సీ. నిగిడి జక్కులఠీవినెల వెల్ల దోఁపఁగాఁ గలిగినవేల్పురాకంటసరుల. యయా. ౪. ౯౯.

సీ మందహాసంబులయందంబు హైసరే సరి లేదు మెడకంటసరికి నెందు. వాల్మీ ౨.౫౦.పారి. ౪. ౧౬. ఆం. భా. ౨ ౧౪౭.

**కంటార్గళ(ల).** సం. వి. ఆ. స్త్రీ. నీలఝింటి, నల్ల గోరంటి.

**కంటాలువు.** సం. వి. ఉ. స్త్రీ. ౧. వార్తాకి, ములకి. ౨ వంశము, వెదురు. ౩ వాఁకుడు. ౪. తుమ్మ.

**కంటాహ్వయము.** సం. వి. అ. న. తామరదుంప

**కంటి.** సం. విశే. (న్. నీ. న్.) ముండ్లు గలది. వి. న్. పుం. ౧. చంద్రి. ౨. ఉత్తరేను. ౩. పల్లేరు. ౪. ౯. కదినుసునెనగలు (బటానీలు). ఈ. స్త్రీ. ముల్లు.

**కంటిని.** సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు.

**కంటివాలు.** వి. (కన్ను, కల్లు+వాలు) చక్రాయుధము.

సీ. ఇనిగడా దుక్కైదుప సంకురప తమ్మి కంటి వాఁడ్ గెలుపుబొక్కసము లయ్యె. భద్రా. ౧. (శ. ర.)

**కంటీలు.** వి. బ. చెవులకు పెట్టుకొనెడుపోఁగులు.

సీ. అత్తనారిచ్చినయపరంజికంటీలు సంశయింపక వేగ చదువఁ బెట్టె. నిరం. ౨. ౧౧౬. (బ్రౌ. పా–"ఘుంటీలు" ముద్రి.)

**కంటు.** వి. ౧. పగ, ద్వేషము, వైరము.

గీ. హాయిగా నీనితంబంబు లంటనీవె, కంటునా మీఁద నేల వాల్గంటి నీకు. అహ. ౩. ౮౩.

ఉ. కంటున రాఘవేశుఁ డలుగన్ నలుమోము లవేల్పు నోడు... రామా. ౯.౨౦౪.ఆం.భా. ౩. ౧౭౬.

౨. శత్రువు, పగవాఁడు.

ద్వి. తొలివేలుపుల కెల్ల దొరయైనవాఁడు, కల వేలుపుల కెల్లఁ గంటైనవాఁడు. రం. రా. ఆర. ౧౮౨ పా. ౩ పం.

ఉ. తుమ్మెదకంటుపూమొగడతోఁ దులదూఁగు లతాంగిముక్కు... రామా ౪.౬౬. (తుమ్మెద కంటుపూ=చంపకపుష్పము.) ఆం. భా. ౨. ౧౭౫.

**కంటె[1](టియ).** వి. (సం. కంఠికా. ప్రా. కంఠిఆ.)

౧. చక్రాకారమైనకంఠాభరణము.

గీ. పలుఁపసనమాలకంటెయు మలినతనువు. ఆము. ౬. ౬. ఆం. భా. ౨. ౧౪౭.

౨. మంగళసూత్రము.

సీ. ప్రాణిన్న్రొదలు గన్పడఁ గంటె కట్టిన ప్పడు గాని గళయుక్తిఁ బొందరాదు. కుపల. ౪. ౪౮.

**కంటె[2].** ప్ర. ద్రు. (ఇదిఉభయయతులలోనిది. చూ. అప్ప ౩. ౨౩౯.) పంచమీవిభక్తిప్రత్యయము.

సీ. విను కార్తవీర్యుకంటెను వీరుఁడగుట. భార. ఆది. ౫. ౧౨౪.

చతుష్కమునకంటె. భాగ. అశ్వ. ౨. ౧౮౬.

రక్షించుకంటె=రక్షించుటకంటె. భార. ఆది. ౭. ౨౮౦.

వచ్చినకంటె=వచ్చినదానికంటె. వరాహ. ౧౨. ౩౮.

**కంఠకూణిక.** సం. వి. ఆ. స్త్రీ–కంఠమువలె ధ్వనించునది–వీణ.

**కంఠతలాసిక.** సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱపుమెడకుకట్టు తోలుపట్టె, త్రాడు, మొ.

**కంఠదఘ్నము.** సం. విశే. (అ. ఈ. అ.) కుత్తుకబంటి.

**కంఠనీడకము.** సం. వి. అ. పుం. చిల్లము, చీపర పిట్ట, పిన్నగ్రద్ద.

**కంఠనీలకము.** సం. వి. అ. పుం. మహాదీపము, పెద్ద దివ్వటీ, కసవుమొదలగువానిని పిరిగాఁ జుట్టి వెలిఁగించుదివ్వె.

**కంఠపాశము.** సం. వి. అ. పుం. ౧. ఏనుఁగుమెడత్రాడు. ౨. పలుపు. ౩. ఉరిత్రాడు.

**కంఠము.** సం.వి. అ. పుం.౧.కుత్తుక,గళము; మెడ.
శ్లో. కంఠాశ్లేషప్రణయిని జనే... మేఘ.౧.౩.
౨.ఎలుఁగు,కంఠస్వరము. ౩.సమీపము. ౪.హోమకుండము యొక్క అంచునుండి వెలుపల ఒకయంగుళముకొలఁది గల ప్రదేశము.౫.మదనము, మంగచెట్టు.

**కంఠలత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మెడపట్టె.౨.కంఠాలంకారమగుబంగారుతీఁగ.

**కంఠశాలూకము.** సం. వి. అ. న. కుత్తుకయందుఁ గలుగు రోగభేదము.

**కంఠశుంఠి(డి).** సం. వి. ఈ. స్త్రీ. తాలువునందు పుట్టు రోగవిశేషము.

**కంఠశోషము.** సం. వి. అ. పుం. ౧.గొంతుకఎండుట. ౨. వ్యర్థసంభాషణమువలన కంఠ మెండుట; వ్యర్థసంభాషణము.

**కంఠసూత్రము.** సం. వి. అ. న. ౧. కంఠమునఁ గట్టుకొనెడి త్రాడు. ౨. మంగళసూత్రము. ౩. సురతబంధభేదము.
శ్లో. యత్కుర్వతే వక్షసి వల్లభస్య, స్తనాభిఘాతం నిబిడోపగూహాత్, పరిశ్రమార్తాశ్శనకై ర్విదగ్ధా, స్తత్కంఠసూత్రం ప్రవదన్తి తజ్జ్ఞాః.

**కంఠస్థము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧.కంఠమందున్నది. ౨. ఒప్పగించుటకు సిద్ధముగా నున్నది. (పాఠాదికము)

**కంఠాగ్ని.** సం. వి. ఇ. పుం. పక్షి, పిట్ట. (దీనికి కంఠముననే పాకాగ్ని కలదు గాన గొంతులోనికిఁ బోవఁగానే ఆహారము జీర్ణమగును.)

**కంఠాల.** సం. వి. ఆ. స్త్రీ. జాలగోణిక, పెరుఁగు మొదలగునవి త్రచ్చెడుకుండ.

**కంఠాలము.** సం. వి. అ. పుం. ౧. కందగడ్డ, సూరణము. ౨. యుద్ధము. ౩.ఖనిత్రము,గుద్దలి. ౪.లొట్టియ. ౫. కంటలము, ఎద్దు మున్నగువానిమీఁద వేసెడు బస్తకులమూట.

**కంఠి.** సం. విణ. (న్. నీ. న్.) కంఠముకలది.వి.ఈ. స్త్రీ. ౧. కుత్తుక, కంఠము. ౨. గుఱ్ఱపుపలుపు.

**కంఠిక.**సం.వి.ఆ.స్త్రీ.కంటె,కంఠాలంకారవిశేషము.

**కంఠీరవము.** సం.వి. అ.పుం-కంఠమున ధ్వనికలది- ౧.సింహము. ౨. మదపుటేనుఁగు. ౩. కపోతము, పావురము.

**కంఠీరవి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వాసకము, అడ్డసరము. ౨. ఆఁడుసింగము. ౩. ఆఁడుమదపుటేనుఁగు. ౪.ఆఁడుపావురము.

**కంఠేకాలుఁడు.** సం. వి. అ. పుం-కంఠమందు నలుపుగలవాఁడు-శివుఁడు.

**కంఠోక్తము.** సం. విణ.(అ.ఆ.అ.) నోటితో స్పష్టముగాఁ జెప్పఁబడినది.

**కంఠ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కంఠమున నున్నది. ౨. కంఠమునఁ బుట్టినది. ౩. కంఠమునకు హితమైనది.

**కండ[1].** వి.(క.కండ)౧.మాంసము;మాంసపుముక్క.
గీ. ఎండియున్నది యొడ లెల్లఁ గండ లేమ, నెత్తురొకబొట్టు పుట్టదు ...శేష. ౨. ౨౧. ఆం. భా. ౨. ౧౩౧.
గీ. కూర్మిమై నిత్తుఁ గండలు గోసిరయిన. భాగ. భీష్మ. ౩. ౨౮౪.
చ. గగనతలంబు నెత్తురులు గండలు నెమ్ములు నొక్కయమ్మడిన్, మొగుళులు లేకయుం గురిసె...భార. ద్రో. ౧. ౧౩౨.
౨. గుంజు.
వ. కండగలతింత్రిణీళలాటుసంఘాతంబులు. మనుచ. ౪. ౬౦.
జ. కండకావరము, కండచుక్క.

**కండ[2].** (సం. ఖండః) ౧. ఖండము, తునియ.
సీ. వివిధాస్త్రశతులు పర్వినఁ గండలై వండఁదతిగిన ట్లుండుపదాతిచయము. భార. ద్రో. ౩. ౧౫౮.

సీ...జడకుచ్చు మీఁదఁ బచ్చడపుఁగండ. గీ.సం
తరించి పదాఱువర్ణములవయసుఁ, బచ్చిబా
లెంతరాలు తాపసపురంధ్రి. హర. ౨.౯౩.
౨. పులకండము, పటికబెల్లము.
ద్వి. గారెలు బూరెలు కండమండెఁగలు. పవ.
౩. ౨౦౮ పా. ౪౦ పం.
సీ.చింపివల్కలము లేమి చేసెడి వసఁ గావు నెఱ
నైనకండమండెఁగలుగాని.జై.భా.౮.౨౦౪.
జ. కండచక్కెర, కండతుండములు.

**కండకావరము.** వి. (√కండ¹) క్రొవ్వు,గర్వము.
ఆ. కండకావరమునఁ గానరు మరణంబు.వేమ.
౩. ౧౪౭.
ద్వి. నేనుగా ర మ్మన్న నిష్ట పల్కెదవు,కానిమ్ము
నీకండకావర మ్మడఁతు. ద్వి.సారంగ.౧.౩౦
పా. ౧౧పం.
ఇక్లే-కండక్రొవ్వు, మొ.
సీ. ఘన మైనకండక్రొవ్వునఁ బాఱు తెంచినయి
డ్డీని పెనులావు లూడఁదన్ని.జై.భా.౧. ౪౫.
గీ. కండగరువంపుమాటలు గావునమ్ము. మనుచ.
౪. ౩౪.

**కండచక్కెర.** వి. (√కండ².సం.ఖండశర్కరా)
పటికబెల్లము.
సీ.కలికి నీకెమ్మోవి కండచక్కెర యంచు గొడఁగి
పాసక మానఁగోరు నొకట. కృ.శకుం.౩.౪౮.
కండచక్కెరదిండి = శుకము,చిలుక. ఆం. భా.
౧. ౪౫.

**కండమేక్క.** వి. (√కండ¹) కడుపులో నడిప్ర
క్కను నల్లగానుండెడుమాంసవిశేషము,కాలఖం
డము. ఆం. భా. ౨. ౧౩౩.

**కండతుండములు.** వి. బ. (కండ²+తుండము)
ముక్కముక్కలు.
సీ. ఒంటి వచ్చినవాని గెంటిపోవఁగ నీక నఱకుం
డు కండతుండములుగాఁగ.జై.భా.౮.౯౪.
ఇక్లే:- కండతుండెములు.
గీ. గండభేరుండమును గండతుండెములుగ, నం
డఁ జనుచుండఁ జెండుబెండాడె నొకఁడు.
రా. వి. ౩. ౬౪.

**కండనము.** సం. వి. అ. న. ౧.దంచుట. ౨.తవుడు,
ఊఁక, మొ.

**కండని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఱోలు. ౨. రోఁకలి.

**కండర.** సం. వి. ఆ. స్త్రీ. మహాస్నాయువు, మహా
నాడి, పెద్దనరము. (ఇది దేహమున ౧౬ కలవం
దురు. వీనివలననే అవయవములు ముడుఁచుట
చాఁచుట మొదలగువ్యాపారములు జరుగును.)

**కండవడము** = గండవడము. (సం. కాండపటః. క.
కండపడ, కండపట) యవనిక, తెర.
(గౌరి) చ. వనిచిగురుకల్పవల్లి మదనాగగతి న్నడ
పాడఁజొచ్చెనో,యనఁ జనుదెంచెఁ గండ
వడ మల్లన వెల్వడి...కు. సం. ౯.౨౧౯.
చ. బెదరుచు నంతరంగమున భీతికిఁ గండవడం
బు నుట్టి ప,ల్కెదు...కు. సం. ౪. ౪౧౫.
(భీతినిమఱుఁగుపఱచి అని భావము.)

**కండిక.** సం. వి. ఆ. స్త్రీ. వైదికదేశము,వేదమండలి
చిన్న అంతర్భాగము. (విల్సను.)

**కండితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧.తొలఁగింపఁ
బడినది. ౨. దంపఁబడినది.

**కండుకము.** సం=కందుకము.(ఇది సంస్కృతనిఘం
టువులలో కానరాదు. అప్పకవి కందుకరూప
ముతో అప్రశస్త ప్రాసమున కుదాహరణముగా
ఈ క్రిందిపద్యమే యిచ్చినాఁడు. చూ. అప్ప.
౩. ౩౮౦.)
ఉ. కండుకకేళిసల్పెదు ప్రకారమున నే ... పా
మరభామ లేతెయా,లెండ ప్రభాతవేళ రచి
యించె ... గోమయపిండము లింటిముంగి
టనే. క్రీడా. ౮౨.
(విరాడ్రూపము)దండ. హేమగర్భాండభాండం
బు లొండొండ నీరోమకూపంబులం దండ

గంధంబులై కందుకంబుల్ వలెన్ నిండియూడన్. వాల్మీకి. ౧. ౭౨.

**కండురా.** సం. వి. ఆ. స్త్రీ. ౧ - తీఁట కలది - దూల గొండి†. ౨. అశ్వమ్లపర్ణి†.

**కండురము.** సం. విశే. (అ. ఆ. అ.) తీఁట కలది. వి. అ. పుం. ౧. కంద†. ౨. కాఁకర†.

**కండువా.** (హిం. ఖండ్వా.) వి. ౧. ఉత్తరీయము, పైని వేసికొనెడు బట్ట.

సీ. చిటిగోచునెల దాఁటి జీరాడుచుసులకి ప్రాపవి యకండువాపల్లెవాటు. బహు. ౫. ౧౭౮.

(వి. సి. పా.)

౨. అష్టమూలము. (శ. ర. - కండువామూలము = అష్టమూలము అని బ్రా.)

**కండువు.** సం. వి. ఉ, ఊ. స్త్రీ. ఖర్జువు, దురద.

**కండూకరి.** సం. వి. ఈ. స్త్రీ. శూకశింబి, దూలగొండి†.

**కండూఘ్నము.** సం. వి. అ. పుం. - తీఁటను పోఁగొట్టునది - ౧. ఆరగ్వధము, రేల†. ౨. సిద్ధార్థము, తెల్లావలు.

**కండూతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. దురద, తీఁట. ౨. కచ్ఛువు, తీఁటకుఱుపు, గజ్జి. ౩. (దురదపోవుటకై) గోఁకుట.

**కండూమక.** సం. వి. ఆ. స్త్రీ. కీటభేదము.

**కండూయ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దురద. ౨. (దురదపోవుటకై) గోఁకుట.

**కండూయకుఁడు.** సం. వి. అ. పుం. (దురదపోవుటకై) గోఁకువాఁడు.

**కండూయనము.** సం. విశే. (అ. ఆ. అ.) - తీఁటపోవుటకు - గోఁకునది. వి. అ. న. (తీఁటపోవుటకై) గోఁకుట, రాచుట.

**కండూయని.** సం. వి. ఈ. స్త్రీ - (దురదపెట్టినప్పుడు) గోఁకుటకు సాధనమైనది - నల్లయిత్తికొమ్ము, మొ.

**కండూయిత.** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) - దురద పోవుటకై - గోఁకువాఁడు.

**కండూయితము.** సం. విశే. (అ. ఆ. అ.) - దురద పోవుటకై - గోఁకఁబడినది. వి. అ. న. (దురదపోవుటకై) గోఁకుట.

**కండూర.** సం. వి. ఆ. స్త్రీ - తీఁటకలది - దూలగొండి, కండుర†.

**కండూరము.** సం. వి. అ. పుం - తీఁట కలది - కంద, సూరణము†.

**కండూలము.** సం = కండూరము.

**కండె(డియ)** వి. ౧. ఊఁచను చుట్టిననూలిచుట్ట.

చ. ..అవ్వెలఁది యొప్పునఁ గండెలు చుట్టు నేర్పునన్. హంస. ౨. ౨౩. శుక. ౨. ౮౨౩.

౨. పేనిననూలిచుట్ట (శ. ర.) ౩. జొన్న మున్నగువానికంకి.

ఉదా: మొక్కజొన్నకండె.

౮ = కండెము.

సీ. కండె దిరిగి యుక్కుఁగంబాలతో మాఱుమల యు బాహువులయగ్గలిక తోడ. పరమ. ౩. ౮౭.

సీ. గుండెలుఁ గండెలు గోళ్లును గీళ్లును బొడలు ను మెడలుఁ దుత్తునియ గాఁగ. అచ్చ. రా. యు. ౧౩౫.

**కండెము.** వి. వ్యాయామముచే గట్టిపడి కండెవలె పుష్టమగు భుజాదులందలి మాంసఖండము.

చ. చనుఁగవ సాముకండెపుఁబిసాళియురంబున సారె కానవే, మన సునుచున్.... విజ. వి. ౧. ౧౦౯.

సీ. కండెముల్ దిరిగి బల్ కొండలు దాపించినటు వలె నెగుబుజా లతిశయిల్ల. సారంగ. ౨. ౮౨.

**కండోలము.** సం. వి. అ. పుం. ౧. పిటము, గంప. ౨. ఉష్ట్రము, ఒంటె.

**కండోలవీణ.** సం. వి. ఆ. స్త్రీ. మాలలు వాయించు ఒకవిధమగువీణె, చండాలవల్లకి.

**కండోలి.** సం. వి. ఈ. స్త్రీ. కండోలవీణ.

**కండ్రిక.** వి. (సం. ఖండః.) ౧. ముక్క, తునియ.

సీ. గడియలోపల మూఁడుకండ్రికలైతాడుధరఁ

సూలఁ దిట్టె మేధావిశిష్టు. అప్ప. ౨. ౩౬౯.
౨. భూఖండము. (వా.)

**కండోష్ఘము.** సం. వి. అ. పుం. శూకకీటము, కంబళిపురుగు, గొంగళిపురుగు. (దీనిని స్పృశించిన మిక్కిలి దురద గలుగును.)

**కంత**=క్రంత². (బ్రా.) వి. ౧. రంధ్రము.
క. తొమ్మిదికంతలతిత్తిక, నిమ్ముగ పొమ్ములును గులము నేటికిఁ జెప్పుమా, నమ్మక దేహము నా దని ... వేమ. ౧. ౨౯౭.
౨. సందు.
గీ. బాగులేయిట్టినెఱ్ఱని ప్రాపు గల్గి, యల్పులపు గొంగి తిరుగ లే మయ్య మేము, కర్మమా మాప గజ మెక్కి కంతఁ దూఱ. సిం. నార. ౬౬. (సర్థారక ప్రయోగములు లేవు.)

**కంతము.** సం. విశే. (అ. ఆ. అ.) సుఖయుక్తము, హాయిగా నుండునది.

**కంతి**=కణిఁతి. వి. (సం. గ్రంథిః.) ౧. గడ్డవలెఁ బుట్టెడురోగవిశేషము.
(ముసలిజంగమయ్యవర్ణనము) సీ. వణఁకెడు శిరమును బెణఁకెడుగమనంబు భగ్నదంతావళి పక్క కంతి. చెన్న బ. ౨. ౨౯. ఆం. భా. ౨. ౭౪.
౨. బొప్పి, బుడిపి.
ద్వి. దుడ్డున వీఁపు కంతులు గట్ట మోఁది. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౩.

**కంతు.** వి. గడువు, నిర్ణీతకాలము. (శ. ర.)

**కంతుఁడు.** సం. వి. ఉ. పుం. మన్మథుఁడు.
గీ. కంతుఁడును నీ విధుండు నొక్కంతవారు. నైష. ౮. ౧౭౯.

**కంతువు.** సం. విశే. (ఉ.) సుఖము కలవాఁడు. వి. ఉ. పుం. ౧. హృదయము. ౨. గాదె. (వై. ని.)

**కంథ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చింపిగుడ్డలను గూర్చి కుట్టినబొంత. ౨. మట్టిగోడ. ౩. గ్రామము, ఊరు.

**కంథటికి.** సం. వి. ఆ. స్త్రీ. కంథ, బొంత. (వై. ని.)

**కంధరి.** సం. వి. ఈ. స్త్రీ. వాఁడిముండ్లు గలయొకానొకవృక్షము.

**కంధారి.** సం =కంధరి.

**కంథావాటము.** సం. వి. అ. పుం. ప్రాకారము. (త్రి. ని.)

**కంద.** వి. (సం. కందః. త. కండై.) కందమొక్క, సూరణము.
గీ. కంద యన సూరణాఖ్య మా గాళికంద. ఆం. భా. ౨. ౭౧.
గీ. ... ఉల్లి కంద, పసుపుఁ గోఁటులు ... నీలా. ౨. ౫౭.
ఏ. కందదుంప.
గీ. ఇంత బతిమాల మా కేల యెట్లు లైనఁ, గాని శుభకంద కందను లేనిదూల, బచ్చలికి నేల గల్గు నోపగమపురుష. సిం. నార. ౫౯.
సీ. కంద పసుపు మొదల్గాఁగలయవి యేకవచనమై నిజమూలవాచ్యము లగు. ఆం. భా. ౨. ౪౧.

**కందఁబొఱు**=కందు¹. (కందన్ + పొఱు.)
(నల్లపదు)
సీ. లలితముక్తాహారగుళికాకలాపంబు ఘ్రాణానిలంబునఁ గందఁబాఱె. నైష. ౨. ౧౧౯.

**కందకము.** వి. అగడిత, పరిఖ.

**కందగుడూచి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకదివ్యసుతిప్పతీఁగ.

**కందటము.** సం. వి. అ. న. తెల్లకలువ, శ్వేతోత్పలము.

**కందనకా(గా)య.** వి. గుండెకాయ.
వ. ... కాలిజమున్ గండనకాయ క్రొవ్వ మొదలగు మిగుల మెత్తనిపలలభిత్తంబు లందుఁ గ్రముకొనన్ గ్రుక్కి. మనుచ. ౪. ౬౦. ఆం. భా. ౨. ౧౩౨. అను. ౪. ౨౩.

**కందన(ణ)ము.** వి. మల్లబంధవిశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.
హంస. ౧. ౨౦౬. ప్రబంధ. ౭౮. ఆం. భా. ౨. ౨౦౯.

గం గలం డె కందు గదా... మొ. రా. బాల. ౪౬.

గీ. నిను వనంగను బిల్ల నా సినుం గనంగం, గూన యనం గందు నాంగను గొడమ యనంగం, దిర్యగర్భకములు గాను దెలియనలయు. ఆం. భా. ౨. ౯౯.

**కందుండు.** వి. (సం. స్కందః.) కుమారస్వామి.

గీ... కందుండు కొమార సామి, యనంగ గుహనామ ధేయంబు లమరు సాంబ. సాం. ని. దేవ. ౭.

**కందుకము.** సం. వి. అ. పుం. న. ౧. చెండు, బంతి. ౨. తలగడ, దిండు.

**కందురీంగ.** వి. (కందురు[1] + ఈంగ) = కందురు[1]. ఆం. భా. ౨. ౯౫.

**కందురు**[1] = కదుందురు, కణుందురు. (సం. గంధోలీ, గంధోలీ.) ఎఱ్ఱనుమ్మెప, కందురీంగ. (శ. ర.) జ: కందురీంగ.

**కందురు**[2]. వి. తృణవిశేషము. ప్రబంధ. ౨౦౧.

**కందువ.** వి. ౧. ప్రదేశము, స్థానము.

క.... ఈ, లోకమున నిట్టిచరితం, బేకందువనైనం గలదె యెవ్వరికైనన్. నిర్వ. ౧౦. ౮౮.

(క) నివాసస్థానము.

ఉ....ధర్మముల కెల్లను గందువ ధర్మరాజు ... వైష. ౪. ౩౫.

మ. దయకుం గందువ దానకేళి కిర వంతశ్శుద్ధికిన్ జన్మభూ, మి... రామా. ౧. ౯౨.

(చ) సంకేతస్థలము.

ఉ. కోటలు బొమ్మరిండ్లు మఱి కొండలు తావలు దివ్యదృష్టికిన్, గాటుకలంధకారములు గాం జని కందువపట్లం బాంసులా, పాటలగంధులొంది రుపభర్తలతో మణితాదు లైనజం, జాటము లేనికూటముల సాహసకల్పలతా ఫలంబులన్. కవిక. ౪. ౧౦౩.

(ట) ఏకాంతస్థలము, రహస్యస్థలము.

క. అంచులం దగినగృహంబుల, కందువ లన్నియును దెలియంగా నొకచోటన్, జందనపు మండపంబునం, గుందనపుంగిన్నె గాంచి కొని చని దానిన్. వైజ. ౪. ౮౨.

౨. జాడ, ఆనవాలు, గుఱుతు.

(అశ్వత్థామ)ను. పరవీరావళియిండ్లకందువ లెడం బాటించుచుం బోయినన్. భార. సౌ. ౧. ౧౬౧.

వ. అహోరాత్రి పెద్దలవలనం గందువ యెఱింగి చని తన్మహాక్షేత్రమంబుం బ్రవేశించి... కాశీ. ౨. ౪౨.

౩. మర్మము, కీలు.

క. ఘంటోలంకారాదుల, పొం దెఱింగిన పెద్ది లేక పొసంగరు కవితా, సుందరల శక్తి యది యా, కందువ తెగ నెఱుంగువాండె కవినరుం డెందున్. కావ్యా. ౩. ౮౮. కాశీ. ౧. ౮.

౪. తెగ, సంఘము.

లయగ్రాహి. ...నిలింపమునిబృందములు...దితి నందనులతోడన్, బొందువడ సంధ యొక చందమునం జేసి రటుకందువలనారు...కా. పు. ౧. ౧౭౩.

౫. చమత్కారము.

గీ. కలికిచూపుల మాటలకందువలను, జేరిక లొనర్చి మేకొనంజేసి వాని, నెనసి యప్పుడె దేవర యిల్లు పడుక, యిల్లు గావించె నంతంబూర్ణెందువదన. శుక. ౨. ౪౩౧.

ఉ. కాయజుతూపు లమ్ముదుర కందువమాటలం బుష్పలావికల్. విజ. వి. ౧. ౧౪. ఆం. భా. ౩. ౩౨.

౬. ఋతువు, కాలము.

మ. ఇవముంగందువలన్ జలంబునను నట్టెండల్ వెసం గాయువే, నవులన్ బంచమహాగ్నిమధ్యమున... నిల్చి చేసెం దపమున్ ... పి. శకుం. ౨. ౧౧౨.

సీ. వానకందువను దివారాత్రములు జలధారల
బయలఁ బడియుండి. నిర్వ. 3. ౬3.

౨. శపథము, ప్రతిజ్ఞ.

చ...బుఖ్యమూకమునఁ గందువ సేయనె యగ్ని సాక్షిగా, శపథము చేసి తప్పి యిట సంతత దారతానుభూతి మోహపడుచున్న వాఁడవు...భా. రా. కిష్కి. ౧. ౮.౨౫.

౩. కొఱలను, నేర్పు.

వ...సాహాయ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నొందిన నీకందువనైనంత్ర చెప్పెదం బ్రియం బంది నిన్నుఁ గోర్తే నన్నుఁ బనిచిన ...భాగ. విరా. ౧. ౭౯.

శ్లో. అచపక్షే హయజ్ఞానే మైంత్రే కౌశలం

శత. సం. భాగ. విరా. 3౨. ౧౧.

కందువచుట్టము—ప్రియబంధువు.

క. కందువచుట్టమనై మది,కందంత యుఁ బాసి మీరిఁ గలభాగ్యము నా,కందించి మనుపఁ దలఁచితి...నా. పంచ. ౮. ౯౯.

కందువదృష్టి—దివ్యదృష్టి.

(చ్యవనుఁడు) స్వి.పొందారఁ గరుణతోఁ బూఁబోఁడి నెత్తి, కందువదృష్టిని గడఁగి లోఁ జూచి, ప్రతిపక్షమనుండు ... పుత్రుండు నీకు, నగుఁగాక కాళింది యనుచు దీవించె. రం. రా. బాల. ౨౦ సా. ౨౨ పం.

**కందువాఱు**=కందు[1].(కందు[1]+పాఱు)అ. క్రి. (మలినమగు)

సీ. కందువాఱినమించుగచ్చుటద్దమువోలె విధుమండలము కాంతి వీడుకొనఁగ.హర.౨.3౦.
(వివర్ణతనొందు.)

చ. వెలవెలఁబాఱె మేఘమువింపవిరోధియుఁ గందువాఱె నా,కులపడెఁ గల్పశాఖి ...
నరస. ౨. ౨౦. (కలంకము కలదియగు అని రెండవయర్థము.)

**కందువు.** సం. వి. ఉ. పుం. స్త్రీ. ౧. పెనము. ౨. నూలుబంతి. 3.పాకశాల, వంటయిల్లు. (శే.ని.)

**కందుశాల.** సం. వి. ఆ. స్త్రీ. వేఁపుడుపని చేయు శాల.

**కందెన,కందియన.** వి. బండియిరుసునకుఁ బూసెడుమసి.

సీ.బండికందెనతోడఁ బ్రతివచ్చుమైచాయ నీలి పచ్చడముతో మేళవింప. నైష. ౨. ౯3.

క. ఇరుసునఁ గందెనఁ బెట్టక,పరమేశ్వరుబండి యైనఁ బాఱదు సుమతీ. సు. శ. 3౦.

ఆ. తెఱఁగు లరసి పువ్వుఁదేనెకందెన నెట్టి.వీర. ౨. ౯౮.

సీ. ... కందెనలు పూసి గుజ్జంబులు పూన్చి మీఁద, నాయుధంబులు నించి ... సు. సం. ౧౨. ౨౩౮.

('బండికన్నులకుఁ బట్టించుచమురు' అని ఆం. భా. ౨. ౨౦౨.)

**కండెఱ.** వి.(కన్ను + తెఱ) నేత్రచ్ఛదము, ఱెప్ప.

మ.ముసునాఁ డంధకవృష్ణిభోజయదుసామంతాగ్రణీసేన గం,డెఱగా...కొంచ అమాత్యులెనుఁ బుట్టి రా సమరె నాస్థానంబునఁ గృష్ణుఁడు...ఉ. హరి. ౨. ౩౮.

**కందోటము.** సం. వి. అ. పుం. తెల్లగలువ. న. నల్లగలువ. (కల్ప.)

**కందోతము.** సం. వి. అ. పుం. కుముదము, తెల్లగలువ.

**కందోద్భవ.** సం. వి. ఆ. స్త్రీ. గుడూచీభేదము, గడ్డగలతిప్పతీఁగ.

**కంధము.** సం. వి.అ.పుం.౧. మేఘము.౨.ముస్తె.

**కంధర(ము).** సం. వి. ఆ. స్త్రీ-శిరస్సును ధరించునది-మెడ.

**కంధరము.** సం. వి. అ. పుం. ౧-నీటిని ధరించునది-మబ్బు, మేఘము. ౨. ముస్తె. 3. మారిషశాకము, నీటిచిత్రికూర.

౨. సుగంధము, సువాసన.

ఆ. కంపు రూపుఁ దెలుపుఁ గలిగి యకంటక,భూ
రుహాదులందుఁ బుట్టినట్టి,పుష్పములఁ బ్రి
యంబుఁ బొంది కైకొం(డ్రు) నిర్జరులు పూజ
నములఁ గుసుపరేణ్యా. భార. అను. ర. ౫.
బస. పు. ర. ౨౬౮ పం.

3. దుర్వాసన, దుర్గంధము. (చూ. కంపుఁదుమ్మ, కంపు పెలుక.)

గీ. కప్పుఁగంపుఁగుడుటఁ గస్తూరియొరపుతో,నల్లి
నాటి చండనోదకములఁ, దెంపు దాని కున్న
కంపు వాయనిభంగి, నెంత యైన నల్ప దింతి
మనసు. ద్వా. ౧. ౯౪.

సా: ఎసరికంపు వారి కింపు.

జ: కంపెరుగుడు, కంపుఁదుమ్మ, కంపు పెలుక.

**కంపుఁదుమ్మ.** వి. (కంపు+తుమ్మ) విట్ఖదిరము. (శ. ర.)

**కంపుపెలుక.** వి. (కంపు+ఎలుక) గంధమూషిక, చుంచు (చి.న-కంపెలుక. శ. ర.)

**కంపె=కుంపె.** వి. (క. గంపె-శ. ర. బ్రౌ. లనుబట్టి పరుపాదిగా గ్రహింపఁబడెను.) తాంబూల పాత్రము

సీ. తాంబూలపాత్రంబు పెబు కంచపంగను గం
పె యంచనఁగను గుంపె యనఁగ. గీ. జాల
పల్లిక యనఁగను...ఆం. భా. ౨. ౧౬౬.

**కంప్యమానము.** సం. విశే. (అ. ఆ. అ.) కంపింపఁజేయఁబడుచున్నది.

**కంప్యము.** సం=కంపనీయము.

**కంప్రము.** సం. విశే. (అ. ఆ. అ.) వణఁకునది, కదలునది.

**కంబమయ్య.** వి. (కంబము+అయ్య)-స్తంభమున వెలసిన అయ్య- నృసింహమూర్తి.

సీ. ఒకటి యాజమునకు నున్నదందురు గాని కా
రెనుపోతును గాన మెచట, నలకంబమయ్య
దా నైనదే మోకాని సింగ మొక్కటియైనని
లల లేదు. య.యా. ౧. ౧౦౬.

**కంబము.** వి. (సం.స్కంధః. ప్రా కంభో. క.కంబం. త. కంబ) ౧. స్తంభము, రాడు.

సీ...పంకంబులోనికంబంబు తర్కము...నైష. ౭. ౭౩. పారి. ౧. ౪౯.

౨. మల్లపరికరవిశేషము.

సీ. తత్సాధనంబులై తగుఁ గంబము కోణత ...
ఆం. భా. ౨. ౨౦౭. ప్రబంధ. ౮౨.

జ. కంబమయ్య, కంబమురాయఁడు,కంబపల్లి.

**కంబమురాయఁడు.** వి. (కంబము+రాయఁడు) కంబమయ్య,నృసింహమూర్తి. య.యా.౧.౧.౨౦.

**కంబరము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సంపృక్తము,కలసినది. ౨. చిత్రవర్ణముకలది. వి.అ.పుం. చిత్రవర్ణము.

**కంబళకము.** సం. వి. అ. పుం. న. కంబళి, ఉన్ని వస్త్రము.

**కంబళపురీషము.** సం.వి. అ.న-కంబళికి అంటిన మలమువలె నెంతశోధించినను విడువనిది-ఒకానొకతిట్టు. (తెనుఁగు గ్రంథములందే కనఁబడుచున్నది.)

ద్వి. మటుమాయలాఁడు కంబళపురీషంబు,పటి
కిరింతలపిల్లి పట్టినదొమ్మ,శుద్ధకష్టం డని చూ
పఱు దెగడ. ద్వి. హరిశ్చ. ఉ. ౪౮౪.

**కంబళ(ల)ము.** సం. వి. అ. పుం. ౧. కంబళి. ౨. (ఉన్నితో నేసిన) ఉత్తరీయము. (పయిని వైచుకొనుసాలువు, మొ.) 3. గంగడోలు. ౪. కంబళిపురుగు. ౫. ఏనుఁగుపక్కెర, ఏనుఁగుమీఁద వేయుచిత్రకంబళము.౬.ఒకజాతిలేడి.న.నీరు.

**కంబళి(డి).** వి. (సం. కంబళః. క. కంబళి) కంబళము, గొంగళి.

సీ. ... చనును గంబ. గీ. లంబు గొంగడి యనఁ
గను గంబళి యన. ఆం. భా. ౨. ౧౫౮.

సీ. పిల్లఁ గ్రోవులు నెక్కు నెట్టినవిండ్లు కంబళ్లును వ్పట్లును వల్లెత్రాళ్లు. శుక. ౨. ౫౪౫.

చ... కంబడిచింపులు... సారంగ. ౧. ౧౧౬.

వ... కటియకంబడిప్రాంత. ఆము. ౪. ౩౫.

కంబళిపురుగు=కంబళివలె నుండునొకానొక పురుగు, గొంగళిపురుగు. (శ. ర. వా.)

జ: కంబళిపండు.

**కంబళి(లి).** సం. విశే. (న. నీ. న.) కంబళము కలది. వి. న. పుం. ఎద్దు. ఈ. స్త్రీ. ఒకజాతి యూఁడులేడి.

**కంబళి(లి)క.** సం. వి. ఆ. స్త్రీ ౧. చిన్నకంబళి. ౨. ఒకజాతియూఁడులేడి.

**కంబళిపండు.** వి. (√కంబళి.) పట్టుపురుగుచెట్టుపండు. (శ. ర.)

**కంబళీ(లీ)యము.** సం. విశే. (అ. ఆ. అ.) కంబళికి సాధనమైనది. (ఉన్ని.)

**కంబవల్లి.** వి. (√కంబము.) ౧. పసుపుకడపటిదినమునఁ జేయు స్తంభపూజ మున్నగుసంస్కారవిశేషము. (౨. గ.-పసుపుకడపటిదినము. ఆం. ౧. ఆం. భా. ౨. ౧౭౮.)

౨. వివాహముకడపటిదినమునఁ జేయుసంస్కారవిశేషము.

సీ. యాజ్ఞికుల్ దక్షిణ లర్పింప రాజులై యుల్లసద్గతిఁ గంబవల్లినాఁడు. రా. వి. ౫. ౮౦.

**కంబి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. దర్వి, గరిఁటె; తెడ్డు. ౨. వెదురుకమ్మి.

**కంబు.** వి. (క. త. కంబు.) సజ్జపైరు, గంటెపైరు. బ. ధాన్యవిశేషము, సజ్జలు, గంటెలు.

**కంబు.** సం. వి. ఉ. పుం. న. కంబువు, శంఖము.

ఉ. ...శృం, గారపువేణి వేణి యొడికంబగుకంబు గళంబు కొమ్మకున్. ప్రబంధ. ౩౧౬.

**కంబుక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అశ్వగంధ, పెన్నేరు. ౨. కంఠము.

**కంబుకంఠ.** సం. వి. ఆ. స్త్రీ=కంబుకంఠి.

**కంబుకంఠి.** సం. వి. ఈ. స్త్రీ. శంఖమువంటికంఠము గల యూఁడుది; ఆఁడుది.

**కంబుకము.** సం. వి. అ. పుం. ౧. సంకు, శంఖము. ౨. కంఠము.

**కంబుకాష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. అశ్వగంధ, పెన్నేరు.

**కంబుగ్రీవ(ము).** సం. వి. ఆ. స్త్రీ. శంఖమువలె మూఁడు రేఖలు గలకంఠము.

**కంబుపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. శంఖపుష్పి.

**కంబుమాలిని.** సం. వి. ఈ. స్త్రీ శంఖపుష్పి.

**కంబువు.** సం. విశే. (ఉ) చిత్రవర్ణముకలది, కర్బురము. (ఊ.) పరద్రవ్యాపహారి, దొంగిలించువాఁడు. వి. ఉ పుం. చిత్రవర్ణము. పుం. న. ౧. శంఖము, సంకు. ౨. కంఠము. ౩. సంకుగాజు, శంఖవలయము. ౪. నత్తగుల్ల. ఉ, ఊ. స్త్రీ. ౧. కంఠము. ౨. గొట్టమువంటిఎముక, నలకము.

**కంబూకము.** సం. వి. అ. పుం. కండనము, తవుడు.

**కంబోజము.** సం. వి. అ పుం. ౧. శంఖభేదము. ౨. గజభేదము. ౩. దేశభేదము. ౪. పున్నాగము, సురపొన్న.

**కంబ్వాత్తాయి.** సం. వి. న. పుం-శంఖమువలెఁ దెల్లనిపూర్వకాయముగల గ్రద్ద-గరుడపక్షి, బొల్లిగ్రద్ద.

**కంభువు.** సం. వి. ఉ. న. ఉశీరము, వట్టివేరు, బొరుగడ్డివేరు.

**కంయము.** సం. విశే. (అ. ఆ. అ.) సుఖాన్వితము, హాయిగా నుండునది.

**కంసము.** సం. వి. అ. పుం. న. ౧. కంచు. ౨. పానపాత్రము. ౩. ఆఢకము, మానవిశేషము (కే. ని-ద్వ్యాఢకము అని వై. ని.) ౪. హంస. (కే. ని.)

**కంసకారుఁడు.** సం. వి. అ. పుం. కంచుపనిచేయు ఒకానొకజాతివాఁడు, కంచరి.

**కంసారాతి.** సం=కంసారి.

**కంసారి.** సం. వి. ఇ. పుం-కంసుని పగవాఁడు-కృష్ణుఁడు.

**కంసాల.** వి. స్వర్ణకారజాతి.
ఆ....కం,సాలజాతివాఁడు చాలఁ గీడు. భోజ రా. ౫. ౩౨౨. (ఇటస్థిరవర్ణమునకు ముందు బిందువు కనఁబడుచున్నది.)

**కంసాలి.** వి. (క.కంసాళిక.)స్వర్ణకారుఁడు.
సీ. స్వర్ణకారాఖ్యఁ బరఁగుఁ బారసి యగసాలి సొన్నారి కంసాలి యనఁగ. ఆం. భా. ౨. ౨౫౬.

**కంసాస్థి.** సం. వి. ఇ. న. కంచు, కాంస్యము.

**కంసికము.** సం. విణ. (ము. ఈ. అ.) కంసమనెడి మానవిశేషముచేతఁ గొనఁబడినది.

**కంసీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కంచునకు సంబంధించినది. ౨. కంచుపాత్రమునఁ బనికి వచ్చునది.

**కంసుఁడు.** సం. వి. అ. పుం. కృష్ణుని మేనమామ, ఒకానొక మథురాపురపురాజు.

**కకందము.** సం. వి. అ. పుం. బంగారు.

**కకపాల**=కక్కుపాల. (సం. కక్షపాలః. ప్రా. కక్ఖపాల) ౧. బైరాగులు చంకను ధరించెడుసంచి.
సీ. కకపాలవెలిబూది గన్నులలోఁ బ్రాణి బాధింతు గప్పరిఁ బల్లవములు. హర. ౫. ౧౦.
సీ. కకపాల కేదారకటకముద్రితపాణిఁ గుఱుచలాతాముతోఁ గూర్చుపట్టి. మనుచ.౧. ౫౯. ఆం. భా. ౨. ౧౭౭.
౨. మంగలపొది. ఆం.భా. ౨.౨౦౧.

**కకపిక**=కకాపిక, కకవిక, కకావిక. విణ.(సం. కాకపికాః. ప్రా. కాకపికా, కకపికా) చెల్లాచెదరు, చిక్కులై చెదరినది.
ద్వి. పికపిక లేలె నివ్వేఱ లకుముకులు, కకపికలాయెఁ బక్కుకపికవాణి. అ. మ. క. ౨. ౧౧౫ పా. ౨౦ పం.
కకపికపడు=చలించు.
క. ఒకపాటికలిమి చేతను, గకపికపడ కప్పులేక కనకాద్రి ధరా, వకమలగరగరికల నించుక సిక్కుపడక యతఁడు సుఖమున నుండుజ్. హంస. ౫.౧౫. (గర్వము-అని భావము.)

**కకవిక**=కకపిక.
విణ. (తాఱుమాఱు, వ్యత్యస్తము.)
క. ఒకయొరిమికి నొకకిరణము, నొకతీర్పరి రైనఁ గాక యొగిఁ బిఱుతైనన్, గకవికలు గాక యుండునె, సకలంబును...సు. శ. ౨౨.
(క్షోభము, కలఁత నొందినది.)
చ. ప్రకటపుపక్షిరాజ తనుఁ బాగము లేపిన నేల నాదుమృత్యుకళికచే గణించు నసియద్రి సముద్ధతిమాపత్సలంబునం, గకపిక చేయఁగాఁ దలఁచి గంతులు వేయఁ గలంగ కష్టదాఁ, బకపక నవ్వినట్లు కనుపట్టె విచిత్రపయఃకణప్రభల్. లక్ష్మీ. ౨. ౬.

**కకాపిక**=కకపిక.
విణ. (చెల్లాచెదరు.)
చ. ఇరుపదిచేతుల న్విపిరి హేతితతుల్ గొనియొక్కపెట్టకుం, గిరులపయి న్నిగిడ్చినఁ గకాపిక లైరొక కొండలు...ఉ.రా.౩.౩౩౫.
చ. గాలుపుగ రంగద్ధామునకుఁ బువ్వులతోఁట యొసర్చు తోఁటనా, కరిగినపాతకంబులు కకావికగా విడనాడి బ్రహ్మవేత్తలఁ గని ముక్తిఁ గాంతు...విప్ర. ౨. ౧౬. వరాహ. ౩. ౫౯. రా. వి. ఉ. ౧౫.

**కకావిక**=కకపిక.
విణ.(చెల్లాచెదరు)
ఉ. ఈశివశక్తి సంగజగతీశ్వరుసైనికు లట్లు చెందుటెఁ, గాఁడఁగ నాత్మసైనికచయంబు కకావికలై కలంగి యా, క్రీడతఁ బాఱఁజొచ్చుట యు...కళా. ౮. ౫౮.

(క్షుభితము, కలఁత నొందినది.)

గీ. మెల్లనె కళావతీసతి మేలుకాంచి, ప్రక్క వేఁపొక్క మగఁడున్న భాగు దెలిసి, యక్క యిది యేమి చోద్యమో యనుచు మిట్టిపడి కకావికయై యొండుకడకుఁ జేరి. శుక. ౧. ౨౨౩.

**కకుంజలము.** సం. వి. అ. పుం. చాతకపక్షి.

**కకుందరము.** సం.వి. అ.న. పిఱుఁదుమీఁదిగుంట.

**కకుత్తు.** సం. వి.ద్. పుం. స్త్రీ.౧. ప్రధానము, శ్రేష్ఠము. ౨. ఎద్దుమూఁపురము. ౩. రాజచిహ్నము. (ఛత్త్రచామరాది.)

**కకుత్స్థుఁడు.** సం.వి. అ.పుం-అసురులను జయించుటకు వృషభరూపుఁ డగు ఇంద్రుని కకుత్తు (మూఁపు)ను ఎక్కినవాఁడు-శశాదుని పుత్త్రుఁడగు పురంజయుఁడు.

**కకుదము.** సం. వి. అ. పుం. న. ౧. ప్రధానము, శ్రేష్ఠము. ౨. ఎద్దుమూఁపురము. ౩. రాజచిహ్నము. (చామరాది.) ౪. హస్తిమేఢ్రము.

**కకుద్మంతము.** సం. విశే. (త్. ద్మతీ. త్.) గొప్ప మూఁపురము గలది. వి. త్. పుం. ఎద్దు.

**కకుద్మతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పిఱుఁదు. ౨. మొల.

**కకుద్మి.** సం. విశే. (న్. నీ. న్.) మూఁపురముగలది. వి. న్. పుం. ౧. మూఁపురము గలయెద్దు. ౨. రైవతుఁ డనురాజు.

**కకుద్మికన్య.** సం. వి.ఆ. స్త్రీ - రైవతునికూఁతురు - రేవతి. (ఈమె బలరామునిభార్య.) శిశు. ౨. ౨౦.

**కకుప్పు.** సం. వి. భ్. స్త్రీ. ౧. దిక్కు. ౨. శోభ, కాంతి. ౩. సంపెఁగదండ, చంపకమాల. ౪. పర్వతశిఖరము. ౫. శాస్త్రము. ౬. ప్రాణము. ౭. వాక్కు.

**కకుభ.** సం. వి. ఆ. స్త్రీ=కకుప్పు.

**కకుభము.** సం. వి. అ. పుం. ౧. వీణకు అమర్చిన సొఱకాయ. (వీణాప్రాంతవక్రకాష్ఠ మని కొందఱు-శబ్దగాంభీర్యమునకై వీణాదండము క్రింద నమర్పఁబడిన చర్మావనద్ధదారుభాండము అని మఱికొందఱు.) ౨. ఏఱుమద్ది.

**కకుభాదని.** సం.వి. ఈ. స్త్రీ. నలి, గువ్వగుత్తి, కపోతాంఘ్రి.

**కక్క.** వి. (క. కక్క) పినతండ్రి. (వా.)

**కక్కపాల**=కకపాల.

(యోగులు మున్నగువారు చంకను దాల్చెడుసంచి)

గీ. కక్కపాలయుఁ గక్షభాగమునఁ బూని, ... ధరణిపతిపాలి కేతెంచెఁ దపసి యొకఁడు. విక్ర. ౨. ౯౨.

**కక్కరము.** విశే. (సం. కర్కరః) కఠినము, మోటైనది.

ద్వి. ఎప్పుడు ముడిగిబ్బ యెమ్ములు సొమ్ము, కక్కరం బగుతోలు కట్టెడువలువ. ద్వి. భాగ. ౪. (శ. ర.)

జ: కక్కరించు.

**కక్కరించు.** అ. క్రి. (√కక్కరము) మొఱుఁగు; పెద్దకేకలు వేయు.

(జంగమయ్యను) చ. కనుఁగొని డాయ వచ్చి శునకంబువిధంబునఁ గక్కరించి యి, ట్లను... చెన్నబ. ౨. ౩౦. (ప్రయోగాంతరము మృగ్యము.)

**కక్కసపె(వె)ట్టు.** స. క్రి. (కక్కసము+పెట్టు) బాధపెట్టు.

వ. ఇక్కరణి రక్కసులం గక్కసపెట్టి కాకుత్స్థుం డొక్కఘటికాచతుష్టయంబున ధనుష్టంకారఘోరంబుగా శరాసారంబు నిగిడించిన. రామా. ౮. ౧౯౨.

**కక్కసము.** విశే. (సం. కర్కశః. ప్రా. కక్కసో. త. కక్కచం.) ౧. కఱకు, వాఁడియైనది, తీక్ష్ణము.

గీ. కక్కసపువంకగోరులఁ ద్రొక్కిత్రొక్కి, కఱ

ఘుముక్కన సందంద కఱచికఱచి. పాండు. ౪. ౨౩౯.

౨. కఠినము, మోటైనది.

ఉ. అక్కట ధర్మమే గురునియాత్మజుఁ బట్టి గమింప నెంచ నీ, కెక్కడఁ బుట్టె నీమమత యిప్పని శుక్రుఁడు విన్నఁ బైఁచునే, సిక్కము మోహ మున్న సతనిం గని వేఁడి పరిగ్రహింపుమీ, కక్కసపుండనంబు కొఱగాదని సారెకు బుద్ధి సెప్పినన్. ఉ. రా. ౭. ౩౩౧.

౩. క్రూరము, ఘోరము.

ఉ. ప్రాఁకున నిద్రపోవ నరమర్దనుపంపున వచ్చి ఘూకముల్, గాకముల న్వధించె నిని కక్కసపుంబని నిర్వహించుటె, ట్లీడ ... వేం. పంచ. ౩. ౧౧.

౪. ఇఱుకైనది.

ద్వి. కక్కసంబైన యిక్కడ నీవు మేము, నొండొరులకు మన మొద్దికై సరదు, కొండము రమ్మంచు...ద్వి. పరమ. ౧. ౪౪౯. ౬ పం.

వి. ౧. దుష్కరత్వము.

క. ఒక్కనివిరివికిని వొరల్, పెక్కండ్రే నొక్కనొకని వెంబడి ననుఁగుల్, పెక్కండ్రు సిలుపఁ బనులకుఁ, గక్కసమగు దింప నుంపఁ గాఁ గాకుండున్. ఆము. ౪. ౨౧౪. (ప్రాఁత ప్రతి పా.)

౨. కాఠిన్యము, నిర్బంధము; తైక్ష్ణ్యము.

సీ. చండభానుఁడు కక్కసముఁ జేసి మున్ను దామహి కిచ్చునప్పులు మరలఁ గొనియె. వైజ. ౧. ౯౭. (రెండర్థములకు నిదే యుదాహరణము.)

వ....తమ్ము నమ్ముదుసల్లు ముందటికి నూకి యక్కక్క మ్రొక్కవే మనపాలివేలు పని బుజ్జగించియు బొమలుగొని జంకించియు...కక్కసాన నిట్లు మ్రొక్కించి. ఆము. ౪. ౩౫.

౩. కశాభేదము, ఒకవిధమైన కొరడా.

చ. అదిగని సైనికుల్ కడుభయంబునఁ జేరి మహోపలంబుతో, నదికిసరీతి నున్న సవనాశ్వము దే యని కక్కసంబులన్, సదసదగాఁగ వ్రేసియును జాటులఁ గట్టియు నేమి చేసియున్, గదలుపలేక... జై. భా. ౪. ౭౭.

జ: కక్కసపడు, కక్కసపెట్టు, కక్కసించు, కక్కసిల్లు.

కక్కసించు. స. క్రి. (√కక్కసము) బాధించు, హింసించు.

ఉ. ...జనకపుత్రి నడల్పులఁ గక్కసింపఁగాఁ, బోయెడి రాక్షసీనిచయముం గని క్రమ్మఱఁ బిల్చి రాఘవ, ప్రేయసికై పిశాచనని పేరడఁగంగలఁ గంటిఁ బొకఁడీ, యాయమ త్రోవనంచుఁ ద్రిజటాహ్వయదానవి మాన్చెఁ దత్త్వరల్. రామా. ౬. ౧౭౨.

గీ. కదిసి కుసుమిషు లభిమన్యుఁ గక్కసింప, సిక్కుజిగి నొక్క మొగిఁ జెక్కు కుక్క లెక్క, పిక్క ప్రక్కయు ..చిక్కించుకొన స్రుక్క సక్కటియును. రా. వి. ౩. ౬౬.

కక్కసిల్లు. అ. క్రి. (√కక్కసించు.) నిండు, క్రిక్కిఱిసియుండు.

ద్వి....పృథివి యాకసము, కక్కసిల్లఁగ నంతు గలిగె నచ్చోట. ద్వి. పారిజ. ౧. ౧౫ పా. ౮ పం.

కక్కి[1]. వి. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

వ. కక్కి కొక్కిన డొక్కర ... నృసింహంబు నాది యగుముప్పదిరెండు విన్నాణంబులనాణెంబు పరీక్షించి... హంస. ౧. ౨౦౬.

కక్కి[2]. వి. (క. కక్కి.) పినతల్లి. (వా.)

కక్కిత. వి. మల్లులవిన్నాణములలో నొకటి. ప్రబంధ. ౮౭.

కక్కిరిబిక్కిరి. విణ. తాఱుమాఱు. (శ. ర.)

**కక్కు**¹ = క్రక్కు. (క. వి. కక్కు) స. క్రి. (కడుపు లోనిది) వెలిపుచ్చు; వెడలించు.

ఉ. ... సయించునె కక్కినకూడు క్రమ్మఱన్. వైజ. ౨. ౧౦౦. (సహించు-ముద్రి.)

సీ. ... సభలో నులూకుని బంచి యాడించినపరుసంబునము, కక్కించి... భార. భీష్మ. ౨. ౩౯౭.

వి. కక్కుట, వాంతి; కక్కినపదార్థము. (వ్రా.)

జ: కక్కుఁదెవులు, కక్కుడు, కక్కువాయి.

**కక్కు**². వి. (√కఱకు?) అంపను మొదలగువాని పల్లు.

క. కక్కులకోడపలిపోలెన్. భోజరా. ౮. ౬౦. పి. శకుం. ౮. ౫౬.

**కక్కుఁదెవులు.** వి. (కక్కు¹ + తెవులు) వాంతిరోగము.

**కక్కుడు.** వి. (√కక్కు¹) కక్కుట (వ్రా, శ.ర.)

**కక్కుఱితి(ర్తి)** = కకుర్తి. వి. (క. కక్కుఱితె. త. కక్కుఱితి.) లోభము, ఆశ.

క. పొంకొంచి నిలుపులు పలు, కండగునే మోడి యాకట కక్కుఱితి మెయిన్. హరి. ఉ. ౩. ౨౩౭.

చ... కడుపునఁగక్కుఱితిన్... ప్రభా. ౧. ౧౧౫.

చ. కికుపులఁ బెట్టి వీరి నడకించి తొలంగెనమన్న వట్టికక్కుఱితియ కాని దైవ మనుకూలము గాదు... జై. భా. ౬. ౨౩౮.

కక్కుర్తిపడు = ఆశపడు. శివరా. ౩. ౭౨.

జ: కక్కుఱితికాఁడు.

**కక్కుఱితి(ర్తి)కాఁడు** = కకుర్తికాఁడు విశే. (√కక్కుఱితి) లోభి.

క. కక్కుఱితికాఁడు కార్యము, చక్కటి యెఱుఁగండు... నా. పంచ. ౧. ౩౨౦.

**కక్కులము.** సం. వి. అ. పుం. వకుళము, పొగడ చెట్టు.

**కక్కువాయి.** వి. (√కక్కు¹) కాసరోగవిశేషము.

గీ... మిరియంబుఁ బిప్పలియుఁ గాజపాల జప్తు వులు గొనఁగ కక్కువాయి, దగ్గు లెల్లను శాంతించు... చికి. (చి.ని.)

**కకుఱితి(ర్తి)** = కక్కుఱితి. వి. (లోభము, ఆశ.)

క. పలదిటుపడెఁ గకుఱితి, పలుకులు పలుక... సారం. ౨. ౧౦౯.

ద్వి. కడుపుఁగకుర్తికిఁ గర్మకాండంబు, తడయక పెట్టుతంత్రంబును గాదు. ప్రభులిం. ౧. ౫. పా. ౨౧. ౫౦.

కకుర్తిపడు = ఆశపడు.

సీ. కకుర్తిపడుచుపరా గాఢతపోయోగధుఁ డగు మఱికిఁ గారంభించెవాని. చంద్ర. ౨. ౭౪.

జ: కకుఱితికాఁడు.

**కకుఱితి(ర్తి)కాఁడు.** విశే. (√కకుఱితి) లోభి.

ద్వి. కడఁగి పసఁగుమీఁదఁ గంచంబు పెట్టి, కుడుపఁగాఁ జూచు కకుర్తికాఁడితఁడు. ద్వి. హరిశ్చ. ఉ. ౪౫౨పం. సుద. ౨. ౬౫.

**కక్కెర** = క్రక్కెర. వి. (సం. క్రకర. ప్రా. కఅక్రో) పక్షివిశేషము.

సీ. గోక్కెరల్ కక్కెరల్ గువ్వలు ... రసిక. ౧. ౬౭. (కర్కరేటువు-అని. ఆం. భా. ౨. ౯౨.)

**కక్కోలకము.** సం. వి. అ. న. ౧. తక్కోలపుచెట్టు నుండి కలుగు పరిమళద్రవ్యము. ౨. స్థూలమరీచము, చలువమిరియము.

**కక్కోలము.** సం. వి. అ. పుం. గంధద్రవ్యము నిచ్చు వృక్షవిశేషము, తక్కోలవృక్షము. న. ౧. తక్కోలఫలము. ౨. తక్కోలపుచెట్టునుండి పుట్టినగంధద్రవ్యము.

**కక్షటము.** సం. విశే. (అ. ఆ. అ.) కఠినమైనది.

**కక్షటి.** సం. వి. ఈ. స్త్రీ. కఠిని, బలపము.

**కక్త్రి.** వి. మల్లబంధవిశేషము, ముప్పదిరెండుపన్నాణములలో నొకటి.

వ....ఢొక్కరము నుత్తరఢొక్కరము కక్త్రి కొక్కెన కుమ్మరింపు ... మల్లుపు. ౩. ౯౯. ప్రబంధ. ౭౮.

**కక్ష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చంకయందు పుండ్లు లేచునట్టి యొకరోగము. ౨. ఏనుఁగునడుమను గట్టు మోకు. ౩. కాంచి, మొలనూలు. ౪. కాసె. ౫. గోడ. ౬. నఖము. ౭. ప్రకోష్ఠము, తొట్టికట్టు; ఇంటిలోపలిభాగము, అంతఃపురము. ౮. సామ్యము, సాటి. ౯. చంక. ౧౦. పోటి, స్పర్ధ. ౧౧. (జ్యోతి) సూర్యాదిగ్రహములు సంచరించుమార్గము. ౧౨. వెనుకప్రక్క దోఁపుకొనుచీర మొదలగువానికొంగు, కచ్చ. ౧౩. వస్త్రాదులయంచు. ౧౪. నడికట్టు. ౧౫. నడుమును బట్టి మొదలగునవి కట్టుట, మధ్యబంధనము. ౧౬. పూర్వపక్షసిద్ధాంతములలో నొకపక్షము. ౧౭. స్పర్ధాపదము, వివాదస్థానము. ౧౮. రథభాగము, రథమందలి అంతస్తు. ౧౯. గురిపెంపిరి.

**కక్షధరము.** సం. వి. అ. న. మూఁపుయొక్క సంధిస్థానము.

**కక్షపము.** సం. వి. అ. పుం. ౧. కచ్ఛపము, తాఁబేలు. ౨. కుబేరుని నవనిధులలో నొకటి.

**కక్షపాల.** సం. వి. ఆ. స్త్రీ. (ఇది సంస్కృతనిఘంటువులందుఁ గానరాదు.) కకపాల, సన్న్యాసులు చంకను దాల్చునంచి.

గీ. అక్షమాల సునస్తులకక్షపాల. సారంగ. ౩. ౧౮౧. చెన్నబ. ౨. ౨౯.

**కక్షము.** సం. వి. అ. పుం. ౧. వెనుకదోఁపుకొనెడి కోకకొంగు, కచ్ఛ. (వై. ని.) ౨. తీఁగ, లత. ౩. గడ్డి, కసవు; ఎండుగడ్డి. ౪. ఎండినయడవి. (త్రి. ని.) ౫. చంక. ౬. రాజాంతఃపురము. ౭. ప్రక్క, పార్శ్వము. ౮. ఇంటిగోడ. ౯. నౌకాంగము. ౧౦. కాంచి, మొలనూలు. ౧౧. దున్నపోతు. ౧౨. కచ్ఛము, జలప్రాయప్రదేశము. ౧౩. పాద. ౧౪. పాపము. ౧౫. చొరరానిఅడవి. (కే. ని.)

**కక్షరుహా.** సం. వి. ఆ. స్త్రీ- జలప్రాయప్రదేశమున మొలచునది- నాగముస్తె.

**కక్షశాయము.** సం. వి. అ. పుం- ఎండుగడ్డిమీఁద పరుండునది- కుక్క.

**కక్షశాయువు.** సం. వి. ఉ. పుం= కక్షశాయము.

**కక్షాపటము.** సం. వి. అ. పుం. కౌపీనము, గోఁచి.

**కక్షావేక్షకుఁడు.** సం. వి. అ. పుం. ౧. అంతఃపురపాలకుఁడు. ౨. ఉద్యానపాలకుఁడు. ౩. రంగాజీవుఁడు. (చిత్రము వ్రాయువాఁడు; నటుఁడు.) ౪. జారుఁడు, విటకాఁడు. ౫. కవి. ౬. ద్వారపాలకుఁడు.

**కక్షోత్థా.** సం. వి. ఆ. స్త్రీ. భద్రముస్తె.

**కక్ష్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రకోష్ఠము, తొట్టికట్టు. ౨. ఇంటిలోపలిభాగము. ౩. మేడయొక్క అంతస్తు. ౪. మొలనూలు, కాంచి. ౫. ఏనుఁగునడుమును గాని గుఱ్ఱమునడుమును గాని కట్టెడి మోకు. ౬. వ్రేలు. ౭. ఉత్తరీయము, పైరవాటము.

**కగ్గము.** వి. (సం. ఖడ్గః. ప్రా. పా. ఖగ్గో) కత్తి, ఖడ్గము.

గీ. కలువనెచ్చెలికానికిఁ గన్నతండ్రి, గట్టుపట్టికి దృఢవజ్రకవచ మగుచు, వెలయుఁ బగ్గంపుఁగగ్గంపుపిప్పఁగంటి, సామినగరంబు ఘరక్షీరసాగరంబు. ఘటికా. ౧. ౮౩. (పగ్గంపుఁగగ్గంపుపిప్పఁగంటిసామి= పాశాయుధుఁ డగుదేవతాశ్రేష్ఠుఁడు, వరుణుఁడు.)

**కగ్గు.** అ. క్రి. వివర్ణమగు.

(క) నల్లపడు.

(మకరాజు) చ. అరిగె నమోరుహాననసదాంబురుహంబుల హ్రాలి తత్తపో, గరిమను పేరు చెప్పి తనకగ్గిన కైదువు సూపి యుద్ధరా, వరుపముఁ బో

యి వజ్రమును నమ్మయి డిక్కిఁ గొఱంగ జేసనీ, వరమున...కకు. ౧. ౨౧౦. (చూ. ౨౦౯.)

(చ) కందు.

ఉ. కగ్గిన చెక్కులుం జెమట గా జెడు మోములు వాడివత్తలై, తగ్గిన మేనులుఁ ... నిప్ర. ౨. ౫౩.

విశ. నిసర్గమైనది.

ద్వి. నుగ్గునూచంబులై నుఱుములై జడిసి, కగ్గులై మ్రగ్గులై కకపికలగుచు, నీవిధంబున మాగధేంద్ర సైన్యంబు. అ.ను.క. ౩. ౧౭౨పా.౧౫౦.

**కచ.** సం. వి. ఆ. స్త్రీ. ఆఁడేనుఁగు, హస్తిని.

**కచంగనము.** సం. వి. అ. న. కరశూన్యహట్టస్థానము, పన్ను లేనిఅంగళ్లుఉండుచోటు. (వాచ.)

**కచంగలము.** సం. వి. అ. పుం. ౧. సముద్రము. ౨. కచంగనము. (త్రి. ని.)

**కచపక్షము.** సం. వి. అ. పుం. కేశసమూహము.

**కచపాశము.** సం.=కచపక్షము.

**కచము.** సం. వి. అ. పుం. ౧.తలవెండ్రుక, కేశము. ౨. కట్టు, బంధము. ౩.ఎండినపుండు. ౪.మబ్బు. ౫. పురువేరుశ.

**కచహస్తము.** సం.=కచపక్షము.

**కచాకచి.** సం. అవ్య. ఒండొరులజుట్టులు పట్టుకొని చేయునది (యుద్ధము-ఇది తెలుఁగున ఒండొరులజుట్టులు పట్టుకొనుచు అనునర్థమున ద్రుతాంతముగాఁ బ్రయుక్తమై యున్నది.ఇట్లే కేశాకేశి, మొ.)

క. ఆహవము చేసి రంగజ, మోహాంధులు గడిమి మెఱసి ముష్టీముష్టిఁ, బాహాబాహిఁ గచాకచి, సాహసముఁ జలంబు దివిజసంఘము వొగడఁ. కాశీ. ౫. ౧౫౦.

**కచాచితము.** సం. విశ. (అ. ఆ. అ.) వెండ్రుకలు విరియఁ బోసికొన్నది, వికీర్ణకేశము.

**కచాటురము.** సం. వి. అ. పుం. దాత్యూహము, కూనుగుండెపక్షి.

**కచామోదము.** సం. వి. అ. పుం. వెండ్రుకలకుఁ బూసికొనునొకగంధద్రవ్యము.

**కచికు్క=ఖచికు్క.**

వి. (పొడుచుటయం దగుధ్వనికి అనుకరణము.)

ద్వి. వికటాసిఁ గొంది కచికు్కనఁ బొడిచె. విష్ణు. ఉ. ౪. ఆ. (శ.ర.)

**కచుఁడు.** సం. వి. అ. పుం. బృహస్పతికొడుకు.

**కచువు.** సం. వి. ఉ. స్త్రీ. ఒకజాతిదుంప.

**కచేలము.** సం. వి. అ. న. లేఖ్యపత్త్రములను గట్టెడుసూత్రాదికము, వ్రాఁతప్రతులసూకులను గాని కాగితములను గాని ఒకటిగాఁ గట్టుదారము మొదలగునది.

**కచోరము.** వి. (సం. కచ్చూరకః) కచ్చూరముశ. (దీనినే గంధకచోర మందురు.)

**కచ్చె.** వి. (సం. కచ్ఛః) ౧. వెనుకకోఁపుకొనెడు దోపతికొంగు.

ద్వి. నెడనెడఁ దనకచ్చ పిడంగఁ బాఱి. ద్వి.హరి శ్చ. ఉ. ౧౧౦౭.

౨. గోఁచి, గుహ్యాంబరము.

సీ. మొలఁ గచ్చకట్టుపై మలఁగినపచ్చనినునుఁ గొంగు దండుగా నులిచి చుట్టి. హరి. పూ. ౭. ౧౩.

౩. ఒట్టి, కాసె.

ఆ. కచ్చ యమరఁ బట్టి కాళ్లను జేతులు, వ్రేల మత్తగజములీల మెఱయ...మల్లు లెత్తివైచె. భార. విరా. ౨. ౧౭.

౪. ఉపస్థేంద్రియము.

గీ...కచ్చ,యన నుపస్థాఖ్య చెలఁగు...ఆం.భా. ౨. ౧౩౬.

జ: కచ్చకాఁడు, కచ్చించు2.

**కచ్చెకాఁడు.** వి. (√కచ్చె)-కాపేసవంతుఁడు-ముని.

గీ. ఆలములు లేమి డొక్క వెన్నంటికొనఁగఁ, దెలివి గలకచ్చుఁదోయి గుంటలు పడంగ...అ చ్చటికి వచ్చె వేలుపుఁగచ్చకాఁడు. కుచేల. ౫. ౪౦.

**కచ్చటము.** సం. వి. అ. న. గజపిప్పలి.

**కచ్చడము¹.** వి. (సం. కచ్ఛటికా. క. కచ్చట.) కౌపీనము, గోఁచి.

గీ. జమిలి మొలత్రాట నినుపకచ్చడ మమర్చి. విక్ర. ౨. ౯౨.

గీ. ... ఇనుప, కచ్చడాల్గట్టుకొనుము న్ముచ్చు వెల్ల. మనుచ. ౨. ౮౩.

**కచ్చడము².** వి. నూనె లోనగునవి తెచ్చెడి బండి. (శ. ర.)

కచ్చడపుబండి = పెద్దగట్టిబండి. (గ్రా.)

**కచ్చరము.** సం. విశే. (వా. క. అ.) ౧. కుత్సితమైనది. ౨. ముఱికిగలది, మలినమైనది. వి. అ. న. తక్రము, మజ్జిగ.

**కచ్చి¹.** వి. సాలెవాఁడు లాకలియొత్తులను పడుగునందుఁ జొప్పించెడుసందు. (శ. ర.)

**కచ్చి².** వి. కచ్ఛదేశపుగుఱ్ఱము.

సీ. ... దేశభేదమహానూభిజలు కాంభోజ తురకికి కచ్చియనంగఁ దోఁచుచుండు. ఆం. భా. ౨. ౧౯౬.

**కచ్చించు¹=కచ్చు¹.** స. క్రి. గవ్వలాటయున్నగు ఆటలలో కాయలుపడపు. (శ. ర.)

**కచ్చించు².** అ. క్రి. (√కచ్చ) కచ్చకట్టుకొను, కచ్చబిగించుకొను.

క. కచ్చించి మల్లు లిద్దఱు, మచ్చరమున లావు మెఱయ మస్తకయులు రెం, డిచ్చఁ జనుదెంచుచాడ్పున, నచ్చటికే తెంచి నిలిచి రధిపతి యెదుర౯. హరి. పూ. ౯. ౭౫.

ద్వి. అచ్చెరువొంద నేకాంతరామయ్య, కచ్చించుకొని యంకకాఁడును బోలె...ఆర్చి బొబ్బిడి పొంగి... బస. పు. ౬. ౫౮౯పం.

**కచ్చిక.** వి. కాలినపిడుక. ఆం. భా. ౨. ౨౪౨.

**కచ్చితము.** విశే. (సం. ఖచితః.) హెచ్చుతగ్గులు లేకుండ సరిగా నుండునది.

**కచ్చు¹=కచ్చించు¹.** స. క్రి. గవ్వలాటయున్నగు ఆటలలో కాయలుపడపు. (శ. ర.)

**కచ్చు².** వి. గర్వము, బింకము.

సీ. అలివింటిముల్కచ్చు లడఁగించు జిగి హెచ్చు నాయకుం బగుకచ్చుఁదోయితోడ. మనుచ. ౬. ౧౦౨.

సీ. ప్రాతేయకిరణబింబంబు వెల్వెలఁబాఱె యస్తాచలంబుపై నల్లమిల్ల, వరుసతో నోషధీవల్లీమతల్లులకాంతి దైన్యవలక్ష్మికచ్చు వదల. గీ. భానుకిరణంబు లొకకొన్ని ప్రాకె ననఁగ. కాశీ. ౧. ౧౨౨.

౨. డాబులు

సీ. గెలుపసిరాజాపు బలుగచ్చులును మెండు... వేమ శ. ౧౮.

(మల్లుబు)వ... పెచ్చుమల్లాడియుఁ, గచ్చులు సేసియు. ప్రబంధ. ౮౯.

కచ్చుఁదనము=గర్వము, ఔద్ధత్యము.

గీ. చిలుపమేపర తెలఁపులొపలనె వచ్చి, వినతుఁడైయుచ్చుఁగలకచ్చుఁదనము హెచ్చ, నేమి కార్యంబు పుటియించు నెఱుకసేయుఁ, డని న...సమీరా. ౬. ౧౪౧. (చూ. ౧౨౪.)

జ: కచ్చుకొను.

**కచ్చు³.** వి. ౧. తొడ, పళ్ళు.

ఉ. ... అల్లుము, ద్రించినజాడఁ దెల్పె సువతీముఖపంబు పరిచ్ఛదచ్ఛటా, కంచుకితోత్పలంబుఘనకచ్చునఁ జిక్కె యచంచలాకృతి౯. వసు. ౪. ౧౩౩.

౨. సిగబంతి.

గీ. భానుబింబంబు వొడిచెఁ బ్రభాతలక్ష్మి, కబరిభారంబుమీఁది చెంగల్వకచ్చు. కాశీ. ౩. ౨౩౮.

**కచ్చె**[4]. వి. (సం. కాంక్షా.) అపేక్ష, కోరిక. (పుండరీకేక్షణుఁడు) సీ. క్షీరోదమధ్యస్థలీరత్న నగగుహాగర్భనివాసంబుకచ్చ వదలి... గీ. పుండరీకునిమానసాంభోజపేఠి, ఖండతుష్టిపరైయుండు నిండుకొలువు. పాండు. ౨. ౧౧.

**కచ్చెకొను.** అ. క్రి. (√కచ్చె[2]) పట్టుపట్టు, పంతముపట్టు.

గీ. ...పట్టుపట్టె, ననెడిమాటనుఁ దగుఁ గచ్చకొనెననంగ. ఆం. భా. ౩.౧౨౯.

గీ. అమరపతికొల్వునను వచ్చె సుమశరుండు, పలుకుపాలిండ్లగుబ్బెలిరతీరుఁబోండ్ల, యూరుజఘనపేరజములఁ జేయు లప్పుడు చూపి, కచ్చకొని మూఁడు చెప్పంగ నచ్చెరగణి. చంద్రా. ౩. ౨౭.

క. ఉచ్చైశ్శ్రవమగుతేనపై, నచ్చలరిడి సెప్పెగా తుదృష్టిశ్రవుఁడై, హెచ్చెనని వేల్పుతేజిం, గచ్చకొని హసించుపీటఁ గల్గుహయంబుల్. చమ. ౧. ౩౦.

**కచ్చెవాసము.** వి. ఇండ్లను వేసెడు పెద్దవాసము. (కా.ర-మూలములో చొప్పినవాసము. అని బ్రా.)

**కచ్చె**[1] **(చ్చియ).** వి. (సం. కక్ష్యా) ౧. కలహము.

చ. మఱియొకయుక్తిఁ రక్కసులు మన్నిగొనంగ ను వారిలోన నొం, డొరులకుఁ గచ్చెపుట్టుటకు నొక్కనిచేఁడియ నొక్కఁ డొందన, క్కుఱ జనియింపఁ జేయనలె ... పార్వ. ౨. ౧౨౫.

౨. విప్రలాపము, విరోధోక్తి.

గీ. ...కచ్చె పగటు కంట, నమ్మ నాఁగను విప్రలాపమ్ము చెలఁగు. ఆం. భా. ౧. ౧౧౬.

జ: కచ్చెపోతు.

**కచ్చె**[2] **(చ్చియ).** వి. (సం. కచ్ఛ) కచ్ఛభేదము, ఒకవిధమైనబట్టమడత.

సీ...కచ్ఛభేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె, చుంగు రింగు నెఱిక చింగు నెతి యనంగ... ఆం. భా. ౨. ౧౫౩.

**కచ్చెపోతు.** విశే. (√కచ్చె[1]) కలహశీలుఁడు.

**కచ్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కౌపీనము, గోఁచి.

శ్లో. కచ్ఛా కచ్ఛటికా కక్షా పటీ కౌపీనమిత్యపి. (త్రి. ని.)

౨. చీరిక, ఈలపురుగు. ౩. వారాహి, సప్తమాతృకలలో నొకతె.

**కచ్ఛటిక.** సం. వి. ఆ. స్త్రీ. కౌపీనము, గోఁచి. (త్రి. ని.)

**కచ్ఛపము.** సం. వి. అ. పుం. ౧- ముఖపుటమును శరీరములోఁ జొనుపుకొని రక్షించుకొనునది; కప్పెరవంటి మేనిచిప్పచేత తక్కిన అంగములను రక్షించుకొనునది- తాఁబేలు. ౨. కుబేరునినవనిధులలో నొకటి. ౩. మల్లబంధవిశేషము.

**కచ్ఛపి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుతాఁబేలు. ౨. సరస్వతి యొక్క వీణె. ౩. క్షుద్రరోగభేదము, మొటిమ.

**కచ్ఛము.** సం. వి. అ. పుం. న-నీటిచేఁ గప్పఁబడినది- కసెను, జలప్రాయప్రదేశము, అనూపము. పుం. ౧. తటము, దరి. ౨. నౌకాంగము, పడవయొక్క యొకానొకభాగము. ౩. వెనుకనోఁపికొనెడి కోవశికొంగు, కచ్ఛ. ౪. కూర్మకర్పరము, తాఁబేటిచిప్ప. (వాచ.) ౫. తున్నకము, నందివృక్షము. ౬. ఒకానొకదేశము. ౭. కూర్మపాదము, తాఁబేటికాలు. (కే. ని.) ౮. ప్రక్క. ౯. గోఁచి. (కే. ని.)

**కచ్ఛరుహా.** సం. వి. ఆ. స్త్రీ - జలప్రాయప్రదేశమున మొలచునది- దూర్వ, గరిక.

**కచ్ఛుఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ- గజ్జిని పోఁగొట్టునది- ౧. పటోలము, చేఁదుపొట్ల. ౨. హపుషాభేదము, కత్తుబోడసరము. (చూ. కచ్ఛువు.)

**కచ్ఛుర.** సం. వి. ఆ. స్త్రీ. ౧.గంట్లకచోరము. ౨. శూకశింబి, దూలగొండి. ౩. వాఁకుడు. ౪.దురాలభ, తీఁటకసింద. ౫. గ్రాహిణీవృక్షము, శేగడిదూలగొండి.

**కచ్ఛురుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. గజ్జిగలవాఁడు. ౨. జారుఁడు.

**కచ్ఛువు.** సం. వి. ఊ. స్త్రీ. (ఉకారాంతముకూడ నని-కల్ప,విల్యమ్సు.) విచర్చిక, గజ్జి.

**కచ్ఛూమతి.** సం. వి. ఈ. స్త్రీ. శూకశింబి, దూలగొండి.

**కచ్ఛూరకము.** సం.వి.అ. పుం. గంటికచోరము.

**కచ్ఛోటిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧.కచ్ఛ,వెనుకకోఁపి కొనెడికోపతికొంగు. ౨. బట్టయొక్క-అంచు.

**కచ్ఛోరము.** సం. వి.అ.న. శటి,గంట్లకచోరము.

**కజము.** సం. వి. అ. న-నీటఁ బుట్టినది-పద్మము, తామరపువ్వు.

**కజాతము.** సం=కజము. చమ. ౨. ౮౩.

**కజాయము**=కజ్జము¹.

శా...కజాయంబు లిం,దన్నె నున్నవి క్రొత్తయట్టికల...పాండు. ౪. ౨౭౬.

**కజ్జ**=కజ్జము¹.

క...ఒకచకోరిక,కులుకుచు నొకకజ్జ మగనిఁ గుడువం జేసెన్. కకు.౩. ౧౦౮. (ప్రయోగాంతరములేదు.)

**కజ్జము¹**=కజాయము,కజ్జ, కజ్జాయము. వి.(సం.ఖాద్యం. ప్రా. ఖజ్జో) ఖాద్యము,భక్ష్యము;భక్ష్యవిశేషము, అపూపము.

సీ. కజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు ధృతరాష్ట్రసుతుఁడు పుత్తెర...భార. ఉద్యో.౩. ౧౭౦.

మ. కలమాన్నంబును నొల్పుఁబప్పుఘృతముల్ గజ్జంబులున్ ఓండివం,టలు... జై. భా. ౬. ౯౨.

గీ...అపూపాభిధానమ్ము దనరుఁ గజ్జ,మప్పమప్పచ్చి కజ్జాయ మనఁగ. ఆం. భా. ౨. ౨౫౮.

**కజ్జము²**=కర్జము.వి (సం.కార్యం)కార్యము,పని.

ద్వి. కజ్జలునకు వినిపింపంగ నతఁడు,కజ్జ మెంతే నియుఁ గలదు...బస.పు. ౬.౬౩౬ పం.

**కజ్జలధ్వజము.** సం.వి.అ.పుం-కజ్జలము ( = మసి) ధ్వజముగాఁగలది-దీపము.

**కజ్జలము.** సం. వి. అ. న. ౧. కాటుక, అంజనము. ౨. సిరా. ౩.దీపపుమసి. ౪. మేఘము. ౫. ఉత్పలము, కలువ. (కే. ని.)

**కజ్జలరోచకము.** సం.వి. అ.పుం. న. దీపస్తంభము.

**కజ్జలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. రసము గంధకము కలిపి నూరినమందు. ౨. సిరా. ౩. దీపపుమసి. ౪. ఒకరూపు చేఁప.

**కజ్జాయము**=కజ్జము¹.

గీ. బలిసి కజ్జాయ మాయ్యారె పాయసములు.రా. వి. ౨. ౧౦౫. ఆం. భా. ౨. ౨౫౮.

**కజ్జూరము**=కజ్జూరము.

ఉ. ...ఖర్జూరము కజ్జూరం బనఁగ శోభిలు ... ఆం. భా. ౨. ౭౯.

**కజ్జూరము**=కజ్జూరము. వి. (సం. ఖర్జూరః. ప్రా. ఖజ్జూరో.) ఒకానొకఫలవృక్షము, పేరీఁదు.

మ. సురపొన్నల్ కలిగొట్లు చందుగులు కజ్జూరంబు లప్పొంపిలున్. యయా. ౫. ౪౯.

**కట**=అకట. అవ్య. (సం. కష్టం. ప్రా. కట్ఠం.) (సంతాపమును దెలుపును.)

ఉ. జీవముఁ బాయువాఁడఁ గట చిత్తజు బారికి నోర్వ వమ్మ నే.శక్ర.౩.౪౬.దశకు.౬.౯౯.

**కటంకటము.** సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. బంగారు. ౩. చిత్రమూలము.

**కటంకటుఁడు.** సం.వి.అ.పుం. ౧.విఘ్నేశ్వరుఁడు. ౨. శివుఁడు.

**కటంకటేరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పసుపు. ౨. మ్రాని పసుపు.

**కటంబకుఁడు.** సం. విశే. (అ. బికా. అ.) కూరలు వండువాఁడు.

**కటంబము.** సం. వి. అ. పుం. ౧. వాద్యము. ౨. బాణము.

**కటంభర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రసారిణి, గొంతెమ గోరు. ౨. కటుకరోహిణి. ౩. కలంబిక, తీఁగ బచ్చలి. ౪. గలిజేరు, పునర్నవ. ౫. మూర్వ, చాఁగ. ౬. హస్తిని, ఆఁడేనుఁగు. ౭. కప్ప. ౮. మణిశిల.

**కటంభరము.** సం. వి. అ. పుం. ౧. జ్యోతిష్మతి, మాలేరు. ౨. శ్యోనాకవృక్షము, దుండిగము.

**కటకట**[1]**.** అవ్య. = అకట. ('కట' కు ఆమ్రేడితరూపము.)

(సంతాపమును దెలుపును)

చ. ...కృష్ణుఁడు లేనిసేమ్మటం, బటుతర దేహాలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁ బోక నేఁ, గటకట పూర్వజన్మమునఁ గర్మము వెట్టిగఁ జేసినాఁడనో. భాగ. ౧. ౩౭౩.

వి. ౧. బాధ, కష్టము.

చ. ...అలంత నవ్వుగుఁగ్, కటకటఁ జెంది వండ వడగాడుపు వీవఁగఁ జొచ్చె హెచ్చుగన్. ధర్మ. ౨. ౧౨౦.

౨. కోపము. (చూ. కటకటపడు.)

జః కటకటపడు.

**కటకట**[2]**.** వి. కొఱుకుపట లోనగువానియందలి ధ్వనికి అనుకరణము.

ద్వి. గొటగొట గొండ్రించి కోఱ లొండొంటిఁ, గటకటఁ దాఁకింప గర్వంబు గలఁగి. నవనాథ. ౩. భా. (చూ. ౪. ౯-గొండ్రించు.)

**కటకటప(ఁబ)డు.** అ. క్రి. (√కటకట[1]) ౧. కష్టపడు, బాధపడు, సంతాపపడు.

(కపులు) క. ఇటువలె వెదకియుఁ దమత్రి, ప్పట గురుపిరహితులమంత్రపతనం బెటు ల, ట్లట మటమై పోఁ జొచ్చినఁ, గటకటపడి ... రామా. ౬. ౬౫.

క. ...మనమున మిక్కుటమై పెరిఁగెడు వెతలం, గటకటపడి యిట్లను దగన్ దనలోనన్. గణిక. ౪. ౯.

క. ...క్రవ్యాదుల, క్రందున నీవీను లిపుడు కటకటఁబడవే. భార. ద్రో. ౨. ౩౩౫.

౨. కోపపడు.

క. అలయక యంపఱుఁ జెప్పం, గలయంతయుఁ జెప్పఁ గతఁడు గటకటఁబడి యా, కొ్కలువు వెడలిపోనియ్యం డమ్ములు కర్ణుఁడు రాజలోకమునం గోనఁగన్. భాగ. ఉద్యో. ౪. ౮౦.

వ. అనుపలుకు లాకర్ణించి కర్ణుండు కటకటంబడి కుంభసంభవున కిట్లనియె... భాగ. విరా. ౪. ౯౭.

శ్లో. ఇత్యేవంవాదినం ద్రోణం కర్ణః క్రుద్ధోఽభ్యభాషత. సం. భార. ౪౦. ౨౮.

వ. గురుం డప్రియుండయ్యును గటకటంబడక యతనితో నిట్లనియె. భార. ద్రో. ౧. ౩౮౯.

**కటకటము.** సం. వి. అ. న. సముద్రమునఁ బుట్టిన యుప్పు. (వై. ని.)

**కటకటా** = అకట.

గీ. కటకటా యనునప్పుడ గద్గదిక నొడమె. మనుచ. ౩. ౯౧.

సీ. కట్టా యనంగను గటకటా యనఁగఁ గటా యనంగ బతార్థమై యెసంగు. ఆం. భా. ౩. ౬౭.

**కటకటాలు.** వి. బ. ఇనుపమూఁచలు లోనగువానిచే ఏర్పఱచెడియడ్డు. (శ. ర.)

**కటకము.** సం. వి. అ. పుం. ముష్టి, పిడికిలి. పుం. న. ౧. కడియము, వలయము. ౨. పర్వతమధ్యభాగము, కొండనడుము. ౩. హస్తిదంతమండనము, ఏనుఁగు కొమ్మునకు వేసెడుపొన్ను. ౪. సముద్రలవణము.

౫. రాజధాని. ౬. శిబిరము, దండు విడియుచోటు. ౭. చాఁప, కటము. ౮. ఓడ్రదేశపు రాజధాని. ౯. సైన్యము.

**కటకరము.** వి. ఒకానొకమృగము, కడఁతి, గంధర్వము.

సీ.... గంధర్వ మాను గడంతి కటకర మంచనఁ గాను. ఆం. భా. ౨. ౮౫.

**కటకసరులు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. బంగారుతీఁగలు గంగాజలమ్ములు కస్తూరినిగరాలు కటకసరులు. హంస. ౪.౧౨౮. ప్రబంధ. ౧౧౨.

**కటకాముఖము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

శ్లో. తర్జనీమధ్యమామధ్యే పుంఖోంగుష్ఠేన పీడ్యతే, యస్మిన్నానామికాయోగః సహస్తః కటకాముఖః. (శృంగారదీపిక.)

**కటకారుఁడు.** సం. వి. అ. పుం. ఒకసంకీర్ణజాతివాఁడు.

శ్లో. శూద్రాయాం వైశ్యతశ్చౌర్యాత్ కటకార ఇతి స్మృతః. ఔశనస స్మృతి. (కటకరుఁడు- అని. వై. ని.)

**కటకోలము.** సం. వి. అ. పుం. పతద్గ్రహము, తమ్మపడిగము.

**కటఖాదకము.** సం. వి. అ. పుం. ౧. గాజుపాత్ర. -శవమును తినునది- ౨. నక్క. ౩. కాకి.

**కటఖాదకుఁడు.** సం. విణ. (అ. దికా. అ)-గడ్డికూడ తినువాఁడు-సర్వభక్షకుఁడు, నియమము లేక అన్నియును తినువాఁడు.

**కటకెట.** వి. ౧. వానచినుకులు రాలుటయందగు ధ్వనికి అనుకరణము.

క. కటకెట లొటలొట రాలెడు, పొటపొటచినుకుల ధరిత్రిపొడ నట్టువడన్, సొటసొటనాఁకట సోలుచుఁ, దటతటపడు చాతకములదైన్యము వాసెన్. వైజ. ౨. ౧౮౬.

౨. (దంతములు) ఒరయుటయందగు ధ్వనికి అనుకరణము.

ద్వి. కఠినోరుదంష్ట్రలు కటకెట నొరయ. ద్వి. భాగ. ౭. స్కం. (శ. ర.)

**కటనము.** సం. వి. అ. న. ఇంటికప్పు.

**కటప్రువు.** సం. విణ. (ఊ. ఊ. ఉ.) ౧. తనయిచ్చవచ్చినట్లు నడచుకొనువాఁడు, కామచారి. ౨. జూదమాడువాఁడు. వి. ఊ. పుం. ౧-నలతృణమున సంచరించునది - కీటభేదము. ౨. శివుఁడు. ౩. రాక్షసుఁడు. ౪. విద్యాధరుఁడు. స్త్రీ. ఖేలగతి, విలాసగమనము. (కే. ని.)

**కటప్రోథము.** సం. వి. అ. పుం. న. పిఱుఁదునందలియున్నతప్రదేశము.

**కటభి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. మానేరు, జ్యోతిష్మతి. ౨. అపరాజిత, సోమిదము.

**కటమర.** వి. వి. (కటము + మర - 'కటుమర' అని. శ. ర.) హనువు, చెక్కిలిమీఁదిభాగము.

సీ. ... హనువు కటమర యందు చనఁగా నొప్ప ... ఆం. భా. ౨. ౧౮౩.

సీ. తళుకుఁజెక్కులు వెల్లఁదనము మెల్లనఁ దాల్పఁ గనరానికటమరల్ పెనుపు నొందె. చంద్రా. ౧. ౬౮.

సీ. గండభాగంబులఁ గటమరలందును బరియసిఁ జొనుప నప్పగతుఁ దార్చి. భోజసుతా. ౪. ౧౦౫.

**కటమాలిని.** సం. వి. ఈ. స్త్రీ. కల్లు, మద్యము.

**కటము.** సం. వి. అ. పుం. న. ౧-మదజలము కురియునది-ఏనుఁగుచెక్కిలి. ౨. వలయము, కడియము. ౩. నల మనెడితృణము. ౪. చాఁప. ౫. కాలకూటవిషము. ౬. గ్రామాదులప్రాంతప్రదేశము. ౭. సమయము. ౮. తృణము, గడ్డి. ౯. శవము. ౧౦. శవరథము, పాడె. ౧౧. శ్మశానము. ౧౨. జూదమున పాచికలుపడుటయందలి భేదము. (మృచ్ఛ.

౨.౯.)౧౩. మొల.౧౪. పిఱుఁదు. ౧౫. చెక్కిన వ్రాఁత.౧౯.సముద్రలవణము. ౨.సొంటి.(వై.ని)

**కటప్రణుఁడు.** సం. వి. అ. పుం. భీమసేనుఁడు. (త్రి.ని.)

**కటశర్కర.** సం.వి ఆ. స్త్రీ. ౧.ఒకానొకయోషధి. ౨. ముక్తాఫలము, ముత్తియము.

**కటా**=అకట.

మ....కీర్తింపఁగాఁ,దగునీసంగతి కీడునం దొడరనే దైవంబుచెయ్యిం గటా. నిర్వ.౫.౧౦౩. ఆం. భా. ౩. ౬౭.

**కటాక్షము.** సం. వి. అ. పుం. అపాంగదృష్టి, కడగంటిచూపు.

**కటాక్షించు.** సం. స. క్రి. ౧. కడగంటఁ జూచు.

వ....కూర్మి రాణి యైననారాయణిం గటాక్షించి హీనస్వరంబున....పరాహ. ౨. ౬౫.

౨. అనుగ్రహించు.

(వ్యవ) నన్నుఁ గటాక్షించి వదలిపెట్టినాఁడు.

**కటాయనము.** సం. వి. అ. న. వీరణమూలము, అవురువేరు.

**కటాయించు.** స. క్రి. ఎగఁబెట్టు, ఎగవేయు, (ఋణాదులు) అపహరించు.

సీ. పైక మీఁజాలక బాకీ కటాయించి యొఱగొడ్డెములఁ బల్కుచుండినామొ. రంగా. ౨. ౧౭౧.

**కటారము**=కటారి.

(బాఁకు.)

వ. ...గదల నడిచియుఁ గటారంబులఁ బొడిచియు...కరవాలంబుల వ్రేసియు. భాగ. ౧౦. ఉ.౪౧౮.(చి.ని.పా-'కుఠారంబుల' ముద్రి.)

**కటారి(రు).** వి. (సం.కఠారః. క.కటారి.)కత్తి; బాఁకు.

క. ఈరేడుజగములం దిఁక, నేరీ నీరీతిగోతు లెన్నికఁగను నో, యూర్యరీ తీరగుకులుకుమి,టారీ ఏల తేలినేమ్పకటారీ నారీ.రసిక.౩.౮౧.

చ....భర్తయుక్, శరమొకఁ డేయఁ ద్రెళ్ళక వెస నిన్నిగుడక్ నఱకెక్ గటారునన్. ఉ. రా. ౭. ౪౧౬, ౨౧౧.

జ: కటారికత్తియ, కటారికాఁడు.

**కటారి(రు)కత్తియ(త్తె).** విశే. (√కటారి.) కటారికలది (ఆఁడుది.)

చ...ఒక్కొకతఱిం బువుఁబోండ్లు కటారికత్తియల్. కళా. ౧. ౩౧.

**కటారి(రు)కాఁడు.** విశే. (√కటారి.) కత్తికలవాఁడు.

చ. బిరుదుకటారికాండ్రు...కళా. ౮. ౧౦౧.

ఉ...చంపఁగ వచ్చుకటారుకానిచం,దాన... కాళ. ౨. ౧౪౦.

**కటారుఁడు.** సం. వి. అ. పుం. ౧. కాముకుఁడు. ౨. పట్టణవాసి.

**కటాలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వికృతమగు చెక్కిళ్లుకలవాఁడు.

**కటాహము.** సం. వి. అ. పుం. ౧. బూరెలమూఁకుడు మొదలగు మూతివెడల్పుగలపాత్రము,బాణలి; పెనము. ౨. తలపుర్రె. ౩. తాఁబేటివెన్నుచిప్ప. ౪. అప్పుడే కొమ్ములువచ్చుచున్న గేదదూడ. ౫. మట్టిదిబ్బ. ౬. చెవులుగలగంగాళము.౭. చేట. ౮.ఒకానొకదీవి.౯.నరకభేదము.

**కటి.** సం. విశే. (న్. నీ. న్.)కటముగలది. వి.న్. పుం. ఏనుఁగు. ఇ, ఈ. స్త్రీ-వస్త్రాదులచేతఁ గప్పఁబడునది-౧. మొల. ౨. పిఱుఁదు. ఈ. స్త్రీ. పిప్పలి.

**కటిక**[1] వి. ౧=కట్టిక. (చూ. కటికది, కటికవాఁడు[1].) ౨. మల్లసాధనవిశేషము. ఆం. భా. ౨. ౨౦౭.

జ: కటికది, కటికవాఁడు[1].

**కటునిష్పావము.** సం. వి. అ. పుం. ఏటివాపున పెరుఁగు నొక జాతి అనుము.

**కటుపత్త్రము.** సం.వి.అ.పుం. ౧.పర్పాటకము. ౨. సితార్జకము, తెల్లగగ్గెర.

**కటుపత్త్రిక.** సం.వి. ఆ. స్త్రీ. కంటకారి, వాఁకుడు.

**కటుఫల.** సం. వి. ఆ. స్త్రీ. శ్రీవల్లీవృక్షము.

**కటుఫలము.** సం. వి. అ. పుం. ౧. చేఁదుపోఁక ౨. చలువమిరియము. ౩. చేఁదుపొట్ల.

**కటుబీజ.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి.

**కటుభంగము.** సం. వి. అ. పుం. సొంఠి. (కల్ప.)

**కటుమంజరిక.** సం.వి. ఆ. స్త్రీ. అపామార్గము, ఉత్తరేను.

**కటుమోదము.** సం. వి. అ. న. ఒకానొక సుగంధద్రవ్యము, జవ్వాది.

**కటురము.** సం. వి. అ. న. తక్రము, మజ్జిగ.

**కటురవము.** సం. విశే. (అ. ఆ. అ.) పరుషధ్వని కలది. వి. అ. పుం. ౧. కప్ప. ౨. పరుషధ్వని.

**కటురోహిణి.** సం.వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి.

**కటువార్తాకి.** సం. వి. ఈ. స్త్రీ. శ్వేతకంటకారిక, తెల్లవాఁకుడు.

**కటువు.** వి. (సం. ఖాటిః) పాడె. (శ. ర.)

**కటువు.** సం. విశే. (ఉ. ఉ, ట్వీ. ఉ.) ౧. కారముగలది (రసము). ౨. పరుషము, ఇంపుకానిది, అప్రియము. (మాట.) ౩. సువాసనగలది. ౪. ముగ్గంధమైనది, చెడుకంపుకొట్టునది. ౫. మత్సరముగలది, దీర్ఘక్రోధముకలది. ౬. తీంత్రమైనది, వాఁడిమిగలది. వి. ఉ. పుం. ౧. కారము. (షడ్రసములలోనొకటి) ౨. గుగ్గిలము. ౩. నెల్లి. ౪. వెలిగారము. (వై. ని.) స్త్రీ. ౧. కటుకరోహిణి. ౨. నల్లావ. ౩. ప్రేంకణము, మోరటి. న. ౧. అకార్యము. ౨. దూషణము.

**కటుస్నేహము.** సం. వి. అ. పుం. ౧. గౌరసర్షపము, తెల్లావ. (రాజని.) ౨. ఆవ, సర్షపము. (త్రి. సి.)

**కటూత్కటకము.** సం. వి. అ. న. సొంఠి.

**కటూత్కటము.** సం. వి. అ. న. ౧. అల్లము. ౨. త్రికటుకము, సొంఠి పిప్పలి మిరియాలు. (వై. ని.)

**కటోదకము.** సం. వి. అ.న. తిలోదకము. (సం. భాగ. ౭. ౨. ౧౭. వ్యాఖ్య.)

**కటోరము.** సం. వి. అ. న. పాత్రభేదము.

**కటోలము.** సం. విశే. (అ. ఆ. అ.) కారమైనది. వి. అ. పుం. కటురసము, కారము.

**కటోలవీణ.** సం. వి. ఆ. స్త్రీ. మాలవాయించు వీణె.

**కటోలి.** సం. వి. ఈ. స్త్రీ. మాలది, చండాలస్త్రీ.

**కటోలుఁడు.** సం. వి. అ. పుం. చండాలుఁడు, మాలవాఁడు.

**కట్ట**[1]. వి. (√కట్టు. క. కట్టె.) ౧. ఒకటిగా చేర్చికట్టిన వస్తుసముదాయము; గుంపు.

సీ. ...దర్భ, కట్టయు జలపూర్ణకలశంబుఁ బువ్వులు మఱచి వచ్చితి నేటిమడుఁగు నోఁగ. భాగ. అను. ౨. ౪౪౬.

క. కైదువకట్టలు... రా.వి. ౨. ౩౨.

వ. ...కట్టలుకం గట్టలువడ నేయుకట్టెఁడిమునియంపకోలకట్టియల... వసు. ౨. ౧౪౦

౨. చెఱువులోనగువానిగట్టు, ఒడ్డు, తీరము; సేతువు, ఆనకట్ట.

(తటాకఫలశ్రుతి) ఆ. ...కట్టఁ, దగినతూము లిడిన సుగతి గలుగు. భార. అను. ౩. ౩౩౧.

ఆ. ... ఎకిమీఁడు, దండుతోడఁ గదలిఁ దత్తీయ నరిగి, కట్టఁ గట్టఁ దివురుపట్టునఁ జెలఁగి యా, న్నీరువుప్ప పొంగి నింగి ముట్టె. అచ్చ. రా. యు. ౭౩.

**కట్ట²**=అకట. (శ.ర, బ్రా.)

**కట్టకడ.** వి. (కడ+కడ-క.కట్టకడ) మిక్కిలికడ.
క....నిఖిలాశలకట్టకడలకు...లక్ష్మీ. ౨.౮౯.

**కట్టడ.** వి. (√కట్టు. త. కట్టళై.) ౧.ధర్మము, విధి.
క.ఇది ధర్మం బసలీనుల, కిది విధి మాతాపితృప్రహీణుల కహహా, యిది కట్టడ తిరిపరులకు. కాశీ. ౭. ౫౨.

౨. నియమము, కట్టుపాటు, ఏర్పాటు.
క.ఏయేకట్టడ లెవ్వరి, కా యాకట్టడలు తప్పక ధపతి ప్రజలన్, నాయమునఁ బ్రోవ వలయుఁ గృ, పాయుతుఁడై తస్కరాదిబాధ లుడుపుచున్. కళా. ౭. ౨౬౪, ౬. ౧౦౦. ఆం. భా. ౨. ౧౭౪.

౩. తీరు, విధము.
క. వీరలమునివేషంబుల, కారణమునఁ గాక యొడలికట్టడయు ముఖ, శ్రీరామణీయకంబు మ, హీరమణునియట్ల కాదె యిరువుర కరయన్. నిర్వ. ౧౦. ౧౨౦.
ద్వి. ఈచక్కఁదనమును నీనేర్పు పెంపు, రాచకట్టడ వీఁడె రాజు గానోపు. ద్వి. సిం. భాగ. ౩. ౪౯. పా.

౪. ప్రకృతి, స్వభావము.
చ....ఏఱులు నిండి పాఱినం, గతుకఁగఁ జూచుఁ గుక్క తనకట్టడ మీఱక యెందు భాస్కరా. భా. శ. ౫.

౫. ప్రతిఫలముగా నిచ్చు ద్రవ్యము.
సీ. చేతి కై దేసి వేల్ శివరాయలవరాల నెలకట్టడలపటాణీల్గ నిబు, లు...రా. వి. ౫. ౧౩.
సీ. నిరుపమోత్తమతపఃపరమపుణ్యంబులు కట్టడయైనళ్ళం గారవతులు. ... గీ. వచ్చి రచ్చరలనిమిషస్వామికడకు. కవిక. ౬. ౪౫.

విణ. నియమితము, ఏర్పాటైనది.
గీ...రాజులరికి నిచ్చినకన్నియ లడఁకువలను, గదిసి కట్టడయగుమాడిగములు సేయఁ, బచ్చ సింగంపుగద్దియమైఁ జెలంగె. యయా. ౧. ౯౮.

**కట్టడచేయు.** స. క్రి. (√కట్టడ.) ౧.నియమించు, ఏర్పాటు చేయు; ఆజ్ఞాపించు.
ద్వి....పొల్లులవెనుకఁ బోద్రోరఁ, గడఁక వసిష్ఠునిఁ గట్టడ చేసి. రం. రా. అయో. ౧౩౬౬. పా. ౩౧పం.
గీ. అంత వసుధ్యాదిఁ జౌర సుత్రియములఁ జూచి, తెమ్మని సువేషు దవ్వులదివి కేఁగు, మనుచుఁ గట్టడసేయఁగా...శుక. ౨. ౨౧౧.

౨. దయచేయు, అనుగ్రహించు.
గీ...నిన్ను...బహునమాధీశ్వరత్వంబుఁ బ్రార్థనంబు, సేయుచున్నాఁడఁ గట్టడసేయు మయ్య. ఉ. రా. ౧. ౨౨౫, ౨. ౧౮౫.

**కట్టడము.** వి. (√కట్టు-క. కట్టడ. త. కట్టడమ్.) ౧. గృహాదికము. (బ్రా, వా.) ౨. కట్టనము, బంధము, కూర్పు.
ఉదా: కట్టడపుఁగాసులపేరు. **కట్టడపుముద్దులు.**

**కట్టడి**=కట్టిడి. వి. (√కట్టు.) ౧.నియతి, భాగ్యము.
గీ. అలరుఁ గట్టిడి బవిసి దయ్యంబు బైసి, కట్టడియనంగ నియతి గాఁ గాలకంఠ. ఆం. భా. ౧. ౯౯.

౨. ఆజ్ఞ.
గీ. నేను నీసమ్ముఖంబున నిలిచి యున్న, వారిలోపల నొకఁడనై వలయుపనికి, నిందు నందును దిరిగెద నిదియ నాదు, మనవి కట్టడి గావింపుమనిన నతఁడు. దశా. ౨. ౧౨౩.

౩. (దేవతాప్రసాదరూపమైన) నియమితద్రవ్యము.
చ. లలనగొ యెందు నీకుఁక గులామునకుం జనపద్ము మాకు ని,చ్చలు పెరుమాళ్ళకో నెలఁ బ్రసాదముకట్టడి సాగివచ్చు నా, తళియ ప్రసాదమీవు సతతంబుఁ బసాదము...వైజ. ౨. ౧౨౮.

౪. నియమము, కట్టుపాటు.
ఉ..కావ్యములమ్మర్తము గానఁగ లేక మ్మగ్మతుల్,

౩. (ఇంద్రియాదులను) నిరోధించు.

క. పట్టిన నేకవ్రతములు, పెట్టె మహీదేవులకు నభీష్టాన్నంబుల్, కట్టె నుపవాసములచే, మెట్టెన్ బుణ్యస్థలములు మెలఁతలు దానన్. వరాహ. ౨. ౧౭౬.

క. మగవాఁడ ననుచు నన్నా, వగవగ నేఁ గడుపు గట్టి యప్పులు మిగులన్, దిగిచి యిటు వండి పెట్టినఁ, బొగులవు సంఘంబుమీఁదిసాట్టెలు క్రియన్. శుక. ౩. ౨౭౯.

౪. ఆరోపించు, మోపు.

క. దోషరహితకన్యకపై, దోషంబులు గట్టి రిత్త దూషించినయా, దూషకుని నూఱుమడుఁగులు, దోషానుగుణముగ భూపతులు గొనవలయున్. విజ్ఞా. ఆచా. ౧౦౮.

క. కనికరము లేక వానిం, గని కరము నిరాపనిందఁ గట్టం దగునే. సారంగ. ౩. ౫౧.

౫. ఘటిల్లఁజేయు, కలిగించు.

మ. ... తెగువన్ దుర్భాష లిట్లాడి యీ, కొలనా కేటికిఁ గట్టె దమ్మ. సారంగ. ౨. ౧౦౨.

సీ. సిరిగట్టు నాకును సిరిగట్టునెల వప్ప... చంద్రా. ౨. ౪౫.

౬. కూడఁబెట్టు.

క. ...మున్, గట్టినకర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. భార. ఆది. ౫. ౫౮.

౭. (దండ, పద్యము, మొ.) కూర్చు.

గీ. వీణ వాయింపఁ బొగడంగ విరులు గట్ట, నేర్చునట్టిది యొకరిత... కాశీ. ౫. ౩౧౬.

క. కరకుశలత మెఱయ మాలికలు గట్టితగన్. విప్ర. ౨. ౩౦.

గీ. కవితముఖమున రగణంబుఁ గట్టునపుడు. కావ్యా. ౭. ౧౩.

ద్వి. ... ముదితసద్భక్తి సమ్మోదంబు మహిమ, పదములుగాఁ గట్టి పాడెడువారు. పండితా. దీక్షా. ౫౫ పా. ౧౦ పం.

౮. (ఇల్లు మొదలగునవి) నిర్మించు.

మ. ... కట్టినశదీయాగారము ... భా. రా. అర. ౧. ౧౧౪.

౯. మూయు, కప్పు.

ఉ. ... వీటికిం, గావలి పెట్టి పౌండ్రవిభుకన్నులు గట్టి ప్రలంబవైరికిన్, సేవ యొనర్చి ... ఉ. హరి. ౨. ౯౮.

౧౦. అడ్డగించు, నిరోధించు.

సీ. ... త్రోవలు గట్టి నరులఁ జంపుచుఁ దద్ధనంబు లెల్ల, సంగ్రహించుచు... హ. వరాహ. ౩. ౪౦.

సీ. చేతులచేత రేవాతోయములఁ గట్టి యొకయిన్ని యవ్వల కుబుకనీక. దశా. ౬. ౭౦.

౧౧. చెల్లించు.

ఉదా: వాఁడు పరీక్షకు సొమ్ము కట్టినాఁడు.
ఇంటిపన్ను కట్టినాఁడు.

౧౨. విధించు.

ఉదా: అధికారులు పౌలమునకు హెచ్చుపన్ను కట్టినారు.

౧౩. మూటకట్టు.

సీ. భక్తిఁ ద్రోవకు సాధ్వి పరికరంబులు వెట్టి కట్టి నపారివిశంగాయగమియు. ఆము. ౨. ౯౭.

వ. నారంగశృంగిబేరభంగంబులతోఁ గట్టినకలమాన్నంపుఁజల్ది పోఁకపొత్తులం గుడువ ... ఆము. ౪. ౩౫.

అ. క్రి. ౧. అగు, ఏర్పడు.

ఉ. అక్కడ నిక్కడ న్నిలిచి రత్తఱి గుంపులు గట్టి వానరుల్. భా. రా. యు. ౯౧౯. (గుంపులుగట్టి=గుంపులుగా నేర్పడి.)

గీ. జోళ్లు గట్టి పోరుచు ... మనుచ. ౪. ౨౩.

గీ. ... కుంతలములు ... జడలుగట్టె ... హర. ౪. ౧౦.

౨. నిబద్ధమగు.

గీ. కట్టు విణ్మూత్రములు పొంగుఁగడుపు ... మార్క. ౨. ౩౪.

నా. ౧. బంధనము, బంధించుట; బంధనసాధనమగు త్రాడు, మొ.

ఉ. కట్టినఁ గట్టుఁగాక పాగ కట్టుడు వేసినఁ బోలు
నున్నదిగాఁ, గట్టక నక్కజ మేమిటికిఁ గట్టె
నహంగ పరమేశ్వరుఁ జిట్టులీల, కెట్టు నమస్క-
రింతు హరి నే ననికిన్నల మ్రొక్కుఁ గాని
యా, కట్టుగ కింకర్తవ్యమనుచు నిక్కాకను వెంటఁ
డు దైన్యుఁ డత్తరిన్. దశా. ౫. ౧౧౯.

సీ. ... సత్యం బనుకట్టునఁ బగఁ గట్టువడి ...
హరి. ఉ. ౭. ౩౦.

గీ. ... ఇనుపకట్ల త్రాళ్ళని ముంతలు ... శుక. ౨. ౩౬౦.

౨. నియతి.

క. ఏడ్వ స్త్రీలకొలమింటఁ, జూడను మంగళములు
గూడుచుం గొనబున ని, ర్లీనిపటి కట్టు దప్పిన,
చేడియ కిఁక నైనఁ బెండ్లి సేయం దగదే. యయా. ౩. ౧౦౦.

౩. ఆకృతివిశేషము, కూర్పు.

ఉదా: మీసకట్టు, మొ.

ఉ. ... పయ్యెదకొంగొక కొంత జారిచ, నక్క-
ట్టు బెలాటలో చనునికన్నులు మూఁటికి విం
దు సేయఁగన్. హర. ౫. ౮౭.

౪. వస్త్రధారణము.

సీ. కాళ్లమొక్కిపి మాఁడుకట్టు సజ్జలను సేయం
గ... భార. విరా. ౧. ౨౨౮.

౫. తొట్టికట్టు, కక్ష్య, గృహాంతర్భాగము. (శ. ర.)

౬. (దేశకాలముల) భాగము.

ఉదా: సీమకట్టు.

గీ. గొల్లపడుచులు చని గుంపుగూడి చూడ, త్రో
లుచు మనత్రాడును దీలతోడ, నడ్డికొని
వచ్చి దమయింటియెదురుకట్లఁ, బసరుయామ
తొడ్డనంబులఁ దగులఁ బెట్టి. వి. పు. ౭. ౧౩౭.

చ. ... ఓస్తు ?తాంగి ... కట్టున ముంగి
టం గనవు గాంద్రయుఁ బమ్మచు... కాశీ.
౬. ౨౬౨.

౭. ఉరికిన కందిపప్పు లోనగువానిరసము, యూషము.

ఉదా: కందికట్టు, పెసరకట్టు, మొ.

ఆం. భా. ౨. ౨౫౧.

౮. నిబంధనము, కట్టుపాటు. (శ. ర.)

కట్టించది — గర్భిణి. (స్త్రీపశువు)

సీ. ... గర్భిణీ చెలువంబు గట్టిన ... ఆం. భా.
౨. ౨౬౩.

కట్టుపడుపు = నిర్బంధించినడుపు, అవశ్యము నడపఁ జేయు.

క. తొలగ స్తంభమునఁ దేసిన, కోలమును బుజ్యం
బుఁ గట్టుపడుపక యున్నే. సారంగ. ౨. ౩౩.
రసిక. ౩. ౯౩.

చెవినిల్లుకట్టుకొని చెప్పు (పోరు) = ఆదేపనిగాఁ జెప్పు, ఎప్పుడును వెంటనుండి చెప్పు.

క. న్యాయం బన్యాయం బని, కూయిడి చెవి నిల్లు
గట్టుకొని చెప్పంగా, నేయోజ న్వినకుండుణ్,
మామాపులమాట ... మహీపతి యైనన్. వేం.
పంచ. ౧. ౫౩౩.

వాడుకలోని ప్రయోగవిశేషములు:–

౧. వాడు నాపై కట్టుకట్టెను. ౨. నా మందుతో జ్వరము కట్టినది. ౩. కసాయివాడు పిండికట్టు కట్టినాఁడు. ౪. ఈబట్టను పిలువ కట్టుము. ౫. ప్రయోగము చేసి వాని నోరు కట్టివేసిరి. ౬. ఆమాటతో వాని నోరు కట్టినది. ౭. ఈకార్యములో వాఁడు నడుముకట్టుకొని పని చేసినాఁడు. ౮. దెబ్బతగిలి తలకు బొప్పికట్టినది. ౯. చేనికి నీరుకట్టుము. ౧౦. అతఁడు వానిపైఁ గత్తి కట్టెను. ౧౧. నాకీ యుపకారము చేసి పుణ్యము కట్టుకొనుము. ౧౨. అంతపాపము కట్టుకొనకుము. ౧౩. చదరంగమున వాని యాట కట్టినది. ౧౪. వానికి కక్కడ తాటాకులు కట్టిపంపిరి. ౧౫. వానిని బొమ్మకట్టి ఏడుచున్నారు. ౧౬. నీవు ఎక్కడకు ప్రయాణము కట్టినావు. ౧౭. నాపై వారందఱు కక్షకట్టిరి. ౧౮. మామిడి

పెద్దపలువన్నె కట్లపెట్టె, దైవనడచెడుకాళ్ల గుం పసఁగ గాలి,కార్చిచ్చని దిగంతముల వానకాళ్లు నడచె. ఆము. ౪. ౮౫.

**కట్లదండ.** వి.(√కట్టు) ఎడనెడ బంగారుకట్లుగాని వెండికట్లుగాని గ్రుచ్చినపల్లపూసలసరము.

చ. మినమిన లీను మేను సెలమింపు మలకొంచెపుటం చుఁగమ్మలుం, గొనబగుముద్దుమోము నమరం గనొన్న మెఱుంగులకట్లదండయుఁ ... మంచ ... శుక. ౩. ౧౦౫.

**కట్లపాము.** వి. (√కట్టు) మేనిపైకట్లవంటిచారలు గలదియొకజాతిపాము.

**కట్లబల్ల.** వి.(కట్లు+బల్ల) కట్టె కాళ్లమంచపుబల్ల. (బ్రౌ, శ.ర.)

**కట్లమంచేము**=కట్లు. (౧. అర్థము.)

**కట్లమారి.** విశే. (కట్లు+మారి.) కట్లు (బంధనములు) పొందుస్వభావముకలది.

(స్తనవర్ణనము.) సీ. నసుదు గ్రక్కలనెమ్ చక్ర వర్తు లటంచు మొట్లనాలరి మొనసెఁ ప గుసె,కిన్నెరకాయలు వన్నెవాసిని యంచుఁ గట్లమారుల నుద్దిఁ గట్టఁ బడుసె. చంద్రా. ౪. ౧౨౭.

**కట్లసంచి.** వి. (√కట్టు) చుట్టు అఱ లేర్పఱచి కుట్టినవిడుపాటిగుండుసంచి. (శ.ర.)

**కట్లసరి.** వి.=కట్లదండ.

సీ.... ఉద్దులుడగలు కట్ల సులు... గీ. అమ్మ,దు డోవనమునఁ దివుగుగాడు చెప్పిపాని. హంస. ౪. ౧౩౮.

**కట్లె(ట్లియ)** వి. (క. కట్లె) బంగారు వెండి మున్నగునవి తూఁచుటకు నుపయోగించుచిన్నత్రాసు, ము.

సీ.... కట్లెవానగుఁడులాలమానగుంజాదికములు. ఆం. భా. ౨. ౩౦౦.

ఆ. కంతుఁ డిరువురందుఁ గలపౌర్యం బొకిం,గ, చూచి కట్లె నైచి తూఁచుకొనఁగ. కళా. ౩. ౧౯౩.

ఉ. మైనపుటంటు పల్వగలమచ్చులచాలొరగ ల్లు కట్లెలుఁ. శుక. ౧. ౪౨౦. భీమ. ౨. ౭౭.

కట్లెసంచి=కట్లెలుంచుకొనుసంచి.

చ. కమటము కట్లెసంచి యొరగల్లను గత్తెర సుత్తె శీర్షముల్, ధమనియు శ్రావణంబు... హంస. ౨. ౧౮౧.

**కట్వాంగము.** సం. వి. అ. పుం. శ్యోనాకము, దుండిగము.

**కట్వరము.** సం. విణ. (అ. ఆ. అ.) నిందితము, తిరస్కరింపఁబడినది. వి. అ. న. ౧. పెరుఁగుమీఁది నీరు. ౨. తక్రము, మజ్జిగ. ౩. వ్యంజనము. (కూర, పచ్చడి, ము.)

**కట్వి.** సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి.

**కఠమర్దుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు. (త్రి. ని.)

**కఠము.** సం. వి. అ. పుం. ౧. కఠశాఖ, యజుర్వేదమందలియొకభాగము. ౨. ఒకానొకయుపనిషత్తు.

**కఠరము.** సం. విణ.=కఠినము.

**కఠశ్రోత్రియుఁడు.** సం. వి. అ. పుం. కఠశాఖను అధ్యయనము చేసినవాఁడు.

**కఠాకువు.** సం. విణ. (ఉ.) పరోత్తాపి, ఇతరములను బాధించునది. వి. ఉ. పుం. ౧. సూర్యుఁడు. ౨. అగ్ని. ౩. కపి, కోఁతి. ౪. పక్షి. ౫. శిల్పి. ౬. జిల్లేడు. ౭. చిత్రమూలము.

**కఠారము.** సం. వి. అ. పుం. ౧. ఖడ్గము, కత్తి. (కే. ని.) ౨. బాఁకు.

వ. కఠారకుఠారగదాదండభిండివాలకరవాలశూలముసలముద్గరతోమరచక్రాదినానాయుధపరిప్లుతబాహుదండుఁడును. వీర. ౪. ౫౪. (శ.ర.పా.)

**కఠారుఁడు.** సం. వి. అ. పుం. శిల్పి. (కే. ని.)

**కఠాహకము.** సం. వి. అ. పుం. దాత్యూహము, నీరుకుఱుఁగుండెపక్షి.

**కఠి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కఠశాఖాధ్యయనము చేసిన

కడ నిల్వక మేడకుం దండ్రు ... మల్లభూ. నీతి. ౪౦.

శ్లో. ధృష్టః పార్శ్వే భవతి చ వసన్ దూరతో ౽ప్యప్రగల్భః. సం. భర్తృ. నీతి. ౫౦.

క. కడనుండి పెక్కుమాటలు, నుడువంగా వచ్చుఁగాక నూల్కొనియెడుపల్, కడగండ్లఁ బడఁగ వచ్చునె, నిడుదకనుఁబొమ్మ్మానికయిన సలలికలారా. నీలా. ౨. ౧౧౧. (కడనుండి=పైగానుండి, సంబంధము కలిగించుకొనకుండి)

౯. దరి, ఒడ్డు.

సీ. వైరిసైన్యాబ్ధిలో వచ్చుగెల్పులనావఁ గడఁ జేర్చుప్రాఁకుడుఁ గడపుఁ జేయి. పారి. షీఠ. ౨౪.

౯. కాలము, వేళ.

గీ. దివమునను సంజకడ యందు దివ్వె లెత్తు. శుక. ౨. ౫౬౧.

౧౦. మరణము, చావు.

వ. కయ్యంబునఁ బొఱఁబొఱఁ గాయంబు గాయంబు సేసి వెఱవేఁకిఁ గొలిపినకాకళత్తు నామధేయచండాలుకరాళ వేషంబు గన్నులం గట్టిన ట్లుండఁ గడఁ గనుట నిట్టికరాళ వేషంబు గలిగెఁ గైశికీ గానఫలదానంబున దీని మానుపవే...ఆము. ౬. ౯౬. (వ్రాఁత ప్రతి పాఠము.)

౧. ఇది ద్రుతాంతముగా నుండి "అందు, ఎడ, విషయమున, వలన" అనునర్థముల నిచ్చును.

క. చెడుతెరువాకారవ్యుల, కడ నిలుదుం గాక మనకుఁ గ్రౌర్యం బేలా. భార. ఉద్యో. ౩. ౯౧.

ద్వి. ... ఇంటికడ విందు గుడిచి ... రం. రా. బాల. ౫౩ పొ. ౧౫ పం. విప్ర. ౩. ౬౧.

చ....నం, దరికడ నాననేయు నిను ... దశకు. ౯. ౨౧. (సుందరికడ=సుందరియెడ.)

సీ. నాలుగు మొగములవేలుపు మొదలుగ నెవ్వనికడ నుదయించె జగము. హరి. ఉ. ౫. ౧౦౯. (ఎవ్వనికడ=ఎవ్వనివలన.)

విణ. ౧. అంత్యము, చివరది.

ఉదా: కడజాతి, కడసారి, మొ.

౨. అన్యము, ఇతరము.

గీ. అనుగుఁ జెక్కుటద్దమొదకడ కడమ తప్పు, వేలు పెఱ యెవరు నిరాశ్యా మారనైరి. ఆం. భా. ౩. ౭౪.

ఆకడ=అవతల, అవ్వల.

క. శాకమహీజము పేరను, శాకద్వీపంబు నాఁగ సన్నుతి కెక్కున్, లోకస్తుత యాదీవికి, నాకడ దుగ్ధాబ్ధి మెఱయు సంతతియ విరివిన్. వి. పు. ౩. ౭౬.

వ. ఉత్తరాభిముఖుండవై చనంజన హేమవంతం బక్కొండ కాకడ బహుహాటకశోభితం బగు హేమకూటం బవల ఋషభాచలంబు ... పొలుచు... భా. రా. యు. ౧౯౧.

కడకుఁబొమ్మను=మారనుగాఁబొమ్మను; మించు.

క. కమ్మెలు దాఁకినబంగరు, బొమ్మరనులయొమ్మెఁ గడకుఁ బొమ్మను రేఖా, సమ్మిళితస్తనకుంభత, టమ్ము దిటమ్ముగను జూపి డగ్గుత్తి కతోన్. సారంగ. ౨. ౨౩౦.

కడలుద్రొక్కు=వ్యభిచరించు.

గీ. పెనిమిటికి నేల కడలుత్రొక్కనలతాంగి. కవిరా. ౨. ౩౪.

జ: కట్టకడ, కడకట్టు, కడకడ, కడకడలి, కడకన్ను, కడకాలను, కడకాలు, కడకుఁబోవు, కడకొంగు, కడకొత్తు, కడకొఱవి, కడగండ్లమారి, కడగండ్లు, కడగట్టు, కడగొట్టు, కడగోరు, కడచను, కడముక్క, కడచెడు, కడచేయు, కడచేరుచు, కడజాతి, కడతల, కడతెగు, కడతేర్చు, కడతేఱు, కడనుంచు, కడపల, కడబంతి, కడముట్టు, కడయేనుఁగు, కడయేలిక, కడరాలు, కడఱెప్ప, కడవన్నె, కడవాఁడు, కడవీను, కడవెళ్లు, కడవోవు, కడవ్రేలు, కడసంజ.

**కడంకరము.** సం = కడంగరము.

**కడంకరీయము.** సం = కడంగరీయము.

**కడంగము.** సం. వి. అ. పుం. ఒకవిధమగుమద్యము.

**కడంగరము.** సం. వి. అ. పుం. మాషముద్గాదికాష్ఠము. (సిద్ధాంతకౌముది.)

**కడంగరీయము.** సం. విణ. (అ.ఆ.అ) మాషముద్గాదికాష్ఠమును తినునది. (అపు, శేచె, మొ.)

**కడంబము.** సం. వి. అ. పుం. ౧. శాకనాడిక, కూరకాఁడ. ౨. అగ్రభాగము,కొన.

**కడంబి.** సం. వి. ఈ. స్త్రీ. తీఁగబచ్చలి †

**కడ(ణ)ఁక.** వి. (√ కడఁగు.) ౧. పూనిక, యత్నము; ఉత్సాహము.

సీ. ప్రతిబంధదురితంబు వాసి పోకుండినఁ గాశికేఁగెడు నట్టికడఁక లేదు. కాశీ. ౩. ౬౯.

ఉ. శ్రీకలకంఠకంఠియు ధరిత్రియు దక్షిణవామ భాగము, న్నైకొని కొల్వ వారిఁ గడఁక న్గవకన్నులకాంతిఁ దేర్చి....విజ. వి పీఠి. ౨.

ద్వి. పణిహారులను బిల్వఁ బంచి యాక్షణమె, కణఁకతోఁ గల్యాణకటకంబునందు. పండితా. దీక్ష. ౨౧ పా. సీలా. ౧. ౪౯.

౨. ధైర్యము; స్థైర్యము.

చ. కరమున నీవు విల్లు గొని కాండముఁ బూనిన మూఁడులోకముల్, కరము భయంబు నొందుఁ గడఁక న్నిను మార్కొను నెవ్వఁ డోపు....ఉ. రా. ౧. ౧౫౫.

చ. అటిమి రమాకుమారుఁ డపుడగ్రతలంబున వచ్చి నిల్చిన, ట్లలిముఖిఁ దోఁచినం గువలయాక్షి వడంకి కడంక దూలి మై, మఱచి....వసు. ౩. ౧౭౯.

సీ. స్థైర్యయత్నంబులు చనుఁ గడంక యనంగ. ఆం. భా. ౩. ౪౬.

౩. ఉదుటు, ఉద్ధతి, గర్వము.

ఉ. ప్రుక్కకి భూమిభృత్కులవిరోధికడంక నడంచి యిమ్మెయిన్, దక్కక హేతిధారి కుచితం బగు కార్యము నిర్వహించి....రాఘవ. ౨. ౧౧౦.

౪. చేష్ట, వ్యాపారము.

ఆ....అంతరంగ మవశతఁ బొందిన, కరన నింద్రియములకడఁకె దక్కె. భార. విరా. ౫. ౧౧౩.

౫. విధము, రీతి, పోలిక.

శా. ....పైఁ జందురుం దొప్పఁగాఁ, గానన్ వెన్నెల పిండిచల్లినకడంకం గల్వపూఁబండు పై. యయా. ౫. ౧౦౯.

సీ. జడఁ జిక్కుదయ్యంబుచందంబునను జెట్టు విడిచిన భూతంబుకడఁకతోడ....గీ. ఎనసి. చరియించు వీట నాహేమరేఖ. హంస. ౧. ౨౨౦.

౬. సంతోషము.

సీ. కైరవకాననోత్కరములు కడుఁ గుందఁ గంజ పుంజంబులు కణఁక నొంద....గీ. పూర్వపర్వతమెక్కె నపూర్వదీప్తి, మండలం బైనమార్తండమండలంబు. విక్ర. ౨ ౧౦౭.

౭. ఆధిక్యము, అతిశయము.

ఉ. కాఁవగ దిక్కు లేమిఁ గడఁకన్ మొఱవెట్టఁ దొడంగె వేదముల్. దశా. ౧. ౨౭౫.

**కడఁగించు.** స. క్రి. (√ కడఁగు) కడఁగజేయు. (ప్రోత్సాహపెట్టు, ప్రేరేఁచు.)

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లికుట్టుమాటలఁ దచ్చి, త్తము లుదికించుచుఁ బాండవ, సమితిం గడఁగించువా రచట నెవ్వరొకో. భార. ఉద్యో. ౪. ౨౪౨.

**కడ(ణ)ఁగు.** అ. క్రి. ౧. ఉద్యమించు, యత్నించు, పూను; ఉత్సహించు.

(దుర్యోధనుఁడు భీమునితో ననినమాటలు)

గీ. .... విప్రులవలనఁ బుట్టి, రైరె సత్క్షత్రియప్ర

భు లవని గావఁ,గడఁగి మీఱిన్మనుబు నిట్లకావె వినఁగ. భార. ఆది. ౬. ౫౯.

ఉ మజ్జన మార్పఁ గల్పకుసుమంబులు గూర్పఁ గడంగి రయ్యెడన్. వసు. ౫. ౭౩.

(కీచకుఁడు) వ. చిడిముడిపడుచు నెదురు సనఁ, గడఁగుచు హారములు చక్కఁగాఁ ద్రోయుచు మ,ల్లడి గొనుచు.... భార. విరా. ౨. ౧౧౪.

౨. సాహసించు, తెగు.

క. కిమ్మీరమర్దనుని చే,నిమ్మెయి నోటాలఁ బెక్కు రే టులు వడి ద,ర్ప మ్మెడలి మూర్ఛ మునిఁగియుఁ, గ్రమ్మఱఁ గురునాథుఁ డెల్లు గడఁగెనొ యనికిన్. భీష్మ. ౨. ౪౦౬.

క. గురువను గట్టను బూయను, గొడువను బోఁబను చుఁ గాక లౌలిత మొన సొరం, గొడుకుం బను చుట దెప్పఁడుఁ, గడఁగునె నాయట్టి పాపకర్ముఁడు దక్కన్. భార. ద్రో. ౨. ౧౪౨.

౩. ధైర్యముతో నిలుచు.

మ....పాండవులు మోహాంధుంఠ భీష్మండు గేశవ నీవుం గడఁగుండు నాకు నెదురై సంగ్రామరంగంబు నన్. భార. సభా. ౨. ౬౩.

గీ. అగ్గలించి నాయెదుర నా హప్పళించి,కడఁగఁ జాలెడు మల్లులఁ గాన నెందు. భార. విరా. ౨. ౮.

౪. కవియు, తలపడు.

క. ....మగధవిభుఁడు ఱో,డును విల్లుఁ దేరు ఘనకే, తనమును గొని కడఁగె శార్ఙ్గధనుపై నొకఁడున్. హరి. ఉ. ౧. ౧౧౨.

క. కవ్వడి యొక్కఁడ కంటిరె, చివ్వునఁ జేయుద మి తండు సేద్పడఁగా నిం,దెవ్వరుఁగడంగ లేవివి, త్రెవ్వి పడినధనము లెటిఁగిలిమి లోఁ దెల్లన్. భార. మౌ. ౧౮౧.

౫. అతిశయిల్లు, వర్ధిల్లు. (ఈయర్థమున నిది తఱచు పాదపూరకము)

సీ. మోహంబువలనఁ బై ముసురు లోభంబు లోభావేశమునఁ గామ మగ్గలించుఁ, గామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు క్రోధంబున వైర మెంతయును బెరుఁగు. భార. ఆర. ౪. ౨౮౮.

ఆ. గాజుకుప్పెలోనఁ గడఁగుచు దీపం బ,దెట్టులుండు జ్ఞాన మట్టు లుండుఁ, దెలిసినట్టివారి దేహంబులందును.... వేమన. ౧. ౯.

క. గణపాదహతులచేతను, వణఁకి గిరుల్ తరులతోడ వసుధం బడియెన్, గణఁగి వసుంధర గిరులును, ఫణిపతిపైఁ బడియెఁ గమఠపతిపైఁ బడియెన్. వీర. ౪. ౮౧.

౬. ఉపక్రమించు, ప్రారంభించు, తొడఁగు.

క. .... అమృతాబ్ధిన్ మథింపఁ గడఁగిరి కడిమిన్. దశ. ౨. ౧౯౩. పారి. ౧. ౧౦౪.

౭. కడఁక, కడఁగించు.

కడ(ఱ)ఁజు. వి. గోకర్ణమృగము, ఒకజాతిదుప్పి.

సీ. ....గోకర్ణనామం బగును గణంజు కడఁజు నా ... ఆం. భా. ౨. ౮౫.

కడ(ఱ)ఁత. వి. కడకంటికి ప్రక్కగా నుండుచోటు, శిరఃపార్శ్వము.

గీ. ....క,డంత యనఁగ శిరఃపార్శ్వ మంతకారి. ఆం. భా. ౨. ౧౪౪.

వ. పెనుఁగడఁత దొడ్డయత్తళ,మున వైచిన నతఁడు మూర్ఛ మునిఁగి....భార. శల్య. ౧. ౩౮౧.

ద్వి. కనుఁగొనఁ జెక్కిళ్లఁ గణఁతలఁ గవవ, నెనయు బూదిద మెత్తుకొని....పండితా. దీక్ష. ౪౦. పా.

కడ(ఱ)ఁతి. వి. గంధర్వమృగము.

సీ. ....గంధర్వమౌను గడంతి....ఆం. భా. ౨. ౮౫.

మ. పులులం ద్రుంచి కడంతులం దునిమి .... శుక. ౧. ౧౭౬.

చ....దు,ప్పులు కణఁతుల్కొటు ల్చెవులపోతులు కొర్న వగండ్లు భల్లుకం,బులు .... ఆదిగాఁ,గల మృగ రాజి....కాశ. ౩. ౪౮.

**కడఁబడు.** అ. క్రి. (కడమ + పడు-శ. ర.) తగ్గు: పోవు.

క. హరి సూకరరూపంబున, హరిణాదిమృగాకృతుల మహర్షులజంబై, హరిసుతుఁడు పూజ్యుఁడైయుం,డ రె వారలగౌరవము కడంబడియె నొకో. వేం. పంచ. ౧. ౧౨౬. (శ. ర. పా.)

ద్వి. ఎడపక నను విక్రయించి చెల్లింపు, కడఁబడుఁ గొంతైనఁ గౌశికుఋణము. ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౦.

క. పడగలఁ గలరత్నంబులు, గడఁబడ నొడ ఉడుశ దంష్ట్రికలు పొడిపొడిగాఁ, గడుబాములకుఁ లోనై. గడుసరిపాములు తొలంగ .... దశా. ౪. ౧౮౩. (ఇట'పడిపోవు, రాలిపోవు' అనిభావము.)

**కడక(గ)ట్టు.** స. క్రి. (కడ + కట్టు.) ౧. నిర్ణయించు, నిశ్చయించు.

క. మునుమున్నకాదె యార్యులు, వినుతనిజజ్ఞానదృష్టి విధిఁ దిరముగఁ గ,న్గొని కడగట్టినవారీ, తనియా దృశభావచేష్టితము లఖిలములుఁ. హరి. పూ. ౮. ౧౩౮.

వ. ....అద్దేవి యశ్రుపూర్ణనయనయై యిట్టిశోకంబు నా కనుభవింపను మద్గర్భంబులకు నిట్టిపోకలం బోవను మున్న కడగట్టినతెఱంగు నీ వేమిసేయు దని యు చితంబుగాఁ బలికె.... హరి. పూ. ౫. ౧౩౫.

౨. విధించు. నియమించు.

చ. దిరిసెనపువ్వుకంటె గణుతింపఁగ మెత్తని మేనుఁ దీఁగె యీ,తరుణికి నిట్టికోమలి లతాతరుసేచన మాచరింపఁగాఁ, గరుణ యొకింత లేక కడగట్టె మునీంద్రుఁడు మాట లేటికిఁ. పి. శకుం. ౨.౬౨

౨. నిర్ణయము, ఏర్పాటు.

వ. .... ఇందులపువ్వులకుం గలపరిమళం బెందుల పువ్వులకుఁ గల దని మునుముట్ట మాయ వెట్టం గడకట్టు చేసికొని యప్పట్టి గదలి యానురపొన్న క్రిందికిం జనుదెంచి .... విక్ర. ౮. ౬౧.

**కడకడ.** వి. (కడ + కడ) - చివరదిక్కు - ఈశానదిక్కు.

క. కడకడయొడయనిముంగై,కడియపునుమ్మెత్తఁ బండు గామిడి మన్నుం,బడఁతుకకై యిమ్మానిని, యొడ లూనినవాఁడునువ్వొ యుక్కు దలిర్పఁ. అచ్చ. రా. బాల. ౯౩.

**కడకడలి.** పి. (కడ + కడలి.) పశ్చిమసముద్రము.

క. వడి నీకీర్తులఁ దోలెకి, కడిమిం దనకందు లెలుపు గావలసిచుమీ. కడకడలియొడలఁ గ్రుంకును, వెడ విల్తునిమామ యోబవిభునరసింహా. నరస. ౫. ౮౩.

క. కడకడలి వేఁగివెలుఁ గను,జనదారి పడి న్మనుం గఁ జని జేగుఋప,చ్చడమూలఁ గట్టె దరినవఁ,బడ మట నెఱసంజ నిండె....యయా. ౨. ౬౯.

**కడక(గ)న్ను.** వి. బౌ. (కడ + కన్ను.) అపాంగము, నేత్రాంతము.

క. ....నరుకడకన్నుడుణం బిగుటయుఁ దద్రుచి, పరం పరంతోన నిగిడె నాణచయుంబుల్. భార. భీష్మ. ౨. ౩౦౫.

గీ. వీని వీక్షింపు కడగంటివీక్షణమున. నైష. ౫.౧౪౦. ఆం. భా. ౨. ౧౪౪.

**కడకము.** సం. వి. అ. న. సముద్రలవణము.

**కడకాలము.** మి. వి. (కడ + కాలము) అంత్యకాలము, మరణసమయము.

ఉ. త్యాగము భోగముఁ సలిపిదైవగతిం గడకాల మైన ఖ,ట్వాగకుఁడై తనూభవుల దగ్గఱ

నల్వురఁ బిల్చి యుట్లనుఁ. ద్వా. ౯. ౯౮.

చ. కని యదలించి యోనిచెడుగా కడకాలము సేరె
నెక్కడం, బనియెదు....వేం. పంచ. ౧. ౨౬౪.

**కడకాలు.** వి. ఔ. (కడ + కాలు) పాదము: పాదాగ్రము.

ఉ.....దేవకి గన్నయార్పురఁ, బరుషవిశాలఘోర
శిలపైఁ గడకాళులు పట్టి వ్రేసి యా, సురముగఁ
జంపెఁ గంసుఁడు....హరి. పూ. ౫. ౧౦౬.

క. కడకా లొకత్రాఁచుపాము గడిఁకం గఱచెఁ. వేం.
పంచ. ౧. ౧౧౬.

ఉ. ....అయో మగనిం గడకాళ్లఁ ద్రోచి నేఁ, డీపసు
ధేశునిం గలయ నెంచితి వెట్లు....శుక. ౧. ౩౦.
(కడకాళ్లఁద్రోచు=నిరసించు.)

**కడకుఁబోపు.** అ. క్రి. (√కడ.) బహిష్ఠయగు, ముట్టగు.

సీ. మును తాను గడకుఁబోయినదినం బావిగాఁ బెచ్చుక
దినమును దినము లెన్ను. దశా. ౬. ౫౩.

ఇట్లే :-కడ కేఁగు.

సీ. అంటుగైకొనియె ముట్టయ్యెఁ బెఱఁగుమానెఁ గడ
కేఁగె నింటికిఁ గాకపోయె, నసఁగ దూరస్థుఁ డన
రు....సాం. ని. మాన. ౨౮.

**కడకొంగు.** వి. (కడ + కొంగు.) కొంగుచివర, అంచలాగ్రము.

సీ. కట్టిన పులితోలుకడకొంగు సోఁకి యాఁబోతుతత్తడి
చిట్టుబుట్టు మనఁగ. హర. ౫. ౧౬.

**కడకొత్తు.** స. క్రి. (కడపు + ఒత్తు.) దూరీకరించు, నిరసించు.

చ. అడు గడుగంటఁ ద్రొక్కుఁ జిగురాకుల బాఁకులఁ
గేరు నారు నెన్నడ కడకొత్తు హంసమిథునమ్ములఁ
దమ్ముల నోము మోము. చంద్రా. ౪. ౧౪౩.
(ఇట బౌపమ్యవాచకము.) పాంచు ౪. ౨౨౦.

**కడకొఱవి.** వి. (కడ + కొఱవి.) ౧. కాలఁగా మిగిలినకట్టె.

ద్వి. పొంత యొఱ్ఱలలోనఁ బొడవటి కాలి, కొంత
చిక్కిన కడకొఱవులు దెచ్చి, కుఱుప్రోగుగా నిడి
కొడుకు నం దుంచి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౫౬.

౨. కాలఁగా మిగిలి పొగయుకట్టె.

క. జ్ఞాతులు దమచేఁ బొందినఁ, జేతోమోదమున వె
లిఁగి చెలువొందుదు ర,స్నాతిం బాసిన విగతవి, భూ
తిం గడకొఱవులట్ల పొగయుదు రధిపా. భార.
ఉద్యో. ౨. ౨౮౫.

**కడగండ్లమారి.** విశే. (కడగండ్లు + మారి.) కష్టశీలుఁడు. (శ. ర.)

**కడగండ్లు.** వి. బ. (కడ + కండ్లు.శ.ర.-కడ + గండ్లు?) ఇక్కట్లు, ఇడుమలు.

సీ. తలగనికడగండ్లఁ దగిలి చట్టైయున్న దాననేదిన
నెఱజాణరాయ. అచ్చ. రా. అయో. ౯౩.

ఉ... కానకు రాఘవుండు చోఁ,గా నిపు డింత పుట్టెఁ
గడగండ్లనువార్తలు మిన్ను ముట్టి దిక్కైనగ రెల్ల
గొల్లుమన....చం. రా. ౪. ౮౫.

**కడగట్టు.** వి. (కడ + గట్టు) చక్రవాళపర్వతము.

గీ. తావిగుబ్బలికడగట్టుతావులందు, నప్పసం బుప్పతి
ల్లుచు మెప్పుఁ గన్న, యట్టికొరవంజు లెల్ల మూసు
ట్టలయ్యె. ప్రబంధ. ౧౬౦.

**కడగొట్టు.** అ. క్రి. (కడ + కొట్టు) నశించు, చచ్చు.

మ. కెడ నెం దుప్పుల డింకవేసె నెలుఁగుల్ గిట్టెం
బులుల్ సింగముల్, కడగొట్టెఁ.... సారంగ,
౧. ౧౦౩.

విశే. కడపటిది, చివరది, చిన్నది.

చ....అందఱకుఁ గడగొట్టుచెల్లెలై, మనుజవరేణ్యుపుట్టి
నొకమానినిరుక్మిణినాఁ బ్రసిద్ధయై. భాగ. ౧౦.
పూ ౧౬౮౫.

ద్వి. శివదేవుఁ డన నొక్క శివభక్తియుతుఁడు, ను

విదయుఁ దానుఁ బొర్గూరి కేఁగుచును, రూపించి కడగొట్టుపాపఁ దా రింటి,కాపిడి.... బస. పు. ౩. ౧౦౮. పం.

కడగొట్టువాఁడు = కడపటివాఁడు, కనిష్ఠ సోదరుఁడు. ఉ. రా. ౭. ౩౨౧.

కడగోరు. వి. బౌ. (కడ + గోరు) కొనగోరు, నఖాగ్రము.

ద్వి. కాటుకకన్నీరు కడగోర దిద్ది. నవ. ౨. ౯౦. పౌ. ౧౦౮ పం.

కడచ(స)ను. అ. క్రి. (కడ + చను) ౧. మరచెంచు, చచ్చు

సీ. జననాథశల్యుండు సమసె సౌబలుఁడు గీటడఁగెనులూకుండు మడిసె సకల, సంశప్తకులు గడచనిరి.... భార. శల్య. ౧. ౯. భార. శాం. ౨ ౪౨౯.

౨. నశించు, పోవు.

ఆ. ....శక్తియెల్లను గడచన్న, నతఁడు నేల వ్రాలె నతిరయమున. భార. అను. ౧. ౯౯.

రగడ. ఎఱుఁగక చేసితి నిపు డపచారము, శరణన్నను గడపనదె విచారము. ఉ. రా. ౩ ౯౨.

౩. కడచు, గతించు.

వ. ....నీవాక్యంబులు నిక్కంబు లగు నైనను గడచనినదానికి శోకం బేల. భా. రా. యు. ౯౭౧.

సీ. సంజప్రొద్దుననుండి సవరేయి కడసన నమ్ముఖంబునఁ గొల్చి సంవసించు. పాండు. ౫. ౨౮౬.

౪. ముగియు, సమాప్తమగు.

క. అనఘా యీయజ్ఞము విధి,సనాథఋత్విక్ప్రయోగ సంపూర్ణంబు,య్యును గడచన నేరదు నడు,మన యుడుగును భూసురోత్తమనిమిత్తమునన్. భార. ఆది. ౨. ౨౦౯.

క. కొడుకులనిధనమునకు నా,కడఁగినహయమేధమఖము కడచనమికి నేఁ, గడుదుఃఖితుండనయ్యెదఁ, దతయఁక నీ విపుడు దీనిఁ దలఁగుము కడఁకన్. భార. ఆర. ౩. ౬౮.

౫. కొనసాగు, నెఱవేఱు.

క. పూనిక కడచన విష్ణు,క్సేనప్రార్థనము సేసి.... విప్ర. ౨. ౧౯.

౬. అపారమగు, అనంతమగు.

సీ. గోత్రాచలము నెత్తుకొని వచ్చి కడచన్నరత్నాకరముఁ గట్టె రాఘవుండు. కు. సం. ౧. ౪౨.

ద్వి. మదఁతి యీతంచె యిమ్మనుజేశుచేతఁ, గడచన్నమన్ననఁ బడసినయతఁడు. బస. పు. ౨. ౯౧.పం. (ప్రాఁత ప్రతిపాఠము.)

స. క్రి. దాఁటు, అతిక్రమించు.

క. వననిధి నవనీలం గడ,చనువాని ప్రసాద మొంది సతులు గృహంబుల్, ధనములు నఖిలసుఖంబులు, మన మారం గాంతు రోలి మర్కటు లెల్లన్. భా. రా. కిష్కిం. ౭౬౬.

సీ. ఏదేవునిజమాయ నెవ్వాఁడుఁ గడసన నేరఁడు తన మేనినీడఁబోలె. పాండు. ౫. ౫౧.

కడచన్న పసిఁడి = ప్రశస్తమైన బంగారము, మేలిమి బంగారము. (బ్రౌ.)

ద్వి. కడచన్న (వన్నె?) పసిఁడియుఁ గప్పయుఁ దూఁచు, నెడ సువర్ణాంతరం బెఱుఁగరాకున్నె. పండితా. వాద. ౧౯౨ పౌ.

కడచు. స. క్రి. (త. కడత్తు.) ౧. (నదీసముద్రాదులను) దాఁటు, తరించు.

గీ. అలసుమంతుని వీడ్కొని యర్కవంశ, ఘనులు గంగాతరంగిణిఁ గడచి .... రామా. ౫. ౨౮. భార. ఉద్యో. ౪. ౬౫.

౨. ఉల్లంఘించు, జవదాఁటు; దాఁటు, అతిక్రమించు.

ఆ. వేదవిహితవిధుల నాదరించుట యూర్ధ్వ, గతికిఁ దెరువు విధులఁ గడచి యెందు, నాఁగఁట దినవాని లోఁగక చేయుట, యధమగతి

మార్గ మనిరి మునులు. భార. ఆది. ౩. ౨౨౦.

మ. కొడుకుల్ భక్తివిధేయు లౌదురుగదా కోడండ్రు మీవాక్యముల్, గడవం జాలక యుందు రా.... భాగ. ౧. ౨౬౭.

క. వడిగొని కౌరవు లొండొరుఁ, గడపఁగ మునుచని రి.... భార. ఆది. ౬. ౬౭.

సీ. కనకంబు పెనుఁగోట వినువీథిఁ గడపంగ.... హరి. ఉ. ౨ ౧౬౨.

గీ. కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి. పారి ౧. ౧౦౫.

౩. తొలఁగించుకొను, తప్పించుకొను.

తరువోజ. ఏనును బ్రజలును నీ ధర్మసతియు, నేయు పాయంబున నిబ్బారిఁ గడవఁ,గా నేర్తు మెయ్యది కర్జంబు.... భార. ఆది. ౬. ౨౪౭.

గీ. ....వారి, వారికర్మఫలంబు లవశ్యభుక్తి, కారణం బులు గా కెందుఁగడవ వశమె. వి. పు. ౧. ౨౧.

వ. ....గండంబులం గడచితిమి.... హర. ౨. ౨౭.

౪. మించు, అతిశయించు.

వ. ....సహదేవుం డాశైనేయు నుద్దేశించి మిమ్ముఁను బాంచాలురం గడచినబందువులు మాకును మమ్ముఁను మిమ్ముఁను మిగిలినబాంధవు లాపాంచాలురఁను వారలకంటె మాకంటె నెక్కుడు సుహృజ్జనులు మీకును లేకునికి దెల్లంబు .... భార. ద్రో. ౫. ౩౭౧.

చ. కొఱవులవేఁడిమిం గడచు ఘోరపుఁబల్కులు కర్ణరంధ్రముల్, చుఱచుఱఁ దాఁకి పాటి మదిఁ జూఁచిన....భా. రా. యు. ౭౨౩. భార. శాం. ౧. ౦౫.

౫. క్రి. ౧. చచ్చు, మరణించు.

గీ. కడచినప్పుడు క్రిమి లొండెఁ గాను లొండెఁ, గు క్కలొండేనియును భుక్తిఁ గొనెదు దేహ,మొకఁడు ప్రార్థించి యడిగిన నొసఁగవలదె. కాశీ. ౬. ౦౩.

సీ. ధ్రువ వసిష్ఠాసుంధతులఁ దనుచ్ఛాయయుఁ గానివాఁ దేఁటిలోనఁ గడచు. జై. భా. ౮. ౫౮.

౨. నశించు, పోవు.

సీ. అలివేణివదన చంద్రాతపంబునఁ గాని కడచునే మోహాంధకారభరము. భాను. ౪. ౨౫.

గీ. పోయె సుపదేశకాలంబు పూర్వమునసె, కడచె ధైర్యంబు....శివరా. ౩. ౩.

౩. గతించు, జరిగిపోవు.

ఉ. ....తన్మూరయఁగా బయల్పడనియట్లుగ నుండెడు వత్సరంబునుఁ, జేరువచేయవం గడచె .... భార. విరా. ౩. ౧౦౬.

వ. ....దినంబులు గడచె వారంబు లరిగెఁ బక్షంబులు చనియె మాసంబులు పోయె....హర ౬. ౧౧.

౪. తొలఁగిపోవు.

గీ. ఇటువలె ననేకగతుల నారటము నొంద, గగనధార తి వానిపైఁ గరుణవొడమి, యడలకు కుమార నీకిది గడవ నేరఁ,దెట్లనినఁ బూర్వవృత్తాంత మెల్ల వినుము. సారంగ. ౩. ౧౨౨.

౫. మేరమీఱు, మిఱమీఱు: మర్యాదనతిక్రమించు.

క. కడు ననురక్తియు నేర్పును,గడఁకయుఁ గలవారి నుఱక కడవఁగ నెగ్గుల్, నొడివెడు వివేకశూన్యుల, కడ నుండెడునంతకంటెఁ గష్టముగలదే. భార. ఆది. ౩. ౧౪౮.

సీ. ఆకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శాఖాచంక్రమక్రియఁ గడవఁ జనక. ప్రభా. ౨. ౩.

మ....వైదేహి నేఁ,గడవం దెచ్చితిఁ దప్పు గావుమని లంకారాజ్య మొప్పించి .... ఎ,య్యెడకైనం జను మా .... భా. రా. యు. ౫౦౧.

౬. కడముట్టు, పారమునొందు.

క. కడవం గఱచినవాఁ డీ,పడు చనుచుం బురుటియిల్లు పడఁతుక వెడలెఁ. మార్క. ౫. ౩౦౪. (కడవం గఱచినవాఁడు = పూర్ణముగా నేర్చినవాఁడు.) విక్ర. ౧. ౨౦.

౬. సుఖముగాఁ గాలము గడపు; మర్యాదతో కాలము గడపు.

క. నీ వేమి కొల యొనర్చితి,వీవగ నది సోఁకు డిగుచు నేఁచఁ దొడంగె, న్వేవేగఁ దత్ప్రతిక్రియ,గావింపక యున్న నెట్లు కడచెద ననినన్. ఉత్త. ౧. ౨౩౫.

క. ఏ నింతనాఁటినుండియు, మానవతులలోన మిగుల మానవతినినై, యీనాఁటికిఁ గడచితి నిఁక, నానోఁచిననోములే మొనర్పం గలవో. శుక. ౧. ౫౦.

౭. మనుగడ సుఖముగా సాగు, జీవనము బాగుగా జరుగు; సుఖముగా జరుగు.

(వ్యవ) వానికి పంద్రెండు రూపాయలతో నెట్లు కడచు చున్నదో తెలియదు.

అక్కడఁ గడవకయే యీయూరు వచ్చినాఁడు. పూఁటఁ గడవనివాఁడైనను దుర్వ్యయములు మానుట లేదు.

నేను లేకుండ వానికిఁ గడవదా యేమి?

జీతము స్వల్ప మగుటచే వానికి సంసారము కడచుట లేదు.

౮. ఎక్కువగు, హెచ్చగు, మీఱు.

(కృత్రిమహంస నెక్కి ఆకాశమునఁ బోవురాచకన్నె యొక్క స్వయంవరమునకు వచ్చిన రాజులవర్ణనము)
క. వడి గల్గి హంసగలికిం, గడవఁ బఱచువారు.... భోజరా. ౫. ౨౪. (చూ. ౫ ౧౭)

కడచిచను = కడచు.

వ. ....మన్వంతరంబు లాఱును గడచిచనియె. వి. పు. ౪. ౪.

౯. కడతెంచు, కడపివుచ్చు, కడపు, కడపుఁజేయు, కడవఁబడు, కడవఁబెట్టు.

కడచుక్క. వి. (కడ + చుక్క) - కడనక్షత్రము - రేవతి. (శ. ర.)

కడచెడు. అ. క్రి. (కడ + చెడు) దిక్కుమాలు, గతిలేకయుండు.

క. విని కినిసి కపిలదేవుఁడు, ఘనహుంకృతి నేసెనంతఁ గిన చెడి వారమ్ము నికోపభస్మసాత్కృత, తనువై వడి రచట సగరతనయులు వెలుచన్. జాహ్నవీ. ౨. ౭౨.

కడచేయు. స. క్రి. (కడ + చేయు) విడుచు, వదలు.

ద్వి. మ మ్మెల్లఁ దంద్రులమూఱుగా నెన్ని, సమ్మతినలుఁ బ్రాణసఖుఁగా వరించెఁ, గావున నాసలఁ గడచేసి మరల, దేవలోకమున కేతెంచితిమి .... ద్వి. నల. ౨. ౬౨౮.

కడచేరుచు(ర్చు) స. క్రి. (కడ + చేరుచు) = కడతేర్చు.

(-దరిచేర్చు - కృతార్థునిచేయు)

క. ....కౌరవులకు మేటి వీవ కావున నీ వీ, ధారుణి మముఁ గడ, చేరుపఁ దగు నెమ్మెయిం బ్రసిద్ధచరిత్రా. భార. ఉద్యో. ౪. ౧౫౩.

కడజాతి. వి (కడ + జాతి) చివరకులము, చండాలజాతి.

ఉ. ఈకడజాతినాతి కిహిహీ మహిదేవుఁడు చిక్కె.... పాండు. ౩. ౮౫. (చూ. ౩. ౭౭.)

(విశ్వామిత్రవర్ణనము) సీ. కడజాతితేనియాగము నిర్వహించినయఘటనఘటనావిహారహారి. చం. రా. ౨. ౫౬.

కడతల. వి. (కడ + తల) చివర ప్రదేశము.

వ. ....కౌరవరాజధాని యైనకరినగరంబుకడతల హలాగ్రంబును జొనిపి యుప్పుటభేదనవిస్తారం బగుగర్వ భుజాగర్వదుర్వారుండై పెకలించి .... భాగ. ౧౦. ఉ. ౫౭౭.

కడతెంచు. స. క్రి. (కడచు + తెంచు - స్వార్థమున) కడచు, దాఁటు.

ద్వి. అపమాన మైనయయ్యమున మార్గంబు, విడిచినఁ గడతెంచి వేవేగ గొల్ల,విడివట్టువరు నందువిడివట్టు సొచ్చి. అ. మ. క. ౨౨ పొ. ౧౩ పం.

**కడతెగు.** అ. క్రి. (కడ + తెగు) ముగియు, సమాప్త మగు.

క. ఉడుమండలంబు దాఁకను, వడి నేఁగిటిఁ గోట దాఁట వచ్చునొ యంచుం, గడతెగక యంతకం తకుఁ, బొడవయ్యెను నాకు దాఁటి పోరాదయ్యెన్. మైరా. ౨. ౧౧.

**కడతేర్చు(ఉచు)** స. క్రి. (√కడతేఱు) కడతేఱఁ జేయు.

(చంపు. వధించు)

క. విని గురుతనూభవుఁడు పది, దినములఁ గడతేర్తు నని యె ధీరవిచారా. భార. ఉద్యో. ४. ४౧४. (చూ. ४. ४౦౩.)

క. ...దానవు, కపటమునఁ దెలిసి వానిఁ గడతేర్చుట యున్. జై. భా. ౫. ౧४౯.

(పోఁగొట్టు)

గీ. వారియగములు గడతేర్చి వాంఛితములఁ, గరుణ నొనగూర్చు.... ఉ. రా. ४. ౨౩.

(కొనసాగించు, నెరవేర్చు; నిర్వర్తించు.)

సీ. తొడఁగినపని చలం బెడపక యతిదుష్కరంబైనఁ గడతేర్చు ప్రభువులార. భార. విరా. ౩. ౨౧.

గీ. జనపని ప్రతిజ్ఞఁ గడతేర్తు నని తలంచి. ఉ. రా. ౩. ౧౧౩.

గీ. ....బంతి, తేర్లదొర వేల్మి నెటిఁ గడతేర్చియున్న. అచ్చ.రా.బాల.౬౩.

(కృతార్థతనొందించు)

(కుంతి కృష్ణునితో నన్నమాటలు) చ. అలఘువిచార నాయలఁత యాప్పుము నన్ గడతేర్పు మెమ్మెయిన్. భార. ఉద్యో. ౩. ౨౦౧.

**కడతేఱు.** అ. క్రి. (కడ + తేఱు) ౧. చచ్చు, మర ణించు; నశించు.

చ. ...కుంభకర్ణుఁ డా, దిగఁ గలవీరు లెల్లఁ గడతేటి రనేకులు శూరులున్న మీ, నగిరము.... భా. రా. యు. ౧౧౨౩.

గీ....వారిదేహంబులు నస్మదాది, దేహములఁ బోలెఁ దుదిఁ గడతేఱు.... కాశీ. ౬. ౬౬.

౨. పోవు, గతించు.

సీ. పరహితంబులు దానపరతలఁ గడతేటె సతత వ్రతోపవాసములు పొలిసె. హరి. పూ. ౧. ౧౦౦.

ఉ....అట్లన్. దే విరహజ్వరంబు కడతేఱునె యీచలి మందులందు.... భోజరా. ౩. ౨४౯.

వ.....ఎన్నంళక్తి కడతేటె.... కాశీ. ४. ౧४౨.

౩. నెఱవేఱు, సిద్ధించు.

ఉ. ముందటియట్ల యింకఁ బదుమూఁడుదినంబుల మాత్రకున్ భవ, న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ.... భార. విరా. ౩. ౬౨.

క. విను మేను జేయఁబూనిన. పనులం దొకటి గడతేటెఁ బాపాత్ము సుయో, ధనుఁ దొరిగొని తలఁ దన్నుదు, నను రెండవపనియుఁ దీర్ప నరిగెద నెలమిన్. భార. కర్ణ.౩. ౨౨౫.

४. బాగుపడు; వర్ధిల్లు; బ్రతుకు.

చ. వలపున స్త్రీలబుద్ధి వినువా రొకరేఁ గడతేటి నట్టివారలు గలరా....సారంగ. ౩. ౬౬.

చ....ఎవ్వరుం బడనిపాట్లకు లోనయి ప్రత్యయార్థమై, యడరెడుచిచ్చుఁ జొచ్చియతియత్నమునన్ సుఖమింతచెందినం,గడపట జానకీసతికిఁ గాఁపురముం గడతేఱదాయెఁ గా. ఉ. రా. ౬. ౩౨౨.

సీ. అనుపమాకృతిఁ జూచి ఘను డౌ ననిరి గాని కడతేఱఁడని నాఁడె నుడువరైరి....గీ.అంచు రత్నాంగి సుతుఁ జూచి యలమటించు. సారంగ. ౩. ౧౦౨.

ఉ..... చంద్రభాస్కరు లి దేమి యకారణవైర మిట్లు నా,దిక్కునఁ జూపినారు కడతేఱఁగ నిత్తునె యింక వారలం, న్మిక్కిలిశక్తి మీఁ ఱఁ

దిగ్భ్రమింగెన నంచుఁ బరిప్లవింపఁగ౯. దశా. ౨. ౩౭౨. అప్ప రా. యు. ౧౧౫.

౫. కృతార్థతనొందు.

వ. ....ఆర్తజనశరణ్యుండ వగునీనిముత్తంబునఁ గడతేఱఁగలదాన నగుట నాకలతెఱం గెఱింగించెద దత్తావధానుండవై యవధరింపుము. విప్ర. ౩. ౧౧.

సీ. ....కడతేఱె ననఁ గృతార్థం బయ్యె ననుట కొప్పు. ఆం. ధా. ౩. ౯౪.

౬. ముగియు, సమాప్తమగు, కడచను.

సీ. ....పూర్ణచంద్రుండు మలినుఁడై కానవచ్చిన నాయువు సంవత్సరంబునఁ గడతేఱు రాజముఖ్య. భార. శాం. ౬. ౧౨౯, (శ. ర, ప్రాంత ప్రతిపాదములు)

**కడనుంచు.** స. క్రి. (కడ౯ + ఉంచు) పరిత్యజించు, వదలివేయు.

సీ. పంకజాతాసనప్రతిపత్తిఁ గడనుంచి మృగరాజపీఠిపై మేల్ఘటించి. గీ. రాజవేషంబు గాంచుధారతి యటంద్రు, మల్లనంతమహీనాథు. మతిననాథు. కకు. ౧. ౧౩.

ఇట్లే :- కడఁద్రోచు.

గీ. రమణ ద్రష్టృత్వనిర్వికారత్వసాక్షి, తాదివిద్యోక్తధర్మజాతమును దొంటి,పగిదిఁ గడఁద్రోచి నీస్వరూపము భజింతు. సీతారా. ౩౩౦. ఉ. హరిశ్చ. ౧. ౬౭.

**కడప**[1] = గడప. వి. (√ కడచు. త. కడప్పు.) ఇంటిగడప, దేహళి.

గీ. కడపమీఁదను మఱి సన్నెకంటిమీఁద, జక్కిమీఁదను గూర్చుండ జాదగాదు. కాశీ. ౨. ౭౫.

**కడప**[2] = కడిమి. వి. (సం. కదంబః.) కడిమిచెట్టు,

సీ. కడపపూఁదేనియఁ గడుపారఁ గొని మ్రోసి తిరుగుతేఁదేఁటులతెరలికయును. హరి.పూ. ౯. ౬౮.

గీ. కడిమి కడప యటం చనఁబడుఁ గదంబ, ము.... ఆం. ధా. ౨. ౪౬.

**కడపల.** వి. బౌ. (√ కడ) అంతము, చివర.

వ. .... శతసహస్రసంఖ్యలయేండ్లు చరియించియుం గుక్షిలోఁ గడపల గానఁ దయ్యె. హరి. ఉ. ౯. ౯౮.

గీ. ఏది మొదలేది కడపల యేది మధ్య,ము.... భీమ. ౬. ౩౪.

గీ. ఇన్ని చేసినఁ గడపట నింటిలోనఁ, బ్రాపుసుకు రేదు పాపంబె తగెఁ గాని. వరాహ. ౭. ౭౬.

విణ. చివరది, కడపటిది.

క. కడపటిఘాములు నడు మగు,నడుఘాములు కడపలగు....హరి. ఉ. ౯. ౪౦,

చ, కడపటినాఁడు....కళా, ౨, ౫౨,

కడపటికొండ = చక్రవాళపర్వతము. వేం. పంచ. ౧. ౭.

కడపలచేరు = అంతమునొందు, పోవు.

సీ. చాతకంబులపిపాసలు కడపలచేరెఁ గాంతారవహ్నుల గర్వ మడఁగె. దాగ. ౧౦. పూ. ౭౫౩.

**కడపిపుచ్చు.** స. క్రి. (కడపి + పుచ్చు.) ౧. పంపు.

(క) అపాయమునుండి తప్పించి పంపు.

వ. ....నికటప్రదేశంబున నున్న పింగాక్షుండు.... తీవ్రమార్గణంబుల నిగిడించి లుంటాకులం దోలి యోటపడకుండ సార్థవాహులం గడపిపుచ్చి. కాశీ. ౪. ౬౪.

(చ) అభీష్టము నెఱవేర్చక పంపు.

గీ. శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి, కడపిపుచ్చిన మూర్ఖులోకములు దప్పు. భార. ఉద్యో. ౧. ౧౬౧.

౨. (కాలము) వెళ్లఁబుచ్చు.

ఆ. ఆలతాంగియుఁ దన కప్పటి కొౕక్కౕంత, గర్భజనన శంక గల దటంచుఁ, జెప్పి సిద్ధుసుతుని సిద్ధుని కీక యేఁ,గలయ నన్యు ననుచుఁ గడపిపుచ్చె. కళా. ౫. ౧౨౧.

౭. కప్పిపుచ్చు, మఱుఁగుపఱుచు.

వ. అంత నావాగ్దేవి యావిధంబున నౌదవినకళా మర్మ భేదనసామ్రాజ్యసంపదను భవావస్థ మానలాఘవ శంక నప్రకాశంబుగాఁ గడపిపుచ్చుటకు సుపాయం బుఁ జింతించి. కళా. ౫. ౧౭.

డపు. స. క్రి. (√ కడచు)౧. చంపు, వధించు: కూల్చు:

శా. తిన్నం డంతట దేవదేవునకు భక్తిం దృప్తిఁ గావింప నా,సన్నగ్రామమహాటవుల్ దిరిగి దంష్ట్రాటంక కోటీపుట,చ్ఛిన్నక్ష్మాజవరాహము న్గడపి కాల్చెన్. ....కాళ. ౩. ౮౬.

చ. ....ప్రహస్తుఁ డుగ్రుఁడై,కరముసలంబునం గడపె గ్రక్కున వేవురుయక్షులన్.... ఉ. రా. ౩. ౩౬.

ద్వి. ముదితరో యాతండు మొగి దోలు దొలిపి, మద్దులఁ గడపినమహితశౌర్యుండు. ని. భాగ. ౩. ౪౯ పొ.

౨. పోఁగొట్టు: రొలఁగించు.

సీ. ...నానాండజముల ప్రాణములు గడపి. కాళ. ౩. ౪౭.

గీ భువనసంక్షోభకారి యై పుట్టెనొక్క. రక్కెఁడియు ల్పాత మది నీవు గడపవలయు. కాశీ. ౨. ౬౯.

గీ. ....నేఁటియాపద గడపవలయు. నా. పంచ. ౧. ౨౨౦.

౩. (పైకి) పోఁజేయు, ఎక్కించు.

చ. ఒడికముతోఁ బ్రయత్నమున నొక్కమహాశిలఁ గొండమీఁదికిన్, గడపఁగ ధార మచ్చటిది గ్రక్కున భూమికి డిగ్గఁ ద్రోవఁ గాఁ,గడుసులభంబు....నా. పంచ. ౧. ౧౦౭.

౪. ఉల్లంఘించు, మీఱు.

ద్వి. గాధేయమునిమాట గడపక శబ్ద. వేధిబాణముల నవ్వేదమూయ లదఁచి. రం. రా. బాల. ౨౭ పొ. ౨౩. పం.

౫. (త. కడత్తు) ఈపునపొమ్మను; పొమ్మను.

ఉ. పట్టపురాజ నంచు నౌడఁబాటులు దప్పను భూజనంబులన్, గట్టియుఁ గొట్టియున్ బహుముఖంబుల నర్థము గూడఁబెట్ట నే,పట్టున నర్థులం గడప.... భోజరా. ౩. ౧౩౭.

క. అడిగినయప్పుడ చెప్పెరఁ,గడపినఁ బోనవ్వయేను గడుదుర్మతినై,పదఁపి నను నిలిపి భిక్షం,బిడక కను నవజ్ఞఁ జేసి తేల మదమునన్. భార. అర. ౫. ౧౩.

గీ. ....నరవరుండు,వేఁడ మణి యీక కడపుట వెట్టి తనము. వరాహ. ౫. ౧౩. కాశీ. ౭. ౧౩౯.

౬. దాఁటించు, తరింపఁజేయు.

గీ. కలుషఘోరపయోరాశిఁ గడపుతరణి. పారి. ౪.౪౯.

౭. (గట్లుమొదలగువానిని) దాఁటించు, మీఱఁజేయు. (కపటద్యూతవర్ణనము) సీ. .... ఎక్కుదాయంబుల యెడలు గడపి. దశప. ౫. ౬౪.

౮. నడపు.

క. అమరేంద్రసుతుఁడు తనకుం,గమలాక్షి సుభద్ర రథము గడపఁగ....భార. ఆది. ౮. ౨౦౨

క. ....మత్స్యగంధి యనఁగా ధర్మా,ర్థంబుగఁ దన తండ్రినియో,గంబున నయ్యమున నోడ గడపుచు నుండెన్. భార. ఆది. ౩. ౩౪.

వ. చంద్రసూర్యులం గాలంబు గడప నియోగించి .... భీమ. ౪. ౧౫౧.

౯. జరపు, వెళ్లఁబుచ్చు.

గీ. కడపితే రాత్రి సులభసౌఖ్యంబుగా మనం

బు గాధప్రసన్నమే యంబుజాక్ష. భార. శాం. ౨. ౪.

గీ. దర్పితేల్వలవాతాపిదమన మీయ. పెక్కుకాలాలు గడపినపెద్దలు....వరాహ. ౯. ౧౩౨.

౧౦. విడిచిపెట్టు, వదలు.

సీ. విరుదులనైనను బిటికివాండ్రనునైనఁ జంపుచోఁ గడఁపడు జముఁడు నేప్పు,లాపును మర్త్యనిచాపు మూన్పఁగ రేపు రణ మొనర్చినఁగాని రాదె మర ణ,ము....భార. స్త్రీ. ౧. ౨౫.

(పంతికర్ణునితోనన్న మాటలు.) చ....గొంతిహృదయం బున శోకము నివ్వటిల్ల ని,ట్లను నిది దైవసంఘటన మక్కట యెట్లును దప్ప నేర్చునే. యనుపమసత్య విస్ఫురణ నాడినమాట మహాత్మున్న నీ,యనుజుల నల్పురం గడపుమర్థును చేఁతపసమ్మతించితిౕ. భార. ఉద్యో. ౪. ౩౦.

౧౧. పాఱఁద్రోలు. తఱుము.

గీ. అచటివెలయాండ్రు రంభాదు లైన నౌరయఁ, గాసె కొంగున వారించి కడపఁ గలరు. మనుచ. ౧. ౫౦.

ద్వి. కనకంపుఁదీఁగెలఁ గడిపుదాహుపులు, మృదుపల్ల వంబుల మిగులుహస్తములు. ద్వి. నల. ౧. ౭౩౩. (ఇట ఔపమ్యద్యోతకము)

కడపుఁజేయి. వి. (కడపు + చేయి) చుక్కాను. అరిత్రము.

సీ. వైరిసైన్యాబ్ధిలో వచ్చుగెల్పుంనావఁ గడఁజేప్పు బ్రాఁ కుడుఁ గడపుఁజేయి. పారి. పీఠి. ౨౪.

కడబంతి. వి. (కడ + బంతి) పంక్తియొక్క చివర.

సా : వడ్డించువాఁడు తనవాఁడైనచో కడబంతిని గూ ర్చుండినను లోపమురాదు.

కడమ. వి. (త.కడై) ౧. కొఱఁత. వెలితి. లోటు.

సీ. అన్న కుమార నీ యట్టి సత్పుత్రుం డు గలుగ మా కేమిటఁ గడమ. సెపుమ. భార. ఆర. ౫. ౧౧౫.

చ. .... గుణము వర్ణన లర్థము శబ్ద మొప్పు నే.కడ మయు లేదు మత్కృతికి... ఉత్త్రాం. ౧. ౨౦.

౨. శేషము, మిగులు.

క. మొదలనె నాకుం గలిగిన,యది శంఖసుదర్శనాంక నాదిపహితమై. పొదబెడిప్రపత్తి యిఁకనడ. పెదఁ గడమయు....పరమ. ౪. ౧౪౦.

(చూ. ౧౩౩. కడమ :- శేషవృత్యముఅనిభావము.)

౩. కడ, అంతము, తుద.

గీ. అనిన సర్వాపరాధి నే నధిపతనయ. నీవు పుణ్యా త్మకుండవు నీకుఁ దప్పు. మోవ నే నెంతవాఁడ నా పాపమునకుఁ, గడమ లే దంచుఁ జాఁగిలఁబడియెఁ గుంథి. భోజరా. ౫. ౩౧౭.

విశ. ౧. న్యూనము, తక్కువయైనది, కొఱఁతపడినది.

ద్వి. ఒక్కటి కడమగా నొగి నూఱుమాయ, లక్కడి వారిచే ననువుగా నెఱిఁగి. రం. రా. ఉ. ౫౬. పొ. ౧. వం.

సీ. రమణీయనూతనరతిరహస్యములకుఁ గామశాస్త్రం బులు గడమ లయ్యె. వి. శపం. ౩. ౨౧౯.

౨ శేషించినది, మిగిలినవి; అన్యము, ఇతరము.

క. కడమకథ నుడువు మనినం, బడఁతికి శుకలోకపట్ట భద్రుఁడు తెలిపెౕ. శుక. ౧. ౧౨౯.

వ. ....కుంతియును దానిరెండుభాగంబులు చేసి యం దొక్కభాగంబు భీమునకుం బెట్టి తక్కినభాగంబు కడమకొడుకులుం దానును గుడుచు. భార. ఆది. ౬. ౨౩౭. ఆం. భా. ౩. ౨౪.

జ : కడఁబడు, కడమపడు, కడమపెట్టు.

కడమప(వ)డు = కడఁబడు. అ. క్రి. ౧. కొఱఁతపడు, న్యూనమగు.

వ. ఒక్కరాత్రాడు సుట్టిన నది రెండంగుళంబులు కడమ పడియె మఱియు నొక్కబంధనంబు

సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యె. భాగ. ౧౦. పూ. ३౮४.

గీ. కడమవడఁ బల్కుఁ బల్కు లాకస్మికముగ, మగువ మదిరారసోన్మాదమహిమవలన. కవిక. ४. ౧౬३

క. ఏవెంటఁ గడమపఱుపక, దేవా మము సంతరించి లివి నీపాలం,జా వగుట దమకుఁ దగు నటు,గావున భక్షింపు పనరఁగా నేమిటికిఁ. వేం. పంచ. ౧. ३౨౬.

౨. శేషించు, మిగులు.

గీ. కదిసి రథ్యముల్ వేయింటఁ గడమపడక, యుండఁ జించి.... హరి. ఉ. ౭. ౨౧౮.

గీ. అట్లు వైరులవధియించి యచటఁ గడమ,పడినపస తులు పడఁద్రోచి .... కేయూర. ౨. ౧౦३.

३. అసంపూర్ణమగు, ముగియకుండు.

వ. చెఱువు కడమపడియె ననియుఁ బేదగుడులకుఁ బూజ నడువ దనియు....చెప్పి పంప నారాజీవా సంబు గుప్తాగుప్తప్రకారంబులం బంపుద్రవ్యంబు లెచ్చి.... ఆము. ४. ३३.

కడమపెట్టు. స. క్రి. (√కడమ.) మిగుల్చు.

గీ. ....అపత్త్రికాప్రకార మేమియు నీ వింకఁ గడమ పెట్టకంతయును నాకు నెఱిఁగింపు .... ప్రభా. ३. ౧४౮. ప్రబోధ. ३. ४.

కడముంత=కడవముంత. (వా, శ. ర.)

కడముట్టు. అ. క్రి. (కడ + ముట్టు.) సమాప్తమగు, ముగియు; నిశ్శేషమగు, సంపూర్ణమగు.

సీ. తనసేవగాఁ బురందరుఁడు గట్టించు తెంపుల హజారము కడముట్టెనొక్కొ. కళా. ३. ౧३౦.

ద్వి. నేఁటితోఁ గడముట్టెనే కౌశికుండు, గాటంబుగా సల్పు కపటనాటకము. ద్వి. హరిశ్చ. ఉ. ౨४३३.

గీ. శత్రువు ఋణంబుఁ జిచ్చు నెచ్చరికతోడఁ, గడమ పెట్టక కడముట్ట నడఁపవలయు. ప్రబోధ. ३. ४.

కడముట్టఁబడు = పారంగతుఁడగు, అవ్వలియొడ్డు చేరు.

గీ. సమధికం బైనసంసారజలధియందు, మునుఁగు చును దేలుచును గడముట్టఁబడని జనుల కెల్లను మత్స్యాదసరసిజములు, తెప్ప యై యుద్ధరించు నిందీవరాక్షి. భీమ. ३. ౧३౦.

కడయేనుఁగు. వి. (కడ + ఏనుఁగు.) దిగ్గజము. అచ్చ. రా. బాల. ३౮.

కడయేలిక. వి. (కడ + ఏలిక.) దిక్పాలుఁడు. అచ్చ రా. అర. ३౮.

ఇట్లే :- కడయొడయుఁడు. అచ్చ. రా. సుం ౧३३.

కడయొత్తు. వి. (కడ + ఒత్తు.) గృహవిశేషముయొక్క చుట్టుగోడయందలి కంబములమీఁది దూలము. (శ.ర.)

కడరాలు. వి. (కడ + ఆలు-ఇది 'పేదరాలు' వంటిది.) కడజాతిస్త్రీ, చండాలస్త్రీ.

ద్వి. వెలయంగఁ బెనిమిటివెనుక నిట్లుండ, వలపదా కడరాలివర్తన మొప్పఁ, గడుసాంగ మయ్యె నీగ రితభక్తియును. పండితా. దీక్ష. ४౨. పొ.

కడతెప్ప. వి. ( కడ + తెప్ప. ) కనుతెప్పయొక్క కొన.

సీ. కడతెప్ప లొరయంగఁ గనువమ్మ లర మోడ్చి.... ....నైష. ३. ౯.

కడలి. వి. (కడలు + ఇ = అలలుకలది- కత కడల్.) సముద్రము, మున్నీరు.

గీ. కపటమత్స్యంబవై నీవు కడలిసఁదుమ. నైష. ౫. ౧౨౦.

కడలికూఁతురు. వి. (కడలి + కూఁతురు) లక్ష్మి. నిఘ. అం. సం. దేవ. ౧౦.

కడలిరాయఁడు. వి. (కడలి+రాయఁడు) ౧. సముద్రములలో గొప్పది - క్షీరాబ్ధి. పాలసముద్రము.

సీ. ....కడలిరాయలలోఁతుఁ గన్నుఁగవ్వ. గీ....మందరంబు. మనుచ. ౫. ४౭.

౨. సముద్రప్రభువు - నీటిఱేఁడు, వరుణుఁడు. ఉ. రా. ౧. ३౧౬.

కడలివెన్న. వి. (కడలి+వెన్న) చంద్రుఁడు.

రగడ. కడలివెన్నయు వేఁడివేలుపు గాడ్పు నగ్గియు నెల్లగాములు....నీవె....అచ్చ. రా. యు. ౬४. అం. సం. దేవ. ౧౫.

కడలు. వి. (బ. కడళ్లు, కడళులు) తరంగము, అల.

సీ. తూఁకొడుపయ్యెద దుఃఖాంబునిధిలోనఁ గడలుచందంబునఁ గడలుకొనఁగ. హరి. పూ. ౯. ౧४४.

(రావణుఁడు) క....అమరబలమునకుం గీడ్పడక నిలిచి మెఱసెను బలు,కడళ్ల కెదురైన దాతికరకోం దిరమై. నిర్వ. ౬. ౧३४.

సీ... జలధులు నలిరేఁగి కడళుల నభ మెక్కఁ గడఁగె ననఁగ. హరి. పూ. ౭. ౧౬३.

జ: కడలి, కడలికూఁతురు, కడలిరాయఁడు, కడలివెన్న, కడలుకొను, కడలుకొలుపు, కడలెత్తు, కడలొత్తు.

కడలుకొ(ల్కొ)ను. అ. క్రి. (కడలు+కొను.)

౧. అతిశయించు.

క. ఉత్తర నలంకరింప ను,దాత్తాభరణాదివస్తుతతి యొసఁగి నరేంద్రోత్తముఁడు నేర్పుగల చెలి,కత్తియలం బుచ్చెఁ బ్రీతి గడలుకొనంగన్. భార. విరా. ౫. ३౮౮.

క. అని ప్రియము గడల్కొనఁ బల్కిన ....సారంగ. ౨. ౮౬.

౨. పొంగు, ఉప్పొంగు.

ఆ. ....కథవినంగ నాకుఁ గౌతుకంబు, మనము నిండి గడలుకొనుచున్నది....భార. ఉద్యో. ३. ४౧౨.

३. వ్యాపించు. (ఈయర్థమున 'కడ+లు+కొను'- అనియుఁ జెప్పవచ్చును.)

మ....గద్దెపొం చెదలి వీఁకం గేసరంబుల్ గడల్కొన....పొల్పొందెం బె నంభోజముల్. భార. ఉద్యో. ౨. ౧౧౦.

४. కలుగు.

గీ. .... నిద్ర రేపు మాపు,మానియుండిన జాడ్యంబు మేనఁ బొడముఁ,గన్నుఁగవయందు నరుణిమ గడలుకొనును. దశా. ౨. ౧३౮.

కడలుకొలుపు. స. క్రి. (√కడలుకొను.) ౧. వ్యాపింపఁజేయు. ఈయర్థమున కడ+లు+కొలుపు - అనియుఁ జెప్పవచ్చును.)

గీ. గఱులు సారించు మీసలు గడలుకొల్పు .... మీన, వేషి పెన్నీట నిగమగవేషి యగుచు. భాగ. ౮. ౭౧౯.

౨. కావించు, కలిగించు.

సీ. రతిదేవినెవ్వీఁగురారాపుఁజన్నులు గడకన్నులకు నింపు గడలుకొలుప.... గీ. ఉక్కడీఁ దయి యేతెంచె నుక్కు మిగిలి,కలికిగారాబుచెలికాఁడు కలికిమదుఁడు. నైష. ౭. ४౧.

సీ నడునెత్తి మస్తిపా లిడి తాలిక లొనర్చి కడలుకొల్పిన గొప్పజడలదింపు. శుక. ౨. ३౨.

కడలెత్తు. అ. క్రి. (కడలు+ఎత్తు) పొంగు, తరంగితమగు.

సీ. పదపల్లవంబునఁ బ్రకటిల్లుచదలేఱు కడలెత్తిధాత్రి వెల్వొడిచి పాఱ. కాశీ. ౫. ౧౧౨.

క. కడలెత్తి మ్రోయ వెలుచును,జలనిధు లినుఁడెండ గాయ శంకిలు....ధా. రా. బాల. ౧౨౬.

కడలొత్తు. అ. క్రి. (కడలు+ఒత్తు) ౧. తరంగితమగు. పొంగు.

మ. నెలయేఱుల్ గడలొత్తఁ జేయుచును .... కానన మారుతంబు తనరున్ వాంఛానుహూపఁ

బుగా, వలఘుస్వేదవినోదనం బొసఁగఁగా నాసీనుఁ డై....హరి. ఉ. ౧. ౩౭.

ఉ. ....లో,నూనినరోషవార్ధి గడలొత్తఁగ ని ట్లనిపల్కె-భూవరా. భాగ. ౧౦. ఉ. ౩౨౪.

౨. వ్యాపించు. (ఇట-కడ + లు + ఒత్తు. అనియుఁ జెప్పవచ్చును.)

సీ. కరమూలములఁజిగి గడలొత్తి వల్లత్కుచో పాంత కాంతుల నొత్తరింప. హరి. పూ. ౮. ౧౬౮.

కడవ. వి. (సం. ఘటః. ప్రా. ఘడో) కుండ, కుంభము.

ఆ. తిండిపోతవీకు తిండనం బేటికిఁ,గడవఁజేరిమనసు కొంత దీఱ,నోపుకొలఁది మ్రింగి యూరక నీవింటి, కడవ యుండు మింక నడిచి పడక. భార. ద్రో. ౪. ౨౩౫. (కడవః-అన్నపుకుండ అనిభావము.)

కడవచెవులపోటరి = కుంభకర్ణుఁడు. అచ్చ. రా. యు. ౨౨౪.

జ : కడముంత, కడవతీటు, కడవముంత, కడవ బాయి.

కడబఁడు. వి. (క. కణవ, కణబ.) మగగుఱ్ఱము.

క. పంచించి ప్రాణవల్లభ, గొంచక తా నుత్తరకు రుకుం భినిఁ బంచా, రించినగోడిగమై వర్తించువిధము యోగదృష్టిఁ దెలిసి కడవఁడై.

క....సంజ్ఞా, కంఖాణిం జేర నరిగి కామాతురతన్. నరాహ. ౫. ౯౫, ౯౬.

కడవఁబడు,కడవఁగఁబడు. అ. క్రి. (√ కడచు - స్వార్థమున 'పడు') - దాఁటిపోవు - ౧. శేషించు, మిగులు.

క. నడుకట్ట లిసుకతిప్పలు, మడలు దరులు వాఁకలును గ్రమంబున నొకడుం, గడవఁబడకుండఁ గృష్ణుఁడు, పడఁతులకును యమున యాటపట్టుగఁ జేసెన్. హరి. పూ. ౮. ౩౭.

౨. గతించు, కడచు.

క. వెడపనికి నాలిఁ బంపం, గొడుకుఁ బనిచి వచ్చినాఁడఁ గ్రూరత్వమునం, గడవంబడునొకొ పని యని, కడువెసఁ జనుదెంచె నశ్రుకణములు దొరఁ గన్. భార. శాం. ౫. ౨౮౧.

గీ. అటుల నిజగృహమున కేఁగి యబ్జవదన, పగలు గడవంగఁబడుటయుఁ బార్థివేంద్రు, కేళిగృహమున కరుగునవ్వేళ....శుక. ౩. ౩.

కడవఁబెట్టు. స. క్రి. (√ కడచు) ౧. తొలఁగించు.

క. ఆపదఁగడవంబెట్టఁగ, నోపి శుభం బైనదాని నొదఁ గూర్పను మా, కిపుట్టువునకుఁ బాండు, క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. భార. ఉద్యో. ౩. ౬.

౨. (కష్టాదులనుండి) దాఁటించు.

గీ. ....మీదయాసుకృతాదుల, పెంపు మిమ్ముఁ గడపఁ బెట్టకున్నె. భార. ఉద్యో. ౧. ౧౦౬.

కడవడించు = కళవళించు. అ. క్రి. కలఁతపడు.

ద్వి. ఎదనెదఁ గడవఁలోఁ బదఁగడచుచునుఁ, గడవడించుచు భుజంగము విజృంభింప. బస. పు. ౬. ౪౩౦ పం.

కడవతీటు. వి. (√ కడవ.) తుడుము, వాద్యవిశేషము. (శ. ర-కడువతీటు అని. చి. ని. బ్రౌ.)

కడవన్నె. వి. (కడ + వన్నె.) ౧. (బంగారముయొక్క) చివరవన్నె, పదియాఱవవన్నె; పదియాఱవవన్నె బంగారము.

సీ. కడవన్నె తళుకుబంగరుకోట....దశా. ౧. ౨౬౨.

సీ. కడవన్నె గిండ్లాకో గజనిమ్మపండ్లాకో సుదతి లలామ వక్షోరుహములు. ఇందు. ౨. ౧౫౮.

కడవన్నెగుబ్బలి = కనకాద్రి, మేరుపర్వతము. ఉ. రా. ౬. ౧౧౦.

కడవముంత = కడముంత. వి. (కడవ + ముంత) చిన్న మట్టిపాత్రము. హంస. ౫. ౧౧.

కడవబాయి. వి. (కడవ + బాయి.) కుమ్మరి కడవలు చేయుట కుపయోగించెడుబాయి. హంస. ౫. ౯.

కడవసము = కడాసము, కళవసము, కళాసము వి. ధార్యచర్మము, ధరించుటకుపయోగించు తోలు.

క. కడవసములుఁ గోలలుఁ గప్పడములు వీరల ధనంబు....భార. ఆది. ౭. ౨౨౫.

చ. జడలను బెంచుచుం గడవసంబులు గట్టుచు.... భూమి జనించినట్టియా, మృడుఁడను గాను.... పార్వ. ౧. ౧౪.

కడవాఁడు. విణ. (కడ + వాఁడు) ౧-సమీపమందుండు వాఁడు-సేవకుఁడు,

(నకులుఁడు ధర్మరాజుతో నన్నమాట) క....నాలోంటి విధం, బామనుజేశ్వరుఁడడిగిన, నే మీకడవాఁడనందు ....భార. విరా. ౧. ౯౬.

(౨-వ - అర్థమునకుఁగూడ నిది యుదాహరణము.)

౨-చివరవాఁడు-(వ) కనిష్ఠుఁడు.

సీ. గారాపు మీతల్లి కడవాఁడఁగాని నేగణుతింపఁగడ వాఁడఁ గాఁజుమయ్య, మనుచ. ౫. ౪.

(ఇటసోదరులలోఁ గని ఁడు అని భావము. ఇది ౩. అర్థమునకుఁగూడ నుదాహరణము)

(చ) అంత్యజుఁడు, చండాలుఁడు.

మ. జడుఁడో భిక్షుఁడొ విప్రుఁడో వృషలుఁడో జ్ఞానా ఢ్యుఁడో సిద్ధుఁడో, కడవాఁడో యనుచున్.... మల్లభూ. వైరా. ౯౬.

శ్లో. చండాలః కిమయం....సం. భ ర్తృ. వైరా. ౯౬.

౩ - దూరపువాఁడు-అన్యుఁడు, పెఱవాఁడు. (చూ. ౨. అర్థము.)

కడవీను. వి. (కడ + వీను) చెవితుద.

మ. పదియార్వన్నె పసిండిపట్ట మవనీ పాలావతం సంబునె, న్నుదుటంగట్టె లతాంగి యొత్తు కడవీనుల్ సోఁక నేర్పొప్పఁగా....నైష. ౬. ౫౩.

కడవెళ్లు. స. క్రి. (కడ + వెళ్లు) దాఁటు, తరించు.

గీ. విరహవారిధి నేఁగడవెళ్ల బెపుడు. ప్రభా. ౩. ౧౨౪.

అ. క్రి. సమాప్తమగు. (శ. ర.)

కడవోవు. అ. క్రి. (కడ + పోవు) ఉడిగిపోవు.

క. ....పాయంబొకనాఁ, డుడివోవుట గలిగిన మదిఁ, గడవోదుగదే మనోజగర్వం బెపుడున్. శివయోగ. ౬. ౩౩ పొ.

కడవ్రేలు. వి. బొ. (కడ + వ్రేలు) చిటికెన వ్రేలు, కనిష్ఠిక.

(శివుఁడు) చ....శీతవసుధాధర కన్యక ముద్దుఁగేలుదా, మరకడవ్రేలు పట్టుకొని మన్ననఁ దిన్ననికిం బ్రసన్నుఁడై. కాళ. ౩. ౧౨౦.

కడసంజ. వి. (కడ + సంజ.) సాయంసంధ్య, మలు సంజ. కళా. ౮. ౧౦.

కడాని(నీ). వి. ౧. బంగారము, కాంచనము.

ఉ. మేలికడానిడాల్డాయలు మీటెడు జాబిలి డాల మేడలో. నీలా. ౧. ౧.

క. చిత్తజుఁడను దొమ్మరిలాఁ, గెత్తి వడిందూఁటి చనఁగ నిడినకడానీ, బెత్తపు వలయములో యన, బిత్తరి తాటంకయుగము బెడఁగై తోఁచెన్. చం. రా. ౩. ౭౯.

౨. మేలిమి బంగారము.

చ. మినుకుఁగడానిబంగరువుమేడలసోరణ గండ్లవెంట. .... నీలా. ౧. ౨౯. ఆంధ. ౨. ౨౭౯.

కడారము. సం. విణ (అ. అ. అ.) ౧. పింగళవర్ణము కలది, కపిలవర్ణముకలది. ౨. గర్వించినది. ౩. నిస్సా రము. వి. అ. పుం. ౧. పింగళవర్ణము. ౨. రూక్ష త్వము. ౩. శూలము. న. జలము.

కడారుఁడు. సం. వి. అ. పుం. భృత్యుఁడు.

కడాసము = కడవసము.

సీ....ధార్యచర్మనామము కడాసము కడవసమన.... ఆం. భా. ౨. ౧౭౭. (ప్రాఁత ప్రతిపాఠము.)

కడి[1]. వి. ౧. కబళము, ముద్ద; (గోమయాది) పిండము.

సీ. కమఠాండము నొక్కకడి చేసికొని మ్రింగ

నరుదెంచుచున్న కాలాంతకుండొ. భా. రా. యు. ౧౪౬౭.

గీ. కదెఁడు మెతుకులకై యింతకష్టపడెదు. కుచేల. ౨. ౧౧౨.

క. కడి మాడ చేయుభోజన,మిడుదుము భిక్షాటనం బిదేలా నీకుఁ. ధర్మ. ౩. ౩౯. (కడిమాడచేయు :- మిక్కిలి విలువగల అనిభావము.) శేష. ౧. ౧౦౦.

(వ్యవ) ఆవు రాత్రి నాలుగుపేఁడకళ్లు వేసినది.

౨. ఆహారము, తిండి.

క. తడి గంట నెపుడుఁ దఱుఁగక,కడి దఱుఁగఁగ వడియుఁ దటిఁగి గానిఁ బుడమిఁ,బడినఁ గన రాక మంచపుఁ, దొడుగఱ్ఱై రట్టె బుజలతో నే మందుఁ. మనుచ. ౩. ౧౩౧.

ఓరెంపుఁగళ్లు = అన్నపిండములు.

ఆ. కలఁక మీఱ మిగులఁ గన్నీరు నించుచుఁ, గొంత దడవు సొగిలి యంత జతన,మొనర నుపులు నీళ్ల నోరెంపుఁగళ్లను, మొదలుగలుగుచెయ్యులదనఁ జేసి. అచ్చ. రా. అయో. ౧౧౨.

జ : కడికంచము, కడిగొను, కడిమెత్తు.

కడి². వి. సువాసన, సుగంధము.

సీ. కబళపరీమళశక్త్యర్థములయందుఁ గసుపట్టుచుండును గడి యనంగ. అం. భా. ౩. ౬౧.

౨. దుర్గంధము.

(గజవర్ణనము) సీ. కడి వోవ, నొదళులు గడిగి నవాశ్వత్థవల్కలరసములు వఱలఁ బూసి. కు. సం. ౧. ౯౦.

జ : కడివోవు.

కడి³. వి. క్షతి, గాయము. అం. భా. ౩. ౬౧.

కడిఁది. విణ. (క. త. కడిదు) ౧. గొప్పది, అధికము; పెద్దది.

చ. ....ఉన్మదకరినైన నుగ్రమృగనాథునినైనను గిట్టి ముట్టి పెట్టిదముగఁ గాలఁ గేలను గడింది మగంటిమి యుల్లసిల్లఁ బట్టుదు .... భార. విరా. ౧. ౮౩.

ఉ. ....కడిందిగ గ్రుక్కి....హరి. ఉ. ౨. ౬౭.

సీ. ....కడిఁదితొమ్మ....రామా. ౬. ౧౧౪.

ద్వి. కడిఁదికొమ్ములపోటు .... రం. రా. సుం. ౨౪౪ పా. ౧౩ పం.

౨. గంభీరము, లోఁతైనది.

(రాముఁడుసముద్రునితోనన్నమాట) ద్వి. కడగానరాని నీకడిఁది చిత్తంబుఁ, బడయుటకై నేను బడియున్నవాఁడ. రం. రా. యు. ౩౦౭ పా. ౬ పం.

ద్వి. కడిఁదిచిత్తంబు చెదరంగ . . రం. రా. యు. ౩౦౨ పా. ౧౬ పం.

౩. కఠినము, తీక్ష్ణము; దారుణము.

ఉ. భావములో నదంభ యగుభక్తికి సంతస మందు దొండె నొం,డే విధియింపుఁ డిప్పుడ కడిందిగ దండము దప్పు గల్గెనేఁ. నైష. ౪. ౧౧౩.

చ....కడిందివేసవిఁ. ఆము. ౨. ౬౪.

చ....పుష్పాది నీపదాంబుజం, బెటువలెనోర్చెనమ్మ తరుణీ తగునమ్మ కడింది చెయ్దముల్. పసు. ౩. ౧౨౧.

౪. అసాధ్యము, అశక్యము.

సీ....అవిచారముఖ్యంబు గాన లోకంబు మెప్పించుట కడిఁదిగాదె. నిర్వ. ౧౦. ౧౪౨.

ఆ. నవసి పొవసి యనుదినముఁ బరప్రేష్యులై, యునికి దలఁప నర్థమునకచూపె, యట్టిదుఃఖలబ్ధమైనయ య్యర్థంబు, విడుచు టెవ్విధమునఁ గడిఁదిగాదె. భార. అర. ౬. ౧౧౧.

౫. ౧ కడిమి, శౌర్యము.

సీ....కడిమి యుక్కు కఱకు గట్టి కడిఁది. గీ. నాఁగ శౌర్యాభిధానంబు గాఁగఁ దెలఁగు. అం. భా. ౨. ౨౨౧.

౨. ఆపద, ఇక్కట్టు.

క. వడిఁ బోయి మీర లిప్పటి, కడిఁదికి నేమాంస

మైన గ్రక్కునఁ గొనిరం, డెడసేయ కనుచు
ననిపిన... నా. పంచ. ౧. ౩౭౬.

కడిఁదిజడదారి=ధూర్జటి, శివుఁడు.
(చంద్రవర్ణనము) గీ. కడిఁదిజడదారిసిగపూవు
గళలప్రోవు. కృ. శకుం. ౧. ౨౨.

**కడికంచము.** వి. (కడి[1] + కంచము) భోజనపాత్రము, అన్నము తినుకంచము.
(శివవర్ణనము) చ. కలుపలరాజు పువ్వు కడికంచ
ము బ్రహ్మకపాలము....హర. ౨. ౭౫.

**కడికండ(ము)లు.** ని. బ. (కండ[2]లు + కండ[2]లు-
క. కడికణ్డ)ఖండఖండములు, ముక్కముక్కలు.
మ...తురగంగంగముల్, గడికండంబులు చేసి...
భాగ. స్కం. ౯. ౧౧౪.
సీ. కడికండలుగ హరికంఠంబు త్రెయుంచు నగ
నొరఁ బట్టినఖడ్గధార. కాశీ.ఖం.౧౫౨.కాశీ.
౨. ౫౯.

**కడిగొను.** స. క్రి. (కడి1 + కొను.) కబళించు, మ్రింగు.
క. చిన్నఁగఁ గడిగొనఁగ వచ్చెనె, చిచ్చఱమా
పచ్చపడినశివునకు దక్కన్. భాగ. ౮.
౨౪౬.

**కడితము.** వి. (సం. ఘుట్టితమ్. ప్రా. ఘుడిత. క. కడిత. త. కడిదమ్) గుడ్డమీఁద చిగురుతోఁ గలిపిన మసి పూసి నల్లపఱిచి అట్టలుగాఁ జేసి వానితో నేర్పఱచిన లెక్కలపుస్తకము. (పలకమీఁదవలె నే యీయట్టలమీఁద బలపముతో వ్రాయుదురు)
ఉ. దక్కఁగ వ్రాసితి న్మను పటమ్ము నయందు
సుశర్మపాపముల్, లెక్క మోయుంగరాదు
లవలేశము వానికి నట్టిప్రాఁతయం, దక్కజ
మిప్పు డొక్కటియు నక్షరరూపము లేదు
దేవ నేఁ, డక్కడితంబు గట్టియుడినట్టుల
యున్నది కప్పుదేఱుచున్. పాండు. ౫.౮౦.
సీ. కపణముల్ నా నెమ్ము గ్గలకట్లసంచిగోతము లె
క్కకడితంబు ... హంస. ౨ ౨౨౬ (రూ.
కణితము. బ్రా.)

**కడితి=కణితి.** వి. గోకర్ణమృగము, కడుఁజు.
వ....అడవులు చొరంబాఱుపిడికడితికదుపును
రసపికి విఱిగి పడినపిటపిటపంబులన్....
మనుచ. ౪. ౩౭.
మ...మృగేన్ పృకప్రాంతముల్ గడుతుల్ చిక్క
గజాళి చొక్కె...సారంగ. ౧. ౧౦౭.

**కడితులము.** సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

**కడిమి[1]**(డిమ్రి). వి. (√ కడు—త. కడుమై) ౧. బలము; పరాక్రమము, శౌర్యము.
గ... నాకడిమి వినుము...
ఉ. క్రమ్మఱ నొక్కరక్కసుఁడ కాఁడు సురా
సురులెల్ల నొక్కఁడై, వచ్చిన నీవ చూడఁ
గ నవార్యబలోన్నతిఁ జేసి వారలన్, ద్రచ్చి
పఠంబు...భార. ఆది. ౬. ౧౯౮, ౧౯౯.
క. ఆరాజమణిసుకుమారుఁడు, మారుఁడు సౌందర్య
మునఁ గుమారుఁడు కడిమిన్. రసిక.౧.౫౩.
మ...సురేశ్వరుని గడ్మింగిట్టి తున్మాడ నో, పినపు
త్రుం దగ నిత్తు నీకు...భా. రా. బాల.౪౭౬.
ఆం. భా. ౨. ౨౨౧.
౨. సంకోపాయము.
గీ. ఏఱునిలుపఁగ నొగ్గుట యుచ్చకంబు, మత్త
కరిఁ గెరలించుట మాయచేఁగ, కొండ నెగ
రించితగగు డీకొనుట కడిమి, కాన నధకుని
యొక మేలు దాన మంత్రు. కవిక. ౨. ౩౭.
౩. ఆధిక్యము, గొప్పతనము; అతిశయము.
చ. నెరవున లావునం గడిమి ధీరమునం గొలు
పొందురాచదే, వర...యయా. ౨. ౧౨౫.
గీ. కినిసి నూఁకటికడిమి నయ్యనిలసుతుఁడు.
ఉ. రా. ౫. ౧౦౧.
విశే. అధికము, పెద్ద.
×గద. కలిగొట్టుప్రాఁకువేడ్కలె కీకుఁ దఱ చె

వి. బియ్యము మున్నగునవి కడిగిననీరు, తండుకి ణము, కుడితి.

సీ. తండులక్షాళనోదకము రాజిల్లను గుడితి య నంగను గడు గనంగ. ఆం. భా. ౨. ౨౫౧.

కడిగిపెట్టు = కడిగివేసిన శ్లేమియు లేకుండఁ జేయు.

గీ. తులసిపోఁగులు మొదలుగాఁ గడిగి పెట్టి, చి క్కు బాకీలు పిదప నిశ్శేషపఱిచె. నిరం. ౨. ౧౧౬. ('లడ'లకు ప్రాసము.)

(వ్యవ) వానికి ఇల్లంతయుఁ గడిగి పెట్టినాఁడు = ఇంటిలోనియాస్తి యంతయు వాని కిచ్చి వేసినాఁడు.

జ: కడుగుడు.

**కడుగుడు.** వి. (√కడుగు) ౧. కడుగుట ౨. పడఁ గట్టుట, శోధనము.

సీ....వడఁగట్టు గాలింపు కడుగు చేసు. గీ. పఱు పడఁగ శోధనాభిధ పడఁగుచుండు. ఆం.భా. ౨. ౨౫౨.

**కడుజు**=కణుజు (శ. ర.)

**కడుపు(ప్పు).** వి. (సం. గర్భః. ప్రా. గబ్భో) ౧. ఉదరము, కుక్షి, పొట్ట.

క...ఎచ్చోటఁ గడుపుఁ బ్రోతుకొ యడుగుము. భా. విరా. ౧. ౨౬౮.

క....పానీయంబుల్, గడుపారఁ ద్రావె... వేం. పంచ. ౧. ౩౬౩.

చ....పసజున్రేవులు తోఁడుము గావ్పుకప్పు లో, సుడుకులు కోఁడుముల్ వడుణుగుండియుఁ దేడుచు...కవి. ౫. ౧౨౩.

ఆ...పేదయై,కడుపుకొఱకుఁ బాతకములు చేసి, రౌరవమునఁ గూలు...కేయూర. ౩. ౨౯౩. (కడుపుకొఱకు=ఉదరపోషణార్థము.) హరి. పూ. ౫. ౨౨౧.

౨. గర్భము, చూలు.

ఉ... జారుశశిఁ బొందికటా కడు పేల దెచ్చు కొం,టెగ్గు దలంపఁగా నలదె ... భాగ. ౯. ౩౭౮.

౩. గర్భాశయము.

క...లేడికడుపునఁ బులి పుట్టునె...భార.ఆది. ౬. ౫౮.

(వ్యవ)వాఁడు నన్ను తనకడుపునఁ బుట్టినబిడ్డకం టె ఎక్కువగా చూచుకొనుచున్నాఁడు. (కడుపునఁబుట్టినబిడ్డ=ఔరసుఁడు.)

౪. గర్భస్థపిండము, భ్రూణము.

క. దైతేయకామినీసం,ఘాతముమగ మొలక లై నకడుపులు డిగ సం,కేతించినట్లు చక్రము, పాతాళంబునకు నరుగఁ బ్రతిషణ్ణాసిల్. ఉ. హరి. ౩. ౧౫౭.

చ. కడుపులు దింప...శుక. ౨. ౨౫.

గీ. దేవకీదేవి కడుపులోఁ దేజరిల్లు,దీప్తగర్భంబు మెల్లన తిగిచి యోగ,నిద్ర గోపికాణికడుపున నిలిపి చనియెఁ,గడుపు దిగె నంచుఁ బౌరులు గలఁగఁబడఁగ. భాగ. ౧౦. పూ. ౬౨.

౫. సంతతి, సంతానము.

(వ్యవ) నీయమ్మకడుపు చల్లఁగా మంచిమాట చెప్పినావు.

గీ. పిరము వాణియు మొదలైనసుకపురంధ్రు, లెల్ల గడుపుల జల్లఁగా నఖిలపించి,నిజము మునఁ గొల్తు రెవ్వని నిత్యకలన,నట్టిశ్రీ మేసు నిమఁ గొల్తు మహానహంబు. భీమ. ౪. ౧౨.

కడుపంటు = కడుపు (ఆఁకలిచే వెన్నునకు) అం టుకొనిపోవు.

గీ. పెంటపొగ్గల్లోఁ గడుపంటి శ్మశ్రు,చలన ములఁ గ్రుక్కుజీర్ణోతుపుల...ఆము. ౬.౧౩.

కడుపుఁ గక్కుఱితి (కక్కుర్తి) = ఉదరపోష ణాశ.

చ. శపథపులఁబట్టి యేను సతతంబును బోదుము వానివీటికిన్,గడు మఱి చాలమిం గడుపుఁ

౨. ఈర్ష్య.
ఉదా: నాకు లాభము వచ్చినదని వానికిఁ గడుపు మంట.

**కడుపూఁద.** వి. (కడుపు+ఊఁద.) ౧. మలమూత్రములు బంధించి కడుపుబ్బరించెడు పశురోగవిశేషము.
ఆ. నరిడి పుప్పి కప్ప నావురు గడుపూఁద, యాము రుఁద్రిక్కు యనఁగ నడరి మఱియుఁ, దెవులు లెన్నియేనిఁ దవిలి యెంతయు మహో, గ్రంబులయ్యెఁ బసుగణంబునందు. హరి.పూ. ౬. ౪౫.
౨. కడుపుబ్బు, ఈర్ష్య. (శ. ర.)

**కడుపేడు.** వి. (కడుఁ + పేడు) పేఁడరవాఁడు కట్టుకట్టెడుసన్నని వెదురుపేడు. (శ. ర.)

**కడువు**=కడుగు.
గీ. ఆజ్యతైలాభ్యపేతభాండావలులకు, నేల్లనీసులనొండె వేన్నీళ్లనొండెఁ, గడువ శౌచంబు గోమయనొండెఁ గలుగు శుద్ధి. మార్క. ౩. ౨౪౪.

**కడాయము.** వి. (క. కడాయ. త. కట్టాయం.) బోను, బలాత్కారము. (శ. ర, బ్రౌ.)

**కడి(డీ)** వి. (సం. ఘటికా. ప్రా. ఖడిఆ. క. కడ్డి. త. కట్టి) ౧. బలపపుఁగోలు, పలకపుల్ల. (శ. ర.)
౨. పాళము, బంగారుమున్నగువానికడ్డి, శలాక.
గీ. కడ్డి యనఁగ సలాక నాఁగను శలాక, యమరు... ఆం. భా. ౨. ౨౭౫.
కడ్డవత్తి=అగరువత్తి.
క. ధూపంబు కడ్డివత్తులు, దీపంబు నొసంగి... శుక. ౨. ౩౯.

**కథాను.** వి. శస్త్రచాలనభేదము, కత్తి విసరులలో నొకటి.
వ.... కథాను ఘాణు దారు ఝాటు మొదలుప మనాలుగు విసరులు... ప్రబంధ. ౭౮.

**కణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకానొకయీఁగ, కుంభీరమక్షిక. ౨. పిప్పలి. ౩. జీరకము, తెల్లజీలకఱ్ఱ.

**కణఁకు.** వి. అగ్ని, నిప్పు.
గీ. సారది విహరించుకపులోకచోటఁ గూడి, కడిఁది చలిచేత మేనులు గడు వడంక, రాత్రి మొఱఁగి గాఁపుభద్యోతరాజిఁ జూచి, కణఁకు గాఁబోలు నని సీసు గాఁచుచుండ. నా. పంచ. ౧. ౯౭౪.

**కణ(డ)ఁజే(ము).** వి. (సం. కంజః. క. కణజ) ౧. ధాన్యాదులు దాఁచుకొనుకొట్టు; గాదె; సోణక.
గీ. ... అనిశకాలఁ, కోటి గోధుమలును వంట సాలయొఁ గణఁజంబుఁ గట్టించుటను మానసమునఁ దలఁచె. పర. ౫. ౬౬.
ద్వి. కణఁజంబు లావిగాఁ గలుగు సంపదలు, గణుతింపఁ జోద్యంబు గాఁగ ... నవనాథ. ౨. ౧౫౭. సం. ౯. ౨౧.
సీ. అఖిలసస్యపూర్ణధాన్యములకణంజలు... హంస. ౨. ౧౩౭.
సీ. కాయధాన్యంబులకణఁజముల్ ఓయ్యంపు గంటెలు దినుసులుగలకొట్టార్లు. హంస. ౨. ౨౨౬.
సీ. ఈఁగ నే యాఁగినఁ బ్రోగైనపంటను జగములన్నియుఁ గపఁజాలు గాదె. కవు. ౧. ౧౨౯.
౨. పాఁతఱ
చ. అలరిన ధాన్యధామనిలయంబుల నెప్పుడుఁ గోడఁబుట్టువుల్, వలకొని యుండఁగా గరిసెలన్ గణఁజంబుల నెత్తరామిచే, నిలిచిన కుప్పకావలికి నిల్వదు రప్పురిఁ గొంగుబత్తెపుం, గొలువున కీయకొల్పి హాలికుల్ బికిరంబుపొసంగు వేలుపున్. చంద్రా. ౧. ౨౫.
౩. ద్రవద్రవ్యములు పోసికొనుటకుపయోగించెడుపాత్రము, గంగాళము.
సీ. ఆమనిదొర తేఁయలకణఁజంబులు వనలక్ష్మి సొ

భాగ్యమునకు నెడలు. గీ. ... అనఁగఁ దగిన యలరుగుంపులు ... ఉ. రా. ౬. ౧౧.

**కణగుగ్గులువు.** సం. వి. ఉ. పుం. ఒకవిధమగు గుగ్గిలము, మహిషాక్షము. (మహిషాక్షి.)

**కణజీరకము.** సం. వి. అ. న. క్షుద్రజీరకము, చిన్న జీలకఱ్ఱ.

**కణజీరము.** సం. వి. అ. పుం. తెల్లజీలకఱ్ఱ.

**కణపాయి.** సం. వి. న్. పుం=కణయము.

**కణభక్షుఁడు.** సం. వి. అ. పుం=కణాదుఁడు.

**కణభము.** సం. వి. అ. పుం. కీటభేదము. (ఇది కుట్టినచోట బొబ్బ మంట పుట్టును.)

**కణభుక్కు-(జుఁడు).** సం. వి. జ్. పుం =కణాదుఁడు.

**కణము.** సం. వి. అ. పుం. ౧. గింజ. ౨. నూక. ౩. లేశము, సూక్ష్మాంశము. (ఉదా: సికతాకణము, జలకణము.) న. మహిషాక్షము. (మహిషాక్షిగుగ్గిలము.) విణ. అ. పుం. సూక్ష్మమైనది. (అనురము.)

**కణయము.** వి. వాయువ్యాంధము, నాయుపభము

ద్వి. కిలకిల్లఁగా నందు వివిధ మేఘములు, గలుగు నాకెండవకణయంబుఁ గడచి... ఆయేనవకణయంబుఁ గడచి. రం. రా. ఉ. ౬౩ పా. ౧౩, ౧౭ పం.

**కణయము.** సం. వి. అ. పుం. ౧. శర భేదము, ఆయుధవిశేషము. (శే. వి.)

వ. కణయకంపనము లయముద్గర ... ప్రముఖప్రహరణంబులు. ఉ. హరి. ౪. ౨౧౩.

౨. క్రతుభేదము. (శే. వి.)

**కణలాభము.** సం. వి. అ. పుం. ౧. తిరుగలి. ౨. నీటిసుడి.

**కణసరము.** వి. శ్వేనవిశేషము, ఒకజాతి డేగ.

సీ. కన్నె లేడులమీఁద గాటుగుప్రబీరంపుఁ గణసరంబులఁ జొన్పి గండడంచి. రసిక. ౧. ౧౧౫. ఆం. భా. ౨. ౯౦. (కడసరము అని చి. వి, శ. ర.)

**కణాటీనము.** సం. వి. అ. పుం. ఖంజనము, కాటుకపిట్ట. (మందపిచ్చుక అనికొందఱు.)

**కణాటీరము.** సం=కణాటీనము.

**కణాదుఁడు.** సం. వి. అ. పుం. వైశేషికసూత్రకర్తయగు నొకఋషి.

**కణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వనజీరకము, అడవిజీలకఱ్ఱ. వి. ఇ. పుం. ధ్వని.

**కణిఁతి**=కంతి.

గీ. ... కంతి కణఁతి ... అనంగను బొంఁగుగ్రంథి. ఆం. భా. ౨. ౭౪.

**కణిక.** వి. (సం. కణికా.) ౧. బలపము. ౨. నిడివియైనముక్క.

ఉదా: అక్షింతలకణిక, సుద్దకణిక.

చెఱకుఁగణిక=చెఱకుముక్క. ద్వి. పరమ. ౧. ౪౪ పా. ౧౬. పం.

**కణిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అణువు, నలుసు, లేశము, అతిసూక్ష్మాంశము. (జలకణిక, మొ.) ౨. సూచి, సూది. ౩. జీలకఱ్ఱ. ౪. గోదుమరవ. ౫. అగ్నిమంథనము, నెల్లి. ౬. తూలిక. ౭. కూణిక, వీణెబిరడ.

**కణికము.** సం. వి. అ. పుం. ౧. గింజ. ౨. అణువు, నలుసు, ౩. గోదుమరవ. ౪. పటవాసకము, బుక్కా.

**కణితము.** సం. వి. అ. న. ఆర్తస్వరము, మూల్గు, మొఱ్ఱ.

**కణితి**=కణఁతి.

స్రగ్ధ. తుండిం చెక్కు మరున్ఁ బిళ్లక్కు దురి మెఁగ నుసురుల్ త్రుంచెఁ జిప్పంగిమూఁకల్. యయా. ౨. ౩౨. చంద్రా. ౨. ౧౪.

**కణిశము.** సం. వి. అ. పుం. స. సస్యమంజరి, ఎన్ను, కంకి.

**కణిష్ఠము.** సం. విశే. (అ.ఆ.అ.) అత్యంతసూక్ష్మమైనది, సూక్ష్మతమము.

**కణీకము.** సం. విశే. (అ.ఆ.అ.) చిన్నది, అల్పము.

**కణీచి.** సం. వి. ఇ. పుం. ౧. నినాదము, ధ్వని. ౨. ఆళ్వాసు, గుఱ్ఱము. ఇ, ఈ. స్త్రీ. ౧. పూచినలత. ౨. గురివెంద. ౩. శకటము, బండి. ౪. మనస్సు. ౫. ఆఁడుగుఱ్ఱము.

**కణీయము.** సం. విశే. (స. యసీ. స.) సూక్ష్మతరము.

**కణుజో**[1]—అణుజో, అడుజో. వి. శ్యేనభేదము.

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి ఁగుడు గిద్ద, బారె జలకట్టె కణుజు వేసడము డేగ, కురు ... అను డేగకోలను. పి. శకుం. ౧. ౧౧౦.

**కణుజో**[2]. వి. పగడములు తూఁచెడుమానవిశేషము.

గీ. పరఁగును బ్రవాళనామంబు పగడమనఁగఁ, బపడ మనఁగ సిరాజి నా వాసియెత్తు, కణుజనంగను విలసిల్లుఁ బ్రణతశక్త, భూరిధన ధంగ శ్రీమాత్ర భూతశీంగ. ఆం. భా. ౨. ౨౭౭.

**కణుదురు.** వి. వృక్షవిశేషము. హంస. ౪. ౧౧.

**కణేర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడేనుఁగు. ౨. వేశ్య.

**కణేరము.** సం. వి. అ. పుం. కర్ణికారము, కొండగోఁగు.

**కణేరువు.** సం. వి. ఉ. పుం—కణేరము. స్త్రీ. ౧. ఆఁడేనుఁగు. ౨. వేశ్య.

**కణ్వము.** సం. వి. అ. న. ౧. పాపము. ౨. భూషణము, అలంకారము.

**కణ్వుఁడు.** సం వి. అ. పుం. ౧. ఒకముని. (శకుంతలను పెంచినవాఁడు.) విశే. (అ.ఆ.అ.) ౧. బధిరుఁడు, చెవిటి. ౨. మేధావి, బుద్ధిమంతుఁడు.

**కత=కద**[2]. వి. (సం. కథా. ప్రా. కధా. క. కతె. త. కత్తం.) ౧. వృత్తాంతము, సమాచారము, సంగతి.

క. ... కొడుకులకత వినియెద ... భార. ద్రో. ౪. ౨౭౭. రామా. ౮. ౧౮౨.

క. అప్పుడు మనుబోంట్లకతల్, చెప్పఁగ నేమిటికిఁ గాఁడిసి వేత్రధరుల్, రొప్పఁగఁ జని యొక్కెసలుపక, యప్పరమేష్ఠియును నచటి కతిమూర్ఖునకున్. కళా. ౨. ౭౧.

౨. చరిత్రము; కథ; చేష్ట, చర్య.

గీ....ఆచట తెనుఁగు, బాసచే నిప్పుడే నొనర్పఁగఁ గోరఁగిన, శిల యనుపేరఁ దేజూన నిప్పటిల్లు, సింతిచెండిలికత తెలుఁ గెట్టు లనిన. శిలా. ౧. ౭౩.

క. కతలుగ మాసంసార, స్థితు లెల్లను జెప్పె ... మనుచ. ౫. ౧౨౮.

గీ. కడమ పన్నియు నిఁక నేల కతలుఁ గాల్లు, ముంతకుఁ జెవులుఁ గల్పింప ముజ్జగములఁ, బసుపుఁజవరాండ్రకును దృణప్రాయ మహా హా. సుప. ౪. ౨౫.

క. కొడుకుపయి నీకుఁ గడుఁ బ్రే, ముడి గావునఁ గతకుఁ గాల్లు ముంతకుఁ జెవు లీ, వడిగెడవు రాజసి కె, క్కడియభిమాన మని పలుకఁ గాంతుం డలుకన్. సారంగ. ౩. ౧౮.

(నృసింహమూర్తినిచూపి ప్రహ్లాదుఁడు తండ్రితోఁ జనినమాట.) చ. ... ఇంకనీ, కతలను మాని యీశ్వరు ననన్యకృపానిధి నాశ్రయింపు... నృసింహ. ౫. ౮౬.

౩. లోకోక్తి, సామెత.

గీ....పులి పేదపడినఁ బసుల, వాండ్రె యొక్కడి రనుకత వచ్చె నాకు. ఉ. హరి. ౪. ౧౦౨.

**కతరాజు**=కథలుచెప్పుటలో నేర్పరి.

క....నీ కిది చెప్పం, గా వలయును గాయందు మి

గులఁ గతేరాజవు నీ,వోపరటూరత్నమ ...
ప్రభా. ౩. ౭౯.

జ: కతకారి, కతపత్త్రము, కతలకాఁడి.

**కతకము.** సం=కతము.

**కత(ల)కారి.** విణ. (కత+కారి.) కథలు చెప్పుట యందు నేర్పరి; నేర్పరి, గడుసరి.

గీ. జనపతిని జేరఁ బోనీక దినదినము, కతలు చెప్పఁగ సాగి తోఁకతలకారి. హంస. ౫. ౨౨౭.

ఉ. కంతుపతాణియుం గతలకారితనంబున వీ ... ఆఁటప్టనన్. శుక. ౨. ౨౩౬.

ద్వి. ... లైన కిడ్డలు నేరనియట్టి, కలుపులు గల ... కతలకాఁడి. అ. ము. క. ౧. ౨౮ గా. ౨౩ పం.

**కతన.** వి. (క. కత.) కారణము. కతము. (సీని కి ప్రత్యయం చేర్చఁ జైనదని దీనికి సంతఃప్రయోగాలు కలవు)

క. ... నీ,కతనన్ సఖపతి నాడఁ గలిగెఁ గు ... వారం. రామా. ౮. ౫౨.

క. ... గ్గారియుఁ బుత్ర్య, స్త్రీసంభాషణము చేసుఁ జెంచనకతనం, జేసి ... జ్ఞానిని, కానంబున నల్లిల్లి కాననభూమిన్. వి. పు. ౮. ౩౮౧. భార. విరా. ౩. ౧౯౦.

**కతపత్త్రము.** ఋ. వి. (√కత.) ప్రమాణపత్త్రము.

సీ. కతపత్త్ర మిడపమ్ముఁ గలగాంమనపు లైనఁ గోరకఁ బరకాంతఁ గోరఁ డనుచు. పాండు. ౧. ౬౩.

**కతము.** వి. కారణము, హేతువు.

మ. ... రాజపుడు దీనస్వాంతుఁడైన ద్రిలం,గత మేమీ ... చం. రా. ౪. ౩౦.

క. నీకతమున నఖిలధారణీరాజ్యము నా, కేకాధిష్ఠిత మగు... భార. ఆది. ౬. ౧౪౦.

క. క్రమమున నీ చేసిన ప్ర,శ్నములకుఁ బ్రత్యుత్తరంబు సమ్మతి నత్యు,త్తముఁ డెవ్వఁ డిచ్చు నతనికి,తమునను శాపాంత మగు బుధస్తుత నీకున్. భార. ఆర. ౮. ౧౨౩.

కతమిచ్చు=గుఱుతిచ్చు, సూచించు.

క. రతిపతి హాళాహళింపన, యతిధైర్యధనంబు కొల్లలాడెనటంచున్, గతమిచ్చుకరణి నిచ్చెన్, బతి యొక తెలనాకుమడుపు ప్రాణేశ్వరికిన్. రామా. ౪. ౧౬౯.

మ. మొగము మొగంబుఁ గూర్చి బలుమచ్చటఁ బత్తులుటాంతరించున్, ఓగియఁ గవుంగిలించి తనప్పే యసిముంగలఁ జంచుపాళికా, సిగళితనాళిదంష్ట్రమున వేగనె రాఁ గరవిచ్చి గోఁగెలో, నోగలుచు నొక్కజక్కవ యిమ్ముందు నినం పెదిధీనప్ర్రత్తిమై. వసు. ౪. ౯.

**కతము.** సం. వి. అ. పుం. చిల్ల, ఇండుగుచెట్టు చిల్లగింజ, ఇందుగుకాయ.

**కతలకాఁడి.** విణ. (కతలు+కాఁడి.) పెక్కుకథ తెలిసినది.

క. నినుఁ గతలకాఁడి యని శే,షన్కనునావచనంబు నిజ మగు స్వగుమా. వేం. పంచ. ౧. ౫౫౪.

**కతిపయము.** సం. విణ. (అ. ఈ. అ.) కొంత, కొంచెము పరిమాణముగలది; కొన్ని. (ఇది జాతివాచకముతో సమసించునపుడుతఱచు ఉత్తరపదముగా నుండును. ఉదా: బ్రాహ్మణకతిపయులు (=కొందఱు బ్రాహ్మణులు) ఉదశ్విత్కతిపయము (=కొంతమజ్జిగ.) శ్లో. కతిపయసహకారపుష్ప రమ్యః. సం. కిరా. ౧౦. ౩౦.– ఇతరముతో సమసించునపుడు పూర్వపదముగానే యుండును. ఉదా: కతిపయప్రయత్నములు. శ్లో.... కతిపయదినస్థాయిహంసా దశార్ణాః. మేఘ. ౧. ౨౩.)

**కతివిధము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎన్నివిధములు కలది.

౩౭. (ఇట తెల్లఁగొరిజలుఁ దోఁకయు నెండ్రుకలును గలనల్లగుఱ్ఱము అని శ. ర.)

సీ. తెలుగంటికల్కి ముద్దియ లూడిగపుఁజెలు ల్కాడిఁది బొబ్బ మెకంబు కత్తలాని. రసిక. ౧. ౨.

**కత్తళఁడు**=కత్తలాని. (చి. ని, శ. ర.)

**కత్తళ(ల)ము.** వి. కవచము.

ఉ. ...పాం,చాలుఁడు నెల్లఁ డీస్త్ర శరజాలములం బొలియించి కాని భూ,పాలక పుచ్చఁ గత్తళము...భాస్క. శల్య. ౨. ౩౪.

శ్లో. నాహత్వా సర్వపాంచాలాన్ విమోక్ష్యే కవచం శుభో. సం. భార. శల్య. ౩౨. ౨౩.

ఆ. కత్తళములు మూపుగసులు ... అచ్చ. రా. ఆర. ౭.

జ: కత్తలాన, కత్తలానము, కత్తలాని, కత్తళఁడు, కత్తళా, కత్తళీఁడు.

**కత్తళా**=కత్తలాని.

(అశ్వాదివాహనము.)

సీ. రమణీయమై నట్టి రాచిల్క కత్తళా పిలపిల్లడ గరకాంశము బడగ. గంధ. ౬.

**కత్తళీఁడు.** విశే. (√కత్తళము) వర్మితుఁడు, కవచముతొడిగినవాఁడు (చి. ని, శ. ర.)

**కత్తి.** వి. (సం. కర్త్రీ. క. త. కత్తి.) ౧. ఆయుధవిశేషము (ఖడ్గము, ఛురిక, మొ.); ఆయుధము.

వ. ...శూలంబుల ఫాలంబులు వాఁడిమియుఁ గత్తుల నెత్తులు వగిలించియు బల్లెంబుల నెల్లెంబులు నొగిలించియు...విక్ర. ౪. ౯౦.

స్రగ్ధర. ఖడ్గిన్ జెండాడు మ్రాఁకుల్ కవుఁగిటి కొలఁదుల్ కత్తి నొక్కొక్కఘాతన్. మనుచ. ౪. ౧.

గీ. కత్తివాతులతో నూరు గాచి తిరిగి, యాడు మురుపాశముల్గఁ గాంచె నాలువేల, వాని లోనిపిశాచముల్ వచ్చివచ్చి, పొదువ నన్నింటిఁ దునుకలప్రోవు చేసె. ఉ. హరి. ౧. ౧౪౦.

(కత్తివాతులు = మొనకత్తులు, విచ్చుకత్తులు.)

సీ. ...కైదువ యనఁగను గత్తి యనఁగ, నాయుధ మొప్పు...ఆం. భా. ౨. ౨౧౧.

౨. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

సీ. కల్లంబు రాటంబు కత్తి కోకిక్క స...గీ. అంబ మెడపట్టు నాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియురెండు విన్నాణములకుఁ జెల్లు. ఆం. భా. ౨. ౨౦౯.

౩. ఒకదినములో నొకఁడు సస్యము కోయుటకు సరిపడు భూమి అని కొందఱు (బ్రౌ.)

౪. నలువదియొకరసములపదునాల్గుకుంటలభూమి. (బ్రౌ.)

కత్తులునూఱు = కలహమునకు కాలుద్రువ్వ.

ఉ. కాయజుఁడా కడపైఁ బలిగి కత్తులునూఱుచు నుండు ... కళా. ౭. ౩౪.

జ: కత్తికాసు, కత్తిగంటము, కత్తిగొంటు, కత్తిపడిక, కత్తిపీఁట, కత్తిపేరమెకము, కత్తిమందు, కత్తిమీఁదసాము, కత్తివాతికూపు, కత్తులబోను.

**కత్తికాసు.** వి. (√కత్తి.) పల్లవానిపనిముట్టు, గీఁతకత్తి. (బ్రౌ, వా.)

**కత్తిగంటము.** వి. (√కత్తి.) ఒకవైపున కత్తిగాను ఒకవైపున గంటముగాను నుపయోగించు వ్రాఁత పనిముట్టు.

గీ. ముడుకతలపాగయును బాహుమూలమందుఁ, గవిలె చర్మపుటొరలోనికత్తిగంట, మలఁతి నీర్కావిదోవతు లమర గ్రామ,కరణ మేతెంచి రెడ్డివెంగట వసించె. శుక. ౨. ౪౧౬.

**కత్తిగొంటు.** విశే. (√కత్తి.)-కత్తివలె తీక్ష్ణమైనది-క్రూరస్వభావము గలది.

ఆ. కత్తిగొంటువైన యత్తగంతు. కు. సం. ౧. ౧౩౪.

కత్తిపిడిక. వి. (√కత్తి.) ఈంత్రవాండ్రకత్తులబుట్ట. (శ.ర.)

కత్తిపీట. వి. (√కత్తి.) కూరలు మొదలగునవి తెగకోయుటకు కత్తియమర్చినపీట.

కత్తిపేరిమొకము. వి. (√కత్తి.) ఖడ్గమృగము. ఉ. రా. ౭. ౩౯౦.

కత్తిమందు. వి. (√కత్తి.) ౧. కత్తియొఱకుపూయుపచ్చ. (శ. ర.) ౨. కుఱుపులకు పూయుమందు. (శ. ర.) ౩. పిడిలో కత్తి దిగించుట కుపయోగించు కొకానొక జిగురు. (వా.)

కత్తిమందు చెట్టు-కత్తిమందు చేయుట కుపయోగించుచెట్టు.

కత్తిమీఁదిసాము. వి. (√కత్తి.) మిక్కిలి జాగరూకతతో చేయవలసినపని, అపాయకృత్యము.

క. దొర నమ్మెద నని కోరుమ, దరయంగ జను లెవ్వరైన నా పెనుబెడఁద, ల్పరికింపఁగ దొరసేవలు, న్నరవు ల్మతి కత్తిమీఁదిసాములు సుమ్మీ. కుచేల. ౩. ౧౨.

కత్తియ(త్తె). అప. మత్వర్థమునను స్వార్థమునను వచ్చు ఒకానొక స్త్రీప్రత్యయము.

ఉదా: అందకత్తియ(త్తె)=అందముకలది, సుందరి.

ఉదా: చెలికత్తియ(త్తె)=చెలి.

కత్తియ(త్తె)ము. వి. ౧. అంకెలయడ్డబంతి. (శ.ర.) ౨. బాను, బంతి, వరుస.

సీ. ... ఘనమైన చెఱకుసింగాణిబద్ద, వలనైన కొదమతేఁటులకత్తెములనారి ... గంధ. ౬.

కత్తిరించు=కత్రించు. స. క్రి. (√కత్తెర[1]. క. కత్తరిసు.) కత్తెరతో ఛేదించు; ఛేదించు, ఖండించు.

గీ. కత్తెరల నొడ్డియాణము గత్తిరించి. ప్రబంధ. ౭౬౮.

సీ. నిగిడి పూ తేకుబాగుగఁ గత్తిరించినగడ్డంబు కొన రొమ్ముఁ గమ్మిరింప. వైష. ౭. ౯౩.

గీ. కత్తిఁ గుసుకగు భిక్షానఁ గత్తిరించి. చంద్రా. ౨. ౧౫.

కత్తిరింపు(లు). అ. క్రి. (√కత్తెర[1]) ఛిన్నముగు

గీ. భటుఁ డొకఁడు వింటఁ జాఱుకంటఁ బంది నేయ, మిట్టిపడి మింట మొఱపినట్టుల తూలి, యది భయవస్తుల్ రాలవ మదర నలిని, రెండు తొడలును వెసఁ గత్తిరించఁగఁ జంపె. శుక. ౧. ౧౭౧.

కత్తివాతితూపు. వి. (√కత్తి) అర్ధచంద్రబాణము.

క. అంగము ఘట్టులు నొమ్ముట, సంగనలును సనిలఁదుకొఁడు దొంగకులయ దైవ, చెం గత్తివాతితూపుల, నింగలములు దెవరఁ బ్రిశిరుఁ జెదరవడి త్రుంచెన్. భా. రా. యు. ౫౫౧.

ఇష్లే:-కత్తివాతియమ్ము, మొ.

ఆ. వాఁడిమైనకత్తివాతియమ్మును గొని, పగతుశిరము చెక్క లెగయ గొట్టెను. భాగ. అగ. ౬. ౨౪౧.

శ్లో. ఏవముక్త్వా నటా స్తస్య పంచ చక్రే వృకోదరః, అర్ధచంద్రేణ బాణేన ... సం. భాగ. వన. ౨౭౩. ౧౨.

కత్తులబోను. వి. (√కత్తి) కత్తు లమర్చినఒకవిధమైనబోను.

చ. గడలు గుడార్లు పగ్గములు కత్తులబోనులు గడ్డపారలు న్, వడిఁ గొని మేటికొమ్ములు వచ్చిరి ... చెన్న. ౨. ౨౦౯.

కత్తువ. వి. ౧. నీటిలోని మన్ను కెల్లగించెడుగసిక, నేద్యమున నుపయోగించు నొకవిధమైనపనిముట్టు. (శ. ర.) ౨. గరిమ, మడికి చుట్టు నేర్పఱచిన చిన్నకట్ట, నేలవిశేషము. ఆం. భా. ౨. ౧.

కత్రృణము. సం. వి. అ. న. ౧. నిమ్మగడ్డి, కామంచిగడ్డి. ౨. నాఁడు. ౩. కుటీ, గడ్డియిల్లు. (కే.వి.)

కత్తెర[1]. వి. (సం. కర్తరీ. ప్రా. కత్తరీ. క. త. కత్తరి.) కత్తిరించుట కుపయోగించు సాధనవిశేషము.

పరమ. ర. ౧౫౪. ఆం. భా. ౨. ౭౯౬.

జ: కత్తిరించు². కత్తిరించు, కత్తిరిల్లు, కత్తెరకాఁడు, కత్తెరకాలు, కత్తెరగడ్డము, కత్తెరచీల, కత్తెరదొంగ, కత్తెరబావిలీ, కత్తెరవాసము, కత్త్రించు.

**కత్తెర².** వి. (సం. కృత్తికా. ప్రా. కత్తికా.) ౧. కృత్తికానక్షత్రము.

సీ. పూచినకోరవిపూఁబోడకింటిచందానఁ గత్తెర యొక్కచోఁ గడలుపండె. గీ. ... మూఁపుటిచెలువు దాల్చి, సూత్తె నొక్కచో విశాఖ వింధ్యాద్రియందు. కాశీ. ౧. ౧౩౭.

౨. భరణిమూఁడు నాలుగుపాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమందును సూర్యుఁ డుండుకాలము. (శ. ర.)

కత్తెరకాపు - మొక్కలు కత్తెరలో కాచుకాపు.

జ: కత్తెరవంగ.

**కత్తెరకాఁడు.** వి. (కత్తెర¹ + కాఁడు - క. కత్తరికళ్ల = జేబులుకత్తిరించిదొంగతనము చేయువాఁడు) కత్తెరదొంగ; మోసగాఁడు.

సీ. ఎడకానితనములు నడుపుకత్తెరకాండ్ర కిచ్చకంబులు గాఁగ మెచ్చులాసఁగి. ప్రబంధ. ౬౭౫.

**కత్తెరకాలు.** వి. (√కత్తెర¹.) అండలపుకాళ్లకు అడుగున పోటిగా అమర్చెడు మొప్పకాలు. (శ. ర.)

**కత్తెరగడ్డము.** వి. (కత్తెర¹ + గడ్డము.) కత్తిరించిన గడ్డము, కత్తెర వేసినగడ్డము.

సీ. కత్తెరగడ్డంబు కలకుఱుంజాలుపిరాసములు... శుక. ౨. ౪౧౨.

**కత్తెరగాయము.** వి. గవాక్షవిశేషము. (శ. ర.)

మ. పురిచుట్టు న్నిశరుండు సాగఁబడుదుర్గభోజాంధకుల్గూడి కత్తెరగాయంబుల గండ్ల ముంగడలసందిం గొమ్మకొమ్ము న్నిరం,తరముగ్ర సావనదీవ తెత్తి ... ఉ.హరి. ౨. ౯౪.

**కత్తెరచీల.** వి. (√కత్తెర¹.) మీటయొక్కయు మనయొక్కయు చీలవదలి రాకుండ దాని చివర రంధ్రమున అడ్డముగా వేసెడుచీల. (శ. ర.)

**కత్తెరదొంగ.** వి. (√కత్తెర¹.) జేబులు మున్నగునవి కత్తిరించి దొంగతనము చేసెడుచోరుఁడు.

**కత్తెరబావిలీ.** వి. (√కత్తెర¹.) స్త్రీకర్ణభూషావిశేషము. (ప్రా.)

**కత్తెరవంగ.** వి. (√కత్తెర². సం. కర్తరికా.) ఒక నిధమైనవంగ, పొట్టివంగ?.

సీ. ... కత్తెరవంగ యూచఁగఁ గర్తారక దినుమండు. ఆం. భా. ౨. ౫౯.

**కత్తెరవాసము.** వి. (√కత్తెర¹.) ఎదురెదురుగా కత్తెరవలె నుంచెడువాసము. (శ. ర.)

**కత్థన.** సం. వి. ఆ. స్త్రీ = కత్థనము.

**కత్థనము.** సం. విశే. (అ. ఆ. అ.) తన్నుఁదాను పొగడుకొనునది. వి. అ. న. తన్నుఁదాను పొగడుకొనుట, ఆత్మశ్లాఘనము.

**కత్రి.** వి. జక్కిణి అను నాట్యముయొక్క అంగవిశేషము.

సీ. లాఁగు మైసిరియుఁ బల్లటియుఁ గత్రియు బెళ్కు విలసిల్లు జక్కిణివిధ మొకర్తు. ఉ. రా. ౬. ౧౩౯.

**కత్రించు** = కత్తిరించు (√కత్తెర¹.)

సీ. రేరాజుపోల్కిఁ గత్రించుసంచపురేకుబొట్టును నొసలికిఁ బొందుపఱిచి. పార్వ. ౫. ౧౭౭. ౭౦. రా. యు. ౩౫౧. పా. ౧౮౦.

**కత్స్వరము.** సం. వి. అ. న. స్కంధము, మూఁపు.

**కథ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కత; చరితము. ౨. చెప్పుట, కథనము. ౩. ఒకజాతిగద్యగ్రంథము. (కాదంబరి, మొ-చూ. ఆఖ్యాయిక.)

శ్లో. కథాయాం సరసం వస్తు గద్యైరేవ వినిర్మితం, క్వచిదత్ర భవేదార్యా క్వచిద్వక్త్రాపవక్త్రకే. ఆదౌ పద్యైర్నమస్కారః ఖలాదేర్వృత్తకీర్తనమ్. సా. ద. ౬. ౩౩౩.

**కథంకథికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.)-ఏమియేమి అనియడుగువాఁడు-ప్రతివిషయమును గుఱించియు ప్రశ్నించుస్వభావముగలవాఁడు; ప్రష్ట, అడుగువాఁడు. (త్రి. ని.)

**కథంభూతము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎట్టిది, ఎటువంటిది.

**కథంవిధము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎట్టివిధము గలది

**కథకుఁడు.** సం. విశే. (అ. థికా. అ.) ౧. వాచకుఁడు, చెప్పువాఁడు. ౨. కథలు చెప్పువాఁడు.

**కథనము.** సం. వి. అ. న. చెప్పుట.

**కథనీయము.** సం. విశే. (అ. ఆ. అ) చెప్పఁదగినది.

**కథనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పువాఁడు.

**కథయత్.** సం. శత్రు. చెప్పుచున్న.

**కథయమానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పుచున్నవాఁడు.

**కథయితృ.** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) కథకుఁడు, చెప్పువాఁడు.

**కథయితవ్యము.** సం=కథనీయము.

**కథానకము.** సం. వి. అ. న. పెక్కుచిన్నకథలు గలగ్రంథము. (బేతాళపంచవింశతి, మొ.)

**కథానాయకుఁడు.** సం. వి. అ. పుం. ఏపురుషుని గుఱించి ముఖ్యముగా కథ చెప్పఁబడునో వాఁడు, కథలో ప్రధానపురుషుఁడు.

**కథాపీఠము.** సం. వి. అ. న. కథాప్రస్తావసూచకమగు గ్రంథముఖము, పీఠిక, ఉపోద్ఘాతము.

**కథాప్రసంగము.** సం. వి. అ. పుం. ౧. కథాసందర్భము. ౨. కథ చెప్పుట.

**కథాప్రసంగుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. జల్పాకుఁడు, వదరుఁబోతు. ౨. విషవైద్యుఁడు.

**కథాప్రాణుఁడు.** సం. వి. అ. పుం. కథలు చెప్పి జీవనము చేయువాఁడు.

**కథాముఖము.** సం. వి. అ. న. ప్రస్తావన, పీఠిక.

**కథాశేషుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.)-ప్రజలు తన్ను చెప్పుకొనుటమాత్రమే మిగులుగాఁ గలవాఁడు, కీర్తిశేషుఁడు-మరణించినవాఁడు. (ఇశ్లే-కథావశేషుఁడు.)

**కథించు.** సం. స. క్రి. చెప్పు.

క. అనుటయు వైశంపాయనుఁ, డనఘా చెప్పఁ గథ యడిగి తమ్యతశుభలాంఛననామధామమాత్మం, గొనియాడి కథింతు నీదుకోరిక యలరన్. హరి. ఉ. ౫. ౧౦౩.

**కథితపదత.** సం. వి. ఆ. స్త్రీ. (అలం) పునరుక్తి అనెడిదోషము.

**కథితము.** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁబడినది. వి. అ. న. కథనము, చెప్పుట.

**కథీకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కథగా చేయఁబడినది. ౨-కథయందుమాత్రమే నిలిచియున్నది-మృతము, చచ్చినది.

**కథేరము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వంచకము, మోసపుచ్చునది. ౨. కథకము, చెప్పునది. వి. అ. పుం. పక్షి. (కే. ని.)

**కథోద్ఘాతము.** సం. వి. అ. పుం. నాటకమందలి ప్రస్తావనా భేదము. (ఇందు సూత్రధారునివాక్యము విన్నపిదప ప్రథమపాత్రము రంగమునఁ బ్రవేశించును.)

**కథ్యమానము.** సం. విశే. (అ. ఆ. అ) చెప్పఁబడుచున్నది.

**కథ్యము.** సం=కథనీయము.

**కద్.** సం. కుత్సితార్థకమగు "కు" అను అవ్యయమునకు తత్పురుషసమాసమున అజాదిపదములు పరమగునపుడును రథ వద త్రి శబ్దములు పరమగునపుడును వచ్చెడి యాదేశము. (ఉదా: కదభ్యాసము, కదాచారము, కదన్నము, కదగ్ని, కద్రథము, కద్వదుఁడు, కత్త్రివర్గము.)

**కద¹** (దా)=కా², కాదా, కాదె, కదె, కదన్న, కదమ్మ, కదయ్యా, కదవె, కదరె, కదవయ్యా, కదరమ్మ, కదరయ్యా, మొ. (√అగు-కాదు+ఆ=కాదా. దీనిలో 'దా' లోపించి 'కా' అను రూపము అయ్యెను. 'కాదా' అనుదానిలో 'కా' పైదీర్ఘము హ్రస్వముగా మారి 'కదా' అయ్యెను. 'కదా, అనుదానిలో తుది దీర్ఘము హ్రస్వమయి 'కద' అని సిద్ధించెను. 'కద' పై 'వు, రు' వర్ణకంబు లేకత్వ బహుత్వంబులఁ గ్రమముగా నవును. వానికి నిత్యముగా ఎకారములను ప్రయుక్తములగును. 'కాదు'నకు ఎకారములను ప్రయుక్తములై 'కాదె, కాదే' మున్నగు రూపములు సిద్ధించును. 'కాదె, కాదే' మొదలగువానినుండి 'కదె, కదే' మొదలగునవి సిద్ధించును. ఇందు 'అమ్మ' స్త్రీవిషయమునను 'అయ్యా, అన్న' పుంవిషయమునను వచ్చును.) అవ్య. ఇది సందర్భానుసారముగా ప్రసిద్ధి, నిశ్చయము, సంతాపము, ప్రార్థనము, ప్రశ్న మున్నగువానిని సూచించును. కొన్నిచోట్ల ఊఁతపదముగా నుపయోగింపఁబడును.

(ప్రసిద్ధికి)

చ... ఏ,గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా. విజ. వి. ౧. ౧౪౫.

(నిశ్చయమునకు)

గీ. అతివచియునవ్వు వీక్షించునప్పుడు కద, యీ శరచ్చంద్రచంద్రిక యింపొనర్చు. ఉ. రా. ౪. ౧౭౨.

క... నేఁడు గదా మ, న్మందిరము పవిత్రమయ్యె మాన్యుఁడ నైతిన్. మను చ. ౧ ౬౧.

(సంతాపమునకు)

క. నెరిమదకుంభికుంభవి,దారణదారుణకృపాణధారలు పరిఘా, కారములు కంపమూలో, ద్ధారములయెఁ బాలుపడెఁ గదా నీకరముల్. హం. ౭. ౧౮.

(ప్రశ్నమునకు)

క. కనుఁగొని యిది గద మందిర,ముని యడిగిన ... పెరా. ౨. ౧౭౮.

ఉ... నా,గంగములారి మీకడను రాఁడు గదా కృప నున్నఁ జూపరె. భాగ. ౧౦. పూ. ౧౨౧౧.

(ప్రశంసకు)

సీ. అదనుమంటలు గ్రమ్మన ట్లున్నయది గదా వహ్నికోత్న ప్రభావములచేత...

వ. అనుమ నయ్యసురపరవృషపుర వర సౌభాగ్యంబు నగ్గించి... రామా. ౬. ౧౦౪, ౧౦౫.

(ఊఁతపదముగా నుండుటకు)

గీ. వేసభీషణదానవవితతిలోనఁ, దల్లడంబునఁ బెదవులు దడుపుమన్న, సాధ్వి రఘువీరగేహినిఁ జక్కఁ జూచి, యవునో కాదో కదా యని యలసుతుఁడు. రామా. ౬. ౧౩౦.

జ: కదమ్మ, కదయ్యా, కదరయ్యా, కదరె, కదవమ్మ, కదవయ్యా, కదవె, మొ.

**కద²**=కత.

(వృత్తాంతము.)

క. మొదల నొక వేగువానిం,గద లరయఁగఁ బనిచి పిదపఁ గార్యము సేయం,బదిల మని పలికె శశిభుఁడు, పదవడి మైందుండు నట్ల పలికె... భా. రా. యు. ౧౭౨.

**కదంబకము**=కదంబము.

విశే. (మిశ్రము.)

చ... విసిలికేశముల్, ముడివడకుండఁ దీర్చి విరులం గురువేసుఁ గదంబకంబుగాఁ, జొడవుగఁ గొప్పువెట్టి... నా. పంచ. 3. ౨౫౬.

**కదంబకము.** సం=కదంబము.

**కదంబపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ.-కడిమిపూలవంటి పూలుకలది-ముండికావృక్షము, బోడతరముచె.

**కదంబము.** విశే. (సం. కదంబః. క. కదంబ. త. కదంపం.) మిశ్రము.

సీ. పన్నీటితోఁ గదంబము చేసి పూసినమృగనాభిఘన రోచనగరు లలుప. ఆము. ౨. ౭౫.

వి. యక్షకర్దమము, కలపము.

సీ. యక్షకర్దమసంజ్ఞ నలరుఁ గదంబమ్ము కలపము నాఁగను... ఆం. భా. ౨. ౧౬౩.

ఉ. కమ్మకదంబ మేల చెలిఁ గౌఁగిటఁ గూర్చ్చనఁ జాలు... రా. వి. ౪. ౯౨. ప్రబంధ. ౧౪౯.

(వృత్తియందు వైకల్పికముగా అంత్యవర్ణలోపము.)

కదంబకావులు_మిశ్రమైనకాసెఁగు గలబట్టలు.

వ. అట్టిచందంబునఁ జందనగంధులును జందనకావులును బట్టెడకావులును జెంగావులును గదంబకావులును గరకంబిలును హొమ్మంచదులును... ద్వా. ౩. ౨౧౬.

చూ: కదంబకము, కదంబించు.

**కదంబము.** సం. వి. అ. పుం. ౧. కడిమిచె. ౨. తెల్లావచె. (వి. ని.) ౩. ఆవచె. ౪. దేవతాళము, దాపరడంగిచె. ౫. సమూహము.

**కదంబి.** సం. వి. ఈ. స్త్రీ. దేవతాళము, దాపరడంగిచె.

**కదంబించు.** అ. క్రి. (√కదంబము.) కూడుకొను, కలియు; అంటుకొను.

సీ. కర్పూరశకలసంగతవీటికాచర్వణములఁ జక్కెరపానకములవలన, మిసిమితావులఁ గదంబించుగందంబుల... వి. ప్ర. ౨. ౫౨.

వ.... పంకరుహకుముదకువలయకహ్లారషండంబులం దండతండంబు లగుతావులఁ గదంబించు బావులును... వి. శకుం. ౧. ౯౬.

గీ.... అప్పసజగంధి, మేనిజవ్వాదిపస గదంబించునోడలు, కడిగికొని వార్చి ప్రవరుఁడు గార్హపత్య, వహ్ని నిట్లని పొగడె ... మనుచ. ౨. ౭౪.

స. క్రి. మిళితముచేయు, కలుపు.

సీ. గంబూర మించఁ గదంబించి కొందలు కలికికన్నియలు బాగా లొసంగ. భాను. ౨. ౪౯.

వ.... కుంకుమరసంబునఁ గదంబించినపచ్చిపసుపునలుంగు నమర్చి... ప్రబంధ. ౫౬౯.

**కదకము.** సం. వి. అ. న.-(పైని) మేఘమువలె నుండునది-వితానము, మేలుకట్టు.

**కదధ్వము.** సం. వి. న్. పుం. కాపథము, చెడుత్రోవ.

**కదనము.** సం. వి. అ. న. ౧. వధ, మారణము. ౨. యుద్ధము. ౩. మర్దనము. ౪. విహ్వలత్వము. ౫. పాపము.

**కదన్న**=కడు[1].

శా. ...ము న్నగ్రాటవీభూములం, దన్నం గొబ్బు గదన్న... భా. రా. యు. ౫౭౪.

**కదన్నము.** సం. వి. అ. న. తినఁగూడనికూడు.

**కదపత్యము.** సం. వి. అ. న. దుస్సంతానము, చెడ్డసంతానము.

**కదభ్యాసము.** సం. వి. అ. పుం. దురభ్యాసము, చెడ్డయలవాటు.

**కదము.** వి. (సం. స్కంధః. ప్రా. కంద. హిం. ఖదమ్) అశ్వగతివిశేషము, అస్కందితము.

(వ్యవ) అతఁడు గుఱ్ఱముచే బాగుగా కదము త్రొక్కింపఁగలఁడు.

**కదము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నీళ్లనిచ్చునది. ౨. సుఖము నిచ్చునది. వి. అ. పుం. మేఘము.

**కదమ్ము**=కడు[1].

(సంతాపమునకు)

ఉ. అంచెలు గట్టి కాలితోడుసై చననీవుగదమ్మ ప్రోదిరా,యంచలు...మనుచ. ౪. ౬౧.

**కదయ్య(య్యా)**=కద[1].

(ప్రార్థనకు)

క....కారుణ్యము, నా దెస నుంపంగదయ్యా నర నాథమణీ. దశా. ౧. ౧౪౮.

**కదరము.** సం. వి. అ. పుం. ౧. అంపము. ౨. ఉల్లోచము, మేల్కట్టు(వై. ని.) ౩. వెలిచంద్ర, శ్వేతఖదిరము. ౪. పాదమునఁ గలుగుక్షుద్ర రోగభేదము. ౫. పాలవిఱుగుడు.

**కదరమ్మ(మ్మా)**=కద[1].

(సంతాపమునకు)

గీ. ...మనలఁ, దలఁచి యమ్మక చెల్ల యవ్వెలఁది యెంత,వంతనడలెనో కదరమ్మ యింతులార. రసిక. ౪. ౪౪.

**కదరయ్య(య్యా)**=కద[1].

(ప్రార్థనమునకు)

గీ...మాపద్మగంధిఁ దోడ్తెచ్చి సన్నుఁ,గూర్పఁ గదరయ్యా మిము వేఁడుకొనెదఁ గాక. సా రంగ. ౨. ౧౭౦.

**కదరె(రే)**=కద[1].

(సంతాపమునకు)

గీ. ఎంత బడలెనో కదరె యయ్యొమ్మెకాఁడు. రసిక. ౪. ౧౭౭.

శా. ...ఈ,వ్యాజస్వాంతుఁడు రుక్మి యుబ్బుఁ గదరే యత్యంతసంతుష్టుఁడై. రుక్మి. ౨.౭౩.

**కదర్థన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. హీనపఱచుట, కీడ్పఱచుట. ౨. పీడించుట.

**కదర్థనము.** సం. వి. అ. న=కదర్థన.

**కదర్థితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అధఃకరింపఁబడినది, కీడ్పఱుపఁబడినది.

శ్లో. కదర్థితస్యాపి హి ధైర్యవృత్తేర్న శక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్. భర్తృ. నీతి. ౭౭.

౨. బాధింపఁబడినది. ౩. దుష్టము, చెడ్డది. ౪. కొఱమాలినది, నిరర్థకము.

**కదర్థ్యమానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. హీనపఱుపఁబడుచున్నవాఁడు, కీడ్పఱుపఁబడుచున్నవాఁడు. ౨. పీడింపఁబడుచున్నవాఁడు.

శ్లో. శరైరజస్రం కుసుమాయుధస్య,కదర్థ్యమానస్తరుణి త్వదర్థే. సం. నైష. ౮. ౭౫.

**కదర్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పిసినిగొట్టు, లోభి.

**కదలాడు**=కదలు. (√ కదలు.)

(చలించు.)

చ. ...మద్దికాయలు కడుం గదలాడఁగ ముద్దుగాఱుపాం,దిక జిగిపాలబుగ్గలును... కల్గి యింపొదవుఁగా సుతుబాల్యము... కవిరా. ౨. ౪౭.

**కదలారతిపళ్లెరము.** వి. (√కదలు.) ఒకవిధమైన ఆరతిపళ్లెము.

వ....హల్లకినీపల్లవాధరామతల్లికలు పూనినజాళువాకదలారతిపళ్లెరంబులసొంపున ...హల్లకస్తోమంబు లుల్లాసంబు పల్లవింపఁజేయ... చంద్రికా. ౪. ౬౮. (వివాహాదిశుభసమయములందు వధూవరాదులు ప్రవేశించునెడహరిద్రాజలాదులతోఁ గూడిన తట్టలతో నెత్తు నారతికి'కదలారతి' యని ప్రసిద్ధి-వ్యాఖ్య.)

**కదలించు**=కదలుచు.

గీ. పట్టెఁ గదలించె నసియాడ్చెఁ బాఁతగల్చె, నెత్తె...తాల్చె నవలీల నిట్లు మందరనగంబు. హర. ౬. ౪౪.

**కదలిక.** వి. (√కదలు) కదలుట.

(చలనము)

గీ. కదలికల జాలుజిలుఁగుఁబయ్యెదలతోడ. పరమ. ౪. ౧౦౧.

(యాత్ర, ఏఁగుట, చనుట.)
ఆం. భా. ౨. ౨౧౯.
(యత్నము)
క. ఇది వేళ గాదు చొరఁబడి, వెదకఁగ నని యున్న యతని వెరవు త్రిలోకా,భ్యుదయాం కురార్పణం బీ,కదలిక యీ డేర్తు నన్న గతి రవి గ్రుంకెన్. రామా. ౬. ౧౦౬.

**కదలు.** అ. క్రి. (క. కదలు. త. కదల్) ౧. చలించు; అస్థిరమగు.
వ. ఒయ్యొయ్య నొయ్యనం గదలుతూఁగుటుయ్యాలలం గన్నుమొగిచియున్న విలాసినీవిలాసులును ...పారి. ౨. ౫౨.
క... కదలనిసిరులం, గేరుచుఁ గుంభకుఁడనియెడి, పేరిటిగొల్లదొర యొకఁడు పేర్మిఁ జెలంగున్. నీలా. ౧. ౪౭.
౨. బయలుదేఱు, ప్రయాణమగు.
మ....మాయాబలం,బున నోడింపఁగ నుత్సహించి కదలెన్ భూరిప్రతాపంబునన్. భా. రా. యు. ౧౨౭౪.
గీ. కాశికాక్షేత్రమున కేఁగఁ గదలి రపుడు, కోర్కు లిగురొత్త బృందారకులును మునులు. కాశీ. ౨. ౩౨.
౩. దండెత్తు.
గీ....మిన్నును నేలయు గ్రక్కతిలఁగ, గాటమై యెల్లి వానిపైఁ గదలవలయు. రాజ.చ. ౨. ౫౯.
౪. నడచు.
ఆ. కాలఁ జెప్పు లిడక కదలరాదు. వి. పు. ౨. ౨౪౫.
౫. వెళ్లు, పోవు; పాతిపోవు.
క. కట్టెఁడి యగుమనుసు నఁగ ట్టిడి యొప్పించి యెందుఁ గదలెద వింకన్. సారంగ. ౨. ౯౭.
గీ. పఱచె వెళ్లెను బయనెత్తె జరిగె నుత్తికెఁ, గదలె నని బాకె నను మాట గాఁ జెలంగు. ఆం. భా. ౩. ౮౬.
సీ. వెలవెలఁ బాఱె మోములు లావులు చలింపఁ గదలె దిక్కులకుసై గరుడకులను. దశా. ౨. ౬౦.
౬. పోవు, నశించు.
సీ. పఱమొయిల్గప్పినఁ బాడఱిను నుఁగాంతి గదలినయమృతాంశుకళ యనంగ. భార. విరా. ౧. ౨౯౪.
౭. యత్నించు.
గీ. నరుఁడు గాండీవమున నొండు నారిఁగూర్చి, యతివఁ దెగటార్తు ననుచుఁ గట్టలుకతోడఁ, దీవ్రతరబాణ మొకటి సంధించి యేయఁ,గదలఁ గన్గొని పల్కె నాకాశవాణి. జై. భా. ౫. ౧౨౨.
వి. ౧. కదలిక, చలనము.
గీ. పండ్లు వేర్వాసి కదలు చూపకయ యున్న. కాశీ. ౩. ౮౪.
ఉ....చిత్తరువో కరువో యనంగ గం,డారపు బొమ్మవోలె నచటం గదలించుక లేక యుండఁగన్. ఉ. హరి. ౧. ౬౦.
౨. ప్రయాణము, యాత్ర.
చ. పొదివి నభోవిహారమునఁ బువ్వును బోలె నలంగకుండ న,మ్మదనసమానుఁ బట్టికొని మానవదానవదేవకోటికిం,గద లెఱుఁగంగనీక చని కాంచె నుషాసతిఁ జిత్రరేఖ యా,ముదితకు రాకపోక లొకమూఁడుమహూర్తము లయ్యె నయ్యెడన్. ఉ. హరి. ౫. ౧౦౯. ఆం. భా. ౨. ౨౧౯.
జ: కదలాడు, కదలారతిపల్లెరము, కదలించు, కదలిక, కదలుచు, కదలుడు, కదలుపడుపడి, కదలుమొన.

**కదలుమే(ల్చ్చ)=కదలించే** స. క్రి. (√కదలు) కదలఁజేయు.

(చలింపఁజేయు.)

గీ. కరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు, రా
మకృష్ణులు శైశవరతులఁ దగిలి. భాగ. ౧౦.
పూ. ౩౮౯.

ఉ... లేఁత చేఁతం దనరారువీణియఁ గదల్చుచు
నల్లన సారె మీటుచుఁ. జాహ్నవీ. ౪. ౧౭.

**కదలుడు**=కదలిక.

(యాత్ర, ప్రయాణము.)

ఆం. భా. ౨. ౨౧౯.

**కదలుపరువడి.** వి. (√కదలు.) ముప్పదిరెండువి
న్యాణములలో నొకటి, మల్లబంధవిశేషము.

వ. ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి కద
లుపరువడి ... నృసింహంబును నాది యగు
ముప్పదిరెండువిన్యాణంబులనాలెంబు పరీ
క్షించి. హంస. ౧. ౨౧౬. ప్రబంధ. ౭౮.

**కదలుమొన.** వి. (√కదలు) మల్లబంధవిశేషము.
ప్రబంధ. ౭౮. హంస. ౧. ౨౧౬.

**కదళ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పృశ్ని, కోలపొన్న ?.
౨. బూరుగు ?. ౩. డింబిక, దుండిగము ?.

**కదళకము.** సం.=కదళము.

**కదళము.** సం. వి. అ. పుం. ౧. అరఁటిచెట్టు. (వై.
ని.) ౨. కోలపొన్న ?. (మే. ని.)

**కదళి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. అరఁటిచెట్టు. ౨. వైజ
యంతి, టెక్కెము. (దీనికిఁ గట్టువస్త్రము అరఁ
టియాకువలె నుండును). ౩. ఒకజాతిలేడి. వి.
న్. పుం. ఒకజాతిలేడి. (క్షీరస్వామి.)

**కదళిక.** సం. వి. ఆ. స్త్రీ=కదళి.

**కదళీదండము.** సం. వి. అ. పుం. అరఁటిబొంద,
అరఁటిదూఁట.

**కదవమ్మ(మ్మా)**=కద[1].

(సంతాపమునకు)

గీ. కమ్మవిలుకానితూపులఁ గ్రమ్ముకొఁక, ముమ్మ
రంబయ్యెఁ గదవమ్మ ముద్దుగుమ్మ. ఇందు. ౩. ౯.

**కదవయ్య(య్యా)**=కద[1].

(ప్రార్థనమునకు)

గీ. కావఁగదవయ్య యర్థార్థికల్పశాఖి. నైష. ౧.
౧౦౭.

మ. అమరుల్ విష్ణునిఁ జేరి పంక్తివదనుం డత్రాసి
యై గాసినేయ, మరుల్లోకము సంచలించె
నిఁక మమ్మాపన్నులం బ్రోవ నా, యమరు
లీ న్నెదురొ జయింపఁగదవయ్యా... ఉ. రా.
౧. ౭౮.

**కదవె(వే)**=కద[1].

(ప్రార్థనమునకు)

సీ. చెన్నారుచి న్నారివన్నెలక్రొన్నెల నగఁ జా
లు చిఱునవ్వు నవ్వఁ గదవె. రసిక. ౫. ౧౪౨.

శా. ... తెల్పఁగదవే యేతత్పురావృత్తముల్.
దశా. ౧. ౨౨౭.

**కదించు**=కదియించు. (√కదియు.)

(బంధించు, బిగించు; అతుకు.)

చ. తలుపు గదించి సూత్రములు త్రాసునఁ గూ
ర్చుచునున్నవాఁ డిసీ, పలువ మ రెంత నే
ర్పరని భర్తనుఁ జూపి దురుక్తు లాడినన్.
హంస. ౨. ౨౧౪.

ఉ.... అరర మ్మొగి మూసి గడెన్ గదించి మో,
దమ్మున రెట్టఁ బట్టికొని దర్పకకేళికి సంభ్ర
మించినన్. హంస. ౫. ౭౩.

చ. కరఁగను బోఁతఁబోయఁగను గ్రాఁచి కదిం
పను గమ్మి దీయఁగా...సారిది విచిత్రచిత్ర
ముగ సొమ్ములు సేయ నతండు నేరిచెన్.
హంస. ౨. ౧౭౨.

(కట్టుకొను, ధరించు)

ఉ. దిద్దిన నాభినామము కదించినమేల్మడిచీర
చీర్ణమూ, నిద్దపుఁబూఁత పుష్పములు నించి
ముడించినకొప్పు ... ఒప్పఁగా, ముద్దియ వ

చ్చి హంసమణిముందర నిల్చె ... హంస. ౨. ౧౭౫.

కదింద్రియము. సం. వి. అ. న. పటుత్వము లేని యింద్రియము.

కదియఁబడు=కదియు. అ. క్రి. (√కదియు-స్వార్థమున 'పడు'.)

(కలియఁబడు.)

(మాలి) క. పఱతెంచి కదియఁబడి యే, డ్తెఱ వ్రేసిన మోము దాఁకి తిరిగె గరుడి యుత్తేఁ జక్రంబున హరి పెడ, మఱి వైచెను దనుజు నను జూ మస్తకము తెగన్. నిర్వ. ౩. ౨౭.

ఉ. అత్తఱి మాళవుండు గదియంబడి తోమర చక్రరాజి ను, న్మత్తగజేంద్రు నొంచి...పలను. ౧౨. ౬౫.

(కలుగు.)

చ. తడఁబడు మాట గద్గదిక దాన్కొను నిల్చిన చోట నిల్వరా, దడుగులఁ దొట్రుపాటు గదియంబడు ...మది లెత్తినయాఁటదానికిన్. పవల. ౩. ౧౦౦.

కదియించు=కదించు. స. క్రి. (√కదియు) కదియఁజేయు.

౧. ఘటించు, చేర్చు; ఖచించు; లగ్నము చేయు.

వ. అంజలిపుటంబు నిటలంబునం గదియించి. కాశీ. ౫. ౧౧౫.

ఉ. ఎత్తి దృగంకపాళిఁ గదియించి...శుక. ౧. ౧౩౯.

చ. ... తమ్మికెం, పులు గదియించినట్టిజిగిపుత్తడి ముక్కలి పేఁట మీఁద...నీలా. ౧. ౬౧.

క. అవిభుపై నాపాలఁ తియు, భావము గదియించె...హరి. ఉ. ౩. ౭.

౨. గ్రహించు, పట్టుకొను.

సీ. కరమునఁ జాలిండ్లు గదియించి కదియించి యధరపల్లవరసం బాని యాని. అని. ౨. ౯౧.

౩. దగ్గఱఁజేర్చు, సమీపింపఁజేయు.

గీ. ఉరగములయొద్ద వాపి యయ్యుత్పలాక్షి, యానసుస్యులు గదియించి నవనిభుజుల. నైష. ౫. ౩౧.

౪. కట్టు.

చ. ...గాండీవం, బులపడ నెక్కు ద్రోచి బిగియం గదియించి నిషంగయుగ్మముల్. భాగ. ౧౦. ఉ. ౧౨౯౨.

౫. రచించు, కూర్చు.

క. మృదుమధురరచనఁ గావ్యము, గదియించిన యట్లు తత్త్వగాఢార్థము చెప్పుము...వాసిష్ఠ. ౧. ౧౪.

౬. బంధించు, బిగించు.

గీ. తలుపు గదియించి దంతికేళి సలుపుచుండె. హంస. ౨. ౨౦౬.

కదియు. అ. క్రి. (త. కది.) ౧. కలియు, కూడు.

(శమీవృక్షవర్ణన.) సీ. కనట లొండొంటితోఁ గదియుచు నెడములు మ్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులుదాని. భార. విరా. ౧. ౧౬౨.

౨. సమీపమునకువచ్చు.

మధ్యా. ఎదురను దవ్వులఁ జూచినపొడవు లెల్లఁ బెత్తనము, కదియఁగా నన్ని యెంతయును దవ్వుఁ కనఁబడఁ బిఱుఁద, నిది దినేశ్వరరథమో యనూరుఁడో యిరెఁ దంచు నపుడు, హృదయమునను గడువిస్మయం బందె నిక్ష్వాకుపతులుఁడు. భాగ. అర. ౨. ౧౬౯.

మ. కదిసె న్లగ్న మటంచు మంత్రులు వొరల్... చను దెంచి. మను చ. ౫. ౫౯.

౩. తగులు, తాఁకు, అంటు.

క. మొదలిటి యాఱును సోఁకిన, మృదుసకములఁ గడుగ శుద్ధి మీఁదటియాఱుం, గదిసిన నీరను గడిగిన, విదితంబుగ శుద్ధి యండ్రు విద్వజ్జనముల్. విజ్ఞా. ఆచా. ౪౩.

సీ. కదియ నాసాశిఖాగ్రమునఁ దర్జని మోపి... నైష. ౫. ౯.

గీ. బాలశైవాలమంజరీ జాలకంబు, లింపుమతి యొత్తు మఱచేతులందుఁ గదియ. నైష. ౨. ౧౪౧. (కదియుక్ = దృఢస్పర్శముగునట్లుగా, గట్టిగా.)

౪. కలుగు.

క. యదువంశతిలక నీనికి,నిది జయకాలంబు పెనఁగ నేటికి హరిచే, నొదవు పవజయము నీనికిఁ, గదియు శుభము నీవు నచిరకాలమునం దుక్. అని. ౩. ౧౧౪.

గీ. లేమ చిన్నారిలేఁగొను లేమి పూను, ననుఁ పత్త్రంబులందు దైన్యంబు గదిసె. పరా. ౨. ౩౦౧.

స. క్రి. ౧. డీకొను, ఎదిరించు.

ఉ...నరకాసురుఁ డిట్లనుఁ బాకశాసనుం, డాలములో ననుం గదిసి యంతకపాశసబేరయుక్తుఁడై, తోలుపులంబడెక్. ... ఉ. హరి. ౧. ౬౧.

౨. పొందు, (రతియందు) కూడు.

ద్వి. కామాంధుఁ డై తల్లిఁ గదిసినయతఁడు, సుమగక సుర ద్రాగుమందెడునతఁడు. ద్వి.హరిశ్చ. ఉ. ౬౮౦ పం.

౩. చేరు, సమీపించు.

క.కృతనిశ్చయుఁ డగు శేషుని,కృతనాస్త్రం బడు ఫణి గదిసి యిట్లను సం,చితవస్తుజాతములలో, వితరణమునకు నొసఁగరానిదియు లే దె చటక్. జై. భా. ౭. ౮౦.

సీ. వడిఁ బోవుచోఁ బోఁకయుడి బాఱు నిలుకడ శ్రీగ్రాహముగ గవాక్షంబు గదిసె నొకతె. ఇందు. ౬. ౫౫.

జః కదెంచు, కదియఁబడు, కదియించు, కదుపు.

**కదుకొను.** అ. క్రి. (కదుకు[1] + కొను?. కదుకు + కొను - అని శ. ర.) అతిశయించు.

(సీత) చ. కదుకొని వేఁడిబాష్పములు గ్రమ్మి పయింబడుఁ బర్వ భీతిమై,నదరుచు... భా. రా. యు. ౨౩౪౭.

**కదుపు.** వి. (√కదియు - సం. కదంబం. త. కదుప్పు)

౧. (సజాతీయపశుపక్ష్యాదుల) సంఘము; గోగణము; పశుసంఘము; సంఘము.

ద్వి. ... మహామృగంబుల ఘనపక్షితతుల, బలువడిఁబుట్టించి పంచిన నవియు నొండొండ గదుపులై యురవడిఁ బఱచి, పండిన చేలెల్ల బయలుగా మేసి. ద్వి. హరిశ్చ. పూ. ౪౯౧ పం.

గీ...మంద, కదుపు పదు పన ఱెలఁగు గోగణము. సాం. ని. తిర్య. ౭౩.

క. కదిసిన బలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగ నీక గాండీవి వెసం, బొదివి యట కడపె నవియును, గొదకొని తమపాలము సొచ్చె గోపాలురతోక్. భార. విరా. ౪. ౨౭౧, ౧. ౨౭౯.

గీ. ... సమజము కదుపు పన నలరు మందు. ఆం. భా. ౨. ౧౦౦.

సీ. గమిపౌఁజు మొత్తము గదుపు... బృందాఖ్యయగు. సాం. ని. మాన. ౩౭.

ఎనుపకదుపు. ఆము. ౪. ౧౨౩.

చిల్క కదుపు. ఉ. రా. ౬. ౨౭.

సుమ్మెపకదుపు. నైష. ౮. ౧౪.

పందికదుపు. ఉ. హరి. ౪. ౨౫.

కదుపుకట్టు = మందగాఁ జేరు, గుంపుకూడు.

గీ. కవిసి యన్యోన్యమైత్రి నక్కడఁ జరించు, పులుల కూనలు జింకపిల్లలు మృగేంద్ర, పోతకంబులు నాలత్రేపులును గదుపు, గట్టికొని కూడియాడ నక్కజముఁ జెంది. పి. శకుం. ౨. ౪౯.

(ఇక్లే - కదుపులుకదుపులుగట్టు.)

క. కదుపులుకదుపులుగట్టుచు, మది లజ్జాపరతఁ జనిరి మాంత్రికులధిపా. నిరం. ౪. ౭౩.

**కదుము.** స. క్రి. (క. కదుబు) ౧. ఆక్రమించు.

చ. వదనము చెంగలింప నిడువాలికకన్నులవాడు
దీఱ సమ్మదమును నుబ్బునుం బెరయ ముత్తు
లకల్ తనువల్లి నిండఁ దక్,గదిమినపంచసా
యకవికారము లింపుగ కట్టిపెట్టి యమ్మద
వతిఁ జేరి యానృపకుమారుఁడు కౌఁగిటఁ
జేర్చి యిట్లనున్. వి. పు. ౬. ౯౩.

౨. అదుము, అణఁచు.

సీ. ఒకరానుతుఁడె చాలు నుద్వేలశక్తి దిక్పా
లురఁ గదిమి కప్పములుగొనఁగ. దశా. ౧. ౭౯.

క. చదిపెం గాలుబలంబులఁ, గదిమెన్ గుజ్జం
పుఁబౌఁజు గగ్గులకాడై, చెదరంగ గంధగజ
ములు, మద మడఁచెం జండవీరమండలిఁ
దాఁకెన్. కాశీ. ౨. ౮౧.

౩. దెబ్బ తగిలినచోట నెత్తురు పేరుకొని వాఁచు
వాఁపు, బొప్పి.

గీ. గావ మనఁగను బొప్పినాఁ గదుము నాఁగఁ,
దగును ఘాతభవగ్రంథి... ఆం. భా. ౨. ౧౩౦.

**కదురు**[1]. అ. క్రి. ౧. కలుగు.

సీ. ఇచ్చట దిక్కు లేరెవ్వరు నాకనుభయమున
మేనఁ గంపంబు పుట్టెఁ,జేయంగ నేమియు
పాయంబు లేమి నాననమున వెల్లఁదనంబు గ
దుర. భార. విరా. ౨. ౩౩.

క. మేలై వచ్చిన మెత్తుర,కాలవశతఁ జేసి కీడు
గదిరిన నతనిం,గేలి యొనర్చుచుఁ జాతురు,
నాలిసతులమాట లంత నమ్మంగలదే. భోజరా.
౮. ౧౮.

౨. అతిశయించు, హెచ్చు.

చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు
విల్లు త్రెళ్లిడిం, దునిమి ... భార. విరా. ౫.
౧౭౬. (చూ. ౧౭౨.)

(అర్జునుఁడు) క....ధర్మసుతునివిడి,దలకరిగెను
మోము వెల్లఁదనమునఁ గదురన్. భార. ద్రో.
౨. ౨౩౧.

౩. వ్యాపించు, పర్వు.

క. కెలఁకుల మీఁదను దూరము,పలుమఱుఁ జూ
డంగఁజనదు పయనంబునఁ గో,డెలకాఁడి
యంత దవ్వాడ,గలుగఁగ ముందఱను దృష్టి
గదురఁగ వలయున్. వి. పు. ౮. ౨౮౬.

సీ. కనుఁగవ మెఱుఁగులు గదిరినముందఱ పు
ష్పోపహారంబు పోలుపు దాల్ప, వేనలికప్పు
పర్విన మీఁదు నీలదుకూలంబు మేల్కట్టు కొ
మరు వడయ. భార. విరా. ౧. ౩౦౮.

౪. విజృంభించు.

చ. ప్రిదులని శౌర్యసంపదలఁ బెట్టినదండలు ద్రె
వ్వ శౌకదుం,గదురుము హుంకరించుచును...
ఐదుపదిసేయక పోరిరి ... కళా. ౮. ౧౦౦.
(శ. ర. పా.)

జః కదుకొను, కదురుకొను.

**కదురు**[2]. వి. (క. కదురు. త. కదిర్.) నూలువడి
కెడు సాధనము, తర్కువు,తంత్వాధారసూచిక.

క. వడిదారము చెవులుం ద్రొక్కుడుపలకయు
దిండు కదురు గుంజలునుం ద్రొక్కుడుబొ
మ్మయునుం ద్రిప్పుడు,పుడుకయునుం గలు
గురాట్నములు గైకొనుమన్. శుక. ౪.
౪౧౯. ఆం. భా. ౨. ౭౯౪.

**కదురుకొను**=కదురు[1].

(అతిశయించు.)

వ...నిదుర గదియుమిఁ గొంజిగిం గదురుకొనుక
నుతుడలును...చంద్రి. ౪. ౧౦౭.

(కవియు, పైఁబడు.)

సీ. శాకినీభూతపిశాచ బేతాళముల్ కహకహక
హమంచుఁ గదురుకొనిన. దశా. ౪. ౨౧౩.

**కదుష్ణము**. సం. విణ. (అ. ఆ. అ.) కోష్ణము, నులి
వెచ్చనిది, ఇంచుక వేఁడికలది. వి. అ. న. నులి
వెచ్చన, ఇంచుక వేఁడిమి.

**కదె(దే)**=కద[1].

(ప్రసిద్ధికి)

క. పెనిమిటిని జెంది కొడుకులఁ, గనియొనుగదా

దేవయాన కణఁ గెట్టిదియో. యయా. ౪.౭౩.
క. లీలమెయిం జూణూరుని, కోలెమ్మిఁతండు వి
టిచి ఘోరధ్వనిజం, ఘూలుండై పంపెఁ గదే,
త్రైలోక్యమునకు మహోజ్జ్వతరశుభవార్తన్. హ
రి. ఉ. ౭. ౨౭౨.
(ఆశ్చర్యమునకు)
క. ఇసుమంత గాని లేఁ డీ, పసిబాలుఁడు ...
బహుభక్ష్యరాసులు, మెసఁగెడి విసువఁడు
ప్రతుష్టిమేకొనఁడు గదే. పాండు. ౫. ౧౮౦.

కద్ది. వి. (క. కద్ది=కోరిక.) అనురాగము? సంగతి?
ఉ. అద్దముఁ జూచి బొట్టునుకు నానతిఁ జేసిన సం
చలించు న, మ్ముద్దియ విశ్వనాథుపయి ముచ్చ
టచేసిన యంతనుండి యి, క్కద్ది నెఱింగి
చందురుని గానఁగనీరు పికంబు గూయ న,
న్నిద్దపుమ్రోఁత మాన్పుదురు నెచ్చెలు లిచ్చ
యెఱింగి నిచ్చలున్. కావ్యా. ౧. ౬౮. (ప్ర
యోగాంతరము లేదు.)

కద్దుము. విణ. దట్టము. (శ. ర.)
క. ఎద్దులు మఱుఁగులు గాఁ జని, కద్దుములై చేరు
పెన్నేకంబుల నాలో, నుద్దవిడి నొంచి గలవు
న, నద్దిర యని యయ్యయాతి యబ్బురపడఁ
గన్. యయా. ౨. ౧౮. (శ. ర. పా. "గద్ద
ములై" ముద్రి.)

కద్రథము. సం. వి. అ. పుం. చెడ్డరథము.

కద్రుణము. సం. విణ. (అ. ఆ. అ.) పింగళవర్ణము
కలది.

కద్రువ. సం. వి. ఊ. స్త్రీ. కశ్యపుని భార్య, నాగ
మాత.

కద్రువు. సం. విణ. (ఉ.) పింగళవర్ణము కలది. వి.
ఉ. పుం. పింగళవర్ణము.

కద్వదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దుర్భాషలా
డువాఁడు.

కద్వరము. సం. వి. అ. న. దధిస్నేహము. (త్రి. ని-
పెరుఁగుమీఁదిమీఁగడ? "మజ్జిగ తేట" అని
విల్యమ్సు.)

కనఁబడు=కానఁబడు. అ. క్రి. (కనన్ + పడు) అ
గపడు, కనుపట్టు; గోచరించు.
మధ్యా... అవ్వి యెంతయును దవ్వయి కనఁబడఁ
బిఱుఁద.... భాగ. ఆర. ౨. ౧౬౯.
చ.... మేలు కనంబడ వెచ్చ నూర్చ న, మ్మనవతి
నాదరించి వసుమంతుఁడు దా నలనాఁటివే
కువన్. శుక. ౧. ౯౯. (మేలుకనంబడన్=
వలపుగోచరించునట్లు.)

కనకక్షారము. సం. వి. అ. పుం. వెలిగారము.

కనకతప్పెట. మి. వి. పటహము. (శ. ర.)

కనకదండము. సం. వి. అ. న. ౧. బంగారుదండ
ము కలరాజచ్ఛత్రము. ౨. బంగారుదండము.

కనకన=గనగన. వి. మండుట ప్రకాశించుట రా
లుట మున్నగువానియందగు అనుకరణము.
వ. మండువేసవిం గనకన మండునగ్నిముఖంబు
నడుమన నిలిచి... హర. ౭. ౧౭.
క. కనకన వెలుఁగుమ నిదిగోఁ, గనవయ్యెం గన
కతరుణి గరుడధ్వజమున్. దశా. ౧. ౧౮౨.
క.... కనకనఁ, గనుఁగొనలన్ నిప్పులురలఁగా
... శుక. ౨. ౨౪౨.
కనకనలాడు=కనకనమను. (వా.)
జ: కనకనమను.

కనకనమను. అ. క్రి. (కనకన + అను) ౧. మిక్కిలి
మండు.
క. నినుఁ జూడఁ గలిగినప్పటి, యను మోహం బిం
తలోనె యధికవ్యథయై, కనకనమనఁ జొ
చ్చెఁ గదే, మనమున సీతాశిరోగ్రమాణిక్యం
బా. రామా. ౬. ౧౮. (మిక్కిలి బాధించు
అభిప్రాయము.)
౨. మిక్కిలి ప్రకాశించు.
క.. కనుఁగొనఁ దివురు నభీష్టము, కనుఁగొనలం

దిపురులొత్తఁగా నెక్కి రొగిఁ, గపకనగోపమితములై, కనకసమును సౌధవీథికలకుఁ గడఁకఁ. లక్ష్మి. ౩. ౬౫.

**కనకనికషము.** సం. వి. అ. పుం. ఒరగంటిమీఁద గీఁచినబంగారుగీటు. మేఘ. ౧. ౩౭.

**కనకపత్త్రము.** సం. వి. అ. న. చెవికిఁ బెట్టుకొనెడి ఒకవిధమైనబంగారునగ.

**కనకపలము.** సం. వి. అ. పుం-బంగారువన్నెగల మాంసముగలది-మత్స్యభేదము. (వాచ.) న. నాలుగుకర్షములయెత్తుబంగారు.

**కనకప్రభ.** సం. వి. ఆ. స్త్రీ. ౧-బంగారువంటి కాంతిగలది-మహాజ్యోతిష్మతి, పెద్దమానేరుతీఁగ. ౨. బంగారముయొక్క కాంతి.

**కనకప్రసవ.** సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణకేతకి, పచ్చమొగలి*.

**కనకమయము.** విణ.(అ. ఈ. అ.) బంగారుది, సువర్ణవికారమైనది.

**కనకము.** సం. వి. అ. న.బంగారు. పుం.౧. సంపెఁగ*. ౨. ఉమ్మెత్త*. ౩. కాంచనాలము*. ౪. కృష్ణాగురువు, నల్లఅగలు. ౫. నాగకేసరము*.౬. మోదుగు*. ౭. కాసమర్దము, కసింద*. ౮. కడిమి*. ౯. కణగుగ్గులువు, మహిషాక్షము.

**కనకరంభ.** సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణకదళి, పచ్చఅరఁటి*.

**కనకాక్షి.** సం.వి.ఈ.స్త్రీ.ఆఁడుగుడ్లగూబ. (వై.ని-పైఁడికంటి అని శ. ర.)

**కనకాచలము.** సం. వి. అ. పుం. బంగారుకొండ, మేరువు. (ఇట్లే: కనకాద్రి, కనకగిరి, కనకశైలము, మొ.)

**కనకారము.** సం. వి. అ. పుం. కోవిదారము*.

**కనకాలుక.** సం. వి. ఆ. స్త్రీ. భృంగారము,బంగారుగిండి.

**కనకాహ్వము.** సం. వి. అ. పుం. ౧. ఉమ్మెత్త*. ౨. నాగకేసరము*.

**కనకాహ్వయము.** సం=కనకాహ్వము.

**కనఖలము.** సం. వి. అ. న. గంగాతీరమున హరిద్వారసమీపముననున్న తీర్థవిశేషము; ఆతీర్థము దగ్గఱనున్న ఒకానొకపర్వతము.

**కననము.** సం. విణ. (అ. ఆ. అ.) కాణము, ఒంటికన్నుగలది.

**కనరు.** అ. క్రి. కోపపడు.

వ...పొరలుచుం దెరలుచు వనరుచుం గనరుచు నొగులుచుం బొగులుచుఁ గసరుచుం గొసరుచు...పా. శకుం. ౩. ౧౯౧.

వి. ౧. కోపము.

సీ. కొల్వు గాచినవానిఁ గూర్మి చూపినవాని సుతునిగా హితునిగాఁ జూడవలయు. గీ. ఇట్టివారలపైఁ బ్రేమ పెట్టుకొక,కనరు పెట్టినమనుజుఁడు గనఁడు కీర్తి. వేం. ౭౯.

గీ. కనరసంగను గసరనఁ దనరుఁ గోపము... ఆం. భా. ౧. ౧౩౫.

౨. (క. కనరు.) వెగటు.

శా. తారుణ్యాతిగచూతనూత్నఫలయుక్తైలాభిఘారస్వన, ద్ధారాధూపితశుష్యదంబుహృతమత్స్యచ్ఛేదపాకోద్గతో,ద్గారంపుంగన రార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం, తారాభ్యంతరవాలుకాస్థితహిమాంతర్నారికేళాంబువుల్. ఆము. ౨. ౬౮.

౩. (కందగడ్డలోనగువానియందలి) నస, దురద. (శ. ర.)

విణ. వెగటైనది.

(వ్యవ) కూర కనరుగా నున్నది.

కనరెక్కు=వెగటైనదగు.

(వ్యవ) వంకాయకూర కనరెక్కినది.

కనరువోవు=కాటువోవు, వెగటగు.

సీ. కనరువోకుండఁ గాఁచినయానవాలతోఁ గడి సేయవచ్చుమీఁగడలతోడ. పి. శకుం. ౧. ౧౩౫.

**కనలించు.** స. క్రి. (√కనలు.) కనలఁజేయు. (కోపింపఁజేయు.)

గీ. చూచి యిట్లను భూపాలసుతులతోడ,నన్నుఁ గనలించి బ్రదుకఁగన్నారు లేరు.ఉ. హరి. ౮. ౬౦.

ఆ. మనసు రాదు నాకు మానినీమణులార ... పొందు, కాకయున్న నన్నుఁ గనలింప కూరక, యుండుఁడు...చంద్రా.౨. ౧౮౪.

**కనలు.** వి. (క. కనలు.) కోపము.

చ....కన్నులం,గనలునఁ గెంపుపెం పడరఁగా నసురాధముఁ డాక్షణంబునన్. హరి. ఉ. ౮. ౫౨.

చ. చిలుపనికమ్మఁదేనియలు చిప్పిలి హస్తములస్తకంబునన్, నిలువక జీరువాఱు నెడ నీ యతిసాంద్రపరాగము ల్గదా,యలరులవింటి జోదునకు నప్పటి కప్పటి కప్పళించుకోఁ, గలిగెడునంచు వేకనలు గైకొని మూసె విభుండు కేతకిన్. నైష. ౧. ౯౨.

శ్లో. ధనుర్మధుస్విన్నకరోఽపి భీమజా,పరం పరాగైస్తవ ధూళిహస్తయన్,ప్రసూనధన్వా శరసాత్కరోతి మా,మితి క్రుధాఽకృశ్యత తేన కేతకమ్. సం. నైష. ౧.౭౧. ఆం. భా. ౧. ౧౩౫.

విణ. మండునది. ('వి. మంట' అని శ. ర.)

సీ. అలుఁగులఁ బొడిపించి యహికోటిఁ గఱపించి కరులచేఁ ద్రొక్కించి కనలుటగ్గిఁ, ద్రోయించి...నృసిం. ౮. ౧౭౭.

అ. క్రి. ౧. మండు, జ్వలించు.

సీ. అనలకణంబులు గనగనఁ గనలంగ దారుణంబైనయాకారవంబు. మార్క. ౨. ౮౯.

మ. ...అయ్యుత్తమ తీక్ష్ణచ్ఛటల నగ్నిజ్వాలలొక్కుమ్మడిం,గనలం గన్గొని వానిపైఁ గవిసెఁ దీక్ష్ణప్రస్ఫురచ్ఛృంగంబులై. హరి. పూ. ౬. ౧౮౭.

౨. తపించు.

క. అని మది విరహానలమునఁ, గనలుచు దైన్యమునఁ బల్కు కామాతురు నమ్ముని మ్రొచ్చునాదరింపక, కనుఁగవ నదలించి పలికెఁ గామిని వెలుచన్. సురా. ౭౭.

సీ. కట్టెండతాఁకునఁ గనలి యంగము చెడి కందినను సిచాయ గలుగు మేను. సురా. ౫౭.

౩. కోపించు.

గీ. ధర్మనందను పలుకులు దనకుహృదయతాప మొనరింప మోమున దైన్య మొంద, నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ,గనలి శౌరితో గద్గదకంఠి యగుచు. భార. ఉద్యో. ౩. ౧౦౦.

గీ. కంటికొనఁ గెంపు గదురంగఁ గనలి చూచి, పదము దిగి పడ శపియించె బాలు సతని. కాశీ. ౮. ౨౬౬.

జ: కనలించు.

**కనాతిగోడ.** వి. (హిం. కనాత్.) వసననిర్మితకుడ్యము, బట్టతో నేర్పఱచినగోడ.

గీ. రంజిలుఁ గనాతిగోడ నరాతి యనఁగ,వసననిర్మితకుడ్యభావంబు గాను. ఆం. భా. ౨. ౧౫౯. (ప్రాఁతప్రతిపాఠము.)

**కనారిలు.** అ. క్రి. (త. కనఱల్.) ౧. కోపగించు, క్రోధయుక్తమగు.

చ. యమునకుఁ దానె పెద్దయముఁడై భయ మొందక రావణుండు సం,యమునికిఁ బోయె నింక నెటులైనను మంచిది మర్త్యకోటిబ,న్నము గడతేఱె నింతటఁ గనారిలి వేల్పులమీఁదఁ జూపు విక్రమము... ఉ.రా.౩.౩౧౮.

౨. తపించు.

ఉ. ఇందునిభాస్యఁ గాంచి విను మింతి శతక్రతుఁ డిచ్చ నిన్ శతానందము లొంది పొందఁ జననం బిటఁ డొందుట నేఁ డిఁకన్ శతానందుఁ డనం దనర్చు నిజనందను లందఱు నవ్యజాతు లన్నం దలవంపులై మది గనారి లెఁ గాన నొకండు పల్కెడన్. సమీర. ౧. ౨౨౦.

**కని.** (సం. వి. ఈ. స్త్రీ. కన్య. కావ్యాద. ౩. ౧౧౧.

**కనికరము.** వి. (త. కణికరం.) ౧. కరుణ, దయ.

క. దైవికమున నొక నేరమి, గావించిన నిట్లు విడువఁగాఁ దగ వౌనే, సేవకుని నన్ను మునులా, రా వలదా యింత కనికరంబైన మదిన్. వరాహ. ౧౦. ౪౩. నీలా. ౧. ౪౩. ఆం. భా. ౧. ౧౩౧.

౨. కరుణము, శోకము.

క. తనకుం దనయులు లేమికిఁ, గనికర మందుచును...భల్లా. ౩. ఆ. (శ. ర.)

సీ. వలరాచ రాచవాఁ డలికాక్షుకను వెచ్చఁ గరఁగినయలకనికరపుఁ జోటు. మనుచ. ౨. ౯.

జ: కనికరించు.

**కనికరించు.** స. క్రి. అ. క్రి. (√కనికరము) కరుణించు. (చూ. కరుణించు.)

(వ్యవ) వానిని కనికరింపరాదు. కనికరించి నావిన్నప మాలింపుము.

**కనిపట్టు.** స. క్రి. (కని+పట్టు-త. కండుపిడి.) వెదకిపట్టు; (క్రొత్తగా) కనుఁగొను, తెలిసికొను.

చ. పరిమెయిఁ బాటి వానిఁ గనిపట్టి వడిం బెడ కేలు గట్టితెచ్చిరి...భార. శాం. ౩. ౫౦౫.

ఉదా: కొలంబస్సు అమెరికాను కనిపట్టెను. పాశ్చాత్యులు మొన్న మొన్ననే విమానములను కనిపట్టినారు. ('కనిపెట్టు' వా.)

**కనిపి(న్పి)ంచు**=కానిపించు. స. క్రి. (√ కను) కనఁజేయు.

(ప్రసవింపఁజేయు.)

(అప్సరోవర్ణనము.) సీ. పలుకువాల్గనులయాఁకలి దీర్చుచలుప యేమగువలఁ గనిపించుమంత్రసాని. చంద్రా. ౩. ౧౦౧.

(పొందఁజేయు, ఘటిల్లఁజేయు.)

మ. తనకర్మంబె శుభాశుభస్థితులు తత్తద్వేళలన్ బ్రాణికిన్, గనిపింపం బరు లెవ్వ రింములకనంగా లేక మిథ్యావిమోహనిరూఢాత్మకులై హితాహితమనీషాయత్తభేదప్రకల్పనలం జిక్కుదు రల్పులు...సమీర. ౧. ౨౨౪.

(చూపు)

చ. కనుఁగవఁ గట్టినట్టిసుదుకం దలఁగించి మృగాళి నెల్లఁ గ్రన్ననఁ గనిపించి పోవిడిచిన స్వైర వొప్పఁగఁ బాఱి మూఁగిమూఁగి నిగిడి లాఁచి పట్టికొనెఁ గీడ్పడఁగాఁ బెనులేటిగుంపులన్, వినుతపరాక్రమంబు లగు వేఁటసివంగులు రాజు మెచ్చఁగన్. చిత్రభా. ౩. ౧౫౧.

మ. వినిపించెన్ హరి పాంచజన్యరవ ముద్వేలప్రభాచక్రమున్, గనిపించెన్ సురదానవావళికి రక్షస్స్వామిమాయాళి లే,దనిపించెన్ క్షణమాత్రలో సమదదేవారాతిరింఛోళి చేఁ, దినిపించెన్ దృణరాజి రాజితభుజాతేజంబు శోభిల్లఁగన్. దశా. ౨. ౪౦౦.

అ. క్రి. కనఁబడు, అగపడు.

సీ. వినుఁగెంపుఁబతకంబు గనిపింప సుకదీర్ఘికా చేలయై మించె గగనలక్ష్మి. ఉ. రా. ౧. ౧౩౬.

మ. కలలో దేవర చెప్పె రేయి యెదుటం గన్పించి నెయ్యంబు వాటిల ... శుక. ౨. ౪౧౫.

**కనియు.** అ. క్రి. కమియు, పరిపక్వమగు.

చ....ఎట్టి దెప్పుడుం, గనియఁగఁ బండి యుండు...భార. ఆర. ౭. ౪౪౫.

క. మును లేతెంచిరి చిత్తము, లనురాగరసాబ్ధి

నోలలాడఁగఁ దపముల్, గనియుంగఁ బండెఁ దమ కని, యనుపమభద్రు బలభద్రుననుజునిఁ జూడక. హరి. ఉ. ౩. ౧౬౧.

**కనిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిటికెనవ్రేలు. ౨.ఒకానొకనాయిక. ౩. తమ్ముని భార్య. ౪. చెల్లెలు.

**కనిష్ఠకము.** సం. విణ. (ఆ. ష్ఠికా. అ.) మిక్కిలియల్పమైనది, కడుఁజిన్నది. వి. అ. న. శూకతృణము, గింజలమీఁదముండ్లుగలధాన్యపుమొక్క.

**కనిష్ఠము.** సం. వి. అ. న. కూప్యమను భూలవణము. (శే. ని.)

**కనిష్ఠిక.** సం. వి. ఆ. స్త్రీ. చిటికెనవ్రేలు.

**కనిష్ఠుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అతిహీనుఁడు, మిక్కిలి యల్పుఁడు. ౨. అతితరుణుఁడు, యవిష్ఠుఁడు. వి. అ. పుం. తమ్ముఁడు.

**కనీని.** సం. వి. ఈ. స్త్రీ.=కనీనిక.

**కనీనిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిటికెనవ్రేలు. ౨. కంటినల్లగ్రుడ్డు.

**కనీయసము.** సం. వి. అ. న. రాగి.

**కనీయుఁడు.** సం. విణ. (స్. యసీ. స్.) ౧. మిక్కిలి యల్పుఁడు. ౨. అతితరుణుఁడు, యవీయుఁడు. వి. స్. పుం. తమ్ముఁడు.

**కనీసము.** విణ. (సం. కనీయస్.) అధమము. (శ. ర.)

**కను.** (దీనికి 'కానక, కానక, కానమి, కానని, కానఁడు' మున్నగువిశేషరూపములుకూడ సిద్ధించును.) స. క్రి. ౧. చూచు.

క. మున్నెన్నఁడు నివ్విధ మేఁ, గన్నది గాదు... భార. ద్రో. ౩. ౧౯౭.

సీ. కానరే కానలలోన లోకోత్తరు నని మ్రాని మ్రానికి నరిగియరిగి. భార. అర. ౨. ౯౪.

౨. ప్రసవించు, (బిడ్డను) కాంచు.

చ. ... ననుం గని కుంతి యెంతయుం, జెడ నదివైచిపోయె... భార. ఉద్యో. ౪. ౩౩.

ఉ. కానక కన్నకూఁతు... దశకు. ౯. ౬౭.

౩. ఎఱుఁగు, తెలియు.

గీ. శారదాదేవివరమున సకలలోక, వర్తనంబులు కానంగ వచ్చుమాకు, భానుమతిమచ్చఁగన్నట్టు భావవీథి. విక్ర. ౩. ౧౨౫.

క. ...అప్పలుకునం, గనియెను దనపలుకు దప్పుగా నతఁడు మదిన్. భార. సౌ. ౨. ౭౪.

వ. క్రమంబునఁ దనచిత్తంబు నలకూబరచింతాయత్తం బగుచుండం దత్సమీపగమనంబున కుపాయంబు గానక బహుకాలంబు గడపి... కళా. ౨. ౪౭.

క. భిన్నాసురాస్త్రములచవిఁ, గన్నమురాహితశిలీముఖము లపు డనిలో, మున్నెఱుఁగనిసురవీరుల, క్రొన్నెత్తురుచవియు నెఱిఁగి క్రోలఁదొడంగెన్. పారి. ౫. ౬.

ఉ. ...ఓ, కన్నియ నీయెడం గలుగుగౌరవ మేయెడఁ జూచి కాన... పారి. ౧. ౬౫. (చూచి కానను=చూచియెఱుఁగను, చూడలేదు.)

౪. పొందు, పడయు; (భాగ్యమును)పొందు.

గీ. తల్లి నీకులగోత్రసౌందర్యములకుఁ, దగినపతిఁ గంటి దానికిఁ దగఁగ గర్భ, మయ్యె నీదుగర్భమున వాఁ డఖిలభువన, వహనమహనీయుఁ డగుచక్రవర్తి సుమ్ము. భార. ఆది. ౪. ౬౧.

ఆ. ఎక్కలమునఁ బుట్టిరేని బహుసు, తుండు నతికృపాన్వితుఁడు వేయునెలలపై, బ్రదికిన తఁడుఁ గంద్రు త్రిదశపదము. భార. అను. ౨. ౬౪.

ఆ. రాఘవత్వమందు రణసరోలీలలఁ, గ్రాలుచున్న నిన్నుఁ గన్నులారఁ, జూడఁ గంటి జన్మసుఖమెల్లఁ బొడగంటి, ముదముతోడఁ జేరి మ్రొక్కఁగంటి. ఉ. హరి. ౬. ౧౧౮.

౫. ఆశ్రయించు, శరణుచొచ్చు.

శా. ...జనకకన్యన్ వేగ యొప్పించి లో, కై

త్రాణుని రామునిం గనుము...భా. రా.సుం. ౪౪౮.

ఉ. ఎట్టు ఘటిల్లు సంధి గడు నెగ్గొనరించినవన్ను నేల చే,పట్టు నతండు నావలదు ప్రాంజలియై తనుఁ గన్నమీఁద నిట్టట్టనువాఁడు గాఁడు శరణాగతవత్సలుఁడు ... భా. రా. యు. ౭౭౮.

విన్కకన్ను. చూ.

(నేత్రము.)

క. మఱి యైదు వేలయేఁడులు, తెఱచినకను మూయ కినునిదెస చూచుచు...ఉ.రా.౨.౧౬౪.

ఉ. వచ్చి లతాగృహంబుతలవాకిలి బోటులు చెప్పి చూపఁ గ,న్విచ్చి ... అచ్చపలాక్షి చూచె లలితాననచంద్రుని మానవేంద్రునిన్. పి. శకుం. 3. ౨౧౨. భార. ద్రో. ౫. ౧౬.

(చెఱకు లోనగువానిగనుపు,పర్వము. 'పర్వము క్రిందిగుంట' అని శ. ర.)

సీ. కను గలవింటఁ బోక్కపుఁజవుల్ వుట్టించి... వసు. 3. ౫3.

విశ. అల్పము. (చూ. కనుచీకటి, మొ.)

కంటవత్తిడుకొను=ఏమఱకుండు, జాగరూకత తోనుండు.

గీ. వట్టికూడును వేన్నిళ్లు పెట్టి యొత్తి,గలుగువీడ్యంబు లిప్పించి వలఁతియైన,వెజ్జు నెచరించి యరయుంచె విప్రసుతుని,గంటవత్తిడుకొని సైరికప్రభుండు. పాండు. 3. ౫౬.

కంటికి రెప్పలీల:-మిక్కిలి జాగ్రత్తతో అని భావము.

ఉ....బో,కొట్టిరి బోల వాడి రెడఁ గూర్కినఁ గంటికి రెప్పలీల నట్టిట్టెడ గాక కాచిరి మహీవరమందిరమంద గామినుల్. రామా. 3. ౧3౨.

కంటినొప్పి=పీడ.

(నక్కపులితో నన్నమాట.) గీ. ఎలుఁగుబంటు వేరు వెత్తు దుప్పులకు గండ, మేదులకు మిత్తి లేళ్లకు నెదురుమక్క, కాసరంబులపాలిటికంటినొప్పి, యనదు గాదుగదా భవదన్వయంబు. శుక. ౨. ౨౮3.

కంటిలోని నెరసు:-మిక్కిలి బాధించుటను దెలుపునప్పు డుపమానముగా నుపయుక్తము.

గీ. నీవు నాదాయతోఁ గూడి నీచబుద్ధి, బుద్ధి సెప్పెదు నాకుఁ దమ్ముఁడవె నీవు,కడఁగి నీమంత్రులును నీవుఁ గంటిలోని, నెరసుసరవిగ నున్నారు నిశ్చయముగ. మొ. రా. యు. ౧. ౨౦.

కంటివింటివజీరు=ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

గీ. కంటివింటివజీర ముక్కంటివింటి, వంటిసిరులగు నీమచ్చెకంటిసిరులు, దంటకుచశైలములు నటువంటి వగుట, నంటరాకను నీజన్మ మూఱ మార. ముకుంద. 3. ౬౯.

కనిపెంచువయసు=సంతానము కనుటకుఁ దగినవయస్సు.

క. కని పెంచువయసుగాదే,తన కేటికి లేక పోవుఁ దనయుం డిఁక నీ,కునుసీజననికి నుత్తమ, తనయులు గల్గుటకుఁ జరువు దగఁ గావింతున్. దశా. ౬. ౪౫.

కనుఁగొ(గ్గొ)లికి=కంటికొలికి.

మ. తొలియుక్కల్ పరికింపఁ గన్గొలుకులం దున్ నీరు నించున్...ఉ. రా. ౪. ౧౫౮.

కనుఁగో(గ్గో)న=కంటికొన.

మ. ...ఉగ్గడు వై కోప్పులు మూఁగి పస్తుపులపై గన్గొనలం దంద్ర యెక్కుడు వోఁచెం గమనీయసౌహృదపరిక్షోభంబునన్ బొల్తికిన్. హరి. ఉ. 3. ౧౮౦.

కనుఁగ్రేవ=నేత్రాంతము, క్రేఁగన్ను.

మ....రోషమువసంగి ఘాత చేతప్పుకఁడై, కనుఁ గ్రేవన్ మిడుఁగుర్లు సాలఁ బొడమంగా... భాగ. 3. ౬౬౨.

కనుఁజాటు=రహస్యము.

ద్వి. ఘనతపోమహిమచేఁ గన్నయాత్మజాని, గ నుఁజాటుగా నుండఁగను జాటువెట్టి. రం. రా. ఉ. ౯౨. పా. ౧౫ పం.

క. కనుఁజాటుతిండి నడిపెన, పతులం గండలును బెరిఁగి...శుక. ౨. ౨౦౭.

కనుగట్టు=కన్నుమూయు; మాయచేయు.

సీ. కనుగట్టి గాంగేయగర్భ డాఁగుడుమూఁత లాడించె వస్త్రాపహరణవేళ. పాండు. ౩. ౧౭౯.

కనుచూపుమేర=చూపు ఆయునంతదూరము.

క. కనుచూపుమేర దానిం, గనుఁగొని యమ్మగువ యగునొ కాదో యనుచుం, జనుదెంచి ... శుక. ౨. ౫౬౬.

కనుచూఱయొసఁగు=కనుచూఱగా ఇచ్చు, యథేచ్ఛముగా చూడ వీలగునట్లు చేయు.

గీ. చూపఱుల కెల్లఁ దనుఁ గనుచూఱ యొసఁగి, వేగ పఱతెంచి చూచె భూవిభు నొకర్తు. కవిక. ౩. ౧౫౧.

కనుదాఁపురము=కనుఁజాటు, కనుమఱుఁగు.

గీ. అయినయాఱిళ్లు నాడికో ళ్లయినవమ్మ, కాఁగలట్టిది యే మైనఁగాని కలదు, ఇంక నీకనుదాఁపురం బేల పొమ్ము, అంబుజాతాక్షి పక్వబింబాధరోష్ఠి. గంధ. ౬౭.

జ: కంట[1], కనఁబడు, కనిపట్టు, కనిపించు, కనుఁగడ, కనుఁగాపు, కనుఁగొను, కనుఁబ్రాము, కన్నది, కన్నయ్య, కన్నవిటి, కన్నాఁగు, కన్నాకు, కన్ను, మొ.

**కనుఁగ(న్గ)డ.** వి. (కను+కడ.) కంటికొన, కడకన్ను.

ఉ. ఆనతమౌళియై యటులు ప్రార్థనసేయుమునీంద్రు శాంభవీ, మానుషవేషధారి దయమానమనస్థితి బిగ్గ నవ్వుచున్, ఫీనులఁ దాఁకుకన్గడల వేమఱుఁ జూచుచుఁ బల్కెఁ జిల్కపల్కుఁ, దేనియసోనవెల్లువలఁ దెప్పలఁ దేలెడు మేలి పల్కులన్. పాండు. ౪. ౧౧౨.

**కనుఁగాపు.** వి. (కను+కాపు.) కనుసంజ్ఞకై కాచుకొనియుండు సేవకుఁడు.

ఉ. ఇట్టివిధంబునన్ విబుధ లెప్పుడును న్గనుఁగాపులట్లు ముక్కువ్వెట్టియుఁ జేసిచేసియును వేసరి...హర. ౩. ౧౧.

**కనుఁగొ(న్గొ)ను.** స. క్రి. (కను+కొను.) ౧. చూచు; పరీక్షించు.

మ....పౌత్రుని భూరిశ్రవసుం గనుంగొనుమ నింద్రుం గ్రేణిసేయంగ నేఁ, చిపపెం పొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునన్ బోరికిన్. భార. భీష్మ. ౧. ౯౪.

ఉ. ఎందును నిట్టిరూపు నను లెవ్వరుఁ గాంచిరె నాక కాదు సంక్రందననూతికిం దగిలి కన్గొనఁజాలదె....భార. విరా. ౨. ౨౬.

వ. ఇట్లిరువురుం బ్రవర్తించినవర్తనంబులు కనుంగొని విక్రమార్కుం డిట్లనియె. విక్ర. ౨. ౯౨.

౨. తెలిసికొను, ఎఱుఁగు.

సీ. జనునవిశ్వాసంబు కనుఁగొని మెలఁగుట విశ్వసనీయుని వేశ్యఱుమట. గీ...వలదు పతికి. ఆము. ౪. ౨౫౨.

గీ. తెల్లవాఱుట గన్గొని యొల్లవాసు. నీలా. ౩. ౪౬.

౩. పొందు, పడయు.

చ....దీనిఁ దాల్చి యిప్పడఁతులలోఁ గనుంగొను మపారమహామహిమానుభావమున్. పారి. ౧. ౬౧.

**కనుఁబాటు.** వి. (కను+పాటు.) ౧. దృష్టి, చూపు.

గీ. శివుని కనుఁబాటు దాఁకనిచిత్తభవుఁడొ. విక్ర. ౯. ౫౨.

౨. దృష్టిదోషము.

సీ. సుదతి నీమై చక్కఁ జూచుట కోడెదఁ గనుఁ

బాటు వొరయునో యని తలంచి. భార. విరా. ౨. ౪౭.

**కనుఁబె(న్బె)ంటి.** వి. (√కను.) కాఁగలప్రయోజనమును సూచించు నొకానొకపక్షి, జీలుగుపిట్ట.

వ...గబ్బులుఁగు గాలి కనుంబెంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు భావిప్రయోజనసూచకంబు లై యున్నయవి. ఆము. ౬. ౬౬.

సీ. గోంగడి కక్కెర గొక్కెర గొరువంక పూరేడు కనుఁబెంటి నీరుకాకి. హంస. ౩. ౧౨.

సీ. వంగపండును గోరువంక కప్పెట పొట్టిపిట్ట పావురము కన్బెంటి మూఁగ, మొదలుగాఁ గల్గుపులుఁగులు....సుద. ౩. ౧౯౪.

**కనుఁబ్రాము, కన్నుఁబ్రాము, కన్ప్రాము.** స. క్రి.(కను+ప్రాము.) కనుపులుము, మోసపుచ్చు.

క. అనుజన్మవధూగమనం, బొనరించినద్రోహి వగుట నోర్వక నిన్నున్, గనుఁబ్రామి సంహరించిన, ననుఁ జెందునె దుష్కృతంబు నగచరతిలకా. రామా. ౫. ౩౧౬.

ఉ. ఆవసుదేవుఁ డెంతయు రయంబున నర్భకు నెత్తుకొంచుఁ దాఁ, గావలియున్న కంసునధికారుల నందఱఁ గన్నుఁబ్రామి దుష్టావృతగేహముఁ వెడలి....పద్మ. ౯. ౯౩.

శా. శ్రీరత్నాకరకన్యకారమణుఁ డారీతిన్ జగన్మోహనా, కారోదార వధూవిలాసముల రక్షశ్శ్రేణిఁ గన్ప్రామి...దశా. ౫. ౩.

**కనుక(న్క).** అవ్య. ద్రు. ౧. కావున, కాఁబట్టి.

గీ. తొలుత మాటలుపడి పుల్లసిలినవాఁడు, గనుకఁ గొంకుచు...విప్ర. ౪. ౮౭.

౨. వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును.

ఉ. భూసుతకోస మేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలముం, జేసిననాతపంబు రహిఁ జెందక నిష్ఫల మౌ...ఉ. రా. ౮. ౮౬.

౩. "చుమీ" అనునర్థ మిచ్చును.

సీ. తడికాల్లతోఁ ద్రొక్కెదవుచుమీ యెద కుశాస్తరణ మాత్మధ్యానసమయ మయ్యె, నెడలేదు వేష్టువ లిట రమ్ము ముట్టెదు గనుకఁ బ్రాతస్స్నానమునకు వలయు. విప్ర. ౩. ౭౭.

౪. అవధారణార్థకము.

సీ. బింబోష్ఠి నేఁ గన్కఁ బీతాంబరము సైన మొఱసియుండుదుఁగదా మేనినిండ. భాగ. ౧౦. ఉ. ౨౧౨.

**కనుకట్టు.** వి. (√కను.) ౧. కన్నులకుఁ గట్టెడు కట్టు, గంత.

వ....పద నగ్గలించి కూయుచున్ గడుపు నకనకంబడన్ గనుకట్టుతోడ మోములు మలంచుచు...మనుచ. ౪. ౨౭.

౨. ఇంద్రజాలవిద్యావిశేషము.

సీ. మేఁత లొసంగినఁ బూఁతలు పూసినఁ గనుకట్లొనర్చిన గాత లిడిన, మందులు పెట్టిన ...మంత్రతంత్రములఁ బన్నిన...ప్రబంధ. ౭౩౮.

**కనుక(న్క)ని.** వి. ౧. సంభ్రమము; వెఱపు, భయము.

చ. ఘనుఁడు వృకోదరుండు దనుఁ గట్టలుకం దలపడ్డకోటికా, స్యునితురగంబులం దునిమి సూతునికంఠముఁ ద్రుంచి వైచి తీవ్రనిశితమైనప్రాసమున వానియురంబుఁ బగిల్చి చంపినం, గనుకనిఁ బాఱె భీతి యొనఁగంగఁ దదీయచమూసమూహముల్. భార. ఆర. ౬. ౨౩౧, అశ్వ. ౪. ౧౨౩.

క. దినదినమున కతివమదిన్, ఘనగరిమన్ మగుఁడు దఱుమఁగా రతులతటిన్, దినదినమునకుఁ గృశించెను, గనుకనియును ద్రవయు నిరవకాశతఁ బొరెన్. కళా. ౭. ౧౫౮. (చూ. ౧౫౫.)

వ. తత్పరిజనంబు లందఱు నకనిపాతంబున బెదరి

చెదరినట్లు గనుకనిం బఱచి రయ్యేక స్తంభ హర్మ్యంబును దక్షకువిషాగ్ని దగ్ధం బయ్యె ...భార.ఆది. ౨. ౨౦౦.

శ్లో. భయాత్పరిత్యజ్య దిశః ప్రపేదిరే. సం. భార. ఆది. ౮౮. ౮.

ఉ. సిగ్గునపుం బికాపికలు...శంకలకుఁ గన్కని ... అగ్గజయానకుం బతికి నయ్యె యథేష్ట రహఃప్రసంగముల్. కవిక. ౩. ౨౯. (కన్కని:-భయహేతువు.)

౨. తీవ్రత; అభినివేశము, పట్టుదల.

క. తనకోడుకుఁ బెక్కురథికులు, గనుకని నొప్పింప...చిత్రభా. ౭. ౯౬.

చ. కనుకనిఁ దెల్లవాఱుదనుకన్ రతిగోరెడు పల్లవాళి మేల్లనుఁగొని...కువల. ౨. ౧౧౨.

ద్వి. ...మాప్రాణంబులైన, విడుతుముగాక మా మడికూటివృత్తి,విడుతుమే యిది యేటివిప రీతవృత్తి, యనుచు బోయలు లేచి కనుకనిఁ బలుక. బస. పు. ౭. ౫౭౦పం. భా. రా. బాల. ౫౬౬.

౩. జాగరూకత.

చ...ఆత్మపత్నులకుఁ గోర్కెగ నావరపాయ సాన్నముం, గనుకని రెండుభాగములుగా నొనరించి తగంగ నందులోన్. భా. రా. బాల.౧౮౮.(కనుకని:-సరిగాఅనిభావము.)

చ. వనములఁ గొండలన్ గుహల వాఁగుల బావులఁ బల్వలంబులన్, ఘనతృణసీమలన్... పురంబులం,గనుకనిఁ జూచుచున్ వెదకి కానక చెచ్చెర వచ్చి...భా.రా.బాల.౬౨౩.

**కనుకను(కన్గను.)** వి. ఔ. (కను+కను) ప్రతినేత్రము.

ద్వి. అనుచుండ వాయువు లందంద విసరెఁ,గను కను పెంధూళి గప్పె...రం. రా.బాల. ౭౭ పా. ౨౨ పం. (కనుకను=కంటిని కంటిని= అందఱికన్నులను.)

కనుగ(న్గ)ంటన్=కన్నార, ప్రత్యక్షముగా.

మ.... అంభోజగర్భాదులున్, దముఁ గావన్ హర లెమ్ము లెమ్మనిరివో తాఁ జూచి కన్గంట న,య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానలజ్వాలలన్. భాగ. ౮. ౨౩౯.

చ....ఈశ్వరుఁ గనుగంటఁ జూచిరఁట వార మృతాత్ములు గావు డొప్పదే. కు. సం. ౭. ౬౯౮.

ద్వి. కఱకంఠుమూర్తిఁ గన్గంట వీక్షించి. బస. పు. ౮. ౮౦౭పం.

**కనుకలి.** వి. (కను+కలి). చూపు, దృష్టి.

చ. వినుకలిచేత నే విరహవేదన నామది నింత వర్ధిలెన్, గనుకలి నట్లు చిత్రఫలకంబునఁ గాంచినయింతి నెమ్మనం,బునఁ గడు నింతకెంత పరిపూర్తి వహించునో...ప్రభా. ౩. ౨౫.

క. అనుమాన మేల నిజ మీ,ననఁబోఁడియె రుక్మబాహునందన యలనా,వినుకలియును గనుకలియును, మనమునఁ దలపోయ నైకమత్యముఁ గాంచెన్. చంద్ర. ౩. ౧౮౫.

కనుకుట్టు. విఱ. (√కను)-నేత్రబాధకుఁడు-బాధకుఁడు.

(చంద్రోదయవర్ణనము.)చ....విరాలికల్కిప్రో, గులకనుకుట్టు...రా. వి. ౩. ౬.

**కనుకుట్టుఁదనము.** వి. (√కనుకుట్టు.) ఈర్ష్య.

వ...అవ్వాదినెలు దమమఱఁది ప్రియవాదితనంబు చూచి కనుకుట్టుఁదనంబున నతనిధర్మంబున కు విఘ్నంబు గావింపం దలంచి...భోజరా. ౬. ౧౨౫.

**కనుకూ(గూ)ర్కు-(రుకు).** అ. క్రి. (√కను.) కనుమూయు, నిద్రించు.

చ. జరఠ యొకర్తు కుంజగృహచంద్రశిలం గను
కూర్కుచుండ...రామా. ౨. ౯౭.

క. చని తత్కాళీగేహం,బున నొకమగనాలికూ
టమునకై కనుగూర్కనియొక్కజారుతో
నిం,పునఁ బొదలుచు నుత్తరంపుమూల రమిం
చెన్. శుక. ౩. ౬౧౨. చంద్రా. ౩. ౪౯.

**కనుకూలి.** వి. ధాన్యరూపమైనకూలి. (శ. ర.)

**కనుగ(గ్గ)లుగు(ల్గు).** అ. క్రి. (కను+కలుగు.)
జాగరూకుఁడగు, అప్రమత్తుఁడగు.

ఉ. ఏమఱి రక్షసాలనిమ్మ గేంద్రుని నక్కయుఁ
గోలుపుచ్చు సం,గ్రామములోనఁ గన్గలిగి
కానక తక్కిన నాశిఖండిచే,నీమనుజేంద్రుఁ
గోల్పడమె...భార. భీష్మ. ౧. ౧౦.

గీ. వింత పుట్టినఁ గనుగల్గి చింతసేయ,కుంట ...
వలదు పతికి. ఆము. ౪. ౨౪౨.

**కనుగి(గ్గి)ఱుపు**=కనుగొలుపు.
స. క్రి. (కనుసైగచేయు.)

సీ. అని పల్కి క్రమ్మఱఁ జనఁజూచుచో దీని
కేఁడు జోదులఁ గన్గిఱిపి యదల్చి,టయు
...అచ్చ.రా. యు. ౧౨౫.

**కనుగి(గ్గి)లుపు**=కనుగొలుపు.
అ. క్రి. (కనుసైగచేయు.)

వ...కన్నియ మొఱంగి యచ్చెలులు విభునకుం
గనుగిలిపి యొండొరులొక్కొక్క నెపంబున
నొయ్యనొయ్యం జనిరి. రామా. ౪. ౧౫౬.

వి. కంటిని ఒకవిధముగాఁ ద్రిప్పుట.

సీ. కన్గిలుపనఁగను గన్గీటు విలసిల్లు...ఆం. భా.
౩. ౨౯.

**కనుగీ(గ్గీ)టు**=కనుగొలుపు.
స. క్రి. (కనుగొలుపు, కనుసైగచేయు.)

సీ. అతఁడు మాండవ్యమహామునిప్రవరుని గను
గీటె నీ వెఱుంగవె యటంచు. హరిశ్చ. ౧.
౧౩౧. విప్ర. ౪. ౭౫.

వి. కనుగిలుపు. ఆం. భా. ౩. ౨౯.

**కనుగుఁజేఁప.** వి. మత్స్యవిశేషము. (శ. ర.)

**కనుగొ(గ్గొ)లుపు(ల్పు)**=కనుగిఱుపు,కనుగిలు
పు, కనుగీటు.అ. క్రి. స. క్రి. (కను+కొలుపు)
కనుసైగచేయు.

వ. నీమది నెఱుంగుదురు గాదె యనునెడ నీవన
మాలిక కనుగొలిపి యెగఁగొలిపినఁ గలవాణి
మఱియు నిట్లనియె. మృ. వి. ౨. ౧౮.

క...తనమ్రోలం,గనుపట్టుననుంగుఁబట్టిఁ గనుగొ
ల్పుటయున్....నీలా. ౧. ౧౪.

**కనుగ్రుడ్డు.** వి. (కను+గ్రుడ్డు.) నేత్రగోళకము.

క. ...మాయగోవు పడుచుం,గనుగ్రుడ్లం దిరుగ
వేసి కాలముచేసెన్...వరాహ. ౧౦. ౪౦.

క. అనినన్ విని తనయిరువది,కనుగ్రుడ్లన్ నిప్పు
లురలఁగాఁ ద్రిప్పుచు న,జ్జనకన్యపాలాత్మ
జపై,ననిమిషరిపుఁ డపుడ చంప నలిగియు
నచటన్. రామా. ౬. ౧౬౮.

**కనుచీకటి**=కనుమబ్బు. వి. (√కను.) సంధ్యా
కాలమందలి లేఁజీకటి. (శ. ర, వా.)

**కను(న్ను)నీరు,కన్నీరు.** వి. (√కను). అశ్రువు.

సీ. కనునీళ్లు పులిమికొంచును బానశాలలో మం
చు గట్టించునమర్త్యకులము. కువల. ౩. ౨౦.

శా. తోరం బౌకనునీరు చన్నుఁగవయందున్
జాఱి జాల్వాఱఁ గ,న్యారత్నంబు ప్రసూ
నతల్పమునఁ దాపార్తిన్ నెసం దూలెడిన్.
ఇందు. ౨. ౧౭౭.

చ...కన్నునీరు గొ,బ్బున వెడలంగ...భోజరా.
౪. ౧౬౭.

వ....అలుక కన్గొనలకెలంకులం దొలంకఁ గన్ని
యు మున్నీరై ప్రవహింప...రామా.౫.౧౮౩.

క. కన్నీరొలుకఁగ వగచిన,నన్నరపతు లెల్ల
నేడ్చిరి...భార. ద్రో. ౧. ౨౯.

**కనుప(న్ప)ట్టు.** అ. క్రి. (√కను.) చూపట్టు, కనఁబడు; గోచరమగు.

ఉ. భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చిన మావి మోక నక్. భార. విరా. 3. ౧౯౨.

మ. ఉడుమార్గం బఖిలంబు నున్ననయి శాణోత్తేజనం బొంది పుల్కడుగంబడ్డ నిశాతఖడ్గము క్రియం గన్పట్టె నప్పట్టునన్. హర. ౨. ౭౫.

చ. ...పా, యనియనుశక్తి నీయెడన యగ్గలమై కనుపట్టు... పారి. ౧. ౧౧౦.

**కనుప(న్ప)డు.** అ. క్రి. (కను + పడు.) చూపట్టు, కనఁబడు.

క. అని సిద్ధురాలు సెప్పినఁ, బొనపొనగా భ్రమలు చెందఁ బులకలు వొడమెన్, మనసిజశిఖి యొనసినచోఁ, గనుపడు ధూమాంకురములగతి నృపుమేనన్. హంస. ౧. ౬౫.

సీ. పొంకంబుగా నూనె పంకించి సవరంబుకుప్పె గన్పడ గొప్పకొప్పు వెట్టు. శుక. 3. 3౫౮.

**కనుపా(న్పా)ప, కంటిపాప.** వి. (కను + పాప.) నేత్రావయవవిశేషము. (కంటిలోని ప్రతిమ-శ. ర.)

మ. కనుపాపల్ పయి కెప్పలన్ గదియ... మను చ. ౫. ౧౮.

ఆ. స్థూలము కను గ్రుడ్డు సూక్ష్మంబు కన్పాప, కంటిపాప నుండుఁ గారణంబు, కారణమున బ్రహ్మకళ వెలుంగఁగవలె, విశ్వ... వేమన. ౧. ౯౮.

**కనుపాలవిత్తులు.** వి. బ. కుళుత్థాంజనము. (శ. ర.)

**కనుపు(న్పు)=గనుపు.** వి. వెదురు చెఱకు లోనగువానియందు వెడవెడ నేర్పడియుండు గ్రంథి, పర్వము.

సీ... కన్ను కనుపు గంటు గను పంచసఁగఁ బర్వ, మమరు... ఆం. భా. ౨. ౭౮.

గీ. జగతి ధర్మార్థకామమోక్షంబు లసఁగ, వఱలు నాలుగుకనుపుల చెఱకుఁగోల, యాది తుది నీరసంబు మధ్యద్వయంబు, సార మంద్రు కుయుక్తి దుర్జనుల గలిగి. దశా. ౧౦. ౯౯.

(అంగుళలనువర్ణనము.) సీ. శిరసెత్తు మునివ్రేలివరుస కన్పులు గల్గుబలుకొమ్ము మగరాలపనుల పైఁడి, సింహలలాటంబు... దశా. ౭. ౧. ౨౯.

కనుపులకలుకాఁడు = చెఱకువిల్తుఁడు, మన్మథుఁడు.

క. కను మూసినఁ గను విచ్చినఁ, గనుపులవిలుకాని త్రాయఁ గణఁగిన నేవే, ల్పును దలఁచిన రాపట్టియు, కనుపట్టెడు నెట్టు లోర్వఁగలఁ గలకంఠీ. చా. వి. ర. ౨౨.

జ: కనుపుకొట్టు, కనుపులగుండ్లు.

**కనుపుకొ(గొ)ట్టు.** స. క్రి. (కనుపు + కొట్టు.) ఖండించు; సంహరించు.

వ. ఇవ్విధంబునఁ గురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్నకన్నడిం గనుంగొని. భార. ద్రో. 3. ౧౫౯.

వ. కాలుబలంబులం గనుపుగొట్టినం గాలు చెయి తల డొక్క యని యేరుపాటు లేక వండం డఱిగినయట్లున్న యెడలును... భార. భీష్మ. 3. ౨౮౦.

వ... అప్పుడమి తేనినుండట నిలిచి పని యేమి వనుపు మనిన నతండు ప్రీతుండై కళ్యపాదులం గనుపుగొట్టు మని పనిచిన నది వారలు న్నెడ కేఁగి పోయె... భార. ఆను. 3. ౨౨౦.

**కనుపులగుండ్లు.** వి. బ. (కనుపులు + గుండ్లు) మణిమయ మైనహస్తభూషావిశేషము. (శ. ర.)

**కనుపె(న్పె)ట్టు.** స. క్రి. (కను + పెట్టు). ౧. ఆలోచించు, పరిశీలించు.

గీ. పరుఁడ నగు నాకు నక్షరపురుషునకును, భేద మేమియు లేదు కన్పెట్టి చూడఁ, గలదె వేఱెంచుకయిన లోకమున ముఖ్య, బింబమున కును దత్ప్రతిబింబమునకు. సీతారా. ౨. ౧౦౨.

౨. కాచు, రక్షించు.

క. అట్టితతి విభుఁడు మాతో,నిట్టటు సేయుమ నకున్కి నీసొమ్ములు గ,న్పెట్టుకొనియున్న వారము,పట్ట వెఱచి యింక మీకు భారంబని నన్. పరమ. ౩. ౪౩.

అ. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు.

ఉ....బెట్టు కూ,పెట్టుచు నిట్లు పోరఁ గనుపె ట్టుక యొక్కరుఁ డుండి....ఆము. ౬. ౭౦. కళా. ౪. ౧౯౬.

**కనుపొట్టలు.** వి. బ. (√కను). కంటిరెప్పలు. (వ్యవ) వానికనుపొట్టలుబ్బినవి.

**కనుబడి.** వి. (√కను). ౧. రాబడి.

సీ. ఒకచాయఁ గరణకుల్ సకలదేశంబుల కనుబడికవిలెలు వినికి సేయ. భోజసుతా. ౧. ౧౦౮.

౨. ఉత్పత్తి. (శ. ర.)

**కనుబేటము.** వి. (కను + బేటము-క. కణు=కన్ను, బేటము=వలపు, మోహము.) చక్షుఃప్రీతి, చూచుటవలనఁగలుగు అనురాగము.

మ. కనుబేటంబున గాట మైనహృదయగ్లానిం బయోజాస్య యి,ట్లునికి న్నెచ్చెలు లిచ్చ నోర్చి తమలో నూహించి శీతక్రియల్, పానరిం పన్ సమకట్టి... దశకు. ౩. ౧౨౩.

క. ...ప్రియసఖుఁడు దన్నుఁ గొల్వఁగఁ బురి కా,వట నరుగుదెంచి యొకచెం,గట నుండెన్ దెలియరాని కనుబేటమునన్. ద్వా. ౧౨. ౩౦. కు. సం. ౧౦. ౩౯౭.

**కనుమ.** వి. (క. కణమె.) ౧. రెండుకొండలనడిమి సందుత్రోవ; కాంతారము.

ఆ. వలస బెదర నృపతి కలఁగక ప్రజవగ,లార్పఁ బనిచి కనుమలందు నిలువ, వేఱు వేఱ యేర్చి విలుమందిఁ బనిచి...ఆము. ౩. ౨౭.

వ. భల్లూకంబులయాక్రోశంబులం బెదరి గుములు పాసి యిఱుకటంపుఁగనుమతెరువులం బఱచుతతి బలుపలుఁగుకొత్రొక్కటంబులం గిట్టలు వగిలి... చాఁపకట్టుగాఁ బడుసారంగంబులకు నిర వైనపట్లును...చంద్రా. ౨. ౭౮.

సీ. ... కనుమ యనినఁ గాంతారమగు ... ఆం. భా. ౨. ౯.

౨. సందు; బిలము, కన్నము.

వ. ప్రవాహంబు నిజప్రవహణగుణంబు విడువక ప్రవహణద్వారంబు వెదకుచుం జిరకాలంబు నిలిచియేనియుం గనుమ గలిగినఁ బ్రవహించుచందంబున....కవిక. ౮. ౧౨౦.

సీ. కన్న మనంగను గనుమ యనంగను గ్రంత యనందగు...ఆం. భా. ౧. ౧౮౪.

చ. అని నియమించి దానిశిర మంజక యెక్కకరండనిగ్రహం, బనువుగఁజేసి యాఖనక మప్పుడ పోయె ననంతరంబు లో,చనములు విచ్చి చూచి మది సంతసమున్ వగపుం దలిర్ప నా,కనుమన తాను నేఁగి భుజగం బొకబొక్క వసించి యాత్మలోన్. కేయూర. ౮. ౧౧౦.

**కనుమబ్బు**=కనుచీకటి. (కను + మబ్బు.)

ఉ. ...పల్లవా,లింగనకాంక్షఁ దన్మహిళ లేఁగనుమబ్బునఁ డక్కఁ బెట్టి తు,చ్ఛాంగన రథ్య నేఁగె నెదురై పతి కన్నులు గోరగింపఁగన్. వేం. పంచ. ౧. ౨౮౬.

**కనుమ(న్మ)రి**=కమ్మరి, కరుమలి. వి. ఇనుపపనివాఁడు, అయస్కారుఁడు.

సీ. కమ్మరి కనుమరి కరుమలి యనఁగాను మీఱుచుండును నయస్కారసంజ్ఞ. ఆం. భా. ౨. ౨౭౮.

ద్వి. మును జీవ మనులోహమునకు జ్ఞానాగ్ని, నొనరఁగఁ బద నిచ్చుకనుమరి యతఁడ. బస. పు. ౮. ౬౬ పం.

వ. కన్మరి...దా. శా. ౮. ౧౩౭౮.

**కనుమఱుఁగు(వు).** వి. (√కను.) ౧. ఆటంకము.

ద్వి. ననుఁ గాంచఁ గోరునీనవ్యదృష్టికిని, గను

మఱుఁ గింతయుఁ గలుగదు బసవ. ప్రభు. ౪. ౧౧౨ పా. ౪ పం.

౨. కన్నులకుఁ గట్టెడిగంత.

ఉ. చెంగటఁ బాలు లేళ్లఁ గని చేతులసన్నల నె
ట్లనిల్పి సి,వ్వంగులబండ్లు డించి తగ వానికిఁ
గన్మఱుఁగుల్ దెరల్చి యా,ముంగలఁ బాఱఁ
జూపుటయు...యయా. ౨. ౧౬.

కన్మఱువు సేయు=కనఁబడకుండఁజేయు.

ఉ. చేరువవానిఁ గన్మఱువు సేయుచు...చీకు
వాలు పెం,పారె జగంబు బెగ్గలము నచ్చెరు
పాటును బొంద సాంద్రమై. దశకు. ౬.౬౦.

**కనుమఱుపడు.** అ. క్రి. (కనుమఱుఁగు+పడు) **కంటికిచాటగు, దాఁగుకొను.**

క. కని కడపిపుచ్చువారును, గనుమఱుపడువా
రుఁ బరులఁ గనుఁగొనువారుꣳ. కు. సం. ౨. ౨౧౫.

**కనుమాపు.** వి.(కను+మాపు)కొంచెముమాయుట.

కనుమాపుమాయు=కొంచెముమాయు.

ద్వి. కలకల మని పక్షిగణములఅంతు,గలిగెఁ జం
ద్రునికాంతి గనుమాపు మాసె. ద్వి. సారంగ. ౩. ౯౯ పా. ౬ పం.

**కనుమాయ.** వి. (కను+మాయ) కనుకట్టు.

గీ. రంగమధ్యంబునందుండి రాజు దెసకు,నుఱుకు
కృష్ణు వేగస్ఫూర్తి యొక్కరుండుఁ, గాన లే
కున్కిఁ గనుమాయకరణి యయ్యెఁ, గంసు
ముందర నిలుచుండఁ గనిరి పిదప. హరి. పూ. ౯. ౧౩౫.

**కనుము**[1]. వి. (వృత్తియందు'ము'వర్ణమునకు 'ప' వర్ణమువచ్చును.) **శరము, తెల్లుకి.**

సీ....కనుపపూబంతి...శివరా. ౧. ౬౧.

గీ. కనుపపులు వేల్పుఁబడవాలుఁ గన్నచోటు.
మనుచ. ౨. ౯. హంస. ౫. ౪౪.

**కనుము**[2]. వి. మకరసంక్రమణ గ్రహణ శవదహన గ్రామదహనశత్రుత్సవదినములకు తరువాతిదినము.

**కనుమూయు.** స. క్రి. (√కను). వంచించు.

సీ. కపురంపుఁబలు కంచుఁ గనుమూసి కటకటా
బూది గప్పిననిప్పఁ బాదుకొల్పి. గీ. ...వె
తలఁ బెట్టంగఁ బని యేమి వెలఁదులార. చం
ద్రా. ౪. ౧౬౭.

**కనుమూ(న్మూ)సిగంత.** వి.(√కను.) ౧.కన్నులు కప్పుటకై కట్టెడితోలుబిళ్ల.

సీ. చంద్రికాపాయికంచంబులోపలిరాయి కాశి
కావళికిఁ గన్మూసిగంత. గీ. ...అరుణుఁ డుద
యించె...చమ. ౩. ౪౦.

౨. దాఁగిలిమూఁతలు, కన్నులు గప్పియాడెడు ఒకానొకఆట.

మ. ...ఓ,మనగుంటల్ కనుమూసిగంత నలుగం
బాలాట లోనైనకే,లనముల్ మీఱఁగ బోట్ల
తో నలరు బాలారత్న మెల్లప్పుడుꣳ. కశా.
౬. ౨౦౨. ఆం. భా. ౨. ౩౦౭.

**కనుమొ(న్మో)ఱఁగు.** స. క్రి.(√కను.) వంచించు.

మ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి హరి పన్నేరꣳ
బ్రహర్షించును,ర్వరకుꣳ....ఆము. ౧. ౨.

**కనుమోడ్చు(డుమే)** = కన్ను మొగుచే. (√కను.)

(నిద్రించు.)

గీ. పన్నగసగాఢ్యుఁ డే నింత కన్ను మోడ్చు,
తజ్జని గలలోన నెదుటఁ బ్రత్యక్షమయ్యె.
రా. వి. ౧. ౧౫.

**కనుమోసము.** వి. (√కను.) చూపుతప్పు, దృష్టిప్రమాదము, లక్ష్యము తప్పుట.

క. వాసవనందనుఁ డెంతయు,గాసిలి యున్నాఁ
డు మనలఁ గని యించుకయుం,దా నైరణ
సేయఁడు గను,మోసము లే కొక్క మొగిన
మునరఁగవలయుꣳ. భార. విరా. ౪. ౨౩౦.

**కనుఱెప్ప.** వి. (కను + ఱెప్ప.) కంటిఱెప్ప.

సీ. కనుఱెప్ప లిడ నెఱుంగనిచూడ్కిఁ జూచుచు జిగివీఁపుదోఁప బోరగిలఁబడుచు. కవిక. ౧. ౫౫.

**కనువిందు.** వి. (కను + విందు) నేత్రోత్సవము, కన్నులపండువు.

క. దినముఁ గనువిందు చేయఁగ, మునిగృహముల వన్యభోజ్యములఁ దృప్తుండై, మనుతనయుం డు...కకు. ౧. ౧౬౦. శుక. ౧. ౨౭౮.

**కనువినికి**=కన్నువినుకలి. (కను + వినికి.)

సరసిజవృత్తము. కప్పఁగఁ దోలుచుఁ గొప్పన జాలుచుఁ గనువినుకులయొడికములగుసరులుఁ. యయా. ౨. ౮౬. అచ్చ. రా. సుం. ౧౭౧.

**కనువెచ్చ.** వి. (కను + వెచ్చ) కంటివేఁడిమి.

సీ. వలరాచరాచవాఁ డలికాక్షుకనువెచ్చఁ గరఁగినయలకనికరపుఁజోటు. మనుచ. ౨. ౯.

విణ. నులివెచ్చ. (శ. ర.)

**కనువెలుఁగు.** వి. (కను + వెలుఁగు) కంటికి వెలుఁగు. (కంటికి వెలుఁగువంటిది, మార్గదర్శకము అని భావము.)

క. కనువెలుఁగు నీవు గా నీ, వెనుక భవన్మతమ యూఁది వీరలు నేనుం, జనుదెంచెద మూఱట నెల, కొన వృషభముపజ్జ నడచుగోవులభంగిన్. భార. ద్రో. ౧. ౬౬.

చ. అనిమిషవాహినీతనయుఁ డస్త్రగురుండును నీకు నెప్పుడుం, గనువెలుఁగై చరింతురు వికర్ణుఁడు గర్ణుఁడు దుస్సనేనుఁడుం, నిను నొకయప్డుఁ బాయరు...భార. శల్య. ౨. ౮౦3.

క. ఆవెలుఁగు గనువెలుంగుగఁ, వా వెలసినపుణ్యమూర్తి ధర్మసుతుం డే, లా వెఱచు రణమునకు...భార. ద్రో. ౧. ౧౦౦.

**కనువేఁదుఱు.** వి. (కను + వేఁదుఱు)-కనుపిచ్చి-చూచినమాత్రముననే యావస్తువుపైఁగలిగినవలపు, వెఱ్ఱివలపు.

ఉ....ఇంత కనువేఁదుఱు సెల్లునటమ్మ యింతికిన్. మనుచ. 3. 33.

**కన్చెదరు.** అ. క్రి. (కను + చెదరు). చెల్లాచెదరగు.

మ. చదిసెం దేరులు పాఱె వారణము లశ్వమ్ము ల్ధరం గూలెఁ గ, న్చెదరెన్ సైన్యము ద్రాఁలె బాహువులు త్రెస్సె న్స్కంసముల్ రాలె నం, గదముల్....కువల. ౨. ౧౮౬.

**కన్దెఱ.** వి. (కను + తెఱపి. ఇది వాతెఱవంటిది.) కనుఱెప్ప.

మ. మఱునాఁ డంధకభోజవృష్ణియదుసామంతాగ్రణీసేనగం, దెఱ గా సాత్యకి రాముఁ డుద్ధవుఁడు హార్దిక్యుండు లోనైనకొం, దఱమాత్యుల్ దనుఁ జుట్టి రా నమరె నాస్థానంబునం గృష్ణుఁడు ... ఉ. హరి. ౨. ౭౮. (కంటికిఱెప్పవంటిది-రక్షకము అనిభావము.)

విణ. (కను + తెఱచు) నేత్రములను తెఱచునట్లు చేయువాఁడు, నేత్రోన్మీలకుఁడు.

గీ. అఖిలజగములకన్దెఱ యగుచు జనన, మాజకరపుటహృదయసరోజములకు, ముకుళనంబును జృంభణంబును నొనర్చి, భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె. భార. విరా. ౨. ౨౮౧.

గీ. సృష్టికన్దెఱ తొలుసంజచెలిమికాఁడు...అరుణుఁ డుదయించె ... కాశీ. ౧. ౧౨౧. (చి. ని. పా)

**కన్న.** ప్ర. ద్రు. (కు + అన్న) కంటె. (ఇది పంచమీవిభక్తి ప్రత్యయము.)

క. నిన్నుఁ జెఱగొన్నహైహయు, కన్నన్ దోర్వీర్య మెక్కు డగుభార్గవులీ, ల న్నిర్జించినరాముని, కన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁడే. చమత్కారరామాయణము. అప్ప. 3. ౨3౭.

ఉ....చంద్రప్రతికోటి మొగం బెలదేఁటిధాటి కన్నం గడుమేటి వేణి పులినంబులసాటి

పెఱుం దయారె...విజ. వి. ౧.౧౪౦. ప్రబో
ధ. ౪. ౩౬. వసు. ౨. ౪౬.

**కన్నకొడుకు.** వి. ఔరసపుత్త్రుఁడు. ఆం. భా. ౨. ౧౧౧.

**కన్నగాఁడు.** వి. (కన్నము+కాఁడు) ఖనకుఁడు, కన్నమువేసి దొంగిలించు దొంగ.

మ. తలపోయం దమపంచతిన్ని యలమీఁదన్ జం
గముల్ వోలె నిచ్చలుఁ దొంగుండెడు కన్న
గాండ్రు విని రాజద్వారముల్ సొచ్చి కా,
వలి కాండ్రం గనుఁబ్రామి. కాశీ. ౪. ౫౨.

సీ. అంకువోయిన కాంత బొంక శంకింమనే కత్తి
యేమజీలునే కన్నగాఁడు. రామలిం. ౧౦౧.
ఆం. భా. ౨. ౨౯౧.

**కన్నడ[1]**=కన్నడవు, కన్నడుగు. వి. ఉపేక్ష; అనాదరము, తిరస్కారము.

క. లాలనసేయవు నన్నుం, గేళీసంగతుల బుజ్జగిం
పవు నీపై, హోళిం జిక్కితిఁ గన్నడ, యేల ద
యం జూడ లాఁతినే మునినాథా. విప్ర. ౩.
౮౮.

కన్నడచేయు, కన్నడయొనర్చు=ఉపేక్షించు; తిరస్కరించు.

ఉ. ఆసరసీరుహాక్షి పయి నాపలు నాసరివారు నన్ను,
ద్వాసితధైర్యతన్ విసివి వాసనవింటివజీరు
నమ్ములన్, గాసిలుచున్న వాఁడ ననుఁ గన్నడ
చేసి విధాత యయ్యెమో, గోసము గాదొకో
తనకుఁ దొయ్యలి నీయక యుట్టు లేఁచుటల్.
అహ. ౨. ౮౧.

సీ. ఒకనిమాటున వైరి నుక్కడంగించిననుశౌ
ర్య మెన్నఁ గన్నడయొనర్చె. చంద్రా. ౧. ౨౧.

జ: కన్నడించు[1], కన్నడీఁడు[1].

**కన్నడ[2].** వి. (సంగీ) ఇరువదినాలుగు స్త్రీరాగములలో నొకటి.

గీ. ...పూర్వ, గౌళ సారంగ మంగళ కౌశికులును,
గన్నడయుఁ జాయయును గౌళ కడు నపూ
ర్వ, మైనభల్లాతకియును నారాయణియును,
గ్రమత నిరువది నాల్గుస్త్రీరాగములును. ప్ర
బంధ. ౯౪. హంస. ౪. ౧౨౩.

**కన్నడగౌళ.** వి. (√కన్నడ[2] ?)-సంగీ- రాగములలో నొకటి.

ఉ. భైరవి నాట తోడి సిరిపాళి దిశాదిశి దేశి
మారువా, గౌరి బిహాహుకి లలిత కన్నడగౌళ
ముఖారి దేవగాం, ధారి వరాళి కన్నడ ధనా
సరి ఘూర్జరి పూరి బేగడా, సూరిభి రామఖల్లి
మొదలైన రాగము లింపు నిమాఁడఁగన్. చె
న్న. ౨. ౨౩౬.

**కన్నడము.** వి. (సం. కర్ణాటః, క. కన్నడవు, త. కన్నడం-వృత్తియందు వైకల్పికముగా ఉవర్ణలోపము.) ౧. కర్ణాటదేశమందలివారు మాటలాడు భాష, కర్ణాటభాష.

గీ....అఱవము తెనుఁగు, కన్నడం బన మఱియు
ట్లు కొన్ని దేశ, భాషలై యొప్పు...ఆం. భా.
౧. ౧౧౦.

౨. కర్ణాటదేశము.

ఉ. కన్నడరాయ యక్కడవఁ గప్పు ప్రియా
పరిభుక్తభాక్కషన్. ఆము. ౧. ౧౪.

జ: కన్నడించు[2], కన్నడీఁడు[2].

**కన్నడ(ళ)వు**=కన్నడుగు. వి. కన్నడ, ఉపేక్ష; తిరస్కారము.

కన్నళవుసేయు = తిరస్కరించు.

గీ. కన్నళవుసేయుఁ గచ్ఛపాకారగరిమఁ, గరిమ
రాశకయూన నీచరణమహిమ. వసు. ౪. ౮౬.

కన్నడవు చేఁత=ఉపేక్ష చేయుట.

మ. మొగమోటంబున నుండఁగాఁ జనదు నం
బుల్ మంజగి లింత తే, పగిదిన్ వచ్చు సువ
ర్ణపాత్రము గణింప స్వేంద్రచే నాగతిం,
దగఁ దెప్పింపక నీవు కన్నడవు చేఁతం బట్టి
ప్రార్థించినన్; మిగులం గెర్లదుఁగాక తాఘు

.. కొనఁజూమ్మీ యన్న భీతాత్ముఁడై. విప్ర. ౫. ౨౧.

**కన్నడి.** (క. కన్నడిగ.) వి=కన్నడీఁడు2. (శ. ర.)

**కన్నడించు1.** స. క్రి. (√కన్నడ1.) ఉపేక్షించు. (శ. ర.)

**కన్నడించు2.** స. క్రి. (ఇది 'తెలిఁగించు' వంటిది?- √ కన్నడము) కన్నడభాషలోనికి మార్చు. (బ్రౌ.)

**కన్నడీఁడు1.** విణ. (కన్నడ1 + ఈఁడు.) ఉపేక్ష చేయువాఁడు. (శ. ర.)

**కన్నడీఁడు2.** వి. (కన్నడము + ఈఁడు.) కన్నడ దేశపువాఁడు, కర్ణాటకుఁడు.

సీ. కన్నడీఁ డనఁగను గర్ణాటకుం డొప్పు...ఆం. భా. ౨. ౧౦౩.

సీ. ఆరెలు గన్నడీ లరవలుం దెలుఁగులుఁ దనబిరు దందియుం దగిలి కొలువ. ద్వా. ౧. ౪౨.

**కన్నడుగు(ళువు)**=కన్నడవు.

కన్నడుగు(ళువు)సేయు=ఉపేక్షించు; తిరస్కరించు.

క. ఇన్నాళ్లు నన్ను మిక్కిలి, మన్నన గావించి చాల మంచిన నీవే, కన్నడుగుసేసి తే మని, విన్నప మొనరింతు నీకు విబుధాధిపతీ. వాల్మీకి. ౩. ౬౩.

సీ. కరభోరుయుగళ నీకలికిఁ జేఁదొడలు భద్రక రంబు లన నుచితంబులమ్మ. గీ. కంతుచక్కఁ దనంబు జయంతుసొగసు, నలవసంతునివింత యొయ్యారిపంతు, కన్నళువుసేయునా రాయ వన్నెకాని, బిగువుకౌఁగిలి నీకు లభించెనేని. చమ. ౨. ౯౭.

**కన్నది.** వి. (కన్న + అది.) తల్లి, మాత.

సీ....అమ్మ కన్నది తల్లి యవ్వ నా మాత పేళ్లమరు. సాం. ని. మాన. ౩.

**కన్నపె(వె)ట్టు.** అ. క్రి. (కన్నము + పెట్టు) కన్నము వేయు.

క. మీవీటి మ్రుచ్చు లెవ్వరు, మావీటం గన్న పెట్టి మణిభూషణముల్, గోవతనంబునఁ దెచ్చిరి. దశకు. ౪. ౨౪.

స. క్రి. కన్నము వేసి దోఁచుకొను; అపహరించు.

ఉ. ... తక్కినట్టినా, నాధనసంపదాఢ్యసదనంబులు నిత్యము కన్న పెట్టుచున్, సాధువిధిం బ్రవర్తిలఁగఁ జల్వె దినంబును వైష్ణవార్చనల్. పరమ. ౪. ౧౯౫.

గీ. ఫాలలోచనఫాలకరాళనేత్ర, కీలికీల లనంగ మిక్కిలి తపోగ్నిఁ, దనరియున్నారు వీరల ధైర్యధనము, కన్న పెట్టఁగఁ జాలఁడు కంతుఁ డనుచు. ఘటికా. ౨. ౧౪౭.

**కన్నపోవు.** అ. క్రి. (కన్నము + పోవు) కన్న పెట్టఁ బడినదియగు.

వ. నాగపట్టనప్రసిద్ధబుద్ధాయతనంబు గన్నపోయె. పరమ. ౫. ౧౫.

**కన్నమిడు.** స. క్రి. (కన్నము + ఇడు). ౧. కన్నము వేసి దోఁచుకొను.

మ. ఒకనాఁ డేగురుదొంగ లంతికమునం దొప్పారుమందారనా, మక మాదుర్గము లీలనేలెడు మహోత్సాహాలుఁ డౌ జీవర, త్నకుకన్యాసదనంబు కన్నమిడువాంఛన్ వచ్చి...ద్వా. ౧౦. ౧౧౫.

౨. కన్నము కలదానినిగాఁ జేయు.

క. మామందిరంబుకుడ్యం, బే మిరువురుఁ గూడి కన్నమిడి యడుగులచొ, ప్పేమియు నెఱుఁగక యుండం, గా మాటితి మప్పు డేను గడు నుత్సుకతన్. దశకు. ౬. ౬౨.

**కన్నము.** వి. (క. కన్న). రంధ్రము, బిలము; దొంగలు త్రవ్వెడుసొరంగము.

ఉదా: ఎలుకకన్నము.

ద్వి. గడియకన్నంబును గడపకన్నంబు. బస.పు. ౫. 3౮౦.

జ: కన్నగాఁడు, కన్నపెట్టు, కన్నపోవు, కన్నమిడు.

కన్నయ్య[1]. వి. (కన్న + అయ్య.) తండ్రి, జనకుఁడు.

సీ...తండ్రి,యబ్బ కన్నయ్య నాయన యయ్య యప్పన జనకాఖ్య లగు...సాం.ని.మాన.3.

కన్నయ్య[2]. వి. (సం. కృష్ణః.ప్రా. కణ్హో-కన్నఁడు + అయ్య) కృష్ణుఁడు. (శ. ర.)

కన్నర. వి. (త. కణ్ణరావి ౧. దుఃఖము. ౨. దురవస్థ.) దురవస్థ; దుఃఖము, కష్టము. (కన్నఱ అని చి. ని, శర. కాని తమిళమును బట్టియు 'కన్నరి' క్రిందనీయఁబడిన యనుప్రాసమునుబట్టియు సాధురేఫముతో గ్రహింపఁబడినది.)

ఉ.అన్న మునీంద్రపుత్త్ర మృగయాక్రియ యింతకుఁదెచ్చె నన్ను ము,న్నెన్నిట నోమి కాంచిరొ సమిద్ధతపఃఫలసార మైనయు,ద్యన్నయశీలు నిన్నుఁ దలిదండ్రులు వా రెట నున్నవారొ యీ,కన్నర చూడఁ బాలయితిఁగా విధి నేవిధి దూఱ నేరుతుఁ. రామా. ౨. ౮౧. (కన్నడ-మూద్రి.)

క. మన్నులు రేఁగఁగ నేనుఁగు,మన్నిఁ డడఁబడి యెంపమావులు ద్రావం, గన్నరఁ బఱచుచు నడియా,స న్నొగులుచు వ్రాలి సోలి జాలిం బడుచుఁ. వాల్మీకి. ౧. ౯౫.

జ: కన్నరి.

కన్నరి. విశే. (√కన్నర) దుఃఖితుఁడు.

(గరుడుఁడు) వ...నిర్జరులు జర్జరులుగా మేఘంబులు మోఘంబులుగాఁ గిన్నరులు గన్నరులుగా భూతంబులు భీతంబులు గా...అరుగునట్టియెడ...ఉ. హరి. ౬. ౨౮.

కన్నవిటి. విశే. (కన్ను + అవిటి.) చీకు,అంధుఁడు.

క. చెవిటికి శంఖధ్వని క,న్నవిటికి దీపంబు షండుఁ డగుపురుషునకుఁ, యువతియు ఖలునకు నుపకృతి,శవమున కిడుభూషణములు జగతి వృథ యగుఁ. భల్లా. ౮ ఆ. (శ. ర.)

కన్నాఁగు. అ. క్రి. (కన్ను + ఆఁగు) నిద్రించు.

శా. అన్నా లక్ష్మణ భ్రాతృవత్సల మరంతాయా సఖిన్నుండవ,య్యన్నిద్రారహితుండవై యకట ము న్నగ్రాటవీభూములం,బన్నం గొల్తు గదన్న నేఁడు రణశయ్యఁ భూవిభుం డుండఁగాఁ, గన్నాఁగం దగునయ్య నీనిమరకుం గాలం బమోఘ్యంగదా.భా.రా.యు.౫౭౮.

కన్నాకు. వి. (కను + ఆకు-ప్రౌఢవ్యాకరణము.) తములపాకులకట్టయందు మొదట నుండెడియాకు. (శ. ర.)

విశే. శ్రేష్ఠము; ముఖ్యుఁడు; నాయకుఁడు;అగ్రేసరుఁడు.

సీ. ... కన్నాకు మేల్బంతి ... ఆణి యంచనఁ దనరు శ్రేష్ఠము ...ఆం. భా. 3. ౧౫.

క. చెన్నొందఁగఁ దనయింటికిఁ,గన్నాకయి మెఱసియుండు గాదిలితనయుఁ,జన్నములు సేయ నడవిన,యున్నాఁ డని విని దశాస్యుఁ డుద్యోగమునఁ. నిర్వ. ౫. ౧౨౮.

క. కన్నాకు మనకు భీష్ముఁడు...భార. భీష్మ. ౧. ౭౬.

సీ. ఎరుమతూఁతలు ముట్టె యెత్తి బిట్టాలించి గమికిఁ గన్నాకయి గాలి యరయు. మనుచ. ౮. ౮౨.

కన్నాత. వి. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

సీ... మెసలమైఁ గన్నాత లిడి...ప్రబంధ.౯౬.

సీ. కన్నాత చాంగణ కందణంబు...గీ...అంజ మెఱపట్టు నాఁగఁ జెన్నలరుచుండు,ముప్ప

దియు రెండు విన్నాణములకుఁ జేర్లు...ఆం. భా. ౨. ౨౦౯.

బ. ౧. రతిబంధవిశేషము.

సీ. కన్నెత లాఁగించి కాంతుమోము గదించి సారెసారెకు మోవిఁ జప్పరించి. శశాం. ౩. ౯౫.

౨. మల్లవిద్యావిశేషము.

సీ. కన్నెతలు పుటము ల్గస్తాలు మండీలు దాశాలు డింకీలు దండెములును,లాఁగు లనంగను రాజిల్లుఁ దద్భేదనామధేయంబులు... ఆం. భా. ౨. ౨౦౭.

**కన్నియ(న్నె)**=కన్య. వి.(సం.కన్యా. క. కన్నె.)

౧. కన్యక, వివాహముకాని బాలిక; స్త్రీ.

సీ. కన్యాభిధానంబు కన్నె కన్నియ కన్య యన మూఁడుపేళ్లచే నమరి యుండు. ఆం. భా. ౨. ౧౦౬.

సీ. మునిదత్తమగుమంత్రమున గొంతి కన్నియ నాఁడు వేడుక దిననాథుఁ దనకుఁ,బ్రత్యక్షముగఁ జేసి పడయుట...భార. శాం.౧.౧౬.

క. అచ్చిన్నికన్నెసోయగ, మచ్చెలువుం జిల్వచెల్వలందును మఱియ, య్యచ్చరచేడియలందును,నిచ్చలుఁ బరికింపఁ గలుగనేర దొకప్డున్. నీలా. ౧. ౫౮.

ఉ. ఇన్నిదినంబులున్ సవతులింటఁబలో సలసత్యభామ క,న్నన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన వించుఁ గాని యో,కన్నియ నీయెడం గలుగుగౌరవ మెందునుఁ జూచి కాన...పారి. ౧. ౬౫.

౨. కూఁతురు, పుత్రిక.

ఉ. పంఛినకోపముల్ సమయసంగభయంబును నగ్గలించి యు,ల్లంబు పెనంగొనంగఁ బతులందగ సభ్యులఁ జూచుమాడ్కి రూ,క్షంబగు చూడ్కి నాద్రుపదుకన్నియ నూచి ... భార. విరా. ౨. ౧౩౯.

ద్వి. కన్నెల నూర్వురఁ గదురూపవతులఁ,గనియె ... రం. రా. బాల. ౩౩ పా. ౧౦పం.

విశే. ౧. మొదటిది, ప్రథమము. (చూ. కన్నెకయ్యము, మొ.)

౨. లేఁతది.

సీ. చిన్నికొమ్మల మించుకన్నెమామిడిచెట్టుఁ జేర్చి నీకును మెచ్చు సేయఁగలను. విప్ర. ౩. ౧౯.

వ. ఆసమయంబునఁ జెన్నలరుకన్నెవెన్నెలల వెన్నెలపులుఁగు లలముకొన్నచిన్నెల...ఘటికా. ౨. ౧౪౬.

౩. క్రొత్తది.

సీ.ధళుధళుక్కున నింగిఁ దాటించెఁ బలుమాఱు నీరాళ్లగొందిఁ గన్నియమెఱుంగు. పాండు. ౪. ౨౧.

క. ...కీర్తివిభవా,న్వితవిను మాకన్నెపాటని యథార్థగతిన్. హ. న. ౨.౬౭. (హరిశ్చంద్రకథయందు.)

కన్నెకూర్మి=ప్రథమానురాగము.

గీ. మానసీయశశాంకకోమలము లైన, యామినీ సమయములుఁ బర్యంకములును, సాత్తులుగ నొందు నలవంత జనవిభుండు,కన్నెకూర్మి ప్రకాశంబు గాకయుండ. నైష. ౧.౮౪.

కన్నియతఱి, కన్నియనాఁడు = కన్యగానున్నపుడు.

సీ. మంత్రబలంబున మార్తాండువరమునఁ గన్నియతఱి గొంతి గన్నవాఁడ,వు ... భార. ఉద్యో. ౪. ౨౯.

సీ. కన్నియనాఁడు భాస్కరుని రావించితి వర మంత్రబలమున వచ్చి యతఁడు,సంప్రీతినొసఁగంగ జన్మించినాఁడవు...భార.ఉద్యో. ౪. ౫౯.

జ: కన్నియలేడి, కన్నెకయ్యము, కన్నెగోరు కోఁత, కన్నెదావి, కన్నెటికము.

కన్నియ(న్నె)లేడి. వి. (కన్నియ+లేడి)కారండవపక్షి. ఆం.భా. ౨. ౯౬.

ద్వి. కొక్కెర జెగ్గురు కొంగ రాపులుఁగు, కక్కెర యాడెలు కన్నియలేడి. ద్వి.హరిశ్చ. పూ. ౬౩౦.

సీ. కొక్కెర పూరేడు గొరుపంక లావుక పాన్నంగి కోవెల కన్నెలేడి. యయా. ౨. ౨౪.

కన్నీరు. వి. (√కన్ను) అశ్రువు.

సీ. అశ్రువు కన్నీరటంచును రాజిలు ... ఆం. భా. ౨. ౧౪౪.

కన్ను=కను. వి. జౌ. (ఇది హల్లు పర మగునపుడు వైకల్పికముగా 'కను, కన్' అను రూపముల నొందును–√ కను–క. కణ్ణు. త. కణ్.) ౧. నేత్రము; చూపు, దృష్టి.

చ...ఏదుకన్ను దెమ్మనినను దెచ్చువాఁడ... విక్ర. ౧. ౧౬౯.

చ... మొక్కలమున మోకమావిపయిఁ గన్నిడి ...కవిక. ౩. ౧౦౫. రా. వి. ౩. ౮౨.

౨. ఇంగితము, అభిప్రాయము; జాడ.

చ. అమృతకళాంశుతుల్య మగుహారము రాముఁడు సీత కిచ్చె నా, రమణి ధరింప నొల్లక కరంబులఁ దాల్చి నిజేశుఁ జూడ భూ, రమణుఁడు నింతి కన్నెఱింగి రాగముతో నగుఁగాక యన్న న,క్కమలదళాక్షి వాయుజుని కంఠమునం దగిలించె వేడుకన్. భా. రా. యు. ౨౬౬౮.

మ. చిగురుంబోఁడియు వానిఁ జూచి తగిలెన్...

క. ఆకన్నెఱింగి యచ్చట, నీకన్నియ నుండనీక యిట తెచ్చితిమి...భోజరా. ౩. ౨౩౫, ౨౩౬.

ఆ....కరితురంగ, రథపదాతిచయము రాపించుచున్నయా, కన్నెఱింగి కోపకలితుఁడగుచు. వి. పు. ౭. ౪౧౩.

౩. చెఱకులోనగువానిగనుపు, పర్వము. ('పర్వము క్రిందిగుంట' అని శ. ర.)

సీ....కన్ను కనుపు గంటు గను పంచనఁగఁ బర్వ, మమరు...ఆం. భా. ౨. ౭౪.

చ. నలనిభుఁ డీజయధ్వజుఁడె నావిభుఁ డంచుఁ దలంచు మనంతలో, వలపుల కోఁడు కెంపుజిగి పంపు మెఱుంగుఁబటాణి నూకి క,న్నులు గల వింట నప్పుడు వినూత్నశరావళు లేసి యార్చె...శుక. ౧. ౩౧౨.

౪. (వల మున్నగువాని)రంధ్రము.

(వేశ్యామాతృవర్ణనము.) వ. ... ప్రాఁతవలయునుం బోలెఁ గన్నులు చెదరి...కవిక. ౪. ౧౧౩.

చ. కన్నులు కన్నులే వలలకన్నులు గావి ... దశా. ౨. ౩౨౧.

సీ. చంద్రకమ్ములును లోచనములు రంధ్రముల్ చెన్నొందు చుండును గన్ను లనఁగ. ఆం.భా. ౩. ౬౧.

౫. (బండి)చక్రము.

(మన్మథరథవర్ణనము.) సీ. పంకరుహంబులు బండికన్నులు చంపకంబులు నొగ లుత్పలంబులిరుసు. కు. సం. ౪. ౮౩౯.

౬. పంతెనద్వారము. (శ. ర.)

౭. నెమిలిపురికన్ను, చంద్రకము.

సీ. చంద్రకము కన్ననఁగఁ బరఁగు. ఆం. భా. ౨. ౯౬.

౮. మృదంగాదివాద్యములముఖభాగమున నేర్పఱుపఁబడినవృత్తనీలమండలము. (కరణి); కరణివేయుప్రక్క; బోనమువేయుప్రక్క.

వ...ఎందేనియుం గన్ను వేయుట మృదంగాదివాదిత్రంబులయందు...ఆము. ౪. ౧౮౭.

ద్వి....మద్దెల యూడుఫలకంబునందు, సంధించి బంధించి సప్తతాళముల, బంధుర గతులుత్త

ప్పకయుండ శ్రుతులు, కూడంగఁ గుడిచేతఁ గొట్టుచు ముద్ద,కూడు దాపటికంటఁ గూడ హత్తించి. ప్రభులిం. ౨౬. పొ. ౧౬ పం.

౯. కపటచేష్ట.

సీ....కన్ననఁ గీలనఁ గపటచేష్ట. ఆం. శే. ౫౫.

కన్నిచ్చుకువచ్చు=కంటికింపగు.

వ. భూయిష్ఠంబు లగుమృగంబులం దెగఁ జూచి యేచి కన్నిచ్చుకువచ్చు పెక్కనంజూడులు చేవడించక కావడించి ప్రొద్దస్తమించునం తకుఁ బఱతెంచునపుడు...పాండు. ౩. ౭౯.

కన్నుండఁ గంటిపాపఁ గొనునట్లు:- చూచుచుండఁగనే మోసము చేయుటను దెలుపును.

క. కన్నుండఁ గంటిపాపం,గొన్నట్లు మొఱంగి బాలుఁ గొనిపోవుటకున్, అన్నిచు బంధుయుతముగ,మన్నిగొనక యున్న నేటిమాటలు మనకున్. ఉ. హరి. ౫. ౨౭౭.

కన్నుఁగవ=నేత్రద్వంద్వము.

చ. మొలచినకూర్మిఁ గన్నుఁగవ మోడ్చినయప్పుడు...నైష. ౧. ౬౪.

కన్నుగానక=అంధుఁడయి; (గర్వాదులచే) అంధుఁడయి.

గీ. అతనుదర్పాంధకార మంతంతఁ గవియఁ, గన్నుగానక సాధ్వి రాఘవుని దేవి,జనకకన్య జగన్మాన్యఁ జెనక వచ్చి, కన్నుగానక చనెఁ బలుగాకి కాకి. రామా. ౫. ౪౦.

వ. మానసాహసుండు రాజ్యగర్వంబునఁ గన్నుగానక...ఏకశు. ౨. ౮.

(ఇట్లే 'కన్నుగానఁడు, కన్నుగానమి' మొదలగువ్యతిరేకార్థకరూపములు గ్రహించునది.)

క. తా నెటువలెఁ బ్రతికెడునో,నానావిధభోజనములు నాకు నసంఖ్యం,బైనమహాసేనకు ని,క్కానసమున నూని గన్నుగానఁడు సుమ్మీ. వరాహ. ౮. ౧౦౧.

వ. దేవా యీవేళ కాపజ్రనాభుండు ప్రాభవాభిమానంబునఁ గన్నుగానమిఁ దన్నుఁ దా నెఱుంగకున్నవాఁడు ... ప్రభా. ౧. ౧౧౪.

కన్నుమిక్కిలివేల్పు=శివుఁడు.

సీ. విన్నెఱి జడఁ బూను కన్నుమిక్కిలివేల్పు ...అచ్చ. భా. ౫. ౭౪ పొ.

కన్నులఁగట్టినట్లుండు = ఎదుటఁ గట్టినట్లుండు, ప్రత్యక్షముగా నగపడుచుండు.

ఉ....దీనిమేనికిన్, గానఁగరాదు సాటి యిది కన్నులఁ గట్టినయట్లు తోఁచెడిన్.చంద్ర. వి. ౧. ౨౪.

కన్నులఁగప్పుకొను=కన్నులనద్దుకొను, గౌరవముతోఁ జూచు.

ఉ. నమ్మినవారు పాండునృపనందను లందఱిలోనఁ బెద్దగా,మిమ్మె గణించు ధర్మజుఁడు మీ రటకున్ విజయంబుసేయ వే,గమ్మెను రేఁగుదెంచి కడుఁ గన్నులఁ గప్పుకొనుం బదం డనం,దమ్మునిమాట యన్న జవదాఁటని యన్న ససంభ్రమంబుగన్.విజ. వి. ౩. ౧౪౨.

కన్నులఁజూపు=కన్నులకుచూపు,కనఁబఱుచు.

ఉ. ఈనవమేఘముల్ ప్రియుల నేటికిఁ గన్నులఁ జూప వయ్యెయో, యీనగపంక్తులైన హృదయేశ్వరులం దగ నేల యీయవో,యీ నఖమంటుగట్లయిన నేటికి వేడుకకాంద్రఁ బంపవో, వానలుఁ బండ్లుఁ బచ్చికలు నైన నేటికి నాకు దైవమా. గంధ. ౬౭.

కన్నులఁబడు=అగపడు, కనఁబడు.

ఉ. అంతటిలో ఋతుధ్వజనరాధిపుమోహనమూర్తి మున్ను గన్నంతయుఁ గన్నులంబడిన...కువల. ౩. ౫౯.

కన్నులపండువు, కనుపండువు=నేత్రోత్సవము; ఉత్సవము.

క....అరిగిరి నగరం,బునకుం గన్నులపండువు,జనపదముజనం బొనర్ప జనసంస్తుత్యా. భార. ఆశ్ర. ౨. ౧౮౮.

వ. రెండవకుసుమకోదండుండునుంబోలె విలాసి నీమండలికిం గన్నులపండువై... నైష. ౧. ౫౭.

చ. పడఁతుకరోమరాజి కనుపండువు నిచ్చు జనంబు మూఁడ్కికిన్. చం. రా. ౩. ౯౬.

కన్నులమ్రొక్కు=నమస్కారవిశేషము.

వ.... శ్వేతద్వీపమందలి తారకస్వామికిఁ గన్నులమ్రొక్కు బదరీవనమందలి నారాయణునకు జోతలు... ప్రబంధ. ౯౯౦.

కన్నులార్చు=కనుసంజ్ఞచేయు.

చ. కనుఁగొని తీవ్రరోషమునఁ గన్నుల నిప్పులు రాల నోరి నా,వనితకుఁ గన్నులార్ప నిటు వచ్చినవాఁడవె నిన్నుఁ బట్టి చ,య్యన సమయింతు...రుక్మా. ౫. ౨౨.

ఉ. ఒక్కవిటోత్తముండు నను నొందఁగఁ జూచినకాంతఁ జూచి వే,ఱొక్కఁడు గన్నులార్చుటకు నోర్వక కోపము మీఱి...చిత్ర భా. ౪. ౫౪.

కన్నులుచల్లనగు=నేత్రానందకరమగు.

ఉ. ఎన్నఁడు చూడఁ గల్గెడునొ యిందుకులాగ్రణి ముద్దుమోము నా,కన్నులు చల్లఁగా... కవిరా. ౩. ౬౨.

కన్నువిన్కలితిన్నె=శేషాచలము.

గీ. భయదరభసశరభసముదయముఁ బ్రోచు, సాహసోదారభూదారచక్ర మచట, జాతివైరంబు లేక... కన్నువిన్కలిదిన్నె ఱేఁడున్నకతన. ప్రబంధ. ౩౪.

కన్ను(ను)వేయు = దృష్టిప్రసరింపఁజేయు; అభిలాషకలిగియుండు.

గీ. ఇంతిదోయిట సేసఁబ్రాలెత్తుచోట,గుబ్బపాలిండ్లక్రేవ గ్రక్కున మురారి,కన్నువేయుటఁ గని లజ్జ గదుర బాహు,లెత్తక కరాగ్రములన పై కెగురఁ జల్లె. ఆము. ౬. ౧౩౩.

గీ. లలితలావణ్యతారుణ్యలక్షణముల,నపరలక్ష్మి యటంచు నయ్యబలమీఁద, నలిననాభుండు గనువేసినాఁడు...వరాహ. ౧౧. ౫౨.

ఇట్లే:-కన్ను(ను)వైచు.

సీ. ఇది యధర్మముత్రోవ యిది పథప్రచ్యుతి యిది యధోగతిహేతు విది యకృత్య. గీ. మని విచారింప కవనీసురాధముండు, కల్కిచండాలకన్యపైఁ గన్నువైచె. శివరా. ౩. ౬౦.

చ. ... నవయౌవనరూపకళావిలాసభా,స్వరుఁడగునట్టియొక్క మగవానిపయిం గనువైచితేమొ ... కువల. ౩. ౧౦౭.

కన్ను(ను)సన్న=నేత్రసంజ్ఞ.

గీ. దేవగంధర్వదానవాదికులు భక్తిఁ,గన్నుసన్నలఁ దన కూడిగములు చేయ, నెపుడు పేరోలగంబుండు నేమిచెప్ప, నాకురంగాక్షిమహిమంబు లసురనాథ. వరాహ. ౧౧. ౮౨.

గీ. అపుడు రుక్మిణికనుసన్న నబ్జముఖులు, రత్నసింహాసనంబు నారదున కిడిరి. పారి. ౧. ౮౬.

కన్నె(న్నులె)ఱ్ఱచేయు=కోపించు.

సీ. పద ముహూర్తము దాసెఁ బతిచెంత కని తెల్పు చేడెపైఁ గన్నెఱ్ఱచేసె దేమి. రసిక. ౫. ౧౬౪.

ఆ. తల్లి పాఱవైచి తరల నన్యులపంచ, బ్రతికె కూఁతవట్టి కొంకుక కీవు, కన్నులెఱ్ఱచేసి యన్నులఁ గని కాఱు,కూఁత లఱచె దేమి కోకిలంబ. రసిక. ౮. ౧౭౦.

ఇట్లే:-కన్నెఱచేయు.

ఉ. ... పాటలముల్ గుసుమోదయంబుచేఁ గన్నెఱచేసెఁ దిట్టెఁ గలకంఠరుతంబులఁ జాతముల్ వృథా, మున్నుగ నన్నిటం గడచి మోదుగపూవులు విఱ్ఱవీఁగినన్. కవిక. ౪. ౭.

కన్నుకట్టు. వి. (√కన్ను) బాలక్రీడావిశేషము.

సీ. వెన్నెలకుప్పలు కన్నుకట్టు... ప్రబంధ. ౬౧౩.

కన్ను(ను)బొమ్మ(మ), కన్బొమ్మ(మ). వి. (√కన్ను.) భ్రూవు.

ఉ. మారునివిండ్లసౌరు పలుమాఱును మీఱెడిక
న్నుబొమ్మలు... ఇందు. ౨. ౧౬౧.

చ. చెలినునువంకకన్నుబొమసింగిణి దిగ్విజయం
బుఁ గూర్పఁగాఁ, దొలుతటియించువి ల్లుని
మి తుంటలు చేసి మరుండు ... చంద్రా. ౪.
౧౨౦.

ఉ. పూని మరుండునాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి
... ఆము. ౧. ౪.

క. కడు నవ్వింపచుఁ జెఱఁగులు, ముడివెట్టెన్
బేరఁటాండ్రు ముదిత కనుబొమల్, ముడివె
ట్టె నాలిసిగ్గున ... మనుచ. ౫. ౯౪.

శా. చెండ్లా గుబ్బలు జాళువాతళుకులా చెక్కు
ల్గడాల్ సింగిణీ,విండ్లా కన్బొమలు...విజ.
వి. ౧. ౧౩౪.

**కన్నుమూ(ల్మూ)యు, కనుమూయు, కన్మూయు.**

అ. క్రి. (√కన్ను) ౧. నిద్రించు.

సీ. కదనోత్సవత్వరఁ గనుమూయ నెఱుఁగక
కోర్కిమై వేఁబోకఁ గోరువారు. కవిక.
౨. ౧౩౨.

౨. దీర్ఘనిద్రఁజెందు, మరణించు.

గీ. అమ్మ నేఁ జెల్ల రొమవెతెయో యవల నొక్క,కొ
మ్మ నాప్రాణవిభు నేలుకొనియె నేమొ,కాక
యుండిన ననుఁ జేర రాకయున్నె,యని ప్ర
లాపించి కనుమూసె నాక్షణంబ. శుక. ౧.
౩౦౬. (చూ. ౩౦౮.)

స. క్రి. కనుగప్పు, వంచించు.

సీ. పన్ని రనుచు నన్ను భ్రమయించి యక్కటా
సలసలఁ గ్రాఁగుక్రొంజమురుఁ జల్లి,కపురం
పుఁబలు కంచుఁ గనుమూసి కటకటా బూది
గప్పిననిప్పఁ బాడుకొల్పి. చంద్రా. ౪.
౧౬౭.

శా. ...నా చేఁ గాదుసుమ్మాప్రజం,గన్ను ల్మూయుఁ
గ. శుక. ౪. ౨౪.

**కన్ను(ను)మొగుచు, కన్మొగుచు.** అ. క్రి.
(√కన్ను.)౧. కనుమూయు, నిద్రించు.

గీ. ప్రహరిఁ దిరుగుట చాలించి భైరవుండు,గ
వని మొగసాలయరుఁగుపైఁ గన్ను మొగిచె.
కాశీ. ౩. ౨౩౫.

౨. ముకుళించు.

క. మసమసకనయ్యె దిక్కులు,పసి గ్రేపుఁ దలం
చి తిరుగఁబడె గూండ్ల కరం,బసమాజము
కలకలము లెగసె నెపనెడఁ గన్ను మొగిచెఁ
గమలవనంబుల్. జై. భా. ౨. ౧౦౧.

**కన్ను(ను)మొఱఁగు, కన్మొఱఁగు.** స. క్రి.
(√కన్ను.) వంచించు, మోసపుచ్చు.

మ. ఎనయం గర్గనమూర్తి శృంగిరిటిఁ గానీ తం
డుఁ గానీ నిరుం,భునిఁ గానీ కయిసండప
ట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం,గనలం
గన్ను మొఱంగి ... భీమేసుఁడు సానివాడ
కరుగున్ ధూర్తప్రకారంబునన్. భీమ. ౧.
౧౧౧.

క. అన విని లక్ష్మణుఁ డిట్లనుఁ,గనునట్లుగ నెమర
నిల్వఁగా లేక మమున్, గను మొఱఁగి పాడి
దప్పుచు,నని చేసిన నిన్ను శూరుఁ డంద్రే చె
పుమా. భా. రా. యు. ౧౩౪౫.

మ. సిరి నొక్కప్పుడు కన్మొఱంగి హరి దన్ జే
రన్ బ్రహర్షించుచు,న్వరసన్...ఆము. ౧.
౨.

**కన్ను(ను)మోడ్చు**=కన్ను మొగుచు.
(నిద్రించు.)

గీ. చల్లచూపులకాంతామతల్లి నాను, తల్లి యల
మేలుమంగకై దండఁ గొనుచుఁ,బన్నగనగా
ధ్యుఁ డే నింత కన్ను మోడ్చు,తతిని గలలో
న నెదుటఁ బ్రత్యక్షమయ్యె. రా. వి.౧.౧౫.

ద్వి. నడురాత్రి యరుదెంచె నరలోకనాథ, క
డు దస్సినాఁడవు కను మోడ్తుగాక.రం.రా.
బాల. ౩౪ పా. ౨౭ పం.

**కన్నుమోడ్పు.** వి. (√కన్ను మోడ్చు.) కన్ను మూయుట; నిద్ర.

చ. అన విని డెంద మూఱడిల నయ్యెడ నించుక సేపు కన్ను మో,డ్పు నెఱపి తాఁ గలంగని యపూర్వతరస్థితి... హ. న. ౨. ౫౩.

**కన్నులకచ్చి.** వి. (√కన్ను.) బాలక్రీడావిశేషము.

సీ...కన్నులకచ్చి గుడుగుడుగుంచాలు పుంజెనగి ఆ. హంస. ౩.౧౫౬.

**కన్నులకలికి(ల్కి).** వి.(కన్నులు+కలికి)- కన్నులయందు మనోజ్ఞత కలది-స్త్రీ, ఆఁడుది.

క. అలయం బ్రాయపుఁగన్నుల,కలికికి ముదిమగఁడు బూచి గావున... వేం. పంచ. ౩.౧౯౦.

ఉ. కన్నులకల్కి నీచెలువు కన్నులు చల్లఁగఁ గాంచఁ గల్గినన్, గన్నులు గల్గినందులకుఁ గల్గు ఫలంబులు గాకయుండినన్, గన్నులు కన్నులే వలలకన్నులు గాక...దశా.౨.౩౭౧.

**కన్నులమ్రాను.** వి.(√కన్ను.)చెఱకు,ఇక్షువు?. (శ. ర.)

**కన్నులవింటిజోదు.** వి. (√కన్ను.) చెఱకు విల్లు గాఁగలయోధుఁడు, మన్మథుఁడు.

ఉ. కన్నులవింటిజోదుపసికంజములాన చకోరలోచనా. దశా. ౨. ౩౭౧.

ఇట్లే: కన్నులవింటివాఁడు.

ఉ. కన్నులవింటివాఁడ తిగకన్నులదేవరతోడఁ బోరి ... నీలా. ౩. ౧౯.

**కన్నులవినుకలి, కన్నువిన్కలి, కనువినుకలి.** వి. (√కన్ను.) చక్షుశ్శ్రవము, పాము.

ద్వి. కన్నులవినుకలి...నవనాథ. ౮. ౧౪౯ పా. ౬పం. ప్రబంధ. ౩౮.

వ. ... ఇది కనువినుకలి నెలవుపుట్టువే విదినిగాఁ జెప్పంబడి జగంబు లెఱిఁగిన వగుటం జేసి నీకుం గొంచెంబుగాఁ జెప్పితిని. యయా. ౩. ౩౯. (కనువినుకలినెలవుపుట్టువు=వాల్మీకి.)

ఇట్లే: కంటివిన్కలి.

వ. కంటివిన్కలిపంట పేరింటికుంటి మొకిమీఁడ. ప్రబంధ. ౨౧౬.

**కన్నులవిలుకా(ల్కా)ఁడు.** వి. (√కన్ను.)- చెఱకు విల్లుగలవాఁడు-మన్మథుఁడు. ఆం. భా. ౧. ౮౫. ఆం. సం. దేవ. ౧౮.

ఇట్లే: కంటినింటివజీరు. ముకుంద. ౩. ౬౯.

కన్నులవిలుకాఁడు=మన్మథుఁడు.

ద్వి. కన్నులవిలుకాఁడు గ్రాఁచె ధైర్యంబు.విష్ణు. పూ. ౩ ఆ. (శ. ర.)

**కన్నెకయ్యము.** వి.(√కన్నె.) ప్రథమయుద్ధము.

గీ. ...కన్నెకయ్యం బనఁగఁ బ్రథమయుద్ధాఖ్య ... ఆం. భా. ౨. ౨౨౨.

మ....కన్నెకయ్యంబున,ర్థి భవత్పుత్రులమీఁది కోపమున నుద్దీపింప నేతెంచి ర, య్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్యద్దంతియూథాకృతిన్. భార. భీష్మ. ౧. ౧౧౦.

**కన్నెకొమరు.** వి. ఓషధివిశేషము.

సీ. ... గాడిపగడపర కన్నెకొమరు... హంస. ౮. ౧౦.

**కన్నెగోరుకోఁత.** వి. (కన్నె+గోరు+కోఁత.) కన్యకలగోళ్లు తీయుసంస్కారము. (ఈసంస్కారము కన్యను పెండ్లిచేయుటకు పూర్వము చేయుదురు. బ్రాహ్మణవైశ్యేతరవర్ణములందు ఈయాచారము కలదు.)

**కన్నెబావి.** వి. (కన్నె+బావి.) చిన్నబావి.('కోనేటివంటి పెద్దబావి అని కొందఱు' అని-శ.ర.)

**కన్నెము.** వి. కోడిగుడ్డుకాయ. (శ. ర-కోడి యొక్కరెండవజీర్ణావయము. బ్రౌ.)

**కన్నెతీక(ర్క)ము.** వి. (కన్నె+తీకము.) ౧. కన్యాత్వము.

చ. కల యనరాదు రామలకుఁ గాములకూటము లెన్నిచందముల్, గలవవి యన్నియుఁ దె లసెఁ గన్నెటికం బిటు వీటిఁబోయెఁ బె,ద్ద లకును బెద్దయై తనరుతండ్రికిఁ దక్కవపా టు దెచ్చితిం,గుల మెరియించితిన్...హరి. ఉ. ౬.౯౧. ఆం.భా. ౨.౧౦.

ద్వి. కన్నెర్క మింతయుఁ గడమ కా కుండ. ప్రభులిం. ౬౯ పా. ౨౦ పం.

౨. వారకన్యల ప్రథమసంగమము.

(కూఁతులు విరక్తలైనందున వేశ్యామాత చింతిం చుట.) ఉ. ... మందుల నైన నీశ్వర, జ్ఞానము మాన్పి కామసుఖసక్తలఁ జేసిరయేని యిత్తుఁ గా,నైనను బుచ్చుకోక కమలాస్యలకన్నెటి కంబు వారికిన్. కాశీ. ౪. ౪౯.

క. అన్నునఁ గను మూయుట రొద, సన్నగిలుట గాఁగిలింత సడలుట నేర్పుల్, సున్నగుట పరాధినిరతి, కన్నెటికపు రతియుఁబోలెఁ గడు నింపొసఁగెన్. మనుచ. ౩. ౧౧౬.

ద్వి. కలపినవాఁడవో కన్నెర్క మిడఁగ. పండితా. పురా. ౧౧౫ పా.

**కన్నెసరులు.** వి. బ. (√కన్నె) ధాన్యవిశేషము.

సీ. సంపంగెపూవడ్లు జాజిరాజనములు గంబూర రాజనాల్కన్నెసరులు. హంస. ౪. ౧౨౯.

**కన్య**=కన్నియ.

వి. (వివాహముకానిబాలిక.)

ఆం. భా. ౨. ౧౦౮.

విశే. (ప్రథమము, మొదటిది.)

సీ. ధృతిఁ గుంతిమద్రభూపతుల నెయ్యపుఁగన్య కలనన వాలుఁదూపుల జయించి. రాఘవ.౧. ౬. (రామాయణార్థమున.)

**కన్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పెండ్లికానిపడుచు. ౨. పదియేండ్లచిన్నది. ౩. కూఁతురు. ౪. ఆఁడుది ౫. (అలం) ఒకనాయిక. ౬. కన్యారాశి. ౭. దుర్గ. ౮. పెద్దయేలకి. ౯. వారాహీకందము, నేలతాటిగడ్డ. ౧౦. వంధ్యాకర్కటి, గొడ్డుఁగాఁకరకి. ౧౧. కలబంద. ౧౨. ప్రేంకణము.

**కన్యక.** సం=కన్య.

**కన్యస.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిటికనవ్రేలు. ౨. కడపటిసోదరి. (వై. ని.)

**కన్యసుఁడు.** సం. వి. అ. పుం. కడగొట్టుతమ్ముఁడు.

**కన్యాకుబ్జము.** సం. వి. అ. పుం. ఒకదేశము. న. ఒకపట్టనము. (ఇప్పుడు దీనిని "కనూజ్" అనుచున్నారు.)

**కన్యాకుమారి.** సం. వి. ఈ. స్త్రీ. దుర్గ.

**కన్యాదానము.** సం.వి. అ.న. కన్యను వరున కిచ్చి పెండ్లిచేయుట.

**కన్యాశుల్కము.** సం. వి. అ. న. కన్యకు వెలగా నిచ్చుధనము, ఉంకువ, ఓలి.

**కన్యుషము.** సం.వి. అ.న. మనికట్టునకు ముందుండుచేయి, పాణి.

**కన్నెప్ప**=కనుఱెప్ప. (ప్రా)

**కన్వేగు.** అ. క్రి. (కను+వేగు) కొంచెము తెల్లవాఱు, తెలతెల్లవాఱు.

క. విన వచ్చి దొంగగా యని,యొనరఁగ నొక బొండకొయ్య నుంచిరి కన్వే,గినవెనుకఁ దెలిసికొని య,చ్చని నను బొమ్మందు రింతె యాది యట్లుండెన్. శుక. ౩. ౨౦౪.

**కపటప్రబంధము.** సం. వి. అ. పుం. కపటముతోఁ గూడినపన్నుగడ.

**కపటము.** సం. వి. అ. పుం. న. (కం=బ్రహ్మను గూడ, పటతి = ఆచ్ఛాదించునది.) కైతవము, కవుడు.

**కపటలేఖ్యము.** సం. వి. అ. న. తప్పుపత్త్రము, సృష్టిపత్త్రము.

**కపటి.** సం. విశే. (పు. స్త్రీ. న.) కపటము గల వాఁడు.

**కపటించు.** సం. అ. క్రి. కపటమొందు, మోసము చేయఁదలఁచు.

క. విపరీతపుఁగలివున నే, యుపద్రవము నొంద కుండ నోమినమునికిం, గపటింతురె స పితా య, స్తు పోషక యటన్న మాట చూడఁగ వల దా. వరాహ. ౧౦. ౩౬. ౪౦. రా. ౬౪. ౧౫౭ పా. ౧౦ పం.

**కపటికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కపటము గలవాఁడు.

**కపటిని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకగంధద్రవ్యము.

**కపటేశ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. శ్వేతకంటకారి, తెల్లవాఁకుడుకీ.

**కపము.** సం. వి. అ. పుం. పశువు. (వై. ని.)

**కపర్దకము.** సం=కపర్దము.

**కపర్దము.** సం. వి. అ. పుం. ౧. గవ్వ. ౨. శివుని జడముడి.

**కపర్ది.** సం. వి. న్. పుం. శివుఁడు.

**కపర్దిక.** సం. వి. ఆ. స్త్రీ. గవ్వ, వరాటకము.

**కపాటఘ్నుఁడు.** సం. విశే. (అ. ఘ్నీ. అ.) తలుపు పగులఁ గొట్టువాఁడు. (దొంగ.)

**కపాటము.** సం=కవాటము.

**కపాటసంధికము.** సం. వి. అ. పుం. కర్ణరోగభేదము.

**కపాటి.** సం=కవాటి.

**కపాటోద్ఘాటనము.** సం. వి. అ. న. ౧. తలుపు తెఱచుట. ౨. కుంచెకోల.

**కపాలనాళిక.** సం. వి. ఆ. స్త్రీ, దారము వడికెడు కదురు, తక్కెవు.

**కపాలపాణి.** సం. వి. ఇ. పుం-కపాలము చేతియందు కలవాఁడు-శివుఁడు.

**కపాలభృత్తు.** సం. వి. త్. పుం-కపాలము ను ధరించువాఁడు-శివుఁడు.

**కపాలమాలి.** సం. వి. న్. పుం-కపాలమాల కలవాఁడు-శివుఁడు.

**కపాలము.** సం. వి. అ. పుం. న. ౧-శిరస్సునుకాపాడునది-తలపుఱ్ఱె. ౨-నీటిని నిలుపునది-కుండలోనగువాని పెంకు. ౩. యజ్ఞీయపురోడాశము ను సంస్కరించుమృన్మయపాత్రవిశేషము. ౪. యతిభిక్షుకాదులభిక్షాపాత్రము, బిచ్చపుకప్పెర. ౫. ఇరుతెగలవారు సమానలాభనష్టముల తోఁ జేసికొన్న సంధి.

శ్లో. కపాల ఉపహారశ్చ సంతాన స్సంగత స్తథా, కపాలసంధి ర్విజ్ఞేయః కేవలం సమసంధితః. హితో. సంధి. ౧౦౭.

౬. గుంపు. న. ౧. గ్రుడ్డులోనగువానిగుల్లచిప్ప. ౨. కుష్ఠరోగభేదము.

**కపాలి.** సం. విశే. (న్. నీ. న్.) కపాలము గలిగి యున్నవాఁడు. వి. న్. పుం. ౧. శివుఁడు. ౨. బ్రాహ్మణకన్యయందు తీవరునివలనఁ బుట్టినసంకరజాతివాఁడు.

**కపాలిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కుండలోనగువాని పెంకు. ౨. దంతరోగభేదము.

**కపాలిని.** సం. వి. ఈ. స్త్రీ. దుర్గ.

**కపాలు.** వి. మల్లవిద్యాసంబంధ ముగుపదునాల్గువిసరులలో నొకటి.

వ. ...ఝూటు ధాణు కపాలు... మొదలైనపదునాల్గువిసరులు...హంస. ౧. ౨౦౬.

**కపి.** సం. వి. ఇ. పుం. ౧. కోఁతి, వానరము. ౨. పంది, వరాహము. ౩. చిల్లమడ్డి, అందుగుజిగురుతోఁ జేసినధూపద్రవ్యము. ౪. సూర్యుఁడు. ౫. విష్ణువు. ౬. ఉసిరికకీ. ౭. కరంజభేదముకీ. ౮. ఎఱ్ఱచందనముకీ. ౯. పింగళవర్ణము. ౧౦ ఏనుఁగు. ఇ, ఈ. స్త్రీ. ౧. ఆఁడుకోఁతి. ౨. ఆఁడుపంది. ౩. ఆఁడుఏనుఁగు.

కపింజలము. సం. వి. అ. పుం. ౧. చాతకము, వానకోయిల. ౨. తెల్లతీతువు, శ్వేతతిత్తిరి. ౩. కముఁజు. (చూ. ఆం. భా. ౨. ౯౭౮.)

కపిక. సం. వి. ఆ. స్త్రీ. నీలసిందువారము, నల్లవావిలి౹.

కపికందుకము. సం. వి.అ. న.కపాలము,తలపుఱ్ఱె.

కపికచ్ఛుర. సం. వి. ఆ. స్త్రీ.శూకశింబి, దూలగొండి౹.

కపికచ్ఛువు. సం. వి. ఉ. స్త్రీ. దూలగొండి౹.

కపికచ్ఛుఫలోపమ. సం.వి.ఆ.స్త్రీ. జతుక,హింగువృక్షము, ఇంగువచెట్టు.

కపికేతనుఁడు. సం. వి.అ. పుం.అర్జునుఁడు. (ఇట్లే: కపిధ్వజుఁడు, మొ.)

కపికోలి. సం. వి. ఇ. పుం. ఒకజాతిరేఁగు, పెద్దరేఁగు౹.

కపిచూడ. సం. వి. ఆ. స్త్రీ. ఆమ్రాతకము, అంబాలపుచెట్టు.

కపిచూతము. సం. వి. అ. పుం=కపిచూడ.

కపిజము. సం. వి. అ. పుం. చిల్లమడ్డి, అందుగుజిగురుతోఁ జేసినధూపద్రవ్యము.

కపితైలము. సం. వి. అ. న=కపిజము.

కపిత్థత్వక్కు-(చము). సం. వి. చ్. పుం. ఏలవాలుకము, నూఁగుదోస౹.

కపిత్థపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. చిత్రపత్త్రిక౹.

కపిత్థము. సం. వి. అ. పుం. ౧-కోఁతులుండునది-వెలఁగ౹. ౨. అభినయ హస్తవిశేషము. (నడిమివ్రేలు మొదలగు మూఁటిని ముడిఁచి బొటనవ్రేలిని చూపుడువ్రేలిని కొనలుకూర్చి పట్టునది.) ౩. వెలఁగపండు.

కపిత్థాస్యము. సం. వి. అ. పుం. గోలాంగూలము, కొండముచ్చు.

కపినామము. సం. వి. న్. పుం=కపిజము.

కపిపిప్పలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రక్తాపామార్గము,ఎఱ్ఱఉత్తరేను౹. ౨. సూర్యావర్తము, ప్రొద్దుతిరుగుడు౹.

కపిప్రభ. సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి౹.

కపిప్రియము. సం. వి. అ. పుం. ౧.ఆమ్రాతకము, అంబాళము౹. ౨. వెలఁగ౹.

కపిరథుఁడు. సం. వి. అ. పుం. ౧-కపి(హనుమంతుఁడు)వాహనముగాఁ గలవాఁడు-రాముఁడు. ౨-రథమున కపి గలవాఁడు-అర్జునుఁడు.

కపిల. సం. వి. ఆ. స్త్రీ. ౧. కపిలగోవు, పుల్లావు. ౨. ఆగ్నేయదిశయందలి యాఁడేనుఁగు. (ఇదిపుండరీకమునకు భార్య.) ౩.రేణుక యనుగంధద్రవ్యము. ౪. ఇరుగుడు౹. ౫. కలబంద౹. ౬.ఒకజాతి జలజంతువు. ౭. విద్యుత్తు, మెఱపు. ౮.ఒకజాతి ఇత్తడి.

కపిలధార. సం. వి. ఆ. స్త్రీ. ౧. గంగానది. ౨.ఒక పుణ్యక్షేత్రము.

కపిలఫల. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిద్రాక్ష౹.

కపిలము. సం. విశే. (అ. ఆ. అ.)౧. పింగళవర్ణము గలది. ౨. కపిలవర్ణపువెంట్రుకలు గలది. (మను. ౩. ౮.) వి. అ. పుం. ౧. కుక్క. ౨. చిల్లమడ్డి, సిహ్లకము. ౩. పింగళవర్ణము. (నీలపీతమిశ్రితవర్ణమని కొందఱు. గోరోచనావర్ణమని కొందఱు.) ౪. పింగళవర్ణము గలవృషభము, పుల్లయెద్దు.

కపిలాక్షి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పచ్చపువ్వులయిరుగుడు, శింశుప౹. ౨. మృగోర్వారువు, బుడమ౹.

కపిలాశ్వుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

కపిలుఁడు. సం. వి. అ. పుం. ౧. అగ్న్యవతారభూతుఁడును నిరీశ్వరసాంఖ్యప్రవర్తకుఁడును అగు ఒకముని. ౨. సేశ్వరసాంఖ్యప్రవర్తకుఁడును

విష్ణ్వవతారమూర్తియును కర్దమప్రజాపతికి దేవహూతియందుఁ బుట్టినవాఁడును అగుఒక ప్రసిద్ధముని,కపిలాచార్యుఁడు.౩.సూర్యుఁడు.౪.అగ్ని.

**కపిలె.** వి. (త. కపిలై.) ౧. ఎడ్లను కట్టి నీ రెత్తెడు యంత్రవిశేషము,మోట. (శ.ర,వా.)౨.తూనికటాయి.

(అగస్త్యవర్ణనము.) సీ. సరిగా జగత్ప్రపంచము
తోడ నొకవంకఁ దూనికవచ్చినదొడ్డకపిలె.
వరాహ. ౭. ౭౯.

**కపిలోమ.** సం. వి. న్, ఆ. స్త్రీ. రేణుక అను గంధద్రవ్యము.

**కపిలోమఫల.** సం. వి. ఆ. స్త్రీ. శూకశింబి, దూలగొండి†.

**కపిలోహము.** సం.వి.అ.న.ఆరకూటము, ఇత్తడి.

**కపివక్త్రుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) కోఁతిముఖమువాఁడు. వి.అ. పుం-శాపముచేత కోఁతిముఖము వచ్చినవాఁడు-నారదుఁడు.

**కపివదాన్యము.** సం. వి. అ. పుం. ఆమ్రాతకము, అంబాళము†.

**కపివల్లి.** సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి†.

**కపిశ.** సం. వి. ఆ. స్త్రీ. ౧.మాధవి,బండిగురువెంద†. ౨. ఉత్కలదేశమునకు దగ్గఱ నున్నయొకనది.౩. చిన్నయెఱ్ఱచీమ.౪.పిశాచమాత,ఒకానొక దేవత.

**కపిశము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. నలుపుపసుపు కలిసినవన్నె గలది. ౨. ఎఱుపు నలుపు కలిసిన వన్నె గలది-వి. అ. పుం. ౧. ఎఱుపును నలుపును కలిసినరంగు. ౨. నలుపును పసుపును కలిసినరంగు. ౩. చిల్లమడ్డి, సిహ్లకము-న. ద్రాక్షామద్యము.

**కపిశితము.** సం. విశ. (అ. ఆ. అ.) కపిశవర్ణము గలదిగాఁ జేయఁబడినది.

**కపిశీక.** సం. వి. ఆ. స్త్రీ. మద్యము. (త్రి. ని.)

**కపిశీర్షకము.** సం. వి. అ. న. హింగుళము, ఇంగిలీకము.

**కపిశీర్షము.** సం. వి. అ. న. ౧. కోఁతితల. ౨. దుర్గప్రాకారశిఖరము, కోటకొమ్మ. ౩. గోడపైకప్పు, మదురు.

**కపీజ్యము.** సం. వి. అ. పుం. క్షీరిక, పాలచెట్టు.

**కపీతనము.** సం. వి. అ. పుం. ౧. అంబాళము†. ౨. కలుజువ్వి†. ౩. దిరిసెనము†. ౪. రావి†. ౫. పోఁక†. ౬. బిల్వము†.

**కపీష్టము.** సం. వి. అ. పుం. ౧. రాజాదనము, పాలచెట్టు. ౨. వెలఁగ, కపిత్థము†.

**కపుఁడు.** సం. విశ.(అ. ఆ. అ.)నీరు త్రాగువాఁడు. వి. అ. పుం-నీటినిపాలించువాఁడు-అప్పతి, వరుణుఁడు.

**కపురపుటనఁటి.** వి. (√కపురము.) సప్తపర్ణము, ఏడాకులనఁటి†.

**కపురము**=కప్పురము. (చూ.)

గీ. సుదతి యొక్కతె కపురంపుసురఁటి విసరె.
పారి. ౨. ౧౨.

సీ. కపురంపుబరణి నిల్కడఁ గన్నఁ గ్రొమ్మించు ప
గడపుఁదీవ మేల్పసిఁడిబొమ్మ. నీలా. ౨.౨౭.
ఆం. భా. ౨. ౧౬౨.

కపురపుబాగలు=కపురబాగాలు.

గీ. మల్లెపూఁదండ లింపు శోభిల్లఁ బూని,పండుటాకులు కపురంపుబాగ లూని. రాజ. చ.
౧. ౧౩౪.

కపురబాగాలు=కర్పూరముతోడివక్కపలుకులు

గీ. కేలుదమ్మికిఁ గపురబాగాలుఁ బండు,టాకుమడుపులు నొసఁగి...శుక. ౧. ౩౨.

కపురవీడెము=కర్పూరముతోడితాంబూలము.

సీ. కపురవీడెము వెల్తి గానియానోరికిఁ గొఱమాలినట్టియాగొంటువక్క..గీ...అంచు,వృద్ధవేశ్యల వగపింతురు...ధూర్తవిటులు ... వైజ.
౩. ౭౨.

**కపురసిల.** వి. (కపురము+సిల)ఒకమందుదినుసు.

సీ. సౌభాగ్యము ను నవాసారంబు పెట్లుప్పు కల్లు
ప్పు పటికయుఁ గపురసిలయు. చికి. ౨.
(చి.ని.)

**కపురు.** వి. సొగసు, శోభ.

సీ. కాసెకట్టిది యేల కపురుగా మైజాఱుచీరఁ
దాల్చు మటంచుఁ జిమ్మి రేఁగు. శుక. ౨.
౪౫౬.

ద్వి. కపురంపుఘాసులఁ గమ్మపన్నీటఁ, గపురు
మించినయరగనువిచ్చువిరుల. ద్వి. పరమ.
౫. ౩౭౫ పొ.

ద్వి. కనలి చూఱలువట్టి కలగుండుపఱుప,నపుడు
వకావకలై పాళె మెల్లఁ,గపురు మాయును
హల్లకల్లోల మైన. అ. మ. క. ౩. ౧౭౨ పొ.
౩ పం.

**కపోతకము.** సం. వి. అ. పుం. ౧.చిన్నపావురము. ౨. అభినయహస్తవిశేషము, కపోతము. ౩.సౌవీరాంజనము.

**కపోతచరణ.** సం. వి. ఆ. స్త్రీ. నలియను గంధద్రవ్యము నిచ్చు ఒక మొక్క, గువ్వగుత్తి.

**కపోతపాలి.** సం. వి. ఈ. స్త్రీ.=కపోతపాలిక.

**కపోతపాలిక.** సం. వి. ఆ. స్త్రీ. కొణిగయంపలి పావురపుగూఁడు, విటంకము.

**కపోతబాణ.** సం. వి. ఆ. స్త్రీ. నలి యనుగంధద్రవ్యము.

**కపోతము.** సం. వి. అ. పుం. ౧. గువ్వ. ౨. పావురము. ౩. పక్షి. ౪. అభినయహస్తవిశేషము. (చాఁపఁబడినవ్రేళ్లుగల రెండుచేతులను ప్రక్కలు కూర్చి బోలుగాఁ బట్టినది) ౫. పావురాయివన్నె, బూడిదవన్నె, ఘూసరవర్ణము.

**కపోతవంక.** సం. వి. ఆ. స్త్రీ. బ్రాహ్మీ.

**కపోతవర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. చిన్నయేలకి.

**కపోతవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. కపోతమువలె ముందుకాలమునకుఁ గూడఁబెట్టుకొనక తత్కాలమునకుఁ గావలసినది గడించి జీవించుట, మీఁదికిఁ గూడఁబెట్టుకొనని మనుగడ, సంచయరహితజీవిక.

**కపోతవేగ.** సం. వి. ఆ. స్త్రీ. బ్రాహ్మీ.

**కపోతసారము.** సం. వి. అ. న. నీలాంజనము, సౌవీరాంజనము.

**కపోతాంఘ్రి.** సం. వి. ఇ. స్త్రీ. గువ్వగుత్తి.

**కపోతాంజనము.** సం. వి. అ. న. నీలాంజనము, సౌవీరాంజనము.

**కపోతారి.** సం. వి. ఇ. పుం. డేగ.

**కపోతి.** సం.వి.ఈ.స్త్రీ.౧.ఆఁడుపావురము.౨.యూపభేదము.

**కపోదా.** వి. పెద్దవిల్లు, గొప్పవిల్లు. (చి. ని.)

సీ. ...బల్వాగువిల్లు దనరియుండును గపోదా య
నఁగ. ఆం. భా. ౨. ౨౧౨.

**కపోలము.** సం. వి. అ. పుం. గండము, చెక్కిలి.

**కప్ప.** వి. (క. కప్పె.) మండూకము, భేకము.

క. ... కప్పలు, గఱరపకట్కురరవరగట్టి
యఱచెన్. హర. ౨. ౧౭.

కప్పయొలుఁగుఁబాము=కప్పయఱపు అఱచెడిపాము;వంచకము.(ఇదిగోముఖవ్యాఘ్రమువంటిది.)

చ. నిను నవలీల దాఁటి ప్రజ నేలకుఁ గోలకుఁ
దెచ్చుచున్నయ,ర్జునుఁ దలయెత్తియైన నటు
సూడవు పాండవపక్షపాతి నీ,మన మటుగా
న నెప్పుడును మాదెసఁ గప్పయొలుంగుఁబా
మవై,యునికి యొఱుంగవచ్చె నటు లూఱట
గా వరమిచ్చినాఁడవో.భాస్క.ద్రో.౩.౧౦౭.

జ: కప్పకుఱుపు,కప్పచిప్ప,కప్పతాళము,కప్ప
నాగుసు, కప్పపాక్కు.

**కప్పకుఱుపు.** వి. (√కప్ప) ఔష్ణ్యముచే అఱ

కాలియందు లేచినబొబ్బ, కప్పపొక్కు.(శ.ర, వా.)

**కప్పచిప్ప.** వి. (కప్ప+చిప్ప-క. కప్పెచిప్ప.) నీటియందలిగుల్ల, శంబూక, ఆలిచిప్ప.

గీ. కప్పచిప్ప యనంగను గాకిచిప్ప, యనఁగ జలశుక్తి దగు...ఆం. భా. ౧. ౧౬౧.

**కప్పడము.** వి. (సం. కర్పటః. ప్రా. కప్పడ. క. కప్పడ. త. కప్పడం.) చినిఁగినబట్ట; బట్ట.

క. కడవసములుఁ గోలలుఁ గ,ప్పడములు వీసల ధనంబు పరికింపఁగ నె,క్కుడి దేశికు లని వగవక ... భార. ఆది. ౭. ౨౨౫.

సీ. కప్పఁగప్పడమును గస్తూరియును గాటుకయు నివేదింతుము గాళి నీకు. పారి. ౨. ౩౫.

గీ. సేల యనఁ బుట్ట మనఁగను జీర యనఁగఁ, గప్పడ మనంగఁ గోక నాఁ గట్టన మన,వస్త్రనామంబు చెలఁగును...ఆం. భా. ౨. ౧౫౧.

**కప్పతాళము.** వి. (కప్ప+తాళము.) ముద్దబీగము.

**కప్పనాగు(వు)రు.** వి. (కప్ప+నాగురు.) చిఱుకప్పకాటుచేత పసులకుఁ గలిగెడువిరేచనరోగము.

ద్వి. ... కప్పనాగురు. నవనాథ. ౧. ౮౦ పొ. ౨ పం.

ఆ. నరిడి పుప్పి కప్పనావురు కడుపూఁద, యదురుఁద్రిక్కు యనఁగ నడరి...హరి. పూ. ౬. ౮౫.

**కప్పపొక్కు**=కప్పకుఱుపు. (వా.)

**కప్పము.** వి. కరము, పన్ను; కానుక.

సీ. ... పరమండలంబులధరణిపతుల, నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును... భార. ఆది. ౧. ౭.

సీ. ఏఁటేఁటఁ గప్పంబు లిచ్చి వర్ధిల్లికి సౌవీరసౌరాష్ట్రిసగరనృపులు. విక్ర. ౮. ౬౦.

మ. గజతాఘోటకహాటకప్రముఖముల్ గప్పంబు లొప్పించుచుఁ, విజితారాతులు మ్రొక్కు... హరి. పూ. ౧. ౧౬.

**కప్పరపడు.** అ. క్రి. (కప్పరము+పడు.)తొందరపడు.

క. అప్పుడు చతురంగంబుల,కుప్పలు కులగోత్రగరమఁ గొంచెపఱుపఁగా, నుప్పొంగి మానసంబులఁ, గప్పరపడి భూతములు జిఘుత్సాపేక్షన్. జై. భా. ౫. ౧౯౩.

ఆ. కాశి పోయెద నని కప్పరపడ నేల. వేమన. ౧. ౫౧. (బ్రౌ. పా.)

**కప్పరపాటు.** వి. (√కప్పరపడు.) సంభ్రమము, తొట్రుపాటు.

ఉ. కప్పరపాటుతో నతనిఁ గన్గొని కన్గొనలందు జాలుగాఁ, జిప్పిలుహర్షబాష్పములచేఁ బదమార్జన మాచరింపుచున్. రంగా.౧.౭౦. భాగ. ౬. ౩౩౨, ౧౦. పూ. ౨౮.

**కప్పరము.** వి. సంభ్రమము, తొట్రుపాటు.

జ: కప్పరపడు, కప్పరపాటు.

**కప్పలి.** వి. (ప్రా. కప్పర. త. కప్పల్.) నౌక; నౌకాభేదము.

క. చెప్పెడి జేమిఁక నొకచో, దెప్పర మగును మ్రుడీను దిగనైచిన వే,నెప్పుకొని కదలకుండెడు,కప్పలితీరునను దేరు గదలక నిలిచెన్. శుక. ౨. ౧౧.

సీ. విరహాంబురాశి దాఁటి రథాంగములు బోరగిలనిడ్డపసిఁడికప్పలి యనంగ. గీ. నేత్రపర్వమయ్యె నిర్జరాధీశది,క్కుండలంబు భానుమండలంబు. పరమ. ౩. ౨౯౦.

మ...కుంకుమరజఃకస్తూరికాద్రవ్యముల్, శరధిం గప్పలిజోగుల న్వీరిపిగాసామాన్లఁ దెప్పించుచేఁ,ర్పరి యావైశ్యకులోత్తముం డవచితిప్పండల్పుఁడే యిమ్మహిన్. హర. పీఠి. ౨౭.

**కప్పారు.** అ. క్రి. (కప్పు[2]+ఆరు.) నల్లనగు.

ఉ. తోరము లయ్యెఁ జన్నుఁగవతోన తొడల్ ...కుచాగ్రతలంబులతోన యూరుగ,ప్పారె ... కు. సం. ౩. ౨౬౭.

సీ. తీఁగలు కప్పార మూఁగి యాలతి సేయుభృంగమాలికలకు బెదరిబెదరి. దళకు. ౯. ౩౮.

సీ. కప్పారురేణువు గమలాప్తబింబంబు రాహుమండలమునరమణఁ గప్పఁ, దెల్లనిరజముశోభిల్లు సంగ్రామరంగమునకుఁ దగుమేలుకట్టునట్లు. భార. భీష్మ. ౧. ౨౪౨.

**కప్పిడు**=కప్పు¹. స. క్రి. (కప్పు¹+ఇడు.) (దాఁచు.)

క. తప్పేమి లేనిమాన్యుని, నొప్పించెద వెంచు నీవినోదము గలదే,కప్పిడఁగ నేల యొప్పమి, నిప్పుడ యెఱిఁగింపు కలిగెనేని మహాత్మా. శేష. ౪. ౩౮.

**కప్పిపుచ్చు.** స. క్రి. (కప్పి+పుచ్చు.) మఱుఁగుపఱుచు, దాఁచు.

సీ. జాగరోద్భూతదృగ్రాగంబు మాణిక్యకర్ణకుండలదీప్తిఁ గప్పిపుచ్చు. నైష. ౧. ౭౪.

గీ.కల్లతనములు పలుమాఱుఁ గప్పిపుచ్చు,నట్టినామీఁదఁ జంపంగ నలుగకున్నె.కాశీ.౭.౯౦.

వ. అప్పాటం బ్రతిభవనంబునఁ బాటిల్లుచీకటితప్పు కప్పిపుచ్చువెరవుపడకుండునట్లుగాఁ బ్రకాశించినక... హర. ౫. ౫౬.

**కప్పిరి.** వి. (కప్పు².) ౧. నలుపు.

(గర్భిణీవర్ణనము) గీ. గుబ్బచంబులు పైఁ బచ్చనెరలు వాఱి, తుదలఁ గప్పిరి వొలుపారఁ గదిసి బలిసె. కు. సం. ౧౦. ౪౦౩.

౨. కొంచెపాటిచీకటి. (శ. ర.)

**కప్పు¹.** స. క్రి. (త. కప్పు.) ౧. ఆచ్ఛాదించు; మఱుఁగుపఱుచు, గోపనము చేయు.

సీ. కరతలయుగళి వక్త్రములు గప్పుక విన్నపంబులకొఱకు దిక్పతులు సేర. కాళ. ౨. ౪.

వ. అని కప్పి పల్కఁబోయి బయల్పడఁ బలికి వెలవెలఁ బాఱుచు... కు. సం. ౫. ౬౦౫.

సీ. ఏచినతలపోఁత దాఁచెద మంటిమా నిట్టూర్పుగాడ్పులు రట్టుసేయుఁ,గడలేనిప్రేమంబు గప్పెద మంటిమా పులకాంకురంబులు పులుగు చెప్పు. వరాహ. ౪. ౧౮.

ఉ. చెప్పుము నిర్వికార సరసీరుహగర్భకుమార యేమియుం,గప్పక నాకు నీకృతయుగంబున నీకనుఁగొన్న చిత్రముల్. వరాహ. ౧.౯౦.

౨. ఆచ్ఛాదకముగాఁ జేయు.

సీ. పులికళాసంబు గప్పుదురు పాఱఁగ మీఁద విద్యాధరాంగనావిటగణంబు. హంస. ౫. ౧౦.

౩. చుట్టుకొను, పరివేష్టించు.

క. అప్పుడు దెలిసియు మదిలో, ముప్పిరిగొనుపుత్రమోహమున సకియలు తక, గప్పుకొని వెంట రాఁగా, నప్పావనచరిత మహితలాధిపుకడకుక. సారంగ. ౩. ౪౩.

౪. బంధించు, మూయు.

క. పలుకఁ డసత్యము దూఱం, బలుకఁడు చెట్టిదముగాఁగఁ బలుకఁడు వాదం,బులకుఁ జొరఁడు వాణి యనం, గలవాకిలి యట్టిబుధుఁడు గప్పం జాలుక. భార. శాం. ౫. ౩౨౨.

క.కప్పె నన మూసె ననుచుం,జెప్పంబడుఁగవుల చేత...ఆం. భా. ౩. ౧౩౧.

అ. క్రి. పర్వు, వ్యాపించు; క్రమ్ము.

ఉ. ఆవనజాస్యహస్తతలజారుణదీప్తులఁ గూడివచ్చుపుష్పావళిమీఁద నీపుతనుజామలశోచులు గప్పి యొప్పె సం,ధ్యావిరళోద్గతప్రకటితారుణదీప్తులలోనఁ బొల్చుతా,రావళిమీఁదఁ బర్వునమృతాంశుకరప్రకరాభిరామమై. కు. సం. ౫. ౫౦౫.

మహాస్రగ్ధర. అమరేంద్రారాతు లిట్లాహవముఖమున నేయంగఁ దత్తీక్ష్ణబాణౌఘము ఘోరంబై సురానీకముపయిఁ బెలుచం గప్పినం జూచి ... భార. ఆది. ౨. ౨౨.

వి. ౧. ఆచ్ఛాదనము.

సీ. తోలఁగుపయ్యెదకప్పుదూసియాడెడుచొప్పు జెడవీడు నెఱిగొప్పువిరులయొప్పు. దశా. ౮. ౩౩.

౨. ఇంటిపైకప్పు.

సీ. కఱవు గేస్తులయిండ్లకప్పు నేఁతలయండ సుడి వడి కలఁగుటల్లఁడుఁగులంప.అచ్చ. రా. బాల. ౪౨.

౩. మఱుఁగు, అడ్డపాటు. ఆం. భా. ౧. ౨౬.

కప్పదేఱినవడపప్పు=పొట్టుతీసినవడపప్పు.

సీ. గోస్తనీమృదుగుళుచ్ఛస్తోమములతోడఁ గప్ప దేఱినవడపప్పుతోడ. ఆము. ౨. ౨౩.

జ: కప్పిడు, కప్పిపుచ్చు, కప్పుకొను, కప్పడు, కప్పదెంచు, కప్పబల్ల.

కప్పు². వి. (క. కప్పు. త. కఱుప్పు.) ౧. నలుపు.

సీ.... కప్పు కం దనఁగను నొప్పుఁ గృష్ణ, వర్ణంబు ... ఆం. భా. ౧. ౧౦౮.

౨. చీకటి.

చ. తనపయి రాజు రా వెసఁ బరింగుఁడు కాలవ శార్తి నేఁగుచోఁ, మునుకొని కప్పుమూఁక ము ను ముట్ట... హ. న. ౪. ౫.

౩. దంతక్షతము.

చ. అరయ రజోగుణావరణ యయ్యెఁ బ్రియుం బగ లెల్లఁ గూడి శ, క్త్యరజసమృద్ధి మీఱ నది దా నతిరాగిణి యంచుఁ గల్వ లో, నర యఁగ యోజితాధరదళాంచలయై ముఖము ద్రఁ గాంచి తా, మరకొమరాలు మాటె నళి మండలిపేరిటికప్పులన్ని యుఁ. హ. న. ౪. ౮.

విణ. నీలము, నల్లనిది.

గీ. ఉప్పరము పేర నొప్పెడుకప్పుటనఁటి, నుప్ప తిలి చుట్టురాలినకప్పురంపుఁ, గుప్పలోయన మందారకోరకాభఁ, దారకావళు లంబరస్థ లిని నెరసె. ఉ. రా. ౪. ౧౫౫.

వ. ... నీలకంఠంబులపింఛంబులయొప్పు తప్పక చూచి విప్పుగలకప్పు మొగు లనుదిగులున... ఉ. రా. ౬. ౨౪.

జ: కప్పారు, కప్పిరి, కప్పుఁగుత్తుకపుల్గు, కప్పుఁగుత్తుకవాఁడు, కప్పుఁదెరువుజాణ, కప్పుఁద్రోవరి, కప్పుఁజైదువ, కప్పుమల, కప్పుమేనిగాను, కప్పురా, కప్పెక్కు.

కప్పుఁగుత్తుకపుల్గు(లుగు). వి. (కప్పు² + కుత్తుక + పుల్గు) నీలకంఠము, నెమిలి.

సీ. కప్పుఁగుత్తుకపుల్గుగముల పెల్లు దొలంగెఁ దెలి మొగుల్ సడల నేడ్తెఱఁ జెలంగె. అచ్చ. రా. కిష్కిం. ౬౯.

ఇశ్లే:-కప్పుమెడపుల్గు-అచ్చ. రా. బాల. ౧౧౯.

కప్పుఁగుత్తుకవాఁడు. వి. (√కప్పు²) శితికంఠుఁడు, శివుఁడు.

సీ. కప్పుఁగుత్తుకవాఁడు గాలిమేఁతరియండజో టివాఁ డరమెయిజోటివాఁడు. అచ్చ. రా. బాల. ౧౩.

కప్పుఁదెరువుజాణ. వి. (కప్పు² + తెరువు + జాణ) కృష్ణవర్త్మ, అగ్ని.

గీ. నిప్పుకలు నెట్టి గవులింపఁ గప్పుఁదెరువు, జాణ మంటలు వెదచల్లఁ జాగె మిగుల. అచ్చ. రా. సుం. ౧౬౬. ఆం. సం. దేవ. ౧౮.

ఇశ్లే:-కప్పుఁద్రోవదొర.

ఉ... వేఁడివేల్పు నా, నొప్పెడుకప్పుఁద్రోవదొర యుఁ వలి స్రుక్కి హసంతికాచ్ఛలం, బుప్ప తిలం గురాశముల నొందెడుపాన్పులక్రింద వర్తిలుఁ. సమీర. ౨. ౧౦౫.

కప్పుఁద్రోవరి. వి. (√కప్పు²) కృష్ణవర్త్మ, అగ్ని. సాం. ని. దేవ. ౧౨.

ఇశ్లే:- కప్పుఁదెరువరి (శ. ర.)

కప్పుకొను. అ. క్రి. స. క్రి. (√కప్పు¹) క్రమ్ము.

గీ. కన్నుఁగవలందుఁ దిమిరంబు గప్పికొనిన. దశా. ౨. ౬౦.

సీ. పటుదీర్ఘతరజటాపటలంబు ముడివీడి కన్నుల
కడ్డమై కప్పికొనఁగ. దశా. ౧. ౧౬౭.

క. అప్పుడు వారలయొడలం,దొప్పెడుకస్తూరి
గంధ ముగ్వీసురులం, గప్పుకొనంగ నొగి
న్వా,రప్పద్మదళాక్షుఁ జూచి యని రీరీతిన్.
వేం. మా. ౧. ౧౮౦.

క. అప్పయుఁ బరిజనములుఁ దనుఁ,దప్పక కనుఁ
గొనుచునుండఁ దగవేది కరం,బొప్పనితమ
కము చిత్తముఁ, గప్పికొనుట నుత్తలంబుగ
దురఁగ నచ్చోన్. భార. విరా. ౨. ౩౬.

స. క్రి. ఆచ్ఛాదించు; మఱుఁగుపఱచు.

క. అందఱఁ గృపార్ద్రవీక్షా,మందరుచిం గప్పు
కొని యమానుషమహిమన్, జెంది ముద మం
ది రాజపు,రందరుఁ డతఁ డూరుసేరె రాజీవ
ముఖీ. శుక. ౧. ౨౫౨.

సీ. కప్పుకో నేల బంగారమా పువుబంతు లవి
సువర్ణలతోదయములు సుమ్ము. కవిరా. ౧. ౭౧.

గీ. గరిమ నదు లెన్ని గలిసినఁ గప్పుకొనుచు, జల
ధి గనుపట్టురీతి సంచారిభావ, సంచయము
లెన్ని గలిసిన మించనీక, తాన కనుపట్టుభా
వంబు స్థాయి దలఁప. నరస. ౩. ౫.

**కప్పుటైదువ.** వి. (కప్పు$^{2}$ + ఐదువ.) కాళి, పార్వతి.

సీ. గెలుపుపేరువజీరుఁ గినిసినకప్పుటైదువరాచ
పెంచు మాదొడ్డివేల్పు. ప్రబంధ. ౧౬౦. (క
ప్పుటైదువరాచపెంచు=శివుఁడు.)

**కప్పుడు.** వి. (√కప్పు$^{1}$.) ఆచ్ఛాదనము. (శ.ర.)

**కప్పుదెంచు.** అ. క్రి. (√చెప్పు$^{1}$ - స్వార్థమున 'తెంచు') క్రమ్ము.

ఉ. ఉఱుముచు నెల్లెడం బిడుగు లుగ్రగతిం బడ
ఘోరమూర్తియై, యఱిముఱిఁ గప్పుదెంచువి
లయాభ్రముచాడ్పున... భార. ద్రో. ౧. ౭౯.

**కప్పుబల్ల.** వి. (√కప్పు1) ద్వారముమీఁద గొడుగు
బల్లతన్ను బల్లలకునడుమనుండెడుపలక. (శ.ర.)

**కప్పుమల.** వి. (√కప్పు$^{2}$.) కాటుకకొండ, అంజ
నాద్రి. (శ. ర.)

**కప్పుమేనిగాము.** వి. (√కప్పు$^{2}$.) శనిగ్రహము.
(శ. ర.)

**కప్పురగంది.** వి. (√కప్పురము.) కర్పూరమువలె
పరిమళించు శరీరముగలస్త్రీ; స్త్రీ.

ఉ... వేలుపుం, గప్పురగందు లెక్కుఁ రి ధగద్ధగితో
న్నతహర్మ్యరేఖలన్. పారి. ౩. ౧౧.

క. అప్పుడు చా శిశిరవిధిన్, నిప్పులఁ బొరలించి
నట్లు నెమ్మదిఁ బొగులన్, ముప్పిరిగొను వేసట
నా, కప్పురగందులను గినుకఁ గనుఁగొని పలి
కెన్. చంద్రా. ౮. ౧౬౬.

('కప్పురగంధులు' అనికొన్నిచోట్లఁ గనఁబడు
చున్నది. అపుడు అది ని. వి. గా గ్రహింపఁ
దగు నని తోఁచుచున్నది.)

**కప్పురపుటనఁటి.** వి. (√కప్పురము) కర్పూరక
దళి.

వ. ...ఉప్పరంబు నంటుకప్పురంపుటనంటి గు
ప్పు మనన్ గప్పుతావులకుఁ దావలం బగు
తావుల... ఉ. రా. ౬. ౨౮.

ఇశ్లే:-కప్రపుటనఁటి, కప్రపనఁటి.

మ. బలుకప్రంపుటనంటికప్పురపుఁ దిప్ప ల్గప్పి
యుప్పొంగుజా, ల్గలగొజ్జంగలనీరు సజ్జకపుఁ
గేళాకూళికిన్ డిగ్గి... వసు. ౧. ౧౩౯.

క. కప్పుంగొప్పులఁ జన్నుం, గప్పుల మొగముల
నొడళ్లఁ గప్పిన మెఱుఁగుం, బుప్పొడి విదిరిచి
కొని మఱి, యప్పడఁతుక లరిగి కప్రపనఁటు
లచెంతన్. యయా. ౮. ౨౭.

**కప్పురపుబెండ.** వి. (√కప్పురము.) ఒకజాతి
బెండ, గంధమూలము. (శ.ర.)

**కప్పురపువంగ.** వి. (√కప్పురము). ఒకజాతి
వంగ, కూటవార్తాకి. (శ.ర.)

**కప్పురబోగి.** వి. (కప్పురము + బోగి) సస్యవిశేషము.

ద్వి. పాలుపు గైకొనక కప్పురబోగి వేఁగె. విష్ణు. పూ. 3 ఆ. (శ. ర.)

(బ) ధాన్యవిశేషము. (వృత్తియం దేకవచనాంతము.)

ఉ. కప్పురబోగివంటకముఁ గమ్మనితాలుపు సాజ్జెపిండితో, నొప్పులుగా భుజించిరి... భీమ. ౨. ౧౩౯.

**కప్పురమద్ది.** వి. (కప్పురము + మద్ది). ఒకజాతి మద్దిచెట్టు.

వ. ఇప్ప కప్పురమద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి... మొదలుగాఁ జెప్పఁ దెలుంగుల ప్రాఁకులు... పి. శకుం. ౨. ౧౪.

**కప్పురము**=కపురము, కప్రము, గంబుర, గంబురము, గంబురా, గంబూర, గంబూరము. వి. (సం. కర్పూరః. ప్రా. కప్పూరో. క. కప్పుర.) కర్పూరము. (వృత్తియందు పల్లుపరమగుచో వికల్పముగా 'ము' వర్ణలోపము.)

గీ. కప్పురంబు జవాదియుఁ గలిపి యిడ్డ, కలపమలఁదఁగ వెన్నఁడు గలుగునొక్కొ. నీలా. ౧. ౧౦౫. ఆను. ౬. ౬౨.

సీ... కపురము కప్రము కప్పురమ్ము, సిరము గంబూర గంబుర గంబురా గంబురమ్ము గంబూరమ్మన మ్మను ఘనసారము... ఆం. భా. ౨. ౧౬౨.

కప్పురగందము = కర్పూరముతోఁ గలిపినచందనము.

సీ. మంచిపున్నమచందమామవెన్నెలచంద మొందు కప్పురగంద మొలపునెలప. ఉ. రా. ౭. ౨౫౪.

కప్పురవీడియ(డె)ము=కర్పూరముతోడి తాంబూలము.

చ. కలికివరాటరాజడప గప్పురవీడెము వెట్టె నవ్వుచు, న్నలునడపంబువానికి ఫణాధరవల్లి దళాంతరంబునన్, బలితపుఁ దేలు మైనమునఁ బన్ని... నైష. ౬. ౧౮౧.

ఉ.... తేనెమోవి పైఁ, గప్పురవీడియంబుజిగి కస్తురిబొట్టును... దశా. ౯. ౨౨౦.

కప్పురబాగలు=కర్పూరముతోడి వక్కపలుకులు.

ఉ... భోజనం బిడుచు, గట్టెదుతెల్లనాకులును గప్పురబాగలు నిచ్చు నిచ్చలున్. శశాం. ౨. ౮౦.

కప్పురపుబాగములు = కప్పురబాగలు. శశాం. 3. ౧౦౫.

జ: కపురపుటనఁటి, కపురము, కపురసిల, కప్పురగంది, కప్పురపుటనఁటి, కప్పురపుబెండ, కప్పురపువంగ, కప్పురబోగి, కప్పురమద్ది, కప్రము.

**కప్పురా(రాయి).** వి. (√కప్పు[2].) నీలమణి, ఇంద్రనీలము.

సీ. నిండుచందురునిగ్గు వెండి మేలందెలు కప్పురా సంతనయొప్పుటోరిజ. ప్రబంధ. ౫౩.

సీ. కప్పురా లనఁగను గనుపట్టు నీలముల్... ఆం. భా. ౨. ౨౭౮.

**కప్పెక్కు.** అ. క్రి. (కప్పు[2] + ఎక్కు) నలుపెక్కు.

క. కొప్పును గోమావళియుం, గప్పెక్కును మోవిఁ బాదకమలంబులఁ గెం, పుప్పతిలెఁ బిఱుఁదుఁ గుచములు, నప్పుడఁటికి మిగులఁ బొదలె యౌవన మైనన్. వరాహ. ౯. ౧౦౦.

**కప్పెట.** వి. పక్షివిశేషము.

సీ. వంగపండును గోరువంక కప్పెట పొట్టిపిట్ట పావురము... సుద. 3. ౧౯౪.

**కప్పెర.** వి. (సం. కర్పరః. ప్రా. కప్పరో. త. కప్పరై.)

౧. కపాలము, పుఱ్ఱె.

గీ. తనరును గరోటి కప్పెర పునుక పుఱ్ఱె, పుచ్చె యన... ఆం. భా. ౨. ౧౩౩.

చ. కఱచినపేనుఁగు న్వైడఁదకప్పెరయు న్మోలఁ బచ్చితోళులున్... ఉ. హరి. ౨. ౧౭౬.

౨. భిక్షాపాత్రము.

గీ. బిసరుహాసనుపుటియకప్పెర ధరించి. హర. ౫. ౫౫.

చ. కరమునఁ బట్టి భిక్షుఁ గొనుకప్పెర గొప్పది గాదు మానెఁడొ,టరుదు... చెన్న. ౫. ౭౭౯.

సీ. కరమూలముల ద్రేలుకప్పెరల్ జోలెలు భద్రరుద్రాక్షనైపథ్యకములు. కాళ. ౪. ౫౪.

౩. కుంపటి.

క. మొగమున మసిబొట్టులు కర,యుగమునఁ గప్పెరయుఁ గత్తియుఁ బ్రేలునెఱుల్, దిగ ద్రిమ్మఁగొద ననుపలుకులుఁ,దగఁజేరఁగవలయుఁ గోళిధామంబునకుఁ. శుక. ౨. ౧౭౭.

గీ. అనుచుఁ దద్భూ్యనుకుం డెంచునంతలోన, సురియ నిప్పులురాలుకప్పెరయు మొగము, మీఁద మసిబొట్లు మించ నమ్మెలఁత రాఁగ. శుక. ౨. ౧౯౨.

**కప్యాఖ్యము.** సం. వి. అ. పుం. చిల్లమడ్డి,అందుగు బంకతోఁజేసిన ధూపద్రవ్యవిశేషము.

**కప్రము**=కప్పురము. (చూ.)

చ... కప్రపుఁ,వలపులు మీఱ... ఆము. ౧. ౭౧. నీలా. ౧. ౫౭. ఆం. భా. ౨. ౧౬౨.

కప్రవీడియము=కర్పూరముతోఁగూడిన తాంలము.

గీ. అచ్చరలు నందనంబునఁ దెచ్చుకొనుసు,రాగ సుమములు హర్మ్యవాతాయనముల,చెంతఁ గాలూఁది తప్పుగ స్త్రీల కొసఁగి,వేఁడి కొని పోవుదురు కప్రవీడియములు. చారుదేష్ణచరిత్రము. (శ. ర.)

జః కప్రములక.

**కప్రములక.** వి. (కప్రము + ములక.) కప్పురపు వంగీ.(శ.ర.)

**కఫకూర్చిక.** సం. వి. ఆ. స్త్రీ. లాల, చొంగ.

**కఫణి.** సం. వి. ఇ. పుం. ఇ,ఈ. స్త్రీ. కూర్పరము, మోఁచేయి.

**కఫము.** సం. వి. అ. పుం. శ్లేష్మము, తెమడ.

**కఫవర్ధనము.** సం. విశ. (అ. ఈ. అ.) కఫమును పెంచునది. వి. అ. పుం. పిండీతకవృక్షము, మంగీ. న. కఫము పెరుఁగుట.

**కఫాంతకము.** సం. వి. అ.పుం. తుమ్మీ.

**కఫారి.** సం. వి.ఇ.పుం. ౧.సొంటి. ౨. మిరియాలు. (ఇట్లే కఫవిరోధి, మొ.)

**కఫి.** సం. విశ. (న్.నీ.న్.) కఫరోగముగలవాఁడు.

**కఫేలువు.** సం. వి. ఊ. పుం. శ్లేష్మాతకము,విరిగీ.

**కఫోణి.** సం=కఫణి.

**కబంధము.** సం. వి. అ. పుం. న-ప్రాణవాయువుచే బంధింపఁబడునది-తల తెగినను ప్రాణవాయువులు గలిగి ఆడెడు మొండెము,అట్టి. పుం-నీరుదేనియందుబంధింపఁబడునోఅది- ౧. ఉదరము, కడుపు. ౨. మబ్బు. ౩. సముద్రము. న-ప్రాణవాయువుల నిలఁబెట్టునది-జలము.

**కబంధుఁడు.** సం. వి. అ. పుం. ౧. వనవాససమయమున రామునిచే హతుఁడైనయొకానొకరాక్షసుఁడు. ౨. రాహువు.

**కబ(వ)రము.** సం. విశ.(అ.ఆ.అ.)౧. సంపృక్తము, మిశ్రము, కలిసినది. ౨. నానావర్ణములుగలది, వివిధమైనరంగులుకలది. వి. అ.పుం. న. ౧. ఉప్పు. ౨. ఆమ్లము, పులుసు.

**కబ(వ)రి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కేశవేశము, కొప్పు. ౨. వాయింట, ఖరపుష్పీ.

**కబరిక.** సం. వి. ఆ. స్త్రీ=కబరి.

**కబరీభరము.** సం. వి. అ. పుం. దట్టమగుకొప్పు.

**కబళనము.** సం. వి. అ. న. కబళించుట.

**కబళము.** సం. వి. అ. పుం. న. ౧. గ్రాసము, కడి, అన్నమున్నగువానిముద్ద. ౨. మత్స్యభేదము.

**కబళించు.** సం. స. క్రి. ౧. మ్రింగు.

సీ. కైరవాకరములగర్వంబు కబళించి కమలషండములకుఁ గాంతి యొసఁగి. మార్క. ౨. ౧౮౯. (ఇట 'పోఁగొట్టి' అనిభావము.)

౨. గ్రహించు, పట్టుకొను.

ఉ...తొండమున నవ్వలిచక్కఁగబళింపఁ బోయి ...మను చ. ౧. ౪.

సీ. అంగుళంబుల నల్ల నలకలు గబళించి కెమ్మోవి యాని యెక్కించుఁ గాయ్వు. భార. విరా. ౨. ౩౧౦. కాశీ. ౫. ౧౯౩.

**కబళితము.** సం.విణ. (అ. ఆ. అ.) ౧. మ్రింగఁబడినది. ౨. భుక్తము, తినఁబడినది. ౩. వ్యాప్తము, పర్వినది. ౪. గృహీతము, పట్టుకొనఁబడినది.

**కబళితవంతుఁడు.** సం. విణ. (త్. వతీ. త్.) కబళించినవాఁడు. (సౌందర్యలహరి. ౨౭.)

**కబాడము.** వి. ఎడ్లమీఁదవేసి తెచ్చెడుకసవులోనగువానిజంటమోపు. (శ. ర.)

**కబాయి(యీ)**=కబ్బాయి. వి. (హిం. కబా.క. కబాయి. త. కపాయ్.) అంగీ.

సీ. నవపుష్పవనము నానామణుల్ గ్రుచ్చినపచ్చపట్టుఁగబాయిబాగు నెఱప. కళా. ౫. ౧౬౯.

రగడ. చాదరలు పైఠిణులు చక్కనికబాయీలు,నడరుచిళ్లాని తేంట్లమరుబూర్నీసులును. హంస. ౫. ౩౫౬. (శ.ర.పా.)

**కబురు.** వి. (హిం. ఖబర్.) ౧.వృత్తాంతము. ౨.దంభము.

సీ. వృత్తాంతదంభము ల్వెలయును గబురన... ఆం. భా. ౩. ౫౩.

**కబ్బపుఁగూరువ(ర్వ)రి.** వి. (కబ్బము+కూరుపరి.) కావ్యకర్త, కవి.

గీ. బంట్లు కబ్బంపుఁగూర్పరు ల్పాళిగాండ్రు. నీలా. ౨. ౪౯.

ఇట్లే:-కబ్బపుఁజేఁతరి. సాం. ని. మాన. ౬.

**కబ్బము.** వి. (సం.కావ్యమ్.ప్రా.కబ్బమ్.త.కాప్పియమ్.)కావ్యము, ప్రబంధము.

గీ. మునుపు మా కీవె భల్లాణుఁ డనెడి పేని,కతయు రుక్మిణిపెండిలికతయు బొబ్బ,మెకపుగుబ్బలికతయు మేల్మిఱనీల,పెండ్లికతయును గబ్బము ల్చెప్పితివి. అచ్చ. రా. బాల. ౧౬. భీమ. ౧. ౧౨.

జ: కబ్బపుఁగూరుపరి,కబ్బముప్రోయాలు.

**కబ్బముప్రోయాలు.** వి. (కబ్బము+ప్రోయాలు.) సరస్వతీదేవి.

(యశోవర్ణనము.) సీ. గిబ్బడాల్దొరగుండు కబ్బంబుప్రోయాలు లిబ్బిగుబ్బెతయబ్బ బొబ్బమెకము. అచ్చ. రా. యు. ౫౯౨.

**కబ్బాయి**=కబాయి.

ద్వి. చెల్లుచీటియు నిచ్చి చేచేత మేలు,కుళ్లాయి కబ్బాయి గొమ్మంచు నొసఁగి. ద్వి. పరమ. ౬. ౪౯౨ పా. ౪ పం.

ద్వి. అసమసాయకుని మోహనతురంగముల, పసమించుపచ్చకబ్బాయి ధరించి. అ. మ.క.౫. ౨౫౯ పా. ౧౯ పం.

**కబ్బిలి.** వి.శౌండికుఁడు, కల్లుఅమ్ము వాఁడు.(శ.ర.)

**కమండలువు.** సం. వి. ఉ. పుం.న. కరకము, సన్న్యాసులుగాని బ్రహ్మచారులుగాని ఉపయోగించుకొనెడి గిండివంటి జలపాత్రవిశేషము.వి. ఉ. పుం. ౧. జువ్వి. ౨. ఒకానొకచతుష్పాజ్జంతువు.

**కమటము**=కమ్మటము. వి. అగసాలెవానికుంపటి.

మ. సుమనశ్చాపునిరాణివాసమునకుం సొమ్ముల్ వినిర్మింపయ,శ్నమునం విచ్చిన మెట్టదమ్మి కమటానం గేసరాంగారమ,ధ్యమునం పైచి

నకర్ణికాకనకముం దర్వీరజఃకీలపుం,జము న
ర్తింపఁ గరంగెడుం గనుము కూజద్భృంగనా
డింధముఁ. వరాహ. ౩. ౯౧.

గీ. సమయ నాడింధమాగ్రణి సాంధ్యరాగ,విమ
లశిఖి మింటిఛాకమటమునఁ గాఁచి, నిశియ
లంకారమున కెత్తి నెలపసిండి, పూదెఁ దొ
లుగట్టుపట్టెడమీఁద నిడియె. రా. వి. ౪.
౪౨.

**కమఠము.** సం. విణ. (అ. ఆ. అ.) పొట్టిది. (కే.
ని.) వి. అ. పుం. ౧. కూర్మము,తాఁబేలు.౨.వెదు
రుగ. ౩. సల్లకి, అందుగు. ౪. కూర్మాక్షి,తాఁబే
టిమెముక. ౫. మునులభిక్షాపాత్రము. (కే.ని.)

**కమఠి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు, ధులి.

**కమతకా(గా)ఁడు**=కమ్మతకాఁడు. వి.(కమతము
+కాఁడు.) హాలికుఁడు, సేద్యగాఁడు.

సీ...కాఁపనఁ గమ్మతకాఁడనంగఁ, గమతగాఁ
డనఁగను గమ్మతీఁడనఁగను దుక్కిము చ్చనఁ
గను దోఁచుచుండు,హాలికాభిధ...ఆం.భా.
౨. ౨౭౯.

**కమతము**=కమ్మతము. వి. (క. కమత. త. కమత్తో
ళిల్.) సాగుబడి, సేద్యము, కృషి. (చూ. కమ
తీఁడు.)

**కమతీఁడు**=కమ్మతీఁడు. వి. (కమతము+ఈఁడు.)
సేద్యగాఁడు, కృషీవలుఁడు, హాలికుఁడు.

సీ. వెదురుచేల్కలుపు దీసి దినంబుఁ గాపాడుక
మతీలు మా కేకలములు సుమ్ము. సారంగ. ౧.
౬౩.

**కమనచ్ఛదము.** సం. వి. అ. పుం. కంకపక్షి, రా
పులుఁగు.

**కమనము.** సం. వి. అ. పుం. అశోకము.

**కమనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కామిం
పఁదగినది, కోరఁదగినది. ౨. మనోహరము, ఇం
పయినది.

**కమనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాముకుఁ
డు. ౨. ఇచ్ఛగలవాఁడు. ౩. కమనీయుఁడు,అ
భిరూపుఁడు, అందగాఁడు. వి. అ. పుం. మన్మ
థుఁడు.

**కమరి**=కమరు[2].

సీ...ఒడ్డాణంబు కమరి యొడ్డణ మనఁ గాంచి వె
లయు, మొలనూ లనంగ నొప్పును గటినూత్రా
ఖ్య...ఆం. భా. ౨. ౧౫౦.

**కమరు[1].** అ. క్రి. (క. కమరు. త. కమఋదల్.)
కాలు, దగ్ధమగు; తాపమునొందు; ఉడుకు.

సీ....తీవ్రాంశుసంతాపమునఁజేసి కమరె నా రెక్కలు గమరవయ్యె. గీ.ననుజూపక్షములు...
భార. ఆర. ౬. ౨౧.(మూ: తతో దగ్ధావిమౌ
పక్షౌ న దగ్ధౌ తు జటాయుషః.)

గీ. తీయవిలు చీమగమి దొల్చి తినియె నేనిఁ,బొ
దలు నావేఁడియూర్పులఁ బువ్వుఁదేరు,కమ
రెనే బట్టబయలగు గర్వరేఖ,విషమసాయక
విచ్చేయు విడిదలకును. పి. శకుం. ౩. ౧౯౦.

వ....నీవు సకలసామ్రాజ్యవిభవంబు మెఱసి చని
యందు నీ తేజంబు ఘర్మసమయంబునాఁటితి
పను తేజంబై పగతురకన్నులు గమరగ నతిదు
స్సహం బగునట్లుగాఁ జేయుము ... భార.
ఆర. ౫. ౩౪౬.

గీ...కంక,ణాదిమణిభూషణోత్కర మపనయిం
చి, యొప్పు పాలివోయి దీనత నుండె బంధు,
జనులచూడ్కులు కమర నజ్జనవిభుండు.మా
ర్క. ౧. ౧౬౭.

చ. కమరె నశేషకోకనదకైరవపంక్తులు శైవలం
బులుఁ. భార. ఆది. ౭. ౨౬౬.

వి. కాలుపు.

సీ.కమరును నార్తనాదములును చెల్లుగ నఖిలమ్ము

గంబుల నాఁగికొనుచు. గీ...పరఁగె, నదుభ తోద్భవం బైనమహానలంబు. భార. ఆశ్రే. ౨. ౧౫౧.

కమరువలచు=కమరువాసనవేయు, కమరుకంపు గొట్టు.

క....తనతనువు గమరువల,చినఁ బక్షములోన వాఁడు జీవముఁ దొఱఁగుఁగ. జై. భా. ౮. ౧౦౦.

క. అన్నంబు కమరువలచుచు, నున్నది...పోడ. ౫. ౧౧.

జ: కమరుచు.

**కమరు²**=కమరి, కమ్మరు. వి. (హిం. కమర్=నడుము.) ఒడ్డాణము.

గీ. లజ్జ యెఱుఁగనికటిమండలంబుమీఁద, వలుఁదవజ్రాలకమరు గర్వంబునూప. కాశీ. 3. ౨౮౦.

సీ. వజ్రాలకమరుశేవ విడంబనముచేయు నేకొండమొలచుట్టు నిందుతనయ. శివరా. ౨. 3.

కమరుపటా=మొలనూలుపట్టా.

గీ. పసిఁడికమరుపటా యొక్కి-కిసలయోష్ఠి, మొలను ధరియించె ... రసిక. ౧. ౭౫. (శ. ర. పా. 'కమ్మరుపట' ముద్రి.)

**కమరుచే.** స. క్రి. (√కమరు¹.) కమరఁజేయు. (కాల్చు)

ద్వి. రమణీయగజవాజిరథశాలలోలిఁ, గమరిచి ...రం. రా. సుం. ౨౭౧పా. ౮ పం. (శ.ర. పా.'కమరిచి' ము ద్రి.)

**కమల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. లక్ష్మి. ౨. ఉత్తమస్త్రీ. 3. ఒకానొకఫలవృక్షము.

**కమలచ్ఛదము.** సం. వి. అ.పుం. ౧. తామరరేకు. ౨. రాపులుఁగు. (కే. ని.)

**కమలజన్ముఁడు.** సం. వి. న్. పుం=కమలజుఁడు.

**కమలజుఁడు.** సం. వి. అ. పుం-కమలమునుండి పుట్టినవాఁడు-తమ్మిచూలి, బ్రహ్మ.

**కమలము.** సం. వి. అ. పుం. న. సారసపక్షి, బెగ్గురుపిట్ట. పుం. ౧. (సంగీ.) ధ్రువకభేదము. ౨. మృగభేదము, ఒకజాతిలేడి. న.౧. తామర; ఎఱ్ఱతామర. ౨. నీరు. 3. రాగి. ౪. మందు. ౫. క్లోమము, కడుపులో నొకప్రక్క-నుండెడి యెఱ్ఱనిమాంసము. ౬. స్థౌణేయమనుగంధద్రవ్యము. ౭. కత్తియొఱ.

**కమలాకరము.** సం. వి. అ. పుం. తామరకొలను.

**కమలాక్షుఁడు.** సం. విశ. (అ. ఈ. అ) తామరలవంటికన్నులుగలవాఁడు. వి. అ. పుం.విష్ణువు.

**కమలాప్తుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. విష్ణువు.

**కమలాఫలము.** సం. వి. అ. న. ఫలవిశేషము.

**కమలాలయ.** సం. వి. ఆ. స్త్రీ. తమ్మియింటిగరిత, లక్ష్మి.

**కమలాసనుఁడు.** సం. వి. అ. పుం-తామరపూవుపీఠముగాఁగలవాఁడు-బ్రహ్మ, నలువ.

**కమలిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తామరతీఁగ. ౨. తామరతంపర, పద్మసమూహము. 3. తామరకొలను.

**కమలు.** అ. క్రి. కందు, వివర్ణమగు; కాలు, దగ్ధమగు.

గీ. నెచ్చెననఁ గందె ననఁగను వేఁగె ననఁగఁ, గమలె ననఁగను దనరు నేకార్థములు గ. ఆం. భా. 3. ౯౯.

మ...మోవి నిట్టూర్పులఁ,గమలఁ దల్పముఁ జేరుచు న్విభునిరాక ల్గోరుచుం బ్రొద్దు భా,రమునం బుచ్చుచు వర్ధమానవిరహగ్లానిఁ మదింగుందుచుఁ. పి. శకుం. ౨. ౧౯౨.

ద్వి.తమతమవారలు తమబంధుజనులు,కమలుటఁ జూచి శోకము నొందువారు. రం. రా.సుం. ౨౭౧ పా. ౨౦ పం.

వి. వైవర్ణ్యము.

సీ. కాళికావిభునిడాకాలితాటింపులకమలు చే
రనినాఁటికిముదహితుఁడు.పి.శకుం.౧.౩౯.

జ: కమలుచు.

**కమలుచే(ల్చు), కమలించే.** స. క్రి. (√కమలు.) కమలఁజేయు.

(కాల్చు)

సీ. క్రొవ్విన పందులఁ గొన్నిటిఁ గమలిచి కత్తితా
లను జివ్వి కాచు గడిగి. ప్రబంధ. ౨౧౦.

(కందించు, నల్లపఱుచు.)

సీ. కమలించెఁగాక యంగజవిగోధిశిగోధిఁ దల
కెక్కఁజాలెనే హాలహలంబు. వసు.౪.౨౯.

**కమలోత్తరము.** సం.వి. అ. న. కుసుంభము, కుసుమపువ్వు.

**కమసాలవాఁడు**=కంసాలి. వి. లోహకారుఁడు. (శ. ర.)

**కమాను.** వి. (హిం. కమాన్.) విల్లు, ధనుస్సు.

ఉ. వైరివిఘాలుఁ డైనకసవక్షితిపాలుఁడు వార్ధి
మేఖలా,భారధురంధరత్వమునఁ బ్రౌఢవచో
రచనస్ఫురూపతా,స్ఫారత నెన్న సాటి య
గు బంగరుగట్టుకమానుపాదుషా,నారికిఁ బద్ధ
సంభవునినారికి ఘాలవిలోచనారికిన్. చం.
రా. ౧. ౫౬.

**కమి.** వి. (√కముచే?) ౧. కబళనము, మ్రింగుట.

సీ. ... కమి యనఁగా నొప్పుఁ గబళనంబు,కబ
ళంబు కడి యనఁగాఁ జను... ఆం.భా. ౨.
౨౬౦.

౨. కమికిలి, పట్టిలి.

కమియారన్=పట్టిలినిండ; తృప్తితీరునట్లు.

సీ. కాంతాజనంబులు కమియార నిడుదు రేఫుర
ములోఁ దత్కాలపుణ్యభిక్ష. భీమ. ౩. ౭.

ఉ. ముంగిట నాడుపుత్త్రుఁ డతిమోదమునం దను
డాలఁ గాంచి వేడ్కం గరయుగ్మ మెత్తి
చిఱుగంతులతో వెడయేడ్పుతోడ డా,యం
గఁ జెలంగి యెత్తుకొని యక్కునఁ జిక్కఁగఁ
జేర్చి ముద్దుమో,మును గమియార ముద్దిడుట
ముజ్జగ మేలుటగాకయుండునే. కవిక. ౧.
౮౦.

జ: కమికిలి.

**కమికిలి.** వి. (√కమి.) పాణివిశేషము, పట్టిలి. ('వంపఁబడిన వ్రేళ్లు గలపుడిసిలి' అని శ. ర.)

సీ. ...పాణివిశేషంబు పరఁగును గమి,కిలి కుప్ప
లప్ప పట్టిలి యన ... ఆం. భా. ౨. ౧౮౧.

చ. కమికెఁడుగుబ్బచన్నుఁగవ గాసికిఁ బాసిన
జాఱుపయ్యెదల్, గమకపువాలుఁగన్ను లె
సఁగన్ బొసఁగించిరి కేళి బాలికల్. రా.వి.
౩. ౭౭.

ఆ. మూఁడుదినము లయ్యె వేఁడంగ నెచ్చటఁ,
గమికెఁ డన్న మైనఁ గలుగదయ్యె,గ్రాసమా
త్ర మేమి గలిగిన నా కిచ్చి, నన్నుఁ గరుణఁ
బ్రోవు మన్నఁ జూచి. ద్వా. ౬. ౧౦౧.

గీ. రెండుకమికిళ్ల వేఁపాకు. చికి. ౧. (చి. ని.)

**కమిత.** సం. విణ. (బు. త్రి. బు.) కాముకుఁడు.

**కమితవ్యము.** సం=కామ్యము.

**కమియు.** అ. క్రి. ౧. కవియు, మీఁదికివచ్చు.

సీ. కమియునుద్ధతవారణముఁ ద్రిప్పు నేసదా చా
రధారేయుహుంకారరవము. భాను. ౧. ౨.

గీ. ఘోరమృగములఁ గమియుంచుకొని ప్రతా
ప, మడర సురియలఁ బొడిచెద మనెడు
వారు. చిత్రభా. ౩. ౧౨౭.

౨. మాఁగు, మిగులఁబండు.

చ. క్రమమునఁ బిందెలుం బసరుఁగాయలుఁ గా
యలు దోరపండులుం,గమిసినపండులుం గె
లలు గట్టి తదున్నతశాఖ లన్నియున్,దమమ
యమై తలిర్పఁగ...హరి. పూ. ౬. ౭౨.

౩. అతిశయించు.

చ...ఇంగిలికంబుఛాయచేఁ, గమిసినదాసనంపుఁ బువుకాంతికి డాసినకూర్మిచుట్ట మా, కొమరున సంజ యంబరముకొంగున నూన్చెఁ గుసుంభరాగముల్. భీమ. ౨. ౨౯.

స. క్రి. ౧. కొఱుకు.

క. తలిరాకు మెఱుఁగువా తెఱ, కలకంఠవిటుండు గమియఁగాఁ జూతలతా, లలన విదిర్చెను గంటివె, యలికంకణముఖరవిటపహస్తముల సతీ. పారి. ౩. ౫౬.

౨. తిను; త్రాగు.

క. ఇందుభవత్తనువులఁ గల, కండలు నెత్తురును వేగ కమియంగా నీ, యండజపతి కానందము, ఖండముగా క్షుత్ప్రపావికారము లడఁగన్. మార్క. ౧. ౭౮.

౩. క్రమ్ము, ఆవరించు.

గీ. అతనుదర్పాంధకార మంతంతఁ గమియఁ, గన్ను గానక సాధ్వి రాఘవుని దేవి, జనకకన్య జగన్మాన్యఁ జెనక వచ్చి, కన్ను గానక చనెఁ బలుగాకి కాకి. రామా. ౫. ౭౦.

కమియన్ = బాగుగా, ఎక్కువగా.

చ. కమియఁగ నింగికిన్ నెగసి కన్కని మ్రాఁకులఁ గూలఁ ద్రోచుచున్...భా. రా. సుం. ౫౫౩.

క. కనలి నిశాచరికేలు, క్కునఁ గమియఁగఁ బట్టి భీతిగొనఁ దిగిచి పడిన్. భా. రా. సు. ౬౮. ('గట్టిగా' అని భావము.)

గీ. అనుభవింపఁ దనికి యట మఱి విషయముల్, విడుతు నని తలంచు వెఱఁగుఁదలఁపు, లఖిలశిఖిశిఖాళియం దింధనాజ్యముల్, గమియ వైచి యార్పఁ గడఁగునట్లు. కు. సం. ౬. ౭౨౬. ('మిక్కుటముగా' అని భావము.)

గీ. పత్త్రములమీఁద మూఁగినభ్రమరకులము, హరవిసర్జనజనితధూర్యశముఁ బోలఁ, గమియ విచ్చినగేదంగికన్నె పువ్వుఁ, గొతుకము పల్లవింపఁగఁ గాంచె విభుఁడు. నైష. ౧. ౯౦. ('పూర్ణముగా' అని భావము.)

మ. ప్రమదోద్దామసుఖానుభూతి గలలోఁ బ్రాప్తించుటన్ మున్న చిత్తములం బ్రాపడి యున్నయయ్యిరువురుం దద్వేళ వీక్షించుచోఁ, దమకం బారఁగ వింత గాక సమతం దాన్కొన్నయాలోకముల్, గమియం బ్రాఁకెఁ బరస్పరాంగముల పైఁ గౌతూహలోద్యద్గతిన్. హరి. ఉ. ౭. ౧౭౫. ('అంతటన్' అని భావము.)

(ఇట్లే సందర్భానుసారముగా అర్థములు గ్రహించునది.)

జ: కముచు.

కముఁజు = కౌఁజు. వి. (సం. కపింజలః.) కపింజల పక్షి.

ద్వి. కముఁజులఁ జిలుకలఁ గ్రౌంచపక్షులను. ద్వి. నల. ౩. ౩౨౩ పం.

కముచు. స. క్రి. (√కమియు.) ౧. గ్రహించు, పట్టుకొను.

క. చనుఁగవ ఘనమో జఘనము, ఘనమో యని నడిమిచక్కిఁ గమిచి విధి కరం, బునఁ దూఁచె దీనిఁ గాకి, ట్లనువుపడు నె వళులపేర నంగుళిరేఖల్. నైష. ౫. ౧౬.

గీ. కరము రాగిత్వె రజనీముఖంబుఁ గాంచి, తమముఁ దత్కేశభర మని తాల్మి లేక, కముపఁ గరములు పైఁ జాఁచి కామి యొత్తెఁగి, వెల్లనైనట్లు శశి కడు విమల మయ్యె. కు. సం. ౮. ౧౧౩.

గీ. కపివరుఁడు పర్వతంబులు గమిచి తెచ్చి, కుప్పలిడురీతిఁ గుండలు కుప్పవెట్టు. హంస. ౫. ౧౦.

౨. కొఱుకు.

సీ. తమి దొలంకఁగ సాము గమిచినచిగురాకుఁ జెలువున కిచ్చు కోయిలవెలంది. చంద్ర. ౩. ౯౨.

౩. నొక్కు.

క. హారపరీక్షామిషమున, భూరమణుండు గమిచె
నింతిపాంకపుఁజన్నుల్, కూరిమి నేరిమిఁ బు
లకాం,కూరంబులు వొడమఁ జిగురుగోరుల
కొనలన్. నైష. ౭. ౧౬౬.

౪. అను, (అధర) పానము చేయు.

సీ. తెమలించి కురు లొయ్యఁ దివియ లేకటము
న్న కదిసిన కెమ్మోవి గమిచి కమిచి. ఉ. హరి.
౫. ౨౧౨.

౫. కబళించు, మ్రింగు.

సీ. అమృతాపహరణార్థ మరుగుపక్షిస్వామిగతిఁ
బుళిందశ్రేణిఁ గమిచి కమిచి. మనుచ. ౪.
౧౧౩.

గీ. తివిచి నవకంబు దీప్తులు ద్రెంచి యలఁతి, తుని
యలుగఁ జంచుపుటములఁ ద్రుంచి తల్లు, లాద
రంబున నందియీ నట్టు లెత్తి, ప్రీతిఁ గమ
చుఁ జకోరంపుఁబిల్లగములు. నిర్వ. ౬. ౪౬.

౬. అక్రమించు.

సీ. వరుస మీఁదటివ్రాలు వ్రాయ నేర్చిననాఁడె
కమిచి దిక్కుల జయాంకములు వ్రాసె. పాం
డు. ౧. ౪౧.

గీ. భోగివశ మైన గేదంగిపూవునకును, వగచు మ
దిఁ గొన్ని బంధుజీవకలతాంత, గుచ్ఛములలో
న నొకకొన్ని కొలువు సేయుఁ, దేఁటు లఖిల
ర్తుమయవనీవాటిఁ గమిచి. పాండు. ౧. ౧౮౧.

**కమ్మ[1].** వి. (త. కమ్మల్.) ౧. తాకనాళము, కాఁడ; పత్త్రవృంతము, మట్ట.

సీ... తాకనాళము పేరు చనును గమ్మ. గీ. కామ
కాఁడన... ఆం. భా. ౨. ౨౪౮.

ఉదా: తాటికమ్మ, మొ.

౨. తాళపర్ణము, తాటియాకు.

గీ.... కమ్మనఁ దాళపర్ణ మెసఁగు. ఆం. భా. ౨.
౭౭.

౩. (క. కమ్మ.) పత్త్రిక, లేఖ, జాబు.

గీ. కమ్మ యనఁగను జాబును గర్ణభూష, పొల్చు
చుండును... ఆం. భా. ౩. ౫౨.

సీ. మఱుఁ బిల్వఁ బంపు కొమ్మా యని ప్రమథసంఘ
ములు తమ పేరఁ గమ్మ లనుప. శుక. ౩. ౪౪౩.

గీ. వలఁతిబంటుల నిర్వురఁ బిలిచి మేలి, కమ్మ
యొసఁగిన వారొకయుమ్మడిఁ జని. అచ్చ.
రా. బాల. ౧౮౭.

౪. కర్ణభూషావిశేషము, తాటంకము.

గీ... తాటంకవాచక మగుఁ, గమ్మయనఁ గాను...
ఆం. భా. ౨. ౧౪౭.

గీ. కమ్మతీఁగ పొగడము... చుక్కబొట్టనఁ జిటి
పొటిసొమ్ము గలిగి... వేం. పంచ. ౪. ౪౧౬.

సీ. కంపించు బంగారు కమ్మలక్రొమ్మించు నిద్దంపుఁ
జెక్కుల నీడ సూప. హర. ౫. ౪౪, ౨౯౩.

జ: కమ్మకట్టు, కమ్మపంజా, కమ్మపువ్వు, కమ్మ
పోఁజా.

**కమ్మ[2].** వి. శూద్రవిశేషము.

సీ. తద్విశేషంబులై తనరుఁ గమ్మని వెల్మ యని
రెడ్డి యని రడ్డి యని వచింప. ఆం. భా. ౨.
౨౮౨.

గీ. రాజులును వెలమలుఁ గమ్మప్రజలు ఘనులు,
గలుగు రాయలతోఁ బోరి గెలుప మనను, వ
శమె ... కృష్ణ. ౩. ౨౬.

వ... అందుఁ బద్మనాయకులన వెలమ లనఁ గమ్మ
లన ..... త్రిమార్గగంగాప్రవాహంబులుం
బోలె గోత్రంబు లెన్ని యేని జగత్పవిత్రం
బులై ప్రవహింపుచుండ... భీమ. ౧. ౩౧.

**కమ్మ[3].** విశే. (వ్యుత్పత్తియందు వికల్పముగా నిగాగమ
ము.) ప్రియమైనది.

(క) ఘ్రాణప్రియమైనది, సువాసనగలది.

వ. పుడమిం బొడముకమ్మని నెత్తావి... హర. ౨.
౨౦.

ఉ. కమ్మని తెమ్మతెమ్మెరలు గ్రమ్మఁగ...నీలా౧.౪.

(చ) జిహ్వాకుప్రియమైనది, రుచ్యము; మధురము;
పులుసులేనిది.

ఉదా: ఈపులిహోర కమ్మఁగా నున్నది.

మ. మదవాలామశరంబులం దొరఁగు కమ్మం దేనె తోఁ గూడి య, య్యరవిందాక్షికిఁ బక్షపుం గవగవీహైయంగవీనంబు ని, ర్ఝరహర్షంబు నొనర్చి ముద్దు రుచిసౌరభ్యంబులన్ ... నైష. ౨. ౯౯.

చ. కనఁ గలిగెన్ విలాసములు కమ్మనిచక్కెర లొల్కుపల్కులన్, వినఁ గలిగెన్ ... దశా. ౨. ౩౦౮.

ఉదా: కమ్మఁగూర.

(ట) నేత్రప్రియమైనది; చక్కనిది.

సీ. కమ్మనిపసిఁడిటంకంబులఁ గరఁగినలాలితనూత్నశలాకవోలె. విక్ర. ౬. ౪౮. విజ. వి. ౧. ౭౦.

కమ్మఁగ=కమ్మనగునట్లు.

సీ. కస్తూరివాసనల్ గమ్మంగఁ గ్రమ్మంగ సారంగధరుఁ డని చేరఁబోవు. సారంగ. ౩. ౨౩౮.

కమ్మగాడ్పు=మలయమారుతము.

గీ. అఖిలభువనైకమోహకుం డైనమాధ, వునకు నీవనవాసిరంజన మయుత్న, కార్యలేశమ్ము సుమ్ము, కమ్మగాడ్పు, కడిమి మ్రోయించెఁ గలకంఠకంఠఘంట. హ. న. ౨. ౮.

కమ్మనివింటిజోదు=ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

ఉ. తుమ్మెదలేమ లాలతులతో మధురస్ఫుటకోకిలానినా, దమ్మునఁ బాడుచుండెను లతానవడోలల నూఁగియాడుచుం, గమ్మనివింటిజోదు జయగాథలు పుష్పితభూజవీథులన్. పి. ర కుం. ౨. ౧౨౯.

కమ్మ(ని)విల్తుఁడు=ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

సీ. కన్నులవిల్తుఁడు కమ్మవిల్తుఁడు పచ్చవిలుకాఁడు చక్కెరవింటిజోదు. సాం. ని. దేవ. ౮.

ఉ. కమ్మనివిల్తుకోపుఁ జెనకం గలచక్కనిమోహనాంగులన్, గొమ్మరొ చూడవమ్మ ... ఉ. హరి. ౪. ౧౧౫.

కమ్మవిల్లు=తియ్యనివిల్లు, చెఱకువిల్లు.

శా. ... కమ్మవిల్వంచి ముం, చె న్నించెన్ నిజశాంబరీతమము రాజీవన్వజుం డయ్యెడన్. కవిరా. ౨. ౧౫౪.

జ: కమ్మకత్తి, కమ్మకసింద, కమ్మన, కమ్మనిమ్మ, కమ్మనీరు, కమ్మమూరియ, కమ్మపిల్లి, కమ్మప్రాఁత, కమ్మవడ, కమ్మవలచు.

కమ్మకట్టు. వి. ($కమ్మ^{1}$ + కట్టు)-వ్రాఁతయొడంబడిక ప్రకారము రాజునకు సాహాయ్యము సేయుసేన-సేనావిశేషము?

చ. దెసమొలవేల్పు సాహిణపుఁ దేజులు పోషకగేహరక్షకుల్, విసువనికమ్మకట్టు మతి వింతజనంబుల బీతు గొల్పుక, క్కస మగురక్కసుల్ వనమృగంబులపాలిటి మృత్యురూపముల్, వెసఁ జనుదెంచె నత్తఱిని వేఁటకు గాటపుసారమేయముల్. కవిరా. ౨. ౮౨.

ఉ. చెలువగు మైత్రిఁ గోయిలవజీరులఁ దుమ్మెదకమ్మకట్టుమూఁకల గోరువంకరాదొరల గాటపుఁజిల్కలకాల్బలంబులన్, నలినకలంబవీరబలనాథుఁడు చైత్రుఁడు తద్బలోచితో, జ్జ్వలలతికాకుటీపటలిఁ జక్కఁగఁ బాళెము డించె నయ్యెడన్. చంద్రి. ౨. ౭౨.

ఉ. చేరదు కీర్తి గౌరవము చిక్కదు రాదు శుభంబు పుణ్యముల్, నీఱగుఁ బాప మంటుఁ బ్రజ నిల్వదు కొల్వదు కమ్మకట్టు వీ, రారులు లెక్కగాఁ గొన రహర్దివసంబు విపత్పరంపరా, భారము కొండలై పెరుఁగు బాపురె సత్యము లేనిపట్టునన్. వేం. పంచ. ౧. ౫౧౩.

కమ్మకత్తి. వి. ($కమ్మ^{3}$ + కత్తి) కుసుమాయుధము, పువ్వుబాఁకు.

ఆ. పెక్కు లేల మరల ముక్కంటిదయ కల్గి, కమ్మకత్తి మనసుఁ గన్నవెట్టు, గండుదొంగ కెపుడుఁ గర్పూరతిలక నీ, శీవిమేను టెంకివాపిమ్రాను. కళ. ౩. ౭౮.

కమ్మకసింద. వి.(కమ్మ³ + కసింద)ఒకజాతికసిందా.
(దీనియాకు సువాసనకై కూరలలో వేయుదురు)
వ....కటివేఁపాకుపరిమళంబులతో సంబంధించు
కమ్మకసిందగంధంబును గమ్మకసిందగంధంబు
తోడం దార్కొను నేలకులసౌరభంబులును
...కాశీ. ౭. ౧౫౫.

కమ్మచ్చు. వి. (కమ్మి + అచ్చు.) అగసాలెవాఁడు
బంగారు వెండి లోనగువానితీఁగ తీసెడి పని
ముట్టు.
ఉ. హెచ్చినమైత్రిఁ బద్మినులకెల్ల ఘనాత్యయ
కారకుండు సొమ్మ్మచ్చుపడంగఁ జేయుట
కునై యలర్కాంచనగంబుపేరికమ్మచ్చున నీ
డ్చుశర్వగిరియందలివెండిసలాకపింజు నా,
వచ్చి మరాళమాలికలు వ్రాలెఁ గొలంకులఁ
జక్రఝుంకృతిన్. ఆము. ౪. ౧౪౮.
సీ. తెలివివెన్నెలవెండితీఁగలు నిగిడించుచదలు
కమ్మచ్చుబెజ్జము లనంగఁ. గీ...జుక్కలమ
రె. పారి. ౨. ౩౬.

కమ్మటము=కమటము.
(అగసాలెవానికుంపటి.)
మ. ప్రతిసూర్యుం డనుకమ్మటంబు మఘవద్బా
ణాసమన్కాలు గో,హిత మన్వేరిటెయూఁ
దుఁగ్రోవి చపలో పేతాంతరాంభోదసం,తతి
యన్నచ్చులసంచి కావి రసనిర్ఘాటీకము న్గ
న్పడన్, జతసొన్నారిబెడంగున న్దనరె వర్షా
వేళ విన్నంగడిన్. చంద్రా. ౪. ౧౭.
జ: కమ్మటీఁడు.

కమ్మటీఁడు. వి. (కమ్మటము + ఈఁడు.) అగసాలె
వాఁడు, స్వర్ణకారుఁడు. (శ. ర.)

కమ్మతకా(గా)ఁడు=కమతకాఁడు.(కమ్మతము +
కాఁడు.)
సీ. దేవాదులకడెంబు దిగిచి కమ్మతగానిపట్టికా
నికి మొలకట్టుచేసె. శుక. ౩. ౫౦. ఆం.భా.
౨. ౨౭౯.

కమ్మతము=కమతము.
(సేద్యము, సాగు.)
సీ. బేహార మాడింపఁ బెరిఁగినధనమునఁ గమ్మతం
బులు వెట్టఁగా ధరిత్రి, నమరినధాన్యంబు
లమ్మించి...నా. పంచ. ౫. ౧౩.
(పొలము.)
సీ. కమ్మతంబులలోన గనులు ద్రవ్వించి బేహార
మాడించి యన్యాయధనము, చోరనీక...పి.
శకుం. ౪. ౧౭౫.
జ: కమ్మతకాఁడు, కమ్మతీఁడు.

కమ్మతీఁడు=కమతీఁడు. (కమ్మతము + ఈఁడు.)
(మందరగిరివర్ణనము.) సీ. సురరాజునకుఁ బాం
డుకరిఁ జేర్చుమరకాఁడు కల్పకంబులపంట
కమ్మతీఁడు. మనుచ. ౫. ౪౭.
గీ. నమ్మిక వసంతుఁ డనుపేరికమ్మతీఁడు,నెఱయ
నెల్లెడ వలరాజుకఱవు దీఱ,నౌర యామని
వచ్చె నాహా యటంచు,జగము తనియంగఁ
బుష్పమంజరులు పండె. రామా. ౧. ౧౬౮.
ఆం. భా. ౨. ౨౭౯.

కమ్మన. విణ. (√కమ్ము³-క. కమ్మగె, కమ్మనె.)కమ్మ
నిది.
లయగ్రాహి. కమ్మనగువిల్లుఁ బువుటమ్ములును బట్టి
వెలయ మ్మరుఁడు పువ్వులరథమ్ము వెస నె
క్కెన్. వీర. ౨. ౨౯.
వి. ౧. కమ్మఁదనము. ౨. మాధుర్యము. ౩. సౌర
భము, సువాసన. (శ. ర.)

కమ్మనిమ్మ. వి. (కమ్మ³ + నిమ్మ) నిమ్మపండువంటివర్ణ
ముగలకిత్తిలి, తియ్యనిమ్మ, శర్కరాంకమా.
(శ. ర.)

కమ్మనీరు. వి. (కమ్మ³ + నీరు) పన్నీరు, హిమాం
బువు.(చూ. వసు. ౩. ౧౬౮.)

ఉ. భావము పల్లవింప నొకపంకజలోచన వ్రాసె నొక్కల, జ్జావతి మించుగుబ్బవలిచన్నులపై మకరీకలాపముల్, వావిరిఁ గమ్మనీరు మృగనాభిరసంబున మేళవించి. నైష. ౩. ౧౦౨. రా. వి. ౩. ౬౭.

౨. మకరందము.

మ. ఉరుశక్తిన్ మధుమాసదోగ్ధ పిదుకన్ జ్యోత్స్నాగవీచంద్రమ, స్స్ఫురదూధః ప్రవిముక్తమైననిబిడజ్యోత్స్నాపయఃపూరమున్, విరియంబాఱినగొజ్జెఁగల్ గురియ మున్నీరై నయకృమ్మనీ, రురరహిం గూడిన నేర్పరించుగములై రోలంబకాదంబముల్. అను. ౫. ౧౨౧.

**కమ్మనూనియ(నె).** వి. (√కమ్మ[3]) సువాసనతైలము.

ఉ... ముసలమ్మకు సైతము కమ్మనూనె మై, నంటి నలుంగుతో జలకమార్చి యొసంగిరి ధౌతవస్త్రముల్. హర. ౨. ౬౯.

సీ. అతఁడు తైలాభ్యంగ మడిగినఁ బతి కమ్మనూనియఁ దెప్పించి మేను శిరము, నభ్యక్తములు సేయ... భార. అను. ౨. ౩౦౬.

**కమ్మపంజో=పంజొలకమ్మ.** వి. (కమ్మ[1]+పంజు)-రత్నములు కూర్చుటచే దివటీవలె వెలిఁగెడుకమ్మ-రత్నములు చెక్కినకమ్మ, రత్నతాటంకము.

వ... బుగ్గలం దగ్గలికనూపుకమ్మపంజులవజ్రపుం జకచకల నకనకలు వీడుకొలిపి... మిటమిటం గాయుదట్టంపుఁబండువెన్నెల... మనుచ. ౩. ౨౬. రా. వి. ౩. ౧౨౮.

**కమ్మపిల్లి.** వి. (కమ్మ[3]+పిల్లి) గంధమార్జాలము, పునుఁగుపిల్లి.

గీ. కమ్మపిల్లులపిల్లలు కారుకోళ్లు, కన్నె దుఱవని కస్తురిగమిశిశువులు, పులులకూనలు భల్లూకపోతకములు, నాదిగాఁ దెచ్చి పతి కుపాయనము లిచ్చి. పి. శకుం. ౧. ౯౬. ఆం. భా. ౨. ౬౮.

**కమ్మపూఁత.** వి. (కమ్మ[3]+పూఁత) పరిమళద్రవ్యలేపము, మైపూఁత, అంగరాగము.

సీ. మోముఁదామరతావి ముద మందుఁ బో క్రొత్త బోజుఁగుకస్తురిచుక్క బొట్టు తేఁటి, చిన్నారిమేన వాసించుఁ బో పొరుగింటికలికిచుట్టముఱొమ్ముకమ్మపూఁత. వేం. పంచ. ౩. ౨౫౯.

**కమ్మర.** వి. ఇనుపపని చేసి బ్రతికెడు జాతి.

ఉదా: కమ్మరవాఁడు, కమ్మరది.

జ: కమ్మరము, కమ్మరి, కమ్మరీఁడు.

**కమ్మరము.** వి. (√కమ్మర) ఇనుపపని చేయువాని వృత్తి.

సీ. కమ్మర మన నయస్కారకర్మం బొప్పు... ఆం. భా. ౨. ౨౬౮.

**కమ్మరి.** వి. (కమ్మర+ఇ. సం. కర్మార. ప్రా. కమ్మారో. క. కమ్మఱ. త. కమ్మాళ.) లోహకారుఁడు, కమ్మరవాఁడు.

సీ. కమ్మరి కనుమరి కరుమలి యనఁగాను మీఱు చుండును నయస్కారసంజ్ఞ. ఆం. భా. ౨. ౨౬౮.

గీ. సరగ మిన్నుకమ్మరి సంజకొలిమి, బెట్టుగాఁగాల్చి బంగారుచుట్టువాలు, పదను వెట్టఁగఁగొనిపోయి పట్టలేక, విడిచె ననఁ బ్రొద్దు పడమటికడలి మునిఁగె. యయా. ౨. ౬౭.

**కమ్మరీఁడు=కమ్మరి.** (కమ్మరి+ఈఁడు-స్వార్థమున)

ఆ. ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱు, కాఁచి యతుక నేర్చుఁ గమ్మరీఁడు, మనసు విఱిగెనేని మఱి యంట నేర్చునా. వేమన. ౧. ౫౨.

వ... తెరువరుల గెలువం దరలుమరునకుం దఱియనుకమ్మరీఁడు వెరవునం జేసి యునిచినకఱకుటమ్ములగుంపులసొంపునం దెంపాఱుకలువక్రొవ్విరులును... నీలా. ౩. ౧౦.

**కమ్మరు**=కమరు$^{2}$. (శ. ర.)

**కమ్మరుబొందు.** వి. రెండుగాఁడికమ్ములనడిమిబిగిబద్ద. (శ. ర.)

**కమ్మరేఁగు**=కమ్మరేను. వి. (కమ్మ$^{3}$+రేఁగు) బదరీవిశేషము.

గీ. ... లకుచాఖ్య కమ్మరేఁగనఁగ నక్క, రేఁగనఁగ వెలయును ... ఆం. భా. ౨. ౪౫.(బ్రౌ, ప్రాంత ప్రతిపాఠములు— ప్రకరణమును బట్టి ఆం. భా. లోని "లకుచ" శబ్దమునకు "బదరీ విశేషము" అనునర్థము చెప్పవలసియున్నది. కాని ఈయర్థము సంస్కృతనిఘంటువులలో కనఁబడదు.)

**కమ్మరేను**=కమ్మరేఁగు.(శ. ర.)

**కమ్మవడ.** వి. (కమ్మ$^{3}$+వడ) భక్ష్యవిశేషము.

సీ. చక్కెరఁ బొరలించి చాలించురసదాళ్లు కడఁ ద్రుంచి యుంచినకమ్మవడయు. పాంచాలీ. ౪. ౫౯.

**కమ్మవలచు.** అ. క్రి. (కమ్మ$^{3}$+వలచు) పరిమళించు, సువాసనగొట్టు.

గీ. ఆపురాణంబు గనఁ దెనుఁగయ్యె నేనిఁ, జెప్ప నేర్చినకవియుఁ బ్రసిద్ధుఁ డేనిఁ, దెనుఁగును డికారమున మించు గనియె నేనిఁ, గుందనము కమ్మవలచినచంద మగును. జై. భా. ౧. ౧౯.

**కమ్మి.** వి. ౧. వస్త్రపుఁగమ్మి, బట్టయొక్క అంచు.

గీ. గజచర్మ మెన్నఁడో కాని నిచ్చలు గట్టుఁ బసిఁడికమ్ములపట్టుపచ్చడంబు. భీమ. ౧. ౧౧౫.

సీ. క్రొత్తకమ్ములతోడికూనలమ్మపటంబుఁ గటివిష్పగా రెండుకట్లు గట్టి. వైజ. ౩. ౧౦౦. ఆం. భా. ౨. ౧౫౩.

౨. బండికంటికడకమ్మి, నేమి.

సీ. ఒకదిక్కు దోరగల్లొఱగి పైఁబకుదునో తొలఁగి కమ్ములు ప్రోయ నిలఁ జలింపఁ, దొడరివే పఱతెంచి త్రొక్కుదునో... అని యాత్మఁ దలఁచు. ఆ. శకటులలఁ బెటింగి ... హరి. పూ. ౫. ౧౭౨. ఆం. భా. ౨. ౨౦౨.

వ. పండ్రెండంచులు నాఱుకమ్ములును మూఁడు తోలులుం గలిగి... భాగ. ౫. ౨. ౮౧.

(మూ:- యస్యైకం చక్రం ద్వాదశారం షణ్నేమి త్రినాభి సంవత్సరాత్మకం సమామనంతి.)

౩. లోహశలాక, కడ్డి; లోహపుఁదీఁగ.

క. నెమ్మిగదా నడ తుమ్మెద, దొమ్మిగదా బెడఁగుఁగురులు తోలకరిమించుం, గమ్మిగదా మెయి మరుదో, దుమ్మిగదా తగినచూపు తొయ్యలికి బళీ. కుచల. ౩. ౭౯.

సీ. కమ్మి యటంచనఁగా లోహలత యొప్పు... ఆం. భా. ౨. ౩౦౦.

౪. నాసికాలంకారవిశేషము.

సీ. కుడిముక్కుఁగమ్ములు గురివెంద పేరులు ... నీలా. ౩. ౪౯.

౫. పేముబొద్దు. (శ. ర.)

**కమ్మిఁదీయు**=కమ్మచ్చునఁదీయు.

సీ. కమ్మిఁదీసినలీలఁ గనుపట్టు నెమ్మేనిమిసమిసల్ గడు మిఱుమిట్లుగొలుప. సారం౫. ౨. ౪౨.

**కమ్మితీయు**=సన్నగిల్లు.

గీ. అంత మనసిజమంత్రితో యౌవనాఖ్య, రాజవర్యుఁ డుగ్రోజము ల్పిబలునట్టి, కార్యములు వల్ల బాల్యంబు కమ్మితీసె, దుర్గములు లేక యెట్లొప్పు దొరతనంబు. పార్వ. ౨. ౨౪.

**కమ్మినూకు**=కమ్మచ్చునఁదీయు.

సీ. కమ్మినూకిన నూత్నకలధౌతమును బోలెఁ జక్కనగు నిక్క మైసొక్కు మానె.... గీ. కాలకంఠుండు త్రిపురసంక్షయ మొనర్ప, నెక్కువెట్టినయపుడు భోగీశ్వరునకు. భీమ. ౪. ౧౩౦.

జ: కమ్మచ్చు, కమ్మిబండి.

**కమ్మిబండి.** (కమ్మి+బండి) వి. కమ్మివేసినమ్రానిచక్రపుబండి. (శ.ర)

**కమ్మిరించు.** స. క్రి. (√కమ్ము?) మూయు, కప్పు.
సీ. నిగిడిపూరెకుబాగుగఁ గత్తిరించినగడ్డంబుకో
న బొమ్ముఁ గమ్మిరింప. నైష. ౭. ౯౩.

**కమ్ము.** వి. (√క్రమ్ము?) కప్పు.
సీ. నీకుల్కుఁ జెం డ్లేవి పైకమ్ము దప్పించు పైకమ్ము
దప్పనే చేకొనంగ. బిల్హ. ౧. ౮౧.

**కమ్మునీరు.** వి. చలువ చేసినబట్టలుతడు పుటకుపయో
గించెడునీలిమందునీరు. (బ్రౌ.)
గీ. కమ్మునీ రన నుపజలాఖ్యఁ జెలంగు. ఆం. భా.
౨. ౩౦౧.

**కమ్మెరాకు.** వి. (కమ్మెర + ఆకు). కారముగలనల్లత
ములపాకు. (శ. ర.–కమ్మేరాకు. బ్రౌ.)

**కమ్రు.** సం. వి. ఆ. స్త్రీ. కళ, చబుకు. (కే. ని.)

**కమ్రము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కాముకము,
మైథునేచ్ఛగలది. ౨. మనోహరమైనది, ఇంపై
నది.

**కయి¹=కై¹.**

(చేయి)

మ. ఒకక్రొవ్వాఁడిలకోరి సింగిణి నసం బొప్పా
రఁ గీల్కొల్పి వా, నికయిం గ్రాలెడువిల్లు
ద్రుంచి...అచ్చ. రా. యు. ౮౯౩.
జ: కయికట్టు, కయికానుక, కయికొను, మొ.

**కయి²=కై².** (కు + అయి.)

(నిమిత్తము.)

చ. గొనకొన నేరఁడయ్యె నినుఁ గూడ సుయో
ధనుఁ బట్టి యట్టికర్ణునకయి నీకు నేటికి మ
నోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్రకా. భార.
శాం. ౧. ౩౯.

(షష్ఠ్యర్థకము.)

చ....నీ విఁకఁ బట్టనస్థలం, బునకయి పొమ్ము రా
జునకుఁ బోలునె యాశ్రమవాసఖిన్నతల్.
కువల. ౮. ౯౩.

**కయి³=కై³.** వి. (సం. కవిః.) కవి.
సీ. కబ్బపునేఁతరి కయి కైసరుఁడు మాటలల్లువాఁ
డను పేళ్లు చెల్లుఁ గవికి. సాం. ని. మాన. ౬.

**కయిక=కైక.**

**కయికట్టు=కైకట్టు.** (కయి¹ + కట్టు.)

**కయికలవాఁడు=కైకలవాఁడు.** (కయి¹ + కల
వాఁడు.)

**కయికానుక(న్క)=కైకానుక.** (√ కయి¹)
(రాజాదులఁ జూడఁబోనపుడుకొనిపోయెడు
ద్రవ్యము, ఉపాయనము.)
ఉ....విశేషభూషణో, ద్భాసితచిత్రచేలము ఖ
పారముగాఁ గయికాన్క చేసి ... శుక. ౬.
౮౦.

**కయికానము=కైకానము.** (√కయి¹)

**కయికూడు=కైకూడు.** అ. క్రి. (√కయి¹) సంభ
వించు.
ద్వి. పురపురఁ బొక్కుచుఁ బుత్రశోకంబు, క
యికూడి భూపాలుగర్భంబునందుఁ, జేయిఁ
జెట్టి కలఁచినచేష్టతోడుత ను...ద్వి. సారం
గ. ౩. ౧౦౧ పా. ౮ పం.

**కయికొను=కైకొను.** (√కయి¹.)

(పొందు, చెందు.)

ఉ. ఆయుధధార ముంచి రుధిరారుణచందనకర్ద
మంబునన్, గాయము నించి శాతవిశిఖప్రసూ
నావళి పైనిగిడ్చి దై, తేయులు శౌరిచేత నతి
తీవ్రముగాఁ గయికొంద్రు ముక్తి స్వా, ధ్యా
యతపోమఖక్రియలు వాల్చినధన్యులకంటె
ముందఱన్. ఉ. రా. ౫. ౧౮౫. పసు. ౩.
౧౬.

(లక్ష్యపెట్టు.)

ఉ. కొండకిరాతుఁ డంచుఁ గయికోక యసంగ

కభావణంబు లు,ద్దండక నాడితిక్... హర. ౭. ౧౦౦.

(చేపట్టు.)

క. కడు వేడ్క_తోడ నీకుం, గొడు కయ్యెడునంత కంటెఁ గోర్కి_యుఁ గలదే, జడుఁ డనక నన్నుఁ గయికొని, గెడ సేయుము నన్నుఁ గా_ర్తికేయునితోడక్. ఉ. హరి. ౫. ౧౩.

కయికోలుపు=కైకొలుపు. (√కయికొను.)

కయికోల=కైకోల. (కయి[1]+కోల)

కయిక్కోలు=కైకోలు. (√కయికొను.)

కయిచాఁపులు=కైచాఁపులు. (కయి[1] + చాఁపులు.)

కయిచెఱ=కైచెఱ. (కయి[1]+చెఱ.)

కయిజా=కైజా.

కయిజామోర=కైజామోర. (కయిజా + మోర.)

కయిజీతగాఁడు=కైజీతగాఁడు. (కయిజీతము + కాఁడు.)

కయిజీతము=కైజీతము. (కయి[1]+జీతము)

కయిజో=కైజో.

కయిత=కైత. వి. (సం. కవితా. ప్రా. కయిత.) కవిత్వము.

జః కయితగాఁడు.

కయితగాఁడు=కైతగాఁడు. (కయిత+కాఁడు.)

కయితప్పు=కైతప్పు. వి. (కయి[1]+తప్పు)

కయిదండ=కైదండ. వి. (కయి[1]+దండ) హస్తావలంబము, చేయూఁత; ఊఁత.

చ. అలసితి విందుబింబముఖి యక్క_ట యంగము చెమ్మరించె గు,బ్బల అవి కేల మాన్పు కటిభార మిఁకక్ గయిదండ గొమ్ము...ఉ. రా. ౬. ౬౬.

చ...నవ్వుచుఁ దద్బలదైత్యవైరిహ,స్తము కయిదండ గొంచు గిరిశప్రముఖాఖిలలోకపాలకుల్,క్రమమునఁ జేరి కొల్వ ... పారి. ౩. ౮౦. చంద్రి. ౨. ౫.

చ. చలువలపుట్టినిండ్లు నవసౌరభలక్ష్ముల కంతరంగముల్, మెలఁపులకు న్నివాసములు మెచ్చులచేరుగడల్ విరక్తతా,కలనల కెత్తుకోళ్లు తమకంబులకుం గయిదండ లామనిక్, మలయుచు వచ్చె గంధగిరిమంథరబంధురగంధవాహముల్. కవిక. ౮. ౧౨.

కయిదు=కైదు. వి. కైజు, పక్షివిశేషము.

ఉ. దూకము గాఁగ నేఁగుకయిదుం గని డేగటమీఁదనుండియుక్,దారునఁ దారి...చంద్రా. ౨. ౧౦౩. (శ. ర. పా.)

కయిదువ(వు)=కైదువ.

కయిప(వ)డు=కైపడు. (కయి[1]+పడు.)

కయిపదము=కైపదము. (కయి[1]+పదము.)

కయిపు(వు)=కైపు.

కయిముడి=కైముడి. (కయి[1]+ముడి.)

కయిమోడుపు(డ్పు)=కైమోడుపు. (కయి[1]+మోడుపు.)

కయిరఁడు=కైరఁడు.

కయిరవడి=కైరవడి.

కయిలాగు=కైలాగు. (√కయి[1])

(హస్తావలంబము, చేయూఁత.)

చ....గద్దియ డిగ్గి యందఱు,న్విడివల కంపి పూవిసరణిక్ హరిగ ల్చిగుడంగ జెట్లు వెం,బడిఁ గయిలా గొసంగఁ దెలిపావలు మెట్టి యొయారము మేర్పడక్. కువల. ౨. ౮౭.

కయిలాట=కైలాట.

జః కయిలాటకత్తె, కయిలాటకాఁడు.

కయిలాటకత్తె(త్తియ)=కైలాటకత్తె. (√కైలాట.)

కయిలాటకము=కైలాటకము.

కయిలాటకాఁడు=కైలాటకాఁడు. (కైలాట+కాఁడు.)

కయిలాటము=కైలాటము. (√కయి¹)

కయిలాసకి=కైలాసకి.

కయిలు=కైలు.

జ: కయిలుదారుఁడు.

కయిలుదారుఁడు=కైలుదారుఁడు. (√కయిలు)

కయివడి=కైవడి. (కయి¹+వడి)

కయివడిముస్తె=కైవడిముస్తె.

కయివసము=కైవసము. (కయి¹+వసము)

కయివారపుఁజెయ్యి=కైవారపుఁజెయ్యి. (కయివారము¹+చెయ్యి.)

కయివారము¹=కైవారము¹.

ఉ...దో,వారిశకోటి దాఁటి కయివారపువారి నదల్చి కిన్నరీ,చారణగానముల్ గలఁచి సమ్ముఖమంది భయంబు నందుచున్. ఘటికా. ౨. ౬౭.

ఉ. వందిజనంబు గ్రమ్మి కయివారముఁ జేయఁగ ...ఉ. హరిశ్చ. ౪. ౧౧౩.

జ: కయివారపుఁజెయ్యి, కయివారి.

కయివారము²=కైవారము².

కయివారి=కైవారి. (కయివారము¹+ఇ)

కయివీఁగు=కైవీఁగు. (కయి¹+వీఁగు.)

కయివా(వ్రా)లు=కైవాలు.

(వంగు, ఒఱగు.)

ఉ. వాడినమోముతోడఁ గయివాలినచూపులతోడ...వచ్చెఁ గి,గ్గాడియుఁ బోలెఁగామగవి గాఁడిఁగలయ్య నృపాలువీటికిన్. సుద. ౩. ౪.

(పడు)

చ...క్రిం,దికిఁ గయివ్రాలుశత్సలిలనిర్మలధార ...ఆము. ౪. ౨౧.

జ: కయివాలుచు.

కయివా(వ్రా)లుచే(ల్చు)=కైవాలుచే. (√కయివాలు)

కయిసదలు=కైసదలు. (కయి¹+సదలు.)

కయిసేఁత=కైసేఁత. (√కయిసేయు.)

క. ఎడ్డెకనపుఁగయిసేఁతల, రడ్డులు నడచిరి పురస్సరద్భూర్యముగా. పాండు. ౩. ౭౫.

కయిసేయు=కైసేయు. స. క్రి. (కయి¹+చేయు) (అలంకరించు.)

చ. చెలువలు బాలనిట్లు గయిసేయఁగఁ బైదలి యోర్తు రాగ మం,ఘ్రుల నలరించి ... వసు. ౫. ౧౨౩.

అ. క్రి. (అలంకారములు పెట్టు.)

చ. దినపరిణామలక్ష్మికిఁ బ్రతీచి తగన్ గయిసేయువేడుకన్. పారి. ౨. ౪౩.

కయ్య=క్రయ్య. వి. ౧. కాలువ; ఏఱు, నది.

సీ. కయ్య కాలువ యనఁ గనుపట్టుఁ గుల్య ... ఆం. భా. ౧. ౧౬౪.

(సముద్రుఁడు రామునితోననుమాటలు.) ద్వి.ఉప్పొంగి కయ్యల కొత్తి పెల్లొరిసి, తప్పించ నమ్మారుతముఁ జూచి మ్రోయ. రం.రా.యు. ౩౧౦ పొ. ౧౯ పం.

౨. కేదారము, పొలము.

సీ. మడి యనఁ గయ్య నా నడచుఁ గేదారంబు ...ఆం. భా. ౨. ౨౩౦.

కయ్యపుఁగ్రచ్చ, కయ్యాలక్రచ్చ. విణ. (√కయ్యము.) కలహశీలుఁడు.

ద్వి. గొడవగొట్టులు ముడివిడుపులు చాల,గడుసరుల్ కయ్యంపుఁగ్రచ్చలు పసిఁడి,వాఁపులు...,వన్నెకత్తెలు వారవనితలు మఱియు.

పండితా. పురా. ౧౧౬ పా.

సీ. కయ్యాలక్రచ్చయి కాలుద్రవ్వుమ సదా మండువాఁ డతిశాంతిమహితుఁ డయ్యె. పాండు. ౪. ౨౧౦.

ద్వి. కయ్యాల క్రచ్చలై కడఁగి యీవచ్చు, ద య్యాలముక్కులు దఱిగి దండింతు. ద్వి. హ రిశ్చ. పూ. ౨౦౮౨.

**కయ్యపుఁదిండి.** వి. (కయ్యము + తిండి) కలహశీల నుఁడు, నారదుఁడు.

గీ...కయ్యంపుఁదిండి, తపసికన్నాకు కతవిను తపసిఁ జూచి, యిట్లు లను... అచ్చ. రా. సుం. ౨. మల్లుపు. ౨. ౮౯.

**కయ్యము.** వి. (ప్రా. కయ్య.) యుద్ధము, పోరు; జ గడము, కలహము.

ఉ. అంతటు నింతకుఁ దెనుకయ్యె మొన లేర్చి చనంగ నెవ్వ సంక్రందనసూతి డగ్గఱియెఁ గయ్యము సేయుట కప్పుడి మ్మకుఁ. భార. విరా. ౪. ౧౮౪. ఆం. భా. ౨. ౨౨౨.

(వ్యవ)వాఁడు ఇద్దఱకునుకయ్యాలు పెట్టినాఁడు.

కయ్యమునకుఁ గాలుద్రవ్వు (దువ్వు, తాఁచు)= యుద్ధమునకు సిద్ధపడు; పోట్లాటకుసిద్ధమగు.

ఆ. కయ్యమునకు నెపుడుఁ గాలుద్రవ్వుదు కా ర్య,గతికిఁ జొరవు...భార. విరా. ౪.౨౦౭.

క. కుయ్యాడక నాముందఱఁ,గయ్యమునకుఁ గా లుదువ్వఁ గడఁగెను దీనిఁ,దయ్యాలకు బలి వెట్టెద, ప్రయ్యలుగా నఱికి యెల్లవారును జూడఁ. మొ. రా. సుం. ౭౦.

మ...నా,కమ్మగినేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్దాఁచులా గొప్పెడుఁ. కళా. ౧. ౪౨.

కయ్యమిచ్చు=పోరాడు.

చ...వే,వెలలును కయ్యమి మ్మని సవేగసముద్ధ తసింహనాదసం,కలితము గాఁగఁ బిల్చెట యు గ్రక్కున వెల్వడియెఁ మహేంద్రుఁ డుఁ. హరి. ఉ. ౪. ౧౬.

కయ్యాలగడుసు=యుద్ధమందు నేర్పరి.

క. అయ్యా పంతం బాడిన,యయ్యచ్చర యేమి చేసె నమరేశ్వరుఁడుఁ, గయ్యాలగడుసు తుది నే,మయ్యెం జెపు మన్న నతని కతఁ డి ట్లనియెఁ. కను. ౧. ౨౦౫.

సందడికయ్యము = దొమ్మియుద్ధము, సంకులయు ద్ధము.

వ. ఇవ్విధంబున నుభయబలంబులుం దలపడి సం దడికయ్యంబునం గదిసె...ఉ. హరి. ౩.౨౭.

జ: కయ్యపుఁగ్రచ్చ, కయ్యపుఁదిండి.

**కయ్యర.** వి. హీనజాతివిశేషము. (శ. ర.)

**కర$^1$.** వి. ౧. తరంగము.

సీ. కర డనఁ గడ లనఁ గర యనంగఁ దరంగ యనఁదరఁగ యనంగ నల యనంగఁ,దెర య నంగను వీచి పరఁగును...ఆం. భా.౧.౧౫౪.

౨. సేతువిశేషము.

సీ...కట్టువ కర గనిమ యనఁగ, సేతువిశేషంబు చెలఁగును ... ఆం. భా. ౨. ౮.

౩. (క. కరె. తు. కరె.) తీరము, దరి, గట్టు.

(శ్వేతద్వీపము) క. హరిభక్తి తేపగా దుస్తర సంసారాబ్ధిఁ గడచుసాధుజనులకుం, గరయై దివిజగణనిరం,తరనిత్యానందమయపదస్థితి నె సఁగుఁ. నృసిం. ౧. ౪౨.

**కర$^2$.** విశే. (సం. ఖరః) తీక్ష్ణము. (చూ.కరసాన.)

జ: కరసాన.

**కరంకము.** సం. వి. అ. పుం. ౧. కొబ్బెరబుఱ్ఱ. ౨. కమండలువు. ౩. కరండము, వక్కలాకుల పెట్టె. ౪. తల;తలపుఱ్ఱ. ౫. ఒకజాతి చెఱకు. ౬. కంకాళము, చర్మమాంసరహిత మగుఒడలి యెముకలగూఁడు. (వై. ని.)

**కరంజకము.** సం. వి. అ. పుం. కానుగు.

**కరంజఫలము.** సం. వి. అ. పుం. కపిత్థము.

**కరంజము.** సం వి. అ. పుం. కానుగుచెట్టు.

**కరండము.** సం. వి. అ. పుం. ౧. వెదురుమున్నగు వానితోఁ జేసినపూలసజ్జ. ౨. కరాటము, బరణి. ౩. మధుకోశము, తేనెపెర. ౪. కత్తి. ౫. కారండవము, ఒకానొకపిట్ట, కన్నెలేడి. ౬. యకృత్తు, కాలఖండము, కారజము.

**కరండి.** సం. వి. ఈ. స్త్రీ=కరండిక.

**కరండిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గరిడియ, వెదురు మొదలగువానితోఁ జేసినపూలసజ్జ. ౨. బరణి, కరాటము.

**కరంబము.** సం. విణ. (అ. ఆ. అ.) మిశ్రితము, కలుపఁబడినది. వి. అ. న. మిశ్రణము, కలుపుట. పుం. కరంభము, దధిమిశ్రితసక్తువు.

**కరంబితము.** సం. విణ. (అ. ఆ. అ.) మిశ్రితము, కలుపఁబడినది.

**కరంభకము.** సం=కరంభము.

**కరంభము.** సం. వి. అ. పుం. ౧. దధిమిశ్రితసక్తువు, పెరుఁగుతోఁ గలిపినపేలపిండి. ౨. వేఁచిన యవలు. ౩. పలువస్తువులు కలియఁగాఁబుట్టు పరిమళము. ౪. ప్రేంకణము, ప్రియంగువృక్షము. ౫. శతావరి, పిల్లపీఁచర.

**కరఁగించే=కరఁచే.** స. క్రి. (√ కరఁగు) కరఁగఁజేయు.

(మెత్తఁబఱచు.)

ఉ. చుట్టఱికంబునన్ మనసు సొచ్చి ననుం గరఁగించి వేఁడినన్, దిట్టతనంబు వోవిడిచి తీవ్రరణంబుకడంక దక్కినేఁ, బట్టినయాయుధంబు పెడఁబాసినఁ గాని వధింపఁ బోలదు... భార. భీష్మ. ౧. ౧౪౯.

(ద్రవింపఁజేయు.)

ద్వి. పరిపూర్ణచంద్రమఃప్రభ గరఁగించి, కరువు నఁ బోసిరో కాక శంకరుని. ప్రభు. ౨. ౧౩ పా. ౧౩ పం.

**కరఁగు.** అ. క్రి. (క. కరంగు. త. కరై. తు. కరగుని.) ౧. ద్రవమగు, నీరగు; రూపఱు.

క. లోహమయదైత్యనగరీ, గేహంబులు హరశరాగ్నికీలాజ్వాలా, దాహమునఁ గరఁగి మూఁడు సమూహములై పెద్దపెద్దముద్దలు నయ్యెన్. భీమ. ౪. ౧౪౧.

గీ. చెప్పకున్నఁ గోపించి యిషీక యెత్తి, చూలు గరఁగంగ వైవంగఁ జూచె గురుఁడు. కాశీ. ౪. ౨౨౭.

సీ. వలరాచరాచవాఁడలికాక్షుకను వెచ్చఁ గరఁగినయలకనికరపుఁజోటు. మనుచ. ౨. ౯.

౨. (ప్రేమాదులచే) పరవశమగు.

చ. రమణభుజానిపీడనఁ గరంగినకాంతలవిస్ఫురన్నితంబములఁ దలిర్చుసన్నవలిపంబులు వీడియు జారవయ్యె... నృసిం. ౩. ౭౧.

సీ. మాతాపితృత్వాభిమానులై నీదెసఁ గరఁగుగోపుఁడు గోపికయు సుకృతులు. హరి. పూ. ౬. ౧౯౮.

స. క్రి. కరఁగించు.

గీ. కుసుమబాణునిబాణముల్ గూడ నైదు, గరఁగి నేరమి వాటించి కరువు గట్టి, పోసి చేసి చైతన్యసంపుటము దగ ఘటించిరో కాక యిట్టిచేడియలు గలరె. భార. విరా. ౨. ౨౭.

ద్వి. రసము చేయఁగవచ్చు రాలు గరంగి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౨౦.

వి. కరఁగుట. (చూ. కరఁగుపడు.)

జ: కరఁగించు, కరఁగుపడు, కరఁచు.

**కరఁగుపడు.** అ. క్రి. (కరఁగు+పడు).

(పోవు, నశించు.)

వ...అంతరంగంబునం జెంగలించుకౌతుకాంకురంబు కరఁగుపడ వెఱఁగుపడి యుద్వేగసమన్వితుండై... మనుచ. ౬. ౯.

కరఁచేఁ=కరఁగించే.

(ద్రవింపఁజేయు.)

సీ. నిలిపి మూలాధారనిర్గతనిర్గుణధామంబు షడ్గ్రంథిదళనకారి,యై పోయి చరమాంబరామృతబింబంబు గరఁచఁగఁ దోడన తొరఁగుసోన. హరి. ఉ. ౫. ౧౭౪.

గీ. చెమట కింపురుషస్త్రీలచెక్కులందుఁ,గ్రమ్మి మృగనాభిపత్త్రభంగములు గరఁచె. హర. 3. ౫౯.

(మెత్తఁబఱచు.)

చ. కడుఁ గఠినంబు లద్రులు జగంబున నందున సంభవించి పెం,పడరునినుం గరంప వశమా యని నన్నిపు డంటివేకదా,వడిఁ గనకాద్రిఁ జాపముగ వంచిననీకు హిమాద్రిజాత యా,పడఁతిఁ గరంచు టెంత యనుపార్వతి మెచ్చుశివుం దలంచెదన్. అప్ప. ౧.౨౦.

(రూపఱఁజేయు.)

చ. కమలశరా నినుం జెఱపఁగా నియమించినఁ జేరి మూఁడుగా,ల్లమునలికావునం దయలలాటవిలోచనకీలి నిన్ను ని,క్కముగఁ గరంప కుండె ననికాద గిరీంద్రకుమారికావరుం, డమలినమంత్రదక్షుసవనావని నాతనిఁ బాఱఁ ద్రోలుటల్. కువల. ౪. ౭౭.

(బాధింప.)

చ...బాలికన్,గరఁచఁగరాదె యేల ననుఁ గ్రాఁచెద రీమకరాంకలాంఛనుల్. విజ. ౨. 3.౯.

కరక. వి. హరీతకి, కరకచెట్టు.

సీ. కరక యం చనఁగను బరఁగు హరీతకి...ఆం. భా. ౨. ౫౦.

గీ. ఆదివైద్యుఁ డతండు దుగ్ధాబ్ధిఁ బుట్టి,నమృతపూర్ణకుంభం బొకహస్తమునను, నంబుచరమును గరకకాయయును నొకటఁ, దాల్చి సాకారమైనశాంతరస ముసఁగ. హర. ౬. ౭3.

జ: కరకంచు, కరకాఁయ.

కరక. సం. వి. ఆ. స్త్రీ. వడగల్లు, కరకము.

కరకంచే. వి. (కరక+అంచు.) ౧. కరకాయ నీటితో వ్రాసినయంచు.

సీ. కరకంచువలిపంబు గట్టిగాఁ గాసించి వెలిత్రాడుగాస్పై బలియఁ జుట్టి. ద్వా. ౭. ౪౫. ఆం. భా. ౨.౧౫౪.

౨. కరకంచువస్త్రము.

సీ. ముత్తెలపందిళ్లు నుత్తరగోగ్రహణంబులు కరకంచు నాఁచుపన్నె,నిండుపన్నెలు...గీ... మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. ప్రబంధ. ౨౭౨.

వ...కదంబకావులును గరకంచులును బొమ్మంచులును ముడుఁగుబొమ్మంచులును ముయ్యంచులును...ద్వా. 3. ౧౭౭.

కరకంటకము. సం. వి. అ. పుం. చేతివ్రేలిగోరు. (త్రి. ని.)

కరకచము. సం. వి. అ. పుం. (జ్యోతి) యోగభేదము. (శనివారమునందు షష్ఠియు, శుక్రవారమునందు సప్తమియు, గురువారమునందు అష్టమియు, బుధవారమునందు నవమియు, కుజవారమునందు దశమియు, సోమవారమునందు ఏకాదశియు, ఆదివారమునందు ద్వాదశియు, తటస్థించినయోగము-వాచ.)

కరకచ్ఛపిక. సం. వి. ఆ. స్త్రీ. కూర్మముద్ర అను అంగుళిసన్నివేశము.

కరకణీ. వి. వేఁటాడుటకుపయుక్తమగు సాధనవిశేషము.

సీ. బలువిండ్లు బొట్టికోలలు తోలుమోకులు గొరకత్తళమ్ములు కరకణీలు. గీ. నాదిగా వేఁటలకు యోగ్యమై తనర్చు,సాధనంబులు సవరించి...రుక్మాం. 3. ౭౦.

**కరకము.** సం.వి. అ.పుం.న. ౧. కమండలువు. ౨. కొబ్బెరబుఱ్ఱ. పుం. ౧. కరక, వడగల్లు. ౨.దానిమ్మ*. ౩. కరంజభేదము*. ౪. మోదుగు*. ౫. కోవిదారము*. ౬. పొగడ, వకుళము*. ౭. కరీరము, వెణుతురు*. ౮. మామిడి*. (వై. ని.)౯. పక్షివిశేషము.

**కర(అ)కర¹(అ).** వి. (క. త. కరకర) వ్రాయుట, నమలుట, పండ్లుగీఁటుట,కొఱుకుట మున్నగువానియందగు ననుకరణము.

(వ్యవ)వాఁడు కరకరమని గంటముతో వ్రాయుచున్నాఁడు. వేఁచినవరుగులు వాఁడు కరకర నమలుచున్నాఁడు. నమలునప్పుడు గారెలు కరకరలాడుచున్నవి.

చ. కరకర పండ్లు గీఁటుచుఁ జెగంబడి ముట్టెను దుంగముస్తెలన్, నెరలిచి మేయుచున్ ... చెన్న. ౨. ౨౦.

ద్వి. కొఱుక జిల్లున నేయి గురియుచు వేఁగి,కఱకఱ మనుచుండుఁ గారవేళ్లములు. అ.మ.క. ౧. ౫౧పా. ౨౭ పం.

క. కఱక ఱనఁ బాఁపకుఱుకులఁ,గొఱికెడియొక దుప్పి మెఱుఁగుఁగోలం గూల్చెన్.సుద. ౩. ౧౮౧.

గీ. అందుల కసూయఁ గరకర మంచు మిగుల,దుష్టకపటవిచారవంతుఁడు జయంతుఁ, డంతకోపముఁ డొరా సుమంతుఁ డనుచు,నంతకోపముతో నుండు నాత్మలోన. సారంగ. ౩. ౧౨౭.

**కరకరపడు**=మండిపడు.

క. కరితురగస్యందనములుఁ, బరివారముఁ దెగిన పిదపఁ బటురోషమునన్, గరకరపడుచును నెదిరిన, ఖరకరవంశజుఁడు ద్రుంచె ఖరుని శిరంబున్. మొ. రా. అర. ౧౫.

**కర(అ)కర²(అ).** క్రి. విశే. ద్రు. (సం. ఖరః.) తీవ్రముగా; అత్యంతము, మిక్కిలి.

వ. ప్రొద్దు కరకరం బొడిచి రాఁగా ...రామా. ౬. ౨౦౫.

చ. కఱకఱ మండుచున్...సమీర. ౪. ౧౨.

సీ. బిరుదులు పచరించి కరకర నెదిరించి చక్రపాతంబుల సమయువారు. హ. వరాహ. ౨. ౨౯ పా.

ద్వి. ఆకీతి బంధువు లాయింతిచూలు,కరఁగునో యని కరకరఁ బొక్కి రంత. అ. మ. క. ౧. ౧౯ పా. ౬ పం.

చ. కఱటులు భూరుహాళ్ళపశుకల్పులు మత్క్రుతిఁ బ్రస్తుతించినన్,గఱకఱఁ బోవనాడినను గల్లవు నామది మోదభేదముల్. వేం. పంచ. ౨. ౧౩౭.

క. లోఁగిటికి రానిరూపముఁ,గాఁగిటికిన్ రాని పొందుఁ గారింపంగా,మూఁగినకుసుమశరంబుల,చేఁ గఱకఱఁ గంది సతిపచిత్తంబంతన్. ఉ. హరి. ౫. ౧౦౧.

**కరకరి.** వి. ౧. చలము, పట్టుదల.

సీ ...కరకరి చలము మచ్చర మనంగ,మాత్సర్య సంజ్ఞ లై మను ... ఆం. భా. ౧. ౧౩౫.

౨. ద్వేషము, స్పర్ధ; ఈర్ష్య.

చ.గరిమఁ గళింగజంబు లగుగంధగజంబులకుంభరాజితోఁ, గరకరి పుట్టఁగాఁగలదు కామిని నీవలిచన్నుదోయికిన్. నైష. ౫. ౧౩౨.

ద్వి. కరికరంబులతో డికరకరిం బెరిఁగి, కరమద్భుతం బైనకరభోరుయుగము. ద్వి.సిం. భాగ. ౩. ౪౭ పా.

చ...అతం డవమానము సేసి యాకృశో,దరి యొఱుఁగంగ నొండెడలఁ దత్పరుఁ డై విహరించు దానికిం,గరకరిఁ బొందియుండి యవుఁగా దన దాయమ గూఢచిత్తయై. దశకు. ౭. ౪౨.

౩. క్రౌర్యము.

చ.కరకరి గూఁటఁ గట్టి యిడఁ గా మొఱపెట్టెడు

లీల బాలభా,స్కరకరకాండకందళవిఘట్టన నించుక వాయివడ్డతా,మర మొఱవెట్టి పెట్టి పలుమాఱును వాకిలి దాఁటి యాఁగుచుఁ, మొరయువిపంచి మీటుగతి మ్రోసి యళుల్ వెడలెఁ గొలంకులఁ. మనుచ. ౩. ౬౦.

కరకరపడు=ద్వేషపడు.

క. హరిభక్తులై మహేశ్వరుఁ,బరువడి శివభక్తుల య్యుఁబంకరుహాక్షుం,గరకరిపడి దూషించి న, నరు లేఁగుదు రుగ్రమైననరకంబునకుఁ. పద్మ. ఉ. ౨. ౮౨.

జ: కరకరించు.

**కరకరించు.** అ. క్రి. (√కరకరి)స్పర్థవహించు.

గీ. అటుల వాఁడది హెచ్చని యాడుచుండ, వాఁడొకఁడు వచ్చి వానిపైఁ గరకరించి, యిదియె దొడ్డని పల్కెనే యీగరాను, నాచెయిని జూడు మటువెన్కఁ దోఁచు నీకు. పార్వ. ౬. ౭౦.

**కరకనా.** విశే. (సం. కర్కశమ్.) కఱకు.

ఉదా: కరకసానేల. (శ. ర.)

**కరకాంభస్సు.** సం. వి. స్. పు.–కరకవలె చల్లని నీరు గలది–నారికేళము, టెంకాయచెట్టు. (త్రి. ని.)

**కరకాసారము.** సం. వి. అ. పుం. శిలావృష్టి, వడగండ్లవాన.

**కరక్కాయ.** వి. (√కరక) కరకచెట్టుకాయ. (శ. ర.)

(వ్యవ) వానినోట కరక్కాయ గొట్టినాఁడు.

**కరగసము.** వి. (సం. క్రకచః. ప్రా.క. కరగస)ఱంపము, క్రకచము (శ.ర, బ్రా.)

ద్వి. కరగసంబులఁ ద్రెంచి కత్తులఁ గోసి,గొఱపంబులను దుస్సి కొఱవులఁ జూఁడి. రం. రా. ఉ. ౫౨ పా. ౮ పం. ('కరకసము'ము ద్రి. పా.)

**కరగోడ.** వి. వెలుగునాటుటకై పాడిమట్టితో నేర్పఱచినగోడ, కోరడి. (శ. ర.)

**కరగ్రహణము.** సం. వి. అ. న=కరగ్రహము.

**కరగ్రహము.** సం. వి. అ. పుం. ౧. పన్నుపుచ్చుకొనుట. ౨. పాణిగ్రహణము, పెండ్లి.

**కరఘుర్షణము.** సం. వి. అ. పుం. కవ్వము, తరిగోల.

**కరఘర్షి.** సం. వి. న్. పుం=కరఘుర్షణము.

**కరచ్ఛద.** సం. వి. ఆ. స్త్రీ. సిందూరపుష్పీ. (జాఫరాచెట్టు.)

**కరచ్ఛదము.** సం. వి. అ. పుం. టేఁకుచెట్టు.

**కరజము.** సం. వి. అ. పుం. ౧. నఖము, గోరు. ౨. కరంజము, కానుగు. న. వ్యాఘ్రనఖము, పులిగోరుచెట్టు.

**కరట.** సం. వి. ఆ. స్త్రీ. అఱ్ఱి, ప్రయాసముచే పిదుకఁదగినయావు.

**కరటము.** సం. వి. అ. పుం. ౧. ఏనుఁగుచెక్కిలి. ౨. కుసుంభవృక్షము. ౩. కాకి. ౪. వాద్యవిశేషము. ౫. నవశ్రాద్ధము, ఏకాదశాహాదిశ్రాద్ధము. ౬. బిల్వము, మారేడు. న. కుంకుమపువ్వు. (శే. ని.)

**కరటి.** సం. వి. న్. పుం–పెద్దగండస్థలములుకలది–ఏనుఁగు.

**కరటుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) ౧. నాస్తికుఁడు. ౨. నింద్యజీవి.

**కరటువు** సం. వి. ఉ. పుం. పక్షివిశేషము, పెద్దకొక్కెర.

**కరడము.** వి. అల, తరంగము, కరడు.

సీ. కాంతాదిసుఖము సైకతవేదికాస్థలి కందర్పవికృతులు కరడములును... కాఁగ. గీ. సమధికం బైనసంసారజలధియందు. భీమ. ౫. ౧౭౦.

**కరడు**[1]. వి. (బ. కరడులు, కరళులు, కరళ్లు) తరంగము, అల.

సీ. కరడు లేవట్టిసాగరముచందంబున నత్యంత గంభీరమై వెలుంగు. వా. రా. ౨. ౧౦౭. (కరుడు-ముద్రి.)

సీ. గగనంబుతో రాయుకరడులు గలజలం బివు రఁబాటినమహార్ణవము కరణి. భార. ద్రో. ౨. ౧౨౬.

గీ...కరళులఁ దేలి చనుచు. నిర్వ. ౮. ౪౯.

ఉ...కరళ్లపాఁటుతో...వరాహ. ౮. ౧౬.

**కరడు**[2]. వి. పక్షివిశేషము.

సీ. కూఁకటికువ్వ కుటాక కళ్కు కరడు...గీ. అనఁగ నిట్లని పక్షి భేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౮.

క. ... కలవింకము కంకణంబు కహ్వాము కరడుల్, గలగవము కనకభుక్కును, గళుకును గంకమును గాకి కక్కెర కైదుల్. ప్రబంధ. ౨౩౦. (కరుడు-ముద్రి.)

**కరణకమ్మలు**. వి. బ. ఒకశాఖబ్రాహ్మణులు. (శ.ర.)

**కరణత్రాణము**. సం. వి. అ. న-హస్తాదీంద్రియములచే రక్షింపఁబడునది; నేత్రాదీంద్రియములను రక్షించునది-తల. (కల్ప.)

**కరణము**. వి. (సం. కరణః. త. కర్ణమ్.) గ్రామపులెక్కలు వ్రాయువాఁడు, గణకుఁడు, కరణికుఁడు.

క. ధరఁ గవిభటమాన్యంబుల, హరణము గా లెక్క కవిలె నంటించెడి యా, కరణము పేరు సపిండీ, కరణము గద... కవిచౌ. శ. ౪౫.

వ...కరణాలు...దా. శా. ౪. ౧౧౦౧.

సీ. అలరును గరణ మంచన లెక్కవాఁ డన గణకాభిధానంబు...ఆం. భా. ౨. ౧౮౭.

**కరణము**. సం. విణ. (అ. ఈ. అ.) చేయునది, చేయుటకు సాధనమైనది. వి. అ. న. ౧. చేఁత, వ్యాపారము, పని. ౨. వాణిజ్యము. ౩. ఇంద్రియము. ౪. దేహము. ౫. సాధనము. ౬. పదమాత్ర. ౭. (వ్యాక) సాధకతమమైనది. ౮. కారణము. ౯. (సంగీ) గీతభేదము; తాళభేదము. ౧౦. నృత్యభేదము. ౧౧. వ్యవహారనిర్ణయసాధన మగుపత్త్రము సాక్ష్యము, మొ. ౧౨. పూఁత. ౧౩. క్షేత్రము; పొలము. ౧౪. (యోగ) ఆసనము. ౧౫. రతిబంధము. ౧౬. (జ్యోతి) బవాది. (ఇవి ౧౧. బవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వణిక్కు, భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము.) ౧౭. ఒకానొక దేశము.

ఉ. వీఁ డిదె తెల్లనాకులను వీడెముసేయుచు వీథి వచ్చుచు, న్వాఁడు మదించి తిండి తిని వాఁడుచుమీఁ యిటమీఁద నేడకో, తేఁడఁ గఁ బోయెడిం గరణదేశపుజాణగ నుండఁ బోలు నీ, బాఁడు పణోపహారపరిపాటి గనుంగొనవచ్చు వీనిచేన్. క్రీడా. ౧౫౯.

౧౮. కాయస్థుఁడు. (వీనివృత్తి లెక్క వ్రాయుట); లెక్క వ్రాయువాఁడు.

గీ. ముదుకరలపాగయును బాహుమూలమందుఁ, గవిలె చర్మపుటొఱలోనికత్తిగంట, మలఁతి నీర్కావిదోవతు లమర గ్రామ, కరణమేతెంచి రెడ్డిచెంగట వసించె. శుక. ౨. ౪౧౬.

**కరణాధిపుఁడు**. సం. వి. అ. పుం. ౧. జీవుఁడు. ౨. ఇంద్రియాధిష్ఠానదేవత.

**కరణి**. వి. విధము, రీతి, చందము.

సి. హయములఁ జెండాడ నరుగుచోట్లను లేళ్లగమిఁ గిట్టుకోల్పులికరణి యొలయు. గీ... అశల్యునందు. భార. శల్య. ౧. ౨౩౨.

క. తరణి వొడిచి తమము సెలచు, కరణిని లోకమునఁ గలుగుకల్మష మెల్లన్, ధరణిపతి

ధర్మ మాత్మ,స్ఫురణంబునఁ జెలుచు విమల
బోధనచరితా. భార. శాం. ౨. ౧౬౦.

గీ... రెండవవేల్పు లేని,కరణిఁ గొలువున్న దొ
రఁ బొడగాంచి యపుడు. నీలా. ౨. ౫౦.

కరణివోలెన్=కరణిన్, విధముగా.

సీ. పూర్వదిక్సతి కలిస్ఫురణతో నుతసుధాకర
రేఖ యుదయించుకరణివోలెఁ, ద్రిదివంబు
నందు సమ్మద మొందఁ గల్పలతాంకుర ముద
యించునట్లువోలె.అ... మేనక కుదయించె,
రాజవదన శైలరాజకన్య. కు.సం. ౩.౨౭౨.

**కరణికము.** వి. కరణముయొక్కపని, గణకవృత్తి.

గీ. బ్రదుకుఁబొద్దుల జనులకు నుదుటూఁకుఁ,గవి
లెను లిఖింప నేర్చినకరణికంబు, గరిమ నొ
ప్పారు ధాత జగద్విధాత.ఘటికా. ౧.౨౨.
ఆం. భా. ౨. ౧౮౭.

**కరణీకుఁడు**=కరణము.

ద్వి. బిగువుగాఁ జెంపఁ దోఁపినబలపములు, తగ
నలవడఁగ నత్తుటిఁ గరణికులు, చను దెంచి
నిలిచి హస్తములు మోడ్చుటయు. ద్వి. పర
మ. ౬. ౪౫౮ పా. ౬ పం.

**కరణీయము.** సం. విశే. (అ. ఆ. అ.) కర్తవ్యము, చేయఁదగినది.

**కరణుఁడు.** సం. వి. అ. పుం. శూద్రస్త్రీకిని వైశ్యునకును బుట్టినవాఁడు.

**కరతలము.** సం. వి. అ. పుం. అఱచేయి.

**కరతలామలకము.** సం. వి. అ. న. అఱచేతిలోని యుసిరికకాయ. (ఇది ఒకరు తెలుపనక్కఱలేకయే తనంతటనే స్పష్టమగుదానికి ఉపమానముగాఁ జెప్పఁబడును.)

**కరతాళము.** సం. వి. అ. న. ౧. చప్పట. ౨. చేతులతో వాయించుతాళము, వాద్యవిశేషము.

**కరతాళి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. చప్పట. ౨. చేతులతో వాయించుతాళము.

**కరతాళిక.** సం. వి. ఆ. స్త్రీ.=కరతాళి.

**కరతిత్తి.** వి. (సం.కరదృతిః.) తములపాకులుమున్నగునవి యుంచుకొనెడు చేతిసంచి.

ద్వి. అయిపుడో వతియుఁ బంచాంగంబు ముష్టిఁ,
బిగినకరతిత్తి పత్త్రాలసంచి. ద్వి. హరిశ్చ.
ఉ. ౫౦౩ పం.

గీ. క్రముకభంగపరంపరాకలిత మయిన, వన్నె
కరతిత్తి మేఖలాపల్లి నిడికి. వేం. పంచ. ౪.
౨౪౮. (చి. ని. పా.)

**కరతోయ.** సం. వి. ఆ. స్త్రీ. సదానీర,ఒకానొకనది.(ఇదిగౌరీవివాహకాలమందు హిమవంతునిచే ఈశ్వరునిహస్తమునఁ విడువఁబడినదానోదకము వలన నేర్పడినది.)

**కరదివియ(వె)**=కరదివ్వె. (శ. ర, చి. ని.)

**కరదివ్వె(వ్వియ)**=కరదీవ. వి. (సం. కరదీపికా. ప్రా. కరదీవిఆ) కరదీప,దివటీ.

ద్వి. కరమునఁ బూనినఖడ్గ కాళ, మరుదుగాఁ
గరదివ్వెయై తోఁచఁ జ... . ద్వి. హరిశ్చ.
పూ. ౧౮౫౬ పం.

**కరదీపిక.** సం. వి. ఆ. స్త్రీ. దివటీ.

శ్లో: వృద్ధస్య భార్యా కరదీపికేవ.

**కరదుఁడు.** సం. విశే. (అ.ఆ. అ.) ౧. పన్నుఇచ్చువాఁడు. ౨. చేయూఁతఇచ్చువాఁడు; అభయహస్త మిచ్చువాఁడు.

**కరపక్క.** వి.(త.కర్తై పొప్పక్కు.)వన్నెతగ్గినకెంపు.

సీ. పద్మరాగాభిధ పరఁగుఁ గెంపన నది వన్నె
తగ్గినఁ గరపక్క యండ్రు.ఆం.భా.౨.౨౭౭.

**కరపత్త్రము.** సం. వి. అ. న. ౧. క్రకచము, అంపము. ౨. జలక్రీడ.

**కరపత్త్రవంతము.** సం. వి. త్. పుం. తాటిచెట్టు.

**కరపత్త్రిక.** సం. వి. ఆ. స్త్రీ. జలక్రీడ, చల్లులాట.

**కరపర్ణము.** సం. వి. అ. పుం. ౧. భిండావృక్షము, బెండచెట్టు. ౨. ఎఱ్ఱాముదపుచెట్టు.

**కరపాని.** వి. రోగవిశేషము, ఒకవిధమైన చిడుము. (బ్రా-చూ. కట్టుకరపాని.)

**కరపాత్రము.** సం. వి. అ. న. జలక్రీడ, చల్లులాట. (కల్ప.)

**కరపాలము.** సం=కరవాలము.

**కరపాలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఈలి, చిన్నకటారి. (కే. ని.) ౨. హస్తయష్టి, దుడ్డుకఱ్ఱ. (వాచ.)

**కరపాలిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఈలి, చిన్నకటారి. ౨. చిన్నగదవంటి చేతికఱ్ఱ, దుడ్డుకఱ్ఱ.

**కరపీడనము.** సం. వి. అ. న. పాణిపీడనము, పెండ్లి.

**కరపుచ్ఛ్వ.** వి. సోమకర్కటిక. (శ. ర.)

**కరపుటము.** సం. వి. అ. పుం. అంజలి, దోసిలి.

**కరపృష్ఠము.** సం. వి. అ. న. మీఁజేయి.

**కరబదరము.** సం.వి. అ.న. చేతిలోని రేఁగుపండు. (ఇది 'కరతలామలకము' వంటిది.)

శ్లో. ...రామవృత్తం, కరబదరసమానం ప్రేక్ష్య దృష్ట్వా ప్రతీచ్యాం. సం. చం. రా. బాల.౮.

**కరబూజా.** వి. (హిం. ఖర్బూజా) ఒకజాతిపండు. (శ.ర.)

**కరభప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. క్షుద్రదురాలభ, తీఁటకసింద.

**కరభము.** సం. వి. అ. పుం. ౧. మనికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదటిదాఁకఁ గలచేతి వెలుపలిభాగము. ౨. ఒంటెపిల్ల. ౩. ఏనుఁగుగున్న. ౪. ఒంటె. ౫. నఖమనుగంధద్రవ్యము. ౬. గార్ధభము, గాడిద.

**కరభవల్లభము.** సం. వి. అ. పుం. ౧. గోఁగు, పీలువృక్షము. ౨. వెలఁగ.

**కరభాదని.** సం. వి. ఈ. స్త్రీ-కరభములచే తినఁబడునది-క్షుద్రదురాలభ, తీఁటకసింద.

**కరభువు.** సం. వి. ఊ. పుం. చేతిగోరు.

**కరభూషణము.** సం. వి. అ. న. కంకణము, చేతికడియము.

**కరమట్టము.** సం. వి. అ. పుం.పోఁక. (త్రి.ని.)

**కరమరి.** సం. వి. న్. పుం. బంది, చెఱసాలలో నున్నజనుఁడు. (వాచ.)

**కరమర్దము.** సం. వి. అ. పుం. కృష్ణపాకఫలము, కలివె.

**కరమర్ది.** సం. వి. ఈ స్త్రీ. చిన్నకలివె.

**కరమాల.** సం. వి. ఆ. స్త్రీ. అంగుళిపర్వమాల.(అనామికనడిమికనుపు ఒకటి, దానిక్రిందికనుపు రెండు, చిటికెనవ్రేలిక్రిందికనుపు మూఁడు, దాని నడిమికనుపు నాలుగు, దానిపయికనుపు అయిదు, అనామికపయికనుపు ఆఱు, నడిమివ్రేలిపయికనుపు ఏడు-నడిమివ్రేలి నడిమికనుపును దానిక్రింది కనుపును మేరువుగా నెంచివిడువఁబడినవి-తర్జనిపయికనుపు ఎనిమిది, దానినడిమికనుపు తొమ్మిది, దానిక్రిందికనుపు పది. ఇట్లు లెక్కించుచు జపము చేయుదురు.)

**కరము.** అవ్య. (క. కరం) అత్యంతము, మిక్కిలి.

క. కర మిష్టము సేసితి మా, కరిసూదన దీన నీకు నగు సత్ఫలముల్ ... భార. ఆది. ౧.౧౧౯.

గీ. కడిఁది పేర్గోచి యాప్రోలు కరము మెఱయు. అచ్చ. రా. బాల. ౩౨.

ఉ. వాన కరంబు దీఱుటయు ... ఉ. రా. ౧. ౧౦౪. (ఇట 'నిశ్శేషముగా' అని యర్థము.)

(కొన్నిపట్లవృత్తియందు 'ము' వర్ణలోపము వైకల్పికము. చూ. కరవాఁడి, మొ.)

జ: కరవాఁడి, కరవేదన.

**కరము.** సం.విశ. (అ.ఈ.అ)-ఇది సమాసాంతము నందే యుపయుక్తము-చేయునది.(ఉదా:దుఃఖ

కరము, విద్య విత్తుకరి.)వి. అ. పుం. ౧. హస్తము, చేయి. ౨. కిరణము. ౩. ఏనుఁగుతొండము. ౪. కప్పము, పన్ను. ౫.కరక,వడగల్లు. ౬.(గణిత) ౨౪ అంగుళములకొలత. ౭. హస్తనక్షత్రము. ౮. శ్వేతశాలి, తెల్లవరిఁ. ౯.హింస.౧౦.ముద్ర. ౧౧. విక్షేపము, చిమ్ముట. న. ౧.ఇంద్రధనుస్సు. (కే. ని.) ౨. అన్నము.(వై. ని.)

**కరముక్తము.** సం.వి.అ.న-చేతితోపట్టుకొని విసరి వేయఁబడునది-శక్తి,మొ.ఆయుధము.

**కరరుహము.** సం. వి. అ. పుం. చేతిగోరు.

**కరవటము**=కరాటము.వి.(సం.కరండః)బరణి; శీర్ణకరండము, ఒకవిధమైనబరణి?

గీ. పొదలి యొండొండ దివియును భువియు దిశలుఁ, బొదివికొనియెడిచీకటిప్రోవువలన, మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్టి,కరవటంబన జగదండఖండ మమరె. నృసిం. ౩. ౮౦.

చ. దళ మగుచంద్రఖండములు దారలు సాంకవమొప్పుపాణిపా,టల మగుదంతపుంగరవటంబు శశాంకుఁడు గుంకు మైనచీ,గలజిగి కెంపుగా బయటిరథ్యల నొప్పుదు రిందుకాంతవే,దులపయి సంధ్యయే బహుతఁ దోఁచె ననన్బురి గట్టివాల్సతుల్. ఆము. ౨. ౨౩.

సీ...భరణి మీఱును దార్వు బరణి డబ్బి,శీర్ణకరండంబు చెలఁగుఁ గరాటంబు కరవటం బనఁగను ... ఆం. భా. ౨. ౧౬౬.

**కరవాఁక.** వి. సముద్రపుగట్టునోరనుండెడి చెమ్మనేల. (శ. ర.)

**కరవాఁడి.** విశ. (కరము+వాఁడి.) మిక్కిలివాఁడియైనది.

గీ. ఔర కరవాఁడిచూపులయాఘుళంబు ...అనఁగ,నేరుపుల మింతు రప్పురివారసతులు. పాండు. ౧. ౧౧౭.

**కరవాయి.** వి. (క. కరవాయి). లోహకారుఁడు సుత్తెతోఁ బాత్రములను చాఁగఁ గొట్టునపుడు ఒత్తుడుగా వానిలోపలఁ జొప్పించెడి మొనవంపుదిమ్మెమొగపుఇనుపకమ్మి. (శ. ర.)

**కరవాలము.** సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

**కరవాలిక.** సం. వి. ఆ. స్త్రీ=కరపాలిక.

**కరవాలు.** వి. (సం. కరవాలః. క. కరవాల, కరవాళ్. త. కైవాళ్) ఖడ్గము, కత్తి.

క. తివిరి కరవాలు సేకొని,అవఅవ లెసఁగంగ నత్తెఅవపైఁ జనుచో. అచ్చ. రా. సుం. ౫౮.

క... అ,వ్వాలుమగఁడు పలకయుఁ గర,వాలుం గొనుటయు నొకండు వడిఁ దునుమాడెన్. మార్క. ౮. ౧౦౮. ఆం. భా. ౨. ౨౧౪.

**కరవీర.** సం. వి. ఆ. స్త్రీ. మణిసిల. (కే. ని.)

**కరవీరకందసంజ్ఞము.** సం. వి. అ. పుం. తైలకందము, ఒకజాతికందిఁ.

**కరవీరకము.** సం.వి.అ.పుం. ౧. కరవీరము, గన్నేరుఁ. ౨. ఏఱుమద్ది, అర్జునముఁ. ౩. ఖడ్గము,కత్తి. ౪. గన్నేరువేరునుండితీయువిషభేదము.

**కరవీరభుజ.** సం. వి. ఆ. స్త్రీ. ఆఢకి, కందిఁ.

**కరవీరభూష.** సం=కరవీరభుజ.

**కరవీరము.** సం. వి. అ. పుం. ౧. కత్తి. ౨. గన్నేరుఁ. ౩. శ్మశానము,వల్లకాడు. న.గన్నేరుపూవు.

**కరవీరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పుత్రవతియగుస్త్రీ. ౨. అదితి. ౩. మంచియావు.

**కరవేదన.** మి.వి.(కరము+వేదన)అధికదుఃఖము.

చ. మొదలనె ముద్దరా లగుట మోహభయంబునఁజేసి శ్రద్ధ యే,నదిదరిఁ బుణ్యతాపసవనంబులలోపల డాఁగి యున్నదో,వెదకుద మంతదాఁకఁ గరవేదన మానుము ...ప్రబోధ. ౩. ౮.

**కరశాఖ.** సం. వి. ఆ. స్త్రీ. అంగుళి, వ్రేలు.

**కరశీకరము.** సం. వి. అ. పుం. ఏనుఁగుతొండము నుండి చిమ్మఁబడు నీటితుంపర, వమథువు.

**కరశూకము.** సం. వి. అ. పుం. చేతిగోరు.

**కరసాన.** వి. (√కర²-సం. ఖరశాణః. క. కగసాణె.) ౧. బాణములు మొనలు మున్నగునవి సానఁబట్టెడు చక్రాకారమైనసాన.

ఉ...మరుసాయకముల్ గరసానఁ బట్టి...నిర్వ. ౬. ౪౩.

గీ. త్వష్ట చను దెంచి లోకబాంధవునిఁ గాంచి, దేవి సంజ్ఞవిధం బెల్లఁ దెలియఁ జెప్ప,యతని తీవ్రమయూఖసహస్రకమున, నెనిమిదవపాలు కరసానఁ దునియఁ బట్టె. వి. పు.౪.౩౯.

౨. గంధముతీసికొనెడు చిన్నసాన.

సీ. కరసానఁ దిగిచినకలివెగందపుబొట్టు తిరికట్టు కొని మోము దిరిగి యుండ. క్రీడా. ౨౨౬.

**కరహాటము.** సం. వి. అ. పుం. ౧. తామరదుంప. ౨. మంగ,పిండీతకవృక్షము.

**కరా**=కర². (చూ. కరామరకత్తి, మొ.)

జః కరామరకత్తి, కరామరి, కరామూరి, కరాపువు.

**కరాంగణము.** సం. వి. అ. న. కప్పము వసూలు చేయుచోటు.

**కరాంబుకము.** సం. వి. అ. పుం. నీటియుసిరికె.

**కరాఘాతము.** సం. వి. అ. పుం. చేతిదెబ్బ, చఱపు.

**కరామొరకత్తి**=కరామొరి, కరామూరి, వి. (√కరా-క.కరామూరి. త. కైచ్చురికై.) ఖడ్గము,కత్తి.

సీ. డాకెలంమన సిరాజీకరామరకత్తి ... మను చ. ౪. ౨౯.

**కరామొరి**=కరామొరకత్తి.

వ...కనకమేఖలాఘటితం బగు చేరుకరామరిమ రకతంపుఁబిడిమెఱుంగులు...మనుచ.౫.౭౧.

**కరామూరి**=కరామొరకత్తి.

క. రామూరితిమ్మవిభునిక,రామూరిం దెగి నిరంతరము నమరమృగీ,లోచనలమదవశాస్త్రా,లోచనలం దవిలి వర్తిలుదు రభియాతుల్. రామా. ౧. ౬౧.

**కరాటము**=కరవటము.

(బరణి; శీర్ణకరండము, ఒకవిధముగుబరణి ?)

వ...మంచులకరాటంబులును...ప్రబంధ. ౭౮.

(కీర్తికాంతావర్ణనము.) సీ. పమ్ముకాటుకకరాటమ్ము ఘోరారిదుష్కీర్తిసంభృతగోదసీతలమ్ము. చంద్రా. ౧. ౪౫.

గీ. బరణియుఁ గరాట మను పేళ్లు ధరణి కమరు. సాం. ని. స్థా. ౬౪.

సీ. శీర్ణకరండంబు చెలఁగుఁ గరాటంబు కరవటం బనఁగను...ఆం. భా. ౨. ౧౬౬.

**కరాతు.** వి. మల్లబంధవిశేషము. మల్లు పు. ౩. ౬౯.

**కరాపువు.** వి.(√కరా)-కారముగలపువ్వు-లవంగము. (శ. ర.)

**కరామర్దము.** సం.వి. అ. పుం.కరమర్దము,కలివె.

**కరామ్లకము.** సం.వి.అ. పుం. కరమర్దము,కలివె.

**కరారోటము.** సం. వి. అ. పుం. అంగుళీయకము, వ్రేలియుంగరము. (త్రి. ని.)

**కరాళ.** సం. వి. ఆ.స్త్రీ. ౧. దుర్గామూర్తిభేదము. ౨. శారిబ, మామెన, సుగంధిపాల.

**కరాళము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. వెఱపుపుట్టించునది, భయానకము. ౨. ఎత్తయినది,తుంగము. ౩. దంతురము, మిట్టపండ్లుగలది.౪. విశాలము. (శే. ని.) వి. అ. పుం. ౧. సర్జరసముతోఁ గలసిననూనె. ౨. ఒకానొక దంతరోగము ౩. కస్తూరీమృగము. న. ౧. చమురులో వేఁపఁబడిన సంబారు. ౨. కృష్ణతులసి.

**కరాళి.** విశ. (సం. కరాళః.) ౧. దుష్టము, చెడ్డది

ఉ. వాలి ప్రతాపకేళిఁ గడువాలి కరాళితనాన
నాన లో, మాలి విరాళి హేళిసుకుమారుని
మోహపుటాలి సైంద్రసీ,లాళిమదాళివేణి జ
వరాలి గ్రహింప...సమీర. 3.3. శుక. 3.
3౪౯.

౨. భీకరము.

గీ. కాళి యెక్కు కరాళిసింగంబునైన, మరపు
కోఁగల మొకయింతమందు పెట్టి. వరాహ.
౪. ౭౫.

జ: కరాళించు.

**కరాళి.** సం. వి. ఈ. స్త్రీ. అగ్నిజిహ్వాలలోనొకటి.

**కరాళించు.** అ. క్రి. (√కరాళి) అఱచు, బొబ్బ
రించు; గర్జించు; సకిలించు; మొఱఁగు.

వ. అని భర్జించుచున్న దేవయానిపలుకులు విని
కరాళించి మ్రోఁగుచున్న భుజంగిచందంబున
నిట్టూర్పులు నిగిడించి పెదవులు గొఱుకుచు
శర్మిష్ఠ యిట్లనియె. భాగ. ౯. ౫౨౦.

వ...పయఃపారావారమధ్యంబున నమృతాహర
ణార్థంబు దిరుగుమహామందరంబు తెఱంగున
మహాభీకరంబు గాఁగఁ గలఁచి కరాళించి
...అగ్గణరాజకంఠీరవుండు...వీర. ౪. ౧౦౭.

ద్వి. కాలకౌశికుఁ డౌడు గఱచి నిప్పుకలు,రాల
వీక్షించి కరాళించి పలికె. ద్వి. హరిశ్చ.
ఉ. ౮౬౮ పం.

ద్వి.ఎక్కినదైతేయు లిటునటుఁ బడఁగ, లెక్క
సేయక కరాళించుగుఱ్ఱములు.రం.రా. యు.
౪౨౧పా. ౨౬ పం. (శ. ర.పా.)

వ...కరాళించుసారమేయంబులును ... భాగ.
౧౦ పూ. ౧౧౯౬.

స. క్రి. నిందించు, తిరస్కరించు.

(వీరబాహుఁడు నక్షత్రకునితో నన్నమాట)

ద్వి. వక్క సేయనిలేకివాఁ డని నన్ను, లెక్క
సేయక కరాళించె నీరాజు. ద్వి. హరిశ్చ.
ఉ. ౧౪౭౪ పం.

**కరాళిక.** సం. వి. ఆ. స్త్రీ. దుర్గ. (వై. ని.)

**కరాళికము.** సం. వి. అ. పుం. ౧. వృక్షము. ౨.
కత్తి. (వై. ని.)

**కరి.** వి. (త. కరి). ౧. నిదర్శనము, దృష్టాంతము.

ద్వి. నెలుపల మూరెఁడు మొలకచ్చతోఁక, వల
య లింగంబులోపలఁ బ్రవేశించె, భంగిగా
మాశివభక్తు లెయ్యెడల, నెంగళివేల్పుల వినఁ
గ నొల్లమికి, నరియమ గట్టినయయ్యంబరం
బు,కరి గాదె నేఁడును గానవచ్చెడిని.బస.
పు. ౬. ౭౩౦ పం.

చ. అలమలయాద్రికుంభభవుఁ డన్కతకంబు శ
రత్తు కుండమం,దలిప్రతిబింబకైతవమునం
దమ కిచ్చిన వారిదేవతల్, తొలఁకులకేలఁ
దాప నిడి తోమఁ గలం కడఁగెం దదీయత,
త్ఫలతకు హ్రస్వ మాటె కరితారక లంబు
వుఁ దేర్చునే యనన్. ఆము. ౪. ౧౪౯.

౨. మేర, హద్దు.

వ. అందఱు హరిణక్రీడనం బనునాటకుం దొ
డంగి ...

క. భాండీరవటము కరిగా,నొండొరులం గడవఁ
జేర్చి యొక్కట హరిణో,చ్చండగతి దాఁ
టుచుం గడుఁ,జండరభసమునఁ గడంగి సరి
సేయంగన్.

వ...ఇట్లు గెలిచినవారి నోటుపడినవారు తమ
తమయఱకట నెక్కించుకొని కరిదాఁకం
బోవలయుట నవ్విధంబొనర్చునప్పుడు.హరి.
పూ. ౭. ౯౨, ౯౩, ౯౪. ఆం. భా. 3. ౬౧.

3. నియమము.

క. ఈతేజోనిధి కర్ణామె,రాతిరి సత్కాంతిఁ
జెందరామి యనుచు ఖ,ద్యోతు రెయి సరు
చిఁ జేయు వి,ధాతకరిం గడచి నీప్రతాపము
శౌరీ. ప్రబంధ. ౧౪౫.

౪. గురి, లక్ష్యము.

క. పరు లెఱిఁగిన నాఁడికిం,గరి యగు ననుతలఁ
పు లేక గతధృతి నవనీ,శ్వరసుత విరివేనలి
తోఁ,బురపురఁ బడి యేడ్చుచుండె భూభా
గమునన్. దశకు. ౪. ౬౯.

విశ. సాక్షి.

సీ. సాక్షి యొప్పును సాకి సాకిరి కరి యన ...
ఆం. భా. ౨. ౩౦౪.

ఆ. కరము సాఁచి యగ్ని కరిగాఁగ సఖ్యంబు,
చేసినార మగుటఁ జెలిమి దలఁచి. భా. రా.
కిష్కి. ౧. ౧౦౨. భార. ఆది. ౨. ౧౧౯.

జ: కరిగొను.

కరి. సం.వి. న్. పుం. ౧-తొండముగలది-ఏనుఁగు.
౨. ఎనిమిదిఅనుసంఖ్య. ౩. నాగకేసరము‡.

కరిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడేనుఁగు. ౨. నఖ
రేఖ, గోటినొక్కు. శిశు. ౪. ౨౯.

కరికము. సం. వి. అ. పుం. విట్ఖదిరము, దుర్గంధము
గలచంద్ర‡. (వాచ.)

కరికుసుంభము. సం. వి. అ. పుం. నాగకేసరచూ
ర్ణము. (కల్ప.)

కరిగర్జితము. సం. వి. అ. న. బృంహితము,ఏనుఁగు
గీఁక.

కరిగొను. స. క్రి. (√కరి.) సాక్షిగాఁజేసికొను.

క. అరిగిన సుదారకుండును, బరిభూతుఁడపోలె
సాధుభావముతోడన్, దొరల కెఱిఁగించి
వారలఁ, గరిగొని యేతెంచె నింటికడకుఁ
గడంకన్. దశకు. ౬. ౫౬.

కరిజె. వి. భక్ష్యవిశేషము.

వ...కరిజలు పారివిళంగాయలు తిమ్మనంబులు
పాలకాయలు చక్కిలంబులు... మొదలుగాఁ
గలభక్ష్యంబులు...ప్రబంధ. ౧౧౨. హంస.
౧. ౧౦౫.

కరిజెకాయ. వి. భక్ష్యవిశేషము.

వ...ముత్తెపుఁజిప్పలుఁ జంద్రకాంతలుఁ గరిజ
కాయలు...ఆదిగాఁగలభక్ష్యంబులు... హం
స. ౧. ౧౦౫.

గీ. గారె లతిరసాలు బొబ్బట్లు కరిజకాయ,లట్లు
బూరెలు జంతికచుట్లు మణుఁగుఁ,బూలు...
చెన్న. ౪. ౩౫౯.

కరిణాలు. వి. బ. సాలెవారిలో నొకతెగవారు.
(శ. ర.)

కరిణి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడేనుఁగు.

కరిణె(ణియ). వి. మృదంగముఖచర్మమంపలికృష్ణ
మండలము. (చి. ని, వా.)

కరి(రీ)త. సం. విశ. (ఋ. త్రీ.ఋ.) ౧. చిమ్మువాఁ
డు, చల్లువాఁడు. ౨. హింసించువాఁడు.

కరి(రీ)తవ్యము. సం. విశ. (అ. ఆ. అ.)౧. చిమ్మఁ
దగినది, చల్లఁదగినది. ౨. హింసింపఁదగినది.

కరిదారకము. సం. వి. అ. పుం-ఏనుఁగునుచీల్చున
ది-సింహము.

కరిది. వి. చర్మవాద్యవిశేషము.

గీ...ఉరుమ యనఁగఁ గరిది యనఁగఁ,దప్పెట
యనంగ వాద్యభేదములు చెలఁగు. ఆం. భా.
౧. ౧౨౯.

కరిని. వి.చెవులయొద్ద కంతివలె పుట్టుప్రాణివిశేషము.

ఆ. చేతరాసియైనఁ జెంచలంబయినను, గుమ్ము
నందుఁ గ్రుక్కిసమ్మడమునఁ, గట్టఁ బొలిసిపో
వుఁ గరి నపవిత్రంపు,గడ్డలైన నీరు గాఁచు
చు. చికి. (చూ.కుమ్ముక్రింది-చి. ని.)

కరిపత్త్రము. సం. వి. అ. న.తాళీసపత్త్రము, తాళి
సపత్రి‡. (రా. ని.)

కరిపోతము. సం. వి. అ. పుం. కలభము, ఏనుఁగు
గున్న. (ఇట్లే: కరిశాబకము, కరిశాబము, మొ.)

**కరిమాచలము.** సం.వి.అ.పుం.సింహము.(త్రి.ని.)

**కరిముఖుఁడు.** సం. వి. అ. పుం. గజముఖుఁడు, వినాయకుఁడు.

**కరిరతము.** సం. వి. అ. న. రతిబంధవిశేషము.

శ్లో. భూగత స్తనయుగాస్యమస్తకా, మున్నతస్ఫిజమధోముఖీం స్త్రియం, క్రామతి స్వకరకృష్టమేహనే నల్లభే కరిరతం తదుచ్యతే. (రతిరహస్యము)

**కరిరము.** సం. వి.అ.పుం.న. కరీరము, వెణుతురు.

**కరివియ**=కరివె. (చి. ని.)

**కరివె(ర్వె).** వి. ఇత్తడిలోనగువానితోఁజేసి వీణాదండమును బొదివికొనియుండునట్లు సొఱకాయపై నమర్చెడుతదంగము. (శ. ర-'కకుభము' అని ఆం. భా. ౧. ౧౨౬.)

గీ. జీవరత్నంపు మేరువు చికిలికెంపు, బిరడలును గరుడపచ్చలకరివె జీని, వ్రాతహొంబట్టుగవుసెన రాణఁ దనరు, వీణె యొకయింతి నిల్పెను వెలఁదియెదుట. వాల్మీ. ౩. ౧౩౨.

ఉ. చెన్నగు జాళువాయొళవు చిన్నరికెంపులమెట్లు నీలపు,న్వన్నియ నొప్పుకాయలు నవంబగు వజ్రపుఁగర్వె పచ్చలం,బన్నినయట్టిమేరువును బాగగుతంత్రులు మించ నొప్పు మే,ల్కిన్నర చెంతఁ జేరి యొకకిన్నరకంఠి యొసంగనయ్యెడన్. చంద్ర. ౨. ౯౪.

**కరివెద.** వి.వర్షము కురియుటకు ముందే నేల దున్ని విత్తనములు చల్లుట.

**కరిస(ర్స)నము.** వి. (సం. కర్షణమ్. ప్రా. త. కరిసనం) కృషి, సేద్యము.

క. కరిసనమును బేహారము,నరసి పసులఁ గూర్చుటయును ననఁగా వృత్తుల్, నరులకు... హరి. పూ. ౭. ౧౩౦.

క. అరులు మిగులఁ గొని రాజులు,నరులకు నెంతయును భయ మొనర్తురు ధరణీ,సురులు గడఁగి వాణిజ్యముఁ,గరిసనమును జేయఁగలరు కలికాలమునన్. భాగ. అర. ౮. ౪౯౩.

సీ. గోవు లెక్కుడు ...వినుతహోమముల కెల్లను బాలుఁ బెరుగు నేయును నిచ్చుఁ గర్సనంబు నకు నొదవు. భా. అను. ౨. ౩౯౭.

ద్వి. కడఁగి కేదారాదికంబుల నెపుడు,సడలని శక్తిఁ గర్సన మొనరించు. ద్వి. భాగ. ౫. (శ. ర.)

**కరిసించు.** స.క్రి. (సం.ఘృష్)డీకొను, ఎదిరించు.

సీ. కంఠీరవము నైనఁ గరిసించుటయ కాని యొకసి నెన్నినిభటోచ్చయంబు. బహు. ౧.౧౦౨.

**కరిసె.** వి. (సం. కర్షః. ప్రా. కరిసం. త. కరిశై) పలములో నాల్గవవంతు, కాలుపలము.

సీ. కరిసె యనంగను గాలుపలం బొప్పు...ఆం. భా. ౨. ౨౬౯.

**కరీరము.** సం. వి. అ. పుం. న. వెదురు మొలక. పుం.౧.కుండ.౨.వెణుతురు. (ఇది మరుభూములందు మొలచును,లొట్టియలకు ప్రియమైనది.)

**కరీరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఏనుఁగుయొక్క దంతమూలము. ౨. ఈలపురుగు, ఝిల్లి, చిమ్మట. ('కరీర' ఆకారాంత స్త్రీలింగమని కొందఱు.)

**కరీషంకషము.** సం. విశే. (అ.ఆ.అ.) పేఁడను ఎండించునది. (వాయువు, మొ.)

**కరీషము.** సం. వి. అ. పుం. న. ౧. ఏఱుపిడుక; పిడుక. ౨. పేఁడ. (హలా.ని.)

శ్లో. కాశ్చిత్ స్త్రియః కరధృతోరుకరీషపిండా, నిర్యాంత్యగారబహిరంగణశోధనాయ. (కాళిదాసప్రహసనము.)

**కరుగు[1](రుపు, ర్పు).** వి. (త. కరు). పోఁతపోసెడిఅచ్చు;అచ్చులోఁ బోసినబొమ్మ;కరఁగెడిమూస.

చ. కరుగునఁ బోయుమాడ్కి నొడికంబు గఛాత మలంచుకై వడిన్. చంద్రా. ౨. ౧౨.

చ. కరువునఁ బోసిరో విధునికాంతి సుధాబ్ధిత
రంగఁ దెచ్చి గం,డరు వొనరించిరో...భా
ర. అను. ౧. ౧౮౩.

చ...ఒకచిత్రకారుని మహోల్లసహస్తునిఁ బిల్చి
వ్రాయఁగాఁ, బనిచిన వ్రాసె నత్తరుణీభావ
ము కర్వునఁ బోసినట్లు...విక్ర. ౩. ౫౨.

(ఊర్వశి). ఉ...కొలువల్లఁ దెచ్చి యచ్చే
రువకంబునుం గదిసి చిత్తరువో కరువో య
నంగ గం,డారపుబొమ్మవోలె నచటం గద
లింపక లేక యుండఁగనె. ఉ.హరి.౧.౬౦.

క.కరువునఁ బూరితమై లో,హరసము లోఁ గా
లునట్టు లంగజశోకో,ద్ధురశిఖి రతితను విమ్మ
గఁ,గరఁగియుఁ బొడవఱక లోనఁ గాలు
చు నుండెన్. కు. సం. ౫. ౫౭౮.

**కరుగు²(వు).** వి. (సం. గర్భః). ౧. వరిపొట్టకట్టు. (శ. ర.) ౨. గర్భము.

క...అట్లయ్యిరువురు నుపయోగింపఁగఁ,గరువు
లు తత్త్వప్రకారకలితము లయ్యెన్. భార.
అను. ౧. ౧౧౧.

శ్లో.అథ గర్భావనుప్రాప్తే ఉభే తే వై యుధిష్ఠిర. సం. భార. అను. ౭. ౩౫.

**కరుడు¹.** వి.గట్టిపడిన ముద్ద.
ఉదా: అన్నపుఁగరుడు.

(చంద్రవర్ణనము.) సీ. అది చకోరములవిందా
కాదు దుగ్ధాబ్ధికడ జనించిననెన్నకరుడు గా
ని. వేం. పంచ. ౪. ౨౩౮.

గీ.పుల్ల నుండెడు తేనెకరుల్లు సరయొ,వనిత కడుఁ
దియ్య నానీదువాతెఱయును. సారంగ. ౨.
౨౦౫. (తేనెకరుల్లు=తేనెపెరలు.)

జ: కరుడుగట్టు.

**కరుడు².** వి. దినదినము వ్రాసెడిసంక్షిప్తపులెక్క. (శ. ర.)

**కరుడుగట్టు.** అ. క్రి. (√కరుడు¹) ముద్దగట్టు, పిండమగు.

గీ. కలసి శుక్లశోణితములు కరుడుగట్టి,విను మ
మేధ్యమధ్యమునఁ బ్రవృద్ధిఁ బొందె. భార.
స్త్రీ. ౧. ౩౬.

క. ...కచాస్త్ర...గ్రంబుల,మకరందము కరుడు
గట్టి ...జాఱినపో,లికె సున్నసిరా సఖు
యా,లికుచస్తనిన్నుముపదాంగుళినఖపంక్తుల్.
...హా. ౩. ౧౧౯.

**కరుణ.** సం. వి. ఆ. స్త్రీ. కనికరము, దయ.

**కరుణామల్లి.** సం. వి. ఈ. స్త్రీ. నవమల్లిక.

**కరుణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧.కరుణగలది, కనికరముగలది. ౨. దీనము, జాలిపుట్టించునది.
వి. అ. పుం. ౧. జంబీరము, నిమ్మ. (వాచా.ని.) ౨.(అలం)ఒకరసము. (దీనికి స్థాయి శోకము.)
న. దైన్యము. (కే. ని.)

**కరుణావిప్రలంభము.** సం. వి. అ. పుం. (అలం) విప్రలంభశృంగారరసభేదము. (శృంగారరసము-సంభోగము విప్రలంభము అని ద్వివిధము. విప్రలంభము-పూర్వానురాగ, మాన, ప్రవాస,కరుణములని చతుర్విధము.)

**కరుణించు.** సం. స. క్రి. ౧. దయతోనిచ్చు.

ఉ. ముస్సు పితామహ మీకు వరముల్ కరుణించు
టఁ జేసి త్రోయరా,కిన్ని దినంబు లేను క్షమి
యించితి... ఉ. రా. ౨. ౯౬.

౨. కనికరించు.

వ. ఇగ్గరుడుండు...మీకు బాధ యగు నని యి
త్తరుశాఖ విడువనేరకున్నవాఁడు వీనిం గరు
ణించి మీ రొండుకడకు నరుగుం డనిన...
భా. ఆది. ౨. ౭౫.

అ. క్రి. కరుణకలవాఁడగు.

వ. విరించి కరుణించి యిట్లనియె. మార్క. ౨. ౧౭౨.

**కరుమపుసాకిరి.** వి. (కరుమము+సాకిరి.)చెయ్యులసాకిరి, కర్మసాక్షి, సూర్యుఁడు.

వ...నీయుప్పు దిన్న వారము గావునఁ దారు నీ తోడివారము. ఎందు కాకరుమపుసాకిరి. లే కున్న నినువంటి జన్నిగట్టులు సాకిరి యని చెప్ప నేల. ప్రబంధ. ౭౮౮.

**కరుమము.** వి. (సం. కర్మ.) కర్మము, పని.

జ: కరుమపుసాకిరి.

**కరుమల**=కమ్మర.

ఉదా: కరుమలవాఁడు, కరుమలది.

జ: కరుమలి.

**కరుమలి**=కమ్మరి. వి.(కరుమల+ఇ)కమ్మరవాఁడు; కమ్మరది.

సీ. కమ్మరి కనుమరి కరుమలి యనఁగాను మీఱు చుండును నయస్కారసంజ్ఞ. ఆం. భా. ౨. ౨౮౪.

**కరువ.** వి. (సం. గ్రావా.) కొండ, పర్వతము.

క. మెట్టనఁ గొండన మల యన,గట్టన గుబ్బలి యనంగఁ గరువ యనంగా,గుట్ట యనఁ దిప్ప యనఁ గ,నృట్టును శైలాఖ్య లార్యభావితచర్యా. ఆం. భా. ౨. ౨౭.

**కరువటిల్లు.** అ. క్రి. కంపిల్లు, వణఁకు.

చ...వడి మోపియుం గరువటిల్లెడు నీమది నింత డల్లడం,బొదవు డి దేమి గారణ మొ యుగ్మ లి నా కెఱిఁగింపు మేర్పడన్. ప. సం. ౪. ౪౧౫. (ప్రయోగాంతరము లేదు.)

**కరువ(ర్వ)లి.** వి. (క.గరువలి). వాయువు, గాలి.

సీ. కరువలిచేఁ దూలుకపిలజటాళియ కర మొ ప్పుశిఖలు గా...మూఁడగ్నులు ప్రత్యక్షమై నయట్లు, దనమ్రోల శర్మిష్ఠతనయులు గ్రీడిం చుచుండంగ...భార. ఆది. 3. ౧౮౨.

సీ. రాత్రుల మిన్ను నిర్మలభావమును బొంద వె లియొండ గాసెఁ గర్వలి దొలంగె. కాశ. 3. ౧౪౯.

గీ. గాడ్పు కరువలి వినుచూలి గాలి వలపు,మో పరి చిలువమేఁ తనఁ బొలుచుఁ బవనుఁ,డు ... ఆం. భా. ౧. ౫౯.

కరువలితోలుజేజే=గాలిరక్కసి,తృణావర్తుఁడు.

క. దొరఁకొని తనుఁ బొదివి కడున్,సరగను జ దలికిని నొగిని జను జేరజపుం,గరువలిబలుతో లుజేజే,నరుదుగ గుదెతాల్పువీటి కనిచెం గ డిమిన్. నీలా. ౧. ౭౪.

జ: కరువలికుడుపరి,కరువలికొడుకు, కరువలిచు ట్టము, కరువలియెర, కరువలిరిక్క.

**కరువలికుడుపరి.** వి. (కరువలి+కుడుపు+అరి[3]) పవనాశనము, పాము.

సీ. తెలికడలిని గరువలికుడుపరిదొరపఱుపుపయి నిదురఁ గొఱలునుటియ. అచ్చ. రా. ఆర. ౧౧౪.

ఇత్లే: కరువలిమేపరి. అచ్చ. రా. అయో. ౨.

**కరువలికొడుకు.** వి. (√కరువలి+కొడుకు)

౧. హనుమంతుఁడు.

క. గిరులును నదులును వనములుఁ,బరికింపుచుఁ బట్టనములు బహువిధగతులన్,దిరుగుచు వె దకుచుఁ గానక,కరువలికొడు కాది యైనకపి వరు లెదుటన్. మొ. రా. సుం. ౬.

౨. భీముఁడు.

ఇత్లే: కరువలికొమరుఁడు, కరువలిపట్టి, మొ. అచ్చ. రా. కిష్కి. ౭౭.భార.భీష్మ.3.౨౨౦.

**కరువలిచుట్టము.** వి. (√కరువలి) వాయుసఖుఁడు, అగ్ని.

వ. ... అక్కరువలిచుట్టంబు మహీవల్లభుం డరు గు తెరువునఁ బ్రబలి...రవులుకొని... హరి శ్చ. 3. ౧౨౦.

ఇత్లే: కరువలివిందు, మొ. రామా. ౬. ౬౭.

**కరువలియెర.** వి. (√కరువలి) పవనాశనము, పాము.

సీ.కరువలియొర సెజ్జ మురువుఁదామరబొజ్జ నెసఁగువాఁడు శుభంబు లొసఁగువాఁడు. ప్రబంధ. 330.

**కరువలిరిక్క.** వి. (√కరువలి)-వాయుదేవతాకమగునక్షత్రము-స్వాతీనక్షత్రము.(శ.ర,బ్రౌ.)

**కరువాడు.** వి. (చి.ని.'కఱువాడు' అని శకటరేఫముతో శ. ర-శ.కరువాడు.) శుష్కమత్స్యము, ఎండినచేఁప.

సీ. అలరును శుష్కమత్స్యం బుప్పుఁజేఁప నా వరుగుఁజేఁ పనఁ గరువా డనంగ. ఆం. భా. ౧. ౧౬౦.

**కరుసు.** వి. (సం. ఘర్షః.) నిష్ఠురోక్తి, పరుషవచనము.

సీ. కఱకు కరుసు కాఱు కాఱొడ్డెము పరుసు పరుసన యనఁగ నిష్ఠురము వెలయు. ఆం. భా. ౧. ౧౧౭.

**కరూష(శ)ము.** సం. వి.అ.పుం.ఒకానొకదేశము.

**కరూషు(శు)ఁడు.** సం. వి. అ. పుం. ౧. కరూశదేశపురాజు. ౨. కరూశదేశవాసి.

**కరేటువు.** సం. వి. ఉ. పుం. పెద్దకొక్కెర.

**కరేణుభువు.** సం. వి. ఊ. పుం. పాలకాప్యుఁడు, గజశాస్త్రప్రవర్తకుఁ డగుఒకముని.

ఇశ్లే:-కరేణుసుతుఁడు, ము.

**కరేణువు.** సం. వి. ఉ. పుం. ౧. ఏనుఁగు. ౨. కర్ణికారముశ్రీ. స్త్రీ. ఆఁడేనుఁగు.

**కరేవరము.** సం. వి. అ. పుం. తురుష్కనామకగంధద్రవ్యము, అందుగుజిగురుతోఁజేసినధూపద్రవ్యము.

**కరోటము.** సం. వి. అ. న. ౧. శిరోస్థి, పుఱ్ఱె. ౨. వస్త్రకోశము, బట్టలపెట్టె. (శే. ని.)

**కరోటి.** సం. వి. ఇ. స్త్రీ. తలయెముక, పుఱ్ఱె.

**కరోటిక.** సం. వి. ఆ. స్త్రీ. పులిసినగంజి. (శే. ని, వై. ని.)

**కరోటుఁడు.** సం. వి. అ. పుం. భృత్యుఁడు, కొలువుకాఁడు. (శే. ని.)

**కర్కంధువు.** సం. వి. ఊ. పుం. స్త్రీ. ౧. రేఁగుశ్రీ. ౨. వ్రణము. స్త్రీ.౧.యుద్ధము. ౨. రథాదులయుగము, కాఁడి. (శే. ని, వై. ని.)

**కర్కచిర్భటి.** సం. వి. ఈ. స్త్రీ. చిన్నదోసశ్రీ.

**కర్కటకము.** సం.వి. అ.పుం. ౧. కుళీరము,ఎండ్రకాయ. ౨. (జ్యోతి) ఒకరాశి. ౩. వృత్తరేఖను గీయుట కుపయోగించుయంత్రభేదము. (కంపసెస్) ౪. ఒకజాతిచెఱకుశ్రీ.(వాచ)

**కర్కటకి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుఎండ్రి. ౨. గొడ్డుకాఁకరశ్రీ.

**కర్కటము.** సం. వి. అ. పుం. ౧. ఎండ్రి. ౨. కొక్కెర, కొంగ. ('రాపులుఁగు' అనికొందఱు.) ౩. (జ్యోతి.) నాల్గవరాశి. ౪. నూఁగుదోసశ్రీ. ౫. అభినయహస్తవిశేషము. (రెండుచేతులవ్రేళ్లను ఒకదానిసందున నొకటి అదికినట్లుగాఁ గూర్చి పట్టినది.) ౬. తామరదుంప. ౭. ముల్లు. ౮. రతిబంధవిశేషము. ౯. త్రాసుదండముయొక్క వంపయినకొన. ౧౦. అలాబువు, సొఱశ్రీ.

**కర్కటశృంగి.** సం. వి. ఈ. స్త్రీ.ఒకానొకచెట్టు.

**కర్కటాంగ.** సం. వి. ఆ. స్త్రీ. కర్కటశృంగిశ్రీ.

**కర్కటాక్షము.** సం. వి. అ.పుం.కర్కటి,దోసశ్రీ.

**కర్కటాఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. కర్కటశృంగిశ్రీ.

**కర్కటాహ్వము.** సం. వి. అ. పుం. బిల్వము,మారేడుశ్రీ.

**కర్కటి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. ఆఁడుపీత. ౨. దోసశ్రీ. ౩. బూరుగుశ్రీ. ౪. సర్పము. ౫. డా

డంగిన్. ౬. ఘోషికావృక్షము, చేఁదుబీఱన్. ౭. కర్కటశృంగిన్.

**కర్కటిక.** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిదోస, నూఁగుదోసన్.

**కర్కటిని.** సం. వి. ఈ. స్త్రీ. మ్రానిపసుపు, దారుహరిద్రన్.

**కర్కటువు.** సం. వి. ఉ. పుం. పెద్దకొక్కెర.

**కర్కము.** సం. వి. అ. పుం. ౧. కుళీరము, ఎండ్రి. ౨. అద్దము. ౩. కుండ. ౪. తెల్లగుఱ్ఱము. ౫. నిప్పు. ౬. (జ్యోతి) కర్కటరాశి. ౭. నూఁగుదోసన్. ౮. గుఱ్ఱముయొక్క తెలుపురంగు. (కే.ని.)

**కర్కరము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. దృఢము, గట్టిది. ౨. కఠినము. వి. అ. పుం. ౧. ముద్గరము. ౨. అద్దము. ౩. కంకరఱాయి. ౪. ఎముక. (కే.ని.)

**కర్కరాంగము.** సం. వి. అ. పుం. ఖంజనపక్షి, కాటుకపిట్ట.

**కర్కరాంధుకము.** సం. వి. అ. పుం. పాడునుయ్యి, అంధకూపము. (త్రి. ని.)

**కర్కరాక్షము.** సం. వి. అ. పుం. కాటుకపిట్ట.

**కర్కరాటుకము.** సం. వి. అ. పుం. కర్కరేటువు, పెద్దకొక్కెర.

**కర్కరాటువు.** సం. వి. ఉ. పుం. ఓరచూపు, కడగంటిచూపు, కటాక్షము.

**కర్కరాలము.** సం. వి. అ. పుం. అలకము, చూర్ణకుంతలము.

**కర్కరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కర్కరిక, కాంతారమను చెఱకున్.

సీ. ఘృతపిండనిభకర్కరీఖండములతోడ...ఆము. ౨. ౭౩.

(తెనుఁగున 'దోసన్.' అనునర్థమున నొకచోఁ బ్రయోగము కనఁబడుచున్నది- గీ ... దుర్వారకర్కరీఫలామోదధారంధరీవరిష్ఠ, పవనములచేత నాహారభాగ్య మిచట, నబ్బు నని యెంచి కెలని బిట్టడవి విడిసె. శుక. ౩. ౩౮౧. చూ. ౩౮౨.)

౨. గిండివంటిపాత్రము. ౩. పెనమునుండి నేయి మొదలగువానిలోఁ వేఁచినవానిని వెలికిఁదీయు నుపకరణము. (జల్లిగరిఁటె, మొ.)

**కర్కరిక.** సం. వి. ఆ. స్త్రీ. కర్కరి, కాంతారమను చెఱకున్.

శ్లో. కాంతారస్స్యాత్కర్కరికా పౌండ్రకస్తు రసాలకః. (షట్స్కంధనిఘంటువు.)

**కర్కరేటము.** సం. వి. అ. పుం. అర్ధచంద్రము, గళహస్తము.

**కర్కరేటువు.** సం. వి. ఉ. పుం. పెద్దకొక్కెర.

**కర్కశ.** సం. వి. ఆ. స్త్రీ. వృశ్చికాళీవృక్షము, తేలుకొండిన్.

**కర్కశచ్ఛద.** సం. వి. ఆ. స్త్రీ. కోశాతకి, ఆవడ, చేఁదుబీఱన్.

**కర్కశచ్ఛదము.** సం. వి. అ. పుం. ౧. శాకోటవృక్షము, బరివెంకన్. ౨. పటోలము, పొట్లన్.

**కర్కశము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కఱకయినది, కఠినస్పర్శవంతము. ౨. గట్టిది, కఠినము. (వ్యతి- మృదువు, కోమలము.) ౩. నిర్దయము, కనికరములేనిది. ౪. తెగువగలది, సాహసికము. ౫. దుర్బోధము, తెలియనిది. (శైలి, మొ.) ౬. అత్యంతము, మిక్కిలియైనది. (సం. రఘు. ౯.౬౪.) ౭. నొప్పించునది, బాధకము. వి. అ. పుం. ౧. కంపిల్లమున్. ౨. కసిందన్. ౩. చెఱకున్. ౪. కత్తి. ౫. రత్నదోషములలోనొకటి.

వ. మఱియు లశున పటల త్రాస చ్ఛిన్న జర్ఝర కర్కశ నీలంబు లనియెడు దోషంబులు కలవు. వాని తెఱంగెఱింగెద. రత్న. ౧౬.

**కర్కశి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకజాతిరేఁగున్.

**కర్కారువు.** సం. వి. ఉ. పుం. గుమ్మడి, కూష్మాండము*.

**కర్కి.** సం. వి. ఇ. పుం. కర్కటరాశి.

**కర్కేతనము.** సం. వి. అ. పుం.న. రత్నవిశేషము.

**కర్కోటకము.** సం=కర్కోటము.

**కర్కోటకి.** సం. వి. ఈ. స్త్రీ. పీతఘోషావృక్షము, ఆనపచెట్టు.

**కర్కోటము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొకనాగము. (ఇది అష్టనాగములలో నొకటి-అనన్తో వాసుకిః పద్మో మహాపద్మోపి తక్షకః, కర్కోటః కులికశ్శఙ్ఖ ఇత్యష్టౌ నాగనాయకాః.) ౨. మారేడు, బిల్వము*.

**కర్చూరకము.** సం. వి. అ. పుం. ౧. గంధకచోరము*. ౨. పసుపు, హరిద్ర*.

**కర్చూరము.** సం. వి. అ. పుం. గంట్లకచోరము*. న. ౧. బంగారు. ౨. హరిదళము.

**కర్జకాయ.** వి. (√కర్జము[2].) భక్ష్యవిశేషము. (శ. ర.)

**కర్జము[1].** వి. (సం. కార్యం. ప్రా. కజ్జ.) కార్యము, పని.

గీ. మునుసుతులు దమ కిమ్ముగాఁ జదివికొండ్రు, గాక పతులకు హిత మగుకర్జ మేల, యొలసి చెప్పుదురు...భాగ. ఆది. ౧. ౩౧, ఉద్యో. ౮. ౨౮౨.

విణ. కర్తవ్యము, చేయఁదగినది.

తరువోజ ... ఏయుపాయంబున నిబ్బారిఁ గడవఁ, గా నేర్తు మెయ్యది గర్జ మిం దుండఁ గా దేఁగుదమ యొండుకడకు...భార. ఆది. ౬. ౨౮౭.

శా. శ్రీమాల్యము కోటికోటులు ధనం బొప్పించి విప్రాళి చే, సర్వక్షోణియు నీవు సైకొనుట కర్జం బన్న...విక్ర. ౪. ౧౩౩.

**కర్జము[2].** వి. భక్ష్యవిశేషము.

ఉ. అత్తల మామలన్ మగల నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులన్, జిత్తుల దుద్దుపెట్టుచును జీటికి మాటికి నన్నె చేరఁగా, వత్తురు మేలుకర్జములు వంతుల కిత్తురు నిండుఁగౌఁగిటం, గ్రుత్తురు...దశా. ౧. ౩౪౪.

జ: కర్జకాయ.

**కర్జూరము.** వి. (సం. ఖర్జూరః.) ఖర్జూరవృక్షము.

మ. సురపొన్నల్ కలిగొట్లుఁ జిందుగలు కర్జూరంబు లబ్బెందలున్. యయా. ౪. ౮౧.

**కర్ణకీటి.** సం. వి. ఈ. స్త్రీ-చెవిలోఁ దూఁరఁబడుపురుగు-శతపది, జెఱ్ఱి.

**కర్ణక్ష్వేడము.** సం. వి. అ. పుం. చెవియందెడతెగనిమ్రోఁతగలిగించురోగము. (ఇది ధాతుక్షయాదులవలనఁ గలుగును.)

**కర్ణగూథము.** సం. వి. అ.న. చెవిమలము, గులిమి.

**కర్ణగూథకము.** సం. వి. అ. పుం. గులిమిగట్టిపడు కర్ణరోగవిశేషము.

**కర్ణగ్రాహుఁడు.** సం. వి. అ. పుం. కర్ణధారుఁడు, ఓడనడుపువాఁడు.

**కర్ణజలూక.** సం. వి. ఆ. స్త్రీ-జలగవలెనుండి చెవిలోఁజొచ్చునది-జెఱ్ఱి.

**కర్ణజలౌకము.** సం. వి. స్. పుం=కర్ణజలూక.

**కర్ణజాహము.** సం. వి. అ. న. కర్ణమూలము, గూబ.

**కర్ణదర్పణము.** సం. వి. అ. పుం. తాటంకము, చెవిపోఁగు. (త్రి. ని.)

**కర్ణదుందుభి.** సం. వి. ఇ. పుం=కర్ణకీటి.

**కర్ణధారుఁడు.** సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు, అరకాటి.

**కర్ణపత్త్రకము.** సం. వి. అ. పుం. కర్ణపాళి, చెవితమ్మె. యాజ్ఞ. ౩. ౯౬.

**కర్ణపరంపర.** సం. వి. ఆ. స్త్రీ. వినికివరుస.
ఇట్లే:- శ్రోత్రపరంపర, మొ.

**కర్ణపర్వము.** సం. వి. న్. న. ౧. మహాభారత మందలి ఎనిమిదవపర్వము. ౨. శ్రోత్రానందము, వీనుల విందు.

**కర్ణపాళి.** సం.వి.ఇ,ఈ.స్త్రీ. ౧. చెవితమ్మె. ౨.కర్ణాలంకారభేదము.

**కర్ణపాశము.** సం. వి. అ. పుం. అందమగుచెవి. (వై. ని.)
శ్లో. సైవోష్ఠముద్రా స చ కర్ణపాశః. సం.ఉ.రా. ౬. ౨౭.

**కర్ణపుష్పము.** సం. వి. అ. పుం. మోరట, చాఁగ**?**.

**కర్ణపూరకము.** సం. ౧=కర్ణపూరము. ౨. కదంబము, కడప**?**.

**కర్ణపూరము.** సం. వి. అ. పుం. ౧. పుష్పాదులచేఁ జేయఁబడినకర్ణభూషణము. ౨.అశోకము, కంకేలి**?**. ౩. దిరిసెనము, శిరీషము**?**. ౪. తిలకము**?**. ౫. నీలోత్పలము, నల్లగలువ. (కే. ని.)

**కర్ణప్రణాదము.** సం. వి. అ. పుం. కర్ణరోగభేదము. (ఇందు పలువిధములగుధ్వనులు వినఁబడును.)

**కర్ణప్రతి(తీ)నాహము.** సం. వి. అ. పుం. కర్ణరోగవిశేషము.

**కర్ణఫలము.** సం. వి. అ. పుం. మత్స్యభేదము.

**కర్ణభూష.** సం. వి. ఆ స్త్రీ=కర్ణభూషణము.

**కర్ణభూషణము.** సం. వి. అ. న. చెవినగ.(వాచ.)

**కర్ణమలము.** సం. వి. అ. న. పింజూషము, గులిమి.

**కర్ణము.** సం. వి. అ. పుం. ౧. అరిత్రము, చుక్కాను. ౨. చెవి. ౩. త్రిభుజములలో సమకోణమునకు ఎదురుగానున్నరేఖ. ౪. గంగాళము మొదలగువానికిఁ జెవివలె నమర్చినపిడి. విశ. (అ. ఆ. అ.) చెవులులేనిది. (పశువు—కే. ని.)

**కర్ణమూలము.** సం. వి. అ. న. చెవియొక్క మొదలు, గూబ.

**కర్ణమోటి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. శివపరిచారికలలో నొకతె.

**కర్ణలత.** సం=కర్ణలతిక.

**కర్ణలతిక.** సం. వి. ఆ. స్త్రీ. చెవితమ్మె.

**కర్ణలుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ప్రశస్తమగు శ్రవణశక్తిగలవాఁడు.

**కర్ణవర్జితము.** సం. విశ. (అ. ఆ. అ.) కర్ణహీనము, చెవిలేనిది. వి. అ. పుం. సర్పము, పాము.

**కర్ణవిట్టు.** సం. వి. ష్. స్త్రీ. కర్ణమలము, గులిమి.

**కర్ణవిషము.** సం. వి. అ. న-కర్ణమునకు విషమువంటిది-కొండెము, దుర్బోధము.

**కర్ణవేధని.** సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగుయొక్క చెవులుకుట్టుసలాక.

**కర్ణవేధనిక.** సం. వి. ఆ. స్త్రీ=కర్ణవేధని.

**కర్ణవేధము.** సం. వి. అ. పుం. (శాస్త్రోక్తవిధానమున) చెవులుకుట్టుట.

**కర్ణవేష్టనము.** సం. వి. అ. న=కర్ణవేష్టము.

**కర్ణవేష్టము.** సం. వి. అ. పుం. కర్ణాభరణము, చెవినగ. (కుండలము, పోఁగు, మొ. )

**కర్ణశూలము.** సం. వి. అ. పుం. న. చెవిపోటు.

**కర్ణస్ఫోట.** సం.వి.ఆ. స్త్రీ.ఒకానొకతీఁగ.(కల్ప.)

**కర్ణహీనము.** సం. విశ. (అ. ఆ. అ.) చెవిలేనిది. వి. అ. పుం. సర్పము, పాము.

**కర్ణాందువు.** సం. వి. ఉ, ఊ. స్త్రీ.ఉత్క్షిప్తికయను చెవినగ.

కర్ణాకర్ణి. సం. అవ్య. (ఇది తెలుఁగున విశేష్యము గా 'శ్రవణపరంపర, వినికివరుస' అను నర్థమున వ్రయుక్తము.)

శా. నావుంజూత మనంబునం గుటిలుఁడై నాకేళుఁ డిబ్బాలుఁ దా,నే కొంపోయినవాఁడు వాఁడు దగు వాఁడే గౌతమస్త్రీరహ, స్స్వీకారాదులు తచ్చరిత్రములు నాచేఁ గోత్రగా నేల కర్ణాకర్ణిం గథలందు మున్ను వినమే నానాప్రకారంబులన్. ఉ. హరి. ౫. ౧౯౬.

కర్ణాటము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము, కన్నడదేశము.

కర్ణాటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కర్ణాటదేశపుస్త్రీ. ౨. హంసపది౹ ౩. (సంగీ) స్త్రీరాగములలో నొకటి.

కర్ణార. సం. వి. అ. పుం. స్త్రీ. గజకర్ణవేధని, ఏనుఁగు చెవికుట్టుసాధనము.

కర్ణాస్ఫాలము. సం. వి. అ. పుం. (ఏనుఁగు) చెవులు తటతటలాడించుట. (కల్ప.)

కర్ణి. సం. విశ. (న్. నీ. న్.) కర్ణము కలది. వి. న్. పుం. కర్ణధారుఁడు. న్, ఇ. పుం. ఈ. స్త్రీ. బాణవిశేషము, చిల్లుగలబాణము. ఈ. స్త్రీ. ౧. చౌర్యశాస్త్రకర్త యగుమూలదేవుఁడనువానితల్లి. ౨. పశువులను గట్టుట కుపయోగించురజ్జువిశేషము. (కే. ని.)

కర్ణిక. సం. వి. అ. స్త్రీ ౧. చెవికమ్మ. ౨. చేతినడిమి వ్రేలు. ౩. ఏనుఁగుతొండముచివరను వ్రేలివలెనుండెడి యవయవము. ౪. పద్మబీజకోశము, తామరదుద్దు. ౫. కుంపెనకత్తె. (హేమ. ని.)

కర్ణికము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. పెద్దచెవులు గలది. ౨. చుక్కానిగలది. వి. అ. న. కృష్ణాజినము, తపస్సుచేసికొనుట కుపయోగించునట్టి కృష్ణమృగచర్మము. (వై. ని.)

కర్ణికాచలము. సం. వి. అ. పుం. మేరుపర్వతము.

కర్ణికారము. సం. వి. అ. పుం. ౧. పరివ్యాధము, ఒకానొకచెట్టు. ౨. ఆరగ్వధము, రేల†.

కర్ణికుఁడు. సం వి. అ. పుం. కర్ణధారుఁడు, ఓడనడుపుటకై చుక్కాని పట్టుకొనువాఁడు.

కర్ణిని. సం. వి. ఈ. స్త్రీ. యోనిరోగభేదము.

కర్ణీమంతము. సం. వి. త్. పుం. ఆరగ్వధము, రేల†.

కర్ణీరథము. సం. వి. అ. పుం. ౧. మూఁపునమోచి కొనిపోవుపల్లకి మొదలగువాహనము. ౨. మట్టితోఁ జేసినబాలకాదిక్రీడాశకటము.

కర్ణీసుతుఁడు. సం. వి. అ. పుం. మూలదేవుఁ డను పేరుగల చౌర్యశాస్త్రకర్త.

కర్ణుఁడు. సం. వి. అ. పుం. కుంతిమొదటికొడుకు. (ఇతఁడు కుంతియందుఁ గన్యాత్వకాలమున సూర్యునికిఁ బుట్టినవాఁడు.)

కర్ణేందువు. సం = కర్ణాందువు.

కర్ణేజపుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) సూచకుఁడు, కొండెకాఁడు.

కర్ణోత్తంసము. సం. వి. అ. పుం. చెవియందు ధరింపఁ బడు ఆభరణము.

కర్ణోరము. సం. వి. అ. పుం. - చెవిలోరోమములు గలది, ఒకజాతిమృగము.

కర్ణ్యము. సం. విశ. (అ. ఆ. అ.) చెవిలోనిది. (గుళిమి, మొ.)

కర్త. సం. విశ. (ఋ. త్రీ. ఋ.) ౧. చేయువాఁడు. ౨. స్వామి, ఒడయఁడు.

మ.... కన్నడరాయశేఖరుఁడు రాయల్ వన్ను సింహాసనం,బునకుం గర్తను జేసె .... కృష్ణ. ౨. ౩౦.

వ. అయ్యజపల్లభుండు సురతపరతంత్రుండైమిని

మిసి యనుశబ్దంబు సేయుచుఁ దప్పాగివెంటం జని యొడంబఱుపం జాలకుండె వంతదానికిఁ గర్త యైన బ్రాహ్మణుండు రోషంబున రతివమర్దంబు గాకుండ నల్లాడుచుండ భాగవృషణంబులు ద్రెంచివేసిన .... భాగ ౯. ౨౭౨.

౩. (వ్యాక) ధాత్వర్థవ్యాపారాశ్రయము. వి. ఋ. పుం. ౧. పరమేశ్వరుఁడు. ౨. బ్రహ్మ.

**కర్తకుఁడు.** సం. విణ. (అ. ర్తికా. అ.) కత్తిరించువాఁడు; ఖండించువాఁడు.

**కర్తనము.** సం. విణ. (అ. ఆ. అ.) ఛేదించునది; కత్తిరించునది. వి. అ. న. ౧. కత్తిరించుట; ఛేదించుట. ౨. నూలువడుకుట. (శే. ని.) ౩. గుఱ్ఱము ధూళియందు పొర్లాడుట. ౪. సాలెవాఁడు బట్టలు నేయుమగ్గము. పుం. ఒకానొకఛేదనసాధనము. (వై. ని.)

**కర్తని.** సం. వి. ఈ. స్త్రీ. కత్తెర.

**కర్తనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) కత్తిరింపఁదగినది; ఖండింపఁదగినది.

**కర్తరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కత్తెర, కత్తిరించుట కుపయోగించుపనిముట్టు. ౨. (జ్యోతి)యోగభేదము.

శ్లో. క్రూరమధ్యగతశ్చంద్రోలగ్నం వాక్రూరమధ్యగం, కర్తరీనామయోగోయం కన్యానిధనకారకః. (కల్ప)

౩. బాణముమొదటిభాగము, పుంఖము. ౪. ఉద్వేగకర్తరి, ఆడకత్తెర. (వై. ని.)

**కర్తరిక.** సం. వి. ఆ. స్త్రీ = కర్తరి.

**కర్తరీముఖము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలిని వంచి చూపుడువ్రేలి మొదటఁ గూర్చి యుంగరపువ్రేలిని వంచి చూపుడునడిమివ్రేళ్లను గత్తెరవలెఁ బట్టినది. శ. ర.)

**కర్తలాణము.** సం. వి. అ. పుం. తెల్లనిగొరిజలును తోఁకయు వెండ్రుకలును గలనల్లగుఱ్ఱము. కత్తలాని.

శ్లో. పూర్వవత్సర్వశుక్లాఙ్ఘ్రిస్త్వథా కృష్ణో భవేద్యది, వరో నామ్నా సవిజ్ఞేయః కర్తలాణస్తురఙ్గమః. శివతత్త్వరత్నాకరము.

క. అల్లునికి నిచ్చె ధాత్రీపల్లభుఁ డనురక్తి నమరవల్లభుహరితో, నుల్లస మాడం జాలెడు, తెల్లనియొకకర్తలాణ తేజోహయముల్. నైష. ౬. ౫౬.

(శ. ర-కాని వావిళ్లవారిప్రతిలోను 'తేజీ'శబ్దముక్రింద శబ్దరత్నాకరములోను 'కత్తలానితేజీహయముల్' అనియు, ఒకతాళపత్రగ్రంథములో 'ఖత్తులానితేజోహయముల్' అనియు పాఠభేదములు కలవు. సంస్కృతనిఘంటువులలో ఈపదము కానరాదు. ఇంకను విచార్యము.)

**కర్తవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) చేయఁదగినది.

**కర్తారు(ఁడు).** వి. (హిం. కర్తార్.) ౧. తురుష్కుల దేవుఁడు. (అల్లా.)

శా. స్మర్తల్ తత్త్వమటంచు నెంచఁగ మహాశైవుల్ మనోజద్విష, న్మూర్తిం గా నుతియింప వైష్ణవులు విష్ణుం డంచు నెంచం దగం, గర్తారుండనుచుం దురుష్కులు మొదల్గాఁ గొల్వఁ బ్రత్యక్షమై, మార్తాండుం డుదయించె నబ్ధితట సీమప్రాంచితౌర్వాకృతిన్. విప్ర. ౩. ౨౦. యయా. ౧. ౧౬.

సీ. అదె పాండవులగుడి యట దక్షిణంబునఁ గర్తారుఁ డుండు తుర్కులమసీదు. క్రీడా. ౧౪౫.

౨. సూర్యునకు తురుష్కభాషానామము.

గీ. అబ్జహితుపేరు లవి యెన్ని యైన నుండఁ, బ్రౌఢకర్తారుశబ్దంబు రూఢి కెక్కెఁ, దిమ్మనృప

ఖడ్గధారావిదీర్ణమర్త్య, ఖానపుంగవసాంగత్యగరిమ దివిని. కువల. ౧. ౪౦.

కర్త్రిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కర్తిరించువాఁడు; ఖండించువాఁడు.

కర్త్రితవ్యము. సం=కర్తనీయము.

కర్త్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కత్తిక, చురకత్తి. (వాచ) ౨. కర్తరి, కత్తెర. (వై. ని.)

కర్దటము. సం. వి. అ. పుం. ౧. బురద. ౨. తామర దుంప. ౩. పంకారము, నాఁచు†.

కర్దనము. సం. వి. అ. న. ఉదరనాదము, కడుపు నందలి మ్రోఁత.

కర్దమకము. సం. వి. అ. పుం శాలిభేదము, ఒకశకము వరి†. (వాచ.)

కర్దమము. సం. వి. అ. పుం. ౧. పంకము, అడుసు. ౨. పాపము. న. మాంసము, ఎఱచి.

కర్దమాటకము. సం. వి. అ. పుం. మలము మొదలగునవి వైచుతావు.

కర్దముఁడు. సం. వి. అ. పుం. ఒకానొక ప్రజాపతి.

కర్పటము. సం. వి. అ. పుం. చెమటమున్నగునవి తుడుచుకొనుట కుపయోగించు చేతిగుడ్డ మాలు. (మాలిన్యాదిదుష్టజీర్ణవస్త్రఖండము అనికొందఱు.)

కర్పటి. సం. విణ. (న్ సీ.న్.) కర్పటముగలవాఁడు.

కర్పటికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)=కర్పటి.

కర్పణము. సం. వి. అ. పుం. ఆయుధవిశేషము.

కర్పరము. సం. వి. అ. పుం. ౧. కటాహము, కొప్పెర. ౨. కుండపెంకు. ౩. తలపుఱ్ఱె. ౪. వెన్నెముక. ౫. శస్త్రభేదము. ౬. ఉదుంబరము, మేడి†. ౭. అగ్ని, నిప్పు. (వై. ని.)

కర్పరాలము. సం. వి. అ. పుం. పర్వతపీలువు, కొండగొనుగు†.

కర్పరి. సం. వి ఈ. స్త్రీ. ౧. మానిపసుపువవండిన అంజనవిశేషము. ౨. కబరి. కొప్పు. (వై. ని.)

కర్పాసము. సం. వి. అ. పుం. న ప్రత్తిచెట్టు.

కర్పూర. సం. వి. ఆ. స్త్రీ పచంపచ, మానిపసుపు.

కర్పూరతైలము. సం. వి. అ. న. కర్పూరపరిమళము గలతైలవిశేషము.

కర్పూరనాళిక. సం. వి. ఆ. స్త్రీ. భక్ష్యవిశేషము.

కర్పూరభోగి. సం. వి. న్. న. కప్పురభోగి. (చూ.)

కర్పూరమణి. సం. వి. ఇ. పుం. రత్నభేదము.

కర్పూరము. సం. వి. అ. పుం. న. ఘనసారము, కప్పురము; పచ్చకర్పూరము.

కర్పూరరసము. సం. వి. అ. పుం. రసకర్పూరము.

కర్ఫరము. సం. వి. అ. పుం. దర్పణము, అద్దము.

కర్బుదారకము. సం. వి. అ. పుం. శ్లేష్మాతకము, విరిగి†.

కర్బుదారము. సం. వి. అ. పుం. ౧. కోవిదారము. ఎఱ్ఱకాంచనము†. ౨. నీలఝుంటి, నల్లగోరంట†.

కర్బుర. సం. వి. ఆ. స్త్రీ. ౧. బర్బర, వాయింట†. ౨. పాటల, కలిగొట్టు†. ౩. విషముగల ఒకజాతి జలగ. (శ్లో. యాచ్ఛిన్నోన్నతకుక్షి స్స్వేల్ పర్శిమత్స్యవదాయతా, సవిషాకర్బురా నామ.... కే. ని.) ౪. కర్బురవర్ణముగలగోవు. (కే. ని.)

కర్బురము. సం. విణ. (అ. ఆ. అ.) చిత్రవర్ణముకలది. (అమరము—ఆకుపచ్చనతెలుపుకలిసిన వర్ణముగల ది వై. ని. కే. ని.) వి. అ. పుం. ౧. చిత్రవర్ణము. (అమరము— ఆకుపచ్చనతెలుపుకలిసినవర్ణము. వై. ని. కే. ని.) ౨. పాపము. ౩. నాదేయనిష్పావధాన్యము, నదీజలముచేఁ బండునట్టి అనుములు. ౪. శటి, గంట్లకచోరము†. న. ౧. నీరు ౨. బంగారు. ౩. ఉమ్మెత్త†.

కర్బురితము. సం. విణ. (అ. ఆ. అ.) కర్బురవర్ణము గలదిగా చేయఁబడినది.

కర్బురుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

కర్బువు. సం. విణ. (ఉ). చిత్రవర్ణముగలది. (యాజ్ఞ. ౩. ౧౬౬.) వి. ఉ. పుం. చిత్రవర్ణము.

కర్మంది. సం. వి. న్. పుం — కర్మందుఁడనుఋషిచే రచింపఁబడినభిక్షుసూత్రముల నధ్యయనముచేయువాఁడు—సన్న్యాసి, మస్కరి.

కర్మకరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మూర్వ, చాఁగ†. ౨. బింబిక,దొండ. (మే. ని.)

కర్మకరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) వేతనమునకై పనిసేయువాఁడు; కూలివాఁడు. వి. అ. పుం-కర్మానుసారముగా పాపులను హింసించువాఁడు-యముఁడు.

కర్మకాండము. సం. వి. అ. పుం. న. వేదమునందలి యజ్ఞాదికర్మవిషయకమగుభాగము.

కర్మకారి. సం. విణ. (న్. ణీ. న్.) పనిచేయువాఁడు.

కర్మకారుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ఎప్పటిపని కప్పుడు కూలి పుచ్చుకొనక వెనుక కలిగినఫలమునకుఁగాని రాఁబోవుఫలమునకుఁగాని పనిచేయువాఁడు. (దాసుఁడు, శిష్యుఁడు, మొ.) వి. అ. పుం. లోహకారుఁడు, కమ్మరి.

కర్మకీలకుఁడు. సం. వి. అ. పుం. రజకుఁడు, చాకలి. (త్రి. ని.)

కర్మక్షేత్రము. సం. వి. అ. న. కర్మభూమి, భరతవర్షము.

కర్మగ్రంథి. సం. వి. ఇ. పుం - కర్మబంధహేతువు - అజ్ఞానజన్యవాసనారూప మగుదోషము.

కర్మచండాలుఁడు. సం. వి. అ. పుం. జన్మముచేతఁ గాక కార్యములచేత చండాలుఁ డైనవాఁడు.

(కర్మచండాలురు నలుగురు - అసూయకుఁడు, పిశునుఁడు, కృతఘ్నుఁడు, దీర్ఘరోషుఁడు.)

కర్మచాండాలుఁడు. సం = కర్మచండాలుఁడు.

కర్మజము. సం. విణ. (అ.ఆ.అ.) కర్మమువలనఁ గలిగినది. (రోగాది) వి. అ. పుం. ౧. కలియుగము. ౨. మఱ్ఱి†.

కర్మఠుఁడు. సం. విణ. (అ.ఆ.అ) = కర్మశూరుఁడు.

కర్మణ్య. సం. వి. ఆ. స్త్రీ. జీతము; కూలి.

కర్మణ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కర్మసాధువు, కర్మములందునేర్పరి.

కర్మధారయము. సం. వి. అ. పుం. (వ్యాక) సమాసవిశేషము, సమానాధికరణతత్పురుషము. (ఉదా :- తెల్లగుఱ్ఱము, మొ.)

కర్మనిష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విహితకర్మముల నాచరించుటయందు ఆసక్తిగలవాఁడు.

కర్మపథము. సం. వి. అ. పుం. ౧. కార్యముయొక్క పద్ధతి. ౨. విహితకర్మానుష్ఠానమార్గము. (వ్యతి-జ్ఞానమార్గము.)

కర్మపాకము. సం. వి. అ. పుం. పూర్వజన్మమునఁ జేసినకర్మములు పరిపక్వమై ఫలోన్ముఖములగుట.

కర్మఫలము. సం. వి. అ. న. శుభాశుభకర్మములయొక్క సుఖదుఃఖాదిరూప మగుఫలము

కర్మభూమి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. భరతవర్షము.

కర్మభోగము. సం. వి. అ. పుం. కర్మజన్యములగు సుఖదుఃఖాదులను అనుభవించుట.

కర్మమీమాంస. సం. వి. ఆ. స్త్రీ. వైదికకర్మప్రతిపాదకమగుశాస్త్రము. (ఇదిజైమినిప్రణీతము. దీనిని పూర్వమీమాంస యనియు నందురు.)

కర్మము. సం. వి. న్. పుం. న. ౧. పని, కార్యము. ౨. విధ్యుక్తకర్మము, నిత్యనైమిత్తికాది. (యజనాదిషట్కర్మములు :- యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్ర

హము— గర్భాధానాదిషోడశకర్మములు :- గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము.) ౩. (వ్యాక) కారకవిశేషము. ౪. (వైశేషిక) ఉత్క్షేపణాదిపంచకర్మములు. (ఉత్క్షేపణము, అవక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము, గమనము.) ౫. (వైద్య) వమనాదిపంచచికిత్సాకర్మములు. (వమనము, రేచనము, నస్యము, అనువాసనము, నిరూహము.) ౬. (జ్యోతి) జన్మనక్షత్రమునకు పదియవనక్షత్రము. ౭. (జ్యోతి) లగ్నమునకు పదియవస్థానము. ౮. యజ్ఞము. ౯. ధవ్యము†. ౧౦. శిల్పము. ౧౧. యాతన. ౧౨. అర్థప్రయోగము, వడ్డి. ౧౩. పాపము. ౧౪. పుణ్యము.

శ్లో.....కర్మశబ్దస్తు పుంనపోః, పుణ్యే పాపే క్రియాశిల్ప యాతనాసు ద్రుమాంతరే, ధవ్యసంజ్ఞే కారకేచ కర్త్రీప్సితతమాదికే, అర్థప్రయోగే యజ్ఞేచ....(కే. ని.)

కర్మమూలము. సం. వి. అ. న. కుశతృణము†.

కర్మయుగము. సం. వి. అ. న. కలియుగము. (త్రి. ని.)

కర్మయోగము. సం. వి. అ. పుం. నిష్కాముఁడై విహితకర్మముల నాచరించుట. (ఇది మోక్షసాధనములలో నొకటి.)

కర్మరంగము. సం. వి. అ. పుం. న. శిరాలము†.

కర్మరి. సం. వి. ఈ. స్త్రీ. వంశరోచన, తవక్షీరి†.

కర్మవాటి. సం వి. ఈ. స్త్రీ. తిథి. (వై. ని.)

కర్మవిపాకము. సం. వి. అ. పుం. ౧=కర్మపాకము. ౨. కర్మఫలమును వివరించిచెప్పునట్టి యొకానొక గ్రంథము.

కర్మవ్యతిహారము. సం. వి. అ. పుం. ౧. క్రియావినిమయము, ఒకఁ డొకనికి ఒకపని చేసినపుడు వాఁ డట్టిపనినే వానికి మరల చేయుట. (ఇరువురు ఒరినొకరు కొట్టుకొనినయెడల వా రిద్దఱు కర్మవ్యతిహారముచేసినవారగుదురు.) ౨. ఒకరికి విహితమైనపనిని మఱియొకరుచేయుట. (శూద్రుఁడుచేయవలసినపని బ్రాహ్మణుఁడుచేయుట, మొ.)

కర్మశాల. సం. వి. ఆ. స్త్రీ. శిల్పాదిశాల, కమ్మరిలో నగువారు పనిచేయుగృహము.

కర్మశాలము. సం. వి. అ. న=కర్మశాల.

కర్మశూరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పూనినకార్యమును పాటుపడి నెఱవేర్చువాఁడు.

కర్మసచివుఁడు. సం. వి. అ. పుం. ఆలోచనము చెప్పుటయందుతప్ప తక్కినకార్యములందు రాజునకు సహాయుఁడగుజనుఁడు. (ఆలోచనచెప్పు మంత్రి ధీసచివుఁ డనబడును.)

కర్మసన్న్యాసి. సం. వి. న్. పుం. ౧. ఐహికకర్మములను విధ్యుక్తముగా వదలుకొన్నసన్న్యాసి. ౨. విహితకర్మములను ఫలాపేక్ష లేక అనుష్ఠించుజనుఁడు.

కర్మసాక్షి. సం. విశే. (న్. ణీ. న్.) పనిచేయుచుండఁగాఁ జూచువాఁడు. వి. న్. పుం. సూర్యుఁడు.

కర్మస్థానము. సం. వి. అ. న. ౧. జనులకార్యములు నడుపుకచేరి మొదలగుస్థానము, కార్యస్థానము. ౨. (జ్యోతి) లగ్నమునకు దశమస్థానము.

కర్మాజీవుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) శిల్పాదికర్మములచే జీవనము జరపుకొనువాఁడు.

కర్మాత్ముఁడు. సం. విశే. (న్). క్రియాసక్తచిత్తుఁడు, క్రియలందు మనస్సు తగిలినవాఁడు. వి. న్. పుం. కర్మబద్ధుఁడగుజీవుఁడు.

కర్మాధికారము. సం. వి. అ. పుం. విహితకర్మము లనుష్ఠించుటకు అర్హత.

కర్మానుష్ఠానము. సం. వి. అ. న. విహితకర్మములను చేయుట.

కర్మారము. సం. వి. అ. పుం. ౧. వెదురు†. ౨. కర్మరంగము†.

కర్మారుఁడు. సం. వి. అ. పుం. కమ్మరవాఁడు.

కర్మి. సం. విణ. (న్. ఈ. న్.) ౧. పనిగలవాఁడు, వ్యాపారయుక్తుఁడు. ౨. ఫలము నుద్దేశించి కర్మములు చేయువాఁడు. వి. న్. పుం. శిల్పి. ఈ. స్త్రీ. ౧. హాటకపుత్రిక, బంగారుబొమ్మ. ౨. శాల. ౩. పలాలము, గింజలురాలిపోయిన వరిమొక్క, మొ. (వై. వి.)

కర్మిష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) క్రియయందు సమర్థుఁడు, పనియందు నేర్పరి.

కరుర్మవు. సం. వి. న్. పుం. న. కర్మము, పని.

కర్మేంద్రియము. సం. వి. అ. న. వాక్పాణిపాదపాయూపస్థములలో నొకటి. (వ్యతి. జ్ఞానేంద్రియము - చక్షురాది.)

కర్వటము. సం. వి. అ. పుం. న. ౧. రెండువందల గ్రామములనడుమ అందముగానుండు పత్తనము.

శ్లో. కర్వటం ద్విశత గ్రామమధ్యేగ్రామో మనోహరః - హారావళి.

౨. దేశభేదము. న. పత్తనము. (కల్ప)

కర్వము. సం. వి. అ. పుం. ఆఖువు, ఎలుక.

కర్వరము. సం. వి. అ. పుం. ౧. వ్యాఘ్రము. బెబ్బులి. ౨. అంజలి, దోసిలి. ౩. పాపము. న. ౧. జలము. ౨. కర్మము. (కే. వి.)

కర్వరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. శివ, పార్వతి. ౨. ఇంగువచెట్టుయొక్క ఆకు. (కల్ప) ౩. భూమి. (కే వి.) ౪. ఆఁడుబెబ్బులి. ౫. రాక్షసి.

కర్వరుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

కర్వుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. (కే. వి.)

కర్శకుఁడు. సం. విణ. (అ. ర్శికా. అ.) ౧. కృశించువాఁడు. ౨. కృశింపఁజేయువాఁడు.

కర్శనీయము. సం. విణ. (అ. ఆ. అ.) కృశింపఁజేయఁదగినది.

కర్శయత్. సం. శత్ర. కృశింపఁజేయుచున్న.

కర్శయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కృశింపఁజేయువాఁడు.

కర్శితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) క్షీణింపఁజేయఁబడినవాఁడు; పీడింపఁబడినవాఁడు. (ఉదా :- వృత్తికర్శితుఁడు, శత్రుకర్శితుఁడు, మొ.)

కర్శ్యము. సం. వి. అ. పుం. కర్చూరము. కచోరము†.

కర్షకుఁడు. సం. విణ. (అ. ర్షికా. అ.) ౧. ఆకర్షించువాఁడు, లాగువాఁడు. ౨. దున్నుకొనిబ్రదుకువాఁడు వి. అ. పుం. కుజుఁడు, అంగారకుఁడు. (వై. వి.)

కర్షణము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ఈడ్చునది, లాగునది. ౨. గీచునది, ఒరయునది. ౩. దున్నునది. వి. అ. న. ౧. ఆకర్షణము, (విల్లులోనగువానిని) లాగుట. ౨. దున్నుట. ౩. ఒరయుట.

కర్షణి. సం. వి. ఈ. స్త్రీ. క్షీరిణీవృక్షము.

కర్షణీయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దున్నఁదగినది. ౨. లాగఁదగినది.

కర్షత్. సం. శత్ర. ౧. దున్నుచున్న. ౨. లాగుచున్న.

కర్షఫల. సం. వి. అ. స్త్రీ. ఆమలకి, ఉసిరిక†.

కర్షఫలము. సం. వి. అ. పుం. విభీతకము, తాండ్ర†.

కర్షము. సం. వి. అ. పుం. ౧. ఆకర్షణము, ఈడ్చుట, లాగుట. ౨. ఒరయిక, రాపు, విలేఖనము. ౩. గీఁత, గీఱ. ౪. కర్షణము, దున్నుట ౫. విభీ

శకము, తాంద్ర†. పుం. న. పదునాలుగుమాషముల యెత్తు.

కర్షిణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కళ్లెము, కవిక. ౨. కిరిణి†.

కర్షితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. లాగింపఁబడినది. ౨. ఒరపెట్టఁబడినది, రాపుపెట్టఁబడినది. ౩. దున్నింపఁబడినది.

కర్షువు. సం. వి. ఊ. స్త్రీ ౧. యజ్ఞార్థము త్రవ్వఁబడిన గర్తము; యజ్ఞార్థము దున్నిననేల. ౨. నది. ౩. కుల్య. కాలువ. ౪. తుషకోష్ఠము, ఊఁకకొట్టు. (వై.ని.) పుం. ౧. కరీషాగ్ని, పిడుకనిప్పు. ౨. వార్త. (వార్త= సేద్యము అనికొందఱు. జీవనోపాయము అని కొందఱు—కల్ప)

కర్ష్ట. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ౧. లాగువాఁడు. ౨. దున్నువాఁడు.

కర్ష్టవ్యము. సం=క్రష్టవ్యము.

కఱకంఠుఁడు. మి. వి. (√కఱ[1]-సం. గరకంఠః, క. కఱెగొరల. త. కఱైక్కణ్డన్.) శ్రీకంఠుఁడు, నీలకంఠుఁడు, శివుఁడు.

క. ఎఱు కని యెఱుఁగక నిన్నుం, మఱకువ నెదిరితిని దీని మఱవుము నన్నుం, గఱకంఠా క్షమియింపుము, నెఱి నెవ్వరి కెఱుఁగనగునె నీచరితంబుల్. భార. అర. ౧. ౩౨౩.

క. మఱచితి గాక లతాంగీ, కఱకంఠునితోడ నాడుకాత్యాయని నీ,నెఱ నెఱిఁగి నాఁడు చెప్పిన,తెఱఁగిదె సమకూరె నింక దిగు లేమిటికిన్. ఉ. హరి. ౫. ౫౮. (వీరేశ. పా.)

కఱకంఠునిల్లాలు = భవాని, పార్వతి. ఆం. భా. ౧. ౪౦.

కఱకరి. విణ. (కఱకు + అరి—ఇది ఉభయపదములలో విది-చూ. కావ్యా. ౩. ౬౫—సం. కర్కరః.) ౧. కఠినము.

వ. అనిన నత్తెఱవ యక్కఱకరిపలుకుల కులికి .... మనుచ. ౨. ౬౧.

౨. సమర్థుఁడు.

చ. మఱియు నతండు సంయమిసమాజవినిర్మిత జాతకర్ముఁడై, నెఱిఁ బరివర్ధితుండు నుపనీతుఁడునై వివిధాయుధంబులన్, గఱకరియై రణస్థలుల గద్దఱియై నిగమార్థవేదియై, నెఱతనకాఁడునై మెఱసె నిర్మలకాంతివిలాసరేఖలన్. మనుచ. ౪. ౩.

కఱకటి. వి. ౧. కరకరి, ద్వేషము.

సీ. మఱఁదులు గాంచినఁ గఱకటి నెంతురు వదినె లెఱింగిన వానిచేదును. హంస. ౧. ౧౨౫.

వ. నాకు నిగ్గిరికి నిప్పుడు గొన్నివాసరంబులనుండి యీరసంబు వెరుఁగం గఱకటి నెట్టుకొని సాగుచున్నది. కాశీ. ౧. ౧౦౦.

క. అఱకాలను విఱిగినములు, కుఱు చైనను విదపఁ జీము కూరిచెడుగతిన్, దఱిఁ దెఱపమిఁ గొంచెపుఁబగ, గఱకటి నరికట్టి పిదపఁ గడు నొప్పించున్. ప్రబోధ. ౨. ౪౯.

౨. బాధ.

(చంద్రోపాలంభనము.) క. తెఱప నపరాధరహితం. గఱకటి పెట్టెదవు....రా. వి. ౪. ౫౪.

చ. కఱకటి పెట్టి సౌమ్యుడుగుఁ గాని నిజార్తి యెఱుంగ దేమియున్. ఆము. ౫. ౬౧.

కఱకు. విణ. (సం. కర్కశః.) ౧. కఠినము, క్రూరము, పరుషము, బిరుసు, ముదుగు, మోటు.

ఆ కఱకుదర్పపూరి పఱపుబ భిక్షన్న, మళన మట్టివారి నతిముదమున, నాదరించెఁ బ్రీతి నాదిగర్భేశ్వరి. భార. అది. ౩. ౨౨౪.

చ. కఱకులు దుష్టవర్తనులు కామమదాదులు....ప్రబోధ. ౪. ౫౪.

క. వనజనయనుఁ డొం దేమియు, ననక నగుచు నూరకుండె నాదిత్యుల కిట్లను సత్యభామ

భావము, మనమునఁ బెవఁగొనఁగ గఱకుమాటల
తోడఁ. వి. పు. ౮. ౧౨౮.

సీ. కఱకులై పెరిఁగినకుఱువెం(డుకలతోడ బట్టయో
దలఁ గావిపాగ యమర. నైష. ౭. ౯౩.

గీ. గాలి రాకుండ వెలుతురుగాక యుండఁ, గఱకుఁగఱ
బట్టఁ గన్నపుగండి గప్పి. వేం. పంచ. ౩. ౨౦౦.

౨. తీక్ష్ణమైనది, వదనైనది; భయంకరమైనది.

వ. సురపతి తఱచు మెఱుఁగు లదరుకఱకుబిదురము
గొని....పారి. ౨. ౮౭.

క....తక్షకాదిమహాహుల్, కఱకుంగోఱల విషములు,
దొరఁగఁగ నీరీతిఁ గఱచి తూలుచునంతన్. దశా.
౪. ౧౮౨.

గీ. కఱకుమిడి(గుడ్లు విప్పులు (గక్కుదృష్టి....కలుగు
వాని....భాగ. ౧౦ ఉ. ౯౩౯.

౩. గాఢము, దట్టము, సాం(దము.

(అనూడుఁడు.) సీ. జంకించి పరపృథగ్జనకోటి చందా
నఁ గఱకుఁజీకటి వెన్నుసఱచువాఁడు. కాశీ. ౩.
౨౩౪.

వి. ౧. కాఠిన్యము; బిరుసుఁదనము.

సీ. కోకంబులకుఁ బైఁడికుండలకఱకుమో పంతయు
సరసత నబ్బెనేని. హరి. ఉ. ౭. ౧౬౪. (శ. ర.
పా.)

క. మొగి విరిసి కఱకు గూడక,పగులక వెడలుపును
నిడుపుఁ బసిమియుఁ గలలేఁ, జిగురరఁటాకులు
పెట్టిరి, దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్యపురం(ధుల్.
భీమ: ౨. ౧౨౮.

౨. శౌర్యము.

సీ....కఠిమి యుక్కు కఱకు గట్టి కడిఁది. గీ. నాఁగ
శౌర్యాభిధానంబు గాఁగఁ బెలఁగు. ఆం. భా. ౨.
౨౨౧.

(బ). ౧. పరుషవచనములు, కఠినోక్తులు.

ఉ. అవ్వను దాతనుం గఱకు లాడఁగ నేటికి .... కృ.
శకుం. ౨. ౨౨౨.

సీ. అతనిచే నున్నట్టియాషాఢదండంబు కఱకులాడు
చుఁ బట్టి విఱిచె నొకతె. మూర్తి(తయోపాఖ్యాన
ము. ౬. ౭౦.

౨. (కూరకృత్యములు.

గీ. ఓరిపాపాత్మ నన్ను నీ వూర కిట్లు. పొరిగొనుటఁ
జేసి కరములఁ జరణములును, నఱకఁబడియుం
డుఁ బొమ్ము నీకఱకు లెల్లఁ, జక్కనగు నంతతో
నని శాప మిచ్చె. భోజరా. ౫. ౧౦౯.

౩. అంపము మొదలగువానికక్కులు.

సీ....కఱకులకశ్లెంబుగాడ్డకేల వేణు. శ. ౬౪. కఱకె
(ర్కె)క్కు = ౧. కఱకుకలదియగు, గట్టిపడు.

వ. కఱకెక్కినమెడలును పఱఁదమూఁపురంబులును
వెడఁదవీఁపులును దోరంపుగంగదోళ్లునునై (కాలు
వృషభంబుల....హరి. పూ. ౫. ౧౪౨.

౨. అరితేఱు.

క. ఆఱువదిలక్షలు రావణు, నుఱుబాహుబలంబు
పేరు లొగి నాలములం,గఱకెక్కినారు వారం,దఱు
మూలబలంబుదొరలు ధరణీనాథా. భా. రా. యు.
౪౩౪.

౩. (కూరమగు.

సీ. రాహు(గహో(గదంష్ట్రావిష(గాహియై కఱకెక్కిన
శశాంకకౌముదియును. కవిక. ౩. ౧౧౦.

౪. పులకించు, గరుపొడుచు.

వ. అని యమ్మునిపతి సురపతికి .... భయంపువార్త
చెప్పినవిని యదరిపడి యక్షణంబ వ(జి....తత్సరో
వరంబునకుఁ జనుదెంచి యబ్బాలసుం గనుంగొని
మేను కఱకెక్క వెక్కసంపడి శిరఃకంపంబు
సేయుచు....కు. సం. ౧౦. ౪౨౬.

ఉ .... మానములు గిద్పడఁ జెయ్యిల కుచ్చలించి

క,ర్కొక్కఁ దనూలతల్...శిఖిప్రసంగతిం, జొక్కి మహీసురాంగనలు సోలి రపూర్వ రతి ప్రమత్తలై. కు. సం. ౧౦. ౪౦౧.

జ: కఱకరి,కఱకుఁదనము, కఱకుగీలు, కఱకుదుమ్ము, కఱకువరహా,కఱకుసాన,కఱగొను.

**కఱకుఁదనము.** వి. (√కఱకు) కాఠిన్యము, పారుష్యము; క్రౌర్యము.

గీ. సంతతంబును శ్రీహరిస్మరణ లేక,కఱకుఁదనమున దుర్భాష లఱచెనేని,విధవ పెనిమిటితోఁగూడ వివిధనరక,కూపబాధలఁ బడుఁగడు గుఱుతు లేక. జై. భా. ౩. ౩౪.

**కఱకుగీలు(ల్లు).** అ. క్రి. (√కఱకు) బిరుసగు.

వ...నిడుద లైయుండుకఱకుగిలునాసాకేశంబులును. కవిక. ౫. ౧౧౦. (శ. ర. పా.)

**కఱ(ఱ)కుట్లు(ట్టులు) = కఱుకుట్లు.** వి. బ. (√కఱ²) కాల్చిపక్వము చేయుటకు గసికయందు గ్రుచ్చినమాంసఖండము; శూల్యము, శూలమునకు గ్రుచ్చికాల్చినమాంసఖండము.

గీ. ఇవ్విధంబున వలలోనియింగలంబు,చల్లఁగా నార్చి కీకటస్వామి పలికె,ఋషికులోత్తమ యిఁక నాకు నిమ్ము నీవు,కైకొనినకీలఁ గఱకుట్లు గాల్పవలయు. వరాహ. ౨. ౨౩.

చ. నిలువుఁడు వేయు నేల తగునే కఱకుట్లును జంకఁబొత్తముల్. ఉ. హరి. ౨. ౧౩౭.

ద్వి. ఎఱచులు కఱకుట్టు లెన్నేని గలవు. బస. పు. ౩. ౬౬౨ పం.

సీ. కఱకు ట్లనంగను గనుపట్టు శూల్యంబు...అం. భా. ౨. ౨౫౨.

**కఱకుదుమ్ము.** వి. (కఱకు+దుమ్ము) సికత, ఇసుక.

సీ. మలయానిలము చేదుమారంబు రేఁగుసౌగంధికంబురజంబుకఱకుదుమ్ము, నిండార విరిసిన బొండుమల్లెలనుండి వడియుమరందంబుగు దరసంబు. గీ. తనకు రసవర్గములు గా సుధా కరుండు...బ్రహ్మాండమండ,పంబు వెన్నెల సన్నసున్నంబు సేసె. మనుచ. ౫. ౩౮.

**కఱకువరహా.** వి. (√కఱకు) నాలుగురూపాయల విలువగలబంగారునాణెము.(పూలవరహా=మూఁడున్నరరూపాయ విలువ గలబంగారునాణెము)

**కఱకుసాన.** వి.(కఱకు+సాన)పదను పెట్టెడిసాన.

గీ.కఱకుసానలఁ గెంపు గాఁకలఁ గడాని,చికిలియగుకీలి మెఱసె బాలకునిమేను. దశా. ౪. ౧౭౭.

**కఱగొను.** అ. క్రి. (కఱకు+కొను) స్థిరపడు.

క. పెఱచోఁ జేసినపాపము,లఱుమక యయ్యోడ నడంగు నవిము క్తమునం,గుఱుకొని చేసినయఘములు,కఱగొని దృఢవజ్రలేపకం బగుఁ దరుణీ. పద్మ. ౩. ౮౮.

**కఱగోలు.** వి. లోపము, లోటు.

చ. తతిమి సుశర్మ తమ్ములను దానును నాజికి నన్నుఁ బిల్వ నే,నెఱుఁగనియట్టు లుండుటిది యేపురుషార్థము వారి సెల్ల నే,డ్తెఱనుఱమాడఁ బంపుము కడిందిగఁ జూడకు నీకు నేమియుం,గఱగోలు గాదు పోమి కడుఁ గష్టము నాకు నుదాత్తమానసా. భార. ద్రో. ౧. ౨౨౩. కకు. ౫. ౩౪, ౩౫.

**కఱచు¹.** స. క్రి.(త.కటి)౧.కాటువేయు,కొఱుకు.

గీ. తొలఁగుపోకుండ మెకములు గఱవకుండఁ, బాఁడి దఱుఁగక యుండ నాపాటిగొల్ల,లిచ్చ మెచ్చ నీదృష్టికి నెక్కఁ గదుపు,నరయ నేర్తు నన్నెలును ధరణినాథ. భార. విరా. ౧. ౨౭౯.

క. జనపతి పంపఁగ సారథి, ఘనవిషకృష్ణోరగములఁ గఱపించె...భార. ఆది. ౫. ౧౭౫.

క.అఱచినఁ బఱచిన ప్రేతలు,గఱచిన నఱఁడించుకయును గరుణింపక యం,దఱ నుఱుము సేసె...భార. సౌ. ౨. ౭.

౨. ఖండించు, ముక్కలుచేయు.

వ. ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు... దైత్యులఁ గఱచియు...ఉ. హరి. ౧. ౧౪౭.

క. ... అక్కఱచినబిసలవవిసరము, తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్. ఆము. ౪. ౧౨౧.

౩. నాటు, గ్రుచ్చుకొను; తగులు, అంటు.

క. అఱిముఱి వ్రేసినఁ బలకం, గఱచినసైంధవుని యలుఁగుఁ గని నరసుతుఁ డే, ర్చెఱ మురిసిన ...భార. ద్రో. ౧. ౧౬౩.

మ...భీ, శరబాణావళిఁ బింజ పింజఁ గఱవంగా నేసి...భాగ. ౪. ౩౩౪.

వ...గఱిగఱిన్ గఱవఁ గరకరిన్ జెఱకువిలుకాఁడు పరఁగించు విరిదమ్మిగొఱకలు...మను చ. ౨. ౮౧. (గఱిగఱిన్ గఱవన్ = పుంఖానుపుంఖముగా అనిభావము.)

౪. పండ్లమున్నగువానితోఁ బట్టుకొను; గ్రహించు. (చూ. కఱపించు[1])

చ. కఱచినపీనుఁగు న్వేడఁదక ప్పెరయు న్నోలఁ బచ్చితోళులున్, బుఱియలపేరులున్ ... ఉ. హరి. ౨. ౧౨౮.

వ...ఇది భూమిపయిం బడిన నిమ్నులకు బాధ యగు నని దానిం గఱచికొని గజకచ్ఛపంబులం గరంబుల నిఱికికొని గరుడుండు గగనంబునం బఱచి...భార. ఆది. ౨. ౬౩.

గీ. చామరంబులు వెనుకకుఁ జనుట నీల,రత్నములు పూరిఁ గఱచుట భ్రమరక మని, తేఁటి బిడ్డపే రిడుట యాతెఱవకురుల, యధికనీలిమ కోడిసూ హరితనూజ. ప్రభా. ౨. ౮౫.

('సూదంటుఱాయి ఇనుము నాకర్షించునట్లు ఇంద్రనీలము గడ్డి నాకర్షించుట శాస్త్రప్రసిద్ధము. ఓడితినని తెల్పుటకు గడ్డి కఱచిన దని రెండవ యర్థము.)

సా: మొఱఁగెడికుక్క కఱవదు.

జ: కఱపించు[1], కాటు[1], కాటులాడు.

**కఱచు[2].** స. క్రి. నేర్చు, అభ్యసించు; తెలియు.

సీ. వేదంబులును ధనుర్వేదాదివిద్యలుఁ గఱచుచుం గడ లేనియెఱుకఁ దనరు. భార. ఆది. ౩. ౧౨.

వ...భాషలు గఱచి...కాశీ. ౩. ౬౯.

క. ఎఱుక గలవారిచరితలు, గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక...భార. ఆది. ౩. ౨౦౩.

జ: కఱపించు[2], కఱపు.

**కఱటి.** విశే. ౧. కుజనుఁడు, దుష్టుఁడు.

గీ. కఱటి యడిగొట్టు పలువ యేతరి గరాసు, చెనఁటి చెన్నఁటి కూళ కుచ్చితుఁడు మొండి, కట్టె నాఁగను కుజనాఖ్యగాఁ జెలంగు. ఆం. భా. ౩. ౬.

౨. వంచకుఁడు, మోసగాఁడు; వంచకము.

ద్వి. కాదేని రాక్షసక్షయముఁ గావింప, నాదటఁ జింతించి యబ్జసంభవుఁడు, మెఱుఁగు లెల్లను గూర్చి మృగముగాఁ జేసి, కఱటియై పుత్తేరఁగా వచ్చినదియొ. రం. రా. అర. ౧౬౨ పు. ౨౮ పం.

సీ. మానంబు పీటఁబో మసఁగి వ్రేతలఁ జిక్కవఱచినయదియె యీకఱటిచూపు. హరి. పూ. ౯. ౨౨౪.

౩. మూర్ఖుఁడు.

క. తెలియనినరుఁ దెలుపఁగ నగుఁ, దెలిసినమానవుని వలదు తెలుపఁగ మదిలోఁ, దెలిసియుఁ దెలియనికఱటికిఁ, గలితన మెఱఁగింపఁ గమలగర్భునివశమే. వేం. పంచ. ౧. ౬౮౮.

వ ... వ్యావహారికసత్యత్వంబు ప్రకటించుప్రపంచంబుచేత వంచితు లగునెఱుక లేనికఱటులకరణి హరిణంబులు మరీచికావీచికాపానవివశంబులై దిశలఁ బరిభ్రమించె. పాండు. ౪. ౧౮. అప్ప. ౨. ౧౮౬.

కఱటితనము = మూర్ఖత్వము.

క. తెఱవా నాడెపుటచ్చర, తెఱవలకుఁ లేనిమే
ల్గదియవచ్చునెడఁ, జెఱచుకొనఁ గూడ
దిపుడీ, కఱటితనం బుడిగి నెమ్మిఁ గైకొను
నన్నున్. అచ్చ. రా. సుం. ౪౦.

౪. అభాగ్యుఁడు.

ద్వి. కన్నులు గానని కఱటిచే నద్ద, మున్న చందం
బున మూఁగనరుంటు, కన్న కలయుఁ బోలె...
ప్రభు. ౪. ౧౦౫ పా. ౭ పం.

**కఱతలాఁడు.** విణ. (కఱతలు + ఆఁడు) ౧. విజ్ఞుఁడు.

సీ. ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబుఁ గ
డదాఁక నెఱిఁగిన కఱతలాని. కాశీ. ౨. ౧౬౦.

౨. పోకిళ్లమారి, దుశ్చేష్టలు చేయువాఁడు.

క. కదలిన మొత్తుదు నెక్కుడఁ, గదలెద వటు
కఱతలాఁడ కదలుమ యేఁజా, చెద ననుచుఁ
బోయి యిమ్ముల, ముదిత నిజకుటుంబకార్య
ములఁ దత్పరయై. హరి. పూ. ౫. ౨౪౨.
(శ. ర. పా.)

**కఱతలు.** వి. బ. (సం. కృతమ్. ప్రా. కత.) చేష్టలు, చేఁతలు; దుశ్చేష్టలు, పోకిళ్లు.

చ. కఱతలు పెద్ద వీని కిటు కాఱియఁ బెట్టెడు
మాన కేమిటన్, నెఱఁకులు మీటుచుండుఁ
దననీచపుమాటలు వీనిఁ బట్టి క్రచ్చఱఁ బరి
మార్పఁ జేసినయుపాయము లన్నియు గొడ్డు
వోయె నీ, వుఱక వధింపఁగావలయు నుగ్ర
పుమాయల నిద్దురాత్మునిన్. నృసిం. ౪. ౧౩౫.
(కఱదలు. చి. ని. పా.)

సీ. కఱపుట నేర్పుట కఱతలు పోకిళ్లు కఱడలు
బుద్ధులు కఱటి మంకు. అప్ప. ౨. ౧౯౭.

జ: కఱతలాఁడు.

**కఱద.** వి. ౧. మాట, పలుకు.

గీ... కఱద నాఁ బలుకు వాఁగఁ, బొల్చు భాషిత
మై మాతృభూతలింగ. ఆం. భా. ౧. ౧౧౦.

(బ) ౧. మాయమాటలు.

చ. ఎఱుఁగుదు తథ్య మింతయు మహీసురవర్య
మతి ప్రకాశతన్, గఱదలు మాని చెప్పుము
ఖగత్వము నేమి నిమిత్త మొందితి, వు...
పద్మ. ౪. ౧౧౬.

౨. బుద్ధులు.

సీ. కఱపుట నేర్పుట కఱతలు పోకిళ్లు కఱదలు
బుద్ధులు కఱటి మంకు. అప్ప. ౨. ౧౯౭.

క. పిఱుతిపియక నాముందఱఁ, దెఱవా యిప్ప
గిది నాడఁ దెఱవా మేల్ మేల్, కొఱమాలి
నయుఖ్వీటిఁడి, కఱదలు నీ కెవ్వ రిపుడు కఱ
పిరి చెపుమా. అచ్చ. రా. అయో. ౨౨.

౩. సంకోచములు.

(దశావస్థలు.) సీ. కఱదలు మాని సంకల్పించెఁ
గలకంఠి యొద విలపించె నన్నుదలమిన్న. ప్ర
బంధ. ౫౫౫.

౪. చేష్టలు, కఱతలు.

క. బిఱబిఱ విభుకడ కరుగక, కొఱకొఱ లాడెద
వ దేమిగోరము మేల్మేల్, వెఱఁ గయ్యెడిఁ
గద నీచెడు, కఱదలు గనుఁగొన్న నెన్నఁగ
న్నెలమిన్నా. రసిక. ౫. ౧౬౩.

౫. చమత్కారములు, వింతలు.

క. కఱదలపులుఁ గిది తా నే, మెఱుఁగునో కో
తిరిగి తిరిగి యీ ఫలకము పైఁ, బఱపెడుఁ జూ
డ్కుల నా నా, మెఱుఁగుం బోఁడికి మరాళి
మృదుమధురోక్తిన్. ప్రభా. ౩. ౪౭.

**కఱదూపము.** వి. (కఱ$^1$ + దూపము — సం. కాలధూపః) ధుంధుమారము, గృహధూమము.

గీ. విరహపరితాపవేదన వేఁగుచున్న, చక్రవా
కాంగనలకటాక్షములయగ్గి, నావహిల్లినకఱ
దూప మనఁగ నొప్పు, నుడుగణాధీశబింబం
బునడిమిమచ్చ. భీమ. ౨. ౪౫.

**కఱ(ఱ్ఱ)నూనె.** వి. (√ కఱ$^2$.) మ్రానితైలము. (శ. ర, వా.)

**కఱపడు.** అ. క్రి. (కఱవు$^1$ + పడు) కొఱఁతపడు, తక్కువగు.

చ. వెఱఁగు జనింప నత్తెఱఁగు వెంగలిమంగలి సూచి కన్నమి, న్నెఱుఁగక యింటి కేఁగి య ట్టు లేసును భూరినిధుల్ గడింతు నం, చఱిము ఱఁ గొంకు లేక లగుడాగ్రము గైకొని య త్న మేమియుం, గఱపడకుండ నాక్షపణక త్రితయాగమనంబుఁ గోరఁగన్. వేం.పంచ. ౫. ౫౮. (కరిపడు-ముద్రి.)

**కఱపించు**[1]. స. క్రి. (√కఱచు[1].) కఱవఁజేయు. (పండ్లమున్నగువానితోఁబట్టికొనఁజేయు.)

ఆ. నెఱచి తల్లిఁ దోఁకఁ గఱపించుకొని దివిఁ, బఱచువానిఁ జూచి పార్థుఁ డలిగి, వానితల్లి శిరముతోన తత్పుచ్ఛంబు, దునిసి యగ్నిశిఖ లఁ దొరఁగ నేసె. భార. ఆది. ౮. ౨౬౩. (గ్రహింపఁజేయు, ఆకర్షింపఁజేయు.)

సీ. ఘననీలములఁ బూరిఁ గఱపించు నన వేణి కురుల మెఱుంగు వాక్రువ్వ నేల. పె. శకుం. ౧.౮౮. ('కొఱికించు, అని రెండవయర్థము.)

**కఱపించు**[2]. స. క్రి. (√కఱపు) కఱపఁజేయు. (నేర్పించు.)

ఉదా: భీష్ముఁడు ద్రోణునిచే కౌరవపాండవు లకు విలువిద్య కఱపించెను.

**కఱపు**. స. క్రి. (√కఱచు[2])౧. నేర్పు, బోధించు.

సీ. ద్రోణగాంగేయులు దురితవిదూరులు నిన్నెద్ది గఱపిరి నెమ్మితోడ. భార. ఆది. ౮. ౪౩.

క. నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ, గన్నియలకు నా ట గఱపఁగా నోపుదు ... భార. విరా. ౧. ౨౩౩.

వ. సమయోచితంబు లగుభాషణంబులు చెలికత్తె యకుం గఱపి పుత్తెర...నైష. ౪. ౯౯.

౨. కలిగించు.

సీ. వారక నేకావతారముల్ హరి కురుకల్పంబు లజానకుఁ గఱపువాని. కు. సం. ౨. ౧౬౩.

వ. అప్పాండవసైనికులు... గతప్రాణులై వదలు కృపాణబాణాసనాదిసాధనంబులు వీరయో ధయూథపతురంగమాతంగంబులం దొరఁగు రుధిరప్రవాహంబులకు జలగ్రాహంబులయొ ప్పు గఱప...జై. భా. ౬. ౧౬౫.

వి. బోధనము; దుర్బోధనము.

ద్వి. నెఱవైన పెద్దలు నేరనియట్టి, కఱపులు గఱ చె నీకతకారిబిడ్డ. అ. మ. క. ౧. ౩౪ పా. ౨౩ పం.

ఆ. శకునికఱపు విని యసన్మార్గవృత్తికిఁ, జొచ్చి యిట్టియెడరు దెచ్చుకొనియె. భార. భీష్మ. ౧. ౩౦.

క. నీకఱపుల నిక్కురుకుల, మాకుల్యముఁ బొందు టేమి యాశ్చర్యము సౌ, మ్యాకృతులు గాని వారల, వాకులు శిక్షలు నుపద్రవంబులు కా వే. భార. ఆది. ౮. ౪౧.

**కఱవ**. వి. ఒకానొకమూలిక. (శ. ర.)

**కఱవు**[1]. వి. కాటకము, క్షామము; లేమి.

సీ. వహ్నియు భయమును వఱపును గఱవును నా దిగాఁ గలయెగ్గు లడఁగెఁ బుడమి. భార. సభా. ౧. ౨౬౧.

క. కఱవుపయిఁ గఱవు వొరయుచు, వెఱపుప యిన్ వెఱపు దోఁప...భార. శాం. ౪.౬౨.

క. కఱవుకుఁ దో డావపంట గలిగినకరణిన్. కువల. ౧. ౧౦౧.

గీ...చతుర, రతులకఱవునఁ బడినట్టు లతులసౌ ఖ్య, వారినిధిఁ దేలుచుండిరి వార లంత.శుక. ౨. ౩౪౪.

మ...శూరశ్రేష్ఠు లన్యుల్ జగం, బుల లే రెవ్వరుఁ గయ్యపున్ గఱవు నన్ బొందన్ ద్రిలోకైక బా, హులు వే యాఱడి మోపులై యెటులు పో నోపుం దలం కయ్యేడిన్. హరి. ఉ. ౬. ౧౯.

విణ. అలభ్యము.

చ... లేరికి బృహన్నల సారథి యైన దీని నవ్వ

రె పురిలోన నింత కఱవా రథచోదకు లింత
యేటికిఁ. భార. విరా. ౪. ౨౦.

క. తగవా మగవారికి నిటు,మగువరొయిడం దెగుపఁ
జూప మాదృశవీరుల్,జగతిం గఱవా దొర
వా,మగఁటిమి గలరాచచందమా యిది యి
హిహీ. రామా. ౫. ౧౭౮. నైష. ౧.౧౦౫.

జ: కఱపడు.

**కఱవు²**. వి.పూరియిండ్లకప్పు నేయునపుడు ఏర్పఱ
చుకొనుమితి.

సీ. కఱవు గేస్తురుయిండ్లకప్పు నేఁతలయంద సు
డివడి కలఁగుటల్ మదుఁగులంద. అచ్చ.
రా. బాల. ౪౭.

**కటి¹**=కటియ, కట్టి, కట్టె. విణ. (క. త. కటి.)
నల్లనిది.

చ. దళముగ నందుఁ గోటలతుదన్ దవిలించిన
మించుపైఁడివ్రాఁ,తలకటిటెక్కెముల్ గని
యెదన్ మెఱుఁగుల్ గలమబ్బులంచు...
యయా. ౧. ౭౯.

సీ. అందంపుటాఁబెయ్యమందలోపలఁ జొచ్చి
క్రీడించుకటివన్నెకోడె యనఁగ. బహు.
౨. ౧౯.

వి. కార్ష్ణ్యము, నల్లఁదనము.

సీ. కటి కట్టి కాటియ కటియ నల్లన నల్పు కప్పు
కందనఁగను నొప్పఁ గృష్ణవర్ణంబు... ఆం.
భా. ౧. ౧౦౮.

క. అఱపాలు సంజకెంపున, కిరవై తనరారి కడ
మ యిరులను సాఁబాల్,కటిఁ బరఁగుచుఁ జ
దలత్తటిఁ,గటి గలగురువిందగింజకై వడిఁ దన
రెన్. ప్రబంధ. ౬౨.

జ: కటిజేజేయన్న,కటిపక్కము,కటిమానికము,
కటిమెడదొర, కటియావు, కటివేము, కటివేలు
పు, కటివేల్పురికక్క, కటివేల్పుపజ్జ.

**కటి²**. వి. పసుమోవి. (శ. ర, శ్రా.)

**కటిజేజేయన్న**. వి. (కటి¹+జేజే+అన్న)-విష్ణు
నియన్న-ఇంద్రుఁడు. ఆం. భా. ౧. ౪౬.

**కటిపక్కము**. వి.(√కటి¹)కృష్ణపక్షము.(శ.ర.)

**కటిమానికము**. వి. (√కటి¹) ఇంద్రనీలమణి,
నీలము.

సీ. కటిమానికంబులగముల తేటలను గూర్చినమే
లిపట్టంపు రెంటెములును. యయా. ౪.౧౨౦.

ఇశ్లే:-కటిరతనము.

సీ. కటిరతనంపుఁజొక్కపుసిరుల్ తళుకొత్త...
నీలా. ౨. ౪౮.

**కటిమెడదొర**. వి. (√కటి¹). శితికంఠుఁడు, శి
వుఁడు.

క. రాకొమరులార గుబ్బలి, రాకన్నియమగని
యబ్బురపువి ల్లిది ముం, దాకటిమెడదొర
దీనిన్,డాకొని బలుటక్కరుల నడంచెన్
గడిమిన్. అచ్చ. రా. బాల. ౧౭౦.

**కటియ(టె)**=కటి¹.

(నల్లనిది)

ఆ. కటియజీలకఱ్ఱ గటివేము గురుజ యిం,గువ
ప్రవర్జనీయకోటి యగుట. భార. అను. ౩.
౧౮౯. (కటియజీలకఱ్ఱ=నల్లజీలకఱ్ఱ.)

సీ. కటియరేవడిఁ బదాగ్రములు జిఱ్ఱన జాఱఁ
బ్రాంతభూజము లూఁతపట్టువారు. చంద్ర.
౫. ౩౯.

వి.కార్ష్ణ్యము, నల్లఁదనము. ఆం. భా. ౧. ౧౦౮.

కటెవాఁక=యమునానది.

ముకుంద. ౧. ౩౪ పా. ౨. పం.

**కటియావు**. వి. (√కటి¹) నల్లావు,కపిలధేనువు.

ద్వి. కమ్మగాఁ గాఁచినకటియాలనెయ్యి, తెమ్మ
లుగాఁ దెచ్చి దించువారలును. ప్రభు. ౫.
౨౫౧ పా. ౩ పం. (చి. ని. పా-'గంగావు
నేయి' ము ద్రి. పా.)

**కటివేము.** వి. (√కటి¹) కృష్ణనింబము.

వ...కుస్తుంబరీకిసలయవాసనలతోడం బిసాళించుకటివేఁపాకుపరిమళంబును ... కాశీ. ౭. ౧౮౫.

ఆ. కటియజీలకఱ్ఱ గటివేము కురుజ యిం,గువ ప్రవర్జనీయకోటి యగుట. భార. ఆను. ౩. ౧౮౯.

సీ. కటివేము నాఁగ నమరుఁ గృష్ణనింబము... ఆం. భా. ౨. ౫౦.

**కటివేలుపు(ల్పు).** వి. (√కటి¹) విష్ణువు. నీలా. ౧. ౬౬.

ఇశ్లే: కటివన్నె వేల్పు. సమీర. ౭. ౭౯.

**కటివేల్పురిక్క.** వి. (√కటి¹) విష్ణుదేవతాకమైననక్షత్రము, శ్రవణనక్షత్రము. (శ. ర.)

**కటివేల్పుహజ్జ.** వి. (√కటి¹) ౧. విష్ణుదేవునిపాదము. ౨. విష్ణుపదము, ఆకాశము.

సీ. విను ద్రిమ్మరులు కటివేల్పుహజ్జను బూజ సలిపినక్రొత్త చెంగలువ లనఁగ. గీ... సంజకెంజాయ లమరె. అచ్చ. రా. అయో. ౧౩.

**కఱకు.** స. క్రి. రాచు.

గీ. కఱకుటంఘ్రుల నిఱికించి గజ్జె గదలఁ, గఱికి నెఱినెఱఁ గోలెమ్ముకయును విఱుగ, విఱిచె వడిఁ గైజా నొకపెద్దవేసడంబు. మనుచ. ౪. ౫౮.

వి. (సం. క్షారః. క. కఱుకు. త. కఱుక్కు.) భస్మవిశేషము. ('మూలికాదులు కాల్చి చేసినభస్మము. ఇది మందుగా నుపయోగించును' అని బ్రౌ.)

సీ. భస్మవిశేషంబు పరఁగును గఱు కన...ఆం. భా. ౨. ౨౪౩.

**కఱు(ఱ్ఱు)కుట్లు**=కఱకుట్లు. (√కఱ్ఱు)

క. కాలవో క్రొవ్వవో మాఁడం, గాలెనొ చవిగావో కమ్మగావో నీకుఁ, జాలవొ యలవడవో తిన, వేలా కఱుకుట్లు పార్వతీశ్వర చెపుమా. కాళ. ౩. ౮౮.

సీ. నీరు వెళ్లఁగ నొత్తి నిప్పుల నాదండ కమ్మఁగాఁగాల్చినకఱ్ఱుకుట్లు. రుక్మాం. ౩. ౨౨౬. (శ. ర. పా. 'కఱ్ఱుకుట్లు' అనిముద్రి.)

**కఱుక్కు(కు).** వి. నఱుకుట మొదలగువానియందగు ధ్వనికనుకరణము. (దీనిఆమ్రేడితరూపము కఱుకుకఱుక్కు-కు)

వ...తలలు కఱుక్కునఁ దెగ నఱుకుసురవీరులును...ఉ. రా. ౪. ౨౯౧.

చ. శయజలజాతవిస్ఫురితచక్రముచే మధుకైటభారి దుర్నయుఁ డగుసైంహికేయునిశిరంబు గఱుక్కునఁ ద్రుంచునంతలో ... దశా. ౨. ౩౬౯. చంద్రా. ౩. ౫౬.

చ. కఱుకుకఱుక్కున న్నఱకి ... రంగా. ౩. ౧౨౩.

క. చెఱకులు నఱకినచాడ్పునఁ, గఱుకుకఱుక్కనఁగ నాత్మకరములు వాల్గుం, దఱిగికొనునంతలోనఁ. చెన్న. ౫. ౨౬౮.

వ...దుప్పులు కుప్పించి తత్కోటరకుటీరంబుల నున్నపన్నగంబులఁ గొమ్ములం గ్రుమ్మి తిగిచి కఱుకుకఱుక్కునం జెఱకుఁ గొఱికిన తెఱంగునఁ గొఱికి...చంద్రా. ౨. ౮౪.

గీ. కఱుకుకఱుకునఁ గుత్తుకఁ గఱచి విఱిచి. వేం. పంచ. ౪. ౫౭౭.

**కఱ్ఱుగోల.** వి. (కఱ్ఱు¹ + కోల) వాఁత వేసెడియినుపకమ్మి, చూఁడుఁగొడుపు. (శ. ర.)

**కఱుదులాఁడు.** విశే. (కఱుదులు + ఆఁడు) నేర్పరి.

సీ. కఱుదులాఁ డగుచక్రి కపటంపుటనువునఁ దను మోసపుచ్చిన...హరి. ఉ. ౭. ౩౦.

**కఱుదులు.** వి. బ. (క. కరుహు, కరుబు.) నేర్పులు.

క. కఱుదులమాటల మమ్ముం, గుఱుచవడుగ యేల యింత గోసెక్కింపఁ, దెఱయఁగ నీయిష్ట

ము మా,కెఱఁగింపుము వేడ్క నిత్తు మెయ్యా
ది రైనన్. హరి. ఉ. ౧౦. ౨౪౨.

వ...దీనికఱుదు లెంతయరుదులు చూచితే యం చు నాయంచపై నాదరాహ్లాదమేదురనిరీక్ష ణంబుల నీక్షించి. ప్రభా. ౩. ౫౨.

జ: కఱుదులాఁడు.

**కఱ్ఱ[1](అ).** విశే. (సం. కాలః. త. కఱై.)నల్లనిది.

గీ. కిఱ్ఱుఁజెప్పులు దొడి నున్నగఱ్ఱతడుపు,లెలమి తోఁ గట్టి...హరి. పూ. ౫. ౨౫౨.

ఉ. దట్టపువన్నె గుడ్డ కఱదట్టిపారన్ సవరించి ...రా. వి. ౨. ౫౫.

వి. ౧. కళంకము; మచ్చ; మఱక, డాగు.

క. తనసుతుఁ డగుశశి మెయికఱఁ,గని చెచ్చె రఁ గడిగిపుచ్చఁగా నని దుగ్ధాం,బునిధి న భంబున కెగసెనో, యనఁ జంద్రిక పర్వె... కు. సం. ౭. ౧౧౬.

మ...దివ్యప్రభావంబునన్,గఱయున్ మాఁగు ను లేక పుట్టినశుభాంగం బద్భుతాపాదియై, నెఱయం గన్నులు విచ్చి చూచుతనయున్ వీక్షించి మోదంబునన్. హరి.పూ.౫.౧౧౯.

చ. ప్రమదమదాతిరేకమునఁ బాశివిలాసవతీక దంబకం,బుమిసినతమ్ములంపుఁగఱయో యన ...సంజ యంబరముకొంగున నూన్చెఁ గుసుం భరాగమున్. భీమ. ౨. ౨౯.

౨. అపకీర్తి, దూఱు.

చ.కని కర మేది బిడ్డని నకారణ మూరక యిప్పు డయ్యయో,కనికర మేది యాజ్ఞయిడేఁ గా తనబుద్ధికళాలసద్వివే, కనికర మేది మున్ వినుతగౌరవకీర్తి వహించి యింక నిం,కని కఱ మేదినీవిభుఁడు గాంచెను నేఁ డని పా క్కిరందఱున్. సారంగ. ౩. ౨౨౦.

జ: కఱమూపము.

**కఱ్ఱి[2](అ).** వి. ౧. కొయ్య. (ఉదా: కఱ్ఱిపెట్టె.)

౨. దండము; పుల్ల, పుడుక; గంట, వరిమున్నగు వానిదుబ్బు, సస్యగుచ్ఛము.

సా: కఱ్ఱిలేనివానిని గొఱ్ఱె కఱచును.

చ...గూఁటికఱ్ఱిసగ మొత్తుచు...ఆము.౪.౧౧౭

సీ... సస్యగుచ్ఛమొప్పు,గంట కఱ్ఱియనంగ ... ఆం. భా. ౨. ౨౩౮.

౩. చాఱ; రేఖ.

గీ. కూర్మిసతి పెట్టెలోఁ దాఁచికొన్న నల్ల,గఱల పండుగుచీరఁ బైఁ గప్పుకొనుచు,నతనుఁ డె సకొల్ప దేవాలయంబుఁ జేరి,ప్రొద్దు గ్రుంకక మున్నె సొంపులు జనింప. శుక. ౨. ౪౭౬.

క. అని యిట్లు చిలుక పలుకన్,విని మిక్కిలి వె ఱఁగు చెంది వెస నంతటిలోఁ,దన చేలికఱలు కనఁబడఁ,జనియెఁ బ్రభావతి రహస్యసదనం బునకున్. శుక. ౪. ౭౭.

కఱ్ఱితేనె=ఒకవిధమగు తేనె.

వ...పూఁదేనె జుంటితేనె పుట్టతేనె పెరతేనె కఱ్ఱితేనె కుసుజాతేనె...ప్రబంధ. ౧౧౨.

జ: కఱకుట్లు, కఱనూనె, కఱ్ఱిజవ్వాది,కఱ్ఱిమడ.

**కఱ్ఱిజేవ్వాది(జి).** వి. (√కఱ్ఱి[2])-కఱ్ఱికు నంటుకొ నియుండుజవ్వాది-పరిమళద్రవ్యవిశేషము, ప్ర శస్తమైనసంకుమదము.

వ... హిమసలిలములు... కఱ్ఱిజవ్వాదికలయికలఁ గలనిగ్గుల నగ్గలంబులై...వసు. ౨. ౧౧.

**కఱ్ఱిమడ.** వి. (√కఱ్ఱి[2]) త్రవ్వుట కుపయోగించు నొకపనిముట్టు.

గీ. గడ్డపాఱలఁ బాఱలఁ గఱ్ఱిమడల,వెడఁదగుద్దం డ్ల నాపుట్ట విరియఁ ద్రవ్వ,నందు నిద్రించు చున్న కాలాహి గెరలి,తూలి పాఱంగఁ గొం దఱుఁ దోలి తోలి. నా. పంచ. ౧. ౨౪౦.

(శ. ర. పా.)

**కఱ్ఱె=కఱె[1]**

(నల్లనిది)

గీ...వారిలోనఁ,దెల్లదామర రేకుల ట్లుల్లసిల్లు, కన్నుదోయి నొప్పారెడుకఱ్ఱెయూతఁ, డొకఁ

డు వెసఁ బుచ్చుకొనియె వి ల్లొక్క-కేల. హరి. పూ. ౯. ౪౫.

సీ. కఱ్ఱి క్రీడాశూన్యకటి గోపురద్వారపరిరక్షకుఁడు కాలభైరవుండు. కాశీ. ౧. ౨.

౨. అర్జునుఁడు.

సీ...గాండీవ మనునొకవి ల్లెప్పుడును వహించు.

ఆ. కఱ్ఱివిక్రమంబు గాల్పనే యిట్లు బన్నములు వడినధర్మనందనుండు, నేను రాజరాజాపీనుంగుఁ గన్నారఁ, గానఁ బడయు మైతి మేని కృష్ణ. భార. ఉద్యో. 3. ౧౧౬.

జ: కఱ్ఱినేస్తి.

**కఱ్ఱినేస్తి.** వి. (√కఱ్ఱి)-అర్జునునకు మిత్త్రుఁడు-కృష్ణుఁడు.

వ. కఱ్ఱినేస్తి తరిమల మోపరి తమ్మికంటి... ప్రబంధ. ౨౧౮.

ఇశ్లే:-కఱ్ఱినెచ్చెలి. ఆం. సం. దేవ. ౬.

**కఱ్ఱు¹.** వి. నాఁగటిదుంపయం దమర్చెడియినుపపాళము, కృషకము.

జ: కఱ్ఱుగోల, కఱ్ఱుగుద్దలి.

**కఱ్ఱు².** వి. ౧. తలుపు తీయునప్పుడు కలిగెడుధ్వని కనుకరణము.

ద్వి. గడియ గ్రక్కునఁ బుచ్చి కఱ్ఱనఁ దలుపు, గడుఁబాఱఁ దెఱచుడు... పండితా. దీక్షా. ౪౪ పా.

౨. కాకధ్వనివిశేషమున కనుకరణము.

గీ. కాకి కఱ్ఱనెఁ దోడనె గాలి పలికెఁ, బొలిచె నట్టింటఁ గుమ్మరపుర్వు మెలఁగి, యిన్నియును గల్ల గాకుండ నేఁగుదెంచె, హృదయనాయకుఁ డోయన్న యిదియె చాలు. శుక. ౨. ౨౨౭.

3. దగ్గుటయం దగుధ్వని కనుకరణము.

సీ. శ్లేష్మంబు కుత్తుక జిఱ్ఱుబుఱ్ఱనఁ గఱ్ఱుకఱ్ఱను దగ్గు లగ్గలము గాఁగ. శుక. 3. 30.

**కఱ్ఱుగుద్దలి.** వి. (√కఱ్ఱు¹) తొల్లిక.

సీ. త్రవ్వటంబులతటిఁ ద్రవ్వటంబులు వెట్టుఁ దగినట్టికఱ్ఱుగుద్దలి గడించి. కళా. ౪. ౬౭.

**కఱ్ఱె(ఱ్ఱెయ)**=కఱ్ఱి¹.

సీ. పల్లచీమల వక్రభల్లాతకియుఁ బోలె నెఱ్ఱదుప్పటి నొప్పుకఱ్ఱెవాని. ఆను. ౮. ౧౯.

**కల¹.** వి. (క. తు. కన. త. కనా.) స్వప్నము.

సీ... సాంగవేదవేది. గీ. యర్థిఁ గల వచ్చి వాత్సల్య మతిశయిల్ల, నస్మదీయప్రణామంబు నాదరించి, తుష్టి దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి, యెలమి నిట్లని యానతియిచ్చె నాకు. భార. విరా. ౧. ౧౦.

చ ... చక్కనిచిగురాకుఁబోండ్ల బిగికౌఁగిలియుం గల నైన లేదు...భర్తృ. 3. ౪౬.

**కల².** అవ. (√కలుగు) ౧. భవిష్యదర్థకము.

వ. దేవకీదేవి కయ్యెడునెనిమిదవచూలు నీకు మృత్యువు గాఁగలయది నిశ్చయంబు...హరి. పూ. ౫. ౭౪.

ద్వి... చెడిపోవఁగలవారు ... రం. రా. అర. ౧౭3 పా. ౧3 పం.

చ...ఉండఁగలాఁడ...భార. అశ్వ. ౪. ౧౯౨.

క...భస్మము గాఁగలారు ... భా. రా. బాల. ౪౧౨.

౨. (క) విధ్యర్థకము. (వలసిన అనునర్థమును దెల్పును.)

గీ. పృథునరేశ్వరుఁ డిటమీఁదఁ జేర్మి యొసఁగఁ, జేయఁగలకార్యములు సవిశేషకృతులు, నాత్మదృష్టిమైఁ గని...హరి. పూ. ౧. ౧౧౯.

వ. వీనిలోన దామక అమరెబోయుండు ఎంథ దేనుగొఱియలం జేకొని ఆచంద్రార్కముగాం దనపుత్రానుపౌత్రికమున నిత్యమానెండునేసి నేయి వోయంగలవాండు...అమరావతి. శా. ౧౧౦౯.

సీ. కలుజువ్వి వావిలి గంధువావిలి యేఋమద్ది మద్దియును...హంస. ౪. ౧౧.

**కలుపు[1](లుప్పు).** స. క్రి. (√ కలియు) చేర్చు, కూర్చు.

గీ. అఖిలలోకైకనాథ నీయట్టిరూప, విక్రమౌదార్యశౌర్యవివేకనిలయు, నొకకుమారుని దయచేసి యుర్విలోనఁ, గడుపు చల్లనికాంతలఁ గలుపు నన్ను. ఉ.హరి. ౨. ౭౫.

సీ. సంప్రణయక్రోధజంపతినివహంబుఁ గలుప వచ్చినచెలికాఁ డనంగ. గీ...వ,సంత మేతెంచె సంతతోత్సవ మెలర్ప. విక్ర. ౫. ౩.

వి. ౧. కలయిక.

సీ. సితభానుఁ డాచార్యుచిగురాకుఁబోఁడిపైఁ గన్నువైచిన కన్నెకలుపుమరులు. నైష.౭. ౧౫౧.(కన్నెకలుపు=ప్రథమసంగమము.)

౨. పైరుమున్నగువానిలోఁ గలిసి మొలచినగడ్డి, మొ.

గీ. మెలపుతోఁ జెట్లపాదులకలుపు దీయు, నెమ్మిదోహదధూపధూమమ్ము లిడును. వైజ. ౨. ౧౨౧.

సీ. పైరు మునుఁగ గాద బలిసినచేలలోఁ దెరలక కలుపులు దీసి తీసి. ఉ. హరిశ్చ. ౪. ౧౩.

సీ. ... కలుపు నాఁ బెరుఁగును గాద మొప్ప. ఆం. భా. ౩. ౫౧.

౩. దధి, పెరుఁగు; మిశ్రదధి.

క. కలు పనఁ జేరగు దధికిన్. ఆం.సం.నానా. ౧.

గీ...కలు పన, మిశ్రదధి యొప్పు... ఆం. భా. ౨. ౨౫౯.

కలిపికొను=చేర్చుకొను.

వ. ...ధర్మంబులు దేటపడ ననుగ్రహించుచుం బుయిలోట వాపి నన్నుం గలిపికొని కృపకు భాజనంబుగాఁ జేయుటం జేసి కొంకక యింక ను నడిగెదను...భార. అను. ౩. ౨.

**కలుపు[2](లుప్పు).** వి. (√కలుచే) మోహము,వలపు.

సీ. కర మర్థి నినుఁ జూచి కనుకలిఁ గలిచినపడఁతులకలుప్ప నిష్ఫలము గాఁగ. కు. సం. ౫. ౫౫౩.

**కలుపు(లుప్పు)ఁగోలు.** వి.(√కలుపు[1]) మైత్రి,ఐకమత్యము.

మ. నపుంజుట్టము లెందఱేని గలరింటన్ వారు మాకై చలం,బునఁ బోరాడుదు రట్టివారలకుఁ గల్పుంగోలుఁ బుట్టింప నిం,పున మన్నింపవె నిత్యవైరము మృగంబు ల్మాని మేల్పొంద మ,న్ననఁ గావించినమంత్ర మైన మణిరైయినన్ మూలికైన న్మనీ.చంద్రా.౩.౧౦౯.

**కలుపుఁగోలుతనము.** వి.(√కలుపుఁగోలు) ఐకమత్యము.

వ. ... నటత్తటిద్వల్లీమతల్లియుంబోలె నుల్లసిల్లియల్లిబిల్లిఁ దెచ్చికోలువలపు దెలుపుకలుపుఁగోలుతనంబులు సలుపుచు నిట్లనియె. రామా. ౫.౧౩౪.(ఐకమత్యపుఁజేష్టలు అని భావము)

**కలుము.** వి. కలుషగంధము.

ఆ. కలుము నాఁగఁ గలుషగంధ మభవ.ఆం.భా. ౧. ౧౦౮.

**కలువ(ల్వ).** వి. (సం.కైరవమ్. క.కలువె.) ఉత్పలము, కువలయము.

సీ. సొగసువాలు మెఱుంగుఁజూపులాశావీథికలఁ గల్వవిరిమేలుక ట్లమర్ప. ఉ. రా. ౨.౧౨౪. నైష. ౩. ౧౮౮. ఆం. భా. ౧. ౧౮౪.

జ: కలువకంటి, కలువగొంగ,కలువచెలి, కలువడము, కలువఱేకు, కలువలదొర, కలువవిందు, కలువవిల్తుఁడు.

**కలువ(ల్వ)కంటి.** వి. (√కలువ.) కలువలవంటి కన్నులు గలయాఁడుది, కువలయాక్షి; స్త్రీ.

సీ. చెవిలోనఁ బాఱంగఁ జిమ్మి గొజ్జఁగనీటఁ గాలభైరవు నొక్క కలువకంటి. భీమ. ౫.౧౧౩.

గీ. పుడమిలోపల మగవాఁడు పూని తనకుఁ గోర్కి యగు కల్వ కంటిఁ గైకొనుచు నుండు. సీలా ౨. ౩౩.

**కలువగొంగ.** వి. (కలువ + గొంగ) - కలువలకు శత్రువు - సూర్యుఁడు.

సీ. కలువగొంగకు లేనిబలువగం గనుజీనివలువ రిం గులు పైని గలుగువాని. ప్రబంధ. ౮౦౨.

ఇశ్లే : కలువ(ల)దాయ, మొ.

సీ.....కలువదాయ, కూనతూ పేని....అచ్చ. రా. యు. ౨౪౮. (కలువదాయకూనతూపు = యామ్యాస్త్ర ము.) అచ్చ. రా. యు. ౭౯.

**కలువచెలి.** వి. (కలువ + చెలి.) కుముదబాంధవుఁడు, చంద్రుఁడు.

గీ. కలువచెలియును బూవుదండలును మంచి, గంధ మునుగేశిసౌధంబుఁ గలికిమోముఁ, గాముకునకు వికారంబు గలుగఁజేయు. భర్తృ. ౨. ౮౯.

ఇశ్లే : కలువలయనుఁగు, మొ.

గీ. కలువల యనుంగు దూర్పుగుబ్బలిని బొడమె. అచ్చ. రా. అయో. ౧౮.

గీ. ....కల్వలయనుంగు, అచ్చ. రా. బాల. ౯౪.

కలువలచెలిరేక = చంద్రరేఖ.

ద్వి. కలువలచెలిరేక కనకశలాక, తలిరులేమొక్క మేల్తళుకులచుక్క. మృ. వి. ౨. ౬౩.

**కలువ(ల్వ)డము[1].** వి. (కలువ + వడము - సం. కైరవవటః. త. కలువటమ్.) ఉత్సవాదులందు ధ్వజస్తంభాదులకు ద్రేలఁ గట్టెడుకలువపూదండ, ప్రాలంబ మాలిక.

ద్వి. విరులచప్పరములు విరచించువారు, పురవీథిఁ గేతనంబులు నిల్పువారు, కలువడంబులు మేలుగాఁ గట్టువారు. రం. రా. అయో. ౮౮ పొ.

ద్వి. కలువడంబులు గట్టి కాంచనదండ, కలితపతాకలు గ్రందుగా నెత్తి. ద్వి. హరిశ్చ. ౨౮౪౯ పం.

**కలువ(ల్వ)డము[2].** వి. వితానము, మేలుకట్టు.

గీ. కలువడము చందువా మేలుక ట్టనంగ, నతిశయిల్లు వితానాహ్వయములు సాంబ. సాం. ని. మాన. ౧౯.

**కలువ(ల్వ)ము.** వి. మందు నూఱెడిరాయి. (శ. ర.)

**కలువ(ల్వ)ఱేకు.** వి. (√కలువ) కువలయదళము.

సీ. కలువఱేకులయేపు ఖండనంబులరూపు నిరసించు వాల్చూపునీటుదాని. ఉ. రా. ౨. ౨౬౬.

(బ) పిఱుఁదులమీఁది నఖక్షతములు, ఉత్పలపత్త్రములు.

సీ. .... పిఱుందుపైఁ గానుపించిన యవి కల్వఱేకు, లనఁగ నెసఁగు.... వేంక. మాన. ౭౩.

**కలువలదొర.** వి. (కలువలు + దొర) చంద్రుఁడు.

క. కనికరము లేక తనచక్కనికరముల గానిఁబెట్టెఁ గలువలదొర....రా. వి. ౪. ౪౪.

ఇశ్లే :- కలువలరాయఁడు, మొ. ఉ. రా. ౭. ౩౩౬.

కలువఱేఁడు. దశా. ౨. ౩౦౨.

కల్వలసామి. ముకుంద. ౨. ౧౮౩.

కలువలఱేనితోడు = లక్ష్మి. అం. భా. ౧. ౪౧.

కల్వరారాయి = చంద్రకాంతశిల. అచ్చ. రా. బాల. ౨౧౪.

**కలువ(ల)విందు.** వి. కలువ + విందు) కుముద బాంధవుఁడు, చంద్రుఁడు.

గీ. గరముతోఁబుట్టు వగుటనో కలువవిందు, కందు దనయందుఁ దాల్చె లక్ష్మణకుమార. రామా. ౬. ౩౦. విక్ర. ౭. ౧౦౨.

**కలువవిల్తుఁడు.** వి. (√కలువ) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు. సానందో. ౫. ౯౧పొ.

**కలుషము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆవిలము, కలఁగఁబాఱినది. ౨. మలినము. ౩. గర్హితము, నిందితము. ౪. అసమర్థము, చాలనిది. ౫. కృష్ణము, నల్ల

నిది. వి. అ. పుం. ౧. మహిషము, దున్నపోతు. ౨. నలుపు. (కే. వి.) న. ౧. మురికి, మాలిన్యము. ౨. పాపము.

**కలుషించు.** సం. అ. క్రి. కలఁగఁబాఱు, కలఁతనొందు; కోపించు.

సీ. ....బ్రహ్మఋషుల నేడ్వుర సృజియించి వారిఁ, గని నన్నుఁబూజింపుఁ డనిన నాపంయము లాత్మ లోపలఁ బరమాత్ముఁ గొలువఁ, గలుషించి వైకారిక స్వరూపుఁడు పద్మజన్ముండు మద్వ్యభిచారకారు. గీ. లారకాన దురాచారులారకాన, కితవకృత్యంబు లిట్లు చేసితిరి మీరు. బ్రహ్మవిజ్ఞానగర్వంబు పదటి పాలు, గావలయు నంచు ఘోరంబుగా శపించె. వరాహ. ౫. ౫౨.

**కలుషితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కలఁగఁబాఱినది, కలఁగినది. ౨. పాపయుక్తము.

**కలుసుఁగూర.** వి. (కలుసు + కూర) అనుకుగా వండినకూర.

సీ. కలుసుఁగూరలుఁ బజ్జలును దియ్యచేరులుఁ బంచదారలు నానవాలు జున్ను. హై. భా. ౩. ౫౦. (శ. ర. పా. 'పులుసుఁగూర' ముద్రి. పా.)

**కల్కనము.** సం. వి. అ. న. శఠత్వము.

**కల్కఫలము.** సం. వి. అ. పుం. దానిమ్మ†.

**కల్కము.** సం. విణ. (అ. ఆ. అ.) పాపి, దుష్టము. వి. అ. పుం. న. ౧. దంభము, కపటము. ౨. పాపము. ౩. విష్ఠ, పురీషము. ౪. కిట్టము, గులిమి మొదలగు దేహమలము. ౫. నెయ్యినూనె లోనగువానిని కాఁచి పక్వము సేయునపుడు వానియందు పైపెరుఁగు ఓషధి ద్రవ్యవిశేషము; నెయ్యి నూనెలోనగువానియందు అడుగున నిలిచినమడ్డి. ౬. మురికి. ౭. తురుష్కమనెడు గంధద్రవ్యము. ౮. చూర్ణము, పొడి. ౯. విభీతకము, తాండ్ర†.

**కల్కి.** సం. విణ. (న్. నీ. న్.) కల్కముకలది. వి. న్. ఇ. పుం. విష్ణుదేవునిపదియవయవతారము.

**కల్జు.** వి. కంసాలి, వడ్రంగి, మొ.

సీ. వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు కల్జువిత్తము రుంజకానిపాలు. రామలిం. ౨౩.

**కల్పకము.** సం. వి. అ. పుం. ౧ = కల్పము. ౨. కర్చూరము, కచోరము†. ౩. కల్పవృక్షము.

**కల్పకారుఁడు.** సం. వి. అ. పుం. ౧. కల్పసూత్రకారుఁడు (కాత్యాయనాశ్వలాయనాది). ౨. మంగలి. (వాచ.)

**కల్పకుఁడు.** సం. విణ. (అ. ల్పికా. అ.) ౧. కల్పించువాఁడు, రచించువాఁడు. ౨. ఆరోపించువాఁడు. వి. అ. పుం. మంగలి, నాపితుఁడు.

**కల్పన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నిర్ణయము, ఏర్పాటు. ౨. రచన; చేఁత, చేయుట. ౩. కైసేఁత, అలంకరించుట. ౪. ఆరోపణము, లేనిది మోపుట. ౫. లేనిది నిర్మించుట, క్రొత్తగాఁ గలిగించుట. ౬. ఊహ, భావన. ౭. (న్యాయ) వ్యతిరేకవ్యాప్తిజ్ఞానాధీన మగుఅనుమాన భేదము. ౮. (మీమాంస) అర్థాపత్తి యనుప్రమాణ విశేషము. ౯. ఎక్కుటకై ఏనుఁగు నాయితముసేయుట.

**కల్పనము.** వి. కలాఁపి, కలయంపి.

సీ. పూనీరు కలువపుష్పోళ్లను దంపించి నుసుపు మీఱంగఁ గల్పనముఁ జల్లి. ల. వి. ౫. ౨౨.

**కల్పనము.** సం. వి. అ. న. ౧. ఏర్పాటు, నిర్ణయము. ౨. రచన; చేఁత, చేయుట. ౩. ఛేదనము, కత్తిరించుట. ౪. ఆరోపము, లేనిది మోపుట. ౫. సాలెవాని మగ్గము. (వై. ని.)

**కల్పని.** సం. వి. ఈ. స్త్రీ - కత్తిరించుసాధనము - కత్తెర.

**కల్పనీయము.** సం. = కల్ప్యము.

కల్పనుఁడు. సం. వి. అ. పుం. ప్రపౌత్రునియొక్క ప్రపౌత్రుఁడు. (వై. ని.)

కల్పపాలుఁడు, సం. వి. అ. పుం. శౌండికుఁడు, గ వుండ్లవాఁడు. (హలా. ని.)

కల్పమానము. సం. విశ. (అ. ఆ. అ.) కల్పించు చున్నది.

కల్పము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. ఉచితము, తగి నది. ౨. సమర్థము, ఓపినది, చాలినది. ౩. ఈషద సమాప్తిని సూచించును. (ఉదా : విద్వత్కల్పుఁడు = పూర్ణముగా విద్వాంసుఁడు కానివాఁడు. ప్రభాతకల్పము. ద్వీపకల్పము, మొ- ఇది యీయర్థమున ప్రత్యయము.) వి. అ. పుం. ౧. న్యాయము. ౨. వికల్పము, పక్షాంత రము. ౩. విధి. ౪. వైదికవిధానములను దెలుపుశాస్త్ర భేదము. (ఇది ఆశ్వలాయనాపస్తంబబోధాయనకాత్యా యనాది సూత్రరూపముగా నుండునొక వేదాంగము.) ౫. సంకల్పము, ఉద్దేశము. ౬. ప్రళయము. ౭. బ్రహ్మ దినము. (మనుష్యమానమున నాలుగుయుగములును వే యిమాఱులు తిరిగి వచ్చినచో బ్రహ్మకొకపగలు అగును. బ్రహ్మయొక్క దివాభాగమున జగత్తు చేష్టాయుక్త మగు ను. అతని రాత్రిభాగమున జగత్తు నిశ్చేష్టమై యుం డును.) ౮. విభీతకము, తాండ్ర†. ౯. కల్పవృక్షము. ౧౦. మత్స్యవిశేషము.

కల్పయత్. సం. శత్ర. కల్పించుచున్న.

కల్పయిత. సం. = కల్పిత.

కల్పయితవ్యము. సం = కల్పితవ్యము.

కల్పలత. సం. వి. ఆ. స్త్రీ. కల్పవృక్షము.

కల్పవృక్షము. సం. వి. అ. పుం. ౧. కోరినవస్తువు లిచ్చెడి దేవవృక్షసామాన్యము, వేల్పుమ్రాను.

శ్లో. .... కల్పద్రుమాణామివ పారిజాతః. సం. రఘు. ౬. ౬.

౨. దేవవృక్షవిశేషము (ఇవి అయిదు :- మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచంద నము) - ఇష్టే : కల్పతరువు, మొ.

కల్పాంతము, సం.వి. అ. పుం. ప్రళయము, త్రుంగుడు.

కల్పి. సం. విశ. (న్. నీ. న్.) ౧. రచించువాఁడు. ౨. ఆరోపించువాఁడు. వి. న్. పుం. మంగలవాఁడు.

కల్పించు. సం. స. క్రి. ౧. సృజించు.

గీ. బహుళజలమధ్యమునఁ బెనుఁబాఁపపాన్పు, పై రజ శ్శక్తి గైకొని పవ్వళించి, లీల నఖిలలోకములు గ ల్పించు వినయ, ధుర్య నారాయణాఖ్యచతుర్థమూర్తి. మార్క. ౧. ౧౧౩.

౨. రచించు. (శ. ర) ౩. (లేనిది) కలిగించు, పు ట్టించు.

(వ్యవ) ఇది కల్పించినకథ కాని నిజమైనదికాదు.

కల్పిత. సం. విశ. (ఋ. త్రీ. ఋ) = కల్పకుఁడు.

కల్పితము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. రచితము; చేయఁబడినది. ౨. వ్యంజితము, స్ఫుటపఱుపఁబడినది. ౩. ఆరోపింపఁబడినది, కల్పనచేయఁబడినది. వి. అ. పుం. ఎక్కుబకు ఆయత్తము చేయఁబడినయేనుఁగు.

కల్పితవ్యము. సం = కల్ప్యము.

కల్ప్యమానము. సం. విశ. (అ. ఆ. అ.) కల్పింపఁ బడుచున్నది.

కల్ప్యము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. రచింపఁ దగి నది. ౨. ఆరోపింపఁదగినది. ౩. అనుష్ఠింపఁదగినది.

కల్మషము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. పాపముగలది. ౨. మలినము, మురికి గలది. వి. అ. పుం. న. ౧. పాపము. ౨. హస్తపుచ్ఛము, మణికట్టుక్రిందిచేయి. ౩. మాలిన్యము. ౪. మడ్డి మొదలగుమలినపదార్థము. పుం. నరకభేదము.

కల్మాషకంఠుఁడు. సం. వి. అ. పుం. ఈశ్వరుఁడు.

కల్మాషపాదుఁడు. సం. వి. అ. పుం. ఒకరాజు.

కల్మాషము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. చిత్రవర్ణ ముకలది. (అమరము - నలుపుతెలుపు కలిసినవన్నె గలది. వై. వి.) ౨. నల్లనిది. వి. అ. పుం. ౧. చిత్ర వర్ణము. (అమరము-నలుపు కలిసినతెలుపు. వై. వి.) ౨. నలుపు. ౩. గంధశాలి, ఒకజాతివరి†.

కల్మాషి. సం. వి. ఈ. స్త్రీ - నల్లనిది - యమునానది.

కల్మాషుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

కల్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. సుర, మద్యము. ౨. హరీతకి, కరక†.

కల్యజగ్ధి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రాతఃకాలమున భుజించుట. ౨. ప్రాతరాశము, చలిది.
ఇస్లే॰- కల్యాశము, మొ.

కల్యము. సం. విణ. (అ. అ. అ.) ౧. రోగము లేనిది, నిరామయము. ౨. సజ్జము, ఆయిత మైనది, సిద్ధమైనది. ౩. సమర్థము, నేర్పరి. ౪. ఉపాయము కలది. (మాట) ౫. శుభమైనది. (మాట ౬. ఏడమూకము, చెవిటిమూఁగ. వి. అ. న. ౧. ప్రత్యూషము, వేకువ. ౨. నిన్న. (శే. వి.) ౩. (జ్యోతి)లగ్నము. ౪. మధువు, కల్లు.

కల్యవర్తము. సం. వి. అ. పుం. ప్రాతరాశము.(త్రిని)

కల్యాణబీజము. సం. వి. అ. న. మసూరము, చిఱుసెనగ†. (రాజని.)

కల్యాణము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. అక్షయము, నాశము లేనిది. ౨. శుభయుక్తము; శుభకరము. వి. అ. న. ౧. ఉత్సవము, పండుగ. ౨. బంగారు. ౩. శుభము, మంగళము; వివాహము.

కా. ....రుక్మిణీకల్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలం బయ్యెడిశా. భాగ. ౧౦ పూ. ౧౬౮౨. (రుక్మిణీకల్యాణంబు = రుక్మిణీవివాహకథ అని భావము.)

కల్యాణ మగు = పెండ్లియాడు.
గీ. అంబమాంబికఁ గల్యాణ మైననాఁడె, వానిగలకీర్తి లక్ష్మికి సేసవెట్టె. పాండు. ౧. ४౧.

కల్యాణి. సం. విణ. (న్. ఈ. న్.) కల్యాణము గలది. వి. స్త్రీ. ౧ మాషపర్ణి, కారుమినుము†. ౨. గోవు. ౩ (సంగీ)రాగభేదము. ౪. భూమి, ౫. పార్వతి.

కల్యాణిక. సం. వి. ఆ. స్త్రీ. మనశ్శిల, మణిశిల.

కల్యాణిని. సం. వి. ఈ. స్త్రీ. బల,ముత్తవపులగము†.

కల్యా(ల్య)పాలుఁడు. సం వి. అ. పుం. శౌండికుఁడు, గవుండ్లవాఁడు.

కల్ల. వి. (క. కళ్. త. కళ్లమ్) ౧ అసత్యము, అనృత వచనము.

ఆ.వె. జల్లి బురుడ బొంకు పొల్లు దబ్బఱ కల్ల, దబ్బు తక్కుటక్కు తవశి తవశి, తసుకు నసుకు దుద్దు తటవట తవతవ, పట హుళిక్కి నా నసత్య మభవ. ఆం. భా. ౧. ౧౧౬.

౨. తప్పు, నేరము, అపరాధము.

మత్తకోకిల. కల్లసే దని విన్నవించుట గాదు వల్లభ యీతనిం, బల్లమం దెగఁ జూచి తేని....మా, తల్లి దండ్రులు పుత్రశోకము దాల్చి చిక్కుదు రీశ్వరా. భాగ. ౧౦. పూ. ౧౬౬౭.

గీ. కాశికాపత్తనద్రోహిఁ గావు మభవ, విశ్వపతి దూషితునిఁ బ్రోవు విశ్వనాథ, కల్ల చేసితి రక్షింపు కాలకంఠ, యనుచుఁ బ్రార్థించు భీమనాయకునిఁ దపసి. భీమ. ౩. ౧౫౩.

౩. పరుషవచనము.

సీ. తనతల్లి వినిని నిన్నను గొన్ని కల్ల లాడుటయు నే వెళ్లిపోవుటయుఁ గలదు. పరమ. ౩. ౨౫౩.

౪. భంగము, హాని.

వ. ఈధర్మానకు ఎవ్వరు కల్ల తలంచినాను పంచ మహాపాతకాలు చేసినదోషమును పొందుదురు. ౧౨౫౩. గు. జి. అమీనాబాదుశాసనము.

(యముఁడు తనకింకరులతో నన్నమాట.) గీ. కేశ నాశ గిరీశ లక్ష్మీపతి త్రిపు, రారి వసుదేవసూ

నుఁడ ప్రత్యక్ష యముచు. జపముసేయుదు రెవ్వ రావి పులపుణ్య. మునులఁ గదిసినప్పుడ మీకుఁ గల్ల వచ్చు. కాశీ. ౩. ౧౬౧.

౫. తోఁట లోనగువానివెలుగు, కట్టువ.

సీ. ....ప్రాచీనసంజ్ఞలు పరఁగుచుండు. గీ. వెలుగు కల్ల యనంగను....ఆం. భా. ౨. ౧౨.

విణ. ౧. అసత్య మైనది, అనృత మైనది.

మ. గుణమా నైఱ వివేకమా నహి మనోగూఢత్వమా లేదు భాషణమా కల్ల విచారమా తవశి వంశాచారమా నాస్తి....హంస. ౫. ౧౧౧.

సీ. పాలు పిండనిగొడ్డుబఱ్ఱె కార్పులుమెంతు కల్లపసిండికిఁ గాంతి మెండు. వేణు. ౧౭.

౨. పరుషము. (శ. ర.) ౩. మాయాకల్పితము; మాయావి.

ఆ. పునుకతాల్పువిల్లు దునిమెఁ దాటకఁ జంపె. ఖరునిఁ దేర్చె వాలిఁ గడవఁబనిచెఁ, గల్లజింకఁ ద్రుంచె గండగొడ్డలితాల్పు, గరువ మడఁచె నతనికడిమి యసదె. అచ్చ. రా. యు. ౫౭.

క. వినుమేము కల్లసారెలు, గొని కపటపునెత్తమాడు కుశలతఁ గా దొప్పనివారి నేపడంచుట, మునబాహు స్వైరకేళిఁ గానిదురాత్మ. భార. శల్య. ౨. ౨౮౧.

ఆ. అపుడు మొసలి పేల్పుటతివమై తనతొంటి. కతయు నచట నున్నకల్లతపసి, దెలుఁగు నతనితోడ నెఱిఁగించి పసిఁడితే,రెక్కి వేల్పు ప్రోలి కేఁగె నంత. అచ్చ. రా. యు. ౪౧౮.

కల్లవెల్లి యగు = చెల్లాచెదరగు.

(రతివిలాపము.) గీ. అరితికాఁ డైనపూవిల్తు నట్టె కొట్టి, కల్లవెల్లిగఁ జేసె నాకాఁపురంబు. పార్వ. ౩. ౧౧౭.

ద్వి. ఎదురను బసి గుబ్బ మేనుంగు బంది, యదియేమి సోద్దెమో కదియంగ వెఱచు, నల్లంతఁ బొద గని చల్లన వవసి, కల్ల వెల్లై పాఱు .... బస. పు. ౪. ౩౪. పం.

జ : కల్లతనము, కల్లరి, కల్లరితనము, కల్లరీఁడు, కల్లరుజు, కల్లవాఁపు, కల్లవాటు, కల్లసేయు.

కల్లతనము. వి. (కల్ల+తనము) ౧. వంచన, మోసము.

ఉ. కల్లతనంబు గాక బొదగట్టినపూర్వపురీతి నేఁడు నాయుల్లమునందు మందుము.... భాగ. ౬. ౫.

ఉ. గట్టివచేఁతలుం బసలుఁ గల్లతనంబులు నీవు పుట్టఁగాఁ, బుట్టినవి....పారి. ౧.౧౨౭.

౨. నేరము, తప్పు, అపరాధము.

గీ. అధిప సంకల్పవైషమ్య మగుటఁ జేసి, హోతకల్లతనంబున నువిద గలిగె, నైనఁగలిగింతు నీకుఁ బ్రియాత్మజునిని, నీవు మెచ్చంగఁ జూడు నానేర్పు బలిమి.భాగ. ౯. ౧౪.

ద్వి. నృపునితో నొండును రెండుగాఁ జెప్పి, కపట మేర్పడఁ బెట్టి కల్లతనంబు, నీమీఁద మోపుట నిక్కంబు....నవనాథ. ౧. ౫౫పొ. ౧౭. పం.

౩. దుశ్చేష్ట, చెడుతనము.

గీ. అన్న మీతండ్రి కోపగాఁ డౌనొ కాఁడొ, యీవు బొనరించుదుర్వృత్త మెఱిఁగె నేని, కల్లతనములు పలుమాఱుఁ గప్పిపుచ్చు, నట్టి నామీఁదఁ జంపంగ నలుగకున్నె. కాశీ. ౪. ౯౦.

(మూలము :- అచ్ఛాదయామి తేనిత్యం పత్యు రగ్రే కుచేష్టితమ్.)

క. అల్లుండ్రఁ గూఁతు లందఱఁ, బొల్లమతిం బిలిచి తెచ్చి పూజన లిడుచున్, గల్లతనంబున దక్షుఁడు, చెల్లింపఁ దొడంగెఁ గ్రతువు శివరహితముగా. వీర. ౧. ౯౭.

కల్లము. వి. ముప్పదిరెండువిన్నాణములలో నొకటి, మల్లబంధవిశేషము; రతిబంధవిశేషము.

సీ. కల్లంబు రాటంబు కత్తి కొక్కెన .... గీ ....నాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియు రెం

డు విన్నాణముల కుఁ బేర్లు. ఆం. భా. ౨. ౨౦౯. ప్రబంధ.౭౭.(కర్లము అపముద్రి.)

సీ. మల్లవల్లభులట్ల మరుసాధనలపట్లఁ గల్లఘుమ్మలకు
వచ్చి కలిసి కలిసి. రాధికా. ౩.౧౩౬.

**కల్లరి** = కల్లరీఁడు. విశే. (కల్ల + అరి-త. కళ్లన్) ౧. అపత్యమాడునది.

పీ. తచ్చనగొండి పోతరకత్తె కల్లరి.... చెన్న.౨.౨౪.

౨. అసత్యమైనది.

సీ. దొరలు గద్దింపఁ గల్లరివార్త నిజముగా నిర్వహింపని
దేటిసీటుకత్తె. శుక. ౧. ౫౫

౩. వంచకుఁడు; మాయలాడు.

క. కల్లరితొలువేలుపుతేఁ,డిల్లనఁ జెలువట్టి కొనుచు నవు
గుచు నున్నాఁ,డు....అచ్చ. రా. ఆర.౬౬.

క. వల్లభునిఁ బ్రోచురతిగతి, నెల్లప్పుడు తొమ్మ డించ
కెంతయుఁ దమి న,ప్పల్లవమృదుపద పెనుపఁగఁ,
గల్లరికృష్ణుండు దానిఁ గని మటిసొక్కెన్. దశ.
౭.౧౭౯.

౪. దుష్టుఁడు; దుష్టురాలు.

ఆ. మంచివారి కెల్ల మంగళప్రద లయ్యుఁ,గల్లరులకు
మేలు గానియట్టి,తనువు లెన్నిమైనఁదాల్చి....భాగ.
౧౦. పూ. ౯౩.

క. అల్లదె తాటక యనియెడు,కల్లరిరాకాసి పొగరు
గదురఁగ వచ్చెన్ ....అచ్చ. రా. బాల. ౧౧౨.

౫. తప్పు చేసినవాఁడు, అపరాధి.

చ. నృపతికుమార లోకమున నీసరిచక్కనివారులేమ
నీ,విపు డటు పోయినప్పుడె పయిఁబడి నిన్నల
వంతఁ బట్టు న,చ్చపలమృగాక్షి నీ వది పొసంగక
వచ్చితి వేని రాజులోఁ, గపటము గాఁగఁ జెప్పి
నినుఁ గల్లరిఁ జేయుఁ జూ మీనిఁబంపఁగన్. సారంగ.
౨. ౧౫.

గీ. తల్లి నామీఁద నటు లేనితప్పు మోపె, నంట
యలయనుఁగుఁదండ్రిదా నదియనిళ్ళ, యంబునే నె
నంబ యిఁకఁ గాదన్నఁ బోనె,యేరివన నేల కల్లరి
నేనె యగుదు. సారంగ. ౨.౨౬౩.

౬. గద్దరి, దిట్ట.

ఉ. మెల్లన వేఁటవేఁపులగమిం బడి సల్గులఁ జంప నే
ర్చితిం,గల్లరి యయ్యె నిప్పు డిది కానలఁబందుల
వేరువి త్తనన్. చంద్రా. ౨. ౬౪.

**కల్లరితనము.** వి. ( √కల్లరి) కల్లరియొక్క భావము. (సాహసకృత్యము.)

సీ. కుంజరేంద్రంబుపైఁ గుప్పించుసింగంబుఁ జెల్లరే చని
పండ్లు డుల్లఁ దన్ను. గీ. అధిప దే వరబంటు
గన్నట్టిపట్టి,నిన్న పున్నమ కైదేండ్లనిసువు సామి.
వానికల్లరితనము లీశ్వరుఁడెఱుంగు, వీరు తటకాప
డుదు రొక్కయింత గవిన. రా. వి. ౩. ౪౫.

**కల్లరీఁడు** = కల్లరి. (కల్లరి + ఈఁడు-స్వార్థమున) వి. (దొంగ.)

సీ. .... కల్లరీఁడు. గీ.... తవళి మోసరి యనఁజెల్లుఁ
దక్కరునకు. సాం. ని. మాన. ౧౨.

**కల్లరుజ్జు.** వి. (కల్ల + అడుజు) మత్స్యవిశేషము.

సీ. మిసి కల్లరుజు తేలుమీను....హంస. ౪.౧౭౬.
(బ్రౌ. శ. ర. పాఠములు.)

**కల్లవాఁపు.** వి. (కల్ల + వాఁపు) నొప్పి లేనివాఁపు. రోగవిశేషము.

ఆ. కల్లవాఁపు పసికిఁ గడు వచ్చె నేనియుఁ, జుట్టు
వాఁత పెట్టు మట్టు గాను,కాఁగుగంజి పాలుఁ గలి
యంగఁ బోసియుఁ,బూయ వాఁపు మానిపోవుఁ
బసికి. పశువైద్యశాస్త్రము. ౯౯.

**కల్లవాటు.** వి. (కల్ల + పాటు) కలఁత, కళవళము.

ద్వి. పెళ్లనుఱంతుల బెదరి యాపిట్ట, కల్లవాట

దర నాకాశంబు ముట్టె. ద్వి. సారంగ. ౧. ౧౧ పొ. ౧౬. పం. (ప్రయోగాంతరము లేదు.)

**కల్లసేయు.** స.క్రి. (కల్ల+చేయు) మోసపుచ్చు.

ద్వి. మాయకాఁ డేతెంచి మనలను గల్ల. సేయుచున్నాఁ డెడసేయక వీనిఁ. దెగటార్చుము....ద్వి. హరిశ్చ. పూ. ౧౯౫౩.

**కల్లు**[1] = కలు[1]. వి. (సం. కల్యమ్. ప్రా. కల్లం. క. కళ్లు. త. కళ్.) ౧. మద్యము, సుర.

ఉ. ఉత్పలగంధి నన్నుడుగు మొల్లను బంపుము కల్లు డేర....భార. విరా. ౨.౯౩.

సీ. కల్లనంగ సురాఖ్య చెల్లును గైపు సారాయి సారా నాఁగ రహిఁదనర్చుఁ. గీ.దద్విశేషంబు....ఆం.భా. ౨. ౩౦౩.

౨. మద్యవిశేషము.

ద్వి. సారాయి యొకయేఱు సరవిని దాఁటెఁ,దాఁటెఁ గల్లును నొక్కపావనతటిని. రం. రా. అయో. (శ. ర)

కల్లటిక = సురాభాండము, కల్లుకుండ.

ఆ. కల్లటికకు భూతి గట్టిగాఁ బెట్టిన,నందులోని గదుప లడఁగనట్లు, మెదను ద్రాదు వేయ మెఱపుతో ద్విజుఁ డౌనె, విశ్వ....వేమన. ౩.౧౩౦.

జః కల్లుపెంట, కల్లువెల్లి.

**కల్లు**[2] = కలు[2]. వి. దే, అనా. (చూ. బడిగల్లు, సన్నికల్లు) ౧. రాయి

గీ. గగనహరినీలశైలశృంగంబునుండి,దొర్లిపడెఁ ద్రొద్దు జేగుఱుఁగల్లువోలె. నైష. ౮. ౧౫౨. ఆం. భా. ౨.౨౯.

౨. (బండి) కన్ను, (బండి) చక్రము.

వ. పరశురామదత్తం బయినభార్గవాస్త్రం బనుపేరిటి మహనీయసాధనం బప్పుడు రాధేయునకుం బ్రతిభాసింపకుండె దాపటికల్లు గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె.... భార. కర్ణ. ౩.౩౪౧.

క. శకటము హరి దన్నిన దివిఁ బ్రకటంబై యెగసి యురుసుభరమునఁ గల్లుల్. వికటంబుగ నేలం బడె....భాగ. ౧౦. పూ. ౨౫౧.

జః కల్లుగాస్తు, కల్లుప్పు, కల్లువడు, కల్లేఱు.

**కల్లుగాస్తు** = కలుగాసుఁగ. వి. (√కల్లు[2]) జాతిగానుఁగు.

సీ. కొందఱుఁ గల్లుగాస్తులఁబెట్టి రక్తముల్ దోరుకి పెద లంగఁ బొంక మణఁచి. సానందో. ౩. ౫౬ పొ.

**కల్లుపెంట.** వి. (√కల్లు[1]) కల్లు అమ్మెడుచోటు. (శ. ర.)

**కల్లుప్పు.** వి. (కల్లు[2] + ఉప్పు) జాతియుప్పు, సైంధవ లవణము.

క. భల్లాతపురక్తముతోఁ,గల్లుప్పును కుంతిపొడుముగలు దూపంబుల్, నల్లనిమేఁకల మూత్రము, తెల్లమ్ముగఁ బట్ట దొమ్మతెవులును మానున్. పశువైద్యశాస్త్రము. ౯.

**కల్లువడు.** అ. క్రి (కల్లు[2] + పడు) స్తంభించు, జాపడు.

వ. ....గుండె జల్లుమని కల్లువడి మునితల్లజుపదపల్లవంబులం ద్రెళ్లి యిట్లంటి....మనుచ. ౫. ౧౯.

క. భల్లం బొక్కటి వింటను, మెల్లన సంధించి పిలిచి మే వెంచి కిటిం, బెల్లురికిపడఁగ నేసినఁ, గల్లవడన్ లేచి యంతఁ గదువడితోడన్. భల్లా. ౨౭. (ఇందు 'కల్లువడన్' అనుదానికి కర్త తప్పినటో య-శ.ర.)

**కల్లువెల్లి.** వి. (√కల్లు[1]) సురాసముద్రము. (చి. ని)

**కల్లెడ.** వి. తరంగము.

వ. గండశైలంబు లొండొండ గుభులు గుభుల్లనం దొల్లురబసంబున నభశ్చరులు తల్లడిల్ల నెల్లెడలం బెల్లెగయుకల్లెడలును....శ్రీరం. ౧. ౧౩౨. (ప్రయోగాంతరము కనఁబడలేదు.)

కల్లెడు=కల్లేడు. వి. బొ. ఒకానొకపిట్ట.

సీ. తైఁజు కక్కెర గువ్వ కల్లెడు కేరజ పూడెలు తొగ గిజిగాఁడు కొరడు. సుద. ౩. ౧౯౪.

కల్లెలుక(ల్క). వి. మూషికవిశేషము. (పొలములలో కలుఁగులయం దుండెడుఎలుక - శ. ర.)

గీ. ఉడుము గరిమిడి కొక్కు దందడియు వెల్ల, యెలుక కల్లెల్క తఱచును నేమిచెప్ప. మనుచ. ౪. ౨౫.

సీ. ....ఎలుక నా మూషకసామాన్యముగఁ దెలంగుఁ, గల్లెల్క యనఁగను వెల్లెలుక యనంగఁ జిట్టెల్క యనఁగను జెలఁగు నిట్లు, కొన్నితద్భేదముల్.... అం. ధా. ౨. ౮౬.

కల్లేడు=కల్లెడు. వి. బొ. ఒకానొకపిట్ట.

పీ. గిజిగాఁడు లావుక కేర్జంబు పూరెడు కల్లేడు పొన్నంగి కౌఁజు పికిలి....పార్వ. ౬. ౭౩.

సీ. తెక్కతాఁకున స్రుక్కి నిక్కి ప్రక్కలు నొక్కనుఱక కల్లేటి నొక్కోరణంబు. మనుచ. ౪. ౫౮.

కల్లేఱు. వి. బొ. (కల్లు² + ఏఱు²) వీరభద్రపర్వత పాదమూలమున పాఱెడియొకనది.

సీ. పాఱె నేశైలంబుపాదమూలంబునఁ గల్లేటితో వృద్ధగంగవారి. కాశీ. ౩. ౨౮.

కల్లోలము. సం. వి. అ. పుం. ౧. పెద్దయల. ౨. సంతోషము.

కల్లోలిని. సం. వి. ఈ. స్త్రీ - కల్లోలములు కలది - నది, ఏఱు.

సీ. గగనకల్లోలినీకల్లోలమాలికాహల్లీసకములతో నపహసించి. నైష. ౧. ౩౭.

కల్లోలుఁడు. సం. విశ. (అ. అ. అ.) శత్రువు. పగవాఁడు.

కళ. వి. మూర్ఛ.

గీ. ధరము సీమీఁద నిధి వార్ధిఁ దరుచునపుడు, హరుని మెడ గంటె హరియురం బంటెఁ గెంపు, నమరసంఘము కళ నొందె నహహ తెలిసె ఘనజగత్కృతి వగుటఁగా కమఠవర్య. చంద్రా. ౧. ౭౪.

క. అలుగువగ చూపువేళం, దలతల మను నింత సోఁకిన స్మగవానిం, గళ దాఁకఁ బెనఁగు నొకమొ, క్కలపుదొరకరాని సీటుకత్తియ యగుటన్. కువల. ౨. ౧౩౯.

కళపట్టు=౧. మూర్ఛనొందు. సొమ్మసిల్లు.

వ. దనుజునిశిరోరుహంబులు వామహస్తంబునం జుట్టి పట్టి చరణంబులఁ గంఠంబు బిగియించినం గళ వట్టి గ్రుడ్లు వెలికుటికి కదల నేరకయున్న సమయంబున....వి. పు. ౭. ౨౧౦.

క. కళవట్టి పడినభీముఁడు, దెలిసెన్ హరికరుణనంత దేవుఁడ నిన్నున్. దెలియక పోరితి నేరము, గల దనఁగా భీము సీరి గౌఁగిటఁ జేర్చెన్. దశ. ౯. ౧౬౦.

కళవాలు=అళపడు.

సీ. మొగమోట యుడిగి సొమ్ముంలమీఁదఁ గళవాటి వదలక యార్జించువారిఁ జూచి. విప్ర. ౪. ౧౬. (ప్రయోగాంతరము లేదు.)

కళ(ల). సం. వి. అ. స్త్రీ. ౧. భాగము,పాలు,అంశము. ౨. చంద్రునిలోఁ బదునాఱవభాగము. ౩. ముప్పది కాష్ఠలకాలము. (కాష్ఠ = ౧౮ రెప్పపాట్లకాలము.) ౪. రాశిచక్రమునందు ౨౧౬౦౦ భాగము, రాశిలో ౧౮౦౦ భాగము. ౫. శరీరమందలి సప్తధాతువులలో నేదే నొకటి. ౬. (ఛంద) ఏకమాత్రాత్మక మగులఘువర్ణము. ౭. మూలధనముమీఁద వచ్చువడ్డి. ౮. స్త్రీరజస్సు. ౯. నౌక, ఓడ. ౧౦. కపటము. ౧౧. గీతవాద్యాదిచతుష్షష్టికళలలో నేదే నొకటి. ౧౨. శిల్పము. ౧౩ మజిపిల. ౧౪. సంఖ్యానము, లెక్కించుట. ౧౫. (ఆంధ్రవ్యాక)ద్రుతప్రకృతికము కానిపదము. (ఉదా :- ఊరక, రాముఁడు, మొ.)

**కళం(లం)కితము.** సం.విణ. (అ.ఆ.అ.) కలంకము కలదిగాఁ జేయఁబడినది.

**కళ(ల)త్రము.** సం.వి.అ.న.౧. పెండ్లాము. ౨. శ్రోణి. ౩. దుర్గస్థానము, కోట. ౪. భగము, ఆఁడుగుఱి. (త్రి.ని.) ౫. (జ్యోతి) లగ్నమునకు ఏడవస్థానము.

**కళపెళ.** వి. ౧. నీరు మొదలగునవి కాఁగుట ఉడుకుట యందగు ధ్వని కనుకరణము.

సీ. కాండముల్ చండమార్తాండతీవ్రకరాతపోద్వృత్తిఁ గళపెళ నుడుకుచుండ. శివధ. ౫. ౯౭.

సీ. కళపెళ నుడుకుచక్కని నూనియలు మీఁదఁ జిల్కఁ జెల్లునె మీకుఁ జెలియలార. నీలా. ౩. ౩౮.

౨. అఱచుటయందగుధ్వని కనుకరణము.

ద్వి. కాలాభ్రభూతముల్ కళపెళ నార్చు, పోలిక గర్జితంబులు మింటఁ బొదలె. అ.మ.క. ౨. ౬౦ పా. ౨౦ పం.

**కళవరము.** వి. మల్లబంధవిశేషము.

గీ. కళవరానకుఁ జొచ్చి డొక్కరము హత్తి. ఉ. హరి. ౩. ౬౯. (శ.ర, చి.ని, పీరేళ. పాఠములు)

**కళవళపడు.** అ. క్రి. (√కళవళము) ౧. కలఁతపడు, క్షోభపడు.

క. ... నిక్కం, బీవిన్నప మన రామ, త్మావల్లభుఁ డాత్మలోనఁ గళవళపడు మఱి. జై. భా. ౬. ౧౫౧.

౨. తొట్రుపడు.

క. వరబలుఁ డగుమనుమచుమని, శరసంభిన్నాంగు లగుచు సమరవిముఖులై, హరిరాజముఁ గని పఱచెడు, కరిబృందము వోలెఁ జనిరి కళవళపడుచున్. భాగ. ౮. ౩౩౯.

క. లలితప్రియసంభోగా, కులవేషము చక్క దిద్దుకొన నెడ లేమిం, గళవళపడుచుఁ బ్రభావతి, యలుక నతర్క్యగతి వచ్చి రచటికి కిరుపురున్. ప్రభా. ౫. ౬౭.

**కళవళపాటు.** వి. (√కళవళపడు) కలఁత; తొట్రుపాటు.

చ. కళవళపాటుతోఁ జెలిమికత్తెల మూఁకుచు ...నీలా. ౩. ౧౮.

చ. ... పంచితివే రఘురామచంద్ర మా, స్థలములకంచు మాధులవిధంబున సేద్చుచుఁ బోయి రెంతయున్, గళవళపాటుతోఁ గరుణ గల్గినరాజును బాయఁ గూడునే. ఉ. రా. ౫. ౩౦౭.

**కళవళమగు**=కళవళపడు. అ. క్రి. (√కళవళము) (సంక్షోభించు, కలఁతపడు)

క. కులశైలంబులు వడఁకెను, గలఁగెఁ బయోధులు పయోజగర్భుఁడు సురలున్, దలఁకిరి మునులమనంబులు, గళవళమయ్యెన్ దదీయగర్వోద్ధతికిన్. నృసిం. ౪. ౧౩౯.

**కళవళము, కలవలము.** వి. (క. కళవళ.) ౧. వ్యాకులత్వము, క్షోభము.

గీ. ఇట్లు వర్తించియును నాతఁ డేమియుందుఁ, గళవళముఁ జెందఁ గూడుఁ గోకయును లేక. శుక. ౩. ౩౬౫.

క. అని యెంచ రానికోర్కులు, మనమునఁ దలపోసి భావమగ్నత చేతం, గనుమూయుఁ గలిసినట్టులు, గని సంతస మందుఁ దెలిసి కళవళ మందున్. విజ. వి. ౩. ౨౮.

చ. అలపిరివింటిదంట తదిలాధిపమోహము నెమ్మనంబునన్, గలవలమాన భేదిమణికైశికఁ గెందలిరాకుముల్కులన్, గలవల మాన నూన్చె నలుకన్ నవసంగరముద్ర నిల్చి మం, గలవలమానమీనతిలకధ్వజశోభిమరుద్రథంబునన్. చంద్రి. ౪. ౧౫. చెన్న. ౨. ౬౧.

౨. సంభ్రమము, తొందర; తొట్రుపాటు.

క. పిలిచి ప్రతివచన మొదవమిఁ, గళవళమున నిల్లు సొచ్చి కాననచరు న, న్నెలవునఁ గానక

వైశ్యుఁడు, నలుమూలలు వెదకి నెమ్మనము దలఁకొందఱ. కాశీ. ౫. ౭౭.

వ...నవ్వుటాలకు వెనుకపాటునం గదిసి మునుంగు లెడలింప బెగడి కళవళింపుఁజూపుల వల్లభులం జూచి... మనుచ. ౩. ౨౮.

౩. నిద్ర మోహము మొదలగువానిచేఁ గలుగుకలవరింత.

సీ. కలవరిం పనఁగను గలవరింత యనంగఁ గలవరమనఁగను గళవళ మన, స్వప్న భాషణము గా జరుగుచుండును...ఆం. భా. ౧. ౧౪౨.

గీ. విరహవిభ్రాంతి నొక్కొక్కవేళయందుఁ, గళవళపువింతభాషల్గకతన నప్పు, డెవ్వఁడో యొక్కమాయావి యేఁగుదెంచె, వంతిపురమున కని లోఁగి రబ్జముఖులు. నైష. ౩. ౯౭.

జ: కళవళపడు, కళవళపాటు, కళవళమగు, కళవళించు.

**కళవళించు.** అ. క్రి. (√ కళవళము.) ౧. కలఁతపడు.

చ...నెట్టన తెగ నగ్గలించు నచటఁ జనులం బరికించు బుద్ధి మ్యాలిన వెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁడై. భార. విరా. ౨. ౩౧.

వ. కళవళించు డెందమ్ములతో నందఱుఁ దరతరమ్ములై కూడి గోవిందుపిఱుందం దగిలి ... హరి. పూ. ౮. ౧౭౫.

౨. తొట్రుపాటు నొందు.

గీ. ముద్దుమోము లల్లాడ్చుచో మూఁపులందుఁ, గర్ణభూషణజాలంబు కళవళింప, మార్చి మార్చి చేతులవ్రేళ్ల మడఁచికొనుచు, నింక నెట్లమ్మ యంచు నయ్యింతు లేడ్వ. ఉ. హరి. ౫. ౨౭౭. (ఇట 'చలించు' అని భావము.)

౩. (కలఁతపడి) అఱచు.

సీ.... వానికాలిప్రే లాకనియంగంబు దాఁకెఁ, దాఁకిన వాఁడు దత్తఱపాటుతో మేలుకని ముచ్చు ముచ్చంచుఁ గళవళించె. కాశీ. ౪. ౧౨౪.

**కళవసము**=కళాసము. వి. తోలు, చర్మము.

గీ. కళవసం బూడ జలకమండలువు వీడ, జడలు మఱి జీర జపమాలసరము జాఱ, దర్భముడి వ్రేల...కువల. ౨. ౩౫.

**కళాంజి**=కాళాంజి. వి. తమ్మపడిగము, తమ్మయుమిసెడుపాత్రము.

చ. ... వాలునుం, బలుక కళాంజి కుంచె యడపం బొకకొందఱు పూని కొల్వఁగఁ. అహ. ౧. ౫౯.

**కళాచిక.** వి. తమ్మపడిగము, పతద్గ్రహము.

సీ. ... పరఁగుఁ గళాచిక పడిగ మనఁగఁ, గాళాంజి యనఁ బతద్గ్రాహిణి...ఆం. భా. ౨. ౧౭౮.

**కళా(లా)దుఁడు.** సం.వి.అ.పుం. ౧-నగలకొఱకిచ్చినబంగారములో కొంతభాగము నపహరించువాఁడు-స్వర్ణకారుఁడు, కమసాలి. (అమరము) ౨-దేవతలకు కళల నిచ్చువాఁడు-చంద్రుఁడు.

శా. ఈ వజ్రుండవు నీటఁ బుట్టితి సుమీ యే నంచు మోమోటపుం, ద్రోవ ల్సెప్పఁగ సిగ్గు గాదె మఱి నీతోఁబుట్టు శ్రీదేవిలీ, లావాసంబు సిరుల్హారింతు వనుచో నయ్యో కళాదుండు చే, తోవీథిఁ సహజాధనాపహరణోద్యోగంబు నెగ్గించునే. వసు. ౪. ౩౪. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**కళా(లా)ధరుఁడు.** సం.వి.అ.పుం. చంద్రుఁడు.

ఇవ్లే:- కళానిధి, మొ.

**కళాయి.** వి. (సం. కటాహః. క. కడాయి.) ౧. నీలిమందు మొదలైనవి కాఁచెడుగంగాళము.

ఉదా: నీలిమందుకళాయి, తులుసుకళాయి.

౨. ఇత్తడిపాత్రలు తోవగువానికి పూసెడుతగరము మొదలగువానిపూఁత.

ఉదా: మాయింట వాలుగుకిన్నెలకు కళాయి పెట్టించితిమి.

**కళాసము**=కళవసము.

ఉ. లాలనఁ గ్రొత్తబెబ్బులికళాసము నెట్టిర యాసనంబుగా. నైష. ౬. ౧౧౫.

గీ. పులికళాసము కకపాల బూదిపూఁత, జడలుఁ బొత్తంబు రుదురక్కసరులు కావి, పుట్టములు లాతమును జోగిపట్టియయును, దనర నయ్యెంతిఁ జేరి దీవన లిడుటయు. అచ్చ. రా. అర. ౫౩.

**కళాసి[1]**. వి. నాట్యవిశేషము.

శ్రీరంగ. ౪. ౧౬౨.

జ: కళాసించు, కళాసిక.

**కళా(లా)సి[2]**. వి. (హిం. ఖలాస్సి). ఓడమీఁదిపనివాఁడు. (శ. ర, వా.)

**కళాసించు**. అ. క్రి. (√ కళాసి1). ౧. కళాసిక చేయు.

వ...మత్తవనమయూరమత్తకాశిని సకలమధురకంఠకేకాగీతికావసానంబునం గళాసించె... కాశీ. 3. ౨3.

ద్వి. అలమహానటుఁడు సంధ్యాతాండవంబు, లలి నటియించి కళాసించుగతిని. నవ. ౧౦౮ పా. (బ్రౌ.)

౨. అలయు.

గీ. తొడల బెడఁగారు నునువల్వతోడ నపుడు, రతిఁ గళాసించి వచ్చినరమణ మెఱయఁ, గొలని వెలువడి వచ్చి రాజలజముఖులు, వసుమతీనాయకానంగవతుల బలసి. విక్ర. ౫. ౬౧, ౪. ౨౨౬.

మ. తెలివిం గైకొని యార్త సాంగముగ నర్తించు గళాసించు నుగ్మలి యో ర్తొక్క తె వ్రాలు సోలములతోఁ గాదంబరీగోష్ఠిచేఁ. కావ్య. 3. ౧౨౦.

**కళాసిక**. వి. (√ కళాసి[1].) తాండవాదులచివరఁ గావించుకృత్యవిశేషము?

వ...విచ్ఛిన్నహారమండలం బగుసురతతాండవంబునకుం గళాసిక యగుహారవళ్యంబునం గుసుమకార్ముకనర్మకర్మకాండకేళీసమాపనాశర్మసారంబు సమసంవిభాగంబుగాఁ బంచికొని యనుభవించుచు... నైష. ౭. ౧౮౭.

సీ. శిఖి తాండవముకళాసికఁ జేసి సడలించెఁ గఱకుటీఁకలపేరికాసెబిగువు. పాండు. ౪. 3౭.

**కళి(లి)ంగ**. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది. (మే. ని.)

**కళి(లి)ంగము**. సం. వి. అ. పుం. ౧. ఒకానొకదేశము. ౨. ధూమ్యాటము, కూఁకటిమూఁగ యనెడుపక్షి. 3. పూతికరంజము, నెమిలియడుగు. ౪. కుటజము, కొండమల్లె. ౫. శిరీషము, దిరిసెనము. ౬. ప్లక్షము, జువ్వి. ౭. కుటజఫలము, ఇంద్రయవము, కొడిసెకాయ.

(బ. కళింగలు) ఒకజాతివడ్లు.

వ. ... ఏడాకుమొలకలు గుజ్జరులు బిరుసులు జొన్నఁబ్రాలు చిన్నిచుక్కలు కళింగలు వంగవరులు జగన్నాథప్రియములు... ప్రబంధ. ౧౧౨.

**కళింగుఁడు**. సం. వి. అ. పుం. కళింగదేశపువాఁడు.

**కళిందకన్య**. సం. వి. ఆ. స్త్రీ.-కళిందపర్వతమునకు కన్యవంటిది, కళిందపర్వతమునఁ బుట్టినది - యమునానది.

ఇశ్లే:- కళిందసుత, కళిందగిరిజ, మొ.

**కళిందము**. సం. వి. అ. పుం. ౧. యమునానది పుట్టినపర్వతము. ౨. విభీతకము, తాండ్ర, తాఁడి.

**కళుకు(ళ్కు)**. విశ. ప్రకాశము గలది, తళుకు గలది.

సీ. తలచూపి మోసులై త్రాసులై తళుకొక్కని క్కి వక్కలవలె నెరసి బెరసి, గొలకట్టి కళుకులై కెరలి పోఁకంతలై వింతలై కొంతల విరివిఁ జెంది. నరస. ౫. ౧౧3.

సీ. పాలిండ్లు కెంగేలఁ బట్టనిచ్చిన మేటికళుకు బంగరుగిండ్లు కానుకిత్తు. రసిక. ౫. ౧౭౨.

చ. కళుకు మెఱుంగుఁ గ్రొంబసిఁడి కాంచికయై కటిమించఁ జాలు...అనఁ గట్టిరి దివ్యదుకూల మింతికిన్. వసు. ౫. ౧౧౩.

వి. ౧. కాంతి.

సీ. చిఱుతనవ్వులడాలు చేనున్న వలమురిఁ గలమురిపెమునకుఁ గళుకు నించ. ఘటికా. ౧. ౧౨౮.

క. పనిచినఁ గొందఱు నెలఁతలు, ననిచినసంతస ముతోడ నగవు దొలంకన్, జని యుదిరిపైఁ డికళుకుల, పని మెఱవడి నలుగు కుడపచ్చల చవికెన్. యయా. ౪. ౮౬.

౨. కిరణము.

సీ. మినుపతళుకు నిగ్గు మించు కళు కనంగఁ గిరణనామంబులై కెరలుచుండు. ఆం. భా. ౧. ౮౨.

౩. పక్షి భేదము.

సీ. కూఁకటిపవ్వ కుటాక కఝ్క కరదు నల్లచ్చి కాఁడును జల్లపిట్ట. గీ. యనఁగ నిట్లొప్పి పక్షి భేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౮.

౪. పొడి.

ఉ. యనిభాతి...తమ్ముం, గుములుఖుదుం బసిఁడికళుకులకు నీ డగుమ వెలయఁగఁ బరాగములు ... కళా. ౧. ౧౦. (శ. ర. పా.)

**కళేబర.** సం. వి.ఆ. స్త్రీ. శివళక్తులు తొమ్మండ్రలో నొకతె. (శే. ని.)

**కళే(లే)బరము.** సం. వి. అ. న. ౧. దేహము, మేను. ౨. శవము. (శే. ని.)

**కళ్యము=కల్లము.**

సీ. కళ్యాలఁ బదిలంబు గానిగుఱ్ఱంబులఁ గ్రొత్తముట్టున కియ్యకొలుపువెరవు. భార. విరా. ౧. ౯౫.

సీ. కళ్యాలఁ దెగినసృక్కముల క్రొన్నెత్తురు లాననంబులకుఁ గెంపావహింప. కాశీ. ౩. ౧౧.

**కళ్ల=కల్లె.** (చి. ని, శ. ర.)

గీ. పొగడ న్యూఁకుల మొదలను బుప్పరసము, బొరఁగి నెత్తావియందును నెరయ నొప్పెఁ, బూచు కొఱకునై మున్న యింపులు దలిర్పఁ, గడఁగి వనలక్ష్మి యుమిసినకల్ల యనఁగ. నృసిం. ౨. ౬౯.

**కళ్లము=కళ్లాము.** వి. (సం. ఖలః. ప్రా. ఖలో. త. కళం) ధాన్యము నూర్చెడుచోటు.

గీ...కళ్ల మనంగ ఖలాఖ్య నెలయు. ఆం. భా. ౨. ౨౩౩.

క. మిను కళ్లము తారలు చిక్కినగింజలు పూర్ణతుహినకిరణుఁడు తూర్పె, త్తినకొలుచు రాశిగా లాం, ఛనము మషీరచితము ద్రచండను దాల్చెన్. వరాహ. ౪. ౧౪౮.

గీ. సమ్మదదిదృక్షుఖస్థరక్షఃపిశాచ, పుంజ మహీభుక్పతత్ప్రభంజనములు, సోఁక వెఱఁబాఱెఁ గళ్లాన పూర్వవాత, ఘుట్టనలఁ బొఱపెనుఁ బొల్లకట్టు వోలె. ఆము. ౪. ౧౩.

**కళ్లాము=కళ్లము.** (శ. ర.)

**కల్లి.** వి. (ప్రా, చి.ని-క.త.కల్లి.) జెముడు.

ఉ. మామిడితోఁపునన్ దనరుమల్లిని భిల్లుఁడు కల్లిఁ జేర్చిన, ట్లామిషబుద్ధి వేఁపి యమరాల యమాల్యము గాదు దార్చిన, ట్లామఘువారి యాత్మపురి కాశ్రమధారణినుండి తెచ్చి దు, ష్క్రమతి నిల్పినట్టిమహికన్యను జూచె నభూషణాకృతిన్. చం. రా. ౭. ౩౩.

శ్లో. మల్లీం చూతవనాదివ స్నుహీవనే మ్లేచ్ఛేన సంస్థాపితాం. సం. చం. రా. సుం. ౧౭.

**కల్లియము=కల్లెము.**

ఉ. కత్తులకల్లియం బొరయఁగా సెలవుల్ దెగి క్ర

మ్మునెత్తుటన్, జొత్తిలి నోర జొల్లలర ... కవిక. ౨. ౯౨. (శ. ర. పా.)

**కళ్లె(ల్లియ).** వి. (ఇట్లు ఎడంతముగా బ్రా, చి. ని, వా.) శైత్యముచే గట్టిపడినయుమ్మి.

సీ... శ్లేష్మంబు వెలయుఁ గళ్లెయనంగ... ఆం భా. ౨. ౧౩౧.

సీ. కొమరొందు తెలినువ్వు లుమియుకళ్లెలు గాఁగ... అచ్చ. రా. కిష్కిం. ౬౬.

**కళ్లెము**=కళ్లియము, కళ్యము. వి. (సం. ఖలీనం. ప్రా. ఖలీణం.) ఖలీనము.

సీ. ముక్కున నసియాడుమురుఁదామరతూఁడు ముత్యాలకళ్లెంబు మురువు నెరప. దశా. ౨. ౬౬. ఉ. రా. ౨. ౩౩౧.

**కవ.** వి. ౧. జోడు, యుగళము.

ఉ... పైపయి విస్తరిల్లుక, న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రునటంచు... మను చ. ౨. ౩౨. హర. ౩. ౮.

౨. జత, మిథునము.

క. హాటకకలశంబులపను, బాటి యగువఘాటి మెఱుఁగుఁ బాలిండ్లు నిరా, ఘాటస్ఫురణ ప్రభ యను, నేటికిఁ జక్కవలకవ యయి విరాజిల్లెన్. నైష. ౨. ౧౯.

సీ. కలికిజక్కవపిట్టకవఁ గూర్ప విప్పంగఁ దరమైనకనుదోయి దయఁ దలిర్ప. గీ. అమరమాతకు శౌరి ప్రత్యక్షమయ్యె. పఠా. ౫. ౮౬. ఆం. భా. ౨. ౧౦౦.

౩. యమళము, ఒకతల్లి కించుమించుగా సమకాలమున జనించినశిశుద్వయము.

సీ. సల్లలితాశోకపల్లవంబులుఁ బాదపల్లవంబులు నొక్కతల్లి ప్రజలౌ, ప్రణయాతిశయమునఁ బాయనిజక్కవకవయు నెవ్వలిసున్నఁ గవయుఁ గవయె. కు. సం. ౭. ౧౨.

(బ) ౧. నకులసహదేవులు.

మ. ... మేదినీ,ధవసందోహము ప్రీతిఁ బొంద మహిమోదాత్తోగ్రయానంబులన్, గవ లేతెంచిరి వేడ్క నొండొరులకుం గయ్యంబు మైఁ జెప్పుచున్. భార. భీష్మ. ౧. ౧౦౯.

గీ. నకులసహదేవు లలయుదురు కవ లనఁగ. ఆం. భా. ౨. ౧౭౨.

౨. కుశలవులు.

గీ. కవలు కవవీణె లూని ద్రాక్షాఫలోప, మాన మానితవాల్మీకిమౌనికవిత, చారురామాయణ శ్లోకసమితి గాన, లీలఁ బఠియింప శత్రుఘ్నుఁ డాలకించి. ఉ. రా. ౯. ౧౬౮.

విశే. రెండు.

చ. కవదొన లేల పూనుకొనెఁ గవ్వడి నా వలదు ... భార. విరా. ౫. ౮౫.

గీ. కవలు కవవీణె లూని... ఉ. రా. ౯. ౧౬౮.

కవలవారు=౧. ఒకతల్లి కించుమించుగా సమకాలమున జనించినశిశువులు.

సీ. కాశిరాజనువానిగాదిలికూఁతులఁ గవలవానిల నతికాంతిమతుల. భార. సభా. ౧. ౧౩౫.

౨. నకులసహదేవులు.

గీ. కవలవారు సూర్యేందుప్రకాశతేజులు ... భార. ఆది. ౫. ౧౩౩.

౩. కుశలవులు.

జ: కవగూడు, కవగొను, కవపిట్ట, కవవాయు, కవ్వడి.

**కవకము.** సం. వి. అ. పుం. గ్రాసము, కబళము.

న. పుట్టగొడుగు.

కవకవ. వి. ౧. నవ్వుటయందగుధ్వని కనుకరణము.

ద్వి. కవకవ నగరు జక్కవకవ బెదరు, నవలివారల్లన నంది పట్టెదరు. అ. మ. క. ౨. ౧౧౫ పా. ౧౭ పం. ఉ. హరి. ౧. ౭౦.

౨. పక్షులు కూయుటయందలిధ్వని కనుకరణము.

ద్వి. కపటంపుఁ బక్షులు కవకవ మనుచు, విప్రశేఖముందఱ వెఱవక వ్రాలె. ద్వి. నల. ౩.

౯౬౯.(వ్రాలుటయం దగుధ్వనికనుకరణము -అని శ.ర.)

**కవకివ.** వి. పావురములధ్వని కనుకరణము.

రగడ. ఇట్టులపురటి వేళఁ గవకివ లెసఁగు నీబక దారిపిట్టలు. శుక. ౧. ౧౩౩.

సీ. బకదారికవకివ లోకదారిమైఁ జూపి తమిఁ గూడరా యంచు దరికి నేఁగు. హంస. ౨. ౧౦౪.

**కవగూడు.** అ. క్రి. (√కవ) జతగాఁ గూడు.

సీ. స్తనయుగచక్రముల్ జలజాతముకుళముల్ కవగూడి మొనచూపి కలహ మంద. ఇందు. ౩. ౫౬. (కవగూడి:-రెండుకక్షలుగా నేర్పడి అని భావము.)

**కవగొను.** స. క్రి. (√కవ)జతగూడు, కలియు.

క. అది మొదలు వానిఁ గవగొని,మదవతి యా రామమధ్యమందిరమున నిం,పొదవఁగ రమింపఁ దొడఁగెను,మదమఁడు విల్లెక్కు డించి మరలి చనంగన్. హంస. ౫. ౩౦౮.

**కవచపత్త్రము.** సం. వి. అ. పుం - స్తోత్రరూప మగుకవచమును వ్రాయుట కుపయోగించుపత్త్ర మువంటిపట్ట కలది-భూర్జపత్త్రవృక్షము.

**కవచము.** సం. వి. అ. పుం. న. ౧. బొందళము, (యుద్ధకాలమందు తొడుగుకొను)ఇనుపచొక్కాయ. ౨.(తంత్ర)మంత్రసాధనాంగ మగుస్తోత్ర విశేషము.పుం.౧.పటహము,తప్పెట.౨.గర్దభాండము,కలుజువ్వి. ౩. నందివృక్షము.

**కవచహరుఁడు.** సం.విణ.(అ.ఆ.అ.)కవచము తాల్పఁ దగినవయస్సు వచ్చినవాఁడు.(తరుణుఁడు)

**కవట**[1]**.** విణ. శేఁతది.

ఉదా: కపటాకు. (శ.ర.)

వి. (త.కవట్టై.)స్కంధశాఖ, పెద్దకొమ్మ.

(శమీవృక్షవర్ణనము) సీ.కవట లొండొంటితోఁ గదియుచు నెడములు న్రింగి వ్రయ్యఁగ సొంపు మిగులుదాని. భార. విరా. ౧. ౧౬౨.

**కవట**[2]**.** వి. ఉపరోగవిశేషము.

ద్వి. మొలవిడి సెలతెవుల్ మూకబంతి కవట... ఆదిగా నెన్నఁ, గలపసరాలరోగములకు నెల్ల. నవ. ౧. ౪౧ పా. ౪ పం.

**కవటము.** సం.వి.అ.న.౧.ఉచ్ఛిష్టపదార్థము. ౨.అన్నము. (శే.ని.)

**కవటి.** సం.వి.ఈ.స్త్రీ.కవాటము,తలుపు.(కల్ప.)

**కవటుఁడు.** సం.వి.అ.పుం. పుల్కసియందు శూద్రునికిఁ బుట్టినసంకరజాతివాఁడు. (శే.ని.)

**కవడె.** వి. (త. కవుడి.) వాద్యవిశేషము.

గీ. కవడె యన నురుమ యనఁగఁ గరిది యనఁగఁ, దప్పెట యనంగ వాద్యభేదములు చెలఁగు. ఆం. భా. ౧. ౧౨౮.

**కవణకాఁడు.** వి. మల్లగమనవేది, మల్లయుద్ధపునడక తెలిసినవాఁడు.

సీ. కవణకాఁ డన మీఱు గమనవేది. ఆం. భా. ౨. ౨౦౮.

గీ. కవులు బుధులును గాయకుల్ గవణకాండ్రు, హాొంతకారులు దసువందు లుండ నండ. మల్లుపు. ౧. ౧౩.

**కవణము**[1]**.** వి. (సం. కబళమ్.) గుఱ్ఱము మొదలగువానికిఁ బెట్టు ఉలవలు లోనుగాఁ గలభక్ష్యము, దాణ; ఆహారము.

ఆ.బియ్యములును నేయుఁ బెరుఁగును గూరగా, యలును వంటకట్టియలును గడ్డి, కవణములును జెల్లగా నొడఁగూర్చి ని,గూఢవృత్తిఁ దానుఁ గూడ నడచె. భార. ఉద్యో. ౧. ౯౩.

గీ...కవణ,మన్న హయాహార భేదమైచను మహేశ. ఆం. భా. ౨. ౧౯౯.(ప్రాఁతప్రతి పా.)

సీ...కవణ మంథన గజాదిగ్రాస మమరుచుండు. ఆం. భా. ౨. ౨౬౦.

(వసంతఋతువర్ణనము.) సీ. చిదుకుతేఁజిగురాకుఁ జేరుడుబియ్యాలకవణంపు బేసుంగుగములు గదల. ఉ. హరిశ్చ. 3. ౧౨.

క. గాలికవణంపు మేపును, చాలుపులం బోలి తరకసంబున నొఱపూ, న్మేలియపరంజిపింజల, వాలారుందూపు లుఱక వాఙిగ నేసెన్. అచ్చ. రా. యు. ౨౯3.

**కవణము².** వి. చికిత్సార్థము కన్నులకుఁ గట్టిన కట్టు.

ద్వి. కన్నులఁ గట్టినకవణంబు వుచ్చి. బస. పు. ౬. ౪౭౦. (ప్రయోగాంతరము లేదు. 'కవళంబు, కమలంబు' అని పాఠాంతరములు.)

**కవను.** వి. (త. కవనై.) గడ్డి.

సీ... గడ్డి గాదము గవతము కసవు కవను, పుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ ... ఆం. భా. ౨. ౭౬.

**కవపిట్ట.** వి. (కవ+పిట్ట) చక్రవాకము.

చ. జలనిధిముద్దుఁగంతు పెలుచం గవపిట్టల పెట్టు మందు... సుదంతా. ౨. ౧౫౧.

**కవయి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. మత్స్యభేదము.

**కవయు.** స. క్రి. (రతియందు) కూడు, రమించు.

క. అందుఁ దనదృష్టి నాటుడుఁ, గందర్పనిశాత సాయకంబులు పెలుచన్, డెందముఁ గాఁడి న ధృతి సెడి, కంది మునీంద్రుండు దానిఁ గవయం దివిరెన్. భార. ఆది. ౪. ౪౪.

క. దినమున సురతం బెయ్యెడఁ, జనదు చెడిపఁ గన్యఁ గవయఁ జనదు... భార. ఆను. ౪. ౧౧౫.

క. గవయింగ వయాద్వైతమిఁ, గవయుం గవయం బు. కృ. శతకం. ౧. ౬౬. ఆం. భా. ౨. ౧౭౮.

**కవటలు.** వి. బ. పాచికలు.

సీ. కవటలనం బాచిక లనంగ నక్షముల్ ...ఆం. శే. ౫౫.

గీ. కవట లుంకించి వైన ... పాత్రాళి సెత్తమాడు. అను. ౧. ౫౯.

**కవలు.** వి. వేదాదిపఠనమునందు కొంతసామ్యముచే ఒకటి విడఁబడి మఱియొకటి వచ్చి కలియుట.

క. పదవర్ణ సౌష్ఠవోన్నతి, యొదవఁగ రవ్వొచ్చి యిచ్చి యొక్కొడను గవ, ల్లొదయింపకుండ గుఱుతులు, మదిఁ బట్టఁగఁ జెప్పుచును సమంచితబుద్ధిన్. పరమ. ౨. ౧౦౯.

సీ. ఎడనెడలఁ గవల్లఁ దడఁబడకుండఁగ గుఱుతులు మదిఁ బాదుకొలిపి కొలిపి. కళా. ౪. ౪౧.

కవలుకొను = కవలువోవు.

గీ. కమలజుని వేదపఠనంబు కవలుకొనియె. విక్ర. ౪. ౫౦. (శ. ర. పా. 'కవలువోయె' ముద్రి. పా.)

కవలువోవు = వేదాదిపఠనమునందు కొంతసామ్యముచే ఒకటి విడఁబడి మఱియొకటి వచ్చి కలియు.

గీ. పాఠ మొనరించుచతఁడు దోసపడు గురునకుఁ, గవలువోకుండఁ బుత్త్రుఁడొకలుపకంటె. పాండు. ౨. ౧౯.

**కవవాయు.** అ. క్రి. (కవ+పాయు)-జతవిడుచు-వియోగ మొందు.

సీ. కవవాసి యలఁచుచుకలహంసరుతము నా నా క్రందనారావ మతిశయిల్ల. కు. సం. ౨. ౨౨౧.

**కవసము.** సం. వి. అ. పుం. కవచము.

**కవాటము.** సం. వి. అ. పుం. న. తలుపు.

**కవాటి.** సం. వి. ఈ. స్త్రీ. తలుపు.

**కవాడము.** వి. (త. కవాడమ్.) ఎద్దులు మోయు(గడ్డి కట్టెలు మున్నగువాని) బరువు. (శ. ర.)

**కవి.** వి. (√కవియు?) పెట్టు, మొగి. (ఒకశబ్దపూర్వకము గాఁ బ్రయోగములందుఁ గన్పట్టుచున్నది.)

క. తారకుకింకరు లుగ్రా, కారులు శతకోటు లొక్కకవిఁ గవిసిరి... కు. సం. ౧౨. ౭౩౨.

క. తారకుసనుజులు ఘోరా,కారులు పదివేవు రొక్కకవిఁ గవిసిరి...కు. సం. ౧౨.౭౯౪, ౨. ౨౧౦.

**కవి.** సం. విణ. (ఇ. ఇ, ఈ. ఇ.) ౧. కవిత్వము చెప్పువాఁడు. ౨. పండితుఁడు. (కే. ని)-వి. ఇ. పుం. ౧. శుక్రుఁడు. ౨. వాల్మీకి. ౩. జలపక్షి. ౪. పండితుఁడు. ౫. కావ్యకర్త. (మే.ని.) ౬. బ్రహ్మ. ఇ, ఈ. స్త్రీ. ౧. ఖలీనము, కళ్లెము. ౨. అంగుళిత్రము, అత్తెము, గోధ. (కే.ని.)

**కవిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కళ్లెము. ౨. మత్స్యవిశేషము.

**కవిగొను.** అ. క్రి. (√కవి?) కవియు, వ్యాపించు.

చ. కవిగొను దానియూర్పులసికన్ గనుగందె వనంబుపువ్వులున్. కవిక. ౪. ౩౦.

**కవిచేయు.** అ. క్రి. (√కవి?) సహగమనము చేయు.

గీ. తోడఁ గవిచేయుదురు వానితో రమించు, కాంత లందఱు...శై. భా. ౫. ౧౦౯. (శ. ర. పా-గతిచేయు ముద్రి.)

**కవిజ్యేష్ఠుఁడు.** సం. వి. అ. పుం. వాల్మీకి.

**కవిత.** సం. వి. ఆ. స్త్రీ. కవిత్వము, కైత.

**కవిత్వము.** సం. వి. అ. న=కవిత.

**కవిదల.** వి. (√కవియు) తాఁకు.

వ. ఇట్లతిభీషణశాసను లైనగణాధీశ్వరులకవిదల కబ్బగింపక...కు. సం. ౨. ౨౦౨.

(ఇక్ష్వాకుఁడు.)వ. జంభాసురేంద్రుం గిట్టి ముట్టి మూదలించిన నతనికవిదల కబ్బగింపక గుండ్రించి జంభాసురేంద్రుఁ దరల నెత్తి...కు. సం. ౧౨. ౭౪౫.

**కవియము.** సం. వి. అ. పుం. న. కళ్లెము.

**కవియించు, కవించు.** స. క్రి. (√కవియు) కవియఁజేయు.

౧. పఱపు, ప్రయోగించు.

క. కవిసినఁ గడంగి యేనును,గవియించితి నంప వెల్లిఁ గడుఁ గ్రూరత...భార. ఉద్యో. ౪. ౩౮౨.

౨. పైకొల్పు.

చ. అలుక సహించి మత్తకరి నట్టె పయిం గవియించి యార్చుచున్. ఉ. రా. ౫. ౧౦౫.

ద్వి. అనఘు వసిష్ఠు మహామునిసింహుఁ, గలఁచి నా దెస కేల కవియించుకొంటి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౬౦౭ పం.

చ. జటమొదలంటఁ గాఁ బెటికి చక్కన దానవకృత్య నాయుధో, త్కటవరశూలహస్తయుతఁ గా నొసరించి కవించె రాజుపైన్. భాగ. ౯. ౧౦౨.

క. అరదము లయ్యును మత్త,ద్విరదము లగుకీరములఁ గవింతురె చెలిపై. ల. వి. ౪. ౬౧.

౩. పడవైచు.

ద్వి. పవనుఁడు మీతండ్రి పరికించి నన్ను,నవలీల నీలవణాంబుధిలోనఁ, గవియించి పక్షము ల్గాచి రక్షించె. రం. రా. కిష్కిం. ౨౩౬ పా. ౧౨ పం.

౪. ఘటిల్లఁజేయు, కలిగించు.

ఉ. ఏలొకో మాగృహంబునకు నిప్పుడు రారు మునీంద్రభద్రశుం, డాలసమాను లైననరనాథతనూజులు మోముఁదమ్ములన్, వాలికపోటు గంట్లు చెలువంబు గవింపగఁ బేరురంబులన్, గ్రాలఁగ లీలమై దివిజకాంతలు వైచినపుష్పమాలికల్. నైష. ౩. ౧౦.

**కవియు.** అ. క్రి. (క. త. కవి.) ౧. పర్వు, వ్యాపించు.

క. ...భూసురాహుతిమంత్రో,ద్భవదారుణదహనశిఖల్,గవిసిన నెద్దియును జేయఁగా నెడ గలదే. భార. ఆది. ౨. ౧౩౨.

క. తిమిరము గవిసినఁ బాండవ,సమితియుఁ గౌరవులు రణము సాలించి నివా,సములకుఁ దగఁ జనిరి...భార. భీష్మ. ౩. ౧౬౪.

౨. పైపడు, పైకొను; పడు; ఉఱుకు.

క. ఇదె యేను గూడ వచ్చితిఁ, బదిలుఁడవై పోరు మింక బకమర్దన యీ,కదిసినవీరుల నెల్లం, గుదియించెద ననుచుఁ గవిసెఁ గురువితతిప యిన్. భార. భీష్మ. ౨. ౩౬౧.

క. రవిబింబము రాహువు పయిఁ,గవిసినఁ బాసినను దోఁపకయుఁదోఁచియు నుం,డువిధమ యజ్ఞానంబున,యవిరతివిరతులయర్థనుఁ డగు నాత్మునకున్. భార. శాం. ౮. ౧౭౮.

సీ. క్రతురక్షకులఁ దాఁకి కనుకనిఁ బోఁదోలి ...వడి జన్నసాలనివాసంబు గొని వేదికలు గ్రొచ్చి గుండముల్ గవియఁ ద్రోచి. కు. సం. ౨. ౨౦౦.

ఆ. మదము మిగిలి కేతుమంతుఁడు గాంగేయు, పైకిఁ గవిసి యతనిబాణశిఖల,మ్రందిపోయెఁ గడఁగి మంటలో నుఱికిన,మిడుతవోలె ... భార. భీష్మ. ౨. ౬౨.

౩. కలుగు, సంభవించు.

సీ. పితృకార్యవిధి సమీపించినఁ గడపని కడపని ముట్టంటు గవిసె నేని. గీ...ఎట్లు,గడపెనింటింట నీకాశికాపురమునఁ,బుణ్యగేహిని ...కాశీ. ౬. ౧౩౯.

స. క్రి. ౧. ఎదుర్కొను, మార్కొను.

చ... వి,చ్చలవిడి భూవిభుం గవిసె సామజమున్ వెస నేయఁ డంచు జో,దులకును జేయి వీచి మును దోలె నతండు రథంబు బల్విడిన్. భార. భీష్మ. ౨. ౨౪౦.

౨. చేరు, సమీపించు.

గీ... డాసెను గదిసెఁ గవిసెఁ,జేరె డగ్గఱె ననఁ బారసించె ననఁగ,వెలయు...ఆం. భా. ౩. ౧౨౮.

౩. పొదువు, క్రమ్ము.

గీ. పొదివెఁ గవిసెను గ్రమ్మెవాఁ బొలుచు నావరించె ననుమాట గాను...ఆం. భా. ౩. ౧౧౬.

జ: కవిదల, కవియించు, కవియుదెంచు.

కవియుదెంచు. =కవియు. అ. క్రి. (కవియు + తెంచు - స్వార్థమున.)

(పైకొన వచ్చు, మార్కొనుటకు వచ్చు.)

క. రక్కసుఁడును దనమదిలో,నక్కపివీరులను జీరికైనఁ గొనక చే, రుక్కున రఘుకులవీరుల, దిక్కునకుం గవియుదెంచెఁ దీవ్రస్ఫురణన్. భార. ఆర. ౬. ౯౬.

వ. అట్టిమాయాసైన్యంబున కగ్రేసరుండై కవియుదెంచు ధేనుకుం గని సంకర్షణుండు... హరి. పూ. ౬. ౭౪.

(కూడవచ్చు, కలిసివచ్చు)

గీ. హస్తిపురిఁ జేరు గలమదహస్తి నెక్కి,క్రాలు కావలిరథములు గవియుదేర,నభ్రగజముపైఁ బర్జన్యుఁ డనఁగ నంప,వాన పరఁగ వికర్ణుండు వచ్చి తాఁకె. భార. విరా. ౪. ౧౯౨.

(పర్వు, వ్యాపించు.)

గీ. జలరుహంబులు పాండవసైనికుల మొ,గంబులట్టుల విన్ననై కాంతి దఱిఁగె,వారిమనముల భీత్యంధకార మడరు,కరణిఁ జీకటి యెడనెడఁ గవియుదెంచె. భార. భీష్మ. ౧. ౩౦౦.

కవిరి. వి. పోఁక చెక్కలు కాఁచఁగా అడుగునకు దిగినపదార్థము. (బ్రా.)

కవిరియుండ. వి. వీడియముతో సేవించుటకు చేసిన తావియుండ, ఖాదిరఘుటిక.

గీ. ఖదిరకర్పూరకస్తూరికాపటీర,వల్కముల చూర్ణములు సమభాగములుగఁ, గూర్చి పదనిడి చేసినఘుటిక లొప్పుఁ, గవిరియుండలు నా వీటికలను గూర్ప. (చి. ని.)

కవిల. విణ. (సం. కపిలం. ప్రా. కవిలం. క. కవిల.) కపిలవర్ణము గలది.

మధ్యా. అవసరజ్ఞుం డయివ్యాసుఁడే తెంచె నంత నత్తపసి,కవిలగడ్డంబును గవిలజడలును గవిల కన్నులును...భార. ఆది. ౮. ౨౪౩.

**కవిలసంచి.** వి. బంగారువర్తకుఁడు మచ్చుముక్క లు ఒరపిడిరాయి మొదలగునవి వేసికొనెడు సంచి.

క. అకరులమచ్చులగుది కర్ణికానువర్ణంబు మధుపనికషము గలత,మ్మికవిలసంచి దివసవ్రై, శ్యకులాగ్రణి వాయిగట్టె సంధ్యావేళన్. వరాహ. ౪. ౧౩౭.

**కవిలె(లియ).** వి. ౧. ఘట్టించినసీలపటపువర్ణుతెక్కపుస్తకము, కడితము; తాటాకులలెక్కపుస్తకము. (శ. ర.) ధనాగమవ్యయాదులలెక్కలు నానాఁడు వ్రాసి చేర్చినపత్త్రములకట్ట. (చి. ని.)

గీ. నలుమొగంబులవాఁడు వేల్పులకు తేఁకు, బ్రదుకుఁబ్రొద్దుల జనులకు నుదుటటాకుఁ,గవిలెను లిఖింప నేర్చినకరణికంబు,గరిమనొప్పారు ధాత జగద్విధాత. ఘటికా. ౧. ౨౨.

సీ. కవిలెలో నున్న ప్రకారంబు ప్రజపాపపుణ్యముల్ చిత్రగుప్తుండు తెలుప. ఉ. రా. ౩. ౩౧౬.

చ. కవిలియ విప్పి చూచి యనఘా యిటేఁ డన్వయధర్మకర్మముల్, దవిలి యొనర్చెఁ గాని మఱి దానము లెవ్వియుఁ జేయఁడు...భోజ రా. ౩. ౫౫. పాండు. ౫. ౭౨.

౨. అయిదరఁటాకులబొత్తి. (వా)

**కవుఁగిలి=కౌఁగిలి.** వి. దే. (√కవుఁగిలు.) ౧. భుజాంతరము, క్రోడము.

చ.... ఎ,క్కుడుకమకంబుతోడఁ దల గ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నత్తఱిన్. కళా.౪.౯౯.

౨. ఆలింగనము.

గీ. ... కౌఁగిలి యనఁ, గవుఁగి లనఁగ నాలింగనాఖ్య లగుసాంబ. సాం. ని. స్థా. ౫౧.

**కవుఁగిలించే=కౌఁగిలించే.** స. క్రి.(√కవుఁగిలు) ఆలింగనముచేయు.

చ. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షినె,మ్మొగము మొగంబునం గదియ మోపు...భార. విరా. ౧. ౨౪౬.

చ ... మేఘనాదునిన్, బిగియఁ గవుంగిలించి కడుఁ బ్రీతి వహించి దశాస్యుఁ డిట్లనున్. ఉ. రా. ౪. ౩౫౬, ౩. ౬౭.

**కవుఁగిలింత=కౌఁగిలింత.** వి. (√కవుఁగిలించే) ఆలింగనము.

ఉ. తానుఁ గుమారజంగమసుధాకరమాళియుఁ గూడిమాడి యిం,పైవరతిప్రసంగముల నర్ధనిమీలితనేత్రపద్మముల్,మాననిచుంబనంబులును మాటలచొక్కులు వీడి వీడిపో,నినికవుంగిలింతలు ననేకవిలాసములున్ జెలంగఁగన్. కాళ. ౧. ౪౨.

**కవుఁగిలింపు=కౌఁగిలింపు.** (√కవుఁగిలించు.)

**కవుఁగిలు=కౌఁగిలు.** స. క్రి. కౌఁగిలించు.

చ...నవ్వ సురపొన్న ముఖాంబుజ మెత్తఁ జంపకం,బు నెఱేఁ గవుంగిలం గొరవి మూర్కొన వావిలి దన్న వంజుళం,బు నుడువ గోఁగునై తరుణి పూచు సురద్రుమ మన్నిపువ్వులన్. పారి. ౪. ౧౦.

జ: కవుఁగిలి, కవుఁగిలించు, కవుఁగిలింత, కవుఁగిలింపు.

**కవుఁజే=కౌఁజే.**

**కవుచే=కాచే.** వి. (క. కవుచు. త. కవిచ్చు.) ౧. ఆమమాంసగంధము,మాఁగుడుపాలకంపు.(చి.ని)

గీ. కవుచుగాలి వాఱఁగవిఁ బాసి వెలువడి,వనుస మీలఁ దినుచు వచ్చి వచ్చి,పాముఁ జంపి పాదపముఁ బ్రాఁకి బకశిశు,ప్రకరభుక్తిఁ దనిసి నకుల మరిగె. వేం. పంచ. ౧. ౬౫౧.

సీ.ఏవీటిసతులపాలిండ్లపైగంబూర నవహారముల చిప్పకవుచు మాన్చు. ఆము. ౨. ౩.

౨. మాంసము.

సీ...నంజుడు పాల రొయించి కవుచు పాలను గం
డ. గీ. చియ్యా యం చన మాంసంబు చెలంగు
...అం. భా. ౨. ౧౩౧.

**కవుడీలు**=కాడీలు.

**కవుడు**=కాడు. వి. (త. కవడు) ౧. కపటము.

సీ...కపటాఖ్య విలసిల్లు గల్చి గౌరు, గబుసు
కైపు కిటుకు కాడు డబ్బు కవుడు డం బనం
గ...అం. భా. ౧. ౧౩౭.

౨. ప్రమాదము, తప్పు.

చ. శ్రుతి గవు డొందినన్ గమలనూతికి నైనను
దీర్చి చెప్ప నేర్తురు...అప్పురివిప్రసత్త
ముల్. పి. శకుం. ౧. ౭౬. (కవలొందు?
-చూ. కవలుకొను.)

**కవుడువు**=కాడువు.

**కవును¹**=కాను¹. వి. (వృత్తియం దిది పూర్వపదం
బగునపుడు నువర్ణమునకు వికల్పముగ లోపం
బగు. ఉదా: కవుందీంగ, మొ. ఉత్తరపద మగు
నపుడు అంత్యోకారమునకు లోపము గొందఱు
చెప్పియున్నారు. నూదిజగాకవున్, లేఁగుబ్ర
నునుంగవున్-శర.) ౧. మధ్యము, నడుము.

మ. తెలుకుం జూపులు సన్నపుంగవును శోభి
ల్లన్...దశా. ౨. ౨౯౮.

సీ...జిగిలేఁగవునుఁదీవ మొగులుత్రోవ. నీలా. ౧.
౫౬.

౨. లస్తకము, వింటినడుము. (చూ. కాను¹)

**కవును²**=కాను². వి. పాదరక్షావిశేషము, ఒకవిధ
మగుచెప్పు.

సీ. పాదరక్షాభిధ పరఁగును జెప్పన మలకడ
మ్మనఁగ సమ్మాళి యనఁగఁ, దద్విశేషమ్ములు త
గుఁబాయపోసు పాపో నూడు వుద్దము ము
చ్చెమెట్టు, కవును మోజా యనఁగా...అం.
భా. ౨. ౨౯౭.

**కవురు**=కారు.¹ వి. ముదురురంగు? (వర్ణాధిక్యము-
శ. ర.)

క. చివురా వాతెఱ నల్లని, కవురా నునుసోగవెం
డ్రుకలు పుత్తడిమేల్, సవురా దేహము ము
ద్దుల, దవురా యని జనులు పొగడ నాభిష
యమరున్. హంస. ౩. ౧౯౩.

వ ...తొడిగినట్టిసరిగకంగులకూరుపుఁబనికవురు
పరకాళాయింటిపొరఁదిగువునిడుదకాసెల...
ప్రబంధ. ౭౭.

**కవులు**=కౌలు. (చూ) వి. (హిం. ఖవుల్) రాజు
లు లోనగువారు ప్రజలు లోనగువారి కిచ్చు
నట్టియొడంబడిక. (శ. ర.)

**కవేరజ**=కావేరి. సం. వి. ఆ. స్త్రీ. దక్షిణహిందూ
స్థానమండలియొకనది. వైజ. ౧. ౭౨.
(ఇట్లే: కవేరకన్య, కవేరసుత, మొ.)

**కవేరుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొకఋషి.
(కిటెల్)

మ...కవేరునిప్రియాత్మజ మత్ప్రతిబింబ మొ
క్కచో, ననువుగ నిల్పి భక్తి నెఱపొర భజిం
చిన మెచ్చి యిచ్చెదం, గొనుము వరంబు నీ
కనినఁ గోమలి గోరెఁ ద్వదీయపాదసం, జనన
ఘనప్రతాప యగు జాహ్నవి మీఱుమహా
మహత్త్వమున్. శ్రీరం. మ. ౨. ౩౯౭.
(కవేరునిప్రియాత్మజ=కావేరి.)

**కవేలము.** సం. వి. అ. న. కువలయము, కలువ.
(కల్ప.)

**కవోష్ణము.** సం. విశ. (అ. ఆ. అ) ఇంచుక వేఁడి
గలది, నులివెచ్చనిది. వి. అ. న. ఇంచుక వేఁడిమి.

**కవ్యము.** సం. వి. అ. న. (వ్యతి-హవ్యము.) పితృ
దేవతల కియ్యఁ దగినఅన్నము.

**కవ్యవాలము.** సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. పితృ
గణభేదము.

**కవ్యవాహనుఁడు.** సం. వి. అ. పుం-పితృదేవతలకు కవ్యమును గొనిపోవువాఁడు-అగ్ని.

**కవ్వడి.** వి. (కవ + పడి)-రెండుచేతులయందును వడి గలవాఁడు-అర్జునుఁడు.

తరల... చెచ్చెరన్ ధరణీశులన్, విడిచిపుచ్చు మ యేను గృష్ణుఁడ వీఁడు భీముఁడు వాఁడు గవ్వడి...భార. సభా. ౧. ౧౯-౨.ఆం.భా. ౨. ౧౮ ౨.

విశ. రెండుచేతులయందును పడి గలవాఁడు.

సీ. ఉత్తుంగఘనవిశాలోరస్కుఁ డనియును గవ్వడి యనియును గరము వేడ్క,విర్వచ్చు నెప్పుడు వినియెడునది...భార.ఆది.౮.౧౮౫.

**కవ్వపుగట్టు.** వి. (కవ్వము + గట్టు)- కవ్వమైన కొండ-మందరపర్వతము,మంథాద్రి.

దండకము... మేటితామేటిమై యెత్తి మవ్వంపుఁగవ్వంపుగట్టుపన స్వేఁపునం దాల్పవా ...నీలా. ౨. ౪౧. అచ్చ. రా. యు. ౧౬౧.

ఇశ్లే: కవ్వపుఁగొండ, మొ.

గీ. భద్రజాతియేనుంగు లప్పట్టనమునఁ,బ్రకటితస్ఫూర్తి నొప్పుసిబ్బములతోడ, విమలవారాశిఫేనఖండములతోడి,కవ్వపుంగొండబంధులో కాక యనఁగ. శివరా. ౨. ౧౦.ఆం. భా. ౨. ౨౮. వరాహ. ౧౧. ౩౧.

**కవ్వము.** వి. మంథానము, పెరుఁగుచిలికెడు సాధనము.

క. తరిత్రాడు చేతికవ్వము, దిరుగక యుండంగ బిట్టు తెమ్మని తినుచున్,బొరిఁబొరి గనయంబునముడి,విరియ పలువచెఱఁగు పట్టి వ్రేతల నీడ్చున్. హరి. పూ. ౫. ౧౯౬. ఆం. భా. ౨. ౨౬౪.

జ: కవ్వపుగట్టు.

**కవ్వు.** స. క్రి. (త. కవ్వు.) ౧. కబళించు. (శ.ర.) ౨. అపహరించు. (శ. ర.)

కవ్వుకొను=౧.ఆదుకొను.౨.ఆక్రమించు.(బ్రౌ.)

**కశ.** సం.వి.ఆ.స్త్రీ. ౧. గుఱ్ఱములోనగువానిని కొట్టుచబుకు. ౨. మాంసరోహిణిక.

**కశము.** సం. వి. అ. పుం. కుచ్చుతోఁక గలమృగి. (వై. ని.)

**కశిపువు.** సం. వి. ఉ. పుం. న. ౧. సెజ్జ, శయ్య.౨. అన్నము. ౩. వస్త్రము. ద్వి. అన్నవస్త్రములు. (నై.ని.)

**కశేరుక.** సం. వి. ఆ. స్త్రీ. వెన్నెముక.

**కశేరుకము.** సం. వి. అ. న. తృణకందము, ఒకజాతిగడ్డిదుంప.

**కశేరువు.** సం. వి. ఉ, ఊ. స్త్రీ. ఉ. పుం.న. తృణకందము, ఒకజాతిగడ్డిదుంప.ఉ.పుం. న. వెన్నెముక. పుం.జంబూద్వీపముయొక్క తొమ్మిదిఖండములలో నొకటి.

**కశ్మలము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. మలినము. ౨.నింద్యము.వి.అ.న. ౧.మూర్ఛ. ౨. మోహము. ౩.పాపము.

**కశ్మీరజము.** సం. వి. అ. పుం. న. కుంకుమపూవు. (ఇశ్లే: కశ్మీరజన్మము, మొ.)

**కశ్మీరము.** సం.వి.అ.పుం.కాశ్మీరదేశము. (ఇది శారదామఠము మొదలు కుంకుమాద్రి వఱకుఁ గలదేశము.)

**కశ్యపము.** సం.వి.అ.న. ౧.తాఁబేలు.౨.మత్స్యభేదము. ౩.మృగభేదము, ఒకజాతిలేడి.

**కశ్యపుఁడు.** సం.విశ. (అ.ఆ.అ.)శ్యావదంతుఁడు, నల్లనిదంతములు గలవాఁడు. వి. అ. పుం. అదితికిని దితికిని భర్తయు బ్రహ్మమానసపుత్త్రుఁడు నగునొక ప్రజాపతి.

**కశ్యము.** సం.విశ.(అ.ఆ.అ.)కశతోఁ గొట్టఁ దగినది. వి.అ. న. ౧. మద్యము. ౨. గుఱ్ఱముయొక్క నడుము.

**కషణము.** సం. విణ. (అ.ఆ.అ.) పక్వము కానిది. వి.అ.న. ఘర్షణము, ఒరయుట, గీఁచుట; కండూయనము, గోఁకుట.

**కషపట్టిక.** సం.వి.ఆ.స్త్రీ. నికషము, ఒరగల్లు.

**కషము.** సం.విణ. (అ.ఆ.అ.) రాయునది, ఒరయునది, గీఁచునది. వి.అ.పుం. ౧.రాయుట. ౨. ఒరగల్లు, నికషము. ('కత్తి సున్నగునవి పదను పెట్టు సాన'అని కొందఱు.)

**కషానువు.** సం.వి.ఉ.పుం.౧.అగ్ని.౨.సూర్యుఁడు.

**కషాయ.** సం.వి.ఆ.స్త్రీ. క్షుద్రదురాలభ,ఒకజాతి తీఁటకసిందరీ.

**కషాయము.** సం.విణ.(అ.ఆ.అ.) ౧.ఒగరు గలది. ౨. సురభి, సువాసన గలది. ౩.లోహితము, ఎఱ్ఱనిది. ౪. అనురాగము గలది. ౫. ఇంపైనధ్వని గలది.(ఉదా:-కషాయకంఠము.)౬.ఎఱుపు పసుపు కలిసినది. వి.అ.పుం.న. ౧. ఒగరు. ౨. రాగము, ఎఱుపు. ౩. క్వాథము, ఓషధులు వేసి కాఁచిననీరు. ౪. నిర్యాసము,చెట్టుబంక. ౫. అనురాగము, విషయాభిలాష. ౬.విలేపనము, చందనాదులపూఁత. ౭.అంగరాగము, పూసికొనెడు చందనము, మొ. ౮. ఎఱుపు కలిసినపసుపు. పుం. ౧.శ్యోనాకము, దుండిగము!. ౨. ధవము!. ౩. పోఁకచెట్టు. ౪. కలియుగము.

**కషాయి.** సం.విణ.(న్.ఈ.న్.)-కషాయముకలది- ౧.బంక నిచ్చునది. ౨.ఒగరు గలది. ౩.ఎఱ్ఱరంగు గలది. ౪. విషయాభిలాషము గలది. వి.న్.పుం. ౧.సాలవృక్షము,మద్ది!. ౨.ఖర్జూరవృక్షము. ౩. లకుచము!.

**కషాయితము.** సం.విణ.(అ.ఆ.అ.) ౧.ఎఱ్ఱవాఱినది. ౨. ఎఱ్ఱగాఁ జేయఁబడినది. ౩.కలుషితము. ఉదా:- రోషకషాయితమనస్కుఁడు, మొ.

**కషి.** సం.విణ.(ఇ) హింసకమైనది.

**కషిక.** సం.వి.ఆ.స్త్రీ.౧.సస్యము!. ౨.మక్షిక, ఈఁగ. (వై.ని.)

**కషితము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧.రాపిడి పెట్టఁబడినది. ౨. బాధితము, పీడితము.

**కషుఁడు.** సం.వి.అ.పుం.సానపెట్టుట లోనగుపనులచే జీవించెడుకొకనికృష్టపుజాతివాఁడు.

శ్లో. కిరాతహూణాంధ్రపుళిందపుల్కసా, ఆభీ
రకంకా యవనాః కసాదయః, యేన్యే చ పా
పా యదుపాశ్రయాశ్రయా, శ్శుధ్యంతి త
స్మై ప్రభవిష్ణవే నమః.సం.భాగ.౧౦స్కం.

**కష్ట(ము)పడు.** మి. అ. క్రి. ౧. దుఃఖపడు.

క. నీవును ద్రోణుఁడుఁ గలుగం,గా వైరులచేత
నేను గష్టపడితిఁ గా,దే...భార. భీష్మ. ౩. ౧౩౭.

౨. శ్రమపడు.

(వ్యవ) వాఁడు పరీక్షకు కష్టపడి చదువుచున్నాఁడు.

**కష్టప(ఱ)ఱుచు.** మి.స.క్రి. కష్టపడఁజేయు.

ఆ.ఋణము నీఁగుపొంటె నిప్పుడ యీజరా,సం
ధుఁ గిట్టి పట్టి సమదబాహు,బల మెలర్పఁ గ
ష్టపఱచెద నీకు మె,చ్చగనొనర్చువాఁడఁ
జూడు నన్ను. హరి.ఉ. ౧.౯౩.

**కష్టపాటు.** మి. వి. కష్టపడుట.

(భంగము, చెఱుపు.)

గీ. నందనమ్మునకును వజ్రనాభదైత్యుఁ, డపుడు
చేసినకష్టపాటబ్జనాభ,యిపుడుఁ దలఁపువఁ
బాటిన హృదయమునకు, నధికతర మైనపరి
తాప మావహిల్లు. ప్రభా. ౧. ౭౩.

**కష్టపుఁబాటు.** మి. వి. కష్టపడుట, ఇడుమలు పడుట.

చ. కౌరవకోటిచేత మనకష్టపుఁబాటు దలంపు
వచ్చినం, గ్రూరవిచేష్టితంబునకు గొంతి రాఁ

దంబడె బంధువర్గముల్, ఘోరముగా వధిం
చుటకుఁ గోల్కొనకున్నది బుద్ధి మీరని,
ర్ధారణసేయఁడా హితము ధర్మము నయ్యె
డువృత్త మెట్టిదో. భార. ఉద్యో. ౪.౯౦.

**కష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దుష్టము, చెడ్డది. ౨. దుఃఖము గలది, పీడ గలది. 3. పీడించునది. ౪. కష్టసాధ్యము, ప్రయాసపడి సాధింపఁ దగినది.(శత్రురోగాది.)వి. అ. న. ౧.సెబ్బర, కీడు, చెఱుపు. ౨. దుఃఖము, పీడ. 3. పాపము. ౪. కస్తి, శ్రమము,ప్రయాసము.

**కష్టముపాటు.** మి.వి. కష్టపడుట, ఇడుమల నొందుట.

ఉ. ఎందును నెవ్వరుం బడనియొంతయుఁ గష్ట
ముపాటు వచ్చినన్.భార.ఉద్యో.౨ ౧౨౯.

**కష్టించు.** సం. అ. క్రి. కష్టపడు.

ఆ. మగనికాలమందు మగువ కష్టించిన, సుతుల
కాలమందు సుఖముఁ బొందు. వేమన. ౧.
౧౨౩.

**కస[1].** వి. (సం. కశా.) గుఱ్ఱము మొదలగువానిని గొట్టెడుచబుకు, కొరడా.

సీ... పగ్గములు చతుస్స్వరములు ప్రణవంబు
గసగోల బ్రహ్మసూతుఁ,డు... కు. సం. ౨.
౧౬౦. (కసగోల=కొరడాకఱ్ఱ.)

**కస[2].** వి.(సం.కషాయమ్. ప్రా.కసాఅమ్. క.కస.)౧. రంజకద్రవ్యములు మున్నగువానిసారము.

ఉదా: పట్టుబట్ట తడుపఁగా రంగుకస దిగిపోయినది.

౨. కసటు, మాలిన్యము.

ఉదా: నువ్వులు కస పోవుదాఁక కడుగవలెను.
కందకస పోవునట్లు కడుగకున్న దురదపెట్టును.

**కసటు.** వి. (సం. కష్టమ్. త. కసడు) ౧. అపరిశుద్ధి.

ఆ. అవతరించి కంసుఁ డాదిగాఁ గలదేవ,శత్రు
కోటి నెల్ల సమయఁజేసి, భరతకులముకసటు
వాపి సంశుద్ధప్రతిష్ఠఁ గూర్చి యరుగుదెంచి
తీశ. భార. మూ. ౭౮.

౨. మలినపదార్థము.

సీ. కడు సంభ్రమమున నక్కడకు నేతెంచి యిం
పెసఁగ మైనుండినకసటుఁ దుడిచి.మనుచ.
౬. ౪౧.

ద్వి. మున్నుగా వగ లనుమున్నీట మునిఁగి, కన్నీ
ట నాసొమ్ముకస లెల్లఁ గడిగి. రం. రా.
కిష్కి.౨౦౨ పా. ౧౮ పం.

సీ. కాఁకలు దేరుబంగరుసలాక యనంగఁ గస
టు వాసినచంద్రకళ యనంగ. అని. 3.౬౨.
(ఇట కళంకము అనిభావము.)

సీ. కన్నియవదనంబు కమలంబు బోల్తు మా కమ
లంబు పుట్టుచోఁ గసటు గలదు. వీర. 3.
౬౬. (ఇట బురద అనిభావము.)

3. పాపము.

సీ. దోస మనంగను దోసఁగు దోసంగు నాఁ గస
టు నాఁ బాపంబు గాఁ దనర్చు. ఆం.భా.౧.
౯౭.

సీ. దురితంబు లెన్నండుఁ బొరయక వెలుఁగొం
దుకమలాప్తకులమునఁ గసటు గలిపి. భార.
ఆర. ౬. ౩౦౮.

౪. నిష్ఠురత్వము, పారుష్యము.

ద్వి. పొమ్మన్న విని మొగంబునఁ జిఱునవ్వు,గ్ర
మ్మ మాటల నొందు కసటు లేకుండ. రం.రా.
అయో. ౯౮ పా. ౨ పం.

౫. వెగటు, అరుచి.

గీ. విసము మెసవిననాఁటియక్కసటు వోవ.(శ్రీ
నాథునిచాటువు.)

౬. విషాదము, ఖేదము, దుఃఖము.

వ. పార్థున కుపనిషదర్థజాతం బవగతంబు సేసి మ

నను కసటు వాపి వివేకంబునకుం జేవ గలిగిం
చి కృష్ణుండు...భార. భీష్మ. ౧.౨౨౩.

౨. మలినము.

సీ. కలువపుష్పాళ్లచేఁ గస బైనవెన్నెల వలిపవె
న్నెలలోన వడిచి తేర్చి. పారి. ౨. ౪౯.

**కసనము.** సం. వి. అ. పుం. కాసరోగము.

**కసనోత్పాటనము.** సం. వి. అ. పుం. వాసకవృ
క్షము, అడ్డసరము.

**కసబెస.** వి. బాగుగా నూఱుట మున్నగువానియం
దగు ననుకరణము.

ద్వి. కలిపి రసంబులఁ గల్వంబులందుఁ, గసబెస
గా నూఱి...నవ. ౫. ౨౧౧ పొ. ౨౦ పం.

**కసమస.** వి. ౧. వేగము, తొందర.

చ... నీప్రకటప్రతాపముం, గసమస దాఁటఁ
బోయి యతిఖంజత నొందె సహస్రపాదుఁ
డు౯. నైష. ౩. ౭౨.

క. ముసిముసినవ్వులు నవ్వుచు, మిసిమింతుఁడు
గాక యొక్కమిఱుత నిలిచి యక్కుసుమశ
రహరుఁడు తపసులు, కసమసఁ దనుఁ బట్టు
కొనఁగఁ గడఁగినఁ బెలుచ౯. హర. ౫. ౫౭.

౨. తొట్రుపాటు, సంభ్రమము.

క. అంతట నిద్దఱమనసులు, కంతునిపసఁ గలసి
వింతకసమస లొలయ౯, మంతనములఁ బెద
వుల నిసి, చింతలు వాఱంగ నగవు లెప్పలు
గోర౯. విక్ర. ౯. ౯౭.

౩. తినుట మున్నగువానియందలి యనుకరణము.

ద్వి. బుద్ధివచ్చినమృగంబులమాంస మెల్ల, గద్దకు
త్తుకపడఁ గసమస మెసఁగి. నవ. ౧. ౪౭
పొ. ౧౧ పం.

**కసరు**[1]. అ. క్రి. ౧. కోపపడు; విసుకొను.

గీ....ఓతండ్రి యాకోడియలనుబట్టి, గట్టిచేసెద
నిఁక నింత కసర వలవదు...నీలా. ౨. ౬౨.

క. పెసరుంబ ప్పేమిటికని, కసరు న్నెయి గొ
నఁడు పండుగను గొయగూరే, కొసరుక౯...
బహు. ౫. ౯.

సీ. కసరి యెంగిలిచేతఁ గాకి వేయనివాఁడు సత
తాన్నదానప్రశస్తుఁ డయ్యె. పాండు. ౪.
౨౧౦.

౨. విజృంభించు, హెచ్చు.

సీ. జలరేఖ లంబరస్థలి విశాలము లయ్యెఁ గసరు
చుఁ దమ్మెరల్ విసరఁ జొచ్చె. ఇందు. ౩.
౧౦౬.

గీ. కసరి యెవ్వానికంఠహుంకారరవము, కొండ
చిలువలకులము లోఁ గూర్చె నహుషు, నట్టిప
రమమహాశైవ నసఘతేజు, వెదకి రానందవన
ములో విబుధమునులు. కాశీ. ౨. ౪౦.

౩. చలించు.

ద్వి. పసిఁడిసలాక సుపాణిముత్తియము, కసరక
నిలుచు క్రొక్కారు మెఱుంగు. ద్వి. భాగ. ౭.
(శ. ర.)

స. క్రి. ఉపాలంభించు, తిట్టు. (చి. ని, ధాతు
మాల)

క. అంపఁ దగువారిఁ గసరుచు, నంపి...మనుచ.
౫. ౨౩.

కసరికొట్టు=తిట్టు. చంద్ర. వి. ౧. ౬౨.

వి. ౧. కోపము.

గీ. అలఁతఁ బానుపుపైఁ బొరలాట తెలుపఁ, దె
గువ లోలోననే నవ్వునగవు తెలుపఁ, గలఁక
మామీఁదిపనిలేని కసరు తెలుపఁ, బొలఁతి రే
లు నీయున్కియే పులుగు గాదె. ఆము. ౫.
౬౦.

సీ. పసులగోడలు వాన్పి వసుధపైఁ గూల్పనిము
సురువానలమీఁదఁ గసరుఁ జూపు. శుక. ౨.
౫౦౪.

౨. పొగరు, గర్వము.

ద్వి. కసరెక్కి యంత ముష్కరము సేయంగఁ,
బొసఁగించి యొగవేయు బొంక నీ కెంత, ముం
గల వెనుకను మూఁడులోకముల, నంగవ నీ

యంతయాఁడుది లేదు. ద్వి. సారంగ. ౩. ౧౦౫ పా.

౩. గాలివాన.

వ.... పెల్లడరునిట్టూర్పు గాడ్పువిసరులఁ గసరెత్తి... పొంగి చింతాసాగరంబు వేగిరంబ వెల్లివొడిచె నన...మనుచ.౩.౯. (కసరెత్తి=తుపాను కలిగి.)

గీ. బిట్టు కసరెత్తి మున్నిటినట్టనడిమి, కరుగఁగా జీను వైచినతరణి యనఁగఁ,జక్కసాగి నరశ్మిచేఁ జుక్కతేఁడు, సమయవశమున గగనమధ్యమున నిలిచె. రా. వి. ౩. ౧౯.

౪. విజృంభణము, అతిశయము.

క. అసురుసు రని సొలయుఁ రా, జసురేంద్రుఁడు మలయపవనుచలికసరునకుఁ.కవిరా.౫. ౨౬౫.

౫. దోషము.

క. ఈరత్నమునకుఁ బ్రుప్పియు, గారయుఁ గర్కశత యనఁగఁ గసరులు మూఁడే,పారనవి యెల్లఁ దెలియక, వారక ధరియింప జగతి వల దెవ్వరికిఁ. రత్న. ౨౭.

జ: కసరుఁదనము, కసరుకొను.

కసరు²=కసురు.

గీ.కాయ గస రేతికొని తించుఁ గానలోన,ఘోరదుఃఖముల్ గుడువంగఁ గోర నేల. భా. రా. సుం. ౧౮౭.

జ: కసరుఁగాయ.

కసరుఁగాయ. వి.(కసరు² + కాయ) లేఁతకాయ.

ద్వి. రసరసాన్నములను మెసవెడువాఁడు, కసరుఁగాయలఁ బ్రొద్దు కడపుచున్నాఁడు. రం. రా. అయో. ౧౩౮ పా. ౧౨ పం.

కసరుఁదనము. వి. (కసరు¹ + తనము.) దోషము.

సీ. కులగోత్రముల కాదికొన్న చిన్నతనంబు విసములో నుదయించు కసరుఁదనము.కృ.శకుం. పీఠి. ౫౬.

కసరుకొను.అ.క్రి.(కసరు1 + కొను-స్వార్థమున) =కసరు¹.

(౧. ఘోషించు, శబ్దించు. ౨. కోపపడు.)

సీ. జలదంబుగతి నిచ్చ వెలవెలఁబాఱక కలకాంబునిధిరీతిఁ గసరుకొనక. నరస. ౫. ౧౯.

కసవు(స్వు). వి. (సం. ఘాసః. ప్రా. కస్సో. క. కసవు.) ౧. గడ్డి, తృణము.

మ...నానాదివౌ,కసు లాస్థానము గూడి యాడుదురు శ్రీకాశీప్రదేశంబునఁ, గసవై పుట్టెడుభాగ్య మైన మనకుఁ గల్పింప దాదైవ మీ,కసుమాలం బగునాక మేల యని యుత్కంఠాతిరేకంబునఁ. కాశీ. ౮. ౨౦౬.

క.... మెచ్చెఁ బశువిసర మెసఁగి మెసవుకసవులఁ. కృ. శకుం. ౧. ౪౩.

ద్వి. సద సత్ర నలి సత్ర సరి గస్వ గత్ర, వెదకియుఁ గానక మది విచారించి. బస. పు. ౩. ౫౩౨పం.

౨. పెంట.

సీ. గల్లుగ ల్లని రత్నకంకణంబులు మ్రోయ గంధవాహునియాలు కసవు నూడ్చు. భీమ. ౩. ౬౨.

కసవుఁగుప్ప=౧.గడ్డిమేటి. (శ. ర.)

౨. పెంటకుప్ప. (శ. ర.)

కసవుపోఁచ=గడ్డిపరక.

సీ. కసవుపోఁచలు కసిగాట్లుగాఁ గొఱుకుచు వివృతాస్యమున జొల్లు విడుచుకొనుచు.హరిశ్చ. ౨. ౪౯.

కసాయి. వి. (హిం.కసాయీ.) కటికవాఁడు,సానికుఁడు. (శ.ర.)

కసి¹. వి. ౧. తీఁట, దురద.

క. చేతులు దలలును బహువిధ,హేతులఁ దునియలుగఁజేసి యిలఁ దొరఁగించెఁ,జేతులకసి వోవంగ న,రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి ప్రకటస్ఫురణఁ. భార. కర్ణ. ౨. ౩౦౦.

క. చేతులకసి వోఁ గయ్యము, నేతవి లెదుసట్టివిధము చింతింపు...హరి.ఉ.౭.౧౮. ఆం. భా. ౨.౧౭౫.

౨. తమి, అపేక్ష.

క. కన్నులకసివోఁ జూచితి, నెన్నఁడు నెచ్చోఁటఁ బోరు లెట్టి వెఱుఁగ నో, యన్న...హరి. ఉ. ౮. ౩౪.

ద్వి. బసవా యనిన బాలబసవఁ డోయనుచుఁ, గసి వోవ నడుగుల నొసలిడి రాచు.పండితా. పురా. ౧౬౬ పొ.

౩. కోపము.

(వ్యవ) వానిని కసి తీఱఁ గొట్టితిని.

జ: కసిమసఁగు, కసిమిరి.

**కసి²**=అసి. విశే. అల్పము. (వృత్తియందు 'కసఁడి' శబ్దముయొక్క తుదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము.) ఉదా: కసిగాటు, మొ.

క్రి. విశే. ఇంచుక. (చూ. కసిగందు.)

**కసింద.** వి. (క. కసింద.) కాసమర్దము.

(దీని భేదములు:—ఒట్టికసింద, కమ్మకసింద, కొండకసింద, తీఁటకసింద.)

సీ. ఇడిసినయిడుపులయెడలఁ జొప్ప నుత్త రేను గసింపకోరిండసొదల. ఆము. ౬. ౧౩.

**కసఁడి.** విశే. అల్పము. (వృత్తియందు దీనికి వికల్పముగా అంత్యవర్ణలోపము. (చూ. కసికోఁత, కసఁడికోఁత.)

జ: కసి², కసఁడికోఁత, కసికోఁత, గసిగందు, కసిగాటు.

**కసఁడికోఁత**=కసికోఁత, కసినికోఁత. వి. (కసఁడి + కోఁత) - చిన్న చిన్న ముక్కలుగాఁ గోయు కోఁత-సంతతము పెట్టెడు బాధ.

శా. తండ్రీ సారెకు రవ్వ నాగ్రహముమీఁదం గన్న దే గాతి గా, గుండ్రాలం గొని దాయ గాక యిది నాకుం దల్లియే యెన్నఁడుక్, పిండ్రం జూచినజాడ నన్ను యమునక్ వీక్షింప దంతంతకుం, బిండ్రం బయ్యెఁ గసిండి కోఁత వలదా మీకు న్విచారింపఁగన్. వరాహ. ౫. ౯౩.

(పతివ్రతావర్ణనము.) సీ. కలహాళనుండు తర్కక్రియాకుశలుండు సంగతోన్నాదోత్తమాంగకుండు. గీ. నగునయేనియు నటువంటిమగని తోడఁ, గాఁపురము సేయు సతి దొడ్డగతిత యగుచుఁ, గసఁడికోఁతల నోర్చి లో విసిగి కొనక, ధాత మాఱకతండ్రి సేఁతకు వగవక. పాండు. ౪. ౧౪౫.

**కసికోఁత**=కసఁడికోఁత. (కసి²+కోఁత.)

గీ. చెలువ యీబాము లనుభవించినను గాని, తెలియదే ప్రేగులోపలితీఁటవంటి, వలపుకసి కోఁత లివి పగవారి కైన, వలదుగా దీని కిపుడేల వచ్చె నమ్మ. కువల. ౩. ౯౯.

**కసిక్కు.** వి. ముండ్లు లోనగునవి నాటుటయందగు ననుకరణము.

చ. చిటచిట మండుమంటలుఁ గసిక్కున నాటెడు ముండ్లత్రోవలుక్. సానందో. ౨. ౫.

**కసిగందు.** అ. క్రి. (కసి²+కందు)కొంచె మైనను కందు. (దీనికి వ్యతిరేకమందే ప్రయోగము)

చ. అతఁడు మదీయసఖ్యపరుఁ డక్కట యేఁ గసిగందకుండ నా, క్షితిపతి యిమ్మెయిం బరుల చేతఁ బరాభవ మొందె...భార. సౌ.౧.౭౦. (కరాలప్రతిపాఠము.)

మ. అసురాధీశసమర్పితంబు లగులీలారామకల్పద్రుమ, ప్రసవంబుల్ కసిగంద వయ్యె ... భీమ. ౪. ౧౪౬.

చ....తపో,ధన ముడివోనిపూనిక వితాన మొనర్పఁ గడంగినాఁడు నీ, మనుకులకీర్తికామినికి మైకసిగందనిచాయ సంధిలక్. చం. రా. ౨. ౬౬.

**కసిగా(కా)టు.** విణ. (కసి² + కాటు) ౧. చిన్న కాటులు గలది; అల్పము, కొంచెము.

గీ. భావమొకరీతిఁ దత్తఱపడ హితంబు,గా దటం చును గసిగాటుగా భుజించి, వేగ ఘనసార మధికంబుఁ గాఁగ నవుడు,చేసెఁ దాంబూల మారాజశేఖరుండు. దిలీప. ౩. ౨౧౩.

గీ. మనసు దీరఁగ నొకనాఁటియునికి లేక, మో సపోయితిఁ గసికాటుముచ్చటలనె, యింత లోనవె నన్ను నీ వింత సేయు,టెఱుఁగ నేర నికతనఁ బూర్ణేందువదన. ప్రబంధ. ౭౫౦. పాండు. ౩. ౭౨.

౨. కొంచెపుపంటికాటు.

గీ. ఒఱలి తూఁడులు కసిగాట్లఁ గొఱికి నిలుచు, నిలిచి పెనఁగొన్న నాఁచుతీఁగలను డాఁగు, ... కొక మొకటి. ప్రబంధ. ౫౯.

గీ. కృష్ణునను మతి రుక్మిణీకీరవాణి,వచ్చి భోజన మిడఁ దలవంచి యగ్గలం బయినచింత వలసి యొల్లమి నతండు, సొగటులను బోయి కసి కాటులు గ భుజించె. విజ. ౨. ౩.౪.

ఉ. కామిని నీదుమోవిఁ గసికాటులు చెక్కుల గోటినొక్కులున్,మోమునఁ జెమ్మరించుట లు ముంగురు లెంతయుఁ జిక్కు లౌందు టల్. సురా. ౧౨౭. (కసికాటులు=దంతక్షతములు.)

కసికాట్లుచేయు=కొంచెముగాఁ గఱచు,కొంచె ముగాఁ గొఱుకు.

ద్వి. మునుపు గాచినపాము మురియుచు వచ్చి, ఘన మైనయూపందు గసికాట్లు చేసి. ద్వి. సా రం౫. ౨. ౬౭ పా. ౩౭౪పం.

**కసిని**=కసిఁడి(చూ. కసినికోఁత.)

జ: కసినికోఁత.

**కసినికోఁత**=కసిఁడికోఁత. (కసిని+కోఁత)

గీ. తనకు ననుకూలు యగునొక్కదాసిలోఁడ, మా లిమి యొనర్చుకొని యుంచిమంచి వెట్టె, దాని తో నొక్కనాఁడు మంతనమునందు, నింటి వారలకసినికోఁ తెల్ల నుడివి. శుక. ౩. ౭౯౭.

కసినికోఁతలుకోసికాఱించు=మర్మస్పర్శము లైనమాటలు మున్నగువానిచేత సంతతము బాధించు.

సీ. కసినికోఁతలుగోసి గారింతు రని బూతు లెలియఁగా వదిలెలఁ దిట్టువారు. శుక. ౩. ౧౨౧.

**కసిబిసి.** విణ. నలఁగినది.

వ. ...ముసలంబులమోఁదులం గసిబిసి యగువా రును...భా. రా. యు. ౧౪౩౨.

౨. ౧. క్రోధము. ద్వి. భాగ. ౬. ౧౨౧. (బ్రౌ)

౨. బాగుగా నలఁగునట్లు నమలుటయం దగునను కరణము.

చ. కసిబిసి నమ్మకంబునకుఁ గానివి చోళ్లు నమ ల్వాలంతితో...పాంచాలీ. ౧. ౭౮.

**కసిమస.** ౨. తొందరగా తినుటయం దగుననుకర ణము.

క. కసిమస నాఁకట ఫలముల్, మెసవుచుఁ జలి విడిచి మేడిమీఁదన్ మోదం, బెసఁగ నటి యించువానరు, మసలక వీక్షించుశింసుమా రుం డనియెన్. వేం. పంచ. ౪. ౭౫.

**కసిమసఁగు.** అ. క్రి. (కసి¹ + మసఁగు) ౧. వి జృంభించు, చెలరేఁగు; అతిశయించు.

గీ... మెఱయుఁగసిమ,సంగెఁ జెలరేఁగె నాఁగ ను సమములుగను. ఆం. భా. ౩. ౯౭.

క. వారల నందఱ రౌద్రా,కారుండై కసిమసంగి గాంగేయుఁడు దు,ర్వారపటుబాణనిహతి ని,వీరాహవరంగమునకు విముఖులఁ జేసెన్. భార. ఆది. ౮. ౨౦౧.

క. వెసఁ జెక్కుమ్ములు మనపై, మసఁగుపడం బఱపి యతఁడు మురభంజన సం,తస మందెడు నింతన యేఁ,గసిమసఁగెదఁ జూడు నన్ను గాండీవంబున్. భార. కర్ణ. ౨. ౭౫౪.

లయవిభాతి... ప్రాణి, ప్రసరములు నొండొకటి మెసఁగఁ దొడఁగెన్ గఱవు గసిమసఁగె వి శ్వమున...వరాహ. ౧౦. ౨౮.

౨. నిపుణుఁడగు, ఆరితేఱు.

గీ....గడితేఱె ననఁగఁ, గసిమసంగె ననంగ నా ఖ్యలు దనర్చు, నిపుణుఁడయ్యె ననుటకు... ఆం. శే. ౩౫.

స. క్రి. ౧. చంపు, సంహరించు.

క. అసురుల మాయోపాయులఁ, గసిమసఁగఁగనఁ ట మఖంబుఁ గావఁగనఁట తా, పసుఁ డొకఁ డఁట సిసువులఁ గ్రొ, న్నిసువుల నడిగెనఁట మునులు నిర్మోహులు గా. రామా. ౪. ౯.

లయగ్రాహి. సింగము కురంగసమితిం గసిమసం గెడు తెఱంగున నభంగజయసంగతిఁ జెలం గెన్. శాం. ౫. ౩౯.

౨. నఱకు, ఖండించు.

క. నావుడుఁ గల్పాంతఫణి, గ్రైవేయకజాగ్ర దుగ్రగతిఁ గదిసి దశ, గ్రీవుఁ డసిఁ గసిమ సంగిన, లావరి యగుపులుఁగుఱేఁడు లావఱి పడియెన్. రామా. ౫. ౨౦౩.

**కసిమిరి.** వి. (√కసి1) తీఁట, దురద.

శా. దేవా కయ్యముతోడి వేడుక మదిం దిట్టాడు మర్త్యుండు నే, త్రోవం జేతులతీఁట వుత్తు నని కోరున్ దానవుం డైననా, కీవే చేతులు చేసి తీకసిమిరిం కెల్లోర్తు...ఉ. హరి. ౫. ౨౧.

**కసివెంద**=కసింద, కాసమర్దము. ఆం. భా. ౨. ౬౩.

**కసీదు.** వి. (హిం. కసీద్) వస్త్రముమీఁద జరీ మున్న గువానితోఁ బువ్వులు మొదలగునవి కుట్టుపని, బుటాపని.

సీ. మును చెవిచాయ జాటినయోరసికను గసీదు రుమాలు భాసిల్లఁ గట్టి. ప్రబంధ. ౧౭౯.

**కసీసము.** వి. (సం. కాసీసమ్. ప్రా. కసీసం.) ౧. అన్నభేది. (బ్రా.) ౨. నల్లబట్ట.

సీ. జరబాజు నేరాజు బురుసా తగటి యనఁ గల ధాతవస్త్రము ల్పెలఁగుచుండు, నవి నల్లచా యచే నలరుచున్నను గసీసం బనఁగాఁ దగు ...ఆం. భా. ౨. ౧౫౫.

విణ. నల్లనిది.

సీ. ఒక్కనాఁడు భవాని యుబుసుపోకకుఁ బైఁ డిజలపోసనము కసీసంపుఁ బట్టు, బంతి ... అ స్ఫాలనము చేయు చాడుచుండ. కాశీ. ౬. ౧౬౧.

ఉ. ఇంగిలికంబునం దడిపి యెత్తు కసీసపు రెంటె మో యనన్, నింగి గరుత్పరంపరలనిగ్గున లేఁదొగ రెక్క...ఆము. ౪. ౧౦. మనుచ. ౫. ౪౫.

**కసు.** విణ. ('కసుఱు' శబ్దమునకు వృత్తియందు మిగి లినరూపము.) లేఁత; అల్పము.

కసుఁగాయ=లేఁతకాయ.

క. ఏఱకుమీ కసుఁగాయలు, దూఱకుమీ బంధు జనుల దోషము సుమ్మీ. సు. శ. ౨౧.

కసుఁగౌను=సన్ననినడుము.

ఉ. మో మఖిలంబుఁ గన్నుఁగవ ముచ్చట మీ ఱఁగ వక్షమంతయున్, గామిడిచన్నుదో యి కసుఁగౌను సమస్తము మిన్న. బిల్హ. ౧. ౬౭.

**కసుఁగందు.** వి. (కసుఱు+కందు.) ౧. లేఁతబిడ్డ, పసికూన.

దండ. ... నీ వంతలోఁ గావుకా వంచు నేడ్పు ల్దలిర్పం గసుంగంద వై ...పారి. ౩. ౩౮.

ద్వి. కసుఁగందునకు నేమి గాని ప్రాయమున, వస ము దప్పిననింద వచ్చె నేఁ జెల్ల. ద్వి. సారంగ. ౨. ౫౮ పా. ౧౩ పం. ('కసిగందు' అపము ద్రితము.)

౨. కందు, నలుపు.

ఉ. ... కసుఁగం దొకయించుక లేక తిన్నవై,

పున్నమచంద్రునొప్పిదముఁ బోలెడు మోము
నవవ్వు దేఱఁగన్. మై. ౧. ౧౩౪.

**కసుగందు.** అ. క్రి.(కందు+కందు-శ.ర.)మిక్కిలివాడు; బాధపడు.

వ. ... పొలుపు లేనియంగరాగంబుతోఁ దలఁప
రానిదీనభావంబుతోఁ గసుగందినబాహుల
తలతో...ఉ.రా.౪.౨౨౧.

క. కుసుమాయుధుబాణంబులఁ,గసుగంది భవద్వి
యోగకలుషత నర్చా,వసరంబుల నర్చకు లి
డు,కుసుమములకు వెఱచు వహ్ని కువలయ
నేత్రా. నైష. ౪. ౩౪.

కసుగందులుగందు=మిక్కిలి వాడు.

క. కసుగందులుగందిననవ,కుసుమలతికవోలె మి
గులఁ గోమలి యొప్పెన్. కళా. ౪. ౧౦౩.

**కసుగు.** అ. క్రి. సణుగు, గొణఁగు.

ద్వి. విసిగినఁ గసిగిన... మెఱుఁగులు గ్రమ్మునా
మేటిఖడ్గమునఁ, దఱిగి రక్తము గాఱఁ దన
తల ద్రెంచి, నీపాదములమీఁద నిలుపుదు...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౪౧.

స. క్రి. అట్టిట్టు ఊఁపు, ఆడించు.

ద్వి... చెవులఁ,గనలుశూలము నాటి కసిగిన లై
న,నుల్లంబు కలఁగి బిట్టులికి...నవ.౨.౧౪౭
పా. ౧౨ పం.

**కసుమాలము.** వి.(సం. కశ్మలమ్. త.కసుమాలమ్.
మ. కసమాల్.) మలినపదార్థము.

క. దేవా యీకసుమాలము, దేవెడుకేల్దోయి
నీదుదేహం బంటం,గా వెఱ పయ్యెడు...
కాశ. ౩. ౯౭.

విశే. ౧. రోఁత కలిగించునది.

మ...నానాదివ్యా,కసు లాస్థానముగూడి యా
డుదురు శ్రీకాశిప్రదేశంబునన్,గస వైపు
ట్టెడుభాగ్య మైన మనకున్ గల్పింప దా
దైవ మీ,కసుమాలం బగునాక మేల యని
యుత్కంఠాతిరేకంబునన్. కాశీ.౭.౨౦౬.

౨. పాపిష్ఠము.

చ...దానధర్మముల్,గ్రతువు లొనర్చనో యి
పు డకారణ మెట్లు విమాన మెక్క స,మ్మత
ముగ నర్హమయ్యెఁ గసుమాలపుమాలకు దుష్ట
శీలకున్. బ్రహ్మో. ౨. ౭౯.

౩. క్రూరము.

క. పసిపాపఁ డనక నాసుతుఁ, గసుమాలపుఁజె
డుగుఁబురుగు కఱచెను దీనన్, ముసుఁగువ
డుపాపమున నది, చెసలం జరియించుఁ గాత
దీనతతోడన్. నా. పంచ. ౩. ౩౨౩.

**కసురు.** వి.(దీనికి వ్యుత్పత్తియం దంత్యవర్ణలోపమును
లేఁత యనునర్థమును గలుగును. ఉదా: కసుఁ
గందు, మొ.) లేఁతకాయ, పిందె.

చ... పెం, పెనసినపండు కాయ కసు రేమియు
నైనను నేఱి తించు...భా.రా.యు.౧౧౭౯.
(శ. ర. పా.)

చ. ఒసఁగిన నిక్కమాయ లవి యొల్లక పల్కరి
మాకుఁ గాయలుం,గసురులు వేళ్లు వెల్లకులుఁ
గాక సముజ్జ్వలభూషణంబులుం, బసిఁడియు
నేల యుక్తమె తపస్విజనంబులకుం బరిగ్ర
హం,బసమభవద్గుణస్తుతిక థైకపరత్వవిభూతి
చాలదే. నిర్వ. ౧౦. ౧౨౨.

జ: కసు, కసుఁగందు.

**కసె(స్సె)ము.** వి. (సం.కచ్ఛః.త. కసివు)జలప్రా
యప్రదేశము.(నీళ్లు చిదచిద యనెడు నేల, చెమ్మ
నేల. శ.ర-కసెము=ఊటగుంట. చి.ని,బ్రౌ.)

**కసేరుక.** సం=కశేరుక.

**కసేరువు.** సం=కశేరువు.

**కస్తి.** వి. (సం. కష్టం.శ.కస్తి.) ౧. కష్టము,శ్రమ
ము.

మ. నను మన్నించెద వేని నీ విపుడు రా నావెం
ట రా కుండినన్, నిను నేఁ బాసి చనంగ

నోప నిచట నీ్నితోడిదే లోకమై,మనువాఁ
డం గనువాఁడ నీకరుణ నీమానంబు చిత్తంబు
వచ్చినచో మానుదు గాని ని న్నిపుడు కస్తిం
బెట్ట నా కేటికిఁ. కాశ. ౩.౭౨.

చ...డెందములోనికస్తి మం,తనమునఁ దెల్ప...
నీలా. ౨. ౧౧౭.

సీ. గాధినూనుఁ డొనర్చుకస్తికి నోర్వఁడే సతి
యుఁ దానును హరిశ్చంద్రనృపతి.రంగా.౨.
౨౩౨.

౨. శోకము, దుఃఖము.

ద్వి. కన్నవా రెల్లను గటకటా యనుచుఁ, గన్నీ
ళ్లు గ్రుక్కుచుఁ గస్తి పొందఁగను.ద్వి.సారం
గ. ౨. ౪౮౪. ౨౨ పం. ఆం.భా. ౧. ౧౩౫.

౩. విపత్తు.

క. ఇడుమ వెత కస్తి యంగద,కడగం డ్లనఁ జను
విపత్తు...ఆం.సం. మాన.౪౯.

జ: కస్తిపడు.

కస్తిపడు. అ. క్రి. (√కస్తి) దుఃఖపడు.

గీ. పొరలి యేడ్చుచు నుండ నబ్బోటు లేల,కస్తి
పడెదమ్మ యని యెత్తి కుస్తరింప. సారంగ.
౩. ౮౨.

ఉ...మానసికవ్యథల్ రుజలు మాన్పఁగ నోపిన
పుణ్యరాశి గం,గానదిఁ జేరి యుండియును
గస్తిపడం దగునయ్య...ఉ. రా. ౬.౨౫౧.

గీ. కామసమ్మోహితక్రౌంచఘాతమునకు, వగచి
నీచాటుకవి చెంచువానిఁ గినిసెఁ,గామమో
హిత యగునింతిఁ గస్తిపఱుప, ననుజుఁ బురి
కొల్పితిది నీకుఁ జనునె రామ. నైష. ౯.
౧౩౦.

కస్తురి. వి. (సం. కస్తూరీ. ప్రా. కత్థూరి. క. కస్తురి.)
౧. మృగమదము,ఒకవిధ మైనపరిమళద్రవ్యము.

ఉ. సంకుమదంబుఁ గస్తురియుఁ జాఁదుఁ బటీర
రము...నైష. ౭. ౧౧.

సీ. సొగసు గా నొసలఁ గస్తురిబొట్టు సవరించి...
నీలా. ౧. ౯౧.

౨. కస్తూరీమృగము.

గీ. కన్ను వెలివని కస్తురిగమిశిశువులు. పి. శకుం.
౧. ౯౮.

౩. ఒకానొక చెట్టు.

సీ. గొజ్జంగి యిజ్జాజిపజ్జం గిసల మొందునెలకె
కస్తురియు గన్నెరయుఁ బూచె. బహు. ౨.
౨౧.

జ:కస్తురిపట్టెయలు,కస్తురిపసుపు,కస్తురి మెకము,
కస్తురివీణియ.

కస్తురిపట్టె(ట్లె)లు. వి. బ. (√కస్తురి.) ౧. ధా
న్యవిశేషము. ౨. పుష్పవిశేషము.

గీ. పచ్చగన్నెరు కస్తురిపట్టెయలును,గుత్తిమల్లె
లుఁ బ్రాఁథి గాఁ గూర్చి మఱియు, సకలజాతు
లఁ బోషింప శక్తి కలిగి, హాలికులు చైత్రుఁ
దెగడుదు రప్పురమున. భాను. ౧. ౯. (శ.
ర. పా. రెం డర్థములకును నిదియే యుదాహ
రణము.)

కస్తురిపసుపు. వి. (√కస్తురి)గంధహరిద్ర.(శ.ర.)

కస్తురిమెకము. వి. (√కస్తురి) కస్తూరీమృగము.

సీ. ఆహా పరాకు విదేహునికాను కీసొబగైనయ
ట్టికస్తురిమెకంబు. యయా. ౧. ౨౮.

కస్తురివీణియ(ణె). వి. (√కస్తురి)కస్తూరీమృగము
యొక్క బొడ్డుకాయ. (ఇందు కస్తూరి యుండు
ను.)

వ. ... కస్తురివీణియలును బిల్లిగడ్డలును...భల్లా.
౩ ఆ. (శ.ర.)

కస్తూరి. సం.వి.ఈ.స్త్రీ. కస్తురి, మృగమదము.

కస్తూరినిగరాలు. మి. వి. బ. ధాన్యవిశేషము.

సీ. బంగారుతీఁగెలు గంగాజలమ్ములు కస్తూరినిగ
రాలు కటకసరులు. హంస. ౮.౧౨౮. ప్రబం
ధ. ౧౧౨.

కస్తూరిపట్టెయ(ట్టె)లు.మి.వి.బ.=కస్తురిపట్టెయలు.

(ధాన్యవిశేషము)

సీ. కుసుమపూరాజనా ల్గుత్తిబల్లుత్తులు కస్తూరిప ట్టెలు గంధసరులు. హంస. ౪. ౧౨౭.

కస్తూరిమల్లి. వి.వి.బ. స్త్రీలు కట్టుకొనెడుఒకవిధ మైనగళ్లచీర.

గీ. చిన్నికస్తూరిమల్లిను జిలుకచార్ల, వన్నియలు మంచిబొమ్మంచువన్నియలును, మొదలు గాఁ గలచీరలు మడముతోడ. ధనా. ౩. ౩౭.

కస్తూరివీణియ(గె). మి.వి=కస్తురివీణియ.

సీ. కస్తూరివీణెలఁ గానుక గాఁ దెచ్చుకొయకు జీతంబు గొప్ప చేయు. పార్వ. ౧. ౬౨.

కస్తూరీమృగము. సం.వి. అ.పుం. కస్తురి బొడ్డునం దుఁ గలయొకజాతిలేడి, గంధమృగము.

కస్స్వరము. సం.విశే. (అ.ఆ.అ.) ౧. పోవునది.౨.పీ డించునది.

కహకహా,కహాకహాకహా. వి. పెద్ద నవ్వు నవ్వున పుడును వీరులు గర్జించునప్పుడును కలుగు ధ్వనికి అనుకరణము.

చ. కహకహ నవ్వె ... శితికంఠుఁడు ...కాశీ. ౭. ౩౦. హంస. ౧. ౨౪౨.

సీ.కహకహకహ నవ్వుకలితనాట్టహాసంబు సురలఁ గాంతాశ్లేషసుఖులఁ జేయు.సమీర.౪.౪౪.

వ. తేరును వీరరసంబుదేరుచుం బోరు గోరుచుం గహకహధ్వనుల గర్జించుచుండె...కను. ౨. ౩౫.

కహ్లారము. సం.వి. అ.న. ఇంచుక యెఱుపు తెలు పును గలిగి మిక్కిలి పరిమళించుకలువ, సౌగం ధికము.

శ్లో...అహ్లాదికహ్లారసమీరణా హి తే. శిశు.౧౨. ౬౬.

కహ్వము. సం. వి. అ. పుం.బకము, వక్కు-కొంగ.

# కా

కా[1]=క[3]. (కొన్నియర్థములయందు మాత్రమే)- అవ్య.ద్రు.అగుధాతువుయొక్క- నుజ్యంతరూపము.

౧. అగుటకు,అగునట్లు మొదలగునర్థములను దెలు పును.

సీ. ధర్మాభివృద్ధి గాఁ దగువడువునకు నీ నిల్లడ బ్ర హ్మచే నిడఁగఁబడిన, యిక్కన్య యతిబాల... భార. ఆది. ౬. ౨౪౭.

౨.అర్థవిశేషము లేకయే తుమున్నంతములకు అను ప్రయుక్తమగును.

శా.పాపాత్ముండు మదాంధుఁ డాతులువ నీపం పె ట్లునుం జేయఁగా, నోపండు... భార.ఉద్యో. ౩. ౪౫, ఆది. ౬. ౨౪౭.

౩. హేతువును దెలుపు 'కి,కు' లకు అనుప్రయు క్తమగును.

క. అచపలాక్షికిఁ గా మన, కీచకు లందఱను రా త్రి గీటడఁచె...భీముఁడు...భార.విరా.౫ ౩౩౧.

గీ. బాడబము హాలహలము నీతోడఁగూడఁ,బడ సె నోచంద్ర యెన్నఁడు నడల లేదు, కడలి వానికిఁ గా నిన్నుఁ గన్నకతన, జడధి య య్యెను భంగముల్ చాలఁ గాంచి. ఇందు. ౪. ౪౨.

౪. అయి. (ప్రయోజనమును దెలుపు 'కి,కు'లకు అనుప్రయుక్తమగును.)

వ. ఇది యేమి సాహసంబు నేసితి రొడ్లకొడుకు లకుం గాఁ దమకొడుకుల విడుచుదుర్బుద్ధు లునుం గలరె. భార. ఆది. ౬. ౨౭౭.

సీ...వర మెద్ది యైన, నడుగుము నీకుఁ గా వని నే యు టొక్కటి దక్క-ంగ... భార.భీష్మ.౧. ౧౫౭.

౫. అనుసరించి, పట్టి-అనువర్థ మిచ్చును.

చ....ఉపన్యసించిన వచనామృతంబు శ్రుతిసీ

మలఁ గా దిగి బోధభూజనే,చన మొనరిం
చుటకా...పాండు. ౨. ౧౬౧.

గీ. ... ఒకనాఁడు కాక మొకటి, ప్రాస్త గ్రం
థిన నటు గాఁ బోయిపోయి. కేయూర.౩.
౩౪.

(వ్యవ) వాఁ డావాలి గా వెళ్లెను.

౫. 'అని' అనునవ్యయమువలె పూర్వోక్తవిష
యమును సూచించును. (ఇది యీయర్థమున తెఱ
చుగా ఏవార్థక మగు'అ'కారమునకు తరువాతఁ
గనఁబడుచున్నది.)

వ. భీమార్జునులు ద్రౌపదీసహితు లయి చను దెంచి
మ్రొక్కి మే మొక్కభిక్ష దెచ్చితి మని తల్లి
కి నివేదించిన నెఱుంగక యెప్పటియట్ల కా
వగచి కుంతీదేవి...భార.ఆది.౬.౨౦౭.

వ. ఇట్లభిమన్యుండు మడిసెన కాఁ దలంచి దు
ర్యోధనుండు సంతోషింప ... భార. ద్రో.
౨. ౭౪. (మడిసెనకా=మడిసెనే అని-
నిశ్చయముగా మడిసెను అని.)

వ...అది తనపై న్యాపరాధంబున నయ్యెఁ గా వ
గచి...భార. అర. ౩. ౧౬౭.

౬. విధేయవిశేషణములకును క్రియావిశేషణము
లకును అనుప్రయుక్తమయి'అగునట్లు' మొ.అర్థ
ముల నిచ్చును.

ఉ... ఎవ్వనిం, బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణ
ముఖ్యుఁ బురోహితుండు గాఁ,జేకొనువార
ము...భార. ఆది. ౬. ౧౪౪.

శా...కృష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభుఁ
నారాయణుం గా ...భార.శాం.౫.౮౬౫.

(వ్యవ) ఆమె మెల్లగా నడచును. వ్యర్థముగా
మాటాడకుము.

కా²=కద¹.

(నిశ్చయమునకు)

సీ. కేఁడు గా మా కనిందితసర్వసామగ్రి సవ
రించె నీరాక కుసలయేళ. వసు. ౩. ౪౪.

ఉ...పూర్వపక్షపుం,గంతులు లేమి చూచెదవు
గా తుది నీబహునార్తిభేదముల్. వసు. ౮.
౨౭.

చ. ఉడుపతి ... నాఁడు పాల్కడలి జనించిన
ప్పుడు దళంబుగ నంటిన మేనిజిడ్డువోఁ, గడు
గుకొనంగ నచ్చె నని కా శివునౌదలయేట...
ఈఁదులాడెడిఁకా. జై. భా. ౧. ౨౭.

కా³. ప్ర. (ఇది పెక్కునామవాచకములకు మహ
త్తువాచ్యం బగునపుడు మతుబర్థమందు వచ్చును.
కొన్నిటికి స్వార్థమందును వచ్చును. కొన్నిపట్ల
తిర్యగ్వాచకములందును గనఁబడుచున్నది. కొ
న్నియెడల దీనికి 'గా' నిత్యముగా నాదేశమ
గును.)

ఉదా: ఆటకాఁడు, చెలికాఁడు, బట్టికాఁడు, అంద
గాఁడు, మొ.

కాంక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

కాంక్షకుఁడు. సం. విశే. (అ. క్షికా. అ.) కాం
క్షించువాఁడు.

కాంక్షణీయము. సం=కాంక్షితవ్యము.

కాంక్షత్. సం. (శతృ) కాంక్షించుచున్న.

కాంక్షించు. సం. స. క్రి. కోరు.

మ. కలకాలంబును నన్నదాన మొసఁగం గాం
క్షించి యామంబులో,పలనే సస్యము విత్తఁ
బండనితపఃప్రాధాన్య మేధాన్యము...వరా
హ. ౧౦. ౫౮.

కాంక్షిత. సం. విశే. (బు. త్రి. బు)=కాంక్ష
కుఁడు.

కాంక్షితము. సం. విశే. (అ. ఆ. అ.) కోరఁబడి
నది. వి. అ. న. అభిలాష, కోరిక.

కాంక్షితవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) కాం
క్షింపఁదగినది.

కాంక్ష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) కాంక్షింపఁబడుచున్నది.

కాంక్ష్యము. సం=కాంక్షితవ్యము.

కాంగ. సం. వి. ఆ. స్త్రీ. వచ, వస.

కాంచనకదళి. సం. వి. ఈ. స్త్రీ. స్వర్ణకదళి, ఒక జాతియరఁటి.

కాంచనకము. సం. వి. అ. పుం. కోవిదారవృక్షము. న. హరితాళము, అరిదళము.

కాంచనకారిణి. సం. వి. ఈ. స్త్రీ. శతమూలి, పిల్లపీఁచర.

కాంచనక్షీరి. సం. వి. ఈ. స్త్రీ. క్షీరిణి, రక్కెస.

కాంచనగిరి. సం. వి. ఇ. పుం. బంగారుకొండ, మేరుపర్వతము.

కాంచనపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. గణికారి, నెల్లి.

కాంచెనము. వి. (సం. కాంచనః) కోవిదారము. (శ. ర.)

కాంచనము. సం. విణ. (అ. ఈ. అ.) సువర్ణమయము, బంగారుది.

శ్లో...కాంచనీ వాసయష్టిః. మేఘ. ౨. ౧౮.

వి. అ. న. ౧. బంగారు. ౨. దీప్తి, కాంతి. ౩. పద్మకేసరము, తామరపూవులోని అకరువు. ౪. నాగకేసరపుష్పము. ౫. ధనము. ౬. హరిదళము. ౭. బంధనము, కట్టుట. పుం. ౧. ఉమ్మెత్త. ౨. చంపకము, సంపెఁగ. ౩. ఉదుంబరము, మేడి. ౪. నాగకేసరము. ౫. కోవిదారము, కాంచనము. ౬. పున్నాగము, పొన్న. ౭. మల్లె.

కాంచనసంధి. సం. వి. ఇ. పుం - బంగారమువంటి (శ్రేష్ఠమైన) సంధి - పదునారుసంధులలో నొకటి యగు సంగతసంధి, యావజ్జీవమును సంపత్తునందుఁ గాని విపత్తునందుఁ గాని భేదము లేకుండ సమానఫలము నొందుపద్ధతిని ఇరుతెగలవారు చేసికొనినసంధి.

కాంచనార(ల)ము. సం. వి. అ. పుం. కోవిదారము, పచ్చనిపూవులకాంచనము.

కాంచని. సం. వి. ఈ. స్త్రీ. ౧. హరిద్ర, పసుపు. ౨. గోరోజనము.

కాంచనీయ. సం. వి. ఆ. స్త్రీ. గోరోజనము.

కాంచనీయము. సం. విణ. (అ. ఆ. అ.) బంగారుది, బంగారుతోఁ జేసినది.

కాంచి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. రశన, అఁదుదానియొంటిపేటమొలనూలు. ౨. హిందూదేశదక్షిణభాగమందలి యొకానొకపట్టనము. (ఇది మోక్షప్రదము లగు నేడుపురములలో నొకటి.)

శ్లో. అయోధ్యా మధురా మాయా కాశీ కాంచి రవంతికా, పురీ ద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయికాః.

కాంచికము. సం. వి. అ. న. ఆరనాళము, కలి.

కాంచు=కాను. స. క్రి. ౧. దర్శించు, చూచు.

చ...యా, దవకులజారిజాతమును...కాంచి రాయాతి, ప్రవరులు...ఉ. హరి. ౪. ౭౧.

సీ. గాంగేయధామశృంగవిటంకముల నీలకంధరోజ్జ్వలగతు ల్గాంచికొనుచు. వసు. ౬. ౯౭.

౨. (బిడ్డను) కను.

గీ. అతనియర్ధాంగలక్ష్మి శ్రీయన్నమాంబ, గాంచెఁ దనయుల నర్ధార్థికల్పతరుల. కాశీ. ౧. ౨౪.

క. అంత ననుఁ గాంచి యది విపి, నాంతరమునఁ బాఱవైచి యరిగె...మనుచ. ౬. ౩౭.

౩. పొందు; (భాగ్యమును) పొందు.

ఉ...జగ, న్నాటకసూత్రి చేతఁ గృతినాథుఁడు గాంచుఁ జిరాయురున్నతుల్. నైష. ౧. ౩.

సీ. నగరిందిరాదేవి నడుమఁ బూనినకాంచిక్రొమెరుగాంచినపైఁడికోటగలుగు. ఉ. రా. ౧. ౨౩౩.

క. ఎంతతపం బొనరించియు, సంతానము లేని వారు సద్గతిఁ బొందం, గాంతురె ... భార. ఆది. ౭. ౨౯౭. (సద్గతిఁ బొందుట యను భాగ్యమును బొందుదురె-అని యర్థము.)

చ...భవదీయదివ్యవచనామృత పాన యశోగ చిత్తతం,గని కృతకృత్యతం బొరయఁ గాంచితి...భార. శాం. ౬. ౩౨౧.

౪. ఆశ్రయించు. (చూ. కను. ౫. అర్థము.)

ఉ...మున్ను సురాసురాదులం,జేపలడంచి లావునఁ బ్రసిద్ధికి నెక్కిన నేను లోకపా,లావళి సర్వ సర్వచరాశ్రితు నేగతిఁ గాంతు మానవుల్. భా. రా. యు. ౭౭౨.

౫. తలఁచు, ఎంచు.

గీ. రాజవర రాజు దెసఁ బ్రతిగ్రహము విషముఁ, గల్లఁగాఁ జూతు మిట్టులు గాంచి యున్న, యట్టిమాకు నీ విచ్చెద ననుట మాని,ధం బెలుంగమి యింతియ తప్పగాదు. భార. అను. ౩. ౨౧౫.

గీ. కాళిదాసు మనంబులోఁ గాంచి మ్రొక్కి. నైష. ౧. ౭.

౬. గ్రహించు; కనిపట్టు.

ఉ. ప్రాని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె కాంచి ...ఆము. ౧. ౪.

క. నావుడు భూసురుఁ డిట్లను, దేవర యానతియు నస్మదీయనియమముల్, భావించి యుభయస్మృతి,గావించు నుపాయ మొకటి గాంచితి వినుఁడీ. విక్ర. ౧. ౧౫౪.

**కాంజి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కాంజికము,కలి. ౨. పెద్దతుమ్మిచెట్టు.

**కాంజిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆరనాళము, కలి. ౨.జీవంతీలత. ౩. పలాశీలత.

**కాంజికము.** సం. వి. అ. న. ఆరనాళము, కలి.

**కాండకటుకము.** సం. వి. అ. పుం. కారవేల్లము, కాఁకరి.

**కాండకారము.** సం. వి. అ. న. గువాకము, పోఁక చెట్టు.

**కాండకీలకము.** సం. వి. అ. పుం. లోధ్రము, లొద్దుగు. (రా.ని.)

**కాండతిక్తము.** సం. వి. అ. పుం. భూనింబము,నేలవేము.

**కాండపటము.** సం. వి. అ.పుం.తిరస్కరిణి,తెర.

**కాండపుష్పా.** సం. వి. ఆ. స్త్రీ. తుమ్మి. (వాచ)

**కాండపృష్ఠము.** సం. వి. అ. పుం. జలము, నీరు. (వై. ని.)

**కాండపృష్ఠుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) శస్త్రాజీవుఁడు,ఆయుధములచేత బ్రదుకువాఁడు. వి.అ. పుం. ౧.కొనఁబడినకొడుకు,క్రీతపుత్త్రుఁడు. ౨. దత్తపుత్త్రుఁడు. ౩. శూద్రాసుతుఁడు.(వై.ని.)

**కాండము.** సం. వి. అ. పుం. న. ౧. గ్రంథపరిచ్ఛేదము.(ఉదా: బాలకాండము,ప్రథమకాండము) ౨.అంకోలవృక్షము, ఊడుగు. ౩. వర్గము, గుంపు, సమూహము. ౪. బాణము. ౫. జలము. ౬. అవసరము, సమయము. ౭. ఆకులు లోనగువాని యీనె. ౮. తామర లోనగువానికాఁడ, నాళము. ౯. వరి లోనగువానిపోఁచ. ౧౦. గుబ్బ, స్తంబము. ౧౧.దండము,కఱ్ఱ.౧౨. వృక్షస్కంధము. ౧౩.పర్వము,గనుపు. ౧౪. గుఱ్ఱము. ౧౫.నిర్జనప్రదేశము. ౧౬. శరము, రెల్లు. (కల్ప.) ౧౭. శ్లాఘ,పొగడ్త. ౧౮.సంధియందువిడిపోయి యేకఖండముగా నున్నయెముక.౧౯. పదియాఱు మూరలకొలత. ౨౦.నిందను తెలుపును.(ఈయర్థమున తత్పురుషసమాసమున ఉత్తరపదముగానే ఉండును. ఉదా: ప్రజాకాండము = కుత్సిత ప్రజ.)

**కాండరుహా.** సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి.

కాండవీణ. సం. వి. ఆ. స్త్రీ. మాలవీణె, కండో లవీణ.

కాండస్పృష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ) - గ్రహింపఁబడినబాణములు కలవాఁడు - శస్త్రాజీవుఁడు, ఆయుధములచేత బ్రతుకువాఁడు. (సైనికాది)

కాండహీనము. సం. వి. అ. న. భద్రముస్తకము.

కాండికే. సం. వి. ఆ. స్త్రీ. ౧. లంక యనెడుధాన్య భేదము. ౨. వాలుకి యనెడునొక జాతి నోనె. (కల్ప.)

కాండీరము. సం వి. అ. పుం. ౧. ఉత్తరేను, అపామార్గము. ౨. గజపిప్పలి. (కే. ని.)

కాండీరి. సం. వి. ఈ. స్త్రీ. మంజిష్ఠ.

కాండీరుఁడు. సం. విణ. (అ. ఆ. అ) - బాణములు ధరించువాఁడు - విలుకాఁడు.

కాండేక్షువు. సం. వి. ఉ. పుం. ౧ కోకిలాక్షము, గొబ్బి. ౨. కాశతృణము.

కాండేరి. సం. వి. ఈ. స్త్రీ. నాగదంతీవృక్షము.

కాండేరుహా. సం. వి. ఆ. స్త్రీ. కాండరుహా, కటుకరోహిణి.

కాండ్ర. వి. ఒకవిధ మగుగడ్డి. (శ.ర.)

ఉ. ...కృపాగుణ మొప్పులతాంగి ఛేదించెను, కృట్టున ముంగిటం గనవుఁ గాండ్రయుఁ బుచ్చుచుఁ జేతిచీఁపురుం, గట్టరుఁ దానుఁ జొచ్చెఁ గటికంఋని నోంకృతినాదదేవుని౯. కాశీ. ౬. ౨౬౨.

సీ. అచ్చోటఁ గసవుఁ గాండ్రంతయుఁ బుచ్చియత్నంబున దివసత్రయంబు వెదక. వాసిష్ఠ. ౫. ౧౩౮.

కాండ్రించే. అ. క్రి. (√కాండ్రు) క్రాయు, ఉమియుటకు పూర్వము శ్లేష్మమును కంఠములోనికి తెచ్చుకొనుటకై 'కాండ్రు' అను ధ్వనిని చేయు.

కాండ్రు. వి. ఉమియుటకుఁ బూర్వము చేయుధ్వని కనుకరణము. (చూ. కాండ్రించు.)

 జ: కాండ్రించు.

కాంత. సం. వి. ఆ. స్త్రీ. ౧. కోరఁదగినఆఁడుది; ఆఁడుది. ౨. పత్ని, పెండ్లము. ౩. ప్రియంగువు, ప్రేంకణము. ౪. పెద్దయేలకి. ౫. రేణుక అనెడి ఓషధి. ౬. నాగరముస్త. ౭ (ఛంద) వృత్త భేదము.

కాంతపక్షి. సం. వి. న్. పుం - కుమారస్వామికి వాహన మైనపక్షి - నెమిలి.

కాంతపుష్పము. సం. వి. అ. పుం. కోవిదారము, కాంచనము.

కాంతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అభీష్టము, కోరఁబడినది. ౨. మనోజ్ఞము, ఇంపయినది. వి. అ. పుం. ౧. వసంతఋతువు. ౨. (చంద్రసూర్యాయశ్శబ్దములకును తత్పర్యాయశబ్దములకును తరువాత వచ్చునపుడు) ఱాయి. (ఉదా: చంద్రకాంతము, ఇందుకాంతము, సూర్యకాంతము, అయస్కాంతము.) ౩. హిజ్జలవృక్షము, ఎఱ్ఱగన్నేరు. న. ౧. కుంకుమము. ౨. లోహభేదము, సూదంటుఱాతినుండి పుట్టినఇనుము.

కాంతలకము. సం. వి. అ. పుం. తున్నవృక్షము, నందివృక్షము.

కాంతలోహము. సం. వి. అ. న. సూదంటుఱాయి. (రా. ని)

కాంతాయసము. సం = కాంతలోహము.

కాంతారకము. సం. వి. అ. పుం. ఒకజాతి చెఱకు.

కాంతారము. సం. వి. అ. పుం. న. ౧. మహారణ్యము, పెరడవి. ౨. దుర్గమ మగుపథము, పోరానిత్రోవ. ౩. ఛిద్రము, రంధ్రము. వి. అ. పుం. ౧. కోవిదారము, కాంచనము. ౨. ఒకజాతి చెఱకు. ౩. వంశము, వెదురు.

కాంతారి. సం. వి. ఈ. స్త్రీ. ఒకజాతి చెఱకు.

కాంతాళ(ల)పడు. అ. క్రి. (కాంతాళము + పడు) కాంతాళము నొందు.

(అధైర్యపడు.)

సీ. తాళవృంతానిలోత్తాలవేదన కోడి తాళక మిగులఁ గాంతాళపడుచు,సారసౌరభగంధ సారచర్చలఁ జేయుసారసావనల వేసారి వి నుచు. చంద్రా. ర. ౨౭౫.

(ఈర్ష్యపడు)

రగడ. తాల మెక్కుడ తాల కిటు కాంతాలప డుచుంతాలదానవు. చంద్రా. ర. ౨౩ర.

కాంతాళ(ల)ము=కాతాళము. వి. ౧. కోపము.

సీ.అలుక యనంగఁ జిం దనఁగఁ గాంతాళ మనఁ గ దోస మనఁగఁ జిందఱ యనంగఁ. గీ. గన రనంగను గస రనఁ దనరుఁ గోప,ము...ఆం. భా. ౧. ౧౩౫.

ద్వి. కాంతాళమునఁ జేతికలశంబు గొట్టి. ద్వి. పరమ. ౭. ౬౦౭ పా. ౭ పం.

ఉ ... శ్రీయలమేలుమంగకాం,తాళము దీర్చి బ్రొమ్మునను దాల్చినవేంకటభర్తఁ గొల్చె దన్. భాను. పీఠి. ౧.

౨. తాలిమిలేమి, అధైర్యము.

క. అని యుబ్బెళ్లూరుచు మది,ననయముఁ జలపో యు నుస్సురనుఁ గాంతాళం,బునఁ బొరలు సిట్లు విరహం,బున కోర్వక యవ్వధూటి బోటిం బలికెన్. ప్రభా. ౩. ౪౨.

౩. ఈర్ష్య.

రగడ. ఇంతి దివితో నొరసి నిదిగొ హింతాళం బు,లింత విరవాదివిరి కేలకాంతాళంబు.ఉ. రా. ౬. ౬౧.

ద్వి. అంతట నిలువక హరిదిక్కుఁ జూచి, కాం తాళమునఁ బల్కెఁ గ్రమ్మఱఁ గనలి. విష్ణు. పూ. ౨. (శ. ర.)

జ: కాంతాళపడు.

కాంతి. సం. వి. ఇ. స్త్రీ. ౧ జిగి, దీప్తి. ౨. ఒప్పిద ము, అందము. ౩. ఇచ్ఛ, కోరిక. ౪. స్త్రీలకు శృంగారమువలనఁ గలుగుసౌందర్యగుణవిశేష ము. ౫. చంద్రునికళలలో ఒకటి.

కాంతిద. సం.వి.ఆ.స్త్రీ. సోమరాజి, కారుగచ్చకీ.

కాంతిదము. సం.విశే. (అ. ఆ. అ.) కాంతి నిచ్చు నది. వి. అ. న. ౧. పిత్తము. ౨. నేయి.

కాంతిదాయకము. సం.విశే. (అ.యికా.అ.)కాం తి నిచ్చునది. వి.అ.న.కాలేయక మనుగంధద్రవ్య ము, నల్లఅగలు. (ఇట్లే: కాంతిదాయి.)

కాంతిలు(ల్లు). సం.అ.క్రి. ప్రకాశించు.

చ. కలువలఱేనిమండలము కాంతిలుచున్నది తూర్పుఁగొండపై. బిల్హ. ౨. ౫౨.

కాంతుఁడు. సం.వి.అ.పుం. ౧. ప్రియుఁడు, చెలు వుఁడు; మగఁడు. ౨. చంద్రుఁడు. ౩. కుమార స్వామి.

కాందర్పికము. సం. వి. అ. న. కామవృద్ధికి సాధన మైనవిధానవిశేషము.

కాందవము. సం.వి.అ.న. కందువునందు (పెనమం దు) కాల్చినభక్ష్యము.

కాందవికుఁడు. సం.విశే. (అ. ఈ. అ.) పిండివం ట లమ్మువాఁడు.

కాందారిమాందారిప్రొద్దు=కాఁదారిప్రొద్దు, కాఁ దారిమాఁదారిప్రొద్దు. వి. నిశీథము, నడిరేయి.

సీ....నడిరాతిరి యన, నడిరేయి యనఁగఁ గాం దారిమాందారిప్రొద్దన సరిప్రొద్దన నడ్డమరే యి. గీ. యన నిశీథాఖ్య దగు... ఆం.భా.౧. ౯౪.

ఇట్లే: కాందారిమాందారివేళ.

మ. ... శివశివా కాశీపతీ యంచు నుత్కృనినా దంబుల ఓగ్గనం బలుకుచున్ గాందారిమాం దారివేళను ధన్యుల్విహరింతు రా సురభిమ ల్లా...మల్ల. వై. ౭౫.

కాందిగ్భూతుఁడు. సం.విశే.(అ.ఆ.అ.) ఏదిక్కు నకుఁ బాఱిపోదు నని వ్యాకులపడువాఁడు.(కల్ప)

**కాందిశీకుఁడు.** సం.విణ.(అ.ఆ.అ)-ఏదిక్కునకుఁ బోదు నని అనుకొనువాఁడు-భయద్రుతుఁడు,పలాయితుఁడు.

**కాంపిల్యము.** సం.వి.అ.పుం. ౧.ఒకానొక దేశము. ౨. ఒకానొకపట్టనము. ౩. కంపిల్లముI.

**కాంపిల్లము.** సం.వి.అ.పుం. కంపిల్లము,గోచనిI.

**కాంబలము.** సం.విణ. (అ.ఈ.అ.)కంబలసంబంధమైనది. వి. అ. పుం. కంబళితోఁ గప్పఁబడినరథము.

**కాంబవికుఁడు.** సం.వి.అ.పుం. ౧.శంఖకారుఁడు, శంఖములతో నగలు చేసిఅమ్మువాఁడు. ౨. శంఖమూఁదువాఁడు.

**కాంబుక.** సం. వి. ఆ. స్త్రీ. అశ్వగంధ, పెన్నేరుI.

**కాంబో(భో)జము.** సం. వి. అ. పుం. ౧. కంబోజదేశపుగుఱ్ఱము. ౨. పున్నాగము, పొన్నI. ౩. శ్వేతఖదిరము, వెలిచంద్రI.(కే.ని.)

**కాంబో(భో)జి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. శ్వేతఖదిరము, వెలిచంద్రI.౨. మాషపర్ణి,కారుమినుముI. ౩.గుంజ, గురివెందI. ౪. వాకుచి, కారుగచ్చI. ౫. రాగవిశేషము.

క...రాగంబులలో, గాంభీర్యము గలరాగము, కాంభోజియె కుందవరపుఁ గవిచౌడప్పా. కవిచౌ. ౪. ౨౩. హంస. ౫. ౧౨౪.

౬. ధాన్యవిశేషము.

సీ. చంద్రవంకలు జీనిసరులు కాంభోజులు వంగాకుబొడమలు పొంగుఁబ్రాలు. తే...అదియగు పేరు గలుగువ ప్లతనియింట,నుండు... హంస. ౪. ౧౨౭.

**కాంబో(భో)జుఁడు.** సం. వి. అ. పుం. ౧.కంబోజదేశనివాసి. ౨. కంబోజదేశపురాజు.

**కాంబోది.** వి. సస్యవిశేషము.

ద్వి.వీఁగెఁ గాంబోది వావిరివంకె డొంకె.విష్ణు.

పూ. ౩. ఆ. (శ. ర.)

**కాంస్యకారుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) కంచరవాఁడు.

**కాంస్యనీలము.** సం. వి. అ. పుం. అంజనభేదము.

**కాంస్యము.** సం. విణ. (అ. ఆ. అ.) కంచుది. వి. అ. న. కంచు. పుం. న. కంచుపాత్రము.

**కాఁక=క్రాఁక.** వి. (√కాఁగు.) ౧. తాపము; బాధ. ఆం. భా. ౧. ౪౯.

ఉ...వలవంత నస్త్రపుల్, జాలుగ నాల్గుజాలు నిఁకఁ జాలు భవం బనునంతకాఁకను౯, బాలయి రాత్రి పంచశరుబారికిఁ జిక్కితి నీకు దక్కితి౯. మనుచ. ౩. ౯౩.

సీ. మలతాల్పు మెయిచాయమబ్బులు గ్రమ్మక యెదకాఁక పెన్నెండ వదలఁ గల దె.నీలా.౧. ౧౦౩.

ఉ...ఇంక న౯, గాఁకలఁ బెట్టకే విను ముఖాముఖిఁ బల్కెద దాఁపనేటికి౯. శశాం. ౩. ౬౧.

౨. కోపము.

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చిన రాజవంశముం, గూఁకటివేళ్లతోఁ బెఱికి గోత్రవధంబును జేసినట్టియా, ఱేఁకపుఁగీడు... జై. భా. ౧. ౬౪.

సీ. కాఁకచేఁ బొరుగిల్లు గాల్చి రావచ్చును దనయిల్లు గాచుకోఁ దరము గాదు. రామలిం. ౨౯. రుక్మాం. ౪. ౯౯.

౩. తపస్సు. (శ.ర.)

ఉ. ఇంతిమృదూక్తిమాధురికి నిక్షురసం బెనవోలఁ జాల కా,ద్యంతము నోడి మధ్యమగుణాశ్రయమై నెఱకాఁక నెన్ని జ,న్మాంతరముల్ వహించియు...వసు. ౨. ౪౬.

౪. జ్వరము. (శ.ర.)

**విణ.** ఉష్ణము. (చూ. కాఁకవెలుఁగు.)

**కాఁకదేఱు=తప్తమగు.**

సీ. నిగమసూత్రములాట నేత్రానలజ్వాలఁ గాఁక చేతినకాముకాండములును. కవిరా. 3.౧౧౦.

కాఁకలను దేఱు=అరితేఱు, గడుసుపాఱు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి, కాఁకలనుదేఱి గడిమీఱి గట్టిపాఱి, రాలు గాయతనాన బేరజపుదారి, నారి తేఱియు బలుగుంటమారి యయ్యె. హంస. ౫. ౧౧౦.

కాఁకర. వి. (సం. కారవేల్లః.) కారవేల్లము. (దీని భేదములు:- అడవికాఁకర, కొమ్ముకాఁకర, గొడ్డుఁగాఁకర, పొట్టికాఁకర.)

క. గోఁకలికైదువవారలో, డాఁకలిదప్పులు హరించె నంచుం గన్నుం, గాఁకఱ బోట్లు హరించని, కాఁకర పొట్లాదిగాఁకఁ గదియించి రె దఱ్. బహు. ౪. ౧౪. ఆం. భా. ౨. ౭౦.

జ: కాఁకరవత్తి.

కాఁకరవత్తి. వి. (√కాఁకర) బాణసంచువిశేషము. (శ.ర.-కాఁకరపూవత్తి. వా.)

కాఁకరా. వి. (కాఁక + రా) వెలుఁగుల ఱేఁడు, త్విషాంపతి, సూర్యుఁడు.

వ. ... తెల్లదీవిరాజ సుడివాలు కేలను దనరిన యొడయ కాఁకరావెన్నెలగుత్తి కన్దోయిమన్నీఁడ... ప్రబంధ. ౨౧౬, ౧౫3.

కాఁకవడు. అ. క్రి. (కాఁక + పడు) తప్తమగు, కాలు.

సీ. కప్పుకేశుణవహ్ని కణవర్షములచేతఁ గసుబంతములు పెక్కు కాఁకవడఁగ. గంధ. ౨౦.

కాఁకవెలుఁగు. వి. (√కాఁక) ఉష్ణరశ్మి, సూర్యుఁడు.

క. చుక్కలరాచొక్కఁడ కాఁ, దక్కాఁకవెలుంగు హృదయమందు జనించెక్, నిక్కమని తెల్పు క్రియ నెవఁ, జక్కన్ గౌస్తుభముఁ దాల్చి శౌరి దలిర్చున్. రామా. 3. ౫౨. సుద. ౫. ౧౫౫.

కాఁగడా. వి. (కాఁగు + గడ) కరదీపిక, చేతిదివ్వటీ.

మ... కాఁగడాలు ... పగలొత్తు ల్దివటీలు... అగ్నిజ్యోతులున్ వెల్గఁగన్. హంస. 3. ౨౮.

కాఁగా(గ). అవ్య. ద్రు. (కాన్ + కాన్) కనుక, కాఁబట్టి.

సీ. నీకుఁ గాఁగాఁ జేఁడె చేకూరినది గాక కొంచెగానికి సమకూడు నెట్లు. బహు. ౫. ౧౦౮.

గీ... కానఁ గాఁగఁ, గావున వనంగ నన్ని యేకార్థములగు. ఆం. భా. 3. ౭౦.

కాఁగాని. విశే. (కాన్ + కాని) కూడని, కాని, తగని.

సీ. గారాపుఁగూఁతుపైఁ గాఁగానిపనిఁ బూనువనజసంభవుని నెమ్మనము వెలితి. నైష. ౭. ౧౫౧.

సీ. కాఁగానిచెలుల దగ్గఱి చరింపకు మమ్మయుత్తమస్త్రీలపొం దుడుగకమ్మ. వేం. పంచ. ౪. 3౮౧.

కాఁగు=క్రాఁగు. అ. క్రి. (క. త. కాయ్) ౧. కాలు, తప్తమగు; బాధపడు.

గీ. అంపమున వీనికంఠంబు త్రుంపి విడుఁడు, మదమతాఁపుల వీనిమర్మముల నొంపుఁ, డెత్తిగానగ్నిఁ గాఁగినయినుపఁ ముసుకఁ, గులికి పోయుఁడు వీనిముక్కునను జెవుల. కాశీ. 3. ౧౫౨.

క. కాఁగేఁడుగుబ్బచనుంగవ, కాఁగేఁడువిరితేనె గురియఁ గలవాతెఱయున్, గాఁగేదు కుందనపుందళు, కాఁగేదు మెయిసోయగము నొయారి కయారే. బహు. ౫. ౫౬.

గీ. నిలిచి పెనఁగొన్న నాఁచుఁదీఁగలను డాఁగు, డాఁగి విరహాభరమ్మునఁ గాఁగి కుందు. ప్రబంధ. ౫౯.

౨. కోపించు.

గీ. అనివఁ బులిఁ గోల ప్రేసినయట్లు రేఁగి, కాఁగి హుమ్మని యసుర యంగంబు వడఁక...ఎ

లుఁగు నింగిఁ బొంగారంగ నట్టు లనియె. నృసిం. ౪. ౧౩౦.

ద్వి. కాఁగి వస్త్రము లేనికపిపుత్త్రిఁ బట్టి, లోఁగక యొకనూతిలోఁ బడద్రొబ్బి...ద్వి. భాగ. ౯. (శ. ర.)

వి. పెద్దబాన.

ఉ. అసలత్రంపి పెట్టి హృదయం బనుకాఁగున యోగవాసనా, భ్యాసపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి. ఉ. హరి. ౪. ౮౬.

చ...కాఁగెఁడు పెన్బొదఁగు...దశా. ౨. ౨౨౪. పాండు. ౪. ౨౧౧.

జ: కాఁక, కాఁకరా, కాఁకపడు, కాఁకసెలుఁగు, కాఁగడా, కాఁగుడు, కాఁచు[1], కాఁపించు, కాఁపు[3], కాఁపుడు.

**కాఁగుడు.** వి. (√కాఁగు) తపించుట, తపనము. (శ. ర.)

**కాఁచేర**=కాసర. వి. కాసిరి.

గీ. ... కాసర యనఁ గాఁచ, ర యనఁ గాశాదనీ సమాహ్వయ మగు ఖవ. ఆం. భా. ౨. ౭౦.

**కాఁచి.** వి. (సం. కాకమాచీ) కాకమాచి, ఓషధివిశేషము.

సీ. కామ జిలుగు మెట్టదామర నెత్తిసనగ జంబిరము కాఁచి నల్లకాఁచి. హంస. ౪. ౧౦. ఆం. భా. ౨. ౭౦.

**కాఁచే[1]**=క్రాఁచే. స. క్రి. (√ కాఁగు) కాఁగఁజేయు.

(తపింపఁజేయు; కాలునట్లు చేయు.)

సీ. గుజ్జగాఁ గాఁచినగోక్షీరపూరంబు జమిలిమండెఁగలపైఁ జల్లి చల్లి. శైష. ౬. ౧౨౦.

గీ. పరకళత్త్రంబుకుచకుంభపాళియందు, నఖము దివిచినపాపాత్మునఖమునందు, సెజ్జగా నగ్నిఁ గాఁచినయినుపసూదు, లుగ్రదృష్టిని జొన్పుఁ డత్యుగ్రహమున. కాశీ. ౩. ౧౫౩. శీలా. ౩. ౩.

చలిగాఁచుకొను=నిప్పుదగ్గఱ నుండి శరీరము వెచ్చపఱచుకొని చలి పోఁగొట్టుకొను. (వా)

**కాఁచే[2].** వి. ఖాదిరము, కవిరి.

సీ. ...నెలయు ఖాది, రమ్ము కాఁచన...ఆం. భా. ౨. ౧౬౭.

కాఁచువడియము=కవిరియుండ.

గీ. కాఁచువడియంబు లనఁగను గైరవ ళ్లనంగ ఖాదిరఘుటికలు...ఆం. శే. ౫౫.

**కాఁజేయు.** స. క్రి. (√అగు) ౧. అగునట్లు చేయు, కావించు, కలుగఁజేయు.

ద్వి. ఎక్కుఁ దలంచిన నేరూపమైన, గ్రక్కున నప్పుడ కాఁజేయుగిరులు. బస. పు. ౩. ౧౦౦౮ పం.

౨. పోఁగొట్టు.

(వ్యవ) వాఁడు పిత్రార్జిత మంతయు కాఁజేసినాఁడు.

౩. అపహరించు.

(వ్యవ) నాసొమ్ము వాఁడు కాఁజేసినాఁడు.

౪. సమాప్తముచేయు, ముగించు.

(వ్యవ) ఆపని కాఁజేసికొని త్వరితముగా రమ్ము.

**కాఁడ.** వి. కూరాకు లోనగువానికామ.

సీ... శాకనాళము పేరు చనును గమ్ము, కామ కాఁడన...ఆం. భా. ౨. ౨౪౮.

**కాఁడి[1].** వి. (త. కాడి) ౧. (రథము బండి నాఁగలి మొదలగువాని) యుగము, ఎడ్లు మొదలగువాని మెడపై నుంచెడుకఱ్ఱ.

క. పలుపులుఁ గాఁడ్లుం బగ్గం, బులుఁ దనయుస్త్రంబు లడరి పాడిసేసిన వి, చ్చలవిడిఁ బాఱెడు రథ్యం, బుల నేయఁడు దివిజరాజపుత్త్రుఁడు కృపతోన్. భార. విరా. ౫. ౫౩.

చ. పవనజుచాపముక్త హరులశగ్గములుం దునుమాడి కాఁడితో, నవి పెనఁగాడఁగా వెడఁదయమ్మునఁ గేతువు గూల్చి ... భార. ద్రో. ౪. ౨౩౩.

౨. యుగమువంటి ఆయుధవిశేషము.

వ...కాఁడి దంశిణి సబళ యీఁటె పెలకట్టె... మల్లుప్ర. ౩. ౬౯.

జ: కాఁడిగట్టు.

కాఁడి². వి. కాఁపుదుగంజి.

సీ...ఉష్ణిక కాఁడి నా నొప్పుచుండు. ఆం. భా. ౨. ౨౫౦.

కాఁడిగట్టు. వి. (√ కాఁడి¹) రెండుపొలములకు నడుమ నున్నగనిమ, చిన్నగట్టు. (ప్రా.)

కాఁడిగట్టువ్యవసాయము=నడుమఁ జిన్నగట్టు మాత్రము వ్యవధానముగా నున్న రెండుపొలములలో నిరువురు వేఱుగాఁ జేయు సేద్యము. (వా.)

కాఁడు. స. క్రి. నాటు, గ్రుచ్చుకొను.

గీ. కంకటము దూఱి యంగంబు గాఁడి పోవఁ, గ్రూరనారాచ మేసిన స్రుక్కి నతఁడు. భార. ద్రో. ౨. ౩౨.

గీ. ఈసుఁ దలఁచుమహాత్ములహృదయములను, గాఁడ నోపనిమృదుపుష్పకాండనికర, మసని భేదింప నోపునే యంగజన్మ. కు. సం. ౮. ౮౨౯.

గీ. వెస నురంబు గాఁడి వీఁపున వెడలె న, ఖ్యాళుగంబు...హరి. ఉ. ౬. ౬౧.

అ. క్రి. నాటుకొను, గ్రుచ్చుకొను; స్థిరపడు.

గీ. మసనిపూఁదూపు లిందాఁకఁ గెరలి వెలికిఁ, గానరాకుండ నెదలోనఁ గాఁడుఁ గాని, కడఁగి యిపు డేమి మే నెల్లఁ గాఁడఁ జొగ, ననుఁగ యని సోలెఁ దైరాలునవల కులికి. రసిక. ౩. ౧౭౬.

ఉ. పాఁడియుఁ బంటయుం గలిగి పంకవిహీన మనోహరాంబువుల్, వేఁడిన నెల్లచోటఁ బ్రభవింపఁగ భానుఁడు శీతభానుఁడుం, గాఁడినమేఘకాళిమవికారము దూరము సేయ నెంతయుం, నాఁడెము చూపె శారద దినంబులు నిర్మలమూర్తి కార్తికన్. పాండు. ౮. ౮౩.

కాఁడఁబాఱు, కాఁడఁగఁబాఱు=కాఁడు.

ఉ. కామము క్రోధముం దమము గాఁడఁగఁబాఱుట మాన్చి యింద్రియస్తోమనిమార్గవర్తనము ద్రుంచుచు...భార. శాం. ౧. ౧౮౭.

కాఁదారిప్రొద్దు=కాందారిమాందారిప్రొద్దు. వి. అర్ధరాత్రము, నడురేయి.

మ. ...పంఙ్క్తిచ్ఛ నంకేశపురాం, గనలం గన్నుమొఱంగి యప్పురిమునం గన్నెలు కాఁదారిప్రొద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ ఘూర్ణప్రకారంబునన్. భీమ. ౧. ౧౧౧. (ప్రయోగాంతరము లేదు- 'కాందారిమాందారిప్రొద్దున' అనియుఁ జదువవచ్చును)

కాఁదారిమాఁదారిప్రొద్దు= కాందారిమాందారిప్రొద్దు.

గీ. వడివడిం జని పట్టియోవాలుఁగంటి, నీవు పేరేమి యెవ్వఁడు నీదుమగఁడు, పూని కాఁదారిమాఁదారిప్రొద్దుకడను, నెందు వోయెదు తలిదండ్రు లెవ్వరనిన. యయా. ౨. ౬౯. (ఇట 'కాందారిమాందారిప్రొద్దు' అనియు ననవచ్చును.)

కాఁపించు. స. క్రి. (√ కాఁచు¹) కాఁచునట్లు చేయు.

ద్వి. ప్రియమునఁ బేర్వెగఁ బిలిచి ధేనువులఁ, బిదికి కుండలపాలు బిందెలఁ బోసి, కాఁపించి నగరికిఁ గావళ్లఁ బనిపె. పల. ౧. ౩౯ పా. ౯ పం.

కాఁపు¹. వి. ౧. శూద్రుఁడు; కర్షకుఁడు, సేద్యకాఁడు.

క. ఓకాఁప యిందు రమ్మని, సాకతమునఁ జేరఁ బిలిచి శకునవిధిజ్ఞుం, డాకసపుకట్ట డించి య, నాకులమతి విచ్చి చూచె నప్పుడు నడుమన్. భోజరా. ౮. ౫౯.

సీ. శూద్రనామంబులు శోభిలు నాలవకొలము

వార లని కాఁపు లని పల్కె. ఆం. భా. ౨. ౨౭౨.

ఆ. కాఁపు లావు వెరవు గల్గి కర్షనముసే,యం
గ వృష్టి దగినయట్లు గలుగ,ఫలము గల్గు...
భార. సౌ. ౧. ౩౧.

సీ...కాఁ పనఁ గమ్మతకాఁ డనంగఁ, గమతకాఁ
డనఁగను గమ్మతీఁ డనఁగను దుక్కిముచ్చ
నఁగను దోఁచుచుండు,హాలికాభిధ... ఆం.
భా. ౨. ౨౨౯.

౨. శూద్రజాతి, పంటకులము.

మ...సాల మంబ ళ్లోయుచుం బట్టి పెన్మసురం
డీఁగెడుకాఁపుగుబ్బెతల...అము. ౪. ౧౩౩.

జ: కాఁపుది, కాఁపువాఁడు.

**కాఁపు**[2]. వి.౧.కాఁపురము, నివాసము.

క. ఇక్కడ నిను వీఁ డెవ్వఁడో,యిక్కరణిఁ
మోసపుచ్చి యేలుకొనంగా,నక్కట వలసని
శంకల,నక్కడనే పాడుకాఁపు లాగతి నుం
టిఁ. కళా. ౩. ౨౬౦.

౨. గృహస్థు.

సీ. కెలఁకుల నున్నతంగెటిజున్న గృహమేధి...
దొడ్డిఁ బెట్టినవేల్పుగిడ్డి కాఁపు. మనుచ. ౧.
౬౬.

ఆ. తోలుతిత్తి వడసి తోరంపుఁగాఁపనై, నీవు
చిఱుమనేల నేఁటిరాత్రి,కంటఁ బిడుకప్రా
మి గర్వంబు గిర్వంబు, నుడుపనైతి నేని నొ
ట్టు వెట్టు. దశకు. ౬. ౫౪.

కాఁపుండు, కాఁపులుండు=కాఁపురముండు, ని
వాసముండు.

గీ. కనకమయహట్టకుట్టిమకాంత మగుచు, నివిధ
మణిసౌధములును వస్తువులుఁ గల్గు, నిప్పురం
బునఁ గాఁపుండ కితర మైన,పురమునం దేల
నిల్చె నిర్జరవిభుండు. హర.౭. ౧౭౭. అము.
౧. ౧౦.

క. ఆపదలు గాఁపులుండవు, చూపులకుఁ గులా
ద్రియట్లు చుట్టుకొనుఁ దుదిఁ, రూపేది
విరిసిపోవు మ,హాపవనాహతపయోధరావళి
భంగిఁ. భోజరా. ౫. ౧౮౭.

కాఁపువచ్చు, కాఁపులువచ్చు = కాఁపురమువ
చ్చు, నివసించుటకు వచ్చు.

గీ...నాకంబు వేడ్క,న య్యెడకుఁ గాఁపువచ్చి,
నయట్టు లుండె.భార. అను. ౨. ౩౧౭.

క. విచ్చెం దిమిరము గాఁపులు,వచ్చె మధుపకు
లము లబ్జవనములకు...భార. విరా.౨.౨౩౭.

కాఁపువోవు, కాఁపులువోవు=కాఁపురమువెళ్లు,
నివసించుటకుఁ బోవు.

వ. పటగృహంబులు మొదలుగా వలయుసమస్త
వస్తువు లొడఁగూర్చి వెడలినదండు పఱపై
సముద్రంబు గాఁపువోవుచందం బయ్యె. భా
ర. ఉద్యో. ౪. ౧౩౦.

ఉ. చిత్రము కృష్ణరాయనృపశేఖర నీదగుధాటి
కోడి స,ర్వత్ర నిలింపకామినులవాడకుఁ గాఁ
పులువోదు రుత్కల,క్షత్రియపాత్రు లెల్ల...
ఆము. ౧. ౩౭.

కాఁపైయుండు=కాఁపురముండు, నివసించు.

మ. ధరకెంధూళులు కృష్ణరాయలచమూధాటీగ
తిఁ వింధ్యగ,హ్వరముల్ దూఱఁగఁ జూచి
తా రచటఁ గాఁ పైయుండుటఁ జాలన,
చ్చెరునై యెఱ్ఱనివింతచీకటులు వచ్చెఁ
జూడరే యంచు వే,సారిదిఁ జూతురు వీర
రుద్రగజరాట్సుద్ధాంతముగ్ధాంగనల్. మను
చ. ౧. ౩౭.

జ: కాఁపురము, కాఁపురించు.

**కాఁపు**[3]. వి. (√కాఁచు[1]) కాఁచుట.

ఉదా: నాలుగువేడినీళ్లకాఁపులతో నొప్పి తగ్గి
నది.

**కాఁపుడు**. వి. (√కాఁచు[1]) కాఁచుట. (శ.ర.)

**కాఁపు(ప)ది**. వి. (కాఁపు+అది) శూద్రజాతిస్త్రీ.
(వ్యవ) ఆకాఁపుది చాల యోగ్యురాలు.

క. కాఁపది యనఁ దగునా యది, కాపదియార్వ
న్నె నలరుకనకముఁ బుటముల్, కాఁప దిగిన
దాల్పతిమ... ఉ. హరిశ్చ. ౮. ౩౩.

**కాఁపురము.** వి. (√కాఁపు²) ౧. నివాసము; నివాసస్థానము.

క. కాఁపురముసేయ కిఁక లం, కాపుర మెడఁబాయ పలసెఁ గా యను... ఉ. రా. ౨. ౨౮౨.

ద్వి. బంగారుఁబోఁడులపాలిండ్లఁబోలు, బంగారు కుండలపస మించి మించి, కాఁపురంబులవారు కని సన్నుతించు, గోపురంబులు ... ద్వి. పరమ. ౧. ౩౩ పా.

సీ. ... లాఁగలఁ గ్రుస్సి యడవకాఁపురముండు నాఖుతతుల. ఆము. ౬. ౧౩.

క. పుర మల్లది యద్భుతగో, పుర మై పరణమిషల సితపుణ్యస్త్రీనూ, పుర మై విభవములకుఁ గాఁ, పుర మై శోభిలెడు నగ్రమునఁ గనుఁగొంటే. కళా. ౪. ౧౦౦.

౨. సంసారము.

సీ. ఏ మేటి యుడుగుఁ గెందామర బల్గాఁపురపుటే ర్లఁ జొనికబ్రంపుఁ దెప్ప. అచ్చ. రా. పీఠి. ౧౧.

ఉ. ...సుఖులై తలిదండ్రులు గూడి దేపియుఁన్, దేపరవోలె నుండి యిలు దీర్పఁగఁ గాఁపుర మొప్పఁ వానికిన్. మనుచ. ౧. ౫౩.

వ. మగలతోఁ గలిసి కాఁపురంబులు సేయుమహాపురంధ్రుల... ఉ. రా. ౮. ౯౮. నీలా. ౧. ౬౫.

కంచంతటి కాఁపురము, కంచంత కాఁపురము = పెద్దకాఁపురము, గొప్పకాఁపురము. (చూ. కంచి.)

**కాఁపురించు.** అ. క్రి. (√ కాఁపురము) కాఁపురము చేయు.

(సంసారము చేయు)

మ. ...ప్రియం, బెదుగన్ మర్త్యుఁడు కాఁపురింపఁ దగు శేదే యోగి యై యొక్కఁడై, లదరిం జేరి కొనం దగున్ ... మల్లభూ. వై. ౬౬.

**కాఁపువాఁడు.** వి. (కాఁపు¹ + వాఁడు) శూద్రుఁడు.

ఆ. పాలవంటివారు పన్ను వెట్టెడువారు, వారె లుఁగరు కాఁపువారు వేమ. వేమన. ౨. ౩౨౫.

**కాఁబట్టి.** అవ్య. (కాన్ + పట్టి) కనుక, కావున.

ఉ. ...సూతుఁడు తద్విదుండు కాఁ, బట్టి... కాశీ. ౧. ౭౬. ఆం. భా. ౩. ౭౦.

**కాఁబడు.** అ. క్రి. (కాన్ + పడు - స్వార్థమున) అగు.

చ. ...నీవు న, న్నరదముఁ బుచ్చుకొమ్మనెద నంది న వండిన కాడె మీఁద సం, గరము ఘటిల్లునే చెలిమి గాఁబడుఁగా కిటు మాటలాడినన్. జై. భా. ౨. ౬౧.

**కాఁబోలు, కాఁగఁబోలు.** అవ్య. ద్రు. (కాన్ + పోలు) ఔనేమో.

(ఊహను దెలుపును)

సీ. గంగాప్రవాహంబు గాఁబోలు నని పనిస్థాదులనుష్ఠాన మాచరింప, నమృతంబువెల్లువ యని నిలింపాదులు మునుకొని దోసిళ్ల ముంచి క్రోలఁ. గీ. దలఁప ... ఇట్టులంబుగ వెన్నెల నిట్ట వొడిచె. విక్ర. ౬. ౬౮.

గీ. కయ్యమిచ్చువాఁడును వీఁడె కాఁగఁబోలు. హరి. ఉ. ౭. ౧౦౭.

**కాక.** అవ్య. (అగుధాతువుయొక్క వ్యతిరేకక్త్వార్థకరూపము) ౧. కలుగక సంభవింపక చాలక మొదలగు నర్థముల నిచ్చును. (చూ. అగు.)

౨. వికల్పమును (పక్షాంతరమును) దెలుపును.

క. దాకొని ఖడ్గాఖడ్గినో, కాక కచాకచినో బాణకాశలమునవో, నీ కెద్ది యిష్టము... రామా. ౫. ౧౮౯.

సీ. ... కాక యనఁగ నుతార్థ మెసఁగు. ఆం. భా. ౩. ౭౨.

౩. 'కాని' అనునర్థము నిచ్చును.

మ...పురావిహితకర్మంబెట్టిదో కాక ల,క్షణకా
లిష్యము రాజయత్నమును జక్కఁబెట్ట లేఁ
డయ్యెడుఁగా. నైష. ౮. ౧౮౫.
౪. 'అంతమాత్రమేకాని' అనుఅర్థమును తెలు
పును.
సీ.కమలించెఁ గాక యంగజవిరోధిశిరోధిఁ దల
కెక్కఁ జాలెనే హాలహాలంబు,క్రాఁచెఁగాక
పయోధికాండప్రకాండంబుఁ బైకిఁ బొం
గించెనే బాడబంబు. వసు. ౪. ౨౯.
౫. 'తక్క' అనుఅర్థమును దెలుపును.
క. నిర్బంధము దుర్మానము,దుర్బుద్ధికిఁ గాక తగు
నె దుర్యోధన...భార. ఉద్యో. ౩.౩౨౩.
గీ. నీవు నలునకుఁ జేర్మితో దేవి వైన,గాక నీస
ముజ్జ్వలరూప... లక్షణావళు లవి సఫలంబు
లగునె. భార.అర. ౨.౨౦.
ఉ. ... నేనె కా,కెవ్వరు నీకుఁ బ్రాణపద మేటి
కి దాఁచెదవే తలోదరీ. విజ. వి. ౩. ౩౧.
౬. ఆశీర్వాదమును దెలుపును.
క. ... ఓ,కుటిలాలక నీకు మగఁడు కోరినకో
ర్కుల్,ఘటియించుఁ గాక...పారి. ౨. ౨౬.
౭. 'కానిమ్ము'అను నర్థము నిచ్చును.
ఆ. అనిన నట్లకాక యని సర్వసేనాధి,పత్యభార
పట్టబంధమునకు,నియ్యకొనియె భీష్ముఁడు...
భార. ఉద్యో. ౪. ౧౫౫.
౮. శాపమును దెలుపును.
(వ్యవ) వాఁడు చచ్చుఁగాక.
౯. ప్రతిజ్ఞానిశ్చయాదులను దెలుపును.
గీ...అతండు మూల మోహాని కెల్లఁ,గాన నాతని
సాధింతుఁ గాక యేను. భార. ఉద్యో. ౪.
౨౮౪.
క...సంధ్యాసమయం,బింతట నేఁటికి నని సా,
లింతముగా కింకఁ బోర లెప్పెన యుత్నే.
భార. భీష్మ. ౨. ౩౪౦.
౧౦. కామచారానుజ్ఞను దెలుపును.

గీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాష యండ్రు,ప
లుకునుడికారమున నాంధ్రభాష యందు,రె
వ్వ రే మన్న నండ్రు గా కేల కొంటఁత,నాకవి
త్వంబు నిజము కర్ణాటభాష. భీమ. ౧. ౧౫.
సీ...ఇట్లలయించుట చాలక యింక నిలిపి,వాని
నే మడిగె దెవ్వఁడు గాక నీ కేమి యిది కాక
దంతపరీక్ష సుమ్ము. కళా. ౩. ౨౭౨. (ఎవ్వఁ
డు గాక=ఎవ్వఁడైన నగుఁ గాక.)
జ: కాకున్నె, కాపేమి.

కాకి. సం. వి. ఆ. స్త్రీ. ౧. కాకనాస,కాకిదొండ. ౨. కాకోలి, కాయకొల్లి. ౩.కాఁచి,కాకమాచి. ౪. కాకోదుంబరిక, తుక్కమేడి. ౫. వెలమసంది, కాకజంఘ. ౬. గుంజ, గురివెంద.

కాకకల. సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండ.

కాకఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. పెద్దకానుగు.

కాకచించ. సం. వి. ఆ. స్త్రీ. గుంజ, గురివెంద.

కాకచించి. సం. వి. ఇ, ఈ. స్త్రీ=కాకచించ.

కాకచ్ఛదము. సం. వి. అ. పుం. ౧-కాకిఱెక్క లవంటి ఱెక్కలు కలది- ఖంజనపక్షి, కాటుక పిట్ట. ౨. కాకిఱెక్క.

కాకజంఘ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కాకిదొండ. ౨. వెలమసంది.

కాకజంబుక. సం. వి. ఆ. స్త్రీ. జలజంబువు, కాకినేరేడు.

కాకజంబుకము. సం. వి. అ. పుం. భూమిజంబువు, నేలనేరేడు.

కాకజంబువు. సం. వి. ఉ. స్త్రీ. భూమిజంబువు, నేలనేరెడు. ఊ. స్త్రీ.జలజంబువు. (వాచ.)

కాకజాతము. సం. వి. అ. పుం. ౧. కోయిల. (విల్యమ్సు) ౨. కాకులగుంపు.

కాకణము. సం. వి. అ. న. మహాకుష్ఠభేదము.

కాకణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఏకకపర్దము, ఒక్క

గవ్వ. ౨ ఇరువదిగవ్వలవిలువ గలనాణెము. ౩.ప ణములో నాల్గవభాగము. ౪. మాషమునందు నా ల్గవభాగము. ౫. మానదండమునందు నాల్గవభాగ ము. ౬.పాదుక.(శే.ని,వై.ని.) ౭.మానదండము, కొలతకఱ్ఱ. (మే. ని.)

కాకతాళీయము. సం.విణ. (అ. ఆ. అ.) ఆకస్మిక సంభవము, అవితర్కితముగా కలిగినది. వి.అ. న. ఒకానొకన్యాయము. (చూ. న్యాయము.)

కాకతిందుకము. సం.వి.అ.పుం. కాకితుమికి, నల్ల తుమికి.

కాకతిక్త. సం. వి. ఆ. స్త్రీ. ౧.కాకిదొండ. ౨.గుం జ, గురివెంద.

కాకతుండఫల. సం.వి.ఆ.స్త్రీ. కాకిదొండ.

కాకతుండము. సం.వి. అ.పుం. ౧. కాలాగురువు. ౨. కావాళము, బాకా. ౩. బాణవిశేషము.

కాకతుండి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రాజకీలి, ఒకవి ధమగు ఇత్తడి. ౨. కాకిదొండ.

కాకతుండిక. సం.వి.ఆ.స్త్రీ. గుంజ, గురివెంద.

కాకదంతగవేషణము. సం. వి. అ. న. ఒకానొక న్యాయము. (చూ. న్యాయము.)

కాకధ్వజము. సం.వి.అ.పుం.బడబాగ్ని.(త్రి.ని.)

కాకనామము. సం. వి. న్. పుం. బకవృక్షము.

కాకనాస. సం.వి.ఆ. స్త్రీ. కాకిదొండ.

కాకనాసము. సం.వి.అ.పుం. వికంటకము, ఒకజా తిదూలగొండి.

కాకనాసిక. సం.వి.ఆ స్త్రీ. ౧.కాకిదొండ. ౨.రక్త త్రివృత్తు, ఎఱ్ఱతెగడ.

కాకనిద్ర. సం. వి. ఆ. స్త్రీ. స్వల్పనిద్ర, గాఢము కానినిద్ర.

కాకనీల. సం. వి. ఆ. స్త్రీ. జలజంబువు.

కాకపక్షము సం.వి.అ.పుం. ౧. కాకిఱెక్క. ౨. పిల్లలు కుంచెడిజుట్టు, బాలశిఖ. (హలా. ని, వై. ని - కాకిఱెక్కవలెనుండుకర్ణపార్శ్వస్థకేశభేద ము, జుల్ఫా - వాచ.)

కాకపదము. సం.వి.అ.పుం రతిబంధభేదము.న.౧. కాకియడుగుకొలది, కాకపదతుల్యపరిమాణము. (కాకపదమాత్రపుశిఖ యుంచుకొనవలయు నని స్మృతులందు విహితము) ౨.గ్రంథములు వ్రాయు నపుడు బంతినడుమ విడిచినదానిని సూచించున ట్టికాకపదాకార మగుగుఱుతు. (ఇది హంసపా దమువంటిది - వాచ.) ౩. వజ్రదోషము.

ఆ. నడుమ నడ్డనిడుపునల్లనిరేఖలు, గలిగి కేని వది యుఁ గాకపదము, వలదు విలువ నిట్టివజ్రం బు దాల్చిన,జముఁడుఁ దిట్టినట్లు చచ్చు నిజ ము. రత్న. ౨౮, ౨౭.

కాకపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. ముద్గపర్ణి, పిల్లపెసర.

కాకపాణి. సం. వి. ఇ. న. మౌక్తికమణిదోషము.

సీ. పారలు పైముఁ దున్న నరయఁ ద్రివృత్తం బు ఘననీలవర్ణంబు కాకపాణి. రత్న. ౫౦.

కాకపీలుకము. సం. వి. అ. పుం. కాకేందువు, కాకితుమికి.

కాకపుచ్ఛము. సం. వి. అ. పుం - కాకితోఁకవం టితోఁక కలది - కోకిలము.

కాకపుష్టము. సం. వి. అ.పుం.( - కాకులచేఁ బో షింపఁబడునది - అఁడుకోయిల తనగ్రుడ్లను బొ దుగుకొనలేక కాకిగూఁటిలో నున్నగ్రుడ్లను దీ సివేసి తనగ్రుడ్లను ఆగూఁటిలో నుంచి కాకిచే పొదిగించును) కోకిలము.

కాకపుష్పము. సం. వి. అ. న. గంధపర్ణము.

కాకపేయము. సం. విణ. (అ. ఆ. అ) ౧ - కాకి త్రాగఁ దగినది - పూర్ణోదకముచేత ప్రశస్తమై నది. (నద్యాది) ౨ - కాకులే త్రాగఁ దగినది - స్వ ల్పోదకము కలది. (నద్యాది)

కాకఫలము. సం. వి. అ. పుం- కాకులకు ప్రియమైనపండ్లు కలది- నింబవృక్షము, వేము.

కాకబలి. సం. వి. ఇ. పుం. కాకులకు ఇడునట్టి అన్నాదిబలి.

కాకభాండి. సం. వి. ఈ. స్త్రీ. మహాకరంజము, నిప్పవస్నె కానుగు.

కాకభీరువు. సం. వి. ఉ. పుం- కాకులకు భయపడునది- పేచకము, గుడ్లగూబ.

కాకమద్గువు. సం. వి. ఉ. పుం. దాత్యూహము, కూకుడుగుండెపక్షి.

కాకమర్దము. సం. వి. అ. పుం. మహాకాలవృక్షము.

కాకమల్లి. సం. వి. ఈ. స్త్రీ. అడవిమల్లె.

కాకమాచి. సం. వి. ఈ. స్త్రీ. కాఁచి.

కాకమాత. సం. వి. ఋ. స్త్రీ. కాకమాచి, కాఁచి.

కాకము. సం. వి. అ. పుం. ౧. కాకి. ౨. శిరోవక్షాళనము, (కాకివలె) తలనుమాత్రము నీట ముంచి చేయుస్నానము. ౩. మానభేదము. ౪. ఒకద్వీపము. న. ౧. కాకులసమూహము. ౨. సురతబంధవిశేషము. ౩. ఇంచుకజలము.

కాకముద్గ. సం. వి. ఆ. స్త్రీ. ముద్గపర్ణి, కాకిపెసర, పిల్లిపెసర.

కాకయవలు. సం. వి. అ. పుం. బ. నిష్ఫలతృణధాన్యము, తండులశూన్యధాన్యము.

కాకరుహా. సం. వి. ఆ. స్త్రీ. వందావృక్షము.

కాకరూకము. సం. వి. అ. పుం. ౧. గుడ్లగూబ. ౨. కపటము, దంభము.

కాకరూకుఁడు. సం. విశే. (అ. ఆ. అ) ౧. భీరువు, పిఱికివాఁడు. ౨. దిగంబరుఁడు, దిసమొలవాఁడు. ౩. దరిద్రుఁడు, బీదవాఁడు. వి. అ. పుం. స్త్రీజితుఁడు, భార్యకు వశుఁడైనమగఁడు.

కాకలకము. సం. వి. అ. పుం. గొంతుకపోఁక, గొంతుముడి. (కల్ప)

ఉదా: ఓష్ఠప్రభృతికాకలకపర్యంతం. (వ్యాక)

కాకలము. సం. వి. అ. పుం. ద్రోణకాకము, మాలకాకి. న. గొంతుముడి. (త్రి. ని.)

కాకలి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. సూక్ష్మమును మధురమును అస్ఫుటమును అగుధ్వని. ౨. మనుష్యులు నిద్రించుటను నిద్రింపమిని దెలిసికొనుటకై దొంగ లుపయోగించుచున్న నిరవళి గలవాద్యవిశేషము. (విల్యమ్సు.) ౩. గుంజ, గురివెంద. (వాచ)

కాకలీద్రాక్ష. సం. వి. ఆ. స్త్రీ. లఘుద్రాక్ష, చిన్నద్రాక్ష, కిసిమిసి.

కాకలీరవము. సం. వి. అ. పుం- సన్ననిఅవ్యక్తమధుర మైనధ్వని కలది- కోయిల.

కాకవంధ్య. సం. వి. ఆ. స్త్రీ. (కాకివలె) ఒకమారే ప్రసవించి పిదప గొడ్డురా లయినస్త్రీ.

కాకవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. జంబూభేదము.

కాకశింబి. సం. వి. ఈ. స్త్రీ. కాకితుండి, కాకిదొండ.

కాకశీర్షము. సం. వి. అ. పుం. బకవృక్షము.

కాకస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. బకవృక్షము. (వాచ)

కాకస్ఫూర్జము. సం. వి. అ. పుం. కాకతిందుకము, కాకితుమికి.

కాకాంగి. సం. వి. ఈ. స్త్రీ. కాకజంఘ, కాకిదొండ.

కాకాంచి. సం. వి. ఈ. స్త్రీ. కాకజంఘ, కాకిదొండ.

కాకాండము. సం. వి. అ. పుం. మహానింబము, పెద్దవేము.

కాకాండి. సం. వి. ఈ. స్త్రీ. మహాజ్యోతిష్మతి, పెద్దమాలెరు.

**కాకాండోలు.** సం.వి.ఆ.స్త్రీ. కోలశింబి,దూలగొండి.

**కాకాక్షిగోళకన్యాయము.** సం. వి.అ. పుం. ౨ కాకాక్షన్యాయము. (చూ. న్యాయము.)

**కాకాదని.** సం.వి.ఈ.స్త్రీ. ౧.గుంజ,గురివెంద. ౨. శ్వేతగుంజ, తెల్లగురివెంద.

**కాకారి.** సం.వి.ఇ.పుం. గ్రుడ్లగూబ.

**కాకి.** వి. (సం.కాకః.క.కాకి. త.కాక్కై.)వాయసము, కాకము.

గీ.పండ్లు వేర్వాసి కదలు చూపకయమున్న,కాకి కడకంటిపైచూపు రాకమున్న, కాలు సేయాడుతతియుంద కదలవలయుఁ, దీర్ఘసేవకు దేహ మస్థిరము గాన. కాశీ. ౩. ౯౪.

సీ. కాకిపిట్టకుఁ జాలఁ గడ లేనిబ్రదు కిడి ... నీలా. ౧. ౧౧౧.

సీ. ... వాయసంబు కాకి నాఁ దగు.ఆం.భా.౨. ౯౩.

విశ. నీచము, అల్పము. (ఉదా: కాకిబంగారు, మొ-బ్రా)

జ: కాకికలువ,కాకిచావు, కాకిచిప్ప, కాకిచెఱకు,కాకితీపు,కాకితుమ్మికి,కాకితూకి,కాకిదొండ, కాకినేరేడు,కాకిపెంపుడు, కాకిపెసర,కాకిబంగారు, కాకిబాతు, కాకిబేగడ,కాకిమేడి,కాకి ఱెక్కలు, కాకిఱెల్లు, కాకివెదురు,కాకిసొమ్ము.

**కాకి.** సం.వి.ఈ.స్త్రీ. ౧.ఆఁడుకాకి. ౨.వాయసీలత. ౩. కాకోలి, కారుకొల్లి.

**కాకికలువ.** వి. (√కాకి) అల్లిపువ్వు, కాకోత్పలము. (శ.ర.)

**కాకిచావు.** వి. (√కాకి-క.కాకిసావు)దిక్కుమాలినచావు,అగతికమరణము.('అకస్మికమరణము' శ. ర,బ్రా.)

**కాకిచిప్ప.** వి.(√కాకి)శంబూక, నీటిగుల్ల, కప్పచిప్ప.

క. అప్పుడు చూచిన నేమని, చెప్పుదు నక్కడలి కాకిచిప్పలు నినుముం,గుప్పలుఁ దెప్పలుఁ దిప్పలుఁ, గప్పలుఁ జిక్కంగ దుమ్ము గ్రమ్ముచునుండెన్. యయా. ౩. ౫౯.ఆం.భా.౧. ౧౬౧. హంస. ౪. ౧౯౬.

**కాకిచెఱకు.** వి. (√కాకి) శరము, తృణవిశేషము.

సీ. కాకిచెఱకనంగఁ గను మన శరమగు ... ఆం. భా. ౨. ౭౪.

**కాకిణి.** సం॰కాకణి. (కల్ప, వాద, విల్యమ్సు.)

**కాకితము**=కాగితము, కాగిదము. వి. (సం. కాగదమ్. క. కాగద. త. కాకితం. హిం. కాగజ్.) వ్రాయుట కుపయోగించుపత్త్రవిశేషము.

ఉ. ...పారసిభాష వ్రాసినం, గన్నులపండువైయమరుఁ గాకితమందలివర్ణపద్ధతుల్. భీమ. ౧. ౭౩.

సీ. ఘుట్టితపటంబు వెలయును గడిత మనఁగ, వెలయుఁ గాకిత మనఁగఁ దద్భేదసంజ్ఞ.ఆం.భా. ౨. ౧౯౯.

**కాకితీపు.** వి. (√కాకి) మూర్ఛావిశేషము, అపస్మారము, కాకిసొమ్ము. (శ. ర,చి. వి.)

**కాకితుమ్మి(మి)కి.** వి. (√కాకి) నల్లతుమికి, కాకతిందుకము. (శ. ర.)

**కాకితూకి**=కాకితుమ్మికి.

సీ.కాకితూ కందుగు కానుగు వరగోఁగు...హంస. ౪. ౧౧.

**కాకిదొండ.** వి. (√కాకి) కాకతుండి.

గీ. కాకిదొండ యనం జనుఁ గాకబింబి. ఆం. భా. ౨. ౬౦.

**కాకినేరేడు.** వి. (√కాకి) నేలనేరేడు, కాకజంబువు.

సీ...కాకి,నేరేడనఁగ నక్కనేరేడనఁగ నేల నేరేడనఁగ జన్న నారహి గను, భూజంబు నామంబు...ఆం. భా. ౨. ౪౬.

**కాకిపెంపుడు.** వి. (కాకి + పెంపుడు) పరభృతము, కోయిల.

ద్వి. కఱకుఁ బెంజెఱకువిల్కాని డాకలకు, మొఱకుఁబల్గాకిపెంపుడులకూఁకలకు. ద్వి.తి. సా. ౧. ౧౨ పా. ౬ పం.

**కాకిపెసరు(ర).** వి. (√ కాకి) పిల్లపెసర, కాకముద్గకి.

గీ. పిల్లపెస రనఁగాఁ గాకిపెస రనఁ దగుఁ గాకముద్గాఖ్య...అం. భా. ౨. ౫౯.

బ. (కాకిపెసలు.) క్షుద్రముద్గములు, పిల్లపెసలు.

సీ. కాకిపెసరు నాఁగఁ గనుపట్టు క్షుద్రముద్గము ...అం. భా. ౨. ౨౩౫.

**కాకిబంగారు.** వి. (√ కాకి) అభ్రకము. (పీతాభ్రకము-శ. ర.)

గీ. కాకిబంగా రనంగ బేగడ యనంగ, నభ్రకము దోఁచు...అం. భా. ౨. ౨౭౯.

**కాకిబాతు.** వి. (√ కాకి) ఒకవిధ మైనఅడవిబాతు. (శ. ర.)

**కాకిబేగడ**=కాకిబంగారు.

ద్వి. కాకిబేగడబొట్టు కంచుమట్టియలు, వైకడ సంకుటుంగరమునుం గలిగి. ద్వి. పరమ. ౮. ౩౨౩ పా. ౧౮ పం.

**కాకిమేడి.** వి. (√ కాకి) కాకోదుంబరిక, బమ్మమేడికి. అం. భా. ౨. ౮౨.

**కాకిఱెక్కలు.** వి. బ. (√ కాకి) ధాన్యవిశేషము.

సీ. ఱెక్కపాలలు కాకిఱెక్కలు పుష్పమంజరులు సీతాభోగసరులు గౌరి, కుంకుమలు... హంస. ౮. ౧౨౯.

**కాకిలల్లు.** వి. (√ కాకి) ఒకజాతిలల్లుకి. (దీని పుల్లలను చెక్కి వ్రాయుట కుపయోగింతురు.)

**కాకివెదురు.** వి. తృణవిశేషము. హంస. ౫. ౮౮.

**కాకిసొమ్ము**=కాకిలిపు (శ. ర.)

**కాకు.** విశ. ౧. వ్యర్థము.

మత్త...నిను వేఁడుకార్యముఁ గాకు చేయక చేయుమీ. మైరా. ౧. ౭౨.

౨. చెల్లాచెదరు, చిందఱవందఱ.

క. ఆకులు వై కాకులవలెఁ, గాకై చనఁ జొచ్చి రెల్లకడలకు నసురుల్. రామా. ౬. ౨౪౧.

౩. కళాహీనము.

ద్వి. వైకుంఠనగరంబు వనజారికరము, సోఁకని కుముదంబుఁ జోకఁ గా కయ్యె. విష్ణు. పూ. ౨. ఆ. (శ. ర.)

వి. ౧. గాసి, బాధ.

క. కాకులలోఁ గోకిలములు, కాకులఁ బడ లేక గులముఁ గలయఁగఁ బవనుం, డాకులపాటొనరింపఁగ, నాకులపాటయ్యె విరహు లగు లోకులకున్. ద్వా. ౭. ౯.

౨. నింద; అవమానము. (చూ. కాకుచేయు.)

జ: కాకుఁదనము, కాకుచేయు, కాకుపడు.

**కాకుఁడు.** సం. వి. అ. పుం. ౧. అతిధృష్టుఁడు. (కల్ప) ౨. కుంటివాఁడు. (విల్స్యమ్సు.)

**కాకుఁదనము.** వి. (√ కాకు) దుశ్చేష్ట, దుండగము.

ఉ...తల్లి బాష్పకలికాతరళీకృతలోచనాంతయై, కాకుఁదనంబు సేసెఁ గొడుకా యిఁక నేమన నేర్తుఁ గోడలిన్. వేం. పంచ. ౮. ౮౨౯.

**కాకుచే(సే)యు.** స. క్రి. (√ కాకు) ౧. నిందించు; అవమానపఱుచు.

క. పరతత్త్వ మెఱుఁగ కూరక, పరమర్షులతోడ నేన పరముఁడ ననుచున్, సుర లెల్లఁ గాకు సేయఁగ, దురహంకృతిఁ బలుకఁ దగునె తోయజగర్భా. కాశీ. ౫. ౯౯.

గీ. పిటికిప్రాణులఁ బొరిగొనుబిరుదుమగఁడ, వగుదు నీ వని యంపంద కొంగముబిరాఁదఁ, జప్పటులు వట్టి యాతఁడు జముని లాఁతు, చేవ

యును బొల్లు గాఁ గాకుచేసి విడిచె. హరి. పూ. ౮. ౧౫౫.

సీ. బిగువుఁజన్నులయొప్పు పృథులాబ్జకోరకకరికుంభములనైనఁ గాకుసేయు. పరమ. ౨. ౩౭.
(ఇట నౌపమ్యవాచకము.)

౨. అణఁచు.

సీ.కాదంబనికురుంబకలితమై ప్రవహించుకాళిందిగర్వంబుఁ గాకుసేసి. మనుచ. ౩. ౧౯.

సీ. ఒక టిచ్చి తోన వేఱొకటిఁ గోరినయట్టి కానీనుగర్వంబుఁ గాకుచేసి.చంద్రా.౧.౨౧.

౩. బాధించు; హింసించు.

ద్వి.కలికి పైఁబడి తద్దఁ గరఁగించునిన్నుఁ, గాకున్న నెన్నైనఁ గల్లలు గూర్చి,కాకుచేయును రాజుగారితోఁ జెప్పి, నీవు నెమ్మనితో నిలిచితి వేని,పావురాయులు లక్ష పదివేలు గలవు. ద్వి. లి. సా. ౧. ౬పా. ౧౨ పం.

**కాకుత్స్థుఁడు.** సం. వి. అ. పుం. కకుత్స్థవంశపు రాజు.

**కాకుదము.** సం. వి. అ. న. తాలువు, దవుడ.

**కాకున్నె.** అవ్య. (కాక + ఉన్నె) నిశ్చయమును దెలుపుచు.

ఆ. అడవిఁ దన్నుఁ బాసి యరిగిన నలిగి కా,కున్నె యిట్లు సేయ నువిద గడఁగె.భార.అర. ౨. ౧౬౮. (అలిగికాకున్నె=అలిగియే.)

**కాకుపడు.** అ. క్రి. (√ కాకు) వ్యాకులపడు, కలఁత నొందు.

క. చీకటికాటుకపిట్టలు, కాకుపడఁగ భాస్కరుండు కరజాలకము,ల్వ్రేఁక నిగిడింపఁ దారలు, వ్యాకులతం దారె ఖగము లగుటఁగ భీతిఁగ. కళాం. ౮. ౧౨౭.

సీ. మెల్లనినగవుల మేనులు మఱపించి కడుజాణమాటలఁ గాకుపఱచి. భాగ. ౮. ౩౧౮.

**కాకుభము.** సం. విశే. (అ. ఈ. అ) దిక్కునకు సంబంధించినది.

**కాకువు.** సం. వి. ఉ. స్త్రీ. ౧. శోకభయాదులచేత కలిగెడు ధ్వనివికారము. ౨. జిహ్వ, నాలుక. (కల్ప)

**కాకేందువు.** సం. వి. ఉ పుం. కాకితుమికి.

**కాకేక్షువు.** సం. వి.ఉ. పుం. కాశముకి. (త్రి.ని, రా. ని.)

**కాకేమి.** అవ్య. (కాక + ఏమి) మఱియొకదాని లేమిని దెలుపును, ఏవకారార్థకము.

వ. ఆవృషభగోమయభక్షణంబున నైనయశుచిభావంబునం గాకేమి యప్పరమపతివ్రత మదీయదృష్టిగోచర గాకున్నదయ్యె. భార. ఆది. ౧. ౯౭.(అశుచిభావంబునం గాకేమి= అశుచిభావముననే.)

**కాకేష్టము.** సం. వి. అ. పుం-కాకులకు ఇష్టమైనది-నింబము, వేముకి.

**కాకోదరము.** సం. వి. అ. పుం- ఉదరములో కుటిలముగా నడచునది-పాము.

**కాకోదుంబరము.** సం. వి. అ. పుం. కాకిమేడి, బమ్మమేడికి.

**కాకోదుంబరిక.** సం.వి.ఆ.స్త్రీ=కాకోదుంబరము.

**కాకోలము.** సం. వి. అ. పుం. ౧. ద్రోణకాకము, మాలకాకి. ౨.సర్పము. ౩. అడవిపంది. పుం. న. విషభేదము. న. నరకభేదము.

**కాకోలి.** సం. వి. ఈ. స్త్రీ. కాయకొల్లికి.

**కాకోలుఁడు.** సం. వి. అ. పుం. కుమ్మరి. (వాచ)

**కాకోలూకిక.** సం. వి. ఆ. స్త్రీ. కాకికిని గుడ్లగూబకును గలసహజవైరము.

**కాక్షము.** సం. వి. అ. న. (కోపాదులవలని)కుచ్చితపుచూపు. పుం. కడకంటిచూపు.

**కాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తువరిక, తొగరికి. ౨. సౌరాష్ట్రమృత్తిక, తొగరిమన్ను. (మే.ని-

ఇది పరిమళించును. దీనిని గోపీచందన మం
దురు.)

**కాగదము.** సం. వి. అ. న. కాగితము.

శ్లో. భూర్జే వా వసనే రక్తే క్షౌమే వా తాల
పత్రకే, కాగదే వాష్టగంధేన... విలిఖ్యధా
రయేన్నరః. (మంత్రకల్పద్రుమము.)

**కాగము.** సం. వి. అ. పుం-కా అనిధ్వనిచేయు
నది-కాకము, కాకి.

**కాగితము**=కాకితము.

గీ. ప్రాణనాయక యిదె చూడు పతులఁ గూడి,
పాయకుఁ డటంచు సతులకుఁ బల్కు దేజి,
పాదుపా హంశికా చేసి పంపుకాగి,తంపుఫర
మాను కోలె సుధాకరుండు. దశా. 3. ౪౫.
ఇందు. ౫. ౮.

**కాగిదము**=కాకితము. (చి. సి, శ్రీ.)

**కాగిన.** వి. మత్స్యవిశేషము. (శ. ర, శ్రీ.)

**కాచనకి.** సం. వి. న్. పుం. వ్రాతప్రతి.

**కాచనము.** సం. వి. అ. న. కచేలము, వ్రాసినకాగి
తములను గాని వ్రాతప్రతులయాకులను గాని
బంధించెడు దారము మొదలైనపుస్తకాదబంధన
ము. (విల్యమ్సు.)

**కాచమణి.** సం. వి. ఇ. పుం. గాజుపూస.

**కాచమలము.** సం=కాచలవణము.

**కాచము.** సం. వి. అ. పుం. ౧. గాజుమన్ను. ౨.
గాజుపూస. 3. శిక్యము, కావడియుట్టి. ౪. త్రా
సుచివరను దారములలో కట్టుఉట్టి. ౫. నేత్ర
రోగవిశేషము. ౬. కాను, అత్యల్ప మగువిలువ
గలఒకానొకనాణెము.

శ్లో. కాచాయ నీచం కమనీయవాచా, మోచా
ఫలస్వాదుముచా న యాచే, దయాకుచేశే
ధవదక్కుచేశే, స్థితేకుచేశే శ్రితయాకుచేశే.

న. గాజుప్పు, చౌటియుప్పు.

**కాచలవణము.** సం. వి. అ. న. గాజుప్పు, సౌవ
ర్చలవణము, చౌటియుప్పు.

**కాచసంభవము.** సం. విశ. (అ. ఆ. అ.) గాజు
వలనఁ బుట్టినది. వి. అ. న=కాచలవణము.

**కాచస్థాలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గాజుపాత్ర. ౨.
ఫలేరుహా, కలిగొట్టుకి.

**కాచాక్షము.** సం. వి. అ. పుం. బకభేదము, ఒక
జాతికొంగ.

**కాచి(చే)కోలు.** వి. (√ కాచుకొను) కాచికొ
నుట, రక్షించుకొనుట.

చ. ఇది దగ దంచు నడ్డపడునంతకు నేరక సభ్యు
లందఱుఁ, మది మది నున్న యట్టియెడ మాని
నికిం దనుఁ దాన కాచికో, లొదవినదానఁ
జేసి నధ నొచ్చెము దక్కినఁ బాండునంద
నుల్, బ్రదికిరిగాకయయ్యెడరు రాచకొమా
రుల కోర్చునట్టిదే. భార. ఉద్యో. ౧. 3౮౮.
(చి. సి. పా.) భార. ద్రో. ౪. ౧౬౬.

**కాచిఘము.** సం. వి. అ. పుం. ౧. ఎలుక. ౨. బం
గారు. (మే. ని.)

**కాచిఘుఁడు.** సం. వి.అ.పుం. క్షేమండుఁడు, తలి
దండ్రులు లేనిబిడ్డఁడు. (మే. ని.)

**కాచితము.** సం. విశ. (అ. ఆ. అ.) కావడియుట్టి
యందుంపఁ బడినది. (కుండ లోనగునది.)

**కాచు[1].** అ. క్రి. ప్రతీక్షించు, ఎదురుచూచు.

ఉ...అకచీ, కాంతుఁడు గాచినాఁడు కుతుకం
బున నీదుకటాక్షవీక్షకుకా. దశా. 2. ౭౬.

(కాచినాఁడు:-కాచుకొనియున్నాఁడనిభావము.)

స. క్రి. (త. క. కా.) ౧. కాపాడు, రక్షించు.

ఆ. గాడ్పుచూలి పిఱుఁదు గావంగ వర్జును, నోర్వ
నమరులైన నోవరాజి. భార. ఆది. ౮. ౨3.

ఆ. ఏను గలుగ వెఱవ నేటికి సేనలఁ, గాతు నీవు
మెచ్చఁ గౌరవేంద్ర. భార. ఉద్యో. ౪.
౨౧3.

క...మనుజా, గావుము ప్రోవుము...హరి. పూ. ౭. ౨౩౮.

౨. మన్నించు, క్షమించు.

ఉ...దూతలు సేరక యాడినప్పుడుం, గాతురు దప్పు విశ్వనయకార్యధురంధరు లైనభూప తుల్. కాశీ. ౬. ౨౨౩.

క. ఆచోళనృపవరేణ్యుఁడు, వాచంయమవరు నిఁ జేర వచ్చి మునీంద్రా, నాచేసినయపరా ధము, గాచి ననుం గావవయ్య కరుణాజలధీ. వి. ప్ర. ౫. ౭౧.

౩. ఆఁపు.

ఉ. ద్రౌపది ... మనంబునఁ బొంగువిషాదరోష ముల్, గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ ది గ్గన లేచి యార్తయై. భార. ఉద్యో. ౩. ౧౧౪.

ఉ. కట్టకుఁ గాపుగా నిదుర గావఁగఁ జాలెడి వారిఁ గొండఱం, బెట్టుచు...భా. రా. యు. ౨౫౮.

నోరుకాచు=౧. రహస్యముగా నుంచు, (రహస్య విషయము) చెప్పకుండ నుండు.

ద్వి. చేరి నీ కొకమాటఁ జెప్పవచ్చితిని, నోరు గాచెద నన్న నుడువుదు నీకు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౩౨ పం.

౨. పథ్యముచేయు.

ఉదా:-నోరుకాచినఁ గాని వ్యాధి కుదురదు.

జ: కాచికోలు, కాచుకొను, కాపరి, కాపాడు, కాపించు, కాపు¹, కాపుకాఁడు, కాపుగడ, కాపెట్టు, కావలి, కావలికాఁడు, కావలివాఁడు.

కాచు². అ. క్రి. ౧. (కాయ కిణము, మొ.) పుట్టు, బయలుదేఱు.

(వ్యవ) ఆచెట్టున పదికాయలు కాచినవి.

ఆమెకడుపున నాలుగు కాయలు కాచినవి.

రాపిడిచే చేతిమీఁద నొకకాయ కాచినది.

౨. బయలుదేఱినకాయలు గలది యగు.

మానిని. కాచి బెడంగుగఁ బండినయాసహకారములం గదలీఫలులం, జూచుచు...భార. ఆది. ౪. ౨౦.

౩. (ఎండ, మొ.) ప్రసరించు.

క. తలఁచిన డెందము గందుచు, బలికిన నోళ్లుఁ బొక్కఁ బ్రథ నూచిన కేల్పులు గమరు నవఁగఁ బటుతర, విలయానలభాతి నెండ వేసవిఁ గాచెన్. కు. సం. ౬. ౭౯౨.

ఉ...హరియె కావలె నంచుఁ దపించె దూరతే, కన్నెతికంబు కాఁజవిఁ గాచిననెన్నెల నేని యయ్యెయో, నిన్నును ముంచె నీజనకునిం గుదియించినవెట్టి యిర్యోడక్. ఉ. రా. ౩. ౧౧౬.

స. క్రి. ౧. (కాయ కిణము మొదలగువానిని) కాంచు.

(వ్యవ) ఆచెట్టు పదికాయలు కాచినది.

వ...పెక్కువిధంబులఁ దమతమకై యొదపదని కావటిమోపులకతనం గంది కాయలు కాచి వంగినవలుఁదమూఁపులును...హరి. పూ. ౫. ౧౪౨.

(వ్యవ) నీ వెప్పుడు వత్తువో యని చూచి చూచి నాకన్నులు కాయలు కాచినవి.

౨. (ఎండ, మొ) కాయు, ప్రసరింపఁజేయు.

గీ. నిదుదత్రొఘ్నాని బయల నెప్పుడుఁ దిరుగుచుఁ, బొసఁగ ముప్పొద్దు మువ్వేసములఁ జెలఁగుచు, వెలుఁగు లెల్లెడఁ గాచుచు నలరుని ర్ల, వేఁటకాఁ డప్పు డెంతయుఁ జేట మీఱె. అచ్చ. రా. అయో. ౪౨.

జ: కాపు².

కాచు(చి)కొను=కాచు¹.

అ. క్రి. (ప్రతీక్షించు)

వ. నలకూబరుశాపానుభవంబునకుం గాచుకొని యుండువానికి నీదుష్కర్మంబున సాధించి నరాజ్య వైభవం బేమి కీర్తిసుకృతంబులకు సాధకం బయ్యెడు...కళా. ౪. ౧౭౭.

స. క్రి. (కాపాడు, రక్షించు.)

గీ. దోసమును నపకీర్తియుఁ దొలఁగఁబెట్టి,నాఁడు గురుఁ గాచుకొంటివి...విక్ర. ౩. ౧౨౯.

**కాచూకము.** సం. వి. అ. పుం. ౧. కోడి. ౨. చక్రవాకము, జక్కవ.

**కాజలము.** సం. వి. అ. న. ఇంచుకనీరు.

**కాజి.** వి. ఒకానొకచెట్టు.

సీ. యువజనరాగవయోరాసు లుప్పొంగ వెలిదమ్మికాజిపువ్వులు ముడుంగ. పారి. ౨. ౪౯. (శ. ర. పా-జాజిపువ్వులు. ముద్రి.)

**కాట.** వి. పులిసినయంబలి?

చ. కని సతిఁ బిల్చి యిక్కటిని గామిని చూచితె యొన్నఁడిప్పురి,న్గనుఁగొనుపంది గా దిది దినంబును గంజియుఁ గాట వోసి పెం,చిననిట నుండు నంచుఁ బతి చెప్పిన సంతస మంది దాని నొ,య్యన దరిఁజేరఁ బిల్చి పులియంబలి యించుక వోసె మూఁకుటన్. చెన్నబ. ౨. ౨౬.

**కాటకము.** వి. కఱవు, క్షామము. (శ. ర.)

**కాటము.** సం. వి. అ. పుం. కూపము, నూయి.

**కాటా.** వి. (హిం. ఖాటా) పెద్దత్రాసు. (శ. ర.)

**కాటికాఁడు.** వి. పక్షివిశేషము.

సీ.వంగపండు పికిలి వామనపాతుకాఁడుల్లంకి కాటికాఁడు పగడంపు, జిట్ట... గీ. అనఁగనిట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౭.

**కాటిపాపఁడు.** వి. (కాడు[1] + పాపఁడు) ౧. గొల్లవాఁడు.

ద్వి. కాటిపాపఁడు పసిఁ గాచుచు నుండ.బస. పు. ౪. ౩౧౭ పం.

౨. శ్మశానపుఁగావలి...వాఁడు.

ద్వి. నీ కెంత గలిగిన నిష్ఫలించి, మాకుఁ గైకొన రాదు మాదకు మిగులఁ, గాటలగంధినీపలు కియ్యకొనఁగఁ,గాటిపాపని కెలకరుణ నీమీఁద. ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౭౪ పం.

**కాటిపాపలవాండ్రు.** వి. బ. (√కాఁడు[1]) జాలవిద్య చేసెడిఆటవికజనవిశేషము. (శ. ర, బ్రా.)

**కాటిఱే(ఱ్ఱే)ఁడు.** వి. (కాడు[1] + ఱేఁడు) మృగయులు మున్నగువారు కొలిచెడిశివరూపదేవత.

ఉ.అమ్మృగయుల్ వినోదగతి నందఱు నయ్యెడఁ గాటిఱేనికిన్,సమ్మతితోడఁ బూజ లిడి... ఇందు. ౨. ౭౧.

సీ. కాఱ్ఱేఁడ మెకములకదుపురాఁజేయుమీ జంక నొక్కటి నీకుఁ జేతి కిత్తు. యయా.౨. ౩. (చండాలిమాట.) ఉ. నేఁడు కృతార్థులైరి జననీజనకుల్ ఫలియించెఁ బుణ్యముల్, నేఁడు పురాకృతంబు లవనీరుహామూలనివాసియైన కా,ఱ్ఱేఁడిలువేలు పొచు నొనరించె మనోరథసిద్ధిసంపదల్. శివరా. ౩. ౭౩.

**కాటు[1].** వి. (√కఱచు-క. కాటు. త.కడి) దంశము, కఱచుట; కఱచుటవలనఁ గలిగినగాయము, గంటి.

చ.చెలువలు మత్తిమ్రానిపయిఁ జిల్కలు మూవిరమింప వానిము,క్కులు గని మత్తిపండులని కోయఁగఁ బోయిన వారిహస్తముల్,దలిరులు సావి కీరములు దండడిఁ గుట్టిన ముగ్ధలందఱున్,గలగొని బాతి రో యివియు గాటుల మ్రానుచున్ భయంబునన్. కు. సం. ౯. ౩౧౬.

చ. ... మా,కఱచినకాట్లకున్ శిశువుకాయముతోలును నుగ్గదయ్యె...నృసిం. ౪. ౪౩.(శ. ర. పా.)

**కాటు[2].** వి. మాఁడువాసన.

సీ. ముంజేతికంకణంబున కద్ద మేటికిఁ దంగేటిజుంటికిఁ దాప యేల,వెలికాటు గ్రమ్ముకూర

ల రుచుల్ గొన నేల పరు లెన్న నేల స్వభా
ర్యగుణము. రామలిం. ౫౫.

కాటునీళ్లు = మాఁడిచినఓమము మున్నగువాని
లో పోసిపొంగించినవీళ్లు.

(వ్యవ) ఓమపుకాటునీళ్లతో అజీర్ణవిరేచనములు
కట్టును.

కాటుపో(వో)వు=కాటువాసన గలది యగు.

(వ్యవ) పాలు కాటువోయినవి.

**కాటుక.** వి. కజ్జలము, కంటి కుపయోగించు లేపన
ద్రవ్యము.

ఉ. మంకెనపువ్వుమీఁదియళిమాడ్కి నృపాధ
రపల్లవోదరా,లంకృతి యైనదంతపదలాంఛ
నముం గని కన్నుఁగోనలం,దంకురితంబు లై
నదరహాసలవంబులు పద్మనేత్ర యి,ట్టింకులు
సేసెఁ బత్త్రములయీఅమిఁ గాటుకచిమ్మఁ
జీకటిక్. వైష. ౭. ౧౮౩.

చ. ఘనగతశంపఁ గంచ మిడి కాటుక దీర్చి...
ఆము. ౨. ౧౬.

కాటుకబరణి=అంజనకరండము. ప్రబంధ. ౬౪.

జ: కాటుకకొండ, కాటుకపట్టు, కాటుకపిట్ట,
కాటుకరేకులు, కాటుకఱాయి, కాటుక తేకు
లపాము.

**కాటుకకొండ.** వి.(√కాటుక)అంజనాద్రి.

ఉ. కాటుకకొండఁ బోలు మెయికాంతి...దశా.
౩. ౧౭౫.

**కాటుకపట్టు.** అ. క్రి. (√కాటుక)నలుపుపాఱు,
నల్లఁబడు.

క. బహుళజలప్లవమాన, ద్రుహిణాండము చెమ్మ
యుటికి రూక్షార్కవిభా,రహితతఁ గాటుక
పట్టెను,రహి చెడి యన నంధతమసరాసులు
బెరసెక్. మనుచ. ౩. ౧౭.

**కాటుకపిట్ట.** వి. (√ కాటుక) ఖంజనపక్షి, ఖంజ
రీటము. (కాటుకపిట్టలు సంభోగముకొఱకు వ్రా
లినభూమిలో ధన ముండు నని ప్రసిద్ధి—చూ.
వసు. ౩. ౧౦౭.)

సీ...కాటుకపిట్ట రువ్వాపులుఁ గనఁ దనరు,ఖంజ
రీటాభిధ. ఆం. భా. ౨. ౯౧.

**కాటుకరేకులు.** వి. బ. (√ కాటుక) ధాన్యవిశే
షము. ప్రబంధ. ౧౧౨.

**కాటుకఱాయి.** వి. (√ కాటుక) సౌవీరాంజన
ము. (శ. ర.)

**కాటుకతేకులపాము.** వి. (√ కాటుక) కాటుక
వలె నల్ల నగుపొడలు గలయొకానొకపాము,పులి
పెంజెర. (శ. ర.)

**కాటులాడు.** అ. క్రి. (√కాటు[1]) కలహించు.

సీ. అనుఖదం బైనరాజ్యామిషంబునకుఁ గుక్క
లభంగిఁ దమలోనఁ గాటులాడి. భార. శాం.
౧. ౪౫.

**కాత్రగడ.** వి. కంచుకోట. (శ. ర.)

**కాఠిన్యము.** సం. వి. అ. న. ౧. కఠినభావము, గ
ట్టిగా నుండుట. ౨. దయలేమి, క్రూరత్వము.
౩. నైష్ఠుర్యము.

**కాడు[1].** వి.పొ. (క. త. కాడు) ౧. అడవి ,కాన.

సీ.నిరుపాధినిస్సీమనిర్నిబంధనవృత్తిగలమహాప్ర
తిభ యేకాటఁ గలసె. శివరా. ౨. ౧౦౯.

(ఏకాటఁగలసె=ఏయడవిలో కలసినది,ఏమైపో
యినది.) హర. ౭. ౫౨.

౨. శ్మశానము, వల్లకాడు.

క. సొదపై నుండఁగ వారలు,పదుంద్రుమం జూ
చి దాని భక్షింపంగా, మదిఁ గోరి చేరి చు
ట్టుం, బొదివినసమయమునఁ గాటిపొంతలె
రువువక్. భార. అను. ౩. ౨౧౦.

క. ఎంత గడించినఁ గూటికి, వెంకటివాఁ డైనఁ
గాటి కిందునిభాస్యా. కుచేల. ౧. ౭౭. ఆం.
భా. ౨. ౨౨౫.

౩. నాశము; చేటు, కీడు.

ఉ. ఏడుదినంబు లన్నమున కెడ్డము పుట్టినయంత మాత్రలో, నేడుచు చున్నవాఁడవు మునీశ్వర కేఁడును నీదుధీరతల్, పాడఱిపోయె నే శివునిభార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిం, గాఁ డొనరింపఁ జూచెదవు కంఠపుఁగ్రోధము పెచ్చు రెచ్చఁగన్. భీమ. ౨. ౧౧౬. (కాడ యొనర్ప. చి. ని. పా– కాడు నొనర్ప. ముద్రి. పా.)

కాటికిఁగాళ్లుచాఁచు = చావునకు సిద్ధముగా నుండు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౪౭ పం.

జః కాటిపాపఁడు, కాటిపాపలవాండ్రు, కాటిఱేఁడు, కాడుచేయు, కాడుపడు, కాఁపుపఱుచు, కాఁపుపాటు.

**కాదు².** అ. క్రి. కాఱు ?

ఉ. వాడినవక్త్రపంకజము...కాడినకన్నునీరు... కు. సం. ౧౧. ౬౨౬.

**కాడుచేయు.** స. క్రి. (√ కాఁపు¹) చీకాఁపపఱుచు.

గీ. ఒక్కవదిపాంత గార్హస్థ్యయుక్తమైన, పుణ్యతప మాచరించుచుఁ బుణ్యజనులు, తారు బంధులుఁ దామరతంపరగుచుఁ, గూడియుండంగ నెంతయుఁ గాఁపుచేసి.

గీ. ఋషులవెంబడి సంరంభ మెసఁగ వచ్చి, తటిని నడుత్రోవ వనములోఁ దపము సేయు, దైత్యమునులపుణ్యాశ్రమస్థలము సొచ్చి, వఱదఁ గొనిపోయె నింపుసర్వస్వములును. భీమ. ౮. ౧౮౦, ౧౮౧.

**కాడుప(డ్ప)డు.** అ. క్రి. (√కాఁపు¹– త. కాఁపుపడు) ౧. నశించు; కనఁబడకపోవు.

చ. కరులు హరుల్ రథంబులును గాప్పడెఁ జేద్పడి కల్లసైనికుల్. ఉ. రా. ౨. ౮౬.

గీ. ఘనవిడాలంబుచేఁ బడి కాఁపుపడిన, యపుడు తనకుకుటుంబునయందుఁ గలుగు, వంత గలుగునె మది మమత్వంబు లేని, యొలుక యందుఁబిచ్చుకయందు నించుకైన. మార్క. ౩. ౩౦౧.

గీ. కటకటా మీవివేకంబు గాఁపుపడఁగ. భీమ. ౮. ౪౩.

చ. తనయుఁ డొకండ వాఁడు గుణధాముఁడు క్రీడనవాంఛ సాంద్రకాననమున కేఁగి కాడుపడినం దడవం జనుదెంచి యెంచుఁ గా, నన మది యాశ ద్రిప్పకొనినన్ వెగడొందుచు వచ్చినాఁడ... భార. శాం. ౩. ౧౪౮.

౨. క్షోభపడు, వ్యాకులమగు.

ఉ. వృత్రునిఁ జంపినప్పుడె సురేంద్రుని మేకొనె బ్రహ్మహత్య త, ద్గాత్రము కంప మొందె మది గాప్పడియెన్... ఉ. రా. ౭. ౩౬౭.

ఆ. మరులుఁదీఁగె మెట్టి యిరు లన్న నో యని, యొడుతమిస్రఁ గాడుపడి పొలంబు, లెల్లఁ దిరిగి... ఆము. ౬. ౧౨. (కాఁపుపడు:– దిగ్భ్రమ చెందు అనిభావము.) ఉ. రా. ౧. ౧౨౬.

౩. చెడ్డది యగు, దుష్టమగు.

క. కూడమ్మికొండ్రు జనములు, బాడబు లాగమము లమ్మి బ్రతుకుదు రెంచుం, జేడియ లమ్ముదు రచ్చోటు, గాఁపుపడినకలియుగమునఁ గౌరవముఖ్యా. హరి. ఉ. ౯. ౩౭.

కాఁపుపడిపోవు=కనఁబడకపోవు.

(గోరూపము తాల్చినరాక్షసస్త్రీలు) వ...అంభారవంబుల నొఱలుచుఁ బఱచి దూరం బగు కాంతారంబు మాఱి కాఁపుపడిపోయె నంత. హరి. పూ. ౬. ౮౯.

**కాడుప(డ్ప)ఱు(అ)మే.** స. క్రి. (√ కాఁపుపడు) కాఁపుపడఁజేయు.

(క్షోభపెట్టు, వ్యాకులపెట్టు.)

గీ. అబలఁ గడు నెడ యెఱుఁగని యాఁటదాన, మెలఁత నతిభీత నన్ను నమ్మించి తెచ్చి, కాననంబులోఁ గన్నులు కట్టి కాఁపుపఱిచి నీ కి

ట్లు పోఁ జెన్నె భావజన్న. కు.సం.౫.౫౪౪.

సీ. మముఁ జావఁ గాలుండు మాయాకురంగమై
పరుపాటవులఁ గాదుపఱిచె నకట. భా. రా. సుం. ౨౫౯.

(నశింపఁజేయు, చంపు; పాడు చేయు)

సీ... ప్రియంవదకొడుకులఁ గాంతారభూమి
లోఁ గాదుపఱచి. దశకు. ౬. ౮౭.

గీ. కాపుఁగోడలు కంచంకాఁపురంబుఁ, బాల
వంటికులంబుఁ గాడ్పఱచి యుక్తికి, మగని
నటు వెట్టి రెంకవమగనివెంట. పాండు. ౩. ౭౧.

(భగ్నము చేయు.)

వ...నీవు నన్ను వరించువప్పు డన్యకాంతాసంగమంబు సేయకుండుటకును నన్ను వదలకుండుటకునుం జేసినశపథంబు గాదుపఱిచితి పాపకర్ముఁడా...భోజరా. ౬. ౧౬౦.

సీ. ఘాలకీలితహస్తవాలఖిల్యాస్త్రవాకర్ణనోల్లాసంబుఁ గాదుపఱచి.గీ...కవియ నేతెంచె మదిరాక్షిఁ గర్మసాక్షి. సమీర. ౧. ౧౯౮.

(అవమానపఱచు.)

ద్వి. వీఁడు వో విష్ణుని విధిఁ గాదుపఱచి, నాఁ
డురులింగమై నలి నున్నవాఁడు. పండితా. దీక్షా. ౫౩. పా.

**కాదుపా(డ్పా)టు.** వి.(√కాదుపడు) క్షోభము, కలఁత.

క. అనిసిఁ బసియును నొండొక, మానిసియుం బ
డఁడు దృష్టిమార్గంబున న,ట్లేను గాడ్పా
టువఁ జనఁ, గానొకచో నుపరిభరము కంప
లఁ దవిలెన్. వేం. పంచ. ౧.౪౭౨.

**కాణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మూస. ౨. శబ్దము. ౩. గమనము. ౪. నిమీలనము. (శే. ని.)

**కాణము.** వి. (సం. ఖాదనం) కుళుత్థాదికమైన యశ్వాదిగ్రాసము, గుఱ్ఱము మొదలగువానికిఁ బెట్టెడు ఉలవలు లోనగుభక్ష్యము, దాణ.

ఆ. బియ్యములును నేయి పెరుఁగును గూరగా,
యలును వంటకట్టెములును గడ్డి,కాణము లు
ను బెల్లుగా నొడఁగూర్చి ని,గూఢవృత్తి
దానుఁ గూడ నడచె. భార. ఉద్యో. ౧. ౯౩. (శ. ర. పా-'ఖాణము, కవణము' ముద్రితపాఠములు.)

**కాణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఒంటికన్ను గలది. ౨. తూఁటుపడినది, చిల్లిపడినది. (ఉదా: కాణవరాటకము=చిల్లిగవ్వ. సం. భర్తృ. ౩. ౪. ఆ. ని.) వి. అ. పుం. కాకి.

**కాణయాచి=కాణాచి.** విణ. (క. కాణాచి. త. కాణియాట్చి.) వంశపరంపరాగతము.

గీ...కాళాంజి కపురంపుఁ బేటి గిండి,యుపద
ములు మోచి మునులు నాబడిని గాణ,యా
చిబంటులువోలె రా నరుగుదెంతు. ఘటికా. ౨. ౯౪.

క. శ్రీకాళహస్తిపతిపద,కోకనదారాధనంబె కు
లధర్మము త,ల్లోకవ్యాపకచిద్వి,ద్యాకార
స్ఫురితయె కాణయాచి మదంబా. కాళ. ౪. ౩౬.

వి. చిరకాలవాసస్థానము.

క. తెరువున జఘనపయోధర,భరమున వడు గల
సి యుడుఁగఁ బతియూఁతగనై,కర మిచ్చు
నాకు నవ్వలి,కర మది నీకాణయాచి గా
యుంగరమా. రామా. ౮. ౧౯౩.

**కాణాచి=కాణయాచి.** విణ. వంశపరంపరాగతము; చిరకాలానుభూతము.

గీ. అనిన గజగజ వణఁకుచు నయ్యొరంగ,ధాము
కోవెల మున్న తొతలతరంబు, నాఁటనుండి
యు మాకుఁ గాణాచి గాదె, యున్నయుండె
డు గలవయ్య యింతపనికి. విప్ర. ౫. ౧౬.

క. ...తెకతేరగ నీ,కెగవిడిచి పోయెదవె ప్రా,
వగ నాకాణాచి యైనవలపులపంటల్. కళా. ౩. ౧౯౧.

వి. ౧. చిరకాలవాసస్థానము.

(అజాతశత్రుఁడు.) శా. దేవబ్రాహ్మణభక్తిప్రోవు ప్రియవక్తృత్వంబుకాణాచి వి,ద్యావైదుష్య మునిక్కు ధర్మమునకుం దార్కాణ మర్యాద కుల్, తావు...విజ. వి. ౧. ౨౦.

౨. వంశాచారము.

మ. వెలయాం బ్రందఱు సన్నుతించిరి ననున్: వే నోర్లఁ గాణాచికిన్, కలిగెన్ దిక్కని మీరు పుట్టినపుడే గారాము నా కింక ని, ష్ఫల మై పోఁ గులధర్మము ల్వదలఁగా భావ్యంబె యోయక్కలా,ర...కాశీ. ౪. ౨౫.

జ: కాణాచికాఁడు.

**కాణాచికాఁడు.** విణ. (కాణాచి + కాఁడు.) ౧. చిరకాలానుభవము కలవాఁడు.

సీ. సచరాచర ప్రపంచమ్మును బాలించురాచతీక మ్ముకాణాచికాఁడు. వరాహ. ౧౧. ౧౪.

౨. చిరకాలనివాసి.

వ. ...చావంచదుగకొండలకాణాచికాఁడా. ప్రబంధ. ౨౧౬.

**కాణాదము.** సం.వి.అ.పుం. కణాదఋషిప్రోక్త మగుతర్కశాస్త్రము.

**కాణూకము.** సం.వి.అ.పుం. ౧. కాకి. ౨.కోడి.౩. ఒకజాతిబాతు.౪. చెట్లకొమ్మలయందు వ్రేలాడు గూండ్లను కట్టునొకజాతిపక్షి, గిజిగాఁడు.

**కాణేయుఁడు.** సం.విణ. (అ.ఈ.అ.) ఒంటికంటి దానికొడుకు.

**కాణేరుఁడు.** సం.విణ.(అ.ఆ.అ)=కాణేయుఁడు.

**కాణేలి.** సం.వి.ఈ.స్త్రీ. ౧.కన్య, పెండ్లికానిస్త్రీ. ౨. కులట, ఱంకుటాలు.

వ. కాణేలీమాతః వామత స్తస్య సార్థవాహస్య గృహమ్. మృచ్ఛ. ౧. ౩౬ పా.

**కాత**=కావుత. (√అగు)
(ఆశీరర్థకము)

గీ. కల్కినఁ బోఁడి జానగుపల్కు లిడుచుఁ, గనికరం బెచ్చ మము నిచ్చఁ గాచుఁ గాత. అచ్చ. రా. బాల. ౬.

(కాక అనుటకు మాఱుగాఁ గూడ నొకచోఁ గలదు.)

ఉ. జాతి తొలంగుఁగాత గుణశక్తి రసాతలసీమ కుం జనుం, గాత ... బహుభంగుల విత్తమె మాకు మేలు వి,ఖ్యాతగుణంబు లెల్లఁ దృణక ల్పము లౌక్యధనంబు లేవడిన్. భర్తృ. ౧. ౩౭.

**కాతంత్రము.** సం. వి. అ.న. కాలాపకవ్యాకరణము. (ఇది కార్త్తికేయప్రసాదమున సర్వవర్మచే రచింపఁబడినది.)

శ్లో. తతోంతః ప్రభుణా తేన స్కందేన మమ దర్శనం,దత్తం...అథా బ్రవీత్స దేవో మాం... అధునా స్వల్పతంత్రత్వాత్కాతంత్రాఖ్యం భవిష్యతి, మద్వాహనకలాపస్య నామ్నా కాలాపకం తథా. (వాచ)

**కాతరము.** సం.విణ.(అ.ఆ.అ.)౧.అధీరము,పిఱికి. ౨. భీతము,వెఱచినది. ౩. వివశము,వ్యాకులము, చెదరినది. (మనస్సు,మొ.) ౪.చంచలము, బెళుకు గలది. (ఉదా:కాతరాక్షి.) వి. అ. పుం.-జలమందు తేలునది-౧. ఉడుపము. ౨. ఒకజాతి పెద్దచేప,కాతలమత్స్యము.

**కాతరిల్లు.** అ.క్రి. (క. కాతరిసు)ఉత్సహించు.

ఆ. ...కరిణులుఁ దారును, నభినవంబుగా మదాంధగంధ,సింధురములు మెఱయ శృంగారములు చేసి, కామకేళి సలుపఁ గాతరిల్లి. కు. సం. ౧. ౯౫.

**కాతర్యము.** సం.వి.అ.న. ౧. వ్యాకులత. ౨.పిఱికితనము. ౩. భయము. ౪. చాంచల్యము.

**కాతలము.** సం. వి. అ. పుం. ఒకజాతి పెద్దచేప.

**కాతా.** వి. (హిం. ఖాతా) వ్యాపారములో సంబంధము, లెక్క. (శ. ర.)

**కాతాళము**=కాంతాళము. వి. ౧. కోపము.

క. మాతంగరథభటాశ్వప, రీతుఁ డగుచుఁ గ్రోవపుండరీకుఁడు చూచెన్, గాతాళంబున నిలువక, పాతాళంబునకుఁ బోయి పాఁ జులునేయన్. జై. భా. ౩. ౯౮.

౨. సామ్యము, పోలిక ?

క. కోఁత నినువంటిమానిసి, క్రోఁతికి నామగనిఁ జేయుకొనఁ జక్కరయన్, జేఁతికిఁ గలవాని సుమీ, కాతాళము గాదు నీకు ఘనుఁ డాతనికిన్. వేం. పంచ. ౩. ౭౫౧. (ఈ ప్రయోగము బట్టి ఈశబ్దము సబిందుక మన రాదు. ఈకవి కట్టినియమము లేదు.)

జ: కాతాళించు.

**కాతాళించు.** అ. క్రి. (√కాతాళము) కోపించు.

సీ. తనుఁ దిట్టికొనక కాతాళించి గొణఁగక మ్రుచ్చిలింపక పాపమునకుఁ జొరక. నీతి. ౩. ౨.

**కాతీయుఁడు.** సం. విశ. (అ.అ.అ.) కాత్యాయనునకు సంబంధించినవాఁడు. (ఛాత్రాది-రూ. కాత్యాయనీయుఁడు.)

**కాత్యాయని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కాత్యాయనఋషిపత్ని. ౨. కాషాయవస్త్రములు ధరించినదియు సగమువయసు చెల్లినదియు నగువితంతువు. ౩. యాజ్ఞవల్క్యఋషిపత్నులలో నొకతె. ౪. పార్వతి.

**కాత్యాయనుఁడు.** సం. వి. అ. పుం. ౧. పాణినిసూత్రములకు వార్త్తికములు రచించినముని, వరరుచి. ౨. ఒకానొకధర్మసూత్రగ్రంథకర్త.

**కాథంచిత్కము.** సం. విశ. (అ. ఈ. అ) కష్టముచేత నిర్వర్తింపఁబడినది.

**కాథికుఁడు.** సం. వి. అ. పుం. కథలు రచించువాఁడు.

**కాదంబకము.** సం. వి. అ. పుం. బాణము.

**కాదంబము.** సం. విశ. (అ. ఈ. అ.) ౧. కలహంసకు సంబంధించినది. ౨. కడిమిచెట్టునకు సంబంధించినది. (పూర్వ, కావ్య, మొ.) వి. అ. పుం. ౧. కలహంస, ధూమ్రవర్ణములైన ముక్కుకాళ్లు రెక్కలు గలహంస. ౨. బాణము. ౩. చెఱకుకోల. ౪. కడిమిచెట్టు.

**కాదంబరము.** సం. వి. అ. న. కదంబపుష్పములనుండి తీసినమద్యము.

**కాదంబరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కదంబపుష్పములనుండి తీసినమద్యము. ౨. మద్యము, సారాయి. ౩. ఏనుఁగుచెక్కిలిమదము. ౪. సరస్వతి. ౫. ఆఁడుకోయిల. ౬. గోరువంక, శారిక. ౭. బాణుఁడు చేసినసంస్కృతవచనకావ్యము.

**కాదంబిని.** సం. వి. ఈ. స్త్రీ. మేఘపంక్తి.

**కాదా**=కద[1].

శా. ...నుయి దాఁటేవానికిం జింతయా, కంతైనం గడ మేనియుం గడమ గాదా యంచు నూహించుచున్. పాండు. ౪. ౨౩౫.

**కాదాచిత్కము.** సం. విశ. (అ. ఈ. అ.) ఎప్పుడో యొకప్పుడు కలుగునది, తఱచుగా సంభవింపనిది.

**కాదు.** అగుధాతువుయొక్కవ్యతిరేకార్థకరూపము. (దీనికి ఒకయర్థ మీక్రిందఁ జూపఁబడినది. మిగిలినవి 'అగు' ధాతువునుబట్టి యూహించుకొనునది. ఇట్లే: 'కాఁడు' మొ.)

(తగదు, కూడదు.)

ఉ. ... ధీ, ప్రష్టులసన్నిధానమున నష్మైయుఁ బల్కినపల్కు దప్పఁగాఁ, గా దని ధర్మనందనుఁడు గ్రమ్మతిచెన్ యదువీరకోపముల్. భార. అర. ౩. ౧౭౦.

గీ. ఘనుఁడు మన కాశ్రయం బయి మనిచె మఱి త్స్య, దేశపతి గాఁడె సేనాపతిత్వమునకు. భార. ఉద్యో. ౪. ౯౩.

కాదను=నిరాకరించు.

కా. గంగానందనుపోటు మెచ్చక నురుం గా దం చు రాధాతనూ, జుం గీడాడుచు ...భార. కల్యా. ౧. ౭౭.

కాదుగూడదు, కాదుగూడదు:-ఎంతమాత్రము కాదు అను నర్థము తెలుపును.

క. కాదుంగూడ దటన్నను, వాదునకుఁ విడుము నన్ను వారి... పరమ. ౫. ౬౬.

చ. విరటుఁడు సూచుచుండ నిను వేపురముండట నట్లు ద్రోవ నో, క్కరుఁడును గాదుగూడ ద నఁ గర్గెనె...భార. విరా. ౨. ౨౫౭.

కాదుకాదు:-నఖర్థకము, ఎంతమాత్రము కాదు.

సీ. ... లేదులే దనఁగను గాదుకాదు నాఁగను నఖర్థ. గీ. మెప్పుచుండును... అం. భా. ౩. ౭౮.

కాదె(దే)=కద[1].

చ. వినుము తమోమయం బయినవిశ్వము దా వెలిఁగించు నీశ్వరుం, డన నొకరుండు వర్ణతతి నాశ్రమకోటిని వాఁడు గాదె చే,సె... భార. శాం. ౧. ౭౯.

క. ఏ నేమి తప్పు చేసితి, నో నళినదళాక్ష నీనియోగంబునఁ గా, దే నాఁడు జలధి నుండుట, మా ని యిటకు వచ్చినాఁడ మగుపలుఁ దానుఁ. వి. పు. ౭. ౧౯౮.

కాద్రవేయుఁడు. సం. వి. అ. పుం-కద్రువకొడుకు-పడగయుఁ దోఁకయుఁ గలిగి నరాకారములో నుండుసర్పభేదము. (అమరసుధ.)

కాన[1]=కోన. వి. (సం. కాననం. త. కావం) అడవి.

సీ...నలుఁ ప్రీతితోడఁ, గానకే కానలలోన లో కోత్తరు నని మ్రానిమ్రానికి నరిగి యరిగి. భార. అర. ౨. ౯౮. అం. భా. ౨. ౩౮.

కానసిరి=వనలక్ష్మి.

సీ. అమనితోడ సయ్యాటకై యచ్చోటికి కి ... రుగు ... దెంచినకానసిరి యనంగ. యయా. ౩. ౮౧.

కాన[2]. అవ్య. సంబోధనమున వను ప్రయుక్తమై ప్రే. మక్రోధాదులను సూచించును.

గీ. పలుక నేటికిఁ జిలుకలకొలికికాన. నైష. ౭. ౫౦.

సీ. కలుషించి వైకారికస్వరూపుఁడు పద్మజన్ముండు మద్వ్యభిచారకారు. గీ. లారకాన దురాచారులారకాన, కితవకృత్యంబు లిట్లు చేసితిరి మీరు, బ్రహ్మవిజ్ఞానగర్వంబు పదటిపాలు, గావలయు నంచు ఘోరంబుగా శపించె. వరాహ. ౫. ౫౨.

గీ...మునిముచ్చుకాన...విప్ర. ౮. ౩౧.

గీ...ఓరి నీచుకాన...ప్రబోధ. ౩. ౩౭.

ఉ. ఓసి గయాళికాన...శుక. ౨. ౩౭౩.

గీ. ధర్మ మేమఱకుండుమీ తల్లికాన. నైష. ౭. ౯.

గీ...పొ తెఱుబండ్లకెదురు, కాళ్లు సాఁతురె యోవెఱ్ఱికాన...శుభ. ౨. ౩౭.

కాన[3]. అవ్య. ద్రు ... =కావున. (√అగు-... పునఁ" అను ... దానిలో 'వు' లోపింపఁగా మిగిలి నరూపము. ... కాని భారతమునందలి యొకనిర్ధారక ప్రయోగ ... ములో కళగాఁ గాన్పించుచున్నది.) కాఁబట్టి, ... కనుక.

మ. ... డఁటే యీజనుఁ డంధుఁడుం బధిరుఁడుఁ ... దింగుండు మూఁకుండునై, పొడమఁ బో ... క్కుచుఁ దల్లిదండ్రులిచటఁ బోవైవ నాయునిశితఁ, బదునై యుం డెడువీని మాని యని జంఘద్వేషి భీతిల్లె సం, దడిఁ గఁ విచ్చెఁడె మానియేని యటు గానఁ మానిగాఁ డార యఁ. చంద్రా. ౩. ౧౧౫.

క. రసవత్ప్రియము లూర్జ, స్విసమాహితములు ను నిచట వివరింపఁగ లే, దసమరసప్రకరణమున, రసభావాద్యుచనిబద్ధరసములు గానఁ. నరస. ౫. ౨౩౦.

మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్ వనము గుం
తీనందనుల్ సింహముల్, మఱి నూహింపన
సింహ మైనవనమున్ మర్దింతు రెందున్ వ
నా,వృతవృత్తంబులు గానిసింహములకున్ వే
గంబ చే టొందుఁ గా,న తగం బొందుట
కార్య మీయుభయము న్సంతుష్టిమై నునిక్కి
కిన్. భార. ఉద్యో. ౧. ౩౫౭.

గీ. కనుకఁ గనుకను గాఁబట్టి కానఁ గాఁగఁ,గా
వున ననంగ నన్ని యేకార్థము లగు. ఆం. భా.
౩. ౨౦.

**కానఁబట్టు.** అ. క్రి. (కానన్ + పట్టు) కనఁబడు.

శా... భూ,నాకం బప్పర మేకొ అంతయును గా
నంబట్ట జెప్పట్టునన్. భా. రా. యు. ౧౫.

**కానఁబడు, కానఁగఁబడు.** అ. క్రి. (√ కను) కనఁబడు, చూపట్టు.

క. స్వానుభవంబునఁ దత్త్వము, గానంబడు ... కాశీ. ౧. ౭౦.

సీ... ప్రతిబింబములు గానఁబడుటకతన. నైష. ౩. ౯౫.

క. ఘనుఁడు మహోగ్రుఁడు నాకుఁ గానఁగఁబడి యెన్. హరి. ఉ. ౬. ౬౩.

**కానక.** అవ్య. (కనుధాతువునకు వ్యతిరేకక్త్వార్థకము-చూ. కనక.)

(ప్రసవింపక)

సీ. కానక కన్నసంతానంబు శిశువులు... నైష. ౧. ౧౦౨. (కానకకన్నసంతానము=లేక లేక పుట్టినసంతతి.)

సీ. కానక కన్నసంతానంబు గావునఁ గానక కన్నసంతాన మయ్యె. రామా. ౫. ౧౨.

(ఆలోచింపక)

శుక. ౮. ౫౮. (చూ. కానిపోని.)

**కాననగు.** అ. క్రి. (√కను) అగపడు, కనఁబడు.

గీ. అథవ నీకంఠమూలంబునందుఁ దెలిసి, కానన య్యెడు నిది యేమి కప్పు చెప్పు. హర. ౬. ౫.

**కాననము.** సం. వి. అ. న. ౧. అడవి. ౨. బ్రహ్మముఖము. ౩. ఇల్లు. (మే. ని.)

**కాననాగ్ని.** సం. వి. ఇ. పుం. అడవినిప్పు, కారుచిచ్చు.

**కాననివాఁడు.** విశే. (√కను) అంధుఁడు.

ఉ. కానరివారి నూఁతగొని కాననివాఁడు విశిష్ట వస్తువుల్, కానని భంగిఁ గర్మములు గైకొని కొంచెము కర్మబద్ధులై, కానరు విష్ణు... భాగ. ౨. ౧౭౨.

**కాననౌకసము.** సం. వి. స. పుం. కోఁతి.

**కాననౌకసుఁడు.** సం. విశే. (స.) అడవిలో నుండువాఁడు. (చూ. కాననౌకుఁడు).

**కానమి.** వి. (కనుధాతువుయొక్క వ్యతిరేకభావార్థకము-చూ. కనమి.)

(అజ్ఞానము.)

ద్వి. దానవానీకంబు తలఁపులో నున్న, కానమి యెల్ల నొక్కట వెల్లవిరిసె, ననఁగఁ జీకటి కడు నగ్గలం బగుచు, దినువీథి నడు మెల్ల విప్రలమై నిండె. రం. రా. యు. ౩౫౭ పం. ౧౯౪౦.

**కానరానిమెక్కు.** వి. (√ కను) అభిజిన్నక్షత్రము. (శ. ర.)

**కానవచ్చు, కానన్ వచ్చు.** అ. క్రి. (√ కను) అగపడు, కనఁబడు.

శా. క్షోణీనాథుఁడు తీగ్రవారిపయి వక్షోజస్ఫురత్కాంచన,స్థూలాగ్రంగము గానవచ్చుటయు మెచ్చు ల్మీఱఁగాఁ జొచ్చి తత్,స్థాణిక్యోజ్జ్వలదీప్తి మెక్కు...విక్ర. ౨. ౧౦౭.

ఆ. తాలలోనఁ గానరాకుండ డాఁగి...దశా. ౧. ౨౬౬.

శా... పెక్కు పదల్, గానవచ్చె...వి. పు. ౨. ౧౦౬.

**కాని[1] (ణి).** వి. (సం. కాకణీ) రూపాయలో అఱువదినాల్గవవంతువిలువ గలరాగినాణెము.

క. కానివ్యయం బెన్నఁడు నొక, కానియుఁ జే
యంగఁ దగదు కార్యము గలచోఁ, మానక ధ
నంబుఁ దృణముగ, మానవపతి చేయునది స
మగ్రవిభూతిన్. రుక్మా. ౩. ౮౫.

సీ. కాణి యనంగను గాకణి విలసిల్లు. ఆం. భా. ౨. ౨౭౨.

కానికిఁగొను, కానికిఁగైకొను = లక్ష్యముసేయు. (దీనికి వ్యతిరేకమునందే ప్రయోగము.)

క. ఏనుఁగులు నుట్టిరాఁ జే, రేనుఁగుపై మణిమ
యంపుటెల్లులు మెఱయం, గా నీవే తెంతువు
మముఁ, గానికిఁ గొనవప్ప డిపుడు గాడిద
వై తే. భార. శాం. ౪. ౩౭౭.

శా. ఆనీలుండు వసూధిపపరివృతుండై పోయి తే
జోనిష్ఠన్, మానిం గానికి నైనఁ గైకొనక...
వరాహ. ౫. ౧౯. హరి. ఉ. ౭. ౩౧.

**కాని²**. (అగుధాతువుయొక్క వ్యతిరేకార్థకవిశేషణరూపము) విశే. సంభవింపని తగని మొదలగు నర్థములను దెలుపును.

ఉదా: కానిపని, కానితలము, కానిమాట, కానిత్రోవ, కానితలఁపు, కానివావి.

కానిబ్రదుకు = తగనిబ్రదుకు; కష్టజీవనము. భీమ. ౨. ౧౫౮.

అవ్య. ౧. తక్క అనునర్థమును దెలుపును. (దీనికి తర్వాత వచ్చుక్రియ వ్యతిరేకార్థకముగ నుండును.)

గీ... అన్నరవరునకు, వినవు నిన్నూఱు కాని లేవ
నిమొహములు. భార. ఉద్యో. ౩. ౩౧౪.

ఉ... చక్రఘోషమున నించుక యించుక గాని
యంత యే, నప్పుడ వినవైతి... నైష. ౨. ౫౮.
భార. ఉద్యో. ౨. ౧౩౭.

౨. కొన్నిచోట్ల అర్థవిశేషము లేకయే ఊఁతపదముగా నుండును.

క... రమ్మా చూతము గాని నీగమనవేగంబున్.
భార. విరా. ౨. ౭౯.

వ. నన్ననిచి వత్తువు గాని రమ్మని కరంబు సాఁచి చెయి పట్టి... భార. ఉద్యో. ౪. ౧౯.

గీ. వ్రాతఫల మేమియో కాని వనజగంధి. హంస. ౩. ౧౫౦.

౩. పూర్వోత్తరము లగువాక్యార్థములకుఁ గలభేదమును సూచించును.

చ. ప్రియములు వల్కి నిన్ననుసరింపఁగఁ బా
ర్థుఁడు గాఁడు సుమ్ము దుర్జయభుజశక్తిని ర
క్షితశత్రుఁడు భీముఁడు గాని... భార. ద్రో.
౪. ౧౪౮.

గీ. జలజకాళిమఁ బాపంగఁ జాలెఁ గాని, సహజ
కాళిమఁ బాపంగఁ జాలదయ్యె. నైష. ౮.
౧౫౭.

౪ = కానీ.

(క) బెదరించుటను దెలుపును.

ద్వి. ఆనందమునలకాంత యనుదెంచి కాంచి, కాని
కానీ పోదు గాని లెమ్మనుచు, నొఱపైనతన
కేల నొకకోలఁ బూని, తఱుచు బిత్తరము త
త్తఱము రెట్టింప. అ. మ. క. ౧. ౩౯ పా.
౧౭ పం.

(చ) వికల్పార్థమును దెలుపును.

(వ్యవ) వాఁడు నేఁడు గాని రేపు గాని వచ్చును.

**కానిక** = కానుక.

సీ... అరవిందభవుఁడు, నమరులుఁ జనుదెంచి ప్రా
ర్థించి వృషముఁ గానిక యిచ్చి కరుణ జనిం
పఁ బలికి. భార. అను. ౪. ౪౩౩.

సీ. కానుక కానిక... ఉపాయనసంజ్ఞ. ఆం. భా. ౨. ౧౯౩.

రగడ. కానిక పూవిలుకానిక యీఁ దగు. య
యా. ౪. ౨౬.

**కానిపిం(న్పిం)చు** = కనిపించు. స. క్రి. (√ కాను చు) చూపు, చూపించు, దర్శింపఁజేయు.

క. వానిం దోడ్కొని చని యా, భూనాథునిఁ
గానిపించి పొందుగఁ దత్కా, ర్యానుష్ఠానవి

కేషము, దా సైఁరేఁగించుటయు విభుఁడు దర్పయు నలరెన్. భార. అర. ౭. ౭.

క. ఆసమయమునఁ గుమారిం, గై సేసి తదీయజన నిఁ గాన్పించి చకో,రీసుదతి సుప్రయాణ, శ్రీసూచన చేసి ప్రణతి సేయించుటయున్. విక్ర. ౪. ౧౯౨.

మ. హరి తానే బలవంతుఁ డైన మును మాయ య్యాన్ విరోధించి యొ,క్కరుఁ డుగ్రాసి వ ధించ నడ్డపడి సోర్గర్వంబు గాన్పించెనే.ఉ. రా. ౩. ౧౧౭. (ఇట ప్రకటించు అని భావము.)

వ. అపూర్వాలోకనకుతూహలంబునం జనుదెంచినయమాత్యులం గానిపించుకొని. దశకు. ౭. ౧౫౪. (అమాత్యులకు దర్శన మిచ్చి అని భావము.)

అ. క్రి. కన్పడు; ప్రత్యక్షమగు.

సీ. జిలుఁగుఁబయ్యంటలోఁ గులుకుగుబ్బలు చూచి కనులఁ గాన్పింపనికొనుఁ జూచి. దశా. ౨. ౩౦౪.

సీ. అపరంజిపసిఁడిచాయలఁ గుల్కుతనువల్లికల యందు బడలికల్ గానిపించె. కవిరా. ౪. ౮౩.

శా. ఈచందంబునఁ బంక్తికంఠునకు వాణీకుండు గాన్పించి... ఉ. రా. ౨. ౧౭౮.

**కానిపోని.** విణ. (√అగు) లేనిపోని, అసత్యమైన.

ఉ... యామినీ,కాంతముఖీ యరుంధతివి కానక నీవయిఁ గానిపోనియీ,సంత ఘటించినట్టి యనేకేణులకోరికి శాస్త్రి సేసి య,త్యంతయశంబు నిల్పితి కదా... శుక. ౪. ౫౪.

**కానివాఁడు.** విణ. (√అగు) ౧. పనికిమాలినవాఁడు, అసమర్థుఁడు.

క. నరు నద్దెసఁ గలవారిని, గురుబలముబ్బ పెడఁబొగడి కొంకొంక గాఁగన్,గురుని గురుతనయు మద్రే,శ్వరు నను నేమిటికిఁ గాని వారిం జేయన్. భార. ద్రో. ౫. ౧౦౫.

౨. అనిష్టుఁడు. (ద్రా) ౩. అనర్హుఁడు. ౪. సంబంధింపనివాఁడు.

వ ... దేవాసురగంధర్వయక్షాములకు దుర్జయులైనయవ్వీరుల నిట్లు సేసి నీవు కానివాఁడవ పోలెం గొలంగి యున్నవాఁడవు... భార. అర. ౭. ౪౧౬.

**కానిక్షిసేయుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) కనిష్ఠురాలికొడుకు.

**కానీ.** అవ్య. (√అగు-కాన్ + ఈ-ఇది ప్రార్థనాద్యర్థక క్రియ యైనను క్రమముగా అవ్యయముగా మాఱినది.) ౧. కానిమ్ము. (అంగీకారమును దెలుపును.)

క. ఏకాంతంబునఁ గదిసిన, నాకాంతుం డలవసిష్టుఁ డైనం గానీ,యాకాంత సీత గానీ,వేకరఁగరె యగ్నిపొంత వెన్నయుఁ బోలెన్. విక్ర. ౩. ౬౧.

౨=కాని².

(క) వికల్పమును తెలుపును.

మ. అకటా యేమని మాటుదాన మిము నాథా వేగుజా మయ్యెఁబోం,దిక గాఁ బాదము లొత్తి మ్మనుట గాని యొంటి యేమో కదా,నికటక్షోణికి నేఁగుదె మ్మనుట గానీ కొంత సెయ్యంపుఁబూ,నికతోఁ గన్నులు విచ్చి చూచుటయొ కానీ లేదు యొక్కింతయున్. కళా. ౪. ౧౧౨. కాశీ. ౨. ౯.

(చ) బెదరించుటవు డుపయుక్తము.

శా...అ,హో వేదంబులు యాగభాగము లమర్త్య శ్రేణికే కాని మా,కేసంకం బని లేక యుండునటుగా నేర్పాటు గావించెఁ గా,నీ వేగంబ హరించి తమ్ముగితులు భగ్నీభూతముల్ సేసెదన్. దశా. ౧. ౨౪౩.

**కానీనుఁడు.** సం. వి. అ. పుం. ౧. కన్యకకొడుకు. ౨. వ్యాసుఁడు. ౩. కర్ణుఁడు.

కాను. వి. నీరు కలియనిమజ్జిగ, మథితము.

గీ...కా నన మీఱు మథితము. ఆం. భా. ౨. ౨౫౯.

ఉ. వెన్నెలకాను జుఱ్ఱుకొని వీథులయందుఁ జ కోరదంపతుల్, మిన్నులుముట్టి వెన్నెలలు మేపుమఁ బిల్లలుఁ దాము నాడఁగన్. కాశీ. ౪. ౯౩.

కానుక(న్క)=కానిక. వి. (క.కాణికె,కాణ్కె. త. కాణిక్కై) దేవుఁడు గురువు రాజులోనగు వారికి గౌరవార్థముగా నిచ్చెడుద్రవ్యము, ఉ పాయనము.

క... రత్నహయధనవస్త్ర,ప్రకరంబులు మొదల గుకా,నుక లందుకొనన్ సుయోధనుని నియ మించెన్. భాగ. ౧౦ ఉ. ౭౭౦.

సీ.రాజమార్గచిరత్నరత్నసౌధశ్రీలు గను ర క్తిఁ గుంకుమ కాన్కసేయ. ఉ. రా. ౧. ౨౩౫.

కానుగు(న్గు). వి. కరంజము. (దీనిభేదములు:- గంట్లకానుగు, తీఁగెకానుగు, నిప్పువన్నెగుత్తు లకానుగు.)

సీ. ౪ ) ొట్టు మోదుగు కానుగ గఱుగు వావిలి ... నేరేడు రెలసు బలుసు. వేం. పంచ. ౪. ౫౨౨.

గీ...కాన్గు నన్న,విరిగి సోమింప... మొదలు గాఁ గల్గుబహువిధ భూరుహములు ... హంస. ౪. ౧౧. అచ్చ.రా. యు.౪౩౮.ఆం.భా.౨.౪౭.

కానుచే(న్చు.) =కాంచే. స. క్రి.

(చూచు, సక్కించు.)

క. మానంబుతోడ వర్ధ,స్నానం బొనరించుచు న్న సాత్వత తేయుం,గానిచి యమ్మాని యను, స్థానాంతమునందు నడుగఁ జనుఁ బను లను చున్. వి. పు. ౮. ౩౦౯.

(కనిపట్టు)

ఉ...అమ్మహాత్ముల కరిష్టము లేమిట నెందు నేల పాటిల్లదు వారిఁ గాన్చుట గడించి తదీయ మహానుభావతన్. భార. విరా. ౩. ౯౯.

(ఆశ్రయించు)

ఉ...భార్గవరాము నాశ్రిత, శ్రీకరుఁ గాన్చు మాపదలు నెందఁగనీఁ డతఁ డాశ్రయించి నన్. భార. ఉద్యో. ౪. ౨౮౯.

జ: కానుపు, కాన్కి.

కానుపు(న్పు). వి. (√కానుచే) కాంచుట.

(దర్శనము; దృష్టి.)

ఉ. చిత్తము మెచ్చి నావలనఁ జిక్కెఁగ వెండి యు నాలతొంగి య,చ్చొత్తినయట్లు నాకుఁ దనయుల్లను చెల్లుసేయ కున్కి దా,నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నష్టము సొచ్చెనొ సిగ్గు పెంపు న,న్నుత్తలమందఁజేయుటకునో తలపో సియెఱుంగ నయ్యెడున్.భార.విరా.౨.౮౪.

క. ఏనును బెద్దలచే మును,వీను లలరఁ దరతరంబ విన్నవిధంబున్,మానసమున నున్న తెఱఁగుఁ, గానుపువం గన్నక్రమముఁ గథన మొనర్తున్. నృసిం. ౧. ౨౪.

(భావించుట; జ్ఞానము.)

గీ..కానఁ దనయట్ల యెదిరిని గాన్పు కాన్పు,వీపు లమఁ దాగతమ్యంబు సెప్పఁ దగదు. కాశీ. ౬. ౭౮.

(తలఁపు, అభిప్రాయము.)

క. ఇరువదినా ల్గనువారలు,నరసి మనశ్శుద్ధి బుద్ధి యనుకాన్పున న,ప్పురుసునఁ బలికెద రేఁ గను,తెరువున విను తత్త్వవిధము దేవస్తుత్యా· భార. అను. ౪. ౧౭౫.

(ప్రాప్తి, పొందుట; భాగ్యమును పొందుట.)

క...కా నేరదు మోక్షపదము, కానుపు దృఢనిశ్చ యుండు గా కున్నెనిన్. భార. శాం. ౬ ౨౯౦.

ఆ.బ్రాహ్మణులకుఁ బ్రియము పాయక చేయంగఁ, గాన్ప చూవె పుణ్యాకర్షఫలము. భార. ఆది. ౬. ౨౭౩.

సీ...కూఁతులఁ గన్న ఫలము దగిన,వరులకు సద్వ్రతచరితుల కీఁగాన్న కాదె నావుడు సూర్యుఁ డాదరించి. భార. ఆది. ౭. ౯౬.

(ప్రసూతి, ప్రసవించుట.)

గీ. ఘనతఁ జొచ్చినయింద్లను దనయు లుండి,కాన్పునకుఁ బుట్టిన శ్చేరుక్రమము గనమె. ఆము. ౪. ౭౯.

సీ.బహువార నులయందు బహువస్తువులు గాంచి కలశపాథోరాశి కానుపుడిగె. హర. ౬. ౧౨౯. ఆం. భా. ౨. ౧౧౯.

(సంతానము)

ఉ. అంచలతేరుఁ బల్కుజవరాలును బొక్కిలి తమ్మినచ్చ క్రొమ్మించుల నీను మేను నునుమిన్కుపొగడ్తయుఁ జివ్వబోన మా,సించినకాన్పు ముజ్జగము చేసిననేర్పును జన్నిదంబుఁ దీ,వంచమొగంబులుం గలుగువాఁడు చెలంగును వేల్పుఁ బెద్దయై. విప్ర. ౧.౨౩.

సీ. ననవిల్తుతల్లియై తనకు నెల్లరు గూర్మి గాన్పగాఁ గాంచినకడిఁదిపడఁతి. అచ్చ. భా. ౧. ౧౫.

కానోపు=కాఁబోలు.

సీ. ఏకారణంబున నేమయ్యెనో వానయేపునఁ దగియెఁ గానోపు నకట. భారం. శాం.౩.౩౦౦. కకు. ౧. ౧౪౩.

కాన్కి(నికి). వి. (√కానుచే) చూపు.

చ. హరునకుఁ జూడఁగా మహిఁ జరాచరరూపము లెల్ల నమ్మతిఁ,గిరిసుతరూప మై విరతభేదముఁ జెప్పఁ దొడంగె నట్లకా,కరయఁగ నాదిశక్తి సచరాచరరూపము కావునన్ మహా,పురుషులకన్న కాన్కి యనపోహము కావు డి దేమి చోద్యమొ. కు. సం. ౬. ౯౨౧. (ప్రయోగాంతరము లేదు.)

కాన్యకుబ్జము. సం=కన్యాకుబ్జము.

కాపంతము. వి. తుక్కు మెడకుఁ గట్టెడికట్టె,శ్వగళకాష్ఠము.

గీ. శ్వగళకాష్ఠంబు వెలయఁ గాపంత మనఁగ ఆం. భా. ౨. ౪౯౦.

కాపటికుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) కపటవ్యవహారము గలవాఁడు, వంచకుఁడు, మోసగాఁడు. వి. అ. పుం. రాజుయొక్క పంచవిధచారవర్గము లో నొకఁడు. (కాపటికుఁడు, ఉదాస్థితుఁడు, గృహపతి, వైదేహికుఁడు, తాపసవ్యంజనుఁడు అను నేవురు పంచవర్గ మనఁబడుదురు.అందు పరమర్మజ్ఞుఁడును ప్రగల్భుఁడు నగుఛాత్రుఁడు కాపటికుఁ డనఁబడును.)

కాపట్యము. సం. వి. అ. న. కపటము, మోసము.

కాపథము. సం. వి. అ. పుం. కుత్సితపుత్రోవ.

కాపరి. విశ. (కాపు[1]+అరి) రక్షకుఁడు, కాచువాఁడు.

ఉ. కాపరి లేనిగొఱ్ఱియలకైనడిఁ గంటకచోరకోటిచే, నేపతి యున్న దీభువన మీశుఁడు కృష్ణుఁడు లేమి...భాగ. ౧. ౪౯౨. నీలా. ౧. ౩౯.

కాపాడు. స. క్రి. (కాపు[1]+ఆడు) కాచు ,రక్షించు.

క. మీపాడినహరిచందము, లేపాడిగఁ దలఁప వచ్చునితఁ డేనతులం, గాపాడినవాఁ డనుఁ గై,త్రోపాడినఁ దన్ను వలచి తొయ్యలులా రా. ఆము. ౫. ౪౦.

కాపాలి. సం. వి. ఈ. స్త్రీ. వాయివిళంగముకీ.

కాపాలికుఁడు. సం. వి. అ. పుం. ౧. ఒకానొక సంకరజాతివాఁడు. ౨=కాపాలుఁడు.

కాపాలుఁడు. సం. వి. అ. పుం. కపాలధారి యగు శైవమతస్థుఁడు.(ఈమతస్థులు శ్మశానమందుండి పుర్రెలమాలలు ధరించి పుర్రెలలో భుజింతురు.)

కాపించు. స. క్రి. (√కాచు[1]) కావఁజేయు.

(రక్షింపఁజేయు.)

సీ. కట్టఁ గాక్షింప దక్షత లేమి నూరూర బం

దెలఁ బడిపోయెఁ బహుగణంబు. మనుచ. 3. ౧౭౯.

**కాపికము.** సం. విణ. (అ. ఈ. అ.) రూపమందుఁ గాని చేష్టలందుఁ గాని కోఁతివంటిది.

**కాపిలము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. కపిలప్రోక్తమైనది. ౨. కపిలునకు సంబంధించినది. వి. అ. పుం. పింగళవర్ణము. న. ౧. సాంఖ్యశాస్త్రము. ౨. ఒకానొక ఉపపురాణము.

**కాపిలుఁడు.** సం. వి. అ. పుం. సాంఖ్యశాస్త్రజ్ఞుఁడు.

**కాపిశము.** సం. వి. అ. న. కపిశా(=పువ్వులగురివెంద) పుష్పములనుండి తీయఁబడు మద్యము.

**కాపిశాయనము.** సం. వి. అ. న. మద్యము, కల్లు.

**కాపిశేయము.** సం. వి. అ. పుం - కపిశయొక్క అపత్యము - పిశాచము. (కల్ప)

**కాపు¹.** వి. (√కాచు¹) రక్షణము.

ఆ. విను మహింస విప్రజనులకు నెల్లభంగులను వలయుఁ బ్రజలవలనఁ గరుణ, గలిగి వారిఁ గీడు గదురకయుండంగఁ, గాపు పతి కహింస కర్త్వ మనఘ. భార. శాం. ౫. ౭౯౯.

విణ. రక్షకుఁడు, కాపరివాఁడు.

రగడ. అతివ మరుశరములకు నళిభటావళి కాపు, ప్రతి లేనివనసస్యపాళి కామని కాపు. ఉ. రా. ౬. ౬౧.

గీ. రాజముఖి కొంతవడికిఁ దారావధూటి, సొగసు నెమ్మోముఁ దప్పక చూచి పేర్మి, నుపిడ సీనెంత కొంచెకత్తెవె జయంతుఁ, గాపుఁ జేసి నగరితవు కావె నీవు. కువల. ౪. ౧౭౩. (కాపు:- విడువక కనుపెట్టుకొని యుండువాఁడు; వశుఁడు అని భావము.)

కాపువెట్టు=కావలియుండు.

సీ. ఈవిభీషణుఁ గొల్చి యేమఱ కీలంకఁ గావఁ గాఁ దగునేనఁ గాపువెట్టు. ఉ. రా. ౪. ౧౩౦. విక్ర. ౧. ౭౬.

ఇట్లే:- కాపిడు.

ద్వి... కడగొట్టుపాపఁ దారింటఁ, గాపిడి యిటు నటఁ గదలకు మమ్మ... అని యప్పగించుచు నరిగిన... బస. పు. 3. ౪౦౭ పం. (ప్రాఁత ప్రతిపా.)

**కాపు².** వి. (√కాచు²) కాయలు కాచుట.

(వ్యవ) ఈచెట్టు సంవత్సరమునకు రెండుకాపులు కాచును. ఈచెట్టునకు కాపు ఉడిగినది. ఈచెట్టు కాపునకు వచ్చినది.

**కాపుకాఁడు**=కాపరి. (కాపు¹ + కాఁడు.)

గీ. కడిఁది జడదారిజన్నంపుఁ గాపుకాఁడ, యింక నైన రొప్ప మాతప్పు లెల్ల సైఁచి, గట్టు చెట్టును దెప్పించి కట్టగట్టి, వేగిరమ దాఁటి చెడుతొలివేల్పుఁ బోఁడువు. అచ్చ. రా. యు. ౭౯.

**కాపుగడ.** వి. (√కాపు¹) రక్షణము.

ద్వి. అన్యాయములు చేసి యర్థము ల్గొనక, మాన్యతఁ బ్రోతువే మఱి కాపుగడల. రం. రా. అయో. ౧౩౭ పొ. ౯ పం. (శ. ర - మఱికాపుజనుల - ముద్రి. పా.)

**కాపురుషుఁడు.** సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు.

**కాపెట్టు.** స. క్రి. (కాపు¹ + పెట్టు) కనుపెట్టుకొను, కాచుకొను.

క. చలి విడిచి జారశేఖరు, కలయికచవి మరగి తెరువు కాపెట్టుక నిచ్చలు లేనిపనుల నెన్నే, నలవఱుచుక యుండు విరహ మగ్గల మైనన్. హంస. ౨. ౧౧౦.

**కాపేయము.** సం. వి. అ. న. ౧. కపిత్వము. ౨. కపికృత్యము, కోఁతిచేష్ట.

**కాపోతము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. కపోతమునకు సంబంధించినది. ౨. బూడిదరంగు కలది. వి. అ. న. ౧. కపోతములసమూహము. ౨. సౌవీరాంజనము. పుం. ౧. బూడిదరంగు. ౨. సర్జికా

క్షారము, రుచకము. ౩. ఒకసంవత్సరమునకు సరి పడినవస్త్వాహారమును నిలువఁజేసికొనువానప్రస్థుఁడు. (వై. ని.)

**కాపోతాంజనము.** సం. వి.అ.న. సౌవీరాంజనము.

**కాప్యకరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) తాఁ జేసినపాపముల నితరులకుఁ జెప్పువాఁడు.

**కాప్యకారము.** సం. వి. అ. పుం. తాఁ జేసినపాపముల నితరులకుఁ జెప్పుట.

**కాప్యకారుఁడు.** సం=కాప్యకరుఁడు.

**కాఫలము.** సం. వి. అ. పుం. కట్ఫలము, పెంకుకి.

**కామ.** వి. (క. కావు, కామ్పు. త. కాంపు. తు. కావు. మ. కాంబు.) ౧. ఛత్త్రము ధ్వజము మున్నగువానిదండము.

చ. గొడుగుగఁ జేసె...నగంబు...హస్త మనుకామ తిరంబుగఁ దాల్చి పొల్చుటకా. హరి.పూ. ౭. ౧౭౮.

ఆ. సిడముకామ నూడు వడఁ కెడు... భార. కర్ణ. ౨. ౧౧౮.

సీ. అలఁతిదంతంపుఁగామలపీలిసురఁటులు శోధించి వడిచినజాంటి తేనె. పి. శకుం. ౧. ౯౮.

ఉ. బంగరుకామకుం జెలువు... ప్రభా. ౧. ౨౪.

చ. కనకపుఁగామతో మరను గర్వ మెలర్పఁగ నెత్తి... భార. కర్ణ. ౧. ౧౬౯.

౨. కలువ తామర మున్నగువానికాఁడ.

గీ. కలువదొంత తాఁకినతొగకామభంగిఁ, బాఁప తేనిమే నెంతయు బలువు తఱిఁగి, స్రుక్కి ...హరి. పూ. ౭. ౪౧.

గీ. కామఁ బాసినకమలంబుకరణి... భార. కర్ణ. ౩. ౩౭౧.

గీ... కుమారి, గోఁగుకామవిధంబునఁ గొంత యొదిగె. పాంచా. ౧. ౪౮.

సీ. పువ్వులతొడిమలు పుచ్చునయుంబుఁ జివుళులకామలు సిదుము... కు. సం. ౪. ౬౧౮.

౩. కూరకాఁడ, శాకనాళము.

సీ... శాకనాళముపేరు జనును గమ్మ. గీ. కామకాఁడన... ఆం. నా. ౨. ౨౪౮.

వ. చల్లయుఁ గామలకూరయు మునగాకుచేరును గందికట్టును... చికి. ౨. (చి.ని.)

౪. మగగుఱి.

సీ. సైంధవలవణంబు సరిగాఁగ మర్దించి కామఁ బూసినవృద్ధి గలుగుచుండు. కళాశాస్త్రము. ౩. ౬౪, ౬౨.

**కామంగామి.** సం=కామగామి.

**కాము(వ)ంచి.** వి. (క. కామంచి) తృణవిశేషము, కత్తృణము, నిమ్మగడ్డి.

సీ... కామంచి కావంచి యనఁ దగుఁ గత్తృణంబు. ఆం. భా. ౨. ౭౬.

**కామంధమి.** సం. వి. న్. పుం. కాంస్యకారుఁడు, కంచరవాఁడు. (కల్ప)

**కామకళ.** సం. వి. ఆ. స్త్రీ. రతిదేవి.

**కామకారము.** సం. విణ. (అ.ఈ. అ.) తనయిచ్ఛచొప్పునఁ జేయునది. వి. అ. పుం. బుద్ధిపూర్వకముగాఁ జేయుట.

**కామకూటము.** సం. వి. అ. పుం. వేశ్యావిభ్రమము, వేశ్యావిలాసము. (మే. ని.)

**కామకూటుఁడు.** సం. వి. అ. పుం-కామమే ప్రధానముగాఁ గలవాఁడు- వేశ్యాప్రియుఁడు, విటుఁడు. (మే. ని.)

**కామకేళి.** సం. విణ. (ఇ) కాముకుఁడు. వి.ఇ.పుం. సురతము, మరుకేళి.

**కామక్రీడ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సురతము. ౨. (ఛంద) ఒకానొకవృత్తము.

**కామగ.** సం. వి. ఆ. స్త్రీ. కులట, ఱంకులాడి.

**కామగతి.** సం. విణ. (ఇ) కోరినచోటికిఁ బోవఁ జాలుశక్తి గలవాఁడు.

**కామగము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎక్కినవాని యిచ్ఛచొప్పున కోరినచోటికి తనంతట పోవునది. (పుష్పకవిమానాది)

**కామగామి.** సం. విశే. (న్. నీ. న్.) ౧. యథేష్టముగా స్త్రీగామి యగువాఁడు, యుక్తాయుక్తవివేకము లేక విచ్చలవిడిని స్త్రీలనుబొందువాఁడు. ౨. కామగమనము గలవాఁడు, ఇచ్ఛ వచ్చినచోటికి వెళ్లువాఁడు.

**కామగుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) యథేష్టముగా స్త్రీగామి యగువాఁడు, విచ్చలవిడిని స్త్రీలను బొందువాఁడు.

**కామగుణము.** సం. వి. అ. పుం. ౧. రాగము, కోరిక. ౨. విషయము, ఇంద్రియార్థము. ౩. ఆభోగము, పరిపూర్ణత. (మే. ని.)

**కామచరుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. విచ్చలవిడిగాఁ ద్రిమ్మరువాఁడు, త్రిమ్మరీఁడు. ౨. ఇష్టము వచ్చినట్లు నడచువాఁడు.

**కామచారము.** సం. వి. అ. పుం. ౧. తనయిచ్ఛచొప్పున తిరుగుట. ౨. బుద్ధిపూర్వకముగా చేయుట, కావలయు పని చేయుట. ౩. ఇంద్రియలోలత్వము, కామపరత.

**కామచారి.** సం. విశే. (న్. ణీ. న్.) ౧. విచ్చలవిడిగాఁ దిరుగువాఁడు; తనయిచ్ఛచొప్పునఁ బ్రవర్తించువాఁడు. ౨. కాముకుఁడు, కామి. వి. న్. పుం. ౧. గరుడుఁడు. ౨. చటకము, పిచ్చుక. (ఇది అతికామము గలది.)

**కామచారుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విచ్చలవిడిగాఁ దిరుగువాఁడు, ఇచ్ఛచొప్పునఁ ద్రిమ్మరువాఁడు; యథేచ్ఛముగాఁ బ్రవర్తించువాఁడు.

**కామజానము.** సం. వి. అ. పుం- కామవికారమును గలిగించునది- కోకిలము.

**కామజిత్తు.** సం. విశే. (త్) కామమును జయించువాఁడు. వి. త్. పుం. ౧- మన్మథుని గెలిచినవాఁడు- శివుఁడు. ౨- రూపముచే మన్మథుని జయించినవాఁడు- కుమారస్వామి. ౩. జినదేవుఁడు.

**కామతాలము.** సం. వి. అ. పుం. పికము, కోయిల.

**కామతిథి.** సం. వి. ఇ. పుం. స్త్రీ. త్రయోదశి.

**కామద.** సం. వి. ఆ. స్త్రీ. కామధేనువు. (మే. ని.)

**కామదార్లు.** మి. వి. బ. ధాన్యవిశేషము.

సీ. గొబ్బికాయలు బలుగుత్తులు పాలమీఁగడలు శ్రీరంగాలు కామదార్లు. హంస. ౪. ౧౨౫.

**కామదుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కామములను (= కోరికలను) ఇచ్చువాఁడు.

**కామదుఘ.** సం. వి. ఆ. స్త్రీ. వేల్పుటావు, కామధేనువు.

**కామదుఘుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అభీష్టములను పిదుకువాఁడు, కోరికల నెల్ల నొసఁగువాఁడు.

**కామదుహము.** సం. వి. హ. స్త్రీ. కామధేనువు. (హి. కామధుక్కు.)

**కామదూతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పాటల, కలిగొట్టు. ౨. ఆఁడుకోయిల.

**కామదూతిక.** సం. వి. ఆ. స్త్రీ = కామదూతి.

**కామదేవుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**కామధేనువు.** సం. వి. ఉ. స్త్రీ- కోరినవస్తువుల నిచ్చెడియావు- వేల్పుటావు.

**కామన.** సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

**కామనీయకము.** సం. వి. అ. న. రమణీయత.

**కామనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఇచ్ఛగలవాఁడు, కామించువాఁడు, కాముకుఁడు.

**కామపాలుఁడు.** సం. వి. అ. పుం. బలరాముఁడు.

**కామఫలము.** సం. వి. అ. పుం. మహారాజామ్రవృక్షము, ఒకజాతిమామిడి. (కల్ప)

**కామము.** సం. వి. అ. పుం. ౧. ఇచ్ఛ, కోరిక. ౨. కామితార్థము, కోరఁబడినవస్తువు. (శ్లో. సర్వాన్కామానవాప్నుతే. మను. ౨. ౫.) ౩. వలపు, ప్రేమ. ౪. ఒకపురుషార్థము ౫. మహారాజామ్రము, ఒకజాతిమామిడి. ౬. రేతస్సు.
(ఈశబ్దము తుమున్నంతములతో సమసించినపుడు విశేషణమై పూర్వపదాంతానుస్వారలోపముకలదియగును. ఉదా: గంతుకామము=పోఁగోరునది.)

**కామయమానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కామించుచున్నవాఁడు; కాముకుఁడు.

**కామయానుఁడు.** సం=కామయమానుఁడు.
శ్లో. కామయానసమవస్థయా తులాం. రఘు. ౧౯. ౫౦.

**కామయిత.** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) కోరువాఁడు; కాముకుఁడు.

**కామయితవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) కోరఁదగినది.

**కామరసికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కాముకుఁడు.

**కామరూపము.** సం. వి. అ. పుం. ౧. ఒకదేశము. (ఇది అస్సాముయొక్క పడమటిభాగము.) ౨. కోరినరూపము.

**కామరూపి.** సం. విశే. (న్. ణీ. న్.) ౧. కోరినరూపమును గైకొనువాఁడు. ౨. సుందరుఁడు, చక్కనివాఁడు, రూపరి. వి. న్. పుం. ౧. విద్యాధరుఁడు. (త్రి. ని.) ౨. అడవిపంది. (వై. ని.)

**కామరూపుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కోరినరూపమును గైకొనువాఁడు. ౨. సుందరుఁడు.

**కామరేఖ.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య. (వాచ.)

**కామల.** సం. వి. ఆ. స్త్రీ. కామాల యను రోగము.

**కామలత.** సం. వి. ఆ. స్త్రీ. మగగుఱి. (వాచ.)

**కామలము.** సం. వి. అ. పుం. ౧. వసంతఋతువు. ౨. మరుభూమి, నిర్జలప్రదేశము. ౩. పిత్తప్రకోపాదులవలనఁ గలుగురోగభేదము, కామెర.

**కామలి.** సం. విశే. (న్. నీ. న్.) కామలారోగము గలవాఁడు.

**కామలుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) కాముకుఁడు.

**కామవతి.** సం. వి. ఈ. స్త్రీ. దారుహరిద్ర, మ్రానిపసుపు.

**కామవరములు.** సం. వి. అ. న. బ. వస్త్రవిశేషము.
వ... పూజాబంధంబులును జలపంజరంబులును గామవరంబులును నూరవరంబులును దారామండలంబులును... అనువేళ్లు గలపుట్టంబులు గట్టుకొని...ద్వా. ౩. ౧౭౭.

**కామవల్లభ.** సం. వి. ఆ. స్త్రీ. చంద్రిక, వెన్నెల.

**కామవల్లభము.** సం. వి. అ. పుం. ౧. వసంతఋతువు. ౨. మామిడిచెట్టు.

**కామవల్లభుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**కామవాదము.** సం. వి. అ. పుం. ఇచ్ఛవచ్చినట్లు ఏదేని చెప్పుట, వదరుట.

**కామవృంత.** సం. వి. ఆ. స్త్రీ. పాటల, కలిగొట్టు.

**కామవృక్షము.** సం. వి. అ. పుం. వృక్షాదని, వృక్షరుహ, బదనిక. (రా. ని.)

**కామవృత్తి.** సం. విశే. (ఇ) తనయిచ్ఛచొప్పున వర్తించుట, స్వేచ్ఛాసంచారము.

**కామవృత్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విషయములందు విచ్చలవిడిగా వర్తించువాఁడు, యథేష్టసంచారి.

**కామశరము.** సం. వి. అ. పుం. ౧. మన్మథునిబాణము. ౨. మామిడి.

**కామశాస్త్రము.** సం. వి. అ. న. రతిశాస్త్రము.

**కామసఖము.** సం. వి. అ. పుం. ౧. వసంతఋతువు. ౨. చైత్రమాసము. 3. మామిడిచెట్టు.

**కామసువు.** సం. విణ. (ఊ) కోరికల నీనునది. వి. ఊ. పుం. వాసుదేవుఁడు. స్త్రీ. రుక్మిణి.

**కామసూత్రము.** సం. వి. అ. న. కామవ్యాపార బోధక మగుశాస్త్రవిశేషము. (ఇది వాత్స్యాయనప్రణీతము.)

**కామాంకుశము.** సం. వి. అ. పుం. ౧. నఖము, గోరు. ౨. మగగుఱి.

**కామాంగము.** సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

**కామాంధ.** సం. వి. ఆ. స్త్రీ. కస్తూరి.

**కామాంధము.** సం. విణ. (అ. ఆ. అ.) కామముచేత గ్రుడ్డి యైనది, మరులుచేత కన్ను గాననిది. వి. అ. పుం. కోయిల.

**కామాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. దేవీమూర్తిభేదము. ౨. వాద్యవిశేషము.

వ. ... కామాక్షులు ముఖవీణలు పిల్లఁగ్రోవులు దండెలు డక్కీలు... ప్రబంధ. ౬౦౪.

3. యోగులు ధరించు ఆభరణవిశేషము.

సీ. అపరంజిపసిఁడికామాక్షులు దామూఁపుపై గొండ్లి గావించుయోగపట్టె. వేం. పంచ. ౪. ౧౧౧. (౨, 3. అర్థములు తెనుఁగుననే కాన్పించుచున్నవి. ఇది 3. వ అర్థమున అచ్చతెనుఁగుప్రబంధమునను గనఁబడుచున్నది.)

సీ. కడునొప్పునంకులు కామాక్షికవ గాఁగ... యయా. 3. ౪౬.

**కామాటము.** వి. (క. కామాట) మోటపని, కూలిపని.

మ... భానుపుత్రాదులకా, వినుమీ చంపక పట్టి తెచ్చి దినము న్నీయింటికామాటపుం, బనికిం జొచ్చెద మన్నదాఁక నిది చెంపల్ వైతు మత్యుద్ధతికా. రామా. ౮. ౧౮౪.

జ: కామాటి.

**కామాటి.** విణ. (కామాటము + ఇ-త. కామాట్టి. క. కామాటి) మోటపని చేయువాఁడు, కూలిపని చేయువాఁడు.

**కామాతురుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కామార్తుఁడు, విరాళి గొన్నవాఁడు.

**కామాత్మజుఁడు.** సం. వి. అ. పుం. ప్రద్యుమ్నుని కొడుకు, అనిరుద్ధుఁడు.

**కామాధిష్ఠానము.** సం. వి. అ. న-కామమున కధిష్ఠానము-ఇంద్రియమనోబుద్ధులు.

**కామాయుధము.** సం. వి. అ. న. ౧. మన్మథునికైదువు. ౨. మగగుఱి. పుం. మామిడిచెట్టు.

**కామాయువు.** సం. వి. స్. పుం. గరుడుఁడు. (త్రి. ని.)

**కామారి.** సం. వి. ఇ. పుం. ౧. శివుఁడు. ౨. విటమాక్షిక ధాతువు.

**కామాల=కామెర.** వి. (సం. కామలా. త. కామాలై) కన్నులు పచ్చనగురోగవిశేషము.

సీ... పసరిక యనఁ, గామాల యనఁగను గామలాభిధ మీఱు...ఆం. భా. ౨. ౧౨౭.

**కామాలిక.** సం. వి. ఆ. స్త్రీ-కామోద్రేకమును గలిగించునది-సుర, మద్యము. (వాచ.)

**కామాలు(ఖు)వు.** సం. వి. ఉ. పుం. రక్తకాంచనముచెట్టు.

**కామి.** వి. (అగుధాతువుయొక్క వ్యతిరేకభావార్థకరూపము.)

(కాకపోవుట)

ఉ. చీటికిమాటి కేకపథసీమ మెలంగఁగఁ బాటిగామి శ్యం, గాటకవీథి కేఁగె ... నైష. 3. ౯3.

(తగకుండుట.)

క. విను హవ్యకవ్యములు మ,జ్జనభోజనములును విప్రజాతివనిత దాఁ, బనిసేయ నడపునది యప్పనులకుఁ బెఱసతులు గామి బ్రాహ్మణుఁడు నృపా. భార. అను. ౨. ౨౮౦.

**కామి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. కాముకుఁడు,మిక్కిలి మరులు గలవాఁడు. ౨. కోరిక గలవాఁడు. వి. ఈ. స్త్రీ. రతిదేవి. న్. పుం. ౧. స్త్రీకి వశుఁ డగుమగఁడు. ౨. సారసము, బెగ్గురుపక్షి. ౩. పావురము. ౪. చక్రవాకము, జక్కవ. ౫. చటకము, పిచ్చుక. ౬. ఋషభము అనుఓషధి.

**కామించు.** సం. స. క్రి. ౧. మోహించు, వలచు.

వ ... తొల్లి యక్కామినిం గామించి దానిచేత నిరాకృతుం డైనవాఁడు కలి యనునొక్కగంధర్వుండు... మార్క. ౫. ౧౦.

౨. కోరు.

(శ్రీరంగపురవర్ణనము.) సీ. కామించు దేవర్షిగణము లేపెనుఁబ్రోల శ్వపచపక్షిమృగాదిజంతువృత్తి. వైజ. ౧. ౪౨.

**కామిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుది. ౨.మిక్కిలి వలపు గలస్త్రీ, ప్రియసంగమమునందు మిక్కిలి యాస గలయాఁడుది. ౩. సుందరి, అందకత్తె. ౪. భీరువు, పిఱికియాఁడుది. ౫. మ్రానిపసుపుచె. ౬. వంద, బదనికచె. ౭. ఆఁడుజక్కవ. ౮. ఆఁడుపావురము. ౯. ఆఁడుబెగ్గురుపక్షి. ౧౦. మద్యము, సుర.

**కామినీశము.** సం. వి. అ. పుం. శోభాంజనవృక్షము, మునగచె. (కల్ప.)

**కామీనము.** సం. వి. అ. పుం. రామపూగము, నిడుపుతొడిమ గలపోఁకచె.

**కామీలము.** సం=కామీనము.

**కాముఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**కాముకకాంత.** సం. వి. ఆ. స్త్రీ. మాధవీలత, పువ్వులగురివెందచె.

**కాముకము.** సం. వి. అ. పుం. ౧. పిచ్చుక. ౨. అశోకవృక్షము. ౩. శింశుప, ఇరుగుడుచె. ౪. తినాసము, సెమ్మిచె. ౫. మాధవీలత,పువ్వులగురివెందచె.

**కాముకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)-ధనాదులందు-ఇచ్ఛ గలవాఁడు. (అ.ఈ.అ.) మైథునేచ్ఛ గలవాఁడు.

కామెర=కామాల.

ఉ. కన్నులు వాఁచి తోయములు గాఱెడు నేని మరీచిఁ బిప్పలిన్,నున్నగ నూఱి పెట్టనొక నొప్పియుఁ బుట్టదు కామెరైనయా,కన్నుల గుంటలన్ రసము కాటుకవట్టుచుఁ దద్రసంబులోఁ,గన్నులఁ బెట్టఁ గామెరలు గ్రక్కునఁ దీఱు దినాష్టకంబునన్. సహదేవశిక్ష.౧. ౧౦౨. (చి. ని.)

కామేశ్వరి. సం. వి. ఈ. స్త్రీ. దుర్గాభేదము.

కామేశ్వరుఁడు. సం. వి.అ.పుం.పరమేశ్వరుఁడు.

కామ్యకర్మము. సం. వి. న్. న. స్వర్గాదికామ్యవిషయములను గోరువాఁడు చేయఁ దగుకర్మము. (జ్యోతిష్టోమాది.)

కామ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడుచున్నది.

కామ్యము. సం. విణ. (అ. ఆ. అ ) ౧. కోరఁ దగినది. ౨. కోరికతోఁ జేయఁబడునది, ఐచ్ఛికము. (వ్యతి- నిత్యనైమిత్తికములు) ౩. కమనీయము, సుందరము, చక్కనిది. (కల్ప.) వి. అ. న. ౧. అశ్వమేధాదికామ్యకర్మము. ౨. రాగి,తామ్రము. (వై. ని.)

కామ్లము. సం. విణ. (అ.ఆ.అ.) ఇంచుక పుల్లనిది. వి. అ. న. ఇంచుకపులుసు.

కాయ. వి. (√కాయు. త. క. కాయ్. తు. కాయి. కు. కావు.) ౧. చెట్టు తీఁగ మున్నగునవి కాచెడు కాయ; శలాటువు, పచ్చికాయ.

శా... గుమ్మడికాయయంత యగుముత్తెం బై... ఆము. ౪. ౨౧౩.

ఉ. పాయక వేరు వెల్లఁకియుఁ బండులు నొం డులు గూరగాయలుం, గోయుచు... కు.సం. ౬. ౬౯౨.

సీ. ... శలాటు వగుచు, గాయన ... ఆం. భా. ౨. ౩౯.

౨. వీణ కమర్చినసొఱకాయ.

సీ. వీణెలగవుసెనల్ వెడలించి చెఱఁగుల మెఱుఁ గు రాఁ గాయలమీఁదఁ దుడిచి. హరిశ్చ. ౨ ౧౦౬.

సీ. శశికాంతమణిపీఠి జాజావాఱఁగఁ గాయ లు త్తుంగకుచపాళి నత్తమిల్ల. మనుచ. ౨. ౨౭.

౩. కిణము, రాపిడివలన శరీరమునం దేర్పడిన కాయ.

ఉ. కన్నులసన్నలం బనులు గైకొని వారక చే యుచుండుటన్, ము న్నటు లున్న పాణితల ముల్ బలు గాయలు గాచెఁ జూచి తే. భార. విరా. ౨. ౨౨౧.

వ. ... ఎడపని కావటి మోపులకతనం గంది కా యలు కాచి వంగినవలుదమూఁపులును ... హరి. పూ. ౫. ౧౪౨.

౪. శిశువు, బిడ్డ. (ఈయర్థ మాలంకారికము.)

ఉ... నాలు గేన్, గాయలు గాయ వచ్చెలువ గర్భమునం దిటువంటిపాపమో. వేం. పంచ. ౧. ౫౮౮.

౫. నేత్రరోగవిశేషము.

ద్వి. పల్లమీసములు నేర్పడుకాయకన్నుఁ, బిల్లిగ డ్డంబును నల్లని మేను. బస. పు. ౩. ౧౧౧౬ పం.

౬. చెడిపోయినధాన్యము.

(వ్యవ) కాయయు పొల్లును లేని వడ్లు.

౭. జూదము, మొ. ఆడునపుడుపయోగించుసారె లోనగునది. (శ. ర.)

కాయధాన్యము = కాయనుండి పుట్టుధాన్యము. (మినుములు పెసలు, మొ.—వడ్లు వరగలు మున్నగునవి గడ్డిధాన్యములు.)

సీ. సెనగలు గోదుమల్ మినుములుఁ దిలలు ముద్గ ములు మున్నుగఁ గలకాయధాన్యములు... ఉ. రా. ౮. ౧౬. సుక. ౩. ౪౮౧.

కాయోపండో (డొ) = సఫలమో విఫలమో.

క... కాయోపండో, కలయూపు చెప్పు మనవు డు, ఫలియించును గోర్కి పొఱఁగొట్టుము వ గలన్. భోజరా. ౩. ౨౫౯.

సీ. పొలఁతి కాయోపండొ పోయినపని యన్నఁ జిలుకమాటను నవ్వుసొలపుఁ దేట. విజ. వి. ౨. ౧౪౧.

(వ్యవ) నీకొఱకు చూచి చూచి నాకన్నులు కాయలు కాచినవి.

కాయపెండలము = పెండలపుకాయ, పెండలపు తీఁగయొక్క కాయ.

(చెంపకాయ తలకాయ పిల్లకాయ మొట్టికాయ మున్నగునవి యూయాస్థలములందుఁ జూచునది.)

జః కాయకంటి, కాయకన్ను.

కాయకంటి. స. (కాయ + కన్ను) కుబేరుఁడు. (శ. ర.)

కాయకన్ను. వి. (√కాయ) కాయకాచినకన్ను. (శ. ర.)

కాయకము. వి. (క. కాయక. త. కాయకమ్.) జీవనోపాయము, జీవనవ్యాపారము; వ్యాపారము, వృత్తి.

ద్వి. కాయకంబులు పెక్కు గఱచుటఁ జేసి, వేయు విషంబుల విత్త మార్జించి. బస. పు. ౫. ౯ పం.

గీ. అనఘుఁ డొకనాఁడు తొల్లిటియట్ల నేఁగి, లిం గ మెప్పటిపాదనుంచి లీలఁ గాయ, కంబు సేయుచునుండంగఁ గష్టకర్మ, చిత్తు లొకకొం

దవఁది చూచి చెలఁగి నగుచు. చెన్న. ౩. ౨౦౭, ౧౯౫.

ఉ. కానకు నంపత ప్పెఱుఁగుగబ్బి మెకంబులు నేరఁ గాయపో, తేనుఁగుదాయ యెల్గు పులి యేసినయే టుసివోయెఁ బోయిన, న్నానితి ని స్సిగో యనుచు మాకులకాయక మైనవేఁట... కవు. ౪. ౫౭.

**కాయక్లేశము.** సం. వి. అ. పుం. ౧. దేహమునకుఁ గలుగుబాధ. ౨. దేహపరిశ్రమము.

**కాయజలము.** సం. వి. అ. న. మూత్రము.

**కాయజుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**కాయబంధనము.** సం. వి. అ. న. ౧. మొలదట్టి, నడుముకాసె. ౨. చేతనాధిష్ఠితమై దేహారంభహేతు వగుశుక్లశోణితసంయోగవిశేషము.

**కాయమానము.** సం. వి. అ. న. ౧. దేహపుఁగొలఁది, దేహపరిమాణము. ౨. పర్ణకుటీరము, ఆకుటిల్లు. ౩. పందిరి. ౪. వేశ్యాగృహము. ౫. కేళీగృహము. (వై. ని.)

**కాయము.** వి. బాలెంతలకిచ్చెడుమందు.

చ. చెలువకు బిడ్డపుట్టు విలసిల్లఁగ భిల్లపురంధ్రు లంతలోఁ, బిలువరె మంత్రసానిఁ దలపెట్టరె కాయముఁ గూర్ప లేమకున్, జలకము గాఁ పరే కొలను చయ్యనఁ ద్రవ్వరె మందగామినిన్, నిలువఁగనీకురే యనుచు నేర్పరులై కడు సంభ్రమింపఁగన్. కాళ. ౩. ౨౬. ఇందు. ౨. ౫.

**కాయము.** సం. విశ. (అ. ఆ. అ.) ప్రజాపతిదేవతాక మైనది. (హవిరాది) వి. అ. పుం. న. ౧. దేహము. ౨. స్కంధము, చెట్టుబోదె. ౩. సమూహము. ౪. మూలధనము, మొదలు, అసలు. ౫. స్వభావము. ౬. గృహము. ౭. లక్ష్యము, గురి. ౮. తంతులు తప్ప తక్కినవీణాభాగము. ౯. కనిష్ఠాంగుళిమూలస్థానము. (దీనిని ప్రజాపతితీర్థ మందురు.) పుం. ప్రాజాపత్య మనెడివివాహభేదము.

**కాయవలనము.** సం. వి. అ. న-కాయమును గప్పునది-కవచము.

**కాయస్థ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ధాత్రి, ఉసిరికచెట్టు. ౨. హరీతకి, కరకచెట్టు. ౩. కాకోలి, కాకుకొల్లిచెట్టు. ౪. ఏలకిచెట్టు. ౫. తులసిచెట్టు.

**కాయస్థుఁడు.** సం. వి. అ. పుం. ౧. పరమాత్ముఁడు. (హేమ. ని.) ౨. కరణము, లెక్కలు వ్రాయువతఁడు. (పరశురాముఁడు క్షత్రియవంశసంహారము సేసినపుడు గర్భిణి యయియున్న యొకక్షత్రియస్త్రీ దాల్భ్యుని శరణుచొచ్చి యతనియాశ్రమములో దాఁగుకొనెను. అతనికిని పరశురామునకును జరిగినసంభాషణముపిదప ఆమెగర్భమం దున్నశిశువును రక్షించుటకు పరశురాముఁ డంగీకరించెను. ఆశిశువు చిత్రగుప్తవంశమందలివారిచేఁ బెంపఁబడి వారివృత్తి యైనలెక్కలు వ్రాయుపని వృత్తిగాఁ గైకొనెను. ఆశిశువుయొక్కవంశ్యు లప్పటినుండియు కాయస్థు లని చెప్పఁబడుచున్నారు.)

**కాయాగ్ని.** సం. వి. ఇ. పుం. జీర్ణశక్తిని గలిగించుజఠరాగ్ని.

**కాయిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రత్యహవృద్ధి, గోజావడ్డి. (శే. ని.) ౨. తాకట్టు పెట్టినఎద్దులు ఆవులు మున్నగువాని నుపయోగించుకొని ఆరూపమునఁ బుచ్చుకొనువడ్డి.

**కాయికము.** సం. విశ. (అ. ఈ. అ.) శరీరమునకు సంబంధించినది. (పాపాది)

**కాయు[1].** స. క్రి. (త. క. కాయ్.) ప్రసరింపఁజేయు.

వ.... చందురుండు కందర్పదిగ్విజయకీర్తిస్ఫూర్తియుం బోనియచ్చవెన్నెలవిచ్చలవిడిం గాయం దొడంగె. కాశీ. ౩. ౨౩.

క. ఇనుఁ డెండ గాయ శంకిలు. భా.రా.బాల. ౧౨౬. వరాహ. ౪. ౨౯.

అ. క్రి. (ఎండ, వెన్నెల) ప్రసరించు.

సీ...ఒకదివిఁ బేరెండ యుబ్బి కాయు. కాశీ. ౧. ౧౨౯.

ఆ. పిండిఁ జల్లినట్లు పండువెన్నెలలు గా,యంగఁ దొడఁగెఁ జెలువ మమర నంత.కళా.౭. ౧౬.

**కాయు**[2]=కాచు[1] స. క్రి. రక్షించు.

గీ. ధీయుతుఁ డటంచు నలువ దీర్ఘాయు వొసఁగి,కాయు రఘునాథవిభు వజ్రకాయుఁ గాఁగ. విజ. ౨. ౧. ౪.

మ...హయమేధంబుల్ఘటింపం దలం,చి విసంఖ్యాధ్వజినీ పరంపర నుదీచీప్రాచ్యవాచీప్రతీ,చ్యవధిక్షోణికి యజ్ఞము క్తహరిఁ గాయం బంపి...వరాహ. ౧. ౧౨౯.

**కాయు**[3]=కాచు[2]. స. క్రి. (కాయలు, మొ.) కాచు.

(వ్యవ) ఆచెట్టు వేయికాయలు కాసినది.

శా. కాయం జొచ్చె రసాలముల్ విరహులాకంపింపఁ గాఁ గోయిలల్,గూయం జొచ్చె మనోజదిగ్విజయ మాఘోషించుచుం దుమ్మెదల్,మ్రోయం జొచ్చె. ద్వా. ౭. ౧౨.

అ. క్రి. (కాయలు, మొ.) పుట్టు, బయలుదేఱు.

ఉ....నాలు గేళ్,గాయలు కాయ వచ్చెలువ గర్భమునం దెటువంటిపాపమో. వెం.పంచ. ౧. ౫౭౭.

(వ్యవ) ఆచెట్టున నాలుగుకాయలు కాసినవి.

**కాయువు(య్వు)**. వి. కాంక్ష, ఇచ్ఛ; అనురాగము, కామము.

సీ. ఇచ్ఛ కాయువు కోర్కి యేఁకట కోరిక యాస యం చనఁగఁ జెన్నలరుఁ గాంక్ష. ఆం. భా. ౧. ౧౩౭.

చ. కర మనురాగ ముల్లమునఁ గ్రమ్మఁగ నమ్మృగిపుచ్ఛమూలము, న్గరమున నంటుచు న్నృపతి కామవికారము నొంద పీఁకఁ ద,త్పరమతియై తనుం దివుచుపార్థివుచిత్త మెఱింగి యేల నీ,కరమునఁ బుచ్ఛమూల మిటు కాయ్వునఁ బట్టెదు మేదినీశ్వరా.మార్క. ౫.౨౩౨.

సీ. అంగుళంబుల నల్ల నలకలు గబళించి కమ్మోవియాని యొక్కింతుఁ గాయ్వు. భార. విరా. ౨. ౩౧౦.

సీ. రాగోత్కటమున సైరణ లేక మానినిఁ గాయ్వునఁ బైపడి కవయఁ దలఁచు. కు. సం. ౫. ౫౨౪.

**కార**. వి. కాసమర్దము.

సీ...బలుసు కార కసి వెంద యన నొప్పు కాసమర్దంబు...ఆం. భా. ౨. ౬౩.

**కార**. సం. వి. ఆ. స్త్రీ. ౧. చెఱ, బంధనము. ౨. చెఱసాల. ౩. వీణకరివె, ప్రసేవకము. ౪. దూతిక. ౫. స్వర్ణము. ౬. కారిక, శ్లోకరూప మగు సూత్రము. (వి.ని.)౭.పీడ,కాటియ.(త్రి.ని.)

**కారంజము**. సం. విణ. (అ. ఈ. అ.) కరంజవృక్షసంబంధ మైనది, కానుగుచెట్టునకు సంబంధించినది (ఫలతైలాది)

**కారండవము**. సం. వి. అ. పుం. కన్నెలేడిపిట్ట.

**కారంధమి**. సం. వి. న్. పుం. ౧. కంచుపనివాఁడు. ౨. ధాతువాదరతుఁడు. (మే. ని.)

**కారంభ**. సం. వి. ఆ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము.

**కారకము**. సం. విణ. (అ. రికా. అ-సమాసాంతములందే) కర్త, చేయునది.(ఉదా: కాంతికారక

ము, మొ.) వి. అ. న. ౧. (వ్యాక) క్రియానిష్పాదక మగుకర్త్రాదిషట్కము. (ఇవి కర్త, కర్మము, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము అని ఆఱు.) ౨. కర్త్రాదులను గూర్చి చెప్పువ్యాకరణభాగము. ౩. కరకాజలము, వడగండ్లనీరు.

**కారకవిభక్తి.** సం. వి. ఇ. స్త్రీ. (వ్యాక) కర్త్రాది బోధక మగువిభక్తిభేదము.

**కారకహేతువు.** సం. వి. ఉ. పుం. కారకరూప మగుహేతువు, ఉత్పాదకహేతువు. (కుండకు మట్టివలె-వ్యతి.జ్ఞాపకహేతువు.నిప్పునకు పొగవలె)

**కారగ్గి.** వి. (కారు³+అగ్గి.) కార్చిచ్చు, దవానలము.

గీ. ఎగ్గతంబునఁ దాను గారగ్గిఁ గాలె, నటె... భార. ఆశ్ర. ౨. ౧౬౩.

ఉ. వెగ్గల మైనకూర్మి నరవిందదళాయతనేత్ర కొండకారగ్గి పటీరకాష్ఠములయందు రవుల్కొనఁ జేసి...కాశీ. ౫. ౧౫౯.

**కారడుగు.** వి. (కారు¹+అడుగు) రెండవపంట. (బ్రౌ.)

**కారణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. యాతన, తీవ్రవేదన. ౨. ప్రేరణ, పురికొలుపుట.

**కారణకారణము.** సం. వి. అ. న. ౧. కారణమునకుఁ గారణము, దూరకారణము. (ఘటమునకు కులాలునితండ్రివంటిది) ౨. పరమేశ్వరుఁడు. ౩. పరమాణువు. సం. కిరా. ౧౫. ౩౫.

**కారణమాల.** సం. వి. ఆ. స్త్రీ. ఒకఅర్థాలంకారము. (ఇందు పూర్వపూర్వములకు ఉత్తరోత్తరములు గాని ఉత్తరోత్తరములకు పూర్వపూర్వములు గాని హేతువులుగా నుండును- ఉదా: నరకము పాపమువలనఁ గలుగును. పాపము దారిద్ర్యమువలనఁ గలుగును-నీతిచే ఐశ్వర్యము కలుగును. ఐశ్వర్యముచే ఈవి కలుగును.)

**కారణము.** సం. వి. అ. న. ౧. (క్రియానిష్పాదకము) హేతువు. ౨. వధము. ౩. సాధనము, కరణము. ౪. ఇంద్రియము. (కల్ప.)

**కారణశరీరము.** సం. వి. అ. న. (వేదాంత) అజ్ఞానరూప మగుశరీరము; స్థూలసూక్ష్మశరీరములకు లోపల నున్నదై దేహాంతరమును గలిగించుటకుఁ గారణ మగుశరీరము.

**కారణికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ)-కారణములను గొని విచారించువాఁడు-పరీక్షకుఁడు.

**కారణోత్తరము.** సం.వి. అ.న. వాది యుపన్యసించినవిషయమును సత్యముగా నంగీకరించి దానికిఁ బ్రాతికూల్యమును సాధించుకారణములను జెప్పు ఉత్తరము.

**కారపుఁజెక్క.** వి. (కారము¹+చెక్క) ద్రాక్షత్వక్కు. (శ. ర-దాల్చినిచెక్క?)

**కారపుఁబడుగు.** వి.(కారము¹+పడుగు)గట్టినూలిపడుగు.(శ.ర.)

సీ. కారంపుఁబడుగులు కండెలకప్పెర...హంస. ౨. ౧౧.

**కారపుఁబూస.** వి. (కారము¹+పూస.) సెనగపిండిలో కారము కలిపి చముదులో వేఁచి చేయుభక్ష్యవిశేషము.

**కారము¹.** వి. (సం. క్షారః. ప్రా. కారం. క. కారవు. త. కారమ్) ౧. షడ్రసములలో నొకటి, కటువు.

క. తరుణికి ధాత్రీపతికిని, బరిచుంబనవేళ దంతపరిపీడన మి,క్షురసంపుఁ బానకములో, మిరియపుఁ గారంబు వోలె మెచ్చొనరించెన్. నైష. ౭. ౧౫౦.

౨. చౌడు.

చ...బుద్ధితోఁ, బొరయనిపాతకంబులు సబుద్ధిక
పుణ్యములన్ నశించు నం, బరమునఁ బట్టినట్టి
మలపంకము గారములోన నద్దఁగా, విరిసిన
యట్లు నమ్ము మిది వేదము సెప్పిన నేను జె
ప్పితిన్. భార. శాం. ౩. ౩౬౪.

౩. నూలు తడిసెడునొకానొక ద్రవద్రవ్యవిశేషము. (శ. ర.) ౪. ఓడ్డలకుఁ బోసెడునొకానొక మందు.

సీ. బలుబూటకపుఁదల్లిప్రాణంబు లుగ్గుగా నెమ్మి
తోఁ జిటిబొజ్జ నిండఁ ద్రావి, పసిఁ దహ
తహపెట్ట ముసరెడుకార్చిచ్చుఁ గారంపు
మందుగా నారగించి. చమ. ౧. ౩౨.

విశే. కటువైనది.

చ. వలపులు గ్రమ్మఁగాఁ బొగచి వండినకార
పుఁగాయఁగూర ల, ప్పళములు ... అర్కపు
త్రము, ఋష్యులు రఘురాముబంతిఁ బ్రియ మొ
ప్ప భుజించి సుఖించి రెంతయున్. ఉ. రా.
౫. ౨౮౮.

కారపుమన్ను=సౌడు. ఆం. భా. ౨. ౫.

జ: కారపుఁజెక్క, కారపుఁబడుగు, కారపుఁబూస.

**కారము**². ఒకానొక తద్ధిత ప్రత్యయము.

ఉదా: నుడికారము, కొలగారము.

**కారము.** సం. వి. అ. పుం. ౧. చేఁత, పని, కార్యము. (ఉదా: పురుషకారము) ౨. యత్నము, పూనిక. (శిశు. ౧౯. ౨౭.) ౩. బలము. ౪. సురతము, రతి. ౫. వధము. ౬. నిశ్చయము. ౭. పూజోపహారము, బలి. ౮. హిమాచలము. ౯. సుంకము, పన్ను. ౧౦. ఒకధ్వనిని గాని వర్ణమును గాని చెప్పునప్పుడు వచ్చుప్రత్యయము. (ఉదా: అకారము, ఫూత్కారము.)

**కారయిత.** సం. విశే. (ఋ. త్రి. ఋ.) చేయించువాఁడు.

**కారయితవ్యము.** సం. విశే. (అ.ఆ.అ.) చేయింపఁ దగినది.

**కారయిల్లు.** మి. వి. ఔ. (కార + ఇల్లు) కారాగృహము, చెఱసాల.

తగలము. ఖలుఁడు గంసుఁడు పెద్దకాలము కార
యింట నడంచె... భాగ. ౧౦. పూ. ౧౩౦.

**కారవము.** సం. వి. అ. పుం.-'కా' అని కూయునది-కాకి. (త్రి. ని.)

**కారవల్లి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. కారవేల్లము, కాఁకరకాయ. (వాచ.)

**కారవి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. శతపుష్ప, సదాపకూర. ౨. రుద్రజటకూర. ౩. ఇంగుపత్రనియాకు. (వై. ని.) ౪. నల్లజీలకఱ్ఱ. ౫. దీప్యము, ఓమము. ౬. క్షుద్రకారవేల్లము, పొట్టికాఁకరకాయ. ౭. అఁడుకాకి.

**కారవేల్లము.** సం. వి. అ. పుం. కాఁకరకాయ.

**కారస్కరము.** సం. వి. అ. పుం- చావును గలిగించునది-విషముష్టి, ముసిఁడికాయ.

**కారస్కరాటిక.** సం. వి. ఆ. స్త్రీ. కర్ణజలౌకము, చెవి దూఱుపాము, చిన్నజెఱ్ఱి. (త్రి. ని.)

**కారాకు.** వి. (కారు[1] + ఆకు) జీర్ణపర్ణము, పండుటాకు.

క. వైరమున నులిచి త్రెంపక, కారాకులు డుల్లి
నట్లు కర్మము లెల్లం, దార పెడఁబాయ వల
యుట, సాఁకృపం దెలియఁ జెప్పె శౌరి య
తనికిన్. భార. భీష్మ. ౧. ౨౦౪.

ద్వి. కారాకు సుడిగాలి గడువడిఁ ద్రిప్పు, తీరున
నాని దిర్దిర మింటఁ ద్రిప్పి. రం. రా. సుం.
౨౬౨ పా. ౧౪ పం.

**కారాకూరము.** విశే. క్షుభితము, కలఁత నొందినది.

క. అకీలిఁ బారునము పో, సారంగధరుండు తోడి
జననాథసుతుల్, సారెకుఁ గేళలు వేయఁగఁ,

గారాకూర మయి మనసు కళవళపడఁగన్. సారంగ. ౨. ౩.

స్రగ్ధర. కారాకూరంబులై రాక్షసులహృదయముల్ గాడ్పడన్ రామునాజ్ఞన్. ఉ. రా. ౧. ౧౨౬.

వి. నిర్బంధము; క్షోభము.

శా...కా,రాకూరంబులు చేసినం గదలి నే రానిచ్చుటన్ బ్రాణముల్,పోకార్తుం దుది నాదువేలుపునకై బొంకన్నిజం బింతయున్. కాశీ. ౩. ౮౨.

మ...ఏకడ నినున్ వీక్షింపలే కున్కి మా,రదశన్ వేఁగెదుకాంత నింత పెనుఁగారాకూరముల్ సేసె నీ,మదిపగ్గు...పరమ. ౩. ౨౭౧.

(పెనుఁగారాకూరముల్ సేసెన్=ఎక్కువక్షోభపెట్టెను.)

**కారాగారము.** సం. వి. అ. న. చెఱసాల.

(ఇట్లే కారాగృహము, మొ.)

**కారాగుప్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) చెఱఁబెట్టఁ బడినవాఁడు, బంది.

**కారాట.** వి. వ్యాపనము. (శ. ర.)

**కారాడు.** స. క్రి. తోలు, నడపు.

గీ. హైమరథములఁ దోలి గంధాంధభద్ర,కరులఁ గారాడి దుముదారుగా హయాళిఁ,జేరవకు నూకి భటులకుఁ జేయి వీచి,యభ్యమిత్రీయదైవసైన్యంబు గదిసి. దశా. ౨. ౩౮౮. (ప్రయోగాంతరము లేదు.)

**కారాపాలుఁడు.** సం. వి. అ. పుం. చెఱసాలయధికారి.

**కారామణులు.** మి. వి. బ. (√కారు⁴?) వల్లబొబ్బరలు. (బ్రౌ)

**కారాయిక.** సం.వి.ఆ. స్త్రీ.బలాక,ఆఁడుకొక్కెర.

**కారావరుఁడు.** సం. వి. అ. పుం. ఒకసంకీర్ణజాతివాఁడు, నిషాదునకు వైదేహస్త్రీయందు పుట్టినవాఁడు.

**కారావు.** వి. (కారు³+ఆవు) అడవియావు.(బ్రౌ)

**కారి.** ఒకానొకతద్ధితప్రత్యయము.

ఉదా: మాటకారి,చలవకారి,కతలకారి.

**కారి.** సం. విణ. (న. ణీ. న.) చేయువాఁడు. (ఈయర్థమున నిది సమాసాంతమునసే ఉండును. ఉదా: కార్యకారి.)-ఇ-శిల్పి, కారువు. (మే. ని.) వి. ఇ. స్త్రీ. క్రియ, పని.

**కారించే.** సం. స. క్రి. బాధించు, పీడించు.

సీ. కొంచక నీరిలో ముంచుచు నెత్తుచుఁ గారించి తీరంబు సేరఁ బెట్టు.భార.ఆది.౫.౧౬౬. (ప్రాఁతప్రతిపా.)

ఉ. ...నీ వడియాసల వచ్చి రిత్త గా,రింపక మాను మాతనిచరిత్రము నీకును మాకు వింతయే. భార. ఉద్యో. ౧. ౩౧౪. భాగ. ౧౦ ఉ. ౫౪౭.

**కారిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. క్రియ,చేయుట. ౨.శిల్పము. ౩.శ్లోకరూపమగుసూత్రము. ౪.హింస, యాతన. ౫. నటునిపెండ్లాము, నటమోహ. ౬. ఒకవిధమైనవడ్డి, వృద్ధిభేదము, కారిత.

**కారికము.** విణ. (క. కారికె.త.కారిక్కమ్.)అనాహతము, చలువ చేయనిది, క్రొత్తది. (వస్త్రము-శ.ర, బ్రౌ.)

**కారిజేము.** వి. (సం. కాలేయమ్) కడుపులో కుడిప్రక్క నుండెడుమాంసఖండవిశేషము, కాలఖండము.

ఆ...సన్నగూర కారిజంబు క్రొవ్వు,పొదలుమారిషములు పొసఁగుకజ్జంబులు,వంబుజాతగంధులనువుపఱచి. రుక్మా. ౩. ౨౨౬.(శ.ర.పా.)

వ...ఎఱచిలో మే లేటికారిజమున్ గందనకాయ క్రొవ్వు మెదడ లగుమిగులమెత్తనిపలలభిత్తం

బు లందుఁ గ్రందుకొనం గ్రుక్కి... మనుచ. ౪. ౬౦.

**కారిత.** సం. వి. ఆ. స్త్రీ. అప్పు పుచ్చుకొన్నవాఁడు తనయక్కఱకొలఁదిని స్వయముగా ఏర్పఱచుకొన్న ఎక్కువవడ్డి, ఒడఁబాటువడ్డి. (శ్లో. ఋణికేన తు యా వృద్ధి రధికా సంప్రకీర్తితా, ఆపత్కాలే కృతా నిత్యం సా తు స్యాత్కారితా మతా. వాచ.)

**కారితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చేయింపఁబడినది. ౨. హింసింపఁబడినది. ౩. చెఱఁ బెట్టఁబడినది.

**కారిసము.** వి. (సం. కార్శ్యం) బాధ.

గీ. ఓతపస్విని సుకృతసంయుతచరిత్ర, వినుము కడునార్త యగుదీనిఁ గనికరంబు, దొఱఁగి యే మివ్విధమున నత్యుగ్రభంగిఁ, గారిసంబులఁ బెట్టెడికారణంబు. శ్రీరం. ౪. ౭౭౭. (ప్రయోగాంతరము లేదు.)

**కారీరము.** సం. విణ. (అ. ఈ. అ.) కరీరసంబంధమైనది.

**కారీరి.** సం. వి. ఈ. స్త్రీ. వర్షముకొఱకు చేయు ఇష్టిభేదము.

**కారీషము.** సం. వి. అ. న. ఏఱుపిడుకలప్రోగు.

**కారు¹.** వి. (సం. కాలః. క. కారు.) ౧. కాలము, సమయము.

సీ. ఎన్నోఁటఁ దీర్ఘంబు లేకారు జనుల కిచ్ఛామాత్ర భోగమోక్షప్రదములు. భీమ. ౩. ౬౫.

ఉదా:- ననకారు.

౨. (త. కార్. క. కారు.) వర్షాకాలము.

సీ. కారు చిత్తడి తొలుకారు తొలుకరి నా వర్షర్తు సంజ్ఞలై పరఁగుచుండు. ఆం. భా. ౧. ౧౬.

క. కారనువీరుఁడు మెఱుఁగను, దోరసిఁ బాంథు లనురిపులఁ దునిమినఁ దద్దే, హారుణబిందులు దొరిఁగెనొ, ధారుణి నన నింద్రగోపతతి విలసిల్లెన్. కు. సం. ౬. ౭౫౧.

క. దొరసినక్రొక్కారున భా,సురశాద్వలతలము లోలిఁ జూడఁగ నొప్పెన్, మరకతమణిగణములు భా,స్వరముగఁ దాపించియున్న జగతియుఁ బోలెన్. భా. రా. కిష్కిం. ౩౧౪.

౩. జ్యేష్ఠాదిమాసచతుష్టయము, కందాయము.

సీ. ఆయతి కారు కందాయ మనంగ జ్యేష్ఠాదిమాస చతుష్టయంబు దనరు. ఆం. భా. ౧. ౧౬.

మ... సారసారణులు తత్కేదారకోదారస,స్యము ముక్కారును బాఁడఁజేయ ... వసు. ౧. ౧౧౦.

౪. ఎండకాలమందు చల్లెడువరిధాన్యము.

ఉదా: కారువడ్లు. (శ. ర.)

౫. జీర్ణము, పండినది. (చూ. కారాకు.)

౬. వయసు.

ఉదా: వారందఱు నొకకారువారు. (శ. ర.)

౭. ఏఁడు, సంవత్సరము.

(వ్యవ) ఇది నాలుగుకారులగిత్త.

జ: కారడుగు, కారాకు, కారుమెఱుఁగు, కారుమొగులు.

**కారు².** వి. ౧. ఒగరు. ౨. ఉప్పు.

(వ్యవ) నూతినీళ్లు కారెక్కినవి.

విణ. ౧. ఒగరైనది.

ద్వి. కసుగాయ గ్రొంచినఁ గారగుఁ గాక. (బ్రౌ)

౨. ఉప్పనిది.

ఉదా: కారునీళ్లు.

జ: కారుకొను¹.

**కారు³.** వి. కాడు, అడవి.

చ. అదియును గాక కోలుపులి నైనను గారెనుపోతు నైన ను,న్మదకరి నైన నుగ్రమృగనాథుని నైనను గిట్టి ముట్టి పట్టును ... భార. విరా. ౧. ౧౩.

విశ. దున్ననిది. (పొలము.)

సీ...తఱచు వాన,కారుపొలంబునఁ గల్గె నేని యుఁ గొల్చు గావింప నేర్చునే యేవిధమున, వల నేర్పడఁగ దున్నఁ బొలములో నైనవ ర్షంబు లేకున్న ధాన్యంబు లగునె ... భార. సౌ. ౧. ౩౧.

జ: కారగ్గి, కారావు, కారుకంది, కారుకొను[2], కారుకొమ్ముమేకము, కారుకొల్లి[2], కారుకోడి, కారుక్రమ్ము[2], కారుగచ్చు, కారుగోఁగు, కారుచిచ్చు, కారుజనము, కారుదున్న, కారునూవు, కారుపసరము, కారుపెసర, కారుపోఁక, కారుపోతు, కారుబుడమ, కారుమినుము, కారుమునగ, కారుసంపెఁగలు, కారూటి, కారూరు, కారెనుము, కారేలకి.

**కారు**[4]. వి. (క. కారు. త. కాల్) ౧. నలుపు. (చూ. కారుకొను౩) ౨. తాంబూలము వేసికొనుటవలన పట్టెడు గార.

సీ. కోరమీసముతీరు నోర వీడెపుఁ గారు నోరచూపుల సౌరు నొఱపు దనర. చెన్న. ౪. ౨౬౪.

కారుపాఱు=నలుపెక్కు.

ద్వి. పడఁతివీనులచెల్వుపడయుంగరామి, నుదుగ కెంతయు వ్రేఁగుచుండె శష్కులులు, తెఱవ మెఱుంగు వాతెఱ సోఁక గాక, తఱి దప్పి చివురు లెంతయుఁ గారుపాఱె. ద్వి. తి.సా. ౧. ౭ పా. ౨౬ పం.

జ: కారుకొను[2], కారుక్రమ్ము.

**కారుండి.** సం. వి. ఈ. స్త్రీ. జలౌకసము, జలగ.

**కారుండిక.** సం. వి. అ. స్త్రీ=కారుండి.

**కారుఁడు.** సం. విశ. (అ. ఈ.అ-ఇది సమాసాంతమందే ఉండును.) చేయువాఁడు.

ఉదా: గ్రంథకారుఁడు, కుంభకారుఁడు, మొ.

వి. అ.పుం.౧.వటి.౨.యతి, సన్న్యాసి. (శా.ని.)

**కారుకంది.** వి.(√కారు[3])వనతువరి,అడవికందికి.

గీ. వనతువరి గోఁచుఁ గాయికం దనఁగ...ఆం. భా. ౨. ౬౪.

**కారుకొ(క్రొ)ను**[1]. అ. క్రి. (√కారు[2]) ఒగరెక్కు.

సీ. తమ్మికెంపులకు నెత్తావి గూర్పనితప్పు చివురులు గాక్రొనఁ జేయుతప్పు. అచ్చ. రా. ఆర. ౨౧.

**కారుకొ(క్రొ)ను**[2]. అ. క్రి.(√కారు[3]-కాఱుకొను అని శ.ర. కాని దానికి నిర్ధారకప్రయోగములు లేవు) ౧. అతిశయించు.

మ. మదభృంగాలకకాంతి కారుకొన శుంభద్గుచ్ఛవక్షోజసం,పద రాణింపఁగ...జాహ్నవీ. ౨. ౧౦౯.

౨. విజృంభించు;వ్యాపించు, క్రమ్ము.

క. కరితురగసమితిఁ గాక్రొని, కురువీరుల మొనలు మొగులుకొమరునఁ గవియన్, శరవేగంబున నరుఁ డుద్ధురమారుతచండభంగి దోఁపఁ దెరలెచ్చెన్. భార.విరా. ౪. ౨౭౦.

క. కారుకొని మేఘమాలా,కారంబునఁ జాలనొప్పెఁ గౌరవసైన్యం,బారూఢవీరరసవి,స్ఫారంబై యంతఁ దోఁచెఁ బాండవబలమున్. భార. భీష్మ. ౨. ౧౬౯.

**కారుకొ(క్రొ)ను**[3]. అ. క్రి. (√కారు[4]) నల్లవాఱు.

గీ. గర్భగోళస్థితుం డైనకాలకంఠు,కంఠహాలహలచ్ఛాయకాళిమంబు, నాభిబిలమున వెడలి కన్పట్టినట్లు, కమలపత్త్రేక్షణుని నారు గారుకొనియె. కాశీ. ౪. ౪.

**కారుకొమ్ముమేకము.** వి. (√కారు[3])దుప్పి. (శ. ర.)

**కాఱుకొట్టి**=కారుకొల్లి[1]. (శ. ర.)

**కారుకొల్లి**[1]. వి. (సం. కాకోలీ)కలిగొట్టుకి.(బ్రా, శ. ర.)

**కారుకోల్లి².** వి. (√కారు³) అడవియులవ, వనకుఘత్థము*.

గీ. ...తప్పెట కారుకోల్లి,మాడి యనఁగ వనకుఘత్థ మగు మహేళ. ఆం. భా. ౨. ౧౮.

**కారుకో(రో్క)డి.** వి. (√కారు³) వనకుక్కుటము, అడవికోడి.

గీ.... కారుకోళ్లు,కన్నె డెఱ్ఱవనికస్తురిగమిశిశువులు ... ఆదిగాఁ దెచ్చి పతి కుపాయనము లిచ్చి. పి.శకుం. ౧.౯౮.

క. కుక్కులలో శబరులలోఁ, గక్కురచిమ్మటలలోనఁ గారోక్కుఖులలోఁ, బక్కుణముగుడి సెనకుమను, గుక్కుపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్. శివరా. ౪. ౪౬. ఆం.భా. ౨. ౯౨.

**కారుక్రమ్ము¹.** అ. క్రి. (√కారు⁴) కారొ్కను, నల్లనగు.

సీ. గరళంపుఁగప్పునఁ గారుక్రమ్ముచు నున్నయుత ము త్తెపుఁగంటసరి యమర్చి. జాహ్నవీ. ౧. ౧౩౧.

**కారుక్రమ్ము².** అ. క్రి. (√కారు³) దట్టముగా వ్యాపించు.

సీ.నిగిడి యీగులకెంపుసెలకట్టు గలచోటఁ గల్వకావిరి కారుక్రమ్ముచోట. పాండు. ౩. ౧౫౮.

**కారుగచ్చ.** వి. (√కారు³) వాగుజి, బావంజి*.

సీ. కారుగ చ్చనఁగను గ్రాలు వాకుచియును... ఆం. భా. ౨. ౫౫.

**కారుగోఁగు.** వి. (√కారు³) కొండగోఁగు*.

వ... నిమ్మపండ్లయచ్చపుఁబచ్చడాలు చాల స్త్రీలుచుం గారుగోఁగులపైఁ బర్వ... యయా. ౪. ౧౩.

**కారుచి(ర్చి)చ్చు.** వి. (కారు³ + చిచ్చు) అడవిలో చెట్లు ఒండొంటితో రాచుకొనుటవలనఁ గలిగినచిచ్చు, దవానలము.

చ. ...అ,కొక్కులఁది నుదారసారరణకోవిదబాహులు లోకపాలకుల్, గలసిరి కారుచిచ్చునకు గాచ్పులు నోడగుచంద మొందఁగన్. ఉ. హరి. ౧. ౨౨.

క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చుకరణి ... భార. భీష్మ. ౩. ౨౭౮.

**కారుచే(ర్చ).** స. క్రి. (√కాఁచు)కాఁచించు, నాటించు.

చ. కవవటు డించి యే గునుకఁగా సురె గొంపు లఁ గార్చి...ఆము. ౬. ౮౧. (శ. గ, వ్రాఁత ప్రతి పా- తార్చి అని ముద్రి. పా.)

**కారుజేనము.** వి. (√ కారు³) శణపుష్పిక, గిలకచెట్టు.

**కారుజము.** సం. వి. అ. పుం. ౧. కలభము, ఏనుఁగుపిల్ల. ౨. వల్మీకము, పుట్ట. ౩. నాగకేసరము*. ౪. గైరికధాతువు. ౫. నురుఁగు. ౬. కారునువ్వు, అడవినువ్వు*. (హేమ. ని.) న. శిల్పిచిత్రము, శిల్పక్రియ. (చెక్కుట చిత్తరువువ్రాయుట లోనగుపని.)

**కారుణికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) కనికరము గలవాఁడు, కృపాళువు.

**కారుణ్యము.** సం. వి. అ. న. దయ, కనికరము.

**కారుణ్యముసేయు.** మి. స. క్రి. దయసేయు, ఇచ్చు.

మ... ఈనరేం, ద్రసుతుం డొండొకభార్య నొల్లక ఘణింప్రాయున్నవాఁ డమ్మనా,లసఁ గారుణ్యము సేయు మీతనికి నుల్లాసంబు సంధిల్లఁగన్. మార్క. ౩. ౮.

**కారునున్న.** వి. (√ కారు³) అడవినున్నపోతు,వనమహిషము.

సీ. కారెనుపోతనఁ గారునున్న యనంగ వనమహిషం బొప్పు...ఆం. భా. ౨. ౮౩.

**కారునూవు.** వి. (√ కారు³) అడవినువ్వు, జర్తిలము*.

**కారుప(ర్ప)సరము.** వి. (కారు³ + పసరము.) అడవిపశువు.

చ...కాఁకల నిండి పొంగుకా,ర్పసరపుఁబాలచే నివురఁ బాటిననివ్వరివోగిరంబుతో,మసలు వెలుంగురాచలుపమంటలఁ గాల్కఱకుట్లనం జూడుల్, మెసవి...చంద్రా. ౨. ౮౬.

**కారుపెసర.** వి. (√ కారు³) అడవిపెసర, ముద్గపర్ణి. ఆం. భా. ౨. ౨౩౫.

**కారుపోఁక.** వి. (√ కారు³) అడవిపోఁక, శైలపూగము.

**కారుపో(ర్పో)తు.** వి. (√ కారు³) వనమహిషము, అడవిదున్న.

మ. పులులుఞ్ సింగములు న్మదేభములుఁ గార్పోతుల్...ఇందు. ౨. ౫౧.

ద్వి...పోరాడెడికారుపోతులును. నవ. ౧. ౮౭ పా. ౬ పం.

**కారుబుడమ.** వి. (√ కారు³) అడవిబుడమ, తీవ్రగంధము.

**కారుమినుము.** వి. (√ కారు³) మాషపర్ణి. ఆం. భా. ౨. ౬౭.

**కారుమునగ.** వి. (√ కారు³) అడవిమునగ, వనశిగ్రువు. ఆం. భా. ౨. ౮౮.

**కారుమె(ర్మె)ఱుఁగు.** వి. (√ కారు¹) వర్షాకాలపు మెఱపు.

క. కారుమెఱుం గన మఱదే,వేరియుఁ దాననఁ గఁ బైఁడివిరిదం డన బం,గారపుబొమ్మనఁ గా సిం,గారంబున దేవయాన కడుఁ జెలువొందెన్. యయా. ౮. ౯౧.

సీ. కార్మెఱుంగున కిట్టికళ గలదే...ఉ. రా. ౮. ౧౭౯.

**కారుమొ(ర్మొ)గులు.** వి. (కారు¹ + మొగులు) వర్షాకాలమేఘము.

వ...ఉప్పరంబునన్ గప్పుకొని మిగుల మెఱయు కారుమొగుళులవలన దిగునగణితజలధారలతీరునన్...ఉ. రా. ౨. ౬౧.

వ. కార్మొగులు తెగలను గని...వసు. ౨. ౧౧.

**కారువు.** సం. విణ. (ఉ. ఉ, స్త్రీ. ఉ.) ౧. చేయువాఁడు. (హేమ. ని.) ౨. శిల్పి. వి. ఉ. పుం. ౧. విశ్వకర్మ. ౨. ఇంద్రుఁడు. (శే. ని.) ౩. శిల్పము. (హేమ. ని.)

**కారుసంపెఁగలు.** వి. బ. (√ కారు³) ధాన్యభేదము. ప్రబంధ. ౧౧౨.

**కారూటి.** వి. (కారు³ + ఊటి.) వన్యవృక్షవిశేషము. (దీనిపండ్లు నిమ్మకాయలంతలై నల్లనై యుండును. ఇవి యభక్ష్యములు. దీనిమ్రాను మూలములు మొదలగువాని నుపయోగింతురు. చి. ని.)

**కారూరు.** వి. ఔ. (కారు³ + ఊరు-క. కారూరు) అడవిపల్లె.

వ. ...వల్లియలు వైచి కోడెలం బట్టి పెనఁచి కారూళ్ల జట్టికాఱులకు వశంబు సేయుబరవసంబెసంగఁ గ్రుమ్మరువారును ... హరి. పూ. ౫. ౧౮౨.

**కారె.** వి. క్షారతృణము, ఒకవిధ మగుగడ్డి.

సీ. క్షారతృణం బగుఁ గారె నా ... ఆం. భా. ౨. ౭౬.

**కారెనుము.** వి. (√ కారు³) వనమహిషము.

వ. ఉపరిప్రదేశంబులఁ గారెనుపపెంటపట్లనీరాఱు నేఱుపిడుకలదాళ్లిడి. మనుచ. ౮. ౬౦.

కారెనుపోతు = కారెనుము. ఆం. భా. ౨. ౯౩.

**కారెము.** వి. నీరుతోఁడుట కుపయోగించు నొక సాధనము. ద్వి. పరమ. ౮. ౨౬౫ పా.

కారెమెత్తు = కారెముతో నీళ్లు తోఁడు.

చ. బడలినవార లిందనుకఁ బాదులు త్రవ్వియుఁ గారెమెత్తియున్, మడవలు దీర్చియుం బిద

ప మార్చియుఁ గాలువ లేర్పరించియున్.
వి.ప్ర. ౩. ౭౪.

**కారేణవము.** సం. విశే. (అ.ఈ.అ.) కరేణువునకు సంబంధించినది. (పాలు, మొ.)

**కారేలకి.** వి. (కారు[3] + ఏలకి) ఏలాపర్ణి. (శ.ర.)

**కారోత్రము.** సం. వి. అ. పుం. సురామండము, కల్లుతేట. (రూ. కారోత్తమము.)

**కార్కరకము.** సం. వి. అ. పుం. పాలనురుఁగు.

**కార్కవాకవము.** సం. విశే. (అ. ఈ. అ.) కృకవాకువునకు (=కోడికి) సంబంధించినది.

**కార్కశ్యము.** సం. వి. అ. న. ౧. కర్కశభావము, కఱకుఁదనము, కఠినత్వము. ౨. నిర్దయత్వము, క్రూరత్వము.

**కార్చు(లుచు).** స. క్రి. (√కాలు[1]) కాఱఁజేయు, స్రవింపఁజేయు.

చ. అలికులవేణి యో ర్తొకనిహస్తముల న్ముఖమజ్జనాంబువుల్, గలఁతియ యొత్తిపోయ నవి గార్చుచు నుండె నతండు దోయిటన్. నైష. ౬. ౧౧౨.

సీ. కనుదోయి బాష్పముల్ గార్పఁబోదు. గంధ. ౯౬.

**కార్జము**=కారిజెము. (శ.ర.)

**కార్ణము.** సం. విశే. (అ. ఈ. అ.) కర్ణమునకు సంబంధించినది. వి. అ. న. ౧. చెవిగులిమి. ౨. చెవిపోఁగు.

**కార్తయుగము.** సం. విశే. (అ. ఈ. అ.) కృతయుగమునకు సంబంధించినది.

**కార్తవీర్యుఁడు.** సం. వి. అ. పుం-కృతవీర్యునికొడుకు-కార్తవీర్యార్జునుఁడు. (ఇతఁడు హైహయదేశపురాజు. జమదగ్నికామధేనువును బలవంతముగా హరించుటచే నతనికొడుకగుపరశురామునిచే హతుఁడయ్యెను.)

**కార్తస్వరము.** సం. వి. అ. న. ౧-కృతస్వర మనెడిగనిలోఁ బుట్టినది-స్వర్ణము, బంగారు. ౨. ఉమ్మెత్త.

**కార్తాంతికుఁడు.** సం. వి. అ. పుం-కృతాంతమును (=సిద్ధాంతమును) ఎఱిఁగినవాఁడు-జ్యోతిషికుఁడు, జోస్యుఁడు.

**కార్తికము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. కృత్తికానక్షత్రమునకు సంబంధించినది. ౨. కార్తికమాసమునకు సంబంధించినది. వి. అ. పుం. ఒకానొకమాసము.

**కార్తికి.** సం. వి. ఈ. స్త్రీ. కార్తికపూర్ణిమ.

**కార్తికికము.** సం. వి. అ. పుం. కార్తికమాసము.

**కార్తికేయుఁడు.** సం. వి. అ. పుం-కృత్తికాపత్యము-కుమారస్వామి, కందుఁడు.

**కార్తె.** వి. (సం. కృత్తికా) ౧. కృత్తికానక్షత్రము.

సీ. కార్తెఁ బాయస మబ్జగర్భునితార మాషములు... భార. అను. ౨. ౩౬౭.

౨. (సం. క్రాంతిః=సంక్రాంతి) సూర్యుఁ డుండు నక్షత్రము; అందు సూర్యుఁ డుండు కాలము. ఉదా: చిత్తకార్తె, మొ.

**కార్త్స్న్యము.** సం. వి. అ. న. కృత్స్నభావము, సాకల్యము.

**కార్దమము.** సం. విశే. (అ. ఈ. అ.) కర్దముచేత వర్ణాంతరమును పొందినది. (వస్త్రాది)

**కార్దమికము.** సం=కార్దమము.

**కార్పటము.** సం. వి. అ. పుం. ౧. కర్పటము, చినిఁగినవస్త్రము. ౨. జతువు, లక్క.

**కార్పటికుఁడు.** సం. వి. అ. పుం. ౧-చింపికావిగుడ్డ గట్టుకొని తిరిగెడివాఁడు-తైర్థికుఁడు. ౨. తీర్థము మోసికొని తెచ్చి యిచ్చుటచేత బ్రతికెడువాఁడు. ౩. తీర్థము మోసికొనిపోయెడు బాటసారి. ౪. కోమటి.

శ్లో. ద్విత్రాణ్యహాని సంభ్రామ్య స కార్పటికసత్త్త
మః. కాశీఖండము. ౩౦.అధ్యా. (శ.ర.)

**కార్పటుఁడు.** సం. వి. అ. పుం-జీర్ణవస్త్రము కట్టుకొని యాచించువాఁడు-అర్థి, యాచకుఁడు.

**కార్పణ్యము.** సం.వి.అ.న-కృపణభావము-౧. పేదఱికము. ౨. పిసినిగొట్టుతనము. ౩. దీనత్వము.

**కార్పాసనాసిక.** సం. వి. ఆ.స్త్రీ. తర్కువు, నూలువడికెడుకదురు.

**కార్పాసము.** సం.విణ. (అ. ఈ. అ)-ప్రత్తికి సంబంధించినది-నూలు,చీర, మొ. వి.అ.పుం. న. ౧. ప్రత్తికాయ. ౨. ప్రత్తి. ౩. నూలు. ౪. వస్త్రము. ౫. కాగితము.

**కార్పాససౌత్రికము.** సం. విణ. (అ.ఈ.అ.) ప్రత్తినూలిచేతఁ జేయఁబడినది. (వస్త్రాది.)

**కార్పాసాస్థి.** సం.వి.ఇ.న. ప్రత్తిగింజ.

**కార్పాసి.** సం.వి.ఈ.స్త్రీ. ప్రత్తిచెట్టు.

**కార్పాసిక.** సం. వి. ఆ. స్త్రీ. ప్రత్తిచెట్టు.

**కార్పాసికము.** సం. విణ. (అ.ఈ.అ.) ప్రత్తితో చేయఁబడినది. (నూలిబట్ట, మొ.)

**కార్మణము.** సం.విణ. (అ.ఈ.అ.) ౧. పనియందు సమర్థమైనది. ౨. నెఱవేఱుదాఁక పనిచేయునది. ౩. కర్మసంబంధమైనది. వి.అ.న. ఓషధ్యాదులచేత చేసెడియుచ్చాటనాదిక్రియ, చిల్లంగి.

**కార్మారకము.** సం.వి.అ.న. కమ్మరిపని.

**కార్మారుఁడు.** సం.వి.అ.పుం.శిల్పి, కర్మకారుఁడు; కమ్మరి.

**కార్మికము.** సం. విణ. (అ. ఈ. అ) చిత్రసూత్రములచే నిర్మింపఁబడినచక్రస్వస్తికాదిచిత్రములు కలది. (వస్త్రము.)

శ్లో. కార్మికే రోమబద్ధే చ త్రింశద్భాగః క్షయో మతః. యాజ్ఞ. వ్యవ. ౧౮౦. (కార్మికం కర్మణా చిత్రేణ నిర్మితమ్. యత్ర నిష్పన్నే పటే చక్రస్వస్తికాదికం చిత్రం సూత్రైః క్రియతే తత్కార్మికమిత్యుచ్యతే. మితాక్షర.)

**కార్ముఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) కర్మశీలుఁడు, కర్మముచేయుస్వభావముగలవాఁడు.

**కార్ముకము.** సం. విణ. (అ. ఆ. అ.) పనియందు నేర్పరి. (మే. ని.) వి. అ. పుం. ౧. మహానింబము, పెద్దవేము!. ౨. వెదురు!. ౩. శ్వేతఖదిరము, వెలిచండ్ర!. ౪. హిజ్జలము, ఎఱ్ఱగన్నేరు!. న.౧. విల్లు. ౨. (జ్యోతి) ధనూరాశి. ౩. తూలస్ఫోటనము, దూదియేకెడివిల్లు.

**కార్య.** సం. వి. ఆ. స్త్రీ. కానీవృక్షము,వాకుఁడు!.

**కార్యకరము.** సం. విణ. (అ.ఈ.అ.) పని చేయునది.

**కార్యకాఁడు.** మి. విణ. (కార్యము+కాఁడు) కార్యము నెఱవేర్చుకొనువాఁడు.

ఆ. ప్రతిన వలదు వైరిపట్టున నృపతికి, దండు వెడలఁ దీరకుండుఁ దీరుఁ,గాక యుండి యుండి కాలాంతరమున నౌఁ,గార్యకాఁడో యంతకాఁడొ నృపుఁడు. ఆము. ౪. ౨౬౩.

**కార్యకారణభావము.** సం. వి. అ. పుం. ఒకటి కార్యముగాను మఱొకటి కారణముగాను ఉండెడిసంబంధము.

**కార్యదర్శి.** సం. విణ. (న్. నీ.న్.) పని నిర్వహించువాఁడు.

**కార్యపుటుఁడు.** సం. వి. అ. పుం. ౧.క్షపణకుఁడు. ౨. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు. ౩. అనర్థకరుఁడు. (వి. ని, మే. ని.)

**కార్యము.** సం. విణ. (అ. ఆ. అ.) కర్తవ్యము, చేయఁదగినది. వి. అ. న. ౧. కర్మము, వ్యాపారము, పని. ౨. ప్రయోజనము. ౩. ఆవశ్యకత, అ

క్క—౪. ర. వ్యాజ్యము, అభియోగము. ౫. హేతువు. (హేమ. ని.) ౬. జన్యము, పుట్టినది. (వ్యతి. కారణము.) ౭. (జ్యోతి) జన్మలగ్నమునకు దశమస్థానము. ౮. (నాటక)కథతేల్చుట, కథాపర్యవసానము.

**కార్యశబ్దికుఁడు.** సం. వి. అ. పుం-శబ్దము నిత్యము కాదు జన్యమని వాదించువాఁడు-నైయాయికుఁడు. (వాచ.)

**కార్యస్థానము.** సం. వి. అ. న. కార్యము నడపుచోటు, కచేరి.

**కార్యి.** సం. విశే. (న్. ఈ. న్.) ౧. పని కలవాఁడు, ఉద్యోగి. ౨. కార్యార్థి, ఒకప్రయోజనమును గోరువాఁడు. ౩. వాజ్యమునందున్నవాఁడు, వివాదయుక్తుఁడు. ౪.(వ్యాక) స్థాని, దేనికి ఆదేశము వచ్చునో అది.

**కార్యికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) కార్యి, వ్యాజ్యమునం దున్నవాఁడు. (వాది లేక ప్రతివాది.) మను. ౭. ౧౨౪.

**కార్వాకు.** వి. క్షుద్రతృణవిశేషము. హంస. ౫. ౪౫.

**కార్శానవము.** సం. విశే. (అ. ఈ. అ.) కృశానుసంబంధమైనది. (జ్వాల, వేఁడి, మొ.)

**కార్శ్యము.** సం. వి. అ. న-కృశత్వము-౧. బక్కతనము. ౨. తగ్గుదల. ౩. సన్నఁదనము, సూక్ష్మత్వము. పుం. ౧. సాలవృక్షము, మద్దిచెట్టు. ౨. లకుచము. ౩. కచోరము.

**కార్షకుఁడు.** సం. విశే. (అ.క్షి కా. అ) దున్నుకొని బ్రతుకువాఁడు, కాఁపువాఁడు, కృషీవలుఁడు.

**కార్షాపణము.** సం. వి. అ. పుం. న. ౧. పదియాఱుపణములయెత్తు. ౨. కర్షమెత్తువెండిటంకము. ౩. ధనము.

**కార్షాపణికము.** సం. విశే. (అ. ఈ. అ.)-కార్షాపణ మిచ్చి కొనినది.

**కార్షి.** సం. వి. ఈ. స్త్రీ. సుకందరాలత, ప్రాచీతీఁగ, నాఁచుతీఁగ.

**కార్షికము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. ఒకకర్షమునకుఁ గొనఁబడినది. ౨. కర్షమెత్తు గలది. ౩. కర్షణమునకు (=దున్నుటకు) అర్హమైనది. వి. అ.పుం. కార్షాపణము, కర్షమెత్తువెండిటంకము.

**కార్షికుఁడు.** సం. విశే. (అ.ఈ.అ.)=కార్షకుఁడు.

**కార్షుఁడు.** సం. విశే. (అ. ఈ.అ.)=కార్షకుఁడు.

**కార్ష్ట్యము.** సం. వి. అ. న. కృష్టత్వము, దున్నఁబడియుండుట.

**కార్ష్ణము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. కృష్ణునకు సంబంధించినది. ౨. వ్యాసునకు సంబంధించినది. ౩. కృష్ణమృగమునకు సంబంధించినది. ౪. కృష్ణదేవతాకమైనది. (హవిరాది.)

**కార్ష్ణి.** సం. వి. ఇ. పుం-కృష్ణునిఅపత్యము-౧. మన్మథుఁడు, ప్రద్యుమ్నుఁడు. ౨. శుకుఁడు. ఈ. స్త్రీ. శతావరి, పిల్లపీఁచర.

**కార్ష్ణ్యము.** సం. వి. అ. న. కృష్ణత్వము, నల్లఁదనము.

**కాఱియ**[1]. వి. (సం. కారికా. ప్రా. కారి ఆ.) బాధ, కష్టము.

క. వేఁడొకవిలు గొని విమతుఁడు, దూఱఁగ వారిమేన నాపెఁ దొమ్మిదియమ్ముల్, మాఱు బదింటఁ బొదివెం, గాఱియగా మఱియుఁ బఱపెఁ గమిఁ గొనఁ దూపుల్. హరి. ఉ. ౧. ౧౫౭.

ఉ. పాటిసఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతి
నూజుతోడ నీ, కాటియ మద్బలంబునకుఁ
గాఁడగునే వివిధాస్త్రసంపదల్, మీటినసీవ
నూడఁగ...భార. కర్ణ. ౩. ౧౦.

క. కాటియలఁ బడుచు... రసిక. ౩. ౧౧౦. కేయూర. ౩. ౨౬౫.

జ: కాటియపడు, కాటియపెట్టు.

**కాటియ².** వి. నలుపు.

సీ. కృతి కట్టి కాటియు కటియ నల్లన నల్పు కప్పు
కిం దనఁగను నొప్పుఁ గృష్ణవర్ణంబు...అం.
భా. ౧. ౧౧౯.

విణ. నల్లనిది.

**కాటియవ(ప)డు.** అ. క్రి.(√కాటియ1) బాధపడు.

క. మనుజు వరింపక మనుజాంగన మనుజాళను
వరించి కాటియపడునే. భా.రా.సుం.౨౨౨.

**కాటియవె(పె,బె)ట్టు.** స. క్రి. (కాటియ¹+పెట్టు.) బాధపెట్టు.

ఉ...మేల్, గాటియవెట్టి యైన నొడికంబుగ
వండుదు నెల్లకూరలున్. భార. విరా. ౧. ౭౭.

చ. కటికితనంబు మాన్చి చటుకామవిడంబముఁ
గూర్చి లజ్జ సంగటపడఁ జేసి యర్థిఁ గడుఁ
గాటియ పెట్టినపాతకంబు... నైష. ౩. ౫౪.

వ...కాటియం బెట్టు...మనుచ. ౩. ౯.

**కాఱు¹.** అ. క్రి. (సం. క్షర్.) ౧. స్రవించు.

శా. మోముల్ వెల్వెలఁ బాఱఁ గన్నుఁగవ నా
మోదాశ్రువుల్ గాఱ...కన్గొనిరి దైత్యుల్
దంభనారాయణున్. దశా. ౨. ౨౯౯.

చ...చెక్కులను దద్దయు ముద్దులు గాఱు మో
మున,న్నవ్వుల వలరారు...నీలా. ౨. ౧౯.

౨. రాలు.

ఉ...నయనకోణములన్ దహనస్ఫులింగముల్,
గాఱఁగ...హరి.పూ. ౪. ౧౪౪. కేయూర.
౧. ౬౦.

జ: కార్పు.

**కాఱు².** వి. (త. కార్.) అజ్ఞానము.

క. వెలుగఁ గనిసం బ్రకృతికి, జూఱు విడిచిన
ట్లతనదుసుజ్ఞానము న,క్కాఱు విడిచి తన
కంటెను,మీఱు నొకటి లేమి గాన్పు మెయి
కొనవలయున్. భార. అను. ౪. ౨౦౨.
(ప్రయోగాంతరము కనఁబడ లేదు.)

బ. ౧. పరుషోక్తులు, కఠినోక్తులు.

ఉ. ఆఱడిపోకయున్ ఫలము నందుటయున్ గని
వల్కు నేరమిన్, మాఱటనోరిదాన వయి
మాటలు చిత్తమునందు నిల్పకేఁ, గాఱులు
ప్రేలెదన్...భార. ఉద్యో. ౩. ౧౦౭.

క. కడు నుడికి మదంబు కొన్ని కాఱులు వలికెన్.
పరమ. ౩. ౨౯౪.

౨. అసత్యవచనములు.

ఆ. ఇవమునూడుకొలపు జేలికల్ము న్నెందుఁ,
గాఱు లాడి రనినకత యెఱుంగ. అచ్చ రా.
అయో. ౩౦.

విణ. ౧. నీచము, దూష్యము, నింద్యము; క్రూరము, పరుషము.

గీ. అతఁ డెఱుఁగఁడు గాక యీయుద్రి భేది,
గౌతమునియింటఁ జేసినకాఱుగోష్ఠి. హర.
౭. ౨౧.

సీ. ...ఇట్లు. గీ. గా పనెడివారి వేదముల్ గాఱు
వేదములు మతంబు లసమ్మతంబులు...అని
గెలిగొందురు విమలమతులు. వరాహ. ౯.
౫౯.

ఆ. తల్లి పాఱవైచి తరల నన్యులపంచ, బ్రతికి
కూఁతవట్టి కొతుక కీవు, కన్ను లెఱ్ఱచేసి య
న్నులఁ గని కాఱు,కూఁత లఱచెదేమి కోకి
లంబ. రసిక. ౪. ౧౩౦.

౨. వ్యర్థము.
(వైకుంఠవర్ణనము.) సీ. ఘటము మంచుఁ బటము మంచుఁ గాఱుయుక్తులఁ బెంచుమస్తతార్కికులకు మూర మగుచు. కళా. ౮. ౨౨౦.
జః కాఱోడ్డెము, కాఱోడ్డెకాఁడు.

**కాఱు³.** వి.౧. సందంశకము, పట్టుకాఱు.
మ. ప్రతిసూర్యుం డనుకష్టటంబు మనువద్యాణాసమస్కారు గ్రోహిత మన్నేరిటియుం దుఁ గ్రోవి... జతసాన్నారి బెడంగున న్దవరె వస్లావేళ విన్నంగడికా. చంద్రా. ౪. ౧౭.
గీ. మీాఱు సండంశకము పేరు కా అనంగ. ఆం. భా. ౨. ౫౯౮.

**కాఱు⁴.** విణ. దట్టమైనది, సాంద్రము.
క. కాఱడవిఁ బఱచుమృగముల... భా. ఆది. ౪. ౧౯.
(శివవర్ణనము.) సీ. తొలుకడపాతాపసలు గెబ్బనర్తిఁజేఁ డెద్దడిగుబురుకాఱిన్నప్రొద్దు. అచ్చ. రా. బాల. ౮.

**కాఱోడ్డెకాఁడు.** విణ. (కాఱోడ్డెము + కాఁడు) పరుషవచనము లాడువాఁడు.
క. చారుఁడు కొండీఁడు మరా, నారికృతఘ్నుండు నింద సలిపెడువాఁడుకా, గాఱోడ్డెకాఁడు బుణియును, బాఁడము మట్టంగ జేసు బహుదుఃఖములకా. శేష. ౩. ౨౬౯.

**కాఱోడ్డెము.** వి. (√కాఱు²) పరుషోక్తి.
సీ... కాఱోడ్డెము పరుసు పరుసన యనఁగ నిష్ఠురము వెలయు. ఆం. భా. ౧. ౧౧౭.
శా. కన్నుంగ్రేవలఁ గెంపు దోఁప నదిరా కాఱోడ్డెమా నేను జెప్ప న్నీవిప్పని కొప్పుకోమి యిది నీపాండిత్యమో... చం. రా. ౫. ౬౧.
(ఇట 'ఏమురాడుట' అని భావము.)

**కాల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దుర్గ. ౨. నీలిచెట్టు. ౩. సుషేణిక, నల్లతెగడ. ౪. సుషవి, నల్లజీలకఱ్ఱ. ౫. మంజిష్ఠ. ౬. అశ్వగంధ, పెన్నేరు.

**కాలంజరము.** సం. వి. అ. పుం. ౧. పర్వతభేదము. ౨. యోగిచక్రమేళకము, యోగులు సమావేశమగుచోటు. (విల్యమ్సు.)

**కాలంజరి.** సం. వి. ఈ. స్త్రీ. చండి, పార్వతి.

**కాలంజరుఁడు.** సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. భైరవుఁడు.

**కాలక.** సం. వి. ఆ. స్త్రీ. కాలకేయు లనుఅసురుల యొక్కమాత, దక్షునికూఁతురు.

**కాలకంజము.** సం. వి. అ. న. నీలోత్పలము, నల్లకలువ.

**కాలకంటకము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొకపక్షి, దాత్యూహము, కూకురుగుండె. ౨. పీతసారము, వేఁగిస.

**కాలకంఠకము.** సం. వి. అ. పుం. ఒకానొకపక్షి, దాత్యూహము, కూకురుగుండె.

**కాలకంఠము.** సం. విణ. (అ. ఆ, ఈ. అ.) నల్లని కంఠము కలది. వి. అ. పుం. ౧. నెమిలి. ౨. కలవింకము, పిచ్చుక. ౩. దాత్యూహము, కూకురుగుండె. ౪. ఖంజనము, కాటుకపిట్ట. ౫. పీతసారము, వేఁగిస.

**కాలకంఠుఁడు.** సం. వి. అ. పుం.-విషము త్రాగుటచే నల్లనికంఠము కలవాఁడు-శివుఁడు.

**కాలకందకము.** సం. వి. అ. పుం. నీరుపాము.

**కాలకచువు.** సం. వి. ఉ. స్త్రీ. నల్లకంద.

**కాలకము.** సం. విణ. (అ. లికా. అ.) నల్లనిది. వి. అ. పుం. ౧. పుట్టుమచ్చ. ౨. అలగర్దము, నీటిపాము. ౩. జతుకము, లక్క. ౪. కంటినల్లగుడ్డు. ౫. (బీజగ) అవ్యక్తరాశిసంజ్ఞాభేదము. న. ౧. యకృత్తు, కారిజము. ౨. కాలశాకము, కటిచేము.

**కాలకర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. అలక్ష్మి, పెద్దమ్మ.

**కాలకలాయము.** సం. వి. అ. పుం. నల్లనిగుండ్రని పెసగలు, నల్లబటానీలు.

**కాలకాలుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**కాలకీలము.** సం. వి. అ. పుం. కోలాహలము, కలకలము. (వాచ.)

**కాలకుంఠుఁడు.** సం. వి. అ. పుం. యముఁడు.

**కాలకూటము.** సం. వి. అ. పుం. న. పాలసముద్రమున పుట్టి శివునిచే త్రాఁగఁబడినహాలాహలవిషము.

**కాలకృతుఁడు.** సం. వి. అ. పుం-కృతకాలుఁడు-సూర్యుఁడు.

**కాలకృత్తు.** సం. వి. త్. పుం. సూర్యుఁడు. (త్రి.ని.)

**కాలకేయులు.** సం. వి. అ. పుం. బ. కాలకాపుత్రులగు రాక్షసులు.

**కాలక్షేపము.** సం. వి. అ. పుం. ౧. కాలము వెళ్లఁబుచ్చుట, ఉబుసుపోక. ౨. విలంబము, జాగు.

**కాలఖంజనము.** సం. వి. అ. న. కారిజము.

**కాలఖండము.** సం=కాలఖంజనము.

**కాలగ్రంథి.** సం. వి. ఇ. పుం. సంవత్సరము.

**కాలఘాతి.** సం. విశే. (న్. నీ. న్.) కాలక్రమమున చంపునది. (విషము, మొ-విల్యమ్సు.)

**కాలచక్రము.** సం. వి. అ. న. చక్రాకారముగా తిరుగుచుండుకాలము.

**కాలచింతకుఁడు.** సం. వి. అ. పుం-కాలము నాలోచించువాఁడు-దైవజ్ఞుఁడు, జోస్యుఁడు.

**కాలజ్ఞము.** సం. వి. అ. పుం. ౧. కోడి. ౨. కోయిల.

**కాలజ్ఞానము.** సం. వి. అ. న. ౧. జ్యోతిశ్శాస్త్రము. ౨. యుక్తకాలము నెఱుఁగుట. 3. మృత్యువును తెలుపుచిహ్నభేదము.

**కాలజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉచితసమయమును తెలిసినవాఁడు. వి. అ. పుం. జోస్యుఁడు.

**కాలటుక.** వి. (కాలు² + అటుక) కుండ లుంచుటకై రెండుమొనలు ఇరుప్రక్కలగోడలయందు పొదిగి యూఁతగా కాళ్లుంచి అడ్డముగా నమర్చినవ్రాను. (శ. ర.)

**కాలతాలము.** సం. వి. అ. పుం. తమాలము, చీకటిచెట్టు!.

**కాలతిందుకము.** సం. వి. అ. పుం. కాకితుమికి!.

**కాలత్రయము.** సం. వి. అ. న. భూతభవిష్యద్వర్తమానము లనుమూఁడుకాలములు.

**కాలధర్మము.** సం. వి. అ. పుం. ౧. మృతి, మరణము. ౨. కాలముయొక్కస్వభావము.

**కాలనేమి.** సం. వి. ఇ. పుం. ౧. (హనుమంతునిచేత హతుఁడైన) ఒకానొకరాక్షసుఁడు. ౨. (విష్ణువుచేత హతుఁడైన) ఒకానొకరాక్షసుఁడు.

**కాలపక్వము.** సం. విశే. (అ. ఆ. అ.) కాలముచేతనే పరిపాకము నొందినది. (ఫలము, మొ.) మను. ౬. ౨౧.

**కాలపర్ణము.** పం. వి. అ. పుం. తగరవృక్షము, నందివర్ధనము!.

**కాలపర్ణి.** పం. వి. ఈ. స్త్రీ. శ్యామాపసాన్న, విదారిగంధ!.

**కాలపాలకము.** సం. వి. అ. న. కంకుష్ఠమృత్తిక.

**కాలపాశము.** సం. వి. అ. పుం. ౧. యమునిపాశాయుధము. ౨. ఉరిత్రాడు.

**కాలపాశికుఁడు.** సం. వి. అ. పుం. ౧. యముఁడు. ౨. ఉరితీయువాఁడు.

**కాలపీలువు.** సం. వి. ఉ. పుం. కాకితుమికి!.

**కాలపృష్ఠము.** సం. వి. అ. పుం. ౧. ఒకజాతిఇఱ్ఱి. ౨. రాపులుఁగు. న. ౧. కర్ణునివిల్లు. ౨. విల్లు. (హేమ. ని.)

కాలపేషి. సం. వి. ఈ. స్త్రీ. శ్యామాలత, త్రింకణ ముఁ.

కాలప్రభాతము. సం. వి. అ. న. శరదృతువు. (త్రి. ని.)

కాలభాండిక. సం. వి. ఆ. స్త్రీ. మంజిష్ఠఁ.

కాలభైరవుఁడు. సం. వి. అ. పుం. శివాంశమున పుట్టి కాశియందున్న ఒకానొక దేవత.

కాలమానము. సం. వి. అ. పుం. ౧. కృష్ణార్జకము, నల్లగగ్గరఁ. ౨. కృష్ణతులసిఁ. (వాచ) న. కాలపరిమాణము, కాలముయొక్క కొలఁది.

కాలమాలకము. సం. వి. అ. పుం. కృష్ణార్జకము, నల్లగగ్గరఁ.

కాలము. సం. విణ. (అ. ఈ. అ.) నల్లనిది. (అ. ఆ. అ.) క్రూరము. వి. అ. పుం. ౧. నలుపు. ౨. వేళ, తఱి, ప్రొద్దు. ౩ కంటినల్లగ్రుడ్డు. ౪. కోయిల. ౫. (సంగీత.) ఒకకాలమానము, తాలప్రమాణవిశేషము. ౬. మరణము, చావు. ౭. ఎఱ్ఱచిత్రమూలముఁ. ౮. తాటిచెట్టు. ౯. కాసమర్దము, కసిందఁ. ౧౦. మూఁడు అను సంఖ్య. ౧౧. రాలము, మద్దిచెట్టుజిగురు. న. ౧. ఇనుము. ౨. కాలీయక మనుగంధద్రవ్యము. ౩. కక్కోలకము, తక్కోలముఁ.

కాలగోచరుఁడగు = మృతినొందు.

ఆ. అట్లు తపము సేసి యద్దేవువరమునఁ, బుత్రదశ
కలబ్ధిఁ బొంది కొంత, కాలమునకు వారు కాల
గోచరులైన... వాసిష్ఠ. ౨. ౧౫౧.

కాలముఖము. సం. వి. అ. పుం- నల్లనిముఖము కలది- కొండముచ్చు.

కాలముచేయు. మి. అ. క్రి. (కాలము + చేయు) కాలధర్మము నొందు, చచ్చు.

క. అని నిశ్చయించి హస్తంబున జలములు పూని
తల్లి పాష్మని ప్రోక్షించిన మాయగోవు పసు
చుం, గను గ్రుడ్లం దిరుగవేసి కాలముచేసెన్.
వరాహ. ౧౦. ౪౦.

కాలమూలము. సం. వి. అ. పుం. ఎఱ్ఱచిత్రమూలముఁ.

కాలమేషి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మంజిష్ఠ, మంజిటితీఁగ. ౨. సుషేణిక, నల్లతెగడఁ. ౩. సోమరాజి, కారుగచ్చఁ.

కాలమేషిక. సం. వి. ఆ. స్త్రీ = కాలమేషి.

కాలయవనుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక యవనరాజు. (ఇతఁడు కృష్ణుని తఱుముకొని వెళ్లి ఒకగుహలో నిద్రించుచున్న ముచుకుందుని కృష్ణుఁడనుభ్రాంతిచే కాలితో తన్ని అతఁడు కనువిచ్చి చూచుటచేత దగ్ధుఁడయ్యెను.)

కాలయాపనము. సం. వి. అ. న. ౧. కాలవిలంబము, జాగు. ౨. కాలము గడపుట, ఉబుసుపోక.

కాలయోగము. సం. వి. అ. పుం. ౧. కాలముయొక్క కూడిక, కాలసంబంధము. ౨. విధి, దైవము.

కాలరాత్రి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. ప్రళయకాలము. ౨. చీకటిరేయి. ౩. దుర్గామూర్తిభేదము. ౪. భీమరథి అనెడునది. ౫. యమునిభగిని. ౬. దీపావళ్యమావాస్య. ౭. మనుష్యుని యాయువున డెబ్బదియేడవసంవత్సరమునందు ఏడవమాసములో ఏడవనాఁటిరాత్రి.

కాలరి. వి. (కాలు[2] + అరి) ౧. పదాతి, కాలిబంటు.

సీ. చేగలమొకములఁ జెండుబెండొనరించి కా
లరిపోఁజుల నేలఁ జమరి. అచ్చ. రా. సుం.
౧౦౮.

౨. దూత, వార్తాహరుఁడు.

వ... మనము వెసగలకాలరుల వేగంబుచ్చి శల్య
కేకయజరాసంధతనయ ధృష్టకేతుప్రభృతు
లయిన భూపతులకును వారివారిబంధుమిత్త్ర

జనంబులకు నెఱింగించుట కార్యంబు. భార. ఉద్యో. ౧. ౩౭.

శ్లో. శల్యస్య ధృష్టకేతోశ్చ జయత్సేనస్య వా విభో, కేకయానాం చ సర్వేషాం దూతా గచ్ఛంతు శీఘ్రగాః. సం. భార. ఉద్యో. ౪. ౮. ప్రబోధ. ౨. ౫౧.

౩. పథికుఁడిచ్చుపన్ను, అనుపు.

సీ... కాలరి నాఁగ ననుపు నాఁగ, నభిగంత్రృభాగధేయము చెలంగును... ఆం. భా. ౨.౧౯౯-౨.

**కాలరుద్రుఁడు.** సం. వి. అ. పుం-కాలరూపుఁడగు రుద్రుఁడు-కాలాగ్నిరుద్రుఁడు (కల్ప.) కాలరూపప్రళయాగ్నిరూపరుద్రభేదము. (వాచ.)

**కాలలవణము.** సం. వి. అ. న. బిడాలవణము.

**కాలలుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) కాలకము కలవాఁడు, పుట్టుమచ్చ గలవాఁడు.

**కాలలో(లౌ)హము.** సం. వి. అ. న. ఇనుము; ఉక్కు.

**కాలవృంతము.** సం. వి. అ. పుం. కులుత్థము, ఉలవ౯.

**కాలవృంతి.** సం. వి. ఈ. స్త్రీ. పాటలి, కలిగొట్టు౯.

**కాలశాకము.** సం. వి. అ. పుం. కృష్ణనింబము, కఱివేము౯.

**కాలశేయము.** సం. వి. అ. న-కలశమునందుండునది-మజ్జిగ.

**కాలసర్పము.** సం. వి. అ. పుం. నల్లత్రాఁచు.

**కాలసారము.** సం. వి. అ. పుం. కృష్ణసారము, నల్లఇఱ్ఱి. న. పీతచందనము, పచ్చగందపుమ్రాను౯.

**కాలసూత్రము.** సం. వి. అ. న. ౧. నరకభేదము. ౨. మృత్యుహేతు వగుసూత్రము. (ఉరిత్రాడు, మొ.)

**కాలస్కంధము.** సం. వి. అ. పుం. ౧. తమాలము, చీకటిమ్రాను౯. ౨. తిందుకము, తుమికి౯. ౩. వకుళము, పొగడ౯. ౪. జీవకము, వేఁగిస౯. ౫. ఉదుంబరము, మేడి౯.

**కాలస్థాలి.** సం. వి. ఈ. స్త్రీ. పాటలి, కలిగొట్టు౯.

**కాలహరణము.** సం. వి. అ. న. విలంబము, జాగు.

**కాలహాని.** సం. వి. ఇ. స్త్రీ.=కాలహరణము.

**కాలహీనము.** సం. వి. అ. పుం. లోధ్రము, లొద్దుగు౯.

**కాలాంజనము.** సం. వి. అ. న. మిక్కిలి నల్లని వగు నొకయంజనవిశేషము.

**కాలాంజని.** సం. వి. ఈ. స్త్రీ. రేచని, తెల్లతెగడ౯. (ఇది విరేచనకారి.)

**కాలాండజము.** సం. వి. అ. పుం-మిక్కిలి నల్లని పిట్ట-కోయిల.

**కాలాంతకుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**కాలాంతరము.** సం. వి. అ. న. ౧. మఱియొకకాలము. ౨. కాలమునకు కాలమునకు నడుమ నుండువ్యవధానము.

**కాలాంతరవిషము.** సం. వి. అ. పుం-కోపకాలమునందుమాత్రము విషముగలది-మూషికాది.

**కాలాగ(గు)రువు.** సం. వి. ఉ. న. కృష్ణాగరువు, నల్లఅగలు౯.

**కాలాగ్ని.** సం. వి. ఇ. పుం. ౧. ప్రళయాగ్ని. ౨. పంచముఖరుద్రాక్షము.

**కాలాతిక్రమము.** సం. వి. అ. పుం. యుక్తకాలము కడచిపోవుట.

(ఇట్లే కాలాతిక్రమణము, కాలాతిపాతము, కాలాత్యయము, కాలాతిరేకము, మొ.)

**కాలాతీతము.** సం. విశ. (అ. ఆ. అ.) కడచిన యుక్తకాలము కలది, యుక్తకాలము దాఁటినది. (కృషి, మొ.) వి. అ. న. కాలాతిక్రమము.

శ్లో. కాలాతీతే వృథాసంధ్యా వంధ్యాస్త్రీమైథునం యథా. (వాచ.)

కాలాత్ముఁడు(త్మ). సం. వి. న్. పుం-కాలరూపుఁడు-పరమేశ్వరుఁడు.

కాలానునాది. సం. వి. న్. పుం. ౧. తుమ్మెద. ౨. చటకము, పిచ్చుక. ౩. కపింజలము, కపుఁజు. ౪. చాతకము, వానకోయిల.

కాలానుసారకము. సం. విశే. (అ. రికా. అ.) కాలము ననుసరించి పోవునది. వి. అ. న. ౧. తగరము, నందివర్ధనము†. ౨. పీతచందనము†.

కాలానుసారి. సం. విశే. (న్. ణీ. న్.) కాలము ననుసరించి వెళ్లువాఁడు. వి. న్. న. ౧. శైలజము, ఱాతిపువ్వు, సిలాజిత్తు. ౨. సరళద్రవము, దేవదారునిర్యాసముతో చేసినధూపద్రవ్యము.

కాలానుసార్యకము. సం =కాలానుసార్యము.

కాలానుసార్యము. సం. వి. అ. న. ౧. శైలేయము, ఱాతిపువ్వు, సిలాజిత్తు. ౨. శింశుప, ఇరుగుడు†. ౩. తగరము, నందివర్ధనము†. ౪. సుగంధిద్రవ్యవిశేషము.

కాలాపము. సం. వి. అ. పుం. సర్పభోగము, పాముయొక్క పడగ.

కాలాయసము. సం. వి. అ. న. ఇనుము.

కాలావధి. సం. వి. ఇ. పుం. గడువు, మితి పెట్టిన కాలము.

కాలి(ళి). సం. వి. ఈ. స్త్రీ. ౧. క్షీరకీటము, పాలలోఁ బుట్టుపురుగు. ౨. నల్లసిరా. ౩. పార్వతి. ౪. నల్లనిక్రొత్తమబ్బు, కృష్ణనవమేఘము. ౫. నల్లనియాఁడుది. ౬. సత్యవతి. (వ్యాసునితల్లి.) ౭. రాత్రి. ౮. అగ్నియొక్క సప్తజిహ్వాలలో నొకటి. ౯. కాలరాత్రి. (యమునిచెల్లెలు.) ౧౦. నింద, దూఱు. ౧౧. బొగ్గు. ౧౨. వృశ్చికాళి, తేలుకొండి†. ౧౩. ఉపోదకి, దుంపబచ్చలి†. ౧౪. కారవి, నల్లజీలకఱ్ఱ†. ౧౫. తువరి, తొగరిమన్ను. (వై. ని.) ౧౬. తొమ్మండ్రు శివశక్తులలో నొకతె. ౧౭. భ్రూకుటి, బొమముడి. ౧౮. సప్తమాతృకలలో నొకతె. ౧౯. పిప్పలి†. న్. పుం. సూర్యుఁడు.

కాలిక. సం. వి. ఆ. స్త్రీ. ౧.పార్వతి.౨.ద్రౌపది. ౩. ఆఁడుకాకి. ౪. బొగ్గు. ౫. నలుపు.౬. నూఁగారు, గోమావళి. ౭. మేఘావళి, మబ్బులగుంపు. ౮. వానమబ్బు; క్రొత్తమబ్బు. ౯. (స్వద్రలోహములకూడికవలనఁ గలిగిన)బంగారునందలిదోషము. ౧౦. సుర, మద్యము. (కల్ప.) ౧౧. నెలనెలకు ఈయవలసినవడ్డి. ౧౨. జటామాంసి†. ౧౩. పటోలశాఖ, పొట్లకొమ్మ. ౧౪. కరక, హారీతకి†.౧౫.కాకోలి, కాచుకొల్లి†. ౧౬.(క్రమముగా వాయిదాలమీఁద)ఇయ్యఁ దగినవస్తువువెల. ౧౭. శ్యామాపక్షి, నల్లపిచ్చుక. ౧౮. క్షీరకీటము, పాలలోఁ బుట్టుపురుగు. ౧౯. హిమసంహతి.(త్రి.ని.)౨౦. ఇంచుకనలుపుచాయ గలవస్త్రాది.౨౧. నల్లసిరా. ౨౨. కుబ్జ,మఱుగుజ్జగుకన్య. ౨౩.అశ్వదంతరేఖ. ౨౪. సూక్ష్మజీరకము, సన్నజీలకఱ్ఱ†. ౨౫. (లజ్జాదులచేత) వెలవెలఁబోవుట, వివర్ణత. ౨౬. చిక్రోడము,ఉడుత. ౨౭. తువరి,తొగరిమన్ను. ౨౮. వృశ్చికపత్త్రము, తేలుకొండి†.

కాలికంచెము. వి. (√ కాలు²) బాలక్రీడావిశేషము, ఇసుకలో కాలితో కంచమువలె వలయములు చేసి యాడుకొనునొకయాట.

సీ. కాలికంచంబును గట్టెగుజ్జము ... గీ. అకట యగచాట్లప్రాఁతలై యాడుకొనుచు. హంస. ౩. ౧౪౬.

కాలికము. సం. విశే. (అ. ఈ. అ.) ౧. కాలముచేతఁ జేయఁబడినది. ౨. కాలభవము, కాలమువలనఁ బుట్టినది.౩.కాలమునకుఁదగినది.వి.అ.పుం.

౧. క్రౌంచపక్షి. ౨. బొగ్గు. న. ౧. కృష్ణచందనము$^{1}$. ౨. వైరము, పగ.

**కాలిడు.** అ. క్రి. (కాలు$^{2}$ + ఇడు) చొచ్చు, ప్రవేశించు.

(ద్యూతవర్ణన.) ఉ. నట్టులు రెండుఁ దాన జతనంబునఁ జేకొని యున్న యిండులం,గట్టి నృపాలుసారెలకుఁ గాలిడ నెందును జోటు లేక ...భోజరా. ౭. ౧౩౦.

**కాలిత్రోవ, కాల్ద్రోవ.** వి. (కాలు$^{2}$ + త్రోవ) -ఒకఁడుమాత్రము నడచిపోవుటకు వీ లైనమార్గము-నడకమార్గము.

సీ... కాలిత్రోవ యన నేకపది...ఆం.భా.౨.౯.

స్రగ్విణి. దండకారణ్యమధ్యంబుకాల్ద్రోవలో, గుండ నేఁ గవ్వపుంగొండకుం బోవ...ప్రబోధ. ౫. ౯౮.

**కాలి(ళి)దాసుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక సుప్రసిద్ధసంస్కృతకవి.

**కాలినడ.** వి. (కాలు$^{2}$ + నడ.) పాదచారము. (శ.ర.)

**కాలిని.** సం. వి. ఈ. స్త్రీ. ఆర్ద్రానక్షత్రము.

**కాలిపుట్టువు.** వి. (కాలు$^{2}$ + పుట్టువు) పాదజుఁడు, శూద్రుఁడు. (శ. ర.)

**కాలిబంటు.** వి. (కాలు$^{2}$ + బంటు) పదాతి. (శ.ర.)

**కాలిబోను.** వి. (కాలు$^{2}$ + బోను) మృగములకాళ్లు తగులుకొనుటకు ఒడ్డియుండెడియురితో సంతనపఱిచినమ్రానియంత్రము.

వ...మృగయుండు బిస యొడ్డి సంఘటించినకాలిబోనులం బడి బెగడక యద్దారు వీడ్చుకొని యూరములఁ దఱియంబడి...మనుచ. ౪. ౩౭.

**కాలిమ.** సం. వి. న్. పుం. ౧. నలుపు. ౨. వివర్ణత. (రూ. కాలిమము.)

**కాలిముల్లు.** వి. (కాలు$^{2}$ + ముల్లు) కాలిలో గ్రుచ్చుకొన్న ముల్లు.

గీ. అనిమిషులగుండెలో గాల మఖిలలోక, సేత్రమున నాటి వేధించునెరసు గాలి,కాలిముల్లు కుధృత్పాలిపాలిపిడుగు, రావణుఁడు డించె భువనముల్ రక్తిఁ జెందె. ఉ. రా. ౧. ౧౪౯. (కాలిముల్లు:- కాలిముల్లువంటివాఁడు, బాధకుఁడు అని భావము.)

**కాలిమూఁక**=కాలుబలము. ($\sqrt{}$కాలు$^{2}$.)

సీ. నూటి కొక్కఁడె చాలి మేటిమగంటిమిఁ గాలుద్రవ్వుచు నుండుకాలిమూఁక. రంగా. ౧. ౧౩౭.

**కాలియ.** వి. పిశాచము.

ఉ. కాలియ పట్టినట్లు గడుఁ గంది కృశుండయి వీడి వెండ్రుకల్దూలఁగ లాంఛనధ్వజములో లగుడంబు తగ ధరించి ప్రే,తాలయ మెల్లఁ ద్రిమ్మరుచు నాయతు లన్నియుఁ గొంచు రాజు పె,న్సాలతనంబు నొందెఁ గొఱ మాలిన దైవము చెయ్ది నక్కటా. మార్క. ౧. ౨౩౬.

**కాలీకము.** సం. వి. అ. పుం. క్రౌంచపక్షి.

**కాలీచి.** సం. వి. ఈ. స్త్రీ. యమునివిచారణస్థానము, యముఁడు పాపుల విచారణ సేయుపట్టు. (వై. ని. త్రి. ని.)

**కాలీయకము.** సం. వి. అ.న. సుగంధిద్రవ్యవిశేషము. పుం. దారుహరిద్ర, మ్రానిపసుపు$^{1}$.

**కాలు$^{1}$.** అ. క్రి. ౧. మండు, ప్రజ్వలించు.

గీ. సతివియోగాగ్ని మనములో సంతసంబుఁ, దగిలికొని కాల దానికిఁ దనుపు సేయఁ,దలఁచియో...హిమగిరికి నీశ్వరుఁడు వచ్చె. కు. సం. ౩. ౩౩౦.

౨. దగ్ధమగు; తప్తమగు.

చ. అడపొడ గాన రాక తెగటారియుఁ గాలిన యట్టిమ్రోడుకై,పడి...మనుచ. ౩. ౪౬.

ఉ. కావ నవర్థమూల మగుకాళినవీమమతావికా
రముల్,మానుట మేలు... ప్రబోధ. ౫.౨౫.
(ఇట నిందాసూచకము.)
ఆ. అధిపుఁ జెట్టలాడె నని దత్తుఁ గని సతి,కడ
రుకోపవహ్ని నొడలు గాలె,వగవ నట్లె యె
ట్టివారికిఁ బ్రియనిరా,కరులఁ గాంచి యొడ
లు గాల కున్నె. కు. సం. ౨. ౧౭౯.

కాల్వడి=తుపాకులు ప్రేల్చుటయందలివేగము.
మ...తుపాకిమంది యెదురెక్కంబాతి వేట్లాడి
కాల్వడి మీఱంగ ధమంధమంధీమిధీమి
ధ్వానంబు మిన్నంటఁగన్. చంద్రా. ౬. ౭౩.
జ: కాలుకొను¹,కాలుకొల్పు,కాలుచు,కాల్పు.

**కాలు²**. వి. దే. (క. కాలు. త.కాల్.కు.కాడు.)
౧. పాదము, అడుగు.
ఆ.పాతులోని కుటికి జనముల నున్మద,లీల నేలఁ
జెట్టి కాలఁ జమర. భార. శాం. ౩.౪౭౪.
చ...అందినక్క సిగయు నందక యుండినఁ గా
ళ్లు పట్టుకొం,దువు...విజ. వి. ౩. ౫౧.
ఉ...కాళులు గడ్డి...హంస. ౩. ౧౦౬.
౨. నాల్గవవంతు, పాతిక.
ఉదా: ముక్కాలు.
గీ...వారి కుదయించెఁ దనయ యోర్త్ర,మూల
నక్షత్రమునయందు మొదటికాలఁ, గేంద్ర
మున నాంగిరసుఁ డుండఁ జంద్రవదన. కా
శీ. ౫. ౩౨౬.
౩. మంచము మున్నగువానికోడు.
ఉ. భృంగి దలంపఁగాఁ బరమభృత్యుఁడు నర్మ
సఖుల్ పిశాచముల్, కంగటికాలు నమ్మఁ
దగునైదువు...జై. భా. ౫. ౮౫.
౪. పద్యచరణము.
సీ...ఈమూఁటి కక్షరంబులు సమం బన్నికాళ్ల.
అప్ప. ౪. ౧౮౧, ౨౨౫.

కాలుకొన్నంత=కాలితో నడవఁగలిగినంత.
సీ. కాలుకొన్నంతయుఁ గడు వేగమునఁ బాఱి
కనుకని దెసలందుఁ గాడుపడియు. నిర్వ.౪
౭౬.
వ.అష్మేటి జోటియుం దానును ఘోటకంబునుఁ
దత్కాలోచితాహారంబులం దృప్తి నలిపి కా
లుకొన్నయంత నేల యరిగి. విక్ర. ౬.౧౦౦.

కాలుతక్కువవాఁడు=వడిగా నడువ లేనివాఁడు.
గీ. కాలు తక్కువవారలు గలయఁ జెదరి,వెనుకఁ
బడి పోవు చెడఁ దన్నుఁ గని భయమునఁ,
బ్రాణదానంబు వేఁడినఁ బార్థుఁ డభయ, హ
స్త మిచ్చుచు దయ పెనుపారఁ బలుకు.భార.
విరా. ౫. ౨౨౫.

కాలాఁగు=కాలునిలుపు, ఉండు, విశ్రమించు.
గీ...మధ్యాహ్న మయ్యెను దేవ యిచట,నేఁడు
కాలాఁగి మామందపాఁడి చూచి,గోరసముఁ
బాయసంబులు నారగించి, నిగ్రహం బయి
న మము మన్నింపవలయు.పి.శకుం.౧.౧౨౩.
జ: కాలటుక, కాలరి, కాలికంచము, కాలిడు,
కాలిత్రోవ, కాలినడ, కాలిపుట్టువు,కాలిబంటు,
కాలిబోను,కాలిముల్లు,కాలీమూఁక,కాలుకొను²,
కాలుమ్చు, కాలుదివియ, కాలుద్రవ్వు, కాలు
ద్రొక్కు, కాలుపలము,కాలుబలము,కాలుమడుఁ
చు, కాలుమానిసి, కాలురి, కాలువల, కాలుసాఁ
చు, కాలూఁదు, కాల్కడ, కాల్కడియము, కా
ల్గజ్జ, మొ.

**కాలుఁడు**. సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. య
ముఁడు. ౩. విశ్వేదేవవిశేషము. ౪. శని.

**కాలుకొను¹**. అ. క్రి. (√కాలు¹) కాలు. (చూ.
కాలుకొల్పు.)

**కాలుకొ(ల్కొ)ను²**. అ. క్రి.(కాలు² + కొను)
కాలుమోపు; నెలకొను.
వ...విష్ణునిమాయవలన నెందును గాల్కొని ని
లువ నంబళింపక శతసహస్రసంఖ్యలయేండ్లు
చరియించి...హరి. ఉ. ౯. ౯౮.

గీ.అంత కంతకు నెక్కుచు సంతమసముఁ, గాలు కొనసీక చంద్రుండు గ్రాలె నధిప. భార. ద్రో. ౫. ౨౬౫.

గీ. కాలుఁ డాదిగ దేవసంఘుంబు నెల్లఁ, గాలు కొనకుండ నెగుచు విక్రమధనుండుఁ, గాల వశమున నిజబాహుగర్వ ముడిగి, కాలగోచ రుఁ డయ్యె నక్కాలనేమి. కు. సం. ౧౨. ౭౭౦.

**కాలుకొల్పు.** స. క్రి. (√ కాలుకొను[1]) కాలు కొనఁ జేయు.

(మండించు)

మ. జలజాప్తోగ్రమయూఖపుంజకుసుకిన్ స ప్తాశ్వకాంతోపల, మ్ముల సోఁకించి తదుగ్ర తా గ్నిలవమున్ బోధించి వాత్యానసా, నిలవే గంబునఁ గాలుకొల్పి పతగానీకంబు పాకం బుగా, నలరించెన్ సముయాఖ్యపాచకుఁడు భూతాహారసంప్రాప్తికిన్. శుక. ౩. ౪౪౯.

**కాలుచే(ల్చే).** స.క్రి.(√కాలు[1])కాలఁజేయు.

(దహించు)

చ...భూరిశిఖావళి ఖాండవంబున,ల్గడఁ గడుఁ బర్వఁగాఁ బెఱిగి కాల్పఁ దొడంగె హుతా శనుండు...భార. ఆది. ౭. ౨౫౯.

క...బ్రహ్మబలమ బల మిలఁ,గనుగొన నీక్షత్త్రబ లము గాల్పనె యనుచున్. భా. రా. బాల. ౫౬౬. (ఇట నిందాసూచకము )

గీ. బ్రహ్మవిజ్ఞానమును నట్ల ప్రజ్వరిల్లి, శుభము న శుభము నొకటిగా సుడిసి కాల్చు. భీమ. ౫. ౧౭౭. (ఇట 'నశింపఁజేయు' అని భావము.)

**కాలుచ్చు.** వి. (కాలు[2]+ఉచ్చు) ఒకవేఁటసాధ నము, పశుపక్ష్యాదులకాళ్లు తగులుకొనునట్లొగ్గు డు ఉరి.

క. మిడిబోనులఁ గాలుచ్చులఁ,బడఁదోలియు... శేర్లన్,వడి గలజింకల నెల్లన్, బొడిచిరి క డుఁ జెంచులు ... యయా. ౨. ౧౯.

**కాలుదివియ.** వి. (కాలు[2]+దివియ) నడచువా రికి దారి చూపుటకై యుపయోగించుకాఁగడా; కాఁగడా.

ఆ. వారు సంభ్రమించి వడిఁ గాలుదివియలు, గొనుచు...వృత్తశాలఁ జొచ్చిరి ... భార. విరా. ౩. ౪.(ప్రాఁత ప్రతి. చి.ని. సా.)

**కాలుద్ర(ల్ద్రి)వ్వు.** అ. క్రి. (కాలు[2]+త్రవ్వు) -వృషభాదులు దర్పాదులచే - కాలితో నేలను త్రవ్వు; కారణము లేకయే (కలహమునకు) సిద్ధ పడు.

ఆ. అధికదర్పయుక్తమై బలీవర్దంబు,నగముదరి విదారణంబుసేయఁ, గాలుద్రవ్వునట్లు గడు బలాఢ్యులతోడ, నేచి వీఁడు విగ్రహింపఁ దొడఁగె. భార. సభా. ౨. ౧౭౩.

గీ...వ్యాఘ్రము...కాలుద్రవ్వుచు నుండెఁ ద త్సాలమూల,మున...విక్ర. ౩. ౭౦.

ఆ. కయ్యమునకు వలదు కాల్ద్రివ్వ నధిప సా,మ మున భేదమునను మార్తమనము, మెత్తఁ జేసి వెఱుచు మెయివడిఁ దప్పించు, కొను తెఱం గెఱింగికొనుట మేలు. భార.శాం.౨.౨౭౨.

క...ముట్టినపగఱసొంపు వడఁచుట యొప్పున్, విను కయ్యమునకుఁ గాల్ద్రి,వ్వినఁ బాటిలు దురిత మెట్టివిభునకునైనన్.భార. శాం. ౩. ౧౫.

**కాలుద్రొ(ల్ద్రొ)క్కు.** స. క్రి. (కాలు[2]+త్రొక్కు) ౧. పెండ్లియాడు. (పెండ్లిలో వధూవరు లొకరికొకరు త్రొక్కుట యాచారము. ఈ యాచార మిప్పుడు శూద్రులలోఁ దఱచు కా న్పించుచున్నది.)

సీ. దివివెలయాలికై తెగునన్నదమ్ములం దగ్రజాఁ గాల్ద్రొక్కినట్టిజంత. చం. రా.౨. ౬౪.

ఇట్లే: చరణముత్రొక్కు.

(గంగావర్ణనము)సీ.సకలరత్నాకరస్థానమై యు

ప్వాంగునంబుధీసుని జరణంబుద్రొక్కి. (అడిదము సూరకవిచాటువు.)

౨. వెంబడించు.

గీ. చెలువ నిను రాజకీరంబు చెట్టపట్టెఁ, గలికి నిను రాజహంసంబు కాలుద్రొక్కె, మంచిశకునంబు లివిగో నామాట చూడు, కన్నెయీ లోనఁ బెండ్లి గాఁ గలదు నీకు. విజ. వి. ౨. ౧౫౯.

అ. క్రి. కాలూఁదు, నిలిచియుండు.

గీ. పూసపాటిమహాస్థానభూమియందుఁ, గాలు ద్రొక్కి నంగ నోడుఁ జండాలుఁ డైనఁ, గదలుమిట మాని దివిజగంగానవాని. (అడిదము సూరకవిచాటువు.)

వి. వివాహము, పెండిలి.

గీ...వివాహనామంబు పెండ్లి చేపట్టు కాలు, ద్రొక్కు పెండిలి యనఁగ ... ఆం. భా. ౨. ౧౭౭.

**కాలుపలము.** మి.వి.(కాలు² + పలము)పలములో నాల్గవభాగము.

సీ. కరిసె యనంగను గాలుపలం బొప్పు...ఆం. భా. ౨. ౨౬౯.

**కాలుబ(ల్బ)లము.** మి. వి. (కాలు² + బలము- క. కాలుబల) కాలితో నడచెడిసేన, పదాతిబలము.

ఆ. చదిసెఁ గాలుబలము చామరచ్ఛత్త్రకేతువులు నాయుధములుఁ దునియ లయ్యె. భార. భీష్మ. ౨. ౧౬౫.

సీ... కాల్బలముల గీటడంచి ... మార్క. ౮. ౧౦౮. హరి. పూ. ౮. ౯౭.

**కాలుమ(ల్మ)డుఁచు.** అ. క్రి. (√కాలు²) మూత్రవిసర్జనము చేయు. (శ.ర.)

**కాలుమానిసి.** వి. (కాలు² + మానిసి) పాదచారి యైనమనుష్యుఁడు; పదాతి.

వ. ఆకాతుకు వీఁడు గాలుమానిసి యగుటం జేసి మనకు నొప్పింప వెరవు గాదయ్యెడు నను దుర్విచారంబున. భార. భీష్మ. 3. ౯౭.

సీ... మొగ్గనేయుంగుఁ బలుకాలుమానిసియును. భార. ద్రో. 3. ౮౫.

**కాలురి**=కాలుచ్చు. (కాలు² + ఉరి.)

క. వెలివాలుగు గాలురులును, వలలుఁ దెరలు దీమములును ... వేఁట కాండ్రుఁ బెనుపఁ గణ. ఉ. హరి. ౮. ౨౨.

**కాలువ(ల్వ).** వి. (సం. కుల్యా. క. కాలువె. త. కాల్వాయ్.) ౧. అల్పమైనకృత్రిమనది, కుల్య; కుల్య పాఱుటకు త్రవ్విసమార్గము.

గీ. లోనిత్రాతొట్టి నిండి కాలువగఁ జాఁగి. ఆము. ౬. ౮.

ద్వి. శ్రీరాముకార్యంబు సేయంగఁ బూని, వారిధి పిల్లకాల్వయుఁ బోలె దాఁటి. రం. రా. సుం. ౨౪౦ పం. ౧ పం.

(వ్యవ) నీరు వచ్చుటకై కాలువ త్రవ్వుచున్నారు.

౨. పరంపర.

సీ. అలిగి యర్జునుఁడు వాలంపకాలువ లోలి నడరించుటయు... భార. భీష్మ. 3. ౨3౮.

కాలువ(లు)గట్టు= కాలువవలె నెడతెగక ప్రసరించు.

వ. ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు గాలువలుగట్టి గట్టిమెయిముఱుపులు చించియు...ఉ. హరి. ౧. ౧౮౫.

**కాలువల.** వి. (కాలు² + వల) పసుపక్ష్యాదులకాళ్లకుఁ దగులుకొనుటకై వేఁటకాండ్రు పన్నెడు వల.

వ... కాలువలల నురుల బోనుల దీమంబులం జిగురుఁగం డెల వేయించి సారమేయంబుల విడిపించిన... పి. శకుం. ౨. ౧౮. వరాహ. ౮. ౭౫.

**కాలుష్యము.** సం. వి. అ. న. ౧. (కోపాదులవలన

మనస్సునకుఁ గలుగు) కలఁక, అప్రసన్నత. ౨. (బురద లోనగువానివలన జలాదులకుఁ గలుగు) మాలిన్యము.

**కాలుసా(చో)ఁచు, కాల్సా(ల్చో)ఁచు.** అ. క్రి. (కాలు² + చాఁచు) ౧. ప్రయాణమగు.

(కైటభాసురుఁడు) మ. వరుణుఁ గుహ్యకనాథు గెల్చి తనకుఁ వారిచ్చు కైకానుకల్, కరుణం గైకొని బ్రహ్మపట్టనముపైఁ గాల్సాఁచి యద్దిక్కునన్.

వ. రాజర్షిగణసేవితుండై యున్నధాతకు నమస్కరించి... శేష. ౪. ౯౦, ౯౧.

౨. యత్నించు; సిద్ధపడు.

సీ. ఎవ్వండు నీచిత్త మెరియించుచున్నాఁడు కైవల్యపదవికై కాలుసాఁచి. గీ. అనతిమ్ము మహేంద్ర...హర. ౩. ౪౪.

సీ. పాపాత్మునకుఁ బారుపత్తె మియ్యఁగ రాదు చాలనిపనికిఁ గాల్చాఁప రాదు. రామలిం. ౫౧.

కాటికిఁ గాళ్లు చాఁచుకొని యుండు=చావ సిద్ధముగా నుండు.

(వ్యవ) కాటికి కాళ్లు చాఁచుకొని యుండి వాఁడు మరల పెండ్లిచేసికొన్నాఁడు.

**కాలూఁదు.** అ. క్రి. (కాలు² + ఊఁదు) ౧. కాలుపెట్టు, కాలుమోపు.

వ... సౌధాగ్రంబునందు నటియించు కేతనపటాంచలంబునం జలంబు గొని యొక్క కాకి గాహసమునకై కాకారవంబుతోడం గాలూఁదఁ దలంచి యనువు గాక చీకాకుపడుచున్నయది. నైష. ౫. ౧౨౭.

౨. ఆఁగు, ఎక్కువకాల ముండు.

క...ఏ,పట్టునఁ గాలూఁదక నిజ,పట్టమున కరుగుదెంచి పార్థివుఁ గాంచెన్. విక్ర. ౨. ౨౨౬.

౩. ప్రవేశించు, చొచ్చు.

క. బాలత్వ మెడలి తరుణిమ, కాలూఁదఁగఁ జిత్త

భవవికారంబులు మైఁ, గీలుకొని త్రుళ్లఁజేయఁగఁ, బాలసుఁడై దురితవితతి పాల్పడి పోవున్. వాసిష్ఠ. ౧. ౧౧౪.

**కాలేయకము.** సం. వి. అ. పుం. ౧. దారుహరిద్ర, మ్రానిపసుపు†. ౨. నల్లఅగలు. (వాచ.) ౩. పీతచందనము, పీతవర్ణసుగంధికాష్ఠము. (కల్ప.)

**కాలేయము.** సం. విణ. (అ. ఆ. అ.) కలియుగమునకు సంబంధించినది. వి. ౧. యకృత్తు, కాలిజము. ౨. నల్లఅగలు†. ౩. పీతచందనము, పీతవర్ణసుగంధికాష్ఠము. (వి.ని. కల్ప.)

**కాలేయుఁడు.** సం. వి. అ. పుం. దైత్యభేదము, కాలకేయుఁడు.

**కాల్క(ల్గ)డ, కాలికడ.** వి. (కాలు² + కడ) కాళ్లకడ, పండుకొనునప్పుడు కాళ్లుంచుకొనుశయ్యాభాగము.

గీ. అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ, డరిగి తలయంపిదెస నున్నతాసనమున, నుండెఁ బదపడి కాల్కడయొద్ద కల్లఁ, జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి. భార. ఉద్యో. ౧. ౬౫.

చ. అడుగులయందు శౌచవిధి యూత్మ నొనర్పఁ దలంప కీవు కాల్గడ దలయంపి గా నిదుర కైకొన...హరి. పూ. ౧. ౮౭.

**కాల్క(లిక)డియము.** వి. (కాలు² + కడియము) పాదవలయము, అందె.

క. అని చీనీచీనాంబర, ఘనమణిహారములు మేలుకాల్కడియంబుల్, గొనబుఁ మెఱుఁగుంగరములు, చనవమరఁగ నిచ్చి పనుప సముచితకీర్తిన్. హంస. ౧. ౭౯.

**కాల్గ(లిక)ట్టు.** వి. (కాలు² + కట్టు) అడిగట్టు, పాదుక.

ద్వి. సరణార్థి సరణార్థి సరణార్థి యనుచుఁ, గర మర్థి వారిచేఁ గాల్గట్టు గొనుచు. పండితా. దీక్షా. ౪౧ పొ.

**కాల్ద(లుద)న్ను.** అ. క్రి. (కాలు² + తన్ను) - కాలు నిలుపు - కదలక నిలుచు.

సీ. అచటికి వేగంబ యరుగక యిచటఁ గాల్దన్ని యుండెడుఁ ట్టిధైర్య మెందుఁ, గలదు... భార. మా. ౯౭.

**కాల్న(లిన)డ.** వి. (కాలు² + నడ) కాలినడక, పదసంచారము.

సీ. ఏ మెల్ల నుండ నీ విట్లొంటిఁ గాల్నడ నేఁగు చున్కికిఁ గత మెద్దియొక్కొ. భార. భీష్మ. ౧. ౧౫౮.

విశ. కాలితో నడచి పోవుటకు వీ లయినది.

చ... సూర్యునిదీప్తికి వాఁడి మించెఁ గాఁ, ల్నడ లయి యేఱు లింక విపినంబు దహించె దవాగ్ను లత్తఱిన్. జాహ్నవీ. ౨. ౧౨౩.

**కాల్పకము.** సం. వి. అ. పుం. కర్చూరము, కచోరము.

**కాల్ప(లుప)డు.** అ. క్రి. (కాలు² + పడు) చిక్కుకొను.

ఆ. జ్ఞానుల మని యెంచి చపలాత్ము లగువారు, తెలివిలేక తమ్ముఁ దెలియలేరు, కష్టగహనమందుఁ గాల్పడి యున్నారు, విశ్వ... వేమన. 3. ౯3. (ప్రయోగాంతరము లేదు.)

**కాల్పనికము.** సం. విశ. (అ. ఈ. అ.) ౧. కల్పితము, కల్పనచే పుట్టినది. ౨. ఆరోపితము, అసత్యము.

**కాల్పము.** సం. వి. అ. పుం. కర్చూరము.

**కాల్బ(లిబ)ందము.** వి. (కాలు² + బందము) - చె ట్టెక్కుటకై - కాలికి వేయుబందము, బంద పుత్రాడు.

(ఈడిగవానివర్ణనము.) మ... కట్లొనర్చిన పిఱుందం గొమ్ము కాల్బందమున్. చెన్న. ౫. ౨౫౨.

**కాల్మ(లిమ)డి.** వి. (కాలు² + మడి) - కాలు మడుఁచుకొని విడుచునది - మూత్రము, ఉచ్చ.

సీ. మనువులు పసులకాల్మడిఁ బ్రుచ్చె ... హరి. పూ. ౬. ౫.

సీ. కలిగొట్టువే రావుకాల్మడిచే నూతి విడెము లోఁ దగిలింప నెలఁది చిక్కు. హంస. ౫. ౧3౦.

**కాల్యా.** సం. వి. ఆ. స్త్రీ. ఎదపదను గలగోవు.

**కాల్యకము.** సం. వి. అ. పుం. కచోరము.

**కాల్యము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ప్రాప్తకాలము, దేనికి యుక్తమైనకాలము వచ్చినదో అది. (శీతాది) ౨. కాలభవము, కాలమున కలుగునది. న. ప్రాతఃకాలము, కల్యము, వేకువ. (కల్ప.)

**కాల్పు(లుపు).** వి. (√కాల్చు) కాల్చుట.

క. ఈకోఁతల కీగోఁతల, కీకాల్పుల కీయవస్థ కీ మోపుదు మే, మీకన్న బిడ్డలము మా, కీకాలము దిక్కు మీరె యిఁకఁ బ్రోవఁ దగున్. సానందో. ౪. ౧౯.

గీ. జననిజఠరాగ్ని కాల్పులఁ దనువు దూలి. సానందో. ౪. ౬౨.

కాల్పువడు = కాల్పఁబడు, కాల్పును బొందు.

చ. చిరముగ నోల్పు వడ్డనరసింహునికంటెను బెద్దవే... కాల్పువడ్డజముకంటెను బెద్దవె నీవు ...కు. సం. ౪. ౪3౨.

**కాల్పురు.** వి. బ. (√కాలు²) పదాతులు, కాలిబంట్లు.

సీ. వరరథ మొక్కండు వారణ మొక్కండు తురగముల్ మూఁడు కాల్పురులు నేవు, రు... భార. ఆది. ౧. ౯౦.

వ. రథికులు రథికులం బొదివి కయ్యంబు సేయఁ గాల్పురు కాల్పురం బెరసి పోట్లాడ నందడి నొండొండ యొదవు పెంభూతు రెగసి. హరి. ఉ. ౬. ౧౨౪.

**కాల్దెరువు, కాలితెరువు.** వి. (కాలు² + తెరువు) = కాలిత్రోవ.

ఉ... యూపసం,ఘుంబులసందడి న్నదువఁ గా డైరు వైవను లేక సాఘర,మ్యంబును శత్రుభీ షణము నై పుర మొప్పుచు నుండు నెప్పు డుక్. జై. భా. ౨. ౫.

కాళ=కాశె.

సీ. కాశె కాళ యనంగఁ గాహళి విలసిల్లు. ఆం. భా. ౧. ౧౨౯.

ద్వి. తాళముల్ తాళముల్ దండడిగొనఁగఁ, గా ళలుఁ గాళలుఁ గలసి ఘూర్ణిల్ల. పండితా. ప ర్వ. 3౫౮ పా.

కాళం(ళాం)జి=కాళంజిక. వి. (సం. కలాచీ. క. కాళంజి, కాళాంజి. త. కాళాంజి) తమ్మపడిగ ము, తమ్మ యుమియుపాత్రము.

సీ.కాళింది వేడ్కతోఁ గాళంజిఁ దాల్ప జాంబ వతి తములపాకు మడిఁచి యొసఁగ. ప్ర భా. ౨. ౧౫.

సీ. కాళాంజి పట్టునిక్కలికి గౌడేంద్రనందన దీని లెస్సగా మనుపవమ్మ. రాజ. చ. 3. ౨౦౨. ఆం. భా. ౨. ౧౬౮. రా. వి.౨.౬౦.

కాళఁజిక=కాళంజి.

వ.వన్నెలాఁడులు చిన్నారికెంగేలుఁజిగురులక్ గనకకలశంబులుఁ గాళంజికలు...మునైన నవి ధరించి. ఉ. రా. ౮. 3౧3.

కాళ(ల)యుక్తము. సం.వి.అ.పుం.ఒకసంవత్సర ము. (వాచ. విల్యమ్సు)

కాళి(లి)ంగము. సం. విశ. (అ. ఈ. అ.) కళింగ దేశమునకు సంబంధించినది. వి. అ. పుం. ౧. నేల గుమ్మడికి. ౨.గజము,ఏనుఁగు. 3.సర్పము,పాము. న. కరబూజాకి.

కాళి(లి)ంగి. సం. వి. ఈ. స్త్రీ. రాజకర్కటి, పె ద్దదోసకి.

కాళీ(లి)ంగిక. సం. వి.ఆ.స్త్రీ.త్రివృత్తు,తెగడకి.

కాళి(లి)ంగుఁడు. సం. వి. అ. పుం. ౧. కళింగ దేశస్థుఁడు. ౨. కళింగదేశపురాజు.

కాళి(లి)ందము. సం. విశ.(అ.ఈ.అ.) ౧.కళింద పర్వతసంబంధమైనది. ౨. కాళిందీనదికి సంబం ధించినది. వి. అ. న. కాళింగము, కరబూజాకి.

కాళి(లి)ంది. సం.వి.ఈ. స్త్రీ. ౧. యమునానది.౨. ఎఱ్ఱతెగడకి. 3.కృష్ణునిఅష్టభార్యలలో నొకతె.

కాళి(లి)ందీభేదనుఁడు. సం. వి. అ. పుం. బలరా ముఁడు.

కాళి(లి)ందీసువు. సం. వి. ఊ. స్త్రీ.-కాళిందిని(= యమునను)కన్నది-సంజ్ఞాదేవి, సూర్యునిభార్య. పుం- కాళిందిని కన్నవాఁడు-సూర్యుఁడు.

కాళిక. సం. వి. ఆ. స్త్రీ. కాలిక, పార్వతి.

కాళి(లి)యుఁడు. సం.వి. అ.పుం.సర్పవిశేషము. (పడగలమీఁద నాట్యము చేసి శ్రీకృష్ణుఁడు దీని పాగరడఁచెను.)

కాళె(ళియ)=కాళ.వి.(సం.కాహళికా.క.కహళె. త. కాళమ్.) బూరగొమ్ము, వాద్యవిశేషము.

క. పాలఁతుక చిఱులొదలం గా,ళెలు వోలమి ...యయా. ౮. ౫౦.

ద్వి. కనకతప్పెటఁ జిత్రగతుల వాయింపఁ,గా ళెలు మించుహెగ్గాళెలు సన్న,గాళెలు రా తు లగ్గలముగా మొరయ. అ. మ. క. ౮. ౧౫౮ పా. ౨౨ పం.

కాళ్లజెఱ్ఱి. వి. (√కాలు²) కర్ణజలూక. ఆం. భా. ౨. ౮౮.

కావచికము. సం.వి.అ.న. కవచము దొడిగినవారిస మూహము.

కావచ్చు. అ. క్రి. (√అగు)౧.అగుటకు సిద్ధముగు.

క. ఈవంశము విచ్ఛేదము, గావచ్చినఁ గులము ని లుపఁగా సత్యవతి, దేవవచనమున సంతతిఁ,

గావించెను వ్యాసుఁ డనుజగత్కర్త దయన్.
భార. ఆది. ౫. ౮. అను. ౬. ౬౬.
(వ్యవ) సూర్యోదయము కావచ్చినది.
౨. కానోపు.
(వ్యవ) ఆదొంగ వీఁడే కావచ్చును.

**కావడి.** వి. టౌ. అనా. (ప్రా. కావడీ. తు. క. త. కావడి.) నీళ్లు లోనగునవి మోయుటకై రెండుకొనలను ఉట్లమర్చినకెదురుబద్ద, వీవధము.
అ...కావళ్ల నెత్తించి...భార. మా. ౧౭౫.
సీ...బలుగావళులును...భార. మా. ౨౯.
వ...కావడుల నుంచియు...మనుచ. ౪. ౬౦.
ఉ...అతి,శ్రాంతుని నన్నుఁ గావట దిసంతులు గొట్టుచు మోచు కేఁగుచో. అను. ౬. ౮౪.
గీ...ఉదర,పోషణంబునకై యూరిపొంత దోస, తోఁటఁ గావించెఁ గావడిపాటు పడుచు. శుక. ౩. ౩౭౬.
ఉదా: కావడిపట్లు.
జ: కావడించు.

**కావడించే.** స. క్రి. (√కావడి) కావడిలోఁ బెట్టు.
వ. భూయిష్ఠంబు లగుమృగములఁ దెగఁజూచి యేచి కన్నిచ్చకు వచ్చుపెక్కుసంజాడులు చేవ డించక కావడించి ప్రాద్ధస్తమించునంతకు నిజనిశాంతంబునకుఁ బఱతెంచునపుడు. పాండు. ౩. ౮౯.
గీ. ఒకఁడు కుంతానఁ బగవానియురము గ్రుచ్చి, వెంటనే యాతఁ డీఁటెచే నెత్తఁ బొడుప, నెలసె నిద్దఱు నిలిచిననిలువు కడన, కాళికై కావడించినకాను కనఁగ. కుపళ. ౨. ౧౩౬.

**కావరము=కావలము.**
వి. (గర్వము, మదము.)
క. గోవింద యతఁడు మంత్రులుఁ, గావరమునఁ జక్క విసరు కార్యవచనముల్. భార. ఉద్యో. ౩. ౨౮. (ప్రాఁతప్రతి పా-కావరములు. ముద్రి. భాల. వ్యా.)
క. అంబుధిజలంబు కణమూ,త్రంబైనం గైటభుండు దనకే ల్పాతా,ళంబున నిడి పయి వామక,రంబునిచి ధరిత్రి కావరంబున మోచెన్. సిద్ధకేపధర్మము. ౪౫. (చి. ని.)
గీ. కిన్నరస్త్రీలఁ జూచి లంఘింపఁ బొలుఁ, గావరం బెత్తి యుద్దామకామవికృతి, వాయుజవములు రవితేరివారువములు. కాశీ. ౩. ౧౦. ఆం. భా. ౧. ౧౩౩.
జ: కావరి, కావరించు, కావరుఁడు.

**కావరి=కావరుఁడు.** (కావరము+ఇ)
(ధూర్తుఁడు.)
సీ. చెడుగు గావరి నీచు చెరికి కేడ ములుచ్చ, బేరజ మన ధూర్తు పేరు వెలయు. ఆం. భా. ౩. ౭.

**కావరించే.** అ. క్రి. (√ కావరము) కావరముగలవాఁ డగు, గర్వించు.
గీ. అంత నక్కాంత నింతంత యనఁగ రాని, తమకమున నవ్విభుండు గాంధర్వసంజ్ఞ, మగు వివాహంబుచేత నిం పావహిల్లఁ, గా వరించె మనోజుండు గావరించె. పరమ. ౨. ౩౯.
వ...యుద్ధంబు సేయుకోలాహలంబు కౌతూహలంబుఁ గల్పింపఁ గావరించి విరించిపట్టివి పంచి పట్టి బెట్టుగాఁ బుట్టుగీతంబులం దల పెట్టె. ఉ. రా. ౨. ౬౧.

**కావరుఁడు=కావలుఁడు.** విశే. (√కావరము) కావరము గలవాఁడు.
గీ. శతముఖుం డనుఘోరరాక్షసవరేణ్యుఁ, డప్రతిద్వంద్వదోర్బలుఁడై సరోజ, గర్భువరములఁ జేసి లోకములఁ గలఁచెఁ, గావరుండు ప్రతాపలంకావరుండు. సీతావి. ౧. ౬౨. భార. అర. ౬. ౬౨.

**కావలము=కావరము.** వి. ౧. దురాచారము.
ఉ. నావుడు దానవేశ్వరుఁడు నందనుఁ జూచి గురుండు చెప్పిన,ట్లీవు పఠింతు గాని యిఁక

సెన్నఁడు నాకు విరోధి యైనఁ, దత్ప్రభుఁ బ్రస్తుతించెదు సుమీ మనవంశములోన లేని యీ, కావల మేల నామహిమకంటెను వాని మహత్త్వ మెక్కుడే. వి. పు. ౨. ౨౮౬.

౨. పాపము.

గీ. దేవపూజలఁ బొలిపోనికావలములు, బ్రాహ్మణోపాస్తిఁ జెడిపోనిపాపచయము, లచ్యుతానంత గోవింద హరి మురారి, యని తలంచిన యప్పుడే యడఁగిపోవు. వి. పు. ౩. ౧౩౫. నైష. ౮. ౧౯౬.

౩. మదము.

విణ. మదించినవి, కావరము.(ఇది 'బల్లిదము'వంటిది.)

కావలయు. అ. క్రి. (√అగు-కాక + వలయు.)

౧=వలయు. (ఇట "కాక" అనుదానికి విశేషార్థము లేదు.)

(క) ఇష్టమగు.

క. కావలసినవర మిచ్చెద...విప్ర. ౫. ౭౨.

(చ) ఆవశ్యక మగు.

గీ...కాపు కావలయు నెడల. ఇందు. ౨. ౫.

౨. అగు, సంబంధము కలిగియుండు.

సీ. జనకుండు సుతుఁడును జన్మంబు నేసిన వనిత వా రేమి కావలయు నీకు. గీ.వావివరుసలు గణియింప వచ్చి తేని,వనిత మాతోడ మాటాడ వశమె నీకు. ఉ. రా. ౪. ౨౧౬. ‖(ఏమి కావలయు=ఎట్టిబంధువు లగుదురు.)

౩. గర్హణమును దెలుపుడు.

క. మాతాపితృవర్జితుఁడగు, నీతని కే నెట్లు బిడ్డ నిచ్చితి నకటా,నాతప్పు గాక యిది దా,నీత నితప్పెట్లు నాకు నిటు కావలయున్. కాశీ. ౭. ౪౯.

అన్య. ద్రు. కాఁబోలు.

(ఊహను దెలుపును.)

వ. కచుండు ... నిహతుం డయ్యెం గావలయు. భార. ఆది. ౩. ౧౧౫.

కావలి. వి. (√కాచు-క. త. తు. కావల్) రక్షణము, కాపు. (బ్రా.)

విణ. రక్షకుఁడు.

క. వెలిదుంపుఁ డిద్దుటికిఁ గావలి నే నుండం గఁ జొమ్ము వాయుం గలదే. ఉ.హరి.౨.౧౩౮.

వ...ద్వారదేశంబులచావళ్లం గావళ్లుండి ప్రొద్దు వోక రక్కసులవేల్పులకయ్యంబులు నెయ్యంబులం జెప్పికొనుచున్న... మహాద్వారపాలకవీరులును... భాగ. ౮. ౪౪౭.

కావలియగు =రక్షకుఁడగు; రక్షకులగు.

వ. మీ రెల్లను వలయు నెడల నిలిచి భీష్మునికిఁ గావలి గావలయు ననిన. భార. భీష్మ.౧.౧౭౪.

కావలియుండు=రక్షకుఁడుగా నుండు; రక్షకులుగా నుండు. మై. ౨. ౧౫౬.

కావలివె(పె)ట్టు=౧. రక్షకునిగా నుంచు; రక్షకులనుగా నుంచు.

వ.నీతమ్ముండు పెద్దమొగసాలం జాలుమానుసులం గావలివెట్టి యభ్యంతరంబు ప్రవేశించి యుండె. భార. శల్య. ౨. ౨౬.

౨. బంధించు.

శా. వ్రేలుంగొమ్మలు నేల దారసిలినన్ వెళ్లంగరాకుండఁగా,లోలోఁ ద్రిమ్మరునాలిగాడ్పులు పగళ్లున్ రేలుఁ బూఁదావులన్,జాలన్ ముచ్చిలిపోవఁ బట్టుకొని పజ్జన్ బచ్చగండార్లలో,సోలన్ గావలిపెట్టె నామని యనన్ జూపట్టె లేఁదోఁటలన్. యయా. ౪. ౮. (ప్రయోగాంతరము కనఁబడలేదు.)

కావళులువె(పె)ట్టు=రక్షకులనుగా ఉంచు.

గీ. పదిలముగఁ గావళులు పెట్టి...నిరం. ౪.౭౦.

కావలికాఁడు. విణ. (కావలి+కాఁడు-క. కావలిగాఱు) రక్షకుఁడు, కాచువాఁడు.

చ...రాజరత్నము పరమేశ్వరుండు పటునాథుఁడు కావలికాఁడు ...కాశీ. ౧. ౬౩.

మ...కన్న గాండ్రు విని రాజద్వారముల్ సొచ్చి కా,వలికాండ్రం గనుఁబ్రామి ... కాశీ. ౪. ౫౨.

కావలివాఁడు=కావలికాఁడు.(కావలి+వాఁడు.)

ఉ. కావలివారిఁ దోలి యొసకంబున గోవులఁ బట్టికొంటి నం,చీవడమాట లేల ... భార. విరా. ౪. ౧౯౨.

కావలుఁడు= కావరుఁడు. విశే. కావలము గలవాఁడు.

(మదము గలవాఁడు, గర్వి.)

ఉత్సా. పోరి చూచి సత్తికన్న బొత్తికన్న నింగితా,కారముల నెఱుంగు దీవు కావలుండవై యహం,కారవృత్తి నీకునల్కక స్నెఱింగి తప్పఁబో,నేర వైతి...కు. సం. ౫. ౫౫౭.

ద్వి. రావణుఁ డట ఘోరరణకళాకేళిఁ, గావలుఁ డగుచు దిక్పాలుర నెల్లఁ, బఱచినతొల్లింటిభంగముల్ ... రం. రా. సుం. ౨౭౧. పా.౧౫. పం.

ఉ. కావలుఁ డైనవీఁడు తగుకార్యముపట్టునె వీనికెమ్మెయిం,జావు నిజంబు...భార. విరా. ౨.౭౮.(ప్రాఁతప్రతి పా-కావలమైన.ముద్రి. భాల. వ్యా.)

కావలె=కావలయు. (చూ.వలె.)

(ఆవశ్యక మగు.)

(వ్యవ) ఆపుస్తకము నాకుఁ గావలెను. ఇమ్ము.

(గర్హణమును దెలుపును)

ఉ... భవిష్యదర్థముల్, గానని నామనంబునకుఁ గావలె నిట్టివిపాదవేదనల్. నరస. ౨. ౪౭.

కావా. వి. (హిం. కావా) అశ్వములమండలాకారగతి.

క. అపనముల గీరావలి,యావలితగతిన్ భ్రమించుచునందం బలరెన్,గావా తిరిగెడుమారుని, మావులు నా నపుడు నికటమండలగతులన్.

హెద్దనభద్రాపరిణయము. ౧. ౪౧ పా.(ప్రాఁతప్రతి.)

కావారము. సం. వి. అ. న. శైవాలము,నాఁచు.

కావారి. సం. వి. ఈ. స్త్రీ. గడ్డి మున్నగువానిచే నిర్మింపఁబడినగొడుగు. (త్రి. ని.)

కావి. వి. (క. త. తు. కావి) ౧. ఎఱుపు.

గీ. కావి జాజెఱ్ఱన యెఱుపు జేవురు తొవ,రనఁగ రక్తాఖ్య నెలయు...ఆం. భా. ౧. ౧౧౮.

౨. కాషాయవస్త్రము, ఎఱ్ఱబట్ట.

సీ. కావి యంచనఁగను గాషాయమై యొప్పు... ఆం. భా. ౨. ౧౫౪.

(వేశ్య) సీ. కమలాతనూజరాగరసంపువడబావిజలజాస్త్రుటెక్కెంపునన్నకావి. వైజ. ౧. ౧౧౨.

ఉ. ఇందునిభాస్య మైలొడవు లేల ధరింపవు నున్న కావు లీ,నెందును మాన లేవు దలు పే టికిఁ గట్టితి...పారి. ౧. ౧౧౫.

విశే. ఎఱ్ఱనిది, అరుణము.

గీ...పోటులఁ దొరఁగురక్తంబుధార,లంగ మెల్లను గప్పిన నప్పు డొప్పెఁ, గావిసెలయేఱులెల్లెడఁ గలయఁ బర్వఁ,బొలుచుకులపర్వతంబుచాడ్పున నతండు. భార. శల్య. ౨.౧౧౧.

వ...కావి యగు మోవియు...హర. ౩. ౨౩. విక్ర. ౧. ౧౩౬.

జ: కావిగొను, కావిగోఁచిదారి, కావితాలుపు, కావిటొయి.

కావించు. స. క్రి. (√అగు) కాఁజేయు,అగునట్లు చేయు.

౧. కలిగించు, లభింపఁజేయు.

క. సేవితమై జనులకు నది, గావించు ననూనధర్మకామార్థంబుల్. భార. అర. ౨. ౨౫౩.

౨. చేయు, చలుపు.

క. దురితము కావించి తొలఁగుదురె పరమునకున్. అము. ౩. ౪౭.

గీ. చంద్రగుప్తుండు గావించె సరసగోష్ఠి, వట్టి మ్రాఁకులఁ జిగురులు పుట్టునట్టు. విక్ర. ౧. ౧౧౨.

౩. సిద్ధముచేయు.

గీ. ఓగిరంబులు గావించు నొప్పు గాఁగ. కాశీ. ౩. ౨౧౨.

౪. సృజించు; నిర్మించు; రచించు.

సీ. ప్రళయకాలంబున జలముల విష్ణుండు యోగనిద్రారతి నొంది మేలు,కాంచి లోకంబులు గావింపఁ దలఁచ నహంకార మెసఁగె...భార. శాం. ౬. ౪౭౯.

సీ. పెలుచ నల్లిండ్లు నిల్పెద నన్న నదలించుఁ జెలువు గావింప నెంచినను గసరు. విప్ర. ౩. ౧౫.

క. నీ విప్పు డాంధ్రభాషం, గావించుచు నున్న చంపుకావ్యమ్ము...వి. పు. పీఠి. ౨౫.

౫. నెఱవేర్చు, సఫలము చేయు.

మ...భవదిష్టం బేను గావింతు...పారి.౪.౧౨.

౬. ఆరోపించు.

గీ. మిత్త్రభేదంబు సేయ నమిత్త్రుఁ డెవ్వఁ,డట్లు సౌమిత్త్రికిని గోప మదర నన్న, నహితుఁ గాఁ జెప్పినాఁడొ నాయందు దోష, మొండు గావించి యాతండు మండువాఁడొ.భా. రా. కిష్కి౦. ౪౫౩.

**కావిగొను.** అ. క్రి. (కావి+కొను) ఎఱ్ఱనగు,ఎఱ్ఱపడు.

క. ఈవిధమున నతికరుణము,గా వనరుహనేత్ర కన్నుఁగవ ధవళరుచుల్,గావిగొన నేడ్చి... మనుచ. ౨. ౭౧.

**కావిగోఁచిదారి**=కావితాలుపు. వి. (కావి+గోఁచి+దారి) సన్న్యాసి. ఆం.భా.౨.౧౭౬.

ఇట్లే:-కావిపుట్టగోఁచులసామి. ఆం. సం. మాన. ౨.

**కావితాలుపు(ల్పు).** (కావి + తాలుపు) సన్న్యాసి, కాషాయధారి. (శ. ర.)

**కావిరి.** వి. ౧. నలుపు, కృష్ణవర్ణము.

ఉ. నావుడు రోషవహ్నివలనం బొగ రేఁగినభంగి మోమునం, గావిరి పర్వ నంగమునఁ గంపము నివ్వటిలంగ...ఉ. హరి. ౫. ౨౧౬.

౨. పొగవంటి నల్లనిపదార్థము. (ఇది ఉత్పాతములలో నొకటి.)

ద్వి. కప్పు మీఱినయట్టికావిరి విరిసెఁ,గప్పె నల్లడలఁ జీకట్లు సాంద్రముగ. ద్వి. పరమ. ౨. ౧౧౫. పా. ౯౩౦. (చి. ని. పా.)

సీ. తేరివాజులు మొగ్గ దెసలఁ గావిరి గప్పె బహుచిత్రమేఘముల్ బయల నిండె. భా. రా. అర. ౧. ౧౫౨.

తోటకము. మొరసెన్ సురగోముఖవాద్యతతుల్,నెరసెన్ మలయానిలలోలగతుల్,విరిసెన్ బలుకావిరి నల్దెసలన్,గురిసెన్ విరుల గ్గురులగ్న మునన్. సమీర. ౨. ౧౨౨.

విశ. నల్లనిది.

ద్వి.కావిరిచీకటుల్ గవిసె లోకముల.విష్ణు.పూ. ౩ ఆ. (శ.ర.)

**కావిరిబొట్టు.** వి. (కావిరి + బొట్టు) పీడాపరిహారార్థము శిశువులకు పెట్టెడునల్లనిబొట్టు.

సీ. ఫాలభాగంబుపైఁ బరఁగుకావిరిబొట్టు కాముని గెల్చినకన్ను గాఁగ. ఆ... బాలలీలఁ బ్రౌఢబాలకుండు, శివునిపగిది నొప్పె శివునికిఁ దనకును, వేఱు లేమిఁ దెల్ప వెలయు నట్లు. భాగ. ౧౦. పూ. ౨౯౭. ("కావలిబొట్టు" పాఠాంతరము అని శ. ర.-అప్పుడు కావలిగా నుంచుబొట్టు అని వ్యుత్పత్తి.)

**కావిడాయి.** వి. (కావి+డాయి) ఎఱ్ఱనిసుద్దడాయి, జేగురుడాయి. (శ. ర.)

**కావిశము.** వి. చేఁప? మొసలి?

సీ. రమణీయ మైసట్టిరాచిల్కకత్తెళా విలసిల్లుడ గరకావిళముపడఁగ. గంధ. ౧. ౬. (డగరకావిళము=మగకావిళము.)

**కావు**[1]. వి. ౧. రోదనధ్వని కనుకరణము.

క...చంటిపాపఁడు, కాటుకకన్నీరు దొరుఁగఁ గావున నేడ్చె౯. వేం. పంచ. ౪. ౪౪౪.

ఉ. ఎత్తిరికావుకావురని యేడ్చి తటీయపమోధరాగ్రముల్, కుత్తుకదాఁకఁ జిక్చికొని... హరి. పూ. ౫. ౧౫౦.

**కావు**[2]. వి. ౧. తిలకవిశేషము.

(క) దొంగలు తా మితరులకుఁ గనఁబడకుండుటకై పెట్టుకొనెడుతిలకము.

సీ...కావుబొట్టు, జిలుఁగుఁగన్నపుఁగత్తి బలపంబు... వేం. పంచ. ౩. ౧౯౯.

గీ. కావు ములుబంతి కమ్ములు గద్దగోరు...ధరించి. ప్రబంధ. ౭౫౯.

(చ) దయ్యాల విడిపించుమాంత్రికులు ధరించెడుతిలకము.

క. కందుబలుకావుఁ బెట్టుక, చెందొవరామాంత్రికుండు చీకటిదయ్యా,లం దఱుమ బూదిఁ జల్లిన,పొందిక వెన్నెల చెలంగె బుధులు నుతింపఁగ౯. ప్రబంధ. ౭౨.

-ట-(శ.కావు)పిల్లలకు రక్షార్థము పెట్టుతిలకము.

సీ. కనుబోయిఁ దిన్నగాఁ గాటుక దీరిచి నుదుటిపై నునుఁగావు కుదురుకొల్పి. చంద్రా. ౨. ౩.

౨. బొట్టు, తిలకము.

సీ. తెల్లజిల్లెడువేరు పిల్లారిదిసెగూఁడు గాజుటద్దము కావుకరపటంబు. బహు. ౫. ౧౨౯. (కావుకరపటము=బొట్టుపెట్టె, స్త్రీలు తిలకాది సామగ్రి యుంచుకొనెడుపెట్టె.)

౩. వశీకరణమునకై పెట్టుకొనెడియంజనము.

శా...చెలి నేత్రాబ్జంబుల న్వశ్యాలక్ష్మీమూలం బగు కావు నించె నన నుంచెం గజ్జలం బింతికి౯. వసు. ౫. ౧౧౮.

**కావు**[3]. వి. పాఁతఱ లోనగువాని పైకప్పు.

వ... ఎసరుగాఁ దేట లగురేటినల్లలు గుమ్మరించి లవణకణసంచయంబు నించి లావుగాఁ గావుఁ గప్పి. మనుచ. ౪. ౬౦.

క. ఇం దుండి పోఁగువాఱుం,డం దందు న్వాలల నొడ్డుఁ డవ్వలియోదా,లం దుండి కావు గప్పఁడు,ముండటఁ గెలఁకులను నిలిచి మున్నరికమెయి౯. కను. ౪. ౭౨.

కావువేయు=గాలి చొరకుండ గడ్డి మున్నగునవి కప్పి పచ్చికాయలు పండవేయు.

(వ్యవ) వేయిమామిడికాయలు కావు వేసినారు.

కావువచ్చు=కావువేయుటచే పండు.

(వ్యవ) బుట్టలో పండ్లు కావువచ్చినవి... తీయవచ్చును.

**కావుట**=కావుడు. (√అగు) వి. అగుట. (ఇది అగుధాతువుయొక్క భావార్థకరూపము.)

చ...ఇది సిద్ధము గావు టెఱింగి భక్తి నెప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు నల్గ నోడుదు౯. భార. ఆది. ౧. ౧౩౮.

క. జీవుఁడు మత్స్యమవేతుఁడు, గావు టెఱుఁగ వలయు దృఢముగా...భార. శాం. ౬. ౩౮౫.

**కావుడు**=కావుట.

చ...వారమృతాత్ములు గావు డొప్ప దే.కు.సం. ౭. ౯౯౪.

**కావుత**=కాత. ద్రు. అగుధాతువుయొక్క ఆశీరార్థక ప్రత్యయాంతరూపము. (ఇది ప్రాయికముగా ఆశీరర్థమున తద్ధర్మార్థకక్రియలకు అనుప్రయుక్తమగును.) ఆశీరర్థకము.

ఉ... అంబ కృతిప్రభుఁ బ్రోచుఁగావుత౯. శశాం. ౧. ౧౫.

ఉ...శాంబరీ,భిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుత౯. మనుచ. ౧. ౨.

**కావున**=కాన. అవ్య. ద్రు. (√అగు) హేతువును దెలుపును.

ఉ. పోరిత మైన నింతకును బుట్టు మహాపద గా వునఁ దరి, త్రిరమణాగ్రగణ్య గణుతించి యవశ్యము పొం దొనర్పవే. భార. ఉద్యో. 3. ౨౬౨.

**కావృకము.** సం. వి. అ. పుం. ౧. కోడి. ౨. చక్ర వాకము, జక్కవ. 3. పీతమస్తకపక్షి, పచ్చతల గలయొకజాతిపిట్ట. (కల్ప)

**కావేరము.** సం. వి. అ. న. కుంకుమపువ్వు.

**కావేరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧-కవేరపుత్రి-దక్షిణ హిందూస్థానమందలి యొకనది. ౨. వెలయాలు, వేశ్య. 3. పసుపు.

**కావ్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పూతన, ఒకరాక్షసి. ౨. బుద్ధి. (మే. ని.)

**కావ్యము.** సం. వి. అ. న. ౧. కవికృత మగు గ్రంథము, కబ్బము. ౨. సుఖము.

**కావ్యలింగము.** సం. వి. అ. న. ఒకానొకఅర్థాలంకారము.

**కావ్యార్థాపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఒకానొకయర్థాలంకారము.

**కావ్యుఁడు.** సం. వి. అ. పుం. శుక్రుఁడు.

**కాశకము.** సం. విశే. (అ. శికా. అ.) ౧. ప్రకాశించునది. ౨. ప్రకాశింపఁ జేయునది. వి. అ. పుం. కాశము, రెల్లు. (కల్ప)

**కాశగర్భము.** సం. వి. అ. పుం. అశ్వవాలకతృణము, ఒకవిధ మగు రెల్లు.

**కాశము.** సం. వి. అ. పుం. న. రెల్లు. న. రెల్లుపువ్వు. పుం. ౧. ప్రథ. ౨. తుమ్ము. 3. కాసము, దగ్గు.

**కాశాదని.** సం. వి. ఈ. స్త్రీ. కాసరి. ఆం. భా. ౨. ౭౦. (ఇది సంస్కృతనిఘంటువులలోఁ గానరాదు.)

**కాశాల్మలి.** సం. వి. ఇ. స్త్రీ. కూటశాల్మలి, కొండబూరుగు. (కల్ప.)

**కాశి.** సం. విశే. (న్. నీ. న్.) ౧. ప్రకాశశీలుఁడు, ప్రకాశించువాఁడు. (ఈయర్థమున సమాసాంతమున నుండును.) ౨. కాసరోగము కలవాఁడు. వి. ఇ, ఈ. స్త్రీ. వారాణసి, గంగాతీరమందలి ఒకప్రసిద్ధనగరము. ఇ. పుం. ౧. సూర్యుఁడు. ౨. ప్రకాశము.

**కాశిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కాశి. ౨. పాణినిసూత్రములకు వామనజయాదిత్యులు చేసినవృత్తివిశేషము.

**కాశికము.** సం. విశే. (అ. ఆ, ఈ. అ.) కాశియందు పుట్టినది, మొ.

**కాశీనాథుఁడు.** సం. వి. అ. పుం. విశ్వేశ్వరుఁడు, శివుఁడు.

**కాశీప్రయాగలు.** సం. వి. అ. పుం. బ. ధాన్యభేదము. ప్రబంధ. ౧౧౨.

**కాశీస(శ)ము.** సం.=కాసీసము. (వాచ.)

**కాశు(సు)వు.** సం. వి. ఉ. స్త్రీ. ౧. శక్తిరూపమైనఅస్త్రము. ౨. వికల మగువాక్కు, స్పష్టముకానిమాట. 3. రోగము. ౪. బుద్ధి. ౫. దీప్తి, కాంతి.

**కాశూ(సూ)కారము.** సం. వి. అ. పుం-కాసువును(=వికలవాక్కును) కలిగించునది-గువాకము, పోఁక.

**కాశూల.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య.

**కాశ్మద్వీపము.** సం. వి. అ. పుం. గంభారి, గుమ్ముడు.

**కాశ్మరి.** సం. వి. ఈ. స్త్రీ. గంభారి, గుమ్ముడు.

**కాశ్మర్యము.** సం. వి. అ. పుం=కాశ్మరి.

**కాశ్మీరజన్మము.** సం. వి. న్. న. కుంకుమపువ్వు.

**కాశ్మీరము.** సం. విశే. (అ. ఈ. అ.) కాశ్మీరదేశ సంబంధమైనది. వి. అ. పుం. ఒకానొకదేశము. న. ౧. కుంకుమపువ్వు. ౨. టంకము, కాసెయులి.

**కాశ్మీరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గుమ్ముడు. ౨. కపిల ద్రాక్ష. (రాజ. ని)

**కాశ్మీర్యము.** సం. విశే. (అ. ఆ. అ.) కాశ్మీరదేశమందున్నది; కాశ్మీరదేశమందు కలిగినది. వి. అ. న. కుంకుమపువ్వు.

**కాశ్యపము.** సం. వి. అ. న. మాంసము.

**కాశ్యపి.** సం. వి. ఇ. పుం. ౧. అనూరుఁడు. ౨. గరుడుఁడు. ఈ. స్త్రీ. భూమి.

**కాశ్యపుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) కశ్యపునకు సంబంధించినవాఁడు. వి. అ. పుం. ౧. ఒకానొక ఋషి. ౨. కణాదుఁడనుముని.

**కాశ్యపేయుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. గరుడుఁడు. ౩. వేల్పు, త్రిదశుఁడు. ౪. రాక్షసుఁడు.

**కాశ్యము.** సం. వి. అ. న. మద్యము.

**కాషము.** సం. వి. అ. పుం. ఒరగల్లు.

**కాషాయము.** సం. విశే. (అ. ఈ. అ.) కషాయవర్ణము గలది, ఎఱ్ఱనిది, కావివన్నె గలది. వి. అ. పుం. కషాయవస్త్రము, కావిబట్ట.

**కాష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దిక్కు. ౨. పదునెనిమిది ఱెప్పపాట్లకాలము. ౩. సీమ, అవధి, మేర. ౪. స్థితి, ఉనికి. ౫. ఉత్కర్షము, అతిశయము. ౬. మ్రానిపసుపు. ౭. కశ్యపుని భార్యలలో నొకతె.

**కాష్ఠకదళి.** సం. వి. ఈ. స్త్రీ. అడవియరఁటి.

**కాష్ఠకము.** సం. వి. అ. న. అగరువు, అగలు.

**కాష్ఠకీటము.** సం. వి. అ. పుం. జీర్ణమగుమ్రానియందు కనఁబడు నొకపురుగు, మ్రాను తొలుచు పురుగు, ఘుణము.

**కాష్ఠకుట్టము.** సం. వి. అ. పుం. పక్షిభేదము, వడ్రంగిపిట్ట, మ్రానిపోటుపులుఁగు.

**కాష్ఠకుద్దాలము.** సం. వి. అ. పుం. ఓడలోనినుఱికి గోఁకుటకై కఱ్ఱతో చేసినగుద్దలి.

**కాష్ఠజంబువు.** సం. వి. ఊ. స్త్రీ. నేలనేరేడు.

**కాష్ఠతంతువు.** సం. వి. ఉ. పుం. మ్రానియందు కనుపట్టుచున్న నితంతువువంటిపురుగు.

**కాష్ఠతక్షకుఁడు.** సం. వి. అ. పుం. వడ్రంగి.

**కాష్ఠదారువు.** సం. వి. ఉ. పుం. దేవదారువు.

**కాష్ఠద్రువు.** సం. వి. ఉ. పుం. పలాశము, మోదుగు.

**కాష్ఠపాటల.** సం. వి. ఆ. స్త్రీ. సితపాటల, తెల్లకలిగొట్టు.

**కాష్ఠపాటలి.** సం. వి. ఈ. స్త్రీ=కాష్ఠపాటల.

**కాష్ఠమఠి.** సం. వి. ఈ. స్త్రీ. చితి, సొద.

**కాష్ఠమల్లము.** సం. వి. అ. పుం. శవయానము, పాడె.

**కాష్ఠము.** సం. వి. అ. న. కఱ్ఱ.

**కాష్ఠమౌనము.** సం. వి. అ. న. సంజ్ఞలచేతనైనను స్వాభిప్రాయమును దెలుపనిమౌనము.

**కాష్ఠలేఖకము.** సం. వి. అ. పుం. కాష్ఠకీటము, మ్రాను తొలుచుపురుగు.

**కాష్ఠలోహి.** సం. వి. న్. పుం. ఇనుము మున్నగు లోహములపొన్నుతో కూడినమ్రానిగుదియ.

**కాష్ఠవల్లిక.** సం. వి. ఆ. స్త్రీ. కటుక, కటుకరోహిణి.

**కాష్ఠశారిబ.** సం.వి. ఆ. స్త్రీ. తెల్లసుగంధిపాల, తెల్లమామెన.

**కాష్ఠాంబువాహిని.** సం. వి. ఈ. స్త్రీ. ఓడలోఁ జొచ్చిననీళ్లను వెలికి పాఱఁబోసెడుదోనె వంటిమ్రానిబొక్కెన.

**కాష్ఠి.** సం. విశే. (న్. నీ. న్.) బహుకాష్ఠయుక్తుఁడు, కఱ్ఱలు మిక్కుటముగాఁ గలవాఁడు.

**కాష్ఠిక.** సం. వి. ఆ. స్త్రీ. చిన్నకట్టె, చిదుగు.

**కాష్ఠికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ)=కాష్ఠి. వి. అ. పుం. కట్టెలమోపరి.

**కాష్ఠీల.** సం. వి. ఆ. స్త్రీ. కదలి, అరఁటి!.

**కాష్ఠీలము.** సం. వి. అ. పుం. రాజార్కము, రాచజిల్లేడు!.

**కాష్ఠోదుంబరిక.** సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరిక, కాకిమేడి!.

**కాస**=కాసె1.

గీ. బొమిడికంబులు వెట్టి జోళ్లమరఁ దాల్చి, చల్లడంబులు దొడిగి కాసలు బిగించి, జముదళంబులు చెక్కి బల్లెములు పూని, వెడలి రప్పుడు పెక్కుండ్రు వేఁటకాండ్రు. కవిరా. ౨. ౭౧.

శా. చల్లాడంబులమీఁదటన్ బిగువుకాసల్ కట్టి ...అని. ౪. ౩౪. (శ. ర. పా.)

జ: కాసించు.

**కాసందీవటిక.** సం. వి. ఆ. స్త్రీ. వేళవారభేదము, ఒకవిధ మగువంటసంబారము.

**కాసఘ్నము.** సం. విశే. (అ. ఈ. అ.) కాసమును హరించునది.

**కాసఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. కంటకారి, వాకుడు!.

**కాసజిత్తు.** సం. వి. త్. స్త్రీ. భార్గి, బారంగి!.

**కాసనాశిని.** సం. వి. ఈ. స్త్రీ. కర్కటశృంగి!.

**కాసమర్దకము.** సం. వి. అ. పుం. కసింద!.

**కాసమర్దనము.** సం. వి. అ. పుం. పటోలము, చేఁదిపొట్ల!.

**కాసమర్దము.** సం. వి. అ. పుం. పీతపుష్పి, కసింద!.

**కాసము.** సం. వి. అ. పుం. క్షవథువు, దగ్గు.

**కాసర**=కాఁచర. వి. కాశాదరి!.

గీ... కాసర యనఁ గాఁచర యనఁ గాశాదనీస మాహ్వయ మగు భవ. ఆం. భా. ౨. ౭౦.

వ... ఆల్లుల్లసిల్లెఁ గాసర గాచె దోస దొరగిలం బాఱె... కాశీ. ౩. ౨౩.

**కాసరము.** సం. వి. అ. పుం. మహిషము, ఎనుపోతు.

**కాసరలు.** వి. బ. శాలిధాన్యవిశేషము. ప్రబంధ. ౧౧౨.

**కాసలనా(ల్నా)డు.** వి. డు. (సం. కోసలః?) ఒకానొకదేశము. (ఇందుండి వచ్చినబ్రాహ్మణులను కాసలనాటివా రందురు.)

ఉ...ఆ, కాసలనాటివారికనకాంగిని జూచితి నీళ్లరేవునన్. వీథి. ౧౪.

క. కాసల్నాటను శ్రేష్ఠుఁడు, మీసాలప్పయ్యగారిమేనల్లుఁడు... క్రీడా. ౪౪.

**కాసా.** వి. దాసీసంతతి.

సీ. సాదువిశ్వేశ్వరశర్మమాన్యంబుల నెలమిఁ గాసాలంజె కిచ్చినావు. చంద్ర. వి. ౧. ౩౨.

**కాసారము.** సం. వి. అ. పుం. సరస్సు, కొలను.

**కాసారి.** సం. వి. ఇ. పుం. కాసమర్దము, కసింద!.

**కాసాలువు.** సం. వి. ఉ. పుం. కాసకందము, కోంకణదేశప్రసిద్ధ మగుఆలుకభేదము, ఒకజాతిగెనసుదుంప.

**కాసి.** సం. విశే. (న్. నీ. న్.) కాసరోగి, దగ్గు కలవాఁడు.

**కాసించు.** స. క్రి. (√కాస) కాసెగా కట్టు; కట్టు, ధరించు.

సీ. కరకంచుసలిపెంబు గట్టిగాఁ గాసించి వెలిత్రాడు కాసెపై బలయఁ జుట్టి. ద్వా. ౭. ౪౫.

సీ. పులితోలు పచ్చడంబుగ మొలఁ గాసించి స
ర్వాంగములను భస్మంబుఁ బూసి. ద్వా. ౭.
౧౦౪.

**కాసీఁడు.** వి. (కాసె² + ఈఁడు) కాసెవాఁడు,ఊ
తిపనివాఁడు.

ద్వి.సున్నంబు నిటిక రాసులుగఁ బెట్టించి,పను
లు సేయంగ నుప్పరలఁ గాసీల. ప్రభు. ౩.
౭౨పొ. ౧౩ పం.

గీ...ఒక్కఁ,నాఁడు కాసీల కిట్లను నయము మీ
ఱ. పరమ. ౫. ౪౭.

**కాసీసము.** సం. వి. అ. న. కాశీసము, ఉపధాతు
భేదము, అన్నభేది. (వాచ)

**కాసు.** వి.౧.పదునొకండుఅణాల యెత్తు గలబంగా
రపునాణెము.

ఉదా: కాసులపేరు.

౨. (సం. కాచః. క. త. కాసు) దుగ్గాణిలో ప
దియవపాలు, దమ్మిడిలో నైదవవంతు. (దుగ్గాని
లో నాల్గవభాగము. శ. ర)

గీ...తనకుఁ దా నబ్బినట్టి, కాసు పదివేలనిష్క
ముల్ గాఁ దలంచి. భాగ. ౧౦ ఉ. ౯౬౫.

ద్వి. మరగి చొచ్చినయట్లు మత్తపోవనము, సు
రుఁగక చొచ్చి కాసుగ నన్నుఁ గొనక. ద్వి.
హరిశ్చ. పూ. ౧౧౯౭. (కాసుగఁగొనక:-
అణుమాత్రమైనను లక్ష్యముసేయక.)

గీ. తావు గాసంతె చాలు...రా. వి. ౨. ౬౦.
(కాసంత=కొంచెము.)

౩. పైకము, ధనము.

గీ. చల్లఁగాఁ జేతికా సెల్ల దుల్లి ... నిరం. ౨.
౧౨౭.

**కాసె¹ (సియ)=కాస.** వి. (సం. కచ్ఛా) ౧. కాసె
కోక, దట్టి.

మ. జిగిమైసొంపును దమ్మిమైమఱుపు డాచేఁ గ
ల్పచేకత్తియుఁ,సిగఁ బూమొగ్గలతాయెతుల్
చిగురుకాసెం జెక్కినం జాలఁ బొ,ల్పగుచు
న్నేడఁగిఱేకువంకియును జాయల్ మీఱఁ
గాఁ బూవుఁదీఁ,గెగుదెం దా వలరాచరౌతుం
టరి కడుం గేరించుచుం జిమ్మినన్. యయా.
౫. ౬౪.

క... కట్టె బిగియం,దనకాసియ వారిరాశి దాఁ
టెడు తెగువన్. రామా. ౬. ౭౩.

౨. కచ్ఛభేదము, కుచ్చెల.

సీ...కచ్ఛభేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల
కుచ్చె...అనంగ... ఆం. భా. ౨. ౧౫౩.

జ: కాసెనిలుకడ, కాసెపోయు.

**కాసె².** వి. ౧. ఊతిపనివాఁడు.

సీ. గ్రావకారుఁడు కాసె కాసెవాఁ డనఁదగు ..
ఆం. భా. ౨. ౨౭౪.

౨. రాయి తొలిచెడుపని. (శ. ర.)

జ: కాసీఁడు, కాసెయులి, కాసెవాఁడు.

**కాసెనిలుక(ల్క)డ.** వి. (√కాసె¹) మల్లబంధ
విశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొ
కటి.

వ...గళకత్తెరయు నృసింహంబును గాసె నిలు
కడయు ననుముప్పదిరెండువిన్నాణములును
...ప్రబంధ. ౬౭. హంస. ౧. ౨౦౬.

సీ. కాసెనిల్కడ గళకత్తెర జోడింపు నరసింగ
ము...గీ. అంజమెడపట్టు నాఁగఁ జెన్నలరు
చుండు, ముప్పదియు రెండు విన్నాణముల
కుఁ బేర్లు. ఆం. భా. ౨. ౨౦౯.

**కాసెయులి.** వి. (కాసె² + ఉలి.) టంకము, ఊ
యి తొలుచుట కుపయోగించుపనిముట్టు.

ఆ. గట్టుఱాలఁ దెచ్చి కాళ్లఁ జేతులఁ ద్రొక్క,
కాసెయులులచేత గాసిచేసి, మొరపఱాల
కెఱఁగుమొప్పెల నే మందు,విశ్వ...వేమన.
౩. ౨౩౭.

గీ...టంక మొప్పగును గాసె,యులి యనఁగ
...ఆం. భా. ౨. ౩౦౦.

కాసెవాఁడు=కాసీఁడు. (√కాసె².)
సీ. గ్రావకాఁడు కాసె కాసెవాఁ డనఁ దగు... ఆం. భా. ౨. ౨౯౪.

కాసెపోయు. అ. క్రి. (కాసె¹+పోయు)-వస్త్రము-గోఁచివలె వెనుక చెక్కు. (శ. ర.)

కాస్మర్యము. సం. వి.అ.పుం.గంభారి, గుమ్ముడుకి.

కాహక. సం. వి.ఆ.స్త్రీ.కాహళవాద్యము, బాకా.

కాహలా(భా)పుష్పము.సం వి.అ.పుం. దుత్తూరము, ఉమ్మెత్తకి.

కాహళ(ల)ము. సం. విశ.(అ.ఆ.అ.) ౧. అసభ్యము, పామరము. (మాట.) ౨. శుష్కము, ఎండినది. 3. ఖలము, చెడ్డది. ౪. భృశము, పెల్లయినది. వి. అ. పుం. ౧. పిల్లి. ౨. కోడి. 3.శబ్దము, సద్దు. న. ౧. అవ్యక్తవాక్యము. ౨.బాకా.

కాహళ(ల). సం. వి. ఆ. స్త్రీ. ౧. పెద్దఢక్క. ౨. బాకా. (వై. ని.)

కాహళి(లి). సం. వి. ఇ. పుం. శివుఁడు. ఈ.స్త్రీ. ౧.కాహళ, బాకా. ౨. జవ్వని, యువతి, తరుణి.

కాహళి(లి)క. సం. వి. ఆ. స్త్రీ. కాహళి, బాకా.

కాహళి(లి)కుఁడు. సం. వి. అ. పుం. కాహళి యూఁదువాఁడు.
క. త్రికవులకుఁ జతుష్కవులకుఁ, బ్రకటంబుగ నెందు నీవ రాజ వనుచుఁ గో, తుకమునఁ గాహళికునిపో, లికఁ దాఁ దచ్చెరువదకాహళి క పూరించెన్. పరమ. ౫. ౯౧.

కాహి. సం. వి. ఈ. స్త్రీ.కుటజము, కొడిసెచెట్టు.

# కి

కి=ప. ప్ర. ప్ర. (షష్ఠీవిభక్తియందు 'ఇ, ఈ, ఐ, లకు తరువాత ప్రాయికముగా 'కి' యును మిగిలినయచ్చులతరువాత 'కు'ను వచ్చును. ఉదా: హరికి, స్త్రీకి, పైకి-ప్రాయికమనుటచే 'నీకు, ఈకు, మీకు' ఇత్యాదులయందు రాదు.)
౧. సంబంధసామాన్యమును తెలుపును. (ఈయర్థమున క్రియతో నన్వయముండదు.)
క...కరుణా,నిపుణుఁడ వై నీమఱఁదికి, నపరాధశతంబు సైఁపు మయ్య యుపేంద్రా.భార. సభా. ౨.౫౯. (మఱఁదికి=మఱఁదియొక్క)
౨. సంబంధవిశేషమును తెలుపును.
(క) స్వస్వామిభావసంబంధము.
(వ్యవ) వాని కైదు మేడ లున్నవి.
(చ) అవయవావయవిభావసంబంధము.
(వ్యవ) పక్షికి రెక్కలు రెం డుండును.
(ట) జన్యజనకభావసంబంధము.
(వ్యవ) అతని కిద్దఱు కొడుకులు గలరు.
(త) తృతీయావిభక్త్యర్థకము.
చ...బుక్కభూ,పతికి సముండు లేఁడు తలఁపఁగ భువనంబున నేగుణంబులన్. కళా. పీఠి. ౨౧. (భూపతికి=భూపతితో.)
మ. సిరికిన్ జెప్పఁడు...భాగ. ౮. ౯౬. (సిరికి=సిరితో.)
క...అతఁడు దంష్ట్రుఁ డండు గవనీపతికిన్.భార. అను. ౪. ౧౩౬. (అవనీపతికి=అవనీపతిచేత.)
(ప) చతుర్థీవిభక్త్యర్థకము. అను. ౫.౧౪3.
(వ్యవ) ఇది తలనొప్పికి మంచిమందు.
(తలనొప్పికి=తలనొప్పి పోవుటకొఱకు.)
(గ) పంచమీ విభక్త్యర్థకము.
క...దానికధికము గలదే.భార.శాం.౬.౫౯౯.
(దానికి=దానికంటె.)
క. ధర్మసుతుఁ డొడ్డి శకుని క,ధర్మస్థితి నోటువడియె...భార. సభా. ౨. ౨౭౯. (శకునికి=శకునివలన)
(జ) సప్తమీవిభక్త్యర్థకము.
గీ. ఎఱుకు విలువిద్యకలిమికి హీనుఁ డయ్యెఁ,

బార్థునకు...భార. ఆది.౫.౨౪౪.(విలువిద్య కలిమికి=ధనుర్విద్యాసంపద్విషయమున.)

(డ) నిర్ధారణార్థకము, లోపల.

గీ. అన్నదానంబు ధర్మంబు లన్నిటికిని, ముఖ్యము...భార. అను. ౪. ౨౭౬.

(ద) పైకి, మీఁదికి; పైని, మీఁద.

గీ. కరికి లంఘించుసింహంబుకరణి మెఱసి. భాగ. ౧. ౨౨౨.

గీ...ఇది చాల నబల దీని,కలుగఁ జనదు...భార. ఆది. ౬. ౨౧౭.

మఱికొన్ని ప్రయోగవిశేషములు.

ఆయూరి కీయూరు అయిదు కోసులు.

వానికి వీఁ డెంతో వీనికి వాఁడును అంతే.

మాటిమాటికి లేచిపోకుము.

**కింక**=కినుక. వి. (√కినియు[1]) ౧. కోపము.

ఉ. పంకజనాభ మాపడినపాటులు రాజ్యము గోలుపోకయుం,గింకకు మూలమై...భార. ద్రో. ౩. ౧౩. భాగ. ౧౦ ఉ. ౨౬౫.

౨. బాధ, పీడ.

ఉ. పంకరుహాంబకుండు మదిఁ బాయక లో వెతఁ బెట్ట నాత్మప, ర్యంకలతాంతకోరకము లాతనికొమ్మెఱుఁగారుతూపులై, కింకలఁ బెట్టఁగా...వి. సం. ౨. ౨౦.

౩. రోగము, తెగులు. ('పసులను మేఁకలను చంపెడురోగవిశేషము' అని శ. ర. 'మారిమొదలైన అంటురోగము' అని బ్రౌ.)

గీ... తెవులు, కింక నా రోగసంజ్ఞయై కెరలుచుండు. ఆం. భా. ౨. ౧౨౪.

కింకపట్టు=పోరుపెట్టు.

(వ్యవ)పిల్లవాఁడు కింకపట్టి యేడ్చుచున్నాఁడు

కింకనీళ్లుతీయు=పిల్లలు పోరుపెట్టుట మానుటకై ఎఱ్ఱనీళ్లు దిగఁదుడిచి పాఱఁబోయు.

(వ్యవ)పిల్ల యేడ్చుచున్నది. కింకనీళ్లుతీయుము.

**కింకరి.** సం. వి. ఈ. స్త్రీ. కింకరునిభార్య.

**కింకరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పరిచారకుఁడు, సేవకుఁడు, దాసుఁడు.

**కింకిణి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. క్షుద్రఘంటిక, చిఱుగంట; గజ్జె. ౨. వికంకతవృక్షము, పుల్లనెలఁగ. ౩. ఘంటారవ, గిలకచెట్టు, గిలిగిచ్చ. ౪. పుల్లద్రాక్ష.

**కింకిణీకము.** సం. వి. అ. పుం. చిఱుగంట; గజ్జె. (శ్లో. కింకిణీకవిభూషితాన్. హరివంశము.)

**కింకిర.** సం. వి. ఆ. స్త్రీ. రక్తము, నెత్తురు.

**కింకిరము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిది. వి. అ. పుం. ౧. గుఱ్ఱము. ౨. కోయిల. ౩. తుమ్మెద. ౪. ఎఱుపు, రక్తవర్ణము. ౫. ఏనుఁగుకుంభస్థలము.

**కింకిరాటము.** సం=కింకిరాతము.

**కింకిరాతము.** సం. వి. అ. పుం. ౧. చిలుక. ౨. కోయిల. ౩. అశోకవృక్షము.

**కింకిరాతు(టు)ఁడు.** సం.వి.అ.పుం. మన్మథుఁడు.

**కింకిరాలము.** సం.వి. అ.పుం. బర్బూరము,తుమ్మ.

**కింకిరి.** వి. (√కింక ?) ౧. కోపము, కింక. (చూ. కింకిరిపడు.) ౨. ఏవ, రోఁత; రోఁతపని.

ఉ. పంకజమున్ దొలంగి తదుపాంతచరన్మధుపప్రసక్తికిన్,గొంకిఝుషాదిరూపములకున్ జనునాథునివింతయక్కుపైఁ, గింకిరి గాఁగ లచ్చి తిలకించి యజస్రము నుండుఁగాత ని, శ్శంకఁ జనుక్యవిశ్వమనుజప్రభుపుణ్యకటాక్షదృష్టులన్. కావ్యా. ౧. ౨.

ద్వి. అప్పుడు నందనుఁ డాయోగివరుని,చీరపైఁ గింకిరి చేయు గోరక్షుఁ, జేర రమ్మని పిల్చి చేతికిఁ బుత్ర, నిచ్చి గోరక్షక యారోఁతఁ గడిగి, తెచ్చి యిమ్మనుటయు ... నవ. ౪. ౧౩౯ పా. ౪ పం.(కింకిరిచేయు:-విష్ఠించు, మలవిసర్జనముచేయు అనిభావము.)

జ: కింకిరిపడు, కింకిరిపాటు.

**కింకిరిపడు.** అ. క్రి. (కింకిరి+పడు.) ౧. కోపించు.

క. అతఁ డెంత చేఁగి తిట్టిన, మతిఁ గింకిరిపడక యపుడు మా టాడక యా, నత యగుచు న ప్పతివ్రత, యతని నతిశ్రేష్ఠుఁగాఁగ నాత్మఁ దలఁచుచుక౯. మార్క. ౨. ౧౫౮.

ద్వి. భరతుండు నాకంటె భక్తుండు మీకు, నత నిఁ బట్టముగట్టుఁ డాత్మఁ గైకేయి, కృత కంబులకు నింకఁ గింకిరిపడకు. రం. రా. అయో. ౧౧౪ పా. ౧౭ పం.

౨. అసూయపడు.

ద్వి. జగతిలోపల హరిశ్చంద్రభూవిభుఁడు, పా గడొందఁ డేమి తాఁ బొగడొందఁ డేమి, బొంక కుండిన నేమి బొంకిన నేమి, కింకిరి పడి పరికింప నా కేల. ద్వి. హరిశ్చ. ఉ. ౨౭౧౩ పం.

౩. గోఁతపడు, ఏవగించు.

ద్వి. అడరుదుర్గంధాన కణుమాత్రమైనఁ, గింకిరి పడక శంకింపక ధైర్య, మింకక చండాలు నింటికి నేఁగి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౮౪ పం.

**కింకిరిపాటు.** వి. (√కింకిరిపడు) కింకిరిపడుట. (కోపపడుట, కోపము.)

సీ. నగుమొగంబుల కాని నాతి నీదెస నెప్డుఁ బతులకుఁ గింకిరిపాటు లేదు. భార. అర. ౫. ౨౯౧. ఉ. హరి. ౩. ౧౪.

**కింకిరుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు. (విల్యమ్సు.)

- **కింక్షణుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) - ఒకక్షణము పోయిన నేమి యని యనుకొనువాఁడు, కాలము విలువ తెలియనివాఁడు - సోమరి, అలసుఁడు.

**కింగళింపు.** వి. మల్లవిద్యాసంబంధ మగుపాదశో పవీతములలో నొకటి. హంస. ౧. ౨౦౬.

**కింగాణి.** వి. కొంఱగానిపని.

ద్వి. కింగాణి మును చేయ దంగవ చూడు. ద్వి. భాగ. ౪. ౧౧౦౪. (బ్రౌ.)

**కింగిరి.** విశ. అల్పము. (శ. ర.)

**కించే.** వి. మనోవ్యథ.

ఉ... ఈతని కుత్తరంబు నే, నెవ్వగ నిత్తుఁ జిత్తమున కేమియుఁ దోఁపదు కించ పుట్టె... సానందో. ౩. ౩౮.

**కించిజ్జ్ఞుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) కొంచెము తెలిసినవాఁడు, అల్పజ్ఞానము గలవాఁడు.

**కించిత్కరము.** సం. విశ. (అ. ఈ. ఆ.) కొంచెము చేయునది, కొంచెము ఉపయోగించునది.

**కించిత్తు.** సం. అవ్య. అల్పము, ఇంచుక; అల్పముగా.

(వ్యవ) ఇందు లాభము కించిత్తయినను లేదు.

క. కొంచక వేఁడుము తగ న, ర్పించెద నిపు డెద్ది నీయభీష్టము నాకుక౯, గించిత్తయిన మనోధన, వంచన మిచ్చోట లే దవశ్యం బనినక౯. జై. భా. ౭. ౨౦౯.

క. కించిత్తు నల్లి కుట్టిన, మంచమునకుఁ బెట్లు వచ్చు మహిలో సుమతీ. సు. శ. ౩౯.

గీ. ఏల కించిత్తు నన్నెంచఁ డితఁ డటంచు. దశా. ౬. ౧౦౧.

**కించిన్మాత్రము.** సం. విశ. (అ. ఆ. అ.) కొంచెపాటిది.

**కించిలికము.** సం=కించులుకము. (కల్ప)

**కించే=క్రించే.** విశ. (సం. కించిత్. ప్రా. కించి.) అల్పము, నీచము.

వ... అజ్ఞాభంగంబు గావించునక్క్రించు నొక్క్రించు కంతయు విచారింపక పట్టుకొనిపోయి మత్పురోహితులముందఱం బెట్టి రందు... జై. భా. ౪. ౧౨౨. ఉ. రా. ౪. ౧౬౩.

**కించులుకము.** సం. వి. అ. పుం. మహీలత, ఎఱ్ఱి, వానపాము.

**కింజము.** సం. వి. అ. న. కింజల్కము, అకరువు.

**కింజలము.** సం. వి. అ. పుం=కింజము.

**కింజల్కము.** సం. వి. అ. పుం. కేసరము, అకరువు. న. ౧. ఆకాశము. (వై. ని.) ౨. నాగకేసర పుష్పము. (కల్ప)

**కింతుఘ్నము.** సం. వి. అ. పుం. బవాదికరణములలో నొకటి. (చూ. కింస్తుఘ్నము. విల్సన్సు.)

**కిందముఁడు.** సం. వి. అ. పుం. పాండురాజును శపించినయొకానొక ఋషి.

**కిందాసుఁడు.** సం. వి. అ. పుం. కుత్సితుఁ డగుదాసుఁడు.

**కిందు**=క్రింద. (క. త. మ. కీఴ్.)

(వశము, అధీనత.)

ద్వి. చేకొని నామాటఁ జేసితి గాన,నీకింద రాజ్యంబు నిత్యమై యుండు,నను చు నాపూరుని నభిషిక్తుఁ జేసి. రం. రా. ఉ. ౧౩౩ పా.

**కింపచానుఁడు.** సం=కింపచుఁడు.

**కింపచుఁడు.** సం. వి౯. (అ. ఆ. అ.)-కొంచెము వండుకొనువాఁడు-లోభి, పిసినిగొట్టు.

**కింపాకము.** సం. వి. అ. పుం ౧. విషముష్టి, ముసిఁడి ౘె. ౨. మహాకాలము ౘె.

**కింపాకుఁడు.** సం. వి౯. (అ. ఆ. అ.)-కుత్సితమనఃపరిపాకము గలవాఁడు-మూఢుఁడు.

**కింపురుషము.** సం. వి. అ. పుం. భారతాదివర్షములలో నొకటి.

**కింపు(పూ)రుషుఁడు.** సం. ౧=కిన్నరుఁడు. ౧. అర్ధము. (కే. ని.)

శ్లో. పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి, ప్రియాముఖం కింపురుష శ్చుచుంబ. సం. కు. సం. ౩. ౩౮.

౨. దేవయోనివిశేషము.

శ్లో. గంధర్వకింపూరుషకిన్నరా జగుః. సం. భాగ. ౮. ౨౧. ౨౦.

**కింపురుషేశ్వరుఁడు.** సం. వి అ. పుం. కుబేరుఁడు.

**కింప్రభువు.** సం. వి. ఉ. పుం. కుత్సితప్రభువు.

**కింభర.** సం. వి. ఆ. స్త్రీ. నలి యనుగంధద్రవ్యము, గువ్వగుత్తుక ౘె.

**కింరాజము.** సం. వి౯. (న్. న్, త్రి, జ్ఞీ. న్.) కుత్సితరాజు గలది. (దేశము.)

**కింరాజు.** సం. వి. న్. పుం. కుత్సితరాజు.

**కింవదంతి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. జనశ్రుతి, లోకప్రవాదము. (కల్ప)

**కింవరాటకుఁడు.** సం. వి. అ. పుం-ఒకగవ్వ పోయిన నేమి అనుకొనువాఁడు, డబ్బు విలువ తెలియవాఁడు-అతివ్యయము చేయువాఁడు.

శ్లో. నృపతే కింక్షణో మూర్ఖో దరిద్రః కింవరాటకః. హితో. ౨. ౯౧.

**కింశారువు.** సం. వి. ఉ. పుం. ౧. సస్యశూకము, వరిమున్నగువానిముల్లు, యవాద్యగ్రము. ౨. బాణము. ౩. రాపులుఁగు.

**కింశుక.** సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిష్మతి, మానేరు, ఎక్కుడుతీఁగె ౘె.

**కింశుకము.** సం. వి. అ. పుం. ౧-చిలుకముక్కువంటి పువ్వులు గలది-మోదుగు ౘె. ౨. నందివృక్షము.

**కింశులుకము.** సం. వి. అ. పుం. మోదుగు, పలాశము ౘె.

**కికి(కా)కిక.** వి. నవ్వుటయం దగుధ్వని కనుకరణము.

చ. కికకికనవ్వి... భల్లా. ౨ఆ. (శ. ర.) చంద్రా. ౨. ౧౨౭, ౩. ౬.

చ...మఱుంగున నష్టు నుగ్రహుం,డునికి యె ఱుంగమి నున్న గియె నుండఁగ లే కితఁడుం గి కాకికఁ. కళా. ౯. ౧౭౧.

**కికి.** సం. వి. ఇ. పుం. కొబ్బెరచెట్టు. ఇ, స్. పుం. ఈ. స్త్రీ. పాలపిట్ట.

**కికిదివము.** సం. వి. అ. పుం=కికిదివి. (రూ. కికిదివము. కల్ప)

**కికీదివి.** సం. వి. ఇ. పుం. చాషము, పాలపిట్ట. (రూ. కికిదివి,కికిదీవి, కికీదీవి.)

**కికురించు=**కిక్కురించు. స. క్రి. (√ కికురు) ౧. మోసపుచ్చు, వంచించు.

ఆ.కృష్ణుఁ జూడు మనుచుఁ గికురించి పరువ్రాల, మేలిభక్ష్యరాశి మెసఁగు నొకఁడు. భాగ. ౧౦ పూ. ౪౯౬.

సీ.కికురించి రిచ్చ పుచ్చుకొనుచో టులనార లాఁ కకు లోను గా కప్ప లీక.మనుచ.3.౧౭౯. సారంగ. ౨. ౧౧3.

౨. పోఁగొట్టు, హరించు.

సీ. చెలువవేనలి చిమ్మఁజీకటిఁ గికురింపఁ జంద్ర సూర్యుల నుంచెఁ జామ యోర్తు. వసు. ౫ ౧౧౬.

అ. క్రి. తప్పించుకొని తిరుగు, నక్కినక్కి తిరుగు.

క. తీపు గలకజ్జ మన్యుఁడు, గోపింపఁగ నొడిసి పుచ్చుకొని ప్రోపాడం, బైపడి యది గొని యొక్కఁడు,క్రేపులలో నిట్టు నట్టుఁ గికురించు నృపా. భాగ. ౧౦ పూ. ౪౫౮.

**కికురింత=**కికురింపు. వి. (√ కికురించు) ౧. మోసము చేయుట; మోసము.

గీ...కికురింపు కికురింత యనఁగఁ జెల్లు, వంచనకరణ మగుచు...ఆం. భా. ౨. ౭౯౨.

౨. దాఁగుట. (చూ. కికురింతలాట.)

**కికురింతలాట.** వి. (కికురింతలు + ఆట) దాఁగిలిమూఁతలాట.

సీ. స్వర్భాల లా చెట్లశాఖలచాటున సంతరింతు న కికురింతలాట,లు... చెన్న. ౫.3౭౮.

**కికురింపు=**కికురింత. ఆం. భా. ౨. ౭౯౨.

**కికురు=**కిక్కురు[1]. వి. వంచన, మోసము.

సీ...వంచన మెసంగు. గీ. జుముఁగు ప్రక్కు కికురు పిక్కు జుణుఁగు మొఱఁగు,డనఁగ... ఆం. భా. ౨. ౭౯౨.

జ: కికురించు, కికురింత, కికురింతలాట, కికురింపు, కికురువెట్టు, కికురువోడుచు.

**కికురువె(పె)ట్టు.** స. క్రి. (√కికురు). కికురించు, వంచించు; త్రోసివేయు.

గీ. దశరథకుమార నీవిడుతప్పుటడుగు, లుల్లమున నమ్మఁగాఁ జాల మొంచు రెండు,తప్పుటడుగుల మును జగత్త్రయముఁ గొంటి,బలిఁ గికురువెట్టి యని బుధుల్ పలికి రపుడు. రామా.3. ౧౪౫.

ఆ. అతని చేత నున్న యమృతకుంభము సూచి,కరలు వొడిచి సురలఁ గికురువెట్టి,పుచ్చుకొనిరి యసురపుంగవు లెల్లను, మాఱు లేనిబలిమి మానవేంద్ర...భాగ. ౯. ౭౯౫.

**కికురువో(పో)డుచు=**కికురించు.

స. క్రి. (వంచించు.)

క. పోరుదురు కికురువోడుచుచుఁ, దూఱుదురు భయంబు లేక తోరపుటిరవుల్, జాఱుదురు ఘనశిలాతటి,మీఱుదు రెన్నంగ రాని మెలఁకువల నృపా. భాగ. ౧౦ పూ. ౪3౧.

**కిక్కస.** వి. క్రోవివంటి తృణవిశేషము, నలము.

సీ.కిక్కస యనఁగఁ బెంపెక్కును నలసంజ్ఞ... ఆం. భా. ౨. ౭౫.

**కిక్కిశము.** సం. వి. అ. పుం. క్రిమివిశేషము. (ఇది కేశనఖదంతములకు హాని కలిగించును.)

**కిక్కురించు=**కికురించు. స. క్రి. (√ కిక్కురు[1]). వంచించు, మోసపుచ్చు.

ఆ. చేతికొండ యొకనిచే నిచ్చి తలనున్న, కొం
డదొంతి కుదురుకొన నమర్చి, మగుడ నడుగ
వాఁడు నగచునుల్ నగ వానిఁ, గిక్కురించి
పోయి వెక్కిరించు. భా. రా. యు. ౨౬౭.

ద్వి. కిన్నరబ్రహ్మయ్యఁ గిక్కురించితివో, కన్నడ
బ్రహ్మయ్యఁ గనుమొఱఁగితివో. పండితా.
మహిమ. ౩౦౬ పొ.

**కిక్కురింత**=కిసురింత. (√కిక్కురించు)

**కిక్కురు**[1]=కిసురు. వి. మోసము, వంచన. (చూ. కిక్కురువెట్టు.)

జ: కిక్కురించు, కిక్కురింత, కిక్కురువెట్టు.

**కిక్కురు**[2]. వి. అల్పమైనకంఠధ్వని కనుకరణము.

కిక్కురుమనక=నిశ్శబ్దముగా.

క. కిక్కురు మన కమ్మృతంబుం, గ్రక్కలు వెట్టు
దురు సురలు...హర. ౬. ౧౨౨. వేమన. ౩.
౧౦౫.

**కిక్కురువెట్టు**=కిసురువెట్టు. స. క్రి. (కిక్కురు[1]+వెట్టు) వంచించు, మోసపుచ్చు.

ఉ. చక్కఁదనంబు జవ్వనము జాణతనంబును
గల్గితివిఁ బెం, పెక్కనదాన నంచు నొకయిం
చుక గర్వము పర్వ నిన్నటుల్, గిక్కురువె
ట్టఁ జూచెదు చెలీ పదమా మువమూర నింక
నా, చక్కెరవింటిదంటునుఁ జూయులకోరుల
నేమి యయ్యెనో. రసిక. ౩. ౯౦.

**కిక్కెస**. అవ్య. ద్రు. గట్టిగా, బిగియునట్లు.

దండకము...భయభ్రాంతుఁడై పాఱ నుంకించు
నక్కించుఁ గంసుం ద్రిలోకీనృశంసు న్ని
యుద్ధక్రియాపద్ధతిం గిక్కెసన్ గొంకుద్రో
ల్నొక్కి...పారి. ౩. ౩౯. (ప్రయోగాంత
రము లేదు. వి. మిక్కిలి కదియిక అని శ.ర.)

**కిఖి**. సం. వి. ఇ. పుం. కోఁతి. (త్రి.ని.) స్త్రీ. నృగాలిక, కొంకనక్క, చిన్నజాతినక్క.

**కిగ్గాడి**. విణ. (సం. కీకటః. క. కిగ్గ్=అల్పము.) అల్పము; నీచము; పనికిమాలినది, అప్రయోజకము.

గీ. పూని కర్ణాత్మజుఁడు వృషసేనుఁ డాత్మ, హయ
ము దాటించినట్టివాఁ గల్లయదిగో, నాఁటి
కది యబ్బురము గాని వీటిలోని, నేఁటికిగ్గా
డిగుఱ్ఱాలు దాఁటుచుండు. కళా. ౮. ౧౩౩.

ఉ...కీ, లూడినయంతలోడ బిగియూడినతాలి
మితోడ వచ్చెఁ గి, గ్గాడియుఁ బోలెఁ గామ
గవి గాఁడిఁ గలయ్య నృపాలువీటికిన్. సు
ద. ౩. ౪.

సీ. తనవిడిచెకి రంధ నుపనైతని తిట్టుకిగ్గాడి
యనుగనుఁ గేలు మొగిచి. ప్రభా. ౧. ౭౯.

సీ. అప్రయోజకసంజ్ఞ యలరుచుండును గొఱ
గానివాఁ డనఁగఁ గిగ్గాడి యనఁగ. ఆం. భా.
౩. ౨౭.

జ: కిగ్గాడికాఁడు.

**కిగ్గాడికాఁడు**=కిగ్గాడి. (కిగ్గాడి+కాఁడు-స్వార్థము) (అప్రయోజకుఁడు.)

క. కిగ్గాడికాండ్రె యెపుడుం, దగ్గనిసంపదలఁ
బొదలఁ దా మది యకటా, బగ్గున మండెడు
...శుక. ౩. ౨౯౦.

**కిచే**. వి. ౧.(పక్షులు కోఁతులు లోనగువాని) కూఁతయందగుధ్వని కనుకరణము. (దీని యామ్రేడిత రూపము కిచకిచ.)

ద్వి. అచలంబుపైకి గుం డనక చెట్టనక, కిచకిచ
ధ్వనులతోఁ గిచకొట్టుకొనుచు, నెగఁబ్రాఁకి
యెక్కుచో...రం. రా. కిష్కిం. ౧౯౯ పొ.
౨౫ పం.

౨. చక్కిలిగింత.

ఉదా: వీఁడు నాకు కిచకిచలు పెట్టుచున్నాఁడు.

౩. చక్కిలిగింతవలనఁ గలుగు జలదరము.

(వ్యవ) చక్కిలిగింత పెట్టినచో పిల్ల కంతో కిచకిచ.

**కిచకిచలాడు, కిచకిచమను=కిచకొట్టు.**

జ: కిచకొట్టు.

**కిచకొట్టు.** అ. క్రి. (కిచ + కొట్టు). కిచకిచమని ధ్వనిచేయు.

ద్వి.కిచకిచ ధ్వనులతోఁ గిచకొట్టుకొనుచు.రం. రా. కిష్కి-ం. ౧౫౫ పొ. ౨౫ పం.

సీ. పూవుగుత్తులవంటిపూపచన్నులు గోళ్ల నదిమినఁ గిచకొట్టునట్టివేళ. శుక. ౧. ౨౧౧.

**కిచుకు.** వి. ధ్వనివిశేషమున కనుకరణము. (ఆమ్రేడితరూపము 'కిచుకుకిచుకు')

(పాము.) వ...నీరంబున ననర్గళప్రచారంబునఁ జేరెంబులు వాఱుచు నోడిసి యొడిసి బడలు పడం గఱచి కిచుకుకిచుకు రనక కతిపయదినంబులకు జలపాదావశేషంబుగా నిఖిలభేకంబులఁ భక్షించి...వేం. పంచ. 3.3౭౦.

**కిచ్చడి.** వి. (క. త. కిచ్చడి. హిం. కిచిడీ.) నానా వస్తువులు చేర్చివండుచిత్రాన్నవిశేషము.

వ...చారులుఁ దియ్యగూరలుఁ బచ్చడులుం గిచ్చడులును బజ్జులుం గిజ్జులును... కాశీ. ౭. ౧౫౫.

సీ. సద్యోఘృతంబులుఁ జక్కెరలుక్కెఱల్ పచ్చళ్లు కిచ్చళ్లు పాయసములు. ఉ. రా. ౬. ౧౨౨.

**కిచ్చిలి.** వి. (క. కిచిలి. త. కిచ్చిలి.) ఒకజాతినారింజకాయ. (బ్రౌ)

**కిటకిట.** వి. (త.కిడుకిడు) పండ్లుకొఱుకుట మున్నగువానియందగుధ్వని కనుకరణము.

వ...జటిలుండు గిటకిటం బండ్లు గొఱికి హుమ్మని...మనుచ. ౫. ౧౯.

సీ. శ్రుతులు విజ్జోడైనచోఁ దంత్రి బిగువుగాఁ బీడించి కిటకిట బిరడఁ ద్రిప్పు. వైజ. ౧. ౧౧౫. దశా. ౨. ౨౬.

క. అటు నిటును జాణిఁగి మెల్లఁగఁ,గిటకిట యని మేను వడఁకఁ గికురించి కుర్కుర,క్కుటకలటవిటపినిటప,చ్ఛటములఁగున లేఁగి డాఁగి శంకరుఁ డంతన్. పార్వ. ౪. ౧౨౪.

**కిటకిటమను=కిటకిటయనుధ్వనిచేయు.**

క. కిటకిటమన రదనపటలి గీఁటుచుఁ బలికెన్. దశా. ౬. ౭౨.

**కిటకిటలాడు** = క్రిక్కిఱిసియు, సమృద్ధముగానుండు.

(వ్యవ) అక్కడ జనులు కిటకిటలాడుచున్నారు. అతనియిల్లు బిడ్డలతో ఎప్పుడును కిటకిటలాడుచుండును.

**కిటి.** సం. వి. ఇ. పుం. సూకరము, పంది.

**కిటికీ.** వి. (హిం. ఖిడ్కీ.) గవాక్షము, సోరణము. (శ.ర, వా)

**కిటిభము.** సం. వి. అ. పుం-పందివలె నల్లగా నుండునది-౧. శిరఃకీటము, పేను. ౨. నల్లి. న. పాముకాటువలనియుపద్రవవిశేషము.

**కిటుకు.** వి. ౧. అకార్యము, దుష్కృత్యము.

చ. కటకట మిమ్మువంటిగుణగణ్యులఁ బుణ్యులఁ జెప్పరానిసం,కటములఁ బెట్టి యెట్టికొఱగాములు చేసితిఁ బెక్కు నాకు నీ,కిటుకున నేమి మేలు కలిగెన్...వి. పు. ౭. ౯౪.

౨. కపటము.

సీ...కపటాఖ్య విలసిల్లు గబ్బి గొరు,గబుసు పైపు కిటుకు కాదు డబ్బు కవుదు డంబనంగ... ఆం. భా. ౧. ౧౩౭.

3. మర్మము, రహస్యము.

(వ్యవ) రాముునకు విభీషణుఁడు లంకలోనికిటుకు లన్నియును చెప్పెను.

౪. చిక్కు.

ద్వి. కపటనాటకుఁ డైనకాశికుఁ డాత్మఁ,గృపమాలి నినుఁ బట్టి కిటుకులు వెట్టె. ద్వి. హరిశ్చ. పూ. ౧౫౭౨ పం.

కిట్టకము. సం= కిట్టము.

కిట్టము. సం. వి. అ. పుం. న. (వై.ని.) మలసామాన్యము.

(క) దేహామలము.

శ్లో. వసా శుక్రమ సృజ్మజ్జా కర్ణవిణ్మూత్రవిణ్ణఖాః, శ్లేష్మాశ్రుదూషికాస్స్వేదో ద్వాదశైతే నృణాం మలాః. (అమరసుధ.)

(చ) లోహాదిధాతుమలము, చిట్టెము.

(ట) నూనె మొదలగువానియడుగుమడ్డి.

కిట్టవర్జితము. సం. వి. అ. న. శుక్లము, రేతస్సు.

కిట్టాలము. సం. వి. అ. పుం. ౧. తామ్రకలశము, రాగిపాత్ర. ౨. లోహమలము, ఇనుపత్రుప్పు.

కిట్టికోల. వి. ఇటికించుటకుఁగా నొకతట్టు కొనలఁ జేర్చికట్టి చిన్నకోలలతో నేర్పఱుపఁబడినసాధనము. (శ. ర.)

కిట్టిమము. సం. వి. అ. న. క్షారోదకము, ఉప్పునీరు.

కిట్టు. స. క్రి. ౧. చంపు.

ఉ. కిట్టుదుఁ గర్ణశల్యు లనుకీటములం గరతాడనంబులం, బెట్టుదు నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ... భార. కర్ణ. 3. ౨౬౧.

౨. సమీపించు, కదియు.

చ... ఉగ్రమృగనాథుని నైనను గిట్టి ముట్టి బెట్టిదముగఁ గాలఁ గేలను గడించివిమగంటిమి యుల్లసిల్లఁ బట్టుదు... భార. విరా. ౧. ౭3.

గీ... కిట్టెను డాసెను గదిసెఁ గవిసెఁ, జేర డగ్గఱె ననఁ దారసించె ననఁగ, వెలయు... ఆం. భా. 3. ౧౨౮.

సక్రి. అక్రి. కవియు, తాఁకు.

మ. మురదైత్యుండు... దేవవ్రాతముం గిట్టి ముష్కరుఁ డై కుండలముల్ హరించె... ఉ. హరి. ౧. ౭౫.

(దుర్యోధనుఁడు ద్రోణునితో నన్నమాట.)

మ... భీమాగ్రజుం డాజిఁ గిట్టినఁ బట్టం గడు నగ్గ మైనయెడఁ గ్రీడింతెప్డు... భార. ద్రో. ౧. 3౭౭.

సీ. ఉద్భటప్రతిభటవ్యూహంబుపైఁ గిట్టి యస్త్రశస్త్రముల నూటాడఁ గోరు. కృ. శకుం. 3. ౭3.

కిట్టుకొను=చేరుకొను.

క. కుఱుమాఁకలు గూడఁ గిట్టికొని తమలోనన్.

వ. మదీయవృత్తాంతంబు చెప్పికొనుచున్నంత. దశకు. ౬. ౧౧౦, ౧౧౧.

కిణము. సం. వి. అ. పుం. ౧. కఠినవస్తుస్పర్శముచే హస్తాదులందు కాచెడికాయ. ౨. శుష్కవ్రణము, ఎండినపుండు, గాయపుకాయ. 3. మాంసపుగ్రంథి, కంతి.

కిణి. సం. వి. ఇ. స్త్రీ. అపామార్గము, ఉత్తరేనుక.

కిణిహి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అపామార్గము, ఉత్తరేనుక. ౨. కటభి, నల్లగినియక. 3. తెల్లగినియక.

కిణ్వము. సం. వి. అ. పుం. న. సురాబీజముక.

న. ౧. పాపము. ౨. మద్యము చేయుట కుపయోగించు నానావస్తుసముదాయము. 3. పిణ్యాకము, తెలికపిండి.

కిత. వి. దేవతార్పణము కై కళ్లమున నొకదెసనుబోసెడుమూఁడుదోసిళ్లధాన్యరాశి. (శ. ర.)

కితవము. సం. వి. అ. పుం. దుత్తూరము, ఉన్మత్తక.

కితవుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వంచకుఁడు, మోసగాఁడు. ౨. ఖలుఁడు, దుష్టుఁడు. 3. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు. వి. అ. పుం. జూదరి.

కిత్తనార. వి. చాఁగనార.

కిత్తలి. వి. (క. కిత్తళె. తు. కిత్తలి) కిచ్చిలిక. (బ్రా)

కిత్తి=కిత్తు. (శ. ర, చి. ని.)

సీ. అలికనేత్రముకిత్తి యారజ్యమానమై యెప్ప
లసందుల నిప్పు లుమిసె. హర. ౭. ౭౯.

**కిత్తు.** వి. (ప్రా-క. త. కిచ్చు.) అగ్ని, నిప్పు.
సీ. నీటిబిడ్డఁడు కిత్తు నిప్పు...సాం.ని. దేవ.౧౨.
వేంక. దేవ. ౧౪. ఆం. భా. ౧. ౪౮.

**కిదుకు.** అ. క్రి. మూలుగు.
సీ. మేలొక్కన్న తెఱఁగున మెల్లనఁ గను విచ్చి
క్రేఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి. భాగ.
౧౦ పూ. ౨౨౫.
క. నిదురించినశిశు వాఁకొని,కిదుకుచుఁ జను గో
రికరలి కిసలయవిలస, న్మృదుచక్రచాపరే
ఖా,స్పదపదమునఁ దన్ని నొక్కబండిన్
దండిన్. భాగ. ౧౦ పూ. ౨౫౦.
ద్వి. వత్తు నేనును నన్ను వదలక తిగిచి, యెత్తు
కొమ్మనుచుఁ బెల్లెసఁగుదైన్యమునఁ, గిదు
కుచుఁ జిన్నికెంగేలఁ బైకొంగుఁ, గదియిం
చి బుడిబుడికన్నీరు దెచ్చి. ద్వి. హరిశ్చ.
పూ. ౨౩౪౨ పం.

**కినియు[1].** స. క్రి. అ. క్రి.(క.కినిసు).౧.కోపించు.
గీ. అనిన ధృతరాష్ట్రుఁ డాపగాతనయు భక్తి,నను
నయించి రాధేయునిఁ గినిసి ప్రియము, దోఁ
పఁ దా నిట్టు లనియె...భార. ఉద్యో. ౧.
౨౫౫.
ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగునచ్చటివృద్ధజనంబు
లెల్ల నో,రెత్తక యూరకుండిరి మహీశ్వరు
చిత్త మెఱుంగ కుక్కఁ దా,నొత్తి కుమారు
లం గినియ నోపఁడ ... భార. ఉద్యో. ౧.
౩౪౬.
చ. అనిమిషనాథ ముఖ్య బదరికాశ్రమతాపస
పంక్తిముండటన్,గినిసి ప్రతిజ్ఞ చేసి రణకే
ళికి నప్పుడ పోవువాఁడనై, పనిపడి నేఁ ద
లంచితి సుపర్ణుని...ఉ. హరి. ౧. ౧౩౭.
చ. ..భవ, త్తనయుఁడు గంధసింధురవితానము పై
నడరించి భీమసేనుని గినియించె...భార.
ద్రో. ౧. ౩౦౦.
సీ. కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప నది
శార్ఙ్గి తేజంబునందు డిందె. పారి. ౫. ౩౦. వ
రాహ. ౧౧. ౧౦.
౨. ద్వేషించు.
గీ. అఖిలవిషయానభిస్నేహుఁ డగుచు శుభము,
నొంది మురియక యశుభంబు నొంది కినియ,
కుండు నెవ్వాఁడు సమత నప్పుండితుండు,
సంస్థితప్రజ్ఞుఁ డగు సూరిజనవరేణ్యా. సీతా
రా. ౩. ౧౪౨.
శ్లో. యస్సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభా
శుభమ్, నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్ర
తిష్ఠితా. గీత. ౨. ౫౭.
జ: కింక, కినుక[1], కినుకకాఁడు, కినుపు, కినువడు.

**కినియు[2].** స. క్రి. సమీపించు. (ప్రా, శ. ర.)
గీ. కినిసి పాణినాళీకంబు సోనుపుటయును,నంత
లోఁబడ కదియు మోహప్రకటన,మాని త
న్నునిచినయతిమానతుంగ,తరు నెనసి తోన
గ్రహణగోచరతఁ దొఱఁగె.హ.న. ౨. ౪౭.
(నలపక్షమున)
జ: కినుక[2].

**కినుక[1]** (న్క)=కింక.
వి. (కోపము, అలుక, కనలు)
చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహు
విల్లు ద్రెళ్ళిడిం, దునిమి...భార. విరా. ౫.
౧౭౬.
గీ. అనిన విని కిన్కఁ బూనినయలంతినగవు,చె
లువు మొగమున కొకక్రొత్తపొలు పొనర్పఁ,
బుండరీకాక్షుఁ డగు పెల్లఁ బోయి యప్పు,
డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు.
భార. ఉద్యో. ౩. ౩౬౪.

సీ...కినుక యవంగను గిన్క యనఁగ...గీ...త
నరుఁ గోప,ము...ఆం. భా. ౧. ౧౩౫.

**కినుక[2].** వి. (√కినియు[2]) అట్టాడుట.

చ...అవ్వికచపంకజలోచన పాంథ యిందు ర,
మ్మనుటయు నిల్లు చేకొనెద వద్దిర మత్పతి వ
చ్చువేళ నీ,కినుకలు సాగ విచ్చుట జగే యన
నాతఁడు భీతచిత్తుఁడై. శుక.౩.౧౯౬.(చూ.
౧౯౫.)

**కినుకకాఁడు.** విశే. (√కినుక[1]) కోపము గలవాఁ
డు, కోపశీలుఁడు. (శ. ర.)

**కినుపు.** వి. (√కినియు[1]) కోపము.

క. అని సామంతులపంతపుఁ,బెనుగాడ్పులఁ దరత
రంబు పెరిఁగెడుననురే,శునికినుపుఁగడలి మొ
రసెనో, యనఁ దగి ప్రస్థానభేరి యంతట
మ్రోసెన్. కవిక. ౨. ౧౪౩.కాశీ.౪.౧౪౭.

**కినువ(న్వ)డు.** అ. క్రి. (కినుపు + పడు) కోప
పడు.

క. జన్నములు సేయునెడఁ బ,క్వాన్నంబులు
గుడుచు చుండు మధిపతి నిన్నున్, జన్నియ
విడిచె రణముతటి, మిన్నక కినువడక పొమ్ము
మీగృహమునకున్. భార. విరా.౪.౨౧౭.

చ. జనకునిఁ గన్నుఁగిన్వడుదు సభ్యుల బంధులఁ
గాంచినం గడున్, గనలుదుఁ దల్లిదిక్కునను
గౌరవబుద్ధి యొకింత లేదు నా,కు ... హరి.
పూ. ౯. ౭౧.

**కిన్నర.** సం. వి.ఆ.స్త్రీ.ఒకజాతివీణె. (విల్యమ్సు.)

ఉ... మే,ల్కిన్నరఁ జెంతఁ జేరి యొకకిన్నర
కంఠి యొసంగ నయ్యెడన్. చంద్రికా. ౨.
౯౫.

**కిన్నరకంఠ.** సం. వి. ఆ. స్త్రీ=కిన్నకంఠి.

**కిన్నరకంఠి.** సం. వి. ఈ. స్త్రీ-కిన్నరులకంఠస్వర
మువంటికంఠస్వరము గలది-మధురకంఠముగల
స్త్రీ; స్త్రీ.

శ్లో. కిమిదం కిన్నరకంఠి సుప్యతే. సం. రఘు
౭. ౬౪.

**కిన్నరము.** సం. వి. అ. న. భారతాదివర్షములలో
నొకటి.

**కిన్నరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వీణాభేదము. (శే.ని,
వై. ని.) ౨. కిన్నరస్త్రీ.

సీ. తతవాదకసమీరహతకిన్నరీరుతుల్ కిన్నరీరు
తులు నేకీభవించె. వసు. ౧. ౧౪౯.

**కిన్నరుఁడు.** సం. వి. అ. పుం. ౧. నరముఖమును అ
శ్వశరీరమును గలదేవయోనివిశేషము.

శ్లో. బింబోష్ఠం బహుమనుతే తురంగవక్త్ర,శ్చుం
బంతం ముఖమిహకిన్నరం ప్రియాయాః.శిశు.
౪. ౩౭.

౨. దేవయోనివిశేషము.

శ్లో. గంధర్వకింపూరుషకిన్నరా జగుః. సం.భాగ.
౭. ౨౦. ౨౦.

**కిన్నరేశుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**కిన్నెర.** వి. (సం. కిన్నరా) వీణావిశేషము.

(సరస్వతీవర్ణనము.) సీ. శృంగారకుసుమంబు
చిన్నిచుక్కలరాజు పసిఁడికిన్నెరవీణ పలు
కుఁదోడు. నైష. ౧. ౫.

సీ. వదరుపల్కులు గాక తుది సాటివచ్చునే కి
న్నెరకాయ లీచన్నుఁగవకు.హంస.౧.౨౧౦.

**కిప్యము.** సం. వి. అ. పుం. పురీషమున పుట్టు క్రి
మి భేదము.

**కిమిచ్ఛకుఁడు.** సం. విశే. (అ. చ్ఛకా. అ)-భోజ
నాదిసమయములందు-ఏమి కావలెను ఏమి కావ
లెను అని అడుగువాఁడు.

శ్లో. సుమనోమోదకై రన్నైర్హిరణ్యేన చ భూ
రిణా,గోభిర్వస్త్రైశ్చ రాజేంద్ర వివిధైశ్చ కిమి
చ్ఛకైః. సం. భార. శాం. ౩౭.౧౭.(కిమిచ్ఛ
సి కిమిచ్ఛసి ఇతి పృచ్ఛద్భిః-వ్యాఖ్యా.)

**కిముకా(ఖా)బు.** వి. (హిం. కంఖ్వాబ్) బంగారు పువ్వులతోఁ గాని వెండిపువ్వులతోఁ గాని కుట్టినట్లుండు గలయొకవిధమైనపట్టుబట్ట.

చ. కళుకుఁబసిండికట్ల భుజగాపయితాణి మెఱుం గుఁగండెపూ,వులకిముకాబుజంటిహరువుల్ బడఁగొట్టువెడందపావడల్ ... మల్లుపు ౪. ౧౮.

సీ. పులితోలునరిగపూవులహొచ్చుకిముఖాబు గొప్పతమానుగా నొప్పఁజేసి. పార్వ. ౫. ౧౪౯.

**కిముడు.** విశ. కొంచెము, అల్పము.

సీ. సైకంబు కొంచెము సన్నంబు తోడెము చిఱు కిము డసదు లే చిఱుత లేఁత. గీ. కొద్దియన్ను వనంగను గొఱలు వల్ప,ము... ఆం. భా. ౩. ౧౬.

**కిమ్మను.** మి. అ. క్రి - ప్రశ్న వేయు - నోరెత్తు, మాటాడు. (దీనికి వ్యతిరేకమందే ప్రయోగము.)

సీ. కళలు వెచ్చము గాని కలువవెచ్చెలికానిము రువుఁ గిమ్మననీని మోముచాని. సారంగ. ౩. ౧౦౮.

ఉ... ఇందుబింబముల్, గిమ్మననీదు మోము... మనుచ. ౩. ౬. (ఇట ఔపమ్యవాచకము.)

**కిమ్మీరము.** సం. విశ. (అ. ఆ. అ.) చిత్రవర్ణము గలది, నానావర్ణములు కలది. వి. అ. పుం. ౧. చిత్రవర్ణము. ౨. నాగరంగము, నారింజ.

**కిమ్మీరుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక రాక్షసుఁడు. (వీఁడు భీమునిచే హతుఁ డయ్యెను.)

**కిమ్ము=ఇమ్ము¹.** (౧. అర్థము. చూ.) ప్రీతి.

ఉ. కమ్మనిజున్ను మంచివెన్న గట్టిది మీఁగడతోఁ బెరుంగు చొ,క్కమ్మగుజున్నుఁబాలు చిలుకల్ మిసి దీసినవెన్నముద్ద వె,చ్చమ్ముల కైదునాల్గుదివసాలకు మూడలముల్లె లిమ్మెయిం,గిమ్ములఁ దెచ్చి యిచ్చు రతికిం బలిమాలుచుఁ బిల్చి నిచ్చలున్. హంస. ౨. ౧౧౧.

**కియాహాము.** సం. వి. అ. పుం. ఎఱ్ఱగుఱ్ఱము. (వై. ని.)

**కియ్య.** వి. (కింద+య) అక్షరముక్రింద వ్రాయు యకారము.

గీ... కియ్య యనఁగ, నడరును యకారనామంబు... ఆం. భా. ౨. ౧౮౭.

**కియ్యవడి=కియ్య.** వి. అక్షరము క్రిందియకారము. (శ. ర.)

**కిరకము.** సం. వి. అ. పుం. పందిపిల్ల.

**కిరకుఁడు.** సం. వి. అ. పుం. లేఖకుఁడు, లేకరి. (వాచ.)

**కిరడు.** వి. బెస్తలు సవారి మోయునపుడు నడచునడకలలో నొకటి. ప్రబంధ. ౬౦౫.

**కిరణమాలి.** సం. వి. న్. పుం. సూర్యుఁడు.

**కిరణము.** సం. వి. అ. పుం. మయూఖము, వెలుఁగు.

**కిరత్.** సం. శతృ. ౧. కప్పుచున్న. ౨. చిమ్ముచున్న, చల్లుచున్న. ౩. హింసించుచున్న.

**కిరము.** సం. విశ. (అ. ఆ. అ.) విక్షేపకము, చల్లునది. వి. అ. పుం. ౧. పంది. ౨. విష్ఠాదులు విసర్జించు ప్రదేశము, మఱుఁగుదొడ్డి.

**కిరాటిక.** సం. వి. ఆ. స్త్రీ. శారిక, గోరువంక.

**కిరాటుఁడు.** సం. వి. అ. పుం. ౧. వైశ్యుఁడు, కోమటి. ౨. మ్లేచ్ఛుఁడు.

శ్లో... ద్వే తు కిరాటస్స్యాన్మ్లేచ్ఛే వణిజి చాపి. (కే. ని.)

**కిరాతకము.** సం. వి. అ. పుం. నేలవేము.

**కిరాతతిక్తము.** సం. వి. అ. పుం. నేలవేము.

**కిరాతము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక దేశము. ౨. ఒకజాతిచేఁప. ౩. భూనింబము, నేలవేము.

**కిరాతి.** సం. వి. ఇ. స్త్రీ. గంగ. ఈ. స్త్రీ. ౧. కిరాత

స్త్రీ, బోయత. ౨. కుంటెనకత్తె. ౩. దుర్గ. శ. ౫౦౫.

**కిరాతిని.** సం. వి. ఈ. స్త్రీ. జటామాంసి.

**కిరాతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) పొట్టివాఁడు. వి. అ. పుం. ౧. నెమిలిపించెము ధరించి యడవియందు తిరిగెడిబోయ, ఎఱుకు. ౨. మ్లేచ్ఛుఁడు.

**కిరి.** సం. వి. ఇ. పుం. ౧-నేలను త్రవ్వునది-పంది. ౨-నీళ్లను చిమ్మునది-మేఘము. స్త్రీ. ఆటవి, ధనుష్కోటి (వై. ని.)

**కిరీటము.** సం. వి. అ. పుం. న. మకుటము, రాజులు తలను దాల్చు భూషణవిశేషము.

సా: కిరీటముపెట్టినతలను సుళ్లుడుగ నేల.

క. చెలులార మీదువిద్యా,నిలసనములమహిమ నేఁడు వింతగఁ జూడన్, వలెనె కిరీటము పెట్టిన,తలకున్ సుళ్లుడుగఁ బోవఁ దగునే యెందున్. వాల్మీకి. ౩. ౬౮.

**కిరీటి.** సం. విశ. (న్. నీ. న్.) కిరీటము దాల్చినవాఁడు. వి. న్. పుం. ౧. ఏనుఁగుయొక్క దంతమూలము. (వై. ని.) ౨. అర్జునుఁడు.

**కిరీటిక.** సం. వి. ఆ. స్త్రీ. జీవక మనెడిగంధద్రవ్యము.

**కిరీటిపచ్చ.** వి. (కిరీటి + పచ్చ-కిరీటిశబ్దముగారుడశబ్దభవము అని శ.ర.) గరుడపచ్చ, మరకతము.

సీ. గోమేధకంబులకుట్టిమంబులతోఁ గిరీటిపచ్చలవితర్దికలతోడ. వరాహ. ౪. ౧౧౧. ద్వి. పరమ. ౩. ౨౪౪ పా.

**కిరుదెస.** వి. (సం. గృధ్రసీ.) తొండియందు కలుగు నొకవాతరోగము.

సీ. గృధ్రసి పేరగుఁ గిరుదెస యనఁగను...అం. భా. ౨. ౧౨౬.

**కిరుసు.** వి. (త. కిరుచు.) ఇరుప్రక్కల వాయి గలిగి వాటమగు నొకవిధమైనకత్తి.

గీ. అనుచుఁ జెల్వపుఁజెంగల్వయరిదికిరుసు, దురుసుమాస్టీని బదరి యయ్యురుసుపట్టి, గురుసుమద్యోతనుని దూతి గరుసు మీఱి, పేరెములు వాఱెడుమరుత్కుమారు ననియె. వసు. ౪. ౩౧. (చెంగల్వయరిదికిరుసుమురుసుమాస్టీఁడు= చెంగల్వకత్తిగాఁగల మొనగాఁడు, మన్మథుఁడు.)

గీ. విరహినెత్తుట జొత్తిల్లుకిరుసు లనఁగ, నరుణతరుణప్రవాళంబు లచటచటఁ, గ్రమ్మ ఋతురాజు నిండోలగంబుచేసె, మదనసేనాధిపత్యసంపదలఁ బొదలి. కార్తిక. ౪. ౧౫౦పా.

కిరుసుఁగత్తి=కిరుసు. కళా. ౭. ౧౨.

కిరుసుఁగైదువు=కిరుసు. చంద్రా. ౨. ౭౫.

**కిర్తి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. పలాలము, గింజలేనివరిపోఁచ, మొ. ౨. గృహము. ౩. స్వర్ణపుత్రిక, బంగారుబొమ్మ (మే.ని.)

**కిర్మిరత్వక్కు-(చము).** సం. వి. చ్. పుం. నాగరంగము, నారింజ.

**కిర్మీరము.** సం.=కిమ్మీరము.

**కిర్మీరితము.** సం. విశ. (అ. ఆ. అ.) చిత్రవర్ణము గలదిగాఁ జేయఁబడినది.

**కిర్మీరుఁడు.** సం. వి. అ. పుం=కిమ్మీరుఁడు.(వాచ)

**కిలకిల.** వి. రథనేమిధ్వన్యనుకరణము. (శ.ర.)

**కిలు**[1]=కిల్లు. (చూ)

జ: కిలుఁజెప్పు.

**కిలు**[2]=చిలు. విశ. (క. కిలు) అల్పము. (దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

సీ. నూఁగారు వొడలు మేనులతోడ నెరకునై కిలుకూఁత లిడ నాలకింప లేదు. వేం. పంచ. ౧. ౨౫౭.

ద్వి... మోవి, కెందలిరాకుమైఁ గిలునవ్వు నెఱ

యా. ద్వి. పరమ. ౨. ౮౮ పా. ౧౪ పం.(చి. ని.పా.)

కిఱుఁజెప్పు=కిఱ్ఱుఁజెప్పు.వి.(కిఱు[1] + చెప్పు.)కిఱ్ఱుమని ధ్వని చేయుచెప్పు.

మ. తతి నాక్రాంతసమస్తలోక బలిదైత్యధ్వంసి యోదేవ నీ,యఱకా లుద్ధతి రాహుమండలము బ్రహ్మాండంబుతో నొత్తినం,గుఱుగుఱ్ఱం చెడసంది బిట్టొఱలునఘోరాహి నీయంఘ్రి కిన్,గిఱుఁజెప్పైనవిధంబు నామనములోఁ గీలించినట్లయ్యెడున్. నైష. ౮. ౧౨౪. చెన్న. 3. 3౧.

కిఱుకు = కిఱ్ఱు. వి. చెప్పులు మున్నగువానిధ్వని కనుకరణము.

ద్వి. కిఱుకుఁజెప్పులు...అ. మ. క. ౧. ౮౯పా. ౧౭ పం.

క. అన విని వా రిది యగు నని, చనుటయు నానాఁటిరేయి శయ్యాపయి న్నా,థునిప్రక్కనుండి తమిరేఁ,గినఁ జిత్తిని చనియెఁ దలుపు గిఱు కనకుండన్. శుక. ౨. ౧౨౮.

కిఱుదు. విశే. (క. కిఱుదు) న్యూనము, తక్కువ.

గీ. ఒకట నుదయాద్రి కస్తాద్రి కొక్కజంగ, దాఁటఁ జాలియుఁ గిఱుదుగా దాఁటి యోడె, దానవుఁడు...దశా. ౮. ౧౮.

చ. యతివరులార నీలనిషధాద్రులు తక్కినవర్ష భూధర,ప్రతతులలోన మిక్కిలియుఁ బ్రస్తుతి గన్నవి లక్షయోజనా,యతములు వీనిఁ గూర్చి కిఱు దైనవి చాఁపున హేమకూటప,ర్వతమును మంచుఁగొండయును ద్వాదశవింశతియోజనంబులన్. వరాహ. ౧౦. ౧౦౮.

జ: కిఱుదుకట్లు.

కిఱుదుకట్లు. వి. బ. (√ కిఱుదు) కుమ్మరవాఁడు కుండలపై చేయునొకవిధమైనపని.హంస.౪.౧3.

కిఱ్ఱు. వి. చెప్పులు మున్నగువానిధ్వని కనుకరణము. (వ్యుత్పత్తియందు వికల్పముగా ద్విత్వలోపము- చూ. కిఱుఁజెప్పు, కిఱ్ఱుఁజెప్పు.)

సీ. నిద్దమౌ కుచ్చులయుద్దాలు గిఱ్ఱని మ్రోయఁగా నల్లానుఁడును జెలంగి. ద్వా. ౧౦. ౮3.

గీ. పాదుకలఁ గిఱ్ఱుకిఱ్ఱని పలుకుచుండుకుచ్చులుద్దాలు...హంస.3.౯౦. శుక. 3. ౮౪3.

గీ. గమనజవమున నత్తాడుకావ డదరి,కిఱ్ఱుకిఱ్ఱని భుజమునఁ గేలి సల్ప. హంస. ౧. ౧౭౨.

సీ. తలుపు కిఱ్ఱనకుండ...కాశీ. ౮. ౧౧౧.

జ: కిఱ్ఱుఁజెప్పు, కిఱ్ఱుఁబాగాలు, కిఱ్ఱుగానుఁగ త్రిప్పళ్లు.

కిఱ్ఱుఁజెప్పు=కిఱుఁజెప్పు.(కిఱ్ఱు + చెప్పు)

ఇట్లే:- కిఱ్ఱుమెట్టు. (శ.ర.)

కిఱ్ఱుఁబాగాలు. వి. బ. (కిఱ్ఱు+పాగాలు) కిఱ్ఱుపావుకోళ్లు. వైజ. ౨. ౮౪.

కిఱ్ఱుగానుఁగత్రిప్పళ్లు. వి. బ. (కిఱ్ఱు+గానుఁగ + త్రిప్పళ్లు.) బాలక్రీడావిశేషము.

సీ. గచ్చకాయలు కిఱ్ఱుగానుఁగత్రిప్పళ్లు గుఱ్ఱపెక్కుడు మంటిగూండ్లు...హంస.3.౧౮౬.

కిలకించితము. సం. వి. అ. న. (కిల=అలీకేన.కిం= ఈషత్. చితం=సంచితం.కల్ప) స్త్రీలశృంగారచేష్టావిశేషము, అభీష్టసమసంగమమువలని యుబ్బుచేఁ గలుగు స్మితాదులకూడిక.

శ్లో. స్మితశుష్కరుదిత హసితత్రాసక్రోధ శ్రమాదీనామ్, సాంకర్యం కిలకించితమభీష్టతమసంగమాదిజాద్ధర్షాత్. సా. ద. 3. ౧౧౧.

కిలకిల=కిలాకిల. వి. (క. కిలకిలా) నవ్వుట మున్నగువానియందగుధ్వని కనుకరణము. (ఇది 'కిల' కు ఆమ్రేడితరూపము.)

క. కలువలు కిలకిల నవ్వెన్.సారంగ.౨.౧౬౨.

చ...బల్, సకినలకూఁకలన్ గిలకిల న్నగుమోహనశయ్య నున్నెడన్...వసు. ౬. ౭౮.

సీ. వలసినయొకకుఁ గమ్మలు వ్రాయువ్రాయసంబు
లవారిగంటాలకిలకిలలును. కువల. ౨.౧౧౦.

చ...గ్రక్కున బాహువు లప్పళించుచుఁ, గిల
కిల నార్పుచుఁ జెలఁగి కేరుచు...ఉ. రా.
౭.౧౩౦.

సీ. చెలఁగుచుఁ గిలకిలల్ గులుకుకో వెలలకు...
యయా. ౮.౧౫, ౫.౮౧.

జ: కిలకిలమను, కిలకిలలాడు, కిలకొట్టు, కిలారిం
చు, కిలారుచు.

**కిలకిల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. హర్షధ్వని. ౨. వీరుని
సింహనాదము.

**కిలకిలమను**=కిలకిలలాడు. (కిలకిల+అను-వా)

**కిలకిలలాడు.** అ. క్రి. (కిలకిలలు+ఆడు) కిలకిల
మనిధ్వని చేయు.

చ...సారెసారెకుం,గిలకిలలాడుచు న్నిగులఁ గే
కలు గొట్టుచు రింతె కాని...నీలా. ౨. ౮౧.

చ...దీనితోఁ,గిలకిలలాడుచుఁ మదనకేళిఁ బె
నంగెడిభాగ్య మెన్నఁడో.మృ.వి.౨.౬౨.

**కిలకొట్టు.** అ. క్రి. (కిలకిల+కొట్టు.) కిలకిలధ్వని
చేయు.

ద్వి. చెలికత్తియలపింఛుఁ జేరఁ జీరుచును, గిల
కొట్టి యంతలోఁ గేరి నవ్వుచును. ద్వి. పర
మ. ౨. ౫౮ పా. ౧౮ పం.

సీ...కిలకొట్టి నవ్వి నవ్వాలయఁజేసి. చంద్రా.
౨. ౫. ఘటికా. ౨. ౧౧౮.

**కిలము.** సం. వి. అ. పుం. ఆట, క్రీడ.

**కిలరము**=కిలారము. వి. పసువులమంద.

వ... శ్రీభీమేశ్వరమహాదేవరకిలరమున చామి
యబోయువంటియయు ... కొమ్మబోలతల్లి
యయు బెరసినబోలవసమునం బెట్టిన ఎడ్లు
౫౦... ద.శా. ౮. ౧౦౧౨.

వ. ... శ్రీభీమేశ్వరమహాదేవరకిలరమున...బె
ట్టిన ఇన్నఎడ్లు౫౦ ...ద.శా. ౮.౧౦౧౭.

**కిలాకిల**=కిలకిల.

(నవ్వుటయం దగుధ్వని కనుకరణము.)

మ ... గౌరికాంత సారెం గిలా,కిల నవ్వ న్మద
మొందుదంతిముఖునిం గీర్తించి నర్తించెదన్.
కువల. ౧. ౭.

చ... నలకూబరుఁ డేమి నేరమే, పలుకవె యం
చు బొమ్మచెయి వట్టిన రంభ నగుం గిలాకి
లన్. దశా. ౧. ౮౫.

**కిలాటము.** సం. వి. అ. పుం. ఇగురఁ గాఁగి గడ్డక
ట్టినపాలు.

**కిలాటి.** సం. వి. న్. పుం. వెనుకి. ఈ. స్త్రీ=కిలా
టము.

**కిలాతము.** వి. గుజ్జు.

ఉ. విన్నన నేఁగుతామరలవిందు కిలాతపుసిడ
లెప్పుడుఁ, వెన్నెలరాచఱాలఁ గని వెళ్లక
నీళ్ల మునింగి యున్న వీ,మన్ను లటంచుఁ
జెంచెతలు మాటికి నమ్ముల నేసి నాటమిన్,
మిన్నక సిగ్గునం గదలి మెల్లనఁ బోవుచు రిం
డ్లపట్లుచున్. యయా. ౨. ౩౯.

**కిలారము**=కిలరము, కీలరము, కీలరు, కీలారము.
వి. పసువులమంద.

సీ...అడవు గోవు,లమ్మ మంద యనఁ గిలారమ్ము
నా...ఆం.భా. ౨.౨౬౧. ద.శా.౮.౧౦౧౦.

జ: కిలారి.

**కిలారి**=కీలారి. వి. (కిలారము+ఇ) గొల్లవాఁడు.

సీ...గోపాలకుం డొప్ప గొల్లవాఁడు, గొల్లఁడు
కీలారి గొల్ల కిలారి పసులగాపరి యనంగ...
ఆం. భా. ౨. ౨౬౧.

**కిలారించె**=కిలారుచె.అ.క్రి. (√ కిలకిల)౧. కిలకిల
మనిధ్వనిచేయు. (శ.ర.)౨.బొబ్బరించు.

వ...పండ్లు గొఱుకుచు నార్భటించుచుం గిలా
రించుచు దక్షిణోత్తరసముద్రంబు లుప్పొంగి

ఘోషించుచు వచ్చుభంగిఁ బోయుమండ ...
వేం. మా. ౩. ౪౨.

కిలారుచే(ర్చు)=కిలారించె.
(బొబ్బరించు)
ఉ.సింగము గాలి వెంబడిన చేరి కురంగముఁ బట్టు
నట్లు చం,ద్రాంగదు జీవముల్ గొని కిలార్చెద
బెట్టుగ నిన్నుఁ దీర్చెదన్.చంద్రా.౬.౧౦౨.
సీ. దేవతల్ డయ్యంగ దిక్కులు వ్రయ్యంగ న
ప్పటప్పటికిఁ గిలార్చుకొనుచు ... ఉ. రా.
౭. ౧౨౦.

కిలాసఘ్నము. సం. వి. అ. పుం-కిలాసరోగమును పోఁగొట్టునది-ఆఁగాకరఁ.

కిలాసము. సం.వి.అ.న. క్షుద్రకుష్ఠరోగము,సోబె.

కిలాసి. సం. విణ. (న్. నీ. న్.) సిధ్మలుఁడు, సోబె రోగము గలవాఁడు.

కిలింజకము. సం=కిలింజము.

కిలింజము. సం. వి. అ. పుం. ౧. చాఁప,కటము.
౨.కాశాదిరజ్జువు, ఔల్లు మున్నగువానితో పేనిన త్రాడు. ౩. సూక్ష్మదారువు. (త్రి. ని.)

కిలిమము. సం. వి. అ. న. దేవదారువు.

కిలు(ల)ము=చిలుము.(బ్రా,వా-క.కిలుబు,కిలబు.)

కిల్బిషము. సం. వి. అ. న. ౧. పాపము. ౨. అపరాధము, తప్పు. ౩. రోగము. (హేమ.ని.)

కిల్లా. వి. (హిం. ఖిల్లా. క. కిల్లె.) కోట.
శా. లాహూఖానుకుమంద మొక్కలుఁడె కిల్లా లె
ల్ల లగ్గల్ గొనెన్. రంగా. ౨. ౪౪.
క.హల్లా సేయుచు బొబ్బలి,కిల్లా తజ్జయము నీకుఁ
గీలొక్కల్పుదు...రంగా. ౨. ౫౪.

కిల్లాకు. వి.(కిల్లా+ఆకు? కిల్ల+ఆకు.శ.ర-త. కిళ్లాక్కు.) ఖండపత్రిక, చీటి, పురోణి; ఆజ్ఞాపత్రము.
సీ...కిల్లాకు చీటి,యన ఖండపత్రిక యలరును...
ఆం. భా. ౨. ౧౯౯.
ఉ...మనువంశచంద్రుకి,ల్లాకునఁ బంపు సేతువు
మహోహితురానుకలోకపాలకుల్. ఉ. హరి
శ్చ. ౪. ౨౧౯.
సీ. మకుపులు చుట్టి యేర్పడఁగ గోయలు వెట్టి
లలి మీటు మకురికిల్లాకు లనుచు. శశాం. ౨.
౯౬.
క. ముల్లోకంబుల నేలుదు, బల్లిదుఁడను గింకరు
లు నుకుర్వులు నాకుం,గిల్లాకుపంపు సేయన్.
రామా. ౫. ౧౭౭.

కిల్లి. వి. మల్లబంధవిశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొకటి, ఒకవిధమైన జెట్టిపట్టు.
సీ...సరిబిత్తరము కిల్లి. గీ. చాగు సమసీసము త
డకాల్ సందుసీస, మంజమెడపట్టు నాఁగఁ
జెన్నలరుచుండు, ముప్పదియురెండువిన్నా
ణములకుఁ బేళ్లు. ఆం.భా. ౨. ౨౦౯.('కిర్లి'
బ్రా, శ.ర. పా.)
వ...చేవయుఁ గందనంబును గిల్లియుఁ దుట్టును బ
రిపోటును...మల్లుపు.౩.౬౯.ప్రబంధ.౭౯.

కివకివ. వి. కోకిల పావురము మున్నగుపక్షులధ్వని కనుకరణము.
వ...కివకివఁ గూయు కోయిలల యారజంబులను...కువల. ౧. ౧౭.
సీ. కిచకొట్టు బకదారికివకివల్ చెవిఁ గుల్క...
శుక. ౧. ౨౧౪.

కివ్వు. అ. క్రి. మడియు, చచ్చు. (బ్రౌ)

కిశ(స)రము. సం. వి.అ.పుం.న. సుగంధద్రవ్యభేదము.

కిశోరము. సం. వి. అ. పుం. ౧. గుఱ్ఱపుపిల్ల;శిశువు, శాబకము. (ఉదా:- సింహకిశోరము, మార్జాలకిశోరము.) ౨. తైలపర్ణియనుఓషధి.

కిశోరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పదునొకండేడ్లకు పదునైదేండ్లకు నడుమునుండువయసు కలవాఁడు. (వాచ.) వి. అ. పుం. సూర్యుఁడు.

**కిష్కింధ.** సం. వి. ఆ. స్త్రీ. వానరరాజధాని.

**కిష్కుపర్వము.** సం. వి. న్. న- కిష్కువు ఎడము గలకణుపులు గలది-౧. చెఱకు౯. ౨. వెదురు౯. ౩. పోటగళము, కిక్కసకసవు౯.

**కిష్కువు.** సం. విణ.(ఉ.)కుత్సితుఁడు.వి.ఉ.పుం. స్త్రీ. ౧. జేన, వితస్తి. ౨. నలువదిరెం డంగుళ ములకొలఁది. ౩.మూర. ౪. ప్రకోష్ఠము,ముంజే యి. (మే. ని, వై. ని.)

**కిసమస.** వి. వ్యథ, బాధ.

క. గుసగుసలువోయి వలపుల,కిసమస లని తెలిసి రసికకిసలయపాణుల్, బిసకిసలకుసుమవిసర ము,వెస మసలక తెచ్చి శిశిరవిధిలాలస లై. విజ. వి. ౩. ౩౬.

**కిసరు.** వి. (క. కిసరు.) దృష్టిదోషము.

చ.కిసలయపాణి లేఁతనునుఁగెంజిగురాకుమెఱుం గుమోవికి౯, గిసరు దొలంగిపోవలసి కేళివ నాంతరలక్ష్మి బోటియై,మసిఁ జిటిబొట్టుపె ట్టె వనుమాడ్కిఁ దదాననవాససంపద౯, భ సలకిశోరకంబు గనుపట్టెడు నల్లని పల్లవాధ రా. రాజ. చ. ౨. ౧౪౪.

ద్వి. ఎన్నిక శాస్త్రంబు లింతియ కాని, యన్నిశా స్త్రములు రావా మీకు ననుచుఁ, జదివింప వచ్చినశాస్త్రుల నెల్లఁ, జదివింపఁగాఁ జూచి నలియును బఱియుఁ,గిసరు దాఁకకయుండఁ గించిత్తు నొసల,మసిబొట్టుఁ బెట్టి ముమ్మాఱుఁ దూపాడువ. ప్రభు. ౨. ౪౨సా. ౨౩ పం.

కన్కిసరు=ఒకరికలిమిని చూచి సహింపలేమి, చూపోపమి.

క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం, గొసరి జను ల్వార్ధినీరు గ్రోలితి వీనిర్, నసికై మా కిమ్మనిక, న్కిసరుడుగం గావ నప్పగించెదుమా డ్కి౯. ఆము. ౪.౧౬౫.

**కిస(శ)లము.** సం. వి. అ.న. పల్లవము,చిగురాకు. (త్రి.ని.)

**కిస(శ)లయము.** సం=కిసలము.

**కిసాలము.** సం. వి. అ. న=కిసలయము.

సీ. తరుణారుణాంశుబంధురరసాలకిసాలపటలి న త్కౌస్తుభంబు గాఁగ. ఇందు. ౨. ౪౨.

**కిసాలు.** వి. నవ్వుటయం దగుధ్వని కనుకరణము. (బ్రౌ)

సీ. కొనుపై నలరారునూనూఁగునూఁగారు నసదుఁ గస్తురిరేఖ యనుచుఁ దుడుచుఁ,దరుణులతో నాటతమిఁ గిసాలున నవ్వి చెలి చల్లువిరు లని చేతు లొడ్డు. మృ. వి. ౧. ౯.

**కిసిమిసి.** వి. (హిం. కిష్మిష్) లఘుద్రాక్ష౯.

వ...తిన్ననిసురపొన్నగున్నలనీడలజాడలఁ గిసి మిసితీవలత్రోవల నెత్తమ్మికొలంకులకెలంకుల వచ్చివచ్చి... మృ.వి. ౨. ౫౫.

**కిసుక.** వి. (సం. కృషిః) కృషి, సేద్యము.

సీ...కృషిసంజ్ఞ మీఱుఁ గిసుక దుక్కి యన... ఆం.భా. ౨.౨౩౩. (ప్రమాణాంతరము కనఁ బడలేదు.)

## కీ

**కీఁచే.** వి. (కోఁతులు మున్నగువాని) ధ్వని కనుక రణము.(దీనికి ఆమ్రేడితరూపము 'కీఁచుకీఁచు')

చ...వేదన౯, వనచరకాంత బెట్టులికి నాథుని కౌఁగిలి వాసి కీఁచుకీఁ,చని కడు బమ్మరించు చు...భోజరా. ౫. ౯౪.

జ: కీఁచుబిళ్ల, కీఁచుబుఱ్ఱ, కీఁచురాయి.

**కీఁచేబిళ్ల.** వి. (√కీఁచే.) అదిమినపుడు కీఁచుకీఁ చనునట్లు లోపల ఓల్లుపెట్టి కుట్టిన బటువుతలగ డ. (శ. ర.)

**కీఁచేబుఱ్ఱ(అ).** వి. (√కీఁచే)అదిమినప్పుడు కీఁ చుకీఁ చని ధ్వనిచేయుతలగడ.

వ... గిలుకుచప్పరకోళ్లమంచపుహాళహాళులును దలిపక్కెలెక్కదూదిమెత్తలో నత్తమిల్లు కీఁచుబుఱ్ఱలకూఁతలును...రాధికా. ౪.౯౬.
బ. బాల్యక్రీడావిశేషము.
సీ...గిలకలు చిటికలు కీఁచుబుఱలు...గీ. అక టయగచాట్లప్రాఁత నై యాడుకొనుచు.హంస. 3. ౧౪౬.

**కీఁచేరాయి.** వి. (√కీఁచే). ఝిల్లి, ఇలకోడి, చిమ్మట.(బ్రౌ,వా.)

**కీఁచేలాడు.** అ. క్రి. (కీఁచేలు + ఆడు.) వాదులాడు, కలహించు. (బ్రౌ.)
(వ్యవ) అత్తకోడండ్రు ఇద్దఱును ఎప్పుడును కీఁచులాడుకొనుచుందురు.

**కీకటము.** సం. వి. అ. పుం. ౧. దేశవిశేషము. ౨. గుఱ్ఱము.

**కీకటుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. నిర్ధనుఁడు, బీద. ౨. అతిలోభి, పిసినిగొట్టు.

**కీకశుఁడు.** సం. వి. అ. పుం. చండాలుఁడు, మాలవాఁడు.

**కీకసము.** సం. విశ. (అ. ఆ. అ.) కఠినము. వి. అ. పుం. నులిపురుగు. న. అస్థి, ఎముక.

**కీకసాస్యము.** సం. వి. అ. పుం. పక్షి.
(ఇష్లే: కీకసముఖము, మొ.)

**కీచకము.** సం. వి. అ. పుం. బొంగువెదురు, గాలి పోసికొని మ్రోఁగెడివెదురు.

**కీచకుఁడు.** సం.వి. అ.పుం. సింహబలుఁడు. (వీఁడు విరాటుని బావమఱఁది. భీమునిచే చంపఁబడెను.)

**కీటకము.** సం. విశ. (అ. ఆ. అ.) కఠినము, నిష్ఠురము. వి. అ. పుం. క్రిమి.

**కీటకుఁడు.** సం. వి. అ. పుం. మాగధుఁడు, వంశవీర్యాదులను స్తోత్రముచేసి జీవించువాఁడు.

**కీటఘ్నము.** సం. వి. అ. పుం-పురుగులను చంపునది-గంధకము.

**కీటజ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. లాక్ష, లక్క. ౨. మాచికాయ.

**కీటజము.** సం. వి. అ. న-క్రిమికోశోద్భవము-పట్టు, కౌశేయము.

**కీటపాదిక.** సం వి. ఆ. స్త్రీ. హంసపదిక.

**కీటమణి.** సం. వి. ఇ. పుం. ఖద్యోతము, మిడుఁగురుఁబురుగు. (వాచ.)

**కీటమాత.** సం. వి. ఋ. స్త్రీ. హంసపదిక.

**కీటమారి.** సం. వి. ఈ. స్త్రీ. హంసపదిక.

**కీటము.** సం. వి. అ. పుం. పురుగు. విశ. అ. పుం. నీచము. (చూ. ఋషభము.)
ఉదా: పక్షికీటము, ద్వీపకీటము, మొ.

**కీటరాజము.** సం. వి. అ. పుం. పృథుకంఠము, కుమ్మరపురుగు.

**కీటు.** వి. గోడ పెట్టునప్పుడు ఒకతడవ వేయుమట్టిముద్దలవరుస, మట్టిగోడయొక్క ఖండము.
(కిరాతుఁడు రాజుతో నన్నమాట) సీ. కీటు దిద్దుడుచోటఁ గేవలమృగనాభి మనుముద్దసరి సుమ్ము మనుజనాథ... రా. వి. 3. ౪౦.

**కీడాడు.** స. క్రి.(కీడు+ఆడు) నిందించు,దూఱు.
మ...నను దోర్బలాసమగ్రుండ నై,యనిలో నిల్వఁగ లేనినీ విటులు కీడాడంగ నర్హుండవే. భార.కర్ణ. 3. ౭౬.
ఆ...గురునిఁ గీడాడుటయు వధించుటగుటఁ జేసి. భార. కర్ణ. 3. ౧౦౦. (ప్రాఁతప్రతిపా.) మనుచ. ౪. ౭౯.

**కీడు.** వి. (బ. కీడులు, కీరులు, కీళ్లు-క. కీట్. త. కీళ్. తు.కీడ్.) ౧. అశుభము.
క. కర్మములు మేలు నిచ్చును,గర్మంబులు కీడు నిచ్చు...భాగ. ౧౦. పూ. 3౨.

సా: కీ డెంచి మే లెంచు మన్నాఁడు.

౨. అకార్యము, దుష్కృత్యము.

గీ. అడవి గోవులకై కాల్చు టధ్వరమునఁ, బశు
వుఁ జంపుటయును... కీడులు గావు వత్స.
భార. శాం. ౧. ౩౦౨.

(చంద్రమతిని తెగవ్రేయ వలసివపుడు హరి
శ్చంద్రుఁ డనుమాట) ద్వి... నాకేలు సాఁగ, దీకీ
డుఁ గావింప నిది తప్పత్రోవ, యేక్రియ గల
దింక నేమి సేయుదును. ద్వి. హరిశ్చ. ఉ.
౨౩౫ పా. ౨౮౬౭ పం.

౩. నాశము; చేటు, హాని.

క. మనుసహితు లైన మునులం, గనుఁగొని యు
ష్మాను గరము గారవమున ని, ట్లనుఁ బ్రశయం
బునకీడునఁ, జనకుండఁగ మీరు రక్ష సలిపి
తిఁ గరుణన్. భార. అర. ౪. ౨౩౧.

తరువోజ... మీఁదు పరికింపకున్నఁ గీ డ్పాటి
ల్లకున్నె. భార. స్త్రీ. ౨. ౫౯.

గీ. ఇంత పల్లు వాద మీకాకి యొక్కటి, యొక్క
రాతి రిచట నున్నమాత్రఁ, గీడు సేరు నను
చుఁ గీనువగొట్టుట, యిద్ది వెఱపు గాక యె
ఱుక యగునె. కేయూర. ౩. ౪౧.

౪. అపకారము, సెబ్బర, చెడుగు.

సీ. పూజానమస్కారములకుఁ బాత్రములు బ్రా
హ్మణులు వారలకుఁ గీ డాచరించి, వాసవుం
డును జెడు... భార. అను. ౫. ౩౩౬.

మ. గురుభీష్మాదులు నూచుచుండ సభ మీకుం గీ
డు నాఁ డట్లు ము, ప్కరులై చేసిరి యంత
సేసియును బశ్చాత్తాపముం బొంది నో, పరు
... భార. ఉద్యో. ౩. ౩౬.

౫. తప్పు, నేరము, అపరాధము.

గీ. కృష్ణ కృష్ణ యనంత యేకీడు లేదు, వీరిదాస
వృత్తులై వీరు తారు తమకుఁ, దీర్ప రానియీ
పెనుఁజిచ్చుఁ దెచ్చుకొనిరి, కరుణ నీవి ప్రప
ర్యులఁ గావ వలయు. నృసిం. ౪. ౧౧౯.
పాండు. ౫. ౨౧౯.

౬. కసటు, మాలిన్యము.

గీ. తామ్ర మాదిగఁ గలయట్టిధాతుచయముఁ,
గొలిమి నిడి యూఁదఁ గీ డెల్లఁ బొలియున
ట్లు, ప్రాణపవననిగ్రహమునఁ గ్రాఁగిపోవు, న
నఘ యింద్రియజనితదోషాదు లెల్ల. మా
ర్క. ౩. ౩౧౫.

౭. పాపము, దురితము.

సీ. అధ్యాత్మవిధులచే నడఁగనిదురితంబు దాన
ము చేసినఁ బోనికీడు. వి. పు. ౩. ౧౩౫.

క. అది పాపము దానికి నా, మది నెప్పుడు వగ
తు విమలమానస యక్కీ, డు దొలంగునట్లు
గా సత్పదార్థదానములు సేయు తాత్పర్య
మునన్. భార. అశ్వ. ౧. ౧౫౩.

విశే. ౧. దుష్టము, చెడ్డది.

క. తొమ్మిదిచిల్లులబొందిన్, గ్రమ్మెడుమలములు
ను గీడుకంపులుఁ జెడుఁ బు, ణ్యమ్ము గలుగుఁ
బ్రాతస్స్నా, న మ్మెప్పుడుఁ జేయుబుధజనం
బుల కెల్లన్. విజ్ఞా. ఆచా. ౪౯. (కీడుకంపు
= దుర్వాసన.)

ఉ. అక్కట ధర్మనందనునియాస్యమునం దొక
నాఁడుఁ గీడుప, ల్కొక్కఁడు లేదు...
భార. ఉద్యో. ౨. ౬౩.

౨. అధమము, తక్కువది.

సీ... సత్ప్రస్థనలఘుధర్మంబు నేమియుఁ బోల
దీయశ్వమేధ మనిన. గీ... నీ వేమిట నిమ్మహా
ధ్వరంబుఁ గీ డంటి చెప్పుమ ప్రస్ఫుటము
గ. భార. అశ్వ. ౪. ౨౧౯.

ద్వి. త్రిపురారిఁ గొల్వనిద్విజముఖ్యుఁ డైన, శ్వ
పచాధములకంటెఁ జాలంగఁ గీడు. బస. పు.
౭. ౨౧౬ పం. ను. సం. ౩. ౨౫౧.

౩. హానికరము, అనర్థకరము.

(భీష్ముఁడు అర్జునునితో అన్నమాట) ఉ... నీవల
నిర్వైరము గీ డని చెప్పఁ జెప్ప నీ, కారవరా
జు మానఁడు... భార. భీష్మ. ౩. ౪౩౩.

శా... కోమలి యోర్వ లేక వలవంతం బడ్డినీజా
తికిం,గీ డౌను గ్రశిఖామణిం బలికె వక్షీణా
నులాపంబులన్. వసు. ౪. ౨౬.

గీ. సురలయాఁకటికూడు మ్రుచ్చులకుఁ గీడు,రి
క్కలకు ఱేఁడు వెలుఁగులయిక్కజోడు.క
విజ. ౩. ౭౯. దశా. ౨.౧౧౪.

౪. అనర్థము, అనుచితము, తగనిది.

గీ. కాన సత్క్షత్రియులకు భైక్షంబు కీడు. అను.
౩. ౬౨.

జః కీడాడు,కీడుపడు,కీడుపఱుచు,కీడుపాటు,
కీడ్వట్టు.

కీడుప(వ,డ్ప,డ్వ)డు. అ.క్రి.(కీడు+పడు) ౧.
తక్కువపడు, లొజ్జగు.

క.తనకు నెడ రైవతతి మా,లనికం బెం గీడువడు
వలజ్జత నది వా,సినయపుడ మఱచి కుజనుఁ
డు,దనుఁ బట్టపురాజా గాఁగఁ దలఁచు మన
మునన్. కేయూర. ౩. ౨౮. (కీడువడు:-త
క్కువ యని యనుకొను అని భావము.)

క...భీమునకు నం,దొఱుఁ గీడ్పడఁ దొడఁగి రు
ద్ధతులు రాజసుతుల్. భార. ఆది. ౫.౧౬౪.

౨. పరమగు, లొంగు.

(భగవద్వర్ణన) మ...కాలంబుఁ గర్తంబు నా,త
నికిం గీడ్వడియుండుఁ గావున నచింత్యం
బుల్ తదాకారముల్. హరి. ఉ. ౯. ౯౨.

౩. దైన్యమునొందు.

సీ. మనమున భీష్ముఁ డిట్లని వితర్కించుఁ బాండ
వుల నాయొక్కవింటన కడంగి, గెలువనే
వీరికిఁ గృష్ణుండు ప్రాపు గాకున్న నింకది
యట్టు లుండనిమ్ము, కృష్ణుఁ దోడుగఁ గొని కీ
డ్పడి వీరలు వచ్చినఁ జెప్పితి వధవిధంబు.
భార. భీష్మ. ౩. ౩౯౬.

౪. అణఁగు, డాఁగు.

ఉ. బాహులచాయయున్ గమనభంగియు నర్జు
నునట్ల దీన సం,దేహము లేదితండు తనతేజ
ము డాఁపఁగ మత్స్యభూమిభృ,ద్గేహమునం
దుఁ బేడి యనఁ గీడ్పడి యుండెనొ కాక
యీకురు,వ్యూహముతో డికయ్యమున కొం
డొకరుం డిటు లొంటి వచ్చునే. భార. వి
రా. ౪. ౭౬.

౫. ఓడు, పరాజితుఁడగు.

సీ. ఉమగోమరాజితో నొరసి కీడ్పడినచందము
న భూపాలులు తలలు వంప. వరాహ. ౬.
౪౬.

౬. చిన్నఁబోవు.

క. నకులసహదేవనయశా,స్త్రకళావేదిత్వమునకు
జను లనురాగా,ధికులై మిమ్ముం గొనియా,
డకు నాతఁడు మనసు గీడ్పడం జింతిల్లున్.
భార. శాం. ౧. ౧౭.

౭. క్రుంగు.

చ. కినిసితి సేని యిద్ధరణిఁ గీడ్పడఁ ద్రొక్కుదు
నంఘ్రులన్ దివం,బును దిశలుం బగుల్తు...
హరి. పూ. ౫. ౯౦.

౮. చచ్చు, నశించు.

శా. స్వర్ఘంటాపథసీమ నిల్చి యమరుల్ సంతో
ష మందన్ మహా,నిర్ఘాతోగ్రరఘూత్తమా
స్త్రనిహతి న్నీ కోటికిన్ గీడ్వడన్, దీర్ఘక్రోధ
ము మాని మానిని ధరిత్రీపుత్రి నిమ్మా...రా
మా. ౭. ౨౦౩.

కీడుప(డ్ప)ఱు(అ)చు. స. క్రి. (√ కీడుపడు)
కీడుపడఁజేయు.

(లొంగఁదీయు.)

గీ.అట్లు వచ్చునాగడఁ గని యచటియోధు,లలిక
తమతమమీఁదన యడరు ననియుఁ, దలఁచి
యొదిఁగిరి రారాజుఁ దలఁప రైరి,ప్రాణభయ
మెట్టివారిఁ గీడ్పఱుపకున్నె. భార. భీష్మ.
౩. ౫౮.

(పోఁగొట్టు.)

ద్వి. తెరువులు దొలఁగించి ధృతులు గీడ్పఱచి.
ద్వి. హరిశ్చ. పూ. ౧౬౬౦ పం.

సీ. పట్టెనామంబుఁ గీడ్పఱచి నూతనవిభూతిని
త్రిపుండ్రంబులు దీర్పవచ్చు. శుక.౩.౭౯.
(ఇట 'తుడిచివేయు' అని భావము.)

(అణఁచు, అణఁగఁద్రొక్కు.)

క. వెఱపింపఁ బోయి వెఱచిన, తెఱఁగునఁ దా
వేఁడికొనఁ బలి న్వెనుకొనియెం, దెఱప తన
యల్కకడుఁ గీడ్పఱచి విజృభించువిరహ
పరితాపము చేఁ. ప్రభా. ౫. ౧౮౨.

క. శరనిధనినాదనిభ మగు,పురఘోషము గీడుప
ఱిచి పొలుపుగఁ గడు న,ప్పురవరమునను మ
హీసుర, వరవేదాధ్యయనరవ మవారిత మ
య్యెఁ. భార.ఆది.౭.౭౫.(ప్రాఁత ప్రతిపా.)

(-స్త్రీని-చెఱచు.)

చ. చెఱగొనిపోయి యాత్మపురిఁ జేర్చి దశాననుఁ
డేసరేఁగి కీడ్పఱిచినసీతఁ దెచ్చుకొని భా
వజు ప్రిక్కుల కౌగ్గి యెగ్గు సి,గ్గెఱుఁగక కూ
డినాఁ డినకులేశ్వరుఁ డక్కట క్షత్త్రధర్మ
ముల్, మఱచెనో యంచు నన్నుఁ బ్రజ మా
టికి దూఱెడు నేమి దెల్పుదుఁ. ఉ. రా.
౬. ౨౧౦.

కీడుపా(డ్పా)టు. వి. (√కీడుపడు) కీడుపడుట.
(తక్కువతనము, హైన్యము.)

క. మేలొనరింపఁగ దొరకొను, మేలిమి గలచా
య కీడు మెయికొని చేయుఁ, లోలత్వరహి
త చాయకుఁ,జాలం గీడ్పాటు వొలయుచం
దము వచ్చుఁ. భార. శాం. ౫. ౪౧౫.

(కష్టము, శ్రమము.)

చ.ఇది గడుముద్దరాలు పను లేమియుఁ జేయఁగ
నేర దెంతయుఁ,మృదు వొకకీడుపాటునకు
మేకొనఁ జాలదు...భార. విరా. ౧. ౧౦౩.

(ఓటు, అపజయము.)

క. దనుజులకు మేలు చేయును, ననిమిషులకుఁ గీ
డుపాటు నగుచుండుట న్మైనమున నూ
హించి తలఁకి,ధనదుండు దొలంగె నాత్తతలి
యుం దానుఁ. హరి. ఉ. ౧౦. ౧౮౬. (మే
లు+చే+ఉను=గెలుపును.)

(చేటు, హాని.)

మ. క్రియ గోల్పోయి తపంబు పెద్దతికముఁ గీ
డ్పాటునం బొంది యన్యాయముం గంది క
లంగి ... నిఁ భక్తైకరక్షాస్ఫురద్దయు దేవే
శు నుపాశ్రయించితిమి...హరి.ఉ.౮.౭౦.

(దైన్యము.)

సీ. ఎలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడు మని
ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప. భార.వి
రా. ౮. ౭౦.

(పరాభవము, అవమానము.)

శా. గంగానందనుఁ డాది గాఁగఁ గురుసంఘం
బెల్ల సంగ్రామధాత్రిం గూలెం బతి యొ
క్కరుండుఁ బటుకాంతేయప్రతాపంబుపే,
ర్మిం గీడ్పాటున కోర్చి పాఱె విధి నామేఁ
బ్రాణముల్ నిల్పె...భార. శల్య. ౨. ౨౧.

(అశుభము.)

గీ. చేటు చేట్పాటు గీడ్పాటు చెట్ట కీడు, నేగి
చెడిది సిలుగు నాఁగఁ జెలఁగు నశుభము...
ఆం. భా. ౧. ౯౯.

కీడేరము. సం. వి. అ. పుం. తండులీయశాకము, చి
ఱ్ఱికూరకు.

కీడ్వె(డువె)ట్టు. స. క్రి. (కీడు+పెట్టు) = కీడ్ప
ఱుచు.

(తక్కువఁజేయు, అధఃకరించు)

సీ. విక్రమక్రమమున విప్వచ్చుతోఁ బ్రతివెట్టి
న బలిమిఁ గీడ్వెట్టువాఁడు. దశమ. ౧. ౭౫.

కీత. విణ. (క. కీతు=చిన్నముక్క.)తక్కువ,నికృ
ష్టము. (ఉదా:-కీతనేల, కీతకుంచము.)

కీదృక్కు. సం. విణ. (శ్) ఎటువంటిది.

కీదృశము. సం.విణ. (అ.ఈ.అ.)=కీదృక్కు.

కీనము. సం.వి.అ.న. మాంసము. (వై.ని.)

**కీనాశము.** సం. వి. అ. పుం. ౧. వానరము, కోఁతి. ౨. అగ్ని.

**కీనాశుఁడు.** సం.విణ.(అ.ఆ.అ.) ౧. కర్షకుఁడు, దున్నెడువాఁడు. ౨. పిసినిగొట్టు, లోభి. ౩. భృతకుఁడు, కూలివాఁడు. (శే. వి.) ౪. రహస్యముగాఁ జంపెడువాఁడు. ౫. కృతఘ్నుఁడు. ౬. క్షుద్రుఁడు. వి. అ. పుం. ౧. రాక్షసుఁడు. ౨. యముఁడు.

**కీరకము.** సం. వి. అ. పుం. ౧. వృక్షవిశేషము. ౨. చిలుకపిల్ల.

**కీరకుఁడు.** సం. వి. అ. పుం. క్షపణకుఁడు, బౌద్ధసన్న్యాసి. (విల్యమ్సు.)

**కీరము.** సం.వి. అ. పుం. చిలుక. బ. కాశ్మీరదేశము.

**కీరితి.** వి. (సం. కీర్తి. ఇ.) యశము.

సీ. ఎవనికీరితి కుభృద్ధవకుభృద్ధరబుధకరిసైంధవసమిద్ధహరిణరుచిర, ము...హంస. ౧. ౧౫.

**కీరేష్టము.** సం.వి.అ.పుం.-చిలుకలకుఁ బ్రియమైనది -౧. మామిడిచెట్టు. ౨. అక్షోటవృక్షము, కొండగోఁగుచెట్టు. ౩. జలమధూకము, నీటియిప్పచెట్టు.

**కీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఆచ్ఛన్నము, కప్పఁబడినది. ౨. విక్షిప్తము, చిమ్మఁబడినది. ౩. హింసితము, నొప్పింపఁబడినది. ౪. చెదరినది.

**కీర్ణి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. విక్షేపము, చిమ్ముట. ౨. చెదరుట. ౩. కప్పుట. ౪. హింసించుట.

**కీర్తకుఁడు.** సం. విణ. (అ. ర్తికా. అ.) కీర్తించువాఁడు.

**కీర్తన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కథనము, చెప్పుట. ౨. పొగడిక. ౩. యశస్సు, కీర్తి.

**కీర్తనము.** సం. వి. అ. న. ౧. కథనము, చెప్పుట. ౨. స్తుతి, పొగడిక.

**కీర్తనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) కీర్తింపఁదగినది.

**కీర్తయత్.** సం. శతృ. కీర్తించుచున్న.

**కీర్తయిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ)=కీర్తకుఁడు.

**కీర్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఖ్యాతి. ౨. ప్రసాదము, అనుగ్రహము. ౩. నైర్మల్యము, తేట. ౪. కర్దమము, బురద. ౫. విస్తారము, వివిరి. ౬. దీప్తి, జిగి. ౭. ధ్వని. ౮. కథనము, చెప్పుట.

**కీర్తించు.** సం. స. క్రి. స్తుతించు, పొగడు.

గీ. చెలులు పగతురు నెవ్వనిచెలితనంబు, కలితనంబుఁ గీర్తింతురు కడఁగి యెపుడు, నట్టిపుత్రునిచే సుగుణాఢ్యులార, పుత్రవంతుఁడు వాఁ బెంపుఁ బొందుఁ దండ్రి. మార్క. ౨. ౨౬౯.

**కీర్తితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. చెప్పఁబడినది. ౨. స్తుతింపఁబడినది. ౩. ఖ్యాతము, ఖ్యాతినొందినది.

**కీర్తితవ్యము.** సం=కీర్తనీయము.

**కీర్తిభాక్కు-(జుఁడు).** సం.విణ. (జ్). ఖ్యాతినొందినవాఁడు. వి. జ్. పుం. ద్రోణుఁడు. (కల్ప)

**కీర్తిశేషము.** సం. విణ. (అ. ఆ. అ)-కీర్తియే శేషముగా కలది-మరణించినది. వి. అ. పుం. మరణము. (కల్ప.)

**కీర్త్యమానుఁడు.** సం.విణ.(అ.ఆ.అ.) కీర్తింపఁబడుచున్నవాఁడు.

**కీర్త్యము.** సం=కీర్తనీయము.

**కీర్యమాణము.** సం.విణ. (అ.ఆ.అ.) ౧. చిమ్మఁబడుచున్నది. ౨. హింసింపఁబడుచున్నది.

**కీల.** సం.వి.ఆ. స్త్రీ=కీలము.

**కీలక.** సం. వి. అ. పుం. ప్రభవాదిసంవత్సరములలో నొకటి.

**కీలకము.** వి. కీలు, మర్మము. (శర, వా)

**కీలకము.** సం.వి.అ.పుం. ౧. స్తంభము. ౨. పసులఁగట్టెడుకొయ్య, గుంజ. ౩. విస్ఫోటము, పొక్కు. (వై.ని.) ౪. మంత్రాంగములలో నొకటి. (మంత్రాంగములు మూఁడు:-బీజము,శక్తి, కీలకము.) ౫. చీల.

**కీలకుఁడు.** సం. విణ. (అ.లికా.అ.) కీలించువాఁడు.

**కీలత్.** సం.శత్రు. కీలించుచున్న.

**కీలనము.** సం.వి.అ.న. కీలించుట.

**కీలనీయము.** సం=కీలితవ్యము.

**కీలము.** సం.వి.అ.పుం. ౧.మంట,అగ్నిశిఖ.౨.కఫోణి, మోఁచేయి. ౩. మేకు, గసిక, శంకువు. ౪. స్తంభము. ౫. లేశము. ౬. బాహువు, చేయి.

**కీలరము**=కిలారము.

సీ. అమరారి తనపేరియమ్ములు వెట్టించి సురధేనుసమితిఁ గీలరముసేసె. కు. సం. ౪. ౩౬౭.
(కీలరముచేయు=మందగాఁజేయు.)

**కీలరి.** విణ.(కీలు+అరి) కీ లెఱిఁగినవాఁడు (శ.ర.)

**కీలరు**=కిలారము.

ద్వి. కీలరుఁ బొడగాంచి కినియుచు దొడ్డి,పలుగాఁడి నిడి...బస.పు. ౭.౮౧౫ పం.

కీలరువాఁడు=కిలారి, పసులకాపరి.

ద్వి. ఏలేసు కేశయ్య కీలరువాఁడో, మోళిగమారయ్య మూలబండరువో. పండితా. పురా. ౧౫౬ పా.

**కీలారము**=కిలారము. వి.(సం.కీలాలః=పశువు. క. కీలార.) పశువులమంద.

గీ. నా కె మందారతరువులు తోఁటలందు, వలఁతిసురభులఁ గీలారములకు నిచ్చె. భీమ. ౫. ౮౭.

క. ఆరా జోకనాఁ డాకీ,లారమువసిఁ జూడవచ్చి లావణ్యతను,శ్రీరుచుల నొప్పి సింహకి,శోరము క్రియ నున్న క్రేపుఁ జూచి ముదమునన్. భోజరా. ౬. ౩౧౩.

జ: కీలారి.

**కీలారి**=కిలారి. వి. (కీలారము+ఇ) గొల్లవాఁడు.

సీ. ... గోపాలకుం డొప్పు గొల్లవాఁడు, గొల్లఁడు కీలారి గొల్ల కిలారి పసులకాపరి యనంగఁ జెలఁగుచుండు. ఆం. భా. ౨. ౨౬౧.

క. కీలారితనమునకు నేఁ,జాలుదు నని కొలిచి మత్స్యజనపాలుకడన్, మే లగునడవడిఁ దంత్రీ,పాలుం డను పేరితోడఁ బరఁగుదు నధిపా. భార. విరా. ౧. ౧౦౦.

సీ. కీలార్లు పెరుఁగునుం బాలు మందలనుండి వడితెపు మాపుఁ గావడులఁ దేర. చంద్ర. ౨. ౧౧౫.

**కీలాలజము.** సం. వి. అ. న. మాంసము.

**కీలాలపుఁడు.** సం.వి.అ.పుం-రక్తముత్రాగువాఁడు-రాక్షసుఁడు.

**కీలాలము.** సం.వి.అ.పుం. పశువు. (కల్ప). న. ౧. నెత్తురు. ౨. నీళ్లు. ౩. అన్నము. ౪. అమృతము. (శే.ని.)

**కీలి.** సం. విణ. (న్. నీ. న్.) కీలించువాఁడు.

**కీలించు.** సం.స.క్రి.(ఇది 'కీల' అను సంస్కృతధాతువునుబట్టి తత్సమముగా గ్రహింపఁబడెను.కాని ఆం. భా.యయాతి. గ్రంథములలో నుండుటఁబట్టి తెలుఁగుగా కూడ కనఁబడుచున్నది.) ౧.తగిలించు. (శ. ర.) ౨. పట్టుకొను.

వ. కుయ్యరకుమారయుగళంబును...గళనిగళనియమితంబుగఁ గేలఁ గీలించి... పాండు.౩. ౮౯.

౩. కదియఁబట్టు, దగ్గఱగాఁ జేర్చు.

మ. కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో,స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి త,త్కుటశాఖాగ్రముమీఁదనుండి యుఱికెన్ గోపాల

సింహంబు ది,క్కటముల్ మ్రోయ ప్రదంబులో గుభగుభధ్వానం బనూనంబుగన్. భాగ. ౧౦ పూ. ౬౩౭.

౪. ఘటిల్లఁజేయు, కూర్చు; పెట్టు.

సీ...కమ్మ చెంగలువవిరుల,తో మాలె లలకలు దువ్వి...గీ...ధమ్మిల్లవలయంబునడుగునందుఁ, గొంతసే పర్థిఁ గీలించి...ఆము. ౫. ౩౮.

సీ. ముత్యాలసేరులు మొగపుఁదీఁగెయు బన్న సరములు గీలించె జాణ యొర్తు.యయా.౪. ౯౦.

సీ. కేళియం దనురక్తిఁ గీలించుఁ గూర్మి నెచ్చెలి కత్తె యనఁగ నేలలితగాత్రి. చం. రా. ౬. ౧౦.

గీ. పెట్టెఁ గీలించె నాఁగను వెలయుచుండు,నుంచె ననుపల్కునకు...ఆం. భా. ౩. ౧౩౦.

క. ఆలలన యొక్కదినమునఁ, దాలవనంబునకుఁ బోవఁ దమకించి తలం,గీలించె మధుఘటము తన, నీలాలకబంధమునకు నెఱపుగ నెసఁగన్. సురా. ౩౩.

కీలిత. సం. విశ. (ఋ. త్రీ. ఋ)=కీలకుఁడు.

కీలితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బద్ధము,కట్టఁబడినది. ౨.మేకు గొట్టి బిగింపఁబడినది;జాతకీలము, మేకులు గలది. ౩. శూలప్రోతము, కొఱుత వేయఁబడినది. ౪. స్థాపితము, నాటఁబడినది. (స్తంభాది) వి. అ. న. బంధము.

కీలితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) కీలింపఁదగినది.

కీలు. వి. (క. కీలు. ద. కీల్.) ౧. సంధి, అతుకు; మర్మస్థానము.

ఉదా: వానికి కీళ్లు పడిపోయినవి. ఇది కీళ్లనొప్పులకు మంచిమందు.

సీ. సడలుఛత్రములు కీలెడలుగాత్రములు మ్రగ్గెడుకరములు తునిఁగెడుశిరములు. ఉ.రా. ౪. ౩౩౨.

ద్వి. కీళ్లెల్లఁ దప్పి మ్రగ్గినరథంబులును.రం.రా. ౪౨౨ పా. ౬ వం.

సీ. తేరిని మావులఁ దెగటార్చి మఱియును నెతేఁ గీలు నో నేయ ... అచ్చ.రా.యు.౩౧౭.

౨. కీలకము, గుట్టు, కిటుకు, మర్మము.

వ. ఒక్కశాఖాగ్రంబు రెండుగాఁ జీరివైచి వాని నట్లు చీరి చంపు మని సంజ్ఞగాఁ జూపిన నతండు నాకీలు దెలిసి యవక్రపరాక్రముండై మాగధుం బడఁ ద్రోచి... భాగ. ౧౦ ఉ. ౭౪౨.

క. లోకంబున నాకీటం, బాకైటభవైరి యొల్ల యాత్మలకు నఖి,ప్టాకాంక్ష యొక్కచందమ, యీకీ లెఱుఁగంగ వలదె హృదయములోనన్. నైష. ౩. ౧౩౯.

౩. కపటచేష్ట.

సీ...క న్ననఁ గీ లనఁ గపటచేష్ట. ఆం.శే.౫౫.

ఉ. కీలెఱుఁగున్ ఘటించి పరికింపక పందుకయుండి పర్కియా,త్రాలసదుర్విచారులము రాత్రి జనించిన నేఁడు తావకీ,నాలయమందు మే మిదె సుఖాప్తిని సుప్తి యొనర్చి రేపుషః,కాలమునందుఁ బోయెదము కారుణికోత్తమ పండనీయవే. హంస. ౪. ౨౩౪. (కీలెఱుఁగు=కృత్రిమస్వరము.)

౪. సీల.

క. మనపెద్దతోఁటలోనికిఁ, జని యయ్యెడ మెలఁగఁ గీలు జరిగిన నచ్చో,టన పడియె నొక్కయుంది య. దశకు. ౧౦. ౧౫౯, ౧౬౩.

౫. మర.

మ. ఒకమాణిక్యముబొమ్మ యొట్టివగకీలో జాఱు వాజాలవ,ల్లిక బాగాల్ కపురంపుటాకుమడుపుల్...అందీయ నతండు... కైకొనియె ...విజ. వి. ౧. ౧౦౬.

౬. ఉపాయము.

క. విని నృపకన్యారత్నము, తనమదిఁ దలపోసి

చూచి దానికి నొకకీల్, గనియెను బుద్ధి చ
తుర్గుణ, మనుట సతులయందు నిశ్చితార్థ మ
నంగన్. భోజరా. ౯. ౧౦౩.

క. లాలనము సేయుచుం దన,యాలయమున కెత్తి
కొని రయంబునఁ జని యే,కీలున నెవ్వరు నె
ఱుఁగం,జాలనియెడ డాఁచి దుఃఖితాడ్చు
వనుండెన్. కేయూర. ౩. ౧౭౮.

౬. రీతి, విధము.

ఉ. కిన్నరకంఠి యొట్టిడినకీలునఁ గాశిపురంబు
నందు భి,క్షాన్నము లేదు నీయడుగులాన ని
జంబుగ విన్నవించెదన్. కాశీ. ౬. ౧౬౮.

౭. ముడి.

(కృష్ణుఁడు) గీ.ఒకత వలువకీ లెడలించి యొూర్త
కడకుఁ, గొనుచుఁ బోయి యుల్లాస మింపా
నరఁ గొఱలు. హరి. పూ. ౭. ౩౧.

౮.మ్రానులోనగువానిపై పూసెడియొకానొక ద్ర
వద్రవ్యము.

ఉదా: తాటిపట్టెలకు కీలుపూసినారా. (శ. ర.)

జ: కీలరి, కీలుఁగొప్పు, కీలుకత్తి, కీలుకాఁడు,
కీలుకొను, కీలుకొలుపు, కీలుగంటు,కీలుచు,కీలు
జడ, కీలుటోడ, కీలుబొమ్మ,కీలుబొమ్మరము,కీలు
ముడి.

కీలుఁగొ(ల్గొ)ప్పు. వి. (కీలు+కొప్పు) కేశబంధ
విశేషము.

సీ. కీలుఁగొప్పు...నైష. ౭. ౧౧౨.

గీ. శ్రవణకహ్లారముకుళంబు జాఱకుండ, విరుల
కీల్గొప్పు వదిలి కైపెక్కకుండ,నెత్తె శృం
గారకందుకం బెత్తినట్లు, కైటభారాతి మం
దరక్ష్మాధరంబు. హర. ౯. ౪౫.

సీ. సొగసుగాఁ బూదండ చొన్పినకీల్గొప్పు జా
ఱఁగా నొకచేత సరదుకొనుచు. వీథి. ౨౫.

కీలుకత్తి. వి. (కీలు+కత్తి) మరకత్తి, మడతకత్తి.
(బ్రా.)

కీలుకాఁడు. వి. (√కీలు) మర త్రిప్పువాఁడు.

సీ. కీలుకాఁ డెడలింపఁ గడసినబొమ్మలకై వడిఁ
బటుతురంగవ్రజంబు. గీ. వికటముగఁ ద్రె
శ్లై...భార. ద్రో. ౩. ౯౨.

కీలుకొ(ల్కొ)ను. అ. క్రి. (కీలు+కొను) ౧.త
గులుకొను, చిక్కుకొను, అంటియుండు.

క. తోలు దిగవిడిచి నాగము, లీలఁ బొలుచు
మాడ్కిఁ గర్మలేపముఁ దనతోఁ, గీలుకొన
నీక వెలుఁగు ని,రాలంబనబోధఘనుఁడు...
భార. శాం. ౪. ౩౫౭.

(ఆదివరాహవర్ణనము.) సీ. ఖురపుటంబునఁ గీలు
కొని మేరుకుధరంబు మువ్వలోపలిజాతిము
రువు వడయ. శివరా. ౧. ౯౧.

చ...చంచువునఁ గీల్కొనుచిల్వ ఖలీన మైత
గన్. దశా. ౨. ౧౬౪.

౨. గ్రుచ్చుకొను, నాటు.

క. వాలికమెఱుంగుఁదూపులు,నాళీకాసనుఁడు
గినుక నారాయణుపైఁ,గీలుకొనఁ జేసి యా
ర్చెను...శివరా. ౧. ౭౯.

గీ. బాహ్యమునఁ గొంత కొంత యభ్యంతరము
నఁ, గీలుకొని యున్నమదనబాణాళివోలె.
నైష. ౯. ౫.

౩. కూడుకొను, అతుకుకొను, కలిసికొను.

ఆ. సత్యతపుని వ్రేలు సమిధలతోఁ గూడఁ, దగి
నవిధము భస్మ మెగయువిధము, ధరణిఁ బ
డ్డతునుక తనుదానె కీల్కొన్న,విధముఁ దెలి
య విన్నవించుటయును.వరాహ.౧౨.౨౮.

౪. ముడివడు.

చ.జనితరతిత్వరం జెలులసన్నిధిఁ బయ్యెద యం
టుభర్తపైఁ,గినిసి యదల్పుమై బొమలు గీ
ల్కొనఁ జేసి...కవిక. ౪. ౧౬౯.

౫. ఒప్పు; ఉండు.

క. వైతాళికు లప్పుడు మృదు,గీతామృతవచనర
చన గీలుకొన యశో,దాతనయు మేల్కొ

ఱుపఁ బ్రా,భాతికరమణీయరాగఫణితులు సె
లఁగెఁ. పారి. ౨. ౫౪.

గీ. మొలకచిగురులు మొగ్గలు పూలు తేనె,పింది
యల్ గాయలు ఫలంబు లెందు వనులఁ,గీలు
కొనెఁ బికభృంగముల్ కీరతతులు, మొద
లుగాఁ గల్గుద్విజరాజి ముదముఁ జెంద. ఇం
దు. ౨. ౪౧.

గీ. నృపతిచేతికి మీఁదుగా నెలఁత చేయి, గీలు
కొనఁజేసె నొక పేరఁటాలపడఁతి. నైష. ౬.
౯౦, ౮. ౧౭౧.

కీలుకొ(ల్కొ)లుపు. స. క్రి. (√ కీలుకొను).
కీలుకొనఁజేయు.

౧. లగ్నముచేయు, తగులుకొనఁజేయు; బం
ధించు.

శా. ...కౌతుకపరీతాలోకజాలంబులన్, బాలా
రత్నము కీలుకొల్పె ముద మొప్పన్ విశ్వ
భూపాలుపై. కావ్యా. ౪. ౫౭.

చ. కలికి యొకర్తు...కటిఁ బూని మేఖలా,వలయ
ము గీలుకొల్ప మఱవన్ ... రామా. ౪.
౧౪౮.

౨. నాటుకొనఁజేయు.

క. వాలికతూపులు మేనం,గీలుకొలిపి నొంప...
భార. కర్ణ. ౨. ౨౪౨. జై. భా. ౫.౧౮౦.

౩. పెట్టు; ఘటించు, కూర్చు.

గీ. ఒకతె ముంగరముత్తె మీ నొక్కయతివ,
యందుకొని కేలికెంజాయ నరుణమైనఁ,
గాంచి దాడిమబీజశంకను గరాగ్ర,కేళికా
కీరముఖమునఁగీలుకొల్పె. రామా. ౪. ౧౪౯.

సీ. కీలుగంటిది యేల పోలఁగా నునుఁగొప్పుఁ గీ
ల్కొల్పుకొ మ్మంచు గిజాపోరు. శుక. ౨.
౪౫౬. నైష. ౫. ౨౪.

౪. నిలుపు.

గీ. అతనివామాంకమున రతి నావహించి, ప్రోల
నుదురాజా ఋతురాజుఁ గీలుకొల్పి. వసు.
౩. ౧౬౯.

చ. గురువుల నాత్మఁ గీల్కొలిపి ఘోరతపోని
యమానుషక్తుఁడై...వరాహ. ౭. ౯౫.

౫. తాల్చు, వహించు.

సీ. పసిదిండిమెకపుఱక్కసితోలు మొలఁ జుట్టి
కేల ముమ్మొనవాలు గీలుకొలిపి. నీలా. ౧. ౧౩.

వ. త్రిశూలంబు కేలం గీలుకొల్పి. భీమ. ౫. ౮.

౬. అమర్చు.

సీ. నీలికాసెలమీఁదఁ గీలుకొల్పినయట్టి సెలవం
కకత్తులతళుకు లెసఁగ. చిత్రభా. ౩. ౧౨౮.
చం. రా. ౬. ౩.

౭. కలిగించు.

శా. కీడొక్కింతయుఁ జెందనీక ప్రియము ల్గీ
ల్కొల్పుచున్ వచ్చెదన్...హరి. పూ. ౭.
౨౪౦.

క. హల్లా చేయుము బొబ్బిలి, కిల్లా తజ్జయము
నీకుఁ గీల్కొల్పుదు...రంగా. ౨. ౫౪.

కీలుగం(ల్గం)టు. వి. (√ కీలు). కేశబంధవిశేష
ము, దూముడి, జాఱుముడి.

చ...కేశపాశముఁ దడియొత్తికొంచుఁ గటిసం
ధి నటింపఁగఁ గీలుగంటు లం,పముగ నమర్చి
...కాశి. ౪. ౧౧౮.

సీ. వాల్గంటి కీల్గంటు వైచి వచ్చినచెల్వ జడ య
ల్లుకొను నాఁటిసౌరు జౌరు. విజ. వి. ౩. ౧౩.
ఆం. భా. ౨. ౧౪౫.

కీలుమే(ల్మే). స. క్రి. (√కీలు)=కీలించే.
(ధరించు, తాల్చు.)

(సిద్ధునివర్ణన) సీ.,చిఱుతకెంజడలఁ గీల్చినజాతి
పటికంబు గళమున రుద్రాక్షకంఠమాల. వేం.
పంచ. ౪. ౧౦౧.

ద్వి. అసమానవదనచంద్రాంకురం బనఁగఁ, బసని
ముత్తియపుఁబావటచేసు గీల్చి. ద్వి. పరమ.
౫. ౪౨౯ పా.

**కీలుజే(ల్జె)డ.** వి. (√కీలు) స్త్రీలు వేసికొనునొకవిధమైనజడ.
చ...నీదుహృదయేశుఁడు వచ్చె నటంచు విన్న నెక్కుడు సెన రొండఁ గీలుజడఁ గోసి నివాళి యొనర్చును...శుక. ౨. ౨౩౨.
సీ...సత్యకీల్జెడకుఁ బూసరులు చుట్టి. ఉ. రా. ౧. ౪౪.

**కీలుటోడ.** వి. (√కీలు). యంత్రములచే నడిచెడి పడవ, నౌకావిశేషము.
వ...తురంగంబులు తరంగంబులుగా ... పల్లకీలు కీలుటోడలుగాఁ జాలసముద్రంబు...తరలివచ్చినట్లుండె. మృ.వి. ౩. ౪౩, ౩౭ పా.

**కీలుపడు.** అ. క్రి. తగులు. (చూ. కీలుపఱచు- శ. ర.)

**కీలుపఱ(ఱు)చు.** స. క్రి. తగులఁజేయు.
గీ...యౌవనలీలావిలాసహాస, హేలనాదులఁ జిత్తంబు గీలుపఱచి. భాగ.స్క.౧. అ. (శ.ర.)

**కీలుబొ(ల్బొ)మ్మ.** వి. (√కీలు.) మరబొమ్మ, జంత్రపుబొమ్మ.
చ. తెలిమగజాతికంబములఁ దీరినబంగరుకీలుబొమ్మ. ఉ. రా. ౧. ౩౧౭.
(రుక్మిణీవర్ణన.) సీ. హరినీలమణిమనోహరమందిర స్తంభముల వినోదించుకీల్బొమ్మవోలె. ఉ. హరి. ౨. ౭౩.

**కీలుబొ(ల్బొ)మ్మరము.** వి. (√కీలు.) మరబొంగరము.
సీ. కీల్బొమ్మరము జాలె గిఱ్ఱునఁ ద్రిమ్మరుతెఱఁగున...ప్రబంధ. ౧౦౯, ౧౧౧.

**కీలుము(ల్ము)డి.** వి. (√కీలు.) కీలుగంటు, జాఱుముడి.
సీ...కేశబంధము పేళ్లు కీల్ముడి క్రొమ్ముడి కీలుగంటు. గీ. నూనెముడి వెన్నుగంటన...సాం. ని. మాన. ౧౪.

**కీల్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) కీలింపఁబడుచున్నది.

**కీల్యము.** సం=కీలితవ్యము.

**కీశపర్ణము.** సం. వి. అ. పుం. అపామార్గము, ఉత్తరేణు ?.

**కీశపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ=కీశపర్ణము.

**కీశము.** సం. విణ. (అ. ఆ. అ.) నగ్నము, దిసమొలది. వి. అ. పుం. కోఁతి.

**కీశవల్లి.** సం=కీశపర్ణి.

**కీశుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**కీస.** విణ. (క. కీసు.) తక్కువ, అల్పము.
ఉదా: కీసయరఁటి, కీసపాలు.
అవ్య. కొంచెము, కించిత్తు.
గీ. రత్నపుర మని గల దొకరాజధాని, కిన్నరాధీశు నగరికిఁ గీస వెలితి. శివరా. ౨. ౩.
గీ...సంధ్య వార్చని బ్రాహ్మణుండు, కీస తక్కువ శూద్రుండు కేవలంబు. కాశీ. స్క. ౨౧౪. రామా. ౩. ౧౩౮.

**కీసర** వి. తిత్తి లోనగువానిలోపలిపొర. (శ. ర.)
చ. ముదుకరుమాలుగుడ్డ భుజమూలమునం గడితంబు మీఁదఁ బ్రాఁ, తదియగుదుప్పటంబు మొలఁ ద్రాసును గీసర యుండుతిత్తి సన్నదినెలవంక నామము...హంస. ౪. ౧౫౬.
విణ. అల్పము. (ఉదా: కీసరపాలు, మొ-శ.ర.)

## కు

**కు**=కి.౧.(చూ.)సంబంధసామాన్యమును దెలుపును. (ఈయర్థమున క్రియతో నన్వయ ముండదు.)
శా. నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి ... హిరణ్యాక్షుండు... భాగ. ౭. ౩౦. (నాకు=నాయొక్క.)

౨. సంబంధవిశేషమును దెలుపును.

(క) స్వస్వామిభావసంబంధము.

ఉదా: నాకు పదివేలరథము లున్నవి.

(చ) అవయవావయవిభావసంబంధము.

ఉదా: అండజమునకు పక్షములు రెండు

(ట) జన్యజనకభావసంబంధము

ఉ. ధన్యుల కా సుభద్రకు శతక్రతుపుత్త్రున కు
ద్భవించె సన్మాన్యయశుండు పుత్త్రుఁ డభిమ
న్యుఁడు...భార. ఆది. ౮. ౨౨౪.

(త) ద్వితీయార్థకము.

చ. చిరముగ బ్రహ్మకుం దపము సేసి యనంతుఁ
డనంతధారణీ,భరగురుకార్యసక్తుఁ డయి...
భార. ఆది. ౨. ౧౨౮. (బ్రహ్మకు=బ్రహ్మను
గూర్చి, బ్రహ్మనుద్దేశించి)

(ప) తృతీయార్థకము.

క...ఆంధ్రకవితా,పితామహుఁడ చెవ్వ రీడు
పేర్కొన నీకుఁ. మనుచ. ౧. ౧౫. (నీకు=
నీతో.)

చ... దేవకీ,తనయుఁడు పారిజాతవసుధారుహ
ముం దనరాజధానికిం,గొని చనఁ బూని యా
తరువు కూఁకటివేళ్లకుఁ బెల్లగించి చైకొ,కొని
బలముఁ జలంబు నొడఁగూడఁగఁ బోవఁగ
నున్నయత్తఱిఁ. వి. పు. ౮. ౧౨౫. (వేళ్ల
కు=వేళ్లతోఁ గూడ)

క. శాంతనవుఁడు భీష్ముండు ప్ర,శాంతుఁడు ద
త్క్రతువు నూచి సంతుష్టుండై, యంతకత
నూజునకు ధృతి,మంతున కత్యంతధర్మ మతి
కిట్లనియెఁ. భార.సభా. ౨. ౩. (తనూజున
కు=తనూజునితో)

(వ్యవ) ఆచేను ఎండకు ఎండుచున్నది. (ఎండ
కు=ఎండచేత)

(గ) చతుర్థ్యర్థకము.

చ. కురువిభురాజసూయమునకుఁ ధన మిచ్చిరి
రాజు లెల్ల...భార. సభా. ౧. ౨౬౨.(రాజ
సూయమునకు=రాజసూయమునిమిత్తము.)

సీ. జాతినిర్ధూపువజ్రాలకమ్మలడాలు గండపాండి
మకుఁ గైదండ యొసఁగ. దశా. ౨. ౨౭౩.

(జ) పంచమ్యర్థకము.

క...నాక కాదీ,త్రిలోకముల కధికుఁ జూచి
తిమి యొకయెలుకుఁ. భార.ఆది.౫.౨౩౯.
(నాకు=నాకంటె.)

క. నన్ను మును పీవు గాచితి,నిన్నుం జెఱ కేను
బాపి నిలిపితి నాకై,మున్ను గలకరుణ మఱి
వక, మన్నింపుము నాకు నంతమానమ చా
లుఁ. కేయూర. ౪. ౧౧౭. (చెఱకు=చెఱ
నుండి)

(డ) సప్తమ్యర్థకము.

శా. ఈపాండిత్యము నీకుఁ దక్క మఱి యెందేఁ
గంటిమే...మనుచ. ౨. ౬౪. (నీకు=నీయం
దు.)

చ...కోమలి నీ కనురక్త...భార.ఆర.౨.౨౦౬.
(నీకు=నీయెడల)

(ద) పైని, మీఁద.

క. గొఱియలపిండునకుఁ గవియుకొల్పులి క్రియ
...భార. భీష్మ. ౧. ౨౯౬.

క. నీకడుపున జన్మించుట, నాకుం గొడు కయ్యె
నితఁడు నాసుతునకు సుశ్లోకా యలుగండ
గునే,నీకు...భార. శాం. ౫. ౪౭౪.

(బ) మాఱుగా, బదులుగా.

చ. కనకము ధేనువుల్ మణినికాయము లిచ్చెద
నేమియైనఁ డక్కును మది కిష్టమైనయది
గోరుము గోవున కంచుఁ జేరి...భార. అను.
౨ ౪౨౯.

మఱికొన్ని ప్రయోగవిశేషములు.

ఇంతకును వాఁడు వచ్చినఁ గదా పెండ్లి యగుట.

అంత కింత యైనది యింత కెంత కానున్నదో.

కు. సం. అవ్య.వృత్తియందు ఉండి పాపనిందాల్పా
ద్యర్థముల నిచ్చును.

ఉదా: కుజనుఁడు, కుతర్కము, కుగ్రామము, మొ.
అజాదిపదములకును రథవద శబ్దములకును సము
దాయము చేత జాతి వాచ్యమగునపుడు తృణశ
బ్దమునకును ముందున్నదీనికి కదాదేశమువచ్చును.
ఉదా: కదశ్వము, కదుష్ణము, కద్రథము, కద్వ
దుఁడు, కత్తృణము, మొ.
సంపర్ధానుసారముగా నొకానొకప్పుడు దీనికి
కాకవాదేశములును వచ్చును.
ఉదా: కాపురుషుఁడు, (చూ. కుపురుషుఁడు) కో
ష్ణము, కవోష్ణము, కాక్షము, కాపథము, మొ.
వి. ఉ. స్త్రీ. భూమి. (దీనికి తెనుఁగున వ్యస్త
ప్రయోగము లేదు. ఉదా: కుజము, కుతలము,
కుధరము, మొ.)

**కుంక.** వి. ౧. బాలవిధవ. (చి. ని, శ. ర - చూ. కుం
కముండ.) ౨. విధవ.
ఆ. కాంత కుంక యైనఁ గానికులం బైన, బాయ
లేక విటుఁడు భ్రమసి యుండు. వేమన. ౨.
౧౫౦. సాం. ని. మాన. ౩౪.
౩. నిందావాచకముగా నుపయోగింపఁబడును.
(వ్యవ) ఓరికుంకా నీవు న న్నేమి చేయఁగలవు.
అసుత్తికుంకలు అల్లరి చేయుచున్నారు.
జ: కుంకముండ.

**కుంకటి**=కూఁకటి. వి. ౧. జుట్టు. ౨. పిల్లజుట్టు.
(శ. ర.)
విశే. ప్రధానము.
ఉదా: కుంకటివేరు. (శ. ర)

**కుంకముండ.** వి. (√కుంక) బాల్యమునందే వైధవ్య
ము ప్రాప్తించినస్త్రీ.
ఉత్సా. కన్నవారివంకవారిఁ గానఁ బ్రాణనా
థుఁడుగా, మున్నె చచ్చె నేను కుంకముండ
నెట్టు లేఁగుదుగా. వేం. పంచ. ౪. ౪౪.

**కుంకుడు.** వి. ఫేనిలముకి. (దీనికాయలతో తల రు
ద్దుకొందురు.)
సీ... కుంకుడన ఫేనిలసంజ్ఞ యగా...ఆం. భా.
౨. ౪౪.
గీ. ... కుంకుడుపండులగుచు వనంగఁ, బలపలని
పాండురాంబుదపంక్తు లమరె. ఆము. ౪.
౧౫౭.
జ: కుంకుడుఁబురుగు.

**కుంకుడుఁబురుగు(వు).** వి. (కుంకుడు + పురుగు)
కుంకుడుకాయలకు పట్టెడు నొకానొకయెఱ్ఱని
పురుగు.

**కుంకుని.** ?=కుంకుమి. (వాచ)

**కుంకుమ.** వి. (సం. కుంకుమమ్. క. కుంకుమ. త.
కుంకుమం.) ఘుసృణము, లేపద్రవ్యవిశేషము;
బొట్టు పెట్టుకొనురాగద్రవ్యవిశేషము.
ఉ. గుబ్బలిపట్టిగబ్బివలిగుబ్బల జొబ్బిలుతావి
కుంకుమన్, గబ్బుకొనంగఁ జాలు నెవఁ గప్పి
నబెబ్బులివన్నె పచ్చడం, బబ్బురమై తనర్పఁ
భ్రమరావలి యుబ్బుచు వెంట నంటఁ గా, గి
బ్బవమూరి తేజి దుమికించుచు వచ్చె మహే
శుఁ డత్తఱిన్. దశా. ౨. ౬౯.
చ. ఉరమున నున్న కుంకుమ మదుజ్జ్వలగోషక
పాయవీక్షణ, స్ఫురదరుణాంశుపుంజ మని
కొంకితి... వరస. ౨. ౧౩.
గీ... ఘుసృణంబు దనరుచుండుఁ, గుంకుమ య
నంగ... ఆం. భా. ౨. ౧౬౦.
మ. పుగసౌధోన్నత కేతుపట్టవల వంశోజాతిప
ద్మాపులం, దిగనై కప్పదలిర్పఁ బద్మపవనల్
హేలాగతి నిత్తుఁడం, చు రవి స్గుంకుమ నిం
పఁగా నరుణుఁడై చూపట్టెఁ గాదేని భా,
స్కరబింబంబునఁ గందు చెందునె గదా జా
బిల్లియందు న్వలెన్. చంద్రా. ౧. ౧౭.
(శ. ర. 'కుంకుమ' అను ఉదంతరూపమును గ్ర
హించి యీపద్యము నుదాహరించెను. కాని యి

టఁ'కుంకుమ'అనియూ ననవచ్చును.అదంత మనుట కు ఆం. భా. యూ, కుంకుమపువ్వు అనుపదమును నిర్ధారకములుగా నుండుటచే అదంతరూపమే గ్రహింపఁబడెను.)

జ: కుంకుమపువ్వు.

**కుంకుమపూవు(పువ్వు).** వి. (కుంకుమ+పువ్వు) కాశ్మీరజన్మము.

సీ. ... కుంకుమపూ వనఁ గుంకుమ మగు...ఆం. భా. ౨. ౧౬౧.

ఉ. సంకుమదంబుఁ గస్తురియుఁ జాఁదుఁ బటీర ముఁ గప్పురంబునుం, గుంకుమపువ్వునుం బు నుఁగు గొజ్జెఁగనీరు...నైష. ౭. ౧౧.

వ. ... పగడపుఁగోళ్లపట్టెమంచంబులు పఱపు గలకుంకుమపూఁబఱపులు...దశా.౧.౧౪.

**కుంకుమము.** సం.వి.అ.న. కుంకుమపువ్వు.

**కుంకుమాద్రి.** సం.వి. ఇ.పుం. కాశ్మీరదేశములో నుండునొకానొకపర్వతము.

**కుంకుమి.** సం. వి. ఈ. స్త్రీ-కుంకుమవర్ణము గలది-మహాజ్యోతిష్మతీలత, పెద్దమానేరుతీఁగ.

**కుంగు**=క్రుంగు. అ. క్రి.వంగు;తగ్గు. (చూ.కుంచు)

జ: కుంగు.

**కుంచత్.** సం. శత్రు. వంగుచున్న.

**కుంచనము.** సం. వి. అ. న. ౧. సంకోచము, ముడుఁగుట; ముడుఁచుట. ౨. వంగుట; వంచుట. ౩. వక్రత్వము, వంకర. ౪. నేత్రరోగవిశేషము.

**కుంచనీయము.** సం=కుంచయితవ్యము.

**కుంచఫల.** సం.వి.ఆ.స్త్రీ. కూశ్మాండి, గుమ్మడి.

**కుంచేము.** వి. (త.కుంజం) ప్రస్థము, నాలుగుమాని కలప్రమాణము గలకొలతపాత్రము.

సీ. ప్రస్థనామంబుగాఁ బరఁగుఁ గుంచ మనంగ ... ఆం. భా. ౨. ౨౭౦.

క. విను మొకకుంచెఁడుధాన్యము, దన కాయతి గల్గునతఁడు దాని నొసఁగినఁ, ధనకోటి గల్గు వాఁడ,ద్ధన మొసఁగిన నొక్కరూప తత్తత్ఫలముల్. భార. అను. ౫. ౨౧౧.

**కుంచయత్.** సం. శత్రు. వంచుచున్న.

**కుంచయితృ.** సం. విశే. (ఋ. స్త్రీ. ఋ.) వంచువాఁడు.

**కుంచయితవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.)వంపఁదగినది.

**కుంచి.** సం. వి. ఇ. పుం. అష్టముష్టిప్రమాణము, ఎనిమిదిపిడికిళ్లపరిమితి గలమానము.

**కుంచిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కుంచెకోల, బీగము తీసెడిపంకరయినుపకమ్మి. ౨. గురిజ, గుంజ. ౩. వంశశాఖ, వెదురుకొమ్మ. ౪. మహీలత, ఎఱ్ఱ. ౫. కృష్ణజీరకము, నల్లజీలకఱ్ఱ. ౬. మెంతి, మెంతిచెట్టు.

**కుంచిత.** సం. విశే. (ఋ.స్త్రీ.ఋ.) వంగువాఁడు.

**కుంచితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ముడిఁగింపఁబడినది. ౨. ముడిఁగినది. ౩. వక్రము, వంకరైనది. వి. అ. న. ౧. తగరపుష్పము, నందివర్ధనపుష్పము

**కుంచియ(చె).** వి. (సం. గుచ్ఛః? క. కుంచ. త. కుంజం.) ౧. కుచ్చు.

గీ. పలికుంచెతలాటంబు పేరోజంబు, మణుల మొగముట్టు వన్ని సాహిణి యొకండు, కర్త యెదుటికిఁ గొనివచ్చె గంధవాహ, బాంధవం బగునొకమహాసైంధవంబు. మనుచ. ౪. ౨౮. (పేరోజములోని శ. ర. పా.)

వ... కొడమత్తువగుంపుకాలికొలందికి వ్రేలు లాలుకుంచెలు గీలించినగవ్వడంపలగంటల నలంకరించి...ఆము. ౪. ౩౫.

౨. (సం. కుంచికా. ప్రా. కుంచిఆ) చామరము; ఈఁగలుమున్నగువానిని తోలుకొనుసాధనము.

చ. అతులితభక్తిఁ బూర్వదిశయందు ననుగ్రహయత్నవధూటి దాఁ, గుతుకము మీఱఁగాఁ

బసిఁడికుంచియ వైచుచుఁ గొల్వుసేయు... కళా. ౮. ౨౩౦.

ద్వి. పాలసుకై జామ్మనిపాలయుముక్షికలఁ, గుంచియతోఁ జోఁపుకొనుచు...ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౮౯పం.

౩. గుత్తిగాఁ గట్టిన నెమలిపురికట్ట.

సీ. లావణ్యలహరి కళానిధి కనకాంగి మదకురంగి మరాళి మణిశలాక, కాలంజి యడపంబు తాళవృంతము గిండి కుంచె పింజామరఁ గొంచు నడువ. రా. వి. ౨. ౬౩.

చ...తనకుంచెయుఁ గృష్ణమృగాజినంబునున్, బలుసుఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁ డాడె వేడుకన్. భార. సభా. ౨. ౩౧. దశా. ౨. ౨౬౦.

౪. సాలెవాఁడు పడుగు సరిచేయు సాధనము.

సీ. కుంచె మగ్గపుకుంచె నూటంబు పగ్గంబు పరఁకై త్రొక్కుడుపట్టె పలక దోనె. హంస. ౨. ౧౧.

సీ. అనువొసఁగు దానిహస్తంబు లీతని గుంచెవీసె డుదానికొమరు మిగుల. హంస. ౧. ౨౨౧.

సీ. ...కుంచిక తనరును గుంచె యనఁగ. ఆం. భా. ౨. ౨౯౬.

౫. చిత్తరువులు వ్రాయుకూలిక. (శ. ర.)

౬. కుచ్చెళ్లు పెట్టినవస్త్రము.

ద్వి. స్థిరచిత్తానందవీచికఁ బోలు కుంచె, మణి యొక భుజమున మార్గ్మలయుంగ. విష్ణు. ఉ. ౫. ౮. (శ. ర.)

౭. గోడకు వెల్లవేయుట కుపయోగించుసాధనము, మట్టి. (శ. ర.)

జ: కుంచెకోల.

**కుంచే**=క్రుంచే. స. క్రి. (√కుంగు) కుంగఁజేయు. (వంచు) (తగ్గించు.)

ఉ. కొంచెముగా నిజాంగకము కుంచి ధరిత్రికి నంతయంత లం,ఘించిన లేమవంతిఁ బరికించుజనంబులు...కవిక. ౨. ౧౧౧.

చ. అనవిని వజ్రిమండిపడి యానవు నారద... దానికి నేన గర్వమును, జెనిచితి నిన్నినాళ్లు నీకఁ బెద్దతికం బొకయింత కుంచెదన్. నిరం. ౪. ౩౫.

సీ. కులగోత్రములవారి చెలువుఁ గుంచఁ డొకింత ప్రాజ్యసామ్రాజ్యభారము వహించి. పె. శకుం. ౧. ౧౩.

ఉ...మాపులన్, మించులఁ గుంచు...రా. వి. ౪. ౯౦. (ఇట నౌపమ్యద్యోతకము.)

**కుంచెకోల.** వి. (√ కుంచె) ౧. కుంచిక, తలుపు లోపలిగడియ తీయుటకును వేయుటకును నుపయోగించు ఇనుపవంకరకోల.

ఆ. కొడవలనెడు కుంచెకోలచే వక్షఃక, వాట మిపుడు తెఱచి వామదేవు, గర్భగేహమునఁ గానంగఁ జేసితి, వౌర యెంతఘనుఁడ వాత్మదేవ. చెన్న. ౩. ౪౩౬.

సీ. ఏదేవుకనుదోయి హిమధామసోదరీకుటికా కవాటంబు కుంచెకోల. రా. వి. ౧. ౨౪.

౨. ఒకవిధమగు బాణసంచు.

గీ. రోచసీసరసీజాలపావపద్మ, మును పూపములై కుంచెకోలగములు, చెలఁగ బిరుసులు పగలువత్తులును నమరఁ, బరఁగు బహుచిత్రబాణనైపమును గనుమి. ప్రబంధ. ౭౭.

**కుంచ్యమానము.** సం. విశే. (అ. త. అ.) వంపఁబడుచున్నది.

**కుంచ్యము.** సం=కుంచయితవ్యము.

**కుంజము.** సం. వి. అ. పుం. న. ౧. నికుంజము, పొదరిల్లు. ౨. గజదంతము, ఏనుఁగుకొమ్ము. ౩. గజహనువు, ఏనుఁగుకటుమర.

**కుంజర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ధాతకి, ఆరె? ౨. పాటల, కలిగొట్టు ?.

**కుంజరచ్ఛాయము.** సం. వి. అ. న. యోగభేదము.

(కృష్ణపక్షత్రయోదశినాఁడు సూర్యుఁడు హస్త యందును చంద్రుఁడు మఘయందు నుండుట.)

**కుంజరము.** సం.వి.అ.పుం. ౧-ప్రశస్తమైన హనువులును దంతములును గలది-ఏనుఁగు. ౨. కేశము, వెండ్రుక. ౩. -ఏనుఁగుతొండమువలె నుండునది-హస్తనక్షత్రము. విశే. అ. పుం. శ్రేష్ఠము. (ఈయర్థమున సమాసపూర్వపదముగా నుండదు)

**కుంజరాలుకము.** సం.వి.అ.న.ఆలుకవిశేషము,ఒక జాతిగెనుసు.

**కుంజరాశనము.** సం.వి.అ.పుం.అశ్వత్థము,రావి.

**కుంజరాసనము.** సం. వి. అ. న. (యోగ) ఆసన భేదము.

**కుంజరి.** సం.వి.ఈ.స్త్రీ. హస్తిని, ఆఁడేనుఁగు.

**కుంజలము.** సం.వి.అ.న. కాంజికము, పులియఁబెట్టిన కడుగునీరు.

**కుంజవల్లరి.** సం.వి.ఈ. స్త్రీ.నికుంజికామ్లవృక్షము.

**కుంట=గుంట.** వి. (సం. కుండమ్. క. కుంటె. త. కుంటం.) ౧. అల్పతటాకము,నీరు నిలుచుపల్లము.

గీ. కుంట గుంట యనంగఁ బేర్కొనఁగ వచ్చు, నల్పమైనతటాకము...ఆం.భా. ౧.౧౬౨.

ఉ. ... ఎందు మం,దాకిని నిర్ఝరాకృతి నుదారగతిం జనుదెంచు టెల్ల ర,త్నాకరుఁ బొందఁ గాక యహహా చన నేర్చునె చౌటికుంటకున్. పి. శకుం. ౩. ౬౪.

౨. కొలను. (శ.ర.) ౩. చెఱువు. (శ.ర.)

ఆ. ఇంట నుండఁ గూడ దిప్పుడ కొని చని, గుంట యైనఁ జెద్దకుంట యైనఁ, దెంట యైన వైచి యింటికి నరుగుదెం, దనఁగ నద్దుకస్తు లాలకించి. వేం. పంచ. ౫. ౪౨.

౪. భూపరిమాణవిశేషము. (శ.ర, బ్రౌ.)

**కుంటకుఁడు.** సం. విశే. (అ.టికా.అ.) స్థూలుఁడు, బలుపు గలవాఁడు.

**కుంటమూలము=గుంటమూలము.** వి.కడదూలమున కును గోడకును అడ్డముగా నుంచుచిన్నదూలము. (శ. ర.)

**కుంటముక్కు.** వి. మత్స్యభేదము.

ద్వా. ౧. ౨౨౧. హంస. ౪. ౧౮౭.

**కుంటి=కుంటు.** విశే. పాదవికలుఁడు;పాదరహితుఁడు.

సీ. ఖంజుఁడు కుంటి నాఁగ...ఆం.భా. ౨.౧౨౨.

గీ. నీ ప్రతాపంబు చనవలె నిఖిలతమము,నడఁచఁగా లేవొ తా నేల యరుగుదెంచుఁ, గుంటిసారథితో నల్లకుముదవైరి. వరస. ౫. ౧౭౯.

**కుంటికుమువు=కుంటి, వంగుడు.**

గీ. కుంటికుముపు లశక్తులు కుష్ఠరోగు,లంధులును వృద్ధులును బాలు రాదిగాఁగఁ, గాశి కరుగంగ లేనివికారు లెల్ల,మోక్షమును బొందుదురు గాక దక్షవాటి. భీమ. ౫. ౨౧.

శ్లో. అశక్తాః కాశికాం గంతుం పంగవోంధాశ్చ కుష్ఠినః. సం. భీమ.

ఉ. దేవత లెల్లఁ దక్కఁగలదీవులకున్ దివి కేఁగుసట్టిపోఁ, బోవఁగ లేక కుంటికుముపుంజిలు వేల్పులు దైత్యదానవుల్, సేవకులై మహీవిభుని చే నధికారనియోగవృత్తికై, జీవితమంది నిల్చిరి త్యజింపఁగఁ జాలక జన్మదేశముల్. కాశి. ౫. ౨౯౧.

గీ. అపుడు జంబూతరుద్వీపవిపులయందు, వాసికెక్కినయద్దివోదాసునాజ్ఞ, గొంది సందిని నొకకుంటికుముపుఁ బేద,యనవ బూతంబు నుండనీరైరి భటులు. కాశి. ౫. ౨౮౭.

జ: కుంటిగాము.

**కుంటిగాము.** వి. (కుంటి + గాము) శనిగ్రహము. (చి. ని, శ. ర.)

**కుంటు.** అ. క్రి. (సం. కుంక్. క. కుంటు) ౧. పాదవైకల్యముచేత వక్రముగా నడచు.

(వ్యవ) మల్లు విజిగినదా యేమి అట్లు కుంటు చు న్నావు.

౨-కుంఠితమగు-పోవు.

చ. తొలఁగెఁ గడంక ప్రీలె ధృతి దూలె వివేక మడంగె బుద్ధి బెగ్గిలె నభిమాన మేఁగెఁ బ్రప గించె నయంబు భయంబు గుంటె గా,సిలె బిగి తారె మేర కులశీలము గ్రుంగె...చంద్రా. ౪. ౧౮౦.

వి. కుంటుతనము.

సీ. ధర్మము నాల్గుపాదంబులఁ జరియించు నేయు గంబునఁ గుం టొకింత లేక. దశా. ౮. ౭౦.

గీ. గుంటికా లొందుధర్మవుకుంటు మాన్ప.కకు. ౧. ౬౦.

విణ. పాదవికలుఁడు; పాదరహితుఁడు.

క. వింటి కదా నీతనయుని, కొంటెతనము వీరి మాని కుటిలాలక న,క్కుంటునకు నిత్తు రఁట యిటు, వంటివి పో పెక్కునోళ్ల వారలమా టల్. భోజరా. ౫. ౩౩౧.

గీ. కుంటు వినతామహాదేవికొడుకుఁగుఱ్ఱ, సవితృ సారథి కట్టెఱ్ఱచాయఁ దెలుప, నరుణుఁ డు దయించెఁ బ్రాగ్దిశాభ్యంతరమున. కాశీ. ౧. ౧౨౧.

జ: కుంటుగించు,కుంటుపఱుచు,కుంటుపిచ్చుక, కుంటువడు, కుంటువాఁడు.

కుంటుగించు. అ. క్రి. (√కుంటు)కుంటు. (శ.ర)

కుంటుపఱుచు. స. క్రి. (√ కుంటుపడు) కుంటు పడఁజేయు.

(చెఱచు, పాడుచేయు.)

సీ. బ్రహ్మచర్యము గుంటుపఱుచుమాణవకుండు పాడిదప్పినధరాపాలకుండు. శివధ.౪.౮౭.

సీ... పెనుఁగొండ సాధించెఁ గోవెలకెల్లూరు గుం టుపఱిచెఁ,గుందాణి విదళించె గొడుగుచిం త జయించె బాగూరు. పంచముపాడుచేసె. వరాహ. ౧. ౩౦.

కుంటుపిచ్చుక=పిచ్చుకకుంటు,పిచ్చుకుంటు. విణ. (కుంటు+పిచ్చుక) పాదరహితుఁడు, పంగువు.

సీ. తా పన సెద్ది యాధార మా దివిఁ బ్రాఁకుపి తృవర్యులకుఁ గుంటుపిచ్చుకలకు. గీ. నట్టిగృ హమేధిధర్మంబునందు...పాండు. ౫. ౨౬౧.

కుంటువ(ప)డు. అ. క్రి. (√కుంటు) ౧. కుంటి యగు, నడువలేని దగు.

క. అరయఁగ నాలుగువిధములఁ, బరఁగుఁ జతు ష్పాదవృత్తిఁ బరఁగినగోవుల్, దొరయుచు నం దొకఁ డెడలిన, నరవర సద్ధర్మవర్తనము గుంటువడున్. భార.అను. ౪. ౨౮౫. (గో పక్షమున.)

ఉ. వాలిక మించుఁ గన్గొనలవాకిట నల్లన సంచ రింపనుం, జాలక చాలఁ గుంటువడెఁ జారు నిరీక్షణఖంజరీటముల్. నైష. ౨. ౧౧౨.

శ్లో. అజని పంగురపాంగనిజాంగణ,భ్రమికలేపి తదీక్షణఖంజనః. సం. నైష. ౪. ౪.

౨. ఆఁగు, నిరుద్ధమగు.

(గంగావతరణము.) వ...కమఠపతివీఁపుచిప్పఁ దాఁకి యుప్పరం బెగసి జగదండకర్పరం బునఁ గుంటువడి మగుడు వేగం బడరఁ బుడ మికి డిగి నలుగడల నెల్లివిరిసి...చం. రా. ౩. ౨౫.

౩. తగ్గు, క్షీణించు, కుంఠితమగు.

మ. గుణదర్పోద్ధతి నిట్లు మర్మములు గీలొక్క నే యఁగా శౌర్యవి,స్ఫురణాహంకరణంబు కుం టువడి యచ్చో నేదుచందంబునన్, శరసం వేధితదేహుఁడై నిలిచె విష్వక్సేనసూనుండు ...జై. భా. ౫. ౧౮౭.

క. తొంటినడ గుంటువడినం, బంటుతనము గుం టుపడక పరుషధ్వనితో, మింటికి నిమ్ముగ నంగిటి, గుంటదనుక నోరు దెఱచికొని యు న్ముఖుఁడై. రామా. ౮. ౧౪౫.

౪. చెడు, భగ్నమగు.

మ. అపు డుద్దాలకుఁ డాగ్రహించి నిజభార్యం
జూచి నిర్భాగ్యురాల పవిత్రం బగుపార్వ
ణంబు నవలీలం బెంటపై వైచి కుంటుపడం
జేసితి శ్రాద్ధకర్మము...శై. భా. ౪. ౧౦౧.

సీ. ఉలపాంసురము లేర్చి యులుపవట్టెడుపూ
న్కిఁ గుళపల్లవాహృతి గుంటువడియె.పాం
డు. ౫. ౨౩౮.

౫. తెగు, ఖండితమగు.

గీ.ఘనభుజుండు సుమిత్రనందనుఁడు జిష్ణుఁ,దరిఁ
గరము గుంటువడ నేయ ననుజాగెలుపు,గాం
చి మోదించె నరత నటించుచక్రి. రాఘవ.
౪. ౧౬౯. (భారతార్థమున.)

**కుంటువాఱు.** అ. క్రి. (కుంటు + పాఱు) మొ
క్కపోవు, బలహీన మగు.

సీ. గుదియఁ జేకొనెఁ దద్దఁ గుంటువాఱె జముం
డు కుదిరె రక్కసుఁడు సోఁకుడుఁదనమున.
అచ్చ. రా. బాల. ౬౮. (శ. ర. పా.)

**కుంటెన.** విణ. (సం. కుట్టనీ.) నాయికానాయకుల
ను గూర్చువాఁడు; కూర్చునది. (చూ. కుంటెన
తనము.)

వి. తార్పుట,తార్పు,నాయికానాయకులనడుమ
చేయుదూతకృత్యము.

చ. తనసరిచాకెతల్ తనకు దాపుగ వారల కెల్లఁ
దాను గుంటెనలు వహించుకొంచు నెఱె
క్కులు నిండి విడెంపుఁజొక్కులున్...క
నఁబడ నవ్వఘూటి పతికన్నులు మూసి చరిం
చు నిచ్చలున్. శుక. ౩. ౧౦౯.

చ. నెలకొను జూటసౌరతటినీనవకైరవిణీవఘూ
టితో, లలితసుధాంసుఁ గూర్చినతలంబునఁ
బార్వతిఁ గూడి యబ్ధికిం, గలయికకుంటె
నల్ నడుకుఁగాఁ బని పూనినయూశపాలకుం,
డల శివుఁ డిచ్చుఁగావుతఁ జిరాయువు నార
నభూపమాళికిన్. కువల. ౧. ౩.

కుంటెననడచు=కుంటెనగాఁ బ్రవర్తించు, నా
యికానాయకులకు దూతకృత్యము నడపు.

సీ. గుఱు తంటిమా నీకు గుఱు తెక్కుడిది భక్తి
నంబికిఁ గుంటెననడచినావు. నిరం. ౩.౨౯.

కుంటెనపంపు, కుంటెనయంపు = కుంటెనగాఁ
బంపు.

ఉ...నీచుపొత్తునన్,బ్రాఁతి మెసంగి తీవు ముసు
ఛస్తుఁడు కుంటెనపంపఁ బోతి...కాళ. ౩.
౧౦౦.

సీ...కుంటెన నిన్నంపెఁ గోర్కి నొకఁడు.రా.
వి. ౨. ౬౦.

కుంటెనపో(వో)వు =కుంటెననడచు.

ద్వి. వేయేసిమాడలు వెల యొసంగుచును, గుం
టెనవోవుచుఁ గొలిచి యాలంజె,యింటికి
నంబెన్న యేఁగఁ దా నేఁగు,చు...పండితా.
మహిమ. ౨౮౧ పా.

ద్వి. ఎడపక ముప్పది యేండ్లు నిచ్చలును, గొన
కొని నంబికిఁ గుంటెనపోవు,చును వచ్చుచు
ను సముత్సుకత మైనడచు. పండితా. మహి
మ. ౨౮౨ పా.

జః కుంటెనకత్తె, కుంటెనకాఁడు, కుంటెనకు
చ్చులు, కుంటెనతనము, కుంటెనపని, కుంటెన
ముడి, కుంటెనీఁడు.

**కుంటెనకత్తె(త్తియ).** విణ.(కుంటెన+కత్తె) తా
ర్పుకత్తె.

సీ. ... కుట్టనీనామధేయంబు తాపికత్తియ యన
నెసఁ,కత్తియ యనఁ బొంతకత్తియ యనఁగఁ
గుంటెనకత్తియ యనంగఁ దనరు ... ఆం.
భా.౨. ౧౧౦.

**కుంటెనకాఁడు.** విణ.(కుంటెన+కాఁడు) తార్పు
కాఁడు.

క. మనసిజుఁ డిద్దఱకును గుంటెనకానితనంబు
చేసెడిన్...విక్ర. ౮. ౫౪.

సీ. సిగ్గింతయును లేక చెల్లెలికై దాను గుంటె
నకాఁ డైనకొంటె యితఁడు. కలు. ౪. ౮౩.

**కుంటెనకుచ్చెలు.** వి. బ. (√కుంటెన?) ఈద్పులనెడుకర్ణభూషావిశేషము. (శ. ర.)

**కుంటెనతనము.** వి. (కుంటెన + తనము) నాయికానాయకులను దార్చుపని.

వ...ఏ నయ్యంగనం గోరి వరియింపం బోవుచున్నాఁడ నమ్మచ్చెకంటికిం గుంటెనతనం బెట్లు సేయ నేర్తు...నైష. ౩. ౬౬.

**కుంటెనపని**=కుంటెనతనము.

క. ఆరయ సమయోచితవాచారచనప్రౌఢి మిగుల నడిసన్నది కా, వేరియ కుంటెనపని కదిగడి, దేఱినయది పంపవలయు దీనినె యనుచుక్. వైజ. ౪. ౨౯. అని. ౩. ౯౭.

**కుంటెనముడి.** వి. (√కుంటెన) తాటాకులపుస్తకముదారమునడుమ నుండెడుముడి. (శ. ర.)

**కుంటెనీఁడు**=కుంటెనకాఁడు. (కుంటెన + ఈఁడు)

సీ. కుంటెనీలకు నిచ్చి కోడిగీలకు నిచ్చి మిన్నక వారకామినుల కిచ్చి. విక్ర. ౬. ౧౨౪.

**కుంటేళ్లు.** వి. బ. స్త్రీకర్ణభూషావిశేషము.

సీ. కడియాలు కుంటేళ్లు గంటలొడ్డాణంబు ...

గీ. మొదలు గలసొమ్ములను దాల్చి మురిపె మమర. చంద్ర. ౬. ౨. ౨౦.

**కుంఠకుఁడు.** సం. విణ. (అ. తికా. అ.) ౧. క్రియామందుఁడు, పనిచుఱుకుఁదనము లేనివాఁడు, సోమరి. ౨. మూర్ఖుఁడు.

**కుంఠత్.** సం. శత్ర. మొక్కపోవుచున్న.

**కుంఠన.** సం. వి. ఆ. స్త్రీ=కుంఠనము.

**కుంఠనము.** సం. వి. అ. న. ౧. మొక్కపోవుట. ౨. మొక్కపోవునట్లు చేయుట.

**కుంఠము.** సం. వి. అ. న. మొక్కవోయిన ఆయుధము, మొనపోయినఆయుధము.

**కుంఠయత్.** సం. శత్ర. మొక్కపోఁగొట్టుచున్న.

**కుంఠి.** సం. విణ. (న్. నీ. న్)=కుంఠకుఁడు.

**కుంఠిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ)=కుంఠకుఁడు.

**కుంఠితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మొక్కపోయినది, వాఁడి తగ్గినది. ౨. మూర్ఖము, మూఢము.

**కుంఠుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. సోమరి, క్రియామందుఁడు. ౨. మూర్ఖుఁడు, మూఢుడు.

**కుంఠ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) మొక్కపోఁగొట్టఁబడుచున్నది.

**కుండ.** వి. (సం. కుండమ్. క. కుండ. త. కుండం.) ౧. మృదాదిభాండము, మట్టి మున్నగువానితోఁ జేసినపాత్ర.

ఆ. కుండ పగిలెనేని క్రొత్తది కొన వచ్చు, భూతలంబునందుఁ బొందుగాను, గూలఁబడినవరుఁడు కుదురుట యరు దయా. వేమన. ౧. ౭౪.

సీ...కుండ నాఁగ మృదాదిభాండ మెసఁగు. ఆం. భా. ౨. ౨౪౫.

క...పూఁ, జెండులపసయును బంగరు, కుండల మెఱుఁగు న్వెలందిగుబ్బల కడఁగుక్. నీలా. ౨. ౨౪.

౨. వర్తుల మైనభాండము.

గీ...వర్తులభాండ మెసఁగుఁ, గుండ యన... ఆం. భా. ౨. ౨౪౬.

౩. మేడలు మున్నగువానిమీఁద ఎత్తెడు కలశాకారము గలయలంకారవిశేషము.

సీ. కంబాలఁ జీని-చీనాంబరంబులు చుట్టి గోపురంబులఁ బైఁడికుండ లెత్తి. విక్ర. ౪. ౧౩౬.

౪. ఇరుసు తగిలించెడుబండిచక్రమునడిమిగుబ్బ.

వ...మున్ను కొండొక క్రుంగినచక్రంబు కుండమునుంగం దిగఁబడిన... భార. కర్ణ. ౩. ౩౫౦.

(బ) ఏనుఁగుకుంభములు.

సీ. కుండలు దాల్చి కర్ణోవల నీరొలుకఁ జేతులఁ
జాఁపుకడయేనుఁగులను [illegible]రోసి. గీ. పుడమి
చెలి నేరె సిరులఁ జెంపడరి యరిది,తేజ
గాంచినదయాచాల్పు తేర్లదొరను. అచ్చ.రా.
బాల. ౪౬.

కుండకడుపు = బానకడుపు, కుండవలె గుండ్రముగా నుండుకడుపు.

మ. నిడుమోముం గుఱుగేలుఁ గుండకడుపు న్నీ
లత్వముక్...మార్క. ౧. ౨౨౪.

జ: కుండగోఁకరి, కుండప్రోఁగులు, కుండబంతి, కుండమార్చు, కుండమార్పు, కుండవీనులజోదు, కుండానుగు, కుంపెరుఁగు.

**కుండంగము.** సం.వి.అ.పుం.కుడుంగము, పొదరిల్లు.

**కుండకీటుఁడు.** సం.వి.అ.పుం. ౧.పతితబ్రాహ్మణీపుత్రుఁడు, చెడిపోయినబ్రాహ్మణస్త్రీకొడుకు.౨.దాసిని కామించినవాఁడు. ౩. చార్వాకమతము ననుసరించువాఁడు, నాస్తికుఁడు.

**కుండకీలుఁడు.** సం. వి. అ. పుం. నీచుఁడు,అధముఁడు.

**కుండగోఁకరి.** విశే. (కుండ+గోఁకరి.) వంటవాఁడు, ఔదనికుఁడు.

ద్వి. కుండగోఁకరిఁ జేసి కువలయేశులకు,వండిపె
ట్టఁగఁ జేసి ... ద్వి. నల. ౨. ౭౦౦ పం.

**కుండగోళకము.** సం.వి.అ.న. ౧.కాంజికము,కలి. ౨. కుండగోళకులసముదాయము.

**కుండగోళము.** సం.వి.అ.న.కాంజికము,కలి.(విల్సన్సు.)

**కుండపాయ్యము.** సం.వి.అ.పుం-దీనియందు కుండతో సోమపానము చేయుదురు-ఒకానొకయాగము.

**కుండప్రోఁగులు.** వి. బ. (√కుండ)ఒకవిధమైన చెవిపోఁగులు.

సీ. కుండప్రోఁగులు చిప్పగొడ్డండ్లు సెలగోలలొ
ప్పారుపలువంకయుంగరములు. గీ. కలికి...
మొల్లముగఁ జేరి రచటికి గొల్ల లెల్ల. నీలా.
౩. ౪౯.

**కుండబంతి.** వి. (కుండ+బంతి) కందుకక్రీడావిశేషము,గెండు ఎత్తుతాలమీఁద ఒకకఱ్ఱ యుంచి దానిని బంతితో కొట్టుచు ఆడెడియాట. (వా)

**కుండమార్చు.** స.క్రి. ఒకటి నిచ్చి మఱియొకటిని పుచ్చుకొను. (శ. ర.)

**కుండమార్పు.** వి. (√ కుండమార్చు.) ఒకటి యిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట, వినిమయము.

సీ.చండాంశునుతుపోల్కిఁ గుండమార్పులు గా
క వాసవమణిభాతిఁ ద్రాస మంద. గీ. కొసఁగ
నేర్తువు యాచకవ్యూహమునకు. నరస. ౫.
౧౯.

**కుండము.** సం.వి.అ.న. ౧.కుండ,మట్టి మున్నగువానితో చేసినపాత్రము.౨.నిప్పులగుండము. ౩. దేవఖాత మగుజలాశయము. (ఇది తఱచు దేవాలయములకు సంబంధించియుండును. ఉదా: అగస్త్యకుండము, మొ.) ౪. మానభేదము.

**కుండలన.** సం. వి. ఆ. స్త్రీ. సున్న చుట్టుట. సం. నైష. ౧. ౧౪.

**కుండలము.** సం.వి.అ.పుం. న. ౧. కర్ణభూషణము. ౨.పాశము,త్రాడు. ౩.వలయము,గుండ్రన.(మేది.)

**కుండలి.** సం.విశే.(న్.నీ.న్) ౧. పోఁగులు గలవాఁడు. ౨. గుండ్రనిది, వలయాకారము గలది. వి. న్. పుం. ౧.పాము.౨.నెమలి.౩.చిత్రమృగము, చాఱలదుప్పి. ౪. వరుణుఁడు. ౫.కోవిదారము, కాంచనముకీ. ఈ. స్త్రీ.౧.గుడూచి,తిప్పతీఁగకీ. ౨. తీక్ష్ణపత్త్ర,ఉప్పికీ. ౩.(యోగ)కుండలీశక్తి. ౪. కుండలాకారనృత్యము,గొండ్లి.

గీ. దండలాసకవిధమును గుండలియును,బ్రెక్క

ణంబు తెలుంగును చేరణంబు. భార.విరా.౧. ౨౪౦.

**కుండలించు.** సం. స. క్రి. ౧. సున్నచుట్టు.

గీ. అతనికీర్తి ప్రతాపంబు లవని( గలుగ, నేల యివి యంచు మదిలోన నెపుడు దల(చు, న పుడ పరివేషమిషమున నబ్జసూర్య,మండల ముల విధాతృండు గుండలించు.నైష.౧.౫౬.

క. పురకాంతలకౌనులకున్, సరిపడ దని బ్రహ్మ యాకసము నారసి వే,సరి దాని( గుండలించి న,సరణిన్ దివి ముట్టె యచటిసాలం బమ రున్.చంద్రా.౧.౩.

౨. వలయాకార మగునట్లు వంచు.

గీ. కోపమున( జాపముం గొని కుండలించె.చం. రా.౮.౧౨౪.

**కుండలిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గుండ్రనిభక్ష్యవి శేషము. (జిలేబి) ౨. గుమాని,తిప్పతీ(గ.(క ల్ప)౩.మూలాధారమందలి షట్చక్రములనడుమ నున్న దేవీభేదము.

**కుండలీకరణము.** సం. వి. అ. న. సున్నచుట్టుట.

**కుండవర్ధనము.** సం. వి. అ. న. ఒకానొకపుష్ప జాతి.

ద్వి.పొన్నలు బొగడలు బొండుమల్లియలు,కుండ వర్ధనములు కొండగోగులును, బండిగురివెం దలు పారిజాతములు. ప్రభు. ౨. ౧౮పా. ౮ పం.

**కుండవీనులజోదు.** వి. (√కుండ) కుంభకర్ణుడు.

క. గుబ్బవెట్టుచు( గొండవలె,న్వెలు( గొప్ప(గ నున్నకుండవీనులజోదున్. అచ్చ. రా.యు. ౨౨౫.

**కుండానుగు.** వి. (కుండ+ఆనుగు) కుండవంటిగుం డ్రనికాయలు కాచుతీనుగు, గోరకచిక్కుడు.

**కుండాశి.** సం. విశే. (న్. నీ. న్.) కుండగోళకుల యన్నముచే బ్రతుకువాడు.

శ్లో.అమృతే జారజః కుండో మృతే భర్తరి గోళ కః, యస్తయోరన్నమశ్నాతి స కుండాశీతి కథ్యతే.(వాచ)

౨. న్. పుం. ధృతరాష్ట్రపుత్రులలో నొకడు.

**కుండి.** సం.వి.ఈ. స్త్రీ. ౧. కమండలువు, గిండి. ౨. స్థాలి.

**కుండిక.** సం.వి.ఆ.స్త్రీ. ౧.పిఠరము, స్థాలి.౨. కమం డలువు, గిండి.

**కుండినము.** సం. వి. అ.న.విదర్భదేశపురాజధాని.

**కుండీరుడు.** సం. విశే. (అ. ఆ. అ.) బలవంతు డు. ౨. అ. పుం. మనుష్యుడు.(కల్ప.)

**కుండు.** వి. ౧. మొక్కలు వేయుట కుపయోగించు మట్టిపాత్రము.

మ. అలమాకందము కుండ్ల దింపదగు నియ్యాం ట్లాక్కచో వేయు(గా,వలె సంపంగికి ద్ర వ్యటం బిడ వలెన్...విప్ర. ౨. ౬౯.

౨. పాదును మొదలైనవి నూరుట కుపయోగిం చుపాత్రము. ౩. నీరు నిలువచేసి యుంచుట కు కట్టినచిన్న కుండము.

**కుండుడు.** సం. వి. అ. పుం. మగడు బ్రదికి యుండ(గా జారునకు పుట్టినకొడుకు.

**కుంద్రృణాచి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లబల్లి. ౨. ఒకజాతిపక్షి. (వై. ని.)

**కుండోధ్ని.** సం. వి. ఈ. స్త్రీ. కుండవలె పెద్దపా దుగు గలయావు.

**కుంతము.** సం. వి. అ. పుం. ౧. ప్రాసము, ఈటె; బల్లెము.౨.గవేధుక,అడవిగోధుమ. ౩. మక్కు ణము, నల్లి.౪. ఉగ్రత,కోపస్వభావము.(వి.ని.)

**కుంతలపక్షము.** సం. వి. అ. పుం.కేశసమూహము.

**కుంతలము.** సం. వి. అ. పుం. ౧. కేశము, వెండ్రు క. ౨. చషకము, పానపాత్రము. ౩. లాంగల ము, నాగలి. ౪. యవలు. ౫. హ్రీబేరము, కురు వేరు. ౬. (సంగీ) ధ్రువకతాళభేదము. ౭. ౧.

వింధ్యపర్వతమునకు దక్షిణముననుండు నొకా నొక దేశము. ౨. మధ్యదేశమునందలి యొక దేశము. (శే. ని, వై. ని.)

**కుంతలవర్ధనము.** సం. వి. అ. పుం. భృంగరాజము, గుంటగలగరి.

**కుంతలిక.** సం. వి. ఆ. స్త్రీ. పెరుఁగు వెన్న లోనగువానిని కోయుకత్తి, ఛురిక. ౨. వాల మను గంధద్రవ్యము, కురువేరు.

**కుంతలోశీరము.** సం. వి. అ. న. వాల మను ఓషధి, కురువేరు. (వాచ)

**కుంతి.** సం. వి. ఇ. పుం. ౧. ఒకానొక దేశము. ౨. క్రథునికొడుకగు ఒక రాజు. ఈ. స్త్రీ. ౧. పృథ, పాండురాజుభార్య. ౨. రేణుకయనుగంధద్రవ్యము. ౩. గుగ్గిలపుచెట్టు. ౪. సల్లకి, అందుగు.

**కుంతిభోజుఁడు.** సం. వి. అ. పుం. ఒకయాదవరాజు, కుంతిని పెంచుకొన్నతండ్రి.

**కుంద.** వి. (క. కుండ) స్తంభము. (శ. ర, బ్రా.)

**కుందకము.** వి. (క. కుండక. త. కుండకమ్) ౧. అభ్యంతరము, అడ్డు. ౨. లోపము. (శ. ర, బ్రా.) ౩. సేద్యము చేయక విడిచిపెట్టినభూమి. (బ్రా.)

**కుందకము.** సం. వి. అ. పుం. ౧. కుందము, మొల్ల. ౨. సంబరేను.

**కుందటీల.** వి. పక్షివిశేషము.

సీ. ...సాళ్వము డేగ గూడ బా తుల్లంగి కుండటీల...ఆ....ఆది యైనపక్షు లతఁడు దీర్చె. హంస. ౩. ౧౩.

**కుందనము.** వి. (క. కుందణ. త. కుందనమ్.) అపరంజి, పరిశుద్ధ మైనబంగారము.

సీ. ...పరిశుద్ధచామీకరాఖ్యలు దనుఁ గదాని, మేలిమి యపరంజి జాళువా కుందనం బదిరినా...ఆం. భా. ౨. ౨౭౬.

గీ. గళశతాఖ్యుఁడు దొడుగుకుందనపుఁ బైఁడి, కంకటముఁ బోలు... నైష. ౬. ౧౮౬. ఆం. సం. స్థా. ౩౫. నాం. ని. స్థా. ౬౭.

**కుందమము.** సం. వి. అ. పుం. బిడాలము, పిల్లి. (త్రి. ని.)

**కుందము.** సం. వి. అ. పుం. న. మొల్ల. న. మొల్లపూవు. పుం. ౧. కుబేరునినవనిధులలో నొకటి. ౨. ఒకానొకగంధద్రవ్యము. ౩. కరవీరము, గన్నేరు. ౪. శస్త్రమార్జకయంత్రము, ఆయుధములు సానఁబెట్టుయంత్రము.

**కుంది.** వి. (త. కుందాణి) ౧. దంచునప్పుడు ధాన్యము చెదరిపోకుండ గుంటమట్టు నమర్చుతాలికుదురు. (శ. ర, బ్రా.) ౨. కుందెన, ధాన్యము దంపుకొను ఱోలు.

గీ. కుంది కుందెన యనఁగను గొలుఁలు ప్రీహ్యు, లూఖలము...ఆం. భా. ౨. ౨౩౯.

౩. ఒకవిధ మగుదీపపాత్రము. (వా)

**కుందించు.** స. క్రి. (√కుందు) కుందఁజేయు.

౧. బాధపెట్టు.

వ... రేలునుం బగళ్లునుం బాయక నిరంతరపథపరిశ్రాంతులం గుందించియు క్షుత్పిపాసాపరవశత్వంబు నొందించియు... హరివం. ౩. ౨౮.

వ... బాదరాయణుండు కాలోచితకృత్యంబులు నిర్వర్తించి గమనోన్ముఖుండై కాశీవియోగజనితవేదనాభరంబు దుస్సహంబై యంతరంగంబుఁ గుందింప నెట్టకేలకు నేటి కెదురీఁదువిధంబున శిష్యులుం దానును...చనువాఁడై... భీమ. ౨. ౫౦.

౨. తక్కువపఱచు, న్యూనపఱచు.

శా. పాపాత్ముండు మదాంధుఁ డాతులువ నీపంపెట్టునుం జేయఁగా, నోపం డడ్డము సెప్ప రెవ్వరును మానోద్రేకముక్త గర్వమునం, గోపంబుం దనుఁ ద్రిప్ప నా ప్రజనులం గుందించుటం బోయిన, ట్లే పోనిత్తురు... భార. ఉద్యో. ౩. ౪౫.

3. తపింపఁజేయు.

శా. క్రోధం బప్రతికారమై హృదయముం గుందింప...భార. విరా. ౨. ౨౭౫.

**కుందిక.** వి. (కుందు + ఇక - ఇది 'పొందిక' వంటిది.) కలఁత, క్షోభము.

సీ. కలశపయోరాశి చిలుకవ్వపుఁగామకుంది కబ్బనినాఁడు మందరంబు. పి.శోపం.౧.౩౯.

**కుందికట్టు**=కుందికాళ్లు. వి. (√కుందు) బాల్యక్రీడావిశేషము.

సీ. పసిఁడిసోపనములపైఁ గుందికట్టుకై కడుముద్దులైనజక్కపలకవలు. యయా. ౩. ౫౫.

**కుందికాళ్లు**=కుందికట్టు. వి. బ. బాల్యక్రీడావిశేషము.

సీ. కోలక్రోఁతులుఁ బిల్లఁగ్రోళ్లుఁ దూరనఁగోలలందలంబులు మఱి కుందికాళ్లు. గీ. ఆదిగా శైశవక్రీడ లాడి రపుడు, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

**కుందిల్లు(లు).** అ. క్రి. (√కుందు) కుందు నొందు. (క్రుంగిపోవు, డిల్లపడు.)

మ... ఆమునీంద్రాంగనా, కుల మత్యాకులవృత్తి నుండెవనటం గుందిల్లి చింతించుచుక్. పు. సం. ౧౦. ౯౦౭.

**కుందు.** అ. క్రి. (క.కుందు) ౧. చింతించు; శోకించు, ఏడ్చు.

గీ. ఏకమై యట్లు ముప్పురహృదయములును, గుంద కానందవారిధియందుఁ దేలె. హర. ౨. ౧౧౫.

ఆ. బ్రహ్మచర్యమునఁ దపంబున నుత్తమ,దానములను బడయఁ దలఁచునట్టి, గతులకంటె సౌఖ్యకారిణి యగుగతిఁ, బొందు నీసుఖుండు గుంద నేల. భార. ద్రో. ౨. ౨౩౮. (చూ. ౩౨౧.)

౨. తపించు, ఉడుకు.

గీ. అట్లు దమలోనఁ దగుమాట లాడి యాడి,శో పరసవేగమునఁ గుంది కుంది వగలఁ, బొంది పొంది పురందరనందనుండు, నచ్యుతుండు నారాత్రి యెట్లొకొ చెపుమ. భార. ద్రో. ౨. ౩౦౯.

సీ. ...ముం దెంత పెనువంతఁ గుందెనో పిల్లఁగ్రో వి. నీలా. ౧. ౧౦౯.

3. బాధపడు, నొగులు.

క. బలవంతుఁడు పైనెత్తిన, బలహీనుఁడు ధనము గోలుపడినయతఁడు మ్రుచ్చిల వేసువాఁడుఁ గామా, కులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా. భార. ఉద్యో. ౨. ౨౧.

మ. నిఖిలస్తుత్యభుజప్రతాపనిధి వానిమీఁద దండెత్తిన, చ్చె ఖలుం డైనదశాననుం డశనితో సిద్ధంబు యుద్ధం బగుక్, శిఖరిక్ మేషము దాఁకి కుందుగతి నీచే వందురుక్ ... ఉ. రా. 3. ౩౧౯.

౪. తగ్గు, క్షీణించు.

గీ. అలుక బొంది క్రూరత నుచితాపగమము, గురువిరోధ మాయువుఁ గడుఁ గుందఁజేయు. భార. అను. ౫. ౧౩౦.

సీ. పెనుమంచు మీఁదఁ బర్విన వికాసము దప్పి చెలువు గుందినసరోజినివిధమున. భార. విరా ౧. ౨౯౪.

౫. క్రుంగు.

చ. సురవిశిఖప్రయోగములు సూపఁ దొడంగిన నేల దద్దరం, దిరిగెఁ బయోనిధుల్ గలఁగె దిగ్గజముల్ మద మేది గుందె ... భార. అర. ౪. ౯౪.

౬. కాంతిహీన మగు.

సీ. కైరవకాననోత్కరములు కడుఁ గుందఁ గంజపుంజంబులు కణఁక నొంద. విక్ర. ౨. ౧౦౭.

గీ. రసికశేఖరుఁ డారాజు రాజవదన, కుందిపుం

దినసెమ్మోముకళలెతింగి, కదుఁ బ్రియ మె
లర్పఁ గౌఁగిట నిముడుకొని సుఖానుభవ
లీలఁ బవలించె నంబుజాక్షి. శుక. ౧. ౨౧౬.

౩. కాలు చక్కఁగా నేల నానించక నడచు.
(శ. ర, వా.)

వి. ౧. దుఃఖము.

గీ. ఉదయగిరిదుర్గమునఁ దమోభ్యుదయబలము,
గూల్పఁగా నొడ్డినపిరంగిగుం డనంగ, గుం
డుఁబుల్గులమదికుందు చెందుమందు, తోఁచె
నెత్తమ్మివిరివిందు తూర్పునందు. రా. వి. 3.
౨౯.

గీ. కలువలకు విందు తామరగములకుందు,దీధితు
లసీమ రోహిణీదేవిప్రేమ, లోకహితకారి
యాచక్రవాకవైరి. చిత్రభా. ర. ౧౧౩.
(కుందు:-దుఃఖకారి అని భావము.)

౨. న్యూనత, తక్కువ; క్షీణత.

ఉ. వెచ్చము పెట్టు మన్నఁ బదివేలకు నుద్దరు
వోల్ల రర్థముల్, దెచ్చిన శేషునాదలలదివ్య
మణుల్ వలె నన్న విల్వలన్, హెచ్చును
గుందు నాడుకొన కిత్తురు లాభము కోర క
న్నఁగా, నెచ్చటఁ గోటికిం బడగ యెత్తని
వైశ్యులు గల్గ రప్పురిన్. పి. శకుం. ౧. ౩౭.

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మ
నంగ రాదు రా,లచ్చికినై పెనంగిన బలంబు
లు రెండును గెల్వ నేర్చునే, హెచ్చగుఁ
గుం దగుం...భార. విరా. ర. ౨3ర. (కుం
దు:-అపజయము అని భావము.)

క. కావున వారలనటనా,ప్రావీణ్యము హెచ్చుఁ
గుందుఁ బ్రకటించుటకై, దేవరఁ దోడ్కొ
ని రమ్మని,దేవేంద్రుఁడు పనిచె...విక్ర. ౨.
౩౭.

ఉ. కందును గుందు లేనిశశికాంతి వహించిన
నెమ్మొగంబులోఁ, జెందొవ రేకులం జులుక
చేయుజటావళితో...భోజరా. ౧.౧౨౫.

విణ. ౧. న్యూనము.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గు కుందు,కొ
దవ లోచ్చు కొదుక యనఁ బొదలు న్యూన,
ము...ఆం. భా. 3. ౨౪.

౨. పొట్టి.

గీ. పొఱటిపీఁపు నీఁచవోయిన చేతులుఁ,గుదియఁ
బడ్డ మెడయుఁ గుందుకాళ్లు, గుజ్జుపాదవు
నైనకోమలి నొక్కతె, గంధపాత్రహస్తఁ
గాంచె నెదుర. పద్మ. ౯. ౨౯౨.

జ: కుందించు, కుందిక, కుందికట్టు, కుందికాళ్లు,
కుందిల్లు, కుందుకొను, కుందువడు, కుందెనగి
త్తి, కుందెనగుడి.

**కుందుఁడు.** సం. వి. అ. పుం. వెన్నుఁడు, విష్ణువు.
(కల్ప.)

**కుందు(ది)కొను.** అ. క్రి=కుందు. (కుందు+కొ
ను-స్వార్థమున.)

(చింతిల్లు)

సీ. ఇంక నాల్గావంబు లిడనైతిఁగా యంచుఁ గు
మ్మరి నెమ్మదిఁ గుందికొనఁగఁ, గుడుము గూ
కల కెల్లఁ గానవైతిఁగా యంచు బేరి తీఱని
యూరిదేరి మంద. శుక. ౨. ౫౬3.

**కుందురము.** సం. వి. అ. పుం. ఒకానొకగంధద్ర
వ్యము౯.

**కుందురు.** వి. తృణవిశేషము.

గీ. కనుము కుందురు గరిమిడి గతిక ... మొదలు
గాఁ బూరి రవళింపఁ బొదలు వెదలు. ప్ర
బంధ. ౨౧౧. హంస. ౫. ౮౫.

**కుందురుకము.** సం=కుందురువు.

**కుందురుకి.** సం. వి. ఈ. స్త్రీ. అందుగు, సల్లకి౯.

**కుందురువు.** సం. వి. ఉ. పుం. స్త్రీ. ఒకానొకగం
ధద్రవ్యము, కుందురము౯.

**కుందుతెల్లు.** వి. (√కుందు) కాళము౯. (గ్రా)

**కుందువడు.** అ. క్రి. (కుందు + పడు) కుందునొందు.
(డిల్లపడు)
వ... కొండఱు దుష్టమతులు లేమిఁ గుందువడిన భర్త నధికకార్పణ్యంబు పచరించి సర్పిర్లవణతైలతండులాదులకై సిబ్బితివఱుతురు... కాశీ. ౨. ౭౯.
(బాధపడు, పీడ నొందు.)
సీ. కలికిగుబ్బలపెంపుఁ గనఁ జాలఁ దమి గాంచి కోకముల్ రాజుచేఁ గుందువడియె. చంద్రి. ౩. ౧౫.

**కుందువు.** సం. వి. ఉ. పుం. మూషికము. స్త్రీ. ఒకానొకగంధద్రవ్యము, కుందురువు. (కల్ప)

**కుందె(దియ)న.** వి. ౧. ఉలూఖలభేదము, ధాన్యము దంపెడుఱోలు, కుంది.
ఉ. భాసురరక్తిమైఁ గలమపాళికఁ గుందెన నించి కంకణౌఘాసమనిస్వనాళి వెలయంగ నయోగ్రము లూని సువ్వి సు,వ్వీ సువి సువ్వి లాలి యని వింతగఁ బాడుచు దంచి పుణ్యగో,త్రాసురకామినుల్ సలిలరంబున సుంకులు చల్లిరత్తఱిన్. చంద్రి. ౬. ౧౬.
ఉ. విప్పగుతమ్మికుందెనల వేడుక నర్కకరప్రభాంగనల్, పుష్పొడిరాజనాలు వలపుల్ వెదచల్లఁగ నించి సారెఁ జాల్, దప్పక దంపనెత్తుముసలచ్ఛటలో యనఁ జూడ వింతయై, యొప్పెఁ దదంతరాళపతదుత్పతదుద్ధతషట్పదావళుల్. ల. వి. ౪. ౧౨౭.
గీ. కుంది కుందెన యనఁగను ఱోలు ప్రీహ్యు,లూఖలము... ఆం. భా. ౨. ౨౩౯.
౨. కూర్చుండ లేనిపసిబిడ్డలు కూర్చుండుటకై యేర్పఱచు నొకవిధ మగుతొట్టె.
సీ. పసిఁడికుందియనఁబోవలఁ బట్టుపొత్తులయొత్తు వనొఱగి కూర్చుండ నేర్చె. వి పు. ౭. ౧౨౫.
౩. ఒకానొకచెట్టు. (శ. ర.)

**కుందెనగిఱి.** వి. (√ కుందు) కుందెనగుడి; బాలక్రీడావిశేషము.
సీ. ... గుడుగుడుగుంచాలు కుందెనగిఱి. హంస. ౩. ౧౮౬.

**కుందెనగుడి.** వి. (√ కుందు.) కుందెనగిఱి, బాలక్రీడావిశేషము.
సీ. చిట్లపొట్లాకాయ సిరిసింగణావత్తి గుడుగుడుగుంచాలు కుందెనగుడి. కాశీ. ౩. ౩౩.

**కుందెలు = కుందేలు.** వి. జా. (చూ. కుందేటికొమ్ము) శశము, చెవులపిల్లి.
ఉ... వంటయిల్, కుందెలు సొచ్చె... భార. ఆది. ౬. ౧౭౬.
ఆ. వేఁటకానియిల్లు వెఱపక కుందెలు, సొచ్చినట్టు లెదిరి వచ్చి తీవు. కు. సం. ౧౨. ౭౬౭.
జ: కుందెవల.

**కుందెవల = కుందేటివల.** వి. (కుందెలు + వల)
క. మెడవల సన్నపువల త్రో,పుడువల డొంకవల మింటముక్కిడివల దాఁ,టుడువల సింగితమనుకువ, లెడవల కుందెవల లాదు లెసఁగెడివలలున్. హంస. ౪. ౧౭౫.

**కుందే(దె)టికొమ్ము.** వి. (కుందేలు + కొమ్ము.) ౧. శశశృంగము.
గీ... కుందేటికొమ్మనంగఁ, బరఁగు శశశృంగనామంబు గరళకంఠ. ఆం. భా. ౨. ౬౬.
౨. శశవిషాణము, చెవులపిల్లికొమ్ము; చెవులపిల్లికొమ్మువంటిది. (అసంభవమును దెలుపును.)
గీ. తిరిగి కుందేటికొమ్ము సాధింప వచ్చుఁ, జేరి మూర్ఖులమనసు రంజింప రాదు. భర్తృ. నీతి. ౫.
మ. వసుధన్ గుందెటికొమ్ము తెచ్చుకొనఁగా వచ్చుం బ్రయత్నంబునన్. మల్లభూ. నీతి. ౫.
గీ. అచకోరాక్షి నిలు వెల్ల సాఖిలాషఁ, దివిరి

వీక్షింపఁ గలిమి కుందేటికొమ్ము. తపతీ. ౨. ౬౦.

**కుందేటితాల్పు.** వి. (√ కుందేలు) శశధరుఁడు, చంద్రుఁడు.

గీ. వచ్చి యవ్వేఁడివేలుపువంగడంపు, నేల మొలత్రాటినిండుఁగుందేటితాల్పు, మ్రోల నిల్చి కరంబు ప్రేముడి దలిర్ప, వెరవులోఁ బలెక్కఁ గేలుఁదామరలు మొగిచి. అచ్చ. రా. యు. ౧౫౫, ౫౧౦.

**కుందేటివల.** వి. (కుందేలు + వల). కుందేళ్లను పట్టుకొనుట కుపయోగించువల.

వ... దొడ్డివల లేటివల కుందేటివల పందివల... మొదలుగా వలయూవలలును... కాశీ. 3. ౮౬.

**కుందేలు.** వి.=కుందెలు.

గీ. జనకుఁ డగుదుగ్ధవార్ధి కుచ్చైశ్శ్రవంబు, గలిగె నైరావణంబును గలిగె నట్టి, తనకు గారాబుఁ బట్టికి వనజవైరి, కొక్కకుందేలు గలుగుట యువిద యరుదె. నైష. ౭. ౧౭౨.

గీ. ... చెవుల, పోతు కుందే లనంగను ఖ్యాతి గాంచు, శశసమాఖ్యలు... ఆం. భా. ౨. ౭౫.

గీ... కుందేళ్ల నందువుల... మనుచ. ౮. ౫౧.

జ: కుందేటికొమ్ము, కుందేటితాల్పు, కుందేటివల.

**కుంపటి.** వి. (క. కుంపటి. త. కుంపెడుసట్టి) అంగారధాని, నిప్పు లుంచెడుపాత్రము.

క. నీమగని తేజమున నుద్దామశమ సముగ్రుఁ డనఁగఁ దగి కుంపటిలోఁ, దామర మొలచిన క్రియఁ దన్నీ మునినిభుఁ డైనసుతుఁడు నీ కుదయించున్. నృసిం. 3. ౧౨౭.

క. ... కుంపటిలోఁ, దామరలుం బోలె నట్టికతి నొప్పారెన్. ఆము. ౨. ౬౯. ఆం. భా. ౨. ౨౮౧.

**కుంపె=కంపె.** వి. తాంబూలపాత్రము.

సీ. తాంబూలపాత్రంబు తబుకు కంచనంగను గంపె యంచనఁగను గుంపె యనఁగ. ఆం. భా. ౨. ౧౬౬.

**కుంపెన.** వి. కర్ణభూషావిశేషము.

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రారేక కుంపెన రావిరేక మ ర్వనఁగఁ గర్ణభూషావిశేషము ల్పొల్చు... ఆం. భా. ౨. ౧౮౭.

**కుంపెరుఁగు.** వి. (కుండ + పెరుఁగు - శ. ర.) ద్రప్సము, దధిభేదము.

గీ. కుంపెరుఁగు నాఁగ ద్రప్స మగును... ఆం. భా. ౨. ౨౫౯.

**కుంబ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. యజ్ఞభూమికి చుట్టునిడిన కంచె. ౨. ముదు గయినశాటిక.

**కుంభ.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య.

**కుంభకము.** సం. వి. అ. పుం. ౧. ఊపిరి బిగఁబట్టుట. (ప్రాణాయామమున కిది యొకయంగము.) ౨. స్థాలి, కుండ.

**కుంభకర్ణుఁడు.** సం. వి. అ. పుం-కుండలవంటి చెవులు కలవాఁడు-ఒకానొక రాక్షసుఁడు, రావణునితమ్ముఁడు.

**కుంభకామల.** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతికామాల రోగము.

**కుంభకారము.** సం. వి. అ. పుం. కుక్కుభము, గంపపులుఁగు, అడవికోడి.

**కుంభకారి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కుమ్మరి పెండ్లాము; కుమ్మరది. ౨. కుళత్థిక, అడవిఉలవ. 3. కుళత్థాంజనము. ౪. మణిసిల.

**కుంభకారిక.** సం. వి. ఆ. స్త్రీ=కుంభకారి.

**కుంభకారుఁడు.** సం. వి. అ. పుం-కుండలు చేయువాఁడు-కులాలుఁడు, కుమ్మరి.

**కుంభఘోణము.** సం. వి. అ. పుం. తంజాపురమండలమందలి యొక ప్రసిద్ధపట్టనము. (ఆ. ని.)

**కుంభచక్రము.** సం. వి. అ. న. (జ్యోతి) చక్రభేదము, కుంభాకారచక్రము. (ఇది ప్రయాణమందలి శుభాశుభములను దెలుపును.)

**కుంభతుంబి.** సం. వి. ఈ. స్త్రీ. అలాబూభేదము, ఒకజాతిసొఱకాయ.

**కుంభదాసి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కుంభిక, తీఁగపాఁచి, నాఁచు. ౨. కుట్టని, కుంటెనకత్తె.

**కుంభపాదుఁడు.** సం. విణ. (అ. పదీ. అ.) శ్లీపదరోగి, ఏనుఁగుకాలివాఁడు.

**కుంభము.** సం. వి. అ. పుం. ౧. ఘటము, కుండ. ౨. ఏనుఁగుకుంభస్థలము. ౩. (జ్యోతి) ఒకానొకరాశి. ౪. ఇరువదిద్రోణములకొలత. ౫. (యోగ) ప్రాణాయామముయొక్క అంగవిశేషము, కుంభకము. (దీనియందుశ్వాసము నిరోధింపఁబడును.) ౬. హృదయరోగవిశేషము. ౭. ౧. గుగ్గిలపుచెట్టు. ౨. త్రివృత్తు, తెల్లతెగడ. (కల్ప.)

**కుంభముద్ర.** సం. వి. ఆ. స్త్రీ. (యోగ) ఒకానొకముద్ర.

శ్లో. దక్షాఙ్గుష్ఠం పరాఙ్గుష్ఠే క్షిప్త్వా హస్తద్వయేన తు, సావకాశా మేకముష్టిం కుర్యాత్సా కుంభముద్రికా. (వాచ)

**కుంభయోని.** సం. వి. ఇ. పుం-కుండయందు పుట్టినవాఁడు-౧. అగస్త్యుఁడు. ౨. ద్రోణుఁడు. ౩. వశిష్ఠుఁడు. (కల్ప)

**కుంభల.** సం. వి. ఆ. స్త్రీ. బోడతరము.

**కుంభసంధి.** సం. వి. ఇ. పుం. ఏనుఁగుకుంభస్థలముల నడిమిసందు, విదువు. (త్రి. ని.)

**కుంభాండము.** సం. వి. అ. న. గుమ్మడి.

**కుంభాండి.** సం. వి. ఈ. స్త్రీ. బూడిదగుమ్మడి, తెల్లగుమ్మడి.

**కుంభాధిపుఁడు.** సం. వి. అ. పుం. శనిగ్రహము.

**కుంభాభిషేకము.** సం. వి. అ. పుం. క్రొత్తగా గుడికట్టించి యందు ప్రతిష్ఠచేసినవిగ్రహమునకు కుంభమునం దుదకము నిండుగఁ బోసి మంత్రపూత మయినయాయుదకముచేత చేయించెడు స్నానము.

**కుంభి.** సం. విణ. (న్. నీ. న్.) కుంభము కలది. వి. న్. పుం. ౧. ఏనుఁగు. ౨. కుంభీరము, మొసలి. ౩. కులాలుఁడు, కుమ్మరవాఁడు. ౪. గుగ్గిలము. ౫. విషకృమిభేదము. ఈ. స్త్రీ. ౧. ఉఖ, వంటకుండ. ౨. భూపాటలి, నేలకలిగొట్టు; కలిగొట్టు. ౩. కుంభిక, తీఁగపాఁచి, నాఁచు. ౪. కట్ఫలము, పినగుమ్ముడు. ౫. పర్పటము, పాపట. ౬. పరివ్యాధము, నీటిప్రబ్బ.

**కుంభించు.** సం. స. క్రి. (ఊపిరి) బిగఁబట్టు, ఆఁపు.

వ... మఱియు నిడయందుఁ బూరించి కుంభించి పింగళనాడిని విడిచి మరలఁ బింగళనాడిని బూరించి కుంభించి యిడయందు విడువ వలయును... వేం. మా. ౩. ౯౪.

**కుంభిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. తీఁగపాఁచి, నాఁచు. ౨. పాటల, కలిగొట్టు. ౩. ద్రోణపుష్పి, తుమ్మి. ౪. ఒకానొకనేత్రరోగము. ౫. వేశ్య. ౬. కట్ఫలము, పినగుమ్ముడు.

**కుంభిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. భూమి, నేల. ౨. కరిణి, ఆఁడేనుఁగు. ౩. జయపాలవృక్షము, భద్రదంతి.

**కుంభిపాకి.** సం. వి. ఈ. స్త్రీ. కట్ఫలము, పినగుమ్ముడు. (కల్ప)

**కుంభిలుఁడు.** సం. వి. అ. పుం. ౧. దొంగ. ౨. శ్లోకార్థమును దొంగిలించువాఁడు. ౩. శాలమత్స్యము, వేగముగా పోవునొకజాతిచేఁప. ౪. శ్యాలుఁడు, పెండ్లాముతోఁడఁబుట్టినవాఁడు.

**కుంభీకము.** సం. వి. అ. పుం. ౧. పున్నాగము. ౨. కుంభిక, తీఁగపాఁచి, నాఁచు.

**కుంభీకుఁడు.** సం. వి. అ. పుం. నపుంసక భేదము.

**కుంభీధాన్యకుఁడు.** సం. వి. అ. పుం=కుంభీధాన్యుఁడు.

**కుంభీధాన్యము.** సం. వి. అ. న. సంవత్సరమునకు చాలునంత కుండలలో నిలువచేసుకొన్న ధాన్యము.

**కుంభీధాన్యుఁడు.** సం. వి. అ. పుం. సంవత్సరమునకు కావలయునంత ధాన్యము కుండలలో నిలువ చేసికొను గృహస్థుఁడు.

**కుంభీనసము.** సం. వి. అ. పుం. పాము.

**కుంభీనసి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. రావణునిపినతల్లి కూఁతురు. (లవణాసురునితల్లి.) ౨. ఆఁడుపాము.

**కుంభీపాకము.** సం. వి. అ. పుం. నరకవిశేషము. (ఇందు ఆవమండలికుండలవలె పాపులు కాల్పఁబడుదురు.)

**కుంభీరకుఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**కుంభీరమక్షిక.** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతి ఈఁగ.

**కుంభీరము.** సం. వి. అ. పుం. నక్రము, మొసలి.

**కుంభీరాసనము.** సం. వి. అ. న. (యోగ) ఆసనభేదము.

శ్లో. పాదోపరి పదం దత్త్వా శిరోపరి కరద్వయమ్,
తిష్ఠేద్దణ్డాకృతిర్యా భూః కుమ్భీరాసనముచ్యతే. (వాచ.)

**కుంభీరుఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**కుంభీలకుఁడు.** సం=కుంభీరకుఁడు.

**కుంభీలము.** సం=కుంభీరము.

**కుంభీలుఁడు.** సం. వి. అ. పుం. ౧. కుంభిలుఁడు, దొంగ. ౨. శ్లోకార్థమును దొంగిలించువాఁడు. (వై. ని.)

**కుంభుఁడు.** సం. వి. అ. పుం. ౧. వేశ్యాపతి, విటుఁడు. (వై. ని) ౨. కుంభకర్ణునికొడుకు.

**కుకభము.** సం. వి. అ. న. మద్యము. (కల్ప)

**కుకరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కుణి, ఈచవోయినచేతులు కలవాఁడు.

**కుకీలము.** సం. వి. అ. పుం - భూమికి మేకువంటిది - పర్వతము, కొండ. (త్రి. ని.)

**కుకుందరము.** సం. వి. అ. న. స్త్రీలపిఱ్ఱదిమీఁది గుంట. పుం. కుక్కపొగాకు.

**కుకుటము.** సం. వి. అ. పుం. బూరుగు, కాల్మలి.

**కుకురము.** సం. వి. అ. పుం. ౧. కుక్కురము, కుక్క. ౨. గ్రంథిపర్ణము, గండిపనము. ౩. దశార్హదేశము.

**కుకూటి.** సం. వి. ఈ. స్త్రీ, న్. పుం. కాల్మలి, బూరుగు.

**కుకూలము.** సం. వి. అ. పుం. తుషానలము, కుస్మ, ఊకనిప్పు. వ. ౧. గసిక నాటినగుంట. ౨. కవచము.

**కుకోలము.** సం. వి. అ. పుం. కోలి, రేఁగు.

**కుక్క** వి. (సం. కుక్కురః. ప్రా. కుక్కుర. త. కుక్కన్, కుక్కల్.) వేఁపి, శునకము.

క. వెడగోఁతల నెత్తు రొలుకఁ, బడఁద్రోచిన వచ్చి కుక్కపదుపు వెనుకకుఁ, జడిసెఁ గబళింప నొల్లక ... భార. శాం. ౩. ౧౦౭.

గీ. ...కంకటి మైలచీరఁ, బఱచి విడెమొల్లరే యంచుఁ బలుకరింపఁ, గుక్కకూఁతుర వలదంచు వెక్కిరించు. శుక. ౨. ౪౧౭. (ఇట నిందావాచకము.) ఆం. భా. ౨. ౨౯౦.

ఇట్లే: - కుక్కలకొడుకు.

సా: కుక్కతోఁక పట్టుకొని గోదావరి యీఁదినట్లు.

విశే. అల్పము, నీచము. (ఇది 'కాకి' వంటిది)

ఉదా: కుక్కపొగాకు.

జః కుక్కగొడుగు, కుక్కగొట్టె, కుక్కచ్చు, కుక్కతొలసి, కుక్కపాల, కుక్కబూరుగు, కుక్కమూతిపిందె, కుక్కమేడి, కుక్కలకట్టు, కుక్కల్లి, కుక్కవాయింట.

**కుక్కగొడుగు.** వి. (√కుక్క) ఛత్త్రాకము, పుట్టగొడుగు†. (శర, వా.)

**కుక్కగొట్టె.** వి. (√కుక్క) అడవిగొట్టె. (బ్రౌ)

**కుక్కచ్చు, కుక్కయచ్చు.** వి. (కుక్క + అచ్చు) కుక్కయాకృతి గలవాఁత, కుక్కముద్ర.

క. చంపినవానిని సరిగాఁ, జంపుట తగు విప్రుఁడైనఁ జంపక పతితు, స్సంపదఁ గొని తలగొఱిగి వ, డంపడి కుక్కచ్చు వేసి దండింపఁ దగున్. విజ్ఞా. ప్రా. ౬౪.

గీ. కల్లుజాదరి మెడఁ బానికలు దగిల్చి, కుక్కయచ్చిడి దండుగఁ గొనుట నీతి. విజ్ఞా. ప్రా. ౪౧.

**కుక్కతొలసి.** వి. (√ కుక్క) ఫణిర్జకము, మరువము†.

ఆ. తొలసి కుక్కతొలసి తోరపువాఁడును, గలగరయును గుంటగలగరయును. చికి. ౨.(చి. ని-కుక్కతొళసి. శ.ర.)

**కుక్కపాల.** వి. (√ కుక్క) వటపత్త్రి†. (వన్యలతావిశేషము. ఇది పాలతీఁగను బోలి యుండును ఆకులు మాత్రము సోగవట్రువలై యుండును. చి. ని.)

సీ ...కుక్కపాలన వటపత్త్రి పరఁగుచుండు. ఆం. భా. ౨. ౬౬.

**కుక్కబూరుగు.** వి. (√కుక్క) ఒకజాతిబూరుగు†. హంస. ౪. ౧౧.

**కుక్కముల్లు.** వి. దద్రురోగవిశేషము. (బ్రౌ)

**కుక్కమూతిపిందె.** వి. (√ కుక్క) కాపుడిగినపుడు కలిగెడు కుక్కమూతివంటిమూతి గలపిందె. (శ. ర.)

ఉదా: చెట్టు చెడుకాలమునను కుక్కమూతిపిందెలు పుట్టును.

**కుక్కమేడి.** వి. (√కుక్క) కాకోదుంబరిక, కాకిమేడి†. (శ. ర.)

**కుక్కలకట్టు.** వి. (√ కుక్క) చోరసాధనవిశేషము, కుక్కలు మొఱుఁగకుండఁ జేయువస్తువిశేషము. చెన్న. ౩. ౨౯౪.

**కుక్కల్లి.** వి. (కుక్క + అల్లి) వన్యవృక్షవిశేషము. (చి. ని.)

**కుక్కవాయింట.** వి. (√ కుక్క) శ్వానబర్బరము†.

గీ. కుక్కవాయింట నాఁగఁ బెంపెసక్క శ్వాన, బర్బరాభిధ... ఆం. భా. ౨. ౨౬౭. (బ్రౌ. పా.)

**కుక్కి.** వి. త్రాళ్లు వదులై పల్లముపడినమంచము; అల్పఖట్వ.

ఉ. ...నీవు ని, స్తేజము నొంది యల్పునిగతిం గొఅమాలినకుక్కిమీఁద నీ, మోజ ననాథుపాటువడ నోగిత మైతె మదీయవల్లభా. భోజరా. ౫. ౨౦౫.

క. కుక్కలలో శబరులలోఁ, గక్కురచిమ్మటులలోనఁ గాకోలములలోఁ, బక్కణములగుడిసెనడుమను, గుక్కిపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్. శివరా. ౪. ౪౬. ఉ. హరిశ్చ. ౪. ౧౩.

సీ. ...రాజిలు నల్పఖట్వ కుక్కియనంగ... ఆం. భా. ౨. ౧౬౪.

విణ. నిమ్నము, లోఁతైనది.

ద్వి. ఆకుక్కినూతిలో నాకీతి నున్న, యాకవినుతఁ గాంచి యన్నుతం బంది. ద్వి. భాగ. ౯స్కం. (శ.ర.)

జ: కుక్కివడు.

**కుక్కిదము.** విశ. (క్రుక్కు?) క్రిక్కిఱిసినది; దట్టము, సాంద్రము.

ఆ. ఉవిదమానసమున నుప్పొంగి వలరసం, బొక్కపెట్టతఱిమి కుక్కిదంబు, గాఁగ నిండి తాల్మిక ట్టవిసెనో యన, వెడలెనశ్రువారి వెల్లిగొనుచు. కు. సం. ౫. ౬౦౬.

ఉ. తారకుఁడుౘ భుజాబలమదంబున షణ్ముఖుమీఁద నేసె నా, నారుచిరాస్త్రసంహతి రణంబునఁ గ్రిక్కిని కుక్కిదంబు గాౘ. కు. సం. ౧౨. ౯౧౫.

**కుక్కివడు.** అ. క్రి. (కుక్కి+వడు) కుక్కియగు, నేఁతసడలి పల్లమగు, దిగఁబడు.

ఆ. కుక్కివడిన మిగులఁ గొంగోడువోయినఁ, గుఱుచయైన విఱిగి కొంచె మైన, మలిన మైన నేఁత పలుచ నైనను నల్లు,లున్న నుల్కమంచ మొప్ప దండ్రు. వి. పు. ౪. ౨౧౫.

**కుక్కుటకము.** సం=కుక్కుటము.

**కుక్కుటకుఁడు.** సం. వి. అ. పుం. ఒకసంకీర్ణజాతివాఁడు, నిషాదస్త్రీయందు శూద్రునకుఁ బుట్టినవాఁడు.

**కుక్కుటధ్వజుఁడు.** సం. వి. అ. పుం-కోడిపడగవాఁడు-కుమారస్వామి.

**కుక్కుటమండపము.** సం. వి. అ. పుం. (కాశియందున్న) ముక్తిమండపము.

**కుక్కుటమస్తకము.** సం. వి. అ. పుం. చవ్యము.

**కుక్కుటము.** సం. వి. అ. పుం. ౧. కోడి. ౨. కుక్కుభము, అడవికోడి. (వాచ)

**కుక్కుటవ్రతము.** సం. వి. అ. న. భాద్రపదశుక్లసప్తమియందు చేయువ్రతవిశేషము. (ఇది సంతానార్థము స్త్రీలు చేయుదురు. దీనినే లలితాసప్తమీవ్రతము అనియు అందురు.)

**కుక్కుటశిఖము.** సం. వి. అ. పుం. కుసుంభవృక్షము, కుసుమచెట్టు.

**కుక్కుటాండము.** సం. వి. అ. న. కోడిగ్రుడ్డు.

**కుక్కుటాసనము.** సం. వి. అ. న. (యోగ) ఆసనభేదము.

శ్లో. నిజహస్తద్వయం భూమౌ పాతయిత్వా జితేన్ద్రియః, పద్మాఖ్యం బద్ధం యత్కార్తి కూర్పరద్వయమధ్యగం, సవ్యాపసవ్యయుగళం కుక్కుటాసనముచ్యతే. (రుద్రయామళము-వాచ.)

**కుక్కుటి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. దంభచర్య, కపటపునడవడి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుకోడి. ౨. శాల్మలి, బూరుగు.

**కుక్కుటీవ్రతము.** సం=కుక్కుటవ్రతము.

**కుక్కుభము.** సం. వి. అ. పుం. అలజము, గంపపులుఁగు, అడవికోడి.

**కుక్కురము.** సం. వి. అ. పుం. కుక్క. న. గ్రంథిపర్ణి, గండివనము.

**కుక్కురవాచ్యు.** సం. వి. చ్. పుం-కుక్కవలె ధ్వనిచేయునది-సారంగమృగము, ఒకజాతిలేడి.

**కుక్కురి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుకుక్క.

**కుక్షము.** సం వి. అ. పుం. ఉదరము, కడుపు. (కాముది.)

**కుక్షి.** సం. వి. ఇ. పుం. ౧. జఠరము, కడుపు. ౨. మధ్యభాగము. 3. కత్తియొఱ.

**కుక్షింభరి.** సం. విశ. (ఇ) ఆత్మంభరి, స్వోదరమాత్రపూరకుఁడు.

**కుక్షిరంధ్రము.** సం. వి. అ. పుం. నలము, కిక్కసపు.

**కుక్షిశూలము.** సం.వి.అ.పుం.న.కడుపులోఁ గలి గెడురోగవిశేషము. (వాచ)

**కుఖనకము.** సం.వి. అ.పుం-భూమిని త్రవ్వునది- ౧. ఎలుక. ౨. పంది.

**కుగ్రామము.** సం.వి. అ. పుం. పల్లెటూరు. (రాజు గాని ఆహితాగ్ని గాని వైద్యుఁడు గాని ధనికుఁడు గాని నది గాని లేనియూరు-విల్యమ్సు.)

**కుచండి.** సం.వి.ఈ.స్త్రీ. మూర్వాలత, చాఁగ.

**కుచందనము.** సం. వి. అ.న.౧-వాసన లేనిచందనము-ఎఱ్ఱగంధము,రక్తచందనము. ౨. కుంకుమపువ్వు. ౩. పత్త్రాంగము, రక్తచందనమువలె నుండు కాష్ఠవిశేషము.

**కుచఫలము.** సం.వి.అ.పుం. దానిమ్మ.

**కుచము.** సం.వి.అ.పుం. స్తనము, చన్ను.

**కుచరుఁడు.** సం.విణ.(అ.ఆ.అ.) పరులదోషములను చెప్పువాఁడు.

**కుచాంగేరి.** సం.వి.ఈ.స్త్రీ.చుక్కకూర.

**కుచాగ్రము.** సం. వి. అ. న. చూచుకము, చనుమొన.

**కుచితము.** సం.విణ.(అ.ఆ.అ) పరిమితము,కొలఁది పాటిది.

**కుచేల.** సం. వి. ఆ. స్త్రీ. విద్ధకర్ణి, చిఱుబొద్ది.

**కుచేలము.** సం. వి. అ. న. ౧-భూమికి వస్త్రమైనది-సముద్రము.

శ్లో. కాచాయ నీచం కమనీయవాచా, మోచాఫలస్వాదుముచా న యాచే, దయాకుచేలే ధనదత్కుచేలే,స్థితేఽకుచేలేశ్రితమాకుచేలే.

౨. కుత్సితచేలము.

**కుచేలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)మాసినట్టిగాని చినిఁగినట్టిగాని వస్త్రములు కట్టువాఁడు. వి. అ. పుం. ఒకానొకఋషి, శ్రీకృష్ణునిమిత్త్రుఁడు.

**కుచ్చెల=**కంచెల.

చ. కలువలు కొప్పున న్నగుమొగంబునఁ గస్తురిబొట్టు పట్టుకుచ్చలయును జంద్రకావిబురుసాపనివల్వయు మైరహింపఁగా. శుక. ౧. ౮౫.

**కుచ్చెలి=**కుచ్చెలి. వి. కోలి, రేఁగు.

సీ. కుచ్చలి యంచనఁ గుచ్చెలి యనఁగను గోళి యటన్నను గోలి యొప్పు. ఆం. భా. ౨.౭౮. హంస. ౪. ౧౩౨.

**కుచ్చెలిగంత.** వి. యోగులును యోగినులును ధరించెడుబొంత.

ఉ.... వెలివన్నెపట్టునూలుక్కుచ్చులు గల్గి యొప్పుతనకుచ్చలిగంతయుఁ గక్షపాలలో,నచ్చపురత్నపేటి నిడినట్టి మహాఘుటికాప్రకాండముల్. పరమ. ౧. ౧౮౧.

సీ...గుబ్బ,చనుదోయి వన్నెకుచ్చలిగంత డావలికరమునందు విభూతికక్షపాల. రాజ.చ.౨. ౯౪.

**కుచ్చెలిబొంత=**కుచ్చలిగంత.

సీ. నలు వగుకలువమొగ్గలు జడల్గా నాఁచు పాలు పైనకుచ్చలిబొంత గాఁగ. గీ. జోగురాలును బోలెను సొబగు మీఱు,కొలను గాంచిరి మదిలోనికోర్కు లలర. యయా. ౩. ౫౬. పరమ. ౧. ౧౮౫.

**కుచ్చితము.** విణ. (సం. కుత్సితః. ప్రా. కుచ్ఛితో. క.కుచ్చిత. త.కుచ్చితమ్.) నీచము, అల్పము, కుత్సితము.

ఆ. వలయుపదవియందు నిలిచి సారాజ్యమంతయును జక్కఁబెట్టి నయము విక్రమంబు నడపునంతమానిసి వై యుండి, కుచ్చితంపుబ్రదుకు కోరఁదగునె. భార. విరా. ౧.౨౮౨.

సీ. ... అధిప నీవలికినయట్ల కరముఁ, గుచ్చితంబైనట్టి కోమటికులమున జన్మింపు మీ వని శా

వ మిచ్చి. మార్క. ౭. ౨౩౮. ఉ. హరి. ౫. ౩౦౧.

౨. నీచత్వము, కుత్సితత్వము.

ఉ. కుచ్చిత మేమి గూడు సమకూడినరాజ్యము వీటఁబుచ్చఁగా,వచ్చిన లాభ మేమి... వేం. పంచ. ౩. ౧౩౭.

**కుచ్చితుఁడు.** వి౦. కుజనుఁడు, దుష్టుఁడు.

గీ. కఱటి యడిగొట్టు పలువ యేతరిగరాపు, చెనఁటి చెన్నఁటి కూళ కుచ్చితుఁడు మొండి, కట్టె నాఁగను గుజనాఖ్యగాఁ జెలంగు. ఆం. భా. ౩. ౭.

ఉ. అచ్చటఁ దొల్లి పార్వతి వయస్యలతో జలకేళిఁ దేలఁగాఁ, గుచ్చితులైన రక్కసులు కొందఱు కాములై జలంబులోఁ,జొచ్చిన నిందుఁ జొచ్చి పురుషుల్ నిజమిట్టులె యాదు రంచు లో,హెచ్చినకిన్క నట్లు శపియించి తిరోహిత యయ్యె నయ్యెడన్.ఉ.రా.౫. ౧౮౩.

**కుచ్చిళ్లు.** వి.బ. (కుచ్చెళ్లు. శ.ర - కుచ్చిలి. చి. ని.) బాలికాక్రీడావిశేషము. (ఇదియే గూఢమణి క్రీడ యందురు అని చి. ని.)

మ.దినముల్ కొన్ని చనంగ నంతఁ గడు నర్మిం బొమ్మపెండిండ్లు గు,జ్జెనగూళ్లచ్చనగండ్లు పింపిళులు కుచ్చిళ్ గీరనంగెంజ లో,మనగుంటల్ కనుమూసిగంత నలుగం బాలాట లోనైన ఖే,లనముల్ ... కళా. ౮.౨౦౨.

**కుచ్చె.** వి. (సం.గుచ్ఛః. ప్రా.కుచ్ఛ. క. త. మ. కుచ్చు.తు.కుచ్చి.)౧. పువ్వులు మొదలగువానిగుత్తి.

సీ. ...కుచ్చన గుత్తి యన గుచి యనఁగ గుచ్ఛాఖ్య దనరు. ఆం.భా. ౨.౯౦.

౨. పట్టు మున్నగువానికుచ్చు.

ఉదా: పాలకీకుచ్చు, కుచ్చుపాగా, మొ.

(బ) ౧.స్త్రీలు జడయందు చేర్చి అల్లుకొనెడి భూషణవిశేషము. (శ.ర.)

సీ. బటువుముత్యములపాపటబొట్టు రాకిడి జడబిళ్లలును గుచ్చు లడరి వెలుఁగ. వేం. మా.౧. ౧౩౦.

౨. కొనచెవి నుంచుకొనెడి భూషావిశేషము. (శ. ర.)

జ: కుచ్చుమీను, కుచ్చుల మెకము.

**కుచ్చెమీను.** వి. (√కుచ్చె) పెద్దతోఁక గలచేఁప. (చి. ని, శ. ర.)

**కుచ్చెలమెకము.** వి. (కుచ్చులు + మెకము) చమరీమృగము. (శ. ర.)

**కుచ్చె.** వి. ౧. కుచ్చెల, పింజె, మడత.

సీ...కచ్ఛభేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె,చుంగు రింగు నెతికచింగు నెతి యనంగ...ఆం. భా. ౨. ౧౫౩.

౨. కెంపువని.

సీ... కెంపువని కుచ్చె యనఁగ వెలయు. ఆం. భా. ౨. ౨౭౭.

**కుచ్చెతీయు.** స. క్రి. (రత్నములను) సానఁబట్టు. (శ. ర.)

**కుచ్చెల.** వి.(బ.కుచ్చెలలు,కుచ్చెళ్లు - సం.కచ్ఛః.)

౧. కుచ్చె, పింజె, మడత.

చ. ...సరిగంచుచల్వకు,చ్చెల లపరంజిమెట్టెయుల జీరఁగ నందెలు మ్రోయ సోయగం,బొలుకఁగ వచ్చె నత్తఱి రఘూత్తముచిత్తము తత్తఱింపఁగన్. ఉ. రా. ౮.౧౮౧.

మ.తళుకుంగుబ్బలఁ బైఁట వేయు మని కాంతల్ దూఱ హేలామదా,కులితస్వాంత యొకర్తు వేగ జెలుఁగుంగుచ్చెళ్లకొం గొత్తిగు,బ్బలపైఁ గప్పిన బైలువడ్డజఘనప్రాంతంబు వీక్షించి ... దశా. ౮. ౧౨౩. ఆం. భా. ౨. ౧౫౩.

౨. పావడ, గాగర.

సీ. మెఱుఁగుఁగుచ్చెలమీఁద జరతారుబుని మీఅుచెంగావిరంగారుచీరఁ గట్టి. హంస. ౧. ౧౨౦.

3. పిడుకలు చొప్ప మొదలగువానిప్రోఁగు, రాశి.

గీ. ... రుబ్బు, ఱోలు పిడుకలకుచ్చెల దాలిగుంత, దనర నిరతంబు వెలయు నాతనిగృహంబు. శుక. ౨. ౪౦౭. (పిడుకలకుచ్చెల=పిడుకలగూడు.)

సీ. ...కుచ్చెల యన రాశి కొలుచుండు. ఆం. భా. ౨. ౨౩౦.

౪. ఎనిమిదిగొట్టములకొలఁది, భూపరిమాణవిశేషము. (బ్రౌ.)

**కుచ్చెలి**=కుచ్చెలి. ఆం.భా.౨.౭౪.

**కుచ్ఛము.** సం. వి. అ. న. కుముదము, తెల్లగలువ. (వాచ.)

**కుజంభ(భి)లుఁడు.** సం.వి.అ.పుం. కన్నపుదొంగ, సంధిచోరుఁడు.

**కుజనుఁడు.** సం.వి.అ.పుం. కుత్సితపురుషుఁడు.

**కుజప్రియము.** సం. వి. అ. పుం-కుజగ్రహమునకిష్టమైనది-విద్రుమము, పగడము.

**కుజము.** సం.వి.అ.పుం-భూమినుండిపుట్టునది-చెట్టు.

**కుజలము.** సం.వి.అ.న. పులికడుగు.

**కుజవారము.** సం.వి.అ.పుం. మంగళవారము.

**కుజుఁడు.** సం.వి.అ.పుం-భూపుత్రుఁడు-౧. నరకాసురుఁడు. ౨. అంగారకుఁడు.

**కుజ్ఝటి.** సం.వి.ఇ,ఈ.స్త్రీ. పొగమంచు. (విల్యమ్సు)

**కుటంకము.** సం. వి. అ.పుం. ఇంటికప్పున కుపయోగించుగడ్డిలోనగునది.

**కుటంగకము.** సం. వి. అ. పుం. ౧. ఛది, పటలము, ఇంటికప్పు. ౨. ఆకులు లోనగువానిచే ఆచ్ఛాదితమైనగృహభేదము.

**కుటచము.** సం. వి. అ. పుం. కుటజము, కొండమల్లెI. (వాచ.)

**కుటజము.** సం. వి. అ. పుం. ౧. కొండమల్లె, కొడిసెచెట్టు. ౨. అగస్త్యవృక్షము, అవిసెI.

**కుటజుఁడు.** సం. వి. అ. పుం-కుండయందు పుట్టినవాఁడు-౧. అగస్త్యుఁడు. ౨. ద్రోణుఁడు. 3. వశిష్ఠుఁడు.

**కుటన్నటము.** సం. వి. అ.పుం. శ్యోనాకము, దుండిగముI. న. కైవర్తీముస్తకము, కైవడిముస్తెI.

**కుటపము.** సం. వి. అ. పుం. ౧. ఇంటితోఁట. ౨. ధాన్యమానవిశేషము, కుడవము. న. పద్మము.

**కుటపుఁడు.** సం. వి. అ. పుం. ముని.

**కుటము.** సం. వి. అ. పుం. న. కలశము, కుండ. పుం. ౧. దుర్గము, కోట. (కల్ప.) ౨. చెట్టు. 3. గృహము; క్షుద్రగృహము, గుడిసె. (శ.ని.) ౪. కొండ.

**కుటరము.** సం. వి. అ.పుం. తరిగంబము, చల్లకాడు.

**కుటరుణ.** సం. వి. ఆ. స్త్రీ. త్రివృత్తు, తెగడI.

**కుటరువు.** సం. వి. ఉ. పుం. ౧. పటగృహము, డేరా. ౨. ఒకజాతిసింహము. (వై. ని.)

**కుటలము.** సం. వి. అ. న. పటలము, ఇంటికప్పు.

**కుటహారిక.** సం. వి. ఆ. స్త్రీ. దాసి, పనికత్తె.

**కుటూక.** వి. పక్షివిశేషము.

సీ. కూఁకటికువ్వ కుటూక కర్కు-కరడు నల్లచ్చికాఁడును జల్లపిట్ట. గీ. యనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౭.

**కుటి.** సం. విశే. (ఇ) కౌటిల్యము కలవాఁడు. (వై. ని.) వి. ఇ. పుం. ౧. దేహము. ౨. చెట్టు. ఇ, ఈ. స్త్రీ. ౧. కౌటిల్యము, వంకర. ౨. గుడిసె. ఈ. స్త్రీ. ౧. కుంభదాసి, నీళ్లు మోయుపనికత్తె. ౨. మురయనుగంధద్రవ్యముI. 3. మద్యము. (హేమ. ని.) ౪. చిత్రగుచ్ఛము, పలురంగులు గల

పూలగుత్తి. ౫. ఇనుము. (వై. ని.)
కుటిచరము. సం. వి. అ. పుం-(జలములో) వంకర గా నడుచునది-జలసూకరము. (వాచ.)
కుటితము. సం. విణ. (అ. ఆ. అ.) కుటిలము, వంకరైనది.
కుటిరము. సం. వి. అ. న. కుటీరము, క్షుద్రగృహము. (కల్ప.)
కుటిల. సం. వి. ఆ. స్త్రీ. ౧. నది.(హేమ. ని.) ౨. స్పృక్కయనుగంధద్రవ్యము. (మే. ని.)
కుటిలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧.వంకరైనది; మెలికలు తిరిగినది. ౨. ఋజువు కానిది, కపటము కలది. (ఉదా: కుటిలహృదయుఁడు, మొ.) వి. అ. న. తగరపుష్పము, నందివర్ధనపుపూవు.
కుటీచకుఁడు. సం.వి. అ. పుం-గుడిసెలో నుండుటచేత నే తృప్తి నొందువాఁడు - సన్న్యాసిభేదము. (కుటీచకుఁడు బహూదకుఁడు హంసుఁడు పరమహంసుఁడు అని సన్న్యాసులు నలువురు.)
కుటీరము. సం. వి. అ. పుం. గుడిసె.
కుటుంగకము. సం=కుటంగకము.
కుటుంబము. సం. వి. అ. పుం. న. ౧. పోష్యవర్గము, పెండ్లాము బిడ్డలు లోనగువారు. ౨. బంధువు, చుట్టము. 3. జ్ఞాతి. ౪. సంతతి, సంతానము. ౫. నామము, పేరు. (వాచ.) ౬. వర్గము, సమూహము.
కుటుంబి. సం.విణ. (న్. నీ. న్)కర్షకుఁడు, దున్నుకొని బ్రదుకువాఁడు.(కల్ప.) వి. న్. పుం.గృహస్థుఁడు. (కల్ప.)
కుటుంబిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. మగఁడును బిడ్డలును గలస్త్రీ. ౨. కుటుంబములసమూహము.
కుటుఁడు. సం.వి.అ.పుం. శిలాకుట్టకుఁడు,ఱాలుమలుచువాఁడు. (శే.ని.)

కుట్టకము. సం.వి. అ. పుం. (గణిత) గుణకాంకవిశేషము.
కుట్టకుఁడు. సం.విణ. (అ.ట్టికా.అ.) ఛేదించువాఁడు.
కుట్టడము. వి. (√కుట్టు.) కుట్టుపని.
సీ. అవికకుట్టడపుఁదోరపునిగ్గుజంటీలు తనులతాద్యుతికిఁ గైదండ యొసఁగ. శుక. ౧. ౨౦౦. (శ.ర.పా.)
కుట్టన. సం.వి.ఆ. స్త్రీ=కుట్టనము.
కుట్టనము. సం.వి.అ.న.౧.ఛేదనము. (చెక్కుట,మలుచుట, మొ) ౨.కుత్సనము, నిందించుట. 3. ప్రతాపనము, కాఁచుట, నెచ్చచేయుట. ౪. గుణనము,గుణించుట.
కుట్టని. సం.వి.ఈ.స్త్రీ. ౧. కుట్టెని, కుంటెనకత్తె. ౨. ఛేదనసాధన మగుకత్తిపీట,మొ.
శ్లో. కుట్టనీ పేషణీ చుల్లీ ఉదకుంభీ చ మార్జనీ, పంచసూనా ఇతి ఖ్యాతాస్తాభి స్స్వర్గం న గచ్ఛతి.
కుట్టనీయము. సం=కుట్టయితవ్యము.
కుట్టమితము. సం. వి. అ. న. దంతక్షతనఖక్షతాదులచే కోపభావ మభినయించినను లోపల మిక్కిలి యానందము పొందునట్టిస్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము.
శ్లో. కేశస్తనాధరాదీనాం గ్రహే హర్షేపి సంభ్రమాత్,ప్రాహుః కుట్టమితం నామ శిరఃకరవిధూననమ్. సా. ద. 3. ౧౧౧.
కుట్టయత్. సం. శత్రు. ఛేదించుచున్న.
కుట్టయమానము. సం. విణ.(అ. ఆ. అ.) ఛేదించుచున్నది.
కుట్టయితృ. సం. విణ. (ఋ.త్రీ.ఋ)=కుట్టకుఁడు.
కుట్టయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁదగినది.

కుట్టహారిక. సం. వి. ఆ. స్త్రీ. దాసి, పనికత్తె.(హలా. ని.)

కుట్టాకము. సం. విణ. (అ. ఈ. అ.) ఛేదించునది.

కుట్టారము. సం. వి. అ. పుం. కొండ. వ. ౧. రతి. ౨. కంబళము.

కుట్టారుగ. వి.(కుఱు+అరుగ)క్షుద్రకోద్రవము?. (బ) ధాన్యవిశేషము.

మ. గురుగుం జెంచలిఁ దుమ్మిఁ జేదగిరిసాకుం దిం త్రిణీపల్లవో,త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారుగో,గిరముల్ మెక్కి...ఆము. ౪. ౧౩౪.

కుట్టావలు. వి. బ. (కుఱు + అవలు) సర్షపవిశేషము. (శ. ర.)

కుట్టితము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁబడినది.

కుట్టిని. సం=కుట్టని.

కుట్టిమము. సం. వి. అ. పుం. వ. ౧. శిలారత్నాది నిబద్ధభూమి, నెలకట్టు. ౨. కుటీరము, గుడిసె. పుం. దానిమ్మ?.(రా.ని.)

కుట్టీరము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదకము. వి. అ. పుం. కొండ.

కుట్టు. స. క్రి.(త.కుత్తు.)౧. (వస్త్రపర్ణాదులు)కుట్టు.

వ. ... మూరకొక్కండును జేనకొక్కండును గాఁ గుట్టినడొల్లుటుల్లారు లుల్లసిల్లఁ బల్లించి నపల్లంబులపై...ఆము. ౪. ౩౫.

సీ. నునుఁబోఁకపొత్తిఁ గుట్టినదొప్పగమిలోడ ... ఆము. ౧. ౭౬.

౨. (చీమ, తేలు, తుమ్మెద, మొ.) కుట్టు.

గీ. మధువుఁ గొన నుత్సహించినమనుజుఁ బట్టి, కుట్టి నిర్జించుమధుకరకులమునట్లు. భార.అర. ౧. ౨౫౧.

౩. గ్రుచ్చు.

వ. ...పిశితఖండంబు లొండొండ యుద్వృత్తుగా నాకుఁబొత్తరలం గట్టియు గుదులు గుట్టియు ...మనుచ. ౪. ౬౦.

౪. (చెవులు, మొ.) కుట్టు.

ఉదా: ఆపిల్లవానికి చెవులు కుట్టినారు.

౫. (అంకురము మున్నగువానిని) పొడుచు.

చ. గుమురులు గట్టి యారికలు గుట్టి ప్రవాళము వట్టి కింకతో,నమలకఁ గ్రుంగి... ఆమనిని శేయుఁబవల్ వడిఁ గూయుఁ గోవెలల్. కు. సం. ౪. ౪౬౩.

వి. ౧. సీవనము, కుట్టుట; కుట్టినదారము.

సీ. జంటనుత్తెపుఁగుట్టుజంటిపైకల నంటి బిగి గుబ్బచన్నులు పిక్కటిల్ల. ఉ.రా.౬.౧౩౧.

ఉ. గుత్తపుఁదాపితాఅవికకుట్టు పటుక్కన విచ్చె రంభకున్. కృ.శకుం. పీఠి. ౧.౨౦.

౨. (కడుపులో పుట్టెడు) నొప్పి,బాధ.

క. అడుకులు దిన్నట్లగునే,కడుపునఁ గుట్టెత్తినపుడు గడుఁ బలుచితినాఁ,డొడ లెఱుఁగక పాండుసుతుల, నుడిగి మదుఁగవలసె నిప్పు డొకసాత్యకిచేన్. భార. ద్రో. ౪. ౨౯.

క. తలనొప్పి కడుపుఁగుట్టుం,బలుగుఱుపుం గాళ్ల తీపు పాటించుచు...శుక. ౨. ౨౦౫.

౩. ప్రొయ్యిలో క్రిక్కిటిసియుండుబూడిద లోనగునది. (శ. ర.)

౪. కుట్టఁగా ఏర్పడి నరంధ్రము.

(వ్యవ) చెవికుట్లు మూసికొనిపోయినవి.

జ: కుట్టడము, కుట్టుకాఁడ,కుట్టుచేఁడు,కుట్టుడాకు, కుట్టుడు,కుట్టుతేలు,కుట్టుపోయు,కుట్టునూల.

కుట్టుకాఁడ. వి. (√కుట్టు) కుట్టుపోఁగు. (శ. ర.)

కుట్టుచేఁడు. వి. (√కుట్టు) కొరడా ?

చ: గురుసతిఁ గూడురట్టునకుఁ గొంకనిమోడు వియోగినీసము,త్కరములకీడు చూచుటకు దర్పకుఁకే పెడుకుట్టుచేఁడు తె,మ్మెరలకుఁ దోడు చిత్రగతి మిన్నులఁ బాఱెడుమాయ

లాఁడు పెన్నిరు లనుపోడు కాలుకొని యే ర్చువెలుంగులవీడు వీఁడువో. వరాహ. ౮. ౨౮.

**కుట్టుడాకు.** వి. (కుట్టుడు+ఆకు) కుట్టినవిస్తరాకు.

**కుట్టుడు.** వి. (√ కుట్టు) కుట్టుట. (శ.ర)

**కుట్టుతేలు.** వి. (కుట్టు + తేలు) ౧. క్షుద్రుఁడు. ౨. కంటకము, ముల్లు.

గీ. కుట్టుతేలనఁ గంటకక్షుద్రు లగుదు,రు... ఆం. భా. 3. ౮౬. (ప్రాఁతప్రతిపా.)

**కుట్టుపోఁగులు.** వి. బ. (√ కుట్టు) చెవులకు పెట్టుకొనుఉంగరమువంటి వట్టిపోఁగులు. (శ. ర.)

**కుట్టుపోయు.** స. క్రి. (కుట్టు + పోయు) కుట్టు. (శ. ర.)

**కుట్టుసురు.** వి. (కుఱు+ఉసురు) కొంచెము మిగిలియున్నప్రాణము. (శ. ర.)

**కుట్టూరుపు(ర్పు).** వి.(కుఱు+ఊరుపు) కొంచెము మిగిలియున్నయూర్పు, కొనయూపిరి.

**కుట్టె(ట్టియ).** వి. గుదస్థానము. (శ. ర.)

**కుట్మ(డ్మ)లము.** సం. విణ. (అ. ఆ. అ.) విరియనది,వికసించునది.వి. అ. పుం. ౧. మొగ్గ; అరవిరిమొగ్గ. ౨. మొగ్గవంటిబాణపుములికి. ౩.నరకవిశేషము. (ఇందలివారు యంత్రరజ్జువులచే పీడితు లగుదురు-వాచ)

**కుట్మ(డ్మ)లితము.** సం.విణ.(అ.ఆ.అ.)జాతకుట్మలము, మొగ్గలుకలది;సగమువిరిసినమొగ్గలుకలది. (వాచ)

**కుట్యమానము.** సం. విణ. (అ. ఆ. అ) ఛేదింపఁబడుచున్నది.

**కుట్యము.** సం=కుట్టయితవ్యము.

**కుట్ర.** విణ. అల్పము.

ఉ. ... పెడంప సోగ రైయె,వట్రిలుకన్నుదోయి నిడువాలుఁగుఱుల్ బటువుంబిఱుంద లేఁ,గుట్రనుచుంగవుణ్ గలుగుకోమలి యై యది ప్రేల నిల్చునణ్. విజ. వి. ౨. ౮౬.

౨. భయంకరము, ఘోరము.

శా. ఓసామీ యిటువంటికొండదరిలో నొంటిం బులుల్ సింగముల్, గాసిం బెట్టెడుకుట్రవట్టడవిలోఁ గల్జువ్విక్రీనీడ నే,యూసం గట్టి ౧ వేటగడ్డ నిలు ... కాళ. 3. ౬౫.

వి. మాయపన్నుగడ, ద్రోహబుద్ధితో చేసెడుపన్నిక. (బ్రౌ.)

ఉదా:- వారందఱును కలిసి వానిపై కుట్ర పన్నుచున్నారు.

**కుట్రపువాఁడు.** వి. కుట్టుపని చేయువాఁడు, సౌచికుఁడు. (శ.ర, బ్రౌ.)

**కుఠరము.** సం.వి.అ.పుం. ౧.కుటరము,కరిగంబము. ౨. తుంగముస్తె.

**కుఠాకువు.** సం.వి.ఉ.పుం.దార్వాఘాటము,వడ్రంగిపిట్ట.

**కుఠాటంక.** సం.వి.ఆ.స్త్రీ=కుఠాటంకము.

**కుఠాటంకము.** సం.వి.అ.పుం. కుఠారము,గొడ్డలి.

**కుఠారకము.** సం.వి. అ.పుం. చిన్నగొడ్డలి.

**కుఠారము.** సం.వి.అ.పుం. ౧.పరశువు, గండగొడ్డలి; గొడ్డలి. ౨. చెట్టు. (కల్ప)

**కుఠారి.** సం.వి.ఈ. స్త్రీ. గండగొడ్డలి. ౯.పుం-గండగొడ్డలి కలవాఁడు-పరశురాముఁడు.

**కుఠారువు.** సం.వి.ఉ.పుం. ౧.చెట్టు. ౨.కోఁతి. 3. శస్త్రకారుఁడు,కైదువులు చేయువాఁడు.(వాచ)

**కుఠి.** సం.వి.ఇ.పుం. ౧. చెట్టు. ౨. కొండ.

**కుఠికము.** సం.వి.అ.పుం.కుష్ఠము, చెంగల్వకోష్టు.

**కుఠేరకము.** సం.వి.అ.పుం.౧.నందివృక్షము.౨.శ్వేతతులసి. 3. పర్ణాసము, నల్లగగ్గెర.

**కుఠేరజము.** సం. వి.అ.పుం. శ్వేతతులసి.(కల్ప)

**కుఠేరము.** సం.వి.అ.పుం. ౧. అగ్ని. ౨.పర్ణాసము, నల్లగగ్గెరి. 3. శ్వేతతులసి.

**కుఠేరువు.** సం.వి. ఉ.పుం. చామరవాతము, వింజామర వీచుటవలన పుట్టుగాలి.

**కుడంగము.** సం.వి.అ.పుం.న.పొదరిల్లు.(వై.ని.)

**కుడతా.** హిం.వి.చొక్కా. (శ.ర.-కుడితిసి.వా.)

**కుడవము.** సం.వి.అ.పుం.ధాన్యమానవిశేషము,మానిక. (ఇది ప్రస్థములో నాల్గవవంతు-చూ. కుడపము.)

**కుడి.** వి. (√కుడుచు-క.తె.మ. కుడి.) ౧.కుడుపు, ఆహారపదార్థము. (చూ. కుడిముట్టు.)

క. కడుపున కందియునుండని, కుడి... నా.పంచ. ౪.౧౦౦.(శ.ర.పా-కుడుపుల.ముద్రి.)

౨. కుడిభాగము.

క. వేదండములొండమునరి, కోదండముఁ దివియు నెడమఁ గుడి నిబిడజ్యా,నాదము రోదసి నిండఁగ, భేదించుక్ గండశిలలఁ బృథుబాణములన్. మనుచ. ౪. ౯.

గీ. తొడరి బడిబడి నెడవింటఁ గుడియెడమల, నదరి వడి నేయుకతివేల్పుకొమరు ... నీలా. 3. ౧౫.

విణ. వామేతరము, దక్షిణము, వలపలది.

ఉదా:-కుడిచేయి, కుడికాలు, కుడివైపు, మొ.

సీ.తామరపగవాఁడు దయితుండుఁ గూడి నీకుడిచూపుఁ గుడిచూపుఁ బరిఢవింప. ఉ. హరి. ౧.౧౧౯. భీమ. ౬. ౬౭.

**కుడి.** సం.వి.ఇ.పుం. దేహము.

**కుడితి.** వి. బియ్యము లోనగువానికడుగునీరు.

సీ. తండులక్షాళనోదకము రాజిల్లును గుడితి యనంగను గడు గనంగ. ఆం. భా. ౨. ౨౫౦.

సీ. వలఁ బడ్డమీను కైవడి నిప్పు ద్రొక్కినకోఁతి భాతిని వెత్తిగొన్నకుక్క,పద్ధతిఁ గుడితిలోఁ బడినమూషికమట్లు శ్లేష్మంబులో నీఁగలీల... చంద్ర. వి. ౧. ౯౨.

ఉదా:-మినుపకుడితి, మొ.

**కుడినీరు.** వి. (కుడి+నీరు) త్రావఁ దగినజలము, పానీయము.

ద్వి. ఎడనీరు నెడనెడ నింపుసొంపైన, కుడినీరు వరుసఁ జేకొనుచు వర్ధింప. అ. మ. క. ౫. ౨౪౯ పా. ౫ పం. దశా. ౭. ౨౭౮.

చ.తనునుఁబసిండియోవరులు దంతపుఁజావడులర్చనాగృహం,బులు గుడినీరుమేడలును భోజనశాలలు...దాఁటి...వసు. ౪. ౭౨.

**కుడిపి.** విణ.(సం.కుహాపి)కుహాపి,అంగవికలుఁడు.

క. గ్రక్కున వెలువడి తనచేఁ, జిక్కులగుదివోలె నున్నసుచిరహారం, బక్కుడిపియుతవైచుచుఁ,దక్కక చేతం ద్రెఁ బ్రాలు తలపైఁ బోసెన్. భోజరా. ౫. ౩౪౧.

**కుడిపించు.** స. క్రి.=కుడుపు. (√కుడుచు)

(తినిపించు)

గీ. హరిణవత్సంబులకు మీరు కరుణతోడఁ,బాయసాన్నంబు గుడిపింప భక్తిఁ జూచి.హర. ౧. ౭.

**కుడిమివాఁడు.** వి. ౧. పాములవాఁడు. ౨. విషవైద్యుఁడు. (బ్రౌ.)

**కుడిముట్టు.** వి. (కుడి+ముట్టు) భోజనపాత్రము, కంచము.

క. తొడవులు చివికినయొమ్ములు, గుడిముట్టు కపాల మిల్లు గుడి ముడియెద్దెక్కుడు ... కు. సం.౭.౮౭.

**కుడియడుగుపరువడి.** వి. (√కుడి) పంద్రెండు పరువడులలో నొకటి. ('పదునాల్గునిసువులలో నొకటి' అని హంస.౧. ౨౦౬.)

వ...ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి...

మొదలుగాఁ గలపదిరెండుపరువడులును... ప్రబంధ. ౭౮.

**కుడియోరభృంగి.** మి. వి. (√కుడి) పండ్రెండు దండలలో నొకటి.

వ...ఎడమయోరభృంగి కుడియోరభృంగి భృంగపటలము...మొదలుగాఁ గలపదిరెండుదండలును... ప్రబంధ. ౭౮.

**కుడిశము.** సం. వి. అ. పుం. మత్స్యవిశేషము.

**కుడుక.** వి. (త.కుడుక్కై.) ౧.పాత్రము (గిన్నె, మొ.)

క. కుడిచేత మాంసఖండము,లెడకేలను మద్యరససహిత మగుకంచుం,గుడుకయుఁ ధరించి ముదమున,వడవణఁకులు గొనుచు నతఁడు వచ్చెం గుడికిన్. శివరా. ౪. ౩౭.

ద్వి. కడుపారఁ జనుఁబాలు గుడిపి పసిండి,కుడుకతో వెండియుఁ గొన్ని చే నిచ్చు.బస.పు. ౬. ౧౨౦ పం.

క. చాలఁగ నిచ్చలు వెన్నయుఁ,బాలుం గుడుక గొని తల్లి పట్టికి సెలవిన్, వ్రేలిడి యింతింతియకాఁ, గ్రోలించును వెరవుతోడ రుచి గొలుపుక్రియన్. హరి.పూ.౫.౧౯౩.('గుడుక' శ.ర.పా.)

౨. తక్కెడతట్ట, తక్కెడసిబ్బె.

గీ. గువ్వ యున్నట్టికుడుక యొకక్కెడుగఁ దూఁగ, మాంసఖండంబు కుడుకలో మఱియు నించి, మఱియు నల్లైన నీక్షించి మదిఁ జెలంగి, త్రాసుపై నిల్చెఁ దాన యద్ధరణివిభుఁడు. శేష. ౨. ౭౬.

**కుడుచు(డ్చు).** స.క్రి.(క.మ.త. కుడి)౧.తిను,భుజించు.

సీ....భీము,దవ్వులఁ జూచి నిత్యము నాకు నియమించి కొనివచ్చుకూ డేల కుడిచె దీవు. భార. ఆది. ౬. ౨౯౨.

సీ. పక్షీరంబులఁ గుడ్చుబ్రాహ్మణు లతిపుణ్యులై లెనిమిదివేలు సమిద్ధమతులు. భార.ఆర.౫.౩౧౬.

ఆ. మెసవెఁ దినియెఁ గుడిచె మెక్కె బోనిసె ను, నమలె నారగించె నా భుజించె, ననుట కాఖ్య లగుచు నలరారుచుండును. ఆం. భా. ౩. ౧౧౮.

౨. త్రాగు, పానముచేయు.

ద్వి. మంచి గొప్పైనక మండలువునను, గొంచకయుంచి తాఁ గుడుమనాపాలు, వాచేరఁ బట్టి భూవరకుమారునకు, వాచవిగా సిద్ధవరుఁడు ద్రాగించి. ద్వి. సారంగ.౨.౯౭పొ. ౧౬ పం.

సీ. ముసు మహీధేనువుచను వత్సమై కుడ్చి వస్తుసంపూర్ణమై వఱలువాఁడు. కు.సం.౭.౯౬౫.

చ...పాలు తమ కిచ్చునె యొచ్చట నైన లేఁగలన్,గుడువఁగ నీనిచోఁ గెరలి గోవులు తన్నును గాక భాస్కరా. భా.శ.౪.

౩. (సుఖదుఃఖాదులు) అనుభవించు; పొందు, చెందు.

గీ.కర్మఫలములు గుడిచినఁ గాని పోవ,వంటి వానిఁ బ్రాయశ్చిత్త మపహరించు. భార. అను. ౫. ౧౧౬.

గీ. ...తొంటి,యట్ల సుఖములఁ గుడువఁ బోవదువ పలయు. భార. విరా. ౩. ౯౦.

వ...పితృధనం బగు రాజ్యంబు ... ఈరెండుదఅంగులవారికిం బంచి కుడువం పగుటయు... భార. ఉద్యో. ౧. ౧౨.

సీ. మేదినీనృపతి...క్రూరుఁ డగునేని లోకంబు బెగడు గుడుచు. భార. శాం. ౨. ౧౭౮.

వ...మనులు గుడిచినపోల్కె...కాశీ.౨.౧౩౮.

కుడిచికూర్చుండి=తినికూర్చుండి, నిర్వ్యాపారముగా, పని లేక, నిర్నిమిత్తముగా; పొగరెక్కి.

గీ. కుడిచికూర్చుండి క్రొవ్వునఁ బుడమిఱేని,

వడఁతిఁ దెచ్చుట నిట్టిచేడ్పాటు లొదవె. అచ్చ. రా. యు. ౪౫౨.

గీ. ఆగడంబున బ్రహ్మస్వ మపహరించి, తెచ్చి పుణ్యంబు సేయంగఁ దివురు టెల్లఁ, గుడిచి కూర్చుండి శిలఁ దెప్పకోయ్యఁ జేసి, జలధి లో నీఁదులాడంగఁ దలఁచినట్లు. జై. భా. ౧. ౬౯.

గీ. కుడిచి కూర్చుండి నెతఁ దెచ్చికొంటి మొక టి, యెన్న నెక్కుడు సద్వారక యెక్కుడిగద, సాంబు నివి విన్నఁ జెను చేటు స్వామి చేత, దనుజులకుఁ బగవీ డఁట యూపురంబు. ప్ర భా. ౪. ౧౬.

జ: కుడి, కుడినీరు, కుడిపించు, కుడియుట్టు, కుడి యడుగుపడువడి, కుడి మోకన్పంగి, కుడుపరి, కు డుపు.

**కుడుపరి.** విశే. (కుడుపు + అరి) కుడుచువాఁడు.

(తినువాఁడు, భుజించువాఁడు)

సీ. తెలికడలిని గడుచలికుడుపరి వొరపఱపుపయి నిదురఁ గొలలునుతియ అచ్చ. రా. అర. ౧౧౪.

**కుడుపు(డ్పు).** స. క్రి. (√కుడుచే.) కుడువఁజే యు, కుడిపించు.

(అనుభవింపఁజేయు.)

క. ... అతులపుణ్యవతిఁ గృష్ణను మీ, నా ల్లెఁ జూడఁ బఱిచిన, క్రూరపుఁ బాపము ఫలంబు గుడుపక యున్నే. భార. ద్రో. ౫. ౩౦.

వి.(త. కుడిప్పు) ౧. భోజనము; భోజనపదార్థము.

గీ. కుల్యయందుఁ ద్రిరాత్రంబు గుడుపు దక్కి, శౌచి యై యనుమర్షణజపముఁ జేసి, యశ్వ మేధఫలముఁ బొందు ననఘ నరుఁడు. భార. అను. ౨. ౯౭.

క. కడుపునఁ బుట్టినకూరిమి, కొడుకుల నుకుమా రమూర్తిఁ గులవర్ధనునిన్, మెడఁ గోసి చంపి నంజాడు, గుడుపుల జోగులకుఁ బెట్టుక్రూయులు గలరే. హర. ౨. ౭౫.

క. బడబాగ్న్యనలాగస్త్యులు, కుడిచినకుడు పఱు గఁజేసి కుశల ప్రదుల, య్యేడు మాకు ననుచు వలచేఁ, గడుపు నిమిరి చదువ గట్టికండ్లుం గ మరున్. విజ్ఞా. ఆచా. ౯౨.

వ... గనగనని నిప్పులం జముకు చిప్పిలం గాల్చిన కమ్మకఱకుట్లు జట్రాతిపయి గాత్రేనికిం గు డుపు వెట్టి... మనుచ. ౪. ౬౦. (ఇట నైవేద్య ము అని భావము.)

౨. అనుభవించుట, భుక్తి.

గీ. కొంచె మైనను దగఁ బంచి కుడుపు మేలు. భా ర. ఉద్యో. ౨. ౪౭.

క. కుడుపుం బత్త్రము సాక్షియుఁ, గడుమేల్ రెం డైన మే లొకటిరైయెనను మే, లొడఁబడ నివి లేకున్నను, జెడ విడువక సత్యమర్థిఁ జేయిం పఁదగున్. విజ్ఞా. వ్యవ. ౩౨.

గీ... మెసవుట యారగింత, యారగింపు కుడుపు నాఁగ నలరు భుక్తి. ఆం. భా. ౨. ౨౬౦.

౩. జీవిక, జీవనోపాయము.

వ... గంధచర్చావీటీచర్వణభూషణాంబరధా రణం బెల్ల నన్యునికొఱకుఁ గాని యాత్మార్థం బు గాదు పడపు గుడుపు గాఁ బరఁగుపడం తుల కిది మర్యాద... జాహ్నవీ. ౪. ౫౪.

కట్టికుడుపు=బంధించి అనుభవింపఁజేయు, తప్ప కుండ అనుభవింపఁజేయు.

క. తొలుజన్మంబునఁ జేసిన, కొలయును బుణ్యం బుఁ గట్టికుడుపక యున్నే. సారంగ. ౨. ౩౩.

కుడుపుడుగుట=పస్తు, ఉపవాసము.

ఆ. దైన్యమునకుఁ ద్రోవ దలఁప నస్థైన్యంబు, కుక్షి వంచనంబు గుడుపుడుగుట, బుద్ధి యైనయట్ల భోగింప నేర్చుట, సార మైనబోధిసత్త్వమ తము. నైష. ౭. ౯౫.

**కుడుము.** వి. (క. కుడుబు, కుడుంబు) మోదకము, భక్ష్యవిశేషము.

క. ఎదిరిం దమయట్టుల కాఁ,మదిఁ దలఁచినఁ బొ
సఁగుఁ గాక మాకుం గుడు మిం,డిదె మీరు
ప్రక్కఁ గొనుఁ డని, చదు రడిచిన మనసు
పొందు చక్కఁబఱు నే. భార. ఉద్యో. ౧.
౩౧౨.

సీ...కుడు మన మోదకం బడరు...ఆం. భా. ౨.
౨౫౬.

కుడుముల తిండికాఁడు = మోదకభక్షకుఁడు, వినాయకుఁడు. ఆం. సం. దేవ. ౧౨.

**కుడ్యమత్స్యము.** సం. వి. అ. పుం. గృహగోధిక, బల్లి. (కల్ప)

**కుడ్యము.** సం.వి.అ.న. ౧.భిత్తి, గోడ. ౨. లేపనము, పూఁత. ౩. కౌతూహలము. (మే. ని.)

**కుణంజము.** సం. వి. అ. పుం. వనవాస్తూకము. (వాచ.)

**కుణంజరము.** సం.వి.అ.పుం. చక్రవర్తికూర.

**కుణకము.** సం.వి.అ.పుం. పిల్ల.

వ....మఱియు నాభరతుండు నిత్యనైమిత్తికక్రియాకలాపంబు నిర్వర్తించునెడ నంతనంత లేచి హరిణకుణకంబుం జూచుచు... భాగ. ౫. ౧. ౧౦౫.

వ. ... తస్య హవా ఐణకుణక ఉచ్చైస్తరాం తస్మిన్ కృతనిజాభిమానస్య. సం. భాగ. ౫. ౮. ౫.

**కుణపము.** సం.విశ.(అ.ఆ.అ) ౧.కుత్సితము, చెడ్డది. ౨. పూతిగంధి, కంపుగొట్టునది. వి. అ. పుం. ౧. శవము, పీనుఁగు. ౨. అస్త్రవిశేషము. ౩.కృమి, పురుగు. న. పూయము, చీము. (మే.ని.)

**కుణపి.** సం.వి. ఈ. స్త్రీ. విట్కారిక, పీతిగోరువంక.

**కుణము.** సం.వి.అ.పుం. కాకి.

**కుణి.** సం.విశ.(ఇ)కుకరుఁడు, ఈచవోయినచేతులు గలవాఁడు. వి. ఇ. పుం. ౧.నందివృక్షము. ౨. వికలహస్తము, ఈచవోయినచేయి. (కే. ని.)

**కుణిందము.** సం.వి.అ.పుం. శబ్దము.

**కుతకుత.** వి. ఉడుకుట మొదలగువానియందలిధ్వని కనుకరణము.

(వ్యవ) అన్నము కుతకుత ఉడుకుచున్నది.
వేసఁగిలో శరీరము కుతకుత లాడును.

**కుతగుఁడు.** విశ. దుష్టుఁడు ?

ద్వి. వ్రతతత్పరతఁ బ్రీతి వర్తింపుచుండఁ, గుతగులై జైనులు గూడి యాయ్యార, నక్కట యొక్కఁ డితనిఁ బొఱిఁగఁ గోలు,యుక్తులెట్లని పెక్కు లూహించి చూచి. బస. పు. ౬. ౨౩౩ పం.

**కుతనువు.** సం. విశ. (ఉ.) కురూపి, వికృతదేహము గలది. వి. ఉ. పుం. కుబేరుఁడు.

**కుతపము.** సం. వి. అ. పుం. ౧. ఎద్దు. ౨.నువ్వులు. పుం. న. ౧. వాద్యవాదకసామగ్రి. (వై.ని.) ౨. మేఁకబొచ్చుతో నేసినకంబళి. ౩. దర్భ. ౪. పగటియొక్క పదునేనుభాగములలో నెనిమిదవ భాగము.౫. దేహళి, కడప. (కే.ని.)

**కుతపుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణుఁడు. ౨. సూర్యుఁడు. ౩. అగ్ని. ౪. భాగినేయుఁడు,తోఁడఁబుట్టినదానికొడుకు. ౫. అతిథి.(కే.ని.)

**కుతి.** వి. (క. కుది) శోకము, దుఃఖము.

సీ... దుమ్ము కుతి జాలి యూపుదుకస్తి నా శోకమొప్పు. ఆం. భా. ౧. ౧౩౫. (ప్రాఁత ప్రతి, ప్రాఁత ప్రతి పా.)

**కుతిక**=కుసుక, కుత్తిక, కుత్తుక. వి. కంఠము, గొంతు.

ఆ. కుతికఁ బిసికి చంపె గురువుప్రాణముఁ గొని, యావు నడిచి భ్రూణహత్య చేసి, నట్టినడుబు క్రోధ మడుచరకంబునఁ, బడుదు రవధి లేని పాపములను. వి. పు. ౩. ౧౧౨.

క... కుతికబంటిలోయములు... శేష. ౪.౫౪.

గీ. కుతిక మోయఁగ నెత్తురుల్ గ్రోలి క్రోలి. దశా. ౨. ౪౩౫.
జ: కుతికంటు.

**కుతికంటు**=కుత్తుకంటు. వి. (కుతిక+అంటు) నాగవల్లినాఁడు పెండ్లికొమార్తకు మెడను గట్టెడి యాభరణవిశేషము.
సీ. ఉల్లిపూసలపేరు హురుముంజిముత్యాలకుతికంటు దాపునఁ గొమరుమిగుల. కవిరా. ౨. ౧౮౨.
సీ...కంఠభూషావిశేష. గీ. మూను గుతికంటు... అం. భా. ౨. ౧౪౮.

**కుతికిలఁబడు**=కుదికిలఁబడు. అ. క్రి. (కుతికిలన్+పడు) క్రుంగఁబడు, కూలఁబడు.
వ...మేర మీఱన్ దిన్నయెరల నన్నుకొని యరగన్ను వెట్టి బోరకడన్ బొటమరింపన్ గూరుకుచున్ గుతికిలం బడునవియును... మనుచ. ౪. ౨౬.
ద్వి. మసలక యాతనిమణికట్టు పట్టి, కుదియఁ దాఁకించినఁ గుతికిలఁబడియె. పల్నాటివీర చరిత్రము. ౨౫౧. (బ్రౌ.)

**కుతికిలు**=కుదికిలు. (చూ. కుతికిలఁబడు.)
జ: కుతికిలఁబడు.

**కుతినీ**=కుత్తిని. వి. (హిం. ఖుతినీ.) ఒకవిధ మగు పట్టుబట్ట.
సీ. కుతినీగుడారు తళ్కుఁబసిండికుండలు జరబాజుచందువా...రసిక. ౩. ౧౪౧.
సీ. చందువా ముత్యాలజాలీలు కుతినీతలాడ దంతపుఁబావజోడు...రసిక. ౪. ౪. ప్రబంధ. ౬౦౫.

**కుతిల(ము)**=కుదిల. వి. బాధ, దుఃఖము.
సీ. విను నృపాలక యాళ్లవెంబడి దేవరగుళ్లపంచలఁ జేరి కుతిల గుడిచి. హరిశ్చ. ౪. ౧౯౧.
ఆ. అనుచు వెచ్చనూర్చు నయ్యింతిలోఁ బుట్టు, మతము లుగ్గడించుఁ గుతిల కుడుచు, మరలి పోవఁ జూచి విరహాగ్ని శిఖలచేఁ, దిరుగు మరులుకొనుచు దివిజవిభుఁడు. పద్మ. ౩. ౨౧.
చ. అతఁడును బుత్రపౌత్రవిలయంబునఁ బుట్టిన శోకవహ్నిచే, వెతపడి ప్రాణముల్ విడువ వేఁడుచు నుండె నటన్న వానికిన్, మతి నిజమర్త్యునేని మనమన్కిత మంతయుఁ దీఱు నాత్మకున్, గుతిలము మాను నాఖులునకున్ మృతి గల్గదు గాని యేమిటన్. ప్రబోధ. ౫. ౫.
ఉ. ధీరుల నింద్రముఖ్యు లగుదిక్పతులం గుతిలాలఁ బెట్టున, వ్వీరుఁడు బాణుఁ డేమిటికి వియ్యపుటిచ్చకుఁ దెచ్చు మర్త్యులన్. ఉ. హరి. ౫. ౧౫౭.
జ: కుతిలగొను, కుతిలపడు, కుతిలపఱుచు, కుతిలపాటు, కుతిలవెట్టు.

**కుతిలగొను.** అ. క్రి. (కుతిల+కొను) కుతిలపడు, బాధపడు, దుఃఖపడు.
ఆ...దైత్యరాజతనయ, దొడరి దేవయానిఁ ద్రోపించె వలు వీక, క్రుంగి నూతిలోనఁ గుతిలగొనఁగ. భాగ. ౯. ౫౨౩.

**కుతిలపడు**=కుదిలపడు. అ. క్రి. (కుతిల+పడు) బాధపడు, దుఃఖపడు.
క. మితి గడచిన ఋణదాతలు, వెతవెట్టఁగ నూరు చొరక వెలివెలిఁ దిరుగన్, దతిఁ గూడు లేక యాఁకటఁ, గుతిలపడు నతండు గువ్వకుత్తుకతోడన్. పాండు. ౩. ౨౦.
క. అడుగక యున్నను నాలిం, గొడుకుల రక్షింపలేక కుతిలపడుచు నెప్పుడుఁ బేదతనము గలనరు, నెడ యడుపఁగ వలయు ... భార. అను. ౨. ౩౪౦.
సీ...అద్దేవదేవుఁడు పోషకుఁడు నువ్వా మది నేల కుతిలపడఁగ. వేం. పంచ. ౨. ౧౬౭.

**కుతిలపఱుచు.** స. క్రి. (√కుతిలపడు.) బాధపడఁజేయు, బాధించు.
క. పాపంబు లేని కులసతిఁ, గోపంబునఁ గుతిలప

ఱుచుకుత్సితునకుఁ ద,త్పాపంబులు బహు తరపరి, తాపం బిహపరములందు దరికొల్పు నృపా. హరి. ఉ. ౯.౭౭.వరాహ.౪.౧౭.

**కుతిలపాటు.** వి. (√కుతిలపడు)బాధ.

సీ. ఎఱుఁగఁడు మత్తిల్లి పరఁటిపుట్టువు గ్రుక్కి గొనినయప్పుడు గలకుతిలపాటు. యయా. ౧. ౨౩.

**కుతిలవె(పె)ట్టు.** స. క్రి. (కుతిల+పెట్టు) పీడించు, బాధపెట్టు.

ఆ...అరాజకత్వ,దోషజాత మైనమురితబాహుళ్యంబు, కుతిలపెట్ట భూమి యతలమునకుఁ, బోవ ...భార. శాం. ౨. ౭౯.

సీ. కయ్యాన జక్కులగమికాని ముక్కంటిఁ గుతిలవెట్టుటయు నీకతనఁగాదె. యయా. ౩. ౯౩.

**కుతుక**=కుతిక.

సీ. చేత ముమ్మొనవాలు చిలువసూడిగములు నొసల మిక్కిలికన్ను విసపుఁగుతుక. రాజ. వి. ౩. ౧౯౦.

**కుతుకము.** సం. వి. అ. న=కౌతుకము.

**కుతుపము.** సం. వి. అ. పుం. చేతిసిద్దె. పుం. న. కుతపకాలము. (కల్ప.)

**కుతువు.** సం. వి. ఊ. స్త్రీ. సిద్దె.

**కుతూణకము.** సం. వి. అ. పుం. బాలురనేత్రరోగవిశేషము.

**కుతూహలము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. ప్రశస్తము, శ్రేష్ఠము. ౨. ఆశ్చర్యకరము, అబ్బురము. వి. అ. న. ౧. కుతుకము, అనుభవింపని ద్రవ్యమునందలియభిలాష. ౨. (అలం)నాయికకు మనోజ్ఞవస్తువును జూచుటయందుఁగల లోలత్వము. ౩. సంతోషము. ఉ. చ. ౧. ౨౦.

**కుతూహలి.** సం. విశ. (న్. నీ. న్.) కుతూహలము గలవాఁడు.

**కుతూహలితుఁడు.** సం. విశ. (అ. ఆ.అ)=కుతూహలి.

**కుత్తృణము.** సం. వి. అ. న. కుంభి, నాఁచు.

**కుత్కీలము.** సం. వి. అ. పుం. కుకీలము,కొండ.

ఉ. వీలక కాంజిత్ర్పముఖవీరులు మున్న కుశాకుగాహతిఁ, గూలిరి రక్తనాగలు బుగుల్కొన లక్ష్మణుమ్రోల ధాతుస,త్కీలము నాల్గువంకల నతిత్వరమాణసమీరవర్తనో, న్మాలితసంప్రఫుల్లసుమనోభరకింసుకవాటి కైవడిఁ. జై. భా. ౬. ౧౭౭. అప్ప. ౩. ౧౨౬.

**కుత్తిక**=కుతిక. (క. కుత్తిగె.)

గీ. హత్తి మిత్తిచందంబున హత్తి వెసఁస,కత్తిఁ గుత్తికను బిఱానఁ గత్తిరించి, సత్తి మత్తిల్లి బలిచేసె సత్తి నొక్కఁ, డవనిపతి యిచ్చమేలు మేలనుచు మెచ్చ. చంద్రా. ౨. ౭౭.

**కుత్తిని**=కుతినీ.వి.(త.కుత్తిని.) ఒకరకముపట్టుబట్ట.

సీ. రత్నకంబళ్లు సూరత్తుకుత్తినిపట్టుదిండ్లు నేమంతిపూఁజెండ్లు గంద,వొడులు ధూపములు పుష్పాదులు...సానందో. ౧. ౧౭ పా.

**కుత్తుక(ము)**=కుతిక. వి. కంఠము.

క. ... శోకము,గూరఁ గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులఁ. భార. భీష్మ. ౨. ౩౬౪.

లయగ్రాహి...కుత్తుకలబంటి యగునెత్తురులు దోయిగుల,నెత్తి చవిఁ గ్రోలుమను...భార. స్త్రీ. ౧. ౭.

ఉ. ఒత్తుగ మాంసము న్మెసఁగుటోగిరముఁ ఘృతశర్కరాదులుఁ, గుత్తుకబంటిగా మెసఁగి ... హరిశ్చ. ౧. ౧౪౦.

సీ. నిరసనకాష్ఠసన్నిభకరంబులతోడఁ గడుఁబొడు వౌ కుత్తుకములతోడ. శ్రీరం. మా. ౧౦. ౨౦. ఆం. భా. ౨. ౧౪౧.

ఒక్కకుత్తుకగు. (చూ. ఒక.)

జ: కుత్తుకంటు.

**కుత్తుకంటు**=కుతికంటు. (కుత్తుక+అంటు)

(అగడ్తవర్ణన) సీ. ధర కుంకుమాంకకంధరఁ డా ల్చికొన్న కట్టాణిపూసలకుత్తుకం టనంగ. రా. వి. ౧. ౬౨.

**కుత్స.** సం.వి.ఆ.స్త్రీ. నింద, దూఱు.

**కుత్సకుఁడు.** సం. విశే. (అ.త్సికా. అ.) నిందించువాఁడు.

**కుత్సన.** సం.వి.ఆ.స్త్రీ.నిందించుట,దూఱుట.

**కుత్సనము.** సం. విశే (అ.ఆ.అ.) నిందించునది. వి. అ. న. నింద, దూఱు; నిందించుట, దూఱుట.

**కుత్సనీయము.** సం.విశే. (అ.ఆ.అ.) నిందింపఁదగినది.

**కుత్స్యమానము.** సం. విశే. (అ. ఆ. అ.) నిందించుచున్నది.

**కుత్సయితృ.** సం.విశే.(ఋ.త్రీ.ఋ)=కుత్సకుఁడు.

**కుత్సల.** సం. వి. ఆ. స్త్రీ. నీలిచెట్టు.

**కుత్సించే.** సం. అ. క్రి. రోఁతపడు.

సీ. కుత్సింపకుం డెట్టు లుత్సర్గవిణ్మూత్రలాలా ద్రవశ్లేష్మజాలమునకు. కాశీ. ౮. ౧౪.

స. క్రి. దూఱు. (బ్రౌ, శ. ర.)

**కుత్సితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిందితము, దూఱఁబడినది. ౨. నికృష్టము, కీడ్పడినది. వి. అ. న. ౧. నింద, దూఱు. ౨. కుష్ఠము, చెంగల్వకోష్టు. ౩. ఋణము, అప్పు. (శే. ని.)

**కుత్సితవ్యము.** సం=కుత్సనీయము.

**కుత్స్యమానము.** సం. విశే. (అ. ఆ. అ.) నిందింపఁబడుచున్నది.

**కుత్స్యము.** సం=కుత్సనీయము.

**కుథ.** సం. వి. ఆ. స్త్రీ. కుథము,ఏనుగుమీఁదఁ బఱచెడిచిత్రకంబళము,

**కుథము.** సం. వి. అ. పుం. దర్భలు. పుం. న. ఏనుఁగుమీఁదఁ బఱచెడిచిత్రకంబళము.

**కుథాకువు.** సం. విశే. (ఉ) పరోత్తాపి, ఇతరులను తపింపఁజేయువాఁడు. వి. ఉ. పుం. ౧. కోఁతి. ౨. సూర్యుఁడు.

**కుదప.** వి. గొంపిడుక్కి. (శ. ర.)

**కుదరము.** సం. వి. అ. పుం. గుల్మము. (వై. ని.)

**కుదాలము.** సం. వి. అ.పుం-భూమిని చీల్చునది-కుద్దాలము, గుద్దలి.

**కుదికిలఁబడు**=కుతికిలఁబడు. అ. క్రి. చదికిలఁబడు, పిఱ్ఱలు నేల నానునట్లు కూలఁబడు.

ద్వి. తలకొన్నకోపమంతట నిల్వ లేక, వెఱచి వాపోవుచు వెసఁ బాఱి తండ్రి, మఱుఁగు చొచ్చినసుకుమారుఁ గుమారుఁ, గుదికిలఁబడ రెట్టఁ గుదియించి తిగిచి. ద్వి.హరిశ్చ.ఉ. ౯౦౧ పం. పండితా. పురా. ౯౩ పా.

**కుదికిలు**=కుతికిలు. అ. క్రి. పిఱ్ఱలు నేల నానునట్లు కూలఁబడు.

వ...అచ్చోరవకు వాసుదేవుండు నీసకంబునం బొడిచిన శైనేయుండు కుదికిలి గదను డాకేలఁ దాపించిన...ఉ. హరి. ౩. ౬౮. (వీరే శ. పా.)

ద్వి. ఒక్కఁడు గుదికిల నుర్విపైఁ ద్రోచె. ద్వి. హరిశ్చ. ఉ. ౯౫౯ పం.

జ: కుదికిలఁబడు.

**కుదినము.** సం. వి. అ. న. ౧-భూభ్రమణముచేతఁ గలుగుదినము - సావనదినము, సూర్యోదయము మొదలుకొని మరల సూర్యోదయమువఱకు పట్టు కాలము. ౨. చెడ్డదినము.

**కుదియి(ది)ంచే**=కుదుచే. స. క్రి.(√కుదియు) కుదియఁజేయు.

౧. అదుము, నొక్కు.

సీ. కుచము లురంబునఁ గుదియించి క్రమమున ని టిసిన కౌఁగిట నింపొనర్తు. భార. విరా. ౨. ౩౦౦.

౨. తగ్గించు.

క. అన్నతభయము నాజిజయముఁ, గొనియెడుత మకంబు పెంపు గుదియింపఁగఁ బాం,డున రేంద్రున గ్రతనయుం, డనుమానము వాయఁ బెట్టి యస్త్రగురునిలోన్. భార. ద్రో. ౫. ౩౦౪.

ఆ. మొదలఁ బెనిచి పిదపఁ గుదియింప నెవ్వాఁ డుఁ, దనదుతొంటిహీనదశఁ దలంపఁ, డలు గుఁ గాన శిల మరయుచుఁ గ్రమవృద్ధిఁ, బెని చి వేళవేళఁ బనులు గొనుము. అను. ౪. ౨౦౯.

౩. అడ్డగించు, ఆఁపు.

క. నదిరయము వారణేంద్రుఁడు, గుదియించినయట్లపోలెఁ గురువర దైన్యా,స్పద మగువిష యోల్లాసముఁ, గుదియించు యోగసిద్ధిగురు వృద్ధులుఁ దుర్. భార. శాం. ౫. ౫౯౨.

శ్లో. తదేవచ మహాస్రోతో విష్టమ్భయతి వారణః, తద్వద్యోగబలం లబ్ధ్వా వ్యూహతే విష యాన్ బహూన్. సం. భార. శాం. ౩౦౬. ౨౩.

క. శరవర్షము నామీఁదం, గురిసిన నే నాకసము నఁ గుదియించితి నా, యరదంబు సొంతకుసు న,చ్చెరువుగ నొకబాణ మైనఁ జేరకయుం డన్. భార. ఉద్యో. ౪. ౩౧౬.

సీ. కుదియించునది నెట్టుకొని యింద్రియవ్యాప్తి మనసుచాంచల్యంబు మాన్చునదియు. కాశీ. ౭. ౧౧౯.

౪. నియమించు, లొంగఁజేయు, వశపఱచు.

క. ... మనసు దూలకయుండన్, మృడ వినుము బుద్ధిఁ గొని యొక్కడునిష్ఠను వలయు దా నిఁ గుదియింపంగన్. భార. అను. ౪. ౨౦౯.

గీ. అనఘ శబ్దాదివిషయంబులందుఁ దగిలి, యి చ్చఁ జరియించు నెప్పుడు నింద్రియములు, బుధుఁడు తత్స్వభావముఁ దనబుద్ధి నెఱిఁగి, యేమఱక వానిఁ దగఁ గుదియింప వలయు. భార. ఆర. ౫. ౯౯.

శ్లో. ఇన్ద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్య సంశయమ్, సంనియమ్య తు తాన్యేవ తతస్సి ద్ధిమవాప్నుయాత్. సం. భార. ఆర. ౨౧౫. ౨౦.

౫. బిగించు, బిగఁబట్టు.

ఉ. ఇంచుక కేలవాగె గుదియించిన సంద్రము దాఁటుచున్ జవం,యించిన కేల గ్రక్కు దల నిట్టటుగా వడిఁ ద్రొక్కుచున్ దువా, ళించిన గట్టు గు ట్టనక లెక్కకు మిక్కిలి ద వ్వు వాఱుచున్, మించిన వారువంబు లట మీఱుచుఁ ద్రిమ్మరు నెన్నియేనియున్. య యా. ౧. ౧౦.

శా. నానావీథిగతిప్రభేదవిహృతిన్ సంతృప్తుఁ డై కాంతుఁ డిం,పూనన్ వాగె గుదించినన్ బురుషక ప్రోన్నమ్రపూర్వాంగమై, కానంగాఁ బడియెన్ మనుజ్జనన మాగంధర్వ మర్త్యాశ్వ సం,తానస్పర్థను మిన్ను ప్రాఁకెడు క్రియన్ దా నెంతయుం జూడ్కికిన్. ప్రభా. ౨. ౩౭.

౬. మరలించు, త్రిప్పు.

సీ. ...ఏ నెట్లు పలికితి నది యట్లు కాక తప్పదు మహీశ,యెన్నఁడుఁ గావున నిచ్చినశాపంబు కుదియింప నెమ్మెయిఁ గొలఁది గాదు. హ ర్య. ౭. ౨౦౪.

౭. దుఃఖపెట్టు.

ద్వి. పగ్గెల నిచ్చలు బాములఁ బెట్టి,యిడుములఁ గుదియించి యించుకసేపు, నెడపక పనులు సేయించుచు నుండె. ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౧౯ పం.

౮. అణఁచు.

క. ... కోపోద్దీపితులై వారలయా, టోపముఁ గుదియించి రతిపటుప్రదరములన్. భార. భీష్మ. ౩. ౧౩౦.

సీ. అలసతఁ జూపుకో య్యారంపునడపులు వనమయూరములగర్వముఁ గుదింప. జై. భా. ౮. ౭౩.

**కుదియు.** అ. క్రి. ౧. క్రుంగు, దిగఁబడు.

ఆ... కడును వ్రేఁగు,గలుగునట్టివంటకట్టియ మోపట్టు, గుదియ మోచి తెచ్చెఁ గురువరేణ్య. భార. అశ్వ. ౩. ౭౨.

సీ. తనయున్నగిరి బెట్టు తాఁచి బిట్టెగసిన నదిశేషుపడగలఁ గుదియ నదుమ. భా.రా.అర. ౨. ౧౧౮.

౨. ఆఁగిపోవు; ఉపశమిల్లు.

సీ. మది నిగిర్చినమాట మగువ నీపెంపునఁ గుదిసి నా నాలుకతుదికి రాదు. భార.విరా.౨.౪౭.

క. మరుదస్త్రమేయ గుహ్యక, శరమున వారించె నతఁడు సరభసముగ నుద్ధురశిఖిబాణం బేసిన,గురుఁడు వరుణవిశిఖనిహతిఁ గుదియం జేసెన్. భార. ఉద్యో. ౪. ౩౨౫.

౩. వెనుదీయు, జంకు.

ద్వి. తెంపు మీఱఁగ నాశ దెగఁ గోసి దీనిఁ, గొంపలోపల నిల్పఁగట్టుదు ననుచుఁ, గుదియక కరతిత్తిఁ గొని దాని వ్రేయ, నది చెడిపోవను నంచింప మోఁదె. ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౨౮ పం.

౪. తగ్గు.

ద్వి. కుదియనికడకతోఁ గోరి యాకాశ, నది నాడఁ బోయిననాగకన్యకలు,చని చని మగుడ రసాతలంబునకుఁ, జనుదెంచుగతి వర్షజలధార లమరె. రం.రా.కిష్కిం. ౨౧౯ పా. ౨౯ పం, అయో. ౧౨౩ పా. ౮ పం.

౫. చెడు, పాడగు.

సీ. నెట్టెంబు సుట్టిన నెమ్మిషించెముదండకొనరేక యొక్కింత కుదియకుండ. హర. ౬. ౪౫.

౬. నశించు, పోవు.

ద్వి. ... చన్నులమీఁదఁ, గాఱెడుకన్నీరుఁ గరపల్లవమునఁ, గదిసినచెక్కును గలికిలేనవ్వు, గుదిసినచూపును ...ద్వి.హరిశ్చ.ఉ.౨౦౮౦ పం.

౭. వ్యర్థమగు, పనికిమాలినదగు.

(వజ్రాయుధము) క. అది యొకఁడుఁ జేయఁజాలక, విడళితశైలమగుతనదువిలసన మచటం, గుదియుట తనకుం దెలిసిన, మద మఱి గిరిభేదిశడకు మగుడం జనియెన్. భార. ఆను. ౧. ౨౫౮.

౮. కుందు, దుఃఖించు.

(చంద్రోపాలంభనము.) చ....పాంథకోటి నా, పదఁ గుదియంగఁ జేయునది పౌరుషరేఖ యటంచు నెంచవే. కకు. ౩. ౧౧౬.

౯. సంకుచితమగు, ముడుఁగు.

ద్వి. పవనుఁడు కోపంబు పట్టలేకప్పు,డవయవంబులఁ జొచ్చి యాతలోదరులఁ, గుదియంగఁ దిగిచినఁ గుబ్జలై...రం. రా. బాల. ౩౩ పా. ౨౮ పం.

గీ. ...దృష్టి చక్కఁగా నిలిపి పిడికిలించి కరములు తాఁ గుదియించి గునుకు,పరువునను దాఁటె బలుఁడు తొంబదియడుగులు. దశా. ౯. ౧౩.

కుదియఁబట్టు,కుదియఁగఁబట్టు=బిగియఁబట్టు.

గీ. కూర్చి వాలంబు మెడఁజుట్టి కుదియఁబట్టి, జన్నభూమికి బలి ద్రిప్పి సకలభూత,కోటి వినుతింపఁ బెల్లార్చి కూఁకలిడఁగ,విసరివైచిన హాతుఁడయ్యె విహ్వలించి. మైరా. ౩.౬౩.

ఆ. మేఁకఁ గుదియఁబట్టి మెడచన్ను గుడిచిన, నాఁకలేల దీఱు నాశ గాక. వేమన. ౧౨౨.

(శ్రౌ)

వ. ... తచ్ఛ్రమూసామజంబులం జూచి యేచిన వెఱం బాఱుతమయెక్కిరింత లెక్కికొని వాగె లిరుగేలం గుదియఁబట్టిన నిలువ కయ్యుత్సవం బీక్షింప వచ్చినప్రజలం ద్రొక్కుచుం బోవ...ఆము. ౪. ౩౫.

చ. ...మానసం,బనుతురగంబు బోధమహితాత్మ వివేకపునూలిత్రాట నల్లన కుదియంగఁ బట్టను దలంచుచు ... భాగ. ౧౦ ఉ. ౧౨౨౬.

కుదియఁబడు=దిగఁబడు, కూలఁబడు.

(వార్ధకవర్ణనము.) సీ.యౌవనస్తంభహైన్యంబున దేహంబు గుమిలి గుడారు నాఁ గుదియఁబడఁగ. దశా. ౨.౧౩౯. (దుర్బలమగు అని భావము.)

ఆ. పొఱటివీఁపు నీఁచవోయినచేతులుఁ,గుదియఁబడ్డ మెడయుఁ గుందుకాళ్లు, గుజ్జుపొడవు నైనకోమలి నొక్కతె, గంధపాత్రహస్తఁగాంచె నెదుర.పద్మ.౯.౨౯౭.(కుదియఁబడ్డ మెడ=పొట్టిమెడ.)

కుదియఁబెట్టు=కృంగఁజేయు, కూల్చు.

సీ. జముదాడి నుడుగక జముదాడి యుడిపించి గుదియ నేఱులఁ ఈనిఁ గుదియఁబెట్టి. అచ్చ. రా. యు. ౪౬౪.

జ: కుదియించు.

**కుదిర.** వి. (సం. కుదరః. క. కుదిరె.త.కుదిరై. తు. కుదురె. మ. కుతిర.) గుఱ్ఱము.

సీ. వెలిపట్టునిద్దంపుఁదళుకులపుట్టంబు మెలపారు పులుఁగుభంజళులకుదిర.కవిస. ౧ ఆ. (శ.ర.)

**కుదిరిక.** వి. (√కుదురు) ౧. అమరిక, పొందిక. ౨. నిలుకడ. ౩. నెమ్మది, స్వస్థత.

ఉదా: వాఁడు కుదిరిక లేనివాఁడు.

కుదిరిక లేనివానికి చదువురాదు.

మనస్సునకు అణుమాత్రపుఁగుదిరికయు లేదు.

**కుదిల**=కుతిల. (చూ. కుదిలపడు, మొ.)

జ: కుదిలపడు, కుదిలపఱచు.

**కుదిలపడు**=కుతిలపడు. (చూ.కుదిలపఱచు.)

**కుదిలపఱ(ఱు)చు**=కుతిలపఱచు.(√కుదిలపడు)

(బాధపెట్టు.)

సీ. నృపతిపై మతి యామినీచరపతి యొనుబదిచి ల్కు లడరించి కుదిలపఱిచె. రసిక. ౬.౩౪.

సీ. బ్రహ్మాదులకుఁ జేయరాని కైంకర్యంబు లీ దేఱ నిట్లు రంగేశ్వరునకు, నొనరించి బుద్ధిమంతులు గాక వీరలు కూలికై నన్నిట్లు కుదిలపఱచు,చున్నారు...పరమ. ౫. ౪౭.

**కుదిలించు.** స. క్రి. (√కుదులు) పిదుచు.

వ ..పొదపొద మని పొవిదల్లులు హస్తపల్లంబులు పట్టి తివిచిన నప్పంకజాక్షి కంకణఝుణఝుణత్కారంబుగాఁ గెంగేలు కుదిలించి తివిచికొని...కాశీ. ౬. ౨౨౬.

**కుదిలిక.** వి. (√ కుదులు) కుదులుట. (శ. ర.)

**కుదుకనగోలు.** క్రి. విశ. అన్యాయ్యముగా?(వి. వంచన-శ. ర.)

(హరిశ్చంద్రుఁడు నక్షత్రకునితో నన్న మాటలు.)

ద్వి...ఇంకనైనఁ, గుదుకనగోలు గైకొనక నా ధనము వదలుము...ద్వి.హరిశ్చ.ఉ.౧౨౭౬.

ద్వి. ఆలిని బుత్రుని నంగడిఁ బెట్టి, కాలకౌశికుఁ డనుకష్టున కమ్మి,కూర్చినధన మెల్లఁ గుదుకనగోలు, నేర్పునఁ గైకొంటి. ద్వి.హరిశ్చ.ఉ. ౧౩౨౬ పం.

**కుదుచు**=కుదియించు.

(అణఁచు, పోఁగొట్టు.)

సీ. నాకాధిపతి యైనవహుషుని తేజంబు గుదిచి పాముగ భూమిఁ గూలవైచె. భా. రా. అర. ౧. ౭౬.

(బిగఁబట్టు;నొక్కు.)

గీ. తోఁకఁ ద్రొక్కినభుజగేంద్రువీఁక సటలు,గుదిచి పెటికినసింగంబుకొదమమాడ్కి, దండ

తాడనకుపితో గ్ర పుండరీక,ధంగిం గృష్ణుండు
గోషించి పలికె నిట్లు. చిత్రభా. ౬. ౧౬౫.

సీ. బలభేదికరి దొడ్క పట్టం జే సాంచుడు శివు
నూతి వెనంచి చే నేతం బట్టి,కుదిచి రాం దిగు
చుడు...కు.సం.౧౧.౪౩౧.యయా.౨.౨౪.
(బంధించు)

క. నా పాదంబులు గుదిచిన,పాపంబున...దశకు.
౩.౧౧౨. (చూ. ౩.౧౩.)

కుదుముకొను=బిలబిలం గొట్టుకొను, తన్నుకొను.

ఆ. చేతం దొడికి క్రింది పెలుకు కేలను బట్టి,యనము
లీల ముష్టి విసరి పొడువం, గుళికనిహతిం గూ
లుకొండకైవడి నిలం, గూలి కాళ్లు గుదుము
కొనుచుం జచ్చె. పద్మ. ౯. ౧౯౩.

**కుదుప**[1]. వి. వంచన, మోసము.

చ. ఎఱుంగనియట్లు యున్న ననుశేశ్వరుండప్పుడు
గాలుం జేయ లా,నతి రభసంబునం గుదుప న
క్కడ నిక్కడ నూడం జూచి మై,గిఱుపంగ
నవ్వికక్తి యెటేంగించుట నెమ్మదిం గోరి వా
నిమై,నుఱుసుఱ సుక్కనొక్క బలసూదన
సూనుండు ప్రక్కదాపునన్. నిర్వ. ౬.౮౪.
(శ.ర.)

**కుదుప**[2]. వి. (నెత్తురు, పెరుంగు, మొ.) పేరుకొన్న ముద్ద. (చిన్నముద్ద-చి. ని-దుర్మాంసఖండము. శ. ర-సూ. కుదప. బ్రౌ, నా.)

క. అత్తజి వెన్నెలచేం దసు,కొత్తునజాండమున
బుక్కుముక్కుం చంద్రుండు భా,స్వత్కరకలశీంగు
దుపల,మొత్తముతోం దేలువెన్నముద్దం జో
లెన్. బహు. ౩. ౫౬.

**కుదుపు**. (బ్రౌ, నా.) స. క్రి. కదలించు.
ఉదా: బండి కుదుపుచున్నది.
పొగపులో వేసి కూర కుదిపినారు.
వి. కదలిక, చలనము.
ఉదా: బండికుదుపుచే నడుము నొప్పిపెట్టినది.

**కుదుము**. వి. కందు, పాప.

క...తలమాసు(సి?) వోని నెత్తురుకుదుములన్, నే
నానిం జేసి రక్షన,దానవపతిమీందం నడవంద
గు నే నియన్. కు. సం. ౧౧. ౫౩౧. ('ముద్ద' అని వ్యాఖ్య. ప్రయోగాంతరము లేదు. 'కందున్' అనియు నవవచ్చును.)

**కుదురు**. అ. క్రి. (క. కుదురు. త. కుదిర్.) ౧. కుదురుపడు, నెలకొను.

సీ. గుబ్బపాలిండ్లకు గుదిరెం గ్రొం జెమటలు తీరై
నచెక్కిళ్లు తెలివి దప్పె. గంధ.౨౧౨,౧౪౬.

౨. సరిపడు, పొసంగు.
ఉదా: వానికిని వీనికిని సంఘ కుదుర లేదు. వీనితో బేరము కుదురదు. ఆమె మెడకు ఈపట్టెడ కుదుర లేదు. వైశ్వదేవమునకును వారపుభోజనమునకును కుదురదు. కులిమకనికిని పడుచుపెండ్లామునకు నెట్లు కుదురును.
౩. స్థిరపడు.
ఉదా: మొన్న నే వానికి పెండ్లి కుదిరినది.
౪. లభ్యమగు, దొరకు.
ఉదా: వానికిఇంతవఱకును ఇల్లు కుదిరినదికాదు.
ఆవిద్యార్థి కింకను వారములు కుదుర లేదు.
౫. చక్కంబడు, బాగుపడు.
ఉదా: వానికి వ్రాంత యింతవఱకు కుదురలేదు.
౬. ఉపశమిల్లు, మాను.

క. మందు దినం గుదురు రోగము. వేమన.౧.౬౦.

సీ. అతనిపేరురమున నంటి కుమ్మక గాని గుబ్బల
పొగ రెట్లు గుదురు నమ్మ. కలు. శ. ౧౯.

వి. జా, అనా. ౧. పాదు, ఆలవాలము.

క. పెరుంగుదుట నిడినచూతం,బును నవమాలిక
యుంబోలెం బొలుపొంది రతం,దురు నమ్ము
గ్ధయు నేకా,ననమున నున్న పుడు నూత్న సౌ
భాగ్యమునన్. భార. విరా. ౫. ౪౦౨.

సీ. ఈసీరజానన దాన కుదురు చేసి వలపుబీజ
ము లెల్ల మొలవం బెట్టె. కు. సం. ౬ ౯౫౦.

సీ. క్రొవ్వారుజవ్వాదికుదురునఁ బెరిఁగిన చేమంతి యదన్న దే కోమలాంగి. విక్ర. ౫. ౧౯.

౨. మొదలు, మూలము.

సీ. కులపర్వతంబులు కుదురులు కదలి సంధులు వాసి తటములు దునిసి పడఁగ. హరి.ఉ.౯. ౨౨౦.

సీ. కుదురు నిండినచిన్ని గుబ్బచన్నులమీఁద ముత్యాలత్రిసరంబు మురువుఁ జూప. భీమ. ౧. ౧౦౪.

3. వంశము. (బ్రా)

(వ్యవ) వారందఱును ఒక్కకుదుటిలోనివారే.

౪. ఆస్పదము, స్థానము;ఆశ్రయము,ఆధారము.

ఉదా: ఇంతసేపటికి నాప్రాణములు కుదుటఁబడినవి.

గీ. ఓపి ధర్మార్థకామంబు లొకటి కొకటి, నాశమొందింపకుండంగ నడపవలయుఁ, గాక ధర్మంబు సెడ నర్థకామములను, గోరువురుషుండు నిందకుఁ గుదురు గాఁడె.భార.శల్య. ౨. ౩౦౨.

క. ఆ నెలఁతభాగ్య మెట్టిదొ, కాని ప్రవాసైకవృత్తిఁ గాంతుఁడు చనినం, దా నుండెఁ బుట్టినింట మ,నోనిగ్రహమునకు నెల్లనుం గుదురగుచున్. భోజరా. 3. ౬౫.

క. కోపము గల్గినచోటను,బాపము వర్తిల్లుఁ బాపపరులకుఁ గోప,వ్యాపారంబులె తోఁచును, గోపము పాపంబు నొక్కకుదురై నడచున్. వి. పు. ౧. ౧౯.

క. కరితురగరథపములరిఁ బొం,పెరిపోయెడు నా మలక్ష్మి పెంపున కెల్లన్, సరసిరుహనదన నీవ కు,దురుగా నొనరించెదం గుతూహల మెసఁగన్. భార. విరా. ౨. ౧౨౨.

౫. నెలవు, ఉనికిపట్టు.

ద్వి. తే యేల తగ బసవా యనఁ బరఁగు, నీయక్షరత్రయం బిటు లొక్కమాటు, చదువు నెవ్వం డేని ముదముతో నతని, వదనంబు శివునకుఁ గుదురు తాను...బస. పు. ౧. ౧౦౩ ౫౦.

చ. అలఘువినూత్నరత్నముల కన్నిటికిం గుదురై నగోవహణా,చలపతికేతి నీ వఖిలసద్గుణరాసుల కాలవాలమై...విక్ర. ౪. ౧౪.

౬. అగసాలెవానిపంపటి.

గీ. బొమ్మయును పేరియగసాలె పూఁటచెలిని, గోరి యలరింపుటకుఁ జపల్కుటఁ గాంచి, నీట నుంచినమేటివన్నియపసిండి, పూటె యనఁ గ్రుంకకడలిలోఁ బ్రొద్దు వ్రాలె.నీలా.3. 3

౭. చుట్టకుదురు. (బ్రా.)

౮. నిలుకడ, స్థైర్యము, స్వస్థత.

ఉదా: వానిమనసున కించెమాత్రమును కుదురు లేదు.

౯. కుదిరిక, పొందిక.

మ. ... ఈమేనిలోఁ, గుదు రీకన్నులబెళ్కు లీతళుకుఁగ్రొల్లో ప్పునన్నశృంగారము...ఉ.రా. ౪. ౧౯౦.

౧౦. వదువ.

క. అరచందమామ నేలిన,దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్, బరువంపుమొల్లమొగ్గల, దొరగాఁ బల్కుదురుఁ బల్కుదురు జవ్వనికిన్. విజ.వి. ౨. ౭౮.

విశే. ౧. స్థిరము, కదలనిది.

క. కుడితొడపై వామపదం, బిడి యితరము మీఁద నితర మిడి నిశ్చలతం, గడుఁ గుదురై కూర్చుండుట, పుడమి స్వీరాసనాఖ్యఁ బొలుచు మహాత్మా. కళా. ౫. ౧౫౪.

ఉదా:- వాఁ డొకచోట కుదురుగాఁ గూర్చుండఁడు.

జ: కుదిరిక, కుదురుకొను, కుదురుకోలుపు, కుదురుచు, కుదురుపడు, కుదురుపఱుచు, కుదురుపాటు, కుదురుసేయు.

**కుదురుకొ(కో)ను.** అ. క్రి. (√కుదురు) ౧. నెలకొను, ఉండు; ప్రవర్తిల్లు.

సీ. కేతకీతతిఁ గల్గుకృతవికాసస్ఫూర్తి కుందవాటి కలపైఁ గుదురుకొనియె. కవిక. ౨. ౬౧.

క. ఉదరము లోకంబులకును, సదనం బగు టెఱిఁగి శివుఁడు చటులవిషాగ్నిం, గుదురుకొనఁ గంఠబిలమునఁ, బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసముక్రియఁ. భాగ. ౮. ౨౪౫.

ఉ. వన్నియ మీఱ నన్నగరివాడలమేడలఁ గ్రీడలం గుదు,ర్కొన్న మెఱుంగుమిన్నలతకూనలకుం జెలులై నిలింపవి, ద్యున్నిభదేవ లిత్తు రళితుండవియుక్తవితీర్ణిభూరుహాళ్,త్పన్నసమగ్రసౌరభనితాంతలతాంతగుళుచ్ఛకచ్ఛటల్. వేం. పంచ. ౧. ౫౨.

౨. స్థిరపడు, పాదుకొను; స్వస్థమగు.

చ. కుదురుకొనెన్ గిరీంద్రములు కూర్మకులాగ్రణి జీవనస్థితిం, బొదలె...విక్ర. ౨.౭౦.

(రెండర్థములకును ఇదియే యుదాహరణము.)

౩. నిలుచు, నిలుకడ గలిగియుండు.

సీ. అడవిలోఁ గడుపడి యుడుగనియడుగులు కదలక యీచాయఁ గుదురుకొనెనె.వాల్మీ. ౨. ౧౨౧.

౪. కలుగు.

గీ.అర్థ్యగులు కోడిగములకై యాకు లెల్లఁ,ద్రుంచి శాఖావితానము ద్రుంచి వైవ,మోడువడి యుండె నది నిల్వ నీడ పట్టుఁ,గొమ్మయును లేమి తనయందుఁ గుదురుకొనఁగ. శుక. ౩. ౪౩౯.

**కుదురుకొలుపు(ల్పు).** స.క్రి.(√కుదురుకొను) నిలుపు, నెలకొల్పు.

గీ. తురగమేధంబుఁ జేసి కౌతుకముతోడఁ, గురుకులంబున సత్కీర్తి గుదురుకొలుపు. జై. భా. ౧. ౬౧.

గీ. మానసాంబుజకర్ణికామధ్యమునను,' గొన్ని దినములు శశిమౌళిఁ గుదురుకొల్పి, మీఁదిగాడ్పుఁ గ్రిఁగాడ్పుతో మేళవించి, భానుశశిమార్గములు గట్టువఱపి తగను. పి. శకుం. ౨. ౧౧౩.

సీ. కనుదోయిఁ దిన్నగాఁ గాటుక దీరిచి నుదుటిపైనునుఁగావు కుదురుకొల్పి.చంద్రా.౨.౩.

**కుదురుచే(ర్చు).** స. క్రి. (√కుదురు) కుదురఁజేయు.

(ఉపశమిల్లఁజేయు, మానుపు.)

ఉదా: ఆ వైద్యుఁడు మూఁడుదినములలో వానికి వ్యాధి కుదిర్చినాఁడు.

**కుదురుప(ర్ప)డు.** అ. క్రి. (కుదురు+పడు) ౧.స్థిరపడు.

సీ. మత్పాదభక్తి యాత్మను జనించినమాత్రఁ గొనసాగి జ్ఞానంబు గుదురుపడును. దశా. ౧. ౨౨౨.

౨. కట్టుపడు.

గీ. పరమమునిమానసాలానబంధనమునఁ, గుదురుపడ కుండు యాదవకుంజరంబు. పారి.౫.౮౦.

౩. తేఱు, స్వస్థమగు.

చ. వెలలి హజార మానృపతి వేల్పులు దవ్వగు దాఁకఁ జూచి మూ,ర్ఛిలి సచివోపచారములఁ జేసి కుదుర్పడి...కకు. ౪. ౧౬౧.

౪. నెలకొను.

సీ. కుదురుపడెను నెలకొనెను డొక్కొనె నన నేకార్థములు గాఁగ నెసఁగుచుండు. ఆం. భా. ౩. ౯౯.

**కుదురుప(ర్ప)ఱు(అ)చే.** స. క్రి. (√కుదురుపడు.) ౧. నెలకొల్పు, నిలుపు.

సీ. భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాఁడును నేఁడు గోరక్షణఖ్యాతిఁ గుదురుపఱిచె. పారి. పీఠి. ౧౮.

క.అన విని కిరీటి కర్ణను,తునిమస్తము రథముపైఁ

కుదుర్పఱచి మదిం, గనలుచు...జై. భా. 3. 3౭. (ఇట'పెట్టుకొను'అని భావము.)

గీ...ఎదఁ దాల్చి కుదురుపఱుపఁ,జాల కసురులు పఱచి రిక్ష్వాకుతిలక. ఉ.రా. 3.3౮౭.

౨. ధరించు, తాల్చు; పెట్టు, అమర్చు.

సీ....ఎదఁ బున్కసరములు కుదురుపఱచి.నీలా. ౧. ౧౩.

సీ. కీలుఁగొప్పునఁ బైఁడిగేదంగి రేకులు గొనలు గానంగరాఁ గుదురుపఱచి. నైష. ౭. ౧౧౨.

3. కలిగించు, ఘటించు.

సీ. పసివాడు దేరియున్న సరోజరాజికిఁ గుదుర సౌభాగ్యంబుఁ గుదురుపఱచి. కవిరా. ౫. ౨౧౭.

**కుదురుపాటు.** వి. (√కుదురుపడు) స్థైర్యము,నిలుకడ.

గీ. కొసర నెఱుఁగనికూరిమి కుదురుపాటెఱుఁగనిదిట్టంబు నిలుక డెఱుఁగనిమనము,నై పతికిఁ దమి రేఁచె నత్యధిక లీల, నంగనామణి నూతనసంగమంబు. చంద్రా. ౬. ౧౮౭.

**కుదురుసే(చే)యు.** స. క్రి. (√కుదురు)చక్కఁజేయు, బాగుపఱుచు.

సీ. వ్రేలివంకరమాత్ర వీఁగ నొత్తఁగ లేఁడు కుదురుసేయఁ గలండె గూనువీఁపు. రామలిం. ౭3.

**కుదులు.** అ. క్రి. ౧. (నిద్రనుండి మేలుకొనునపుడు) కదలు.

ద్వి. నాపతి భూపతి నాపాటుఁ జూడ,నోపక నాచీర నొకసాము చించి, యది కట్టి నను విడనాడి పోయినను, కుదులుచు నే మేలుకొని లేచి విభుని,గానక యేడ్చుచు...ద్వి. నల. ౪, ౨౨౨.

౨. అదురు, చలించు. (శ. ర.)

జ: కుదిలించు, కుదిలిక, కుదులుకొను.

**కుదులుకొను.** అ. క్రి. (√కుదులు-స్వార్థమున 'కొను') ౧. కంపించు, వడఁకు.

క. అది యత్తఱిఁ గుదవ నతనిం, గదియంబడనిచ్చి వెఱపు గలదానిగతిన్, గుదులుకొను నేల బునకొ,త్తెద వను నే నెట్లు చేపడితి నను నడలున్. వేం. పంచ. ౪. ౫౦౨.

౨. విలవిలఁగొట్టుకొను ?

ద్వి ... బాలుఁ,బడ వైచి కుదులుకోఁ బదముల నూఁది, మెడ ద్రొక్కి...నవ. ౪. ౧౩౯ పా. ౧౧ పం.

చ...వెలంగమ్రానితోఁ, జదియఁగ నొక్కఁబెట్టుగొని చంపెఁ గుమారుఁడు వేఁగ రక్కసుం, గుదులుకొనంగ బాలకులు కో యని యార్వ నఖర్వలీలతోన్. భాగ. ౧౦ పూ. ౪3౫.

**కుదువ.** వి. (త. కుదువై.) ౧. తాకట్టు, అధి.

సీ. తాకట్టు కుదువ యుద్ధర వారకం బీ డనంగను నాధి చెలంగుచుండు.ఆం.భా.౨.౨౯.

సీ. ధననారములు చోరతతులపా లయ్యెను సొమ్ములు కుదువను సాగసి చనియె. శుక. ౨. 3౬౦.

౨. న్యాసము, దాఁచుకొన్నధనము.

గీ. కుదువ యనఁగను సుపనిధి పొదలు శర్వ. ఆం. భా. ౨. ౨౬౭.

కుదువపెట్టు=తాకట్టుపెట్టు,అధిపెట్టు.

సీ. విత్తంబు చాలనివిభవంబు కొఱగాదు కుదువపెట్టఁగ రాదు కుంచినంబు. రామలిం.౪౯.

**కుదృష్టి.** సం. విశ. (ఇ) కుదృష్టికలవాఁడు. వి.ఇ. స్త్రీ. ౧. దుర్బలమగుచూపు. ౨. దృష్టిదోషము,కనుఁబాటు. 3. పాషండాదిదర్శనము, అవైదికసిద్ధాంతము.

**కుదేహుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) కుత్సితదేహము గలవాఁడు. వి. అ. పుం. కుబేరుఁడు.

**కుద్దాల(ర)ము.** సం. వి. అ. పుం-భూమిని చీల్చునది-౧.గుద్దలి. ౨. కోవిదారము, కాంచనముకి.

కుద్రంక(గ)ము. సం. వి. అ. పుం. ౧. కావలి కాచుటకై మంచెమీఁదఁ గట్టినయిల్లు.

కుద్రవము. సం. వి. అ. పుం. కోద్రవము, ఆరుగలు, ఆళ్లు.

కుధరము. సం. వి. అ. పుం- భూమిని ధరించునది- కొండ.

కుధాన్యము. సం. వి. అ. న. కుత్సితధాన్యము. (ఆళ్లు, చామలు, కొఱ్ఱలు, మొ.)

కుధ్రము. సం.వి. అ. పుం- భూమిని ధరించునది- కొండ.

కునఖము. సం.వి.అ.పుం.గోళ్లకు పుప్పి కలిగించెడి రోగవిశేషము.

కునఖి. సం. విశే. (న్. నీ. న్.) కునఖరోగము గలవాఁడు.

కునటము. సం. వి. అ.పుం. శ్యోనాక భేదము,ఒక విధమగు దుండిగము*.

కునటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మణిసిల. (నేపాలదేశపుమణిసిల. వై. ని.) ౨. ధన్యాకము, దనియాలు. 3. నైపుణ్యములేని ఆటకత్తె. (కల్ప.)

కునదిక. సం. వి. ఆ. స్త్రీ. చిన్న యేఱు. సం.పంచ. ౧. ౨౬.

కునలి. సం. వి. న్. పుం.అగస్త్యవృక్షము,అవిసె* (త్రి. ని.)

కునాభి. సం. వి. ఇ. పుం. ౧. వాత్య, సుడిగాలి. (త్రి. ని, వాచ.) ౨. నిధి భేదము.

కునాశకము. సం. వి. అ. పుం. యాసము, తీఁటకసింద*.

కునాళిక. సం. వి. ఆ. స్త్రీ. పక్షిశాల. (వై.ని.)

కునికిపడు. అ. క్రి. నిద్రచే తూఁగిపడు*. (చూ. కునికిపాటు.)

కునికిపాటు. వి. (√కునికిపడు) నిద్రచే తూఁగిపడుట, ప్రమీల, తంద్ర.

(వ్యవ) కూర్చుండి వాఁడు కునికిపాట్లు పడుచున్నాఁడు.

కునిస్టి. విశే. కుంటివాఁడు.

సీ. ఖంజుఁడు కుంటి వాఁగఁ గునిస్టి వాఁగఁ దోఁచును...ఆం. భా. ౨. ౧౨౨.

కునుకు(న్కు-). అ. క్రి. ౧. నిద్రచే తూఁగు, తూలు.

ఉదా: వాఁడు కూర్చుండి కునుకుచున్నాఁడు.

౨. తగ్గు, నిస్తేజ మగు.

ఉదా:- దీపము కునుకుచున్నది ఎగసనఁ ద్రోయుము.

వి. అల్పనిద్ర.

సీ. ధన మున్న నృపవహ్నితస్కరభయచింతఁ గునుకు కంటికి రాక కుందుచుండు. రామలిం. ౭.

ఆ. ఈతఁ డనెడుమాట లెల్ల బూటకములు,కూలి సేయుచుండి కునుకఁ జెండె. చెన్న. 3. ౪౨౮.

(దుర్జనవర్ణనము) సీ. చోర సేమఱించి ముంచుకొను ప్రవాహంబు కునుకుపట్టినఁ జుట్టుకొను దవాగ్ని. రామలిం. 3౧.

జః కునికిపడు, కునికిపాటు.

కున్న=కున్నె, కూన. వి. (సం.కుణకః. క.కున్ని.త. కుంచు. తు. కిన్ని.) బుడుతఁడు, శిశువు.

క. నిన్నింతవానిఁ జేసిన, యన్నాలుగుమోముల తఁడు హరిపొక్కిటియం, దున్న వెలిదమ్మి యీనిన,కున్న యగుట తెలిసి విడువు కోపము తండ్రీ. నృసిం. ౫. ౨౭.

ద్వి. పున్నెంబు నేసినపొలఁతులు సెలల, నెన్నఁ దొమ్మిది మోచి కున్నలఁ గంద్రు. బస. పు. ౧. 3౫౮ పా.

జ: కున్నఁడు.

**కున్నఁడు.** వి. (√ కున్న) బాలుఁడు, బిడ్డఁడు. (బ్రా, శ. ర.)

**కున్నె**=కున్న.

ఉ. వెన్నెలవన్నెలాఁడి సెలవి న్నెలకొ ల్పెడు నవ్వుఁబువ్వుచాల్, క్రొన్నెలకున్నెలా గుసఁ డళుకన్ను నిక్కినయున్న నెన్నొసల్, పె న్నెలమన్నెలంపమును చేరొన్ను బిత్తరిమో ముఁదమ్మియుఁ గ్, మి న్నెలమి న్నెలంతతలమి న్న మిటార పుఁగొనుదీఁగయుఁ గ్. రా. వి. ౪. ౯౧.

**కుపకము.** వి. శకటభేదము.

ద్వి. కొల్లారుబండ్లును గుపకపుబండ్లు, గొల్లెనలందు నెక్కొన్నుచాఁపబండ్లుఁ, గర మర్థితో నెక్కి...ద్వి. భాగ. ౨. ౩౨ పా.

వ... ద్రౌపదీప్రముఖవధూజనంబులనుం దక్కనుం గలభరతభార్యల నందలంబులను గుపకంబుబండ్లను నిడికొని...భార. ఆశ్ర. ౨. ౭౮. (ప్రాఁత ప్రతులపాఠము.)

**కుపథము.** సం. వి. అ. పుం. కానిత్రోవ, చెడ్డదారి.

**కుపసము**=కుప్పసము.

(అవిక)

సీ. గురుపత్ని నా కొక్క కుపసంబుఁ గుట్టును చలిగాలి యొడలిపైఁ బొలయకుండ. కాశీ. ౭. ౪౦.

(పాముకుబుసము)

ద్వి. తనరారునాయంపతండంబుఁ జూడు, కుపసంబు లూడ్చినక్రూరసర్పముల, నుపమింప ననువులై యొడియు రాఘవుని. రం. రా. యు. ౩౭౪ పా. ౯ పం.

**కుపితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) కోపించినవాఁడు.

**కుపిని.** సం. వి. న్. పుం. కైవర్తుఁడు, జాలరి, చేఁపలవాఁడు. (త్రి. ని.) ఈ. స్త్రీ. చిన్న చేఁపలను పట్టువల, మావు. (విల్సను)

**కుపీలువు.** సం. వి. ఉ. పుం. కాకేందువు, కాకితుమికి.

**కుపూయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కుత్సితుఁడు, అధముఁడు, నిందితుఁడు.

**కుప్ప[1].** వి. (క. కుప్ప. త. కుప్పల్) ౧. (ధాన్యము మన్ను మున్నగునవి) రాశి, ప్రోగు.

ఉదా: వడ్లకుప్ప, మట్టికుప్ప, పేడకుప్ప, మొ.

సీ. చక్రవాకంబులచందంబు గొనివచ్చి కుప్పలు నేసిన ట్లొప్పు మెఱసి. భార. విరా. ౨. ౫౨.

గీ. ప్రోక యనఁ బ్రోవనంగను బ్రోగు నాఁగఁ, గుప్ప యన రాసి యనఁగను గువ్వ యనఁగ, రాశి యగు...ఆం. భా. ౨. ౧౦౧.

ఉ. పప్పును బిండివంటలును బాయసముల్ ఘృతముల్ గుడంబులుం, గుప్పలు గాఁగఁ జొట్టునును గూర్చఁగ...భీమ. ౨. ౧౩౯.

**కుప్పలుగట్టు**=కుప్పలు గా నేర్పడు, ప్రోగులు గా నేర్పడు.

ఉ... పెక్కులు ద్రెళ్లెఁ బీనుఁగుల్, కండలుఁ బ్రేవులుం గలిసి కాలువలై యెసలారె నెత్తురుల్, కుండలచాయను స్తములు గుప్పలుగట్టెఁ బుకంబువీగులక్. శే మూాస. ౨. ౧౧౬.

**కుప్పలుగొను**=కుప్పలగు, రాసులగు.

ద్వి... రాక్షసులఁ, జప్పళ్లు తఱుమగా సంగ్రామ భూమిఁ, గుప్పలుగొన నుకల్ గూల్చుటఁ జూవి. రం. రా. ఉ. ౭౮ పా. ౧౦ పం.

**కుప్ప తెప్పలు గా**=ప్రోగు ప్రోగులు గా.

గీ. కప్పురపుగంది వనిలోనఁ గలయ మొలఁగుఁ, గప్పురపుటంటిబోదెల నుప్పతిల్లి, కుప్ప తెప్పలు గా రాలుకప్పురంబుఁ, దనవగపుఁగప్పురంబును దడఁబడంగ. మృ. వి. ౨. ౧౫.

**కుప్పలుబుకు**= కుప్పలుకుప్పలు గా ఉబుకు; మిక్కిలి వ్యాపించు.

సీ. తాటంకమణిభానుధాళధళ్యంబులు చెక్కు

టద్దములపైఁ జిందులాడ,నవ్యహారప్రభా సై
గనిగ్యంబులు కుచపర్వతంబులఁ గుప్పలుబు
క. చిత్రభా. ౨. ౭౬.

జ: కుప్పఁగూర, కుప్పకోలుగొను, కుప్పగూలు, కుప్పగూల్చు, కుప్పతించు, కుప్పతిలు, కుప్పనఁగూర, కుప్పనఁగూరు, కుప్పవడు.

**కుప్ప²**. వి. (ఇది ప్రతు లన్నిటియందును పరుషాది గాఁ గనఁబడుచున్నది.గుప్ప?) పాణివిశేషము. (ఇది 'పుడిసిలి,కమికిలి' వంటి మానవిశేషము.)

సీ ...పాణివిశేషంబు పరఁగును గమి,కిలి కుప్ప
లప్ప పట్టిలి యన...ఆం. భా. ౨. ౧౪౧.

**కుప్పఁగూర(లు)**=కుప్పనఁగూర. క్రి.విశే. (√కుప్ప¹). కుప్పకుప్పలుగా, ప్రోగుప్రోగులుగా.

చ. ఎడ గని యబ్బలంబు గడు నేడ్తెఱఁ గిట్టి మ
హాస్త్రశస్త్రముల్, గడువడిఁ గుప్పఁగూరగఁ
జలంబునఁ బైఁ దొరఁగింప ... భార. ద్రో.
౩. ౧౫౨.

గీ. నీవు భీష్మున కలికినఁ బోవ దేను, గలుగ వెఱ
పేల యతనిపైఁ గవియు మెయిది,కొని మదీ
యబాణంబులఁ గుప్పఁగూర, పఱపి కూల్చె
ద నీతనిఁ బటురయమున. భార. భీష్మ. ౩.
౩౩౫.

మ. ...సముద్యద్వేగుఁడై తోలి తొ,ప్పఱఁ దె
ట్టెక్ శరజాలముక్ బిఱుదఁ గుప్పంగూర
నాటించుచుక్. నిర్వ. ౫. ౯౯.

చ. హిమగిరిసానుదేశమున నెక్కుడు వైభవ ము
ల్లసిల్ల యజ్ఞము దగఁ జేసి భూమిసురసంఘ
ము లెల్లను దృప్తిఁ బొంద హేమ మొసఁ
గఁ గుప్పఁగూరలు సమగ్రకుతూహలుఁడై
కనత్సువర్ణమయగృహక్రియోపకరణ ప్రక
రంబులు నిచ్చె భక్తితోక్. భార. అశ్వ. ౧.
౩౧.

**కుప్పకోలుగొను**. అ. క్రి. (√కుప్ప¹) నిండుకొను, మెండగు.

వ... ఆర్తరవంబులు కుప్పకోలుగొన గర్జించు
తెఱంగు లెఱింగికొని ... కంచివీరశరభకవి
కృతహరిశ్చంద్రోపాఖ్యానము. ౩.౬౧.(బ్రౌ)

**కుప్పగూలు**. అ. క్రి. (కుప్ప¹ + కూలు) కుప్పగా కూలు, ప్రోగుగా పడు.

సీ. అస్తోకతరతారకాస్తోమములతోన గోపురంబు
లమఱుల్ గుప్పగూల. భా.రా.యు.౪౯౯.

ఉ. వాహనసూతయోధరథవర్గము లొక్కటఁ
గుప్పగూల నా,గోహకపాతముల్ బెరయ
మ్రోయుచు దంతులు మ్రొగ్గ...భా. రా.యు.
౫౩౧.

సీ. మీఱుచు నేట్లాడు కాయపోతులకొమ్ము చప్పు
ళ్లఁ బులుఁగులు కుప్పగూల.యయా.౧.౪౪.

**కుప్పగూల్చు**. స. క్రి. (√కుప్పగూలు) కుప్పలుగాఁ బడవేయు, రాసులుగాఁ గూల్చు.

గీ. నిరతిశయముగ నాప్పలు నింగి ముట్టఁ, గుప్ప
గూల్చె నిశాచరకోటి నపుడు. భా.రా.యు.
౧౯౬౫.

ద్వి. సేనాసమేతుఁడై చెలఁగి ప్రేరేఁప, వాని
నాతనిసేన వడిఁ గుప్పగూల్చె. రం. రా. ఉ.
౭౪ పా. ౨౪ పం.

**కుప్పట**. వి. ఒకవిధమైనకూలి? (ఇది 'కూలి'శబ్దమునకు అనుప్రయుక్తమై కన్పట్టుచున్నది.)

క. ఆయిండ్లఁ గూలి కుప్పట, లాయముగా నొరు
నధీనరై మనునొకవ,న్నీయసి వేఁగినమది
లోఁ, బాయనితమి మ్రొక్కి నిలువఁబడి యి
ట్లనియెక్. వేం. పంచ. ౫. ౪౩.

**కుప్పటగురిగింజే**. వి. బాలక్రీడావిశేషము.

సీ. దాఁగిలిమూఁతలు తనుబిల్ల యాలంకి కుప్పట
గురిగింజ కొండకోఁతి. హంస. ౩. ౧౪౬.
(బ్రౌ. పా. 'గుబ్బటగురిగింజ' ముద్రి. పా.)

**కుప్పతించే**. స. క్రి.(√కుప్ప¹) కుప్పలుగా పడఁజేయు.

మ...క,న్గొలుకుల్ నిప్పులఁ గుప్పతిల్లఁ...సమీర. ౭. ౧౨౭.

**కుప్పతిలు(ల్లు).** అ.క్రి.(√కుప్ప¹) కుప్పలుగాఁ బడు, ప్రోగుగాఁ బడు.

క. అప్పుడు కన్నుల నిప్పులు, గుప్పతిలఁగఁ గెరలి పండ్లు గొఱుకుచు వాఁ డా, చొప్పునవచ్చి నన్నిటఁ, దప్పక వీక్షించి ప్రల్లదంబునఁ బలికెన్. వేం. పంచ. ౧. ౬౦౭.

కుప్పతిలఁబడు=కుప్పతిలు.

ఉ. కూలినభద్రనాగములు కుప్పతిలంబడు తేరులున్ ధరన్, వ్రాలెడుఘోటకంబులు నవారణ మ్రగ్గెడువీరయోధులున్...జై.భా.౫.౫౭.

**కుప్పనఁగూర(లు)**=కుప్పఁగూర. క్రి.విణ. కుప్పకుప్పలుగా, ప్రోగుప్రోగులుగా.

క. అప్పుడు గురుతనయాద్రిం, గప్పఁగ వజ్రోపమానకాండములు వెసం, గుప్పనఁగూర వఱచునరుఁ, డప్పరుసఁదనమున కోర్చి యతఁడు పెనంగెన్. భార. కర్ణ. ౨. ౨౯౮.

క. అప్పుడు సతియును బతియును, నొప్పగ సమదృష్టి నుండి రుచితాసములై, కుప్పనఁగూరలుగా మరుఁ, డప్పువ్వులకోల లేయ నదవయ్యెననన్. భోజరా. ౭. ౧౨౫.

**కుప్పనఁగూరు.** స.క్రి.(√కుప్ప¹) గుంపుగూడు.

ఉ. అప్పుడు శౌరిఁ జూచు ప్రమదాతిశయంబు హృదంతరంబులం, జిప్పిల సంభ్రమించి కయిసేయుతెఱంగయథాతథంబు గాఁ, గుప్పనఁగూరి యొండొరులఁ గూడఁగ నీక కడంగి వేలుపుం, గప్పురగందు లెక్కిరి ధగద్ధగితోన్నతహర్మ్యరేఖలన్. పారి. ౩. ౧౧.

**కుప్పము.** వి. (క.కొప్ప.త.కుప్పమ్.) ౧.గ్రామము, ఊరు.

సీ. ఊరు కుప్పము గ్రామ మొప్పు ... ఆం. భా. ౨. ౨౩.

౨. పల్లెవాండ్రగూడెము, బెస్తపల్లె. (శ.ర.)

**కుప్ప(లు)వడు.** అ.క్రి.(√కుప్ప¹)౧. కుప్పగాఁ గూడు, ప్రోగగు, పుంజీభవించు.

క. వరపతి గని యరు పండఁగ, ధరఁ బ్రేవులు గుప్పవడఁగఁ దనుఁ గొట్టినమ,ల్లరముకుతిక గఱచుక తా, సరిచావుగఁ జచ్చె నొక్కజాగిల మచటన్. చంద్రా. ౨. ౯౮.

క. అప్పుడు తపసులు తమలో, నెప్పరమ తీఱె నేమిటికి నిఁక నిచటం, గుప్పలువడి నిలువఁగ రం, డెప్పటితావులకు పోద మిందఱ మనుచున్. వరాహ. ౧౦. ౩౮. అచ్చ. రా. యు. ౯౦.

౨. స్తంభించు.

సీ. కాళ్లు కుప్పవడంగఁ గదలఁజాలక యట్టె నిదుమునుం గిడి శయనించు చెలువ. దశా. ౮. ౮౫.

**కుప్పసము**=కుపసము, కుబుసము1, కూసము. వి. (సం. కూర్పాసః. ప్రా. కుప్పాసో. క. కుప్పస. త. కుప్పాయమ్.) ౧.కంచుకము.

(క) చొక్కా.

సీ. తనుకుఁ గ్రొవ్వాఁడిబెబ్బులి కోఱ చేయమ్ము గుత్తంపు టెలుఁగుతో లుక్కుప్పసంబు. చంద్రా. ౨. ౩౮.

క. తొడిగినకుప్పస మూడ్చిన, పదుపున నారాజు మేన వసియించినయా, కడిఁదిరుజ లెల్లఁ బాసిన, నొడలూప్పె సువర్ణభాతి నుజ్జ్వల మగుచున్. భోజరా. ౧. ౧౩౭.

ఉ. వెన్నెలకుప్పసం బిడినవింతవిలాసము వాసికెక్కఁగాఁ, గిన్నరకంఠి యొత్తు మరుకీర్తి యఁ బోనిపటీరపంకము, న్విన్ననువొప్పఁగా నలఁదె నిద్దపుఁజాయ మెఱుంగునం బదా, ర్వన్నెపసిండితోడ నొరవచ్చు నృపాలునియంగకంబులన్. నైష. ౬. ౫౦. (వెన్నెలకుప్పసము = వెన్నెలవంటి సన్నని తెల్లచొక్కా.)

(చ) అవిక.

ఉ. కుప్పసము ల్వదల్చి వలిగుబ్బల నొత్తిరి...అ
ధీశు...కామినుల్. ఆము. ౫. ౧౦౪. రా. వి.
౫. ౨౫.

౨. పాముకుబుసము.

క. మంగళచరిత్ర యగుసీ,తాంగన నపహావభీ
తుఁ డగునాకుఁ ద్యజింపంగ నగు నేఁడు దు
ష్టభు,జంగము తనప్రాఁతకుప్పసం బూడ్చుగ
తిఁ. జై. భా. ౬. ౪౭. విప్ర. ౧. ౨౫.ఆం.
భా. ౧. ౧౪౮.

కుప్పి[1]. వి. అహాస్పష్ప, సదాపకి.

ఆ. కుప్పిచూపు నూతి గొంటుపోఁకం తేసి, మూఁ
డుదినము లియ్య ములుచ యుయున, చలువవేఁ
కి దీఱు ఘర్మ గాకున్నను, నిది విచిత్ర మను
చు నెల్ల రనఁగ. చికి. (చి. ని.) హంస. ౪.
౧౦.

కుప్పి[2]=కుప్పె.

సీ...కాచము విలసిల్లు గా జనంగఁ, బింగాణి కు
ప్పికుప్పియ కుప్పె యనఁగను దత్కృతచష
కాఖ్య తనరుచుండు. ఆం. భా. ౭. ౭౮౦.

కుప్పించు. అ. క్రి. (క. కుప్పుసు.) ౧. దూఁకు
టకు ముందు కాళ్లు కదియఁబట్టి నేల నదుము.

సీ. బిట్టూని కుప్పించుపృథుపాదములవడి శేషాహి
ఫణములు సెదరిపా.. భా. రా. సుం. ౫౧౮.

(మా కూపరంగము) సీ. చందునినెత్తితో సమరం
బునకు నేఁగుపగిదిఁ గుప్పించి యుప్పర మె
గయును. భా. రా. ఆర. ౭. ౫౩.

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి గ
గనభాగం బెల్లఁ గప్పికొనఁగ. భాగ. ౧.
౭౭౭.

౭. దుముకు, దూఁకు.

మ...అంఘ్రు లిఱియంగాఁ బెట్టి బిట్టూఁది గ్ర,
క్కున నక్కొండ యడంగఁ ద్రొక్కి పయి
కిం గుప్పించి లంఘించుచోఁ. రామా. ౬.
౯౩.

వ...అప్పాలదిండియొడయఁడు కొండపైనుండి
కుప్పించుకోదమసింగంబు తెఱంగునఁ బుడ
మి కుతికి...అచ్చ. రా. యు. ౩౮౫.

సీ. ఉప్పరం బెగసి వే కుప్పించి రథరథ్యరథిక
లఁ దుముకుగా రాచి వైచు. రాజ. చ. ౭.
౨౫.

కుప్పిగంతు. వి. (√కుప్పించు?) చిన్నదుముకు, చి
న్నగంతు.

శా...ఈవీటఁ బోరాడుటల్, వ్రేతల్ సూడఁ
గఁ గుప్పిగంతు లిడుటే వీక్షింపు గోపార్భ
కా. భాగ. ౧౦ పూ. ౧౩౩౨.

సీ. అబ్ధి లంఘించినహనుమంతుముందఱ గణన
కెక్కునె కుప్పగంతు లెల్ల. హరిశ్చ. ౧. ౧౪౬.

(బ) బాలక్రీడావిశేషము.

సీ. కుప్పగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్లదీవులు
గొబ్బిళ్లు గూవనాలు. గీ. ఆదిగా శైశవక్రీడ
లాడి రపుడు, రామకృష్ణులు గోపదారకులఁ
గూడి. వి. పు. ౨. ౭౦౭.

జః కుప్పగంతుగొను.

కుప్పిగంతుగొను. అ. క్రి. (కుప్పిగంతు+కొను)
దుముకు, గంతువేయు.

ఆ. వ్యోమకేశుజడలనుండి యవ్వాహిని, కుప్పిగం
తు గొనినఁ గ్రుంగె ధరణి. భోజరా. ౨. ౩౯.

కుప్పీలు. వి.బ. బాలికాక్రీడావిశేషము. (శ.ర.)

కుప్పె(ప్పియ)=కుప్పి[2]. వి. (సం. కూపీ. క. త.
కుప్పి.) ౧. కాచాదిపాత్రవిశేషము.

గీ. గాజుకుప్పెలఁ గస్తూరికాజలంబు, కర్ణికారాం
బపై నించెఁ గర్ణమోటి. భీమ. ౫. ౧౧౫.

వ. ...కప్పురంపుఁగుప్పెలం గొప్పరించినసరస
మధురసంబులు...పారి. ౭. ౫౭.

ఆ. గాజుకుప్పెలోనఁ గడఁగుచు దీపంబ, దెట్టు
లుండు జ్ఞాన మట్టు లుండుఁ, దెలిసినట్టివారి
దేహంబులందును...వేమన. ౧. ౯.

౨. గిండి లోనగువాని మీఁది మూఁత.
క. చాలఁగ నమృతము వోలుఁడు, క్రోలుటకై నినిచి కనకకుంభంబులపైఁ, నీలపుఁగుప్పెలు నిలిపిన, పోలికఁ జను మొనలఁ గప్పు పాలఁతికి నొప్పెన్. నృసిం. ౩. ౧౩౨.
౩. సవరమునకు మొదట నుండు గ్రంథి.
గీ. అడర బెడఁగైననిడువాలుజడ సడల్చి, కుప్పెగన్పడ సవరంపుఁగొప్పుఁ బెట్టి, మురియు ముంగిట నిలుమండి మొలకనగవు, లెసఁగ విటభాగ్యరేఖ యా హేమరేఖ. హంస. ౧. ౨౧౬.
గీ. కడియములు కెంపురవలయుంగరము వెండి, కుప్పెసవరంబు కుఱుమాపుకూనలమ్మ, చీర... శుక. ౨. ౪౧౧.
౪. గొడుగుమీఁదిగుబ్బ, బొగడ.
ద్వి. పెద పెద్దపసిఁడికుప్పెలు మీఁద నొప్పఁ, బ్రవిమలం బగు నెనుబది వేలసంఖ్య, ధవళాతపత్రముల్ దనుజాలు పట్టె. రం. రా. యు. ౩౪౯ పా. ౨౨ పం.
౫. ఇత్తడి లోనగువానితోఁ జేసి యెద్దుకొమ్ముకొనఁ దగిల్చెడితొడుగు. (శ. ర.)
౬. కత్తియొఱకు చివర నమర్చుతొడుగు.
సీ. కోశాంతకోశాదిగుప్తిభూషలు కుప్పె యన నరడాయన నగుఁ గ్రమముగ. ఆం. భా. ౨. ౨౧౫.
౭. (ఔషధముయొక్క) ఉండ.
(వ్యవ) వసంతకుసుమాకరము కుప్పెలుకట్టి యమ్ముచున్నారు.
జ: కుప్పెకోల.

కుప్పెంట. వి. హరితమంజరి, మూరుకొండికి. (శ. ర, వా.)

కుప్పెకోల. వి. (కుప్పె+కోల.) బాణవిశేషము, క్షుద్రకము. ('అలుఁగు లేని బాణము' అని బ్రౌ.)
సీ. కవిసిన నతఁడు వికర్ణునిధ్యంబులఁ గూల్చి యాతనిపయిఁ గుప్పెకోల, లిరువది నాటింప ... భార. భీష్మ. ౨. ౩౯౩.
వ... సాత్యకి తత్తిమి మన మొన నుఱుము చేయుం దొడంగిన ద్రోణుండు మాఱ్కొని యిరువదేనుకుప్పెకోలల నతని చేత నేటులువడి ... భార. ద్రో. ౩. ౨౭౦.
శ్లో. సాత్యకిః పంచవింశత్యా క్షుద్రకాణాం సమార్పయత్. సం. భార. ద్రో. (శ. ర.)
ద్వి. అప్పటనుండి యాయవనుండు నృపునిఁ, గుప్పుచున్నాఁడు పూఁగుప్పెకోలలను. ప్రభు. ౬౬ పా. ౨౦ పం.

కుప్యత్. సం. శత్రృ. కోపగించుచున్న.

కుప్యము. సం. వి. అ. న. వెండి బంగారు కాక తక్కినలోహము.

కుప్యశాల. సం. వి. ఆ. స్త్రీ. వెండి బంగారు కాక తక్కినధాతువులచే పాత్రాదులు చేయుకొట్టు, కాంస్యాదిపాత్రనిర్మాణశాల.

కుప్రియము. సం. విణ. (అ. ఆ. అ.) జఘన్యము, అధమము, నింద్యము. (హలా. ని.)

కుప్లవము. సం. వి. అ. పుం. తృణాదులచే నిర్మితమగు తెప్ప.

కుబుసము[1] = కుప్పసము.

(చొక్కా.)

ఆ. పుణ్యపాపకర్మపుంజనిబద్ధమై, తొడిగినకుబుసంబువడువు దాల్చి, జీర్ణమగుచు నుండు చెనఁటి దేహంబున, యుండు నీవు మమతఁ బొందవలదు. సూర్య. ౩. ౧౦౪.

(నిలువుటంగీ.)

గీ. కావికుబుసంబు జలకుండికయును బూని. మనుచ. ౧. ౫౯.

(పాముయొక్క కూసము; చర్మము.)

సీ. కుప్పస మనఁగను కుబుసం బనంగను గంచుక నామంబుగాఁ జెలంగు. ఆం. భా. ౧. ౧౪౮.

సీ. కుబుసంబు విడిచినకోడమనాగము కేవ దొన వెడల్చినపువ్వుఁదూపుసరణి. పరమ. ౨. ౩౧. (వాసుకివర్ణనము) సీ. పగిలి బీఁటలువాఱితగఁడెత్తెఁ గుబుసంబు తోరంపువెల్లులితునుకలట్ల. భీమ. ౪. ౧౩౦.

ఉ. .... మహాఖిలముగాఁగ వ్యాళవిభుఁ డెన్నలుఁ గీడ్చినమాడ్కి నీడ్చె నబ్బాలికుఁ గాలభైరవుఁడు పైకుబుసం బొకపోరువెత్తఁగ౯. పాండు. ౪. ౨౫౪.

**కుబుసము².** వి. తలుపునకు క్రిందుమీఁదుల నుంచెడికూచము. (శ.ర-తలుపు ఉతక.అని బ్రా.)

**కుబేరకము.** సం. వి. అ. న. కుత్సితదేహము,కురూపము. (వై.ని.) పుం. నందివృక్షము.

**కుబేరాక్షము.** సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము.

సీ. క్రీడించు నొకవేళఁ దోడిబాలురఁ గూడి యక్షిణగతిఁ గుబేరాక్షకేళి. పాండు. ౪. ౧౩౪.('వెన్నెలకుప్పలయాట'అని వ్యాఖ్య)

**కుబేరాక్షి.** సం.వి.ఈ.స్త్రీ.పాటల,కలిగొట్టు౯.

**కుబేరాద్రి.** సం.వి.ఇ.పుం. కైలాసము. (ఇట్లే: కుబేరగిరి, మొ.)

**కుబేరుఁడు.** సం.విణ.(అ. ఆ. ఆ.) కుత్సితదేహము గలవాఁడు. వి.అ.పుం.ధనదుఁడు,పైఁడిఱేఁడు. (ఇతఁడు విశ్రవసునకు ఇలబిలయందుఁ బుట్టినవాఁడు. రావణునకు సవతితల్లికొడుకు. మూఁడు కాళ్లును ఎనిమిదిపండ్లును మెల్లకన్నును గలవికృతదేహమువాఁడు-కల్ప)

**కుబ్జ.** సం.వి.ఆ.స్త్రీ. కంసునిగట్టువాలు,కంసునినగరి సైరంధ్రి.

**కుబ్జకంటకము.** సం. వి. అ.పుం. శ్వేతఖదిరము,వెలిచండ్ర౯. (రా. ని.)

**కుబ్జకము.** సం. వి. అ. పుం. ౧. తినిశము, సెమ్మి౯. ౨. మిక్కిలి పరిమళము గలపువ్వులతోఁ గూడినవృక్షవిశేషము, గొజ్జఁగ౯. (ఇదియే 'గులాబి' అని యొకరు.)

**కుబ్జము.** సం. వి. అ. పుం. ౧. గూను. ౨. వంపుకత్తి. ౩. అపామార్గము, ఉత్తరేను౯.

**కుబ్జిక.** సం. వి. ఆ. స్త్రీ. ఎనిమిదేండ్లయీడు గల కన్య.

**కుబ్జుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) గడులుఁడు,గూనువాఁడు.

**కుబ్రము.** సం. వి. అ. న. ౧. వనము, అడవి. ౨. హోమకుండము. ౩. కుండలము. ౪. తంతువు. ౫. శకటము, బండి. ౬. గృహము.

**కుబ్రహ్మ.** సం. వి. న్. పుం=కుబ్రహ్మఁడు.

**కుబ్రహ్మఁడు.** సం. వి. అ. పుం. కుత్సితబ్రాహ్మణుఁడు.

**కుభృత్తు.** సం. వి. త్. పుం. ౧-భూమిని భరించువాఁడు-రాజు. ౨-భూమిని భరించునది-కొండ.

**కుమారకము.** సం. వి. అ. పుం. తిక్తశాకము, ఉలిమిరిచెట్టు.

**కుమారజీవము.** సం. వి. అ. పుం. పుత్రజీవకవృక్షము.

**కుమారపాలనుఁడు.** సం.విణ. (అ. ఆ. అ.) పిల్లలను రక్షించువాఁడు. వి. అ. పుం-పిల్లవాఁడుగా నుండి ప్రజాపాలనము చేసినవాఁడు-శాలివాహనుఁడు.

**కుమారభృత్య.** సం. వి. ఆ. స్త్రీ. (వైద్య) కుమారరక్షణోపాయము, బాలకులను బెంచువెరవు.

**కుమారము.** సం. వి. అ. పుం. ౧. చిలుక. ౨. వరుణవృక్షము, ఉలిమిరి౯. ౩. సింధువదము. ౪. బాలగ్రహభేదము. ౫. శుద్ధసువర్ణము, చొక్కపుబంగారు.

**కుమారయువు.** సం. వి. ఉ. పుం. యువరాజు.

**కుమారవాహి.** సం. వి. న్. పుం. నెమలి.

**కుమారవ్రతము.** సం. వి. అ. న. నిత్యబ్రహ్మచర్యము, మరణపర్యంత ముండుబ్రహ్మచర్యనియమము.

**కుమారసువు.** సం. వి. ఊ. స్త్రీ-కుమారస్వామిని కన్నది-౧. పార్వతి. ౨. గంగ. పుం. అగ్ని.

**కుమారి.** సం. విణ. (న్. ఈ. న్) =కుమారులుగలవాఁడు. వి. ఈ. స్త్రీ. ౧. కూఁతురు. ౨. కన్య, పెండ్లికానిపడుచు. ౩. ఆఁడులేడి. (వై. ని.) ౪. పార్వతి. ౫. నదీభేదము. ౬. శ్యామాపక్షి. (రా. ని.) ౭. జంబూద్వీపముయొక్క అంశ మగుకుమారికాఖండము. (కన్యాకుమారి. హేమ. ని.) ౮. నవమాలిక, విరజాజిచె. ౯. ఘృతకుమారి, కలబందచె. ౧౦. అపరాజిత, విష్ణుక్రాంతిచె. ౧౧. పిన్నగోరంటచె. ౧౨. పీతసహా, పచ్చగోరంటచె. ౧౩. పెద్దయేలకిచె. ౧౪. కుస్తుంబురువు, కొత్తిమిరిచె. (శే. ని.)

**కుమారిక.** సం. వి. ఆ. స్త్రీ=కుమారి. వి.

**కుమారిలు(ల్లు).** అ. క్రి. ౧. కుములు, రాఁజు.

ఆ. జ్ఞాతికులము నూర్చి నూతఁ బోయక నాదు, డెంద మించుకైన డిందుపడదు, కానరాదు గాని లోనఁ గుమారిలు,చున్న దిపుడు రోషహుతవహంబు. ప్రబోధ. ౨. ౬౮.

౨. (లోలోపల) తపించు, ఉడుకు.

క. మానవతి యిట్లు మానని, మానక్రోధములచేఁ గుమారిలి చింతా,ధీనగతి నుండ... పారి. ౧. ౧౧౪.

ఉ. మాను దురంతవేదనఁ గుమారిల నేల పసిండికొండవిల్కాఁనివరప్రసాదమునఁ గల్గినవానికి హాని వచ్చునా. సారంగ. ౩. ౨౭౬. ప్రభా. ౩. ౧౨౪.

**కుమారుఁడు.** సం. విణ. (అ. ఈ. అ)-అందమున మన్మథుని క్రిందుపఱచువాఁడు- సుందరుఁడు. వి. అ. పుం. ౧. కొడుకు. ౨. (నాట్యోక్తియందు) యువరాజు. ౩. స్కందుఁడు, కొమరసామి. ౪. అయిదేండ్లలోపలిబాలుఁడు. ౫. అశ్వవారకుఁడు, గుఱ్ఱపువాఁడు.

**కుమారోపవాహము.** సం. వి. అ. పుం-కుమారస్వామి రెండవవాహనము-కుక్కుటము, కోడి.

**కుమాలకము.** సం. వి. అ. పుం. సౌవీరదేశము.

**కుమి=కుమ్మి.** వి. కుసూలవిశేషము, ధాన్యాదు లుంచుకొను నొకవిధమగుపాఁతర.

సీ... కుసూలాభిధ గాదె యనంగను గరిసె యనఁ గఁ. గీ. దద్విశేషసమాఖ్యలు దనరుచుండుఁ, గొట్టు కూటు పాడక కుమి బొట్ట యనఁగ. ఆం. భా. ౨. ౨౪౦.

**కుమిలించు.** స. క్రి. (√కుములు) కుములఁజేయు. (ఉడికించు.)

సీ. చెలిపాదములఁ బెట్టి చిగురులు గుమిలించి ఘనభీతిఁ గాఁ బికకంఠి యొకతె. చంద్రా. ౪. ౧౬౫.

**కుముఖము.** సం. వి. అ. పుం. సూకరము, పంది. (వై. ని.)

**కుముటు.** వి. ౧. కాసభేదము.

గీ... కాసంబు పేరు దనరుచుండు,నుబ్బస మనంగ దగ్గ నుక్కిస మనఁ,గాసభేదము కుముటు నాఁగను దనరు. ఆం. భా. ౨. ౧౨౬.

౨. వాంతికి ముందు కంఠబిలమున నెత్తువికారము. (శ. ర.)

అ. క్రి. వాంతికి ముందు కంఠమున వికార మెత్తు. (శ. ర.)

**కుముద.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గంభారి, పెదగుమ్ముడుచె. ౨. కుంభిక, నాఁచుచె. ౩. సాలపర్ణి, ముయ్యాకుపొన్నచె. ౪. కట్ఫలము, పినగుమ్ముడుచె. ౫. ధాతకి, ఆరెచె.

**కుముదఖండము.** సం. వి. అ. న. ౧. కుముదషండము, తెల్లగలువపెంపర. ౨. తెల్లగలువపుటుక.

**కుముదఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ-కలువలను చంపునది-ఒకానొకవిషక్షీరవృక్షము.

**కుముదబాంధవుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**కుముదము.** సం. వి. అ. పుం. న. (కే. ని.) ౧. కైరవము, తెల్లగలువ. ౨. రక్తపద్మము, ఎఱ్ఱదామర. ౩. రూప్యము, వెండి. ౪. దమనకము, బ్రహ్మజట యనెడియోషధి. పుం. ౧. నిరృతిదిక్కునందలి యేనుఁగు. ౨. కర్పూరము. ౩. శివునిశంఖము.

**కుముదాకరము.** సం. వి. అ. పుం. కలువ లుండుచోటు. (సరస్సు, మొ.)

**కుముదాభిఖ్యము.** సం. వి. అ. న. వెండి.

**కుముది.** సం. వి. ఈ. స్త్రీ. కట్ఫలము, పినగుమ్ముడుకే.

**కుముదిక.** సం. వి. ఆ. స్త్రీ=కుముది.

**కుముదికము.** సం. విణ. (అ. ఆ. అ) కుముదములు గలది. (సరస్సు, మొ.)

**కుముదిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లగలువతీఁగె. ౨. తెల్లగలువ లుండుచోటు. (కొలను, మొ.) ౩. తెల్లగలువతంపర, కుముదసమూహము.

**కుముదినీనాయకుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు, కలువలఱేఁడు.

**కుముదుఁడు.** సం. విణ. (ద్). ౧. సంతోషహీనుఁడు. ౨. కృపణుఁడు, లోభి. వి. అ. పుం. ౧. ఒకానొకవానరుఁడు. ౨. ఒకానొకనాగుఁడు. (వీనిచెల్లెలు కుముద్వతి రామపుత్రుఁ డగుకుశునిభార్య.) ౩. ఒకానొకదైత్యుఁడు.

**కుముద్వంతము.** సం. విణ. (త్. ద్వతీ. త్.) చాల కుముదములు గలది. (సరస్సు, మొ.)

**కుముద్వతి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లగలువతీఁగె. ౨. తెల్లగలువలసమూహము. ౩. తెల్లగలువ లుండుచోటు (సరస్సు, మొ.) ౪. ఒకానొకనది. ౫. కుశునిభార్య. (కుముదనాగునిచెల్లెలు.)

**కుములు.** అ. క్రి. ౧. రాఁజు, రవులు.

సీ. పూరజం బని చాల బొంకించి యమ్మగోకుమిలి నిగ్గులు దేరుకుమ్ము గుప్పి. చంద్రా. ౪. ౧౬౭.

౨. (లోలోపల) తపించు, ఉడుకు.

గీ. సవతి యాడినమాటలు సారెఁ దలఁచి, కొనుచుఁ బేర్చినదుఃఖాగ్నిఁ గుములు చుండె. భాగ. ౪. ౨౨౬.

ద్వి. వాలుఁగన్నుల నీళ్లు వఱదలై పాఱఁ, గొడుకున్నచందంబుఁ గుములుచుఁ జూచి. ద్వి. సారంగ. ౨. ౭౨ పా. ౧౬ పం.

క. అని బుజ్జగించి యొయ్యన, నెన రంటినమనముతోడ నెచ్చెలి పలుకన్, దనలోఁ గుములుచు సీమంతిని పై నిగనిగ నెలుంగునెలఁగని పలికెన్. చంద్రా. ౫. ౭౨.

౩. సడలు, బిగివీడు.

సీ. యౌవనస్తంభహైన్యంబున దేహంబు కుమిలి గుడారు నాఁ గుసియఁబడఁగ. దశా. ౨. ౧౩౯.

**కుమ్మకు.** వి. (హిం. కుమ్మక్.) సహాయము, తోడు. (శ.ర-'కుమ్మక్కు'అని వా.)

**కుమ్మర.** వి. కుండలు మున్నగునవి చేసి జీవించెడిజాతి, కులాలజాతి.

ఉదా: కుమ్మరవాఁడు, కుమ్మరది, మొ.

విణ. నలుపు, నల్లనిది.

ఉదా: కుమ్మరగువ్వ, కుమ్మరపానిక, మొ.

కుమ్మరస్వరూపములు = కుమ్మరి చేయుకుండలు మున్నగుపాత్రములు. (బ్రౌ)

జ: కుమ్మరగువ్వ, కుమ్మరచెట్టు, కుమ్మరత, కుమ్మరపురుగు, కుమ్మరపానిక, కుమ్మరపోలిక, కుమ్మరసాన, కుమ్మరసారె, కుమ్మరసారెచుక్క, కుమ్మరావము, కుమ్మరి.

**కుమ్మరగువ్వ.** వి. (కుమ్మర + గువ్వ.) పక్షివిశేషము, ఖంజరీటము. (శ. ర.)

**కుమ్మరచెట్టు.** వి. (√కుమ్మర) ఒకానొకచెట్టు. (శ. ర, బ్రా.)

**కుమ్మరత.** వి. (కుమ్మర + త) కుమ్మరది, కులాలస్త్రీ. (శ. ర, బ్రా.)

**కుమ్మరపురుగు(రువు, ర్వు).** వి. (√ కుమ్మర) కుమ్మరవానివలె ఎల్లప్పుడు మట్టిలో నుండుపురుగు, యమకీటము.

ఉ. కుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరపు ర్వని యందు రే కదా. (భట్టుమూర్తిచాటువు.)

**కుమ్మరపౌనిక.** వి. (కుమ్మర + పౌనిక) కృష్ణముంజము.

సీ...కుమ్మరపౌనిక నాఁగను గృష్ణముంజ మొప్పు. ఆం. భా. ౨. ౬౪.

**కుమ్మరపోలికి(ల్కి).** వి. (కుమ్మరపోలిక - శ. ర.) వృక్షవిశేషము.

సీ...గుమ్ముడు మోవి తపసియుఁ గుమ్మరపోల్కి గుగ్గిల మెఱ్ఱపోల్కి వేగి. హంస. ౪. ౧౧.

**కుమ్మర(రి)సాన = కుమ్మరసారె.** వి. (కుమ్మర + సాన) కులాలచక్రము. (బ్రా)

సీ. ఘనవర్తులావర్తగర్తభాగముల దిర్దిరను గుమ్మరసానరీతిఁ దిరుగు. దశా. ౧. ౧౯౫.

**కుమ్మర(రి)సారె = కుమ్మరసాన.** వి. (కుమ్మర + సారె) కులాలచక్రము, కుమ్మరవాఁడు కుండలు చేయుట కుపయోగించుచక్రము.

గీ. ధాత్రి కుమ్మరిసారెవిధమునఁ దిరిగె. భార. ఉద్యో. ౪. ౧౧౬.

చ. ... అత్తురగ మల్తకచక్రనయావలంబియై, తిరుగురయంబుచేత నెడ త్రెవ్వక కుమ్మరిసారెచాడ్పునం, బరఁగె... ప్రభా. ౨. ౩౪.

ఉ. కుంభిని దిద్దిరం దిరిగెఁ గుమ్మరిసారెవిధంబునన్ ...హరిశ్చ. ౧. ౧౭౧.

(బ) బాలక్రీడావిశేషము.

సీ. తుమ్మెదరేఁపుల్లు కుమ్మరసారెలు బందారుబన వన్నె పత్తికాయ. గీ...ఆడుకొనుచు. హంస. ౩. ౧౪౬.

**కుమ్మరసారెమేకు.** వి - కులాలచక్రాకృతి గలనక్షత్రము - విశాఖానక్షత్రము. (బ్రా, శ. ర)

**కుమ్మరావము.** వి. (కుమ్మర + ఆవము) కుమ్మరి కాల్చుట కేర్పఱచినకుండలు లోనగువానిదొంతర.

గీ. చక్రి పాదమంగఁ బార్థివస్థానమయ్యె, నోరి మీవంశమందుఁ దాఁ గోర్వఁ జాలు, వారిఁ జాపుము కుమ్మరావమున రాగి, మంతి రేఱంగఁ గలవె నీ కింత యేల. ఉ. హరి. ౩. ౪౭. రా. వి. ౫. ౯౯.

**కుమ్మరి.** వి. (కుమ్మర + ఇ - సం. కుంభకారః. ప్రా. కుంభఆరో, కుంభారో. క. కుంబఱ, కుంబాఱ) కుంభకారుఁడు, కుమ్మరవాఁడు.

సీ. ఇంక నాల్గావంబు లిడనైతిఁగా యంచుఁ గుమ్మరి నెమ్మదిఁ గుందికొనఁగ. శుక. ౨. ౫౬౩. ఆం. భా. ౨. ౨౭౨.

కుమ్మరి కొకయేఁడు గుదె కొక పెట్టు = కుమ్మరి యొకయేఁడు పడినశ్రమము ఒక్క కఱ్ఱదెబ్బతో వ్యర్థ మగును.

క. ఇది పెక్కేఁడులు పట్టెన్, సదనంబులు గట్ట నాకు శంభునికొఱకున్, దుదిఁ గుమ్మరి కొకయేఁడును, గుదె కొక పెట్టన్న మాటకున్ సరి వచ్చెన్. కాశి. ౨. ౯౯.

కుమ్మరి కొకయేఁడు గుదియ కొకనాఁడు = కుమ్మరి యొకయేఁడు చేసినపని కఱ్ఱ ఒక్కనాఁడు చెఱుపఁ గలదు.

ఆ. గతము చేసినట్టికర్మబంధము లన్ని, విరిసిపోవు సత్యగురునివలన, కుమ్మరి కొకయేఁడు గుదియ కు నొకనాఁడు. వేమన. ౨. ౧౨౭.

**కుమ్మరించు = క్రుమ్మరించు** స. క్రి - కుమ్మరిలఁ జేయు-

కుండ మున్నగువానినుండి జలాదిపదార్థములను అధికముగా వెలువఱుచు; మిక్కుటముగా వెలువఱుచు.

మ. తనతోయం బినరశ్మి లెత్త నిల వాత్యారేణు మూర్తి న్మహం, ద్రవకుం జెప్పఁగ మ్రుచ్చఁ బట్టి దివమందు న్విఘ్నటింపన్ భయం,బునఁ దద్రశ్మిసహస్రము న్వెసడిగెంబో డాఁగి వే గుమ్మరిం,ప నసన్ధారలు దోఁచె మించు వెలిఁగింప న్మబ్బులన్వోల్లిపై. ఆము. ౪.౫౩. (వ్రాఁతప్రతి పా.)

వ... గంపపాడిపాలుపును గుమ్మరించుకమ్మిల్లమల్లికాహల్లకవాసంతికాజాతికేతకీకుందకుసుమగంధంబులును...భీమ. ౧.౧౧౭.

సీ. గ్రుచ్చి చేతుల మేను ముచ్చుట్టు రాఁ జుట్టి దొమ్మియూర్పులతావి గుమ్మరించి. కవిక. ౪. ౧౬౬.

(వ్యవ) బిందెలోని అన్న మంతయు చాఁపలో కుమ్మరించినాఁడు. వర్షము కుండలతో కుమ్మరించినట్లు కురియుచున్నది. పండినకూర యంతయు వానికే కుమ్మరించినాఁడు.

జ: కుమ్మరింపు, కుమ్మరిలు.

**కుమ్మరింపు.** వి. (√కుమ్మరించు) ౧. కుమ్మరించుట. (బ్రౌ.) ౨. మల్లబంధవిశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొకటి. హంస. ౧. ౨౦౬. ఆం. భా. ౨. ౨౦౯.

**కుమ్మరిలు(ల్లు)**=క్రుమ్మరిలు. అ. క్రి. (√కుమ్మరించు) కుండలు లోనగువానినుండి జలాదులు ఒక్కసారి గాపడు; రాలు. (శ. ర.)

సీ. ... మిడిగ్రుడ్ల నిప్పులు కుమ్మరిలఁగ. హరి. పూ. ౫. ౧౪౯. (శ. ర. పా.)

**కుమ్మి**=కుమి. వి. కుహూలవిశేషము, ఒకవిధ మగుపాణక.

(లోభివర్ణనము) సీ. మూసి ముల్లడిచి కుమ్ములకొబ్బిపై మెత్తు లూడ్పఁడు పస్తైన నుండుఁ గాని. పాండు. ౪. ౧౪౯.

చ. పడఁతికో నిత్యమైమగురుభక్తుల కన్న మొసంగి కాని వే,కుడువవు నీగృహంబునను గుమ్ములు గాదెలు లేవు... చెన్న. ౪. ౯౯. పండితా. దీక్షా. ౪౪ పా.

**కుమ్ము**[1]=క్రుమ్ము. స. క్రి. (క. త. కుమ్ము.) ౧. వలఁగఁ గొట్టు; దంచు.

సీ. గోడలు పూయంగఁ గుమ్మి గంధంబున మేదించినట్టిజవ్వాదియడుసు. యయా. ౧. ౪౭.

గీ. భూసురక్షేత్రము హరించుబుద్ధి నెవ్వఁ, డడ్డపెట్టుచు వానిని యమునిమాత్య, లినుపరోళ్ల ను బడవైచి యినుము గాఁగఁ, గుమ్ముచుందు రు సతతంబు గోడు కుడుప. శేష. ౩. ౩౭.

క. తమ్మాకు రెండుపట్టులు,కుమ్మి యజాక్షీరములను గూర్చి వడిచి చా, రొమ్ముగఁ ద్రిదినంబులు గొనఁ,బమ్మినరేచీక పెల్లఁ బాయున్ వేగన్. చికి. (చి. ని.)

౨. పొడుచు.

సీ. ఈవంకి నేవంక నేవంకవోకుండఁ గోటానఁగోటులు గుమ్మినాను. ష. చ. ౨. ౮౯.

ఉదా: ఆవు నన్ను కుమ్మినది.

వి=కుమ్మె. పోటు, దెబ్బ.

సీ. గుబ్బకుమ్ముల నెడల్ గుమ్మెలువోఁ గ్రుమ్మి గట్టిగా బిగియారఁ గౌఁగిలించి. ఘటికా. ౨. ౧౧౬.

గీ. ప్రతిబలము వ్రేయుటయుగుమ్మకూర్లకతనఁ, గుమ్ములానినబంగారుగోడలు... కువల. ౩. ౧౫.

జ: కుమ్ముపురువు, కుమ్ములాడు.

**కుమ్ము**[2]. వి. పొట్టునిప్పు, కుకూలము.

సీ. పూరజం బని చాల బొంకించి యమ్మరో కుమిలి నిగ్గులు దేరుకుమ్ము నుప్పి. చంద్రా. ౪. ౧౬౭.

ఆ. చేఁత రాసియయినఁ జెంచలం బయినను, గుమ్ముచందుఁ గ్రుక్కి సమ్మదమునఁ,గట్టఁ బొలిసి

పోవుఁ గరి నవరాత్రంపు,గడ్డ లైన నీరు గా
లుచున్న.చికి. (చి. ని.) ఆం. భా. ౨.౨౮౨

**కుమ్ముగాఁచు**=కుమ్ముదగ్గఱ చలి పోవుటకై శరీర
ము కాఁచుకొను.

గీ.అత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము,గాఁ
చుచోటికి మకరసంక్రాంతి వేళ. శివరా. ౪.
౨౭.

**కుమ్ముపురువు(గు).** వి. (√ కుమ్ము1.) ఒకజాతిపు
రుగు.

గీ. కుమ్ముపురువు చిక్కుపురువు గుంతపురువు. ప్ర
బంధ. ౧౩౦.

**కుమ్ములాడు**=క్రుమ్ములాడు. అ. క్రి. (కుమ్ము1లు+
ఆడు) పోట్లాడు, పోరు.

గీ.అత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము,కాఁ
చుచోటికి మకరసంక్రాంతి వేళ. శివరా. ౪.
౨౭.

సీ. కూలె నొక్కమ్మడిఁ గొమ్ముకత్తులకొద్దిఁ గుమ్ము
లాడి మదాంధకుంజరములు. చంద్రా. ౬.
౭౫.

**కుమ్ముసుద్ది.** వి.సంకేతవృత్తాంతము,గూఢార్థము గ
లవృత్తాంతము. (శ.ర, బ్రౌ.)

**కుమ్మె**=కుమ్ము1. వి. పోటు, పొడుపు; నొక్కు.

క. కుమ్మెలు దాఁకినబంగరు,బొమ్మరములయొమ్మెఁ
గడకుఁ బొమ్మనురేఖా,సమ్మిళిత స్తనకుంభత,
టమ్ము దిటమ్ముగను జూపి డగ్గుత్తికతోన్. సా
రంగ. ౨. ౨౩౦.

ఉ. క్రమ్మి చతుష్కరిం జనురు కాలువలై ప్రవ
హింప రోమపుం,గుమ్మెలఁ బార్శ్వభూజము
లు గూకలు వత్తులు గా ముఖంబునం,దుమ్ము
లు రేఁగ మై మఱచి దున్నుచు ముస్తలఁ జె
చ్చి కుంజముల్,గొమ్ములఁ జిమ్ముదాని నొక
ఘోరవరాహముఁ గాంచి యాత్మలోన్.
వేం. పంచ. ౨. ౧౦౫.

సీ. క్రొవ్వాఁడి కొనగోటికుమ్మెలు బిగియించు చెం
పపెట్టు కపోలసీమ పెలుచ. చంద్రా. ౩.
౭౭.

**కుమ్మెలుపోవు**=నొక్కులుపడు; గంటులుపడు.

సీ. బిగువుఁ గౌఁగిళ్లచేఁ బ్రియుబాహుపురులొ
త్తి కుమ్మెలుపోయినకుచతటములు. ప్రభా.
౫. ౬౨.

సీ. గుబ్బకుమ్ముల పెడల్ గుమ్మెలుపోఁ గ్రుమ్మి గట్టి
గా బిగియూరఁ గౌఁగిలించి. ఘటికా. ౨.
౧౧౬.

చ. ఎఱుఁగదు లేఁత మోవిచిగు రెంతయుఁ గుమ్మె
లుపోవ నొక్కుటల్. శకుం. ౩. ౯౬.

**కుయి**=కూయి. వి. మొఱ.

ఆ. ఎట్లు బ్రదుకువార మెందుఁ జేరెదువార,మ
ధిప వినఁగఁ దగదె యాదుకుయులు. భాగ.
౧౦ పూ. ౯౯౫. కృ. శకుం. ౩. ౧౪౭.

విశే. రక్షకము. (చూ. కుయిపోవు.)

జ: కుయిపోవు, కుయోమొఱ్ఱో.

**కుయిపోవు.** అ. క్రి.(కుయి + పోవు) రక్షకముగా
పోవు.

సీ. పసులకై కుయిపోయి పరులశస్త్రములచే నని
లోన సమసినయట్టివాఁడు. గీ. దినకరాత్మజ
నీపురంబునకు రాఁడు. రుక్మాం. ౨. ౧౦౧.

**కుయోమొఱ్ఱో**=కుయ్యోమొఱ్ఱో.

ద్వి. రక్కసిపలెనె ఘారణి పిక్కటిల్ల, మొక్క
లంబునఁ గుయోమొఱ్ఱో యనంగ.ద్వి.సారం
గ. ౩. ౧౫౪ పం.

**కుయ్యి**=కూయి.

(మొఱ, ఆర్తధ్వని.)

ఆ. అనద నైతి నిచట నాలికు య్యాలింపు, డక
టమీరు గలుగ నాక్రమించి, వన్నుఁ గట్టి
నూతనందను లిమ్మెయి,వెఱపు లేక భంగపఱు
చువారు. భార.విరా.౩.౧౯.

(దీనాలాపము; అల్పవచనము.)

క. కుయ్యాడక నాముందఱఁ, గయ్యమునకుఁ గాలుదువ్వఁ గడఁగెను దీనిన్, దయ్యాలకు బలి వెట్టెద, వ్రయ్యాలుగా నటికి యెల్లవారును జూడన్. మొ. రా. సుం. ౭౦.

క. ఇయ్యాడవి వీని సేబలు, దయ్యంబులు వ్రేసినొక్కొ తరలక యుండన్, డయ్యఁ డొకింతయు మనతోఁ, గుయ్యన నొల్లందు కన్నుఁ గొన తెఱవంగన్. వాల్మీ. ౨. ౧౨౦.

జ: కుయ్యిడు, కుయ్యోమొఱ్ఱో.

**కుయ్యిడు**=కూయిడు. అ. క్రి. (కుయ్యి + ఇడు.) -కోపాములచే - కేకలువేయు, అఱచు; మొఱపెట్టు.

ద్వి. అంత్యజుఁ డంత్యజుఁ డనుచుఁ గుయ్యిడెద, రంత్యజునకుఁ జోర నది యెట్లు వచ్చు. పండితా. దీక్షా. ౮౩ పా.

మ. అవు బావా యమృతంబు ముందు మనదైత్యశ్రేణికిం బంతునో, దివిజుల్ కుయ్యిడకుండముం దొసఁగి యందే కొంత తర్వాత దా, నవదైత్యాసురరాక్షసావళులకున్ వడ్డింతునో ... దశా. ౨. ౩౪౮.

ఉ. కుయ్యిడ శక్తి లే దుదరగోళములోపల నున్న వాఁడ ది, క్కెయ్యది...భాగ. ౧. ౨౮౦.

స. క్రి. మొఱవెట్టి యడుగు.

క. ఆఁకట మలమల మాఁడుచుఁ, దేఁకువ చెడి చేతు లొగ్గి దీనత్వమునన్, గాకముగతి వాపోవుచు, గోకర్ణక్షేత్రజనులఁ గుయ్యిడఁ దొడఁగెన్. బ్రహ్మో. ౨. ౬౮.

**కుయ్యోమొఱ్ఱో(ఱో)**=కుయోమొఱ్ఱో. వి. (భయదుఃఖాదులందు చేయు) ఆర్తధ్వనియొక్క అనుకరణము.

ఉదా: కొట్టక పోయినను వాఁడు కుయ్యోమొఱ్ఱో యనుచున్నాఁడు.

మ... ఈ, గుని దొవారికు లడ్డపడ్డఁ దల మంచుం జొచ్చి కుయ్యోమొఱో, విను మాలింపుము చిత్తగింపుము దయన్ వీక్షింపు మం చంబుజా, సనముఖ్యుల్ గని రార్తరక్షణకళాసంరంభునిన్ శంభునిన్. భాగ. ౮. ౨౧౯.

**కురంక(కు)రము.** సం. వి. అ. పుం. సారసపక్షి, జెగ్గురుపిట్ట.

**కురంగకము.** సం=కురంగము.

**కురంగనాభి.** సం. వి. ఇ. పుం. మృగనాభి, కస్తూరి.

**కురంగమము.** సం. వి. అ. పుం. కురంగము, జింక.

**కురంగము.** సం. వి. అ. పుం. ౧. జింక. ౨. ఇంచుకంత యెఱుపువన్నె గలపెద్దయిఱ్ఱి.

శ్లో. కురంగ ఈషత్తామ్రస్స్యాద్ధరిణాకృతికో మహాన్. (ఆ. ని)

౩. కోఁతి. న. ౧. వెండి. ౨. తీర్థభేదము.

**కురంగాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. లేడికన్నులవంటి కన్నులు గలస్త్రీ; స్త్రీ.

**కురంగి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడులేడి.

**కురంగిక.** సం. వి. ఆ. స్త్రీ. ముద్గపర్ణి, పిల్లపెసర.

**కురంజి.** వి. ఇరువదినాలుగుస్త్రీరాగములలో నొకటి.

సీ... సలలి, త బిలాహరి కురంజి ధన్యాసి...హంస. ౪. ౧౨౩. ప్రబంధ. ౯౪.

**కురంజియోమము.** వి. ఒకానొకయోమము. (బ్రా, వా.)

**కురంటకము.** సం=కురంటము.

**కురంటము.** సం. వి. అ. పుం. పీతఝింటి, పచ్చపువ్వులగోరంట.

**కురంటిక.** సం. వి. ఆ. స్త్రీ. పచ్చపువ్వులగోరంట.

**కురండము.** సం. వి. అ. పుం. ౧. సాకరుండవృక్షము. ౨. అండవృద్ధి, బుడ్డ.

**కురక.** సం. వి. ఆ. స్త్రీ. సల్లకి, అందుగు.

**కురచిల్లము.** సం. వి. అ. పుం. కర్కటము, ఎండ్రి.

కురటుఁడు. సం.వి.అ.పుం. చర్మకారుఁడు, మాదిగవాఁడు.

కురము¹=కురుము¹. వి. పశువులకుఁ గలుగుశీతరోగము. (శ.ర.)

కురరము. సం.వి.అ పుం.ఉత్క్రోశము, పక్షివిశేషము.(లకుముకిపిట్ట అని కొందఱు. పెన్నడపులుఁగు అని కొందఱు.)

కురరాంఘ్రి. సం.వి.ఇ.పుం. దేవసర్షపము.

కురరి. సం.వి.ఈ.స్త్రీ. ౧. స్త్రీపక్షివిశేషము.(ఆఁడులకుముకి అని కొందఱు. ఆఁడుపెన్నడపులుఁగు అని కొందఱు.) ౨. మేషి,ఆఁడుగొఱ్ఱె.(వై.ని.)

కురవకము. సం.వి.అ.పుం. ౧.ఎఱ్ఱగోరంట. ౨.ఎఱ్ఱచేమంతి.

కురస. సం. వి. ఆ. స్త్రీ. గోజిహ్వా, బెండ.

కురసము. సం.విశే. (అ.ఆ.అ.) చెడ్డరసము గలది. వి.అ.పుం. ౧.మద్యవిశేషము. ౨.చెడ్డరసము.

కురాడ(ళ)ము. వి. మంచపుపందిరిగుడ్డ.

ఉ. పట్టుతలాడయుణ్ వాళ్ఁదిపచ్చనునుంబఱిపింద్రగోపపుం, బట్టుకురాడముం ...కన్నయానృపతిమంచముపై నతు లుంచి రచ్చెలిన్. పాంచా. ౫. ౧౦.

చ. బటువులు తాపితాపఱపుపట్టుతలాడయుమీఁదఁ జల్వదుప్పటి పయిఁ జప్పరంపుజిగిబంగరువ్రాఁతకురాళముం గుఱుంగటఁ బడిగంబుఁ గంచుదివెగంబముఁ గల్గినపట్టెమంచము,తళ్కుటుచి నించ మించురతిధామముఁ జేరితి నిర్భయంబునన్. శుక. ౪. ౨౨. చంద్రా. ౪. ౭౦.

కురాసాని. వి. ఒకానొక దేశము.

మ. అలుకన్ ఘోటకధట్టికాఖురపుటీహల్యన్ గురాసాని పుచ్ఛలువో దున్ని చలచ్చమూగజమదాసారప్లుతిం గీర్తిపుష్కలసస్యం బిడి యేకధాటి బళిరా కట్టించి తౌ దృష్టిశ్రీ, దులఖానోగ్రకపాల మర్థపహరిమ్యాభజాంగలశ్రేణికన్. అమ. ౧. ౪౨.

కురాసానిగందవొడి = కురాసానిదేశసంబంధమైనబుక్కా.

ఉ. ఆనగరంబుగంధవహుఁ డంగడివీథుల నాడుచుం గురాసానిపిసాళిగందవొడి సన్నపుఁగుంకుమపూవుఁబోఁచ లే,మేనియుఁ జొచ్చి యెత్తికొని యిచ్చకు వచ్చినత్రోవఁ బోవఁగా,నా నని కట్టి పెట్టె యొకఁ డైన మఱుంగిడఁ డెంత ముద్దొకో. కకు. ౧.౧౩౯.

కురాసానియోమము=కురాసానిదేశములోఁ బుట్టుఓమము.

గీ. చనుఁ గురాసానియోమ మంచన యవాని, కాభిధ...ఆం.భా.౨.౫౭. ప్రబంధ.౬౪౦.

కురాహము. సం. వి. అ. పుం. నల్లనిపిక్కలును ఇంచుక తెల్లనివన్నెయుఁ గలగుఱ్ఱము. (కల్ప.)

కురి. సం. వి. ఈ. స్త్రీ. తృణధాన్యభేదము.

కురిచీ(ర్చీ). వి. (క. త. కుర్చి. హిం. కుర్సీ.) కూర్చుండుట కుపయోగించునున్నపీఠవిశేషము.

సీ...పట్టివేళ్లసురఁటీలు మేల్పైఁడికురిచీలు... రసిక. ౧. ౬౧.

కురిచీపీఁట=కురిచీవలె ఎత్తుకాళ్లు గలపీఁట. మృ.వి. 3. ౭౫.

కురిడీ. వి. లోపల నీరింకినకొబ్బెర. (శ. ర, బ్రా. 'కురిడీ' నాఁకుక.)

కురిమింద. వి. ఒకవిధ మగువత్తుగుల్ల, శంబూకవిశేషము.

సీ...నత్తగుల్ల చుట్టుమగుల్ల కురిమింద నాఁచు దుగవ్వ ముఱుండము కాకిచిప్ప. హంస.౪. ౧౮౬.

కురిమిడి. వి. మడిచుట్టు వేసినకట్ట, గనిమ. (శ.ర, బ్రా.)

**కురియించే,కురించే.** స. క్రి. (√ కురియు. ఇది కుదియించు,కుదించు-కదియించు, కదించు వంటిది.) ౧. వర్షింపఁజేయు, కురియఁజేయు.

మధ్యా. భూమి కనావృష్టి యైన... తనదివ్యప్రభుసాయకముల,సామజావలి సేయునట్లు మేఘసంచయముల సేసి, భూమికిఁ గురియించె వర్షములు సస్యముల్ వృద్ధిఁ బొంద.భార.అర. ౩.౨౦౬.

చ. ...వేలుపుం, గామిరెలు కల్పభూజనవకోరకముల్ గురియించిరో యనన్. విక్ర. ౪. ౨౦౮.

క. పరుసఁదనము మెయి నరి గొనఁ, జొరఁ దగదది పొదుఁగు గోయుచొ ప్పగు విను పాల్గురియించుకొనఁ దలంచిన, నరయ వలదె గోవుఁ బ్రజయు నట్టిద యధిపా. భార. శాం.౨. ౨౯౯. (ఇట 'పుష్కలముగా నిచ్చునట్లు చేయు' అని భావము.)

ఉ. అంతఁ బలిప్రతాగుణమహత్త్వముఁ జూచి సురల్ ప్రమోదిత,స్వాంతత యొప్పఁ గ్రొవ్విరులవానఁ గురించిరి భామమీఁద ... భోజరా. ౫. ౩౨౩.

చ. ... దేవత లెల్ల వారిపై,సుకరముగాఁ గురించి రతిచోద్యముగా నమృతంపువర్షముల్. సీతా. వి. ౪. ౧౫౦.

**కురియు(ర్యు).** అ. క్రి. ౧. వర్షించు.

సీ. వలసినయప్పుడ వానలు కురియుట సస్యసమృద్ధి ప్రశస్త మయ్యె. భార.ఆది. ౫.౩.

క. మినుమినుకుమినుకు మనియెం, బెనుమిణుకుల బరణి ధరణి బిట్టూటాడెన్,వననిధులు పిరిసెఁ గురిసెన్, గనగనగన మనుచు నిప్పుకలు గుప్పలుగన్. పాండు. ౫. ౧౭౭.

మ. చెవికిం గేలివసంతకోత్పలదళశ్రీలై కపోలంబులన్, నవకాలాగురుపత్త్రరేఖలయి మేనం గమ్మకస్తూరియై, ధవళాంభోరుహనేత్రపైఁ గురిసె నుద్యల్లీల సీమంతపున్, సవనాజ్యాహుతిహోమసంప్రభవచంచద్వహ్నిధూమచ్ఛటల్. శివరా. ౨. ౫౭. (ఇట 'అధికముగా వ్యాపించు' అని భావము.)

చ.ఉడుగక యేడురాత్రులు మహోద్ధతి వానలు గుర్యఁ జూచి...పద్మ. ౯. ౨౩౧.

ద్వి. శివదుందుభులు మ్రోయ దివిఁ బుష్పవృష్టి, యవిరళంబై కుర్య నంత భర్గుండు. పండితా. దీక్షా.౪౭ పా.

౨. (జీర్ణ మైనగృహాదులు) ఊఁటియు.

ఉదా: ఆయింటిపెణక కురియుచున్నది.

స. క్రి. వర్షింపఁజేయు, కురియించు.

వ. నందినియు...అంగవిక్షేపంబున నంగారవృష్టిఁ గురియుచు...భార. ఆది. ౮. ౧౦౬.

చ...వాఁ,డుపలమహోగ్రవర్షము సముద్ధతిమైఁ గురిసెన్ గుమారుపై. నిర్వ. ౧౦. ౨౬.

సీ. పలుకంగ నేర్తురు పాటలాధరముల మొల్కలేనగవులు ముద్దు గురియ. భీమ. ౧. ౯౪. (ఇట 'అధికముగా కలిగించు'అని భావము.)

వ...విశ్వామిత్త్రు నతిప్రీతిం బూజించి వానికిని వానిసేనకును నభిమతంబు లైనయాహారంబులు గురియ నందిని యనుతనహోమధేనువుం బంచిన...భార.ఆది. ౮. ౯౫. (ఇట 'అధికముగా నిచ్చు' అనిభావము.)

చ. సురలకుఁ గల్పభూరుహము చొప్పునఁ గోరినకోర్కు లన్నియుం,గురియుదు వీవు నీతపమగోచర మిట్టిదనంగ...హరి.ఉ.౨.౧౫౬.

(ఇట 'అభీష్టార్థములను పుష్కలముగా నిత్తువు' అని భావము.)

మహాస్రగ్ధర... రుష నయ్యామరాగ్రేసరుం డంప మ్రబ్బుల్,ధృతిమై దాల్వాఁ గుర్యన్ ...అప్ప. ౪. ౨౩౩ పా.

జ: కురియించు.

**కురీరము.** సం. వి. అ. న. మైథునము.

కురుంటకము. సం.వి.అ.పుం. కురంటకము, పచ్చ గోరంటి.

కురుంటము. సం=కురంటము.

కురుంటి. సం.వి.ఈ.స్త్రీ. ౧.దారుపుత్త్రలిక, కఱ్ఱబొమ్మ. ౨. బ్రాహ్మణి, బ్రాహ్మణునిభార్య.(విల్యమ్సు)

కురుండము. సం=కురుంటము.

కురుంబ. సం.వి.ఆ.స్త్రీ. ద్రోణపుష్పి,ఏనుఁగుతుమ్మి.

కురుంబము. సం.వి.అ.న.జంబీరభేదము.(వాచ.)

కురుంబి. సం.వి.ఈ.స్త్రీ. సైంహలీవృక్షము,సింహళపిప్పలి.

కురుంబిక. సం.వి.ఆ.స్త్రీ. ౧.సైంహలి, సంహళపిప్పలి.౨ ద్రోణపుష్పి,ఏనుఁగుతుమ్మి.

కురుజు. వి. ౧. దూలముమీఁదిగుజ్జు.

చ....మదనచేతులచాతురి నెయ్యపుంగురుం,జా
విదలు దార్చ విష్ణుపద మొత్తుఁ బురిన్ గృహ
లక్ష్మి నూత్నతన్. ఆము. ౨. ౧౭.

౨. (క.కురుజు) స్థిరరథము, రథమువలె ఎత్తుగా కట్టినయొకవిధమైనకట్టడము.(మంచె-శ.ర)

సీ. ...కురుజు నా స్థిరరథ మగు.ఆంభా.౨.౧౬౬.

చ.పసిఁడికురుంజులన్ మెలఁగుబంగరుబొమ్మలఁ
జూమ దేవతా,ప్రసవసుగంధులన్ ధ్వజప
రంపరఁ బిల్చి వివాహవీటికా;విసర మొసం
గ ... వసు. ౪. ౬౬.

చ. అరు దటు చూడఁగా నమరె నంపులఁ గ్రం
దుగఁ గుందనంపుఁ బెన్, గురుఁజులమీఁదఁ
దార్కొనినక్రొత్తగుపుత్తడిబొమ్మ లెల్లెడన్,
సారిదిని తేనిసోబనపుసొంపు గనుంగొన వ
చ్చినట్లియ,చ్చరపువుఁబోండ్లచందమునఁ జ
క్కఁదనంబులసొంపు పెంపునన్.యయా.౪.
౧౪౩.

సీ. శృంగారము లెసంగ బంగారపు మెఱుంగుఁ
బోండ్లు కురుఁజులపై గొండ్లి సలుప.సారంగ.
౨. ౧౯౦.

ఉ. అప్పుడ వారు తీర్పరుల నందులకున్ సమకూ
ర్ప జాగవా, యొప్పులకుప్పలై మెఱయు
చుండెడుమేరువులున్ గురుంజులున్,జప్ప
రముల్ వితానములు సర్వము నాయితపెట్టి
... విజ. వి. ౨. ౮౯.

విణ. (క. కుఱుజు) వామనుఁడు, గుజ్జు, పొట్టివాఁడు.

సీ. కుఱుచ కోట్ర కురుఁజు కోటిక...తింగణా
యనఁగను వామనాఖ్య దనరు. ఆం. భా.
౨. ౧౨౩. (బ్రౌ. పా.)

కురుకందకము సం. వి. అ. న. మూలకము, ముల్లంగి.

కురుకు=కూరుకు. వి. నిద్ర.

గీ...కూర్కొన నిదుర నా నిద్దు రనఁగఁ, గుఱు
కనఁగ నిద్ర ... ఆం. భా. ౧. ౧౪౧. (బ్రౌ.
పా.)

కురుక్షేత్రము. సం. వి. అ. న. ఒకపుణ్యక్షేత్రము. (ఇది ఇప్పటిఢిల్లీప్రాంతమున నున్నది.ఇందే భారతయుద్ధము జరిగెను.)

కురుక్షేత్రయోగము. సం.వి.అ.పుం. ౧. (జ్యోతి) యోగభేదము. (ఒకసావనదినమందు తిథిత్రయము నక్షత్రత్రయము యోగత్రయము కూడి యుండుట.)౨.కురుక్షేత్రమందు మృత్యువు కలుగు నని సూచించు గ్రహయోగభేదము.

కురుచిల్లము. సం. వి. అ. పుం. కుళీరము, పీత, ఎండ్రి.

కురుజాంగలము. సం=కురుక్షేత్రము. (వాచ)

కురుజీ. వి. చిన్నకంట్లము. (శ. ర.)

కురుజు. వి. ౧. ఒకజాతి డేగ.

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిడ్డు, జా
లె జలకట్టె కణుజు వేసడము బైరి,కురుజు

నోరణ మను డేగకొలముసాళు,వములఁ బిలు
పుకు వేఁటకు వచ్చువాని. పి.శకుం.౧.౧౧౦.

౨. ఈఁకలు రాల్చినపక్షి.

గీ. గూఁటిగు వ్వన నణు జనఁ గురు జనంగ,నీఁ
కరాల్చినపక్షి యా నిందుమాళి. ఆం. భా.
౨. ౯౭.

3. ఒకవిధమైనబాణసంచు.

వ...కురుజాలు కుండబిలుసులు సంపెంగపూల
బిలుసులు... మొదలైనబాణవిద్యలపై ఖురులు
...హంస. 3. ౨౯.

**కురుజోతేనె.** వి. ఒకరకపుతేనె.(స్వచ్ఛమైనతేనె.
బ్రౌ.)

గీ. కురుజాతేనెయుఁ గా దిది కుసుమరసము. శ
కాం .3. ౪3.

వ. ... ముసురుతేనె పూఁదేనె జుంటితేనె పుట్ట
తేనె కట్టుతేనె కురుజాతేనె...ప్రబంధ.౧౧౨.

**కురుటి.** సం. వి.న్. పుం. గుఱ్ఱము.

**కురుడి.** వి. (సంగీ) స్వరస్థాయిభేదము.

ద్వి. కురుడి మోడామోడి పారి రవాళంబు...ఆ
దిగా సాగయుతాయములు... బస. పు. 3.
౯౪౨ పం. ('కురడ మోడామోడి పారి ధు
వాలంబు' ప్రాఁతప్రతి.౭౧ పొ. ౧౪ పం.)

**కురుత.** వి. ఒకవిధమైనచేఁప. (బ్రౌ)

**కురుతము.** సం. వి. అ. పుం. ౧. పెద్దవెదురుగంప.
౨. చెడ్డధ్వని.

**కురునదిక.** సం.వి.ఆ.స్త్రీ. చిన్న యేఱు.

**కురుప.** వి. అజాజీవుఁడు,మేకలవాఁడు.

గీ. ... కురుప యనఁగఁ,దగును మేఁకలవానిపే
రు...ఆం. భా. ౨. ౨౭౪.

**కురుపిశంగిల.** సం.వి.ఆ.స్త్రీ.గోధ,ఉడుము.

**కురుబిల్వము.** సం. వి. అ. పుం. పద్మరాగమణి,
కెంపు.

**కురుమ**[1]=పరుము. వి.పశురోగవిశేషము. నవ. ౧.
౪౧ పొ. ౧ పం.

**కురుమ**[2]. వి. (క.కుఱుంబ,కుఱుబ.) ౧. గొఱ్ఱెబొ
చ్చుతో కంబళ్లు నేయుగొల్లజాతి.

ఉదా: కురుమవాఁడు. (శ. ర.)

౨. నిడుపైన గొఱ్ఱెబొచ్చు. (బ్రౌ)

కురుమపొట్టేలు = దేహమునందు నిడుదబొచ్చు
గలమగగొఱ్ఱె. ప్రబంధ. ౧33.

**కురుమము.** సం.వి.అ.పుం. ౧. శిల్పి.౨.భాజనము,
పాత్రము. (కే.ని.)

కురుమగొఱ్ఱె=దేహమునందు నిడుదబొచ్చు గల
గొఱ్ఱె. (చి.ని,బ్రౌ-కురుపగొఱ్ఱె-శ.ర.)

**కురురాజు.** సం.వి.అ.పుం. దుర్యోధనుఁడు.

**కురురాట్టు.** సం.వి.జ్.పుం.దుర్యోధనుఁడు.

**కురులము.** సం.వి. అ.పుం. ఫాలస్థితచూర్ణకుంతల
ము, ముంగురులు.

శ్లో. తే లలాటే భ్రమరకాః కురులా భ్రమరాల
కాః. వై. ని. కే. ని.)

**కురులి.** సం.వి.ఈ.స్త్రీ.లక్ష్యవేధము,(విలుకాండ్రు)
బాణములతో లక్ష్యమును గుఱిచూచి కొట్టుట.
(కే.ని.)

**కురులు.** వి.బ.(సం.కురులః.ప్రా.కురిలో.క.కురుల్.
త.కుఱుల్.) ౧.అలకములు;శిరోజములు,తలవెం
డ్రుకలు.

సీ. అలకలు కురు లన నలరును బహుతచే...ఆం.
భా. ౨. ౧౪౫.

సీ. ఇందుబింబముమీఁదికందుచందంబునఁ గురు
లు నెమ్మొగమున నెరసియుండ. భార. విరా.
౨. ౧3౭, ౧౫౬.

సీ ...కొదమతేఁటులఁ గేరుకురులవాఁడు.నీలా.
౧. 33.

సీ. కొప్పు మెల్లన విచ్చి కురులు చిక్కాడలించి
తల యంటె నేర్పుతోఁ బొలఁతి యొర్తు.
యయా. ౪. ౭౯.

జ: కురువేరు.

**కురువ.** వి. (క.కుఱువ=కొండ.) మెరక, ఉన్నత స్థలము? (కొండమీఁద నేర్పడిన కాలిత్రోవ. శ. ర, బ్రౌ.)

ద్వి. మెల్లన సాగుచు మెట్టుమెట్టుచును, గొల్ల ముల్ డిగ్గుచుఁ గురువ లెక్కుచును.పండితా. పర్వ. 3౮౮ పా.

**కురువకము.** సం=కురవకము. (వాచ)

**కురువడములు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. నివ్వరుల్... కురువడాల్ కంటసరులు.హంస. ౪. ౧౭౮.

**కురువర్షము.** సం.వి.అ.న.ఉత్తరకురుభూమి.(నవ వర్షములలో నొకటి.)

**కురువిందము.** సం.వి.అ.పుం.౧.కోలతుంగముస్తె, నిడుముస్తె. ౨.మాషము,మినుములు. 3. దర్పణము, అద్దము. ౪.హింగుళము, ఇంగిలీకము. ౫. వ్రీహివిశేషము. ౬.పద్మరాగమణి.

సీ. సలలితమత్తకోకిలలోచనద్యుతి నలరారుఁ గురువింద మనెడికెంపు. రత్నపరీక్ష. ౧౧.

**కురువి(బి)స్తము.** సం. వి. అ. పుం. పలమెత్తుస్వర్ణము, నాలుగుకర్షములయెత్తుబంగారము.

**కురువు.** సం. వి. ఉ. పుం. ౧. అజమీఢునిమనుమఁడగునొకచంద్రవంశపురాజు. ౨. ఒకానొక ఋత్విక్కు. 3. జంబూద్వీపమందలినవవర్షములలో నొకటి. ౪. అన్నము. ౫. కంటకారిక, వాఁకుడు? ౬. ఒకదేశము. (శే. ని-ఇది డిల్లిప్రాంతమున నున్నది.)

**కురువృద్ధుఁడు.** సం.వి. అ.పుం. భీష్ముఁడు.

**కురువేరు.** వి. (కురులు+వేరు-క. కుఱువేరు.) శేళము, హ్రీబేరము?

గీ. ... హ్రీబేరవాచకముగఁ, బొసఁగుఁ గురువేరనంగ...ఆం.భా.౨.౬౧.

సీ. కల్వారేకులమిద్దెఁ గావించి యామట్టుఁ గురువేరువడి గట్టె విరుల తేనెఁ,బూసి...యయా. ౫. ౯౮. ఉ.రా. 3. ౨౦౧.

**కురూపము.** సం.విశ. (అ. ఆ. అ.) వికృతరూపము గలది. వి.అ.న. వికృతరూపము.

**కురూప్యము.** సం.వి.అ.న. రంగము, తగరము.

**కురుక్కుటము.** సం. వి. అ.పుం.కుక్కుటము,కోడి.

**కుర్కురము.** సం.వి.అ.పుం. కుక్క.

**కుర్ణజము.** సం.వి.అ.పుం. కులంజనవృక్షము,దుంపరాష్ట్రము?

**కుర్దనము.** సం=కూర్దనము.

**కుర్పరము.** సం. వి. అ. పుం. ౧.కూర్పరము,మోఁచేయి. ౨. జానువు, మోఁకాలు. (మే.ని.)

**కుర్వత్.** సం. శత్ర. చేయుచున్న.

**కుర్వాణుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) చేయుచున్నవాఁడు. వి. అ. పుం. భృత్యుఁడు, పనిచేయువాఁడు.

**కుఱఁగలి.** వి. దే. సమీపము, చేరువ.

వ. అనిన గంధర్వుండు పెద్దయుం బ్రొద్దు విచారించి యిచ్చోటికిఁ గుఱంగట నుత్కోచం బను పుణ్యతీర్థంబునం దపంబు సేయుచున్నవాని ధౌమ్యుం డను బ్రాహ్మణుని...భార. ఆది. ౭. ౧౫౬.

చ...అ,క్కుఱఁగట శోకజాస్రువులుఁ గోయను నేడ్పులు నుప్పతిల్లెడున్. జై.భా.౧.౫౭.

విశ. సమీపస్థము, చేరువైనది.

వ... ప్రభాసం బనుతీర్థంబునకుఁ జని యందులకు ద్వారావతిపురంబు కుఱంగలి యని విని...భార. ఆది. ౮. ౧౬3.

క. చాలఁ గుఱంగటిమఱుఁగుల,గాలాపుస్వేఁటలాడఁగా దొరకినబ,ల్లీలు చవిఁ దేల్చె నపుడా,పాలెంబునడిగినబక్కబంట్రౌతులనున్.

కువల. ౨. ౧౦౯.

**కుఱకుఱ.** విశ. (√ కుఱ్ఱ) అత్యల్పము, మిక్కిలి తక్కువైనది.

క. కుఱకుఱవేలుపుఁ దెఱవలఁ, జెఱవట్టినయటులె తెలివి చెడి రామునితో,నుఱక పగ దెచ్చుకొంటివి,కొఱవిం దల గోఁకుకొనఁగఁ గోరెదుకరణిన్. అచ్చ. రా. సుం. ౫౦.

క. ఈకవితాదోషోత్కర, మేకడ నీ వొసఁగుమాడ్కి నియ్యక ఖలులౌ, నాకుఱకుఱదాతలకు మ,హాకుకవు లొనర్చుకృతులయందు వసించున్. నరస. ౪. ౪.

క. పఱతెంచి వనము వెఱుకుఁ, కుఱకుఱరక్కసుల నొక్కకొందఱఁ గేలన్, విఱుచుట యిటు చిక్కుట ని,న్నెఱుకపడం జూచుటకుఁ జుమీ దనుజేశా. రామా. ౬. ౨౩౪.

**కుఱు.** విశ. (క. త. కుఱు-వృత్తియందు 'కుఱుచ' శబ్దముయొక్క అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. అచ్చులు పరమగునపుడు 'ఱ' వర్ణమునకు 'ద్విరుక్తటకారము' ఆదేశమగును. ఉదా: కుఱుమొల్ల, కుట్టుసురు, మొ.) పొట్టి.

సీ...అరుణాయతాక్షుఁడై కుఱుగడ్డబిల్లఁ బ్రోష్ఠమునిచి. ఆము. ౪. ౫౮.

సీ. దూడలు పెనుమూపకొడెలు కుఱు గాఁడిగిత్తలు...శుక. ౨. ౪౦౮.

క్రి. విశ. కొంచెముగా.

ద్వి. ముఱముఱమని పట్టుఁబుట్టంబు విడిచి,కుఱు మాసి యున్నట్టికోకను గట్టి. ద్వి. సారంగ. ౩౫పొ. ౭౨౨ పం.

కుఱుమాపు(దు)=కొంచెముగా మాసినది.

సీ. నినువుపై పసుపునూనియజిడ్డు లంటినచిటిక మ్మికుఱుమాపుఁజీరతోడ. శుక. ౪. ౩౮.

క. వలపలిదిక్కున కించుక, మలఁగం గాఁ దుఱుమిడి కుఱుమాపుఁబుట్టం,బలవడఁ గట్టి జరకవ,ల్కులమున నెప్పిఁగుఁజన్నుఁగవ గప్పి తగన్. భార. విరా. ౧. ౨౯౧.

వ... సంధ్యాకాలంబున మసకమసకచీకటిం గుఱుమాపుదుంబుట్టంబు ముసుంగువెట్టుకొని ...నైష. ౭. ౧౪౧.

**కుఱుకు.** వి. ప్రోగు, రాశి.

మ. కుఱుకుల్ గట్టె భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహంబులై,పఱచెన్ నెత్తురు భూతకోటి విహరింపన్ బ్రస్తుతింపన్ సురల్. భార. ద్రో. ౪. ౭౩.

ద్వి. కొఱఁకులు మాని పక్షులు గూండ్లు సేరెఁ, గుఱుకులు గట్టె చీకురువాయు లడరె. ద్వి. హరిశ్చ. పూ. ౧౮౪౨ పం. భార. స్త్రీ. ౨. ౩.

**కుఱుకొను.** అ. క్రి. త్వరపడు. (ఆంధ్రధాతుమాల.)

సీ. ...కుఱుకొని కుఱఁగలి కుఱుపు వ్రణము... అప్ప. ౨. ౧౯౭.

**కుఱుగడ.** వి. (కుఱు+గడ) ఒకానొకయుద్ధసాధనము.

వ. ... విఱిగి పడినకుఱుగడలును... జై. భా. ౫. ౨౦.

**కుఱుచ.** వి. (క. కుఱు మ.) ౧. అచిరకాలము, అల్పకాలము.

వ.... ప్రాణభయంబు మనుష్యుల మగువాకు నేఁడైన మీకు మఱునాఁడైన నవలినాఁడైనఁ దుదయుగాంతంబునం దైన నిడుపుగుఱుచల నెప్పుడుఁ దప్ప దంతవత్త్వంబునకుఁ దారతమ్యం బేమి...ఆము. ౬. ౩౧.

౨. హ్రస్వమైనయచ్చు.

క. కుఱుచలపైయరబిందులు, నెఱయఁగ నూఁదినను జెల్లు... ఆంధ్రభాషాభూషణము. ౫౭.

౩. అశ్వగతిభేదము.

చ. పతి యలతేజి నెక్కి నరపాలురు గొల్వ హయాధిరోహపాం,డితి సరిదాఁట్లు జోడనలు నిబ్బరముల్ రవగాలు వేడెముల్, జవనము

మీఁఱఁ జూపి కుఱుచన్ వడి నూకి మలంచి వైచుచున్, జతురులు మెచ్చఁగాఁ జనియె శైలనివాసులు త్రోవ నూపఁగన్. చంద్రా. ౨. ౬౦.

సీ. ఇలమీఁదఁ దనయాజ్ఞ చెలియలికట్టగా నిలిపి నగరిఁ గుఱుచలను మలఁచి. ప్రబంధ. ౧౮౫.

౪. న్యూనత, కొదవ.

సీ. ... లొచ్చు కొద కడమ,కుఱుచ యొచ్చెము తగ్గు కొంచెము తక్కువ కుందు కొదవ లో ను కొద్ది యనఁగ, మెఱయు న్యూనత పేళ్లు... సాం.ని.మాన.౪౦.

విశే. (వృత్తి యందు దీనికి కొన్ని యెడల అంత్య వర్ణలోపము-చూ.కుఱు.) ౧. హ్రస్వము,పొట్టిది; చిన్నది; లఘువు, చులుకనిది.

సీ. కుఱుచ చేతులు మిడిగ్రుడ్లును గడుకొన్న తఱ టులు మఱి చుంచుతలలు నమర. భార. ఆర. ౧. ౩౦౦.

సీ. కుఱుచ కొట్ర కురుఁజా...గీ...అనఁగను వా మనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩. సాం. ని. మాన. ౫.

ద్వి. కుఱుచమంటల జీబుకొని యున్నకసవు, చుఱచుఱఁ గమరంగ ... ద్వి.హరిశ్చ. పూ. ౨౨౩౧ పం.

ద్వి. నిను విచారింపక నీపుత్త్రినైన, ననుఁ గుఱు చగఁ జేసె నరనాథుఁ డనిన. రం. రా. ఉ. ౧౩౨ పా. ౫ పం.

కుఱుచలు ద్రొక్కు=చిందులు ద్రొక్కు, నర్తించు.

చ...హారముల్,కుఱుచలు ద్రొక్క ముంగురులు గ్రొం జెమటన్ బడ సెక్క వేలుపుం,దెఱవ యొకర్తు చేదిజగతీపతికిన్ శిర సంటె వేడు కన్. వసు. ౫. ౬౫.

కుఱుచసేయు, కుఱుచకావించు = తక్కువప ఱుచు.

వ...నీవును నాపలుకులు గుఱుచసేయక నీపెం పునుం బ్రకటంబుగా నయ్యుత్తరకుమారు నకు రథంబు గడప నియ్యకొని ... భార. వి రా. ౪. ౨౯.

ఉ. సత్తుగ నోఁచ నెట్లుఁ బతిసంగతికిం బ్రతి రూపమేని నా,చిత్తముపూనికం గుఱుచనే సినసోలముతో డినన్ బ్రియో,ద్వృత్తవిశాల వక్షమునఁ దేఱెడునట్లుగ వ్రాసి చూపి నా, యుత్తలపాటు మాన్పు మది నూఱడి వెన్నె లచిచ్చు చొచ్చెదన్. కవిక. ౩.౧౦౬.విక్ర. ౨. ౩౫.

శా...ఈబుడు తెంత నన్గుఱుచకావింపన్ దను న్నెత్తురే. అను. ౬. ౧౦౯.

జ: కుట్టారిక, కుట్టుసురు, కుట్టూరుపు, కుఱుగడ, కుఱుచపడు, కుఱుచపఱుచు, కుఱునువ్వు, కుఱు పంది, కుఱుమట్టము, కుఱువాఁడు, కుఱుముష్టి, కుఱుమొల్ల.

**కుఱుచేపడు.** అ. క్రి. (√కుఱుచే) తగ్గు. (శ. ర.)

**కుఱుచపఱుచు.** స. క్రి. (√ కుఱుచేపడు) కుఱు చపడఁజేయు.

(తగ్గించు)

గీ. వివృతవక్త్రంబు సూప నవ్వీరవరుఁడు, మఱి పయోదముగతి మేను కుఱుచపఱిచి. భా. రా. సుం. ౪౮.

**కుఱునువ్వు.** వి. (√కుఱు) తిలసస్య భేదము,చిన్న జాతినువ్వు. హంస. ౪. ౧౨౬.

**కుఱుపంది.** వి. (కుఱు + పంది)వనవరాహ భేదము, ఒకజాతి అడవిపంది.(ఇది జేనెఁడుపొడవై పిడి వెల్తి మూరెఁడునిడుదయై యుండును.పచ్చికమా త్రము మేయును. చి.ని-'ఒకవిధమైనలేడి' అని బ్రౌ.)

**కుఱుపు.** వి. (క. కురు.త.కురుప్పు.) అల్పవ్రణము.

గీ.వఱలుఁ గుఱు పనఁగాను నల్పవ్రణంబు.ఆం. భా. ౨. ౧౨౯.

**కుఱుమట్టము.** విశే. (√ కుఱు) పొట్టిగాను పుష్టి

గాను ఉన్నది ('కుదిమట్టము' అని వా.)

క. వెఱచుచు వంగుచు వ్రాలుచు ... కుఱుమట్ట పుఁబొట్టివడుగు కొంత నటించెన్. భాగ. ౮. ౫౩౮.

మహాస్రగ్ధర. మెఱుఁగారుంగోరఁ జిమ్ముచున్ మిడుఁగుఱు లెగయన్ మేదినీభృద్విషత్తుల్, కుఱుమట్టం బైనతోఁకం గొని విసరు వెసం గూలఁగా సాలపంక్తుల్ ... వరాహ. ౧౨. ౩౨.

ద్వి. ఉన్నత్తవేషంబు నొప్పఁగాఁ దాల్చి, కుఱుమట్టపంగంబు కుంటిపాదంబు, పరికిమీసంబులు పల్లవెంట్రుకలు... ప్రభు. ౪.౧౪౪ పొ. ౧౨ పం.

**కుఱుమాఁడు.** వి. (కుఱు + మాఁడు) ఇంటిమూల కప్పు. (శ. ర, బ్రౌ.)

**కుఱుముష్టి.** మి. వి.(√కుఱు) చిన్న జాతి ముసిఁడి చెట్టు. ద్వి. సారంగ. ౨. ౮౦ పొ. ౨ పం.

**కుఱుమొల్ల.** వి.(కుఱు + మొల్ల) ఒక జాతి మొల్ల తీగె.

సీ. ఘనసారగుణ యిదే కర్పూరపేటిక కుఱుమొల్లవిరు లివే కుందరదన. ఇందు. ౬. ౧౨౦.

**కుఱువు.** వి. ఊరువు, తొడ.

గీ. కుఱువు తొడ యన నూరువు పరఁగుచుండు. ఆం. భా. ౨. ౧౩౫.

వ... మఱియు దివియునుం గాక స్త్రీభాగం బైనడాపలికుఱు వెక్కక పురుషభాగంబై పుత్త్రోహణయోగ్యం బైననావలపలికుఱు వెక్కితి గావున నాపుత్త్రునకు భార్య వగు మనిన... భార. ఆది. ౪. ౧౩౮.

గీ. పాణిపుటకీర్ణపాత్రంబుఁ బాఱవైచి, కుఱువుపై నున్న కిన్నర నుఱుకఁ ద్రోచి. పాండు. ౫. ౧౩౬.

**కుఱ్ఱ.** విశే. ౧. చిన్నది, లేఁతవయస్సు గలది.

ఉదా: కుఱ్ఱవాఁడు, కుఱ్ఱది, మొ. (కొన్నిచోట్ల సమాసోత్తరపదముగా నుపయోగింపఁ బడినది. చూ. అల్లుఁగుఱ్ఱ, కొడుకుఁగుఱ్ఱ, మొ.)

వి. ౧. బాలుఁడు, పిల్లవాఁడు. ఆం. భా. ౨. ౧౧౮.

ఆ. కోరు మెద్దియైనఁ గుఱ్ఱ నీవు. భాగ. ౭. ౩౭౦.

౨. కొడుకు.

గీ. ఎన్నఁ గొమరులు కల్గక యున్నవారి, కింపు నందును నెమ్మది పొందదనుచుఁ, బుడమివేలుపుఁ బెద్దలు నుడువుచుండు, రట్టుగుటఁ గుఱ్ఱ లిఁక నాకు నబ్బ వలయు. అచ్చ. రా. బాల. ౫౧.

ద్వి. మాకుఱ్ఱఁ జూడక మఱుఁ గొని కాలు, శోకాగ్ని లాఱవు చూపవే వాని. రం. రా. అయో. ౧౨౫ పొ. ౭౯ పం.

జ: కుఱకుఱ.

**కుఱ్ఱఁడు.** వి. బాలుఁడు, పిల్లవాఁడు.

క. గుఱ్ఱముఁ గొనిపో బుద్ధుల, కుఱ్ఱఁడ మీ తాత యొద్దకున్ నీతండ్రుల్, వెఱ్ఱులు నీకై రదె యీ, మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభమగున్. భాగ. ౯. ౨౧౫.

క. తొఱ్ఱులఁ గాచిననందుని, కుఱ్ఱని చరితామృతంబు గొనకొని చెవులం, జుఱ్ఱంగఁ దనివి గలుగునె. భాగ. ౧౦ పూ. ౬౩౩.

విశే. చిన్నవాఁడు, లేఁతవయసువాఁడు. (చూ. కుఱ్ఱ. విశే.)

సీ. కొడుకుఁగుఱ్ఱఁడు చన్ను గుడువక ట్లుంట విచారించి మేదరసాని, యపుడు. పరమ. ౧. ౧౩౯.

**కుఱ్ఱి.** వి. గోవు, ఆవు.

చ. ... రాజ్యముం, గొన నగునయ్య యిచ్చెడిపి కుఱ్ఱికి... భార. ఆది. ౭. ౧౦౧.

సీ. జగములు మూఁడును సంతోషమును బొందెఁ గుఱ్ఱులు చన్నులఁ గురిసెఁ బాలు. భాగ. ౧౦ పూ. ౯౫౦.

మత్త. ... నాలుగే న్పాఁడికుఱ్ఱులు నీఁడె వీనికిఁ

బాలు ద్రావుచు నుండఁగాన్. భార. ఆది. ౫. ౨౧౮.

గీ...గోవు కుఱ్ఱి,యావు నాఁగను ... ఆం. భా. ౨. ౨౬౨.

వలపులకుఱ్ఱి=కామధేనువు.

క. వనచరులను జూచుచు నటఁ,జని జనపతి కాంచె నొక్కచక్కనియిఱ్ఱిన్, మునిపతి పెంపుడుబుఱ్ఱిని,వనమునఁ జరియించువేళ వలపుల కుఱ్ఱిన్. పి. శకుం. ౨. ౧౭.

**కుఱ్ఱు.** అ. క్రి. (త. కుఱ్ఱు) కూయు, అఱచు. (శ. ర, బ్రా.) వి. కూఁత.

సీ. పెల్లుగాఁ బొలుచుఁపూరేళ్లకుఱ్ఱులసద్దు దొడ్డయౌ బెళగువ్వ లొడ్డురవళి. చంద్రా. ౨ ౭౧.

**కులంజనము.** సం=కులంజము.

**కులంజము.** సం. వి. అ. పుం. దుంపరాష్ట్రముకీ.

**కులంభర(లు)ఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, కన్నపుదొంగ. (వాచ.)

**కులకంటకుఁడు.** సం. వి. అ. పుం. వంశమునకు కంటకమువలె బాధహేతు వైనవాఁడు.

**కులకము.** సం. వి. అ. న. ౧. నాలుగింటికి పైఁగా నుండి ఒక క్రియతో ముగిసెడు పద్యసమూహము. ౨. పటోలలత, చేఁదుపొట్లకీ. 3. సమూహము. ౪. అల్ప సమాసములు గలగద్యబంధము. పుం. ౧. కాకేందువు, కాకితుమికీ. ౨. వల్మీకము, పుట్ట. 3. మరువకము, మరువముకీ.

**కులకరుఁడు.** సం. వి. అ. పుం. కులమునకు మూలపురుషుఁడు.

**కులకర్కటి.** సం. వి. ఈ. స్త్రీ. చిత్రకూటప్రాంతమందలి యొకజాతిదోసకీ.

**కులకుండలి.** సం=కులకుండలిని.

**కులకుండలిని.** సం. వి. ఈ. స్త్రీ. (తంత్ర)మూలాధారమందు ఆఁడుపామువలె నున్న శివశక్తిభేదము.

**కులకుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) ౧. కులశ్రేష్ఠుఁడు. ౨. శిల్పికులప్రధానుఁడు, పనివాండ్రలో పెద్ద.

**కులకుల.** వి. క్షుద్రక్రిములబాహుళ్యమును సూచించుటయం దుపయోగింపఁబడుఅనుకరణము. (వ్యవ) వానితలనిండ పేలు కులకులలాడుచున్నవి. ఈపుచ్చుపండ్లలో పురుగులు కులకులలాడుచున్నవి.

**కులక్కము.** సం. వి. అ. పుం. కరతాళి, తాళమువేసెడి కంచువాద్యము.

**కులక్షయ.** సం. వి. ఆ. స్త్రీ. శూకశింబి, దూలగొండికీ.

**కులగిరి.** సం. వి. ఇ. పుం. కులాచలము, కులపర్వతము.

**కులగురువు.** సం. వి. ఉ. పుం. కులాచార్యుఁడు.

**కులఘ్నుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) వంశఘాతకుఁడు, వంశమును నాశముచేయువాఁడు. (మనుష్యుఁడు)

**కులజము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. గొప్పకులమునఁ బుట్టినది, గొప్పకులముది. ౨. కులక్రమమునఁ గలిగినది, వంశపరంపరలచే లభించినది.

**కులట.** సం. వి. ఆ. స్త్రీ. ౧-కులము విడిచి పోవునది-అసతి, అంపటాలు. ౨. పతివ్రత యగుభిక్షుకి.

**కులటి.** సం. వి. ఈ. స్త్రీ. మనశ్శిల. (కల్ప)

**కులటుఁడు.** సం. వి. అ. పుం-ఒకకుటుంబమునుండి మఱియొకకుటుంబమునకు వెళ్లువాఁడు-దత్తపుత్రుఁడు.

**కులతంతువు.** సం. వి. ఉ. పుం. వంశవర్ధకుఁడు, వంశమందుఁ బుట్టి సంతానముచే ఆకులమును వర్ధిల్లఁజేయువాఁడు.

**కులతిథి.** సం. వి. ఇ. పుం. స్త్రీ. చతుర్థి, అష్టమి, ద్వాదశి, చతుర్దశి-వీనిలో నేదేనియొకతిథి. (తిథులు కులము లనియు అకులము లనియు కులాకులము లనియు మూఁడువిధములు. ద్వితీయాదశమీషష్ఠ

లు తప్ప తక్కినసరితిథులు కులతిథులు. పాడ్య మి మున్నగు బేసితిథులు అకులతిథులు. ద్వితీయాదశమిషష్ఠులు కులాకులతిథులు.)

**కుల(ళ)త్థ.** సం. వి. ఆ. స్త్రీ. వనకులత్థము, అడవియులవలు. (పాఠాంతరము. కుళుత్థ.)

**కుల(ళ)త్థము.** సం. వి. అ. పుం. ఉలవలు. (పాఠాంతరము. కుళుత్థము.)

**కుల(ళ)త్థిక.** సం. వి. ఆ. స్త్రీ. (పాఠాంతరము. కుళుత్థికా.) ౧. చక్షుష్య, కులత్థాంజనము. ౨. వనకులత్థము, అడవియులవలు. ౩. ఉలవగింజవలె నుండుకాటుకరాయి.

**కులదీపకుఁడు.** సం. విణ. (అ. పికా. అ.) కులమును ప్రకాశింపఁజేయువాఁడు, కులమునకు వన్నె తెచ్చువాఁడు.

**కులదేవత.** సం. వి. ఆ. స్త్రీ. ఇలువేల్పు, కులక్రమముగా నుపాసింపఁబడుదేవత.

**కులద్రుమము.** సం. వి. అ. పుం. శ్లేష్మాతకము మొదలగువానిలో నొకటి.

శ్లో. శ్లేష్మాతకః కరఞ్జశ్చ బిల్వాశ్వత్థకదమ్బకాః, నిమ్బో వటోదుమ్బరౌ చ ధాత్రీ చిఞ్చా చ దశ స్మృతాః. (వాచ.)

**కులనక్షత్రము.** సం. వి. అ. న. శతతార, ఆర్ద్ర, మూల, అభిజిత్తు - ఇవి తక్క మిగిలినవానిలోని సరినక్షత్రములలో నొకటి. (నక్షత్రములు కులము లనియు అకులము లనియు కులాకులము లనియు మూఁడువిధములు. భరణి, రోహిణి, పుష్యము, మఘ, ఉత్తర, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, శ్రవణము, ఉత్తరభద్రపద ఈ పదునొకొండును కులనక్షత్రములు. అశ్విని, కృత్తిక, మృగశీర్షము, పునర్వసువు, ఆశ్లేష, పుబ్బ, హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, పూర్వభద్రపద, రేవతి ఈ పదుమూఁడును అకులనక్షత్రములు. ఆర్ద్ర, మూల, అభిజిత్తు, శతతార ఈనాలుగును కులాకులనక్షత్రములు.)

**కులనాశము.** సం. వి. అ. పుం. ౧. వంశముయొక్క నాశము. ౨. లొట్టియ, ఉష్ట్రము. (వాచ)

**కులపతి.** సం. వి. ఇ. పుం. ౧. వంశశ్రేష్ఠుఁడు. ౨. పదివేలశిష్యులను అన్నదానాదులచేఁ బోషించి యధ్యయనము చేయించు బ్రహ్మర్షి.

శ్లో. మునీనాం దశసాహస్రం యోఽన్నదానాదిపోషణాత్, అధ్యాపయతి విప్రర్షిరసౌ కులపతిః స్మృతః. (వాచ.)

**కులపత్రము.** సం. వి. అ. పుం. దమనకము, దవనము.

**కులపరంపర.** సం. వి. ఆ. స్త్రీ. వంశక్రమము.

**కులపర్వతము.** సం. వి. అ. పుం. కులగిరి. (ఇవి యేడు)

శ్లో. మహేన్ద్రో మలయస్సహ్యశ్శుక్తిమానృక్షపర్వతః, విన్ధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః. (త్రి. ని.)

**కులపాలకము.** సం. వి. అ. పుం. ఒకజాతినారింజ, కమలాఫలము.

**కులపాలకుఁడు.** సం. విణ. (అ. లికా. అ.) వంశపాలకుఁడు.

**కులపాలి.** సం. వి. ఈ. స్త్రీ. కులవతి, కులస్త్రీ, మంచికులమును శీలమును గలయాఁడుది.

**కులపాలిక.** సం. వి. ఆ. స్త్రీ. = కులపాలి.

**కులపుత్రుఁడు.** సం. వి. అ. పుం. వంశోద్ధారకుఁడగుపుత్త్రుఁడు.

**కులపురుషుఁడు.** సం. వి. అ. పుం. ౧. కులీనుఁడు, మంచికులమువాఁడు. ౨. కులమునకు మూలపురుషుఁడు.

**కులభార్య.** సం. వి. ఆ. స్త్రీ. సాధ్వి యగుపెండ్లాము.

**కులభృత్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గర్భిణికి చేయు పరిచర్య. ౨. వంశమును పోషించుట.

**కులము.** సం. విశ. (అ. ఆ. అ.) తిలకకుసుమపరిమళము గలది. (వై. ని.) వి. అ. న. ౧. వంశము, అన్వయము. ౨. సజాతీయప్రాణిసమూహము, తెగ. (ఉదా: విప్రకులము, పక్షికులము.) ౩. గృహము, ఇల్లు. ౪. జనపదము. ౫. దేహము. ౬. ఋషులకు చేయుజలతర్పణము. పుం. ౧. తిలకపుష్పపరిమళము. (వై. ని.) ౨. మార్జాలము, పిల్లి. (కే. ని.)

**కులవంతుఁడు.** సం. విశ. (త్. వతీ. త్.) కులీనుఁడు, గొప్పకులమువాఁడు.

**కులవారము.** సం. వి. అ. పుం. మంగళవారశుక్రవారములలో నేదేనియొకటి. (వారములు అకులవారము లనియు కులవారము లనియు కులాకులవారము లనియు మూఁడువిధములు. ఆది సోమ, గురు, శని వారములు అకులవారములు. మంగళ, శుక్రవారములు కులవారములు. బుధవారము కులాకులవారము.)

**కులవిద్యా.** సం. వి. ఆ. స్త్రీ. వంశక్రమాగత మగు విద్య.

**కులవిప్రుఁడు.** సం. వి. అ. పుం. వంశక్రమముగా వచ్చినపురోహితుఁడు. (ఇష్లే: కులబ్రాహ్మణుఁడు, మొ.)

**కులవృద్ధుఁడు.** సం. వి. అ. పుం. కుటుంబమునందు పెద్దవాఁడు.

**కులవ్రతము.** సం. వి. అ. పుం. న. వంశపరంపరగా ఆచరింపఁబడువ్రతము.

**కులశ్రేష్ఠి.** సం. వి. న్. పుం. శిల్పికుప్రధానుఁడు, పనివాండ్రలో పెద్ద. (అమరము)

**కులసంభవుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మంచి వంశమందుఁ బుట్టినవాఁడు, బీజ్యుఁడు.

**కులసత్త్రము.** సం. వి. అ. న. పిత్రాదిక్రమముగా సహస్రవర్షము లనుష్ఠింపఁ దగుయాగవిశేషము.

**కులసౌరభము.** సం. వి. అ. న. మరువకము, మరువము.

**కులస్త్రీ.** సం=కులపాలి.

**కులహం(హుం)డకము.** సం. వి. అ. పుం. జలావర్తము, నీటిసుడి.

**కులాంకురము.** సం. వి. అ. పుం. కులముయొక్క ఉత్తరాభివృద్ధికి హేతు వైనసంతానము.

**కులాంగన.** సం. వి. ఆ. స్త్రీ=కులస్త్రీ.

**కులాంగారుఁడు.** సం. వి. అ. పుం - కులమునకు బొగ్గువంటివాఁడు - వంశదూషకుఁడు, వంశమునకు అపకీర్తి తెచ్చువాఁడు.

**కులాయము.** సం. వి. అ. పుం. ౧. నీడము, పక్షిగూఁడు. ౨. గృహము, ఇల్లు. ౩. స్థానము, చోటు.

**కులాయిక.** సం. వి. ఆ. స్త్రీ - గూండ్లు కలది - పక్షిశాల, పక్షు లుండుటకు కట్టినశాల.

**కులాలము.** సం. వి. అ. పుం. ౧ కుక్కుభము, గంపపులుఁగు, అడవికోడి. ౨. కౌశికము, గ్రుడ్లగూబ. (హేమ. ని.)

**కులాలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తుత్థవిశేషము. (అమరసుధ.) ౨. వనకుళుత్థము, అడవియులవలు. (రా. ని.) ౩. కుమ్మరవానిభార్య. ౪. కుమ్మరది.

**కులాలిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కుమ్మరిపెండ్లాము. ౨. కుమ్మరది.

**కులాలుఁడు.** సం. వి. అ. పుం. కుంభకారుఁడు, కుమ్మరవాఁడు.

**కులాహము.** సం. వి. అ. పుం. ౧. ఇంచుక పసుపువన్నెయు నల్లనిమోఁకాళ్లును గలఅశ్వము. ౨. కృకలాసము, తొండ. ౩. శాకభేదముౕ.

**కులి.** సం. విశ. (న్. నీ. న్.) మంచికులమువాఁడు.

వి.న్.పుం.కొండ.(వాచ)ఇ. పుం. చేయి. (శ్లో. కులిర్హస్తో భుజాదళః.త్రి.ని.)ఇ,ఈ. స్త్రీ. కంట కారిక,వాఁకుడుకీ. ఈ. స్త్రీ. పత్నియొక్క జ్యేష్ఠ భగిని, వదినె. (వై. ని.)

**కులింగదృక్కు.** సం.వి.శ్.స్త్రీ. యక్షాక్షి,గచ్చ చెట్టు.

**కులికము.** సం.వి.అ.పుం. ౧.ఒకానొక చెట్టు. ౨.అష్టమహానాగములలో నొకటి.3.రవ్యాదివారము లందు వచ్చుదుష్టకాలము.

ఉదా: కులికవేళ, కులికకాలము.

**కులికి(ల్కి)ంచే.** స.క్రి. (√కులుకు.) కులుకఁజేయు.

(ఒయ్యారముగాఁ గదల్చు.)

మ....గుబ్బచన్నులు గుల్కించుమెలంతలున్ ...మల్లభూ. వైరా. ౫౬.

**కులికుఁడు.** సం.విశ. (అ.ఆ.అ.) కులశ్రేష్ఠుఁడు.

వి. అ. పుం. ౧. శిల్పికులప్రధానుఁడు, పనివాండ్రలో పెద్ద. ౨. సమానవంశమునఁ బుట్టినవాఁడు, జ్ఞాతి.

**కులిరు.** వి. (క. కుళిర్) చల్లఁదనము.

కులిరుగొను=శీతల మగు, చల్లఁబడు.

క. కొలవేఁగులు నెలదూఁడులుఁ,దలిరులు నీహార వారిఁ దడిపి నయమునన్, గులిరుగొన మేన నొత్తిరి,లలనలు పార్వతికి శీతలక్రియ లెలయన్. కు. సం. ౫. ౬౨. (ప్రయోగాంతరము లేదు)

**కులిశద్రుమము.** సం. వి. అ. పుం. స్నుహి, జెముడుకీ.

**కులిశధరుఁడు.** సం. వి. అ.పుం-వజ్రమును ధరించినవాఁడు-ఇంద్రుఁడు.

**కులిశనాయకము.** సం. వి. అ. పుం. సురతబంధభేదము. (కులిశనామకము అని కొందఱు.)

**కులిశము.** సం. వి. అ. పుం. న-ఇంద్రునిచేతియందుండునది; పర్వతములను పగులఁగొట్టునది-వజ్రాయుధము. పుం. ౧. మత్స్యవిశేషము. ౨. అస్థిసంహారవృక్షము, నల్లేరుకీ.

**కులీనకము.** సం. వి. అ. పుం. వనముద్గము, అడవిపెసరకీ.

**కులీనసము.** సం. వి. అ. న. నీరు. (వై.ని.)

**కులీనుఁడు.** సం.విశ. (అ.ఆ.అ.) ఉత్తమకులమునఁ బుట్టినవాఁడు.

**కులుఁడు.** సం.వి.అ.పుం.కులికుఁడు,శిల్పికుల ప్రధానుఁడు, పనివాండ్రలో పెద్ద. (కల్ప)

**కులుకము.** సం. వి. అ. న. జిహ్వామలము, నాలుకపాఁచి. (త్రి. ని.)

**కులుకు(ల్కు).** అ. క్రి.(క.కులుకు.త. కులుక్కు)

౧. శృంగారముగా కదులు, నీటుగా కదలు, గునియు.

వ. ... చెదరినముంగురులు చక్కదువ్వుచు నల్లనల్లనం గులుకుచు...శశాం.3.౨౧.

చ. బలువగపారువాపలుకు పల్కఁగ వచ్చునో కుల్క వచ్చునో, చెలువుని చెంగటం బరుని చెంగటఁ బోలెఁ గురంగలోచనా. శుక. ౧. ౪౪౦. ఇందు. ౫. ౧౦3.

౨. మఱియు.

క. కొండయనుఁగుఁగూఁతుఁ గలిసి కులికెడుదొరకున్. అచ్చ. రా. బాల. ౨3. వేం. మా. ౧. ౬౧.

3. ప్రకటమగు.

గీ. వాసుకి ననంతశక్తినివాసుఁ బిల్వ,నంపి యిట్లని పలికెఁ బ్రియంబు గులుక.దశా.౨.౧౭౧.

గీ. అనుచు నఖిలాంగశృంగార మభినుతించు, గతిఁ దులాకోటిమణికోటికాంచిదామ, కింకిణీగణకంకణాకీర్ణకలక,లారవమ్ములు గులుక నొయ్యారమొలుక. సారంగ. ౨. ౪౩.

౪. ఒప్పు, ప్రకాశించు.

వ. ... సంక్రందనచందనగంధ్వలికఫలకంబునం గులుకుకర్పూరతిలకంబుతోఁ దులఁదూఁగి ...ఉ. రా. ౪. ౧౬౩.

దరువు. ఉరమున వల్లికి గుల్కె, నదియు హరినామమే పరుసఁ బల్కె. మ్ప. వి. ౧. ౧౩.

స. క్రి. ౧. వెదచల్లు, చిమ్ము; బయలుపఱుచు, ప్రకటించు.

(నరసింహస్వామి) చ...ద్విజవేషముతోడ వచ్చె నా,గరదధిగంధముల్ గులుకకట్టు ప్రసాదపుమాటలోడుతన్. పరమ. ౪. ౨౨౭. (శ. ర. పా.)

సీ. కొదలుమాటలు తేనె గులుకుచుఁ బలుకుచో మోహనం బగువింతముద్దుఁజెలువు. గీ. కలిగి ... కళా. ౬.౧౯౬.

చ...చీకటుల్,గులికెడునీలిదట్టి... కువల. ౪. ౨౦౨.

సీ. వలపులు గులుకుచెంగలువ క్రొవ్విరులతేకులు గానరా నేసకొప్పు ముడిచి. వరాహ. ౩. ౧౧౧.

ఉ. భూవరముఖ్యుసన్నిధికిఁ బోయెడుమామిడిపండ్లపుట్టికల్, మోవఁగఁ గూలిఁ బుచ్చుకొని మూఁతఁ గుల్కెడుగ్రామ్యచేష్టితం, బావహిలంగ నేఁగి...కళా. ౬. ౧౯౫.

౨. పోయు; వేయు.

సీ. గొజ్జంగపూఁదేనె కులికి మేదించినకమ్మఁగస్తురి మేనఁ గలయ నలఁదు. కాశీ. ౩. ౧౧౫. క్రీడా. ౪౩.

క. గంబూర కులికి...పన్నీటన్, బింబోష్ఠి యతనిపాదా,బ్జంబులు గడిగించెఁ గూర్మిసకియలచేతన్. సారంగ. ౨. ౯౪. విక్ర. ౮. ౯౬.

౩. కదలించు.

సీ. ఉబ్బుబుగ్గల నొక్కి యొయ్యనొయ్యనఁ గోలఁగొమ్మావిఁ గులికి సీత్కృతులు సలిపి. చంద్రా. ౨. ౯.

గీ. ఎఱ్ఱగా నగ్నిఁ గాఁగినయినుపయినుకఁ, గులికి పోయుఁడు వీనిముక్కునను జెవుల. కాశీ. ౩. ౧౯౨.

౪. గంగరించు.

గీ. పల్మఱును దేఁటిచిన్నిపాపలకుఁ గులికి, పువ్వుఁదేనియ నుగ్గులు పోసి పోసి. యయా. ౪. ౨౯.

౯. పూయు.

చ. అలఘుతటీయఖేయముల నాడెడునన్నులగుబ్బచన్నులన్, గులికినయేణనాభినవకుంకుమసంకుమదాంకపంకసం,కలితవిలేపము ల్గరఁగి గమ్మని కమ్మనితావు లీన...హ. న. ౧. ౧౦.

౬. తాఁకించు ?

క. తలదలతోఁ దాఁకించినఁ, దల మీఱుంగాలు గాలఁ దాఁకించిన మి,క్కిలికాలు గలుగుఁ జేతులఁ, గులికినఁ దనచేయి మీఁదగున్ వ్రేటునకున్. ఉ. హరి. ౬. ౧౦౬.

వి. ౧. శృంగారపుఁగుదిలిక.

గీ. దానితిన్ననినుఁబల్కు దానికుల్కు, దానియొయ్యారమును మెచ్చి తాల్మి నిలుప, లేక పరుణుండుగూడ స్ఖలించెఁ దేజ, మదియు మునుపటిఘటమందె యతిప యుంచె. ఉ. రా. ౬. ౩౮౪.

వ. ... మేలిమైనకులుకుల రసికజనంబులమనంబుల మరులుకొలుపన్ జాలి... మను చ. ౯. ౧౦౧.

౨. విలాసము; అందము, ఒప్పు.

సీ. చిత్రము కులుకు బెడఁగు...హొయలనఁగ విలాస మొప్పచుండు. ఆం. భా. ౧. ౧౩౯.

సీ. ఫలభంగములు సేయుపనిఁ బూనెదరు గదా కులుకులా యివి మీకుఁ జిలుకలార. శృం. శకుం. ౨. ౨౦౯.

మ...ఏరా యధరామృతం బొసఁగి న న్మన్నింప
రా యంచు దైన్యరసం బుప్పతిల న్నెలంత
వలవంతం గుల్కులం జిల్కుపాం,దరగండ
చ్యుతబాష్పధార కొనగోటన్ మీటుచుం
బల్కఁగన్. సారంగ. ౨. ౧౨౯.

చ...కులుకు చల్లెడుచూపులు...కవిరా. ౫.౩౧.
(ఖ) కుమ్మరి కుండలపై చేయుశిల్పము. (ఒకవిధ
మగునకిస్కిపని) హంస. ౫. ౧౩.

విణ. ౧. శృంగారపుఁగుదిలిక గలది.

సీ. గుత్తంపుఱవిక దా హత్తకుండఁగఁ జేసి కల
పంబు కులుకుగుబ్బలను బూయు. హంస. ౧.
౧౨౬.

వ. కొందఱు కులుకులాఁడులు తమకులుకుగుబ్బ
లం బోలకున్న నీళ్లు మోయించి రనఁ జాలు
జాళువాగిండ్లు పూని కెలంకులం గొలువుసే
య...ఉ. రా. ౫. ౨౪౯.

సీ. వసివాళ్లు వాడెడుపవనాబ్జములతోడ వలపుఁ
దెల్పెడుకుల్కుటెలుఁగుతోడ. పరమ. ౪.
౧౦౧.

౨. మనోజ్ఞము, ఒప్పిదము, అందమైనది.

సీ. కులుకుఁబాయపురాచతలిరాకుఁబోఁడులు...
నీలా. ౧. ౨౭.

సీ. నగుముద్దుమోమున మృగనాభితిలకంబు కులు
కుడాల్ సిరులు ముంగురుల నొరయ.దశా.౧.
౭౧.

కుల్కుఁదనము=అందము.

గీ. కుందనముఁ గేరుచెక్కుకుల్కుందనంబు, ప
ల్లవము నవ్వుచరణసంపల్లవంబు. చంద్రా.౫.
౧౨౫.

జ: కులికించు, కులుకులాఁడి.

**కులుకు(ల్కు)లాఁడి.** వి.(√కులుకు) విలాసములు
గలస్త్రీ;స్త్రీ.

గీ. ... సింగార మొలుక ముద్దుఁ,జిలుకకడ ని
ల్చెఁ గోమటికులుకులాఁడి. శుక.౧.౧౪౯.

వ. ... చిలుకలవలెఁ బలుక నేర్చినకొందఱు కు
లుకులాఁడులు...ఉ.రా.౫.౨౪౯.

చ. ... అప్పలుకులకుల్కులాఁడి నను భవ్యకవి
త్వధురీణుఁ జేయుతన్. భోజసుతా. ౧. ౬.
(పలుకులకుల్కులాఁడి=పలుకులవెలంది, స
రస్వతి.)

**కులుక్కగుంజ.** సం.వి.ఆ.స్త్రీ. ఉల్కాగ్ని,కొఱవి
నిప్పు. (కల్ప)

**కులుప.** వి. (త. కుసుప్పై=వాఁపు.) శోఫవ్యాధి,
వాఁపు.

(వేశ్యామాతృవర్ణనము.)

ద్వి. వెలికుఱికినకండ్లు వ్రేలుచన్నులును, గులుప
వట్టినమేను కోఁతి మొగంబు. ద్వి. పరమ.౪.
౨౯౦ పా.

**కుల్మాషము.** సం.విణ. (అ. ఆ. అ)శబలము, చిత్రవ
ర్ణము గలది. (కే.ని.) వి. అ.న. కాంజికము, పులి
యఁబెట్టిన కడుగునీరు. పుం. ౧. అలసందెలు,బొ
బ్బరలు. ౨. మినుములు లోనగువానిగుగ్గిళ్లు. ౩.
కురువిందమణి. ౪.యవపిష్టము. ౫.సూపభక్తము,
పులగము. ౬. శబలము,చిత్రవర్ణము. (కే.ని.)

**కుల్యా.** సం.వి.ఆ.స్త్రీ. ౧.కృత్రిమసరిత్తు,కాలువ. ౨.
జలప్రణాళి, తూముకాలువ. ౩. జీవంతిక, తిప్ప
తీఁగె. ౪. నది,ఏఱు. (వై.ని.) ౫. సాధ్వి, క్రొ
త్తడి. (హలా. ని.)

**కుల్యము.** సం. విణ. (అ. ఆ, అ.) ౧. సత్కులము
నఁ బుట్టినది. ౨. మాన్యము, గొప్పది. ౩. కుల
మునకు హితమైనది. వి. అ. న. ౧. అస్థి,ఎముక.
౨. మాంసము. ౩. శూర్పము, చేట. ౪. అష్టద్రో
ణపరిమాణము.

**కుల్లిమి=కుల్లెము.** వి.ఒకజాతిమలుఁగుపాము, పాఁ
వమీను. (బ్రౌ.)

**కుల్లెము=కుల్లిమి.** (బ్రౌ.)

**కుళము.** వి.(త.కుళమ్=చెఱువు)కొలను, చెఱువు.

గీ. ఇవి మహాశక్తు లివి జ్యోతు లివి మఠంబు, లివి

య మణిమయపుందంతు లివి కుళంబు,లివి సు
వర్ణాళ్ళసముదయం బివి తటంబు, లనుచుఁ
బేర్వేరఁజూపుచు నరిగి యంత. చెన్న. 3.
౮౫.

**కుళాయ**=కుళ్లాయి.

మ. తలహాళంబట్టుకుళాయలుం దళుకునిద్దాయొం
ట్లు...దశా. ౭. ౧. ౩౩. ఉ. రా. ౫. ౨౭౦.

**కుళాయి**=కుళ్లాయి.

గీ. పాత్తములు మేల్కుళాయి పల్ముత్తియం
పుఁ,బోఁగులును ... కర్లి ముంగిటికి వచ్చి,
నిలిచె వడి నొక్కనాడెంపు నేలవేల్పు. నీ
లా. ౧. ౬౦. ఆం. భా. ౨. ౧౫౫. భాను.
౮. ౬౦.

**కుళి(లి)ంగము.** సం. వి. అ. పుం. చటకము, పి
చ్చుక.

**కుళి(లి)ంగి.** సం. వి. ఈ. స్త్రీ. కర్కటశ్శృంగి.

**కుళిరము.** సం. వి. అ. పుం. ౧.కర్కటము,ఎండ్రి.
౨. (జ్యోతి) కర్కటరాశి.

**కుళీరము.** సం=కుళిరము.

**కుళుపు.** వి. రాజావర్తమనుమణివిశేషము. (బ్రౌ.)
ఉంగరమునకు పొదిగెడువిశాల మగుమణివిశేష
ము. (శ. ర.)

చ. సరసిజసంభవుండు పురసారసగేహినికిన్ ర
చించున, చ్చెరు వగునీలపుంగుళుపు చెక్కిన
మేలిపసిండిముద్దుటుం,గర మన మింటితో
నొరయికన్ గనుపట్టెడు గోపురస్ఫుర,ద్గురు
తరశాతకుంభరుచిగుంభితసాలము వీట మి
టుగన్. చంద్రా. ౧. ౮.

**కుళ్లా(ల్లా)**=కుళ్లాయి.

లయగ్రాహి...దోర,త్నాంగదము కుంకుమతరం
గముల గుప్ప జిగి వొంగుబురుసాపనిబెడం
గు గలకుళ్లా, నింగికిఁ దళ్త్తళ లాసంగ ...
రా. వి. ౨. ౩౯.

శా. కుల్లా నెట్టితిఁ గోక సుట్టితి మహాకూర్పాస
ముం దొడ్గితిన్ ... తల్లీ కన్నడరాజ్యలక్ష్మి ద
య లేదా నేను శ్రీనాథుఁడన్.(శ్రీనాథుని
చాటువు.)

గీ. ప్రబలు వస్త్రముకుటము కుల్లా కుళాయి,యనఁ
గ...ఆం.భా. ౨. ౧౫౫.

**కుళ్లాయి**=కుళాయ, కుళాయి, కుళ్లా, కుళ్లాయ. వి.
(సం. ఖోలకః. క.కుల్లాయి.త.కుల్లా)చిన్నటోపి.

సీ. పరిజనంబులు వీఁచుసురఁటిలె మ్మెరల బంగరు
వ్రాఁతకుళ్లాయికళలు గదల.చంద్ర.౨.౯౩.

ద్వి. తల యున్నఁ గుళ్లాయి తగిలింపవచ్చు. ద్వి.
సారంగ. ౧. ౧౯ పా. ౧౨ పం.

**కుళ్లాయ**=కుళ్లాయి.

క. తల గలిగినఁ గుళ్లాయలు, గల వేవగనైన నీవు
గలిగినఁ దాద్య,క్కలరవము లెన్ని యైనం,
గలిగెడుఁ బోకు మని యడ్డకా ల్వేయంగన్.
సారంగ. ౨. ౧౬. (శ.ర. పా-కుళ్లాయలు.
ముద్రి.)

**కుళ్లు**=క్రుళ్లు. అ. క్రి. ౧. (కాలాతిక్రమణముచే
ఫలాదులు) చెడు, పాడగు.
ఉదా: మామిడిపండు కుళ్లినది.

గీ. రాజముఖులార వరముఖాంభోజలార,చారు
బిసబాహులార రంభోరులార, కందఁగా
నేల ముడుఁగుచుఁ గుంద నేల,కుళ్లఁగా నేల
తలవంపుగొళ్లవేల. చంద్రా. ౮. ౨౫౮. (రెం
డవయర్థమునకుఁ గూడ ఇది యుదాహరణ
ము.)

౨. (మనస్సులో) దుఃఖించు, తపించు.

ఆ. కొండతాళ్లు దెచ్చి కోరికఁ గట్టిన,గుళ్లలోనఁ
దిరిగి కుళ్ల నేల,పాయ రానిశివుఁడు ప్రాణి
గాయె యుండంగ. వేమన. ౨. ౧౮౯.

వి. ౧. చింత, అంతస్తాపము.

(వ్యవ) ఆకుళ్లుతో వాఁడు సగమయి పోయినాఁడు.
౨. కాపట్యము, కాలుష్యము.
ఉదా: వాఁడు మనస్సులో కుళ్లుపెట్టుకొని మాటలాడుచున్నాఁడు.
౩. కుళ్లినపదార్థము; మాలిన్యము.
(వ్యవ) ఆతూములో కుళ్లు అంతయు తీసివేయుము. ఒడలికుళ్లు. బట్టలకుళ్లు.
విణ. కుళ్లినది, చెడిపోయినది.
గీ. కుళ్లుఁదిత్తికిఁ గవిసినకుక్క వోలె. రామలిం. ౧-౩.

**కుళ్లుకుళ్లు.** వి. దగ్గునప్పుడు కలుగుధ్వనియొక్క అనుకరణము.
గీ...కుళ్లుకుళ్లున దగ్గుకొనుచు,నుండు మనుజుండు జర తన్ను నిండ ముంప. శివధ. ౫. ౭౧.

**కుళ్లుకొను**=క్రుళ్లుకొను. అ. క్రి. (√కుళ్లు-స్వార్థమున 'కొను') కుళ్లు,(మనస్సులో)దుఃఖించు,పరితపించు.
సీ. గొంతియమందల నించుకొనసైతిఁగా యంచు గొల్లవాఁ డూరకే కుళ్లుకొనఁగ. సుక. ౨. ౫౬౩.

**కుళ్లుపోతు**=క్రుళ్లుపోతు. విణ. దుఃఖశీలుఁడు,మనస్సులో నెప్పుడును తపించువాఁడు. (శ. ర.)

**కువ**=కువ్వ. వి. (త. కువై.) ౧. కుప్ప, రాశి.
క. వివిధాస్త్రకోవిదుఁడు వా,సవి వానిరథంబుఁ బార్శ్ని సారథుల మహిం,గువలుపడ నేసె... భార. ఆది. ౬. ౧౨.
౨. పాఁతఱ. (బ్రౌ.)

**కువంగము.** సం.వి.అ.న. సీసము.

**కువకాలుక.** సం. వి. ఆ. స్త్రీ. ఘోలీశాకము, చేతరాసిగ.

**కువకువ.** వి. కోకిలధ్వన్యనుకరణము.
చ. మనుఁజిగురాకు మేయుతతి నోరికెలంకులఁ దేఁటి గుట్టినన్, వనతరుశాఖలన్ గువకువధ్వనిఁ బాఱు పికాంగనన్ బికం, బనునయమొప్ప మాన్పగతి నాత్మముఖంబు ముఖంబుఁ జేర్చి చుం,బన మొనరించె...మనుచ. ౩. ౧౨.

**కువజ్రము.** సం.వి.అ.న. వైక్రాంతమణి.

**కువము.** సం.వి.అ.న. ౧.ఉత్పలము,కలువ.

**కువరము.** సం.విణ. (అ.ఆ.అ.) ఒగరు గలది.వి.అ. పుం. తువరము, ఒగరు.

**కువలము.** సం.వి.అ.న. ౧.ఉత్పలము, కలువ.
౨. బదరీఫలము,రేఁగుపండు. ౩.ముత్యము.(మే. ని.) ౪. జలము. ౫.సరోవరము, పాముకడుపు. (వాచ.)

**కువలయము.** సం. వి. అ. న. ౧. ఉత్పలము,కలువ.
౨. నల్లగలువ. పుం. న. భూమండలము.

**కువలయాపీడము.** సం.వి.అ.పుం. ఒకయేనుఁగు. (ఇది కృష్ణునిచే చంపఁబడిన కంసునియేనుఁగు.)

**కువలయాశ్వుఁడు.** సం.వి. అ.పుం. ధుంధుమారుఁడను రాజు.

**కువలయిని.** సం.వి. ఈ. స్త్రీ.నల్లగలువతీఁగ. ౨.కువలయసమూహము.

**కువలయేశుఁడు.** సం.వి.అ.పుం.౧.కలువలఱేఁడు, చంద్రుఁడు. ౨.భూమండలాధిపతి,రాజు.

**కువలి.** సం. వి. ఈ. స్త్రీ. రేఁగు.

**కువలేశయుఁడు.** సం. వి. అ. పుం-నీటియందుఁ బరుండువాఁడు-విష్ణువు.

**కువాటము.** సం. వి. అ. పుం. తలుపు, కవాటము. (వై. ని.)

**కువాడము**=కువ్వాడము, కువాళము[1]. వి. ౧. కపటచేష్ట.

ద్వి. లోకంబులో లేనిలోటతాఁటకత్తె, నీకువా
డమ్ము లన్నియు మాకుఁ దెలియుఁ, గైకొని
మేఁకలఁ గాచిరా పొమ్ము, నీకంటె మిక్కిలి
నెఱజాణ నేను. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౪
పం.

౨. కాపట్యము.

ఆ. నీకువాడ మెల్ల నిన్న రాతిరి గంటి, నమ్మ చెల్ల
నిన్ను నమ్మరాదు, నవ్వు గాదు రేయి నా ప్ర
క్కలోనుండి, కలవరింప లేదె చెలుల నెల్ల.
శృంగారరాధామాధవసంవాదము. ౧. ౪౧.

**కువాడి**=కువాళి. (కువాడము + ఇ.)

ద్వి. క్రచ్చఱ ద్వీపాంతరంబుననుండి, వచ్చిన
యట్టికువాడివ డ్రంగి, యవగడం బైనయీ
యాలయం బిట్లు, సవరించె నని సవసవ గాఁ
గ వింటె. ద్వి. పరమ. ౭. ౫౨౩ పా.

**కువాదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పరులదో
షమును ప్రకటించువాఁడు. ౨. దుర్భాషలాడు
వాఁడు. ౩. కుత్సితవాదము చేయువాఁడు.

**కువాళము**[1]=కువాడము. వి. కపటచేష్ట.

చ. తెలిసితి హో యి దంతయును దేవరపట్టపుదేవి
కైతవం, బలసుతుఁ బాడి దప్పినను నాజ్ఞయొ
నర్పఁగ లంచ మిచ్చి వే, పిలిచి తలార్ల చేత
ననిపించిన దిట్టుల నీకువాళముల్, దెలియక
వెట్టిరాజ యిది లెస్స నిజం బని నమ్మినాఁడ
వే. సారంగ. ౩. ౨౦౭.

విణ. కపటి, కుత్సితుఁడు.

గీ. తాడిమ్రా నుక్కు మీఱంగ నూడఁ బెఱికి, య
క్కువాళంపురక్కసుఁ డెక్కుకొన్న, యర
ద మఱపఱ లోపరింప నలిగి వాఁడు, వాని నె
న్నోసలుఱిక నొవ్వంగ నేసె. అచ్చ. రా.
సుం. ౧౧౫.

జ: కువాళి.

**కువాళము**[2]. వి. వాహనము లోనగువానిగొనెన.

సీ... వాహనాద్యాచ్ఛాద్యవస్త్రసంజ్ఞ, తనరుఁ గు
వాళ మంచనఁగ... ఆం. భా. ౨. ౧౫౫.

జ: కువాళించు.

**కువాళి**=కువాడి. విణ. (కువాళము[1] + ఇ) మోస
గాఁడు.

చ... వేడ్కకాఁ డగుచు నక్కట యీకొఱగా
మి చేయుమం, జెఱుప నుపాయ మెంచి యి
లు చేర్చెను దేవరసామ్ముఁ దచ్చి యీ, యఱ
నకువాళి యింత యురి యౌ నని కానక మో
సపోయితిన్. వైజ. ౪. ౯౫.

**కువాళించు.** స. క్రి. (√ కువాళము[2]) - గొనెన
గాఁజేయు-కప్పు.

మ. ప్రకటస్నేహ మెలర్ప నాతనిపయిం బద్మా
వతీకాంత వా, లికక్రొవ్వాఁడి మెఱుంగుఁ
జూపుల నివాళించెన్ గువాళించుచున్. వి
క్ర. ౧. ౨౪.

**కువాహులము.** సం. వి. అ. పుం. లొట్టియ.

**కువిందుఁడు.** సం. వి. అ. పుం. తంతువాయుఁడు,
సాలెవాఁడు.

**కువిచిలు.** వి. మృత్పాత్రవిశేషము. (బ్రా). హంస.
౫. ౧౨.

**కువృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. చెడ్డనడవడి.

**కువృత్తికృత్తు.** సం. విణ. (త్) కువృత్తిని చేయు
వాఁడు. వి. త్. పుం. పూతికరంజము, నెమిల
డుగు ?.

**కువేణి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. మత్స్యధాని, చేఁపలబుట్ట.

**కువేలము.** సం. వి. అ. న. కువలయము, కలువ.
(కే. ని.)

**కువ్వ**=కువ. వి. ౧. రాశి, ప్రోగు.

వ... పెన్నెలఁ జెన్నలరువెన్నెలకువ్వలమువ్వం
బున నివ్వటిల్లు తెల్లజల్లుల నుల్లసిల్లుబల్లిదంపు
జల్లి పెకంబులును... ప్రబంధ. ౧౮౬.

గీ. ప్రోక యనఁ బ్రోవనంగను బ్రోగు నాఁగఁ,గువ్వ యన రాసి యనఁగను గువ్వ యనఁగ, రాశి యగు... ఆం. భా. ౨. ౧౦౧. అ. మ. క. ౫. ౨౨౨ పా. ౨౪ పం.

౨. పాఁతఱ. (బ్రౌ)

కువ్వాడము=కువాడము. (శ. ర, బ్రౌ.)

కుశ. సం. వి. అ. పుం. న. దర్భ. ఆ. స్త్రీ. ౧. గుఱ్ఱపుకళ్లెము, వాగె. ౨. అరణి. (వై. ని.) ౩. రజ్జువు, త్రాడు.

కుశపము. సం. వి. అ. పుం-దీనితో నీరు త్రాగుదురు-పానపాత్రము.

కుశము. సం. వి. అ. పుం. ౧ ఒకద్వీపము. ౨. యోక్త్రము, పలుపు. న. ౧. జలము. ౨. హ్రీబేరము, కురువేరు. (కే. ని.)

కుశలప్రశ్నము. సం. వి. అ. పుం. క్షేమము నడుగుట.

కుశలము. సం. విశ. (అ. ఆ. అ) ౧. చతురము, నేర్పుగలది. ౨. క్షేమము గలది. ౩. శుభమైనది. ౪. పుణ్యమైనది. వి. అ. న. ౧. క్షేమము. ౨. శుభము. ౩. పుణ్యము. ౪. పర్యాప్తి, సమృద్ధి, పూర్ణత.

కుశలి. సం. విశ. (న్. నీ. న్.) కుశలము గలవాఁడు.

కుశస్థలము. సం. వి. అ. న. కన్యాకుబ్జదేశము.

కుశస్థలి. సం. వి. ఈ. స్త్రీ. ద్వారక.

కుశాంగుళీయము. సం. వి. అ. పుం. పవిత్రము, దర్భలతో చేసినయుంగరము.

కుశాక్షము. సం. వి. అ. పుం. కోఁతి. (వాచ.)

కుశాగ్రబుద్ధి. సం. విశ. (ఇ)-కుశాగ్రమువంటిబుద్ధిగలవాఁడు-చుఱుకైనబుద్ధి గలవాఁడు.

కుశాగ్రము. సం. వి. అ. న. దర్భమొన.

కుశాగ్రీయము. సం. విశ. (అ. ఆ. అ) కుశాగ్రమువంటిది, వాఁడి యైనది. (బుద్ధి, మొ.)

కుశాసనము. సం. వి. అ. న. దర్భాసనము.

కుశి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఫాలము, నాఁగటికఱ్ఱు. ౨. ఇనుముతో చేసినవస్తువు. (కే. ని.) ౩. భగ్నాస్థిబంధము, విఱిగినయెముకలు అతుకుకొనుటకు కట్టిన కట్టు. (వై. ని.)

కుశిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఫాలము, నాఁగటికఱ్ఱు. ౨. గవేధుక, అడవిగోదుమ॰.

కుశికము. సం. వి. అ. పుం. ౧. నూనె మొదలగువానిమడ్డి. ౨. అక్షము, తాండ్ర॰. ౩. సర్జవృక్షము, మద్ది॰.

కుశికుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) మెల్లకంటివాఁడు. వి. అ. పుం. ఒకానొకఋషి. (ఇతఁడు విశ్వామిత్రునితాత. వాచ)

కుశీదము. సం. వి. అ. న. ౧. కుసీదము, ధనము వడ్డికిచ్చి బ్రతుకువృత్తి. ౨. రక్తచందనము॰.

కుశీలవుఁడు. సం. వి. అ. పుం. ౧. నటుఁడు. ౨. వంది, బట్టువాఁడు. ౩. గాయకుఁడు. ౪. యాచకుఁడు. ౫. వాల్మీకి.

కుశుఁడు. సం. విశ. (అ. ఆ. అ) ౧. పాపిష్ఠుఁడు, కుత్సితకర్మము చేయువాఁడు. ౨. మత్తుఁడు, మదించినవాఁడు. వి. అ. పుం. రాముని పెద్దకొడుకు.

కుశేశయము. సం. వి. అ. న- నీటియం దుండునది-పద్మము, తామర. పుం. ౧. సారసపక్షి. ౨. కర్ణికారము॰.

కుషాకువు. సం. వి. ఉ. పుం. ౧. కోఁతి. ౨. అగ్ని. ౩. సూర్యుఁడు.

కుషితము. సం. విశ. (అ. ఆ. అ.) జలమిశ్రితము, నీటితో కలపఁబడినది.

కుష్ఠకేతువు. సం. వి. ఉ. పుం. మార్కండిక, నేలతంగేడు॰.

కుష్ఠగంధి. సం. వి. ఇ. న. ఏలావాలుకము, నూఁగుదోసి॰.

**కుష్ఠగంధిని.** సం. వి. ఈ. స్త్రీ. అశ్వగంధ, పెన్నేరుగ.

**కుష్ఠఘ్నము.** సం. విణ. (అ. ఈ. అ.) కుష్ఠవ్యాధిని పోఁగొట్టునది. (ఔషధము.) వి. అ. పుం. ౧. హితావళి. ౨. ఖదిరము, చంద్రి. చేఁతిపాట్లి.

**కుష్ఠఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వాయువిళంగము. ౨. కాకోదుంబరిక. ౩. వాకుచి, కారుగచ్చ.

**కుష్ఠనాశిని.** సం. వి. ఈ. స్త్రీ. సోమరాజి, కారుగచ్చ.

**కుష్ఠనుత్తు(దము).** సం. వి. ద్. స్త్రీ. భారద్వాజి, అడవి ప్రత్తిచెట్టు.

**కుష్ఠము.** సం. విణ. (అ.ఆ. అ.) భూమియందుండునది. వి. అ. పుం. న. ౧. వ్యాధివిశేషము. (ఇది పదునెనిమిదివిధములు గలది.) ౨. చెంగల్వకోష్టు. (శే. ని.)

**కుష్ఠసూదనము.** సం. వి. అ. పుం. ఆరగ్వధము, రేల.

**కుష్ఠహంత.** సం. వి. ఋ. పుం. హస్తికందము, ఒకవిధ మగుకంద.

**కుష్ఠహంత్రి.** సం. వి. ఈ. స్త్రీ. వాకుచి, కారుగచ్చ.

**కుష్ఠహృత్తు.** సం. వి. ద్. పుం. విట్ఖదిరము, దుర్గంధము గలచంద్రి. (వెలితుమ్మ. అనికొందఱు.)

**కుష్ఠారి.** సం. వి. ఇ. పుం-కుష్ఠమును పోఁగొట్టునది-౧. గంధకము. ౨. విట్ఖదిరము, దుర్గంధము గలచంద్రి. (వెలితుమ్మ అనికొందఱు.) ౩. చేఁతిపాట్లి. ౪. ఖదిరము, చంద్రి.

**కుష్ఠి.** సం.విణ.(న్.నీ.న్) కుష్ఠరోగము గలవాఁడు.

**కుష్ఠితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కుష్ఠరోగము గలవాఁడు.

**కుష్మలము.** సం. వి. అ. న. ౧. ఛేదనము, కోఁత. ౨. ఛాదనము, కప్పుట. ౩.వికాసము,విరియుట.

**కుష్మాండము.** సం. వి. అ. పుం. ౧. కర్కారువు, గుమ్మడి. ౨. దేవతాగణవిశేషము. ౩. భ్రూణము, గర్భపిండము.

**కుష్మాండి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కర్కారువు, గుమ్మడి. ౨. ఉమ, నల్లఅగిసె.

**కుసి.** వి. (క. కుసి.) మంచపుకోడు మున్నగువానిరంధ్రములలో చొనుపుటకు సన్నముగా చెక్కినపట్టె మున్నగువానిచివర, పట్టికాగ్రము; అవయవములసంధి.

సీ...కుసి కూచ మనఁ బట్టికాగ్రమై యలరుచుండు. ఆం. భా. ౨. ౧౬౪.

సీ. పసిబాలుఁ డగునాఁడ బండిరూపమ్మదైత్యవీరునిఁ గుసులకు విఱుగఁ దన్నె. చిత్రభా. ౫. ౧౭౨.

క. కసరి పొదరిల్లు వెడలఁగ,నొస లొకతలిరాకు దాఁకె నునుగాడ్పునకుఁ, భసలగుణ మెక్కువెట్టఁగఁ, గుసుమశరాసనునివిల్లు కుసుల కువిఱిగెఁ. కకు. ౧. ౧౭౯.

గీ. కొమ్ముతాఁకులఁ గుసులుకుఁ,గూల మబ్బులు... చిక్కువడక చరించు నం దొక్కకరటి.రా. వి. ౩. ౪౯.

**కుసిగుంపు.** వి. (√కుసి?) శ్రమము, బాధ.

ద్వి. అని తనకొంగు చయ్యనఁ జుట్టి పట్టి,కొని పోకు మని కుసిగుంపు గావింప. ద్వి. పరమ. ౭. ౫౪౫ పా. ౪ పం.

చ...నాకు నీ,కొలు విఁకఁ జాలు నన్నఁ గుసిగుంపులఁ బెట్టు వధింపఁ జూచుఁ గే,వలవరకంబు గా కొలుచువారికి దుష్ప్రభుసంశ్రయం బిసీ. వేం. పంచ. ౧. ౪౨౯.

క. రుసివంటిదాన వన్నీ,కుసిగుం పావరించి యేమి గుడిచెదు పాపం,బసివోలెఁ దాఁకు నిను

నే, నుసురన్నం జాలుఁ జాలు నోహో యను డుఁ. వేం. పంచ. ౧. ౨౫౨. (కుసిగుంపాన రించు=బాధపెట్టు.)

కుసిగుంపునడక=అలసగమనము, మందగమనము. ద్వి. కుసిగుంపునడకలతో డెబాఁపతలు, అసమాన గతి వచ్చి...అ. మ. క. ౫. ౨౩౬ పొ. ౨౪ పం.

**కుసితము.** సం. వి. అ. పుం. జనపదము, దేశము.

**కుసితాయి.** సం. వి. ఈ. స్త్రీ=కుసిదాయి.

**కుసితుఁడు.** సం. వి. అ. పుం. వడ్డివ్యాపారమువలన బ్రదుకువాఁడు.

**కుసిదము.** సం=కుసీదము.

**కుసిదాయి.** సం. వి. ఈ. స్త్రీ. కుసిదుని పెండ్లాము.

**కుసిదుఁడు.** సం=కుసీదుఁడు.

**కుసిలించే=కుసులు.** అ. క్రి. (√కుసులు) అతృప్తిచే ఖేదపడు, మనోవ్యాకులత నొందు. (శ. ర, బ్రా.)

**కుసిలింత.** వి. (√ కుసిలించే) అతృప్తిచేఁ గలిగిన ఖేదము, మనోవ్యథ. (శ. ర, బ్రా.)

**కుసీద.** సం. వి. అ. స్త్రీ. ధనము వడ్డికిచ్చి బ్రదుకు స్త్రీ.

**కుసీదము.** సం. వి. అ. న. వడ్డివ్యాపారమువలన జీవించుట.

**కుసీది.** సం. విశే. (న్. నీ. న్)=కుసీదుఁడు.

**కుసీదికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ)=కుసీది.

**కుసీదుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) వృద్ధిజీవి, వడ్డిచేత బ్రతుకువాఁడు.

**కుసుంబొ.** వి. (సం. కుసుంభః. త. కుసుంబా.) కుసుంభవర్ణము, ఎఱుపు మించినపసుపువన్నె.

సీ. కనకపుష్పముల నొప్పినకుసుంబాపాగ రాణింపఁ గల్కితురాయి మెఱయ. వేం. మా. ౧. ౧౩౪.

ద్వి. పసిమి గుల్కెడుకుసుంబాపాగఁ జుట్టి, వెస బంగరపురంగువిరులంగి దొడిగి. మ్మ. వి. ౧. ౩౨.

**కుసుంభము.** సం. వి. అ. పుం. ౧. మహారజనవృక్షము, కుంకుమచెట్టు. ౨. కమండలువు. న. ౧. కుంకుమపువ్వు. ౨. బంగారు.

**కుసుంభరాగము.** సం. వి. అ. పుం. ౧. కుంకుమపూవుయొక్క ఎఱుపు. ౨. కుంకుమపూవువలనఁ గలిగినయెఱుపు. ౩. కుంకుమపూవువంటి యెఱుపు. ౪. నాయికానాయకులపూర్వానురాగభేదము, కుసుమపూవువన్నెవలె పైకి శోభించినను హృదయమున గాఢముగా లేక తుదకు వీడిపోవు అనురాగము. (నాయికానాయకులపూర్వానురాగము త్రివిధము:-౧. నీలీరాగము=పైకి మిగుల శోభింపకున్నను హృదయమున గాఢముగా నుండి ఎన్నటికిని చెడనియనురాగము. ౨. మంజిష్ఠారాగము=పైకి మిగుల శోభించునదియు ఎన్నటికిని చెడనిదియు నగునురాగము. ౩. కుసుంభరాగము. చూ. ౪. అర్థము.)

**కుసుని.** విశే. వామనుఁడు.

సీ. కుఱుచ కొట్ర కురుఁజు కొటిక కుసుని... వామనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩. (బ్రా. పా-కుసులి. ముద్రి. పా.)

**కుసుమ=కుసుమము.** వి. (క. కుసుమ్బె. త. కుసుంబం.) ౧. ఒకజాతిపూలమొక్క. (బ్రా-ఒకజాతి చెట్టు. శ. ర.) ౨. సస్యవిశేషము. ౩. ధాన్యవిశేషము.

సీ. గోదుమ పెదనువ్వు కుఱునువ్వు తెలినువ్వు కుసుమ వెల్లగిసెయు గోఁగు జనము. హంస. ౪. ౧౨౭.

౩. సస్యకుసుమము, నుంకు.

సీ. సస్యకుసుమసంజ్ఞచను నుంకనంగను గుసుమ నాఁగను...ఆం. భా. ౨. ౨౩౭.

౪. (సం. కుసుంభః) కుసుంభవర్ణము, ఎఱుపు మించినపసుపువన్నె.

మ. కుసుమం బెట్టినచీరకొంగు వొలయం గ్రొవ్వారుపాలిండ్లపై, ద్రిసరంబుల్ పొలుపార ...క్రీడా. ౮౬.

గీ. కుసుదకేదారమునసుండి క్రొత్తచిరియు, కమలపండంబులకు వేడ్క గాఁపువచ్చు, కొదమతుమ్మెదకడలెక్కఁ గుసుమవెట్టె, నభినవం బైనప్రథమసంధ్యాగమంబు. నైష. ౮. ౫.

౫. పుండునందలి మొలక. (బ్రౌ.)

కుసుమపూవు=కుసుంభపుష్పము.

సీ. కంకేళిచిగురాకు గర్ణపూరముఁ జేసి కుసుమపూవులధూళి కురులఁ దాల్చి. ౫ ౩౭.

సీ. కుసుమపూ వనఁగఁ దగును గుసుంభాభిధ... ఆం. భా. ౨. ౧౬౧.

జ: కుసుమపూరాజనాలు.

**కుసుమధన్వుఁడు.** సం. వి. న్. పుం. మన్మథుఁడు, పూవిలుతుఁడు.

**కుసుమపురము.** సం. వి. అ. న. పాటలీపుత్రమను పట్టనము.

**కుసుమపూరాజనాలు.** వి. బ (కుసుమపూ+రాజనాలు.) ధాన్యవిశేషము. హంస. ౪. ౧౨౮. ప్రబంధ. ౧౧౨.

**కుసుమము**=కుసుమ.

(ఎఱ్ఱరంగు.)

క. కుసుమం బద్దినవిధమునఁ, బసుపున హత్తించినట్లు బంగారమునం, బసనిచ్చినగతి సంధ్యావసరంబున నింగి యరుణవర్ణం బయ్యెన్. నైష. ౮. ౧౫౭.

చ. అలకనిజీబులోఁ గుసుమ మద్దినపావడ దోఁప...మనుచ. ౬. ౩౧.

(బ) ధాన్యవిశేషము.

సీ. బలుతీఁగెమల్లె లుపార్జించితిమి చాలఁ గుసుమముల్ చలుకఁగాఁ గూర్ప లేమె. కవిజ. ౧. ౧౩. ఆము. ౧. ౬౬.

**కుసుమము.** సం. వి. అ. పుం. న. ౧. పువ్వు. ౨. స్త్రీరజస్సు. ౩. ఫలము, పండు. ౪. నేత్రరోగవిశేషము, కంటిలో వేయుపూవు. (శే. వి.)

**కుసుమాంజనము.** సం. వి. అ. న. ఇత్తడిమలమునుండి తీయఁబడిపుష్పాకారముగనుండుకాటుక.

**కుసుమాకరము.** సం. వి. అ. పుం. ౧. తోఁట. ౨. పూగుత్తి. ౩. వసంతర్తువు.

**కుసుమాగమము.** సం. వి. అ. పుం. వసంతర్తువు, ఆమని.

**కుసుమాధిపము.** సం. వి. అ. పుం. చంపకము, సంపెఁగ.

**కుసుమాలుఁడు.** సం. వి. అ. పుం. దొంగ. (కల్ప)

**కుసుమాస్త్రుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, పూవిలుతుఁడు.

(ఇట్లే: కుసుమాయుధుఁడు, కుసుమబాణుఁడు, కుసుమశరుఁడు, మొ.)

**కుసుమించే.** సం. అ. క్రి. పుష్పించు. (బ్రౌ.)

**కుసుమితము.** సం. విశే. (అ. ఆ. అ.) జాతకుసుమము, పువ్వులు పూచినది.

**కుసుమేషువు.** సం. వి. ఉ. పుం. మన్మథుఁడు, పుష్పబాణుఁడు.

**కుసురుకొను.** అ. క్రి. (త. కుసూన్=ఉపేక్ష, అలక్ష్యము.) ఉపేక్ష వహించు?

వ. అని తత్తిమి యడుగుచున్న రతిముఖవికారంబు గని మనసిజుండు మనంబునం గుసురుకొనుచుఁ జెలువవ్వ నవ్వుచు నిట్లనియె. కు. సం. ౪. ౪౧౪.

**కుసులు**=కుసిలించే. అ. క్రి. అతృప్తిచే ఖేదపడు, మనోవ్యాకులత నొందు. (శ. ర., బ్రౌ.)

జ: కుసిలించు, కుసిలింత.

కుసుళ్లు. వి.బ. దండకడియములు, స్త్రీభుజాలంకారములు. (బ్రౌ.)

సీ. అలికభాగమునఁ జింతాకువెడల్పుగఁ బొసఁగించుకొన్నవిభూతిరేఖ, సందిట నిరువంకనొందుపైఁడికుసుళ్ల సందంబు నొందువ్రాత్తపూస. గీ. అమర జంగము రాలయ్యె నఖిలపల్లవావశీకృతసమ్మోహ యలయయికోఁచ. శుక. ౨. ౩౨.

కుసువు. సం.వి.ఊ.పుం. గండూపదము, ఎఱ్ఱ, వానపాము.

కుసూలము. సం. వి. అ. పుం. ధాన్యముపోసెడు గాదె; పాణక, మొ.

కుసృతి. సం.విణ. (ఇ) దుర్వృత్తి కలవాఁడు, చెడ్డనడవడి గలవాఁడు. వి.ఇ.స్త్రీ. ౧. చెడ్డనడవడి, శాఠ్యము. ౨. ఇంద్రజాలము. (కల్ప)

కుస్టు. కుష్ఠరోగము.

సీ. ... కుష్ఠరులు మనఁ గుస్టవఁ బులు మన విలసిల్లు... అం.భా. ౨.౧౨౮.(ప్రాఁతప్రతిపా)

కుస్తరించు. స.క్రి. ౧. లాలించు, బుజ్జగించు.

గీ. సహ్యకన్యాతటోద్యానచందనద్రు,కుంజముల నీలకుంతలఁ గుస్తరించి, కంతుసామ్రాజ్యమేలించి... ఆము. ౬. ౧౩౫.

వ. ... కంఠంబుఁ జఱచి మొగంబు ముడిచి ప్రస్తుతులఁ గుస్తరించి... ముచ. ౪. ౧౧౫.

౨. ఊఱడించు, అనునయించు, ఓదార్చు.

గీ. కూఁతు రొంటొకచందానఁ గుస్తరించి, యార్తి వారించి... వేం. పంచ. ౪. ౩౩౩.

గీ. పారలి యేడ్చుచు నుండ నబ్బోటు శేల,కప్పి పడెదమ్మ యని యెత్తి కుస్తరింప. సారంగ. ౩. ౪౨. రం.రా. ఉ. ౧౩౨పా. ౭ పం.

౩. శాంతిపఱుచు.

ఉ. ఇంచుక ప్రొద్దుపోకడకు నెవ్వరితో నుబు నేమి చెప్పుదుం, బంచశరవ్యథం దలఁకుభావము నేగతిఁ గుస్తరింతు... విక్ర. ౬. ౩౮.

౪. సమాధానపఱుచు, ఒప్పించు.

గీ. సమ్మదంబున వసుమంతుఁ డుమ్మలించి, కూర్మి బంధుల నందఱుఁ గుస్తరించి, గోలయూఁ బతివ్రతాధర్మశీల యగుచుఁ, బ్రాణపద మైన యిల్లాలిఁ బజ్జఁ జేరి. శుక. ౧. ౯౮.

ఆ. దానిఁ బట్టఁ బూనుకొజిబీజా గనుఁగొని, సానినిట్లు సేయఁ జనదు నాకుఁ, గూర్మి మీఱ మీఱుకుస్తరించి చిటు తోడి, తెచ్చి కూర్పవలయు నిచ్చలముగ. చంద్ర. వి. ౩. ౩౨.

౫. (లాలనార్థము) చఱచు, చేతితో తట్టు.

చ. కనఁదగు తెల్లమానికపుఁగప్పుల నొప్పెడుచప్పరాలలోఁ, దవపాడ వైనసెడఁ గని తాళకయేచుఁ గటంచుఁ గొమ్ముల౯, జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసినముత్తెపుసింగపుంగమి౯, గనుఁగొని తాలు వేల్పుదొరగారతఁ దౌదలఁ గుస్తరింపఁగ౯. యయా. ౧. ౭౭. (శ. ర. పా.)

గీ. మస్తకము దువ్వి పలుమాఱుఁ గుస్తరించి, సమరసముఁ జూపి మెల్లనె సముతుపఱచి, వాగెబిగియించి తమ్మిచూల్ వాగె సడలి, పన్నెసోఁకిన మునుఁదఱిఁ బఱవ దయ్యె. చంద్రా. ౩. ౬౬.

౬. సేవించు.

గీ. కోటిపల్లీశుకోమలాంఘ్రులకు మ్రొక్కి, కుండలాముఖతీర్థంబుఁ గుస్తరించి, భీమమండలి దాపలఁ బెట్టుకొనుచు, గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె. భీమ. ౧. ౨౧.

౭. తాల్చు.

రగడ. కుటిలాలకములమీఁదఁ జిన్నిపువ్వుఁ గుస్తరించు నమ్మగ మణికర్ణిక. కాశీ. ౬. ౧౨౬.

సీ. సీమంతపథమునఁ జేర్చుక్క సవరించి కురుల పైఁ జిన్నిపూ గుస్తరించి. కాశీ. ౭. ౧౪౭.

౮. ఆచ్ఛాదనము చేయు, కప్పు.

సీ.హురుమంజిముత్యాలయురగుపాగ మెఱుంగు
నొసలిచిత్తరిబొట్టు ముసుఁగు వేయ, జాతినీల
పుఁదాళిచాకచక్యప్రభల్ కస్తూరి నెఱిపూఁ
తఁ గుస్తరింప. సారంగ. ౧. ౭౯.

౯. ఉల్లాసపెట్టు, సంతోషపెట్టు. (చూ. కుస్త
రింపు.)

౧౦. ఆజ్ఞాపించు.

సీ. ఓరుదుపస్తాదులఁ జేర్వర నాడాడ ముస్తాదు
గా నిల్వఁ గుస్తరించి. రంగా. ౨.౧౯౫.

జ: కుస్తరింపు.

**కుస్తరింపు.** వి.(√కుస్తరించు.) ఉల్లాసము.

ఉ.మారునిమాయపంపు దినమానము మేల్ సడలిం
పు జారిణీ,జారులకుస్తరింపు జలజంబులకుం
డలవంపు...కనఁగాఁదగెఁ జీకటిగుంపు పెం
పుగాౘ. ల. వి. ౪. ౪౧.

**కుస్తుంబరి.** సం.వి.ఈ.స్త్రీ.ధాన్యాకము,కొత్తిమిరి.

**కుస్తుంబురువు.** సం. వి. ఉ.న=కుస్తుంబరి.

**కుస్తుభుఁడు.** సం. వి. అ. పుం. ౧.విష్ణువు. ౨.సము
ద్రుఁడు.

**కుహా.** సం.వి. ఆ.స్త్రీ. కటుకరోహిణి.

**కుహకజీవి.** సం. విశే. (న్.నీ.న్) మాయాజీవి.

**కుహకము.** సం. వి. అ. న-ఆశ్చర్యమును కలిగిం
చునది-౧. ఇంద్రజాలము, మాయ. ౨. వంచన,
మోసము.

**కుహకస్వనము.** సం.వి.అ.పుం-ఆశ్చర్యకర మగు
ధ్వని కలది-కుక్కుటము, కోడి.
(ఇట్లే: కుహకస్వరము.)

**కుహకుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) ౧. ఇంద్రజాలి
కుఁడు. ౨. వంచకుఁడు, మాయకాఁడు.(వాచ.)

**కుహన.** సం.వి.ఆ.స్త్రీ. కపటచర్య,దంభచర్య.
(దంభముచే కావించుధ్యానమూనాది.)

**కుహనము.** సం.విశే.(అ.ఆ.అ.) ౧. ఈర్ష్య గలది.
౨. మాయ గలది, వంచకము. వి. అ. పుం. ౧. ఎ
లుక. ౨. వల్మీకము, ఘట్టి. న. ౧. ఒకరకముమ
ట్టికుండ. ౨.కాచభాజనము, గాజుపాత్ర.(మే.
ని.) ౩. మాయ.

**కుహరము.** సం. వి. అ. న. ౧. రంధ్రము, బెజ్జము.
౨. గుహ. ౩. కోటరము, తొఱ్ఱ. ౪. కంఠము, గ
ళము. ౫. కంఠధ్వని, ఎలుఁగు. ౬. చెవి. ౭. సా
మీప్యము. (కల్ప.)

**కుహరితము.** సం. వి. అ. న. ౧. శబ్దము. ౨. పికా
లాపము, కోయిలకూఁత. ౩. రతికూజితము.

**కుహళి.** సం. వి. ఇ. పుం. ౧. పూగపుష్పిక, వివా
హాదులందు ఈయఁబడు తాంబూలము, మొ.(వి
ల్యమ్సు)

**కుహళ.** సం. వి. ఆ. స్త్రీ. కాహళి, బాకా.
శ్లో. కాహళీ తు కుహళా స్యాత్. అ. పా. ప్ర.
వాట్య. (శ. ర.)

**కుహికుహి.** సం. వి. ఇ. పుం. కాసరోగులు దగ్గున
పుడు పుట్టెడుధ్వనియొక్క అనుకరణము.
గీ. ఘూకరవములచాడ్పున ఘోరవృత్తిఁ, దనరు
ఘనకాసకుహికుహిధ్వనులవలన, భావజుఁడు
వెళ్లిపోయినపాడుమేడ, పగిదిఁ గాన్పించు
ముదుసలిపడఁతి యొకతె. కళా. ౩.౫౩.

**కుహుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**కుహువు.** సం. వి. ఊ. స్త్రీ. ౧. చంద్రకళ కానరా
నియమావాస్య. ౨. కోకిలధ్వని. ౩. హిమవత్ప
ర్వతజాతనదీవిశేషము.

**కుహూకంఠము.** సం. వి. అ.పుం-కుహూ అనెడి
ధ్వని కంఠమునఁ గలది-కోకిల.
(ఇట్లే: కుహూముఖము, మొ )

**కుహూలము.** సం. వి. అ. న. సశల్యభూమిచ్ఛి
ద్రము, గసికలు నాటినగుంట. (వాచ)

**కుహేళి.** సం. వి. ఈ. స్త్రీ. దట్టమైనమంచు, మూడమంచు.

## కూ

**కూ**=కూయి.

(మొఱ్ఱ)

ఆ. అకట యాదుకూయు నాలకూయును లేఁ
తి, వారికైన నరయ వలయు నరిన, నన్నుఁ
గీచకుండు దన్నఁగ నెట్టులు, సూడ నేర్చె ధ
గ్మసూనుఁ డపుడు. భాగ. విరా. ౨. ౧౬౭.

జ: కూపెట్టు, కూయిడు.

కూఁకే. వి. ౧. కూఁత.

ఉ. క్రొవ్వునఁ గూయుకోయిలలకూఁకలు శారిక
లాడుమాటలున్. శుక. చ. ౨. ౧౯. యయా.
౪. ౧౨.

౨. అఱపు, బొబ్బరింత.

గీ. తోఁక యల్లార్చి శేవునఁ గూఁకఁ బెట్టి, దో
రణము డిగ్గి పోరికిఁ దొడరునెడల. అచ్చ.
రా. సుం. ౧౦౭.

౩. ఆర్తధ్వని.

సీ. ఒకమూల డాఁగి మేడకులకూఁకలు విని కలఁగి
పయ్యెద మేలిఁ గప్పువెలఁది. దశా. ౪. ౪౫.

(బ) చీవాట్లు. (చూ. కూఁకలు వేయు.)

అరగూఁకపెట్టు=అర్ధక్రోశప్రమాణము.

గీ. ఇంక మణిశైలమునకు వైకంఠమునకు, నడుమ
బిల్వవనం బంత నిడుపు వెడలు, పునను గను
పట్టుఁ బంక జవనము దాని, చెట్టులకు నెల్ల న
రగూఁకపెట్టు పొడువు. వరాహ. ౧౦. ౧౨౬.

కూఁక(లు)పెట్టు=౧. అఱచు, బొబ్బపెట్టు.

క. అఁకట మలమలమాడుచుఁ, గూఁకలు వెట్టు
చును బయటఁ గువలయసుతుల, త్యాగకల నుం
డఁగ నీకీ, వీఁకన్ భుజియింపఁ దగునె విప్ర
వరేణ్యా. శేష. ౧ ఆ. (శ. ౪).

ఉ. ... దిశల్ వడఁ గూఁక వెట్టుచున్. రామా.
౮. ౧౦౯.

౨. కూయు.

క. సురగాలి యెదురు వీచెను, వల డొక్కుటఁ
గూఁక వెట్టె వసుమతి వణఁకెన్, ఉరగంబు
లు పొడచూపెను, హరిణసమూహంబు త్రోవ
కడ్డము దాఁటెన్. మై. ౨. ౩.

కూఁకలిడు=౧. కూయు.

గీ. తలిరుఁబోఁడుల డెందము ల్తల్లడిల్లఁ, గూఁకలి
డుకొంచు నెంతయుఁ గొఱఁత లేక, యాగ
డంబునఁ బురి విచ్చి యాడె దేమి, యక్కు
టా నెమ్మి నీయాట యుడివిఁ గలదు. నీలా. ౩.
౨౭.

౨. కేకలు వేయు.

క. నాకొడుకును నాకోడలు, నేకతమునఁ బెనఁ
గఁ బాము నీతఁడు వైచెం, గోక లెఱుంగక
పాఱినఁ, గూఁకలిడెన్ నీసుతుండు గుణమె
గుణాఢ్యా. భాగ. ౧౦ పూ. ౩౨౫.

కూఁకలు వేయు=౧. (పిలుచుటకు) కేకలు వేయు.

సీ. తెరువడ్డుకట్టంగ మరునికింకరులకుఁ గూఁక
లు వేయునో కోకిలంబు. పి. శకుం. ౩. ౩౫.

౨. చీవాట్లుపెట్టు.

ఉదా: వానిని నేను కూఁకలువేయుదును లే.

జ: కూఁకరించు, కూఁకవేటు.

కూఁకటి=కుంకటి. వి. (సం. కూటకః) ౧. శిఖ, జుట్టు.

ఆ. వాఁడి యైనకత్తివాతియమ్మునఁ గొని, పగతు
శిరము చెక్కు లెగయ గొఱిగి, వరుల కెల్లఁ
జూడ నవ్వగునట్లు గాఁ, గలయ నైదుగూఁక
టుల నొనర్చె. భార. అర. ౬. ౨౫౦. (చూ.
సం. భార. అర. ౨౭౩. ౧౦, ౧౯.)

ఉ. ముద్దులమాటలున్ జిలుగుమోమున నున్నని
లేఁతచెక్కులున్, గొద్దిగ నున్న నెన్నడుముఁ
గూఁకటికందకపాలపట్టికన్, విద్దెము సేయు
ముంగురులు విప్పగు నెప్పులగొప్పకన్ను
లున్, బ్రొద్దొకవింతయై యమరెఁ బుష్పసు
గంధికి బాల్యవేళలన్. అని. ౨. ౨౧.

౨. నెమలిజుట్టు, చూడ.

సీ. పురి యనఁ బింఛంబు మెఱయ జుట్టు సిక
  మంచు సిగ కూఁక టన నుల్లసిలుచు శిఖ.ఆం.
  భా. ౨. ౯౬.

౩. జుట్టువెండ్రుకలు, శిరోజములు.

సీ. జడలయల్లిక యూడ్చి సంపెంగనూనియఁ
  బిన్నకూఁకట్ల జొబ్బిలఁగ నంటి. హర. ౨.
  ౧౦౭.

౪. కాకపక్షము, జులాపు.

సీ. ఉదకబిందుకలాప ముట్టియుట్టిపడంగఁ గ
  ర మొప్పుముద్దుకూఁకట్లతోడ. కాశీ. ౪.
  ౬౯.

శ్లో. తోయార్ద్రకాకపక్షాగ్రమ్. సం. కాశీ.

సీ. కూఁకటి యనఁ జిప్పకూఁకటి యనఁ గాక
  పక్షంబు...ఆం. భా. ౨. ౧౪౫.

౫. కూఁకటివేరు, తల్లివేరు.

ఉ.ఇత్తరళాక్షి మేనిజిగి యేలిక మేలిక దానిపైఁ
  డి కీ,గుత్తపుగుబ్బలాఁడిజడ కూఁకటి చీఁక
  టిమూలదుంప కీ, పుత్తడిబొమ్మకన్నుఁగవ
  పోలిక వాలికగండుమీల కీ,బిత్తరిముద్దునె
  మ్మొగము పిన్నమ పున్నమచందమామకున్.
  విజ. వి. ౨. ౧౦౭.

విశ. ప్రధానము. (చూ. కూఁకటివేరు.)

కూఁకటిప్రాయము = పిల్లజుట్టువయసు, లేఁబ్రా
యము.

క. ఈరీతి మనిరి క్రమమున, నారఘుకులతిలకు
  లనుదినాభ్యుదయతనూ,చారిమఁ గూఁకటి
  ప్రాయము, వారై గురుమాతృభక్తివశమాన
  సులై. రామా. ౩. ౧౪౭.

కూఁకటిరత్నము=చూడామణి, తలమానికము.

ఉ.చీఁకటికాసచిమ్ము భవుచేలకుసుంభము తూ
  ర్పుఁగొండకున్,గూఁకటిరత్నమబ్జరమకూరి
  మిపంట చకోరరాజిపే, రాఁకటిమంట కో
  ణకిరణావళిగంట రథాంగకేలికిన్, దేఁకువ
  పెంట మింటఁ జనుదెంచె దిశేంద్రుఁడు
  కాలఘంటయై. కాశ. ౪. ౯౭.

కూఁకటివేళ్లతోఁ బెఱుకు=నిర్మూలము చేయు.

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చిన
  రాజవంశముం, గూఁకటివేళ్లతోఁ బెఱికి...
  జై. భా. ౧. ౬౪.

కూఁకటుల్ గొలిచి చేయుట=జుట్లు(=తలలు)కొ
లిచి పెండ్లిచేయుట,వధూవరులు ఈడుజోడుగా
నుండునట్లు చూచి పెండ్లి సేయుట.

ఉ. ...కమనీయకౌతుక,శ్రీవిధిఁ గూఁకటుల్
  గొలిచి చేసినకూరిమిసోమిదమ్మ సా,ఖ్యావ
  హయై భజింప...మనుచ. ౧. ౫౩.

జ: కూఁకటికువ్వె, కూఁకటిమువ్వ, కూఁకటి
  మూఁగ, కూఁకటివేరు.

కూఁకటికువ్వె. (శ. ర-కూఁకటిగువ్వ. బ్రా.) వి.
  (√ కూఁకటి) ఒకానొకపక్షి.

సీ. కూకటికువ్వె కుటాకకుర్కు...గీ. అనఁగ ని
  ట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం.భా.౨. ౯౭.
  (కూఁకటిగువ్వ-ప్రాఁతప్రతిపా.)

కూఁకటిమువ్వ. వి. (√కూఁకటి)ఒకానొకపక్షి,
  ధూమ్యాటము.

సీ. ... ధూమ్యాట మెసఁగును గూఁకటిమువ్వ
  నాఁ గూఁకటిమూఁగ యనఁగ. ఆం. భా.౨.
  ౯౧.

క. గువ్వలు కొంజులు కూఁకటి,మువ్వలు లావుక
  లు కోళ్లు పూరేళ్లు మొదల్, క్రొవ్వినపులుఁ
  గులగమి నో, ళ్లువ్విళ్లూరంగ నప్పు డుర్వీశ
  వ్రాతన్. ఇందు. ౨. ౭౦.

కూఁకటిమూఁగ. వి.౧=కూఁకటిమువ్వ. ఆం.భా.
  ౨.౯౧. ౨. భరద్వాజపక్షి. ఆం.సం.తిర్య.౧౫.

కూఁకటివేరు. వి. (√ కూఁకటి) కుంకటివేరు, తల్లి
  వేరు.

క. ... మోహుఁ బట్టి తునుమాడక యీ,పిల్లలఁ
  దునుముట కూఁకటి,వేళ్లుండఁగ మునిఁడికొ
  మలు విఱుచుట గాదే. ప్రబోధ.౫.౩. పండి
  తా. పర్వ. ౩౧౨ పా.

**కూఁకరించు.** స. క్రి. (√కూఁక) కూఁకలు వేయు, చీవాట్లు పెట్టు.

సీ... రేఁచి వారలఁ గూఁకరించి పోవు. సత్యభామాసాంత్వనము. ౪. ౫౮.

**కూఁకవేటు.** వి. (√కూఁక) ఒకజాతిపాము.

సీ. కూఁకవేటులు చిల్వగులియలు త్రాఁచులు పెరజాలు గుఱ్ఱపుఁబెరజా లచటఁ. గీ. గలవు తక్కినజెఱ్ఱిపోతులును ... ద్వా. ౮. ౯౮. (కూటబెట్టు-బ్రౌ. పా.)

**కూఁకు=క్రుంకు.** అ. క్రి. అస్తమించు.

సీ. ... కూఁకె నాఁ గనుపట్టుఁ గ్రుంకె ననుట ఆం. భా. 3. ౯౭.

ఆ. మూఁక గూడి ప్రొద్దు గూఁకుదాఁక. ష. చ. 3. ౧౨౫. ఉ. హరిశ్చ. ౪. ౧3.

**కూఁకుడు=కుంకుడు.** వి. (క. కూగటె.) కుంకుడు చెట్టు. (చి. వి.)

సీ. ... చీకిరేను కూఁకుడు నెమ్మి ప్రేంకణమ్ము. హంస. ౪. ౧౧.

**కూఁత.** వి. (√కూయు) ౧. అఱపు, కేఁక.

సీ. మొన్నఁ బారాశర్యముని కోట రాఁ గూఁత లెగయించి వెరవేఁకి యెత్తఁజేసె. కువల. ౨. ౮౦.

సీ. పాటఁ బాటిగఁ బాడి పరభృతమ్ముల రేఁచి కూఁతలు వేయించెఁ గొమ్మ యొకతె. చంద్రా. 3. ౯౭.

౨. మొఱ, ఆర్తధ్వని.

వ... అట్లు కూఁత ముట్టి పట్టుకొని... కళా. 3. ౧౫3. (కూఁతముట్టి = కూఁతననుసరించి వచ్చి.)

గీ. మొఱ్ఱ యన మొఱ యనఁగ వాపోక యనఁగఁ, గూయి నాఁ గూఁత నాఁగ నాక్రోశ మొప్పు. ఆం. భా. ౧. ౧౧౨.

3. ప్రలాపము, ప్రేలుడు.

చ. తలఁకక యోని యేమిటికి [illegible] దలపెట్టినదాన విచ్చటం, దెలియము [illegible] నీవు పెనఁద్రిమ్మరికూఁతలదానవే కదా. కళా. ౫. ౫౦.

గీ. ఇచ్చినను నేమి వినయోక్తు లెఱుఁగవలయు, గడుసుఁగూఁతల సత్కీర్తి గలుగఁబోదు. వేణు. ౫౭.

పోటుకూఁత=పీరాలాపము.

క. అని పలుక మఱియు నాతఁడు, మన సీయక యున్నఁ జూచి మంచిది పతిచే, నినుఁ దునిమించెద ననుఁ గనుఁ, గొనరా యని బోటి పోటుకూఁతలు నెట్టెన్. శుక. ౨. ౫3౨.

సా: ఇతఁడు కూఁతకరణము గాని వ్రాఁతకరణము గాఁడు:- మాటలప్రోగు గాని పని చేయ లేఁడని భావము.

కూఁతలిడు=కూయు.

వ... దుంపదూండ్లు మెసవి విసువక కూఁతలిడు కొదమరాయంచలును... నీలా. 3. ౧౦.

కూఁతలువెట్టు=కేఁకలువేయు, అఱచు.

ఉ. బందులఁ బట్టి చోరకులు బాధ యొనర్పఁగ ధారణీసురుల్, గుంది సమస్తసంపదలు గోల్పడి కానలలోన నుండఁగాఁ, గొంద ఱెఱింగి కట్టి వెసఁ గొట్టుచు భంగము లెల్లఁ జేయఁగాఁ, గొందల మంది యేడ్చుచును గూఁతలు వెట్టెద రాలకింపుఁడీ. వి. పు. ౨. ౧3౦.

**కూఁతకైదువు.** వి. (√కూఁత) శంఖము. (శ. ర.)

**కూఁతనేల.** వి. (√కూఁత) కూఁతవేటుమేర, కోసు నేల, క్రోశము.

సీ. ... కూఁతపట్టునేల యనంగఁ గూఁతనేల యనంగఁ గ్రోశము... ఆం. భా. ౨. ౯.

**కూఁతపట్టు.** వి. (√కూఁత.) కూఁతవేటుమేర. (శ. ర.)

**కూఁతపట్టునేల.** వి. (√కూఁత) కూఁతనేల, క్రోశము. ఆం. భా. ౨. ౯.

**కూఁతవేటుమేర.** వి. (√కూఁత)-కూఁతవేసినచో వినఁబడునంతదూరము-కోసుదూరము.

సీ. బ్రహ్మర్షు లధివసింపఁగఁ గోరుకొనుచోట
వీటికోటకుఁ గూఁతవేటు మేర. గీ. విరివిగ
రు వినిర్మించె విశ్వకర్మ. కకు. ౨. ౮.

ఇట్లే: కూఁతవేటుదూరము.

సీ. విను మిచ్చటికిఁ గూఁతవేటు దూరంబునఁ
గల దొక్క హ్రదము నిర్మలజలంబు. హరిశ్చ.
౩. ౬౫

**కూఁతు**=కూఁతురు. వి. (ఈశబ్దమునకు మొదట 'ఆఁడుశిశువు' అనునర్థమే యుండి కాలక్రమమున 'పుత్రిక' అనులాక్షణికార్థము కలిగినట్లు కనఁబడుచున్నది. ఇట్లే 'కొడుకు' శబ్దమునకు మొదట 'బాలుఁడు' అనునర్థమే యుండి పిదప 'పుత్రుఁడు' అనులాక్షణికార్థము కలిగినట్లు కనఁబడుచున్నది. ఈరెండుశబ్దములకుఁ గలరెండర్థములును భట్టారకుని కవిత్వమందే కానవచ్చుచున్నవి. ఇటీవల వీనిలాక్షణికార్థములే ప్రచారములోనికి వచ్చినవి.) ౧. ఆఁడుశిశువు, బాలిక.

వ. అంత నేము శిష్యగణంబులతోడ ... చని యమ్మాలినీపులినతలంబున శకుంతరక్షితయైన కూఁతును... ఎత్తికొని వచ్చి శకుంతరక్షిత యగుటం జేసి శకుంతల యనునామం బిడి కరంబు గారవంబునఁ బెనిచితిమి. భార. ఆది. ౪. ౪౭.

౨. పుత్రిక, కొమార్తె.

సీ. పడసిరి పలువురఁ గొడుకులఁ గూఁతుల... భార. ఆది. ౩. ౫౧.

మ. వినుమీ మానవనాథుకూఁతునకు నువ్విళ్లూరు నీరాజనం,దనుఁడు...దశకు. ౪. ౪౩.

సీ...గంధర్వనాథులకూఁతులు...హరి. ఉ. ౪. ౧౭౯. ఆం. భా. ౨. ౧౧౧.

**కూఁతురు**=కూఁతు. చూ. (ప్రాచీనశాసనములు పెక్కింటిలో నీశబ్దము గురురేఫయుక్తముగా నున్నది.) వి. ఔ. ౧. ఆఁడుశిశువు, బాలిక. (చెలికత్తెలు సుగాత్రితో అనినమాటలు.)

ఆ. నలినవదన యెన్నినాళ్లైనఁ జిన్నికూఁతుర
వుగావు నీవు తొడఁగి పతికిఁ, దగినసేవ
సేయ కగునె...కళా. ౪. ౬౭.

౨. పుత్రిక, కొమార్తె.

సీ...పుత్రికాహ్వాయ మొప్పఁ గూఁతు కొమా
రిత కూఁతు రనఁగ. ఆం. భా. ౨. ౧౧౧.

గీ. ఆతనూజుల కందఱ కనుజ యై ల,తాంగి దు
శ్శల యనుకూఁతు రమరఁ బుట్టె.భార.ఆది.
౫. ౧౦౮.

ఉ...నీ,కూఁతురి నీయఁ జూడఁ గలుగుం గద...
పార్వ. ౫. ౭౨.

చ...ఇత్తు నీ,తనియనుజత్రయంబునకుఁ దక్కిన
కూఁతురులన్ భవత్కృపన్. రామా. ౪.
౯౬. (చి. ని. పా.)

౩. స్త్రీ, ఆఁడుది.

ఆ.కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి,నట్టి
పనికి నుచితమైనసమయ,మొదవెఁ దడయు
టెంక నొప్పదు...భార. ఉద్యో.౩.౧౯౯.

సా: కూఁతుళ్లఁ గన్నమ్మకు కుర్చీపీఁటలు కొడుకులఁ గన్నమ్మకు గోడపంచలు.

పెండ్లికూఁతురు=వధువు, పెండ్లికొమార్తె.

మ...పెండ్లికూఁ,తురిఁ గావించిరి పేరటాండ్రు
మహిభృత్పుత్రిన్ బ్రమోదంబునన్. కులశే
ఖరమాహాత్మ్యము. ౪ ఆ. (చి. ని.)

జ: కూఁతురుబుడమ.

**కూఁతురు(రి)బుడమ.** వి. (కూఁతురు+బుడమ) ఏలావాలుకము, నూఁగుదోసకీ.

సీ... తెలియంగఁ దగును నూదోస రేణుకలు కూఁ
తురుబుడ మన. గీ. వాలుకమ్మని...ఆం. భా.
౨. ౬౧.

గీ. బొల్లిపూసరయును సోమవల్లి చేఁతి,పొట్లబి
వ్వంబు కూఁతురిబుడమ పెసలు,గాఁచి గుడ
మున లేహ్యపాకముగఁ జేసి,ఘృతయుతం బై
నఁ గాసలు క్రిందుపడును. చికి. (చి.ని.)

**కూకి(కీ).** వి. ౧. పారావతము, పావురము.

గీ. కూకివగపల్కు పల్కు బెళ్కుచును గుల్కు, నట్టె మెయి వ్రాలు సుఖపులావారిని సోలు, ముద్దులను బెట్టు దబ్బఱమోడి పెట్టు, నంత మెల్లఁగ గడిదేరి యాయొయారి. మల్లుపు. ౮. ౯౨.

గీ. పరఁగు నొడ్డీలు కూకీలు పల్లటీలు, పావురాలును బకదార్లు పావురములు, నాఁగఁ గలరవ పక్షిబృందముల పేర్లు. ఆం. సం. తిర్య. ౧౩. అహ. ౩. ౧౯. వేంక. తిర్య. ౯౭.

౨. పారావతవిశేషము.

క. మేలైనలకోరి లొడ్డీలుగ్...బకదార్లును గూ, కీలు ననెడు పేరులం దగినపార్వములన్. సారంగ. ౧. ౧౧౪.

సీ. పారావతంబగుఁ బావురాయి యనంగ ... తద్భేదములుగాను దనరుచుండును...ఒడ్డీకూకి బకదారిదూరబారు లనంగ...ఆం. భా. ౨. ౭౯.

కూకీపల్కులు=మణితధ్వనులు, రతికూజితములు.

సీ. మణితవాచకము లై మనుఁ బావురాపల్కు లనఁగఁ గూకీపల్కు లనఁగ...ఆం.భా. ౨. ౧౭౦.

**కూకు.** వి. ఆమిక్ష, పాలవిఱుగు.

సీ. ... ఆమిక్షసంజ్ఞ యై యలరుఁ గూకు, పాలవిఱుగు నాఁగ ... ఆం. భా. ౨. ౧౪౨.

జ: కూకులువత్తులగు.

**కూకుదుఁడు.** సం. వి. అ. పుం. అలంకృతురాలగు కన్యను వరునకు సత్కారపూర్వకముగా దానము సేయువాఁడు.

**కూకురుగుండఁగి**= కూకురుగుండె. (శ. ర, బ్రౌ, చి. ని.)

**కూకురుగుండె.** వి. దాత్యూహము, పక్షివిశేషము.

సీ. దాత్యూహసంజ్ఞ యై తనరుఁ గూకురుగుండె నాఁగ...ఆం. భా. ౨. ౯౩.

**కూకులువత్తులగు.** అ. క్రి. (కూకులు + వత్తులు + అగు). తుత్తునియలగు; చెదరు.

ఉ. క్రమ్మి చతుష్కరిం జనుదు కాలువ లై ప్రవహింప గోమపుం, గుమ్మెలఁ బార్శ్వభూజములు గూకులువత్తులుగా ముఖంబునన్, దుమ్ములు రేఁగ మై మఱచి దున్నుచు ముస్తలఁ దేల్చి కుంజముల్, గొమ్మలఁ జిమ్ముదాని నొక ఘోరవరాహముఁ గాంచి యాత్మలోన్. వేం. పంచ. ౨. ౧౦౫.

ఉ. కుంభిరదప్రహారములఁ గూకులు వత్తులునైన మిన్ను...వేం పంచ. ౧. ౮౯. (చి.ని.పా.)

ద్వి. కొట్టన నిష్ఠలు నిలిపెడుబుషుల, గుట్టు లన్నియును గూకులువత్తు లయ్యె, నిట్టి దుర్దశ రాకకేమికారణము. ప్రభులిం. ౧. ౩. ౨౦పా. ౨౦ పం.

క. చిలువదళవాయు లప్పుడు, తలబీకనకాయ లై యథాయథ లై కూ, కులువత్తులు నై మొనతల, నిలువక శేషాహికడకు నెఱి చెడి పాఱన్. హై. భా. ౪. ౧౦౨.

**కూగు.** వి. (క. కూగు=కూఁత) కూఁతవేటుదూరము, క్రోసు?

ద్వి. కూగెంట నొక్కొకకూటంబు గలదు, యోగీంద్రసిద్ధనియుక్తంబు లవియు. పండితా. పర్వ. ౩౭౮పా.

**కూచేము.** వి. (క. కూచ.) ౧. గుంజ, స్తంభము.

సీ. గండంపుఁగూచముల్ పొందించి కుఱువేళ్ల నలవగాఁ గట్టినయట్టిమహిమ. రా.వి.౩.౭౧.

౨. కుసి, మంచము మున్నగువానిపట్టెయొక్క సన్ననిచివర, పట్టికాగ్రము.

సీ. పట్టె యంచనఁ దగుఁ బట్టిక కుసి కూచ మనఁ బట్టికాగ్ర మై యలరుచుండు. ఆం. భా. ౨. ౧౬౮.

**కూచము.** సం. వి. అ. పుం. ౧. కుచము, స్తనము. (కల్ప) ౨. హస్తి, ఏనుఁగు. (శే.ని.)

**కూచి**[1]**.** విణ. (క. కూచి.) ౧. విరిసినది, వికసించినది.

గీ. నల్లప్రజపై సరగ దండు వెళ్లఁ దలఁచి, రాజు వేయించు వెలిగుడారం బనంగఁ, దోఁచెఁ బాండిమ ప్రాచిఁ దోడ్తోన యందుఁ, గువలయదళమ్ము లప్పుడు గూచి యయ్యె. సారంగ. ౨. ౧౬౧.

వి=కూచీ.(హిం. కూచ్) దండయాత్ర. (చూ. కూచిచేయు.)

జ: కూచి చేయు.

**కూచి**[2]**.** విణ.(త.కూచ్చు) వాఁడియైనది, నిశితము.

ఉ. చూచుతటి న్మనోభవుఁడు చొచ్చి పరస్పరవీక్షణంబు లన్, గూచి మెఱుంగుబల్లిలుకుఁ గోలలపాలయి నొచ్చి యొందు నా,హా చనలేని యానరపరాత్మజాలం జిగురాకుఁగత్తి చేఁ, గామట లేక యప్డు నటిక న్గొడఁగె న్వడి నజ్జనజ్జగన్. చంద్రా. ౨. ౧౩౯.

వి. వాఁడిమి, శౌర్యము.

శా. జౌనే తార సెబాసు మెచ్చవలె నాహా నీగుణం బింకిటన్, వానిం జూచిన నీకు నిన్నుఁ గనుఁగొన్న న్వానికిన్ శోకసం,ధానం బొందఁగఁ జేసినప్పుడు గదా నాకూచి శేకున్నచో, నేనే రంభనె యచ్చరల్ వొగడఁగా నీపేరునం బిల్వవే. కువల. ౫. ౮౭.

**కూచి.** సం.వి.ఈ.స్త్రీ.౧.కూచిక, తూలిక.(కౌముది) ౨. స్త్రీ. ౩. ఆఁడేనుఁగు. (శే.ని.)

**కూచిక.** సం.వి.ఆ.స్త్రీ.౧.తూలిక, చిత్తరువు వ్రాయువాగఱ. ౨. తాళపుఁజెవి.

**కూచి(చీ)చేయు.** అ. క్రి. (√కూచి[1]) దండువెడలు.

వ. ... అపు డుభయపార్శ్వవర్తులై బలసి కలసి కొలిచి యున్న చంద్రాదుల విలోకించి పయనం బై రండు పొండని పంచి కూచిసేయ నియమించి యంతఃపురంబుఁ బ్రవేశించి ... చంద్రా. ౩. ౫౨.

సీ. కూచిసేయింపఁగాఁ జూచె నందమొ యేల చైద్యుఁ డెఱుంగఁడే శార్ఙ్గలతిక, వెలిగుడారంబుల నిలిపె నందమొ యేల బాణుఁ డెఱుంగఁడే బంధురగద. చంద్ర. ౫. ౧౨౫.

శా. రాచక్రంబున మేలుబంతి యనఁగా రాజిల్లునారాజు కూ,చీచేయించి సమంచితాత్తబలసత్సేనాసమేతంబుగా. రంగా. ౨. ౫౯.

ఇట్లే:-కూచిగావించు.

గీ...కూచిగావింప...రా. వి. ౨. ౬౭

**కూచిమతము.** వి.సాతాని మతములలో నొకమతము. (బ్రౌ.)

సీ.తనది కూచిమతంబు తమ్ముఁడు బౌద్ధుండు సర్వేశ్వరమతంబు షడ్గునిది. వే:ఖ. ౬౯.

**కూచిమారము.** వి. పోకిరితనము. (బ్రౌ)

ద్వి. కుటిలకుత్సితములు కూచిమారములు, మటుమాయతనములు మందువ్రాఁకులును, నటమటంబులును సున్నైన చెద్దెములు. ప్రభులిం. ౨. ౫౦ పొ. ౭ పం.

**కూచిమారుఁడు.** సం. వి. అ. పుం. ౧. పురుషజాతులు నాల్గింటిలో నొక జాతివాఁడు.

సీ. మన సీక మందుల మాయల మరగించి కొలిచుచు నాకూచిమారు నొల్ల. కు. సం. ౭. ౧౮౫.

౨. కామశాస్త్రగ్రంథకర్తలలో నొకఁడు.

మ. స్మరవాత్స్యాయనకూచిమారకృతశాస్త్రగ్రంథసందర్భముల్, పరిశీలించినవాఁడ... నైష. ౨. ౫౬.

**కూచీ**=కూచి[1]. (చూ. కూచిచేయు)

**కూజనము.** సం=కూజితము. (వై.ని.)

**కూజము.** సం. వి. అ. పుం=కూజితము.

**కూజా.** వి.(హిం.కూజా) పాత్రవిశేషము. (శ.ర)

**కూజితము.** సం. వి. అ. న. అవ్యక్తధ్వని.

**కూటకము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కపటమైనది. ౨. కల్లయైనది, నిజముకానిది. వి. అ. పుం. ౧. మురయను గంధద్రవ్యము. ౨. కలికి, కొప్పు. న.౧. నాఁగటిదుంప,గొడగ,ఏఁడికోల లేని నాఁగలి. ౨. ఫాలము, కఱ్ఱు.

**కూటకృత్తు.** సం. విణ. (త్) ౧. కపటము పన్నువాఁడు, వంచకుఁడు. ౨. తప్పుపత్త్రము తప్పునాణెము లోనగు నవి కల్పించువాఁడు. వి.త్. పుం. ౧. కాయస్థుఁడు. ౨. శివుఁడు.

**కూటఖడ్గము.** సం.వి. అ. పుం. లోపల ఖడ్గము గల కఱ్ఱ, కఱ్ఱకత్తి.

**కూటజము.** సం. వి. అ. పుం. కుటజము, కొండమల్లె.

**కూటపాకలము.** సం. వి. అ. పుం. ఏనుఁగులకు వచ్చెడి ఒకవిధ మగుజ్వరము.

శ్లో. అభిహన్తిహన్త కథమేష మాధవం,సుకుమారకాయ మనవగ్రహ స్స్మరః. అచిరేణ వైకృతవివర్తదారుణః, కలభం కఠోర ఇవ కూటపాకలః. మాలతీ. ౧. ౪౨.

**కూటపాలకము.** సం. వి. అ. పుం. కుమ్మరి ఆవము. (వాచ)

**కూటపాలకుఁడు.** సం.వి.అ.పుం. కుమ్మరి. (వాచ)

**కూటపాశము.** సం=కూటబంధము.

**కూటబంధము.** సం. వి. అ. పుం. బోను;వల;గాలము.

**కూటమానము.** సం.వి.అ.పుం. ౧.తప్పుతూనిక; తప్పుకొలత. ౨. తప్పుమానము. (తప్పుతూనికతాయి,తప్పుమానిక, మొ.)

**కూటమి.** వి. (√ కూడు² -క. కూట.త. కూటం.) ౧. కూడిక, చేరిక; స్నేహము, చెలిమి.

సీ. ఎలమిఁ బొల్పగుయూథికలకు సంతలకూటములకును మఱి విచ్చుమొగ్గ లొదవె. ఆము. ౪. ౧౨౩.

మ. ...ప్రకృతి నచ్ఛం బైనసస్మార్గి యొ,న్నఁటికిన్ గూటమివంకవచ్చువికృతిన్ మగ్నుండుగా నేర్చునే. మనుచ. ౩. ౨౪. దశా. ౨.౧౫౫.

౨. స్త్రీపురుషులకలయిక, సంభోగము.

గీ. చంద్రముఖితోడికూటమి జన్మఫలము. విక్ర. ౩. ౪౭.

చ. సరివల పైనకూటమికి సాటిఁక లేదు గదా తలంపఁగన్. సారం. ౩. ౧౫౦.

గీ. కొలుఁ గవయుట కూడిక కూటమి కలయిక యనన్ రతి...ఆం. భా. ౨. ౧౭౭.

**కూటము.** (కూ. కూటాము. అని శ.ర, బ్రౌ). వి. (√కూడు²) ౧. చావడి.

క. ...భూభృత్తిలకము పచ్చెన్ హేతన్నృప,కులకముతో భోజనంపుఁగూటంబునకున్. రా. వి. ౨. ౯౬.

క. చని యది వడ్డింపఁగ భో,జనకృత్యము దీర్చి యంత జలజాప్తుఁడు గ్రుం,కిన దానికన్నుసన్నం,గని కూటములో వసించెఁ గాకటిమీఁదన్. శుక. ౨. ౫౨౪.

౨. కొలువుకూటము, సభాభవనము.

క. అలుకుఁడు మృగమదమున ముగ్గులు వెట్టుఁడు గప్పురమునఁ గుంకుమమున గోడలు పూయుఁడు మణిదామకములు గట్టుఁడు పెద్ద కూటమున సొంపారన్. భార. ఉద్యో. ౩. ౧౫౨.

౩. కూటమి, స్త్రీపురుషులకలయిక, సంగమము.

క. చని తత్కేళీగేహం,బున నొకమగనాలికూటమునకై కనుగూ,ర్కనియొక్కజారుతోనిం,పునఁ బొదలుచు నుత్తరంపుమూల రమించెన్. శుక. ౩. ౬౧౨.

**కూటము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. మిథ్యాభూతము, అసత్యము, కల్లయైనది; కృత్రిమమైనది. ౨. కపటము గలది. ౩. నిశ్చలము, చలింపనిది. ౪. నిందితము, తుచ్ఛము. ౫.కొమ్ములు విఱిగినది. (పశువు - శే.ని). వి. అ. పుం. న. ౧.కపటము, కైతవము. ౨. అసత్యము, బొంకు. ౩. దంభము, డాబు. ౪.మాయ, గారడము. ౫. పాపము. (శే.ని) ౬.పర్వతశృంగము, కొండకొమ్ము. ౭.(అన్నాదుల) ప్రోగు,రాశి.(ఉదా: అన్నకూటము, అభ్రకూటము,మృత్కూటము, మొ.)౮.కట్టు,ఫాలము. (శే. ని). ౯. తేళ్ళు లోనగువానిని పట్టుయంత్రభేదము, బోను. ౧౦. పురద్వారము, గవను. ౧౧. దాగలి. ౧౨. సమ్మెట. ౧౩. ఆకాశము. (శే. ని.)౧౪.ఒకవిధమగు బాణము.౧౫.అగ్రము,కొన. ౧౬. పుంజము, సమూహము.సం.భాగ.౧౧.౬౩. పుం. ౧. ఇల్లు. ౨. కాసెయులి.

**కూటముత్యము.** మి. వి.(కూటము + ముత్యము.) కృత్రిమమౌక్తికము, చేఁతముత్యము. (బ్రౌ-కూటిముత్యము. శ. ర.)

**కూటయుద్ధము.** సం. వి. అ. న. ౧. వినోదార్థము చేసెడియుద్ధము. ౨. అధర్మయుద్ధము.

**కూటశాల్మలి.** సం. వి. ఇ,ఈ. స్త్రీ.ఇ.పుం.కృష్ణశాల్మలి, కొండబూరుగు.

**కూటసాక్షి.** సం. వి. ఇ. పుం. తప్పుసాక్ష్యము చెప్పువాఁడు.

**కూటస్థము.** సం. విశే. (అ. ఆ. అ)-కూటమువలె నిర్వికారముగా నుండునది-ఎల్లకాలము పరిణామాదులు లేక యేకరూపముగా నుండునది.వి.అ. న.వ్యాఘ్రనఖ మనుగంధద్రవ్యము, పులిగోరు.

**కూటస్థుఁడు.** సం.వి. అ. పుం.౧-కూటమందు(=అగ్రమందు) ఉండువాఁడు - వంశమునకు మూలపురుషుఁడు. ౨-కూటమువలె నిర్వికారముగా నుండువాఁడు-పరమాత్మ.

**కూటాఖ్యానము.** సం. వి. అ. న. ౧.కల్పనాకథ. ౨. అసత్యము చెప్పుట.

**కూటాగారము.** సం. వి. అ. న. ౧. మేడమీఁది యిల్లు, చంద్రశాల. ౨. క్రీడాగృహము. ౩. కపటగృహము, కల్లయిల్లు.(వాచ.)

**కూటాయువు(స్సు).** సం. వి. స. పుం. గుగ్గిలపుఁ జెట్టు.

**కూటార్థభాష.** సం. వి. ఆ. స్త్రీ. కల్పనాకథ. (వాచ.)

**కూటార్థము.** సం. వి. అ. పుం. ౧. లోపల మఱియొకయర్థము గలిగియున్న బాహ్యార్థము. ౨. కల్పితార్థము.

**కూటికుప్పలు.** వి. బ. (√ కూడు[1]) ధాన్యవిశేషము.

వ... ఏఱుమల్లెలు మునిమనోహరాలు వెండిగుండ్లు బొంతమడమలు కూటికుప్పలు కారుసంపెఁగలు ... ప్రబంధ. ౧౧౨.

**కూటినీళ్లు.** వి. బ. (√కూడు1) పుల్లనీళ్లు, ఆరనాళకము. (శ. ర, బ్రౌ.)

**కూటు.** వి. ధాన్యము పోయుటకు వెంటితో నేసి అలికినగాదె,పురి. (శ.ర.)

సీ. ... తగుఁ గుసూలాభిధ గాదె యనంగను గరిసె యనఁగఁ. గీ.దద్విశేషసమాఖ్యలు దనరుచుండుఁ, గొట్టు కూటు పాదక కుమి గొట్ట యనఁగ. ఆం. భా. ౨. ౨౪౦.

**కూటువ.** వి.(√కూడు[2]-సం.కూటం)౧.గుంపు; ప్రోగు, రాశి.

క. తోపలార కోదమజక్రువ, కవలార కడింది సోయగపుఁదుమ్మెదకూటువలార మీ రిప్పుడు మా,నవలారతనంబుఁ జూచినారే చెపుఁడా. అచ్చ. రా. ఆర. ౭౭.

క. తులువతోలువేల్పుకూటువ,బలితపుఁబెన్నోగులుఁజాలుపయ్యెరకుఁ దగన్. నీలా. ౧.౨౦.

ద్వి. గుగ్గులుతెరువులకూటువ లరసి, యగ్గలంబుగ మహిసాక్షి సాధించి. పండితా. పురా. ౧౨౮ పా.

క. వీటీపాటీరాగరు,హాటకతాటంకమణిమయా భరణంబుల్, గూటువలుగ నిడియొద నీక, జోటీ మా టాడి ముద్దు చూపంగదవే. రసిక. 3. ౮౦.

౨. సాంగత్యము, కూటమి.

(వెన్నెల) వ. ... చుంబనం బిడఁబోయి కెంగే ల నదరంట వాటువడుకాముకులవెలవెలపా టుకూటువం గోటికిఁ బడగ లెత్తి...మనుచ. 3. ౨౮.

కూటువలుగొను, కూటువలుగూడు = గుంపులు గూడు.

క. వీటఁ గలచేడె లెల్లను,హాటకమణిఘటితతుం గహర్మ్యాగ్రములం,గూటువలు గొనుచుఁ జూ చిరి, పాటించి విశాలవక్షుఁ బద్మదళాక్షున్. భాగ. ౧౦ పూ. ౧౨౪౮.

మ. ...స్త్రా దేవతాముఖ్యు లెల్లను మోదంబున న వ్యభూవరుల మ్రోలం గూటువల్గూడి డా,కొ ని సర్వే మునయస్సురా గ్రహయుతాః కు ర్వంతు వామ్మంగళ,మ్మని లగ్నాష్టకము ల్ప ఠించిరి...రసిక. ౮. ౧౯౮.

కూటువమూఁక. వి. (కూటువ + మూఁక) ప్రో త్సాహపఱచి యక్కడక్కడ వెదకి తెచ్చినపి ఱికిబలము.

చ. అడవులఁ గొండలం బడి మహాపద నూ పఱి చన్నవారి ని,ప్పుడు గొనివచ్చి కృష్ణుఁ డొక ప్రోవుగఁ గూటువమూఁకఁ గూర్చినం,బోడు తురె పాండునందనులు భూవర యేటికి నింత భీతి...భార. ఉద్యో. ౨. ౨౦౮.

ద్వి. కూటువమూఁకలు పాటి యై కూడఁ, జాటిం చి తెచ్చినసభలును సభలె. పండితా. వాద. ౧౩౬ పా.

కూటువసరులు. వి. బ. (√కూటువ) ఒకవిధ మగుహారము.

ద్వి. కాటుక చెదరి కన్గవనీరు జాఱఁ, గూటువ సరులఁ జిక్కువడ హారములు, జమిలిముత్యపు బొట్టు సరి దూలి చెదర. పద్మ. 3. ౨౧. (బ్రౌ)

కూటువు=కూటువ.

(గుంపు.)

సీ. చవులతోఁ జెంగావపువులతో నసుఁబుట్టు వులతోఁ జిలుకకూటువులతోడ. అచ్చ. రా. ఆర. ౨౮.

(స్త్రీపురుషులసాంగత్యము)

కళాశాస్త్రము. ౧. ౯.

కూడ. అవ్య. ద్రు. (కూడుధాతువుయొక్క తుము న్నాద్యర్థకరూపము - త. కూడ. క. కూడె.) ౧. స హార్థకము.

క. భీమునిఁ దత్సోదరులను, భూమీశ్వర యిపు డ పట్టి హరివుచ్చెద ను,ద్దామత మ్రింగెదఁ గృష్ణుని,తో మిత్రగణంబుతో సుతులతోఁ గూడన్. భార. ద్రో. ౪. ౨౧౧. ఆం. భా. 3. ౭౦.

౨. సముచ్చయార్థకము.

గీ. తారకాధీశ్వరుండుఁ జింతామణియును,కూ డ దుగ్ధాంబునిధిలోనఁ గూలుఁగాక. హర. ౬. ౨౪.

క. మదిరాక్షీ యేతత్కథ,కొదవ యగుట లేదు కడమ గూడఁ బలికెద,న్మునుముని విని పొ మ్మ ని...శుక. ౧. ౨౩౭.

3. సైతము, ఏనియు, ఐనను.

(క) అపకర్షమునకు.

ఉదా: ఉండ నిల్లు కూడ లేదు. వారు త్రాగుటకు మంచినీళ్లు కూడ నీయరు.

(చ) ఉత్కర్షమునకు.

ఉదా: వాఁడు రాజును గూడ ధిక్కరించి మా

టలాడును. జ్ఞానులు స్వర్గభోగమును గూడ లె క్కసేయరు.

**కూడఁబడు.** అ. క్రి. (కూడన్ + పడు-స్వార్థము న) ౧. కూడు, చేరు.

క. అభిమన్యువివాహమునకుఁ, బ్రభువర్గం బెల్లఁ గూడఁబడి యుండఁగ నా,సభ నీకై యేఁ బలికితి...భార. ఉద్యో. ౧. ౨౯.

క. ఇత్తెఱఁగున సభలోపలఁ, దత్తఱమునఁ గూడఁబడినదర్పితసామం, తోత్తములలో నవిభుఁడు,మత్తద్విపలీల మనసు మండ నిటు ల నన్. ఉ. హరి. ౫. ౨౭౬.

౨. ముడుఁగఁబాఱు, ముడుఁగు.

గీ. కొన్ని దేశంబు లీఁచచేఁ గూడఁబడియె. కాశి. ౧. ౧౩౭.

౩. స్వస్థమగు, కుదురుపడు.

వ...తండ్రి యాదాదిమాటకుం జెవి యొగ్గి చెదరినచిత్తంబు కూడంబడ నచ్చెరువడి యుపలక్షించుచు నుండె...దశకు. ౩. ౫౨.

**కూడఁబాఱు.** అ. క్రి. (కూడన్ + పాఱు-స్వార్థమున) కలిసికొను, ఏకమగు.

ఆ. వారు సంభ్రమించి వడిఁ గాలుదివియలు, గొనుచు నులివు మిగులఁ గూడఁబాఱి,నృత్తశాలఁ జొచ్చిరి... భార. విరా. ౩. ౪. (ప్రాఁత ప్రతి. చి. ని. పా.) ఉద్యో. ౧. ౧౪౨.

**కూడఁబెట్టు.** స. క్రి. (కూడన్ + పెట్టు-త. కూట్టివై.) ౧. సమావేశము చేయు, ఒకచోఁ గూర్చు.

చ. అని తనవంగడం బగుధరాధిపమంత్రిపదాతివర్గముం,బనివడి కూడఁబెట్టి...ఉ. హరి. ౩. ౫.

సీ...పజలు, మిసుక నవ్వెండ్రుకయమగులదొర యెల్లనాడెంపుఁబాఱులఁ గూడఁబెట్టి.అచ్చ. రా. బాల. ౫౪.

౨. నిలువచేయు.

క. కట్టక కుడువక రొక్కములకుఁ, బెట్టక తమతండ్రి గూడఁబెట్టినసిరి...విక్ర. ౨. ౧౬౩.

ద్వి...కొలుచులు గూడఁబెట్టు...అ. మ.క. ౧. ౭ పా. ౧౨ పం.

సీ...కుశపవిత్రంబులు గూడఁబెట్టు. హర. ౩. ౩౬.

౩. సంధానము చేయు, కలుపు, తార్చు.

(వేశ్యామాతృవర్ణనము)వ...తగవు గోరియుంబోలెఁ గూడఁబెట్టుచు...కవిక. ౪. ౧౧౩.

**కూడముట్టు.** స. క్రి. (√కూడు[3])-తతిమి-కలిసికొను.

ఆ. ఆత్మజవము నచ్చి హరిణంబు డిగి భీతిఁ, బాఱఁ గాల్లు రాక పవనుఁ డసుర, లెగిచి కూడముట్ట నెక్కిరింతయిటినోరి,గతిక దిగిచి నోరఁ గఱచుకొనియె. కవిక. ౨. ౧౨౦.

వ. ... హేమాంగదుండు చనినజాడ యరసి యతిత్వరితగతిం జని కూడముట్టిన నాఖిలంబైన యాకలకలం బాలించి...విక్ర. ౬. ౨౭.

**కూడలి.** వి. (త. కూట్టల్. క.కూడల్.) ౧. నద్యాదులు కలసినచోటు.

సీ. కయ్య కాలువ యనఁ గనుపట్టుఁ గుల్య కూడలి యన సంభేద మలరుచుండు. ఆం.భా. ౧. ౧౬౪.

ద్వి. వినియె నంతయు నట సనియెఁ గూడలికిఁ, గనియె సద్గురువు సంగయదేవు నచట. బస. పు. ౭. ౯౭౩ పం,౧. ౬౨౨,౫౭౧ పం.

౨. ఎల్ల, అవధి.(చూ. కూడలిత్రాయి.)

జ: కూడలిత్రాయి, కూడలివాయి.

**కూడలిత్రాయి.** వి.(కూడలి+త్రాయి)ఎల్లత్రాయి, సరిహద్దుత్రాయి. (శ.ర.)

**కూడలివాయి.** వి. ( కూడలి+వాయి)రెండుపంచలు కలిసినమూలయం దేర్పఱచిననీటిదారి. (శ. ర.)

**కూడిక.** వి.(√కూడు[2]-త.కూడుకై) కూడుట.

(సాందిక.)

క. ...మారెటి, పండులసోయగము జక్కవలకూడిక... వెలఁదిగుబ్బలకడఁగుక్. నీలా. ౨. ౨౮.

(రతి, సంభోగము.)

గీ. కౌఁగిలిఁ గవయుట కూడిక కూటమి కల, యిక యనఁగ రతి... ఆం. భా. ౨. ౧౬౫.

**కూడిమాడు.** అ. క్రి. (√కూడు²) కలసిమెలసి యుండు, అనఁగి పెనఁగి యుండు.

గీ. ... మృగేంద్ర, పోతకంబులు నాల్క్రేపులును గడుపుఁ, గట్టికొని కూడిమాడ నక్కజము చెందె. ప. శకుం. ౨. ౮౯.

చ. తలఁపఁగ రాజశేఖరుఁ డతండు తలోదరి సర్వమంగళా, కలితవు నీవు మీఁద లోకగాత్రము లై పడిఁ గూడిమాడుమక్, జెలఁగుట యొప్పఁ గాఁ గలుగఁ జెల్లునె నీకు... నిర. 3. ౧౮౬.

సీ. తోడికన్నెలు దానుఁ గూడిమాడి చరించు సురసౌధ నీడలఁ జూచిచూచి... గీ. హృదయపీఠిక నెట్లు ధరింపవాఁడు. రాఘ. చ. ౨. ౩౫.

స. క్రి. రమించు, కూడు.

సీ. కలధన మెల్లఁ బోకడఁ బెట్టి నాన్యసీ యై బిచ్చమెత్తనియుగ్రజాంజము. గీ. లేఁడు ధరలోన రతిసేనఁ గూడిమాడి, యున్నపిటులందు... శాంక. ౫. ౧౨౦.

**కూడివచ్చు.** అ. క్రి. (√కూడు²) లాభము కలుగు, కలిసివచ్చు.

ఉదా:- నాని కావ్యపారమున నాలుగువేలు కూడివచ్చినవి.

**కూడు¹.** వి. దే. (√ కుడుచు–క. త. కూళు) అన్నము, తిండి.

గీ. కుడుచుచెడ నాని పెనువ్రేలు కూటిలోనఁ, దునిసిపడి యున్న... భార. ఆది. ౬. ౨౫౬.

క. పేరు పలలుండు గూడుం, జీరయు నిడి పాకతంబు సేసినఁ జాలుక్. భార. విరా. ౧. ౨౧౯. ఆం. భా. ౨. ౨౫౬.

సా: కూటికి తక్కువ యైన కులమునకుఁ దక్కువ యగునా? కానికూడు తిన్నను కడుపు నిండదు.

కూటిపే(బీ)ద = తిండిలేనిది; తిండిలేనివాఁడు. (ఇది 'పాలబీద' వంటిది.)

సీ. రతుల నేరుపు లేనిరామ జారయుఁ జోర కుమతి యౌ నెలనాఁగ కూటిపేద. గీ. యైనమృగనేత్ర... రతి యొనర్పఁగఁ గౌఁగాదు రసికులకును. వి. పు. ౮. ౨౨౦.

చ. పడమర నెట్టునయ్యుదుకుఁ బ్రాకన మొల్లక కూటిపేదలై, బడలిక నూడునచ్చిలుప ప్రగ్గములక్... ఆము. ౨. ౮౯.

క. అంతట మగనికి సన్నం, బింత యిడక వండి సట్టిఁ దెల్లను జారుక్, పొంతములఁ జేర్చు నాతఁడ, నంతవ్యథఁ గూటిబీద యై నెవ్వగలక్. శుక. ౩. ౩౫౫.

జ: కూటికుప్పలు, కూటినీళ్లు, కూడునీరు.

**కూడు².** అ. క్రి. (క. త. కూడు) ౧. గుమిగాఁ జేరు, సంఘటించు.

వ. ... అకస్మాడిన పాషండషండంబు తలపంచుకొని పోయిన... ఆము. ౮. ౬౫.

౨. కలిసియుండు.

వ. ...దివ్యాభరణంబులతోడం గూడి పార్వతి సర్వలోకనయనోత్సవకర యయ్యె... హర. ౮. ౭౩.

౩. కలుగు, సంభవించు.

ఉ. ఆరసహాను లై గరిమ నచ్చుటఁ ద్రిమ్మరుచున్నవారికిం, జేరవు రోగముల్ చెమట చెందదు మేనులఁ బూతిగంధముక్, ఘోరజరాదిదోషములుఁ గూడవు... వి. పు. ౩. ౩౦.

సీ. కుహనాకిటికి లక్ష్మికుచకుంభములమీఁదికుంకు

మంబున నుసుల్ కొనఁగఁ గూడె. భీమ. ౧. ౩౪.

౪. సమకూడు, లభించు.

చ. బలము లపారముల్ ధరణిభర్తయుఁ బర్యట నంబువంక నాఁ, కలిఁగొనినాఁడు వేగిర మె కావలె భోజన మెట్లు కూడు... వరాహ. ౪. ౧౦౩.

౫. శక్యమగు, సాధ్యమగు.

గీ. వచ్చి యరరని రోధంబువలనఁ జూచి, కాంతు చేష్ట మొఱంగి చేగడియ నివియుఁ, గూడ దె త్తఁగ రా దింకఁ గోరివచ్చు, చెనఁటిచుట్టాలు చేత బజీత నగుదు. శుక. ౨. ౧౨౭.

మ... సహియింపం గూడునే యింద్రజి, ద్బల మవ్వీరుఁడు నచ్చె నీకు హిత మాపాదించు సౌమిత్రి చేన్. ఉ. రా. ౧. ౧౫౭.

౬. యుక్తమగు, తగు.

పద్మకము. కొడుకుపల్కు విని కూడదు నాక దు రాత్ముఁడై, కడఁగి మీకు నపకారము సేసి ధ రిత్రి నెల్వడఁగఁ బంచెఁ గదాఁ బాపమ తిన్ ధృతరాష్ట్రుఁ డె, య్యెడల మర్జునుల నే మఱి నమ్మఁగఁ బోలునే. భార. ఆది. ౬. ౨౨౭.

ఉ. రాజగృహంబుకంటె నభిరామము గా నిలు గట్టఁ గూడదు... భార. విరా. ౧. ౧౨౩.

క... కూడునె యిల్లాలి నన్నుఁ గొట్టం దిట్టన్. వేం. పంచ. ౪. ౪౨౯.

౭. చాలు, సమర్థమగు.

వ... గుట్టు చెడి యిట్టట్టు మెదలం గూడక త ట్టింబడినపులుఁగులగతిఁ గొట్టుమిట్టాడి ... కృష్ణ. ౩. ౩౭.

వ... నిప్పు ద్రొక్కినచందంబున మిట్టిపడి... ఇ ట్టట్టు తరలి పోఁ గూడక యావ ద్రావిణవాని గతి వారటించుచున్న... సారంగ. ౩. ౨౯.

౮. సంబంధించు.

ఉదా: అది నలుగురతోఁ గూడినపని గాని యొ కనిపని గాదు. ఇది పెద్దవారితోఁ గూడినవ్యవ హారము.

స. క్రి. ౧. పొందు, చెందు.

క. వాడక వ్రాలక తెవులులఁ, గూడక తగ నల్ల గెలలు కొని నవకము లై, చూడఁగ భద్ర ము లగుచును, వీడన్ సస్యంబు లిడుమ వీ డెం బ్రజకున్. భాగ. ౧౦ పూ. ౭౫౭.

చ... నేఁడు నాపురుకుల మెల్లఁ బావనతఁ గూ డె నిజం బని కౌఁగిలించినన్. జై. భా. ౮. ౧౩౧. ఆం. భా. ౩. ౧౧౯.

౨. కలుపు, సంకలితము చేయు.

సీ. లఘువులక్రింది వెల్లను గూడి వెండియు నొ క్కటి గలుపుక యుగ్గళింప. గీ. నైనసంఖ్య వృత్తము... అప్ప. ౪. ౧౪౯.

ఉదా: ఈమూఁడంకెలను కూడి మొత్తము చెప్పు.

స. క్రి. అ. క్రి. ౧. చేరు; కలియు.

గీ. త్రుంకఁ బాఱుసహస్రాంశుఁ గూడ లేక, వెను కఁ జిక్కినజరదంశువితతి వోలె. నైష. ౨. ౪౦.

మ. మరువాలారుశరంబులం దొరఁగుకమ్మందేనె తోఁ గూడి య, య్యరవిందాక్షికిఁ బక్షిపుం గవగవీహైయంగవీనంబు ని, ర్భరహర్షంబు నొనర్చె మున్ను రుచిసౌరభ్యంబులం బిమ్మ టన్, మరియం ద్రోయుచు నించె నెమ్మనము నన్ మూర్ఛాయముర్చాయమున్. నైష. ౨. ౯౯.

౨. రమించు, సంభోగించు.

క... లోపాముద్రం, జూచి మునీంద్రుఁడు మ న్మథగోచరుఁడై దానిఁ బ్రీతిఁ గూడఁగఁ దివిరెన్. భార. అర. ౨. ౩౩౧.

గీ. పిడుతలో నాయకుఁడు దాఁచిపెట్టినట్టి, మా డ లర్పించి వానితోఁ గూడి మెలఁగె. శుక. ౩. ౧౩౧.

జ: కూటమి, కూటము, కూటువ, కూటువమూఁక, కూటువసరులు, కూటువు, కూడ, కూడఁబడు, కూడఁబాఱు, కూడఁబెట్టు, కూడముట్టు, కూడిక, కూడిమాడు, కూడివచ్చు, కూడుకొను, కూడుదల, కూరిచి, కూరిమి, కూరిమికత్తియ, కూరిమికాఁడు, కూరుచు, కూరుచుండఁబడు, కూరుచుండఁబెట్టు, కూరుచుండు, కూరుచుకొను, కూరుచుకోలు, కూరుపరి, కూరుపు, కూర్పించు.

**కూడుకొ (డ్కొ)ను**=కూడు.

స. క్రి. (కూడు, చేరు; స్నేహితునిగాఁ జేసికొను.)

వ...అనిలనందనుం డొక్కమడువున మధురశిశిరజలంబులఁ బానంబుసేసి యుల్లసిల్లి యాద్రుపదపుత్త్రుం గూడుకొనియె...భార. భీష్మ. ౨. 323. ద్వా. ౧. ౧౬౬.

గీ...నిహీనులఁ గూడుకొంట,వ్యసనినైయుంట చల ముంట వలదు పతికి. ఆము. ర. ౨౹౨.

(రమించు)

ఆ. అతని కేమి కొఱఁతె పతిహితంబుఁ బ్రాణ, మిచ్చినాఁడు దివికి నేఁగినాఁడు, రమణుఁ డగుమ నచట రంభాదిసతులఁ గూ,డ్కొనకయున్న నన్నుఁ గూడ నను పు. ద్వా. ౧౧. ౧౪౧.

**కూడుదల.** వి. (√కూడు2-క. కూడుపడె. త.కూడుదల్.) లాభము.

క. వేడు కలరఁ భూదేవికిఁ, గ్రోడాకారంబుఁ జూపి కులికెడుహరికిం, గ్రీడాచల మొప్పిన చోఁ, గూడుదలయు గాదె యటకుఁ గొనిచో మ్రొంకెఁ. వేం. మా. ౧. ౬౫.

**కూడునీరు.** వి. (√కూడు1) గంజి.శుక. 3.౧౦3.

**కూడ్యము.** సం=కుడ్యము.

**కూణి.** సం. విణ. (ఇ) కుణి, ఈచపోయినచేతులవాఁడు.

**కూణికి.** సం. వి. ఆ. స్త్రీ. వీణకొనఁకల.(వై.ని.)

**కూణితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మూయఁబడినది. ౨. ముడువఁబడినది.

**కూణితేక్షణము.** సం. వి. అ.పుం-మూయఁబడిన కన్నులు గలది-శ్యేనము, డేగ.

**కూదరుఁడు.** సం.వి. అ. పుం-కుత్సితజన్మము గలవాఁడు-జాతివిశేషము. (ముట్టుత యగు బ్రాహ్మణస్త్రీకి మొదటిదినమున ఋషిసంగమమువలనఁ బుట్టినవాఁడు-కల్ప.)

**కూద్దాలము.** సం.వి.అ.పుం.కుద్దాలవృక్షము,కాంచనము.

**కూన**[1]=కున్న. వి. (చూ.కొంచెము-సం. కుణకః.)

౧. పశుపక్ష్యాదుల శిశువు; శిశువు.

గీ. నిను వసఁగను బిల్ల నా నినుఁ గనంగఁ, గూనయనఁ గంచు నాఁగను గొడమ యనఁగఁ, దిర్యగర్భకములుగాను దెలియవలయు, నౌపచారిక మన్యాఖ్య లౌట శర్వ. ఆం. భా. ౨. ౯౯.

ద్వి. ...పులులును వాని,కూనలయును జన్నుఁగుడిచెడుచేళ్లు. ద్వి. హరిశ్చ. పూ. ౭౮3 పం.

సీ. పందిపెంటికి నైదు పదియుఁ గూనల నిచ్చి ... సీలా. ౧. ౧౦౧.

ద్వి. గట్టిగా భాగ్యంబు గలచభామణికిఁ, బుట్టకనా కేల పుట్టితి కూన. ద్వి. హరిశ్చ. ఉ. ౧౭3౬ పం.

క. కూనలఁ గానలకుఁ బనుపుకొన నేరుతు నే. అచ్చ. రా. బాల. ౧౦౨.

క...తొలఁగి పోవ రాదా యెట కే,నో కూన... కళా. 3. ౭౬. వాసిష్ఠ. ౨. ౧౨౦.

విణ. చిన్నది, లేఁతది.

నెలకూన=బాలచంద్రుఁడు.

గీ. కుగడ మిగురాకు నిలఁజట్టుఁ బనఁటులఁ గరి, కుంభములఁ దమ్మి నెల నెలకూనఁ గపుర,ము

బ్జముల మీఁల మొగులుఁ గాలాహిఁ బసేఁడి, సంపెఁగలఁ గూర్చి నలువ నిర్మింపఁబోలు. వ సు. ౨. ౩౩.

లతకూన=౧. లేఁదీఁగ.

సీ. కనుఁగొంటి లతకూన నని డాయుఁ గాకున్న నభినవతరలతావాప్తిఁ దెలుపు. వసు. ౩. ౮౨. (మూఁడవయర్థమునకును నిదియే యుదాహరణము)

౨. తీఁగ.

గీ. తీఁగ తీఁగియ లతకూన తీఁగె యనఁగఁ, దనరు లత పేరు... సాం. ని. స్థా. ౫౮.

౩. కన్నెపడుచు.

జ: కూనగుంత, కూనరాగము, కూనలమ్మ, కూనలమ్మచీర.

**కూన²**. వి. కంటిలో పెరుఁగుదుర్మాంసవిశేషము. (వ్యవ) వానిరెండుకన్నులలోను కూనలు పెరిఁగినవి.

**కూనగుంత**. వి. (√ కూన¹) మీఁటమొదలు అనెడుపల్లము. (శ. ర.)

గీ. మ్రాను మీఁటుగ నెగయ గోమాయు వప్పు, డేకతాళప్రమాణమ ల్లెగసి కూన, గుంతలోఁ బడి గ్రుడ్లు వెల్కుఱుక నాల్కఁ, నడుము గఱచుక యఱచుచు బెడిసి మడిసె. హంస. ౧. ౧౯౩.

**కూనరాగము**. వి. (√కూన¹) లోలోపల మెల్లఁగా పాడుకొను రాగము.

(వ్యవ) కూనరాగము తీయు లేనిమగవాఁడును కుడుములు వండలేనియాఁడుదియును ఉండరు.

**కూనలమ్మ**. వి. (కూన¹లు+అమ్మ=సంతతి నిచ్చుదేవత.) ఒకానొకగ్రామదేవత. (చూ. కూనలమ్మచీర.)

**కూనలమ్మచీర**. వి. (కూనలమ్మ+చీర) కూనలమ్మకు ఇష్టమైనచీర, గళ్లు గలఒకవిధమగుచీర.

గీ. ... కుఱుమాపుకూనలమ్మచీర కుడిపైఁటలో పలిసిస్తుఅవిశ, యొసఁగఁ జరియించు నిట్టుల య్యెమ్మెలాఁడి. శుక. ౨. ౪౧౧.

ఇట్లే: - కూనలమ్మపటము.

సీ. క్రొత్తకమ్ములతోడి కూనలమ్మపటంబుఁ గటివిప్పఁగా రెండు కట్లు కట్టి. వైజ. ౩. ౧౦౦.

**కూపకచ్ఛపము**. సం=కూపకూర్మము.

**కూపకము**. సం. వి. అ. పుం. ౧. చెలమ. ౨. గుంత; పిఱుదిమీఁదిగుంత, కుకుందరము. (హేమ. ని.) ౩. తెరచాఁపకొయ్య. ౪. చితి, శవమును దహనము చేయుటకు పేర్చినకట్టెలప్రోగు. ౫. నూనెసిద్దె.

**కూపకూర్మము**. సం. వి. అ. పుం. ౧. నూతిలోని తాఁబేలు. ౨-నూతిలోనితాఁబేలు తా నుండు నూయి తప్ప ఇతరప్రపంచ మెఱుఁగనట్లు తా నుండుతావు తప్ప ఇతర ప్రపంచము నెఱుఁగనివాఁడు-అల్పవిషయాభిజ్ఞుఁడు. (వాచ.)

**కూపమండూకము**. సం. వి. అ. పుం. ౧. నూతిలోని కప్ప. ౨-నూతిలోని కప్ప తా నుండు నూయి తప్ప ఇతరప్రపంచ మెఱుఁగనట్లు తా నుండు తావు తప్ప ఇతరప్రపంచము నెఱుఁగనివాఁడు-అల్పవిషయాభిజ్ఞుఁడు.

**కూపము**. సం. వి. అ. పుం. ౧. నూయి. ౨. గుంట. ౩. గుణవృక్షకము, ఓడతెరచాఁపకొయ్య. ౪. దానము చేయుటకు నలంకరించినకన్య, పెండ్లికూఁతురు. (శే. ని, వై. ని.)

**కూపయంత్రఘటి**. సం. వి. ఈ. స్త్రీ. గిరకకు సంబంధించిన చేద, కుండ, బొక్కెన, మొ.

**కూపయంత్రఘటిక**. సం. వి. ఆ. స్త్రీ = కూపయంత్రఘటి.

**కూపయంత్రఘటికాన్యాయము**. సం. వి. అ. పుం. న్యాయవిశేషము. (చూ. న్యాయము.)

**కూపయంత్రము.** సం. వి. అ. న. నూతిగిరక ఏత
ము, మో.

**కూపాం(గ)కము.** సం. వి. అ. పుం. రోమాంచ
ము, గగుఱు. (వాచ)

**కూపా(వా)రము.** సం. వి. అ. పుం. సముద్రము.
(కల్ప.)

**కూపి.** సం. వి. ఈ. స్త్రీ. ౧.పాత్రవిశేషము,కుప్పె.
(కల్ప.) ౨. అల్పకూపము. (శే. ని.)

**కూపిక.** సం. వి. ఆ. స్త్రీ. జలమధ్యస్థితశిల.(మే.ని.)

**కూపెట్టు.** అ. క్రి. (కూ + పెట్టు) ౧. (భయదుః
ఖాదులచే) అఱచు.

క. తాపించె ధనదువదనముఁ, గూపెట్టఁగఁ గాల
కంఠుకొడు కుత్తరవే, దీపాపాణాంచలమున
...కాశీ. ౭. ౯౦.

శా. కూపెట్టంగ మహీసుపర్వులమొసల్ గోపెం
బరస్త్రీరతిం, బ్రాపించెన్... నీపితామహుఁ
డు...వరాహ. ౨.౯౭.

౨. మొఱపెట్టు.

క...విపన్నుల్, కూపెట్టిన విని తీర్పను... ఆ
ము. ౪. ౨౦౪.

క. చుట్టాలకుఁ దెల్పుదు మదిఁ, దొట్టినకినుకం ద
లార్లతోఁ జెప్పుదుఁ గూ, పెట్టుదు దొరముం
దర ననుఁ, బట్టకు మని పఱవ నతఁడు బసవ
గుభీతిన్. శుక. ౧. ౪౫౨.

స. క్రి. ౧. (బిగ్గరగా) పిలుచు.

క. తలుపు సడలింపు మనుచుం, గులభామను
మాంత్రికుండు కూపెట్టినచోఁ,దలఁకెడివ్యా
పారిమన,శ్చలనము పో వీఁపుఁ జఱచి సం
భ్రమ మొదవన్. హంస. ౩. ౧౦౫.

౨. (స్తుత్యాదులు బిగ్గరగా) చేయు.

ఉ...పద్మజుఁ గూర్చి యేఁగి కూ,పెట్టిరి హస్త
ముల్ మొగిచి పెద్దయెలుంగునఁ దద్గుణస్తు
తుల్. హర. ౩. ౧౧.

**కూప్యము.** సం. విశే. (అ. ఆ. అ.) నూతియంద
లిది; నూతిలో పుట్టినది. వి. అ. పుం. పాంసులవ
ణము.

**కూబరము.** సం. విశే. (అ. ఆ. అ.) రమ్యము, సుం
దరము. వి. అ. పుం. న. ౧. యుగంధరము, నొగ.
౨. గంత్రి. కంబలావృతరథము. (వై. ని, శే.ని.)

**కూబరి.** సం. వి. న్. పుం. రథము; బండి. ఈ.స్త్రీ.
కంబలావృతరథము. (హలా. ని.)

**కూమము.** సం. వి. అ. న. కొలను, సరస్సు.

**కూయి**=కుయి, కుయ్యి, కూ. వి. (√కూయు).౧.
కూఁత, అఱపు.

ఉ. కూయయఁ జంపి యేనుఁగులకొమ్ములు నె
మ్ములు గొంచు...కు. సం. ౬. ౬౭౨.(కూయ
అన్=కూఁత రాకుండునట్లు.)

౨. మొఱ, ఆర్తధ్వని.

గీ. మమ్ము రక్షింపు మని పలుమాఱుఁ గూయు,
నాఁడుకూయి వీతెంచిన నానరవరుఁ, డోడ
కోడకుఁ డేనుండ నొకఁడు మిమ్ము, నకట
యన్యాయవృత్తిమై నలఁపఁగలఁడె. మార్క.
౧. ౧౪౬. ఆం. భా. ౧. ౧౧౫.

౩. ఆర్తిసందేశము, భయవార్త.

వ...నేఁడు కౌరవులు పసులం బట్టిరని కూయి
వచ్చిన...భార. విరా. ౪. ౨౭.

ఉ. ఇక్కడఁ గూయి చెప్పుటకు నెంతయు దూ
రపుఁజొప్పు మార్చి పో,నిక్కడ వైపు నట్ట
డవి యిక్కడఁ జేరువ నూరు పల్లె లే,దు...
కాశి. ౪. ౬౬.

విశే. రక్షకము, కుయి.

చ. అసమున మీఁ దెఱుంగక మహోగ్రహవృత్తిఁ
గడంగి చెచ్చెరం,బసులకుఁగూయిగాఁ జని
యెఁ బాఁపఁడు ... భార. విరా. ౫. ౨౩౪.

కూయివచ్చినవారు = ఆర్తిసందేశమును దెచ్చిన
వారు.

వ...అప్పుడుపాలపుంగవుం డెక్కడెక్కడ యు

... ని యక్కూ యిచ్చినవారు తెరువుపెట్ట నతి త్వరితంబుగ నరిగె... హరి. పూ. ౭. ౫౯.

**కూయిడు.** అ. క్రి. (కూ + ఇడు)-భయదుఃఖాదులచే-అఱచు; మొఱపెట్టు.

క. ఆయెడ సఖు లొకఁ డొక్కఁడు, కూయిడి జలగూడ కడసి గునుకుపరువులం, బోయిరి చెంగటియూరుల, కాయూరవ్యఁడు హిరణ్యఁడట్లరిగతితోఁ. హంస. ౪. ౨౨౨.

ఉ...జయ, శ్రీకమనీయ హా రఘువరేణ్య త్రిలోకశరణ్య నాయెడన్, నీకుఁ బరాకు సేయఁ దగునే యని యాపికవాణి కూయిడన్. చం. రా. ౫. ౭౧.

ఉ. కూయిడఁ జొచ్చె మన్మథునకుం గలకంఠమ దాళిదంపతుల్, కో యని... రామా. ౧. ౧౯౭.

**కూయు.** అ. క్రి. (క. కూగు. త. కూవు.) ౧. అఱచు.

చ. తెరువరు లైనయట్టిపరదేశమహీసురు లర్థవాంఛఁ దత్పురమున కేఁగుదేర వెడదోస్యములం బచరించి వారు నిర్భరగతి నోడఁ గూయఁ దమబాపఁడె గెల్చె నటంచుఁ గాఁపుల, చ్చెరువడ నాడుకంటికి దిసింతురె వీరని యాతఁ డుబ్బునన్. శుక. ౨. ౪౩౯.

క. మాసె నభోమణి నక్కలు, గూసెన్ ... భార. విరా. ౪. ౮౬.

గీ. కొక్కరోకో యటంచును గోళ్లు గూసె. హర. ౭. ౧౩౭.

సా: కూసెడుగాడిద వచ్చి మేసెడు గాడిదను చెఱచినది.

౨. మొఱపెట్టు.

గీ. తలలు దఱిగి పూజించినదర్పలీల, సెనఁగువీరుఁడు నీశైల మెత్తఁబోయి, బాహు లిఱుకంగఁ దాల్మిని బాసి కూసె. హరి. ఉ. ౬. ౯. హంస. ౩. ౧౪౪.

౩. పదరు, ప్రేలు.

గీ. మూన్నృతమె కాని వాలుకఁ జొనుపనట్టి, వాయకాగ్రణి దబ్బఱ ల్గూయ సాగె. నిరం. ౪. ౬౭.

(వ్యవ) ఇప్పుడు కూసినకూఁతలు మరలఁ గూయుము.

జ: కూఁత, కూఁతకైదువు, కూఁతసేల, కూఁతపట్టు, కూఁతపట్టుసేల, కూఁతవేటు మేర.

**కూర.** వి.(త. కఱి.) ౧. తోఁటకూర వంకాయ మొదలగు అపక్వశాకపదార్థము. (దీని భేదములు:- ఆకుఁగూరలు, పూవుఁగూరలు, కాయకూరలు, దుంపకూరలు.)

సీ. ఆకు పువ్వును గాయ లాదిగా నివి యెల్లఁ గూర యంచనఁగను మీఱుచుండు. అం. భా. ౨. ౬౭.

ఉ...కూరగాయలుం, గోయుచు... కు. సం. ౬. ౬౬౨.

గీ. కూరగాయ కట్టియ విల్చికొనఁగ వలసి, యునికి...హరి. పూ. ౬. ౫. జై. భా. ౪. ౯౬.

౨. వండినశాకము, పక్వశాకము.

మ...కూరలు చల్లనారవె మహాత్మా యోగిచూడామణీ. హర. ౨. ౧౩౧.

చ...ఓరి మనుజాధమ నిచ్చలుఁ దెచ్చువంటకం, బును నులివేఁడికూరలు నపూపములున్ గొని రా కహంకృతిన్. విక్ర. ౫. ౨౧౯.

కూటికూరకు చంద్రహాసము పూనుట=అల్పకార్యముకై యధికసాధన ముపయోగించుట.

గీ. ఒండు విలు పూని యతిదర్ప మొలయ నగ్ర, జన్ముఁ గని కూటికూరకుఁ జంద్రహాస, మలవు మైఁ బూనఁబడె నంచు నళనికల్ప, మగుశరం బేసి యార్చె నయ్యసురవరుఁడు. రుక్మా. ౫. ౨౬.

కూరాకుచేయు=వధించు, చంపు.

గీ. పులులఁ బట్టలుచీరి దుప్పులను శేళ్ల, నేకలమ్ములఁ గ్రుమ్మి కూరాకుసేసి, యమరఁ జమరులఁ బట్టి పాలార్చు మిపుడు, సామి చూడుము నీ బంట్లసత్తు వనుచు. సారంగ. ౧. ౯౦.

కూరాకైయుఱుకు=కూరాకువలె నుఱుకు, తపించు.

క. ఈరీతిఁ గడుపునొప్పిం, గూరాకైయుడికి గోడు గుడుచుచు నుండా, లారి యొకనాఁడు నిజగ, ఖారసనసంఘటకు ఘటకుఁ గనుఁగొని పలికెన్. వేం. పంచ. ౪. ౫౬౦.

జ: కూరపసుపు.

**కూరట.** వి. పొరలుట. (శ. ర, బ్రా.)

**కూరపసుపు.** వి. (√ కూర) కూరలలోఁ జేర్చెడు పసుపు. (శ. ర.)

**కూరము.** సం. వి. అ. పుం. న. అన్నము.

**కూరముక్కు.** వి. మత్స్యవిశేషము. హంస. ౪. ౧౮౭.

**కూరాడు.** వి. ఔ. ధాన్యామ్లము, కలి, పులియఁబెట్టినకడుసనీరు.

సీ. కూరాడు కలి నాఁగ మీఁఱు ధాన్యామ్లము... ఆం. భా. ౨. ౨౫౦.

గీ. తేరు లన్నియుఁ గూరాటి తేరులుగను, గుఱ్ఱముల నెల్లఁ గావేరిగుఱ్ఱములుగ, నేనుఁగుల నెల్ల వెడయూపు టేనుఁగులుగ, దళము లన్నియు మఱి హారదళము గాఁగ.

వ. ఇట్లు సహాయింపం జూచి బలంబుపై కుఱికి ... మొ. రా. సుం. ౧౭౪, ౧౭౫.

**కూరిచి(ర్చి)**=గుఱిచి, గుఱించి. అవ్య. ('కూరుచు' ధాతువునకు క్త్వార్థకరూపము. ఇది ద్వితీయావిభక్తిపై చేరియుండును.) గుఱించి, ఉద్దేశించి.

క. వనజాక్షుఁ గూర్చి జన్నము, లొనరించిన సుగతి గలుగు...దశా. ౩. ౧౭౮.

క. అమ్మకువ చపలఁ గూరచి, యమ్మా భువి నాఁట దాన నైన నిన్నే, యమ్మహితసాహసము నా, కిమ్మా నాకోర్కు లెల్ల నీడేఱుటకున్. శుక. ౩. ౫౯౩.

(ఈ క్రింది ప్రయోగమునందు వ్యవహితముగాఁ గూడఁ గానిపించుచున్నది.)

క. జనవినుతముగాఁ బెక్కు స, వనములు దనుఁ దాన కూర్చి వైదికయుక్తిం, బొనరించుచు ననురాగము, మనమునఁ దఘుకోత్త దైత్యమర్దనుఁ డెలమిన్. భాగ. ౧౦. ఉ. ౧౩౨౦.

**కూరిమి(ర్మి).** (√కూర్మి-క. కూర్మె.) ౧. ప్రేమ, స్నేహము; వాత్సల్యము.

సీ. నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెనరెలమి మేలు ప్యారిమి చెలిమి యరితి. గీ... అనఁ బ్రేమ దోఁచును...ఆం. భా. ౧. ౧౩౬.

క. కూరిమి గలదినములలోఁ, నేరము లెన్నఁడును గలుగ నేరవు మఱి యా, కూరిమి విరసంబైనను, నేరము లే తోఁచుచుండు...సు.శ. ౩౮.

ఆ. బుజ్జగించి కూర్మి పొంపిరివోవఁగ, హితమితోక్తిఁ బుత్రికిట్టు లనియె. హర. ౪. ౫.

౨. స్త్రీకి పురుషునిమీఁదఁ గాని పురుషునకు స్త్రీమీఁదఁ గాని యుండునను రాగము, వలపు.

క. వారిజలోచన నీపైఁ, గూరిమి గలమగని వెదకికొను మొకు ననఁడే. భార. ఉద్యో. ౧. ౩౫౦.

విశే. కూరిమి గలది, ప్రియము.

గీ. కూర్మియనుజన్మహృదయంబుకోర్కి యెఱిఁగి. కాశీ. ౧. ౧౨.

ఉ.... మా, యమ్మ భవాని సంయమికులాగ్రణి కూరిమిబిడ్డ నిచ్చి రా, పొమ్మన వచ్చితిన్ ...రాజ. చ. ౨. ౯౫.

**కూరిమి(ర్మి)కత్తియ(త్తె).** విశే. (√కూరిమి) కూర్మి గలది.

క. అటువంటికూర్మికత్తియ, కుటిలాలక నెడసి నే మొకో యది విధిసం,ఘటనము గావలె... కుచేల. ౪. ౧౬౫.

**కూరిమి(ర్మి)కాఁడు.** విణ. (√ కూరిమి) కూర్మి గలవాఁడు.

(ప్రియుఁడు)

చ. అడుగుల నంటి యూరువుల నాని నితంబము లందె నాభినిం, బుడికి వళుల్ స్పృశించి కుచముల్ పడి ముట్టి సరోవశాంసమూ, ప్పడఁకులఁ గూర్మికానివలె బంధురకంకణకర్ణికావళిం,దడవుచు నిల్చి హైకోనియెఁ దన్మయతం బ్రతిబంధ వైఖరిన్. కృ. శకుం. ౨. ౧౬౮.

**కూరు[1].** అ. క్రి. ౧. కలుగు.

క...శోకము,గూరన్ గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్. భార. భీష్మ. ౨. ౩౬౪.

క...వగ మనమునఁ గూర...నిర్వ. 3. ౧౦౪.

౨. మునుఁగు, నిమగ్నమగు.

ఉ. దారుణపాశబంధనవిధానములన్ నరకార్ణవంబులోఁ, గూరిననన్ను నేఁడు సెడకుండ నొనర్చినపుణ్యమూర్తులన్. భాగ. ౬.౧౪౨.

3. క్రుంగు, అడఁగు

క. ఓరమణి యిట్టు లేటికి,హారమణీభూష లిడక యసురుసు రనుచున్, దీఱని చింతాభరమునఁ, గూరెద వి త్తెఱఁగు వేరుకొనుమా తెలియన్. ప్రబంధ. ౭33.

౪. చొచ్చు, తూఱు.

సీ. ఎముకలఁ గూరి మూత్రమ్ములలో నూరి ప్రేవుల లో నక్కి మావిఁ జిక్కి గీ. తల్లిగర్భంబులోఁ బ్రాణి తల్లడిల్లు. శివధ. ౫. ౧౨.

ఉ...కడు నొప్పెడు మేనులు వాఁడికైదువుల్, గూరఁగ నాటినం బుడమిఁ గూలుటకక్కట యోర్వ వచ్చునే. భార. ఉద్యో. 3. ౨౬౮.

స. క్రి. ౧. పొందు.

చ...హైకొను మన్న నతండు ప్రీతి నెక్కొన భుజియించి పెండియును గూరఁడ తృప్తి... భార. అశ్వ. ౪. ౨33.

క...కుజనులు వృద్ధిం,గూరుదురు సాధుజనులకు, దారుణదుర్దశలు పొందు...హరి.ఉ.౯. ౩౯.

౨. (మందు మొదలగువానిని) గట్టించు, దిట్టముగా నొక్కు; క్రుక్కు.

ఉదా: పిరంగిలో మందు కూరినారు.తల్లి బిడ్డకు కూరికూరి అన్నము పెట్టినది.

జ: కూరుకొను.

**కూరు[2]**=కూరుకు. అ. క్రి. నిద్రించు

లయగ్రాహి...కా,శీగకృత సేతువులదారిఁ జను చో నచటఁ గూరుకలహంస లగడై రొదలు సేయున్. వసు. ౨. ౨౨.

కూరు మొన=నిద్రించు సేన.

గీ. కూరు మొన పెట్టినట్టులు గొంద ఉజ్జ్వలాయుధములు గంకటములు నమర నున్నఁ, జూచి చావనివా రని చూడు చేర, నరుగకున్నవి కంకగృధ్రాదు లలికి. భార.స్త్రీ.౨. ౨౦. (కూరు మొన=వాఁడియైన మొన అని శ. ర.-'కూరుకుచున్న యట్టులు' అని కరాల,భా.ల. వ్యా.పా.)

జ: కూరుకు, కూరుకుపాటు, కూర్కు వాఁడు.

**కూరుకు(ర్కు)**=కూరు[2]. అ. క్రి. ౧. నిద్రించు; కునుకు, కాంతిమాంద్యము నొందు.

మ. అదె నాబిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు నున్నదులై పోయెద రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై, కడలం డీమగవంద కూరుకుగతిం గన్మూసి గుర్వెట్టుచున్. భాగ. ౯. ౪౦౫.

చ.కుసుమముఁ బవ్వళించుచును గూర్కుచు మేల్కనుచున్ రమించుచున్, బడుచును లేచుచు న్నరుఁడు భావమునం దవిముక్తిసీమ సం,గడిఁ బ్రవహించు శీగగనగంగఁ దలంచి త్యజించుఁ బాపముల్. కాశీ. ౫. ౪౦.

ఉ... ఘృత మతిమాత్ర వోసినం, గూరికిగూర్కు యాశుణము గొబ్బున మందివదీపమో యనన్. నైష. ౩. ౧౧౬. (శ. ర. పా.)

౨. మూఁతపడుట; నిమీలితమగుట.
గీ. అదిగర్భేశ్వరుం డైనయవ్విభునకు, బ్రాను
వడి మేను బహుతరగ్లాని నొంది, కన్ను
గూర్కొడునంత వగ్గహనభాగ, మేలుచేతా
ళుఁ డతిదుర్నిరీక్షుఁ డగుచు.శుక.౧.౧౯౦.
౩. నిద్ర.
క. కంటికిఁ గూరుకు రా దాఁ,కంటికిఁ దుది లే
దు చిక్కకయె యెట్లుందుఁ. శుక. ౩.
౪౧౧.
సీ.నగభుర్త కండూయనముసౌఖ్యమునఁ గూర్కు
వట్టుకూర్మము గుఱుపెట్టె ననఁగ. వరాహ.
౭. ౬౧. ఆం. భా. ౧. ౧౪౧.
కూరుకి(ర్కి)డు=కన్నుమూఁతవేయు.
చ. పనిఁ జరియించి యిచ్చటికి వచ్చి ముదంబు
నఁ బువ్వుసెజ్జ నిం,పున శయనించి యుండు
తటిఁ బొందుగఁ గూర్కిడినంతలోపలన్.
చ. ఒకకలఁ గంటి...బిల్హ. ౨. ౩౬, ౩౭.

**కూరుకు(ర్కు)పాటు.** వి. (√ కూరు²) కునికి
పాటు, తంద్ర.
సీ. శత్రులఁ దలయూఁచి జంకించుటలు మాని
కూర్కుపాటులఁ దూఁగి కూరువారు. వరా
హ. ౧౧. ౧౨౬.

**కూరుకొ(ర్కొ)ను.** అ. క్రి. (√కూరు¹-స్వా
ర్థమున 'కొను'-త. కూఱుకొళ్.) ౧. కలుగు.
మ...కూర్కొల్ కూర్కొనెన్ గంట వె,ల్వె
లఁబాఱెన్ ముఖచంద్రమండలము పా
ల్చెన్ నోరు మృద్గంధగం,ధిలమై కోసలక
న్యకున్...రామా. ౩. ౯౩.
౨. దిగఁబడు, దించుకొని పోవు.
ఉదా: వానికాలు ఇసుకలో కూరుకొని పోయి
నది.బండిచక్రములు ఊబిలో కూరుకొని పోయి
నవి.
స. క్రి. క్రుక్కు.
సీ. ఏగురార్ధకచల్లు లెలమిఁ బన్నిదమాడి కూ
ర్కొని కూర్కొని కుడుచు నొక్కఁ,డు...
భాగ. ౧౦ పూ. ౪౯౬.
ఉ...శకుంతలాధరపుటామృతపూరము లూర్పు
పుచ్చు కేఁ, గుత్తుకబంటిగాఁ గడఁగి కూ
ర్కొని కూర్కొని త్రావకుండినన్.పి.శకుం.
౩. ౧౬౪.
సీ...ఏను శంతనుసుతుండు,గురుఁడును విదురుం
డుఁ గూర్కొని కూర్కొని చెవులఁ బోయ
మె సవిశేషకార్య. గీ.వచనములు...భార.
స్త్రీ. ౧. ౧౪౨.

**కూరుచే(ర్చు).** స. క్రి. (√కూడు²)౧. చేర్చు;
కలుపు.
చ...ఉద్ధుర,ధ్వనిఁ బఠియింపఁ జొచ్చెఁ బ్రణ
వంబునఁ గూర్చినమంత్రరాజమున్. కాశీ.
౨. ౧౪౭.
చ...ఎక్కుడుతమకంబులోడఁ దల గ్రుచ్చి
కవుంగిటఁ గూర్చె నత్తఱిన్.కళా.౪.౯౯.
సీ.భసిత మెన్నఁడొ కాని ప్రతిదినంబు నలందు
మలయజంబు కురంగమదముఁ గూర్చి. భీమ.
౧. ౧౧౫.
౨. సంధానముచేయు, సంఘటనచేయు.
(సుదేష్ణ కీచకునితో నన్నమాట.) ఆ. ఇంత దల
ర నేల యెమ్మెయినైనను, గొమ్మ నలవరించి
కూర్చు టరుదె. భార. విరా. ౨. ౮౦.
గీ. నలుని దమయంతితోఁ గూర్పఁ దలఁచియు
న్న,ధాత...నైష. ౧. ౮౦.
౩. మిత్త్రులుగాఁ జేయు, మైత్త్రిచేఁ గలుపు.
ఉ. కాననభూమికిం జనుట కారణికోత్తమ నీ
చెఱుంగవే,కాన సహించి పాండవులఁ గౌర
వులం దగఁ గూర్పఁ జేర్పనన్. భార. ఉ
ద్యో. ౩. ౭౫.
౪. అదుకు; ఏకముచేయు.
క. తనుమధ్యవళీభంగములను గూర్పఁగ వవి
యఁ దక్కులముల యగుటఁ గం,తునియిడి

నవత్రిఁ జేసి కనఁ, జనునొడ్డాణమున నడుము చామకు నమరుఁగా. ఆను. ౫. ౨౭.

సీ. చందురునునుఁగాంతి కం దేర్చి కూర్చి బాగునకుఁ దెచ్చినయట్లు గొమరు మిగిలి. భార. విరా. ౨. ౫౨.

౫. అంటించు;(వింట)సంధించు;లగ్నము చేయు.

గీ. వస్త్రములు తైలమున ముంచి వహ్నిఁ గూర్చి. హర. ౨. ౩౦.

ఉ. భావజుఁ డప్పు డున్మదనబాణము తియ్యనివింటఁ గూర్చుచో. నైష. ౧. ౭౯.

ఉ...షడక్షరమంత్రము జిహ్వఁ గూర్చివా,చాటత సత్యసత్త్వుఁ డగుశాంభవయోగివరేణ్యుఁడు...భీమ. ౬. ౨౬.

౬. (అలంకారముగా) పెట్టు.

(శివు నలంకరించుట) సీ...మాహేశ రుద్రాక్షమాలఁ గూర్చె. హర. ౮. ౭౭.

ఉ...సురాంగనాజనం, బజ్జగతీమహేంద్రు శిరసంటు నలుం గిడ బుజ్జవంబునన్, మజ్జనమార్పఁ గల్పకుసుమంబులు గూర్పఁ గడంగి రయ్యెడన్. వసు. ౫. ౭౩.

౭. కూడఁబెట్టు, నిలువచేయు.

గీ. కొంద ఱర్థము వారిక కూర్చి యిచ్చి,౩.... భార. ఆది. ౭. ౧౩౨.

క. మీ పెద్దలు కూర్చినని,త్తేవ మొకటి...ఆను. ౮. ౧౯౭.

౮. పొందించు; చెందఁజేయు.

గీ.దండ్యు దండింపకుండు టదండ్యు దండ,నంబు గూర్చుట విప్రమనంబు నొచ్చు, నట్టివని సేఁత...నూహింస ధరణిపతికి. భార. ఆను. ౫. ౬౬.

ఉ. చెప్పెడి దేమి నాకుఁ గలజీవన మంతయు నీక కూర్చి యెల్లప్పుడు నిన్నుఁ బాయక ప్రియాచరణం బొనరించ నేర్తు...వసు. ౨. ౧౩౦.

౯. సమావేశము చేయు, ప్రోగుచేయు.

గీ. రయముతో వారు వాత్మీయ ఋషిమిత్ర, బంధుపరివారతతిఁ గూర్చి ప్రోడి మెఱయు. రాఘవ. ౮. ౭౭.

క. మన కిదియే సమయం బిఁక,నని నన్యనికాటకోటి నణఁగింప నటం,చును వజ్రి కుమారునిఁ జూ,చిన మంచిద యనుచు నతఁడు సేనలు గూర్చెన్. దశా. ౮. ౩౬.

౧౦. (కార్యమును)సంఘటన చేయు, ఒడఁగూర్చు.

గీ. బుద్ధిమంతుండు పోకలఁ బోయినాఁడు, కూర్ప విప్పంగ నోపు నాకొడుకుఁగుఱ్ఱ. కాశీ. ౬. ౫౬.

౧౧. రచించు; కల్పించు.

సీ. శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకలకథాసారసంగ్రహంబు. ఆను. ౧. ౧౩.

సీ. పటుచమత్కారగుంఫన మొప్ప ద్రౌపదీపరిణయం బేజాణ ప్రౌఢిఁ గూర్చె. జాహ్నవి. ౧. ౧౬.

క...కన్గవ,తళుకులు వేఱొక్క పుష్పదామముఁ గూర్పన్. దశా. ౨. ౧౮.

౧౨. కలిగించు; కావించు, చేయు.

క. అఱకాలను విఱిగినములు, కుఱుచైనను బిదపఁ బీము గూరిచెడుగతిన్. ప్రబోధ. ౨. ౮౯.

సీ. కువలయానందంబు గూర్చుచల్లనిరాజు ... వసు. ౧. ౨౧.

సీ. కలశంబు లభినవగంధంబులుగఁ గూర్చి తనువున నలఁదుసు ననువు గాఁగ. భార. విరా. ౧. ౧౦౭.

ఉ. కొందల మేల బాల మనకూర్చుసపర్యకు మెచ్చి యిందిరా,నందనుఁ డిందు సన్నిధియొనర్చెఁ జామీ...వసు. ౩. ౧౭౮.

౧౩. (వస్త్రాదులు) కుట్టు.

ద్వి. ఇంతవానికి నీకు నిట నూదిఁ బూని, గంత బొంతయుఁ గూర్పఁ గారణం బేమి. ద్వి. పరమ. ౨. ౭౪ పా. ౪ పం.

అ. క్రి. ౧. ఇష్టుఁడగు; ప్రియపడు.

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నీ వొక్క రూప యసదృశధర్మా, చారుండవు రాజనకుం, గూరుతు కత మేమి యిట్లగుటకుం జెపుమా. భార. ఉద్యో. ౩. ౨౧౭.

క. ధనలుబ్ధుల మ్రుచ్చులఁ గూ, ర్పనివారలఁ బగఆవలనివారల ధృతి చా, లనివారల దుర్జనులం, బనుపవుగా రాజకార్యభారము దాల్పఁగ. భార. సభా. ౧. ౪౦.

మ. హరి మేనల్లుఁడు గొంతికూర్చుమనుమం డస్త్రత్రనూజుండు... భార. ద్రో. ౨. ౨౩౬.

గీ. వాఁడు నాకూర్చిరక్షింపవలయువాఁడు. భాగ. ౭. ౬౬౧. (నాకూర్చిరక్షింపవలయువాఁడు=నేను ప్రియపడి రక్షింపవలసినవాఁడు.)

౨. కూడికగావించు, సంఘటనచేయు.

ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగుఁ జనా, భ్యర్చిత మైనభారత మపారకృపాపరతంత్రవృత్తి మైఁ, జేర్చినదేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా, నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్. భార. విరా. ౧. ౨౭.

**కూరుచే(ర్చు)ండఁబడు.** అ. క్రి. (√ కూరుచుండు-స్వార్థమున 'పడు') కూలఁబడు, చతికిలఁబడు.

ఆ. వలుఁదనారసంబు వక్షంబు దూఱంగ, నేయుటయును బాండవేయుఁ డార్తిఁ, గూరి నిలువలేక కూర్చుండఁబడి మూతు, నరద మెగువు లోలఁగ ననియె నధిప. భార. కర్ణ. ౨. ౩౭౧.

గీ. ఇంత పాపంబు సేయంగ నెత్తికొందు, మయ్యా రాజ్యలోభంబున నఖిలబంధు, జనుల వధియింపఁ దొడఁగితి మని రథంబు, మీఁదఁ గూర్చుండఁబడియెఁ జే యూఁదికొనుచు. భార. భీష్మ. ౧. ౧౭౭.

**కూరుచే(ర్చు)ండఁబెట్టు.** స. క్రి. (√ కూరుచుండు) కూర్చుండఁజేయు.

గీ. అవ్వి పేకబోటి నృపునిపాదాంతికమున, నెందుసందిళ్లు పట్టి కూర్చుండఁబెట్టి. కళా. ౭. ౧౪౫.

ఇట్లే: కూర్చుండఁగఁబెట్టు.

మ... అనేకరత్నఖచితస్వర్ణాగ్రసింహాసనం, బున్నఁ గూర్చుండఁగఁబెట్టి భక్తిపరతం బూజించి రవ్యగ్రులై. భీమ. ౪. ౭౯.

**కూరుచే(ర్చు)ండు.** అ. క్రి. (√కూరుచే) ఉపవిష్టుఁడగు, ఆసీనుఁడగు.

చ. నడచుచుఁ గూరుచుండుచును... కాశీ. ౫. ౪౦.

క. చని ధర్మసుతుఁడు సింహా, సనమున భీముఁడు లాత్మసముచితరుచిరా, సనముల సభాస్థలింగఁ, గొని పంచాగ్నులును బోలెఁ గూర్చున్నంతన్. భార. విరా. ౫. ౩౧౬.

గీ... జన్నయసిద్ధమంత్రి, కొలువు గూర్చుండి నను వేడ్కఁ బిలువఁ బంచి. విక్ర. ౧. ౧౯.

**కూరుచే(ర్చు)కొను.** స. క్రి. (√కూరుచే) ౧. సంపాదించు.

సీ. మెఱుఁగుఁజుక్కలచాయ మించు నీతెల్లని గురువెండసే రెందుఁ గూర్చుకొంటి. హై. భా. ౩. ౭౪.

౨. సమావేశముచేసికొను, ప్రోగుచేసికొను.

వ. అచ్యుతుండు సురాసురులం గూర్చుకొని మందరాచలంబు పెకికి తెచ్చునది... హర. ౬. ౪౦.

3. మిత్త్రునిగాఁ జేసికొను.

క. బలవంతులైన దైత్యులు, గొలువఁగ నున్నాఁడు బలిని గూర్చుక కలశీ,జలధి మథియింపుఁడు...దశా. ౨. ౮౭.

౪. అనుగ్రహపాత్త్రునిగాఁ జేసికొను.

క. నేరిచిన నేరకున్నను, గూరుచుకొని రాక మీరె కోపించిన నె,వ్వారిఁక మాకు శరణ్యులు. దశా. ౨. ౩౭.

౫. వెంటఁ బెట్టుకొను.

వ. ... ఆనలినాసనుండు వెన్నునిం గూర్చుకొని మాసమీపమునకు వచ్చి మమ్మిట్లు సన్నుతించె. హర. ౬. ౩౨.

**కూరుమే(ర్చే)కోలు, కూరిచి(ర్చి)కోలు.** వి. (√కూరుమేకొను.) కూర్చుకొనుట.

(కలియఁగట్టుకొనుట)

చ. నరవరుఁ డేము సంగరమునం బడకున్కి యెఱుంగఁ డక్కటా, బరవసమేది వచ్చెఁ బిదపం బినియుం మముఁ గూర్చికోలు దుస్తర మనుబుద్ధి నిప్పటికి శత్త్రులఁ గన్గొనఁగం దలంచి యీ, వెరవున డాఁగె సర్వపృథివీపతి దుర్దశ నిట్లు పొందునే. భార. శల్య. ౨.౧౭.

**కూరుప(ర్ప)రి.** విశ. (కూరుపు + అరి) కూర్చువాఁడు.

(రచయిత)

క. అని యెల్లవేల్పులం బేర్కొని కబ్బము కూరుపరుల గురునిఁ గడంకం, గొనియాడి యచ్చతెలుఁగునఁ, బనిపడి కబ్బంబుఁ గూరుపం గడఁగునెడం. అచ్చ.రా.బాల.౧౨.

వి. మౌర్వీమధ్యతంతుబంధము, నారియందు బాణము సంధించెడుచోటు. ఆం.భా.౨.౨౧౧.

**కూరుపు(ర్పు).** వి. (√కూరుచే) కూరుచుట.

(కట్టు)

వ. ... లొడిగినట్టిసరిగకంగులకూరుపుఁబనికవుదుపరకాళ్ళాయొంటిసారబిగువునిడుపుఁగాసెల... ప్రబంధ. ౭౮.

**కూర్కు-(రుకు)వాఁడు.** విశ. (కూర్కు + వాఁడు) నిద్రాళువు, నిదురపోతు.

గీ. ...కూర్కువాఁ డనంగను నిద్రాళువర్తిపేరు. ఆం. భా. 3. ౧౧.

**కూర్చము.** సం.విశ. (అ. ఆ. అ.) కఠినమైనది.

వి.అ.పుం.న. ౧.కుశముష్టి,పిడికెఁడుదర్భలు. ౨. మయూరపుచ్ఛము. 3. భ్రూమధ్యము, కనుబొమలనడిమిభాగము. ౪. కనుబొమలనడిమివెండ్రుకలు.౫.శ్మశ్రువు,పెరిఁగినగడ్డము మీసమును. ౬. తల. ౭. కైతవము, మిష. ౮. దంభము, డంబము. ౯. వికత్థనము,పొగడికొనుట.౧౦.ముతికి తుడిచివేయుటకై పట్టివేళ్లు వెండ్రుకలు లోనగువానితో నేర్పఱిచినకుంచె.

**కూర్చలుఁడు.** సం.విశ.(అ.అ.అ.) మీసమును గడ్డమును గలవాఁడు.

**కూర్చశిరస్సు.** సం.వి. స్.న. ౧.పాదస్కంధము, మీఁగాలు. ౨. కరస్కంధము, మీఁజేయి. (విల్యమ్సు)

**కూర్చశీర్షము.** సం.వి.అ.పుం. ౧.నారికేళము,కొబ్బరి. ౨. జీవక మనుగంధద్రవ్యము.

**కూర్చశేఖరము.** సం. వి. అ. పుం. నారికేళము, కొబ్బరి.

**కూర్చిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కుట్మలము, మొగ్గ. (మే. ని.) ౨. కుంచెకోల. 3. చిత్తరువువ్రాసెడి తూలిక. ౪. సూచి, సూది. ౫. మస్తుపిండము, గడ్డకట్టినమీఁగడ.

శ్లో. కూర్చికా మస్తుపిండే స్యాత్సూచి తూలిక యోరపి, కవాటస్యాంకుశే చాపి. (కే.ని.)

**కూర్దనము.** సం.వి.అ.న. ఖేల, క్రీడ.

**కూర్దని.** సం.వి. ఈ. స్త్రీ. చైత్త్రపూర్ణిమ.(ఆనాఁడు

జనులు కామదేవోత్సవము చేయుదురు.)

**కూర్పము.** సం.వి.అ.పుం. కనుబొమలనడిమిభాగము.

**కూర్పరము.** సం.వి.అ.పుం.౧.మోఁచేయి.౨.మోఁకాలు.

**కూర్పాసకము.** సం. వి. అ. పుం. ౧.అవిక.౨.అరచట్ట,పొట్టిచొక్కా.

**కూర్పాసము.** సం.వి.అ.పుం. ౧.కంచుకము, అవిక. ౨. అరచట్ట,పొట్టిచొక్కా.3.వారవాణము, కవచము.

**కూర్పించు.** స.క్రి.(√కూర్చు) కూర్పఁజేయు. (నిర్మింపఁజేయు.)

సీ. మలిపించె బంగారముల దేవగృహములు కూర్పించె నట్టిండ్లు కుండినమున. భీమ. ౫. ౮౭.

**కూర్నీనిసాతు.** వి.(హిం. కూర్నిశాత్.) సలాము, వందనము.

గీ. గుడిగుడీధూమపానవిఘూర్ణమాన, చకితదృగపాంగు హైదరుజంగుఁ గాంచి, నజరు గుజరానుపఱచె సాన్నాకడాని,జాలె మాతఁడు కూర్నీనిసాతు చేసి. రంగా. ౨. ౮౫.

**కూర్మపృష్ఠము.** సం. వి. అ. పుం. అమ్లానము, తెల్లపెద్దగోరంటకీ. (చేమంతికీ.అని కొందఱు.) న. ౧. శరావము, మూఁకుడు. ౨. తాఁబేటివీఁపుచిప్ప.

**కూర్మము.** సం. వి. అ. పుం. ౧-మందమైననడకగలది-కచ్ఛపము, తాఁబేలు. ౨. ఒక ఉపవాయువు. 3. విష్ణునిద్వితీయావతారము. ౪. (మంత్ర) ఒకానొకముద్ర. ౫. (నాట్య) అభినయహస్తవిశేషము. ౬. గొలుసు మున్నగువాని చేత కట్టువీనుఁగుపాదముయొక్క భాగము.

శ్లో. కూర్మస్సందానభాగస్స్యాత్. (వై. ని.)

**కూర్మి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు.

**కూలంకష.** సం. వి. ఆ. స్త్రీ-ఒడ్డును ఒరయునది-నది, ఏఱు.

**కూలంకషము.** సం. విశ. (అ. ఆ. అ.) ఒడ్డును ఒరయునది.(వెల్లువ, నది, మొ.)—('కూలంకష ప్రజ్ఞ' మొదలగుచోట్ల కూలంకషశబ్దము లక్షణచే పూర్ణార్థకము.) వి. సముద్రము. (త్రి.ని.)

**కూలఁబడు.** అ. క్రి. (కూలన్ + పడు) కూలు. (విఱిగిపడు.)

ఉ. కూలఁబడెన్ దిశల్ సుధరకూటము లుర్వికి రాలె నేల పా,తాళము నాఁక వ్రీలె...రామా. ౮. ౬౧.

సీ. ఆజానులంబివక్షోజతాడనములఁ గులభూధరంబులు కూలఁబడఁగ. దశా. ౪. ౨౦౨.

(చదికిలఁబడు)

మ. అలరెం దత్తనువుల్ ధరం బడుట భూతాజ్ఞప్తిచే వెట్టిమో,పులు నేలం బడవైచి కూలఁబడుకాపు ల్వోలె నప్పట్టునన్. కువల. ౨. ౧౪౧.

(చచ్చు)

చ. పలుకఁ దొడంగి రప్పుడమిపట్టిఁ గనుంగొని నీకి దేటికిం, జలమునఁ జావ నీమగనిసత్త్వయీపాలిమేరఁ జొచ్చి రాఁ,గల దని చూచితో ఖరుఁడు గాఁ డటు గూలఁబడంగ శంకగో, జ్వలరజతాచలోత్థనవశాతశిఖోన్నఖరుండు మానినీ. రామా. ౬. ౧3౯.

**కూలము.** సం.వి.అ.న.౧.గట్టు,ఒడ్డు.౨.ప్రాంతము, సమీపప్రదేశము. 3.తటాకము, చెఱువు.౪.సేనయొక్క వెనుకటిభాగము. ౫. స్తూపము, మట్టిలోనగువాని దిబ్బ.

**కూలముద్రుజము.** సం. విశ. (అ.ఆ.అ.) ఒడ్డును భేదించునది. (నదీగజాదికము)

**కూలముద్వహము.** సం.విశ.(అ.ఆ.అ.)గట్లనంటి ప్రవహించునది. (నద్యాది)

కూలమ్ము. వి. (కూలు² + అమ్ము) బాణవిశేషము.

క. కూలమ్మున నొకఁడు సరి,తూ్కూలమ్మున ఖడ్గిసేసి కో యని యార్చెన్. చంద్ర. ౨.౪౧.

కూలవతి. సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

కూలార్చు. స క్రి. (√కూలు¹.)కూల్చు, చంపు.

ద్వి. కుటిలు గజాసురుఁ గూలార్చి వ్రచ్చి, నటనకుఁ జొచ్చుట నాల్గవలీల. పండితా. వాద. ౨౨౫ పా.

కూలి. వి. (క.త.మ.తు.కూలి)౧.చేసినపనికి ప్రతిఫలముగా నిచ్చెడుధనము, భృతి, జీతము.

ఉ.కూలికి నూనె లంటి కలగూరలకై పొలమెల్లఁ జుట్టి...శుక. ౨. ౩౬౩.

చ. చదువులు చెప్పి చూచి మఱి సారెకుఁ గూలికి లెక్క వ్రాసి చూ,చి...హంస.౪.౩౦.

సీ. బాడిగ కూలి సంబళము జీత మనంగ వేతనసంజ్ఞయై ఖ్యాతిఁ జెందు. ఆం.భా.౨.౩౦౩.

౨. పన్ను.

గీ. నీవు మాధర్మములలోన నృపవరేణ్య, కూలియాఱవభాగంబు గొనుచు మమ్ముఁ, గావఁ బూనినకతమునఁ గాదె యొండు,చింత యెఱుఁగక రేలు నిద్రింతు మేము. మార్క.౫. ౧౩౮.

కూలిచదువుచెప్పువాఁడు = డబ్బు పుచ్చుకొని విద్య గఱపువాఁడు, భృతకోపాధ్యాయుఁడు.

గీ. ... గ్రామయాజకుండు పరపూర్వపెని మిటి కూలిచదువు,చెప్పువాఁడును శ్రాద్ధవర్జితులు సుమ్ము. వరాహ. ౫. ౫౫.

కూలిపని=కూలికి చేయుపని, భృతకవృత్తి.

సీ. కూలిపనులు చేయ హాలికవృత్తికి నోపుదు వీకృత్య ముచిత మగునె. హరిశ్చ. ౪. ౧౧౭.

కూలిపనివాఁడు=కూలికిఁ బనిచేయువాఁడు,భృతకుఁడు.

క. దాసుఁడు భృత్యుఁడు సెంతయు, వాసిగఁ బని చేయువారు వారలలోనన్, దాసుఁడు విలిచినవాఁడు,ద్యాపితభృత్యుండు కూలిపనివాఁ డెందున్. విజ్ఞా. ప్రా. ౩౬.

(వ్యవ) వాఁడు కూలి నాలి చేసికొని బ్రదుకుచున్నాఁడు.

జ: కూలికాఁడు, కూలిగూలు, కూలివాఁడు.

కూలి. సం. విణ. (న్. నీ. న్.) కూలములు గలది. (నదము, మొ.)

కూలించు=కూలుచు.

(దుల్చు, రాల్చు.)

సీ. ఆశరముఖనిభం బాశర మటు దాఁకఁ బవనాభిహతిఁ దూలుబంధుజీవ,కుంజంబుపువ్వులఁ గూలించువిధమున నవనవక్షతజబిందువులు దొరఁగఁ, జేయుచు...పాండు. ౫. ౧౭.

కూలికాఁడు. వి. (√ కూలి-క. కూలికాఱ) కూలిపని చేయువాఁడు, కూలివాఁడు.

చ...ఘాసము లూడ్చుకూలికాం,డ్రకు...వేం. పంచ. ౧. ౬౮౧.

కూలిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. నది. ౨. సౌవీరాంజనము.

కూలియాలు. వి. దే. (కూలి+ఆలు)వెలయాలు, వేశ్య.

చ...రొక్క మీఁ గలుగువాఁడె మనోజుఁడు కూలియాలికిన్. కు. సం. ౮. ౧౪౩.

కూలివాఁడు. వి. (√కూలి.) కూలిపనిచేయువాఁడు, జీతగాఁడు.

సీ. వైతనికుండు సంబళకాఁ డనఁగ జీతగాఁడనంగను గూలివాఁ డనఁ దగు. ఆం. భా. ౨. ౨౮౮.

కూలు¹. అ. క్రి. ౧. పడు.

మ. ...వామాక్షి తత్పూరుస్తు,ద్ధతి సేసెన్ దలసేలఁ గూల నొకటన్...ఉ.హరి. ౧.౧౬౩.

గీ. పక్షపాతులు నరకకూపానఁ గూలు,దురు... వరాహ. ౧౦. ౭౮.

క. ...వెనగోఁజూచుఁ గీ,లాలము ముక్కున వాతం, గూలనతఁడు గూలి తన్నికొనుచుం జచ్చెన్. భా. రా. యు. ౯౯౧. (కూలు:-కాఱు అని భావము.)

౨. భగ్నమగు, విఱుగు.

ఉ. అన్నలు దమ్ము లైనమను నండఱ నొక్కవిధం బునం గృపన్, మన్ననసేయ వేల యనినన్ నను నూరక తిట్టెఁ దిట్టినన్, దన్నితిఁ దన్నినన్ వనపదంబులు గూల శపించె నిట్టికో, పోన్నతి బుద్ధిఁ బల్లులకు యుక్తమె పుత్రకులన్ శపింతురే. వి. పు. ౪. ౩౨.

౩. ధ్వస్తమగు, పాడగు.

గీ. వెడలిపోయితి నిర్విఘ్నవెంట నరుగు, పెండ్లివారలఁ జూడ నాపిన్నతనము,గూల నింతటిలో వట్టికోప మెత్తి,తలుపు బిగియించె మగఁ డేమి తలఁచినాఁడొ. శుక. ౨.౧౩౧, ౨౭౮.

౪. చచ్చు, మరణించు.

ఉ. కూలెదువారె పాండవులు ఘోరపుఁబోరనొకం డొకండ యీ, చాలెదువార లెల్లమును చావఁ గ్రమంబున సేన లన్నియుం, గూలఁగఁ గౌరవుల్ పిదపఁ గూలుదురు... భార. ఉద్యో. ౨. ౨౭౧.

ఉ. బాలకులార రండు మనప్రాయపుబాలురు గొంద ఱుర్విపైఁ, గూలుట గంటిరే గురుఁడు క్రూరుఁ డనర్థచయంబునందు దు,శ్శీలత నర్థకల్పనము చేసె... భాగ. ౭. ౨౧౨.

జ: కూలఁబడు, కూలార్చు, కూలించు, కూలుచు.

కూలు[2]. వి. లవిత్రమూలము; పిడిలో నమర్చెడు కత్తిలోనగువాని మొదటిభాగము.

సీ. ... కూలు నాఁగ లవిత్రమూల మొప్పు. ఆం. భా. ౨. ౨౩౧.

(వ్యవ) బల్లెము కూలులోనికి విఱిగినది.

జ: కూలమ్ము.

కూలుచే(ల్చు)=కూలించే. స. క్రి. (√కూలు[1]) కూలఁజేయు.

(పడఁగొట్టు)

క. వాలమ్ములు పది మేనం, గీలించిన నాతఁ డతనికేతనము ధరం, గూలిచి చాపము ద్రుంచిన. భార. ద్రో. ౧. ౧౯౭.

సీ...పక్వఫలాగతతులఁ గూల్చు. ఉ. రా. ౨. ౧౪౮.

(త్రోయు, పడవేయు.)

సీ. ... పరిపాటికొంపలోఁ గూల్పక యీమర్గమునఁ ద్రోయ నేల యనుచు. శుక. ౩. ౫౨౮.

(భగ్నము చేయు; ధ్వస్త మొనర్చు; చెఱచు, పాడు చేయు.)

గీ. నందకము గూల్చు యాదవునందకంబుఁ, బాంచజన్యంబు చేతఁ దత్పాంచజన్య, మడఁగు శార్ఙ్గంబు చేఁ జెడు నతనిశార్ఙ్గ, మిసుము సేయదె గదగోపుఁ డెత్తుగదను. ఉ. హరి. ౩. ౭.

సీ...జల్లిపల్లె సమగ్రశక్తిఁ గూల్చె. పారి. పీఠి. ౨౩.

గీ...ఎన్ని,కాఁపురంబులు కూల్చితో కద యటంచుఁ, బలుక...శుక. ౩. ౨౦౧.

(పోఁగొట్టు, అడఁచు, శమింపఁజేయు.)

గీ. ఇతనియధరామృతంబు నాయిచ్చ దీరఁ, గ్రోలఁగాఁ గాని తాపంబుఁ గూల్పఁజాల. బిల్హ. ౨. ౧౨౫.

(చంపు, వధించు.)

ఆ... బొంకుమాట లాడి గురునిఁ,గూల్ప నేర్చిన ట్టిక్రూరాత్ముఁ డేగతిఁ, బోవువాఁడు సెపుమ బుధవరేణ్య. భార. శాం. ౧. ౧౯౯.

క. మండెడుబలునారసమున, గుండియ వగులంగ నేసి కూల్చితి దీనిన్. హర. ౭. ౫౩.

కూల్యము. సం. విశ. (అ.ఆ.అ.) ౧. కూలభవము,గట్టున నున్నది. ౨. కూలజాతము,గట్టునపుట్టినది.

**కూళ**=కూళఁడు. విశే. (సం. క్రూరః. క. కూళ. త. కూళై.) ౧. క్రూరుఁడు.

చ. ...పూ, విలుతుఁడు కూళ వాఁ డిడెడు వేదన కోరువఁ జాల... రసిక. ౩. ౧౯.

సీ. కూళతో ల్వేలుపుఁ గూటువగాటంపుటడవుల మేటిపయ్యెర యనుంగు. అచ్చ. రా. బాల. ౬౩.

౨. కుజనుఁడు, చెనఁటి, కుత్సితుఁడు.

మ. ...వక్త్రుఁ బ్రల్లదుఁ డనుచున్ దేజస్వి గర్వాధికుం, డనుఁ గూళెవ్వరి మేలనున్ సుగభిమల్లా... మల్లభూ. నీతి. ౪౩.

శ్లో. తతో్ క నామ గుణో భవేత్స గుణినాం యో దుర్జనై ర్దాంకితః. సం. భర్తృ. నీతి ౪౩.

గీ. కఱటి యడిగొట్టు పలువ యేతరి గరాసు, చెనఁటి చెన్నఁటి కూళ కుచ్చితుఁడు మొండి, కట్టె నాఁగను గుజనాఖ్యగాఁ జెలంగు. ఆం. భా. ౩. ౨. హంస. ౫. ౧౧౩.

౩. మూఢుఁడు, అవివేకి.

గీ. పాణియాహారకబళంబు పాఱవైచి, కూర్పరము నాకు పెనువెఱ్ఱికూళ పోలె. కాశీ. ౨. ౧౧౦.

క. లోలత విటుఁ డైనం దా, నేలా తల్లులసృజించు నిటు వేశ్యలకుం, గీ లెఱుఁగక చెఱిచెను విధి, కూళయి గొడ్రాలు బిడ్డకుట్టే మెఱుఁగున్. వైజ. ౩. ౧౨౬.

౪. దీనుఁడు, కృపణుఁడు, దరిద్రుఁడు.

ఉ. కూలికి నూనె లంటి కలగూరలకై పొల మెల్లఁ జుట్టి ప్రాల్మాలక యాత్మబంధుజనులం దఱియం జని ప్రాఁతబట్టకై, కూళతనంబునం బ్రభులకుం దనుమర్దన మాచరించియున్, బ్రాలుడు ప్రొద్దుతోడ గృహవాటికిఁ జేరు నతండు నిత్యమున్. శుక. ౨. ౩౬౩.

జ: కూళఁడు, కూళమారి.

**కూళఁడు**=కూళ. (√ కూళ - ఇది అన్వర్థ్యముగా కొన్ని ముద్రితపాఠములందు కలదు. చి. ని, శ. ర. లందును కొన్ని ముద్రితపాఠములందును ఉన్వర్థ్యముగాఁ గలదు. దేనికిని నిర్ధారక ప్రయోగములు కనఁబడవు.) విశే. ౧. అవివేకి, మూఢుఁడు.

మ. చతురుం డంచు నిలింపసంయమి దెసన్ సస్నేహమై యుండు మా, మతి మున్నెప్పుడుఁ గూళఁడయ్యె నకటా మాపోఁటివంత్యావధ్యులం, దతిహాస్యంబుగ నిట్లు పల్కఁ దగునే... హర. పూ. ౫. ౯౯. (ప్రాఁత ప్రతి. పా.)

ఉ. లాలితయూపయౌవనవిలాసమనోహరయై తనర్చునీ, లాలక నిద్రవోవఁ గని యూదటఁ గౌఁగిట మేలుకన్పఁ గాఁ, జాలక యాత్మఁ దక్కనవిచారము లొందఁగ నూరకుండునా, కూళఁడు కామరాజ్యమునకున్ వెలి గాఁడె తలంచి చూడఁగన్. షోడ. ౨. ౫౧.

౨. లుబ్ధుఁడు, పిసినిగొట్టు.

క. పండుగ పబ్బం బైనను, గొం దని యొకకాసు నీనికూళుని సీసీ, లందును వెడలఁగఁ దోలము, బండాటము వీనివలపు పనికా దిచటన్. భల్లా. ౫ఆ. (శ. ర.)

**కూళమారి.** విశే. (√ కూళ.) దుష్టశీలుఁడు.

గీ. కూళమారి విధాత చేకూర్చె నిటుల. ప్రబంధ. ౬౫౫.

**కూవరము.** సం=కూబరము.

**కూష్మా(శ్మా)ండము.** సం. వి. అ. పుం. ౧. పిశాచభేదము. ౨. గుమ్మడికి. ౩. గర్భస్థపిండవిశేషము.

**కూసము**=కుప్పసము.

(నిర్మోకము, పాముయొక్క పైతోలు.)

ఉ. బచ్చెన లూడి ధూసరవిభాపరిభాసురలీలఁ గన్గొనన్, మెచ్చు ఘటింప శేనిరమణీయపుఁ గంబములన్ దనర్చును, ద్యచ్ఛపరేక్షణా ప్రతిమలందు సడల్చినపాముకూసముల్, గ్రచ్ఛ

ఱ నుత్తరీయతను గాంచుచు నున్నవి తత్కు-
చోపరిన్. రఘు. ౯. ౧౧.

(చోక్కా.)

ఆ. పాగ పచ్చడంబు పైకిఁ గూసంబును, పోఁగు
లుంగరములు బొజ్జకడుపు, గలిగినట్టివానిఁ
గందురు చుట్టముల్. వేమన. ౨. ౨౧.

**కూహా.** సం. వి. ఆ. స్త్రీ. కుజ్ఝటి, మంచు.

**కూహాకుఁడు.** సం=కుహకుఁడు.

**కూహాన.** సం=కుహన.

# కృ

**కృంతత్.** సం. శ త్రృ. కత్తిరించుచున్న; ఖండించుచున్న.

**కృంతత్రము.** సం.వి.అ.న. లాంగలము,నాఁగలి.

**కృకణము.** సం. వి.అ.పుం. ౧. క్రకరము,కక్కెరపక్షి. ౨. క్రిమి. ౩. కృకరము, దేహమందలివాయుభేదము.

**కృకము.** సం. వి. అ. పుం. కంఠము, కుత్తుక.

**కృకరము.** సం. వి. అ. పుం. ౧. కక్కెరపక్షి. ౨. తుమ్ము గలిగించుదేహస్థవాయువిశేషము. ౩. చవ్యము ? ౪. కరవీరము, గన్నేరు ? (వై.ని.)

**కృకల.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి ?

**కృకలాస(శ)ము.** సం. వి. అ. పుం. సరటము, తొండ; ఊసరవెల్లి.

**కృకవాకువు.** సం. వి. ఉ. పుం. ౧. కోడి. ౨. నెమిలి. ౩. సరటము, తొండ;చిత్రబింబము, ఊసరవెల్లి.

**కృకాటిక.** సం. వి. ఆ. స్త్రీ. కంఠపశ్చాద్భాగము, మెడయందలి ఎత్తైనప్రదేశము.('ఘాట,ముచ్చిలిగుంట' అని కొందఱు.)

**కృకూలాసము.** సం=కృకలాసము. (కల్ప)

**కృచ్ఛ్రప్రాణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. ప్రాణాపాయములో నున్నవాఁడు. ౨. కష్టపడి జీవించువాఁడు. (విల్యమ్సు)

**కృచ్ఛ్రము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. కష్టమైనది. ౨. పాపయుక్తము. వి. అ. పుం. న. ౧. సాంతపనాదివ్రతము. ౨. కష్టము,దుఃఖము; బాధ, పీడ. పుం. మూత్రకృచ్ఛ్రరోగము. న.పాపము.

**కృచ్ఛ్రారి.** సం. వి. ఇ పుం. బిల్వభేదము, ఒకజాతిమారేడు ?

**కృచ్ఛ్రార్ధము.** సం. వి. అ. పుం. ఆఱుదినములు చేయఁదగినవ్రతవిశేషము.

శ్లో. సాయం ప్రాత స్తథైకైకం దినద్వయమయాచితం, దినద్వయం చ నాశ్నియాత్ కృచ్ఛ్రార్ధస్సోఽభిధీయతే. (కల్ప.)

**కృణువు.** సం. వి. ఉ. పుం. చిత్రకరజాతి, ముచ్చిజాతి.

**కృతకము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కృత్రిమము, కల్పితమైనది. (ఉదా:కృతకపుత్త్రుఁడు=కల్పితపుత్త్రుఁడు,పెంపుడుకొడుకు.) ౨. నిజము కానిది, కపటమైనది.

**కృతకాద్రి.** సం.వి. ఇ. పుం- క్రీడించుటకొఱకు నిర్మింపఁబడినపర్వతము- చేఁతగట్టు.

**కృతకాముఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అవాప్తకాముఁడు, కోరికలు నెఱవేఱినవాఁడు.

**కృతకృత్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విహితకృత్యమును చేసినవాఁడు, కృతార్థుఁడు. (ఇట్లే: కృతక్రియుఁడు, కృతకార్యుఁడు.)

**కృతక్షణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. లబ్ధావకాశుఁడు, సమయము దొరకినవాఁడు. ౨. నియతసమయముకొఱకు తహతహతో నెదురుచూచువాఁడు.

వ. వయం సర్వే సోత్సుకాః కృతక్షణా స్తిష్ఠామః. సం. పంచ. ౧.

**కృతఘ్నుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) చేసిన మేలు మఱచువాఁడు.

**కృతచ్ఛిద్ర.** సం. వి. ఆ. స్త్రీ-లోపల రంధ్రము గలది-కోశాతకి, బీఱ్కీ.

**కృతఘ్నము.** సం. వి. అ. పుం-చేసిన మేలు మఱవనిది-కుక్క. (మే. ని.)

**కృతజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చేసిన మేలు స్మృతియం దుంచుకొనువాఁడు.

**కృతత్ర.** సం. వి. ఆ. స్త్రీ. త్రాయమాణలత, కలుఁగానుగు కీ.

**కృతదాసుఁడు.** సం. వి. అ. పుం. నియతకాలము వఱకు దాసుఁడనుగా నుందు నని చేరినవాఁడు.

**కృతనిశ్చయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ)-చేయఁబడిన నిశ్చయము గలవాఁడు-నిశ్చయము చేసికొన్నవాఁడు.

**కృతపడు.** మి. అ. క్రి. (కృతము + పడు) గతించు, కడచు.

వ... దేవా వినుము వగచినం గృతపడినకార్యంబు గ్రమ్మఱం బొడమునే డెందంబు గుందు నంతియ కాక... భార. కర్ణ. ౧. ౨౭.

**కృతపుంఖుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) శరాభ్యాసమందు నిపుణుఁడు, విలువిద్యయందు నేర్పరియైనవాఁడు.

**కృతపూర్వము.** సం. విశే. (అ. ఆ. అ) పూర్వకృతము, పూర్వము చేయఁబడినది.

**కృతపూర్వి.** సం. విశే. (న్. నీ. న్.) పూర్వము చేసినవాఁడు.

**కృతప్రతిజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ప్రతిజ్ఞ చేసినవాఁడు.

**కృతఫల.** సం. వి. ఆ. స్త్రీ. కోలశింబి, ఒకానొక లత కీ. (విల్యమ్సు)

**కృతఫలము.** సం. వి. అ. న.కక్కోలము కీ.(వాచ)

**కృతబుద్ధి.** సం. విశే. (ఇ)౧. శిక్షిత మైనబుద్ధి గలవాఁడు, పండితుఁడు, ప్రాజ్ఞుఁడు. ౨. స్థిరచిత్తుఁడు. వి. ఇ. స్త్రీ. ౧. శిక్షిత మైనబుద్ధి. ౨. స్థిరచిత్తము.

**కృతమతి.** సం. విశే. (ఇ) ౧.నిశ్చితమనస్కుఁడు. ౨. విద్వాంసుఁడు.

**కృతమాలము.** సం. వి. అ. పుం. ఆరగ్వధము, ఱేల కీ.

**కృతము.** సం. విశే. (అ.ఆ.అ)౧. చేయఁబడినది. ౨. సంపాదింపఁబడినది. ౩.జనితము, పుట్టింపఁబడినది. ౪. అభ్యస్తము, అలవాటు చేయఁబడినది. (ఉదా:కృతాస్త్రుఁడు.) ౫. సిద్ధము చేయఁబడినది, పక్వము. (ఉదా: కృతాన్నము) ౬. హింసితము,నొప్పింపఁబడినది. ౭. పర్యాప్తము, చాలినది. ౮. నియమితము. (ఉదా: కృతకాలము.) వి. అ. పుం. న. కృతయుగము. న. ౧. ఉపకారము, చేసిన మేలు. ౨. ఫలము. ౩.కృత్యము, చేఁత, పని. ౪. అన్నాదిరూపహవ్యము. (వై. ని.)

**కృతముఖుఁడు.** సం. విశే. (అ. ఈ, ఆ. అ.) ౧. పండితుఁడు. ౨. నిపుణుఁడు, నేర్పరి.

**కృతలక్షణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. గుణములచేత ప్రసిద్ధి చెందినవాఁడు. ౨. కృతయుగలక్షణములు గలవాఁడు.

ఉ. కోప మొకింత లేదు బుధకోటికిఁ గొంగుఁ బసిండి సత్యమా,రూపము తారతమ్యము తెలుంగు స్వతంత్రుఁడు నూతనప్రియా,టోపము లేనినిశ్చలుఁ డిటుల్ కృతలక్షణుఁడై

చెలంగఁగా, ద్వాపరలక్షణముం డనఁగ వచ్చు నొకో యలధర్మనందనుఁ. విజ. వి. ౧. ౨౩. (ఇది పైరెండర్థములకు నుదాహరణము.) ౩. కృతచిహ్నుఁడు, గుఱుతిడఁబడ్డవాఁడు.

**కృతవర్మ(ర్ముఁడు).** సం. వి. న్. పుం. యదువంశ్యుఁడగు ఒకానొకక్షత్త్రియుఁడు.

**కృతవిద్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) అభ్యస్తవిద్యుఁడు, విద్య నభ్యసించినవాఁడు, పండితుఁడు.

**కృతవీర్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) వీర్యవంతుఁడు. వి. అ. పుం. చంద్రవంశ్యుఁ డగునొక రాజు, కార్తవీర్యార్జునునితండ్రి.

**కృతవేతనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చేసిన పనికి కూలి పుచ్చుకొనువాఁడు. (దాసాది) ఇశ్లే: కృతభృతికుఁడు.

**కృతవేది.** సం. విశే. (న్. నీ. న్) చేసినమే లెఱిఁగినవాఁడు, కృతజ్ఞుఁడు.

**కృతవేధకము.** సం. వి. అ. పుం. శ్వేతకోశాతకి, తెల్లబీఱకీ.

**కృతవేధన.** సం. వి. ఆ. స్త్రీ. కోశాతకి, బీఱకీ.

**కృతశిల్పుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) అభ్యసింపఁబడినశిల్పవిద్య గలవాఁడు; శిల్పమునందు నేర్పరి.

**కృతశ్రముఁడు.** సం. విశే. (అ. ఆ. అ) -శాస్త్ర శిల్పాదులందు-పరిశ్రమము చేసినవాఁడు.

**కృతసాపత్నిక.** సం. వి. ఆ. స్త్రీ. అధివిన్న, తాను బ్రతికియుండఁగా మరల పెండ్లాడినభర్త గలస్త్రీ.

**కృతహస్తుఁడు.** సం.విశే. (అ. ఆ. అ) గుఱి తప్పక యేయువాఁడు, విలువిద్యయందు నేర్పరి; నేర్పరి.

**కృతాంజలి.** సం. విశే. (ఇ) చేమోడ్చినవాఁడు. వి. ఇ. పుం.౧. లజ్జాలువు, సోఁకుడుముడుఁగు.కీ. ౨. కూర్చినదోసిలి.

**కృతాంతము.** సం. విశే. (అ.ఆ. అ) - చేయఁబడినఅంతము గలది-౧. ముగింపఁబడినది. ౨. నశింపఁజేయఁబడినది. వి. అ. పుం. ౧. సిద్ధాంతము. ౨. పాపము, అశుభము. ౩. దైవము, భాగ్యము, అదృష్టము. ౪. శనివారము. ౫. భరణీనక్షత్త్రము.

**కృతాంతుఁడు.** సం. వి. అ. పుం. ౧. యముఁడు. ౨. శని.

**కృతాత్ముఁడు.** సం. విశే. (న్. ఆ, శ్. న్) ౧. శిక్షిత మగుమనస్సు గలవాఁడు, మనస్సును లోఁబఱచుకొన్నవాఁడు. ౨.శుద్ధాంతఃకరణుఁడు, నిర్మల మగుమనస్సు గలవాఁడు.

**కృతాయాసుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ఆయాసము నొందినవాఁడు.

**కృతార్థుఁడు.** సం. విశే. (అ. ఆ. అ)-నెఱవేర్చుకొన్నపని గలవాఁడు-కృతకృత్యుఁడు.

**కృతాలయము.** సం. విశే. (అ. ఆ. అ) వాసస్థానము నేర్పఱచుకొన్నది. వి. అ. పుం. కప్ప.

**కృతావధానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) సావధానుఁడు, ఎచ్చరిక గలవాఁడు.

**కృతాస్త్రుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) అస్త్రములందు శిక్షితుఁ డైనవాఁడు, అస్త్రవిద్యయందు నేర్పు గలవాఁడు.

**కృతాహారుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ఆరగించినవాఁడు, భోజనము చేసినవాఁడు.

**కృతి.** సం. విశే. (న్. నీ. న్) ౧-నెఱవేర్చుకొనిన పని గలవాఁడు-ధన్యుఁడు. ౨. కుశలుఁడు, నేర్పరి. ౩. పండితుఁడు. వి. ఇ. స్త్రీ. ౧. చేయుట. ౨. క్రియ, పని. ౩. ప్రబంధము, గ్రంథము. ౪. ప్రయత్నము. ౫. హింస. ౬. ఇర్వది యను సంఖ్య. (ఉదా: కృతికరుఁడు=ఇరువది చేతులు గలవాఁడు, రావణుఁడు.) ౭. (ఛంద) ఒక్కొక్క-

పాదమునకు ఇరువది యక్షరములు గల ఒకానొక ఛందస్సు.

కృతుఁడు. సం. వి.అ. పుం. కూటికి పని సేయుదాసుఁడు. (వై. ని.)

కృతోదకుఁడు. సం. విశే. (అ. ఆ. అ) ౧. స్నానము చేసినవాఁడు. ౨. ఉదకకర్మ మాచరించినవాఁడు, తర్పణము విడిచినవాఁడు.

కృత్తము. సం. విశే. (అ. ఆ. అ) ఛేదింపఁబడినది.

కృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. (మృగాదుల) తోలు, చర్మము. ౨. భూర్జపత్త్రము, బుజపత్త్రి. ౩. చెట్టుపట్ట. ౪. కృత్తికానక్షత్త్రము. (మే. ని.) ౫. కత్తిరించుట, ఖండించుట.

కృత్తిక. సం. వి. ఆ. స్త్రీ. అశ్విన్యాదులయందు మూఁడవనక్షత్త్రము. (వాచ-ఇది నిత్యబహువచనాంతమని వై. ని.)

కృత్తికాభవుఁడు. సం. వి. అ. పుం. కార్త్తికేయుఁడు, కుమారస్వామి.

కృత్తివాసుఁడు. సం. వి. స్, అ. పుం. తోలుదాలుపు, శివుఁడు. (సకారాంతమైనపుడు రూ. కృత్తివాసుఁడు.)

కృత్తు. సం. విశే. (త్) చేయువాఁడు. (ఈయర్థమున సమాసాంతమునందే యుండును. ఉదా: పుణ్యకృత్తు, మొ.) వి. త్. పుం. (వ్యాక) విశేష్యవిశేషణరూపములు ఏర్పడుటకై క్రియలపైవచ్చు ప్రత్యయము. (కృదంతములు=క్రియాజన్యవిశేష్యవిశేషణరూపములు. ఉదా: మొలక, వాలిక, గమనము, బంధకుఁడు, మొ.)

కృత్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. క్రియ, పని. ౨. అభిచారక్రియవలనఁ బుట్టిన దేవతామూర్తి భేదము.

కృత్యము. సం. విశే. (అ. ఆ. అ) ౧. చేయఁదగినది. ౨. క్రుద్ధము, కోపగించినది. ౩. లుబ్ధము, లోభయుక్తము. ౪. భీతము, జడిసినది. ౫. విద్విష్టము. ౬. అవమానితము, పరాభవింపఁబడినది. ౭. ఛేదింపఁదగినది. (కే. ని.) వి. అ. న. కార్యము, పని; ప్రయోజనము. (కల్ప) పుం. (వ్యాక) తవ్యదాదిప్రత్యయము.

కృత్రిమధూపకము. సం. వి. అ. పుం. అనేక పరిమళవస్తువులు కూర్చి చేసిన ధూపద్రవ్యము.

కృత్రిమపుత్త్రకము. సం. వి. అ. పుం. వస్త్రాదులచేత చేయఁబడిన బొమ్మ.

కృత్రిమపుత్త్రుఁడు. సం.వి. అ. పుం. ధనక్షేత్రాదులందు ఆశ కలిగించి పెంచుకొన్న మాతాపితృవిహీనపుత్త్రుఁడు.

ఇట్లే: కృత్రిమసుతుఁడు, మొ.

కృత్రిమము. సం. విశే. (అ.ఆ.అ) స్వాభావికము కానిది, కల్పితము. (ఉదా: కృత్రిమమైత్త్రి.) వి. అ. పుం. సిహ్లకము, చిల్లమడ్డి. న. ౧. బిడలవణము, ఒకరకము ఉప్పు. ౨. కాచలవణము, గాజుప్పు. ౩. రసాంజనము.

కృత్స్నము. సం.వి. అ.న. ౧. నీరు. ౨. సమూహము. (వాచ)

కృత్స్నము. సం.విశే. (అ.ఆ.అ.) సమస్తము, అంతయు. వి. అ. న. ౧. నీరు. ౨. కుక్షి, కడుపు.

కృదంతము. సం.వి. అ. పుం.కృత్ప్రత్యయము కడపటఁ గలపదము. (చూ. కృత్తు.)

కృదరము. సం. వి. అ. పుం. కుసూలము. (పాణిక, గాదె, మొ.)

కృప. సం. వి. ఆ. స్త్రీ. ప్రత్యుపకారమును గోరక పరులదుఃఖమును బోఁగొట్టవలెననెడి యిచ్ఛ, దయ, కనికరము.

కృపణము. సం. వి. అ. పుం. క్రిమి, పురుగు. న. దైన్యము.

శ్లో. వక్తుం సత్యపాముత్సహే సకృపణం దేహీతి దీనం వచః. (వాచ)

**కృపణుఁడు.** సం.విణ. (అ.ఆ.అ.) ౧.నిర్ధనుఁడు, బీద. ౨.లోభి, పిసినిగొట్టు. ౩.కుత్సితుఁడు. ౪.మందుఁడు, వివేకము లేనివాఁడు.

**కృపవాఁడు.** వి. విణ. దయను బొందినవాఁడు, అనుగ్రహపాత్రుఁడు.

ఉ. ఎవ్వనిమూర్తి నార్తి యొకయించుక లేదు స భాంతరంబులం, దెవ్వఁడు పూజ్యుఁడై మెఱయు నీజను లెల్ల సదా విధేయులై, యెవ్వని నాశ్రయింపుదు రహీనవచోవిభవాభిరాముఁడై, యెవ్వఁడు తేజరిల్లు నతఁ డెప్పుడు నీ కృపవాఁడు భార్గవీ. వి. పు. ౧. ౨౦౩.

**కృపసే(చే)యు.** వి. స. క్రి. దయచేయు, దయతో నిచ్చు.

చ. ...అమ్ముకుందుఁడే, తనయుఁగ నాకు నీశువుఁ దాఁ గృపసేసె నటంచు హృష్టుఁడై. ఆము. ౫. ౫.

౨. దయతో నుపదేశించు.

సీ. మ్రొక్కి నా కైహికాముష్మికసౌఖ్యప్రదాయి మంత్రము కృపచేయ వలయు. వరాహ. ౧౨. ౪౬.

**కృపాణము.** సం. వి. అ. న-కృపను పోఁగొట్టునది-ఖడ్గము, కత్తి.

**కృపాణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కర్తరి, కత్తెర. ౨. ఛురిక, చురకత్తి.

**కృపాణిక.** సం. వి. ఆ. స్త్రీ. ఛురిక, చూరకత్తి.

**కృపాళు(వు)ఁడు.** సం. విణ. (ఉ) కనికరము గలవాఁడు.

**కృపి.** సం. వి. ఈ. స్త్రీ. కృపాచార్యుని చెల్లెలు, ద్రోణుని భార్య.

**కృపీటపాలము.** సం. వి. అ. పుం. ౧. కేనిపాతము, ఓడతెడ్డు. ౨. సముద్రము. ౩. వాయువు.

**కృపీటము.** సం. వి. అ. న. ౧. ఉదరము, కడుపు. ౨. జలము. ౩. ఇంధనము, కట్టియ, సమిధ.

**కృపీటయోని.** సం. వి. ఇ. పుం. అగ్ని, నిప్పు.

**కృపుఁడు.** సం. వి. అ. పుం. కృపాచార్యుఁడు. (అశ్వత్థామకు మేనమామ, చిరంజీవులలో నొకఁడు.)

**కృమి.** సం. వి. ఇ. పుం. ౧. క్రిమి, పురుగు. ౨. కడుపులో నులిపురుగులు పుట్టెడురోగము. ౩. గాడిద. ౪. లక్క.

**కృమికంటకము.** సం. వి. అ. న. ౧. వాయువిడంగము!. ౨. ఉదుంబరము, మేడి!.

**కృమికము.** సం. వి. అ. పుం. చిన్నక్రిమి.

**కృమికర్ణము.** సం. వి. అ. పుం. చెవిలో క్రిములు పుట్టురోగము.

**కృమికోశము.** సం. వి. అ. పుం. పట్టుకాయ.

**కృమికోశోత్థము.** సం. వి. అ. న. కౌశేయము, పట్టుబట్ట.

**కృమిఘ్న.** సం.వి.ఆ.స్త్రీ. హరిద్ర, పసుపు. (కల్ప)

**కృమిఘ్నము.** సం. విణ. (అ. ఈ. అ) క్రిములను చంపునది. (మనుష్యేతరము—మనుష్యకర్తృకమైనపుడు-అ. ఆ. అ.) వి. అ. పుం. ౧. వాయువిడంగము!. ౨. పలాండువు!. ౩. కోలకందము, ఒకజాతిదుంప!. ౪. పారిభద్రము, వేము!. ౫. భల్లాతకము, నల్లజీడి!.

**కృమిఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ధూమపత్ర, పొగాకు!. ౨. విడంగము!.

**కృమిజ.** సం.వి.ఆ.స్త్రీ. లాక్ష, లక్క.

**కృమిజగ్ధము.** సం. వి. అ. న. అగురువు, అగలు.

**కృమిజము.** సం=కృమిజగ్ధము.

**కృమిజలజము.** సం=కృమిశంఖము. (రా. ని.)
(ఇశ్లే: కృమివారిరుహము. రా. ని.)

**కృమిణము.** సం. విణ. (అ.ఆ.అ.) క్రిములు గలది.

కృమిదంతకము. సం.వి.అ.పుం. పంటిలో క్రిములు గలిగించురోగము, దంతరోగభేదము.

కృమిపర్వతము. సం. వి. అ. పుం. పుట్ట.

కృమి ఫలము.సం.వి.అ.పుం.ఉదుంబరము, మేడి I. న. మేడిపండు.

కృమిరిపువు. సం.వి.ఉ.పుం. వాయువిడంగము I. ఇట్లే: కృమిశత్రువు.

కృమిల. సం. వి. ఆ. స్త్రీ. బహుప్రసవ యగుస్త్రీ, పెక్కు బిడ్డలు గన్న యాఁడుది.

కృమిలము. సం=కృమిణము.

కృమిలిక. సం.వి.ఆ.స్త్రీ. ఎఱ్ఱరంగు వేసిన నారబట్ట.

కృమిశంఖము. సం. వి. అ. పుం. శంఖభేదము.

కృమిశుక్తి. సం. వి. ఇ. స్త్రీ. జలశుక్తి,నీటియందలి గుల్ల, శంబూక.

కృమిాలకము. సం.వి. అ.పుం. వనముద్గము,అడవి పెసర I.

కృశము. సం. విశే. (అ.ఆ.అ.) ౧.బక్కది,చిక్కినది. ౨.సూక్ష్మము, సన్నము. ౩.అల్పము,కొంచెపాటిది, చిన్నది. ర. క్షీణదశలో నున్నది.

కృశర. సం. వి. ఆ. స్త్రీ=కృశరము. (కల్ప)

కృశ(స)రము. సం.వి.అ.పుం. నూవులు బియ్యము కలిపి వండినపక్వాన్నము.

కృశల. సం. వి. ఆ. స్త్రీ. కేశము, వెండ్రుక.

కృశశాఖము. సం. వి. అ. పుం. పర్పటము, పాపటచెట్టు.

కృశాంగము. సం. విశే. (అ. ఈ, ఆ. అ.) కృశించిన అంగములు కలది.

కృశాంగి. సం. వి. ఈ. స్త్రీ.ప్రేంకణము, ప్రియంగులత I.

కృశానురేతసుఁడు. సం. వి. స్. పుం-అగ్నియందు రేతస్సును వైచినవాఁడు- శివుఁడు. (రూ· కృశానురేతుఁడు.)

కృశానువు. సం. వి. ఉ. పుం. ౧. అగ్ని, నిప్పు. ౨. చిత్రమూలము I.

కృశాశ్వి. సం.వి.న్. పుం-కృశాశ్వుఁ డనువానిచే రచింపఁబడిననటసూత్రము అధ్యయనము చేసిన వాఁడు-నటుఁడు, నట్టువుఁడు.

కృశి(యి)ంచు. సం. అ.క్రి.క్షీణించు, సన్నగిల్లు.

మ... కృశించె మే నరుచి యాలో మించె నారుల్లసించె నురుశ్రాంతి జనించె గర్భము రహించె న్నించె నిట్టూరుపుల్. ఉ. రా. ౧. ౧౯౧.

గీ.తనువు కృశియింప శాంతితోఁ దపము సేయు. ఉ. రా. ౫. ౧౯౩.

స. క్రి. కృశింపఁజేయు, క్షీణింపఁజేయు.

(యమునిమాట) క. హరిపాదభక్తులై యీశ్వర నిందయు శంభుచరణసంసేవకులై, హరినింద యుఁ గావించిన,దురితాత్ముల లేదు దప్పిలోఁ గృశియింపఁగ. రుక్మా. ౨.౭౬, ౭౭.

కృశిక. సం. వి. ఆ. స్త్రీ. ఆఖుకర్ణిలత,ఎలుకచెవి I.

కృశోదరము. సం. విశే. (అ. ఆ, ఈ. అ.) సన్నని నడుము కలది.

కృశ్యత్. సం. శత్రు. కృశించుచున్న.

కృషకము. సం. వి. అ. పుం. ౧ వృషభము, ఎద్దు. ౨. ఫాలము, నాఁగటికఱ్ఱు. (మే. ని.)

కృషకుఁడు. సం. విశే. (అ. షికా. అ.) కర్షకుఁడు, దున్నువాఁడు. (మే. ని.)

కృషత్. సం=కర్షత్.

కృషాణుఁడు. సం. వి. అ. పుం. సేద్యగాఁడు, కర్షకుఁడు. (వాచ.)

కృషి. సం. వి. ఇ. స్త్రీ. కరిసనము, సేద్యము.

కృషికము. సం.వి.అ.పుం. ఫాలము,నాఁగటికఱ్ఱు.

కృషికుఁడు. సం.విశే.(అ.ఆ.అ.) సేద్యకాఁడు.

**కృషీవలుఁడు.** సం॰కృషికుఁడు.

**కృష్టపచ్యము.** సం. విశ. (అ.ఆ.అ.) దున్నినపొలమునందు పండునది. (ధాన్యాది.)

**కృష్టపాక్యము.** సం. విశ. (అ.ఆ.అ.) దున్నినపొలమున పండింపఁబడునది. (ధాన్యాది)

**కృష్టము.** సం.విశ.(అ.ఆ.అ) ౧.ఆకర్షింపఁబడినది, ఈడ్వఁబడినది. ౨. దున్నఁబడినది.(నేల) వి.అ.న. ౧. కర్షణము,దున్నుట. ౨.లాగుట. ౩.కృశించుట.

**కృష్టి.** సం.వి.ఇ.పుం.పండితుఁడు. స్త్రీ. ౧. ఆకర్షణము, ఈడ్చుట, లాగుట. ౨. దున్నుట. ౩. కృశించుట.

**కృష్ణ.** సం.వి.ఆ.స్త్రీ. ౧.కృష్ణానది. ౨.ద్రౌపది. ౩. యమునానది. ౪. దుర్గ. ౫. అగ్నిజిహ్వాభేదము. ౬. ద్రాక్షᵎ. ౭. నీలిᵎ. ౮. పిప్పలిᵎ. ౯. నల్లగలిజేరుᵎ. ౧౦.నల్లజీలకఱ్ఱᵎ.౧౧.గుమ్ముడిᵎ.౧౨.కటుకరోహిణిᵎ.౧౩.శారిబాభేదము,ఒకజాతిమామెనᵎ.౧౪.రాజసర్షపముᵎ. ౧౫.పర్పటిᵎ.౧౬.కాకోలి,కారుకొల్లిᵎ.౧౭.సోమరాజి, కారుగచ్చᵎ. ౧౮. కృష్ణతులసిᵎ. ౧౯. అతివిష, అతివసᵎ. (కే. ని.)

**కృష్ణకందము.** సం.వి. అ.న-నల్లనిదుంప గలది-ఎఱ్ఱగలువᵎ.

**కృష్ణకము.** సం.వి.అ.న. నల్లయిఱ్ఱితోలు.

**కృష్ణకర్ముఁడు.** సం.విశ.(న్)దురాచారవంతుఁడు, పాపకర్ముఁడు.

**కృష్ణకాకము.** సం. వి. అ. పుం. మాలకాకి, బొంతకాకి.

**కృష్ణకాయము.** సం. విశ. (అ.ఆ.అ.) నల్లనిదేహము గలది. వి.అ.పుం. ౧.మహిషము,దున్న. ౨.నల్లనిదేహము.

**కృష్ణకాష్ఠము.** సం. వి. అ. న.కాలాగురువు,నల్లనియగలు.

**కృష్ణకోహలుఁడు.** సం.వి.అ.పుం. జూవరి.(త్రి. ని.)

**కృష్ణగంగ.** సం.వి.ఆ.స్త్రీ. కృష్ణానది. (రా. ని.)

**కృష్ణగంధ.** సం.వి.ఆ స్త్రీ.శోభాంజనము,మునగᵎ.

**కృష్ణగతి.** సం.విశ.(ఇ) దురాచారుఁడు.వి.ఇ.పుం. కృష్ణవర్త్మ, అగ్ని.

**కృష్ణగర్భము.** సం. వి. అ. పుం. కట్ఫలము, పినగుమ్ముడుᵎ.

**కృష్ణచంచుకము.** సం. వి. అ. పుం-నల్లనిముక్కుగలది-చణకము, సెనగᵎ.

**కృష్ణచూడిక.** సం. వి. ఆ. స్త్రీ-నల్లనిఅగ్రము గలది-గురిజ, గురివెందᵎ.

**కృష్ణచూర్ణము.** సం. వి. అ. న. లోహమలము, ఇనుపత్రుప్పు.

**కృష్ణజట.** సం. వి. ఆ. స్త్రీ. జటామాంసిᵎ.

**కృష్ణజీరకము.** సం. వి. అ. పుం. నల్లజీలకఱ్ఱᵎ.

**కృష్ణతండుల.** సం. వి. ఆ. స్త్రీ. కర్ణస్ఫోటాలత.

**కృష్ణతామ్రము.** సం. వి. అ. న. గోశీర్షచందనము, నల్లగాను ఎఱ్ఱగాను నుండుచందనము.

**కృష్ణతారము.** సం. విశ. (అ. ఆ. అ) నల్లనికనుగ్రుడ్డు గలది. వి. అ. పుం. హరిణము, ఇఱ్ఱి.

**కృష్ణత్రివృత.** సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడᵎ.

**కృష్ణదంత.** సం. వి. ఆ. స్త్రీ. కాశ్మరీవృక్షము, గుమ్ముడుᵎ.

**కృష్ణదేహము.** సం. విశ. (అ. ఆ. అ.) నల్లనిదేహముగలది. వి. అ. పుం. ౧. తుమ్మెద. ౨. నల్లనిదేహము.

**కృష్ణద్వైపాయనుఁడు.** సం. వి. అ. పుం. వ్యాసుఁడు.

**కృష్ణధ(ధు)త్తూరము.** సం. వి. అ. పుం. నల్లయుమ్మెత్త.

**కృష్ణధనము.** సం. వి. అ. న. ద్యూతాదిదుర్వ్యాపారములచే గడించినధనము.

**కృష్ణనింబము.** సం. వి. అ. పుం. సురభిచ్ఛదము, కఱివేఁపచెట్టు.

శ్లో. కృష్ణనింబః కాలశాకః కైడర్యః సురభిచ్ఛదః. (షట్స్కంధనిఘంటువు.)

**కృష్ణనీలా(లము)లు.** సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము.

సీ. మందిగంద్రలు నాగమల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు. హంస. ౪. ౧౨౭.

**కృష్ణపర్ణము.** సం. వి. అ. పుం. మహాపిండీతకము, పెద్దమంగ.

**కృష్ణపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. కృష్ణతులసి, నల్లతులసి.

**కృష్ణపాకఫలము.** సం. వి. అ. పుం. కరమర్దము, కలివె.

**కృష్ణపాకము.** సం=కృష్ణపాకఫలము.

**కృష్ణపుష్పము.** సం. విశ. (అ.ఆ.అ.) నల్లనిపువ్వులు గలది. వి. అ. పుం. నల్లయుమ్మెత్త.

**కృష్ణపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. ప్రియంగువు.

**కృష్ణఫల.** సం. వి. ఆ. స్త్రీ. సోమరాజి, కారుగచ్చ.

**కృష్ణభూమము.** సం. వి. అ. పుం. నల్లరేగడనేల గలదేశము.

**కృష్ణభేద.** సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి.

**కృష్ణభేది.** సం. వి. ఈ. స్త్రీ=కృష్ణభేద.

**కృష్ణము.** సం. విశ. (అ.ఆ.అ.) ౧. నల్లనిది. ౨. భీతము, వెఱచినది. ౩. అశుభము. వి. అ. పుం. ౧. నలుపు. ౨. కాకి. ౩. కోయిల. ౪. కలివెచెట్టు. ౫. అగ్ని. ౬. బహుళపక్షము. ౭. వ్రీహిభేదము. ౮. మేఘము. ౯. కలియుగము. ౧౦. నల్లత్రాఁచు. ౧౧. నల్లయిఱ్ఱి. ౧౨. ఒకజాతియెలుక. న. ౧. మరిచము, మిరియము. ౨. ఇనుము. ౩. నీలాంజనము, సౌవీరాంజనము. (రా. ని.) ౪. కాలాగురువు, నల్లఅగలు. (కల్ప) ౫. సీసము. ౬. పాపము. (శే. ని.)

**కృష్ణముఖము.** సం. విశ. (అ.ఆ, ఈ.అ.) నల్లనిముఖము గలది. వి. అ. పుం. కొండముచ్చు.

**కృష్ణమూలి.** సం. వి. ఈ. స్త్రీ. శారిబావిశేషము, ఒకజాతిమామెన.

**కృష్ణయజుర్వేదము.** సం. వి. అ. పుం. తైత్తిరీయకయజుర్వేదము.

**కృష్ణరక్తిక.** సం. వి. ఆ. స్త్రీ. గుంజ, గురివెంద.

**కృష్ణరాయఁడు.** సం. వి. అ. పుం. విజయనగరాధీశుఁడగు ఒకప్రభువు.

మ... దీర్ఘాయువు నిచ్చుఁగావుత గుణాంభోరాశికిం గృష్ణరాయనికిన్ వారణరాజవక్త్రుఁడు కృపాయత్తైకచిత్తాబ్జుఁడై. పారి. ౧. ౩.

గీ. ... అచ్యుతాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు. మనుచ. ౧. ౩౧.

మ. అలపోత్రిప్రభుదంష్ట్ర భోగివరభోగాగ్రాళి రా లుద్భటాచలకూటోపలకోటికూపుచెడ నిచ్చల్ రాయఁగా నైనమొక్కలు భూకాంతకు నున్న నయ్యెనరసత్పాలు శ్రీకృష్ణరాయలబాహామృగనాభిసంకుమదసాంద్రాలేపపంకంబునన్. మనుచ. ౧. ౩౫.

**కృష్ణల.** సం. వి. ఆ. స్త్రీ. గురివెంద.

కృష్ణలవణము. సం.వి.అ.న. ౧. గాజుప్పు. ౨. సౌవర్చలవణము.

కృష్ణలోహము. సం. వి. అ. న. అయస్కాంతము, సూదంటుఱాయి.

కృష్ణలోహితము. సం. వి. అ. పుం. నలుపును ఎఱుపును కలసినరంగు, ధూమ్రవర్ణము, బూడిదరంగు.

కృష్ణవర్త్మ. సం. విశే. (న్. న్, అ. న్) ౧. దుష్టవర్తనము గలవాఁడు, చెడ్డనడవడిగలవాఁడు. వి. న్. పుం. ౧-నల్లనిమార్గము గలవాఁడు-అగ్ని. ౨. రాహువు. ౩. చిత్రమూలము, చిత్రకముI.

కృష్ణవల్లి. సం. వి. ఈ. స్త్రీ. ౧. కృష్ణతులసిI. ౨. కర్కటి, దోసI. ౩. శారిబాభేదము, ఒకజాతి మామెనI. ౪. ఒకజాతిదూడపాలI.

కృష్ణవల్లిక. సం. వి. ఆ. స్త్రీ. జలుకాలత, కోరిందI.

కృష్ణవానరము. సం. వి. అ. పుం. కొండముచ్చు.

కృష్ణవృంత. సం. వి. ఆ. స్త్రీ. ౧. కుబేరాక్షి, కలిగొట్టుI. ౨. మాషపర్ణి, కారుమినుముI.

కృష్ణవేణ(ణ్ణ). సం. వి. ఆ. స్త్రీ=కృష్ణవేణి. రా. ని. కాశికావృత్తి. ౨. ౧. ౨౧.

కృష్ణవేణి. సం. వి. ఈ. స్త్రీ. కృష్ణానది. సం. భాగ. ౫. ౧౯. ౧౮. సం. భార. సభా. ౯. ౨౪.

కృష్ణశకుని. సం. వి. ఇ. పుం. ౧. కాకి. ౨. నల్లని పక్షి.

కృష్ణశృంగము. సం. వి. అ. పుం. దున్నపోతు.

కృష్ణసఖము. సం. వి. అ. పుం. అర్జునవృక్షము, మద్దిI.

కృష్ణసఖి. సం. వి. ఈ. స్త్రీ. నల్లజీలకఱ్ఱI.

కృష్ణసఖుఁడు. సం. వి. అ. పుం. అర్జునుఁడు.

కృష్ణసర్షపము. సం. వి. అ. పుం. నల్లావI.

కృష్ణసార. సం. వి. ఆ. స్త్రీ. శింశుప, ఇరుగుడుI.

కృష్ణసా(శా)రము. సం. వి. అ. పుం. ౧. నల్లయిఱ్ఱి. ౨. ఇరుగుడు, శింశుపI. ౩. జెముడుI.

కృష్ణస్కంధము. సం. వి. అ. పుం. తమాలము, చీకటిమ్రాను.

కృష్ణాంజని. సం. వి. ఈ. స్త్రీ. కాలాంజనీవృక్షము, అడవిప్రత్తిI.

కృష్ణాగురువు. సం. వి. ఉ. న. నల్లయగలు.

కృష్ణాచలము. సం. వి. అ.పుం-కృష్ణునకు ప్రియమగుకొండ-రైవతకపర్వతము. (కల్ప)

కృష్ణాజినము. సం. వి. అ. న. నల్లయిఱ్ఱితోలు.

కృష్ణాధ్వుఁడు. సం. వి. న్. పుం. కృష్ణవర్త్మ, అగ్ని.

కృష్ణాభ. సం. వి. ఆ. స్త్రీ. కాలాంజని, అడవిప్రత్తిI.

కృష్ణామిషము. సం. వి. అ. న-రంగునందు కృష్ణునితో స్పర్ధగలది-ఇనుము.

కృష్ణాయసము. సం. వి. అ. న. ఇనుము.

కృష్ణార్జకము. సం. వి. అ. పుం. ౧. నల్లగగ్గెరI. ౨. నల్లతులసిI.

కృష్ణాలువు. సం. వి. ఉ. పుం. కాలాలువు, నల్లగెనుసుI.

కృష్ణావాసము. సం. వి. అ. పుం-కృష్ణునినివాసస్థానము-అశ్వత్థము, రావిI.

కృష్ణాష్టమి. సం. వి. ఈ. స్త్రీ. శ్రావణకృష్ణపక్షాష్టమి, గోకులాష్టమి.

కృష్ణిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లావI.

కృష్ణిమ(ము). సం.వి.న్.పుం. నల్లఁదనము.

కృష్ణుఁడు. సం.వి.అ.పుం. ౧. దేవకీవసుదేవులకొడుకు. ౨. వేదవ్యాసుఁడు. ౩. అర్జునుఁడు. ౪. పర

మూర్తి. ౫. రుద్రుఁడు. (శే.వి.)
కృష్ణేక్షువు. సం.వి.ఉ.పుం. నల్ల చెఱకు.
కృష్ణోదుంబరిక. సం.వి.ఆ.స్త్రీ. కాకోదుంబరి, కాకిమేడి.
కృష్యమాణము. సం.విణ.(అ.ఆ.అ) ౧.దున్నఁబడుచున్నది. ౨.లాగఁబడుచున్నది.
కృష్యము. సం=కర్షణీయము.

## క్లృ

క్లృప్తకీల. సం.వి.ఆ. స్త్రీ. వ్యవస్థాపత్త్రము, నియమపత్త్రము. (దస్తావేజు, మొ.)
క్లృప్తధూపము.సం.వి.అ.పుం. సిహ్లకము, చిల్లమడ్డి.
క్లృప్తము. సం.విణ.(అ.ఆ.అ.) ౧. రచితము,నిర్మితము. ౨. సమర్థము. ౩. ఛిన్నము, ఖండింపఁబడినది.
శ్లో. క్లృప్తకేశనఖశ్మశ్రుః...మను.౪. ౩౫.
క్లృప్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కల్పనము, రచించుట. ౨. అవధారణము, నిశ్చయము. ౩. ఏర్పాటు.
క్లృప్తికము. సం. విణ. (అ. ఆ. అ) ప్రక్రయము, కొనుట. (వాచ. ని.)

## కె

కె. విణ. వృత్తియందు 'కెంపు' శబ్దముయొక్క లుప్తశేషము. (చూ. కెంపు. విణ.)
కెంగట. (చి. ని.) వి. తాటిటెంక.
సీ...కెంగ టంచనఁగఁ జెలంగుఁ దాళ,బీజాభిధానంబు...ఆం. భా. ౨. ౭౮.
కెంచేము. విణ. దిట్ట?
క. కాంచిన ననపానాగడ, కెంచపుమాస్ట్రీఁడు బెట్టు గెరలుచుఁ జెలిఁ బై,కొంచు నెదఁ దటాయించక్, గొంచించక మొగలికొకుగుమ్మిలిఁ జిమ్మెక్. ఉ. హరిశ్చ. ౪. ౧౧౪.
వ. వారాంగనలకటాక్షమార్గం బపేక్షించుచిరుదుకెంచపుమాస్ట్రీలచాలును ...ప్రబంధ.౭౮.
కెందమ్మి. వి. (కెంపు+తమ్మి.) ఎఱ్ఱదామర, రక్తోత్పలము.
సీ. కెందమ్మి చెందమ్మి కెందామర యన రక్తోత్పలసంజ్ఞ లై యొప్పచుండు. ఆం. భా. ౧. ౧౬౪. పారి. ౩. ౨౪.
కెందామర=కెందమ్మి. నైష. ౮. ౭౧. ఆం. భా. ౧. ౧౬౪.
కెందొగ(వ). వి. (కెంపు + తొగ) ఎఱ్ఱకలువ, హల్లకము. ఉ. రా. ౬. ౬౧.
కెంపు. వి. ౧. పద్మరాగమణి.
సీ. మృగనేత్ర పెదవితో సాగనుఁ బూనఁ గడంగి కెంపు నీరసము చెక్కించుకొనియె. వసు. ౨. ౪౫.
సీ. పద్మరాగాభిధ వరఁగుఁ గెంపన...ఆం. భా. ౨. ౨౭౭. శకాం. ౩. ౪౩.
౨. రక్తిమ, ఎఱుపు.
క. వెండియు నుడుగక రవిసుతుఁ, డొండొండ నిశాతసాయకోత్కరము సముద్దండతఁ బైనించిన నా,ఖండలనందనుఁడు గెంపు గనుఁగవఁ గదురన్. భార. విరా. ౫. ౧౦౬.
సీ. కెంజడల్ పై వ్రాలి కెంపు లీన విపంచి మొరయించునారదముని యనంగ. రా. వి. ౩. ౯.
౩. దంతక్షతము.
చ....విడికెంపుకెంపు మీ,ఱు మెఱుఁగుమోవి పైఁ జూఱుచుఱుక్కను కెంపులకుం దలంకఁగన్. దశా. ౭. ౧౫౬.
సీ.దంతక్షతంబు రత్నం బగుఁ గెంపు నాన్... ఆం. భా. ౩. ౫౪.
విణ. (క.త. కెమ్పు. మ. కెంబు—వృత్తియందు మీఁదివర్ణములు వైకల్పికముగా లోపించి 'కె' యనునది మిగులును. దానికి కొన్ని

యెడల సమాగమమును, కొన్నియెడల పర
మగుహల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా:
కెంగేలు, కెంజడ, కెంధూళి, కెన్నురువు,
కెమ్మోవి, మొ.) ఎఱ్ఱనిది.

చ... మేటివిల్లు వే, కొని కనుదోయి గెంపుగ న
కుంఠితవిక్రమ మొప్పఁ ద్రుంచె నా,తని
ఘనకార్ముకంబు...భార. కర్ణ. 3. ౧౬3.
(కెంపుగన్=ఎఱ్ఱనిదికాఁగా.)

సీ. తెల్దమ్మివిరియింటి తెలిగంటి కెంపువాతెర
సొంపె పవడంపుఁదీఁగెగుంపు. దశా. ౧.
౧౬౪.

కెంగుచ్చు. ఆము. ౪. ౯౨.
కెంగేలు. భార. విరా. ౨. 3౧౦.
కెంజడ. మనుచ. ౧. ౫౯.
కెంజాయ. భార. భీష్మ. ౨. ౨౨.
కెంజిగు(వు)రు. ఉ. రా. ౬. ౧౭. శకు. ౫.౫౫.
కెంపారు=ఎఱ్ఱనగు.

మ. ఘనరాద్రోద్ధతి భద్రకాళిక కటాక్షజ్యో
త్స్నఁ గెంపార నుష్ణాని వక్త్రంబు బిగించి
యూఁదుటయు...కాశీ. ౬. ౨౨౭.

కెంపెక్కు=కెంపారు.

ఉ...నేల కెం,పెక్కుచు వచ్చె...భార. వి
రా. ౨. 3౧౯.

కెంబువ్వు. అచ్చ. రా. యు. 3౨3. బిల్హ. ౨.
౧౯.
కెన్నురువు. ఆము. ౪. ౧౦౦.
కెమ్మోము. దశా. 3. ౧౦౪.
కెమ్మోవి. నైష. ౨. ౨౬.
జః కెందమ్మి, కెందామర, కెందొగ, కెంపుకంటి,
కెంపుగాము, కెంపుసవతు, కెంబసుపు.

**కెంపుకంటి.** వి. (కెంపు + కన్ను)-ఎఱ్ఱనికన్ను
లు గలది-కోయిల. (శ. ర, బ్రౌ.)

**కెంపుగాము.** వి. (కెంపు + గాము)- ఎఱ్ఱనిగ్ర
హము-కుజుఁడు, అంగారకుఁడు. (శ. ర,బ్రౌ.)

**కెంపుసవతు.** వి. (కెంపు+సవతు)-కెంపుతో స
మాన మైనది-స్వాతీనక్షత్రము. (శ. ర.)

**కెంబసుపు.** వి. (కెంపు+పసుపు) కుంకుమము.

సీ. నునుపుగా దువ్వి తీర్చినకెంపుబాలేందుపస
మీఱునొసటి కెంబసుపుబొట్టు. శుక. ౨.
౪౨3.

**కెకరించు.** అ. క్రి. అభిలషించు, కోరు. (బ్రౌ.)

ద్వి. లోలత నఱచేతిలో నిమ్మపండు, లీలఁ బో
షింప లాలితవైభవమున, సుకసుకంబున
నుండి స్రుక్కక చావఁ, గెకరించెదవు విధి
గెలువ నీవళ మె. నవ. ౧. ౬౫పా. ౧౬౦.

**కెచ్చెలితనము.** వి. అల్లరి, దొమ్మి, (బ్రౌ.)

**కెడ=కడ.** వి. (ఇట్లు పరుసాది గా శ. ర—గెడ?
చూ. అగ్గెడ.) ౧. పార్శ్వము, ప్రక్క.

గీ. కృపుఁడు వృషసేనుఁడును వారికెడన కూడి,
పార్థతనువునఁ దూపులు పఱపిరి...భార.
ద్రో. ౪. 3౦3. (శ. ర, ప్రాఁత ప్రతులపాఠ
ము. 'గెడన' అని వావిళ్ల ప్రతిపాఠము.)

గీ. లలితకలకంఠకోలాహలంబు లెసఁగ, దళ
ముకొని రెండుగెడలఁ గాదంబకోటి, గొ
ల్వ రాచిల్కసాంబ్రాణిగుఱ్ఱ మెక్కి, దర్ప
కుఁడు పాంథజనులపై దండువెడలె.ఉ.రా.
౪. ౧౫౬.

సీ...పార్శ్వసంజ్ఞ, కెల ననఁ గెలఁ కనఁ గెడ
యన బగి యనఁ బ్రక్కయనంగఁ గన్ప
ట్టు...ఆం. భా.౨.౧3౭. (ప్రాఁత ప్రతిపా)

౨. దిక్కు.

సీ.ఇటు వల్లెత్రాటిమిక్కుటపుఁ డెక్కురికిబు కెడ
గొప్పతిప్ప వీక్షించినాఁడ. ప్రబంధ.౧౪౯.

జః కెడగూడు.

**కెడగూడు.** అ. క్రి. (√ కెడ) ౧. కూడు, గుం
పగు.

ద్వి. గుడికి నేతెంచునయ్యెడఁ బురజనులు,గడ
గూడి తన్నిరుగెలఁకులఁ గొలువ. బస. పు. ౪. ౭౦౯ పం.

౨. ప్రక్కనుండు.

సీ. నెఱి లేక నీతోడునీడ యై గడగూడి పరఁగి
నన్నింత యెరవు సేసి. కు. సం. ౫. ౬౦౨.

**కెడపు.** స. క్రి. (√ కెడయు-త. కెడప్పు) కెడయఁ జేయు.

౧. పడఁజేయు, పడవేయు, కూల్చు.

చ. మిడుక మదగ్రజన్ముఁ గుశమీఁదికిఁ గట్టుక
పోయి బావిలోఁ, గెడపితి వట్టినిన్నిపుడు
గీటణఁగింపక పోవనిత్తునే. జై. భా. ౩. ౧౦౯.

(చంద్రకిరణములు) సీ. కెరలి చీకటిమ్రాను గెడ
పంగ నిక్కినసమయగజంబుదంతము లనంగ. పారి. ౨. ౩౬

౨. విసరివేయు, త్రోయు.

క. ఒకతూపున రఘువీరుఁడు, మకరాకరమధ్య
సీమ మాటీచు సురాంతకుఁ బడఁ గెడపి సు
బాహున్, బ్రకటశిలీముఖముఖాగ్ని భస్మ
ము చేసెన్. రామా. ౪. ౫౦.

౩. చంపు.

క. తొడిగిననాపటుబాణము,కడుఘోర మమో
ఘ మంతకర మగుటను నే,విడువను దొడిఁ
బడ నెవ్వనిఁ, గెడపునో యని సంశయమున
గిరిచరవర్యా. భా. రా. కిష్కిం. ౧౯౩.

క. ఈహరిణనయనఁ గెడపిన, స్త్రీహత్యయుఁ గె
డప కున్నఁ జెచ్చెర స్వామి,ద్రోహంబును
బాటిల్లెడు, నూహించిన నాకు నెద్ది యుచి
తము చేయన్. హరిశ్చ. ౫. ౧౪౩.

౪. పాడుచేయు, నాశనముచేయు.

స్రగ్ధర. చించెం జెండాడె మట్టెం జిదిమె విఱి
చెఁ గ్రొచ్చెన్ విఘట్టించె దంచెన్,ద్రుంచెం
జక్కాడె మోఁదెం దొడసెఁ గెడపె నత్యు
ద్ధతిం గాశికాపూః, పంచక్రోశధరిత్రీపరిధిఁ
గరిసురప్రత్యనీకుండు హేలా,సంచారోద
గ్రభంగిన్ జలముకొని వనీసౌధవప్రాట్టవీ
థుల్. కాశీ. ౬. ౧౭౬.

౫. హరించు, పోఁగొట్టు.

గీ. అచ్యుత యనంత గోవింద యనెడు నామ,కీర్త
నం బౌషధం బౌచుఁ గెడపఁ జాలు,రోగజా
లంబు లెల్ల నారూఢిగాఁగఁ, దథ్య మీమాట
దప్పదు ధర్మపుత్ర. శేష. ౧. ౫౧.

**కెడయాడు.** అ. క్రి. (కెడ+ఆడు.) నడయాడు, సంచరించు.

సీ. ఈహంసయానంబు నింతయొప్పయి యున్న
యతివ యిక్కడఁ గెడయాడె నేని. షోడ. ౮. ౩౯.

**కెడయిక.** వి. (√ కెడయు) ౧. పాటు, పతనము. (శ. ర.) ౨. చావు, మరణము. (శ. ర.)

**కెడయు.** అ. క్రి. (క. త. కెడు) ౧. విఱిగిపడు; పడు, కూలు.

క. కూలెడుగుఱ్ఱంబులు ధర,వ్రాలెడు నేనుఁగులుఁ
గెడయురథములు నై ... భార. భీష్మ. ౩. ౩౫౩.

ద్వి. ఉత్తరుఁడును మూర్ఛ నొరగె వాపురము,
తెత్తలేకను నవ్వు డిలమీఁదఁ బడియెఁ,గెడ
సిన వీక్షించి క్రీడి యేతెంచి, కడు వేగ హ
రులవాగెలు పట్టి యొత్తి. ద్వి. భార. విరా. ౨. ౪౪ పా.

క. రక్కసకుఁ దాను నెక్కుడు, రక్కస యై
కృష్ణుఁ డిట్లు క్రోధావేశం, బక్కజముగఁ
బచరింపఁగ, నక్కుటిలాసురియుఁ గెడపె
హా యనుచు భువిన్. హరి. పూ. ౫. ౧౫౧.

౨. ఛిన్నమగు, తెగు.

సీ. పరములు వడయుంగ శిరములు గెడయంగఁ
బంక్తికంఠుఁడు హిరిపాలఁ గనియె. ఉ. హరి. ౨. ౧౮౧.

౩. చచ్చు, మరణించు.

మ. కెడసెక్ దుప్పులు డింకవేసె సెలుఁగుల్ గిట్టెక్ బులుల్ సింగముల్, కడగొట్టెక్ ... సారంగ. ౧. ౧౦౭.

క. అంగిరసుఁడ నీకేటికి, సంగరము తపస్వివరు లసవనముహుతముల్, మ్రింగినలా వకట యిచటి, కిం గొఱయే లోలఁగు మెదిరి కెడయక నాచేక్. హరి. ఉ. ౮. ౭౯.

౪(=ఎడయు.)పాయు, ఎడ మగు.

గీ. ఎడసెఁ బిరివిచ్చె సెడమయ్యెఁ గెడసెఁ జెంగెఁ, బాసెఁ గేడించె నాఁగను బరఁగుచుండు, వీడె ననుటకు...ఆం. భా. ౩. ౮౫.

జ: కెడపు, కెడయుక, కెడవు, కెడ్బేరసు.

**కెడవు.** వి. (√కెడయు) పాటు, పతనము. (శ. ర, బ్రా.)విణ. ప్రక్కకు పడినది, ఒఱిగినది. (చూ. ఒడ్డగెడవు.)

క. విడువిడుఁ డని ఫణి పలుకఁగఁ, గడుభరమున మొదలఁ గుదురు గలుగమిఁ గెడవై, బుడబుడ రవమున నఖిలము, వడవడ వడఁకఁగ మహాద్రి వనధి మునింగెక్. భాగ. ౮. ౧౯౯.

తలకెడవుగక్=తలక్రిందుగా.

వ. భగ్నచరణంబులై తలకెడవుగం ద్రెళ్లినతురంగకళేబరంబులం గవుంగిలించుకొని ... పారి. ౫. ౧౩.

**కెడ్బేరసు.** విణ. (కెడ+బెరయు=కెడగూడు?-క. బెరసు=కూడిక, కలయిక.) సంకీర్ణము, కలసినది.

క. దురమున మెడ దొడ దల మొల, బరి శిర ముర మక్కు ప్రక్క... కెడ్బేరసై యేప్పడ కలిథీ, కరమయ్యె జముండు కుడిచి క్రక్కనదంగిక్. కు. సం. ౧౧. ౭౬౦, ౬౯౪.

**కెరగొట్టు.** అ. క్రి. (కెరలు+కొట్టు. శ. ర.) కిలకిలఁబలుకు.

సీ...కెరగొట్టె ననఁగను గిలకిలఁబలి, కెనసెడి మాట యూ...ఆం. భా. ౩. ౯౭.

**కెరలించు**=కెరలుచు.

(ప్రకోపింపఁజేయు, ఉద్రేకింపఁజేయు.)

గీ. సోయగము గాంచి తిలకించి సొబగుమించి, మరులు గెరలించి కెరలించి మదిఁ గరంచి, యలమరలు దీఱ లాలించి యామతించి, కలికితోలికూటమి విభుండు తులకరించె. కృ. శకుం. ౩. ౫౦.

సీ. కొనగోరు నాటించి కూర్మి పాటించి నాతమకంబుఁ గెరలించుతలిరుఁబోఁడి. శశాం. ౪. ౫౯.

(కోపింపఁజేయు.)

ఉ. ఇంకిటు నిన్ను నమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం, బొంకము గానియావలనిబొంకులు మాచవి గావు రుక్మిణీ, పంకజపత్త్రనేత్రకును బ్రాణపదంబులు గాని వల్లవీ, కింకర చాలుఁ జాలు నడికింపకు నింపకు లేనికూయుముల్. పారి. ౧. ౧౨౬.

(బాధించు.)

క. రాచిలుకా కోమలి దెసఁ, జూచితె శ్రుతికటువులనెడు శుకనామము నీ, కేచాడ్పునఁ దగు వల దిఁక, మాచెలిఁ గెరలించి తేని మాటలు వచ్చుక్. విజ. వి. ౩. ౫౮.

గీ. కేళిఁ గబళించి యాత్మచూలి మించి, సూళిఁ గెరలించి యుగ్రగ్రహాలి నొంచి, యెందు నున్నను దెత్తు నీయిందువదన, నవ నవుఁ జూడు మదవద వదలి యధిప. రామా. ౫. ౨౭౭.

**కెరలియాడు.** అ. క్రి. (కెరలి+ఆడు) ఉత్సహించు.

గీ...బాణాసురుండు, దనుజసుందరీసహితుఁడై మనసులోనఁ, గెరలియాడుచు మధుపానకేళిఁ దేలి, యాహవముఁ గోరుచుండె...ఉ. హరి. ౫. ౪౭.

**కెరలు(ర్లు).** అ. క్రి. (క. కెరళు) ౧. ప్రకోపించు; అతిశయించు; పొంగు.

గీ. కుడుపుపైఁ గుడ్చు దివనిద్రఁ గూరు సురత, పరత నొందుఁ బెల్లాయాసపడు విమూఢుఁ, డతని బాధించు దోషత్రయంబు గెరలి. భార. అశ్వ. ౧. ౧౧౬.

గీ...అప్పధూటిఁ, బర్ణశాలాంతరముఁ జేర్చి బ్రాహ్మణుండు, కెరలుకోర్కులఁ గందర్పకేళిఁ దేలె. మనుచ. ౬. ౩౫.

చ. కెరలుస్రవంతి...ఆము. ౪. ౧౫౦.

(వ్యవ) పసరు కెర్లి వాంతిరూపముగాఁ బైకి వచ్చినది.

౨. విజృంభించు, చెలరేఁగు.

సీ. ఒండొరులసరోషహుంకృతిఁ గెరలుచుఁ గెరలి తూపులవాన గురిసి కురిసి. రాఘవ. ౪. ౨౨౫, ౨౩౧.

గీ. గొంటుగాఁ గోయిలలు రేఁగి కుమ్ములాడు, మొనసి వలితెమ్మెరలు కెర్లి పెనఁగులాడు.కువల. ౩. ౯౫.

౩. కోపించు, చిరాకుపడు.

చ...మాంసముల్, నెరపుచు యజ్ఞవిఘ్న మవలీల నొనర్తురు సారెసారెకుం, గెరలి శపింప వారిఁ బరికించి తపోవ్యయ మోర్వలేమి చేన్. భా. రా. బాల. ౧౭౩.

గీ. అనఘచారిత్ర యెవ్వ రేమన నొకింత, కెరల నిసుశీల సంపన్న గేస్తురాలు. సారంగ. ౩. ౪౬.

పంచచామరము...మ జిట్ల వచ్చి సారెసారె నన్నుఁ గెర్లఁ జేయ రాక పొమ్మికన్.విప్ర. ౪. ౫౯.

౪. సంభ్రమించు, తత్తఱపడు.

చ. కెరలక క్రమ్మఱింప నడుగెంటనె నిల్చి నొకింత నూకినన్, శరనిధు లేడు దాఁటు మెయి చాఁచి చివుక్కున నుక్కు మీఱి సంగరమున గాయ మైనవతిఁ గాచుఁ జలింపక తత్పురిహరుల్...పాండు. ౧. ౧౧౪.

ద్వి. వరకపీంద్రులు మహావంశవర్ధనులు, కెరలి పాఱుదురె ప్రాకృతులచందమున. రం. రా. యు. ౪౦౮ పా. ౬ పం.

౫. ఒలుకు.

క...నినో,దమ్మగుకథ వినియెడు యుని, కమ్మనిచక్కెరలు కెరలఁగా నిట్లనియెన్. శుక. ౪. ౧౦౭.

౬. వ్యాపించు, ప్రసరించు.

గీ. నియతిచేతఁ గదర్థితుం డయిన ధైర్యవరుని ధైర్యగుణంబు మాన్పంగఁ దరమె, క్రిందు సేయంగఁబడినట్టికృష్ణవర్ఘుని, కీలలెం దైన మీఁదుగాఁ గెరలుఁ గాదె. భర్తృ. ౧. ౭౭.

౭. భ్రమించు, తిరుగు, దొర్లు.

చ. పరిమిళితప్రవాళనవపట్టపటధ్వజమాతనూతనస్మరరథరాజమున్ భ్రమరజాలగుణాంచితపాంసుచక్రముల్, గెరల మహాబలంబు దరలింప లతావనితాళి ఋవ్వలే, మనవపుబంతులట్లు శుకమండలి గూడెడిఁ గంటె పైపయిన్. వసు. ౩. ౧౩౫.

౮. కూయు, రుతము చేయు.

గీ. ప్రమదమునఁ దేఁటు లెలుఁ గెత్తి పాడుచోట, శారిక లనంగశాస్త్రముల్ చదువుచోటఁ, గీరకలకంఠములు క్రొవ్వి కెరలుచోటఁ, బాపురములారజంబులు పలుకుచోట. మనుచ. ౩. ౧౧౧. (శ. ర. పా-'కేయ' ముద్రి.)

జ: కెరగొట్టు, కెరలించు, కెరలియూను, కెరలుకొను, కెరలుచు, కెరలువోఁడుము.

**కెరలు(ర్లు)కొను.** అ. క్రి. (కెరలు+కొను.) చెలరేఁగు.

గీ. పఱిల దిక్కుల నెంచి దుర్వార మైన, కీడు మేలును దెల్పుచుఁ గేక లిడుచుఁ, గెర్లికొను

చుచు దనపేరు కేరికొనుచు, వచ్చె నచటికి డుబుడక్కవాఁ డొకండు. హంస. ౨. ౨౬.

**కెరలుచు(ల్చు)=కెరలించు.** స. క్రి.(√కెరలు) కెరలఁజేయు.

౧. ఎగయఁజేయు.

సీ. విరహచింతాగ్ని నివ్విధిఁ గెరల్పుదు నన్నప గిదిఁ బద్మపరాగ మెగయఁగొట్టి. గీ... విహ రింపఁ దొడఁగె మందానిలంబు. వరాహ. ౩. ౬౫.

౨. వ్యాపింపఁజేయు.

ఉ...ధైర్యముం జెదరి చెంత సఖీమణిఁ గాంచి వింటివే, తమ్ములదాయమూపు నెఱతావిఁ గెర ల్చువసంతునేపు నా,కమ్మనివిల్తుకోపుఁ జెన కం గలచక్కనిమోహనాంగునిన్, గొమ్మరో చూడవమ్మ నలకూబరుఁడా యితఁ డంబుజా ననా ఉ. హరిశ్చ. ౪. ౧౧౫.

౩. ఉత్సాహపెట్టు.

౮... పృథుభీషణబాహుల సాహసంబులన్,ద డవి కెరల్చుచున్ జనిరి నాథుని మ్రోలనృ పాలనందనుల్. మనుచ. ౪. ౩౦.

౪. తమకింపఁజేయు.

ఉ. ఆమధురంపుసొంపు కడు నాత్మఁ గెరల్ప... కళా. ౬. ౧౨౪.

౫. కోపింపఁజేయు.

చ. హరి నరయన్ గురుం డనుప నత్తఱి సాగరు లుర్వి రోసి వే,సరి ధరఁ ద్రవ్వి త్రవ్వి బలిస న్మగులై హరిబుద్ధి దక్కి చి,క్కెర మునిను చ్చ టంచు గమకింపులచేఁ గపిలుం గెరల్చి త,ద్గురుతరకోపదీపమునకున్ శలభాకృతిఁ జెంది రందఱున్. చం. రా. ౩. ౧౪.

**కెరలువాఱుచు.** అ. క్రి. (కెరలు+వాఱుచు) ౧. విజృంభించు.

ఆ. అతని చేత నున్న యమృతకుంభము నూది, కె రలువొడిచి సురలఁ గికురువెట్టి, పుచ్చికొనిరి యసురపుంగవు లెల్లను, మాఱు లేనిబలిమి మానవేంద్ర. భాగ. ౮. ౨౯౫.

౨. వర్ధిల్లు, పెరుఁగు (శ. ర.)

(లేడిపిల్ల) గీ. గరిమ నీగతి మెల్లనఁ గెరలువొడి చి, చెలఁగి యాడంగ భరతుండు చిత్తమం దు,సంతసిల్లుచు నుండె... భాగ. ౫. ౧. ౧౦౬.

**కెలఁకు.** స. క్రి. ౧. కదలించు, రేఁపు.

వ... ఇందులకుం బొందుపడు ప్రత్యుత్తరంబుల వీనిఁ గెలఁకిన బుద్ధిక్షోభంబుగా నింతకంటె నేమి యబద్ధంబు వినంబడునో... ఆము. ౬. ౩౬.

ద్వి ... ఆటినపుండ్లు గోలలను, గెలఁకిన క్రియ... పండితా. మహిమ. ౨౯౧ పొ.

ద్వి... కెలఁకెదు సుతుచావు... పండితా. మహి మ. ౨౯౧ పొ. (ఇటఁ 'స్మృతికిఁ దెచ్చు' అని భావము.)

౨. ఊడఁబెఱుకు, పీఁకు.

వ ... భగునికన్నులు కెలఁకి పూషుపండ్లు వెఱి కి... కాశీ. ౬. ౯౫. (శ. ర. పా-'కలికి' ముద్రి.)

సీ. పరదారదర్శనాపరము లౌనికనుల్ కెలఁకఁ గఁ గాని నాకినుక పోదు. మల్లుపు. ౩. ౩౫.

**కెలను.** వి. జొ. (దీని 'ను' వర్ణమునకు ఏకత్వమున వికల్పముగాను బహుత్వమున నిత్యముగాను బిం దుపూర్వక 'కు' వర్ణము వచ్చును.) ౧. పార్శ్వ ము, ప్రక్క.

సీ ... పార్శ్వసంజ్ఞ, కెల నవఁ గెలఁకన...కన్న ట్టు...ఆం.భా. ౨.౧౩౮.(ప్రాఁత ప్రతిపా.)

క. కెలఁకులఁ బిఱిందిదెసయుం, గలయం బరికిం చి... భార. విరా. ౨. ౩౨౬.

క. బలఁగము గలభూపాలుఁడు, గెలనిమహీశ్వ రులబుద్ధికిని వ్రేఁగగుచున్. భార. శాం. ౨. ౩౫౮.

మ.తఱుకున్ముత్తెపుఁగొల్పుకూటమున నిద్రా సిం గపుంగద్దెపైఁ,గొలువై యుండె నురా 'సురా

దులు కెలంకుల్ చేరి సేవింపఁగా ... దశా. ౫. ౨౯.

౨. దాపు, సమీపము.

సీ. కెలను దా బంజ దగ్గఱ క్రేవ పొంత, యంచ యొద్ద నానికటాఖ్య లగు మహేళ. ఆం. భా. ౩. ౨౧.

సీ... కెలన నున్న, చిన్నముద్దులసిరియాళ సెట్టి కనియె. హర. ౨. ౭౩.

౩. దిక్కు, దెస.

చ. కురిసెఁ బ్రచండవృష్టి ఘనఘోషము లెల్ల కెలంకులన్ భయంకరములుగా... భార. అర. ౩. ౨౯౭.

విశే. ౧. సమీపస్థుఁడు.

ఆ. ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ, జలుప వలయు నృపతి గొలువున్నయెడల బాహిరము లైనఁ గెలని కగ్గలగుట. భార. విరా. ౧. ౧౩౭.

౨. ఎదుటివాఁడు, పోటిగాఁడు.

సీ. కెలని నోడించువిధముఁ దా గెలుచువిధముఁ, దలఁచుకొనుచును రాజ్యతంత్రంబు చాగు, రీతిఁ గోల్పడి యంచితఖ్యాతిఁ బాయు, నెరపు నొప్పదు జూదంబు నృపకుమార. పి. శకుం. ౪. ౧౬౪.

**కెలయు.** అ. క్రి. ౧. కేరు, చెలరేఁగు.

సీ ... కట్టుకొంగు. గీ. తొలఁగి జఘనంబు కనిపింపఁ గెలసి నవ్వు. దశా. ౬. ౧౯౦.

క. జగతాఁగ యొకతె దిట్టును, మగువా నాసరికి నీఁడువా యన నదియున్, మొగ మొగఁ జేయుట కెలయుట, తగినది గద యాఁతనీళ్లఁ దగుసతి కనియెన్. రా. వి. ౩. ౧౨౦.

౨. వేడుకపడు, ఉత్సాహము నొందు.

సీ. కెలసి నెలపుల్గుగములు గ్రుక్కిళ్లు మ్రింగఁ, గ్రమ్ముకొని వచ్చువెన్నెలచెమ్మ యనఁగఁ, దొలుకెలుపు దోఁచెఁ దూర్పునఁ ద్రుళ్లుమబ్బ, నునురునకుఁ బెట్టుబలితంపు బెసరువో తె. చంద్రా. ౫. ౫౩.

౩. విఱ్ఱవీఁగు, గర్వించు, నిక్కు.

సీ. నిలుచుండి చంకచేతులు కట్టుకొనువాఁడె కొలువ రా రే మంచుఁ గెలయ సాగె. కువల. ౨. ౨౪.

ద్వి. కెలయుచు నిను నీవె కీర్తించుకొనెదు, కుల జుండు తనుఁదానె కొనియాడుకొనునె. రం. రా. అర. ౧౬౬ పొ. ౧౫ పం.

౪. కసరుకొను, కోపపడు.

సీ. స్త్రీలఁగా నందఱ సృష్టింపరైతి రంచును నువధాతలఁ జూచి కెలయు. దశా. ౪. ౧౧౯.

**కెలవు.** వి. అనురాగము, వలపు.

క. పలువుర కొకభామినిపైఁ, దలఁపును రొకవారసతికిఁ దగఁ బలువుగపై, వలపును మృగవిహగాదుల, కెలవు రసాభాసమయ్యె క్షితి నెట్లన్నన్. వరస. ౩. ౧౪౪.

క. గుఱిచేసి గిన్నెఁ బంపిన, తరువాతను మల్లి పంపఁ దగ దంపినచోన్, మఱి మిమ్ముఁ గొదవ చేసిన, తెఱఁ గగుఁ గెలవులును మీమదిం గడు నెడయున్. విప్ర. ౪. ౭౩.

**కెలసము.** వి. (క. కెలస) ౧. పని, కృత్యము.

వ. పాండవులం బరిమార్చుపని సేఁడ చేయక మఱి చేసిన రారాజు నిర్గతప్రాణుం డైన నాకెలసం బెవ్వరి కెక్కుడు ... భార. సౌ. ౧. ౨౪.

వ. నాకుం దగిన కెలసంబు గంటి దీని కింతకు మై కొంటిఁ దాంబూలంబు దయసేయుము... కు. సం. ౪. ౪౧౦.

క. చిక్కనలగుషంబునఁ దల, వ్రక్కలుగా మోఁది చంపి వైచిరి మఱియుం, బెక్కుఝషంబులఁ బట్టిరి, యక్కెలసము మాని తనిసిరి ... వేం. పంచ. ౧. ౬౧౯.

౨. అక్కఱ, కావలసినపని, అభీష్టకృత్యము.

ఉ...ఏను నీ,చుట్టమ నై భుజాబలముసొంపున నీకెలసంబు దీర్చెదం,జట్టన నన్నుఁ బంపుము భృశంబుగ నెయ్యది కార్య మిత్తటిన్.భార. ఆర. ౫. ౨౨౭.

చ...భవచ్చరణంబులఁ గొల్వ వచ్చితిం, గెలస ము దీనికంటెఁ బరికింపఁగ నెయ్యది నాకుఁ జెప్పుమా. వేం. పంచ. ౧. ౧౬౬.

౩. నిమిత్తము, హేతువు.

చ.బలుసెగ నించువిల్లడుగుఁబట్టినదే యిపు డా కుబూదిగెం,పులఁ ద్రిరుచిత్వ మూఁది మరు ముష్టిబిగిం దివిఁ గ్రాయుమా క్తికం,బుల జడి జొమ్మనం దొరఁగుఁబో యిదియిందుని దేని పుట్టరాఁ,గెలసమొ నాఁగఁ బోల్పులుజిగింగ రకాన్నుతి నొప్పె మేఘముల్. ఆము. ౪. ౯౬.(కెలసమో=హేతువేమి.)

౪. సేవ, ఉపచారము.

సీ...దివిజగణంబులు నెరవులై యీశుండు పుర ము లేయఁ. గీ.దలఁచినంతన బోరనఁ దమకుఁ దార,వచ్చి కెలసంబు సేసినవారె కారె. కు. సం. ౨. ౧౬౦.

ద్వి. ఏకాంతమున హాటకేశ్వరం బేఁగి,యాకాం తుఁ గెలసంబు లర్పించువారు. పండితా. పర్వ. ౩౬౨ పా.

**కెల్లగించు.** స. క్రి. ౧. వెల్లగించు. (శ. ర.) ౨. రేఁచు. (శ. ర.)

**కెల్లుమలఁగు.** అ. క్రి. పరాఙ్ముఖమగు, పెడమొ గముపెట్టు.

గీ. శైలసుతయును... శేకరాలోకనంబులఁ గె ల్లుమలఁగి. హర. ౩. ౭౧.

**కెళకుళి**=కేళాకూళి.

(క్రీడాసరస్సు).

సీ. ఈకెళకుళిలోన కెలనాఁగ ప్రోదిరాయంచ లకవల నిందించియాడె. షోడ. ౭. ౩౭.(శ. ర.పా.)

**కెళవు.** వి. ౧. ప్రక్క, పార్శ్వము.

చ. అని వినిపింప నప్పు డమరాధిపసూనుఁడు వచ్చి ధర్మనం,దనునకు నమ్రుఁడై కెళవునన్ భజియింప ముదస్రుపూరలో,చన యయి కుంతి...జై. భా. ౭. ౧౨౩.

గీ. ఊరు పాడైనఁ గెళవులయూళ్ల కుతికి, మె సవ దొరఁకొంటిఁ బ్రజ మారి మసఁగినట్లు. మనుచ. ౫. ౨౬.

౨. దూరము.

క.అనఘుఁడు సత్త్వమె రూపై,జనియించినవాఁ డు వీఁ డసాధ్యుం డీవే,శను బ్రద్యుమ్నా దుల నిట,నునిచి మనము కెళవు లొలఁగి యుండుద మనుచున్.జై.భా.౫.౫౩.(చూ. ౫౪.)

**కెళాకుళి**=కేళాకూళి.

(క్రీడాసరస్సు.)

సీ. ఈకెళాకుళిచెంత రాకేందుబింబాస్య తివిరి యంచకు నడ ల్దిద్దుచుండె. రసిక. ౩. ౧౧౭.

**కెళాకూళి**=కేళాకూళి.

(క్రీడాసరస్సు)

గీ. తావితమ్మికెళాకూళిదండ నొప్పు, గొప్పప స్నీటికాల్వకు నుప్పరిగకు, నతులజలసూత్ర మిడినట్టియద్భుతంబుఁ, గాంచి రాజన్యమూ ర్ధన్యకన్యఁ బొగడె. రా. వి. ౩. ౭౧.

**కెళ్లుకొను.** స. క్రి. (త. కెళ్లు=తిను.) నోటవైచు కొను.

వ. వెండియు నొండెడలం గుంభముక్తముక్తాఫల శర్కరిలంబు లగు నేనికమెదళ్లు కెళ్లుకొని యు నమలి చవిగొన లేక మరల వెడలఁ గ్రక్కు డాకినీగణంబులును...కవిక.౨.౧౯౭.

**కెవనిబంటు.** వి. (త. కెవుని=గవను, కోటగుమ్మ ము.) గవనిబంటు, కోటగుమ్మము కాచువాఁడు, ద్వారపాలకవిశేషము.

వ... రాయబారులు సగ్రాణంపుఁదెగలు కెవని బంటులు వేశ్యాజనంబు లనియెడుదెబ్బది రెండు వినియోగంబులవారలు నలుచెఱఁగు లఁ గొలిచి రాఁ... ప్రబంధ. ౭౮.

**కెవ్వు.** వి. ఆర్భటయం దగుసల్లాసాదిసూచకధ్వని కనుకరణము.

గీ. శంకరుఁడు నంది పై నెక్కి హుంకరించి, యతిశయార్భటిఁ గెవ్వున నార్చి పేర్చి. అని. ౪. ౭౬. (బ్రా, ముద్రి. పా. 'క్రేవు' శ.ర. పా.)

వ...ఉబుము లురుముఖబృంహితంబు లనియు రేసి యేసగాఁ దివిసి తడవిండ్ల నేసి కెవ్వు నం గూసి డాసి...వసు. ౨.౧౧. ('క్రెవ్వు' ముద్రి. పా.)

## కే

**కే.** వి. ఉత్సాహమును దెలుపుధ్వనికనుకరణము.

క. ... నీప్రియతనయుం, డోయమ్మ కడవ లన్నియుఁ, గే యని బోరగిలఁ ద్రోచి కేరుచు వచ్చెన్. హరి. పూ. ౫. ౨౧౨.

ఉ...భస్మము మేన నలంది కెంజడల్, భూమిని వ్రాల శూలమును బూనుక కే యని గంతులేయునా, స్వామినిఁ జూచునెచ్చెలికిఁ బైనెవ రావెఱవేఁకిఁ దీర్పఁగన్. పార్వ. ౪. ౯౪.

**కేందుకము.** సం. వి. అ. పుం. గాలవవృక్షము, లొద్దుగుగ్గి.

**కేందువు.** సం. వి. ఉ. పుం. తిందుకము, నల్లతుమికి.

**కేంద్రము.** సం. వి. అ. న. (జ్యోతి) ౧. వృత్తక్షేత్రముయొక్క మధ్యస్థానము. ౨. లగ్నమును దానికి చతుర్థసప్తమదశమస్థానములును.

**కేఁగో.** వి. నెమలికూఁతకు అనుకరణము.

క. కేఁగోదమనెమిలి పల్కెడుఁ, గేఁగో యని వైశ్య మనకు గెలు పగుఁ జుమ్మీ. క్రీడా. ౫౨.

**కేక.** వి. (సం. ప్రా. కేకా. క. కేక.) ౧. నెమలి కూఁత.

సీ...కేక కేక యనంగను దనరు...ఆం. భా. ౨. ౯౬.

౨. అఱపు, పెద్దకూఁత.

క. అరితిఁ బారువము పోఁ, సారంగధరుండు తోడిజననాథసుతుల్, సారెకుఁ గేకలు వేయఁగఁ, గారాకూర మయి మనను గళవళపడఁగన్. సారం. ౨. ౩.

జః కేకరించు, కేకరింత, కేకించు.

**కేక.** సం. వి. ఆ. స్త్రీ. నెమలికూఁత.

**కేకటగెమ్మటలు.** వి. బ. వేళాకోళములు.

ద్వి. కర మనురక్తియు కారణంబుగను, గిరిజేశుఁ గేకటగెమ్మట లాడి, యును సరసము చేసి యును గేలి చేసి, యును...పండితా. మహిమ. ౨౭౩ పా.

**కేకయము.** సం. వి. అ. పుం. ఒక దేశము.

**కేకయి.** సం. వి. ఈ. స్త్రీ. కేకయదేశాధిపతికూఁతురు; కైక. (దశరథునిభార్యలలో నొక తె. భరతునితల్లి.)

**కేకరము.** సం. వి. అ. న. మెల్లకన్ను. (వాచ.)

**కేకరాక్షి.** సం. వి. ఇ. న. మెల్లకన్ను; కడకన్ను.

శా. మానిక్రోధవిధూతపత్త్రముల మామాతో సపత్త్రల్గదా, కానీ రం డని కేకరాక్షిరుచి మొక్కల్ప్రక్కలన్ గార్గతూ, దానల్పాహిపకల్పకాండతతులం దారం బురిం బోల్చినా, జానేయంబులు ఫేనహాస మిది కైజా మోర లల్లాడ్చుచున్. అము. ౨. ౨౬.

**కేకరాక్షుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) మెల్లకంటివాఁడు.

**కేకరించు.** అ. క్రి. (√ కేక - క. కేకరిను.) ౧. కేకలు వేయు.

ద్వి. క్రీడించి మలయుచుఁ గేకరించుచును. నవ. 3 భా. (శ. ర.)

౨. గొంతుక సవరించుకొనుచు సకిలించునట్లు ధ్వని చేయు.

ఆ. వచ్చి మదికి మెచ్చువచ్చునచ్చెలిబడా, పగలఁ జూచి వింతపదము వాడి, కేకరించి కొన్నిపోకలు పోయి యచ్చె డెచూపు దన్నుఁ జేరకునికి. శుక. ౧. ౪౨౭. ప్రబంధ. ౭౫౫.

స. క్రి. గద్దించు, అదలించు.

సీ. ఇంచునీటిని గేకరించుచల్లనిమాట జాబిల్లితోఁ బొందుఁ జలుపుమోము. గంధ. ౧౯౯. (ఇట ఔపమ్యమును దెలుపును.)

**కేకరించు.** సం. అ. క్రి. కడగన్నుపెట్టు.

గీ. కనియుఁ గాననివిధమున ననఘ తేజుఁ, డెటుఁగియును నెఱుంగనిభంగి నింద్రుదిక్కుఁ, గేకరించియుఁ జూడక కృష్ణుఁ డంచి, తానుం డయి యుండె ననాదరమున. హరి. పూ. ౭. ౧౯౬. (శ. ర. పా.)

**కేకరింత.** వి. (√ కేకరించు). ౧. కేకలు వేయుట. (శ. ర.) ౨. గొంతు సరి చేసికొనునపుడు కలుగుశబ్దము.

సీ. ఒదవెడు గాద్గద్య మదిరిపాటునఁ బల్కరింపఁ బుట్టెడు కేకరింత దెలుప. ఆము. ౫. ౬౦.

**కేకరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) మెల్లకంటివాఁడు. (వాచ.)

**కేకాలి.** సం=కేకావలము. (వై. ని.)

**కేకావలము.** సం. వి. అ. పుం- కేకలుగలది - నెమిలి.

**కేకి.** సం. వి. న్. పుం=కేకావలము.

**కేకించు.** అ. క్రి. (√ కేక) కేకలువేయు, (మయూరము) ధ్వని చేయు.

గీ. మెఱసి క్రొవ్వేణినెంటిపై నెఱసి పొలయు, నడలు దరికొని వావిరి నఱముచుండెఁ, గాననెల్లఁ జెలంగ గ్రక్కుడల మదము, దగిలి కేకించుపురినమ్మిషగిదిఁ వోలె. కు. సం. ౫. ౫౬౫.

**కేకి(క)సలు.** వి. బ. ౧. పరిహాసము చేయునపుడు కేకలు వేయుచు కొట్టుచప్పటలు.

మత్తకోకిల... దొడ్డక్రొవ్విరిబంతులన్, వారి రువ్వుచు లీల నవ్వుచు వారివారికి వారిలోఁ, గేలిఁ దేలుచుఁ జాలఁ ద్రేలుచుఁ గేకసల్ వడిఁ గొట్టుచున్. రాజ. చ. ౨. ౧౬౦.

౨. నమస్కారములు, మ్రొక్కులు.

రగడ. శ్వేతాద్రిస్థలి సింహాలోచనున కెలమిని గేకిసలిచ్చుచు భక్తిని. హంస. ౪. ౨౧౩.

గీ. విరుల కేటికిఁ జేరెద విరులతరులఁ, గిసలముల కేల యింత కేకిసల మసలఁ, బొగడ దండజయాన యీపొగడఁపండ, దవన మవనంబు సవరింప దవనతాంగి. బహు. ౨. ౪౧.

కేకి(క)సగొట్టు, కేకి(క)సలుగొ(ల్గొ)ట్టు=పరిహాసము చేయునపుడు కేకలు వేయుచు చప్పటలు కొట్టు; కేకలు వేయుచు చప్పటలు గొట్టి నవ్వు.

ఉ. కేకిసగొట్టి యోర్తు గిలిగించిన నొక్కవిలోలనేత్ర లీలాకలకంఠకూజితముల న్నగ... చంద్ర. ౪. ౧౭.

చ. వనిత యొకర్తు మున్నొకని గవాక్షతలంబున నింతులుండుటం, గనుఁగొనఁ జోటు లేమి నొకకార్యముపేరిట బాల నోర్తు వం, చనఁ దొలఁగంగఁ బిల్చి రభసంబునఁ దత్పతిజాలకంబు చేకొని హరిఁ జూచెఁ గేకిసలుగొట్టుచు బోటులు దాని నవ్వఁగన్. పారి. 3. ౧౨. ('కేకసలుగొట్టు' వ్రా. పా.)

వ. అకసంబుఁ గేకసల్గొట్టి కాకుసేయుట కానునుఁగొనులు... ప్రబంధ. ౪౦.

సీ. ...కేకసల్లొట్టె నాఁ గేకలువేయుచుఁ గేలు దట్టి. గీ. నవ్వుట చెలంగు ... అం. భా. 3. ౯౭.

కేకి(క)సలాడు=కేకిసలుఁగొట్టు.

గీ. వృష్ణిభోజాంధకులు కురువీర యిట్లు,రేఁగి మద్యపానం బొనరించి ముదముఁ, బొంది కేకిసలాడుచుఁ బోఁదువడని, వలుకు లెసఁగం గఁ దిరిగి నవ్వులు సెలంగ. భార.మౌ. ౪౧.

ఉ. కాక మదీయవాక్యములు గైకొన నొల్లక మోరత్రోపునన్, గేకసలాడుచుం జనినఁ గింకరసైన్యముతోడఁ గూడి యేఁ, జేకొని మిమ్ము గెల్చి యతిచిత్రమహాఘనమేతుఁ డైనయా, లోకవినిందితున్ నరకలోకముఁ జేర్చెదఁ బంత మొప్పఁగన్. మత్స్యపురాణము. 3. ౯౫.

**కేటత్రాడు.** వి. జా. యమపాశము.

క. పితరదొర కేటత్రాటం, జతనంబునఁ దివియ మిగుల జడుపున సెదలో, వెత కుడుముతపసి బిడ్డని, బ్రతికించి యసంబు గన్న బల్లిదున కొగిన్. నీలా. ౧. ౨౨.

**కేటాయించే**=ఖేటాయించే. స. క్రి. వేఱుపఱుచు. (శ. ర, వా.)

**కేడ.** విశే. (త. కేడన్.) ధూర్తుఁడు.

సీ. చెడుగు గావరి నీచు చెరికి కేడ ములుచ బేరజ మన ధూర్తుపేరు వెలయు.అం.భా.3.౭.

**కేడించే**=క్రేడించే. స. క్రి. ౧. తొలఁగించు.

గీ. లేచి మెలపునఁ దాను గీలించియున్న, మెట్టు సడలించి వాకిటఁ బెట్టినట్టి, తడకఁ గేడించి పొదరునఁ దార్చిభూమి,సురశిఖామణి యటు లొంగి చూచునపుడు. విప్ర. 3. ౬౫.

ద్వి. క్రిందటిగాలిగాఁ గేడించి రథము,సందు పాటునఁ దోలు మనుచుఁ దోలించి. ద్వి. హరిశ్చ. పూ. ౬౯౪౭౦.

౨. అలక్ష్యముసేయు, సరకుగొనకుండు.

వ...బాణుండు సాత్యకిం గేడించి ప్రళయాగ్నియుం బోలె విజృంభించి ... భాగ. ౧౦. ఉ. ౪౧౫.

శా.శృంగారాదిరసోదయంబునకు సంసిద్ధాస్పదంబైనత,ద్రంగన్నాయకనాయికానిచయముం దత్తద్గుణశ్రేణిచేఁ,బొంగారన్వివరింతు నేర్పడ సముద్యోతప్రబోధాత్ము లెల్లం గేడింపక యాదరింపుఁడు దృఢోల్లాసంబు శోభిల్లెడున్. కావ్యా. 3. ౨.

అ. క్రి. ౧. తొలఁగు, అపసరిల్లు;యుద్ధమునుండి తొలఁగు.

సీ. వట్టరా దీతనివరు వగ్గలం బని భావింపఁగా సమీపమున నిలుచు, నదరి పార్శ్వంబుల కడ్డంబు వచ్చినఁ గేడించి యిట్టటుఁ గికురువెట్టు. భాగ. ౧౦ పూ. ౧౬౨౭.

సీ. ఘృతశుద్ధి గావించి కేడింపఁజేయక కులటను సరిగఁ గైకొనెడువాని. పార్వ. ౨. ౧౨3.

(కేడింపఁజేయక:-బహిష్కరింపక.)

(చాణూరుఁడు కృష్ణునితో నన్నమాటలు)

సీ. కేడించి కుంభిని క్రిందికిఁ బోరాదు మనుజసింహుఁడ నని మలయ రాదు. భాగ. ౧౦ పూ. ౧3౪౦.

సీ. మొన పేర్చి వైరులు మోహరించినవేళఁ గేడింపకప్పుడె గెలుచు టొండె. నా. పంచ. ౧. ౨౯౧.

జ: కేడించుకొను.

**కేడించుకొను**= కేడించే. (కేడించే + కొను - స్వార్థమున.)

(పాతిపోవు.)

సీ. జోడించినసివంగి కేడించుకొనునిట్టి వెఱకగాఁ గుట్టూర్పు విడిచి త్రెళ్ల. గీ...ఒకమహానినద మొగసె. శుక. ౪. ౯౫.

**కేడువాఱు.** అ. క్రి. (క. త. కేడు=నాశనము.) నశించు, చచ్చు.

గీ. సారథులు వ్రాలఁ గొమ్ములు చదిసి కూలఁ,బ క్కెరలు ప్రీలఁ గరవాలపటలి తూలఁ,గే డువాఱంగ నవి పోరు ఖేచరాళి,వార్షమునఁ జూడఁగాఁ బొమ్మ లాడినట్టు. కుచేల. ౨. ౧౪౫. (కేడివాఱు-ముద్రి)

**కేడెము**=కేవడము. వి. (సం. ఖేటకమ్. ప్రా. కేడ అం. త. కేడయం.) ఖేటకము, డాలు, పలక.

సీ. తలబొమిడికము కత్తళము కేడెము కత్తి యాదిగాఁ గలవి ముస్తి దొనర్ప. ఉ. రా. ౪. ౨౭౮.

పీ... ఖేటక మెసఁగును గేడె మనఁగ... ఆం. భా. ౨. ౨౧౬.

**కేణిక.** సం. వి. ఆ. స్త్రీ. పటకుటి, గుడారము.

**కేతకము.** సం. వి. అ. పుం. ౧. మొగలిచె. ౨. ధ్వజము, జెండా. న. మొగలిపువ్వు.

**కేతకి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పచ్చపూమొగలి, గేదఁగిచె. ౨. గేదఁగిపూవు. ౩. మాలతి, జాజిచె. ౪. నదీవిశేషము, సువర్ణముఖి.

శా. మాలూరచ్ఛదనోత్పలాబ్జసితపద్మశ్రేణిభారంబు శుం,డాలగ్నం బొనరించి హస్తి శశిజూటప్రాంతమం దుంచి త,త్కాలన్యస్తమణుల్ పడం దుడిచి కేతక్యాపగం గ్రుంకుచున్, గెల నీరముఁ దెచ్చి మై దొడసి భక్తిం బూజనల్ సేయఁగన్. కాశి. ౪. ౧౭౩.

ఉ. ఆతఁడు కేతకీశటెనియందు నిజాంగము దోఁచి తత్పమో,ధాతసమస్తదేహుఁ గలధాతమహీధరగేహు నర్చనో, పేతునిఁ జేయు ... కాశి. ౪. ౧౫౦.

**కేతనము.** సం. వి. అ. న. ౧. గృహము, ఇల్లు. ౨. నిమంత్రణము, శ్రాద్ధాదులందు భోజనమునకు పిలుచుట. ౩. ధ్వజము. ౪. చిహ్నము. ౫. కృత్యము, కర్జము. ౬. చాపము, విల్లు. (కే. వి.)

**కేతుతార.** సం. వి. ఆ. స్త్రీ. ధూమకేతువు, తోఁకచుక్క.

**కేతుభము.** సం. వి. అ. పుం. మేఘము.

**కేతుమాలము.** సం. వి. అ. పుం. న. నవవర్షములలో నొకటి. (కల్ప.)

**కేతురత్నము.** సం. వి. అ. న. వైడూర్యమణి.

**కేతువు.** సం. వి. ఉ. పుం. ౧. నవగ్రహములలో నొకటి (ఇది ఛాయాగ్రహము.) ౨. టెక్కెము, జెండా. ౩. చిహ్నము. గుఱుతు. ౪. కాంతి. ౫. ధూమకేతువు. ౬. అగ్ని. ౭. కిరణము ౮. రోగవిశేషము. ౯. శత్రువు. ౧౦. తక్కిలిచెట్టు, వైజయంతికచె. విశే. ఉ. పుం. శ్రేష్ఠుఁడు. (విలమ్స)

శ్లో. మనువంశకేతుం. సం. రఘు. ౨. ౩౩.

**కేదరము.** సం. వి. అ. పుం. ఒకానొకవృక్షము. (కల్ప)

**కేదరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) కేకరుఁడు, మెల్లకంటివాఁడు. (అమరసుధ.)

**కేదారకటుక.** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతికటుకరోహిణిచె.

**కేదారకము.** సం. వి. అ. పుం. ఒకజాతివడ్లు.

**కేదారగౌళ.** సం. వి. ఆ. స్త్రీ. ముప్పదిరెండువన్నెసకరాగములలో నొకటి.

సీ. కాంభోజి కేదారగౌళ శోకవరాళి పున్నాగ గుమ్మకాంభోజి ... హంస. ౫. ౧౨౪.

**కేదారజము.** సం. వి. అ. న. ౧. ఒకజాతివడ్లు. ౨. పద్మకాష్ఠము, ఓషధివిశేషముచె.

**కేదారము.** సం. వి. అ. పుం. న. వరిమడి. పుం. ౧. హిమవత్పర్వతప్రాంతమం దున్నఒకానొక కొండ. ౨. ఆలవాలము, పాదు. ౩. ఒకానొకపుణ్యక్షేత్రము.

**కేదారుఁడు.** సం. వి. అ. పుం-భార్య తలయందు గలవాఁడు - గంగాధరుఁడు, శివుఁడు.

కేనము. వి. ౧. మాయ, వంచన.

వ. నిజనందనలం బుజ్జగించి వెలయాలి కేనంబు లలవడ నోజగొల్పుచు...కు. సం. ౭.౧౪౧.

ద్వి. కేన మేటికిఁ గందిగింజనుగాఁపు, వానిని వేఁప కెవ్వలఁ జవి గాద, యనుమాట నిజమయ్యె...ద్వి. పరమ. ౫౩౨ పు. ౧౧ పం.

౨. (క. కీన=అల్పము.) న్యూనత, కొఱఁత.

ఉ...గాం,గేయుఁడుఁ దారకాసురుఁడుఁ గేనము లేకని సేసి కీసునన్.కు.సం.౧౨.౯౨౫.

కేనారము. సం. వి. అ. పుం. ౧. తల. ౨. కపోలము, చెక్కిలి. ౩. సంధి,కీలు. ౪. కుంభినరకము. (మే.ని.)

కేనిపాతకము. సం=కేనిపాతము.

కేనిపాతము. సం. వి. అ. పుం- పడవ నడిపించునపుడు నీటియందు వేయఁబడునది-అరిత్రము, ఓడత్రెడ్డు.

కేమద్రుమము. సం. వి. అ. పుం. ఒకానొకజాతకయోగము.(చంద్రునకు ధనవ్యయస్థానములయందు గ్రహములు లేకుండుట.)

కేయూరము. సం. వి. అ. న - భుజశిరస్సున నుండునది-అంగదము, భుజకీర్తి. పుం.రతిబంధవిశేషము.

కేరజే(ర్జే)ము=కేరిజే. వి. పక్షివిశేషము.

గీ. కారుకోళ్లును గాఁజాలుఁ గక్కెరలును, బావురములుఁ బూరేళ్లును గేరజములు, గువ్వలును మొదలుగ లెక్కకొలఁది మీఱఁ,గలవు పులుఁగులు చేతులు గ్రక్కఁ గ్రొవ్వి. చిత్రభా. ౩. ౧౨౨.

గీ. అంచలు నెమిళ్లు కేర్జము ల్పంచవన్నె, చిలుకలు పికాదిశకునము ల్గలసి పలుక. హంస. ౫. ౧౪౩.

సీ. గిజిగాఁడు పూరేడు కేర్జంబు పొన్నంగి ....

గీ. అనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౭.

కేరడము. వి. (√ కేరు.) ౧. వక్రోక్తి, వంకరమాట; పరిహాసము, గేలి.

గీ. తప్పు గలభర్తమ్రోల సోత్ప్రాసఫణితిఁ, గేరడము లాడుసతి మధ్యధీర...నరస.౨.౨౯.

శ్లో. ప్రియం సోత్ప్రాసవక్రోక్త్యా మధ్యా ధీరా దహేద్రుషా. సా. ద. ౩. ౬౧.

గీ. క్రేణి యనఁ దచ్చన యనంగఁ గేరడ మన, గేలి యన మేల మన మందెమేల మనఁగ, నాట యనఁ ద్రస్తరి యనఁగ హేళి యనఁగఁ, బొలుచుఁ బరిహాసములు ... ఆం. భా. ౧. ౧౩౯.

చ ... నెచ్చెలుల్, పకపక నవ్వి కేరడపుఁబల్కులు పల్కఁగ నెట్టకేలకున్...చంద్రా. ౨. ౧౪౫.

౨. చతురోక్తి, చమత్కారపుమాట.

గీ. ఇటుల వజ్రారశేఖరుఁ డేలఁ బట్టి, యింటిలో నున్నవస్తువు లెదురువెట్టి, వలపులకుఁ జిక్కి కేరడములకుఁ జొక్కి, సంగమసుఖంబు కొన్నాళ్లు జరిపెఁ గన్నె. హంస. ౨. ౧౧౨.

౪. తిరస్కారము,

సీ. యదుపుంగవున కింత యపకార మొనరించి దేవతావిభుఁ డైన దిగులు చొరఁడె ... అద్దేవుమనుమని నద్దిరా యెటు చూతు ననక కేరడ మెవ్వఁ డలవరించె. ఉ. హరి. ౫. ౨౭౨.

౫. తిరస్కారపుమాట.

ఉ. బాడబశూరునిం జెనకుపార్థివు లెవ్వ రటంచుఁ గేరడం,బాడ బలా యి దేటిమద మంచు భృగూద్వహగర్వవార్ధికిన్, బాడబ మాత్రతాపము గనంబడఁజేసి... ఉ. రా. ౧. ౯౦.

౬. అనవుడు నడుగక మిక్కిలి, కినుకం గేరడము లాడ గేలిగఁ గొనుచున్, విని విని వేసరి

యో ర్వశ, యెవసినవగతో డఁ గూడ నీపదు
చనియెక్. యయా. ౩. ౭౫.
గీ. ఇకని కెక్కడిసామ్రాజ్య మేడ బ్రదుకు, చెడి
యెఁ దెక తేర యనుచుఁ గేరడము లాడె.
వేం. పంచ. ౧. ౩౬౯.
(పావురము) లయగ్రాహి. పేరెములు వాఱుచు
సమీరునిహుటాహుటినిఁ గేరడము లాడు
చు మహోరయముతో న,య్యారె యన మీఱి
...సారంగ. ౧. ౧౭౧.(ఇట ఔపమ్యద్యో
తకము)
కేరడముచేయు=తిరస్కరించు.
సీ. అయ్యుంతి తనపాపలందు మిక్కిలికూర్మి బెర
య సంజ్ఞాదేవిబిడ్డ లయిన. గీ. ముప్వురను గే
రడముసేయ నవ్విధంబు, సైఁప లేక యొక
ప్పుడు శమనుఁ డలిగి, చరణ మమ్మాఱు దల్లి
పైఁ జాఁచెఁ దన్న. హరి. పూ. ౧. ౧౭౭.

**కేరడించు.** స. క్రి. (√కేరడము) కేరడముచేయు.
(వక్రార్థము కలదానినిగాఁ జేయు; పరిహసించు.)
సీ. కడు మెఱయింపకే కటకంబు లన బ్రాయుఁ
గటకము ల్బ్రభయత్నగరిమ ననుచుఁ. గీ. జెలి
పలుకుఁ గేరడించుచు...వసు. ౪. ౭౬.
సీ. తక్షకసముదగ్రదంష్ట్రాగ్రద్విషకీలకీలాక్రీడఁ
గేరడించి. గీ. యబ్ధి నావిర్భవించి యాహర
విరించి, మఘవదమరాశరవరాళిమదికి జాలి,
గ్రుచ్చె...హాలాహలంబు. లక్ష్మి. ౧. ౧౨౪.
(ఇట ఔపమ్యద్యోతకము.)

**కేరళము.** సం. వి. అ. పుం. దేశవిశేషము.

**కేరళి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కేరళస్త్రీ. ౨. జ్యోతిర్గ్రం
థవిశేషము. ౩. హోర, రాశిలో సగముభాగము.

**కేరళుఁడు.** సం. వి. అ. పుం. కేరళదేశస్థుఁడు.

**కేరించు.** అ. క్రి. (√కేరు) విజృంభించు, చెలరేఁగు.
మ...పూవుఁదీఁ, గౌగుదెం దా వలరాచయొంటరి
కడుం గేరించుచుం జిమ్మినన్. యయా. ౪.
౭౪. (శ. ర. పా.)

**కేరింత.** వి. (√కేరించు) నవ్వు.
గీ. నగవు నవ్వు కేరింత నాఁ దగును హాస,ము
...ఆం. భా. ౧. ౧౩౧.
కేరింతలుగొట్టు=ఉత్సాహముతోఁ గూడినకేక
లువేయు.
(వ్యవ) వాఁడూరక కేరింతలుగొట్టుచున్నాఁడు.

**కేరిజే**=కేరజేము.
సీ. పిచ్చుక కేరిజ బెగ్గురు వడ్రంగి... ప్రబంధ.
౨౩౪.

**కేరు.** అ. క్రి. ౧. ఉత్సాహపడు.
క. భృత్యులఁ దీర్పరులైనయ, మాత్యులఁ గన్గొని
ప్రమోదమతి నఖిలజన, స్తుత్యముగ మంగ
ళోచిత, కృత్యము లొనరింపుఁ డనినఁ గేరు
చు వారల్. రుక్మి. ౨. ౧౬.
౨. ఉల్లాసముతో నుండు.
సీ. కోరి కాంతులతోఁ జకోరికల్ రతిఁ గేరె...
మనుచ. ౩. ౨౩.
క. పొంగుచు మూఁడు జగంబులు, రంగనఁగఁగ
నేలుచుండి ప్రాలనిబలుదీ, వింగేరెడు నీ కిపు
డా, బంగరుఁజిటిపాప చెలిమి పాటిల వలదే.
అచ్చ. రా. ఆర. ౩౨.
౩. ఉల్లాసముతో పలుకు; ఉల్లాసముతో కూ
యు.
చ...కుచంబు లోరగా, వెలువడఁ బైఁట వేయు
నెఱవింతగఁ గేరు మరుల్కొనంగ బె, ళ్కు
లు గొనఁ జూచు లేనివగలుం గొని మాటికిఁ
గుల్కు గోటిచి, మ్ములు నొనరించు నవ్వెలఁది
మోహపుఁబాయమువానిఁ జూచినన్. హం
స. ౧. ౨౧౭.
గీ. కీరకలకంఠములు క్రొవ్వి కేరుచోట. మనుచ.
౩. ౧౧౧.
౪. కుతూహలపడు, తమిగొను.

చ... ఉ,గ్మలి మఱియొర్తు వేనలిని గంధము మెత్తి మిటారిగుబ్బలకా, గలయఁ బ్రసూన మాలికలు గట్టి హారింగనఁ జేరెఁ గేరుమకా. రుక్మి. ౫. ౨౬.

౫. చెలరేఁగు.

చ... కువలయాధిపుపాటలు పాడినం గరం,బల రుచుఁ గేరికేరి నగు నన్యులపాటలు పాడినం గరం,బలయుచు నేడ్చు లోకు లవురా పతి భక్తి యటంచు నవ్వఁగకా. కళా. ౬.౧౯౫.

చ... నీ,కిల నొకరుండు సాటి గలఁడే యన బె ట్టుగఁ గేరి నవ్వుచుకా. ఉ. రా. ౫. ౧౯౯.

స. క్రి. ౧. ఎగతాళిచేయు.

వ... సంగడీలం జీరువారును సంగరభీరులం గేరువారును ...పారి. ౪. ౬౬.

ఉ. ఊరక చుట్టుకొన్నఁ గమలోత్పలపంక్తులు వాడు నంచునో, యేఱును గూర్చి చుట్టితివ యెంతటిజాణవు మేలుమేలు నీ,నేరుపు మె చ్చవచ్చు నని నిచ్చలు మచ్చిక కుంభుఁ గేరు నీ,హారగిరీంద్రకన్యక దయామతిఁ గోర్కు లు మా కొసంగుతకా. ఉ. రా. ౧. ౪.

౨. నిందించు, దూషించు.

శా. మారుం బేర్కొని దూఱు గంధవహుఁ బల్కు లుం దుటారించి వే,సారుం జైత్రునిఁ గేరు ... శుక. ౧. ౩౧౪.

౩. చులుకఁజేయు, లాఘవపఱచు, తిరస్కరించు.

గీ. వారకన్యక యని నీవు కేరవలదు, దీనితో నా కు నేస్తంబు పూని కూర్చెఁ,గడఁకమై మిత్ర వరుఁడు సంకరమనీషి. చంద్ర. ౨. ౧. ౨౩.

శ. రంగుగ నెన్నడుమున ని,న్నుం గేరె నటంచుఁ గినుక నూల్కొన గరితకా, మ్రింగితివో ని క్కంబుగ, సింగమ కలచంద మెల్లఁ జెపు మా సరగకా. అచ్చ. రా. అర. ౯౧.

చ...క్రొమ్మొగులువన్నియఁ గేరుచు గొప్పతీర వో...నీలా. ౨. ౧౯. (ఇట కౌటమ్యార్థ్య తకము.)

వి. శిశురోదనధ్వన్యనుకరణము.

ఉదా: పాలు లేక పసివాఁడు కేరుకేరు మని ఏ డ్చుచున్నాఁడు. కుక్కను జూచినతోడనే పిల్ల వాఁడు కేరుమన్నాఁడు.

జ: కేరడము, కేరడించు, కేరించు, కేరింత, కే రుకొను, కేరుచు, కేరుపు.

**కేరుకొను.** స. క్రి. (√ కేరు) ఉత్సాహముతో చెప్పుకొను.

గీ... కీడుమేలును దెల్పుచుఁ గేక లిడుచుఁ,గల్లి కొనుచును దనపేరు కేరికొనుచు, వచ్చె నచ టికి దుబుడక్కవాఁ డొకండు. హంస. ౨. ౨౭.

అ. క్రి. ఉత్సహించు.

వ...ఒండొరులఁ గడవం గేరికొను బేతాళ బాలి కాజనంబులవలనను...పారి. ౫. ౧౩.

**కేరుచే**=కేరు. (చూ. కేరుపు.)

**కేరుపు.** వి. (√కేరుచే) కేరుట, విజృంభణము.

క. గారాబునఁ బెరిఁగినకల్యం,గారాంబుధి గాని గడును గా దొకనాఁడుకా, గేరుపుల గానిఁ బెట్టెదు,నూ రాసుత చూడ నూననుకుమార సుమీ. పాంచా. ౫. ౧౫. (శ. ర. పా.)

**కేలకుఁడు.** సం.వి.అ.పుం. ప్లవకుఁడు, కత్తివాదర మున్నగువానిపై నాట్యముచేయు నర్తకుఁడు. (కల్ప.)

**కేలాసము.** సం. వి. అ. పుం. స్ఫటికము. (వాచ.)

**కేలికుంచిక.** సం. వి. ఆ. స్త్రీ. భార్యానుజ, స్యాలి క, మఱఁదలు. (వై. ని.)

**కేలు.** వి. ఔ. అనా. (సం. కులిః.) ౧. హస్తము, చేయి.

సీ. నడు మింత యని కేలఁ దొడికి పట్టినధాతయం గుళిరేఖ లజ్జాస్యవళులు. సై. ప. ౨. ౧౫.

చ. అన విని నవ్వి యవ్వికసితాంబుజలోచన

పైఁటకొంగు కేలున నులివట్టుచుం దళుకులు
క్కనుచూపులఁ జూచి...శుక. ౨. ౪౬౯.
గీ. కట్టినాఁడఁ గేలఁ గంకణంబు. పాండు. ౪.
౧౦౫.
క ... ఇరు, గేలులఁ గనుపట్టు నతనికిని దివ్యము
లై ... వి. పు. ౩. ౧౦౧.
మ. తళుకొత్తున్ ... కేల్లింతికిన్. ఆము. ౫.
౨౦. కళా.౧. ౩.
౨. తొండము.
(గజవర్ణనము). సీ. చలువచే ద్వార వేదు లెత్తింగి
నిల్చి తజ్జనభిక్ష్యుకుఁ గేలు సాఁచి సాఁచి.
ఆము.౨.౨౪. వసు.౧.౧౦౭.
జః కేలుదండ, కేలుమెకము, కేలుమొగుచు, కేలు
మొగ్గ, కేలుమోడుచు, కేలుమోడ్పు, కేలువి
డుచు, కేలుసాఁచు, కేలొసఁగు.

**కేలుదండ=** కైదండ. వి. (√కేలు)
(హస్తావలంబనము.)
చ... రఘూద్వహుం డతిరయంబున లక్ష్మణుకే
లుదండతో ...
సీ...అందలం బెక్కి.... దశా.౭. ౨౮, ౨౯.

**కేలుమెకము.** వి.(కేలు + మెకము)ఏనుఁగు,హస్తి.
గీ. పద్మరాగంపుబోదెలపడుకటింటి, సన్నసు
న్నంపుఁదిన్నియచందుచుట్టు, మెట్టికలనీల
పుంగేలుమెకముదోయి, పరఁగి యొప్పారు
గొప్పయుప్పరిగ కరిగి. రా. వి. ౫. ౮౫.

**కేలుమొగుచు.** అ. క్రి. (√కేలు)నమస్కరించు.
గీ. ... ఉత్పలాక్షి, కృష్ణనర్తకుభక్తిమైఁ గేలు
మొగిచి. హరిశ్చ. ౩. ౧౩౦.

**కేలుమొగ్గ.** వి. (కేలు+ మొగ్గ) అంజలిబంధము,
చేమోడ్పు. (శ. ర, బ్రౌ.)

**కేలుమో(ల్మో)డుచు(డ్చు).** అ. క్రి. (√ కే
లు) కేలుమొగుచు, నమస్కరించు.
గీ. కప్పురము దబ్బపండులు నిప్పపువ్వు, మొద
లుగాఁ గానుకలు పెట్టి మ్రొల నిలిచి, వలిక
రిట్లని కేల్మోడ్చి ప్రభునిఁ గూర్చి. రసిక. ౧.
౬౪, ౨. ౧౦౬.

**కేలుమో(ల్మో)డ్పు.** వి. (కేలు+మోడ్పు) నమ
స్కారము. ఆం. భా. ౨. ౧౭౫.

**కేలువిడుచు.** అ. క్రి. (√కేలు)-హస్తసంజ్ఞచేత
అనుజ్ఞయిచ్చు-ఆజ్ఞాపించు.
అ. పన్ని వేగిరించుపరనిజధ్వజినులఁ,జూచి కో
ప మేచి త్రోచి యపుడు, పోర నొండొకం
టిఁ బొడుచుట కవనీశ,విబుధరిపులు గేలు
విడుచుటయును. కవిక. ౨. ౧౫౧.

**కేలుసాఁచు.** అ. క్రి. (కేలు + చాఁచు.) యాచ
నార్థము చేయి చాఁచు.
సీ. శ్రీకాంత దా నయ్యుఁ బ్రియు నిరోధింపదు
క్రిందై విరోధికిఁ గేలుసాఁప.వసు.౧.౬౫.

**కేలొసఁగు.** అ. క్రి. (కేలు+ఒసఁగు.) కేలుమో
డ్పొసఁగు, నమస్కరించు.
రగడ. వ్యాఘ్రపురస్థలియందు మహాబాహుస్వా
మికిఁ గేలొసఁగెద హితముగ. హంస. ౪.
౨౦౩.

**కేళకుళి=** కేళాకూళి.
గీ. కేళికాగారములపొంతఁ గేళకుళులఁ, జొర
వెఱచు జోటి యెట్టు లిచ్చోటిమేటి, తేటగా
జంగపూనీటియేటి కాల్వ, దాఁట నోపెనా
కవిరమ్మ బోటులార. రసిక. ౪. ౪౪.

**కేళకూళి=** కేళాకూళి.
సీ. కుక్కుటేశ్వ...కేళకూళి నుద్భవ మైనమణిక
ర్ణిక నొనర్చు మజ్జనంబు. భీమ. ౩. ౧౮౯.

**కేళాకుళి=** కేళాకూళి.
సీ ... క్రీడాఖాతమై కనుపట్టుఁ గేళాకూళి య
నఁగఁ గేళాకుళి యన. ఆం. భా. ౧. ౧౬౩.

**కేళాకూళి=** కేళాకుళి, కేళకూళి, కేళకుళి, కేళా

కుళి, కళాకూళి, కళకుళి. వి. క్రీడాఖాతము, క్రీడాసరస్సు.

శా. అకల్పంపుటనంటిమూఁకనడిచాయకా మిం చుపస్నీటికే,ళాకూళికా దిలకించి యావరిని జెల్వం బైన చెంగల్వరా, జాకట్టుం దెలిచల్వ దిన్నె గని యారా యెంత సౌఖ్యప్రదం, బై కన్పట్టిన దీర్ఘంబు బనుమ దైత్యస్వామి యం దుండఁగా. ఉ. రా. ౪. ౧౬౬.

కేళి. సం. వి. ఇ. పుం. ఇ,ఈ. స్త్రీ. ౧. ఆట,క్రీడ. ౨. స్త్రీపురుషులవిహారక్రీడ. ౩. పరిహాసము.ఇ. స్త్రీ.భూమి. (వాచ.)

కేళిక. వి. (శ. ర. ను బట్టి యిది తెనుఁగుగా గ్రహింపఁబడినది-సం. కేళికా. త. కేళిక్కై.) నృత్యము, నాట్యము.

చ... జక్కిణికొరవంజిమేళములఁ గేళిక సల్పి రి... రామా. ౨. ౧౩౧. (శ. ర. పా.)

ద్వి. చాఁగు బళా యనుశబ్దముల్ మ్రోయఁ,గాఁ గేళికలతోడఁ గర మర్థి నేఁగి. బస. పు. ౭. ౧౫౪.

కేళిక. సం. వి. ఆ. స్త్రీ=కేళి.

కేళికము. సం. వి. అ. పుం. అశోకముకి.

కేళికల. సం. వి. ఆ. స్త్రీ. ౧. సరస్వతివీణె,కచ్ఛపి. (వాచ)

కేళికిల. సం. ఆ. స్త్రీ. రతి,కామునిపత్ని.

కేళికిలుఁడు. సం. విశే. (అ.ఆ.అ) పరిహాసము చేయువాఁడు. వి. అ. పుం. (నాటక) విదూషకుఁడు.

కేళికీర్ణము. సం. వి. అ. పుం. లొట్టియ,ఉష్ట్రము.

కేళినాగరుఁడు. సం. వి. అ. పుం. భోగప్రధానుఁ డగునాగరనాయకుఁడు.

కేళిముఖము. సం. వి. అ. పుం. పరిహాసము. (త్రి.ని.)

కేళివృక్షము. సం. వి. అ. పుం. కదంబవృక్షవిశేషము. (కల్ప.)

కేళిశీలుఁడు. సం. విశే. (అ. ఆ. అ) పరిహాసకుఁడు, పరియాచకము చేయుస్వభావము గలవాఁడు.

కేళిశుషి. సం. వి. ఇ. స్త్రీ. భూమి.

కేళిసచివుఁడు. సం. వి. అ. పుం.ఆటచెలికాఁడు, నర్మసఖుఁడు. (విదూషకుఁడు, మొ.)

కేవడము. వి. ఒకవిధ మైనడాలు, ఖేటకభేదము.

సీ... ఖేటక మెసఁగును గేడె మనఁగఁ, దద్భేద నామమై తనరును జిల్లోటి కేవడ మంచన ...ఆం. భా. ౨. ౨౧౬.

సీ. మిహిపసిండిపరుంజా మొహదా కెలంకుల తావు గుజ్జరినేఁతకేవడంబు. మనుచ. ౪. ౨౫.

కేవరి. విశే. (కేవు² + అరి) కేవు పుచ్చుకొను వాఁడు. (బ్రా.)

కేవర్తుఁడు. సం. వి. అ. పుం- నీటియందు వర్తించువాఁడు-కైవర్తుఁడు, జాలరి. (కల్ప)

కేవలద్రవ్యము. సం. వి. అ. న. మరీచము, మిరియము.

కేవలము. సం. విశే. (అ. ఆ. అ) ౧. కృత్స్నము, సమస్తము. ౨. ఏకము, అద్వితీయము;అసహాయము. ౩. అచ్చము,మఱియొకదానితోఁగూడనిది.

శ్లో.కాతర్యం కేవలా నీతిః శౌర్యం శ్వాపదచేష్టితం. సం. రఘు. ౧౭. ౪౭.

వి. అ. న. అవధారణము, నిర్ణయము.

కేవలుఁడు. సం. విశే. (అ.ఆ.అ) సామాన్యుఁడు, సాధారణుఁడు.

క. ఈమత్స్యపతి సహాయము,గా మాకుం దీర్ప రానికార్యము గలదే,సామాద్యుపాయపరుఁడు,ద్దామభుజాబలయుతుం డితఁడు కేవలుఁడే. భార. ఉద్యో. ౧. ౩౦.

క... సాత్యకియు... కృష్ణాసోదరులుఁ దలఁపఁ గేవలులె నృపా. భార. ఉద్యో. ౨. ౧౭౭.

**కేవు**[1]=కవ్వు. వి. అర్భుటయుం దగుఉల్లాసాదిసూచకధ్వని కనుకరణము.

ఉ. ఆవలరాయరాహుతుఁ డహంకృతిఁ బచ్చని ఔక్కపక్కెరల్, లీవి సహింపు తేజిని వడిం దుమికింపుము నుగ్రమూర్తియై, కేవున నార్చి తూఁటి నటిశెల్ యతిహృద్ధృతి ఖండఖండముల్, గా వర కేతకీకుసుమగర్భదళోజ్జ్వలఖడ్గధార చే౯. కవిరా. ౪. ౧౨౬. అచ్చ. రా. యు. ౨౭౬.

**కేవు**[2]. వి. (హిం. కేవు) ఓడకూలి. (శ.ర,బ్రా,వా.)
జ: కేవరి.

**కేశకారము.** సం. వి. అ. పుం. ౧. గుఱ్ఱమువెండ్రుకలను కత్తిరించుకత్తెర. (వై.ని.) ౨. ఇక్షుభేదము, ఒకజాతి చెఱకు౯.

**కేశకీటము.** సం. వి. అ. పుం. పేను.

**కేశగర్భము.** సం.వి.అ.పుం. కబరి, కొప్పు.

**కేశఘ్నము.** సం. వి.అ.న-వెండ్రుకలు పోఁగొట్టునది-ఇంద్రలుప్తకము,బట్టతల; పేనుకొఱుకుట.

**కేశచ్ఛిత్తు.** సం.వి.ద్.పుం. మంగలి. (యా. కేశచ్ఛిదుఁడు.)

**కేశచ్ఛిదుఁడు.** సం.వి.అ.పుం. మంగలి. (వాచ)

**కేశజాలము.** సం.వి.అ.న. కేశమాలము,వెండ్రుక కుదురు.

**కేశటము.** సం. వి. అ. పుం. ౧. ఛాగము, మేఁక. ౨. పేను. ౩. మన్మథునిశోషణబాణము. ౪. శోణకవృక్షము, దుండిగము౯.

**కేశటుఁడు.** సం.వి.అ.పుం. ౧. భ్రాత. ౨. విష్ణువు.

**కేశనామము.** సం. వి. న్. న. హ్రీబేరము, కురువేరు౯.

**కేశపక్షము.** సం.వి.అ.పుం. కేశసమూహము.

**కేశపర్ణి.** సం.వి.ఈ. స్త్రీ. అపామార్గము,ఉత్తరేను౯.

**కేశపాశము.** సం=కేశపక్షము.

**కేశపాశి.** సం.వి.ఈ. స్త్రీ. సిగ.

**కేశబంధము.** సం.వి.అ.పుం. ౧. క్రొమ్ముడి, కొప్పు, కీలుగంటు, జడ, మొ. ౨. కేశములను బంధించు సాధనము. (త్రాడు, మొ.)

**కేశభారము.** సం=కేశపక్షము.

**కేశమథని.** సం.వి.ఈ. స్త్రీ. శమి, జమ్మి౯.

**కేశమార్జకము.** సం. వి. అ.న-కేశములను దువ్వునది-దువ్వెన.

**కేశమార్జనము.** సం.వి.అ.పుం. కంకతిక,దువ్వెన.

**కేశము.** సం.వి.అ.పుం. ౧.తలవెండ్రుక. ౨.గుఱ్ఱము సింగము లోనగువాని మెడవెండ్రుక,జూలు. ౩. కిరణము. ౪. యోని,ఆఁడుగుఱి. పుం.న. హ్రీబేరము, కురువేరు౯. (కే.ని,మే.ని.)

**కేశముష్టి.** సం. వి. ఇ. పుం. మహానింబము, పెద్దవేము౯.

**కేశరంజనము.** సం.వి.అ.పుం. భృంగరాజము,గుంటగలగర౯.

**కేశరచన.** సం.వి. ఆ. స్త్రీ. వెండ్రుకలు దువ్వి కొప్పు మొదలగువానిని పెట్టుట.

**కేశరచనము.** సం.వి. అ.న=కేశరచన.

**కేశరాజము.** సం.వి.అ.పుం. భృంగరాజము,గుంటగలగర౯.

**కేశరుహా.** సం.వి.ఆ. స్త్రీ. ఒకజాతిదంతీవృక్షము౯.

కేశవము. సం.వి.అ.పుం. పొన్న చె. (కల్ప)

కేశవర్ధని. సం.వి.ఈ.స్త్రీ. సహదేవీలత చె.

కేశవాలయము. సం.వి.అ.పుం.అశ్వత్థము,రావి చె.

కేశవావాసము. సం=కేశవాలయము.

కేశవుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ప్రశస్తమైనకేశములు గలవాఁడు. వి. అ. పుం- కేశియనురాక్షసుని చంపినవాఁడు-విష్ణువు. (వాచ)

కేశవేశము. సం.వి.అ.పుం. కేశబంధము. (కొప్పు, సిగ, ముడి, జడ, మొ.)

కేశహంత్ర్యఫల. సం. వి. ఆ. స్త్రీ-రోమములను పోఁగొట్టుపండ్లు గలది-శమి, జమ్మి చె.

కేశహస్తము. సం=కేశపక్షము.

కేశాంతము. సం. వి. అ. పుం.కేశచ్ఛేదనకర్మము, గోదానము. (ఇది బ్రాహ్మణులకు పదియాఱవయేఁటను క్షత్రియులకు ఇరువదిరెండవయేఁటను వైశ్యులకు ఇరువదినాలుగవయేఁటనుచేయుకేశచ్ఛేదనసంస్కారము.) మను. ౨. ౬౫.

కేశాంతికము. సం. విణ. (అ.ఆ.అ.) వెండ్రుకలవఱకు నుండునది, తలయెత్తుపొడుగు గలది.

కేశాకేశి. సం. అవ్య. ఒండొరులవెండ్రుకలు పట్టుకొని చేయునది. (యుద్ధము-చూ. కచాకచి.)

కేశారుహా. సం. వి. ఆ. స్త్రీ. సహదేవీలత. (వాచ)

కేశార్హా. సం.వి.ఆ.స్త్రీ. మహానీలి, పెద్దనీలి చె.

కేశి. సం.విణ. (న్. నీ. న్.) మంచివెండ్రుకలు గలవాఁడు. వి. న్. పుం. ౧. కృష్ణునిచే చంపఁబడిన ఒకరాక్షసుఁడు. ౨. సింహము. ఈ. స్త్రీ. ౧. నీలి చె. ౨. భూతకేశి చె. 3. అజలోమ చె.(కల్ప.) ౪. చూడ, సిగ. (వై. ని.)

కేశిక. సం.వి.ఆ. స్త్రీ.శతావరి,పిల్లపీఁచర,చల్లగడ్డ చె.

కేశికుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) మంచివెండ్రుకలు గలవాఁడు.

కేశిని. సం.వి.ఈ. స్త్రీ. ౧. మంచివెండ్రుకలు గలస్త్రీ. ౨. ఒకరాక్షసి, కైకసి. (రావణకుంభకర్ణాదుల తల్లి.) 3. దుర్గ. ౪. చోరపుష్పి,కడిలము చె.౫.జటామాంసి చె. (కల్ప.)

కేశుఁడు. సం.వి.అ.పుం. ౧. వరుణుఁడు. (హేమ. ని.) ౨. విష్ణువు.

కేశ్యము. సం.విణ.(అ.ఆ.అ.) కేశములకు హితమైనది, వెండ్రుకలకు నలుపు లోనగువానిని గలిగించునది. వి. అ. పుం. భృంగరాజము, గుంటగలగర చె. న. కృష్ణాగురువు, నల్లఅగలు.

కేసర. సం. వి. ఆ. స్త్రీ. కార్పాసము, ప్రత్తిచెట్టు. (కే. ని.)

కేసరము. సం. వి. అ. పుం. న. ౧. సింహములోనగువాని మెడమీఁదిజూలు. ౨. కింజల్కము. పుం. ౧. నాగకేసరము చె. ౨. పున్నాగము, పొన్న చె. 3. వకుళము, పొగడ చె. (కే.ని.) న. ౧.ఇంగువ. ౨. బంగారు. 3. కాసీసము, అన్నభేది. (కల్ప.)

కేసరపూరకము. సం.వి.అ.పుం. మాతులుంగము, మాదిఫలము చె.

కేసరాచలము. సం. వి. అ. పుం. మేరుపర్వతము. (వాచ)

కేసరామ్లము. సం.వి.అ. పుం. మాతులుంగము,మాదిఫలము చె.

కేసరి[1]. వి. మృగవిశేషము, ఖేచరము.

సీ. ... కేసరి యన ఖేచర మగు...ఆం. భా. ౨. ౫౫. (బ్రౌ, శ. ర. పా- కిసరి. ప్రాఁతప్రతి వ్రాఁతప్రతులపాఠము.)

కేసరి[2]. వి. ఒకవిధ మగువరిపైరు.

(బ. కేసరులు-ర్లు-) ఒకజాతి ఎఱ్ఱవడ్లు. (శ్రా.)

వ. ...కస్తూరినిగరాలు ముత్తెసరు లేనుఁగుకొమ్ములు గంగాజలములు కేసరులు చంద్రవంకలు ...ప్రబంధ. ౧౧౨.

సీ. సన్నసూములు పచ్చగన్నెర్లు గోదండరామము ల్కేసర్లు రాయసర్లు. హంప. ౪. ౧౨౫.

**కేసరి.** సం. వి. న్. పుం. ౧. హనుమంతునితండ్రి. ౨. సింహము. ౩. గుఱ్ఱము. ౪. పొన్నచె. ౫. నాగకేసరముచె. ౬. రక్తశిగ్రువు, ఎఱ్ఱమునగచె. ౭. బీజపూరము, మాదిఫలముచె. విణ. న్. పుం. శ్రేష్ఠుఁడు. (ఈయర్థమున సమాసపూర్వపదముగా నుండదు. చూ. ఋషభుఁడు.)

## కై

**కై**[1]=కయి[1]. వి. (క. కై, కయి. త. కై.) హస్తము, చేయి.

మ. ...చిలుకన్ గైనుంచకే చిల్కపల్కులో నీపల్కులో కాంచలేము ... ఉ. రా. ౬. ౫౬.

క. కైకా నీపూనినపని, కై కాకై కందినట్టియనుఁగుంగొడుకి, ట్టై కానల కేఁగెడు ... అచ్చ. రా. అయో. ౯౪. ఆం. భా. ౨. ౧౩౫.

౨. తొండము. (చూ. కేలు, చేయి.)

జ: కైకట్టు, కైకలవాఁడు, కైకానుక, కైకాసము, కైకూడు, కైకొను, కైకొలుపు, కైకోల, కైకోలు, కైచాఁపులు, కైచెఱ, కైజీతగాఁడు, కైజీతము, కైతప్పు, కైదండ, కైపడు, కైపదము, కైముడి, కైమోడుపు, కైలాగు, కైలాటము, కైవడి, కైవసము, కైవీఁగు, కైసన్నలు, కైసాటిమక్కు, కైసేఁత, కైసేయు.

**కై**[2]=కయి[2]. ప్ర. (కు+ఐ-ఇది ఉభయయుతుల లోనిది)-చతుర్థీవిభక్తిప్రత్యయము-కొఱకు.

(క) ప్రయోజనమును తెలుపును.

క. కమలాపతిఁ గొల్తు ముక్తికై విభు ననఁగన్. నరస. ౪. ౨౫.

గీ. అనఘ మామామ శకుని నాకై కడంగి, జూదమాడెడు నీతోడ...భార. సభా. ౨. ౧౭౪.

గీ. అమరతటినీతనూజు పైయలుకఁ జేసి, యనికిఁ జొరవటె యట్లైన నతఁడు సచ్చు, నంతదాఁకఁ బాండవులకై కొంత సమర, కేలి వేడుకఁ జలుపుట వోలదొక్కొ. భార. భీష్మ. ౧. ౧౬౩. (ఇట 'పక్షమున' అని భావము)

(చ) హేత్వర్థకము.

గీ. అదియుఁ గాక మరుత్తుండు యజ్ఞవేళ, నుచితదక్షిణ లర్పించి యున్నధనముఁ, గొల్లవిడిచిన బ్రాహ్మణు లెల్లఁ దనిసి, విడిచి రర్థంబు దీనికై వెఱవ నేల. జై. భా. ౧. ౭౩.

(ట) దెసకు, వైపునకు.

ఉ. ... అ,త్యంతముఁ దత్తఱిల్లఁగఁ దదాననముం దనకై మరల్చుచున్. కళా. ౫. ౧౫.

**కై**[3]=కయి[3].

**కైంకర్యము.** సం. వి. అ. న. సేవ, ఊడిగము.

**కైక**=కయిక. వి. (సం. కైకేయీ.) దశరథుని భార్యలలో నొకతె.

క. కైకా నీపూనినపని, కై కా కై కందినట్టియనుఁగుంగొడుకి, ట్టై కానల కేఁగెడు నిఁక, నే కడ నీవంటితులువ లేరే పుడమిన్. అచ్చ. రా. అయో. ౯౪.

సీ. ... కైకేయి వెలయూను గైక యనఁగ. ఆం. భా. ౨. ౧౦౫.

**కైకట్టు**=కయికట్టు. వి. (కై[1]+కట్టు) సందర్భము.

సీ. సందర్భసంజ్ఞయై చనును గైకట్టన ... ఆం. భా. ౧. ౧౧౨.

**కైకయి.** సం. వి. ఈ. స్త్రీ. కేకయరాజకూఁతురు; కైక, కైకేయి.

**కైకయుఁడు.** సం.వి.అ.పుం. కేకయదేశపురాజు. (రూ. కేకయుఁడు.)

**కైకలవాఁడు**=కయికలవాఁడు.వి.(√కై[1].) తంతువాయ భేదము.

సీ. తంతువాయాభిధ డనరు మగ్గరి యన...తద్భేదము ల్తొగటవాఁ డనఁగను సాలీఁ డనంగను సాలె యనఁగ ... కైకలవాఁ డనఁగను ... ఆం. భా. ౨. ౨౮౩.

**కైకసి.** సం.వి.ఈ.స్త్రీ. రావణాదులమాత, కేశిని.

**కైకానుక(న్క)**=కయికానుక.(కై[1]+కానుక-త. కైక్కాణి.)

(రాజాదులఁ జూడఁ బోవునపుడు కొనిపో యెడుద్రవ్యము, ఉపాయనము.)

మ. పులిగోరుల్ పెరతేనె కస్తురి మెకంబుల్ పున్గుజవ్వాజిపిల్లులు... సెలవిండ్లుఁ బొఱవాతంపకట్టలుఁ గైకానుక లిచ్చి బోయదొరబిడ్డల్ గాంచి రాభూవిభుఁ. రామా. ౨. ౫.

గీ. నీకుఁ గైకాన్కఁ జేసెద నేఁడు దానిఁ,దత్తనూజులకంఠరక్తంబు గ్రోలు.శుక. ౨. ౨౮౯.

(బహుమానము; లంచము.)

గీ. గుండ్లపేరును గైకాన్క కోరి సేతు,నమ్మ నా విన్నపంబు నీ వాలకించి,వాని ననుఁ గూర్పనీనేర్పు పూని మెఱసి. హంస. ౨. ౩౭.

**కైకాసము**=కయికాసము. వి.(√కై[1]) రాయిడి, బాధ.

క. చేసెడువలరాయనికై,కాసములకుఁ గాక జడిసెఁ గాఁపుంగొడుకుఁ, లో సుదతిఁ దెచ్చుటకు ని,ద్రాసక్తుని మాటెఁ జన్నుద్రావెడుకొడుకుఁ. వేం. పంచ. ౪. ౪౮౮.(ప్రయోగాంతరము లేదు.)

**కైకూడు**=కయికూడు. (√కై[1])

**కైకేయి.** సం.వి.ఈ.స్త్రీ.కేకయరాజకూఁతురు; కైక, దశరథునిమూఁడవభార్య, భరతునితల్లి.

**కైకేయుఁడు.** సం.వి.అ.పుం. కేకయదేశపురాజు.

**కైకొను**=కయికొను. స. క్రి. (√కై[1]. త. కైక్కొళ్.) ౧. ధరించు;స్వీకరించు,పుచ్చుకొను; పట్టుకొను, గ్రహించు.

శా. శ్రీకంఠా నిను నీవు నేమఱకుమీ చిత్తంబు రంజించెదఁ, నాకద్వేషుల డాఁగురించుటకునై నాఁ డేను గైకొన్న కాం,తాకారంబు జగన్విమజ్జనము నీకై చూచెదేఁ జూపెదఁ ...భాగ. ౮. ౩౯౧.

చ. పొడువుగ నెల్లయంగడులఁ బ్రోవులువోసిన నూత్నరత్నముల్, కడఁక ననేకవేషములు గైకొని వచ్చినయర్థికోటికిఁ,బిడికిస లాదిగాఁగ బలివెట్టుదు రెప్పుడు వైశ్యభామినుల్...విక్ర. ౧. ౭౪.

గీ. కైకొనుము దీని నని యిచ్చె నాకవనిత, పూర్ణచంద్రనిభాస్య కప్పూవుదండ. నైష. ౩. ౧౨౦.

చ. ... ప్రదక్షిణార్చియై,యకలుషలీలఁ గైకొనియె హవ్యవహుండు హవిర్విభాగముఁ. భీమ. ౫. ౩౯.

ఉ. ...తా గురుజనంబులు కుంకుమ సంకుమాంకముం, బోలెడుచల్వయుం బసుపుముద్దయుఁ గైకొని తోడ రా మహా,కేళిరథాంగయైన నదికిం జని మజ్జనమాడి వేడుకఁ. శుక. ౧. ౪౨౨.

చ. అనవుడు బోయ యిట్లను శుకాంగనతో నడలంగ నేల నీ,తనయులఁ జంప నేను బిసితంబులు బ్రాఁతియె నాకు వీనిఁ గై,కొని వెలవెట్టువారికడకుం జని యమ్ముదు... కేయూర. ౪. ౬౭.

౨-పాణిగ్రహణము చేయు-వివాహమగు, పెండ్లియాడు.

చ. భవదనుజాత్మజ న్వసున్నపాలుఁడు గైకొను
నెల్లి నేఁట...వసు. ౪. ౪.

ఆ. తనకు సదృశుఁ డైనతరుణునిఁ గైకొంట,రా
జసుతకుఁ దగవు రాజవదన.భాగ.౯.౬౨౦.
విక్ర. ౪. ౫౪.

౩. భావించు, ఎంచు.

గీ. ... గెల్పు గెల్పుగ మదీయ,బుద్ధి గైకొనద
య్యోధు సిద్ధముఖ్య. భార. శాం. ౧. ౬.

సీ. అఖిలసైన్యములు సహాయులు గూడంగఁ గృ
ష్ణుచే నపజయక్లేశ మొంది, యే మని తనవీటి
కేఁగె నమ్మగధేశుఁ డకట యిమ్మెయిఁ దన
యంత మేటి, యవనీపతుల కెల్ల నగ్రణి య
నిఁ బాతిపోక కర్జంబుగఁ గైకొనంగఁ, జను
నె...హరి. ఉ. ౨. ౩.

౪. ధ్యానించు.

శా. ... శ్రీం,గారాగారము మంగళాచలపతిం
గైకొందుఁ జిత్తంబునన్. గంధ. ౧.

౫. లక్ష్యపెట్టు,సరకుగొను,పాటించు;ఆదరించు.

క. తనకొలఁది నుపాయంబులు, పొనరిచి ధనవం
తుఁ డగుట భూపగుణము నిర్ధనుని నిజప్రజ
యును గైకొనదు విరోధులును సరకుగొనరు
కుమారా. భార. శాం. ౩. ౧౭౩.

మ. దయ నాయూడినమాట గైకొనవు సంతాపం
బుఁ దెచ్చుం జుమీ. భార.ఉద్యో.౪.౪౭.

క. ఏకాధివాసమైత్రిం, జేకొను మేఖలకు హితము
చెప్పుతలఁపున్నం,బోకుము నీ వెన్నఁడు నది,
కైకొనదు హితోక్తి తెలియఁగా లేదు మ
దిన్. కేయూర. ౩. ౨౬౪.

గీ. తప్పు సేసితి రిట్టులు దగునె వీర,లేమిగతిఁ బ
ల్కినను నది యెల్ల మనము,గైకొన వలయుఁ
గా కిట్లు గాదుగూడ,దని నిషేధించు టొ
ప్పునె మనుజనాథ. భార. విరా. ౫. ౨౭౫.

౬. అంగీకరించు, ఒప్పుకొను.

క. ఆకుహనాభూసురుఁ డపు, డాకాంతలసరస
సమ్మదాలాపములన్, గైకొనుచు ముదితహృ
దయుం,డై కేళీవనము వెడలి యరిగి కుఱంగ
టన్. మనుచ. ౩. ౧౧౦.

క. తగుమాట లాంబికేయుం,డగు నని కైకొను నె
య్యెన్నఁ డైనను ..భార. ఉద్యో. ౧.౩౧౫.

౭. ఆక్రమించు, వశపఱచుకొను.

చ. మదగజరాజకుంభముల మచ్చరికించు చుకో
జకుంభముల్,కదిసి కలంత మేరయుచుఁ గై
కొని యున్నవి యెల్లవారికిన్,విదితము గాఁ
గ నిట్టితటి నీచెలిడెందమునందు నేమియుం,
గదలక మాకు నుండ నవకాశము లేదు గదే
కళావతీ. నైష. ౮. ౬౫.

వ...వారిప్రధానులు స్వామిద్రోహంబులు చేసి
రాజ్యంబులు గైకొని యేలం గలవారు...వి.
పు. ౬. ౩౯౫.

మ. కొనియెం గంచుకముల్ సముద్భటనటన్ఘోటీ
భటప్రౌఢిఁ గై,కొనియె న్స్వేదుక జీడికోట
యహితక్షోణీశు లల్లాడ...కాశీ. ౧. ౩౩.

౮. అవలంబించు, పూను.

సీ. ఏఁడుగాలం బయ్యె నేను నిరాహారఘోర
వ్రతంబుఁ గైకొన్నవాఁడ. హర. ౨. ౫౩.

౯. పొందు, చెందు.

చ. అకుగులయందు శౌచవిధి యాత్మ నొనర్పఁ
దలంప కీవు కాల్గడ దలయింపి గా నిదుర
గైకొన నేనది యంతరంబు గాఁ, గడఁగి మ
దంతహేతు వగుగర్భము నొంచితి...హరి.
పూ. ౧. ౮౭.

మ...కాశీశ్వర నీలకంఠ యనుచున్ మ్రాఁగన్ను
వాటిల్లఁ దత్కాలశీనూనుఁడు మూర్ఛఁ గై
కొనుఁ గ్రమక్షామాక్షరోల్లాసియై. కాశీ.
౨. ౧౫౪.

౧౦. అనుభవించు.

చ. ఆదియును గాక పూర్వకృత మైనయఘంబు

లు వ్యాధిరూపమై,పాదివినఁ దాను గైకొనక పోవునె... భోజరా. ౧. ౧౦౬.

సీ. ప్రాణేశ పతికి మున్పరలోక మరిగెడు చెలువ లేతపములు చేసిరొక్కొ,వల్లభ చూచితే వై ధవ్య మొక్కింతపడియైనఁ గైకొన వలసె నాకు. భా. రా. యు. ౩౯౨.

గీ. అసమసింహాసనస్థుఁడై యఖిలరాజ్య,వైభవంబులు గైకొంచు వఱలువాఁడు, నియతిమై గాలిఁ గ్రోలెడు నేఁడు నహహ, యధిప యతఁడు మహాభోగి యగుట నిజము.కవిక. ౬. ౩౯.

౧౧. భక్షించు, తిను.

ఉ. కల్లరిత్రాఁచు నిప్పుకలు గైకొనుకేకిచకోర పాళికిం,జెల్లినఁ జెల్లుఁ గాక సరసీజబిసంబులిగుళ్లు మేసి భా,సిల్లెడుమీ కయో విషము చిల్కఁగ వేఁడిమి గుల్కఁ బల్కఁగాఁ, జెల్లునె యోమరాళపికశేఖరులార వచింపుఁ డింపుగన్. విజ. ౨. ౩. ౫౭.

ఉ ... వాడుమోములుం, బొందువడంగ సాంద్రతర భూరుహపంక్తులచల్లనీడలం, గంధఫలాదిఖాద్యములు గైకొని కొండొక నిల్చి యెండియున్. భా. రా. యు. ౨౭౧. శుక. ౧. ౪౨౩.

౧౨. పట్టు, అనుసరించు.

వ. మాధవుండు ... కరినగరంబు పెంటెరువు గైకొని... చనిచని...భార. ఉద్యో.౩.౧౪౫.

మ. చరమాశాంతరవీథిఁ గైకొని సరోజాతప్రియుం డేఁగఁగా...విక్ర. ౨. ౧౧౫.

అ. క్రి. ౧. పూను, ఉద్యమించు.

క. మాకుం బుణ్యము సాలమి,గా శేమి జగత్త్రయంబుఁ గావం బ్రోవం,గైకొన్న నీవు సకలవి,వేకివి మాదుఃఖ మెఱుఁగవే మధుమథనా. ఉ. హరి. ౪. ౯౬.

౨. కలుగు ?

క. ఏకరి దనకు నపాయము, గైకొనఁగాఁ దనదు మూర్ధకంపము నేయన్, లోకమున కపుడు సకలము,హీకంపము పుట్టు నట్టియిభరాజంబున్. భా. రా. బాల. ౪౨౦.

కైకొలుపు=కయికొలుపు. స. క్రి. (√ కైకొను) కైకొనఁజేయు.

(సమ్మతింపఁజేయు)

క. నావుడు మానరనాథుఁడు,కేవలపురుషుండె వాఁడు కీడొందుపనుల్, గావించునె మది బెదరం,గా వలదని చెప్పి దొరలు గైకొలుపుటయున్. భోజరా. ౪. ౭౪. (చూ.౭౩.)

కైకోల=కయికోల. వి. (కై¹ + కోల-త. కైక్కోళన్.) గుడ్డలు నేసికొని బ్రతికెడు ఒకానొకజాతి. (ఉదా: కైకోలవాఁడు, కైకోలది. శ. ర.)

కైకోలు=కయికోలు. వి. (√ కైకొను). కైకొనుట.

(అంగీకారము)

సీ. నీవ కా కెవ్వరు నేర్తు రీపని కియ్యకో మ్మని యతని కైకోలు వడసి. భాగ. ౧౦. ౧౯౨.

(గ్రహణము, గ్రహించుట)

శా. గంగం దాల్చితి వుత్తమాంగమున నన్ గైకోలు గావించి త,ర్ధాంగీకారము...నరస.౧. ౫. (శ. ర. పా- కైకోలుగావించు = గ్రహించు.)

(ప్రతిజ్ఞ)

క. నేలయు నుదకముఁ దేజము, గాలియు నాకసము సాక్షిగఁ గాచితి నాకై,కో లిదె రెండాడఁగ నా,నాలుక మీకులమువారి నాలుకయటులే. ద్వా. ౫. ౧౯౦.

కైచోఁపులు. వి. బ. (కై¹ + చోఁపులు) వనుస్కృతి. (శ. ర.)

రగడ...నిబిడస్థలిలో నిబిడాకార, స్వామికి మతిఁ గైచాఁపు లొసంగుచు. హంస. ౪. ౨౧౩.

కైచెఱి=కయిచెఱి. విణ. (కై¹+చెఱి) చేతిలో బందియైనది.

క. ఏచినతనవిడువాలువి,లోచనముల చెలువమునకు లొంగి జలజముల్, కై చెఱయిచ్చెనం గే,లీచాలితనలిన మాకలికి ధరియించున్. వరాహ. ౧౧. ౫౦.

కైజో=కయిజో. వి. (పార్సీ. ఖైజ్.) వాఁగెను వెనుక కీడ్చి కట్టుట. (శ. ర)

క. ఆకోలాహల మరు దని, యాకర్ణింపుచు విభుండు హయము డిగి హుసా,రై కైజా చేసి మహో,నోకహతలమున నిలిచి కనుంగొనుచుండన్. చంద్రా. ౨. ౧౧౧.

శా. కైజా చేసినబొందుమల్లెవిరిబల్లంధాజగాజోదు లే,జీజాడం దల వాంచి బోటిచెఱఁగుం జే గట్టిగాఁ జుట్టి ను,గ్గాజుంగంబముచాటున న్నిలిచి క్రేఁగంట న్ననుం జూచునం, భోజాతాక్షిని సెజ్జకుం దిగుచు నేర్పుల్ గల్గునే మీఁదటన్. కువల. ౪. ౯౯.

సీ. లాయంబులోనిలులాయంబుపైఁ గాలుఁ డెక్కుడునరునిపై రక్కసుండు, కైజా యనుర్చి నక్రంబుపై వరుణుండు...శ్రీరం. మా. ౪. ౯౧.

జః కైజామోర.

కైజామోర=కయిజామోర. వి. (కైజా + మోర.) ౧. హయశీర్షకంపనము.

సీ...కైజామోర యన హయశీర్షకంపనము వెలయు...ఆం. భా. ౨. ౨౦౦.

౨. కళ్లెముతో వెనుకకు బిగించినమూతి.

సీ. హయనాథుఁ డంపినహరులు కైజామోర లార్చుచుఁ బతికి జోహారుసేయ. వసు. ౧.౧౫.

సీ. అనికి వేలుపుఁదేజి సలరు కైజామోరయల్లార్చుచేఁ జీరుహయకులముల. చంద్రి. ౬. ౭౫.

శా... పురిం బొల్చు నా,జానేయంబులు ఫేనహాస మిడి కైజామోర లల్లార్చుచున్. ఆము. ౨. ౨౬.

కైజీతగాఁడు=కయిజీతగాఁడు. విణ. (కైజీతము + గాఁడు) భృతకుఁడు; భృతకయోధుఁడు.

ఆ. కానవంబుబలముఁ గైజీతగాండ్రును, సైనయట్టిబలము లాలు నరసి. భార. ఆశ్ర. ౧. ౭౩.

కైజీతము=కయిజీతము. వి. (కై¹+ జీతము) ఎప్పటికప్పుడిచ్చుజీతము.

గీ. ఒకని నొకఁ డెచ్చరించుచుఁ జికిలియొఱలు, పాఱవైచుచు వడిఁ జొరఁ బాఱువారు,నగుచుఁ గైజీతములవార లనికి నిగిడి. కువల. ౨. ౧౪౩.

సీ.అఖిలసీమామూల మైనదుర్గమ్ము లుంబలికలు గల కమ్మవెలమదొరలు,చేతి కైదేసివేల్ శివరాయలవరాలనెలకట్టుపలపటాణీల్ గరీబు, లూళ్లాయములమీఁద హారపుత్త్రులవు గన్న రాయకైజీతంబురాయవారు... రా. వి.౫.౧౩.

విణ. శపథాయుధనిక్షేవి, వెనుకకు తిరుగ నని యొట్టు పెట్టుకొని యుద్ధము చేయువాఁడు, సంశప్తకుఁడు.

సీ. శపథాయుధనిక్షేవి చనుచు గైజీత మంచనఁగను...ఆం. భా. ౨. ౧౭౫.

మ...బోయల్ దాయలై పాయక,ప్పురవీథిన్ బరవీరుల న్గదుమ గుంపుల్గూడి కైజీతముల్, దఱుమన్ బర్విడి స్వామిపుష్కరిణితీర్థంబందు వే గ్రుంకినన్. ప్రబంధ. ౭౯౭.

కైజో=కయిజో, కైదు, కయిదు. వి. కపింజలము, కౌఁజు.

సీ. కాఁ జనఁ గై జనఁగాఁ గపింజల మొప్పు... ఆం. భా. ౨. ౯౪. సుద. ౩. ౧౯౪.

గీ. కలుకుటంప్రుల నితికించి గజ్జె గదలఁ,గతికి నె తినెతికో లెమ్మకయును విఱుగ,వితిచె వడిఁ గైజు నొక పెద్దవేసడంబు. మనుచ. ౪. ౫౮.

**కైటభ.** సం. వి. ఆ. స్త్రీ. దుర్గ. (త్రి. ని.)

**కైటభారి.** సం. వి. ఇ. పుం. విష్ణువు, వెన్నుఁడు.

**కైటభి.** సం. వి. ఈ. స్త్రీ=కైటభ. (త్రి. ని.)

**కైటభుఁడు.** సం. వి. అ. పుం. ఒక రాక్షసుఁడు. (విష్ణుదేవుఁడు నిదురించుచుండఁగా నతనికర్ణములనుండి కైటభుఁడును మధుఁడును పుట్టి బ్రహ్మదేవుని చంపఁ బోవఁగా విష్ణువు వారిని సంహరించెను.)

**కైటర్యము.** సం. వి. అ. పుం. ౧. భూనింబము, నేలవేము శ. ౨. కట్ఫలము, పినగుమ్ముడు శ. ౩. పూతికరంజము, నెమిలియడుగు శ. ౪. మదనవృక్షము, ఉమ్మెత్త శ.

**కైడర్యము.** సం. వి.అ. పుం. ౧=కైటర్యము. ౨. కృష్ణనింబము, కతివేము శ.

శ్లో. కృష్ణనింబః కాలశాకః కైడర్యః సురభిచ్ఛదః. షట్చక్రంధనిఘంటువు.

**కైత**=కయిత.

ఉ. పూఁత మెఱుంగులుం బసరుఁ బూపబెడంగులు చూపునట్టి వా, కైతలు...(పెద్దన చాటువు)

జ: కైతగాఁడు.

**కైతకము.** సం. విణ. (అ. ఈ. అ) మొగలిసంబంధమైనది. (పువ్వు, మొ.)

**కైతగాఁడు**=కయితగాఁడు. వి. (కైత+కాఁడు.) కవిత్వము చెప్పువాఁడు, కవి. వేణు. ౨౨.

**కైతప్పు**=కయితప్పు. వి. (కై1+తప్పు). చేతిపొరపాటు; పొరపాటు, ప్రమాదము.

సీ. కంగుకంగున నేలఁ గైతప్పగాఁ బడు వేటము లేఱుక దాఁటి దాఁటి. మనుచ. ౪. ౧౦౩.

ఉ. అప్పుడ మౌక్తికాంజలిఁ బ్రియంబునఁ జేయుచు దేవ నిన్న కై,తప్పునఁ జేరె నీహయము తండ్రికి నోర్వక పోదు బిడ్డఁడే,యొప్పమిఁ జేసెనేనియు ననూనకృపామతి నన్నుఁ జూచి యీ,తప్పు సహింపు మంచు వసుధాస్థలిఁ జాఁగిలి మ్రొక్కెఁ గ్రమ్మఱన్. జై.భా. ౫. ౧౬౮.

**కైతవము.** సం. వి. అ. పుం. ధుత్తూరము, ఉమ్మెత్త శ. న. ౧. వైడూర్యమణి.-కితవునిధర్మము.- ౨. జూదము. ౩. పందెము, పణము. ౪. కపటము.

**కైతవుఁడు.** సం. వి. అ. పుం. ౧. జూదరి. ౨. మోసగాఁడు. (వాచ.)

**కైదండ**=కయిదండ. (కై1+దండ.)

(హస్తావలంబము, చేయూఁత; ఊఁత.)

సీ. అర్ధరాత్రంబున నల్లాడనాథుండు దానె యొవ్వనికిఁ గైదండ యొసఁగె. హర. ౧. ౧౫.

సీ. కైదండ లిచ్చి రాకలువరాయనిఁ దెచ్చియందు మీఁదట నుంచె నతివ యోర్తు. యయా. ౪. ౯౩.

సీ. గంధేభఘుంటికాఘణఘణల్ ఘనబృంహితధ్వానములకుఁ గైదండ యొసఁగ. దశా. ౨. ౩౭౭. (ఇట 'బృంహితములను హెచ్చుచేయు' అని భావము.)

**కైదారకము** సం. వి. అ. న. కేదారసమూహము.

**కైదారికము.** సం=కైదారకము.

**కైదార్యము.** సం=కైదారకము.

**కైదు**=కయిదు. వి. కైజా.

క. కఱకును గంకము గాకి కక్కుర కైదుల్. ప్రబంధ. ౨౩౦.

**కైదువ(వు)**=కయిదువ. వి. ౧. ఆయుధము.

సీ. ...కైదువ యనఁగను గత్తి యనఁగ, నాయు
ధ మొప్పు...అం. భా. ౨. ౨౧౧.

చ. కరమున శైలభేది యగు కైదువ యున్న శచీ
కళత్రుఁడో...హరిశ్చ. ౪. ౭౧.

క. ...పోరి మిడుఁగుఱు లెగసి కైదువులపొడి
రాలెన్. భార. ద్రో. ౫. ౫౧.

క. పొడిచిన కైదువునకుఁ జమురిడఁగా వలదు
...మనుచ. ౪. ౧౯.

ఉ. ...తెల్లని మోముగుఱ్ఱమును తెల్లనిమామయుఁ
దెల్ల కైదువున్, దెల్లనికోడలుం గలుగు తెల్ల
నిమూఁతురితండ్రిఁ గొల్చెదన్. రుక్మా. ౧.
౬౦.

౨. వాఁడి యైనఅంచు.

చ. బిలబిలిపాలు జాలుకొను చెక్కుల టెక్కును
మద్దికాయలున్, గళుకులరావిరేక చిఱుగజ్జె
య లందియ లైదు కైదువల్, గలయపరంజి
బిళ్ల తుది గన్ బులిగోరును బుట్టువెండ్రు
కల్, చెలఁగ దుపట్టి పందువులు చేసెఁ ద
గన్ దలిదండ్రి కంటికిన్. రా. వి. ౨. ౨౧.

౩. శ్యేనవిశేషము, ఒకజాతి డేగ ?

సీ. ఈమించు కైదు వాళ్లెన్ని గల్గిన నైనఁ దిత్తి
దీసినమాడ్కిఁ ద్రెంచి పట్టు. చంద్రా. ౨.
౭౭.

పిడుగు కైదువు=వజ్రాయుధము. వసు. ౫. ౩౬.

కైప(వ)డు=కయిపడు. అ. క్రి. (కై1 + పడు)
కైవ్రాలు, క్రిందికొఱగు.

వ ... ఒకయింటిమచ్చెకంటి పంచాళద్వర్ష దేశీ
య పలితసారం బైనవేణికాభరంబు కైవడ...
కలమధురవీణాక్వాణపాణింధమం బైనయెలుం
గత్తు ... చేరం బిలిచిన ... భీమ. ౨. ౧౧౦.

కైపదము=కయిపదము. వి. (కై1 + పదము -
ప్రా. కయిపద.) కవితాశక్తిని పరీక్షించుటకై
పూరింప నిచ్చెడి పద్యాంశము, సమస్య.

ఉ. కైపద మిచ్చువారలును గ్రక్కునఁ బద్య
ము చెప్పువారలున్, రూపితసంస్కృతాది
పదరూఢి యెలర్ప మహాప్రబంధముల్, శే
షాసఁగంగఁ బల్కి పృథివిం బ్రథితంబుగఁ
జేయువారు ధా, రాపురమందె కాక కలరా
మతి తక్కినపట్టనంబులన్. భోజరా. ౨. ౫౦.

కైపు=కయిపు. వి. (త. కయిప్పు)౧. మత్తు, మైక
ము, లాహిరి.

గీ. విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్న,గం
టు లన్నియుఁ బ్రియుఁ గూడి కైపు మిగిలి,
పెనఁగు నెడ నెట్టవిరిసె నా వనిత మేనఁ, గ
లయ నవనఖదంతవిక్షతము లడరె. కు.సం. ౯.
౧౭౯. రా. వి. ౨. ౨౭.

౨. సురాభేదము, సారాయి.

సీ. కల్లనంగ సురాఖ్య చెల్లును గైపు సారాయి
సారా నాఁగ రహిఁ దనర్చుఁ, దద్విశేషం
బు...అం. భా. ౨. ౩౦౩.

౩. కపటము.

సీ. ...కపటాఖ్య విలసిల్లు గబ్బి గొయ, గబును
కైపు కిటుకు కాదు డబ్బు కవుడు డంబనం
గ...అం. భా. ౧. ౧౩౯.

౪. ఉద్రేకము, విజృంభణము.

క. దీప మణఁగఁ జీకటియును, గోప ముడుగ
శాంతిగుణముఁ గోల్కొను క్రియ నా,టో
పోద్భటముగ వేసవి, కైపు సడలఁ దోఁచెఁ
గారుకాలము దళమై. పాండు. ౪. ౧౯.

చ. ...తేఁకువ వచ్చువిరోధిసేనలన్, మరలఁగఁ
దోలుచోఁ నిలిచి మార్కొనువీరులఁ దాఁకి
వీఁక జర్జరితముగాఁ బడం బొడిచి చంపక
చిత్తము కైపు వోవునే. కు.సం. ౧౧.౬౧౯.
(ఇట 'కోపోద్రేకము' అని భావము )

౫. అందము, సౌందర్యము, ఒప్పిదము.

ఉ. కారుమెఱుంగులం దెగడు కైపున నొప్పు నె
లంత లంత బం,గారపుఁ బళ్లెరంబుల వగన్

నునుము త్తెపుముగ్గులోన నిం, పారెదుకెంపు దివ్వియల నందపుఁగెందొడవుల్ చెలంగఁ గా,నారతు లిచ్చి రప్పుడు యయాతికి లేనగ వొప్ప నర్తిలిన్. యయా. ౪. ౧౦౩.

సీ. పేరోలగంబున్నఁ జేర్చు కైపులతోడ నచ్చర పూఁబోఁడు లరుగుదేర. యయా. ౫.౧౫౫.

ఉ. ఎల్లరు నంత మేలుకొని యిందుముఖుల్ ముఖమజ్జనాదికం,బల్లనఁ దీర్చి కైపుగఁ దుకూంబరముల్ మణిభూషణావళుల్, మల్లెసరంబులున్ బరిమళంబులుఁ దాలిచి...రామా. ౨. ౧౦౭.

౬. విధము.

సీ. పాళ్లు గావించు కైపున రథుల్ రథముల నడిపి నుగ్గాడిరి కడఁకఁ గరుల. చంద్రా. ౬. ౧౦౦.

గీ. రావణునిఁ జెట్టవట్టినరాజ్యలక్ష్మి, కైపు తోఁపించులంకపొంకంబు గాంచి. రామా. ౬. ౧౦౩.

కైపెక్కు= ౧. మత్తిల్లు; అలసుఁడగు, సోమరియగు.

ఉదా: వాఁడు కైపెక్కి యున్నాఁడు.

గీ. జనులు మున్న కైపెక్కి యశక్య మని మ,నంబులోపల న్రుక్కి కార్యంబునందుఁ, బూని యుద్యోగ మొనరింపలేని రీట్లు,దానిసఫలతాఫలతలు దారు గంద్రు. మార్క. ౩. ౪౭.

౨. వీడు, పదలు; చెదరు.

సీ. కబరికాభారంబు కైపెక్కి విరులతో నవటుభాగంబుపై నత్తమిల్ల. కాశీ. ౧. ౩.

గీ. శ్రవణకహ్లారముకుళంబు జాఱకుండ, విరులకీల్గొప్పు వదలి కైపెక్కకుండ, నెత్తె శృంగారకందుకం బెత్తినట్లు, కైటభారాతి మందరత్నాధరంబు. హర. ౬. ౪౫.

కైముఁడి=కయిముడి. వి. (కై[1] + ముడి) వాద్యవిశేషము, తాళము.

గీ. తనరుఁ జాయ్యంకి కైముడి యనఁగఁ దాళ,ము...ఆం. భా. ౧. ౧౨౮.

సీ. గాలికొమ్ములు డోళ్లు కైముళ్లు రుంజలు ... మొ. రా. యు. ౩. ౨౬.

కైముతికన్యాయము. సం= కైముత్యన్యాయము.

కైముత్యన్యాయము. సం. వి. అ. పుం. ఒకానొకన్యాయము. (చూ. న్యాయము.)

కైమోడుపు(డ్పు)= కయిమోడుపు. వి. (కై[1] + మోడుపు.) నమస్కారము.

రగడ. మాహూరమం దనమానత విడిసినకాలమేఘునకుఁ గైమోడుపు లని. హంస. ౪. ౨౧౩.

కైరఁడు= కయిరఁడు. వి. (క. కయిర) అశ్వవిశేషము. (శ. ర.)

మ...మాహేంద్రచాపంబు మో,హనరత్నంబుల వాగెత్రాడు వడగం డ్లాస్యస్రవత్ఫేన మైత నరం దజ్జలదంబు కైరఁ డెగయున్ ధారావిహారంబులన్. వరాహ. ౧౦.౯౩.

గీ. బిగువుపదిలంబు చూచి గంభీరవృత్తి, మ్రొక్కి పొన్నంకవన్నియ ద్రొక్కి నిక్కి, సరవిఁ గైరని నెక్కి యుత్సాహలీల, పిక్కటిల్లఁగఁ ద్రొక్కించి రొక్కవగను. ప్రబంధ. ౧౭౪.

కైరవడి= కయిరవడి. వి. (సం. ఖాదిరవటీ.) తాంబూలముతోఁ గూడ నుపయోగించుకొనుటకు కాఁచు లోనగువస్తువులు చేర్చి చేసినయుండ, కాఁచువడియము, ఖాదిరఘుటిక.

సీ...ఖాదిరవట మొప్పును గైరవడి యన ... ఆం. భా. ౨. ౧౬౭.

సీ. కప్పురగందంబు కైరవళ్ పట్టీలు తట్టుపునుగును... ప్రబంధ. ౫౭.

గీ. కాఁచువడియంబు లనఁగను గైరవళ్లు,నంగ ఖాదిరఘుటికలనంగదమున. ఆం. శే. ౫౫.

కైరవము. సం. వి. అ. న. తెల్లగలువ.

కైరవి. సం. వి. న్. పుం. చంద్రుఁడు. ఈ. స్త్రీ. వెన్నెల.

**కైరవిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లగలువతీఁగ. ౨. తెల్లగలువలసమూహము. ౩. తెల్లగలువ లున్న కొలను.

**కైరవుఁడు.** సం. వి. అ. పుం. ౧. కితవుఁడు, జూదరి. ౨. శత్రువు. (మే. ని.)

**కైరాతము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. కిరాత సంబంధ మైనది. ౨. కిరాతదేశభవము. వి.అ.న. ౧. ఒకజాతిచందనపుమ్రాను. ౨. భూనింబము, నేలవేము.

**కైరాతుఁడు.** సం. వి. అ. పుం. బలవంతుఁ డగు పురుషుఁడు. (కల్ప.)

**కైలాగు**=కయిలాగు. వి. (√కై¹-త. కైలాగు.) హస్తావలంబము, చేయూఁత; ఊఁత.

క. మునుకలు గంగానదిలో, నొనరించుటకన్న
భాగ్య మున్నదె యనుచున్, మును కలుగం
గా దిగి పరి,జనములు కైలా గొసంగ స్నా
నోన్ముఖుఁడై. విజ. వి. ౧. ౫౫.

మ. అని సంతోషితచిత్తుఁడై బహువిధవ్యాపార
మాధుర్యలీ,ల నుతింపం దనపాణిపల్లవము
కైలా గిచ్చి యమ్మానిఁ ద,ద్ఘనగేహప్రతిహార
గేహళిఁ జొరంగాఁ బంపి తా నాత్మర,మ్య
నిశాంతంబున నుండె రంగపతి పద్మాదిప్రి
యాసక్తుఁడై. విప్ర. ౪. ౮౬.

**కైలాట(ము)**=కయిలాట. వి. ౧. మాయోపాయము; మాయ, మోసము.

ఉ. ... తానును గజాస్యుఁడు లక్ష్మియుఁ జేసినట్టి
కై,లాటమునన్ ఘటిల్లె సకలార్థము దేవర
యాజ్ఞ పెంపునన్. కాశీ. ౬. ౧౪౧.

ఉ. ... కై,లాటము చేసె దేటికి బళా పికమా
యిఁక మాను ... వేం. పంచ. ౪. ౧౯౨.

మ. కని చిల్కం దన పెంటి గాఁ దలఁచి యాకై
లాటపుంబుల్గు గ్ర,క్కున మి న్నందిన మేడ
మీఁదికిఁ దఱుక్కంగాంతితో జాతి ...
సారంగ. ౧. ౧౨౯.

వ. అవ్వోయవ్వ కడుపుకూటికి దబ్బ ఱాడితి వని
తలంచి యుండావే అది కల్ల గాదు కైలాట
గాదు తరకటబరకట గాదు తబ్బిబ్బు గా
దు... వేం. మా. ౫. ౩౮.

౨. కీడు.

గీ. చూడక మొగంబు త్రిప్పి మాటాడ కిపుడు,
చే దిగిచి పట్టుక పరాకు చేసినపుడె,యేమి
పుట్టునో కైలాట మింక మీఁద, మగువ దయ
లేక విడనాడఁ దగునె నీకు. విజ. వి. ౨.
౧౯౮.

జ: కైలాటకత్తె, కైలాటకము, కైలాటకాఁడు.

**కైలాటకత్తె(త్తియ)**=కయిలాటకత్తె. విణ. (√కైలాట) మాయలాడి, మాయావిని.

**కైలాటకము**=కయిలాటకము. వి. (√కైలాట) మాయోపాయము; మాయ, మోసము.

సీ. పనిలేనిపనికైనఁ బాటి కైలాటకంబులు సే
యుమునిఁ గన్నప్రోడవేల్పు. చిత్రభా. ౪.
౧౨౦. ప్రబంధ. ౫౨.

**కైలాటకాఁడు**=కయిలాటకాఁడు. విణ. (కైలాట + కాఁడు) మాయాశీలుఁడు, మాయావి; దుష్టుఁడు.

సీ.... తవలికాఁ డనఁగఁ గైలాటకాఁ డనఁగను
డక్కరి యనఁ. గీ. డంకనంగను మాయావి
పొంక మగును. ఆం.భా. ౨. ౨౮౬.

గీ. కల్లరియు గొంటు కైలాటకాఁడు చెడుగు,
...కూళ గడుసన వత్తిల్లుఁ గుజను పేళ్లు. ఆం.
సం. మాన. ౧౧.

**కైలాటము**=కయిలాటము.వి.(√కై¹)నమస్కారము.

రగడ. ఉత్తలతలమున నుత్తమహరికిని ఘనతరభ
క్తిని గైలాటము లని. హంస. ౪. ౨౧౩.

**కైలాసకి**=కయిలాసకి. వి. నాట్యవిశేషము.

ఉ....కై,లాసకి పేరణీవిధము లాఁగులు జక్కిణి చిందుకోల్వెణుల్, బాసలు కోపుఁజాపులును బాట పదాభినయంబు లేకయున్, వాసికి మీఱు నాట్యకలనన్ బ్రకటించెను హావభావముల్. శ్రీరం. మా. ౪. ౧౬౨.

**కైలాసము.** సం. వి. అ. పుం-కేలాసము(=స్ఫటికము)వలెఁ బ్రకాశించునది-వెండికొండ.(ఇది శివునకును కుబేరునకును ఉనికిపట్టు.)

**కైలు**=కయిలు. వి. (హిం. కైల్) పండినధాన్యము కొలత. (శ. ర.)

జ: కైలుదారుఁడు.

**కైలుదారుఁడు**=కయిలుదారుఁడు. వి.(√కైలు) కైలు చేయించెడియధికారి.

**కైళము.** సం. వి. అ. న. ౧. వేడుక, వినోదము. ౨. కేళీసమూహము.

**కైవడి**=కయివడి. వి. (కై¹+వడి) ౧.కరజవము, చేతివడి, చేతిచురుకు.

గీ. కైవడి యనంగఁ దగు రీతి కరజవంబు.ఆం.భా. ౩. ౫౨.

క. కైవడి మెకములఁ గ్రుమ్మెడి,కైవడి మాయావి చేవ కనఁబోయెదుగా, దేవర మా దేవరవలె, వేవేగమె సామి వేఁట విచ్చేయవయా. సారంగ. ౧. ౭౬.

౨.ప్రకారము,రీతి; పోలిక,సామ్యము.

క. ... మెకములఁగ్రుమ్మెడి,కైవడి...సారంగ. ౧. ౭౬. ఆం. భా. ౩. ౫౨.

చ...పాలలోఁ బడినబల్లులకైవడి కెల్లపెంటలన్, జడితిమి వేయు నేల సరసీరుహసంభవ దుష్టదైత్యు చేన్. హర. ౩. ౧౫.

క. విను మలుక వొడమి మిక్కిలి, కను దెఱచిన త్రిపురవైరికైవడి యాయర్జునునందుఁ దోఁచుచున్నది....భార. భీష్మ. ౨. ౯౩.

ఆం. భా. ౨. ౩౦౨.

**కైవడిముస్తె**=కయివడిముస్తె. వి.(సం. కైవర్తముస్తా.) తుంగముస్తె.(శ. ర.)

**కైవర్తకుఁడు.** సం. వి. అ. పుం=కైవర్తుఁడు.

**కైవర్తము.** సం. వి. అ. న. కైవడిముస్తె, తుంగముస్తె.

**కైవర్తి.** సం. వి. ఈ. స్త్రీ. కైవడిముస్తె. (కల్ప)

**కైవర్తుఁడు.** సం. వి. అ. పుం-నీటియందు వర్తించువాఁడు-చేఁపలఁ బట్టువాఁడు, జాలరి.

**కైవల్యము.** సం. వి. అ. న-కేవలత్వము, ఐక్యము-౧.ఒంటరి యగుట,ఏకాకిత్వము.౨.(రెండు పదార్థములు) ఒకటిగా అగుట. ౩. నిర్వాణము, మోక్షము.

**కైవలి**=కైవడి.

(ఉపమ, పోలిక.)

సీ. కైవడి కైవలి కయివడి కాడుపు ... పోలిక యనఁగఁ బోల్పొందు నుపమపేరు.ఆం.భా. ౨. ౩౦౨.

**కైవసము**=కయివసము. విణ. (కై¹+వసము) -హస్తగతము-వశము, స్వాధీనము.

క. కావేరిని స్మరియించినఁ, గావేరిని దీర్థమాడి కావేరినదిన్, సేవించిన వారలకున్, గైవసమగుఁ గ్రతుఫలంబుఁ గైవల్యంబున్. శేష. ౪. ౧౭౨.

సీ. పరుఁడు గైవస మైనవనిత స్వాధీనభర్తృక ... నరస. ౨. ౪౦.

**కైవారపుఁజెయ్యి**=కయివారపుఁజెయ్యి. వి. (కైవారము¹+చెయ్యి) నమస్కారవిశేషము.

రగడ. తనరుశరణ్యస్థలముశరణ్యస్వామికి నిదె కైవారపుఁజెయ్యని. హంస. ౪. ౨౧౩.

**కైవారము¹**=కయివారము¹. వి.(త. కైవారమ్.) స్తోత్రము,పొగడ్త.

వ. ...హరసఖవీరభటహరిణశార్దూలుండును సుర రాజకుమారపరివారవారివాహపవనుండును న నుకైవారంబులు సెలంగ నరకాసురుఁడు... ఉ. హరి. ౧. ౪౯.

సీ. కైవార మనఁగఁ బొగడ్త యనఁగఁ. గీ. బొ గడిత యనంగఁ బొగడు నాఁ బొగడిక య న, మెప్పు నా మెచ్చు నాఁగను మీఱు వి నుతి. ఆం.భా. ౧. ౧౧౪.

సీ. మొనలకైదువవాఁడు మినుకుఁగైవారముల్ మెచ్చువాఁ డని బీర మెచ్చువాఁడు. అచ్చ. రా. బాల. ౧౩.

గీ. అనుచుఁ గైవార మొనరించునవ్వలంతి, మ న్నువేలుపు మేల్బంతిమదికి మీఱ, వేడ్క లొనగూర్చి పనిచి ... నీలా. ౨. ౪౨.

మ. బలభిద్వహ్నియమప్రచేతసులకుం బ్రస్తో యు వే మెల్లనుం, గలిభూపాలునియొద్దిపాఠ కుల మీకైవారదుర్భాషణం, బులకుం గాని యతండు మెచ్చఁడు దయాబుద్ధిం బరాధీన వృత్తుల నిశ్చేదల మమ్ముఁ గావఁ దగు నీద్రో హంబు లేకుండఁగన్. శైవ. ౬. ౭౯.

(ఈ ప్రయోగముతో.శ.ర.దీనిని తత్సమమునుగా గ్రహించెను. కాని శ్రీనాథునకు సంస్కృత సమాసమున సంస్కృతేతరపదములఁ జేర్చునల వాటు గలదు. ఇట్లే 'హేరాళ'పదమును గూడఁ బ్రయోగించినాఁడు.

క... వసియించుఁ, హేరాళక్రీడాసం,చారిణి మాకాంబ భక్తజనరక్షణకై. భీమ. ౧. ౧౦౦.

'కయివారము' అను రూపాంతర ముండుటచేత ను అచ్చతెనుఁగు గ్రంథములలో నుండుటచేతను సంస్కృతనిఘంటువులలో లేకపోవుటచేతను దీనిని అచ్ఛికముగా గ్రహించుటయే యుక్తము)

కైవారముచే(సే)యు=స్తుతించు, పొగడు.

క. నావుడు నిది యా సంజయ, కైవారముసేసె దీవు కౌంతేయుల... భార. ఉద్యో. ౨. ౨౨౬.

క. మీవారెల్లను దెలుచం,గైవారముసేసి రతి నిఁ గౌరవనాథా. భార. ద్రో. ౩. ౧౩౬.

జ: కైవారపుఁజెయ్యి, కైవారి.

కైవారము²=కయివారము². వి.చుట్టుసుంకుకొ లఁది. (చి.ని.) పరిధి, గుండ్రనివానిచుట్టుకొలఁ ది.(బ్రౌ) ఉదా: నూతికైవారము, ప్రహరికైవార ము, నెం.

కైవారి=కయివారి. వి.(కైవారము¹ + ఇ - ఇది ఒ యారివంటిది.) స్తోత్రపాఠకుఁడు, కైవారముచే యువాఁడు, వంది.

మ. కమలాక్షస్మరఘస్మరాబ్జభవులుం గైవారు లంభోధిపూరములుం బుక్కిటిసాము గో త్రగిరివర్గమ్ముం గనత్కుండుకా,భము...హరి. పూ. ౧. ౪.

సీ. సారిది సంజాతుఁడై నూతుండు నాఁ జనుమ నియుఁ దన్నఖకాలమునన జనన, మొంది మా గధుఁడు నా నొప్పసంయమియు నయ్యాజు నాజ్ఞఁ గైవారులై దివిజాల,నలరించుపని ను న్కి...హరి. పూ. ౧. ౧౧౯.

కైవా(వ్రా)లు=కయివాలు. అ. క్రి. ౧. వంగు, ఒఱగు.

ఉ...బలుసుఁబండులచాయఁ దనర్చి పండి కై, వ్రాలినరాజనంబులకు వచ్చుశుకంబులఁ జేర నీక...విక్ర. ౪. ౩౯.

గీ. ప్రొద్దు కైవాలుదాఁక నప్పాలఁతు లుండి, యే మొ సర్వేశ్వరుం డిట్లు తామసించె, ననుచుఁ జింతించుచున్న ... శుక. ౩. ౯౩.

౨. పక్ష్యాదులు క్రిందికి దిగు, వ్రాలు.

సీ. నఖపాళి బెడఁగు మాన్పకు మంచు నుతులు గై వ్రాలె నా స్ఫటికాక్షమాలిక దగ. ఉ. రా. ౩. ౧౦౩.

౩. పడు.

శా. కంఠేకాలపదారవిందములపైఁ గైవ్రాలి లో లాక్షుఁడున్, ధుంఠీశు న్వినుతించి భైరవుని

మోము్పంగేలుతో డాపి వై,కుంభస్వామికిఁ జాఁగి మ్రొక్కి ... చంద్ర. ౩. ౨౨.

వ... పన్నీరు నించిన యన్నీరుతిత్తు లొత్త వియత్తలంబునం బాఱి కైవ్రాలుధారల వాద్యంబులు దడిసిన ... ఆము. ౪. ౩౫.

౪. గలించు, కడచు.

గీ. ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ, గాశికాఖండ మనుమహాగ్రంథ మేను, దెనుఁగు చేసెద ... కాశీ. ౧. ౨.

౫. మ్లానమగు, వాడు.

క. వ్రాలిన యొప్పలు వెతఁ గై,వ్రాలినహృదయాంబుజంబు వసుమతిమీఁదన్,వ్రాలినచూపులు మొగమున, వ్రేలంగను ముక్కుమీఁదివ్రేలుం దనరన్. సారంగ. ౨. ౨౫౫.

జః కైవాలుచు.

**కైవా(వ్రా)లుచే(ల్చే)**=కయివాలుచే. స. క్రి. (√కైవాలు) కైవ్రాలఁ జేయు. (శ.ర, శ్రా.)

**కైవీఁగు**=కయివీఁగు. అ. క్రి. (కై[1]+వీఁగు.) చేయుచున్నపని నుండిమరలు, పనిమాను.

వ. అంత నుభయబలంబులుం గైవీఁగి నిజశిబిరంబుల కరుగునవసరంబున...కు.సం.౧౧.౨౨౩.

(ఇట 'యుద్ధకృత్యము మాని' అని భావము.)

**కైవు**=కయివు. వి. కైపు, మత్తు.

కైవెక్కు=మత్తిల్లు.

క. నావుడు మురారి నవ్వుచు, నావేఁదుఱు నూఱడించి యనుచితము మహీ,దేవునిఁ జంపుట యనుచుం, గైవెక్కినవాని మేను కరమున నిమిరెన్. ఉ. హరి. ౨. ౧౫౦.

**కైశికము.** సం. వి. అ. న. వెండ్రుకలసమూహము. (శొప్ప, సిగ, మొ.)

**కైశికి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. శృంగారకరుణరసానుకూల మగునొకకావ్యవృత్తి. ౨. దుర్గ.

**కైశోరము.** సం. విణ. (అ. ఈ. అ) కిశోరసంబంధమైనది. వి. అ. న. వయోవిశేషము. (పదునొకండు మొదలు పదునేనేండ్లవఱకు ఉండువయస్సు అని కొందఱు. పదునొకండు మొదలు ఇరువదియేండ్లవఱకును ఉండువయస్సు అని కొందఱు. పండ్లు వచ్చినది మొదలు మూఁడుసంవత్సరములవఱకును ఉండువయస్సు అని మఱికొందఱు.)

**కైశ్యము.** సం=కైశికము.

**కైసడలు**=కయిసడలు. అ. క్రి. (కై[1]+సడలు) కైవ్రాలు, ఒఱగు, వంగు.

ఉ. వేసవి పాటపాటనర నెండ్రుకతోఁ దిలకండులాన్వయ, శ్రీ నటియింపఁ గైసడలి వ్రేఁకని చన్నులు పాలవంకలై,కా ససియార్ప... కాశీ. ౨. ౧౫౯.

**కైసరుఁడు.** వి. (సం. కవీశ్వరః.) కవి.

సీ. కబ్బపుఁజేఁతరి కయి కైసరుఁడు మాటలల్లువాఁ డనుపేళ్లు చెల్లుఁ గవికి.సాం.ని.మాన.౬.

**కైసాటిచుక్క**=కయిసాటిచుక్క. వి. (కై[1]+సాటి+చుక్క)-చేతియాకృతి గలనక్షత్రము-హస్తనక్షత్రము. (శ. ర.)

**కైసేఁత**=కయిసేఁత. వి. (√కైసేయు) అలంకరించుట.

క.గరిత లలంకృతి సేయఁగ,గరువపుమురు వపుడు హెచ్చి కన్నియ దనరెం, బరియణపుం గైసేఁతల, నరపతి యొఱపతిశయిల్లునటనఁ జెలంగన్. విజ. వి. ౨. ౧౩. ఆం. భా. ౨.౧౪౬.

**కైసేయు**=కయిసేయు. స. క్రి. (కై[1]+చేయు.)

౧. అలంకరించు.

క. ఆసమయమునఁ గుమారిం, గైసేసి తదీయజననిఁ గాన్పించి చకోరీసుదతి సుప్రయాణ, శ్రీనూతన చేసి ప్రణతి సేయించుటయున్. విక్ర. ౪. ౧౯౨.

ఉ...కై,సేసికొనం గడంగె... విక్ర. ౭ ౭౨.
ద్వి. పురము కై సేయించి...అ.మ. క. ౫. ౨౫౩ పా. ౨. పం.

౨. పూజించు, అర్చించు.

మ. తనకుం దాన ప్రతిష్ఠితుం డయినయాదక్షా ధ్వరధ్వంసి సే,మును పూజించితిఁ బిమ్మటన్ హరియు నంభోజాతగర్భుండునుం, గని కైసేసిరి యంతమీఁద సురలున్ గంధర్వులుం జేరి యా,ర్చనముల్ సేసిరి మీరు చేయుఁడు తగన్ సమ్యక్సమారాధనల్. భీమ. ౪. ౨౦౩.

## క్రొ

**క్రొంకనక్క.** వి. (కొంకు + నక్క=పిఱికినక్క-క్రొ.) క్షుద్రజంబుకము, చిన్న జాతినక్క.

ఉ. చీమలుఁ గాకులుం గ్రిములు జింకలు నక్కలుఁ గొంకనక్కలున్. భార. అశ్వ. ౨. ౧౧౭.

గీ...కొంకనక్క యనఁగ, క్షుద్రజంబుక మంచు నెంచుకొనఁ దగును. ఆం. భా. ౨. ౯౩.

ఆ. కొంకనక్క చావ గొఱ్ఱె లేమిటి కేడ్చు. వేమన. ౨. ౫౯.

**క్రొంకర.** వి. (క. కొక్కె) వంకర, వంపు, వక్రత్వము. (చూ. కొంకరలుపోవు.)

విశే. వక్రము, వంకర యైనది.

క. ఎక్కడిమొగ మెక్కడిపాదు, వెక్కడిరూపేడగమన మెక్కడికంఠం, బెక్కడ వినము కనుంగొన,మిక్కొంకర మొకము ననుచు నేత్తెఱ దానిన్. వేం. పంచ. ౧. ౪౭౬.

వంకరకొంకరమాటలు=అడ్డదిడ్డపుమాటలు.

వ...ఈ బ్రహ్మచారి శంకరునిగుఱించి యింకను వంకరకొంకరమాట లాడ నుంకించుచున్నవాఁడ ... హర. ౪. ౩౩.

జః కొంకరలుపోవు,కొంగోడు,కొంగోడుపడు, కొంగోడువోవు.

**కొంకరలుపోవు.** అ. క్రి. (√ కొంకర.) శైత్యాదులచే వంకర యగు, మెలికలుతిరుగు.

చ. నినుఁ దనచంక వైచుకొని నీరనిధానచతుష్టయంబునన్, జని చని సాంధ్యకృత్యములు సల్పెడునంతకుఁ ద్రిప్పి తెచ్చి పెం,పున నట వైచి కొంకరలుపోయిననీ మెయి చక్క నొక్క పో, నిచిన వాలినందనుఁడ నంగదుఁడన్ దశకంఠ వింటివే. రామా. ౭. ౨౫౯.

కొంకరవంకరలువోవు=కొంకరలుపోవు.

ద్వి ... ఈశ్వరుని, వడు మటు వీఁగి యున్నది యొక్కదెసకు, వారక కొంకరవంకరలోవ్వి, గారీశు చేతులు పూరించినవియు. బస. పు. ౩. ౫౬౩. పం.

**కొంకి=క్రొంకి.** వి. (క. కొంకి) ౧. వస్తువును లాగికొన నుపయోగించునట్లు వెదురు మున్నగువానికి చివరఁ గట్టుపుల్ల, మొ.

వ. ఇవ్విధంబున నెడలం దిగిచి బ్రదికించి కొంకిగలనిడుపువెదురునం జేఁద పుచ్చి నీరు దిగిచి యబ్బాలునిదప్పి దీర్చి... దశకు. ౧౧. ౭౯.

౨. అందనిపండ్లులోనగువానిఁ గోయుటకు ఉపయుక్తముగా వంకరచిల్లదోఁపినకోల, దోఁటి. (శ. ర.)

౩. చోరసాధనవిశేషము; యుద్ధసాధనవిశేషము.

ఉ. కత్తియు నీలిచీరయును గంకటి రజ్జువు నారసంబు ముల్,గుత్తియు వాటురా లినుము గొంకియు నక్షత లొల్కుబూదియున్. చెన్న. ౩. ౨౯౪. బస. పు. ౫. ౩౩౯ పం.

వ...పౌండ్రభూపాలుండు యదువీరునగరంబు కలుఁగోట వికటంబుగా పలుఁదటంకంబుల నఱకించియు దంతపుగుండ్లం బడవైచియుఁ గొంకి క్రమ్ముడు దగరు మొదలుగాఁ గలసాధనంబులచేఁ జీకాకు పఱచియు... ఉ.హరి. ౩. ౩౬.

౪. వంపుచీల. (శ. ర.)

౫. కాలిమడమపైభాగము.

సీ. మడమ యం చనఁగను మనుఁ బార్ష్ణి కొంకి నాఁ దదుపరి దేశమై తనరుచుండు. ఆం. భా. ౨. ౧౩౫.

చ. కవపటు డించి యే గునుకఁ గా నురెఁ గొంకులఁ దార్చి కూలుడు, న్నివిడినబొజ్జపై మిగులునిద్దపుదోవతిపట్టి డొల్లి రాఁ, దివిచి పెనంగ పల్లవముఁ ద్రెంచి యనంతునిగంట్ల కూనపుం, జెవులు గ గొాద కట్టు గసె చేతుల టెక్కయు దోఁపు నొల్చి పోక్. ఆము. ౬. ౭౧.

(బ) ౧. ముచ్చిలిగుంటకు ప్రక్క నుండెడియెముకలు. (ఉదా: మెడకొంకులు. శ. ర, బ్రౌ.)

౨. మోఁకాలిచిప్పకు లోతట్టు రెండుప్రక్కల నుండెడియెముకలు. (శ. ర.)

కొంకిగోరు=కొంకివంటిగోరు, వంకరగోరు.

సీ. బూరుగుకాయఁ బోల్ బోరలు లవిటులకొన కత్తెరలకట్లు కొంకిగోళ్లు. ప్రబంధ. ౧౩౦.

ఇట్లే: కొంకివ్రేళ్లు.

సీ. బొక్కబొమ్ములు లోఁతుఁబొట్టలు మిడిగ్రుడ్లు గూనివీఁపులు నిడుఁగొంకివ్రేళ్లు. ఉ. హరి. ౨. ౧౨౨.

కొంకిసిగ=కొంకివలె వంకరగా నుండుసిగ.

వ... చెవులసంకులు లోవంకభుజంబులు కొంకిసిగలు గావిదుప్పటులు నొప్ప... ఆము. ౪. ౩౫.

కాలికొంకులు=డేగ మొదలగుపక్షులకాళ్లయందలి కొంకివంటివంకరగోళ్లు. (బ్రౌ.)

**కొంకి(కు)కొను.** అ. క్రి.=కొంకు. (√కొంకు-స్వార్థమున 'కొను')

(వెనుదీయు)

ఉ... అనుమానముతో నొకకొంత గొంకికొం, చక్కట నీ కొకందులకు నచ్చిక లేక మెలంగ విష్ణుదా, సెక్కడిభర్త గాఁగ సృజియించెన జుం డని హేల నవ్వుచుక్. హంస. ౧. ౭౯.

**కొంకు.** అ. క్రి. ౧. భయపడు, జడియు, ఉలుకు.

గీ. వచ్చి యుచ్చండకర్మ తా వాకిటికడ, నిలిచి తనయుగ్రమహిషినిఁ బిలువఁగానె, గుండె జల్లని చతురుండు కొంకుచుండ, నతని నెట్లింతి యిలు వెళ్ల ననుప వలయు. హంస. ౩. ౧౮౪.

గీ. కుచభరంబున నడుము కొంకుచు వడంక, నూలు దోఁడును వేశ్య నవ్వాలుఁగంటి. హంస. ౨. ౨౨.

క.... కాననాంతమున మ్రుచ్చులకుం, గొంకి యపహాయతను నే, వంకకు నరిగితివో ... విక్ర. ౭. ౧౨౭.

౨. సంకోచించు; వెనుదీయు.

ఉ. ఇట్టిది క్రూరకర్మ మని యించుక కొంకక లక్కఱుంటఁ జీ, చొప్పట్టితి మాయజూదమున నుత్తము ధర్మజుఁ దూలఁబుచ్చితి ... భార. శల్య. ౨. ౧౩౪.

శా... ఆచిర్ణాండసంభీశ్వరుం, డేమిక్ గొంకక పెట్టు జంగములకుక్ హేరాళ మిష్టాన్నముల్. హర. ౨. ౨౭.

క. క్రుంకె నెల మఱఁడు వేఁటకుఁ, గొంకె నుషూచ్ఛయము డొంకెఁ గుముదంబులదా, లింకెఁ దిమిరోత్కరంబుల, లంకె రవిచ్ఛవియు దివిఁ దొలంకెఁ గడంకక్. బహు. ౨. ౧౦.

వి. ౧. భయము, జడుపు, బెదరు.

ఆ. తలఁకు పుట్టెఁ గొంకు గొలఁదికి మీఱె వె, న్నాటు దోఁచె ముట్టుపాటు దొడరె. భార. విరా. ౨. ౧౦౬.

ఆ. ఓరి దోసకారి యూఱుగనిల్వ్రువనఁ, బెల్లు మీఱి జగముతల్లి యైన, ప్రొద్దుఁగోలపుసామిముద్దియ నిటు లేల, కొంచుఁ బోయె దిపుడు కొంకు లేక. అచ్చ. రా. అర. ౬౯.

౨. సంకోచము.

క. తెలివ యొడఁబాటుమాటం, బలివోయిన కొంకుతోడ బ్రాహ్మణుఁ గొని కన్యకుఁ గగు నెడకు నరిగె...భార. అను. ౧. ౭౪.

చ ... మానక వేచని మంతనంబున, న్వనితలు కొంకుతో భయమునన్ వినిపించిరి యేమి మాయయో, మనుజవరాగ్రగణ్య మణిమాలిక గర్భముఁదాల్చె వింతగన్.ఉ.హరిశ్చ.౨.౯౪.

౩. వంకర, కొంకర. (చూ. కొంకువోవు)

చ. పదములకొంకు వోఁ బిసికి ప్రక్కలస్రుక్కడలించి దంశవం,శదమనవృత్తి నిం పొసఁగి పొస్న నఖంబుల దువ్వి నెత్తురుల్, చిది కెడు గండ్ల భూరజముచిల్క...పాండు.౪.౨౩౬.

కొంకుకొసరు=సంకోచము;జంకు. (ఈరెండుపదములును సమానార్థకములు. చూ. కొసరు. ౪. అర్థము.)

గీ. సింహబలుఁ డత్యుదగ్రుఁడై చిగురుఁబోఁడి, పజ్జఁ గడు వడిఁ దగిలి కోపంబు గదుర, నొడిసి తల పట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ, గొంకుకొస రింమకయు లేక కూలఁ దాఁచె. భార. విరా. ౨. ౧౨౭.

గీ. గోత్రపరిపంథితోఁ గొంకుకొసరు లేక.కుపల. ౪. ౬౬.

క. అని రంభ సిగ్గువడఁ బల్కిన దానికిఁ గొంకు కొసరు లేక దశముఖుం, డనుమానింపక యిట్లను...నిర్వ. ౬. ఉ౭. విక్ర. ౩. ౯౭.

జ: కొంకనక్క, కొంకికొను, కొంకుపడు,కొంకుపాటు, కొంకువోవు.

కొంకుప(వ)డు. (గ్రా.)అ. క్రి. (√కొంకు)భయపడు; సంకోచించు; వెనుదీయు.

కొంకుపాటు. వి. (√కొంకుపడు)౧.భయపడుట; భయము.

సీ. పరులు తిట్టినచోటఁ బ్రత్యుత్తరము లేక ప్రాణహానికిఁ గొంకుపాటు లేక.గీ...అపుడ విద్వత్ప్రబంధంబు వనుకరించె,జారిణీజారవరహస్సంగమములు. కవిక.౪. ౧౦౭. (శ. ర. పా.)

౨. సంకోచపడుట; సంకోచము.

చ...వాని చెంతకున్, గుతుక మెలర్పఁగాఁ జని శకుంగని కోమలి కొంకుపాటుతోఁ, గొతుకుచుఁ బల్కె...హంస. ౩. ౨౨౦.

కొంకు(లు)వోవు. అ. క్రి. (√ కొంకు). ౧. (శీతబాధాదులచే) కొంకరలుపోవు, వంకర యగు.

గీ. కొన్ని దేశంబు లివముచేఁ గొంకువోయె. కాశీ.౧.౧౩౭. (దేశములు=దేశములోని ప్రాణులు.)

చ...అపదం, బొరయకయుండఁ జేయుము ప్రభూతపుసీతునఁ గొంకువోయెడున్. భార. శాం. ౩. ౩౧౩. (ఈతఁడు అనుకర్తృపదము అధ్యాహార్యము.)

ద్వి. కొంకులువోక లోవంకలు గాక,పొంకంబు దప్పక పొందులు చెడక ...అక్కజం బగుచుఁ, బొదము ల్తొల్లింటిభాతిని నమర. పండితా. పురా. ౯౩. పా.

కొంగ. వి. (సం. క్రుఙ్.) ౧. క్రౌంచపక్షి.

గీ. కొంచ కొంగ యనంగను గ్రౌంచ మెసఁగు. ఆం. భా. ౨. ౯౩.

౨. బకము.

సీ. కొక్కెరా లనఁగను గొక్కు లనంగను గొక్కెర లనఁగను గొంగ లనఁగఁ, బరఁగు నభిఖ్యలు బకవిహంగములకు...ఆం. సం. తిర్య. ౧౨.

గీ...కొంగ యన బకంబు. సాం. ని. తిర్య.౭౯.

(గేలుకొంగ, గుడికొంగ, పినిగలకొంగ, పూఁగొంగ, సంకుబుద్ధికొంగ, దోసికొంగ-ఇవి కొంగలలోని భేదములు అని క్రొత్తబ్రా.)

కొంగ మెడ=పొడుగు మెడ.

కొంగకాళ్లవాఁడు = ఎత్తైనమోఁకాళ్లు గలవాఁడు, ఊర్ధ్వజానువు.

క. తమపెనుపలు కరము గొంచెము, లమేయము
లు పగఱమూఁకలు...హరి. ఉ. ౨. ౧౯.
గీ. చింత యేటికి మన కింక నెంతకార్య, మైనఁ
బవమానసూనుఁడు పూనుకొన్న, సులభత వ
హించు నితఁడె కావలయు నన్న,గోష్పదము
కంటె మున్నిది కొంచియంబు. చం. రా.
౬. ౯౨.
౨. సుకరము, తేలిక యైనది, చులుకనిది.
క... అ,మ్మానినితోఁ బొందు కొంచెమా యొన
గూడన్. శుక. ౪. ౧౬.
క. తెలిసిన నేఁగుము తెలియని,యలవైనం బో
కు కొంచెమా పరపురుషుం,గలయుటలు...
శుక. ౧. ౪౪౭.
వి. ౧. న్యూనత, కొఱఁత, లోటు.
ఉ...నీకు నీ,కొంచెము వచ్చె నెల్ల హరిఁ గోర
నుతింపమి నార్యపూజితా. భాగ. ౧. ౯౫.
ఉ...నూఱులన్, గాంచనివారు సద్గతులు గాం
చరటంచు శ్రుతుల్ వచించు నా,కొంచె
ము దీసివేసి సుతుఁ గోవిదు నిచ్చి కృతార్థుఁ
జేయవే. శేష. ౪. ౨౧. వి. పు. ౧. ౬౫.
౨. అల్పకాలము, అచిరకాలము.
ఉ. మేరుగిరీంద్రచాపుని యమేయకృపారసపూ
ర్ణదృష్టి నీ,కూరిమిపట్టిపైఁ గలదు కొంచెము
లోననె కాయసిద్ధికిం, గారణ మున్న దాత
నికిఁగా మదిఁ గుందకుఁడీ...సారంగ. ౩.
౨౫౧.
౩. సంక్షేపము, సంగ్రహరూపము.
క. అని మన్వాదులు విస్తర,మునఁ జెప్పినమర్మ
ధర్మములు గొంచెమునన్,వినిపించిన ... వ
రాహ. ౯. ౧౩౧.
కొంచెపువాఁడు=అల్పుఁడు.
క. వీరితలం పెఱిఁగిన గాం,ధారీతనయుఁడు ను
హృద్వితాపముఁ గూర్పం,బోరఁబరిమార్తుఁ
గొంచెపు,వారై యున్నాడన యని యవశ్య
ముఁ గడఁకన్. భార. ఉద్యో. ౧. ౧౪.
ఉ. వంచన నన్యకాంతఁ గొనివచ్చినదుష్టుని మీ
దశాననుం, గొంచెపువానిఁగాఁ దలఁచుకొ
మ్మిట నల్పులు లేరు...భా.రా.యు.౧౦౩౭.
జ: కొంచెకత్తె, కొంచెకాఁడు, కొంచెతనము,
కొంచెపడు, కొంచెపఱచు, కొంచెముచే
యు, కొంత, కొందఱు, కొందాఁక, కొని,
కొన్నాళ్లు, కొన్ని, మొ.
కొంచె(చియ)ముచేయు. స. క్రి.(కొంచెము+
చేయు.) ౧. తక్కువపఱుచు, అవమానించు.
సీ. శ్యామోదయము కొంచియము చేయ నేతెంచి
శ్యామోదయమును హెచ్చఁగఁ దనర్చె. చం
ద్రి. ౪. ౪౫.
౨. వంచించు, మోసపుచ్చు.
ఉ... ఈమమున్,గొంచెముచేసి త్రాడ్గొతికికోఁ
దలపోసెదు మెచ్చితి న్నినున్. ఆము. ౬. ౪౦.
కొంజె=కొఁచె. అ. క్రి.భయపడు; సంకోచించు.
క. కంజదళాక్షుఁడు వెదకెను, గొంజక తేఁగల
నపారగురుతృణవనికా,పుంజంబుల...భాగ.
౧౦ పూ. ౫౦౫.
క. అంజక బాలకుఁ డనియును, గొంజక దయ
మాలి రాజకుంజర యంతన్, గుంజరమును
డీకొలిపెను,గుంజరపాలకుఁడు గోపకుంజరు
మీఁదన్. భాగ. ౧౦ పూ. ౧౩౧౭.
కొంట. వి. (√ కొను) కొనుట. (అనుప్రయుక్త
మైన 'కొను' ధాతువునకును రూప మిట్లెయుం
గునది. ఉదా: కనుఁగొంట, కైకొంట, పైకొంట,
మొ. శ. ర)
కొంటె. విశే. (త. కొండి.) అకార్యకరణశీలుఁడు,
దుష్టుఁడు, ధూర్తుఁడు.
క. కొంటెవి మాహృదయంబులు, గొంటెవి మానం
బు లజ్జఁ గొంటెవి పలుకుల్,గొంటె వికశ నెటు

నీ సెదొ, కొంటెవు గద నిన్ను నెఱిఁగి కొంటిమి కృష్ణా. భాగ. ౧౦ పూ. ౮౨౨. హంస. ౫. ౧౧౩.

జ: కొంటెతనము.

**కొంటెతనము.** వి.(√కొంటె) దౌష్ట్యము, ధార్ష్ట్యము, అకార్యము.

ఉ. తుంటఁట కార్ముకంబు కఱదొట్టినతేంట్లఁట వింటినారి చే, యంటిన వాడుతూపు లఁట... కాయము లేదఁట నీకు లోకముల్, కొంటెతనంబునన్ గెలిచితో లిది యచ్చెరియంబు మన్మథా. కృ. శతం. ౨. ౧౭౯.

క. వింటి కదా నీతనయుని, కొంటెతనము వీరి మాని కుటిలాలక న, క్కుంటునకు నిత్తు రఁట యిటు, వంటివి పో పెక్కునోళ్లవారలమాటల్. భోజరా. ౫. ౩౩౧.

**కొండ.** వి. (క. కొండ) ౧. పర్వతము.

సీ. ఏకొండశిఖరాగ్ర మీక్షించినంతన భవబంధములఁ బెడఁబాపఁ గల్గు. విక్ర. ౧. ౧౯౭.

౨. ఆకాశము.

(వ్యవ) కొండమీఁదిచుక్కలు. కొండంతయు ఎఱుపెక్కినది.

౩. ఘనకార్యము, గొప్పపని.

క. కొండ ధరించుట నాకొక, కొండా ...హరి. పూ. ౭. ౧౭౯.

క. దండిని బ్రహ్మాండంబులు, చెండుల క్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడువారికిన్, గొండఁ బెకలించి యెత్తుట, కొండొకపని గాక యొక్కకొండా తలఁపన్. భాగ. ౧౦ పూ. ౯౧౮.

విశే. గొప్పది, ఘనము.

గీ. తా నెఱింగియు నీజాతి గానిదాని, మాటలెల్లను గొండగా మదిఁ దలంచి, యల్ల నడుచేయి గిన్నె యిట్లుంప నేల, కుడిచి కూర్చుండి నను బాలి గొలుప నేల. విప్ర. ౪. ౭౭.

కొండఁ ద్రవ్వి యెలుకను బట్టు (కొను)=స్వల్పఫలముకై యెక్కుడుశ్రమ నొందు.

ఉత్సా. ... ఇప్పుడీవు చెప్పినట్టికష్టపా, టెంత దానకైన ఘుటిక నినుము పసిఁడి యౌట దా, నెంత వినుము కొండఁ ద్రవ్వి యెలుకఁ బట్టుటిది సుమీ. పరమ. ౧. ౧౮౭.

గీ. ఎంతదవ్వులనుండియో యేఁగుదెంచి, కడెఁడు మెతుకులకై యింత కష్టపడెదుఁ, గటకటా యమ్మహీసురాగ్రణివిధంబు, కొండఁ ద్రవ్వి యెలుకను గొనుట యయ్యె. కుచేల. ౨. ౧౧౨.

గోరంతలు కొండం (డలం) తలు చేయు = అల్పవిషయమును అధికముగాఁ జేయు.

(వ్యవ) వాఁడు గోరంతలు కొండంతలుచేయును.

ఉ. ... గో, రంతలు కొండలంత లగునట్లుగఁ జేసితి మంచు...ఆము. ౫. ౭౭.

కొండఁజేయు=పెద్దచేయు.

సీ. ఈకొండ మణికాంచనాకారరుచి గాంచెఁ గొండ లెల్లను దనుఁ గొండఁజేయ. విక్ర. ౨. ౧౫.

కొండపట్టు=పర్వతములకుఁ బాఱిపోవు.

ఉ. గద్దియ డిగ్గి కశ్యపునిగాదిలిసూనుఁడు గొండపట్టినన్ ... కాశీ. ౬. ౨౧.

సా: కొండ తలక్రిందఁ బెట్టుకొని వాలకొఱకు వెదకినట్లు.

జ: కొండంగి, కొండఁజేయు, కొండకంది, కొండకాకి, కొండకాలువ, కొండకోఁతి, కొండగుమ్మడు, కొండగుఱుతు, కొండగోనుగు, కొండగొఱ్ఱె, మొ.

**కొండంగి.** వి. (√కొండ) కొండముచ్చు, గోలాంగూలము.

సీ. కొండముచ్చనఁగను గొండంగి యనఁగ గోలాంగూల మెసఁగును...ఆం. భా. ౨. ౮౩.

ద్వి. కటకటా కాటికిఁ గాళ్లు సాఁచియును, విట తనంబులజాడ విడువఁ డీబుడుగుఁ,గొండంగి వీని వెక్కిరుఁ దలదఱుగ. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౫౯. ('కొండెంగ' శ.ర. పా.)

కొండకంది. వి. (√కొండ) సస్యవిశేషము, ఒకజాతికందిబీ. (బ్రౌ, శ. ర.)

కొండకాకి. వి. (√కొండ) ఒకజాతికాకి, అద్రికాకము. ('మాలకాకి' అని చి. ని.)

కొండకాలువ. వి. (√కొండ) సెలయేఱు, ఝురము.

కొండకోఁతి. వి. (√కొండ) బాలక్రీడావిశేషము.

సీ. దాఁగిలిమూఁతలు తనుబిల్ల యాలంకి గుబ్బట గురిగింజ కొండకోఁతి. హంస. ౩. ౧౪౬.

కొండగుమ్ము(ము)డు. వి. (√కొండ) ఒకజాతిగుమ్ముడుబీ. హంస. ౪. ౧౧.

గీ. మూఁడువేళ లపామార్గమూలములును, గుండ లీమూలరజమును గొండగుముడు, వేఁడినీళ్లను సేవింప వికృత మైన, కఠినశూలలు పాలివో వు గ్రంథు లణఁగు. (చికి-చి. ని.)

కొండగుఱుతు. వి. (√కొండ) సాధారణ మైనగుఱుతు. (శ.ర.వా.)

కొండగోనుగు. వి. (√కొండ) వృక్షవిశేషము, అక్షోటముబీ. (శ. ర.)

కొండగొఱ్ఱె (ఱ్ఱియ, ఱె, ఱియ.) వి. (కొండ+గొఱ్ఱె.) రోహిషము, కొండలయం దుండెడు ఒకజాతిగొఱ్ఱె.

పి...కొండగొఱ్ఱెల మన్నిగొనియోఁ గొన్ని. పి. శతం. ౨. ౧౫.

సీ. కొండగొఱియ నాఁ దగును రోహిషాభిధ... ఆం. భా. ౨. ౯౫.

గీ. కోఁతితో మైత్త్రి వాటించుఁ గొండగొఱియ, యార్వ్యశేయునిపుణ్యాశ్రమాంతరమున. శ్రీ. ౨. ౪౩.

స్రగ్ధర. చెండాడెన్ గొండగొఱ్ఱెల్ తెలిగె లుఁగులన్ ... యయా. ౨. ౩౨. (ఇందలి 'గొఱ్ఱు' అను రూపము చింత్యము.)

కొండగోఁ(ఁగు)ను. వి. (√కొండ-బ.కొండగోఁగులు.) ౧. కర్ణికారము, ఒకానొకచెట్టు. (చూ. వసు. ౩. ౧౪౬, ౧౪౭.)

సీ. కొసరి వావిలిఁ గొండగోఁగును వనిపించె మూర్కొని మాటాడి ముదిత యొర్తు. యయా. ౪. ౧౯.

౨. కందరాళముబీ.

గీ. కందరాళము కొండగోఁ గనఁగఁ గొండ,గో నవఁగఁ బరఁగు...ఆం.భా. ౨. ౪౩.

కొండచిలువ. వి. (కొండ + చిలువ.) కొండపాము, గోనసము.

వ ... యాతుధానుం డనుకొండచిలువ నొడియ ...మనుచ. ౪. ౧౧౫.

సీ. కొండచిలువ యన గోనసం బగు...ఆం.భా. ౧. ౧౪౭.

కొండచీమ. వి. (√కొండ) ఒకజాతిచీమ. (శ.ర.)

కొండచూలి. వి. (కొండ+చూలి.) హిమవత్పుత్త్రి, పార్వతి. వేమన. ౨. ౨౨౨.

ఇట్లే: కొండరాచూలి: వీర. ౧. ౧.

కొండపట్టి. ద్వి. హరిశ్చ. ఉ. ౨౬౭౩ పం.

కొండజువ్వి. వి. (√కొండ) ఒకజాతిజువ్వి, కలజువ్విబీ.

ద్వి. గుది గొన్న జువ్వులు కొండజువ్వులును, ము దిరినమోదుగుల్ మలుమోదుగులును. ద్వి. పరమ. ౨. ౫౪ పా. ౯ పం.

కొండజెఱ్ఱి. వి. (√కొండ) ఒకజాతిపెద్దజెఱ్ఱి. (ఇది మూఁడుమూళ్లనిడుద యై యొళ్లునల్లకట్లు గలిగి అరచేనకొలఁదికాళ్లు గలిగి యుండును. ఇది జంతువులను దతిమి కఱచును, దీనివిషము చే జంతువు మేను బద్దలై చచ్చును-చి. ని.)

**కొండజొన్న.** వి. (√ కొండ) ఒకవిధ మగుజొన్నలు. (శ. ర.)

**కొండతంగే(గె)డు.** వి. (√ కొండ) ఒకజాతితంగేడులు. (శ. ర.)

**కొండత్రిమ్మరి.** వి. (కొండ + త్రిమ్మరి) కోతి. ఇట్లే: తిప్పత్రిమ్మరి, మలత్రిమ్మరి, మొ. (బ్రౌ, శ. ర.)

**కొండదాసరి.** వి. (కొండ + దాసరి) ముష్టి యెత్తుకొని జీవించు ఒకజాతి దాసరి.

గీ. తనదు చెల్లెలి దొడ్డభూధవున కిచ్చి, యతనివలనను సిరి గాంచునంతకంటె, సారమై తోఁచుఁ గొండదాసరితనంబు. రామలిం. ౭౫.

**కొండనాలుక(ల్క).** వి. ( కొండ + నాలుక ) -పైనుండునాలుక - ఉపజిహ్విక, ఘంటిక.

సీ. ఎచ్చోట ముచ్చిచ్చు నేఁడేసి నాల్కలు కొండనాల్కలదాఁకఁ గోతపడియె. భీమ. ౩. ౩౭.

**కొండపగతుఁడు.** వి. (√ కొండ) ఇంద్రుఁడు.

సీ. కొండపగతుపట్టికోడలినిండు వేఁకటిఁ గాచి నట్టిచేకత్తివాఁడు. రా. వి. ౧. ౭౧. (శ. ర. పా.)

**కొండపలుకు.** వి. (కొండ + పలుకు) పర్వతగుహయందలి ప్రతిధ్వని.

గీ. కొమరుఁ బిల్వనియలపల్కు కొండపల్కు, పట్టిఁ జూడనినును గ్రుడ్లు పెట్టుగ్రుడ్లు. చంద్రా. ౧. ౫౩.

**కొండపిండి.** వి. (√ కొండ) పిండికొండచెట్టు. (దీనియాకులు రాలను పిండి చేయును.)

సీ. కొండపిండి యనంగఁ బిండికొండ యనంగ నగభేదిసంజ్ఞగా నలరుచుండు. ఆం. భా. ౨. ౬౫.

**కొండపిచ్చుక.** వి. (కొండ + పిచ్చుక) ఒకజాతి పిచ్చుక.

సీ... కొండపిచ్చుక వానకోయిలయును. హంస. ౩. ౧౨.

**కొండప్రత్తి.** వి. (√ కొండ) ఒకజాతి ప్రత్తిలు. (శ. ర.)

**కొండబరిగె(వరగ?)** వి. (√ కొండ) సస్యవిశేషములు.

సీ. జడకొఱ్ఱ కొఱ్ఱలు చామలు వెలిచామ కట్టారి కారికె కొండబరిగె, బరిగె ... హంస. ౪. ౧౨౭.

**కొండబూరుగ.** వి (కొండ + బూరుగ.) కూటశాల్మలిలు.

వ... కొండబూరుగమ్రానిచేవకొఱడుల ద్రిప్పుడులును పూలతురాయిల రాణించుచేకత్తుల గిలగిలలును ... ప్రబంధ. ౭౫.

గీ... కొండబూరుగ యనఁ, గాను జనుఁ గూటశాల్మలి ... ఆం. భా. ౨. ౪౭.

**కొండబెండ.** వి. (√ కొండ.) ఒకజాతి బెండలు. (బ్రౌ.)

**కొండమల్లయ్య.** వి. (కొండ + మల్లయ్య.) శ్రీశైలమల్లికార్జునుఁడు, శివుఁడు.

సీ. కొండమల్లయ్యచే నుండు నందురు గాని జింకను గాన మేవంక నైన. యయా. ౧. ౧౦౬.

**కొండమల్లె(ల్లియ).** వి. (√ కొండ) ఒకజాతి మల్లె, గిరిమల్లికలు. (శ. ర.)

**కొండమామిడి.** వి. (√ కొండ) ఒకజాతి మామిడి, కోశామ్రములు. (శ. ర.)

**కొండమారేడు.** వి. (√ కొండ) ఒకజాతిమారేడులు. (శ. ర.)

జ: కొంగగొడ్డలి, కొంగవాలు.

**కొంగగొడ్డలి.** వి. (కొంగ + గొడ్డలి) త్రవ్వెడుసాధనవిశేషము. (దీనిచివర కొంగముక్కువలె నుండును. బ్రౌ.)

**కొంగవాలు.** వి. (√కొంగ) మాలమాదిగలు ధరించెడికత్తి; ఒకవిధమైనకత్తి.

క. సురియాళుచేతికత్తికి, నరు లందఱు పేరుపెట్టినారు ధరిత్రిన్, మఱి కొంగవా లనంగను, దిరుమలపై నుండుదేవదేవ ముకుందా. (దేశ్యనామార్థకోశము.)

సీ. మాతంగుఁ డగువానిచేత నుండెడికత్తి కొంగవా లనఁగఁ జెలంగుచుండు. ఆం. భా. ౨. ౨౮౯.

(పందివేఁట) ఉ. కుక్కల నొంచఁ జూచి మఱి కొందఱు కొన్నిటిఁ గొంగవాలులన్, బక్కలు సించినన్...యయా. ౨. ౧౦.

సీ. వంకిలిబ్బిదొరలా వంకిలి నొందించి కొంగవాలున గట్లగొంగ గెలిచి. అచ్చ. రా. యు. ౪౭౪.

(వేశ్యావర్ణనము) వ...మదనుముద్గరంబు లన శంబరారికఠారంబు లన నంగభవుకొంగవాలు లన...భీమ. ౧. ౧౧౭.

**కొంగు.** వి. చెఱఁగు, చేలాంచలము.

గీ. అట్టికర్ణునిఁ గొంగున నగ్ని దాఁచి, నట్టు లెక్కైయి దాఁచితో యమ్మ చెపుమ. భార. స్త్రీ. ౨. ౧౭౮.

ద్వి. పొంగి చిచ్చులుకంగఁ బోవుచుఁ జీర, కొంగోసరించు పెన్వొంగలియట్ల. బస. పు. ౩. ౧౧౪౦ పం. ఆం. భా. ౨. ౧౫౨.

సా: కొంగు తగిలినను కొంత వాసియే.

**కొంగుపసిఁడి, కొంగుబంగ(గా)రము** = కొంగునఁ గట్టినబంగారము - ఇది ఒకరు ఈయ నక్కఱ లేకుండ తనకు తానే లభించు ఉత్తమపదార్థమునకు ఉపమానముగా ఉపయోగింపఁబడును.

క. తనుఁ గన్నతండ్రి సెప్పిన, పని సేసిన నుగతి కొంగుపసిఁడియ కాదే. భాగ. ౯. ౫౫౭.

చ. విటులకుఁ గొంగుబంగరము వేడుకకాంద్రకుఁ బట్టుఁగొమ్మ యు, త్కటతరమన్మథార్తులకుఁ గల్పకుజంబు...హంస. ౧. ౨౧౫.

క. రామానుజయ్యదాన, ప్రామాణికముద్ర కొంగుబంగార మగున్. పాండు. ౧. ౬౫.

కొంగుబత్తెము = కొంగున ముడుచుకొను బత్తెము, ధాన్యరూపమైనకాపుకూలి. (దీనిని వినాయకునిచేట యందురు)

చ...నిలిచినకుప్పకావలికి నిల్పుదు రప్పుడుఁ గొంగుబత్తెపుం, గొలువున కీయకొల్పి హాలికుల్ బికిరంబు పొసంగువేళుపున్. చంద్రా. ౧. ౨౫.

కొంగుముడి = ౧. భార్యాభర్తలు నద్యాదులందు స్నానము చేయునపుడు ఇరువురబట్టలకొంగులు కలిపి వేయుముడి.

చ. తిరుమలకంచిపుష్పగిరితీర్థములుం జని కొంగుముళ్లతో, వరములు దంపతుల్వడయ వారక కాన్కలు వైచి...హంస. ౨. ౮౫.

౨-కొంగున వేసికొనినముడి - ఇది సిద్ధముగా నున్నపదార్థమునకు ఉపమానముగా ఉపయోగింపఁబడును.

ఉ. అంగన నాకుఁ గొంగుముడియై తగు నీ విభుడిచ్చునీవి త, న్వంగి భవన్మనోజ్ఞమధురాధరకాంచనకాంచికాస్థలుల్, తంగెటిజున్ను ముంగిటినిధానము నా నటు గానఁ బాయలే, నంగజానన నాదుహృదయం బెఱుఁగున్ వలవంబు జానవా. రామా. ౪. ౧౬౨.

చ...శుభప్రసంగ మం, గనకు నొసంగఁ గొంగుముడి గాదె భవద్వచనంబు నావుడున్. వసు. ౩. ౪౩.

కొంగుముడి వేసికొను=నిశ్చయము మని యెంచుకొను.

క. మది తహతహ విడిచి యింకకా, ముదమున సతులార కొంగుముడి వేసికొనుం,డిక నేఁటి మాటికిఁ గూ,ర్చెద వాలాయముగ నేను బ్రియులను మిమ్ముకా., ప్రభా. ౫. ౮౫.

జ: కొంగుపఱచు, కొంగుమాయు.

**కొంగుపఱ(టు)చు.** అ. క్రి. (√కొంగు) రతికి సిద్ధ మగు; సిద్ధ మగు.

గీ. వారలెల్లను బంగారువంటినిన్నుఁ, జూచి పలుగాకులకుఁ గొంగుపఱచు చెలుల, నంటి వర్తింప వాని కేమాయె...శుక. ౨. ౧౭౦.

గీ. గుట్టు నానయు విడనాడి కొంగుపఱిచి, యగడుపడి పడిచి పడసినట్టిపసిఁడి, కటకటా యేమిటికి నెక్క గడనవంక, నేమి గంటిని దొడుసు నా కేమి యనుచు. విప్ర. ౩. ౭౧.

గీ. కవుల కిఁగలజాతి యొక్కటియు లేదు, వితరణము వైశ్యులకుఁ బెండ్లివేళఁ గలదు, కొంగుపఱచిరి నృపతు లాకూటికొఱకు. రామలిం. ౨౩.

ఇట్లే:-కొంగొడ్డు.

గీ ... కాసుబీసములకై యబ్బినట్టి, పురుషులకు నెల్లఁ గొంగొడ్డి పొట్టపోసి,కొనెడి వెలయాలి బ్రదు కిట్టి దనఁగ నేల. పరమ. ౩. ౨౦౭.

**కొంగుమాయు.** అ. క్రి. (√ కొంగు) చెఱఁగు మాయు, బహిష్ఠ యగు. (శ. ర.)

**కొంగొంగు.** వి. కొంగలు చేయుధ్వనికి అనుకరణము.

సీ...కొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ. హర. ౫. ౧౬.

**కొంగోడువడు**=కొంగోడుపోవు.

(ఒడ్డగిల్లు, ఒఱగు.)

సీ. కలఁగి వారిధులపంకము నివ్వటిల్లెను గులపర్వతములు కొంగోడువడియె. హై. ౨. ౩౭.

**కొంగోడుపోవు**=కొంగోడువడు. అ. క్రి. (కొంగోడు+పోవు) కోడు విషమముగా నుండుటచే మంచము మున్నగునవి యొఱగు.

ఆ. కుక్కిపడిన మిగులఁ గొంగోడుపోయినఁ, గుఱుచ యైన మిగులఁ గొంచె మైన, మలినమైన నేఁత పలుచనైనను నల్లులున్న నుల్కమంచ మెప్ప దండ్రు. వి. పు. ౩. ౨౧౫.

**కొంచే**=క్రొంచే. వి. (సం. క్రౌంచః. ప్రా. కొంచో. క. కొంచ.) క్రౌంచపక్షి.

సీ. పసిఁడికిఁ బ్రొమ్మ మీపజ్జ నేఁగదు గదా కొంచలార కొలంకుటంచలార. అచ్చ.రా.అర. ౮౬. ఆం. భా. ౨. ౯౩.

కొంచగట్టు=క్రౌంచపర్వతము. అచ్చ. రా. యు. ౨౦౯.

ఇట్లే: కొంచగుబ్బలి. ఆం. సం. దేవ. ౧౩.

కొంచదీవి=క్రౌంచద్వీపము. (శ. ర)

కొంచమొగ్గరము=క్రౌంచవ్యూహము. (శ. ర)

కొంచసారము=(క్రౌంచపక్షిధ్వనివంటిధ్వని గలది.) సప్తస్వరములలో నాల్గవది, మధ్యమ స్వరము. (శ. ర )

**కొంచించు**= కొఁచు అ. క్రి. (√కొంచు-స్వార్థమున 'ఇంచు') సంకోచించు,

క. కొంచింపక పడిఁ బెన్నిధిఁ, గాంచిన పేదయునుబోలె ఘనతరహర్షో, దంచితమానసుఁడై యా,పంచాననమధ్యఁ జేరి పలికెకా క్రేమకా. రసిక. ౫. ౧౩౯.

మ ... పుత్త్రుం డటం,చును గొంచింపక వీని నొంచుఁ డిపుడు...దశా. ౮. ౧౭౧.

**కొంచు**=కొంచించు, కొఁచు అ. క్రి (సం. కుఞ్చ్)

౧. భయపడు; సంకోచించు.

లయగ్రాహి....పలికెఁ బ్రార్థించుచు జలేభుల
కుఁ గొంచుచు ఖగాళిఁ బెదరించుచుఁ జెలంగి
రి హసించుచు లతాంగుల్. ఉ. రా. 3.
౨౧౮.

క. క్రోధుఁడు హింసను గని దుస్స్వాధాటోప
మున మల్లచఱచుచు వినుమా, యోధర్మపత్ని
నీ పను, సాధనమున కెట్టివారిఁ జంపుదుఁ
గొంచక. ప్రబోధ. ౨. ౬౬.

రగడ. కొమ్మ యిది నిజంబు పలుకఁ గొంచెఁ
గొంచెపఱచి ప్రేమ. వరాహ. 3. ౯౨.

ఉ. కొంచక యంబుధిం బడినకొండలపత్త్రము
లూడ్చదయ్యె నూ,ఱంచులకత్తి...వసు. 3.
౧౦౭.

౨. మందగించు.

మ. కనుఁగొన్నంతనె కన్యకామణికి లేఁగా నింత
గాన్పించెఁ జన్నొనలఁ నీలిమ యావరించె
ముఖపాండుశ్రీ మిటారించెఁ గుల్కునడల్
గొంచె...ఉ. రా. ౧. ౧౯౧.

వి. ౧. కొంకు, సందేహము.

ఆ. ఓరి దోసకారి కూరిమిన్నైదోడ,వనుచు నిన్ను
నమ్మి యకట పగతు,తోడఁ బోరొనర్పఁ
దొడఁగినచోఁ గిన్కరించి రాఁగఁ జనునె
కొంచు లేక. అచ్చ. రా. కిష్కి౦. ౨౯.

౨. తక్కువ, లోపము.

గీ. వేలుపులతోఁడు దన కొకవెల్లమొదవె,గల
దనుచు నిక్కు నింతియు కాని యిట్లు,గలవె
పలువన్ని యలగిడ్డికదుపు లంచు, నెంచుచుం
డు నతం డెందుఁ గొంచు లేక. నీలా. ౧.
౪౯.

3. మదము, గర్వము.

మ. ముదితల్ కొందఱు కెంపురాబురటకొమ్ముల్
పూని యేతేర నీ,ట దశత్వంకజనేత్ర యొా
ర్తు తననీడఁ జూచి యారార కొం,చు దలి
ర్పఁ జెలి యొప్పతో పగలు వంజుల్ మించ
నేతెంచె నే,నిదిగో దాని జయింతు నంచు
దుమికెఁ హేలావతుల్ నవ్వఁగఁ. చం
ద్రా. ౪. ౨౪౫.

౪. ముఱికి చెమట.

సీ...పరఁగుఁ గొంచనఁగను ముఱికి చెమట.ఆం.
భా. ౧. ౧౪౦.

విశ. తక్కువ, అల్పము.

ఆ. అట్ల పఱచువారిఁ బోల్లెను గా మర,లించి
సోఁకుతోఁడు గొంచు గాని,కినుకతోడ వ
త్తనిఁ గనుఁగొని బొమముడు,లదర నిట్టు ల
నుచు నుదరి పలికె. అచ్చ. రా. యు. ౧౦౦.

జ: కొంచించు, కొంచుఁడు.

కొంచుఁడు. విశ. (√ కొంచె) అల్పుఁడు, కించు.

శా ... ప్రత్యర్థిసంహారుఁ డా,భల్లూకేంద్రుఁడు
జాంబవంతుఁడు తలంపఁ గొంచుఁడే ...
సీతావి. ౧. ౧౦౫.

కొంచెకత్తె. విశ. (కొంచెము + కత్తె.) అమాయి
కురాలు.

గీ. రాజముఖి కొంతపడికిఁ దారావధూటి, సా
గసునెమ్మోముఁ దప్పక చూచి పేర్మి, నువిద
నీ వెంతకొంచెకత్తెవె జయంతుఁ,గాపునేసి
నగరితవు కావె నీవు. కుల. ౪. ౧౭౩. (ఇట
వ్యతిరేకలక్షణచే 'జాణ, నేర్పరి' అని భా
వము.)

కొంచెకా(గా)ఁడు. విశ.(కొంచెము+కాఁడు)
అల్పుఁడు, సామాన్యుఁడు.

వ... కించిజ్జ్ఞనై జడమతి నన్నుం గొంచెగానిం
గాఁ దలంచి నీతం జూడఁబోవఁ దెరువైన
నొసంగవైతివి...ఉ. రా. ౮. ౧౧౨.

సీ. నీకుఁగాఁగాఁ దేదె చేకూరినది గాక కొంచె
గానికి సమకూడు టెట్లు. ఖహ. ౫. ౧౧౮.
కుశ. ౨. ౨౮౫.

**కొంచెతనము.** వి. (కొంచెము+తనము) తక్కువతనము, సూక్ష్మత్వము.

అ. కలికికురులనిడుపు కన్నులవెడలుపు, గుబ్బదోయి హెచ్చుగొనబుఁగౌను,కొంచెతనము పిఱుఁదుఁగొప్పురును బొక్కిలి,లోఁతు నెన్న నెన గలుగుట యరిది. అచ్చ. రా. అర.౨౩.

కొంచెతనము సేయు=అవమానపఱచు.

గీ. అలిక మరచందురునితోడఁ జెలిమి చేయుఁ, దియ్యపలుకులుఁ దేనెలు వియ్యమంద, నడపు లంచలఁ గొంచెతనంబు చేయుఁ, గమలగంధిమనోహరాకార మలరె. కేయూర. ౪. ౧౩౫.

**కొంచెపడు.** అ. క్రి. (కొంచెము+పడు) ౧. తక్కువయగు, కొఱఁత నొందు.

వ. తండ్రీ నీప్రసాదంబున నన్నియు సమకూరెదుం గాక కొంచెపడియెడు నే... భోజరా. ౬. ౧౯౧.

౨. సన్నగిల్లు, కృశించు.

సీ. కడువొడ్డకటికటి కడుఁ గొంచెపడియుండె నతనాభి యొకటి యున్నతి వహించె. చంద్రా. ౧. ౯౭.

౩. లాఘవము నొందు, తేలికయగు.

క. ఒరునొద్ద కేఁగి హైన్యము, పరికింపక వేఁడి కొంచెపడియెడు కన్నన్,మరణం బుత్కృష్టంబు...శివధ. ౫. ౯౪.

గీ. నీమపరమపతివ్రతానియతి కెదిరి, కొంచెపడెఁ దారకలలోనఁ గాంచు మనెడి,కరణి నిజపత్నితోన భూవరసుతుండు, తగ నొనర్చె నరుంధతీదర్శనంబు. ఇందు. ౬. ౬౨.

౪. తగ్గిపోవు, క్షీణించు.

గీ. క్రూరసంతతి వెలయునే కొంచెపడక, విరివిగా ధర్మసంతతి వెలసినట్లు. నీతి. ౪౯.

౫. వ్యర్థమగు, నిష్ఫలమగు.

గీ. తరుణి నీచేత మదనతంత్రంబు తెలుఁగోరి యున్నాఁడ నాయాస కొంచెపడ యుండ సురత సుఖాంభోధి నోలలార్చి,యిపు సొంపార నన్ను మన్నింప వలయు. వి. ౩. ౨. ౨౧౭.

**కొంచెపఱుచు.** స. క్రి. (√కొంచెపడు) కొంచెపడఁజేయు.

(తగ్గించు, తక్కువచేయు)

క. అప్పను చతురంగంబుల,నుప్పులు కులగో... గరిమఁ గొంచెపఱుపఁగా, నుప్పొంగి మా... సంబులఁ, గప్పరపడి భూతములు జిగుతా... పేర్మిన్. జై. భా. ౫. ౧౯౩.

(తక్కువపఱచు, లాఘవపఱచు; చెఱచు, హాని చేయు.)

సీ. భూభరణక్రియాస్ఫురణఁ గుంభీనసక్రోడే... ములైనఁ గొంచెపఱుచు. వి. పు. ౫. ౬౫.

గీ. మానసంబున ధర్మ మేమఱకుమమ్మ, నుతికెక్కునసీసరిసతులలోన, వాసి గనుమమ్మ కుశీలవర్తనములు, కొంచెపఱుపక మను విచారించుమమ్మ. వరాహ. ౨. ౧౨౪.

**కొంచె(చియ)ము.** విశే. (కొంచెము, కొంచిక, కొంచుక, కొండొక, కొంత, కొంచఱు, కొన్ని అను శబ్దములలోని పూర్వభాగ మైన'కొన్'అనునది కించిదర్థక మగుఒకానొకశబ్దము యొక్కలుప్తశేషరూప మనియు, అందలికకారము మీఁది ఒకారము ఉకారముగా మాఱి 'కుంచు' శబ్దమందును, ఊకారముగా మాఱి 'కూఁతు,కూఁతురు, కూన' శబ్దములందును, చేరినట్లును ఊహింపఁదగి యున్నది-సం. కించిత్. క. కొంచ, కొంజం. త. కొచ్చె.) ౧. (ప్రమాణామునందు) అల్పము, తక్కువది.

సీ.కొంచెపుటశనంబు గొనుచు సంగంబులఁ బాసి యింద్రియములపజ్జఁ జనమి. భాగ. కాం. ౬. ౩౦.

**కొండము.** వి. (ఇక్లే వరుసాదిగా. బ్రా- సం. కుండక్. ప్రా. కొండమ్. త. కుండం.) గుండము.

గీ. ...కుండాఖ్య నెలయు,చుండు గుండ మనంగ ను గొండ మనఁగ. ఆం. భా. ౨. ౨౪౧.

**కొండముక్కిడి.** వి. (√ కొండ) ఒకజాతిముక్కిడి, వృక్షవిశేషము. హంస. ౪. ౧౧, ౧౩౫.

**కొండముసువ.** వి. (√ కొండ.) కొండమ్రుచ్చు. (చి. ని, ౯. ౪)

**కొండమ్రు(ము)చ్చు.** వి. (కొండ + మ్రుచ్చు.) నల్లనిముఖము గలపెద్దకోఁతి, గోలాంగూలము.

వ... నేల యీనినటుల మున్నీరు వెల్లివిరసిననై ఖురిఁ బుట్టియిసుళ్లకరణిఁ గాకులజోకఁ గొండమ్రుచ్చులబాగున... ప్రబంధ. ౭౮౮.

ఆ. కోఁతిఁ బట్టి తెచ్చి కొత్తపుట్టము గట్టి, కొండముచ్చు లెల్లఁ గొలిచినట్లు, నీతిహీనులొద్ద నిర్భాగ్యు లుందురు... వేమన. ౨. ౬౪.

**కొండయల్లుఁడు.** వి.(√కొండ)-హిమవంతునియల్లుఁడు-శివుఁడు. చిత్రభా. ౫. ౧౦.

**కొండయిప్ప.** వి. ( √కొండ ) గిరిమధూకము. (చి. ని.)

**కొండయెక్కు,కొండెక్కు.** అ. క్రి. (కొండ+ఎక్కు) ౧.ఉన్నతస్థితికి వచ్చు,అతిశయము నొందు.

ద్వి. బ్రహ్మచారిని లోకపావనాత్ముండ,బ్రాహ్మణుఁడను బీదబాపఁడఁ గాను,హరికృపఁ గల్గు సర్వైశ్వర్యములును,గొఱఁత లే దిప్పుడే కొండయెక్కెదవు,ఇపు డేమి చెప్పెదు నీమేను నీది,తపము చాలెమ్ము నాతరుణిని గమ్ము. మృ.వి.౨.౬౭.

౨. మిట్టెక్కు, గర్వముచే ఓట్టిబిగియు.

గీ. కరుణ జగములఁ బ్రోచుటో తురగ మెక్కి,ఘనరిపులఁ గొట్టుటో తురుష్కవధ యొంతె, కొండయెక్కెదు బలిమాలుకొనినకొలఁది. సిం. నార. ౧౭.

౩. (వ్యతిరేకలక్షణచే) ఆఱు, ఆఱిపోవు.

(వ్యప) దీపము కొండెక్కినది.

**కొండరాగి.** వి. (√ కొండ) ఒకజాతిరావిచెట్టు. (ఇది ఫుల్లమామిడివంటిది.దీనికాయలు ఉప్పున ఊరఁబెట్టి అన్నములో నంజుకొందురు -చి. ని.)

**కొండరాయఁడు.** వి. (√కొండ)పర్వతరాజు, హిమవంతుఁడు. వీర. ౩. ౧౦౮.

**కొండరావి**=కొండరాగి. (√ కొండ) హంస. ౪. ౧౧.

**కొండరి.** వి. (కొండ+ అరి) పర్వతీయుఁడు, కొండవాఁడు, కిరాతుఁడు, బోయ.

చ. నెఱపక యున్నవార లిట నెట్టితనం బిది గాదె కొండరుల్ చుఱు కొకయింత లేక మనుజుండమదేవత కిందు నిత్యముఁ, జెఱు పొనరింతురప్పఁ డది సేగి విదేసులఁ బట్టుచున్నవా, రె ఱుఁగఁగఁ జెప్పితి న్వెడలి యేఁగుఁడు ప్రాణముసడ్డ గల్గినన్. ద్వా. ౧౧. ౧౯, ౨౬.

**కొండఱేఁడు.** వి. (కొండ+ ఱేఁడు) హిమవంతుఁడు.

ఆ. కొండఱేనికూఁతు కుసుమాపచయకేళిఁ, బోవుఁ బ్రతిదినంబు... భోజరా. ౫. ౧౯౧. వేమన. ౨. ౨౨౨.

**కొండలరాయఁడు.** వి. (√కొండ)-ఏడుకొండలకధిపతి-వేంకటేశ్వరుఁడు.

సీ. కొండలరాయనిఁ గొలుచుకవులకు బంగారంబుముడుపు మోఁకాళ్లముడుపు. ప్రబంధ.౨౪.

**కొండల్లము.** వి. (√కొండ) ఒకజాతిఅల్లము,తృణపుష్పిక. (౯. ౪.)

**కొండవంగ.** వి. (√కొండ) ఒకజాతివంగ. (బ్రా)

**కొండవాఁడు.** వి. (√కొండ)పర్వతీయుఁడు,కిరాతుఁడు, బోయ. ('కొండవారు' అని౯.౪.)

**కొండవీడు.** వి. జా. (కొండ+వీడు) ౧. కైలాసపట్టనము.

గీ. కొండవీ డేలువేలుపుఁ గూడి పాల,కడలినడు
చక్కి బలుమానికములదీవిఁ,బుడుకుమ్రాఁకులు
మాఁకేళ్లు వౌదలి పొదలు,కడిమిపూఁదోఁటలో
నాడుగరితఁ దలఁతు. అచ్చ.రా. ౧.౨.

౨. ఆంధ్రదేశములోని ఒకపట్టనము.

సీ. మఱి కొండవీ డెక్కి మాన్యానినలి యైనయ
లకసవాపాత్రు నంటి రాఁజె. ఆము. ౧. ౩౬.

కొండవీటిచేఁత్రాడు = కొండవీటిలోని లోఁతు నూతులనీరు తోఁడుట కుపయోగించుచేఁత్రాడు. (ఇది అతిదీర్ఘవిషయమునకు ఉపమానముగా వాడఁబడును)

ఉదా: ఈకథ ఎప్పటికిని తెగక కొండవీటిచేఁత్రాడువలె నున్నది.

**కొండసంపెఁగ.** వి. (√కొఁడ)ఒకజాతిసంపెఁగకీ. హంస. ౪. ౧౧.

**కొండసూడు.** వి. (కొండ + సూడు) గోత్రవైరి, దేవేంద్రుఁడు. అచ్చ. రా. కిష్కిం. ౨౫.

**కొండాట¹(ము).** వి. (√ కొండాడు¹) ౧.స్తుతి, పొగడిక.

శా... ఉన్నపురముల్ గొండాటకర్హంబులే.కాశీ. ౧. ౧౮.

వ. వృథా కొండాటములు మాని శౌర్యంబులు పూని యనిఁ జేసినఁ గాని పోనీయ మనువారును ... ల. వి. ౧. ౭౬.

౨. అన్యచింత లేక ఒకదానియందు మనస్సు లగ్నముచేయుట, వ్యాసంగము.

ద్వి. ...తదంగ,సౌకుమార్యంబు లోచనపర్వ మొదవఁ, గైకొని చూడవు గాని చూచినను, నది యొకొండాటమూ నన్నియు మఱచి. నవ. ౪. ౧౩౬ పా. ౧౭ పం.

గీ. హరునితోడిద కొండాటమై లతాంగి, యుగ్ర

తాపంబు సైరింపకున్నఁ జూచి. వీర. ౧. ౧౮౫.

**కొండాట²(ము).** వి. (√కొండాడు²)కలహము, పోరు.

క. అని కెలసి పులుసుపులుసనఁ, దనుఁ జూడం
జూడఁ బట్టితన్నం గొట్టెన్ ,దనివి సనఁ దిట్టె
ననలుం, గొనలుగ రొద నుగనిఁ దగనికొండా
టమునన్. వేం. పంచ. ౪. ౪౬౮.

౨. బాధకము.

శా... చూడు నేఁ, డీకొండాటపుటెల్కయు
త్కొఱుఁగ కిల్లెపార భక్షించెడిన్. వేం.పంచ. ౨. ౯౦.

**కొండాడు¹**=కొనియాడు. స. క్రి. ( √ కొను-త. కొండాడు.) పొగడు, స్తుతించు.

ఉ. చేడియ యీనృపాలకులశేఖరు సంతతదానకీలుఁ గొం, డాడఁగ వేయినోళ్లవలె నంచు వచించితి నప్పుడు ... రాజ. చ. ౩. ౧౩౩.

సీ. కొనియాడెఁ బొగడెను గొండాడె నగ్గించె ననఁగను వినుతించె ననుట దోఁచు. ఆం. భా. ౩. ౧౨౪.

**కొండాడు²**=కోరాడు. అ. క్రి. ౧. కొట్లాడు, జగడమాడు. (చూ. కొండాట²)

(వ్యవ) నీపెండ్లికోసము నేను నెలదినములనుండి వానితోఁ గొండాడుచు నేయున్నాను.

౨. దుమ్ముఱేగఁజేయు.

సీ. కోరాడెఁ జిరిమెను గొండాడె నాఁగను దుమ్మురేఁచె నటంచుఁ దోఁచుచుండు. ఆం. భా. ౩. ౧౩౨.

జ: కొండాట².

**కొండి.** వి. ౧. తేలుకోఁక.

సీ ... తేలనఁగను వృశ్చికంబు ... తత్పుచ్ఛనామమై తనరుఁ గొండి యనంగ ... ఆం. భా.౨. ౧౮.

౨. తేలుతోఁకచివర నుండుముల్లు. (బ్రా.)
3. పీతడెక్క.
క. అక్కర్కట ముండఁగ నల, కొక్కెర దత్తరస మొలిచికొని తినుసదిరై, ముక్కత్తి చూచు నాలో, నొక్కుఁకుసఁ గొండ్ల నిజికి యొత్తెఁ గళముఁ. వేం. పంచ. ౧. ౩౨౬.
ర. ఔక్కతలుప్రసంచలయం దమర్చు తేలుతోఁక వంటియినుపగొండ్లెము. (శ. ర.)

**కొండిక**=కొండొక. (చూ. కొంచెము.) విణ. (ప్రమాణవయోభాగ్యాదులందు) కొంచెము, అల్పము.
క. దండితబలిసై జగములు, నిండఁ బెరుఁగుచున్న వేళ నీయడుగున భూ, మండల మతిసూక్ష్మాకృతిఁ, గొండికమచ్చయిను బోలెఁ గొమరొందు హరీ. పాండు. ౨. ౬౦.
సీ. మెండుగా బలిసి భూమండలాఖండల కొండిక కుండిక నుండఁగూడ. గీ. దింత నిర్బంధమై నచో నెటుల నోర్తు. దశా. ౧. ౧౪౧.
సీ. మీతండ్రియింట నేఁ బ్రీతిఁ గొండికనాఁడు చెలులతో నాడుచు ... మార్క. ౫. ౨౪౦.
క. కొండికప్రాయంబు ... వరాహ. ర. ౧౩౫.
క. కొండికలము మన కెంతటి, దండి గలుగు నధిక పస్తుతతి హరి కొసఁగఁ, గొండంతదేవునకు మక్షి, కొండంతయుఁ బత్రి యిడెదుకుశలులు గలరే. కుచేల. ౧. ౧౧౦.

వి. బాలుఁడు; బాలిక.
సీ. దొర దాల్చురవణముల్ తొడుగఁడే భృత్యుండు కొండిక ప్రాయఁడే గురుఁడు ప్రాయ. రామలిం. ౩౫.
క. ఒండుకొద లేదు తూరుపుఁ, గొండపయిం బ్రొద్దు వొడిచెఁ గొమ్మా యిఁక నేఁ, డెండఁ బడకుండఁ గూఁతుం, గొండిక యన కంపవలయుఁ గూరిమి ననుడుఁ. యయా. ర. ౧౨౬.
**కొండికనగవు**=మందహాసము. వరాహ. ౧౦. ౭౪.
**కొండికవాఁడు**=చిన్నవాఁడు, బాలుఁడు.

ఉ. ... ఇప్పుడీ, కొండికవాని నమ్మి పగగొలిది కార్యమె మీకు శౌర్యమే. ఉ. సం. ౧౦. ౫౨౯.
**కొండియుఁడు.** వి. (√ కొండియము.) కొండెము చెప్పువాఁడు.
ఉ. క్రూరుఁడు లోభియుఁ శఠుఁడుఁ గొండియుఁడుఁ జడుఁడుఁ గృతఘ్నుఁడుఁ, నేరని వాఁడు బొంకరియు నిండకు నోర్చునతండుఁ బందయుఁ, ధీరత లేమి దుర్నయ మతివ్యసనత్వముఁ గల్గువారలుం, జేరుప నున్కి భూపతికిఁ జెట్టయొనర్చు నరేశ్వరోత్తమా. భార. శాం. ౩. ౯౬౭.
సీ. కొండెకాఁడనఁగను గొండెగీఁడనఁగను గొండియుఁడనఁ బిశునుండు వెలయు. ఆం. భా. ౩. ౧౩. ప్రబంధ. ౬౭౩.
**కొండీ.** పి. కొక్కెము. (బ్రా.)
**కొండీఁడు.** విణ. (కొండెము + ఈఁడు-క. కొండెగ. త. కొండుణి.) కొండెము చెప్పువాఁడు.
సీ. కొండీనినాలుక రెండుగాఁ జీరెదునలఖగంబులఁ జూడు మపనినాథ. మార్క. ౨. ౯౫.
గీ. అనృతవాదుల కొండీల యన్యమండి, గాన్న భోక్తల మర్యాద నడఁచువారి, విశ్వసించినఁబోఁ ద్రుంచి వేయునట్టి, ఖలుల జిహ్వాలు గోతురు కాలభటులు. శేష. ౩. ౩౩.
ద్వి. పికలుండు గొండీఁడు నడకిన నైన, నొకఁడు మందున కైన నూరిలో లేఁడు. బస. పు. ౧. ౫౭౯౦.
**కొండుక**=కొండొక. (చూ. కొంచెము.)
విణ. (చిన్న; చిన్నవాఁడు.)
వ. ... అర్జునుకొండుకనాఁటిపరాక్రమగుణసంపదలు వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె... భార. ఆది. ౫. ౨౫౯.
వ. ... చిత్రాంగదుండు బాల్యంబున గంధర్వనిహ

తుం డయిన వానికిం గొండుకవాని విచిత్రవీ
ర్యు రాజ్యాభిషిక్తుం జేసి ... భార. ఆది. ౮. ౧౧౩.

ఆ. ... వారిలోఁ, బరశురాముఁ డాదిపురుషమూ
ర్తి, దండితాహితుండు గొండుక యయ్యును,
దద్ద గుణములందుఁ బెద్ద యయ్యె. భార. శాం. ౩. ౭౦.

**కొండె(డియ).** వి. స్త్రీ పురుషులు తలయొక్క పురో
భాగమున వేసికొనెడుసిగ, ముందుసిగ.

చ. ... కొం, డెలపయి కమ్మ గ్రామ్యతరుణీకలి
డించిన పేఁపగంపలం, దళ మగుచున్న చెంగ
లువదండల ... ఆము. ౧. ౭౫.

గీ. కురులు సవరించి విరులతోఁ గొండెఁ గట్టి, మే
లుచందురకాపిరుమాలు చుట్టి, సరిగెజిగివల్వ
మేన మెచ్చంగఁ దాల్చి, మెఱయుభూషల
నొడలిపై మెఱయఁజేసి. వేం. మా. ౮. ౨౮౫.

సీ. చందురులో నున్నకందుఁ దా మణఁగించుకేవఁ
జెందలలకొండియలు చెలఁగ. విప్ర. ౧. ౭౯.

గీ. కేశబంధవిశేషాఖ్య గేయఁ గ్రొమ్ముడి యన వెద
యన నూనెముడి యనఁ గొండె, యనఁగఁ
గీల్గంటనఁగఁ జొల్లె మనఁగ నడచు. ఆం. భా.
౨. ౧౮౫. రా. వి. ౧. ౬౨.

**కొండెఁడు.** విణ. (కొండెము + వాఁడు) కొండెము
చెప్పువాఁడు, చాడీ చెప్పువాఁడు.

క. ధరఁ గాఁపు కొండెఁ డైనను, గరణాలను బ్ర
తుకు లేదు గదరా సుమతీ. సు శ. ౮౫. వేమ
న. ౩. ౧౮౯.

**కొండెకత్తె(త్తియ).** విణ. (కొండెము + కత్తె)
చాడీలు చెప్పునది. (ఆరుద్ర [illegible]. ౮.)

**కొండెకా(గా)ఁడు.** విణ (కొండెము + కాఁడు)
చాడీలమారి, కొండెములు చెప్పువాఁడు.

సీ. కుమతియుఁ జుట్టంబుఁ గొండెకాఁడు ప్రియుం
డు కరుణావిహీనుండు కార్యదక్షుఁ, డు ...
రామలిం. ౧౧.

ఆ. కొండెగాఁడు చావఁ గొంపదముకఁ బోవ, వం
తు కింతె గాని పగపు లేదు, కొంకనక్క చావ
గొర్తె లేమిటి కేడ్చు ... వేమన. ౨. ౫౯. ఆం.
భా. ౩. ౧౩.

**కొండెగీఁడు.** విణ. (√కొండెము-క. కొండెగ.)
కొండెము చెప్పువాఁడు.

సీ. కొండెకాఁ డనఁగను గొండెగీఁ డనఁగను గొం
డియుఁ డనఁ బిసునుండు నెలయు. ఆం. భా.
౩. ౧౩.

**కొండె(డియ)ము.** వి. (క. కొండె. త. కొండియమ్)
చాడీ, ఇతరులపై లేనిపోని నేరములు చెప్పుట, పై
శున్యము.

సీ. ... గురుజనంబుల, నిందించు టాగమనింద తదీ
యవిక్రయవిధి తద్విలేఖనము గొండి, యము
... గీ ... ఆర్యకోటి, నిరయహేతువులుగఁ జె
ప్పు నృపవరేణ్య. భార. అను. ౨. ౬౧.

గీ. విను మరక్షితమంత్రంబు విరిసిపోవుఁ, గొండి
యంబున సఖ్యంబు గ్రుంగిపోవు. నా. పంచ.
౧. ౧౮౮.

సీ వినఁగోరఁ డొకనాఁడు వీనుల కింపుగాఁ గొ
లువువారలమీఁదికొండెములను. మొ. రా. బా
ల. ౨౧.

సీ. అత్తమామల కెదురాడుమశ్చారిణి వావివర్తన
లేనివాడవనె, కొండేలఁ గొంపలు గూల్చు
పాతకురాలు బరి భిక్ష మిడనినిర్భాగ్యురాలు.
శ్రీరం. మా. ౫. ౩౮.

ఉ. ఓనృప నాపఁ జూడ నలయుగ్మలి నీసుతు
నిజ మనోహరా, నూనవిలాసుఁ జూచి నిలు
వోపక పట్టిన లోను గామి నెం, తే నెగులూ
ని వానిఁ బొలియింపఁగ మాయలు పన్ని నిట్లు
కొం, డేనను ధర్మరాజులను నిక్కముగా మి
ముఁ జెప్ప నేటికిఁక. సారంగ. ౨. ౨౮౭.

కొండెపుఁగొఱవి=కొండెములమారి.

ద్వి. మిండతల ల్కాత్తి కి మిగిలినగొంట్లు,కొండెపుఁ గొఱవులు... పండితా. పురా. ౧౧౬ పా.

కొండెపుఁదపసి=(కొండెములు చెప్పుముని)నార దుఁడు.

సీ. చలిగొండవెలిగట్టుచాయల గిలుబాడి కొండెం పుఁదపసిఁ గైకొనక చెలఁగి. గీ ... పాఁపరా యఁడు సెగడె నీప్రాంతమందు. చిత్రభా. ౫. ౧౦.

జ: కొండియుఁడు, కొండీఁడు, కొండెఁడు, కొండెకత్తె,కొండెకాఁడు, కొండెగీఁడు, కొండే లమారి.

**కొండెవల.** వి. చేఁపలు పట్టుటకు ఒక్కఁడే వేసెడు వల. (శ. ర.)

**కొండేలమారి.** విశ. (√కొండెము.)చాడీగొట్టు.

సీ. కడకుఁ బోయిన నొక్కకడఁ బరుండఁగ రాదు మఱఁదలు కొండేలమారిబసివి. అహ. ౩. ౮౩.

**కొండొక**=కొండిక, కొండుక. విశ. (చూ. కొంచెము-సం. కుణక.)౧. చిన్నవాఁడు; చిన్నది.

క. అకటకట యుత్తరుఁడు కొం,డొక కాంభోజుండునుం గదుర బాలుఁడు... భార. స్త్రీ. ౨. ౭౮.

సీ. ఇవ్విధంబునఁ గాంచి హృదయేశుమన్ననఁ బెనుచుచు నుండ నబ్బిసరుహాక్షి, కొండొకసవతియు గురుతరధర్మరక్షణశీలత న్ననుగుణవిధేయ. రాఘవ. ౮. ౭౮.

౨. కొంచెము, అల్పము.

క. ద్యూతజ్ఞులదెసఁ గొండొక,ప్రీతియుఁ గలదు ...భార. విరా. ౧. ౨౦౭.

వ. ... కొండొకయు నుపేక్ష లేక ... భార. విరా. ౩. ౭౭.

క. దంతిని బ్రహ్మాండంబులు,చెండులక్రియఁ బట్టి యెగురఁ జిమ్మెడుహరికిన్, గొండఁ చెకలించి యెత్తుట,కొండొకపని గాక యొక్కకొండా తలఁపన్. భాగ. ౧౦ పూ. ౯౧౮.

౩. పొట్టి, హ్రస్వము.

గీ. బాలుఁ డొక్కండు కొండొకకోల నేతఁ,బట్టుకొని ... భార. ఆది. ౬. ౨౬౦.

ఉ. కొండొకవాలమున్ గుఱుచకొమ్ములు నన్నువలైనవీనులున్ ...క్రాలఁగాఁ, దొండము లేని భద్రకరితో నెనయైనవనీవరాహమున్. విక్ర. ౩. ౭౫.

క్రి. విశ=ఒండొకఁ. ౧. ఇంచుక, కొంచెము.

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున నొవ్వనిజనంబులు నా,చేతిధన మెల్లఁ గొని చరి,భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. భార. విరా. ౧. ౧౯౬.

వ. కొంతేయాగ్రజుఁడు గురుబలంబు గనుంగొని కొండొక విన్ననై వివ్వచ్చు నాలోకించి... భార. భీష్మ. ౧. ౧౨౮.

౨. కొంచెము సేపు; కొంచెము దూరము.

వ. ...తొలంగఁద్రోవ రాని లేమికి నొండొకయుపాయంబు మదిం దోఁపమికిం గొండొక చింతించి...విక్ర. ౨. ౧౭౭.

వ. ఏనును భక్తిమయం బగుసాష్టాంగదండప్రణామం బాచరించి కొండొక దొలంగి... భార. విరా. ౧. ౧౩.

కొండొకనవ్వు=చిఱునవ్వు, మందహాసము.

గీ. అనినఁ గొండొకన వ్వొలయంగఁ జూచి,యింద్రనందనుఁ డాతని కిట్టు లనియె, నేను గలుగంగ నీ కేమి...భార.విరా. ౫. ౧౧౪.

**కొండ్ర.** వి. ఒకసారి చాలు చుట్టినకొలఁది గలపొలము, చుట్టుదున్నినచాలునడిమినేల; పొలము.

క. కురియు నెల మూఁడువానలు,సురభులు చన్నవిసి పితుకు సుకృతముజరుగున్,ధరఁ గొండ్రవేలు పండును, బరఁగుం బురుహాయుషంబు

ప్రజలకు నెల్లన్. కాశీ. ౪. ౨౯౯.

గీ. వలపుదోసంబు వాయంగ వాన గురియఁ, గొం
డ్రలం బండు నారంభకోటు లెల్ల. భీమ. ౩. ౧౪౨. రా. వి. ౫. ౭౨. ఆం. భా. ౨. ౨౩౩.

ఒకకొండ్రయెత్తు=ఒకచాలుదున్ను.

సీ. ఓర్చునాఁగలి గూర్చి యొకకొండ్రయెత్తిన ఫణిరాజుతలగుట్టు బయలుపడ ద.కకు.౧.౧౨౯.

జః కొండ్రకైదువు.

**కొండ్రకైదువు.** వి.(కొండ్ర+కైదువు)హలము, నాఁగలి.

గీ. కొండ్రకైదువుబల్లిదుకూర్మితోడు. రా.వి.౧. ౭౧. (శ.ర.పా.)

**కొంత.** స. (చూ. కొంచెము- కొంచెము + అంత) ఇంచుకంత.

క. కౌంతేయులబారిం బడ, నింతియ సిరిచాలు రాజ్యమెల్లను దాఱై, పొంత ననుఁ బెట్టుకొని యొక, కొంత యొసఁగిరేని నట్టికూ డేమిటికిన్. భార. శల్య. ౨. ౧౩.

గీ. క్రూరబుద్ధియై తొడఁగినఁ గొంత కొంత, వినియు వినమి ... దశకు. ౧౧. ౧౩౬.

వ. అమ్మంత్రిమాటను గొంతగాఁ బ్రసంగించి యిట్లనియె. దశకు. ౧౧. ౭౭.

**కొంతము.** వి. (సం. కుంతః. ప్రా. కొంతో. క. కొంత. త. కుందం.) ఈఁటె, బల్లెము.

క. ఎంత జితేంద్రియులైనను, నెంత సదాచారులైన నేకాంతమునం, గాంతలసంగతి నుండినఁ, గంతునికొంతాలపాలు గా కుండుదురే. విక్ర. ౩. ౬౦.

క. గొంతాన నొకఁడు బెబ్బులిఁ, గొంతానం జిదిమి మెచ్చికొనఁ జేసినచో ... శుక. ౧. ౧౭౨. కు. సం. ౧౧. ౬౯౬.

కొంతపుమొగ్గరము = కుంతాకారముగా నుండు వ్యూహము.

సీ. పాలుపొందఁగా జెల్లు ప్రాచినవిధమున మును
కొని కొంతంపుమొగ్గరంబు. కు. సం. ౧౧. ౬౬౦.

విరికొంతపువేల్పు=పుష్పాయుధుఁడు, మన్మథుఁడు.

క. అంతట నొకనాఁ డింతులు, సంతసమునఁ గొల్వఁ బైఁడిజగ్గిలెపైఁ జే,మంతులమాడువులో విరి, కొంతపువే ల్పనఁగ రాజు కొలువున్నయెడన్. యయా. ౫ ౪౫.

**కొందఱు.** స. బ. (చూ. కొంచెము- 'కొంత' శబ్దమునకు మహన్మహత్యర్థకరూపము) కొంతసంఖ్య గలవారు.

మ. మును నీ వెన్నితి విక్రమాఢ్యు లని మమ్ముం గొందఱన్ ... భార. ద్రో. ౨. ౨౯౪.

చ. ... చిట్టికంపుఁ ద్రాగుడు గని సన్నల న్నగిరి కొందఱు పాంథుఁ బ్రపాప్రపాలికల్. ఆము. ౨. ౫౯.

గీ. అంప టెంపఱు కొందఱు ముందఱు యన ... శకటరేఫంబు లుడురాజ శకలసూరి. సర్వలక్షణసారసంగ్రహము.

**కొందలపడు.** అ. క్రి. (కొందలము+పడు) ౧. కలఁతపడు, సంక్షోభించు.

(సైంధవునిమాటలు) క. పెదవులు దడుపుచుఁ గాళ్లన్, గుదివడ వడఁకుచు మనంబు గొందలపడఁగా, నిది యేటిమాట లాడెదఁ, దుదిఁ బార్థుఁడు గానకుండఁ దొలఁగిన వలయున్. భార. ద్రో. ౨. ౨౯౨.

చ. నలువురు గుప్పగుప్పనను నాలుగుమూలలనుండి దూఁకి పి,చ్చలవిడిఁ బాఱసాగినను సాహసమొప్పఁగఁ దద్విభుండు గొం,దలపడి చూచి వీ రెవరు దాఁచక చెప్పుము చెప్పకున్న నగ్గలమున నిన్వధింతు నని కత్తిని దా నొఱ దూసి పల్కెన్. హంస. ౩. ౧౧౦.

౨. దుఃఖించు, శోకించు.

చ. అలఘుఁడు వాలి రామవసుధాధిపుఘోరశిలీ

ముఖంబుచే, నిలిగిన వేఁడిమాట విని యొంతయు నుల్లము జల్లనంగఁ గొం,దలపడి తార యంగదుఁడుఁ దాను మహీస్థలి వ్రాలి... భా. రా. కిష్కిం. ౨౬౬.

క. అందులకుఁ జాల భయపడి, యందఱు మడుగులకు వ్రాలి యతిదీనతతోఁ, గొందలపడ నపుడాతని, డెందము నైకొనియె నక్కటికపుం బెంపుగ్. విజ. వి. ౨. ౫౭.

**కొందలపఱుచు.** స. క్రి. (√ కొందలపడు) కలఁత పెట్టు.

క. ...విభుం డమానుష తేజో,గ్రను డగుసహదేవుఁ గనుం,గొని యిట్లు పగలు మిగిలి కొందలపఱుపగ్. భార. విరా. ౧. ౯౭.

**కొందలపాటు.** వి. (√ కొందలపడు.) కలఁత, సంక్షోభము.

సీ. అందంద కదిసెడుకొందలపాటుచేఁ దలఁకుచు నునికికి నిలుకడయును. భార. విరా. ౨. ౩౦౫.

చ. ముదిపాలదిండిచేటు తమమూఁకల కొందలపాటు వేల్పుమ,న్నెదొరలగెల్పునీటు గని... ఉ. రా. ౮. ౩౦౬.

**కొందలపెట్టు.** స. క్రి. (కొందలము + పెట్టు.) ౧. కలఁత నొందించు, కలవరపెట్టు.

సీ. రాజ్యాంగములయందు రమణ మమత్వంబు ప్రబలమై పాటునఁ బడఁగ నీక, డెందంబు నెవ్వగఁ గొందలపెట్టెడు నకట ... మార్క. ౬. ౨౨.

క. మీవెంట వత్తునే నై, రావణనాగంబు నెక్కి రయ మొప్పంగా, దేవగణంబులతోడను, గోవిందునిమంద లెల్లఁ గొందలపెట్టగ్. భాగ. ౧౦ పూ. ౯౦౩.

౨. బాధపెట్టు.

ఉ. ...నీ,వలన వరంబు లిట్లు గని వాలినదైత్యుఁడు మమ్ము నింక నే,కొలఁదుల నైచునే కరము కొందలపెట్టక యెట్లుఁ గావునం, దలఁపుమెకింత శాత్రవవధంబువిధంబు త్రిలోకనాయకా. హరి. పూ. ౮. ౨౨.

**కొందలము.** వి. (త. కొందళం.) ౧. క్షోభము, కలఁత.

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం,చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం,దల మందెం ద్రిదశేంద్రు పట్టనము పాతాళంబు ఘూర్ణిల్లె ... భార. విరా. ౪. ౧౭౨.

ఉ. ఎందును నెవ్వరుం బడనియొంతయుఁ గష్టము పాటు వచ్చినం, గొందల మంది పాండువిభుకోడలు దవ్వుల నున్న నన్ను గో,విందుఁడ కావు మంచుఁ బలవించుట యోఁగఁగ రానియప్పు డో, కొం దలపోయ త్రేఁ గయి చలింపక యున్నది యెప్పుడుగ్ మదిగ్. భార. ఉద్యో. ౨. ౧౭౯.

౨. సంతాపము, విచారము.

చ. కలఁగుచు నేయుపాయమును గానక నిన్నును నీతనూజుఁ గొం,దలమున విక్రయించు వసుధాధవుఁ డెవ్వరికైనఁ జెచ్చెరగ్. హరిశ్చ. ౩. ౨౫౮.

౩. బాధ.

చ. ... తనకుఁ దోడ్పడువారలు లేక నక్ మదిం, దలఁపఁడె యత్తఱిగ్ రిపువధంబున కెద్దుము తండ్రి యేను గొం,దలమునఁ బొందకుండ నని తాఁ బలుమాఱును జీర కుండునే. భార. ద్రో. ౨. ౨౮౭.

సీ. ... కొందలంబు, సలుపు నోవి యనంగఁ జను వ్యథ... ఆం. భా. ౧. ౧౫౦.

౪. సందియము, సంశయము.

క. కొందఱు గలఁ డందురు నినుఁ, గొందఱు లేఁ డందు రతఁడు గుణి గాఁ డనుచుం, గొందఱు గలఁ డని లేఁ డని, కొందల మందుదురు నిన్ను గూర్చి మహాత్మా. భాగ. ౭. ౨౨౫.

జ: కొందలపడు, కొందలపఱుచు, కొందలపాటు, కొందలపెట్టు, కొందలించు.

**కొందలించే=కొందలపడు.** (√ కొందలము.) (కలఁతపడు.)

వ. అప్పుడు పందికదుపులవెనువెంటం దవిలి కొందలింపం జిందఱవందఱగాఁ జేసి యేసి యట చనఁ జన...ఉ. హరి. ౪. ౨౫.

**కొందాఁక.** అవ్య. ద్రు. (కొంత+దాఁక) కొంతపర్యంతము, కొంతవఱకు.

మ. కులకాంతాకరసంగమంబు మఱియుం గొందాఁక నాకాంక్షసే,యులలాటాక్షుని ... వరాహ. ౬. ౨౭.

**కొందు.** స. క్రి. (త. కొందు=పొడుచు) పొడుచు. ('నఱ్ఱుగా నఱకు,నలినలిగాఁ గొట్టు' శ.ర, బ్రౌ.)

గీ. పొదమున నైదుతూపులపాదుసాహి, తమ్మిదోదుమ్మిఁ గొంది డెందమ్ము గ్రుమ్మి, క్రమ్ముకొని దోమ్మి సేసిన సొమ్మసిల్లి, యమ్మహామహుఁ డిట్లును నెమ్మనమున. ఉ. రా. ౭. ౪౫౬.

**కొంప.** వి. లొంప, అల్పగృహము, బీదయిల్లు; ఇల్లు.

సీ. ... అల్పగృహము, కొంప లొం పనఁ దగు... ఆం. భా. ౨. ౧౪.

సీ. అరిభయంకరలంక యం బేదకొంపయే కోపించుకొనిపోయి కొలవిఁ జూఁడ. రామా. ౭. ౭.

శా. కొంపం బో రుదయించి రావు గద నాకుం జెప్పుమా నీకథల్. వేం. పంచ. ౪. ౪౨౫.

(వ్యవ.) ఇంతపని చేయుటకు నీకొం పేమి మునిఁగినది. వాఁడు దానికొంప తీసినాఁడు.

జ: కొంపచెఱుపు.

**కొంపచెఱుపు.** విణ. (√కొంప)-కొంప చెఱుచువాఁడు-వలుగాకి, దుష్టుఁడు.

గీ. కొంటె కనుమూలమును దూబ కొంపచెఱుపు. హంస. ౫. ౧౧౩.

**కొకిబికి.** విణ. వికృత మైనది.

సీ. కొకిబికి వేసంపుగూనిమూఁపులమీఁద మూఁడు పంగలయీఁటె మోపినాఁడు. మనుచ. ౪. ౭౩.

వ. ... కొకిబికి యొకంబునఁ జిబిబి వెండ్రుకలు జుంజుఱుఁగొప్పునం జెదరి యుప్పరం బెగయ... విప్ర. ౪. ౨౪. జాహ్నవీ. పీఠి. ౨౦.

కొకిబికికాలు=తప్పటడుగు, తప్పునాట్యము.

క. తకిట తకతక యటం చని, యొకజతి యేడక్షరాల నున్నది యది యా,దికి సరిపడ నటియింపుము, గొకిబికిగా నైన బిరుదు గొనుమా నెన్కన్. పార్వ. ౫. ౧౯౯.

**కొక్కరాయి.** వి. (త. కొక్కు) బలాక, కొక్కెర.

సీ. పొటిపిట్ట యుల్లంకి పాస్నంగి తీతువు కున్నంగి యేట్రింత కొక్కరాయి. ప్రబంధ. ౨౩౪.

సీ. ... బలాక కొక్కెర యనంగఁ, గొక్కరాయి యనఁ జెంపెక్కను...ఆం. భా. ౨. ౯౪.

**కొక్కరించే.** స. క్రి. (క. కొక్కరిసు=౧. పరిహాసము చేయు. ౨. బెదరించు.) ౧. (కోఁతులు) వెక్కిరించు; వెక్కిరించు.

(వానరవర్ణనము.) ద్వి. కొనచెవుల్ జిక్కించి కొక్కరించుచును...రం. రా. సుం. ౨౭౪ పా. ౫ పం.

(నటవర్ణనము) ద్వి. మోఁకాళ్లు దొడలును ముడివర్చుకొనుచుఁ, గూఁకటి గిలుపుచుఁ గొక్కరించుచును. పండితా. పర్వ. ౩౭౧ పా.

౨. బెదరించు, జడిపించు.

చ. మనుకులచంద్రుఁ డట్టియెడ మాతలి దెచ్చినవాసవీయకాంచనరథ మెక్కి యొక్కడినచాపముతోఁ బ్రతిఘాచలద్విలో,చనములతో యుగాంతయమశాసను నైవడి మించుపేల్పులన్, గనుఁగొని కొక్కరించుదశకంఠు నెదుర్పడి పోరునయ్యెడన్. దశా. ౭. ౨. ౧౫౧.

౩. (పశువులు) కాళ్లతో కల్లగించు.

గీ. కుప్పలై యున్నయెరువెల్లఁ గొక్కరించి. నా. పంచ. ౩. ౫౧. (శ. ర. పా.)

జ: కొక్కరింత.

**కొక్కరింత.** వి. (√కొక్కరించు.) కొక్కరించుట. (శ. ర.)

**కొక్కి=గొగ్గి.** విణ. ఎచ్చుతగ్గులు గలది.

సీ. కాంతరో నీతావికావివేరా విటు వానికొక్కి దంతంబుల నొక్కఁ దగునె. హంస. ౧. ౯౧.

వి. విషమస్థితి.

చ.... ఫణిపుంగవుఁ జేఁడు దలంగ మట్టి దిక్కులు పగిలించి బ్రహ్మ నొకకొక్కికిఁ దెచ్చెద మీక్షణంబునన్. మై. ౩. ౩౬.

**కొక్కిరిబిక్కిరి.** వి. చీకిలిమాకిలి, వంకరటింకర.

ఉదా: వానివ్రాఁత కొక్కిరిబిక్కిరిగా నుండును.

**కొక్కిస=కొక్కస¹.** వి. మల్లబంధవిశేషము.

వ. ... కక్కి కొక్కిస డొక్కర... ఆది యగు ముప్పదిరెండువిన్నాణంబులనాణెంబు పరీక్షించి ... హంస. ౧. ౨౦౬. ఆం. భా. ౨. ౨౦౯. ప్రబంధ. ౭౯౦.

**కొక్కు¹.** వి. పందికొక్కు.

సీ. ...కొక్కన గరిమిడికొక్కనంగను బందికొక్కనంగ. గీ. మూషికాభిధ లగు...ఆం. భా. ౨. ౧౬. రం. రా. సుం. ౨౬౪ పొ. ౨౭ పం.

ఆ. కొక్కు తిండియాసఁ జిక్కి చచ్చినయట్లు. వేమన. ౧. ౨౦౧.

జ: కొక్కురౌతు.

**కొక్కు².** వి. ఒకానొకయాట. (వా.)

**కొక్కురో(రొ)కో=కొక్కొరోకో, కొక్కొక్కొ, కొక్కొక్కో.** వి. కోడికూఁతయొక్క అనుకరణము.

గీ. అప్సరస్త్రీనికేతనాభ్యంతరములఁ, గొక్కురోకో యటంచును గోళ్లు గూసె. హర. ౭. ౧౩౭.

క. కొక్కులు విదిల్చి లావులు, ముక్కుకొనం దువ్వి మోదమునఁ గంధరముల్, మిక్కిలి దిక్కుగనుంగొనఁ, గొక్కురొకో యనుచుఁ గోళ్లు కూయం దొడఁగెన్. శుక. ౧. ౧౪౫. నైష. ౮. ౭౯.

**కొక్కురౌతు, కొక్కుహజ్జోమాదు.** వి. (√కొక్కు.) మూషకవాహనుఁడు, విఘ్నేశ్వరుఁడు.

గీ. గుజ్జువేల్పు పిళ్లారి కొక్కురౌతు ... అన వినాయకునకుఁ బేళ్లొప్పును సుగంధికుంతలే శ. ఆం. భా. ౧. ౪౩. అచ్చ. రా. బాల. ౨౧.

**కొక్కెర.** వి. పెద్దకొంగ, మహాబకము; బలాక.

వ. ఒక్కమహాబకంబు వచ్చె. అది పద్మభవునకుం బ్రసాదపాత్రం బగుట నాళీజంఘుండును రాజధర్ముండు నను పేళ్లం బరఁగు. ఆకొక్కెరకు నమ్మఱ్ఱి నివాసంబై యుండు...భార. శాం. ౩. ౪౭౮.

ద్వి. కొక్కెర బెగ్గురు కొంగ రాపులుఁగు, కక్కెర యాడెలు కన్నియలేడి, నెలిచె లావుక యాదివేర్వేఱుజాతి, పులుఁగు లన్నిటిఁ బొరిపుచ్చి ...ద్వి. హరిశ్చ. పూ. ౬౨౯.

సీ...బలాక కొక్కెర యనంగఁ, గొక్కరాయి యనఁ బెంపెక్కును...ఆం. భా. ౨. ౯౪.

**కొక్కెస¹=కొక్కిస.** వి. మల్లబంధవిశేషము.

సీ. కలియక తొలుమాఱుల డింకి దొరలించి మిసిమినుఁద్దొడలఁ గొక్కెస ఘటించి. కత్తివేల్పు శతకము. ౫౭. (చి. ని.) మల్లుపు. ౩. ౬౯. ప్రబంధ. ౧౭ పం.

**కొక్కెస².** వి. ఒకానొక చెట్టు. (శ. ర.)

**కొక్కొక్కొ=కొక్కురోకో.**

క...కొక్కొక్కొ యనుచుఁ గోడి కూయుఁ దొడంగెన్. వరాహ. ౪. ౧౬౪.

**కొక్కొరో(రొ)కో=కొక్కురోకో.**

ఉ...ప్రొద్దెను గొక్కొరోకో యని కుక్కుటస్ఫుర

దకుంభితకంఠకఠోరనాదముల్. విక్ర. ౬. ౭౩.

సీ. కొక్కొరోకో యని కుక్కుటంబులు కూసె. కాశీ. ౩. ౨౩౫. (శ. ర. పా.)

**కొక్కోకో**=కొక్కురోకో.

శా. కొక్కోకో యని కుక్కుటచ్ఛటలెలుంగుల్ రెచ్చె నల్దిక్కులన్. బహు. ౩. ౯౪.

**కొజ్జా.** వి. (హిం. ఖోజా.) షండుఁడు, రాణివాసపుఁగావలివాఁడు.

సీ. వీథులఁ దిరుగంగ వెసఁ దలారులు పట్టి కొజ్జాను జేసిరో...భోజరా. ౪. ౩౧౯. వేంక. మాన. ౩౧. (ఖొజ్జా. ముద్రి.)

**కొటారము**=కొటారు.

(కళ్లము)

క. వింటె యిటువంటి త్రిమ్మరి, పంటకొలంబున నెకాదు పాటింపఁగ వ్రాల్గంటులఁ గలదా సాబగుల, పంటకొటారంబు కళలపంజర మనఘా. ఉ. హరిశ్చ. ౪. ౭.

గీ. తోఁట చేను కొటారంబు దొడ్డి యనెడు, వాసలన్నియు నిసుమంత లయ్యె...వసు. ౨. ౧౪౯.

జ: కొటారి.

**కొటారి.** వి. (కొటారము+ఇ) ఉగ్రాణపువాఁడు, కోష్ఠాధికారి. (శ. ర.)

**కొటారు**=కొటారము, కొట్టరువు. వి. (సం. కోష్ఠాగారమ్. క. కొట్టార. త. కొట్టారమ్.) ౧. కొట్టు.

సీ. ... కొటారు. గీ. కొట్ట మని పల్కఁగాఁ దగుఁ గోష్ఠగృహము. ఆం. భా. ౨. ౧౫.

సీ. కాయధాన్యంబులకణఁజముల్ బియ్యపుగరిసెలు దినుసులు గలకొటార్లు. హంస. ౨. ౨౨౬.

౨. ఉప్పు మొదలగునవి రాసులుగా నుండెడుచోటు, కళ్లము.

ఉదా: ఉప్పుకొటారు, మొ.

ఉ. చూతమె డాసి పక్వతరశుక్తిపుటాంతరదృశ్యమౌక్తిక, వ్రాతము లై వెలుంగుగరువంపుఁ గొటారుల నొప్పు తామ్రపర్ణీతటమట్లు జీర్ణదళబృందసమావృతపాండురప్రసూ, నాతిమకోష్ఠమూలముల నర్థి నెసంగుమధూకసాలముల్. మనుచ. ౩. ౮౦. వసు. ౧. ౯౪.

౩. ఆస్పదము, స్థానము.

సీ... జాదరి యొప్పెరాసె గాతలకొటారు, మగని కంటి నెరసు... చెన్న. ౨. ౨౪.

చ...ప్రాయపుం గలిమికొటారిదే కద జగాజిగి హైఁడిపెటారి మారుచే, నలుకకటారి యంచు శకటారి నుతించు మిటారి మించుగన్. ముకుంద. ౩. ౨౦౬.

**కొటి(ట్టి)క**[1]. వి. (సం. కుటీ. త. కుడి). గ్రామము; పట్టనము.

గీ. పల్లె కొట్టిక కొటిక కుప్పమ్ము నాఁగ, నూరనఁగ గ్రామనామంబు లొప్పుచుండు. ఆం. సం. స్థా. ౪.

సీ. నిటలాక్షుగుడి లేనికొటిక నున్న యతండు నిల్లడధన మీక యేఁచునతఁడు. శై. భా. ౧. ౮౬.

ద్వి. ఈకొట్టికకు విప్రుఁ డెట్లు చేరెడిని, గైకొని బ్రతుక నేగతి గల దింక. ద్వి. హరిశ్చ. ఉ. ౧. ౫౨౭ పం.

సీ. జక్కులరాయిక్కఁ జొక్కు నెక్కటియుద్దికడిఁది ముక్కొటికసోఁకుడులవెగులు. అచ్చ. రా. బాల. ౮. (ముక్కొటికసోఁకుడులు=త్రిపురాసురులు.)

**కొటిక**[2]. విణ. వామనుఁడు, పొట్టివాఁడు.

సీ. కుఱుచ కొట్ర కురుఁజ కొటిక కుసుని...అనఁగను వామనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩.

**కొటికాఁడు**=కొట్టికాఁడు. (√కొటి)

(వధ చేయుకింకరుఁడు.)

ఉ...కుమారుఁడు శౌరి నెమ్మదిన్, గట్టిగ నిల్పనప్డు గొటికాండ్రు కృపన్ వలకాలిపిల్లవ్రేల్, మట్టఁగఁ గోసి మంత్రవయుముందటఁ బెట్టి కృతప్రణాములై. జై. భా. ౮. ౪౧. (శ. ర. పా.)

**కొట్టకొన.** వి. (√కొన) అన్నిటికి కొన. (శ. ర.)

**కొట్టడి(డీ).** వి. (సం. కోష్ఠః. ప్రా. కొట్ఠ. త. కొట్టడి.) సరకు లుంచెడుగది, కొట్టు.

చ. పరఁగెడురత్నకొట్టడులు భద్రముగా నొగి బీగముద్రలన్, గరిమ నొసర్చి ... హంస. ౧. ౧౧౯.

సీ. గౌళముల్ పచ్చాకు కచ్చూరములు చాల నించినకొట్టడీ ల్మించి యేఁగి. హంస. ౧. ౮౧.

**కొట్టము=కొట్టాము.** వి. (సం.గోష్ఠమ్.ప్రా. గొట్ఠం) ౧. గోవులు ఏనుఁగులు గుఱ్ఱములు మొదలగువాని నుంచెడిపాల, పశుశాల; శాల, చావడి.

ఉ. ఏ నీక నేమి సెప్పిన మహీపతి బొంకుగ నెంచు నెందు రాజానుమతంబు ధర్మ మని యంద్రు గదా బుధు లైన నేమి యెద్దీనె నటన్నఁ గొట్టమున నేర్పడఁ గట్టు మటన్న చంద మే,కానఁగ నయ్యె... సారంగ. ౨. ౨౭౬.

సీ. పాడు వైనమువ్వంచఁ బొలుమనట్లుగ నేనుఁగులకు గుఱ్ఱములకుఁ గొట్టములును. భార. ఉద్యో. ౧. ౯౩.

గీ. ... తగు శాల కొట్ట మంచనఁగ నభవ. ఆం.భా. ౨. ౧౩.

గీ. ముమ్మర మ్మైనయారివేరమ్ము మవికిఁ,బుట్టి యతఁడేఁగెఁ దలవరికొట్టమునకు. వైజ. ౪. ౬౬.

౨. కొట్టు, సరకు లుంచెడిగది.

గీ. కొట్ట మని పల్కఁగాఁ దగుఁ గోష్ఠగృహము. ఆం. భా. ౨. ౧౫.

**కొట్టరువు=కొటారు.** వి.ధాన్యాదు లుంచెడికొట్టు.

ద్వి. బోరన మ్రోయుచప్పుడు వినఁబడఁగ, సౌరాష్ట్రనాథుఁ డాశ్చర్యం బెలర్పఁ, దివిరి కొట్టరువుగాదియ వ్రచ్చికొనుచు, భువిఁ బ్రతిష్ఠం దయ్యె...బస. పు. ౬. ౬౭౧ పం.

ద్వి. ... సోమేశుఁ డాదివముతో ల్లాడు, మడఁపురేఖయు నందిపడగయుఁ గొమరుఁ,బడిహారిక్రియఁ బట్టపగలె యేతెంచి, కొట్టరువునఁ బళ్లు గొలిపించుచుండ.బస.పు. ౬. ౬౮౭ పం.

**కొట్టాము=కొట్టము.**

(పశుశాల)

క.సానులకు గబ్బిబెబ్బులి,పూని కనుంగొనిన వాఁడు పోనీఁడు గడే,హాని యొనరించు హాలత, కూన సరగఁ బాఱిపొమ్ము కొట్టామునకున్. చంద్ర. వి. ౨. ౬౪.

**కొట్టి(టి)=కోటి**[2]. (చూ. కొట్టికాఁడు, కొటికాఁడు.)

జ: కొటికాఁడు, కొట్టికత్తె, కొట్టికాఁడు.

**కొట్టికత్తె.** స్త్రీ. (√ కొట్టి) పరిచారిక, సేవకురాలు.

వ...గుత్తులమొడచిగుళ్లు వలవంత వేఁడిమిం బొరలుకాంతలయిగురుఁబాన్పులకుఁ గొట్టికత్తెలు పుడికినన్...పూచినయశోకభూజాతపోతంబులును... కేయూర. ౪. ౫౦.

**కొట్టికాఁడు=కొటికాఁడు.** పు. (√ కొట్టి) వేగులవాఁడు, చారుఁడు.

క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడు నగుచు నతని నెల పగునడవిన్,బోరఁ గొట్టికాండ్రు డెక్కముఁ, బరికించి యెఱింగి కలయఁబడి కూఁత లిడన్. ఆము. ౩. ౨౬. ('కోటికాఁడు' పాఠాంతర మని శ. ర.)

వ...మృగములు నెలువచుటకు హరిచ్ఛదచ్ఛటావృతశిరస్కటిధనుష్కాటులై కొట్టికానిం జూపెట్టుకొని యెదురుమాటలు గాకుండ నుండి... మనుచ. ౪. ౩౭.

**కొట్టించు.** స. క్రి. (√కొట్టు[1]) కొట్టఁజేయు.

(పడఁగొట్టించు.)

సీ. నట్టింట దేవళ్ల పెట్టెఁ బెట్టినతిన్నెఁ గొట్టించి వెసఁ బందిగూఁడు చేసె. శుక. ౩. ౫౦.

(మ్రోఁగింపఁజేయు)

వ...పణవమృదంగదుందుభిప్రముఖతూర్యంబులతో

గొట్టించియుఁ గావళులు పట్టించియు...మను
చ. ౪. ౩౭.

**కొట్టివేయు.** స. క్రి. (√కొట్టు¹) ౧. పడఁగొట్టు, కూల్చు.

క. దళవాయితోడఁ గోటకు, సెలుపటియిల్లిల్లు గొ
ట్టివేయించి పిరం,గులు లగ్గంబులమీఁద,న్నిలి
పింపఁగఁ బనిచి నిగుడు సెన్వగతోడన్. కువల.
౩. ౩.

౨. తగ్గించు, తీసివేయు.

(వ్యవ) వడ్డీ కొట్టివేసి నాయొద్దనుండి మూలధనము మాత్రమే పుచ్చుకొన్నాఁడు.

౩. (గణిత) వ్యవకలనము చేయు.

ఉదా: ఎనిమిదిలో నుండి మూఁడు కొట్టివేయఁగా అయిదు మిగులును.

౪. అననుకూలముగా పరిష్కరించు.

ఉదా: వ్యాఖ్యము కొట్టివేసినాఁడు.

**కొట్టు¹.** స. క్రి. (త. కొట్టు) ౧. తాడించు, ప్రహరించు.

క. జననాథ యేమి చెప్పుదుఁ,గనలుచు నవ్వగ్గుతప
సి కటము లదరఁగాఁ, దనచేతి నాగబెత్తముఁ,
గొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నదయుఁడై.
మనుచ. ౪. ౯౫.

వ...సముల్లోలకల్లోలహల్లీసక ప్రభూతఝుంఝూ
నిలంబులు చఱచి కొట్టినం గూలువారును ...
వరాహ. ౭. ౫౯.

(క) చఱచు.

చ.పొలమరు లందుఁ గూఁత లిడ భూసురు లన్నది
వార్చి వార్చి మ్రాఁ,కులతుద లెక్కి చప్పటులు
గొట్టి యదల్పఁగ...ఆము. ౩. ౨౨.

(చ)-కొట్టి-వాయించు, మ్రోఁగించు.

ఉదా: డంకాకొట్టు, డప్పుకొట్టు, బేగంటకొట్టు.

౨. (కొట్టి) చంపు.

ఉ. ...దైత్యుల నూఁచముట్టుగాఁ, గొట్టినశౌర్య
ధుర్యునకుఁ గోసలరాజకుమారునెయ్యపుం, బట్టికి
కి రామభద్రునకుఁ బైపయిఁ జేకుఱుఁగాక భ
ద్రముల్. శై. భా. ౬. ౫౫.

గీ. ... హాయి యనుచు, నిందిరను గూడియుంటి
వీ వింటికన్న, గుడి పదిల మంచు యవనులఁ
గొట్టవయ్యా. సిం. నార. ౨.

౩. కూల్చు, పాడుచేయు.

గీ...చుట్టు,ముట్టి బెట్టుగఁ దురకలపట్టనములు,
గొట్టి సాధించ నలరు గగ్గోలుపడఁగ. కృష్ణ.
౨. ౯౬.

౪. వెళ్లఁగొట్టు, పోఁద్రోలు.

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ, బట్టితిరి తదీయ
భార్యఁ బాండవపుత్రకుం, గొట్టితిరి వారు మను
పఁగ,నెట్టన భరియింప వలెనె యీప్రాణము
లన్. భాగ. ౧. ౩౧౨.

గీ. ఇటుల నయ్యంబ మనసులో నీసుఁ బెట్టి, యాఁ
కలిని గట్టి దప్పుల నవలఁ దట్టి, నిద్దురను గొట్టి
వైరాగ్యనియతిఁ బట్టి, యుగ్రతపమును జే
యుచు నుండె నచట. పార్వ. ౪. ౪౨.

౫. పగులఁగొట్టు, బ్రద్దలుగొట్టు.

సీ. నీళ్లు వెల్లువగట్టి నికటాగ్రహారధరాసురులా
లికేరములు గొట్ట. శుక. ౩. ౪౪౨.

౬. కొఱికివేయు.

చ ... అవ్వని నేమఱి నిద్రవోవఁగా, నెలుకలు
గొట్టె నేము సిగలు...కకు. ౫. ౧౭.

(వ్యవ) పుస్తకము లన్నియు చెదలు కొట్టినవి. చిమ్మట చీర కొట్టివేసినది.

౭. చేయు, కావించు.

మ. భరమై తోఁచుకుటుంబరక్షణమునఁగాఁ బ్రాహ్మా
లి చింతన్ నిరం,తరతాళీదళసంపుటప్రకర
కాంతారంబునం దర్థపున్, దెసవాటుల్ ద
గి కొట్టి తజ్జపరిషద్విజ్ఞాతచౌర్యక్రియా, విర
నుండై కొలఁకంబమున్ గుకవి పృథ్వీభృత్స
మావక్షితిన్. మనుచ. ౧. ౯.

ఉ. ...వనిఁ దెరువాటులు గొట్టి కొట్టి మేఁ, స్వాం
చి విరక్తి దాసరివి నిన్నఁ గదా యయినాఁడ
వు...ఆము. ౬. ౮౦.

౮. ఛేదించు.

ఉదా: పూలతోను కాయలతోను ఉన్న చెట్టు కొట్టఁగూడదు.

౯. ఇది ప్రేరణార్థమందు 'చేయు' ధాతువువలె కొన్నితుమున్నర్థకముల కనుప్రయుక్తమగును.

ఉదా: చెడఁగొట్టు, పోఁగొట్టు, చెదరఁగొట్టు, విడఁగొట్టు, మొ.

౧౦. అనుకరణశబ్దముల కనుప్రయుక్తమై 'ఉచ్చరించు, అను, పలుకు' అనెడియర్థము నిచ్చును. (చూ. రాకొట్టు, చీకొట్టు, కిలకొట్టు, కిచకొట్టు, బుసకొట్టు, ఊఁకొట్టు, మొ.)

౧౧. ఆడు, తిట్టు.

ద్వి. ఈసొన్నలాపురి యిటు గాలకుండఁ, జేసిన
వాఁడె పో శివయోగివర్యుఁ,డనుచు వీతెఁడిగొ
ట్టులందఱుఁ గొట్ట, వినుచుండె రామయ్య వి
న్నఁదనమున. ప్రభు. ౩.౫౩ పా. ౨ పం.
(చూ. పద్యప్రభు. ౩. ౪౧ పా.)

అ. క్రి. ౧. తగులు, తాఁకు.

తరల. అరిగి తక్కుపటంపుధేనువు నల్లనల్లన మళ్ల
లోఁ, దిరుగుచుఁ వడి గాలి గొట్టినఁ ద్రెళ్లు
చుఁ మతి లేచుచుఁ. వరాహ. ౧౦. ౩౫.

(వ్యవ) వానికి వడ గొట్టినది, ఎండ కొట్టినది, బిడ్డకు సందు కొట్టినది, మొ.

౨. ఎక్కువగా కలుగు.

సీ. ... పార్థివేంద్ర, యాఁకలి గొట్టి నే నడిగిన
యన్నంబుఁ బెట్టింపుము ... దశా. ౬. ౭౧.

వి. ౧. దెబ్బ, ప్రహారము; తాఁకుట.

గీ. ఇట్లు కొట్టినకొట్టున నెత్తువాఱి, పుష్పకోమలధవ
ళకపోలతలము, కరుణ పుట్టించె రాహువు గ
ఱచి విడువఁ, దొరఁగునెత్తురుతోడిచందురునిబ
గిది. వరాహ. ౨. ౧౩౪.

గీ. కలికిచందోయి నెడిరెడికలన నేమొ, గంధగజ
కుంభపాళికిఁ గలిగెఁ బెట్లు, కలిగె బంగారు
బొంగరమ్ములకుఁ గట్లు, కలశముల కెల్ల మును
మున్నె గలిగెఁ గొట్లు. ఇందు. ౨. ౧౪౯.

చ. మిడిమిడిమెండ కొట్టునను మేనులు పెట్లుచు
నుండ నేలపైఁ, నదుగుల దుమ్ము కుమ్మునలె నంటు
కొనఁ ...వాల్మీకి. ౨. ౯౦.

౨. దండోపాయము.

సీ. ...కొఱలు నవలఁ, జకురుపాయంబులసంజ్ఞయై
మం చీగి వేఱు కొట్టిన నాల్గు వేఱువేఱ. ఆం.
భా. ౨. ౧౯౦.

కంపుకొట్టు=వాసనవేయు.

దారులుకొట్టు=దారిదోఁపిడి చేయు.

అచ్చుకొట్టు=ముద్రించు.

సున్నముకొట్టు=వెల్లవేయు.

డాబులుకొట్టు=బడాయులుకొట్టు, బడాయిమాటలాడు.

ఈఁతకొట్టు=ఈఁదు.

ఊరుకొట్టు=ఊరు దోఁచుకొను.

వానినోటిలో మన్ను గొట్టినాఁడు= వానిజీవికకు భంగము కలిగించినాఁడు.

కొట్టినపిండి=బాగుగఁ దెలిసినది, అతిపరిచితమైనది.

ఉ. కోమలి నాకు నెట్టెరుఁగఁ గొట్టినపిండి సమస్త
లోకముల్, నీమది కింపులైనయవి నిర్భరశ
క్తిని దే సమర్థుఁడఁ. కళా. ౬. ౩౬.

ఉదా: రామాయణము వానికి కొట్టినపిండి.

జ: కొట్టించు, కొట్టివేయు, కొట్టుకొను, కొట్టువడు, కొట్టుమిట్టాడు, కొట్టుమిట్టిపడు, కొట్టులాట, కొట్టులాడు, కొట్లమారి.

కొట్టు². వి. (సం. కోష్ఠః) సామగ్రులుంచెడుగది.

సీ. కొట్లు దేహారులగోనబుటంగడులంద తఱచు
గా గొందెమూ ల్తులుపులంద. అచ్చ. రా. బా
ల. ౮౭.

**కొట్టు³.** వి. ఒకానొక చెట్టు.

వ...కొడిసెల నొడిసెల నందుగుల నిందుగులఁ గలుగొట్లఁ గొట్ల...పి. శకుం. ౨. ౧౪.

**కొట్టుకొను.** అ. క్రి. (√కొట్టు¹) ౧.సంచలించు, కదలు.

(వ్యవ) గాలిలో బట్ట కొట్టుకొనుచున్నది.

౨. ఆందోళించు, డోలాయమానమగు.

(వ్యవ) కొడుకు కే మగునో యని వానిప్రాణాలు కొట్టుకొనుచున్నవి.

౩. శ్రమపడి పనిచేయు.

(వ్యవ) నీ వెంత కొట్టుకొనినను ఇంతకంటె చెక్కువ ధనము రాదు. కొట్టుకొని కొట్టుకొని వచ్చి వాఁడు గనుక పండుకొనినవెంటనే వానికి నిద్ర పట్టినది.

౪. బాధపడు.

(వ్యవ) వంట కొంచె మాలస్య మైనయెడల పిల్లలు ఆఁకలిచే కొట్టుకొందురు.

సా: బఱ్ఱ కొట్టుకొనిపోవుచుండఁగా పోఁగులకేడ్చినట్లు.

(వాడుకలోని విశేషప్రయోగములు.)

వాఁడు వాకిటఁ గొట్టుకొనుచున్నాఁడు కొంచెము బిచ్చము వేసి పంపుము. వారును వీరును కొట్టుకొనుచున్నారు. ఉప్పెనచే ఊళ్లు కొట్టుకొనిపోయినవి. పేలపిండి గాలికి కొట్టుకొనిపోవుచున్నది. ప్రవాహములోఁబడి వాఁడు కొట్టుకొనిపోవుచున్నాఁడు.

**కొట్టుప(వ)డు.** అ. క్రి. (కొట్టు¹ + పడు) ౧.దెబ్బలుపడు, తాడిత మగు.

ఉ. కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట... విష్ణుభవదూరునిఁ జేర్కొనిరేని మీఁద నక్కాలుని యాతనాతతిఁ గానరు పూనరు దుఃఖభారముల్. భాగ. ౬. ౧౨౩.

క.కొట్టుపడి యటకు మును పే,తిట్టుంబడి యేడ్చువాడు చెనఁ గని మదిలోఁ,గట్టలుక వొడమి నాసఖు, లిట్టనిరి మునీంద్రుతోడ సెత్తినవాలు చక్. మనుచ. ౪.౭౬. వేం. పంచ.౪. ౪౭౩.

౨. బాధపడు, పీడిత మగు.

క. అట్టిమహాదారిద్ర్యము, దొట్టిన హరిశర్మ ధృతియుఁ దూలక తృష్ణం, గొట్టుపడకుండఁగాఁ దన,పట్టపుటిల్లాలిఁ గష్టపడి పోషించెన్.హంస. ౨. ౧౫౧.

౩. వ్యయమగు. (శ. ర.)

**కొట్టుమిట్టాడు.** అ. క్రి. (కొట్టు¹ + మిట్టి + ఆడు) అతిశయించు; నిరంకుశముగా మిట్టాడు, స్వేచ్ఛగా సంచరించు.

సీ ... ఆఁకలి కొట్టుమిట్టాడంగ ... భాగ. ౯. ౧౦౧.

క. రక్కసులు వేడబంబుల, మిక్కిలి నాముకొని కొట్టుమిట్టాడంగా, నక్కట యొక మెకమున నై, యిక్కానల నొంటిఁ దిరుగు టిది తగవగునే. యయా. ౨. ౫౭.

**కొట్టుమిట్టిపడు**=కొట్టుమిట్టాడు. అ. క్రి. ఎగిరిపడు, మిడిసిపడు.

ఉ. దిగ్గన లేచి నిబ్బరము దీటుకుచంబుల నాఁచలేక తాఁ,బగ్గకుఁ గొట్టుమిట్టిపడు పైఁటచెఱంగఱఁ సేల జాఱఁగన్. ఉ. హరిశ్చ. ౪. ౨౬.

**కొట్టులా(ట్లా)ట.** వి. (√కొట్టులాడు) కలహము, జగడము.

క. నీ కేమి యాతఁ డాతఁడుఁ, జైకొని మార్కొనిన నిన్నుఁ బ్రార్థించిరటో, యీ కొట్లాటలు దీర్పఁగఁ, నాకాధిపతనయ యనుచు వారదుఁ దనియెన్. అహ. ౧. ౧౦౫.

గీ. పికిలిపిట్టలఁ గొట్లాటఁ బెట్టి చూచు. కువల. ౫. ౯.

**కొట్టులా(ట్లా)డు,కొట్లాడు.** అ.క్రి.(√కొట్టు¹) ౧. ప్రహరించుకొను; జగడమాడు, పోట్లాడు.

రగడ. జలజనాళముల విశాలసరసలీలఁ గొట్టుకా డి. రా. వి. ౩. ౧౨౧.

సీ. అంతకంతకు నంకురాది సకర్తృక మనుచుఁ గొట్లాడువేదాంతికులును. రా. వి. ౨. ౧౫.

గీ. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు, డడ్డపడి వారితోడఁ గొట్లాడిరైన, దాని నుడుపంగఁ జూరకున్నవానిఁ గ్రూర,కర్ముఁ డని చెప్పుదు రు కర్మకాండవిదులు. భార. ఉద్యో. ౩. ౨౪౨.

౨. బాధపడు.

క. కట్టా త్రికరణ మెఱుఁగఁగఁ,బుట్టినదురితముల నపుడ పాలియింపనియా,కట్టిఁడి దేహం బుడి గినఁ,గొట్టాడును బిట్టు నరకకూపంబులలోన్. భాగ. ౬. ౪౩.

**కొట్టె.** వి. (త. కొట్టు.) ఒకవిధమైనగాడె.

సీ...తగుఁ గునూలాభిధ గాడె యనంగను గరిపె యనఁగఁ. గీ. దక్షిశేషసమాఖ్యలు తనరుచుం డుఁ, గొట్టె కూటు పాడక కుమి బొట్ట యనఁ గ...ఆం. భా. ౨. ౨౪౦.

**కొట్నము.** వి.(ఇది'కట్టు' ధాతువునకు 'కట్నము' వంటిది. √ కొట్టు[1]-క. కొట్టణ, కొట్ట.) ౧. వడ్లుమున్నగువానియొక్క-దంపు.

ద్వి...సేఁ డాదిగా మీరు గూడి, చని వీరబాహునిసదనంబునందు, వెట్టిఁ గొట్నము నీళ్లు వెలయంగఁగసవు,కట్టెలు నివి యావిగాఁ గలపనులు, పగ లెల్లఁజేసి ... ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౬౧ పం.

మ. సాలపుందమ్మెరసోగలేఁదలిరుమోసుల్ పూరజం బెంతయున్,గలయం బర్వఁగఁ దావిక్రొవ్విరిఁ గడంకన్ వ్రాలుమన్ దేలుమన్, వెలపెన్ మాధవకానసేందిరలపెండ్లిం దీవపూఁబోఁడులు,తక్కిలికన్ గొట్నము లేఁటిపాట లెసఁగంగా దంచుకీలిం జెలీ. చంద్రా. ౪. ౨౧౫.

౨. ఊడిగము. (శ. ర.)

శా. ఇట్టట్టైందును బోవ రాక వగతో నెల్లప్పుడున్ వేలుపుల్,వెట్టిం గొట్నముఁ జేయ... యయా. ౨. ౬౩.

క. అనవుడు భూతంబులు మా,కును మీకృపఁ జేయ వెట్లు కొట్నంబుల మ,మ్మును బట్టి నోపు నేయవి, యని పదముల కెఱఁగి పలికి రంతయుఁ దెలియన్. మై. ౩. ౨౯.

కొట్నములపాటలు=పెండ్లిలో కొట్నములుదంచునపుడుపాడుపాటలు.

వ. అప్పుడు గప్పురగంధులు పెండ్లికొట్నంబులపాటలు పాడిరఁట యెటువలెను. మృ. వి. ౩. ౫౯.

కొట్నము(లు)దంచు = పెండ్లిలో స్త్రీలు పలురకములవడ్లు కలిపి పాటలు పాడుచు దంచు.

పాట. చెలియ రావె చేడె రావె చిన్ని రావె పొన్న రావె, వెలఁది రావె కొట్నములు వేగ దంచుము॥ గరుడవాహనములు మంచి గొరికుంకుమములు రత్న,సరులు పచ్చగన్నేరులు సన్నదినునులు, కలయఁ గూర్చి ... దంచిరి. మృ. వి. ౩. ౬౦.

**కొట్ర[1].** వి.పిండి లోనగువాని నుడుకఁ బెట్టుటకు పెట్టినయెసరు.

వ...కీచకతండులంబులం బిండికొట్టి కొట్రఁ బోసి యుప్పి గొప్పలుగాఁ జేసి యావించినకుడుములబానలు...కాశ. ౩. ౩౬.

**కొట్ర[2].** విశే. వామనుఁడు.

సీ. కుఱుచ కొట్ర కురుఁజు...గీ...అనఁగను వామనాఖ్యదనరు...ఆం. భా. ౨. ౧౨౩.

**కొట్ల(ట్టుల)మారి.** విశే. (√కొట్టు[1]) కొట్లుపడు స్వభావము గలవాఁడు, దెబ్బలు తినుస్వభావము గలవాఁడు.

సీ. తాళముల్ చూడఁ గీర్తనపాత్రము లటంచుఁ గొట్లమారుల జోడుగూర్పఁ దగునె. గీ...గబ్బిచద్దుబ్బుగవకు. చంద్రా. ౪. ౧౨౮.

**కొడతము**=కొణతము 1. వి. కుక్క మున్నగువాని మెడకుఁ గట్టి పట్టుకొను కఱ్ఱ.

క. కొడతములు విచ్చి కుక్కల, విడుచుచుఁ బెను వలల నిగుడ విప్పుచుఁ గడఁకన్, నెడనెడ నార్చుచు నటిమటిఁ, గమువడి వలవేఁటకాండ్రు గవిసిరి పెలుచన్. పద్మ. ౧. ౧౧౩.

**కొడమ.** వి. ముఖభాగమునందు కట్టు లేక నడుమ వలవలె నల్లిక గలయూఁతవంటి మత్స్యగ్రహణ సాధనవిశేషము.

గీ. కొడమ తీ ఱడ్డకొడమ ద్రొబ్బుడుపుటంబు, చాఁప రెుత్తెల గూడయు... హంస. ౪. ౧౭౪.

క. వలలం గాలంబులఁ గొడ, మల నూఁదులఁ జావ్వలను గ్రమంబున... ప్రబంధ. ౧౯౪.

**కొడవలి.** వి. దే. అవా. (బ. కొడవలులు, కొడవళులు, కొడవళ్లు, కొడవండులు, కొడవండ్లు) లవిత్రము, కక్కులు గలిగి వక్రాకారమై గడ్డి మున్నగునవి కోయుట కుపయోగించునొకానొక పనిముట్టు.

క. కడునియతిఁ దపము చేయుచు, నడవికి నొకదినమునందు నరిగి సమిత్తుల్, కొడవంటఁ గోయునురవడిఁ, దడఁబడి తనవామహస్తతర్జని తెగినన్. వరాహ. ౧౨. ౨౪.

గీ... సత్త్వమును రజస్సును దమస్సు, ననఁగ గుణములు... ఒండుమెయిఁ దగ విట్టలముగ, నొలయు వైరాగ్య మనుకొడవలిన కాని. భార. శాం. ౪. ౧౯౨. ఆం. భా. ౨. ౨౩౧.

**కొడస**=కొడిసె. వి. (సం. కుటజః) కుటజము, కొండమల్లె.

గీ... కొడస, కొడిసె యనఁ గుటజం బగు... ఆం. భా. ౨. ౫౦.

**కొడి.** వి. (సం. కోటిః. ప్రా. కోడి. క. కుడి) ౧. దీపశిఖ; దానినుండి వెడలుపొగ.

సీ. కొడిఁ బుట్టుకాళిమాంకురపు మేఘములకు మెఱుఁగులై మాపుఁ గ్రొమ్మించు లలర... గీ. అరతులొసంగుదివ్యకన్యకలు ధన్య,మతులు గ్రీడింతు రయ్యుత్తమస్థలమున. పాండు. ౨. ౧౨౮.

క. శ్రీకమలగృహము మోము వి,లోకింపఁగ దీపకళికలు కనుంగవ యా, నాకొడి వాటినసన్నపు,రేకలు నా బొమలు సుందరికిఁ జెలువొందున్. పి. శకుం. ౨. ౧౮౯.

౨. దీపపువత్తి మున్నగువానియొక్క దగ్ధాగ్రము, కాలినచివర.

ఉదా: దీపపుకొడి, పొగమట్టకొడి.

(వ్యవ) కొడి కత్తిరించుటచేత దీపము బాగుగా వెలుఁగుచున్నది.

3. లక్షణము, చిహ్నము.

ఉదా: చవుటికొడిసేల. (బ్రా.)

4. జెండా ?

ఉదా: కొడిస్తంభము=ధ్వజస్తంభము. (బ్రా)

కొడివేయు=జెండాయెత్తు. (బ్రా)

జ: కొడివడు.

**కొడిగ(గె)**=కొణిగ. వి. ముంజూరు, చూరుముందుభాగము.

ద్వి. అది మీఱఁగాసిక యపరంజికొడిగ, ముదురుఁ గెంపులపాళముగ నెండ గాయ. రం. రా. సుం. (చి. ని.)

సీ. పొడిమగఱాచందుకొడిగె నంటినజాతిరేఖోతి తాగోడజాజుటాకు. ఘటికా. ౨. ౬౬.

**కొడిద**=కొడిదిలి. వి. బొట్టనవ్రేలు కాక తక్కిన నాలుగువ్రేళ్లను వంపఁగా నేర్పడినచేర.

గీ. భాసిలు నికుబ్జచతురంగుళీసమాఖ్య, కొడిద కొడిదిలి యనఁగ రత్నోవిదారి. ఆం. భా. ౨. ౧౪౦.

**కొడిది(డ్డి).** వి. ఒకానొకచెట్టు. (శ. ర, బ్రా.)

సీ. కొడిదిపూసల నంటుకొలిపిన మొలత్రాడు తలదుప్పు చీరణంబులపాదియును. ఆ... అమర నాకస్మికంబుగా, మందనుండి యింటిమగఁడు వచ్చె. వేం. పంచ. ౧. ౫౭.

సీ. సిగులు గప్పనిచంద్రనిష్ఠురైవడి నున్న దీకొ
డ్డిపూస నీకవ్వఁ డిచ్చె. జై. భా. ౩. ౭౪.

**కొడిదిలి**=కొడిద, కొణిద[1], కొణిదిలి. వి. ౧. బొ
టనవ్రేలు కాక తక్కినవాల్గువ్రేళ్లను వంపఁగా
నేర్పడినచేర.

గీ. భాసిలు నిశబ్జచతురంగుళీసమాఖ్య, కొడిద
కొడిదిలి యనఁగ రత్నోవిదారి. ఆం. భా. ౨.
౧౪౦.

చ. పుడమిని రాచయిండ్ల మఱి పుట్టునె యీవగ
కొమ్మ యమ్మరో, కొడిదెఁడు నెమ్మొగంబు
తళుకుందొలికన్నులు చేరఁడేసి గా... బహు.
౪. ౧౦౬. చంద్రా. ౧. ౭౯.

**కొడిమె[1]**. వి. ౧. అపనింద.

సీ... అయ్యబ్జముఖియు. గీ. మిగుల వెఱఁగంది
యంతట నగుచు మీరు, సృష్టికర్త లెట్లైనను
జేయఁగలరు, మదికి వలసినయట్ల చేయుదు
రుగాని, పట్టికొడిమెలు నాకును గట్టఁ జన
దు. కళా. ౫. ౫౬.

౨. అనృతము, అసత్యము.

సీ. బూతు నా బూమె నా బూశ నా బూటక
మ్మనఁగను వేసట మనఁగఁ గొడిమె. గీ. యనఁ
గను నబద్ధసంజ్ఞయై యలరుచుండు. ఆం. భా.
౧. ౧౧౮.

౩. పాపము, దోషము.

క. కడు నరుడుగ నీయెడ నీ, యడుగుంగొన యం
త సోఁకినంతనె చెడుగుం, గొడిమెలు విడి
చని క్రమ్మఱ, మడఁతితనం బొదవె నాకు
మానిసిమిన్నా. అచ్చ. రా. బాల. ౧౪౯.

జ: కొడిమెలాఁడు.

**కొడిమె[2]**. వి. చేఁపలబుట్ట, కువేణి.

సీ...కువేణి చెలంగుఁ గొడిమె యంచనఁగను...
ఆం. భా. ౧. ౧౫౯.

**కొడిమెలాఁడు**. విశే. (కొడిమె[1]లు + ఆఁడు.)
పాపాత్ముఁడు. (శ. ర, బ్రౌ.)

**కొడివడు**. అ. క్రి. (√ కొడి) క్రుంగు ?

సీ ... దృష్టికధికగోచరంబు. ఆ. గాఁగఁ బన్ని
నిలిచెఁ గాయ్యోతో దానవ, కులబలంబు నే
లకొడివడంగ. కు. సం. ౧౧. ౬౪౯. (ప్ర
యోగాంతరము లేదు. ఇంకను విచార్యము.)

**కొడిసె[1]**=కొడస.

గీ. కొడిసెవిరులకమ్మఁదనంబు గొఱలి కొండ, సె
లల జాలుతుంపురు మోఁచి మెలఁగుచున్న,
గాడ్పుమురిపంబు నెందును గలిగి యెల్ల, వా
రిమనసులు వేడ్కల మూరిఁబోయె. హరి.
పూ. ౯. ౬౮.

గీ... కొడస, కొడిసె యనఁ గుటజం బగు ...
ఆం. భా. ౨. ౫౦.

జ: కొడిసెపాల.

**కొడిసె[2]**. వి. మత్స్యవిశేషము, ఒకవిధ మగు చేఁప.

సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువులెంకలకిచ్చె వా
లుగలను సంగడీలకిచ్చె ...కొడిసెలఁ బరిహా
సకులకు నిచ్చె. ద్వా. ౧. ౨౪౦.

**కొడిసెపాల**. వి. (√కొడిసె[1]) కొడిసెకాయ, ఇం
ద్రయవము.

గీ...కొడిసెపాల, నాఁగ నింద్రయవము దోఁచు
నాగభూష. ఆం. భా. ౨. ౫౦.

**కొడుఁగురు**=కొణుఁగురు. వి. ౧. దీపముయొక్క
చిట్టెము, దీపకిట్టము. (చి. ని, శ. ర.)

౨. (శైత్యాదులచే శరీరమునకుఁ గలుగు) వంకర.
(చూ. కొడుఁగురువోవు)

జ: కొడుఁగురువోవు.

**కొడుఁగురువోవు**=కొణుఁగురువోవు. అ. క్రి.

(కొడుఁగుఱు+పోవు) - శైత్యాదులచే-సంకర
పోవు, మెరికెలుతిరుగు.

(గిరిగాఁడు) వ... సీతునం, గొడుఁగుఱుపోయి యున్నసఖుఁ గ్రోఁతిఁ గనుంగొని చాలఁ గుందుచుక్. కేయూర. ౩. ౨౬౦.

**కొడుకఁడు**=కొడుకు. వి. బిడ్డఁడు, కొడుకు.

క. కొడుకఁడు నాసొదిగిటిఁబోఁ, జెడి పోయిన నాఁటనుండి చెలియా తెలియుం,బడ దేవార్తయు నతఁ డే,నడుపున కెచ్చోట నిలిచి వర్తించెడినో. భాగ. ౧౦ ఉ. ౩౨.

**కొడుకు**=కొడుకఁడు. వి. (చూ.కూఁతు.) ౧. మగశిశువు, బాలుఁడు.

ఆ. ఘనభుజుండు రాధ యనుదానిపతి యొక్క, నాఁడు దరుగుడెంచి చూచి రత్న, పుంజభరిత మయినమంజసలో నున్న, కొడుకు దాని లోన కొనుచు వచ్చి. భార. ఆది. ౫. ౩౧.

వ ... సాత్యకియు నశ్వాలు బలదేవుచేతికి నెత్తుకొన నిచ్చి తదనంతరంబ నారాయణు చేతికి నిచ్చిన.

క. అక్కొడుకు నబ్జనాభుం, డక్కజముగ నెత్తికొనుచు నందఱుఁ జూడఁగ్, గ్రక్కున నొక్కటనడఁగెను, మిక్కిలిచేతులును వానిమిక్కిలికన్నుల్. భార. సభా. ౨. ౫౮, ౫౯. ఆం. భా. ౨. ౧౧౫.

౨. పుత్రుఁడు.

క. పొడువునఁ బ్రాయంబునఁ గడుఁ, గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు నీ,కొడుకని యీతని నెంతయు, నెడమడుగుగఁ జూపఁ దత్తెయుండదు నగఁగాక్. భార.ఆది. ౮. ౧౦౦.

గీ. కూఁతురై పుట్టి వదవడి కొడుకుఁదనము,గాంచి భీష్ముని నాజిరంగమునఁ జంపు, నట్టియ జ్వాలాపత్యంబు పుట్టు నీకుఁ, దప్పదిది యని రుద్రుండు చెప్పి చనియె. భార. ఉద్యో.౮. ౩౬౦.

౩. పురుషుఁడు, మగవాఁడు.

క. చేపెమువలరాయుఁడికై, కానముగఁ గాక జడిసెఁ గాఁపుఁగొడు కా,లో నుదతిఁ దెచ్చుటకు ని,ద్రాసక్తుని మీఁటెఁ జన్ను ద్రావడుకొడుకుక్. వేం. పంచ. ౪. ౪౭౫.

**కొడుకుఁగుఱ్ఱ**=కుఱ్ఱవాఁడైనకొడుకు.

గీ. ధర్మతనయాదులైననీతమ్ములకును, ధార్తరాష్ట్రులకును నీవ తగువిభుండ, వేలు మీలోకమెల్ల నీ కేల రాధ, కొడుకితండనుతక్కువ కొడుకుఁగుఱ్ఱ. భార. ఉద్యో. ౪. ౫౯.

క. కొడుకుంగుఱ్ఱకుఁ జనుఁబా,లిడి ... వేం. పంచ. ౪. ౪౯౧.

సా. కొడుకు బ్రదికియుండవలె కోడలు ముండమోయవలె నన్నట్లు.

జ: కోటరము, కోటవీకము, కోడంత్రము, కోడంత్రికము, కోడవికము,కోడలితనము, కోడలు.

**కొడుపు**. వి. డంకా వేగంట మున్నగువానిని వాయించుకోల, కోణము.

గీ. క్రొమ్మెఱుఁగుఁదీఁగె తళ్కులకమ్మపసిఁడి,కొడుపుతాఁకుల ఘూర్ణిల్లె ఘోరభంగి,దర్పితోద్దండదండయాత్రకును బోలె, భూమిరమేఘుమాళిక పేరిభేరి. రామా. ౬. ౭.

సీ. మసిబొట్టుబోనాన నసలుకొల్పినకన్ను కొడుపుచేఁ దాటించు నెడపఁదవప. క్రీడా. ౧౩౬.

ఉ. అంగదుఁ డత్స్వయంవరమహామహవైభవకేలిహాలికిక్,గ్రంగన ఘంటపైఁ గొడుపు వ్రాలుట యొన్నఁడో నాఁటనుండియుక్, సంగరముక్ గిరఁబుగ మనంబున భావనసేయఁరైరి యా,మంగళకార్యనిష్ఠు లయి మధ్యమలోకమున న్మహీపతుల్. నైష. ౩. ౨౫.

౨. బలపము లోనగువానికడ్డి.

వ. ఈబలపపుఁగొడుపున వలసినయన్ని లెక్క

లోఁడి వ్రాసి యాలాతపుఁగోల సవ్యహస్తం
బునఁ బట్టి మట్టించిన నన్నియు నీవు దలం
చినప్రాణులై నిల్చి నీవు చెప్పినవని చేయు
...ద్వా. ౮. ౧౧౩. ఆము. ౨. ౫౪.

౩. తంబుఱ వీణె మున్నగుతంత్రీవాద్యములు వాయించుటకు వ్రేలికిఁ దగుల్చుకొనులోహపు గోరు. (శ. ర, బ్రౌ.)

౪. జంతికలు చేయుగొట్టము (బ్రౌ.)

౫. అప్పడాలు మున్నగునవి ఒత్తుగుండ్రనికఱ్ఱ. (బ్రౌ )

ప్రత్తికోడుపు=ప్రత్తికాయలోనిజడ, విడి.

సీ. శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు గుంటిమీఁదటి ప్రత్తికోడుపువోలె. కాశీ. ౧. ౧౩౮.

జమ్ముకోడుపు=జమ్ముకండె, జమ్ముకంకి, జమ్ముపెన్ను. (బ్రౌ.)

**కోడుము.** వి. తీర్థపుబిందె.

క. కోడు మెత్తుకొఱకు గుడికిన్, నడుచున్ వెలపడుచు నాభినామునునం గ్రొమ్ముడిసొరున్నడి చేరు, న్వడి జాఱుంబైఁట వింతవగఁ గనిపింపన్. శుక. ౩. ౧౭. ('కోడుమెత్తుకొఱకున్=తిరుమజ్జనపుసేవయందు తీర్థపుబిందె నెత్తునప్పుడు కావించుచుత్సవమునకు' అని కథాసందర్భమును బట్టి తోఁచుచున్నది.)

**కోణజేము**=కోణజా. (బ్రౌ.)

**కోణజా.** వి. వాకిటికావలియిల్లు, ద్వారమును మాత్రము సంరక్షణముచేయుపంచ. (బ్రౌ, శ. ర. "కొంజా" అనివాడుక.)

**కోణతము**[1]=కొడతము.

సీ. బిరుదు గల్గినయింటఁ బెరిఁగినం గోణతంబు విప్పినంతనె కుక్క వెదకుఁ జెప్పు. వేణు. ౩౬.

**కోణతము**[2], **కోణత.** వి. మల్లసాధనవిశేషము.

మ. అమరం గ్రొవ్విరితేనెజాలుకోణతా లందందలాగించి షాంకముగం బుష్పాడిమట్టిలోఁ బొరలి వీఁకన్ బోఁకపూమెుగ్గగోతములం ద్రొబ్బి సమీరమల్లుఁ డనువొందన్ మావిపూలోడిఁ ద్రిప్పమెయిన్ గోకిలబాలుఁ డెంచికొను సొంపుల్ గుల్కువాదంబులన్. శకుం. ౨. ౧౧౭.

సీ. మనుపు జెట్టి యనంగ మల్లాభిధానంబు...తత్సాధనంబులై తగుఁ గంబము కోణత...ఆం. భా. ౨. ౨౦౭. ప్రబంధ. ౮౨.

**కోణిఁగె.** వి. దిబ్బ, కుప్ప.

వ...మగరాలగోడలనీడలం దుఱంగలించుక్రీడాపులినంపుఁగోణింగెలఁ జెలంగురంగుల మెలంగువెలుంగులు...కృష్ణ. ౧. ౨౦.

**కోణిగ(గె)**=కోడిగ. వి. ముంజూరు, చూరుముందటిభాగము.

సీ. పగడాలకోణిగలనిగనిగ ల్వజ్రంపుజగతిశ్రీవల నెఱజాజా నింప. వసు. ౨. ౨౩.

సీ. నెలవులై చెలువారునిలువుల పిలసిల్లి కోణిగఁ బారావతకులము వదర. మను చ. ౬. ౩.

ద్వి. గోమేదకంబులకోణిగెలుబవిరి, గామల్చి పైవజ్రగార యొసంగి. రం. రా. బాల. ౭౩పా. ౮పం.

చ. చెదరి కపోతముల్ గోణిగ చేరక తారకవీథిఁ బాఱఁగా...వసు. ౪. ౬౩.

కోణిగచూరు=కోణిగ.

సీ. దోఁపుచూరసఁగను దోఁచు నంతశ్ఛదికోణిగచూరసఁగ నగు వ్యలీకము...ఆం. భా. ౨. ౨౧.

**కోణిగె.** వి. నమస్కారము.

రగడ. గోవర్ధనమునఁ గొలువై గన్పడు, గోపవేషునకుఁ గొణిగె లొనవ్చుచు ... హంస. ౪. ౨౧౩.

వ...తులసీవనమువలిగ వాఘరునకుఁ గొణిగి... ప్రబంధ. ౮౮౦.

కొణిద[1]=కొడిద. (బ్రౌ.)

కొణిద[2]. వి. మనుష్యజాతివిశేషము. (శ. ర, బ్రౌ.)

కొణిదిలి=కొడిదిలి.

ద్వి. ఎనయు నిద్ధర నెల్ల నేలినన్నృపులు, గొనిపోయిరే నేలఁ గొణిదెఁడం తైన. ద్వి.హరిశ్చ. పూ. ౧౪౨౭ పం. భా. శ. ౮.

కొణుఁగురు=కొడుఁగురు. వి. ౧. దీపముయొక్క చిట్టెము. (శ. ర.) ౨. (శైత్యాదులచే శరీరమునకుఁ గలుగు) వంకర. (చూ. కొడుఁగురువోవు.)

కొణుజో=కొనుజో. వి. పిడుఁజో, పశువులదేహమందు చేరి రక్తము పీల్చెడిజంతువిశేషము. (శ. ర, బ్రౌ.)

కొతి(త్తి)మిరి. వి. (సం. కుస్తుంబరీ. ప్రా. కొత్థుంబరి. త. కొత్తమల్లి. క. కొత్తుంబరి.) దనియపుమొక్క, ధాన్యాకము.

సీ...కుస్తుంబరి దనర్పుఁ గొతిమిరి యన. ఆం. భా. ౨. ౨౪౯. అ. మ. శ. స. ౨౪౮ పా. ౧౬ పం.

జ: కొతిమిరిపురుగు.

కొతిమిరిపురుగు. వి. (√ కొతిమిరి) దీపములో పడి చచ్చునొకవిధమైనపురుగు. (ఇది దీపములోఁ బడి కాలునప్పుడు కొత్తిమిరివాసన కొట్టును గనుక ఇట్టిపేరు వచ్చినది. బ్రౌ.)

కొతుకు=కొదుకు. అ. క్రి. ౧. జంకు, వెనుదీయు.

ఆ. తల్లి పాలువైచి తరల నన్న్యులపంచ, బ్రతికి కూఁతపట్టి కొతుక కీవు, కన్ను లెఱ్ఱచేసి యన్నులఁ గని కాలు,కూఁత లఱచె దేమి కోకిలంబ. రసిక. ౪. ౧౭౦.

చ. అతితరమారఘోరవిశిఖాగ్నిశిఖాపరితాపభీతి న,య్యాతివలమిన్న నిన్నిచటికంపెడిచో మతి యేమి పల్కె నీ,మతిఁ గొతుకంగ నేల చెప్పుమా...శుకమా రయంబునన్. రసిక. స. ౪౬.

౨. వర్ణలోపముగా మాటాడు, మాటలునమలు. (శ. ర.)

వి. సంకోచము, జంకు. (శ. ర.)

విశే. వర్ణలోపము గాని పదలోపము గాని కలది, గ్రస్తము. (౧. పదము. ౨. వాక్యము.)

సీ. గచ్చు కొతుకు నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు. ...ఆం. భా. ౧. ౧౧౮.

జ: కొతుకుపడు.

కొతుకుపడు. అ. క్రి. (కొతుకు+పడు) ౧. (మాట) లుప్తవర్ణము గాని లుప్తపదము గాని అగు. (శ. ర.)

౨. తగ్గు, తక్కువ యగు.

క. అతనికి మంజుల యనఁ గా, సతి యొక్కతె గలదు దానిసరి యెన్నుటకుం, గొతుకుపడు రతికిఁ జతురత, యితరల నిఁక నెన్న నేల యిందుని భాస్యా. హంస. ౨. ౮౦.

కొత్తడ(ళ)ము=క్రొత్తడము. వి. (త. కొత్తళమ్. క. కొత్తళ.) కోటబురుజు.

ద్వి. తలు చైనయట్టికొత్తడములతోడ, నిర వైన ముందఱియిట్టికకోట,పడమటివాకి తేర్పడఁ గాచి యుందు, రెడపక రాక్షసు లెనుబదికోట్లు. రం. రా. యు. ౩౦౩ పా. ౧౮ పం.

చ. తలఁకునఁ గోటనల్గడలఁ దల్పులు వేల్పులు మూసి డాసి కొ,త్తళములపై నలంగములఁ దార్కొని మార్కొని...ఉ. రా. ౪. ౨౭౨.

సీ...సాలావయవాఖ్య కొత్త,ళ మ్మన...ఆం.భా ౨. ౧౨.

**కొత్తెము.** వి. తాటిపండునందు విత్తు లేనికండ. (శ. ర.)

**కొత్తెమ్మ(మ).** వి. యోగిని, యోగాభ్యాసము చేయువాఁడుని. (బ్రౌ.)

కొత్తెమసాని=యోగిని యగుస్త్రీ.

వ... ప్రత్యక్షీకృతమోక్షలక్ష్మీవిశేషంబులం బోని యనశనవ్రతపుష్కిభూతంబు లగుమేనులుం గలకొత్తెమసానులును ... విప్ర. ౨. ౧౪.

**కొత్వాలు.** వి. (హిం. కోత్వాల్) పోలీసుఅధికారి. (శ. ర.)

గీ. ఎఱుక గలవారికరబడి నేఁగునపుడు, కరముల సిఖాలు చేసి ముష్కరతురుష్క, లవలఁ బొమ్మని కొత్వాలు కప్పగింతు, రచ్చటికిఁ జేరఁ బరులకు నలవి కామ. కృష్ణ. ౨. ౧౨౩.

**కొద=**కొదవ. వి. (√కొదవ) ౧. కొఱఁత, లోపము, న్యూనత.

సీ. కూడుసీరకు నింటఁ గొద లేక యుండునే ... హర. ౨. ౫౧.

క. చదలేటినీటఁ దడుపక, కొద లేటికిఁ దీఱు నగరుకొమరుల కని ప్రేమ దిగంతచరుఁడు గరుడుఁడు, మది వంత యడంప నంశుమంతుం డంతన్. చం. రా. ౩. ౧౬.

౨. అక్కఱ, గమి, ఆశ.

క. ఇది గాంధర్వవివాహము, సుదతీ మన కిపుడు సాక్షి సూర్యుఁడె యగ నో, ముదుకఁడ నీకొద తీఱిన, వదలెద వే నొల్లననుఁ బ్రవాళాధరయున్. భోజరా. ౭. ౧౧౫.

వ... జాతినపయ్యెదలు దారినపేరెదలు కొలఁది గడచినసద్దులు కొద దీఱనిసుద్దులు గలిగి యయ్యెడ ... సమీర. ౩. ౧౭౮.

౩. సంకోచము, జంకు.

చ. ఎదఁ గొద లేక మ్రుచ్చులని యెట్లు వచించితి కల్లభర్మసం, పదలకు మూల మైనహరిభక్తులకిప్పుడ కాదు వారికిం, దుద నొకచోటఁ బాటి లదు దొంగతనం బని యేను బాస చేసెద ... పరమ. ౩. ౭౧.

౪. శేషము, మిగులు.

గీ. అనిన లాఁతుగఁ గోల్పోక నతఁడు రాజా, రడ్డిఁ గను నని కొదయుఁ దీర్పంగ మగిడి, యంతఁ బరియును జైప్రజ కలిసి పాఱి, పోవ వాఁడును నెడపోట్లు పొడిచి చనియె. ఆను. ౬. ౮౩. (శ. ర. పా.)

**కొదమ.** వి. తిర్యగర్భకము, పశుపక్ష్యాదులపిల్ల; శిశువు.

గీ. నిను వనంగను బిల్ల నా నినుఁ గనంగఁ, గూన యనఁ గందు నాఁగను గొదమ యనఁగఁ, దిర్యగర్భకములు గాను దెలియ వలయు, నాపచారిక మన్యాఖ్య లౌట తర్వ. ఆం. భా. ౨. ౯౯.

సీ. త్రాళ్లఁ బట్టింపంగఁ దఱి యైనకొదమల సంచు లెఱింగి శిక్షించునేర్పు. భార. విరా. ౧. ౯౫.

పులికొదమ. భార. ద్రో. ౨. ౮౯.

అంచకొదమ. నైష. ౬. ౨౨.

లేటికొదమ. పారి. ౨. ౬౩.

లేడికొదమ. హర. ౫. ౫౫.

వేఁడివేలుపుఁగొదమ = సూర్యశిశువు.

చ ... వేఁడివేలుపుం, గొదమలు దావపావకునికుఱలు ... వానరవీరులు ... రామా. ౭. ౧౮౦.

విశే. ౧. తరుణము, పసుమని. (పసుపక్ష్యాదిశబ్దము)

సీ. గోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి మావుల హత్తించుమార్దవంబు. భార. విరా. ౧. ౯౫.

కొదమతుమ్మెద. నైష. ౮. ౫.

కొదమపులి. కళా. ౧. ౨౨౭.

కొదమపాయము. ఘటికా. ౨. ౨౬.

౨. బలిష్ఠము, దృఢము.
సీ. కొదమగుబ్బలదానిఁ గ్రొమ్మించుఁ గ్రమ్మించు నెమ్మేనినిగనిగన్నిగలదాని. దశా. ౨. ౧౦.
౩. లేఁత; పిన్న, చిన్న.
సీ. సౌరభోల్లాసముల్ జాతి గ్రుంగఁగఁ జేర నలరారుకొదమక్రొవ్వులను నెలను. ఆము. ౫. ౧౩౯.
సీ. ధుంఢివిఘ్నేశునిష్ఠురకంఠవేదిపైఁ గొదమచుక్కలరాజుఁ గుస్తరించు. భీమ. ౨. ౪౪.
ఉ. సోరణగండ్ల రాఁ గొదమచుక్కలు పట్టసతు ల్కవాటముల్, చేరుప ... ఆము. ౨. ౧౩.

కొదమతనము = చిన్నతనము, లేఁబ్రాయము.
గీ. కొదమతనమున నొప్పారి పిదప గండు, మెఱసి పొదలెడుమృగనాథు తెఱఁగు దోఁప. హరి. పూ. ౬. ౧౭౫.

కొదమయెండ = ఈరెండ, లేఁతయెండ.
గీ. కొమరుఁబ్రాయంపునూనూఁగుఁగొదమయెండ, ప్రాచి కభినవమాణిక్యపదక మయ్యె. కాశీ. ౧. ౧౨౩.

కొదమపిడుగు = తీక్ష్ణమైనపిడుగు. (బ్రౌ.)
పిడుగుఁగొదమ = కొదమపిడుగు.
ఆ. కొడుకుపాటుఁ జూచి కోపించి కాళింగ, పతి రయమునఁ దేరు వఱపి భీముఁ, బొదివి పిడుగుఁగొదమకోనినారసము బి,ట్టేసె నది యతండు వేసెఁ దునియ. భార.భీష్మ.౨.౬౫.
జ: కొదమరి.

**కొదమరి.** విణ. (కొదమ + అరి) పిల్లలు గలది.
ద్వి. మద మతిధృతి మాలి మదగజేంద్రుఁబు,కొదమరిపందిచన్గుడుచునే దేవ. పండితా. మహిమ.౨౬౦ పొ.

**కొదరు.** అ. క్రి. ౧. అతిశయించు.
(ఉపాకవ్యవర్ణనము) సీ. కోర్కులతమకంబు కొదరియుఁ దాలిమిపొందున నందంద క్రిందువడఁగ. హరి. ఉ. ౭. ౧౭౩.
౨. చెదరు. (శ.ర.) ౩. రేఁగు (శ.ర.) ౪. వ్రాడికలమునుండి సిరావలె చిందు. (బ్రౌ.)

**కొదలించు.** స. క్రి. (√కొదలు) కుదించు, తగ్గించు, సంకుచితముచేయు.
సీ. నెడతొక్కుఁబలుకుల వినిపించుఁ గొదలించుఁ గలయ వల్లభుపల్కుపలుకుపొంత. కు.సం.౯. ౩౪౬.

**కొదలు.** విణ. (క. కొడలు.) ౧. మందము, అలసము.
గీ... సారెఁ గొల్లుబ్బయువజనశ్రమజలాబ్ధి,నినుడుకొన దక్షిణము వాసి యేఁగుచెంచెఁ, గొదలునడతోడఁ బవమానకుంభజుండు. చంద్ర. ౩. ౧౦౭.
౨. అవ్యక్తము, అస్ఫుటము.
సీ. కొదలుమాటలు తేనె గులుకుచుఁ బలుకువో మోహనం బగువింత ముద్దుఁ జెలువు. కళా.౬. ౧౯౬.
గీ. సుకవిసంస్తుత్యు శంభుదాసుని నుతింప, నేర్తు నే రైన నేను వర్ణింతు నతని, చిన్నిమనుమఁడఁ గావునఁ జెఱుతవాంద్ర, కొదలుపలుకులు ముద్దు నేయుదురు గాదె. విప్ర. ౧. ౧౨.
జ: కొదలించు, కొదలుపడు.

**కొదలువ(ల్ప)డు.** అ. క్రి. (కొదలు+పడు)= కొదపడు.

(న్యూనత నొందు, కొఱఁతపడు)

ఉ. ఇమ్ములఁ దోడ నాడుచెలు లే మను చుండు దురోకొ యిప్డు నా, తమ్మునిముద్దుమాటలు గొదల్పడఁ బల్కెడుచిల్కబోద ని,త్యమ్మును బొత్తునం గుడుచున ట్టిలి చేడ్పడు ... నిర్వ. ౫. ౧౦౫.

**కొదవ—కొద.** వి. ౧. కొఱఁత, లోపము.
గీ. నేను మీదాన నగుట మీగానకథలు, వడివ

నవ్వేళఁ గొదవలు దడవ లేమొ. కళా. ౨. ౪౩.

గీ. ఇది యెఱుంగక యున్న నా లేమి కొదవ, నీకుఁ దెలియక యుండుట నీతి గాదు. శుక. ౩. ౨౭౩.

౨. లేమి, దారిద్ర్యము.

సీ. ఉదరపోషణమున కుర్వీశులను వేఁడి కొదవచేఁ గుందుచుఁ గొన్ని నాళ్లు. వేణు. ౩౩.

౩. తక్కువపాటు, న్యూనత, అవమానము.

ద్వి. ఇది నాదుముఖభంగ మీక్షింపు నాదు, కొదవ నీకొదవగాఁ గోర్కి భావింపు. రం. రా. అర. ౧౬౯ పొ. ౪ పం.

గీ... ఆర్తశరణ్య నీప్రాపు గలిగి, యుండఁగా నిట్టి కొవ మా కొదవ లేల. రామా. ౩. ౬౫.

౪. సంశయము, సందేహము.

గీ... అతని, తీర్థయాత్రయుఁ దపమును దేటపఱప, నొదవినపుడు గదా మదికొదవ దీఱు. కళా. ౨. ౧౫౭. (చూ. ౧౫౬)

౫. అపరాధము, నేరము, తప్పు.

గీ. బుజముపై నొక్క రోఁకలి పూని పట్టి, పదరుకొనుచును గసరుచుఁ బెదవు లదరఁ, గొదవ లెన్నుచుఁ దాఁ గన్నకూఁతు రున్న, కావునకు వచ్చె నలదేవదేవితల్లి. విప్ర. ౪. ౧౯.

చ. అన విని యంత యేమిటికి నానతి యిచ్చెద రిన్నినాళ్లుఁ దద్దను జూని నొంచి మీపద ముదారముదాకృతి నొందఁ జేయకుం, డినయది నాకు నేర మవునే కద యీకొదవన్ సహించి న, న్నను పుఁడు వానిఁ బట్టి నుఱుమాడెద నొద్దికఁ జెల్లఁజేసెదన్. కువల. ౨. ౭౧.

౬. న్యూనము.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గు కుందు, కొదవ లొచ్చు కొదుక యనఁ బొదలు న్యూనము... అం. భా. ౩. ౨౪.

ఱ: కొద, కొదవచేయు, కొదవడు, కొదవపడు.

కొదవచేయు. స. క్రి. (కొదవ + చేయు) చిన్నఁబుచ్చు, అవమానించు.

క. గుఱిచేసి గిన్నెఁ బంపిన, తెరువాకను మళ్లి పంపఁదగ దంపినచో, మఱి నిన్నుఁ గొదవచేసిన, తెఱఁ గగుఁ గెలవులును మీమదిం గడు నెడయున్. విప్ర. ౪. ౭౩.

కొదవ(వ)డు. అ. క్రి. (కొద + పడు) ౧. న్యూనత నొందు, కొఱఁతపడు.

క. యాగము కొదవడకుండఁగ, సాగింపుఁడు యుష్మదీయసవనానలకుం, డాగతవినీలఘూమస, మాగమమున దనుజమశకమండలి మ్రగ్గున్. పి. శకుం. ౩. ౧౦౬.

౨. తగ్గు, క్షీణించు; ఎత్తుపడు.

సీ. ముదిమిచే లావెల్లఁ గొదవడ్డ ఖరుని ద్రుంపుటయు నీళ్లకు నడ్డుపోయుటయును. అచ్చ. రా. యు. ౨౫౫.

క. కదలు రదనములు పదములు, గుదివడు జవసత్త్వ మింకుఁ గొదవడుఁ జూపుల్, వదనంబు స్రుక్కుఁ జిక్కున్, ముదిమి సుమీ రోఁత ... సుద. ౨. ౧౩౬.

సీ... కొదవడ్డయేనుఁగుఁ గొదమపోలె. దశకు. ౩. ౪౦.

౩. విచ్ఛిన్నమగు, ఎడతెగు.

సీ. కొదవడ్డ కౌరవక్షోణిపాలవతంసవంశంబు నిలిచె నెవ్వానివలన. వరాహ. ౧. ౯.

౪. మిగులు, శేషించు.

క. కలయం ద్రిమ్మరి మేదినిఁ, గలవీరుల నోర్చి జయముఁ గైకొంటి మను, ష్యులు నీకెదురే యింకం, గలదే కొదవడ్డచోటఖండితశౌర్యా. నిర్వ. ౫. ౩౯.

కొదవపడు = కొదపడు. అ. క్రి. (√కొదవ)
(కొఱఁతపడు, తక్కువపడు)

సీ... తత్త్రపతిము యంతయు మన కబ్బినఁ బను లన్నియుఁ గొదవపడక సాగు. పరమ. ౫. ౧౪.

క. రంగద్విలాసకుబ్జా,లింగనలోషిత మదీయాలీలాసేవా, సాంగత్యవచనరచనల, భంగుల నేమైనఁ గొదవపడెనొ యుపేంద్రా. విప్ర. ౪. ౩౭.

(భంగమగు, చెడు.)

క. కొదవపడియెఁ బని యనుచు, న్మది జాలిం దూలి వర్ధమానుఁడు దానిన్, వదినుండి మనుచు నందుల, కు దయాపరతంత్రుఁ డగుచుఁ గొండఱ నిలిపెన్. వేం. పంచ. ౧. ౯౬.

**కొదుక.** విశ. న్యూనము, తక్కువ.

గీ. తక్కువ కొఱంత పొచ్చెము తగ్గు కుందు, కొదవ లొచ్చు కొదుక యనఁబొదలు న్యూన, ము...ఆం. భా. ౩. ౨౪.

**కొదుకు**=కొతుకు. అ. క్రి. ౧. జంకు, భయపడు; వెనుదీయు.

క. అలంకి యాడుకైవడిఁ, గోలాటం బేయుమాడ్కిఁ గొదుకక కవలై, యాలమునఁ జెడుగు డాడెడు, పోలిక నిరువాఁగు జగడమునఁ గలఁబడియెన్. చంద్రా. ౬. ౮౪.

క. తనకు ననిష్టం బగునో, యని కొదుకుట శంక ...నరస. ౩. ౫౭.

సీ. అడిగినఁ గొదుకక పుడమివేల్పులకు నిచ్చలుఁ బాఁడిమొదవులఁ జాల నొసఁగు. నీలా. ౧. ౪౯.

ద్వి. ఇది యుడుగఁగ వచ్చునిది రాదటంచుఁ, గొదుకక వర మేఁకొను మిత్తు ననిన. ద్వి. పరమ. ౨. ౧౦౦ పా. ౨౦ పం.

౨. వర్ణలోపముగా మాటాడు, మాటనములు.

క. బ్రదికినబలిదైత్యేంద్రుం, డెదఁ దనయపజయముఁ దలఁచి యెంతయు వెతచేఁ, గొదుకుచు నిట్లని పలికెన్, త్రిదశాహితగురుని న్యాయనిష్ఠురఫణితిన్. దశా. ౫. ౫.

జ: కొదుకుకొను.

**కొదుకుకొను.** అ. క్రి. (కొదుకు+కొను- స్వార్థమున.)

(జంకు, భయపడు.)

గీ. అల్లనల్లన హరి హరి హరి యటంచు, గోలఁదనబోలె నొదుఁగుచుఁ గొదికికొనుచు, ని: పదభక్తి మూర్తిభవించె ననఁగఁ, జకితహ ణాక్షిదానఁసాని యయ్యె. విప్ర. ౩. ౩.

**కొదుపు.** స. క్రి. (త. కుదప్పు) ఏదేని నోట వే: కొని మ్రింగకుఁడ ఊరక నములు. (శ. ర-ఊరిచు. బ్రా.)

**కొద్ది**=కొలఁది.

వి. (పరిమితి, పరిమాణము.)

ద్వి. ఇలువేల్పులకుఁ బూజ లిచ్చెదువారు, కఁ కొద్ది దానముల్ గావించువారు. రం. రా. అయో. ౭౭ పా. ౧౯ పం.

ఉ. ముద్దియమోహ మెంతటిదొ మోహనరూపవిలాస వింటె యే, సుద్దుల నొల్ల దెవ్వరినిఁ జూడఁగ నొల్లదు సొమ్ములొల్ల దే, ప్రొద్దు విడెంబు చల్వలును భోజన మొల్లదు నిద్ర యొల్ల దీ, కొద్దికిఁ బచ్చవిల్తునిలకోరుల నేమగుచున్న దో కదా. శకాం. ౪. ౧౦౬.

సీ. తమికొద్ది నధరబింబము గంటివడనీక మొనపంటి నొక్కెంత మోపు మనుచు. అని. ౩. ౧౬. జాహ్నవీ. ౩. ౯౬. దశా. ౫. ౨౮.

(శక్తి)

గీ. వైచి సరగునఁ గ్రమ్మఱ వచ్చి తలుపు, మూసి గడె పెట్టి యిఁక మునిముచ్చుకాన, యిటు మొగం బైన నాకొద్ది యెఱిఁగె దనుచు, నింటికిని వచ్చె నవ్విటకంటకియును. విప్ర. ౪. ౩౧.

వ... రాళ్ల నొడిసెలలఁ బెట్టి చేకొద్దిఁ ద్రిప్పి తివ్వటివ్వన ఉవ్వచు...పానంసో. ౨. ౨౪ పా.

సీ. మొలవంకికొద్ది బెబ్బులిని గెల్చిననాఁడు గరిగ నీముంజేతిగవ్వదండ. చంద్రా. ౨. ౫౮.

విశ. (అల్పము, కొంచెము.)

ద్వి. కొద్దిగా ముత్తెఁపుగొనబువజ్రాల, మద్దికాయ

లడాలుమలయఁ జెక్కిళ్లు. రం. రా. బాల. ౨౦ పా. ౩౦ పం.

(పాటిది, ప్రమాణము కలది.)

సీ. తాళములంతలై తగ నిమ్మకండులకొద్దులై బొంగరాలుద్ది గాంచి. ప్రబంధ. ౭౦౦.

(వ్యవ) కొద్దివారు గొప్పవారు. కొద్దిమంది.

జ: కొద్దికాఁడు.

**కొద్దికాఁడు.** విశే. (కొద్ది+కాఁడు.) క్షుద్రుఁడు, అల్పుఁడు.

సీ. కొద్దికాఁ డనఁగను క్షుద్రుండు తగు ... ఆం. భా. ౩. ౧౩.

**కొన.** వి. (క. కొనె. త. కొనై.) ౧. చివర, కొస.

ఆ. జలరువాలుదీవియల నల్లనల్లార్చు, నొర్లగండ్ల యందుఁ జొచ్చి సుడిసి, తిరిగి వేగుఁబోక తెమ్మెర తలవీఁగ, కొనలవంక లొత్తు ననలఁ బ్రోచు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

ద్వి. కని బొద్దుఁ డంత నుత్కటకోపవహ్ని, కొనలను దనుదాన గొని కాలుచుండ. పండితా. వాద. ౧౭౬ పా. (వహ్నికొన=అగ్నిశిఖ.)

క. కొనఁ గననిపాపకర్ముఁడు, తను నాహారాదివిధులఁ దనుపఁడు మేయక, జననీఁడు కాలు గట్టుక, మనుటయుఁ జచ్చుటయుఁ గాదు మద్విధ మనఘా. వేం. పంచ. ౪. ౫౬౫.

౨. వృక్షాదులచివరకొమ్మ, అగ్రశాఖ.

చ. భయ మనుతొల్లికక విమలభావవసుంధరఁ జెల్లగించి భక్తి యనెడువిత్తుఁ బెట్టి ప్రతదీనది సమ్మదవారిఁ జల్లఁగా, నయమున నంకురించుచు ననల్ గొనలై యెలమిం జెలంగి త, న్మయము గఁ బ్రాఁకె నంచనఁగ నారులమైపులకంబు లేర్పడెన్. కాశీ. ౪. ౧౨౨.

చ. ... ఉగ్రత మహాబలురాకకు నోర్వఁ జాలక్కాతని నోకభంగి గెల్తు నని తాఁ దలపోసి హత్తించె నాతఁలుం, గొనలును బొంపముల్ నిడుదకొమ్మలు శేయగుడుఁ రయంబునన్. భార. శాం. ౩. ౩౯౪.

౩. గుబ్బిపుజాలు, కేసరము.

సీ. తేజినా నున్న తవాజియై పిలసిల్లు... గీ. కొన యనఁగఁ గేసరం బొప్పు... ఆం. భా. ౨. ౧౯౭.

కొనచీకటి=పేకువ నుండులేఁజీకటి.

గీ. అంతఁ దొలుకోడి గూయ నయ్యాత్మపాదుఁ, డాత్మశిష్యులఁ దెలుపుచు సరిగె నదికి, నింద్రుఁడును గొనచీకటి నింతియిల్లు, సొచ్చి నెమ్మేను బుణుకంగ సుందరయును. జాహ్నవీ. ౪. ౯౬.

నడుకొన=నడిమిప్రదేశము.

క. అనుచు నొడఁబాటు లేకున్నను నయ్యుత్తరుని నొగలనడుకొన నిడి తా, నను రథ మెక్కి రథికుఁడయి, చనియె నరుఁడు జమ్మి సేర సమ్మదలీలన్. భార. విరా. ౪. ౯౮.

వ. ...సకలచతురంగంబులం బూఁచున ట్లొనర్చి యొక్క మోహరంబుగా నమర్చి యం దగ్రభాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వత్థామసౌబలుల నునిచి నడుకొన శల్యు నిలిపి యన్న శేంద్రుఁడు వెన్నుదన్ని నిల్చునట్లు సేసె ... భార. ద్రో. ౫. ౧౪౨.

సీ. కుతలంబునడుకొనఁ గొలకొండగా నిల్పి శరనిధి గ్రొచ్చిరి సగరసుతులు. ప. సం. ౧. ౫౨.

కొనరిక్క = రేవతీనక్షత్రము.

క. కొనరిక్కనేరిపాలఁ తుక, పెసిమిటిపై నాఁగలియును బెనుఁదాటిపెడం, బును బూని తవలికాండ్రన్, దునిమి పుడమిపనఁతి ప్రేఁగు ద్రోయుదువు గదా. అచ్చ. రా. బాల. ౧౫౯.

కొనగోరు = గోటికొన, నఖాగ్రము. భీమ. ౧. ౧౧౦. రాజ. చ. ౨. ౧౦౭.

కొనముక్కు = నాసికాగ్రము. వైజ. ౪. ౬౭.

కొనరట్ట = హస్తాగ్రము. రం. రా. అయో. ౯౯ పా. ౫. పం.

కొనబావిలీ = చెవికొనయందు ధరించెడి భూషావిశేషము. (వా)

జ: కొట్టకొన, కొనలిడు, కొనలునిగుడు, కొనలువాఱు, కొనలుసాగు, కొనలొత్తు, కొనసాగించు, కొనసాగు.

**కొనటి, కొనటివాఁడు.** విశే. కురూపి.

గీ... రూపవిహీనులు దారు రూపు, గలిగి తోలు మేనఁ గొనటులఁ బలికినారు. భార. అను. ౫. ౯౩.

గీ. ...కన్యఁ, గులజ నైనను రోగిణిఁ గొనటిఁ జెనఁటిఁ, బరిణయంబగు టొప్పదు...మార్క. ౩. ౨౩౯.

గీ. బుద్ధిమంతు నివలన దుర్బుద్ధు లధికు,వలన హీనులు రూపసివలనఁ గొనటి, వారసూయలు సేయుదురిరసమున... భార. శాం. ౩. ౭౦.

**కొనకొనఁగోడి.** వి. బొల్లికోడి, జలకుక్కుటము.

గీ. కొనకొనంగోడి యెట్రింత కొంకనక్క, నమిలి యీ నాలుగిటిదర్శనంబు లెస్స. క్రీడా. ౫౨.

సీ. చక్రస్తనప్రకాశమునకు ఫేనంపుఁగొం గిడి కొనకొనఁగోళ్ల గొణఁగి. ఆము. ౪. ౧౩. సుద. ౩. ౧౯౪.

**కొనలిడు.** అ. క్రి. (కొనలు + ఇడు) వర్ధిల్లు, అతిశయించు.

క. ... క్రుయ్య దొకయించు కైనను, దయ్యాదు కొనలిడియెఁ దృష్ణ... భాగ. ౯. ౫౭౭.

**కొనలునిగుడు.** అ. క్రి. (కొనలు + నిగుడు.) కొనలొత్తు, వర్ధిల్లు, అతిశయించు.

ఆ. వాఁడు నతనిరాక పోఁడిగ నిజబుద్ధి, నెఱిఁగి యతనియున్నయెడకు వచ్చి, పరమభక్తి మ్రొక్కి ధరణీసురేశ్వరుఁ, గుశల మడిగి ప్రియము గొనలునిగుడ. భార. ఆర. ౫. ౨౮.

క. అర్థులకు మ్రొక్కి తక్కటి, క్రొత్తడులందఱకుఁ బ్రియము గొనలునిగుడఁ గ్యానత్తతిఁ బిలకించె వరవ, నూత్నమ రైమె సత్యభామ యుజ్జ్వలగరిమన్. హరి. ఉ. ౪. ౨౨౧.

**కొనలువాఱు.** అ. క్రి. (కొనలు + పాఱు) వ్యాపించు, ప్రసరించు.

వ... నిజగరుత్కనక రేఖామయూఖంబు లాఖండలారిదిక్కునకు నక్కజంపు టెలమిం గొనలు వాఱి యుద్దీపించు ప్రద్యుమ్న ప్రతాపవైభవంబునుంబోలెఁ జాల నాలోకనీయంబు లగుచుండ. ప్రభా. ౨. ౧౦౫.

**కొనలుసాగు.** అ. క్రి. (కొనలు + సాఁగు?) ౧. కొనసాగు, వర్ధిల్లు.

గీ. గోపకాంతలయాసలు కొనలుసాగు, చందమునఁ గోర్కె లెంతయు సందడించెఁ, గడుపులోపల సర్వలోకములు నిడిన, బాలకునితల్లి యైన యప్పద్మముఖికి. వి. పు. ౭. ౪౭.

గీ. ఇవ్విధంబున బ్రాహ్మణుం డెఱిఁగియెఱిఁగి, తిరుగుమండఁగఁ బెక్కువత్సరము లరుగఁ, గలుగుదురు పుత్రు లిద్ద ఱక్కాలమునకుఁ, గుండగోళకవంశంబు కొనలుసాగ. కాశీ. ౭. ౨౩౪.

౨. వ్యాపించు, ప్రసరించు.

వ. ... అనవుడుఁ గనుంగొనలఁ గొనలుసాగుకనలున కనుకూలం బైనహృదయంబు సదయంబుగా నొనరించి... కాశీ. ౧. ౫౭.

**కొనలొత్తు.** అ. క్రి. (కొనలు + ఒత్తు) వర్ధిల్లు.

ద్వి. కొనిపోయె వేడ్కలు కొనలొత్త నపుడు, వినుతార్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి. రం. రా. బాల. ౨౫ పా. ౨౦ పం.

**కొనసాగించు.** స. క్రి. (√కొనసాగు) కొనసాగఁ జేయు.

(వృద్ధిచేయు, పెంచు.)

మ. ధన మార్జింపుము నార్జితం బయినతద్ద్రవ్యంబు తీరంబుచేఁ, గొనసాగింపుము వడ్డివానివలనన్ గూర్తున్ మతిం గొంత... ప్రబోధ. ౪. ౩౩.

**కొనసాగు.** అ. క్రి. (కొన + సాగు?) ౧. ప్రసరించు, వ్యాపించు; ప్రవహించు.

గీ. కాల మనుకువిందుఁడు చంద్రికాపటంబు, చే
యఁ బన్నినమగ్గమొకో యనంగ, నవమయూ
ఖాళి గొనసాగి మిపుల నొప్పె, విధుఁ డమర
వానిగృహాభిత్తి వివర మనఁగ. కళా. ౭. ౧౪.

చ. నొసలను ముంగురుల్ చెదర నూల్కొని ము
క్కరడాలు మోవిపై, నెసఁ గొనసాగ ...
జాహ్నవీ. ౧. ౧౮౬.

సీ. ముజ్జగమ్ముఁ బవిత్రముగఁ జేయుతీర్థమ్ముఁ గొన
సాగఁ జేసినయనఘమూర్తి. విజ. వి. ౧.౧౨౭.

౨. వర్ధిల్లు, పెరుఁగు, అతిశయించు.

ఆ. కొడుకుఁ గన్నవేడ్క గొనసాగ రోహిణిఁ,
జీరఁ బంచి చిత్రచేలములను, మండనముల
నిచ్చి మన్నించె నందుండు. భాగ. ౧౦ పూ.
౧౯౭.

వ. నాబంధువర్గంబు బంధువర్గపుఁడీఁగయుంబో
లెఁ గొనసాగి బ్రదుకుం గాక యని యాశీర్వ
దించి ... కాశీ. ౪. ౧౬౯.

సీ. మత్పాదభక్తి యాత్మకు జనించినమాత్రఁ గొన
సాగి జ్ఞానంబు గుదురుపడును. దశా. ౧.౨౨౨

౩. పూర్తియగు; నెఱవేఱు, సఫలమగు.

గీ. అమ్మహాపూజ గొనసాగినట్టులైన, సంగరం
బున గెల్చె శత్రునైన, విఘ్న మొందిన
నోడు నవ్విధము మత్త, చిత్తుఁ దాట గణింపక
చేయఁ దొడఁగె. ఉ. రా. ౩. ౨౦౪.

గీ. ...అశక్తులైన, వారిచేఁతలు కొనసాగి వచ్చు
నెట్లు. వరాహ. ౧౧. ౨౮.

గీ. వేలుపులవేల్పు మాటమొఱ యాలకించి, కనికర
పుఁజూడ్కిఁ గనుఁగొని గాట మగుచు, నెద
లఁ బొదలెడునట్టి కల్లఁ బ్రిదిలపఱచి, సాఁ
కవే కోర్కు లింకఁ గొనసాగఁ జేసి. అచ్చ.
రా. బాల. ౬౯.

**కొని=కొన్ని.**

క. మనుజపతి యివ్విధంబునఁ, దనచెఱయింటికిని
మ్రుచ్చుఁ దప్పన నొప్పించినయట్టుల పదిని
సరకు, గొనక మఱచి యున్నయెడను గొనిదిన
ములకున్. నిర్వ. ౨.౬౩.

(హల్లు పర మగుచో 'ఇ'కారము లోపించుటయుఁ గలదు)

ఉ. కొన్ని గొణంగి కొన్ని నగి కొన్ని తుటారము
లాడి...పాండు. ౮. ౧౮౨.

**కొనితెచ్చు.** స. క్రి. (కొని + తెచ్చు) తీసికొనివచ్చు.

వ. భగీరథుం డనురాజన్యుండు కపిలముని ప్రదీప్త
కోపానలదగ్ధు లగుసాగరుల నిరయాంబువలన
నుద్ధరించుటకై తపోవిశేషంబున మందాకినిం
గొని తేర...కాశీ. ౪. ౨౮.

క. తోరపులత్తుకచాయల, వారువములు గట్టి మహి
షవరకేతువు నెల్వార సమకట్టి తేరా, సార
థి గొని తేర నెక్కి సంరంభమునన్. ఉ. రా.
౩. ౩౮౩.

చ. ఇతరులు రాకమున్న యది యెక్కడఁ బెట్టిన
దానవో నుశీ, క్రమతఁ గొని తెమ్ము తల్లిఖుతుఁ
గన్నులఁ జూచినదాఁక నామనం, బతిముదితం
బు గాదు... ప్రభా. ౧. ౧౩౬.

**కొనిపించు.** స. క్రి. (√ కొను) కొనఁజేయు.
(విలువకు పుచ్చుకొనఁజేయు.)

ఉదా: మగనిచే ఆమె జరీచీర కొనిపించినది.

**కొనిపెట్టు.** స. క్రి. (కొని + పెట్టు) కొనియిచ్చు, విలిచియిచ్చు.

సీ. మురువుతో నామేలిముసుఁగు దీసినవేళఁ గొని
పెట్టు మందునో కుప్పసంబు. గంధ. ౧౩౧.

**కొనిపోవు, కొంపోవు.** స. క్రి. (కొని + పోవు) అపహరించు; తీసికొనిపోవు.

క. నాచిన్నిముద్దుఁగూఁతురు, నాచక్కనితల్లి వీ
థి నడయాడఁగ నన్నిచు కొనిపోయె పాళ్య
ము, రాచిలుకం గొంచుఁ బోవు క్రమమునఁ
దంత్రీ. రాజ. చ. ౨. ౩౧.

క. చంపినఁ జంపుము నన్నటు, గొంపోకుండినను
జాలు కొసర కదయుకే, జంపిన నన్నొకటిన
మఱి, కొంపోయిన సెంద మెట్లగుదుకో యె
ఱుఁగక్. ప్రభా. ౩. ౧౪౩.

ఇట్లే: కొనిచను, కొంచుఁజను, కొంచేఁగు, కొం
చుఁబోవు.

క. శౌరి యిచె పారిజాతము, గోరికఁ గొనిచనుచు
మనలఁ గొనిపోఁడని లోఁ, గూరిన నెవ్వగఁ ద
క్కిన, భూరుహములు మధురసాస్రపూరము
నించెక్. పారి. ౪. ౫౨.

చ. భామినితోడ నిట్లనియెఁ బద్మదళాక్షునిఁ గా
నఁ బోయెదక్, గోమలి బల్దరిద్రులము కొంచుఁ
జనక్ మన కొద్దివస్తు వా, స్వామికి నిష్టమైన
యది సంగతియే చన రిత్తచేతులక్, భూమిపు
లొద్దకుక్ సతులపొందులకుక్ గురు లున్నచో
టికిక్. కుచేల. ౧. ౧౦౩.

శా. ... వా, కుం గాంతాజనులం దగంగఁ బురికిం
గొంచేఁగు టర్హం బగుక్. భార. శల్య. ౨. ౨౧.

క... రాచిలుకం గొంచుఁబోవు... రాజ.చ.౨.౩౧.

**కొనియాట.** వి. (√కొనియాడు) కొనియాడుట.

(శ్లాఘనము)

ఉ. ... అత్యాదరవృత్తి మీరు విజయాశ నను
గొనియాటఁ జేసి యాఁ, గాదన కియ్యకొంటి
...భార. ద్రో. ౧. ౭౩.

క. నను సహదేవనయుశా, స్త్రకళావేదిత్వమునకు
జను లనురాగా, ధికులై మిమ్ముం గొనియాటకు
నాతఁడు మనసు గీష్పడం జింతిల్లుక్. భార.
శాం. ౧. ౧౭.

(ఆచరించుట)

సీ. తలఁపంగ నాద్యమై తనరుధర్మమ యెప్డుఁ గొని
యాట నాస్తికగోష్ఠిఁ జనమి... గీ...ఇన్నియు
ను శిష్టచరితంబు లిద్ధచరిత. భార. అర. ౫. ౪౪.

(కొలుచుట)

క. కడుఁ గ్రొత్తలు నీ విటు నను, బడుగుం బాటిం
చి మిన్ను ప్రాఁకించెదు నీ, యడుగులఁ గొని
యాటకుఁ బను, పడి నారము నీకు మమ్ముఁ బాడి
యె పొగడక్. హరి. ఉ. ౭. ౫౨.

**కొనియాడు**=కొండాడు. స. క్రి. (కొని+ఆడు.)

౧. మెచ్చు, పొగడు, స్తుతించు.

క. తనపలుకు లోక మెల్లను, గొనియాడఁగఁ దగిన
లోకగురుఁడు... భార. ఆది. ౭. ౨౪౬.

చ. హరుఁ జెడనాడి వీరిఁ గొని యాడెదు పెద్దయు
నీవు... కు. సం. ౨. ౧౬౬.

౨. గౌరవించు, ఆదరించు; పాటించు, లక్ష్యపెట్టు.

చ. ... నీగురువుఁ బొల్తి తగం గొనియాడు మెట్లు
నా, ప్పె నటుల భక్తిమై నడవు... భార. విరా.
౧. ౨౫౨.

సీ. కుంతీమహాదేవికోడంద్రలోపల నగ్గలంబుగఁ
గొనియాడఁ బరఁగి. భార. విరా. ౨. ౨౧౬.

క. అనిరఁ బితృదేవతలు మా, కును నీకును నరకగతి
యగుం జుమ్మీ నీ, మనమున మావచనంబులు,
కొనియాడక విడిచితేని కులజలధిశశీ. మార్క.
౭. ౧౯.

౩. భజించు, సేవించు, కొలుచు.

క. ... నీవు నివ్విధములజనములం, గొనియాడుము
వారలు శోభనము లొసంగుదు రఘుంబుఁ బా
పుదురు కృపక్. భార. అను. ౨. ౧౩౬.

సీ. స్వర్గకాములు పితృవర్గంబుఁ గొనియాడి యిహ
లోకసుఖలీల లెల్లఁ గాంచి. హరి. పూ. ౨.
౧౩౦.

౪. కాపాడు, రక్షించు, పోషించు.

గీ. ...అతనిపుత్రకులు దాని, సెంగిసులు పెట్టి కొ
నియాడ నెలమిఁ బెరిఁగి. భార. కర్ణ. ౨. ౫౪.

క. విను మద్గోవిందుఁడు సఖుఁ, డును బంధుఁడుఁ
గార్యకర్తృకుఁడునై నిన్నుం, గొనియాడుచుం
డ దురితం, బను పేరును గలదె నీకు వనచరి
త్రా. భార. శాం. ౩. ౪౮.

క. విను భక్తియు వెలుపుఁ గలిగి, యనుజన్ములు పె

ద్దవాని నారాధింపఁగ, జనవర యతండు తమ్ము
లఁ,గొనియాడఁగ సిరికిఁ బట్టగుచు రుజ్వులునై.
భార. అను. ౮. ౧౩౨.

మూ: సర్వేషాం వృత్తిదాతా స్యాత్సచైతాన్
ప్రతిపాలయేత్, కనిష్ఠాస్తం నమస్యేరన్ సర్వే
ఛందానువర్తినః. సం. భార. అను. ౧౬౨. ౧.
రం.రా. కిష్కి. ౦. ౨౧౬ పా. ౨౩ పం.

౫. అవలంబించు; ఆచరించు.

చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ
బొందె నిట్లు నే,యదుము కులప్రయుక్తమ
గుచున్న సనాతనధర్మ మిత్తెఱం,గ దహనకర్మ
మెల్ల మది గానిదిగా మును నిశ్చయించి మా,
మొదలిటివా రొనర్చువిధనుం గొనియాడితి
మేము నియ్యెడన్. భార. విరా. ౧. ౧౭౯.

క. విను రాజా లెట్టిధర్మము, గొనియాడుదు రట్ల
నడచు గుఱుకొని ధాత్రీ, జనము ... హరి.పూ.
౨. ౮౭.

క. అనిన నతఁ డిట్టిధర్మము, కొనియాడక వ్రతము
లొండు గోరి నడపఁగాఁ,బని యేమి... భార.
శాం. ౬. ౫౦౪.

౬. తలపోయు.

క.విధివశమునవచ్చినకీ,డ్పదములు గొనియాడి వ్రేఁ
గులై విపులభవాం,బుధి మునుఁగుదురు ...
భార. అను. ౧. ౯.

శ్లో. కోహ్యాత్మానం గురుం కుర్యాత్ ప్రాప్తవ్యే
సతి చింతయన్, ప్లవం తే ధర్మలఘవో లోకేం
భసి యథా ప్లవాః, మజ్జంతి పాపగురవః శస్త్రం
స్కన్న మివోదకే. సం. భార. అను. ౧. ౨౨,
౨౩.

**కొనివచ్చు.** స. క్రి. (కొని + వచ్చు) తెచ్చు.
(తీసికొనివచ్చు)

గీ.... సాహిణి యొకండు, కర్తయెదుటికిఁ గొనివ
చ్చె గంధవాహ, బాంధవం బగు శోకమహా సైం
ధవంబు. మను. చ. ౪. ౨౮.

(ప్రైఁడిచేఁప) సీ. తనసంతతికి మేఁతఁ గొనివచ్చు
రీతి దిక్కరికరీరంబులగరుల వాను. దశ. ౧.
౨౫౯.

**కొను.** స. క్రి. (త. కొళ్.) ౧. గ్రహించు.

(క) పట్టుకొను.

తరళము...ఏను తీర్థము లీసము ద్రతటంబునన...
వీని నెన్నఁడు నాఁడనో,డుదురు నస్తును లిందుఁ
గోల్లొనడుల్ గొనుచు వడిఁ జొచ్చుడుర్.భా
ర. ఆది. ౮. ౧౪౮.

సీ. గంధర్వకామినీకాముక వ్రాతంబు లాతాలఁ గొ
ని మోఁది లజ్జఁ గొంద్రు. హర. ౫. ౧౦.

ఉ. ముందల వట్టినట్లు తనముఖ్యతరాస్త్రము గొన్న
దేవకీ,నందనుఁ జూచి...పారి. ౫. ౩౮.

(చ) తీసికొను; తీసికొనిపోవు.

ఆ. ... అతివపింఁడుఁ, గరులఁ దురగములను నరదం
బులను గొని, యరుగుజెంచె ... భార. మా.
౧౧౫.

క. చని సంప్రార్థించి యతనిఁ,గొని రుద్రునిఁ గాం
చి నీసఖుం డీతఁడు వచ్చినకార్యము కృపతో
డను,విను మని దండంబు లెఱఁగు వినిపించెఁ ద
గన్. భార. శాం. ౩. ౧౧౭.

(ట)-ధనాదులు- ప్రతిగ్రహించు; పరిగ్రహించు,
స్వీకరించు.

గీ. కపిల యిచ్చినవానిన కాదు నిజము, కొన్నవా
నిని బుణ్యాత్ముఁడుగఁ జేయు. భార. అను.
౩. ౧౦౩.

క. విను మిచ్చెద నని యీమిరుఁ, గొనియెద నని
పలికి ఇదపఁ గొనవనికియు నత్యానృతంబులు
సత్యవ్రత,మునకుం దొలఁగంగ మనకు భూవర
తగునే. భార. శాం. ౪.౧౫౦.

క. కాకేమి తన్నుఁ దిట్టెనె, కోకిల తన కేమి ధన
ము కోకొమ్మనెనే,లోకము పగ యగుఁ బరు
సని, వాకునఁ జుట్టమగు మధురవాక్యములన
నన్. కవిక. ౨. ౮.

క. ష్టే కందమూలఫలములు, కోకొం డని యొసఁగ
నందికొని నమలి కపులెల్ల. భా. రా. కిష్కి. ౧.
౬౫౫.

(ఆ) లోఁగొను, ఇముడ్చుకొను.

గీ....సముద్రంబులోన బుఱ్ఱ, వైవఁ గొన్నంత గొ
నుఁ గాక...భార. భీష్మ. ౨. ౭౮౨.

౨. అపహరించు; హరించు.

క. ఆమిష మని దానిం గొనఁ,గా మది సమకట్టి
యొక్కఖగ మాఖగముల్, వ్యోమమునఁ దాఁ
క...భార. ఆది. 3. ౨౯.

గీ. ... బ్రాహ్మణధనంబు గొనుట ధర్మంబు గాదు,
మనుజపతులకుఁ దగియెడిమానికంబు, గాన వి
డుచుట నీతిమార్గంబు గాదు. వరాహ. ౫. ౫.

క. ఉన్నఁ గని యప్పడఁతి యో,యన్న విడువు
భుజగనాథు ననవుడు నతఁ డీ,పిన్నాతని ప్రా
ణంబులు, గొన్నది యిది దీనియసువులుఁ గొని
యెద ననియెన్. భార. అను. ౧. ౭.

3. ఆధారముగాఁ జేసికొను; అనుసరించు.

గీ. ... ఎవ్వరిఁ గొని యతండు, కౌరవులమీఁద నె
త్తి రాఁ గలుగువాఁడు. భార. ఉద్యో. ౨
౧౬౯.

క. తమతమదేశంబులకై, మిముఁ గొని పాండవుల
గెలుచు మెయికోలున భూ,రమణులు గొంద
ఱు వచ్చిరి...భార. భీష్మ. ౧. 3౧.

గీ. పురము వెడలి గోమతి యను పుణ్యతటిని,నడుము
కొని చని యారాజనందనుండు, దీనియావలఁ ద
పనో కో ద్విజకుమార,వరులయా రని యడుగం
గ వారు సేరి. మార్క. 3. ౬౬.

౪. కావించు, చేయు.

క. వడి దొవఁ దిగుచుట దొడుగుట,వెడలం దెగ గొ
నుట శరము విడుచుట గానం,బడక విలు గుడు
సువడుటయు,నడుగక రక్కసులు పడుటయు
ను గానఁబడుమ్. భా. రా. అర. ౧. ౨౭౪.
(తెగగొను=జ్యాకృష్టి చేయు.)

చ. ధనువుల విల్లు బాణములు-దారుణలీల నమర్చి
బద్ధిగల్,గొని నిగిడించు...భా. రా. అర. ౨
౨౭౪.

౫. పొందు, ప్రాపించు. (ఇది పెక్కుపట్ల విశేష్య
ముల కనుప్రయుక్తమై ఈయర్థములో శబ్దపల్ల
క్రియగా ఏర్పడుచున్నది. ఉదా: తెవులుగొను,
భయముగొను, మఱలుకొను.)

గీ.కుసుమధనువున నెవ్వండు గొను విజయము.భా
గ. ౧౦ ఉ. ౧౦.

ఉ. ... సురేశ్వరాదులం, బన్నములాడి నీమగని
పక్షము పల్కెదు గాక బేల నీ,కొన్న మరు
ద్గజ్జనులు గొందురె వ్రాత్యులఁ బూజ్య లం
దురే. కు. సం. ౨. ౧౬౯.

క....ఈతటినిం,గనుఁగొను పుణ్యుఁడు మిక్కిలి,
కను గొను నెన్నుదుట నెన్నఁగాఁదర మగునే.
దశా. ౧. ౧౨3. పాండు. ౧. ౭౧.

౬. లక్ష్యముగాఁ జేయు, గుఱిగాఁ జేయు.

ద్వి. ... ఇంద్రజిత్తు, పసిఁడిపింజల నొప్పుబాణ
ము ల్దొడిగి, గోముఖుం డనువానిఁ గొని కాఁడ
నేసె. రం. రా. ఉ. ౭౫ పా. ౧౭ పం.

౭. లక్ష్యపెట్టు, సరకుసేయు.

క. కొనరు బుధులమాట నాస్తికులు వినయనిధీ.
భార. శాం. ౬. ౨౨౫.

చ. ... భుజశక్తి నెవ్వరిం,గొనక కరంగి రజ్జువలు
కుల్ గడుఁ జెక్కులు వల్కు దప్పు నీ,వు ...
భార. మహా. ౪౪. భార. ద్రో. ౫. 3౭. నృసిం.
౪. ౨౧.

౮. వశపఱుచుకొను, ఆక్రమించు, స్వాధీనపఱు
చుకొను.

సీ. అభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి యోధ
యీపెన్నేలయెల్లఁ దాన,కొని యధ్వరములు
పెక్కొనరించి ... భార. శాం. ౧. ౨3౮.

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభాముని ముఖ్యుల క
ట్టఁ బట్టి యా,తలఁ బడనై చుచుం దమముఁ బా

మె యవారణఁ దత్తదాసనం,బులు గొని కూరుచుండిరి ... ప్రభా. ౧. ౮౨.

గీ. ఇందుర మ్మన్నచోట నిల్లెల్లఁ గొనుట. కువల. ౨. ౨౩.

౯. తాల్చు, ధరించు.

క. నలువదితొమ్మిది రూపం,బులు గొనియుం బుష్పగంధములు మోవఁగ లే, కలసియుఁ దమ్మిగ లానుం,బలుమఱు యువజనము మేనిపలుచని చెమటల్. పాండు. ౧. ౧౮౫.

సీ. కొమ్ముకత్తుల మెఱుంగులనెల్ల పావడల్ గొనునది మస్తేనుఁగులచయంబు. కువల. ౨. ౧౨౭.

౧౦. పూను.

క. విను మప్పలుకులు పాటిగఁ, గొని దుర్యోధనుని తోడఁ గొంటిని బగ... భార. కర్ణ. ౩. ౬౦.

ఆ. హితజనంబు లెదుర నీతని కడరైనఁ, బ్రాణమిత్త్రు ననుచుఁ బ్రతినఁ గొంటి. జై. భా. ౮. ౯౦.

౧౧. కలియు, కూడు, చేరు.

సీ. కమలకాననమధ్యకలహంసవిభుభాతిఁ గూర్మి నెచ్చెలిపిండు గొని చెలఁగుచు. పాండు. ౨. ౩౧. కేయూర. ౪. ౧౬౫.

౧౨. తలఁచు, ఎంచు.

క. అది రవి గ్రుంకుటగాఁ గొని, మద మెసకంబెసఁగ నార్చి మనసైన్యంబుల్, వొదలె... భార. ద్రో. ౪. ౩౧౬.

ఆ. దనుజుఁ డనుము మనుట తప్పుగాఁ గొనకుమీ. రుక్మా. ౫. ౧౬.

క. కటకట మనవారిది దుర్ఘటముగఁ గొని యెంతె చింతఁ గావించెద రిప్పటి కింక నేము మేమెం, తటిపగయును దీర్ప లేమె తమయాజ్ఞవశన్. ప్రభా. ౨. ౫౫.

౧౩. నెఱవేర్చు, సాధించు.

క. రాణింపఁ బల్కి తనపని, జాణై కొను ... అము. ౪. ౨౬౯.

ద్వి. పెనుపొందఁగా సామభేదదానములఁ, గొన రాని కార్యంబు గొనకొని చేని, మఱిగదా దండంబు. రం. రా. యు. ౨౯౯పా. ౧ పం.

౧౪. తెచ్చుకొను, తెచ్చిపెట్టుకొను.

చ. కిలకిల నవ్వు మోవిపలుగెంటుల దీటుఁ గుచంబు లొరగా, వెలువడఁ బైఁటవేయు నెఱవింతగఁ గేరు మరుల్కొనంగ బెళుకులు గొనఁ జూచు లేనివగలుం గొని మాటికిఁ గుల్కు... హంస. ౧. ౨౧౭.

౧౫. చేరనిచ్చు.

వ. ... క్షేత్రపులం గొననియావులం దొలఁగం గట్టి పిల్లు పెట్టియు మందులు సల్లియుం జాల దుఃఖపఱిచి చేఁ బెఱింగించువారును. హరి. పూ. ౫. ౧౪౨.

౧౬. (నృత్తాదులను) ప్రయోగించు.

క. మద్దెలసద్దున నీతని, నిద్దురమబ్బెల్లఁ బోవ నేర్పు మెఱయ నే, నిద్దముగ దేశిఁ గొనియెద, నొద్దిక గా నుండుఁ డనుచు నొవరిచి సఖులన్. వాల్మీకి. ౩. ౧౨౨.

౧౭. భుజించు, తిను.

క. విను మధురాహారంబులు, గొనుటయుఁ జెక్కుండ్రు నిద్ర గూరినయెడ మేల్కొనియుని కియుఁ గార్యాలో,చనముఁ దెరువు నడచుటయును జన దొక్కనికిన్. భార. ఉద్యో. ౨. ౩౮.

క. తనుయాత్రకుఁ గా నశనము, గొనుఁ బూర్ణముగాఁ గొనండు... భార. శాం. ౫. ౩౨౧.

౧౮. త్రాగు.

క. శ్రీపాదంబులు గడిగెను, శ్రీపాదోదకము గొనియె... హర. ౨. ౧౨౪.

క. ఎనుబదియేఁడులవార్ధక, మునఁ బ్రాప్తవశక్తియుడిగిపో దాతనికిన్, దినిరొండిది పెద్దమాంసము, కొనిరొండియది కల్లు మనసు క్రొవ్వ ట్టుడుగున్. శివరా. ౪. ౧౫.

విశేషరూపములు వ్యాకరణములనుబట్టియు ప్రయోగములనుబట్టియు గ్రహింపవలయును. కొన్ని ప్రయోగము లీక్రింద ఈయఁబడినవి.

చూచికొండము=చూచికొందము.

ఆ. ... చూచి,కొండ మెల్లపనియు రండు వేగ. భార. మా. ౧౭౩.

కొండ్రు=కొందురు.

సీ. ... మీలయట్టుల బలవంతు లల్పులఁ దమకు నాహారములుగఁ.గీ.గొండ్రు భూపతి లేకున్న మండ్రె జనము,లు.../భార.శాం. ౨. ౨౫౫.

కొండు=కొనుఁడు.

ఉ. కొండని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థుల కెల్లఁ బంచి యీ,కుండుట...నైష. ౧.౫౧.

కొండ్రు=కొనుదురు.

శా. స్వామిద్రోహము వాపికొండ్రు చట... కాశీ. ౬. ౩౭.

చవిగొను=౧. రుచిచూచు, ఆస్వాదించు.

సీ.ఏమి దాఁ జవిగొన్న హృదయేశుకెమ్మోవి దోఁపక యది మున్ను దోఁపకుండె. కళా. ౬. ౨౧౪.

౨. తిను; అనుభవించు.

మ. వివిధాజ్యాహుతిభూపదీపములు నైవేద్యంబు నీయగ్ని మున్,జవిగొన్ బిమ్మట భుక్తిముక్తులు నవశ్యప్రీతిగా నెప్పుడున్,జవిగొండ్రం బురుహాసనాచ్యుతమహేశానాదిబృందారక,ప్రవరుల్ ...కాశీ. ౩. ౨౦౬.

తెవులుగొను, తెవుళులుగొను=రుగ్ణమగు, వ్యాధిగ్రస్తమగు. భార. ఆది. ౫. ౫౩, అను.౫. ౨౧౪.

భయముగొను=భయపడు. భార. ఆర. ౨. ౮౪.

భుక్తిగొను=భుజించు. కాశీ. ౨. ౭౫.

జ:కొంటు,కొండాట[1],కొండాడు[1],కొనితెచ్చు, కొనిపించు, కొనిపెట్టు, కొనిపోవు,కొనియాట, కొనియాడు,కొనివచ్చు, కొనుగోలు[1],కొనుబడి, కొనుమొదలు, కొలువు[4], కో[2], మొ.

**కొనుగోలు[1].** వి. (√కొను) కొనుట, క్రయము. (శ. ర.)

**కొనుగోలు[2].** వి.నాట్యయోగ్యతద్ధిత్తాదిశబ్దోచ్చారణము.

మ. ఏకతాళంబున వీరమర్దళరవం బేకంబుగా నట్టువుల్,ధికతోంతత్తకఝుంకుఝుంకుకిణతోం ధిత్తాంకియల్లోధకు,ద్ధికుకే త్తైయ్యధిమికుక్కతక్కుధిగుతాంధిత్తాత్తతాళంబులన్, గకుబంతంబులు మాఱుపల్కకొనుగో ల్గన్పట్ట నప్పట్టునన్. ప్రబంధ. ౯౪.

**కొనుజే=కొఱుజే.** వి. పిడుఁజు, పసులదేహమందు చేరి రక్తము పీల్చెడిజంతువిశేషము.

సీ.ఎరువు తిప్పలుగొని యెల్లమందలు గొనుజెక్కమేపులచోటు ద్రొక్కఁబడియె. హరి. పూ. ౬. ౫ (శ. ర. ప్రాఁత ప్రతిపా-కొనుజెక్క=కొనుజాలుపట్టి.)

**కొనుబడి.** వి. (√కొను) కొనుగోలు, క్రయము. (శ. ర.)

**కొనుమొదలు.** వి. (√కొను) క్రయధనము,కొనుటకిచ్చినసొమ్ము. (శ.ర, బ్రౌ.)

**కొన్నాళ్లు.** వి. బ. (కొన్ని+నాళ్లు) కొన్ని నాళ్లు, కొన్నిదినములు, కొంతకాలము.

గీ. మున్ను కొన్నాళ్లు పలుగాకిమూఁకలోనఁ, గలసి మెలఁగిన తెలఁ గెల్లఁ గానిపింపఁ,జేడియలమీఁద గ్రుడ్లొత్తసేయ రాకు,కోయిలా యింక నీయిల్లు గూలిపోను. నీలా. ౩. ౨౫.వసు. ౧. ౧౨౩.

**కొన్ని=కొని.** స. ఔ. (చూ. కొంచెము-'కొంత' శబ్దమునకు అమదర్థకబహువచనరూపము) కతిపయార్థకము.

సీ. బాగాలు వెస నొక్కఁ పద్మాక్షి యొసఁగిన వెగ్గలం బని కొన్ని వెడల నుమిసి. మనుచ. 3. ౬౬.

ఉ. కొన్నిటిఁ బార్శ్వముల్ నలియఁ గొన్నిటి వీపులు పిండిపిండిగా,నన్నిటి భీముఁ డుద్భటగదాహతి సేనికవేఁటలాడఁగన్. భార.భీష్మ. ౨. ౨౧౧. (ప్రాఁతప్రతులపాఠము.)

ద్వి. ... మతికొన్ని వేల్పులు...బస.పు.౪.3౧3. (ఇట మహన్మహత్త్వార్థకముగా నుపయోగింపఁబడినది.)

**కొపురు.** వి. (సం. గోపురమ్.) ౧. శిఖరము.

క. దాఁటుటయుఁ గొండకొపు ౘలు, బీఁటలువాఱెం గడిందిబీతున జేజే,దాఁటు వడంకం బాఱెను,గాటపుఁబయ్యెరల మొగులు గడలకుఁ బాఱెన్. అచ్చ. రా. కిష్కిం ౧౧౨.

౨. ఉన్నతి.

ఆ. ... గొనబుఁగొను,గొంచెతనముఁ బిఱుఁదుఁ గొపురును బొక్కిలి,లోఁతు సెన్న సెన గలుగుట యరిది. అచ్చ.రా.అర.౨3. (శ.ర.పా)

**కొపెర=కొప్పెర.** వి. పెద్దమూతి గలపాత్రము.

సీ. సారాయికొపెరగంజాపాడుల్ దిమ్మంచు హారిణితోఁ గడు నెగ్గులాడి రనుచు.కువల.౧. ౪౧.

**కొప్పరము=కొప్రము.** వి.౧. శిఖరము, అగ్రము. (శ. ర.) ౨. మూఁపు.

గీ. కొప్పగము మూఁ పటంచన నొప్పు నంస,ము ... ఆంభా. ౨. ౧3౭.

క. అప్పుడు భయవిస్మయములు, ముప్పిరిగొన నశ్వశిరుఁడు ముందటఁ బైపై,నుప్పరము లెగయుగరుడుని,కొప్పరమున నున్నకపటగోవిందునకున్. వరాహ. ౧. ౧౪౨. ఉ. హరి. ౬. ౧౦౮.

విణ. విజృంభితము, ముమ్మరము.

ఉ. ... రోగముల్,కొప్పర మైనచో...దా.శ. ౧౬.

జ: కొప్పరించు, కొప్పరింత.

**కొప్పరించు.** అ. క్రి.(√కొప్పరము) ౧. విజృంభించు; అతిశయించు.

వ. ...అడిదంబులు జళిపించిన ఝణఝణఝంకారంబులుం దదీయపరస్పరఘర్షణ క్రేంకారంబులుం ఐహహుంకారంబులును ముప్పిరిగొనం గొప్పరించియు... అదలించియుం గదలించి యుఁ బోరునవసరంబున... అవ్వీరద్వయంబుం గనుంగొని...ఉ. హరి. ౪. ౨౫౬.

వ. రేవెలుంగురాచిప్పలం గప్పురంపుఁగుప్పెలం గొప్పరించినసరసమనురసంబులు నించి ... పారి. ౨. ౫౨.

౨. (కోపాదులచే) రోమాంచము కలది యగు.

సీ. కొప్పరించఁగ మింటఁ గ్రొవ్వాఁడి రోముముల్ చొచ్చి వచ్చినతోలు ల్పుక్కఁగుంపు. చంద్రా. ౧. ౭౫.

సీ. గాలి సోఁకినసైనఁగనలి మైఁగొప్పరించి తటాన నట బయల్ సెలసికొనుచు. చంద్రా. ౨. ౯౨. ఉ. రా. ౭. ౪౧3.

3. పండ్లిగిలించు. (బ్రౌ)

ద్వి. కొప్పరింపుమఁ బండుకోఁతి యై యుండె. అభిమన్యుచరిత్ర. ౧౭౪.

స. క్రి. నిండుగాఁ బోయు.

సీ. దైవతైర్థికులు మందాకినీతోయముల్ గొప్పరించిన గాజుకుప్పె లనఁగ...గీ...కనుపట్టెఁ దారకానసముదయంబు. విప్ర. 3. ౨౮.

**కొప్పరింత.** వి. (√ కొప్పరించు) అతిశయము; విజృంభణము. (శ. ర.)

**కొప్పు[1].** వి. (త. కొప్పు.) ౧. స్త్రీధమ్మిల్లము,కబరి, వేనలి.

చ.... మోమున,వ్వల వలరాయఁ గ్రొమ్మొగులువ

న్నియఁ గెరును గొప్పుతీ రహి,చిలుకలకొ
ల్కి సౌరు సెతేఁ జెప్పఁగ నల్వకునైనఁ దీరు
నే. నీలా. ౨. ౧౯. దశా. ౬. ౩౮.

౨. మగవానిసిగ, జుట్టుముడి.

ఉ. అగ్ని దాహభీతి నంగారపర్ణుండు,బమ్మరిల్లి నే
లఁ బడిన వానిఁ, గొప్పు వట్టి యీడ్చుకొని వ
చ్చె ధర్మజు, కడకు నింద్రసుతుఁడు కడిమి
మెఱసి. భార. ఆది. ౭. ౮౮.

౩. ఇంటికప్పుయొక్కయూర్ధ్వభాగము; ఉన్నత
స్థానము.

గీ. చని యధిశ్రయణిని పప్పినిసంగ్రహించి,యిం
టినడికొప్పు తగిలించి యెఱుఁగనట్లు, నుంగి
టికిఁ బోయి...శుక. ౩. ౩౧౮.

క. లలిఁ గొప్పెక్కించితి మధు,పుల శుకుల నడు
గుపఱచితి పుష్పాస్త్రా మా,లలకును మంచం
బులు వాఁ,పలుకును బీఁట లనుమాట బళి నిజ
మయ్యెన్. చంద్రా. ౫. ౯౧.

౪. (వింటి) కొన, గనయును, కోపు.

చ. తెగువ మనోభవుండు తియతియ్యనిసింగిణి
వింటికొప్పునన్, దగిలిచె దత్కువాటెపనితాచి
కుసంబులఁ బోలుశింజినిన్. భీమ. ౫. ౯౫.

సీ. కబరియు శిఖయును గార్ముకాగ్రంబును గొ
ప్పని పల్కఁగా నొప్పు[illegible]ండు. ఆం. భా. ౩.
౬౧.

జ: కొప్పుగొలుసులు, కొప్పువల.

**కొప్పు².** వి. నాట్యవిశేషము, కోపు.

గీ. పెక్కువగజక్కిణీ కొప్పు ద్రొక్కి నొక్కి,
చక్కనిమిటారి నరపతు ల్సొక్కి చూడ.
దశా. ౭.౧.౨౫౭. ('కోపు' అనియును చదు
వ వచ్చును.)

**కొప్పుగొలుసులు.** వి. బ. (√ కొప్పు¹) కొప్పు
నకు నుభయపార్శ్వములయందు పెట్టుకొనుగొ
లుసులు, ఆభరణవిశేషము. (వా)

**కొప్పువల.** వి. (కొప్పు¹ + వల) వాలపాశ్యావిశేష
ము. ('తలవెండ్రుకలను బంధించునట్టిముత్యాలస
రము' బ్రౌ.)

సీ....తనరును వాలపాశ్యావిశేషములు నూనక
తురాయి, ముత్యాలకుచ్చు కొప్పువల పాపట
బొట్టు జిలిబిలి జల్లియుఁ జేరుచుక్క, యు
నగ...ఆం. భా. ౨. ౧౮౭.

గీ. చెవులపూవులు బవిరలు చేరుచుక్క, కొప్పు
వలయును నవరించి కొప్పు నిఱు,భూషణము
లకుఁ దా నొకభూషణ మయి, పడఁతి యపు
డొప్పెఁ గన్నులపండు వగుచు కళా. ౭.౬౬.

గీ. బవిరలును గొప్పువలయును బసఁడి యొఱ్ఱు,
దిద్ది ..యయా. ౮. ౯౯.

**కొప్పెర=కొప్పెర.** వి (సం. కర్పరః.) ౧. కటాహ
ము, కాఁగు; నెఱల్పునూతి గలచిన్నపాత్రము.

గీ. ఇట్టిసేనలతో నమ్మహీశ్వరుండు, వెడలుచును
శంఖలిఖితు లనెడిపురోహితుల నియోగించి
రానివారలను వైవుఁ,డరసి కాఁగినచమురుఁ
గొప్పెరలలోన. జై. భా. ౮. ౧౧౦.

సీ. ధనముకొప్పెఁగదండఁ బెనుభూతి మున్నట్లు
గంగదరిని మొసలి గాచినట్లు. వైజ.౩.౧౨౫.

గీ. పసిఁడికొప్పెర లాతంబు పచ్చకోల, జోగప
ట్టియు కకపాల జోలెనంచి, కలికికాటుక గీ
ర్బొట్టు పలుఁగుపేరు, జాతి గాఁ బొల్చి నెఱ
మిండజంగ మగుచు. హంస. ౫. ౮౦.

౨. తలపుర్రె.

క. అప్పుడు విడువక ద్రేసెం, గుప్పన నడునెత్తి
పగులఁ గొట్టఁగ వెడలెం, గొప్పెర నెత్తురు
భీముని, కప్పాండవలోచనము నత్రులు గా
ఱన్. దశా. ౯. ౧౫౭.

**కొప్రము=కొప్పరము.** వి. శిఖరము.

ఉ. పున్నమచందురుం దెగడుపొంకపుమోముల
రాచకన్నియల్, గ్రొన్నెలతాలమేలిపనికొ
ప్రపుమేడల నాటలాడ...నీలా.౧.౨౮.

**కొబ్బెర=కొబ్బరి.** వి. ౧. నారికేళము!.

ఉదా: కొబ్బరకాయ, కొబ్బరపండు.

సీ. కోఁతి కొబ్బరకాయ కొన కెక్కి వడఁద్రో యు దానిజలంబులు ద్రావఁగలదె. రామలిం. ౧౨.

ఉ. మ్రొక్కు లొసర్తు...చక్కెర కొబ్బరపండు లుండ్రముల్, మెక్కెడుపాఁపజందెములమే టికి...నీలా. ౧. ౨.

౨. కొబ్బరకాయలోనిభోజ్యపదార్థము, పేశము.

గీ. చాఱపప్పును గసగసాల్ జాజికాయ, సెనగ లనుములు పత్రియు మునగపువ్వు, కొబ్బర యు మందపాలతోఁ గూర్చి త్రావి, యుబ్బద బ్బరకాఁడు నీ కబ్బు టగుసె. ప్రబంధ. ౬౪౧.

సీ. ... కొబ్బరనఁ గొబ్బెర యటం చనఁగఁ ద ర్పెళ మెసఁగు...ఆం. భా. ౨. ౨౮.

క. తరణిదళరసమునను గొబ్బెర నిండఁ రాచి రాచి పెట్టిన ఉళవా,సరములకు మస్తకీటక, మురలి సుకేశములు మొలచు మొదలిటెనియు తిఁ. చికి. (చి. ని.)

జ: కొబ్బరపూవు, కొబ్బరయుండ.

**కొబ్బరపూవు.** వి.(√కొబ్బర) మొలక మొలచిన కొబ్బరకాయలో ఉండపలె నుండుమెత్తనిపదా ర్థము. (బ్రౌ)

**కొబ్బరయుండ.** వి. (√కొబ్బర.) భక్ష్యవిశేష ము, మూండము. (శ. ర.)

**కొమ**[1]**=కొమ్మ**[1]. వి. శాఖ. (శ. ర.)

**కొమ**[2]**=కొమ్మ**[2].

(ఆఁడుది, స్త్రీ.)

క. కమలముల నుజ్జగించుం, గుముదంబుల బుజ్జగిం చుఁ గొమమాపులు పున్నమచందమామవె లుఁగుల, కొమ రంతయుఁ బుణికి పుచ్చుకొనఁ బోలుఁ జామి. విజ. వి. ౧. ౧౩౩.

క. కొమ నాము మీఁదఁ జైకొని, నుమనారాచం బు లేసి స్రుక్కించకు... మదకీరగమన లంబ రదమనా. రసిక. ౪. ౧౬౬.

**కొమరసామి.** వి. (చి.ని,శ.ర-సం.కుమారస్వామి) కుమారస్వామి.

లయగ్రాహి. హైమవతిపట్టి నఖిలామరశరణ్యు నతకామితకరుఁ గొమరసామి భజియిం చెఁ. కాశి. ౪. ౩౦౨.

సీ. కొక్కొరోకో యని కొమరసామిరథంబు కం తంబు సాఁచి క్రేంకార మిచ్చె. భీమ. ౨. ౭౯.

సీ. ... అల్లదె కొమరసామయ్యనగరు. క్రీడా. ౧౪౯. ('కొమరుసామయ్య' ముద్రి.)

**కొమరాలు.** వి.ఔ. (కొమరు+ఆలు) ౧.యువతి, జవరాలు; స్త్రీ.

సీ. కొమరాలిసిబ్బెంపుగుబ్బపొందమ్మి మొగ్గలు పే రెదకుఁ జేర్పఁ గలిగె నేని. పె. శకుం. ౨. ౯౭.

గీ. ... మిత్త్రమోహార్తిఖిన్న, తమ్మికొమరాలు వ క్త్రనేత్రములు మోడ్చె. వేం. పంచ. ౪. ౨౩౪.

౨. సుందరి, అందము గలస్త్రీ.

ఆ. చాల ముద్దరాలు జవరాలు కొమరాలు. భాగ. ౯. ౨౨.

క. ఆలవు బాలవు గదుఁ గొమ, రాలవు గోమలివి ముద్దరాలవు...కు. సం. ౬. ౬౨౨.

**కొమరిత=కొమారి,కొమారిత, కొమార్త.** వి. (సం.కు మారీ. త. కుమరి)కూఁతురు, దుహిత.

గీ...అతనునారాచ మైన, రాచకొమరితఁ జాం చాలిఁ జూచునపుడు. పాంచా. ౨. ౩౧.

**కొమరు**[1]**.** వి. (సం. కూబరః. త.కొమ్మై.) ౧.మనో జ్ఞత, సొంపు, ఒప్పిదము.

ఆ. సోయగంబు సొబగు జోక మురువు కొమరు, చె
లువు తీరు సొగసు పొలుపు చెన్ను, చక్కఁదన
మనంగ సౌందర్య మొప్పును...ఆం. భా. ౩.
౪౧.

సీ. వదనంబుకొమరు భావనఁజేసి వేఱుగా నుదుటి
పెం పలకలఁ బాదువఁబడఁగ. భార. విరా.
౧. ౨౭. ఉ. రా. ౧. ౨౧౦.

౨. విధము.

క. కరితురగసమితి గాఁగ్రాని, కురువీరుల మొన
లు మొగులుకొమరునఁ గవియఁగ. భార. వి
రా. ౪. ౨౭౦.

ద్వి. రెండుహస్తము లెత్తి రెక్కలతోడి, కొండ
తీవ్వన వచ్చుకొమరు దీపింప. రం. రా. బాల.
౨౭ పా. ౯ పం.

విశే. ౧. మనోహరము, మనోజ్ఞము, చక్కనిది.

క...హారరత్నము త,ద్వీపములోదధితీరంబునఁ,
గొమరుగ నేకతమ యిచ్చెఁ బ్రమ్మరుచున్నఁగ.
భార. ఆది. ౨. ౨౬.

గీ. చిఱుచెమటఁ బేర్చువింత క్రొమ్మెఱుఁగులోడఁ,
గొమరు మే నొప్ప...కళా. ౪. ౯౬.

౨. (సం. కుమారః) పడుచువాఁడు; పడుచుది.

గీ. పాటితూమున రసము దైవాఱఁ గొలిచి, కొమ
రుజంగమునకు నిచ్చెఁ గోర్కి తీఱ. హర. ౧.
౨౩.

లయగ్రాహి. లేనికొమరుందనము లేని చెలువంబు
ను...కళా. ౪. ౪౯. (కొమరుందనము=యౌ
వనము.)

కొమరుమిగులు=అందగించు, ఒప్పు, చెన్నొందు.

సీ. చందురునుచఁ గాంతికం దేర్చి కూర్చి బాగు
నకుఁ దెచ్చిన యట్లు గొమరుమిగిలి. భార. వి
రా. ౨. ౫౨.

సీ. రమణీయమహాక్తికరత్నహారంబులు కుచకుంభ
ములమీఁదఁ గొమరుమిగులు. విక్ర. ౧. ౭.

కొమరారు=కొమరుమిగులు.

(సూర్యోదయవర్ణనము) సీ. చక్రవాకద్వయసం
తతి యొఱకలకొమరారు కెంజాయఁ గ్రొత్తఁ
జేసి. భార. ఉద్యో. ౨. ౧౧౪.

సీ. కొండంతకల్మిచేఁ గొమరారియుండియు నుద
వాసమున నుండె నువిదకుచము,లు...చంద్రా.
౨. ౧౨౩.

కొమరొందు=కొమరుమిగులు.

క. కొమరుం బ్రాయము మిక్కిలి, కొమరొందెడు
దినముఁ గ్రొత్తక్రొత్తగ చెలమిగ. కళా. ౪.
౪౬.

సీ. సర్వపర్వతకులసార్వభౌముం డనఁ గొమరొం
దుపడమటికొండదండ. విక్ర. ౨. ౧౦౨.

జః కొమరుఁదనము, కొమరుఁబాయము.

**కొమరు²**. వి. (చూ. కొమరేఱు-సం. కుమారః.)
కుమారస్వామి.

క. కొమరు సా మన నేసాని కొమరుమిగులు ...
ఆం. సం. దేవ. ౧౩. సాం. ని. దేవ. ౭.

**కొమరుఁడు¹**=కొమారుఁడు. (సం. కుమారః. ప్రా.
కుమారో.) ౧. పుత్త్రుఁడు, కొడుకు.

సీ. ... కన్నకొడుకు కొమారుఁడు కొమరుఁ డ
నఁగఁ బుత్త్రాభిధానంబు...ఆం. భా. ౨. ౧౧౧.

ద్వి. అమలకీర్తులఁ బుట్టుఁ డగువిభాండకుని, కొ
మరుండ ఋశ్యశృంగుండు నాపేరు. రం. రా.
బాల. ౧౨ పా. ౨౪ పం.

౨. పురుషుఁడు, మగవాఁడు.

ఉ. కొండొకసేపు నిల్చి చనుకోరిక రాకొమరుం
డు...విక్ర. ౩. ౭౭.

౩. కొమారవయస్సువాఁడు, యౌవనమునకు పూ
ర్వవయస్సువాఁడు. ఆం. భా. ౨. ౧౧౭.

**కొమరుఁడు²**. వి. (సం. కుమారః) కుమారస్వామి.

ఉ. కొమరుఁడు సామి కొంచమల గొట్టినజాణఁ

డు...బారకేశ్లమరినవాఁడు వా నగు గుహ
ఖ్యలు...ఆం. భా. ౧. ౪౪.

**కొమరుఁదనము.** వి. (√కొమరు¹) యౌవనము.
లయగ్రాహి ... లోఁచుక, లేనికొమరుండనము
లేనిచెలువంబు...కళా. ౪. ౪౯.

**కొమరుఁబాయము.** వి. (కొమరు+ప్రాయము.)
యౌవనము, పడుచుఁదనము.
వ. ... గాటంపుమరునాటలకుం దివురుకొమరుఁ
బాయంపుండుటారికత్తియలును...నీలా. ౩.
౧౦.
ఇట్లే: కొమరువాఁడు, కొమరుఁబ్రాయము.
మ. ...కొమరునాఁడే చెల్లె మా శైఖరుల్. కకు.
౪. ౭౬.
క. ... కొమరుంబ్రాయము మిక్కిలి, గొమరొం
దెడు...కళా. ౪. ౪౬.

**కొమరులు.** వి. బ. మేలుదూలనుమీఁదిగుజ్జులు.
(శ. ర, బ్రౌ-కొమరలు అని వాడుక.)

**కొమరేలు.** వి. దే. (√కొమరు².) పీఠికాపురస
మీపమునందు కుమారారామగ్రామమున నుం
డుదివ్యవాహిని, స్వామిపుష్కరిణి.
సీ. కొమరేటికల్యాణకమలషండంబుల సౌరభ్య
భారంబు సంతరించి. భీమ. ౨. ౬౨, ౬౩.

**కొమారి**=కొమరిత.

(స్త్రీ)

గీ. ఆకొమిరెప్రాయపుమిటారిరాకొమారి,యడుగు
లను వ్రాలి ... చంద్రా. ౪. ౧౯౧.

**కొమారిత**=కొమరిత.

(పుత్రిక, కూఁతురు.)

క. చెలువంబు గలకొమారిత,గలిగినయందులకు ఫ
లము గాదే విధవో,జ్వలమతిబలధృతిలీలా,
కలితుఁడ వగునీకు నొసఁగఁ గాంచుట లనఁ
గన్. సమీర. ౨. ౫౩.
ఉ. ... బోటి వచ్చి యో,పల్లవపాణి నిన్నిలువఁ
బంపిరి నన్నిట రాజుగారనం,బల్లకి యొక్క
యాదొరకొమారిత...పాంచా. ౨. ౧౦.

**కొమారుఁడు.** వి. (బ. కొమారులు,కొమార్లు)౧. కు
మారుఁడు, పుత్త్రుఁడు.
సీ....కన్నకొడుకు కొమారుఁడు కొమరుఁడనఁ
గఁ, బుత్త్రాభిధానంబు... ఆం. భా. ౨.
౧౧౧.
మ ...తల్లిదండ్రుల్ మనం,బు విరాజిల్లఁగఁ గూ
డఁబెట్టినధనంబుల్ లోకమందున్ గొమార్ల
విగా కెవ్వరి పమ్మ...సారం౫. ౨. ౮౫.
౨. పురుషుఁడు, మగవాఁడు.
గీ. కన్య దనకంటె కింపైనధన్య నొకనిఁ, గోరికొ
నుఁ గాక రాచకొమారులందు. భోజనుతా. ౨.
౫౨. కళా. ౩. ౧౩౦.

**కొమార్త**=కొమరిత.

(కన్య)

చ. చెలువలచెంతకుం జనియె సిగ్గులపెండ్లికొమా
ర్తయుంబలెన్. కువల. ౨. ౭౮.

**కొమిరె.** వి. (సం. కుమారీ) ౧. కొమారవయస్సున
నున్న స్త్రీ, యౌవనమునకుఁ బూర్వవయస్సున ను
న్నస్త్రీ. ఆం. భా. ౨. ౧౦౬.
౨. యువతి, యౌవనము గలస్త్రీ.
క. అమరావతిఁ గలవేలుపుఁ,గొమిరెలలో నెల్ల
రూపగుణశీలములం, గొమరారుదు...విక్ర.
౨. ౨౪౫.
ఉ. కొమిరెలు నీకు లేరె పది కోటులు వత్తురు
కోరితేని...ఉ. రా. ౪. ౨౧౦.
౩. కూఁతురు, పుత్త్రిక.
చ. కొమిరె మనోవ్యథం బొగుల గ్రుచ్చి కవుం
గిటఁ జేర్చి తల్లి...వసు. ౩. ౧౦౫.
౪. స్త్రీ.
గీ. మాను మీమోహ మని తెల్పి మానవేంద్రు
చిత్త మొగ్గించి యొకమాటఁజేసి రాచకొ

మిరె నిదురించుతతి మందసమున నుంచి, పీడు వెడలించుకొని తెచ్చువేళ నెదుట. శుక. ౧. ౩౭౫.

విశ. యౌవనముగలది. (స్త్రీ)

వ... కొమిరెహరిణలోచనలచలితకంకణసంకుల క్రేంకారంబు లానవామోదమేదురారావఘుంకారంబులబింకంబు లడంప...ఆము. ౪.౩౫.

కొమ్మ¹=కొమ¹. వి.(త.కొంబు, కొంబర్.) ౧.శాఖ.

సీ. అభ్రంకషాభోగ మగుమఱ్ఱికొమ్మను గట్టినవ్రే లెడునుట్టి యెక్కి. విక్ర. ౨. ౪౪.

మ. హరిశౌర్యం డగురామభూవిభునితీవ్రాటోపవద్వాహినీ, శరవేగంబున నాత్మమూలబలము ల్లాఁతా దళాడంబరం, బరుగం గొమ్మలు వోవ లా పతి నిజామాదుల్ వజీరు ల్భజిం, తురు నమ్రత్వముఁ గానలో మునలిమాను ల్గావితర్కింపఁగన్.పసు. ౧. ౪౫. ('పుత్రపౌత్రాదులు' అని ధ్వని.)

౨. (కోట గోపురము మున్నగువాని) శిఖరము, శృంగము.

సీ. చీలలు చెదరి బచ్చెన చిట్లి వానలఁ గూలు కొమ్మలతోడిగోపురములు. చంద్ర.౩.౪౭.

సీ. శ్రీకలితానూనచిత్రరేఖాయుక్తి కొమ్మలందును గోటకొమ్మలందు. విక్ర. ౭. ౧౩౩.

లయగ్రాహి. అన్నగముపై జరఠపన్నగపతిస్ఫటలన న్నెగసి కోటతుదల న్నెగడుకొమ్మల్. మనుచ. ౫. ౩౦.

జః కొమ్మత్రిమ్మరి, కొమ్మదాసరి, కొమ్మమెకము, కొమ్మలువోవు.

కొమ్మ²=కొమ². వి. ఆఁడుది, స్త్రీ; భార్య.

క. ఆమ్మేటివిద్య నాచే,నిమ్ముగ నంతయు నెఱింగి నృప నన్ను వివాహమ్మగు మనవుడు రెండవ, కొమ్మ మదికా ప్రేమ గడలుకొన నిట్లని యెన్. మనుచ. ౬. ౧౭.

గీ. సేవకులపాలిసురశాఖిపూవుఁగొమ్మ, కోమలార్ధేందుధరుకొమ్మ గోఁగులమ్మ. భీమ. ౧. ౯౭.

కొమ్మచెట్టు. వి. (√కొమ్మ¹?) వృక్షవిశేషము.(దీని కఱ్ఱ కాఁగడావలె వెలుఁగును - బ్రౌ.)

కొమ్మత్రిమ్మరి. వి. (కొమ్మ¹+త్రిమ్మరి) వానరము, కోఁతి.

గీ. మమ్ముఁ గొలువుము సుగ్రీవు మడిపి నీకుఁ, గొమ్మత్రిమ్మరినా డొవగూడఁజేతు. అచ్చ. రా. యు. ౧౨౩. (శ. ర. పా.)

కొమ్మదాసరి. వి. (కొమ్మ¹+దాసరి) ఊరినడిమి చెట్టెక్కి బిచ్చముకొఱకుఁ గేకలువేయు ఒకజాతి దాసరివాఁడు. (వా)

కొమ్మనగొల్లపిండిచెట్టు. వి. పూతికకీ. (శ. ర.)

కొమ్మనగొలిమిడి. వి. మూలఫలకీ. (శ. ర.)

కొమ్మనగోర. వి. వృక్షవిశేషము. (శ. ర-ఉపలక్షేదకము, కొండపిండిచెట్టు. బ్రౌ)

కొమ్మనఁటి=కొమ్మనరఁటి. వి.(√కొమ్ము)-కొమ్ములవలె నుండుకాయలు గలఅనఁటి-కదళీవిశేషముకీ.

గీ. పనసపం డ్లీడపండ్లు కొమ్మనఁటిపండ్లు,కప్పురపుదబ్బపండులు నిప్పుపువ్వు, మొదలుగాఁ గానుకలు పెట్టి మ్రోల నిలిచి,పలికిరి...రసిక. ౧. ౬౪.

కొమ్మనరఁటి=కొమ్మనఁటి. వి. (ఇది 'కొమ్మనగోర, కొమ్మనగులిమిడి'వంటిది.) కదళీవిశేషము కీ.

ఆ. తొలఁగఁబెట్టె రోషకలికించితంబులోఁ, గొమ్మనరఁటిపండ్లు గూర్మిమఱఁది. నైష. ౬. ౧౩౯.

కొమ్మమెకము. వి. (కొమ్మ+మెకము.) శాఖామృగము, వానరము, కోఁతి.

క. అనిన విని రాముతమ్ముఁడు, సెన రొదవఁగ నతనిఁ జూచి సెప్పునఁ బలికెన్, విను కొమ్మమె

కపుబలియుండ, గొనకొని మాచంద మెల్ల గుఱు తెలిఁగింతుఁగా. అచ్చ. రా. కిష్కిం. ౯.

**కొమ్మలువోవు.** అ. క్రి. (కొమ్మలు¹ + పోవు.) అతిశయిల్లు.

చ. ... రతికోర్కులు కొమ్మలువోవ... విభుండును వారిజపత్త్రనేత్రయుఁగా, గడపల లేనికేళి తమకంబున నుల్లము లుల్లసిల్లఁగాఁగా. నిర్వ. ౯. ౭౩.

**కొమ్మి.** వి. అడవిలో పెరుఁగునొకవిధమైనఫలవృక్షము. (దీనిపూవులు సువాసన గలవిగను ఆకులు కఱకు గలవిగను ఉండును. బ్రౌ)

గీ. కొమ్మిపండ్లుఁ దపండ్లును గొంజిపండ్లు, మేడిపండ్లును మొదలుగాఁ గూడిమాడి, చెంచెతలు దెత్తు రిత్తు విచ్చేయుమయ్య. కళా. ౩. ౬౯.

సీ. మామిడికాయయు మారేడుకాయయుఁ గొండముక్కిడికాయ కొమ్మికాయ. గీ. ... అది, తైనయూరుఁగాయలు గల వతనియింట. హంస. ౪. ౧౩౫.

**కొమ్ము.** వి. (క. త. కొంబు) ౧. పశుశృంగము, విషాణము.

ఉ. కొమ్ములఁ గ్రుమ్ములాడు మదఘోరవృషంబుల మార్కొఁ బోరుచో ... ఉ. రా. ౩. ౨౫౦.

క. పొడ చెదరి బూది చల్లిన, యొడళ్లతో నాల్గు రెండు నొకటియుఁ బ్రంగల్, వెడలినకొమ్ములబరువున, నడుగిడఁగా లేవు బలిసి యందలిదుప్పుల్. మను. ౪. ౨౧.

సీ. ...శృంగంబు కొమ్మనఁ జెలఁగుచుండు. ఆం. భా. ౨. ౨౬౨.

౨. ఏనుఁగుదంతము.

ఉ. కొమ్ములు ద్రుంపఁబడ్డనవకుంభివిధంబునఁ గూలెఁ గుంభినికా. భా. రా. అర. ౧. ౨౨౪.

సీ. మదహస్తి వయినను నెదిరి కొమ్ములు పట్టి చదికిలఁబడఁ ద్రోచుసత్త్వములును. విక్ర. ౧. ౭౭.

౩. పందికోఱ, వరాహదంష్ట్ర.

సీ. నీటిలో మునిఁగిననేలచేడియఁ గొమ్ముకొన నుబ్బ నెత్తినఘోణి వీవ. పారి. ౧. ౪౯.

౪. చొఱ మున్నగు చేఁపలముఖభాగమున అంచుమువలె నుండుఅవయవము.

సీ. తిమితిమింగిలముఖ్యదీర్ఘమత్స్యంబులఁ గొమ్మన గుములుగా గ్రుచ్చి యెత్తు. దశా. ౧. ౨౪౯.

సీ. బిరుదువజ్రపుగండపెండారమై మీఱఁ గొమ్మన శేషాహి గ్రుచ్చి యెత్తు. దశా. ౧. ౨౨౫.

౫. బాలచంద్రరేఖయందలి రెండుకొనలలో నొకటి.

సీ. వర్ణగర్భము వడవకపోయె విదియలఁ గుముదాప్తుదారణకొమ్ము దఱిఁగె. కాశీ. ౩. ౧౪౯. (దారణకొమ్ము = వెలహెచ్చుతగ్గులను సూచించుకొన.)

౬. (విల్లు కావడిబద్ద తక్కెడదండె మున్నగువాని) కొన.

క. మృడుఁడు కనకాద్రిచాపము, గుడుసువడం దివియఁ గూడి కుశలప్రశ్నం, బడిగిరి యొండొరులను గని, కడకొమ్ముల నున్నయదితికద్రూతనయుల్. భీమ. ౪. ౧౩౪.

సీ. ధనువుక్రిందటికొమ్ము ధరణిపై మోపి మీఁదటికొమ్ము వామహస్తమునఁ బట్టి. భోజరా. ౫. ౨౭.

సీ. పెల్లులోహండికావళ్లకొమ్ముల వ్రేలుగిడ్డిమొత్తము నేతిలడ్డిగలును. ఆము. ౨. ౯౭.

౭. పసుపు లోనగువానినిడు పైనదుంప.

ఉదా: చాయపసుపుఁగొమ్ము, అల్లపుఁగొమ్ము, సొంటికొమ్ము, మొ.

౮. చిమ్మనగ్రోవి.

గీ. అనుచు నొకదిక్కు చేరి లావునను మీఱి, కొమ్ముదగఁ బూని యుడుపాలిఁ గోర్కి నాని, చలము దొరలంగ నాడునెచ్చెలులఁ గదిసి, సఖులు సరసత జలకేళి సల్పిరపుడు. చంద్రా. ౪. ౨౪౭.

చ...జీవితేశసమితి గొమ్ములం గరఁచి చల్ల... ఆము. ౫.౧౧౩.

౯. (పర్వత) శిఖరము.

క. గుబ్బలికొమ్మెక్కటి గడు,నిబ్బరమునఁ బెఱికి యాతనిన్ వైచిన వాఁ,డుబ్బు సెడక మలద్రిమ్మరి, జెబ్బలిపై మొనలవాలు పేర్మిన్ వైచెన్. అచ్చ. రా. యు. ౨౪౧.

౧౦. కోటశృంగము, కోటకొమ్మ.

క. ఇమ్ముల నప్పురివప్రము,కొమ్ములపై నుండి పురముకొమ్మలు వేడ్కన్, దమ్ములచుట్టముపదజల,జమ్ములఁ బూజింతు రొగి నజస్రముఁ బ్రీతిన్. మొ. రా. బాల. ౪.

సీ...వరణశృంగ మ్మగుఁ గొమ్ము నా... ఆం. భా. ౨. ౧౨.

౧౧. కొమ్మ, వృక్షశాఖ.

ఉ. అం దొక కొండచేరువ సితాబ్జవనంబులతీరభూమి మ్రాకండముకొమ్మునన్ బిగియఁ గాళులు రెండుఁ దగిల్చి వ్రేలుచున్, గ్రింద హుతాశనార్చుల నఖేదమునం గబళించి మ్రింగుచు,న్నెందము కాంతి నొంద మహనీయతపంబొకఁ డాచరింపఁగన్. నిర్వ. ౧౦. ౭౧.

సీ. కలఁదుఁ బున్నాగంబు లలరుఁగొమ్ముల మహోన్నతి గలయనఘీకమతుల నైన. హ.న.౨.౧౬. (నలార్థమున)

౧౨. చెఱుపుకొన, కలుఁజు, మరిగొమ్ము

వ. సుకుమారుండు చెఱుపుకొమ్ముదావలం బట్టుకొని విపినషండంబునడుము గాఁ బక్కణంబునకు దక్షిణంబుగా నొరసికొని పోయి ...శివరా. ౩. ౧౦౨.

గీ. చరమగర్వోన్నతము లురభ్రములు రెండు,చెఱుపుకొమ్మునఁ గయ్యంబు సేయుచుండె. వేం. పంచ. ౧. ౨౩౨.

౧౩. ఆందోళికాదండము, పల్లకి మున్నగువానికి ముందువెనుకల నుండుదండె.

సీ. అపరంజి మొసలివాయనుసులశిరసులోఁ గనుపులు తొమ్మిది గలుగుకొమ్ము,నలసూర్యపటముపావాన్నెంపుసరిగమేలుక్కట్టుపనులహెచ్చు పట్టుఁగుచ్చు. రా. వి. ౨. ౪౩.

గీ...ఆందోళికకు సంజ్ఞ యందల మనఁ, గొఱలుఁ దదుభయదండంబు కొమ్మనంగ. ఆం. భా. ౨. ౨౦౧.

(వ్యవ) ఆనవారి ముందుకొమ్ము ముగ్గురును వెనుకకొమ్ము ఇద్దఱును పట్టి మోయుచున్నారు.

గీ. ఈ చెలువ నన్నుఁ జేరన నింక నెపుడుఁ, గొమ్ముదించకయుందు నుడమ్ము మీఱి. దశా. ౨. ౨౬౪. (కొమ్ముదించకయుందున్ = ఎప్పుడును అందలములోఁ బెట్టి మోయుచునే యుందును.)

౧౪. ఊఁదెడివాద్యవిశేషము.

మ...వేణుస్వనం,బులు గావించుచుఁ గొమ్ము లూఁదుచు...భాగ. ౧౦పూ. ౭౨౫.

క. కొమ్ములనివడమ్ములు శం,ఖమ్ములశబ్దములు...రా. వి. ౫. ౬౦.

సీ. కొమ్ము నా వాద్యభేదమ్మును శృంగ మా...ఆం. భా. ౩. ౫౨.

౧౫. గాండ్లవాఁడు బండము తగిలించుకొనుటకై నడికట్టునకు అమర్చినవంకరకొయ్య. (వా.)

౧౬. బలము, సేన.

క. కొమ్మా దానవనాథుని, కొమ్మాహవమునకుఁ దోలఁగ గురువిజయము నై,కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ,గొమ్మాభరణములు నీవు కోరిన నెల్లన్. భాగ. ౧౦ ఉ. ౧౭౭.

౧౭. ఉత్సాహము.

ఆ. అంత గోపసింహుఁ డసురకొమ్ములు పట్టి,ధరణిఁ ద్రొబ్బి త్రొక్కి దైత్యభటుల, కొమ్ము వీడ నురలఁ గొమ్ము వర్ధిల వాని,కొమ్ము వెఱికి మొత్తి కూల్చె నధిప. భాగ. ౧౦ పూ. ౧౧౪౪.

౧౮. పల్లునకుఁ బేరు 'ఉ'కారచిహ్నము.

గీ. కొమ్ముక్రారలు మఱి ద్విపర్ణమ్ము లగుట, వానియొ
డమని గురువులు వట్రసుడులు, ప్రాణములు గా
న వానిడాపలను గల్గు, నక్కరము లెల్ల లఘు
వులు నిక్కముగను. అప్ప. ౪. ౪౯.

వాఁడు కొమ్ములు తిరిగినపండితుఁడు = వాఁడు గొ
ప్పపండితుఁడు, పాండిత్యప్రౌఢి గలవాఁడు.

వానికి కొమ్ములు వచ్చినవి = వానికి పొగరెక్కువై
నది.

ఉదా: ఇప్పుడు వానికి కొమ్ములు వచ్చినవి మనతో
వాఁడు మాటలాడునా.

చెఱుకుఁగొమ్ము = మరల మొక్క యగుటకు నాటె
డు చెఱకు ముక్క. (వా.)

జ: కొమ్మనఁటి, కొమ్ముకాఁకర, కొమ్ముకాఁడు, కొ
మ్ముచేఁప, కొమ్ముచోఱ, కొమ్ముటుడుము, కొమ్ముటే
నుఁగు, కొమ్ముతేజి, కొమ్ముపెసర, కొమ్ముమాచకమ్మ,
కొమ్ములుగలవేలుపు, కొమ్ములనూపు, కొమ్మువాఁడు.

**కొమ్ముకాఁకర.** వి. (√ కొమ్ము) ఒకజాతికాఁకర, కారవెల్లవిశేషము. (శ. ర, బ్రౌ.)

**కొమ్ముకాఁడు.** వి. (కొమ్ము + కాఁడు) ౧. అగసాలె వాఁడు, కంసాలవాఁడు. ౨. వరాహము, పంది.

సీ. నరకహేతుహిరణ్యహరణవృత్తిఁ జరించుకొ
మ్ముకాని భజించుకొదవ లెల్ల. వసు. ౧. ౬౨.

(పైరెండర్థములకుఁగూడ నిది యుదాహరణము.)

క. ఆకొమ్ముకాఁడు తొల్లిటి, యేకలమో కాక య
ముఁడో... ద్వా. ౮. ౧౯. (చూ. ౧౭.)

౩. కొమ్ముఁ దెడువాఁడు, మాతంగసదృశుఁ డగు
నొకజాతి వాఁడు.

సీ. మాతంగసదృశుఁ డౌమనుజుండు తగు బోయఁ
డనఁగను గొమ్ముకాఁ డనఁగ... ఆం. భా. ౨.
౫౯. (శ. ర, బ్రౌ. పా.)

**కొమ్ముచేఁప.** వి. (√కొమ్ము) ఒకానొకయాఁడు మత్స్యము, శృంగి. (శ. ర.)

**కొమ్ముచోఱ.** వి. (√కొమ్ము) ముఖభాగమందు అంపమువంటికొమ్ము గలచోఱమీను.

క. కరములు ద్రవ్వినఁ బండులఁ, గరాసి గఱచు
కొని రౌద్రగతి నని మేషోత్కరముఁ దగఁ బ
ఱచె నొక్కఁడు, సురవాహినిఁ దఱియుకొ
మ్ముచోఱయుఁ బోలెన్. కు. సం. ౧౧. ౭౨.

**కొమ్ముటుడుము, కొమ్ములయుడుము.** వి. (కొమ్ము + ఉడుము) కొమ్ము గలఉడుము, గోధికావిశేషము.

ఆ. కాలు ద్రవ్వ యునికిఁ గని కొమ్ముటుడుములఁ,
గఱచి తిగిచెఁ గొన్ని మొఱసడములు. చంద్ర.
౨. ౪౫.

క. ఒడలుబ్బ నిక్కి ముందటి, యడుగులు ధర నూఁ
ది చిందునలబలమునకున్, జడియ కొకగబ్బిగం
డ, కుక్కడుకడిమిన్ దివిచెఁ గ్రుంగి కొమ్ముల
యుడుమున్. మనుచ. ౪. ౫౩.

**కొమ్ముటేనుఁగు.** వి. (కొమ్ము + ఏనుఁగు) పురుషగజము, మగయేనుఁగు.

గీ. కొమ్ముటేనుంగు మొగమైనకొడుకుఁ గుఱ్ఱ. హర.
౩. ౨౫.

చ. మునుకొని దంష్ట్రికాయుధములు ముందటిచీకటి
నెల్లఁ బాపఁగా, వెనుకఁ దమాలనీలనిజవిగ్ర
హదీప్తులు చిమ్మఁజీకటిం, బెనుపఁగఁ గొమ్ము
టేనుఁగు విభీషణతం జనుదెంచునైవడిన్, దను
జవరుండు వచ్చె... విక్ర. ౫. ౧౮౭.

ఉదా: పండితులలోఁ గొమ్ముటేనుఁగులు సభకు వ
చ్చిరి. (కొమ్ముటేనుఁగులు = కొమ్ముటేనుఁగులవంటి
వారు, గొప్పవారు.)

**కొమ్ముతేజి.** వి. (కొమ్ము + తేజి = కొమ్ములు గలవాహనము) ఎద్దు, వృషభము.

సీ. పులితోలుపాంబట్టుఁబుట్టముల్ గలవారు కొ
మ్ముతేజుల నెక్కుగునియువారు. గీ... ప్రమథ
వీరులు గొల్చి రాబాహులేయు. పాండు. ౧.
౧౬౫.

**కొమ్ముపెసర.** వి. (√కొమ్ము) ఒకజాతిపెసరు. (శ. ర.)

**కొమ్ముమాచేకమ్మ.** వి. (√ కొమ్ము) కొమ్ములు గల మాచకమ్మ. (శ.ర.- స్తనములు వచ్చియు ముట్టురానిది. బ్రౌ.)

**కొమ్ములుగలవేలుపు(ల్పు).** వి. (√ కొమ్ము) విఘ్నేశ్వరుఁడు.

చ.... కొమ్ములు గలవేల్పు విఘ్నతరుమూలములం బెకలించుబల్లిదుం, డలగణభర్త యప్పసచివాగ్రణి కీవుత మొప్పితార్థముల్. రాజ.చ.౧.౫.

**కొమ్ములుసూపు.** అ. క్రి. (కొమ్ములు + చూపు) ౧. కొమ్ములువేయు. ౨. ఎదిరించి మార్కొను.

సీ. కుంభోదకముఁ బోసి యంభోజముఖి వెంపఁ జాతంబు కొమ్ములుసూపఁ దొణఁగె. విక్ర. ౪. ౧౫౬ (ఇది రెండర్థములకుఁ గూడ నుదాహరణము.)

**కొమ్మువాఁడు.** వి. ( √ కొమ్ము ) =కొమ్ముకాఁడు. (శ. ర.)

**కొయగూర=కొయ్యగూర.** వి. (కొయుగూర- శ. ర.) కొయ్యతోఁటకూర.

క. పెసరుంబప్పేమిటికని, కసవు న్నెయి గొనఁడు పండుగను గొయగూరే, కొసరుం బలుచని చల్లయె, మెసరుం గనఁ డతనిలోభమున కేమందుఁగా. బహుళా. ౫. ౭.

గీ... కొయ్యగూర చక్రవర్తము చిల్కకూర గోలి, కూర... హంస. ౪. ౧౩౩.

**కొయ్య.** వి. (√ కోయు?) ౧. కఱ్ఱ, దారువు.

వ... పెల్లికొయ్యలు దెచ్చి నుచ్చు లంటించినఁగా చెచ్చువెరుఁగుచిచ్చు లాత్రంపులఁగా దవిలించి చిముడ నుడికిన వెలువరించి... మను.చ.౪. ౬౦.

సీ. తనరుఁ గొయ్య యనంగ దారుసమాఖ్యయై... ఆం. భా. ౨. ౩౭.

ఆ. కొయ్యబొమ్మ తెచ్చి కొట్టిన గుణి యౌనె... వేమన. ౨. ౧౩.

౨. స్తంభము, గుంజ.

ఉదా: ఓడకొయ్య, కట్టుఁగొయ్య, మొ.

౩. (=కొయ్యకాలు) కోఁతకోసినవరి మున్నగు సస్యములమోడు.

గీ. వాడఁబాఱినయవి వక్త్రవనరుహములు, భాజనంబులలోన నిప్పచ్చరంబు, పిఱుకు భిక్షాన్నములు లేమి నాకఁ దలిఁకఁ, జేలపంటలఁ గొయ్యలే చెప్పఁ గాఁడ. కాశీ. ౬. ౧౪౩.

౪. దంతము, పల్లు. (ఈయర్థము పాములవాడుకలోనిది-అని బ్రౌ.)

గీ. కొయ్య లూడినపెండ్లికొడుకుకుఁ జెలినవ్వ విభవమండలిఁ గాయునెన్నొ లయ్యె. వేం. పంచ. ౩. ౧౭౫.

౫. మొద్దు, మూర్ఖుఁడు.

ఆ. అలుబిడ్డ లేనియట్టి త్రిష్టరి యగు, కొయ్య గాక కుదుటఁ గూడునెట్టి, కుడుసువార లిట్టి క్రొవ్విదంబులు సేయఁ, జొచ్చు టెచ్చగించి చూతు రయ్య. భార. ఉద్యో. ౨. ౯.

ద్వి. మాయలు పన్నక మాదిగకొయ్య౯, జూపుము చూపు మెచ్చోట డాఁచితివొ. పండితా. దీక్షా. ౪౫౭.

వినుపరానికొయ్య=వినిపింపరాని మొద్దు, చెప్పిన మాట విననికఠినహృదయుఁడు. (వా)

కొలుకరానికొయ్య=కఠినహృదయుఁడు. (వా)

విఱుగఁబాటుకొయ్య=గర్వశీలుఁడు. (వా.)

గుండగొయ్య=దుష్టుఁడు. (శ.ర- మొండివాఁడు, మూర్ఖుఁడు. బ్రౌ.)

జ: కొయ్యకాలు, కొయ్యగండ, కొయ్యగూర, కొయ్యకోడు, కొయ్యతనము, కొయ్యనగాఁడు.

**కొయ్యకా(గా)లు.** వి. (కొయ్య+కాలు) కో

న్న వరి మున్నగుసస్యములు కోయఁగా మిగిలిన మ్రోడు.

సీ... చేలపంటలు కొయ్యకాలె తెలుపు. రామ లిం. ౫౩.

**కొయ్య(య)గండ.** వి. (కొయ్య+కండ) కన్ను లు మున్నగువానియందు పెరుఁగుదుర్మాంసము. (వా.)

**కొయ్యగూర, కొయ్యతోఁటకూర = కొయ గూర.** వి. (కొయ్య+కూర=ఒకవిధ మగుతోఁట కూర. బ్రౌ. కోయు+కూర=కొయ్యగూర.శ.ర.)

ఆ. కొయ్యగూరవేళ్లు కొమరు మించినపాట్లు, వేళ్లు వేఱువేఱ వేఁడినీళ్ల, నూఱి... చికి. ౨.(చి.ని.)

సా: కొయ్యతోఁటకూరకును సిగ్గులేదు కొడవటి కిని సిగ్గులేదు. (కలహించుకొనినమనుష్యులు మర లఁ గలసికొన్నప్పుడు ఆక్షేపార్థ ముపయోగింపఁ బడుసామెత.)

**కొయ్యజోడు.** వి. (కొయ్య+జోడు) బొంత, ద్రు పదము. (బ్రౌ.)

**కొయ్యతనము.** వి. (√ కొయ్య) ౧. ధూర్త్యము, దార్ష్ట్యము.

గీ. గోపికలఁ గృష్ణుఁ డలయించుకొయ్యతనము. ధనా. ౨. ౭౬.

గీ. కొయ్యతనమునఁ గోపించుఁ గొంతతడవు. వ రాహ. ౧౧. ౭౬.

౨. దుష్టచేష్ట, కొంటెపని.

గీ. పట్టనములోన నీవు దర్పమునఁ జేయు, కొయ్య తనములు వీక్షించి కూర్మితనయ, నవ్వుదురు నిన్ను మొదల నానావిధముల, నవ్వుదురు దీక్షి తుని ననంతరము జనులు. కాశీ. ౪. ౯౪.

**కొయ్యనగాఁడు=కొయ్య.** విశే. (√కొయ్య.) (మూఢుఁడు)

ద్వి. కొఱగానిజఱభులకొయ్యనగాండ్ర, గొఱియల వార్తలు గూడుకే త్రవ్వ. బస. పు. ౫. ౯౧ వం.

**కొరటబండి.** వి. పిడ్యంగులను దెచ్చెడుబండి.

ఉ. పన్నినసన్నపుం గొరటబండ్లపయిం గొనివ చ్చుపిడ్యఁగుల్. ఉదయకోదయము. ౩. ౭౩.

**కొరడా.** హిం. వి. చబుకు, జాటి.

క. రూకలకోమటికొడుకా, పోకలఁ బోయెదవ దేల పోరా పోరా, నీపుం గత్తే కొరడా, చే కొని కొట్టింతుఁ గొంటె చెనఁటి గరాసా. అ హ. ౧. ౧౦౦.

**కొరడు**[1]. వి. (క. కొఱడు, కొరడు) వంకరగాఁ గాక ఋజువుగా నుండుఇంద్రధనుస్సు, రోహి తము.

గీ. గుండెలవియ మింటఁ గొరడు వోఁచె. మై. ౨. ౪. ఆం. భా. ౧. ౭౨.

**కొరడు**[2]. వి. పక్షివిశేషము. ('గుడ్లగూబ' అని శ. ర.)

సీ... ఆడెలుతొంగ గిజగాఁడు కొరడు. సువ. ౩. ౧౯౪.

**కొరద.** వి. మత్స్యవిశేషము.

సీ. కొరదయుఁ గడిసె పాపర మల్లు ముచ్చంగి... వేం. పంచ. ౧. ౨౯౪.

సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱమీను లసే ముచ్చంగి బేడిస జెల్ల చాఱమీను. హంస. ౪. ౧౨౭. (శ. ర. పా.)

**కొరనాసిగండు=కొర్నవగండు.** వి. క్రూరమృగవిశే షము, దుమ్ములగొండి. (శ. ర, బ్రౌ.)

**కొరవంజి.** వి. (ఇట్లు దీనిని లఘురేఫముతో చి. ని, శ. ర-√ కొఱవ ?. క. కొఱవంజి=కొఱవజాతి స్త్రీ. త. కుఱవంజి=కొఱవజాతిస్త్రీ.) ౧. ఎఱుకసాని; ఎఱుకువాఁడు, కిరాతుఁడు.

శా. ఏయేభూములు చూచినావె కొరవంజీ రూప లావణ్యరేఖాయుక్తిం దగుకొమ్మ లెందుఁ గ ల రీత్మామండలికి... శుక. ౧. ౧౪.

గీ. వేయు నేటికిఁ దరిమలవెండికొండ, తావిగుబ్బ

టెకడకట్టు కావులందు, నప్పసం బుష్పతిల్లుచు మెప్పఁ గన్న, యట్టికొరవంజా కెల్ల మానుట్ట లయ్యె. ప్రబంధ. ౧౬౦.

క. పాదనుండి గొప్ప బెబ్బులి, కొదమం జే యిచ్చి పిలిచి కొరవంజి యొకం, డదరక కను చెదరక మది, బెదరక పదరకయ కుబుచపిడెమునఁ గెడ పెన్. చంద్రా. ౨. ౯౦.

౨. ఎలుకులు చేయునాట్యము; నాట్యవిశేషము.

క. ఎలుకో యెలుక యటంచు మం, గొరవంజి నటించె నొక్కఁ గుఱుకుచ చంకన్, బురుకుఁడు బంగరుబుట్టియు, సారిదిం గొల్లాపురమ్మసుద్దులు వెలయన్. దశా. ౭. ౧. ౨౯.

సీ. చలుపుచున్నది ప్రోడజాడలఁ గొరవంజి యలతిలోత్తమ నృత్యనిలయసీమ. కవిరా. ౩. ౯౯.

**కొరవి.** వి.(సం. కురవకః) ఎఱ్ఱగోరంట, కురవకముకీ.

సీ...కొరవి నాఁ గ్రోవి నాఁ గ్రొమ్మి నాఁగఁ, గురవక నామ మా...ఆం. భా. ౨. ౫౩. పి.శకుం. ౨. ౧౩౯. కాశీ. ౧. ౧౩౯.

**కొర్నవగండు**=కొర్ణగండు, కొరనాసిగండు. వి. క్రూరమృగవిశేషము, దుమ్ములగొండి.

చ...చెవులపోతులు కొర్నవగండ్లు... కస్తురిపిల్లులాదిగాఁ, గలమృగరాజి ... కానుక లంపెఁ దండ్రికిన్. కాశీ. ౩. ౪౯.

**కొఱ**[1]=కొఱఁత. వి. (త. కుఱై) ౧ కొఱఁత, తక్కువ, లోపము, న్యూనత.

సీ. ... కొఱ యన నొప్ప తక్కువ చెలంగు. ఆం. భా. ౩. ౪౬.

౨. శేషము, మిగులు.

క. ముఱిముఱిచీకటిలో నం, దఱు రాజులు సమర ముడిగి తగ నెల్లిటికిం, గొఱ గలకల నగు నడువుఁడు, నెఱ వగుగోవర్ధనాద్రి నేలకు ననుచున్. ఉ. హరి. ౪. ౨౭౨.

విశే. (చూ. కొఱయగు) ౧. చిన్నది; తక్కువయైనది, అల్పము.

సీ.మునులభార్యల దోఁచుకొని పుక్కోడాళంబు నొక్కి వేదులు గొఱచక్కులాడి. వరాహ. ౫. ౧౧౫.(కొఱచక్కులాడి=చిన్న చిన్న ముక్కలు చేసి.)

రగడ. కొఱవివేక మగుఁ గొరవికా నన గొన.ఇందు. ౩. ౩౫. ప్రబోధ. ౫. ౧౯.

కొఱనెల=అర్ధచంద్రుఁడు, బాలచంద్రుఁడు. నవనాథ. ౨. ౭౯పా. ౧౧ పం.

కొఱనెలతూపు=అర్ధచంద్రబాణము.

చ. ... మఘదైత్యహరుండు మహేంద్రుశింజినిం, గొఱనెలతూపునం దునిమి...పారి. ౫. ౩౧.

కొఱనోము=అల్పవ్రతము.

కొఱనోమునోఁచు=అల్పసుకృతము చేయు, తక్కువపుణ్యము చేయు.

గీ. జగతిఁ గొఱనోమునోఁచినజలజముఖుల, కూరిమి గణించి యతఁ డేల గారవించు.వసు.౪.౧౧౧.

జ: కొఱనవ్వు, కొఱప్రాణము, కొఱవోవు, కొఱసంది.

**కొఱ**[2]. వి. ౧. శ్రేయస్సు, మంచి, మేలు.

క...ఏ,మోయి యిది నీకు మంచిదో, కో యాఁడుది యనురుమన్నఁ గొఱ గాదు సుమీ. సారంగ. ౨. ౧౨౩.

క ... పెం,గట్టడవి కయిన వెడలం,గొట్టింపుము చేయవేని గొఱ గాదు సుమీ. నీలా. ౨. ౬౦.

౨. వ్యాపారము, చేష్ట.

ద్వి. కంతునికొఱ రోసి కన్నులు మూసి,చింత లోక్కటి చేసి శివుఁ దలపోసి. ద్వి. హరిశ్చ. ఉ. ౬౩ పం.

౩. ప్రయోజనము, పని.

సీ. ... కొఱ యనఁ గాఁ బని... అప్ప. ౨౧౯౭.

(చూ. కొఱమాలు, కొఱముట్టు, మొ.)

౪. శిల్పము. (శ. ర.)

సీ. కొఱ మించుపగడంపుగుం ద్రగంబంబులు ... అచ్చ. రా. అయో. ౪. ౪.

౫. అందము, ఒప్పిదము.

మణిగణనికరము. కలువలదొర కొఱగలతలవిరిగా ...మలయుచు జగముల మనుచునొడయఁడా. అచ్చ. రా. అయో. ౧౧౯. అం.భా. ౩.౪౬.

విణ. ౧. ప్రయోజనకారి, ఉపయోగకరము, పనికి వచ్చునది.

క. జవ్వనముం గలపుడు శాల, పువ్వుంబోడులకు ద్రవ్యములుగా కకటా, యెవ్వారికిఁ గొఱ యగుదురె, దవ్వై ప్రాయంబు చనినతతి వెలపడఁ దుల్. పరమ. ౩. ౪౮౭.

క. అంధునకుఁ గొఱయె వెన్నెల. మనుచ. ౨.౫౬.

౨. ప్రియము, మనోహరము.

క. ... నీకున్, మడవక మాయట్టివారిమాటలు కొఱయే. భార. సభా. ౨. ౧౯౦.

క. తమ్ములదొర వైరవజా, తమ్ముల చెఱ చక్రసంయుతమ్ములకొఱ...తపనుఁడు పొడమెన్. రా.వి. ౧.౭౦.

మ. ... గుబ్బచన్నులు గుల్కంచు మెలంతలున్ సొగసుకాండ్రున్ గూడ నానాటపాటలవాంద్రుం గొఱ గాక రాజులకు నిష్ఠావంతు లౌత జ్ఞులే... మల్లభూ. ౩.౫౬.

౩. శ్రేయస్కరము.

వ. ...గురుభృత్యసామంతకాంత లగమ్యులు విష్ణుండు సర్వలోకగురుండు తత్ప్రతిహారణ ప్రయత్నంబు కొఱ గాదు...వరాహ. ౧౧. ౫౭.

క. తఱచుగ మొకములఁ బొరిగొను, మఱపున వచ్చితిమి దవ్వు మనపాల మిటకి, త్తఱి నగునిమిత్తములు నృప, కొఱ గా విద మనకుఁ బెద్దగొడవగు ననినన్. మనుచ. ౪. ౬౩.

౪. అర్హము, యుక్తము.

క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాహంబుఁ ద్రోపుఁ బాడియుఁ దమయం, తలవారితో నతగు నధి, కులహీనులతోడ నైనఁ గొఱ గా దధిపా. భార. ఉద్యో. ౨. ౪౬.

క. ఈరీతిని మద్వల్లభుఁ, గోరక మెడఁ గౌఁగిలించుకొని నీ వుండన్, పైరించుట కొఱ గా దిది, రారమ్మిఁక నోర్వఁ జుమ్ము రావే యనుచున్. కళా. ౩. ౧౯౨. శుక. ౨. ౫౨౯.

౫. సమర్థము, చాలినది.

చ. ఒకఋషిచేత నాయుధసముత్కర మెల్లను సప్రయోగమం, త్రకముగ నభ్యసించి సమరంబునకుం గొఱ యైనవాఁడ... భార. విరా. ౩. ౧౫౦.

మ. సకియా నీమదిలోనికోరిక ఘటించన్ లేక మోహాబ్ధివేలకుఁ జేరం గొఱ గాక పంచవటిఁ జాట్లం జెట్టునా మీఁదికి, న్నకు నీకున్ సమయంబె...చం. రా. ౫. ౭౦.

కొఱగానివాఁడు=అప్రయోజకుఁడు.

సీ. అప్రయోజకసంజ్ఞ యలరుచుండును గొఱగానివాఁ డనఁగఁ గిగ్గాడి యనఁగ. ఆం.భా. ౨.౨౭.

జ: కొఱకు, కొఱగామి, కొఱమాలు, కొఱముట్టు.

కొఱ[3]=కొఱ్ఱ[2]. వి. పాఠీనము, ఒకజాతి చేఁప.

సీ. కొఱకొఱ్ఱ యనఁగను బరఁగుఁ బాఠీనంబు... ఆం. భా. ౧. ౧౬౦.

కొఱఁకు=కొఱను. వి. చీడు, విపీతము.

గీ...కొఱఁ కనంగను చీడు నాఁ గొఱ ననంగఁ, గంచె యన నప్రహతభూమి కాఖ్య లెసఁగు. ఆం. భా. ౨. ౬.

కొఱఁత[1]=కొఱ[1]. వి. (త. కుఱై) తక్కువ, లోపము.

ఆ. ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును, జెలియుఁ బరిజనంబుఁ గొలువ నీకు, గురువ యింక నొక్క కొఱఁతయు లే దిందుఁ, జేరి బ్రదుకు బుద్ధిగారవమున. భార. విరా. ౧. ౨౫౩.

సీ. ఎక్కువదక్కువ లెన్నండు నొందక నిర్గుణత్వంబున నెఱయుఘనుఁడు, గురుతయుఁ గొఱఁతయు గుణసంగతి వహించు మనుకేళ చా

ద్య మే మత్స్య మగుట. భాగ. ౧. ౬౯౩. ఆం. భా. ౩. ౨౪.

౨. అవమానము, అగౌరవము.

సీ. పారయఁ గర్గైనె పాండుపుత్రులసతి దుస్ససే
నుండు సభను జేసినకొఱంత. విప్ర. ౪. ౪౯.

మ...తజ్జపరిషద్విజ్ఞాతచార్యక్రియా, విరసుండై
కొఱఁతం బడుం గుకవి పృథ్వీభృత్సమీపక్షి
తిన్. మనుచ. ౧. ౯.

౩. దోషము, తప్పు.

గీ. అనిన సంజయుఁ డిట్లను నకట కొడుకు, మీఁదఁ
దప్పు పెట్టెదవు నీమీఁదికొఱంత, నీకుఁ గానం
గ వచ్చునె... భార. ఉద్యో. ౪. ౧౫౬.

క. నీకొడుకు నీకు నిచ్చితిఁ, గై కొనుము విరించి
చిట్టకాలకు లోనై, నాకుఁ బగ యగుట నంగ
ము, లేకున్నాఁ డతఁడు కొఱంత లే దతనిచె
యిన్. ఉ. హరి. ౨. ౧౫౪.

౪. తరువాయి, శేషము.

వ. నియమాచరణంబునకు నొక్కసంవత్సరంబు
గొఱంత గలదు... భార. విరా. ౧. ౩౧౩.

సీ...అన్న నీ విం తేల యడ లెదు కాలపర్యయము
నుడుప, వళమె యెవ్వరికిని వార్తలకొఱంతఁ
జెప్పుము మాకు...భార. మా. ౧౯౭.

విశ. ౧. తక్కువ, న్యూనము, అల్పము.

గీ...కరలి పండ్రెండువాలమ్ము లేసి, పద్మనాభుని
నొప్పించి పార్థు నొకటి, కొఱంత గా నూఱుశ
రముల నుఱక నొంచె. భార. కర్ణ. ౩. ౩౨౧.

గీ. కారి మేము కులస్థానపౌరుషముల, నేమిటఁ గొ
ఱంత తెల్పుమా...దశా. ౨. ౧౯౦. ఆం. సం.
మాన. ౭౩.

౨. మిగిలినది, శేషించినది.

క. కావింపు కొఱంతకార్యము...దశకు. ౬. ౧౨౭.

జ: కొఱంతపఱచు, కొఱంతపడు, కొఱంతవోవు.

**కొఱంత²**. వి. కొఱ్ఱు, శూలము.

సీ... కొఱంత వాఁ డక్కువ కొఱ్ఱు వెలయు. ఆం.
భా. ౩. ౪౬.

సీ...కొఱ్ఱుకుఁ గడమ గాఁ గొఱంత యనఁగ. సాం.
ని. నా. ౧౬.

మ. భరమై తోఁచుకుటుంబరక్షణకుఁ గాఁ బ్రాల్మాలి
చింత న్నిరం, తరతాళీదళసంపుటప్రకరకాం
తారంబునం దర్థపుం, దెరువాటుల్ దగి కొట్టి
తజ్జపరిషద్విజ్ఞాతచార్యక్రియా, విరసుండై కొ
ఱంతంబడుం గుకవిపృథ్వీభృత్సమీపక్షితిన్.
మనుచ. ౧. ౯. (పైమూఁడు ప్రయోగములు
నిర్ధారకములుగా నున్నను దూర మింకను విచా
ర్యము.)

**కొఱఁతప(వ)ఱచు**. స. క్రి. (√కొఱఁతపడు) తక్కువపఱచు, న్యూనము చేయు.

సీ. కమలాక్షి నిడువాలుఁగన్నులు కుసుమాస్త్రుక్రొ
వ్వాఁడితూపులఁ గొఱఁతపఱచె. వి. పు. ౨.
౧౯౬.

**కొఱఁతవ(ప)డు**. అ. క్రి. (కొఱఁత¹ + పడు) తక్కువపడు, న్యూనమగు, హీనమగు.

క...విక్రమశీలం, గొఱఁతవడనీక కర్ణుఁడు, మొ
ఱఁగు లడరుశక్తి నురలు మెచ్చఁగ నైచెన్.
భార. విరా. ౫. ౧౧౦.

సీ ...తద్వృత్తమొకటి కొఱంత, పడకుండఁ బ్ర
త్యక్షపరిచితం బైనది గాదె నీబుద్ధికి...హరి.
పూ. ౧. ౪౭.

**కొఱఁతవోవు** అ. క్రి. (కొఱఁత¹ + పోవు) తక్కువపడు, న్యూనమగు. (ఒకపట్టున నిది వ్యవహితము గాఁగూడఁ గనుపట్టుచున్నది)

ఉ...విదిశాపురి మించు నందు నే, వెంటఁ గొఱంత
వోనిపృథివీసురుఁ డొక్కఁడు సోమశర్మ పే,
రింట నెసంగు...శుక. ౨. ౧౭౪.

సీ. ఏమని మాటాడ నెన్నంగఁ దోడనే పోయె నే
తన వ్రతంబులు కొఱంత. విప్ర. ౨. ౭౪.

**కొఱకచ్చు.** వి. (క. కొఱ.) కొఱవి, అలాతము, ఉల్కము.

చ. అలమరునాజ్ఞ శీతకరు నవ్వల రమ్మని చెప్పి గుంపులై, యలిబలముల్ వియోగిహృదయంబులు చూడఁగఁ దెచ్చినట్టివె,న్నెలకొఱకచ్చులో యనఁగ నిండినచీకటిమీఁద నింగిఁ జుక్కలు గనుపట్టె వచ్చి పొడకట్టె శశాంకుఁడు నంతఁ దూర్పునన్. రామా. ౨. ౯౪.

సీ... దర్పాంధ మద్దివాంధంబు గనలి. గీ. పసుపుజేగుఱుకొఱకచ్చు మిసిమి దేఱు, మిట్టకను గ్రుడ్లు మిడిమిట్లు మిడిసిపడఁగఁ, గంఠఘూత్కారముల దిశల్ గలవరింప, గర్వదుర్లోకమునకుఁ గాకమున కనియె. వేం. పంచ. ౩. ౧౩౪.

**కొఱకు.** ద్రు. (కొఱ$^2$ + కు-చతుర్థీవిభక్తియందు వచ్చు ప్రత్యయము.) ౧. కై, కోసము. (ఉద్దేశనిమిత్తాద్యర్థములను దెలుపును.)

చ... మాకొఱకుఁ గాఁ జనుదెంచి... భాగ. ౧౦ఉ. ౧౦౦౮.

సీ. పరిభవంబునకునై ప్రతికారముగ వైరిఁ గూల్చితిఁ గాని నీకొఱకుఁ గాదు. భార. ఆర. ౭. ౧౫౭. రం. రా. బాల. ౧౦పా. ౨౭ పం.

క... భవార్తి యడఁచెడుకొఱకై. కాశ. ౧. ౬౭.

౨. సంప్రదానార్థకము.

క. వేదోక్తవిధిని మేమా, యాదివిజులకొఱకె యిత్తు మధ్వరభాగం, బు... దశా. ౧. ౨౪౨.

**కొఱకొఱ.** వి. ౧. కోపము.

క. తెఱవలకడుపులలోనే, డ్డెఱఁ బెరిఁగెడు ప్రోడ కేయి ద్రిమ్మరిదొరపైఁ, గొఱకొఱ నూర్పులు నిగుడుచు, తెఱఁగున గాటంపుటూర్పుఁ దన్మైర లడరన్. అచ్చ. రా. బాల. ౬౨.

క. పిటీకితసంబును జలమును, గొఱకొఱ యీలేని గొనము... ఎఱుఁగఁ దలఁ డించుకయిన నెత్లడలందున్. నీలా. ౧. ౪౪.

౨. ద్వేషము, విరోధము.

వ... ఆమహాయోగిని విష్ణుభక్తి యదిసదా మాతోడికొఱకొఱ మానదు కటకటా దాని నెన్నండును సాధింపలేక పోయితిమి ... ప్రబోధ. ౨. ౪౬.

విణ. కొఱకొఱ కలవాఁడు.

ఆ. ... పారిజాతంబు గొనుటెడఁ, దొడరి వృత్రభేది నొడిచి తతఁడు, గొంత మనసునందుఁ గొఱకొఱ గాకున్న, యోట సైఁచునే మహోన్నతుండు. హరి. ఉ. ౬. ౧౯.

ద్వి. కురునాయకునికొఱకొఱమాటలకును, హరి మేనబావను నాత్మఁ గైకొనక. అ. మ. క. ౫. ౨౫౫ పా. ౨ పం.

జ: కొఱకొఱలాడు.

**కొఱకొఱలాడు.** అ. క్రి. (కొఱకొఱలు + ఆడు) చిరాకుపడు, విసుగుకొను.

క. బిఱబిఱ విభుకడ కరుగక, కొఱకొఱలాడెద వదేమి గోరము మేత్మేల్, వెఱఁ గయ్యెడిఁ గద నీచెడు, కఱదలు గనుఁగొన్న నెన్నఁ గన్నెలమిన్నా. రసిక. ౫. ౧౬౩.

ద్వి. కొఱకొఱలాడుచుఁ గోపంబుతోడఁ, బరువిడి చనుదోయిబరువున నడుము, గడగడ వడఁకంగఁ గచభృంగపాళి, ముడివిడి యడుగుఁదమ్ముల మీఁదఁ గప్పియ మృ. వి. ౩. ౯౨.

**కొఱగామి.** వి. (√ కొఱ$^2$) ౧. అప్రయోజకత్వము, పనికిమాలినతనము.

క. కొఱ గానికొడుకు పుట్టినఁ, గొఱగామియ కాదు తండ్రి గుణములుఁ జెఱుచున్... సు. శ. ౪౧.

౨. అకార్యము, దుష్టకృత్యము, చెడ్డపని; కొంటెచేష్ట.

సీ. ధార్తరాష్ట్రులకీడు దలఁపక సైంధవుకొఱగాము తెల్లను మఱచి తండ్రి, లేనియాకువునై మానితం బైననీయక్కటికంబుఁజూ చదరఁజేయు, ము... భార. అశ్వ. ౪. ౪౭.

క. పాఱవకు కలలోఁ జేసిన, కొఱగామికి వగచు
చోట గుణరత్నము చేకుఱె నీకు నలిగి త
న్నినఁ, బఱపుపయిం బడినయట్లు పద్మదళా
క్షీ. ఉ. హరి. ౫. ౧౫౩.

క. వఱువాత లేచి నీదగు,కొఱగాములు చక్కఁ
ద్రోచికొనఁ బోయె దినం,బు ... హరి. పూ.
౫. ౨౩౯.

౩. దౌష్ట్యము, చెడ్డతనము.

క. ఎఱుఁగుదు నేను సుయోధను, కొఱగామి
యు నతనితోడఁ గూడినన్నపు లం,డఱుఁ బ
గ మనమున నిడికొని,యఱుమటయును సం
ధి పొసఁగ దనియు మహాత్మా. భార. ఉద్యో.
౩. ౨౩౭.

శ్లో. దౌరాత్మ్యం ధార్తరాష్ట్రస్య క్షత్రియాణాం
చ వైరితాం,సర్వమేతదహం జానన్ క్షత్తః
ప్రాప్తోద్య కౌరవాన్. సం. భార. ఉద్యో.
౯౩. ౫.

సీ. చూచితే లక్ష్మణ సుగ్రీవుకొఱగామి యమ్మె
యిఁ దనపగ యడఁచి మనము, కపిరాజ్య
మిచ్చినఁ గైకొని యింద్రియసుఖముల నెం
తయుఁ జొక్కి నేఁడు, మనదిక్కు దలఁపఁ
డు...భార. అర. ౭. ౩.

౪. దోషము, లోపము; తప్పు, నేరము.

క. ఇక్కొఱగాములలోపల, నొక్కటి నీచిత్త
వృత్తి నొందెనో...భార. ఉద్యో. ౨. ౨౧.

శ్లో. కచ్చిదేతైర్మహాదోషైర్న స్పృష్టోసి నరా
ధిప. సం. భార. ఉద్యో. ౩౩. ౧౫.

సీ. ...కొఱగాము లెన్నియో యున్న ... దశకు.
౪. ౮౨. కాశీ. ౩. ౨౧౬.

౫. అపాయము, హాని, విపత్తు.

వ...నన్నుఁ బ్రభావతి చూచి గుఱుతెఱింగె
నేని చంద్రవతిగుణవతులకు నేమి కొఱగా
మి సంఘటిల్లునో యని తలంకెద... ప్రభా.
౪. ౨౨.

వ. ... శారదానందగురుం డొక్కరుండునుం ద
క్క నిక్కొఱగామి నక్కఁజేయ నెక్కుడి
వాఁడునుం గొఱ గాఁడ...విక్ర. ౩. ౧౦౬.

౬. దుర్నిమిత్తము, దుశ్శకునము.

క. ఆకొఱగాములఁ గనుఁగొని ... మనుచ. ౪.
౬౨. (చూ. ౬౧.)

ఉ. శాకునికప్రసంగ మిది సాహసికాదరణీయ
మౌనె చీ, కాకయి యూరకే యొగదిగం ద
లపోయుచు నున్నవారికిన్, గాక సదా మ
నోజయము గల్గినధీరులకున్ భయంబు లే, దే
కొఱగాము లైన మను నింత యెఱుంగక
మించి వచ్చునే. రామా. ౭. ౬౯.

కొఱడు. వి. దే. (త. కుఱడు) ౧. మ్రానిమ్రోడు,
స్థాణువు.

ద్వి. ఈకొఱటన పత్తి నీగడ్డనండ, ప్రాకటంబు
గఁ బాలు వడయుదు నవుచుఁ, గుంప వేగ
మె కడ్గికొని వచ్చి పిదుకఁ, గుండ నిండఁగఁ
బాలు గురిసె నాగొడ్డు, కొఱటనె పత్రి యం
కురతమై పరఁగె ... బస. పు. ౨. ౪౪౭,
౪౪౯ పం.

ద్వి. అంకింప నీదుష్పృణాపిలోకనత, నంగుఱింప
డె కొఱ డైన నాతుణము...పండితా. పురా.
౧౫౮.

౨. స్తంభము ?

సీ. ఒకచోఁ దగుల్పడె నుపకార్యకొఱటికిఁ
దర మైనరోహిణీతారకంబు. కాశీ. ౧. ౧౩౮.

౩. ఆయుధవిశేషము, కొఱడుకోల.

ఉ. భూరిధృతిం బసిండిజలపోఁతకఱార్లఁ గొఱ
ట్లఁ బూని యు,వీరవరుల్ ...కళా. ౮. ౯౯.

విశ-స్థాణువువంటివాఁడు-మూర్ఖుఁడు.

క. ఎఱిఁగి యొఱిఁగి నీముందఱ,నఱగొడ్డెము చేసి
పోయి రది గైకొన నీ, తెఱఁ గయినహంసడి
భకులు, కొఱవిం దల బరికికొన్నకొఱడులు
గారే. ఉ. హరి. ౪. ౧౦౬.

జః కొఱడుకోల, కొఱడుపాఱు, కొఱడువడు.

**కొఱడుకోల.** వి. (కొఱడు+కోల.) ఆయుధవిశేషము, కొఱడు.

చ. కొనలు మొనల్పడం గొఱడుకోలవిధంబున
దూయఁ జెక్కుచెక్కునికుఱుమట్టపుంజిఱుత
కట్టియ నోరికొసంగి కొట్ట నెత్తినమునికాళ్ల
గోళ్లు వడిఁ ద్రెంచి తటాలునఁ గుక్కుప
ట్టైడం, గొని పులిఁ గట్టి పట్టె నృపకుంజరు
చెంగట నొక్కఁ డుద్ధతిన్. చంద్రా. ౨. ౯౫.

**కొఱడుపాఱు**=కొఱడువడు. అ. క్రి. (కొఱడు+పాఱు=కొఱడుగ నగు) కొయ్యపాఱు, చైతన్యహీన మగు. (శ. ర, బ్రా.)

ఇట్లే 'కొయ్యపాఱు, మొ. (వా)

**కొఱడువడు.** అ. క్రి. (కొఱడు+పడు) మ్రాన్పడు, నిశ్చేష్ట మగు.

సీ...కొఱడువడుట...అప్ప. ౨. ౧౯౭.

**కొఱనవ్వు.** వి. (√కొఱ[1]) చిఱునవ్వు, మందహాసము.

సీ. కొఱనవ్వు కపురంపుఁగ్రోవి యౌ వన నేల
గొనబుపెన్నెలరాశి యనఁగ రాదె. బహు. ౫. ౫౨.

**కొఱను**=కొఱఁకు. వి. దే. (చూ. కలను) దున్నకుండ పసువుల మేఁతకై విడిచిపెట్టిన నేల, బీడు, వివీతము; అడవి.

గీ...కొఱఁకనంగను బీడు నాఁ గొఱ వనంగఁ,
గంచె యన నప్రహతభూమి కాఖ్య లెసఁగు.
ఆం. భా. ౨. ౬.

క. కొఱనుగ నాఁగినపొలమును, నెఱయం గరిస
నము గల్గునేలయు సరి...విజ్ఞా. ప్రా. ౧౫.

క. సరసీరుహసంభవుచే, నరకుం దేవరము వడసి
నమ్మినవాఁడో, పురములు గైకొని కొఱఁకుల,
తెరువులఁ బట్టించె నన్నుఁ దిక్పాలకులన్. ఉ.
హరి. ౧. ౧౨౯.

**కొఱపము**=గొఱపము. వి. (సం. క్షురప్రః. ప్రా. ఖురప్ప) గుఱ్ఱములను తోమెడుసాధనవిశేషము.

గీ. కొఱప మనఁగ క్షురప్రము వరఁగు:.. ఆం.
భా. ౨. ౧౯౯. హంస. ౫. ౪౧.

**కొఱప్రాణము.** వి. (√కొఱ[1]) కొనయూపిరి, కుట్టుసురు.

క...అతిలియొసపిన యూప్పల్, పఱవ మిడిగ్రు
డ్లు వడఁకఁగఁ, గొఱప్రాణము కోడఁ దన్నికొ
నునమ్మెదవుకా. ఆము. ౩. ౨౩.

ద్వి. అతిమి కొందఱు చచ్చి రాహవక్షోణిఁ, గొఱ
ప్రాణములతోడఁ గొందఱు పడిరి. రం. రా.
ఉ. ౭౭ పా. ౧౨ పం.

**కొఱమాలు.** అ. క్రి. (కొఱ[2] + మాలు) ౧. పనికిమాలినదగు, నిరుపయోగమగు.

క. ఎఱిఁగినవారల మనుచును, గొఱమాలినరొ
ఱుక లెఱిఁగి కొందఱు నీపే, రెఱిఁగియుఁ ద
లపఁగ నొల్లరు, పఱతు రధోగతులజాడఁ బ
ద్ధదళాక్షా. భాగ. ౧౦ పూ. ౯౪.

(శీతకాలవర్ణనము) క. నెఱసురఁటి విశ్రమిం
పం, దఱియై నెఱి మించుమంచుతాఁకుల జిగి
వా, తెఱ పిల్లగ్రోవిఁ బూనం, గొఱమాలెన్
వెలమిటారికూఁతురిలెగకున్. చం. రా. ౫.
౨౫.

౨. నీచమగు.

సీ. కొఱమాలి విన మిడ్డకఱుకక్కుసిఁ జెండి ప
ఱపు మీఱెడిబండి వియుగఁ ద్రొక్కు. నీలా.
౧. ౩.

౩. వికృతమగు.

(పిశాచవర్ణనము) సీ. కలి వోసె నాన్చినగ్రచ్చ
కాయులభంగిఁ గొఱమాలినట్టిన్యగ్రోధకములు.
కాశీ. ౩. ౧౩౮.

**కొఱముట్టు.** వి. (√ కొఱ[2]) పనిముట్టు, ఉపకరణము. (శ. ర, వా.)

**కొఱలు.** అ. క్రి. ౧. కోపించు, రోషించు.

క. పిఱుఁదం గురుధరణీపతి, నఱచేతం బ్రాణములు ఘనారాతిబలం, బుఱుని తెగువ ముందటఁ దె,న్గొఱలుట చిత్తమునఁ జెట్టికొని విహరించెన్. భార. స్త్రీ. ౨. ౭౮.

౨. ఉండు, వసించు.

గీ. తపసిజాబిల్లిజవరాంద్రదండ నుండఁ, బుడమిపట్టిక మదిఁ గోర్కి పుట్టు టెఱిఁగి, వేడ్క నొకపర్ణశాల గావించి యచటఁ, గొఱలె నారాచసింగంపుఁగొదమ కోయి. రామా. ౫. ౬౫.

౩. వెలుఁగు, ప్రకాశించు.

సీ. క్రుంకుగుబ్బలిఁ బుట్టి కొఱలుచుఁ గడలవెంబడిఁ బ్రాఁకు నెరగలిమంట లనఁగ. అచ్చ. రా. అయో. ౧౩.

చ. కొఱలెడి తేజుచేఁ బసిఁడిగుబ్బలియున్ మఱి యెండికొండయున్, గరఁగు నటంచు సంద్రములు కాఁకల నింకు నటంచు... యయా. ౩. ౧౫౯.

౪. అతిశయించు, మించు.

సీ... కొఱలురజస్తమోగుణములందు, వర్తించునీ పాపవర్తికి నేకేలి మాధవుపదభక్తి మది వసించె. భాగ. ౬. ౪౪౦.

రగడ. కుఱుచ లైనను నిచ్చ మదమునఁ గొఱలు నీయేనుంగుగున్నలు, దొరయ నొకపరిపాటి దొరలకు దొరకవు... శుక. ౧. ౧౩౩.

౫. ఒప్పు.

ద్వి. కొఱలుమనోమయకోశంబులోన, మఱి తోఁచు విజ్ఞానమయకోశ మదియు. పండితా. వాద. ౧౯౭ పా.

సీ. తవణిల్లెఁ గొఱలె నడరెను... చెనె నలరె ననంగ నొప్పె నన్నాటగాఁ జెప్పఁబడును. అం. భా. ౩. ౭౩. రాఘవ. ౧. ౧౨.

౬. నిండు, పూర్ణమగు.

సీ. కొఱ యనఁగాఁ బని కొఱలుట నిండుట. అప్ప. ౨. ౧౯౮.

స. క్రి. ౧. పొందు, వడయు.

క... బిడ్డ లీముప్పురకున్, నెఱసిన గారా మేమియుఁ, గొఱఁతవడక యుండ నడపి కొఱలుము శుభమున్. హరి. పూ. ౧. ౧౮౧.

సీ ... శాంతిఁ గొఱలి విప్ర. గీ. కులము దైవస్వరూపం బగుట మనంబు, నందు దృఢముగ నిల్పి తదాశ్రయమున, నెలయువాఁడ వైనను మేలు... భార. అను. ౫. ౩౫౩.

౨. కోరు, అభిలషించు.

క. ఎఱిఁగెడువారికి నైనను, గఱపక తక్క రుచిత ప్రకారము శుభముం, గొఱలుహితు లట్లగుట నం,దఱకును జెప్పంగ వలయుఁ దగియెడు బుద్ధుల్. భార. విరా. ౧. ౧౧౬.

చ... సనా,తన మగుమోక్షముం గొఱలి తా విడుచున్ గృహధర్మవర్గమున్. భార. శాం. ౫. ౩౧౦.

కొఱలుకొను = కొఱలు, ఒప్పు.

సీ. కలయంగఁ గుముదినీకుల మెల్ల నభినవకోశసంపత్తి చేఁ గొఱలుకొనఁగ. కవిక. ౪. ౧౯౮.

**కొఱవ.** వి. ఒకానొక కొండజాతి.

ఉదా: కొఱవవాఁడు, కొఱవది. (శ. ర, ప్రా.)

జ: కొఱవత.

**కొఱవత.** వి. (కొఱవ + త) కొఱవజాతిస్త్రీ, కొఱవది. (శ. ర.)

**కొఱవి.** వి. కొఱకమ్పు, అలాతము, ఉల్ముకము.

గీ. కొఱవి ద్రిప్పినయొప్పున మెఱసెఁ బార్థు, గాండివము ... భార. అర. ౬. ౨౨౬.

గీ. కోఁతిఁ దెచ్చితి ననఁ బోయి కొఱవిఁ దెచ్చి, పాఁడ ననవుడు ముక్కులు నలుచుకొనిరి, కొలువువా రెల్ల నపుడు పక్కున నగుచు. దశా. ౮. ౨. ౯౭. అం. భా. ౨. ౨౪౨.

కొఱవిలోఁ దలగోఁకుకొను, కొఱవిలోఁ దలబరికికొను=బుద్ధిపూర్వకముగా కీడు తెచ్చుకొను.

గీ. ధరణి మఱియును పెక్కువిధంబులందు, బ్రహ్మవిదులైనబ్రాహ్మణప్రభులమహిమ, వినమె యెఱిఁగి యెఱింగి సద్వ్యసనచరిత, కొఱవిగొని నెత్తినే తలగోఁకికొనఁగ. భార. అర. ౫. ౨౦.

క. ఎఱిఁగి యెఱిఁగి నీముందఱ, నఱగొడ్డెము చేసి పోయి రది గైకొనసి, తెఱఁ గయినహంసడిభకులు, కొఱవిం దల బరికికొన్న కొఱకులు గా రే. ఉ. హరి. ౮. ౧౨౬.

జ: కొఱవికోల, కొఱవిచీమ, కొఱవిదయ్యము.

**కొఱవి(ర్వి)కోల.** వి. (√ కొఱవి) ఆగ్నేయాస్త్రము.

చ. చెలఁగి చెలంగి మానసము చిల్లులువోవఁగ నేసి బాలికన్, వలపులరాచజోదు ప్రసవంబుల పేరిటికొర్వికోలలన్. పి. శకుం. ౩. ౧౬౯.

**కొఱవిచీమ.** వి. (కొఱవి+చీమ) పెద్దయెఱ్ఱచీమ. (శ. ర-ఇది కుట్టినయెడల కొఱవితో అంటించినట్లు మంట పెట్టును.)

**కొఱవిదయ్యము.** వి.(కొఱవి+దయ్యము)పిశాచభేదము.

గీ. గగన మనుద్రభూమి నేకతమ తిరుగు, నదరులుమి సెడికొఱవిదయ్యాలు వీఁడె. నైష. ౨. ౧౨౨. హరిశ్చ. ౫. ౧౦౧.

**కొఱవోవు.** అ. క్రి. (కొఱ[1]+పోవు) డిల్లపోవు, సత్త్వహీనమగు..

వ. ... బ్రహ్మమాటకుం గొఱవోయినవాణి యేమిటం దేఱె నని యడిగిన బ్రాహ్మణుం డిట్లనియె.

క. ప్రాణాపానంబులయెడ, వాణి నిలుచుఁ గానఁ బ్రాణవాయు వొదవి తత్, క్షీణత్వ ముడిపి ... భార. అశ్వ. ౨. ౨౨, ౨౩.

**కొఱసంది.** వి. (కొఱ[1]+సంది) ఆయువు, జీవస్థానము.

క. పఱతెంచి కరి మదము నే, డ్తెఱఁ దొండం బెత్తి వ్రేయ దెప్పఱికమునన్, గొఱసంది తాఁకి నేలకు, నొఱగినసింగంపుఁగొదమయొప్పమరంగన్. నిర్వ. ౧౦. ౭౯.

క... పిడికిటఁ గొఱసంది గడు బెడిదముగఁ బొడిచెం, బగతుఁడు గను మిడిసి నేలఁ బడి తన్నికొనన్. భార. విరా. ౨. ౩౫౧.

**కొఱుకు.** స. క్రి. (క. కొఱుకు. త. కొఱి.) కఱచు, దంశనము చేయు.

గీ. పటపటఁ గపాలపంక్తులఁ బగులఁ గొఱికి, బలము నెల్లను గడియలోపలను మ్రింగె. మనుచ. ౪. ౧౧౩.

వి. ౧. ఆహారము, ఎర, మేఁత; తినుట.

సీ. వడి సావియెఱుకు విన్ బడిగంట బఱుమబ్బుఁ గొక్కుగుంపుల కిడ్డకొఱుకు లనఁగ. గీ...చుక్కలు వెలింగె. చంద్రా. ౫. ౫౨.

గీ. కొఱుకునకుఁ బోయి బడిగంటఁ గూలుకరణి. సీత. ౧౩. ('కొఱఁకు' ముద్రి.)

ఉ...కొఱుకు చూపుచు నొడ్డినబోను మేలుగా, బో నని కాన కాసపడి పోవుచుఁ గూలదె కొక్కు భాస్కరా. భా. శ. ౩౦. ('కొఱఁకు' ముద్రి.)

(కలభాషిణిమాటలు) గీ... ఆకొర్కి సాధించు చింతఁ దక్కు, చింత యెఱుఁగక యేఁగుదెంచి తిఁ గొఱుకుకుఁ, బోవ బడిగల్లు వడియె నోపాలఁతి...కళా. ౩. ౯౭. ('కొరక' ముద్రి)

గీ. కొఱుకునకు లేక మూషకకోటి చేర, కునికి... శుక. ౩. ౨౮౪.

౨. మేహరోగవిశేషము. (శ. ర)

ఉదా: కొఱుకుసవాయి.

పండ్లుకొఱుకు=కోపముచే పండ్లు పటపటలాడించు.

క. నేటుకొని పండ్లుకొఱుకుచుఁ, జీటికిమాటికిని గసరు చిలుకం జిలుకా, బోటుల నలయించెదు...నీలా. ౩. ౨౬.

సీ. కలలోనిదిక్పాలకులమీఁదఁ జని మాఱుకొను వారిఁ గని పండ్లుగొఱికికొనుము. ఉ. రా. ౨. ౨౯౫.

(వ్యవ) ఆ బ్బిమ్మని కుఱ్ఱవాఁడు నాప్రాణాలు కొఱుకుచున్నాఁడు. నన్ను వాఁడు కొఱుకుకొని తినుచున్నాఁడు(=మిక్కిలి బాధించుచున్నాఁడు.)

**కొఱుతనుఱుకు.** అ. క్రి. (√కొఱ్ఱు) సాహసకృత్యము చేయు.

ఆ. కొఱుతనుఱుకఁ గాని కొడుకు కన్నఁడును గార్య,తంత్రమునకుఁ జొరఁడు... భార. స్త్రీ. ౧. ౧౭.

వ...కృష్ణుఁ డెప్పుడుం గొఱుతనుఱుకఁ బిన్నవాఁడునుం బిన్నకొలందులం బోయెడువాఁడు కాఁ డనువారును...హరి. పూ. ౭. ౨౯.

విశే. ౧. సాహసికుఁడు.

వ...నీచెప్పెడిధర్మంబులు కౌరవులకుం జెప్ప వలవదా వారలుగదా మీఁ దెఱుంగక కొఱుతనుఱుకులై చెడుతెరువునం బోయెడువారు ...భార. ఉద్యో. ౧. ౩౮౩.

గీ. చుఱుకుఁజూపునఁ గాలినకొఱుతనుఱుకు, నుఱుకుఁజూపులఁ బుట్టించునెఱుకువారి,ఝుఱుకువలిగుబ్బపాలిండ్లయిగురుఁబోండ్ల, సేవ కిచ్చెద నీకు విచ్చేయవయ్య. కాశీ. ౩.౭౧. (చుఱుకుఁజూపునఁగాలినకొఱుతనుఱుకు=మన్మథుని.)

౨. క్రూరుఁడు.

గీ. ముక్కు లేనిబోసిమొగమున వెడలెడి, నిడుదయూర్పుతోడ నెత్తురొలుకఁ, జెలువ మగని దిక్కు చేసన్నఁ జూపి యా,కొఱుతనుఱుకు ముక్కు గోసె ననియె. విక్ర. ౭. ౧౬౦.

**కొఱ్ఱ[1].** వి. సస్యవిశేషము, ప్రియంగువు.

ఆ. కొఱ్ఱగింజ నోరఁ గొఱికియు నొకప్రొద్దు, చెఱుచుకొన్నవిధము కొఱఁత లైన, పిరుఁలు నమ్మి నీదుశ్రీపాదచింతన, మఱచి నాఁడ నెంత మందమతిని. కుచేల. ౩. ౫౨.

గీ. కొఱలుచుంచుఁ బ్రియంగువు కొఱ్ఱ యనఁగ. ఆం. భా. ౨. ౨౩౮

౨. ప్రియంగుధాన్యము.

సీ...కొఱ్ఱలు చామలు...హంస. ౮. ౧౨౭.

**కొఱ్ఱ[2]=కొఱ[3].** వి. (త.కుఱవై) మత్స్యవిశేషము.

సీ. కొఱ కొఱ్ఱ యనఁగను బరఁగుఁ బాఠీనంబు... ఆం. భా. ౧. ౧౬౦.

కొఱ్ఱమీను=కొఱ్ఱచేఁప.

సీ. కొండు దాసరికొయ్య కొఱ్ఱమీ నులస ము చ్చంగి బేడిస జెల్ల చాఱమీను. హంస. ౮. ౧౯౭. ప్రబంధ. ౧౯౫.

**కొఱ్ఱు.** వి. దే. (కొఱ్ఱులు, కొఱులు, కొర్లు, కొఱ్ఱితిన్,కొర్త్రిన్,కొఱుతన్,కొర్తన్, మొ.దీని రూపములు. చూ. అఱ్ఱు.శ.కొఘు.)౧.ముల్లు; ఇనుపముల్లు.

క. సాలయుత తూనిఁగలం గొఱ్ఱులఁ బెట్టితి నీవు నీచిఱుతకాలము...భార. ఆది. ౮. ౨౭౦.

సీ. లికుచావళికి వృత్తలీల చెన్నగుఁ గాక బొంగరంబులఁ గొర్తఁ బూన్ప వలదె..గీ. తెఱవపాలిండ్లతోడ వాదించె నేని ... పె. శకుం. ౨. ౭౫.

౨. మేకు, శల్యము.

చ...ముల్లు వుచ్చి కొఱ్ఱిడిచి:చంద మయ్యె...మనుచ. ౩. ౩౮.

౩. శూలము, వధసాధనవిశేషము.

గీ. పాతకులకొఱ్ఱు నట్టువపాలియదుకుఁ, గ్రోవి భరతంపుటయ గారిగుండెదివులు...శుక.౩.౨౦.

సీ ... యదువృష్ణిభోజాంధకవీరవరులఁ, గొఱ్ఱుల నిడుఁడు...వి. పు. ౭. ౮౧౩.

క. నెఱి మాలి బందెవట్టిన,నతిముతిఁ జంపినను గజము నశ్వము మ్రుచ్చె,వఱిగొనిన నట్టివారలఁ, గొఱులఁ దిగిచి చంపు టొప్పుఁ గువలయపతికిన్. విజ్ఞా. ప్రా. ౧౦౮.

ద్వి. పశుపరించుచుఁ గొర్లపాలు సేయుచును. బస. పు. ౬. ౨౨౮ పం.

ఆ. కొర్తు వేయ దొంగ కోరినచంద మా. వేమన. ౨. ౩౧౩.

సీ. కొర్తిమీఁదను గొంతుకూర్చుండుకొనినట్లు ...వేణు. ౫౦.

కొర్తుఁబడు=శూలప్రోతుఁ డగు.

ద్వి. చంపి మాండవ్యుండు సరి గొర్తుఁ బడియె. బస. పు. ౫. ౩౭౨ పం.

జ: కొలుతనులుకు.

**కొల**[1]. వి. (√కొలుచు[1]) కొలత, (ధాన్యాదులను) కొలుచుట.

(వ్యవ) ధాన్యమును చౌకగానే యిచ్చును గాని వాఁడు కొలలో మోసము చేయును.

(సా) అంబటియేలు వచ్చుచున్నది అత్తగారా యన కొలబుట్ట నాచేతిలోనే యున్నది కోడలా యన్నట్లు.

**కొల**[2]. వి. (క. కొలె. త. కొలై.) ౧. హింస, వధ.

చ. మనసిజ దోస మాఁడుకొల మానఁగదయ్య తలంచి మ్రొక్కెదన్. చంద్ర. ౪. ౭౪.

౨. దోషము, పాపము.

క. తొలుజన్మంబునఁ జేసిన, కొలయును బుణ్యంబుఁ గట్టికుడుపక యున్నే. సారంగ. ౨. ౩౩.

క. కొల యన దురితంబు పేరు ... ఆం. శే. ౨౧. శశాం. ౩. ౭౭.

౩. పగ, వైరము.

ద్వి. వనచరాధమ యోరి వాలికి నీవు, తనయుండవై లేని దశరథాత్మజుని, గోఁచితి బంటవై కొల యీఁగ వైతి, చలమున నీతండ్రిఁ జంపి నాఁ డతఁడు. రం. రా. యు. ౩౮౯ పొ. ౧ పం.

**కొలఁకు**=కొలను.

(చెఱువు, సరస్సు)

సీ...కొలను, కొలఁకు నాఁగ సరసి వెలయును... ఆం. భా. ౧. ౧౬౩.

చ... కమ్మనితమ్మికొలంకుతెమ్మెరల్, వొలయఁగ ...పారి. ౧. ౯౨.

**కొలఁకువు**=కొలను. వి. చెఱువు.

శా...వచ్చి నీటన్ గుభుల్, గుంభధ్వానముతోఁ గొలంకువు గలంకుం బొందఁ గాఁ జొచ్చి:.. భాగ. ౭. ౧౧౧.

ఉ...ఒకతమ్మికొలంకువుఁ గాంచి యచ్చటన్. కృ. శకుం. ౨. ౧౬౬.

**కొలఁది**=కొల్ది, కొద్ది. వి. ౧. పరిమాణము, మితి.

వ. జంబూద్వీపవిష్కంభంబుకొలఁది యెనుబది వేలు నాలునూఱుయోజనంబులు ... భార. భీష్మ. ౧. ౨౯.

క...అతనిబోధము, కొలఁది పరీక్షింపఁ దనకుఁ గోర్కి వొడమినన్. భార. శాం. ౬. ౧౯౧.

ఆ. నిద్ర పెంపు నిద్ర నిగ్రహించుటయును, గొలఁది మీఱుకుడుపుఁ గుడువమియును. భార. అను. ౫. ౨౬౩.

గీ...కొలఁది కెక్కు, దైనరిపుసైన్యకోటితో... హరి. ఉ. ౩. ౧౧౨.

సీ. పన్నిరి మేరువు ల్బహుసంఖ్యలకొలందిఁ జంద్రసూర్యాకల్పశతముతోడ. వసు. ౫. ౬౪.

క. తలవెండ్రుక లెగఁగట్టెదు, కొలఁదిని నానృపకుమారకుఁడు కడిమి మెఱుఁగన్, నలుదెసలకరులగండ, స్థలఫలకములన్ లిఖించె జయశాసనముల్. నైష. ౧. ౬౨. (ఇట వయఃపరిమాణము.)

౨. అవధి, మేర.

క. తలఁపఁగ రిపులకు నిమ్మగు, కొలఁది గడచి వచ్చితిమి యకుంఠితబాహా, బలము సెలవఁ దఱి యయ్యెను... భార. విరా. ౪. ౮౩.

గీ. లస్తకంబునకొలఁదికి లక్ష్మణుండు, వెడఁదయమ్మున నభిమన్యువిల్లు దునియ, నేసి యార్చిన... భార. భీష్మ. ౨. ౭౫.

౩. శక్తి, సామర్థ్యము; శక్తితారతమ్యము; మహిమ, మహత్త్వము.

ఆ. ఇట్లు దొరలు నొవ్వ నేడ్తెఱఁ దనచేతి, కొలఁది నూపి క్రీడి పెలఁగి... భార. విరా. ౭. ౬౬.

ఆ. ఆఁడుదాన నబల నైన నే నించుక, యులికి చూచుడును భయమునఁ దలరు, దుగ్రుగ్రలోచనోద్భూతవహ్నికి, నెదిరి నిలువ నీకు నెంత కొలఁది. కు. సం. ౪. ౪౩౦.

క. కొలఁది యెఱుంగక కృష్ణులఁ, గలన గెలుతు ననియెదవు ...భార. కర్ణ. ౨. ౩౫.

చ. కొలఁది యెఱుంగ కిట్టిపలుకుల్ పలుకం దగుఁ గాదు నాక...భార. ఆది. ౫. ౨౦౩.

క. నెలకొని వేసవిఁ జలువయుఁ, జలివేళల నుష్ణగుణము సముచితభంగిం, గలిగించునీలతాంతము, కొలఁదులు చెప్పంగ నిచ్చ క్రొత్తలు సుమ్మీ. పారి. ౧. ౬౩.

౪. స్థితి, అవస్థ.

వ...హయదైత్యుఁడు...కుత్తుక యదరఁ దోఁక యెత్తి శకృన్మూత్రంబులు విడుచుచు నడిచి పడి యును విడుచుకొలందికిఁ జేరి చేష్టఁ దక్కి...హరి. పూ. ౯. ౧౧౩.

౫. విధము, తెఱఁగు, రీతి.

క. నాకొడుకు లెక్కుడిబ్బ్రదు, శీకొలఁదిఁ దలంప నిప్పు డెన్నినవీరా, నీకంబు నోర్వ వచ్చునె, యీకూడినసైనికులకు నే మనువాఁడన్. భార. ఉద్యో. ౨. ౨౩౭.

సీ. వెడత్రోవ మును చెప్పి పడి నవ్వఁ దిరుగునధ్వగుకొలందినె యపత్రపయు మరల. ఆము. ౪. ౧౬౩.

విశే. ౧. పరిమాణము గలది.

క. మెడ యెఱుఁగఁ జేతికైదువు, వడ నిను నీ వెఱుఁగకున్నభంగి గనియెఁ గ, వ్వడి యూరకుండునటె చె, ప్పెడుకొలఁదియె వానికరుణ పెంపు కుమారా. భార. విరా. ౫. ౨౧౬.

స్రగ్ధర. ఖడ్గీన్ జెందాడు మ్రాఁకుల్ కవుఁగిటికొలఁదుల్ కత్తి నొక్కొక్క ఘాతన్. మను. ౪. ౯.

౨. సాటి, సమానము.

చ...గు, బ్బలసిరు లన్నఁ జోద్యములు భవ్యతరాగ్రత నొప్పనవ్వియే, కొలఁదులు వాని కింక నొనగూడునె యున్నవి యెన్నియేనియున్. చమ. ౨. ౭౧.

గీ. కొమ్మ నామాత్యతిక్కనికొలఁదిపదివుఁ, డింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు. దశకు. ౧. ౯౨.

౩. అల్పము, కొంచెము, తక్కువది; అల్పసంఖ్యాకము.

క...గంగాస్నానంబునఁ, దొలఁగం గలపాతకము చతుర్దశభువనం, బులఁ గూడి చేయఁ జాలవు, కొలఁదిరె గంగాతిశయము గుణరత్ననిధీ. జాహ్నవీ. ౩. ౮౨.

ద్వి. ఉన్నతస్తనకుంభయుగళభారమున, నన్నువు కాఁదీఁగెయుసియాట కులికి, చెలువున నేమంబు చింతించె ననఁగఁ, గొలఁదిభూషణములు కొమరారఁ బూని. రం. రా. ఉ. ౮౦ పా. ౧౧ పం.

౪. శక్యము, సాధ్యము, తరము.

చ. దళితవిరోధి యిట్టి దని దాని తెఱం గెఱుఁగంగ బ్రహ్మకుం, గొలఁదియె తా నవాఙ్మనసగోచర మద్భుతరూపము...భార. సభా. ౧. ౮౯.

గీ. కుండములసంఖ్య లెక్కింపఁ గొలఁది కాదు, వాపికలసంఖ్య లెక్కింప వలను గాదు, పద్మలోచన కాశికాపట్టణమున. కాశీ. ౪. ౨౦౫.

గీ. వలదు చాటితి నతఁడు నీకొలఁది గాఁడు, చేటుతతి గాన నీ కిట్లు చెడ్డబుద్ధి, పొదయుచు

న్నది...భా. రా. యు. ౧౪౩. (నీకొలఁది= నీకు సాధ్యుఁడు.)

కొలఁదికి డాయు=దగ్గఱకువచ్చు.

చ. నిలువక మెల్లఁ దాఁగు నటు నిల్చిన మెల్పు న టించుఁ బట్టఁ జే,యలఁతికిఁ జేరినం జిదిమిన ట్టులు దూరము దాఁటుఁ గ్రమ్మఱం,గొలఁదికి డాసినం బొదలు గొందులు సొచ్చు నడంగి నన్న న,న్వాలఁ బొడనూపు మాటు గొని వ చ్చిన వెండియు నందు నొండెడన్. భా. రా. అర. ౨. ౪౬.

నోరికొలఁదులు=నోటికివచ్చినమాటలు.

సీ. తొడిఁబడి సొమ్మసోబడి యెఱుంగక నోరికొ లఁదు లొక్కనిఁ జూచి పలికితేని. పి. ప్ర. ౫. ౪౦.

ద్వి. ఈరీతి సాధింప నెవ్వరివశము, నోరికొలం దుల నుడువంగ నేల. ద్వి. ప్రభు. ౧౧౫ పా. ౨౦ పం.

వేలకొలఁదులు=సమయానుకూలములు.

చ. శివుఁ డిటు రమ్మటంచు దయచేసినచోఁ దల కక్కు తుగ్రనై,భవమునఁ జూచుచో నడుగు వట్టితి వే మనవచ్చు నీగుణం, బవు నవు నం దిన న్నిగయు నందక యున్నను గాల్గఁ బట్టు కొం,దువు హరిణాంక వేలకొలఁదు ల్గవ నీ నడకల్ దలంపఁగన్. విజ. వి. ౩. ౫౧.

ఆకొలఁదులవాఁడు=అట్టివాఁడు.

క. అక్కట తప్పఁ దలంచితి, నక్కొలఁదుల వాఁడె కృష్ణునల్లుఁడు పోరన్, గ్రుక్కెనె బాహాగర్వము, దక్కెనె నాకొడుకు మిన్ను దలపైఁ బడినన్. భార. ద్రో. ౨. ౨౪౭. (సామాన్యుఁడు అని భావము.)

ఏకొలఁదులవాఁడు=ఎట్టివాఁడు.

క. బలవంతులబలములు న,గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ దీర్పదు నే, కొలఁదులవారికి గర్వము,నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభం గిన్. భార. ఉద్యో. ౩. ౩౦౩. (ఏకొలఁదుల వారికి=ఎంతగొప్పవారికిని.)

మాకొలఁదులు=మావంటివారు.

క. ఏ నొక్కటి యడిగెదఁ జెపు,మా నలినదళా క్షి యనుడు మాకొలఁదులప,ల్కైన నదుత్తర మిచ్చెద, నానతి యి మ్మనియె నది ప్రియం బెసఁగంగన్. భార. అను. ౨. ౧౬౭. (మాకొలఁదులపలుకు = మావంటివారు చెప్పఁదగినపలుకు.)

ఎడకొలఁదిన్=అవకాశమునుబట్టి.

గీ. అసుర వధసాధనము రోయునపుడు గ్రుద్ది, తాఁచి తిరిగినఁ గృతముష్టి దండ నిలిచి,యెడ కొలఁది వెన్కవడ నొయ్య నడచి నడచి... ఆము. ౬. ౨౨.

శక్తికొలఁదిన్=శక్త్యనుసారముగా.

వ...శక్తికొలఁది శ్రుతదృష్టంబు లుపేక్షింపక ర క్షణశిక్షణంబు లాచరించుచు ... ఆము. ౪. ౨౭౫.

సా: విత్తముకొలఁది వైభవము. పిండికొలఁదిరొట్టె.

జ: కొలఁదియిడు, కొలఁదిపెట్టు, కొలఁదివేయు, కొలవేయు.

కొలఁదియిడు=కొలఁదిపెట్టు.

(లెక్కించు, గణించు)

క. కొలఁదియిడ రానిశరతతిఁ, బొలివోవక దేవ శిల్పిఁ బొదివిన...హరి. ఉ. ౧౦. ౬౬.

కొలఁదిపెట్టు. స. క్రి. (కొలఁది+పెట్టు) ౧. ఎంచు, గణించు, లెక్కించు.

ఆ. వర్షధార లెన్న వచ్చు గంగావాలు, కలు గ ణింప వచ్చు గగనవీథి, వెలుఁగుతారకములఁ గొలఁదిపెట్టఁగ వచ్చుఁ, గాని సతుల మనసు గాన రాదు. భోజ. రా. ౪. ౨౪౭.

వ. కారవు లున్న చక్కటికిం గట్టెదురుగా నిలిచి యెల్లవారిసైన్యంబులుం గ్రమంబునఁ గొలంది వెట్టుకొనుచు నందఱకు సంజ్ఞలు నడియాలంబు లుం గల్పించి...భార. భీష్మ. ౧. ౧౨౨.

సీ. కొలఁదివెట్టఁగ రానికోలలు హరిమీఁద సేసె దిగ్భాగంబు లెల్లఁగప్ప. హరి. ఉ. ౪. ౧౭౫.

౨. పరిమితముచేయు, కొంచెపఱుచు.

సీ. పాదవుల సడిసన్నయొడళుల లెక్కయమ్ముల పెంపు గగనంబు గొలఁదివెట్ట. భార. విరా. 3 ౧౬౭. (ప్రాఁత ప్రతి పా.)

**కొలఁదివేరు**=కొలవేరు. వి. (కొలఁది+వేరు) వట్టివేరు?

సీ...అరఁటి, మోసుల వీజనంబులు సేయు కొలఁదివేళ్లిరవుగాఁ గూర్చి చామరలు సేయు. కు. సం. ౫. ౬౧౯.

**కొలకొండ.** వి.(కొల¹+కొండ) త్రవ్విన నేలలోఁతు తెలిసికొనుటకై నడుమ త్రవ్వకుండ వదలిపెట్టెడుమిట్ట.

సీ. కుతలంబుపడుకొనఁ గొలకొండగా నిల్పి కరనిధి గ్రొచ్చిరి సగరసుతులు. కు. సం. ౧. ౫౨.

**కొలకొల**=గొలగొల. వి. (సం. కలకలః) (పక్షులు మున్నగువానిధ్వనికి అనుకరణము.)

చ. కొలకొలఁ గూయు...కోకదంపతుల్. మను చ. 3. ౬౨.

చ. అలరుఁ బురంబునన్... నీరుకో,గ్గొలకొల మంచుఁ గ్రుంకుమెడగుంపులవంపులు దోఁప... పొల్చుపురాతనతీర్థకుండముల్. ఆము.౧.౭౧.

చ. కొలకొలమంచు మేఁతలకు గూఁడుల వెల్వడు పక్షిరావముల్. పారి. ౨. ౬౯.

సీ. సందడించుచు దశాశ్వాహిణీసైన్యంబు లనిశంబుఁ గొలకొల మసుచు నుండు. శై. భా. ౧. ౮౪.

చ. కొలకొలమంచు నుండు సితకోకనదప్రభవప్రసూత నా,కొలువిది తొంటినాఁ డతిథికోటు లసందడి... నైష. 3. ౧౩.

**కొలగాఁడు.** వి. (కొల¹+కాఁడు) ధాన్యాదులు కొలుచువాఁడు.

**కొలగారము.** వి. (√కొల¹) ౧. ధాన్యాదులు కొలిచినందుల కిచ్చుకూలి. (శ. ర, బ్రౌ.) ౨. కొలుచుట, కొలత. (బ్రౌ.)

**కొలత.** వి. (√ కొలుచు¹) ౧. పరిమాణము.(శ.ర.) ౨.(ధాన్యాదులను) కొలుచుట. (శ.ర.)

**కొలనాడు.** అ. క్రి. (కొలను+ఆడు.) తీర్థమాడు, స్నానముచేయు.

గీ. మేలితేనియ నిండినమెట్టతమ్మిఁ, జేరి కొలనాడి పుష్పాడి పేరితఱు, పానఁగ నవ్వలిక్రొవ్విరి పురుటియిల్లు, వింతగాఁ జెందుఁ దేఁటిబాలెంత కంటె. కువల. 3. ౧౨౫.

సీ. పితృవనంబునదాఁకఁ బతివిమానము వెంటఁ జనిసేసి కొలనాడఁ గదలుభంగి. గీ...చిచ్చుబుకఁ బోవుచికవరాజీవనేత్ర, కళ్యమేధంబు ఫలము తథ్యంబు గలుగు. కాశీ. ౨. ౮౬.

**కొలను(ల్ను)**=కొలఁకు, కొలఁకువు. వి. దే. (సం. కూలం. త. కుళమ్. క. కొళ - మా.కలను.) ౧. చెఱువు, సరస్సు.

సీ. మరకతశైలాశ్మకూరముల విలసిల్లఁ గొల నని సన్మణిస్థలము సూచి. భార. సభా. ౧. ౧౨.

ఉ. వీటికి నాల్గువంకలను వెన్నెలతేటలఁ బోలు నీళ్లతో,హాటకపద్మమండితము లైనకొలంకులు చూడ నొప్పగున్. భీమ. ౧. ౯౬.

చ. పరిఖ నిజాశ్రయంబుపరిపాటిఁ దలిర్పఁ బదాఱువన్నెబం, గరువున నైనరాజ్యగృహకల్పన కర్ణికగాఁగ గంధసిం,ధురములు తేఁటులై మెఱయఁ దోరపుఁగొమ్మలు కేసరంబులుగా, ధర యనుకొల్నిలో మెలమతామరపూవనఁగోట మీటగున్. పాండు. ౧. ౧౦౬.

గీ. కొలనఁ గరిదంపతులు పద్మకళికలాకట్ట, కొకటి యీనెత్తమరరంప మొలుకసము క్రేసలకరత్నద్మనిలయకు సెలమితోడఁ, గపగ సభిషేకమున కెత్తుకడవ లనఁగ. ఆము. ౪.౧౬3.

౨. పుట్టినశిశువును స్నానము చేయించునపుడు ఆ స్నానోదకము పడుటకై కొలనివలె త్రవ్వినచిన్న గుంట.

గీ. కాయ మొనరింప జలకంబుఁ గాఁచఁ గొలనఁ, గొలను ద్రవ్వింపఁ గాపు కావలయునెడల, నరసి వేఁపాకు పురుటింట నెరయఁ జెక్కి, హెచ్చరిక గల్గియుండవలె యింతులార. ఇం దు. ౨. ౫.

ద్వి....అతివ యొకర్తు...కొలనిచక్కటిఁ బాదు కొనుగద్దెపీఁట, నాసీనయై చరణాబ్జముల్ సాఁచి...ఆ.ముక. ౨ర హా. ౧౦ పం.

వేలుపుఁగొలను=సురదీర్ఘిక, ఆకాశగంగ.

గీ. కాంచి చేరంగఁ జని మధుకైటభారి, రత్నసోపానకలితమార్గముల డిగ్గి, కులసతియుఁ దాను వేలుపుఁగొలను దరిసె. పారి. ౪. ౨౭.

జ: కొలనాడు.

**కొలపగ.** వి. (కొలము+పగ) జాతివైరము.

చ. కొలపగ దీర్చుకోఁ దలఁచి...శుక. ౨ ఆ౪. వేం. పంచ. ౩. ౧౯౫.

**కొలపగతుఁడు.** వి. (కొలము+పగతుఁడు) సహజ శత్రువు

క. తల లెత్తి చూడ వెఱతురు, వెలవెలనై మాటు పలుక నఱతురు నెఱయన్, జలియించి పఱతు రిస్సీ, కొలపగతురు గాక యాచకులు లోభుల కున్. వేం. పంచ. ౨. ౧౪౧.

**కొలపెట్టు.** స. క్రి. (కొల¹+పెట్టు) కొలతవేయు, కొలుచు.

వ...శేషవాసుకిముఖ్యమహానాగంబుల ముళ్లువేసి చుట్టినం గాని దీని మొదలివలను కొలపెట్ట రాదు...వరాహ. ౧౨. ౪౩.

**కొలము.** వి. (సం. కులమ్.) ౧. వంశము, అన్వయము. (వృత్తియందు వికల్పముగా అంత్యవర్ణలోపము-చూ. కొలసామి, మొ.)

ఉ. పుట్టువు నన్వవాయమును బుద్ధి నెఱుంగము రాకొలంబునన్, బుట్టినవాఁడొ ... కిరా. ౨. ౮౯. (రాకొలము=క్షత్రియవంశము.)

గీ. మానికంబవు గద కూచిమంచికొలము, నం దర య...నీలా. ౧. ౧౫.

౨. సజాతీయప్రాణిసముదాయము.

గీ. సడలువడనిక డిందినొసఁగునయాళి, బోరప్రాఁకుచుఁ గొలముల పులుఁగు లోఁడ. అచ్చ. రా. బాల. ౬౩.

సీ. కలకలఁ బల్కు చిల్కలకొలంబులఁ జాల నలరు పొన్నల మూఁగి యలరు లాఁగి. యయా. ౪. ౧౫.

జ: కొలపగ, కొలపగతుఁడు, కొలసామి.

**కొలవేరు**=కొలఁదివేరు. (√కొలఁది)

క. కొలవేసులు నెలమూఁడులు, దలిరులు నీహారవారిఁ దడిపి నయమునన్...కు. సం. ౫. ౬౭.

**కొలసామి, కొలముసామి.** వి. (కొలము+సామి.) కులస్వామి, కులశ్రేష్ఠుఁడు.

క. అది యొకనాఁ డంబరమునఁ, బదివేలు బకాది వారిపక్షులు సనఁగా, నదె నాకొలసాములు వో, యెద రని యడ్డముగఁ బాఱి... శేషూ ౪. ౩. ౧౫౦.

క. జాలము నతికి విహంగమ, జాలము బ్రదికించి కొలముసాముల హేలా, లీలం గలపుట గనుఁగొని, యాల్కుపతనకుఁడు మూషకాగ్రణి కనియెన్. వేం. పంచ. ౨. ౪౩.

**కొలారకము.** వి. (√ కొల¹) కొలత.

గీ. కొలువడి కొలారకం బనఁ గొలుచుట కగు. వేంక. మాన. ౬౮. (శ.ర.పా.)

**కొలారము**=కొల్లారు. (√ కొలారు-శ. ర.)

**కొలారికము.** వి. (√ కొల¹) ద్వంద్వయుద్ధము చేయ నున్న మల్లురకు కొలత చూచి జయుదువు తీర్పు అచుట.

గీ. ఒంటిపోట్లాటఁ గోరుచు నున్నయట్టి, మానటీ
లకుఁ గైదువు లిట్టుఁ జూచి, యేరుపఱచుట
వెలయుఁ గోలారిక మన. ఆం. భా. ౨. ౨౦౬.

కొలారికమంపు=ద్వంద్వయుద్ధమునకై రమ్మని(కటారిని) పంపు.

ఉ. పంద గులామ నీవు నొకబంటవె కొంటనికిన్కతోడఁ బ్రాఁకిందరి చిక్కటారిని గోలారికమంపినాఁటి కెచ్చుటకా, బొందుగ దాఁగి యుంటివిర...అహ. ౧. ౧౦౨.

**కొలారు**=కొల్లారు. (శ. ర.)

జః కొలారము, కొలారుబండి.

**కొలారుబండి**=కొల్లారుబండి. (√కొలారు)

సీ.తండోపతండమై గండోపలము లుండుపథము లందుఁ గోలారుబండ్ల నాఁగి. శుక. ౧. ౧౫౨.

**కొలి.** వి. బిల్లగోడు ఆడునపుడు బిల్లఁ బెట్టి కొట్టుటకుఁ ద్రవ్వినచిన్న పల్లము. (శ. ర.)

ఆ. కూడి గిరులుఁ దరులు గొల్లంబుఁ బల్లంబు, నరసి మిట్ట పుట్ట లడవిఁ దడవి, యోపి తోలులుఁ గోలులు నోలంబు సాలంబు, నూచి క్రంత గుంత చొచ్చి వచ్చి. ఉ. హరి. ౫. ౩౧౧. (శ. ర. పా.)

**కొలికి(లిక్కి).** వి. ౧. కంటికొన. ('ముక్కునంటిన కంటిమూల' అని శ. ర-కాని బసవపురాణమును బట్టి కంటియావలితుద ఆవలితుద కూడ నర్థ మగుచున్నది.)

ద్వి. కొలుకులు రెండు నంగుళముల నడుమఁ, గలయఁగఁ గన్నెల్లఁ గొలుకులై కాఁగ,నక్కన్నుఁగొలుకులు నరచేత మూయఁ, బక్కిళ్లఁ బింబించి పాఱంగఁ దొడఁగె. బస. పు. ౩. ౭౭౮పం.(చూ. బస. పు. ౮౦౭ పం.)

ఉ. కోఱలు చప్పరించి కనుఁగొల్కుల నిప్పుకలొల్క నల్కమై, బోరున రొప్పి పైఁబడిన పోతరపుంగిటి...శుక. ౧. ౧౭౯.

౨. కొక్కెము, హారాదులకు ముఖభాగమున వంపుగా నుండుబంధనసాధనము; బంధము.

సీ. ఘనకిరీటంబులు గట్టిగా సవరించి కలితకుండలములకొలుకు లదిమి. దశా. ౨. ౧౮౩.

(ఉదాః తాఁళపుఁగొలికి, పలుపుఁగొలికి.)

క. పలుకుల నగవుల నడపుల, నలుకల నవలోకనముల నాభీరవధూ, కులములమనములతాలిమి, కొలుకులు వదలించుఘనునిఁ గొలిచెద మదిలోన్. భాగ. ౧. ౨౨౮.

౩. కంఠము, గొంతుక.

గీ. గొంతు గొంతుక కుత్తుక కొలికి బొండు, గనఁగఁ గంఠంబు చెలఁగును...ఆం. భా. ౨.౧౮౧.

కొలికికిఁ దెచ్చు=లోంగఁదీయు.

ద్వి. అలవి మీఱినముత్తియంబుల నొక్క,కొలికికిఁ దెచ్చు నీకొమ్మపల్వరుస. అ. మ. క.౨.౯౮౫ పం.

కొలికికివచ్చు=౧. ఫలోన్ముఖమగు.

వ. ఇద్దఱకు నీడయి యున్నది కార్యంబును గొలికికివచ్చినది శుభస్య శీఘ్ర మ్మని పెద్దలు పలుకుదురు గావున దీనికిఁ దడయ నేల. వీర.౩.౫౮.

౨. లొంగు.

ద్వి. నిను నేఁడు ముఖమున నెత్తురు ప్రామి,కొనిగుల్ల పఱుపక కొలికికిరావు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౮ పం.

జః కొలికిచెప్పు, కొలికిపూస, కొలికిముడి.

**కొలికిచెప్పు.** వి. (కొలికి+చెప్పు) కొలికి గలపాదరక్ష, పాదరక్షాభేదము.

సీ...కొలికిచెప్పులు జమ్మగూడ లలఁతి, పిల్లఁగ్రోవులు...శుక. ౨. ౫౮౫.

**కొలికి(లిక్కి)పూస.** వి. (√కొలికి) కొలికికిఁ దగిలించెడుపూస.

మ. పాలుపారన్ శరదంగనాతిలక మంభోజాకరంపుంజొకా, కొలికిన్ దామరకొల్కిపూస వెసఁ గీల్కొఁజేసి క్రౌంచాద్రిఁ ద్వారలత

లం దగురెండుదార్లఁ జెలువారఁగ వచ్చురా యంచబో, దలపేరఁగ ధరియించి...చంద్రా. ౪. ౩౨.

**క్రొలికిముడి.** వి. (√ కొలికి) జాఱుముడి,వదులుము డి. (శ. ర, బ్రా.)

**క్రొలి(ల్పి)పించు¹.** స. క్రి. (√ కొలుచు¹)-ధా న్యాదికము-కొలువఁజేయు.

(వ్యవ) వాఁడు నాకు పుట్టెఁడుధాన్యము కొలిపిం చినాఁడు.

**కొలి(ల్పి)పించు².** స. క్రి. (√ కొలుచు²) కొ లువఁజేయు.

(సేవింపఁజేయు.)

వ...కులగురుం డగునమ్మందాకినీనందనుండు వారి నభినందించి కొలిపించుకొని యుండె...భార. భీష్మ. ౩. ౪౨౦.

వ... ఇవ్విధంబున సుఖిం జేసి ననుం గొల్పించు కొని మఱియు దవ్వు సని యాకాశంబున కెగ సిన...భార. అను. ౧. ౩౬౯.

**క్రొలి(ల్పి)పించు³.** అ. క్రి. (√ కొలుపు³) నా ట్యయోగ్యతద్ధిత్తాదిశబ్దముల నుచ్చరించు.

**క్రొలిమి(ల్మి).** వి. (క. కొలిమె.) కమ్మరి మున్నగు వారు లోహములు కాల్చుటకు నిప్పంచెడిగుంట.

సీ. కోపంబు గదిరినఁ గొలుముల కెన యైనకన్నుల నిప్పులు గడలుకొనఁగ. భా. రా. యు. ౧౩౨౫.

సీ. వనమహీస్థలి కొల్మి ఘనకింశుక ప్రసూనంబు లంగారవారంబులు...ప్రబంధ. ౪౪.

గీ. తామ్ర మాదిగఁ గలయట్టిధాతుచయముఁ, గొ లిమి నిడి యూఁదఁ గీ డెల్లఁ బోలియునట్లు, ప్రాణపవననిగ్రహమునఁ గ్రాఁగిపోవు, నన్ను యింద్రియజనితదోషాలి యెల్ల. మార్క. ౩. ౩౧౫. ఆం. భా. ౨. ౨౯౯.

జ: కొలిమితిత్తి.

**క్రొలిమితిత్తి.** వి. (√కొలిమి) కొలిమి యూఁదెడి తిత్తి, భస్త్రి.

గీ. కొలిమితిత్తి యనంగను జెలఁగు భస్త్రి. ఆం.భా. ౨. ౨౯౯.

**క్రొలుచు¹(ల్చు).** స. క్రి. కొలతవేయు.

గీ. పాటితూమున రసము దైవాఱఁ గొలిచి. హర. ౧. ౨౩.

మ... త్రైవిక్రమ,స్ఫురణఁగ మించఁ బదాంబుజం బొకటిచే క్షోణీస్థలిం గొల్చి...దశా. ౫. ౧౧౪.

ఉ...అవ్వధూటిక్రొ,ల్గన్నులు చేరలం గొలుచు కైవడి... నైష. ౭. ౩౯.

చ.... చందనపుమానికఁ గొల్చినమాళ్లు గల్గి కో, భిలుదురు రెడ్డిబిడ్డలు...శుక. ౨. ౮౦౬.

వి. ౧. ధాన్యము; వరిధాన్యము.

క. కొలు చపహరించునన్నరుఁ, డెలుకయుఁ బంది యును నైనయీదుర్జననం,బులఁ బొందు ... భార. అను. ౮. ౨౬౧.

గీ. నెట్టుకొని కొల్చు పోఁకకుఁ బుట్టెఁ డమ్మె, శ్రీరఘుస్వామి రాజ్యంబు సేయునపుడు. ఉ. రా. ౭. ౧౪౧.

సీ. దవసంబు కొలుచు నా ధాన్యంబు రాజిల్లు... ఆం. భా. ౨. ౨౩౬.

క. కొలుచు యవలు సెనగలు మినుములు తిల లా వలు కుసుత్థములు ముచ్చిలినఁగ. మార్క. ౨. ౧౧౪.

జ: కొల¹, కొలకొండ, కొలగాఁడు, కొలగారము, కొలత, కొలపెట్టు, కొలారకము, కొలారిక ము, కొలిపించు¹, కొలువడి.

**క్రొలుచు²(ల్చు).** స. క్రి. ౧. ఉపాసించు, ధ్యా నించు.

ఉ ... నూరిచే,తోరుచిరాబ్జబోధనరతుం డగుది వ్యవరాశరాత్మజాం,భోరుహమిత్త్రుఁ గొల్చి... భార. ఆది. ౧. ౨౨.

క...నా,రాయణుఁడె వరంబు కొల్వ మతని న టించుచుక్. ఆము. ౪. ౩౪.

౨. సేవించు, ఓలగించు.

ఆ. గురుని గురుతనూజుఁ గొలిచి యయ్యిరువుర,నెమ్మి వడసెఁ దనదు నేర్పు పేర్మి. భార. ఆది. ౩. ౧౧౦.

క. శైలసుతాపతి భక్తుల,పాలిటిపెన్నిధి వసించు భక్తిం గొలుమీ. కాశీ. ౩. ౫౬.

౩. నమస్కరించు.

గీ...కేల్మోగిచెఁ గొలిచె, నెఱఁగెఁ జేమోడ్చె నన నమస్కృతి యొనర్చె, ననుట...ఆం. సం.మాన. ౩౧.

జ: కొలిపించు², కొలుపు², కొలువు,కొలువుకాఁడు, కొలువుడుకాఁడు.

**కొలుపు¹(ల్పు).** అ. క్రి. ౧.ఇష్టపడు,సమ్మతించు.

క. ఈయనతో రణ మిప్పుడు, సేయఁగ మది గొల్పదస్త్రశిఖరికిఁ జేరం, దోయజమిత్త్రుఁడు నేఁటికిఁ, బోయి మనము వత్త మెల్లిప్రొద్దున ననికిన్. భార. భీష్మ. ౨. ౨౫౨.

క. కావున నినుఁ జెడఁబాయఁగ,నోవిహగవరేణ్య కొలుప దుల్లంబు...కళా. ౨. ౧౭౯.

౨. సమ్మత మగు, ఇష్ట మగు.

క. ఈపేదమాట లెల్లను, గోపవివకుఁ డైననాకుఁ గొలుపవు... భార. అను. ౧. ౧౧.

ఉ...మత్స్వరో,దీరణమొత్తి కోలునకు సీడుగఁ బల్కెడువీణ లేద యెం,దారసి చూచినం గొలుప దాత్మకు దానను బాట మిక్కిలిన్.కళా. ౭. ౧౯౬.

౩. పనికివచ్చు, చెల్లు, సాగు.

ద్వి. తక్కవ సీవట్టితానకంబులును,గొలుపవు మాయెడఁ గుటిలవిచార. ద్వి. హరిశ్చ. పూ. ౧౧౫౩.

ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయపుభంగులె మందు గాక ని,ర్మాయత నుల్లసిల్లెడువరాక్రమశీలు గొల్ప నెట్లు...భార.శల్య.౨.౫౨.

**కొలుపు²(ల్పు).** వి. (√ కొలుచు²) ౧. సేవ.

ఆ.... జంగమమల్లికార్జునునికొలుపు మొసరు మనుఁగఁ గొనుట. కు. సం. ౧. ౧౨.

సీ. హరి యొకండ జగత్కర్త యఖిలభర్త,విశ్వసంహర్త భోక్త వివేకయోక్త, తలఁపుబలుపును గొలుపును దెలుపు నతని, జనన కావింప నగునొండుదిక్కు లోక. నృసిం. ౪. ౧౦౩.

౨. నమస్కారము.

సీ. జోత చాఁగిలి కొల్పు జోహారు గిడిగిడి పొడుపు చేకూర్పు మ్రొక్కు మొగుపు...అమరుదండము పేళ్లు...సాం. ని. మాన. ౨౫.

వ...ద్వారవతియందలియాదవేంద్రునకుఁ గొలుపు న జస్థానమందలిగోపీజనప్రియునకు గొల్పుల్లు...ప్రబంధ. ౪౨౧.

౩. గ్రామశక్తికి చేసెడియుత్సవవిశేషము.

గీ....తద్విశేషంబు లొప్పు...జాతర కొలు పన...ఆం.భా.౧.౧౪౩. (వ్రాతప్రతి పా.)

**కొలుపు³(ల్పు).** అ. క్రి.(శ.ర.) నాట్యయోగ్యతద్ధిత్తాదిశబ్దముల నుచ్చరించు.

వి. కొనుగోలు, నాట్యయోగ్యతద్ధిత్తాదిశబ్దోచ్చారణము.

వ. కలమధురకిన్నరీనిక్వాణంబులరాణం బ్రాణఁజెఱుచువిన్నాణంపుఁగొల్పు లెలుంగులును... మనుచ. ౫. ౨౧.

జ: కొలిపించు³.

**కొలుపు⁴.** స. క్రి. కొను ధాతువునకు ప్రేరణరూపము.

(పురికొల్పు.)

క. అలిగి దశార్ణాధీశుఁడు,కొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూరగజము...భార. భీష్మ. ౩. ౧౫౧.

ఆ. పోరు వడపె దృఢమనోరథహరికుంజ, రోగ్రబలము గొలిపి యాగ్రహమున. రాఘవ. ౪. ౧౨౧.

(పుట్టించు, కలిగించు.)

క. చాలఁగ నిచ్చలు చెన్నయుఁ, బాలుం గుడుక
గొని తల్లి పట్టికి నలరిన్, వ్రేలిడి యింతింతి
యకాఁ, గ్రోలించును వెరవుతోడ రుచి గొలు
పు క్రియన్. హరి. పూ. ౫. ౧౯౩.

మ...అగ్గలికన్ దార్కొని తీవ్ర బాణతతి యా
కాశంబునన్ జీకటుల్, గొలుపన్ నిల్చి పె
నంగి రయ్యహితులన్ ఘోరప్రకారంబు
లన్. హరి. ఉ. ౩. ౧౧౦.

చ...రామభద్ర చెచ్చెరన్ జవి కొల్పు భవత్కవి
త్వముల్. రామా. ౧. ౧౩౦.

(-కను-గీఁటు, గిలుపు.)

చూ. కనుగొలుపు.

(వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు.)

ఉ. ఏటి గుఱించి పల్కు ఏను మేటికి నీభయ
మోహభంగి యెప్పాట భవత్సమాన మగుపా
టి సరిన్ని కరంబు లేదు వాః, పాటవ మొప్ప
మత్పదముపైఁ బ్రవహింపు మదాజ్ఞ నన్న న,
చ్చోట సపాటమై కదలివోటియుఁ గొల్పె ని
జప్రవాహమున్. పాండు. ౨. ౧౩౫.

కాటుకొల్పు=కాటుకొనఁ జేయు, కఱవఁజేయు, ఉసికొల్పు.

సీ. ఇవి కాటుకొల్పిన వృద్ధకూర్మము వీపుచి పైపై
న నెఱచికె చింపఁ జాలు. మనుచ. ౪. ౩౧.

కొల్పుడుచేతులు = చేమోడ్పులు, నమస్కారములు.

రగడ. చైత్రకూటమున సరసతఁ గొల్వగు, గోవిం
దునకును గొల్పుడు చేతులు. హంస. ౪. ౨౧౩.

**కొలువడి.** వి. (√ కొలుచు[1]) కొలత.

సీ. కొలువడి కొలారకం బనఁ గొలుచుట కగు. వేం
క. మాన. ౬౭.

**కొలువాసములు.** వి. ఒకవిధ మగుచేఁప, రాజీవ
ము. (శ. ర.)

**కొలువు(ల్వు).** వి. (√ కొలుచు[2]-త. కొలు) ౧. సే
వ, పరిచర్య.

చ...ఏ, వప్రఁగొలు పైన నాకు నిలుపన్ మది గొ
ల్పదు గాన నిన్ను భూ, మిపతులలోన సాధు
జనమిత్త్రుఁడు నా విని కొల్వ వచ్చితిన్. భార.
విరా. ౧. ౧౯౭.

సీ. కొలువటం చనఁగను వెలయు సేవావృత్తి...
ఆం. భా. ౨. ౨౨౭.

౨. ఆస్థానము, రాజసభ.

క. అలయక యందఱుఁ జెప్పం, గలయంతయుఁ జె
ప్పి రతఁడు గటకటఁబడి య, క్కొలువు వెడ
లి పోయెన్...భార. ఉద్యో. ౪. ౭౦.

చ...కొల్వున కేఁగుదెంచి మన్ననఁ బ్రజవిన్న
పంబులు వినంగదవయ్య...విక్ర. ౩. ౪౪.

సీ...ఆస్థానసంజ్ఞయై యలరు నోల. గీ. గమ్ము కొలు
వన...ఆం. భా. ౨. ౧౭౧.

౩. ఆస్పదము, స్థానము.

క. ఈపసిపాపని నిచ్చట, నీపెనుఁబాముకు నిట్టు
లెర సేసిన యీ, యాపదకుఁ గొలువుగాఁ గల,
యీపాటున కేమి పాప మేఁ జేసితినో. హరి.
పూ. ౭. ౩౨.

క. పొలఁతి సుపుత్త్రయు నిడుమకుఁ, గొలువుగ న
ట్టడవిలోనఁ గొడుకుం గాంచెన్. దశకు. ౨.
౯౦.

కొలువగు=సభ కలవాఁడగు, సభచేయు. (చూ. అ
గు. ౧౫ అర్థము.)

మ. ఖుసి మీఱన్ సురధాణ నిండుకొలువై కూర్చు
న్నచో...హర. పీఠి. ౨౨.

శా...సనకాదిసంయములు శశ్వద్వేదవేదాంతవి,
ద్యావేదుల్ ప్రమదంబునం గొలువఁ గొల్వై
యున్న యద్దేవునిన్. వి. పు. ౧. ౧౬౫.

కొలువిచ్చు, కొలువోసఁగు=కొలువగు, సభచేయు.

వ. విరాటుండును వెడలి వచ్చి బయలికొలువిచ్చు
టం జేసి తదాస్థానంబు సేరం బోవునప్పుడు.
భార. విరా. ౧. ౧౭౪. (బయలికొలువిచ్చు=
బహిరంగసభచేయు.)

సీ. మిసిమిదువ్వలువ బన్నసరంబు మొగలి రేకులుఁ
దాల్చి జాఱెక్కి కొలువొసంగి. ఆము. ౪. ౧౩౫.

కొలువుకూటము, కొలువుసాల, కొలువుహజారము=ఆస్థానమండపము, సభామందిరము.

క... కురురాజే తెంచెఁ గొలువుకూటంబునకున్. భార. ఉద్యో. ౪. ౧౩౭.

ఆ. భావములు దలిర్ప సేవించియుండ న,క్కొలువుసాల యొప్పెఁ గురువరేణ్య. భార. శాం. ౧. ౩౭౨.

చ. అలరులపాన్పు పచ్చడము నై నవరత్నమయాతపత్రమై, కొలువుహజారమై యలముకుందుని యిచ్చకు వచ్చినట్లనే, యలరుననంతకుండలి సహస్రముఖంబుల నాకు సూక్తిమం,డలి కృప చేసి ప్రోచుఁ గృతినాయకు గొబ్బరినారసింహునిన్. రామా. ౧. ౪.

కొలువుగూర్చుండు=కొలువునందుఁ గూర్చుండు, సభాసీనుఁ డగు.

గీ... జన్నయసిద్ధమంత్రి,కొలువుగూర్చుండి నను వేడ్కఁ బిలువఁ బంచి. విక్ర. ౧. ౧౯.

కొలువుసేసికొను=కొలువు కుదుర్చుకొను, సేవ సంపాదించుకొను.

క. కని కొలువుసేసికొని మా,లిని నాఁ జని సాధ్వి యిది మలీమసవృత్తిం, బనిపాంతఁ బోవ దన్నఁడు, నను వ్రేఁకఁదనంబు దోఁచునట్లు చరింతున్. భార. విరా. ౧. ౧౦౬.

కొలువుదీర్చు=సభచేయు.

చ... పెద్దకొల్వుదీ,ర్చె వలువ యంచు నెంచి... దశా. ౧. ౨౬౩.

కొలువుమ్రొక్కు = సభతీర్చియున్న రాజాదులకు మ్రొక్కెడిమ్రొక్కు; మ్రొక్కు.

గీ. చేరి వేర్వేఱ బారులుతీరి కొల్వు, మ్రొక్కు మ్రొక్కిన వారలముఖముఁ జూచి. దశా. ౨. ౩౯౧.

వ. ధర్మపురియందలియోగానందునకుఁ గొల్వుమ్రొక్కు శ్రీకాకుళమందలి తెలుఁగురాయనికి దండము.... ప్రబంధ ౯౯౦.

కొలువువిరియు=సభచాలించు.

గీ. కార్య మెక్కఁడు గనిన మాత్సర్యమున నొ,కండు గాదని ఖండించుఁ గన్నెఱింగి, యిరువురను గాదనక కొల్వువిరిసి మీఁద, నల్లవాఁ డెన్నినది సేయ నగు శుభంబు. ఆము. ౪. ౨౨౭.

కొలువుసింగారమగు = కొలువుండుటకై (రాజాదులు) అలంకరించుకొను.

గీ. పొసఁగఁ గుంకుమగందపుఁబూఁత రత్నహారములు గానరా ముత్తియంపుటంగి, రహిఁ దొడిగి పెద్దపీతాంబరంబు వెలయఁ, గొలువుసింగారమయ్యె రఘుప్రభుండు. ఉ. రా. ౫. ౨౪౭.

కొలువుసేయు=సభచేయు; నివసించు.

గీ. భోగివశమైన గేదంగిపూవునకును, వగచు మదిఁ గొన్ని బంధుజీవకలతాంత, గుచ్ఛములలోన నొకకొన్ని కొలువుసేయుఁ, దేఁటు లఖిలర్తుమయవనీవాటిఁ గమిచి. పాండు. ౧. ౧౯౧.

క్రొలువుకాఁడు=కొలువుడుకాఁడు. వి. సేవకుఁడు. (శ. ర.)

క్రొలువు(ల్వు)డుకాఁడు=కొలువుకాఁడు.

గీ... సేవకాఖ్య లగు జీత,గాఁడు కొల్వుడుకాఁడనఁగాను...ఆం. భా. ౨. ౧౯౪.

క్రొలె=క్రోలె. అవ్య. ద్రు.

(మొదలుకొని.)

శా... భూపాలుఁ డా,రామక్షోణికిఁ జన్ననాఁటఁగోలె నిద్రాసౌఖ్యము ల్మానినాఁ, దేహాయంచు వచింప వింటిఁ దమలో శేకాంతలీలాగతిన్. వసు. ౪. ౭౬.

(ఉండి-పంచమ్యర్థకము)

చ. నృపవర పెక్కునాళ్లఁ గోలె నిన్నుఁ గనుంగొ

నకున్నయట్టి మా,తపములు పండె ... భాగ. ౯. ౩౧౮.(ప్రాతప్రతి. పా)

కొల్ది=కొలఁది.

(విధము, రీతి.)

స్రగ్విణి....ఓపుత్ర నీవార్త దంభోళిరీతిం,దూలఁగా శ్రేయ కీకొల్ది నత్నెటికిన్, జాలినొందించె నాజాడ యింకెట్టిదో, తూలుమీతల్లికిన్ దుఃఖ మెట్లా యునో. భాగ. ౬. ౪౫౩.

(పరిమితి, పరిమాణము)

ఉ...తప్పి పెన్గెడెము చాటు చేసి తోవసేజము కొల్దికిఁ గ్రుమ్మి దిక్కు ల్కల్లాడఁగ జాజిపూస బళ మంది ఘనధ్వని మీఱ నార్చుచున్. చంద్ర. ౨. ౧౫౮. (తోవసేజముకొల్దికిన్=కలువబాఁకు అంతయును శరీరములోనికిఁ దూఱునట్లు.)

(శక్తి, బలము.)

మ... మేలుకు న్నకన్ బోపి తెచ్చినదుడ్లన్ గుదికోలలం దఱుముచున్ జేకొల్దులన్ మోఁది ...శ్రీరం. మా. ౩. ౯౮.

మ. వెడవింట న్నునువాఁడిపూములుకు లోలిం గూర్చి బిట్టార్చి నెవ్వడిఁ జేకొల్దిగఁ దీసి... నీలా. ౩. ౧౩. (చేకొల్దిగన్ = చేతియొక్క యావచ్ఛక్తితోడను.)

కొల్ల. వి. (త. కొళ్లై. క. కొళ్లె) దోఁపుడు.

ద్వి. ఏచి కొల్లకుఁ బోయి యెదు రెదుర్గాను, బైచీర గోల్పడ్డభావన దోఁచు. బస. పు.౭.౫౮౯ పం.

సీ. చెఱయుఁ గొల్లయు లూటి సీమలో లేకుండ దండెత్తవలయు శాత్రవులమీఁద. నీతి. ౩౦. ఆం. భా. ౨. ౨౨౩.

విణ. అతిమాత్రము, సమృద్ధము, పుష్కలము.

ఉ...ఫలియించెను గోరిక లెల్లఁ గొల్లగా. దశా. ౨. ౧౫.

క. ఎల్లరు మెచ్చనిమక్కృతి,నుల్లంబున మెచ్చఁగాక యొకఁ డుష్ప్రకులం, బొల్లనివల్లవిశాస్త్రము, గొల్లలుగాఁ బొగడ నొక్క కోయిల కేదే. కవిక. పీఠి. ౨౦.

ఉదా: పదిరూపాయలు నాకు కొల్లకొల్ల (గ్రా)

కొల్లలుఁగొమ్ములుపోవు=అధికమగు,అతిశయించు.

ఉ. ఇమ్మెయి నేమిటం గొఱఁత యించుక లేక చరించు చున్కికిన్, సమ్మద మంది వాదుగృహాసంపద పొంపిరిపోవనీక ము,ఖ్యమ్ముగ నిర్వహింపు మని యైహిక భూరిసుఖంబు గొల్లలుం, గొమ్ములుపోవఁగాఁ బనిచె గోమిని శక్తికుమారుఁ డర్థితోన్. దశకు. ౧౦. ౧౧౧.

కొల్లపట్టు=దోఁచు.

మ... ఈశ్వరభూభర్త షెడందకోటయుపనాళ్వ వ్రాతమున్ భీమసం,గరరంగంబునఁ గొల్లపట్టుకొని వీఁకం గందుకూరిపురాం, తరసీమంబునఁ జక్కఁగా నఱికె దుర్దాంతారిసంతానమున్. వరాహ. ౧. ౩౧.

జ: కొల్లకత్తె, కొల్లకాఁడు, కొల్లగొట్టు, కొల్లగొను, కొల్లపడు, కొల్లపఱుచు, కొల్లపుచ్చు, కొల్లపెట్టు, కొల్లరి,కొల్లవిడుచు,కొల్లవోవు, కొల్లాడు.

కొల్లకత్తె. విణ. (√కొల్ల) కొల్లపెట్టునది(ఆఁడుది-శ. ర.)

కొల్లకాఁడు. విణ. (√కొల్ల)కొల్లపెట్టువాఁడు.

గీ. బల్లిదుండయి చీకటికొల్లకాఁ డ,వక్రవిక్రమగతి దిశ లాక్రమింప. ఘటికా. ౨. ౧౪౦.

(చీకటికొల్లకాఁడు=చంద్రుఁడు)

కొల్లకొట్టు. స. క్రి. ( √ కొల్ల ) ౧. కొల్లపెట్టు, దోఁచుకొను. ౨ కొల్లగా సంపాదించు. ( శ. ర, బ్రౌ.)

కొల్లగొను. స. క్రి. (కొల్ల + కొను) కొల్లపెట్టు, దోఁచుకొను; పుష్కలముగా పడయు.

మ. అపనీతత్రిదశేంద్రుచూపుబరికన్యాగండపా

లిద్వయీ, నవలావణ్యరసంబుఁ గొల్లగొని యంతఁ జెంత ఫాలంపురా,జు విలోకించి చలించి కైకొనినయీసొమ్మెల్ల ఘర్మాంబువై, తన మొప్పన్ వెసడించి తూలెఁ గబరీతాపింఛకుంజాంతమున్. మనుచ. ౫. ౯౨.

గీ. ఇవ్విధంబున నిశ్శంక నేసరేఁగి, యెల్లవారును మోక్షంబుఁ గొల్లగొనఁగఁ, జూడఁ జాలక యింద్రాదిసురలు గూడి, కదలి వైకుంఠపతి సమ్ముఖమున కరిగి. వరాహ. ౧౦. ౧౩, ౨. ౭౬.

**కొల్లపడు.** అ. క్రి. (√కొల్ల) కొల్లవోవు, అపహృతమగు. (చూ. కొల్లపఱచు.)

**కొల్లపఱ(ఱు)చు.** స. క్రి. (√కొల్లపడు) కొల్లపెట్టు, దోఁచుకొను.

గీ. అఖిరంగులరవళికి నాన్నృపాలు, శిబిర మెల్లఁ జికాకయి చెదరఁ దొణఁగె, నపుడరాజకమైన తదావసథముఁ, గొల్లపఱచిరి కొల్లరు ల్గొల్లగాను. రంగా. ౩. ౨౬౫.

**కొల్లపుచ్చు.** స. క్రి. (చూ. కొల్లవోవు-√కొల్ల పోవు) ౧. చూఱగొను, అపహరించు.

గీ. వివులకాంచనరత్నాదివివిధవస్తు, కోటి నెల్లను నందంద కొల్లపుచ్చి, ప్రజలఁ జెఱపట్టి ... భాగ. ౧౦ ఉ. ౯౩౯.

౨. చెఱచు, భ్రష్టము చేయు.

గీ. స్త్రీలు దుర్జనగోష్ఠి వర్జించి కులము, శీలమును గొల్లపుచ్చక యోలి భర్తృ,వశత వర్తించిరేని వైవస్వతాల,యంబుఁ జొరక ప్రవేశింతు రమరపురిని. జాహ్నవీ. ౩. ౭౯.

**కొల్లపె(వె)ట్టు.** స. క్రి. (√కొల్ల) ౧. దొంగిలించు; దోఁచుకొను, కొల్లకొట్టు.

మ. ...ఏరా కృష్ణ వ్రేపల్లెలో, నను బాల్వెన్నలు కొల్లపెట్టి తని యన్నన్ ...దశా. ౯. ౧౯౬.

మత్తకోకిల. వ్రల్లదంబున వేల్పు లుద్ధతిఁ బాఱి రాజనివాసముం, గొల్లవెట్టి సమస్తవిత్తముఁ గ్రూరతం గొనిపోవఁగా. భాగ. ౭. ౨౨౫.

౨. పుష్కలముగా పడయు, అధికముగా సంపాదించు.

చ. దురితము లెన్ని చేసితినొ తొల్లిటిజన్మమునందుఁ గాశికా,పురమున సర్వజంతువులు భూరిపిముక్తులు గొల్లవెట్టఁగా, హరహర యెత్తిఁ జేతు లిడి యశ్రులు గన్నుల నుప్పతిల్లఁగాఁ, గరినిభయానతో నిద పొకాలెద మిన్నులు వడ్డచోటికిన్. కాశీ. ౨. ౧౫౬.

**కొల్లరి.** విశే. (కొల్ల+అరి-ఇది 'కల్లరి'వంటిది) కొల్లగొనువాఁడు, దోఁపుడుకాఁడు.

గీ. కొల్లపఱచిరి కొల్లరు ల్గొల్లగాను రంగా. ౩. ౨౬౫.

**కొల్లవిడుచు.** స. క్రి. (√కొల్ల)-కొల్లగాఁ గొనవిడిచిపెట్టు- ౧. యథేచ్ఛముగా ననుభవింపనిచ్చు; పుష్కలముగా నొసఁగు.

గీ. అదియుఁ గాక మరుత్తుండు యజ్ఞవేళ, నుచితదక్షిణ లర్పించి యున్న ధనముఁ, గొల్లవిడిచిన బ్రాహ్మణు లెల్లఁ దనిసి,విడిచి రర్థంబు...జై. భా. ౧. ౭౩.

గీ. కుమ్మరావంబుకడవలు కొల్లవిడుచు, బాలురకుఁ దియ్యపండులు పంచియిచ్చుఁ, జెలులఁ దానును వ్రతములు సలుపుచుండుఁ, దామరసనేత్ర పుత్రసంతానకాంక్ష. శివరా. ౨. ౮౦.

౨. వశపఱచు, అధీనము చేయు.

గీ. కుంది తలపోఁతలకు మదిఁ గొల్లవిడుచు, విడిచి దరి దాపు లేమిఁ బెన్వేతల మునుఁగు, మునిఁగి యెవ్వరు పిలిచినఁ గినియు మిగుల, హరిసుతుండు ప్రభావతీవిరహవశత. ప్రభా. ౨. ౧౧౧.

**కొల్లవో(పో)వు.** అ. క్రి. (శ.ర. కాని కాళ.లో ని సాధకప్రయోగమునుబట్టి 'కొల్లఁబోవు' అని గ్రహించుట యుక్తము-కొల్ల+పోవు) ౧. చూఱపోవు, అపహృతమగు.

సీ. వాడకంబులు గొన్న వార లేఁగిరి తోఁట లెల్లను ఖరులచేఁ గొల్లవోయె. శుక. ౨. ౩౬౦.

౨. చెడు, భగ్నము.

మ. ...నా,ది వృథాజన్మము గాదె నాతపము భ
క్తిం బాడుగా కున్నె యేల విచారింపఁగ
నెల్లియు౯ వ్రతము కొల్లంబోయిన౯ జా
చెద౯. కాశీ. ౨. ౧౧౪.

కొల్వణి. వి. నాట్యవిశేషము.

ఉ. దేశివిధంబు రట్టణము దివ్యకళాసియుఁ గోల
చారి కై,లాసకి పేరణీవిధము లాఁగులు జ
క్కిణి చిందుకొల్వణుల్, బాసలు కోపుఁ జా
ఫులును బాట పదాభినయంబు లేకయు౯,
వానికి మీఱి నాట్యకలనం బ్రకటించెను హా
వభావముల్. శ్రీరం. మా. ౪. ౧౬౨.

కొల్లాడు, కొల్లలాడు. స. క్రి. (కొల్ల+ఆడు)

౧. దొంగిలించు; దోఁచుకొను; హరించు.

గీ. మహిమ దీపింప విటవిటీమానధనము,కితకితన
మునఁ గొల్లాడుకన్నగాఁడు. ధనా. ౧. ౩౪.

సీ. ఉపవీతములు ద్రెంచి యుర్వీసురుల నొంచి
యగ్రహారములు కొల్లాడి కాల్చి. ఉ. హరి
శ్చ. ౪. ౮౪.

మ. ...గొల్లగుబ్బెతలమానం జెల్లఁ గొల్లాడఁడో.
దశా. ౧౦. ౮౦.

సీ. నల్లగల్వలచెల్వు కొల్లలాడుచు యూథి కెక్కు
చొక్కపుమేనిచక్కఁదనము. పరమ. ౩.
౮౦. (ఇట ఔపమ్యద్యోతకము.)

ద్వి. గోవిందుచీరంబుఁ గొల్లలాడింతు. ద్వి. హరి
శ్చ. పూ. ౧౨౪౦. (ఇట 'ఉడిగించు, పోఁ
గొట్టు' అని తాత్పర్యము.)

౨. కొల్లగా సంపాదించు, యథేచ్ఛముగాఁ బడ
యు.

క...కొ,ల్లాడిరి కైవల్యలక్ష్మి నమరులు మునులు౯.
కాశీ. ౨. ౩౭.

౩. యథేచ్ఛముగా ననుభవించు.

సీ. ఎనసెఁ గదవమ్మ నీమనోభీష్ట మితని, యలయఁ
బ్రాయంబు కొల్లాడు మనుమఁ బలికె. శుక.
౪. ౨౩.

కొల్లాబండి=కొల్లారుబండి. (శ. ర.)

కొల్లాయపంచె. వి. చిన్నయంగవస్త్రము.(శ.ర.)
ఇట్టే 'కొల్లాయిగుడ్డ' (వా.)

కొల్లారము=కొల్లారు. (√కొల్లారు-శ. ర.)

కొల్లారు=కొల్లారము, కొలారము, కొలారు. వి.
చతుశ్శాలము, నాలుగిండ్లచావడి, నడుమ బయలు
ను నాలుగుప్రక్కల కట్టడమును గలయిల్లు. (శ.
ర, బ్రౌ.)
జ: కొల్లాబండి, కొల్లారుబండి, కొల్లారము.

కొల్లారుబ(ర్బ)ండి=కొలారుబండి, కొల్లాబండి.
వి.(కొల్లారు+బండి-క.కొల్లారు. త.కులారి.) కం
బళివాహ్యకము,కంబళముచేఁ గప్పఁబడినబండి.

గీ. పావలటు మీటి కొల్లారుబండి యెక్కి, దుర
దురన రంభయింటికి నరిగి తనను,పయన మె
ఱిఁగించి సమ్మనపడనిదానిఁ, గుస్తరించుచు న
నిపించుకొని యతండు. కువల. ౪. ౨౧౩.

సీ. కంబళివాహ్యకాఖ్యలగుఁ గొల్లార్బండి పా
టబండి హాయిబండి యనఁగ. ఆం. భా.
౨. ౨౦౧.

కొల్లి. వి. ఒకానొక చెట్టు. (శ. ర, బ్రౌ.)

కొల్లు, కొల్లుకట్ట, కొల్లుగుంట. వి. నీళ్లగుంట.
(బ్రౌ.)

కొళ్లు[1]. వి. దగ్గుటయం దగుధ్వని కనుకరణము.
(ఆమ్రేడితమున 'కొళ్లుకొళ్లు')

సీ. గుఱ్ఱుగుఱ్ఱని కొళ్లుకొళ్లున దగ్గుచోఁ దవిలిన చెవు
లు చిందర్లువోవ. విప్ర. ౪. ౧౯.

కొళ్లు[2]. వి. బ. (సం. కుళుత్థః. త. కొళ్లు) ఉలవలు.
(బ్రౌ.)

సీ. రవయుప్పు నీరుల్లిరసము నించినకొళ్లగంజి

కాఁగులగుంపు కడు రహించు. గీ...పానీయ
శాల యొప్పె. హంస. ౨. ౧౫౯.

సీ. కలదండిపనిఁ బెండి కాఁచి చేమిరిపెట్టి యు
ఱఁగకుండఁగఁ బట్టి యట్టి పొట్టె,కొల్లపంకటి
తోడఁ గూడునిల్లడి జాగు సెరపక బంటు
బానిసలఁ బనిచి. వేం. పంచ. ౪. ౪౫౫.

**కొవ్వెర**=కొబ్బెర.వి. కొబ్బెరకాయ యందలి పేసె
ము, గుంజు.

సీ...కొబ్బె రసఁ గొవ్వెర యటం చనఁగఁ దత్పే
శ మెసఁగు. ఆం. భా. ౨. ౭౮.

**కొస.** వి. ౧. కొన, అగ్రము, చివర.

సీ. కొసవెండ్రుకలఁ బట్టి కూపెట్ట సింగంబుఁ బ
ట్టి తేకున్న నీబంటఁ గాను. వేం. పంచ. ౨.
౧౯౪.(కొసవెండ్రుకలు=వెండ్రుకలకొసలు)

౨. కొంగు.

గీ. కట్టితోడి పూసి కైసేసి కౌతుకమునఁ,గొస
దిగఁగ నీలిపుట్టంబు మునుఁగువెట్టి,గాజు లెగఁ
ద్రోసి చప్పుడు గాకయుండ,వచ్చె నూర్వశి
యర్జునావాసమునకు. హర. ౭. ౧౧౯.

విణ. కడపటిది, చివరది.

గీ. నిన్నుఁ జంపఁగఁ దలపోసి నీదుమంత్రి,వరు
లు గాచుచు నున్నారు వలదు గోత్ర,కలహ
మీచెడుబుద్ధి యేకరణి నబ్బె,నన్న యింకొ
క్కకొసమాట యాలకింపు. మొ. రా. యు.
౧. ౨౩.

జ: కొసగలముత్తెము.

**కొసగలముత్తెము.** వి. (√ కొస) ముంతమామిడి
పండువలె నుండుముత్యము. (ఈజాతిముత్తెము
చాల విలువ గలది. బ్రౌ.)

**కొసరు.** అ. క్రి. ౧.మాటిమాటికి కూయు.(చూ.వి.
౧. అర్థము.)

సీ. పారిజాతకలశాపల్లవంబులు మేసి కొసరెను
ద్యానపుంస్కోకిలములు. హర. ౭. ౧౩౫.

గీ. కోకిలము పంచమశ్రుతిఁ గొసరినట్లు.క్రీడా.
౧౦౧.

౨. విజృంభించు.

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల గ్రోల్చినభం
గి నేడ్చె న,బ్బిసరుహనేత్ర ... కాశీ. ౫.
౧౬౮.

గీ. కల్పతరుపల్లవంబులు గమిచి మేసి, కోకిలం
బెప్డు గూయునో కొసరి యనుచు. నైష. ౪.
౨౦.

౩. సంకోచించు; జంకు.

క. బోరనఁ బ్రత్యక్షంబై,కోరినవర మేమి యైనఁ
గొసరక యిత్తుఁ. భాగ. ౧౦ ఉ. ౮౩౪.

ద్వి. అసమంజసుం డనునగ్రనందనునిఁ, గొసరక
పురి వెళ్లఁగొట్టఁగా లేదె. రం. రా. అయో.
౧౧౦ పు. ౧౩ పం.

గీ. అనుచు హరిణాంకమూర్తి తీవ్రాంశుఁబోలెఁ,
గొసర కగ్నిఁ బ్రవేశించెఁ గువలయాక్షి. కా
శీ. ౫. ౧౭౦.

స. క్రి. (క. కొసరు) ౧. అపేక్షించు,కోరు; ప్రా
ర్థించు, వేఁడు.

క. పెసరుంబప్పేమిటికని,కసరు న్నొయి గొనఁ
డు పండుగను గొయకూరే,కొసరుఁ...బహు.
౫౮.

సీ. ధవుఁ గూర్మి కొసరుచున్నవిపోలె మధురాళిప
నరుహాస్యములఁ బద్మినులు తెఱచె. మనుచ.
౫. ౪౦.

సీ. చెలికత్తెవలె లెస్స పలుకుచున్నది మావి నలచి
ల్కఁ బట్టి యిమ్మనుచుఁ గొసరు. దశా. ౮.
౯౯.

౨. (కొనువాఁడు) తా నిచ్చినవెలకు సరిపడినసర
కుకంటె ఎక్కువగా నడుగు.

ఉ. ఎత్తులయొప్పుకంటె సర మెత్తుట యొప్పఁగఁ
బోక్కవిల్వకా,యొత్తిడిఁ బుప్పుముల్ కొస
ర కూరక యున్కికి నల్ల నవ్వుచుఁ,విత్తము

క్రొన చిత్తములు వేగ హరింతురు నేర్పు మీ
ఱంగా...పుష్పలావికల్. విక్ర. ౧. ౭౩.

౩. ఆస్వాదించు, అనుభవించు.

(తుష్మెదలు) గీ...సతిమోముతావిఁ గొసర ...
కాంచె నని యున్నరను మహీకాంతుఁ డ
పుడు. వసు. ౩. ౭౫. (ప్రయోగాంతరము
లేదు.)

వి. ౧. అనులాపము, మాటిమాటికి పలుకుట.

గీ. కొసరు నా ననులాప ముల్లసిలుచుండు. ఆం.
భా. ౧. ౧౧౫.

౨. వాంఛ, కోరిక; ప్రార్థనము.

చ. కిసలయపత్త్రికన్ మకరకేతననూతనవార్త ల
న్నియుం,బొసఁగ లిఖించి యందుఁ దలపూవు
లుఁ దమ్మయు నాసచేయునా,కొసరు తెఱం గె
ఱింగి కుచకుంభములం బతిఁ దాల్చు నన్ను
సంతసమున వ్రాసి యిచ్చినఁ గదా చెలికత్తె
ల కేను మ్రొక్కుదన్. ఉ. హరి. ౫. ౧౨౫.

ఉ. మ్రొక్కులు పల్కుమోడి విసరుల్ కసరు
ల్కొసరుల్ సెలంగ...శశాం. ౩. ౯౭.

గీ...అత్తవిటులు, కొసరుఁబల్కులతో గ్రుచ్చి
గ్రుచ్చి యడుగ...కువల. ౫. ౧౦, ౩౭.

౩. సరకులు కొనువానికి అమ్మువాఁ డిచ్చుపెచ్చు.
(శ. ర, వా.)

౪. సంకోచము; జంకు. (ఈయర్థమునఁ బ్రాయిక
ముగాఁ బ్రయోగములందు 'కొంకు' పదముతోఁ
గూడి కన్పట్టుచున్నది - చూ. కొంకు.)

ఆ. వరుణదేవ నాకు వరవీరగుణముల,కొడుకు పు
ట్టెనేని గొడుకుఁ బట్టి,పసువుఁ జేసి నీవు పరి
ణమింపఁగ వేల్తుఁ,గొడుకు నీఁగదయ్య కొస
రు లేక. భాగ. ౯. ౧౭౪.

౫. సంశయము, సందేహము.

ద్వి. బసవనుజ్ఞానభక్తిమార్గముల,కొసరులు దీర్ప
మాకును వశ మగునె. ప్రభులిం. ౪. ౧౦౫
పా. ౧౭ పం.

౬. విజృంభణము.

(కోడిపందెమువర్ణనము.) సీ ... ఒంటికేన్నునఁ
గొసరుడిపి యుడిపి. దశకు. ౯. ౩౩.

క్రొస్సె. వి. (సం. కుశః) దర్భ.

గీ. క్రొస్సె దబ్బన దర్భ లగుగా మహీశ. ఆం.
భా. ౨. ౭౫. (ప్రాతప్రతి వ్రాఁతప్రతులపాఠ
ము.)

## క్రో

క్రో1. వి. ౧. (యుద్ధాముఖంబు) ఉత్సాహసూచక
ముగా చేయుఅఱపునకు అనుకరణము. (దీనిఆమ్రే
డితరూపము 'క్రోక్రో')

క. ఏయుఁడు పాడువుం డకువుఁడు, వ్రేయఁ
డనుచు వారు జాహ్నవీతనయుఁ గదుగా, డా
యుదు మనసైనికులుగా,గో యని తలపడ్డఁ
బోరు ఘోరం బయ్యెన్. భార. భీష్మ. ౩.
౪౦౯.

సీ.కో యని యార్చుచుఁ గుప్పించి దాఁటుచు పే
లలు వాడుము నీల లిడుచు. అచ్చ. రా. యు.
౯౦.

౨. ఏడ్పువంటి ధ్వనికి అనుకరణము.

చ...అక్కుఱఁగట శోకజాత్రువులుఁ గోయ
నునేడ్పులు నుప్పతిల్లెడున్. జై. భా. ౧. ౫౭.

క. అనుచుఁ దనూజాల నిద్దఱఁ, గొనగోటం గిల్లి
వారు కో యని యేడ్వన్. శుక. ౨. ౨౫౭.

ఉ...కో,కో యని కూయఁగాఁ గుతిక కోసిన
లోకమువారు తిట్టరే. వి. పు. ౭. ౧౧.

౩. భయంకరముగా అఱచుటయందలిధ్వనికి అను
కరణము.

క. పని గల్గి నీరపాత్రము,గొని నుంగిటి కేఁగు
డెంచి కో యనుకూఁతల్,విని చేరిన వికృతా
కృతిఁ, గని యున్నాఁ డన్న యేమికతమో
యెఱుఁగన్. శుక. ౨. ౫౩౭.

౪. కోయిలకూఁతయందలిధ్వనికి అనుకరణము.

క. కోయిల లంతయుఁ గనుఁగొని,కో యని కూ

యంగఁ జిలుకగుంపులు కినుకం, బాయనినె మ్మొగములఁ గెం,బాయలు దులకింప వెక్క సంబుగఁ బల్కె౯. చిత్రభా. ౩. ౩౪.

౫. ఘోషకుఁడు (=చాటించువాఁడు) అఱచుచు చేయుధ్వనికి అనుకరణము.

ఉ...అంబుజబాంధవుఁ డస్తసీమకు౯, బోయి నఁ జూచి వేచినతమోవిభుఁ డంప దినాంత యోధుఁ డీ,చాయఁ దదీయపత్నిఁ బిలుచం బడనీడిచికొంచుఁ బోయెమం,గో యనుమూ డిక్క నంతట శకుంతరవంబు సెలంగె నెల్లెడ౯. పారి. ౨. ౩౦.

**కో².** (√కొను) కొన్నిపట్ల కొనుధాతువునకు ఆదేశముగా వచ్చునది. (ఉదా: కోపయ్య, కోకొమ్ము, కోరు, కోను, కోము, కోక, కో౯, మొ- చూ. కొను.)

ఉ. పమ్మినరక్తిచే నెనయుపల్లవకోటుల దూఱి నేల కో,కొమ్మని కూడి క్రొవ్వలపుఁ గూర్చె బలీ సుమనస్సమూహముల్. కృ. శకుం. ౧. ౪౩.

మ...కన్గోఁ జాలక...వసు. ౨. ౮౧.

ఉ...సద్గురుఁడు ముందుగఁ గైకొన కేను గోనటం, చాజగతీశచంద్రుఁడు మహానియమం బొనరించె మించుగ౯. చెన్న. ౨. ౨౦౨.

**కోంకణ.** సం. వి. ఆ. స్త్రీ. రేణుక, జమదగ్నిభార్య, పరశురామునితల్లి.

**కోంకణము.** సం. వి. అ. పుం. ఒకానొక దేశము. (ఇది సహ్యాద్రికిని సముద్రమునకును నడుమ నున్నది.)

**కోంకృతి.** సం. వి. ఇ. స్త్రీ. (కోడియొక్క) కోం అనుకూఁత.

ఉ. కోంకృతి చట్టనాంగణనికుంజకుటీకృకవాకురాజిచే...వినంబడె౯. రామా. ౨.౧౦౮.

క...కుక్కుటములు పక్కణమునఁ గోంకృతి సలిపె౯. రామా. ౨. ౧౦౩.

**కోఁగు.** స. క్రి. గొఱుగు. (శ. ర, ప్రా)

సీ...ముండనసంజ్ఞ యలరుచు నుండును గోఁగుట బోడింపు గొఱుగుట యన. ఆం. భా. ౨. ౧౪౪.

**కోఁచే.** విణ. (త. కోళై.) పిఱికి, భీరువు.

ఆ. ఓరి కోఁచబంట యొక్కించు కేనియు, మగతనంబు లేక పగతుఁ జేరి,కొలుచుచుండి వాలికొడుకు నం చిటువలెఁ, జెప్పకొనఁగ నీకు సిగ్గు గాదె. అచ్చ. రా. యు. ౧౨౦.

క. అని తమదొర దూఱెడుధన,దుని మారీచప్రహస్తధూమ్రాక్షశుకా, ద్యనిమిషరిపుమంత్రులు మా,ర్కొని నిలువఁగ లేక చనిరి కోఁచతనమున౯. ఉ. రా. ౩. ౮౯. ఆం. భా. ౨. ౨౨౧. వేంక. మాన. ౫౪.

వి. పిఱికితనము, భయము.

గీ.... ఉద్ధతులముల్క,గారిసందర్శన మొనర్చు గారవమునఁ, గోఁచ యొక్కింత లేక యారాచపట్టి. రంగా. ౧. ౧౬౭.

జ: కోఁచవాఱు.

**కోఁచేవాఱు.** అ. క్రి. (కోఁచ+పాఱు) భయపడు, భీతిల్లు.

గీ...ఒకవానరంబు...ఆడెడుఁ దనుఁ జూచి కోఁచవాఱు;రక్కసుల నొక్కతోరణం బెక్కనగుచు. రామా. ౬. ౨౦౩.

గీ... వేల్పు,రాచవారలు నాకత్తిఁ గోఁచవాఱ, నితఁ డనఁగ నెంత బలహంత యేల వంత. చంద్రా. ౩. ౩౩.

చ. భిదురధరుండుఁ జక్రియును బెట్టుగ దీర్ఘవిచార మింత చే,యుదురఁట దైత్యుఁ డెంత బలియుండొ కదా యని కోఁచవాఱి కి,ట్లుదుటున వానిఁ ద్రుంతు నను నొక్కనిఁ బంపిన నంటి చాలదే, యిది నెర వైనబంటుతన మిట్టిది నీక తగు౯ గుమారకా. ప్రభా. ౨. ౫౯.

**కోఁడు.** స. క్రి. బియ్యము మొదలగువానిని చేట లోఁ బోసి ప్రక్కవాటుగా ఇటు నటు త్రిప్పు.

చ...కపర్దికొనలు చూఁడుచుం దనుజాప్రేవులు దోఁడుచు గాడ్పుకడ్పులో, గునుకులు గోఁడుచు న్వరుణుగుండిఱుఁ దేఁడుచు...కకు. ౫. ౧౨౩. (గునుకులు=ధాన్యవిశేషము. గునుకులుగోఁడుచుణ్:-బాధ కలిగించుచు.)

**కోఁత.** వి. (√కోయు.) ఛేదనము, ఖండనము;హింస, బాధ.

క.వెడగోఁతల నెత్తు రొలుకఁ,బడఁద్రోచిన వచ్చి కుక్కపదుపు వెనుకకుణ్, జడిసెఁ గబళింప నొల్లక...భార. శాం 3. ౫౦౮.

ద్వి. కమలాక్షి తుచ్ఛభోగముల కాసించి,యము నిచేఁ గోఁతల కమ్మనే నోర్వ. ద్వి. సారం క. ౧. ౭౮ పా. ౨౨ పం.

(వ్యవ) అత్తగారికోఁతలు ఆమె పడలే కున్నది.

కోఁతపట్టు=కోఁతకోయ నారంభించు.

(వ్యవ) వారిచేను మొన్ననే కోఁతపట్టినారు.

కోఁతకువచ్చు=కోసెడిపదనికి వచ్చు.

(వ్యవ) ఇంక నెలకుఁ గాని యీచేను కోఁతకు రాదు.

**కోఁతప(వ)డు.** అ. క్రి. (కోఁత+పడు) ౧. ఖండితమగు, నఱకఁబడు.

సీ. ఎచ్చోట ముచ్చిచ్చునేదేసినాల్కలు కొండ నాల్కలదాఁకఁ గోఁతపడియె. భీమ. 3.౩౭.

క. ఏయంగము గొని ఖూద్రుఁడు,పాయక విప్రునకుఁ దాను బాధకుఁ డగు వాఁ, డాయంగము కోఁతపడక,పోయెద నన రాదు తనకు భూపతిచేతణ్. విజ్ఞా. ప్రా. ౪౭.

౨. హింస నొందు, బాధితమగు.

గీ. కుపితమానసుఁడై వృథా కోయఁ బనిచె,నకట యిటువంటికువిభుఁ డెందైనఁ గలఁడె, కాలుచేఁ గోఁతపడలేక కడకుఁ దొలఁగఁ, గాలు చేఁ గోఁతపడఁజేసె నాలతాంగి. సారం క. 3. ౧౨౦.

**కోఁతి=క్రోఁతి.** వి. (క. కోతి. త. కోంది) ౧. మర్కటము, వానరము.

సీ. కోఁతికి జలతారుకుళ్లాయి యేటికి విరజాజి పూదండ విధవ కేల. రామలిం. 33.

సీ. కోఁతి కొబ్బెరకాయ కొన కెక్కి పడఁద్రోయు దానిజలంబులు ద్రావఁ గలదె. రామలిం. ౧౭.

ఉ...అకట కోఁతికి మానిక మేల...దశా. ౧. ౭౯౫.

సా: కులమింటికోఁతినైనను పెండ్లాడుట మంచిది(:-అందము లేకపోయినను కులీనురాలిని పెండ్లాడుట శ్రేష్ఠము.) తాఁ జెడ్డకోఁతి వన మెల్లఁ జెఱచినట్లు(:-తాను చెడుటయే కాక తక్కిన వారిని కూడ చెఱచుటను దెలుపును.) కోఁతిపుండు బ్రహ్మరాక్షసి యైనట్లు(:-చిన్నకష్టము పెద్ద కష్టముగా పరిణమించుటను దెలుపును.) కోఁతికి కొబ్బెరకాయ దొరకినట్లు(:-అనుభవింప లేనివానికి అనుభవయోగ్య మగుపదార్థము దొరకుటను దెలుపును.) నిప్పు ద్రొక్కినకోఁతికి సివ మెత్తినట్లు(:-స్వభావముచే చపలుఁడైనవానికి మఱి యొకచాపల్యకారణము గలుగుటను దెలుపును.)

చ...నిప్పు ద్రొక్కుకోఁ,తికి సివ మెత్తుచంద మది త్రిప్పుట కేరితరంబు భూవరా. రంగా. ౨. ౨౨౬.

జ: కోఁతికొమ్మంచి, కోఁతిగుమ్మకట్టు, కోఁతిపుల్లలు, కోఁతిమామిడి.

**కోఁతికొమ్మంచి.** వి. (√కోఁతి) బాలు రాడెడి యొకయాట. (బ్రా, వా.)

**కోఁతిగుమ్మకట్టు**=కోఁతికొమ్మంచి. (బ్రా.)

**కోఁతిపుల్లలు.** వి.బ. (√కోఁతి) మగ్గపుపలకదారములను మీఁదికిఁ దగిల్చెడిపుల్లలు.(శ. ర, బ్రా.)

**కోఁతిమామిడి.** వి. (√ కోఁతి) కపీతనము, అంబాళముకీ. (దీనిపండ్లు కోఁతికి ప్రియములు.)

**కోఁదాము.** వి. ఔ. తాళవృక్షవిశేషము.

సీ. ముక్కు-దాడిమ బీజ మెంగలింగ కోఁదాము ...హంస. ౪. ౧౧.

సా: ఈఁదా దన్నచో కోఁదా దనుట=ఎదురెత్తుగా ప్రవర్తించుట. (చూ. ఈఁదాము.)

**కోక.** వి. వస్త్రము, బట్ట (వాడుకయందు స్త్రీవస్త్రపర్యాయమై యున్నది.)

ద్వి. కోక లురుకుచుఁ జాకి క్రొవ్వి...బస. పు. ౪. ౧౦౧ పా. ౪౦ పం.

గీ. ఇట్లు వర్తించియును నాతఁ డేమియందుఁ, గళవళముఁ జెందెఁ గూడుఁ గోకయును లే క. శుక. 3. 32౫.

గీ. అపుడు గురుభామ చిత్రాంగి యలమి బలిమి, నొడిసి పట్టినఁ జైకోక విడిచి చనియె. సారంగ. ౨. ౧3౨.

సీ. కులటలఁ గూడదు తొలఁగనీయదు పైఁట మీఁగాళ్లపైఁ గోక మెలఁగనీదు. దశా. ౧౦. ౧౦౯.

**కోకదేవము.** సం. వి. అ. పుం.పావురము.(రా.ని.)

**కోకనదము.** సం. వి. అ. న. ౧-చక్రవాకములను కూయునట్లు చేయునది-చెంగలువ,ఎఱ్ఱకలువపూవు. ౨. చెందమ్మి, ఎఱ్ఱతామరపూవు. (మే. ని.)

**కోకము.** సం. వి. అ. పుం. ౧. జక్కవ,చక్రవాకము. ౨. తోఁడేలు. 3. కప్ప. ౪. ఈఁతచెట్టు.

**కోకిలము.** సం. వి. అ. పుం. ౧. పికము, కోయిల. (నైష.౪.౭౦.) ౨. కొఱవి. 3. ఛందోవిశేషము.

**కోకిలాక్షము.** సం. వి. అ. పుం. ములుగోలిమిడికీ.

**కోకిలావాసము.** సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

**కోకిలేక్షువు.** సం. వి. ఉ. పుం. నల్లచెఱుకు కీ.

**కోకిలోత్సవము.** సం=కోకిలావాసము.

**కోగెల=కోయిల²,** కోవెల². వి. (సం. కోకిలః.తు. కోగిల్) పికము, వనప్రియము. (చి. ని, శ. ర.)

**కోచము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. సంకుచితమగునది, ముడుఁగునది. ౨. సంకోచింపఁ జేయునది, ముడుఁగఁ జేయునది. వి. అ. పుం. సంకోచము, ముడుఁగుట.

**కోచే.** వి. జలజంతువిశేషము. హంస. ౪. ౧౫౭.

**కోచుఁడు.** సం. వి. అ. పుం. జాలరివానికి కటికదానియందు పుట్టినసంకీర్ణజాతివాఁడు.

**కోజాగరము.** సం. వి. అ. పుం. ఆశ్వయుజపూర్ణిమ.(కోజాగర్తి=ఎవఁడు మేలుకొని యున్నాఁడు? అని లక్ష్మి ఆనాఁటిరాత్రి ప్రశ్నించును-కల్ప)

**కోట.** వి. (సం. కోటః. ప్రా. కొట్ట, కోట. క. కోటె.) ౧. దుర్గప్రాకారము, రాజధానిచుట్టునుండు ప్రహరి.

గీ. అమరు హాటకమయకవాటములతోడ, గురుతరం బై నయప్పీటికోటగవను. నైష. ౨.౪౨.

సీ...ప్రాకార మగుఁ గోట యన ... ఆం. భా. ౨. ౧౨.

౨. చుట్టును ప్రాకారము కలిగి రాజవాసస్థానమగుపురము.

సీ. కోట యేమఱ కప్డుఁ బాటించి గడ్డియు భాణంబు గొల్చను గట్టియలును, నేయి నూనెయును నానాయుధమ్ములు నౌషధములు నాభీలయంత్రములుఁ గూప,ములు లోనుగానందు పలయువాని సమగ్రములుగ సంపాదించి...భార. శాం. ౨. ౫౪.

పెట్టనికోట=కట్టక యేర్పడినకోటవంటిది, అయత్నముగా లభించినరక్షణసాధనము.

ఉ. పెట్టనికోట నీకు హరి....భార. ఉద్యో.౧. ౨౯౭.

తరల. వినుము కౌరవకోటికిం దనవిల్లు పెట్టని కోటగా, నని యొనర్చి....భార. స్త్రీ. ౨. ౧౭౪.

కోటకొమ్మ=దుర్గప్రాకారశిఖరము.

గీ...పొల్పుఁ జూడఁ, బట్టనముకోటకొమ్మలపం క్తి గగన, మండలశ్రీకి సంపంగిదండవోలె. ఆము. ౨. ౫.

గీ...చెలఁగి కోట, కొమ్మలం దాడుతెలుఁగంటికొ మ్మ లిఁడెడు, వేల్పుదొరమానికములు నవ్వీటఁ దనరు. నీలా. ౧. ౩౧.

**కోటఁడు.** వి. (త. కోట్టాన్.) గుడ్లగూబ.

క...కోటఁడు, పావకకీలాళిఁ గాలి భస్మం బయ్యెన్. వేం. పంచ. ౩. ౩౪౧.

ఉ. ఘుక్కని మాటిమాటికిని గోటఁడు బల్కెడు వామదిక్కునం, జొక్కటమై ఫలించు మన శోభనకార్యము లెల్లఁ డిట్టిభా. క్రీడా. ౫౧. ఆం. భా. ౨. ౯౧.

**కోటకుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొకసంకీర్ణజాతివాఁడు. (వీనికి గృహకారకత్వము వృత్తి.)

**కోటము.** సం. వి. అ. పుం. ౧. దుర్గము, కోట. (కల్ప.) ౨. కౌటిల్యము, కుటిలత.

**కోటర(ట్ర)ము**=కోడంట్రికము. వి. (√ కోడలు.) కోడలితనము.

(స్నుషాత్వము, కోడంట్రికము.)

చ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా,పురుషునిపాలికిన్ బతులు వో వఁగ వీరలతోన యేను జె,చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో యటుగాక పాడి మై, వరవుడ మోపి చేయుదునో వారికి మాధవ నిశ్చయింపుమా. భార. ఉద్యో. ౩. ౧౧౨.

సీ. వైవాహికక్రియావ్యసనంబు గొన్నేండ్లు గొన్నేండ్లు కోడంద్ర కోట్రములును. వి. పు. ౫. ౧౫౭.

ఉ. రాయిడికత్తెలైనపెనుఁబ్రామిడియత్తలయిండ్లఁ గోట్రముల్, సేయఁవిలాసిను ల్మనుకు సెందఁగ...విక్ర. ౬. ౭౩.

**కోటరము.** సం. వి. అ. పుం. న. నిష్కుహము, చెట్టుతొఱ్ఱ.

**కోటరావణము.** సం. వి. అ. న. తొఱ్ఱ లున్న చెట్లు గలయడవి.

**కోటరించు**=కొరాడు.

(పంచ ముట్టితో నేల కెల్లగించు.)

సీ. చిఱుతయై గురుతరస్థితి రొప్పి రుప్పించుఁ గోలమై లీలమైఁ గోటరించు. ల.వి.౨.౧౦౨.

**కోటత్రికము**=కోడంట్రికము. వి. (√ కోడలు.)

(కోడంట్రికము, స్నుషాత్వము.)

చ. పలుకఁబడంతి యేయువిదపజ్జలఁ గోటత్రికంబు సేయఁ. రామా. ౧. ౨. (శ.ర.పా)

**కోటవి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. దిసమొలగలయాఁడుది, నగ్నిక. ౨. దుర్గాదేవి. (కల్ప)

**కోటానఁగోటులు.** వి. బ. (కోటులు + కోటులు-శ. ర.) పెక్కుకోటులు.

క. కాటుకకొండలకైవడిఁ, గోటానంగోట్లు మింట ఘూర్ణిల్లుమ సం,స్ఫోటించుమేఘగణములు, గాటంబుగ వృష్టి గురియఁ గరఁగి జగంబుల్. మత్స్యపురాణము. ౨. ౩౧.

క. హాటకములు దక్షిణగాఁ, గోటానంగోటు లొసఁగి కుంభిని యెల్లం, బాటించి ధారవోసెను, హాటకగర్భప్రభావుఁ డగువరరుచికిన్. విక్ర. ౫. ౧౩౦.

సీ. కొండలు మ్రాఁకులుఁ గోటానఁగోటులు పృథివి బీఁటలువాఱఁ బెఱుకువాడు.భా. రా.యు. ౨౬౩.

**కోటి**[1]. వి. (సం. కోటిః.) నూఱులక్షలసంఖ్య.

(ఈక్రింది ప్రయోగమునుబట్టి తెనుఁగుపదముగా గ్రహింపఁబడినది.)

క. తడవఁగ వసమా యందుల, గొడవనిసిరు లేరికైన గొలుఁగఁగఁ వచ్చున్, నొడువక కోటికి నెత్తి న, పడగలచేఁ గోమటింద్లబంగరుమళిగల్. యయా. ౧. ౮౮.

కోటికిఁబడగయెత్తు = కోటీశ్వరుఁ డైనట్లు జెండా యెత్తుకొను, ధనాఢ్యుఁ డగు; ఘనుఁ డగు.

క. అన నిట్టిపలువయలపుల, కును గోటికిఁబడగ యెత్తి గుబి యగుపెద్దన్, నిను నమ్మరాదుగా క, ట్లొనరిచితే నిట్టిలంచ మొసఁగనె సీకున్. కళా. ౭. ౨౭.

**కోటి**[2]. వి. వేగు, చారుఁడు.

కోటియిడు=చారుల నియమించు.

క. చెడ విఱిగి యడవిఁ బడి యెడ, నెడ గట్టులతుదలఁ గోటియిడి లోఁగడకున్, దడుకు వోడిపించి యాకుల, గుడిసెల వసియించె మంత్రి గురుభటయుతుఁడై. ఆము. ౩.౧౭.(శ.ర.పా.)

జ: కోటికాఁడు.

**కోటి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. కోణము, అంచు. ౨. అగ్రభాగము, చివర. ౩. చాపాగ్రము, వింటికొప్పు. ౪. అతిశయము, పెంపు. ౫. సంఖ్యావిశేషము, నూఱులక్షలు. ౬. వర్గము, సముదాయము. (ఉదా: మనుష్యకోటి, ప్రాణికోటి, మొ.) ౭. వాదమునందు ఒకపక్షము. (ఉదా: పూర్వపక్షకోటి. కల్ప.) ౮. (గణిత.) భుజకర్ణభిన్న మగు క్షేత్రావయవరేఖాభేదము.

**కోటికాఁడు.** వి. (కోటి[2]+కాఁడు-స్వార్థమున.) వేగువాఁడు, చారుఁడు. (శ. ర.)

**కోటిజిత్తు.** సం. వి. త్. పుం-పండితకోటిని జయించినవాఁడు-కాళిదాసకవి.

**కోటిపాత్రము.** సం. వి. అ.న. కేనిపాతము, త్రెడ్డు.

**కోటిరము.** సం. వి. అ. పుం. ౧. జటాజూటము, ఋషులు తలపై కొమ్మువలె వేసికొనుజడలముడి. (ఆ.ని.) .౨. నకులము, ముంగిస. ౩. ఇంద్రగోపకీటము, ఆరుద్రపురుగు.

**కోటిరుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**కోటివర్ష.** సం. వి. ఆ. స్త్రీ. స్పృక్కా యనుగంధద్రవ్యము.

**కోటిశము.** సం. వి. అ. పుం. మట్టిగడ్డలు పగులఁగొట్టెడికొయ్య, లోష్టభేదనము.

**కోటీరము.** సం. వి. అ. పుం. ౧. కిరీటము, బాసికము. ౨. ఋషులు శిరసున కొమ్మువలె వేసికొను జడలముడి, జటాజూటము.

శ్లో. పాణౌ ఫణీ భజతి కంకణభూయమైశే, సోయం మనోహరమణీః మణీయమున్వైః, కోటీరబంధనధనుర్గుణయోగపట్ట, వ్యాపారపారగమముం భజ భూతభర్తుః. సం. నైష. ౧౧. ౧౮.

**కోటీశము.** సం=కోటిశము.

**కోటేరు.** వి. విపరీతబద్ధలాంగలము, దుక్కికి పోవునపుడు గాని దుక్కియై మరలివచ్చునపుడు గాని పణత మీఁదుగా కాఁడికి తగిలించిననాఁగలి. (దీనిని కవులు చక్కనిసోగముక్కున కుపమానముగా గ్రహింతురు.)

సీ. కోటే రనంగను గొఱలు విపర్యయబద్ధలాంగల సంజ్ఞ...ఆం. భా. ౨. ౨౩౨.

ద్వి. మీఁదైనయెద్దులమెడకాఁడిమీఁదఁ, గోటేరు వైచి...పరమ. ౭. ౫౩౧ పా.

క. కోటేరు వెట్టిన ట్లా, పాటీరసుగంధినాస భాసిలు ననఘా. ఇందు. ౨. ౧౬౪.

సీ. మీ టేరుపడి మంచికోటేరు వెట్టినమురువు చూపట్టెడుముక్కు చెక్కు. వాల్మీకి. ౩. ౧౧౭.

**కోట్టము.** సం.వి.అ.పుం.దుర్గపురము.(అమరసుధ.)

**కోట్టారము.** సం. వి. అ. న. ౧. దుర్గపురము. ౨. పావంచ, కొలనిమెట్టు. ౩. నూయి. (విల్యమ్సు.)

**కోరము.** సం. వి. అ. పుం. మండలాకారమైనమచ్చలు కలిగెడు ఒకజాతికుష్ఠరోగము.

**కోరరము.** సం. వి. అ. పుం. అంకోలము, ఊడుగుచెట్టు.

**కోరరపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. వృద్ధదారకము, బొద్ది తీగ.

**కోడ.** వి. ఒకవిధమగు నాటు.

సీ. నా అటంచనఁగను మీటు వాపొంటురావలి కోడయనఁగను బొలుచుఁ దద్వి, శేషనామంబు....ఆం. భా. ౨. ౩౫.(బ్రౌ.పా.)

**కోడంగి**=కోణంగి. (క. కోడంగి.)

ద్వి. కోడంగిగతి బాలుఁ డాడు మనంగ, వేడుక మతిఁ దోలఁ కాడంగ నాడు. పండితా. పురా. ౧౬౬ పా.

**కోడంట్రము**=కోడంట్రికము. వి. (√ కోడలు.) (కోడటికము, కోడలితనము, స్నుషాత్వము.)

క...ఓ, రమణీమణి నీకోడంట్రము నెఱుఁగరు వారు యోగరసనిశ్చలతన్. కళా. ౭. ౮౯. ఆం. భా. ౨. ౧౧౧.

**కోడంట్రికము**=కోడంట్రము, కోడటికము, కోటటికము, కోటరము. వి.(√ కోడలు) ౧. కోడలితనము, స్నుషాత్వము.

క...సకి నాతనుజానకు నీవు సతివై కోడంట్రికమెపుడు చేసితివి నీ, మొకమే నే నెఱుఁగఁ జెల్పుము నిజంబు...ఉ. రా. ౪. ౨౦౬.

౨. కోడలిని అత్తవారు పెట్టుబాధ. (వా.)

**కోడబడి.** వి. భక్ష్యవిశేషము. హంస. ౧. ౧౦౫. (ముద్రి, బ్రౌ. పా-కోడిబడి. శ. ర. పా.)

**కోడటికము**=కోడంట్రికము. (కోడలు+టికము) వి. (కోడంట్రికము, స్నుషాత్వము.)

సీ...కోడంట్రమనఁగఁ గోడటిక మంచన స్నుషాత్వ మలరును...ఆం. భా. ౨. ౧౧౧.

**కోడలితనము.** వి. (√ కోడలు.) స్నుషాత్వము, కోండట్రము.

సీ. అత్తగారని బత్తి నడుగు లొత్తుచు శచీవనజాక్షి కోడలితనము నెఱప. దశా. ౩. ౪౯.

**కోడలు.** వి. దే. (కొడుకు+ఆలు-శ. ర.) కొడుకుయొక్క భార్య, స్నుష.

క. సుందరి నాకోడంట్రు రయం దధ్యక్షితవు నీవు ...భార. సభా. ౨. ౨౫౭.

క. లలితాంగిఁ బడసెఁ దనకో, డలిరూపముకంటెఁ గడు బెడం గగుహూపో, జ్వలకాంతి గలుగుదానిన్...భార. ఆర. ౩. ౨౬౬.

సీ. అక్కటా హింసాదు లైనకోడండ్రార యొక్కడ నున్నారు...ప్రబోధ. ౫. ౮.

క. కల దాహా ద్రవసతి శశి, కల దా ననఁ జాలు నొకవికారపుఁగోడల్, చలదాలోలకటాక్షాం, చలదామనిబద్ధతరుణజనఖంజనయై. పాండు. ౩. ౬౦. ఆం. భా. ౨. ౧౧౧.

సా. కోడకు నలుపైన-నోకుల మెల్ల నలుపు. కొడుకు బ్రదితికియుండ వలెను కోడ లుండ మోయ వలెను.

**కోడాడు**=క్రోడాడు, కోరాడు. స. క్రి. ౧. కొమ్ములతో పొడుచు.

వ. ఇవ్విధంబున నవ్వేదండంబు లొండొండ చండక్రీడన్ గోడాడుచుండ. నృసిం. ౪. ౪౭.

౨. అపహరించు.

మ...అష్టాని శూలంబు చేకొని నారాయణు ప్రాణముల్ రణములోఁ గోడాడఁ జూడన్... ఉ. హరి. ౬. ౧౫.

**కోడి.** వి. (సం. కుక్కుటః. ప్రా. కుక్కుడో. శ. కోటి) కుక్కుటము, అజ్జవాలు.

గీ. కొక్కొరోకో యటంచును గోళ్లు కూసె. హర. ౭. ౧౩౭.

సీ. ద్రవిణము పైపన్నిదము లొడ్డి మాత్సర్యగతిఁ గోడిపందెము లట్టువారు. వైజ. ౩. ౬౯. ఆం. భా. ౨. ౯౨.

జ: కోడిపేఁట, కోడి తెప్ప, కోడిపోరు.

**కోడిగ**=కోడీ. వి. (త. కోడి=హారము) ౧. హారము,

సరము ?. (రత్నములు వస్త్రములు మున్నగువాని యొక్క ఇరువదింటిసమూహము. బ్రా. రత్నముల యిరువదింటిసంజ్ఞ. శ. ర.)

సీ. కోయచేడెకుఁ గెంపుకోడిగల నోసంగి గురిగింజలను దీసి సరము గూర్చు. పార్వ. ౨. ౨౩.

**కోడిగము.** వి. ౧. వంచన.

గీ... ఉర్వి చేరె, నడుగుచూపరిజడదారియొడయ నింటి, కోడి కోడిగములవేల్పుప్రోడ యపుడు. దశా. ౫. ౨౬.

క. వీడక యిట్టుల నాగ్గై, దేఁడులు విహరించ గర్భమిరవుగ నిలిచెఁ, బ్రీడావతికిని నాహరి, కోడిగ మే మనుచుఁ దెల్ప గుణరత్ననిధీ. ఉ. హరిశ్చ. ౨. ౯౧.

౨. విలాసచేష్ట, శృంగారచేష్ట.

సీ. కడఁకఁ జేసినకోడిగముల కెల్లను బ్రతి చేసకుట లోకకొన్నిదినములందు. అని. ౧. ౧౧౯.

ఉ ... ఈ, కోఁతివిటుండు చేయునెడకోడిగముల్గని మాటి వత్తురే. భల్లా. ౫. (శ. ర.)

ఉ. కుక్కయుఁ బోలె వెంటఁబడి కోడిగ మాడక భావజార్తిచే, నిక్కడ నిల్వఁగాఁ దరమె ...చంద్ర. వి. ౧. ౭౦.

౩. కేళి, పరిహాసము.

సీ. అతులితవేదవేదాంతచర్చల బ్రహ్మనైనఁ గోడిగ మాడుహంసతతులు. చెన్న. ౧. ౨.

౪. కొంటెతనము.

గీ. అధ్వగులు కోడిగములకై యాకు లెల్లఁ, ద్రెంచి శాఖావితానము ల్దునిచివైవ, మోడుపడియుండె... శుక. ౩. ౪౩౯.

ద్వి. కినిసి బ్రాహ్మణుని శిక్షింప లేరనుచుఁ, జెనఁటి కోడిగములు సేసి పోయెదవొ. ద్వి. హరిశ్చ. ఉ. ౬౫౫ పం.

విణ. దుష్టము.

గీ. కోడిగపుఁగంతుయాతన కోడి వ్రజ్రి, కోడిరై కూసెఁ గొక్కొరోకో యటంచు. అహ. ౩. ౬౧.

చ. ఇననిభుఁడైనగౌతమమునీంద్రు వివేకము వీటిఁబుచ్చి యా, యనఘునిధర్మపత్నికి నహల్యకు నాఁడడి దేఁ దలంచి వం, చనగతిఁ గూయు కోడిగపుజాతి... విప్ర. ౩. ౪౭.

౨. వ్యర్థము, నిరుపయోగము.

చ. పని మఱి లేనికోడిగపుబాఁపని నీ వొకప్రోది సేసి పే, ర్కొని ముహు నావిలాసగుణరూఢి వెలుంగనియట్లు పన్నిదం, బని కడు మించ నాడితి యాడినమాటకుఁ దారసిల్లినన్, వెనుకకుఁ బోకు మంచుఁ జెలి నెండియు జంకెన లుల్లసిల్లఁగన్. విప్ర. ౨. ౭౩.

వ. అతం డొక్కనాఁడు ... దాసీజనంబులు తన కాచరించునూడిగంబులఁ గోడిగంబులం జేసి కూడుసిల్లకుం బాసి గాసిపడుసమయంబున... వేం. పంచ. ౩. ౧౭౬.

జ: కోడిగించు, కోడిగీఁడు.

**కోడిగించు.** అ. క్రి. (√ కోడిగము.) శృంగారచేష్టలు చేయు.

సీ. గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి పరకామినీసహోదరతఁ జూప... గీ. కోరి తొలుమేనఁ దనకైనకొదువ లెల్ల, మాన్పుకొన వచ్చి భువనైకమాన్యలీల, నవతరించినకృష్ణుఁడౌ ననఁగ మించె, నరసవిభుకృష్ణరాయభూనాయకుండు. పారి. పీఠి. ౧౬.

స. క్రి. కోడిగము చేయు, పరిహసించు.

సీ. మందువేసవినాఁటిమార్తాండబింబంబు గోడిగించుపసిండిగుబ్బతోడ. కాశీ. ౪. ౨౯౪.

**కోడిగీఁడు.** విణ. (కోడిగము + ఈఁడు) కోడిగము చేయువాఁడు.

(కొంటెవాఁడు.)

సీ. తనరథంబునకు మాధవసత్యభామల గుఱ్ఱాలఁ జేసినకోడిగీఁడు. వరాహ. ౨. ౮౦.

గీ. వాల్కపై నువ్వుగింజైన నాననట్టి, యారివేరంపుఁదపసి శయ్యంబు కడుపు, కూడుగాఁ

జేసి మెలఁగెడుకోడిగీఁడు...చిత్ర.భా.౫.౪౩.
(శృంగారచేష్టాపరుఁడు, విలాసవంతుఁడు.)
సీ. కుంటెనీలకు నిచ్చి కోడిగీలకు నిచ్చి మిన్నక వారకాములకిచ్చి. విక్ర. ౭. ౧౨౪.

**కోడిపీఁట.** వి. (కోడి+పీఁట) బండిపోలుగట్టి చివర క్రింద ఎత్తుగా నుంచెడు మోపుడుకొయ్య, అను కర్ష ము.
సీ. పంకరుహంబులు బండికన్నులు ... అశోకము ల్గోడిపీఁట...కు. సం. ౪. ౪౩౯.

**కోడిపోరు.** వి. (√కోడి) కుక్కుటకలహము, ద్యూతభేదము. ఆం. భా. ౨. ౩౦౮.

**కోడియ=కోడె.**
వి. (కోడెదూడ, గిత్త, వత్సతరము.)
గీ. తలఁకి యోతండ్రి యాకోడియలను బట్టి.నీలా. ౨. ౮౨.
చ. గొఱియలమంద యాఁబసులగుంపు ... తఱుపులగాడి కోడియలదామెన గాదెలఁ గొల్చి గల్గి యే,కొఱఁతయు లేక యుండు నొకగొల్లత...వేం. పంచ. ౧. ౫౭౮.

**కోడిటె(డె)ప్ప.** వి.(కోడి+ఎప్ప.)కనుఱెప్పల యందు కలుగు రోగవిశేషము.
ద్వి. చెప్పఁ జిత్రము గోడిఎప్ప పెర్గినదో,తప్ప వోనోపునో తడికంటివిధమొ. బస. పు. ౩. ౭౭౮ పం.
ద్వి. గ్రుడ్డికన్నారకన్ను కోడెప్పకన్ను. పండి తా. మహిమ. ౨౭౩. పా.

**కోడీ=కోడిగ.** (శ. ర.)

**కోదు[1].** వి. దే. (మంచములు మున్నగువాని) కాలు.
వ... పగడపుఁగోళ్లపట్టెమంచములు...దశా. ౧. ౧౪.
సీ....కోదనఁగ ఖట్వాంగ మెసఁగు.ఆం.భా.౨. ౧౮౪.

**కోదు[2].** వి. దే. ఊరివరినీటిపల్లము. (శ. ర, వాకుల్యావిశేషము. చి. ని.)
ఉ...కాల మెసచేసిన నేతము లెత్తి కాల్వలుం,బాయలు కోళ్లు నూతులును బావులు రాట్నములుం జలార్థమై,చేయఁగ నాయెఁ గాక మతి చేయ నినాఁడని తామె పుట్టునే. ద్వా. ౮. ౭౦. శీమ. ౩. ౨౨.
ఉదా: ఏర్లును కోళ్లును ఏక మగునట్లుగా వర్ష ము కురిసినది.

**కోదు[3].** వి. రేఖ, గీఁత.
సీ. ఖట్వాంగరేఖలు గనుపట్టుఁ గోదు నా...ఆం. భా. ౩. ౫౩.

**కోదుతాఱు.** అ. క్రి. పండిన పైరు మిక్కిలి యెండు. (శ. ర, బ్రౌ.)

**కోడె=కోడియ.** వి. ౧.కాఁడికి మరపఁ దగినమగదూడ, గిత్త. (శ. ర.) ౨.గోవుమున్నగువానిమగదూడ; ఎద్దు, వృషభము.
సీ... కోడె యనఁగఁ బెయ్య యనఁగ. గీ. గోప్రభృతి పుంస్త్ర్యపత్యముల్ ... ఆం. భా. ౨. ౨౮౨.
సీ. ఆదిశాక్వరము పిహారంబు సలుపు నీకొండచెంపల గోవుకోడెవో లె. వరాహ. ౮. ౭౭.
ఉ...శూలపాణికిం, గా లొక టేమొ కుంటి వలెఁ గన్పడుచున్నది లేక కోడె నే,వేళల నెక్కుచుం దిరుగ నెట్టియొ... పార్వ. ౪.౯౨.
౩. విటుఁడు.
గీ. అడిగినంతయు నో యిచ్చినట్టికొత్త, కోడెఁ జేకొని తను వెళ్లఁ గొట్టుటయును,బ్రాతిఁ దన వల్పులంజియఁ బాయలేక, క్రీడ యించుక లేనిచేబోడిబోజుఁగు. కవిక. ౪. ౯౯.
విణ. తరుణము, పడుచుది.
క. మద మొదవుకోడెవిటులకు, హృదయపుటాంతరములోన హోమాహోమిక, బనివేలమ్మ

ఘులు పుట్టుదు రానీమాటికుచపటుత్వము గ
న్నక్. హంస. ౧. ౨౧౨.

శా. శామాంధల్ వెలనాటికోడెవిధవల్... క్రీ
డా. ౨౦౯.

సీ. కోడెజక్కవగబ్బిగుబ్బచన్నులమీఁదఁ దరఁగ
పయ్యెదకొంగు పొరలి పడఁగ. దశా. ౯.
౧౩౦.

౨. మగది.

గీ...ఎవరి, నెదిరి కొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కో
డె, తఱుపులను బొడ్చుచు...నీలా. ౨. ౪౩.

(వ్యవ) ఆయావునకు పుట్టినది కోడెదూడా?
పెయ్యదూడా?

కోడెప్రాయము=తారుణ్యము, యౌవనము.

మత్తకోకిల. కోడెప్రాయపుగబ్బిగుబ్బెతఁ గూర్చి
వేలుపుఁబ్రోడ దాఁ,గోడియై యొకరేయి కూ
యిడ...సమీర. ౧. ౨౧౪.

జ: కోడెకాఁడు, కోడెకొండ, కోడెగాడ్పు, కో
డెతనము, కోఁడెత్రాఁచు, కోడెరాతు.

**కోడెకాఁడు.** వి. (√కోడె) ౧. యువకుఁడు, త
రుణుఁడు, పడుచువాఁడు.

ఆ. కోడెకాఁ డనంగ గోవాళ్లు నాఁగను, యువజ
నాఖ్య లొప్పచుండు రెండు. ఆం. సం.మాన.
౭.

గీ...మించుఁబోండ్లఁ,గూడి జలకేళిఁ గావించు
కోడెకానిఁ, దలిరువిల్కాని నగుచక్కఁదన
మువాని. దశా. ౬. ౩౪.

౨. యౌవనమునకు పూర్వదశయం దున్నవాఁడు.

గీ. కోడెకాఁడు కొమరుఁ డనఁ గొండికనఁగఁ,
దగుఁ గుమారుఁడు తరుణుఁడు దనరు వయసు,
వాఁ డనుచుఁ బలుకంగ...ఆం.భా.౨.౧౧౭.

౩. విటుఁడు, పల్లవుఁడు.

ఉ. ఎన్నఁడుఁ గాను నీస మొక టిచ్చినవాఁడవు
గావు నీట నీ,వన్నియకోడెకాండ్రు తగ వార
వధూటులకై యొసంగునా,చిన్నెలు నీవు
చూచియు నినీ తల వంపఁగ నేర వన్నిటన్,
చిన్నతనంబు దాల్చితివి పెద్దగ నిన్నిఁక నా
డ నేటికిన్. విప్ర. ౨. ౨౩.

సీ...గోవాళ్లు బొజుఁగు నాఁ గోడెకాఁడు. గీ.వె
చ్చకాఁడు నను పుకాఁడు వేడ్కకాఁడు,లం
జెకాఁడు మిండఁ డనఁబల్లవుఁడు దనరు. పాం.
ని. మాన. ౭.

**కోడెకొండ.** వి. (కోడె+కొండ) హిమాలయపర్వ
తము. (పృథుచక్రవర్తి భూమిని ధేనువును గాను
హిమవంతమును దూడనుగను జేసి రత్నములు నో
షధులును పిదికె నని పురాణప్రసిద్ధి.)

ఉ. ఎన్నఁటిమాట నీ వెఱుఁగుదే తుహినాచల
మాట మేనకం, గన్నులఁ జూపి యంపనెగఁ
గ్రాఁచినకాఁకకుఁ జల్లఁజల్లఁ దా,ర్కొన్న
విరాళి నాఁటివలిగొజ్జఁగనీటఁ జామయ్యా ధా
త్రికిం, బన్నినకోడెకొండ యొడఁబాటునఁ
దాల్చెఁ దదంక మిప్పుడున్. కకు. ౧.౧౯౪.

**కోడెగాడ్పు.** వి. (√ కోడె) లేగాలి, మందమారు
తము.

సీ. నుఱుప కే లున్నవి నెఱయ ధైర్యంబును గం
దంపుమలకోడెగాడ్పుగములు. ప్రభా. ౫.
౧౩౪.

**కోడెతనము.** వి.(√కోడె) ౧. పడుచుఁదనము.౨.
విటత్వము.

ఉ. వచ్చి పురంబువాకిట రువారపుఁగోడెతనం
బులోడఁ గ,న్నిచ్చకు వచ్చు చేడియల నెచ్చరి
కించుచు...విక్ర. ౭. ౭.

౩. జాణతనము, ప్రౌఢి.

(సీతారాములకేళీవర్ణనము.) సీ. సవులు చిక్కులం
దీర్చి జవ్వాజి కస్తూరి కులుకుగుబ్బలఁ బూయు
కోడెతనము. ఉ. రా. ౬. ౧౬౭.

**కోడెత్రాఁచు.** వి. ( √ కోడె. ) పడుచుత్రాఁచు
పాము.

సీ. మంగలకత్తిపై నంగ ముంచినయట్లు కోడెత్రాఁ
చును ముద్దులాడినట్లు. వేణు. ౫౦.
(ఇట్లే కోడెపాము, కోడెనాగు.)
ద్వి. ఘన మైనయాపందు గసికాట్లు చేసి, యాడు
చు మునుపటియవిధి పోనాడి, కోడెపాము
యాడుకొనుచుండె నంత. ద్వి. శ. సా. ౨.
౬౬ పా. ౧౦ పం.
సీ. తమి నీలకంఠకంఠముల హారంబులబాగుఁ జూ
పెడుఁ గోడెనాగు లీడ. వాల్మీకి. ౩. ౧౪౩.

**క్రోడెరాతు.** వి. (√ కోడె) వృషభవాహనుఁడు,
శివుఁడు.
సీ. ఇటు కోడెరాతు మై నిడ్డపాముల మేఁతసొం
పు లీనెడుకొండఁ జూచినాఁడ. నరస. ౫.
౨౨.
(ఇట్లే కోడెవయాళివజీరుఁడు.)
చ. అలవి యెఱుంగ కొక్కపులి కల్గినవాఁడయి
ఖ్యాతిఁ జెంది యక్కొక్కపగఁ దీర్చుకోఁదలఁ
చి కోడెవయాళివజీరుఁ డెప్పుడుఁ దా, మెలఁగె
డు వ్యాఘ్రచర్మ మనుమినెఱడాగు ధరించి
కూరతా,కలన భవత్కులంబునకుఁ గల్గదు ప్రో
డు మృగాన్వయంబునన్. శుక. ౨. ౨౭౪.

**క్రోణంగి=కోడంగి.** వి. (త. కోణంగి.) అంగములను
వికారముగా చూపి జనులను నవ్వించుచు బిచ్చ
మెత్తుదాసరి.
ఉదా: కోణంగిచేష్టలు, కోణంగియాటలు.
సీ. ఆశించు నెపుడు నత్యాసక్తి నమ్మహానటుఁడు
నేనగరిఁ గోణంగి యగుట. వైజ. ౧. ౪౨.
వ... గోవింద లిడుచు నెద్దుల పైఁ దమ్మటమ్ములు లిడి
మి లిడి మని మ్రోయ వ్రేయుచు వచ్చుకోణంగి
దాసరులగంతులు గని. ప్రబంధ. ౭౭. హంస.
౩. ౨౯.
జ: కోణంగితనము.

**క్రోణంగితనము.** వి. (√ కోణంగి) కోణంగిచేష్ట,
వెక్కిరింత. (బ్రౌ.)

**క్రోణకుణము.** సం. వి. అ. పుం-మంచపుమూలలఁ
దిరుగునది-మత్కుణము, నల్లి.

**క్రోణపుఁడు.** సం. వి. అ. పుం-విదిక్కు పాలించు
వాఁడు-నైరృతుఁడు, మూలఱేఁడు.

**క్రోణము.** సం. వి. అ. పుం. ౧. ఇల్లు లోనగువాని
మూల. ౨. (క్షేత్రగ) రెండురేఖలు కలియుచో
టు. ౩. విదిక్కు, మూల. ౪. వీణ మొదలగువా
ద్యముల వాయించుకఁంటివంటిసాధనము (కమాను
మొ); గంట లోనగువాని వాయించెడుకోడుపు.
౫. అంచు, మొన. ౬. కుజగ్రహము. ౭. లగుడ
ము, దుడ్డుఁగఱ్ఱ. ౮. వాద్యభేదము. (కల్ప) ౯. శ
నిగ్రహము.

**క్రోణాఘాతము.** సం. వి. అ. పుం. ౧. కమాను మొ
దలగువాదనసాధనములతో సారంగి మొదలగు
వానిని వాయించుట. ౨. బహుఢక్కలను బహు
భేరులను ఒక్కసారిగా వాయించుట.
శ్లో. ఢక్కాశతసహస్రాణి భేరీశతశతానిచ, ఏక
దా యత్ర హన్యన్తే కోణాఘాత స్స ఉచ్య
తే. (భరతుఁడు.)

**క్రోణాలగొంది.** మి. వి. మిక్కిలి యిఱుకైనచీకటి
మూల
మత్త కోకిల. జాలి దక్కి మ తాంత రాళ విశాలవే
దులయందుఁ గో,ణాలగొందిఁ దపంబు సల్పు
జనంబుతాల్పులు దూలఁ ద,ద్వాలికావలనిస్తు
లస్తనపాళికామృగనాభివా,తూలికాహతిఁ బ
క్ష్వాళాల్మలికూలికాళకలాకృతిన్. పాండు.
౫. ౨౯౬. (కోనాలగొంది.ముద్రి-ప్రయో
గాంతరము లేదు.)

**క్రోణిగి.** వి. నతి, నమస్కారము.
వ... తులసీవనమందలిగదాధరునకుఁ గోణిగి కృ
తశౌచమందలి పాపహరునకుఁ దెలుపుట....
ప్రబంధ. ౭౦.

**క్రోణే.** వి. (క. కోణే.) అంతఃపురము.

శా. కోణేవాకిట వారి నిల్పి కులుమంగుత్తంపుఁజ
స్తుబ్బరే, జాణల్ కొందఱు కుంచెగిండియడ
పాల్పొగింప...నృపాలుఁ డంతిపురముం జే
రెం బ్రమోదంబునన్. కుచల. ౨. ౪౮.

**కోథము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మథితము, తరువఁబడినది. ౨. గళితము, జాఱినది. వి. అ. పుం. ౧. నేత్రరోగభేదము. ౨. భగందరరోగవిశేషము. ౩. జాఱుట. ౪. మథించుట, చిలుకుట.

**కోదండము.** వి. (త. కోదండం. క. కోదండ.) బాలదండనసాధనము, నేరము చేసినబాలురు పట్టుకొని వ్రేలాడుటకై మీఁదఁ గట్టినత్రాడు.

గీ. తొడలు వడిపెట్టి కోదండ మమరఁ గట్టి,రెట్ట
లెగఁబెట్టఁ బట్టించు రేపు మాపు. హంస. ౩. ౧౪౧.

**కోదండము.** సం. వి. అ. న. ౧. విల్లు, ధనుస్సు. ౨. ధనూరాశి. పుం. ౧. కనుబొమ్మ. ౨. ఒకానొక దేశము.

**కోదండి.** సం. విణ. (న్. నీ. న్.) విల్లు కలవాఁడు, విలుకాఁడు.

**కోదండరామములు.** సం. వి. అ. పుం. బ. ఒక జాతివడ్లు.

సీ. సన్ననూదులు పచ్చగన్నేర్లు గోదండరామము
లేక్కసర్లు రాయసర్లు. హంస. ౪. ౧౨౫.

**కోదారము.** సం. వి. అ. పుం. ఒకజాతిధాన్యము.

**కోద్రంగము.** సం. వి. అ. పుం. మంచె.

శ్లో. కోద్రంగస్తు తమంగస్స్యాత్. అమరపద
పారిజాతము. (శ.ర.)

**కోద్రవము.** సం. వి. అ. పుం. కోరదూషము, అళ్లు.

**కోన[1]**=కాన[1]. వి. ౧. అడవి; తోఁట.

ఆ. గోల యిట్టికాఱుఁగోనలో నిన్నొంటి,డించి
చనఁగఁ జనునె...అచ్చ. రా. అర. ౪౯.

చ...తిన్న నికన్నెమావిగుం,పునఁ బెనఁగొన్నమ
ల్లియలు పూచినకోనలు గాంచి యెక్కు
చోన్. వసు. ౨. ౨౦.

౨. కోన యనుదేశవిశేషము.

సీ. కోన బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలె ... మనుచ.
౧. ౩౭.

జ: కోనతెంకి, కోనత్రిమ్మరి, కోనమునికిపట్టు, కోనమేకము.

**కోన[2].** వి. (సం. కోణః. క. కోణ. త. కోణమ్.) ౧. మూల.

ఉ...ఇండులకందున కేఁగి గొందులుం, గోనలుఁ
జూచునంత...దశకు. ౫. ౭౧.

సీ. క్రొంజీకటులు గ్రమ్ముకోనలకోనల ఘనమైన
యోగిపుంగవులగవుల. సారంగ. ౩. ౨౩౨.
ఆంభా. ౨. ౩౦.

౨. లోయ, కొండసందు.

సీ. మందరశైలంబునందు నొకానొకకోనలోఁగా
నలో గుమురు గాఁగ,బలసినవెదురుబొంపము
క్రింద...దశా. ౪. ౭౮.

వ...కారుపోతులకోలాహలంబులం బ్రతిశబ్దంబు
లీనుకోనలును...మనుచ. ౪. ౩౭.

౩. కొన, అగ్రము.

గీ... తెలికన్నుఁగోనలమెక్కురింత,నెక్కు బలు
కొండఁ దూఁటువో నేయు మేటి. పాండు. ౧.
౧౬౧. (తెలికన్నుఁగోనలయెక్కురింత=శుక్లాపాంగ-మయూర-వాహనము)

ద్వి. తోన శ్రీరంగనాథుఁడు తెలిగన్నుఁ,గోనల
నమృతంబు గురియ నిట్లనియె. ద్వి. పరమ. ౫.
౪౨౫ పా.

జ: కోనకోఁడు.

**కోన[3].** వి. గోసమూహము.

క... గోబృందావ్యాయంబు లలరున్, మందనఁ
గోన యన. ఆం. శే. ౩౨.

**కోనతె(టె)ంకి**=కోనమునికిపట్టు.

క...రక్కసుఁ, డరు దందుచు...ఒకయినుపద్రు
డ్డునఁ, బరిగొని యక్కోన తెంకిబంట్లఁ జదు
ముచుక్. అచ్చ. రా. యు. ౨౪౪.

**కోనత్రిమ్మరి.** వి. (√ కోన[1]) వనచరము, కోఁతి.
గీ. మంచి మెడకోనత్రిమ్మరిమన్నగాని, కత యె
ఱింగింప...అచ్చ. రా. కిష్కిం. ౯. (మంచి
మెడకోనత్రిమ్మరి=సుగ్రీవుఁడు.)

**కోనమనికిపట్టు.** వి. (√ కోన[1])వనౌకము, కోఁతి.
గీ ... కేసరి యనుకోనమనికిపట్టు,కలికి యంజన
యనునది గన్నవాఁడ. అచ్చ. రా. కిష్కిం.
౧౧.

**కోనమలహారి.** మి. వి. (సంగీ) రాగవిశేషము. ప్ర
బంధ. ౯౭.

**కోనమెకము.** వి. (√కోన[1]) వానరము, కోఁతి.
సీ...మొసలి, కన్నులరాకాసిమిన్న కోనమెకం
పుగుంపులఁ దార్కొని యంపవాన, గురిసె
...అచ్చ. రా. యు. ౩౧౧.

**కోనవేఁడు.** వి.(కోన[2] + ఏఁడు.) కోణపుఁడు, నై
ఋతుఁడు. (శ. ర.)

**కోనాలకము.** సం. వి. అ. పుం. న. సంఘసంచారి
యై నల్లతోఁకయు తెల్లకడుపును గలఒకజాతిజల
పక్షి.

**కోనాలక.** సం. వి. ఆ. స్త్రీ=కోనాలకము.

**కోనాలి.** సం.వి.ఇ పుం.ఇ,ఈ.స్త్రీ=కోనాలకము.

**కోనెఱు=కోనేఱు.**
క...చెఱువు మడువు లొండు కుంట చెలమ పడి
య కో,నెఱు బుగ్గ వాఁగు...హంస.౪.౨౧౦.

**కోనేఱు=కోనెఱు.** వి. దే. (కోన[1] + ఏఱు-త.క.
కోశేరి) చుట్టు మెట్లు కట్టినసలుచదరపుఁజెఱు
వు, పుష్కరిణి.
సీ. నెగడుఁ బుష్కరిణి కోనే ఱనఁగ...ఆం.భా.
౧. ౧౬౨.

**కోపకత్తె.** మి. విశే. (కోపము+కత్తె.) కోపముగ
లది (స్త్రీ.)
సీ. సుక్షత్రియకులంబు నిక్షత్రముగఁ జేయుకో
డుకుఁగాంచినయట్టికోపకత్తె. క్రీడా.౧౨౯.

**కోపకుఁడు.** సం. విశే. (అ. పికా. అ.) కోపించు
వాఁడు.

**కోపగాఁడు.** మి. విశే. (కోపము+కాఁడు) కోప
ము గలవాఁడు.
గీ. నిను గలయుభర్త కోపగాఁ డనఁగ నేల. సా
రంగ. ౨. ౧౧౫.
క. ద్వైపాయనముని వెడలం, ద్రోపించినకోపగాఁ
డు ధూర్జటి...భీమ. ౪. ౧౩.
గీ. అన్న మీతండ్రి కోపగాఁ డౌనొ కాఁడొ.
కాశీ. ౪.౯౦.

**కోపగించు.** అ. క్రి. (సం.కోపః-ఇది 'చిత్తగించు'
వంటిది.) కోపించు, కోపపడు.
సీ. మధుపసంగతిఁ గూడిమాడి నిద్రింపఁగాఁ గి
నుకఁ బద్మిని కోపగించె ననఁగ.తపతీ.౪.౨౧.
గీ...ఆపడంతుక దెల్పినఁ గోపగించి. సారంగ.
౨. ౨౭౦.

**కోపగిలు(ల్లు).** అ. క్రి.(సం. కోపః) కోపగించు.
సీ. వేగ మూహింపుమీ విధుబింబముఖి కోపగిలిన
భావము సమ్మతిలినభావ. గీ. మనుచుఁ దను నె
చ్చరింప...చంద్రా. ౩. ౭౭.

**కోపన.** సం. వి. ఆ. స్త్రీ. కోపము గలయాఁడుది, భా
మిని.

**కోపనకము.** సం. వి. అ. న. చోరక మనుగంధద్ర
వ్యము శ.

**కోపనకుఁడు.** సం. విశే. (అ. నికా. అ.) కోపశీ
లుఁడు, కోపము గలవాఁడు.

**కోపనము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కోపశీలము,
మండిపడునది. ౨. కోపము గలిగించునది. ౩. వా
తాదిదోషములను మిక్కుటముగా జేయునది.
వి. అ. న. కోపగించుట.

కోపనీయము. సం = కోపయితవ్యము.

కోపము. సం. వి. అ. పుం. ౧. క్రోధము, కినుక. ౨. దేహమందలివాతాదిదోషములలో నేదేని మిక్కుటమగుట. ప్రకోపము. (ఉదా : పిత్తకోపము, వాతకోపము.)

కోపయిత. సం. విణ (ఋ త్రి. ఋ) కోపింపఁజేయువాఁడు.

కోపయితవ్యము. సం. విణ (అ ఆ. అ) కోపింపఁజేయఁ దగినది.

కోపలత. సం. వి. అ స్త్రీ కర్ణస్ఫోటాలత.

కోపి. సం. విణ (న్. నీ. న్) ౧ మిక్కుటమగు కోపము గలవాఁడు. ౨ కోపము గలిగించువాఁడు ౩. వాతాదులను రేఁచునది. వి. న్. పుం జలపారావతము, నీటిపావురాయి (కల్ప)

కోపించు. సం. అ. క్రి కోపగించు

క రక్కసులరాజు నీతో, మిక్కిలి కోపించినాఁడు.... భా. రా. యు ౧౩౨.

ఆ కొడుకుపాటు చూచి కోపించి కాశింగ, పతిరయమునఁ దేరు వఱపి భార. భీష్మ ౨ ౬౩.

స క్రి కినియు.

మ. గురుశాస్త్రార్థగరిష్ఠులైనబుధులన్ గోపింపఁగా రాదు మల్లభూ. నీతి. ౧౩

ఓ ఆపదవాలను దమకటుఁ, గోపించుచుఁ గవులఁ బాతకుల బారుల నా, లోపలఁ గూర్పుండఁగ నిడి, యాపాడి తగంగఁ దీర్పుఁ డని నియమించెన్. ద్వా. ౬. ౩౩.

కోపిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) = కోపకుఁడు.

కోపితము. సం. విణ. (అ. ఆ. అ.) కోపింపఁజేయఁబడినది. ౨. మిక్కుటముగా రేఁపఁబడినది. (వాతాది)

కోపు. వి. (క. కోపు త. కొప్పు.) ౧. నాట్యముతీరు. నాట్యగతిభేదము.

మ.... నాలిగా, ఉబ్బుపేరం గలనట్టువ ల్గులఁ గోపుతో చూపులేఁదీవపా, త్రల కియ్యామని పూపుముత్తెపు సరు లొల్పంగ నిచ్చెంగడున్ యయా. ౪. ౧౧౫.

గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు, కోపు కోపున దార రెల్ల హోఁవు దొసఁగ. వైజ. ౧౪ ౧౨౯. శ. రా. ౪ ౧౩౩ ౪౦. భా. ౧. ౧౩౦.

౨ సౌందర్యము, అందము, చక్కఁదనము.

ఉ. కమ్మవిలుకోపుఁ జెనకం గలచక్కనిమోహనాంగునిన్, గొమ్మరో చూడవమ్మ నలకూబరుఁ డా యితఁ డంబుజాననా. ఉ. హరిశ్చ. ౪. ౧౧౩.

గీ. చిత్తజానులయేపు మేల్కుటకోపు, మదురుగోడల మెఱపు వాల్మగలయొఱపు రసిక. ౧. ౩౬. చంద్రా ౩ ౨౮

౩ బలము, శక్తి, సామర్థ్యము

దండకము. మందరాగింబుఁ బెన్గోపున న్మోఁపునం దాల్పవా కృ కకుం. ౩ ౧౩౩.

గీ. ఏలికలవెంట వెస నంత నేపు రేఁగి, కోపు మీఱి జనోద్వృత్తిఁ గూడఁ బొంచి, యెందుఁ జొచ్చినఁ జొరనీయ కిక్కి తెచ్చి, పలుగులను గూర్చెనొక కొన్నిజాగిలములు శుక. ౧. ౧౬౦

౪. నిమిత్తము, ప్రయోజనము.

చ .. నే నహుషునిద్దఁడఁ జేను యయాతి వేఁట కోపున నవరించినన్ దెరలు బోనులు గైకొన కొక్కయిల్లి వ, చ్చినఁ జనుదెంచినాఁడ.. యయా. ౨. ౩౩

౫. దశ, దిక్కు; పార్శ్వము. ప్రక్క.

ద్వి. భూపాల యీకొండపొంతపశ్చిమపుఁ, గోపున నొక మఱ్ఱి కొమ రొందుచుండు. రం రా. అయో. ౧౨౪ పొ ౧౮. పం

సీ. కరకంకణంబులు గల్లనఁ జేలు లిరుకోపులఁ జేరి పిహోపు లిడఁగ. శరాం. ౪. ౧౪౨.

౬. విధము, రీతి.

ఉ. క్రోధము మూర్తిఁ గైకొనినకోపునఁ గాంచనవేష్ట నోజ్జ్వలో, త్సేధగదాధరుం డగుచుఁ జెచ్చెర రావణుమీఁది కేఁగఁగజా. ఉ. రా. ౩. ౨౪౧, ౮. ౧౧౨.

౭. పలకమీఁద వ్రాసెడికడ్డి, బలపము; కడ్డి. (శ. ర.)

౮. (వింటియొక్క) కొప్పు, కొన, కోటి.

సీ. ధనురగ్రమధ్యనృత్తావయవమ్ములు గొఱలుచు నుండును గోపు నాఁగ. ఆం. భా. ౩. ౬౨.

సీ.... కోపు కొప్పు, నాఁ జను ధనురగ్రనామంబులు.... సాం. ని. మాన. ౪౩.

చ.... మృతసర్పము నొక్కటి వింటికోపునం,బని వడి తెచ్చి పైచె నటు బ్రహ్మమునీంద్రునియంస వేదికన్. భాగ. ౧. ౪౬౩. (శ ర. పా.)

౯. మద్యము.

సీ.... మద్యమ్ము పేళ్లు. గీ. తనరు సారాయి కోప న.... వేంక. ౭౦. (శ. ర. పా.)

సీ.... కోపు, సారాయి యనఁ జెల్లు వారుణీనామముల్.... సాం. ని. మాన. ౪౭.

౧౦. సమయము. (శ. ర, బ్రౌ.)

౧౧. చేఁపలను గ్రుచ్చెడిసూది. (శ. ర, బ్రౌ.)

౧౨. దుకాణము. (బ్రౌ. చూ-కోపుదారుఁడు.)

౧౩. నిడివి, పొడుగు.

సీ. అష్టదిఙ్ముఖములం దష్టాంగములు మించఁ గోపు గాంచినవజ్రకూబరములు. దశా. ౩. ౧౩.

౧౪. (త. కూప్పుదల్.) నమస్కారములు.

వ.... పినాకీ నీకు నమస్కారంబు కైలాసనిలయా నీకుఁ గోపులు పళ్యల్లలాటా నీకు నేటికోట్లు.... భీమ. ౩ ౨౧౧.

౧౫. మనోహరము.

ద్వి. దాఁపుర మేల బృందావనమందుఁ,గో పైన చెంగల్వకొలనిలోపలను. ద్వి. శ. సా. ౧. ౨౬ పొ. ౧ పం.

చెఱువుకోపు = అలుఁగు, తటాకజలనిర్గమనమార్గము.

సీ. మల్కికిఁ జెఱువుకోపునకు నల్గనఁ బొల్చు.... సాం. ని. నానా. ౮౮.

జ : కోపుదారుఁడు, కోపుపరువడి, కోపువాఱు.

కోపుదారుఁడు. వి. (√ కోపు) దుకాణముపెట్టువాఁడు. (పైనుండి సరకులను తెచ్చి యమ్మెడివాఁడు. శ. ర-వర్తకుఁడు. చి. ని.)

కోపుపరువడి. వి. (కోపు + పరువడి.) పండ్రెండు పరువడులలో నొకటి. (పదునాల్గువిపరులలో నొకటి- అని హంస. ౧. ౨౦౬)

వ ...ఎదమఱుగుపరువడి కుడియడుగుపరువడి కిదలు పరువడి దాఁటడుగుపరువడి కోపుపరువడి.... మొదలుగాఁగలపదిరెండు పరువడులును. ప్రబంధ. ౭౮.

కోపువాఱు. అ. క్రి. (√ కోపు) అందగించు, రమ్యమగు. (శ. ర, బ్రౌ.)

కోప్యము. సం = కోపయితవ్యము.

కోమ[1]. వి. వల్మీకాగ్రము, పుట్టచివర.

సీ.... పుట్టిన వల్మీక మెప్పుచుండుఁ. గీ. గోమయనఁ దదగ్రభూమి యొ.... ఆం. భా. ౨. ౮. ద్వి. హరిశ్చ. పూ. ౧౯౬౨ పం.

కోమ[2] = కొమ్మ. వి. స్త్రీ. ఆఁడుది.

ఉ. మాయనుఁగుంజెలిజా వెదకుమూ యను వొప్పుఁదుటారి చిల్కలే, మా యను .... గద్దటికాయఁజింక కో,మూ యను.... అచ్చ. రా. అర. ౯౬. (శ. ర. పా - ప్రయోగాంతరములేదు.)

కోమటి. వి. (సం. కార్పటికః. క. కోమటి. త. కోమట్టి.) వైశ్యుఁడు.

సీ. కోమట్లు మూఁడవకొలము వా రన బేరు లన వైశ్యనామము ల్దనరు నళన. ఆం. సం. మాన. ౨.

చ. కొనుఁడు పరార్థ్యరత్నములు గోరినవానిన యిత్తు మన్నెలం, గున( బచరింతు రంగదులం( గోమటు లప్పురి సిద్ధరత్నముల్. భార. ఆది. ౮. ౫౩.

జ : కోమటీఁడు.

కోమటీఁడు = కోమటి. వి. ( కోమటి + ఈఁడు- స్వార్థమున.) వైశ్యుఁడు.

సీ.... సంచిమూల్యము విచ్చి పడి కోర్చి త్రెవర్షికుల జంటఁ దిరుగనికోమటీఁడు.... గీ. లేఁడు ధరలోన రతిసేనఁ గూడి మాడి, యున్నవిటులందు.... హం స. ౫ ౧౨౦.

కోమలకము. సం. వి. అ. న. తామరతూఁడు.

కోమలము. సం. విశ. (అ. ఆ అ.) ౧. మృదువు, మెత్తనిది. ౨. అందమైనది, సొగసైనది. ౩. ఇంపైనది, మనోజ్ఞము. వి. అ. న. ౧. నీరు. ౨. వగడమునందలి యొకానొకదోషము; కోమలదోషము గలప గడము.

వ. మఱియు జర్జరంబును గోమలంబును మలినంబును బ్రుప్పియు ననంబడునాలుగుదోషంబులు గల పవి యెఱింగించెద. రత్న. ౬౫.

చ. బుడుపులు గల్గుజర్జరముఁ బూనినఁ బ్రాణము లుత్తరించు లేమిడి నొదవించు వేదనలు మీఱఁగఁ గోమలనామవిద్రుమం, బెడపక.... రత్న. ౬౬.

కోమలి. వి. (సం కోమలా. క. కోమలె.) చక్కఁదనము గలఆఁడుది; ఆఁడుది.

ఉ. తామరకెంపు లంతటను దాచినముక్కలిపీఁటమీఁద టజా, గోమలు లంతఁ బెండ్లికొడుకుండగ నుంచిన.... యయా. ౪. ౧౦౪.

క.... ఇత్తెఱఁగునఁ బలికిన నాలకించి కోమలి మిగులజా. నీలా. ౨. ౫౫.

సీ. ఎలనాగ కోమలి యింతి చెలువ చెలి వెలఁదుక మెలఁతుక పెలఁది మెలఁత.... గీ.... అనస్త్రీనమాఖ్యలు.... ఆం. భా. ౨. ౧౦౪.

జ: కోమలికము.

కోమలికము. వి. (√ కోమలి.) సౌందర్యము, చక్కఁదనము.

క. ఈము క్కిచెవు లీమొగ, మీమేలిమిపొలుపుగలదె యేచెలువకు నీ కోమలిక మెఱుఁగుటకునై, రాముఁడు మెలఁగించి చూచె రమణీ విన్నుజా. భా. రా. అర. ౧. ౧౪౮.

సీ. మెఱుఁగాఱుమొంటియు మేనికోమలికంబుఁ గద్దిట్టగుణము గుల్కెడుమొగంబు. కళా. ४. ४४.

కోయ. వి. ఒకజాతికిరాతుఁడు, ఆటవిక భేదము, ఒకజాతి బోయ.

గీ. బోయ నాఁగఁ గిరాతుఁ డౌఁ గోయ చెంచు, పరికి యేనాది... అనఁ దద్భేదములఁగఁ, బొల్లును వివంగ.... ఆం. భా. ౨. ౨౮౬.

క. ఒదయా నీపేరిటియా, బుడుతని కెన గానఁ గానఁ బురుడింపఁగ నిక్కడిబోయలలో మఱి యెక్కుడుచాయలమలల మెలఁగుకోయలలోనజా. చంద్రా. ౨. ४౩.

జ: కోయత.

కోయత. వి. (గోయ + త.) కోయజాతిస్త్రీ.

గీ.... కోయతల్ చెప్పుకొనఁగ, సకలమును విన్నవారము.... ప్రబంధ. ౧౩४.

కోయష్టి. సం. వి. ఇ. పుం. నీటిగంపపులుఁగు, నీటి బెళగువ్వ.

కోయష్టికము. సం. వి. అ. పుం. చీకుఁగొక్కెర, గ్రుడ్డికొంగ.

కోయిల[1] = కోవెల[1]. వి. (త. కోయిల్) ౧. దేవాలయము, గుడి.

ఉ... కైమఁడుజా, గొంపక యోరి సొగయుఁడ కోయిలకొత్తులమారికాన మా, మంచిమతంబుగైకొనుము మానుము నీమత మన్న బొద్దుఁడుజా. ప్రబోధ. ౩. ౨౮. (కోయిలకొత్తుల

మారి = వేశ్యాలంపటుఁడు.)

౨. ఒకానొకదివ్యస్థలము.

క. కోయిలఁ దిరుమలఁ బెరుమా, కోయిలఁ దిరుపతులఁ గుంభకోణాదికపు, ణ్యాయతనంబుల మాయం, బై యెక్కడఁ బోయెనొకో మురాంతకుప్రతిమల్. కాశీ. ౫. ౨౮౮.

**కోయిల²** = కోవెల², కొంగెల. వి. (సం. కోకిలః. ప్రా. కోఇల. త. కుయిల్. క. కుకిల్.) పికము.

చ. అలరులు గోసి కోసినవయస్యలఁ బల్మఱుఁ గౌఁగిలించి కోయిలలయెలుంగు లోలిఁ గొని....దాఁగురిం, తలు హరితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపికల్. హరి. పూ. ౮. ౩౫.

క. తలిరాకుగుత్తిఁ దమిఁ గో, యిల చంచునఁజించి క్రోల్చె నీరీతి విరో, గులగుండియ లవియింపుదు. బలుభిడి నని మదనియెదుటఁ బచరించె నవన్. పారి. ౩. ४౯.

**కోయు.** స. క్రి. (క. త. కొయ్.) ౧. ఖండించు. ఛేదించు, నఱకు.

గీ. అపుడు మెడ గోయ ముని రోఁజు టాలకించి. మనుచ. ౬. ౫౧.

ఉ. కానకుఁ గొంపుఁ బో యిపుడు కాళ్లను జేతులఁ గోయుఁ డంచు లో, నూవినకిన్క రాజుముదుటుం గర మిచ్చెను....సారంగ. ౩. ౩౬.

గీ. అన లన్నియు మొదలంటఁ గోసియున్న, గోఁచి కట్టున కటువంటిగొడవ గడవ, రాక మెడఁ జుట్టు కొనియె....పాండు. ౫. ౨౩౮.

౨. (పువ్వులు కాయలు ఆకులు మున్నగునవి) త్రుంచు.

రగడ. చనకుఁ దీఁక దవ్వులకు సఖులార పువ్వులకు, ననుచు నలరులు గోసి రతివ లల్లన దాసి. మనుచ. ౩. ౮४.

వ....అందన్నిమాఁకులపండ్లు గోయం దలంచెద .... నైష. ౨. ౬౩.

ఉ. అంటలు గట్టి చెల్కలకు నాంధ్రుడు బిడ్డలఁ గూరఁ గోయఁ బో....ఆము. ౩. ౩౩.

కోసికొని (సుక) తిను = మరణబాధపెట్టు, మిక్కిలి బాధించు.

ఉ... సీగళము రాట్నమునం బిగియించి యుంతునో, కోసుకతిందునో యనినఁ గోమలి నిశ్చలధైర్యధుర్యయై. శుక. ౨. ౩౭౩.

కోఁతలుకోయు. సొఱకాయకోఁతలుకోయు = ప్రజ్ఞలు పల్కు, బడాయిమాట లాడు. (వా)

ఙ : కోఁత, కోఁతపడు.

**కోర.** వి. (త. కోరం.) ౧. మద్యము మున్నగునవి త్రాగుపాత్రము; పాత్రము.

ఉ....కాంతయుఁ దాను నొక్కకోరం దనుపార దివ్యమది రామధురామృతపానకేళి యం,దంద యొనర్చఁగా .... నృసిం. ౩. ౫४. భార. మౌ. ౩౯.

సీ. సురవరు లమృతంబు వరుపఁ గ్రోలెడుకోరకాముకశ్రేణికి ఖడ్గధార. చిత్రభా. ४. ౧౧౦.

సీ. చంద్రకాంతపుఁగోరఁ జల్లనిపన్నీరఁ దొరఁగెడు కన్నీరు తుడిచి తుడిచి. విక్ర. ४. ౧౬౨. వి. పు. ౭. ౩౮౭.

౨. పళ్లెము.

గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు, కోపు కోపున దొర లెల్ల దోఁపు లొసఁగ, నాయకుఁడు బాపురే బాపురే యటంచుఁ, గట్నములు పైఁడికోర బొగాలునంప. వైజ. ౧. ౧౨౯.

ఉ. కూరిమిమంత్రితోడ నలకూబరుఁ డేకతమాడి పెద్ద బం, గారపుఁగోరఁ గల్పవనికాజనికాంతముల్లైనచీరలున్, హారవిభూషణావళియు నమ్మిథునంబునకుం బ్రియంబుతో, నారదమౌనిచేత నదనం బదివించెఁ గుబేరుపేరుగాన్. మనుచ. ౫. ౫౬.

విణ. పెద్ద. (ముద్దుగోర.)

(మఱికొన్నియర్థములకు-చూ. కోరపొద, కోరసిగ, మొ)

జ : కోరకావడి, కోరకొండె, కోరకొమ్ము, కోరగొను, కోరచూపు, కోరదౌడ, కోరపాగ, కోరమీసము, కోరవాయి, కోరవాలు, కోరవోవు, కోరసిగ.

కోరంగి. సం. వి. ఈ. స్త్రీ. ౧. చిట్టేలకి†. ౨. పిప్పలి†.

కోరకము. సం. వి. అ. పుం. న. ౧. మొగ్గ. ౨. తామరతూఁడు. ౩. తక్కోలము†. ౪. చోర మను గంధద్రవ్యము.†

కోరకావడి. వి. ( కోర + కావడి. ) కొనలు పైకి వంగి ధనురాకారముగ నుండుకావడిబద్ద. (వా)

కోరకితము. సం. విణ. (అ. అ. అ.) సంజాతకుట్మలము, మొగ్గతొడిగినది. (లత, మొ.)

కోరకొండె = కోరసిగ. వి. బిడ్డలు లోనగువారికి ముఖపార్శ్వమున వేసెడుకొండె. (శ. ర.)

కోరకొమ్ము. వి. (√ కోర) వాఁడియైనకొమ్ము. (బ్రౌ)

సీ. హోమకుండములపై కుటికి కొంకరకోరకొమ్ములఁ గోరాడుఁ గొంతతడవు. వరాహ. ౧౧. ౬౭.

కోరగించు. అ. క్రి. (ఇది 'కోపగించు' వంటిది- సం. కోరః.) ౧. మొగ్గతొడుగు, కోరకిత మగు.

సీ. జలదానిలంబునఁ బులకించెనో యనఁ గుటజ భూజంబులు కోరగించె. విక్ర. ౪. ౩౧. హర. ౨. ౨౦.

౨. ఉదయించు, పొడుచు.

శా. నాళీకాప్తుఁడు గోరగించునటముఁ బ్రత్యూషకాలంబునఁ .... శృంగారపుం, గేళాకూళిని దీర్ఘమాడి ....తపతీ. ౩. ౭.

౩. (కోపముచే) ఎఱ్ఱవాఱు ఎఱ్ఱనగు.

ఉ. నా విని కోరగింప నయనంబులు విస్ఫురితాధరోష్ఠయై, యావెడమాయలాఁడి .... వేం. పంచ. ౪. ౪౭౭. (చూ. ౪౭౬, ౪౭౮.)

౪. (క. కోరయిసు = మిఱుమిట్లుగొను.) మిఱుమిట్లుగొను, మిక్కిలిబెదరు.

సీ. మించుకన్నులు కోరగించురాజాన్నంబు నుపమింప రానిసద్యోఘృతంబు. విక్ర. ౪. ౧౮౮.

చ. కనుఁగవ గోరగింపఁ బొడకట్టె సముజ్జ్వల సాంధ్యరాగముల్. పారి. ౨. ౩౧.

౫. ముడుఁగు, ముకుళిత మగు.

గీ. కోరగించినకడకంటికొలికిఁ జూచి,వాఁడివాలికపూఁదూపునంక దీర్చి, చొరగి రతిదేవి పాలిండ్ల నొత్తగిలిన, యించువిలుకాని వ్రాసినా రిడుపునందు. వైష. ౬. ౧౫౦. (చూ :- వ .... కోరకితనేత్రత్రిభాగుండై....హర. ౫. ౩౯.)

౬. ఏమ్చు? (స. క్రి. బాధించు?)

గీ. కలిమిలేము లెఱుంగక గడుసువగల, బిడ్డ లింపైన వస్తువు లడ్డులేక, కొంచెతనమునఁ దెమ్మంచుఁ గోరగింపఁ, దల్లి యేమియు నన లేక తల్లడించె. కుచేల. ౧. ౩౯.

కోరగొను = కోరవోవు. (కోర + కొను.)

( హేమంతర్తువునందు ) ఉ .... కాళ్లు నేలపైఁ, ద్రొక్కఁగ రాక కోరగొని తొట్రుపడంగ .... పద్మ. ౩. ౬౯.

కోరచూపు. వి. ( √ కోర.) క్రూరదృష్టి.

(కిరాతవర్ణనము.) సీ. కోరచూపులయెఱ్ఱచేరుగ్రుడ్డుల వాఁడు....వరాహ. ౨. ౪౫.

కోరడి. వి. ఆవరణముగా వేసినపొదిమట్టిగోడ, కరగోడ. (శ. ర.)

కోరదూషము. సం. వి. అ. పుం. కోద్రవము, ఆరిక†.

కోరదౌడ. వి. (√ కోర.) చప్పిదౌడ, లోని కణఁగిన దౌడ. (బ్రౌ.)

సీ. అరేయి గల నెల్లవారును గోరదౌడలును వల్లనిమేను గలనెలంత, యొక్కఁత యిలు సొచ్చియువిదల పీడిచికొని పోవ....కవిరి. భార. మౌ. ౨౫.

వ .... కోరదౌదలును బల్లమీనంబులును గుబురచేతు లును....గలయొక్క బ్రహ్మరాక్షసుండు....బాహ్మ పీ. ४. ౨౦.

**కోరపాగ(గా).** వి. (√కోర) ఒక చెంగ కొరగున ట్లు చుట్టినతలపాగా. (వా)

**కోరమీస(ము).** వి. (√కోర.) పెద్దమీసము.(శ ర- సూక్ష్మాగ్రము గల మీసము. (బ్రౌ)

అ. మనుజరక్తసిక్తతనువును గోరమీ. సములు వృత్త లోచనములు....భార. అశ్వ. ३. ८६.

గీ. కోరమీస మిడిగ్రుడ్లు....కలిగి. నైష. ఱ. ౯३.

**కోరము.** వి. (√కోరు²) కొబ్బెర మున్నగునవి కోరు టకు ఉపయోగించుసాధనము. (వా)

**కోరము.** సం. వి. అ. పుం. ౧. అవయవాస్థిసంధివిశేష ము. (వాచ) ౨. కోరకము, మొగ్గ. ३. వృక్షాంకుర ము, చెట్టు మొలక. (శే.ని.)

**కోరవాయి.** వి. (కోర+వాయి) కోష్ఠమునందును శిర స్సునందును పుట్టువాతరోగము.

గీ....కోర, వాయి యనఁ గోష్ఠశీర్షస్థవాయు వొప్పు.... ఆం. భా. ౨. ౧౨౫.

**కోరవాఱు.** అ. క్రి. (కోర+పాఱు) - కోపముచే-ఎఱ్ఱ వాఱు, ఎఱ్ఱనగు.

స్రగ్ధర. అసుద్యుమ్నాగ్రజన్ముండు .... నేత్రాంతముల్ కోరవాఱన్, మీనంబుల్ దీటి పర్వెన్ మృగపరి వృఢగంభీరనాదంబుతోడన్. వరాహ. ३. ౨౦.

**కోరవోవు.** అ. క్రి. (కోర+పోవు) కొంకరలుపోవు.

ఉ....శీతధారజలంబు లర్థిమెయిఁద్రావి శరీరము కోర వోవఁగా, నాఱడి వొంద నేల....విక్ర. ౧. ౨౦౦.

గీ....ప్రత్యుద్గమాభివందనము లెలమి, నడవకుండిన మానసీ నన్నుఁ గన్న, నోరిమాటకుఁ దవకేమి గో రవోయె. భాగ. ४. ४౨.

**కోరసిగ=కోరకొం డె.** వి. (√కోర) ఓరసిగ, ముఖ పార్శ్వమున వేసెడుజుట్టుముడి.

(వేశ్యలు బుశ్యశృంగుని గూర్చి యనుకొను మాటలు) గీ. కోరసిగ వేయుచోటనే కొమ్ము పుట్టి,చెఱిచివది ....రామా. ౨. ౧౧౦.

(దండనాయకవర్ణనము) సీ. చెవిచెంత కొరగ వేసిన కోరసిగనందు తెల్లచెంగులబట్ట వెల్లఁ గట్టి. వైజ. ४ ౬౬.

**కోరా.** విణ. సంస్కరింపనిది, బాగుచేయనిది. (వస్త్రము లోహము. మొ.)

మ. తలఁ గోరా ముడిగుడ్డయున్ దనరఁ బ్రాతఃకాల మం దెప్పుడున్. చెన్న. ५. ౨५౨.

జ : కోరాబంగారు.

**కోరాడు=క్రోరాడు.** స. క్రి. (కోరు²+ఆడు.) ౧. (ఏనుఁగులు క్రీడార్థము దంతములతో గట్టు మున్నగు వానిని) క్రుమ్ము.

క. జేగురుఁ గోరాడినమద, నాగంబులరీతి....జై. భా. ६. ౧౬६.

(కరులు) సీ. దిక్కూలములు మోచి రెక్కొండమని సుమీ యలదరుల్ దాము గోరాడుచుండు. సారంగ. ౧. ६౨.

౨. (ఎద్దులు దున్నలు మొదలగునవి మదోత్సాహముల చేతఁ గొమ్ములతో) కొట్టు.

సీ. ఈకొండనెలయేఱు లీశ్వరువృషభంబు గోరాడు కూలముల్ గూడి యొప్పు. హరి. ఉ. ౬. ర.

సీ. కొమ్ముల నుదకమ్ము గోరాడి వే చల్లి కలఁచి క్రీ డింపనీ కాసరములు. పీ. శకుం. ३. ४.

సీ. హోమకుండములపై కుటికి కొంకరకోరకొమ్ములఁ గోరాడుఁ గొంతతడవు. వరాహ. ౧౧. ६౬.

३. (పంది ముట్టెతో నేల మున్నగునవి) తెల్లగిం చు.

సీ. అవనీతలము మోర నలవోకఁ గోరాడుఁ ద్రోవ గట్టినఁ దప్పుద్రోవ నుఱుకు....గీ....అమ్మహాకోల మవనిగహ్వరము చొచ్చె. విక్ర. ౨. ౧౩౫. రామ. ౩౭౮.

౪. (ఎలుఁగులు, మొనఖాదులతో) చీరు, చీల్చు.

వ....ఎలుఁగులు గులగులం బుట్టలు నిశితనిజనఖర కులిశకోటులం గోరాడ....మనుచ. ౪. ౩౮.

౫ (దుమ్ము లోవగు వానిని) రేఁగఁజేయు.

గీ. ప్రాభవంబున దోర్దండబలము మెఱసి. గ్రొచ్చి కోరాడి త్రవ్విరి కుతల మెల్ల. భాగ. ౯. ౨౦౫.

ఉ....క్రేళ్లుదాఁటెడుమదాళులతోఁ దెలిదమ్మిధూళి గో. రాడిరి... లతాంగులు రాగరసైకమగ్నలై. రామా. ౧. ౨౦౬. ఆం. భా. ౩. ౧౩౨.

౬. పాడుచేయు.

(ద్వివిదుఁ డనువానరుఁడు) సీ. సరిదుపవనసరోవరములఁ గోరాడి మందలఁ గొందల మొందఁ జేసి. భాగ ౧౦. ఉ ౫౪౦.

కోరాబంగారు. వి. (√ కోరా) అపరిశుద్ధమైన బంగారము, ఇతరలోహములతో కలసి వన్నె తగ్గిన బంగారము. (బ్రౌ. శ. ర.)

కోరింద వి. లక్కగలిగెడి యొకానొకతీఁగ. (శ,ర.)

సీ. ఇడిసినయిరుపులయెడలఁ బొడ్రేనుత్తరేనుగ నిండ కోరిందపాదల. ఆము. ౬. ౧౩.

సీ. ఎడ నెడఁ బికిలిపూ లిడినసంకుల పేర్లు కోరింద పూసలఁ గూడఁ దాల్చి. యయా. ౧. ౩౦.

కోరిక = కోరికి, కోరికె. వి. (√కోరు[1]. త. కోరిక్కై. క. కోటికె.) ౧. కోరుట; ఇచ్ఛ, వాంఛ, కామము.

క. కోరికయు నొల్లమియు లే,కేరూపున భూతములకు నెగ్గగు తెఱఁగుం, జేరక యకామవృత్తిఁ ద,పో రతి నున్నతఁడు బ్రహ్మముం బ్రాపించుఁ. భార. శాం. ౬. ౨౭౪.

క. ఈకథ యెవ్వరు చదివినఁ,గైకొన్నను విన్నఁగోరిక ను వ్రాసిన వా. రేకాలము శంభువికృప, నాకల్పము గందు రైహికాముష్మికముల్. భల్లా. (శ. ర.)

క....మీర లిచ్చుట మనికిగా, సారెకుఁ గొల్వఁగ వత్తు ను, గోరికతోఁ గంసహర ముకుంద మురారీ. పారి. ౧. ౫౧.

౨. అభీష్టార్థము, వాంఛితార్థము; వరము.

ఉ. ఎక్కుడుభక్తితోఁ గొలువ నిచ్చెదఁ గోరినవారికోరికల్. దశా. ౧. ౨౫౫.

క... నీకు నెయ్యది. కోరిక యేతెంచినాఁడ గురుదక్షిణయీ, భూరమణ వేఁడుము....ఆము. ౩. ౫౪.

గీ. నలువ కోరిక లొసఁగెడినాఁడు .... అచ్చ. రా. యు. ౭.

కోరికి(రిక్క) = కోరిక. వి. (√ కోరు[1]) ౧. వాంఛ ఇచ్ఛ, అభిలాషము.

క. నీకోరికి యప్రతిహత, మేకార్యము గోరి వచ్చి తెలిఁగింపుము... భార. ద్రో. ౨. ౧౬౧.

చ....ఇత్తెఱంగుగో, రిక్కకిఁ గత మేమి పాండవుల గెల్చి ధరన్ పగ మీఁ దలంచితే. భార. ద్రో. ౧. ౧౦౯.

౨. వాంఛితార్థము, అభీష్టార్థము.

క. నా కోర్కి విదపఁ జెప్పెద, లోకనుతా యొకటి యడుగ లోలత్వము చి,త్తాకలిత మయ్యె....భార. శాం. ౬. ౫౯౬.

క. కొలిచినబంటులకోర్కులు, పొలు పొనరఁగఁ బిడుకువేలుపున్మొదవునకున్. నీలా. ౧. ౨౧. హరి. ఉ. ౨. ౧౫౬.

౩. చిత్తము, మనస్సు, ఇచ్ఛ.

ద్వి. ఇదె నాదుముఖభంగ మీక్షింపు నాదు, కొదవ నీ కొదవఁగాఁ గోర్కి భావింపు, మనిన నచ్చెరు వంది యాత్మ భావించి, దమఘాదినాథుఁ

డాదానవి కనియె. రం. రా. అర. ౧౬౯ పా. ౪. పం.

కోర్కులపంట = వాంఛితముల నిచ్చునది.

ఉ....ముం, గొంగుపసిండి భక్తులకుఁ గోర్కులపంట జగంబులందు మా, మంగళశైలవల్లభునమంబగు దైవము లేదు చూడఁగ౯. అని. ౧. ౪౨.

కోరికిపడు = అపేక్షపడు, తమకించు.

మ. విని వీక్షించినదాఁక ముచ్చటపడు౯ వీక్షించి గాఢోపగూ, హనలాభం బగుదాఁకఁ గోరికిపడు౯.... మల్లభూ. శృం. ౨౨.

కోరికె = కోరిక.

(ఇచ్ఛ, వాంఛ)

క. కేదారశ్రీగురువర. పాదాంభోజాతమునకుఁ బ్రణతి యొనర్తు౯, మేదిని మామకమానస, కేదారము లందుఁ గోరికెలు ఫలియింప౯ తపతీ. ౧. ౭.

కోరితము¹. సం. విణ. (అ. ఆ. అ.) కోరకితము, మొగ్గ తొడిగినది.

కోరు¹. స. క్రి (క. త. మ. తు. కోరు.) ౧. వాంఛించు, కామించు; వరించు.

క. కోరినవంటకములు నా, నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తి౯. భార. విరా. ౧. ౨౧౯.

ఉ .... పరదారధనాదులఁ గోరనేని .... మనుచ. ౨. ౭౬.

ఉ. ఔర యి దేటిమోజన మృగాయతలోచన నన్నుఁ గోరునో, కోరదొ....దశా. ౨. ౩౧౩.

౨. ప్రతీక్షించు, నిరీక్షించు, ఎదురుచూచు.

గీ....కొంత ధైర్య, శాలినై యుంటిఁ దన్ని దర్శనముఁ గోరి. దశా. ౧. ౧౬౫.

ఇ: కోరిక, కోరికి, కోరికె.

క్రోరు². స. క్రి. చీరు; గీఱు.

సీ. తోరంపుఁగొమ్ములఁ గోరి చెంబాడుచోఁ గదిఁదిచిచ్చునఁ బ్రోచి కాల్చుచోట. నృసిం. ౪. ౧౨౧.

(వ్యవ) కొబ్బెరకాయలు కోరి కూరవండుదురు. వి. కామదండము, మగగుటి.

గీ. గురునిసతి దాదియు ననంగఁ బరఁగువారిఁ, గవయు కష్టుండు గురుతల్పగామి వాఁడు, ఉత్తమబ్రాహ్మణుఁడుగాక యుండె నేని,చంప కాతనికోరును ద్రెంప వలయు. విజ్ఞా. ప్రా. ౧౧౬. (ఇట 'కోలను' అనియు చదువ వచ్చును.)

శ్లో. ఆచార్యపత్నీం స్వసుతాం గచ్ఛంస్తు గురుతల్పగః, లింగం ఛిత్త్వా వధస్తస్య....యాజ్ఞ. ప్రా. ౨౩౩.

౨. గీఱినకొబ్బెర మున్నగుపదార్థము.

(వ్యవ) కొబ్బెరకోరుపూరణముపెట్టి బూరెలు వండినారు.

౩ (క. కోఱు)-పంట మున్నగువానియందలి-భాగము, పాలు, వంతు.

క. కో రనఁ బా లన వంశం, బు....అం. శే. ౪౫.

ఉ. వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ, గో రరి గొంచు సద్వ్యయముగోరి యొనర్చుట రాజధర్మవి, స్తారముగా బలారికి వచస్పతి చెప్పుట యప్రసిద్ధమే. భార. భీష్మ. ౩. ౩౦౯.

క. దున నియ్యకొన్నకృషికుఁడు, దునకయ యున్నేని యొకని దున్నింపఁ దగు౯,దునక దునసీయ కాఁగినఁ, గొనఁగా నగుఁ జేనియరియుఁ గోరు నతని చే౯. విజ్ఞా. వ్యవ. ౧౫౧.

సంగోరు = సగముపాలు.

మేటికోరు = పెద్దభాగము. (రైతునకు పెద్దభాగము. బ్రౌ.)

౪. (సం. కారః.) రాజాదుల కిచ్చుదనేతరవస్తురూపమైనకప్పము.

చ. అరులకుఁ గోరువెట్టితిఁ గదా వినుఁ దమ్ముఁడ వైరిఁ జంపి యె, వ్వరివలమూఁపుమీఁద విలు

ౖవెతు నయోధ్యకు నెట్లు పోవుదుర్, మఱలి సుమిత్ర నన్నడిగినం దలవంచుట యుత్తరం బె... రామా. ౫. ౩౫.

జ: కోరము, కోరాడు.

**కోరురాజనాలు.** వి. బ. ధాన్యవిశేషము. (బ్రౌ)

సీ....జిలకఱరాజనా ల్చింతపువ్వులు గోరురాజ నా ల్బూదపోల్ రాజనాలు. హంస. ౪. ౧౭౫.

**కోర్ణగండు=కోర్నపగండు** వి. క్రూరమృగవిశేషము, దుమ్ములగొండి.

మ.... కోర్ణగండ్లు గుఱుపోతు ల్కాండగొట్టె ల్కారం,గులు నెందెందుఁ గనుంగొనంగ వని లోఁ గోటానఁగోటుల్ నృపా. ఇందు. ౨ ౫౧.

**కోఱ.** వి. (సం. ఖురః. త. కోరప్పల్.) ౧. పల్లు, దంష్ట్ర.

చ. తమలముకెంపున న్మెఱుఁగు దాఁకినచెంధిర కావికోఱలు న్...ఒప్పమిండజం,గను చను దెంచె... హర. ౧. ౧౫.

సీ. మెఱుఁగుఁగోఱలు దుల్ల మృత్యుదేవతనోరు దట్టించి యంతకాలఁ దన్నినాఁడు. భీమ. ౧. ౧౧౦.

(కాలనేమి) ఉ. కోఱలు దీటుచున్ నయనకోణములన్ దహనస్ఫులింగముల్, కాఱఁగ... హరి. పూ. ౪. ౧౪౪.

గీ...వాసుకికోఱలు వెఱుక...భార. విరా. ౪. ౨౧౩.

చ. బరవస మొప్ప గాలితడఁబాటు మెయిన్ గవి దూఱి యొక్కకు, ర్కారము తమంబులో వెరఁజి కోఱలచేఁ గబళించి పొట్టపెం,జెర నుడు మంచుఁ దెచ్చి కని చేవ దొఱంగక ద్రుంచి వైచె...మనుచ. ౪. ౫౨.

**కోఱలుతీసినపాము = కోఱలు తీసినపామువంటిది.** (వా.)

**కోఱకైదువు**=దంష్ట్రాయుధము, పాము.

గీ. చలువ గలమట్టితో ట్టికిఁ జట్టుమీఁద, నిలుచె నందఱితోఁ గూడఁ బొలసు మెసఁగి, కోఱకైదువదు నెదారిగుఱుతుగట్టు,సామి సంతోసమున నున్న సమయమునను. ప్రబం. ౨౧౦. (కోఱకైదువదు నెదారి=సర్పరాజు,శేషుఁడు.)

జ: కోఱకొమ్ము, కోఱపల్లు.

**కోఱకొమ్ము.** వి. (కోఱ+కొమ్ము) పందికొమ్ము,వాఁడి మైన గుఱకొమ్ము. (బ్రౌ)

సీ. మీఁదికి న్వ్రాఁడికోఱకొమ్ములఁ బుట్టి లాగు కావరము గోరాడి యాడి. ౫. పు. ౭ ౩౦౪.

**కోఱడము.** వి. ౧. క్రోధము, కోపము.

చ. పడిగొని కాలకేయభటవర్గము ద్రోచినఁ దాను నేనలుం,గడఁగి నిశాచరేశ్వరుఁడు గ్రందుగఁ దాఁకి రణంబునందడిం, దొడిఁబడ ప్రేసెఁ దీప్రతరవోరశనిం దను నీడఁబోక కోఱడమున బిట్టు గిట్టినమునంది నెఱుంగక దుర్మదాంధుఁడై. నిర్వ. ౫. ౭౭. (మా. ౭౬.)

౨. క్రౌర్యము.

గీ. బాలకునిఁ జంపఁ దలఁచుట పాప మనక, కోఱడంబున నొండొరు మీఱఁ బాఱ, వేఱె వేఱె యుపాయముల్ వెదకి వెదకి, కలయఁ బల్కుకిరాతులఁ గాంచి యచట. దశకు. ౨. ౭౧.

౩. ప్రతికూలవచనము.

చ. ధనదునియొద్ద కేఁగి యుచితంబుగఁ బల్కి పురంబుఁ బాసి పొమ్మని మును చెప్ప కోఱడము లాడిన మద్భుజశక్తి యంబుజా, సనవరశక్తి మూలబలశక్తి యెఱుంగఁగఁ జాటి చెప్పి రమ్మని చతురాతిభాషణుఁ బ్రహస్తునిఁ బుచ్చె నురారి లంకకున్. నిర్వ. ౩. ౯౯.

ఉ. జీటికకల్లు ద్రావి మదసింధురగామిను లన్ని కేరియ్యల్వాఱుచు గాఁడుగీతములు వాడుచుఁ బొల్పుగఁ గ్రాలి యాడుచున్, గోఱడమాడు

చుం బఱులకు న్వాశవస్తులు గాక మేరకుక్, మీఱుచు వన్యకాంతలు రమింతురు తద్విపి నాంతరంబునన్. కు. సం. ౬. ౭౦౨. (ప్రాతప్రతిపాఠము.)

**కోఱపల్లు.** వి. ఔ. (√కోఱ) మృగదంష్ట్రవలె వాఁడిమొన గలిగి పలువరుసలో ప్రక్క నుండు పల్లు.
(వ్యవ) పిల్లవానికి ముందఱిపండ్లు వచ్చినవి కాని కోఱపండ్లు రాలేదు.

సీ. దేవేంద్రమదభేది తెలిచాయ గలకోఱపంటి
మొనల్ సానఁబట్టుకొమ్మ. కువల. ౨. ౧౦౨.

**కోల.** వి. (క. త. మ. కోల్.) ౧. చేతికఱ్ఱ; కఱ్ఱ; వెత్రము.

గీ. బాలుఁ డొక్కండు కొండొకకోల నేతఁ, బ
ట్టుకొని... భార. ఆది. ౬. ౨౬౦.

చ. కలికిపిసాళిసవ్వు లెసఁగన్ వటుభూర్తులు
కొంద ఱొండొరుం, దలకొన నెచ్చరించి త
మదండపుఁగోలల నున్నమాఱుగోఁ, చులు వె
సఁ బుచ్చి వైచి... ప్రభా. ౧. ౧౦౨. (దండపుఁగోల=దండముగా నుపయోగించుకఱ్ఱ.)

గీ... పెగ్గడికత్తె లరిది, పైఁడికోలలు పూని వే వ
దఁ డటంచుఁ, బల్లకీముందఱను బరాబరులు సే
య. యయా. ౪. ౧౫౮.

౨. (చెఱకు) గడ. (చూ. చెఱకుఁగోల.)

3. (గొడుగు మున్నగువాని) కామ, దండము.

చ. గొడుగుల గాలిఁ గూల్చి మఱి కోలలతోడన పా
ఱనార్చెఁ జే, డ్పడ జడి మేఘుఁడ ట్లకట పాం
థులపైఁ దన కెంత వైరమో. ఆము. ౪. ౧౫౯.

౪. పుల్ల, పుడుక.

క. వాలికపూములుకులఁ ద,త్కాలంబునఁ దొంటి
యంపగంట్లును రేఁగెన్, జాలఁగ నురిసినపుం
డులు, కోలలఁ గాలఁకు టని యాశకుంతల క
య్యెన్. పి. శకుం. 3. ౧౭౦.

౫. బాణము.

క. విందునిసారథి నొకకో,లం దునిమిన వాహము
లు గలంగంబడి... భార. భీష్మ. 3. 33.

ఆ. కుండనీరు ముంప సుమసుమధ్వని విని, కుంభినిన
దబుద్ధిఁ గోలఁ దొడిఁగి, కడిమి సేయు... భా.
రా. అయో. ౧౭౬.

౬. కత్తికట్లుకాల్చుట కుపయోగపడుశూలము, ఇనుపసలాక.

సీ. చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ దగి
లించి నురియతో బిగియ ద్రిండు, గట్టినను
నుఁజేలక ప్పెంకతయును జెన్ను నేయంగ
దాపలిచేలియందు, బెడిదంపుఁగోలలు బెడఁ
గొంద... భార. విరా. ౧. ౨౧౧.

౭. శిశ్నము, మగగుఱి.

గీ. గుదమునం దేనుమాఱులుఁ గోల నొక్క, మాఱు
దాపలిచేఁ బదిమార్లు రెండు, చేతులను నేడు
మాఱులుఁ బ్రీతి మన్ను, చమిరి శౌచంబు చే
యుట చదువుఁదనము. విజ్ఞా. ఆచా. 3౯.

విశ. దీర్ఘవృత్తము. (వ్యతి. గుండ్రము.)
ఉదా: కోలమొగము, కోలనిమ్మ, మొ.

**కోలమూఁపు**=ఎత్తైనమూఁపు.

సీ. బూరకాసలు నీచవోయిన చేతులుఁ గోలమూఁ
పులు గుదిగొన్న తొడలు. ఉ. హరి. ౨. ౧౨౨.

**నేలకుఁగోలకుఁ దెచ్చు**=(కొందఱను నేలఁ బడవైచు కొందఱను బాణములతో కొట్టు) పలువిధముల క్షోభపెట్టు. (క్రిందుమీఁదుచేయు. శ. ర, బ్రౌ.)

క. నకులుఁడు సహదేవుండును, బ్రకటభుజాసుభ
రణమున నరాతిబలము నే, లకుఁగోలకుఁ దెత్తు
ర నో, రికివచ్చినయట్టు లాడితె యిబ్బంగిన్.
భార. కర్ణ. 3. ౫౫.

గీ. కోలుమసఁగి గురుండు పాంచాలసేన, నేలకును
గోలకును దెచ్చె... భార. ద్రో. ౫. 3౦౧.

**కోలకుఁదెచ్చు**=బాణమునకు గుఱిసేయు.

(శ్రీరామావతారమున) గీ. కడలిఁ గోలకుఁ దెచ్చి
పగబ్బి పీవ. పారి. ౧. ౪౯.

పా: కోల లేనికొట్టు, త్రాడు లేనికట్టు. (బ్రౌ)
జ: కోలకాఁడు, కోలక్రోఁతులు, కోలగగ్గర, కోలజాన్ను, కోలజెముడు, కోలడబ్బ, కోలదివియ, కోలదివ్వె, కోలనిమ్మ, కోలపాల, కోలపొన్న, కోలమెఱుఁగు, కోలలవారు, కోలవస, కోలాకుపొన్న, కోలాట, కోలాటపుఁగమ్మ, కోలెమ్మ.

**కోల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చవ్య మనుగంధద్రవ్యము కే. ౨. పిప్పలి కే.

**కోలంబకము.** సం. వి. అ. పుం. వీణాశరీరము, వీణయొక్క సర్వాంగము.

**కోలకందము.** సం. వి. అ. పుం. కృమిఘ్నము, ఒకజాతిదుంప కే. (రా. ని.)

**క్రోలకము.** సం. వి. అ. న. ౧. తక్కోలపుఁజెట్టు. ౨. మిరియము కే. పుం. ౧. అంకోలము, ఊడుగు కే. ౨. బహువారకము, విరిగి కే.

**కోలకాఁడు.** విశ. (కోల+కాఁడు.) వేత్రధరుఁడు, చోపుదారుఁడు.
ద్వి. వెడనవ్వు గదుర భూవిభుని డాయుటయుఁ, గడు రయంబునఁ గోలకాం డ్రదలింప, వడి త్రోయవచ్చినవారి వారించి, పుడమిఱఁడా తనిపోలిక దెలిసి. నవనాథ. ౪. ౧౩౦ పా. ౧౩౦.
సీ. అఖిలజీవుల నేర్పు యముఁడు నాముందఱఁ గోలకాఁడై యుండు వేళ యెఱిఁగి. సీతావి. ౪. ౧౧౧.

**కోలక్రోఁతులు.** వి. బ. (కోల+క్రోఁతులు) బాలక్రీడావిశేషము, కోఁతికొమ్మంచి.
సీ. కోలక్రోఁతులు బిల్లగోల్లు దూరనగోల లందలంబులు మఱి కుందికాల్లు...గీ...ఆదిగా శైశవక్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

**కోలగగ్గర.** వి. (√ కోల) కాళ్లకు త్రాడు తగిలించి ఎద్దులను మూటకట్టుగా కట్టి పడవేయుట.
గీ. ఎద్దులను గాళ్లు గట్టి క్రిందు వేయు టొప్పుఁ, గోలగగ్గర యనఁగ...ఆం. భా. ౩. ౩౨.
గీ. అసియుఁ శాత్రయుఁ దేఁ బంపి యాంత్రవల్లిఁ, గోలగగ్గర ద్రోయఁ దక్కుజముతోడ, నొరగి రక్కసుతో దైన్యవిరహితముగ, ధర్మమెఱిఁగించుసూక్తి నాతండు పలికె. ఆము. ౬. ౭౭. (శ. ర, బ్రౌ. పా-కోలగగ్గరద్రోయఁగ= పసరమును కట్టి పడవేయునట్లు పడవేయఁగా)

**కోలచారి.** వి. నాట్యవిశేషము
ఉ. దేశిపథంబు రట్టణము దివ్యకళాసియుఁ గోలచారి... శ్రీరం. మా. ౪. ౧౬౨.

**కోలజాన్ను.** వి. (√కోల.) ఒకరకము తేనె, ఔద్దాలకము. (శ. ర)

**కోలజెముడు.** వి. (కోల+జెముడు) ఒకవిధ మగు జెముడు, సింహుండభేదము కే.
గీ. నేలతీఁటకసిందయుఁ గోలజెముడు ... మొదలు, గాఁ గలుగునట్టిచిఱుచెట్లఁ గాంచి యంత. హంస. ౪. ౧౦.

**కోలడబ్బ.** వి. (√ కోల.) ఒకజాతిడబ్బ కే. (శ. ర.)

**కోలదలము.** సం. వి. అ. న. నఖ మనుగంధద్రవ్యము కే.

**కోలదివియ.** వి. (√ కోల) కాఁగడా.
గీ. కోలదివియలవెలుఁగు దిక్కులకు నిగిడి, తొడరి పురవీథిఁ జీకటిఁ దొలఁగఁ దోల. దశకు. ౫. ౯౦.

**కోలదివ్వె(వ్వియ)**=కోలదివియ.
ద్వి...తలవరులు, కోలదివ్వెలవారిఁ గొంచు నవ్వీథిఁ, బదపదఁ డిఱ దొంగపదపంక్తి చూప్పు, వదలకుం డని రాఁగ...ద్వి. హరిశ్చ. ఉ. ౨౩౯ పం.

**కోలనిమ్మ.** వి. (√ కోల) నిడుపుగా నుండుకాయలు గలఒకజాతినిమ్మ కే. (శ. ర.)

**కోలపాల.** వి. (√ కోల.) అర్కపుష్పిక 1. (శ. ర.)

**కోలపుచ్ఛము.** సం. వి. అ. పుం.- పందితోఁకవంటి తోఁక గలది- రాపులుఁగు.

**కోలపొన్న**=కోలాకుపొన్న. (కోల+పొన్న.)

సీ. కోలపొన్న యనంగఁ గొమరారుఁ బృశ్నిపర్ణి యు...ఆం. భా. ౨. ౫౫.

**కోలము.** వి. (త. కోలమ్=ఆట.) నాట్యభేదము. (బ్రౌ.)

గీ. గగనరంగస్థలంబున మిగులఁ బ్రౌఢి, మమునఁ గాళిక నిల్చి కోలము నటింపఁ, బొరి మొగంబున రాలునిప్పక లనంగ, గుంపులై రాలె మహి నింద్రగోపతతులు. ఆము. ౪. ౯౫.

**కోలము.** సం. విణ. (అ. ఆ. అ.) ఖంజము, కుంటిది. వి. అ. పుం. ౧. పంది. ౨. తెప్ప. ౩. శనిగ్రహము. ౪. ఒడి. ౫. కౌఁగిలి. ౬. మూషికము, ఎలుక. న. ౧. అర్ధకర్ష మెత్తు. ౨. తక్కోలము 1. ౩. రేఁగుఁ బండు. ౪. త్రికటుకము. ౫. సంతి, సొంటి.

**కోలమెఱుఁగు.** వి. (కోల+మెఱుఁగు) నిలువు మెఱపు, ఐరావతి.

సీ. శివుదిక్కునందు వేకువఁ గోలమెఱుఁగులు మెఱసె...హరి. పూ. ౭. ౧౬౦.

వ. కోలమెఱుంగుల తెఱంగున రంగు మీఱు బంగారుజలపోఁత బెత్తంబులనటన ఘటిల్ల ...కళా. ౭. ౬౯.

**కోలలవారు.** వి. బ. (√ కోల) వేత్రధరులు, చోపుదారులు.

వ. సైనికులం బేరుకొని వాసి యెక్కించి పురికొలుపు కోలలవారి యెలుంగులును...ఉ. హరి. ౩. ౨౭.

**కోలవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి 1.

**కోలవస.** వి. (√ కోల) జటిల 1. (శ. ర.)

**కోలశింబి.** సం. వి. ఈ. స్త్రీ. ఖట్వ, కంబళిచిక్కుడు 1.

**కోలాకుపొన్న.** వి. (కోల+ఆకు+పొన్న) పృశ్నిపర్ణి, అంఘ్రిపర్ణిక 1.

సి...చిత్రపర్ణియు నల్లతీఁగె కోలాకుపొన్న...హంస. ౪. ౧౦.

**కోలాట(ము).** వి. (కోల+ఆట-త. కోలాట్టం.) హల్లీసకము, స్త్రీలు చేతికోలలతో తాళము వేయుచు పాడుచు చుట్టును తిరిగి ఆడెడు ఒకవిధమగు ఆట.

సీ ..కోలాట మనఁగ హల్లీసకం బలరుచుండు. ఆం. భా. ౧. ౧౩౦.

గీ...నిద్దంపు వేశ్యకఁ, దవిలి కోలాట మాడుగంధర్వసతుల. చంద్రి. ౨. ౨౦.

వ...మోహనాంగు లపారశృంగారంబులు నెఱపుచుఁ గోలాటలాడ. ల వి. ౫. ౭౪.

(ఈ క్రింది ప్రయోగమున పురుషుల ఆటగా కూడ కనఁబడుచున్నది.)

సీ. కోలాటములు పిల్లఁగ్రోవులు గుమ్మడి క్రోవిక్రూఁతలు సూఁదుఁగ్రోవులు...గీ...ఆడుకొనుచుఁ, జముపుపై సంధ్యపై నాస్థ చాల లేక, పొలఁతి యోఁకిలి నేఁ బ్రొద్దుపుచ్చుచుండ. హంస. ౩. ౧౪౬.

కోలాటము వైచు=కోలాటము వేయు.

శా. గీర్వాణబాలామణుల్ ...పాడుచుం, గోలాటంబులు వైచి రాయలి కను గూర్తింగటాక్షింపఁగన్. చంద్ర. ౨. ౧౩౯.

**కోలాటపుఁగమ్మ.** వి. (కోలాటము+కమ్మ) ఒకవిధమైననగ, కర్ణాభరణవిశేషము.

సీ. కడియాలుఁ బెక్కు జోకలయుంగరములు నుంగరయుఁ గోలాటంపుఁగమ్మ జోడు. కళా. ౭. ౬౬. (ముంగరయును గోలాట కమ్మజోడు. పాఠాంతరము-శ. ర.)

కోలారికము = కోలారికము. చూ. (త. కోలారిక్కమ్.)

కోలారికమంపు=ద్వంద్వయుద్ధమునకు రమ్మని (కటారిని) పంపు.

క. నూరేలను నింద్రజాఁడు కోలారికమంపిన నతండు లలితోల్లాసం, బారంగఁ గొదవపడెనా, యారీతియు మంచి దని ప్రియంబునఁ బలికెన్. కువల. ౫. ౫౫.

**కోలాస.** వి. (కోలు² + ఆస.) పేరాస, అత్యాశ.

ద్వి. కనుకనిఁ బ్రాణలింగప్రసాదంబుఁ, గొన నిత్తురే మీకుఁ గుటిలాత్ములార, కోలాస లేల పైఁ గొనరఁ గుంచంబు, గూలబడ్డట్లుగు...బస. పు. ౭. ౫౭౯.

సీ...దర్శనములు కోలాసఁ గొనక...పి.శకుం. ౪. ౧౭౫.

**కోలాసకత్తియ(త్తె).** వి. (√ కోలాస) అత్యాశ గలయాఁడుది.

ద్వి. పుట్టినప్పుడ నేర్చుబుద్ధులపోక, కోలాసకత్తియ...అలంజెతల్లి. పండితా. పురా. ౧౨౨ పొ.

**కోలాహలము.** సం. వి. అ. పుం. కలకలము, అలబలము, పెద్దరొద.

**కోలి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. రేఁగుచె. ౨. గంగరేఁగు చె.

**కోలు¹.** వి. (√ కొను) ౧. అనుప్రయుక్తమైన కొనుధాతువునకు భావార్థకరూపము.

గీ. తమి నెమకోఁలుసేయు మాతల్లి చెలుల. కళా. ౭. ౭౨.

సీ. పొంగారుమైఁ దోఁచుశృంగారచేష్టలతమిఁ దెచ్చికోలుమార్గమున డాఁచి మనుచ. 3. ౯౭.

౨. కొల్ల.

క. మున్నును నేఁ గారణముగ, నన్నియుడుముల ను భవించి కనుజాలు వీరిం, గన్నారఁ జూతుఁ గాని జగన్నుత భీష్మునకుఁ గోలుగా నీఁ జాలన్. భార. భీష్మ. 3. ౭౫౧.

జ: కోలుపడు, కోలుపుచ్చు, కోలుపోక, కోలుపోవు, కోల్పాటు.

**కోలు².** క్రి. విశే. (క. కోల్) మిక్కిలి. (చూ. కోలుమసఁగు.)

విశే. పెద్ద. (ఈయర్థమునఁ గొన్నిముద్రితప్రతులలో 'క్రోలు' అని గలదు.)

ఉదా: కోల్పులి, కోలుమొసలి, మొ.

జ: కోలాస, కోలాసకత్తియ, కోలుకాఁడు, కోలుకొను, కోలుకోలుపు, కోలుతల, కోలుపులి, కోలుమసఁగు, కోలుముందు, కోలుమొసలి.

**కోలు³**=కోలె². అవ్య. మొదలుకొని, ఉండి.

గీ. ఇప్పు డేఁడాదిగోల్ సామి యేఁగుదేమి, నేల యానినతెఱఁగున నోలి నెపుడుఁ, గడిమి నెడయాక తిరుగు మేకంబు లడవి. యయా. ౧. ౧౦౬.

**కోలుకాఁడు.** వి. (శ.ర.- √కోలు²?- క. కోలుగాఱ=బంటు. కోలకాఁడు?) ౧. సుంకరి క్రింది బంటు.

(సంతవర్ణనము) సీ. పెనుఁగోలుకాండ్రకు జనసమూహంబులగణుతి చూపెడునాయకప్రభుండు. హంస. ౨. ౪౮.

౨. కావలివాఁడు, కాపరి.

క. కనుఁగొనినమాత్ర నొండొరు, మనములు నొడఁబడిన వారి మతియొక్కఁడకుం, జనకుండ నడ్డుపెట్టఁగ, మనసిజుఁ డనుకోలుకాఁడు మాటికిఁ దటిమెన్. విక్ర. ౫. ౨౫.

3. నియమించెడియధికారి.

క. పులి కోలుకాఁడు గావున, నలయక వరుసఁ జెఁగి వాని ననుపఁగ నోకనాఁ, డొలసి రొమ్ముచెవులపోతుకుఁ, గలయఁగ నీవరున యము

చుగ్రక్కున జెప్పన్. నా.పంచ.౧.౫౭౮.

**కోలుఁడు.** సం. వి. అ. పుం. ఒకసంకీర్ణజాతివాఁడు.

**కోలుకొ(ల్కొ)ను.** అ. క్రి. (√ కోలు².) ౧. ఉత్సహించు.

ఉ. ...నీకటాక్షదృ, క్కోణముప్రాపున న్మరుఁడు గోల్కొని పంత మెలర్పఁగాఁ గొనెన్, బాణదశార్ధపాతమునఁ బావకుఘూరిమనోభిమానమున్. నైష. ౮. ౩౧.

సీ. భద్రేభములు వీడుపడఁ దాఁకఁ గోల్కొని గుండెలు పగులంగఁ గ్రుమ్మి క్రుమ్మి. గీ...రణంబులో నేపు చూపె, భట్టి జగజెట్టి డీకొల్పు భద్రగజము. విక్ర. ౮. ౧౧౧.

౨. వర్ధిల్లు, వృద్ధి నొందు.

క. దీప మణఁగఁ జీకటియును, గోప మడుగ శాంతిగుణముఁ గోల్కొనుక్రియ నా, టోపోద్భటమగువేసవి, కైపు సడలఁ దోఁచెఁ గారుకాలము దళమై. పాండు. ౮. ౧౯.

చ. తనయుదరంబునం బొడమి తామ్రరుచిచ్ఛట లుల్లసిల్లఁ గో,ల్కొనుధరణీజసంతతికి...ఆము. ౫. ౧౧౬.

౩. (మూర్ఛాదిబాధలనుండి) తేఱుకొను, స్వస్థత నొందు.

క. నరసూను నపుడు కర్ణజుఁ, డిరుమూఁడుశిలీముఖంబు లెద నించిన నొ,చ్చి రయంబునఁ గోల్కొని వా,నరదముఁ దునిమెన్ సకేతుహయసూతముగాన్. జై. భా. ౭. ౧౯.

క. దనుజేంద్రుఁడు గోల్కొనఁ,గనిశముఁ బోఁ ద్రోలుమండు సమరగణంబున్. కు. సం. ౮. ౩౬౯.

గీ. కొంతమాత్రపుటేవి గాకింత లేసి, తలము తప్పినయావులు తగుల నియ్య,నిచ్చి మఱి కోలుకొన లేక యేపు దఱిఁగి, పోవఁ దొగడకె జనులు దుర్బుద్ధి యనుచు. హరిశ్చ. ౮. ౫౩.

**కోలుకొలుపు.** స. క్రి. (√ కోలుకొను) కోలుకొనఁజేయు. (ఉత్సహింపఁజేయు, ప్రోత్సాహపఱుచు.)

సీ. రవిఁ దెత్తుమే నీకు రమణుఁడు గా నలకూబరుఁ దెత్తుమే కోలుకొలిపి. కు. సం. ౬. ౬౭౪.

**కోలుకోలన్నలు.** వి. బ. బాలికాక్రీడావిశేషము.

సీ.గుజ్జెనగూడులు కోలుకోలన్నలు గీరనగింజలు ...హంస. ౫. ౧౫౫.

**కోలుత(ల్త)ల.** వి. (కోలు² + తల-త.కోలుదల్.) ఎదుటనిలిచి చేయుయుద్ధము; యుద్ధము; దెబ్బ.

వ. శకుని కిడంగి యోధవరులతో మీరు కోల్తల నేయుం డేను బెడమట్టునఁ దాఁకి ధర్మనందనాదుల సమయించెద నంచు సముద్ధతిం గదిసె. భార. శల్య. ౧. ౩౩౭.

శ్లో. యుద్ధ్యధ్వమగ్రతో యావత్ పృష్ఠతో హన్మి పాండవాన్. సం. భార. శల్య. ౨౨.౨౬.

ఆ. అతఁడు వడిన నెండి యానేనఁ గోల్తల, నేయ నొకఁడు లేమి సిద్ధము...భార. ఉద్యో. ౨. ౨౧౯.

శ్లో. భీమసేనే చ నిహతే కోన్యో యుధ్యేత భారత, పరేషాం తన్మమాచక్ష్వ యది వేత్థ పరంతప. సం. భార. ఉద్యో. ౫౫. ౬౧.

మ ...దనుజేంద్రుం డాత్మఁ జింతించి కోల్తల నేఁ జేసి జయింతు వైరి నని యాత్రాభేరి వ్రేయించినన్. రామా. ౫. ౬౦.

క. భూరిబలఘోర మగు నా, భూరమణునికోలుతలకుఁ బోవక భీష్మ, స్ఫారబలము ద్రోణునిదో, స్సారంబును నచ్చి నీదుసైన్యము పెనఁగెన్. భార. భీష్మ. ౨. ౧౧౯.

చ.గురుఁ డనుతీవ్రమారుతముకోల్తల కోర్వక ధర్మపుత్రబలం, ధురబలవారిదోత్కరము దూలుడు...భార. ద్రో. ౧. ౨౬౯.

క. అకటి నపుడు గోల్తలకుం, గాక కలంగఁబడి వాల్గడలకు విచ్చెం, జీకాఁకుపడుచు నంగము, హీకాంతునిసేన లెల్ల నెంతయు భీతిన్. కళా. ౫. ౬౦.

కోలుత(ల్తు)లసేయు = ౧. యుద్ధసన్నాహము చేయు; (యుద్ధమునకు) సన్నాహము చేయు.

గీ. మోహరించెను దండెత్తె మొనసె దాడి, చేసెఁ బోట్లాగఁ గోల్తలచేసె ... అనఁగఁ బేర్లొన రుచుండు, సాహసోద్యోగ మొనరించె ననుట కు...ఆం. శే. ౧౩.

వ. సుశర్మ త్రిమ్ముండు సంగతంబుగాఁ గోల్తలసేసి రథసమూహంబుతో విరాటవ్యూహంబు నెదుర్కొని...భార. విరా. ౩. ౧౫౨.

మ. అనికిం గోల్తలసేయ వార్చడచుచో ... అచ్చ. రా. యు. ౨౩౭.

౨. యుద్ధము చేయుటకు ప్రోత్సహించు.

గీ. ఉన్నచోటన కదలక యున్నద్రోణ, భీష్ములను గోలుతలసేయఁ బెఱిగి సేన, చంద్రుఁ డుదయింపఁ బెరిఁగినశరధియట్లు, తోడుతోడుతఁ బొంగారి చూడ నొప్పె. భార. భీష్మ. ౨. ౧౧౭.

౩. (సేనలను) నడపు.

క. సమరథుఁడు బిరుదు లక్ష్మణ, కుమారకుం డేచి మొనలఁ గోల్తలసేయుఁ, మిను నెల్ల మిగులు భుజగర్వము మదముం గలఁడు కొనఁ డ రాతుల నధిపా. భార. ఉద్యో. ౪. ౨౨౪.

శ్లో. లక్ష్మణస్తవ పుత్రశ్చ తథా దుశ్శాసనస్య చ. యుద్ధానాం చ విశేషజ్ఞౌ ప్రణేతారౌ చ సర్వశః. సం. భార. ఉద్యో. ౧౬౮. ౧౪, ౧౫.

కోలుప(ల్ప)డు. అ. క్రి. (కోలు[1] + పడు) ౧. క్షీణించు, తగ్గు.

క. అలకాఁపువగలచిలుకల, కొలికికిఁ దమి యింత యైనఁ గోల్పడక మదం, బలరారి యుండ ...హంస. ౪. ౧౫౫.

౨. హింసింపఁబడు.

క. ద్రోణాచార్యునియుగ్రపు, బాణంబుల కోర్చి యతఁడు పసునంతకు నక్షీణధృతి ననసమసమర, క్షోణి నిలిచి కర్ణుచేతఁ గోల్పడియెఁ గడే. భార. కర్ణ. ౩. ౨౪. (ళ.ర.పా.)

మ. అడవిం గోల్పడు ప్రాణి యొయ్యదియు లేకాటోప మేపారన, చ్చెడుగం డుగ్రతఁ ద ద్ర్వజంబు దెసకుం శీఘ్రంబ యేతెంచె ... హరి. పూ. ౮. ౧౦౪.

౩. అపహృత మగు.

క. హరిభార్యలు బోయలచేఁ, బరిభవమునఁ బొంది కోలుపడి రని మదిలోఁ, బరితాప మొందకుము భూ, సురశాపము మున్ను గలదు నూవారలకుఁ. వి. పు. ౮. ౨౮౩.

స. క్రి=కోలుపోవు.

(పోఁగొట్టుకొను.)

చ...నిన్నునుం, బుడమిని దమ్ముఁ గోల్పడిరి పార్థివవర్ధితు లైనపాండవుల్. భార. సభా. ౨. ౧౪.

చ...కోల్పడి తీవును నీదుశీలముం. భార. శాం. ౩. ౧౪౫.

క. బలవంతుఁడు పై నెత్తిన, బలహీనుఁడు ధనము గోలుపడినయతఁడు మ్రుచ్చిల వేఁచువాఁడు గామాతురచిత్తుఁడు నిద్ర లేక యుందురు రథిపా. భార. ఉద్యో. ౨. ౨౧.

ఆ. అలికొలుకు ననుజాఁ గోలుపడితి. భా. రా. యు. ౫౭౪. భార. భీష్మ. ౧. ౮౦.

కోలుపుచ్చు. స. క్రి. (✓కోలుపోవు.) కోలుపోవఁ జేయు.

(పోఁగొట్టు; చంపు.)

చ. అనవుడుఁ గీచకుండు హృదయంబునఁ బొంగి లతాంగితోడ నిట్లను ధృతి గోలుపుచ్చెఁ గుసుమాయుధుఁ డేటివిచార మిట్టు వేఁప నగునె...భార. విరా. ౨. ౨౬౩.

ఉ. ఏమటి రక్షపాలనిమ్ము గేంద్రుని నక్కయుఁ గోలుపుచ్చు సంగ్రామములోనఁ గన్గలిగి కానక తక్కిన నాశిఖండిచే, నీమనుజేంద్రుఁ గో

ల్పడమె...భార. భీష్మ. ౧. ౮౦.

చ...పూ,రుఁ గురుని ఠంతి రాఘవు మరుత్తునిఁ గాలము కోలుపుచ్చెదే. అను. ౨. ౮౦.

**కోలుపు(ల్పు)లి.** వి. (కోలు² + పులి) పెద్దపులి, వ్యాఘ్రము.

చ. అదియును గాక కోలుపులి నైనను గారెనుపోతు నైన నున్మదకరి నైన నుగ్రమృగనాథుని నైనను గిట్టి ముట్టి...పట్టుదు ... భార. విరా. ౧. ౮౩.

క... గొజియలపిండునను గవియుకోల్పులిక్రియ...భార. భీష్మ. ౧. ౨౯౬.

**కోలుపోక.** వి. (√కోలుపోవు) పోఁగొట్టుకొనుట.

సీ...అధిక,గుణుని సౌభద్రునిఁ గులభూషణంబుఁ బాంచాలితనూజపంచకముఁ గోలు. గీ.పోకఁ జేసియు గెల్పు గెల్పుగ మదీయ,బుద్ధి కెక్కొన దయ్యె...భార. శాం. ౧. ౬.

సీ. భూసుర దేవార్థములు పుచ్చికొనుట యర్థము గోలుపోక బాంధవులచావు...గీ...పీన నొకటఁ, గార్శ్యపాండురత్వంబులు గలుగు నన ఘ. భార. అను. ౪. ౩౮౬.

**కోలుపో(ల్పో)వు**=కోలుపడు. స. క్రి. (కోలు¹ + పోవు) పోఁగొట్టుకొను.

గీ... తొల్లిటిరాజవరులు, కాలవశమున నాయువుల్ గోలుపోయి...భాగ. ౧౨. ౧౭.

గీ...జంభారియెదురఁ, గాంతిసంపద గోల్పోయి కలియుగంబు, సాధ్వసాతిరేకంబున జలదరించె. నైష. ౭. ౯౫.

సీ. తాతలచేఁ బాలితం బైనమత్పురం బిటు కోలుపోదునే హీనవృత్తి. మార్క. ౬. ౧౧.

అ. క్రి. చెడు.

గీ. ఇట్టు లగుట యెఱిఁగి యెల్లభంగుల రహస్యంబు కోలుపోనియట్లు గాఁగ,నడరునీదుకోర్కి కనురూప మెట్టెది,యట్టిభోగభంగి ననుభవింపు. భార. విరా. ౨. ౨౬౨. (రహస్యము కోలుపోనియట్లు:-రహస్యము బయల్పడకుండునట్లు.)

చ. కినియుట మాను మేలె మునికిన్ గుపితత్వము శాంతవృత్తి నా,యనునయ మాదరింపు వినుమల్పతపంబులచేతఁ గోలుపో,దు నె మఱి యట్లు గాక యతిదుష్కర మైనతపంబు సంచితం, బనఁ దగు బ్రహ్మచర్యమును నాఁడిపోవె కటా శపించినన్. భార. అశ్వ. ౩. ౩౫.

శ్లో. న చ మాం తపసాల్పేన శక్తోభిభవితుం పుమాన్. సం. భార. అశ్వ. ౫౩. ౨౪.

౨. మోసపోవు.

సీ. కోలుపోయె ననంగ జేలుపోయె ననంగ మోసపోయె ననుట పొలుము...ఆం. భా. ౩. ౯౭.

**కోలుమ(ల్మ)సఁగు.** అ. క్రి. (కోలు² + మసఁగు) కసిమసఁగు, మిక్కిలి విజృంభించు; అతిశయించు.

చ. కుపితయుగాంతరుద్రుగతిఁ గోలుమసంగినవాఁడు భీష్ముఁ డేఁ,చి పటుభుజాబలంబు విలసిల్లఁగ మార్కొనకున్కి యొప్పునే. భార. భీష్మ. ౨. ౧౩౮.

చ...అదినూ,కరములు పోలెఁ గోల్మసఁగి కైపునఁ గొన్ని మదాంధగంధసిం,ధురములు...కు. సం. ౧౧. ౭౨౩.

సీ. కోలుమసంగెదుకోర్కులవెనువెంటఁ బాఱుచు ననికికి నూఱటయును. అ. లేమిఁ దాల్మి గొనఁగ లేక యలంమరి...భార. విరా. ౨. ౩౧౫.

స. క్రి. చంపు, కసిమసఁగు.

సీ. తండ్రి యధ్వరవిఘాతకు బారిసమరినఁ గొడుకు శంఖనఖాఖ్యుఁ గోలుమసఁగె. కకు. ౨. ౧౧౮.

**కోలుముందు.** వి.(కోలు² + ముందు) మిక్కిలిముందు, మున్ముందు.

గీ. లలితలావణ్యతారుణ్యలక్షణముల, నవరలక్ష్మి యటంచు నయ్యాబలమీఁద, నలినవాభుండు

కనువేసినాఁడు గానఁ, గోలుముందుగ నీవ చే
కొనఁగ వలయు. వరాహ. ౧౧. ౫౨.

**కోలుమొ(ల్మొ)సడి, కోలుమొ(ల్మొ)సలి.** వి. (కోలు+మొసడి) పెద్దమొసలి.
తరలము...వీన పెన్నఁడు నాడ నో, దుదురు స
న్నను లిందుఁ గోల్మొసడుల్ గొను న్వడిఁ జొ
చ్చుదుర్. భార. ఆది. ౮. ౧౪౮.
సీ. మునుఁగుచో సడుముఁ గోల్మొసలి మ్రింగె...
కళా. ౪. ౧౪౨.

**కోలె¹.** వి. కొయ్యకాలు, వెన్నుకోసినకాఁడ. (శ. ర, బ్రౌ.)

**కోలె²** = కొలె. అవ్య. ద్రు. మొదలుకొని, ఉండి.
సీ. జననుత దానివత్సంబు నిన్నటఁ గోలె నుడు
గక యఱచుచు నున్నయదియు. భార. ఆది.
౮. ౧౧౮.
సీ. గోగ్రహణంబునఁ గోలె....భార. ఉద్యో.
౩. ౯౨.
క. నినుఁ గనినప్పటఁ గోలె...భా. రా. అర. ౧.
౧౪౯.
గీ...పుట్టినకోలెను...భార. విరా. ౧. ౭౪.
(పుట్టినకోలెను=పుట్టినది మొదలుకొని.)

**కోలెమ్ము, కోలెమ్ముక, కోలెముక.** వి. (కోల + ఎమ్ము) కశేరుక, వెన్నెముక.
ఆ. నేలఁ బెట్టి వానికోలెమ్ము బల్లన, విఱిచి నడు
ము ద్రుంచి వీచి వైచె. భార. ఆది. ౬. ౨౧౫.
గీ. కఱకుటంఘ్రుల నిటికించి గజ్జ గదలఁ, గఱిక నె
ఱినెఱిఁ గోలెమ్ముక యును విఱుగ, విఱిచె వడిఁ
గె జూ నొక పెద్దవేసడంబు. మనుచ. ౪. ౫౮.
ఉ. కొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱు
మాడు నిట్టు ల, య్యన్నిటి నయ్యులూకము
రయం బెసఁగ న్వధియించె భూవరా. భార.
సౌ. ౧. ౧౮.

**కోల్పా(లుపా)టు.** వి. (√ కోలుపడు) కోలుప
డుట.
(భంగము, చేటు.)
శా. కుంతీసూనునిచేతఁ గర్ణున, కనిం గోల్పాటు
వాటిల్లునే. భార. కర్ణ. ౩. ౨౭౫.
శ్లో. న చార్జునో జేష్యతి కర్ణమాహవే. సం. భార.
కర్ణ. ౯౪. ౪౪.
(పోఁగొట్టుకొనుట.)
గీ. ధరణిరాజ్యముగోల్పాటుఁ దండ్రిచావు. ని
ష్టబంధువియోగంబు ... భా. రా. అర. ౧.
౨౧.

**కోల్య.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి.

**కోళము.** వి. (క. కోళ) బొండ, ద్రుపదము.
ద్వి. నూలిసంకెలఁ బాఱునూఁకి బంగారు, కోళం
బులోఁ గాలు గ్రుచ్చిన ట్లయ్యెఁ, జిన్నసంసా
రంబు చీ యని రోసి, పన్నుగాఁ బెట్టెఁ గా
బాహ్యాలంపటము. ప్రభులిం. ౩. ౮౩ పా.
౬ పం.

**కోళిగి.** వి. నతివిశేషము, నమస్కారభేదము.
వ...మా యూస్థలమందలిమఘసూదనునకుఁ గోళిగి
...ప్రబంధ. ౮౮౦.

**కోళె.** విశ. వెఱఁగుపడువాఁడు, విస్మితుఁడు.
సీ. కోళె నాఁగను వెఱఁగుపడువాఁ డనఁగను వి
స్మయాన్వితసంజ్ఞ నెలయుచుండు. ఆం. భా.
౩. ౯.

**కోవ=క్రోవ.** వి. ౧. (ముత్తెములు మున్నగువాని) శర
ము, హారము; పేట.
ఉ. క్రొత్తమెఱుంగుముత్తియపుఁ గోవయొ వా
లు మెఱుంగుఁదీవయో...సున. ౪. ౬౨.
సీ. అతిభోగభాగ్యంబు లనుముత్తియంబులసరులఁ
గూర్చినకోవ శంభుసేవ. రాజశే. ౧. ౬౭.
౨. బిడ్డలకు గొంతుకయందుఁ గలిగెడురోగవిశే
షము.
ద్వి. అతిమియో కోవయో యంగిటిముల్లొ. బస.
పు. ౩. ౩౬౫ పం.

3. కోమ, గోపురాకారముగా నుండుపుట్టదివ
ర. (శ.ర.) ౪. వంశానుక్రమము.
ఉదా:ఆపిల్లకోవ మంచిది కాదు. (వ్యా.)
కోవలుపడవ్రాయు=పూసగ్రుచ్చినట్లు లిఖించు.
క. అవృషలీపతి యావజ్జీవంబుగ నంతనంతఁ జే
సినవాని, హోమిసరంబులు పటమునఁ, గో
వలుపడ వ్రాసి చిత్రగుప్తుఁడు దాఁచెన్. పాండు. ౨. ౭౪.

**కోవరము.** విశే. గాఢము, అధికము.
క...వానిమాటలకు లో,లో వెకవెక నగుచు
నింటిలోపలి కలయి,చ్ఛాపతి పోయెం బో
యినఁ, గోవరపుంబ్రేమఁ గాఁపుఁగోడు కవ్వే
శన్.
ఉ. కే లగలించి పట్టి రతికిం బిరుపీఁకులు సేయ
...వేం. పంచ. ౪. ౪౯౭, ౪౯౮.

**కోవి.** వి. జాడు,క్షీణసస్యము.
సీ. కోవి యనఁగను గ్రోవి యనఁగ జా డనంగను
క్షీణసస్యంబు దగును. ఆం. భా. ౨.౨౩౭.

**కోవిదారము.** సం. వి.అ. పుం. ఎఱ్ఱకాంచనము శీ.

**కోవిదుఁడు.** సం.విశే. (అ. ఆ. అ) పండితుఁడు, వి
ద్వాంసుఁడు.

**కోవు.** వి. అర్పుటయుం దగుధ్వనికి అనుకరణము.
ఉ. కో వని యార్చిరం డెసలఁ గుంజరముల్ సె
దరెన్...కాశీ. ౨. ౩౫.
ఉ. ...కంతుఁడు గ్రుఁడై, కో వని యార్చి లేఁ
జిగురుఁగుంతముఁ గైకొని యుద్ధగించునో. పి.
శకుం. ౩. ౩౪.
ఉ. కోవున నార్చి ... శకు. ౨. ౯౧.

**కోవురము.** వి.౧.ఉక్కళము,శత్రువులరాకను దెలి
సికొనుటకై ఉన్నతస్థలములందు ఉంచుకావలి.
(శత్రువును పట్టుకొనుటకై పొంచెడిపొంచు. శ.
ర, వ్యా.)
గీ.ఉదయగిరిమీఁదఁ గోవురంబుండి నిగుడు,నహి
తరవిరశ్మిచే బద్ధుఁ డగుచుఁ దోఁడి,బలగ మైన
ట్టిచుక్కలవలన ద్రోవఁ, జూవ నేతెంచె నన
వేగుఁజుక్క వొడిచె. మనుచ. ౩. ౧౪౪.
౨. చెట్లపై కెక్కి వైరులను మాటు.
సీ. కోవురం బనఁ జెట్లకోన కెక్కి వైరులఁ జూ
చుట యర్థమై తోఁచియుండు. ఆం. భా. ౩.
౨౯.

**కోవెల**[1]=కోయిల[1]. వి. గుడి, దేవాలయము.
మ. అలచట్టుం దలమట్టుఁగన్గలికిఁ జేయుం జాలు
రావెల్పుఁ గో,వెలచుట్టున్ సుమనోవతంస
సరణిన్ వేంచేయఁగాఁ జేసి... బహు. ౨.
౬౦.
ఉ. కోవెలపారువత్తెమునకుం బనిఁ బూనియు
నేను సాధుసం, సేవయు దీనపోషణముఁ జేసి
తిఁ గావున నీభవంబునన్, భూవర జాతిసం
స్మరణము స్వహియించితి ... ఉ. రా. ౭.
౨౬.
క. దేవాలయాహ్వయంబులు, కోవెల యన దేవ
ళంబు గుడి నా వెలయున్.ఆం.సం. దేవ. ౨౬.

**కోవెల**[2]=కోగిల, కోయిల[2]. వి. పికము.
సీ. తులకించుమూఁడవతోలిపల్లురవళి కోవెలకూఁ
తలకు నొక్కవింత నెఱప. యయా. ౨. ౫౦.
సీ. కోవెల చిగురాకుఁ గొతికిన సాధునియధరం
బు గంటు సేయంగ నెంచు. దశా. ౩. ౧౭.

**కోశకారము.** సం. వి. అ. పుం. ౧. పట్టుకాయ
లోనిపురుగు, పట్టుపురుగు. ౨.ఒకజాతి చెఱకుశీ.

**కోశకారుఁడు.** సం.వి.అ.పుం. ౧.కత్తియొఱలు చే
యువాఁడు. ౨. నిఘంటువు చేయువాఁడు.

**కోశకృత్తు.** సం. వి. త్. పుం. ౧= కోశకారుఁడు.
౨=కోశకారము.

**కోశచంచువు.** సం.వి.ఉ.పుం. సారసపక్షి, బెగ్గురు
పిట్ట.

**కోశపాలుఁడు.** సం.వి.అ.పుం. కోశరక్షకుఁడు, బొక్కసముపై అధికారి. (వాచ)
(ఇక్లే: కోశపాలకుఁడు, కోశనాయకుఁడు, మొ.)

**కోశఫల.** సం.వి.ఆ.స్త్రీ. మహాకోశాతకి, పెద్దబీఱకి.

**కోశఫలము.** సం. వి. అ. న. కకోల్కలక మనుగంధద్రవ్యము. (కల్ప.)

**కోశము.** సం.వి.అ.పుం.న.౧.పాత్రము; పానపాత్రము. ౨.మందస, పెట్టె. ౩.కత్తిఱొర. ౪.కప్పు, ఆచ్ఛాదనము. ౫. శింబ, మినుములు మొదలగువాని పొట్టు. ౬. సమూహము, రాశి. ౭.ఉగ్రాణము, కొట్టు. ౮.భాండాగారము, బొక్కసము ఉండు చోటు. ౯.బొక్కసము, ధనౌఘము. ౧౦. వెండిబంగారములు. ౧౧. నిఘంటువు. ౧౨. పుస్తకము. ౧౩. మొగ్గ. ౧౪. జాజికాయ. ౧౫. జాజికాయ మున్నగువానిపైబరడు. ౧౬. పట్టుకాయ. ౧౭. ఆఁడుగుఱి. ౧౮. ముష్కము, వృషణము. ౧౯. గుడ్డు. ౨౦. (వేదాంత) పంచకోశములలో నేదే నొకటి. (అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము - ఇవి పంచకోశములు) ౨౧. ఇల్లు. ౨౨. ఆశయము, తిత్తి. (శ్వాసకోశము, మొ.) ౨౩. దివ్యములలో నొకటి, స్నానము చేసి తడిబట్టలతో ఉగ్రదేవతలను పూజించి దేవతలను స్నానము చేయించినయుదకము త్రావుచు చేయుప్రమాణము. ౨౪. మామిడికాయ మున్నగువానిలో నుండు టెంక. న. మేఘము, మబ్బు. (శే.ని.)

**కోశలికము.** సం.వి.అ.న. కౌశలికము, లంచము.

**కోశాగారము.** సం.వి.అ.పుం.న. భాండాగారము, బొక్కసము.

**కోశాతకి.** సం.వి.ఈ.స్త్రీ.౧.ఆవడకి. ౨.పొట్లకి. ౩. బీఱకి.

**కోశాధ్యక్షుఁడు.** సం.వి.అ.పుం. ౧. బొక్కసముపై అధికారి. ౨. కుబేరుఁడు.

**కోశామ్రము.** సం. వి. అ. పుం. కొండమామిడికి.

**కోశి.** సం.వి.ఈ.స్త్రీ. పాదుక, చెప్పు.

**కోషము.** సం=కోశము.

**కోషి.** సం=కోశి.

**కోష్ఠపాలుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఉగ్రాణముపై అధికారి, కొట్టున కధికారి. ౨. కొట్టుకావలివాఁడు.

**కోష్ఠము.** సం.వి.అ.పుం. ౧. ఉదరమధ్యము, కడుపులోనిభాగము. ౨. గృహమధ్యము, ఇంటిలోపలిభాగము. ౩. సామగ్రులుంచెడుకొట్టు. ౪. గాదె, పాణక, మొ.

**కోష్ఠాగారము.** సం. వి. అ. న. సామగ్రులుంచుకొట్టు.

**కోష్ఠాగారికుఁడు.** సం. వి. అ. పుం. సామగ్రులకొట్టుపైఅధికారి.

**కోష్ఠాగ్ని.** సం. వి. ఇ. పుం. జఠరాగ్ని.

**కోష్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) ఇంచుక వేఁడిగలది, నులివెచ్చనిది. వి. అ. న. ఇంచుక వేఁడి, నులివెచ్చన.

**కోసము**=కోసరము. అవ్య. ౧. కొఱకు, నిమిత్తము.

ఉ. భూసుతకోస మేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలముం, జేసిననాతపంబు రహిఁ జెందక నిష్ఫల మా... ఉ. రా. ౮. ౯౬.

సీ. పలరాజుకోసమై యలవసంతుఁడు గుంపుసేసి నచిలుక తేజీ లనంగ. ఉ. రా. ౧. ౧౬౯.

ద్వి. కోరికతో దీనికోస మిందులకు, సారంగధరుఁడు రా సం దాయె నేఁడు. ద్వి. శ. సా. ౧. ౧౪ పా. ౨౨ పం.

౨. కారణముచేత.

క. పాదివప్పయు నేనును బన్నిదమాడినకోస

మీతనిం దెచ్చితి నా, కొదవపని దీఱె ...
నైజ. ౩. ౯౬.

క్రోసరము=కోసము. (క. కోసర.)
(నిమిత్తము, కొఱకు.)

సీ. కూటికోసరము నేఁ గొఱగాని జనులచేఁ బలు
గద్దరింపులు పడఁగవలసె. నరసింహశతకము.
౫౨.

సీ. ముక్తికోసరము నేమ్రొక్కి వేఁడెదఁగాని దం
డిభాగ్యమునిమిత్తంబుగాను. నరసింహశతక
ము. ౭.

క్రోసల. సం.వి.ఆ.స్త్రీ. అయోధ్యాపురము.

క్రోస(శ)లము. సం.వి.అ.పుం. ఒకానొక దేశము.

క్రోస(శ)లుఁడు. సం.వి.అ.పుం. ౧. కోసలదేశవా
సి. ౨. కోసలదేశాధిపతి.

కోసు[1]=క్రోసు. వి.(సం. క్రోశః.ప్రా.కోసో.) క్రోశ
ము.

గీ. ఎట్టు పాసితి వాస్థలం బేనుకోసు,లు...భీమ.
౨. ౭౭.

కోసు[2]. విణ. దీర్ఘము, పొడుగైనది.

ఉదా: కోసుముత్తెము. ఇల్లు కోసుగాఁ గట్టినా
రు. (బ్రౌ)

కోస్టు. వి. (సం. కుష్ఠమ్.) చెంగల్వకోస్టు,ఒకానొక
మందుచెట్టు, పారిభాష్యము.

కోహళము. సం.వి.అ.పుం. ౧. కాహళ మనువాద్య
ము. ౨. ఒకజాతిమద్యము.

క్రోహళుఁడు. సం. వి. అ. పుం. నాట్యశాస్త్రప్రవ
ర్తకుఁ డైనయొకముని.

కోహో. వి. పరిహాసము చేయుటయందగుధ్వని కను
కరణము.

వ. ... కేలు చఱచి కోహో యని గేలిసేయుఁగణి
కాకదంబంబులచప్పటలు...ఆము. ౪. ౩౫.

# కౌ

కౌంకణము. సం.వి.అ.పుం. కొంకణదేశము.

కౌంకణుఁడు. సం.వి.అ.పుం.౧. కొంకణదేశాధిపతి.
౨. కొంకణదేశవాసి.

కౌంతి. సం.వి.ఈ.స్త్రీ-కుంతిదేశమున నుండునది-
రేణుక యనుగంధద్రవ్యము.

కౌంతికుఁడు. సం.వి.అ.పుం. ఈఁటెకాఁడు, కుంత
మును ఆయుధముగా పట్టువాఁడు.

కౌంతేయుఁడు. సం.వి.అ.పుం. కుంతికొడుకు.

కౌంభకారి. సం.వి.ఇ.పుం. కుమ్మరవానికొడుకు.

కౌఁగిలి=కవుఁగిలి. వి. దే. ౧. భుజాంతరము, క్రో
డము.

సీ. ఇటరమ్ము నన్నుఁ గౌఁగిటఁ జేర్పు కొడుక
... భార. శల్య. ౧. ౧౭.

మ. పొలఁతుక్ గౌఁగిట గ్రుచ్చియెత్తి తలఁబ్రా
లోప్పొయించునవ్వేళ...పారి.పీఠి.౪.

ఉ. కౌఁగిటి కాస చేసి నొడికారితనంబున ని
న్నుఁ దేల్చి రా,రాఁ గొఱగానివాఁడ నయి
...హ. హరి. ౧. ౬౪.

౨. ఆలింగనము.

ఉ. మోమటు ద్రిప్ప నేమి యొకము ద్దిడరాద
లతాంగి ప్రేమమై, వేమఱుఁ గౌఁగి లియ్యఁ
గదవే బిగిచన్గవ ఱొమ్ముఁ గ్రుమ్ముచుక్. ఇందు.
౬. ౧౩౫.

జ: కౌఁగిలింపు, కౌఁగిలింత, కౌఁగిలింపు.

కౌఁగిలించు=కవుఁగిలించు. స. క్రి. (√కౌఁగిలి.)
౧. ఆలింగనము చేయు.

గీ. ఇష్టమానస మైనయూహేమఖగము, నలుని
మానస మానందజలధియందుఁ, గర్ణశష్కులి
కలశంబుఁ గౌఁగిలించి, యీఁదజేయుచు మృ
దుభాష నిట్టు లనియె. నైష. ౨. ౩.

సీ. తరళతాటంకరత్నప్రభారింఛోళి గండస్థలం

బులఁ గౌఁగిలింప. కాశీ. ౧. ౩. (ఇట 'ఆవరించు' అని భావము.)

**కౌఁగిలింత**=కవుఁగిలింత. వి. (√కౌఁగిలించే) ఆలింగనము.

చ. హృదయము లెప్పుడుం గదియుకే తఱచౌవె డకౌఁగిలింతలన్. ఆము. ౨. ౬౨.

చ. ... వేమఱుఁ గౌఁగిలింత చేన్, గలయకయున్నఁ దాళఁ గలనా... చంద్రి. ౪. ౪.

**కౌఁగిలింపు**=కవుఁగిలింపు. వి. (√కౌఁగిలించే.) ఆలింగనము.

సీ. ... కరఁగింప నేరని కౌఁగిలింపు. చంద్రా. ౯. ౧౪౭.

**కౌఁజు**=కవుఁజు. వి. (సం. కపింజలః) కపింజలము, పక్షివిశేషము.

ఆ. కారుకోడి కౌఁజు కక్కెర పూరేడు... పిట్టలెల్ల గూండ్ల బిట్టు చెలఁగ. యయా. ౧. ౧౧౩. హంస. ౩. ౧౨.

**కౌఁగిలు**=కవుఁగిలు.

**కౌకృత్యము.** సం. వి. అ. న. ౧. అకార్యము చేయుట. ౨. పశ్చాత్తాపపడుట. (మే. ని.)

**కౌకౌ.** వి. కాకధ్వని కనుకరణము.

శా. ప్రాతఃకాలము వాయసంబు పఠినాపత్యోక్త శాస్త్రంబులోఁ, దాతజ్ఞానము చెప్పఁ డెవ్వియనుచందం బొప్పఁ గౌ కౌ యనం, జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబు గాఁ గోకిల, వ్రాతం బిచ్చెఁ దుహీ తుహీ యని గృహారామ ప్రదేశంబులన్. నైష. ౭. ౧౯.

**కౌక్కుటము.** సం. విణ. (అ. ఈ. అ.) కుక్కుటసంబంధమైనది.

**కౌక్కుటికుఁడు.** సం. వి. అ. పుం. ౧. (పురుగులు మొదలగువానిని త్రొక్కకుండుటకై) కుక్కుటము వలె క్రిందికిఁ జూచుచు నడచునట్టియతి. ౨. కపటము కలవాఁడు, వంచకుఁడు, దాంభికుఁడు.

**కౌక్షము.** సం. విణ. (అ. ఈ. అ.) కుక్షిసంబంధమైనది.

**కౌక్షింభర్యము.** సం. వి. అ. న. కుక్షింభరిత్వము, పొట్టపోసికొనుట.

**కౌక్షేయకము.** సం. వి. అ. పుం-కుక్షికి దగ్గఱగా ఉంచుకొనఁబడినది-ఖడ్గము, కత్తి.

**కౌచే**=కవుచే.

(చేఁపమీఁదిపొలుసు, శల్కము; జంతువులచర్మముపొట్టు.)

మ. దివిజద్వేషి నుదారవారిచరమూర్తిం ద్రుంచి చాతుర్య మొప్ప వడిం జౌకపుఁదల్ల కౌచు గమిదంభం బొంద మైఁ దాల్చి వేదవిశుద్ధాక్షరపంక్తి ... ఆము. ౪. ౧౭.

సీ. క్రొవ్వినపందులఁ గొన్నిటిఁ గమలిచి కత్తితాలను జివ్వి కౌచు గడిగి. ప్రబంధ. ౨౧౦.

(మాంసము.)

మ. ... కౌచుదో, బ్బగుదుల్ చన్నులౌ హేమకుంభములె... మల్లభూ. వై. ౧౬.

శ్లో. స్తనౌ మాంసగ్రంథీ కనకకలశావిత్యుపమితౌ. సం. భర్తృ. వై. ౧౬.

(దుర్గంధము)

సీ. ఏ రాజువివిధపుష్పారాధనమున గంగాధరుతలమీఁది కౌచు మాసె. నరస. ౧. ౩౫.

కౌచుమేపరి=మాంసము తినువాఁడు.

సీ... పలలాశి కౌచుమేపరి యనఁదగు. ఆం. భా. ౩. ౬.

**కౌటకికుఁడు.** సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులను చంపి మాంసమును విక్రయించి జీవించుకసాయివాఁడు.

**కౌటతక్షుఁడు.** సం. వి. అ. పుం. తనయింటనే యుండి పని చేయువడ్రంగి, స్వతంత్రుఁడైనవడ్రంగి. (వ్యతి. గ్రామతక్షుఁడు.)

**కౌటికుఁడు.** సం.విణ. (అ.ఈ.అ.) ౧. వలతో తిరుగువాఁడు. ౨. కపటముతో వర్తించువాఁడు. వి. అ. పుం. మృగపక్ష్యాదులను చంపి విక్రయించి జీవించుకసాయివాఁడు.

**కౌటిలికుఁడు.** సం. వి. అ. పుం. ౧-కుటిలగతిచే మృగములఁ బట్టువాఁడు-వేఁటకాఁడు. ౨-కాఱుతో నిప్పులను గ్రహించువాఁడు-కమ్మరి.

**కౌటిల్యము.** సం.వి.అ.న. ౧.వంకర. ౨.కపటము.

**కౌటిల్యుఁడు.** సం. వి. అ. పుం-కుటిలుఁడు-చాణక్యుఁడు.

**కౌటుంబము.** సం.విణ.(అ.ఈ.అ.) ౧. కుటుంబమునకు కావలయునది. (ద్రవ్యము,మొ.) ౨. కుటుంబసంబంధమైనది.

**కౌటుంబికుఁడు.** సం. విణ.(అ.ఈ.అ.) ౧.కుటుంబభరణము చేయువాఁడు. (ఇంటిపెద్ద, యజమానుఁడు.) ౨. కుటుంబములోనివాఁడు.

**కౌటుఁడు.** సం.విణ. (అ.ఈ.అ.)౧.సొంతయింటవసించునది; స్వతంత్రమైనది,స్వేచ్ఛ గలది. ౨.ఇంటఁ జెరిఁగినది, పెంపుడైనది.౩.కపటముతో కూడినది. ౪. బోనులో నున్నది.

**కౌడీలు**=కవుడీలు. వి. బహు. నమస్కారము.

వ. ...భక్తలోచనమండలిభవఘ్నస్వామికిఁ గౌడీలు గోమంతపర్వతమండలికౌరికి మోడ్పుఁగేలు...ప్రబంధ. ౭౭౦.

**కౌడు**=కవుడు.

(కపటము)
ఆం. భా. ౧. ౧౩౭.

**కౌడువు**=కవుడువు. వి. మాదిరి, తైవడి.

సీ. తైవడి తైవలి కయివడి కౌడువు మాదిరి పోలిక మాడ్కి పురుడు, పోలిక యనఁగఁ బోల్పొందు నుపమపేరు...ఆం.భా. ౨. ౩౦౨.

**కౌణపదంతుఁడు.** సం.వి. అ.పుం. శాంతనవుఁడు, భీష్ముఁడు. (త్రి.ని.)

**కౌణపుఁడు.** సం.వి.అ. పుఁ-శవములను తినువాఁడు-రాక్షసుఁడు, రక్కసి. ౨-కోణమును పాలించువాఁడు-నైరృతుఁడు,మూలఱేఁడు.

**కౌణ్యము.** సం.వి.అ.న. చేతులు ఈచవోవుట.

**కౌతుకము.** సం.వి.అ.పుం. ౧. అనుభవింపనిద్రవ్యమును గూర్చినయాశ, తహతహ. ౨. పెండ్లియందు చేతఁ గట్టుకొనెడితోరము. ౩. ఉత్సవము, పండుగ. ౪. సంతోషము. ౫. వేడుక,వినోదము. ౬. వరుసగా వచ్చినమేలు, కల్యాణపరంపర. ౭. ఇచ్ఛ, కోరిక.

**కౌతుకాగారము.** సం.వి.అ.న. క్రీడాగృహము.

**కౌతుకి.** సం. విణ. ( న్. నీ. న్. ) కౌతుకము గలవాఁడు.

**కౌతుకితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కౌతుకము గలవాఁడు, తమి గలవాఁడు.

**కౌతూహలము.** సం=కుతూహలము.

**కౌదాలీకుఁడు.** సం. వి. అ. పుం. ఒకసంకీర్ణజాతివాఁడు.(జాలరివానికి చాకలదానియందు పుట్టినవాఁడు-కల్ప.)

**కౌద్దాలికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) గుద్దలితో త్రవ్వుకొని జీవించువాఁడు.

ఉ...సత్కృపుల్, హాలికులైన నేమి గహనాంతరసీమలఁ గందమూలకౌద్దాలికులైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై. భాగ.పీఠి.

**కౌద్రవికము.** సం. వి. అ. న. సౌవర్చలవణము.

**కౌద్రవీణము.** సం.వి.అ.న. అల్లు పండుభూమి.

**కౌను**[1]=కవును[1]. (చూ.) వి. ౧. నడుము,మధ్యము.

ఉ...ఇందుబింబముక్రొ,గి మ్మనసీదు మోము గిరిశ్రేపులు మూఁపులు కౌను గానరా,దమ్మక చెల్వవానివికచాంబకముల్ శతపత్రజైత్రముల్. మనుచ. ౩. ౬.

సీ. అన్నువకౌఁదీఁగయందంబు మది నిల్పి జఘున చక్రంబుపైఁ జలుపు దృష్టి. భార. ఆది. ౩. ౩౮.

చ. అను వగుకౌనుఁదీఁగె లనియాడఁ బయోధర ము ల్వణంకఁగా. భీమ. ౫. ౧౦౩.

౫. లస్తకము, ధనుర్మధ్యము, వింటినడుము.

చ. పిడికిఁడుకౌనుఁ గొప్పఁ గని ప్రేమఁ ద్రివక్ర సమాంగిఁ జేసి తేఁ, బిడికిఁడుకౌనుఁ గొప్పఁ బయిపెచ్చుగుణంబును గంటినందునే, ర్వడఁగ నిజత్రివక్రతయుఁ బాపఁగ మ్రొక్కుడునాసుమాలిపై, జడిగొన నమ్మ లీను హరికార్ముకధనుర్లత గామఁ గావుతన్. ఆము. ౧. ౮.

కౌను²=కవును².

కౌపము. సం. విణ. (అ.ఈ.అ) కూపసంబంధమైనది. (జలము, మొ.)

కౌపీనము. సం. వి.అ.న. ౧. అకార్యము, పాపము. ౨. గుహ్యాంగము. ౩. గోఁచి.

కౌబేరము. సం. విణ. (అ. ఈ.అ.) కుబేరసంబంధమైనది. (దిక్కు, మొ.) వి. అ. న. ౧. చెంగల్వకోష్టు కి. ౨. ఒకదినుసుపిండివంట.

కౌబేరి. సం. వి. ఈ. స్త్రీ. కుబేరుఁ డున్నదిక్కు, ఉత్తరదిక్కు.

కౌబ్జము. సం.విణ. (అ. ఈ.అ.) కుబ్జునకు సంబంధించినది.

కౌంభకార్య. సం. వి. ఆ. స్త్రీ. కుమ్మరవానికూఁతురు.

కౌమారకము. సం.వి.అ.న.వయోవస్థాభేదము,కౌమారము.

కౌమారము. సం. విణ. (అ.ఈ.అ.) ౧. కుమారునకు సంబంధించినది. ౨. కుమారస్వామికి సంబంధించినది. వి.అ.న. ౧. అయిదేండ్లవఱకు నుండు వయస్సు. (మూఁడవసంవత్సరము మొదలుఎనిమిదవసంవత్సరమువఱకు నుండు వయస్సు అని కొందఱు. పదునాఱు సంవత్సరములవఱకునుండు వయస్సు అని కొందఱు. ముప్పది సంవత్సరములవఱకు నుండువయస్సు అని మఱికొందఱు.)

కౌమారి. సం. వి. ఈ. స్త్రీ. ౧. బ్రహ్మచర్యమున నుండువానిని పెండ్లియాడిన స్త్రీ. ౨. సప్తమాతృకలలో ఒకతె.

కౌమారికేయుఁడు. సం. వి. అ.పుం. కానీనుఁడు, పెండ్లికానిదానికి పుట్టినకొడుకు.

కౌమారుఁడు. సం.వి.అ.పుం. అవివాహితకన్యను పెండ్లియాడినపురుషుఁడు.

కౌముదము. సం.వి.అ.పుం. కార్తికమాసము.

కౌముది. సం.వి. ఈ.స్త్రీ. ౧-కుముదములను ప్రకాశింపఁజేయునది-వెన్నెల.-భూజనులను సంతోషపెట్టునది-౨. కార్తికపూర్ణిమ. ౩. ఆశ్వయుజపూర్ణిమ. ౪. ఉత్సవము, పండుగ. ౫. కార్తికోత్సవము. (త్రి. ని) ౬. దీపోత్సవతిథి.

కౌముదీవృక్షము. సం.వి.అ.పుం. దీపపుసెమ్మె, దీపస్తంభము.

(ఇట్లే: కౌముదీద్రుమము, మొ.)

కౌమోదకి. సం.వి.ఈ.స్త్రీ. విష్ణుని గద.

కౌరవము. సం.విణ. (అ. ఈ.అ.) కురువులకు సంబంధించినది.

కౌరవుఁడు. సం.వి. అ. పుం. కురువంశపువాఁడు.

కౌరవ్యుఁడు. సం.వి.అ.పుం.౧. కురువంశపువాఁడు. ౨. కురుదేశపురాజు.

కౌరు=కవురు.

కౌర్ప్యము. సం.వి.అ.పుం. వృశ్చికలగ్నము.

కౌలటినేయుఁడు. సం.వి.అ.పుం. భిక్షుకియు పతివ్రతయు ఐనదానికొడుకు.

**కౌలటేయుఁడు.** సం. ౧=కౌలటినేయుఁడు. ౨=కౌలటేరుఁడు.

**కౌలటేరుఁడు.** సం. వి. అ.పుం. కులటాపుత్త్రుఁడు, అంకుటాలికొడుకు.

**కౌలము.** సం.విణ. (అ. ఈ. అ.) కులమునకు సంబంధించినది. (అస్తి, మొ.) వి. అ. న. శాక్తేయమతము; శాక్తేయమతగ్రంథము.

**కౌలవ.** సం.వి.అ.పుం. (జ్యోతి.) బవాదికరణములలో ఒకటి. (చూ. కరణము.)

**కౌలాలకము.** సం.విణ. (అ.ఆ.అ) కుమ్మరిచే చేయఁబడినది. (మూఁకుడు, మొ.)

**కౌలికము.** సం. విణ. (అ.ఈ.అ.) వంశపరంపరగా వచ్చినది. (ఆచారము, మొ.)

**కౌలికుఁడు.** సం.వి. అ.పుం. కౌలుఁడు, పాషండుఁడు.

**కౌలీనము.** సం.విణ. (అ.ఆ.అ.) కులక్రమాగతము, వంశపరంపరగా వచ్చినది. (ఆచారము, మొ.) వి. అ. న. ౧. నింద,అపవాదము. ౨. కుకార్యము, నిందింపఁదగినపని. ౩.పశుపక్షిసర్పములపోట్లాట. ౪. యుద్ధము,జగడము. ౫.కులీనత్వము,గొప్పవంశమునందలిపుట్టుక. ౬. గుహ్యావయవము.

**కౌలు=కవులు.** వి. (హిం. ఖౌల్. క.కవులు,కౌలు. త.కవుల్.)౧.రాజాదులు ప్రజలు మన్నగువారికిచ్చునొడంబడిక, అభయపత్త్రము.

సీ...కౌలన నభయపత్త్రాభిధ యలరుచుండు. ఆం. భా. ౨. ౧౨౭.

గీ. సాహెబునుబావు నీవనుజంకు వొడమి, కౌలు గావలె ననుటయే కంటకంబె. రంగా.౨. ౧౩౧, ౧౪౫.

క. మే లైనసరకు లాతని,కౌలున దిగుమాట నిజము కలవాఁ డగుటకా. కుక. ౧. ౭౩.

**కౌలుఁడు.** సం. వి అ. పుం. ౧. శాక్తేయమతావలంబి. ౨. శాక్తేయమతాచారము నెఱిఁగినవాడు. ౩. సత్కులమున పుట్టినవాఁడు. (వాచ.)

**కౌలేయకము.** సం. విణ. (అ. ఆ. అ.) మంచికులమున పుట్టినది. (మే.ని) వి. అ. పుం. కుక్క.

**కౌళ(ళు)త్థము.** సం. విణ. (అ. ఈ.అ.) ౧. ఉలవలకు సంబంధించినది. ౨.ఉలవలతో చేయఁబడినది. (భక్ష్యాది.)

**కౌళ(ళు)త్థీనము.** సం. వి. అ. న. ఉలవలు పండుభూమి.

**కౌశలము.** సం. వి. అ.న. ౧. క్షేమము, సుఖస్థితి. ౨. నేర్పరితనము.

**కౌశలి.** సం. వి. ఈ. స్త్రీ.౧. కుశలప్రశ్నము,క్షేమాదుల నడుగుట. ౨. కానుక.

**కౌశల్యము.** సం=కౌశలము.

**కౌశాంబి.** సం.వి.ఈ. స్త్రీ-కుశాంబుఁ డనువానిచే నిర్మింపఁబడినది-ఒకపట్టనము.

**కౌశిక.** సం. వి. అ. స్త్రీ. పానపాత్త్రము. (వాచ)

**కౌశికఫలము.** సం. వి. అ. పుం-కోశమం దున్నఫలము కలది-నారికేళము, కొబ్బరచెట్టు.

**కౌశికము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. ఒఱయందుంపఁబడినది. ౨. గుడ్లగూబకు సంబంధించినది. ౩. కుశికవంశమున పుట్టినది. వి. అ. పుం. ౧. గుడ్లగూబ. ౨. గుగ్గిలపుఁజెట్టు. ౩. ముంగిస. ౪. మజ్జ, నెనడు. ౫. శృంగారరసము. (త్రి.ని)

**కౌశికి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒకనది. ౨. దుర్గ.

**కౌశికుఁడు.** సం. వి.అ.పుం. ౧. విశ్వామిత్త్రుఁడు.౨. పాములవాఁడు. ౩. ఇంద్రుఁడు.౪. కోశాధ్యక్షుఁడు. ౫.నిఘంటువు తెలిసినవాఁడు.(హేమ.ని.)

**కౌశేయము.** సం. వి. అ. న. ౧-పట్టుకాయనుండి బయలువెడలినది-పట్టు. ౨. పట్టుబట్ట. (రూ. కౌషేయము.)

కౌసలేయుఁడు. సం. వి.అ.పుం-కౌసల్యకొడుకు-రాముఁడు. (కల్ప)

కౌసల్య. సం. వి. ఆ. స్త్రీ. కోసలదేశపురాజుకూఁతురు, దశరథునిజ్యేష్ఠపత్ని, రామునితల్లి.

కౌసల్యాయని. సం. వి. ఇ. పుం. రాముఁడు, కౌసల్యకొడుకు.

కౌసీదము. సం. విశే. (అ. ఈ. అ) కుసీదసంబంధమైనది.

కౌసీద్యము. సం. వి. అ. న. ౧. కుసీదభావము, వడ్డిజీవనము. ౨. ఆలస్యము. ౩. తంద్ర, కునికిపాటు.

కౌసుంభము. సం. విశే. ( అ. ఈ. అ) ౧. కుంకుమపూవుతో చేయఁబడినది. ౨. కుంకుమపూరంగు వేయఁబడినది.వి.అ.పుం.అరణ్యకుసుంభము.(రా.ని)

కౌసుమము. సం. విశే.(అ.ఈ.అ.) కుసుమసంబంధమైనది. వి. అ. న. ౧. మకరందము, పూఁదేనె. ౨. పుష్పపరాగము, పుప్పొడి. ౩. పుష్పాంజనము, ఒకవిధమైనకాటుక.

కౌసృతికుఁడు. సం. వి. అ. పుం -కుమార్గమున పోవువాఁడు-తవలికాఁడు, వంచకుఁడు, మోసకాఁడు.

కౌస్తుభము. సం. వి. అ. పుం. ౧-కుస్తుభమందు(=సముద్రమునందు) పుట్టినది- విష్ణువక్షస్థలమునందలి మణి. ౨. ఒకజాతినూనె. ౩.(తంత్ర.) వ్రేళ్లతో పట్టునొకవిధముద్ర.

## క్ర

క్రంగు=కంగు$_2$. వి. (త. కఱంగు=మ్రోఁగు) గంట మొదలగువానిధ్వని కనుకరణము.

ఉ. అంగదుఁ డత్స్వయంవరమహామహా వైభవకేళి
హుళాళికిన్, గ్రంగగన గంటపైఁ గొడుపు వ్రా
లుట యొన్నఁడొ నాఁటనుండియున్. నైష.
౩. ౨౫.

ద్వి. క్రంగున వజ్రంబు గదిసినకొండ, భంగి శబ్దము పుట్టఁ బ్రభు విట్టు లనియె. ప్రభు. ౪. ౧౨౫ పా. ౨౦ పం.

చ...క్రం,గనఁ దనుదాన మ్రోయుజయఘంటిక ...పి.క్ర. ౫. ౧౨౫.

క్రంచేఱ=క్రచ్చేఱ. క్రి. విశే. దు. (క్రంచు+అఱన్)

(శీఘ్రముగా)

క...ఉమేశాస్త్రమునం, గ్రంచఱ నంతకుపురి
కేఁ, గించితిఁ బౌలోమకాలకేయాసురులన్.
భార. అర. ౪. ౭౬.

(ఎడతెగకుండ)

సీ. క్రంచఱ నీరిలో ముంచుచు నెత్తుచుఁ గారించి
తీరంబు సేరఁ జెట్టు. భార. ఆది. ౫. ౧౬౬.

క్రంత[1]. వి. పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకుఁ దీసికొనుపోవు ప్రధానద్రవ్యము.(కంత-వా.)

వ...అభిమన్యునకు శృంగారంబు సేయించి...
మణిగణంబులు నంబరనికరంబులుఁ బుష్పపుం
జంబులు ఫలప్రచయంబులు లోనుగాఁ గల
యోగ్యవస్తువుల విస్తరిల్లిన క్రంత నడప...
భార. విరా. ౫. ౩౭౯.

గీ. దగ్గఱె ముహూర్తవేళ యోదశరథేంద్ర,యే
ల యాలస్యమని మూను లెచ్చరింప, మహిత
మణిహేమవస్తుసామగ్రి మెఱయఁ, గ్రంత
నడిపించి తామును గదలి రపుడు. రామా. ౪.
౧౧౪.

ద్వి. క్రంతలు గొని పుణ్యకాంతలు నడువ. రం. రా. బాల. ౭౫ పా. ౨౧ పం. నైష. ౬. ౬౭.

క్రంత[2]=కంత. వి. (సం. గర్తః) ౧. సందుత్రోవ; త్రోవ; రథ్య, రాజవీథి.

సీ. రచ్చలు క్రంతలు రాజమార్గంబులు విపణిదే
శంబులు విశదములుగఁ, జేసిరి... భాగ. ౧౦
పూ. ౧౭౧౭.

ఉ. చోరనిబిలంబులున్ వెడలఁ జూడని క్రంత
లుఁ గాలు రావడం, దిరుగనిత్రోవలున్ ...జ

ఱుఁగనిచీరలుం గలవె చేరినయీసురకోటికి
చ్యుతా. ఉ. హరి. ౧. ౧౩౧.

ఉ. అంతట లంకలోనఁ దగ నక్కడ నక్కడ వా
డవాడలం, గ్రంతలఁ గ్రంతల న్నిలిచి క్రచ్చ
అమూఁకలు గట్టి...భా. రా.యు. ౧౪౬౧.

వ...ఈమహోత్సవంబులలో నిట్టిగలబలు సేయు
దురే మీయట్టి బలుబంట్లకు సందిక్రంతలజ
గడంబులు వలదని తోడ్కొని చని...ద్వా.
౭. ౩౦. (సందిక్రంతలజగడములు:-అల్పకల
హములు అని భావము.)

మ. ప్రజ లెల్లం బురిఁ గ్రంతక్రంతల మహోపా
యంబుగాఁ బల్కెడుఁ. హర. ౨. ౭౯.

సీ...క్రంతలఁ బన్నీరు గలయఁ జల్లి. నీలా. ౩.
౪౯.

౨. రంధ్రము, చిల్లి.

మ. ఇనజాం దేశశరాసుఁ డయ్యెఁ బదివే లేసెఁ
శితాస్త్రంబు లం,దున మే నంతయుఁ గ్రంత
లైన దశవక్త్రుం డంత మూర్ఛిల్లి...ఉ. రా. ౩.
౩౫౩.

ఉ...నృపాలదేహముఁ, గ్రంతలు చేసి చొచ్చె
విశిఖంబులు...జై. భా. ౨.౬౯.

చ...కనుఁ గ్రంతల ముంతలఁ బోసినట్లు బో,రనఁ
గడు బాష్పపూరములు గ్రమ్మఁగ నేడ్చుచు
...పాండు. ౩.౯౧.

౩. రచ్చ, సభ.

ద్వి. తనజాడ తెలిసి క్రంతకుఁ దీసి లేని,మనము
న బెదరక మానంబు విడిచి,కట్టుఁ గొట్టును బ
డి...ద్వి. హరిశ్చ. ఉ. ౬౪౩ పం.

**క్రందకుఁడు.** సం. విణ. (అ.దికా.అ) ౧. ఏడ్చు
వాఁడు. ౨. ఏడ్పించువాఁడు.

**క్రందత్.** సం. శత్రు. ౧ స్పర్థచే యోధులు యుద్ధ
మునకుఁ బిలుచుకొనుచున్న. ౨. ఏడ్చుచున్న.

**క్రందనము.** సం. వి. అ. పుం. పిల్లి. (వాచ.) న.
౧. రోదనము, ఏడ్పు. ౨. ధ్వని. (వై. ని.) ౩. స్ప
ర్థచేత యోధులు యుద్ధమునకు పిలుచుకొనుట
(అమరసుధ.)

**క్రందనీయము.** సం.=క్రందితవ్యము.

**క్రందయత్.** సం. శత్రు. ఏడ్పించుచున్న.

**క్రందయిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ) ఏడ్పించు
వాఁడు.

**క్రందిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ) ఏడ్చువాఁడు.

**క్రందితము.** సం. వి. అ. న.=క్రందనము.

**క్రందితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) స్పర్థచే
యోధులు యుద్ధమునకుఁ బిలువఁ దగినది.

**క్రందిల్లు(లు).** అ. క్రి. (√క్రందు) ౧. మ్రోఁగు
క. అందముగ వీరకాహళ, దుందుభినిస్సాణశంఖ
తూర్యంబు లొగిఁ, గ్రందిల్లె ... వీర. ౪.
౧౬౧.

౨. కేకలు వేయు.

క. స్కందగణేశులు దోడై, క్రందిలి యిరుదెసలఁ
దఱుమ గణనాథబలం, బంపంబు చెలఁగి యా
ర్పుల, సందడి మి న్నంది కృష్ణసైన్యముఁ దాఁ
కెఁ. పద్మ. ౧౦. ౧౬౩.

**క్రందు.** అ. క్రి. (సం. క్రంద్) ౧. మ్రోఁగు (చూ.
క్రందిల్లు) ౨. విలపించు.

గీ ... కృతఘ్ను ను గ్రకంటకసముదయము మీఁ
దఁ, గ్రంద నదిమియు మఱియు దుఃఖములఁ
బెట్టు, తెఱఁగు లెన్ని యన్నింటను బఱుకు
రధిప. భార. అను. ౪. ౨౬౩.

వి. ౧. క్రందనము, మొఱ్ఱ.

సీ...క్రందనఁగాఁ దగుఁ గ్రందనంబు. శం. భా.
౨. ౨౨౩.

౨. అతిదారుణమైనధ్వని.

సీ. సిరిఁ బాసియును నొక్కచింతయు లేక వీచుల

క్రందడంగిన జలధివోలె. భార. శాం. ౪. ౪౧౨.

సీ... అతిదారుణధ్వని ఱంఖన ఱంతన ఱంపియ
నఁగఁ గ్రందన విలసిల్లు... ఆం. భా. ౧. ౧౨౧.
భార. ద్రో. ౨. ౩౩౫.

౩. సందడి, సమ్మర్దము.

సీ. ఉత్సవసందర్శనోత్సుకులై పోయి కడుఁబెద్ద
ప్రొద్దయ్యెఁ గొడుకు లేల, మసలిరొ కార
ణుల్ వినువక వైరంబు గావించుపాపస్వభా
వు లెఱిఁగి, క్రందునఁ జంపిరొ... భార. ఆది.
౬. ౨౦౬.

ఉ. కామవిలోభకస్పృహల గర్వపరంపర క్రందు
వాసి హృత్తామరసస్థితుండగుసదాశివుఁ గాం
చి... హరి. పూ. ౧. ౧౦.

౪. ఉపద్రవము.

గీ. బహువిధంబులఁ బగతుర బరవసమున, నిత్తె
ఱంగునఁ గలుగు క్రందల్ల నోర్చి, నిల్చి గెల్చి
న సత్కీర్తి నెగడుఁ గాక. భార. విరా. ౪.
౬౨.

గీ. ఏల వ్రేపల్లెపెద్దవారిట్లు వెఱ్ఱి, గొనిరి కృష్ణుఁ
బోనిచ్చినఁ గ్రూరులైన, రక్కసులు లోను
గాఁ జేయు క్రందు లెల్ల, నుడుపఁ దమకు ది
క్కైనవాఁ డొరుఁడు గలఁడె. హరి. పూ. ౭.
౧౭౧.

ద్వి. కలహంబు గానోపుఁ గ్రందు గానోపుఁ, బ్రళ
యంబు గానోపుఁ బ్రజలకు నింక. పండితా.
మహిమ. ౨౫౯ పా.

౫. అతిశయము.

చ. ... చూడ్కు లాకులపడి చూపుపండువులు
గోరఁగఁ గోర్కుల క్రందు చేష్టితంబులఁ ద
డఁబెట్ట భావములపూఁపు బయల్పడ వారి నిద్ద
ఱన్, బలసి మనుండు తుల్యరసపాకముతీపులు
గ్రోల్చి విన్కలిన్. హరి. ఉ. ౩. ౭.

క. ... ప్రస్పందితపాకరవముల, క్రందున ధ
ర్మజుఁడు పేలుకనియె నరేంద్రా. భార. ద్రో.
౩. ౬.

క్రందుగన్=౧. అధికముగా.

వ. ... ఆఁదంద క్రందుగా మందుచేదివియలు
చెందొవలును గా... మనుచ. ౫. ౬౧.

౨. ఒక్కుమ్మడిగా.

సీ. విందానువిందులు గ్రందుగ నెసఁ గుంతిభోజుని
నాతనిపుత్త్రుఁ దాఁకి, రి... భార. భీష్మ. ౧.
౨౬౬.

క్రందగు=గుంపగు.

మ. ... గుభాలునన్ లకుముకుల్ క్రందై పడన్
లేచు... ఆము. ౧. ౫౬.

క్రందుసేయు=భేదముపుట్టించు.

ఆ. సూతపుత్త్ర యితఁడు నాతలఁ బెద్దమా, పెత్తి
నమ్మియున్నయట్టిచోటఁ, గ్రందు సేయ నా
కుఁ గాదని సైరించి,యున్న బ్రతికి తింక నూ
రకుఁడు. భార. ఉద్యో. ౪. ౨౫౧.

శ్లో. సముద్యతోయం భారో మే సుమహాన్ సా
గరోపమః, మిథో భేదో న మే కార్యస్తేన
జీవసి సూతజ. సం. భార. ఉద్యో. ౧౬౭. ౩౧.

క్రందొనరించు=విరోధించు.

ఉ ... వారి త్రిప్పులం, గ్రందొనరించి... దశకు.
౫. ౪౫.

జ: క్రందిల్లు, క్రందుకయ్యము, క్రందుకొను,
క్రందుపఱుచు, క్రందుపాటు, క్రందువడు.

క్రందుకయ్యము. వి. (√ క్రందు) సంకులయుద్ధ
ము, దొమ్మిజగడము.

చ. అనవుడుఁ గ్రందుకయ్యమున నప్పటికిన్
మనవారు లాఁతివారని మది నేర్పరింప వస
మమ్మ... నిర్వ. ౫. ౧౨౪.

వ ... ఉభయబలంబులు నురవడించి కలయన్
బెరసినం గ్రందుకయ్యం బయ్యె ... భార.
కర్ణ. ౧. ౧౭౬.

క. వడిఁ గదియ కెందు మొనలకుఁ, గడు నచ్చెరువమునఁ గ్రందుకయ్యం బయ్యెన్. భా. రా. యు. ౬౫౧.

**క్రందుకొను.** అ. క్రి. (క్రందు + కొను) ౧. అతిశయించు; బహుళ మగు, తఱచగు.

చ. కని వినయంబు గ్రందుకొనఁగాఁ బ్రణమిల్లి ...జై. భా. ౭. ౭౪.

సీ. భీషణోత్తమహాయహేషావిఘోషంబు గరిబృంహితస్ఫూర్తిఁ గ్రందుకొలుప. భాగ. ౬. ౩౬౯.

వ. సమయసముత్థానంబునం గ్రందుకొను రాజనందనులయందియల మొరపంబులతోడ గడ దెరసి. నైష. ౬. ౨౯.

గీ. సంతతరిరంసపరమహంస ప్రరోహ, కారణము హావికస్వరకమలచక్ర, పూర్ణసదమలసరసు లే పురమునందుఁ, గ్రందుకొనుచుండు నాచిదానందనగరి. ప్రబోధ. ౧. ౩౯.

౨. నిండు.

ఉ. ... ఎల్లచోటులుఁ, గ్రిక్కిఱియంగఁ గ్రందుకొని కీశబలంబులు ... భా. రా. కిష్కిం. ౫౧౩.

సీ. చూడ్కికిఁ బ్రేఁకమై సురవిమానములచే గగనమార్గం బెల్లఁ గ్రందుకొనియె. పారి. ౫. ౬౭.

౩. మూఁగు, గుమిగూడు.

చ. పొడగన వేళ యబ్బె నని పొంగి కళింగకళాంగముఖ్యుల,య్యెడ నెడ యీక క్రందుకొని యొల్లెడల న్వెడలంగ...వసు. ౧. ౧౪౭.

వ. ద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చుచుమున ల్లగువర్ణధరులచేతులకుం గ్రందుకొని చేసాఁచిన ... ఆము. ౪. ౫౩.

**క్రందువఱుచు.** స. క్రి. (√ క్రందుపడు) కప్పు.

సీ. తులసీదళాళిమంజులదామకంబులు కౌస్తుభపదకంబుఁ గ్రందువఱుచ. కాశి. ౫. ౧౧౨.

**క్రందుపాటు.** వి. (√ క్రందుపడు) సమ్మర్దము, క్రందు.

గీ. ఇవ్విధంబునఁ గ్రందుపాటింత యైన, భీష్ముకడఁక నీసైన్యంబు భీముబలిమిఁ, జేసి యాసీనయును నప్డు సిక్కువడక, పోరె నేమని చెప్పుదుఁ గౌరవేంద్ర. భార. భీష్మ. ౨. ౧౦౩.

**క్రందువ(ప)డు.** అ. క్రి. (క్రందు + పడు) ౧. సంకులము గాఁ బడు, గుంపు గాఁ బడు.

సీ. ధరణీతలంబు పాతాళంబునకుఁ గ్రుంగ వడువ నింగికి నెత్త నతఁడె చాలు, గ్రహతారకాఘంబు మహిఁ గ్రందువడ రాల్ప నవి పొందువడ నిల్ప నతఁడె చాలు. భా. రా. అర. ౧. ౨౪౮.

౨. మూఁగు, గుంపగు.

క. ఇలఁ గోలఁ దట్టుమన్ సం, బళి సంబళి యనుచుఁ గ్రందుపడుజనములకున్, దొలఁగుమ నొదుఁగుచు నాభూ, తలపతికడ కరుగుదెంచి తానిట్లనియెన్. మార్క. ౧. ౨౨౫.

**క్రంద్యమానము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. యుద్ధమునకుఁ బిలువఁబడుచున్నది. ౨. ఏడ్పింపఁబడుచున్నది.

**క్రంద్యము.** సం. = క్రందితవ్యము.

**క్రంప** = కంప.

చ. కడఁక యొలర్ప నొడ్లకును గ్రంపలు వైచియు ...హరి. పూ. ౬. ౨౫. భార. అను. ౩. ౨౩౫.

**క్రకచ.** సం. వి. ఆ. స్త్రీ. కేతకి, మొగలి. (త్రి. ని.)

**క్రకచచ్ఛదము.** సం. వి. అ. పుం. రంపమువంటి ఆకులు గలది - మొగలి.

**క్రకణము.** సం. వి. అ. పుం. కక్కెరపక్షి. (కల్ప)

**క్రకచపత్త్రము.** సం. వి. అ. పుం. ౧. శాకవృక్షము, టేఁకు (రా.ని.) ౨. మొగలి (వాచ)

**క్రకచపాత్తు.** సం. వి. ద. పుం. రంపమువంటిపా

దములు గలది-కూసరవెల్లి; తొండ.

**క్రకచము.** సం. వి. అ. పుం. న. రంపము. పుం. వెణుతురు.

**క్రకరము.** సం. విణ. (అ. ఆ. అ.) దీనము. వి. అ. పుం. ౧. కక్కరపక్షి. ౨. రంపము. ౩. వెణుతురు.

**క్రక్కస**=కక్కసము. విణ.

(కఠినము)

ఉ. ... తామరచూలిదేవి యా, క్రక్కసజవ్వనిం గరము గారవ మొప్పఁగఁ జూచి యిట్లనున్. నైష. ౫. ౧౧౬.

జ: క్రక్కసపడు.

**క్రక్కసపడు**=కక్కసపడు. అ. క్రి. (క్రక్కస+పడు.)

(కఠినమగు)

క. తక్కినయాదనుజాంతకు, లక్కడఁ బడియున్న శవము లటు ద్రొక్కుచుఁ బో, నిక్కుచుఁ జని గంధర్వులు, గ్రక్కసపడి కొట్టి రమితగదలం దలలన్. వేం. మా. ౩. ౧౧.

**క్రక్కించు.** స. క్రి. (√ క్రక్కు) క్రక్కఁజేయు.

(కడుపులోనిది వెలిపుచ్చు; వెడలించు)

ఉ. ...బాధించి మనుష్యమాంసములు దించున గ్రొవ్వితి వాని నెల్లఁ గ్రక్కించెద... భార. ఆది. ౬. ౨౯౪.

ద్వి. ఈప్రొద్దు వానిఁ గుయ్యోడ సిగఁబట్టి, వీపుఱీఁటంతయు విడిపించి యెదుట, దక్కించి పోయి నధన మెల్ల మగుడఁ, గ్రక్కింపకున్న నే కలహాకంఠికనె. ద్వి. పారిజా. ఉ. ౧౨౭౦ పం.

మ... భవద్దర్పంబు గ్రక్కింతు... ఉ. హరి. ౪. ౨౬౫. (పోఁగొట్టు అని భావము)

**క్రక్కు**=కక్కు[1]. స. క్రి. కడుపులోనిది వెలిపుచ్చు; వెడలించు.

క. నలుఁ దొల్లి యాక్రమించిన, కలి కర్కోటకు విషంబు గ్రక్కుచు నోడలన్, వెలువడి నలునకు విహితాం, జలియై త న్నెఱుఁగఁ జెప్పెఁ జంచలుఁ డగుచున్. భార. అర. ౨. ౧౭౯.

గీ. కఱకుమిడిగ్రుడ్లు నిప్పులు గ్రక్కుదృష్టి. భాగ. ౧౦ ఉ. ౯౩౯.

మ. గద లన్యోన్యసమాహతిన్ మిడుఁగుఱుల్ గ్రక్కంగ పోరించుచున్. భార. ద్రో. ౧.౧౫౫.

వి. వ్యాధివిశేషము, ప్రచ్ఛర్దిక.

గీ... క్రక్కనఁ జరిది యంచనఁగఁ దనరు, చుండుఁ బ్రచ్ఛర్దిక... ఆం. భా. ౨.౧౨౭.

జ: క్రక్కించు, క్రక్కుపడు.

**క్రక్కుప(వ)డు.** అ. క్రి. (√ క్రక్కు) స్ఖలితమగు, తొట్రుపడు.

సీ. అక్రోశపరిదేవనాక్షరవ్రాతంబు కంఠగద్గదిక చేఁ గ్రక్కుపడఁగ. హర. ౩. ౯౨.

**క్రక్కెర**=కక్కెర. (శ. ర)

**క్రచ్ఛేఱ**=క్రంచేఱ. క్రి. విణ. ద్రు. (క్రచ్చు+అఱన్-ఇది ఉభయవచలలోనిది. చూ. కావ్యా. ౭. ౬౯)౧. అమోఘముగా, నిష్ఫలము గాకుండ.

ఉ. ఇచ్చెద శక్తి నీకు విను మేర్పడ నాజి మదీయశత్రులం, గ్రచ్చఱఁ జంపి చంపి యది గ్రమ్మఱి చేతికి వచ్చుచుండు... భార. అర. ౭.౩౬౯.

౨. స్పష్టముగా.

చ. అహిపతికంకణుండు తనయుల్లముఁడు గా మదిఁ గోరి నిష్ఠతోఁ, దుహినధరాధరేంద్రుఁడు చతుర్దశదివ్యమహాబ్దముల్ సుమ, స్సహముగఁ జేసె నయ్యెడఁ బ్రచండతపం బచటన్ శివుం డను, గ్రహమున నుద్భవించె నని క్రచ్చఱఁ బల్కుఁ బురాణసంహితల్. భీమ. ౩. ౧౬౦.

౩. ఎల్లప్పుడు, సతతము.

చ. ఎఱిఁగితి నేను నిన్ను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్రచ్చఱ భవదీయరక్షణమునం దవెలుంగుచునుండు... భార. అర. ౭.౩౬౬.

౪. శీఘ్రముగా.

చ. తతియగునంతకున్ రిపునదగ్రత సైఁచుట నీతి నీవు నా, కఱపినయట్ల చేయుము తగం జనియాతనిఁ గాంచి నన్ను నే, తెఱఁగున నైనఁ బొందఁగ మదిం దలపోఁతయ కర్జ నేని క్ర, మ్మఱమునివర్గవాహనుఁడవై చనుదె మ్మను మంతఁ దీఱెడున్. భార. ఉద్యో. ౧.౧౭౬.

చ... క్ర, మ్మఱఁ దనక్రేవ నున్నఘనచాపముఁ దాల్చి...భా. రా. యు. ౧౪౪౧. ఆం.భా. ౩. ౭౧.

౫. అనాలోచితముగా.

చ. చెఱఁ తతనఁబఁ నందగవు చిత్తమునం దలపోయలేక ముం, దఱ నటు వోవనిచ్చితిఁ బితామహుఁడున్ జనకుండు నింకఁ గ్ర, మ్మఱ నిలఁ బంచి చక్కసగ మక్కడ నెవ్వరి కేని మద్బలం, బెఱుఁగక యీఁదలంచినను నే నది యేటికి సమ్మతించెదన్. భార. ఉద్యో. ౩. ౩౬౧.

౬. ఇది సందర్భమునుబట్టి సవిలాసముగా మున్నగునర్థముల నిచ్చును.

ఉ. క్రమ్మఱ వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా, వచ్చితిమి ... భార. ఆది. ౪. ౨౭.

**క్రమ్ము.** వి. ౧. ధాన్యాదులం దలిపనికిమాలినపదార్థము. (పొల్లు, మొ.)

గీ. గూనివాఁడును బిచ్చకకుంటు గుజ్జుఁ, గొలుచు లమ్ముచోఁ గ్రమ్ములు గలిపి...పూర్వభవమున లాభంబుఁ బొందినారు. భార. అను. ౫. ౧౦౪.

౨. పేనినత్రాడు లోనగువానియం దుపయుక్తము కానితృణాదులయంశము. (శ. ర)

౩. కోపము.

క. వచ్చుటయుఁ గాక నోరికి, వచ్చినయట్లేపురేఁగి పదరుచుఁ జూడ్కిన్, గ్రమ్మెగయఁ బోవుచున్నాఁ, డచ్చెరు విది తెలియఁ జెప్పుమా కనుడున్. వేం. పంచ. ౧. ౬౦౨.

౪(=కమ్ము⁴.) కాంతి, కోరిక.

గీ. పెట్టవాల్పట్టరాకనిడిట్టవేల్పు, క్రమ్మ లోడఁగూర్చి మము నిచ్చ గాచుఁ గాత. అచ్చ. రా. బాల. ౮.

సీ. కతివేల్పుచూడ్కి జక్కర లుబ్బిపాఱక బలుక్రమ్ముఁ బైరులు పండఁ గలవె. నీలా. ౧. ౧౦౩.

స. క్రి. చుట్టుకొను.

వ... మచ్చరం బిచ్చం బెచ్చుపెరుఁగం బెచ్చెరం జొచ్చి క్రమ్మి... పులుఁగు కలగుండువఱచి చఱచినం గనలి దనుజుండు ... రామా. ౫. ౧౯౯.

జ: క్రమ్మఱ, క్రమ్ముకొను.

**క్రమ్ముకొను.** స. క్రి. (√ క్రమ్ము) ౧. చుట్టుకొను; ఆక్రమించు, ఆవరించు.

క. వచ్చి వసురాజశేఖరుఁ, డిచ్చినముద్రిక లతాంగి యెదుట నిడి చెలుల్, గ్రమ్ముకొని యడుగ నిట్లను, నచ్చేడియ దనయుదంత మాద్యంతమునన్. వసు. ౪. ౫౭.

ఉ. వచ్చుసువర్ణగౌరి జనవశ్యసుమూర్తి విలోచనంబులన్, గ్రమ్ముక పట్టి యచ్చటిధరాపతిసూనునికాయ మయ్యెడ, న్మెచ్చి నుతించె...చంద్రి. ౫. ౩౬, ౪. ౧౦౭.

౨. కదియు, చేరు.

వ... పెమ్ము పెఱుఁగునమ్మపుఁబమ్మలచాయలు మెచ్చులుసేయఁ బచ్చికల మచ్చికల విచ్చలవిడిఁ గ్రమ్ముకొని మొసవ నుంకించునంకంపురాజీంక జంకించి...వసు. ౨. ౧౧.

**క్రతుద్రుహుఁడు.** సం. వి. హ. పుం-క్రతువులను పాడుచేయువాఁడు-రాక్షసుఁడు.

**క్రతుధ్రుక్కు.** సం=క్రతుద్రుహుఁడు.

**క్రతుధ్రుట్టు.** సం=క్రతుద్రుహుఁడు.

**క్రతుధ్వంసి.** సం. వి. న. పుం-దక్షయజ్ఞమును ధ్వంసముచేసినవాఁడు-శివుఁడు, జన్నపుగొంగ.

**క్రతుపతి.** సం. వి. ఇ. పుం. యజ్ఞకర్త, యజమానుఁడు.

**క్రతుభు(క్కు)జుఁడు.** సం. వి. జ్. పుం. దేవత, జన్నపుఁదిండి.

**క్రతురాజము.** సం. వి. అ. పుం. ౧. రాజసూయము. ౨. అశ్వమేధము.

**క్రతురాట్టు(టు).** సం. వి. జ్. పుం=క్రతురాజము.

**క్రతువిక్రయి.** సం. విశే. (న్. ణీ. న్) ధనమును దీసికొని క్రతుఫలమును ఇతరులకు ధారపోయువాఁడు.

**క్రతువు.** సం. వి. ఉ. పుం. ౧. యజ్ఞము. ౨. విష్ణువు. ౩. ఒకానొక ప్రజాపతి.

**క్రథత్.** సం. శత్రు. హింసించుచున్న.

**క్రథనము.** సం. వి. అ. న. ౧. హింస. ౨. ఛేదనము, నఱకుట.

**క్రథనీయము.** సం=క్రథితవ్యము.

**క్రథిత.** సం. విశే. (ఋ. త్రీ. ఋ.)=క్రాథకుఁడు.

**క్రథితవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) హింసింపఁ దగినది.

**క్రథ్యమానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) హింసింపఁబడుచున్నవాఁడు.

**క్రథ్యము.** సం=క్రథితవ్యము.

**క్రన్న=క్రన్నన.** క్రి. విశే. దృ. ౧. శీఘ్రముగా.

తరల.తరుణి ద్రౌపది యిట్లు పాండవధార్తరాష్ట్రుల
దైనళీ,కరపరస్పరకోపవేగము క్రన్నఁ బా
చి విపత్తిసా,గరనిమగ్నుల నుద్ధరించె...నిజేశుల...భార. సభా. ౨. ౨౬౮.

౨. పిమ్మట.

గీ...మున్ను తన్నోటు,పడియెనో నన్ను మున్నోటువడి విభుండు, క్రన్నఁ దన్నోటువడియెనో యన్న వాకు, తెఱుఁగఁ జెప్పుము దీని నీ
వెఱుఁగుదేని. భార. సభా. ౨. ౨౦౯.

౩. మరల.

ఆ. ఇన్నరేంద్రుచేత మున్న గృహీతమై, యున్న
నాకరంబు క్రన్న నింక, నొరుల కర్థ మగును...భార. ఆది. ౩. ౧౬౮.

**క్రన్నన=క్రన్న.**

(శీఘ్రముగా, చయ్యన.)

గీ...క్రన్నన నన,నప్పళి మన లిరాన నా నొ
వ్వచుండు, ఝడితిపదతుల్యములు గాను జుం
ద్రనాళి. ఆం. భా. ౩. ౭౧.

(పిమ్మట)

మానిని. కన్నుల నిప్పులు రాలఁగ నిట్లను గర్వమున
న్విహగాధమ నీ,యన్నకు మృత్యువు నన్ను తెఱుంగవె ప్రాణము లిప్పుడు వ్రాల్చెద నం,చు
న్నతశాతకృపాణము ద్రిప్పుచు మ్రగ్రఁ డాఁకిన నిద్దఱకుక్, క్రన్నన శక్రునువర్ణులకయ్యము తైవడి ఘోరరణం బొదవెక్. మార్క. ౧.
౩౭.

**క్రమకము.** సం. విశే. (అ. మికా. అ) ౧. సక్రమము, క్రమము కలది. ౨. పోవునది, వెళ్లునది.

**క్రమకుఁడు.** సం. వి. అ. పుం. ౧. వేదమందలి క్రమపాఠమును దెలిసినవాఁడు. ౨. వేదమందలి క్రమపాఠమును జదువుచున్నవాఁడు. (కల్ప)

**క్రమణము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము. న. ౧.పాదము. ౨. పాదవిక్షేపము, అడుగిడుట. (శే. ని.)

**క్రమము.** సం. వి. అ. పుం. ౧. అడుగిడుట, పాదవిక్షేపము. ౨. అడుగు. (శే. ని.) ౩. జరుగుట. (ఉదా: కాలక్రమము) ౪. వరుస. ౫. అనుష్ఠానము, ఆచరణము. (శిశు. ౧౪. ౫౩. వితతక్రమే =విస్తృతానుష్ఠానే-మల్లి. వ్యా.) ౬. కల్పము, విధి. (మే. ని-శే. ని.) ౭. అఱుముట, ఆక్రమించుట. ౮. బలిమి, శక్తి, సామర్థ్యము. (వి. ని.)

౯. పద్ధతి, ప్రకారము, విధము.

(రేణు:౪) శ్లో. నేత్రక్రమేణోపరురోధ సూర్యమ్. సం. రఘు. ౭. ౩౯. (నేత్రక్రమేణ=బట్టవిధమున)

సీ. పల్లంబు పోనాడు వైశ్యుని సేవను గాలు గాలి నపల్లి క్రమము దోఁప... గీ. ఎవనివి చరియించు వీట నాహేమరేఖ. హంస. ౧. ౨౨౦.

౧౦. ఒకవిధమగు వేదపాఠము. ౧౧. విన్యాసము. (వాచ.) ౧౨. కంపము, వణఁకు. (వి. ని.)

**క్రమించే**=క్రమియించే. సం. స. క్రి. ౧. అతిక్రమించు, దాఁటు.

శా. మందాక్షాంచలము ల్లఘించి కులధర్మస్రోత సుల్ దాఁటి తన్నిందాభీతిమహాటవుల్ గడచి ప్రాంచత్ బుంశ్చలీకోటి నిస్సందేహస్ఫురణ స్ఫుజంగనివసత్సాంకేతికస్థానముల్, కందర్పుం డనుమంత్రదేవత సమాకర్షింపఁగా న య్యేడన్. అని. ౩. ౧౮.

౨. చంపు.

సీ...ఆచక్రధరుని, జర యను రాక్షసి నెరవునఁ బట్టి క్రమింపఁ బొం డని చెప్పి ... భార. మౌ. ౧౦.

౩. కడపు, జెల్లఁబుచ్చు.

మ. ఘననిర్ఘత్ జలపాయిరై పటుతటిత్కాంతి చ్ఛటల్ జెంజడల్, దనరన్ మించె సహస్రవర్షము లనంతక్షాంతివాతాశనం, బున వేయేండ్లు క్రమించె మే నచలమున్ బోలన్ నిరాహారుఁడై, తను వాశింపక యేండ్లు వేయుఁ గడపెన్ త్రైలోక్య మారా యనన్. ఉ. రా. ౧. ౨౧౮.

ఉ. చిత్తము వంచుటో హరి భజించుటో బంధము లూడ్చ ధైర్యపుం గత్తి ధరించుటో నియతి గైకొని మించుటొ యార్తిఁ గాంచుటో, చిత్తజరోగముల్ పెనుచు నీ కనుమాలపుఁ దోలుబొమ్మతో, హత్తుట లేమి పాప్మన కహప్మలు మూఁడు వితా క్రమించితిన్. సమీర. ౩. ౨౮౯.

**క్రమికము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రమముగా వచ్చినది. ౨. వంశపరంపరగా వచ్చినది. (వాచ.)

(క్రమిత, క్రామత్ మొదలగు రూపములు 'అతిక్రమిత, అతిక్రామత్' మొదలగు రూపములవలె గ్రహించునది.)

**క్రమియించే**=క్రమించే. సం. స. క్రి.

(అతిక్రమించు, దాఁటు.)

ఉ...అవ్వీరుఁడు ద్వారషట్క మతివేగమునన్ గ్రమియించి సప్తమద్వారము సేరఁగాఁ జని ప్రధానుఁడు దెల్పినయట్ల యచ్చటన్. ఉ. రా. ౮. ౯.

(కడపు, జెల్లఁబుచ్చు.)

చ...ఇంచుకయుఁ గంటికిఁ గూరుకు రాక శయ్యపైఁ, బొరలుచు లేచుచున్ మరలఁ బొందుచుఁ గూర్కొ-కభంగి నవ్విభావరిఁ గ్రమియించె రావణుఁ డవారితశోకసమాకులాత్ముఁడై. భా. రా. యు. ౭౩౦.

**క్రముకము.** సం. వి. అ. పుం. ౧. గువాకము, పోఁకచెట్టు. ౨. ఎఱ్ఱలొద్దుగు ?. ౩. గంగరావి ?. ౪. నాగముస్తె ?. ౫. ప్రత్తిచెట్టు. న. పోఁకకాయ.

**క్రమువు.** సం. వి. ఉ. పుం. పోఁకచెట్టు. (వాచ).

**క్రమేలకము.** సం=క్రమేలము.

**క్రమేలము.** సం. వి. అ. పుం. ఉష్ట్రము, ఒంటె.

**క్రమ్మన**=గ్రమ్మన. అవ్య. దు. శీఘ్రముగా.

గీ...పుడమి పగులఁ, బెల్లగిలి కూలెఁ దరువులు గొల్ల లెల్లఁ, గూడఁబడి రత్ను కొందఱు గోపసతులు, చూచి క్రమ్మనఁ బాటి యశోద తోడ. హరి. పూ. ౫. ౨౮౩.

క. తమ్ములతో నపు డాస్థా,నమ్మునఁ గొలువుండి ధర్మనందనుఁడు ప్రేమో,దమ్మునఁ దమ్ముఁడ రమ్మని, క్రమ్మనఁ గదియంగ భీముఁ గౌఁగిటఁ జేర్చెన్. జై. భా. ౩.౫.

చ. చనువెడ దాని మన్మథశిలీముఖము సోఁకిన నొచ్చె నంచుఁ దూ,యని కలఁగూరుఁ దూపొడిచి యల్లనఁ బుప్పొడి రక్షవెట్టి క్ర,మ్మన నధరామృతంపుఁ బలుమం దొకయించుక యిచ్చి మించులం, బొనరినచూపులం బడిసిపోనటు వైచుచుఁ గౌఁగిలించుచున్. విక్ర. ౪. ౫౯.

**క్రమ్మఱ, క్రమ్మఱఁగ.** అవ్య. ద్రు. (√ క్రమ్మఱు) ౧. పునరర్థకము, మరల.

క. క్రమ్మఱ రథ మెక్కి బలి,ష్ఠ మ్మగుచాపంబు దాల్చి సంకర్షణుఁ డ, స్త్రమ్ములు పఱఁగించి రణా,గ్రమ్మునఁ బలువుర వధించెఁ గాశ్యులఁ గడిమిన్. హరి. ఉ. ౩. ౧౨౫.

క. ... చచ్చి క్రమ్మఱఁ,బుట్టినచందమున... నైష. ౨.౪. ఆం. భా. ౩. ౬౯.

౨. వాక్యాలంకారము.

క. ...సురముని, క్రమ్మఱ నాకస్మికమ్ముగా నచ్చటికిన్.

క. చనుదెంచి యమ్మురారికి...ఒక్కదివ్యకుసుమ మొసఁగెన్. పారి. ౧.౭౫, ౭౬.

**క్రమ్మఱి.** అవ్య. (√ క్రమ్మఱు) పునరర్థకము, క్రమ్మఱ, మరల.

గీ. మగుడఁ గ్రమ్మఱఁ గ్రమ్మఱి మరల సారె, వెండి మాటికిఁ దిరుగ నా వెలయును బున,రర్థకముగ...ఆం. భా. ౩. ౬౯.

**క్రమ్మఱించే=క్రమ్మఱుచే.** స. క్రి. (√ క్రమ్మఱు.) మరలించు, త్రిప్పు.

ఉ. ... విప్రుఁ డొప్పు నో,చం దతికాంతుఁ డయ్యె నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్. భార. ఆది. ౧. ౧౦౦.

చ. అనిలజవంబునం బఱచునశ్వదనాగ మెదిర్చి క్రమ్మఱిం,చినపరికాఁడపోలెఁ గురుసింహవరూధము నిట్లు గ్రమ్మఱిం,చుచు నితఁ డంచునుం దగిలి చూపఱు సాళ్వమహీశువిక్రమం, బొనరఁగ నల్లడం బొగడుచుండిరి విస్మయాసక్తచిత్తులై. భార. ఆది. ౪. ౨౦౬.

సీ. పులినోరికండయై పోయినమనభానుమతిఁ గ్రమ్మఱించినయతఁ డితండు. రాజ. చ. ౨.౧౧౨.

సీ. రోషారుణాక్షులరుచులును సిందూరకాంతియు రవిదీప్తిఁ గ్రమ్మఱింప. భార. విరా. ౩. ౧౬౭. (ఇట ఔపమ్యద్యోతకము.)

**క్రమ్మఱిల్లు(లు)=క్రమ్మఱు.** (√ క్రమ్మఱు) (మరలు; మరలివచ్చు.)

చ. పఱచిన దేవకీసుతుఁడు పక్కున నవ్వెనఁ గ్రమ్మఱిల్లి మైఁ,దఱచుగ రోమహర్షణ ముదంచితభక్తిభరాకులత్వ మేఁ,ర్పఱచుచుఁ గేల్మోగిడ్చి పలుపల్కులతక్కులసన్నవెన్నెలన్, బఱపుచుఁ బ్రస్తుతించె మునిబంగవిభంజను భక్తరంజనున్. పాండు. ౪. ౯౦.

ఉ. గౌరివివాహమై కుసుమకార్ముకుఁ గ్రమ్మఱిలంగఁ జేసి బృం,దారకవర్గము న్నిజపథంబున కన్పి హిమాచలంబుపైఁ, బారిషదవ్రజంబు దను భక్తి భజింపఁగ నాదరించె సం,సారసుఖంబు శంకరుఁడు...హర. ౫. ౩.

వ. అతిపరుషపవనసంపాతాహతం బైన దీపంబునుంబోలె నీపరమమిత్త్రుండు క్రమ్మఱిలండనుమ్మీ. హర. ౩. ౯౩. (పైరెం డుదాహరణములందును 'పునర్జీవితుఁ డగు' అని భావము.)

**క్రమ్మఱు.** అ. క్రి. నివర్తిల్లు, మరలు; మరలివచ్చు; మరలిపోవు.

మ. పఱచున్ దవ్వుగఁ జేయలంతి నిలుచుం బట్టీక యాసాసలం, బిఱువోవున్ ... క్రమ్మఱి చూచుం జెవి దార్చి నిల్చు...మాయామృగంబిమ్ములన్. భార. అర. ౬. ౩౨౪.

ఉ. అమ్మైన సొచ్చుచొప్పు తెలియక్ విని నం
తియకాని యిమ్మలం, గ్రమ్మఱుభంగి వాఁడు
వినఁగానఁడు...భార. ద్రో. ౨. ౨౩౫.

శా. ఈవేళ బలియు నతనిం, బోవిడిచితి పొమ్ము
పాడిఁ బోయినరాజ్యం, బేవిధిఁ గ్రమ్మఱు
నావెర, వీవెర వని వ్రేలు మడఁచి యేర్పడఁ
జెపుమా. అము. ౩. ౪౪.

గీ. ఎలమి నెవ్వనిగృహమున శేఁగు దెంచి, యఫలి
తాశుఁడై క్రమ్మఱు నట్టిఅతిథి, తనదుదుష్కృ
త మాగృహస్థునకు నిచ్చి, యతనిసుకృత మం
తయుఁ గొని యరుగుఁ బుత్ర. మార్క. ౩.
౧౪౯.

మ. ... నీకు నెంతటివాఁ డైన నెదిర్చి ప్రాణము
లతోఁ దాఁ గ్రమ్మఱఁ డేమి ప్రస్ఫుట
మోఘూప యరాతిచేష్టలు భవద్భ్రూభంగవ
క్యంతముల్. రాఘవ. ౩. ౧౦౯.

జ: క్రమ్మఱు, క్రమ్మరి, క్రమ్మరించు, క్రమ్మరిల్లు,
క్రమ్మఱుచు.

క్రమ్మఱుచు=క్రమ్మరించు.
(మరలించు, త్రిప్పు.)

చ. అక్కజ మైనచెల్వమున నాత్మకు వ్రేఁగయి
పొల్చుపొల్తిపై, నెక్కొనుచూడ్కిఁ గ్రమ్మ
ఱుప నేరక యూరక నిల్చె...భార. విరా.
౨. ౨౩.

గీ. అనుటయును వార లామాట లాదరించి, క్రమ్మ
ఱుప రాదు పలు కమోఘమ్ము మాకు. భీమ.
౪. ౧౪౯.

ఉ. ...ధర్మనందనుఁడు గ్రమ్మరిచెక్ యదువీర
కోపముల్. భార. అర. ౩. ౧౭౦. (ఉపశమి
ల్లఁజేయు అని భావము.)

క్రమ్మించు. స. క్రి. క్రమ్మఁజేయు. (√క్రమ్ము)
(వ్యాపింపఁజేయు.)

సీ. కొదమగుబ్బలదానిఁ గ్రొమ్మించుఁ గ్రమ్మించునె
మ్మెనినిగనిగన్నిగలదాని. దశా. ౨. ౧౦.

సీ. వెలిడాలు గ్రమ్మించునిచ్చుకత్తులవేల్పుమూఁ
క రెల్లెడలఁ గ్రమ్ముకొని నడువ. దశా. ౨. ౧౯.

క్రమ్ము. అ. క్రి. ౧. వ్యాపించు, ప్రసరించు; ప్రవ
హించు; కాఱు.

చ. కరమున నున్నశూలమునఁ గ్రమ్ము మెఱుంగు
లు శత్రుసైన్యభీ,కరములు గా...భార. భీష్మ.
౩. ౧౦౯.

ఉ.. రక్తజలంబు పైపయిం, గ్రమ్మఁగఁ గూలె
...భా. రా. అర. ౨. ౩౯౧.

క. గ్రమ్మన నెత్తురుటేఱులు, గ్రమ్మ నఖండప్ర
చండకాలానలకీ,లమ్ములఁ దెగడు మెఱుఁగువా,
లమ్ముల నక్షౌహిణీత్రయము మడియించెక్.
జై. భా. ౭. ౧౬౧.

గీ. రమణి పొరిఁబొరిఁ గన్నీరు గ్రమ్మఁ జుట్టు, మె
లఁగి కాకుల గ్రద్దలఁ దోలఁగ నడుచు,చున్న
యది...భార. స్త్రీ. ౨. ౬౪.

౨. కవియు, పైఁబడు; పడు.

క. పతి పురికొలిపిన నమవస,నతిశయముగఁ బొం
గుజలధి యనఁ గ్రమ్మినయు,ద్ధతబలము నిలిపె
నమ్మా,రుతి నెలియలికట్టక్రియ నిరూఢస్థితి
రై. భార. భీష్మ. ౨. ౨౧౭.

ఉ. తోరపుటక్కునారిపులు దొమ్మిగఁ బైపయిఁ
గ్రమ్మ వారి లీ,లారణవృత్తిఁ గిట్టి...రాఘవ.
౨. ౨౧.

౩. ఉబుకు.

గీ. అరమాకాంతరూపరేఖాతిశయముఁ, గాంచు
వారి కప్పు డంతరంగమున నిండి, వెలిఁ గ్ర
మ్మినయనురాగజల మనంగ,స్వేద మానంద
బాష్పముల్ చెలువమయ్యె. దశా. ౨. ౭౬౩.

౪. అతిశయించు, అధిక మగు.

క. గొనయంబు నెక్కఁ ద్రోచిన, గనయంబున శ
క్కకున్నఁ గ్రమ్మినతమకం,బున విల్లు విడిచి
వేటాక,యనిమిషభటుఁ డనికి వెడలె నడిద
ముఁ గొనుచుక్. పారి. ౪. ౫౧.

౫. కలుగు, పుట్టు.

సీ. ఒకసింహ ముగ్రమై యుటికి గుట్టమ్ము నాతనిఁ జంపి బలుకండ యనుతలంపు, గ్రమ్మ రత్నము నోరఁ గబళించునంతలో నేతెంచి మృగపతి నెలుఁగుఱేఁడు, జాంబవంతుఁడు మహాస త్త్వుండు వధియించి...హరి. పూ. ౩. ౧౭౭.

చ. మలయసమీరణాభిహతి మ్రాఁకుల నాకులు డుల్లి డుల్లి...కుట్మలములు గ్రమ్మి క్రమ్మి...కు. సం. ౪. ౪౪౩.

స. క్రి. ౧. కలియు, కూడు.

మ. మతిఁ గ్రీడారతి గల్గెనేని సకలక్ష్మాపుణ్యదేశాళి గాంచి తపస్స్ఫూర్తి మెయిం గృశించి వనరాశిం జెందుమాబోంట్లనుద్ధతి చేఁ గ్రమ్మఁగ నేల నీకుఁ గలవే తారుణ్యలావణ్యజృంభితరంభాదినిలింపభామ లన భూభృన్మౌళి రాగాంధుఁడై. వసు. ౨. ౧౩౬.

౨. (ప్రక్షులు ఱెక్కలతో గ్రుడ్లను) కప్పు, పొదుగు.

ఉ. తమ్మి పతంగపత్ని తమిఁ దాల్చినపాండుర కోరకాండముల్, గ్రమ్మి నిమీలితచ్ఛదపరంపరచేఁ బ్రసవాప్తివేళ రా, నిమ్ముగ వాని నొయ్య విరియించిన హేతుగుణాప్తిఁ బాంధవ, గ్రమ్ముల నేచు తేఁటిపిలుకల్వెడలెన్ సహజాసితచ్ఛవిన్. వసు. ౪. ౧౩౪.

౩. ఆవరించు, చుట్టుకొను.

గీ. పొదివెఁ గవిసెను గ్రమ్మె నాఁ బోలుచు నావరించె ననుమాట గాను...ఆం. భా. ౩. ౧౧౭.

౪. చుట్టు.

(రథవర్ణనము) సీ. జత గూర్చి తారవజ్రాలఁ బమ్మి నకమ్మి గ్రమ్మినమణిరథాంగములగములు. వసు. ౧. ౧౪౪.

జ: క్రమ్మించు, క్రమ్ముకొను, క్రమ్ముదల, క్రమ్ముదెంచు, క్రమ్మువడు.

క్రమ్ముకొను. అ. క్రి. (క్రమ్ము + కొను-స్వార్థమున.)

(మూఁగు)

సీ. దర్పకునెఱకాతుఁదనముపేర్మికిఁ గ్రమ్ముకొను సతేజఃకీర్తిఘనము లనఁగ... గీ...జలదపథమున నుండి భూస్థలికి డిగ్గుహంసములు వర్ణనాసిమ నలకరించె. ప్రభా. ౨. ౪౧.

క్రమ్ముదల. వి. (√క్రమ్ము) ౧. క్రమ్ముట. (శ. ర.)
౨. కప్పుట, మఱుఁగుపఱచుట. (బ్రౌ.)

క్రమ్ముదెంచు. అ. క్రి. (క్రమ్ము+తెంచు- స్వార్థమున) క్రమ్ము.

(వ్యాపించు.)

(నృసింహవర్ణనము) సీ. ప్రళయాభ్రచంచలాప్రతిమభాస్వరములై ఖరనఖరోచులు గ్రమ్ముదేర. భాగ. ౭. ౨౯౧.

(త్రోసికొనివచ్చు.)

చ. కనుఁగొని దర్పమంథరముగా నతఁ డిట్లనుఁ బాండవాగ్రజన్మునకు వడిం బెనంగఁగ ననుం బవనాత్మజుఁ జూచువేడ్క ని న్జనతతి యంత కంత కిటు సందడిగాఁ దనయిచ్చఁ గ్రమ్ముదెంచునో యుపవేశనిశ్చలతఁ జూచిన మే లఖిలప్రియంబుగన్. భార. శల్య. ౨. ౨౩౧.

(ఉబుకు)

గీ. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి, హోమసమయకృత్యంబుల నొడపి సౌఖ్యరసము పెన్నిట్టి పొరిఁబొరిఁ గ్రమ్ముదేర, సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు. భార. విరా. ౫. ౪౦౨.

(వెడలు, ఉద్గత మగు)

చ. బెగడక శూల మెత్తికొని భీమతరంబుగ నోర మంటలుం, బొగలును గ్రమ్ముదేర మును బోరన మృత్యువు వచ్చి ... భా. రా. యు. ౧౪౯౨.

క్రమ్మువడు. అ. క్రి. (క్రమ్ము+ పడు.)

(మూఁతపడు.)

గీ. ఘనుఁడు గృహమేధి పెరటిలోఁ గ్రంతఁ జూచి, క్రమ్మువడ మంచి దోకరేఁగుకొమ్మ వేయుము, మనుచు భృత్యునిఁ బలుకంగ నంబుజా

క్షి, వానిగొడ్డలి వడబావిలోన వైచె. గంధ. ౬౬.

**క్రయణము.** సం. వి. అ. న. కొనుట, విలుచుట.

**క్రయణీయము.** సం=క్రేయము.

**క్రయపత్త్రము.** సం=క్రయలేఖ్యము.

**క్రయపెట్టు.** మి. స. క్రి. (క్రయము + పెట్టు) వెలకు పెట్టు, అమ్మఁజూపు.

సీ. పొరుగూళ్లఁ గలమాన్యభూముల ధాన్యంబుఁ గ్రయపెట్టి విడుచు...నిరం. ౨. ౨౬.

**క్రయము.** సం. వి. అ. పుం. ౧. వెల. ౨. (వెలయిచ్చి) కొనుట, కొనుగోలు.

**క్రయలేఖ్యము.** సం. వి. అ. న. క్రయమును సూచించుపత్త్రము.

**క్రయవిక్రయికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) క్రయవిక్రయములచే జీవించువాఁడు.

**క్రయారోహము.** సం. వి. అ. పుం-కొనుటకు వచ్చుచోటు-హట్టము, అంగడివీథి.

**క్రయించు.** సం. స. క్రి. (సరకును వెలయిచ్చి) కొను, విలుచు. (శ.ర)

**క్రయికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) (సరకును వెలయిచ్చి) కొనువాఁడు, విలువకాఁడు. (వై. ని.)

**క్రయ్య=కయ్య.**

(కుల్య, కాలువ)

ఉ. ...కృత్త వానరశిరశ్చరణాదులు నేమిఘట్టనం, గ్రయ్యలు గట్టి యున్న రుధిరస్థలులుం బతితాస్త్రపంక్తులుం, గయ్యపునేల నుగ్రగతిఁ గానఁబడం దఱుచయ్యె నంతయుఁన్. భా. రా. యు. ౬౯౭.

ఆ. అధికబలము గల్చి యవనీపతులు గొంద, అతివిహీనరిపులయాక్రమమున, మడిసి రకట జలధి వెడలి సన్నపుఁగ్రయ్య, మానిఁగి రూపడంగుజనులమాడ్కి. భార. సౌ. ౨. ౧౪.

క్రయ్యూట=కాలువయూట, కాలువనీరు.

ద్వి. ఇందులక్రయ్యూట లీప్సితార్థంబు, లంది చ్చురసరసాయనసుధావారి. పండితా. పర్వ. ౩౧౩ పు.

**క్రయ్యఁబడు.** అ. క్రి. (క్రయ్యన్ + పడు-స్వార్థమున) ౧. కలియఁబడు; చొరఁబడు.

క. నెయ్యమున నడిగిపుచ్చుట, యియ్యకొనక యర్థ మీక యీర్ష్యాపరుఁడై, కయ్యమున గెలిచి కన్యకఁ, గ్రయ్యంబడి చేసికొనిన రాక్షస మయ్యెన్. విజ్ఞా. ఆచా. ౧౦౦. (బలాత్కారము గా అని భావము.)

క. ఒంటి చరింపకు పొలమున, నింటికిఁ గడుఁ బ్రొద్దు గలుగ నేతెంచుచు రా, వెంటఁబడి పొడుచుగోవుల, జంటఁ జనకు క్రయ్యఁబడకు సందడి యగుచోన్. భోజరా. ౬. ౩౨.

౨. కలియు, కూడు.

క. వెయ్యేండ్లయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్నవాఁడ...భాగ. ౯. ౪౭౭.

**క్రయ్యఁబాఱు.** అ. క్రి. (క్రయ్యన్ + పాఱు) కలయఁబాఱు.

(గంగ) వ... మానిని యన లోఁతు సూపక గరిత యన సడిచప్పుడు సేయక ముగుద యన బయలుపడక ప్రమద యనఁ గ్రయ్యంబాఱుచుఁ బతివ్రత యన నిట్టట్టు చనక...ప్రవహించి. భాగ. ౯. ౨౩౦.

**క్రయ్యము.** సం. విణ. (అ. ఆ. అ) కొనుటకు అంగడియందు సిద్ధపఱుపఁబడినది.

**క్రయ్యు.** అ. క్రి. కలియు.

(గంగావర్ణనము) వ ... ముద్దుఁజందురులోడ నెయ్యంబునఁ గ్రయ్య నడరి చొప్పు దప్పక సాగి చనుదెంచుసుధార్ణవంబుకైవడిఁ బెంపు గలిగి...భాగ. ౯. ౨౩౦.

ఙ: క్రయ్యఁబడు, క్రయ్యఁబాఱు.

క్రల్లపడు. అ. క్రి. దగ్ధమగు, కాలు.
క. తరు లెల్లఁ గ్రల్లపడఁగా, విరళములై నీడ లు
న్నవిధ మొప్పె వహ్నిస్ఫురరుచులతోడఁ దల
పడి,యరవరలై తుమురుతుమురులై పడినక్రి
యన్. హరి. పూ. ౬. ౩౬. (శ. ర. పా.)

క్రవ్యఘాతనము. సం. వి. అ. పుం-మాంసముకొ
ఱకు చంపఁబడునది-లేడి, జింక.

క్రవ్యము. సం. వి. అ. న. మాంసము, పొల.

క్రవ్యాత్తు. సం. విణ. (ద్) మాంసమును తిను
వాఁడు. వి. ద్. పుం. ౧. రాక్షసుఁడు. ౨. మాంస
మును తినుజంతువు. (పులి, గ్రద్ద, మొ.)

క్రవ్యాదము. సం. వి. అ. పుం. ౧. మాంసమును
తినుజంతువు (పులి, గ్రద్ద, మొ.) ౨. రురువు, న
ల్లచాఱలు గలదుప్పి. (కల్ప.)

క్రవ్యాదుఁడు. సం. విణ. (అ. ఆ. అ) మాంసము
ను తినువాఁడు. వి. అ. పుం. రాక్షసుఁడు.

క్రవ్యాశి. సం. విణ. (న్. నీ. న్.) వి. న్. పుం=
క్రవ్యాత్తు.

క్రశితము. సం. విణ. (అ. ఆ. అ.) కృశీకృతము,
కృశింపఁజేయఁబడినది.

క్రశిమ(ము). సం. వి. న్. పుం. కృశత్వము, బ
క్కచిల్లుట.

క్రష్ట. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. కృశించువాఁ
డు. ౨. లాగువాఁడు. ౩. దున్నువాఁడు.

క్రష్టవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. దున్నఁ ద
గినది. ౨. లాగఁ దగినది.

## క్రా

క్రాంతదర్శి. సం. విణ. (న్. నీ. న్.) ఇంద్రియా
తీతవిషయజ్ఞానము కలవాఁడు, సర్వజ్ఞుఁడు.

క్రాంతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పోయినది,
వెళ్లినది. ౨. ఆక్రాంతము, వ్యాప్తము. శకు. ౪. ౩.
వి. అ. పుం. గుఱ్ఱము. న. ౧. పోవుట, వెళ్లుట.
౨. అడుగు, చరణము. ౩. (జ్యోతి) ఏకనక్షత్ర
మున చంద్రునితో మఱియొకగ్రహము కలియుట.

క్రాంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పోవుట. ౨. అడుగి
డుట, పాదవిక్షేపము. ౩. మీఱుట, అతిశయిం
చుట. ౪. అణఁచుట,ఆక్రమించుట. ౫. ఖగోళ
మండలిసూర్యమార్గము.

క్రాంతికక్షము. సం. వి. అ. పుం. ఖగోళమండలి
సూర్యమార్గము.

క్రాంతిమండలము. సం. వి. అ. న=క్రాంతికక్షము.

క్రాంతివలయము. సం. వి. అ. న. పుం=క్రాంతిక
క్షము.

క్రాంతివృత్తము. సం. వి. అ. న=క్రాంతికక్షము.

క్రాఁక=కాఁక. (√క్రాఁగు-శ. ర.)

క్రాఁగు=కాఁగు. అ. క్రి. ౧. దగ్ధమగు, కాలు; త
పించు, మండు; పరితాప మొందు.
ఉ. కౌరవకోటి దర్పమునఁ గానక నిన్నుఁ బరా
భవించి దు,ర్వారభవత్ప్రతాపశిఖిఁ గ్రాఁగె
మదిక వగ పేల దీనికిన్. భార. శాం. ౧. ౯౩.
క. ఈగంగాదికతీర్థము,లీఁగంగా నీవు తమసమి
ద్ధాంబువులం, దోఁగెడు వారల గనఁగనఁ,గ్రాఁ
గెడునంగారసింధుకల్లోలములన్. పాండు.
౧. ౧౫౦.
సీ. పరదేసులై భూమిఁ దిరిగెడివారును గతి లేక
యాఁకటఁ గ్రాఁగువారు. వి. పు. ౪. ౧౫౪.
౨. పోవు, నశించు.
ఆ. కడుఁ బ్రసిద్ధ మిదియుఁ గర్కోటకుని దమ,
యంతిఁ బుణ్యమూర్తి యైననలుని, నుతచరి
త్రుఁ డైనఋతుపర్ణుఁ గీర్తింపఁ, గలిభయం
బు లెల్లఁ గ్రాఁగు నధిప. భార. ఆర. ౨. ౨౩౦.
గీ. క్షత్రవధ నైనపాపంబు గ్రాఁగ వలయుఁ,గడఁ

గి నాకును సద్గతి గలుగ వలయు. భార. అర. ౨. ౨౬౨.

సీ. ఘనతపోనియతిఁ గ్రాఁగనికలుషంబులు జప
ము సేసిన నశించనియఘంబు,లు... గీ. అచ్యు
తానంత గోవింద హరి మురారి,యని తలంచి
నయప్పుడే యడఁగిపోవు. వి. పు. ౩. ౧౩౫.

వి. కాఁగు, పెద్దబాన.

సీ...క్రాలుఁ గటాహంబు క్రాఁ గనంగ. అం.భా. ౨. ౨౮౫.

గీ. క్రాఁగుపై మ్రొగ్గు తెలినిగ్గుఁ గ్రాఁగి పొంగ,సాగు
పాలని పై నీరు చల్లి చల్లి, యల్లుకొనునట్టివె
న్నెల నల్లుకొన్న, యన్నుమిన్నలు విహరించి
రన్నివగల. రా. వి. ౩. ౧౩.

క్రాఁగిపోవు=క్రాఁగు.

(నశించు.)

గీ. తామ్ర మాదిగఁ గలయట్టిధాతుచయము,గాలి
మి నిడి యూఁదఁ గీ డెల్లఁ బోలియునట్లు,
ప్రాణపవననిగ్రహమునఁ గ్రాఁగిపోవు,ననఘు
యింద్రియజనితదోషాదు లెల్ల. మార్క. ౩.
౩౧౫.

జ: క్రాఁక, క్రాఁగుడు, క్రాఁచు.

**క్రాఁగుడు**=కాఁగుడు. వి. (√క్రాఁగు) తపించుట,
తపనము. (శ. ర.)

**క్రాఁచు**=కాఁచు. స. క్రి. (√క్రాఁగు) ౧. కాల్చు;
కరఁగించు; తపింపఁజేయు.

సీ. పటుతరం బగుచటచ్చటరవం బెసఁగంగ మ్రాఁ
కులుఁ బొదలును గ్రాఁచికొనుచు...గీ...పరఁ
గె, నద్భుతోద్భవం బైనమహానలంబు. భార.
ఆశ్ర. ౨. ౧౫౧.

చ...త్రిజగంబులక న్నలబ్రహ్మవిష్ణురుద్రమహి
మ లొక్కటై కలయఁ గ్రాఁచినయుండ త్రి
వేదమూలకంద మని నుతింప నొప్పెసఁగెఁ
దామరసప్రియబింబ మత్తఱిఁ. నిర్వ. ౬.
౭౭.

గీ. తపనతపనీయ మాతపతాపవహ్నిఁ,గ్రాఁచుకా
లకళాదుఫూత్కారచయము, నాఁగఁ దగెఁ
బశ్చిమానిలోగ్రాగమంబు. కృ. శకుం. ౧. ౩౦.

వ...వాద్యంబులు తడిసిన విద్యోపజీవులు పుష్క
రంబులు గ్రాఁప నగ్గి రోయుచుండ...ఆము. ౮.
౩౫.

సీ. కనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె...
గీ ... కృష్ణ,రాయబాహుప్రతాపజాగ్రన్మహా
గ్ని. మనుచ. ౧. ౩౭.

౨. నశింపఁజేయు, పోఁగొట్టు; చంపు.

క. నను నీస్తవమున నెవ్వం, డనుదినమును భక్తి
తో సమాహితమతియై, వినుతించు నతనియా
పద,లనయంబును నే నసంశయంబుగఁ గ్రాఁ
తున్. మార్క. ౬. ౨౩౧.

గీ. విప్రకడుపులో నున్నయవ్విప్రు ననుజుఁ, బిలి
చె రమ్మని వాతాపి ప్రియముతోడ,జీవితుం
డయివాఁడు వెచ్చెరను విప్రు,కడుపు వ్రచ్చు
చు వెలువడి క్రాఁచె విప్రు. భార. ఆర. ౨.
౩౨౦.

౩. పీడించు.

శా. ఆచారంబు జితేంద్రియత్వము విధేయత్వంబు
లజ్జాగుణ, ప్రాచుర్యంబును నామనప్తము ల
గున్ బత్మాంకితంబుల్ దృఢ,భ్రూచాపచ్యుత
ముల్ శ్రవఃపథగతంబుల్ తన్విదృగ్బాణ
ముల్, క్రాఁచ జ్జాగినయంతలో నురభిమల్లా
...మల్లభూ. శృం. ౭౮.

క్రాఁచిపుచ్చు=క్రాఁచు, నశింపఁజేయు.

గీ. సప్తగోదావరమునీట జలకమార్చి, పుష్పగం
ధాక్షతంబులఁ బూజసేసి, కలిభవం బైనకలు
షంబుఁ గ్రాఁచిపుచ్చి, మర్త్యుఁ డొందును వే
గం బమర్త్యపదవి. భీమ. ౩. ౧౧౫.

**క్రాకచికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) అంపపుఁ
గోఁతగాఁడు.

**క్రాథకుఁడు.** సం. విణ. (అ. థకా. అ.) హింసించు
వాఁడు.

క్రాథము. సం. వి. అ. పుం. హింస, వధము.

క్రాయకుఁడు. సం. విశే. (అ. యిక. అ.) క్రేత, కొనువాఁడు.

క్రాయు. అ. క్రి. కాండ్రించు.

సీ. ధవళలాంగూలపల్లవచాలనంబుల గా ముదీ చ్ఛాయలఁ గ్రాసి యుమియ. కాశీ.౪. ౨౬౯.

సీ. ధర్మరాజు లటన్న దబ్బరలే లిట్టుఁ గంబము య్యె యటన్నఁ గ్రాసి యుమియు. శుక. ౩. ౪౯.

స. క్రి. ౧. కక్కు.

ఉ. మ్రింగియుఁ గ్రాయ వచ్చిలువ మెల్ల విధం గనుగందకుండఁగన్. నైష. ౮. ౧౭౩.

క. కొలఁది యెఱుంగక తిని కో,కిలకామిని వెడలఁ గ్రాసెఁ గిసలయఖండం,బులు... వరాహ. ౩. ౮౮.

౨. ఉమియు.

ఉ...నెత్తురు చవిచూచుఁ గండలు తుథూ య ని క్రాయు... పిశాచవిభుండు ... ఉ. హరి. ౨. ౧౨౪. అచలా. ౨. ౮౧.

క్రార=క్రారవడి. వి. (క్ర య్యు+ర-శ. ర.) జడ్డయై ఒకయక్షరముతోఁ గలియురేఫము.

గీ. కొమ్ముక్రారలు మఱి ద్వివర్ణమ్ము లగుట, వాని యెడమవి గురువులు వట్రువులు, ప్రాణములు గాన వానిడావలను గల్గు,నక్కరము లెల్ల లఘువులు నిక్కముగను. అప్ప. ౪. ౪౯.

గీ...క్రార,గిలక యన రేఫ మెసఁగును... ఆం. భా. ౨. ౧౮౭.

క్రారవడి=క్రార. వి. (క్రార + వడి-స్వార్థమున) జడ్డయై ఒకయక్షరముతోఁ గలియురేఫము. (శ. ర, బ్రౌ.)

క్రాలు. అ. క్రి ౧. చలించు, కదలు.

ఉ. అళియుఁబోలె నివ్వడు వనాళి యమార్గమునం జరించుని,న్నోలలితాంగి కా దనుచు నున్నది మందసమీరణంబులం,గ్రాలుప్రవాళమంజరులు కమ్రకరంబులవిభ్రంబు గా, బాలరసాల పుష్పరసపాయివనప్రియకంఠహుంకృతిన్. నైష. ౨. ౪౮.

వ... ఈరాజానీరాజనకరణంబులకు రం డనుచు నమరకాంతలఁ బిలుమనోజం గ్రాలునూతన కేతనంబులును...భా. రా. అయో. ౧౦.

౨. సంచరించు, తిరుగు.

క. నేలకు నల్లెఁడుపాడు పునఁ, గ్రాలుచు మును మెఱయుగురునిరథచక్రము ల,క్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంటసిలఁ బడియె నృపా. భార. ద్రో. ౫. ౩౧౭.

గీ. అలజాలంబు నీరిపై నామజాడ, గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ, నిదురలోపలఁ గలఁ దోఁచునీడ పిదపఁ, గానవచ్చునె యప్పుడ కన్నఁగాక. ఉ. హరి. ౫. ౧౧౦.

౩. ప్రవర్తిల్లు; వర్తిల్లు.

చ. గుణ మిది దోష మిట్టి దని కొంత యెఱింగినఁ గాక యిట్లు ని,ర్గుణతయె పట్టి క్రాలుకవు కుం దగువారలు సెప్పు సౌమ్యభా,షణము నిర ర్థకంబు...నిర్వ. ౬. ౬.

క. కైలాసనగమునందును,గ్రాలెడు ప్రావృట్పయోధరము చందమునన్, లాలితకటిభాగంబున,నీలాంబర మమరు రామునిం బొడగాంచెన్.వి. పు.౭. ౩౩౯.

సీ. మడుఁగులోపలఁ జొచ్చి కడుపార నుదకంబు గ్రోలంగ దిగ నందుఁ గ్రాలుమొసలి, పాదముల్ కబళించి పట్టిన ... మొ. రా. యు. ౨. ౭౪.

౪. చెదరు.

ఉ. కాలమునాఁటిమృత్యువుముఖంబునఁ బోలె ను విస్ఫులింగముల్, గ్రాలఁగ దేవసంఘములు గంపము నొంద...భాగ. ౬. ౪౨౫.

౫. క్రమ్ము.

గీ. గళితశృంఖల లయ్యు నకాలనిద్ర, గనుఁగవలఁ గ్రాలఁ దమయంతిఁ గదల వయ్యె,దారుణా ఘోరణ ప్రయత్న మునఁ గాని,నముచిమథనుని వీట కుండాలఘటలు. పారి. ౪. ౬౭.

౬. అతిశయించు; విజృంభించు.

గీ. దేవలోకజిగీష చేఁ ద్రిపురహంతు,కామకా మాంతకోద్భటాకారు లగుచు, లంక విడిచి మ నోవీథి శంక విడిచి,యసురు లుత్సాహములు గ్రాల నరుగు వేళ. ఉ. రా. ౨. ౩౦.

క...అతఁడు బలువిలు గొని, క్రాలుచు నాభీమ ముఖ్యరథికుల నొంచెన్. భార. ద్రో. ౪. ౨౯.

౭. సంచలించు, క్షోభపడు.

ద్వి. ఏలె వధూమణి యెన్నిచందములఁ, గ్రాలు చున్నాఁడఁ గటకటా యనవు. రం. రా. అర. ౧౫౭ పా. ౧౩ పం.

౮. ఒప్పు.

శా. ప్రాలేయాంశుమరీచినిర్మలతనూభాగంబుఁ గృష్ణాజిన, వ్యాలోలామలయజ్ఞసూత్రములు నంసాసక్తవీణాలతా, లాలిత్యంబు లలాటి కారుచులుఁ గ్రాల న్నారదుం డిచ్చలం, గై లాసంబుననుండి వచ్చె...ఉ. హరి. ౩. ౯.

సీ...క్రాలెను వటు లెఁ దుబుంగలించె ... అనంగ నొప్పె నన్నాటగాఁ జెప్పఁబడును. ఆం. భా. ౩. ౮౩.

జ: క్రాలుఁగన్ను, క్రాలుకొను, క్రాల్గంటి.

క్రాలుఁగ(ల్గ)న్ను. వి. హా. ౧. చంచలేక్షణము, లోలనేత్రము.

శా...లోలోపల వేడుకల్ నిగుడ సిగ్గుల్ దేలు నొయ్యారపుం, గ్రాలుంగన్నులఁ గ్రొమ్మెఱుం గులు దొలంకన్ మందయానంబులో, నాలీ లానిలయంబు చేసుదురొకో నాళీకపత్రేక్షు ణల్. వరాహ. ౪. ౮.

సీ. ఇందీవరంబుల నీను క్రాల్గన్నులకరదిందుముఖు లు చామరము లిడఁగ. మనుచ. ౧.౧౨.

౨. లోగవిశేషయుక్తమైన నేత్రము.

ద్వి...వ్రంగుడుకన్ను, క్రాలుఁగన్నను నీరు గా ఱెడికన్ను. పండితా. మహిమ. ౨౬౩ పా.

క్రాలుకొను. అ. క్రి. (క్రాలు + కొను-స్వార్థమున) = క్రాలు.

(ప్రకాశించు)

వ...కరంగుకురంగధరకాంతకందళంబులజలజలని తెలినీటిజాలునం గ్రాలుకొనుచు నచ్చవెన్నెల విచ్చలవిడిఁ జెచ్చు పెరిఁగి...వసు. ౪. ౨౩.

క్రాల్గంటి. వి. (రూ. క్రాలుఁగంటి-క్రాలు + కన్ను) తరళాక్షి, చంచలాక్షి; స్త్రీ.

క...కోర్కుల్, బిట్టొదవెఁ బిఱుఁదులుం జను, కట్టులుఁ గడు బలిసె నపుడు క్రాల్గంటుల కున్. అచ్చ. రా. బాల. ౭౬.

ఆ...వలపుఁ,గాఁక బలిత మయ్యెఁ గ్రాల్గంటి కి...నీలా. ౩. ౩౬.

క్రి

క్రి = క్రి. విణ. క్రిందిది. (చూ. క్రిందు. విణ)

ఉదా: క్రిందల, క్రియ్యాట.

క్రించే = కించే. విణ. ౧. అల్పుఁడు, నీచుఁడు; అ ల్పము, నీచము.

ఉ. వంచన రాముదేవిఁ గొనివచ్చినయట్టులు గా దు కోరి నక్తంచర నన్ను సాహవముఖంబు న డాయుట లన్న నయ్యరే, క్రించ సహోద రుం గరము గీడ్పడి మానవు చేతఁ బొంది యే, యించుట గాదు లే...భా. రా. యు. ౪౮౪.

క. క్రించామాధుని నినుఁద, క్కించుట యన పెం త సింధుకీలాలమునన్, వంచింపఁబడదె ము న్నొక,వంచక మభిజాతకముతవల్లభు చేతన్. వెం. పంచ. ౪. ౫౧౮.

గీ. పాడిమానిసు లంద్రు నిన్నాళ్లు నోకని, బోదివి రిస్సిరో పెక్కండ్రు ప్రోడ లిదియు, మగఁ టిమిరియు క్రించువని కిట్టు దెగినయప్పు, డుల్ల ములు వారలకు నెట్టు లుండెనొక్కొ. భార. స్త్రీ. ౨. ౭౬.

౨. దుష్టుఁడు.

ఉ. వారలు వాలిపంపునన వచ్చినవా రనుశంక నామదిన్, వారక నాటి యున్నయది వాలి యు నాయెడఁ గ్రించు రాజు లే, పార ననేక మార్గముల నప్రియులం దెగఁ జూతురు ... భా. రా. కిష్కిం. ౧౧.

ఉ. కాన తెలుంగ పీవు బలుగాములుఁ బాము లుఁ గ్రించు చెంచులున్, దానవమాయలుం గ లపథంబులు... భా. రా. అయో. ౪౩.

జ: క్రించుఁడు, క్రించుఁదనము.

**క్రించేఁడు** = క్రించె, కించె. విణ. (√ క్రించె) నీచుఁడు, అల్పుఁడు.

మ ... నిన్నుఁ గఠినస్వాంతంబుతోఁ గాననం, బునఁ ద్రోయించినతప్పు చాలక జగంబుల్ చూచి శోకింపఁ గ్రిం, చునిచందంబున రచ్చఁ బెట్టితి నటంచున్ డాఁగి పో నేల... నీనగు మొగంబుం జూపవే జానకీ. ఉ. రా. ౮. ౯౬.

**క్రించేఁదనము.** వి. (క్రించు + తనము.) అల్ప త్వము, నైచ్యము.

క... కమనీయగుణ, స్తోమ నిజభామ నొల్లక, ధా మమున నటించెఁ గ్రించుఁదనమున జడుఁడై. భాగ. ౬. ౧౦౬.

ఉ... నీ, ప్రేమకు వచ్చుదానులకుఁ గ్రించుఁదనం బున నెగ్గు చేసితిన్. భాగ. ౯. ౧౧౬.

**క్రిందంటు** = అడుగంటు. (క్రింద + అంటు) (నశించు.)

ఉ. మంటకుఁ జేరి కామిడుతమాడ్కి నశించక మ ఱ్ఱుమారిమే, నంటియు నింటి కేఁగి చద లంటినదుర్మతి సేవతోఁ గ్రిం, దంటఁగ మం టివాన గురియుం గల దేడుదినంబులు ... ఉ. రా. ౭. ౩౩౭.

**క్రిందల.** వి. (క్రింద + తల) క్రిందగుతల.

సీ. మోముఁదమ్మికిఁ దేఁటిమొత్తమై పొగ పర్వ త్రేలుఁ గ్రిందల గాఁగ వృక్షశాఖ. పాండు. ౨. ౨౯. (క్రిందలగాఁగ = తల క్రిందు గా, అ ధోముఖముగా.)

**క్రింద.** వి. దే. ౧. అధోభాగము, దిగువ.

గీ. నాభికందంబు క్రిందట నలినగంధి, కుండలీశక్తి దేవత యుండు నెలవు. కాశీ. ౨. ౧౨౫, ౧౨౭.

క. ఊఁడుకొనఁబడుమధూళిక, యోడికలకుఁ గ్రిం దఁ గ్రమ్మియుండెడు తేంట్లన్, నీడలు తిరిగి యుఁ దిరుగని, జాడఁ దరు ల్వ్రాలిచె నవ్వసం తపువేళన్. ఆము. ౫. ౧౩౭.

దండకము. చాగంపుబల్ రక్కసుం గ్రిందికిం ద్రొ క్కవా. నీలా. ౨. ౪౧. (క్రిందికిన్ :- పా తాళలోకమునకు అని భావము.)

౨. పూర్వకాలము.

(నరకంబులను) వ. అతనితోడఁ గ్రిందటఁ బదిత రంబులవారును ముందటఁ బదితరంబులవారు ను బొందుదురు. భాగ. ౧౦ ఉ. ౪౮౧.

౩ - అధస్థితి - వశము.

సీ. తాను రుక్మిణి యయ్యుఁ దగ దన దాత్మ నాయ కుఁ డొకనను క్రింద వారులఁ బట్టు. వసు. ౧. ౬౫.

ఉదా: అతని క్రిందఁ బని చేయుట కష్టము.

విణ. (వృత్తియందు వికల్పముగా 'ందు' లోపించు ను. అట్టియెడల కొన్నిపట్లను గాగమమును, కొన్ని పట్ల మీఁదివర్ణమునకు ద్విత్వమును, కొన్నిపట్లలు ప్త శేషమునకు దీర్ఘమును వచ్చును.)

ఉదా: క్రిందల, క్రీఁగడుపు, క్రియ్యాట, క్రీ నీడ.

౧. అధోభాగమం దున్నది.

గీ. ... క్రిందటి ప్రయ్య భువియు మీఁది, ప్రయ్య

డివియును...హరి.పూ. ౧. ౫౩.

సీ. చరమాంగపీఠికాస్థాపిత శేషుండు కిరవళచ్ఛవ రాజు క్రిందిమట్టు. హర. ౬. ౮౦.

గీ. చచ్చిపోయినవారికై చాల వగల, దుఃఖపడుదురు మఱునాఁడు తోడరి చనరొ, తాము బ్రదుకుట లేదె తథ్యంబు తడవ, వనిత క్రిం దాకుమీఁదాకువాసి గాదె. కుచేల. ౧. ౭౦.

౨. తక్కువ.

సీ. శ్రీకాంత దానయ్యఁ బ్రియు నిరోధింపదు క్రిందై విరోధికిఁ గెలు సాఁప. వసు. ౧. ౬౫.

సీ. అజసమాగమనవిఖ్యాతి వచింపవే యంచలనడక క్రిం దౌను గాని, చక్రీశ్వరకథాప్రసక్తిఁ గజింపవే మలయమారుతధాటి నిలుచుఁ గాని. ఇందు. ౩. ౭౮.

౩. కడచినది.

ఉదా: క్రిందటియేఁడు, క్రిందటినెల.

(వ్యవ) మంచి చెడ్డ క్రిందఁ బరిణమించినది. (చెడ్డ క్రింద=చెడ్డగా)

జ: క్రిందంటు, క్రిందల, క్రిందుపడు, క్రిందుపఱుచు, క్రిందుసేయు, క్రిగ్గాలి, క్రియ్యాట, క్రీఁగడుపు, క్రీఁదొడ, క్రీఁబడు, క్రీగాడ్పు, క్రీగోరు, క్రీనీడ, క్రీనీరునేల, క్రీవాడ.

**క్రిందుప(వ)డు.** అ. క్రి. (√ క్రిందు) ౧. తక్కువయగు, తగ్గు.

సీ. బ్రతుకుభాగ్యము క్రిందుపడఁగఁ బాఁపన యిండ్ల కరిగి యాఁకటికిఁ గూడడిగి ననుచు. శుక. ౨. ౫౭౭.

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య, లడుగువట్టెఁ గ్రిందువడిరి బుధులు, హీనజాతిపురుష లెచ్చిరి... వేం. పంచ. ౨. ౧౩౨.

ఉ. అంతట లజ్జ క్రిందువడ నత్యధికంబుగ మించి మానసా, భ్యంతరపూర్ణ మైనపతిభక్తి కతంబున నఁ దల్లిమాట యొక్కింతయుఁ దాను గైకొనక...కళా. ౮. ౯౮.

౨. లోఁబడు, లొంగు.

చ. పగవాఁడైనను వచ్చి క్రిందుపడి తాఁ బ్రార్థించినఁ గా వానికిం, దగుసంభావన లిచ్చి పుచ్చుటయె పో ధర్మంబు...వి. పు. ౬. ౧౬౦. మనుచ. ౩. ౫౦.

౩. ఓడు.

సీ. బిరుదంటిమా నీకు బిరుదెక్కడిది పాండునృపకుమారునకుఁ గ్రిందుపడినావు. నిరం. ౩. ౨౯.

సీ. పలుచందములఁ జిందములఁ గ్రిందుపడఁజేసి నెలతాల్పుబలువేల్పు చెలువు నవ్వి. గీ ... తనయసం బెల్లకడల, వెలుఁగ...నీలా. ౧. ౮౫. (ఇట ఔపమ్యద్యోతకము) హర. ౩. ౧౭౯.

**క్రిందుపఱు(అ)చు.** స. క్రి. (√ క్రిందుపడు) క్రిందుపడఁజేయు.

౧. అధస్థితముగాఁ జేయు.

మ...లం, ఘనచాతుర్యము నింగి క్రిందుపఱుపంగా వానరానీకముం, గినుకం బొంగుచు ... భా.రా.యు. ౧౮౨౭.

౨. భంగపఱుచు, అవమానపఱుచు.

సీ. అఘుడైత్యుఁ బొరిగొని నడరి వత్సకుఁ ద్రుంచె గిరి యెత్తి దేవేంద్రుఁ గ్రిందుపఱచె. భాగ. ౧౦ పూ. ౧౩౨౭.

౩. ఓడించు.

సీ. బ్రహ్మ మధ్యస్థుఁడై పరికింపఁ గుండలీశ్వరుఁ గ్రిందుపఱిచినశాద్ధికుండు. వరాహ. ౯. ౮౩.

సీ. విమలధైర్యంబున హిమమహీధర మేరుమందరాద్రుల నైనఁ గ్రిందుపఱుచు. వి. పు. ౫. ౬౫. (ఇట ఔపమ్యద్యోతకము)

**క్రిందుసే(చే)యు.** స. క్రి. (క్రిందు + చేయు) క్రిందుగాఁజేయు.

(అధోముఖముగఁ జేయు)

గీ. నియతిచేతఁ గదర్థితుం డయినధైర్య, పరునిధైర్యగుణంబు మాన్పంగఁ దరమె, క్రిందుసేయం గఁబడినట్టికృష్ణపథుని, కీల లెంతైన మీఁదు గాఁ గెరలుఁ గాదె. భర్తృ. ౧. ౭౭.

(తక్కువపఱచు)

చ. అనుడు నగస్త్యుఁ డిట్లనియె హైమవతీసుతు తోడఁ దోడిస, న్మను లలరంగ నోయనఘమూర్తి సమస్తముఁ గ్రిందుచేసి మిం, చినబలువేల్పుఁ దీర్థమును క్షేత్రము నొక్కెడఁ గూడియుం డెనే, ని నిరుపమాద్భుతిం దెలిపి నీవు మముం గరుణింపఁగాఁ దగున్. పాండు. ౧. ౧౫౨.

**క్రిక్క.** వి. వంది, బట్టు.

గీ...బట్లు, క్రిక్కలనఁ బాఠకాఖ్యలు గేరుచుం డు. ఆం. భా. ౨. ౧౮౬.

మ...అభ్రవిభ్రమము నేలా సర్వలోకాశ్రయ, క్షమతం బేర్చుచపుక్యవిశ్వవిభుశశ్వద్దానధారాజలౌ, ఘముతో సాటికిఁ బాటిసేసెదవు క్రిక్కాచక్కఁ దర్కింపుమా. కావ్యా. ౭. ౬౩.

సీ. పసిఁడిజీరాపట్టెపనికీలుటందియ లడుగుఁదమ్ములఁ గ్రిక్కలట్ల తనర. మల్లుపు. ౪. ౫౭. వేంక. ౩౦.

**క్రిక్కటిల్లు(లు).** అ. క్రి. కంపించు.

శా. క్షోణీచక్రము గ్రిక్కటిల్లఁగ దిశల్ ఘూర్ణిల్ల దట్టించుచున్, జాణూరుం డతిభీషణస్ఫురణలో శార్ఙ్గిన్ వెసం దాఁకి ... పద్మ. ౯. ౩౨౧.

**క్రిక్కిఱి.** విశే. (ఇది వృత్తియందే కనఁబడుచున్నది- √ క్రిక్కిఱియు.) మిక్కిలి యిఱుకైనది, కొంచెమైన ఎడము లేక యుండునది.

ఉ. క్రిక్కిఱిచన్నుదోయి యురుగ్రైవలకాంతియుఁ బంచబాణుఁ గ్రొం, స్వెక్కఁగఁ జేయ హస్తయుగ మెత్తి ... నైష. ౭. ౧౯౪.

**క్రిక్కిఱించు.** స. క్రి. (√ క్రిక్కిఱియు-చూ. ఇఱించు) క్రిక్కిఱియఁజేయు.

(ఎడము లేకుండఁ జేయు)

క. పలుకు నెడఁ బార్థసేనా, కలకలములు నిజపురోపకంఠసరణిది, క్కులఁ గ్రిక్కిఱింప ... జై. భా. ౮. ౧౨౭. (శ. ర. పా- 'నిండిచు' అని భావము)

వ. ...నడి కెక్కఁ గ్రిక్కిఱించుచు నొక్కయెడం గాలువాడిచి ముక్కున నక్కాంతహారతరళంబు నొక్కుచు ... పాండు. ౪. ౨౩౭. ('ముడుఁచు' అని భావము)

**క్రిక్కిఱియు.** అ. క్రి. (క్రిక్కు + ఇఱియు. శ.ర- ఇది ఉభయయతులలోనిది. మా. కావ్యా. ౭. ౬౯)

౧. ఎడము లేకయుండు, నిండు.

ఉ. దిక్కులు నాకసంబు జగతీతలభాగము నెల్ల చోటులుం, గ్రిక్కిఱియంగఁ గ్రిందుకొని కీశబలంబులు వెన్క ముందటం, బెక్కువిధంబులన్ నడువ భీకరభంగులఁ గ్రొవ్వు లారఁగా, నక్కజ మంద వచ్చి ప్లవగాధిపుపట్టన మెల్ల ముంచినన్. భా. రా. కిష్కిం. ౫౧౩.

క. క్రిక్కిఱిసినశరములలో ... కు. సం. ౧౧. ౭౪౩.

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతిదారుణభంగి రణంబు సేయ వాఁ, డుఱక నిశాతసాయకము లొక్కమొగిం బది మేనియందుఁ గ్రిక్కిఱియఁ గఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములన్... భార. విరా. ౩. ౨౧౫. కవిజ. ౩. ౧౭. కు.సం. ౮. ౯౬.

౨. చేరు, కూడు.

సీ...కూడ జెరసెఁ గ్రిక్కిఱిసెను జెనఁగ దొరపె, వందెఁ గదిసెఁ జేరె నవ వంటె నని తోఁ

చు...ఆం. భా. ౩. ౧౧౯.

**క్రిక్కు**=కిలుకు². వి. త్రిప్పు. (క. ర)

జః క్రిక్కితి, క్రిక్కించు, క్రిక్కిటియు, క్రిక్కొను.

**క్రిక్కొను**=క్రిక్కిటియు. అ. క్రి. (క్రిక్కు+కొను.)

(నిందు)

సీ. తళుకొత్తుమిన్నేటితరఁగలఁ గ్రమ్ముకొన్నుకుపులఁ గుచులపై విరులఁ బెనుచు, మెఱుఁగులఁ గ్రిక్కొనుకొఱనెలఁ గేతకిదళములతో వేణి నెలవు కొలుప. కు.సం. ౩. ౨౮౯.

క. మృదుబలము లుక్కిఁ గ్రిక్కొన,విడిసిన...కు.సం. ౭. ౭౭.

**క్రిగ్గాలి.** వి. (క్రిందు+గాలి)తూర్పుగాలి.(బ్రౌ)

ద్వి. వరఁగిన పెనుగాలిబలుపునఁ జేసి, చిరిఁగిన యోకులభిద్రపుష్పములు, క్రిగ్గాలి దూలఁ దాఁకినఁ బొంగి తుదలు, బుగ్గరించినయట్టి మొగ్గపుష్పములు...కావని వర్ణించి ... బస. పు. ౪. ౧౨౫ పం.

**క్రితము.** వి. పూర్వము, మునుపు.

ద్వి. క్రితము నీప్రాణపరిత్యాగమునకు, మతి మెచ్చి యవసరోచిత మిచ్చి వన్న. బస. పు. ౭. ౯౩౭ పం.

చ. ఇటక్రితమెన్నితో యశుల నిందుముఖీవఖ శేషమద్యముక్షా, గుటుకునఁ గ్రోల నీకుటిలకుంతలయెంగిటిమాధ్విఁ గల్గువి, స్ఫుటమధురత్వ వాసనలు చూడవుగాక దివౌకసుల్ సుధా, ఘుటికలలోని చేఁదు మతి కోరుదురే యిటు క్రోలఁ గల్గినన్. ప్రబోధ. ౩. ౫౬.

(వ్యవ) ఈపని నాలుగునెలల క్రితము జరిగినది. ఇంతకుఁ గ్రితము వానిని నేను చూడ లేదు.

**క్రిమి.** సం. వి. ఇ. పుం=కృమి.

**క్రిమిఘ్న.** సం. వి. ఆ. స్త్రీ. పాగాకు ?.

**క్రిమిఘ్నము.** సం. వి. అ. పుం. వాయువిళంగము ?.

**క్రిమిఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. సోమరాజి, కారుగచ్చ ?.

**క్రిమిజ.** సం. వి. ఆ. స్త్రీ. లాక్ష, లక్క.

**క్రిమిజము.** సం. వి. అ. న. అగురువు, అగలు ?.

**క్రిమిజాతము.** సం. వి. అ. న. ౧. లత్తుక. ౨. లక్క.

**క్రిమిజాపము.** సం. వి. అ. పుం. అగురువు, అగలు ?.

**క్రిమిశత్రువు.** సం. వి. ఉ. పుం. బాడిదచెట్టు.

**క్రిమిశాత్రవము.** సం. వి. అ. పుం. దుర్గంధముగలదంత్ర ?. (వెలితుమ్మ అని కొందఱు)

**క్రిమిశైలము.** సం. వి. అ. పుం.వల్మీకము, పుట్ట.

**క్రియ.** సం. వి. ఆ. స్త్రీ ౧. ధాత్వర్థము. ౨. చేయుట. ౩. చేష్ట, వ్యాపారము, పని. ౪. శిక్ష,విద్యాభ్యాసము. ౫. నిష్కృతి, ప్రాయశ్చిత్తము. ౬. పూజ. ౭. చికిత్స. ౮. వ్యవహారసాధనము లగుసాక్షిలిఖితపత్త్రాది. ౯. ఉపాయము.౧౦.సాధనము, ఉపకరణము. ౧౧.ఆరంభము. ౧౨.విధము. (ఈయర్థము తెనుఁగుననే కలదు.)

సీ. అలికిడి మేల్కొనుకని ధృష్టద్యుమ్నుఁ బట్టిన క్రియఁ దలపట్టి యీడ్చి.భార.సౌ.౧.౧౬౮.

**క్రియగొను.** మి. అ. క్రి. ౧.కలుగు,ఒనగూడు.

క. ఉడుగక మే మహితముఁ బలి,కెదువారము నీవు హితవు క్రియగొనఁగాఁ బ, ల్కెడువాఁడవు...భార. అను. ౭. ౪౦.

౨. పూను.

ద్వి. ఒనర ముందర శిరం బుండ మోఁకాలి, కిని నేన వెట్టంగఁ గ్రియగొనినట్లు. పండితా. దీక్షా. ౬౯ పా.

**క్రియము.** సం. వి. అ. పుం.(జ్యోతి) మేషరాశి.

**క్రియాకారుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) పని సేయువాఁడు. వి. అ. పుం. క్రొత్తశిష్యుఁడు. (త్రి.ని.)

**క్రియాకారము.** సం. వి. అ. పుం. ప్రతిజ్ఞ.

**క్రియాద్వేషి.** సం. విణ. (న్. ణీ. న్) వ్యవహారమందు సాక్షిలిఖితపత్త్రాదులకు వ్యతిరేకముగాఁ జెప్పు ప్రతివాది.

శ్లో. అన్యవాదీ క్రియాద్వేషీ నోపస్థాతా నిరుత్తరః, ఆహూతప్రపలాయీ చ హీనః పంచవిధః స్మృతః. (వాచ.)

**క్రియాపవర్గము.** సం. వి. అ. పుం. కార్యసమాప్తి, పూనినకార్యముయొక్క ముగియుట. సం. కిరా. ౧. ౧౪.

**క్రియాపాదము.** సం. వి. అ. పుం. వ్యవహారాంగములు నాల్గిటిలో మూఁడవది.

**క్రియాభ్యుపగమము.** సం. వి. అ. పుం. సేద్యము మున్నగువానియందు భూస్వామియు రయితు మున్నగువారును చేసికొనెడిఒడంబడిక.

**క్రియావంతుఁడు.** సం. విణ. (త్. వతీ. త్) పనియందు పూనిక గలవాఁడు, క్రియాసక్తుఁడు.

**క్రియావసన్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) సాక్ష్యములు మొదలగువానిమూలమున వ్యాజ్యమునందు ఓడినవాఁడు.

**క్రియావిశేషణము.** సం. వి. అ. న. క్రియతో అన్వయించువిశేషణము.

**క్రియాసమభిహారము.** సం. వి. అ. పుం. ౧. పని మరలమరల చేయుట. ౨. పని అధికముగా చేయుట. ౩. పనిని మరల మరల అధికముగా చేయుట. శిశు. ౨. ౪౩.

**క్రియ్యు=ప్రయ్యు.** అ. క్రి. కృశించు.

క. క్రొక్కారు మెఱుఁగు మేనులుఁ, గ్రిక్కితిసి నచన్నఁగవలుఁ గ్రిస్సినవడుముల్. భాగ. ౭. ౨౬౫.

సీ. ఒడిసి భక్షించిన మున్నమీనము లెల్ల ఖిన్నంబులై వగఁ గ్రిస్సియున్న. భాగ. ౧౦ పూ. ౪౦౪.

**క్రియ్యాట.** వి. (క్రిందు+ఊట) క్రిందియూట.

గీ. ఏకమై కాలువలు గట్టి యేకహేలఁ, బఱవ నందలి క్రియ్యాటపనిమి తేటఁ, బండు నవ్వీటముక్కారుఁ బసిఁడిగాఱు, సరసధాన్యంబు మంచిరాజనపుఁ జేల. పాండు. ౧. ౧౧౭.

## క్రీ

**క్రీ.** విణ. క్రిందిది. (చూ. క్రిందు. విణ.)

**క్రీఁగడుపు.** వి. (క్రిందు+కడుపు) వస్తి, పొత్తికడుపు.

సీ... పొత్తి, కడుపు క్రీఁగడుపు నాఁగను వస్తి చన్నొందు... ఆం. భా. ౨. ౧౩౬.

**క్రీఁదొడ.** వి. (క్రిందు+తొడ) క్రిందితొడ, తొడఅడుగుభాగము.

గీ. కర్ణునుత్సంగమున మస్తకంబుఁ జేర్చి, గురుఁడు నిద్రింప వికృతాతిఘోరరూప, మశక మనియెడునొకకీట మద్రిసేంద్ర, తనయు క్రీఁదొడఁ దొలిచె సత్వరముగాఁగ. భార. శాం. ౧. ౨౧.

**క్రీఁబడు.** అ. క్రి. (క్రిందు + పడు) తక్కువయగు.

సీ. సురకరి యాయద్రిఁ జరియించు సేసుంగుఁ గొదములఁ గ్రీఁబడ్డకొదముయొక్క. మార్క. ౧. ౯౪. (కృతపడు-శ.ర.పా)

**క్రీగాడ్పు.** వి. (క్రిందు+గాడ్పు)-క్రిందిగాలి-అపానము.

గీ. మానసాంబుజకర్ణి కామమ్యమునను, గొన్ని దిశ

ములు శశిమౌళిఁ గుదురుకొల్పి, మీఁదిగాడ్పుఁ గ్రీగాడ్పుతో మేళవించి, భానుశశిమార్గములు గట్టువఱపి తగను. పి. శకుం. ౨. ౧౧౩.

**క్రీగోరు.** వి. ఔ. (క్రిందు + గోరు)-క్రిందనున్న గోరు-కాలిగోరు.

శా. చేటంచేటముగా నిభంబు కరిణిం బ్రేమంబుతోఁ జేరి...క్రీగోటఁ ద్రవ్వె యొరయుగ్ ... కు. సం. ౧. ౧౦౦.

**క్రీడ.** సం.వి.ఆ.స్త్రీ.౧. బంధులు మున్నగువానితో ఆడుఆట. ౨. ప్రియులు మున్నగువారు చేయుపరిహాసము. ౩.అవజ్ఞ, అనాదరము. (మే.ని) ౪. విహారము.

**క్రీడత్.** సం. శత్రు. క్రీడించుచున్న.

**క్రీడనకము.** సం. వి. అ. న. క్రీడాసాధనము. (ఆటబొమ్మ, మొ.)

**క్రీడనము.** సం. వి. అ. న. ౧. ఆట. ౨. ఆటబొమ్మ.

**క్రీడనీయకము.** సం=క్రీడనకము.

**క్రీడము.** సం. వి. అ. పుం. పరిహాసము. (కల్ప.)

**క్రీడాగృహము.** సం. వి. అ. న. కేళీగృహము. ఇట్లే క్రీడామందిరము, మొ.

**క్రీడానారి.** సం. వి. ఈ. స్త్రీ. వేశ్య, ఆటవెలఁది.

**క్రీడారత్నము.** సం. వి. అ. న. ౧-ఆటలలో శ్రేష్ఠమైనది-రతి, సంభోగము. ౨. క్రీడార్థమైనరత్నము.

**క్రీడావనము.** సం. వి. అ. న. ఉద్యానము, ఆటతోఁట.

ఇట్లే క్రీడాకాననము, మొ.

**క్రీడి.** వి. (సం. కిరీటీ. ప్రా. కిరీడి) అర్జునుఁడు.

సీ...వేగంటికొమరుఁడు వెన్నునంటు, వెన్నుమచ్చుదునీఁడు విల్వచ్చు కవ్వడి గెలుపు పేరుగలాఁడు క్రీడి యనఁగ, నర్జునునామంబులగు ...పాం. ని. దేవ. ౧౬. భార. విరా. ౪.౧౫.

**క్రీడించు.** సం. అ. క్రి. ౧. విహరించు.

సీ. ఏకాంతమునఁ దనయిచ్చఁ గ్రీడింప దర్పకుఁ బాసి వచ్చినరతి యనంగ. మార్క. ౨. ౭౯౪. ౨. రమించు.

మ...ఎలమిం గ్రీడింపు వాతో మనోహరకేళీగతి నెందుఁ బోకుము సుహృద్వ్యామోహము ప్పొంగఁగన్. మార్క. ౪. ౨౪౦.

**క్రీడిత.** సం. విశే. (బు. త్రి. బు) క్రీడించువాఁడు, విహరించువాఁడు.

**క్రీడితము.** సం. వి. అ. న. క్రీడ.

**క్రీణత్.** సం. శత్రు. కొనుచున్న.

**క్రీణానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) కొనుచున్నవాఁడు.

**క్రీతకుఁడు.** సం. వి. అ. పుం. ధన మిచ్చి కొన్నకొడుకు, క్రీతుఁడు.

**క్రీతము.** సం. విశే. (అ. ఆ. అ.) వెల యిచ్చి కొనఁబడినది, విలువఁబడినది.

**క్రీతి.** సం. వి. ఇ. స్త్రీ. కొనుట.

**క్రీతుఁడు.** సం. వి. అ. పుం. తల్లిదండ్రులనుండి కొనఁబడినపుత్త్రుఁడు. (వీఁడు పన్నిద్దఱుపుత్త్రులలో నొకఁడు.)

**క్రీనీడ.** వి. (క్రిందు+నీడ) క్రిందినీడ.

గీ. లతలక్రీనీడఁ దిలతండులితము లగుచుఁ, గాంతయీనిందుశేఖరనికరము లమరు. వైష. ౭. ౧౭౪.

**క్రీనీరునేల.** వి. (క్రిందు+నీరు+నేల) అనూపము, జలప్రాయదేశము.

గీ. నీరుముం పనఁ గ్రీనీరునేల యనఁగ, ఖ్యాతిగాంచు ననూపంబు మాతృభూత. అం. భా. ౨. ౭.

**క్రీయమాణము.** సం. విణ. (అ. ఆ. అ) కొనఁబడుచున్నది.

**క్రీవాడ.** వి. ( క్రిందు + వాడ. ) పాటిపొలము. (శ. ర)

## క్రు

**క్రుంకించు.** స. క్రి. (√క్రుంకు) క్రుంకఁజేయు. (అస్తమింపఁజేయు)

గీ. అనుచుఁ గ్రుంకింప రానిప్రొద్దరసి యరసి. భార. విరా. ౨. ౩౧౪.

**క్రుంకు.** అ. క్రి. ౧. మునుఁగు; స్నానముచేయు.

చ. ఇటు తగునే సుయోధన...ఏమిటికిఁ గ్రుంకితి నీళ్లను జావు దప్పనే. భార. శల్య. ౨. ౫౪.

గీ. కణఁకఁ గాంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి. కాశీ. ౩. ౧౬.

౨. అస్తమించు.

సీ...కూఁకి నాఁ గనుపట్టుఁ గ్రుంకె ననుట. ఆం. భా. ౩. ౯౭.

క. మాయరవి యేల క్రుంకఁడొ, కో యను నిట్టేల తడసెనో యను...భార. విరా. ౨. ౩౧౨.

గీ...ప్రొద్దు గ్రుంకెడుదాఁకఁ బోరు జరుపు, చున్న విజయహాని జనింప కున్నె...రాఘవ.౪. ౧౭౪.

౩. చచ్చు, మృతి నొందు.

శా. శంకాకీర్ణమనస్కు దానవరిపుల్ చక్రాయుధుం డింతలోఁ, గ్రుంకెం బో యని భీతు లైరి యచటన్...ఉ. హరి. ౬. ౧౯౦.

వ. దనుజాలు మనుజాలం జుట్టుముట్టి బలిమి నలిమి యలిగి యలుఁగులతోడం గూడ మ్రింగినఁ గ్రుంకక. రాజ.చ. ౨. ౭౪.

సీ. క్రుంకె నేఁగను బోయె డింకవేసెను మ్రగ్గ ననఁ జచ్చె ననుమాట కాఖ్య లయ్యె. ఆం. భా. ౩. ౮౭.

౪. గ్రుచ్చుకొను.

ఉ. కోలలసంధి సెంపములు గ్రుంకిన సంత దినక్రమంబునన్, మీటినవొవ్వి భుక్తిఁ గొన సేరక యాననగహ్వరంబునన్, గాటెడులాల తోడఁ బులి గ్రచ్చతి లోఁబడి యుండ మ్రానిపైఁ, గూటినవంత నొక్కరుద్రుమకుట్టవిహంగము దాని కిట్లనున్. కేయూర. ౩. ౧౧౫.

౫. అడుగునకుఁ బోవు.

మ...రవిదీప్తిం గ్రుంకి పాతాళగహ్వరముం దూటినవాని...ఆము. ౨. ౬౬.

వి. అస్తమయము.

సీ. తమియు మత్సరము డెందమున నంతంతకుఁ బొడమి కానఁడు ప్రొద్దుపొడుపుఁ గ్రుంకు. పి. శకుం. ౪. ౧౬౪.

**క్రుంకిడు, క్రుంకులిడు**=స్నానముచేయు.

శా. ఏయేతీర్థములందుఁ గ్రుంకిడితిరి...మనుచ.౧. ౬౮.

సీ. తెల్లవాఱ నటంచుఁ దివిరి యజ్జన్నిగట్టేటి పొంతకుఁ గ్రుంకులిడఁగఁ జన్న. అచ్చ. రా. బాల. ౧౪౬.

**క్రుంకువెట్టు, క్రుంకులువెట్టు**=౧. క్రుంకిడు,స్నానముచేయు.

ఉ. చొచ్చి చనంగ భోగవతిచొప్పున నొప్పు స్రవంతి యుండఁగా, నచ్చటఁ గ్రుంకువెట్టి వెస నవ్వలి కేఁగి...భోజరా. ౫.౨౨౨.

సీ. యజ్ఞతటాకంబునందుఁ గ్రుంకులు వెట్టి బ్రహ్మర్షిపితృతృప్తిఁ బ్రస్తరించి. భీమ.౩.౧౧౭.

౨. క్రిందికి వంగు.

గీ. ఎట్లు గ్రుంకులువెట్టుచు నేచి పట్టనీక యెటపాఱనేనిఁ బోనీక శరము,పాలువడఁ జేసి తెమ్ము భూపాల యొప్పఁ,జారుతర మైనయీ మృగచర్మ మైన. భా. రా. అర. ౨. ౩౭.

**తప్పఁగ్రుంకు**=తప్పించుకొను.

గీ. వాకు వెలిచి కైలాసయానంబు పేరఁ, గొంత

కాల మస్తమయిఁ దప్పఁ గ్రుంకిపోయి, తీవు లేకున్నఁ జూవె మహావిభూతి, మెఱయ వచ్చియు నీయూరు సెలువ నైతి. హరి. ఉ. ౬. ౨౦౭.

గీ. తప్పఁ గ్రుంకెడువెర వాత్మఁ దలఁచి తలఁచి. దశకు. ౫. ౯౧.

జ: క్రుంకించు, క్రుంకుఁగడలి, క్రుంకుగట్టు, క్రుంకుడు, క్రుంకుడుగట్టు.

**క్రుంకుఁగడలి.** వి. ( క్రుంకు + కడలి ) పశ్చిమ సముద్రము.

గీ. నీట ముంచిన మేలివన్నె యపసిండి, పూరె యనఁ గ్రుంకుఁగడలిలోఁ బ్రొద్దు వ్రాలె. నీలా. ౩. ౩.

**క్రుంకుగట్టు**=క్రుంకుడుగట్టు. వి. అస్తపర్వతము, పడమటికొండ.

క. ఈవిధమున నయ్యామవ, తీవైభవ మొప్పమిగుల దృష్టించుచు ని, ద్రావశత నయ్యాకుం జను, కైవడి రేరాజు గ్రుంకుగట్టున కరిగెన్. వైజ. ౧. ౧౧౦.

చ. పెనిమిటి యైనవెన్నుఁ డొగిఁ బ్రేముడి నిచ్చినఁ బుట్టు గ్రుంకుగ, ట్లనుదన రెండుచేతుల నొయారము మీఱఁగ నేలకొమ్మ దాల్చినపవడంపుఁజట్టలుఁగుఁ జెందమును బలెఁ జూడ నొప్పెనం, తను దగఁ దూర్పునన్ వెనుకఁ దమ్ముల విందును జందమామయున్. యయా. ౫. ౩౦.

ఇట్లే క్రుంకుగుబ్బలి, మొ.

సీ. క్రుంకుగుబ్బలి... అచ్చ. రా. అయో. ౧౩.

సీ. క్రుంకుమల... ప్రబంధ. ౧౬౧.

సీ. క్రుంకుమెట్టు... యయా. ౨. ౭౦.

చ... క్రుంకుమెట్ట... పారి. ౨. ౩౨.

సీ... అస్తాద్రి పడమటికొండ, క్రుంకుఁగొండ యన నగు... ఆం. భా. ౨. ౨౮.

**క్రుంకుడు.** వి. (√ క్రుంకు) (అస్తమయము.) చూ. క్రుంకుడుగట్టు.

**క్రుంకుడుగట్టు**=క్రుంకుగట్టు. వి. అస్తాద్రి.

సీ. నెలతాల్పు దేవర యలిగినఁ బని గాదు వెండిగుబ్బలి డేక యుండనిండు... వలి రేయుఁ బగలును నడక గానఁగ రాదు పుట్టు గ్రుంకుడుగట్లు వెట్టి రండు. యయా. ౩. ౩౮.

**క్రుంగఁబడు**=క్రుంగు. అ. క్రి. ( క్రుంగన్ + పడు-స్వార్థమున) దిగఁబడు, క్రిందికి పోవు.

ఆ. ధరణి గ్రుంగఁబడఁగఁ ద్వరతోడ దవ్వగాఁ, దుంగభంగి నిడుదచెంగ లిడుచు. భా. రా. కిష్కి. ౪౩౧.

**క్రుంగిలు(ల్లు)**=క్రుంగు. (√ క్రుంగు) ముడుఁగు, సంకుచితావయవ మగు.

ఉ. ఇగ్గడు వెన్కకుం బయికి నీడ్చినఁ బైఁట దొలంగఁజేయఁ గే, లొగ్గడు రెమ్మి పోఁకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులుం, బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు బాల ననం బనేమి యా, సిగ్గుకు సిగ్గు లేదిటులు సేసినపిమ్మట నుండ వచ్చునే. విజ. వి. ౨. ౩౦.

**క్రుంగు.** అ. క్రి. ౧. దిగఁబడు.

సీ. ఆకాశవాహినీసైకతంబుల ఖురాంచలటంకములు గ్రుంగ జడనుపడిన. కాశీ. ౩. ౧౨.

౨. అడఁగు.

సీ. క్రుద్ధకుంభోద్భవభ్రూలతాకౌటిల్యవికృతిఁ గ్రుంగని నాఁటివింధ్యశిఖరి. నైష. ౧. ౩౫. దశా. ౧. ౨౬౧.

౩. తగ్గు; నశించు; మరణించు.

ఉ. కోపము పొంగుఁ గ్రుంగు నొకకొన్ని దినంబులు... దశకు. ౫. ౨౩. ఆం. భా. ౩. ౭౮.

సీ. పరమసాధుజనంబుభావంబు లుప్పొంగెఁ గలుషచారిత్రులబలిమి గ్రుంగె. కళా. ౪. ౧౨౩.

శా. కాశీదేవనదీజలంబులను గ్రుంకం గ్రుంగు నర్వాఘముల్. సురా. ౨౦.

సీ. సమయుట యీల్గుట చావు చక్కడఁగుట
క్రుంగుట త్రుంగుట కూలుట...మిత్తి పెన్ని
దుర నా మీఱును మరణము. ఆం. భా. ౨.
౨౨౫.

౪. వంగు, క్రింది కొదుఁగు; పొట్టిదగు.

(మల్లయుద్ధవర్ణనము) సీ...బలువిడి వాఁడు పై
నడరిన జరగక యువనిఁ గ్రుంగి, నిలుచు...
భార. విరా. ౨. ౧౫.

మ. చరమాశాంతరవీథిఁ గైకొని సరోజాతప్రి
యుం డేఁగఁగా,సరి నంతంతకుఁ గ్రుంగి క్రుం
గి కనకస్తంభఁబు చిత్రంబుగా, నరసీపూర
సమస్థితం బగుటయుఁ సర్వాంసహాధీశుఁ
డుఁ, వారవారం దిగి వచ్చి యప్పురిని దా
విశ్రాంతచేతస్కుఁడై. విక్ర. ౨. ౧౧౪.

క్రుంగిపోవు=క్రుంగు.

(నశించు)

గీ. కొండియంబున సఖ్యంబు గ్రుంగిపోవుఁ, గరి
నభాషలఁ బడిపోవుఁ గాతరుండు.నా.పంచ.
౧. ౧౪౪.

(హీనసత్త్వుఁ డగు.)

(వా) వాఁడు కష్టములచేత క్రుంగిపోయినాఁడు.

జ: క్రుంగఁబడు, క్రుంగిలు.

**క్రుంచ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అఁడుకొంచ, ఒక
విధమైనఅఁడుకొంగ. ౨. అఁడుహంస.

**క్రుంచము.** సం. వి. చ్.పుం.౧. క్రౌంచము, కొం
చ, ఒకవిధమైనకొంగ. ౨. హంస, అంచ.
అ.పుం. ౧.కొంచపిట్ట, ఒకవిధమైన కొంగ.౨. ఒ
కవిధమైనవీణె. ౩. క్రౌంచపర్వతము, కొంచగు
బ్బలి.

**క్రుక్కించు.** స. క్రి. (√ క్రుక్కు) క్రుక్కఁ
జేయు.

(అదిమించు, కూరించు)

వ...కేదారపంకంబులోనఁ గానరాకుండ నువ
ర్ణమయంబైనబేరంబుఁ గ్రుక్కించి... పర
మ. ౫. ౨౭.

**క్రుక్కిదము.** విశే. (√ క్రుక్కు) ౧. నిండినది.

ఉ. అక్కజమై మహార్ఘనివహంబు సదుక్తులు మె
చ్చఁ జూచినఁ, గ్రుక్కిద మైనసత్కృతి
...కు. సం. ౧. ౩౭.

౨. పూడినది.

ద్వి. గ్రుక్కన భస్మంబు గాఱురంధ్రంబు, గ్రు
క్కిదంబై కట్టుకొని కీలుకొనుడు.పండితా.
పురా. ౧౩౪ పొ.

**క్రుక్కు.** స. క్రి. (క. కుక్కు) ౧. (పేను మొ
దలగువానిని) బొటనవ్రేలిగోటితో నొక్కు.

గీ. ఎలయుసీత్కారములతోడ నీల్గు గ్రుక్కి,
యంటుసొంటులు పరికించి యంట్లఁ బొడిచె,
గోరుముక్కుల దిగమువ్వి తూరు పెత్తి, సెలు
లఁ గలిగినపేల నన్నింటిఁ దిగిచె. పాండు.
౩. ౩౦.

సీ. కన్నగాం డ్రగుమ నగళ్లు ప్రవేశించి యం
దు సెంతటివార లడ్డమైనఁ. అ. జక్కడఁ
చుచుఁ బేను గ్రుక్కినపాటిగా, నిష్టమైన
యర్థ మెల్లఁ బడసి. ప్రభా. ౧. ౧౧౭.
(పేనుగ్రుక్కినపాటిగా:-కొంచెమైన నిత
రులకు తెలియకుండ, చప్పుడు లేకుండ)

౨. అడఁచు.

వ...కార్శ్యచ్ఛం గన్నీరు గ్రుక్కుకొని...అను.
౬. ౬౬.

సీ. పాడమురసావేశమున వచ్చునగ్నోక్తు లాదవి
నాలుకకు రాకుండఁ గ్రుక్కి. మనుచ. ౩.
౯౭. నరస. ౧. ౬౪.

౩. అదుము, కూరు.

ఉదా: పిల్లలకు అన్నము క్రుక్కి క్రుక్కి పెట్టఁ
గూడదు.

౪. తూర్చు, చొప్పించు.

ఉ. అక్కమలాయతాక్షుఁడు భయంకరబాహు

వు దైత్యుకుక్షిలోఁ, గ్రుక్కినఁ దద్దయుఁ గా బ
లిసి రోఁగ ముపేక్షలచేత మేఁకకాఁ, బెక్కుస
మైనచందమున విహ్వలభావముఁ జేసి దేహ
ముఁగా, వ్రక్కలు వాపి చంపె...వి. పు. ౭.
౩౨౮.

వి. వంచన, మోసము.

సీ...వంచన మెసంగు. గీ. జుడుఁగు క్రుక్కు కి
వుడు పిక్కు జుణుఁగు మొఱఁగు, డనఁగ...
ఆం. భా. ౨. ౭౯౨.

జ: క్రుక్కించు, క్రుక్కిడదు, క్రుక్కుడు.

క్రుక్కుడు. వి. (√క్రుక్కు) ౧. క్రుక్కుట. (శ. ర.) ౨. పీడనము, అదుముట.

సీ...క్రుక్కు డదుము డొత్తడ మ్మొత్తు నాఁ బీ
డనమ్ము విరాజిల్లు...ఆం. భా. ౧. ౧౫౦.

క్రుచ్చు=కూర్చు. స. క్రి. (చూ. వా క్రుచ్చు)

క్రుత్తు. సం. వి. ధ్. స్త్రీ=క్రుధ.

క్రుధ. సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక.

క్రుద్ధము. సం. విణ. (అ. ఆ. అ) కుపితము, కోపము నొందినది. వి. అ. న. కోపము.

క్రుధ్యత్. సం. శత్రు. కోపపడుచున్న.

క్రుమ్మరించు=కుమ్మరించు. స. క్రి. క్రుమ్మరిలఁ జేయు.
(అధికముగా ప్రసరింపఁ జేయు.)

గీ. కమ్మనిపిసాళివలపులు గ్రుమ్మరించు, కమ్మజవ్వా
దిఁ దలయంటేఁ గలికి యొకతె. వసు. ౫.
౧౧౯.

(అధికముగా వెలువఱుచు)

సీ. క్రోధపావకుఁ డుండుకుండంబు లన నేత్రగో
ళముల్ మంటలు గ్రుమ్మరింప. ఉ. రా. ౩.
౩౮౫.

(కుండలు లోనఁగువానినుండి యొక్కసారిగా
జలాదులను పడఁజేయు.)

గీ. కడవలను గ్రుమ్మరించినవడువు దోఁచఁ, గురి
యుచుండఁగ వఱదల గ్రుంతమిట్ట, లొక్క
కొలఁదిగఁ బాఱె నీళ్లక్కజముగ. ద్వా. ౧౦.
౭౮.

జ: క్రుమ్మరిల్లు.

క్రుమ్మరిల్లు(లు)=కుమ్మరిలు. అ. క్రి. (√క్రుమ్మరించు) కుండ లోనగువానినుండి యొక్కసారిగా జలాదులు పడు; పడు.

క. భృంగీసంగీతస్వన, మాంగళ్యసుగంధకుసుమమం
జరుల బయల్, పొంగుమరందముసెవమున, శృం
గారరసంబు గ్రుమ్మరిలుపాదరింటఁగా. కవిరా.
౨. ౧౬౧.

వ...చూర్ణంబు లైనకర్ణంబులును వ్రక్క లైన
ప్రక్కలును మునిసినశస్త్రంబులును విరిసిన
జోళ్లును గ్రుమ్మరిల్లినబొమ్మిడికమ్ములును గుం
పులుగొను పడగలును...పద్మ. ౧౦. ౭౯.

క్రుమ్మరు. అ. క్రి. ౧. తిరుగు, సంచరించు.

ఆ. క్రూరవనమృగములు గ్రుమ్మరుచున్నయా, వి
జనవిషమశైలవిపినభూమి. భార. ఆది. ౭.
౭౫.

క. ఇమ్మడువు మీనములతోఁ, నిమ్ముఁగ గూడాడి
పెరిఁగి యున్నాళ్లను బ్రేమమ్మున నుండితి
నొంటిగఁ, గ్రుమ్మరలే నింక నమ్మఁ గొనిపో
వఁగదే. నా. పంచ. ౧. ౨౨౬.

౨. విహరించు.

ఉ. ఈమొలదోఁట నుండఁ దగ దింకొకచక్కి
వసింప నేఁగుఁ డో, ధీయుతులార పాండ్యన
రదేవతనూభవ కేళికాగృహ, ప్రాయత నిందు
నెప్డు నిరపాయమున న్విహరించుచుండు నేఁ,
డాయెలనాఁగ గ్రుమ్మరుటకై యట వచ్చెఁ
దలంగుఁ డిత్తఱిఁగాఁ. శుక. ౧. ౩౨౮.

వ...సుకన్య యనునది యిష్టసఖులతోఁ గ్రుమ్మ
రుచున్న...భార. అర. ౩. ౧౭౬.

౩. ప్రవర్తించు.

క. ఊరులింగము బోధించిన, కరణిఁగా గ్రుమ్మరుదు
వంటకట్టితు లోకమో, వరుసమగ వారలగే

హా్వరణములో బయలనుండి వైచుచు నుండెన్. చెన్న. ౫. ౨౨౪.

**క్రుమ్ము**=కుమ్ము[1]. స. క్రి. పొడుచు.

వ. ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు... నొసల్లు గ్రుమ్మియు... ఉ. హరి. ౧. ౧౮౫.

సీ. కంసారి బిగియారఁ గౌఁగిటఁ జేర్చిన గుబ్బలఁ గసిదీఱఁ గ్రుమ్మెఁ గొమ్మ. రాధికా. ౨. ౧౩౬.

దండకము. మన్నంతయుం గొంచు బల్వుఁపరాయిక్కకుం బ్రాఁకుబంగారపుంగంటిరేద్రిమ్మరిం జన్నపుంబందివై చెండి వాల్గొమ్మునం గ్రుమ్మవా ... అచ్చ. రా. యు. ౧౬౧. ఉ. రా. ౧. ౬౭.

వి. పోటు, పొడుపు.

సీ. కలుకుగుబ్బల యొమ్ముఁ గ్రుమ్ము లేర్పడ గ్రుచ్చి తనివారఁ గౌఁగిట నదఁగి పెనఁగి. ఉ. హరి శ్చ. ౪. ౧౩౨.

**క్రుమ్మడఁగించు**=అడఁచు.

సీ. దయ పిఱిందికి వైచి నయము క్రుమ్మడఁగించి బాంధవం బురివి పాపమునఁ బొదలి. దశకు. ౩. ౯.

**క్రుమ్మెసలాడు**=కుమ్ములాడు, పొడుచు.

మ... రాచబిడ్డలునున్ వెల్మదొర ల్దురమ్మునకు నొడ్డారించి క్రొవ్వాఁడిబాఁకులతోఁ గ్రుమ్మెసలాడ సాగి రలుకన్ గోవిందశర్భర్బటిన్. రంగా. ౩. ౨౧౫.

జ: క్రుమ్మడు, క్రుమ్ముడుపడు, క్రుమ్ములాడు.

**క్రుమ్ముడు**. వి. (√క్రుమ్ము) పోటు, పొడుపు. (శ. ర.)

**క్రుమ్ముడుపడు**. అ. క్రి. (√ క్రుమ్ముడు) పోటుపడు. (శ. ర.)

**క్రుమ్ములాడు**=కుమ్ములాడు. అ. క్రి. (క్రుమ్ములు+ అడు) పోట్లాడు.

గీ. కొసర శాఁబోతు నాఁబోతుఁ గ్రుమ్ములాడ, నడిమియాఁజెయ్యాగతి వచ్చె నాకు నిపుడు. కాశీ. ౨. ౧౦౪.

ఉ. కొమ్మ బెదంగుసొంపుఁ గనుఁగొన్న కనుంగవ దత్తఱింపఁగా, నమ్మని యాఁప నోపకపుడల్లన తెప్పలు విచ్చుఁ గ్రమ్మఱం, గ్రమ్మఱఁ గృష్ణ కృష్ణ యని గ్రుక్కన మోడ్చు మగుడ్చుఁ గ్రమ్మఱం, గ్రమ్మఱ మూయు మన్మథవికారము ధైర్యముఁ గ్రుమ్ములాడఁగన్. కళా. ౩. ౧౯.

**క్రుయ్యఁబాఱు**=క్రుయ్యు. (క్రుయ్యన్+పాఱు-స్వార్థమున.)

(కృశించు)

సీ. వలికి యెంతయుఁ గ్రుయ్యఁబాఱిన నునుఁజెక్కు లందంద తడిపెడు నశ్రువారి. హరి. ఉ. ౩. ౪౭. (వావిళ్లప్రతిపా.)

**క్రుయ్యు**. అ. క్రి. (సం. కృశ్.) ౧. కృశించు; తగ్గు, క్షీణించు.

మ. మలినుండై కడు డస్సి క్రుస్సి...కు. సం. ౧౦. ౪౫౬.

చ... తలల్ దిగవైచి నోరఁ ద్రేగుడు చొరఁగంగ నెంతయును గ్రుస్సి ఖురంబులు ప్రస్సి పుచ్చ లుగ్గడువుగఁ బాఱఁ దద్దయును గాతియఁ బొందె ప్రజంబునన్ బసుల్. హరి. పూ. ౬. ౪౩.

క. వెయ్యేం డ్లయ్యును నీతోఁ, గ్రయ్యంబడియున్నవాఁడఁ గామసుఖములం, గ్రుయ్య దొకయించుకైనన్, డయ్యదు కొనలిడియెఁ దృష్ణ నవపద్మముఖీ. భాగ. ౯. ౫౭౭.

మ. నినుఁ జింతించిన విన్నఁ జేరుకొనిన న్నిర్మూలమై క్రుస్సి పాపవనికాయంబు వినష్టమౌ నఁట... భాగ. ౧౦ పూ. ౧౧౧౭.

౨. వెనుదీయు; వెనుకపడు.

ఉ. ఎయ్యెడఁ గయ్యముల్ గలవొ యెవ్వరు చివ్వల కుత్సహింతురో, క్రుయ్యక యుంచుఁ

గోరి వెసఁ గ్రుమ్మరుచుండుము కొందు నేను ...హరి. పూ. ౮. ౧౧౬.

వ.... తరుణతరుణీజనంబులు...వినోదంబుల నడటుడివీూటి కడచి చనం బంగ్యాంధజరఠప్రముఖులు క్రుస్సి యోలాకుపడ నెవనెడం గా పలియై తగువారు నడిపింప...హరి. పూ. ౬. ౨౨.

జ: క్రుయ్యఁబాఱు.

క్రుళ్లగించే. అ. క్రి. (√ క్రుళ్లు)-మనస్సులో-దుఃఖించు. (శ.ర)

క్రుళ్లగింత. వి. ( √ క్రుళ్లగించే ) -మనస్సులో-దుఃఖించుట. (శ.ర)

క్రుళ్లు=కుళ్లు. అ. క్రి.

(అవియు, పగులు)

గీ. గుండియలు గ్రుళ్లఁ దన్నినఁ గ్రుక్కుమిక్కు, రనక యాతనికినుక చల్లారనిచ్చె. శుక. ౩. ౬౩౩.

(-మనస్సులో-దుఃఖించు)

సీ. కోపశోకంబులఁ గ్రుళ్లుచుఁ దనలోన మండుచు దితి సాల మఱుఁగఁ దొడఁగె. భాగ. ౬. ౫౦౯.

జ: క్రుళ్లగించు, క్రుళ్లగింత, క్రుళ్లుపోతు.

క్రుళ్లుపోతు=కుళ్లుపోతు. విణ. (√ క్రుళ్లు.) క్రుళ్లగించుస్వభావము కలవాఁడు. (శ. ర)

క్రుశ్యమానుఁడు. సం. విణ. (అ.ఆ.అ) ౧. తిట్టఁబడుచున్నవాఁడు. ౨.పిలువఁబడుచున్నవాఁడు.

క్రుశ్వము. సం. వి. న్. పుం. ౧. నక్క. ౨. కొంగ. (కే. ని.)

క్రుశ్వరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడునక్క. ౨.ఆఁడుకొంగ. (కే. ని.)

క్రుష్టము. సం. విణ. (అ. ఆ. అ) ౧. అఱచినది.౨. యుద్ధాదులకు పిలువఁబడినది. ౩. తిట్టఁబడినది. ౪. ఏడ్చినది. వి. అ. న. ౧. కూఁత, అఱపు. ౨. ఏడ్పు. ౩. చప్పుడు, ధ్వని.

## క్రూ

క్రూర. సం. వి. ఆ. స్త్రీ. ౧. రక్తపునర్నవ, ఎఱ్ఱగలిజేరు కీ. ౨. బదరి, రేఁగు కీ. ౩. కంటకారి, వాఁకుడు కీ.

క్రూరకోష్ఠుఁడు. సం. విణ. ( అ. ఆ. అ )-క్రూరమైనకోష్ఠము కలవాఁడు-బద్ధకోష్ఠుఁడు,మలబంధము గలవాఁడు.

క్రూరగంధము. సం. వి. అ. పుం-చెడ్డకంపు కొట్టునది-గంధకము.

క్రూరదృక్కు. సం. విణ. (శ్) క్రూరమైనచూపు కలవాఁడు. వి. పుం. ౧. పిశునుఁడు, దుష్టుఁడు ౨. శని. ౩. అంగారకుఁడు. స్త్రీ. క్రూరదృష్టి, క్రూరమైనచూపు.

క్రూరధూర్తము. సం. వి. అ.పుం. నల్లఉమ్మెత్త కీ.

క్రూరము. సం. విణ. (అ. ఆ. అ) ౧. కనికరము లేనిది. ౨. పరుసనిది, కఠినము. ౩. ఉగ్రము,భయంకరము. ౪. హింసకము, నాశము సేయునది. ౫. ఉష్ణము, వేండ్రము కలది. ౬. కఠినమైనది.౭. దరిద్రము, ధనము లేనిది. వి. అ. పుం. ౧. డేగ.౨. కంకము, రాపులుఁగు. (రా. ని) ౩. (జ్యోతి)మేషాదిరాసులలో బేసిరాశి. ౪. అస్థి, ఎమ్ము. (కే.ని)

క్రూరరావి. సం. వి. న్. పుం. ద్రోణకాకము,మాలకాకి. (రా. ని)

## క్రే

క్రే. (వృత్తియందు 'క్రేవ' శబ్దమునకు తుదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము.)

ఉదా: క్రేఁగన్ను, మొ.

**క్రేంకారము.** సం. వి. అ. పుం=క్రేంకృతి. (రథనేమియొక్క ధ్వని.) వ... తక్కినదండనాథులం దానును రథనేమిక్రేంకారభేరీభాంకారశింజినీటంకారవీరభటహుంకారంబులకు వియత్తలంబు నొంది యెదుర్చుటయు ...శ కాం. ౫. ౨౧.

క్రేంకారమిచ్చు=ధ్వని చేయు, కూయు.

సీ. కొక్కొరోకో యని కొమరసామిరథంబు కంఠంబు సాఁచి క్రేంకారమిచ్చె. భీమ. ౨. ౨౭. (క్రొక్కారమిచ్చె. శ. ర. పా.)

**క్రేంకృతి.** సం. వి. ఇ. స్త్రీ=క్రేంకారము. ౧. శారికాదిధ్వని.

ఉ...కలారవ, క్రేంకృతి శారికాపికశుకీవిహగాదులచే వినంబడెన్. రామా. ౨. ౧౦౪.

చ. కలయఁగ వారిదేవతలు గాంచుసరోవరదంభదర్పణం,బులపయి దట్టపుంజిలుము వోవఁగఁ దారలకంచు గీయఁగా,బలె నలుపంకలంగ లయఁ బాయక తేలుచుఁ బద్మరేణువుల్, కలఁకులఁ బాసి పోఁ జెలఁగెఁ గ్రేంకృతు లిచ్చు మరాళమాలికల్. ఆము. ౪. ౧౫౦.

౨. నూపురాదిధ్వని.

చ... అందియల క్రేంకృతి గంకణమేఖలాధ్వనిం, బ్రకటనుసేయ...కాశీ. ౪. ౧౫౪.

**క్రేఁగన్ను.** వి. దే. (క్రేవ+కన్ను) నేత్రాంచలము; కటాక్షము.

సీ... కడకన్ననంగఁ గ్రేఁగన్ననంగ. గీ. నగు నపాంగంబు...ఆం. భా. ౨. ౧౪౪.

గీ. కడలికడనుండి మగిడి క్రేఁగంటిదృష్టి, యిడుచుఁ బాయుచు జడదారియొడయు లపుడు. దశా. ౧. ౧౭౭.

సీ. క్రేఁగంటనైన వీక్షింపవు ... వరాహ. ౨. ౫౬. కాశీ. ౪. ౧౪౭.

**క్రేఁగయి.** వి. (క్రేవ+కయి) హస్తాగ్రము.

చ. మంతపుఁ గోడుతాలువరిమన్కిబిడారపు మెట్టుఁ గ్రేఁగయిం,గొంచక యొత్తినట్టి నిను... అచ్చ. రా. యు. ౧౩.( క్రేగయి-శ.ర.పా.)

**క్రేఁటు.** అ. క్రి. ౧.గొంతు సవరించుకొనుటకై ఒకవిధ మగుధ్వని చేయు, సకిలించు. (శ. ర.)

వ. ఉమ్మలిక యింత యేటి కనుటయు నబ్బోటి క్రేఁటుచు నిట్లనియె. మనుచ. ౬. ౯.

౨. తొట్రుపడు.

ఉ...అమాసచీకటిం, గ్రేఁటుచు నేఁగుదెంచ నడురేయిని జోరుఁడు కన్న పెట్టఁగన్. భల్లా. ౧. (శ. ర.)

వి. గద్గదకంఠమును బాగుచేసికొనుటకై చేసెడి ధ్వని, సకిలింత.

సీ. తత్స్వాదుకృద్ధ్వని దనరను గ్రేఁటన...ఆం. భా. ౧. ౧౨౨. (గ్రేఁటు-అని. ప్రా)

జ: క్రేఁటుకొను.

**క్రేఁటుకొను**=క్రేఁటు. అ. క్రి. (క్రేఁటు+కొను-స్వార్థమున)

(గొంతు సవరించుకొనుటకై యొకవిధ మగుశబ్దము చేయు)

క...గండఫలకభాగఁబులపైఁ,గాటుకకన్నీ రొలుకఁగ,మాట వెడలఁ గ్రేఁటుకొనుచు మానిని పలికెన్. మనుచ. ౩. ౯౨.

(వరూథిని) క...అతనిఁ జూడమఱఁ, గోపమునం జూచి గ్రేఁటుకొనుచుం బలికెన్. మనుచ. ౨౬౮.

**క్రేఁదొట్టు.** అ. క్రి. (క్రేవ+తొట్టు) గట్టొరయు.

వ. ఇరువురగదలును మసకంబునం బెనంగుపాములపగిదిం దాలించుపాసికలపోలికఁ గ్రేఁదొట్టుకరళ్లకైవడిఁ గలయ బెరయ...ఉ. హరి. ౩. ౬౪. (క్రైతొట్టు. ముద్రి-క్రేతొట్టు. శ. ర. పా.)

**క్రేగాలి.** వి. (క్రేవ+గాలి) ప్రక్కగాలి.

ద్వి. సంపంగికేళ్ళిగాలిఁ జలియించుచేఁటి, గుంపు
లగతి ...అ. మ. క. ౨. ౬౭. ౨౩ పం.

క్రేడి[1]. వి. సంబావులతోఁ గలసినకారు లోనగు ఎఱ్ఱవడ్లు. (శ. ర.)

క్రేడి[2]=క్రేణి.

(పరిహాసము-చూ. క్రేడిసేయు.)

జ: క్రేడించు, క్రేడిసేయు.

క్రేడించే=క్రేణించే, కేడించే. స. క్రి. (√క్రేడి[2].) ఉపేక్షించు, అలక్ష్యముచేయు.

గీ. తమ్ము వరియింపకునికి దీర్ఘమ్ము రోఁజు, నహులఁ
గ్రేడించి నడచిరి యానధరులు. నైష. ౫.
౩౦.

అ. క్రి. తొలఁగు.

క ... విప్రులతోడ మెయికొని పోరి, ట్లమ్ముపడ
నేటి కని వివ్వచ్చుఁడు గ్రేడించి యొండు
వలనికి నడచెన్. భార. భీష్మ. ౨. ౩౦౭.

క. ఓడితి మె మేము రణమునఁ, గ్రీడికిఁ గ్రేడిం
చి రాక గెలుపే యతఁ డే, చ్చో డాఁగి
పోయెనొకొ మా, తోడిబవర మిట్లు తాను దొ
లఁగినఁ దెగునే. భార. ద్రో. ౧. ౩౭౮. ప్ర
భా. ౩. ౩౮.

క్రేడిసేయు=క్రేణిసేయు. స. క్రి. (క్రేడి[2] + చేయు) పరిహాసముచేయు.

వ...విలయమార్తాండమండలంబు వేఁడిమిం గ్రేడి
సేయు మూఁడవ బాణంబు తూణంబునం దిగు
చునప్పుడు. జై. భా. ౫. ౭౨. (శ. ర. పా-
ఔపమ్యద్యోతకము.)

క్రేణి=క్రేడి[2]. వి. ౧. ఉన్నతపదము, పెద్దయధికారము.

క. మించి ధనమానఁ బ్రజ నెరి, యించుమరాత్ముల
కుఁ గ్రేణి యిచ్చుట పతి కూ, హించిన నిండిన
చెఱువవి, యించి శకులకులము సంగ్రహించు
ట గాదే. కవిక. ౨. ౧౫.

౨. పరిహాసము.

ఉ. నారి యొకర్తు చొక్కపుసవల్ గలచక్కఁ
చిన్నపొన్నకుం, జేరి ప్రసూనగుచ్ఛము లశే
షము గోసియుఁ గ్రేణి నోర్తు నీ, భూరుహ మె
క్కు మన్న నగి పూచెఁ గఁ జేయుదు నా కి
టంతయున్, మేరువు గాదు నా వది నమేరు వ
నం దగి పూచెఁ గమ్మటన్. చమ. ౧. ౬౫.
(శ. ర. పా.)

క్రేణివట్టు=పొందు ?

గీ. పరమకళ్యాణి యాపగాంభస్త్రివేణి, రాజశే
ఖావతంసుగారాపురాణి, సమధికప్రీతిఁ దేలి
యాసత్యవాణి, సేవలత్వాశుభశ్రేణి గ్రేణివట్టె.
కాశీ. ౩. ౯౦.

జ: క్రేణించు, క్రేణిసేయు.

క్రేణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. (వెలయిచ్చి)కొనుట. (విల్యమ్సు) ౨. భూమి మున్నగునవి ఇంతకాలమునకు ఇంతద్రవ్యము ఇచ్చెద మని ఫలభోగమునకై పరిగ్రహించుట. (శే.ని.)

క్రేణించే=క్రేడించే. స. క్రి. (√క్రేణి.) అలక్ష్యము చేయు, తిరస్కరించు.

సీ. పూఁబోఁడి యిపుడు నాపూబంతు లింక నీపా
లింటి వనుచు డాపంగఁ దగునె, కమల మొ
క్కటి నేను గానుకఁగా నిచ్చినఁ గనుసన్నఁ
గ్రేణింపఁ జనునె సకియ. గీ. యనుచు విభు
ప్రొల మేలంబు లాడుకొనుచు, నంగసౌంద
ర్యసంసూచనాభిరామ, చాటువాచాచమ
త్క్రియాసరణి మీఱ, గిల్లి రప్పుడు సతులు
రాగిల్లి విరులు. రామా. ౧. ౧౮౫.

క్రేణిసేయు=క్రేడిసేయు. స. క్రి. (√క్రేణి.) పరిహసించు, తిరస్కరించు.

ఉ. ... కాంచనహర్మ్యతుంగశృంగమ్ములరశ్మిశే
ఖలు ప్రకాశములై కడఁ బర్వి. తత్సమీప, ప
ద్మునఁ బాఱుచున్నఘనపంక్తులయుం దదిర

ద్యుతివ్రతానమ్ములఁ గ్రేణిసేయుమ ననార
తముఁ బిలసిల్లుఁ దత్పురిన్. భార. ఆది. ౭.
౪౧. (ఇట ఔపమ్యద్యోతకము.)

ఉ. కాయజుఁ గ్రేణిసేయు ననఁ గాళకు మీఱు
ననంగ విభ్రమశ్రీయును జెంపునుం గలుగఁ
జేసి విధాతృఁడు పేడిఁ జేసెనే. భార. విరా.
౧. ౨౩౮.

ఇట్లే: క్రేణియొనర్చు.

ఉ. ... మేనకఁ గ్రేణియొనర్చుప్రాయపుం, జేడి
య లబ్బురం బయినచెంగలువల్ తగఁ జల్లి
రండటన్. యయా. ౮. ౧౫౬. (ఇట ఔప
మ్యద్యోతకము.)

క్రేత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) వెలయిచ్చి కొను
వాఁడు, విలువకాఁడు.

క్రేతవ్యము. సం=క్రేయము.

క్రేపు. వి. ౧. దూడ, వత్సము.

సీ. దూడ నాఁ గ్రేపు నాఁ దోఁచును వత్సంబు...
ఆం. భా. ౨. ౨౬౨.

క. అరి మిగులఁ గొనుట క్రేపులు, పారిమాలం బి
దికినట్ల భూవర...భార. శాం. ౨. ౩౭౯.

క...క్రేపులరూపముల నేఁ జరించెద ననుమన్.
భాగ. ౧౦ పూ. ౫౧౦.

౨. (పర్వత) శిఖరము.

ఉ. ...ఇందుబింబమున్, గి మ్మననీదు మోము గిరి
క్రేపులు మూఁపులు కొను గానరా,ను ... మ
నుచ. ౩. ౬.

జః క్రేపుఁగుఱ్ఱ.

క్రేపుఁగుఱ్ఱ. వి. (√ క్రేపు) చిన్నదూడ.

సీ. ధారిణీగవికి రత్నమహౌషధంబులు చేఁపు పు
ట్టించిన క్రేపుఁగుఱ్ఱ. వరాహ. ౧౦. ౮౭.

క్రేయము. సం. విణ. (అ. ఆ. అ.) కొనఁదగినది.
(సరకు)

క్రేయో. వి. పసులఁగొట్టుటయం దగుధ్వని కనుక
రణము.

శా. ... ఈ,యోషిద్భాదములన్ ధనంబుఁ గొని
క్రేయో యంచు మర్త్యాళి దు,ర్భాషల్వల్కుఁ
బురంబులో వెడలఁ బంపం బాడి ... భల్లా.
౩ ఆ. (శ. ర.)

క్రేళ్లు. వి. బ. ౧. బాహుళ్యము, అతిశయము.

సీ. రోహణాద్రియుఁ బెక్కురూపు లై యున్న
ట్లు క్రీడాచలంబుల క్రేళ్లు గలిగి. భా. రా.
యు. ౨౪౧.

౨. గంతులు; పర్వులు. (చూ. క్రేళ్లుదాఁటు, క్రే
ళ్లుదోలు, మొ.)

క్రేళ్లుచూ(సూ)చు=క్రేళ్లువాఱఁజూచు, చంచల
ముగాఁ జూచు.

ఉ...సత్యసంతతుల్, వెచ్చపుఁగూరుముల్ పరి
ఢవింపఁగ నేరరు నేర రబ్జసం,పచ్చటులంబు
లై మెఱయుబచ్చినచూపులఁ గ్రేళ్లుచూడఁ
గన్. పి. శకుం. ౨. ౧౬౦.

సీ. అచిరాంశురుచు లేమి యని వానిదెసఁ దప్పఁ
జూచుభావనఁ గ్రేళ్లుసూచు నలివ. కు. సం.
౭. ౬.

క్రేళ్లుచూపులు=చంచలదృష్టులు.

సీ. క్రేళ్లుచూపులకలికితనంబుపస నేర్చె...కళా.
౬. ౨౦౦.

క్రేళ్లుత్రుళ్లు=క్రేళ్లుఱుకు.

సీ. తల వాంచి బెళుకుఁజూపులు క్రేళ్లుత్రుళ్లఁగఁ
దెఱమఱుంగున నిల్చునోఱపుఁ జూచి. కువల.
౮. ౭౧.

జః క్రేళ్లుదాఁటు, క్రేళ్లుదోలు, క్రేళ్లుద్రిప్పు, క్రే
ళ్లుబ్బు, క్రేళ్లుఱుకు, క్రేళ్లువాఱు, క్రేళ్లుసను, క్రే
ళ్లగయు.

క్రేళ్లుదాఁటు. అ. క్రి. (క్రేళ్లు+దాఁటు) ౧. ఎగి
రిపడు.

ద్వి...మీలు, క్రేళ్లుదాఁటుచు మాటికిని సముల్లో
ల,కల్లోలములఁ దేలు క్రమముఁ గన్గొంటె. వి
ష్ణు. పూ. ౨ అ. (శ.ర.)

౨. గంతులిడు; దుముకు.

చ...కపీంద్రులు దిక్కు లార్పులం,బటియలు సే యుచుఁ బ్రమరి పాఱుచుఁ గేరుచుఁ గ్రేళ్లు దాఁటుచుఁ. భా. రా. యు. ౨౯౩.

సీ. అడ్డంబునిడుపుటాఁబడ్డలగతి మనుఁబిళ్లు డొం కలనుండి క్రేళ్లుదాఁట. మనుచ. ౨.౬. రాజ. చ. ౩. ౧౬౧. ప్రబోధ. ౧. ౪౯.

ఇక్లే: క్రేళ్లుగదాఁటు.

ఉ.... ఉదగ్రశిలాచలధూరిశృంగముల్, గేల ధరించి నల్గడలఁ గ్రేళ్లుగదాఁటుచు నార్పులం దెసల్,ప్రీలఁగఁ జేయుచుఁ...భా. రా. కి ష్కిం. ౫౮౨.

క్రేళ్లుదోలు. స. క్రి. (క్రేళ్లు+తోలు) పరుగులె త్తించు.

వ. అని పలికి సమరప్రకారంబునం దేరు క్రేళ్లు దోలి పాంచాలబలంబులపయి నడరె. భార. భీష్మ. ౩. ౩౬౯.

క్రేళ్లుద్రిప్పు. స. క్రి. (క్రేళ్లు+త్రిప్పు.) గంతు లువేయించు.

మ... కోర్కులు క్రేళ్లుద్రిప్ప...మనుచ. ౨. ౩౦.

క్రేళ్లుబ్బు. అ. క్రి. (క్రేళ్లు+ఉబ్బు) అతిశయిం చు.

సీ. అలజలంబులు ధాత్రి నవఘళింపక మున్నె క్రేళ్లుబ్బు వారియకీర్తిపంక,మాపంకసంకరం బంకురింపక మున్నె పాడము నసత్కీర్తిపుం డరీక,ము...నరస. ౫. ౧౦౨.

క్రేళ్లుఱుకు. అ. క్రి. (క్రేళ్లు+ఉఱుకు).౧.ఉఱు కు, దూఁకు.

క. చటినుండి తోలఁగ నుఱికెదు, సెఱసింగపుఁ గొదమ వోలె నిబ్బరముగఁ గ్రేళ్లుఱికెం దొ లఁగం బగతుని, యటుకటనుండి భువిమీఁది కబ్బలియుండుఁ. హరి. పూ. ౬. ౧౦౫.

క. ఆలోనం గుఱుధరణీ, పాలుఁ డడరి ప్రేయు టయును బవనసుతునిపై, సోలె నది గానఁ డాపలి, కేలీవిభ్రమము దోఁపఁ గ్రేళ్లుఱికె నృపా. భార. శల్య. ౨. ౨౬౫.

౨. ఎగిరిపడు, మిడిసిపడు; గంతులిడు.

వ. చకితకురంగశాబంబుకరణిం గ్రేళ్లుఱుకు చేడి సమీలకరణిం బ్రేక్షణప్రభాజాలంబులు న లుగడలం గడలుకొన...కృ. శకుం.౨.౮౦.

సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్లుఱికెడువాలుగ సోగలమేలు డించి. భార. విరా. ౨. ౯౩. (శ. ర. పా)

సీ. హయము క్రేళ్లుఱుకునో యని రెండుగడలం దు వాగెఁ బట్టిరి మత్స్యవత్సపతులు. కళా. ౬. ౬౨.

క్రేళ్లువాఱు. అ. క్రి. (క్రేళ్లు+పాఱు) గంతులు వేయు.

ద్వి. బల్లిమల్ మాశివభక్తులే యనుచుఁ, గ్రేళ్లువా ఱుచు నాడు క్రియఁ బాడి యాడు. బస.పు. ౧. ౮౨౦.

ఉ...లోచనప్రభా,జాలము క్రేళ్లువాఱఁగఁ గు చద్వితయంబు చలింపఁ జొక్కుచుఁ, సో లుచు సారెకు న్మరలి చూచుచుఁ జేరె నికుంజ గేహముఁ. కృ. శకుం. ౨. ౮౯.

గీ. మలఁగి గజకంధరము ద్రుంచి తోలఁగ నుఱికి, కెంపు దళుకొత్త వాలుతోఁ గ్రేళ్లువాఱు, నావృకోదరుపైఁ గవియంగఁ జేయి,వీచె సేన కుఁ గాళింగవిభుఁడు గడఁగి. భార. భీష్మ. ౨. ౬౦.

క్రేళ్లుసను. అ. క్రి. (క్రేళ్లు+చను) క్రేళ్లుదాఁ టు, ఎగిరిపడు.

సీ. హస్తులగదురున కడరి నిల్వక క్రేళ్లుసనుహ యంబులమణిస్యందనములు. భా. రా. యు. ౫౧౯.

**క్రేళ్లెగయు.** అ. క్రి. (క్రేళ్లు+ఎగయు) మీఁది కెగురు,పై కెగురు.

క ... కే లాగిఁ జగి యలుఁగుతోన క్రేళ్లెగసి వ డిం, దూలె...కు. సం. ౧౧. ౭౨౪.

**క్రేవ.** వి. ౧. ప్రక్క, పార్శ్వము. (వృత్తియం దం త్యవర్ణలోపము. చూ. క్రే.)

వ. కయ్యంబు కలహూ పంతయుఁ గనుఁగొనుటకు మింటిక్రేవ నున్న జెరవు గా దనుపరుసన సవిత్రుండు చక్కనిమింటికిం జనుజెంచె. భా ర. భీష్మ. 3. ౩౮౬.

క. క్రేవల సేకాంగులు రా...అను. ౨. ౯౬.

క. ఇరుక్రేవల నఁడకళా,గ్గరథాంగగదాయుధము లు రాఁ దొడఁగె...పారి. ౨. ౭౭.

౨. సమీపప్రదేశము, దగ్గఱ.

గీ...క్రేవ పొంత, యంచ యొద్ద నా నికటాఖ్య యగు...ఆం. భా. 3. ౨౧.

3. ప్రదేశము, చోటు.

చ. అలకలఁ జిన్నిపూ వల్లికనంతన మోము సెమ ర్చుఁ జన్నుఁగ్రేవల మృదుపత్త్రభంగములు వ్రాయుడుఁ గా నసియాడు ... కోమలి మను ప్రసవాస్త్రహతిం జలింపడే. కు. సం. ౫. ౬౧౨.

ఉ. తాళఁగ లేక తాల్మి చెడి తల్లడ మందుచు లే చి సేలపై, వ్రాలుచు...కే లెడఁ జేర్చుచుం జలువక్రేవల కేఁగుచు నీరు ద్రావుచుకా. చెన్న. ౫. ౧౩.

కన్నుఁగ్రేవ, కంటిక్రేవ=కంటిపార్శ్వము, కం టికొన.

శా. కన్నుంగ్రేవలఁ గెంపు దోఁప ... చం. రా. ౫. ౬౧.

ఉ...కంటిక్రేవ...భార. భీష్మ. ౨. ౩౦.

జః క్రే, క్రేఁగన్ను, క్రేఁగయి, క్రేఁదొట్టు, క్రేగాలి, మొ.

# క్రై

**క్రైలు.** వి. ధాన్యము నుఱిచి కొలుమట, ఒబ్బిడి.

వ... క్రైలుగ నఱికి పగఱం జిట్టుముట్టాడుసహజ సాహసులును...ఉ.హరి.౪.౨౯౯. (ఇక్కడ క్రైలుగ ననఁగా సర్వనాశముగ ననియర్థము. గ్రంథములయం దిట్లు రేఫసహితముగా నిది కానఁబడుచున్నది-శ. ర.)

జః క్రైలుదారి.

**క్రైలుదారి.** వి. (√క్రైలు) క్రైలు చేయించెడి యధికారి. (శ. ర.)

# క్రొ

**క్రొ.** విశే. (వృత్తియందు క్రొత్తశబ్దముయొక్క లు ప్తశేషము. చూ. క్రొత్త.)

**క్రొంకి=కొంకి.**

(యుద్ధసాధనవిశేషము.)

గీ. పాశముల్వెట్టి క్రొంకులు బద్దపములుఁ, గత్తి గొంతంబు లాడిసెల్లుఁ గత్తళములు, నారస ములును సిందులు నగరిలోనఁ, జెట్టి ... ఉ. హరి. ౨. ౯౨.

(చోరసాధనవిశేషము)

చ...కొ,య్యయు నురి క్రొంకి నారసము...దశ కు. ౫. ౭౨.

మత్తకోకిల...గద్దగోరును గ్రొంకియుకా. ద్వా. . ౧౦. ౧౧౮.

**క్రొంచే=కొంచే** (సం. క్రౌంచః. ప్రా.కొంచ) క్రౌం చపక్షి.

ఉ. ఱెక్కలు సించి కంఠమున ఱేకులు వాపి శి రంబు వ్రచ్చి పేరుక్కునఁ గ్రొంచచంద మగునొడ్డు గలంగఁగఁ జేసి... భార. భీష్మ. ౨. ౩౦.

**క్రొంజాయ.** వి. (క్రొత్త+చాయ) నూతనకాంతి.

సీ. రంజిల్లునపరంజి క్రొంజాయకమ్మడాల్తపసుపుఁ జెక్కు_లమీఁదఁ దాంపవింప. ఇందు. ౪. ౧౭౩.

**క్రొంజిగురు.** వి. (క్రొత్త + చిగురు) లేఁతచిగురు.

సీ. పావనవైజయంతీవనమాలిక క్రొంజిగురొత్తిన గుజ్జుమావి... గీ. అనఁగఁ జూపట్టె జలధికన్యాలలామ, పద్మనాభునిఘనభుజాభ్యంతరమున. దశా. ౨. ౨౮౨.

**క్రొంజిగురులవిల్కాఁడు.** వి. (√క్రొత్త)- లేఁజిగురువిల్తుఁడు- మన్మథుఁడు. ఆం. భా. ౧. ౮౫.

**క్రొంజిలుఁగుఁజేల్వ.** వి. (క్రొత్త + జిలుగు + చల్వ) క్రొత్తదియైన సన్నపువస్త్రము.

చ. జలకములాడి క్రొంజిలుఁగుఁజల్వలు దాలిచి పుణ్యవేదిపై, నెలకొని సంధ్య వార్చి జపనిష్ఠలు దీర్చి కృతాగ్నిహోత్రుఁడై. ఉ. రా. ౫. ౨౮౬.

**క్రొఁజీకటి.** వి. (క్రొత్త + చీకటి) మునిచీకటి, మసకచీకటి.

మ. నటదీశానశిరస్తటత్రుటితరత్నచ్ఛాయఁ గల్లోలినీ, విటమధ్యంబున వ్రాలె నభ్రమణి తద్వేగాభిపాతోన్నమ, త్పటుపాథోలవధారఁదారలెగసెం దద్బిందుసందానితో, త్కటసంధ్యానలధూమకందళములై కన్పట్టెఁ గ్రొంజీకటుల్. వసు. ౪. ౧౦.

**క్రొందమ్మి**- క్రొత్తమ్మి. (శ.ర.)

**క్రొందావి**= క్రొత్తావి. వి. (క్రొత్త + తావి) నూతనపరిమళము.

క. కుందనపుటందియల హారి, చందనతరుఖండవహ్నిసంతప్తంబై, క్రొందావు లొల్కు పన్నీ, టందగ జలకంబొనర్చి... హంస. ౫. ౩౬౬.

**క్రొంబట్టు.** వి. (క్రొత్త + పట్టు) క్రొత్తపట్టు.

సీ. బెడఁగుఁజెంగావిచల్లడముపై బిగియించి కట్టి నక్రొంబట్టుదట్టి దనర. దశా. ౭. ౨౭.

**క్రొంబని.** వి. (క్రొత్త + పని) వింత యగుశిల్పము, అపూర్వశిల్పము. ఇందు. ౬. ౧౩౧.

**క్రొంబూవిలుకాఁడు.** వి. (క్రొత్త + పూ + విలుకాఁడు) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.

ఉ... క్రొం, బూవిలుకాని సాహిణపుఁ బ్రోపరి యామని వచ్చె నత్తఱిన్. కృ. శకుం. ౧. ౭౧.

**క్రొంబెరుఁగు.** వి. (క్రొత్త + పెరుఁగు) నూతనదధి.

సీ. పెక్కులాగులఁ గదంబించుజున్నులతోడఁ బేరి దాఁకొన్న క్రొంబెరుఁగుతోడ. పి. శకుం. ౧. ౧౩౫.

**క్రొంబొగ.** వి. (క్రొత్త + పొగ) నూతనధూమము. భా. రా. యు. ౨౧౯.

**క్రొక్కారము.** వి. కోడికూఁత.

సీ. కార్కోడిగములక్రొక్కారంబునందడి... చంద్రా. ౨. ౮౧. (శ. ర. పా- కొక్కారము. చి. ని. పా- కోకారము. ముద్రి. పా)

**క్రొక్కారు.** వి. (క్రొత్త + కారు) వర్షాకాలము. కవిక. ౬. ౧౯.

క్రొక్కారుమెఱుఁగు= వర్షాకాలపుమెఱుపు. భార. విరా. ౨. ౮౩. నైష. ౩. ౮౮.

**క్రొగ్గంటి.** వి. (క్రొత్త + గంటి) క్రొత్తగాఁ బడిన గాయము.

సీ. బయలపైఁ గ్రమ్మెడునరుణధారలు దము మేనిక్రొగ్గంటులలోనఁ జొచ్చి. కు. సం. ౧౧. ౭౦౨.

వ... ఆపాదచూడంబుగా నొదవినక్రొగ్గంట్లనుము గక నెడలుక్రొన్నెత్తుట జొత్తిల్లి... కవిక. ౨. ౧౯౭.

**క్రొత్త.** (వృత్తియందు మీఁదివర్ణములు వికల్పముగా లోపించి 'క్రొ' అనునది మిగులును. దీనికి కొన్నియెడల నుమాగమమును కొన్నియెడల పరమగుహల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా: క్రొంబసిఁడి, క్రొంబులకలు, క్రొక్కారు, క్రొగ్గంటి, క్రొగ్గండి, క్రొన్నెల, క్రొమ్మేఘము, మొ.) విశే. అపూర్వము; నూతనము.

క...తద్గ్రామణశాలలీవృష్టి మిగులఁ గ్రొత్త యగు చు వీక్షణముల కత్యద్భుతకారణ మై తన రార...

ఆ. చెలువ యీయపూర్వశాలలీ ప్రవర్ష మెక్కడి ది...కళా. ౬. ౯, ౧౦.

ఉ. వారివిహారవేళఁ జెలువా చెలువారెడునీచనుం గవఁ, సారపుఁదారహారములచందముఁ గైకొనుఁగావృతం జమ, త్కారము క్రొత్తయై మెఱ య...అంబుపృషత్కదంబముల్. నైష. ౫. ౧౦౭.

గీ...క్రొత్త మిహి హాస యనఁగ మీఱును నవం బు...ఆం. భా. ౩. ౨౩.

శా...అవి వినంగాఁ గ్రొత్త లై చుండు...భాగ. ౧౦ పూ. ౧౬౭౨.

క్రి. విశే. క్రొత్తగా.

సీ. క్రొత్త దోమినదంతకోరకంబులయందుఁ దాంబూలరాగంబుతఁబుకు గూర్చి. క్రీడా. ౧౩౪.

వి. అపూర్వత.

ఉ. ఆఱురసంబులం జవులయందుల క్రొత్తలు పుట్ట నిచ్చలుఁ, వే ఱొకభంగిఁ బాకములు విన్న ను వొప్పఁగఁ జేసిచేసి న, న్నీఱఁగ బానిసీని నొకనిఁ బురిఁగాననియట్లు గాఁగ మేఁ, గాఁటియవెట్టి యైన నొడికంబున వండుదు నెల్లగూరలుఁ. భార. విరా. ౧. ౪౪.

సీ... ప్రబంధంబులు గ్రొత్తలు పుట్టించుకొని లిఖింప. విక్ర. ౧. ౨౦.

క్రొత్తచేయు = అలవాటు లేమిచే వికృతి గలిగించు.

క. తపతపలాడుచుఁ బాడెదు, క్షపణకునిం జూచి బుద్ధసంయమి సిద్ధాధిప మధురసపానం బీ, చపలునికిం గ్రొత్తచేసె సంకటపఱచెఁ. ప్రబోధ. ౩. ౬౦.

జ: క్రొ, క్రొంజాయ, క్రొంజిగురు, క్రొంజిగురులవిల్కాఁడు, క్రొంజిలుఁగుఁజల్వ, క్రొంజీకటి, క్రొందమ్మి, క్రొందావి, క్రొంబట్టు, క్రొంబని, క్రొంబూవిలుకాఁడు, క్రొంబెరుఁగు, క్రొంబొగ, క్రొక్కారు, క్రొగ్గంటి, క్రొత్తపడు, క్రొత్తమగఁడు, క్రొత్తముట్టు, క్రొత్తమ్మి, క్రొత్తవఱుచు, క్రొత్తావి, క్రొన్నన, క్రొన్నురుఁగు, క్రొన్నెత్తురు, క్రొన్నెల, క్రొమ్మావి, క్రొమ్మించు, క్రొమ్ముడి, క్రొమ్మెఱుఁగు, క్రొమ్మేఘము, క్రొవ్వాఁడి, క్రొవ్విరి, క్రొవ్వేడ, మొ.

క్రొత్తడ(ళ)ము=కొత్తడము. వి. కోటబురుజు.

సీ. ... క్రొత్తడంబులతోడఁ గోట దీర్చి ... పి. శకుం. ౪. ౧౪౪.

సీ. క్రొత్తడంబులకెంపు క్రొత్తడంబులరంగు నింగికిఁ బోఁపువన్నియలు నింప. యయా. ౧. ౩.

సీ. మండసంబులు దేపి మాడువుల్ పొడగని క్రొత్తడంబులు చూచి కోటగవఁకు, ఱారసి ... అచ్చ. రా. సుం. ౭.

క్రొత్తడి. వి. ౧. సాధ్వి, పతివ్రత.

సీ. ... సాధ్వి తనరుచుండుఁ గ్రొత్తడి యనంగ. ఆం. భా. ౨. ౧౧౬.

౨. మగనాలు, పతివత్ని.

క. అత్తలకు మ్రొక్కి తక్కటి, క్రొత్తడులందఱకుఁ బ్రియము గొనలునిగుడఁగా, న త్తఱిఁ దిలకించె వరవ, ధూత్తమ యై సత్యభామ యుజ్జ్వలగరిమఁ. హరి. ఉ. ౪. ౨౨౦.

చ. ... అది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొత్తడి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుటఁ జూచి శోకిలితిఁ. భార. ఉద్యో. ౩. ౧౭౪.

సా: రంకుటాలికిఁ గ్రొత్తడిసుద్దులు పెచ్చు. (క్రొత్తడిసుద్దులు=పతివ్రత చెప్పునట్టిమాటలు.)

క్రొత్తప(వ)డు. అ. క్రి. (క్రొత్త + పడు) క్రొత్త యగు. (చూ. క్రొత్తవఱుచు.)

క్రొత్తమగఁడు. వి. (క్రొత్త + మగఁడు) జారుఁడు.

ఆ. కోర్కె మీఱ ముద్దుగొంగడి పఱచిన, మంచమునకుఁ గ్రొత్తమగనిఁ గొనుచుఁ, గులుకునడల న

రిగి కూర్చుండె దానిక్రిందింటిమగఁడు దాఁ
గు తెలియఁగ లేక. వేం. పంచ. ౩. ౨౭౨.

**క్రొత్తముట్టు.** వి. (క్రొత్త+ముట్టు) ౧. నూలిపోఁగు. (వడుక నారంభించినపుడు ఏకుననుండి పురి లేక సాఁగఁదీసి కదురున కంటించెడునూలు-శ.ర.)
గీ. క్రొత్తముట్టన నూలుపోఁగును సమర్థ, పాలు
చును...ఆం. భా. ౩. ౪౭.
సీ. కళ్యాలఁ బదిలంబు గానిగుత్తింబులఁ గ్రొత్తము
ట్టున కియ్యకొలుపువరవు భార.విరా.౧.౯౫.
౨. సమర్థ. ఆం. భా. ౩. ౪౭.

**క్రొత్తమ్మి.** వి. (క్రొత్త+తమ్మి) క్రొత్తగా వికసించినపద్మము. పి. శకుం. ౩. ౧౭౫.

**క్రొత్తన(ప)ఱుచు.** స. క్రి. (√క్రొత్తపడు) క్రొత్తపడఁజేయు.
(నూతనముగాఁ జేయు.)
మ. ప్రమదం బానవకాంతిఁ గ్రొత్తపఱుపం బా
దాతిభూయిష్ఠసైన్యముతో భీముఁడు...సమ
రక్రీడకు వచ్చె...భార. భీష్మ. ౧. ౧౦౫.

**క్రొత్తావి**=క్రొందావి.
సీ. వయసంపుగుత్తులఁ బ్రసన్ననిపాలింపఁ మవ్వం
బుఁ దమలోన మార్చికొనఁగఁ, జిందుతేనియ
లును జెమటచిత్తడియును క్రొత్తావి తమలోన
ఓత్తరింప. పి. శకుం. ౨. ౬౧.

**క్రొన్నన.** వి. (క్రొత్త+నన) క్రొత్తనన.
(క్రొత్తమొగ్గ)
ఉ...వనిఁ దోఁచెఁ గ్రొన్ననల్. ఆము.౫.౧౧౪.
క్రొన్ననలొత్తు=పల్లవించు, చిగుర్చు.
ఉ. కుంతల నొంద కెంతయును గ్రొన్ననలొత్తుని
జావలోకనో,త్కంఠ నతిప్రయత్నమునఁ ద
త్కృతి నిట్లు పఠింప...పరమ. ౫. ౧౧౪.
క్రొన్ననఁబోఁడి=ననఁబోఁడి, స్త్రీ. నీలా. ౧. ౧౧౬.
క్రొన్ననవింటివాఁడు=పూవిల్తుఁడు, మన్మథుఁడు. విక్ర. ౧. ౧౦౭.

**క్రొన్నురుఁగు.** వి. (క్రొత్త+నురుఁగు) నూతనఫేనము. పరమ. ౧. ౬౩.

**క్రొన్నెత్తురు.** వి. బొ. (క్రొత్త+నెత్తురు) క్రొత్తనెత్తురు.
వ...క్రొగ్గంట్లనుఁ ముకగక వెడలుక్రొన్నెత్తుటజొ
త్తిల్లి.... కవిక. ౨. ౧౯౭.

**క్రొన్నెల.** వి. (క్రొత్త+నెల) బాలచంద్రుఁడు, ఒక్కకళ గలచంద్రుఁడు. దశా. ౩. ౪౬.
బ. చెక్కిళ్లయందును దొడలయందును మీఁదేకులందును గావించెడునఖక్షతములు.
గీ...మీఁజెయిఁ జెక్కిటను దొడకడ,నిలుమనవి
క్రొన్నెల లనఁగఁ జెలఁగుచుండు. వేంక. ౭౫.
క్రొన్నెలతాలుపు=చంద్రశేఖరుఁడు, శివుఁడు. రాజ. వ. ౧. ౫.

**క్రొమ్మావి.** వి. (క్రొత్త+మావి) క్రొత్తమామిడిచెట్టు. ఉ. రా. ౩. ౬౬.

**క్రొమ్మి.** వి. ఎఱ్ఱగోరంట ?.
సీ...కొరవి నాఁ గ్రోవి నాఁ గ్రొమ్మి నాఁగఁ, గుర
వక నామ యూ...ఆం. భా. ౨. ౫౩.

**క్రొమ్మించు.** వి. (క్రొత్త+మించు) ౧. నూత్నకాంతి. హర. ౫. ౪౪.
౨. క్రొత్తమెఱపు. నీలా. ౨. ౨౭.

**క్రొమ్ముడి.** వి. (క్రొత్త+ముడి. శ. ర-కురులు+ముడి=క్రుమ్ముడి అని కొందఱు) కేశబంధవిశేషము.
ఉ. ద్రోవది బంధురం బయినక్రొమ్ముడి గ్రమ్మన వి
డ్చి...భార. ఉద్యో. ౩. ౧౧౪.
గీ. కేశబంధవిశేషాఖ్య గేయుఁ గ్రొమ్ముడి యన...
ఆం. భా. ౨. ౧౪౫.

**క్రొమ్మెఱుఁగు.** వి. (క్రొత్త + మెఱుఁగు) ౧. క్రొత్తమెఱపు, తొలకరిమెఱపు.
క. ఉఱుముమురిమి మూలగాడ్పులు, చఱచి విసరఁ

జొచ్చె మదనసంహారుదెసఁ గ్రొ,మ్మెఱుఁ గుద్భ
వించె...హర. ౨. ౧౭.

చ. పవడపుఁదీవలో తళుకుబంగరుబొమ్మలో క్రొ
మ్మెఱుంగులో...నీలా. ౧. ౪౦.

౨. క్రొత్తకాంతి.

గీ. ఇంక నొకవింత యాదానవేంద్రు కడిఁది, మేనఁ
బుట్టినపుట్టఁ గ్రొమ్మెఱుఁగుగోళ్ల, గ్రొచ్చి తేని
యఁ గైకొనునిచ్చ నిచ్చ, యచ్ఛభల్లంబు ల
చ్చట నచ్చుపడఁగ. దశా. ౪. ౨౯.

**క్రొమ్మేఘము.** వి. (క్రొత్త + మేఘము) క్రొత్త మే
ఘము.

సీ. పుష్కలావర్తకంబులు లోనుగాఁ గలక్రొమ్మే
ఘములు వృష్టి గురియకుండ. భీమ. ౩. ౭౭.

ద్వి... క్రొమ్మేఘంబు గర్జిల్లి కురియ. రం. రా. ఉ.
౩౯ పా. ౧౭ పం.

**క్రొయిపు=కైపు ?.** (చూ. క్రొయిపెక్కు)

జః క్రొయిపెక్కు.

**క్రొయిపెక్కు.** అ. క్రి. కైపెక్కు, వదలు, వీడు.

సీ. క్రొయిపెక్కి జాఱినక్రొమ్ముడిలో పలివిరులు
తుమ్మెదలకు విందుపెట్ట. కాశీ. ౫. ౧౧౯. (చి.
ని. పా.)

**క్రొల్లు=కొల్లు.** వి. దగ్గుటయం దగుధ్వని కనుకరణ
ము.

చ. గుదియను గేల నూనుకొని క్రొల్లున దగ్గుచు నో
టికుంపుకుల్, చెదరఁ గ్రమంబుఁ జెప్పుచు
ను శితనగాత్మజఁ జేర ... పార్వ. ౪. ౬౭.
(ప్రయోగాంతరము లేదు)

**క్రొవ్వాఁడి.** విణ. (క్రొత్త + వాఁడి) మిక్కిలి వాఁ
డి యైనది.

శా. ప్రారంభం బొకయింత లేకయుఁ దృణప్రా
యంబు నట్లొందఁగాఁ, గ్రూరాసిం దెగ వేసె
నో నటికనో క్రొవ్వాఁడిఱంపంబుచే ... హ
ర. ౭. ౬౯.

వి. మిక్కిలివాఁడిమి, తీక్ష్ణత.

ద్వి. బెదరక వదలక పిదపిద గాక, క్రొవ్వాఁడి నూ
పక క్రూరత లేక. పండితా. దీక్షా. ౬౧ పా.

**క్రొవ్వారు.** అ. క్రి. (క్రొవ్వు + ఆరు) బలియు; అ
తిశయించు; సారవంతమగు.

శా. క్రొవ్వారుంజనుదోయి వ్రేఁగునకు నాగోరం
తకా నంతయుఁ, జవ్వాడంగ... భాను. ౪.
౪౪.

గీ. విరిసెఁ గ్రొవ్వారి నాగకేసరపుఁబువ్వు, మీఁది
ధూపంబుభంగిఁ దుమ్మెదలు వెడలె. భీమ. ౫.
౯౬.

సీ. క్రొవ్వారుజవ్వాదికుసుమునఁ బెరిఁగిన చేమంతి
యున్న దేకోమలాంగి. విక్ర. ౫. ౧౯.

**క్రొవ్విదము.** వి. (క్రొవ్వు + ఇదము) ౧.దుష్కార్య
ము, దుశ్చేష్ట.

ఆ. ఆలు బిడ్డ లేనియట్టి త్రిమ్మరి యగు, కొయ్య గా
క కుదుటఁ గూడు పెట్టి, కుఱుచవార లిట్టి క్రొ
వ్విదంబులు సేయఁ, జొచ్చు టిచ్చగించి చూతు
రయ్య. భార. ఉద్యో. ౨. ౯.

చ... క్రొ, వ్విదములు దక్క మీపలుకు విష్ణుఁడు
లక్ష్మియు విన్న మెత్తురే. కు. సం. ౪. ౪౨౧.

౨. బలియుట, బలుపు.

ఉ. చన్నులక్రొవ్విదంబుఁ గటిచక్రపుఁ బెంపును
మోవికెంపు... పద్మ. ౩. ౭.

విణ. పరువమునకు వచ్చినది, పరిపాకదశకు వచ్చిన
ది.

సీ. విరియ నూఁకించు క్రొవ్విదపుమల్లియ మొగ్గ లెల
తావిఁ జొక్కించునిక్కలందు...గీ. తిరిగి తి
రిగి...నృసిం. ౩. ౭౫.

**క్రొవ్విరి.** వి. (క్రొత్త + విరి) క్రొత్త పువ్వు. నైష.
౭. ౧౬౧.

**క్రొవ్వు.** అ. క్రి. ౧. గర్వించు, మదించు.

సీ. వినుము దంభోద్భవుం డను రాజు దన కను రర్వ

ఱ శేరంబుఁ గ్రొవ్వి ... భార. ఉద్యో. ౩. ౨౭౬.

గీ. గొబ్బె క్రొవ్వియు సెలకట్టెఁ గొత్తికినట్లు, కట కటా మీవివేకంబు గాడుపడఁగ. భీమ. ౪. ౫౩.

౨. వాఁడియగు, తీక్ష్ణమగు.

ఉ... తదీయమస్త్రముం, గ్రొవ్వినమచ్ఛరంబునన కూల్చెద...ఉ. హరి. ౩. ౪౩.

౩. బలియు; అతిశయించు.

ఉ. క్రొవ్వినగట్టినిబ్బరపుగుబ్బచనుంగవలున్ ... హరిశ్చ. ౧. ౧౦౨.

చ... నిర్మలసౌధసువర్ణజాలకం,బుల వెడలుం గికీ శగళమాలిహాలాహలకాంతిఁ బోలి గు,గ్గులుమ హిషాక్షవాసనలఁ గ్రొవ్వినమంగళధూపధూ ముముల్. కాశీ. ౧. ౪౯.

వి. ౧. శరీరమందలిధాతువులలో నొకటి.

గీ...వస చెలఁగుఁ గ్రొవ్వు నా ... ఆం. భా. ౨. ౧౩౨.

గీ...వాయు వంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి,నొ వ్వుఁ దెవులును బుట్టింపఁ గ్రొవ్వు సెఱచు. భార. అశ్వ. ౧. ౧౭౬.

ఆ...అఁ,కొని ముసిండి దినినఁ గ్రొవ్వు లావుఁ, గలుగునయ్య...భార. ఉద్యో. ౩. ౩౩౩.

౨. మదము, గర్వము.

క. ఇవ్విధమున శినివీరుని, క్రొవ్వు చెఱచి పాం డుపుత్రకులబాణంబుల్, నివ్వటిలెక నలు వుర, నవ్వీరుఁడు నొవ్వ నేసె నచ్ఛశభంగిన్. భార. శల్య. ౧. ౨౭.

ఉ...భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ దప్పితిన్, గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జ నుదెంచి...మనుచ. ౨. ౩౯. ఆం. భా. ౧. ౧౩౩.

౩. సారము, నిగ్గు.

సీ. వనజాక్షిచూపులు వలరాజుతూపులు క్రొత్త వెన్నెలలోని క్రొవ్వు నవ్వు. విక్ర. ౧. ౧౧౯.

సీ. పూవుబంతులు రువ్వుపాలఁతుల తెలినవ్వు కలి కివెన్నెల క్రొవ్వు గనుట యొకటి. కువల. ౪. ౧౩౨.

౪. పుష్టి, బలుపు.

ఉ. కోమలతామ్రచూళికల క్రొవ్వఱసంజకుఁ బ్రోదివెట్టి ని,స్సీమకఠోరతారరుతిఁ జెట్టుప లాడ్చుచు నజ్జు లెత్తి వి,శ్రామము పోలెఁ గూ సె ... కాపటీరశిఖరంబులఁ గుక్కుటచక్రవాళ ముల్. నైష. ౭. ౧౫౩.

౫. మహోక్తులు, పొగరుఁబోతుమాటలు.

చ. జలజభవాచ్యుతాదిసురసంఘము లెల్లను భక్తి యుక్తులై, కొలుచుమహేశు నీచపలుకుత్సిత విప్రుఁడు వచ్చి నోరఁ గ్రొ,వ్వులు వలుకంగ ...కు. సం. ౬. ౭౭౬.

క్రొవ్వడఁగించు=మద మడుగఁ జేయు.

ఉ...అని నాకు నశక్యమె కర్ణశల్యులం, గ్రొవ్వడఁ గించుట...భార. కర్ణ. ౩. ౨౬౨.

క్రొవ్వెక్కు=మదించు, గర్వించు.

ఉ. క్రిక్కిఱిసి చన్నుఁగోయియిరు క్రేవలకాంతి యుఁ బంచబాణుఁ గ్రొ,వ్వెక్కఁగఁ జేయ హస్తయుగ మెత్తి ... కొప్పు వెట్టుచోఁ, జొ క్కులఁ బెట్టె భూవరునిచూపులఁ గోమలిబా హుమూలముల్. నైష. ౬. ౧౯౪.

జ: క్రొవ్వారు, క్రొవ్విదము, క్రొవ్వుగొను, క్రొవ్వెద.

**క్రొవ్వుగొను.** అ. క్రి. (క్రొవ్వు+కొను) మదించు.

సీ. పరువంపుఁ జినుకులపసఁ గ్రొవ్వుగొని తేలగిలఁ బడువానకోయిలలమొప్పు. హరి. పూ. ౯. ౬౭.

**క్రొవ్వెద.** వి. (క్రొవ్వు+వెద) కబరి, కొప్పు.

సీ...కబరికిఁ దుఱుము. గీ. కొప్పు క్రొవ్వెద మూల నా నొప్పుఁ బేళ్లు. ఆం. భా. ౨. ౧౪౫.

గీ. సెఱులు కురులు వెండ్రుకలు నా సెఱక లనఁగఁ,

గొవ్వ తుఱు మన వేనలి క్రొన్నెద యునఁ, గే శధమ్మిల్లములు మించు...అం. సం. మాన.౧౬.
క...చెం,గలువలు క్రొవ్వెదకు వే ఱొకర్తు ఘటించెఁ. ఆము. ౬. ౧౨౯.

## క్రో

క్రోంచము. సం. వి. అ. పుం. క్రౌంచపర్వతము.(వాచ.)

క్రోఁతి=కోఁతి. వి. (క. తు. కోతి. త. కోది) వానరము, కోఁతి.

ద్వి. ఆక్రూరతకుఁ గాక యగచరుల్ పఱవ,నో క్రోఁతులార మీ కులుక నేమిటికి,నాజిలో ఖరుని నుక్కడఁచినయట్టి, రాజుమీఁదనె కాని రాదునాయమ్ము...ఇదె మహాకాయుండ నేతెంచినాఁడ. రం. రా. యు. ౩౭౬పా. ౨౩ పం.

సీ. వలఁ బడ్డమీనుకై వడి నిప్పు ద్రొక్కినక్రోఁతి భాతిని నెట్టిగొన్నకుక్క,పద్ధతి...చంద్ర.వి. ౧. ౯౨. ఉ. రా. ౩. ౨౭౬.

క్రోఁతిని బ్రహ్మరాక్షసుని జేయుట:-కొలఁదిదానిని గొప్పగాఁ జేయుట.

ఆ. వీరధర్మమిట్లు విడిచి విభీషణ,రాజునెదుట దాశరథులఁ బొగడఁ, బాడి యగునె క్రోఁతి బ్రహ్మరాక్షసుఁ జేయ, వచ్చినాఁడ వెంతవారు వారు. భా. రా. యు. ౧౧౯.

క్రోడ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఱొమ్ము. ౨. ఒడి. ౩. గుఱ్ఱపుఱొమ్ము.

క్రోడపాదము. సం. వి. అ. పుం. తాఁబేలు.

క్రోడము. సం. వి. అ. పుం. ౧. పంది. ౨. కోటరము, చెట్టుతొఱ్ఱ. ( వాచ ) న. ౧. ఱొమ్ము. ౨. ఒడి. ౩. గుఱ్ఱపుఱొమ్ము. ౪. లోపలిభాగము.
మ...నాభిపం, కరుహక్రోడమిళిందబృందము... ఆము. ౧. ౫.

మహాస్రగ్ధర.గళగర్తక్రోడనిర్యత్క్వాకహానినదోద్గాథహాసంబు...మనుచ. ౪. ౯౫.

క్రోడాడు=కోరాడు.

(-ఏనుఁగు, వృషభము మొదలగునవి-కొమ్ములతోఁ బొడుచు)

క. ఏడాకుపొన్నకొమ్మలు, గ్రోడాడెమునడవిగారుకోదములు మోద, క్రీడఁ దనరుచాడ్పునఁ బై,నోడికలయి పువ్వుఁదేనె లురలఁగ నొప్పెఁ. హరి. పూ. ౭.౧౧౭.

వ. నెదయావులవెనుకం దగిలి యొండొంటిం జేరనీక బలియుఱంకెలం బొదివి కాలు ద్రవ్వి క్రోడాడుచు...హరి. పూ. ౫. ౧౪౨.

సీ. గోడలఁ గ్రోడాడి కోవెలల్ నుగ్గాడి ... నీలా. ౩. ౫౫.

(-పంది ముట్టెతో నేల-కల్లగించు)

వ. మహాదేహంబు లగువరాహంబులు చొచ్చి ఘోషంబుల నెల్లచోట్లుం గ్రోడాడం దొడంగె. హరి. పూ. ౬. ౧౦.

క్రోడించే. సం. స. క్రి.(సం. క్రుడ?=నిమజ్జనే) మథించు.

గీ. నవమతిస్ఫూర్తిఁ గ్రోడించినాఁడ వఖిల,కావ్యలక్షణలక్ష్యసాగరము నెరయ,నిన్ను వేర్వేఱ యింక వర్ణింప నేల,ప్రౌఢ వన్నిట సర్వజ్ఞుమాడనుకవి. మై. ౧. ౧౮.

క్రోడీకరణము. సం. వి. అ. న. ఆలింగనము.

శ్లో. ఆలిఙ్గనముపగూహన,మాహుః పరిరంభణం పరిష్వంగం, ఆశ్లేషమంకపాలీం,క్రోడీకరణం చతుల్యార్థమ్.(హలా. ని.)

క్రోడీకరించే. సం. స. క్రి. ౧. ఒకటిగాఁ జేర్చు. (శ. ర.) ౨. గ్రహించు, తెలిసికొను.

వ. ఇట్లు యౌవనప్రాదుర్భావంబై తేజరిల్లి శాస్త్రంబులు క్రోడీకరించి పురాణంబులు హృద్గ

తంబులు గావించి నీతులు విస్తరంబుగాఁ దెలి
పి... సారంగ. ౧. ౫౩.

**క్రోడీకృతి.** సం. వి. ఇ. స్త్రీ=క్రోడీకరణము.

**క్రోడుఁడు.** సం. వి. అ. పుం. శని. (మే. ని.)

**క్రోధకుఁడు.** సం. విశే. (అ. ధికా. అ.) ౧. కోపించువాఁడు. ౨. కోపము గలిగించువాఁడు.

**క్రోధన.** సం. వి. అ. పుం. ఒకానొక సంవత్సరము. ఆ. స్త్రీ. కోపవతి, కోపము గలయాఁడుది.

**క్రోధనము.** సం. వి. అ. న. కోపించుట; కోపము.

**క్రోధనీయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కోపింపఁజేయఁ దగినవాఁడు.

**క్రోధనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కోపము గలవాఁడు.

**క్రోధము.** సం. వి. అ. పుం. ౧. కోపము, కినుక. ౨. (అలం) రౌద్రరసముయొక్క స్థాయిభావము.

**క్రోధమూర్ఛితము.** సం. వి. అ. పుం. చోరమను గంధద్రవ్యము శ.

**క్రోధమూర్ఛితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కోపముచేత ఒడలెఱుంగనివాఁడు.

**క్రోధయిత.** సం. విశే. (ఋ. త్రి. ఋ.) కోపింపఁజేయువాఁడు.

**క్రోధయితవ్యుఁడు.** సం=క్రోధనీయుఁడు.

**క్రోధాళువు.** సం. విశే. (ఉ.) కోపశీలుఁడు, కోపించుస్వభావముగలవాఁడు. (వాచ, విల్యమ్సు)

**క్రోధి.** సం. విశే. (న్. నీ. న్.) కోపము గలవాఁడు. వి. న్. పుం. ౧. ఒకానొకసంవత్సరము. ౨. మహిషము, దున్నపోతు. ౩. కుక్క.

**క్రోధించు.** సం. అ. క్రి. కోపగిల్లు.

సీ. క్రోధించి నూత్నాపరాధంబునకు నైనఁ గావింతు రెప్పుడు జీవహింస. వరాహ. ౯. ౧౨౪.

**క్రోద్ధ.** సం. విశే. (ఋ. ద్వి. ఋ) కోపించువాఁడు.

**క్రోయు.** స. క్రి. (సర్పము, పక్షి, మొ. జిహ్వలు) చాఁచు.

క. నాలుకలు గ్రోయుచు విష,జ్వాలలు నిగుడంగ నుగ్రసర్పద్వయ మా,భీలాకృతి నుండఁగ ...భార. ద్రో. ౨. ౩౭౧.

ద్వి. వాసుకి మెచ్చక వాలునాలుకలు, గ్రోసెడు నన్నట్టిఘోరసర్పంబు. బస. పు. ౬. ౪౨౪౦.

(కృష్ణుఁడు కుంతితో నన్నమాట) గీ. నాలుకలు గ్రోయుసర్జునానలము దలఁచి, యెరగొనం గని సంతృప్తి యెనక మెసఁగు. భార. ఉద్యో. ౪. ౧౨.

**క్రోలించు**=క్రోల్చు[1]. స. క్రి. (√ క్రోలు) క్రోలఁజేయు.

(త్రాగించు.)

సీ. హరులపగ్గము లూడ్చి యంబువుల్ గ్రోలించి సారథి దరిఁ దరుచ్ఛాయ నిలుప. చం. రా. ౪. ౬౭. హరి. పూ. ౫. ౧౯౩.

**క్రోలు.** స. క్రి. ౧. త్రాగు, పానముచేయు.

మ... మే లైనమద్యం బుద, గ్రగతిం గ్రోలి ... రామా. ౭. ౧౪౩.

ఉ. ఎత్తిలి కావుకావు రని యేడ్చి తదీయపయోధరాగ్రముల్,కుత్తుకదాఁకఁ బీల్చికొని క్రోలెఁ గ్రమంబునఁ జన్నుఁబాలతో, నెత్తురు మున్నుగాఁగ గణనీయము లైచనుసప్తధాతువుల్. హరి. పూ. ౫. ౧౫౦.

గీ. మావికడ నిల్చి విరులనెత్తావిఁ గ్రోలు. మను చ. ౩. ౩౧. (ఇట 'ఆఘ్రాణించు' అని భావము.)

చ...తియ్యనినీరు గ్రోలి...హర. ౩. ౩౨.

చ...క్రోలెఁ జెదవిణ మదవిహ్వలితాంతరంగ య్యె. దశా. ౩. ౭౯.

చ. పోలఁదుకకాంతి యింత పాటవోవఁగనీ కెన లారుతారని,శ్చలతఁ గడంగి క్రోలికొనఁ జాలుటఁ గీచకముఖ్యులోచనం,బులు నయనం ప్రధాన మనుపూర్వవచక్షితి దప్పకుండఁగా, సెలమి వహించెఁ దక్కుఁగలయింద్రియవర్గము ధిక్కరించుచున్. భార. విరా. ౨. ౩౫. (ఇట 'అత్యాదరముతోచూచు' అని భావము.)

౨. భక్షించు, తిను.

క. నాలుకలు రెండు నిన్నుం, గ్రోలనె కల్పించె నలువ ఘోరాహికి నన్నా లిగ్రహ మపుడ తెగఁ దినఁ,జాలదు మృదుపవన విరహిజనదురితమునన్. మను చ. ౩. ౫౧.

క. తలిరాకుగుత్తిఁ దమిఁ గో,యిల చంచునఁ జించి క్రోలె నీకీతి వియో,గులగుండియ లవి యింపుడు,ఒలువిడి నని మరునియెదుటఁ బచరించె నన్. పారి. ౩. ౪౯.

౩. మ్రింగు.

(మత్స్యావతారము) సీ. ఉగ్రసత్త్వాహార ముపశమించుటకు నా బడబానలముఁ గ్రోలి పాఱవిడుచు. దశా. ౧. ౭౯.

వి. ౧. పద్మాదినాళము; క్రోవి, గొట్టము.

సీ. క్రోవి యనంగను గ్రోలు నా నాళ మా...ఆం. భా. ౧. ౧౬౫.

ఉ. బెబ్బులి గొంతుక్రోల్ గఱచి ... ఆము. ౩. ౨౦.

క. అమలగతిఁ గరముఁ గ్రోలుగ, నమరిచి మాని తతపోమయాధికశక్తిన్, ధమనక్రియ నొనరించిన, నమితగుణా చెప్పఁ జిట్ట లయ్యెను దానన్. భార. అశ్వ. ౧. ౭౧. (చూ. ౨౨, ౨౩.)

సీ. కనకంపుఁగ్రోళులు గొని ముంచి కాశ్మీరజలము లొండొరులపైఁ జల్లువారు. కు. సం. ౯. ౨౫౦. (క్రోళులు=చిమ్మనగ్రోవులు)

౨. జాడు, క్షీణసస్యము.

సీ... కోవి యనంగను గ్రోలనంగ, జాడనంగను క్షీణసస్యంబు దగును ... ఆం. భా. ౨. ౨౩౭.

జ: క్రోలించు, క్రోలుకసవు, క్రోలుచు.

క్రోలుకసవు. వి. (√ క్రోలు) తృణవిశేషము, నడము ౯. (శ. ర.)

క్రోలుచే¹ (ల్చు)=క్రోలఁచే. స. క్రి. క్రోలఁజేయు.

(త్రాగించు)

ఉ. వీనులతేనె యై కురియు వింతగఁ గావ్యరసంబుఁ గ్రోల్చి యన్నూనవకోటికిం బసుపమానశమానఁగఁ జేసె...నృసిం. పీఠి ౭.(శ.ర.పా.)

క్రోలుచే²(ల్చు). స. క్రి. ౧. పఠించు; అభ్యసించు.

శా. ఆసాయంబుగ నానిశాత్యయముగా నామ్నాయముల్ క్రోల్చుచో, నాసీనప్రచలాయితంబయిన లే దాహా విశిర్కిఁబంపఁగన్. పాండు. ౫. ౧౭౧.

గీ. క్రోల్చె యోగంబు...శివరా. ౨ ౭౨.

౨. (కోకిల మున్నగునవి)పాడు, గానము చేయు.

ఉ. కోయిల పంచమస్వరము క్రోల్చినభంగిని విద్ధకంచిరా,మాయుణ మాటుకాండములు నచ్యుశజాగరవేళఁ బాడు నా,రాయవితంకు రత్నము...క్రీడా. ౧౭౦.

అ. క్రి. (కోకిల,-మొ.) కూయు.

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న,చ్చసనుమనేత్ర...కాశీ. ౫. ౧౬౭.

ఉ. మానక యుబ్బి గబ్బులఁగు మాటికిమాటికిఁ గ్రోల్చెఁ గొమ్మపై ... హర. ౨. ౧౯. (కోల్చె-ముద్రి.)

క్రోవ=కోవ. వి. ౧ నరము.

సీ. అన్నులతలమిన్న యాణిముత్తెపుఁగ్రోవ ... నీలా. ౨. ౨౭.

ఉ... సురాంతకు భాగ్యరత్నపుం గ్రోవ యనం దనర్చిన త్రికూటము నుష్మికి లక్ష్మణాగ్రజా. రామా. ౭. ౧౪౦. (శ. ర. పా)

౨. రోగవిశేషము, దర్పామయము.

సీ... క్రోవ యనఁగ దర్పామయంబు చెలంగు... ఆం. భా. ౨. ౧౨౯.

**క్రోవి¹.** వి. (క. తు. కోవి) ౧. గొట్టము; పద్మాదుల నాళము.

గీ. తియ్యపూఁదేనియల క్రోవి దీనిమోవి. నైష. ౩. ౧౭౦.

మ. రతులన్ సీధుగసంబు క్రోవు లగు వార స్త్రీలకెమ్మోవులన్, మతి నుప్పొంగుచుఁ గ్రోలి... ప్రబోధ. ౨. ౩.

సీ. క్రోవి యనంగను గ్రోలు నా నాళమా ... ఆం. భా. ౧. ౧౬౯.

౨. ఆనుపోసెడిగొట్టము.

సీ. పరిపరి యచ్చులు చరికుండ యూడిత చీడు దబ్బలు దండె నాడె క్రోవి. హంస. ౨. ౧౧.

౩. తుపాకి.

సీ. చేతిక్రోవులు వైచి చీతు చెయ్యులఁ బాకె బగ్గుపాడై తుపాకిమూఁక. రా. వి. ౫. ౧౫.

ద్వి. క్రోవులు జబురుజంగులు పిరంగులును. అ. మ. క. ౩. ౧౭౧ పా. ౧౪ పం.

౪. భూమిలోపల నీళ్లు వచ్చుట కేర్పఱచిన మార్గము. (శ. ర)

చ. కొలఁకుల వాఁగులన్ నదులఁ గ్రోవుల బావుల నిర్ఝరంబులన్, గలయఁగ రోసి రోసి ... భార. అర. ౪. ౩౩౨.

౫. బుడ్డి; బరణి.

సీ. కపురంపుబరణి చిల్కుల దివ్వెకంబంబు నిల్వుటద్దంబు పన్నీటిక్రోవి. నీలా. ౩. ౯౦.

ద్వి. కులికి కస్తురివీణెఁ గోసినకరణిఁ, దలికప్పురపుఁగ్రోవి తెఱచినకరణి. అ. మ. క. ౧౯ పా. ౭ పం.

సీ. తలియులేమావిక్రొత్తజవాదిబలుఁగ్రోవి వలపులదీవి చెంగలువబావి. అచ్చ. రా. బాల. ౧౩౬.

౬. మూస, లోహములు కరఁగెడిపాత్రము.

క. వనరాను లేదు నుప్పరి, పెనమున నీరులును బోలెఁ బెల్లున నుడికెన్, గనకాద్రి క్రోవిలోపలి, కనకంబునుబోలె నీరుగాఁ గరఁగె వడిన్. కు. సం. ౬. ౮౧౨.

ఉ. కాలకళాదుఁ డెంచ యనుకాంచనరేణువు ప్రత్యగాశ నాఁ, గ్రాలెడు క్రోవిఁ గూర్చి కరఁగంగ... కళా. ౮. ౯.

౭. కంఠనాళము.

గీ. కొంద ఱినతనూజామల క్రోవిలోనఁ, బ్రాణములు గల్గఁ దెలియుండి బ్రతికెద మన, నీలగజముఖ్యబల మదె నిగిడి పాదిపె, శాత్రవుని నంచుఁ గొండఱు సంతసిలఁగ. రాఘవ. ౪. ౧౫౫.

౮. రంధ్రము.

సీ. చెదలుఁబ్రువ్వు లతనిఁ బొదుగఁ బుట్టలు వెట్టెఁ బుట్టక్రోవులలోనఁ బుట్టెఁ జెట్లు. వాల్మీకి. ౩. ౧౪౦.

**క్రోవి².** వి. (సం. కురవకః) కురవకము, ఎఱ్ఱగోరంటి.

సీ... కొరవి నాఁ గ్రోవి నాఁ గ్రొమ్మి నాఁగఁ, గురవకనామ మూ... ఆం. భా. ౨. ౯౩.

మానిని. ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల... భార. ఆది. ౪. ౨౦.

మ. విను మింతు ల్దిలకంబుఁ జంపకముఁ గ్రోవి న్సిందువారంబు ... ఊహించి కన్గొన మోమెత్తఁగఁ గౌఁగిలించుకొన మూర్కొ... ననుచున్... పారి. ౪. ౯.

**క్రోశకుఁడు.** సం. విణ (అ. శకా. అ.) ఆక్రోశించువాఁడు.

**క్రోశత్.** సం. శత్రు. ఆక్రోశించుచున్న.

**క్రోశతాళము.** సం. వి. అ. పుం-క్రోసుపఱకు విని పించుధ్వని కలది-ఒకరకముపెద్దభేరి.

**క్రోశధ్వని.** సం. వి ఇ. పుం=క్రోశతాళము.

**క్రోశనము.** సం. విశే. (అ. ఆ. అ.) అఱచునది,కూయునది. (అ. ఈ. అ.) అఱచుటకు సాధన మైనది, కూయుటకు సాధన మైనది. వి. అ. న. కూఁత, అఱపు.

**క్రోశనీయము.** సం=క్రోష్టవ్యము.

**క్రోశము.** సం. వి. అ. పుం. ౧. ఏడ్పు, రోదనము. ౨. ఆహ్వానము, పిలుపు. ౩-కూఁత వినిపించు నంత దూరము-వేయిదండముల పరిమితి; రెండువేలదండముల పరిమితి.

శ్లో. చతుర్హస్తో ధనుర్దండో నాలికా తద్యుగేన చ, క్రోశో ధనుస్సహస్రేణ...(వాచ.)

శ్లో. హస్తైశ్చతుర్భిర్భవతీహ దండః, క్రోశస్సహస్రద్వితయేన తేషాం. (లీలావతి.)

**క్రోశ్యము.** సం=క్రోష్టవ్యము.

**క్రోష్టృ.** సం. విశే. (ఋ. స్త్రీ. ఋ)=క్రోశకుఁడు.

**క్రోష్టవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧.తిట్టఁ దగినది. ౨. పిలువఁ దగినది.

**క్రోష్టుపుచ్ఛిక.** సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్న ŧ.

**క్రోష్టువిన్న.** సం. వి. ఆ. స్త్రీ.నక్కతోఁకపొన్న ŧ.

**క్రోష్టువు.** సం. వి. ఉ. పుం. జంబుకము, నక్క.

**క్రోష్ట్రి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడునక్క. ౨. నల్లనేలగుమ్మడి ŧ. ('తెల్లనేలగుమ్మడి' అని కొందఱు) ౩. లాంగలి, నీరుపిప్పలి ŧ.

**క్రోసు=కోసు.** వి. (సం. క్రోశః) క్రోశము. (౩. అర్థము. చూ.)

గీ. అపుడు వారాణసీక్షేత్ర మైదుక్రోసు, లంత మేర యుపద్రవం బండకుండు. కాశీ. ౨.౫౧.

## క్రౌ

**క్రౌంచదారణుఁడు.** సం. వి. అ. పుం. ౧. గుహుఁడు, కుమారస్వామి. ౨. పరశురాముఁడు. (కుమారస్వామియు పరశురాముఁడును దీనికి తూఁటు పొడిచి రని పురాణకథ.)

**క్రౌంచము.** సం. వి. అ. పుం. ౧. కొంచపిట్ట, ఒకరిక మగుకొంగ. ౨. ఒకానొకపర్వతము, కొంచగుబ్బలి. ౩. ఒకానొకద్వీపము.

**క్రౌంచాదనము.** సం. వి. అ. న- క్రౌంచములచే తినఁబడునది-౧.తామరతూఁడు. ౨.చించోటకమను తృణము. ౩. పిప్పలి ŧ. (మే. ని.)

**క్రౌంచాదని.** సం. వి. ఈ. స్త్రీ. పద్మబీజము, తామరపూవులోనిగింజ. (రా. ని.)

**క్రౌర్యము.** సం. వి. అ. న. క్రూరభావము, క్రూరత్వము.

**క్రౌశశతికుఁడు.** సం. వి. అ. పుం. ౧. నూఱుక్రోసులు నడచువాఁడు. ౨. నూఱుక్రోసులదూరమునుండి వచ్చి కలసికొనఁ దగినవాఁడు. (ఉపాధ్యాయుఁడు, మొ.)

## క్ల

**క్లమకము.** సం. విశే. (అ. మికా. అ.) ౧. బడలునది. ౨. బడలించునది.

**క్లమథము.** సం=క్లమము.

**క్లమము.** సం. వి. అ. పుం. బడలిక, శ్రమము.

**క్లమి.** సం. విశే. (న్. నీ. న్.) బడలినది.

**క్లమిత.** సం. విశే. (ఋ. త్రీ. ఋ) బడలువాఁడు.

## క్లా

**క్లాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. బడలినది. ౨. వాడినది, పడలినది. శాకుం. ౩. ౨౮.

క్లాంతి. సం. వి. ఇ. స్త్రీ. క్లమము, బడలిక.

క్లామ్యత్. సం. శత్రు. బడలుచున్న.

## క్లి

క్లిందత్. సం. శత్రు. ఏడ్చుచున్న.

క్లిందమానుఁడు. సం. విశ. (అ. ఆ. అ) ఏడ్చుచున్నవాఁడు.

క్లిందయత్. సం. శత్రు. ఏడ్పించుచున్న.

క్లిందయమానుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ఏడ్పించుచున్నవాఁడు.

క్లిద్యత్. సం. శత్రు. తడియుచున్న.

క్లిన్నము. సం. విశ. (అ. ఆ. అ.) ఆర్ద్రము, తడిసినది.

క్లిన్నవర్త్మము. సం. వి. న్. న. నీరుగ్రమ్ముట దురదపెట్టుట మొదలగుగుణములు గలకంటిరోగము.

క్లిశితము. సం. = క్లిష్టము. విశ.

క్లిశ్యత్. సం. శత్రు. క్లేశపడుచున్న.

క్లిశ్యమానము. సం. విశ. (అ.ఆ.అ.) ౧. క్లేశము నొందుచున్నది. ౨. క్లేశపెట్టఁబడుచున్నది.

క్లిష్టము. సం. విశ. (అ.ఆ. అ.) ౧. క్లేశము చెందినది, నొప్పి నొందినది; దారిద్ర్యాదులచేత బాధనొందినది. ౨. క్షీణించునది, మంద మైనది.

శ్లో. హిమక్లిష్టప్రకాశాని జ్యోతీంషీవ ముఖాని వః. సం. కు. సం. ౨. ౧౯.

౩. చెదరినది.

శ్లో. అర్ధపీతస్తనం మాతురామర్దక్లిష్టకేసరం, ప్రక్రీడితుం సింహశిశుం బలాత్కారేణ కర్షతి. శాకుం. ౭. ౧౪.

౪. వాడినది, చెడినది.

శ్లో. ఇదముపనతమేవంరూపమక్లిష్టకాంతి. శాకుం. ౫. ౧౯.

౫. అత్యల్పము.

శ్లో. స్వప్నో ను మాయా ను మతిభ్రమో ను, క్లిష్టం ను తావత్ఫలమేవ పుణ్యైః. శాకుం. ౬. ౧౦.

వి.అ.న. ౧. పూర్వోత్తరవిరుద్ధ మైనవాక్యము. ఉదా: నాతల్లిగొడ్డురాలు.

౨. దూర మైనయర్థము కలవాక్యము.

క. దూరార్థము క్లిష్టం బగు, ధారణిఁ బవనాశనేంద్రధరమకుటాలం, కారమణి జనకవరపుత్రీరమణకుమారరూపదీపితుఁ డనఁగన్. నరస. ౭. ౧౭.

క్లిష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నొప్పి, బాధ, వేదన. ౨. కొలువు, సేవ.

## క్లీ

క్లీతకము. సం. వి. అ. న. అతిమధురము ?. (కల్ప)

క్లీతకిక. సం. వి. అ. స్త్రీ. నీలిచెట్టు.

క్లీబము. సం. వి. అ. న. నపుంసకలింగము.

క్లీబుఁడు. సం. విశ. ( అ. ఆ. అ. ) ౧. పుంస్త్వము లేనివాఁడు, మగతనము లేనివాఁడు. ౨. విక్రమము లేనివాఁడు, పౌరుషము లేనివాఁడు; పిఱికి. వి. అ. పుం. నపుంసకుఁడు.

## క్లే

క్లేదకము. సం. విశ. (అ. దికా. అ.) తడుపునది. వి.అ. పుం. కఫము.

క్లేదనము. సం. విశ. (అ.ఆ.అ.) తడుపునది. (అ. ఈ. అ.) తడుపుటకు సాధన మైనది. వి. అ. పుం. కఫము. న. తడుపుట.

క్లేదనీయము. సం. = క్లేదితవ్యము.

క్లేదము. సం. వి. అ. పుం. ౧. ఆర్ద్రత, తడి. ౨. ఉపద్రవము, నొగులు. ౩. పుంటినుండి కాఱురసి.

క్లేదయత్. సం. శత్రు. తడుపుచున్న.

క్లేదయమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ) తడుపుచున్నవాఁడు.

క్లేదిత. సం. విణ. (బు. త్రీ. బు)=క్లేదకము. విణ.

క్లేదితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) తడుపఁదగినది.

క్లేదువు. సం. వి. ఉ. పుం. ౧. చంద్రుఁడు. ౨. క్షేత్రము. ౩. శరీరము. ౪. భంగము. (శే. ని.)

క్లేద్యము. సం=క్లేదితవ్యము.

క్లేశకుఁడు. సం. విణ. (అ. శికా. అ.) బాధపెట్టువాఁడు.

క్లేశనీయము. సం=క్లేశితవ్యము.

క్లేశము. సం. వి. అ. పుం. ౧. దుఃఖము. (కల్ప) ౨. కోపము. ౩. వ్యవసాయము, ప్రయత్నము. ౪. సేవ. ౫. (యోగ) పంచక్లేశములలో నొకటి. (౧. అవిద్య. ౨. అస్మిత. ౩. రాగము. ౪. ద్వేషము. ౫. మరణభయము-ఇవి పంచక్లేశములు. కల్ప)

క్లేశిత. సం. విణ. (బు. త్రీ. బు)=క్లేశకుఁడు.

క్లేశితము. సం. విణ. (అ. ఆ. అ.) నొప్పింపఁబడినది, బాధితము, పీడితము.

క్లేశితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) క్లేశపెట్టఁదగినది.

క్లేశ్యము. సం=క్లేశితవ్యము.

## క్లై

క్లైతికికము. సం. వి. అ. న. మద్యము.

క్లైబ్యము. సం. వి. అ. న. ౧. నపుంసకత్వము, పేడితనము. ౨. విక్రమములేమి, పిఱికితనము.

## క్లో

క్లోమము. సం. వి. అ, న్. న. నీరుతిత్తి. (చూ. ౮౦. భా. ౨. ౧౩౨.)

## క్వ

క్వంగువు. సం. వి. ఉ. పుం. కంగువు, కొఱ్ఱలు.

క్వణత్. సం. శత్రు. ధ్వనిసేయుచున్న.

క్వణనము. సం. వి. అ. న=క్వాణము.

క్వణము. సం. వి. అ. పుం=క్వాణము.

క్వణిత. సం. విణ. (బు. త్రీ. బు.) ధ్వనిచేయునది.

క్వణితము. సం. వి. అ. న=క్వాణము.

క్వథత్. సం. శత్రు. కాఁచుచున్న.

క్వథనము. సం. వి. అ. న. (నీరు, మొ.) కాఁచుట.

క్వథనీయము. సం=క్వథితవ్యము.

క్వథిత. సం. విణ. (బు. త్రీ. బు) క్వాథకుఁడు.

క్వథితము. సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా కాఁచఁబడినది.

క్వథితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) కాఁచఁదగినది.

క్వథ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) కాఁచఁబడుచున్నది.

## క్వా

క్వాచిత్కము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. క్వాచిద్భవము, అక్కడక్కడ సంభవించునది. ౨. కాదాచిత్కము, అప్పుడప్పుడు కలుగునది.

క్వాణకము. సం. విణ. (అ. ణికా. అ.) ౧. మ్రోఁగునది. ౨. మ్రోఁగించునది.

క్వాణనీయము. సం=క్వాణితవ్యము.

**క్వాణము.** సం. వి. అ. పుం. వీణాభూషణఘంటాదులమ్రోఁత; మ్రోఁత.

**క్వాణయత్.** సం. శత్రు. మ్రోఁగించుచున్న.

**క్వాణయమానము.** సం. విణ. (అ. ఆ. అ.) మ్రోఁగించుచున్నది.

**క్వాణయితృ.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) మ్రోఁగించువాఁడు.

**క్వాణితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) మ్రోఁగింపఁ దగినది.

**క్వాణ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) మ్రోఁగింపఁబడుచున్నది.

**క్వాణ్యము.** సం=క్వాణితవ్యము.

**క్వాథకుఁడు.** సం. విణ. (అ. థికా. అ.) కాఁచువాఁడు.

**క్వాథము.** సం. వి. అ. పుం. ౧. (వైద్య) కషాయము. ౨. బాధ.

**క్వాథోద్భవము.** సం. వి. అ. న. దార్విక, అంజనవిశేషము.

**క్వాథ్యము.** సం=క్వథితవ్యము.

## క్ష

**క్షంతృ.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) క్షమిత, ఓర్పరి, సహిష్ణుఁడు.

**క్షంతవ్యము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఓర్వఁ దగినది. ౨. మన్నింపఁ దగినది.

**క్షణద.** సం. వి. ఆ. స్త్రీ. ౧-ప్రజలకు తీఱిక నిచ్చునది; యువజనులకు ఉత్సవము నిచ్చునది - రాత్రి. ౨. పసుపు.

**క్షణదము.** సం. వి. అ. న. నీరు. (వాచ)

**క్షణదుఁడు.** సం. వి. అ. పుం. మౌహూర్తికుఁడు, జోస్యుఁడు. (మే. ని.)

**క్షణద్యుతి.** సం. వి. ఇ. స్త్రీ. మెఱుపు.

**క్షణనము.** సం. వి. అ. న. ౧. వధము, కొల. ౨. గాయపఱుచుట.

**క్షణనిశ్శ్వాసము.** సం. వి. అ. పుం. సముద్రములోని ఒకవిధమైన పెద్దచేఁప.

**క్షణప్రకాశ.** సం=క్షణప్రభ.

**క్షణప్రభ.** సం. వి. ఆ. స్త్రీ. తటిత్తు, మెఱుపు.

**క్షణభంగురము.** సం. విణ. (అ. ఆ. అ.) క్షణమాత్రములో నశించునది.

**క్షణము.** సం. వి. అ. పుం. ౧. అత్యల్పకాలము. ౨. ముహూర్తము. ౩. గడియలో ఆఱవపాలు. ౪. నిర్వ్యాపారత్వము, తీఱిక, తీఱుబడి. ౫. తఱి, అవసరము. ౬. ఉత్సవము. ౭. అస్వతంత్రత, పరాధీనత. (కే. ని.) ౮. పున్నమ మొదలగుపర్వము. (మే. ని.)

**క్షణరామి.** సం. వి. న్. పుం. పావురము. (కల్ప)

**క్షణవిధ్వంసి.** సం. విణ. (న్. నీ న్) క్షణములో నశించునది. వి. న్. పుం. సృష్టియందేదియును ఎప్పుడును ఏకరూపముగా నుండదనియు జగత్తు ప్రతిక్షణము నశించి పుట్టుచుండు ననియు చెప్పెడి యొక తెగనాస్తికుఁడు.

**క్షణి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. అవకాశము కలది, తెఱపి కలది. ౨. క్షణికము, క్షణమాత్ర ముండునది. ౩. ఉత్సవము కలది.

**క్షణించు.** సం. స. క్రి=క్షణియించు. (శ. ర.)

**క్షణిక.** సం. వి. ఆ. స్త్రీ. మెఱుపు.

**క్షణికము.** సం. విణ. (అ. ఆ. అ.) నశ్వరము, క్షణకాల ముండునది.

**క్షణితువు.** సం. వి. ఉ. పుం. వ్రణము; గంటి. (వై. ని.)

**క్షణిని.** సం. వి. ఈ. (స్త్రీ)=క్షణద. (వాచ.)

ణియించే. సం. స. క్రి. (భోజనమునకు రమ్మని) ప్రార్థించు.

వ. అయ్యా నీ వతిథివి మాయింటం గృతభోజనుఁడ వై పొమ్మని క్షణియించిన. భార.ఆది.౧.౯౯.

తజము. సం.వి. అ.న-గాయమునుండి పుట్టినది-౧. నెత్తురు, రక్తము. ౨. చీము, పూయము. (కల్ప.)

తము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. గాయపడినది. ౨. చింపఁబడినది; చీల్పఁబడినది. ౩. క్షీణించినది, నాశము నొందినది. ౪. బాధింపఁబడినది. ౫. కొట్టఁబడినది. వి. అ. న. ౧. గాయము, గంటి. ౨. అపాయము, ఆపద. ౩. విదారణము, చీల్చుట. ౪. దెబ్బ. ౫. బాధ, నొగులు. ౬. (జ్యోతి) లగ్నమునకు ఆఱవరాశి.

తయోని. సం. వి. ఇ. స్త్రీ. కన్యాత్వము చెడిన స్త్రీ.

తహారము. సం. వి. అ. న-గాయములను మాన్పునది-అగలు, అగరువు ?.

తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. గాయము, గంటి. ౨. ఛేదించుట, ౩. నష్టి, నాశము. ౪. క్షీణత్వము, తగ్గుట.

క్షతోదరము. సం. వి. అ. న. గ్రహణీరోగము.

క్షత్త. సం. వి. ఋ. పుం. ౧. ద్వారపాలకుఁడు. ౨. సారథి. ౩. శూద్రస్త్రీయందు క్షత్త్రియునకుఁ బుట్టినవాఁడు. (పారశైనుకుఁడు, క్షత్త్రియస్త్రీయందు శూద్రునకుఁ బుట్టినవాఁడు అని కొందఱు. ఆయోగవుఁడు, వైశ్యస్త్రీయందు శూద్రునకు పుట్టినవాఁడు అని కొందఱు. పారశవుఁడు, శూద్రస్త్రీయందు బ్రాహ్మణునకు పుట్టినవాఁడు అని కొందఱు) ౪. దాసీపుత్త్రుఁడు. (విదురుఁడు, మొ.) ౫. బ్రహ్మ. ౬. చేఁప. ౭. దూత, రాయబారి. ౮. ముసలము, రోఁకలి. ౯. రుద్రుఁడు, శివుఁడు. విశ. (ఋ. త్రీ. ఋ) ౧. మృతుఁడు. ౨. అవినీతుఁడు. (శే. ని.)

క్షత్తు. సం. వి. త్. స్త్రీ. ౧. చంపుట, ౨. చించుట; చీల్చుట. ౩. నొప్పించుట, బాధించుట. ౪. గాయము.

క్షత్త్రబంధువు. సం. వి. ఉ. పుం. నీచక్షత్త్రియుఁడు; క్షత్త్రియుఁడు. మను. ౨. ౩౮, ౧౨౪.

క్షత్త్రము. సం. వి. అ. న. ౧. క్షత్త్రియవర్ణము, రాచకులము. ౨. ధనము. ౩. నీరు. ౪. మేను, శరీరము. (కల్ప)

క్షత్త్రి. సం. వి. న్. పుం. రాచకొలమువాఁడు, రాచవాఁడు (విల్యమ్సు). ఈ. స్త్రీ. క్షత్త్రియస్త్రీ, రాచది.

క్షత్త్రియ. సం. వి. ఆ. స్త్రీ. క్షత్త్రియజాతిస్త్రీ, రాచది.

క్షత్త్రియ(యి)క. సం. వి. ఆ. స్త్రీ=క్షత్త్రియ.

క్షత్త్రియాణి. సం. వి. ఈ. స్త్రీ. క్షత్త్రియస్త్రీ, రాచది.

క్షత్త్రియి. సం. వి. ఈ. స్త్రీ. క్షత్త్రియుని అసవర్ణభార్య.

క్షత్త్రియుఁడు. సం. వి. అ. పుం. క్షత్త్రియజాతియందుఁ బుట్టినవాఁడు, రాచవాఁడు.

క్షత్త్రుఁడు. సం. వి. అ. పుం. క్షత్త్రియుఁడు, రాచవాఁడు. (శే. ని.)

క్షప. సం. వి. ఆ. స్త్రీ. ౧-వ్యాపారముల నాఁపివేయునది-రాత్రి, రేయి. ౨. పసుపు.

క్షపణకుఁడు. సం. వి. అ. పుం. బౌద్ధసన్న్యాసి. ౨. విక్రమాదిత్యుని యాస్థానమున నుండెడినవరత్నములలో నొకఁడు.

శ్లో. ధన్వంతరిక్షపణకామరసింహశంకు, వేతాళభట్టఘటకర్పరకాళిదాసాః, ఖ్యాతో వరాహమిహిరో నృపతేస్సభాయాం, రత్నాని వై వరరుచిర్నవ విక్రమస్య. (కల్ప)

**క్షపణము.** సం. వి. అ. న. ఉపవాసము. మను. ౪. ౨౨౨.

**క్షపణుఁడు.** సం. వి.అ.పుం. బౌద్ధసన్న్యాసి.(కల్ప) విశే. (అ. ఆ. అ) నిర్లజ్జుఁడు. (త్రి. ని)

**క్షపణ్యువు.** సం. వి. ఉ. పుం. తప్పిదము, దోషము.

**క్షపము.** సం. వి. అ. పుం. నీరు. (వాచ.)

**క్షపాకరము.** సం. వి. అ. పుం. కర్పూరము.

**క్షపాకరుఁడు.** సం. వి. అ. పుం-రాత్రిని చేయు వాఁడు-చంద్రుఁడు.

**క్షపాటుఁడు.** సం. విశే. (అ.ఆ.అ) రాత్రి సంచరించువాఁడు. వి. అ. పుం. రాక్షసుఁడు.

**క్షపానాథుఁడు,** సం. వి. అ. పుం. రేఱేఁడు, చంద్రుఁడు.

**క్షమ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఓర్పు. ౨. మన్నింపు. ౩. నేల, భూమి.

**క్షమకుఁడు,** సం. విశే. (అ. మికా. అ.) క్షమించు వాఁడు.

**క్షమణీయము.** సం=క్షంతవ్యము.

**క్షమమాణుఁడు,** సం. విశే. (అ. ఆ. అ.) క్షమించుచున్నవాఁడు.

**క్షమాపణ.** సం. వి. ఆ. స్త్రీ=క్షమాపణము.

**క్షమాపణము.** సం. వి. అ. న. క్షమింప వేఁడుకొనుట.

శ్లో. క్షమాప యైకపదయోః పదయోః పతతి ప్రియే, శేముస్సరోజయానాయ నారుణకాంతయః. ర. స. ౧౦౫. పా.

శ్లో. బ్రహ్మంస్త్వం గచ్ఛ భద్రం తే నాభాగతనయం నృపం, క్షమాపయ మహాభాగ తతశ్శాంతిర్భవిష్యతి. సం. భాగ. ౯. ౪. ౬౪.

**క్షమి,** సం. విశే. (న్. ఈ. న్.) ౧. సహిష్ణువు, ఓర్పరి. ౨. మన్నించువాఁడు. ౩. శక్తుఁడు, చాలిన వాఁడు.

**క్షమించే.** సం. స. క్రి=క్షమియించే.

(మన్నించు)

గీ. అన్న నీమాట జవదాఁటి యాడితి మని, యలుక సేయక ప్రతివాదములు క్షమించి, యనుమతి యొసంగు మిపుడె మదాంధు లగుసు, ధాంధుల జయించి వచ్చెద మనుచుఁ బలికె. ఉ. రా. ౨. ౨౫.

**క్షమిత.** సం=క్షంత.

**క్షమితము.** సం. విశే. (అ. ఆ. అ.) క్షమింపఁబడినది.

**క్షమితవ్యము.** సం=క్షంతవ్యము.

**క్షమియించే.** సం. స. క్రి. ౧. సహించు, ఓర్చు.

క. క్షమియించువారిఁ గని చాలమి పెట్టుదు రైనను దలంప ననూన, క్షమయ కడు మెఱయు తోడ వృత్తమరూపము గోరువారు దాల్తురు దానిన్. భార. ఉద్యో. ౨. ౪౦.

౨. మన్నించు.

క. ఎఱుకని యొఱుఁగక నిన్నున్, మఱపున నెదిరితిని దీని మఱవుము నన్నుం, గఱకంఠా క్షమియింపుము, నెఱి నెవ్వరి కెఱుఁగ నగునె నీచరితంబుల్. భార. ఆర. ౧. ౩౨౬.

౩. శమింపఁజేయు, అడఁచు.

క. అలయక నిమిత్తజం బగు, నలుకను క్షమియించి శాంతుఁ డగుపురుషుం డిమ్ముల రక్షింపఁగ నోపునె, పొలుపుగ ధర్మార్థకామములు సముసులుగాన్. భార. ఆది. ౬. ౧౪౩.

**క్షముఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సహించువాఁడు, ఓర్పరి. ౨. శక్తుఁడు, సమర్థుఁడు, చాలినవాఁడు. (ఉదా: కార్యక్షముఁడు, నిర్మూలనక్షముఁడు) ౩. అర్హుఁడు, తగినవాఁడు. (ఉదా: స్పర్శక్షముఁడు, నిందాక్షముఁడు, స్తుతిక్షముఁడు, మొ.) ౪. హితుఁడు.

క్షమ్యమాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) క్షమింపఁబడుచున్నవాఁడు.

క్షయ. సం. వి. అ. పుం. ప్రభవాదిసంవత్సరముల లో కడపటిది. (వాచ)

క్షయకాసము. సం. వి. అ. పుం. క్షయరోగపు దగ్గు.

క్షయణము. సం. విణ. (అ. ఆ. అ.) క్షీణింపఁజేయునది. (అ.ఈ.అ.) క్షయింపఁజేయ సాధన మైనది. వి. అ. న. వాసస్థానము, ఉనికిపట్టు.

క్షయత్. సం. శత్రు. క్షయించుచున్న.

క్షయము. సం.వి. అ. పుం.౧.అపచయము, తగ్గుదల. ౨. ప్రళయము. 3.క్షయరోగము, అఱుఁడెవులు. ౪. ఇల్లు. ౫.హింస. ౬. గమనము. ౭. నివసించుట, ఉండుట. (కే. ని.)

క్షయి. సం. విణ. (న్. ణీ. న్.) ౧. నశించునది; తగ్గునది. ౨. క్షయరోగము గలది. వి. న్. పుం. చంద్రుఁడు.

క్షయించే. సం. అ. క్రి. క్షీణించు.

వ. అతనితపంబు భిన్నభాండగతం బైనక్షీరంబు చందంబున క్షయించు. భాగ. ౪. ౪౩౨.

క్షయిష్ణువు. సం. విణ. (ఉ) ౧. నశించునది. ౨. తఱుఁగునది.

క్షయ్యము. సం. విణ. (అ. ఆ. అ.) క్షయింపఁజేయ శక్య మైనది, నశింపఁజేయ శక్య మైనది.

క్షరణము. సం. వి. అ. న. ౧. స్రవించుట, కాఱుట. ౨. స్వేదనము, చెమర్చుట. 3. నశించుట.

క్షరత్. సం. శత్రు. ౧. స్రవించుచున్న. ౨. నశించుచున్న.

క్షరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. స్రవించునది, కాఱునది. ౨.నశించునది. వి. అ. పుం. మేఘము, మబ్బు. న. నీరు.

క్షరి. సం. విణ. (న్. ణీ. న్.) క్షరణము గలది. (శల్ప) వి. న్. పుం. వానకాఱు, వర్షాకాలము.

క్షరించే. సం=క్షరియించే.

క్షరిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ)=క్షారకము.

క్షరితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. స్రవించినది, కాఱినది. ౨. నశించినది. వి. అ. న. ౧. కాఱుట. ౨. నశించుట.

క్షరియించే. సం. అ. క్రి. ౧. నశించు. ౨. స్రవించు, కాఱు. 3. పుట్టు.

క. క్షర మండ్రు దానివలనను, క్షరియించినతత్త్వములను...భార. శాం. ౬. ౬.

క్షవకము. సం. వి. అ. పుం. ౧. రాజిక, నల్లావాలు. ౨. అపామార్గము, ఉత్తరేను.

క్షవథువు. సం. వి. ఉ. పుం. ౧. తుమ్ము. ౨. దగ్గు.

క్షవము. సం. వి. అ. పుం. ౧ తుమ్ము. ౨. దగ్గు. 3.నల్లావాలు.

క్షవిక. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతివాఁకుడు.

## క్షా

క్షాంతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. సహిష్ణువు, సహనస్వభావము కలది. ౨.మన్నింపఁబడినది; సైఁపఁబడినది.

క్షాంతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఓర్పు,క్షమ. ౨.మన్నించుట. 3. భూమి, నేల. (నై. ని.)

క్షాంతువు. సం. విణ. (ఉ) ఓర్పు గలవాఁడు, సైఁచువాఁడు. వి. ఉ. పుం. తండ్రి.

క్షాత్త్రము. సం. విణ. (అ. ఈ. అ.) క్షత్త్రియునకు సంబంధించినది. వి. అ. న. ౧. క్షత్త్రియసమూహము. ౨. క్షత్త్రియధర్మము.

క్షాత్త్రి. సం. వి. ఇ. పుం. క్షత్త్రియునకు ఇతరవర్ణస్త్రీయందుఁ బుట్టినవాఁడు.

క్షామము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కృశము, సన్నగిల్లినది, చిక్కినది. ౨. అల్పము,చిన్నది, అస

ము. వి. అ. న. ౧. కఱవు. ౨. నాశము.

క్షామ్యత్. సం. శత్రు. క్షమించుచున్న.

క్షామ్యము. సం=క్షంతవ్యము.

క్షాయకము. సం. విశే. (అ. యికా. అ.) క్షయించునది.

క్షాయమాణము. సం. విశే. (అ. ఆ. అ) క్షయింపఁజేయఁచున్నది.

క్షాయయత్. సం. శత్రు. క్షయింపఁజేయుచున్న.

క్షాయ్యమాణము. సం. విశే. (అ.ఆ.అ) క్షయింపఁజేయఁబడుచున్నది.

క్షారకము. సం. విశే. (అ. రికా. అ) ౧. స్రవించునది. ౨. నశించునది. వి. అ. పుం. ౧.పసరుమొగ్గ. ౨. (పక్షులు మత్స్యములు మున్నగువానినివేసెడి) బుట్ట.

క్షారకుఁడు. సం వి. అ. పుం-క్షారకము (=బట్టలకు పెట్టుకారము) ఉపయోగించువాఁడు-చాఁకలవాఁడు. (వాచ.)

క్షారణము. సం. విశే. (అ. ఆ. అ) ౧. స్రవింపఁజేయునది. ౨. నశింపఁజేయునది. వి. అ. న. ౧. మద్యాదులుబట్టిఁబట్టితీయుట. ౨. స్రవింపఁజేయుట. ౩. నశింపఁజేయుట.౪.గర్హణము,నింద.(వై. ని.)

క్షారము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. స్రవించునది, కాఱునది. (వాచ.) ౨. తిక్తలవణరసమిశ్రణముచేతఁ గలిగినరసము గలది. వి. అ. పుం. ౧. క్షరణము, కాఱుట. ౨. బూడిద. ౩. బెల్లము, గుడము. ౪. గాజు, ఒకవిధమగుమన్ను. ౫. సర్జికాక్షారము, సజ్జాకారము. ౬. యవక్షారము. ౭. తిక్తలవణరసమిశ్రణముచేతఁ గలిగినరసము. (శ. ని.) ౮. ఉప్పు. (మే. ని.) ౯. కారము, కటువు. (త్రిరాత్రముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణవర్జనం చ-ఆపస్తంబసూత్రము.) ౧౦. టంకణము,వెలిగారము.౧౧. బిడలవణము. (వాచ)

క్షారయత్. సం. శత్రు. ౧. స్రవింపఁజేయుచున్న. ౨. నశింపఁజేయుచున్న.

క్షారాచ్ఛము. సం. వి. అ. న. సాముద్రలవణము, సముద్రపుటుప్పు.

క్షారిక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁకలి.

క్షారితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఉప్పునుండియావిరిమూపమునఁ దీయఁబడినది. ౨. స్రవింపఁజేయఁబడినది. ౩. నశింపఁజేయఁబడినది. ౪. అపవాదగ్రస్తము, మోపఁబడిననింద కలది.

క్షారోదము. సం. వి. అ. పుం. ఉప్పుసముద్రము.

క్షార్యమాణము. సం. విశే. (అ. ఆ. అ) ౧. స్రవింపఁజేయఁబడుచున్నది. ౨. నశింపఁజేయఁబడుచున్నది.

క్షాళకుఁడు. సం. విశే. (అ.ళికా. అ) కడుగువాఁడు; శుద్ధి చేయువాఁడు.

క్షాళన. సం. వి. ఆ. స్త్రీ. కడుగుట; శుద్ధిచేయుట.

క్షాళనము. సం. విశే. (అ. ఆ. అ.) కడుగునది. (అ. ఈ. అ.) శుద్ధి చేయుటకు సాధనమైనది. వి. అ. న. కడుగుట. పుం. యూపవిశేషము. (వై. ని.)

క్షాళనీయము. సం=క్షాళయితవ్యము.

క్షాళము. సం. విశే. (అ. ఆ. అ.) కడుగునది; శుద్ధి చేయునది.

క్షాళయత్. సం. శత్రు. కడుగుచున్న; శుద్ధిచేయుచున్న.

క్షాళయమానము. సం. విశే. (అ. ఆ. అ.) కడుగుచున్నది; శుద్ధిచేయుచున్నది.

క్షాళయిత. సం. విశే. (బు. త్రీ. బు)=క్షాళకుఁడు.

క్షాళయితవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) కడుగఁ దగినది; శుద్ధిచేయఁ దగినది.

క్షాళితము. సం. విశే. (అ. ఆ. అ.) కడుగఁబడినది; శుద్ధిచేయఁబడినది.

**క్షాళ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) కడుగఁబడుచున్నది; శుద్ధిచేయఁబడుచున్నది.

**క్షాళ్యము.** సం=క్షాళయితవ్యము.

## క్షి

**క్షితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. క్షయము నొందినది, నశించినది. ౨. హింసింపఁబడినది. వి. అ. న. ౧. నాశము. ౨. హింస.

**క్షితి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. భూమి, నేల. ౨. ఉనికిపట్టు, ఇల్లు. ౩. నాశము. ౪. ప్రళయము. ౫. క్షయము, తగ్గుదల.

**క్షితిధరము.** సం. వి. అ. పుం. పర్వతము, నేలతాలుపు.

**క్షితిపతి.** సం. వి. ఇ. పుం. రాజు, నేలఱేఁడు.

**క్షితివ్యుదాసము.** సం. వి. అ. పుం. సారంగము, నేలమాలె.

**క్షిద్రము.** సం. వి. అ. పుం. ౧. తెవులు. ౨. పశ్వాదులకొమ్ము (వాచ)

**క్షిద్రుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు. (వాచ)

**క్షిప.** సం. వి. ఆ. స్త్రీ. క్షేపణము, చిమ్ముట, విసరివైచుట.

**క్షిపకుఁడు.** సం. విణ. (అ. పకా. అ.) ౧. చిమ్మువాఁడు, విసరువాఁడు. ౨. నిరాకరించువాఁడు. వి. అ. పుం. విలుకాఁడు.

**క్షిపణువు.** సం. వి. ఉ. పుం. గాడ్పు.

**క్షిపణ్యువు.** సం. విణ. (ఉ) ౧. మంచిపరిళము గలది. ౨. వ్యాపించునది, నెఱయునది. వి. ఉ. పుం. ౧. శరీరము, మేను. ౨. వసంతర్తువు ౩. మంచి పరిమళము.

**క్షిపత్.** సం=క్షిప్యత్.

**క్షిప్తము.** సం. విణ. (అ ఆ. అ.) ౧. త్రోయఁబడినది; విసరివైవఁబడినది. ౨. విడువఁబడినది. ౩. అలక్ష్యముసేయఁబడినది, తిరస్కరింపఁబడినది. ౪. ఉంపఁబడినది. ౫. కలఁగినది, వ్యాకులము. (మనస్సు)

**క్షిప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. త్రోయుట; విసరివైచుట. ౨. నిరాకరించుట. ౩. (గూఢార్థములు) బయలుపఱుచుట.

**క్షిప్నువు.** సం. విణ. (ఉ) ౧. త్రోయువాఁడు; విసరివైచువాఁడు. ౨. తిరస్కరించువాఁడు, నిరాకరించువాఁడు.

**క్షిప్యత్.** సం. శత్రు. ౧. చిమ్ముచున్న, త్రోసివేయుచున్న. ౨. నిరసించుచున్న. ౩. (కాలమును) కడపుచున్న. ౪. కదల్చుచున్న.

**క్షిప్యమాణము.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. చిమ్మఁబడుచున్నది, త్రోసివేయఁబడుచున్నది. ౨. నిరసింపఁబడుచున్నది. ౩. కడపఁబడుచున్నది. (కాలము) ౪. కదల్పఁబడుచున్నది.

**క్షిప్రము.** సం. విణ. (అ. ఆ. అ.) వేగవంతము, వడిగలది. వి. అ. న. ౧. ముహూర్తమునందు పదునైదవపాలు. ౨. బొటనవ్రేలికిని చూపుడువ్రేలికిని నడిమిభాగము. క్రి. విణ. అ. న. శీఘ్రము.

**క్షిప్రశ్యేనము.** సం. వి. అ. పుం. భారద్వాజపక్షి, ఏట్రింత.

**క్షియ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. క్షయము, తగ్గుదల. ౨. ధర్మవ్యతిక్రమము.

## క్షీ

**క్షీణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తఱిఁగినది. ౨. కృశించినది, సన్నగిలినది. ౩. నశించినది. ౪. అల్పము, కొంచెమైనది.

క్షీణవాసి. సం. వి. న్. పుం-పాడుపడినయిండ్లలో నివసించునది-పావురము.

క్షీణించు. సం.అ. క్రి. ౧. తఱుఁగు. ౨. కృశించు, సన్నగిల్లు. ౩. నశించు.

క్షీబుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) మద్యాములచే మత్తు నొందినవాఁడు, మత్తిల్లినవాఁడు.

క్షీరకంఠుఁడు. సం. విశ. (అ. అ, ఈ. అ.) పాలు కంఠమునఁ గలవాఁడు. వి. అ. పుం. పాలు త్రావు పసిబిడ్డఁడు.

క్షీరగ్రాహి. సం. వి. న్. పుం. ఇంద్రనీలమణిభేదము.

క. పారం బగునీలము గో, క్షీరములం దిడఁగ నది యుఁ గృష్ణము నైనన్, క్షీరగ్రాహి యనంబడు, నారత్నోత్తమము దాల్ప నమరులకమరున్. రత్న. ౬౭.

క్షీరద్రుమము. సం. వి. అ. పుం. ౧. పాలుగలచెట్టు. ౨. అశ్వత్థము, రావిచె.

క్షీరధాత్రి. సం. వి. ఈ. స్త్రీ. పాలిచ్చుదాది.

క్షీరనీరన్యాయము. సం = క్షీరోదకన్యాయము. (చూ. న్యాయము.)

క్షీరనీరము. సం. వి. అ. న. ౧. క్షీరనీరములసముదాయము. ౨. క్షీరనీరములవలె కలియునది-గాఢాలింగనము, బిగికౌఁగిలి.

క్షీరపాణ(న)ము. సం. వి. అ. న. పాలుత్రావుట. (కల్ప)

క్షీరపాణి(ని). సం. వి. ఈ. స్త్రీ. పాలుత్రాగెడిపాత్రము. (కల్ప)

క్షీరపాణుఁడు. సం. వి. అ. పుం. ఉశీనరదేశస్థుఁడు. (ఈదేశస్థులు తఱచు పాలు త్రాగుదురు.)

క్షీరము. సం. వి. అ. పుం. న. ౧. దుగ్ధము, పాలు. ౨. చెట్లు మొదలగువానినుండి కాఱు తెల్లనిద్రవము. ౩. నీరు. (శే. ని.)

క్షీరమోరటా. సం. వి. ఆ. స్త్రీ. చేఁగొనచె.

క్షీరవికృతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కూర్చిక, పాలవిఱుగుడు. ౨. జున్ను.

క్షీరవిదారి. సం. వి. ఈ. స్త్రీ. నల్లనేలగుమ్మడుచె. (కల్ప)

క్షీరవృక్షము. సం. వి. అ. పుం. ౧. పాలుగలచెట్టు. ౨. న్యగ్రోధము, మఱ్ఱిచె. ౩. ఉదుంబరము, అత్తిచె. ౪. అశ్వత్థము, రావిచె. ౫. మధూకము, ఇప్పచె.

క్షీరశరము. సం. వి. అ. పుం. ఆమిక్ష, పాలవిఱుగుడు, కూకు.

క్షీరశుక్ల. సం. వి. ఆ. స్త్రీ = క్షీరవిదారి. (కల్ప)

క్షీరాబ్ధి. సం. వి. ఇ. పుం. పాలసముద్రము.

క్షీరావి. సం. వి. ఈ. స్త్రీ. దుగ్ధిక, చిఱుపాలచె.

క్షీరాశము. సం. విశ. (అ. ఆ. అ.) పాలు త్రాగునది. వి. అ. పుం-పాలును నీరును కలిసి యుండునపుడు పాలు విభజించి త్రాగునది-హంస.

క్షీరాహ్వము. సం. వి. అ. పుం. సరళవృక్షము.

క్షీరి. సం. విశ. (న్. ణీ. న్.) పాలు గలది.

క్షీరిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. పాలచెట్టు. ౨. పాలతో వండినవంటకము, పరమాన్నము.

క్షీరిణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పీతదుగ్ధచె. ౨. వరాహక్రాంతచె. ౩. దుగ్ధికచె. (కల్ప)

క్షీరేయి. సం. వి. ఈ. స్త్రీ. పాలు బియ్యమును చక్కెరయును కలిపి చేసినవంటకము, పరమాన్నము.

క్షీరోదకన్యాయము. సం. వి. అ. పుం. న్యాయములలో నొకటి. (చూ. న్యాయము.)

క్షీరోదము. సం. వి. అ. పుం. పాలసముద్రము.

## క్షు

క్షుందత్. సం. శత్రు. పాడిచేయుచున్న.

క్షుందానము. సం. విశ. (అ.ఆ. అ.) పాడిచేయు చున్నది.

క్షుణ్ణము. సం. విశ. ( అ. ఆ. అ. ) ౧. పాడిసేయఁ బడినది; నలఁగఁగొట్టఁబడినది. ౨. నలఁగినది.(మా ర్గము, మొ.) ౩. అభ్యస్తము, అలవాటుపడినది.

క్షుణ్ణుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) వ్యుత్పన్నుఁడు, (శాస్త్రాదులందు) నిరూఢప్రజ్ఞుఁడు.

క్షుతము. సం. వి. అ. న. తుమ్ము.

క్షుతాభిజననము. సం. వి. అ.పుం. -గాటు చే తు మ్ములు కలిగించునది-నల్లావ ?.

క్షుతి. సం. వి. ఇ. స్త్రీ. తుమ్ము.

క్షుత్తు. సం. వి. ద్. స్త్రీ. పాడిసేయుట. ధ్. స్త్రీ. బు భుక్ష, ఆఁకలి. త్. స్త్రీ. తుమ్ము.

క్షుద్యమానము. సం. విశ. (అ. ఆ. అ.) పాడిచే యఁబడుచున్నది.

క్షుద్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఈఁగ. ౨. తేనెటీఁగ. ౩. అంగహీన యగుఆఁడుది. ౪. వేశ్య. ౫. జగడ మాడుస్త్రీ, గయాళి. ౬. చాంగేరి, పులిచింత ?. ౭. వాఁకుడు ?. ౮. అడవిగోదుమ ?.

క్షుద్రకము. సం. వి. అ. పుం. బాణవిశేషము, కు ప్పెకోల.

శ్లో. అష్టైనం పంచవింశత్యా క్షుద్రకాణాం స మాచినోత్. సం. భార. భీష్మ. (శ. ర.)

శ్లో. సాత్యకిః పంచవింశత్యా క్షుద్రకాణాం స మార్పయత్. సం. భార. ద్రో. (శ. ర.)

క్షుద్రకులిశము. సం. వి. అ. పుం. వైక్రాంతమణి

క్షుద్రఘంటిక. సం. వి.ఆ. స్త్రీ. చిఱుగంట; గజ్జె.

క్షుద్రచందనము. సం. వి. అ. న. రక్తచందనము, ఎఱ్ఱచందనము ?.

క్షుద్రదంశిక. సం.వి. ఆ. స్త్రీ. చిన్న యడవియీఁగ.

క్షుద్రమూలకము. సం. వి.అ.న.చిన్నముల్లంగి?.

క్షుద్రశంఖము. సం. వి. అ. పుం. నత్తగుల్ల.

క్షుద్రిక. సం. వి. ఆ. స్త్రీ. చిన్న జోటీఁగ.

క్షుద్రుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ౧. నీచుఁడు, అధముఁడు. ౨. క్రూరుఁడు, హింసించువాఁడు. ౩. దరిద్రుఁడు, బీదవాఁడు. ౪. కృపణుఁడు, లోభి.

క్షుధ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁకలి.

క్షుధాభిజననము. సం. వి. అ. పుం-ఆఁకలి పుట్టిం చునది-నల్లావ ?.

క్షుధితము. సం. విశ. (అ. ఆ. అ.) ఆఁకలిగొన్నది.

క్షుధునము. సం. వి. అ. పుం. ఒకానొకమ్లేచ్ఛ జాతి.

క్షుధ్యత్. సం. శత్రు. ఆఁకొనుచున్న, ఆఁకలిగొను చున్న.

క్షుపము. సం. వి. అ. పుం. కుఱుచకొమ్మలును ఊడ లును గలచెట్టు.

క్షుబ్ధము. సం. విశ=క్షుభితము. వి. అ. పుం. ౧.క వ్వము. ౨. ఒకానొకరతిబంధము. (కల్ప)

క్షుభము. సం. విశ. (అ. ఆ. అ.) కలఁతపెట్టునది, క్షోభపెట్టునది.

క్షుభితము. సం. విశ. ( అ. ఆ. అ. ) ౧. కలఁగినది, వ్యాకులము. ౨. భయపడినది.

క్షుభ్నత్. సం. శత్రు. క్షోభ మొందుచున్న.

క్షుభ్యత్. సం=క్షుభ్నత్.

క్షుభ్యమాణుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) క్షోభ పెట్టఁబడుచున్నవాఁడు.

క్షుమ. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలిచెట్టు. ౨. అతసి, అగిసె ?. ౩. శణము, జనము ?.

క్షురకము. సం. వి. అ. పుం. ౧. గోలిమిడి ?. ౨.వ ల్లెరు ?. ౩. బొట్టుగు ?.

క్షురకర్మము. సం. వి. న్.న.క్షౌరము, గొఱుగుట.
క్షురధానము. సం. వి. అ. న. మంగలపొది.
క్షురప్రము. సం. వి. అ. పుం. ౧. గుఱ్ఱపులాడము వలె అర్ధచంద్రాకార మగుఅలుఁగు గలబాణము, అర్ధచంద్రబాణము. ౨. కొడవలి, లవిత్రము.
క్షురభాండము. సం=క్షురధానము.
క్షురమర్ది. సం. వి. న్. పుం. నాపితుఁడు, మంగలి.
క్షురము. సం. వి. అ. పుం.౧. మంగలకత్తి. ౨.గొరిజ, డెక్క. ౩. బాణము ౪. గొలిమిడి?. ౫. పల్లేరు?.
క్షురముండి. సం=క్షురమర్ది.
క్షురి. సం. వి. న్. పుం. మంగలి. ఈ. స్త్రీ. ౧. కత్తి, సురియ; చూరకత్తి. ౨. మంగలకత్తి.
క్షురిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. కత్తి; చూరకత్తి. ౨. మంగలకత్తి.
క్షురిణి. సం. వి. ఈ. స్త్రీ. మంగలది.
క్షుల్లకము. సం. విశ. (అ. ఆ అ.) ౧. అల్పము, స్వల్పము. ౨. నీచము. ౩. పామరము, మూఢము. ౪. చిన్నది, కనిష్ఠము. ౫. పేద. వి.అ. పుం. నత్తగుల్ల.

## క్షే

క్షేత. సం. విశ (ఋ. త్రీ. ఋ.)=క్షాయకము.
క్షేత్రకరుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) క్షేత్రాజీవుఁడు, పొలమువలనజీవించువాఁడు.
క్షేత్రకృత్తు. సం. విశ (త్)=క్షేత్రకరుఁడు.
క్షేత్రజుఁడు. సం. వి. అ. పుం.ద్వాదశపుత్రులలో నొకఁడు, భర్తయనుజ్ఞచేత భార్యకు మఱియొకని వలనఁ బుట్టినవాఁడు.
క్షేత్రజ్ఞుఁడు. సం. విశ (అ. ఆ. అ.) నేర్పరి.వి.అ పుం. ౧. జీవుఁడు. ౨. పరమాత్మ. ౩. సేద్యకాఁడు. ౪. వటుకభైరవమూర్తి, ఒకదేవతామూర్తి.
క్షేత్రపాలుఁడు. సం. విశ. (అ. ఆ.అ.)-క్షేత్రమును పాలించువాఁడు-౧. పొలముకాపరి. ౨. పుణ్యక్షేత్రమును కాచువాఁడు. (భైరవుఁడు, మాధవుఁడు, మొ.)
క్షేత్రఫలము. సం. వి. అ. న. (గణిత) క్షేత్రముయొక్క చదరపుకొలత.
క్షేత్రము. సం. వి. అ. న. ౧. వరిమడి. ౨. నేల.౩. స్థానము, ఉనికిపట్టు. ౪. పుణ్యస్థలము, యాత్రాస్థానము. ౫. పెండ్లాము. ౬. యోని, భగము.౭. శరీరము.౮.ఆకాశము.౯. గృహము. ౧౦.(గణిత) త్రికోణము చతుష్కోణము మున్నగురేఖారూపము.౧౧.(జ్యోతి)రాశి. ౧౨. బృందము, సమూహము. ౧౩. నక్షత్రము. (కే. ని.) ౧౪. పట్టనము. (వై.ని)
క్షేత్రాజీవి. సం. విశ.(న్.నీ.న్.)=క్షేత్రాజీవుఁడు.
క్షేత్రాజీవుఁడు. సం. వి. అ. పుం.పొలమువలన బ్రతుకువాఁడు, సేద్యకాఁడు.
క్షేత్రి. సం. విశ. (న్. నీ. న్.) క్షేత్రముకలవాఁడు. వి. న్.పుం.౧. సేద్యకాఁడు.౨. పెనిమిటి. ౩. జీవుఁడు. ౪. పరమాత్మ.
క్షేత్రికుఁడు. సం. విశ. (అ. ఆ. అ) వి. అ. పుం= క్షేత్రి.
క్షేత్రియము. సం. విశ. (అ.ఆ. అ.) ౧. క్షేత్రమునకు సంబంధించినది. ౨.మడియందుఁ బుట్టితీసి వేయఁదగినది. (కలుపు.) ౩-దేహాంతరమున కుదుర్పఁ దగినది-కుదుర్ప రానిది. (రోగము, మొ.)
క్షేత్రియుఁడు. సం. వి. అ. పుం. పరదారరతుఁడు, పరస్త్రీసక్తుఁడు.
క్షేపకము. సం. విశ. (అ. ఇకా. అ.) ౧. త్రోయునది, వైచునది; విసరునది, ఉవ్వునది.౨. కదల్చునది. ౩.దూఱునది. ౪. నిరసించునది. ౫. ప్రక్షిప్తము, నడుమఁ జొప్పింపఁబడినది. (వాక్యము,

గ్రంథభాగము, మొ.) ౬. (గణిత) సంకలనీయ సంఖ్యావిశేషము.

శ్లో. భాజ్యో హారః క్షేపకశ్చాపవర్త్యః కేనా ప్యాదౌ సంభవే కుట్టకార్థమ్. (లీలావతి.)

క్షేపణము. సం. విణ (అ. ఆ. అ.) ౧. చిమ్మునది, త్రోయునది. ౨. కదల్చునది. ౩. నిరసించునది.(అ. ఈ. అ.) క్షేపణసాధన మైనది. వి.అ. న. ౧.త్రోయుట, వైచుట; విసరుట, ఉప్పుట. ౨. (కాలము) కడపుట, జరుపుట. ౩. నిరసించుట. ౪. దూఱుట.

క్షేపణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. తెడ్డు. ౨. చేఁప వల. ౩. ఒడిసెల.

క్షేపణీయము. సం. విణ. (అ. ఆ. అ) ౧. చిమ్మఁదగినది, త్రోయఁదగినది. ౨. కదల్పఁదగినది. ౩.జరుపఁ దగినది.(కాలము.) ౪.నిరసింపఁ దగినది.వి.అ. న. భిండిపాలము, విడిచివాటుగుదియ.

క్షేపము. సం. వి. అ. పుం. ౧. చిమ్ముట,త్రోయుట; ఏయుట. ౨. (కనుబొమ, మొ. వానిని) కదల్చుట, అల్లార్చుట. ౩. ప్రేరించుట. ౪. గర్వము, కావరము. ౫. మీఱుట, ఉల్లంఘించుట. ౬. విలంబము. ౭. దూఱుట. ౮. నిరసనము, అనాదరము. ౯. లేపనము, పూఁత. ౧౦. పూలగుత్తి. (త్రి. ని.)

క్షేపిమము. సం. వి. న్. పుం. మిక్కిలివడి. (రూ. క్షేపిమ.)

క్షేపిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ) క్షిప్రతమము, మిగుల వడి గలది.

క్షేపీయము. సం. విణ. (స్. యసీ. స్.) క్షిప్రతరము, ఒకదానికంటె ఎక్కువవడి గలది.

క్షేప్త. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ౧. త్రోయునది, వైచునది; విసరునది, ఉప్పునది. ౨. కదల్చునది. ౩. దూఱునది. ౪. నిరసించునది.

క్షేప్తవ్యము. సం. విణ= క్షేపణీయము.

క్షేప్యము. సం. విణ= క్షేపణీయము.

క్షేమ. సం. వి. ఆ. స్త్రీ. దుర్గ, పార్వతి.

క్షేమంకరుఁడు. విణ. (అ. ఆ. అ.)= క్షేమకరుఁడు.

క్షేమకరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) క్షేమము చేయువాఁడు.

క్షేమకారి. సం. విణ. (న్. ణీ. న్.) క్షేమము కలిగించువాఁడు. వి. న్. పుం. గరుత్మంతుఁడు.(ప్రా) ఆ. క్షేమకారి దీర్చెఁ జెలరేఁగి యనుకూల, మారుతంబు వీచె...అని. ౪. ౩౬. (ఈయర్థము సంస్కృతనిఘంటువులలో లేదు.)

క్షేమకారుఁడు. సం. విణ. (అ. ఈ. అ)= క్షేమకరుఁడు.

క్షేమకృత్తు. సం.విణ.(త్) క్షేమము చేయువాఁడు.

క్షేమతండులములు. సం. వి.అ.పుం.బ. ప్రయాణకాలమందు పట్టిచేతులతోఁ బోక యింటినుండి కొలఁదిగాఁ గట్టికొనిపోయెడి బియ్యము.

సీ...శాలిక్షేమతండులములు. ఆము. ౨. ౯౩.

క్షేమము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్షేమమును కూర్చునది. ౨. క్షేమము గలది. వి. అ. పుం. న. ౧. కుశలము. ౨. కలిగినది రక్షించుకొనుట. (లేనిది సంపాదించుట యోగము అనఁబడును.) ౩. మోక్షము. ౪. చోరమనుగంధద్రవ్యము?.

క్షేమ్యము. సం. విణ. (అ. ఆ. అ. ) కుశలయోగ్యము, సేమమునకు తగినది.

## క్షై

క్షైణ్యము. సం. వి. అ.న. క్షీణత్వము, క్షీణమగుట.

క్షైత్రజ్ఞము. సం. విణ. (అ. ఈ.అ.) క్షేత్రజ్ఞసంబంధ మైనది. వి. అ. న. ఆత్మస్వరూపజ్ఞానము.

**క్షైత్రము.** సం. విణ. (అ. ఈ.అ.) క్షేత్రసంబంధమైనది. వి. అ. న. ౧. క్షైత్రము. ౨. క్షేత్రముల సమూహము.

**క్షైప్రము.** సం. వి. అ. న. క్షిప్రత్వము, శీఘ్రత, త్వర.

**క్షైరేయము.** సం. విణ. (అ. ఈ.అ.) క్షీరముతో సంస్కరింపఁబడినది, పాలతో వండఁబడినది.

## క్షో

**క్షోడము.** సం. వి. అ. పుం. ౧. ఆలానము, ఏనుఁగును కట్టుకంబము. (కల్ప). ౨. ధామార్గవము, ఆవడ ?. (వై.ని.)

**క్షోణి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. భూమి, నేల. ౨. (గణిత) ఒకటి అనుసంఖ్య. ౩. మూంజి, ముంజతృణముతో నల్లిన బ్రహ్మచారిమొలత్రాడు.

**క్షోత్తృ.** సం. విణ (ఋ. త్రీ. ఋ.) పిండిచేయువాఁడు; పొడిచేయువాఁడు. వి. ఋ. పుం. రోఁకలి, మొ.

**క్షోత్తవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పొడిచేయఁదగినది; పిండిచేయఁదగినది.

**క్షోదకము.** సం. విణ. (అ. దికా. అ.) పొడిచేయునది; పిండిచేయునది.

**క్షోదక్షమము.** సం. విణ. (అ ఆ. అ.) ౧. పొడిచేయుటకుఁ దగినది; పిండిచేయఁదగినది. ౨. సూక్ష్మపరీక్షణమునకు తగినది.

**క్షోదనీయము.** సం=క్షోత్తవ్యము.

**క్షోదము.** సం. వి. అ. పుం. ౧. పొడిచేయుట; పిండిచేయుట. ౨. పొడి; పిండి.

**క్షోదితము.** సం. విణ (అ. ఆ. అ.) పొడిచేయఁబడినది; పిండిచేయఁబడినది. వి. అ. న. పొడి; పిండి.

**క్షోదిమము.** సం. వి. న్. పుం. క్షుద్రత, సూక్ష్మత్వము. (రూ. క్షోదిమ.)

**క్షోదిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) క్షుద్రతమము, మిక్కిలిక్షుద్రము.

**క్షోదీయము.** సం. విణ. (స్. యసీ. స్.) క్షుద్రతరము.

**క్షోద్యము.** సం=క్షోత్తవ్యము.

**క్షోధకుఁడు.** సం. విణ. (అ. ధికా. అ.) ఆఁకొన్నవాఁడు.

**క్షోద్ధృ.** సం. విణ. (ఋ. ద్ధ్రీ. ఋ.)=క్షోధకుఁడు.

**క్షోభకుఁడు.** సం. విణ. (అ. భికా. అ.) ౧. క్షోభపెట్టువాఁడు. ౨. క్షోభపడువాఁడు.

**క్షోభణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్షోభపెట్టునది. ౨. క్షోభపడునది. (అ. ఈ. అ.) క్షోభమునకు సాధనమైనది. వి. అ. న. కలఁచుట, వ్యాకులపెట్టుట. పుం. మన్మథునిపంచబాణములలో నొకటి.

**క్షోభణీయము.** సం=క్షోభయితవ్యము.

**క్షోభమాణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) క్షోభించుచున్నవాఁడు.

**క్షోభము.** సం. వి. అ. పుం. ౧. చలనము, కదలుట; కదలిక. ౨. వ్యాకులత, కలఁత. ౩. కదల్చుట, రేఁపుట.

శ్లో. జ్వలతి చలితేంధనోఽగ్నిర్విప్రకృతః పన్నగః ఫణాం కురుతే, ప్రాయస్స్వం మహిమానం క్షోభాత్ప్రతిపద్యతే జంతుః. శాకుం. ౬. ౩౧.

**క్షోభయత్.** సం. శత్రు. క్షోభపెట్టుచున్న.

**క్షోభయమాణము.** సం. విణ. (అ. ఆ. అ.) క్షోభపెట్టుచున్నది.

**క్షోభయిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) క్షోభపెట్టువాఁడు.

**క్షోభయితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) క్షోభపెట్టఁదగినది.

క్షోభించే. సం. అ. క్రి. కలఁతపడు (శ.ర.)

క్షోభిత. సం. విణ (ఋ. త్రీ. ఋ.) క్షోభపడు వాఁడు.

క్షోభితము. సం. విణ. (అ. ఆ. అ.) కలఁతపెట్టఁబడినది.

క్షోభ్యము. సం=క్షోభయితవ్యము.

## క్షౌ

క్షౌద్రజము. సం. వి. అ. న-తేనెవలనఁబుట్టినది-మైనము.

క్షౌద్రము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. క్షుద్రునకు సంబంధించినది. ౨. తేనెటీఁగలకు సంబంధించినది. వి. అ. పుం. చంపకము, సంపెంగి. న. ౧. అల్పత్వము. ౨. నీచత్వము. ౩. తేనె. ౪. నీరు. ౫. ధూళి, పాంసువు.

క్షౌద్రమేహము. సం. వి. అ. పుం. మధుమేహమనురోగము.

క్షౌద్రేయము. సం. వి. అ. న. సిక్థకము, మైనము. (రా. ని.)

క్షౌమము. సం. విణ. (అ. ఈ. అ.) అగిసెసంబంధమైనది(బట్ట.) వి. అ. పుం. న. ౧.పట్టువస్త్రము. ౨. మేడ మున్నగువానిమీఁదిగది. న. నారచీర.

క్షౌరము. సం. వి. అ. న. ముండనము, వపనము.

క్షౌరి. సం. వి.ఈ. స్త్రీ. మంగలకత్తి.

క్షౌరికుఁడు. సం. వి. అ. పుం. మంగలి.

## క్ష్ణు

క్ష్ణుతము. సం. విణ. (అ. ఆ. అ.) వాఁడిచేయఁబడినది, సానఁబట్టఁబడినది.

## క్ష్మా

క్ష్మా. సం. వి. ఆ. స్త్రీ. ౧. నేల. ౨. (గణిత.) ఒకటియనుసంఖ్య.

క్ష్మాజము. సం. వి. అ. పుం. చెట్టు.

క్ష్మాజుఁడు. సం. వి అ. పుం-భూపుత్రుఁడు-౧.నరకాసురుఁడు. ౨. అంగారకుఁడు.

క్ష్మాతము. సం. విణ. (అ. ఆ. అ.) కంపించినది, వణఁకినది.

క్ష్మాపితము. సం. విణ. (అ. ఆ.అ.) కంపింపఁజేయఁబడినది, వణఁకింపఁబడినది.

క్ష్మాభృత్తు. సం. వి. త్. పుం. ౧.కొండ. ౨.రాజు.

క్ష్మాయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కంపించువాఁడు, వణఁకువాఁడు.

## క్ష్వి

క్ష్వింకము. సం. వి. అ. పుం. ఎఱ్ఱనిమొగము గలకోఁతి. (వై. ని)

క్ష్విణ్ణము. సం విణ. (అ. ఆ. అ.) ౧. జిడ్డుగలది. ౨. ముక్తము,విడువఁబడినది.

## క్ష్వే

క్ష్వేడ. సం. వి. ఆ. స్త్రీ. ౧. సింహనాదము,యుద్ధమందు వీరుని పెడబొబ్బ. ౨.వెదురుసలాక, వెదురుగసిక.

క్ష్వేడనము. సం. వి. అ. న. సింహనాదము,యుద్ధవీరుని పెడబొబ్బ.

క్ష్వేడము. సం. విణ. (అ. ఆ. అ. ) ౧. కుటిలము, వంకరైనది. ౨. దురాసదము,పొందరానిది. వి.అ. న. ౧. ఆవడపువ్వు, చేఁదుబీఱపూవు. ౨. ఎఱ్ఱబీల్లెడుకాయ. పుం. ౧. ధ్వని, మ్రోఁత. ౨. విషము. ౩. ఒకానొకకర్ణరోగము. (వై. ని.)

క్ష్వేడితము. సం=క్ష్వేడనము.

క్ష్వేళ. సం. వి. ఆ. స్త్రీ.౧. క్రీడ. (కల్ప) ౨. సింహనాదము, యుద్ధవీరుని పెడబొబ్బ.

క్ష్వేళము. సం. వి. అ. పుం. విషము.

క్ష్వేళి. సం. వి. ఈ. స్త్రీ=క్ష్వేళ.

క్ష్వేళిక. సం=క్ష్వేళ.

క్ష్వేళితము. సం. వి. అ. న=క్ష్వేళ.

## ఖ

ఖ. సం. ఒకానొక యక్షరము. వి. అ. పుం. సూర్యుఁడు. న. ౧. ఆకాశము. ౨. స్వర్గము. ౩. ఇంద్రియము. ౪. క్షేత్రము, పొలము. ౫. నక్షత్రము. ౬. (క్షేత్రగ) బిందువు, బొట్టు. ౭. సుఖము. ౮. జ్ఞానము. ౯. బ్రహ్మము. ౧౦. (గణిత) శూన్యము, సున్న. (మే. ని.) ౧౧. పట్టణము. ౧౨. ఛిద్రము, కన్నము. ౧౩. గృహము, ఇల్లు. (శే. ని.) ౧౪. లగ్నమునకు పదియవరాశి. (కల్ప) ౧౫. అభ్రకము. (రా. ని.)

('ఆకాశము' అనునర్థమునఁ దక్క మిగిలినయర్థము లందుఁ దెలుఁగున వ్యస్తప్రయోగము గనఁబడదు.)

ఉ. ఖంబు గదే కవుఁగ శ్రుతినుఖంబు గదే నుడి షట్పదీమయూ, ఖంబు గదే కచంబు విశిఖంబు గదే నిడువాలుఁజూపు శం,ఖంబు గదే గళంబు...రుక్మి. ౫. ౬౦.

ఖంకరము. సం. వి. అ. పుం. ముంగురులు. (కల్ప)

ఖంగు=కంగు². వి.౧. గంట మ్రోఁగుట తుపాకి ప్రేలుట మున్నగువానియందగుధ్వనికి అనుకరణము. (దీనిఆమ్రేడితరూపము. 'ఖంగుఖంగు')

గీ. ఘంట ఖంగని మ్రోయు...హంస. ౨. ౪౮.

వ...పెట్లుఁగ్రోవులవరుసలఖంగుపెఖిల్ ధిమిరింగుఖఖిల్ ఘమీల్ ఘాంగుఖణీల్... ఘాంఘంకరణ శబ్దంబు లబ్దంబులగర్జితంబులఁ దర్జించి ...ప్రబంధ. ౭౮౮.

ఉ. కచ్ఛపరాజువెన్నెముక ఖంగునఁ దాఁకని గట్టు లేదు...రామా. ౭. ౧౩౨.

గీ. కంచు గీసినతెఱఁగున ఖంగు రనఁగఁ, జేడియలు గూడి ధవళముల్ పాడుచుండ. శమ. ౩. ౯౦.

సీ. ఒండొంటిఁ గొట్టుచో ఖండాలు ఖంగుఖంగు నఁ దాఁకి పెనుమిణుఁగురులు గ్రక్క. శశా. ౮. ౬౬.

సీ. ఎప్పుడు చూచిన నెడపక ఖంగుఖం గనుచు క్కుటులులమహాస్వనంబు. పరమ. ౫. ౪౦. ఉ. రా. ౪. ౫౦. వరాహ. ౯. ౧౪౭.

ఖంగుఖంగు. వి. ఆయుధము మున్నగుకఠినపదార్థము లొకదానితో నొకటి తాఁకినపుడు కలుగు ధ్వనికి అనుకరణము.

ఉ. త్నా...వాద్యస్వనభీషణంబుగా, నిబ్బరంపుటార్భటిఁ జనించెనంత నెల్లచో, దబ్బుదుబ్బుఖంగుఖంగుతంగుతింగు మద్ధ్వనుల్. కళా. ౮. ౧౦౯.

ఖంగురింగు. వి. చిన్నపిరంగులధ్వనికి అనుకరణము.

వ... పిరంగులధింధిమ్ములు జబురుజంగులఖంగురింగులు గుంటిక్రోవులదబ్బుదుబ్బులు... ప్రబంధ. ౭౮౮.

ఖంజ. సం. వి. ఆ. స్త్రీ. ఛందోవిశేషము.

ఖంజఖేటము. సం. వి. అ. పుం. ఖంజరీటము, కాటుకపిట్ట.

ఖంజఖేలము. సం=ఖంజఖేటము. (త్రి. ని.)

ఖంజన. సం. వి. ఆ. స్త్రీ. సర్షపి, ఖంజనాకారస్త్రీపక్షివిశేషము. (వాచ, కల్ప.)

ఖంజనము. సం. వి. అ. పుం. కాటుకపిట్ట.

ఖంజనిక. సం=ఖంజన.

ఖంజపాదము. సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము, గంజనగాలు.

ఖంజము. సం. విశ. (అ. ఆ. అ.) ఒకకాలు కుంటిదైనది, ఏకపాదవికలమైనది.

**ఖంజరి.** సం. వి. ఈ. స్త్రీ. వాద్యవిశేషము. (ఈపద మీక్రిందియుదాహరణమునమాత్రమే కాన్పించుచున్నది.)

సీ. కాహళదుందుభిఖంజరీమర్దళ భేరీరవంబులు భోరుకలఁగ. భాను. ౪. ౬౪.

**ఖంజరీట(క)ము.** సం. వి. అ. పుం. కాటుకపిట్ట.

**ఖండ.** సం. వి. అ.పుం. గర్భాధానాదివిధిప్రతిపాదకగ్రంథము. (ఇది దర్భాదులలో చేర్పఁదగును.)

ఉ...శ్రోతులఁ దవ్వవట్టుదుర్, ఖండల ముష్టి వివ్వఁ గని నవ్వుదు వెండి ప్రయోక్తలన్... ఆము. ౬. ౬౭.

**ఖండకథ.** సం. వి. ఆ. స్త్రీ. చిన్నకథ.

**ఖండకర్ణము.** సం. వి. అ. పుం. రక్తాళువు,ఎఱ్ఱదుంప, తియ్యాగెనునుగే.

**ఖండకావ్యము.** సం. వి. అ. న. చిన్నకావ్యము, మహాకావ్యలక్షణము లన్నియు లేనికావ్యము.

శ్లో. ఖణ్డకావ్యం భవేత్కావ్యస్యైకదేశానుసారి చ.యథా మేఘదూతాది. సా. ద.౬. ౩౨౯.

**ఖండకాళువు.** సం. వి. ఉ. న. రక్తాళువు, ఎఱ్ఱదుంప.

**ఖండకుఁడు.** సం. విణ. (అ. డికా. అ) ఖండించువాఁడు. వి. అ. పుం. గోళ్లు లేనివాఁడు.

**ఖండజము.** సం. వి. అ. పుం. ఒకదినుసుచక్కెర.

**ఖండధార.** సం. వి. ఆ. స్త్రీ- ఒకదళమునందే వాఁడికలది-కత్తెర.

**ఖండనము.** సం. విణ. (అ. ఆ. అ)-ఖండించునది- ౧. త్రుంచునది. ౨. విఱుచునది. ౩. (వాదాదులను) నిరాకరించునది. ౪. నాశము సేయునది. (అ. ఈ. అ.) ఖండనసాధనమైనది. వి. అ. న.౧. ఛేదించుట. ౨. విఱుచుట. ౩. కఱచుట,కొఱుకుట. (ఉదా: అధరోష్ఠఖండనము.)౪.యుక్తులచే (వాదము మొదలగువానిని) నిరాకరించుట. ౫. భంగము, విచ్ఛిత్తి. ౬. ఒకానొకగ్రంథము, వితండాగ్రంథము. (ఇందు సర్వమతములును ఖండింపఁబడును.)

**ఖండనీయము.** సం.= ఖండితవ్యము.

**ఖండపరశువు.** సం.= ఖండపర్శువు.

**ఖండపర్శువు.** సం. వి. ఉ. పుం. ౧. దంతములు విఱిగినఏనుఁగు. ౨. రాహువు. ౩.సున్నముపూయువాఁడు. ౪. ఖండామలక మనెడుమందు. ౫. పరశురాముఁడు. ౬. శివుఁడు. (మే. ని.) ౭. గండగొడ్డలి.

**ఖండప్రళయము.** సం. వి. అ. పుం. చిన్నప్రళయము, స్వర్గమునకుఁ గాక భూమ్యాదిలోకములకు మాత్రము కలుగుప్రళయము.

**ఖండమానము.** సం. విణ. (అ. ఆ. అ) ఖండించుచున్నది.

**ఖండము.** సం. విణ. (అ. ఆ. అ.)౧. ఖండించునది. ౨. ఖండింపఁబడినది. ౩. కొఱవడినది, తక్కువపడినది,అసంపూర్ణము. (విల్సన్)వి.అ. పుం.న. ౧. అర్ధము, సగము. ౨. భాగము, ఏకదేశము;తునుక, ముక్క. పుం. ౧. పులకండము, కండచక్కెర. ౨. రత్నదోషము.న.౧. ఒకజాతిఉప్పు. ౨. ఒకజాతిచెఱకు గే. (విల్సన్)

**ఖండమోదకము.** సం. వి. అ. పుం. ఒకజాతిచక్కెర.

**ఖండయత్.** సం. శత్రు. ఖండించుచున్న.

**ఖండయమానము.** సం.= ఖండమానము.

**ఖండయిత.** సం.= ఖండిత. విణ.

**ఖండయితవ్యము.** సం.= ఖండితవ్యము.

**ఖండలవణము.** సం. వి. అ. న. ఒకజాతిఉప్పు.

**ఖండవికారము.** సం. వి. అ. పుం. చక్కెర.

**ఖండశర్కర.** సం. వి. ఆ. స్త్రీ. కండచక్కెర, పులకండము.

**ఖండసరులు.** మి. వి. బ. వస్త్రవిశేషము.

సీ. జాళీలు చెఱఁగులు సామంతవిధులును గావులు దసిలీలు ఖండసరులు. ధనా. ౩. ౩౮.

**ఖండా.** వి. (చి.ని, శ.ర.-సం. కరండః.) పెద్దకత్తి.

క. ...కడు నుద్దండతరచండమతియై, ఖండా యొఱ దుస్సి వైచి కర మెత్తుటయున్. శుక. ౧. ౧౨౦.

ఉ. లేఁజిగురాకునిద్దపుగలీబున నుంచినతమ్మి ఱేకు ఖండా జళిపించి మారుఁడు ... దశా. ౭. ౨౧౧.

సీ. ఒండొంటిఁ గొట్టుచో ఖండాలు ఖంగు ఖంగునఁ దాఁకి పెనుమిణుఁగుఱులు గ్రక్క. కళా. ౮. ౬౬.

**ఖండాభ్రము.** సం. వి. అ. న. ౧. చెదరినమబ్బు. ౨. దంతక్షతవిశేషము. (మే. ని)

**ఖండించు.** సం. స. క్రి. ౧. ఖండములు చేయు.

శా. చండక్రోధ మెలర్పఁ జండిక వెస న్శస్త్రాస్త్రవర్షంబున, ఖ్ఖండించె న్దనుజాస్త్రశస్త్రములు ...మార్క. ౬. ౯౦.

౨. (వాదాదికము) నిరాకరించు.

**ఖండిక.** వి. ౧. చిన్నపల్లె. (శ.ర.-ఇది శ్రీనాథునిచే సంస్కృతపదముగా ప్రయోగింపఁబడినది)

సీ. ...గ్రామఖండిక... భీమ. ౫. ౮౦.

౨. పన్నులేకుండ గుత్తకిచ్చినభూఖండము. (బ్రౌ)

**ఖండికము.** సం. వి. అ. పుం. ౧. కలాయము, బటానిగింజ. ౨. కక్షము, చంక.

**ఖండిత.** సం. విణ. (బు. త్రి. బు) ఖండించువాఁడు. వి. ఆ. స్త్రీ. ౧. నాయకుఁడు రాత్రి మఱియొకదానియింటికిఁ బోయి సంభోగచిహ్నములతో రాఁగాఁ జూచి కోపము నొందిననాయిక. (ఇది ఎనమండ్రునాయికలలో నొకతె.

శ్లో. పార్శ్వమేతి ప్రియో యస్యా అన్యసంభోగచిహ్నితః, సా ఖణ్డితేతి కథితా ధీరైరీర్ష్యాకషాయితా. సా. ద. ౩.౭౫.

**ఖండితము.** సం. విణ. (అ. ఆ. అ)-ఖండింపఁబడినది-౧. నఱకఁబడినది; విఱువఁబడినది. ౨. పోఁగొట్టఁబడినది, నశింపఁజేయఁబడినది. ౩. (యుక్తులచే) నిరాకరింపఁబడినది. (వాదము)

**ఖండితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ) ఖండింపఁదగినది.

**ఖండిని.** సం. వి. ఈ. స్త్రీ-నవఖండములు గలది - భూమి.

**ఖండీ.** వి. (హిం. ఖండీ) పుట్టి. (శ. ర.)

**ఖండీరము.** సం. వి. అ. పుం. పీతముద్గము, పచ్చపెసలు.

**ఖండ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ) ఖండింపఁబడుచున్నది.

**ఖండ్యము.** సం=ఖండితవ్యము.

**ఖండ్రిక**=ఖండిక.

(పన్నులేకుండ గుత్తకిచ్చినభూఖండము.)

క. ఏనాఁటి యగ్రహారమొ, మానాఁటికి మాన్యమాయె మాపని దీరెన్, మీనాఁట ఖండ్రి కాయెను, నానాఁటికిఁ దీసికట్టు నాగంభట్టూ. (చాటువు)

**ఖక్ఖటము.** సం. విణ. (అ. ఆ. అ.) కఠిన మైనది, గట్టిది. (విల్సన్.)

**ఖగమనము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆకాశగమనము గలది, ఆకాశమునఁ బోవునది. వి. అ. న. ఆకాశగమనము. పుం. ౧. పక్షి. ౨. బాణము.

**ఖగమము.** సం=ఖగము.

**ఖగము.** సం. విణ. (అ. ఆ. అ) ఆకాశమునఁ బోవునది. వి. అ. పుం. ౧. పక్షి. ౨. గాలి. ౩. సూర్యాదిగ్రహము. ౪. బాణము.

**ఖగుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. వేలుపు, దేవత.

**ఖగోళము.** సం. వి. అ. పుం. ఆకాశగోళము.

**ఖగోళవిద్య.** సం. వి. ఆ. స్త్రీ.-ఆకాశగోళమును గుఱించి తెలుపువిద్య-జ్యోతిశ్శాస్త్రము.

**ఖగ్గడము.** సం. వి. అ. పుం. ఒకజాతితృణము.

**ఖచకుఁడు.** సం. విశ. (అ. చికా. అ.) ఖచించువాఁడు.

**ఖచనము.** సం. విశ. (అ. ఈ. అ) ఖచించుటకు సాధన మైనది. వి. అ. న. ఖచించుట.

**ఖచనీయము.** సం=ఖచితవ్యము.

**ఖచమసుఁడు.** సం.వి.అ.పుం. చంద్రుఁడు.(త్రి.వి.)

**ఖచరము.** సం. విశ. (అ. ఈ. అ.) ఆకాశమందు సంచరించునది. వి. అ. పుం. ౧. పక్షి. ౨. మబ్బు. ౩. గాలి. ౪. సూర్యాదిగ్రహము. ౫. పాదరసము.

**ఖచరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. రాక్షసస్త్రీ. ౨. దుర్గ. ౩. ఖేచరీముద్ర, యోగశాస్త్రప్రసిద్ధమగు ముద్రావిశేషము.

**ఖచరుఁడు.** సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. వేలుపు. (గంధర్వుఁడు, విద్యాధరుఁడు, మొ.) ౩. రాక్షసుఁడు.

**ఖచించు.** సం=ఖచియించు.

వ...బంగరుపుపల్లసంబులపైఁ జెల్లు ఖచించిన నానావిధ మాణిక్యరత్నప్రభాపటలంబులతోడం జొక్కళింపుచు నింద్రాయుధంబులతోడం దోడుచూపుచు గంగాతరంగంబులతెఱంగు దాల్చువారువంబులును...హ.హరి. ౪.౨౧౩.

**ఖచిక్కు**=కచిక్కు. వి. ౧. చిలుకలు మొదలగునవి కొఱుకుటయం దగుధ్వనికి అనుకరణము. (ఆమ్రేడితరూపము 'ఖచిఖచిక్కు')

చ. జిలిబిలి తెక్కలార్చుచు ఖచిక్కున ముక్కునఁ బక్వదాడిమీ,ఫలయుగళంబు నొక్కునాకబాలకుకంబురకంబుఁ జూచి వా, లిలిమి నదల్చుచు న్విరులబంతి సెలంతుక దాని సేసె...కృ. శకుం. ౨. ౩౩.

౨. కుక్కుటయం దగుధ్వనికి అనుకరణము.

ఉ. కేరఁగ రాదు నవ్వ గిలిగింతలు పెట్టఁగ రాదు చెక్కులం,జీరఁగ రాదు గుబ్బలు ఖచిక్కునఁ గ్రుమ్మఁగ రాదు...హంస. ౧. ౯౪.

౩. బాణాదులు నాటుటయం దగుధ్వని కనుకరణము.

ఉ ...అ,పోఁటరినిక్ ఖచిక్కురని పూములుకుల్లది నాట నేసి నీ,నాటకశాలబోట్లబరణంబులఁ జాఁగిలి మ్రొక్కఁ జేసెదన్. పార్వ. ౨ ౧౩౧.

సీ. ఖచిఖచి క్క్రంచని...మల్లుపు. ౧. ౫౯.

**ఖచిత.** సం. విశ. (ఋ. త్రి. ఋ)=ఖచకుఁడు.

**ఖచితము.** సం. విశ. (అ. ఆ. అ.) ౧. చెక్కఁబడినది, పొదుగఁబడినది, తాపఁబడినది. ౨. సంయుక్తము, కూడినది. ౩. వ్యాప్తము.

**ఖచితవ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) ఖచింపఁ దగినది.

**ఖచియించు.** సం. స. క్రి. చెక్కు, పొదుగు, తాచు.

క. ఖచియించినవజ్రంబుల,రుచులను బోలుపారు సీవిరులు బెరయంగన్. భార. ఉద్యో. ౪. ౧౨౩.

**ఖచ్చత్.** సం. శత్రు. ఖచించుచున్న.

**ఖచ్యమానము.** సం. విశ. (అ. ఆ. అ) ఖచింపఁబడుచున్నది.

**ఖజ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కవ్వము. ౨. ప్రేళ్లు చాఁపి వచేయి. [illegible]. ౪. చిలుకుట్కు ఖదించుట. ౫. [illegible] యుద్ధము.

**ఖజకము.** సం. వి. అ. పుం. కవ్వము.

**ఖజపము.** సం. వి. అ. న. నెయ్యి.

**ఖజము.** సం. వి. అ. పుం. ౧. కవ్వము. ౨. చిలుకుట, మథించుట. ౩. త్రెడ్డు, దర్వి.

**ఖజాక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. త్రెడ్డు, గరిఁటె. ౨. అసతి, ఉంకుటాలు.

**ఖజాకము.** సం. వి. అ. పుం. ౧. పక్షి. ౨. వైశాఖము, చల్లకవ్వము. న. ౧. ఆకాశము. ౨. శరీరము.

**ఖజానా.** వి. (హిం. ఖజానా) ధనాగారము.

మ. తరువుల్ పాలనసేయుచుండు నెడలన్ ధర్మ
ప్రకారంబు నుం,దరమై పర్వఁగ నచ్చటచ్చ
ట జమీన్దారుల్ దివాణాన కొ,ప్పరులై
క్రమ్మర సీమ లెల్ల ఖిరదాబాదాను గావింపు
చున్, సరకారర్థము దస్తుసేయఁడు ఖజానా
నింపుఁ డింపొందఁగన్. రంగా. ౧. ౧౪౧.

**ఖజిక.** సం. వి. ఆ. స్త్రీ. త్రెడ్డు, గరిఁటె; మిల్లి.

**ఖజ్యోతి.** సం. వి. స్. పుం=ఖద్యోతము. (కల్ప)

**ఖటకటాహకము.** సం. వి. అ. పుం-ఉమియుపాత్రము-తమ్మపడిగము.

**ఖటకము.** సం. వి. అ. పుం. పిడికిలి.

**ఖటకాముఖము.** సం. వి. అ. పుం. చూపుడువ్రేలికిని నడిమివ్రేలికిని నడుమ నున్న బాణముయొక్క పిడిని బొటనవ్రేలితోను ఉంగరపువ్రేలితోను బిగియఁబట్టునట్టిహస్తవిన్యాసవిశేషము.

శ్లో. జ్యాకృష్టిబద్ధఖటకాముఖపాణిపృష్ఠ, ప్రేంఖ
న్నఖాంశుచయసంవలితోంబికాయాః, త్వాం
పాతు...కటాక్షః. అమరుకము. ౧. (పాఠ-
'కటకాముఖ' పాఠాంతరము.)

**ఖటకుఁడు.** సం. వి. అ. పుం. ఘటకుఁడు, పెండ్లిసంధానములు చేయువాఁడు. (విల్యమ్సు)

**ఖటక్కిక.** సం. వి. ఆ. స్త్రీ. పక్షద్వారము, ప్రక్కనుండుద్వారము, దిడ్డివాకిలి. (విల్యమ్సు)

**ఖటము.** సం. విశే. (అ. ఆ. అ) కఠినము. వి. అ. పుం. ౧. శ్లేష్మము, తెమడ. ౨. అంధకూపము, పాడునూయి. ౩. ఆయుధవిశేషము. ౪. టంకము, ఉలి. ౫. నాఁగలి. ౬. పచ్చిక, గడ్డి. ౭. కాఠిన్యము.

**ఖటి.** సం=ఖటిని. (వై. ని.) వి. ఇ. పుం. పాడె, శవవాహనము. (త్రి. ని.)

**ఖటిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. బలపము, సుద్దముక్క. ౨. కర్ణరంధ్రము. ౩. వీరణము, ఆవురుగడ్డి.

**ఖటికము.** సం. వి. అ. పుం. ముష్టి, పిడికిలి.

**ఖటిని.** సం. వి. ఈ. స్త్రీ. బలపము, సుద్దముక్క, కఠిని. (రా. ని.)

**ఖట్ట.** సం. వి. ఆ. స్త్రీ. ఖట్వ, మంచము. (కల్ప)

**ఖట్టాశము.** సం=ఖట్టాసము.

**ఖట్టాసము.** సం. వి. అ. పుం. గంధమార్జాలము, పునుఁగుపిల్లి.

**ఖట్టి.** సం. వి. ఇ. పుం. స్త్రీ. పాడె, శవవాహనము.

**ఖట్టిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. క్షుద్రఖట్వ, చిన్నమంచము. ౨. గద్దె. ౩. శవవాహనము, పాడె. (కల్ప)

**ఖట్టికుఁడు.** సం. వి. అ. పుం. వేఁటకాఁడు; పిట్టలవేఁటకాఁడు.

**ఖట్టేరకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ఖర్వుఁడు, పొట్టివాఁడు.

**ఖట్వ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పర్యంకము, మంచము. ౨. (వైద్య) ఖట్వాకారము గల వ్రణబంధము. ౩. కోలకించి, కంబళిచిక్కుడుకీ.

**ఖట్వాంగధరుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

ఖట్వాంగము. సం. వి. అ. పుం. శివునియాయుధవిశేషము.

ఖట్వాంగి. సం. వి. న్. పుం. శివుఁడు.

ఖట్వాప్లుతుఁడు. సం=ఖట్వారూఢుఁడు.

ఖట్వారూఢుఁడు. సం. విణ. (అ. ఆ. అ)-మంచ మెక్కినవాఁడు- ౧. జాల్ముఁడు, దుర్వినీతుఁడు. ౨. మూఢుఁడు.

ఖట్వికి. సం. వి. ఆ. స్త్రీ. మంచము;చిన్న మంచము.

ఖడి. సం. వి. ఈ. స్త్రీ. బలపము, సుద్దముక్క.

ఖడిక. సం. వి. ఆ. స్త్రీ=ఖడి.

ఖడువు. సం.వి.ఉ,ఊ. స్త్రీ. పాడె, శవవాహనము.

ఖడ్గకోశము. సం. వి. అ. పుం. కత్తిఱయొఱ.

ఖడ్గధేనువు. సం. వి. ఉ. స్త్రీ. ౧. చూరకత్తి, చిన్న కత్తి. ౨. ఆఁడుఖడ్గమృగము.

ఖడ్గపత్రము. సం. వి. అ. న. కత్తివాదర. పుం. నరకమందలియొక చెట్టు,అసిపత్రము.(దీనియాకులు కత్తులవలె నుండును.)

ఖడ్గపిధానము. సం. వి. అ. న. కత్తిఱయొఱ.(హలా. ని.)

ఖడ్గపుత్రిక. సం. వి. ఆ. స్త్రీ.అసిపుత్రి, చూరకత్తి, చిన్నకత్తి.

ఖడ్గఫలము. సం. వి. అ. న. కత్తివాదర.

ఖడ్గబంధము. సం. వి. అ. పుం. ఒకజాతిచిత్రకవిత్వబంధము. (దీనియందు శబ్దములు ఖడ్గరూపముగా ఏర్పఱుపఁబడును.)

ఖడ్గము. సం. వి. అ. పుం. ౧. కత్తి. ౨. ఒకానొక మృగము. ౩. ఖడ్గమృగముకొమ్ము. న. ఇనుము.

ఖడ్గారీటము. సం. వి. అ. పుం. కేడెము, డాలు.

ఖడ్గారీటుఁడు. సం. వి. అ. పుం. అసిధారావ్రతము పూనినవాఁడు.

ఖడ్గాహ్వము. సం. వి. అ. పుం. ఖడ్గమృగము.

ఖడ్గి. సం. విణ. (న్. నీ. న్) కత్తి గలవాఁడు. వి. న్. పుం. ఖడ్గమృగము.

ఖడ్గికుఁడు. సం. వి. అ. పుం. ౧. ఖడ్గధారి, కత్తి చేతఁ బట్టువాఁడు. ౨. కటికవాఁడు.

ఖడ్గీకము. సం. వి. అ. న. కొడవలి.

ఖణి. వి. మ్రోఁగుటయందగుధ్వనికి అనుకరణము. (ఆమ్రేడితరూపము. 'ఖణిఖణి')

ద్వి. వడి మీఁట ఖణిఖణి వాఁగుమ గిరుల, బెడఁగుఁ గైకొనుటిగిబిగిచన్నుఁగవల... మెఱుఁగుఁబోణులు సంభ్రమించి యంతంత. అ. మ. క. ౫. ౨౬౯ పా. ౧౦ పం.

ఖణిల్లు(లు). వి. (చూ. ఖణిలుఖణిలు). ఎద్దు అంకె వేయుట ఖడ్గాదులు విఱుగుట మున్నగువానియం దగుధ్వనికి అనుకరణము. (ఆమ్రేడితరూపములు-ఖణిల్ ఖణిల్లు, ఖణిఖణిల్లు.)

సీ. అలవోకవలె ఖణి ల్లని అంకె వైచిన రోదసీకుహరంబు భేదిలంగ. భాగ. ౧౦ ఉ. ౮౦౩.

ద్వి. వెస ఖణి ల్లని అంకె వేసి కుప్పించు, బసవరాయని నెక్కి...ద్వి. హరిశ్చ. ఉ.౨౯౬.

సీ. అడిదంబు జళిపించి మెడమీఁద వైచిన వడి ఖణి ల్లనుచు రెండయ్యె నపుడు. దశా. ౮. ౧౭౭.

ఉ. అంటని నేర్పుతో వగలయందముఁ జందముఁ జూపఁ బూని కోలాటము వేయుకైవడిని లాలితదృక్తరళప్రభావళుల్, పాటిగఁ బోఁగుఁ బెంబడిని చార్య్యములం జరియించు వస్త్రముల్, ధాటిగ నేయునప్పులకతట్టున చెట్టు ఖణిల్ఖణి ల్లనన్. హంస. ౨. ౧౩.

గీ. మినమినల్కు-ంకుమపురేఖ మించు లొల్కఁ, ఖణిఖణి ల్లని మెట్టియ ల్కడు రహించె. హంస. ౫. ౩౬౦.

**ఖణేలు**=ఖణిల్లు.

(తుపాకులు ప్రేలుటయందగుధ్వనికి అనుకరణము)
ప్రబంధ. ౭౮౭.

జ: ఖణీలుఖణిలు.

**ఖణేలుఖణేలు.** వి. (ఖణీలు+ఖణిలు) ఎద్దు అంకె వేయుట మొదలగువానియం దగుధ్వనికి అనుకరణము.

చ. ఫణిపతిహారభావభవభస్మసుధాకరభూషితాళికే, తృణధవళప్రభాకలిత సానుచరద్వృష
భాధిపుఁ ఖణీల్, ఖణిలున అంకెవేయ కె
ఱుఁగఁ సమకూడదు చూడ నన్నగా, గణి
తరుచిప్రసారము జగత్త్రయగాహకమై వెలుం
గఁగఁ. కాశీ. ౪. ౧౫౩.

**ఖతమాలము.** సం.వి అ.పుం. ౧. పొగ. ౨. మబ్బు.

**ఖత్తు.** వి. (హిం.ఖత్తు.) ౧.రీతి.౨.ఉత్తరము.(శ.ర)

**ఖదత్.** సం. శత్రు. ౧. తినుచున్న. ౨. హింసించుచున్న.

**ఖదికలు.** సం. వి. ఆ. స్త్రీ. బ. లాజలు, పేలాలు.

**ఖదిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ) ౧. భక్షించువాఁడు. ౨. హింసించువాఁడు.

**ఖదిర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. లజ్జాలువు, అత్తపత్తి కీ. ౨. ముణుఁగుఁదామర కీ.

**ఖదిరపత్రి.** సం. వి. ఈ. స్త్రీ. సోఁకుడుముడుఁగు, లజ్జాలువు, అత్తపత్తి కీ.

**ఖదిరము.** సం. వి. అ. పుం. ౧. గాయత్రి, చంద్ర కీ. ౨. ఒకజాతితేలు.(శే. ని-దీనివిషమునకు చికిత్స లేదు.)

**ఖదిరసారము.** సం. వి. అ. పుం. కాఁచు, కవిరి.

**ఖదిరుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. చంద్రుఁడు.

**ఖద్ది.** వి. (క. కద్ది=కోరిక?-కిటిలు) బలము.

స్రగ్ధర. ఖద్దిఁ జెండాడుఁ బ్రాకుల్ కవుఁగిటఁ
కౌఁలఁదుల్ కత్తినొక్కొక్కగాతఁ. మను
చ. ౪. ౮. (గ్రద్ధఁ = గ్రద్దనఁ-అని శ్రా.
వ్యా-ప్రయోగాంతరము లేదు)

**ఖద్యోతనుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**ఖద్యోతము.** సం. వి. అ. పుం. మిడుఁగుఱుఁబురుగు.

**ఖద్యోతుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**ఖధూపము.** సం. వి. అ. పుం. పయి కెగురవేసెడిబాణపంచు.

**ఖనకము.** సం. వి. అ. పుం. ఎలుక.

**ఖనకుఁడు.** సం. విణ. (అ. నికా. అ) ౧. త్రవ్వెడువాఁడు. ౨. భూమివిత్తజ్ఞుఁడు, భూమియందలి పాఁతులు నిధులు కనిపెట్టువాఁడు.(శే. ని)-వి. అ. పుం. ౧. కన్నపుదొంగ. ౨. క్షత్రియస్త్రీయందు మాగధునివలనఁ బుట్టినవాఁడు. (శే. ని)

**ఖనత్.** సం. శత్రు. త్రవ్వుచున్న.

**ఖననము.** సం. వి. అ.న.౧. త్రవ్వుట. ౨. పూడ్చుట, పాఁతిపెట్టుట.

**ఖననీయము.** సం=ఖనితవ్యము.

**ఖనమానము.** సం. విణ. (అ. ఆ. అ) త్రవ్వుచున్నది.

**ఖని.** సం. వి. ఇ, ఈ. స్త్రీ రత్నములు పుట్టెడుచోటు, గని.

**ఖనిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ)=ఖనకుఁడు .విణ.

**ఖనితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ) త్రవ్వఁదగినది.

**ఖనిత్రకము.** సం=ఖనిత్రము.

**ఖనిత్రము.** సం. వి. అ. న ౧.గడ్డపాఱ.౨.గుద్దలి.

న్యమానము. సం. విణ. (అ. ఆ. అ) త్రవ్వఁబడుచున్నది.

పరాగము. సం. వి. అ. పుం. చీకటి.

పుటుఁడు. సం. వి. అ. పుం. అన్నము ఆకులోఁ బెట్టుకొనక చేతఁ బెట్టుకొని భుజించువ్రతము గలవాఁడు. (వై. ని.)

పురము. సం. విణ. (అ. ఆ. అ) అలసము, సోమరి యయినది. వి. అ. పుం. ౧. పూగపట్టము, పోఁక పట్టు. ౨. పోఁకచెట్టు. 3. ప్రాణిబంక. ౪. భద్రముస్తము ?. ౫. బాలము, కురువేరు?. ౬. గంధర్వనగరము. (ఇది ఆకాశమునఁ గనఁబడినపుడు అశుభము కలుగును.) ౭. దైత్యపురభేదము. న. ౧. ఘటము, కుండ. (హేమ. ని.) ౨. పోఁకకాయ. (శే. ని.)

ఖపుష్పము. సం. వి. అ. న. ఆకాశపుష్పము. (శశవిషాణాదులవలె నిది అసంభవవస్తువునకు ఉపమానముగా గ్రహింపఁబడును.)

ఇట్లే: ఖకుసుమము, మొ.

ఖభము. సం. వి. అ. న. గ్రహము. (విల్యమ్సు)

ఖర. సం. వి. అ. పుం. ప్రభవాదులలో ఒకానొక సంవత్సరము. ఆ. స్త్రీ. డావరడంగి ?.

ఖరకరుఁడు. సం. వి. అ. పుం. చండాంశువు, సూర్యుఁడు

ఖరకుటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. గాడిదలకొట్టము. ౨. వాఁడి గలకత్తులుండుచోటు, క్షౌరశాల.

ఖరకోణము. సం. వి. అ. పుం. తిత్తిరిపక్షి, తీతువుపిట్ట.

ఖరణసుఁడు. సం. విణ. (-స్-అ.ఆ.అ) వాఁడి యైన ముక్కు గలవాఁడు, గద్దముక్కువాఁడు.

ఖరదళ. సం. వి. ఆ. స్త్రీ. మేడి ?.

ఖరదూషణము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త ?.

ఖరనాళము. సం. వి. అ. న.-కఱకైన కాఁడ గలది-తామర, పద్మము.

ఖరపాత్రము. సం. వి. అ. న. ఇనుపపాత్రము.

ఖరపాదాఢ్యము. సం. వి. అ. పుం. కలఁగ ?.

ఖరపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. వాయింట ?.

ఖరపుష్పము. సం. వి. అ. పుం. మరువము ?.

ఖరప్రియము. సం. వి. అ. పుం. కఠినవస్తువులయందిష్టము గలది-పావురము. (ఇది రాలు తినుట సుప్రసిద్ధము.)

ఖరమంజరి. సం. వి. ఈ. స్త్రీ-వాఁడి యైనయెన్నులు గలది-ఉత్తరేను ?.

ఖరము. సం. విణ. (అ. ఆ. అ) ౧. గట్టిది, పరుసనిది, బిరుసైనది. ౨. వాఁడిమి గలది. 3. వేఁడిమి గలది, వేండ్రమయినది; తీక్ష్ణము, చురుకు గలది. ౪. క్రూరమయినది. వి. అ. పుం. ౧. గాడిద; వేసడము, కంచరగాడిద. ౨. కంకపక్షి, రాబందు. 3. కాకి. ౪. కురరపక్షి. న. ౧. వేఁడిమి. ౨. వాఁడిమి.

ఖరాబు. విణ. (హిం. ఖరాబ్) చెడ్డవాఁడు.

సీ....ఖరాబు కూళ బందెలమారి నుండటిపాపాలముద్ద ధగిడి. హంస. ౫. ౧౧౩.

ఖరాబ్దాంకురకము. సం. వి. అ. పుం-మేఘములు తీవ్రముగా ఉఱిమినపుడు పుట్టునది-వైడూర్యమణి.

ఖరాలికము. సం. వి. అ. పుం. ౧. మంగలపొది. ౨. ఇనుపబాణము. 3. తలాఁపి, తలగడ.

ఖరాలికుఁడు. సం. వి. అ. పుం. మంగలి.

ఖరాశ్వ. సం. వి. ఆ. స్త్రీ. ఓమము ?.

ఖరింధముఁడు. సం. విణ. (అ. ఆ. అ) =ఖరింధయుఁడు. (అ. ని.)

ఖరింధయుఁడు. సం. విణ. (అ. ఈ. అ) గాడిదపాలు త్రాగువాఁడు.

ఖరిక. సం. వి. ఆ. స్త్రీ. పొడి చేసిన ఒకానొక కస్తూరి.

ఖరీదు. వి. (హిం. ఖరీద్.) వెల. (శ. ర.)

ఖరీవృషము. సం. వి. అ. పుం. ఖరము, మగగాడిద. (కాశికావృత్తి. ౬. ౨. ౧౪౪.)

ఖరుఁడు. సం. వి. అ. పుం. ఒకరక్కసుఁడు.

ఖరువు. సం. విణ. (ఉ.) ౧. దురాచారుఁడు, నిషిద్ధకార్యములఁ జేయువాఁడు. ౨. తెల్లనిది. ౩. క్రూరము. ౪. తీక్ష్ణము. వి. ఉ. స్త్రీ. భర్తను వరించు కన్య. పుం. ౧. దర్పము. ౨. మన్మథుఁడు. ౩. ఈశ్వరుఁడు. ౪. గుఱ్ఱము, హయము. ౫. దంతము, పల్లు. ౬. నరుఁడు, పురుషుఁడు. ౭. (సంగీ) గీతభేదము. ౮. నారి, స్త్రీ. ౯. తెలుపు.

ఖర్చు. వి. (హిం. ఖర్చ్) వ్యయము. (శ. ర, వా)

ఖర్జనము. సం. వి. అ. న. గోఁకుట.

ఖర్జిక. సం. వి. ఆ. స్త్రీ. తొలుకురోగము, ఉపదంశరోగము.

ఖర్జురము. సం. వి. అ. న. రజతము, వెండి.

ఖర్జువు. సం. వి. ఊ. స్త్రీ. ౧. తీఁట. ౨. చిట్టీఁదు శీ. ౩. ఒకానొకపురుగు.

ఖర్జూరకము. సం. వి. అ. పుం. వృశ్చికము, తేలు. (విల్యమ్సు)

ఖర్జూరము. సం. వి. అ. పుం. ౧. ఖర్జూరపుచెట్టు. ౨. తేలు. న. ౧. వెండి. ౨. ఖర్జూరపుపండు. ౩. హరిదళము. ౪. ఖలము. (మే. ని.)

ఖర్జూరి. సం. వి. ఈ. స్త్రీ. ఈఁతశీ.(చూ.అం.భా. ౨. ౭౯.)

ఖర్పరము. సం. వి. అ. పుం. ౧. బిచ్చమెత్తెడు చిప్ప. ౨. తలపుర్రె. ౩. కుండపెంకు. ౪. పాలతుత్తము.

ఖర్పరి. సం. వి. ఈ. స్త్రీ. పాలుతుత్తము.

ఖర్పరుఁడు. సం. వి. అ. పుం. ౧. దొంగ. ౨. మోసకాఁడు, వంచకుఁడు

ఖర్బూజము. సం. వి. అ. న. కరబూజా, ఫలభేదము. (కల్ప, విల్యమ్సు)

ఖర్వటము. సం. వి. అ. పుం. న. ౧. ఒకప్రక్క గ్రామమును నొకప్రక్క నగరమును గలదిగాను నదీగిరిసమాశ్రయము గలదిగాను నుండుగ్రామభేదము. ౨.చతుశ్శతగ్రామమధ్యస్థలము. (కల్ప)

ఖర్వము. సం. విణ. (అ. ఆ. అ) ౧. పొట్టిది. ౨. అధమము. వి. అ. పుం. న. ౧. సంఖ్యావిశేషము. (౧౦,౦౦౦,౦౦౦,౦౦౦.) పుం. కుబేరునినిధులలో నొకటి.

ఖలకము. సం. వి. అ. పుం. కుండ. (వాచ)

ఖలతి. సం. విణ. (ఇ. ఇ, ఈ. ఇ) బట్టతలవాఁడు.

ఖలతికము. సం. వి. అ. పుం. ఒకానొకకొండ.

ఖలపువు. సం. విణ. (ఊ. ఊ ఉ.) కళ్లము ఊడ్చువాఁడు.

ఖలము. సం. వి. అ. న. ౧. నేల, భూమి. ౨. చోటు. ౩. తక్రవిశేషము. ౪. కల్కము, చమురు మున్నగునవి తీసివేసిన తెలికపిండి, మో. పుం. ౧. ధుత్తూరము, ఉమ్మెత్త శీ. ౨. తమాలము శీ. ౩. వెదురుశీ. ౪. కల్పము. ౫. యుద్ధము. పుం. న. కళ్లము. (కే. ని)

ఖలమూర్తి. సం. వి. ఇ. పుం. పాదరసము.

ఖలి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. నూనె మొదలగువానియడుగుమడ్డి, కల్కము.

శ్లో. స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతి తిలఖలీం చాందనైరింధనాద్యైః. సం. భర్తృ. నీతి. ౯౭.

ఖలినము. సం=ఖలీనము. (కల్ప)

**ఖలిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కళ్లములసమూహము. ౨. ఖలులసమూహము. ౩. తాలమూలికి. (కల్లు)

**ఖలీకారము.** సం. వి. అ. పుం. ౧. అపకారము. ౨. బాధించుట, నొప్పించుట. ౩. పరిభవించుట, అనాదరము చేయుట. ౪. భర్త్సనము, బెదరించుట.

**ఖలీకృతి.** సం. వి. ఇ. స్త్రీ.=ఖలీకారము.

**ఖలీనము.** సం. వి. అ. పుం. న. గుఱ్ఱపుకళ్లెము.

**ఖలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అధముఁడు. ౨. క్రూరుఁడు, దుర్జనుఁడు. ౩. నీచుఁడు. వి. అ. పుం. సూర్యుఁడు.

**ఖలూ(ఖూ)రిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. శస్త్రాభ్యాసము, గరిడీ.

చ.. మంటికై, సారెల రథ్యుఁడీ కమలబుద్ధి ఖలూరికఁ దక్క వజ్రదోః, పరిఘువశీకృతాన్యనరపాలకు లప్పురి రాకుమారకుల్. ఆము. ౨. ౩౪.

౨. శస్త్రాభ్యాసప్రదేశము, గరిడీసాల.

సీ. ఒకయంఘ్రి గగనగంగకు ఖలూరిక నొక్కయడుగు వేదములకు పిడిదిఁ జూప. ప్రబంధ. ౫౪౨.

**ఖల్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కళ్లములసమూహము. ౨. ఖలులసమూహము.

**ఖల్లము.** సం. వి. అ. పుం. ౧. జాతికల్వము. ౨. పల్లము, గొయ్యి. ౩. తోలు. ౪. తోలుతిత్తి. ౫. చాతకము, వానకోయిల. ౬. కాలువ, కయ్య. ౭. వస్త్రవిశేషము.

**ఖల్లి.** సం. వి. ఈ. స్త్రీ. కాలుచేతులందు పోట్లు గలిగించునొకానొకరోగము.

**ఖల్లిక.** సం. వి. ఆ. స్త్రీ. మంగలము, పేపుడుచట్టి.

**ఖల్లీటుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) బట్టతలవాఁడు. (విల్యమ్సు)

**ఖల్వాటుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ఇంద్రలుప్తము గలవాఁడు, బట్టతలవాఁడు. (విల్యమ్సు)

**ఖళిఖెళి.** వి. పిరఁగు వాయించుటయం దగుధ్వని కనుకరణము.

సీ. ఖెళఖెళపిరఁగా ళ్ఖళిఖెళి వాయించి... హంస. ౨. ౭౯.

**ఖళీఖెళి.** వి. కోడిపుంజులు తన్నుకొనునపు డగుధ్వని కనుకరణము.

చ... చిక్కె వేసి సల్లిరి మద్దిపోయటంచును ఖళీఖెళిఁ బుంజులు దన్నులాడఁగన్. హంస. ౩. ౨౧౬.

**ఖశము.** సం. వి. అ. పుం. హిందూదేశమునం దుత్తరమున నున్న పర్వతమయ దేశము.

**ఖశయము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆకాశమునం దుండునది.

**ఖశీరము.** సం. వి. అ. పుం. హిందూదేశమున ఉత్తరమునందలియొకానొక దేశము.

**ఖశీరుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఖశీరదేశాధిపతి. ౨. ఖశీరదేశవాసి.

**ఖశ్వాసము.** సం. వి. అ. పుం-ఆకాశమునకు ఊపిరివంటిది-గాలి.

**ఖష్పము.** సం. వి. అ. పుం. ౧. కోపము. ౨. బలాత్కారము.

**ఖసతిలము.** సం. వి. అ. పుం. గసగసా.

**ఖసము.** సం. వి. అ. పుం. ౧. తీఁట, గజ్జి. ౨=ఖశము. ౩. గసగసా.

**ఖసూచి.** సం. విణ. (ఇ)-అడిగినప్రశ్నమును మఱపించుటకు ఆకాశమును చూపువాఁడు; సమాధానము చెప్పలేక ఆకాశమును చూచువాఁడు-ప్రతిభలేనివాఁడు. (ఉదా: వైయాకరణఖసూచి=చెడ్డవైయాకరణుఁడు, వ్యాకరణమును మఱచిపోయినవాఁడు.)

**ఖస్కానము.** సం. వి. అ. పుం. గసగసాలు. వ. గసగసలు.

**ఖస్కానరసము.** సం. వి. అ. పుం. అహిఫేనము, నల్లమందు.

**ఖస్ఫటికము.** సం. వి. అ. పుం. ౧. సూర్యకాంతమణి. ౨. చంద్రకాంతము, చలువఱాయి.

## ఖా

**ఖాండవప్రస్థము.** సం. వి. అ. పుం. పాండవులు హస్తినాపురమునుండి వెడలినతరువాత నివసించిన చోటు.

క. నెమ్మిఁ జని ఖాండవప్రస్థమ్ము నివాసమ్ముఁ జేసి ...భార. ఆది. ౮. ౬౭.

**ఖాండవము.** సం. వి. అ. పుం. ౧. పులకండము, పటికబెల్లము. ౨. (మిఠాయి మున్నగు) భక్ష్యపదార్థము, తినుబండము. వ. ఇంద్రునియొక్క యొకానొకవనము. (ఇది కురుక్షేత్రమందలిది. దీనిని కృష్ణార్జునులసాహాయ్యమున అగ్ని దహించె నని భారతకథ.)

**ఖాండవికుఁడు.** సం. వి. అ. పుం. పిండివంటలు చేయువాఁడు, మిఠాయి మున్నగునవి చేయువాఁడు.

**ఖాండికుఁడు.** సం=ఖాండవికుఁడు.

**ఖాచకుఁడు.** సం. విణ. (అ. చికా. అ.) ఖచించువాఁడు.

**ఖాచ్యము.** సం=ఖచితవ్యము.

**ఖాజికము.** సం. వి. అ. పుం. లాజలు, పేలాలు.

**ఖాట.** సం. వి. ఆ. స్త్రీ. శవవాహనము, పాడె.

**ఖాటము.** సం. వి. అ. పుం=ఖాట.

**ఖాటి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. శవవాహనము, పాడె. ౨. అసద్గ్రాహము, పెంకెపట్టు. 3. కిణము, కాయ. (మే. వి.)

**ఖాటిక.** సం=ఖాటి.

**ఖాణము**=ఖాణా. వి. (సం. ఖాదనం. హిం. ఖానా.) అశ్వాదులకుఁ బెట్టెడి యులవలు లోనుగాఁ గలభక్ష్యము, దాణా.

సీ. బంగారుకోన కెక్కుడుకెక్కురసెత్తమిఁకూఁడు లఖాణంపుఁదురికి నడువ. ఉ. హరిశ్చ. 3. ౧3౧.

క. ఏణాక్షి నపుడు వెడసింగాణింగొని యలరుఁ దూపుగమిఁ జక్కురయే, ఖాణముగాఁ గలిగినకం, ఖాణపుదారపింజ పింజఁ గాఁడఁగనేసె౯. విజ. వి. ౧. ౬౨.

**ఖాణా**=ఖాణము.

మ. ...లేగుజ్జుపొన్నలు పున్నాగము లై వని౯ జిగురుఖాణా మేటికి౯ మెచ్చుగా౯. శకాం. ౨. ౧౧౪.

**ఖాతకము.** సం. వి. అ. న. అగడ్త.

**ఖాతకుఁడు.** సం. వి. అ. పుం. అధమర్ణుఁడు, అప్పుపడినవాఁడు.

**ఖాతభువు.** సం. వి. ఊ. స్త్రీ-త్రవ్వుటవలన నేర్పడినది-అగడ్త.

**ఖాతము.** సం. విణ. (అ. ఆ. అ) త్రవ్వఁబడినది. వి. అ. న. ౧. గోయి. ౨. అగడ్త. 3. పుష్కరిణి, కోనేఱు. ౪. గుహ. ౫. త్రవ్వుట.

**ఖాతి.** సం. వి. ఇ. స్త్రీ. త్రవ్వుట.

**ఖాతీరు.** వి. లక్ష్యము.

శా. రంగారాయఁడు మామొలాజుమతుకై రాకేటికిం జిక్కునా, బంగాళాపురగాతమాతటనటద్బృంహిస్థధాత్రీశు లెల్లం గూర్మి౯ మదనుజ్ఞఁ జెంది హితలీల న్వచ్చునిష్టాప్తిఁ జొక్కంగానం డోకో వెల్లబిడ్డ మములం ఖాతీరుకుం దేఁడోకో. రంగా. ౨. ౮౯.

**ఖాత్రము.** సం. వి. అ. న. ౧. గుద్దలి. ౨. కోనేఱు. 3. దారము. ౪. అడవి.

**ఖాదకుఁడు.** సం. విణ. (అ. దికా. అ) ౧. తినువాఁడు. ౨. తినిపించువాఁడు. వి. అ. పుం. అప్పు పుచ్చుకొనువాఁడు.

**ఖాదత్.** సం. శతృ. తినుచున్న.

**ఖాదతమోదతా.** సం. వి. ఆ. స్త్రీ. తినుఁడు సంతోషింపుఁడు అని ప్రేరేఁచుట. (వాచ)

**ఖాదనము.** సం. వి. అ. పుం. పల్లు. న. ౧. తినుట. ౨. ఆహారము, తిండి.

**ఖాదము.** సం. విణ. ( అ. ఆ. అ ) తినునది. వి.అ. పుం. ౧. తినుట. ౨. ఆహారము, తిండి.

**ఖాదయితృ.** సం. విణ. (ఋ. త్రీ. ఋ) తినిపించువాఁడు.

**ఖాదిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ) తినువాఁడు.

**ఖాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడినది.

**ఖాదిరము.** సం. విణ. (అ. ఈ. అ.) ఖదిరవృక్షమునకు సంబంధించినది. వి. అ. పుం. రంగదము, కవిరి, కాఁచు.

**ఖాదుకము.** సం. విణ. (అ. ఆ. అ) హింసాశీలము, హాని చేయునది.

**ఖాద్యము.** సం. విణ. (అ. ఆ. అ) తినఁ దగినది. వి. అ. న. మిఠాయి మొదలగుతినుబండము.

**ఖానకము.** సం=ఖనకము.

**ఖానకుఁడు.** సం=ఖనకుఁడు.

**ఖానము.** సం. వి. అ. న. తినుట. (వాచ)

**ఖాని.** సం=ఖని.

**ఖానికము.** సం. వి. అ. పుం. న. గోడకన్నము.

**ఖానిలుఁడు.** సం. వి. అ. పుం. కన్నపుదొంగ.

**ఖానుఁడు, ఖాను, ఖాన.** వి. (హిం. ఖాన్.) ౧. తురుష్కప్రభువు.

శా. ఆమాటల్ విని ఖానుఁ డర్థకృత మానశ్యాళి దీపింపఁగా. రంగా. ౨. ౪౮.

సీ. ఉడుగవివి భ్రాంతిఁ దడగార్లుపడ నిల్చుఖానులు డాఁగఁ జీకటులు చేసె. వసు. ౧. ౪౬.

సీ. అభిభూతఖానమల్కావిష్కృతాయశోధ్వాంతసంతతి కాత్మ సంతసిల్లి. నరస. ౨. ౨౦.

౨. ఇది ఒకతెగతురుష్కులపేర్లతుదఁ జేర్పఁబడును.

క...అమీనుఖానుసింగంబునకుఁ. యయా. ౧. ౪౪.

క. వెరయునమీఁ ఖాన సింగిణీసుల్తానా. యయా. ౩. ౧.

గీ. మేలుసిరు లందునట్టియమీనుఖాన, యొడయఁ డొకనాఁడు నిండుఁ బేరోలగమున. యయా. ౧. ౬.

**ఖానోదకము.** సం. వి. అ. పుం–త్రాగుట కుపయోగించునీరు కలది–కొబ్బరచెట్టు. (త్రి. ని)

**ఖాయము.** విణ. (హిం. ఖాయం) స్థిరము, శాశ్వతము. (శ. ర, వా.)

**ఖారము.** సం. వి. అ. పుం=ఖారి.

**ఖారి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. పుట్టి,పరిమాణవిశేషము. (ప్రాఁతలెక్కలలో పుట్టి యనుటకు 'ఖ' అను గుఱుతు కలదు.)

**ఖారింపచము.** సం. విణ. (అ. ఆ. అ) పుట్టి పరిమితి గలబియ్యము మున్నగునవి వండెడునది. (పాత్రము.)

**ఖారికము.** సం. విణ. (అ. ఈ. అ)=ఖారీకము. వి. అ. న. మహాపారేవతము, పెద్ద ఈడెకి.

**ఖారీకము.** సం. విణ. (అ. ఆ. అ) పుట్టెఁడువిత్తులు విత్తఁ దగినది. (పొలము)

**ఖారీవాపము.** సం=ఖారీకము.

**ఖారీవాపుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) పుట్టెఁడువిత్తనములు చల్లువాఁడు.

**ఖార్కారము.** సం. వి. అ. పుం. గాడిదయోండ్ర.

**ఖార్వ.** సం. వి. ఆ. స్త్రీ. త్రేతాయుగము.(విల్యమ్సు)

**ఖాలత్యము.** సం. వి. అ. న. ఇంద్రలుప్తరోగము, బట్టతల.

**ఖాలీ(ళీ).** విణ. (హిం. ఖాలీ) ఉత్తది.

గీ. అట్టిపలు కాలకించి దమ్మన్న యనియెఁ, గోట ఖాలీయొనర్చుట కేటిసబబు. రంగా. ౨.౧౪౯.

(వ్యవ) వాఁడు ఖాళీస్థలము కొన్నాఁడు.

ఆయుద్యోగము ఇపుడు ఖాళీగా నున్నది.

**ఖామందు**=ఖావందు. (శ. ర.)

**ఖావందు.** వి. (హిం. ఖావంద్.) ప్రభువు, నాయకుఁడు, యజమానుఁడు.

శా... మేల్గడీ, ఖాలీచేసి యథేచ్ఛ నేఁగు మని మీఖావందుకుఁ జ్వ్రాయుమీ. రంగా. ౨. ౧౪౫.

మ. అధికారంబు నహించి వచ్చినసుబా వామీఁద ఖావందవు...రంగా. ౨. ౧౭౪.

**ఖాసా.** విణ. (హిం. ఖాస్) సొంతమైన. (శ. ర)

**ఖిందానము.** సం. విణ. (అ. ఆ. అ) ఖేదపడుచున్నది.

**ఖిఖి.** సం. వి. ఇ. పుం. కిఖి, కొంకనక్క.

**ఖిదిరుఁడు.** సం. వి. అ. పుం. ౧. చంద్రుఁడు. ౨. తపస్వి. ౩. దరిద్రుఁడు. (కల్ప)

**ఖిద్యమానము.** సం. విణ. (అ. ఆ. అ) ఖేదపడుచున్నది.

**ఖిద్రుఁడు.** సం. వి. అ. పుం. దరిద్రుఁడు.

**ఖిన్నము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. ఖేదము నొందినది, దుఃఖము నొందినది. ౨. దైన్యము నొందినది.

**ఖిలము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దున్ననిది. (సేల.) ౨. ఉత్సన్నము, చెడినది. వి. అ.న. శేషము, మిగిలినది.

శ్లో. అలం దగ్ధైః ద్రుమైర్దీనైః ఖిలానాం శివమస్తు వః. సం. భాగ. ౬. ౪. ౧౬.

**ఖిలీభవించు.** సం. అ. క్రి. ఖిలమగు, చెడు.

వ...త్రివర్గనాశంబున నుభయలోకమార్గంబును ఖిలీభవించు...కాశీ. ౫. ౨౯౫.

## ఖు

**ఖుంగాహము.** సం. వి. అ. పుం. నల్లనిగుఱ్ఱము. (కల్ప)

**ఖుడకము.** సం. వి. అ.పుం. గుల్ఫము, చీలమండ.

**ఖుదా.** వి. (హిం.ఖుదా=స్వయంభువు, దేవుఁడు.) దేవుఁడు.

గీ...రాయలతోఁ బోరి గెలువ మనకు, వశమె యైన ఖుదా యన్నవాఁ డటంచు. కృష్ణ. ౩. ౨౬. రంగా. ౨. ౨౫౨.

**ఖుద్దున.** క్రి. విణ. (హిం. ఖుద్) సొంతముగా. (శ. ర.)

**ఖురణసుఁడు.** సం. విణ. (-స్-అ.ఆ.అ) బుఱ్ఱముక్కువాఁడు.

**ఖురప్రము.** సం. వి. అ. పుం.=క్షురప్రము.

**ఖురము.** సం. వి. అ. పుం. ౧. గొరిజ. ౨. నఖమను దుగంధద్రవ్యము. ౩. మంగలకత్తి. ౪. మంచపుకోడు.

**ఖురళి.** సం. వి. ఈ. స్త్రీ. సాము.

**ఖురాకము.** సం. వి. అ. పుం. పశువు, జంతువు.

**ఖురాలకము.** సం. వి. అ. పుం. ఇనుపబాణము, గొరక.

**ఖురాలికము.** సం. వి. అ. పుం. ౧. మంగలపొది. ౨. ఇనుపబాణము. ౩. తలాఁపి.

ర్దనము. సం. వి. అ. న. కుర్దనము, క్రీడ, ఆట.
లాసా. హిం. వి. సౌఖ్యము, నెమ్మది. (శ. ర.)
ల్లకము. సం. విశే. (అ. ల్లికా. అ) ఖుల్లము.
ల్లమము. సం. వి. అ. పుం. ఘంటాపథము, బాట.
ల్లము. సం. విశే. (అ. ఆ. అ) ౧. అల్పము, క్షుద్రము. ౨. దరిద్రము. ౩. నిష్ఠురము. ౪. దుష్టము. ౫. కనిష్ఠము, చిన్నది. (ఉదా: ఖుల్లపితామహుఁడు. కల్ప)
ఖుల్లసు. వి. (హిం. ఖులాస్) వివరము. (శ. ర.)
ఖుసి. వి. (హిం. ఖుషీ) సంతోషము.

మ. ఖుసి మీఱఁగ సురధాణనిండుఁగొలువై కూర్చున్నచో ...హర. ౧. ౨౨.

## ఖూ

ఖూబు. అవ్య. (హిం. ఖూబ్) సెబాసు, బళీ.

మ. అవురా వాతెఱతేట ఖూబు పిలుఁదో య్యారంబు మజ్ఝారె చ,న్నవతేస్కాల్ ...ప్రబంధ. ౪౮౪.

## ఖే

ఖేగమనము. సం. విశే. (అ. ఆ. అ) ఆకాశమునఁ బోవునది. వి. అ. న. ఆకాశగమనము. పుం. కాలకంఠపక్షి.
ఖేచరము. సం=ఖచరము.
ఖేచరి. సం=ఖచరి.
ఖేచరుఁడు. సం=ఖచరుఁడు.
ఖేటము. సం. విశే. (అ. ఆ. అ) ౧. అధమము, గర్హ్యము. ౨. వృద్ధిజీవి, వడ్డిచేత బ్రతుకునది. వి. అ. పుం. ౧. పంటకాఁపు లుండెడుపల్లె. ౨. కఫము. ౩. గ్రహము. (రవ్యాది) ౪. సునందకము, బలరాముగదగద. పుం. న. ౧. ఆఖేటము, వేట. ౨. చర్మము. న. ౧. గడ్డి. ౨. డాలు.
ఖేటాయించు=కేటాయించు. స. క్రి. (హిం. ఖేటా) వేఱుపఱుచు. (శ. ర.)
ఖేటి. సం. విశే. (న్. నీ. న్) ౧. పొరుఁడు, పట్టణవాసి. ౨. కాముకుఁడు.
ఖేటించు. స. క్రి. (హిం. ఖేటా) విడిచిపెట్టు.

మ...మీ రాకోట ఖేటింపుఁడ, న్నృపము ల్దప్పినవల్కు వల్కఁ దగునే పాశ్చాత్యలోకేశ్వరా. రంగా. ౨. ౧౭౪.

ఖేటితానుఁడు. సం. వి. అ. పుం. వైతాళికుఁడు, స్తోత్రపాఠములతో మేలుకొలుపువాఁడు.
ఖేదకుఁడు. సం. విశే. (అ. దికా. అ) ౧. ఖేదపడువాఁడు. ౨. ఖేదపెట్టువాఁడు.
ఖేదనము. సం. వి. అ. న. ౧. దైన్యము, విన్నఁదనము. ౨. బడలిక. ౩. బాధ. ౪. దారిద్ర్యము.
ఖేదనీయము. సం=ఖేదయితవ్యము.
ఖేదము. సం. వి. అ. పుం. ౧. దైన్యము, విన్నఁదనము. ౨. బడలిక, అలయిక. ౩. బాధ, పీడ. ౪. దారిద్ర్యము, లేమిడి. ౫. రోగము.
ఖేదయత్. సం. శత్రు. ఖేదపెట్టుచున్న.
ఖేదయిత. సం. విశే. (ఋ. త్రీ. ఋ) ఖేదపెట్టువాఁడు.
ఖేదయితవ్యము. సం. విశే. (అ. ఆ. అ) ఖేదపెట్టఁదగినది.
ఖేదించు. సం. అ. క్రి. ఖేదపడు.

వ...అంగదుండు విన్నఁదనంబు నొంద హనుమంతుండు ఖేదింప లక్ష్మణుండు వగలం బొగుల ... భా. రా. యు. ౨౩౭౪.

ఖేదితము. సం. విశే. (అ. ఆ. అ) ౧. బాధితము, నొప్పింపఁబడినది. ౨. కలఁతపెట్టఁబడినది. ౩. ఖేదము గలది.

ఖేద్యము. సం= ఖేదయితవ్యము.

ఖేయము. సం. విణ. (అ.ఆ.అ) ఖననీయము, త్రవ్వఁదగినది. వి. అ. న. పరిఖ, అగడ్త. పుం. నీళ్లు పాఱుటకు వీలుగాఁ గట్టినఆనకట్ట.

శ్లో. సేతుశ్చ ద్వివిధో జ్ఞేయః ఖేయో బద్ధ్యస్తథైవ చ, తోయప్రవర్తనాత్ఖేయో బద్ధ్యస్స్యాత్తన్నివర్తనాత్. (అని నారదుఁడు. సం. విజ్ఞా. వ్యవ. వ్యాఖ్య-శ. ర.)

ఖేల. సం. వి. ఆ. స్త్రీ. క్రీడ, ఆట.

ఖేలనము. సం. వి. అ. న. ౧. కదలుట, అల్లల్లాడుట. ౨. క్రీడ, ఆట. ౩. క్రీడాసాధనము. (చదరంగము మున్నగువానియందలికాయ, సెత్త పలక, మొ.)

ఖేలని. సం. వి. ఈ. స్త్రీ. శారిఫలము, సెత్త పలక.

ఖేలము. సం. విణ. (అ. ఆ. అ) ౧. క్రీడించునది, ఆడునది; విలాసయుక్తము. ౨. చలించునది, అల్లల్లాడునది. వి. అ. పుం. వేణువు, వెదురు. (శే. ని.)

ఖేలి. సం. విణ. (ఇ) ఆకాశమునఁ బోవునది. వి. ఇ. స్త్రీ. క్రీడ, ఆట. పుం. ౧. బాణము. ౨. జంతువు. ౩. పక్షి. ౪. సూర్యుఁడు. ౫. గీతము. (విల్యమ్సు)

ఖేల్లాహము. సం. వి. అ. పుం. తెల్లనితోఁకయు జూలును గలకపిలవర్ణపుగుఱ్ఱము. (మే. ని.)

ఖేసరము. సం. వి. అ. పుం- ఎగురుదానివలె త్వరగాఁ బోవునది-కంచరగాడిద.

## ఖై

ఖై(కై)ది(దీ). వి. (హిం. ఖైదీ) చెఱలో నుంచఁబడినవాఁడు. (శ. ర, వా.)

ఖై(కై)దు. వి. (హిం. ఖైద్.) చెఱ, కారాగృహము. (శ. ర, వా.)

ఖైలికము. సం. విణ. (అ. ఈ. అ)-ఖిలమందలిది-అనుబంధమున నున్నది.

## ఖో

ఖోంగాహము. సం. వి. అ. పుం. తెలుపును గోధుమరంగును గలగుఱ్ఱము. (వై. ని.)

ఖోటి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. నేర్పుకత్తె, జాణ; మాయలాఁడి.

ఖోడుఁడు. సం. విణ. (అ. ఆ. అ) కుంటివాఁడు. వి. అ. పుం. శని. (వై. ని)

ఖోరము. సం= ఖోలము. (కల్ప)

ఖోలకము. సం. వి. అ. పుం. ౧. శిరస్త్రాణము. ౨. పుట్ట. ౩. పూగకోశము, పోఁకగుల్ల. ౪. పాకము. (కల్ప)

ఖోలము. సం. విణ. (అ.ఆ. అ) కుంటిది. (కల్ప)

ఖోలి. సం. వి. ఇ. స్త్రీ. తూణము, అమ్ములపొది.

ఖోల్ముకము. సం. వి. అ. పుం-ఆకాశమున కొఱవివలె ఎఱ్ఱగా నుండునది-అంగారకగ్రహము.

ఖ్యా(క్యా)త. సం. ఽణ. (ఋ. త్రీ. ఋ.) చెప్పువాఁడు.

ఖ్యాతగర్హణుఁడు. సం. విణ. (అ. ఆ. అ) అపకీర్తుఁడు, ప్రసిద్ధమైననింద గలవాఁడు. (వై. ని. అమరము.)

ఖ్యా(క్యా)తము. సం. విణ. (అ. ఆ. అ) ౧. చెప్పఁబడినది. ౨. ప్రసిద్ధము, వాసికెక్కినది. ౩. ఘోషితము, చాటఁబడినది. వి. అ. న. ౧. ప్రకటనము, చాటుట. ౨. చెప్పుట.

ఖ్యా(క్యా)తవ్యము. సం. విణ. (అ.ఆ.అ) చెప్పఁదగినది.

ఖ్యా(క్యా)తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రసిద్ధి, వాసి. ౨. చెప్పుట. ౩. ప్రశంస, పొగడ్త. ౪. (వేదాంత) జ్ఞానము.

**ఖ్యా(క్యా)నము.** సం. వి. అ. న. చెప్పట.

**ఖ్యా(క్యా)నీయము.** సం=ఖ్యాతవ్యము.

**ఖ్యాపకము.** సం. విణ. (అ. పిహా. అ) ౧. తెలుపునది, చెప్పునది. ౨. ప్రకాశకము, బయలుపఱచునది.

**ఖ్యాపనము.** సం. వి. అ. న. ౧. ప్రకటించుట, తెలుపుట, బయలుపుచ్చుట. ౨. ప్రసిద్ధముచేయుట, ప్రసిద్ధిపఱచుట.

**ఖ్యే(క్యే)యము.** సం=ఖ్యాతవ్యము.

## గ

**గ.** ఉభ. ఒకానొకయక్షరము.

**గ.** సం. వి. అ. పుం. ౧. గంధర్వుఁడు. ౨. విఘ్నేశ్వరుఁడు. ౩. గానము. ౪. స్త్రీ. గాథ-నానార్థరత్నమాల-(దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

**గఁగ.** విణ. పెద్ద. (చూ. గంగడోలు.)

జ: గఁగడోలు, గంగరావి, గంగరేను.

**గంగ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భాగీరథి, హిమవత్పర్వతమునుండి ప్రవహించుచున్నయొకానొకనది ;నది, ఏఱు.

గీ. మిన్న యాగాలమీఁగంగ వస్నె తెక్కు...రసిక. ౬. ౧౭౩.

౩. ఉదకము, నీరు.

ఉదా: ఈబావిగంగ మంచిది. నేను వానియింట ఇంత గంగయైనను త్రాగలేదు. (బ్రౌ- ఈయర్థము తెనుఁగుననే కలదు.)

**గంగక.** సం. వి. ఆ. స్త్రీ=గంగ.

**గంగడోలు.** వి. (√గంగ. క. గంగదొవల్) ౧. గళముక్రిందితోలు, గళకంబళము, ఆవులకును ఎడ్లకును మెడక్రింద వ్రేలాడెడిపెద్దతోలు.

వ. వెడఁదవీపులును దోరంపుగంగడోళ్లును వైప్రాలువృషభంబులదర్పవికారంబులవలనను... హరి. పూ. ౫. ౧౪౨.

సీ. శరధులు నాలుగు గోరిజపట్టులు గాఁగ శైలింపనది గంగడోలు గాఁగ. శరస. ౧. ౫౭.

౨. పెద్దడోలు.

సీ. పాస్నయుఁ బెద్దడోల్చను గంగడోలన... ఆం. భా. ౩. ౪౭.

**గంగనమ్మ.** మి. వి. ఒకానొకగ్రామదేవత.

గీ. గొప్పచింబోతుకదుపులఁ గూర్చి నీకు, గావు పెట్టింతుఁ జమ్మి యోగంగనమ్మ. నీలా. ౧. ౧౧౩.

**గంగనుఱుఁగులు.** మి.వి. బ-గంగలోని నుఱుఁగులవలె నుండునవి-భక్ష్యవిశేషము.

ద్వి. వరుగు లప్పడములు వడియముల్ గంగ, నురుఁగులు...ప్రభులిం. ౪. ౧౫౦పా. ౧౯వం.

**గఁగమయిల.** వి. నలుపు. విణ. నల్లనిది. (బ్రౌ.)

గంగమయిలావు=నలుపును పసుపును గలసినవర్ణము గలయావు. (శ. ర.)

**గంగమ్మ.** మి. వి. (గంగ + అమ్మ) ౧. గంగనమ్మ. (శ. ర.) ౨. గంగాదేవి.

గీ. విమలడిండీరఖండఖండములతోడ, మురువు దీవియు నామోదమును జవంబు, వడువు నొప్పంగ గంగమ్మ నడువవమ్మ. భీమ. ౪. ౧౭౫.

**గంగరావి.** వి. (√గంగ) బ్రహ్మదారువుకీ.

రగడ. రమణ నెసఁగెడుగంగరావులను రావులను ...భాను. ౨. ౬౯.

సీ...గంగరావి యంచనఁగను బ్రహ్మదారు...ఆం. భా. ౨. ౪౨. (దీనిపూవులు పెద్దవిగను పసుపుపచ్చగను ఉండును. బ్రౌ.)

**గంగరేను, గంగరేఁగు.** వి. (బ. గంగరేఁగులు-√గంగ) పెద్దకాయలు గలయొకజాతిరేఁగుకీ. ( దీని పూవులు పెద్దవిగను పసుపుపచ్చగను ఉండును. బ్రౌ.)

సీ... జానపండులు గంగరేనుపండ్లు. కాశ. ౩. ౬.

గీ... కర్కంధువు దనర్చు గంగరేఁ గ,వంగ... ఆం. భా. ౨. ౪౫.

**గంగసిందూరము.** మి. వి. బొట్టు పెట్టుకొనుటకు ఉపయోగించు నొకజాతిసిందూరము. (వా)

**గంగాక.** సం. వి. ఆ. స్త్రీ=గంగ.

**గంగాజలములు.** సం. వి. అ. న. బ. ధాన్యవిశేషము.

సీ. అర్థిఁ బ్రయాగంబు లాస్త్రింప నార్జింపఁగా నోప మెట్లు గంగాజలంబు,లు ... కవిజ. ౧. ౧౩.

**గంగాద్వారము.** సం. వి. అ. న-గంగ భూమి కవతరించిన ప్రదేశము-హరిద్వారము, మాయాపురి.

**గంగాధరుఁడు.** సం. వి. అ. పుం. ౧. మిన్నువాఁకతాలుపు, శివుఁడు. ౨. సముద్రుఁడు. (త్రి. ని.)

**గంగాపుత్రుఁడు.** సం. వి. అ. పుం. ౧. భీష్ముఁడు. ౨. కుమారస్వామి. ౩. గంగాతీరమున యాత్రికులచే స్నానాదిక్రియలు చేయించుబ్రాహ్మణుఁడు. ౪. ఒకానొకసంకీర్ణజాతివాఁడు.

**గంగాళము.** వి. (క. గంగాళ. త. కంగాళం.) ౧. మూతి వెడలుపు గల పెద్దపాత్రము.

సీ... తతముఖభాండాఖ్య తనరు బానఁ,పవ్వ గంగాళము... ఆం. భా. ౨. ౨౪౯.

ఉ. వేళ మె కోడికూఁత యగువేళలఁ జల్దిభుజించి బండ్లు గం,గాళము కూడు నీరు చపుకారముఁ దేవిడియంపుఁజొక్కలో,మైలలమోపు వీపున నమర్చిన రేపుగుత్తాని సెక్కెవ,య్యాళిగఁ బోవు వాఁడు... శుక. ౩. ౧౦౩.

౨. భోజనపాత్రము.

గీ. మగనిఁ గూర్కెకు మనుచు నమ్మాయలాఁడి, వెడఁదగంగాళమునఁ గూడు గుడిచి లేచి. వేం. పంచ. ౪. ౪౫౯.

**గంగి.** వి. సాధు వైనయావు.

ద్వి. మంచిగంగుపాలు మఱుఁగంగఁ గాఁచి. బస. పు. ౩. ౪౧౩ పం.

విశే. సాధు వైనది; పూజ్యము.

ఉత్సాహ... గంగిగోవుచంటిసాదుబాఁపనిన్ నినున్, జనుని పలువ యనఁగ... శళా. ౮. ౩౦.

శా. అన్నా చెల్లెలనయ్యెదన్ విడువు నీ కన్నంబు వెట్టింతు నా,హ్రాన్నాధున్ ద్విజు గంగి కుత్తి నకటా హింసింప నేలయ్య... భాగ. ౯. ౨౪౯.

జ: గంగిరెద్దు, గంగెద్దు, గంగెద్దులాట.

**గంగిక.** సం. వి. ఆ. స్త్రీ=గంగ.

**గంగిరెద్దు.** వి. (గంగి + ఎద్దు)=గంగెద్దు.

సీ. గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్ కలిమి గల్గిన వారకామినులకు. రామలిం. ౧౦.

**గంగెద్దు**=గంగిరెద్దు. వి. (గంగి + ఎద్దు) దాసరులు శృంగారించి యాడించునట్టియెద్దు, దేవవృషభము.

గీ. వెలయు గంగెద్దు నా దేవవృషభసంజ్ఞ. ఆం. భా. ౨. ౨౯౧.

**గంగెద్దులాట.** వి. (√ గంగెద్దు) గంగెద్దువేషము వేసికొని యాడెడియాట, బాలక్రీడావిశేషము.

సీ. బండ్లికలును జొప్పబెండ్లమంచంబులు గంగెద్దులాటలు ... గీ. అకట యగచాట్లపాఁతనై యాడుకొనుచు. హంస. ౩. ౧౪౯.

**గంగోలము.** సం. వి. అ. పుం. గోమేదకమణి.

**గంజే.** వి. కృషికి యోగ్య మైనభూమి. (శ. ర.)

**గంజ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గుడిసె. ౨. కల్లుదుకాణము, కల్లుపాక. ౩. మద్యభాండము, కల్లుకుండ. ౪. గని. ౫. గంజాయి.

క. కలముఁ బట్టియు గంజా,హాల లుపాంశువ భుజించునధముల బైటం,జాలఁడు వైవన్... అము. ౪. ౪౮.

గంజెనగాలు. వి. బాలక్రీడావిశేషము.
సీ. గంజనగా లన ఖంజపాదక్రీడగాఁ జెలంగు ...ఆం. భా. ౨. ౩౦౭.

గంజనము. సం. విణ. (అ. ఆ. అ) తిరస్కరించునది.

గంజము. సం. వి. అ. పుం. ౧. గని. ౨. భాండాగారము, బొక్కసము. ౩. గోష్ఠము, పసులసాల. ౪. హట్టము, అంగడి. ౫. తిరస్కారము.

గంజా=గంజాయి. వి. (త. కంజా. హిం. ఘంజా.)
సీ. సారాయికొప్పెర గంజాపొడుద్దెమ్మంచు నంగండు ల్వడిఁ గొల్లలాడి రనుమ. కువల. ౧. ౪౧.

గంజాయి=గంజా. వి. ౧. కైపు పుట్టించునట్టి ఒకానొక మొక్క. ఆం. భా. ౨. ౭౩.
౨. గంజాయిచెట్టుఆకు. ఆం. భా. ౨. ౪౧.
౩. కైపు గలుగుటకై గంజాయిపత్రితో చేయు పదార్థము, బంగు.
ద్వి. గంజాయి దినె నేమి కలు ద్రావె నేమి. ద్వి. పారిశ్చ. ౨. ౧౯౯ పా. ౧౪౫౧ పం.
సీ. బంగు గంజాయి నాఁ బరఁగుఁ గలంజాఖ్య ...ఆం. భా. ౨. ౩౦౪.

గంజి. వి. (సం. కాంజికమ్. త. కంజి. క. తు. గంజి.) అన్నము వార్చినరసము.
సీ. తలఁ బడ్డగుదియదెబ్బలఁ బాఁతమసి యిడియంబలిగం జిండ్ల నడుగువారు. ఆము. ౬. ౯౫. ఆం. భా. ౨. ౨౫౦.
జ: గంజిగుల్ల, గంజితొరక.

గంజిక. సం. వి. ఆ. స్త్రీ=గంజ.

గంజిగుల్ల. వి. (గంజి + గుల్ల) నీటిబుగ్గవలె లేచెడి బొబ్బ. (శ. ర, బ్రౌ.)

గంజితొరక. వి. (√ గంజి) గంజిమీఁదిమీఁగడ. (శ. ర.)

గంజా. వి. కూరలు మున్నగునవి అమ్మువీథి, బజారు. (చి. ని, శ. ర.)

గంట[1]. వి. (సం. ఘంటా. క. గంటె.) ౧. ఘంట, వాద్యవిశేషము.
గీ. గజముపై గంట వేయించి కలయ వీటఁ, జాటఁ గాఁ బంచె నతఁడు...రామా. ౯. ౨౫.
(సందివర్ణనము.) సీ. కనకాచలేంద్రంబు గళమునఁ గట్టినకమనీయ మగుపైఁడిగంట గాఁగ. కు. సం. ౯. ౨౨.
౨. కింకిణి, అలంకారముగా ధరించుచిఱుగంట.
సీ. గంటలమొలనూలు కడిఁదియొడ్డాణంబు నుంగరంబులు వెట్టె నువిద యోర్తు. యయా. ౪. ౯౯.
౩. రెండున్నరగడియలకాలము.
(వ్యవ) రేయింబవలును ఇరువదినాలుగుగంటలు.
౪. ఒకగడియ. (చూ. గడియారము.) ఆం. భా. ౩. ౫౩.
జ: గంటలమ్మ, గంటవేఁట.

గంట[2]. వి. (క. గంటికె) గడ్డిదుబ్బు, తృణస్తంబము.
గీ. గంట యనఁ బైరుదుబ్బను ఘటిక యొప్పు. ఆం. భా. ౩. ౫౩. (ప్రాఁతిప్రతిపా.)
ఉ. కాలునిదున్న వంచి నయి గంటయు దున్నక మంటివా మహో, కాలునినంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటివా, హాళికు లెన్నఁడుం దెగనియారులచేలును జొడుమళ్లునుం, గాలిరేల సాగి రిలఁ గల్గుపసిం గొని పేడ మున్నుగన్. ఆము. ౪. ౧౨౪.
గీ. జొల్లుగంటల నాఁబోతు లుల్లసిల్లె. ఆము. ౪. ౧౫౬.
వ...ఏ మాతనిపితృపితామహులము మాపట్టినయుపురుగంటవే కొల్లం గాలుండు మూషకవ్యాజంబునఁ దరతరంబ కొఱికిన నొక్కవేర తక్కి యున్నది. భార. ఆది. ౨. ౧౪౩.
శ్లో. వీరణస్తంబకే లగ్నాః సర్వతః పరిభక్షితే. మూషకేన నిగూఢేన గర్తేస్మిన్నిత్యవాసినా. సం. భార. ఆది. ౧౩. ౧౭.

గంటకట్టు=గంట యేర్పడినది యగు,దుబ్బుకట్టు. (శ. ర.)

గంటకట్టె=సస్యనాళము.

సీ. గంటకట్టె యనంగఁ గనుపట్టు నాళంబు ... ఆం. భా. ౨. ౨౩౭.

**గంటము.** వి. (త. గంటం.) ఉక్కు మున్నగువాని తోఁ జేయఁబడి తాటాకులమీఁద వ్రాయుట కుప యోగించుసాధనము.

గీ. పసిఁడిగంటాన...భీమ. ౧. ౯౦.

ఉ. గడియకు నూఱుపద్యములు గంటము లేక రచింతు ... చే, నడిదమువాఁడ సూరనసమాఖ్యుఁడ నా కొకరుండు సాటియే. (చాటువు) ఆం. భా. ౨. ౧౯౫.

**గంటలమ్మ.** వి. (గంట¹లు+అమ్మ) ఒకానొక గ్రామదేవత. (శ. ర.)

**గంటవేఁట.** వి. (గంట¹+వేఁట) రాత్రి యాడెడిఒకవిధ మగువేఁట, మృగయావిశేషము. (ఇందు దీపములను చిఱుగంటలను ఉపయోగింతురు. బ్రౌ.)

గీ. ముంగివేఁ బేదువేఁట సివంగివేఁట, యుఱ్ఱివేఁటయు గంటవేఁ బెద్దవేఁట, మొదలుగాఁ గలవేఁటలయుద వెంతింగి, తిన్నఁ డొక్కొక్కటూకు వర్తింపఁ దొడఁగె. కాళ. ౩. ౪౭.

గీ. గంటవేఁటలఁ దిరుగాడుకడకు లెఱుకు, మూఁక...వెం. పంచ. ౪. ౨౪౦.

గంటవేఁటరి=గంటవేఁట యాడువాఁడు.

ద్వి. వెడవిల్తుఁ డనుగంటవేఁటరి గూఁటి, నిడినవి వియపోలె నిసుఁ దస్త్రమించె. ఆ. మ. క. ౨. ౯౭ పా. ౫ పం.

**గంటి.** వి. (√గంటు) ౧. గాయము, క్షతము.

సీ... విను మొక్కనాఁ డత్తపస్వి శ్రేష్ఠునాటి దర్భ. ఆ. గంటిఁ గూరయనయు గాతీన వర్తించె, నతఁడు తపముసిద్ధి కార్త్మఁ బొంగి. భార. శల్య. ౨. ౧౬౦.

శ్లో. క్షతేః కిల కరే రాజంస్తస్యశాకరసో ద్రవత్. సం. భార. శల్య. ౩౯. ౩౮.

ఉ. పంటికొలందిఁ జక్కెరలపానక మూరెడు కావిమోవిఁ బెన్గంటి యొనర్చి గుబ్బలెవక ట్టిగఁ జేర్చి కవుంగిలించి...రసిక. ౪. ౧౪.

౨. రంధ్రము, కన్నము.

సీ. క్రౌంచాచలముపోటుగంటిఁ దూఱినరాజహంసము ల్వడి హాళాహళులు సేయ. విజ. వి. ౩. ౨౫.

క. తొడిఁదొడిఁ గ్రోవులప్రవ్వుల, విడిచి దివియ లార్చి గంటివెలుఁ గాలోనకా, బడకుండఁ జెలులు మాటఁగ,నొడయుని క్రియ నుల్కు లేక యొకరుఁడు సొచ్చెన్. ద్వా. ౧౦. ౧౨౨.

గంటిసేయు=క్షతముచేయు,గాయము గలదిగాఁ జేయు.

సీ. కోవెల లిగురాకుఁ గొఱికిన నాథుని యధరంబు గంటిసేయంగ నెంచు. దశా. ౩. ౧౭.

**గంటివఱుచు.** స. క్రి. (√గంటిపడు) గంటిపడఁజేయు.

(రంధ్రముపడఁజేయు)

సీ. ఈసంకుమదగంధి యీవాడిమపనంబుఁ గాపాడుఁ జిలుకలు గ్రమ్మకుండ ... గీ. ఫలసముత్కరములు గంటివఱుచు ననుచు. చంద్రా. ౪ ౯౩.

**గంటివ(ప)డు.** అ. క్రి. (గంటి+పడు)

(గాయముపడు)

లయగ్రాహి. వెంటఁ బడి పట్టుకొని గొంటుకన మేర్పడఁగ, గంటిపడఁ దాఁచుచు మగంటిమి దలిర్పన్. భా. రా. యు. ౧౪౩౦.

వ. ఒండొరువుల మఱుపెట్టి చూచు వెలుగోలుమాపుల నితరేతర ధైర్యంబులు గంటిపడ ...పా

౮. ౨. ౫౨. (క్షీణ మగు అని భావము) అని. ౩. ౧౬.

**గంటివెట్టు.** స. క్రి. (గంటి + పెట్టు) గంటిపడఁ జేయు.

(బొట్టిపెట్టు)

క. నేఁటి కిది గంటివెట్టఁగ, నేటికి నీ బోయ వింట నిడ్డనరము లీ, పూఁటఁ గడపఁ జాలవె యొక, నాఁటం బ్రాణంబు సనునె నవసినమాత్రన్. కేయూర. ౩. ౧౪౩.

**గంటీలు=గంట్లు.** (క. గంట) వి. బ. కర్ణవేష్టనవిశేషము, ఒకవిధ మగు చెవిప్రోఁగులు.

సీ...ప్రోఁ గన గర్ణవేష్టనసంజ్ఞయై వెలయుఁ దద్వి, శేషాభిధానమై చెలఁగు గంటీ లొంట్లుపోఁగులు చౌకట్లు నాఁగ...ఆం. భా. ౨.౧౪౯.

గీ. గిలుకుమట్టెలు గంటీలు జిలుఁగురవిక, సన్నపూవేయికన్నులచలువచీర, పసిమిఁ జిల్కెడు ముంజేతిపచ్చ లమర, దుడ్డెతనమునఁ దిరుగాడు రెడ్డిసాని. హంస. ౪. ౧౩౯. నవనాథ. ౧. ౫౭ పా. ౧౬ పం.

**గంటు.** స. క్రి. గాయపఱచు, గాయము గలవానిని గాఁ జేయు.

ఉ. వేఁదుఱుగొన్నమానవుని వేమఱు గంటియు బిట్టు కాల్చియున్, మోఁదియు నీటఁ ద్రొక్కియును మున్కొని తీర్పఁ గడంగువెజ్జునట్లు ... నృసిం. ౫. ౧౨.

వి. (సం. గ్రంథిః. క. గంటు) ౧. గంటి, గాయము, క్షతము.

సీ. చికిలిచందురకావిచిగురాకుమనుమోవి నంటిన మొనపంటిగంటుఁ జూచి. శుక. ౧. ౨౨౬.

౨. ముడి, గ్రంథి.

(క) హృదయగ్రంథి.

ఉ. దగదగ మంచుఁ గ్రొమ్మెఱుఁగుదండము ల్పై వడి గంటు లాఱుచుం, బగుల మనంబు చింపుకొని మానిని విద్య యనంగఁ బుట్టి ... ప్రబోధ. ౫. ౧౦౯.

సీ. బంధత్రయంబునఁ బవనంబు మధ్యమనాళిమార్గమునకు నూలుకొలిపి, గంటు లాఱుఁ బగుల్పఁగడు హెమ్మవహ్నిచే మీఁదికుండలికన్య మేలుకొలిపి. వరాహ. ౧౦. ౫౪.

(చ)-వెండ్రుకల-ముడి.

ఆ. బలియుఁ డపుడు వెండ్రుకలు పాచి ముడిచి గం, టెసఁగఁ దాల్చి వీరరసికవృత్తి, నుద్ధతుండు మల్లయుద్ధప్రసాధనం, బమర నిలిచె వేడ్క నమితబలుఁడు. భార. సభా. ౧. ౨౦౦.

గీ. తోయజానన మతియొార్తు ధూప మొసఁగి, గోవజవ్వాది పంకించి కురులు దువ్వి, గంటుగా వైచి...పార్వ. ౫. ౧౨౯.

(ట) సంచియొక్క-ముడి.

మ... పెలుచం గంటు ఫుటుక్కునం దునిసి వేపృథ్వీం బడెం జాలె... ఆము. ౪. ౩.

౩. గనుపు, పర్వము.

సీ...కన్ను కనుపు గంటు గను పంచనఁగఁ బర్వ, మనను...ఆం. భా. ౨. ౭౪.

జ: గంటి, గంటిపఱుచు, గంటిపడు, గంటివెట్టు, గంటువెట్టు, గంట్లకచోరము, గంట్లకానుగు.

**గంటుబారంగి.** వి. (క. గంటుబారంగి.) బారంగి, భార్ఙి, ఓషధివిశేషము ?.

గీ ... బారంగి గంటుబారంగియుఁ జెఱుతేఁకనఁగ భార్ఙి వెలయును...ఆం. భా. ౨. ౫౪.

**గంటువెట్టు.** స. క్రి. (గంటు + పెట్టు) ముడివడఁ జేయు, ముడుచుకొను.

వ. ఏనిట్టిదాని వినం జాల ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గన లేచి పోయె. భార. ఉద్యో. ౩. ౮౩.

శా. చన్నె వానిపరాభవంబునకు నుత్సాహంబు సేయంగ నీ, కన్నన్ మోములు గంటువెట్టు

కొని రోషాయత్తుఁడై యత్తఱిక౯. నిర్వ. 3. ౧౦౭.

**గంటె**[1]. వి. గరిఁటె.

గీ...గంటె గరిఁటె నా మనును గంబి ... ఆం. భా. ౨. ౨౮౩.

ఆ. గంగిగోవుపాలు గంటెఁడైనను జాలు. వేమ. ౧. ౧౦౫.

**గంటె**[2]. వి. సజ్జపైరు, సస్యవిశేషము. ?.

వ...గంటెకొఱ్ఱలుచును...భీమ. 3. ౫౭.

బ. సజ్జలు, ధాన్యవిశేషము.

**గంటెకామ.** వి. ఒకానొకచెట్టు. (శ.ర.)

**గంట్లకచోరము.** వి. (√ గంటు.) షడ్గ్రంథికి. (శ.ర.)

**గంట్లకానుగు.** వి. (√ గంటు.) షడ్గ్రంథము, ఒకజాతికానుగు ?. (శ.ర, చిం. ని.)

**గంట్లము.** వి. గర్భిణులకు పెట్టునూడిద ?

సీ. పూలతేనెలయందుఁ జాలాలిగోర్వంకపిండు గంట్లంబులు పెట్టి పెట్టి. యయా. ౪. ౨౫. (శ.ర. పా-గెంట్లంబులు. ముద్రి. ఇంకను విచార్యము.)

**గంట్లు.** వి. బ=గంటీలు. (చూ. అనంతునిగంట్లు.)

**గండ**[1]. వి. (సం. గండః. క. గండ=౧. శూరుఁడు. ౨. మగఁడు. త. కండన్=౧. శూరుఁడు. ౨. మగఁడు) శూరుఁడు, వీరుఁడు; మగఁడు.

ఉభయరగండ (గండఁడు)=గజపతులకు అశ్వపతులకు మగఁడు.

సీ. విమలకీర్తిప్రతాపములు నీచే సమకట్టునే యుభయరగండబిరుద. నరస. ౫. ౨౦.

చ. ఉభయరగండ తావకరణోగ్రజయానకము ల్గుభుల్గుభుల్గుభు లని మ్రోయఁగా భవదకుంఠితవీరభటు ల్ప్రభుల్ప్రభుల్ప్రభులని శత్రుభూపతులపైఁ జోరఁబాఱ నెడ న్విభుల్విభు, ల్విభు లని సంభ్రమింపుదురు వేడ్కృ నఖర్వసువర్వభామినుల్. నరస. ౨. ౭౫.

మూరురాయరగండ (గండఁడు)=గజపతులకు అశ్వపతులకు నరపతులకు మగఁడు.

గీ. మూరురాయరగండపెండారమణిమ, రీదిరిం చోలిఁ గలయు నావృతము లగుచు, నంకపాళి నటద్దుకూలాంచలములు, చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీ వహింప. మనుచ. ౧. ౧౨.

గండరగండ(గండఁడు)=శూరులకెల్ల శూరుఁడు.

గీ...మేనగట్టురాకన్నియయును, గలుగుజగముల గండరగండవేల్పు. అచ్చ. రా. యు. ౫౯౦. నరస. ౫. ౨౦.

జ: గండకత్తెర, గండగొడ్డలి, గండగొడ్డలితాల్పు, గండపెండరము, గండపెండారము, గండపెండెము, గండపెండెరము.

**గండ**[2]. వి. మ్రొక్కుబడి. (చూ. గండదల, గండదీపము.)

జ: గండదల, గండదీపము.

**గండఁడు**=గండ1.

(శూరుఁడు, వీరుఁడు; మగఁడు)

క. గండఁడు శంభుద్రోహర, గండఁడు మహినన్యదైవగండరులకుఁ దా, మిండఁ డగువీరభద్రుఁడు, దండెత్తె...వీర. ౫. ౭౯. (ద్రోహరగండఁడు=ద్రోహులకు మగఁడు-రెండర్థములకు నిదే యుదాహరణము.)

**గండకత్తెర.** వి. (గండ1 + కత్తెర.) మెడను కత్తిరించుకొనెడి యొకవిధమైనకత్తెర; వాఁడియైన కత్తెర.

క. ఈ మెయిఁ గుగండకత్తెర, చే మిడిదల యిచ్చు సాహసికుఁడు శిరం బల్లే మగుడఁగ నదుకుకొనం, గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁగినవానిక౯. కళా. ౬. ౮౩.

ద్వి. దండి పెద్దలమనో ధైర్యంపులతకు, గండకత్తెర
దీనికలికివాఙ్మ్రు. విష్ణుమాయావిలాసము. ౪. (౪.౪.)

**గండకము.** సం. వి. అ. పుం. ౧. ఒకవిధమైనశిశుభూషణము, పులిగోరుపదకము. ౨. ఖడ్గమృగము. ౩. అంతరాయము. ౪. విద్యాభేదము. (మే. ని.) ౫. అశ్వకంఠాలంకారము. (వై. ని.) ౬. శకులార్భకము, చేఁపపిల్ల.

ఆ. కన్నతల్లి కన్నఁ గరుణ తే దొకవేళఁ, బట్టిఁ బట్టి తివియుఁ బార్థివేంద్ర, గండకముల కిట్టి గండముల్ గల విఁ కే, మనఁగ వచ్చు నెట్లు మనఁగవచ్చు. దశా.౧. ౧౩౬.

**గండకి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గంగానదికి ఉపనదియగుఒకయేఱు. ౨. ఆఁడుఖడ్గమృగము.

**గండకీపుత్రము.** సం. వి. అ.పుం. సాలగ్రామశిల.

**గండకుసుమము.** సం. వి. అ. న. ఏనుఁగుచెక్కిలినుండికాఱుమదము.

**గండగొడ్డలి.** వి. దే. (గండ[1] + గొడ్డలి. త. కండకోడలి.)

సీ. పులులమొత్తంబుల బోనులఁ జొరఁ దోలి గండగొడ్డండ్లచేఁ జెంపి చెండి. రసిక. ౧. ౧౧౦.

ద్వి. గండగొడ్డట రాజకంఠనాళములు, చెండి చెండాడివైచినబడలికయు. ద్వి. పరమ. ౨. ౧౨౪ పా. ౧ పం.

సీ. ఖండపరశు వొప్పు గండగొడ్డలి యన...ఆం. భా. ౨. ౨౧౬. (ప్రాఁతప్రతిపా.)

ఇ: గండగొడ్డలితాల్పు.

**గండగొడ్డలితాల్పు.** వి. (గండగొడ్డలి + తాల్పు) పరశురాముఁడు.

సీ. బలురాచమిన్నపోఁజాల బిట్టు నెఱవినగండగొడ్డలితాల్పు గండడంచె. అచ్చ. రా. యు. ౨౨.

**గండగ్రామము.** సం. వి. అ. పుం. పెద్దగ్రామము. (విల్యమ్సు)

**గండతల.** వి.(గండ[2] + తల.) మ్రొక్కుబడికి ఇచ్చెడితల, బలిగా ఇచ్చెడితల.

సీ. మును బావమఱఁదు లిమ్ముల నంబికకు గండతల లియ్య నిరువురతరుణు లపుడు, ప్రార్థింప నద్దేవి ప్రత్యక్షమై వీరిప్రాణంబు లిచ్చెదఁ బాసియున్న,బొందులు దలలును బొందింపుఁ డనిన...భోజరా. ౫. ౨౪౯.

**గండదీపము.** మి. వి. (గండ[2] + దీపము) మ్రొక్కుబడిదీపము.

క. ఆనాఁటఁ జూచి తలవరు, లే నెలఁతయు గండదీప మెత్తఁగ వచ్చెన్, బోని మ్మని కనుఁగొన నమ్మానిని గుడి సొచ్చి కనియె మగనిన్ మగువన్. శుక. ౨. ౪౯౫.

**గండపెండరము**=గండపెండారము.

సీ. పొసఁగ నొదలల హొన్నొప్పమిడికమ్ములఁ బూని డాకాల గండపెండర మమర్చి.అచ్చ.రా. యు. ౨౦౩.

గీ. పెద్దపీతాంబరము గండపెండరంబు.దశా. ౬. ౨౫౦.

**గండపెండారము**=గండపెండరము, గండపెండెరము, గండపెండెము. (గండ[1] + పెండారము.) వి. శూరులు కవులు మొదలగువారు కాలను బిరుదుగా ధరించెడుఅందె.

సీ. డాకాలిగండపెండారంబుదాపున బొమ్మలై వైరిభూభుజాలు వ్రేల. కాశీ. ౧. ౪౫.

సీ. జేజేలయెకిమీలఁ జెక్కినగండపెండారంబు పదమునన్ గండుమీఱ. దశా.౩.౧౯౮.

**గండపెండె(డేము)ము**=గండపెండారము.

సీ. తొలువేల్పురాప్రతిమలచెక్కడపుగండపెండెంబు డాకాల దండిఁ జూప. ఉ. రా. ౨. ౪౨, పా. ౨౯౮.

**గండపెండె(డే)రము**=గండపెండారము. (క.గం డపెండేర.) అము. ౬. ౫౭.
సీ. దండగా మగరాలు దాపినబలితంపుగండపెం డెరము డాకాలఁ గ్రాల. రసిక. ౧. ౪౭.
సీ. బిరుదైవకవిగండపెండేరమున కీవె తగు దని తానె పాదమునఁ దొడిగె.(పెద్దనచాటువు)

**గండభేరుండము.** సం. వి. అ. పుం. ౧. రెండుతలలు మూఁడుకన్నులును గల పక్షివిశేషము. (సంస్కృ తనిఘంటువులందు భేరుండశబ్దమే కాని యీశ బ్దము కనఁబడదు)
శ్లో. వజ్రతుండం వజ్రనఖం వజ్రపక్షం మహాబ లం, గండభేరుండవదనం ద్విశిర్షంభీమవిక్ర మం. జ్వాలాకరాళవదనం త్రినేత్రం శత్రు నాశనం, అనేకకోటిశరభాక్ భక్షయంతం ముహుర్ముహుః ఏవం ధ్యాయేన్మహావిష్ణుం గం డభేరుండరూపిణమ్). మంత్రశాస్త్రము.)
౨. మృగవిశేషము.
వ. మఱియు సింహాబుషభశార్దూలగండభేరుండ భల్లూకవరాహాదిమృగంబుల నఖండపరాక్ర మంబున ఖండించి...రుక్మా. ౩. ౧౦౦.

**గండమాల.** సం. వి. అ. స్త్రీ. మెడమట్టు గడ్డలు లే చెడివ్యాధివిశేషము.

**గండమాలము.** సం. వి. అ. పుం=గండమాల.

**గండము.** సం. వి. అ. పుం. ౧. కపోలము, చెక్కిలి. ౨. ఏనుఁగుచెక్కిలి. ౩. బుద్బుదము, నీటిమీఁది బుగ్గ.౪. పొక్కు; కులుపు; పుండు; కాయ, కిణము. ౫.గుఱుతు. ౬.ఖడ్గమృగము. ౭. అశ్వకంఠభూష ణము. ౮. (జ్యోతి) అశ్విన్యాదినక్షత్రములదుష్ట ఘటికలు. ౯. దుష్టనక్షత్రఘటికాజననమునఁ గ లుగుహాని. (ఉదా: మాతృగండము, పితృగండ ము, మొ.) ౧౦. గుండ్రాయి. ౧౧. (జ్యోతి) వి ష్కంభాదియోగములలో పదియవది. ౧౨. కవ చము. ౧౩. పుంశేఁడుగవ్వలు, నాలుగుగవ్వలు. (శే. ని.) ౧౪. గర్వము. ౧౫. (నాటక)వీథ్యంగ ములలో నొకటి. విశే. ప్రశస్తము, శ్రేష్ఠము. (ఇ దిసమాసమందే-విల్యమ్సు)

**గండమూర్ఖుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) అతిమూ ర్ఖుఁడు.(విల్యమ్సు)

**గండరించు.** స. క్రి. (√ గండరువు)-పడియచ్చు మున్నగువానిచే విగ్రహాదులను-నిర్మించు, రచిం చు, చేయు.
క. పరువడిఁ గులగిరులిడి వా,ిరుహాసనుఁ డొనరి గండరించెనొకో నాఁ,గర మమరి తత్పురం బున, నురుతరమణిహర్మ్యనికర మొలి వెలుం గుఁ. కు. సం. ౭. ౫౪౩.
గీ...ప్రళయకాలానలమున,గండరించినరూపం బుకరణి భీముఁ, డతిభయంకరాకారత నతిశ యిల్లె. భార. విరా. ౨. ౧౩౪.
సీ. కాంచనమణిగణచంచలరోచులఁ గాంతనె మ్మోముగా గండరించి. విక్ర. ౭. ౪౪. మా ర్క. ౩.౫౩. (శ. ర. పా-సంతరించి.ముద్రి)
అ. క్రి. ఉదయించు, పుట్టు.
సీ. నిండుఁబున్నమనాఁడు గండరించినచంద్ర మండలశ్రీలతో మాఱుమలయు, భద్రవిద్యో తాతపత్రంబు గ్రాలుచు మిన్నేటికరఁగల మెలుపుగోలువ ... గీ. సాటి సెప్పంగ రాని రాజసముతోడ, నింద్రుఁ డొప్పారె వైభవ సాంద్రుఁ డగుచు. భాగ. ౬. ౨౬౦.

**గండరుఁడు**=గండఁడు?
క...మహి నన్యదైవగండరులకుఁ దా,మిండఁ డ గువీరభద్రుఁడు, దండెత్తె...వీర. ౪. ౭౫.
(ఇట సంస్కృతసమాసమున ప్రయోగింపఁబడినది.)

**గండరులు.** వి. బ. ( సం. ఖండః ? )తునుకలు. (శ. ర.)

**గండరువు**=గండారము. వి. పడియచ్చు, ఒత్తి రూ పమేర్పడుచుటకై తొలిచి చేసినయచ్చు; అట్టి యచ్చునఁ దీసినప్రతికృతి.

క. కరువున గండరువునఁ జి,త్తరువున నినచంద్ర
రుచులఁ దారలరుచులన్, హరిహరధాత్రాదుల
కీ,హరిణమునకురూపు వడయ నలవియె యెం
దున్. భా. రా. అర. ౨. ౩౩.

క. వెన్నెలపోఁతపనులో యన, వెన్నెలగండరు
వుపనులవిధమున మీఁదన్, వెన్నెలనీరు వఱ
పి రనఁ, గన్నుల కింపొసఁగె నిల సకలరూప
ములున్. నిర్వ. ౬. ౫౩.

చ. కరువునఁ జేసిరో విధునికాంతి సుధాబ్ధిసరం
గఁ దెచ్చి గం,డరు వొనరించిరో హరుజ
టాస్థలికిం దొడ వైనయేటిపెన్నురువునఁ జే
సిరో యన మనోజ్ఞసితచ్ఛవి నుల్లసిల్లుసుం,దర
తురగోత్తమంబు దవుదవ్వులఁ గాంచిరి చా
రులోచనల్. భార. అను. ౧. ౧౮౩.

**గండవడము**=కండవడము. (శ. ర.)

క. ఉండిరి కాంతయుఁ బతియును,గండవడము
మాటునందుఁ గడు నింపులతో, నిండినవే
డ్కలు తనరఁగ, నొండొరులం జూడఁ గ
న్నులవ్విరులూరన్. హంస. ౮. ౬౧. విప్ర.
౪. ౩.

**గండశిల.** సం. వి. ఆ. స్త్రీ పెద్దబండ.

**గండశైలము.** సం. వి. అ. పుం.కొండనుండి జా
రిపడినపెద్దఱాయి.

**గండసాహ్వయ.** సం. వి. ఆ. స్త్రీ. గండకీనది.

**గండాంగము.** సం. వి. అ. పుం. ఖడ్గమృగము.

**గండాడు.** అ. క్రి. (గండు+ఆడు)-మగపని చే
యు-రమించు.

క. చండాలితో ద్విజుం డొగి, గండాడిన వత్స
మున భగము వ్రాసి తగన్, దండువు గొని దే
శంబున,నుండకయుండంగ నడుచు టుచిత
ము పతికిన్. విజ్ఞా. ప్రా. ౧౨౬.

**గండారము**=గండరువు.

ఉ ... అచ్ఛేరువవశంబునుం గదిసి చిత్తరువో క
రువో యనంగ గం,డారపుబొమ్మకో లె నచ
టం గదలించుక లేక యుండఁగన్. ఉ.
హరి. ౧. ౬౦.

వ... గండారంబులబొమ్మలరహిని మానులశేవను
జక్కఁగా మేనుల నినుమంత గదలనీక నిలు
చువారును... ప్రబంధ. ౭౮౮.

**గండారు.** వి. చెఱసాల.

శా. త్రైలుంగొష్ఠులు నేల దారసిలినన్ నెల్లంగరా
కుండఁగా, లోలోఁ ద్రిమ్మరునాలిగాడ్పులు
పగళ్లన్ గేలుఁ బూఁదావులన్, జాలన్
ముచ్చిలిపోవఁ బట్టుకొని పజ్జన్ బచ్చగండా
గ్గలో, సోలన్ గావలిపెట్టె నామని యనన్
జూపట్టెఁ లేఁదోఁటలన్. యయా. ౪. ౮.
(ప్రయోగాంతరము లేదు)

**గండాలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తెల్లగఱికె. ౨. స
ర్పాక్షిలత.

**గండి.** వి. (తు.ను. క.గండి) ౧.రంధ్రము,బిలము.

గీ. సరియ యన గండి యనఁగను సరె యనంగ,బ
డిలి యన దుంక మన రంధ్ర మడరు ... ఆం.
భా. ౧. ౧౪౫.

ఉ. సన్నపుగండి యొక్కటి రసాతలమార్గము
పోలె నివ్వమై...భోజరా. ౫. ౭౫.

వ...నవ్యనారాచభిన్నదేహంబులయి దిగ్గనఁ గ్రొ
గ్గండ్లవలన నెడలురక్తస్యందసందోహంబులతో
...భాగ. ౧౦ పూ.౧౫౪౮. వేం. పంచ. ౩.
౨౦౦.

గండిచేయు=కన్నము కలదిగా చేయు.

గీ. త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు,
బండికల్లుగ నీమేను గండిచేసె, నదియు నల
వాటి తెగటాఱునైతి చంద్ర,యకట గోపి
కయెడ నపథ్యమునఁ జేసి. మనుచ. ౩. ౪౦.

౨. గుంట.

సీ...ఆకురాలుపుగండ్లయందు...మనుచ.౬.౨౭.
ఆము. ౫. ౧౧౭.

౩. సందు, అవకాశము.

ఉ. ...వాయసు వానియమ్ములన్, గీఱఁగ నొండువిండ్లు గొని కివ్వ నెలర్పఁగ జేసి శస్త్రయిం, దీఱద గండి గాంచి నసుతేరిపథంబునఁ బోవ వారికిన్. భార. ద్రో. ౩. ౪౩.

జ: గండిదొంగ.

**గండి.** సం. వి. ఇ. పుం. స్కంధము, వేళ్లు మొదలు కొమ్మలవఱకు నుండు మ్రానిభాగము.

**గండిక**=గండి. (శ. ర.)

**గండిక.** సం. వి. ఆ. స్త్రీ. గులకరాయి.

**గండిదొంగ.** వి. (గండి+దొంగ) కన్నపుదొంగ.

గీ. వీఁడెపో ప్రేలగీముల వెన్నజున్ను, గములఁ గొల్లగ వెక్కునగండిదొంగ. నీలా. ౩. ౫౨.

సీ. ...గండిదొంగవఁ గన్నకాఁడవంగఁ, దగును రంగాకారికస్కరనామంబు... ఆం. భా. ౨. ౨౯౧.

**గండివనము.** వి. (సం. గ్రంథిపర్ణమ్) గ్రంథిపర్ణము ?.

గీ... గ్రంథిపర్ణంబు పొల్పగు గండివనము, నాఁగ ...ఆం. భా. ౨. ౬౨.

**గండీరము.** సం. వి. అ. పుం. ౧. ఏఱువంగ ?. ౨. తురజకూర ?. వ. చిత్తికూర ?.

**గండీరి.** సం. వి. ఈ. స్త్రీ. జెముడు ?.

**గండీరుఁడు.** సం. వి. అ. పుం. శూరుఁడు.

**గండు.** వి. (సం. గండః. క. గండు) ౧. మగతనము, మగటిమి, పౌరుషము; బలము, శక్తి, సామర్థ్యము.

గీ. మగతనంబన గండన మగటిమి యనఁ, బౌరుషంబున శాఖ్యలై పరఁగుచుండు. ఆం. నం. మాన. ౫౭.

క. గండున రాధాతనయుఁడు, రెండు దినంబులు పెనంగి...భార. అశ్వ. ౩. ౧౨౪.

క. పాండవులును బాంచాలురు, దండిమగలు వారు నూడఁ దలఁకక నిన్నున్, భండనమునఁ బడవైవఁగ, గండు గలుగు టద్భుతంబు... భార. స్త్రీ. ౨. ౭౭.

౨. మగజాతిజంతువు, పశుజాతిలో మగది; మగకుక్క.

సీ. గండనఁ బోతనఁ గాను దిర్యక్పుంస, పాఖ్యయౌ...ఆం. భా. ౨. ౧౦౦.

ఆ. గూనివీపు లదుర గొణఁగి తిట్టుచు నేసఁ, గఱచినట్టికుక్క గండ్లనంగ, మూతినరపమీసముల బోయముసళ్లు, పందివలలు మోచి పఱచి రప్పుడు. మనుచ. ౪. ౩౬.

క. ఒడ లుబ్బ నిక్కి ముంపతి, యడుగులు ధర నూఁది చిందునలబలమునకున్, జడియక కొరగ ల్చిగండె, క్కడుఁగడిమిన్ దివిచెఁ గ్రుంగి కొమ్ములయుడుముల్. మనుచ. ౪. ౫౩.

చ. ...నులివెచ్చపెన్నురువు నెత్తురు ద్రావుచు వేఁటదీర్పఁగాఁ, బులితలగుండుగండఁ డనఁ బొల్చినగం డిది భూవరోత్తమా. చంద్రా. ౨. ౭౫.

౩. గర్వము.

ఉ. ...దుర్దమదోర్బలు లమ్మహాత్మకుల్, గండున బెట్టు పైఁబడుట కార్యము గాదు ... భార. సౌ. ౧. ౨౨.

సీ. ఒండు చూడండు మూర్ఖుండు మండు నటంచుఁ దొండమై గండాఱియుండె ధనదుఁడు ... ఉ. రా. ౩. ౧౪౧.

౪. కోపము.

గీ. అని గయాళించి కొనుచు హస్తాంబుజముల, నలరుపాపని దురదుర నరిగి తొట్ల, లోనఁ బడవైచి మొగమునఁ బూనుగండు, తోడ బొమముడి నిగుడ నత్తోయజాక్షి. శుక. ౪. ౪౩.

విశే. మగజాతిది, మగది.

ఉదా: గండుఁదుమ్మెద, గండుమీను, గండుఁబిల్లి.

సీ. చంచులఁ జిగురాకుఁ జించి యాడుచు నలి కెలుఁగించుగండుఁగోయిలలసొంపు. భార. అను. ౧. ౧౮౧.

గండడఁగు=బలహీనుఁ డగు.

క... భీమసేనుఁ దాఁకి...నొంచిన, గండడఁగక యతఁడు...భార. ద్రో. ౪. ౧౫౩.

గండడఁగించు=గండడఁచు, నశింపఁజేయు.

చ... కైటభదానవభేది యంతరం,గము వెడలించెఁ గాని నిను గండడఁ,గింపకపోయె నిందిరారమణిఁ దలంచి రాత్రిచర రాగనిమగ్నుల కేడ ధర్మముల్. వసు. ౪. ౩౨.

చ... క్రోధకామముల గఁడడఁగించి...ఉ. హరి. ౪. ౮౭.

గండడఁచు=ఓడించు,లొంగఁదీయు.

సీ. ఎదిరించుకరికైన బెదరించువారికైన గండడంపఁగఁ జాలుగుండెదిటము. ఇందు. ౧. ౧౫౨.

గండుమిగులు=విజృంభించు; ఒప్పు.

క. పాండవపాంచాలాదులు, గండుమిగిలి బెట్టు దలుమఁ గౌరవబల మొం,డొండ కలంగెడు నది నీ,గండితనము సూపి కావఁ దగుతఱి వచ్చెన్. భార. ద్రో. ౫. ౯౫.

వ... శిఖండి గాంగేయునకుఁ గట్టెదురుగా నిలిచి గండుమిగిలి యొప్పె ... భార. భీష్మ. ౧. ౧౩౦.

సీ. వికటాస్థిహారముల్ విషధరమాలికల్ గజచర్మవసనంబు గండుమిగుల... గీ... మదమత్తవృషభ మెక్కి,యుద్రుఁ డీవేళ మెలఁగెడు రౌద్రముగను. దశా. ౩. ౫౨.

గండుమీఱు=శక్తిహెచ్చు.

వ... అమ్మహాభాగుండు గండుమీఱి... తనుచ్ఛాయాపూరంబున నక్కానన వెలింగించుచు ... మనుచ. ౨. ౭౭.

గండుమెఱయు=గండుమిగులు.

వ. విండుకెలమగండు గండుమెఱసి యేతేరఁ జేతి చూచినతో గవగువ... రాజ. చ. ౩. ౧౪౨.

వ. అన్నలుండు ... సంపూర్ణపూర్ణిమాచంద్రబింబు విడంబింపం జాలుకెమ్మొగంబునకుం గళంకాలంకారశంక నంకురింపంజేయం జాలుకోమలశ్మశ్రురాజి విరాజిల్లం గండుమెఱసి... నైష. ౧. ౫౭.

జ: గండాడు, గఁడుతాయి, గండువావిలి.

గండుఁడు. సం. ౯. అ. పుం. పూరుఁడు. (శే. ని.)

గండుతాయి. వి. (గఁడు+తాయి) మగతాయి, వజ్రము.

సీ. గండుతానిగ్గుచొకాటంపుమొగముట్టుతోగకేఁకలపతాణి దుమికి యాడ. ఉ. హరిశ్చ. ౩. ౧౩౧.

గండువావిలి. వి. (గండు+వావిలి.) వృక్షవిశేషము.

సీ. కలుజువ్వి వావిలి గండువావిలి యేఱుమద్దిమద్దియును...హంస. ౪. ౧౧.

గండువు. సం. వి. ఉ. పుం. ఉ, ఊ స్త్రీ. తలగడ.

గండూపదభవము. సం. వి. అ. న. సీసము. (కల్ప)

గండూపదము. సం. వి. అ పుం. కించులుకము, ఎఱ్ఱ, వానపాము.

గండూపది. సం. వి. ఈ. స్త్రీ. శిలి, ఆఁడువానపాము.

గండూష. సం. వి. అ. స్త్రీ=గండూషము. (శే.ని)

గండూషము. సం. వి. అ. పుం. న. ౧. పుక్కిలింత. ౨. పుడిసిలి. ౩. ఏనుఁగుతొండము చివర. (వై. ని.)

గండూషించు. సం. స. క్రి. పుక్కిలించు.

వ... కాదంబరి గండూషించి...మనుచ. ౩. ౭౮.

గండె=గండె. వి. (సం. గడః. తి. కెండై) మత్స్యవిశేషము; మత్స్యము.

ఉ... పిత్తడికాను మల్లుమీ, వల్లెయు గండెరొ

య్య పర కాదిగఁ జేపలఁ బట్టి... ప్రబంధ. ౧౯౫.

గీ. తాను సురపానిన్నృపతనుల్ దాల్చి యకట, కామినీతతి నుడికించుకంటె నట్టె, గండోయును నల్ల దాసరి గాఁడుఁ గిరియు,హరియు నై పో వ్రటయ మంచి దనుయుగంబు. అను. ౫.౯౧.

**గండోలము.** సం. వి. అ. పుం. ౧. గుడము, బెల్లము. ౨. గుడకము, బెల్లముతో వండిన ఔషధవిశేషము. ౩. కబళము, నోరుపట్టుముద్ద.

**గండోలి.** సం. వి. ఈ. స్త్రీ. కసుఁదురికఁ. (వై.ని.)

**గండ్ర¹.** విశే. ౧. ధృష్టుఁడు. (శ.ర, వా.) ౨. పెద్దది. (చూ. గండ్రచీమ.) బ. ౧. పరుషము.

శా. తండ్రీ నాకు ననుగ్రహింపఁగద నైద్యం బంచుఁ బ్రార్థించినన్, గండ్రల్ గా నటు లాడి ధిక్కృతులఁ బోకాల్నంటివి...మనుచ. ౫. ౧౭.

౨ గట్టివి, పొల్లుకానివి.

గీ. నుఱిపి తూర్పెత్తి కడలకు బిరుసు దిగిచి, గండ్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి. శివధ. ౫. ౮.

జ: గండ్రచీమ, గండ్రనూఁక.

**గండ్ర².** వి. (సం. ఖండః.) ఖండము, ముక్క.

సీ.గనె గండ్ర గండ్రిక గనియ యటంచన నిష్వాదిఖండము లెన్నఁదగును. ఆం. భా. ౨. ౬౫.

ద్వి. గండ్రలుగాఁ గొట్టెఁ గాళ్లను ... పండితా. పురా. ౯౬ పా. అని. ౯. ౮౫.

జ: గండ్రించు.

**గండ్రచీమ.** వి. (గండ్ర¹ + చీమ) ఉలంకలము, పెద్దనల్లచీమ. (శ. ర.)

**గండ్రనూఁక.** వి. (గండ్ర¹ + నూఁక) పెద్దనూఁక, పెద్దతండులఖండము. (వా)

**గండ్రపురి.** వి. పోటికత్తి ? (గాయపడినవానికిఁ జేయు ఉపచారము.) సీ. పతయాసు వగుబొంది పడకుండుటకు గండ్రపురి లిచ్చుగతిఁ జాలఁ బొత్తులునిచి. పాంచు. ౩. ౫౬. (గండ్రపురి=ఊఁతకోల-వ్యాఖ్య)

**గండ్రించు.** స. క్రి. (√ గండ్ర²) ఖండించు, నఱకు, గండ్రలుగాఁ జేయు.

క...వానితల యిలఁ గూలం, గండ్రించువేల్పుపగతుం, డింద్రగమారయ్య నితని నెన్నఁగఁ దరమే. చెన్న. ౫. ౨౫౦.

**గండ్రిక=గండ్ర².** వి. (సం. ఖండకః) ఖండము, ముక్క.

స్రగ్ధర...గండ్రికల్ చేసి నేలన్, నిండించెన్ దుష్ప్రలన్ బన్నిదమున గొకటిన్ లేక యుండంగ నచ్చోన్. యయా. ౨. ౩౨.

సీ.గనె గండ్ర గండ్రిక గనియ యటంచన నిష్వాదిఖండము లెన్నఁదగును. ఆం. భా. ౨. ౬౫.

**గంత.** వి. (సం. కంథా. త. కంథై. క. కంతె.) ౧. కంథ, బొంత.

గీ...కంథ మీఁఱు బొంత,గంతన... ఆం. భా. ౨. ౧౫౮.

౨. చినిఁగినవలువ.

ద్వి.ఇంతవానికి నీవు నిటు నూది పూని,గంత బొంతయుఁ గుట్టఁగారణం బేమి. ద్వి. పరమ. ౨. ౮౪ పా. (చి. ని. పా.)

౩.ఎద్దులు లోనగువానిమీఁద వేయుగోనె, మెత్త. (నందివాహనవర్ణనము.) ద్వి. పస మించుమువ్వలుఁ బసిఁడిగంటలును, బసిదిండిగంతయుఁ బాఁపపట్టెడయు...కలిగి...ద్వి. పరమ. ౨. ౭౬ పా.

౪. కనఁబడకుండ ఎద్దులకన్నులకు కట్టెడుచర్మాదికము, కనుమూఁత.

(వ్యవ) ఎద్దుకు గంతలుగట్టి గానుఁగ గాడించుదురు.

సా:గంతకుఁ దగినబొంత:- దేనికిఁ దగినది దానికి దొరకు నని భావము.

క. భోగేచ్ఛ నాకుఁ గల్గిన, నీగతిఁ జరియింప నేటి కింటనె యున్నాఁ, డాగడ మున్నిటివిట సం,భోగము గంతలకుఁ దగినబొంతలు లేవే. వైజ. ౨. ౧౦౧.

ంత. సం. విణ. (ఋ. త్రి. ఋ) ౧. పోవువాఁడు. ౨. పొందువాఁడు.

ంతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పొంద దగినది.

ంతు[1]. వి. (క. గంతు) ప్లుతగతి భేదము.

గీ... ప్లుతగతి భేదంబు జంగ గంతు,దాఁటు పల్లటీ దుముకు నాఁ దనరు... ఆం.భా.౨.౧౯౭.

వ... త్రుళ్లి గంతు లిడుగబ్బి బెబ్బులులనలఁగుడుల ... మనుచ. ౪. ౩౭.

చ... కనీనికాద్యుతులు గంతులువైవ ... గంధ. ౪౩.

ఉ... గంతుల,స్తోకత వేసి యొక్కయెడఁ జూచి సమగ్రపుదృష్టి లేకయే,కాకవి కావుకావుమని కాకవిధంబు వహించు నిద్ధరన్. ఇందు. ౧. ౧౩.

బ. త్రుళ్లు, మిడిసిపాటు.

మానిని. అంత మదింపకువే యని పల్కిన నంత మదింపకువే యనుచున్, గంతు లడంచెద లెమ్మని పల్కిన గంతు లడంచెద లెమ్మనుచున్. కళా. ౩. ౧౯౫.

(చంద్రోపాలంభము) ఉ... పూర్వపతత్పుపుం, గంతుల కేమి చూచెదవుగా తుది నీబహుళార్తి భేదముల్. వసు. ౪. ౭౭.

(సూర్యాస్తమయవర్ణనము) ఉ... రథాంగపంక్తికిన్, గంతులు దీరె నుత్పలవనంబుల నాడఁగఁ జేరె భృంగముల్. వాల్మీకి. ౩. ౯౭.

గంతుఁబరువు = గంతులు వేయుచుపరుగెత్తుపరుగు.

క. ఆచీకటి వెనుతగిలినఁ,బ్రాచీదిశనుండి గంతుఁబరువున రవి ధ,ర్మాచలముమిఁక త్రోవను, వేచని యెం గాక... భాగ. ౧౦ పూ. ౧౭౯౩.

జ: గంతుగొను.

గంతు[2]. వి. సమూహము, గుంపు.

ఆ. కత్తిగొంటు లైనయత్తగంతు. కు. సం. ౭. ౧౩౫.

రగడ. కలికి కలికిలతలను దుష్టమృగగంతుగంతులు చూడు... వాల్మీకి. ౩. ౧౧౪.

గంతుగొను. అ. క్రి. (గంతు[1] + కొను) ౧. దుముకు, దాఁటు.

వచనమయూరము ... రక్కసులు సిగ్గడిగి భూమిన్, గంతుగొని పాఱి రవకారవము లాగ్న్యన్. భాగ. ౬. ౩౭౭.

క... ధరణికి, గంతుగొనె న్వడిని బంక్తికంధరుఁ డలుకన్. మొ. రా. యు. ౨. ౩౭.

౨. చచ్చు.

మ... గిట్టెన్ పులు ల్సింగముల్, కడగొట్టెన్ మనుఁబిల్లు గంతుగొనె ... సారంగ. ౧. ౧౦౭. ఆం. సం. మాన. ౫౩. ఆం. భా. ౩. ౭౭.

గంతువు. సం. వి. ఉ. పుం. పోవువాఁడు, వెళ్లువాఁడు.

గంత్రి. సం. వి. ఈ. స్త్రీ. కంబలావృతరథము. (వై. ని.)

గందపట్టె[1](ట్టియ). వి. (సం. స్కంధపట్టికా. ప్రా. ఖంధపట్టిఆ. క. గందపట్టిగె.) తలుపుమీఁద నమర్చబడియడ్డుకొయ్య.

గీ... గంద, పట్టె నా స్కంధపట్టిక పఱలు ... ఆం. భా. ౨. ౭౧.

మ... అధాత్రీపువత్సకవా,టముపై నె ప్డొగిఁ గందపట్టెగతి నుండన్ నాడుకే ల్సేర్చుటల్. కళా. ౭. ౧౧౦.

క. బలిసద్మద్వారేంద్రోపలఫలకకవాట మనఁగఁ బరఁగె సగని యార్తుల గందపట్టియలుగాఁ, జెలఁగు... చంద్ర. ౪. ౭౬.

**గందపట్టె²(ట్టియ).** వి. (గందము + పట్టె) గం దముతోఁ బెట్టినరేఖ.

గీ. ఉదుటుగుబ్బలు గలతల్పుటురము నూఁచి, గం దపట్టెలు నూఁచి బంగారు నూఁచి, వీటివాకిటి చోటునే విడువ కెపుడు, నుట్లువెట్టుచు నుం దురు సోమరవులు. ఆము. ౨. ౧౦.

గీ. గందపట్టె యనంగను జందనాను, లేపనకవా టవట్టికల్ మీఱు ... ఆం. భా. ౩. ౫౮.

(ఇవి 'గందపట్టె¹'కుఁ గూడఁ బ్రమాణములు.)

**గందపుఁగొండ.** వి. (గందము+కొండ) మలయా చలము.

చ. ...అ,య్యాళికచ సేదఁదేర్చె నపు డందపుగంద పుఁగొండపయ్యెరల్. రా. వి. ౩. ౭౦.

ఇట్లే గందపుమెట్టు, మొ. ప్రబంధ. ౮౭.

**గందపుమ్రాను.** వి. దే. (గందము+మ్రాను.) చం దనవృక్షము.

చ. వనిచినగుజ్జుమావికలనం దగుగందపుమ్రానికొ మ్మలం, బెనఁగొనియున్నమల్లికలపెక్కువ గ న్గొని...విప్ర. ౩. ౫.

**గందపొ(వొ)డి.** వి. (గందము + పొడి-త. కంద ప్పొడి.) గంధచూర్ణము, బుక్కా.

సీ. బలుకప్పురంపుఁదిప్పలు వితర్దులుగాఁగఁ బు ప్పొడుల్ వలిగందపొడులు గాఁగ. రసిక. ౨. ౧౮.

గీ. ...గంధమార్ణంబు చెలఁగు బుక్కా మనంగ, గందవొడి యనఁగాను బుక్కా యన భవ. ఆం. భా. ౨. ౧౬౨.

సీ. అలరుగుత్తులనిండ నలరుపుప్పొడి గుబ్బకవలపై వలఁదుగందవొడిఁ బోల. చంద్రి. ౨.౭౩.

**గందము.** వి. (సం. గంధః) ౧. చందనవృక్షము.

ద్వి. గందంపుఁగొమ్మలఁ గాలాహి చుట్టు, చందం బునను...ద్వి. పరమ. ౮. ౩౨౯ పా.

౨. చందనపుచెక్క మొదలగునవి అఱుగఁదీయఁ గా వచ్చులేపనద్రవ్యము.

ఉ. గందపుఁబూఁత...శుక. ౨. ౯౬.

గీ. గంద మందంద డెందంబునందు నలఁది. విక్ర. ౮. ౧౫౯.

ఉదా: మంచిగందము, సాంటిగందము, మొ.

౩. వాసన; సువాసన.

ఆ. కంపు గబ్బు గౌలు గందంబు వల పన,గంధ మెప్ప...ఆం. భా. ౧. ౧౦౬.

ఉ. కమ్మనియార్పుగాడుపులగందముఁ గ్రోలఁగ వచ్చి.. పార. ౩. ౭౧.

ఉ...క్రొత్తకప్రపుం,గందముచందముం దెగడుఁ గన్నియకౌమ్మెయితావి...నీలా. ౧. ౫౭.

జ: గందపట్టె², గందపుఁగొండ, గందపుమ్రాను, గందపొడి.

**గందొడివాఁడు.** వి. (తోలుబొమ్మలాటలోని) హా స్యగాఁడు; హాస్యగాఁడు.

సీ. పూల్గట్టుసాతానిబోడి కుంగర మిచ్చు గం దొడివానికి విందు సేయు. హంస. ౫. ౧౩౮.

**గంధకము.** సం. వి. అ. పుం. ఉపధాతువిశేషము, ఒకమందుదినుసు.

**గంధకారి.** సం. వి. ఈ. స్త్రీ. ముసుఁగుఁదామరకీ.

**గంధకారిక.** సం. వి. ఆ. స్త్రీ. వాసనద్రవ్యముల నాయితపఱచుపనికత్తె, సైరంధ్రి.

**గంధకాలి.** సం. వి. ఈ. స్త్రీ. యోజనగంధి, సత్య వతి. (వ్యాసునితల్లి.)

**గంధకాష్ఠము.** సం. వి. అ. న. అగురువు కీ. (త్రి. ని-శంబరచందనము. రా. ని.)

**గంధకుటి.** సం. వి. ఈ. స్త్రీ. మురయనుగంధద్ర వ్యముకీ.

**గంధగజము.** సం. వి. అ. పుం. గజవిశేషము.

శ్లో. యస్యగంధం సమాఘ్రాయ నతిష్ఠన్తి ప్రతిద్వి

పాః, స వై గంధగజో నామ నృపతే ర్విజయావహః. (అ. ని.)

ఇట్లే గంధద్విపము, మొ.

గంధచేలిక. సం. వి. ఆ. స్త్రీ. కస్తూరి (రా. ని, త్రి. ని)

గంధజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. ఘ్రాణేంద్రియము, ముక్కు.

గంధతూర్యము. సం. వి. అ. న. యుద్ధమున వాయింపఁబడు భేరి మొదలగువాద్యము.

గంధతైలము. సం. వి. అ. న. ౧. చందనమునుండి తీసినఅత్తరువు. ౨. సువాసన గలనూనె.

గంధదారువు. సం. వి. ఉ. న. అగలు.

గంధధూళి. సం. వి. ఇ. స్త్రీ. కస్తూరి.

గంధనకులము. సం. వి. అ. పుం. చుంచు. (వాచ)

గంధనము. సం. వి. అ. న. ౧. ఉత్సాహపెట్టుట. ౨. ప్రకాశనము, బయలుపఱచుట. ౩. హింసించుట, బాధించుట. ౪. సూచించుట. ౫. ఉద్వర్తనము, నలుఁగు పెట్టుట.

గంధనాకులి. సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షి.

గంధనాళి. సం. వి. ఈ. స్త్రీ. ముక్కు. (త్రి. ని.)

గంధనిలయ. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిమల్లె.

గంధపత్ర. సం. వి. ఆ. స్త్రీ. శటి, ఒకవిధ మగుక చోరము.

గంధపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అజమోద, ఒకజాతిఓమము. ౨. అశ్వగంధ, పెన్నేరు.

గంధపలాశి. సం. వి. ఈ. స్త్రీ=గంధపత్ర.

గంధపలాశిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. పసుపు. ౨. గంధపత్ర, శటి.

గంధపాషాణము. సం. వి. అ. పుం. గంధకము.

గంధపిశాచిక. సం. వి. ఆ. స్త్రీ. గుగ్గిలము మున్నగువానిధూపము.

గంధపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. నీలి.

గంధపుష్పము. సం. వి. అ. పుం. ౧. వేతసము, ప్రబ్బ. ౨. కేతకము, మొగలి. ౩. అంకోలము, ఊడుగు. ౪. బహువారకము, విరిగి.

గంధఫలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ప్రేంకణము. ౨. సంపెఁగ మొగ్గ.

గంధబంధువు. సం. వి. ఉ. పుం. మామిడి చెట్టు.

గంధమాదనము. సం. విణ. (అ. ఈ. అ.) సుగంధముచే పరవశము చేయునది. వి. అ. పుం. నల్లని పెద్దతుమ్మెద. ౨. గంధకము. పుం. న. ఒకానొక కొండ. (ఇది మేరువునకుఁ దూర్పున నున్నది. సుగంధివనములకు ప్రసిద్ధము.) న. గంధమాదనపర్వతమందలి ఒకానొకయడవి.

గంధమాదని. సం. వి. ఈ. స్త్రీ. ౧. మద్యము, సారాయి. ౨. బదనిక.

గంధమాదిని. సం. వి. ఈ. స్త్రీ. ౧. లక్క. ౨. మురయనుగంధద్రవ్యము.

గంధమార్జారము. సం. వి. అ. పుం. ఖట్టాసము, పునుఁగుపిల్లి.

గంధము. సం. వి. అ. పుం. ౧. సువాసన; వాసన. ౨. లేశము, సూక్ష్మాంశము. ౩. గంధకము. ౪. అఱుగఁదీయఁగా వచ్చినలేపనద్రవ్యము, గందము. ౫. సంబంధము. ౬. గర్వము.

గంధమూలము. సం. వి. అ. పుం. కులంజనము.

గంధమూలి. సం. వి. ఈ. స్త్రీ. గంట్లకచోరము.

గంధమూషి. సం. వి. ఈ. స్త్రీ. చుంచు.

గంధమూషికము. సం. వి. అ. పుం. చుంచు. (త్రి. ని.)

గంధమృగము. సం. వి. అ. పుం. ౧. పునుఁగుపిల్లి. ౨. కస్తూరీమృగము.

గంధమోదనము. సం. వి. అ. పుం. గంధకము.

గంధమోహిని. సం. వి. ఈ. స్త్రీ-గంధముచే మోహింపఁజేయునది-సంపెఁగమొగ్గ.

గంధరసము. సం. వి. అ. పుం. బాలెంతబోళము, గోపము.

గంధరసాంగకము. సం. వి. అ. పుం. సరలనిర్యాసము, దేవదారువృక్షముయొక్క బంక.

గంధరాజము. సం. వి. అ. పుం. ౧. ఒకానొకపూలచెట్టు. ౨. ఒకజాతిమల్లె!. ౩. ఒకవిధమైనగుగ్గిలము, కణగుగ్గులువు. ౪. జవాది యనుగంధద్రవ్యము. ౫. చందనపుమ్రాను.

గంధర్వనగరము. సం. వి. అ. న. ౧. గంధర్వుల పురము. ౨. భూమియందు ఎండమావులవలె ఆకాశమందు తోఁచుమిథ్యానగరము. (ఇది కనఁబడినపుడు అశుభము కలుగును.)

ఇట్లే గంధర్వపురము, మొ.

గంధర్వము. సం. వి. అ. పుం. ౧. కడఁతి, ఒకజాతిమృగము. ౨. గుఱ్ఱము. ౩. అంతరాభవసత్త్వము, మరణమునకును తిరిగి జన్మించుటకును మధ్యకాలమున యాతనాశరీరము ధరించినప్రాణి. ౪. మగకోయిల.

గంధర్వవిద్య. సం. వి. ఆ. స్త్రీ. సంగీతవిద్య.

గంధర్వవేదము. సం. వి. అ. పుం. సామవేదోపవేదము, సంగీతమూలగ్రంథము.

గంధర్వహస్తము. సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

గంధర్వుఁడు. సం. వి. అ. పుం. ౧. దేవయోనివిశేషము. ౨. పాటపాడువాఁడు, గాయకుఁడు.

గంధలత. సం. వి. ఆ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము!.

గంధవతి. సం. వి. ఈ. స్త్రీ-గంధము గలది-౧. భూమి, నేల. ౨. మత్స్యగంధి, సత్యవతి. (వ్యాసుని తల్లి.) ౩. మద్యము. ౪. అడవిమల్లె!. ౫. మురయనుగంధద్రవ్యము!. ౬. వాయుదేవునిపురము.

గంధవహ. సం. వి. ఆ. స్త్రీ-గంధమును గ్రహించునది-నాసిక, ముక్కు.

గంధవహాయనము. సం. వి. అ. న. వాతాయనము, గవాక్షము, కిటికీ.

ఉ. వచ్చుతతిం బురాంగనలు వారక నొండొరులాజ్ఞ మీఱి మేల్, మచ్చులు చేరియుం గృహసమంచితగంధవహాయనంబులం, బిచ్చుగ హత్తియుం వెడలి వీథుల రచ్చల బాఱుదీరియుం, ముచ్చట మీఱఁ దద్విభవముం మది మెచ్చుచుఁ జూచుచున్న య్యెడం. ఉ. హరిశ్చ. ౪. ౨౨.

గంధవహుఁడు. సం. వి. అ. పుం-గంధమును కొనిపోవువాఁడు-వాయువు, గాలి.

గంధవాహ. సం=గంధవహ.

గంధవాహము. సం. వి. అ. పుం. కస్తూరీమృగము.

గంధవాహుఁడు. సం=గంధవహుఁడు.

గంధశుండిని. సం. వి. ఈ. స్త్రీ-దుర్గంధము గలముట్టె గలది-గంధమూషి, చుంచు.

గంధశేఖరము. సం. వి. అ. పుం. మృగమదము, కస్తూరి.

గంధసరులు. మి. వి. బ. ధాన్యవిశేషము.

సీ. కుసుమపూరాజనాల్గుత్తిబల్గుత్తులు కస్తూరిపట్టెలు గంధసరులు. గీ ... ఆదియగుపేరు గలుగు వడ్లు...హంస. ౪. ౧౭.

వ...పచ్చదిననసరులు గంధసరులు ముద్దిగంద్రలు ...ప్రబంధ. ౧౧౨.

గంధసారము. సం. వి. అ. పుం. ౧. చందనము!. ౨. ఒకజాతిమల్లె!.

గంధసోమము. సం. వి. అ. న. తెల్లగలువ!.

**గంధహారిక.** సం. వి.ఆ. స్త్రీ. గంధకారిక, సైరంధ్రి.

**గంధాఖువు.** సం. వి. ఉ. పుం. చుంచు.

**గంధాఢ్యము.** సం. విశే. (అ. ఆ. అ) గంధముతో నిండినది. వి. అ. పుం. ౧. చందనవృక్షము. ౨. నారింజ చెట్టు. న. ౧. చందనము. ౨. జవాది యనుగంధద్రవ్యము.

**గంధామ్ల.** సం. వి. ఆ. స్త్రీ. అడవిమాదిఫలము చెట్టు.

**గంధారము.** సం. వి. అ. పుం. ఒకానొక దేశము.

**గంధాశ్మము.** సం. వి. న. పుం. గంధకము.

**గంధి.** సం. విశే. (ఇ) గంధము గలది. (ఉత్, పూతి, సు, సురభి, శబ్దములు పూర్వపదములుగా నున్నట్టిదియును ఉపమానవాచకము పూర్వపదముగా నున్నట్టిదియు నగుపరిమళవాచకగంధశబ్దమునకును ఉత్తరపదమగు అల్పార్థకగంధశబ్దమునకును బహువ్రీహిసమాసమున ఇకారాంతాదేశము (ఱు) 'గంధి' యను రూపము గలుగును - ఉదా : సుగంధి పుష్పము, పద్మగంధి స్త్రీ, ఘృతగంధి భోజనము = నేయి కొంచెము గలభోజనము.) వి. న. పుం. నల్లి.

**గంధికము.** సం. విశే. (అ. ఆ. అ.) గంధము గలది. వి. అ. పుం. గంధకము.

**గంధికుఁడు.** సం. వి. అ. పుం. పరిమళద్రవ్యముల నమ్మువర్తకుఁడు.

**గంధిని.** సం. వి. ఈ. స్త్రీ. మురయనుగంధద్రవ్యము చెట్టు.

**గంధో(ధా)తువు.** సం. వి. ఉ. పుం. పునుఁగుపిల్లి.

**గంధోత్తమ.** సం. వి. ఆ. స్త్రీ. మద్యము, కల్లు.

**గంధోలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కణుఁదుటీఁగ. ౨. కచోరము చెట్టు.

**గంప.** వి. (క. గంపె.) వెదురు లోనగువానితో నల్లినపాత్రము, కండోలము.

చ... పేఁపగంపలఁ, దళ మగుచున్న చెంగలువ దండల... ఆము. ౧. ౭౫.

సీ... కండోల మెసఁగును గంప యనఁగ. ఆం. భా. ౨. ౨౮౦.

జ: గంపపులుఁగు, గంపసిడి.

**గంపపులుఁగు**=గబ్బిలుఁగు. వి (గంప+పులుఁగు) కుక్కుభము, అడవికోడి. (వీనిని గంపలతో తెచ్చి అమ్ముదురు- బ్రా.)

సీ... కుక్కుభంబు గబ్బిలుఁగు గంపపులుఁ గనఁగ, వఱలు... ఆం. భా. ౨. ౯౭.

**గంపసిడి.** వి. ( √ గంప ) గ్రామదేవతకు మ్రొక్కు చెల్లించుటకై మనుష్యుని గంపలోఁ గూర్చుండఁ బెట్టి యూరేఁగించెడుసిడి. (చూ. సిడి.)

**గంబుర(ము)**=కప్పురము.

ఉ. కారు మెఱుంగు రాచిలుక కస్తురిపిల్లె పదాఱువన్నెబంగారము రస్తుకుప్ప తెలిగంబుర వెన్నెలలోనిలేట యొయ్యారపుఁ జెంకి యందము కన్నిటికెం దగుపట్టుఁగొమ్మ సింగారపుఁ గొంతి గ్రైనపుఁ గాంత నయో వయోపెఁ బాయ నేర్తునే. శుక. ౧. ౯౮.

సీ... గంబూర గంబుర గంబురా గంబురమ్ము గంబూర మ్మన మ్మను ఘనసారము... ఆం. భా. ౨. ౧౬౨.

**గంబురా**=కప్పురము.

శా. శ్రీవిన్నాణపుగుబ్బచన్నుల నయారే గంబురా గుప్పి ముక్తావల్లుల్ ఘటియించె దేమి శశికిన్ దారాప్రయుక్తంబనే, భావంబో యని పల్కుకల్కి చెలి సంభావింపఁ గాంచీపురీ, దేవుం డీవుత సీనయార్యమణికిన్ దీర్ఘాయురారోగ్యముల్. శశాం. ౧. ౧. ఆం. భా. ౨. ౧౬౨.

**గంబూర(ము)**=కప్పురము.

సీ. ఏపీట సతులపాలిండ్లపై గంబూర నవహారము లచిప్పకవుచు మాన్చు. ఆము. ౨. ౩.

సీ. మొత్తమై మూరుతాయత్తమై గంబూర మెగయ వితానముల్ బిగియ వలదు. వసు.౧.౧౪౧. ఆం. భా. ౨. ౧౬౨.

జః గంబూరరాజనాలు.

గంబూరరాజనాలు. వి.బ. (√గంబూర) ధాన్యవిశేషము.

సీ. సంపంగెపూవడ్లు జాజిరాజనములు గంబూరరాజనాల్ క్రొన్నెసరులు. హంస. ౪. ౧౨౭.

గంభారి. సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడుకీ.

గంభీరము. సం. విశే. (అ. ఆ. అ) ౧. లోఁతు గలది. (నది, మొ.) ౨. దురవగాహము, గ్రహింపరానిది. (హృదయము అర్థము, మొ.) ౩. మంద్రము.(ధ్వని) వి. అ. పుం. ౧. తామరకీ. ౨. జంబీరము, నిమ్మకీ.

గంభీరవేది. సం. వి. న్. పుం. తోలుఊడునట్లును నెత్తురు కాఱునట్లును మాంసము ముక్కలుగా పడునట్లును బరిగోలలతోడను అంకుశములతోడను పొడిచి యెంత బాధ పెట్టినను ఒడలెఱుంగకుండునట్టియేనుఁగు; చిరకాలమునకు శిక్షను గ్రహించుఏనుఁగు.

గంభీరిమ(ము). సం. వి. న్. పుం. గాంభీర్యము.

గగన(నే)చరము. సం. విశే. (అ. ఈ. అ) ఆకాశమునఁ దిరుగునది. వి. అ. పుం. ౧. పక్షి. ౨. గ్రహము. ౩. రాశిచక్రము.

గగనము. విశే.(చి.ని,శ.ర-సం.ఘనమ్?గహనమ్?) దుర్లభము.

సీ.గగనఘంటాపథక్రమణశీలున కింత గగనమయ్యె లతాంగి కానుఁజదలు. వసు. ౩. ౯౯.

ద్వి. వేఁడెదఁ గాదేని వెడలునాయంప, వాఁడిమిసైనను వార్ధి నింకింతు,బంధింతుఁ గాదేని పవనతనూజ, కంథిదాఁటుట యెంత గగనంబు నాకు. రం. రా.యు. ౨౪౦ పా.౧౦౯౦.

గగనము. సం. వి. అ. న. ౧. ఆకాశము. ౨. (గణిత) శూన్యము, సున్న.

గగురు=గగ్గురు, గగురుపు. వి. భయహర్షాదులచేత మేనివెండ్రుకలు నిక్కఁబొడుచుట, రోమాంచము.

సీ. పులకలనంగను బులకరమనఁగను గగ్గురనంగను గగురనంగ,గరుపాల్పనంగను బరఁగు రోమాంచంబు...ఆం. భా. ౧. ౧౪౧.

జః గగురుపాటు, గగురుపాఱు, గగురుపొడము, గగురుపొడుచు, గగురుపొడుపు.

గగురుపా(ర్పా)టు. వి. (√గగురు) రోమాంచము.

గీ. గగురుపాటును పడఁకును గానిపింప, నెల్లను మనోవితానంబు నెనసి కొల్వ,మంచుజిగిసట్టి పొగడ విరించనుండు, గరుణఁ బౌలస్త్యజానకు సాక్షాత్కరించె. ఉ. రా. ౧. ౨౨౧.

సీ. పైపపచ్చలతాళి మీఱ మొల్కలగగుర్పాటుఁగంచుక మూనె రత్నగర్భ. ఉ. రా. ౧. ౧౩౬.

గగురుపా(ర్పా)ఱు. అ. క్రి. (గగురు+పాఱు) గగురుపాటు కలది యగు.

మ. కమలాకామినిపాణిపంకజము సోఁకన్ మై గగుర్పాఱ న,క్కమలాక్షుం డనిశంబు సాత్త్వికమునన్ గన్పట్టియున్ సద్విలా,సమునన్ సాత్త్వికమూనె...ఉ. రా. ౮. ౩౧౧. పాం. ని. మాన. ౨౪.

గగురుపు(ర్పు)=గగురు. వి. రోమాంచము.

ఉ.గుప్పున నవ్వు డప్పుడఁతిగుబ్బలు మించె గగుర్పుకూర్పునన్. చంద్రా. ౬. ౧౪౨.

గగురుపొ(ర్పొ)డము. అ. క్రి. (గగురు+పొడము) గగురు గలది యగు.

(యోగనిష్ఠనివర్ణన) చ. జోటజోట ధారగా వడియుచుం గడ లెత్తుసుధారసంబు గ్రుం,గుటగుట నప్పటప్పటికిఁ గ్రోలుచు నాలుగురెండు మూలలన్,గుటిలత దాల్చుభోగిని గగుర్పొడమించుచు దక్షిణశ్రవ,స్తటవిసరత్పయోదని నదంబునఁ జొక్కుచు మబ్బ గ్రక్కుచున్. పాండు. ౪. ౪౮.

**గగురుపొ(ర్పొ)డుచు.** అ. క్రి. (గగురు + పొడుచు) రోమాంచిత మగు, పులకించు; (రోమములు) నిక్కు.

సీ. ...పులకలొత్తెను గగుర్పొడిచె... గీ....అనఁగఁ దగును రోమాంచనామముల్ ... సాం. ని. మాన. ౨౪.

చ...సమ్మదాశ్రులన్, దొలఁచినయట్లు వోయెడుఁ గనుంగవకాటుక చేఁటులెత్తుఁ జె,క్కులమకరీవిలాసము గగుర్పొడువన్ వారిఁ జూచువేళ...పారి. 3. ౧౨.

గీ. కైదువలు విడిచి యొడళ్లు గగురుపొడువ,నంత నంతఁ గకాపిక లైనవారిఁ,గని మురుండు కుబేరునిఁ గదిసి యేసెఁ, బ్రతిభయాశీవిషోపమబాణతతుల. ఉ. హ. ౧. ౪౧.

ఉ. గుబ్బమెఱుంగుఁజన్గవ గగుర్పొడువన్ ...మనుచ. ౨. ౨౭.

క... మెయి గగుర్పొడువఁగ...పారి. ౧. ౧౨౨.

మహాస్రగ్ధర ... కాంచెన్, శలసంతానంబు మేనన్ గగురుపొడిచి కన్పట్ట నున్నట్టి యేదున్. కళా. ౬. ౧౬.

**గగురుపొ(ర్పొ)డుపు**=గగురుపాటు. (√గగురుపొడుచు)

సీ. మొగలిపూఁబొదలు మోమునఁ జేర్చుచీరగాఁ బూరిమోసులు గగుర్పొడుపు గాఁగ...గీ. వేలప్రోయాలు దనముద్దుఁజూలిఁ దలఁచి, తెఱపి గనరానివంతలఁ గొఱలి యొఱలె. అచ్చ. రా. కిష్కిం. ౬౬.

**గగ్గు.** వి. గద్గదిక, డగ్గుత్తిక.

సీ. గగ్గునా వెలయు గద్గదిక ... ఆం. భా. ౧. ౧౨౨.

అ. క్రి. సంకోచించు. (శ. ర.)

**గగ్గురు**=గగురు. వి. రోమాంచము.

సీ. పులక లనంగను బులకర మనఁగను గగ్గురనంగను గగురనంగ,గరుదాల్పనంగను బరగు రోమాంచంబు...ఆం. భా. ౧. ౧౪౧.

**గగ్గులకాడు.** వి. దే. (గగ్గులు+కాడు) ధాన్యము రాల్చినకంకులరాశి. (శ. ర.)

పిగ. ౧. చెల్లాచెదరైనది; నిస్సారము.

సీ. తలలు పీడంగ విద్యాధరు ల్పఱచిరి గగ్గులకాడైరి ఖచరవరులు. పారి. ౫. 3౭.

సీ. గగ్గులకాడైరి కలఁగి రోటాఱిరి వెలవెల్ల నైరి నివ్వెఱఁగుపడిరి. హర. 3. ౧౦.

క. చదిపెం గాలుబలంబులఁ, గదిమెన్ గజ్జంబు పొఁజు గగ్గులకాడై, చెదరంగ... కాళ. ౨. ౪౧. కాశీ. ౭. ౮౭.

౨. చెదరఁగొట్టునది.

ఉ. సిగ్గునకుం బికాపికలు చిత్తసమున్నతి పేరివార్తకున్, గగ్గులకాళ్లు శంకలకుఁ గక్కని యొగ్గులఁ బుట్టునల్కకున్, సగ్గిపముగ్గిసల్ నిలువు నైరణమున్ గననీనిమొత్తికో,ళ్లగ్గజయాన కుంబతికి నయ్యె యశేష్టగృహప్రసంగముల్. కవిక. 3. ౨౨౯.

**గగ్గులకాటఁగల్పు**=నాశము చేయు, పాడు చేయు.

ఉ. డగ్గఱి యెవ్వఁడో కటకటా శివలింగము మీఁదిరత్నముల్,గగ్గులకాటఁగల్పి ములుకంపలు తీవలు పెట్టె నేఁడు... కాళ. ౨. ౧౧౦.

**గగ్గులకాడులు గావించు**=వధియించు.

సీ. గగ్గులకాడులు గావించె ముగియించె...గీ... అనంగఁ బొందగు వధించె, ననుటకు సమాఖ్యలై...ఆం. భా. 3. ౧౨౩.

**గగ్గులు.** వి. బ. నులిచినకంకులు. (శ. ర.)

జ: గగ్గులకాడు.

**గగ్గెర.** వి. ఒకానొక చెట్టు. (ఇది తెల్లగగ్గెర, నల్లగగ్గెర అని ద్వివిధము.)

గీ. దవనమును గగ్గెరయు బిల్వదళము లాది, యైన పూజాద్రవ్యమ్ము లపుడు దచ్చి, వంతులకుఁ గొండపాడుపుగా వైమటయును. ఉ. రా. 3. ౨౦౧.

**గగ్గోలు.** వి. ౧. క్షోభము, కలఁత; అల్లరి.

గీ. అపుడు గొందఱు మృగయు లయ్యడవిఁ దూఱి, ఘోరముగ నెల్లకడల గగ్గోలు గాఁగఁ, గూఁత లిడి చోఁపుటయు మృగకులము గలఁగి, బయలువెడలినఁ గాంచి యప్పార్థివుండు. దసిక. ౧. ౧౦౮.

గీ. గొల్లవాడల నెల్ల గగ్గోలు పుట్టి ... నీలా. 3. ౫౫.

గీ. గొల్లుగాఁ గూఁక లిడుచు గగ్గోలు సేసి, లేవకుండిన విసిరి యాలెంక లినుప, ద్రుడ్ల గుదియలఁ బిడికిళ్ల రోఁకళ్లులను, మొత్తి ... అచ్చ. రా. యు. ౨౨౭.

౨. పరాక్రమము, శక్తి?

గీ. జేలుపోవనిపాలదిండ్ల నూలుకొనుచు, దీలుఁడఁ గొట్టునట్టిగగ్గోలువాఁడ. ప్రబంధ. ౨౨౪. (ప్రయోగాంతరము లేదు)

గగ్గోలుగ=౧. అధికముగా.

ఉ...గగ్గోలుగ నుప్పతిల్లె బిగిగుబ్బలపైఁ బులకాంకురావళుల్. గంధ. ౭3.

౨. ఆకస్మికముగా?

క. ఈరీతి మెలఁగువారల, దారల్ విని రాజకొడుకు ధవళాఖ్యాకుం, డౌరా గగ్గోలుగ నన్నారివయిం బడుచు నని ఘనం బగుప్రేమన్. శుక. ౨. ౨౧౫.

జ: గగ్గోలుపడు.

**గగ్గోలుప(వ)డు.** అ. క్రి. (√ గగ్గోలు) ౧. క్షోభపడు, కలఁత నొందు.

(పుమూరవుఁడు) గీ... ఏఁగెఁ జటులపటహ, ఘూర్ణితధ్వని దిశలు గగ్గోలుపడఁగ. కవిరా. 3. ౧౪.

ద్వి. నే నొక్కరుండ నన్నిటఁ దో డౌకరిఁ, గానక బెగడి నల్గడలు చూచుచును, బడలుచు గగ్గోలువడి మోరటిలుచు. విష్ణు. పూ. 3.ఆ.(శ. ర.)

౨. అతిశయించు.

వ...నీలంపుగిన్నుల గగ్గోలుపడుకోనవాతెరిం గౌఁగిలించిన పొగడగుంపులనట్టనడుమ...కువల. ౪. ౯౨.

**గచ్చె=గ్రచ్చె.** వి. (త. కళచ్చి. క. గజ్జగె.) ముళ్ళుకంప?

ఆ. ఇమ్ముచానియొద్ద నీనివాఁడుండినఁ, జమ్ముఁ గాని యీవి సాగనీఁడు, కల్పతరువు క్రింద గచ్చచెట్టున్నట్లు... వేమన. ౨. ౭.

సీ. గచ్చ గ్రచ్చనఁ జెల్వు గాంచుఁ గాచస్థాలి...ఆం. భా. ౨. ౪౯. (ఈయర్థము కాచస్థాలీశబ్దమునకు సంస్కృతనిఘంటువులలో లేదు.)

జ: గచ్చకాయలు.

**గచ్చెకాయలు.** వి.బ.(√గచ్చె)గచ్చకాయలాట, బాలక్రీడావిశేషము.

సీ. గచ్చకాయలు కిట్టుగానుఁగ త్రిప్పుట్లు, గుజ్జిపెక్కుడు మంటిగూండ్లు ... హంస. 3. ౧౪౬.

గీ. గచ్చకాయలు దాఁగిలిమ్రుచ్చులాట, బంతి పెకమాట చిందఱవడపులాట, లనెడు శైశవదుర్వృత్తి నధిగమించి. ప్రబంధ. ౬౧3.

**గచ్చె[1].** వి. (క. గచ్చు=గార.)౧. బంగారము నున్నము మొదలగువానిపూఁత.

సీ. పసిఁడిగచ్చుమరసోపానముల్ మాఁటఁదుం
గిత విశాలితయుఁ జిత్రితయు నైన, సభ...
ఆము. ౪. ౫౫.

చ. ఇలఁ గలవస్తుసంతతులకెల్లను గచ్చిడుమాస్వ
భావపాటలరుచి కేమొ వేఱ యొకడా లిఁ
క వచ్చునె లక్కనీట మమ్ములమిన దెంతయు
గ్ధ యిది యంచుఁ బదాబ్జము లంగుళీముఖం,
బుల నగునట్లు మించునఖము లైఱయన్ గొ
మరారు నింతికిన్. ఆము. ౫. ౩౪.

గీ. పచ్చవిలుకునినడయాడుగచ్చుకోల, పూన్కి
నవ్వేల్పుఁజిగురాకుఁబోఁడియును నల, మానిప
రమేశ్వరుని యాశ్రమంబుఁ జేరి. చంద్రా. ౩.
౯౭. ప్రబంధ. ౭౫.

౨. గోడలోనగువానికి పూయుటకై యినుక
చేర్చి దంచినసున్నము, గార.

గీ. కాలగుణయుక్తి మింటిచక్కటికి నెగయ,
వాసవునిపట్టి పాడువుగా వైచి యాడు, గ
చ్చు చమరినదారుచక్రంపుబిళ్ల, వోలె నొ
య్యనఁ బ్రాచి లేఁబ్రొద్దు పొడిచె. మనుచ.
౫. ౪౦.

౩. కాంతి.

(కృష్ణుఁ డను మేఘము) ఉ. క్రాలెడుపచ్చపట్టు
నునుగచ్చుల క్రొమ్మెఱుఁగై చలింప... హరి.
పూ. ౬. ౧౧౬. (శ. ర. పా.)

౪. కపటము.

వ... పెచ్చు మల్లాడియును గచ్చులు నేసియు పె
చ్చుకత్తులు దూసియు... ప్రబంధ. ౭౫౦.

గచ్చుగ=కపటముగ.

క. వచ్చి యిది యేమి చెలి యని, విచ్చలవిడి వీ
పుఁ జఱచి వెఱవకు మని లోఁ, జొచ్చిన భ
యమున నదరిన, గచ్చుగ నిట్లనియె గోపక
న్యక పతితోన్. హంస. ౨. ౧౨౪.

జ: గచ్చులాఁడి, గచ్చువిచ్చగు.

**గచ్చె[2]**=గ్రచ్చె. విణ. గ్రస్తము, వర్ణలోపము
గాని పదలోపము గాని కలిగినది.) పదము వా
క్యము.)

ఆ. గచ్చుకౌతుకు నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు.
ఆం. భా. ౧. ౧౧౫. (శ.ర.పా)

౨. బ. దంభములు, డాబులు.

సీ. గెలువని రాజుకు బలుగచ్చులును మొండు నెల
మి సంధ్యకు మైనునేచ్చ మెండు. వేమ. ౧౩౩.

జ: గచ్చువడు.

**గచ్చెలాఁడి.** విణ. (గచ్చు[1]లు+ఆఁడి) మాయలాఁ
డియగు (స్త్రీ); స్త్రీ.

వ... మందరంబుఁ దెచ్చి పాతిపాతి సముద్రం
బుఁ ద్రచ్చి చేఁజొచ్చినయమృతంబు గచ్చు
లాఁడికి మెచ్చి చూఱవుచ్చి విచ్చవులకు
నోగిరం బిచ్చి తమ్ముఁ గట్టఁ ద్రాగ్గు తామే
తెచ్చికొని రనువారును...లక్ష్మీ. ౨. ౭౬.

ఉ...ఇటు వచ్చినయచ్చరగచ్చులాండ్రలో, నే
రుచిరాంగి చక్కనిది ... అహ. ౧. ౭౨.

**గచ్చెవడు.** అ. క్రి. (√గచ్చె[2]) లోపించు?

క. చొచ్చి శివదివ్యలింగముఁ, గ్రుచ్చి బిగిఁయు నం
టఁ బొదివికొని తనవెంటన్, వచ్చుజముఁ ద
లఁచి తాలిమి, గచ్చువడఁగ నతఁడు భీతగతి
నిట్లనియెన్. శివలీలావిలాసము. ౨.

**గచ్చెవిచ్చెగు.** అ. క్రి. (గచ్చు[1]+విచ్చు+అ
గు) కార్యము వికలమగు; వికలమగు.

గీ. అఱుమాఁడయ్యె గచ్చువిచ్చయ్యె ననఁగ, బె
డిసె బుసివోయె ననఁగను జెడియె ననఁగ, నా
ఖ్యలగుఁ గార్యవైకల్యమయ్యె ననుటకు...
ఆం. శే. ౯.

గీ. అటుల జయభేరికారవం బతిశయింపఁ, బెలఁ
గి చనుదెంచునతనికోల్తలకుఁ గాక, బెదరి బె
దరి కలంగి కన్ జెదరి తొలఁగి, గచ్చువిచ్చ
య్యెఁ బారశీకవ్రజంబు. కృష్ణ. ౩. ౩౯.

**గచ్ఛత్.** సం. శత్రు. పోవుచున్న.

**గజే.** విశే. (సం. గజః) పెద్ద. (దీనికి వృత్తియందే ప్రయోగము కలదు. చూ. గజనిమ్మ)
జ: గజదండ, గజదొంగ, గజనిమ్మ, గజయీఁత.

**గజకందము.** సం. వి. అ. పుం. హస్తికందము, ఒకజాతిదుంపకూర.

**గజకర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. ఓషధివిశేషము. (వాచ)

**గజగజ.** వి. వడఁకుటయం దగుఅనుకరణము.
ద్వి. కడు భయంబున వాఁడు గజగజ మేను, వడఁక దైన్యంబున వాపవు కెరఁగి. నవనాథ. 3. ౨౨౬ పా. ౧౭ పం.

**గజగామిని.** సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగువలె నడచు స్త్రీ; స్త్రీ.

**గజచ్ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పుణ్యకాలవిశేషము, శ్రాద్ధోచిత మగుసూర్యగ్రహణకాలము.
శ్లో. సైంహికేయో యదా భానుం గ్రసతే పర్వసంధిషు, గజచ్ఛాయా తు సా ప్రోక్తా తత్ర శ్రాద్ధం ప్రకల్పయేత్. (కల్ప.)
౨. ఏనుఁగుయొక్క ఛాయ.

**గజచ్ఛాయము.** సం. వి. అ. న. ఏనుఁగుయొక్క ఛాయ. పుం. మహిషము, దున్నపోతు.

**గజత.** సం. వి. ఆ. స్త్రీ. గజసమూహము.

**గజదండ.** వి. (గజ+దండ) మల్లవిద్యావిశేషము, పదిరెండుదండలలో నొకటి.
వ...అవ్వీరుఁడు సమదండ గజదండ కుక్కుటపుదండ మొదలుగాఁ గల పదిరెండుదండలయ ఖండపాండిత్యంబు దెలిసి...హంస. ౧. ౨౦౬. మల్లుపు. 3. ౬౯.

**గజదంతము.** సం. వి. అ. పుం. ౧. ఏనుఁగుదంతము. ౨. బట్టలు మొదలగునవి ఉంచుటకు గోడకు కొట్టినకొయ్య. (వాచ.)

**గజదొంగ.** వి. (గజ+దొంగ) పెద్దదొంగ, గొప్పదొంగ. (శ్రీ, వా.)

**గజనిమీలనము.** సం. వి. అ. న-ఏనుఁగువలె కన్నులు మూసికొనుట-౧. చూచియు చూడనట్లుండుట. ౨. కపటము, వంచన.

**గజనిమీలిక.** సం. వి. అ. స్త్రీ=గజనిమీలనము.

**గజనిమ్మ.** వి. (గజ+నిమ్మ-క. గజనింబ) లకుచము, పెద్దనిమ్మకూర.
గీ. నిమ్మ యంచనఁగా జంభలమ్ము దోఁచు, నదియొగొప్పైన గజనిమ్మ యనఁగఁ దగును. ఆం. భా. ౨. ౪౨.
రగడ. నెలకొనుచుఁ బ్రబలుగజనిమ్మలను నిమ్మలను. భాను. ౨. ౬౮.

**గజపతిలాగీలు.** మి. వి. బ. ధాన్యవిశేషము.
వ...కాఉసంపెఁగలు కందర్పభోగులు గజపతిలాగీలు బొండడీలు... అనునూటనాలుగువగల పైరులచేరుడుబియ్యంపువట్టిపసాదంబులు... ప్రబంధ. ౧౧౨.

**గజపిప్పలి.** సం. వి. ఈ. స్త్రీ. పిప్పలీభేదముకూర.

**గజపుటము.** సం. వి. అ. పుం. పుటము వేయుటకై గజములోఁతు త్రవ్వినగోయి. (వాచ)

**గజబంధని.** సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగుసాల.

**గజబంధిని.** సం=గజబంధని.

**గజభక్ష్య.** సం. వి. ఆ. స్త్రీ-ఏనుఁగులు తినఁదగినది-సల్లకి, అందుగుకూర.

**గజమాచలము.** సం=కరిమాచలము. (కల్ప)

**గజము.** వి. (సం. గజః. హిం. గజ్) ఇనుపసలాక, ఇనుపయీఁచ; తుపాకిలో మందు దట్టించెడి యినుపసలాక. (వా)

**గజము.** సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు. (భద్రము, మంద్రము మృగము అని గజజాతులు మూఁడు. త్రివిధగజములకును మానభేదముచే అరాళము, అత్యరాళము, మధ్యము, కనిష్ఠము, వామనము

అని నామములు గలవు. మఱియు పిష్టకము, వ్యాళము, పూతనము, మాతృకము, మాయూకము, పంచమంగళము మున్నగు గజభేదము లనేకములు కలవు. గజముయొక్క శిరఃపిండములు కుంభములు. కుంభముల క్రిందిచోటు ఆరక్షము. కుంభముల నడిమిచోటు విదువు. చెక్కిలి కటము. నొసలు అవగ్రహము. కనుగ్రుడ్డు ఈషిక. కడగంటిచోటు నిర్యాణము. కర్ణమూలము చూళిక. దంతమూలము కరీరిక. దంతమధ్యము శంఖము. అడ్డముగా విసరఁబడినకొమ్ముదెబ్బ పరిణామము. నొసటిబుడిపి వాతకుంభము. వాతకుంభము క్రిందిచోటు వాహిత్థము. వాహిత్థము క్రిందికొమ్ములలోపలిచోటు ప్రతిమానము. తొండము శుండ. తొండముచివర కర్ణిక. తొండమున వచ్చుతుంపురు వమథువు. ముఖమునందలిబొట్ల(=పొడల)గుంపు పద్మకము. మూఁపు ఆసనము. మేఢ్రము కకుదము. మోఁకాలు ప్రోహము. మోఁకాలి క్రిందిచోటు సందానము. పిక్కకుముందుచోటు అయస్కారము. ప్రక్కచోటు పక్షభాగము. ముందటిచోటు దంతభాగము. ముందటికాళ్లపిక్కలు మొదలుగాఁ గలచోటు గాత్రము. వెనుకటికాళ్లపిక్కలు మొదలుగాఁ గలచోటు అపరము. మెడను గట్టెడు గొలుసు కలాపకము. కాళ్లఁ గట్టెడుగొలుసు త్రిపది. నడుమునఁ గట్టెడుమోకు వరత్ర. దీనిని ఆయితముసేయునపుడు మెడను గట్టెడుత్రాడు సజ్జన. వీపుమీఁదఁ బఱచుకంబళము విధానము. గంత శారి. ఇది నీళ్ల మునుఁగుట నిర్వాణము. దీనిఅలంకారము శృంగారము. దీనినిఁ బట్టుటకు త్రవ్వెడుపల్లము అవపాతము. దీనికిఁ గలిగెడు పిత్తజ్వరము పాకలము. మదము దానాదికము.) ౨. ఎనిమిది అనుసంఖ్య. 3. మూఁడడుగులపరిమాణము, ముప్పదియాఱంగుళములు. (శ్లో. సాధారణనరాఙ్గుళ్యా త్రింశదఙ్గుళకో గజః. అనువాక్యము ననుసరించి ముప్పదియంగుళములు.)

**గజమోటనము.** సం. వి.అ. పుం-ఏనుఁగును హింసించునది-సింహము. (విల్యమ్సు.)

**గజయాన.** సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగునడకవంటినడక గలస్త్రీ; స్త్రీ.

**గజేయీఁత.** వి. (గజ+ఈఁత) గొప్పయీఁత. (వా.)

**గజరిపువు.** సం. వి. ఉ. పుం. ౧. సింహము, ఏనుఁగుగొంగ. ౨. గజాసురశత్రువు, శివుఁడు.

**గజేరుగజేరులుపోవు.** అ. క్రి. (గజరుగజరులు+పోవు) పులకరించు.

క. జవరాలగుకాపాలిని,కవుఁగిటఁ దన మేను గజరుగజరులుపోఁగా, నవిరళసుఖమున హృదయం,బివతాళింపంగ బౌద్ధుఁ డిట్లని పలికెన్. ప్రబోధ. 3. ౮౬.

(భిక్షుః-సానందం పరిష్వజ్య రోమాంచమభినీయ జనాంతికం. అహో సుఖస్పర్శా కాపాలినీ. సం. ప్రబోధ. 3.)

**గజసాహ్వయము.** సం=గజాహ్వయము.

**గజాజీవుఁడు.** సం. వి. అ. పుం-ఏనుఁగువలన బ్రతుకువాఁడు-మావంతుఁడు, మావటీఁడు.

**గజాననుఁడు.** సం. వి. అ. పుం. వినాయకుఁడు, ఏనుఁగుమోముసామి.

**గజాశనము.** సం. వి. అ. పుం. అశ్వత్థము. న. తామరవేరు.

**గజాహ్వ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గజపిప్పలి. ౨. హస్తినాపురి.

**గజాహ్వము.** సం=గజాహ్వయము.

**గజాహ్వయము.** సం. వి. అ. న. హస్తినాపురము.

**గజిబిజి.** వి. ౧. క్షోభము, కలఁత, కలవరము.

చ. గజిబిజి లేక యుబ్బక యఖండితశౌర్యము నస్త్రవీర్యమున్, భుజబలముం బొగడ్త వడ... భార. భీష్మ. ౨. 33.

క...నిత్యమును హరికిన్,గజిబిజి లేక తలంచిన,నుజనులకును నతని యందుఁ జొరఁగా వచ్చున్.

భాగ. ౧౨. ౭. (ఇట మనశ్చలనము అని భావము.)

క. గజదైత్యుఁ డివ్విధంబున, గజిబిజి సేయంగఁ గాశికానగరమునం, బ్రజనితభయకంపమునం, బ్రజ తామరపాకునీళ్లభంగిఁ దలంకెన్. కాశీ. ౯. ౧౭౬. (శ.ర.పా.) భార. ద్రో. ౪. ౨౮౫.

౨. తమకము; ఉద్రేకము.

వ. ...చరదేశం బాపోశనంబుగొనం దమకించుతనబలంబుగజిబిజి యుడిపికొని గోగణంబుల యగపా టూహించి... భార. విరా. ౩. ౧౩౧.

ద్వి. మంగళశివకథామహితసంగప్ర, సంగతి గొన్నివాసరములు సలిపి, కల్యాణమున కభిగమనంబుసేయఁ, గల్యాణమున భక్తిగజిబిజి పుట్టె. పండితా. మహిమ. ౧౦౧ పా.

౩. అల్లరి.

క. అజుఁ డరుగుదెంచి గురునిన్, రజనీకరుఁ గాంచి యిట్టిరచ్చలు గలవే, గజిబిజి వల దని తారా, గజయానం జేరఁబోయి గ్రక్కునఁ బలికెన్. శశాం. ౫. ౧౨౭.

గీ. పొదువు పోనీక పట్టుము భూమిదేవ, వర్య యనుకొంచు వచ్చి కవాటముగడె, యొడపి వంతనె తద్భర్త యింతితోడ, నెవ్వఁ డీతండు గజిబిజి యేమి యనుచు. హంస. ౫. ౨౪౨.

౪. సందడి, ప్రాణిసమూహధ్వని.

సీ. కామాదిఖగములగజిబిజు లడఁగ దేహాభిమానాదిత్యుఁ డస్తమింప. సీతారా. ౧. ౧౪౭.

వ...తదుగ్రతకుం గాక చీకాకుపడు ప్రజలగజిబిజు లాలించుచు గౌడపతి ... కళా. ౮. ౭౩.

వ. అయ్యవసరంబునఁ గళాపూర్ణుఁడు తదాగమనంబున కెదురుచూచుచుండి వారిగజిబిజి కొంత చేరువను వినంబడిన...కళా. ౭. ౧౨౦.

౫. మ్లానత, వాడుట.

క. భుజగర్వ మడఁగఁ జుట్టిన, భుజగాస్త్రము లిట్టు సట్టుఁ బొరలంబడినన్, గజిబిజి లేదు మొగంబున, మఱ బాపురె వీనిఁ బోల మగలుం గలరే. ఉ. హరి. ౫. ౨౭౦.

౬. పీడ, బాధ.

చ... శ్వేరజపులతాంతబాణుఁడు కరస్థితపల్లవఖడ్గధారచే, గజిబిజి చేసినేని మఱి కార్యము దప్పు నటంచు గొబ్బునన్. రాజ. చ. ౩. ౮౩.

విణ. ౧. కలవర మొందినవాఁడు; కలవర మొందినది.

క...చాలఁ గలకలపడుచున్, గజిబిజియైరి సభాస్థలిఁ, బ్రజ లెల్లను బొట్టివడుగుఁ బాఁపనిరాకన్. భాగ. ౮. ౫౩౪.

వ. అని తెగువం బలికిన నమ్మునుప గజగజ వడంకి గజిబిజియై యంతరంగంబున నిట్లని చింతింపం దొడంగె. సురా. ౮౮.

౨. పోయినది.

క. పొలఁతుక నిజదయితునకై, కలమానధనంబు చాల గజిబిజి గాఁ దా, నిలువడియును గులగతియును, దలఁపమియు త్రపావినాశదశ యనఁ బగఁగున్. కావ్యా. ౨. ౭౬.

౩. నలఁగినది.

సీ. ఈగుబ్బ లిఁకమీఁద నాగోటికొనధాటి గదిసిన గజిబిజి గాక యున్నె. కువల. ౩. ౫౪.

జ: గజిబిజించు, గజిబిజిపడు.

**గజిబిజించు.** అ. క్రి. (√ గజిబిజి.) ౧. కలవరపడు, కలఁతపడు.

వ. అట్టియెడఁ దదీయసైన్యంబు గజిబిజించిన. ఉ. హరి. ౩. ౭౮.

౨. గడబడ చేయు.

ద్వి. చనుదెంచి ముష్టికచాణూరముఖ్యు, లెనయ రంగస్థల మెల్లఁ దారగుచు, భుజ మప్పళింపుచుఁ బొరి విజృంభించి, గజిబిజింపుచు నం

డఁగా నంతలోన. ద్వి. భాగ. 3. ౫౧ పా.

**గజిబిజిపడు.** అ. క్రి. (గజిబిజి + పడు) కలఁత నొందు.

క. గుజగుజలువోవువారును, గజిబిజిపడువారుఁ జాలఁ గలకలపడుచున్, గజిబిజి యైరి సభాస్థలిఁ, బ్రజ లెల్లను బొట్టిపడుగుఁ బాఁపనిరాకన్. భాగ. ౮. ౫3౪.

**గజ్జ.** వి. తొడసందు, వంక్షణము.

సీ. గజ్జ నాఁ దనరు వంక్షణము...ఆం. భా. ౨. ౧3౬.

(హనుమంతుఁడు) క. జలనిధులు జానుదఘ్నం,బులు గాఁ గులగిరులు గజ్జపాడువులు గఁ ద్వారలు దలపువ్వులు గా దిక్కులు కడవం బెరిఁగెఁ గనకకుధరముభంగిన్. భా. రా. సుం. 3౦౮.

జ: గజ్జదుముకు.

**గజ్జదుముకు.** వి. (గజ్జ+దుముకు) మల్లవిద్యావిశేషము. (ఇది లోగజ్జదుముకు, వెలిగజ్జదుముకు-అని ద్వివిధము)

వ... లోవెలిమారణగజ్జదుముకునఱుకు లనునఱుకులును...మల్లుపు 3. ౬౯.

వ. ... లోవెలిగజ్జదుముకుమారణనఱుకు మొదలైనయిరువదిగలనఱుకులు... ప్రబంధ. ౭౮.

**గజ్జి.** వి. (సం. కచ్ఛూః) కచ్ఛువు, తీఁటకుఱుపు.

సీ...గజ్జి, చిడుము నా ఖర్జువు చెలఁగును...ఆం. భా. ౨. ౧౭౯.

**గజ్జియ(జ్జె).** వి. క్షుద్రఘంటావిశేషము, ఒకవిధమగుచిఱుగంట.

ద్వి. చెందమ్మిరేకులఁ జెనకుపాదములఁ, జెఁదినపసిఁడిగజ్జియలు నందియలు. ద్వి. పరమ. ౧. 3౪ పా.

ద్వి. అంత నొయ్యన దోఁగియాడంగ నేర్చె,నంత బంగరుగజ్జియలును...ద్వి. పరమ. ౫. 3౭౭.

ఉ. చక్కనితండ్రి పాదజలజంబుల గజ్జెలు మ్రోయ ముందుమా, చక్కి నటించు టివ్వి డొకసారి యవాడవు... ఉ. రా. ౧. ౧౮౪.

సీ...బురజ చిఱుగంట మువ్వ గజ్జె యన క్షుద్ర, ఘంటావిశేషముల్ గన్పట్టుచుండును...ఆం. భా. ౨. ౧౫౧.

జ: గజ్జెగొలుసు.

**గజ్జు.** వి. మదము.

గజ్జుపట్టు=మదించు; అధికమగు.

ద్వి. కర్మజాడ్యము మాని గావింతురేని, మర్మంబుఁ జెప్పెద మఱి మొనర్చుటకు, గజ్జుపట్టిన యహంకారంబు పశువు, రజ్జువు వాయుపూరకమె యూపంబు,మనసు జ్ఞానమె యగ్ని... ప్రభు. ౪. ౧3౫ పా. ౧౯ పం.

గజ్జురేఁగు=మదించు.

(శరదృతువర్ణనము) గీ. ఇల్లు శోభిల్లె మంకెనలుల్లసిల్లె, కాలకంధరవాహంబు గజ్జురేఁగె. పాండు. ౪. 3౭.

జ: గజ్జులాఁడు.

**గజ్జూరము.** వి. (సం. ఖర్జూరః) ఖర్జూరము. (శ. ర.)

**గజ్జులాఁడు.** విశే. (గజ్జు + ఆఁడు) గర్వి, మదించినవాఁడు

వ. అని యుద్ధమునందు పల్కిన నాగజ్జులాఁడు మోఱకంబున మొగ మడ్డంబు గదల్చి...హంస. ౭. ౬౧.

**గజ్జెగొలుసు.** వి. (గజ్జె+గొలుసు) స్త్రీపాదాభరణవిశేషము, పాఁజేబులు. (శ. ర.)

**గటక.** వి. ౧. పిండితోఁ జేసినజావ, అంబలి. (శ. ర, బ్రా.) ౨. లేపనార్థము నూతి యుడికించినపిండి. (చి. ని, బ్రా.)

**గట్ట.** వి. (సం. ఘట్టనా) సిద్దినోటికి వేసి గట్టించెడు బిరడ. (శ. ర.)

**గట్టన.** వి. (సం. ఘట్టనా) గట్టించుట. (శ. ర, వా.)

**గట్టము.** విశే. గట్టిది.

చ. పదవు లిడంగ నాత్మ ఖురపాతములం గనకాద్రి చెంగటం, గర మపరంజిరామొరసుగట్టపు రేలలు చూర్ణితంబులై, ఖురళికలట్లయాట బలఘోటకకోటికి నేద దేఱంగాఁ, బోరలుటకయ్యెడం వెదకఁబో వలదయ్యె రజఃప్రదేశముల్. కవిక. ౨. ౧౦౦.

**గట్టి.** విశే. (క. గట్టి) ౧. కర్కశము, కఠినము; దృఢము.

సీ. కఠిమి విల్కాలకొల్కి గబ్బిగుబ్బలగట్టితన మెఱింగినయురస్థలము మెఱయ. దశా. ౫. ౪౬.

గీ. బుద్ధ నీగట్టిహృదయసంపుటముఁ దాఁకి, కుంతితను లయ్యె మరునంపకోల లెల్ల. నైష. ౮. ౧౩౯.

గీ. గట్టి కటికి యనంగఁ గన్పట్టు దృఢము. ఆం. భా. ౩. ౨౩.

౨. బిగువైనది, సడలనిది.

క. అని పొగడుమ నొయ్యారపు, టమవున జడ లల్లి జిలుఁగు లగుపయ్యెదలం, జనుకట్లు గట్టి గట్టిగ, ననిమిషకాంతలు లతాంతహరణోత్సుకలై. మనుచ. ౩. ౮౩.

౩. గుల్లకానిది; తఱచైనది, దట్టమైనది.

గీ... గట్టివగహో... శుక. ౩. ౫౦.

సీ... గట్టికమ్మిదుప్పటి... శుక. ౨. ౨౪౧.

౪. అధికము.

గీ. అట్టి శ్రీపర్వతము చూచినట్టివారు, గట్టిపుణ్యంబు చేసినయట్టివారు. విక్ర. ౧. ౧౯౭.

౫. నిశ్చితము, నిజము.

ఆ. ఇతనికడుపు వ్రచ్చి యిందిష్టు రత్నంబుఁ, గాంచిరేని తనదుకడుపు వ్రత్తు, రుఱక చంపి పోదు రూరక విడువరు, కడుపు వ్రచ్చు టెట్లు గట్టితనకు. కేయూర. ౩. ౩౩౧.

౬. దిట్ట.

సీ. వేదశాస్త్రంబులు వెదకి కానఁగ లేనిగట్టి ప్రేతలతోలఁ గట్టుపడియె. భాగ. ౧౧౬... ౯౦.

వి. ౧. గట్టితనము, దృఢత్వము.

ఉదా: ఇనుపపెట్టెయొక్క గట్టి కత్తిపెట్టె... రాదు.

౨. పొల్లు కానిగింజ.

(బలరామునిమాటలు) గీ. మాగధాధము బహుళసైన్యమర్దనమున, కేను గోఁకలి గైకొంటి నిది నిజంబె, యింక మీలోన గట్టి పొల్లేరుపఱచి, చెరుగఁ జక్రంబె చాలద శ్రీహరికిని. దశా. ౯. ౫౦.

౩. శౌర్యము.

ఉ. ముందర రాజుఁ బుచ్చి బలముల్ గలయం బడి గోవ్రజంబులన్, దండి వెట్టుమంచుఁ బిఱుఁదన్ నడిపింపఁగఁ బంచి గట్టిమై, నందఱు నింతకున్ వెనుకయై మొన లేర్చి చనంగ ...భార. విరా. ౪. ౧౭౪.

సీ ... కడిమి యుక్కు కఱపు గట్టి కడిఁది. గీ. నాఁగ శౌర్యాభిధానంబు గాఁగఁ జెలఁగు. ఆం. భా. ౨. ౨౨౧.

౪. ధృతి, ధైర్యము.

గీ... ఉదుటు గట్టి, దిట్ట మురిపి బిగువు నాఁగ ధృతికిఁ బేర్లు. ఆ. సం. మాన. ౫౩.

౫. కణిక.

సీ. హరిహరబ్రహ్మమహానుభావంబు లొక్కటిగాఁ గఁ గరఁగినగట్టి యనఁగ. భార. విరా. ౨. ౨౪౧. (ప్రాచ ప్రతి, చి. ని. పా)

౬. బాలురు వ్రాసికొనువ్రానిపలకలమీఁద బొగ్గుపొడి పసరు కలిపి పూయుపూఁత.

ఉ. దేవి తమోమషీరసము తేటఁ బోసంగఁగ గట్టి వెట్టి యం, కావలి వ్రాయఁగాఁ దొడఁగె నంబరసంపుటకాంతరంబునన్, బూవిలుకాని శౌర్యగుణముల్ హరిణాంకుఁడు ముత్తియంబులం, దావడముల్ రచించినవిధంబున దుక్కటికాముఖంబులన్. నైష. ౮. ౧౭౦. (పేదం.

పా- ప్రాంత ప్రతులపాఠమునుబట్టియు కట్టించు అనుగుంటూరుమండలము వాడుకనుబట్టియు 'కట్టిపెట్టు'గా గ్రహించి కట్టించు అనునర్థము చెప్పుట మంచిదని తోఁచెడిని. కట్టించు=బొగ్గుపొడి పసరు మొదలగువానిచేత-పలకకు-పూయుపూఁత. గుంటూరువాడుక.)

గట్టిగ (గా)=౧. కఠినముగా.

ఉ. గట్టిగ నుండుకొండలును...నీలా. ౨. ౨౩.

౨. శ్రద్ధతో, సావధానముగా.

క. అటు లేనియుఁ జెప్పెద నీ, సాటిపాటితలపోఁత లెల్లఁ బోవ నడువుమా, ఁటమునుగు నెమ్మనము నొక్కటిగా నొనరించి గట్టిగా వినుమధిపా. పాండు. ౪. ౫౦.

౩. పూర్ణముగా.

క. ఇట్టిదినంబులు ముప్పది, నెట్టన పద్మజునకొక్క నెల యట్టినెలల్, గట్టిగఁ బండ్రెండగు నమ, యట్టిసమలు నూఱు బ్రహ్మయాయుస్సుమీ. వి. పు ౧. ౭౧.

౪. స్పష్టముగా.

ఉ...వంశ మెల్లఁ బ్రాతమ్మగు నీదుచర్య వని ధాతపడంతియొ యానతిచ్చె స్వప్నమున వచ్చి తావకగుణంబులు చూచినయట్ల గట్టిగన్. కళా. ౪. ౧౨౬.

క. చిట్టుములు ప్రబ్బెఁ దాఁగను, పట్టికి నిటమీఁద ధర్మపథమున నిటులం, బుట్టెడు నరుచి యటంచున్, గట్టిగ జనములకుఁ దెల్పకైవడి దితికిన్. దశా. ౩. ౧౦౬.

౫. బాగుగా అనునట్లు.

సీ. హీరకుట్టిమభూము లిసుకనేల లటంచు గట్టిగా నడుగులు పెట్ట వెఱచు. దశా. ౧. ౨౭౨.

౬. నిశ్చితముగ.

క. అట్టియుపాయము నీకుం, దట్టిన నృపుపొందు మాటదలఁపుము లేదా, గట్టిగ నీమగఁ డెటేఁగిన, యట్టయినను సిగ్గుపాటు లొఁగదె చెలియా. హంస. ౨. ౧౨౭.

౭. నిశ్చలముగ, కదలకుండఁగ.

క. తగ మేహనంబుపై సవ్యగుల్ఫ మిడి దానిపైఁ దదన్యం బిడి గట్టిగఁ గూర్చుండుట యొాథ, వ్యగణా మోక్షాసనాఖ్యమై పెంపొందున్. కళా. ౫. ౧౫౭.

౮. రూక్షము.

ఉదా: పద్యము గట్టిగా రాలేదు.

౯. ఉగ్రరగా.

ఉదా: గట్టిగా మాటలాడినఁ గాని నాకు వినఁబడదు.

గట్టినైసుది=ప్రౌఢ.

సీ ..గట్టినైసుదియుఁ బ్రోఢ యనఁగఁ దగుఁ బ్రౌఢ. సాం. ని. మాన. ౧౩.

గట్టివాఁడు=దిట్ట, సమర్థుఁడు. (మహత్త్వమహార్థకరూపము 'గట్టిది')

ఆ. గట్టివాఁడ వగుటఁ గార్ముకనిపుణత, గలుగుట శరవిద్య ఘనుఁడ వగుట, ధైర్యశాలి వగుట శౌర్యధురీణుఁడ, వగుట నిన్నెఱుంగనయ్యె నేను. రామయామాత్యకృతగమోపాఖ్యానము. ౨ ఆ.

ఉదా: వాఁడు గణితశాస్త్రములోఁ జాల గట్టివాఁడు.

జ: గట్టిపాటు, గట్టివ, గట్టినా, గట్టివాతనము, గట్టివాయి.

గట్టించు. స. క్రి. (√ గట్టి? క. గట్టిసు.) గట్టన చేయు.

సీ. గందపుఁబొడి వైచి గట్టించి యందుపై నెలరాలఁ గట్టిన నెలవునందు. యయా. ౫. ౯౮.

గట్టినబోది. వి. బాలక్రీడావిశేషము.

సీ. చిడుగుడువ్వలపోటి చెండు గట్టినబోది యల్లియుప్పనఁబట్టె లప్పళాలు. కాశ. ౩. ౩౩. ప్రబంధ. ౬౧౩.

గట్టిపాటు. అ. క్రి. (గట్టి+పాటు) గట్టిపడు, బెదరుటీటు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వచ్చులఁ బెరిఁగి, కాకలను దేఁటి గడి మీఁటి గట్టిపాటి, రాలు గాయత వాన బేరజపు దారి, నారి తేటియు బలుగుంట మారి యయ్యె. హంస. ౪. ౧౧౦.

గట్టెల్లు. అ. క్రి. (సం. ఘట్) సమకూడు, సంభవించు, ఘటిల్లు.

ద్వి. నెట్టికిఁ గర్గంబు లిట్టు దేవరకు, గట్టిల్లె నింతియ కావున మఱియు, భక్తుని మ్రింగినవచ్చిన క్రూరుఁడు, భక్తుని జంపఁ జాల్పడునూనగాఁడు. బస పు. ౪. ౬౮౩ పం. (ప్రయోగాంతరము కనఁబడ లేదు.)

గట్టెన=గట్టివా.

విశ. (ధూర్తుఁడు.)

ఉ. గట్టిన చేఁతలుం బసులఁ గల్లతనంబులు నీవు పుట్టఁగాఁ, బుట్టినవి... పారి. ౧. ౧౨౭.

గట్టివా. విశ. (గట్టి+వా) ౧. మాటకారి.

(కార్తవీర్యార్జునుని క్రీడావర్ణనము)

గీ. గట్టివా యొక్కఁడె సహస్రకరుని మీఁదఁ, దట్టము గాఁ బొక్కను శైవాలకమును నించి, తలఁపనిది యొక్కటియె యయుక్తం బటంచు, విభుఁడు చిఱునవ్వు నవ్వ నవ్వించె సఖుల. ఉ. రా. ౩. ౨౧౫.

౨. కఠినమైన వాక్కు గలది, పరుషమైన వాక్కు గలది; ధూర్తురాలు; దుష్టురాలు.

గీ. తగిలి పలుమఱుఁ జెవులు చీఁదఱఁగొనంగ, బిట్టు మొరసెను వస త్రాగినట్టు లట్టి, గట్టివా జాడ లెట్టుగాఁ బట్టువడియె, బెట్టుగా నిన్ను వెనఁ జెఱఁ బెట్టియుసను. నీలా. ౩. ౨౯.

మ... లోఁ దార్ష్ట్రియా, దనిఁ బాడం బులకాంకురంబు లొనగూడం గట్టివా యుంతి వేఁ, చని యవ్వాకిటి కడ్డమై నిలిచి కాంక్షం బట్టఁగాఁ బోయినన్. పారంగ. ౨. ౯౩.

చ. ఉడుగక బుద్ధి ముత్తులిడ నోపి యొకర్లము లేక యుంతఁగాఁ, గడు నెదలోఁ దలంచుకొని గాటపుమక్కువఁ బ్రోదిసేయున, య్యోడయనిఁ బాసి యాగడపుటోజలఁ ద్రిమ్మరునట్టి గట్టివా, పడఁతుక యెయ్యెడన్ దలఁకఁ బాసిన వెండ్రుక గాదె యెన్నఁగన్. అచ్చ. రా. అయో. ౭౨.

౩. దుష్టుఁడు.

దండకము... కన్నతోఁ బొట్టనిం బట్టి యిట్టట్టుగా బిట్టు దట్టింపుము బెట్టుగా బెట్టు బట్టి వారక్కసు న్నెక్కసం బైన పేరుక్కుతో నుక్కఁగంబంబునం బుట్టి గిట్టింపవా... అచ్చ. రా. యు. ౧౬౧.

౪. దిట్టఁడు.

సీ. పెనుఁబాఁపపేరు వేసినగట్టివా కుంభిదైత్యావరోధవైధవ్యదాయి. వరాహ. ౬. ౭౯.

౫. ధూర్తస్త్రీ, గట్టివాయి.

సీ. గట్టివా జంతబాఁగ గయ్యాళి యనఁగను ధూర్తయోషాభిధ దోఁచుచుండు. ఆం. భా. ౨. ౧౧౭.

గట్టివాతనము. వి. (గట్టివా+తనము) గయ్యాళితనము, ధార్ష్ట్యము.

వ. వెంట వెంట వచ్చు నిజచ్ఛాయలం గని తమ్ము నంత నంతఁ జూపెట్టుక వచ్చుచోంటు తమ్మిక్కంటు లని యప్పట్టున గట్టివాతనంబులు గనుపట్టఁ దమ నేరమి వారిపై నారోపించి ... చంద్రా. ౫. ౬౩.

గట్టివాయి=గట్టివా.

వి. (ధూర్తస్త్రీ, గయ్యాళి.)

క. వంచాడించక తాలిమి, డించక బిగు ... దల్లడించక మదిలో, నించుక రైనను .. జలి, యించక యాగట్టివాయి యిట్లని పల్కెన్. పారంగ. ౩. ౨౦౬.

సీ. గట్టివాయి యనంగ గయ్యాళి యన గ య

న ధూర్తసతికిఁ నాహ్వాయము లమరు. ఆం. సం. మాన. ౪. సాం. ని. మాన. ౫.

**గట్టివాలు.** వి. ('గట్టువాలు' అని శ. ర. కాని భారతాదుల పెక్కుప్రతులపాఠమును బట్టియు, కన్నడమును బట్టియు 'గట్టివాలు' అని గ్రహింపఁబడినది-క. గట్టి=పరిమళద్రవ్యములయుండ. వళ్తి- స్త్రీప్రత్యయము. గట్టివళ్తి=సైరంధ్రి, గంధకారిక.) సైరంధ్రీజాతిస్త్రీ, పరులయింట నుండి గంధపుష్పములచే నలంకరించుస్వతంత్రస్త్రీ; గంధపుష్పాదుల నమ్ముస్త్రీ.

ఆ. ఏను గట్టివాలు నాన నా కెవ్వరు,కడుపుకూడు వెట్టి కట్టఁ జీర, యిచ్చి సాకతమున నేలుదురట్టివా,రలకుఁ బనులు సేసి మెలఁగుబుద్ధి.

క. వచ్చితి ... భార. విరా. ౧. ౨౯౮, ౨౯౯.

సీ.గట్టివాలై లక్ష్మి గైసేయుచున్నది చేరి యంతఃపురస్త్రీజనముల. కాశీ. ౭. ౫౭.

(కుబ్జ అనినమాట)మ.కలపం బెవ్వరు గూర్చి తెచ్చినను నిక్కం బొల్లఁ డెల్లప్పుడున్,జలకం బాడి మదాగమంబ మదిలోన న్వార్చుఁ గంసుండు రా,జెలమిన్ మెచ్చినగట్టివాలిది యనన్ హృద్యక్రియావిద్యఁ జే,శలనై యుందుదు ...హరి. పూ. ౯. ౨౮. కాశీ. ౨. ౧౪౬.

గీ. ఏకజాతిసుమంబు లనేకజాతి,కలితసుమనఃకదంబమ్ముగా నొనర్చి, వలచి తరితీపు పుట్టించి పిలుతు రర్థి,గట్టివాలుపడంతు లప్పట్టనమున. తపతీ. ౧. ౬౧.

చ. దల మగుచంద్రఖండములు దారలు సాంకవమొప్పుపాణిపాత్రల మగుదంతభృంగరవటంబు శశాంకుఁడు గుంకుమైనచీ,గలజిగి కెంపుగా బయటిరథ్యల నొప్పదు రిందుకాంతవే,దులపయి సంధ్యయే బహుశఁ దోఁచె నన న్పురిగట్టివాల్పతుల్. అము. ౨. ౨౩. చంద్రా. ౧. ౩౬.

**గట్టు.** వి. ౧. పర్వతము.

ఆ. గాడ్పువేల్పుపట్టి గట్టెక్కి యుక్కునఁ,జాచె నూటి కేటికోటిమగని, భావిసేతు వచ్చుపడ లంకకడను,నూత్రపట్టుమాడ్కిఁ జాడ్కి వెలుఁగ. రామా. ౬. ౯౨.

సీ... గట్టు నాఁ దీరవగంబు లలరు. ఆం. భా. ౩. ౫౩.

౨. తీరము, ఒడ్డు. ఆం. భా. ౩. ౫౩.

గట్టులరొకిమీఁడు=అద్రిరాజు, హిమవత్పర్వతము. రామ. ౨౧౩.

గట్టురాజల్లుఁడు=శివుఁడు. రామా. ౧. ౪౩.

గట్టుచాటునిక్షేపము=పర్వతముక్రింద నుండునిధి. (అసాధ్యము, వశము గానిది అని భావము)

గీ. జనమనోరమ ధాన్యమాలిని గళావ,తియుఁ దిలోత్తమ పూర్వచిత్తియుఁ బ్రమోహి, మొదలుగా నింతులకుఁ జింత యొదవె నళని,చిత్తమది గట్టుచాటునిక్షేప మనుచు. కవిరా. ౩. ౪౮.

జ: గట్టుఁద్రిమ్మరి, గట్టుతాలుపు, గట్టుదాయ, గట్టుపట్టి, గట్టురాచూలి, గట్టులరాయఁడు, గట్టులఱేఁడు,గట్టువిలుకాఁడు, గట్టువిల్తుఁడు, గట్రామూలి, గట్లనూఁడు.

**గట్టుఁద్రిమ్మరి.** వి. (గట్టు + త్రిమ్మరి.) మలత్రిమ్మరి, వానరము, కోఁతి.

క. ఉమ్మలిక యుడిగి తద్దయు, నెమ్మదితో నుండు మిపుడు నీ చెంతకు బీ,ర మ్మొదవఁగ నగ్గట్టుం,ద్రిమ్మరి మొన గానిఁ బట్టి తెచ్చెద నెలమిన్. అచ్చ. రా. సుం. ౧౨౮, ౧౧౨.

**గట్టుతాలుపు.** వి. (శ. ర-గట్టు + తాలుపు) వగధరుఁడు, విష్ణువు.

సీ. మశకపంక్తులయట్లు మాత్త రుద్ధతిఁ జావగట్టుతాలుపు చెట్టు బెట్టుఁ జెందె, మకరవైఖరి వైరినికరంబు చెలరేఁగ వనజనాభుఁడు వార్ధి వహి వహించె. ఉ. రా. ౨. ౫౦. ('గట్టుఁదాలుపు' ముద్రి)

**గట్టుదాయ.** వి. (గట్టు+దాయ) గోత్రభిత్తు, దేవేంద్రుఁడు.

గీ. బమ్మయ మ్మెచ్చ యజ్జగబంటుమీఁద, వైవనది సంపఁ జాలక వానిఁ గుదియఁ,గట్టి వైచిన మే నల్లఁబట్టివైచి, తండ్రికడ నిల్పె నగ్గట్టుదాయ నూఁడు. అచ్చ. రా. సుం. ౧౩౨. (గట్టుదాయనూఁడు=ఇంద్రజిత్తు.)

**గట్టుపట్టి.** వి. (గట్టు+పట్టి) ౧. మైనాకుఁడు.

సీ. గట్టుపట్టినిఁ జెట్టపట్టి చట్టుప లేలినట్టి జెట్టినిఁ గ్రోలుదిట్టతపము. అచలా. ౩. ౪౧.

౨. పార్వతి. వరాహ. ౯. ౫౮.

**గట్టురాచూలి.** వి. (గట్టు+రాచ+చూలి.) హిమవత్పుత్రి, పార్వతి.

దండకము... ఈశునిల్లాలవై యున్న యాగట్టురాచూలివి న్నీవ కావే... రాజ. చ. ౨. ౧౯.

**గట్టుల(ల్ల)రాయఁడు**=గట్టులఱేఁడు. సాం. ని. స్థా. ౫౫.

**గట్టుల(ల్ల)ఱేఁడు.** వి. (√గట్టు)హిమవంతుఁడు, నగాధిపుఁడు. (శ. ర.)

**గట్టువిలుకాఁడు.** వి. (√గట్టు) శివుఁడు. అచ్చ. రా. సుం. ౧౫౨.

**గట్టువిలుతు(లు)ఁడు**=గట్టువిలుకాఁడు. ఆం. సం. దేవ. ౬.

**గట్రాచూలి**=గట్టురాచూలి.

శా. ఎట్రాశేషుఁడు పోతరించి సభలో నెగ్గాడె నా రత్నమీఁ, డట్రా వాసుకితక్షకాదిధృత రాష్ట్రామాత్యకర్కోటకుల్, చుట్రా నిల్తురు గాక నన్ను సమరక్షోణిఁ విజృంభించి యా,గట్రాచూలివిభుం డెదిర్చిన నహంకారం బు వారించెదన్. జై. భా. ౭. ౯౨.

(ఇట్లే 'గట్లఱేనిబిడ్డ' ఆం. భా. ౧. ౪౦.)

**గట్లనూఁడు.** వి. (√గట్టు) గోత్రభిత్తు, దేవేంద్రుఁడు.

(ఇట్లే గట్లగొంగ.) అచ్చ. రా. యు. ౪౭౪, కిష్కి. ౧౮.

**గడ**[1]. వి. (సం. కాండః. క. గడె.) ఇక్షురంభాదికాండము.

సీ. ఇక్ష్వాదికాండాఖ్య యొసఁగును గడ యన... ఆం. భా. ౨. ౭౫.

సీ. కమలపుపాళంబు గాలాపుఁ బ్రాఁడుగాఁ గాలోగ్ర దండంబు గడయుఁ గాఁగ. కు. సం. ౧౦. ౫౩౫.

సీ. పరిభూతబిసపద్మభాతులు చేతులు కదలికాయుగళంబుగడలు దొడలు. భా. రా. సుం. ౧౫౩.

౨. యుద్ధసాధనవిశేషము. (ఈఁటె ?)

సీ. విరివిరై మేఘముల్ పెరిఁగివచ్చినపోక ఘనపతాకలశతాంగములు హత్తి, వెదురుపొదల్ పేర్చువిధమునఁ గనిపించుగడలపోఁజులు సమగ్రముగఁ గూడి. విజ. వి. ౩. ౧౫౨.

గీ. గడలపోఁజులరొద లిరుగడలఁ జెలఁగ, దొరల నందఱు మన్ననల్ దొరల వనిచి. సారంగ. ౨. ౧౯౦.

౩. ఓడకంబము, తెరచాఁపకొయ్య.

క. గడ కట్టినయోడపగిది ... శివయోగసారము. ౨. ఆ. (శ. ర.)

జః గడచీల, గడసాదన.

**గడ**[2]. వి. (సం. ఘటా. ప్రా. ఘడ.) సమూహము.

సీ. ముక్కువఁ దేఁకువ దక్కి లోఁ దవిలి యాడెడుచక్రవాకపుగడలతోడ. నిర్వ. ౧. ౫౩. (శ. ర. పా.)

**గడ**[3]. ప్ర. చేర్వాదులకంటె వచ్చు నొకానొకప్రత్యయము. (చూ. అత్తుగడ, చేరుగడ, మొ.)

**గడగడ.** వి. (త. కడకడప్పు) వడఁకుట మున్నగువానియందగు అనుకరణము.

క. గడగడ వడఁకెడు మేన,న్నిడువెంట్రుక వెట్ట... ఉ. హరి. ౬. ౯౬.

ద్వి. కూటమి నొకజోడుతో డరై యున్న, నాఁటి సఖ్యము మది నాటి ప్రేరేఁప, గడగడ వసు దేవుకడ కేఁగ నతఁడు. అ. మ. క. ౧. ౨౮ పా. (వడివడిగా వెడలు అని భావము.)

గడగడపఱచు=వణఁకింపఁ జేయు, భయపెట్టు.

ద్వి. కనకరేఖాకాంతి గడగడపఱచు, తనువల్లిక యు వీణఁ దలపించు నెలుఁగు. రం. రా. ఉ. ౨౦ పా. ౭ పం. (ఇట ఔపమ్యమును తెలుపును.)

జ: గడగడలాడు.

**గడగడలాడు.** అ. క్రి. (గడగడలు + ఆడు) వడఁకు.

ఉదా: వాఁడు నన్నుఁ జూచిన గడగడలాడును. (శ. ర, వా.)

**గడచీల.** వి. (√ గడ[1]) ఏతపుబానయం దమర్చి యుండెడుదండెపుఁ బీఁటలు తగుల్చుటకు గడతల నుండెడుచీల, కుండ గట్టెడుచోట ఏతపుగడకొనకు అమర్చుచీల. (శ. ర.)

**గడన[1].** వి. (√ గడించు[1]. సం. ఘటనా) సంపాదనము, ఆర్జనము.

క. గడన గలమగనిఁ జూచిన, నడుగులకును మడుఁగు లిడుదు రతివలు తమలో, గడ నుడుగు మగనిఁ జూచిన, నడపీనుఁగు వచ్చె ననుచు నగుదురు సుమతీ. సు. శ. ౪౩.

క. నీ వీవైష్ణవు విటునిం, గావించిన లంజె తనపు గడన విడిచెదవ్, గావింప లేకయుండిన, నీవు న్విడిచెదవె యనిన నెలఁతుక యొప్పెన్. వైజ. ౨. ౩౦. బహు. ౫. ౪.

**గడన[2].** వి. (√ గడించు[2]. సం. గణనా) ౧. ఎన్నిక, లెక్క.

సీ. లక్షించి మలయశైలమ్ముఁ దేఁ డని కాని గంధసారమునకు గడన లేదు. కై. భా. ౫. ౧౬౭.

౨. స్తోత్రము.

ఆ. అనిన రౌద్రరసము మనమున నడరంగఁ, బడగ యెత్తునురగపాలుకేళి, సేనయుఁ జేతిసారెఁ గొని వ్రేసెఁ బతి నేఁడి, గడన యుడుగు మన్న నుడుగ వచుచు. భార. విరా. ౫. ౨౫౯.

౩. దొంగ మేపు.

గీ. ...గడన యనఁగ, లంప మన దొంగ మేపు చెలంగు నభవ. ఆం. భా. ౩. ౩౫.

గడనకత్తె=గడనచేడియ. (శ. ర-గడన[1] + కత్తె)

**గడనచేడియ.** వి. (గడన[1] + చేడియ) భోగముది, వేశ్య.

గీ. దొరలు మన్నీలు చెలులు బందుగులు జెట్లు, బంట్లు కబ్బంపుఁగూర్పరు ల్పాఠ గాండ్రు, గడనచేడియ లూడిగీల్ గాణ లోజ్జ, బాఁపన య్యాలు దీర్పరు ల్బలసి కొలువ. సీలా. ౨. ౪౯.

**గడనము.** వి. (క. గడణ) గడ, సమూహము.

క. పిసుగు లయి తాఁకు నలుగడ, జడనిధులై ముంచు గోత్రశైలములై పై, పదుఁ జదియఁ గారు మొగులుల, గడనములై కప్పుఁ బన్నగములై చుట్టున్. కు. సం. ౧౨. ౯౭౩.

గడప=కడప. వి. దేహళి, ద్వారముయొక్క క్రింది కమ్మి. (వా, చి. ని, శ. ర.)

సీ. ...గడప యన దేహళీసంజ్ఞ యగును నభవ. ఆం. భా. ౨. ౧౭.

**గడబడ, గడిబిడి.** వి. (హిం. గడ్ బిడ్.) ౧. అల్లరి. (శ. ర.) ౨. తొందర, బాధ. (బ్రౌ)

**గడము.** వి. కుండ లోనగువానిమూఁత, గడి.

గీ ... గడి యన గడంబు, నాఁగను ఘటాదిశపిధాన మా గిరీశ. ఆం. భా. ౧. ౭౬.

**గడము.** సం. వి. అ. పుం. ౧. తెర. ౨. వెలుగు, కంచె. ౩. అగడ్త. ౪. విఘ్నము. ౫. గండశిల. ౬. ఒకానొకదేశము.

**గడలవణము.** సం=గడోత్థము.

**గడవం(మం)చె.** వి. (శ. ర-గడ1 + మంచె?- హిం. ఘరోంచి.) మూటలు మున్నగునవి పెట్టుట కై కోళ్లు అమర్చినచట్టము.

**గడసాదన.** వి.(గడ¹ + సాదన) సాము,వ్యాయామము. (శ. ర.)

**గడసియ.** వి. ౧. అటుక. ౨. మచ్చు, మిద్దె. 3. మదురు. (చి. ని.)

**గడసిల్లు.** అ. క్రి. కడనుండు, చివర ఉగు? (గడిసిల్లు=క్రుంగు ? చూ. గడిసిల(బడు)

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిట్టింకులింకించె గంభీరహుంకారగర్జనమున ... గడసిల్లుఘర యొడ్డగెడ వైన నెవ్వాఁడు త్రాసుపైఁ గట్టెఁడంచమున వంచె. భీమ. ౨. ౭౭.

**గడసె.** వి. ౧.గడసియ, అటుక. (అప్ర -శ.ర.)

**గడి¹.** వి. (క. గడి) ౧. సీమ, పొలిమేర; సరిహద్దు; మితి, మేర.

క. పొలిమేరన గడి యనఁగాఁ, బొలిమెర యన నెల్ల యనఁగఁ బోలును సీమా,స్థలనామధేయములు...ఆం. భా. ౨. ౨౮.

క. పరఁగును నచ్చట వాహిని, విరజ యనఁగ మిగుల నొకటి విమలామృతని, ర్భరపూర్ణ యగుచు నది గడి,పరమపదమునకు భవప్రపంచంబునకున్. పరమ. ౧. ౨౮.

క. అడవులు గడిదేశము లవి, దడములుగాఁ బెంపుమా...ఆము. ౪. ౨౫౬.

ఆ. కలఁగి తేఁటవోదు గడి దప్పు వెలిమనుు, నీటికుప్పనీరు నేటుమనసు. అచ్చ. భా. ౪. ౫౭.

చ. ఎదిరినయోబళేశ్వరినరనేంద్రునికీర్తి నిజాంశుపంక్తికిన్, మదనవిరోధి భీతుఁడయి మార్గ్గాన కేఁగినఁ దద్రథంబు దత్పదనము నాక్రమించి రథసంబున నావృషభాధిపధ్వజాన్, వెదకెఁ జామి యజాండముల వే వెడలెం గడి లేనియానునన్. వరస. ౪. ౬౭.

౨. చదరంగపుబల్ల మున్నగువానిమీఁద గీచినయిల్లు.

ఉదా: చదరంగపుగడి.

3. దరి, సమీపము.

క. తరుగుల్మాదులమఱువునఁ, దరతరమ చలించి గడికిఁ దారుచుఁ బురసం,హారు నెయిదఁ జొచ్చెఁ గాముఁడు...కు. సం. ౫. ౪౯3.

౪. కుండ లోనగువానిమూఁత, గడము.

గీ...గడి యన గడంబు,నాఁగను ఘటాదికపిధాన మూ గిరీశ. ఆం. భా. ౧. ౭౬.

౫. (రెండురెండుపశువులకు) ఒక్కొక్క కాలు చేర్చి వేసెడిబంధము. (చూ. గడిత్రాడు)

౬. మర్యాద, కట్టుబాటు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి,కాకలను దేటి గడి మీఱి గట్టిపాటి, రాలుగాయతనాన బేరజపుదారి, నారితేఱియు బలుగుంటమారి యయ్యె. హంస. ౫. ౧౧౦.

జ: గడికాళ్లువేయు, గడిత్రాడు, గడిదేఱు, గడిదొంగ, గడిపోటు.

**గడి²**=గడీ. వి. దుర్గము, కోట. (చి. ని.)

క. ఆబొబ్బిలిగడిపై తేఱఁ,గా బుసుజులపై నెసంగునాగ్నేయకళా,త్మీబదయోమయ మైనయ, రాబాసాం పన్న నెన్నరా దెవ్వరికిన్. రంగా. ౨. ౨౭.

**గడి.** సం. వి. ఇ పుం. గిత్త, కోడెదూడ.

**గడి(యి)ంచె¹.** స. క్రి. (సం.ఘట్). ౧. సంపాదించు, ఆర్జించు.

ద్వి...నూటపదార్లు,గడియించి యావవకాలంబునందు. ద్వి. సారంగ. ౨. ౬౮ పా. ౨3 పం.

చ. పుడమి సమస్తవర్ణములపొల్తులు నీలువు దప్పి లంజెలై, పడిచి గండింతు రర్థములు...వరాహ. ౯. ౧౭౬.

ద్వి. గోఁచి గట్టినవాఁటఁగోలెఁ బీనుఁగుల, మోచి గడించినమూలధనంబు... ద్వి. హరిశ్చ. ఉ. ౭౨౭ పం.

౨. కల్పించు.

మ... దోఁ,సము సుమ్మెందు నిరాపనిందలు గడించకు... పారం. ౩. ౧౨.

చ. అటు దలఁ డౌర యెంతటిమహాత్ములు మీరలు నాదుమీఁదనా, కటకట మీవహోరచనకౌశల మోభువనప్రపంచసం,ఘటనధురీణ యున్న నగి కామిని యిం దిపు డేమి గాంచి యీ,కిటుకు గడించి పల్కె డెంతెఁ గింపుము కల్గిన నాకు నావుడున్. కళా. ౫. ౩౭.

జ: గడన¹, గడనకత్తె, గడనచేసికొను.

**గడి(యి)ంచు².** స. క్రి. (సం. గణ్) గణన సేయు, పాటించు.

క. వెడదరువు లిచటఁ జెల్లవు, పుడమి నహహ దొంగ లానపాడిచినఁ గోకల్, విడుతురె గడింతువే యెక్కడిగతిమాలినపిశాచికవో నీమాటల్. కళా. ౩. ౧౯౩.

ద్వి. వడు గని యిది యేమి గడియించె దీవు, జడుఁడ నెట్లయితి వీశ్వరునిఁ గొల్చియును, బరమార్థ గురునిగాఁ బడసి దుర్నరుల, గురు లని తలఁచుట నరకంబు గాదె. బస. పు. ౧. ౭౫ పం.

**గడికాళ్లువేయు.** స. క్రి. (√గడి¹)-రెండు రెండు పశువులను-ఒక్కొక్క కాలు చేర్చి లంకె వేయు.

ఉదా: ఆవులను పొలములో గడికాళ్లువేసి రా. (శ. ర.)

**గడితపడు.** అ. క్రి. (గడితము + పడు) గట్టిపడు, ఘనీభవించు.

గీ... వలరాచమేపుడుకంటివేల్పు,జడలలోనుండి వడియుచు గడితపడిన, తేటవెలుపుటేటిపెన్నీటిబొట్టు, లనఁగఁ జుక్క లుగనుపట్టె... యయా. ౨. ౭౧.

**గడితము.** విణ. (సం. ఘటితం. ప్రా. ఘటిఅ) ౧. ముదు రైనది, మోటుది; చిక్కనిది, తఱ చైనది.

సీ. గడితంపుటెలుఁగుతో లక్కావ్విన నొప్పారుబలు తేరు వేయి మావులు వహింప. హరి. ఉ. ౭. ౨౧౩.

సీ. పచ్చియేనికతోలుపచ్చడంబుఁ ద్యజించి గడితంపుఁబట్టుపచ్చడము గట్టు. హర. ౫. ౫.

సీ. కుండబొజ్జల క్రింద క్రిందు గా బిగియించి గడితంపుమడుఁగులు గట్టినారు. నైష. ౭. ౬౩.

౨. అధికము, మిక్కుటము; పెద్దది.

క... పది వేలముద్దుఁ దలిరుంబోఁడు, ల్లలి గొద రిటు వలె గడితపు,వలంతం జెంది కంద ఫలము నృపాలా. రసిక. ౩. ౧౪౧.

గీ... జగములు గడితంపుఁ గనికరంపుఁ, బెంపు రాణింప నెపుడు పాలింపుచుండు. రసిక. ౧. ౨.

సీ. గడితంపుఁగీల్జడ కటిమండలంబునఁ బలుదెఱంగుల లాస్యకలన నెఱప. రసిక. ౫. ౧౩౩.

క. బెసిదపుటసిదముఁ గైకొని, గడితపుటాఱడుస్సి వాఁడిఖడ్గము చేతన్ ... జవ గోసి యతండు వేగ చనియె లతాంగీ. శుక. ౨. ౨౨౩.

వి. ౧. తఱచు, బాహుళ్యము.

క. మిడుతలగడితము తొలుకరి,పిడుగులబెడిదంబు చిలువపింఁడులవడియున్. అచ్చ. రా. యు. ౩౨౫.

౨. సాంద్రత్వము, చిక్కన.

క. పడఁతుక యొక్కతె పోఁగుల, గడితము గల చల్వవల్వ గైకొని... పార్వ. ౫. ౧౨౭.

౩. ముదుగుఁదనము, మోటుఁదనము. (శ. ర.)

జ: గడితపడు.

**గడిత్రాడు.** వి. దే. (√గడి¹)-రెండు రెండు పశువులను-ఒక్కొక్క కాలు చేర్చి లంకెవేసెడుపలుపు. (చి. ని, శ. ర.)

**గడిదల.** వి. ఒకవిధ మైనయాయుధము.

క...కూలిరి గడిదలలు దాఁకి కుంభినిమీఁదఁ. కు. సం. ౧౧. ౬౯౬.

వ...గడిదల లూని జళిపించియును ... ప్రబంధ. ౭౭౫.

**గడిదేఱు.** అ. క్రి. (గడి¹ + తేఱు) నిపుణుఁడగు, ఆరితేఱు.

గీ. ఆరితేఱె ననం గడిదేఱె ననఁగఁ, గసిమసంగె ననంగ వాఖ్యలు దనర్చు, నిపుణుఁ డయ్యె నటంచుటకు...ఆం. శే. ౩౫.

క. వెడవెడ దుర్వ్యవహారపు, నడవడి గడిదేఱి గురుజనము శిక్షింపఁ, గడుసువడి విప్రతనయుఁడు...పాండు. ౩. ౧౪.

గీ. జారవిద్యలఁ గడు గడిదేఱి యామి,టూరి విడివడ్డమరుతేజీదాడి మీఱి. శుక. ౨. ౧౦౧.

**గడిదొంగ.** వి. (√గడి¹) గడిదేఱినదొంగ, నిపుణుఁడగుచోరుఁడు. (బ్రౌ)

**గడిపోతు.** వి. (గడి¹ + పోతు) ఆఁబోతు.

ద్వి. ఉడుగక వాతఁ గ్రొవ్వులుకంగఁ గుడిచి, గడిపోతువలె మేనికండలు పెంచి. ద్వి. హరిశ్చ. ఉ. ౫౫౭ పం.

**గడియ¹(డె).** వి. ౧. అర్గళము, తలుపునకు నడ్డుగా వైచుకఱ్ఱ.

సీ...అర్గళాఖ్య,గడియ నాఁ దగును...ఆం.భా. ౨. ౨౨.

గీ...తలుపు,మూసి గడియ బిగించెద మోసపోక. శుక. ౨. ౧౨౨.

గీ. అతివ బంగారువఱలోని కరిగి మిగులఁ, బెరుఁగుసిబ్బితిచే గడెఁ బెట్టుకొనియె. యయా. ౫. ౩౪.

గడియలుపడు=గడియలు వేసినట్లగు.

క. ఉడుగనిపన్నులఁ బెవులను, గడియులుపడ మేను పడఁక...పాండు. ౩. ౧౦౩.

**గడియ²(డె).** వి. (సం. ఘటికా) ౧. ఘటిక, ఇరువదినాల్గునిమిషములకాలము.

గీ. గడె గడియ నాఁగ ఘటిక యగు...ఆం. భా. ౧. ౯౫.

చ. గడెలు పదాఱు చెల్లె ననఁగా విని... కువల. ౨. ౪౭.

౨. ముహూర్తము, అల్పకాలము.

గీ. కంతుశత్రు జయించెద గడియలోన. దశా. ౩. ౩౭.

గీ. గడియతడవుగోఁ బొడిపొడిగా నొనర్చె. హరి. ఉ. ౬. ౧౯౯.

జ: గడియకుడుక.

**గడియకుడుక.** వి. (గడియ² + కుడుక) గడియలను దెలుపుపాత్రవిశేషము. (ఇది అడుగున చిల్లులు గలిగియుండి తేలికగా నుండును. ఇది నీటిలో తేల విడువఁగా క్రిందిచిల్లులనుండి నీరు పోసికొని ఒకగడియ సేపటికి మునుఁగును. దీనినిబట్టి పూర్వము కాలమానమును దెలిసికొనెడివారు.)

ఆ. గడియకుడుకభంగి గ్రహరాజు జలధిలో,వ్రాలె...ద్వా. ౪. ౨౩౯.

గీ. గడియకుడుక మునుంగుట గని గురుండు, తెల్లవాఱెను నని పలుతెంచి పలుక. కువల. ౨. ౧౨౫.

**గడియారము.** వి. (క. గడియార. త. గడికారం. తు. గడియాళ్) గడియలు తెలుపుయంత్రవిశేషము; కాలము తెలుపుయంత్రవిశేషము.

మ. ఉడువీథిన్ శిఖరావలంబి యగునభ్రోర్వీశమోసాలపై, గడియారంబున మ్రోసె రెండెనిమిదుల్ ఘంటాఘణాత్కారముల్ ... క్రీడా. ౧౫౫.

ఉ. అవలినాయకాక్షుగడియారమునం దభిసారికాజిఘాంసానిరతప్రసూనశరచాపగుణధ్వనులో యనంగ ఘం,టానినదంబు లయ్యెడ వినంబడియెం గుపితాబ్జలోచనా,మానసము ల్చలింపఁ బ్రథమప్రహరాగమప్రశంసనులై. పారి. ౨. ౫౦.

ద్వి. ఒక్కొక్కగడియ కొక్కొక్కవండు వ్రాలు, నక్కజం బగు గడియారవృక్షములు, ఒక్కొక్క గడియ కొక్కొక్కమాటు చెలఁగు, నక్కజం బగుగడియారశైలములు. బస. పు. 3. ౧౦౦౫, ౧౦౦౬ పం. (ఇటవృత్తియందు 'ము' వర్ణలోపము.)

(వ్యవ)గడియారము పండ్రెండుగంటలు కొట్టినది.

**గడిసిలఁబడు.** అ. క్రి. (అొమ్ము) భారాదులచే క్రుంగఁబడు. ('గరిసిలఁబడు' అని బ్రౌ)

సీ. ఇగురుమేఁతల నొక రెక్కఁ గోకిలకును వడి అొమ్ము గడిసిలఁబడియె నేని... గీ... బట్టబయలగు గర్వరేఖ,విషమసాయక... పి.శకుం. 3. ౧౯౦.

**గడీ**=గడి[2].

గీ. రావువారిగడీమీఁద రాచవారి, పనుపునఁ బరాసువారు కోపంబుఁ జేసి.రంగా. ౨.౧౨౨.

**గదు**=గద్దు. (చూ. గదుఁగాయ, గదుమన్నెము.)

జ: గదుఁగాయ, గదుమన్నెము.

**గదుకము.** సం. వి. అ. పుం. భృంగారము, బంగారుగిండి; గిండి.

**గదుఁగాయ.** విశే. (గదు+కాయ) రాలుగాయ, తుంటరి. (వా)

**గదుమన్నెము.** వి. (గదు + మన్నెము) గద్దుమన్నెము, లోమన్నెము. (వా)

**గదురుఁడు.** సం.=గదులుఁడు.

**గదులుఁడు.** సం. విశే. (అ. ఈ. అ) కుబ్జుఁడు, మఱుగుజ్జు. (విల్సన్సు.)

**గదువు.** వి. (క. గదువు)-కాలముయొక్క-అవధి, మేర.

గీ. గదు వనఁగ మేర యనఁగ నుగ్గడి యనంగ, నడరు మర్యాద...ఆం. భా. ౨. ౧౯౧.

ద్వి...కొన్ని,దినములు గదు విడి...ద్వి. పరమ. ౭. ౫౮౬ పా.

ద్వి. ఆగదువుకు రానియట్టివానరుల, వేగంబె తల దెగ వ్రేయుము నీవు. రం. రా. కిష్కిం. (చి. ని.)

**గదువు.** సం. విశే. (ఉ) కుబ్జుఁడు. వి. ఉ. పుం. ౧. బల్లెము. ౨. గిండి. 3. ఎల్ల, వానపాము. ౪. మెడమీఁదికంతి. ౫. కంతివలె నిరర్థక మగుపదార్థము.

**గదుసరి.** విశే. (గదుసు+అరి-క. గదుసరి) ౧. కఠినము; కఠినుఁడు.

ద్వి. నమ్మిక పుట్టించి నయములు సేసి, గదుసరిమనసులు గరఁగించి వుచ్చి. ద్వి. హరిశ్చ. ఉ. ౬౧౯ పం.

సీ...కఠినాత్ముఁ డొప్పను గదుసరి యనఁ. ఆం. భా. 3. ౧౨.

౨. మాయలమారి, వంచకము.

క. అదుగులు తొట్రుపడంగా, నద లొందినయది యపోలె నయ్యెయెడలన్,బుడమిఁ బడి మ్రొగ్గి లేచుచు, గదుసరి యగుశశక మొయ్యఁగదియం బోవన్. నా. పంచ. ౧. ౨౫౪. వైజ. ౪. ౯౪.

3. దుష్టుఁడు, కూళ.

క. ఒదయఁడ నే నొకజన్నము, గదు వేడుకతో నొనర్పఁ గడఁగిన నెపుడున్, గదుసరికక్కను లిరువురు, దొడరి వడిన్ జెలువుమందుదురు చల మెదవన్. అచ్చ. రా. బాల. ౯౫.

ద్వి. గొడవగొట్టులు ముడివిడుపులు చాల, గదుసరు ల్గయ్యాంపుఁగ్రచ్చలు...పండితా. పురా. ౧౧౬ పా.

౪. అసాధ్యుఁడు. (శ. ర, బ్రౌ.)

**గదుసు.** విశే. (క. గదుసు. త. కడిదు) ౧. కఠినము, గట్టిది.

కవిరాజ ... గదునుఁజనుంగవ ... కవిరా. ౫. ౨౪౫.

గీ. గదునుఁబిక్కలు గరిగినమడమ లమర, వెంట

నిరుపంకఁ జెంపుడు వేఁపు లరుగ. కుశ. ౨.
౪౧౨.

సీ. గడు సైన పెనుమొద్దు గాలికి వెఱచునా విఱు
గఁ గాచినమ్రాను వెఱచుఁ గాక. రామలిం
౨౪.

౨. కుజనుఁడు, కూళ.

ఆ. ఆతతాయి గడుసు వన్యదేస్య వధర్హ్యు ... అ
ము. ౪. ౨౦౯.

గీ. కూళ గడుసన వర్తిల్లుఁ గుజను పేళ్లు. ఆం.
సం. మాన. ౧౧.

వ... నీవు చని యీనడుమ నంకురితదర్పు లగు
చు నెదుర్పడం గడంగుగడుసువారల లెక్క
లెక్కడం గలరో వారి నుక్కడంచి ... క
ళా. ౭. ౨౬౮.

౩. గాఢము, అధికము; హెచ్చైనది.

(రతివిలాపము) క. పుడమిఁ బడి పొరలి తను
నొక్కఁడు చుట్టం బనుచు నెత్తఁగా లేకుని
కిఁక, గడు సగుశోకము నెమ్మది, నడఁగక మె
ల్లఁగ వరాళి కారంభించెఁ. పార్వ. ౩.౭౪.

౪. అసాధ్యము. (శ. ర.)

వి. ౧. కాఠిన్యము. (శ. ర.) ౨. మొండితనము.
(చూ. గడుసుపడు.)

గడుసరాలు=గడుసుఁదనము గల స్త్రీ.

ఆ. ఎవ్వరిగుణములును నేమన్న మానవు, చక్కఁ
జేయ రాదు కుక్కతోఁక, గడుసు రాలు మగ
ని గంపఁ బెట్టుమ్రు రా. వేమన. ౧. ౧౬.

జ: గడుసరి, గడుసుఁదనము, గడుసుపడు.

**గడుసుఁదనము.** వి. (√ గడుసు) ౧. కాఠిన్యము.

గీ. శైశవ యేవీఁకఁ బవళించు లేకలేక, కలిగినక
కుత్థ్సవంశశేఖరునిమృదులతను వయోయీ
ను నెనయునీమనసుకంటె, గడుసుఁదన
మొందును పలసంఘములయందు. చం. రా. ౪.
౨౯.

౨. మొటుఁదనము.

సీ. రాఁ గూడదని పల్కు రమణు వెంబడి సేఁగి
కానలో విహరించు గడుసుఁదనము, మాయా
మృగమువెంట మగఁడు పోవఁగ వంటమ
ఱఁది నంపెన నాఁటిమంకుఁదనము...కృ.శకుం.
పీఠి. ౫౦.

౩. ధార్ష్ట్యము.

వ... మీర లీమ్రుచ్చుల నెచ్చరికం గనుపెట్టుకొని
యుండుఁ డనుటయు నదిరిపడుచు నప్పడు
చులు గడుసుఁదనంబున నతని నధిక్షేపించి.
ప్రభా. ౧. ౧౦౭.

**గడుసుప(వ)డు.** అ. క్రి. (గడుసు+పడు) మొం
డితనము వహించు, బండ యగు.

క. వెనవెన దుర్వ్యవహారపు, నడనడి గడిదేతి
గురుజనము శిక్షింపక, గడుసుపడి విప్రతన
యుఁడు, నడి కోరిచి వంగపరకచాటుకొ
మానెక. పాండు. ౩. ౧౪. (శ.ర.పా. 'వంకి
పరక' ముద్రి. పా)

క. అమ్మఁగ దగునాని నడిగిన, నిడిన మొనకొ గొ
సరఁ గొసర నీలే ననఁగా, గడుసుపడి యాస
చేఁ దా, నడిగిన దుర్మార్గవృత్తుఁ డగు రా వే
మా. వేమన. ౨. ౧౯౪.

**గడేకారి.** (ఇది అరవము అని శ.ర.కాని అరవనిఘం
టువులలోఁ గానరాదు) వి. బల్లెము గలవాఁడు;
పోకిరి. (శ.ర.పోకిరి అనునర్థమున 'గడేకారి'వా)

**గడేరము.** సం. వి. అ. పుం. మేఘము.

**గడోత్థము.** సం. వి. అ. న. గడదేశమునఁ బుట్టుజా
తియుప్పు.

**గడోలము.** సం. వి. అ. పుం. ౧. గ్రాసము, కబళ
ము. ౨. గుడము, బెల్లము.

**గడ్డ.** వి. (సం. గండః. క. గడ్డె. త. కట్టి.) ౧. వ్రణ
ము.

ఉదా: నెత్తురుగడ్డ.

౨. దుంప, మూలము.

సీ. మోరకగ్గల మైనకోలచేఁ దుంగగడ్డలు ద్రవ్వుకటి రాజు చెలిమి పిసి. కాశీ. ౧. ౫౯.

౩. మంటిపెల్ల, లోష్టము, బెడ్డ.

క. ఘనతర మగుహ్రీగౌరవమున మునిఁగినఁ బాప మఖిలమును మాపు సెడుం, బెనుపునయగ్గలికఁ బోగడు, గనినపయోరాశిఁ బడ్డగడ్డయుఁ బోలెన్. భార. అను. ౨. ౮౦. ఆం. భా. ౨. ౨౩౦.

౪. (ఏటిమొక్క) ఒడ్డు.

ద్వి... కావేరి, ఘనవేగమున రెండుగడ్డలు జవురు, కొని పాఱి... ద్వి. పరమ. ౫౮౧ పా. ౩ పం.

శా. ఓసామీ ... నట్టడవిలోఁ గల్జువ్విక్రీనీడనే, యాసం గట్టితి వేటిగడ్డనిలు... కాశీ. ౩. ౬౫.

గడ్డపెరుఁగు=గడ్డవలె నుండుపెరుఁగు. (వా.)

నడుగడ్డ=ద్వీపము, ఏటినడుమ నుండుదిబ్బ.

సీ. కావేరినడుగడ్డఁ గాఁపురంబుండును దివసాంతమున నిటుఁ దిరిగి వత్తు. కకు. ౧. ౨౧౫.

చ. చరణవిహీనుఁ డట్టె ఘనసాగరభీకరవీచికాసముత్కరపరిఖాంత మైననడుగడ్డకు వచ్చి నిజోదరాగ్నిచే, నెరియుచు నున్నయట్టితుది నెవ్వరికిం బడయంగ రానినుందరి యిది పత్నియయ్యెడిని దైవముచేఁతల కడ్డమున్నదే. భోజరా. ౫. ౩౮౬.

జ: గడ్డపలుగు, గడ్డపాఱ, గడ్డప్రొయ్యి.

**గడ్డపలుగు.** వి. (√ గడ్డ) గునపము. (వా)

**గడ్డపాఱ.** వి. (గడ్డ + పాఱ - క. కట్టహార) - గడ్డలు పెల్లగించునది - గునపము, ఖనిత్రము.

గీ. వాఁడు కల్యాణపురం దనపనునఁ బరఁగు, కల్యారూపతనునికిఁ దచ్ఛిలదనుము, గడ్డపాఱలకై వసిఁ గానిపించి, పేర్చుట ఖనిత్రకలుఁడని పేరు గలదు. కళా. ౬. ౨౩. ౫ం. భా. ౨. ౨౩౦.

**గడ్డప్రొయ్యి.** వి. (గడ్డ+ప్రొయ్యి) గడ్డలతో నేర్పఱిచినప్రొయ్యి. (శ. ర, వా.)

**గడ్డము.** వి. (క. గడ్డ) ౧. చిబుకము.

గీ... చిబుకాఖ్య యలరు గడ్డ, మనఁగ గడ్డువ నాఁగ... ఆం. భా. ౨. ౧౮౨.

మ... తా నొక్కచే, తన కంఠంబును గౌఁగిలించి యొకచేతన్ గడ్డము న్బట్టి చెక్కునఁ జెక్కును నొక్కచన్నొవయురఃకోణంబుతో రాయఁగన్. కళా. ౫. ౬౧.

౨. చిబుకశ్మశ్రువు, గడ్డముమీఁదిపొడుగుపాటి వెండ్రుకలమొత్తము.

పీ... చిబుకశ్మశ్రు వడరు. గీ. గడ్డ మన... ఆం. భా. ౨. ౧౮౬.

సీ. నిగిడి పూఁతేకుబాగు గఁ గత్తిరించినగడ్డంబు కొనరొమ్ము గమ్మికింప. నైష. ౭. ౯౩.

వ... అర్ధనారి గావునం బురుషుండు గాఁడు గడ్డంబు గలిగినకతంబున యోష గాదు ... కాశీ. ౭. ౮౭.

**గడ్డరము.** సం. వి. అ. పుం. గొఱ్ఱె. (వాచ.)

**గడ్డరిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉత్పత్తిస్థానము తెలియక ఎడతెగకుండ ప్రవహించుపోకానోకనది. ౨. మగగొఱ్ఱె ననుసరించి పోవు ఆఁడుగొఱ్ఱె. (వాచ - మగగొఱ్ఱెల చేత ననుసరింపఁబడు ఆఁడు గొఱ్ఱె - కల్ప)

**గడ్డి.** వి. కసవు, తృణము.

సీ... గడ్డి గాదము గవతము కసవు కవను, పుల్లుపూరి యనంగఁ జెల్లుచు తృణసంజ్ఞ ... ఆం. భా. ౨. ౭౬.

జ: గడ్డిపాము, గడ్డిపిట్ట, గడ్డిబొద్దు.

**గడ్డిపాము.** వి. (√ గడ్డి.) ఒకజాతిపాము. (శ. ర)

**గడ్డిపిట్ట.** వి. (గడ్డి+పిట్ట) పక్షివిశేషము.

సీ. పికిలిపిట్టలు గడ్డిపిట్టలు గోరలు బంగరుపిచ్చిక ల్పనుపుముద్ద. గీ. లాదిగాఁ గలుగుపులుఁగులు ...రసిక. ౧. ౬౩. (శ.ర.పా)

**గడ్డిబొద్దు.** వి. (గడ్డి + బొద్దు) ౧. చుట్టకుదురు. (శ. ర.) ౨. కొన్ని మోపుల పరిమాణము గలిగి బండిమీఁదఁ దీసికొని వచ్చెడి పెద్దగడ్డికట్ట.

గీ. గడ్డిబొద్దువలెను మేను గానిపింప, బారకట్టి ల తెఱఁగున బాహు లలర, జనకయాగంబుఁ జూడవచ్చెను లలాట, సాంద్రతరరోమరేఖ యాచంద్రరేఖ. చంద్ర. వి. ౧. ౬౯.

**గడ్డు.** విణ. ౧. అధికుఁడు, ఎక్కువవాఁడు.

సీ. అలు చైనవానియి ల్లాక్రమింపఁగఁ జూచుఁ డ వకు గడ్డైనఁ బాదములు పట్టు. రామలిం ౨౬.

౨. అసాధ్యము.

ఉదా: గడ్డురోగము

క్రి. విణ. అధికముగా, మిక్కిలి. (చూ. గడ్డుకు)

వి. ఆధిక్యము, అతిశయము. (చూ. గడ్డుకొను)

జ: గడ్డుకొను, గడ్డుఉుకు.

**గడ్డుకొను.** అ. క్రి. (గడ్డు + కొను.) అతిశయించు.

వ. యాదఃపతి మేదురామృతంబు జిడ్డున గడ్డుకొని నపూపాదిత్యవదనంబున నుప్పతిల్లుత్రుళ్లమెఱుంగులు...భీమ. ౫. ౯. (శ. ర. పా.)

**గడ్డుఉుకు.** అ. క్రి (గడ్డు + ఉఱుకు.) ౧. పైపడు, కవియు.

వ. అనఁ గంఠీరవుఁడు... శరాసనకళావిశేషంబున నీను నెఱపుచుం దెఱపి గొని రథంబు వఱపించి రొుఁఱపుపఱపున నడ్డగించు పగఱయొడ్డు గడ్డుఱికి చించుకొని...రాఘవ. ౪. ౧౫౨.

వ...గడ్డుఉుక నీక యడ్డంబుగా నొడ్డుకొనియొడు నెదిరిపిడికిలి వాయం డట్టి...కళా. ౩. ౨౬౬.

౨. పాఱిపోవు, తప్పుకొనిపోవు.

వ...అడ్డగించి నించినయొడ్డువలలకు సడ్డించి కడ్డనం బడక గడ్డుఱికియు మృగంబు లనేకంబులు వొలియుటయును...ఉ. హరి. ౪. ౨౯.

**గణకి.** సం. వి. ఈ. స్త్రీ. గణకుని పెండ్లాము.

**గణకుఁడు.** సం. వి. అ. పుం. ౧. జోస్యుఁడు. ౨. కరణము, గ్రామపు లెక్కలు వ్రాయువాఁడు.

**గణగణ.** వి. (క.త. కణకణ.) ఘంటాధ్వనికి అనుకరణము.

సీ...గణగణ మొలనూలిగంట లులియు. ప్రబంధ. ౧౯.

**గణచక్రకము.** సం. వి. అ. న. సత్పురుషులసహభోజనము.

శ్లో. ధార్మికాణాం తు సంభూయ భోజనం గణచక్రకమ్. (త్రి. ని.)

**గణదీక్షి.** సం. వి. న్. పుం. పెక్కండ్రకుఁ బురోహితుఁ డగువాఁడు. (యాజ్ఞ. ౧. ౧౬౧.)

**గణదేవతలు.** సం. వి. ఆ. స్త్రీ. బ. గణములుగా నుండు దేవతావిశేషములు.

శ్లో. ఆదిత్యవిశ్వవసవస్తుషితా భాస్వరానిలాః, మహారాజికసాధ్యాశ్చ రుద్రాశ్చ గణదేవతాః. (అమరము.)

**గణద్రవ్యము.** సం. వి అ. పుం. సాధారణద్రవ్యము, పెక్కురసొత్తు.

**గణన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఎన్నిక. ౨. తలఁచుట.

**గణనము.** సం. వి. అ. న. ౧. ఎన్నిక, లెక్కపెట్టుట. ౨. భావించుట, తలఁచుట.

**గణనీయము.** సం. విణ. (అ. ఆ. అ) గణింపఁ దగినది.

**గణపతి.** సం. వి. ఇ. పుం. వినాయకుఁడు.

**గణపూర్వుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) గ్రామణి, గణమునందు ముఖ్యుఁడు.

**గణము.** సం. వి. అ. పుం. ౧. సమూహము. ౨. ప్ర

మ్మథులసమూహము. ౩. సేనావిశేషము. (ఇర్వదే డురథములు అన్ని యేనుఁగులు ఎనుబదియొక్క గుఱ్ఱము నూటముప్పదియేవురు కాల్బురును గలసేన.) ౪. (ఛంద) మగణము, మొ. ౫. (వ్యాక) ఒక్క సూత్రముక్రింద వచ్చుపదాది. ౬. శబ్దము, ధ్వని. (శే. ని)

**గణయత్.** సం. శత్రు. గణించుచున్న.

**గణయితవ్యము.** సం=గణనీయము.

**గణరాత్రము.** సం. వి. అ. న. పెక్కురాత్రులసమూహము.

**గణరూపము.** సం. వి. అ. పుం. జిల్లేడుచెట్టు.

**గణవృత్తము.** సం. వి. అ. న. గణబద్ధ మగువృత్తము. (శార్దూలాది. వ్యతి. మాత్రావృత్తము.)

**గణహాసము.** సం. విణ. (అ. ఆ. అ) పెక్కురను పరిహసించునది. వి. అ. పుం. చోర మనుగంధద్రవ్యముచెట్టు.

**గణాచారి.** సం. వి. న్. పుం. సివమెక్కి గంతులు వేయువాఁడు. (ఇది తెలుఁగున నే కలదు.)
(వేశ్యామాతృవర్ణనము) సీ. తా నున్న శ్రేణి కంతటికి గణాచారి పెక్కుసుద్దులు మ్రోయుపెద్దబేరి. శుక. ౩. ౧౭.

**గణాధిపుఁడు.** సం. వి. అ. పుం. ౧. వినాయకుఁడు. ౨. శివుఁడు. ౩. ఒకసమూహమునకు ముఖ్యుఁడైనవాఁడు, గామిడి.

**గణాన్నము.** సం. వి. అ. న. ౧. పెక్కండ్రకొఱకు వండినయన్నము. ౨. పెక్కండ్రసొత్తయిన యన్నము.

**గణి.** సం. వి. ఇ. స్త్రీ. గణనము, లెక్కించుట. పుం. సాంగముగా వేదాధ్యయనము చేసినవాఁడు. (వై. ని.)

**గణి(యి)ంచు.** సం. స. క్రి. ౧. లెక్కపెట్టు.
సీ... భూరజోంబుధిజలపరమాణుగణము. గీ. నైన గణియింపఁగా వచ్చుఁ గాని వినుము, తత్కృతయుగంబులోపలిదైత్యమథన, కృతచరిత్రంబు లన్నియు నెన్న రాదు, వనజభవునకు శతకోటివత్సరముల. వరాహ. ౫. ౪౬.
౨. ఎంచు, ఆలోచించు.
శా. దారస్వీకృతియు న్దయాభిరతియుఁ ... దీనదా, సీరాజీసుతబాంధవాతురజనశ్రేణీసమృద్ధాన్నస, త్కారోదారతయు న్గణింప గృహికి న్ధర్మంబు లుద్యన్మతిఁ. మార్క. ౩. ౧౪౫.
౩. లక్ష్యపెట్టు, పాటించు.
చ. వరద నిరీహయోగిజనవర్గసుపూజిత నీపదాబ్జముల్, నిరతము నంతరంగమున నిల్పి భవత్పదనుగ్రహాదిక, స్ఫురణఁ దనర్చునన్ను నతిమూఢు లవిద్యులు మున్నమంగళా, వరణుఁ డటంచుఁ బల్కిన భవన్మతి నే గణియింప నచ్యుతా. భాగ. ౪. ౧౬౫.
౪. స్తుతించు, పొగడు.
మంజులగతిరగడ. నైమిశపుణ్యావనంబునఁ బొందినహరికిని మంగళహారతు లెత్తుచుఁ, దనరుహరిక్షేత్రంబున నెలకొనుసాలగ్రామస్వామి గణింపుదు. హంస. ౪. ౨౧౩.
౫. చూచు.
ఉ. ఎక్కడఁ జూచినన్ జనమదేభతురంగమనోజ్ఞరావ మేదిక్కునఁ జూచినన్ మదవతీమృదుగానజతానమాన మే, దిక్కు గణించినన్ వివిధచామరకేతనభూషణద్యుతుల్, మిక్కిలి వింతచంద మయి మెచ్చొనరించె మహోద్భుతంబుగన్. ఇందు. ౫. ౬౭.
౬. ఉగ్గడించు, చెప్పు.
క. ఐన జను లాడుకొనియెడి, నానోక్తులు వినఁ దలంచి నన్నడిగిన మీ, యానకు వెఱచి గణించెద, భానుకులాధీశ వినుము పౌరులపలుకుల్. ఉ. రా. ౬. ౧౯౯.
చ. కినియుమి సంగవర్జన మకించనభావము దాత్రివిశ్రవా, సనము ప్రశాంతి యార్జవము శౌచ

ము సద్వ్రతనిష్ఠ హైతుభో,జన మిల నిద్ర సేఁత కృప సంతతతత్త్వవిచింతనంబు మా,నిని యతిధర్మముల్ శ్రుతి గణించినభంగిన యేను జెప్పితిన్. భార. అను. ౫. ౧౬. భాగ. ౧౦ పూ. ౩౩౪.

**గణిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వారాంగన, వేశ్య. ౨. ఆఁడేనుఁగు. ౩. అడవిమొల్ల. ౪. నెల్లి.

**గణికారిక.** సం. వి. ఆ. స్త్రీ. నెల్లి.

**గణితము.** సం. విణ. (అ. ఆ. అ.) గణింపఁబడినది. వి. అ. న. ౧. గణించుట. ౨. లెక్క. ౩. గణితశాస్త్రము.

**గణితి.** సం. విణ. (న్. నీ. న్) ౧. గణించినవాఁడు, గణన చేసినవాఁడు. ౨. గణితశాస్త్రజ్ఞుఁడు.

**గణుతి.** వి. (సం. గణితమ్) ౧. ఎన్నిక, లెక్క.

(సంతవర్ణనము) సీ. పెనుఁగోలుకాండ్రకు జనసమూహంబులగణుతి చూపెడునాయకప్రభుండు. హంస. ౨. ౪౭.

౨. నుతి, స్తోత్రము.

క. గురుదేయాధికనిస్పృహా,ధరణీసురుఁ డర్థికామితధనాధికదా,యి రఘువు సాకేతజనో,త్కరముల కయ్యిరువురైరి గణుతి ఘటింపన్. రఘు. ౩. ౯౦.

శ్లో. జనస్య సాకేతనివాసినస్తౌ,ద్వావప్యభూతామభినంద్యసత్త్వౌ, గురుప్రదేయాధికనిస్పృహోర్థీ,నృపోర్థికామాదధికప్రదశ్చ. సం. రఘు. ౫. ౩౧.

౩. లక్ష్యము, లెక్క.

(అశ్వవర్ణనము) సీ. కసవుమోపరి గాలి గణుతియే మాకంచు నగినట్ల వదనఫేనముల రాల్చు. శ శాం. ౨. ౨౫.

జః గణుతించు.

**గణుతించు.** స. క్రి. (√ గణుతి) ౧. ఎంచు, భావించు.

క. యాగంబునందు శ్రద్ధా,యోగము గలశుచి శ్రద్ధలయినవరనిశుచి పృ,థ్యాగమసంపదఁ దుల్యులు,గా గణుతించిరి నిరూపకత సమరవరుల్. భార. శాం. ౫. ౨౪౭.

శ్లో. శుచేరశ్రద్దధానస్య శ్రద్దధానస్య చాశుచేః, దేవా విత్తమమన్యంత సదృశం యజ్ఞకర్మణి. సం. భార. శాం. ౨౭౦. ౧౦.

౨. లెక్కించు.

క. గుణనిధి యగు ప్రహ్లాదుని,గుణము లనేకములు గలవు గురుకాలమునన్, గణుతింప నశక్యంబులు,ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్. భాగ. ౭. ౧౨౦.

౩. లక్ష్యపెట్టు, సరకుసేయు.

ఉ. దిగ్గన లేచిపోయె గణుతింపక వాఁడు విరోధులబ్ధికై,యగ్గలికంబునన్ మనల నందఱఁ జీరికిఁ జేకొనండు... నిర్వ. ౩. ౧౦౭.

౪. స్తుతించు, కొనియాడు.

సీ. గణుతింతు నిరవద్యగద్యపద్యనిబంధపరితోషితస్థాణు భట్టబాణు. భీమ. ౧. ౭.

**గణె(ణియ)ము.** వి. వేషధారులు ధరించెడిలక్కసొమ్ము. (చి. ని, శ. ర.)

**గణేయము.** సం=గణనీయము. సం. నైష. ౩.౪౦.

**గణేరుక.** సం వి. ఆ. స్త్రీ. ౧. కుంటెనకత్తె. ౨. పనికత్తె.

**గణేరువు.** సం. వి. ఉ. పుం. కర్ణికారము. స్త్రీ. ౧. వేశ్య. ౨. ఆఁడేనుఁగు.

**గణేశభూషణము.** సం. వి. అ. న. సిందూరము.

**గణోత్సాహము.** సం. వి. అ. పుం-సజాతీయముల గుంపుతోఁ గూడి తిరుగుటయం దుత్సాహము గలది-ఖడ్గమృగము.

**గణ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) గణింపఁబడుచున్నది.

**గణ్యము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. సంఖ్యేయము, లెక్కింపఁ దగినది. ౨. లెక్కసేయఁ దగినది, లక్ష్యము సేయఁ దగినది. ౩. గణములోఁ జేరినది.

**గతపడు.** మి. అ. క్రి. (గతము + పడు) ౧. కడచు. (శ. ర) ౨. చచ్చు.

ద్వి. వాతశేషు లగురాక్షసావళి సెచ్చు, గతపడ్డ యా మ్మహాకాయునిఁ దలఁచి. ర౦. రా. యు. ౩౭౭ పా. ౨౧ పం.

**గతభర్తృక.** సం. వి. ఆ. స్త్రీ. విధవ.

**గతము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. పోయినది. ౨. కడచినది, గతించినది. ౩. చచ్చినది,నశించినది. ౪. ప్రాప్తము, పొందినది, చెందినది. ౫. జ్ఞాతము, తెలియఁబడినది, గ్రహింపఁబడినది. వి. అ. న. ౧. పోవుట. ౨. గతి, నడక. ౩. ప్రకారము, విధము. (శే. ని)

**గతసన్నకము.** సం. వి. అ. పుం. మద ముడిగిన యేనుఁగు.

**గతాగతము.** సం. వి. అ. న. రాకపోకలు.

**గతానుగతము.** సం. వి. అ. న. ఒకరు ప్రవర్తించునటులు ప్రవర్తించుట.

**గతానుగతికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ఒకరు ప్రవర్తించునటులు ప్రవర్తించువాఁడు.

శ్లో. తామేవానుగతా గతానుగతికాస్త్యక్త్వాను రాగాః ప్రజాః. ముద్రా. ౬. ౫.

**గతాయువు.** సం. విశే. (న్) ౧. మృతుఁడు. ౨. వయసు గడచినవాఁడు, వృద్ధు.

**గతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. గమనము, పోక. ౨. నడక. ౩. త్రోవ. ౪. ఉపాయము. ౫. ఎఱుక, జ్ఞానము. ౬. స్థానము. ౭. నాడీవ్రణ మార్గము, నారిపుంటికంటిత్రోవ. (మే. ని, వి. ని.)౮. ప్రమాణము.

శ్లో...మృగః క్షతః క్షణా, దనేన పూర్వం న మయేతి కా గతిః. సం. కిరా. ౧౪. ౧౫. (కాగతిః=కిం ప్రమాణమ్. మల్లి. వ్యా.)

౯. స్వరూపము.

శ్లో...న వయం నిరూపయితుమస్య గతిమ్. సం. కిరా. ౬. ౩౬. (గతిం=స్వరూపమ్. మల్లి. వ్యా.)

౧౦. విషయము.

శ్లో...మనోరథానామగతిర్న విద్యతే. సం. కు. సం. ౫. ౬౪. (అగతిః=అవిషయః. మల్లి. వ్యా.)

౧౧. పరిణామము.

శ్లో. దురధిగమా హి గతిః ప్రయోజనానామ్. సం. కిరా. ౧౦ ౮౦. (గతిః=పరిణతిః. మల్లి. వ్యా)

౧౨. శరణము, దిక్కు.

గీ...అందఱకు నీవ గతి గాక యన్యుఁ డొకఁడు, నీకు గతి యౌనె సకలలోకైకనాథ. దశా. ౧. ౧౬౧, ౧౫౮.

౧౩. పతె; విధము, రీతి.

ద్వి. ఎన్నిక కెక్కి యీరేడులోకముల, వెన్నెల గతిఁ గీర్తి వెలిఁగించె ... ద్వి. హరిశ్చ. పూ. ౧౫౨ పం.

సీ. చంద్రమతీ నాథుచందాన నబ్బురి వైఖరిఁ బురుకుత్సునిగతిఁ బురూర, పురిమాడ్కి ... శుక. ౧. ౧౦.

గీ...వీర, లేమిగతిఁ బల్కినను నది యెల్ల మనము, గైకొన వలయుఁ గాక... భార. విరా. ౫. ౨౭౫.

**గతించు.** సం. అ. క్రి. ౧. కడచు.

చ. వినయవిశేషహృద్య లగువిద్యలు నేర్చుట లేమ నీతి చే, ధనమును గూర్చ లేదు శలిదంద్రులనే వయఁ జేయలేదు ...... గొబ్బున సముద్రం బు కాకులకుఁ బోలె గతించెఁ బరాన్నభుక్తులకు. భర్తృ. వైరా. ౪౭.

౨. చచ్చు. (శ. ర, వా)

**గతిగొను.** మి. అ. క్రి. (గతి+కొను) ఏకగతి కలది యగు.

క. కలికివరుమదనకదనపుఁ,బలుకులకలకలము చె
డఁగువడు మేఖలము,వ్వలరవళిఁ దగిలి గతిగొ
నఁ, గలకంఠి రతంబు సలుపుగమకము గని
యెన్. భాగ. ౬. ౯౯.

**గతిపడు.** మి. అ. క్రి. (గతి + పడు) లభించు.

క....వానితలఁ ద్రెంచి సమ్ముత్కటముగ నసల
ములో నొ,క్కట వైవుము సిద్ధులెల్ల గతిప
డు నీకున్. ద్వా. ౧౨. ౬౫.

**గతిల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వరుస, పరంపర. ౨. ఏ
ఱు, నది. ౩ వేత్రలత, పేము ?.

**గతుకు**[1]=కతుకు స. క్రి. (కుక్క మొదలగునవి)
కొంచెముకొంచెముగాఁ దిను; నాలుకతో కొం
చెముకొంచెముగాఁ ద్రాగు.

క. ప్రతిగృహము నెపుడుఁ దిరుగుచు, నతిశయ
మున భుక్తశేష మాతురమతినై, గతుకుచు
వీథుల నుండుచుఁ, గతిపయసంవత్సరములు గ
డపితి నచటన్. బ్రహ్మో. ౨. ౧౨౪.

(వ్యవ) కుక్క గంజి గతికినది.

వి. ఎంగిలి తినుట. (శ. ర.)

**గతుకు**[2]. వి. గొయ్యి. (బ్రౌ, చి. ని.)

(వ్యవ) చీకటిలోఁ బోవుటచే గతుకులోఁ బడి
నాఁడు.

**గత్త(ము).** వి. ఎరువు. (బ్రౌ, శ. ర.)

**గత్తర.** వి. ౧. క్రమము లేక కలిసిపోయి యుండు
ట. (బ్రౌ) ౨. ఉపద్రవము. (శ. ర)

**గత్తు.** వి. మాత్రగంధము. (శ. ర.)

**గత్వరము.** సం. విశే. (అ. ఈ. అ) ౧. పోవునది.
౨. నశించునది, నశ్వరము. ౩. కదలునది.

**గద.** సం. వి. ఆ. స్త్రీ. గుదియ, దుడ్డువలె నుండు
ఆయుధవిశేషము.

**గదమాయించు.** స. క్రి. గద్దించు. (శ. ర.)

**గదము.** సం. వి. అ. పుం. ౧. తెవులు, రోగము.
౨. ఉఱుము. ౩. విషభేదము. (వాచ)

**గదయిత్నువు.** సం. విశే. (ఉ) ౧. వాచాలుఁడు,
వదరుపోతు. ౨. కాముకుఁడు. వి. ఉ. పుం. కా
ముఁడు, మన్మథుఁడు.

**గదాంబరము.** సం. వి. అ. పుం. మేఘము. (త్రి. ని.)

**గదాగ్రజుఁడు.** సం. వి. అ. పుం-గదుని యన్న -
విష్ణువు.

**గదాధరుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు. ౨.
ఒకతర్కగ్రంథకర్త.

**గది.** వి. ఇంటిలోపలియఱ. (శ. ర.)

(వ్యవ) నిన్న నేను మా మేడగదిలో పరుంటిని.

**గది.** సం. విశే. (న్. నీ. న్) ౧. గదను ధరించిన
వాఁడు. ౨. రోగి, తెవులు గలవాఁడు.

**గదితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. చెప్పఁబడి
నది. ౨. రోగము కలది.

**గదుకు**=కతుకు.

(కుక్క మొదలగునవి కొంచెముకొంచెముగాఁ
దిను; కొంచెముకొంచెముగా గ్రహించు.)

చ. కదిసిన నోరవోయి యొఱుకబ్బపుదొంతులస
త్పదార్థముల్, గదుకుచు నెట్టివారిఁ బొడగ
న్నను గుఱ్ఱని స్నేహసౌఖ్యముల్, మనికి నస
హ్యమై శునకమార్గమునం జరియించుచున్న
దు,ప్పదకవు లెల్ల మత్కవితఁ బట్టక దవ్వు
లు వింద్రు గావుతన్. వాసిష్ఠ. ౧. ౭. (వైరం
దర్థములకును ఇది యుదాహరణము)

వి. ఎంగిలి తినుట. (శ. ర.)

**గదుము.** స. క్రి. అదలించు, గద్దించు.

సీ. అదలించె గద్దించె నదలించె ననఁగను గదిమె
నం చనుమాటగాఁ జెలంగు. ఆం. భా. ౩.
౧౨౪.

సీ. కాలుపుల్ దిని యాము గవిసి మన్నోచితులు కా
రుపోతులనైన గదుమఁ జూచు. సారంగ. ౧.
౬౯.

చ. ...విన్న చే, కద వినుఁ బట్ట మర్వరకుఁ గట్టెద నన్నది యందు కింతి దర్, గదిమికొంవం దలం కినది కన్నది విన్నది గాని దేమి చెప్పదు ...చం. రా. ౪. ౪౧.

**గదురు.** వి. (క. గదరు) దుర్గంధము, దుర్వాసన.

సీ. పులితోళ్లపై వాలుఁబోసినరక్తార్ద్రశిరోము క్కాళిగదురుకంపు. చంద్ర. ౫. ౧౨౧.

చ. ముదమున సోమకాసురుఁడు ముచ్చిలి యచ్చ లమారఁ గొన్న ప్రాఁ, జదువులు తెచ్చి తజ్జఠర సాంద్రతరాంత్రము లంట నంటుబల్, గదు రు దొలంగఁ గీర్తియునుగంగఁ దొలంచి ... పాండు ౨.౫౬.

విణ. విస్రము, పచ్చివాసన గలది.

ఆ...గదురు నాఁగ నగును విస్రాఖ్యయై.ఆం.భా. ౧. ౧౧౭.

సీ. జాళువాపైతాణిసాలుఁ దూలఁగఁ జేసి గదు రుతో ల్కటిసీమఁ గదురుకొనియె. ఘటికా. ౧. ౧౫౩.

**గద్గదము.** సం. విణ. (అ. ఆ. అ.) డగ్గుత్తికపడిన ది. (స్వరము.)

**గద్గదస్వరము.** సం. వి. అ. పుం. ౧. డగ్గుత్తికపడి నయెలుఁగు. ౨. ఎనుపోతు.

**గద్గదిక.** సం. వి. ఆ. స్త్రీ. డగ్గుత్తిక.

**గద్గదితము.** సం. విణ.(అ.ఆ.అ.)గద్గదస్వరముగలది.

**గద్ద=గ్రద్ద.** వి. పక్షివిశేషము, గృధ్రము. (చి. ని, శ. ర, వా.)

జ: గద్దగోరు, గద్దముక్కువాఁడు.

**గద్దగోరు.** వి. దే. (√గద్ద.) ౧. గద్దయొక్క గోరు. ౨.ఒకానొకచెట్టు. (దీనియాకులు గద్దగో రువలె నుండును.)

వ...ఇప్ప కప్పురమద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి ... మొదలుగఁ బెక్కుతెఱంగుల వృక్షములు...వి. శకుం. ౨. ౧౪.

౩. చోరసాధనవిశేషము.(ఇది గద్దగోరువలె నుం డును)

గీ. కావు మలుబంతి సికముళ్లు గద్దగోరు... తో లునిచ్చెన మొదలు ముందుగ ధరించి. ప్రబం ధ. ౭౫౯.

సీ. భవనదీపాహితభ్రమరపేటిక వాలుకాధ స్త్రి తలముళ్లు గద్దగోళ్లు... గీ... ఎట్టినికన్ను ల మర, దూరితత్రాసుఁ డపు డొక్కడొంగబం టు. వేం. పంచ. ౩.౧౯౯.పరమ.౪.౧౭౪.

౪. ఒకవిధ మగుగొండ్లెము. (ఇది గద్దగోరువలె నుండును-వా.)

**గద్దన.** వి. గద్దింపు.

సీ...గద్దింపు వెలయును గద్దన యనఁ. ఆం. భా. ౩. ౩౦.

**గద్దముక్కువాఁడు.** విణ. (గద్ద+ముక్కు+వాఁ డు)-గద్దముక్కువంటిముక్కు గలవాఁడు-ఖరణ సుఁడు, వాఁడిముక్కు గలవాఁడు. (శ. ర.)

**గద్దరి.** విణ. ౧. నేర్పరి, నిపుణుఁడు.

చ. కరితురగాధిరోహముల గద్దరులై విలువిద్ద లందు నేర్పరులయి ... చం. రా. ౨. ౫౨.

౨. ఉద్ధతుఁడు, పొగరు గలది; పొగరు గలవాఁడు.

చ...గద్దరిపంది నొకండు పన్ను చే, యుదరక ముప్పిడిం బొడిచి యంటఁగఁ బట్టుమఁ గో లుఁగొట్టినన్, మెసఁగ నీక తెచ్చినను మె చ్చు లొసంగెను రాజు వానికిన్. యయా. ౨. ౧౧.

శా... ఇట్లింతే గద్దరివై గురుం దొలఁగి పోసి వు...పరమ. ౫. ౩౬౩.

౩. దుష్టుఁడు; దుష్టము.

ఉ...తద్భుహసీమ వసింపనీయ దీ,గద్దరి గ్రద్ద చేరి కలకాలము పోరెడిఁ బోరు మాన్పవే.ఉ.రా. ౭. ౨౩౦.

చ...చొక్కట మగునేపువాని కొకగద్దరిజా డలచేడెఁ గూరుచుం, గటకట తమ్మిచూలికొ

అగాములు బొములుగాఁ దలంచెనఁట్. నీలా. ౧. ౧౧౦.

క. ముద్దులపట్టివి నీ కీ, గద్దరిచందముల మెలఁగఁగా రాదు సుమీ. నీలా. ౨. ౧౦౫.

౪. సాంద్రము, దట్టమైనది.

చ... ఆ, యత మగుచక్రవాళగిరియంచులగద్దరి యంధకారముఁ, జితనిజకీర్తిచంద్రికలచేత నతం డడఁగించు చుండఁగన్. నీమం. ౧. ౧౬౦. అప్ప. ౨. ౧౯౭.

జ: గద్దరించు, గద్దరికాఁడు, గద్దరితనము.

**గద్దరించు.** అ. క్రి. (√ గద్దరి. క. గద్దరిసు, గద్రిసు) గర్జించు.

(ఆదివరాహవర్ణనము) సీ. కఠినవాలము బెట్టు గాలించి మొకచోట. గడిమిమై రొప్పుచు గద్దరించు. హ. వరాహ. ౩. ౪.

**గద్దరికాఁడు.** విశే. (గద్దరి + కాఁడు - స్వార్థమున) గద్దరితనము గలవాఁడు, ధీరుఁడు.

ఉ... ఇట్టిప, ల్గద్దరికాఁడు వాఁడిని జగంబులు గెల్చుట యేమి వింత... అచ్చ. రా. సుం. ౧౨.

**గద్దరితనము.** వి. (√ గద్దరి) ధైర్యము.

క. పెద్దపులి వెడలి చనె నని, గద్దరితనమునను నక్కలకదుపులు పొదలో, నుద్దవిడిఁ జొచ్చి చిఱుతల, యొద్దం బడినట్టు లయ్యె నోయమరేంద్రా. దశా. ౮. ౪౦.

**గద్దించు=గద్దరించు.** స. క్రి. అదలించు, బెదరించు.

ద్వి. ఎవ్వఁడు నావారి నెల్ల గద్దించి, చివ్వకు నామీఁదఁ జేచాఁచు... ప్రభులిం. ౩. ౯౫ పా. ౨౮ పం.

సీ. గవి నున్నపులిఁ గన్నఁ గవిసి గద్దించి గొబ్బన నొడ్చితే నోపుప్రోడ నేను. ఉ. రా. ౭. ౪౦౮.

సీ. అదలించె గద్దించె నడలించె ననఁగను గదిమెనం చనుమాటగాఁ దెలంగు. ఆం. భా. ౩. ౧౨౪.

జ: గద్దింపు.

**గద్దింపు.** వి. (√ గద్దించు.) అదలింపు.

గీ. అతనిగద్దింపులను భయ మందువారు. సువల. ౨. ౬౯.

సీ... గద్దింపు వెలయును గద్దన యన. ఆం. భా. ౩. ౩౦.

**గద్దిగ.** వి. గద్దియపైఁ బఱచుకంబళి, గద్దెకంబళి.

సీ. బటువుగద్దియలపైఁ బట్టుగద్దిగలింత జమున దేశముల హిజారులమర. సువల. ౧. ౫౬.

గీ... సొగసులిద్దంపుఁబట్టుగద్దిగ వసించి. సువల. ౨. ౫.

(ఈపద మీగ్రంథముననే కానిపించుచున్నది.)

**గద్దియ[1] (ద్దె).** వి. (సం. ఖట్టికా.) ౧. సింహాసనము.

గీ. క్షత్త్రియునిఁ దెచ్చి తొలితొలి గద్దియ నిడి, పట్టబద్ధుఁ గావించుచో... హరి. పూ. ౧. ౧౦౩.

సీ. ఉచితంబు లగుషోడశోపచారంబుల నాగద్దెకతిభక్తి నాచరించి. విక్ర. ౨. ౯౫.

క... మను, న్నాయకుఁడు నిల్పె నునున, స్వామికి సరిగద్దెమీఁద సౌహార్దమునన్. హర. ౩. ౮౦.

౨. పీఠము, పీఁట.

గీ... పీఠంబు దనరుచుండు, గద్దె గద్దియ పీఁట నాఁగను... ఆం. భా. ౨. ౧౬౫.

౩. పువ్వులలో నుండెడిమిద్దె, దుద్దు.

గీ. తమ్మిగద్దియదాకట క్రమ్మి యట్టి, కొమ్మఁ గావింపఁబోలు నెత్తమ్మిచూలి. వసు. ౨. ౩౨.

౪. సోద. (బ్రౌ, శ. ర. - సోదచెప్పెడిచోటు. వా.)

గద్దెకంబడి=గద్దెమీఁద వైచుకంబళి, గద్దిగ.

ద్వి... గద్దె, కంబళ్లు కప్పడికంబళ్లు గోర్వ, డంబులు... పండితా. పర్వ. ౩౮౬ పా.

**గద్దియ[2] (ద్దె).** వి. (సం. గద్యాణమ్) బంగారునాణెము, వరహా.

సీ. పదివేలమొదవులు పదివేలగద్దలపసిఁడియు ని
ష్మహీపతుల కిమ్ము. భాగ. అర. ౨. ౩౮౮.
(శ. ర, క రాల. ప్రతులపాఠము.)

**గద్దువ.** వి. (క. గద్ద) గడ్డము, చిబుకము.

సీ. మడమలు మోవంగ మైలచీరలు గట్టి కర్ణముల్ మోవంగఁ గాటుక లిడి...వెడలి గద్దువ మోవ వీడియంబులు చేసి కాంక్షఁ జెంపలు మోవ గంద మలఁది. కవిక. ౪. ౯౪.

గీ. అమ్మ పగవకె యంచును నక్కుఁ జేర్చి, గద్దువను బట్టుకొని వేఁడఁగాఁ దొడంగు. పార్వ. ౨. ౧౬౩.

గీ...చిబుకాఖ్య యలరు గడ్డమనఁగ గద్దువ నాఁగ...ఆం. భా. ౨. ౧౪౨.

**గద్దెపొంకములు.** వి. బ. పరువునకుఁ దగినగౌరవంపుమాటలు.

సీ. కలవి లేనివి కొన్ని కొలువునఁ గూర్చుండి గద్దెపొంకాల్ చెప్పఁ గలదు గాక. చంద్రా. ౩. ౪౬. (గద్దెపొంకము-శ. ర, చి. ని. పా.)

**గద్యము.** సం. విశే. (అ. ఆ. అ) చెప్పఁ దగినది.
వి. అ. న. వచనము. (వ్యతి. పద్యము.)

**గద్యాణకము.** సం=గద్యాణము.

**గద్యాణము.** సం. వి. అ. పుం. ౧. నలువదియెనిమిదిగురివెందగింజలయెత్తు. ౨. వరహా, ఒకబంగారు నాణెము.

**గద్యానకము.** సం=గద్యాణము. (కల్ప)

**గనగన**=కనకన. వి.
(తపించుట యందలియనుకరణము.)

సీ. వేసవి గనగన వేఁగుచట్రాతిపై నగ్గి నల్లడ మండ నఱ్ఱుఁ జాచి. నిర్వ. ౩. ౬౩.

చ. గనగన నెల్ల ప్రొద్దుఁ గొని కాలెడువేఁడిమిఁ జేర్చుభర్తమే, నెనయను దగ్గఱన్ సయిఁప నింతయు భీతి నొదుంగుచున్...హరి.పూ.౧. ౧౬౭. (ప్రాఁత ప్రతిపా).

(కోపముచే మండిపడుటయందలియనుకరణము.)

క. అనుటయు హంసుఁడు గనగనఁ, గనలి మదిం జెలువు విడిచి కాలువఁ బొగడం, జను నే వీనికి నని యిట్లను...ఉ. హరి. ౪. ౧౯౬.

(త్వరితముగా చొచ్చుటయం దగు ననుకరణము.)

ద్వి. గడియ గ్రక్కునఁ బుచ్చి గత్తినఁ దలుపు, గడుఁ బాఱఁ దెఱచుచు గనగన ద్విజాలు, సొచ్చుదు నంతలో...పండితా. దీక్షా. ౪౪పా.

విశే. ౧. గనగనయను కాంతిగలది. (కర్మధారయమున నిగాగమము.)

వ...మవ్వంపుదివ్వెలవలె నివ్వటిలుగనగననిమణులకై...ఉ. రా. ౩. ౧౯౧.

వ...మినుకుమినుకు మనుగనగననిమణులఘృణులపెంపు శంపలసొం పలరింప... సమీర. ౩. ౧౭౫.

వ...గనగనని నిప్పులన్...మనుచ.౪. ౬౦.

గనగనలాడుకుంపటి=గనగనమండునిప్పులు గల కుంపటి. సానందో. ౨. ౬.

**గనప.** విశే. (√ గనము?) పెద్దది; ఎత్తైనది.
(వృత్తియందే దీనికి ప్రయోగములు కనఁబడుచున్నవి.)

సీ. కాంచి యుదంకుండు గ్రమ్మన దిగదాఁటి వెనుకొనునంతను గనపపుట్టఁ, జొచ్చె నయ్యురగము...భార. అశ్వ. ౩. ౧౦౫.

గీ. కావిసెలయేఱు లురిలెడుగనపకొండ,కరణినొందె బాణుఁడు బాహుకర్తనమున. హరి. ఉ. ౫. ౨౧౨.

సీ. జాంబూనదచ్ఛాయచందంబువర్ణంబు గలిగిన పలుచనిగనపమేను. భార. ఆశ్ర. ౨. ౪౦. భార. శాం. ౪. ౪౦.

**గనపర**=గనిమెర. వి. గన్నేరు ? (చూ. గనపరాకులు)
జ: గనపరాకులు.

**గనపరాకులు.** వి.బ.గన్నెరాకమ్ములయొక్క అలుఁగులు. (వావిళ్ల, వేదము. వ్యాఖ్యలు.)

గీ...గనపరాకులు నిగిడ్చి, చెప్పటట్టులు శోధించి సిగలు విప్పి. అము. ౬. ౭౫. (గనపరాకులు నిగిడ్చి=గొడుగుల గన్నెరాకులువలిపించి అని వ్రాఁతప్రతివ్యాఖ్య- 'కనపరాకులు=గన్నెరాకులవంటి అలుఁగులు.' అని బ్రౌ- ప్రయోగాంతరము కనఁబడలేదు )

**గనము.** విశే. (సం. ఘనమ్. క. గన.) అధికము.

సీ...పెను గొప్ప బలు పేరు పెద్ద దొడ్డ, గన మన నధికాఖ్య లౌనవు...సాం. ని. మాన. ౪౯.

**గనయము.** వి. ౧. పోఁకముడి, నీవి.

గీ. నాతిగనయంబు వదలింప నాథుమీఁద, నాభిపంకజగంధ మున్నతిఁ జరించె,నన జుగుప్సాభిధాశ్లీల మయ్యె నింతి,కపుడు పొక్కిలిరోంపికం పర్థ మగుట. కావ్యా. ౬. ౯౧.

సీ. ఆనయంబుఁ దిన్ననియనువున గనయంబు ప్రిదులంగ మెలఁగి చొక్కొదవఁజేయు. అ. నిక్కరంబు...భార. స్త్రీ. ౨. ౧౩౩.

౨. వింటికొప్పు.

క. గొనయంబునెక్కఁ ద్రోచిన, గనయంబున కెక్కకున్నఁ గ్రమ్మినతమకం,బున విల్లు విడిచి వేల్పొక, యనిమిషభటుఁ డనికి వెడలె నడిదము గొనుచున్. పారి. ౪. ౭౧.

**గని¹.** వి. (సం. ఖనిః) ౧. ఆకరము, బంగారము మున్నగునవి పుట్టుచోటు; స్థానము.

గీ. గని యనఁగ నాకరం బగు ... ఆం. భా. ౨. ౩౨.

క. జనపదములు పురగిరులున్, గనులు వను ల్నదులు ... కనుఁగొనుచుఁ బోయి ప్రోలన్ లీలన్. హంస. ౫. ౩౪౭.

గీ. ...అధికశుభంబులకు భ,వత్ప్రసాదంబు గని కాద వాసుదేవ. భార. శల్య. ౨. ౩౩౯.

మ...ప్రచ్ఛనివిల్కానికి మామ ఛల్వగని పక్వత్ఫలజాటాగ్రహోహానరత్నంబు సుధాకరుండు...పారి. ౪. ౪౭.

౨. బిలము, రంధ్రము.

చ. అనవుడు నిప్పగోత్రమునందు ఘుహాబిల మొప్పచుండు దానను గుహ యొక్క చెప్పుదును సవ్యముగాఁ గనుపట్టు నందులో, నసుపమమైనగుండు గల దందును నేడు బిలంబు లుండు నగ్గనులఁ జరించుఁ దుమ్మెదలకైవడి నెప్పుడు వానిప్రాణముల్. మై. ౩. ౧౨౧.

**గని².** వి. (సం. ఘనమ్.) గడ్డ, ముద్ద. (చూ. గనికట్టు)

జ: గనికట్టు.

**గనికట్టు.** అ. క్రి. (గని² + కట్టు) ఘనీభవించు, గడ్డకట్టు.

వ...సేవంతిపూఁబొదలచినుకున ననఘహిమసలిలములు ... కస్తూరిమెకంబులమదభరంబులం దొరఁగు నాభీరక్తంబు లిగిరి గనికట్టిన నిగరములు గరఁచికొని పఱచి...వసు. ౨, ౯౧.

**గనికెకుండలు.** వి. బ. బాల్యక్రీడావిశేషము.

సీ...చొప్పబెండ్లమంచంబులు గంగెద్దులాటలు గనికెకుండలు...హంస. ౩. ౧౪౬.

(ప్రయోగాంతరము లేదు-గరగకుండలు?)

**గనిమ.** వి. (పాదుమడి మున్నగువాని) గట్టు, సేతువిశేషము.

క. మహనీయమఘుఝుకేసం,గ్రహమునఁ గాలువలు వఱపి గనిమలుగ రజం,బహరహము నెఱపి మాకు,న్సహకారము లయ్యె నచటి సహకారంబుల్. వసు. ౧. ౧౩౭. ఆం. భా. ౫. ౭.

మ. గనిమల్ దీఱిచి కాల్వలేర్పఱిచి ... బహు. ౨. ౨౦.

సీ. ఆడునుదుక్కలను మళ్లెడలఁ గాఁ బొలుల దురుసై నగనిమలు నతికి నతికి, పైరుమునుఁగ గాద

బలిసినచేలలోఁ జెరలక కలుపులుతీసితీసి. ఉ. హరిశ్చ. ౪. ౧౩.

**గనిమెర**=గనవర. వి. గన్నేరు కీ.

ద్వి. గనిమెరపూఁజాయ గలుగునీర్కావి, గనుప ట్టుకాటి మీఁగాళ్లతో నొరయ. ద్వి. పరమ. ౪. ౨౬౭ పా. ౧౧ పం. (చి. ని. పా.)

**గనియ(నె).** వి. (సం. కణికా) ఖండము, ముక్క.

సీ. గనె గండ్ర గండ్రిక గనియ యటంచన ని ష్ఠ్యాదిఖండంబు లెన్నఁ దగును. ఆం. భా. ౨. ౭౫.

గీ... మేని, గనియ లన్నియు సంధానకరణి నది కి. భా. రా. యు. ౧౧౨౦.

సీ... తనుపారురసదాడిగనెలతోడ. ఆము. ౨. ౭౩.

ద్వి... సభవారు నట్టిదురాత్మ... గనెలుగాఁ జే తులుఁ గాళ్లుఁ గోయింపఁ, జను నని...నవ. ౨. ౯౨ పా. ౧౩ పం.

**గనివోటు.** వి. (క. కణి=రాయి. త. కణె) ఆనవా లుకై తాళ్లమీఁద వరుసగా వేయు పోటు ?.

ద్వి...ఉలు లోలి నాటి, వసలు మించఁగ సూ త్రపట్టినపగిది, వినుపక గనివోటు వేయువా రలును ... అనిమిషశిల్పి, గని యోటువడు చుండ గనివోటు వైవ. ద్వి. పరమ. ౭.౫౧౫ పా.

గనివోటుకొట్టు=గనివోటుపడునట్లు కొట్టు ?.

సీ. ఎప్పుడు చూచిన నెడపక ఖంగుఖం గనును క్కుటులులమహాస్వనంబు, బెడిదంపుటడ్డీలు బిగియించి గనివోటు కొండ గొట్టెడుకట్టు కుండ్లరవము. పరమ. ౫. ౪౦.

**గనీబు.** వి. ఒఱ, ఖడ్గకోశము.

చ. కలకల నవ్వుచు న్నృపశిఖామణి హొన్ను గ నీబులోనియిుట్టలపు మెఱుంగుఁజాయలబెడం గుఁగటారి జకిన దూసి మంత్రులు గన కూ ద్రుమస్తము కఱుక్కునఁ ద్రుంచె...ఉ.రా. ౭. ౨౧౧.

**గనుపు**=కనుపు. వి. వెదురు చెఱకు లోనగువానియం దు ఎడనెడ నుండుముడి, పర్వము.

సీ...కన్ను కనుపు గంటు గను వంచనఁగఁ బ ర్వ,మమరు...ఆం. భా. ౨. ౭౪.

**గన్నెర**=గన్నేరు.

రగడ. తలిరుఁబోఁడి నీతలఁపునఁ గన్నెఱ, వలను తేనెలకు వంపపు గన్నెర.రాజ.చ.౨.౧౪౯.

సీ. గొజ్జంగి యుజ్జాజివజ్జం గిసల మొందునెలకే క స్తురియు గన్నెరయుఁ బూచె.బహు. ౨.౨౧.

**గన్నెరాకమ్ము.** వి (గన్నెరు+ఆకు+అమ్ము)-గన్నే రాకువంటియలుఁగు గలబాణము-బాణవిశేషము.

వ...అట్లు తాఁకుటయు వారల నతండు గన్నె రాకమ్ములఁ జీకాకుపఱిచె...భార. భీష్మ.౩. ౨౧౯.

గీ. పసిఁడిపీఠంబుపై నుంచి పద్మనయనఁ, జెలువ మగు గన్నెరాకమ్ము సేతి కిచ్చి. నైష.౬.౩౭.

**గన్నెరు**=గన్నేరు.

(గన్నేరుపువ్వు)

సుగంధి. చాలుఁ జాలు నెంత కైనఁ జాలు నున్న గన్నెరుల్. యయా. ౪. ౨౦.

ఉ. కన్నియ యెన్నియేండ్లు విరిగన్నెరులక్ హ రుఁ బూజసేసిరో...రా. వి. ౪. ౨౩.

(గన్నేరుచెట్టు.)

సీ...కరవీర మలరును గన్నే రనంగను గన్నెర నఁగ. ఆం. భా. ౨. ౫౩.

(బ. ధాన్యవిశేషము.) వేంక. మాన.౭౬.

**గన్నేరు**=గన్నెర, గన్నెరు. వి. కరవీరము కీ.

సీ. గన్నేరుఁబూఁజాయఁ గనుపట్టుజిలుఁగైనసలి లకాషాయవస్త్రంబు గట్టి. నైష. ౭. ౧౦౩. ఆం. భా. ౨. ౫౩.

(బ) ధాన్యవిశేషము. సాం. ని. మాన. ౫౨.

**గప్పళించు.** అ. క్రి. ఇసుకు.

సీ. ఇవి పొత్తి సొలసినమృగనాభిమృగిసెత్తురులు గప్పళించినకెలవు లయ్యె. రా. వి. ౩. ౫౩.

(ప్రయోగాంతరము లేదు)

**గప్పాలు.** వి.బ.(హిం. గప్) జంభాలు, అతిశయపు మాటలు. (శ. ర.)

**గప్పు=గుప్పు².** వి. వాసనగొట్టుటయందలియనుకరణము. (ఆమ్రేడితరూపము-గప్పుగప్పు.)

(వ్యవ) వాఁడు రాఁగానే అత్తరువాసన గప్పు మని కొట్టుచున్నది.

రగడ. కప్పురంపుటనంటు లవిగో గప్పుగప్పునఁ దావిఁజల్లెడు. కిరా. ౩. ౨౦.

**గప్పున=గుప్పున.** క్రి. విశే. ద్రు. శీఘ్రముగా; అకస్మాత్తుగా.

సీ. పటచిత్రితాకారపతిరేఖ కనుదాయ విప్పు ఱెప్పలచేత నప్పళించె, నప్పళింపఁగనీక గప్పునఁ గనుదోయి నలమి పైఁబడ లజ్జ యడ్డ కట్టె. చంద్రా. ౫. ౨౭.

(గుబ్బలు) ఉ. గప్పున వ్రాలఁగాఁ దివురుకైవడి నుబ్బున నిబ్బరింపుచుఁ. చంద్రా. ౬. ౧౪౨.

సీ. చెలులు సిబ్బెంపుగుబ్బలఁ జిల్కుపన్నీట సెగ సి గప్పునఁ గప్పి నిగుడుపొగలు. చంద్రా. ౪. ౨౨.

**గబగబ=గవగవ.** (బ్రౌ.)

(వ్యవ) వాఁడు గబగబ పరుగెత్తుకొని వచ్చినాఁడు. వాఁడు గబగబ ఉత్తరము చదివినాఁడు. వాఁడు గబగబ పని చేసినాఁడు.

**గబీలు.** వి. గ్రుద్దుట నీళ్లలో మునుకుట మండుట కలఁత నొందుట మున్నగువానియందలి యనుకరణము.

(వ్యవ) వాఁడు గబీలున నొక గ్రుద్దు గ్రుద్దెను. వాఁడు నూతిలో గబీలున ఉఱికినాఁడు. అయడవి గబీలున మండుచున్నది. (శ. ర.) కడుపులో గబీలు మనుచున్నది.

క...అతనిఁ గనినంతనె నా, డెందము గబీలు మనియెఁ...అహ. ౩. ౮.

**గబుక్కున=గవుకున.**

(వ్యవ) వాఁడు గబుక్కున నూతిలో దూఁకినాఁడు.

**గబుసు.** వి. కపటము.

సీ... కపటాఖ్య విలసిల్లు గబ్బి గారు, గబుసు కైపు కిటుకు కాదు డబ్బు కవుదు డంబవం గ... అం. భా. ౧. ౧౩౪.

**గబ్బాటు¹.** వి. కలఁత. (శ. ర.)

**గబ్బాటు².** విశే. వెలతక్కువైనది.(పసుపు కంద చేమ గెనసు పెండలము మున్నగువస్తువు-శ.ర.)

**గబ్బి.** విశే. (గబ్బు+ఇ-క. గబ్బి) గర్వి; దుష్టము.

సీ...రాచబిడ్డయై యుండి గబ్బితనం బెఱుంగఁడు... ఉ. హరి. ౫. ౨౭౪.

ఉ. అసతిఁ గూడి యాసరణి నవ్య మెఱుంగక యుండ నీసునం, గాసిలి తత్సపత్ని జర గబ్బితనంబునఁ జెంపఁ గొట్టుచుఁ, దా నెక పుట్టి యప్పుడు దనర్చురతిఁ ముఖచుంబనంబునుం, జేసెనొకో యనంగ నరసెం బతి కయ్యుయిచోటు లంకటఁ. పరమ. ౨. ౪౬.

క. గబ్బిమురుం డొఱ వెలుఁగక, గొబ్బునఁ బైఁ బడును...విజ. వి. ౨. ౧౯౧.

౨. నిక్కినది, నిగిడినది.

వ...పలుకంబండినమారేడుపండ్లగారాముఁ జెఱచుగబ్బిగుబ్బలబెడంగును...హర. ౩. ౨౩.

(స్తనవర్ణనము.) సీ. కొనలుబ్బి గబ్బులై గుబ్బలై యపరంజికుండలై కొండలై దండ నిండి. నరస. ౫. ౧౧౩.

౩. గొప్పవాఁడు, ఘనుఁడు.

గీ.కదలిఁ గోలకుఁ దెచ్చినగబ్బి వీవ.పారి ౧.౪౯.

(మందరపర్వతము.) సీ.. కడలిరాయలలోఁతు గన్నగబ్బి. మనుచ. ౫. ౪౭.

౪. ధీరుఁడు.

గీ. ఒగి నిరాయుధహస్తుఁడై యొక్కరుండు, కాలయవనునికడ కేఁగి గబ్బితనము, వెలయఁ దనపేరు చెప్పి గర్వించి తన్నుఁ, దఱిమి పట్టంగ నోపినఁ దగిలి రమ్ము.

చ. అనుటయు...వి.పు. ౮. ౧౮, ౧౯.

౫. కపటము, కవుడు.

సీ... కపటాఖ్య విలసిల్లు గబ్బి గారు, గబుసు కైపు కీటుకు కాడు డబ్బు కవుడు డంబనం గ...ఆం. భా. ౧. ౧౩౮.

**గబ్బిడా**=గబ్బిలము.

సీ...గబ్బిలము గబ్బిడా గబ్బిలాయి చీకు, రా యనంగను దైలపాయికాఖ్యలు చెల్లు ... సాం. ని. తిర్య. ౮౧.

**గబ్బిడాయి**=గబ్బిలము.

గీ. గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ, దైలపాయిక చెన్నొందు దక్షశిక్ష. ఆం. భా. ౨. ౯౪.

**గబ్బిలము**=గబ్బిడా, గబ్బిడాయి, గబ్బిలాయి. వి. తైలపాయిక, ఇంటికప్పు మొదలగువానినుండి తలక్రిందుగా వ్రేలాడుఒకవిధ మగుపక్షి.

గీ. గబ్బిడాయి యనంగను గబ్బిల మనఁ, దైలపాయిక చెన్నొందు దక్షశిక్ష. ఆం. భా. ౨. ౯౪.

**గబ్బిలాయి**=గబ్బిలము. (క. గబ్బిలాయి)

సీ...గబ్బిలము గబ్బిడా గబ్బిలాయి చీకు, రా యనంగను దైలపాయికాఖ్యలు చెల్లు...ఆం. సం. తిర్య. ౮౧.

**గబ్బిలి.** వి. జా. పిడికిలి.

ఉదా: గబ్బెఁడుకూర తే. (శ. ర.)

**గబ్బివాఁడు.** విణ. (గబ్బి+వాఁడు) గబ్బితనము గలవాఁడు.

(కొంటెవాఁడు)

(కృష్ణుఁడు) ద్వి. మునిమేఁ టనే ... పదుచు, చనుగుబ్బ గోరొత్తి చనుగబ్బివాఁడు అ.మ. క. ౧. ౩౪ పా. ౧౦ పం.

**గబ్బిస.** వి. ఒకానొకమూలిక. (శ. ర.)

**గబ్బు.** వి. (సం. గర్వః. క. గబ్బు) ౧. గర్వము; పొగరు.

ద్వి. గబ్బున జైనమార్గమె యాది యనుచు, మెట్టి మాతోఁ బ్రతిఘట్టించి యాడ. బస. పు. ౬ ౫౫౯ పం.

చ. కడఁగి కుమారుపేరురము గబ్బును నుబ్బును దొంగలింపఁగాఁ, బొడిచెను... నృసిం. ౪. ౧౧౪.

సీ. కరఁలించి యమృతంబు గిలకొట్టఁగా రాదె ముద్దుచూపెడివీరి మోవులందుఁ, బచ్చబంగారు కుప్పలుసేయఁగా రాదె గబ్బు మీఱినవీరి గుబ్బలందు. పాండు. ౧. ౧౧౭.

౨. (గజాదుల)మదము. (చూ. గబ్బుచెంకమేకము)

౩. గంధము; దుర్గంధము.

ఆ. కంపు గబ్బు గవులు గండంబు వల పస, గంధ మొప్పు...ఆం. భా. ౧. ౧౦౬.

సీ...పొలగబ్బు...చంద్రా. ౨. ౮౮.

సీ. ఎడ లేక తఱచు వ్రేలెడుజిబ్బటీలచే గబ్బులు వెదచల్లుగర్భగృహము. చంద్ర. ౩. ౪౮.

జ: గబ్బి, గబ్బివాఁడు, గబ్బుకొను, గబ్బుచీకటి, గబ్బుచెంకమేకము, గబ్బుదేలు, గబ్బెక్కు.

**గబ్బుకొను.** అ. క్రి. (గబ్బు+కొను) గబ్బు కలది యగు.

(వాసనగొట్టు, పరిమళించు.)

ఉ. గుబ్బలిపట్టిగబ్బివలిగుబ్బలజొబ్బిలుతావికుంకుమక్, గబ్బుకొనంగఁ జాలునెదఁ గప్పినబెబ్బులివన్నెవచ్చడం, బబ్బురమై తనర్పఁ బ్రమథావలి యుబ్బుచు వెంట నంటఁగా, గిబ్బవ

యాళి తేజి దుమికించుచు వచ్చె మహాసుఁడ త్తఱిన్. దశా. ౨. ౬౯.

**గబ్బుచీకటి.** వి. (గబ్బు+చీకటి.) గాఢాంధకారము. (శ. ర)

**గబ్బుచెంకమెకము.** వి. (గబ్బు+చెంక+మెకము)-మదము గాఱుచెంపలు గలమృగము-ఏనుఁగు.

సీ. గబ్బుచెంకమెకంబుగట్టికళవసంబు కుబుసంబుగాఁ జేసికొన్నదంట. ఆం. భా. ౧. ౩౭.

**గబ్బుదేఱు.** అ. క్రి. (గబ్బు+తేఱు.) గబ్బు కలది యగు.

(అతిశయించు)

సీ. మెఱుపులై మిట్టలై మిక్కిలి బటువులై క్రాలుఁగన్నులచెన్ను గబ్బుదేఱ. గీ. పత్త్రిపతికేతనుని పురః క్షేత్త్ర మూఁడి, యున్న శ్రీక్షేత్త్రపాలకు యోగిలోకరమణు' ముప్పదిరెండక్షరములమంత్త్ర, రాజము జపించి కొల్వ దొరకు శుభములు. పాండు. ౨. ౯౧.

**గబ్బులుఁగు**=గంపపులుఁగు. (గంప + పులుఁగు.)

ఉ. మానక యుబ్బి గబ్బులుఁగు మాటికి మాటికిఁ గ్రోల్చెఁ గొమ్మపై ...హర. ౨. ౧౮.

వ... కాళికంబు డబ్బు గబ్బులుఁగు గాలికనుఁబెంటి పైఁడికంటె లోనగుతిర్యక్కులు భావిప్రయోజనసాధకంబులై యున్నయవి. ఆము. ౬. ౬౬. ఆం. భా. ౨. ౯౭.

**గబ్బెక్కు.** అ. క్రి. (గబ్బు + ఎక్కు) గబ్బుమీఱు, సాంద్రమగు, దట్టమగు.

ఉ... గ, బ్బెక్కినమబ్బు శైలగుహ లీఁగె దిశల్ వెలుఁగొంద నిక్కలన్, జక్కవజోళ్లు గేరె జలజాతహితుం డుదయించెఁ దూర్పునన్. వేం. పంచ. ౩. ౧౦౭.

**గభస్తి.** సం. వి. ఇ. పుం. ౧. కిరణము. ౨. సూర్యుఁడు. స్త్రీ. స్వాహా, అగ్నిదేవునిభార్య.

**గభస్తిమంతుఁడు.** సం. వి. త్. పుం. సూర్యుఁడు.

**గభస్తిమాలి.** సం. వి. న్. పుం. సూర్యుఁడు.

**గభస్తిహస్తుఁడు.** సం. వి. అ. పుం-కిరణములు చేతులుగాఁ గలవాఁడు-సూర్యుఁడు. (త్రి. ని.) (ఇట్లే గభస్తికరుఁడు, మొ.)

**గభీరము.** సం. విణ=గంభీరము. విణ.

**గభీరిక.** సం. వి. ఆ. స్త్రీ. గంభీరధ్వని నిచ్చునొకభేరి, పెద్దఢక్క.

**గభీరిమ(ము).** సం. వి. న్. పుం. గాంభీర్యము.

**గభోలికము.** సం. వి. అ. పుం. గుండ్రనితలగడ.

గమకము. వి. ౧. యత్నము, పూనిక; ఉత్సాహము.

క. గమకమున నెదురుపగతురఁ, గొమరుం బాయములవేల్పుఁగొమ్మలఁ గదుఁ జుట్టములఁ గఁ గూర్చెదు నేనపు, సమకూరిన రాయపక్షిసాశ్వంబునకున్. యయా. ౧. ౭౨.

చ. సమదగజంబుపై కుఱుకు సామజవైరికి నూటి పెట్టువా, గమకముఁ జూచి భూపతిముఖంబున వ్యాధులమూఁక నిల్వ లే, కమిత భయాప్తి నోరసిలె... పారంగ. ౧. ౧౦౦.

మ. గమకంబుల్ సెడి కైదువుల్ విడిచి ... ఉ. రా. ౨. ౯౧.

౨. పుష్టి.

సీ... తాటిదండములు త్రోయంగ రెట్టలగమకము. ప్రబంధ. ౮౨.

౩. నైపుణ్యము.

క. కలికి వరుమదనకదనపుఁ, బలుకులకలకలము బెడఁగువడు మేఖలము, వ్వాలరవళిఁ దగిలి గతిగోనఁ, గలకంఠి రతంబు సలుపుగమకము గని యెన్. భాగ. ౬. ౯౯.

విణ. ౧. అధికము, ఉరువు, గొప్ప.

వ. ఇట్లు మ్రొక్కి కేని నమ్ముద్రియ గద్దెపై నుంచి తద్దయు నుద్దవిడి నతనిమీఁదికమకంబు గమకంబై పర్వ నతనిమదియుఁ దనపుయుం దగులంటం దలిసి ...యయా. ౪. ౬౫.

మ. ప్రళయాభీలఘనాఘనారవసమారంభంబు లాపోటుఁగూఁ, దల దైత్యోదరముల్ వ గిల్చి మఱియంతన్ బోక తద్రక్తధారలు గ్రోలన్ గమకంబుగాఁ దెఱచువక్త్రంబో యనన్ జెజ్జ మిం, పలరం దాలుచు పాంచజన్యము మదీయాభీష్టముల్ సేయుతన్. చంద్రా. ౧. ౭.

వ...పాదసంవాహనాదికంబులఁ బతుల నిదుర వుచ్చి గమకమ్ము లగుతమకమ్ములు తమకు నెత్తులు నెట్ట నలఘుతరసాహసైకసహాయ లగుతాపికత్తియలదాపుల సంకేతస్థలంబులకుం జేరి ... చంద్రా. ౫. ౬౩.

౨. మనోజ్ఞము, సొంపైనది.

ద్వి. అందులఁ బంగరుహరువుచిత్తరువు, లందంబుగాఁ దీర్చి హరినీలకరుల, గమి గమిచినపటికంపుసింగముల, గమక మాసోపానగతుల నేర్పఱచి. రం. రా. బాల. ౭౩ పా. ౧౦ పం.

చ. కమికెఁదు గుబ్బచన్నుఁగవగాసికిఁ బాసిన జాఱుపయ్యెదల్, గమకపువాలుఁగన్ను లెసఁగన్ బొసఁగించిరి కేళి బాలికల్. రా.వి.౩. ౯౯.

౩. స్థూలము.

గీ. ఒమ్ము గాత్రమ్ము గమకము హొమ్ము నాఁగ, స్థూల మగు...ఆం. భా. ౩. ౨౦.

జ: గమకముగొను, గమకించు, గమకింపు.

**గమకము.** సం. విణ. (అ. మికా. అ) ౧. వెళ్లునది. ౨. తోఁపఁజేయునది. ౩. ప్రమాణములచే నిరూపించునది. వి. అ. పుం. (సంగీ) స్వరవిన్యాసభేదము.

**గమకముగొను.** అ. క్రి. (గమకము+కొను) యత్నము చేయు, యత్నించు.

క. పలికెద నని గమకముగొనుఁ, బలికినఁ గడు నలుగువిభుఁడు ప్రతివచనములన్, బలుకఁ డని నిలుచు శశిముఖి...భాగ. ౭. ౩౪౩.

**గమకించు.** అ. క్రి. (√ గమకము) ౧. యత్నించు, పూను.

ద్వి. చంద్రహాసం బెత్తి జానకి వ్రేయ, నింద్రారి గమకింప ... రం. రా. సుం. ౨౫౨ పా. ౭ పం.

ఉ. చంచలనేత్రఁ గాంచి నృపచంద్రుఁడు మోహము నిల్ప లేక చే, లాంచల మంటి శయ్యకపు డల్లనఁ దార్చి కవుంగిలింప నుం, కించుఁ బయంట నంట గమకించుఁ జలించుట దెవ్వ డెవ్వడం, చించుక సేపు లోన మెఱయించు ననేకమనోవికారముల్ విజ. వి. ౨ ౨౭.

౨. మనోజ్ఞ మగు, ఒప్పు.

సీ. గమకించుచమురివాలను లోనఁ గీలించి యాప్పరంబుగ నోరకొప్పు దిద్ది. నైజ. ౪. ౩౦.

ద్వి... చిత్రాంగిఁ గనుఁగొని మ్రొక్కి, వినుతింప వారాశివిధమునఁ బొంగి, గమకించు ముత్యాలగద్దెపై నుండి, దుమికి...ద్వి. సారంగ. ౧. ౨౨ పా. ౬ పం.

**గమకింపు.** వి. (√ గమకించు) గమకించుట. (ఆదలింపు.)

చ. హరి నరయన్ గుఱుం డనుప నత్త్రిసాగరు లుర్విఁ గోసి వే, సరి ధరఁ ద్రవ్వి త్రవ్వి బలిపద్మగులై హరిబుద్ధి దక్కఁ, చి, క్కుర మునిమచ్చటం దమకింపులచేఁ గపిలుం గెరల్చి త, ద్గురుతరకోపదీపమునకున్ శలభాకృతిఁ జెందిరండఱున్. చం. రా. ౩. ౧౪.

**గమగమ.** వి. (క. గమగమ.) ౧. పరిమళించుట కోపగించుట మున్నగువానియందగు ననుకరణము.

సీ. గమగమ వలచుచొక్కపుఁగమ్మఁగస్తురి నలుఁదొడె నొకమదనాగయాన. రసిక. ౧. ౭౧.

సీ. గమగమ మైకదంబములు గుబాళింప ... ప్రబంధ. ౯౯.

గీ. గమగమలకప్రపువిడెంబుగంధ మొలయ, మిసు

మినల్కు(గమకముపు రేఖ మించు లొల్కు. హం
స. ౫. ౩౭౦.

క. అనుటయు హంసుఁడు గమగమఁ,గనలి మదిం
జెఱుపు విడిచి కాలువఁ బొగడం, జను నే వీని
కి వని... హ. హరి. ౪. ౧౫౬.

౨. సువాసన.

క. వలదుపవనవాసనలం, గలిపె(నులమ్మ్యగమపాది
కముగమగమలన్, వెలుపల లోపల వలపులు,
గలనును(గప్పురపుబరణి గా కది పురమా. క
కు. ౧. ౧౪౪.

జ: గమగమించు.

**గమగమించు.** అ. క్రి. (√గమగమ) గమగమ యా
ని వాసనగొట్టు.

గీ. కప్పురపువీడియుపు(దావి గమగమింప. శేష. ౪
ఆ. (శ. ర.)

**గమథము.** సం. వి. అ. పుం. త్రోవ.

**గమథుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) పోవువాఁడు,
యాత్రికుఁడు.

**గమనము.** సం. వి. అ. న. ౧. పోక, వెళ్లుట. ౨. ప్ర
యాణము. ౩. పొందుట. ౪. రమించుట. (ఉదా:
అగమ్యాగమనము, మొ.)

**గమనించు.** సం. అ. క్రి. ౧. పయనమగు.

సీ. నడిచె నింద్రుండు కిన్నరకాహ్వలు మ్రోయ గ
మనించె శిఖి డిండిమములు మ్రోయ. వరాహ.
౨. ౫.

గీ. సకలజనులకుఁ బయనంబు చాటఁ బంచి,బల
ముఁ జడలంబు గదలింపఁ బంచి పెట్టి, తాను గ
మనింప సమకట్టి తద్విధంబుఁ, దల్లి కెఱిఁగిం
చ నిజనికాంతమున కరిగె. జై. భా. ౨.౧౦౬.

౨. చరించు, తిరుగు.

ద్వి. పసుధేనునొద్దనె వదలక నీవు, వసియింపఁ ద
గు నన్న వచ్చితి నేను, దలఁచినప్పుడు వచ్చి
ధరియింతు రూపు, గలిగియుఁ బోడ లేక గ
మనింప నేర్తు రం. రా. ఉ.౧౧౫ పా.౧౯ పం.

౩. వెడలు, ఉద్గతమగు.

ద్వి. అమృతాన్నరుచి లోన నడఁగక వెలికి,గమ
నించె నన దేహకళ వెల్లఁబారె. రం. రా.
బాల. ౧౯ పా. ౨౪ పం.

౪. కుతూహలపడు.

ఉ. నింతువు నాకుకోర్కి గమనింతువు కేళి కహ
ర్నిశంబు...శకాం. ౪. ౫౦. (ఇట 'తలఁచు'
అని శ. ర.)

స. క్రి. ౧. గ్రహించు; పాటించు.

(వ్యవ)అందఱు ఈవిషయము గమనింపవలయును.
వాఁడు నే నెంత చెప్పినను నామాట గమనింపకు
న్నాఁడు.

౨. నడపు.

క...రథికుఁడు గమనించినపుడె రథ మరుగును
...వేమన. (బ్రౌ)

**గమనిక.** సం. వి. ఆ. స్త్రీ. అల్పమార్గము, సూక్ష్మపద్ధ
తి; విధము.

వ...న చ అర్థశక్తిమూలే వ్యంజనే అనుమానశం
కా,వ్యంగ్యవ్యంజకయోరవినాభావాభావాత్
...నచాభిధావృత్తిః,సంకేతితార్థ ఏవ తస్యాః
పరిచయ ఇతీయతీ గమనికా. ప్రతాపరుద్రీ
యము. కావ్యప్రకరణము. ౪౨ పా.

సీ...మంత్రవర్తనముఁ దంత్ర,గమనికయును వి
విధము లైనదానవిధులు బహుళత్యాగములు
ను లోక,సంస్తుతము లయ్యె...భార. అశ్వ.
౪. ౨౧౫.

వ...ముఖ్యవరాహంబుగమనిక నున్నతక్షుం బై
...భాగ. ౯. ౨౩౦. (శ. ర. పా. 'గరిమ'
ముద్రి.)

వ...మృత్యుదేవతయెత్తునం గాలుపోలిక శమను
నిగమనిక నెఱిరి...భాగ. ౧౦ పూ. ౧౩౧౫.

**గమనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పొందఁ
దగినది. ౨. తెలియఁ దగినది.

**గమము.** సం. వి. అ. పుం. ౧. పోక. ౨. ప్రయాణము, పయనము; దంశసూత్ర. ౩. త్రోవ. ౪. వివేచింపమి, ఆలోచనములేమి. ౫. ద్యూతభేదము, ఒకవిధమగు సొగటాలయాట. ౬. పొందుట. ౭. సంభోగము, రతి.

శ్లో. బ్రహ్మహత్యాసురాపానం స్తేయం గుర్వంగనాగమః. మను. ౧౧. ౫౪.

**గమయత్.** సం. శతృ. ౧. నడపించుచున్న. ౨. పొందించుచున్న.

**గమయితృ.** సం. విశే. (ఋ. త్రీ. ఋ) ౧. నడిపించువాఁడు. ౨. పొందించువాఁడు.

**గమయితవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నడిపింపఁ దగినది. ౨. పొందింపఁ దగినది.

**గమాయించు.** అ. క్రి. గమగమించు, పరిమళము గొట్టు, సువాసన గొట్టు.

మ. పరమాన్నంబులుఁ బిండివంటలును సూపంబుల్ గమాయించుపం,డ్లరసంబుల్ ... అని. ౧. ౧౦౫.

**గమి.** వి. ౧. సమూహము, గుంపు.

ఆ. కవలవారుఁ గొడుకుగమియుఁ బాంచాలవ,ర్గంబు వృష్ణివరులుఁ గడఁగి రేని, యొక్కమాత్రలోన నువ్వెత్తుగొనరె. భార. ఉద్యో. ౧. ౨౯.

గీ. మొగుడఁబాఱిన యరవిందములను బాసి, గములు గములుగ మత్తభృంగములు గూడి, ధుంతవిఘ్నశు చెక్కు లుక్కంతఁ జేర, నభినవం బైనయపరసంధ్యాగమమున. భీమ. ౨. ౭౯.

సీ. గమిఁ బాసి తలిరుజొంపమునకు మెయిమెయిఁ దాఁకంగఁ జనుపికదంపతులును. భార. విరా. ౨. ౩౦౬. ఆం. భా. ౨. ౧౦౦.

విశే. సాంద్రము, దట్టమైనది. (శ. ర.)

క. నెఱిదగఁ దేఁజితమై గమి, మెఱుఁగు లడరువారసమున మిక్కిలి వడి వే, డ్తఱ మెఱయు సురము నొంచిన...భార. కర్ణ. ౩. ౫.

జ: గమికత్తె, గమికాఁడు, గమిగూడు, గమిగొను.

**గమి.** సం. విశే. (న్. నీ. న్) పోవువాఁడు.

**గమి(మియి)ంచు.** సం. స. క్రి. ౧. చేరు.

వ...నీకుఁ దక్కనయ్యలకు నాతాటక యున్నదేశంబు గమింప నశక్యంబు...భా. రా. బాల. ౨౩౭.

౨. రమించు, కూడు.

ఉ...అగ,మ్యాగమనంబునందుఁ బరిహారము చెప్పదనింక బ్రాహ్మణ,స్త్రీ గమియింప రాజనకుఁ జెల్లదు...వరాహ. ౯. ౧౨౭.

అ. క్రి. వెళ్లు.

సీ. గమియింపు మిప్పుడు ఘనరభసంబునకడఁక వింధ్యాద్రినిగ్రహము నేయ. సేతు. ౩. ౭౬ షా.

ఉ...మజ్జనం, బాడి గమించి చొచ్చెను దదంతికరాజమరాళకూజితా, మ్రేడితకింకిణీరవపరిష్కృతఘోటము యజ్ఞవాటముక్. జై. భా. ౬. ౨౦౨.

ద్వి...ఏకలింగనిష్ఠాభక్తియుక్తిఁ, జనక దుష్పథములఁ జరియించు టెల్ల, రాజితాంచితరత్నరాజ ముండంగ, గాజు పెంచుక లేఱి గమియించినట్లు. బస. పు. ౬. ౭౫౯ పం.

**గమికత్తె.** వి. (గమి + కత్తె) అంతఃపురపరిచారికలలో ముఖ్యురాలు.

క. గమికత్తెలలో నపుడా, క్రమ మెఱిఁగింపంగ వారు గ్రక్కునఁ జేతః, ప్రమదప్రదమై యొప్పెడు, ప్రమదవనముఁ జేరి యపుడు ప్రమదం బెసఁగన్. శశాం. ౪. ౧౬౪. (మా. ౧౬౩.)

**గమికాఁడు.** వి. (√గమి) ౧. ముఖ్యజనుఁడు.

గీ. అనుదు నందులో గమికాండ్రు రతనిఁ జూచి, దేవరకు నిట్టియక్కఱ దీర్పఁ గాక, యెన్నఁటికి పేము నీసొమ్ముఁ దిన్నవార, మిందఱము

వని తమయూఁక రెల్లఁ జూపి. పరమ. ౫.౧౧.

౨. అధిపతి.

సీ. కయ్యాన జక్కులగమికాని ముక్కంటిఁ గుతి
లపెట్టుటలు నీకతనఁగాదె. యయా. ౩. ౯౪.

౩. అల్పసేనాధిపతి; సేనాధిపతి.

సీ... అల్పసైన్యాధిపతి యొప్ప జంగిలి గమి. గీ.
కాఁడనంగను... ఆం. భా. ౨. ౧౭౪.

క. అక్కరణిఁ బోరుటక్కరి,రక్కసిగమికాం
డ్రముప్పర స్తానిసిఱేఁ,డొక్కొక్కకఱకు
టమ్మునఁ, జిక్కంగా నీక దలలు చిదిమెం గి
నుకన్. అచ్చ. రా. అర. ౧౪.

**గమిగూడు.** అ. క్రి. (గమి+కూడు) గుంపుగూడు.

సీ. రవి గ్రుంక ముకుళించు రాజీవములఁ బాసి గ
మిగూడు తుమ్మెదకదుపనంగ...గీ...దండిచీ
కటితండంబు మెండుకొనియె. కువల. ౪.౧౨.

**గమిగొను.** అ. క్రి. (గమి+కొను) ప్రోగువడు.

ఉ. ఈగతిఁ జూతురే తగులరే తగులే తగులేమ లీ
ధరన్, రాగదుఁ డైనవిశ్వనృపురాకయ పోత
గురాక నాకులో, లోగమిగొన్న చూపుఁ దో
గలున్ దొగలై విలసిల్లు దానిచే, సాగెడు న
న్నరేంద్రునకు సద్ద్విజరాజకళాధరత్వమున్.
కావ్యా. ౨.౬౯.

క. వేయోకవిలు గొని విమతుఁడు, దూఱఁగ పారి
మేన నాటెఁ దొమ్మిదియమ్ముల్, మా ఱెనుబ
దింటఁ బొదివెం, గాఱియగా మఱియుఁ బఱ
పె గమిగొనఁ దూపుల్. హరి. ఉ. ౧. ౧౫౭.
(అధికముగా అనిభావము.)

**గము.** సం. విణ. (అ. ఆ. అ—ఇది సమాసాంతము నందే యుండును.) ౧. పోవునది. (ఉదా: మార్గగము.) ౨. పొందునది. (ఉదా: కంఠగము.)

**గమ్మత్తు.** వి. (హిం. గమ్మత్) ౧. చమత్కారము.

క. గమ్మత్తు చిమ్మ నొకకథఁ, గ్రమ్మఱఁ దెల్పెదను
వేణిఁ గ్రమ్మువిరులపైఁ, దుమ్మెదలు ఝుమ్మ ఝు
మ్మనఁ, గొమ్మా తల యూఁచి మెచ్చుకొమ్మా య
న్నన్. హంస. ౨. ౬.

౨. వేడుక. (శ. ర, బ్రౌ. మిశ్ర.)

**గమ్మము.** వి. (సం. ఘర్మః) చెమట.

వ. తనువునఁ జెమటలు గ్రిక్కిఱిసినమదనమాయా
విలసనంబునం బొడమినప్రోడతనంబున నెంత
గమ్మంబు గ్రమ్మెనని పతులకుఁ దెలియకుండం
బలుకుచు... చంద్రి. ౪. ౧౦౭. (ప్రయోగాం
తరము కనఁబడ లేదు.)

**గమ్ము=ఘుమ్ము** వి. వాసనకొట్టుట మున్నగువానియందగు ననుకరణము.

చ. కలపపుఁదావి నల్గడల గమ్మనఁగన్...ఉ. రా.
౬. ౧౬౧.

రగడ. గమ్మ రని పన్నీరు తొలఁకెనుఁ గంటివే
యివి గాజుపనఁటులు. శుక. ౧. ౧౩౩.

ఉ. గమ్మనఁ గన్నునీ రొలుకఁగా నపు డిట్లను...
భోజరా. ౫. ౪౭.

క. అని మారు దూఱుసమయుం,బున గమ్మున వీచు
వాతపోతముల...ల. వి. ౪. ౭౫.

గమ్మను=పరిమళించు.

ఉ. పూఁత మెఱుంగులుం బసరుఁబూపబెడంగు
లుఁ జూపునట్టివా, కైతలు జగ్గునిగ్గునెన గావలె
గమ్మన గమ్మన న్వలెన్...(పెద్దనచాటువు)

**గమ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. పొందఁబడుచున్నది. ౨. తెలియఁబడుచున్నది.

**గమ్యము.** సం=గమనీయము.

**గయ.** సం. వి. ఆ. స్త్రీ. బీహారునందలియొక క్షేత్రము.

**గయము.** సం. వి.అ.పుం. ౧. ధనము. ౨.గృహము. ౩. అపత్యము. (కే. ని.) ౪.పశుభేదము. (మే.ని)

**గయాళము=గయ్యాళము.** (శ. ర.)

జ: గయాళి, గయాళించు.

**గయాళి=గయ్యాళి.** (గయాళము+ఇ-శ. ర.)

విశే. (క్రూరము.)

గీ. సడలువడనికడిందిదొసఁగుగయాళి, బోరప్రాఁ కుడుకొలములపులుఁగు నేఁడ. అచ్చ. రా. బాల. ౬౩.

చ. దొసఁగులఁ బెట్టుచున్ జలముతో మగలం ద గనాడి యద్దిరా, యుసురులు గొందు రాగడ పుటోజ గయాళులు గా వెలందుకల్. అచ్చ. రా. అయో. ౨౮.

(వదరుఁబోతు)

చ... చిగురువిందులనీలిగయాళికిన్ హలా, హల గుళికాభదుర్దఘనాళికి నాళికి లోఁగి యా త్రలోన్. వసు. ౩. ౧౧౨.

క. ఆయన వినఁ బ్రేలెదరు సుఁ, డీ యిట్లు గయాళులార... కళా. ౪. ౬౨. రసిక. ౩. ౯౧.

వి. (ధూర్త స్త్రీ.)

సీ. గట్టివా జంత తాఁగ గయాళి యనఁగను ధూర్తయోషాభిధ దోఁచుచుండు. ఆం. భా. ౨. ౧౧౭.

గీ...గట్టివాయి, తాఁగ జంత గయాళియు నాఁగఁ దనరు, ధూర్తవనితకు...సాం. ని. మాన. ౫.

**గయాళించే=గయ్యాళించే.** అ. క్రి. (√గయాళి.)

(ఉద్ధతిచూపు.)

మ. అనుమం గంకణనిస్వనంబులు బెడంగై మ్రోయఁ గాంచీకల, స్వనముల్ వీనులవిందు సేయ నుదుటుంజన్నుల్ గయాళింప లో, చనదీప్తుల్ చెలఁగంగఁ బైకొనుసరోజాతాస్యతోడం గ డం, కను గ్రీడింపఁ దొడంగె నత్తఱి రంగ స్వామి ప్రేరేపఁగన్. విప్ర. ౩. ౭౯.

(పెద్దకేకలువేయు, అఱచు.)

గీ... అమ్మచెల్ల, వింత నావంటిదానికా యింత మాట.

గీ. అని గయాళించుకొనుచు హస్తాంబుజముల, వలఱుపావని దురదుర నరిది తొట్ల, లోనఁ బడ వైచి మొగమునఁ బూనుగంపు, తోడ బొమముడి నిగుడ నత్తోయజాక్షి. శుక. ౪. ౪౨, ౪౩.

**గయాళు.** వి. సేద్యము చేయుటకు తగనిపొలము. (బ్రౌ, శ. ర-సేద్యము చేయనిపొలము. వా)

**గయుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక రాక్షసుఁడు. ౨. షోడశమహారాజులలో నొకఁడు.

**గయ్యాళము=గయాళము.** వి. ధిక్కారపుమాట. (శ. ర.)

జ: గయ్యాళి, గయ్యాళించు.

**గయ్యాళి=గయాళి.** విశే. (గయ్యాళము+ఇ-క. గయ్యాళి. త. కైయాళి.) ౧. ధూర్తుఁడు; ధూర్తురాలు.

గీ. ఉద్ధతులు గొంట్లు పలుగాకు లుదుఱుమిడుకు, లాకతాయలు శఠులు గయ్యాళు లగుచు. హర. ౫. ౧౦.

౨. జగడగొండి.

సీ. కలహంబె కూడుగా మెలఁగెడుగయ్యాళి నిష్ఠురత్వము నూపు నెఱకరాళి. శుక. ౩. ౧౮.

వి. ధూర్తస్త్రీ.

సీ. గట్టివాయి యనంగ గయ్యాళి యన తాఁగ యన ధూర్తసతికి నాహ్వాయము లమరు. ఆం. సం. మాన. ౪.

**గయ్యాళించే=గయాళించే.** అ. క్రి. (√గయ్యాళి) ధిక్కరించి మాటలాడు.

క. నీ విచ్చో మెఱయత వై, కావరమున పలసినట్లు గయ్యాళింపం, గా వెఱచి పెద్దమొఱగా, నీ వీరిని వారిఁ దగిలి యేలవచింతున్. కళా. ౩. ౨౨౨.

స. క్రి. ధిక్కరించు.

ద్వి. అనఁటికంబముల గయ్యాళించుతొడలు. ద్వి. హరిశ్చ. ఉ. ౩౫౫ పం. (ఇట ఔపమ్యావాచకము.)

**గర[1].** వి. జూదమాడుట కుపయోగించుకొను ఒకవిధమైనపాచిక.

సీ. మేటిజూదరి యన వాటమై తివుటమై నాడుచుండుదు నే సహస్రికములు, దృష్టియేమఱక సందియము జాగరంబును దిగయును గరయునాఁ దేటపడిన,యచ్చులలోన నేయ చెప్పఁగైకొని మాటలాడినయట్లు వేటు గలుగ. ద్వా. ౧౦. ౮౭. (ప్రాఁత ప్రతిపా.)

**గర[2].** వి. ముద్ద, గడ్డ. (చూ. గరపడు.)

జః గరకట్టు, గరకొను, గరపడు.

**గర[3].** వి. రేఖావిశేషము.

గీ. రేఁక యనఁగను రేఖరై రీతి గాంచు,గర యనఁగఁ దద్విశేషమై పరఁగుచుండు. ఆం. భా. ౨. ౩౮.

**గర.** సం. వి. ఆ. స్త్రీ. దేవతాళము, డావరడంగికి. (శే. ని.)

**గరకట్టు.** అ. క్రి. (గర[2]+కట్టు) గడ్డకట్టు.

ఉ. క్రమ్మెడుశోణితంబు గరకట్టఁగ... జై. భా. ౬. ౧౯౬.

**గరకొను.** అ. క్రి. (గర[2]+కొను) గరకట్టు, గడ్డకట్టు. (శ. ర.)

**గరగ.** వి. (సం. కరకః) ౧. నీళ్లు త్రాగుట లోనగువాని కుపయోగించెడుచిన్నపాత్రము.

గీ. గరగ లొసఁగినవరుఁడు భూమును లొనర్చు, నాచమనముఖకర్మంబులందు షష్ఠ,భాగఫలమొందు... భార. అను. ౨. ౩౯౯.

౨. ఘటము; గ్రామదేవతాఘటము.

సీ... గరగతో విమలోదకములు డించి. హర. ౨. ౧౨౩.

ద్వి. వరుణుండు తనబల్మి వర్జించి వచ్చి, గరగకావడిమోఁగఁ గాచియుండు. రం. రా. సుం. (శ. ర.)

(వ్యవ) వాఁడు అమ్మవారిఉత్సవములో గరగ నెత్తుకొని ఆడుచున్నాఁడు.

జః గరగడ.

**గరగడ.** వి. (గరగ+గడ) నూనె మొదలయినవి చిన్ననోరు గలపాత్రములలోఁ బోయుటకు అడుగున ఆఁదోఁకవలె త్రోవి యమర్చి చేసినవిశాలముఖపాత్రవిశేషము. (బ్రౌ, శ. ర.)

**గరగర.** విశే. (దీనికి కర్మధారయమందు నిగాగమము వచ్చును.) ౧. మేదురము, చక్కనైనను పైనది. (చూ. గరగరనివాఁడు.)

౨. చక్కనైనది.

వ... గరగరని నెఱికురులు గుఱిగడవఁ బెరిఁగిన వగుటం జేసి... మనుచ. ౩. ౯.

క. మెడమన్ను వలఁచి యలకలు, ముడిగొని నిజపాణిపద్మములు గరగరగాఁ, గడుగుకొని తనకు మఱఁదలు,విడె మొసఁగుచుఁ బసిమి పసిఁడిపీపన వీపక్. పాండు. ౩. ౩౧. (పరిశుభ్రముగా అని భావము.)

గీ. ఏను వంటలవాడనై యానరేంద్రుఁ,గొలిచి గరగరగాఁ గూడు గూర చిత్త,మునకు వచ్చినచందంబునన యొనర్చి, నేర్చి మెలఁగుదుఁ గరము వినీతి మెఱసి. భార. విరా. ౧. ౭౬. (రుచ్యముగా అని భావము.)

క్రి. విశే. చక్కఁగా, బాగుగా; పూర్తిగా.

ద్వి. సన్నబియ్యం బేర్చి జడికట్టకుండఁ, గన్నులకింపుగా గరగరఁ గాఁచి, మెదుకు మెదుకుతోడ మిళితంబు గాక, పదను గా వార్చినభవ్యాన్నములును. ప్రభులిం. ౪. ౧౫౦ పా. ౨పం.

క. తరితీపు లేని మోహము, గరగరగా విడువవలయు... సు. శ. (బ్రౌ.)

వి. కాంతి, శోభ.

ద్వి. గాజుటోపరిలోన గరగర మీఱ, రాజిల్లునవపుష్యరాగరత్నముల. నవ. ౧. ౬౨పా. ౧౯పం.

జ: గరగరన, గరగరనివాఁడు, గరగరిక.

**గరగరన.** విశే. (√ గరగర.) ౧. చక్కనిది, అంద మైనది; అనుకూల మైనది.

క. అగురువుచిగురుఁబోఁడి సదా గరగరనై మనోజాతరవాణిగరిమన్, సోగమెఱుంగు తెఱంగున, దా గేహములోన మెలఁగుఁ దారుణ్యమునన్. వరాహ. ౭. ౧౯.

క. అది గరగర నగుపురుషుం, డెదుటం బడ నీఁడు జీవితేశ్వరుఁ డయినన్, మదిఁ గలదుఃఖం బెల్లను, దుదముట్టు నటంచు మోహదుర్దశనొందున్. హంస. ౪. ౮౦.

చ. ...సర్వకార్యముల్, గరగర నయ్యె రమ్ము శశిఖండశిఖామణి యంచు భక్తితోన్. కాశీ. ౬. ౮౦.

క. బిరుసింత గాక నడిమికి, మురియక ననుఁ బ్రాయివడి చిముడఁబాఱక యే, బెరికియును లేక మిక్కిలి, గరగర నగునేఱుప్రాలకలమాన్నంబుల్. జై. భా. ౮. ౧౯౮. (రుచ్యమైనది అని భావము.)

౨. నును పైనది.

ద్వి ... నీరువెడలి, గరగర నైనచొక్కపురాతిమీఁదఁ, బరువడి నందంద పంక్తులు సాగి. ద్వి. సిం. భాగ. ౨. ౧౯ పా.

**గరగరనివాఁడు.** విశే. (గరగర + వాఁడు.) చక్కనైనున్ననైనవాఁడు, మేదురుఁడు.

గీ. గరగరనివాఁడు నవ్వుమొగంబువాఁడు, చూడఁ గలవాఁడు మేలైనసొబగువాఁడు, వావిమేనత్తకొడుకు గావలయు నాకు, నర్జునుండు పరాక్రమోపార్జునుండు. విజ. వి. ౨. ౧౬౪.

గీ. మేదురసమాఖ్య యా మినమిననివాఁడు, గరగరనివాఁడు నాఁగను గాలకంఠ. ఆం. భా. ౩. ౧౦.

**గరగరిక=గరాగరిక.** వి. (గరగర + ఇక) ౧. చక్కఁదనము, అందము.

గీ. చెలువమెడ తుంటవిల్తునిచెంప మరయ, నందు నిరుగడ వైచినకుందనంపు, సరులు పూఁబోఁడిచేతులు చాల నరయఁ, గాక యుండిన నీగరగరిక గలదె. యయా. ౪. ౪౨.

బంధురము. గురుజఘనములును గుచములభరముం గొప్పలగొప్పతనంబులు మే, గరగరికలు సిరి గల నగుమొగముల్ కల్కిమెఱుంగఁగనుం గవలున్, దొరయఁగ నెలకడఁతులు విటధనముల్ దోఁతురు చొప్పడ నప్పురిలోన్. కళా. ౧. ౧౮.

౨. శృంగారరసము.

సీ. గరగరిక యన సింగార మనంగను శృంగారనామంబు చెలఁగుచుండు. ఆం. భా. ౧. ౧౩౧.

౩. అలంకారము.

ఆ. పతిప్రవాసవేళఁ బాటించుకొనవు నె,మ్మేన గరగరికలు మెఱుఁగుఁబోఁడి. కళా. ౪. ౧౨౯.

౪. నైర్మల్యము.

సీ. ...పులుగడిగినముత్యములఁ బోలి గరగరికలు వహించి. శతకసంపుటము. ౧. ౨౩. (బ్రా.)

సీ. రతిరయచ్ఛిన్నసూత్రమునఁ జిక్కక ముత్తెములు రాల గరగరికలు వహింప. గీ. ...వలఁతు లప్పద్మముఖులు. ఆము. ౧. ౬౦. (మకుటో నైర్మల్యము, విచారములేమి అని భావము. గరకరిక=నైర్మల్యము. అని శ. ర, వ్రాతప్రతి వ్యాఖ్య-'సరకుగొనమి' అని వేదమువారి వ్యాఖ్య.)

౫. విధము.

క. పరదేశం బెఱుఁగక తగు, గరగరికన్ విడువ ముదువఁ గలిగి నడుమఁ జేదతికము పాటిలి తిరియన్, విఱిగిననను బోఁటి కమరు నే యింతైనన్. వేం. పంచ. ౨. ౧౩౧.

విశే. సుందరము, అంద మైనది; పరిశుభ్రము.

చ. గరగరికైన దైనెనపు గల్గిన దైనెఱనీటుకత్తె

ద్యై, పసునపునిండుజవ్వనపుబాగరినాగరికం పుఁబ్రోడ యై...కళాం. ४.౭౦.

క. దొరకైనఁ జేదకైనన్, వెరవరియిల్లాలికైన వేశ్యకునైనన్,గరగరికతనము బా గగు... కవిపా. శ. ౬౧.

**గరగు.** వి. ఒకానొకచెట్టు. (దీనికాయలు ఊరవే యుదురు.)

సీ. గరగుకాయయు ముల్కాయయు యందుగుకా య లుసిరికకాయలు నుస్తెకాయ...గీ... అ ది,యైనఁయూరుఁగాయలు గల వతనియింట. హంస. ४. ౧3౫.

**గరజా.** వి. (క.గరజు.హిం.గరజ్.) అక్కఱ. (చి. ని-గరజు. శ. ४.)

**గరణము.** సం. వి. అ. న. ౧. మ్రింగుట. ౨. చల్లుట. 3. విషము. (వాచ)

**గరదము.** సం. వి. అ. న. విషము. (వాచ)

**గరదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) విషముపెట్టువాఁడు.

**గరభము.** సం. వి. అ. పుం. గర్భము. (కల్ప)

**గరము.** సం. వి. అ. పుం. ౧. తెవులు. ౨.సేచనము, తడుపుట. 3. మ్రింగుట. ४. విషము. ౫. కృత్రిమవిషము,ఉపవిషము.(మే.ని.)౬. ఔషధచూర్ణము. ౭.గళము, కంఠము. న. ౧. (జ్యోతి) ఒకానొకకరణము. (కల్ప.) ౨. జలము. (శే. ని.)

**గరలమురువులు.** వి. బ. కుమ్మరవాఁడు కుండలపై చెక్కు-అలంకారవిశేషము.|హంస.౫. ౧3. (ప్రయోగాంతరములేదు. ఇంకను విచార్యము.)

**గరళము.** సం. వి. అ. పుం. న. విషము; సర్పవిషము.న.౧.గడ్డిమోపు.౨.పరిమాణవిశేషము.(వాచ)

**గరళారి.** సం. వి. ఇ. పుం-విషమునకు శత్రువు-గరుడపచ్చ.

**గరవడ(ళ)ము.** వి. మల్లబంధవిశేషము.

వ...అబ్బలానుజుం డుబ్బి గొబ్బున మేను పర్థిల్ల పర్థాంగంబున నుండి జానువుల నెత్తుచు నురవడిం గరవడంబున నున్న నాదుర్నయుం డును బాల మేలు మేలని లీలం గాలు సార నిచ్చి త్రోచిన...భాగ. ౧౦ పూ. ౧3४౫.

చ ... చేబయుణ్, గరవళముణ్ నృసింహుముపు గ్గైకొని జెట్లను గాంచి వెంబడిక్. ప్రబంధ. ౮౧.

**గరవసు.** అ. క్రి. (గర² + పసు) ఘనీభవించు,గడ్డకట్టు.

(కైలాసవర్ణనము) సీ.కరఁగు వెన్నఁడు లేక గర పడ్డలేమంచు దెచ్చి యున్నశము గాఁ దీర్చిరో క్కా. భోజరా. ౭. ౨౧౫.

**గరవ్రతము.** సం. వి. అ. పుం-విషజంతు వగుసర్పమును తినునది-నెమిలి.

**గరాగరిక=గరగరిక.** విణ. సుందరము.

మ. కుదురైరె యొప్పులకుప్ప యై తనువులో గోరంత యొచ్చెంబు లే,నిది యై నొవ్వనిజవ్వనంబు గల దై నిద్దంపుటొయ్యారి యై, మదనోజ్జీవిత యై గరాగరిక యై మాణిక్యపుణ్ బొమ్మయా, మదిరాక్షిణ్ సృజియింతు నే నొకతె మన్నా హాత్త్యముం జూడుమా. అహ. ౨. ౯.

**గరాధిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. లాక్షాక్రిమి, లక్కపురుగు. ౨. లాక్ష, లక్క.

**గరాసు.** విణ. కుజనుఁడు, దుష్టుఁడు; దుష్టురాలు.

గీ. కరటి యడిగొట్టు పలువ యేతరి గరాసు, చెనఁటి చెన్నఁటి కూళ కుచ్చితుఁడు మొండి, కట్టె నాఁగను గుజనాఖ్యగాఁ జెలంగు.ఆం. భా. 3. ౭.

గీ. గ్రామమున కెల్ల మాలిమికాఁడ వగుట, బ్రతికి పోతివి పోర బాఁపనగరాస. శుక. ౨.४౭४.

ఉ. బిడ్డయొ పాపయో చిదిమి పెట్టినకైవడి నున్న నిన్నుఁ దా,నడ్డ యొనర్ప కవ్వలఁ బిశాచము వంటిగరాసుఁ గూడె నీ,యెడ్డెఁడు ... శుక. ౧. ४3౮.

క. సామి పలుమఱు దేవర, కే మని వినిపింతు నిం
క నీఁగకు నిలియుం, బాములకు బలియేఁ బెట్ట
క, యాముసలిగరాను పిసిడి య్యై వర్తించుక్.
విప్ర. 3. ౧౬. అహ. ౧. ౧౦౦.

**గరిఁటె**=గంటె. వి. (త. కరండి)-కఱ్ఱ ఇనుము మున్నగువానితోఁ జేసిన-తెడ్డు, కంబి.

గీ...గంటె గరిఁటె నా మనును గంబి. ఆం.భా. ౨. ౨౪౩.

ద్వి. నేయి గరింటెఁడుక్ బోయకయున్న. పండితా. వాద. ౨౦౩ పా.

జ: గరిఁటెకామ.

**గరిఁటెకామ**. వి. (గరిఁటె + కామ) ఓషధివిశేషము.

గీ. కటుకరోహిణిఁ జనుఁబాలఁ గలయ నూఱి, కడుపునకుఁ బోసి యొడ లెల్లఁ గలయఁ జమురఁ, దీఱుఁ బాలీజ్వరంబు లీతీరు వసయు, గరిఁటెకామరసంబునఁ గలపి చముర. చికి. ౨. (చి. ని.)

**గరిగ**=గరగ. (బ్రౌ, చి. ని.) వి. చిన్నకుండ; కుండ.

క. ఊరుయుగం బరు పేరక్, బాలెడుబంగారు నీటివాఁకను రతియుక్, మాఱుఁడును జిన్నిగరిగలు, సౌరుగ ముంచి రనఁ జెలికి జానువులమరుక్. అహ. ౨. ౫౦.

సీ...తగు గళంతిక గలంతె గరిగ యన. ఆం. భా. ౨. ౨౪౭.

ద్వి. పెరుఁగుబానలు పాలపేస్పులు తేనె, గరిగలు దెచ్చి దగ్గఱఁ బెట్టఁ గొంద, ఱను నియమింప ... ప్రభులిం. ౪. ౧౫౦ పా. ౧౫ పం. ('గరిగె' ముద్రి.)

సీ. పొంగులు రాఁ గాఁగి పొరలునూనియ ముంచి గరిగల వంచి యుక్కుఱఁగఁ జల్లు. రంగా. 3. ౯౬. ('గరిగె' ముద్రి.)

**గరిగొను**. అ. క్రి. అతిశయించు.

ద్వి ... ఇంద్రజిత్తు ... మాల్యములు, ధరియించి వహ్నికిఁ దగఁ బరిస్తరణ, మురుతోమరంబులు నుగ్రవస్త్రములు, గఱి లేనిశరములు గావించి వలువు, గరిగొన్న పెను మేఁకకంఠరక్తమున, నొగిఁ దాడిసమిధల హోమంబు సేయ. రం. రా. యు. ౩౫౯ పా. ౫ పం.

**గరిడి(డీ)**. వి. (సం. ఖురళీ. క. గరడి, గరుడి) ౧. సాము.

గీ. అంత కఁతకు వర్ధిల్లుహరికొమాళ్ల, బలఁగమున కిది చాల దక్ తలఁపుతోడఁ, దిరుగఁ గట్టింత మనుపైఁడిగరిడిసాల, యట్ల యున్నదియే విశ్వాబ్జవదన. కళా. 3. ౧౩౦.

సీ. గరిడిసాధనలవేడ్కలఁ గొంత తడవు... కళా. ౭. ౩౪.

౨. సాముసేర్చుకొనుచోటు, సాముకూటము; అభ్యాసస్థానము.

సీ. నికటఖురూరికల్ సెగడును గరిడి నా...ఆం. భా. 3. ౪౬.

చ. తళుకుఁబసిండియోవరులు దంతపుఁజావడులు ...కెంపుటోడుబి, ళ్లలగరిడీలు శీతలశిలాతలముల్... వసు. ౪. ౭౨.

గీ. పద్మసంభవవై కుంభభగ్నసభలు, సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర. మనుచ. ౨. ౪౩.

గీ. దక్షవాటిక సకలవిద్యలకు గరిడి, దక్షవాటిక విభవంబుతానకంబు, దక్షవాటిక శివునియంతఃపురంబు. భీమ. ౬. ౧౦౫.

గీ. సర్వవేదపురాణశాస్త్రములగరిడి, సర్వపాపౌఘజలదఝంఝూమరుత్తు, సర్వమోక్షములకును నాస్పదము కాశి. కాశీ. ౭. ౨౮౮.

3. సమీపము, సన్నిధి.

సీ. నికటఖురూరికల్ సెగడును గరిడి నా...ఆం. భా. 3. ౪౬.

సీ. ఆసవనక్షోణియందును సరసులగరిడి నిష్టపురా
ణపరిచితిఁ బ్రియ, మందెడుసమయంబున...
రాఘవ. ౨. ౧౯. (రామాయణార్థమున.)

గరిడికత్తు=ఆరితేఱు.

ద్వి. హయనిభస్తులమూర్ధ శిరమునఁ దాల్చి, గరిడి
కెక్కినయంకకాఁడును బోలె.పండితా.వాద.
౧౭౬ పే.

జ: గరిడిముచ్చు.

**గరిడిముచ్చు.** విశ. (గరిడి + ముచ్చు) ఆరితేఱిన
దొంగ.

గీ. సత్యభామయు భోజాత్మజయును హరియు, గు
రువులుగ గానకళ లెల్ల గరిడిముచ్చుఁ,దనను
తో నేర్చితివి గద యనుచుఁ బలికె. కళా. ౨.
౮౫.

**గరిడియ.** వి. (సం. కరండకః) వెదురుబుట్ట.

క. ఫలభారము దుర్భర మని, వెలఁది యచట నొ
క్కవృక్షవిటపంబున నిమ్ముల గరిడియ దగిలి
చి...భార. అర. ౭. ౨౬౬.

**గరిత**=గర్త. వి. ౧. భార్య.

సీ. మూఁడుత్రోవలఁ బాఱి మున్నిటిగరితగాఁ బ
రఁగు నేదేవునిపాదతటిని. ఉ.హ.రి.౨.౧౮౪.

గీ...గరిత యనఁగ నిల్లా లనంగ, గృహిణి చెలఁ
గును...ఆం. భా. ౨. ౧౦౫.

౨. పతివ్రత.

గీ. ఇంతఁ జెనిమిటి వీఁ డని యెఱుఁగ లేక,గరిత
గావున నిజనాథుఁ గానఁ గోరి, సుభగమతు
లార నానాథుఁ జూపుఁ డనుచు, నశ్వదేవ
తల కపు డయ్యబల మ్రొక్కె. భాగ.౯.౬౦.

సీ...అతనిదేవేరి సీతమ గడింది, గరితయ యేని జ
గంబుల కిది మేలు పని యేని యిమ్ముల్కి పలు
చి చెనఁటి. గీ. పాలను మేపరిగమికానిఁ బొ
లియఁజేయుఁ, గాత ... అచ్చ. రా. యు.
౩౫౬.

౩. ఆఁడుది.

ద్వి. కదలి నే గోఁకలి గైకొన్న నవలఁ, గదలుదు
రీవాడగరిత లందఱును. ద్వి. హరిశ్చ. ఉ.
౧౧౯౬ పం.

గీ. గరిత యలివ నాస్త్రీసమాఖ్యలు మహేశ. ఆం.
సం. మాన. ౯.

**గరితము.** సం. విశ. (అ. ఆ. అ) విషము గలది.

**గరిబడు.** అ. క్రి. కలియఁబడు, డీకొను.

సీ. ఖచిఖచిక్కంచని గరిబడి మొనఁ జిమ్ముకొమ్ము
జేయుంగుల కొదెఁగి చనక. మల్లుపు. ౧. ౫౯.

గీ...నిజచ్ఛాయల ప్రతి,కరు లని గరిబడుటగ
ల్గుగంధకరులు. ప్రబంధ. ౫౩.

వ... హరాంతకారులపైఁ బడి ముడిఁగి రెండు
మోఁచేతులపోటుల గరిబడుకితులును... ప్ర
బంధ. ౭౫. (ఇది యింకను విచార్యము)

**గరిమ(ము).** సం. వి. స్త్రీ. పుం. ౧. విధము. (ఈ
యర్థము తెనుఁగుననే కలదు.)

సీ. భరతునిలాగునఁ బరశురాముని భాతి రంతిదే
వునిభంగి రాముగరిమ. విక్ర. ౨. ౬౯.

౨. భారము, బరువు. ౩. గొప్పతనము, పెద్దతిక
ము, గౌరవము.

ఉ. దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాం
డునృపాలుపాలు రా,జన్యవరుండు ధర్మజుఁ
డు సమ్మతి వేఁడెడు నన్న లోకసా,మాన్యవి
ధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద
మ,న్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల
మాతఁ డందెడుఁ. భార. ఉద్యో. ౧. ౩౨.

౪. ఉత్కర్షము, శ్రేష్ఠత. ౫. అణిమాద్యష్టైశ్వ
ర్యములలో నొకటి.

**గరిమిడి**[1]. వి. పందికొక్కు.

సీ. చొరఁబడ్డమంగిస యురిఁబడ్డగరిమిడి మునుపు
గా గొల్లన ముగిసిపోవ, జోడించినసివంగి కే
డించుకొనునిత్తి వెనుకగాఁ గుట్టొక్కు విడిచి
త్రెళ్ల...గీ...ఒకమహానినద మొగసె. కకు.
౮. ౯౫.

గరిమిడికొక్కు=పందికొక్కు, గరిమిడి.
సీ...కొక్కున గరిమిడికొక్కనంగను బందికొక్కనంగ, మూషికాభిధ లగు ... ఆం. భా. ౨. ౯౬.

**గరిమిడి²**. వి. గఱిక, దూర్వ; తృణవిశేషము.
సీ...గరిమిడి గఱిక నాఁగఁ జను దూర్వ. ఆం. భా. ౨. ౨౮.
గీ. కసువు కుందురు గరిమిడి గఱిక... మొదలు గాఁ బూరి రవలింపఁ బొదలు వెపలు. ప్రబంధ. ౨౦౧.
గీ...గఱిక...కుందురు గరిమిడి. హంస. ౫.౮౫.

**గరివడె(డియ)ము**. వి. (సం. ఖరవటకః) ఒకవిధ మగువడియము.
సీ. పొల్చుమాషాపూపము వడ యనంగను వడియ మనంగను వటక మెసఁగు, గరివడె మనఁగను ఖరవటకం బొప్పు...ఆం. భా. ౨. ౨౫౫.

**గరివించు**. అ. క్రి. (సం. గర్వ) గర్వపడు, గర్వించు.
గీ. నేర్చె గరివింప మెప్పింప నేర్చె... కవిక. ౩. ౨౨౬. (శ. ర. పా. 'గరువించు' అని ముద్రితపాఠము. అపక్షమున - గరువము + ఇంచు. అనవలెను.)

**గరిష్ఠము**. సం. విణ. (అ. ఆ. అ) మిక్కిలి గురువు, మిక్కిలి బరువైనది. ౨. మిక్కిలి గొప్పది, శ్రేష్ఠమైనది.

**గరిసియ**=గరిసె. (చి. ని.)

**గరిసె**=గరిసియ. వి. (క. గరసె. త. కరిసై.) ౧. గాదె; పాణక.
సీ...కుసూలాభిధ గాదె యనంగను గరిసె యనఁగ. ఆం. భా. ౨. ౨౮౦.
సీ. భాండసంభారంబు పగిలించి గోడలు గోరాడి గరిసెలు కూలఁ దాఁకి. హరి. పూ. ౬. ౧౩౯.
గీ. భూమి నశ్రుత స్మృతదృష్టపూర్వ మైన, బహుళసంవత్సరంచర పాదుకొనిన, గరిసె యనఁ గోట మించఁగ గణన కెక్కె, నందుపై నుంచునిలువార మన దివంబు. చంద్రా. ౧. ౫.
సీ. కాయధాన్యంబులకణఁజము ల్బియ్యంపుగరిసెలు దినుసులు గలకొటార్లు. హంస. ౨.౨౨౬.
౨. మానవిశేషము, ఆఱువందలకుంచములపరిమాణము.
చ. గరిసెలవ్రాఁతె కాని యొకగంటెఁ డెఱుంగను మన్నెదేశముల్, దిరిగి యభీష్టవస్తువులు తెచ్చి భుజింతును సార్వకాలముఁ, సుచిరసత్కవిత్వనిధిసూరకవీంద్రున కేల గగ్గెఁ గం,చరమును రేగ మేఁక మెషచన్నులపోలిక రెండుగ్రామముల్. (అడిదముసూరనచాటువు)
జః గరిసెబావి.

**గరిసెన**. వి. భక్ష్యవిశేషము.
సీ... లడ్డువాల్ గుట్టలు గరిసెనప్రోఁగులు నతిరసమెట్లు, లప్పడాలకొటారులు...శ్రీరం. మా. ౬. ౧౧౦. (ప్రయోగాంతరము కనఁబడదు.)

**గరిసెబావి**. వి. (గరిసె + బావి.) ఒఱలు మున్నగువానికి బదులుగా చువ్వలతో గాదవలె అల్లి నేల లోపలికి దింపి యేర్పఱచునొకవిధమైననూయి. (శ. ర, బ్రా.)

**గరీబు**. విణ. (క. గరిబ. త. గరీబు. హిం. గరీబ్.) బీదవాఁడు, దీనుఁడు. (శ. ర.)
వి. మహమ్మదీయులలో నొకతెగ.
సీ. అఖిలసీమామూల మైనదుర్గమ్ము లుంబళికలు గలకమ్మవెలమదొరలు, చేతికై దేసివేల్ శివరాయలవరాల నెలకట్టుడలపటాణీ ల్గరీబు,లు ... రా. వి. ౫. ౧౩. రంగా. ౨. ౩౯.

**గరీయము**. సం. విణ. (స్. యసీ. స్.) గురుతరము, మఱొకదానికంటె గురువైనది.

**గరు**=గగురు. వి. రోమాంచము, గగురుపాటు.

ద్వి. ధరణి యంతయు రక్తధారలచేత, గరు ఫుట్ట నెత్తురు కాల్వ లై పాఱె. ద్వి. సారంగ. ౩. ౧౦౯ పా. ౬ పం.

(ఆదివరాహము.) సీ. కాఁడి పాటిన మేనిగరులు ... శివరా. ౧. ౬౧.

ఇ: గరుదాల్చు, గరుదాల్పు, గరుపాటు, గరుపాటుమొన, గరుపాఱు.

**గరుటా(ల)మంతుఁడు.** వి. (సం. గరుత్మాన్.) గరుత్మంతుఁడు.

క. గరుటాలమంతుఁ డనఁగను, గరుడి యనన్ బొల్లి నెమ్మిగ నుపిట్ట యనన్, గరుటామంతుం డనఁగను, గరుడుని పే ళ్లొప్పు... ఆం. భా. ౧. ౫౩.

సీ. కంబమయ్యెరొ మేలు గలిగింపు నీ కొక్క గరుటాలమంతుని గాను కిత్తు. యయా. ౨. ౩.

**గరుడకంబము.** మి. వి. (క. గరుడకంబ.) ౧. గరుడస్తంభము. ౨. నేరము చేసిన వారిని బంధించుటకై కొత్వాలుచావడి యెదుట పాఁతఁబడిన స్తంభము.

సీ. గరుడులను గరుడకంబాలఁ గట్టి గంధర్వుల గంధర్వతతుల నడిచి. ఉ. రా. ౨. ౯౭.

**గరుడటెక్కెము.** మి. వి. గరుడధ్వజము.

వ... ముత్యాలగొడుగులు గరుడ టెక్కెంబులు కనకవేత్రంబులు బంగారుసురఁటులు... అమృతపూర్ణ హైమకలశంబులు మొదలగునవి ధరియించి వివిధకైంకర్యపరాయణత్వంబున నగ్రభాగంబున నడమవారును... ఉ. రా. ౭. ౨౯౮. (ఇట ప్రకరణమునుబట్టి 'గరుడపచ్చల టెక్కెము' అని అర్థమగుచున్నది.)

**గరుడధ్వజుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**గరుడపచ్చ.** మి. వి. ౧. గారుత్మతము, ఆకుపచ్చ వన్నె గలమాణిక్యము.

క. పని మెఱవడి నలరుగరుడపచ్చలచవికన్. యయా. ౮. ౭౬.

(ఈ గ్రంథమునందు అచ్చ తెలుఁగుపదముగా గ్రహింపఁబడినది.)

౨. గరుడపచ్చవన్నె గలవస్త్రవిశేషము.

గీ... గరుడపచ్చలు నేత్రముల్ తురగవల్లు ... మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. ప్రబంధ. ౨౭౨.

**గరుడము.** సం. వి. అ. పుం. ౧. గరుడాకారముగఁ గట్టినయిల్లు. ౨. గరుడాకారముగఁ బన్నినవ్యూహము.

**గరుడనరులు.** మి. వి. బ. ధాన్యవిశేషము. హంస. ౪. ౧౨౭.

**గరుడస్తంభము.** సం. వి. అ. పుం. విష్ణ్వాలయమునకు ఎదుట నుండెడిధ్వజ స్తంభము.

**గరుడాంకితము.** సం. వి. అ. న. గరుడపచ్చ.

**గరుడాగ్రజుఁడు.** సం. వి. అ. పుం-గరుత్మంతుని యన్న-అనూరుఁడు.

**గరుడాశ్మము.** సం. వి. న్. పుం. గరుడపచ్చ.

**గరుడి.** వి. (సం. గరుడః) గరుత్మంతుఁడు.

క... గరుడి యనన్ బొల్లి నెమ్మిగ నుపిట్ట యనన్, గరుటామంతుం డనఁగను, గరుడుని పే ళ్లొప్పు ... ఆం. భా. ౧. ౫౩. కు. సం. ౭. ౨౯. నిర్వ. ౩. ౨౭.

ఇ: గరుడిరవుతు.

**గరుడిరవుతు.** వి. (√గరుడి) గరుడవాహనుఁడు, విష్ణువు. (శ. ర.)

**గరుడుఁడు.** సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు, గరుడి. (ఇతఁడు కశ్యపప్రజాపతికి వినతయందుఁ బుట్టినవాఁడు.)

**గరుడోద్గారము.** సం. వి. అ. న. గరుడపచ్చ. (కల్ప.)

**గరుత్తు.** సం. వి. త్. పుం. పక్షము, ఱెక్క.

**గరుత్మంతుఁడు.** సం. వి. త్. పుం. ౧. గరుడుఁడు, గరుడి. ౨. అగ్ని.

**గరుదాల్చు.** అ. క్రి. (గరు + తాల్చు.) గగుర్పొడుచు.

ఉ. అప్పుడు రంభ చాల భయమందుచు నమ్ముని యుగ్రరూపముం, దప్పక చూడ మేను గరుదాల్చుచు నున్నది... కళా. ౩. ౧౩.

గీ. జడ్డుపడి యుండె నొకకొంత ప్రొద్దు వేడ్క, నవయవంబులు గరుదాల్ప నచ్యుతుండు. శివరా. ౧. ౬౮. వైజ. ౨. ౧౩౭. కాశీ. ౨. ౧౮౯, ౩. ౧౨౧.

(ఇది వ్యస్తము గాను నన్వయింప వచ్చును. కాని ప్రయోగబాహుళ్యమును బట్టియు 'గరుదాల్పు' అనురూపమును బట్టియు ప్రత్యేకపదముగా గ్రహింపఁబడినది.)

**గరుదాల్పు.** వి. (√ గరుదాల్చు.) రోమాంచము, గగురుపాటు.

సీ. పులక లనంగను బులకర మనఁగను గగ్గురనం గను గగురనంగ, గరుదాల్పనంగను బరఁగు రోమాంచంబు... ఆం. భా. ౧. ౧౮౧.

**గరుద్యోధి.** సం. వి. న్. పుం.- ఱెక్కలతో యుద్ధము చేయునది- భారతీపక్షి. (వాచ.)

**గరుపాటు.** వి. (√ గరు) రోమాంచము.

చ. అన విని గుండె జల్లనఁగ నచ్చెరుపాటును జిచ్చుపాటు నెక్కొన గరుపాటునుం గదురఁ గొండొక సేపటు లూరకుండి... శశాం. ౩. ౬౮.

సీ. మగనిచిన్నెలకు మార్మొగ మిడ్డచెలి మేనిగరుపాటు లోకూర్మి కలిమిఁ దెలిపె. అచ్చ. భా. ౩. ౮౭.

**గరుపాటుమొన.** వి. (గరుపాటు + మొన) పందిముట్టె. (శ. ర.)

సీ. అతిశీధుమదవికారత మేను లెఱుఁగనికరటుల సఖ్య మగ్రాహ్య మనియు... గరుపాటు మొనఁ ద్రవ్వి కడుపుఁ బోసికొనెడిపందితోఁ బొందు నిర్బంధ మనియు... గీ. ధరణి కరిఫణికిటి ధరేశ్వరుల రోసి, విష్ణుసన్నిభు నమ్మర్త్యవిభునిఁ జేరె. వేం. పంచ. ౧. ౭౩.

**గరుపాఱు.** అ. క్రి. (గరు + పాఱు) గగుర్పొడుచు.

క. కని యుత్తరుండు గరుపా, ఱిన మేను దలఁకు మనము జిచ్చపడిన చూ, పును నై తొట్రుపడుచు ని, ట్లనియె... భార. విరా. ౮. ౫౧.

క. నరపతి యానందాస్రులు, గరసరసిరుహముల నొత్తి కను దనియఁగ న, య్యిరువురఁ జూచుచు మేనులు, గరుపాఱఁగ గ్రుచ్చి యొక్క కౌఁగిటఁ జేర్చెన్. భార. ద్రో. ౫. ౧౬.

సీ... పులక లొత్తెను గగుర్పొడిచె గగురు. గీ. పాఱె గరుపాఱె మైమోడుపర్వె ననఁగఁ, దగు ను రోమాంచనామముల్... పాం. వి. మాన. ౨౮.

**గరుము.** విణ. గులకఱాలచేత గట్టి యైనది.

ఉదా: గరుపనేల. (శ. ర.- గరపనేల = ఎఱ్ఱనియిసుకనేల, గొడ్డునేల. (బ్రౌ. వా.)

**గరువము[1].** వి. (సం. గౌరవమ్.) ౧. గొప్పతనము, గౌరవము.

క. దూతీముఖమున గరువము, ప్రీతియుఁ బొదలంగఁ గదియుఁ బ్రియము లరయఁ గా, ర్యాతురతఁ దార పైకొను, టే తెరువునఁ గాదు చూడు మిది నీబుద్ధిన్. హరి. ఉ. ౭. ౧౮౬.

(రావణుఁడు సీతతో ననినమాటలు) చ... నిను మది నాదరించు టిది నీదగుభాగ్యము గాదె యింతయున్, వనిత యెఱుంగవైతి గరువంపువిచారము లేదు నీయెడన్. భార. అర. ౬. ౮౦౫.

౨. విస్తృతి, విరివి.

మ. గరువం బారఁగ నీకు నిన్నియును వక్కాణిం
పఁగా నేటికిఁ, సురతిర్యఙ్మనుజాదిలోకము
లలోఁ జూపట్టు నానాచరాచరభూతంబు
లయందు నంద మగుస్త్రీసంజ్ఞల్ రమారూప
ముల్, పురుషాకారము లన్నియుఁ హరిమ
యంబుల్ గా విచారింపుమీ. వి.పు. ౧. ౧౨౯.
(గరువంబారఁగ=విస్తరించి.)

విశ. విస్తృతము, సవిస్తరము.

ఉ. వనటఁ బ్రాలంగఁ బెట్టి గరువంబుగఁ జెప్పుము
దీనిమూలముఁ ... భార. ఉద్యో. ౪. ౨౯౭.

౨. అధిక మైనది, అతిశయ మైనది; పెద్దది.

ఉ... ఈ, శాంతకు వంశశీలగుణగౌరవయౌవన
రూపసత్కళా, వంతుఁడు కాంతుఁ డైన గ
రువంపుఁదపంబు ఫలంబు నొందుఁ బో ... వి
క్ర. ౬. ౫౧.

సీ. బహుళయాతాయాతపరిపాటిఁ బాటిల్లుగరు
వంపునిట్టూర్పు గాడ్పుతోడ. కాశీ. ౪. ౬౯.

ఉ. చూతమె దాసి పక్వతరశుక్తిపుటాంతరదృ
శ్యమహాక్తిక, వ్రాతము లై వెలుంగుగరువంపుఁ
గొటారుల నొప్పు తామ్రప, ర్ణీతటము ... మ
నుచ. ౩. ౭౯.

గరువము². వి. (సం. గర్వః.) గర్వము.

క. గరువము మురిపం బనఁగను, బరఁగుఁ గర్వం
బుపేళ్లు...ఆం. శే. ౩౦.

ఆ. కల్లజింకఁ జిదిమె గండగొడ్డలితాల్పు, గరువ
మడఁచె నతనికడిమి యసదె.అచ్చ.రా.యు.
౧౧౬.

ఉ. ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వి
నంగ రుక్మిణీ, కాంత వినంగ నేను వినఁగాఁ
బలికెం బతిఁ గూర్చుదాన నా, యంతటివా
రు లే రని యహంకృతి చెప్పెడు విఱ్ఱవీఁగు
చు, న్వంతున వచ్చుసత్యగరువం బిఁకఁ జెల్ల
దటంచు మానినీ. పారి. ౧. ౭౦.

గరువు¹. వి. ఖరభూమి, గట్టినేల.

ఆ. గరువు గరుసు నాఁగ ఖరభూమి విలసిల్లు.
ఆం. భా. ౨. ౪.

వ...అచ్చటఁ గ్రొచ్చి గరువునేలల గుంట లొ
నరించి...మనుచ. ౪. ౬౦.

జ: గర్వాడు.

గరువు². వి. చెంప.

చ. గరువున కొత్తఁ జెంగలువకచ్చు ఘటించిన
మాళిఁ జుట్టెఁ జెం,దిరికచెఱంగునఁ బసిఁ
డితీఁగలు నించినజిల్గుఁబాగ ... మనుచ. ౫.
౫౭.

గరుసు¹(రుసు). వి. (సం. కర్కశః. క. గరుసు)

౧. గరువునేల, కఠిన మైనభూమి.

ఆ. గరువు గరుసు నాఁగ ఖరభూమి విలసిల్లు.ఆం.
భా. ౨. ౪.

౨. గులకఱాయి.

(పురవర్ణనము) క. జల మిక్షుఫలరసంబులు, గలు
పంబురుహోత్పలములు గరుసులు ముత్యం,బు
లు మీలు మణులు సంకులు, నలి సస్యము చెఱ
కు రాజనపుఁ బొల మెల్లఁ.కు.సం.౭.౯౨౫.

౩. తోలు, చర్మము.

సీ. దొనదొన మనునీఁగతుట్టెలరూ పేలుపసక
క్రంపలను బ్రే లెడుగరుసులు. ఆము. ౫.౧౭.

గరుసు²(రుసు). వి. ౧. మేర, మర్యాద, అవధి.

సీ. గరుసులు గడవంగఁ గదలి యల్లల్లన యొత్తు మ
హాడముల నుత్తరించి...ఆ... ఉగ్రభంగి గాఁ
బయోనిధు లొక్కటఁ, బెల్లు రేఁగి జగము వె
ల్లివాడిచె. భార. అర. ౪. ౨౨౯.

గీ. ధరణిధరములు గూలఁగ ధరణి వణఁక, జలధు
లుప్పొంగి కడవ గర్పులను సకల,భువనసంక్షో
భముగఁ జలంబును బలంబు,డిగక నలువుమైఁ
బోరె నాడియు బకంబు. మార్క. ౨. ౧౨.

చ. పరిభవచింత చిత్తమున బల్పుకొనం దలపోఁ

తలఁకఁ బగల్, గరుసులు దాఁటనించుకయుఁ గఁటికిఁ గూరుకు రాక...భా.రా.యు.౭౩౦.

చ. సురపతి మార్గశీర్షమున శుద్ధచతుర్దశినాఁడు రోహిణిం, బొరసినసిద్ధయోగమున భూతల మిచ్చెఁ బయోధిగోత్రముల్, గరుసుగఁ దుల్యభాగయును గంద్రుడు లోనుగ దక్షవాటికావరునకు భీమనాధునకు వారవధూత్రిశత ద్వయంబుతోఁ. భీమ. ౫. ౮౩.

గరుసెక్కు=మేరమీఱు, పొంగు.

క. కని మనమునఁ గోరిక నిక్కి నితాంతానందవార్ధి గరుసెక్కఁగఁ జక్కనిసతి నాశిఖరికి మ్రొక్కి నియోగించుమను మ్రొక్కి కౌతూహలి యై. వరాహ. ౧౦. ౮౭.

**గర్గము.** సం. వి. అ. పుం. ౧. వృషభము. ౨. వానపాము. ౩. (సంగీ) తాళవిశేషము.

**గర్గరము.** సం. వి. అ. పుం. ఒకజాతిచేఁప.

**గర్గరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తరికడవ, పెరుఁగు చిలికెడుకుండ. ౨. కలశి, కుండ. ౩.పాలమున వేసికొనెడిపాక. (వై. ని.)

**గర్గుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఒకానొకఋషి, బ్రహ్మమానసపుత్రులలో నొకఁడు. ౨. బృహస్పతివంశస్థుఁడును వితథునిపుత్రుఁడు నగు ఒకానొకముని. (కల్ప)

**గర్జ.** సం. వి. ఆ. స్త్రీ. మేఘధ్వని;ధ్వని. (వై. ని.)

**గర్జకుఁడు.** సం. విణ. (అ. ర్జికా.అ)గర్జించువాఁడు.

**గర్జత్.** సం. శత్రు. గర్జించుచున్న.

**గర్జన.** సం=గర్జ. (వై. ని)

**గర్జనము.** సం. వి. అ. న. ౧. మేఘధ్వని; ధ్వని. ౨. కోపము. (మే. ని.)

**గర్జము.** సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు. ౨. మేఘధ్వని; ధ్వని. (వై. ని.)

**గర్జరము.** సం. వి. అ.పుం.మూలకము, ముల్లంగి ?.

**గర్జి.** సం. వి. ఇ. పుం. మేఘధ్వని; ధ్వని.

**గర్జించు.** సం. అ. క్రి. మేఘము ధ్వనిచేయు;ధ్వనిచేయు, అఱచు.

(గేదరూపము దాల్చినరాక్షసి.) గీ. గోంద్రుగోంద్రని గర్జించుఁ గొంతతడవు, కోరచూపుల వీక్షించుఁ గొంతతడవు. వరాహ. ౧౧. ౮౬.

సీ. మునుపు జంగాలఁ జేసినభుజంగులఁ గన్న గర్జించి శునకమై కఱవ వచ్చు. వైజ. ౨. ౮౪.

**గర్జితము.** సం. వి. అ. న. మేఘధ్వని, ఉఱుము; ధ్వని. పుం. మదపుటేనుఁగు.

**గర్జిలు(ల్లు).** సం. అ. క్రి. ౧. ఉఱుము.

(కుసుఁడు) క...కదలె విలయకాలమేఘ మొదరి గర్జిల్లెనన దిక్కు లదురఁగ, మల్ల చఱచు కొనుచు...జై. భా. ౬. ౧౩౫.

౨. మ్రోఁగు.

క... హతశేషచమూరక్షకసింహనాదములు గర్జిల్లఁ. జై. భా. ౬. ౧౨౬.

౩. అఱచు.

లయగ్రాహి. నిర్జరవరప్రముఖదుర్జయుఁ డనం బరఁగుదుర్జయుఁడు...కనలి గర్జిలుచు వీఁకఁ. వరాహ. ౫. ౨౬.

**గర్త**=గరిత.

(భార్య.)

చ. విను మొకబ్రాహ్మణుండు కులవృత్తము పెంపు దొఱంగి బోయ దాసి నొకత గర్తఁ జేసికొని...భార. శాం. ౩. ౮౭౨. ('ఆలి' పాఠాంతరము)

**గర్తము.** సం. వి. అ. పుం. ౧. పల్లము, గొయ్యి. ౨. పిఱుఁదులమీఁదిగుంత. ౩. త్రిగర్తదేశము.

**గర్తాటము.** సం. వి. అ. పుం-కన్నమునఁ దిరుగునది-౧. ఎలుక. ౨. పందికొక్కు.

**గర్తిక.** సం. వి. ఆ. స్త్రీ-గోయి కలది-సాలెవాఁడు నేఁత నేయుచోటు, తంతుశాల.

**గర్దభగదము.** సం. వి. అ. పుం. జాలగర్దభము, ఒకానొకచర్మవ్యాధి.

**గర్దభము.** సం. వి. అ. పుం. ౧. గాడిద. ౨. గంధద్రవ్యవిశేషము. న. తెల్లగలువ.

**గర్దభాండము.** సం. వి. అ. పుం. ౧. ప్లక్షము, కలుజువ్వి చె. ౨. పిప్పలి చె.

**గర్దభాహ్వయము.** సం. వి. అ. పుం. కుముదము, తెల్లగలువ.

**గర్దభి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుగాడిద. ౨. పేఁడపురుగు.

**గర్ధన.** సం. వి. ఆ. స్త్రీ=గర్ధనము.

**గర్ధనము.** సం. వి. అ. న. తృష్ణ, పేరాస.

**గర్ధనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) గృధ్నువు, పేరాస గలవాఁడు.

**గర్ధము.** సం. వి. అ. పుం. తృష్ణ, పేరాస.

**గర్ధి.** సం. విణ. (న్. నీ. న్.) పేరాస గలది.

**గర్ధించు.** సం. అ. క్రి. పేరాసపడు.

సీ... లోభంబ యది ... ధర్మంబు గలఁచి నరునిఁ, బ్రియిమాలి యేమిటి కయినను గర్ధించువానిఁగా సమకట్టు...భార. శాం. ౩. ౩౯౯.

**గర్ధితుఁడు.** సం=గర్ధనుఁడు.

**గర్భండము.** సం. వి. అ. పుం. వృద్ధనాభి, ఊఁదబొడ్డు.

**గర్భకము.** సం. వి. అ. పుం. వెండ్రుకలలోపల ముడుచుకొన్న పూలదండ. న. రెండురాత్రులు, నిశాద్వయము. (వై. ని-పుం. నిన్నటిరాత్రియు నేఁటి పగలును నేఁటిరాత్రియును గలిసినకాలము. విల్యమ్స)

**గర్భకోశము.** సం. వి. అ. పుం. స్త్రీశరీరమున భ్రూణముండుచోటు, గర్భాశయము.

**గర్భచ్యుతి.** సం. వి. ఇ. స్త్రీ. గర్భస్రావము, కడుపుపోవుట.

**గర్భదరిద్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) పుట్టుకనుండియు దరిద్రుఁడైనవాఁడు.

**గర్భదాసుఁడు.** సం. వి. అ. పుం. దాసీపుత్రుఁడు, పుట్టుకనుండి దాసుఁడయినవాఁడు.

**గర్భపాకి.** సం. వి. న్. పుం. షష్టికము, అఱువదిదినములలో పండువరి చె.

**గర్భపాతము.** సం. వి. అ. పుం. నాలుగుమాసముల పిదప గర్భము చెడిపోవుట.

**గర్భము.** సం. వి. అ. పుం. ౧. కుక్షి. ౨. భ్రూణము, కడుపులోనిపిండము. ౩. చూలు. ౪. శిశువు. ౫. గర్భారంభకాలము, చూలు కలిగినకాలము. ౬. అపవరకము, లోపలిగది. ౭. లోపలిభాగము. ౮. అన్నము. ౯. అగ్ని. ౧౦. పనసముల్లు. ౧౧. నాటకసంధులలో నొకటి, గర్భసంధి. ౧౨. అపత్యము, సంతానము. ౧౩. శుక్రము. ౧౪. సమూహము. ౧౫. సారము. ౧౬. బీజము. (శే. ని.)

**గర్భవతి.** సం. వి. ఈ. స్త్రీ. చూలాలు.

**గర్భవాసము.** సం. వి. అ. పుం. ౧. గర్భమందుండుట. ౨. గర్భరూపస్థానము.

శ్లో. అసకృద్గర్భవాసేషు వాసం జన్మ చ దారుణం. మను. ౧౨. ౭౮. (గర్భవాసేషు=గర్భస్థానేషు. కుల్లూకభట్టవ్యాఖ్య.)

**గర్భవేదన.** సం. వి. ఆ. స్త్రీ. ప్రసవవేదన, నీళ్లాడునప్పటిబాధ.

**గర్భశంకువు.** సం. వి. ఉ. పుం. చచ్చినపిండమును వెలికిఁదీయునొకశస్త్రము.

**గర్భస్రావము.** సం. వి. అ. పుం. గర్భము స్రవించుట, నాలుగుమాసములలోపల గర్భము జాఱిపోవుట.

**గర్భస్రావి.** సం. వి. న్. పుం. హింతాళము, ఈఁదాడు, ఒకజాతితాటిచెట్టు. (రా. ని.)

**గర్భాంకము.** సం. వి. అ. పుం. (నాటక) అంకమధ్యమున వచ్చుఅంకము.

**గర్భాగారము.** సం. వి. అ. న. ౧. గర్భాశయము. ౨. ఓవరి, లోపలిగది. ౩. పురుటిల్లు. ౪. దేవాలయములందు దేవతావిగ్రహ మున్నచోటు.

**గర్భాధానము.** సం. వి. అ. న. ౧. గర్భము కలిగించుట. ౨. రజస్వలానంతరము గర్భోత్పత్తికై కావించుసంస్కారవిశేషము.

**గర్భావేక్షణము.** సం. వి. అ. న. మంత్రసానితనము.

**గర్భాశయము.** సం. వి. అ. పుం. ౧. స్త్రీశరీరమున భ్రూణ ముండుచోటు. ౨. గర్భమును చుట్టుకొని యుండెడుసంచి, మావి.

**గర్భాష్టమము.** సం. విశే. (అ. ఈ. అ) గర్భారంభకాలము మొదలు ఎనిమిదవది. (నెల, ఏఁడు, మొ.)

**గర్భి.** సం. విశే. (న్. ణీ. న్) గర్భము గలది.

**గర్భిణి.** సం. వి. ఈ. స్త్రీ. అంతర్వత్ని, చూలాలు.

**గర్భితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. సంజాతగర్భము, గర్భము గలది. ౨. గర్భమునందు (లోపల) గలది. (ఉదా: నిందాగర్భితము, భావగర్భితము, మొ.) వి. అ. న. వాక్యమధ్యమున వాక్యాంతరము చెప్పుట అనుదోషము, వాక్యగర్భితము. (వాచ)

**గర్భీకరించు.** సం. స. క్రి. గర్భము (=అపత్యము) గాఁజేసికొను; కడుపులో నుంచుకొను; ఆదరించు.

సీ. శక్తి గర్భీకరించక యుండెనే వరుంధతి నొక్కగతి నీ దనంగ వచ్చు, జనులు నిందింప మందుని గాంచకుండెనే ఛాయఁ గొంత సమంబు సేయ వచ్చు. ఉ. రా. ౧. ౩౯.

ద్వి. శర ణన్న పశువుల సత్కృపఁ గాచు, బిరుదు దలంచి గర్భీకరించుకొని, శరణార్థి యనుట యే చాలు నా కనుచుఁ, బరిపాలనము సేయభారంబు మీది. ప్రభులిం. ౩. ౧౦౧ పొ. ౧౫౫ పం.

**గర్భేశ్వరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ఆగర్భశ్రీమంతుఁడు, పుట్టుకనుండియు సంపన్నుఁ డైనవాఁడు.

**గర్భోపఘాతము.** సం. వి. అ. పుం. ౧. గర్భము చెడుట. ౨. మేఘములజలోత్పాదనశక్తి నశించుట. (వాచ)

**గర్భోపఘాతిని.** సం. వి. ఈ. స్త్రీ. అకాలసంయోగాదులవలన గర్భస్రావము నొందుఆవు.

**గర్ముత్తు.** సం వి. త్. స్త్రీ. ౧. గంటె, తృణసస్యవిశేషము. ౨. బంగారు. ౩. లత, తీఁగ. (మే. ని.)

**గర్వము.** సం. వి. అ. పుం. ౧. అహంకారము, ధనవిద్యాదులవలనఁ గలుగుమదము, కావరము. ౨. (అలం) ముప్పదిమూఁడు వ్యభిచారిభావములలో నొకటి.

"రూపధనవిద్యాదిప్రయుక్తాత్మోత్కర్షాధీనపరావహేలనం గర్వః" (రస.)

౩. గర్వోక్తి, గరువపుమాట.

మ...వారికిఁ దగం బాలీక గర్వంబు లాడిన నిక్కం బగునల్క నర్జునుఁడు గాండీపంబు మోపెట్టి...భార. ఉద్యో. ౧. ౨౬౬.

**గర్వాటుఁడు.** సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు. (త్రి. ని.)

**గర్వాడు, గరువాడు.** అ. క్రి. (గరువు[1] + ఆడు) మేపుమేయు.

సీ...గర్వాడె నాఁగ మేపుమేసె ననుట దనరుచు...ఆం. భా. ౩. ౯౭.

**గర్వి.** సం. విశే. (న్. ణీ. న్.) గర్వము గలవాఁడు.

**గర్వించు.** సం. అ. క్రి. గర్వపడు. వరాహ. ౧౧. ౬౨.

**గర్వితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) గర్వించినవాఁడు, గర్వము గలవాఁడు.

**గర్హా.** సం. వి. ఆ. స్త్రీ. నింద, దూఱు.

**గర్హకుఁడు.** సం. విణ. (అ. శ్లాఘా. అ.) గర్హించువాఁడు.

**గర్హణా.** సం. వి. ఆ. స్త్రీ=గర్హణము.

**గర్హణము.** సం. వి అ. న. నింద, దూఱు.

**గర్హణీయము.** సం=గర్హ్యము.

**గర్హమాణము.** సం. విణ. (అ. ఆ. అ) నిందించుచున్నది.

**గర్హించు.** సం. స. క్రి. నిందించు, దూఱు.

వ...వారలు కొనియాడుమంత్రంబులు గర్హించితి... భాగ. ఉద్యో. ౧. ౨౦౧. మార్క. ౫. ౭౬.

**గర్హితము.** సం. విణ. (అ.ఆ.అ.) నిందింపఁబడినది.

**గర్హ్యమాణము.** సం. విణ. (అ. ఆ.అ.) నిందింపఁబడుచున్నది.

**గర్హ్యము.** సం. విణ. (అ. ఆ. అ) నిందింపఁ దగినది, దూఱఁ దగినది.

**గర్హ్యవాది.** సం. విణ. (న్. పు. న్.) కవ్వపుఁడు, తుచ్ఛసంభాషణము చేయువాఁడు.

**గఱగఱ.** వి. గఱుకుగా నున్నవస్తువును స్పృశించుటయందగు ననుకరణము.

(వ్యవ) చేతితో రాచినపుడు బల్ల గఱగఱలాడుచున్నది. అడుగు వేసినయెడల అయ్యది గఱగఱమనును.

**గఱగొఱ** వి. తక్కువ.

చ. తతిమి నుశర్మ తమ్ములును దానును నాజికి నన్నుఁ బిల్వ నే, నెఱుఁగనియట్టు లుండు టిది యేపురుషార్థము వారి నెల్ల నే, డ్తెఱ నుఱుమాడఁ బంపుము కడిందిగఁ జూడకు నీకు నేమియుం, గఱగొఱ గాదు పోమి గడుఁ గష్టము నాకు నుదాత్తమానసా. భార. ద్రో. ౧. ౨౨౩.

**గఱి**[1]. వి. (సం. గరుత్. క. గఱి.)-పక్షి బాణము మొదలగువాని-పక్షము, ఱెక్క; ఈఁక.

సీ. అహితపన్నగభేదు లనిబలె గృహవిటంకపుఁ గలాపుల నొయ్య గఱులు నిమిరి. ఆము. ౨. ౩౮.

మ...విదర్భుండు నత్తఱి నేసెం దెగ నిండ నారసమునన్ దైత్యారివక్షంబునం, గఱి దోఁపఁ జూరియున్ భుగుల్భుగులుగాఁ గ్రక్కె న్వెసన్ నెత్తురుల్. ఉ.హరి. ౪. ౨౩౧.

గీ. జనవిభుఁడు నాట సవ్యాపసవ్యగతులఁ, దిరుగుచో గర్లతూపులు బరులు రెంటఁ, గట్టికను పట్టె ఱెక్కలు గలమహోమ, హీధరంబువిధంబున నేకలంబు. వరాహ. ౪. ౭౩.

సీ. పర్జన్య శరణంబు ప్రాపించి గఱులతోఁ జదలఁ గ్రుమ్మరుశిలోచ్చయచయంబొ. కృ. శత. ౧. ౩౭.

సీ. సరి లేనిమంచిగుజ్జరి నేతపట్టయుఁ బఱి పైన రాయంచగఱులపఱుపు. ఉ. రా. ౬. ౧౬౦.

జ: గఱిచిలుకు.

**గఱి**[2]. విణ. గఱుకు. (చూ. గఱిగమ్మ.)

వి. గఱుకుఁదనము.

పిల్లినాలుకకు గఱి ఎక్కువగా నుండును. (వా.)

జ: గఱిగమ్మ, గఱిచిప్ప.

**గఱిక.** వి. దూర్వ, ఒకరకముగడ్డి క.

వ... మెత్తనిగఱిక మేసి పోసరించి... బెదరుకొదమత్తట్టువగుంపు... ఆము. ౪. ౩౫. సాం. ని. స్థా. ౬౧.

జ: గఱికచెక్క, గఱికమోడిచెక్క, గఱికసూదులు.

**గఱికచెక్క.** వి. (గఱిక + చెక్క) పచ్చికతోడి మట్టిపెల్ల, పచ్చికపెల్ల. (శ. ర.)

**గఱికమోడిచెక్క**=గఱికచెక్క. (బ్రౌ, శ. ర.)

**గటికసూములు.** వి. బ. (గటిక + సూములు) శాలిధాన్యవిశేషము. (శ. ర.)

**గటిగమ్మ.** వి. (గటి² + కమ్మ) అంపముపలె గటుకు టంచులు గలతాటికమ్మ. (బ్రౌ, వా)

**గటిచిప్ప.** వి. (గటి² + చిప్ప) ముత్యపుఁజిప్ప. (శ. ర.)

**గటిచిలుకు.** వి. (√గటి¹) ఱెక్కలు కట్టినబాణము.

క... గటిచిలుకులు వింట్ల లోనుగాఁ గొంచు వెసన్. యయా. ౧. ౪౨.

ఇట్లే: గటికట్టియ. అచ్చ. రా. యు. ౩౬౪.

**గటుకు.** వి. కొండవలిలోనగువానికఱ్ఱ. (శ. ర.)

విశే. రూక్షము, నునుపు గానిది.

ఉదా: వానిచెయ్యి గటుకుగా నున్నది. బల్ల గటుకుగా నున్నది.

**గటుగు.** వి. ఒకానొకచెట్టు. (శ. ర, బ్రౌ)

**గటువ.** విశే. (సం. గురుః. పా. గరు. క. గరువ) ౧. గౌరవము గలది, మర్యాద గలది.

వ. ... జూదరియాలికి గటువతనం బెక్కడిదియది ...భార. విరా. ౨. ౧౫౩.

క. నీగూఢజంకెలకు నుద్వేగపడం గుసుమశరుఁడె విటసింహుఁడు వే, వేగ కమలాక్షిఁ దెచ్చెద, వో గటువతనంబు వాసి పోనెంచెదవో. నిరం. ౩. ౩౧.

౨. గాంభీర్యముకలది, గంభీరము.

గీ. ధీరయై యిట్లు సమ్మదపూరమునకు, గటువతనమునుఖలితంపుఁగట్ట వెట్టి, వెలఁది యెఱుఁగని యదివోలె వికృతి లేక, యల్ల నెప్పటియట్టుల యరుగుటయును. భార. విరా. ౩. ౫౫.

౩. పెద్ద, వృద్ధుఁడు; గొప్పవాఁడు.

(కర్ణుఁడు వికర్ణునితో నన్నమాటలు) ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మువు, చేల నీకుఁ జెప్ప నేల వలసెఁ, జిటుకవాని కింత గటువతనం బిది, చన్నె వృద్ధజనము లున్నచోట. భార. సభా. ౨. ౨౫౯.

శ్లో. త్వం న కేవలబాల్యేన ధార్తరాష్ట్ర విదీర్యసే, యద్బ్రవీషి సభామధ్యే బాలః స్థవిరభాషితమ్. సం. భార. సభా. ౯౦. ౫౯.

వ... మిక్కిలి నక్కఱపడి వేఁడక ప్రౌఢ లగుగటువ లిరువు రేకాంతమామచోటి కేటికిఁ బోయెదరు... ప్రభా. ౩. ౫౨.

చ... గటువల్ చవిగానికథల్ వచింతురే. ప్రభా. ౩. ౫. ఉ. రా. ౫. ౫౩.

౪. ప్రౌఢము.

వ... రాగవల్లరి యాగటువతనంబులాగు లెగరిత లందును మున్న కన్నవిన్నవియె దీనికిం దు లెంత యరుదులు చూచితే యంచు నాయంచపై నాదరాహ్లాదమేదురనిరీక్షణంబుల నీక్షించి... ప్రభా. ౩. ౫౨.

**గట్టు.** వి. త్రేఁచుటయందలిధ్వని కనుకరణము.

గీ... మనసిజారాతి మ్రింగి గట్టునఁగఁ ద్రేఁచె. కాశీ. ౪. ౨౩౭.

సీ. గ్రహణవేళలయందు రాహు వాహరించి తృప్తిమై గట్టునఁ ద్రేఁచె నేని. నైష. ౨. ౧౨౩.

గీ. ఆత్మసంతానములతోడ నారగించి, కాకినీ డాకినీభూతజాతమంత్రఁ, దనివి పుట్టిన గట్టుగట్టు నను ద్రేఁచె. చంద్రా. ౬. ౧౦౦.

**గట్రె.** వి. మత్స్యములఁ బట్టెడుసాధనవిశేషము. (దీని ఆకారము తిత్తివంటిది. కాని యిది మిక్కిలి పెద్దది. శ. ర.)

**గల.** వి. ౧. అందెలు మొదలగునవి కదలునపుడు గలిగెడిధ్వని కనుకరణము. (దీనికి ఆమ్రేడితమందే ప్రయోగములు గలవు.)

గీ. గజ్జియలమ్రోత గలగలగల యటంచు. మల్హణ. ౪. ౬౫.

చ. గలగల మ్రోయుచుండెలును గజ్జెలు మువ్వలు పైఁడియుంగరం,బులు...శశా. ౬. ౧౯౯.

ద్వి. కంకణంబులు గలగల మ్రోయుచుండ. అ. మ. శ. ౧. ౩౭ పా. ౧౭ పం.

౨. వృక్షాదులు కదలుటచేయుం దగుధ్వని కనుకరణము.

ఉ. గగనభాగ మెంత గల దంతట నగంబు,లాడఁ బొచ్చెఁ దెచ్చునపుడు గపులు, వరుస నెగుర నెగుర నైవఁగా గలగలఁ, గటకకాననములు గ్రక్కదలఁగ. రామా. ౩. ౧౨౩.

వ...గలగ లనఁ జెట్లు గదలింపుచు వెనుక ముందరఁ జూపి మెలఁగుచుఁ జెనఁగులాటం జెలంగుచుఁ దెక్కటెల్లుమర్కటంబులును ...ప్రబంధ. ౧౭౬.

**గలఁతియ(తె).** వి. (సం. గళంతికా. క.గణిగె) గిండి, చెంబు.

చ. అలికులవేణి యో ర్తొకనిహస్తముల న్సుఖమజ్జనాంబువుల్, గలఁతియ యెత్తి పోయ నవి గార్చుచు నుండె నతండు దోయిటన్ ...నైష. ౬. ౧౧౨.

సీ...తగు గళంతిక గలం తె గరిగ యన. ఆం.భా. ౨. ౨౮౩.

**గలతరించు.** అ. క్రి. (మేను) జల్లు మను.

(ఉదా: నాకు ఒళ్లంతయు గలతరించుచున్నది- శ. ర, చి. ని.)

**గలబ.** వి. (హిం. గలబా. బ్రా. మిశ్ర.) అల్లరి;జగడము; దుండగము.

వ...ఎల్లజనులం గూర్చుండ నిడి గలబ పుట్టకుండ నెడనెడం దలవరుల నిలిపి ... ద్వా. ౩. ౬౮.

సీ. గలబ గాకుండ వేల్పుల నొక్కనొకనిఁగా ధరరాజు వెలినుండి యనుపువాఁడు. కువల.౨. ౬౧.

వ...ఈమహోత్సవంబులలో నిట్టిగలబలు సేయుదురే మీ యట్టి బలుబంట్లకు సందిక్రంతజగడంబులు వల దని...ద్వా. ౩. ౩౦.

ద్వి. క్రతుకర్మములకు విఘ్నములు గావించి, క్షితిమీఁద గలబలు చేయఁ దొల్లిడల.ద్వి.భాగ. ౩. (శ. ర.)

జ: గలబరించు.

**గలబరించు.** అ. క్రి. (√గలబ) ౧. దోఁకుపుట్టు.

గీ. గగనయాన వేగంబున గలబరించి, కడుపు నిండఁగఁ గ్రోలినకమలమధువుఁ, గ్రక్కెనో నాఁగ గగనమార్గంబునందు, భానుబింబంబు రక్తాతపంబుఁ గాసె. శివరా. ౩. ౯౨.

౨. కలఁగు.

(ఉదా: నాకు బుద్ధి గలబరించుచున్నది. శ. ర.)

**గలి.** సం. వి. ఇ. పుం. బలము గలిగియును బరువు మోయనిఎద్దు. స్త్రీ. లత. (వాచ)

**గలిజే(జె)రు, గల్జే(జె)రు.** వి. పునర్నవ, మూలికావిశేషము.

సీ. గలిజె రనంగను గలిజే రనంగఁ బునర్నవసంజ్ఞ గా నమరియుండు. ఆం. భా. ౨. ౬౯.

సీ...గలిజేరు గుంటగల్జేరును దంతి బందారు సేల,తంగేడు...హంస. ౪. ౧౦.

సీ...గలిజెరు బరివెంక గగ్గర...చికి. ౨. (చి.ని)

**గలిబిలి.** వి. ౧. సందడి, రొద.

క...మానులు దమలో,గలిబిలి చాలించి కన్నుఁగఱవులు దీఱన్, గొలువను మ్రొక్కను బోగదన్, దలఁపులు పురికొలుపఁ జూచుతతి... శ్రీరం. మా. ౬. ౨౩.

౨. కలఁత, క్షోభము.

క. ఎలమి గలలక్ష్మి యొకనికిఁ, గలిగిన నది వంచి కుడువఁగాఁ గూడి యనేకులు పెక్కుభంగులం గలిబిలి సేయుదు రతనిమనను భేదించి తగన్. దశకు. ౧౧. ౭౯.

౩. నలఁగుడు.

సీ. రాజితబహువిధరథసమూహముఁ జొచ్చి గలి

బిలి యగునట్లు గలఁచి కలఁచి. భార. విరా. ౫. ౫౬. (గజిబిజి. శ. ర. పా.)

గలీబు. వి. (హిం. గలాఫ్. బ్రా. మిశ్ర.) ౧. తలగడ మొదలగువానికి తొడుగుగాసెన. (శ. ర, వా) ౨. ఖడ్గకోశము, కత్తియొఱ.

ఉ. ఆజనకేంద్రుకన్యరుచిరాంగవిలాసముఁ జూచినంతలోఁ, లేఁజిగురాకునిద్దపుగలీబున నుంచినతమ్మిరేకుఖంగా జళిపించి మారుఁడు తటాలునఁ జేరెదఁ జూచి వైవఁగా, రాజన్నపాలశేఖరుఁడు రామనృపాలుఁడు సాక్షినెమ్మదిన్. దశా. ౭. ౨౧౧.

౩. కత్తియొఱకు తొడుగుగవుసెన.

సీ. కోశసమాచ్ఛాదికోఱలు గలీ బన... ఆం. భా. ౨. ౨౧౫.

గల్భము. సం. విణ. (అ. ఆ. అ) ౧. దిట్టమైనది. ౨. గర్వముగలది.

గల్ల[1]. వి. పాల్ల. (శ. ర.)

గల్ల[2]. వి. మాదిగవాఁడు తోలు నానవేసెడిచట్టి. (శ. ర.)

గల్లకము. సం. వి. అ. పుం. ౧. చషకము, మద్యపానపాత్రము. ౨. ఇంద్రనీలమణి.

గల్లచాతురి. సం. వి. ఈ. స్త్రీ. చెక్కిలిక్రింద నుంచుకొనుగుండ్రనిచిన్నదిండు.

గల్లము. సం. వి. అ. పుం. గండస్థలము, చెక్కిలి.

గల్లు. వి. భూషణాదులు మ్రోఁగుటయం దగుధ్వని కనుకరణము.

సీ. గల్లున నందియల్ గదలంగ నది దన్నెఁ గాంతయక్కజ మశోకంబ యగును. కళా. ౩. ౨౫.

సీ. కరకంకణంబులు గల్లనఁ జెలు లిరుకోపులఁ జేరి వీచోపు లిడఁగ. శకాం. ౪. ౧౪౨.

(ఆమ్రేడితరూపము 'గలుగల్లు, గల్లుగల్లు')

చ... కంకణావలి గలుగ ల్లనంగఁ బలుపం గమకించె లతాంగి సిగ్గునన్. కృ. శకుం ౩. ౩౫.

వ. అల్లనల్లన మోగపాదుకాయుగళంబు గల్లుగల్లన మ్రోఁగ... హర. ౫. ౫౧.

సా: వైద్యుని సంచిలో గల్లు మనఁగానే రోగి యింటిలో గొల్లుమన్నారు.

గల్వర్కము. సం. వి. అ. పుం. ౧. స్ఫటికము. ౨. ఇంద్రనీలమణి. (పద్మరాగ మని కొందఱు.) ౩. చషకము, మద్యపానపాత్రము.

గళంతి. సం. వి. ఈ. స్త్రీ=గళంతిక.

గళంతిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. జారి; గిండి, చెంబు. ౨. ధారాపాత్ర, లింగముపై అభిషేకార్థము వ్రేలాడఁ గట్టెడుపాత్రము.

శ్లో. దేవాలయేషు యే దద్యుర్బహుధారా గళంతికాః. సం. కాశీ. ౧౨. ౫౫.

గళకంబము. సం. వి. అ. పుం. ఆవులకును ఎద్దులకును మెడక్రింద వ్రేలాడుతోలు, సాస్న, గంగడోలు.

గళకత్తెర. మి. వి. (గళము + కత్తెర) మల్లబంధవిశేషము, ముప్పదిరెండువిన్నాణములలో నొకటి.

వ... పాదగళాప్తియు గళకత్తెరయుఁ గాళనిల్కడయు నృసింహంబు నాది యగుముప్పదిరెండు విన్నాణంబులనాణెంబు పరీక్షించి ... హంస. ౧. ౨౦౬. మల్లుపు. ౩. ౬౯. ప్రబంధ. ౭౯. ఆం. భా. ౨. ౨౦౯.

గళకము. సం. వి. అ. పుం. ౧. కంఠము. ౨. ఒకజాతిచేఁప.

గళగండము. సం. వి. అ. పుం. గండమాల, మెడచుట్టు గడ్డలు లేచెడువ్యాధివిశేషము.

గళగళ. వి. ౧. ఉదకము పోయుట పుక్కిలించుట వడిగా చెప్పుట మొదలగువానియం దగుధ్వనికి అనుకరణము.

సీ. సలిలంబు గళగళఁ దలలమీఁదటఁ బోసి బుడ్డకాయల నెత్తి పొడిచి పొడిచి... వాల్మీకి. ౨. ౯౬.

ద్వి. చెలువార వాసిల్లుశీతలోదకము, లలరుచు గ్రుక్కుగ్రుక్కనఁగఁ ద్రావుచును,బూరించి గళగళఁ బుక్కిలించుచును. పండితా. దీక్షా. ౪౨ పా.

గీ. అతఁడు తోలువాఁడు చదివినయంతవట్టు, గళగళని చెప్పెఁ దండ్రి యక్కజము నొంద. పరమ. ౫. ౧౬౦. (శ. ర. పా.)

౨. గొలుసులధ్వనికి అనుకరణము.

సీ. గళగళధ్వనులతోఁ గంఠశృంఖల లూడ్చి నుడివడఁ గుక్కల నడవిఁ గలిపి. మనుచ. ౪. ౧౦౩.

**గళగ్రహము.** సం. వి. అ. పుం. ౧. (గెంటుటకు) మెడపట్టుకొనుట, గొంతుక పట్టుకొనుట. ౨. కంఠరోగభేదము. ౩. తిథివిశేషము.

శ్లో. కృష్ణపక్షే చతుర్థీచ,సప్తమ్యాదిదినత్రయం, త్రయోదశీచతుష్కంచ, అష్టావేతే గళగ్రహాః. (వాచ)

**గళగ్రాహి.** సం. విశే. (న్. ఈ. న్) ౧. గొంతుక పట్టుకొనువాఁడు. (శత్రువు.) ౨. ఎదుటివారిగళధ్వని విని మరల కూయునది, 'కో' యనిన 'కో' యనునది. (కోయిల)

మ. తిలకింపం బ్రతిపక్షి రాచిలుక జాతిద్వేషి
చైత్రుండు పూవిలుచేదాల్పు సదా మధువ్ర
తగుణాన్వితుండు ప్రాణంబుదాయలు గా
డ్పుల్ శశి యంకకాఁడు పిక మయ్యయ్యో
గళగ్రాహి యిబ్బలవద్ద్వేషులలోన నెట్లు వి
హరింప న్వచ్చు నాబోఁటికిన్. వి. సం. ౨.
౧౨౨.

౩-గళముచే గ్రహించువాఁడు-దొరకినదెల్ల హరించువాఁడు.

**గళద్వారము.** సం. వి. అ. న. నోరు, వాయి.

**గళనము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. జాఱునది. ౨. స్రవించునది, కాఱునది. వి. అ.న. ౧. జాఱుట. ౨. స్రవించుట, కాఱుట.

**గళము.** సం. వి. అ. పుం. ౧.కుత్తుక. ౨. సాలవృక్షనిర్యాసము, సజ్జరసము. ౩. ఒకానొకవాద్యము. ౪. మత్స్యభేదము. ౫. ఎల్లుగడ్డి, బృహత్కాళము కీ.

**గళమేఖల.** సం.వి. ఆ.స్త్రీ.కంఠాభరణము,కంటె.

**గళవార్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఆరోగ్యవంతుఁడు, మిక్కిలి తిని యఱిగించుకొనఁ జాలువాఁడు.

శ్లో. దృశ్యంతే నైవ తీర్థేషు గలవార్తాస్తపస్వినః. (వాచ)

**గళవిద్రధి.** సం. వి. ఇ. పుం. కుత్తుకలోనివ్రణము.

**గళశుండిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కొండనాలుక. ౨. తాలుగతరోగవిశేషము. (కల్ప)

**గళస్తని.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుమేఁక.

**గళహస్తము.** సం. వి. అ. పుం. ౧. త్రోయుటకుఁ గాని పిసుకుటకుఁ గాని మెడమీఁద వేసినచేయి. ౨. అర్ధచంద్రబాణము.

**గళహస్తితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) గెంటుటకుఁ గాని పిసుకుటకుఁ గాని మెడ పట్టుకొనఁబడినవాఁడు.

**గళాంకురము.** సం. వి. అ. పుం. గళరోగవిశేషము, కంఠమున మాంసపుమొలకలు బయలుదేఱు రోగము. (కల్ప)

**గళానిలము.** సం. వి. అ. పుం. మత్స్యభేదము. (త్రి. ని.)

**గళితకము.** సం. వి. అ. పుం. నాట్యవిశేషము.

**గళితకుష్ఠము.** సం. వి. అ. న. వ్రేళ్లు మొదలగునవి పడిపోవునట్లు చేయుకుష్ఠరోగము.

**గళితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. జాఱినది. ౨. పడినది. ౩. కాఱినది. ౪. సడలినది, ప్రిదిలినది. ౫. క్షీణించినది,తఱిఁగినది. ౬. తినఁబడినది, మ్రింగఁబడినది.

**గళేగండము.** సం. వి.అ. పుం- మెడక్రింద వ్రేలాడుమాంసపుముద్ద కలది-ఒకానొకపిట్ట.

**గళోద్భవము.** సం. వి. అ. పుం. అశ్వగళమున పుట్టెడురోచమాన మనుసుడి. (త్రి. ని.)

**గళౌఘము.** సం. వి. అ. పుం. గళవిద్రధివంటికంఠరోగభేదము. (వాచ)

**గళ్య.** సం. వి. ఆ. స్త్రీ. గళములసమూహము. (వాచ.)

**గళ్ల=**కళ్ల. (శ. ర, బ్రౌ.)

**గళ్లి=**కళ్లి. (బ్రౌ.)

**గళ్లిము.** వి. పాలమీఁగడవంటిలేఁతకొబ్బెర. (శ.ర)

**గవఁకు=**గవను.

సీ...గవఁకు గవను నాఁగఁ గలవు గోపురసంజ్ఞలు ... ఆం. భా. ౨. ౨౧.

**గవగవ=**గబగబ. వి. శీఘ్రముగా కవియుట పరుగెత్తుట మున్నగువానియందగుఅనుకరణము.

క. గవయింగ గవయీకైతమిఁ, గవయం గవయంబు మీఁద గవగవఁ గవియం, గవియించిన జాగిలములఁ, గవియంగానీఁడు భర్త కరుణాన్వితుఁడై. కృ. శకుం. ౧. ౭౭.

**గవతము.** వి. కసవు.

సీ...గడ్డి గాదము గవతము కసవు కవను, పుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ ... ఆం. భా. ౨. ౭౭.

**గవను=**గవఁకు. వి. దే. (బ. గవఁకులు-చూ. కలను) పురద్వారము, గోపురము.

సీ...వికిరరోమార్గమంబు. గీ. లశ్వకరికలభాదులయందుఁ గానఁ, బడు గవంకుల వాపోవుఁ బట్టపగలు, మెఁగి వఱల్లు ... భా. రా. యు. ౧౪.

ఉ. తారలు బూరగొమ్ములును దప్పెటలుం బటహంబులుం బదుల్, నూఱులు వేలు మ్రోయ గవనుల్ వడి వెల్వడి హస్తి యుత్తర, ద్వారమువంకఁ దార యిరువంకలఁ జొఁజులు దీర్చి రయ్యెడన్. రామా. ౯. ౬౯. (ఇట బహువచనమున 'గవనులు' అనురూపము కూడఁ గనుపట్టుచున్నది.)

సీ. కుంభనికుంభముఖ్యులతోడ నలకుంభకర్ణుండు దూరుపుగవనియందు. ఉ. రా. ౪. ౨౬౭. పి. శకుం. ౧. ౧౩౨. ఆం. భా. ౨. ౨౧.

గవనికాపరి = పురద్వారపాలకుఁడు. నీలా. ౨. ౪౭.

**గవయము.** సం. వి. అ. పుం. గురుపోతు, వనవృషభము.

శ్లో. వనగౌర్గవయః ప్రోక్తో బలభద్రో మహాగవః. (రా. ని.)

**గవయి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగవయము.

**గవర.** వి. (సం. గౌరః. ప్రా. గఉరో.) కొంచెమెఱుపు, ఈషద్రాగము.

విణ. కొంచె మెఱ్ఱనిది, ఈషద్రక్తము.

ద్వి. రవరవతాంబూలరాగంబుతోడ, గవరలై యున్నచక్కనివంతములును. ద్వి. పరమ. ౩. ౧౫౫ పా. ౬. పం. (చి. ని. పా. 'గవరన' ముద్రి. పా.)

జ: గవరన.

**గవరన.** వి. (√ గవర.) ఈషద్రాగము, కొంచెమెఱుపు.

విణ. కొంచె మెఱ్ఱనిది, ఈషద్రక్తము.

సీ. కడుపు మండించునాకఁటిచిచ్చుసెగ దాఁకి గవరనై యున్నకన్గవలవాఁడు. నైష. ౭. ౭౩.

**గవలము.** సం. వి. అ. పుం. మహిషము, దున్నపోతు. న. దున్నపోతుకొమ్ము.

**గవలి.** సం. వి. ఈ. స్త్రీ. మహిషి, గేదె.

**గవాంపతి.** సం. వి. ఇ. పుం. ౧. ఎద్దు. ౨. పసులకాపరి. ౩. సూర్యుఁడు. ౪. అగ్ని.

**గవాక్షము.** సం.వి.అ.పుం-దేనినుండి సూర్యాదుల కిరణములు లోపలికి వ్యాపించునో అది-కిటికీ.

**గవాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. చిన్నపాఁపర కీ. ౨. బుడమకీ.

**గవాక్షితము.** సం. విశే. (అ.ఆ.అ) కిటికీ గలది.

**గవాగ్రము.** సం. వి. అ. న. గోవులసమూహము.

**గవాదనము.** సం. వి. అ. న. పసులు మేయుగడ్డి.

**గవాదని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పసులకసవుతొట్టి. ౨. పెద్దపాఁపరకీ.

**గవామృతము.** సం. వి. అ. న. గోక్షీరము, ఆవు పాలు.

**గవావికము.** సం. వి. అ. న. ఆవులయు గొఱ్ఱెల యు సముదాయము.

**గవాశ్వము.** సం. వి. అ. న. గోవులయు గుఱ్ఱముల యు సమూహము.

**గవాహ్నికము.** సం. వి.అ. న. ఆవునకు ఒకదినము నకు సరిపడినయాహారము.

**గవి.** వి. (క. గవి. త. కవి. హిం. గవ్హా.) ౧. గుహ.

గీ... చెలఁగును గుహ,గవి యనఁగ...ఆం. భా. ౨. ౩౨.

సీ. ఎదురునో రెత్తంగ నిత్తుమే తము నంచుఁ గొం డలగవులలో గుండ్లు గొట్టె. రామా. ౭. ౩౮.

మ. గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱుమంగాఁ గాంచి రా జేసె...మనుచ. ౪.౮౬.

౨. గుంట, ఖాతము.

సీ. గాతము గవి యన ఖాతంబు ...ఆం. భా. ౧. ౧౮౬.

గీ. ఊఁతయులజల్లఁ జెఱువుల నుండ రాక,కార్గొస ళ్లునెగళ్లును గవులు విడిచి,తరలి చెంతల నూతి గుంతల వసించె. వేం. పంచ. ౧. ౨౯౮.

**గవిల.** వి.(సం. కపిలా.) కపిలగోవు.

వ...ఈధర్మునకొవునకు నెవరేని విరోధము సేసిర ని గంగ్గ కఱుత వెయి గ్గవిలల వధియించినా రు. దా. శా. ౪. ౧౧౩౩.

వ...ఆచంద్రతారకముగా నిచ్చె దీనికి విలంబ ము పుట్టించినవాండు గంగ్గ కఱ్ఱ వేయి గవిల ల బొడిచినవాండు వారణాసి వ్రచ్చినవాం డు. శ్రీ. శా. ౪.౯౦౯.

**గవిలెము.** వి. గందములో రాచి కలిపెడువిత్తు. (శ. ర-సోపువంటిపరిమళపదార్థము. బ్రౌ.)

**గవుండ్లవాఁడు=గౌండ్లవాఁడు.** వి. సారాయమ్ము వాఁడు.('కల్లు గీచువాఁడు' అని కొందఱు.శ.ర-మహత్త్వార్థకరూపము 'గవుండ్లది')

**గవుఁడు=గౌఁడు.**

**గవుకున.** అవ్య. ద్రు. తొందరతో, ఆలోచింపకుం డఁగా. ('గబుక్కున' వా.)

గీ. అట్టినన్నును జేరి భయంబు లేని, పాలుపుతో నున్న దీపువుఁబోణి చెంత, నను గవుకునఁ బట్టరా దనయ వలయు, మోజన యొనర్చి సేయుట రాజనీతి. శుక. ౨. ౨౪౯.

**గవుడపేరు=గౌడపేరు.** వి. కంఠభూషావిశేషము.

సీ. తరుణి హైహయరాజదంతాస్థిపటలంబు గవు డపేరుగఁ జేసి కట్టెనఱుత...క్రీడా.౧౨౫.
('గవడ' అపముద్రి.)

**గవుడసరము=గౌడసరము.**

ద్వి. ముత్తెపుఁజేరులు ముంగామురములు,నొత్తుల గాజులు నొడ్డైనవనులు,గవుడసరాలు బంగా రుకడెములు, నవరనిరత్నాలసందిదండలును. ప్రభులిం. ౪. ౧౮౩ పా. ౧౬ పం.

**గవుద**=గౌద.

(చిబుకము.)

సీ. ...ముక్కు, నవుఁబువ్వు చెవులు శ్రీల్ ను నుఁబండ్లు మొల్ల లధర మిగు ర్చెక్కు లద్ద ములు గవుద, తాటిగింజ మెడ చిందము త్రేళ్లు పగడముల్ కరము లబ్జములు .... ప్రబంధ. ౩౯౮.

జ: గవుదకట్టు.

**గవుదకట్టు**=గౌదకట్టు. (గవుద+కట్టు.)

**గవుర**=గౌర.

**గవురు**[1]=గౌరు[1].

**గవురు**[2]=గౌరు2.

**గవురు**[3]=గౌరు3.

**గవులు**=గౌలు.

(గంధము, వాసన.)

ఆ. కంపు గబ్బు గవులు గందంబు వల పన, గంధ మొప్పు...ఆం. భా. ౧. ౧౦౬.

(దుర్గంధము.)

చ. పాలనుగవుల్ కడుం గదురఁ బొట్టకుఁ గట్టె నటంచు నార్చుచుఁ, సాలయక వచ్చుతాట కఁ గనుంగొని రాజడదారి...యయా. ౩.౭.

**గవుళి**=గౌళి.

**గవుసెన**=గౌసెన. వి. వీణ విల్లు మొదలగువానికి తొడుగుగలీబు.

గీ. ఘనకుచము లనుకిన్నెరకాయలకును, బట్టుప య్యెద గవుసెనబాగు నూప, సకలసౌభాగ్యల క్షణచారుమహిమ, నుల్లసిల్లెడుకన్యక నొర్తుఁ దెచ్చి. వి. పు. ౨. ౧౯౬.

ద్వి. శివసూత్రములు గవుసెనలవస్త్రములు. పండి తా. పర్వ. ౩౮౬ పా.

చ...నీ, లవసనపుష్పనుంగు పాదలంగఁ బ్రభావతి వచ్చె నత్తఱిఁ, గవుసెనలోపలం జకచకల్ గలదర్పణలక్ష్మిఁ గేరుచుఁ. శుక. ౨. ౩౦౫. విక్ర. ౮. ౧౦౧. హరి. ఉ. ౩. ౧౫౯. వరా హ. ౬. ౪౪.

**గవేధుక**. సం. వి. ఆ. స్త్రీ=గవేధువు.

**గవేధువు**. సం. వి. ఉ. స్త్రీ. అడవిగోదుమలు. (వై. ని, అమరము.)

**గవేషకుఁడు**. సం. విణ. (అ. షిశా. అ.) వెదకు వాఁడు.

**గవేషణ**. సం. వి. ఆ. స్త్రీ. గవేషణము, వెదకుట.

**గవేషణము**. సం. వి. అ. న=గవేషణ.

**గవేషము**. సం. విణ. (అ. ఆ. అ) వెదకునది. వి.అ. పుం. వెదకుట. (వాచ)

**గవేషయత్**. సం. శత్రు. వెదకుచున్న.

**గవేషయమాణము**. సం. విణ. (అ. ఆ. అ) వెద కుచున్నది.

**గవేషయితృ**. సం. విణ. (ఋ. త్రీ. ఋ)=గవేష కుఁడు.

**గవేషించె**. సం. స. క్రి. వెదకు. (బ్రా, శ. ర.)

**గవేషితము**. సం. విణ. (అ. ఆ. అ) వెదకఁబడినది.

**గవేష్యమాణము**. సం. విణ. (అ. ఆ. అ.) వెదకఁ బడుచున్నది.

**గవ్య**. సం. వి. ఆ. స్త్రీ. ౧. గోసమూహము. ౨. రెం డుకోసులు ౩. గోయోజనము. (వై. ని.)

**గవ్యము**. సం. విణ. (అ.ఆ.అ) ౧. గోసంబంధమై నది. ౨. గోవునకు హితమైనది. ౩. గోవికార మైనది. (పంచగవ్యములు:- పాలు, పెరుఁగు, నె య్యి, పంచితము, పేఁడ.) వి. అ. న. ౧. పసులు మేయుపొలము. ౨. అల్లెత్రాడు. ౩. రాగద్రవ్య భేదము. (శే. ని)

**గవ్యూతము**. సం. వి. అ. న=గవ్యూతి. (వాచ)

వ్యూతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. రెండుకోసులు. ౨. ఒకకోసు. (వాచ.)

గవ్వ. వి. వరాటిక, కపర్దకము. (దీనిని చిన్న నాణె ముగా వాడుదురు.)

వ...గవ్వదండలగంటల నలంకరించి...ఆము. ౪. ౩౫.

గీ...గవ్వ యనఁగ వెలయు, చుండును వరాటమై ...ఆం. భా. ౧. ౧౬౧.

గవ్వచాకము = పుంజెఁడుగవ్వలు, నాలుగుగవ్వల మొత్తము.

మ.చరమాశానికషోపలాంచలమునన్ సంధ్యాప్ర కాశోదయం, బొరఁ గావించి విరించిచేఁ గొ నినసూర్యం డన్వదార్వస్నబం, గరపుంబూ దియమై వియద్విపణి వేడ్కం గాల మన్నచ్చు చ్చొచ్చెరఁ జెల్లించినగవ్వచాక మన మించెం దారకాచక్రముల్. నైష. ౮. ౧౪౯.

శ్లో. అస్తాచలేఽస్మిన్ నికషోపలాభే సంధ్యాక షోల్లేఖపరీక్షితో యః, విక్రీయ తం హేళి హిరణ్యపిండం, తారావరాటానియమాదిత వ్యోః. సం. నైష. ౨౨. ౧౩.

జ: గవ్వసరులు.

గవ్వసరులు. వి. బ. (గవ్వ+సరుబు.) ధాన్యవిశేష ము. హంస. ౪. ౧౨౯.

గస. వి. (సం. కాసః. త. కళం) ఉబ్బసము. (శ. ర- 'కంఠములోనినస' అని చి. వి.)

గసగస. వి. (క. గసగసె. త. కసకసా. హిం. కష్ ఖాష్.) సస్యభేదము ?. (దీనివిత్తులు నల్లమందువి త్తులందురు.)

వ...గసగస మొసక మెసఁగ...కాశీ. ౩. ౨౩.

బ. (గసగసలు, గసగసాలు.)గసగసవిత్తులు, అహి ఫేనబీజములు.

గీ. జాజికాయలు జాపత్రి చాఱపప్పు, సెనగ ల నుములు గసగసల్ మునగపువ్వు, మదనవిత్తులు కొబ్బెర మందసాలు,సూతి త్రాగిన మద్యము బ్బఁ జేయువేళ. హంస. ౫. ౧౩౧.

ఆ. వెముఁబ్రాలు పాలివదనికల్ గసగసాల్,జల్లి మొకపుఁబాలుఁ జాఱపప్పు. యయా. ౧. ౧౦౩. ఆం. భా. ౨. ౧౬౧.

గసాబు. వి. తుపాకివంటియుద్ధసాధనవిశేషము.

ద్వి. క్రోవులు జబురుజంగులు పిరంగులును, బుస క్రోవులును గసాబులు తుపాకులును, వసుధ లీలగ నొక్కపడిఁ గాల్చి ... ఆ. మ. ౪. ౩. ౧౭౧ పా. ౧౫ పం.

గసి[1]. వి. శంకుభేదము, ఒకవిధమగు మేకు; ఒకా నొకవేఁటసాధనము.

సీ...వసి గసి మేకన వసుధ శంకు. గీ. భేదనా మంబు లగుమ శోభిల్లుచు ... ఆం. భా. ౨. ౨౧౯.

ద్వి. మునుకొని యాతనిముక్కుఁగ్రోళ్లందు, ఘన మైనపాఱలు గసులుఁ బెట్టియును. రం. రా. యు. ౩౯౫ పా. ౧౨ పం.

ఆ...వసులు గసులు...ఆది గాఁగఁదెచ్చి రాట వికులు. పి. శకుం. ౧. ౧౧౬. హరిశ్చం.౨. ౬.

జ: గసిక.

గసి[2]. వి. (క. గసి) కాఁచిననెయ్యి లోనగువానియ డుగునకు చెరుముడ్డి.

సీ...గసి నాఘృతాదికల్కంబు దనరు. ఆం. భా. ౨. ౨౫౯.

గసిక. వి. (√గసి[1]) ౧. త్రవ్వుటకనువుగా కొన చెక్కినకొయ్య. (శ. ర, వా) ౨. శూలము, శ లాక.

ద్వి...మానవమాంస,ఖండంబు లొండొంప గసి కల గ్రుచ్చి,కమ్మఁగాఁ గాల్చి చంకను బెట్టి మెసఁగి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౨౪.

౩.మొన యేర్పడునట్లు చెక్కినకొయ్యబాణము.

గీ. అలయ దూరస్థితు నృపాలు నసముఖ్ధిఁ, దవిలి

తగనికోర్కులు గోరి తివిరి మొగ్గ,గసికలకుఁ జాల నగ్గమై యెసఁగ...హ. వ. ౨. ౬౬.

గీ. గసికకోలలు గొని భిల్లబిసరుహాక్షు, లడవిఁ ది రుగుదు రాత్మనాయకులఁ గూడి. కాశ. ౩. ౧౫.

**గసిబిసి**=గజిబిజి.

విశే. (చెల్లాచెదరు, మిక్కిలి చెదరినది.)

చ... అనురులమాయ లన్నియును నబ్జదళాక్షుఁ డు వచ్చినంతటన్, గసిబిసియై నిరర్థ మయి గ్రక్కునఁ బోయెను నిద్ర నొంది సం,తస మున మేలుకొన్నగతిఁ దాల్చి చెలంగిరి వే ల్పు లందఱున్. భాగ. ౮. ౩౪౩.

(తాఱుమాఱు, వ్యత్యస్తము.)

క. లసితాలంకృతిసంధులు,గసిబిసియై చెదరకుం డఁ గల్పించినఁ బొం,దెసఁగెడుసంయోగం బది, రసికులు నరసింహసంకరం బనఁ బరఁ గుశ్. కావ్యా. ౩. ౯.

ద్వి...బిజ్జులుని,నొసలిరేఖలు గసిబిసిచేసి రాజ్య, మనమాత్మకవిలియ నటు తుడిపించి. బస. పు. ౭. ౯౧౫ పం.

(కలఁగినది)

(మన్మథుఁడు)గీ...అయ్యావనివిభుని, వ్రతము ల న్నియుఁ గొనిపోయి వఱదఁ గలిపి, చిత్తమం తయు గసిబిసి చేసి విడిచె. భోజరా. ౭.౧౦౦.

సీ. పలునొక్కులను జిక్కువఱపకు మని మ్రొక్కు కుసుమకోమల గసిబిసి యొనర్చి. మృ. వి. ౧. ౪౫.

**గస్తాలు.** వి. బ. మల్లవిద్యావిశేషము.

వ...బసికీలు గస్తాలు పుటంబు లనునట్టివసుసల వితంబులును...మల్లుపు. ౩. ౬౯. ఆం. భా. ౨. ౨౦౭.

**గస్తీలు.** వి. బ. (గస్తు+ఈలు.) కావలివారు.

ఉదా: పైగస్తీలు వచ్చినారు. (శ. ర.)

**గస్తు.** వి. (హిం. శ. గస్తు.) -రాత్రివేళ దొంగతన ము లోనగునవి జరుగకుండుటకై కావలివారు- ఊరు తిరిగి కాచుకావలి.

ద్వి. ఆలీలఁ గొఱవిదయ్యంబుల దివ్వె, కోలలవా రిఁగాఁ గొని గస్తు దిరిగి. ద్వి. పారిజా. ఉ. ౧౬౬౮ పం.

గీ. కుశలగతి మజ్జనము లాడి కుడిచి కట్టి, ప్రజలు నిద్రించి రయ్యర్ధరాత్రవేళ, ఖడ్గఖేటకపాణి యై గస్తు దిరిగెఁ, బెద్దతలవరి కింకరో పతుఁ డగుచు. వేం. పంచ. ౩. ౧౯౭.

సీ. కడు గడీపై నలంగము చుట్టు నెల్లెడ గస్తు గ్రుమ్మరునట్లు గట్టిపఱచి. రంగా. ౨. ౧౯౮.

జ: గస్తీలు.

**గహనము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. నిబిడము, ద ట్టమైనది. ౨. దుష్ప్రవేశము, చొర రానిది. ౩. దుర్బోధము, ఎఱుఁగ రానిది. వి. అ. న. ౧. అ డవి; దట్టమయిన అడవి. ౨. గుహ. ౩. దుఃఖము, కాఁపియ. ౪. జలము.

**గహ్వము.** సం. వి. అ. న. ౧. గాంభీర్యము. ౨. దు ర్గము, పోవ నలవి గానిచోటు.

**గహ్వరము.** సం. విశే. (అ. ఆ. అ) ౧-గాంభీర్య ము గలది-లోఁతయినది. ౨.దుష్ప్రవేశము, చొర రానిది. వి. అ. పుం. పొదరిల్లు. న.౧.దంభము.౨. అడవి. ౩. గుహ. ౪.ఏడ్పు. ౫. జలము. ౬.గాంభీ ర్యము, గుట్టు. (కే. ని.)

క. కులభామిని యేమైనను, గలుగుకోలఁది నింటి లోన గహ్వరమునఁ బ్రొద్దులు గడపునె ప్రి యమున నా,నెలఁతుక నీవంపు నేయ నేర్చె నె చెపుమా. కుచేల. ౨.౮౩.

**గహ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గుహ. ౨. భూమి, నేల. (విల్యమ్సు.)

## గా

**గా.** ఇది మహాద్వాచకమునకు అనుప్రయుక్తమై నీ చత్వమిత్రత్వములను దెలుపును.(ఇది పరమగునపు

డుపూర్వాచ్చునకు 'ఇ' ఆదేశ మగును. దీనిని 'ఇగా' అని కొందఱు గ్రహించిరి. సంబుద్ధియందు 'గ' అను రూపము గూడ నుండును.)

సీ... ప్రశ్న చెప్పఁగ మాలపాపిగాఁడు. వేమ. ౨౫.

ఉ... ఖా, గోతులబుచ్చిగానికి... (చాటువు)

క. జగములు వొగడఁగ నెగడిన, జగబంటరికో మరుఁ డయ్యు జతనమునఁ గటా, పగ దీఱుప నోపవు నీ మగతన మేమిటికిఁ దులువమాఱ ద్రిమ్మరిగా. అచ్చ. రా. యు. ౧౨౨.

క... గోపాలిగ రమ్మటంచుఁ గొడుకున్ బిలిచెన్. అహోబలపండితీయము. ౩౫౬ పా.

**గాంగము.** సం. విణ. (అ. ఈ. అ) గంగది, గంగకు సంబంధించినది.

**గాంగాయని.** సం. వి. ఇ. పుం = గాంగేయుఁడు.

**గాంగుఁడు.** సం = గాంగేయుఁడు.

**గాంగేయము.** సం. వి. అ. న. ౧. బంగారు. ౨. కనకాహ్వయము, ఉమ్మెత్త కి. పుం. ఒకవిధమగు చేఁప.

**గాంగేయుఁడు.** సం. వి. అ. పుం - గంగాపుత్రుఁడు - ౧. భీష్ముఁడు. ౨. కుమారస్వామి.

**గాంగేరుకి.** సం. వి. ఈ. స్త్రీ. బీఱకి.

**గాంజికాయము.** సం. వి. అ. పుం. వర్తిక, మీనవల్లంకిపిట్ట.

**గాండివము.** సం = గాండీవము.

**గాండివి.** సం = గాండీవి.

**గాండీవము.** సం. వి. అ. పుం. న. ౧. అర్జునునివిల్లు. ౨. విల్లు. (మే. ని.)

**గాండీవి.** సం. వి. న్. పుం. అర్జునుఁడు.

**గాండ్రించె.** అ. క్రి. (ముఖము) ఉబ్బు. (శ. ర.)

**గాండ్రు.** వి. పులి యఱచుటయందగుధ్వనికి అనుకరణము.

వ... పాఱమ్ములు బొమ్మకలంకులం గాఁడ గాండ్రుగాండ్రు మని రొప్పి నొప్పి కుప్పరంబుగా వియత్తలంబునకు విల్లెత్తుపాడు వెగసి... మనుచ. ౪. ౩౭. (బ్రా. పా - కాండ్రుకాండ్రు. శ. ర. పా)

గాండ్రుపెట్టు = గాండ్రుమను.

ద్వి. మండ్రాటముగ నిట్టిమాంసంబు మెసవి, గాండ్రుపెట్టెడుపెద్దగండుమెకాలు. ద్వి. సారంగ. ౨. ౮౦ పా. ౧౨ పం.

**గాండ్ల.** వి. నూనె అమ్మి జీవించెడుజాతి. (చూ. గాండ్లవాఁడు.)

జ: గాండ్లవాఁడు.

**గాండ్లవాఁడు.** విణ. (√ గాండ్ల) గాండ్లజాతివాఁడు. (మహత్త్వార్థక రూపము 'గాండ్లడె')

వ... కటిక బట్టు జెట్టి దేండ్ర తొగట గాండ్లవారును... హంస. ౩. ౨౯.

**గాంతువు.** సం = గంతువు.

**గాందిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గంగానది. ౨. కాశిరాజుకూఁతురు. (శ్వఫల్కునిభార్య. అక్రూరుని తల్లి.)

**గాంధర్వము.** సం. విణ. (అ. ఈ. అ) గంధర్వసంబంధమైనది. వి. అ. పుం. ౧. వధూవరులు పరస్పరేచ్ఛచేఁ జేసికొనువివాహము. ౨. సంగీతవిషయక శ్రుతియుపవేదము. ౩. దినమునొక్కపదునేను ముహూర్తములలో నేడవది. ౪. గుఱ్ఱము. న. సంగీతము, గానము, పాట.

**గాంధర్వి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వాక్కు, భాష. ౨. దుర్గ. (విల్యమ్సు)

**గాంధర్వుఁడు.** సం = గంధర్వుఁడు.

**గాంధారము.** సం. వి. అ. పుం. ౧. (సంగీత) స్వరవిశేషము. ౨. సిందూరము. ౩. ఒకానొక దేశము. న. గంధరసము, బాలింతబోళము.

**గాంధారి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గంజాయి. ౨. ధృ

తరాష్ట్రునిభార్య. 3. యవాసము, తీఁటకసింద్రీ. ఇ. పుం. శకుని. (ఇతఁడు దుర్యోధనునికి మేనమామ.)

**గాంధారేయుఁడు.** సం. వి. అ. పుం. గాంధారి పుత్రుఁడు. (దుర్యోధనాది)

**గాంధికము.** సం. వి. అ. న. గంధద్రవ్యము.

**గాంధికుఁడు.** సం. వి. అ. పుం. గంధద్రవ్యములమ్ము పురుషుఁడు. (వాచ)

**గాంభీర్యము.** సం. వి. అ. న. ౧. లోఁతు. ౨. (క్రోధశోకాదులచే) వికారము నొందకుండుట.

**గాఁజేర[1].** వి. ఒకానొకదుంప.

ఆ... పెండల, మల్ల ముల్లి పసుపు ముల్లంగి వెల్లుల్లి, గాఁజరయును మొదలుగాఁగఁ గలవు... హంస. ౪. ౧౩౧.

**గాఁజేర[2].** వి. (సం. కలంజః) పొగాకు.

సీ. గంజాయి యనఁగను గాంధారి చెన్నొందు గాఁజర యంచనఁగాఁ గళంజ, మగు...ఆం. భా. ౨. ౬౩.

**గాఁడి.** వి. (త. కాడి) ౧. తొలిచి కాని త్రవ్వి కాని నిడుపుగా ఏర్పఱచినపల్లము. (చూ. గాఁడిప్రొయ్యి) ౨. నిపానము, పసులు నీరు త్రాగుటకు గాఁడి యేర్పడ ఱాతితో కట్టినతొట్టి.

(యమునావర్ణనము.) గీ. ప్రతిదినముఁ గ్రోల నిది గాఁడిబావి గాదె, కృతకకృత్కరినందగోబృందమునకు, క్షేత్ర మిది గాదె దివసకృజ్జలజమునకు. వేం. పంచ. 3. ౧౨౧.; ఆం. భా. ౧. ౧౬౨.

3. పసులను కట్టుచోట కసవు వేయుటకు పలకలు లోనగువానితో గాఁడిగా చేర్పఱచినస్థానము.

(అమరావతీపురవర్ణనము.) గీ. కామగవిఁ గట్ట నిది గదా గాఁడిపట్టు. ఉ. రా. ౪. ౨౫౯.

(ఈశ్వరవర్ణన) గీ. విషగళుఁడు గాఁడిఁ గట్టినవేల్పుటావు, హాటకాచలధన్వి సిద్ధాంజనంబు... భక్తులకును. పి. శకుం. ౪. ౪.

జ: గాఁడిప్రొయ్యి.

**గాఁడిప్రొయ్యి.** వి. (గాఁడి + ప్రొయ్యి.) గాఁడి త్రవ్వి ఏర్పఱచినప్రొయ్యి. (వా)

**గాఁడు.** వి. ౧. కంమూతి, దురద.

గీ... మూల జిల నవ నస గాఁడు దురద యనఁ గఁ, బరఁగుఁ గంమూతి...ఆం. భా. ౨. ౧౭౫.

౨. కామమదము. (శ. ర.)

**గాగర.** వి. స్త్రీలు కట్టుకొను పావడ. (శ. ర. 'గాగరా' చి. ని, వా.)

**గాజరము.** సం. వి. అ. న. పచ్చముల్లంగి ?.

**గాజోపరుఁజో.** వి. ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యాతలము, కత్తి మొదలగువానిపిడి.

సీ... ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము. గీ. జరపరుంజో నవంగను బరఁగు నదియె, చనును నెమ్మిపరుఁజో గాజాపరుఁ జన. ఆం. భా. ౨. ౨౧౫. (శ. ర. పా)

**గాజో.** వి. (సం. కాచః. క. గాజు.) ఇసుక కరఁగించి చేసినయొకపదార్థము, కాచము.

గీ. వలచుఁ గస్తూరినిగరాలతలుపు దెఱవ, గాజుటోవరిలో ధూపగంధలహరి. నైష. ౭. ౧౫౪.

ద్వి. గాజు పెంచుక లేఱ గమియించినట్లు. బస. పు. ౨౦౧ పొ. ౧౫ పం.

క... వంటచెఱకుఁ దెచ్చుచుఁ బురనా, రిజనుల కమ్మి యాతఁడు, గాజు గడపినట్లు దినము గడపుచు నుండెక. శుక. 3. ౨౭౬. ఆం. భా. ౨. ౨౯౦.

౨. గాజుతో చేసినహస్తవలయము; హస్తవలయము.

ఉదా: నీవు పురుషుఁడవా ? గాజులు తొడిగించుకొని యింటఁ గూరుచుండుటఁడుదానవా?

గీ. గాజు లెగఁ ద్రోసి చప్పుడు గాకయుండ, వచ్చె నూర్వశి యర్జునావాసమునకు. హర. ౭. ౧౧౯.

సీ. సడలి ముంజే వ్రాలుజాఱువాఁపైఁడిగాజులు పైకి నెగఁ ద్రోయుచో విలాసము...దశా. ౨. ౩౬౦. ఉ. హరి. ౪. ౧౫౭.

జ: గాజుకడియము, గాజుకప్పెరలు, గాజుకుప్పె, గాజుకొప్పెర, గాజుపడు, గాజుప్పు, గాజులవాఁడు, గాజువాఱు.

**గాజుకడియము.** వి. (√గాజు) గాజుతోఁ జేయఁబడినకడియము.

ఆ. భూజనంబు నేలు రాజు మగం డయ్యు, గాజుకడియ మనెడిగతి చెలంగె. కుచేల. ౨. ౧౧౦.

౨. ధాన్యవిశేషము.

వ... ఊఁదుఘుటికలు గాజుకడియములు జాజికుసుమలు...అనునూటనాలుగువగలపైరులు... ప్రబంధ. ౧౧౨.

**గాజుకప్పెరలు.** వి. బ. (గాజు+కప్పెరలు) ధాన్యవిశేషము.

సీ...గాజుకప్పెరల్ కురువడాల్ కంటసరులు... గీ...అది యగు పేరు గల్గువ డ్లతనియింట, నుండు...హంస. ౪. ౧౨౯.

**గాజుకుప్పె.** వి. (గాజు+కుప్పె.) కాచపాత్రవిశేషము.

సీ. చేదిన్వో ప్రతిమ చొసీతిబంధముల మేల్కట్టు గొజ్జఁగినీటి గాజుకుప్పె. గీ. కలరతాగారము నను...వైజ. ౩. ౭౪.

ఆ. గాజుకుప్పెలోనఁ గడఁగుచు దీపంబు, దెట్టులుండు జ్ఞాన మట్టు లుండుఁ, దెలిసినట్టివారి దేహంబులందును...వేమన. ౧. ౯.

**గాజుకొప్పెర.** వి. (గాజు+కొప్పెర) గాజుతోఁ జేసినపాత్రవిశేషము.

గీ. గాజుకొప్పెర యనఁగను గర్పర మగు. ఆం. భా. ౨. ౨౪౫.

**గాజుపడు**=గాజువాఱు. (గాజు+పడు.) (కాంతిహీన మగు)

ఉ. అజగరేక వీరుఁ డగునర్జునుఁడు...పనువార్యర నొక్కపెట్టునం, గాజుపడంగఁ గూల్చె...చిత్రభా. ౭. ౧౨౧.

**గాజుప్పు.** వి. (గాజు + ఉప్పు) ఒకానొకఉప్పు, కాచలవణము. (శ. ర.)

**గాజులవాఁడు.** వి. (గాజులు+వాఁడు) గాజుల మ్మెడుబలిజె. (శ. ర, వా.)

**గాజువాఱు.** అ. క్రి. (గాజు+పాఱు) కాంతిహీన మగు, గాజుపడు.

గీ. నెఱయ వర్తిలి నెనయు నీనెమ్మొగంబు, ఘనభుజంగవిషవ్యాప్తి గాజువాఱె, రాహుకబళితరోహిణీరమణుమాడ్కి, నుండఁ గనుఁగొని యే నెట్టు లుండుఁ గుత్తి. మార్క. ౧. ౨౫౪.

ఉ. కందవు గాజువాఱవు వికారము నొందవు... దీర్ఘనిద్రల ధరిత్రి శయించినజంతుదేహముల్. కాశీ. ౩. ౧౦౫.

గీ. గాజువాఱదు చరణపంకజయుగంబు, హస్తతలములకెంజాయ లడఁగిపోవు. హరిశ్చ. ౫. ౩౯.

**గాజె(జియ)**=గాదియ. వి. (సం. గంజః) కునూలము, ధాన్యము మొదలగునవి పోసికొనుటకు ఏర్పడినచిన్న బొట్ట. (శ. ర, చి. ని.)

**గాటము.** విశే. (సం. గాఢమ్. క. గాట.) అధికమైనది; సాంద్రము, దట్టము.

గీ. గాట మగుచలివేళను నీటిలోన, భార్గవుఁడు ఘోర మైనతపం బొనర్చె. పరమ. ౧. ౧౧౨.

(ఆదిమత్స్యవర్ణనము.) మ. తళుకుంజాయకడాని మైపొడలు నిద్రామీనలుక్ వేయిగో, ఱలు గాటంపుగఱుల్...దశా. ౧. ౨౧౧.

ద్వి. పాటలాతింత్రిణీప్రముఖవృక్షముల, గాట మానడవుల...ద్వి. హరిశ్చ. పూ. ౫౯౬.

సీ. గాటంబుగా నిర్లు గవియుదేహమువాఁడు కడు పక్కళించినకడుపువాఁడు. వరాహ. ౨. ౪౫.

**గాటు.** వి. (సం. కటుః) ౧. కటువు, కారము.

గీ...గాటు, కార మొప్పోష్ణన యనంగఁ గటువు వెలయు. ఆం. భా. ౧. ౧౦౪.

౨. (తీవ్రమగు) వాసన.

సీ. బొట్టుకస్తురినీటు పట్టుబల్వలెవాటుదొట్టుగంధపుగాటుఁ దొంగలింప. చెన్న. ౪. ౨౬౪.

విశే. ౧. కారము కలది.

ఉదా: మిరెపకాయ చాల గాటుగా నున్నది.

౨. తీవ్రమగువాసన గలది.

ఉదా: పొగాకు గాటుగా నున్నది.

**గాఢి.** విశే. (సం. గాఢమ్) గాటము.

రగడ. గాడిగ వెన్నెల గాయఁగఁ దరువుల, నీడలఁ బొడవెన్నెలలు...బిల్హ. ౨. ౨౯. (ప్రయోగాంతరము లేదు.)

**గాడిద(డ్డ).** వి. (సం. గార్దభః. త. కళుదై.) గాలిగాఁడు, ఖరము.

చ. గాడిదరూపు దాల్చి యుముకల్ దినుచుండఁగఁ జూచి యుల్లసం,బాడెదు శక్ర...భార. శాం. ౪. ౩౯౬.

సీ. జాతైనబారాహజారతేజికిఁ గాక కటుకుల కళ్లెంబు గాడ్ద కేల. వేము. ౬౪. ఆం.భా. ౨. ౨౬౬.

జ: గాడిదకాళ్లవాఁడు, గాడిదపులి.

**గాడిదకాళ్లవాఁడు.** విశే.(√గాడిద)ముట్టుమోఁకాళ్లవాఁడు, ముడికాళ్లవాఁడు, సంజ్ఞావు.(శ.ర.)

**గాడిదగడపర.** వి. ఒకానొకయోషధి, పిండీతకము?.

గీ. పాదలుఁ బిండీతకమ్ము గాడిదగడపర, చాగరాడి వెలికి యటంచన...ఆం. భా. ౨. ౬౫.

సీ...గాడిదగడపర కన్నెగొమర. హంస. ౪. ౧౦.

**గాడిదపులి.** వి. (√గాడిద) దుమ్ములగొండి, కొర్నవగండు. (శ.ర.)

**గాడీ.** వి. (హిం.గాడీ) బండి;రథము. (బ్రా. మిశ్ర. వా.) శ.ర. ఈపదము దే. వి. గా 'గాడి' అను రూపాంతరముతోను 'రథవిశేషము' అనునర్థముతోను గ్రహించి యీ క్రిందిభారతమును ప్రమాణముగా నిచ్చినాఁడు.

సీ...చిత్రలలిత,గతి నొప్పు నేనూఱు గాడీలు... భార. ఆది ౮. ౨౨౧. ఒకప్రాఁతప్రతిలోఁ గూడ పాఠ మిట్లే యున్నది. కాని దీనికి మూల మగు సం. భార. ఆది.౨౪౭. ౪౧. శ్లోకమునుబట్టి 'ఏనూఱుగాడిదలను'అను భా.ల.వ్యా. పాఠమును, ముద్రితపాఠమును యుక్తముగాఁ గనఁబడుచున్నవి. 'గాడీలు' అను పాఠము గ్రహించినయెడల రథములు రెండుమార్లు చెప్పఁబడుటయు గాడిదలమాట లేకపోవుటయు సంభవించును.

**గాడుపు(డ్పు).** వి. వాయువు, గాలి.

సీ. ఏచి యీచెవిగాడు పాచెవిఁ బోవంగ ... పాండు. ౨. ౨౯.

సీ...చల్లని గాడ్పు...భార. ఆది. ౪. ౨౩. ఆం. భా. ౧. ౫౯.

జ: గాడుపుచూలు, గాడుపుకంద్రి, గాడుపుసంగడీఁడు, గాడ్పుతూపు, గాడ్పుదిండి.

**గాడుపుచూలు(లి).** వి.(గాడుపు+చూలు) ౧. హనుమంతుఁడు.

క...తులువతొలువేలుపులం, గాడుపడఁ దఱిమి యార్చుచు, గాడుపుచూలీవు సొచ్చె గాటపుఁగినుకన్. అచ్చ. రా. సుం. ౧౭౧.

గీ... గాడ్పుచూలి యిట్లీవమునూడు, గ్రుంకనంతకు నొదిఁగి యక్కొండ నున్న. అచ్చ. రా. సుం. ౨.

౨. భీముఁడు.

ఇట్లే:- గాడుపుకొడుకు, మొ.

క. ... గర్వ మడంచి విడిచె గాడ్పుకొడుకు కొగిన్. రాఘవ. ౪. ౩౩.

**గాడుపుతండ్రి.** వి. (గాడుపు + తండ్రి) ఆకాశము.

క. అపు డగ్గివన్నె లొలువ్రేలుపు తన నెమ్మేనిమంటలు గడిందిగ గాడుపుతండ్రిఁ బొదువఁ గోఁతిపదుపుపై నరదంబు నెమ్మితోఁ బఱపుటముకన్. అచ్చ. రా. యు. ౪౯౦.

**గాడుపుసంగడీఁడు.** వి. (గాడుపు + సంగడీఁడు) వాయుసఖుఁడు, అగ్ని.

గీ... ఇంద్రజితుండు దీవి,కరిగి గాడుపుసంగడీఁడలర నొక్క,దండ వేలిమి యొనరింప... అచ్చ. రా. యు. ౧౩౭.

ఇట్లే:- గాడ్పుచుట్టము.

మ. జముఁడో వేల్పుల ఱేఁడో నీళ్లదొరయో చాగంపురాయండొ వి,క్కమరుండో విసదారితొల్పరియొ సోఁకుంబెద్దయో గాడ్పుచుట్టమొ... అచ్చ. రా. సుం. ౧౫౧.

**గాడ్పుతూపు.** వి. (గాడ్పు + తూపు) వాయువ్యాస్త్రము.

చ... గాడ్పుతూపు నెవ్వడిఁ బఱఁగించి చేయిదగవైచెఁ గడిందిగ రాముఁ డత్తఱిన్. అచ్చ. రా. యు. ౨౪౮.

**గాడ్పుదిండి.** వి. (గాడ్పు + తిండి) పవనాశనము, సర్పము, పాము.

(గురుస్తుతి) సీ. ఏదంట యొసఁగుకున్నాది దోసపుఁదుల్య గాడ్పుదిండులకు వాకట్టుమందు. అచ్చ. రా. బాల. ౧౧.

గాడ్పుదిండిములికి = నాగాస్త్రము.

ఆ. సోలి యుపుడె తెలిసి సోఁకుజో దంతయు, నులికి గాడ్పుదిండిములికి వైవ. అచ్చ. రా. యు. ౩౫౩.

**గాఢము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. అవగాఢము, అవగాహనము చేయఁబడినది. (నద్యాది) ౨. అవగాహనము చేసినది, మునిఁగినది. ౩. గుత్తమైనది, బిగువైనది. (గాఢాలింగనము, గాఢాంగనము, మొ.) ౪. దట్టమైనది. ౫. క్రిక్కిఱిసినది. ౬. మిక్కుటమైనది, అధికము.

**గాణ.** వి. (సం. గాయనః. ప్రా. గాఅణో. క. గాణ.) పాటకాఁడు; పాటకత్తె.

సీ. గాణ యుంచననఁగను గాయకాధిప చెల్లు.. అం. భా. ౨. ౨౭౮.

ఉ. వీణియ ముట్టి పంచశరవిక్రమము ల్పచరించుగీతముల్, గాణతనంబు మీఱఁ బలుకంగలభాగ్యము నాకుఁ గల్గునే. చంద్ర. ౪. ౧౧౨.

వ... కలమధురకిన్నరీనిక్వాణంబుల రాణం ద్రాణఁ జెఱుమవిన్నాణంపుఁగొల్పు టెయింగులను వేల్పుగాణలు పాడులక్ష్మీనారాయణులకళ్యాణంపుఁబాటలం దీటుకొనుతిన్ననిరవంబులున్ గలసి... మనుచ. ౫. ౮౧.

**గాణపతము.** సం. విణ. (అ. ఈ. అ) గణపతికి సంబంధించినది.

**గాణిక్యము.** సం. వి. అ. న. గణికలసమూహము, వేశ్యాసమూహము.

**గాణీ.** వి. (సం. గాయనీ. క. గాణి) గాయకురాలు, పాటకత్తె.

వ... మఱియు నిక్కులాచలసంతానంబు సంతానకుసుమవాసనాసమాగతసారంగసంగీతభంగీతరంగంబు లుపాంగంబులుగాఁ బాడువేల్పుగాణీలపాణీరితమాణిక్యవీణామధురరాణామృతంబులఁ గరఁగి... వసు. ౨. ౧౧.

క. ఐదువ గాణీలకు భా,పాదన గేయముల పేర భార

తి సతిపై, మోదమున ధవళవర్ణ,ప్రాదుర్భావం
బు సెఱపెఁ బలుమఱు నచటన్. వసు. ౫.
౧౨౬.

**గాణు.** వి. హాని.

క. రాణించినసీకాఁగిటఁ,బ్రాణేశ్వర నాకు మగు
డఁ బ్రాయము వచ్చెన్, జాణలగువారికూర్మి
కి, గాణు గలుగ నేర దెంతకాలంబునకున్.
ప్రబోధ. ౨. ౩౫.(ప్రయోగాంతరములేదు)

గ. మిథ్యాదృష్టిః:-మహారాజ! అహమపి సాం
ప్రతం నవయౌవనా సంవృత్తా. న ఖలు భావా
నుబంధః ప్రేమా కాలేనాపి విఘటతే... సం.
ప్రబోధ. ౨. ౯౧ పొ.

**గాణుఁడు.** వి. (సం. గాయనః) గాయకుఁడు, పాట
గాఁడు.

(గంధర్వవర్ణనము) శా. పక్షుంబుల్ లలిఁ దాల్చు
కీరనిభదీవ్యద్వాణులుల్ గాణులున్. పారి.
ఉ. ౭. ౧౨౦.

**గాత.** వి. (సం. ఘాతః) ౧. దెబ్బ, వ్రేటు, పెట్టు.

స్రగ్ధర... ఖడ్గిన్ జెండాడుమ్రాఁకుల్ కవుఁగిటికో
లఁదుల్ కత్తి నొక్కొక్క గాతన్. మనుచ.
౪.౮౫.(ఖడ్గి క్రింది శ.ర.పా)

వంచచా.కట.రికానిగాతచేత...రా.వి.౪.౪౭.

౨. ద్రోహము.

సీ...ఎబ్బెరానీ గాతలకోటూరు. ఆ. మగనికంటె
నెరను వగలాఁడి. చెన్న. ౨. ౨౪.

**గాత.** సం. విణ. (బు. స్త్రీ. బు) గానము చేయు
వాఁడు, పాడెడువాఁడు.

**గాతము.** వి. (సం. ఖాతమ్. క. గాతాము)పల్లము,
గోయి.

సీ. గాతము గవి యన ఖాతంబు ... ఆం. భా. ౧.
౧౪౬.

మ. సలుగుల్ మట్టెలఁ దుంగవేళ్లు పెకలించన్
జెందుగాతాల దిక్కులు గంపింపఁగఁ బద్ద
యేనుఁగులపైఁ గుప్పించి సింగంపుఁబిల్లలు
...చంద్రా. ౨. ౬౪.

**గాతవ్యము.** సం. విణ. (అ. ఆ. అ) పాడఁదగినది.

**గాతి**[1]. వి. (సం. ఘాతిః. క. గాతి) దెబ్బ, చఱపు.
గాతిగొను=కొట్టు.

సీ. ... దేవరాడ్డహనదండి, యాతుపాశిమరుత్తుల
గాతిగొనిన, ధనదుఁ జెందిరి...వరాహ. ౬.
౧౩౦.

**గాతి**[2]. వి. గ్రాసము.

గీ. చెఱకులను బెల్లమును జూపి చిన్నవాండ్రఁ,
జంపి తొడవులు గొని వమ్ముసాహసమునఁ,
బాపముల కెల్ల నొడికట్టి పాయు కపుడు,శ్వ
తుఁ డీరీతి లంజియగాతికోఱకు. భల్లా. ౩.
(శ. ర.)

మ. అగసంస్తంభనమానిగాతి కటు డాయం గాక
యారాగ్నికిన్, దెగవాడన్ వనహానిదుర్వ్య
శపుటద్ధిన్ శక్యమా దాఁటఁగన్. చం. రా.
౬. ౯౦.

శ్లో. అకలశధవళేహ్యం దుశ్శమం బాడబాద్యైః
సం. చం. రా. కిష్కి౦. ౯౦.

**గాతు.** వి=అగాదు.

గాతుగావించు=అగాముచేయు, వ్రేల్చు.

(సైనికులు) గీ. లెక్క కక్కుడుగాఁ దూఁగురేకి
లాలు... పిరంగు, లొక్కమొగి గాతు గా
వింపనుక్కు మెఱసె, గుండ్లగుంపులు జడివాన
గురిసినట్లు. రంగా. ౩. ౬౬.

గాతుగా=తప్పకుండ.

ద్వి. బేతాళు నొక్కనిఁ బిలిచి నీ వింక, గాతు
గా నాకొల్వుకాఁడవై పేరిఁ,గొట్టి యుండఁజేఁ
బనిగొనుచు నిచ్చోటఁ, బెట్టింపు తగుమం చెఁ
బెంపార ననిన. ద్వి. హరిశ్చ.ఉ.౧౬౭౯ పం.

జ: గాతుకలఁగు.

**గాతుకలఁగు.** అ. క్రి. (గాతు + కలఁగు- ఇది
బోరుకలఁగువంటిది.) ఛేదిల్లు, పగులు.

క...శౌరి తామ్రధ్వజానికా..గద గొని మస్తకము గాతుకలఁగఁగ నడిచెకా. జై. భా. ౭.౧౭౯.

శీ. కాద్రవేయులకన్నులు గాతుకలఁగ, భీకరజయానకము చఱపించుటయును. వరాహ. ౧౧. ౧౨౧.

సీ. కణఁత లెల్లను గాతుకలఁగి దిక్కరులకుఁ బొటపాటఁ గన్నీటిబొట్లు పడియె. రామా. ౯. ౭౪.

గాతువు. సం. విశ (ఉ) ౧. రోషణుఁడు, కోపి.

౨. గాతుకుఁడు. వి. ఉ. పుం. ౧. గంధర్వుఁడు. ౨. మగకోయిల. ౩. గండుఁదుమ్మెద. (మే. ని.)

౪. అన్నము. స్త్రీ. పృథివి, భూమి. (కే. ని.)

గాత్రము. విశ. స్థూలము.

గీ. ఒమ్ము గాత్రమ్ము గమకము హొమ్ము నాఁగ, స్థూల మగు...ఆం. భా. ౩. ౨౦.

వి. కంఠము; కంఠస్వరము.

సీ. రహి వుట్టజంత్రగాత్రముల రాల్గరఁగించు విమలగాంధర్వంబు విద్య మాకు. మనుచ. ౨. ౪౩.

గాత్రము. సం. వి. అ. న. ౧. కళేబరము, శరీరము. ౨. అంగము, అవయవము. ౩. ఏనుఁగుయొక్క ముందటిపిక్కలు లోనగుచోటు, గజాగ్రజంఘాదిదేశము. (మే. ని.)

గాత్రసంకోచి. సం. వి. న్. పుం-అవయవములను సంకోచింపఁజేయునది-నల్లతొండ. (రా. ని)

గాత్రానులేపని. సం. వి. ఈ. స్త్రీ. పరిమళముగలలేపనద్రవ్యము.

గాథ. సం. వి. ఆ. స్త్రీ. ౧. చరిత్రము. ౨. గానము, పాట. ౩. ప్రాకృతభాష. ౪. (ఛంద) ఒకానొకవృత్తము. (మే. ని.)

గాథకుఁడు. సం. విశ. (అ. థికా. అ.) గాయకుఁడు, పాడెడువాఁడు.

గాద[1]. వి. ౧. కదుము, బొప్పి, గాదము.

ఉ...మేను పెనుగాదలు గట్టఁగ వ్రేసికొంచుఁ దన్నె చ్ఛకయున్న వానిఁ గని మే గరు దాల్పఁగ నిట్లు పల్కెనకా. వాసిష్ఠ. ౨. ౧౯౨. ('గ్రావ' శ. ర. పా.)

౨. చెమటకాయలతిఱుచు. (శ.ర.)

గాద[2]. వి. (సం. గాథా) వృత్తాంతము, సమాచారము.

గీ...తత్ప్రాణసఖులు, దేవకీదేవి కీమాట దెల్పకున్నఁ, గా దనుచుఁ జేరి చెలి యున్నగాద దెలిపి,రి... విజ. వి. ౩. ౬౯. (ప్రయోగాంతరము కనఁబడలేదు.)

గాద[3]=గాదము[2].

సీ. పైరు మునుఁగ గాద బలిసినచేలలోఁ దరలక కలుపులు దీసి తీసి. ఉ. హరిశ్చ. ౪. ౧౩.

గాదము[1]. వి. గాద, కదుము, ఘాతభవగ్రంథి.

గీ. గాద మనఁగను బొప్పి నాఁ గదుము నాఁగఁ, దగును ఘాతభవగ్రంథి...ఆం. భా. ౨.౧౩౦.

గాదము[2]. వి. కసవు, గడ్డి.

సీ. గడ్డి గాదము గవతము కసవు కవను, పుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ...ఆం. భా. ౨. ౭౬.

చ. అలఘుబలాఢ్యుఁ డయ్యును దయాళువు గావున శాంతచిత్తుఁడై, నిలిచినతంద్రికాలమున నెమ్మది గాదములోనిపోసకాయులువలె నున్నరాజులు బలారిభయంకర నిన్ను నట్లు కాఁ,దలఁచిరి దాడివెట్టి భుజదర్పముఁ జూపుము వేయు నేటికికా. వరాహ. ౩. ౨౪.

గీ...గాదమున మాటుపడి యున్నకాయపోలె. విక్ర. ౪. ౬౦.

గాదిలి. వి. ౧. కూర్మి, ప్రేమ.

గీ. అలరుఁ జుట్టము కూర్మి గాదిలి యనంగ. ఆం. భా. ౩. ౪౬. ఆం. శే. ౬.

౨. చుట్టము. ఆం. భా. 3. ౪౭.

3. ప్రియుఁడు, భర్త; ప్రియురాలు, భార్య.

ఉ...భర్త భా, గమ్ములకర్త భారతికి గాదెలి ము వ్వురతొల్త పేరు...హరి. పూ. ౧. 3.

ఉ...అల్కలోఁ, గన్నుల నిప్పు లొల్కఁ హరు గాదిలి దక్షునిఁ జూచి యిట్లనుక్. కు.సం.౨. ౧౬3.

విణ. ప్రేమపాత్రము.

సీ. కాశిరాజనువాని గాదెలికూఁతులఁ గవలవారల నతికాంతిమతుల. భార. సభా. ౧.౧౩౫.

(తల్లి కొడుకును పిల్చుట) ద్వి...యక్షేశసఖుని సన్నిధిఁ బ్రసాదంబు గొనఁగ నాగాదిలి రావె. బస. పు. ౪. ౪౪౬ పం.

గాదియ(దె)=గాదె.

సీ. ఎదురుమాతినపందిఁ గదిసి గాదియ క్రిందిపం దికొక్కని మోరఁ బట్టి కడపు...గీ. అధిప దేవరబంటు గన్నట్టిపట్టి...రా. వి. 3. ౪౫.

ద్వి. గంభీర మగుకొల్చుగాదెలలోన ... పండి తా. దీక్షా. ౪౪. పా.

సీ...కుసూలాభిధ గాదె యనంగను గరిసె య నఁగ. ఆం. భా. ౨. ౨౪౦.

గాధము. సం. విణ. (అ.ఆ.అ) మెరకగా నున్నది, లోఁతు లేనిది. (వ్యతి. అగాధము.) వి. అ. న.౧. లోఁతు లేనిచోటు, మెట్ట, మెరక. ౨.స్థానము, చోటు. 3. లిప్స, సంపాదింప నిచ్ఛ.

గాధి. సం. వి. ఇ, న్. పుం. విశ్వామిత్రునితండ్రి.

గాధేయుఁడు. సం. వి. అ. పుం. గాధిపుత్త్రుఁడు, విశ్వామిత్త్రుఁడు.

గానము. సం. వి. అ. న.౧. పాట. ౨. ధ్వని.(శ.ని.) 3. పోవుట. ౪.స్తుతి. (వాచ.)

గాని. సం. విణ. (న్. నీ. న్.) ౧. పోవువాఁడు.౨. పొగడువాఁడు. 3. పాడెడువాఁడు, గానము చేయువాఁడు. (వాచ)

గానిని. సం. వి. ఈ. స్త్రీ. కంఠస్వరము తేటపఱచునట్టియొకమూలిక, వచ, వస ౯. (వాచ)

గానుఁగ(గ్గ)=గానుఁగు. (క. గాణ. త. శాణమ్.) నూనె చెఱకురసము మున్నగునవి తీయుయంత్రము.

సీ. తిలయంత్రసంజ్ఞయై యలరు గానుఁగ యన... ఆం. భా. ౨. 3౦౨.

గానుఁగరోఁకలి=గానుఁగాడుట కుపయోగించు రోఁకలి.

చ...తదంగము లొండొకటిం బొరింబొరిం, గదియఁగ నొక్కి నొక్కి పెనుగానుఁగరోఁకట నిశుఖండముల్, చిదుపు తెఱంగునం జిదియఁ జేయుడు...పరమ. ౧. ౮౫.

గానుఁగపట్టె=గానుఁగ ఆడునపుడు గానుఁగవారు కూర్చుండుపలక.

ఉ. ఈనలినాక్షి దాఁ దిరుపుటెద్దుఁ బ్రతోదము మోపి రొప్పుచుక్, గానుఁగపట్టెపైఁ దిరుగుఁ గట్టెఁడి టిట్టిభ మందరాద్రిమం,థానకమధ్య మానతిమిఘామజల భ్రమిమండలం బధి,ష్ఠానముగా భ్రమించునలసంపద చేసియుఁ బోలుపుండుసే. క్రీడా. ౧౦3.

గానుఁగబోలు=బోటివలె నుండుగానుఁగభాగము.

సీ. బూరుగుపెనుమ్రానుపొడవు గానుఁగబోటివల ము దేహము దాకపంటినోరు. చంద్ర. వి.౧. ౮౫.

గానుఁగు(గ్గు),గానువు=గానుఁగ. వి.నూనె లోనగువానిని దీసెడియంత్రము.

క...ఆతనివంశం బెల్లక్, గానువునఁ బెట్టి యార్చిన,తేనియుఁ జాల దిది పెద్దయే దక్షునకుక్. కు. సం. ౨. ౨౫. (చూ. కల్లుగాన్గు.)

గానుఁగు(గ)ది=తిలఘాతుకురాలు.

ఉ. మానవిలోచనంబులుకు మీటిన భంగనుగుబ్బచన్నులుక్ ...మంద యానముం, గా నొనరిం

చి దీని గణికామణిఁ జేయక నిర్దయాత్ముఁడై, గానుఁగఁ దానిఁ జేసినవికారవిధిం దలమొత్తఁ గాఁ దగున్. క్రీడా. ౧౦౪.

గానుఁగు(గ)వాఁడు=తిలఘాతుకుఁడు.

సీ... తిలఘాతుకుం డొప్పఁ దెలికవాఁడు, గానుఁగవాఁ డన... ఆం. భా. ౨. ౨౮౫.

గానుఁగాడు=(నువ్వులు మొదలైనవి) గానుఁగలోఁ బెట్టి ఆడు.

(వ్యవ) దినమునకు ఎన్ని నువ్వులు గానుఁగాడుదురు.

సా: గానుఁగుఁబోటిలో చేయి పెట్టి పెరుమాళ్లకృప యన్నట్లు.

జ: గానుఁగుఁబిండి.

గానుఁగు(గ్గు)ఁబిండి. వి.(గానుఁగు+పిండి) తెలికపిండి, పిణ్యాకము.

క. దుండిగపాకుం గానుఁగుఁ, బిండియు దోపకడఁ బొరఁటి ప్రేమం దినఁగా, రెండయిదుదినములకుఁ దా, ముండుట లే దనుచుఁ బోవు నుగ్రపు బల్లుల్. (చికి. చి. ని.)

సీ... తిలపిష్టమున కగుఁ దెలికపిండి. గీ. గాన్గుఁబిండి యనంగ... సాం. ని. మాన. ౪౬.

గాబ=గాబము. వి. తృణవిశేషము. (శ. ర)

ఉదా: ఇక్కడ గాబ యెక్కువగా పెరిఁగినది.

ద్వి. గాబకోరిందలఁ గడు దట్టమైన. ద్వి. పరమ. ౬. ౪౯౯ పా. ౪ పం.

గాబము=గాబ. (శ. ర.)

గాబరా. వి. (హిం. గాబరా. బ్రా. మిశ్ర.) భయము, తొందర, కలవరము. (శ. ర.)

గాబాగూబీ. వి. అడావుడి, గడబడ.

క. నీబానిసతో త్రిదిదయ, చే బాసల నిచ్చి చాలఁ జేపట్టు మిఁకన్, గాబాగూబీ సేయక, నీబంతిని గూడు గుడుపు నిత్యము సామీ. చంద్ర. వి. ౩. ౧౪౭.

గాబు. వి. మూతివెడల్పు గలపెద్దపాత్రము, కొప్పెర.

గీ. గాబు కొప్పెర యనఁగను గర్పర మగు... ఆం. భా. ౨. ౨౪౫.

సా: గాబు వచ్చి కడముంతలోఁ దూరినట్లు.

గామ. వి. పిపీలికావిశేషము. (శ. ర.)

ద్వి. ఓసి యమంగల్య మొదవ నేడ్చెదవొ, యీసంధ్యప్రొద్దు మాయింటిముందటను, గలగొని చీమలగామలవలెను, జెలఁగుచు ముందఱ శిశువు లాడఁగను. ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౯౪ పం.

గామి. సం. విణ. (న్. నీ. న్.) ౧. పోవునది. ౨. పొందునది.

గామిడి. విణ. (సం. గ్రామణీః.) ౧. శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు.

మ... ఊరిగా, మిడిబాఁపల్ చనుదెంచి రద్దు)పద భూమీభర్తయిల్ చేరఁగన్. పాంచాలీ. ౪. ౩౭.

క. కడకడయొడయనిముంగై, కడియపునెత్తఁ బండుగామిడి మన్నుం, బడఁతుకకై యిమ్మానిసి, యొడలూనినవాఁడు నూనె యుక్కఁ దలిర్పన్. అచ్చ. రా. బాల. ౯౬.

౨. పీనము, బలిసినది.

ఉ. మో మఖిలంబుఁ గన్నుఁగవ ముచ్చట మీఱఁగ వత్సు మంతయున్, గామిడిచన్నదోయి కనుఁగొను సమస్తము మిన్న... బిల్హ. ౩. ౬౭.

౩. గయ్యాళి.

ఉ. ఆమహితాత్ముఁ డొక్కవెలయాలికి మిక్కిలి తాను గూర్చువాఁడై మనుకన్నెలంగుమ నొకప్పుడు నేమియు నీయకున్నదో, గామిడి దానితల్లి విటకంటకి యిల్వెడలింప వంత చే, భామినియింటిపంచ బహుభంగులఁ జింతిలుచుండ నవ్విటిన్. విప్ర. ౪. ౪౨.

౪. దుష్టము.

ద్వి. నామీఁదికో మ్మేల నటియెదు కోరి, గామిడిగొ ల్ల యీకానవనంబునను, మాకు నీడై యున్న యీకొమ్మె కాని, చేకొని నటియింగఁ జెట్టులు లేవె. బస. పు. 3. ౧౧౨౫ పం.

ఉ. ఏ మనుదాన నేకరణి నే మనుదాన వియోగ సాగరం, బే మని యీఁదుదాన గతి యే మని వల్కెడువారిఁ గాన హా, గామిడిదైవ మీవిత ముగా మిడిమేలపుఁజేఁత నిర్దయత్, సీమలు గానిసీమలకుఁ జెల్వఁడ యేఁగఁగఁ దెచ్చె వ క్కటా. శకాం. ౨. ౧౩౩.

జ: గామిడికత్తె, గామిడికాఁడు, గామిడిపంది.

**గామిడికత్తె**=గామిడి. (గామిడి + కత్తె - స్వార్థమున)

(దుష్టురాలు)

ఉ. సీమపాలంతు లెల్లఁ దమచేతికి వచ్చినదాఁక నోయి నా, సామి వికీర్ణకర్ణ యన సాగుదు రం తటిలోన నోయి నీ, గ్రామము నామ మెయ్యది యొకొ యనఁ జూతురు కూఁతు రావగన్, గామిడికత్తె గాసు మిముఁ గన్నులఁ గప్పకొ నంగ నేరుచున్. బహు. ౫. ౧౨౨.

**గామిడికాఁడు.** వి. (గామిడి + కాఁడు) వరాహ యూథపము, పందికదుపునకు మొనగాఁడైనపంది.

గీ. పంది సలు గేకల మ్మనఁ బరఁగు ఘృష్టి, తనరు గామిడికాఁ డనఁ దద్గణేశుఁడు...ఆం. భా. ౨. ౮౨.

**గామిడిపంది**=గామిడికాఁడు. (గామిడి + పంది)

సీ. ఘురఘురధ్వనులతోఁ గోఱలకొనఁ జిమ్ముగా మిడిపందులఁ గని తోలఁగక. మల్లు పు. ౧. ౫౯.

**గాము.** వి. (సం. గ్రహః) ౧. పిశాచము.

ఆ... బూచి, గాము సోఁకు సత్తి గాలి దయ్యము బూత, మనఁ బిశాచసంజ్ఞ లలరు నభవ. ఆం. భా. ౧. ౬౩.

గీ. నిప్పు ద్రొక్కినరీతిని నిలువ దెచట, గాము సోఁకినరీతిని గలవరించు, విత్తిగి తల మిన్ను వడిన ట్లు విన్నఁబోవు, భావజానిధాటిఁ గలఁగి రాధావధూటి. రాధికా. ౨. ౧౯.

చ. కలువలగోము జక్కవలగాము వియోగులశాము...చంద్రుఁడు దోఁచెఁ దూర్పునన్. ఘటికా. ౨. ౧౪౩. (ఇట 'పీడించువాఁడు' అని భావము.) భార. సా. ౧. ౧౫౬.

౨. సూర్యాదిగ్రహము.

సీ... నాలు, గవలగనంబున నన్నిగాములును మే ల్పొడ్కులఁ దనరార వేడ్కఁ బొదలి, మొద లిదెలంది రామునిఁ గాంచె... అచ్చ. రా. బా ల. ౮౪.

గీ. కాముఁ డనఁగ నెంత గండుఁగోయిల యెంత, సోముఁ డెంత గాలి సేమ మెంత, భీము రాము గాముఁ బాముఁ బ్రార్థించిన, భామ వారిగర్వ భంగ మగును. కవిరా. 3. ౧౫3.

గాములమేటి=సూర్యుఁడు, గ్రహపతి.

ఉ. గాములమేటి లోకములకన్న తమమ్ములమిత్తి యామినీ, భామ తొలంగుబావ ... భానుఁడు తూర్పునఁదోఁచె సత్త్వతన్. కృ. శకుం. 3. ౫౮.

ఇట్లే: గాములఱేఁడు.

ద్వి. కలువలపగవాఁడు గాములఱేఁడు. ద్వి. హరిశ్చ. పూ. ౨౨౦౧ పం.

**గాముకము.** సం. విణ. (అ. ఆ. అ) పోవునది.

**గాముకోసు.** వి. ఊరిమట్టుకోట. (చి. ని.)

**గాయకము**[1]. వి. (త. కాయకం = వ్యామోహము) మాయ, వంచన.

గీ. చాయవాటులు సన్నలు గాయకములు, మె చ్చులును దళ్ళవలు పారపొచ్చెములును, దగవులును వారకాంతావితానములకు, జలజలోచనలార నైసర్గికములు. కాళ. ౪. 3౦.

విణ. వంచకము.

గీ. ఓసి పాపాత్మురాల నీ బేసదారి, గాయకపునుద్దు

ఱెల్ల నాకాశవాణి, తెలుగ విని వచ్చి ...పా
రంగ. ౩. ౨౦౮.

ద్వి. మృత్యువు గిత్యువు మెసవంగ వెఱచు, సత్యం
తవజ్రమయం బగు నిదియు, గాయకంబులు
వల్కఁగా లేము గాని, కాయసిద్ధులు చూపఁ
గలము మే మనిన. ప్రభులిం. ౮. ౧౨౮ పా.
౨౩ పం. (గాయకములు:-కపటవచనములు.)

**గాయకము².** విణ. ప్రియము, ఎక్కువవెల గలది.

ఉదా: ఈయేఁడు మిరెపకాయలు గాయకముగా
నున్నవి.

**గాయకుఁడు.** విణ. ప్రౌఢుఁడు.

ఉ. ప్రాయపు గాయకుల్ వెలనెపాన నెగాదిగఁ
జూడ నేర్పు లౌ, రా యివి దండమీఁదఁ గొ
సరం దొరఁకొంటిరి మంచిసాములే, పో యి
టు లైనచో సరసము ల్గద మా కిపు డంచు న
ప్పురిం, గాయజాతూపు లమ్ముదురు కందువమా
టలఁ బుప్పలావికల్. విజ. వి. ౧. ౧౮.

ఉ. గాయకుఁ డొక్క గాయకశిఖామణి యాయె
డఁ దద్గుణుల్ విప, న్న్యాయతవృత్తి వర్తిలుప్రి
యవ్రతనూనునిఁ గాంచి వైశ్యరా, ధేయ సు
ధీజనావలివిధేయ భవత్సుతుఁ డిచ్చినట్టిగా,
శేయముఁ గంటె దానగుణశేఖరుఁ డంచుఁ బ
దంబు వాడినన్. బహు. ౫. ౧౫౮.

**గాయకుఁడు.** సం. విణ. (అ. యికా. అ) ౧. పాట
పాడువాఁడు. ౨. నర్తకుఁడు, నటుఁడు.

**గాయత్.** సం. శత్రు. గానము చేయుచున్న.

**గాయత్రి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ద్విజులు సంధ్యో
పాసనయందు జపించుమంత్రవిశేషము; దేవతా
విశేషము. ౨. ఆఱుఅక్షరములఛందస్సు. ౩. ఖది
రము, చంద్రకి.

**గాయనము.** సం. వి. అ. న. పాడుట; పాట.

**గాయనుఁడు.** సం. విణ. (అ. ఈ. అ) పాట పాడు
వాఁడు.

**గాయమానము.** వి. శస్త్రవిద్యాభేదము, ఒకవిధ
మగుసాదన.

వ... లోబిత్తరియు వెలిబిత్తరియు సర్పాంకుశం
బును మొదలుగాఁ గలపదిరెండుగాయమానం
బులును... ప్రబంధ. ౭౭.

సీ... సాదకాఁ డనఁగను శస్త్రదక్షుఁ. గీ. డలరుఁ
దద్విద్య సావన యనఁగ నెగడు, నలుకు పరు
వడి గాయమానంబు విసరు, మొన లనంగను ద
ద్భేదములు చెలంగు. ఆం. భా. ౨. ౨౦౫.

**గాయము.** వి. (క. గాయ. త. కాయం) కత్తి లో
నగువానితాఁకునఁ గల్గుదెబ్బ, క్షతి, నలుకు.

శా... అతఁడుల్ రాకాసి మేల్బంతిపైఁ, దేజారం
బెడిదంపునారసము లెంతేని న్వడి న్వైచి
మే, న్గాజుంబూసకు సందు లేక కదియం గా
యంబులం జేసినన్. అచ్చ. రా. యు. ౫౦౩.

క. ఇవి పందికొమ్ముగాయము, లివి సింగపుఁగోఱ
జీర లివి యేనుఁగుపో, ట్లివి పులిగోరులచెనకు
లు, నువుగింజకుఁ జో టిడము తనువు గనుము
నృపా. రా. వి. ౩. ౮౭.

గాయము చేయు = గాయము కలదిగాఁ జేయు.

వ... కయ్యంబునఁ బాఱఁ బాఱఁ గాయంబు గా
యంబు సేసి ... ఆము. ౬. ౭౬. (వ్రాఁతప్రతి.)

**గాయము.** సం. వి. అ. పుం. ౧. పాడుట. ౨. పాట.

**గార¹.** వి. (సం. క్షారః. క. గారె. త. కారై.) ౧.
గోడ లోనగువానిపూఁతకై ఇసుకఁ జేర్చి దంచి
నసున్నము.

సీ. కంకర బెండడి గార సోద యనంగ లేపవిశే
షమై తోఁపఁ దగును. ఆం. భా. ౨. ౧౭.

సీ. చికిలిప్రాఁగింపుటిట్టికలగోడలు వెట్టి వజ్రంపు
గారలపను లొనర్చి. ఉ. రా. ౨. ౭౨.
పాండు. ౫. ౨౭౮.

౨. డాఁగు, మఱక.

ఉదా: తాంబూలపుగార.

౩. పట్టు.

ఉదా: కంటికి నల్లమందుగార వేసినారు.

౪. రత్నదోషవిశేషము.

క. ఈరత్నమునకుఁ బ్రిప్పియుఁ, గారయుఁ గర్కశము నసఁగఁ గసరులు మూఁడే, పాయు నవి యెల్లఁ దెలియక, వారక ధరియింప జగతి వల దెవ్వరికిన్. రత్న. ౨౮.

జ: గారకాఁడు.

గార². వి. ౧. ఇంగుది, ఒకానొకచెట్టు. (దీనికి సాలగ్రామనిఘంటువులో 'జలజంతువినాశక' మనుపర్యాయపదము కలదు. సాల.ని.౬౭౦ పా)

గీ. గాలములు నైచువారవి కావటంచుఁ, బెనువల లవేయువారవి పనికిరావటంచు నడి గారచెక్కకై యఱచువారు, నైనయసురుల కనియె మత్స్యంపుమూర్తి. దశా.౧.౨౭౯.

సీ... గార యనంగ నలరు నింగు.గీ.దియు...ఆం. భా. ౨. ౪౭.

౨. గారచెక్కతో తీసినగంధము.(ఇది త్రాఁగిన చేఁపలు మత్తెక్కి పడిపోవును. బ్రౌ.)

గీ. గారఁ ద్రావినమీనుసంగతి మనోజ, వేదన నతండు పొరలఁ దన్విఁయు నెఱింగి, తనవలకుఁ జేరెఁబో బోడిదాస రనుచు, డెందమునఁ జాల సంతస మంద నంత. వైజ. ౨. ౧౪౦.

ఆ. వలలు దారు నింక వచ్చి జాలరివేఁట, కాలు నేలు గలఁచి గారవెట్టి, మిడిసిపోవనీక మెడఁ బట్టుకొనియెద, రప్పు డెందుఁ జొత్తు నన ఘుచరిత. భాగ. ౮. ౬౯౬. ద్వి. తి. సా. ౪౨ పా. ౧౧ పం. దశా. ౧. ౧౫౪.

గారపిండి=గారకాయలపిండి.

ద్వి. మొనసి తిలోదకములు వోసి వగలు, పెనఁగొన మఱి గారపిండి చేఁ బుణ్య, ధను లర్థిఁ బిండప్రదానము ల్చేసి. రం. రా. అయో.౧౩౮ పా. ౨౯ పం.

గారకాయ=ఇంగుదీఫలము; గారకాయలో మందుకూరి చేసిన ఒకానొకబాణసంచు. (వా)

గారనూనె=ఇంగుదీతైలము, గారకాయలనుండి తీయునూనె.

గార³. వి. ఒకజాతిచేఁప. (బ్రౌ)

గారకాఁడు. వి. (గార¹ + కాఁడు) నూసరి, గచ్చుపని చేయువాఁడు.

సీ... మీఱు నూసరి యన గారకాఁడు ... ఆం. భా. ౨. ౨౮౨.

గారడము. వి. (సం. గారుడమ్. క. గారడ. త. కారడం) ౧. విషమంత్రము. (శ. ర.) ౨. మాయ.

గీ. గారడపురక్కసుని నెంచుఁ గానకుండి, రి... అచ్చ. రా. యు. ౩౨౭.

క. తలఁపున నిది గారడ మని, తలఁచకు మాసింగఁ డల్లతఱిఁగొండదరిన్, దల మోచి తెచ్చినవి యివి, తల నుంచుము పసిఁడితాయెతల నుంచి నృపా. శుక. ౧. ౧౫.

జ: గారడి, గారడీ, గారడీఁడు.

గారడి. వి. (గారడము + ఇ)పాములు పట్టువాఁడు, గారడీఁడు.

గీ. వ్యాళసంగ్రాహినామమై వఱలు గార, డీఁ డనంగను బాములవాఁ డనంగ, గారడి యనంగ...ఆం. భా. ౧. ౧౪౮.

గారడీ=గారడము. వి. (√ గారడము. క. గారడి) ఇంద్రజాలము; మాయ. (బ్రౌ, వా)

గారడీఁడు. వి. (గారడి + ఈఁడు–స్వార్థమున) ౧. గారుడమంత్రము తెలిసినవాఁడు, పాములవాఁడు.

ఆ. అను నెఱింగి భూపుఁ డనుపాముఁ బట్టియాడించు మంత్రి గారడీనికరణి. ద్వా. ౧. ౧౯౪.

గీ. వ్యాళసంగ్రాహినామమై వఱలు గార, డీఁ డనంగను బాములవాఁ డనంగ, గారడి యనంగ ...ఆం. భా. ౧. ౧౪౮.

౨. (గారడీ + ఈఁడు) ఐంద్రజాలికుఁడు.

గీ. ఐంద్రజాలికసంజ్ఞయై యలరుచుండు, గారడీఁ డన... ఆం. భా. ౨. ౨౧౩.

**గారము.** వి=గారవము.

(అపేక్ష; వలపు.)

సీ. కందుకక్రీడపై గారంబు వచరించువాస్తాబ్జము లఁ బూనె నతుమాల. హర. ౪. ౧౧.

(ఆకాశవాణిమాట) ద్వి. సఖియ నీయింటికి సారం గధరుఁడు, ఒకపావురముపెంట నుతికి రా లే దె, రాఁగానె నీవు గారముచేయ లేదె, బా గుగా నీకాళ్లఁ బడి మ్రొక్క లేదె. ద్వి. శ. సా. 3. ౧౦౪ పా. ౧౨ పం.

(మైత్రి.)

గీ. పొం దొరిమె పొత్తు గారము పొందికయునఁ, బరఁగుచుండును మిత్రభావంబు... ఆం. భా. ౨. ౧౫౬.

విశ. అధికము.

క. నూరెల ముదికొముదిసిం, గారము గారమయి పాముకస్వరె మెఱుఁగుల్, వాఱుచెలువారు నొకతెలి, పొరువమిట వ్రాలె వెఱఁగుపడి వడిఁ జూడన్. సారంగ. ౨. ౨౦౩.

**గారవము**=గారము, గారాబము, గారాము. వి. (సం. గౌరవమ్. ప్రా. గారవం.) ౧. గౌరవము, ఆదరము.

ఆ. మత్స్యవిషయరాజ్యమహిమకు యుక్తుఁడు, గాఁ దలంచెనేని గారవమున, నట్ల చేసి భక్తి ననుచరింతు నమాత్య, సుతసుహృద్భటార్య యుతము గాఁగ. భార. విరా. ౧. ౧౫౫.

౨. గొప్పతనము.

సీ. నిండుఁగొల్వునను గూర్చుండి ధర్మజాతోడఁ గార్యంబు దెలిపెడిగారవంబు. దశా. ౧. ౯౪.

౩. ప్రేమ, అనురాగము; వాత్సల్యము.

క. ఈరాజు రాజముఖియును, గారవమునఁ గల సి మెలసి కందర్పునుఖ, శ్రీరతులై విహరించె ద, రీరీతిని మనము నునికి యెంతయు నొప్పన్. విక్ర. ౭. ౧౫.

క. ఆరాజర్షియు దానికిఁ, గారణ మమ్మునియు గాఁ బ్రకాశజ్ఞానో, దారమతి నెఱిఁగి కన్నియ, గారవమునఁ గొని పులస్త్యుకడకుం జనియెన్. నిర్వ. ౨. ౨౭.

౪. ముద్దు, లాలనము.

గీ. చెంచుఁజిపురాఁబోఁటులచేత లెల్ల, నభిన యింతురు పర్ణశాలాంతరములఁ, దండ్రు లెం దేని చనుసప్డ తల్లు లెదుర, గారవము సేయ ము నికన్యకాజనంబు. హర. ౫. ౩౭.

౫. రీతి, విధము.

సీ. శిబిపోలిక మనుత్తుచెల్వునను దిలీపుకరణి సు హోత్రుని గారవమున. విక్ర. ౨. ౬౯.

జ: గారవించు, గారవిల్లు

**గారవించు.** స. క్రి. (√ గారవము) గారవము చేయు.

(ఆదరించు.)

గీ. నాకుఁ బ్రాణంబుప్రాణమై నన్నుఁ దన్న, కాఁగ భావించి యాదేవి గారవించు. భార. విరా. ౧. ౩౧౬.

చ. అనవుడు నక్కరాఁ బనిచి యప్పలి గౌఁగి టఁ జేర్చి బాష్పముల్, గనుఁగవఁ గ్రమ్మ నుజ్ బలుకులం దగఁ బెద్దయు గారవించినన్. భా. ౪. కాం. 3. ౭౪.

(గారవము చేయు.)

శా. ...న న్నవను శ్రీనాథాఖ్యునిం బిల్చి సత్కా రం బొప్పఁగ గారవించి పలికెన్ గంభీరవా క్ప్రౌఢిమన్. నైష. ౧. ౧౨.

(లాలనచేయు)

సీ. తనమంజులాలాపతతిఁ గూడి భాషించుకీరం బు నొకకేల గారవించి. విక్ర. ౨. ౨౩.

సీ. ...కార్తికేయుని కూలి గారవించి, ముద్దాడు నెడ... శి. హరి. ౫. ౬.

**గారవిల్లు(లు).** అ. క్రి. (√ గారవము) గారవము నొందు.

(లాలనమును పొందు)

(బభ్రువాహనుని శైశవవర్ణన.) సీ. తనవంశకర్తను త్పలబాంధవునిఁ బోలుఁ గరము లర్తిలిఁ జూఁచి గారవిలుట. విజ. వి. ౨. ౪౦.

(అనురాగమునొందు, వలపుఁజెందు.)

క. చెలువా పదివే లైనను, విలువా నినుఁ జూచి గారవిలువారలకున్. చంద్ర. ౪. ౧౧౪.

(గౌరవము నొందు)

ఉ. ...తమ్ములు గల్గి గారవిలుధన్యులసంపద కోటి లెక్క...ల. వి. ౩. ౫౫.

**గారాబము.** వి=గారవము.

(వాత్సల్యము.)

(రేవతి)ఆ.ఏఁటఁ బెంచుదానిఁ బూఁటఁ బెంచె న టంచు, జనులు పల్కు పలుకు సత్యముగను, గన్నతల్లి మిగుల గారాబమునఁ బెంపఁ, బెరిఁగెఁ జైత్రలతిక పెంపు మీఱ. దశా. ౭. ౭౦.

(గొప్పతనము)

క. వారలలోఁ గౌసల్యా, నారీమణి యఖిలపావనశ్రీమద్గర్భారూఢలక్షణంబుల, గారాబముఁ జెంద విభుఁడు గడు రంజిల్లన్. రామా. ౩. ౭౧.

విశే. ప్రేమాస్పద మైనది, ప్రియము.

సీ. రాజశేఖరునిగారాబంపుఁబూఁదోఁట విపులామహాదేవివెల్లచేల...గీ... అంబురాశి. చిత్రభా. ౫. ౫.

**గారాబు.** విశే. ప్రియము.

గీ. సోమమకుటునిగారాబుజోటి యైన, దక్షవాటికఁ బ్రతిమహోత్సవమునందు. భీమ. ౩. ౬౨.

సీ. కమలాప్తసారథి గారాబుఁదమ్ముండు ...పారి. ౨. ౯౧. అచ్చ. రా. యు. ౪౯౧.

**గారాము.** వి=గారవము.

(గొప్పతనము)

సీ. మారేడుపండులగారాము పెంచునీయొలచన్నుఁగవ వేడుకలఁ బొనర్చ. భార. అను. ౧. ౫౦.

శా. ఈరూపే కలలోఁ గలం గలచె నన్నేరూపుత్రోవం జేరు నా, కీరూపింతటి చేటికాఁ బసికిఁదా నిల్లాలుగా నోముననగ్గారా మేలరితాంగికిం గలుగు...ఉ. హరి. ౫. ౧౫౫.

(ఆదరము.)

క. ఆరాజు సేయుసెయ్యము, గారాముసు జెప్ప దీవు గడుఁ దీపుగా. భార. ఉద్యో. ౧. ౩౪౦.

(మరియాద, గౌరవము.)

ఆ.విగతనాథ లైనమగువలగారాము,పెడక యుండునట్లు నడపికొనుచు. భార. మా. ౧౯౫.

(కామోద్రేకము)

శా. ఆరామామణిమీఁదిప్రేమమున నిట్లారామసీమాసర్గో,వారంబు ల్గిలకించి యందు నతిదుర్వారంబులై మీఱుచున్,గారావంబులచేవనంగరుజ వొంగారం గురంగాక్షి కృం,గారాగారముఁ జేరి తాల్మి నిలుపంగా రాక గారామునన్. వసు. ౩. ౭౩. (మా. ౭౪.)

విశే. అనుఁగు, ప్రియ మైనది.

సీ...భూరిశ్రవసుఁడు నీదు, గారాపుఁబట్టి... భార. స్త్రీ. ౨. ౧౨౯.

శా... మారయసుఁ బుణ్యాచార భీమాంబకు,గ్గారా మైనతనూజు నన్ననఘు శ్రీనాథాఖ్యునిం బిల్చి...నైష. ౧. ౧౨. నీలా. ౧. ౧౨.

(గౌరవపాత్రము)

క. దేవకియును రోహిణియును, రేవతియును రుక్మిణియును ప్రియము లెసఁగ సంభావనలొనర్ప గారా,మై వెలసె బలీంద్రుపౌత్రియుదుతతి కెల్లన్. హరి. ఉ. ౭. ౨౯౯.

గారిత్రము. సం. వి. అ. న. అన్నము. (కల్ప)

గారు. వి. జౌ. ఇది తఱుచుగా స్త్రీసమములగు నేక వచనాంత దేశ్యశబ్దములకుఁ గొన్నింటికి చివరఁ జేర్పఁబడి పూజ్యతను దెలుపును.

ఉ...కూరిమియుల్లు నంపుకో, నెట్టిరిపోవ మాన్పు నుదయించెకో మానుసనక్కగారికిన్. నైష. ౭. ౪.

గీ. కదిసి నిలుచున్న సౌమిత్రి నదిసె గారి, జిలుఁగు నవ్వులు మగతాళిమిలుకతారి, నవఁగె పెనఁగఁ ద్రిలోక మోహనవిలాస, ధాముఁడై మించె సీతాభిరాముఁ డపుడు. ఉ. రా. ౬. ౧౧౯.

ద్వి...మసణయ్యగారు...పండితా. దీక్షా. ౬౦పా.

ఉదా: నాయుఁడుగారు, సోమయాజులుగారు.

ఉ. నన్నయభట్టుగారు యజనం బొనరించినచోట జన్మించె, ట్టున్నది...(చాటువు)

గారుడము. సం. విశ. (అ. ఈ. అ) ౧. గరుడాకారము గలది. (వ్యూహము, మొ.) ౨. గరుడసంబంధమైనది, గరుడుఁడు దేవతగాఁ గలది. (అస్త్ర మంత్రాది) వి. అ. పుం. న. ౧. గరుడపచ్చ. ౨. విషమంత్రము. ౩. గరుడాస్త్రము. ౪. గరుడవ్యూహము. ౫. బంగారు. ౬. గరుడపురాణము.

గారుడికుఁడు. సం. వి. అ. పుం. విషవైద్యుఁడు, పాములవాఁడు.

గారుత్మతము. సం. విశ. (అ. ఈ. అ) ౧. గరుడాకారము గలది. (వ్యూహము, మొ.) ౨. గరుడుఁ డధిదేవతగాఁ గలది. (అస్త్రము, మొ.) వి. అ. న. గరుడపచ్చ.

గారె. వి. భక్ష్యవిశేషము, మినుపపప్పు రుబ్బి చేసెడివడ.

సీ. గారెలు బూరెలు చాపలు మోపులుఁ గమ్మని మాంసముల్ ఘుమ్మమనుచు. ఉ. రా. ౬. ౧౨౨.

మ. కుసుముల్ గారెలు బెల్లమండెఁగలు... రామా. ౨. ౧౧౫.

సా: కడుపు నిండినవానికి గారెలు చేఁదు.

గార్గ్యుఁడు. సం. విశ. (అ. గ్రీ. అ) గర్గునివంశమున పుట్టినవాఁడు.

గార్దభము. సం. వి. అ. పుం. గర్దభము, గాడిద.

గార్ధ్యము. సం. వి. అ. న. పేరాస, తృష్ణ.

గార్ధ్రము. సం. విశ. (అ. ఈ. అ.) గృధ్రసంబంధమైనది. వి. అ. న. బాణము.

గార్భము. సం. విశ. (అ. ఈ. అ) గర్భసంబంధమైనది.

గార్భిణము. సం. విశ. (అ. ఈ. అ.) గర్భిణికి సంబంధించినది. వి. అ. న. ౧. గర్భిణీసమూహము. ౨. సీమంతోన్నయనము, గర్భిణీసంస్కారవిశేషము. (శే. ని.)

గార్హపతము. సం. విశ. (అ. ఈ. అ.) గృహపతిసంబంధమైనది. వి. అ. న. గార్హస్థ్యము, గృహస్థధర్మము.

గార్హపత్యము. సం. వి. అ. పుం-గృహపతితో నిత్యము కూడి యుండునది- అగ్నిహోత్రభేదము, శ్రౌతాగ్నులలో నొకటి. (గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అని శ్రౌతాగ్నులు మూఁడు.) న. గృహపతిత్వము, గార్హస్థ్యము.

గార్హము. సం. విశ. (అ. ఈ. అ) గృహసంబంధమైనది.

గార్హస్థ్యము. సం. వి. అ. న. ౧. గృహస్థాశ్రమము. ౨. గృహస్థుఁడు ప్రతిదినము నడుపింపవలసిన పంచయజ్ఞములు, మొ.

గాలగాఁడు. వి. (గాలము+కాఁడు.) గాలము వేసి చేఁపలు పట్టువాఁడు.

సీ...పాపనిర్ముక్తుఁడై మతి యోగ మాచరింపఁగ యోగ్యుఁ డగు నరుండు. గీ. మనను పట్టుట మత్స్యపుటనువు దాని, కామిషము గాలగాని కేట్లట్లు... భార. అను. ౫. ౨౫౬.

**గాలనము.** సం. వి. అ. న. ౧. వడఁబోయుట. ౨. ద్రవింపఁజేయుట, కరఁగించుట. ౩. శాపము, తిట్టు.

**గాలపుఁజొవ్వ.** వి. (గాలము + జవ్వ) చేఁపలను బట్టుటకుపయోగించుసన్నని పొడుగైన నరము. (బ్రౌ)

**గాలము=గాలాము.** వి. (సం. గాలమ్. క. తు. గాళ.) ౧. చేఁపలను బట్టుటకు ఉక్కుకమ్మితో వంకరగాఁ జేసినసాధనము, బడిశము. (దీని భేదములు:- ఉంటగాలము, గోరుగాలము, మొ.)

సీ...బడిశ మొసఁగు, గాల మంచనఁగను. ఆం. భా. ౧. ౧౫౯.

ఆ. నీళ్లలోని చేఁప నెఱి మాంసమాశకు, గాలమందుఁ జిక్కు కూలు నట్టి, యాశ పుట్టి మనుజుఁ డాఁశతిఁ జెడిపోవు...వేమన. ౧. ౫౫.

చ. కలువలవిందు జక్కవలగాలము తమ్ముల కెల్లవైరి చుక్కలచెలికాఁడు...భా. రా. యు. ౨౬౪౭. (ఇట 'బాధకుఁడు' అని భావము.)

గీ. అనిమిషులగుండెలో గాలము...ఉ. రా. ౧. ౧౪౯.

౨. నూతిలోని చేఁద మున్నగునవి తీయుట కుపయోగించుసాధనము. (వా)

జ: గాలగాఁడు, గాలపుఁజొవ్వ.

**గాలము.** సం. వి. అ. పుం. ౧. గళనము. ౨. మదనము, 'ఉమ్మెత్త'. న. ౧. ఉమ్మెత్తకాయ. ౨. బడిశము, గాలము. (కే. ని.)

**గాలవము.** సం. వి. అ. పుం. లొద్దుగు, లోధ్రము.

**గాలాము=గాలము.**

సీ. వాలాయుగోరు మేల్ గాలాముచేసె నేఁటేఁటి హిరణ్యాసుశీకములకు ... గీ. అనృహార్య తుషర్యుండు...పాండు. ౨. ౧౩౭.

క. చాలఁ గుఱుంగటిముమ్ముఁగుల, గాలాపుఁ బ్రేఁటలాడఁగా దొరకినబల్లీలు చవిఁ దేల్చె నపుడా, పాలెంబున డిగినబక్కబంట్రౌతులనుకాఁ. కుచేల. ౨. ౧౦౮.

**గాలి.** వి. (క. గాళి. త. కాల్. తు. ఘాళి) ౧. వాయువు.

సీ. కమ్మనిచల్లనిగాలి మెల్లన వీచె హోమానలంబు సెన్నొంది వెలిఁగె. భాగ.౧౦ పూ.౧౦౫. ఆం. భా. ౩. ౫౩.

౨. మృగాదివేద్యగంధము, పసి.

సీ. ఇది గాలిగనిన మూకవరాహదనుజేంద్రు నైన జుట్టెంటిలోఁ నాఁగఁ జాలు. మనుచ. ౪. ౩౧.

(సూకరము) సీ. ఎగుచుకూఁతలు ముట్టె యెత్తి వెట్టాలించి గమికిఁ గన్నాకయి గాలి యరయు. మనుచ. ౪. ౪౨.

౩-వాయురూపమున నుండునది-పిశాచము.

క. అన విన వదరకువే యీ, తని కేమియు లేదటంచు దానిపిఱుందన్, జని వీరుఁ డతనియాకృతిఁ, గని త్రోవం గాలి సోఁకెఁ గావలె ననుచున్. శుక. ౨. ౫౩౯.

సీ. పవనపిశాచము ల్పరఁగు గాలి యనంగ...ఆం. భా. ౩. ౫౩.

౪. పశువులకు తగిలెడివ్యాధివిశేషము. (దీని భేదములు:- కాలుగాలి, నాలుకగాలి.)

కాలుగాలి = పశువులకు గొరిజలయందు పుండుపడెడివ్యాధి, గాలికుంటు. (వా)

నాలుకగాలి = పశువులకు నాలుకయందు పుండుపడెడివ్యాధి. (దీనినే 'నోటిగాలి' యందురు.)

క. తైలంబు కోద్రవాన్నము, మాలిమితో నేడుమార్లు మంత్రించియు గో, జాలంబులకును బెట్టిన, నాలుకగాళ్లంటవండ్రు. ... పశువైద్యశాస్త్రము. ౭౯.

గాలితేరెక్కుమన్నఁడు = (మలయవాయువు రథముగాఁ గల ప్రభువు) మన్మథుఁడు. ఆం. భా. ౧. ౪౫.

గాలిపాట=నేర్చుకొనకుండ వినికివలన వచ్చిన గానము. (వా)

గాలిబ్రతుకు, గాలిజీవనము= స్థిర మైనజీవనోపాయము లేనిబ్రతుకు. (బ్రా)

గాలికవణంబు మేపుడు=భవనాశనము, పాము. అచ్చ. రా. యు. ౭౯౩.

జ: గాలిఁబుచ్చు, గాలిఁబోవు, గాలికుంటు, గాలికొమ్ము, గాలిగంగలు, గాలిగాఁడు, గాలిగుడి, గాలిగూఁడు, గాలిగొను, గాలిగోపురము, గాలిగుడ్డు, గాలిచీర, గాలిచూలు, గాలిదిండి, గాలిద్రిమ్మరి, గాలినెచ్చెలి, గాలిపంట, గాలిపటము, గాలిపడగ, గాలిపిశాచము, గాలిబిళ్ల, గాలిమాట, గాలిమెకము, గాలిమేఁతరి, గాలివాన, గాలివేఁత.

**గాలి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. నింద. (వై. ని.) ౨. శాపము, తిట్టు. (విల్యమ్సు, ఆ. ని.)

**గాలించు.** స. క్రి. ౧. నీళ్లలో పోసి బియ్యములో నగువానిని రాళ్లు రాకుండ పైకి తీయు. (బ్రా) ౨. శోధించు, వెదకు.

సీ...కోటగవఁకు, లారసి బలితంపుఁదేసులు గాలించి...అచ్చ. రా. సుం. ౮.

మ...వీఁక నొక్కట లంకాదినిశాటకోటి నుదధింగాలించి కారించెదన్. భా. రా. సుం. ౧౨౭.

గీ. మేఁక మెడచన్నులకుఁ బాలు మేడిపూలు, లేవు త్రిభువనములను గాలించి చూడ. వేణు. ౮౫.

జ: గాలింపు.

**గాలింపు.** వి. (√గాలించు) శోధనము, వెదఁబోఁత.

సీ...వడిఁగట్టు గాలింపు కడుగు డేరు. గీ. పలు వనఁగ శోధనాభిధ వరఁగుమందు. ఆం. భా. ౨. ౨౫౨.

**గాలిఁబుచ్చు.** అ. క్రి. (√గాలిఁబోవు) గాలిఁబోవఁజేయు. (వ్యర్థముచేయు.)

శా. వాలుం గేలున నంటఁ బట్టుకొని జీవం బింత నిస్సారమే, యేలా సాహస మింత క్రూరమతి పై యేకాంత మిక్కాననలో, గాలింబుచ్చెదు పౌరుషం బిది విను గానం గదన్ దోస మీ, బేలుం జెప్పికతంబు చెప్ప నినుఁ సంప్రీతాత్మునిం జేయుదున్. దశకు. ౬. ౬.

**గాలిఁబోవు.** అ. క్రి. (√గాలి) ౧. గాలికి కొట్టుకొనిపోవు; నశించు.

గీ. గాలిఁబోయెడువరుగాకుగతిఁ గరంబు, తూలిపోయెడు నెమ్మనితోడఁ జనుచు, విప్రవర్యుండు కన్నులవిందు గాఁగ, వీక్షణము చేసె రుక్మిణీవిభుపురమ్ము. కుచేల. ౨. ౭.

(చంద్రోపాలంభనము.) సీ. ఎప్పుడు జంకించు హృజ్జాతశింజినిఁ గావరంబునఁ దన్ను గాలిఁబోవ. వరాహ. ౪. ౨౧.

౨. వ్యర్థమగు.

ఉ...వాఁడాయతశక్తి నన్ను నిట నంకిలివెట్టిన నప్పురామభూ, నాయకునాజ్ఞ గైకొనిన నాపని చెల్లక గాలిఁబోవదే. భా. రా. సుం. ౭౧.

**గాలికుంటు.** వి. (గాలి+కుంటు) పసువులకు గొరిజలయందు పుండుపడెడువ్యాధి. (శ. ర.)

(వ్యవ) వారిగేదకు గాలికుంటు తగిలినది.

**గాలికొమ్ము.** వి. (గాలి + కొమ్ము) వాద్యభేదము.

సీ. గాలికొమ్ములు డోళ్లు కైముళ్లు రుంజలు ... మొ. రా. యు. ౩. ౨౬.

**గాలిగంగలు.** మి. వి. బ. (√గాలి) పిశాచరూపము గలక్షుద్రస్త్రీదేవతలు.

క. అతఁడేఁ దన్నగరిపతి, జాతర సాటించెఁ బహువిసర మనితరసా, ధ్యాతతవాతామయుని, ఘ్రాతావాతిఁ దూల గాలిగంగల కెల్లన్. పాండు. ౩. ౭౩.

**గాలిగాఁడు.** వి. (గాలి+కాఁడు)- గాలివలె అంతటను దిరుగునది-గాడిద.

చ. ...అనఘుతఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడు మీఁద బెత్తుగాఁ, గనుఁగొని గాలిగానికడకాళ్లకు మ్రొక్కఁడె నాఁడు భాస్కరా. భా. శ. ౩౮.

సీ...రేవుగుఱ్ఱము గాలిగాఁడు, గాడిద యనఁగను ఖరము రాఁగిలుచుండు...వేంక. ౯౮.

**గాలిగుడి.** వి. (గాలి + గుడి) సూర్యచంద్రులకుఁ జుట్టు నేర్పడెడుమండలము, పరివేషము. (శ.ర)

**గాలిగూఁడు.** వి. (గాలి+గూఁడు) గాలికి ఆఱుటకై గూఁడువలె ఏర్పఱచిన పనలకుప్ప. (వా)

**గాలిగొను.** అ. క్రి. (గాలి+కొను) గాలిచే తడియాఱు.

వ... తిత్త్రొలిచి గాలిగొన వైచినకుక్కకళిమంబుఁ గనుంగొని...భార. శాం. ౩. ౨౮౫.

**గాలిగోపురము.** మి. వి. (గాలి+గోపురము) మిక్కిలి యెత్తుగా నుండుదేవాలయపుగోపురము.

**గాలిగ్రుడ్డు.** విణ. (గాలి+గ్రుడ్డు) ౧. అవివేకి, తెలివిమాలినవాఁడు. (బ్రా.) ౨. పేద. అప్ర. (శ.ర.)
వి. ౧. గ్రుడ్డువలె ఎండమావులలో గానఁబడుధూమవికారము. ౨. హనుమంతుఁడు. (చి. ని.)

**గాలిచీర.** వి. (గాలి+చీర) ౧. తెరచాఁప.

సీ. అఖిలభూతదయాపరాయణత్వము లిపికాఁడు వైరాగ్యంబు గాలిచీర. గీ... మురారిచరణరాజీవభక్తి, గౌరవం బనుపేరోడ...వరాహ. ౫. ౭౬.

౨. గాలి చొరకుండునట్లు కన్నమునకు కప్పెడు చీర, చోరసాధనవిశేషము.

మత్త. గాలిచీరయు నొల్కి-బూడిద గ్రద్దగోరును గొంకియుఁ, గోలయుఁ వెలుఁగార్చు పుప్పలక్రోవి ముండుఁబంతియుఁ, మైలమందులకొయ్య గత్తెర మాఱుఁగన్న పుఁగత్తియున్, నీలిబిందును వల్లఫ్రూఁతయు నేప్ప తోడుగ మ్రుచ్చులున్. ద్వా. ౧౦. ౧౧౮.

**గాలిచూలు(లి).** వి. (గాలి+చూలు) ౧. అగ్ని. ౨. భీముఁడు.

గీ. తుంగమదువున నాదుమాతంగవిభుని, భంగి భవదీయసైన్యంబు బడలువడఁగ, లీల నిస్సంభ్రముం డయి కేలి సలిపె, గాలిచూలప్డు గగనచరాలి వొగడ. భార. భీష్మ. ౨. ౨౨౨.

౩. హనుమంతుఁడు.

ఇక్లే:- గాలిపట్టి.

సీ...కడిఁది పులుఁగు, నకుఁ దగినట్టిచందము దీర్చి యురుగుమఁ బంపచేయవ గాలిపట్టిఁ గాంచి. యయా. ౩. ౨౧.

**గాలితము.** సం. విణ. (అం.త్రి.అ) ౧. వడఁబోయఁబడినది; వస్త్రాదులలో పోసి మెత్తనిది క్రిందికి దిగునట్లు చేయఁబడినది. (పిండి, మొ-ఉదా: వస్త్రగాలితము, మొ.) ౨. కరఁగింపఁబడినది.

**గాలిదిండి.** వి. (గాలి+తిండి)-పవనాశనము-సర్పము.

గీ. మీలు కప్పలు తాఁ బేళ్లు గాలిదిండ్లు, మొసళులెండ్రులు నెగడులు మొదలు గలుగు, నీరుద్రిమ్మరిపసుపులు...అచ్చ. రా. యు. ౩.

**గాలిద్రిమ్మరి.** వి. (గాలి+త్రిమ్మరి)-గాలిరూపమునఁ దిరుగునది-పిశాచము.

సీ. ఏమీ పిశాచంబ యీళ్వరుండే నిన్ను భేదబుద్ధినిఁ బంపఁ బ్రేరకుండు, కాక భూసుర యేను గర్తనే యయ్యాశుననుమతి మ్రింగెద వంటి నిన్ను...గీ. గాలిద్రిమ్మరి యీశుం డకల్మషుండు, హింసఁ జేయించునే కాల మింతె గాక, యోరి వినరోరి జాలిమాత్రోపజీవి, కాలమని యీశుఁ డని వేఱు గాదు ... శ్రీరం. మా. ౬. ౧౧.

**గాలిని.** సం. వి. ఈ. (స్త్రీ.) (మంత్ర) ముద్రావిశేషము.

**గాలినచ్చెలి.** వి. (గాలి+నచ్చెలి) వాయుసఖుఁడు, అగ్ని. ఆం. సం. దేవ. ౧౫.

**గాలిపంట.** వి. (గాలి+ పంట) నిర్ణయము లేనిపంట. (శ. ర.)

**గాలిపటము.** మి. వి. (గాలి+పటము) ౧. పిల్లలు గాలిలో నెగురవేసికొనుటకై కాగితము మున్నగువానితోఁ గట్టినపటము, గాలిపడగ.

మ. అనుదారక్ష రఘువీరుఁ డొక్క తతి బాల్య క్రీడ మారీచము, వ్కరుమే నాళుగయుక్తి గాలిపటముంగా వింట నాడింపుచుక్. చంద్రా. ౧. ౨౧. శుక. 3. ౪౪౭.

౨. బాలక్రీడావిశేషము, గాలిపటముతో ఆడుడుకొనుఆట.

సీ...దోఁపిల్లు గాలిపటంబు సరి చేసి పుటచెండు చాకిమూట. హంస. 3. ౧౪౬.

**గాలిపడగ.** వి. (గాలి+పడగ) గాలిపటము.

గీ. అలజాలంబు నీటిపై నాడుజాడ, గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ, నిదురలోపలఁ గలఁ దోఁచు నీడ పిదపఁ, గానవచ్చునె యప్పుడ కన్నఁ గాక. ఉ. హరి. ౫.౧౧౦.

**గాలిపిశాచము.** మి. వి. (గాలి+పిశాచము) గాలిరూపమున నుండుపిశాచము. వేం.పంచ. ౧.౨౪3.

**గాలిబిళ్ల.** వి. (గాలి+బిళ్ల) గొదలు వాఁచెడురోగవిశేషము, గొదబిళ్ల. (బ్రౌ, వా)

**గాలిమాట.** వి. (గాలి+మాట) లోకప్రవాదము, జనశ్రుతి.

సీ. మలయమారుత మైన మెలఁతఁ దెచ్చు నటన్నఁ గానరా దదియును గాలిమాట. తపతీ.౨.౭౯.

**గాలిమెకము.** వి. (గాలి+మెకము)-వాయువునకు వాహన మైనమృగము-లేడి, వాతాయువు.

సీ. తడవింట నేయక తటిమి గాలిమెకంబు నుసురుతోఁ గొనివచ్చునసమజవము. రా. వి. 3. ౪౬.

**గాలిమేఁతరి.** వి. (గాలి+మేఁత+అరి)-వాయువు ఆహారముగాఁ గలది-పవనాశనము, పాము.

సీ. కప్పఁగుత్తుకవాఁడు గాలిమేఁతరియందజోటి వాఁ డర మెయిజోటివాఁడు. అచ్చ. రా. బాల. ౧3.

ఇట్లే:- గాలిమేపరి.

సీ. ఘనవృషభేంద్రుండు గాలిమేపరిపిండు వాజిగా భూషణరాజి గాఁగ. చెన్న. ౨. ౧౫౩.

**గాలివాన.** వి. (గాలి + వాన) గాలితోడివాన, ఝంఝ.

వ...అప్పు డప్పవ్వుఁదోఁట గాటంపుగాలివానచేత నేకీడునుం బొరయకునికి జనులు వెఱఁగందుచుండిరి... కళా. ౪. ౯3.

**గాలివేఁత.** వి. (గాలి+వేఁత) ౧. గాలికొట్టుట.

౨. జ్వరభేదము (శ. ర.)

**గాలోడితము.** సం. వి. అ. న. పరీక్షణము, వాగ్విమర్శనము.

**గాలోడితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మత్తుగొన్నవాఁడు, పిచ్చి పెక్కినవాఁడు. ౨. తెవులుగలవాఁడు. 3. మూర్ఖుఁడు, తెలివి లేనివాఁడు.

**గాలోడ్యము.** సం. వి. అ. న. పద్మబీజము.

**గాళకుఁడు.** విణ. (క. గాళక) ౧. దిట్టఁడు, ధీరుఁడు.

ఉ. గాళకు లాపురీభటశిఖామణు లెక్కటియుక్కుతునక్క లా,ఖిలతరాళనుల్ చిదిమి పెట్టినబంటులు... విజ. వి. ౧. ౧౦.

౨. ప్రౌఢుఁడు.

ఆ. అనుచు నెల్లవేల్పులను గొల్చి మును కబ్బ, ములను గన్న గాళకులను దలఁచి. నీలా. ౧.౧౧.

ఆ. గోల గాని మిగుల గాళకురాలు గా,దింతి... నీలా. 3. ౧౦౦.

**గాళుచేయు**=కాడుచేయు. స. క్రి. (క. గాళు= నాశము, పాడు.) నాశముచేయు, ధ్వంసము చేయు, పాడుచేయు.

సీ. ఆటలిప్పలు ప్రచ్చి పాటబండులు గూల్చి క ట్టువ లన్నియు గాళుచేసి. అచ్చ. రా. సుం. ౯౫.

**గావల్గణి.** సం. వి. ఇ. పుం-గవల్గణునికొడుకు-సంజయుఁడు. (వాచ)

**గావు.** వి. (త. కావు.) బలి.

గీ. గొప్పచింబోతుకదుపులఁ గూర్చి నీకు, గావు వెట్టింతుఁ జుమ్మ యోగంగనమ్మ. నీలా. ౧. ౧౧౩.

గావుకేక=(బలి యిచ్చునపుడు వేయుకేక) పెద్ద కేక. (వా)

జ: గావుకొను, గావుపట్టు.

**గావుకొను.** స. క్రి. (గావు + కొను) బలి పుచ్చుకొను.

చ. గొఱియల మేఁకపోతులను గొమ్ముపొట్టేళ్లను గావుకొందువు... కాళికేశ్వరీ. వీథి. ౮౧.

**గావుకోడి.** వి. మూలికావిశేషము. (శ. ర, బ్రా)

**గావుప(వ)ట్టు.** స. క్రి. (గావు+పట్టు) ౧. చంపు.

సీ. కడుఁదుసీఁగయుఁ బోలె వడిఁ దోలి కఱచి యీకస్తూరిదుప్పుల గావుపట్టు...గీ. అని... వేఁటకాండ్రు, మెచ్చి పొగడుచు మెకముల మీఁద గొలుసు, లులిపి జాగిలముల నుసికొలిపి రపుడు. సారంగ. ౧. ౯౨.

సీ. హోమకుండములు నిర్ధూమధామంబులు గావించి పశువుల గావువట్టి. వరాహ. ౫. ౧౧౫.

౨. నాశముచేయు.

ద్వి. పోదలెడుపురుషార్థముల గావువట్టి, మదము మాత్సర్యంబు మట్టి మల్లాడి. విష్ణు. పూ. ౩ ఆ. (శ. ర.)

వి. గట్టిపట్టు, కార్యము ముగియువఱకు ఒక్కపట్టుగా పట్టినపట్టు. (చి. ని, శ. ర)

**గాసటబీసట.** వి. సలక్షణముగానిచదువు. (శ. ర.)

ఉ. భాసురభారతార్థములభంగులనిక్క మెఱుంగ నేరమిం, గాసటబీసటే చదివి గాథలు త్రవ్వుతెనుంగువారికిన్, వ్యాసముని ప్రణీతపర రమార్థము తెల్లగఁ జేసినట్టియ, జ్ఞాపనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్. నృసిం. పీఠి. ౯.

**గాసము.** వి. (సం. గ్రాసః.) ఆహారము, తిండి; బత్తెము.

సీ. నల్లదేవరకోలఁ బల్లె లేసినమేటి విసము గాసము గాఁగ మెసఁగుజియ్య. శివధ. ౩. ౭౫.

క. మీసము పస మగమూతికి, వాసము పస యిండ్ల కెల్ల వనితల కెల్లన్, వేసము పస బంట్రౌతుకు, గాసము పస...కవిచౌ. శ. ౯౦. రా. వి. ౫. ౫.

**గాసి.** వి. (క. తు. గాసి) వ్యథ, వెత.

ఉ... అ, య్యో సరసీరుహాక్షి మదయోగభరంబున నిట్లు ఖిన్నయై, గాసి వహించియున్నది... శుక. ౧. ౧౨౪.

సీ... వంత గాసి వెతారయు కాఱియ వెత, బారి నొగులు నొప్పి బాద సెగులు నొవ్వి వందురు దురపిల్లు కొందలంబు, సలుపు నోవి యనంగఁ జను వ్యథ ... ఆం. భా. ౧. ౧౪౦. రా. వి. ౨. ౬౦.

విశే. ౧. నష్టము, నశించినది, చెడినది.

గీ... బేహార మాడు, టయును గోరక్ష గావించుటయును మొదలు, గాఁగ బ్రతికెడు తెరువులు గాసి గావె. భార. శాం. ౨. ౨౫౫.

గీ. కర్ణశకునిదుశ్శాసనుల్ ఘనులు గాఁగఁ, దఱఁచి వారలఁ గొని మమ్ము గెలుచువాఁడ, వై మనంబున శంకింప కట్టు కీడు, చేసి తాపూఁపు దప్పిన గాసి యైతి. భార. శల్య. ౨. ౫౯.

౨. వ్యర్థము, పనికిమాలినది.

చ...నీదగుసహాయతఁ గౌరవసేన రూపుమా,పు టయవలీల వాకు ననుఁ బొల్లుగఁ జేయుట నీ కుఁ బాడియే,కటకట నాపరాక్రమము గా సి గఁ జక్రము చేత నంటితే. భార. భీష్మ. ౨. ౧౬౧.

౩. నలఁగినది.

సీ. కమ్మక్రొవ్విరిసరుల్ గాసిగ్రాయి యసియాడ బలు కీలుఁ గొప్పులఁ బట్టి యీడ్చి.ఉ.రా.౪.౯౩.

జః గాసించు, గాసిఁబడు,గాసిఁబఱచు, గాసిఁబె ట్టు, గాసిలు, గాసిసేయు.

గాసించు. స. క్రి. (√గాసి) గాసిలఁజేయు.

(బాధించు, క్లేశపఱుచు)

క. చేసినమే లెఱుఁగుదు రొరు,గాసింపరు కుచ్చి తంపుఁగఱద లెఱుఁగ ర,త్యాసక్తసౌహృదు లు స,త్యాసీనులు సురలు వార లపకారకులే. ఉ. హరి. ౫. ౩౦౧.

ద్వి. గాసించి వీరి నిక్కడ నాకు నేన,చేసేతఁ బట్టి శిక్షించితి నేని,యీజాడ తన కేల యె ఱిఁగింప వనుచు,రాజు విన్నను నపరాధఁబు వచ్చు...ద్వి. పరమ. ౪. ౩౩౪ పా. ౮ పం.

గాసిఁబడు. అ. క్రి. (√గాసి) ౧. బాధపడు, దుః ఖపడు.

సీ. హోమాజ్యగంధోర్మి కుద్వేగ మొందుచుఁ గ్ర తుధూమముల చేత గాసిఁబడుచు. నైష. ౭. ౧౨౩.

క. హా సుకుమార కుమారక,హా సుగుణనిధాన నీ కు నర్హ్యం బఁటరా,గాసిఁబడఁజేసి మమ్ముఁ, బాసి చనఁగ నేమి తప్పు పాటిలెఁ జెపుమా. ఉ. రా. ౭. ౧౮౨.

క. స్త్రీ సంతోషించుతెఱం, గాసపడని మనసు గలుగునట్టియధముఁ డి,చ్చో సడిఁ గనుఁ జని యచ్చో, గాసింబడు జమునిభటులు గాఁటి యపట్టఁ. భార. అశ్వ. ౪. ౨౨౯.

౨. చెడు.

క. అసమయమున రహస్యము, గాసింబడకుండ బుద్ధిగౌరవమున నా,రాసుతుని బాలచంద్రి క,చేసన్నలఁదొలఁగఁ బంచెఁ జెలితోఁ గూ డఁగ. దశకు. ౩. ౧౧౭.

గాసిఁబఱు(అ)చు. స. క్రి. (√గాసిఁబడు) గా సిఁబడఁజేయు.

(పీడించు)

సీ. కవజక్కవల టెక్కు గాంచునీచనుదోయి కలి కి యేకతమునందు గాసిఁబఱిచె. ఉ. రా. ౪. ౨౨౭.

(బాధపెట్టు)

సీ. బహురూపులను మీటి వర్ణకాలఁబుగ్రాగి దూఁటి క డఁగి మునిస్త్రీల గాసిఁబఱచు. ఉ. హరివ. ౪. ౮౪.

(నాశముచేయు, చెఱుచు.)

వ...గడుసరిదానవులు పసిమి గలపసిఁడి కాస చేసి పడఁ ద్రోసి గాసింబఱచినప్రాసాదంబు లును...ఉ. హరి. ౧. ౫౩. (వీరేశ. పా.)

గాసిఁబెట్టు. స. క్రి. (√గాసి) ౧. దుఃఖపెట్టు, శ్రమపెట్టు, బాధపెట్టు.

క. అసదృ నమ్మెయి నీదు,శ్శాసనుఁ డప్పాండుపు త్రసతిఁ గ్రూరాత్ముం,డై సంక లేక పెద్దయు, గాసింబెట్టంగ ...భార. స్త్రీ. ౨. ౫౬.

క. ఆసాసల వచ్చితి నను, గాసింబెట్టి యది యడ విఁ గలసెను మృగయా,వ్యాసక్తుఁడు వగచు న్నన,యేసినమృగ మనఘు తప్పి యేఁగుటకుఁ గ డుఁగ. భార. శాం. ౩. ౧౫౩.

సీ. వేల్పుఁగన్నియల నేవేళ దేశీయంపుబిట్టుఁజేఁ తల గాసిఁబెట్టువారు. వరస. ౫. ౯౦.

౨. ధ్వంసముచేయు, చెడఁగొట్టు, చెఱుచు.

గీ...ఏకాంత మంతయు గాసిఁబెట్టఁ, గడఁగి... దశకు. ౬. ౮౨.

**గాసిలు(ల్లు).** అ. క్రి. (√గాసి) ౧. శ్రమపడు, ఆయాసపడు; కష్టపడు, బాధపడు.

ఉ. గాసిలనీక రాసుతులఁ గాశికుఁ డాఁకలి నీరువట్టువా,యాసము లేనిమంత్రము... కృప చేసి కృతార్థులఁ జేసె నంతయున్. రామా. ౮. ౨౭.

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే,గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి... పారి. ౧. ౧౩౩. (ఇటఁ'తప్తమగు'అని భావము.)

క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్వాఁడు మనలఁ గని యించుకయుం, దా సైరణనేయఁడు... భార. విరా. ౮. ౨౩౦.

౨. క్షీణమగు, తగ్గు.

చ...నామనంబునఁ గడింది భయంబు జనించె దక్షిణాం,గనికరముల్ చలించె ధృతి గాసిలెమే నవశత్వ మొందె... ఉ. రా. ౬. ౨౩౬.

౩. కోపమొందు.

ఉ...అంతకు ముగ్గడి ద్రవ్వి మీఁయెడన్, గాసిలియుండుయాదవనికాయము సైఁపదు రాజనూయమున్. ఉ. హరి. ౮. ౧౨౭.

ఉ. ఆసమయంబునన్ మనసిజారి లలాటతటీనటీభవ,దూ్భ్రిసముదగ్రుఁడై తనసుతుం గడకన్నులు జేవురింపఁగా, గాసిలి చూచి వీఁడు సురకాంతల నాసభలోన నెత్తులం, జేసెఁ దనూవిలాసములచే నని భీషణభాషణార్భటిన్. వరాహ. ౬. ౫౭. వి. పు. ౭. ౨౮౩.

**గాసి(చే)సేయు.** స. క్రి.(గాసి+చేయు)౧. బాధపెట్టు.

ఉ. భంగముతోడ నున్నవనుఁ బంపు విరాటునిమీఁద భూమికిం, జెంగట నుండు నావయినజీతపుటూళ్లు సంతతంబు వా,నిం గడు గాసి సేయునతనిం జెఱుపన్ దటి యయ్యె... భార. విరా. ౩. ౧౧౯.

శ్లో. రాష్ట్రం మమాసకృద్రాజన్ రాజ్ఞా మాత్స్యేన బాధితమ్. సం. భార. విరా. ౩౨. ౩౭.

గీ. పదియు నొక్కంద్ర రుద్రులఁ బాఱవిడిచె, గాసిచేయక కాకోలకంఠపట్టి, తండ్రి పేరివా రగుట చిత్తమునఁ దలఁచి. కాశీ. ౭. ౭౫.

౨. ధ్వంసముచేయు, పాడుచేయు.

చ...సమస్తభూజముల్, బలువిడి గాసిచేసి బహుభంగుల నిట్టులు ద్రుళ్లు చున్నెడన్. భా. రా. సుం. ౫౮౦.

చ. వననిధి దాఁటి లంకయును వానివనంబును గాసిచేసి నం,దనుఁ డగఁ జూచి వచ్చినవిధం బదియల్పులచేతఁ దీరునే, జనకజఁ గాంతుమేయసమసాహసుఁ డీతఁడు లేక తక్కినన్. నిర్వ. ౭. ౧౩౨.

**గాహనము.** సం. వి. అ. న. ౧. స్నానము, మునుఁగుట. ౨. చొచ్చుట.

**గాహమానుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) ౧. ప్రవేశించుచున్నవాఁడు.

శ్లో. బ్రహ్మావర్తం జనపద మథ చ్ఛాయయా గాహమానః. మేఘ. ౧. ౮౭.

౨. స్నానము చేయుచున్నవాఁడు.

**గాహము.** సం. విణ. (అ. ఆ.అ.) ౧. మునుఁగునది, క్రుంకునది. ౨. చొచ్చునది. వి. అ. పుం. ౧. అవగాహనము, మునుక. ౨. ప్రవేశము, చొచ్చుట.

**గాహిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. మునుఁగువాఁడు, స్నానము చేయువాఁడు. ౨. చొచ్చువాఁడు.

**గాహితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రవేశింపఁబడినది. (నద్యాది) ౨. నిమగ్నము, మునిఁగినది.

## గి

**గి=గీ.** అవ. నిందయందు ఆమ్రేడితశబ్దముయొక్క ఆద్యక్షరమునకు వచ్చెడియాదేశము.

చ. హరి గిరి వహ్ని గిహ్ని మతి యంతకు గింతకు దైత్యు గీత్యు వార్వరు గిరు గాడ్పు గీడ్పు ధనవల్లభు గిల్లభు ... భా. రా. యు. ౯౦౪.

క...నీవు గినిసిన, వరముల గిరములను బ్రదుకు వారే కుమతుల్. ఉ. హరి. ౪. ౧౦౭.

**గింగురు.** వి. ౧. వింటినారినుండి బాణము వెడలుట మున్నగువానియందగుధ్వనికి అనుకరణము.

ద్వి. కోదమునాగముఁ బోనికోల మిణ్గుఋలు, పెద రంగ దొనఁ దీసి శింజినిఁ దొడిగి, తెగ గింగు రనఁ బాపి దృష్టి సంధించి, తెగ నేయుటయు ...ద్వి. హరిశ్చ. పూ. ౭౧౫.

౨. పెద్దధ్వని వినునప్పుడు చెవులలోఁ గలుగుధ్వనికి అనుకరణము.

ఉదా: అరోద వినఁగానే నా చెవులు గింగురుమన్నవి.

**గింజ.** వి. బీజము, విత్తు.

ఉ...గుమ్మడిగింజ తెఱంగు...ఆము. ౫. ౯౦.

సీ. వీడెంపుబలు కెంపు విరిసి వెన్నెలగాయ వరి గింజ నొకటఁ బల్వరుసఁ దోమ. ఆము. ౧.౬౦. ఆం. భా. ౨. ౩౯.

**గింజు.** స. క్రి. విదిలించు, చిమ్ము.

ద్వి. జయకాముఁ డలుఁగులు జళిపించి చిమ్ము, క్రియఁ గరచరణముల్ గింజి యాడుచును. అ. మ. క. ౧. ౨౫ పొ. ౨౦ పం.

జ: గింజుకొను.

**గింజుకొను.** స. క్రి. (√గింజు)-కాళ్లు-విదిలించు, చిమ్ము.

శా...మీఁజేతులం గన్నులిం, పారం దోముచుఁ జేవఁ బూని పిఱుఁ దొయ్య స్నీఁది కల్లార్చుచుఁగా, శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజుకొనుచుం జెల్వంబు రెట్టింపఁగన్. హరి. పూ. ౫. ౧౭౦.

వ...అకాౄంచనహంసంబు ...ఎగయ సుంకించుచుఁ జంచుపుటంబునఁ బాణిపల్లవంబులు గఱచుచుఁ జరణంబులు గింజుకొనుచు...నై. ష.౧. ౧౧౧.

అ. క్రి. కాళ్లు చేతులు విదిలించుకొను, గిజగిజలాడు; శ్రమపడు.

వ. చండికానసముద్దండపాశంబునం దగుల్పడి గింజుకొనుచు పాశములు పన్నినవలలం బడి తన్నుకొనుచున్నఁబోతులకీతి నుండిరి...వరాహా. ౧౧. ౧౦౫.

(వ్యవ) వాఁడు ఎంత గింజుకొన్నను దమ వంట లేదు.

**గింటెన.** వి. దింటెన ?.

సీ...గింటెన యనఁగను దింటెన యన, గిరికర్ణి చెలువొందు...ఆం. భా. ౨. ౫౬.

**గింటెము**=గంటెము. (క. త. గింట.) జమిలిపోఁగు నేతబట్ట, రెంటెము.

గీ. మదతపసిమిడిగింటెముల్ మంజిడిజిగి, దోమతెరమంచములు హసంతులు జవాజి, యగలుసిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ, జలినెలలు తద్వధూపచరణుఁ డగుచు. కళా. ౭. ౧౮౧.

విశే. దట్టమైనది, సాంద్రము; అధికము.

సీ. పసిఁడిగింటెంపుదుప్పటికప్పు లోహళోహళా కమ్ముఁగస్తురితిలకమ్ము బళిర. వాల్మీ కి.౩.౧౫౧.

సీ. రింగులువాఱ గైరికపుగింటెంపుఁబచ్చడము గట్టి ప్రదేశమునఁ గట్టి. వరాహ. ౬. ౪౦.

ఉ. గంటని ప్రేమ మేను పులకించెఁ గిరీటికిఁ బూలాసంగి వాల్గంటి గిఱుక్కునం దిరుగఁ గమ్మనికస్తురితావి గ్రమ్ముకో, గింటెపుగబ్బిగుబ్బల జిగిన్ వెలిఁజిమ్ము నొయారిజిల్గుఁబ, య్యంట చెఱం గొకింత దనయంగముపై నటు పోకినంతటన్. విజ. వి. ౨. ౧౩౪.

**గిండి.** వి. (సం. కుండీ. క. త. గిండి) భృంగారము, సన్నని మెడ గలపాత్ర. (చెంబు, జారీ, మొ.)

గీ...భృంగారు గిండి నాఁ జను ... ఆం. భా. ౨. ౧౯౩.

సీ. గొడుగు పావలు కేలఁ గొని నాగ్నజితి యుండ జలములగిండి లక్షణ వహింప. ప్రభా. ౨. ౧౫.

సీ. తళుకుబంగరుగిండ్లు దులకించువిరిచెండ్లు నడఁగించుపాలిండ్ల నమరుదాని. ఉ. రా. ౨. ౨౬౬.

(వ్యాసునివర్ణన.) గీ. కేల మున్నీటిక్రొన్నీటిగిండివాని. చంద్ర. ౩. ౨౧.

సీ. నీరధీశ్వరుఁడు పన్నీటిగిండి ధరింప మృగవాహనుఁడు తాళవృంత మూన. దశా. ౨. ౧౨౭.

**గిందుకము.** సం. వి. అ. పుం. క్రీడాకందుకము, ఆటబంతి. (వాచ, విల్యమ్సు.)

**గిచ్చు.** స. క్రి. ౧. గీచు. (శ. ర, బ్రౌ) ౨. (గోళ్ళతో) గిల్లు. (వా)

**గిజగిజ.** వి. (క. గిజి) ౧. క్షోభము, కలవరము. (చూ. గిజగిజపడు.) ౨. కాళ్లుచేతులు విదిలించుటయం దగుఅనుకరణము.

ఉదా: వాఁడు మూర్ఛ వచ్చి గిజగిజ తన్నుకొనుచున్నాఁడు.

గిజగిజయగు=కలఁత నొందు.

క. గజపదనాదులు గాంచిరి, నిజరక్షితసీమఁ గాలనియమితభృత్య, ప్రజకృతబహువిధబాధల, గిజగిజయగుశూద్రభక్తుఁ గీలితదేహుల్. శ్రీరం. ౩. ౫౭౨.

ద్వి. ఒందంగఁ బాదాగ్ర మూఁది నటింపఁ, గ్రిందటికూర్మంబు గిజగిజగాఁగ. బస. పు. ౩. ౬౧౦ పం.

జ: గిజగిజకుడుచు, గిజగిజపడు, గిజగిజలాడు.

**గిజగిజకుడుచు**=గిజగిజలాడు. (గిజగిజ+కుడుచు)

సీ. కదలించి యెత్తఁగాఁ గడు నశక్తుండయి గిజగిజకుడిచె నక్కొకయుండు. శుక. ౩. ౭౩.

**గిజగిజపడు**=గిజగిజలాడు. (గిజగిజ+పడు)

క...చిలుకలు, గిజిగాఁడ బలుపులుగుము వాఁడు గిజగిజపడుచున్. అచ్చ. రా. యు. ౨౧౩. (గిజగిజకొను-శ. ర. పా)

**గిజగిజలాడు.** అ. క్రి. (గిజగిజలు+ఆడు) క్షోభపడు, కలవర మొందు.

వ ... ధవళకిరణుకిరణంబులు చులుకుమలుకున మర్మంబు లంటిన గజగమన గిజగిజలాడి తాళఁజాలక మూర్ఛ గ్రమ్మి సొమ్మసిలిన...మృ. వి. ౨. ౮౪.

గిజగిజలాడుకొను=గిజగిజలాడు.

ద్వి. కినుకతోఁ బలికిన గిజగిజలాడుకొనుచు నింటికి వచ్చి కొంకుచు నుంటి. ద్వి. తి. సా. ౨. ౭౩ పా. ౨౬ పం.

**గిజరు**=గిజారు. వి. ౧. బీజము, గింజ.

గీ...బీజాఖ్య వరఁగు విత్తు, విత్తనము గింజ గిజరన...ఆం. భా. ౨. ౩౯.

ఉదా: గిజరువంకాయ.

౨. మామిడిపండు లోనగువానియం దుండుపీచు. (శ. ర, బ్రౌ.) ౩. కోడిగ్రుడ్డులోనివచ్చని పదార్థము. (బ్రౌ.)

**గిజిగాఁడు**=గిజ్జిగాఁడు. వి. (క. గిజు గార.) పక్షివిశేషము.

సీ. గిజిగాఁడు పూరేడు కేర్జంబు పొన్నంగి...

గీ...ఇట్లని పక్షి భేదాఖ్య లలరు...ఆం. భా. ౨. ౯౭.

గీ...ఒకకులాయము ఘటించుఁ, గాని గిజిగాఁడు మాడువు గట్టఁ గలఁడె. వి. నం. ౧. ౧౩.

ఉ...శృంగారవనద్రుమాళి గిజిగాఁడులు గూఁడులఁ జేర్చు...మనుచ. ౧. ౩౬.

**గిజిబిజి.** వి. నమలుటయం దగుఅనుకరణము.

చ. అజునివరంబుకల్మి నిటలాక్షుమహోక్షముఁ దాఁకి గెల్చి దిగ్గజములమూపు మూఁపురముగాఁ గొన నోపు సురాసురాస్త్రముల్,

గిజిబిజిఁ బిప్పిగా నములు గిత్త దద్దియము దా
ద్రుళంపుట, క్కజములు తేరిగిబ్బల ప్రకార
ము లాతఁ డజేయుఁ డెమ్మెయిన్. కకు. ౫.
౭౨.

**గిజేరు**=గిజేరు. (శ. ర, బ్రా)

**గిజ్జిగాఁడు**=గిజిగాఁడు. వి. పచ్చపిట్ట, బంగారుపి
చ్చుక. (శ. ర, బ్రా)

**గిజ్జే.** వి. భక్ష్యవిశేషము.

వ ... పచ్చడులుం గిచ్చడులుం బజ్జీలుం గిజ్జె
లున్ వడియంబులుం గడియంబులును...కా
శీ. ౭. ౧౯౫. (చి. ని. పా.)

**గిట.** వి. కృశించుటయం దగుఅనుకరణము. (ఆమ్రే
డితరూపము-గిటగిటగిట)

క. పెటపెటపెటఁ గాపె వ్రవి,పటపటపట మను
చు గిరులు పగిలెన్ రగిలెన్, జిటచిటచిట మ
నుచున్ వని, గిటగిటగిట మనుచు జనము కృ
శియించె సెగన్. రా. వి. ౫. ౯౯.

**గిటక.** విణ. పొట్టివాఁడు.

సీ. పొట్టి మొట్టి గిటక పొదిటి పొదడు...తింగ
ణా యనఁగను వామనాఖ్య దనరు... అం.
భా. ౨. ౧౨౩.

**గిటగిట**[1]=కిటకిట. వి. ౧. పండ్లుగీఁటుటయం దగు
ననుకరణము.

ద్వి. గిటగిటఁ బండ్లను గీఁటి కౌశికుఁడు,చిటచిట
మిడుఁగుర్లు చెదర వీక్షించి. ద్వి. హరిశ్చ.
పూ. ౧౧౯౩ పం.

౨. (నడుము) వడఁకుటయం దగుననుకరణము.
(చూ. గిటగిటమను)

జ: గిటగిటమను.

**గిటగిట**[2]. విణ. కృశము, సూక్ష్మము. (వృత్తియందు
నిగాగమము)

క...కీల్జడ నటి,యింపన్ గిటగిటనికా నొకింత చ
లింపన్. విజ. వి. ౩. ౭౯.

గీ. మఱియు నయ్యిందుబింబాస్యమందగతియుఁ,
గటిభరముపొంకమును గిటగిటనినడుము, మె
ఱుఁగుఁజెక్కులు వళులు గంభీరనాభి, సొం
పుఁ జూపఱ కొకవింతయింపు నొసఁగె. వర
మ. ౩. ౧౨౫.

జ: గిటగిటన.

**గిటగిటన.** విణ. (√గిటగిట[2])౧.అల్పము,హీనము.

వ...మహేంద్రనిషధద్రోణంబులు దరిద్రాణంబులు
హేమకూటంబు గిటగిటన తక్కుఁజెఱుకొం
డలం బేర్కొనం గారణం బేమి...కాశీ. ౧.
౧౦౦.

౨. మృదులము, సుకుమారము.

ద్వి. కటకట భార మెక్కడనుండి వచ్చె,గిటగిట
నైనయీకీరవాణికిని ... ద్వి. హరిశ్చ. ఉ.
౯౧౯ పం.

౩. కృశము.

వ...ఈబోటి... పుటపాకనికాశం బగుకాఁకం
జీకాకుపడి నాఁడునాఁటికి నగుచున్నట్లగిట
గిట నగుచున్నది...ఆము. ౫. ౫౫.

౪. కొంచెము, చాలనిది.

వ...చదువ దొరఁకొనిన నరునకుఁ గాలంబు నా
లంబు విఘ్నంబు లఖిలోద్యమఘ్నంబు లందు
లకు సామగ్రి గిటగిటన కొంతెఱుక నగుమ
దంబు పుటపుటన...ఆము. ౧. ౭౯. (వ్రాఁత
ప్రతి పా.)

**గిటగిటమను**=కిటకిటమను. అ. క్రి. (గిటగిట[1]+
అను) వణఁకు.

క. చనుఁగవ వ్రేఁగున గిటగిట, మనుచెన్నడు మే
మి యగునో యనియెడిశంకన్,గనకపుఁగట్లి
డినాఁడో,వనజాసనుఁ డనఁగ వనితవళు లిం
పెసఁగున్. ప్రభా. ౨. ౯౩.

**గిట్ట.** వి. ౧. ఖురము, డెక్క.

గీ...గొరిజ డెక్క,గిట్ట యన ఖురనామంబు గెరు
చుండు...అం. భా. ౨. ౧౯౭.

౨. ప్రాణము.

వ... మైందుని జాంబవంతగిట్టల గజ సెనిమిదిట లలఁ గుముదు నైదమ్ముల ... అచ్చ. రా. యు. ౩౬౪.

సీ. చేరి యెక్కినచోటఁ బూరి మెక్కినచోట భయదోక్తి దయశక్తిఁ బరఁగఁ జూపె, గిట్టఁ బూనినచక్కిఁ బుట్ట లానినచక్కి గురుశక్తి యురుభక్తి గుదురుపఱచె... రా. వి. ౫.౧౨.

**గిట్టించు[1].** స. క్రి. (√గిట్టు[1]) ౧. చంపు.

దండకము... బల్గట్టివారక్కసుల్ వెక్కసం బైన పేరుక్కుతో నుక్కుఁగంబంబునం బుట్టి గిట్టింపవా... అచ్చ. రా. యు. ౧౬౧.

౨. భేదించు.

ద్వి. తనయుఁడు పిన్నని తలపోయ వలదు, కినిసినఁ గొండలు గిట్టింప నోపు. అ.ము.క. ౧. ౩౫ పా. ౨౨ పం.

**గిట్టించు[2].** అ. క్రి. (√గిట్టు[2]) గిట్టుబడియగు. (శ. ర-చూ. గిట్టింపు[2].)

**గిట్టింపు[1].** వి. (√గిట్టించు[1]) చావు. (శ. ర.)

**గిట్టింపు[2].** వి. (√గిట్టించు[2].) గిట్టుబడి. (శ.ర,వా)

**గిట్టు[1].** అ. క్రి. చచ్చు.

ఆ. వీరు కలియుగమున వేయేండ్లలోపలఁ, బుట్ట గిట్టఁ గలరు భూవరేంద్ర. భాగ. ౯. ౬౭౨.

మ. కెడసెం దుప్పులు డింక వేసె నెలుఁగుల్ గిట్టె న్బులుల్ సింగముల్, కడగొట్టెన్... సారంగ. ౧. ౧౦౮.

౨. చెడు, నశించు.

సీ. గుట్టు పోనిచ్చిన గిట్టుఁ బెద్దతికంబు, దుర్వ్యయపరుఁ డైనఁ దొలఁగు మిసిమి. రామలిం. ౪౭.

జ: గిట్టించు[1], గిట్టింపు[1].

**గిట్టు[2].** అ. క్రి. ౧. చాలు.

సా. ... గిట్టినచో ఈవని చేయుము. గిట్టని ... నుకొనుము.

౨. అనుకూలమగు; ఇష్టమగు; సరిపడు.

ఉదా: ఆనీళ్లు నాకు గిట్ట లేదు. ఇంగువ నాకు గిట్టదు. మావా రిక్కడకు వచ్చుట మీకు గిట్టదు. మాకును వారికిని గిట్టదు. వారు నాకు గిట్టనివారు.

జ: గిట్టించు[2], గిట్టింపు[2], గిట్టుబడి.

**గిట్టుబడి.** వి. (గిట్టు[2] + బడి) అమ్మకమునందలి లాభము. (శ. ర.)

**గిడస.** విశ. పొట్టి, గిటక, వామనము. (బ్రౌ, శ.ర.)

**గిడిగిళ్లు.** వి. బ. నమస్కారము.

వ... చిత్రకూటమందలి రాఘవునకు గిడిగిళ్లు నంది గ్రామమందలి రాక్షసఘ్నునకు జేజే... ప్రబంధ. రారం. హంస. ౪. ౨౧౩.

**గిడిబిడి.** వి. (క. గిడిబిడి.) వాద్యవిశేషము.

వ... తప్పెట గిడిబిడి తుడుము... మొదలైన హృద్యానవద్య వాద్యవిశేషంబులు. హంస. ౩. ౨౯.

గీ. వేల్పుగిడిబిళ్లు మొరయఁ గ్రొవ్విరులు గురియ. సుద. ౨. ౮౬.

**గిడియ.** వి. పటహవిశేషము.

సీ... తమ్మటం బనఁగను దమటం బనంగను దమటాభిధానంబు దనరుచుండుఁ. గీ. దుడు మనంగను దముకు నా గిడియ యనఁగ, నరగ ళమనంగఁ దద్భేదనామము లగు. ఆం. భా. ౧. ౧౨౮.

**గిడుగు.** వి. కామ లేనిగొడుగు, కామ అక్కఱలేని గొడుగు. (శ. ర.)

**గిడ్డ.** విశ. (క. గిడ్డ.) పొట్టి, వామనుఁడు.

గీ... కుఱుచ తింగణ గిడ్డ గిఱిక గుజ్జు, పొట్టి యన, వామనాఖ్య లౌ... సాం. ని. మాన. ౫.

వి. వామనమూర్తి, విష్ణ్వవతారభేదము.

రగడ. మీను తాఁ జేల్పంది మానిషాదియము దా
యు నేలవేల్పును...అచ్చ. రా...

గిడ్డంగి. వి. (క. త. గిడ్డంగి.) ౧. సరకు లుంచి య
ద్దెయిల్లు. ౨. చెఱసాల. (శ.ర.)

గిడ్డజొన్న. వి. చిఱుజొన్న, చిన్నగింజలజొన్న ?. (బ్రౌ).

గిడ్డతనము. వి. పొట్టితనము, వామనత్వము. (బ్రౌ)

గిడ్డి. వి. (సం.గృష్టిః.క.త.గిడ్డి.) పొట్టియావు; ఆవు.
సీ...కేరు వామనగవి గిడ్డి యనఁగ ... ఆం. భా. ౨. ౨౬౩.
ఉ. ఏనిక మోముబూమియు వహించి చరించుచు
నుండుకామధు, గ్ధేనువు ధుంతి కాశి నిది తె
ల్లము వేల్పులగిడ్డి కానినాఁ, డీనున మోక్షత
ర్ణకము...కాశీ. ౬. ౬౧.
విణ. గిడ్డ, పొట్టిది.
సీ...ఆవు పొట్టియు గిడ్డి యనఁ జెలంగు ... ఆం. భా. ౩. ౪౬.

గిడ్డు. వి. (క. గిడుగ) శ్యేనవిశేషము.
క...సాళ్వంబులు గి,డ్డులు మొదలుగఁ గలవిడివేఁ,
టలపులుఁగులు పదనుతో మిటారింపంగన్.
యయా. ౧. ౪౦.
గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడు గిడ్డు,జాలె
జలకట్టె కణుజు వేసడము డైరి...అనుదేగ
కులము...పి. శకుం. ౧. ౧౧౦.

గిత్త. వి. ఎద్దుపట్టనికోడె, ఆర్షభ్యము; వృషభము.
సీ. గిత్త నా గిబ్బ నాఁ గెరలు నార్షభ్యము ...
ఆం. భా. ౨. ౨౬౨.
సీ. గిత్తతత్తడివాఁడు బుత్తిముత్తు లిడంగఁ జాలు
వాఁ డౌదల జాలువాఁడు. అచ్చ. రా.బాల. ౧౩.

గిద్ద. వి. సోలలో నాలుగవభాగము. (శ. ర, వా.)

గిద్దు. వి. శ్యేనవిశేషము.
...జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేనభేదములు...
ఆం. భా. ౨. ౯౦.
ద్వి. ఎద్దు లిఱ్ఱులు పిడియేనుఁగు పెద్ద,గిద్దులు డేగ
లు గేరజంబులును...ప్రభులిం. ౪.౧౩౧పా.
౧౭వం. ప్రబంధ. ౧౯౧. కాళ. ౩. ౪౬.

గినియ. వి. కటఖి ?. (బ్రౌ, శ. ర)

గినుమాడు. స. క్రి. (గినుము+ఆడు) వంచించు.
మ. తను నాప్యాయితుఁ జేసి కేవు గృహాకృత్యం
బు ల్వావర్పం దొడం,గినతల్లిం గినుమాడి త
ప్పుడుగులం గ్రీడారతిం బోయి ... హరి.
పూ. ౫. ౧౯౬. (శ. ర-ప్రయోగాంతరము
లేదు. గిలుబాడు ?)

గినుము. వి. వంచన. (శ. ర-చూ. గినుమాడు)
జ: గినుమాడు.

గిన్నె(న్నియ). వి. (త. గిణ్ణి. క. గిణ్ణిల్.) లోహాది
పాత్రము.
గీ. పాని యీశానిరై మహోత్సవమునందుఁ, గేల
నవచంద్రకాంతపుగిన్నె పూని ... భీమ. ౧. ౧౦౪.
ఆ...పైఁడిగిన్నె...దశా. ౪. ౧౩౮.
సీ. సెరపుగా నూటి గిన్నియల నించినయట్టియరిది
కుంకుమ నించినట్లయుండె. కువల. ౫. ౩౭.
క...అగ్గిన్నియ జి,య్యాలకడపుం గొని చేనఁగా...
వైజ. ౪. ౭౩. ఉ. హరి. ౩. ౭౬.
౨. చషకము, పానపాత్రము.
గీ. గిన్నె యన డబ్బు రనఁ గోర యన్నఁ జషక,
ము...ఆం. భా. ౨. ౨౪౪.

గిబ్బ=గిత్త. వి. ౧. ఎద్దు, వృషభము.
ఉ...మదించి అంకెలిడుపోటరిగిబ్బల శోని నెక్కి
యీ,శానుఁడు వచ్చె...పారి. ౪. ౭౪.
వ...వడి గలగిబ్బలం బూన్చినశకటంబులు...భా
గ. ౧౦ పూ. ౨౧౧.
౨. ఎద్దుపట్టనికోడె, ఆర్షభ్యము.

సీ. గిత్త వా గిబ్బ నాఁ గెరలు నార్షభ్యము ... ఆం. భా. ౨. ౪౬౨.

విశే. (ఋషభశబ్దమువలెనే ఉత్తరపదమగునపుడు) శ్రేష్ఠవాచకము.

క. చన్నులు జక్కవగిబ్బలు... నీలా. ౧. ౫౫.

సీ. కలిమిగుబ్బెతమిన్నగబ్బిగిబ్బరపుబ్బుగుబ్బలా జక్కవగిబ్బజోడు. దశా. ౧. ౧౬౮.

గిబ్బడాల్దొర=వృషభధ్వజుఁడు, శివుఁడు.

సీ. గిబ్బడాల్దొరగుండు కబ్బంపుఁబ్రోయాలు లిబ్బిగుబ్బెతయబ్బ బొబ్బమెకము. అచ్చ. రా. యు. ౫౯౨. (గిబ్బడాల్దొరగుండు=కైలాసపర్వతము.)

గిబ్బబాబాజోదు=వృషభవాహనుఁడు, శివుఁడు. అచ్చ. రా. అర. ౫౭.

గిబ్బరాతు = వృషభవాహనుఁడు, ఈశ్వరుఁడు. పార్వ. ౨. ౧౭౫.

గిర. సం. వి. ఆ. స్త్రీ. వాక్కు. (త్రి. ని.)

గిరక. వి. ౧. నూలిరాట్నము, ఘటయంత్రము. (శ. ర-గిఱక. చి. ని. గిలక. వా)

౨. నూలిరాట్నముయొక్క చక్రము.

సీ. తంతుసంతతిసముత్పాదనయంత్రంబు రాట్నమంచనఁగను రహిఁకి నెక్కుఁ,దద్బద్ధసూత్రంబు తగు వడి యంచన గిరక నా భ్రమకంబు పరఁగు చుండు. ఆం. భా. ౨. ౫౯౮. (గిఱక. ప్రాచ్య ప్రతిపా.)

గిరగిర. వి. తిరుగుట మొదలగువానియందగుధ్వనికి అనుకరణము.

చ... ప్రచండమండలాగ్రము జళిపించుచుఁ గిరగిర ద్దిరుగ న్నెగవైచి పట్టుచుఁ. కళా. ౬. ౧౮.

సీ. బరుల నఖంబుల గిరగిర గోఁకుచుఁ బోరిఁబోరి ఫలములఁ గఱచివైచు.భాగ. ౧౦ ఉ. ౫౮౮. దశా. ౧. ౨౨౫.

గిరణము. సం. వి. అ. న. మ్రింగుట, గిలనము.

గిరదా. వి. (హిం. గిర్దా) గుండ్రనిజుట్టును చుట్టియుండుపెండ్రుకలు. (శ. ర-గిరజా. వా)

గిరవు. వి. ౧. కదువ, తాకట్టు.

సీ. కనుదోయి మెఱుఁగులు కంతుతూపులకడ గిరవుగాఁ బెట్టితే హరిణనయన. విక్ర. ౭. ౬౨.

చ... అరుణంపుబొండ్లములనారికెడంబులు వజ్రకుట్టిమంబగుపథముం జెలంగు భవనావృతశోషితరత్నరక్షకభ్రగతరుసంతతిం బ్రథమభార్యఁ బురిం గిరవుంచె వార్ధి నాఁ. ఆము. ౧. ౫౮.

౨. కానుక, ఉపాయనము.

(కిరాతకన్యావర్ణనము) గీ. హరిణకరిహరిచమరంబు లక్షికుంభ, మధ్యవాలాకృతులు దెచ్చి మనుపుకొలఁకు,భిల్లపతియింట గిరవులు పెట్టెననఁగ, దృక్కుచవలగ్నచికురచారిమల నొప్పు. వరాహ. ౨. ౧౧౩.

రగడ... కోరి గిరవులుపెట్టి కొలుచుజగతీపతులు ...పి. శకుం. ౩. ౨౨౫.

గిరస. విశే. పంద, పిఱికి, సమరభీరువు. (శ. ర.)

గిరాకి. విశే. (హిం. గిరాన్.) వెల యధికమైనది, ప్రియమైనది. (శ. ర.)

గిరాటువేయు. స. క్రి. ఉవ్వు. (శ. ర, వా)

గిరి. సం. విశే. (ఇ) పూజ్యమైనది. వి. ఇ. పుం. ౧. పర్వతము. ౨. నేత్రరోగవిశేషము. ౩. అచ్ఛనగాయ. (వై. ని.) ౪. (గణిత) ఏడుఅనుసంఖ్య. ౫. మేఘము. ౬. పాదరసమందలియొకానొకదోషము. ౭. కొందఱు సన్న్యాసులనామములతుదిని జేర్పఁబడుబిరుదు. (ఉదా: ఆనందగిరి, మొ.) ౮. తంత్రమతానుసారి యగుసన్న్యాసి.౯. ప్లక్షము, జువ్వి. (కే. ని.) స్త్రీ. మ్రింగుట.

గిరిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. చిట్టెలుక. ౨. వసురాజుభార్య.

గిరికంటకము. సం. వి. అ. పుం-గిరులకు శత్రువు-వజ్రాయుధము. (త్రి. ని.)

గిరికదంబము. సం. వి. అ. పుం. ఒకజాతికడిమి చెట్టు.

గిరికర్ణి. సం. వి. ఈ. స్త్రీ. దింటెన చెట్టు.

గిరికర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. భూమి, నేల. (త్రి. ని.) ౨. దింటెన చెట్టు.

గిరిగి(గ్గి)టు. వి. (క. గిరిగటు, గిగ్గటు=చక్కని ధ్వని లేనిసంగీతపుఁ బనిముట్టు.) ఒకానొకసంగీతపుఁబనిముట్టు. (బ. ఆమనవునువాయించెడుకంచుతాళము అని శ. ర.)

ద్వి. మఱి మును ల్వంచినమహితోరగంబు, గిరిగిట గాఁ బట్టి క్రియ నామనాఁడు. పండితా. వాద. ౨౩౯ పా.

ద్వి. గెడగూడి పసిఁడి గిగ్గిటకేళికలను, గడునొప్పుసొన్నలిక పురంబువారు. బస. పు. ౨. ౭౩ పం.

ద్వి... పసిఁడిపానంబు, గిరిగిటల్గాఁ బట్టి కేళికల్ సేయు. (భల్లా. ౨ ఆ. శ. ర)

గిరిజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పార్వతి. ౨. పర్వతకదళి, కొండయరఁటి చెట్టు. ౩. మల్లెతీఁగ. ౪. నిమ్నగ, నది. (కే. ని.)

గిరిజము. సం. విణ. (అ. ఆ. అ.) కొండయందుఁ బుట్టినది. వి. అ. న. ౧. అభ్రకము. ౨. లోహము, ఇనుము. ౩. శిలాజిత్తు. ౪. గైరికము, కావిఱాయి.

గిరిజామలము. సం. వి. అ. న. అభ్రకము.

గిరిజ్వరము. సం. వి. అ. పుం. ఇంద్రునివజ్రము.

గిరిధరుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, గట్టుతాల్పు.

గిరిధాతువు. సం. వి. ఉ. పుం. గైరికము.

గిరిపుష్పకము. సం. వి. అ. న. శిలాజిత్తు.

గిరిప్రియ. సం. వి. ఆ. స్త్రీ. చమరి, ఆఁడుచమరమృగము. (రా. ని)

గిరిభిత్తు. సం. వి. ద్. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. వజ్రాయుధము.

గిరిమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. కుటజము, కొండమల్లె చెట్టు.

గిరిమృత్తు. సం. వి. ద్. స్త్రీ. గైరికధాతువు. (త్రి. ని.)

గిరియకము. సం=గిరీయకము.

గిరియాకము. సం=గిరీయకము.

గిరిరాజు. సం. వి. అ. పుం. హిమవంతుఁడు.

గిరివేము. మి. వి. కొండవేము చెట్టు. హంస. ౪. ౧౧.

గిరివ్రజము. సం. వి. అ. న. ఒకపట్టణము. (ఇది మగధదేశమునందలిది. జరాసంధునిరాజధాని.)

గిరిశయుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

గిరిశుఁడు. సం=గిరిశయుఁడు.

గిరిసారము. సం. వి. అ. పుం. ౧. లోహము, ఇనుము. ౨. తగరము. ౩. మలయపర్వతము. (మే. ని.)

గిరిసెము. వి. (సం. శిరీషః) దిరిసెనము, శిరీషము చెట్టు.

సీ... దిరిసెము గిరిసెము దిరిసెన మనఁ, జనును శిరీషాఖ్య... ఆం. భా. ౨. ౪౯.

గిరిస్తని. సం. వి. ఈ. స్త్రీ. భూమి. (వై. ని)

గిరిస్రవ. సం. వి. ఆ. స్త్రీ. నిర్ఝరము, సెలయేఱు.

గిరీయకము. సం. వి. అ. పుం. అచ్చనగాయ, గిరి. (వై. ని)

గిరీశుఁడు. సం. వి. అ. పుం-కైలాసపతి-శివుఁడు.

గిఱిక. విణ. గిటక, పొట్టి. (బ్రౌ, శ. ర.)

జ: గిఱికతాడు.

గిఱికతాడు. వి. ఔ. (గిఱిక+తాడు) హింతాలము, ఈఁదాడు చెట్టు. (బ్రౌ, శ. ర.)

**గిఱి.** వి. (క. గిఱి) వలయాకారపురేఖ.

మ...దైత్యేశుఁ డయ్యాటలోఁ, గొనిపోయెన్ గిఱి దాఁటి రాము...భాగ. ౧౦ పూ. ౧౩౧.

మ...తనచుట్టు న్గిఱి గీసె నాఁగఁ బరిధిన్ ఖద్యోతుఁ డొప్పె న్దివిన్. పె. శకుం. ౩. ౫౦.

జ: గిఱికొను, గిఱికొలుపు, గిఱిపిల్లాఁడి.

**గిఱికొ(గొ)ను=గ్రిక్కొను.** స. క్రి. (√గిఱి)

౧. చుట్టుకొను, పరివేష్టించు.

గీ...గిఱికొనెను బ్రహ్మఁ బరికొనె గ్రిక్కొనె నన, వెలయు వేష్టించె ననుటకు వేదవేద్య. ఆం. భా. ౩. ౧౧౭.

క. ఉఱక మదీయాంగంబులు, గిఱిగొన నట్లేయుటయును ... భార. ఉద్యో. ౪. ౩౨౦.

౨. ఆవరించు.

క. అఱవఱ లైనరథంబులు... కూలినకరులున్, గిఱికొనియె న్సమరమేదినీతల మెల్లన్. భార. భీష్మ. ౨. ౨౩౬.

అ. క్రి. ౧. వ్యాపించు, పర్వు.

క. దిక్కులనుండి ధరిత్రిం, గ్రిక్కిఱిసి మహాతమంబు గిఱికొనె...విప్ర. ౩. ౩౦.

చ. మెఱుఁగులు గర్జితంబులును మిక్కిలి సోనయుఁ గల్గుమేఘముల్, గిఱికొన నొప్పునాకసములీల...భార. ద్రో. ౧. ౨౭౮.

౨. ప్రవహించు.

గీ. ఉడుగ కందంద త్రావుచో నురముమీఁద, వఱద లై క్రొత్తనెత్తురు గిఱిగొనంగఁ, గత్తుముల నున్న కుణపంబు కఱచి కఱచి, పలలకబళంబు మెసఁగుచు భయదభంగి. హరిశ్చ. ౩. ౯౧.

౩. అధికముగా కలుగు.

క...కేళీవనదర్శనేచ్ఛ గిఱికొన మెలఁగెన్. ఉ. రా. ౪. ౧౪౭.

క. ఈవియుఁ జల్లఁదనంబును, సేవలసౌందర్యగుణము గిఱికొనఁగఁ గళా,భావుకుఁ డై నృసింహాత్మావల్లభుఁ డమరుఁ బూర్ణచంద్రోపముఁ డై. వరసు. ౫. ౧౩.

క. తెఱవ పులకాంకురంబులు, గిఱికొన నవ్వేళఁ జూడ్కికి ముదం బొసఁగెన్...నైష. ౬. ౬. కై. భా. ౪. ౧౧౯.

౪ స్థిరపడు.

క. ఈలీల నిజపదార్చన, కేళీతత్పరత నతఁడు గిఱికొని యుండన్, నాళీకగేహినీకుచ, పాళీలోలుండు రంగపతి మదిలోనన్. విప్ర. ౨. ౩౪.

**గిఱికొలుపు.** స. క్రి. (√ గిఱికొను) గిఱికొనఁజేయు.

(క్రమ్ముకొనఁజేయు.)

క. మఱియును శరళలికము మెఱు, గిఱికొలిపిన వృష్ణివరుఁడు గిఱియఁగ లేకే, పఱి యున్నఁ జూచి యార్చుచు, మెఱసిరి నీతనయు లుబ్బు మిగిలి నరేంద్రా. భార. ద్రో. ౩. ౨౭౧.

**గిఱిపిల్లాఁడి.** వి. (గిఱి + పిల్లాఁడి) స్త్రీలు కాలి మూఁడవ వ్రేలను ధరించెడు పిల్లాణి. (శ. ర.)

**గిఱుకు.** స. క్రి. (త. గిఱుక్కు) ౧. అక్షరములు బటువుగా వ్రాయక వంకరటొంకరగా గీయు. (శ. ర-గిలుకు. వా.) ౨. (తప్పువ్రాఁతను) తుడుచు. (శ. ర.) వి. తుడుపు. (శ. ర.)

**గిఱుక్కు.** వి. శీఘ్రముగా మరలుట మొదలగువానియం దగుఅనుకరణము.

చ...గిఱుక్కున న్మరలి వ్రేసె...చంద్రా. ౨. ౧౦౨.

చ...భయ మంది గిఱుక్కున మోముఁ ద్రిప్పుచో...దశా. ౨. ౩౧౫.

సీ. చేరి మాటాడక చెలి గిఱుక్కున నేఁగ మతి చుఱుక్కని చాల వెతలఁ జెంద. శశాం. ౨. ౯౬.

**గిఱుపు(ర్పు)=గిలుపు.** స. క్రి. ౧. (కను) గీఁటు.

చ...అతఁడుం, దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి కన్గిఱిపినమాత్ర

లోన నతనిం బటుబాణచతుష్కయుగ్మ మే, త్తెఱఁ దొడి మౌర్వి గ్రమ్మఱ ఘటించుచు నెదన్ వడి చేసి యార్చినన్. భార. విరా. ౫. ౧౮౧.

శా...శ్రీభీమేశ్వరస్వామి నిష్ప్రత్యూహం బగు సౌహార్దంబున హరిబ్రహ్మేశులన్ భ్రూతా, ప్రత్యుత్థానసంజ్ఞ చేసి కను గిఱ్ఱం జూగె...భీమ. ౫. ౧౧౨.

౨. కదలించు, చలింపఁజేయు.

చ...అసురేశ్వరుఁ డప్పుడు గాలుఁ జేయు లా, వతి రభసంబునం గుడుప నక్కడ నిక్కడ నూడఁ జూచి మై, గిఱుపఁగ నవ్వి శక్తి యెత్తఁగించుట నెమ్మదిఁ గోరి వాని మై, నుఱనుఱ స్రుక్క నొక్క బలనూదననూనుఁడు ప్రక్కదాపునన్. నిర్వ. ౬. ౭౮.

సీ. తురగరూపము దాల్చి తోఁక యల్లార్చుచుఁ గర్ణముల్ గిఱుపుచుఁ గడుఁ జెలంగి, హేషించుచును...మార్క. ౫. ౩౫౯.

౩. దువ్వు, సవరించు.

సీ. హరిమ్రోల వినతాంగుఁడై యున్నయురగారి యొఱకలు పలుమాఱు గిఱిపి గిఱిపి. నృసిం. ౧. ౫౮.

గిఱ్ఱు. వి. ౧. గుండ్రముగాఁ దిరుగుటయం దగు ననుకరణము.

సీ. మరుఁడు వైచిన పైఁడిహురువుబొంగరమట్లు బలువిడి గిఱ్ఱున బ్రమరి దిరుగు. మల్లు పు. ౪. ౬౫.

సీ. కీలాబ్రహ్మరము జాలె గిఱ్ఱునఁ ద్రిమ్మరు తెఱఁగున... ప్రబంధ. ౧౦౯.

౨=గిఱుక్కు.

గీ. బరులకంపూతికై రాయఁబడినతరువు, తునిసి పెల్లున విఱిగి గిఱ్ఱునను మరలి, పక్కనను రెండు తునియలై పడఁగఁ గొట్టె, భీకరం బగు నొకదొడ్డనూకరంబు. చంద్రా. ౨. ౯౨.

జ: గిఱ్ఱుపురుగు.

గిఱ్ఱుపురుగు. వి. (గిఱ్ఱు + పురుగు) చెట్లయం దుండి యొల్లప్పుడు గిఱ్ఱు మని కూయునట్టి యొకపురుగు. (శ. ర.)

గిల. వి. గిలక యున్నగువానిధ్వని కనుకరణము.

(చూ. గిలక, గిలకొట్టు, మొ— ఆమ్రేడితరూపము 'గిలగిల')

చ. అలర గళస్థలింగ మపు డాత్మకరంబున నిల్పి వింతగా, గిలగిల నాఁగ గిల్క యొకకేలఁ గదల్పఁగ... చెన్న. ౫. ౧౯౮.

గీ... చలువవలువ, పెళపెళ గ్గిల్కు మట్టెలగిలగిలల్ రహించ రాయంచకడ నిల్చెఁ జంచలాక్షి. హంస. ౩. ౫౮.

ద్వి. మువ్వల గిలగిల మొఱయ జాడించి, క్రొవ్వున నుప్పొంగు కొమరుసాళ్వముల. అ. మ. క. ౫. ౨౨౧ పా. ౨౭ పం.

గిలగిలలుగ నార్చు=గిలగిలధ్వని వచ్చునట్లు ఆఱఁబెట్టు, తడి యేమియు లేనియట్లు ఆఱఁబెట్టు.

క. గుళిగ లావరించి నీడన్, గిలగిలలుగ నార్చి నారికేళపుబుఱ్ఱన్, జెలువొంద దాఁచి మేహంబుల ననుపానముల నీయఁ బోవున్... (చికి. ౨. చి. ని.)

జ: గిలక, గిలకచెట్టు, గిలకబండి, గిలకసరము, గిలకొట్టు, గిలగిలచెట్టు, గిలగిలలాడు.

గిలక(ల్క). వి. (√గిల. క. గిలకె-కొన్నిప్రతులలో గిలుకయని ఉత్తధ్యరూపము కనఁబడుచున్నది.)

౧. గిలగిలమని మ్రోఁగెడు బాల్యక్రీడాసాధనము.

సీ. జలదేవతాపుత్రికలు దాల్ప నిచ్చినగిలకలక్రియఁ జెందొవలు దనర్ప. రాజ. చ. ౨. ౧౫౨.

చ...గిలగిల నాఁగ గిల్క యొకకేలఁ గదల్పఁగ ...చెన్న. ౫. ౧౯౮.

౨. గిలగిలమని మ్రోఁగెడు ఇనుపరేకుబిళ్ల.

గీ. పసిఁడిగిలకలచేర్కోల... కాశీ. ౩. ౧౨.

గీ. గిలక లున్న వెదురు కేలఁ బట్టి... నా. పంచ. ౨. ౭౮.

౩. రేఫముయొక్క రూపాంతరనామము, పలపల గిలక.

గీ. మొదల రేఫాక్షరంబు నాపిదప దాని, జడ్డ
యును గూర్చి యొకటిగాఁ జదువుకొనుచు,
ముందు జడ్డయు వెన రేఫమునకు బదులు, గిల
క విభజించియు లిఖింతు రలఘుమతులు. అ
ప్ప. ౨. ౪౧.

౪. కాలిచీలమండకు వెనుక నుండుభాగము.

(వా) గిలకలలో వాఁపు పుట్టినది.

౫. ఆంత్రరోగవిశేషము. (వా)

౬. బాలక్రీడావిశేషము.

సీ...గిలకలు చిటికలు కీఁచుబుఱలు...గీ...అక
ట యగచాట్లప్రాఁత సై యాడుకొనుచు.
హంస. ౩. ౧౪౬.

గిలకలపండుగ=బడిపిల్లలు నవరాత్రములలో గిలకలు పట్టుకొని తిరిగెడియుత్సవము.

**గిలకచెట్టు.** వి. (√గిలక) ఘంటారవకీ.

సీ. గిలగిలచెట్టు నా గిలిగింతచెట్టు నా గిలిగిచ్చ
చెట్టన గిలకచెట్టు,టన్న ఘంటారవ యా
ను...ఆం. భా. ౨. ౫౩.

**గిలకట.** వి. ఒకానొకయోషధి.

సీ. కుండలివ్యాయును గుముడును నేలతంగేడు
త్తరేనియు గిలకటయును. (చికి. చి. ని)

**గిలకబండి.** వి. (√ గిలక) చిన్నచక్రములబండి (శ. ర.)

**గిలకరించు.** స. క్రి. ౧. చిలుకు, మథించు.

క. తరువం బెట్టినబానల, పెరుగులు మును గిలక
రించి పేర్చినవెన్నల్,నురువు లెగఁగ్రోలి...
హరి. పూ. ౫. ౨౦౩.

సీ. దుగ్ధాబ్ధి గిలకరింతురె నిలింపులు తొల్లి యా
యాసవముచవి యెఱిఁగిరేని. రుక్మా. ౩. ౨౩౧.

౨. గిలకొట్టు. (శ. ర.)

**గిలకసరము.** మి. వి. (√గిలక.) స్త్రీలు ధరించెడు ఆభరణవిశేషము.

ద్వి. కెంపులముక్కఱ గిలకసరంబు, సొంపుతో
వజ్రాలతోడుహారములు. ద్వి. శ. సా. ౧. ౧౩
పా. ౧౪ పం.

**గిలకొట్టు.** స. క్రి. (గిల+కొట్టు) ౧. కలుపు, రంగరించు.

ఉ. పాలడలోనఁ బోసి చనుఁబాలు నెయిం గిల
కొట్టి కాళ్లపై,బాలకు నుంచి. సారంగ. ౧.
౪౪. (శ. ర. పా.)

౨. వ్రేళ్లతో చిలుకు.

సీ. కరలించి యమృతంబు గిలకొట్టఁగా రాదె
ముద్దుఁ జూపెడివీరిమోవులందు. పాండు. ౧.
౧౧౭.

౩. వ్రేళ్లతో పుణుకు.

సీ. గిలకొట్టి యట్టె చక్కిలిగిలి యని పెట్టి కిలకొ
ట్టి నవ్వి నవ్వాలయఁజేసి. చంద్రా. ౨. ౫.

**గిలగిలచెట్టు.** వి. (√ గిల) గిలకచెట్టు. ఆం. భా. ౨. ౫౭.

**గిలగిలము.** సం. వి. అ. పుం. మకరము, మొసలి. (వాచ)

**గిలగిలలాడు.** అ. క్రి. (√గిల)క్షోభ నొందు;బాధచే తన్నుకొను. (బ్రా, వా.) ఉదా: ఆపిల్లవాఁడు అన్నమునకు గిలగిలలాడుచున్నాఁడు. ఆదూడ ఆదెబ్బతో గిలగిలలాడి చచ్చినది.

**గిలగ్రాహము.** సం. వి. అ. పుం. మొసలి. (కల్ప)

**గిలనము.** సం. వి. అ. న. గిరణము, మ్రింగుట.

**గిలము.** సం. విణ. (అ. ఆ. అ) మ్రింగునది. వి. అ. పుం. జంబీరము, నిమ్మకీ.

**గిలాబ.** వి. (హిం. గిలాబ) గచ్చుచేయుట. (శ.ర)

**గిలి.** వి. (క. త. గిలి.) భయము.

ఉదా: పులి పోయినను గిలి పోలేదు.(బ్రా,శ.ర.)

**గిలి.** సం. వి. ఇ. స్త్రీ. గిరణము, మ్రింగుట.

**గిలిగించు.** స. క్రి. గిలిగింత కలదానినిగా చేయు, గిలిగింతపెట్టు.

చ. వలికిలి సెజ్జమీఁదఁ గడు విప్పుగుఁకన్నులచా

య లొత్తఁ జెక్కిలి గిలిగించి క్రేతలు వ గింపఁగ నుండుట...హరి. పూ. ౮.౧౩౪.

ఉ. కేకిసకొట్టి యోర్తు గిలిగించిన నొక్కవిలోల నేత్ర లీ,లాకలకంఠకూజితముల న్నగ... చంద్ర. ౪. ౧౭.

జః గిలిగింత, గిలిగింతచెట్టు.

గిలిగి(ల్గి)ంత. వి. (√గిలిగించే) చక్కిలిగింత.

గీ...ఓసరసిజాక్షి, యేను జెక్కిలి గిలిగింతలిడుటఁ దలఁచెఁ. నైష. ౮. ౮౬.

ఉ. కేరఁగ రాదు నవ్వ గిలిగింతలువెట్టఁగ రాదు చెక్కులం,జీరఁగ రాదు...హంస. ౧. ౯౪.

మ. తనకుం గౌఁగిలి యీ వొకప్పుడును నాథా నీకరస్పర్శనం,బున గిల్గింత లెయ్యంచుఁ బద్మిని కరాంభోజంబున స్పందమం,దనటద్వాయుచ లద్దళాంగుళులు గన్పట్టంగ నవ్వోల్గురా,యని రారా యని పిల్చె నాఁ దగ ద్విరేఫాద్యంత దీర్ఘధ్వనుల్. విజ. వి. ౧. ౧౩౯.

గిలిగింతవాఱు=గిలిగింత పెట్టిన ట్లగు,గులగులమను.

గీ. పాలు వోయించుకొని యాకృపాళుమూర్తి, ఖూలినాంచారి పాలిండ్ల మూమకముఖు, పాల చేఁపున గిలిగింతవాఱుటయును, మెత్త మెత్త న నఱచేత నొత్తికొనుచు. హర. ౨. ౯౫.

గిలిగింత(లు)వోవు=గిలిగింత కలది యగు, చలించు.

గీ. ఎదుట జలకేళి గావింపఁ దదఖిలాంగ,ములు నిరీక్షించి గిలిగింతవోవుమనను, నిలువ లేని కతంబున నిర్గమించెఁ,జరమధాతువు శైలని ర్ఝరముపోలె. వరాహ. ౧౧. ౮౧.

వ... అదియు ... గొప్పచనుగుబ్బలు ఱొమ్మునఁ గాఁడిపాఱ బిగియఁ గౌఁగిలించిన వాఁడు... అంతఃకరణంబు గిలిగింతలువోవ నర్హాంతయ ర్హాంతయనుచు నంతకంతకు నింద్రియవికారంబు బలవంతంబై సంధిల్ల. ప్రబోధ. ౩. ౫౧.

గిలిగింతచెట్టు. వి. (√ గిలిగింత.) గిలకచెట్టు.ఆం. భా. ౨. ౫౭.

గిలిగిచ్చెచెట్టు. వి. గిలకచెట్టు. ఆం. భా. ౨. ౫౭.

గిలిగిలి[1]. వి. గిలిగింత.

చ. అలికులవేణి యీ రొకనిహస్తముల స్మఖమజ్జనాంబువుల్,గలఁతియ యొత్తిపోయ నవి గార్చుచు నుండె నతండు దోయిటన్, నెలకొని దానిక్రొమ్మెఱుఁగునిద్దపుఁజెక్కులు ముద్దుపెట్టుకోఁ,గెళవులవారిచూపుగిలిగిల్ల మొఱంగెఁ గ వేళఁ గోరుచున్. నైష. ౬.౧౧౨.

గిలిగిలి[2]. వి. మంచము సకినలధ్వనికి అనుకరణము.

క. ఒకచోటఁ బువ్వుఁబందిరి, యొకచోఁ జప్పరము దూఁగుటుయ్యేల యొకచో, సకినలగిలిగిలిమంచం,బొకచోఁ గప్పురపుఁబలుఁగుటోవరియొకచోన్. నైష. ౭.౧౪౮.

గిలిగిలించే. స. క్రి=గిలిగించే. (చూ. గిలిగిలింత.)

జః గిలిగిలింత.

గిలిగిలింత. వి. (√ గిలిగిలించే.) గిలిగింత.

సీ. లలిఁ గపోలంబులు గిలిగిలింతలువుచ్చి నవ్వింపఁ గలకల నవ్వి నవ్వి. హరి. పూ. ౫.౯౫౦.
(గిలిగిలింతలువుచ్చు = గిలిగిలింతలు కలవానిఁగాఁ జేయు.)

గిలితము. సం. విణ. (అ. ఆ. అ) మ్రింగఁబడినది.

గిలుకరించే. అ. క్రి. (√ గిలుకు) మ్రోఁగు.

గీ. కలికిచూపులు వీనులఁ బలుకరింప, సొలపునడపుల నందియ ల్గిలుకరింప. చంద్రా. ౩. ౯౨.
('గిలకరించు' క. ర.పా.)

గిలుకు(ల్కు). వి. ౧. మట్టెలు మొదలగువానిధ్వనికి అనుకరణము.

మ. చరణాబ్జంబుల గిల్కుమట్టెలరొదల్ సంధిల్ల ...చం. రా. ౫. ౩౬.

వ...గిలుకుటందియరవళితో ... ఉ. రా. ౫. ౨౪౮.

సీ...గిలుకుమువ్వలకోలఁ గేలఁ బట్టి...హర. ౫. ౫౫.
సీ. గిల్కుగిల్కన మ్రోయుకింకిణీగుచ్ఛంబు తాళమానంబుతో మేళవింప. క్రీడా. ౧౩౬.
౨. ధ్వని.
సీ. అంతరాంతరములం దక్షిబృందంబులు వెళవెళమనియెడుగిలుకు లెసఁగ. భీమ. ౪. ౧౩౭.
జః గిలుకరించు.

**గిలుపు.** స. క్రి=గిలుపు.
(-కన్ను-గీఁటు.)
వ...కన్నియ మెఱుంగి యచ్చెలులు విభునకుం గన్ను గిలిపి యొండొరు లొక్కొకనెపంబునం జనిరి...రామా. ౪. ౧౫౬. (శ. ర. పా) అప్ప. ౪. ౪౨౧.
(ఆడించు)
ద్వి. మోఁకాళ్లు దొడలును ముడిపఱ్చుకొనుచుఁ, గూఁకటి గిలుపుచుఁ గొక్కరించుచును. పండితా. పర్వ. ౩౭౧.

**గిలుబా(ల్బా)డు.** స. క్రి. (గిలుబు+ఆడు) ౧. అపహరించు.
సీ. ఇందు గీసినరీతి నించుకించుక చేరి గిలుబాడుఁ దల్లిపైఁ గలపసిండి. పాండు. ౩. ౧౬.
సీ. గేదంగివాసనల్ గిలుబాడి నునుసురపొన్నపువ్వులవలపులు గ్రహించి. గీ. చలువ తెమ్మెరయమ్మేటి శ్రమము మాన్చె. ఉ. రా. ౪. ౧౬౭.
ఉ. వేడుకతో విమర్దకుఁడు విశ్వసనీయుఁ డనం గఁ జాలి తా,నీడయుఁ బోలెఁ దోఁ దిరిగి నెయ్యముకల్మి విధంబు దెల్పఁగా,నీడగుమాటలం బనుల నిచ్చలు నిచ్చకు వచ్చుభంగి గి,ల్బాడి తదంతరంగము బయల్పడ మా కెఱిఁగించు నిచ్చలుఙ్. దశకు. ౬. ౨౬. (గ్రహించు అని భావము.)
౨. వంచించు.
ద్వి. వనజాక్షి యొక్కతి మనసుఁ బంపుడును, జని మనోహరునితోడను రమియించెఁ,దను గిలుబాడెఁ గదా మనం బనుచు,నెనయ నపుంసకం బిల మనశ్శబ్ద, మనినపాణినిసూత్ర మాలిసేయుమనుచు, వనిత గోపించుచు వచ్చె నమ్మనను. పండితా. దీక్షా. ౭౭ పా.
౩. ఏలు, ఎన్ను.
సీ కేసరి ధూమ్రాక్షు గిలుబాడుకొనె వానరేశ్వరుండు ప్రహస్తు నేఁచికొనియె. రామా. ౭. ౨౭౭.

**గిలుబు.** స. క్రి. అపహరించు.
సీ. మేటిజూదరి యన వాటమూతిపుటమై నాడుచుండుడు నే నహర్నిశంబు...గీ. తలఁపుగతి వచ్చుఁ గోరినదాయ మనఁగ, శకునిజూదంబు దీనియచ్చోకో యనంగ,గిలుపు నాయది కానొడ్డు గిలుబ నేర్చి, యెల్లపిడికిళ్ల విడిపించియేన కొందు. ద్వా. ౧౦. ౭౭. చంద్రా. ౫. ౧౦౪.
౨. దొంగతనము, చౌర్యము.
సీ.పరఁగుఁ దొక్కలి యన బందిపోటనఁగను గిలుబనఁగాను లంకింపు నాఁగ, దాఁపర మనఁగను...చౌర్యంబు...౩౦. భా. ౨. ౭౯౨.
జః గిలుబాడు, గిలుబుకొను, గిలుబుచేయు.

**గిలుబుకొను.** స. క్రి. (గిలుబు + కొను) కొంగిలించు.
రగడ. గురివెంద నది గిలుబుకొనియెఁ బయ్యెరదొంగ. మనుచ. ౩.౭౪.
సీ. తనుఁ జూడ వచ్చినఁ గనికరంబును లేక కలసొమ్ము లెల్లను గిలుబుకొనుట. రామ. ౩౬౬.

**గిలుబుచేయు.** స. క్రి. (గిలుబు+ చేయు.) అపహరించు.
సీ.తలిదండ్రులకు సమ్మతంబుగా నతిథినత్క్రియయటంచు నొకింత గిలుబుచేయు. నిరం. ౨. ౨౬.
సీ...కృతవీర్యునర్థంబు గిలుబుచేసి, కొని దాఁచి యున్నవా రని భార్గవుల నెల్లఁ బలికిన...

భార. ఆది. ౭. ౧౩౨. (శ. ర. ప్రాఁత ప్రతి తుల. పా.)

గిల్ల. విశే. మెల్ల, కంటి కడకు ఒఱిగినది, కేకరము. (చూ. గిల్లకన్ను, మొ.)
జః గిల్లకన్ను, గిల్లచూపు.

గిల్లకన్ను. వి. జో. (గిల్ల + కన్ను.) మెల్లకన్ను.
సీ. వింతవానిఁ గటాక్షవీక్షణంబునఁ జూచుకిసల యోష్ఠి వహించు గిల్లకన్ను. కాశీ. ౨. ౮౦.
శ్లో. కటాక్షయతి వా వ్యం వై కేకరాక్షీతు సా భవేత్. సం. కాశీ.

గిల్లచూపు. వి. (గిల్ల + చూపు.) మెల్లచూపు.
ద్వి. పిల్లికన్నులు బల్ల పెరిఁగినకడుపు, గిల్లచూపులుఁ జాల గిఱికొన్న బొచ్చు. నవనాథ. ౩. ౧౦౭ పా. ౧౯ పం.

గిల్లు. స. క్రి. ౧. (గోళ్లతో) త్రుంచు.
సీ. పెనుప్రేలికొనగోర బిసరుహాసనుమోముఁ గెంధమ్మివిరివోలె గిల్లినాఁడు. భీమ. ౧.౧౧౦.
రగడ. కొమ్మ వేగిర మేటికే కొనగోర గోరఁటవిరులు గిల్లుము. పారి. ౪. ౧౬.
చ...గోరు మోపి గిల్లనిచిగురాకు లాలితవిలాస నికేతన మాలతాంగి దా,ననుభవకర్త యేఘనుఁడో యావిధియత్న మెఱుంగనయ్యెదక్. పి. శకుం. ౨. ౧౫౮.
౨. (నఖములతో) క్షతముచేయు, గిచ్చు.
క. అనుచుఁ దనూజుల నిద్దఱఁ, గొనగోటం గిల్లివారు కో యని యేడ్వన్. శుక. ౨. ౨౫౭.
వి. నఖక్షతము. (శ. ర.)
జః గిల్లుడు.

గిల్లుడు=గిల్లు. వి. (√ గిల్లు.) నఖక్షతము. (శ.ర.)

గివులు. స. క్రి. గీఱు.
గీ. వడలుబీఱెండకును శరద్వృక్షము డిగి, వార్షికమె యొక్క త్రోటి నిర్వంకవక్షతులను గివులుచు వెట్టిచూపుల నురంబు, కొలఁకులు గనుంగొనుచుఁ గానఁ గేకు లుండె. ఆము.౪. ౧౮౧. (శ. ర. పా. 'నివురు' ముద్రి. పా.)

గిసుకు. వి. తుమ్ముటయుం దగుఅనుకరణము.
ద్వి. భసితంబుఁ బూయంగ గిసుకువఁ దుమ్మ,నావేమువిభుఁడు శతాయుష్య మనుచు.పండితా. పురా. ౧౬౮ పా.

## గీ

గీ[1]=గి. అవ.నిందయందు దీర్ఘాది యైనయామ్రేడితశబ్దముయొక్క ఆద్యక్షరమునకు వచ్చెడియాదేశము.
చ...అంతకు గింతకు దైత్య గిత్య...భా. రా. యు. ౯౦౪.
మ...ఇంకక్ సాత్యకిక్ గిత్యకిక్...ఉ.హరి. ౪. ౧౩౨.

గీ[2]. వి. ఘంటాధ్వనికి అనుకరణము.
ఉ...వరించి రా,భామిను లందఱుక్ గుసుమబాణుఁడు గీ యని ఘంట వ్రేయఁగాక్.భాగ. ౯. ౧౭౭.

గీఃపతి. సం. వి. ఇ. పుం. ౧. బృహస్పతి. ౨. చదువరి, పండితుఁడు.

గీండ్రు. వి. పెద్దచప్పుడు వినుటవలన చెవులలో కలిగెడుధ్వనికి అనుకరణము,
గీండ్రుమను=గింగురుమను.
క. వినువక చను సెమకొడునవ్వుసిపాపఁడు తల్లి దాపుఁ బాయుటఁ గడు వెక్కసపడుచు సారెసారెకు, వసుధను రై చెవులు గీండ్రుమన వాపోయెక్. వేం. పంచ.౪. ౪౩౩.

గీఁక. వి. (సం. ఘీంకారః.) బృంహితము, ఏనుఁగుఘీంకారము.
క. గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజనై గీఁక పెట్టఁ గులిశము సేలక్, భజన చెడి విడిచె నింద్రుఁడు...భాగ. ౬. ౪౦౭.
గీ...గీఁక, యనఁగ ఘీంకారనామధేయంబు చెలఁగు...అం. భా. ౨. ౧౯౪.

జ: గీపెట్టు.

**గీఁకు.** స. క్రి. గోరు మొదలగువానితో గీచు.

ద్వి. కొదమసింగములను గోరి తుండములు, మదమున నొయ్యనఁ బుడుకు నేనుఁగులు, వాని చెక్కులఁ దీఁట వక్రనఖాళిఁ,బూని గీఁకుచు నున్న పులులును...ద్వి.హరిశ్చ. పూ. ౭౪౧ పం.

**గీఁటు.** స. క్రి. ౧. (పండ్లు) కొఱుకు, దీఁటు.

ద్వి. గిటగిటఁ బండ్లను గీఁటి కౌశికుఁడు, చిటచిట మిడుఁగుర్లు చెదర వీక్షించి. ద్వి. హరిశ్చ. పూ. ౧౧౯౩ పం.

చ...గిటగిటఁ గోఱ లుద్దవిడి గీఁటుచు రొప్పుచుఁ గొప్పరించుచుక౯, గిటిగణ మేఁకుఁదేర ... ద్వా. ౮. ౨౬. వరాహ. ౨. ౧౩౨.

౨. (కన్ను) గిఱుపు, గిలుపు.

క. మును దక్షుఁ డధ్వుఁ బలుకఁగఁ, గనుగీఁటిన భగునిఁ బట్టి కన్నులు పెకలించెను నందీశ్వరుఁడు...భాగ. ౪. ౧౧౯. ఉ.హరి.౫.౫౯.

౩. చిమ్ము.

క...కంటినీరు గీఁటి యతనిపై, ధూళి వెసఁ దుడిచి...వాసిష్ఠ. ౪. ౪౦.

౪. మీటు.

చ...లేజవరాలు చెక్కు గీఁటిన వస వల్చు బాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే. నైష. ౧. ౧౭.

చ. తనమృదుగీతి కాపరిణతధ్వనిపై ఖరిఁ బల్కుమంచు మించినరహిఁ జేతివీణియకుఁ జెక్కులు గీఁటుచు నేర్పుచున్నదో, యన నఖరాంకురంబుల నయమ్మునఁ దంత్రులు మీటి గానమింపొనరఁగఁ జేయువాణి ప్రతిభోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయని౯. పారి. పీఠి. ౫.

ఉ...కుమారుని మక్కువ మీఱ నేద్పు రాఁ,జెక్కులు గీఁటి యొత్తి యొదఁజేరిచి ముచ్చటఁ దీఱునట్లుగా, నక్కట ముద్దులాడ వలదా ...సారంగ. ౧. ౧౧.

౫. చీల్చు.

చ...ధరిత్రి కొమ్మునం,' దలవడ మాటి రక్కసు నియంగమ గీఁటి బలీంద్రుని౯ రసా,తలమున మాటి...దా. శ. ౩౩.

వెడల(ఁగ)గీఁటు=వెడలఁగొట్టు, తఱిమివేయు.

క. ఏటికి నీరాచరికం, బాఁటది మొఱవెట్టఁ బసువు లాతురపడ నో,యాఁటదని లేచి దొంగల, గీఁటవు వెడలంగ శవము క్రియ నుండెదవే. భాగ. ౯. ౪౦౯.

**గీఁత.** వి. (√ గీయు) ౧. రేఖ, గీటు. (శ.ర.) ౨. గీయుట (చూ. గీఁతకత్తి, మొ.)

**గీఁతకట్ట(ట్టియ).** వి. (గీఁత+కట్టె) వడ్లవాఁడు నాములు తీర్చుటకై ఉపయోగించుపనిముట్టు,కత్తికాను. (శ. ర, బ్రా.)

**గీఁతకత్తి.** వి. (√ గీఁత) గీఁతగీసెడికత్తి, ఈండ్రవానికత్తి. చెన్న. ౫. ౨౫౨.

**గీచే**=గీయు. (శ. ర)

మ. కనకాంగీమణి కంచు గీచినగతి౯ గంథంబు మీఱ౯ జటాం, తనిరూఢశ్రుతిపాఠ మొందినపులస్త్యబ్రహ్మవేదధ్వని౯,విని...ఉ.రా. ౧. ౧౮౧.

**గీజో.** వి. పీఁకులాట. (బ్రా)

జ: గీజాపోరు.

**గీజాపోరు.** అ. క్రి. (గీజా + పోరు) ౧. విరామము లేకుండ జగడమాడు.

సీ. కీలుగం టిది యేల పోలఁగా నుసుఁగొప్ప గిల్లాల్పుకొమ్మంచు గీజాపోరు ... శుక. ౨. ౪౫౬.

౨. మిక్కిలి మారము చేయు.

గీ. శిశువులు...చిఱుదిండి గని యిది తెమ్మటంచు, గీజాపోరుట కద పెల్లగిల్లఁ బొగిలి, పాలఁతి యూరార్ప నతఁడు శాంపురము సేయు. శుక. ౩. ౨౪౪.

గీటడ(ణ)ఁగించే=గీటడఁచే. స. క్రి. (√ గీటడఁగు.) చంపు; నశింపఁజేయు.
(కంసునిమాటలు) సీ...ఉగ్రసేను మాయయ్య గీటడఁగించి పినతండ్రి దేవకుఁ బిలుకుమార్చి ...భాగ. ౧౦ పూ. ౧౧౬౧.
దండకము ... భీమకోపంబున శ్లోకవిద్రావణుꣳ రావణు న్వాటిచే గీటణంగింతు వంచు...కృ. శకుం. ౩. ౧౫౭. భార. విరా. ౨. ౧౩౫.
సీ.ఉత్కంఠరమ సంకునొఅపు గీటడఁగించి వెలిద మ్మితుటుములఁ జాలుకఁ జూచి. గీ...ఉల్లసిల్లె, మహిత పెద్దాడనూరయామాత్యుహాళి.పె శకుం. ౧. ౮౩. (ఇట ఔపమ్యవాచకము.)

గీటడఁగు. అ. క్రి.(గీటు² + అడఁగు) చచ్చు;నశించు.
సీ...యాదవు లెల్లను నమ్ముసలము, నద్భుతశక్తి గీటడఁగుదురు...భార. మా. ౧౦౮.
సీ...సౌబలుఁడు గీటఁడగెను లూకుండు మడిసె ...భార. శల్య. ౧. ౯.
చ...మహాత్మ మీరు చెప్పినపరమార్థతత్త్వమున పెంపున నాహృదయంబులోనఁ గల్గినయవివేక మంతయును గీటడఁగెꣳ సుఖి నైతి... వి. పు. ౩. ౩౬౮.

గీటడ(ణ)ఁచే=గీటడఁగించే.
(చంపు.)
గీ. మేటిమగని ఘటోత్కచు గీటడఁచఁడె, యట్టి జెట్టికిఁ బోరఁ జా వెట్టిభంగి,నయ్యె...భార. కర్ణ. ౧. ౮౨.
క...మన,కీచకు లండఱను రాత్రి గీటడఁచె రహ,స్యోచితవిధమున గంధ,ర్వాచరణము పేర భీముఁడు...భార. విరా. ౫. ౩౩౧.

గీటు¹. వి. గీఁత, రేఖ.(శ. ర, వా.)
జ: గీట్లబ్రద్ద.

గీటు². వి. ౧. (క. కీటు=అనాదరము.) అనాదరము, ఉపేక్ష. (చూ. గీటునఁబుచ్చు.)
౨. గర్వము. (బ్రౌ)
జ: గీటడఁగించు, గీటడఁగు, గీటడఁచు.

గీటునఁబుచ్చు. స. క్రి. ౧. అనాదరించు, ఉపేక్షించు.
క. విని విననివానిచందం,బున గీటునఁబుచ్చి ... జై. భా. ౮. ౩౯.
వ. అని తలంచుమఁ గీచకునిమాటలు గీటునంబుచ్చి యొండుపలుకులు జరపిన...భార. విరా. ౨. ౮౨.
సీ...కులము గీటునఁబుచ్చి వలను దప్పి, శౌచంబు వదలి...దశకు. ౩. ౯. భార. సౌ. ౨. ౭౭.
౨. పోఁగొట్టు.
వ. అతండు భీమసేనపక్షపాతంబున నతనిచింత గీటునఁబుచ్చె...భార. శల్య. ౨. ౩౧౧.

గీట్లబ్రద్ద. వి.(√గీటు1) కాగితములు లోనగువాని యందు గీట్లు వేయుటకు ఉపయోగించుకోల. (శ. ర.)

గీత. సం. వి. అ. స్త్రీ. ఆధ్యాత్మికతత్త్వవిషయమై ప్రశ్నోత్తరరూపమున నుండు గ్రంథము. (ఉదా:భగవద్గీత,రామగీత,శివగీత,పాండవగీత, మొ.)

గీతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. గానము చేయఁబడినది, పాడఁబడినది. ౨. పలుకఁబడినది, చెప్పఁబడినది. వి. అ. న. ౧. గానము, పాట. ౨. (ఛంద.) పద్యవిశేషము. (ఈయర్థము తెనుఁగున నే కలదు ) అప్ప.ర. ౨౦౮.

గీతమోది. సం. విణ. (న్. నీ. న్) గానముచే సంతోషించువాఁడు. వి. న్. పుం. కిన్నరుఁడు.

గీతి. సం. విణ. (న్. నీ. న్.) ౧. గానము చేయువాఁడు. ౨. సంగీతముతో చదువువాఁడు. వి. ఇ. స్త్రీ. ౧. పాట. ౨. (ఛంద) వృత్తభేదము.

గిదుపోరు=గిజాపోరు.
సీ. దోసాన కలిగిన నోసి పో లెమ్మనుఁ బేదసాదలఁ బ్రోవ గిదుపోరు.గీ...అయ్య ననుఁ గన్న కొయ్య గయ్యాళి తల్లి. విప్ర. ౩. ౧౫.

**గీపెట్టు.** అ. క్రి. (గీఁక + పెట్టు) ౧. (ఏనుఁగు)ఘీంకారము చేయు.

సీ. కేల్గల మెకములగీపెట్టుటలును మావులసకిలింత లగ్గలపుఁ దేర్ల,రొదలు కాలరులయార్పులు వాయిదమ్ములమ్రోఁతలు నొక్కటై...అచ్చ.రా. యు. ౩౨౨.

౨. మొఱపెట్టు.

క...క్రేపుల గోపాలసుతులఁ గృష్ణునితోడన్, గీపెట్టఁగ మ్రింగెద నని, పాపపురక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా. భాగ. ౧౦ పూ. ౪౬౭.

సీ. అలమి గీపెట్టింతు మలుకఁ గోఁటలు నూతి పై వచ్చుభూదారపతులనైన. హ. న. ౨. ౧౯౭.

దండకము...అత్యుగ్రమైయొక్కరావంబు పుట్టెన్ బెళా రంచు బ్రహ్మాండభాండంబు వ్రీలెన్...నానామహాభూతసంఘంబు గీపెట్టె ...దశా. ౪. ౨౩౨.

౩. మ్రోయు, ధ్వనిచేయు.

క. మదిరాక్షిజంఘ లంగజు, గద లగు నూహింపఁగావు కాహళు లైన,న్నదుకు వడక గీపెట్టక ...ఉన్నే. పాండు. ౩. ౧౭౨.

**గీము.** వి. (సం. గృహమ్? గేహమ్? క.గేబు.) ఇల్లు; నివాసము, ఉనికి.

సీ. ఎడపక గీమున కేతెంచువిందుల కలిమి వల్వలును సొమ్ములు నొసంగు. నీలా. ౧. ౪౯.

శా. సామీ దేవర పేరు సెప్పికొని యీసంద్రంపుఁ బెద్దోనలో, గీము ల్గైకొని చుట్టపక్కములతోఁ గీ డెన్నఁడున్ లేక మా,భూమి న్గల్గిన వేఁటతోడఁ గడుపుల్ పూరింతుము ... చంద్రా. ౨. ౬.

గీమువేల్పు=గృహదేవత, ఇలువేల్పు.

క...వేనోములు నోఁచి గీమువేల్పుల కెన్నో, కానుకలు నించి కాంచిన,కూనలఁ గానలకుఁ బంపుకొన నేరుదునే. అచ్చ. రా. బాల. ౧౦౨.

బలిగీము=బలిసద్మము, పాతాళము.

చ. క్షితి నుదయంబుఁ జెంది బలిగీమునకు న్వడి వేరువాతి...చం. రా. ౨. ౭౨.

**గీయు=గీచు.** స. క్రి. ౧. చివ్వు, చెక్కు.

సీ. గీసి గొజ్జఁగనీరు పోసి నూతినక్రొత్తచిలుబంతి పనుపులో చేవ నలఁది. హర. ౨. ౧౦౩.

గీ. నలువ సన్నంబుగా దీనినడుము గీసి, యౌవనమునకు నిచ్చె నాయంశ మెల్ల,నది యుపాదానముగఁ గదా యిది సృజించె,నున్నతము లైన యేతత్పయోధరముల. నైష. ౩. ౯౧.

వ...మఱియునుత్తాలంబు లగుతాలంబులం గిరాతజాలంబులు గీసి...చంద్రా. ౨. ౭౪.

౨. గోఁకు.

చ. కలయఁగ వారిదేవతలు గాంచుసరోవరదంభదర్పణం,బులపయి దట్టపుంజిలును వోవఁగఁదా రలకంచు గీయఁగా,బలె నలువంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేణువుల్, కలఁకులఁ బాసి పోఁ జెలఁగెఁ గ్రేంకృతు లిమ్చు మరాళమాలికల్. ఆము. ౪. ౧౭౦.

క. అసమయంబునఁ గాంస్యము, గీసినగతి ... ఒక్కనుడి వినఁబడియెన్. ఉ. రా. ౭. ౧౨౬.

౩. గంటమున్నగునవి కొడుపున్నగువానితో రాచు.

వ...అంచెపువ్వుకున్ గింకిణీరవంబును నురుమగీసినగతిన్ దేటి మ్రోసినక్రియ...మనుచ.౪. ౧౧౫.

౪. అఱుగఁదీయు.

సీ. ఇందు గీసినరీతి నిందుకించుక చేరి గిలుబాడుఁ దల్లిపైఁ గలపసిండి. పాండు. ౩. ౧౬.

౫. బలపము మున్నగువానితోఁ పలక మున్నగువానిపై గీచు. (శ. ర.)

జః గీఁత, గీఁతకట్టె, గీఁతకత్తి.

**గిరథుఁడు.** సం. వి. అ. పుం-రథమువలె వడిగలవాక్కు గలవాఁడు-బృహస్పతి. (త్రి. ని.)

**గిరన(నం)గింజే.** వి. బాల్యక్రీడావిశేషము.

సీ. తూరనతుంకాలు గిరనగింజలు పిల్లదీ వాలంకిబిల్లగోడు. కాశ. ౩. ౩౩.

మ...పింపిళ్లు కుచ్చిల్ గీరవంగింజ లో, మనగుం
టల్ కనుమూసిగంత నలుగంబాలాట ... క
ళా. ౬. ౨౦౨.

సీ...గీరనగింజ కొండకోఁతి...హంస. ౩. ౧౪౬.

ఉ. చారుచిరత్నరత్నమయసౌధముల న్బరివైశ్య
కన్యకల్గీరనగింజ లాడుచుతి...శకాం.౨.౧౯.

**గీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మ్రింగఁబడినది. ౨. వర్ణింపఁబడినది; పొగడఁబడినది.

**గీర్ణి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. వర్ణించుట; స్తోత్రము. ౨. నిగరణము, మ్రింగుట.

**గీర్దేవి.** సం. వి. ఈ. స్త్రీ. వాగ్దేవి, సరస్వతి.

**గీర్పతి.** సం=గీఃపతి.

**గీర్బాణుఁడు.** సం=గీర్వాణుఁడు.

**గీర్వాణకుసుమము.** సం. వి. అ. న. దేవకుసుమము, లవంగము.

**గీర్వాణుఁడు.** సం. వి. అ. పుం-వాక్కు బాణముగాఁ గలవాఁడు; వేదశాస్త్రరూపవాక్కును వివరించి చెప్పువాఁడు; స్తుతిరూప మగుమంత్రాదికము వినఁ గోరువాఁడు- దేవత, వేల్పు.

**గీఱ.** వి. (√గీఱు) గీఁత, రేఖ.

రగడ. కన్నెచంటిమింటిగీఱఁ గన్నఁ గన్నతల్లి
దిట్టు...వరాహ. ౩. ౯౨.

**గీఱు.** అ. క్రి. నాటు, గ్రుచ్చుకొను.

చ...ద్రౌపది నింతకాల మప్పలుకు లలంచమం
డె మదిఁ బాయవు గీఱినయమ్ము లట్ల...భార.
౩. ౩౬.

ఉ...వృకోదరుండు పదితూపులు పాములు పుట్ట
లోనికిం, దూఱినయట్లు గాఁ బ్రబలకోర్బల
మేర్పడ నేయ నెమ్ములన్, గీఱిన మూర్ఛ వచ్చి
యొఱగెన్...భార. భీష్మ. ౨. ౩౯౭.

సీ. పాంచాలి నవమానపఱచిన తెఱఁగును నయ్యం
తి వెనుకఁ రా నడవిఁ గలయు, ధర్మజాచన్న చం
దంబును మది గీఱి యుండక మఱి పెట్టు లేవె
నె నీకు...భార. ఆశ్ర. ౧. ౧౧౭.

స. క్రి. ౧. (పండ్లతో) చీకు.

సీ. ఎఱది గీఱిన జీర లేర్పడఁ దునుముట్టఁ దీకిన
నులిపద్మికీకసముల. ఆము. ౬. ౧౩.

౨. ఛేదించు.

వ...ఇట్లు మనుచూపుచు దేయుహాయకంబులు
...మర్మంబులు గీఱియు...ఉ.హరి.౧.౨౪౭.

౩. భేదించు.

క...గీఱునె సాత్త్వికులబుద్ధి గిల్బిషచయముల్.
నృసిం. ౧. ౯౫.

౪. (గోళ్లతో మరుఁగు) దువ్వు.

ఉ. చేరఁగ రార నీకురులు చిక్కువడించెద నం
చు నేర్పుతో, సారసగంధి పిల్చి బిగిచన్నులు
వెన్నున నాన నిల్చి కర్ణం, గారవువింతమాటల
వికావిక వాని నగించి నవ్వుచుం, గూరిమి మీ
ఱ గీఱి కొనగోటఁ జిటుక్కున నొక్కుఁ జొ
క్కఁగన్. శకాం. ౨. ౭౪.

శా. పన్నీటన్ నయనంబు లొత్తెఁ దనువుం బాటీ
రపంకంబులోఁ, జెన్నారం బదనిచ్చె గీఱి సి
గ వేసెన్ దాయెతు ల్సొట్టె...హంస.౧.౩౫.

జ: గీఱ, గీఱుగాజు, గీఱుడు, గీఱునామము, గీ
ఱుబొట్టు.

**గీఱుగాజు.** వి. (√గీఱు) ఒకవిధ మైన గాజు. (శ. ర.)

**గీఱుడు.** వి. (√గీఱు) ౧. గోఁకుడు. ౨. భేదనము. (శ. ర.)

**గీఱునా(ర్నా)మము.** వి. (గీఱు+నామము) గోటితో గీఱి తీర్చబడిబొట్టు.

సీ. తెఱవ కస్తురిమక్క దీర్చి వచ్చిన బొక్క గీఱు
నామము నాఁటితీరుఁ గేరు...విజ. వి.౩. ౧౩.

సీ. సెలరేక నుదుటిపై నీ లైనకమ్మఁగస్తూరిగీర్నా
మంబు సొగ మీఱ. ఇందు. ౧. ౨౦.

గీఱుబొ(ర్బొ)ట్టు=గీఱునామము.

గీ. వెలయ మృగనాభి గీఱ్బొట్టు పెట్టినారు... సై
ష. ౩. ౬౩.

గీ. కలికికాటుకగీఱ్బొట్టు పలుఁగుపేరు, జాతి
గాఁ దాల్చి వెలఁమిండజంగ మగుచు... హ
ర. ౫. ౪౦.

గీవు=గిరవు. అప్ర. (శ. ర.)

గీష్పతి. సం=గీఃపతి. (ఈశబ్దము పాణినీయమునకు
విరుద్ధము.)

ఉ...గీష్పతి యేమి చెప్పె నిట క్రింద బలారికిఁ
గామవిక్రియా,దుష్పథవృత్తికిన్ ... సైష.
౪. ౭౫.

## గు

గుంజె. వి. (క. గుంజె) ౧. స్తంభము.

సీ. వికలంపుఁదడ్లపోలిక డొంకుచేతులు పందిలి
గుంజలపగిదికాళ్లు. ప్రబంధ. ౬౨౨.

౨. రాట్నముయొక్క అవయవము. (ఇది స్తంభ
మువలె నుండును.)

క. వడిదారము చెవులుం ద్రొక్కుడుపలకయు
దిండు కదురు గుంజలునుం ద్రొక్కుడుబొమ్మ
యునుం ద్రిప్పుడు,పుడుకయునుం గలుగురా
ట్నములు నైకొనుచున్. శుక. ౨. ౪౧౯.

గుంజ. సం. వి. అ. స్త్రీ. ౧. గురిజ, గురివెందగి. ౨.
రెండుగోదుమగింజలయెత్తు. ౩. అవ్యక్తమధురధ్వ
ని. ౪. తప్పెట, వాద్యభేదము. ౫. గంజ, కల్లుదు
కాణము. (వాచ) ౬. ఉప్పళము, ఉప్పఁబత్తి.

గుంజత్. సం. శత్రు. అవ్యక్తమధురధ్వని చేయుచు
న్న.

గుంజనము. సం. వి. అ. న. అవ్యక్తమధురధ్వని.

గుంజెనుసుఁగు. స. క్రి. పరిహాసముచేయు. (శ. ర.)
వి. ఎలుఁగుగొడ్డాట. (శ. ర.)

గుంజము. సం. వి. అ. పుం. ౧. అవ్యక్తమధురధ్వ
ని. ౨. గుచ్ఛము, పూలగుత్తి.

గుంజాటన. మి. వి. వ్యసనము. (శ. ర.)

గుంజిక. సం. వి. ఆ. స్త్రీ. గురివెందపూస.

గుంజితము. సం. వి. అ. న. అవ్యక్తమధురధ్వని.

గుంజిలి[1]. వి. గోపనము, దాఁపురము. (చూ. గుం
జిలిపెట్టు[1].)

జ: గుంజిలిపెట్టు 1.

గుఁజిలి[2]. వి. (బ.గుంజిళ్లు) చేతులు కట్టుకొని రెం
డుకాళ్లు చేర్చిపెట్టి కూర్చుండి లేచుట. (గ్రా,
శ. ర.)

సీ. గుంజిళ్లు పెట్టించుకొను మేటి పిళ్లారి కడుపు
దాలుపు పెద్దకడుపువేల్పు. సాం. ని. దేవ. ౨.

జ: గుంజిలిపెట్టు[2].

గుంజిలిపెట్టు[1]. అ. క్రి. (గుంజిలి[1] + పెట్టు) గో
పనముచేయు, దాఁచు.

ఉ. కావరమెత్తి యిట్టు తనుఁ గాఱియపెట్టుచు
నున్న దాని ని,చ్చావతిఁ జూచి లేచి రథసం
బున రెడ్డన పల్కె నోసి నీ,చేవ యెఱింగి కా
దె మును చెప్పక గుంజిలిపెట్టి యున్కి నీ,వే
వల దన్న వేఁడుకొనవే మఱి యేనయి చెప్పి
నాఁడనే. వేం. పంచ. ౪. ౪౬౯.

గుంజిలిపెట్టు[2]. అ. క్రి. (గుంజిలి[2] + పెట్టు) గుం
జిళ్లుతీయువానివలె పైకిఁ బోవుచుఁ గ్రిందికి వ
చ్చుచుండు.

క. పెంకెమట జాఱ దోవతి, పింకెలు మాటికిని
గాళ్లఁ బెనఁగొనఁ గడుపుల్, గుంజిలిపెట్టఁగ
వేలుపు,లంకెలఁ గూడంగఁ జని హాళాహాళి
మెఱయుచున్. వాల్మీకి. ౩. ౭౧.

గుంజా. స. క్రి. (క. గుంజా.) ౧. (వ్య, మొ.) జా
డించు.

శా. తారాప్రోష్ఠులఁ గాలసూతుఁడు వియద్వారా
 శ వేఁటాడి ప్రాణ్ణారంభం బనుబుట్టఁ బెట్టి ను
 రి వాయుం గుంజి యీఁ దాఱఁ జై,న్నార
 స్యైచివజాలవా యనఁగ శోభాకించనత్వం
 బునన్,దారానాయకమండలం బమర వస్త్ర
 గ్రావకూటంబునన్. కాశీ. ౪. ౯౬.
సీ. అని చిన్నకూఁకటిఁ బెనఁచినజడ పట్టి గుంజి
 యీడిచి చెంపఁ గొట్టి తిట్టె.పారిశ్చ.౫.౧౭.
౨. లాగు, బలాత్కారముగానీడ్చు. (బ్రౌ, చి.ని. ధాతుమాల.)
సీ.కరముష్టిదండ మొక్కఁడు తీసి పోవైచె నంజ
 కొక్కఁడు శిఖ గుంజి యడిచె. పారిశ్చ. ౪. ౧౬౨.
౩. ఉదుకు; బట్ట ఉదికినట్లు కొట్టు.
సీ... అమ్మ్యోడకుఁ జీరలు గుంజునొక్కచాకిత
 యుఁ దా నొంటి వచ్చి. భోజరా. ౪.౧౪౫.
ఉ...భక్త్వవస్త్రావళి గుంజుచో... చెన్న. ౩.౧౯౭.
సీ. పాదంబు లిరుచేతఁ బట్టి గుంజుండు జర్జరితం
 బుగా వీనిఁ జట్టురాత. కాశీ. ౩. ౧౫౭.
వి. ౧. ఈఁతచెట్టు తాటిచెట్టు మున్నగువాని మొవ్వ.
(దుర్భిక్షవర్ణనము.) గీ...ఈఁత, గుంజు మొదలు
 గఁ దిన దొరఁకొనియె జనము.కాశీ. ౩.౧౫౧.
౨. తాళపేశము.(తాటితేగ మొనయందు బుఱ్ఱలో నుండెడుగిజురు. శ. ర.)
గీ. తాళపేశంబు గుం జనఁ బోలు నభవ. ఆం.
 భా. ౨. ౭౭.
౩. ఫలాదులలో అనుకుగా నుండుసారము,గుజ్జు. (బ్రౌ)
జ: గుంజుకొను, గుంజెలాడు.

**గుంజెకొను.** స. క్రి. (√గుంజె)లాగుకొను.(బ్రౌ)
**గుంజెలాడు.** అ. క్రి. (√గుంజె) పెనఁగులాడు. (బ్రౌ)
**గుంట**=కుంట.

(చిన్నగొయ్యి, గుంత.)

వ...గరువునేలల గుంట లొనరించి ... మనుచ.
 ౪. ౬౦.

(చిన్నచెఱువు, అల్పతటాకము.)

గీ. కుంట గుంట యనంగఁ బేర్కొనఁగ వచ్చు,
 నల్ప మైనతటాక మార్యాసమేత. ఆం. భా.
 ౧. ౧౬౨. ఆము. ౪.౨౩౬.

(కొండ్ర)

గీ. ప్రబలు సీతానివృత్తి కొండ్ర యన గుంట,య
 నఁగ...ఆం. భా. ౨. ౨౩౩.

(భూపరిమాణవిశేషము. శ. ర, బ్రౌ.)

జ: గుంటక, గుంటకలగర, గుంటక్రోవి, గుంటగలి
జేరు, గుంటచాళ్లు, గుంటమూలము, గుంటనక్క,
గుంటప్రొయ్యి, గుంటమారి, గుంటుుపడు.

**గుంటక.** వి. (√గుంట-క. కుంటె) దున్ని విత్తులు చల్లినవెనుక నేల సవరచేయుసాధనము. (చి.ని, శ. ర, బ్రౌ.)
సీ. గుంటక నాఁగను గొఱ్ఱు నా...పరఁగును గృ
 షి,సాధనభేదముల్ ... ఆం. భా. ౨. ౨౩౩.

**గుంటకలగర.** వి. (√ గుంట) భృంగరాజము ౘ. ఆం. భా. ౨. ౬౯. (గుంటగలగర-శ.ర,చి.ని.)
**గుంటక్రోవి.** వి. (గుంట + క్రోవి) ఒకరకముపిరం గి. (చి. ని-గుంటక్రోవ. బ్రౌ, శ. ర.)
గీ...గుంటక్రోవి,జబురుజంగి తుపాకి జజా యనం
 గ, వెలయు నగ్ని ప్రసారణాఖ్యలు మహేశ.
 ఆం. భా. ౨. ౨౧౭.

**గుంటగలిజే(ల్జే)రు.** వి. (గుంట+గలిజేరు) గుంట కలగర, భృంగరాజము ౘ.
గీ. గుంటగలిజేరు కలగర గుంటకలగ,ర యనఁ జె
 న్నొందు నా భృంగరాజసంజ్ఞ.ఆం. భా.౨.౬౯.
పీ... గలిజేరు గుంటగల్జేరును. హంస. ౪. ౧౦.

**గుంటచాళ్లు.** వి. బ. (గుంట+చాళ్లు)బాలక్రీడా విశేషము.
సీ...పుట్టచెండ్లుప్పనఁబట్టె లాలంకులు గుడుగు
 డుగుంచాలు గుంటచాళ్లు... గీ. అదిగా ౖై

వక్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

**గుంటదూలము**=కుంటదూలము. (శ. ర.)

**గుంటనక్క.** వి. (గుంట + నక్క) చిన్న జాతి నక్క, కిఖి. (శ. ర.)

**గుంటప్రొయ్యి.** వి. (గుంట+ప్రొయ్యి.) గుంట త్రవ్వి యేర్పఱచిన ప్రొయ్యి. (శ. ర)

**గుంటమారి.** విశే. (గుంట+మారి) దుర్మార్గుఁడు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి, కాఁ కలను దేఱి గడిమీఱి గట్టిపాఱి, రాలు గాయతనాన బేరజపుదారి, నారితేఱియు బలుగుంటమారి యయ్యె. హంస. ౫. ౧౧౦.

**గుంటలుపడు.** అ. క్రి. (√ గుంట.) పల్లమగు, లోఁతగు.

వ...వెన్నంటుకొనినయుదరంబులు గుంటలుపడిన కన్నులు...దశా. ౨. ౫౩.

**గుంటి.** వి. ౧. చేనిభాగము. (శ. ర.) ౨. దున్నుట మొదలగువాని కేర్పఱచుకొన్న భూభాగము. (బ్రౌ, శ. ర.)

**గుంటిక్రోవి.** వి. (గుండు+క్రోవి.) ఒకవిధ మైనతుపాకి.

వ...పిరంగులధింధిమ్ములు... గుంటిక్రోవులడబ్బుడుబ్బులు...ప్రబంధ. ౭౮౮.

గీ. క్రోవులను గుంటిక్రోవులఁ గోటమూఁక, యుల ముఖంబునఁ దొట్టినబలము సెల్లి, మంగలము లోనిపేలాలమాడ్కిఁ బేల్చె. రా.వి.౫.౨౨.

**గుంటు.** వి. ఒకజాతియాయుధము.

గుంటుకాఁడు=గుంటు అను నాయుధముకలవాఁడు.

సీ. ఎంచనుర్విపడు సేయు సేనిక కాని ముక్కుయ్యలవడ ప్రేయుగుంటుకాని. కు. సం. ౧౧. ౬౧౦.

**గుంఠనము.** సం. వి. అ. న. ౧. కప్పుట. ౨. పూయుట.

**గుంఠితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. కప్పఁబడినది. ౨. పూయఁబడినది.

**గుండ[1].** వి. ౧. గుడ్డ, బట్ట.

సీ. ఎండగట్టినకావిగుండలకెంజాయ చిగురుజొంపంబులచెన్నుఁ దెంప. యయా. ౨. ౫౦. (శ. ర. పా-'అఱఁగట్టినకావిచీరల' ముద్రి. పా.)

**గుండ[2].** (సం. గుండకః) పొడి. (శ. ర, వా.)

జః గుండాడు.

**గుండ[3].** ప్ర. ద్రు. పంచమీవిభక్తిప్రత్యయము.

గీ. కైకొనక సమిధలు తోంటికరణిఁ గోయు, చుండె ఖండితతర్జనిగుండ నెత్తురెమిక మొదలుగ లేదయ్యె నించుకైన, భూతియె పెడలె నార తపోవిభూతి. వరాహ. ౧౨. ౨౫.

స్రగ్విణి. దండకారణ్యమధ్యంబుకాల్ద్రోవలో, గుండ నేఁ గవ్వపుంగొండకుం బోవ...ప్రబోధ. ౫. ౯౮.

**గుండఁగి.** వి. సలిలకుక్కుటము, నీరుకోడి.

గీ. సలిలకుక్కుటనామంబు వెలయు నీరుకోడి యనఁ బుల్లగోర కన గుండఁగి యన. ఆం. భా. ౨. ౯౨.

**గుండఁడు.** వి. (క. గుండ) బంటు, దానుఁడు.

సీ. బానసీఁడన బంటు వరపుఁడు గుండఁడు నాఁగ దాసాఖ్యలు గాఁగఁదనరు. ఆం.భా. ౨. ౭౮.

ఉ. గుండనికిం బసిండిపనిగో రడిబండకు వెండితాయెతుల్, లండికిఁ జేకడెంబు పదిలంబుగ గుమ్మెతకాని కంటెలున్, బెండెము బాడుగోలునకు భృత్యునకు న్నైడనూలు చాటుకో, దండున కుంగరాలు మొలత్రాడులు గుంటెనకాని కియ్యఁగన్. హంస. ౫. ౧౩౬.

సీ. అకతాయ బికారి యడిబండ గుండఁడు మొం

డికట్టై గులాము మెప్పై గోప. హంస. ౫. ౧౧౩.

**గుండకము.** సం. విశే. (అ. ఆ. అ) మలిన మైనది. వి. అ. పుం. ౧. పొడి, గుండ. ౨. స్నేహపాత్రము, చమురుపాత్రము. ౩. అవ్యక్తమధురధ్వని.

**గుండక్రియ.** సం.వి.ఆ. స్త్రీ.ఒకానొకరాగము.
సీ. గుజ్జరి మలహరి గుండక్రియ వరాళి దేవగాంధారియు...ప్రబంధ. ౯౫.

**గుండగొయ్య.** వి. దుష్టుఁడు. (శ. ర-'మూర్ఖుఁడు' అని బ్రా)

**గుండము.** వి. (సం. కుండం. త. కుంటం.) నిప్పుల గుంట.
ద్వి. ఈగుండములు సొచ్చి యొలమిఁ జొట్టియును, జాఁగిలిపడియుండు సర్పములే పెక్కు. రం. రా. యు. ౭౯౦ పం. ౨౦ వం.
సీ. అవఅవ మండుకెట్టినిచంద్రమల్లెలచోద్యంపు గుండాలు చొచ్చువారు. క్రీడా. ౧౪౨.
౨. (నద్యాదుల)లోఁతుభాగము.
సీ. చామచన్నులతోడ సరివత్తు మని కోకములు దండిగుండాన మునిఁగెనేని, యతివమైదొరయుదు నని సువర్ణశిలాక వహ్నిలోపలఁ జొచ్చి వచ్చెనేని...విక్ర.౫.౧౭౦.
ఉ. గాములమేటి లోకములకన్న తమమ్ములమిత్తియామినీ,భామ తొలంగుబావ సెకవాఁకల గుండము...కృ. శకుం. ౩. ౫౮.

**గుండము.** సం. వి. అ. పుం. వాసన గలయొకవిధ మైనగడ్డి.

**గుండా.** వి. ధీరుఁడు. (బ్రా, శ. ర.)

**గుండాడు.** స. క్రి. (గుండ² + ఆడు) గుండగాఁ జేయు, పొడిచేయు.
సీ. దుండగంబునఁ బూలగుండాడ వికలితవృత్తిఁ గల్పకవాటి పీటఁబోయి. వరాహ. ౧౦.౧౫.

**గుండారోచని.** సం. వి. ఈ. స్త్రీ. కాంపిల్యము, కంపిల్లము ?.

**గుండారోచనిక.** సం. వి. ఆ. స్త్రీ=గుండారోచని.

**గుండాల.** సం. వి. ఆ. స్త్రీ. జలోద్భూత, ఒకవిధ మైనగడ్డిదుబ్బు.

**గుండాసిని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకవిధ మగుగడ్డి.

**గుండికము.** సం. వి. అ. పుం. (బియ్యము, మొదలగువాని) పిండి.

**గుండిగ.** వి. (సం. కుండికా. త. కుండిగై.)వెడల్పు నోరు గలలోహపాత్రము. (శ.ర)

**గుండితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧.పొడిసేయఁబడినది,పిండిసేయఁబడినది. ౨. కప్పఁబడినది.

**గుండీ.** వి. (క. గుండ.త.గొండి) బొత్తాము.(శ. ర.)

**గుండు.** వి. దే. (సం. గండః. క. గుండు. త. కుండు.) ౧. గుండ్రపురాయి; పెద్దఱాయి.
సీ. వర్తులశిలపేరు వఱలు గుండనఁగను ... అం. భా. ౨. ౭౯.
గీ. కోపమున హలధరుఁ డొకగుండు వైవ. భాగ. ౧౦ ఉ. ౫౪౪.
గీ. నల్లసేనపుగుండులు నడచినట్లు. ఉ. హరి. ౪. ౨౬.
గీ. అంటుకొనె నధ్వరాశ్వ మగ్గుంటితోడ. జై. భా. ౪. ౭౬. పాండు. ౫. ౨౪౦.
౨. తూనికఱాయి. (శ. ర.)
౩. ఫిరంగి తుపాకిలోనగువానిగుండు.
వ...పౌండ్ర భూపాలుండు యదువీరునగరంబు కలుకోట ... దంచనపుగుండ్లం బడవైచియు ...ఉ. హరి. ౩. ౩౬.
౪. ఉండ, గోళకము.
గీ...గుం డన నుండ నా నమరు గోళ, కాఖ్య... అం. భా. ౨. ౨౭౫.

౫. పర్వతము.

సీ. ఒంటిగా మడికానుగుంటిపైఁ గూర్చుండి సంజకెంజాయ పెన్జడలు దాల్చి. నరస. ౨. ౧౨౯. అచ్చ. రా. సుం. ౫౭.

౬. నగలలో నమర్చెడుగుండ్రాయి.

సీ...రెండుగుండ్లముంగరలు మైజాఱుచీరలు. శుక. ౨. ౩౩౨.

౭. మోటకు కట్టుగుండు, కపిలెగుండు. (శ.ర.)

౮. లంగరు.

సీ. బెడిదంపుగాలిచే బెదరి రొత్తినచాఁప విడిచి గుండ్లను డిగవిడుచుటయును. దశకు. ౧౦. ౬౩.

విశ. గుండ్రనిది, వర్తులము. (చూ. గుండుసున్న, గుండుఁబులుఁగు.)

జ: గుంటిక్రోవి, గుండుఁబులుఁగు, గుండుకొను, గుండుగిలు, గుండుగుత్త, గుండుజల్ల, గుండుసున్న, గుండ్రాయి, గుండ్లుబెండ్లాడు.

**గుండుఁబులుఁగు(ల్గు).** వి. (గుండు + పులుఁగు) చక్రవాకపక్షి.

గీ. గుండుఁబుల్గులమదికుందు చెందుమందు, దోఁచె నెత్తమ్మివిరివిందు... రా. వి. ౩. ౨౯.

గుండుఁబులుఁగులవేఁటకాఁడు=కోకారి, చంద్రుఁడు.

(వెన్నెలవర్ణనము) వ... గుండుంబులుఁగులవేఁటకాఁడు కాముకసంకేతనికేతనగచ్ఛదిచ్ఛావతులపై వైచినపువ్వువలలచిమ్మన... బహు. ౩. ౫౯.

**గుండుకొను.** స. క్రి. (గుండు + కొను.) చుట్టుకొను, ఆవరించు.

క. గుండుకొని చూచుమానిసి, తండముఁ దలఁగంగఁ ద్రోచి తత్కరి వెస నా, చండాలుఁ దెచ్చి భూజన, మండలి కభిషిక్తుఁ జేసె మంత్రులు చూడన్. వాసిష్ఠ. ౪. ౧౦౩.

**గుండుగిలు.** అ. క్రి. (√ గుండు) చుట్టచుట్టుకొనిపడు.

వ ... అయ్యుభయబలంబులుఁ దలపడునప్పుడు కొండలపాటులం జదియువారును దరువుల వ్రేటుల వ్రాలువారును గండశైలంబులతాఁకున గుండుగిలువారును ... భా. రా. యు. ౧౪౩౨.

చ. జయమునఁ బొంగి పెల్లుగ నిశాచరవల్లభుఁడార్వ సేనలుం, బ్రియమున నొక్కపెట్ట వలికేఁగి నభంబు పెలంగ నార్చినన్, భయమున దండు గుండుగిలఁ బాఱుడు నాసమవర్తి యొంతయున్, రయమున నుద్భటారుణతురంగసమాహరథాధిరూఢుఁ డై. నిర్వ. ౫. ౫౮.

**గుండుగుత్త.** వి. (గుండు + గుత్త) సమస్తస్వాతంత్ర్యములతో నిచ్చెడుగుత్త. (శ. ర)

**గుండుజల్ల.** వి. (గుండు + జల్ల) పెద్దగంప. (శ.ర.)

**గుండుములుపుగాఁడు.** వి. పక్షివిశేషము. (బ్రౌ, శ. ర.)

**గుండుసున్న.** వి. (√ గుండు) గుండ్రనిసున్న.

(వ్యవ) వానికి లెక్కలలో గుండుసున్న వచ్చినది=వాఁడు లెక్కలపరీక్షలోతప్పిపోయినాఁడు.

**గుండె(డియ).** వి. (త. కుండి. క. గుండిగె.) ౧. గుండెకాయ, హృదయము; మనస్సు.

గీ. అనిమిషులగుండెలో గాలమ్మునిలలోక, నేత్రమున నాటి వేధించునెరను ... రావణుఁడుడిందె... ఉ. రా. ౧. ౧౪౯.

చ. కుజమున నున్నవానరునిగుండియ దండియకంబు నీకుఁ గా, భుజబలసార యిమ్ము కొనిపోయెద నాయెద దీర మత్ప్రియా, నుజ కన... వేం. పంచ. ౪. ౮౬. ఆం. భా. ౨. ౧౩౨.

సీ. ఎదిరించుకరి నైన బెదరించుహరి నైన గంపడంపఁగఁ జాలుగుండెపటిమ. ఇందు. ౧. ౧౫౨.

౨. ధైర్యము.

సీ. పాండుపుత్త్రులబహిఃప్రాణంబు నుత్తమశీలసమగ్రఁ బాంచాలతనయఁ, గొనిపోవుకంతటిగుం

డె గర్దైని విమోహాంధమానసుఁ డైనసైంధవు
నకు. భార. అర. ౬. ౧౯౭.
ఎన్ని గుండెలుకలవు:- ధైర్యము చాల దనిభావము.
గీ. అనిన గజగజ వణఁకుచు నయ్యరంగ, ధామ
కోవెల మున్ను తాతలతరంబు, నాఁటనుండి
యు మాకుఁ గాణాచి గాదె, యెన్ని గుండెలు
గల వయ్య యింతపనికి. విప్ర. ౫. ౧౭౭.
గుండెగూడఁబెట్టు=మనసు దృఢపఱచుకొను.
ఆ... వానియలుకకు నే నైన, గుండెగూడఁబె
ట్టియుండ వెఱతు. వి. పు. ౧. ౧౫౭.
గుండెతల=వక్షము, ఱొమ్ము.
గీ. గుండెతల బిట్టు దన్నినఁ గూలుటయును. దశ
కు. ౬. ౧౮౩.
గుండెలుసీరగు=ధైర్యముచెడు.
క. చారులచే గాండీవి మహారథికులతోడ వచ్చె
నని విని గుండెల్ సీ రై సైంధవశవయుఁడు,
పేరోలగముండి బిట్టు పిఱువడి చచ్చెన్. జై.
భా. ౮. ౧౫౬.
గుండెపట్టుకొను=ధైర్యము తెచ్చికొను.
వ. మహాత్మా వినోదప్రవృత్తం బైనవాగ్వాదంబు
నకు నీదిగంబరునిమీఁద నింత తెగం బని రే
దని ప్రియంబు చెప్పినఁ గాపాలికుండు ప
ట్టెం బొఱలోపలఁ బెట్టిన బైనుండును గొం
త గుండెపట్టుకొని యోయి సోమసిద్ధాంతా
శాంతుండ వై భవదీయదర్శనంబున భోగమో
క్షంబులఁ గలతెఱం గెఱింగింపు మనిన... ప్ర
బోధ. ౩. ౮౦.
గుండెలుతీసినబంటు=భయస్థాన మగుగుండె లే లే
నివాఁడు, మహాధీరుఁడు. (వా)
నీగుండెలలో నిద్రపోయెదను:-న న్నెప్పుడును
మఱవకుండునట్లు నీకు భయంకరుఁడనుగా నుం
దును. (చూ. లేఁడు)
జ: గుండెకాయ, గుండెవగరు.

**గుండెకాయ.** వి. (గుండె + కాయ) కాయవలె
నుండుహృదయావయవము, కందనగాయ.
గీ... దొడ్డనారసమున గుండెకాయ, వగుల బి
ట్టేయుటయును... భార. ద్రో. ౩. ౯౫.
ఆ. కపటధర్మకంచుకంబున పెలసిరి, గాని సత్యపు
రుషకారపరులు, గారు పాండుసుతులు వార
ల నమ్మఁగఁ, గాదు నేశ గుండెకాయ యిడిన.
భార. శల్య. ౨. ౩౯౭. వేం. పంచ. ౪. ౨౪౪.

**గుండెవగరు.** వి. (గుండె + వగరు) వసువులవ
చ్చుశ్వాసరోగవిశేషము.
క. కలియును వెంపలివేరును, నలియంగా నులిచి
ముక్కునస్యము నేయన్, బలు చగుడగ్గును వ
గరును, దలిపిగ మత్తి గుండెవగరుఁ దీఱుం బ
సికికిన్. గోచికి. ౧. (చి. ని.)

**గుండ్ర[1].** విశ. ('గుండ్రము' నకు అంత్యవర్ణము లో
పింపఁగా మిగిలిన రూపము. దీనికి వృత్తియందు
నిగాగమము వికల్పముగా వచ్చును.) వర్తులము.
ఉదా: గుండ్రకడుపు, గుండ్రనికడుపు, గుండ్ర
మొగము, గుండ్రనిమొగము.
వి. బ. ౧. పింపి కొట్టి చెరుగఁగా వెనుకకు నిలిచి
నవఱంపలు. (శ. ర)
౨. రసముమున్న గునవి తీయుటకై చెఱకుమున్న
గువానిని నొక్కురాట్నముకోలలు.
మ. ఇలకు న్వ్రేఁగు గఁ బండి తీరవనపుంద్రేక్షు
చ్ఛటలీపుల,గ్గలమై వ్రాల నురుస్వనంబు లెసఁ
గం గాఁ ద్రిప్పరాట్నంపుగుండ్రలు నాఁ దే
నెకొలంకులం బొరలి పాఱ న్విమ్మపంకేరు
హంబుల నాడెం దొలుసంజఁ దేఁటివలయం
బు లారయుంకారముల్. ఆము. ౪. ౧౫౨.
ద్వి. గొనకొన్న రాట్నపుగుండ్రలకరణిఁ, బనిఁ
బూని ఘనకర్మ పరతంత్రు లగుచు, నరకంబు
లందు జన్మంబులయందుఁ దిరుగుచు నిట్లు వర్తి
లెడుజీవులకు. ద్వి. పరమ. ౧. ౨౪ పా. కు.
సం. ౧౧. ౭౩౩.
౩. భ్రమణము, తిరుగుట. (చి. ని-చూ. గుండ్రించు.)

**గుండ్ర²**. వి. వృక్షవిశేషము. హంస. ౪. ౫.

**గుండ్ర³=గూండ్ర**. వి. ఘూకధ్వని, గ్రుడ్లగూబ కూఁత. (చి. ని.)

గుండ్రలుకొలుపు=(గ్రుడ్లగూబ) కూయు.

క. కాకంబులు వాపోయెడి, ఘూకంబులు నగరఁ బగలు గుండ్రలుకొలిపెన్. భాగ. ౧. ౩౪౨.

శ్లో...ఉలూకః కంపయన్వనః, ప్రత్యులూకశ్చ కుహ్వానై ర్విశ్వం ద్రాక్షూన్యమిచ్ఛతః. సం. భాగ. ౧. ౧౪. ౧౫.

**గుండ్రతుంగ**. వి. (గుండ్ర¹ + తుంగ.) ఒకవిధ మగుతుంగ, ముస్తాభేదముకీ. (బ్రౌ, శ. ర)

**గుండ్రన**. వి. (√ గుండ్ర¹) వర్తులత. విణ. వర్తులము.

**గుండ్రము**. విణ. (సం. కుండలమ్) వర్తులము.

ఉదా: బొంగరము గుండ్రముగాఁ దిరుగును.

జ: గుండ్ర¹, గుండ్రతుంగ, గుండ్రన, గుండ్రించు.

**గుండ్రాయి, గుండ్రా**. వి.బొ. (గుండు+రాయి)

౧. పెద్దరాయి.

క. గుండ్రాతిరూపుఁ గైకొని, తండ్రీ పెక్కేఁడు లిందుఁ దరలక యుంటెన్. అచ్చ. రా. బాల. ౧౪౭.

౨. సన్నెకల్లు.

శా...గుండ్రా డాఁచినఁ బెండ్లి యేమిటికిఁ జిక్కున్ గష్టముప్టింపచా. మనుచ. ౫. ౧౭.

(చూ. మ. సనెకల్ డాఁచినఁ బెండ్లి మానునొకొ...కాశీ. ౫. ౩౧౧.)

౩. పొత్రము. (శ. ర, బ్రౌ.)

**గుండ్రించు**. అ. క్రి. (√ గుండ్ర¹) ౧. తిరుగాడు, తిరుగు; తిరుగఁబడు.

గీ. నీవు మఱి యింటిలోన గుండ్రించుచున్నఁ, గడుపు నిండునె దొరఁ జేరి గాస ముడుగు. శుక. ౨. ౩౭౧.

వ. ఇట్లు దాఁకి ... జంభాసురేంద్రుం గిట్టి ముట్టి మూదలించిన నతనికవిదల కబ్బగింపక గుండ్రించి...కు. సం. ౧౨. ౭౪౫.

౨. కడుపులో త్రిప్పు.

ఆ. గుండె నున్నమందు గుండ్రించి పడిపోవు, నంతఁ బాలు చక్కెఁ రందుఁ గలిపి, త్రాగి రెండునాళ్లు తగుపథ్యమున నుండ, మందు తెవు లడంగు మనుజులకును. చికి. (చి. ని)

౩. త్రేఁచు.

ద్వి. తిని పులిపోతుపొందిక నన్ను లెక్కఁ, గొనఁ డింటిలోపల గుండ్రించుకొనుచు. ద్వి. పరమ. ౪. ౩౦౦ పా. (చి. ని. పా.)

జ: గుండ్రింపు.

**గుండ్రింపు**. వి. (√ గుండ్రించు.) గుండ్రించుట. (శ. ర.)

**గుండ్లకమ్మ**. వి. నదీవిశేషము, ఒక యేఱు.

వ...తీర్థయాత్రాపరులకు సురతరువుకొమ్మ యగు గుండ్లకమ్మయు...కాశీ. ౩. ౧౭౭.

**గుండ్లుబెండ్లాడు**. స. క్రి. (గుండ్లు + బెండ్లు + ఆడు) చలింపఁజేయు, కదలించు.

ద్వి...వాయువు లాగి లోకపంక్తు, లన్నియు గుండ్లుబెండ్లాడంగఁ దొణఁగె. ౪౦. రా. ఉ. ౧౦ పా. ౧౪ పం.

**గుంత=గుంట**. వి. (సం. గర్తః) ౧. చిన్నగోయి, గుంట.

గీ. కార్పాసల్లు సెగల్లను గవులు విడిచి, తరలి చెంతల నూతిగుంతల వసించె, గరలి వర్తిలునమ్మహాగ్రీష్మమునను. వేం. పంచ. ౧. ౩౦౭.

ద్వి. అంత కంతకు దట్టమై చెట్టు గుట్ట, గుంత మిట్టనుమఁ గన్గొన రాక యపుడు. ద్వి. హరిశ్చ. పూ. ౨౧౩౬ పం.

౨. పిఱుఁదిమీఁదిగుంట, కూపకము. (శ. ర.)

విణ. పల్లమైనది, లోఁతైనది.

గీ. గుంతమోముదు గుబ్బకేలు కుంచకముఖ్, మిట్ట పండ్లును...మార్క. ౫. ౧౮౧.

సీ. వక్షంబు గుంత యై వర్ష్మంబు పరుస నై తెలి నోరఁ బ్రేవుడు తీఁగసాఁగ...కాశీ. ౬. ౮౧.

జ: గుంతపురువు.

**గుంతపురువు.** వి. (గుంత + పురువు) క్రిమివిశేషము.

గీ. కుమ్మపురువు చిక్కుపురువు గుంతపురువు, నుడిపురువు... ప్రబంధ. ౧౩౦.

**గుండలము.** సం. వి.అ.పుం. మద్దెలమ్రోఁత.

**గుండాలము.** సం=గుంద్రాలము.

**గుంద్ర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నాగముస్తె?. ౨. ప్రేంకణము?.

**గుంద్రము.** సం. వి. అ. పుం. కాకిచెఱకు,ఒకవిధమైన జెల్లు?.

**గుంద్రాలము.** సం. వి. అ. పుం. చకోరపక్షి, వెన్నెలపులుఁగు.

**గుంపించు[1].** స. క్రి. (√ గుంపు - త. కుంపస్) కుప్పవేయు.

క. ఘూకంబు లున్న గుహకును,వాకిటఁ గాష్ఠములుఁ దృణము వడి గుంపింపన్,వే కవిసి చిరంజీవియు,దాకొని తనముక్కుఁ గొఱవిఁ దగిలించె వడిన్. నా. పంచ.౩.౨౮౬. (శ.ర.పా.)

**గుంపించు[2].** స. క్రి. అతిక్రమించు. (శ. ర)

క. చంపినఁ జచ్చెద ననుచును, గంపింపక యోరి పలువ కఠినోక్తుల నన్, గుంపించెదు చావున కుం, దెంపరి యై పదరువాని తెఱఁగునఁ గుమతీ. భాగ. ౭. ౨౭౦.

**గుంపు.** వి. (సం. గుంఫః. ప్రా. గుంబో. క. గుంపు. త. కుంబు) ౧. సమూహము; ప్రోగు.

సీ. నిమునపెన్నెతిగుంపు జడకట్టు సగడుముమ్మును మంకు తపము గైకొనినచోటు. మను. ౨.౯౯.

మ...కూరగుంపు...ఆము. ౧. ౮౨.

సీ...పెనుగాలిగుంపు వీవ. శుక. ౧. ౧౮౩.

దండకము...గుంపులై యింతులం గూడి యాభీరు లా దేవతా సేతకున్ జాతర ల్సేయు...పారి. ౩. ౩౮.

చ. కరితురగాదిఘట్టనము గాలియు నొంపఁ దొంటి యున్నయుత్తరువు ననేకభూరుహవితానము గుంపయి పేర్చి బాధలం, బొరయఁగనె...భార. ఉద్యో. ౨. ౮౮.

౨. నూలు వడుకునపుడు నడుమ నడుమ వచ్చెడి యుండ.

గీ. దివసమంత వితాపోయె నపుర రాఁతె, గుంపు వంపును లేకుండ గుండుపోఁగు,గాఁ బదాఱింటితరమును గాఁగ నూలు, వడుకరే యంచు నొండొరుల్ నుడివికొనుచు. శుక.౨. ౪౧౮.

గుంపులుగట్టు=గుంపులగు.

వ...పట్టనంబునఁ గాఁపురంబున్నవా రందఱుం దక్కఁ దక్కినవా రందఱు గుంపుఁగట్టి... చనిరి. హర. ౨. ౨౭.

జ: గుంపించు[1], గుంపుగూడు, గుంపుగొను.

**గుంపుగూడు.** అ. క్రి. (గుంపు+ కూడు) మల్లడిగొను, గుంపుగాఁ జేరు.

గీ.గుంపుగూడె నసెడి పలుకొప్పచుండు,మల్లడిగొనె ననంగను మాతృభూతి. ఆం. భా. ౩. ౧౦౩.

గుంపులుగూడు=గుంపులుగాఁ జేరు.

క.గుంపులుగూడికొని విచారింపఁగ శాండిల్యుఁ డది యెఱిఁగి...వరాహ. ౧౦. ౩౫.

**గుంపుగొను**=గుంపుగూడు. (గుంపు+కొను)

సీ. రమణీయగతిఁ జకోరకుమారికలు గుంపుగొని యాడువెన్నెలకుప్ప లనఁగ. పె. శకుం. ౨. ౧౮౩

(వృద్ధవేశ్య) గీ. గుంపుగొని చూచువారలఁ గొట్టఁ బూను,వెఱఁగుపడి యింటిబిడ్డల వెక్కిరించు...శుక. ౩. ౭౯.

గుంపులుగొను=గుంపులు గాఁజేరు.

క...కుంతీతనయుం, డనిఁ దనివి సనక గుంపులు, గొని యున్నాఁడ లరసెఁ గలయఁ గురుసైన్య మునన్. భార. విరా. ౫. ౧౭౭.

గుంపులుగుంపులుగొను = గుంపులు గుంపులు గాఁ జేరు.

ద్వి. గుంపులుగుంపులుగొని తన్ను చూచి, సాం పే ది రాములిమున్ను చెప్పమను. రం. రా. అ యో. ౧౨౧ పా. ౭౯ పం.

**గుంపెన[1].** వి. ౧. గంతు.

(వేశ్యామాతృవర్ణన.) గీ. వెక్కి యన రాదు పైఁబడి వెక్కిరించు, గామి దన రాదు మొగమున గంటువెట్టుఁ, బెంకె యన రాదు వట్టిగుంపెన లు వేయు. శుక. ౩. ౨౧.

ఉ. లంపులమారిదాన నిను లాఁచుక మాదిగవాఁ డు గోయ వ్రేకొంపకుఁ బోవ్రుటంచు మిణుఁ గుర్లు జనింపఁగఁ బండ్లు గీఁటి మ్రైఁగంపము పుట్టఁ జేగుదియకట్టెను దిట్టుచుఁ గొట్టఁ బో తు బల్గుంపెన నింటికై చనినఁ గుమ్మరి గాఁడి ని గట్టిఁ గట్టినన్. హంస. ౫. ౬౬.

౨. విజృంభణము. (శ. ర.) ౩. పోటు, దెబ్బ.

సీ. బిబ్బోకవతిగబ్బిగుబ్బగుంపెనసొంపు గనును రంబున దివ్యకవచ మొప్ప. శకాం. ౫. ౧౪. (ప్రా. పా.)

**గుంపెన[2].** వి. ఒకానొక చెట్టు.

గీ. కలికిమొలదేఁటికదుపుల కలికి యులికి, పెనలు గొనియెడుచిన్నిగుంపెనల కేఁగి, మరల కాన ట్టుమెట్టదామరలు చిదిమి, తోఁట నాడుచు మెలఁతుక లీన్నటు మెఱసి. యయా. ౪. ౧౫.

గీ. పూగముల నవ్యకుసుమపరాగ మెసఁగ, నిమ్మ లందును లేఁతపూరెమ్మ లమరె, ననలఁ బెనఁ గొనెఁ జిన్నిగుంపెనలగుంపు, లభినవం బగు నావసంతాగమమున. కవిజ. ౨. ౬.

**గుంఫన.** సం. వి. అ. స్త్రీ=గుంఫనము.

**గుంఫనము.** సం. వి. అ. న. ౧. కూర్పుట. ౨. మాట లు మొదలగువానిని చక్కఁగాఁ గూర్పుట.

(విధము—అనువర్థముతో 'గుంభనము' అని యొక తెనుఁగుకవి ప్రయోగించినాఁడు.)

క. కుంభీనసములు ప్రేలిన, గుంభనమునఁ గుంభి హస్తగురుతరధారా, రంభమున రేయుఁ బగ లున్, గుంభద్రోణములుపట్టి కురిసె న్వానల్. కవిక. ౬. ౨౩.

**గుంఫము.** సం. వి. అ. పుం. ౧. కూర్పు; మాటలకూ ర్పు. ౨. బహుభాషణము. ౩. శ్మశ్రువు.

**గుంఫించు.** సం. అ. క్రి. గుంఫితమగు.

(చెదరకుండు)

మ. అనురాధీశసమర్పితంబు లగులీలారామకల్ప ద్రుమ, ప్రసవంబుల్ కనుగందవమ్యో విలస త్పాటీరగోరోచనా, ఘుసృణాలేపనపంకితా కలనమై గుంఫించె నారాయణా, స్త్రనము జ్జృంభణ భీమలింగమునకున్ దైతేయరాట్స్వా మికిన్. భీమ. ౪. ౧౪౬.

**గుంఫితము.** సం=గుఫితము.

**గుంబము**=గుమ్మము. (శ. ర.)

**గుగ్గిలము.** వి. (సం. గుగ్గులుః. క. గుగ్గిళ. త. మ. కుంగిలియం) ౧. గుగ్గులువు, గుగ్గిలపుఁజెట్టు.

సీ. గుగ్గిల మంచన గుగ్గులువు దనమ్ము... ఆం. భా. ౨. ౭౫. హంస. ౪. ౧౧.

౨. గుగ్గులువృక్షపుబంక.

గీ. అగ్గి రవులించి యూవాలు గుగ్గిలంబు, జీడిపుసు కలు కానుగుచిగురు లగరు. అచ్చ. రా. యు. ౪౩౫.

**గుగ్గిళ్లు.** వి. బ. (క. గుగ్గరి.) అభ్యూషము, ఉడికిన అనుములు మొదలగునవి.

సీ...అలసందగుగ్గిళ్లు కొణిదెడు ... బహు. ౫. ౧౬౩.

సీ. గుగ్గిళ్లనంగను గుల్మాషములు మీఱు ... ఆం. భా. ౨. ౨౫౩.

పా: ఇవి ఇనుపగుగ్గిళ్లు కాని అనుపగుగ్గిళ్లు కావు.

**గుగ్గులము.** సం. వి. అ. పుం. ౧. గుగ్గిలపుఁజెట్టు ౨. గుగ్గిలము. (వాచ)

**గుగ్గులుకుఁడు.** సం. వి. అ. పుం. గుగ్గిలపువర్తకుఁడు.

**గుగ్గులువు.** సం. వి. ఉ. పుం=గుగ్గులము.

**గుచ్ఛకణిశము.** సం. వి. అ. పుం. ఒకవిధమైనధాన్యము.

**గుచ్ఛకము.** సం=గుచ్ఛము.

**గుచ్ఛపత్త్రము.** సం. వి. అ. పుం. తాటిచెట్టు.

**గుచ్ఛఫల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కదళి, అరఁటికీ. ౨. ద్రాక్షకీ. ౩. అగ్నిదమని, వాఁకుడుకీ. ౪. కాకమాచి, కాఁచికీ. ౫. నిష్పావికీ.

**గుచ్ఛఫలము.** సం. వి. అ. పుం. ౧. రీఠాకరంజము, కుంకుడుకీ. ౨. కతకము, ఇందుగుకీ.

**గుచ్ఛము.** సం. వి. అ. పుం. ౧. పూలగుత్తి. ౨. మయూరపుచ్ఛము, నెమలిపురి. ౩. ముప్పదిరెండుపేటలు గలహారము. ౪. తృణాదిస్తంబము, వరిమొదలగువానిదుబ్బు. ౫. పొద. ౬. సమూహము.

**గుచ్ఛార్ధము.** సం. వి. అ. పుం. పదియాఱుపేటలు గలహారము.

**గుజగుంపు.** వి. (√గుజగుజ?) ౧. అడావుడి.

మ. భుజగర్వంబున నాకరుల్ సురలు నంభోరాశిఁ ద్రచ్చన్ మహాభుజగగ్రామణిమస్తపుచ్ఛముల నార్పు ల్మీఱ నందించునా, గుజగుంపు ల్గననయ్యె నీ నెలవు మాకున్ జూపు మంచున్ దమోరజముల్ సత్త్వగుణంబుఁ బట్టి చలపోరన్ జూచు చందంబునన్. ల. వి. ౧. ౧౧౪.

౨. గుసగుస.

సీ. రమ్ము మారునిగుడారమ్ము మారు నిజమ్ము గుంపు చోటుల గుజగుంపు లేల. కువల. ౪. ౧౪౨.

గుజగుంపుపెట్టు=అల్లరిపెట్టు.

ద్వి. గొల్లయిల్లాండ్రను గుజగుంపుపెట్టు, వల్లవాగ్రణిఁ బుణ్యు వసుదేవతనయుఁ, బొడగంటి నే... ద్వి. సిం. భాగ. ౨. ౩౮ పా.

**గుజగుజ.** వి. ౧. గుసగుస.

ద్వి... గుజగుజలకు నెల్ల గుఱియైతి నింక, నగుబాటు వచ్చెల్లె నాతులలోన, మొఁగ మెత్త నేర్తునే... బస. పు. ౫. ౫౧ పం.

ద్వి. ఇది యేమి గుజగుజ లేకాంతములను, విదితంబుగా నాకు వినిపింపుఁ డనిన. ప్రభులిం. ౨. ౩౬ పా. ౧౦ పం.

౨. గజిబిజి. (చూ. గుజగుజలాడు. ౨. అర్థము.)

విణ. బాధితము. (చూ. గుజగుజయగు.)

జ: గుజగుజయగు, గుజగుజతేకులు, గుజగుజలాడు, గుజగుజపోవు.

**గుజగుజయగు.** అ. క్రి. (√గుజగుజ) బాధపడు.

గీ... గుజగుజ యైరి దస్సి, రొల్లఁబోయిరి... వార. ౩. ౧౦.

క. గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజయై గీఁకవెట్టె... భాగ. ౬. ౪౦౭.

**గుజగుజతే(రే)కులు.** వి. బ. (√గుజగుజ) బాలికాక్రీడావిశేషము.

సీ. గుజగుజ తేకులు గుజ్జెనగూళ్లును బొమ్మలపెండిండ్లు నమ్మనములు. దశా. ౮. ౮౧. హంస. ౫. ౧౫౫. భోజసుతా. ౨. ౯.

**గుజగుజలాడు.** అ. క్రి. (గుజగుజలు+ఆడు) ౧. గుసగుసలాడు.

గీ... సభవార లందఱు నంత నంత, నల్ల నల్లన గుజగుజలాడుచుండి, రి... భార. విరా. ౨. ౧౪౬.

చ. గుజగుజలాడ వారిఁ గనుఁగొనల విట్టదలించి ... రాజ. చ. ౩. ౮౩.

౨. గజిబిజిపడు, త్రొక్కులాడు.

ద్వి. అతఁ డగస్త్యుని నల్లన గోఁకె, నాతఁడు జమదగ్ని నదిమె హస్తమున, నీవిధి నుత్తరం బీకయుండోరుల, నీవు నీ వని చూపి నిఖిలసన్తు

ములు, గుజగుజలాడ ... ద్వి. పారిజా. తృ. ౨౨౩ పం.

**గుజేగుజే(లు)వోవు, గుజేగుజేలఁబోవు**=గుసగుసలఁబోవు. అ. క్రి. (√గుజేగుజే) గుసగుసలాడు, రహస్యముగా మాటలాడు.

వ. అనుచుం గలదు లే దని పెక్కువిధంబులం దలపోసి గుజగుజలువోవు చుండుదురు...భార. విరా. ౨. ౨౦౧. (చూ. ౨౦౦.)

క. గుజగుజలువోవువారును, గజిబిజిపడువారు ...భాగ. ౯. ౫౩౮. (చూ. ౫౩౩.)

క. అని గుజగుజవోవుచు నివ్వని దప్పక దనుజలోకపాలునితోడన్, వినిపింప వలయు నని వేచని బాణునిఁ జేరి మ్రొక్కి సద్వినయమునన్. భాగ. ౧౦ ఉ. ౩౬౯.

వ...బోటికత్తియలు...తమలోన గుజగుజలంబోవు చుండిరి...నైష. ౩. ౧౨౪.

**గుజేరాతి**=గుజేతీ, గుజ్జేరాతి, గుజ్జేరి. వి. (సం. ఘూర్జరః.) ౧. ఘూర్జరదేశము, గుజ్జరి.

ద్వి. చిత్తజజనకలక్ష్మీవివాహంబు, గుజరాతికంపులగోడ లిఖింప. రం. రా. బాల. ౬౩ పా. ౧౬ పం. భాను. ౪. ౭౯.

౨. ఘూర్జరదేశభాష.

గీ. అరబి పారసి గుజరాతి యారె మచ్చ, తెనుఁగు కన్నోజి మొదలుగాఁ దెలిసి వ్రాయ, దారిగన్నట్టివాఁడు...యయా. ౧. ౪౬.

౩. నాట్యభేదము.

చ. నాట్యభేదంబులనామము ల్దనరు జక్కిణి గుజరాతి పేరణు లవంగ. ఆం. భా. ౧. ౧౩౦.

చ. కులిశాయుధునినిండుఁగొలువులో గుజరాతి మేలుకోపులఁ గొంత మెప్పు వడసి. ఉ. రా. ౪. ౧౬౫.

**గుజేరానువఱచే**=గుజేరాయించే. స. క్రి. (హిం. గుజరానా) ఇచ్చు, సమర్పించు.

గీ. గుడిగుడీఘూమపానవిఘూర్ణమాన, చకితదృగపాంగు హైదరుజంగుఁ గాంచి, నజరు గుజరానువఱచె సౌన్నాకడాని, జాలె మాతఁడు కూర్నిసాతు చేసి. రంగా. ౨. ౯౫.

**గుజేరాయించే**=గుజేరానువఱచే.

మ...హైదరుజంగును...కని యాత్మన్నివ్వెఱంగందుచున్, హితమున్ దెల్పుచు నర్జిదాస్తు గుజరాయించెన్...రంగా. ౨. ౧౮౯.

**గుజేరీ**=గుజేరాతి.

(ఘూర్జరదేశము)

రగడ. చెప్పఁ జూపఁగ రాదు ముక్కుముకీమ వీ గుజరీతివాసులు. శుక. ౧. ౧౩౩. (శ.ర.పా.)

**గుజోటి.** విణ. ధనవంతుఁడు. (శ. ర)

**గుజోరు**=గిజోరు. వి. పేశము, బేసము. (శ.ర.)

**గుజ్జేరాతి**=గుజేరాతి. (శ. ర)

**గుజ్జేరి.** వి. (క. గుజ్జరి) ౧. ఘూర్జరదేశము. (రూ. గుజ్జరి. శ. ర.)

సీ. సరి లేనిమంచిగుజ్జరి నేఁతపట్టుచుఁ బఱపైన రాయంచగఱులపఱపు. ఉ. రా. ౯. ౧౯౦. చంద్రా. ౪. ౬౦.

౨. రంగులలో నొకటి.

రగడ. కంటకి గుజ్జరి మనుపులు మొదలుగఁ, గలిగినపలువన్నెలపుట్టంబులు. కవిక. ౩. ౧౭౫.

౩. (సంగీ) రాగభేదము.

సీ. గుజ్జరి మలహరి గుండక్రియ వరాళి...ప్రబంధ. ౭౫. హంస. ౫. ౧౨౮.

(బ.) ధాన్యవిశేషము.

వ...ఏడాకుమొలకలు గుజ్జరులు బిరుసులు ...అను నూటనాలుగువగలపైరుల చేరుడుబియ్యంపువట్టిపసాదంబులు...ప్రబంధ. ౧౧౨.

జ: గుజ్జరివాఁడు.

**గుజ్జేరివాఁడు.** వి. (√గుజ్జేరి.) ఘూర్జరదేశస్థుఁడు.

సీ...గుజ్జరివాఁడవ ఘూర్జరుఁడగు. ఆం.భా.౨. ౧౦౩.

**గుజ్జె.** విశే. (సం. కుబ్జః. ప్రా. కుజ్జో. క. గుజ్జ.) ౧. పొట్టివాఁడు, వామనుఁడు.

ఉ. బొజ్జగలయ్య యయ్యింద్రములభోగి మెఱుంగుఁబసిండిచాయబ, ల్గుజ్జ ... గణనాథుఁడు ...సుద. ౧. ౭.

గీ. గూనివాఁడును బిచ్చుకకుంటు గుజ్జ...భార. అను. ౫. ౧౦౪.

౨. చిక్కనిది.

సీ. గుజ్జగాఁ గాఁచినగోక్షీరపూరంబు జమిలి మండెఁగలపైఁ జల్లిచల్లి. నైష. ౬. ౧౨౦.

(వెన్నెలపులుఁగులు) వ...ఇంచురసంబుల మించు గుజ్జువెన్నెలల నంజుకొన ... ఘటికా. ౨ ౧౪౬.

వి. ౧. వత్సతరము, కోడెదూడ.

సీ. ముంకినాఁ బరఁగుబ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై వర్తించు శిక్షింప వలయునట్టి,గుజ్జుదోయిని జట్టిగొని ప్రీతి లంకించియుండ లంకియతోన గండుమీఱి. భార. శాం. ౪. ౪౦.

గీ. కేఁటిగుజ్జులఁ గట్టినపాటబండి,యెక్కి శీఘ్రంబ మందకు నేఁగె నెలమి. హరి. పూ. ౫. ౧౪౧.

౨. అను కసురసద్రవ్యము.

క...కొకల నైవేద్యములను గుజ్జుల వన్యా,నేకఫలభక్ష్యశర్కర,శాకాదులఁ గడిమిమ్రానిజాతరఁ జేసెఁ. శ్రీరం. మా. ౬. ౧౦౩.

౩. క్రొవ్వు, వస.

వ...దాక్షాయణీసుతుపొట్ట గుజ్జుఱుక మట్టి... కాశీ. ౭. ౯౫.

సీ. కోరకొవ్వఁడు పదాంగుష్ఠభాగంబున నుడురాజుపొట్ట గుజ్జుఱుక నూఁదె. కాశీ.౩.౩౨.

౪. కుబ్జదారువు, పొట్టికొయ్య.

సీ...గుజ్జు నాఁ దనరుఁ గుబ్జ,దారువు...ఆం.భా. ౨. ౨౩౩.

ఉదా: గుంటకగుజ్జు, దూలపుగుజ్జు, బండిపట్టెపుగుజ్జు, మొ.

జ: గుజ్జుఁదనము, గుజ్జునోగిరము, గుజ్జుపొట్ల, గుజ్జుప్రాలు, గుజ్జుమామిడి,గుజ్జువేల్పు,గుజ్జెనగూడు.

**గుజ్జెఁదనము.** వి. (గుజ్జు + తనము) కుబ్జత్వము. (బ్రౌ)

**గుజ్జెనోగిరము.** వి. (గుజ్జు+ఓగిరము) పులుసు గలిపినయన్నము. (బ్రౌ)

ద్వి. కడుపున కియ్యెడ గుదగుద లేల, కడికిఁడు దెత్తునా గుజ్జునోగిరము.బస.పు.౩.౪౨౬పం.

**గుజ్జెపొట్ల.** వి. (√గుజ్జె) పొట్టికాయలు కా[illegible] పొట్ల. (శ.ర.)

**గుజ్జెప్రాలు.** వి. (√ గుజ్జె) ఒకజాతిబియ్యపువడ్లు. (బ్రౌ)

**గుజ్జెమామిడి.** వి. (గుజ్జు+మామిడి) పొట్టి మామిడి, రాజామ్రము.

సీ. గోరాజగమనుండు గుజ్జుమామిడిపండు కుసుమాస్త్రహారుఁడు ముంగొంగుపసిఁడి.పి.శకుం. ౪.౪.

**గుజ్జెవేల్పు(లుపు).** వి. (గుజ్జు + వేల్పు) విఘ్నేశ్వరుఁడు. భీమ. ౩. ౧౫౪. రామలిం. ౧.

**గుజ్జెనగూడు.** వి. (గుజ్జు+ఎన+కూడు-శ. ర.) ౧. బాలికలాడుకొనెడిఒకయాట.

మ. దినముల్ కొన్ని చనంగ నంతఁ గడునర్థిం బొమ్మపెండిండ్లు గుజ్జెనగూళ్లు చ్చవగండ్లు పింపిళులు కుచ్చిళ్ల్ గిరనంగింజలో,మవగుంటల్ కనుమూసిగంత వలుగం బాలాటలో న్నైనకోలనముల్ మీఱఁగ బోట్లతో నలరు బాలారత్న మెల్లప్పుడుఁ. కళా.౬.౨౦౨.పాంస. ౫. ౧౫౫.

౨. బాలికలు బొమ్మలుపెట్టి యాడుకొనునప్పుడు వండెడివంటకము.

సీ. పాంచాలికాకేళికర్త్యాన్న నామంబు గుజ్జెన గూ డనఁ గొఱలుచుండు. ఆం. భా. ౨. ౨౫౩.

రగడ. చిఱుదేంట్ల కొసఁగె గుజ్జెనగూళ్లు గొజ్జం గ. మనుచ. ౩. ౭౪.

సీ. గుజ్జెనగూళ్లను గొమ రొప్ప వండించి చెలుల కుఁ బెట్టించుఁ జెలువు మెఱసి. భాగ. ౧౦ పూ. ౧౬౭౭.

**గుటక.** వి. (ప్రా. ఘుట్ట ఇ. క. గుటుకు=గ్రుక్క) ౧. ఒకసారి నోటఁ బోసికొని మ్రింగెడునీళ్లు లో నగువానికొలఁది. (శ. ర.) ౨. ఒకసారిగా మ్రిం గుట. (బ్రౌ.)

గుటకలువేయు=ఉవ్విళ్లూరు; తమకించు.

(వ్యవ.) ఆపిల్ల పాయసము చూచి గుటకలు వే యుచున్నది.

వాఁడు ఆయువతిని చూచి గుటకలు వేయుచు న్నాఁడు.

**గుటగుట.** వి. (త. కుడుకుడు) ౧. వ్యాఘ్రము భల్లూకము వరాహము మొదలగునవి చేసెడుధ్వనివిశేష మున కనుకరణము.

సీ. ఒకవాసరమున దైవికతీర్థ మాడుచో గుటగు టమనుచు నాఁకొన్నకోలు, పులి తటంబునఁ బ్రేఁచపొదనుండి పూనిపుంగవుమీఁద నుఱి కిన...వరాహ. ౭. ౭౦.

గీ. ఉల్ల మగలంగ వయ్యుగ్రభల్లుకంబు, గుటగుట యటంచు రొప్పి యక్కుటిలుఁ గదిసి. శుక. ౧. ౪౧౦.

సీ. ఘుమఘుమాఘుమసన్న హవకుహూహూఘోణిఘోణా ఘుటీగుటగుటలతోడ...గీ. అవఘళించి...ధణం ధణారవము రత్న, సానుగుహలఁ బ్రతిధ్వను లీన విజయ, చటహాచటలంబు చఱపించి చటులరయ మున. వరాహ. ౩. ౨౬. యయా. ౨. ౭.

౨. అన్నము ఉడుకుట, నీళ్లు త్రాగుట లోనగు వానియందలి ధ్వనికి అనుకరణము. (శ. ర)

౩. పెద్దతికపుమాటలు. (శ. ర)

క. కటకట గురువులతో సీ, గుటగుటలా సేసు గోరకోరిక విరగా, నటు నిటుఁ బొద్దులు పు చ్చుచు, నటమటఁ జెఱగాయసుద్దు లాడెద వౌరా. కళాం. ౩. ౭౮.

వ...అటమటమ్మున విద్య గొనుటయుం గాక గు టగుటలు గురువుతో నా యని...మనుచ. ౫. ౧౯.

సీ. గుట్టెఱుంగుదు దేల గురులతో గుటగుటల్ బిగియక చనఁ గదే బిసరుహాక్షి. చంద్రా. ౬. ౧౩౫.

జః గ్రుంగుటగుట.

**గుటి.** సం. వి. ఈ. స్త్రీ=గుటిక. (వాచ)

**గుటిక.** సం. వి. ఆ. స్త్రీ. ఉండ, మాత్ర; గుండ్ర నివదార్థము.

**గుటికాంజనము.** సం. వి. అ. న. ఒకవిధ మగుకా టుక. (వాచ)

**గుటుకు(క్కు).** వి. మ్రింగుట త్రాగుటయుం దగు ధ్వని కనుకరణము. (దీనిఆమ్రేడితరూపములు-గు టుకుగుటుకు, గుటుగుటుకు.)

క...విషము...మృడుఁడు గుటుకున మ్రింగెగా. హర. ౬. ౬౯.

సీ. దారుణాఖండమార్తాండమండలము నుప్పొంగి గుటుక్కున మ్రింగవచ్చు. నరస. ౫. ౧౩౦.

చ. ఇటక్రితమెన్నితో యములనిందుముఖీముఖ శేషమద్యముక్తా, గుటుకునఁ గ్రోల... ప్రబో ధ. ౩. ౫౬.

గీ. గుటుకుమునకుండ బ్రహ్మాండకోటి మ్రింగి. దశా. ౧. ౨౭౯.

సీ. బిగిచన్నుఁగవఁ గేలఁ బీడించి కబళించి గ్రు క్క గ్రుక్కకు గుటుగుటుకుమనుచు...మేని లో సత్త్వ మెల్లఁ. గీ. ద్రావి ... భాగ. ౧౦ పూ. ౨౨౫.

జ: గుటుక్కను.

**గుటుక్కను, గుటుక్కుమను.** అ. క్రి. (గుటుక్కు+అను) చచ్చు. (బ్రౌ, శ. ర.)
(వ్యవ) వైద్యుఁడు వచ్చులోపలనే రోగి గుటుక్కుమన్నాఁడు.

**గుట్ట[1].** వి. (సం. గోత్రః. ప్రా. గోడో. క. గుట్ట.)
౧. పర్వతము.
సీ. వలిమెట్టు నాకుఁ గావలిపట్టు దేవర సామి గుట్టకు నేను సామి నొడయ. చంప్రా. ౨. ౪౫. ఆం. భా. ౨. ౨౮.
౨. ఉపలరాశి, జాతిగుట్ట. (చిన్నకొండ. శ.ర.)
(అశ్వవర్ణము.) ఉ...దువాళించిన గట్టు గుట్టనక లెక్కకు మిక్కిలి దవ్వు పాఱుమఱ్, మించినవారువంబులు...యయా. ౧. ౭౨.
వ...నలునిం బిలిచి నీవు వానరవీరులు తెచ్చియందిచ్చుగట్టుగుట్టలం గట్టకట్టిన వనధి కట్టుపడు ... రామా. ౬. ౧౨౨. ఆం. భా. ౩. ౫౩.
౩. రాశి, ప్రోగు.
సీ. కొట్టి వైచినతల ల్గుట్టలై కాటుకకొండలదండిని మెండు నూప. దశా. ౬. ౧౩౮.
సీ. చెడిపెను మృదుశయ్యఁ జేర్చిన విడిచి బల్పెంటగుట్టలఁ బవ్వళింపఁ జూచు. రామలిం. ౩౪.

**గుట్ట[2].** విశే. అఱకువాఁడు, భీరువు.
గీ. ఉపలరాశియు నఱకువాఁ డొప్పచుండు, గుట్టయని పల్కఁగ...ఆం. భా. ౩. ౫౩. (ప్రాఁతప్రతి.)

**గుట్టు.** వి. (సం. గూఢమ్. క. తు. త. గుట్టు.) ౧. మర్మము, రహస్యము.
క. ఏమో యని యుంటిమి సుత్రామునిగుట్టెల్లఁ దెలిసె...దశా. ౬. ౯౦.
౨. ధైర్యము.
ఉ. క్రీడ దొఱంగి యావారివిరించిముఖుల్ క్రము నొంది గుట్టు పో, వాదరొ వంచపాయక శరాహతిపాల్పడి పువ్వుఁబొమ్మలఱ్, వాడరొ...రాజ. చ. ౩. ౮౩.
౩. మోసము, వంచన.
ఉత్సాహ. గుట్టుతోడ నిట్లొసంగఁ గ్రోలి యేను నన్నుతో, గుట్టు పాటి యుండునంతఁ గ్రుంకు మెట్టనెత్తుపుం, జట్టుమీఁదఁ బ్రొద్దు చేర... యయా. ౩. ౧౨౩. (చూ. ౧౨౨.)

గుట్టిచ్చు=మర్మము తెలియనిచ్చు.
వ ... గుట్టీక నలంగియు నత్తమామలచిత్తంబు వచ్చునట్లు భక్తిశక్తులు మెఱసి పాటులంబడు మఱందలిసౌందర్యంబు... పాండు. ౩. ౨౪.

గుట్టుచెడు=ధైర్యము చెడు.
వ. ఇట్టితెఱంగునం బిట్టు వడి గుట్టుచెడి గట్టువడిం జేరుటకై యగడితం బడి మునింగి దరిం జేరి...రా. వి. ౫. ౩౨.

గుట్టుపట్టు=హృదయము, గుండె.
ఉ. బాలవిరాళి నిట్లు సుమబాణశరాళికిఁ జంద్రచంద్రికాపాళికి సన్నగాలికిని భావజుతేజివయాళికిన్ రవో, ద్యేలమదాళికిన్ బ్రసవదీప్తవనీఋతుమాళికి న్సదా, లోలత గుట్టుపట్టగల లోఁగి వచింపుము నార్తిఁ జెందఁగన్. ఉ. హరిశ్చ. ౪. ౪౪.
జ: గుట్టుకీడు, గుట్టుసాకిరి.

**గుట్టుకీడు.** వి. (గుట్టు+కీడు) గూఢశత్రువు.
చ. పలుకులు వేయు నేమిటికిఁ బార్థివుఁ డాత్మభుజాభృతక్షమా, తలమున గుట్టుకీడుబహుధా యరయుంచి యడంచి ... ఆము. ౪. ౨౫౦. (బ్రౌ. పా-'గుట్టుఁ జేసు' శ. ర, ప్రాఁతప్రతి. 'కుట్టుపేడు' వావిళ్ల. పా-'కుట్టుతేలు'? చూ.)

**గుట్టుసాకిరి.** విశే. (గుట్టు + సాకిరి) వాదితనవ్యవహారము గెల్చుటకొఱకు రప్పింపఁగా వచ్చి దాఁగియుండి ప్రతివాదియొక్కమాట లన్నియుఁ జక్కఁగా విన్నసాక్షి. (శ. ర)

**గుడ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గుళిక, ఉండ. ౨. జెముడుకీ. ౩. ద్రాక్షకీ. ౪. త్రుత్తికీ. ౫. తర్జన్యంగుష్ఠాగ్రసంయోగవలయము, చూపుడువ్రేలికొనయు బొటనవ్రేలికొనయు దగ్గఱగా పట్టఁగా వలయాకారముగ నేర్పడుమధ్యప్రదేశము. (చూ. గుడాకేశుఁడు.)

**గుడకము.** సం. వి. అ. పుం. ౧. గుళిక, ఉండ. ౨. గ్రాసము, కబళము. ౩. బెల్లము; బెల్లముతోఁ జేసినమందు.

**గుడగుడ.** వి. ఉడుకుటయందగుధ్వనికి అనుకరణము.

క. గుడగుడ నుడికెడునుదకము. ద్వా. ౭.౧౭౭.

**గుడతృణము.** సం. వి. అ. న. చెఱకుకీ.

**గుడత్వక్కు.** సం. వి. చ్. స్త్రీ. లవంగపుపట్ట. (వాచ)

**గుడత్వచ.** సం. వి. ఆ. స్త్రీ=గుడత్వక్కు.

**గుడత్వచము.** సం. వి. అ. న=గుడత్వక్కు. (కల్ప)

**గుడదారువు.** సం. వి. ఉ. పుం. న. చెఱకుకీ. (త్రి. ని.)

**గుడపిష్టము.** సం. వి. అ. న. ౧. చలిమిడి, బెల్లము కలిపినపిండి. ౨. బెల్లపుపాకములో పిండి కలిపి చేయునొకవంటకము. ౩. బెల్లపుపాడి.

**గుడపుష్పము.** సం. వి. అ. పుం. మధూకము, ఇప్పకీ.

**గుడ ఫలము.** సం. వి. అ. పుం. పీలువృక్షము.

**గుడము.** సం. వి. అ. పుం. ౧. బెల్లము. ౨. వకుళము, పొగడకీ. ౩. ఏనుఁగుకవచము. ౪. గ్రాసము, కబళము. ౫. అచ్చనగాయ, గోళము. (శే. ని, వై. ని.)

**గుడలము.** సం. విగి. (అ. ఆ. అ) బెల్లముతోఁ జేసినది. వి. అ. న. బెల్లపుసారాయి.

**గుడశర్కర.** సం. వి. ఆ. స్త్రీ. కండచక్కెర, పటికబెల్లము.

**గుడాక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. తంద్ర, అలసత. ౨. నిద్ర.

**గుడాకు.** మి. వి. (గుడము + ఆకు-త. పుడుకుడా) బెల్లముతో మర్దించినపొగాకు. (శ. ర, బ్రౌ.)

చ. గుడిగుడి ద్రాగ బంగిజడఁ గూర్చినచిల్మిగుడాకుముద్ద...పార్వ. ౨. ౯౭.

**గుడాకేశుఁడు.** సం. వి. అ. పుం—గుడాకా=అలసత్వమును. ఈశుఁడు=శాసించువాఁడు. అనఁగా సోమరితనమును అణఁచువాఁడు; గుడా=తర్జన్యంగుష్ఠాగ్రసంయోగవలయపరిమితిగల. కేశుఁడు=జుట్టుగలవాఁడు; గుడా=జెముడువలె మిక్కుటముగాఁ బెరిఁగిన. కేశుఁడు=జుట్టు గలవాఁడు—౧. అర్జునుఁడు. ౨. శివుఁడు.

**గుడారము**=గుడారు, గూడారము, గూడారు. వి. (క. గుడార.) ౧. పటకుటీరము, బట్టతో నేర్పఱిచినయిల్లు, డేరా.

మ... దంష్ట్రాంకురాగ్రమునన్ ధారణి యొంటికంబముగుడారం బై తగన్ ద్వాదశార్యమతేజోహతిఁ గంద కొప్పెసఁగుమాయాదంష్ట్రి నిన్నెన్నెదన్. చంద్రా. ౧.౭౬.

చ. ... నాల్గువంకల గుడారము లెత్తిరి జీనిపట్టు పగ్గములు దిగించి...వాల్మీకి. ౩. ౯౬.

సీ. కొఱలు గుడారము గూడారము గుడారు గూడారనఁగను నాల్గు పటగేహ నామధేయంబులు...ఆం. భా. ౨. ౨౫౯.

౨. గుడారమువలె నుండుచెవిభాగము, శ్రవణైకదేశము.

సీ. శ్రవణైకదేశ మాచ్ఛాదనగేహంబు మీఱుచునుండు గుడార మనఁగ. ఆం. భా. ౩. ౫౪.

**గుడారు**=గుడారము. వి. వస్త్రగృహము, డేరా.

క... అరిదిపనులపట్టుగుడారుల్...శుక. ౧.౧౦౦.

మ... పురిచెంతలన్ వెలిగుడార్వేయంగఁ బంచెన్ వసన్. కృష్ణ. ౨. ౧౪౬.

చ. గడలు గుడార్లు పగ్గములు కత్తులబోనులు గడ్డపాఱలున్, బడిఁ గొని మేటిదొమ్మరులు వచ్చిరి బిల్లమహీశుపాలికిన్. చెన్న. ౨. ౨౦౯.

**గుడి.** వి. (క. గుడి) ౧. దేవాలయము; పత్తులదేవాలయము.

క. దేవాలయాహ్వయంబులు, కోవెల యన దేవళంబు గుడి నా వెలయున్. ఆం. సం. దేవ. ౨౬.

గీ. కుప్పలను దిప్పలను వాళ్ల గుళ్ల నూళ్లఁ, దిరిగి యాహార మందక సొరిగి యరిగి. హంస. ౧. ౧౭౯.

క. మృడునకు మ్రొక్కఁగఁ బోయిన, గుడి మీఁదం బడినయట్లు... సుద. ౨. ౨౦.

సీ... దేవళంబు నా దేవాలయాఖ్యలై తేజరిల్లు, గుడి కోవెల యనంగ నడచు పత్తులదీర్ఘ దేవాలయములు... ఆం. భా. ౨. ౧౬.

౨. గుండ్రముగా నుండుగీఁత, గిఱి.

గీ. పరిఖ గుడి వోలెఁ దనచుట్టుఁ దిరిగియుండఁ, బరుల కేరికి గ్రహణగోచరము గాక, విమథ రాధీశభాషితవిషమభాష్య, పఙ్క్తికయుఁ బోలె నొప్పె నప్పట్టనంబు. నైష. ౨. ౩౭.

సీ. సపరివేషం బైనచంద్రబింబము వోలె గుడి వ్రాసి జానకి నిడినచోటు. సారంగ. ౧. ౧౦౯.

౩. పరివేషము.

సీ. పరివేషనామంబు భాసిల్లుమండుసు గుడి యనఁ బరిధి నా గుడుసు నాఁగ. ఆం. భా. ౧. ౭౨.

౪. ఇకారచిహ్నము.

క. చెలులు తలకట్టు లాచాఁ, పులు నైత్వాత్వము లిమిత్త్రములు గుడిగవయున్, నుళిగవయు నొత్వయుగమును, జెలు వగుమట్టములు ద్వివిధత్వం గొత్వమ్ముల్. అప్ప. ౩. ౪౫.

౫. ఒకవిధమైనగుడారము.

సీ. గుళ్లు మంచియలును గూడారములును బందిళ్లును గలయ నెత్తించువారు. కు. సం. ౧౧. ౬౦౦.

మ. ఒడఁబాటించుక లేక నీమనములో నుత్ఫుల్లపత్రాక్షి యీ, యెడ నేకాదశి మాన కున్న సతుని న్ హింసింపుమా యంచు మా, కడ నే యుండి వినంగ రానిపలుకుల్ త్వత్పాలకున్ బల్కుటల్, గుడి నుండే గుడిత్రాళ్లు గోయుటయు నాకుం జూడ నీచందముల్. రుక్మా. ౫. ౧౧౯.

౬. అఁడుగుఱి. (చూ. గుడిముద్రవేసికొను.)

(బ) బాలక్రీడావిశేషము.

గీ. గుళ్లు దాఁగిలిమ్రుచ్చులు గోడిపట్టె,లు... వి. పు. ౭. ౨౦౨.

సా: ఇంటికంటె గుడి పదిలము.

గుడిమ్రింగువానికి తల్పు లప్పడములు:- పెద్దపని చేయువానికి చిన్నపని చేయుట సులభము.

మ. పతిఁ దల్లిని దండ్రిఁ జంపుట తృణప్రాయంబు తోఁబుట్టులన్, మఱియుం జూమట లెక్కగా దనిన జన్మజ్ఞాతికీటంబులన్, గడపం బూనుట నాకు దొడ్డ గుడిమ్రింగేవానికిం దల్పు లప్పడముల్... ప్రబోధ. ౨. ౬౭.

ఇట్లే:- గుడిమ్రింగువానికి నంది పిండివడియము. గుడిమ్రింగువానికి లింగము సొన్పిండివడెము.

గీ. ఎందు గుడిమ్రింగువానికి నంది పిండి,వడియమను పల్కుఁ యుంగవే పుడమిలోన. విక్ర. ౨. ౨౩౯.

గీ... యవనులు మిమ్ము నిట్లడలఁజేయ, నట్టివాండ్రకు ద్విజా లెంత యాఁగద గుడి,మ్రింగువానికి లింగ మూర్పిండివడెము. సిం. నార. ౩౬.

గుడి(కి)ముద్రవేసికొను = బ్రహ్మచారిణిగా నుండు.

చ. జననము నందినం బురుషజన్మము కావలెఁ గాక యాఁడుదై,నను గుడిముద్ర వైచికొనినం దగు... శుక. ౨. ౫౦౬.

ఆ. గుడికిముద్ర వేసికొని కులమున వన్నె,వాసి గాంచి మాటవాసిఁ బెరిఁగి, సానియనువలంచు

జాణ పై మగనాలి, పాటు తోర్చి తెల్లు వద్దన యన. ప్రబంధ. ౬౫౮.

జ: గుడికట్టు, గుడికొను, గుడిగుడి, గుడిచుట్టు, గుడిజెల్ల, గుడితిరుగుకొను, గుడివడు, గుడిసాని.

**గుడిక.** సం=గుళిక.

**గుడికట్టు.** వి. (గుడి + కట్టు) గ్రామమునాలుగుదిక్కుల యెల్లలయేర్పాటు. (శ. ర.)

గీ. సరవి గుడికట్టుగాఁ జెంగ జెరను వ్రాసి, యంత కము లేసి కులవర్గ లాయకట్లు, దీర్చి...హం స. ౮. ౫౯.

**గుడికొను.** అ. క్రి. (√ గుడి-త. గుడికోళ్) ౧. వ్యాపించు, క్రమ్ము.

క. వడముడి శల్యుని ... వడవైచినయెడ నొడలం, గుడికొనుడు మృత్యుఁడు తుమతుమకొనుచుం జనియెఁ. పాంచాలీ. ౨. ౬౫.

౨. గుండ్రముగాఁ దిరుగు.

చీ...గుడికొంచు గి జ్జన నడచునుములు. ఉ. హరి ళ్ర. ౨. ౧౨౬.

౩. ఉబుకు, పైకివచ్చు.

క. అడలుమఁ బెదవులు తడుపుచు, గుడికొనుక న్నీరు గ్రక్కుకొనుచుఁ ... సారంగ. ౩. ౧౬౮.

౪. అతిశయించు.

చ...నారచీరలుం, గొడుకులు దాను గట్టుకొని కూరలఁ గాయల ఖుత్తు మాన్పుచుఁ, గుడికొనువంత శేవగలుఁ గుందుచు నెంత నలంగి యున్నదో, యడవులలోన సీత...ఉ. రా. ౯. ౭౨.

**గుడిగి.** వి. (క. గుడిగి) మోఁకాలివఱకు తొడిగికొను వస్త్రకవచము. (శ. ర.)

**గుడిగుడి.** విశ. (√గుడి) ఉబుకునది, పొరలి పొరలి వచ్చునది. ('అల్పము' అని శ. ర)

ద్వి. గుడిగుడికన్నీరు గ్రక్కుచు నొండు, నుడువ నాలుక రాక నులివేఁడియూర్పు, లందంద నిగుడ...ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౩ పం.

ద్వి. గుడిగుడికన్నీళ్లు గ్రక్కుచుఁ గాంత, వడి లేచి యాతలవరుల నొప్పించి, మో మెత్తి చిక్కిచ్చే... ద్వి. శ. సా. ౨. ౩౬ పా. ౨౦ పం.

**గుడిగుడీ.** వి. హుక్కాగొట్టము.

సీ. ఎలమితో సోమయాజుల పెద్దజాకీలు గుడిగుడీ లుగఁ జేసికొనెడివారు. సిం. నార. ౨౦.

**గుడిచుట్టు.** వి. (గుడి+చుట్టు) పరివేషము, సూర్యచంద్రులచుట్టు నేర్పడుమండలము. (బ్రౌ, శ. ర)

అ. క్రి. ౧. (గుజ్జము) మండలాకారముగాఁ దిరుగు, వేడెము తిరుగు. (బ్రౌ.) ౨. మండలాకారముగాఁ దిరుగు.

మత్తకోకిల. చూడ నీజగ మంతయుఁ జావనఁ జుట్టిపట్టుక లీల నేఁ, బోడు లేక రయంబునఁ గుడిచుట్టునట్టిస్వతంత్రతఁ, గూడి యుండినకాలచక్రముఁ గోరి చూడనివాని కిఁ, జాడఁ గల్గును గర్మసంగతిఁ జారుమోక్షపదం బిలఁ. భాగ. ౬. ౨౩౬.

శ్లో. కాలచక్రం భ్రమత్తీక్ష్ణం దృఢం నిష్కృష్య యజ్జగత్, స్వతంత్రమబుధస్యేహ కిమసత్కర్మభిర్భవేత్. సం. భాగ. ౬. ౫.౧౯.

**గుడిజెల్ల.** వి. (గుడి+జెల్ల.) మత్స్యవిశేషము. (బ్రౌ, శ. ర.)

**గుడితిరుగుకొను.** అ. క్రి. (గుడి+తిరుగు+కొను-స్వార్థమున.) గుండ్రముగాఁ దిరుగు.

క. అమ్మాధవార్జునులఁ బెను, దుమ్ము పొదుగ రథము దిరుగఁ దొడఁగెఁ దడవుగా, బొమ్మరము తిరుగునురవడిఁ; గుమ్మరిసారె గుడితిరుగుకొనెడు విధమునఁ. జై. భా. ౫. ౩౫.

**గుడివడు.** అ. క్రి. (గుడి + పడు.) గుండ్రమగు.

ద్వి. ఎడపక మసఁడు సామేషువుల్ పఱప, గుడివడు ... కోదండ మనఁగ, నలుని విల్లుని

మూమ యాగుచందమామ, కళలతోఁ బూర్వ నగంబుపై నిలిచె. అ. మ. శ. ౨. ౭౭ పా. ౧౨ పం.

**గుడిసాని.** వి. (గుడి+సాని) దేవదాసి, దేవాలయములో ఆఁటపాటలు జరుపుభోగముది.

వ. ... పణ్డీశ్వరదేవరగుడిసానిబానమ్మకు.... దా. శా. ౪. ౧౧౩౦.

**గుడిసె[1].** వి. ఒకవిత్తు చింతపండు. (శ. ర.)

సీ. చింత యనంగను జించ యాఁ దత్ఫలైకాంశంబు గుడిసె యంచనఁగ వెలయు. ఆం. భా. ౨. ౪౭.

**గుడిసె[2].** వి. (సం. కుటీరః.క.గుడిసిలు.త. కుడిసై.) కుటీరము, స్తంభములు గోడలు వెనువట్టెయు లేకుండ తృణాదులతో నేర్పఱచినచిన్నయిల్లు.

గీ. అనుడు వాఁడు శుశ్రూషకుఁడై వసించె,గుడిసె యొక టెసఁ గావించుకొని ముదమున.భార. అను. ౧. ౨౭౬.

క. కులశీలమానుషాదులు,గలవరులకుఁ గాక కీర్తి కష్టున కేలా,తలు పేల చాఁపగుడిసెకు ... కవిచా. శ. ౩౭.

క. నీ వపుడు వీఁడు వాఁడని, భావించక గుడిసె వైచి పరులం బొందక్. శుక. ౨. ౪౬. ఆం. భా. ౨. ౧౪. హరి. పూ. ౬. ౨౫.

జ: గుడిసెవేటుది.

**గుడిసె[3].** వి. పక్షివిశేషము.

సీ. గున్నంగి కనకాక్షి గుడిసె...అ. అది యైనవత్తు లతఁడు దీర్చు. హంస. ౩. ౧౨.

**గుడిసెవేటుది, గుడిసెవేఁటు.** వి. (√ గుడిసె[2]) కులట.

సీ. గుడిసెవేటుది యన నడరుఁ గువేశ్యాఖ్య... ఆం. భా. ౨. ౧౧౮.

సీ. పట్టపురాజు చేపట్టి యుంచంగానె గుడిసెవేటుకు భారిగుణము రాదు. వేమ. ౮.

**గుదుక్కు=గుటుక్కు.** వి. మ్రింగుటయం దగు అనుకరణము. (ఆమ్రేడితమందు 'గుదుగుదుక్కు')

ద్వి. ఉడుగక వెడలునిట్టూర్పులతోడ, గుదుగుదుక్కున మ్రింగు గ్రుక్కిళ్లతోడ. ద్వి. నల. ౫. ౧౦౧ పం.

**గుదుగుదు.** వి. (క.గుదుగుదు.త. గుదుగుదుప్పు)

౧. నడచుటయం దగువనుకరణము.

క. అడుగులు పుడమిని వడి నిడి, గుదుగుదు మని నడచి కొట్టుకొని...పార్వ. ౪. ౧౨౩.

౨. పరుగెత్తుటయం దగువనుకరణము.

ఉదా: గుదుగుదు మని పరుగెత్తుకొని వచ్చెను. (శ. ర, బ్రౌ.)

**గుదుగుదుగుంచేము.** వి. బాల్యక్రీడావిశేషము.

సీ. గొబ్బిపిఱుందు ద్రేఁగునఁ దడఁబడునడల్ గుగుదుగుదుగుంచ మింపడర నాడ. నీలా. ౧. ౭౫.

వ ... గుదుగుదుగుంచంబు నోమనగుంటలు ... భోజసుతా. ౨. ౯.

సీ...కన్నులకచ్చి గుదుగుదుగుంచాలు కుందెన గిలి...గీ... అకట యగచాట్లపోతనై యాడుకొనుచు...హంస. ౩. ౧౪౬. వి. పు. ౭. ౨౦౨.

**గుదుగురావిలము.** వి. పక్షివిశేషము.

సీ. కార్కోడిగుములక్రొక్కారంపుసందడి గుదుగురావిలముల బెడఁగుసారము. చంద్రా. ౨. ౭౧. (శ. ర. పా)

**గుదుప.** వి. ముద్గరము,గుదియ.

గీ. గుదె గుదియ దుడ్డు గునుపము గుదుప యనఁగ, ముద్గరము...ఆం. భా. ౨. ౨౧౬.

**గుదుసు.** విశ. (క. గుదును. త. కుండు.) గుండ్రము, వర్తులము.

సీ. గుడుసు సైనపూవింటఁ గూడి కమ్మనితూపు కట కాముఖపుఁ గేలఁ గరము మెఱయు. సై. వ. ౩. ౪౧.

మ. వడిఁ దూణమ్మున నమ్ము గైకొనుట తీవ్రస్ఫూర్తి సంధించు టేఁగ్వడ లీలం దగ వాపు టేయుట మదిం భావింపఁగా రాక విల్, గుడుసై యుండుటయుం బ్రచండగతి రక్షోవత్సుముల్ ప్రయ్యుచ,ప్పుడు వా రొక్కటఁ గూలుమ్రోతయు నభోభూభాగముల్ గప్పఁగన్. భా. రా. ఆర. ౧. ౨౦౯.

వి. ౧. పరివేషము.

సీ. పరివేషనామంబు భాసిల్లుచుండును గుడి యనఁ బరిది నా గుడుసు నాఁగ. ఆం. భా. ౧. ౮౨.

౨. (=గుడిసె²) కుటీరము.

సీ...గుడిసె నా గుడుసు నా నీరెండు వెలయుఁ గుటీరమునకు. ఆం. భా. ౨. ౧౪.

౩. గుడి, ఇకారచిహ్నము.

గీ. గుడుసు పైఁ గ్రియనడుమ నాగుడుసు వచ్చి, భిన్నయతి యగు రానిచోఁ బెఱయతి యగు, నెదను లచ్చిని హరి ధరియించె ననఁగ, రిపుల నెల్లను బోర హరించె ననఁగ. అప్ప. ౩. ౮౦.

జ: గుడుసుకైదువజోదు, గుడుసుకొండ, గుడుసువడు, గుడుసువాలు.

**గుడుసుకైదువజోదు.** వి. (గుడుసు+కైదువ+జోదు) విష్ణువు, చక్రపాణి.

క. అని మొఱలిడుకేజేలం, గనుఁగొని యగ్గడుసుగుడుసుకైదువజో దిట్లనియెన్....అచ్చ. రా. బాల. ౬౦.

**గుడుసుకొండ.** వి. (గుడుసు+కొండ) చుట్టుకొండ, చక్రవాళపర్వతము

గీ. ఒకగొడుగునీడ నీవు కీడుమగ నడుపు, గుడుసుకొండకు లోనైనపుడమిఁ గలుగు, పజల నెల్లను బ్రియమైనపగిదిఁ బోలను, విందు గావించెదను వేఁటవడలు సామి. చంద్రా. ౨. ౬౬.

**గుడుసువ(వ)డు.** అ. క్రి. (గుడుసు+పడు) ౧. గుండ్రమగు.

క. ఉఱక యపరి మొఱసినయే,డ్తెఱ నెఱయఁగ గుడుసువడి యతిస్ఫురితరుచిన్, మెఱసి ధనువనలవలయము, తెఱఁగునఁ జక్రగతి ప్రతిహతిం జేసెన్. భార. కర్ణ. ౩. ౪౧.

క. మృడుఁడు కనకాద్రిచాపము, గుడుసువడం దివియ ... భీమ. ౪. ౧౩౪. హరి. ఉ. ౬. ౨౧౫.

౨. తగ్గు, తఱుఁగు, తక్కువపడు.

వ...లావు సెడి చేవ దఱిఁగి కడంకలు గుడుసువడి కడిమి పెంపు పోనాడి...హరి. పూ. ౬. ౧౨౯.

(క్షత్త్రియవర్ణనము) సీ. ఒకనితోఁ బెనఁగ నోపక భంగ మొందినవడము డిసత్త్వంబు గుడుసువఱచి. చంద్రా. ౧. ౨౧.

**గుడుసువాలు.** వి. (గుడుసు+వాలు) చక్రము.

గీ. చుట్టుకైమవు గుడుసువా ల్పడియడివము, బటువుకత్తి నాఁ జక్రము నిటలనయన. ఆం. భా. ౧. ౫౨. అచ్చ. రా. యు. ౬౪.

**గుడూచి.** సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగ.

**గుడేరము.** సం. వి. అ. పుం. ౧. గులిక, ఉండ. ౨. గ్రాసము, కబళము.

**గుడ్డ¹.** వి. (క. గుడ్డె. త. కుట్టై) ౧. వస్త్రఖండము.

సీ...గుడ్డ నా బట్ట నాఁ జెఱఁగొందు వస్త్రఖండము...ఆం. భా. ౨. ౧౫౩.

౨. వస్త్రము. (శ. ర, వా) ౩. క్షేత్రఖండము; స్థానము.

గీ. గుడ్డవృత్తులు వృత్తులఁ గొలుచుగుత్త, చేలు గ్రామాంశములు వాధికేల లెల్ల, జనపయులకమ్మఁజూపు నిచ్చాధిహార,వర్తి నాఁ దేమి గానున్నవాఁడొ మీఁద. పాండు. ౩. ౧౬.

ద్వి. గుడ్డవ్వ భక్తి గుడ్డరాయి వరఁగె. బస. పు. ౭. ౪౨౯ పం.

ద్వి. ప్రతిసలగుడ్డ విప్రతభక్తిగడ్డ, వ్రతములపంట ... బస. పు. ౨. ౧౩౩ పం.

**గుడ్డ[2].** వి. (క. గుడ్డ=బాలుఁడు) బిడ్డ.

ద్వి. పాడ్డలబాచయ్యగుడ్డరాయా నంబి, బిడ్డఁడో ని మ్మవ్వ పెంపుడుకొడుకొ. పండితా. పురా. ౧౫౬ పా.

**గుడ్డము=గుడ్డాము.** వి. చేను. (శ. ర - క. గుడ్డ=పర్వతము.) పర్వతము ?

క. ఎడ్డతనపుఁగైసేఁతల, రడ్డులు పడచిరి పురస్సరద్భార్యముగా, గుడ్డంబుచక్కఁ గట్టం, బడ్డమ పోశక్తి దివ్యభవనంబునకుఁ. పాండు. ౩.౭౫.

**గుడ్డాము=గుడ్డము.** (శ. ర.)

**గుడ్డి.** వి. అట్టచెమ్మఆటలో పలికిలఁబడ్డరయింటికాయ. (శ. ర)

**గుణ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దూర్వా. ౨. మాంసరోహిణీ. (కల్ప)

**గుణకథనము.** సం. వి. అ. న. ౧. గుణవర్ణనము. ౨. (అలం) మన్మథావస్థలలో నొకటి.

శ్లో. అభిలాషశ్చింతా స్మృతిగుణకథనోద్వేగసంప్రలాపాశ్చ, ఉన్మాదోథ వ్యాధిర్జడతా మృతిరితి దశాత్ర కామకృతాః. (సా. ద.)

**గుణకము.** సం. వి. అ. పుం. హెచ్చించుసంఖ్య, హెచ్చవేయుసంఖ్య.

**గుణకారము.** సం. వి. అ. పుం. ఆవృత్తి చేయుట, గుణించుట.

**గుణకారుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) ౧. గుణమును కలిగించువాఁడు. ౨-పాకభేదముచేత రసరూపగుణమును కలిగించువాఁడు-వంటవాఁడు. వి. అ. పుం. భీముఁడు. (త్రి. ని.)

**గుణనము.** సం. వి. అ. న. గుణించుట, హెచ్చవేయుట.

**గుణని.** సం. వి. ఈ. స్త్రీ. దార్ఢ్యముకొఱకు మరల మరల నావృత్తి చేయుట, నిరంతరాభ్యాసము, అనుశీలనము. (త్రి. ని.)

**గుణనిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నృత్యము. ౨. కంఠహారము, దండ. ౩. మరల మరల ఆవృత్తి చేయుట, నిరంతరాభ్యాసము. (శిసు. ౨. ౭౫.) ౪. శూన్యము, సున్న.

**గుణనీయము.** సం. విశే. (అ. ఆ. అ) గుణింపఁదగినది. వి. అ. పుం. ఆవృత్తి, అభ్యాసము.

**గుణపడు.** మి. అ. క్రి. (గుణము+పడు) చక్కఁబడు. (శ. ర.)

**గుణము.** సం. వి. అ. పుం. ౧. గొనము, వస్తుధర్మము. ౨. మంచిగొనము. ౩. ప్రయోజనము, ఫలము. ('కః స్థానలాభే గుణః' సం. పంచ. ౨. ౨౩.) ౪. దారము; త్రాడు; మోకు, మొ. ౫. అల్లెత్రాడు, మౌర్వి. ౬. వాద్యములతీఁగ. ౭. (వైశేషిక) రూపాదిచతుర్వింశతిగుణములలో నేదేనొకటి. ౮. ఆవృత్తి, రెట్టి, మడుఁగు. (ఉదా: ద్విగుణము, త్రిగుణము, మొ.) ౯. గౌణము, అప్రధానము. ౧౦. ఉత్కర్షము, గొప్పతనము. (సం. కిరా. ౬. ౭.) ౧౧. ఇంద్రియము. ౧౨. ఇంద్రియవిషయము, భూతగుణము. ౧౩. మూఁడు అనుసంఖ్య. ౧౪. (వ్యాక) అ ఏ ఓ లకు సంజ్ఞ. ౧౫. (గణిత) గుణకము.

ప్రకృతిగుణములు మూఁడు:-సత్త్వము, రజస్సు తమస్సు.

భూతగుణములు అయిదు:-శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము.

భగవద్గుణములు ఆఱు:-ఐశ్వర్యము, వీర్యము, యశము, జ్ఞానము, శ్రీ, వైరాగ్యము. (జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు. అని ప్రకారాంతరము.)

రాజనీతిగుణములు ఆఱు:-సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము.

కావ్యగుణములు పది:-మాధుర్యము, ప్రసాదము, శ్లేష, సౌకుమార్యము, సమత, అర్థదీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి.

వైశేషికగుణములు ఇరువదినాలుగు :- రూపరసగంధస్పర్శసంఖ్యాపరిమాణపృథక్త్వసంయోగవిభాగపరత్వాపరత్వగురుత్వద్రవత్వస్నేహశబ్దబుద్ధి సుఖదుఃఖేచ్ఛాద్వేషప్రయత్నధర్మాధర్మసంస్కారములు.

ధీరగుణములు పదునాల్గు:-దేశకాలజ్ఞత, దార్ఢ్యము, సర్వక్లేశసహిష్ణుత, సర్వవిజ్ఞానిత, దాక్ష్యము (=సమర్థత), ఓజస్సు(=బలము), మంత్రగోపనము, అవిసంవాదిత(=సందర్భానుకూల్యము), శౌర్యము, శక్తిజ్ఞత్వము, కృతజ్ఞత, శరణాగతవాత్సల్యము, అమర్షిత్వము, అచాపలము,(=చాపల్యములేమి) ధీరగుణములు ఎనిమిదని కొందఱు:-సర్వభూతదయ, క్షాంతి, అనసూయ(=ఈర్ష్యలేమి), శౌచము, అనాయాసము, మంగళము, అకార్పణ్యము (=ఔదార్యము), అస్పృహ. (వాచ)

**గుణలయని.** సం. వి. ఈ స్త్రీ. పటకుటీరము, గుడారము, డేరా. (హలా. ని.)

**గుణలయనిక.** సం. వి. ఆ. స్త్రీ=గుణలయని.

**గుణవృక్షకము.** సం. వి. అ. పుం. ఓడకంబము.

**గుణాలయము.** సం. వి. అ. పుం. గుడారము, డేరా.

**గుణావర్తము.** సం. వి. అ. పుం-నూలు పట్టి త్రవ్వినగొయ్యి-గోడ మున్నగునవి కట్టుటకై త్రవ్వినగొయ్యి, పునాది. (ఇది నిఘంటువులలోఁ గనఁబడదు)

సీ. రఘువరేణ్యక్రోధరసము లంకకు ముట్టఁ గ్రొవ్వారుకాలువఁ ద్రవ్వె ననఁగ, నాగామిసేతుబంధానురూపంబుగాఁ జేయుగుణావర్తమో యనంగ... గీ. ఒకనిమిషమాత్ర మప్పు | డయ్యుదధినడుమ, నఱకుపడి తోఁచె...రామా. ౬. ౧౦౧.

**గుణి.** సం. విణ. (న్. నీ. న్) గుణము గలవాఁడు.

వి. న్. పుం-నారి కలది-విల్లు.

**గుణింతము.** వి.౧.(సం. గుణితమ్.)హల్లులతో అచ్చులను హల్లులను జేర్చుట.

సీ. దండమ్మునను గుణింతము పెట్టర మ్మన్న నంగుళివ్రణ మాయె ననుచు జాణిఁగి. హంస. ౩. ౧౮౧.

౨. అంకెలను హెచ్చవేయుట. (బ్రౌ)

**గుణితము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. (గణిత) హెచ్చవేయఁబడినది. (సంఖ్య) ౨. హెచ్చింపఁబడినది, అధికముగాఁ జేయఁబడినది.

**గుణియించు, గుణించు.** సం. స. క్రి. ౧. (గణిత) హెచ్చవేయు.

సీ...తద్గణము త్రిగుణిత మైన,వాహిని యగు దాని వడి మూఁట గుణియింపఁ బృతన నాఁ బరఁగుఁ దత్పృతన మూఁట. ఆ. గుణిత మైనఁ జము వగుఁ...భార. ఆది. ౧. ౭౦.

౨. వల్లెవేయు, ఉవ్వవేయు.

చ. ద్విజవరులన్ గుమారుల నతిప్రియదర్శను లైనవారి ఋగ్యజుషపదక్రమంబులు క్రియన్ గుణియించుచు వచ్చువారి నగ్గజపురపల్లభుండు గని గ్రక్కున డాయఁగఁ బిల్చి...భార. ఆది. ౨. ౧౯౫.

క. శీతలమహీరుహచ్ఛాయాతలకల్పితవితర్దికానీనవటు,వ్రాతము గుణియింపఁగ శుక,పోతంబులు పనస కవలుపోయినఁ జెప్పన్. వరాహ. ౪. ౯౨.

ద్వి. సరి గూడి ఋగ్యజుస్సామవేదములు, పరఁగ గుణించెదు బ్రహ్మరాక్షసులు. ద్వి. హరిశ్చ-ఉ. ౧౬౫౦ పం.

౩. మరల మరలఁ దలపోయు, చింతించు.

ఉ. ... ఏ,కాంతమ కేళిశయ్యపయిఁ గాంత గుణించు మనోరథార్థముల్. శివరా. ౨. ౧౯.

**గుణీభూతవ్యంగ్యము.** సం. వి. అ. న. వ్యంగ్యము అప్రధానముగాఁ గలకావ్యము, మధ్యమకావ్యము.

**గుణుఁడు.** సం. వి. అ. పుం. వంటలవాఁడు (త్రి. ని.)

**గుణ్యము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. గుణింపఁ దగినది. ౨. ప్రశస్తగుణములు గలది.

**గుత్త.** వి. (క. గుత్తె, గుత్తిగె. త. కుత్తగై.) భూమ్యాదులను తగినఫలమిచ్చుటకు ఒప్పికొని అనుభవమున నుంచికొనుట.

సీ... ఊళ్లు గుత్త కీక. పి. శకుం. ౪. ౧౭౫.

ఉ... నీకొడుకుమూఢత మానుప వేల వాఁడుగో, తొత్తులమారియై గృహము ద్రొక్కక యొక్కకదానిఁ బూనికన్, గుత్తకు నంచు నుంచుకొని కోకలు మూకలు జోక నీయఁగన్. నిరం. ౨. ౪౮.

చ... వాని మేనిడా, ల్కొమరున కేను మేలువడి గుత్తకు నిచ్చితి నేమి చెప్పుదున్. కువల. ౪. ౧౭౬. ('మేను' అనుకర్మపదము అధ్యాహార్యము.)

విణ. గుత్తకుఁ దీసికొనఁబడినది.

సీ. ఆకుఁదోఁటలుగుంపు పోఁకమ్రాఁకులు గుత్తచేలు గొబ్బెలకదు పాలమంద. గీ ... కలిగి కనుపట్టు నాతనికాఁపురంబు. శుక. ౨. ౧౪౫.

ఉ. బిత్తరి పైఁడి యిచ్చువిటుఁ బిల్చు నటంచురు కొంద కేరికో, గుత్తని కొంద త్రాడుమరు... బహు. ౫. ౮౧.

జ: గుత్తకాఁడు, గుత్తగట్టు, గుత్తగొను, గుత్తజట్టి, గుత్తవట్టు.

**గుత్తకాఁడు.** వి. (√ గుత్త.) గుత్తకు పుచ్చుకొను వాఁడు. (శ. ర.)

**గుత్తగట్టు.** స. క్రి. (గుత్త + కట్టు.) గుత్తకిచ్చు.

ఆ. బత్తిఁ బత్తిరిడిన ముత్తిబుత్తులు రెండు, నొత్తి గుత్తగట్టుచుండు ఱేఁడ. నీలా. ౧. ౧౧౮.

**గుత్తగొను.** స. క్రి. (గుత్త + కొను.) గుత్తగా పుచ్చుకొను.

క. ఇక్కలికి గుత్తగొనుఁబో, తక్కక దివి నిమిష మున్న దైవతవిటులన్. కళా. ౩. ౭౩.

క. సురుచిరతరకనకలతా, గురురుచిసంపదల గుత్తగొనులీలానుం,దర మగుసీమే నెక్కడ, హరహర నీయొంటిరాక యది యెట్లు చెలీ. జాహ్నవీ. ౪. ౨౨.

**గుత్తజట్టి.** వి. (గుత్త + జట్టి.) టోకున బేరము చేయుట. (చి. ని.)

**గుత్తము.** విణ. ౧. ఎచ్చుతక్కువలు లేక సరిగా నుండునది, కచ్చితము. (ఱైక, మొ.)

(జాగిలములవర్ణన.) వ... గుత్తంబు లగుమిగులమెత్తనిజలపోఁతతోలుపట్టెడలు మెడల నమర... మనుచ. ౪. ౨౭.

సీ. గములుగా నెలనూడిగములుగాఁ జేతుల దలముగాఁ దూండ్ల గుత్తములు చేసి. యయా. ౫. ౧౦౦.

ఉ ... గుత్తపుఁదాపితాలివికకుట్టు పటుక్కున విచ్చె రంభకున్. కృ. శకుం. పీఠి. ౧. ౮౦.

౨. కఠినము, గట్టిది.

వ... తదుదరకరకనికరములు జలజలఁ దొరంగినం జూచి గుత్తంపుముత్తియంబు లని యేఁటి ...వసు. ౨. ౧౧.

ఉ. బిత్తరి యొత్తు ముత్తియపుఁ బేరు వలగ్నమున ఘటించి కేల్గుత్తపుఁ జన్నుదోయి నొనఁగూర్చి రయంబునఁ జూడ వచ్చెరా, జోత్తము ... వసు. ౬. ౧౪.

ద్వి. ఏడ నెవ్వరు లేక యీరాజతలనె, కూడె నీ యీబలు గుత్తంపుటప్పు. ద్వి. పారిజా. ఉ. ౪౫౪ పం. (ఇట తీర్పరాని దని భావము.)

౩. (సం. గుప్తమ్. ప్రా. గుత్త.) గుప్తము, రహస్యము, గూఢము.

క. కోఁఅమాలినదుర్లక్షణ, కోఁఅగా దిది నీకు వాలె గుత్తంబుగ ని,ర్జఱిభి వధించెద నీతో, నఱ లేని మనోజకేళి నలరెద నెలమిన్. భా. రా. ఆర. ౧. ౧౪౦.

సీ. వెలరయెంత యీమల్లికల కని పలికించి గుత్తంపుమోవివల్లొత్తుఁ గాంచి. రా. వి. ౧. ౫౭.

**గుత్తవట్టు**=గుత్తగొను. (గుత్త+పట్టు)

సీ. పచ్చిత్రితో ల్బత్తెము చ్చాలమె ట్లందికొనఁ దాన యూరెల్ల గుత్తపట్టు. ఆను. ౬. ౬౯.

**గుత్తి.** వి. (సం. గుచ్ఛః. ప్రా. గుత్తి. క. గుత్తు. త. కొత్తు) ౧. పువ్వులు పండ్లు పూసలు లోనగువాని గుచ్ఛము.

సీ...కుచ్చన గుత్తియన గుచియనఁగ గుచ్ఛాఖ్యదనరు. ఆం. భా. ౨. ౪౦.

ఉ...పురవరోపవనంబులు పొచ్చి యిచ్చఁ బూ, గుత్తుల వ్రాలి తేనియలు కుత్తుకబంటిగఁ గ్రోలి లీలమై, నొత్తిలి మ్రోయుచుంపు దళుకొత్తుచు నుండు మదాళిదంపతుల్. విక్ర. ౧. ౯౪.

సీ. పనసలు నీడలుఁ బండి గుత్తులుగట్టి వారక వానిపై వ్రాలి యుండు. కు. సం. ౭. ౯౩౦.

మ...మామిడిగుత్తులు... ఆను. ౧. ౬౬. (మామిడిగుత్తులు=మామిడిపూగుత్తులు)

గీ...గురివెందపూసలగుత్తి...హార. ౭. ౧౪౦.

క. కత్తులబోనులు దూలుచు, గుత్తిగఁ బెక్కండ్ర నొకటి గొని మోయుచు నువ్వెత్తునఁ బంటను దూలము, లెత్తుచు మఱి కొంద ఱాడి రెలమి వహింపన్. చెన్న. ౨. ౨౨౪. భాగ. ౮. ౪౪౭.

౨. చీలమండ.

సీ. గుత్తులకొలఁదికిఁ గృత్తంబులై పడియున్న పాదంబు లొక్కొక్కచోట. నిర్వ. ౪. ౬౧.

౩. మనికట్టుక్రిందిహస్తభాగము. (వా)

౪. వన్యవృక్షవిశేషము. (ఇది గురిగింజంతలై రెట్టనిలియ్యనిపండ్లగలలు గలిగియుండును. చి. ని.) హంస. ౪. ౧౧.

౪. (కవ్వముయొక్క) బిళ్ల.

వ...కొండకవ్వంబుగుత్తి జెఱజెఱం దిరుగువేగంబునఁ జటచటాయమానంబులై బుగులుబుగుల్లనుచప్పుళ్లుప్పరం బెగసి...భాగ. ౮. ౨౦౯.

జ: గుత్తికవ్వము, గుత్తిపండ్లు, గుత్తిబలుగుత్తులు, గుత్తిమల్లెలు, గుత్తులుగొను.

**గుత్తిక**=గుత్తుక. వి. అంఘ్రి, పాదము. (చూ. గుత్తికగువ్వ.)

జ: గుత్తికగువ్వ.

**గుత్తికగువ్వ.** (√ గుత్తిక.) వి. కపోతాంఘ్రి, గువ్వగుత్తికకూ. (శ. ర.)

**గుత్తికవ్వము.** వి. (గుత్తి + కవ్వము) వెదురుగొయ్యచివరను చీల్చి దారముతోఁ గట్టి యేర్పఱచినకవ్వము. (బ్రౌ, శ. ర.)

**గుత్తిపండ్లు.** వి. బ. (√ గుత్తి) గుత్తుగుత్తులుగా పండెడుఒకవిధమైనపండ్లు. (శ. ర, బ్రౌ)

**గుత్తిబలుగు(గ్గు)త్తులు.** వి. బ. (√గుత్తి) ధాన్యవిశేషము.

వ ... పసుపుగన్నెర్లు గుత్తిబలుగుత్తులు రావిపూరాజనాలు... ప్రబంధ. ౧౧౨.

సీ. కుసుమపూరాజనా ల్గుత్తిబల్గుత్తులు కస్తూరిపట్టెలు గంధసరులు. హంస. ౪. ౧౨౮.

**గుత్తిమల్లెలు.** వి. బ. (గుత్తి + మల్లెలు) ధాన్యవిశేషము.

గీ...కస్తూరిపట్టెయులును, గుత్తిమల్లెలు ప్రౌఢిగాఁ గూర్చి మఱియు, సకలజాతులఁ బోషింప శక్తి గలిగి, హాళికులు చైత్రుఁ బొగడుచు రహ్వారమున. భాను. ౧. ౯.

**గుత్తుక**=గుత్తిక. (చూ. గువ్వగుత్తుక)

**గుత్తుగుత్తు.** వి. మహాభయము కలిగినపుడు ప్రాణము లు కొట్టుకొనుటకనుకరణము.

గీ. తలఁకి యున్నవా రున్నచోఁ దలలు గట్టి,కొని రి మఱి ప్రాణములు గుత్తుగు త్తనంగఁ, జనిన శోకంబు క్రమ్మఁ దనుఁ బొదువఁగ, దేవకీ దేవి మూర్ఛానిధేయ యయ్యె. హరి. పూ. ౯. ౧౩౨.

**గుత్తులుగొను.** అ. క్రి. (గుత్తులు + కొను) గుత్తు లు బయలు దేఱు.

చ...కుసుమంబులు వాసన కెక్కి యెక్కి గు, త్తులుగొని పండి పండి వినుతుల్ దగ నారము లొప్పె నామనిన్. కు. సం. ౪. ౪౪౩.

**గుత్సకము.** సం. వి. అ. పుం. ౧. గుచ్ఛకము, పూ గుత్తి. ౨. గ్రంథపరిచ్ఛేదము, స్తబకము.

**గుత్సము.** సం. వి. అ. పుం. ౧=గుచ్ఛము. (వాచ) ౨. గ్రంథిపర్ణము౽. (మే. ని.)

**గుత్సార్థము.** సం=గుచ్ఛార్థము.

**గుదకీలకము.** సం. వి. అ. పుం. మూలవ్యాధి. (హ లా. ని.)

**గుదకీలము.** సం=గుదకీలకము. (కల్ప)

**గుదగుద.** వి. పరితపించుటయం దగుననుకరణము. (చూ. గుదగుదపడు, మొ.)

బ. సందేహములు.

ద్వి. కుదుపున కియ్యెడ గుదగుద లేల, కుడికేఁడు దెత్తునా గుజ్జనోగిరము. బస. పు. ౩. ౪౨౬ పం. (ప్రాఁత ప్రతిపా.)

జ: గుదగుదపడు, గుదగుదమను, గుదగుదలాడు.

**గుదగుదపడు.** అ. క్రి. (గుదగుద + పడు) పరితా పపడు.

ద్వి. ఇది యేల వెడకత లిన్నియుఁ బన్ని,గుదగుద పడక నెమ్మది నుండుఁ డనిన. బస. పు. ౭. ౫౬౫ పం.

**గుదగుదమను.** అ. క్రి. (గుదగుద + అను.) పరిత పించు.

ద్వి. గుడి కేఁగ రామిని గుదగుదమనుచుఁ, గుసుద క...బస. పు. ౬. ౨౬౪ పం.

**గుదగుదలాడు.** అ. క్రి. (గుదగుదలు + ఆడు) దగ్గుత్తికతో నేడ్చు. (శ. ర.)

**గుదగ్రహము.** సం. వి. అ. పుం. మలబంధము.

**గుదపాకము.** సం. వి. అ. పుం. గుదస్థానము వాఁ చుట.

**గుదభ్రంశము.** సం. వి. అ. పుం. (అతిసారాదుల చే) గుదము జాఱుట.

**గుదము.** సం. వి. అ. న. పాయువు, ముడ్డి.

**గుదస్తంభము.** సం. వి. అ. పుం. మలబంధము.

**గుదాంకురము.** సం. వి. అ. పుం. మూలవ్యాధి.

**గుది.** వి. (క. గుడి) ౧. ఆకులు లోనగువానిసరము.

ఉదా: మఱ్ఱియాకులగుది.

చ. కరమున నున్నశూలమునఁ గ్రమ్మె మొఱుంగులు శత్రుసైన్యభీ,కరములుగా గజాశ్వభటకాయ ములన్ గుది గ్రుచ్చినట్లుగాఁ, జెరువుమ వచ్చువానిఁ గురుసింహుఁడు చూచి ... భార. భీష్మ. ౩. ౧౦౯.

చ. అదరులు వాఱునస్త్రముల నార్చి మహోసుర లేచియేసి పెన్,గుదులుగ గ్రుచ్చి దేవతలు కో ల్తల కోర్వక పాఱి రయ్యెడన్. భాగ. ౬. ౨౭౩. భోజరా. ౫. ౩౪౧. కు. సం. ౨. ౨౧౧.

౨. పూలు మొదలగువానిగుత్తి.

క...మొగ్గల, గుములు తలిరుఁగొమ్మలందు గుదిగొని పొదలెన్. ఉ. రా. ౬. ౧౦. ఆం. భా. ౨. ౪౦.

ఉదా: తాళపుఁజెవులగుది.

౩. (సం. గ్రంథిః.) కంతి.

మ... రోఁతవ,ట్లగుపూఁబోండ్లనితంబయుల్ కర

గీ. మన్ను గేస్తుఁడు వగ్గియు మిన్ను నీరు,ప్రొద్దు నెల గాడ్పు లెవ్వానిరూపు లయ్యె.నీలా. ౧. ౧౨.

3. భర్త.

సీ. జంటమొగంబులసామిముద్దులకుఱ్ఱతల్లిగేస్తుఁడు పిగఁ దాల్చుపువ్వు. రామ. 3౫౧.

మ...పల్కుాంబోటి గేస్తుండు...నీలా.౨.౧౧౯.

జః గేస్తురాలు.

గేస్తురాలు. వి. (గేస్తు+ఆలు) ౧. ఇల్లాలు, మగనాలు, కులస్త్రీ.

మ...దర్పకజన్యంబున గేస్తురాల నయితిం బ్రాహ్మీణ్యాహైన్యంబునన్. కువల. ౫. 3౦.

గీ. అనఘచారిత్ర యెవ్వ రే మన నొకింత, కరల నిసుశీల సంపన్న గేస్తురాలు, అత్తరుణిఁ జూచి యపుడు నో శత్తి పలికె. సారంగ.3.౮౬.

౨. గృహిణి, భార్య.

గీ. తమ్ముఁడును గేస్తురాలును దాను నగరు, వెడలి ...అచ్చ. రా. అయో. ౮౨.

గీ. అలరుమెం డైననిండుఁ బ్రాయంబుకలిమి, రస్తుమీఱుచు నాతని గేస్తురాలు. శుక. ౨. ౧౦౦.

గేహము. సం. వి. అ. న. గృహము, ఇల్లు.

గేహి. సం. వి.న్. పుం. గృహస్థు, గేస్తు.

గేహిని. సం. వి. ఈ. స్త్రీ. గృహిణి, ఇల్లాలు.

గేహేక్ష్వేడి. సం. విశే. (న్. నీ. న్)-ఇంట మాత్రమే గర్జించువాఁడు-పిఱికివాఁడు, పంద.

గేహేదాహి. సం. విశే. (న్. నీ. న్.)=గేహేశూరుఁడు.

గేహేనర్ది. సం. విశే. (న్. నీ. న్)=గేహేక్ష్వేడి.

గేహేమేహి. సం. విశే.(న్. నీ. న్) -గృహమందే మూత్రవిసర్జనము చేయువాఁడు - సోమరి, అలసుఁడు.

గేహేశూరుఁడు. సం. విశే. (అ.ఆ.అ) -ఇంటనే బింకము లాడువాఁడు-పంద,పిఱికివాఁడు. (విల్యమ్సు)

## గై

గైత. వి. కిరాతభేదము. (మి శ్రప్రా)

సీ. వేసమన్నీఁడ నీ వీకాన వెరఁజాము గైత నీ వాజాడ గనఁగఁ జూపు. ప్రబంధ. ౧౯3.

గైరము. సం. విశే. (అ. ఈ. అ) ౧. కొండయం దైనది. ౨. గిరిసంబంధ మైనది.

గైరికము. సం. వి. అ. పుం. న-కొండ యందు పుట్టినది-పర్వతధాతువిశేషము,జేగుఱు. న. బంగారు.

గైరికుఁడు. సం. వి. అ. పుం. పర్వతీయుఁడు, కిరాతుఁడు.

గైరేయము. సం. విశే. (అ. ఈ. అ.) కొండయందు పుట్టినది. వి. అ. న.౧. సిలాజిత్తు. ౨. జేగుఱు ధాయి.

## గొ

గొంగ. వి. పగతుఁడు, శత్రువు; సంహారకుఁడు.

సీ...వైరి. గీ. మనును...కంటనఁగ గొంగ యన నూఁడుకాఁ డనంగ...ఆం. భా. ౨. ౧౮౫.

చ. కువలయపర్వ మబ్జములగొంగ చకోరమనోరథంబు...నిశామణి తూర్పునఁ దోఁచె...భా. రా. సుం. ౧౭౦.

మ ... వైరిమనుజేంద్రశ్రేణికిం గొంగ. నిర్వ. ౧. 3౯.

గొంగడి=గొంగళి. (మహా. ఘోంగడీ. క. గొంగడ) వి. కంబళి.

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచున్, బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచు... భాగ. ౧౦ పూ. ౮3౩.

ద్వి. భృంగకాంతుల జడిపించువన్నియల, గొంగ

డి మునుఁగిడికొని యిల్లు వెడలి. ద్వి. పరమ. ౫. ౩౫౩ పా.

క. శాకపుసరకులుఁ బోఁకలు, నాకులు గొంగళ్లు ...ప్రియ మయ్యె శీతకాలమునందుఁ. వేం. పంచ. ౧. ౬౭౬. ఆం. భా. ౨. ౧౫౭.

౨. పక్షివిశేషము.

సీ. గొంగడి కక్కెర గొక్కెర గొరవంక...హంస. ౩. ౧౨.

జ: గొంగడిగాఁడు.

**గొంగడిగాఁడు**=గొంగడి. వి.(గొంగడి+కాఁడు-స్వార్థమున) పక్షివిశేషము.

వ. మఱియుఁ గైదు కక్కెర కారుకోడి లావుక వెలిచె నేలనెమిలి డాబ గొంగడిగాఁడు మొదలగుపక్షులు...చంద్రా. ౨. ౭౮.

**గొంగళి**=గొంగడి.

(కంబళి)

క. గొంగళి ముసుంగుతో నయ,సంగతి నిలు వెడలి పౌరజనవర్తన లెల్లం గనుఁగొనుచును... పరమ. ౪. ౬.

**గొంగళిపురుగు.** వి. (గొంగళి+పురుగు) కంబళిపురుగు. (శ. ర, వా.)

**గొంజె.** వి. గొడ్డుటావు, వం-

గీ. గొడ్డన పంజ నా గొంజ నా వంధ్య యా... ఆం. భా. ౨. ౨౬౩.

**గొంజి.** వి. ఒకానొక ఫలవృక్షము.

గీ. కొమ్మిపండ్లుఁ దీఁతపండ్లును గొంజిపండ్లు, మేడిపండ్లును మొదలుగాఁ గూడిమాడి, చెంచెతలు దెత్తు రిత్తు విచ్చేయవయ్య. కాళ. ౩. ౬౯.

**గొంటరి**=గొంటు¹. విణ. (గొంటు¹+అరి-స్వార్థమున) ౧. దిట్ట.

ఉ. కోయిలపేరిగారడపుగొంటరి తా ఋతురాజామందటన్, మాయ వహించి లేఁజిగురుమారునికత్తులు మ్రింగ...శకాం. ౨. ౧౧౬.

౨. దుష్టము; దుష్టురాలు.

గీ. పెంపెడల నిట్టియెడ నీవు సొంపు సడలి,తుంటవిలుదంటగొంటరితంటలకును, దిన్నఁదన మతి విన్న నై ఖిన్న వగుచు, వేడ్క దొఱఁగంగ నేటికే వెలఁదిమిన్న. ఇందు. ౩. ౬.

వ...ఆగొంటరివెంటఁ దలవరులఁ గూర్చి మీ రిది చూపినజాడ వేశ్యమందిరంబున కరిగి కనకపాత్రం బిచ్చినవానిం బుచ్చుకొన్నదానిం బట్టి తెం డని పనిచిన...విక్ర. ౫. ౩౧.

౩. కఠినుఁడు.

సీ. గొంటరి ధాతకీకుసుమకోమలయంగ మలయంగఁజేయ నేచల మటంచు. హ. వ. ౪. ౪౧.

ద్వి. ఇచ్చోటి కుండుండి యేల వచ్చితివి,వచ్చితిం బో యిటువంటిగొంటరిని, గనుఁగొంటి నేలకో...ద్వి. పరమ. ౪. ౨౭౯ పా.

**గొంటు¹**=గొట్టు¹. విణ. (సం. కుంఠః) ౧. దుష్టము.

ఉ...ఈతఁడా, గొంటునిశాచరి వ్యసుఁ గూల్చుటవింటిమి కాదె యేర్పడన్. హరి. ఉ. ౪. ౨౩౩.

౨. వంచకుఁడు.

చ. కొడుకుల మండలోన నిడి గొంటుతనంబున మోసపుచ్చె నీ,బడుగును బట్టి చంపు టిది భావ్య మటంచుఁ గృపాణపాణి యై,వడి వసుదేవునిం దునుమ వచ్చినకంసునిఁ జూచి...భాగ. ౧౦ పూ. ౧౧౪౯.

౨. కఠినుఁడు, క్రూరుఁడు; ఘాతుకుఁడు.

సీ. నీపట్టు వదల వన్నిట గొంటు వని తిట్టునువిద బల్గిలిగింత నుబుకఁ జేసి. మృ. వి. ౧. ౪౫.

లయగ్రాహి...వెంటఁ బడి పట్టుకొని గొంటుతన మేర్పడఁగ గంటి పడఁ దాఁచు హ మగంటిమి దలిర్పన్. భా. రా. యు. ౧౪౩౦.

ద్వి. మిండతల్కాత్తికి మిగిలినగొంట్లు. పండితా. పురా. ౧౧౬ పా.

౩. దిట్ట.

గీ. కనకకశిపుని జముప్రోలి కనుపుగొంటు, చాలి తా నేకఘూకాంధ్య సంధ్య దొలఁగె. రా.వి. 3. 3.

జ: గొంటరి, గొంటుకాఁడు.

**గొంటు**[2]. వి. (సం.ఘోంటా) మొద్దువక్క, బందన లేనివక్క.

క. పచ్చనియాకుం దానికిఁ, బుచ్చినగొం టొక టి నములు...బహు. ౫. ౯.

సీ. కప్రపువీడెము వెల్తిగానియానోరికిఁ గొఱమా లినట్టియీగొంటువక్క. వై జ. 3. ౭౨.

**గొంటు**[3]. ప్ర. 'కలది, కలవాఁడు' అనునర్థమును దెలుపును. (చూ. తెవులుగొంటు.)

**గొంటుకాఁడు.** విశే. (గొంటు[1]+కాఁడు- స్వార్థమున.)

(కఠినుఁడు.)

'గొంటుకాఁడు మువ్వగోపాలరాయఁడు' క్షేత్రయ. (శ. ర.)

**గొండము.** వి.(సం.కుండః) కుండము,నిప్పులగుంట.

సీ...కుండాఖ్య వెలయుచుండు గుండ మనంగను గొండ మనఁగ...ఆం. భా. ౨. ౨౪౧.

**గొండి.** ప్ర. తాచ్ఛీల్యమున వచ్చును.

ఉదా:-లంచగొండి, మొ.

ద్వి. బొంకులపిడుగులు అంకులగొండ్లు ...వన్నెకత్తెలు వారవనితలు ... పండితా. పురా. ౧౧౬ పు.

**గొండిలి(డ్లి).** వి. (సం. క్రీడా.) ౧. ఆట.

గీ.గొండ్లి సలుపంగ వనుఁగుఁబూఁబోండ్లు గారు, తులువపాలయోగిరపుఁబొలంతుకలు గాని... అచ్చ. రా. అయో. ౭౭.

సీ. త్రుళ్లాట గొండ్లి నాఁ దోఁచును గ్రీడాఖ్య... ఆం. భా. ౧. ౧౮౦.

౨. కుండలాకారనృత్యము; నృత్యము.

ద్వి. కోలాటమును శాత్ర గొండ్లి పేరణియుఁ, గెలిక జోకయు లీల నటింప. బస. పు.౧. ౫౭ పం.

సీ. తెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ వరుఋండు గొండిలి పరిఢవింప,మొకములచాయ వేల్పొకచందముగ నిల్చి కమలసంభవుఁడు పెక్కణ మొనర్ప. ఉ. హరి. ౪.౨౧౬.

సీ. జలదేవతాహస్తచామరానిలములు కుటిలాలకములకు గొండ్లి గఱప. కాశీ. ౫. ౫౨. నైష. ౧. ౯.

3. నర్తకి.

క. లలితగగనరంగంబున, నలయక క్రొమ్మెఱుఁగు గొండ్లియై యుండెడుచో,నలవడియె మొగులు తెరలును, బొలు పగుపడగండ్లగములపుష్పాంజలులున్. హరి. పూ. ౬. ౧౦౭.

గీ. కుంతలాధీశుఁ డైనయుపంతిదేవు, ననుగలంబ పనోకవారిజాక్షి మించి, గొండ్లి యన విని పిలిచి యక్కొమ్మనృత్త, మెంతయును వేడ్కఁ జూచె వసంతవర్మ. దశకు. ౧౧. ౧౨3.

జ: గొండ్లికాఁడు.

**గొండీలు.** వి. బ. నటివిశేషము.

వ...కాళియహ్రదగోవిందునకు గొండీలు గోవర్ధనమందరగోపవేషునకుఁ డెంకణాలు ...ప్రబంధ. ౮౮ ం.

రగడ. అలరఁగఁ గాళియహ్రదతలమునఁ గలగోవిందునకును గొండీ లెన్నుచు... హంస. ౪. ౨౧3.

**గొండెము=గొండ్లెము**[1].

సీ. కొట్లు పేహరులగొనబుటంగడులంద తెఱచుగా గొండెముల్ తలుపులంద... అచ్చ. రా. బాల. ౪౭.

**గొండ్లికాఁడు.** వి. (గొండ్లి+కాఁడు.)

(నటుఁడు)

సీ. కలగూటు లొక్కవంకను దొలంగుచు నుండ గొండ్లికాండ్రను గెలంకుల నటింప.... విప్ర. ౫. ౧౦.

**గొండ్లెము**[1]=గొండెము. వి. ౧. తలుపువిలుకు, తలుపు రాకుండ తగిలించుఇనుపగొలుసు.

ద్వి. లోని కేఁగెనుసంతలోఁ దల్పు మూసి,పూని గొండ్లెముఁ బెట్టి పోయె నాతిష్యుఁడు... ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౭౯ పం. ఆం. భా. ౩. ౫౧.

**గొండ్లెము**[2]. వి. బండికుంపటి,ఒకచోటనుండి మఱియొకచోటునకుఁ దీసికొనివెళ్లుటకు ఉపయోగించు కుంపటి.

సీ. బండికుంపటి చిల్కు పగఁగు గొండ్లె మనంగ...ఆం. భా. ౩. ౫౧.

**గొంతరించు.** అ. క్రి. అతిశయించు.

ఉ. కైపువహించుఁ గోకనదకాంతులు చెంతల గొంతరింపఁగా, నాపుటభేదనంపుఁగమలాకరముల్...ల. వి. ౩. ౫౭. (ప్రయోగాంతరము లేదు.)

**గొంతి.** వి. (సం. కుంతీ. క. కొంతి) పాండురాజు పెద్దభార్య.

సీ. గొంతిమూఁడవపట్టికోడలినిండువేఁకటిఁ గాచినట్టిచేకత్తెవాఁడు. రా. వి. ౧. ౭౧. భార. ఆశ్ర. ౨. ౭౨.

జ: గొంతెమ.

**గొంతు**=గొంతుక. వి. ౧. కంఠము.

గీ. గొంతు గొంతుక కుత్తుక కొలికి బొండు,గనఁగఁ గంఠంబు...ఆం. భా. ౨. ౧౮౧.

గీ. పెదవి పేఁ బెత్తు నాలుక పిడుచగట్టు,గొంతు తడితీయు...దశా. ౨. ౧౩౬.

౨. కంఠధ్వని.

సీ. పెట్ట సేరనిరండ పెక్కువిద్యలఁ బెద్ద గొఱ్ఱెలిముండకు గొంతు పెద్ద. వేణు. ౨౦. హంస. ౩. ౨౨౨.

గొంతుకూర్చుండు(కూర్చుండుకొను)=మోఁకాళ్లు గొంతుదాఁక అనునట్లు కూర్చుండు.

(వ్యవ) వాఁడు గొంతుకూర్చుండి భుజించును.

సీ. కొర్తిమీఁదను గొంతుకూర్చుండుకొనినట్లు నూతిపైఁ పసిబిడ్డ నుంచినట్లు. వేణు. ౫౦.

తడిప్రాఁతగొంతుఁగోయు=తెలియకుండ అపకారము చేయు.

క. ఉసుపతి హిమఘృణి చేఁబలెఁ, దడిప్రాఁతగొంతుగోయుతగ నెత్తిఁగిలితివో, కడు మెత్తనితలిరాకులఁ, బడఁతులమెడఁ గోసె దీవు బాపురె మదనా. పాంచా. ౩. ౬౫.

జ: గొంతుక, గొంతుకపోఁక,గొంతుమాలు,గొంతుముడి.

**గొంతుక**=గొంతు. (గొంతు+ఉక.)

ఉ...బిట్టు గొంతుక, ల్గోసితి నల్లపూసకొలకుం బదివేవురు పుణ్యభామలక్. వరాహ. ౭. ౭౫. కై. భా. ౬. ౧౭౫.

**గొంతుకపోఁక.** వి. (గొంతుక+పోఁక) గొంతుకముందటివైపు పోఁకవలె నుండెడిమెముక, గొంతుముడి. (శ. ర.)

**గొంతుమాలు.** వి. (√గొంతు) ముప్పదిరెండువిన్నాణములలో నొకటి, మల్లబంధవిశేషము.

సీ. కన్నాత చాంగణ కందణంబు తిణింగి గొంతుమాలును జేబ కుమ్మరింపు...గీ...నాఁగఁ జెన్నలరుమందు, ముప్పదియురెండువిన్నాణములకుఁ జేట్లు. ఆం. భా. ౨. ౨౦౯. హంస. ౧. ౨౦౬. మల్లుపు. ౩. ౬౯.

**గొంతుముడి**=గొంతుకపోఁక. (√గొంతు-శ.ర.)

**గొంతెమ(మ్మ).** వి. (గొంతి+అమ) ఒకానొకగ్రామదేవత. (గ్రా)

(వ్యవ) గొంతెమ్మపండుగు.

గొంతెమకోరిక=అసాధ్యపుఁగోరిక.

గీ. చాలకుండిన నగుఁ జెట్ట బాలుఁ డితఁడు,కొసరి గొంతెమకోరికల్ గోరసేని, యిడకపోక బోల దిడఁ బోల దీరు దివియఁ, జేను రాజన్నితైర్థికుల్ పెలుచ లంద్రు. పాండు. ౪. ౧౬౬.

**గొంతెమగోరు.** వి. (గొంతెమ + కోరు. శ. ర.) సారణి, లంజెసవరము *కి.*

సీ...సారణి గొంతెమగోరు లంజెసవర మన నగు ...ఆం. భా. ౨. ౬౦.

**గొంది.** వి. (క. గొంది) ౧. కొండయొక్క చిన్న ముఱుఁగుచోటు, గిర్యల్పకోణము; మూల.

గీ. గొంది యనఁగను గిర్యల్పకోణ మొప్పు. ఆం. భా. ౨. ౩౧.

ఉ...ఉదయార్కునిరాక నడంగెఁ జీకటు, ల్గొందుల సందుల న్గుహల గుట్టలఁ జెట్టులఁ జాటుమాటులన్. అని. ౩. ౭౫.

క. పులి నమలెడుమాంసము వెర, వలవడఁ దా మపహరించి యానక్క కుని, మ్ముల నిల్వం గావించిన, నిలయంబునగొందిఁ బెట్టి నే ర్పారం గన్. భార. శాం. ౩. ౬౨.

చ. వెడలఁగనీక గొంది నిడి వేయువిధంబుల భంగ పెట్టుచుం, జడకలు గట్ట నిచ్చి నిజసంపదకుం జొర నీక నిచ్చలుం, గడ నిడి కూడు వెట్టుమను గాసి యొనర్చుచు నేలతెంకి మై, నిఱుగడ సేయఁగా వలయు నీలువు మాలినఱింకుటాం డ్రకున్. విజ్ఞా. ఆచా. ౧౧. (చి. ని. పా.)

౨. చిన్నసందు. (బ్రౌ, వా.) ౩. స్థానము.

గీ. కట్టివేల్పుమఱింది భోగములగొంది, రిక్క గమి మక్కువబోజుంగు రేవెలుంగు. కృ. శకుం. ౧. ౨౨.

చ. హరివిముఖాత్ము లన్యవిషయస్పృహచిత్తులుఁ బాపవర్తులు, న్నిరయనిపాతహేతువును నింద్యచరిత్రము నైనదుష్కథా, నిరతిఁ జరించువారలును నేరరు పొందఁగ నిందిరామనో, హరచరణారవిందభజనాత్మకు లుండెడుగొందినారయన్. భాగ. ౩. ౫౧౭. (చి. ని. పా.)

౪. మహానసము, వంటయిల్లు. (చి. ని.)

**గొగ్గి=కొక్కు.** విశే. ఎచ్చుతగ్గులు కలది.

గీ. డొల్ల చెవులును గొగ్గిపండులును గలిగి, యున్న మద్గ్రీవుఁడై వచ్చుచున్నవానిఁ, గలిమహారాజుఁ గనిరి దిక్పాలవరులు. నైష. ౭. ౯౩.

వి. ౧. ఎచ్చుతగ్గులుగా నుండుట, వైషమ్యము.

ఉదా: తాటియాకు గొగ్గి లేకుండ గీయ వలయును.

౨. శిరస్త్రము.

గీ...చను శిరస్త్రంబు గొగ్గి సీసకము బొమిడి, కం బనంగను ...ఆం. భా. ౨. ౨౦౪.

౩. ఎచ్చుతగ్గులు గలముత్తెము. (కొస గలముత్తెము. బ్రౌ)

సీ...మౌక్తికం బొప్పును...ముత్తియ మన...గీ. అదియ నెర నైన గొగ్గి యం చనఁగ వెలయు ...ఆం. భా. ౨. ౨౬౬.

**గొజ్జేఁగ=గొజ్జఁగి, గొజ్జెఁగ.** వి. (సం. కుబ్జకః. ప్రా. కుజ్జఓ. క. గొజ్జగె) కుబ్జకము *కి.* (సేవంతికావిశేషము, ఊకులచేమంతి *కి.* చి. ని.—పచ్చపువ్వుల మొగలి, ఆఁడుమొగలి *కి.* బ్రౌ.)

సీ. గోరంటలును గొండగోఁగులు దేవకాంచనకుసుమములు గొజ్జంగవిరులు. ఉ. రా. ౩. ౨౦౧.

రగడ. చిఱుదేంట్ల కొసఁగె గుజ్జైనగూస్లు గొజ్జంగ, యొఱుఁగ కది పూ వంద నేల యిటు రజ్జంగ. మనుచ. ౨. ౭౪.

జ: గొజ్జఁగనీరు.

**గొజ్జేఁగనీరు.** వి. జా. (గొజ్జఁగ + నీరు.) పన్నీరు.

గీ. దేవకి యొసంగఁగా వసుదేవుఁ డపుడు, చంద్రకాంతపుగిండిగొజ్జంగనీటఁ, బసిఁడిపళ్లెము లోఁ బదాబ్జములు గడిగి, తనదు మేనల్లునకుఁ గన్య ధారవోసె. విజ. వి. ౩. ౧౧౧.

ఉ... పెన్నెఱుల్, వేమఱుఁ జేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులం, గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగనీ రెడఁ జల్లి చల్లి ... పారి. ౨. ౧౦.

**గొజ్జేఁగి=గొజ్జేఁగ.**

సీ. గొజ్జంగి యిజ్జాజిపజ్జం గిసల మొందుసెలకె క స్తురియు గన్నెరయుఁ బూచె.బహు. ౨ ౨౧.

సీ... కుబ్జంబు గొజ్జంగి గొజ్జెంగ నాఁ జను...ఆం. భా. ౨. ౫౨.

జ: గొజ్జఁగిమంచు.

గొజ్జేఁగిమంచే=గొజ్జేఁగనీరు.

ఉ. గొజ్జఁగిమంచులన్ గలపి కూర్చినపుష్పాడితి న్నిమీఁద...పూ,సెజ్జ ఘటించి...వసు. 3. ౧౬౮.

గొజ్జేఁబ్రాలు. వి. బ. ధాన్యవిశేషము.

సీ...గౌరి,కుంకుమల్ రణ పెండ్లికొడుకులు పిచ్చు కగోళ్లు ప్రయాగలు గొజ్జాఁబ్రాలు. హంస.౪. ౧౨౮.

గొజ్జెఁగ=గొజ్జేఁగ.

ఉ. చెంగలువల్ నురంగములు శ్రీతులసీనిచయం బుఁ గమ్మగొ,జ్జెంగలు లోనుగాఁగలవి శ్రీపతి కర్పణసేయు నిచ్చలున్. పరమ. 3. ౧౮౯.

గీ. సికను నెత్తావిక్రొత్తగొజ్జెంగసరులు, చుట్టు నొకనీలవేణి యాత్మేశపతికి. రసిక. ౧. ౭౧.

జ: గొజ్జెఁగనీరు.

గొజ్జెఁగనీరు=గొజ్జేఁగనీరు.

గీ. బహుళకస్తూరికామేఘపటలమునకు,శీకరాసా ర మయ్యె గొజ్జెంగనీరు. భీమ. ౫. ౧౨౧.

గొటగొట. వి. పులి గాండ్రించుట మొదలగువాని యందలిధ్వని కనుకరణము.

ద్వి. గొటగొట గాండ్రించి కోఱ లాండొంటి,గ టగటఁ దాఁకింప గర్భంబు నలఁగి. నవనాథ. 3 భా. (శ. ర)

సీ. కొల్పులుల్ మంపిల్లి గొటగొట మని రొప్పి బ లుసింగముల నైనఁ బట్టఁ జూచు. సారంగ.౧. ౬౮.

ద్వి. వడి జొల్లు సెలవుల వడియ నూరపులు, నిడు ద నై గొటగొట నిగుడ ... ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౪౮ పం.

గొట్టము. వి. (క. గొట్ట) ౧. వెదురు మొదలగువా నిక్రోవి.

ఉదా: తుపాకిగొట్టము, వెదురుగొట్టము, మొ.

గొట్టె. వి. ఒకదినుసుగడ్డ, కశేరువు. (శ. ర.)

గొట్టు[1]=గొంటు[1]. వి. ౧. దౌష్ట్యము.

ద్వి.గొట్టు సేయఁగ దొరఁకొంటివే యనుచుఁ,బట్ట నీ కది పాణిపద్మంబుఁ దట్టె. విష్ణు. ఉ. ౪ ఆ. (శ. ర.)

౨. అల్లరి.

గీ. ఆలు మగఁడును నియ్యారియఱుత నిలిచి, చ లిది భుజియింప నాసొమ్ము సంగ్రహించె,గొ ట్టుసేయక వీనిఁ జాపెట్టుకొనుచు,నిచ్చటికిఁ దెచ్చితిమి వట్టుఁడిప్పు డితని.శుక.3.౫౮౬.

సీ. చెప్పు డనఁగా రాదు చేట యెత్తుక వచ్చు గ్రు డ్డిక న్నన రాదు గొట్టుసేయు. గీ. వెత్తి యన రాదు పైఁబడి వెక్కిరించు...శుక. 3. ౨౧.

విశే. (క. గొట్టు) ౧. కఠినము.

వ... నట్టడవులలో మీపట్టపుదేవిని విడిచిపెట్టి వచ్చితి వని యీగొట్టుమాట దిట్టతనంబుతో నధిపతిం జేరి యింక నెట్టు విన్నపంబు సేయు దు...ఉ. రా. ౬ 3౪3.

౨. భీకరుఁడు.

మత్త. అట్టివృత్రునిమీఁద దేవత లల్కతోఁ బెను మూఁకలై, చుట్టుముట్టి మహాస్త్రవిద్యలు నూపి యేపున నేయ నా,గొట్టువీరుఁడు వార లేసిన క్రూరశస్త్రము లన్నియుం, జొట్టి పట్టుక మ్రిం గి శూరత జోక నార్చె మహోగ్రుఁడై. భా గ. ౬. 3౨౧

3. దుష్టుఁడు, దుర్మార్గుఁడు.

ఉ. గొట్టుఁదనానఁ దనా పడలఁగొట్టినదిట్టను ర ట్టడంచుఁ తో,బుట్టువ నాట నొం డవక పో యితి...ఉ. రా. ౨. ౩౦౯. (శ. ర. పా.)

౪. విరోధి.

(చంద్రవర్ణనము) చ... జక్కవలగొట్టు చకోరు లమేలియట్టు రే,పాలఁతుకతాళిబొట్టు...రా వి. ౩. ౭.

గొట్టుగ(గా)=కఠోరముగా; పూర్ణముగా.

రగడ. గోర గోరఁట నించితివొ కలిగొట్టు గొ ట్టుగఁ గోయఁ బోసఁగవు...వసు. ౩. ౧౪౯.

గొట్టు[2]. ప్ర. తాచ్ఛీల్యాద్యర్థమున వచ్చును.

ఉదా: గొడవగొట్టు (ఇట తాచ్ఛీల్యమున) పిసినిగొట్టు. (ఇట స్వార్థమున.)

గొట్టు[3]. (ప్రా). వి. గాలి, వాయువు.

క. మరుదాఖ్య లొప్పుచుండును, ధర వినుమాలి యన సోఁకుదయ్య మనం బ,య్యెర యన గొ ట్టన నీఁ దనఁ, గరువలి యనఁ దెమ్మె రనఁగ గాలి యనంగన్. ఆం. సం. దేవ. ౨౩.

గొట్టె. వి. ఘోటజటి. (శ. ర.)

గొట్లె. వి. (సం. ఘోంటా) రేఁగుచెట్టు. (శ. ర.)

గొడఁగు=గొణఁగు. అ. క్రి. స. క్రి. ౧. ఎదుటివారికి వినఁబడకుండ నోటిలో నుచ్చరించు.

ఆ. అనుచు వేఁడుకొనిన హనుమంతునకుఁ గడు, వ గ్గిచల్లనయ్యె నాతఁ డంతఁ, గడఁకఁ బ్రాఁత మినుకునుడువులు గొడఁగినఁ, గడిఁది మీఱి బమ్మకట్లు వీడె. అచ్చ. రా. సుం. ౧౬౦.

చ...కకుత్స్థుఁ డేటు సేఁ,మఱక యిదే మొకో కు లిశమంత్రము తప్ప గొడంగినాఁడనో, కొఱఁ తలు పుట్టెనో శుచితకున్...కళా. ౫. ౧౩౦.

౨. కసరు.

సీ. కోరి కూడినభర్తఁ జేరుమింత నటంచు గొ డఁగి పంచిరి పెంచుకొన్నవారు. కృ. శతం. ౩. ౧౪౬.

సీ. గొడఁగుచుఁ దిట్టి పెంపుడుకీరముల రేఁచి వ డలిట్లు తిట్టించెఁ బడఁతి యొకతె. చంద్రా. ౩. ౯౬.

౩. (పావురములు) కూయు.

చ. గొడఁగెడుపావురాలకొదఁ గూడి ప్రతిధ్వ ను లిచ్చుకెంపుజా, కొడిగల ప్రేలుబంగరపు గూఁడులఁ బల్కెడుచిల్కచాలుచే ... చంద్ర. ౪. ౪౯.

ముచ్చటల్ గొడఁగుకొను=ముచ్చలాడుకొను.

సీ. అగుడురా తోఁబుట్టు లళికుమారకులార కుసు లతో ముచ్చటల్ గొడఁగికొనుఁడు. కళా. ౧. ౧౪౦.

గొడగ. వి. (సం. కూటకమ్)ఏడికోల లేనినాఁగలి. (శ. ర.)

గొడగర. వి. చెప్పులు కుట్టి జీవించెడుజాతి.

ఉదా: గొడగరవాఁడు, గొడగరది. (శ. ర.)

జ: గొడగరి.

గొడగరి=గొడారి. వి. (గొడగర + ఇ) చర్మకారుఁడు, మాదిగవాఁడు.

ఆ. చాకిబోయవాఁడు జలగరి గొడగరి, కుక్క నూనగాఁడు కోడి పంది, బొడ్డుక్రిందియంగ ముల విప్ర సోఁకిన, నచటు గడుగ వలయు నండ్రు బుధులు. విజ్ఞా. ఆచా. ౫౭.

గొడవ. వి. (క. గొడవె.) ౧. జోలి, సంబంధము.

గీ. అమ్మగొడ వేల యాగవయమ్ములకును, ఖడ్గ మంకించఁగా నేల ఖడ్గములకు, భల్ల మది యేల యీ యచ్ఛభల్లములకు, నక్షయ్య యీబంతి పిక బంతి యయ్యె నేని. చంద్రా. ౨. ౪౩.

వ. ఇట్లు తమకు వలయునెడఁ బడఁతులగొడవ త డవనితమయొడయఁడు తమ్ము మిగులఁ గూడి మాడి యుండమికి. హంస. ౫. ౫౨.

ద్వి ... మునులకు ఖడ్గకూఁటీర,కోదండశరముల

గొడవ యేమిటికి. ౪౦. రా. కిష్కి. ౧౯౭ పా. ౨౯ పం.

౨. కయ్యము, యుద్ధము; కలహము, తంపి.

సీ. గొడవ బవరము జగడ మాల మని యన యుద్ధ వాచకములై యొప్పుచుండు. ఆం. భా. ౨. ౨౨౨.

(నారదుఁడు) సీ. పూసిగొండితనానఁ బోయి యె వ్వరికైన గొడవలు కావించుకొండెగాఁడు. వరాహ. ౯. ౨౬.

3. అశుభము, కీడు.

గీ. మేలు గలవాఁడు మఱియుచు మెసవ నేర్చి, గొడవలాదవడుతతిఁ బోవ విడువఁ దగునె, తలఁప ననుజులయెడయఁడై తనరుమగని, వె రసెజింగినవాడెంపువెలఁదుకలకు.అచ్చ. రా. అయో. ౭౧.

౪. ఆపద, ఇడుమ.

క...ఇత్తతి వగునిమిత్తములు నృప,కొఱగా విడ మనకుఁ బెద్దగొడ వగు ననినన్. మనుచ. ౪. ౬౩.

౫. దుఃఖము, బాధ, పీడ.

గీ. మొదలివెన్నుఁడు పంటలముగుఁగొడవ, లు డుపుకొఱ కిర్లగొంగవంగడమునందు, రాముఁ డై పుట్టె...అచ్చ. రా. యు. ౧౯.

క. చంచలలోచన యెం దరు, దెంచెనొ నను గానలేక దృఢబలవిలస, త్పంచశరనిశితవిశి ఖా,కుంచితహృత్కమల యగుచు గొడవలు బెరయన్. రసిక. ౬. ౪౪.

౬. దోషము, తప్పు.

చ.అడుగక కాని డాఁచినపదార్థము లిచ్చుట నీతి గాదు నీ,వడిగితి కాన నిప్పుడు సమర్పణచేసితి నింక నాయెడన్, గొడవలు లేవు ... వి. పు. ౬. ౩౩౯.

౭. అల్లరి.

(వ్యవ)ఇక్కడ గొడవ చేయవలదు. పామ్య.

౮. కలఁత. (శ. ర.) ౯. అడ్డి, నిరోధము.(శ.ర.)

జ: గొడవగొట్టు.

గొడవగొట్టు. విశే. (గొడవ+గొట్టు²) గొడవ చే యుస్వభావము గలవాఁడు.

ద్వి. గొడవగొట్టులు ముడివిడుపులు చాల,గడున దుల్ కయ్యంపుఁగ్రచ్చలు ... వారవనితలు ...పండితా. పురా. ౧౧౬ పా.

గొడారి=గొడగరి.

ద్వి. మాలకు మాంసంబు మఱి గొడారికిని,డోలును సన్నట్లు...బస. పు. ౪. ౧౦౦ పం.

గొడిగ. వి. గులకతాయి. (శ. ర.)

గొడియ(డె). వి. ౧. అందలముయొక్క ఒకానొక యవయవము.

సీ. సింహలలాటంబు జీవదంతంబులగొడియలు... దశా. ౭. ౧. ౨౯.

సీ. ఉదిరికంకణము లింపొసఁగుదంతపుగొడెల్ న యము మించినముసనాబు పడము. రా.వి. ౨. ౪౩. చంద్రా. ౩. ౬౭.

౨. నేరము చేసినవానిచేతులకు వేయుబంధన సాధనము.

సీ. వీరభద్రారెడ్డివిద్వాంసుముంజేత వియ్యమందె ను గదా వెదురుగొడియ. వీథి. ౪౭.

కోలాటగొడియలు=కోలాటపుకఱ్ఱలు.

ద్వి. నీలరుద్రులు హరికోలెమ్ము లెలమిఁ, గోలాట గొడియలకొమరున నేయ. పండితా. వాద. ౨౩౯ పా.

గొడిమె. వి. ఇడుమ, కష్టము.

చ. అరదము డోలి వింట గొనయుంబు దవిల్చి మె ఱుంగుటమ్ము ల,బ్బరముగఁ బూన్చి యాయ్యు ఱియబంటులనిద్దపుమేను లెల్ల నా,విరి నలి యంగ నేసి గొడిమె ల్పెరయించిన సైంప నో పక,బ్బిరుదుమగల్ పడిం బఱపుపెట్టఁ దొడం గిన నంగదుం డొగిన్. అచ్చ. రా. యు. ౧౭౯.

క. అడవులఁ బదునాల్గేఁడులు, గోడిసెల కోడిగట్టి సాఁకుకొంటివి మమ్మా,బడలిక నిపు డిజ్జగడ పుఁ,బుడమిం బవళించి నిదురవోయితో తండ్రీ. అచ్చ. రా. యు. ౩౯౩.

**గోడిసె.** వి. ౧ (=గుడిసె[1].) పండినచింతకాయలో ఒకగింజ యుండుభాగము.

(వ్యవ) ఒకగోడిసె తీసి నోటిలో వేసికొని రుచి చూచినాను. ఈచింతపండు చాల రుచిగా నున్నది.

౨. చింతకాయ.

క. ఉడుపతి తనలో నమృతము, గడలుకొనియుఁ బెక్కు చవులు గానక కృశుఁడై, విడిచినకళ లన్నియు నీ,గోడిసెలరూపమునఁ జింతఁ గొలుపగఁ బోలున్. ద్వా. ౩. ౧౫౯.

**గోడుగు(వు).** వి. (క. కొడె. త. కుడై. మ. కుట)

౧. ఛత్త్రము, ఆతపత్త్రము.

సీ...గొడుగన గొడుపన ఛత్త్రాఖ్య యడరుచుండు. ఆం. భా. ౨. ౧౯౩.

క. జడి దాఁకి వడఁకుపసులకు, గొడుగుగ దివసంబు లేడు గోవర్ధనమున్, వడిఁ బెఱికి యట్లు దాల్చిన,కడిఁదిబలం బరయ హరికిఁ గలరే సదృశుల్. హరి. ఉ. ౪. ౨౩౭.

సా: ఏయెండ కాగొడుగు పట్టుట=సమయానుకూలముగా సంచరించుట.

౨. పాపకోళ్లు బొంగరము మున్నగువానికి గొడుగువలె నుండుగుబ్బ.

వ...అబ్బోటి హాటకమయం బైనగొడుగుపావలగిలకలు గులకరింప... భీమ. ౨. ౧౨౭.

క. అసమలసమానబిసరుహ, విసరలసద్ధూళికలితవిభ్రమదావ, ద్రసముదయం బానదిలోఁ, బొసఁగుం జలచరులగొడుగుబొమ్మరము లనన్. శుక. ౩. ౩౨౫.

౩. హస్తతలమం దుండుఛత్త్రాకారరేఖావిశేషము.

గీ. వసుధలో నెట్టిశ్రీ గలవారి వేని,కరభములు దాస్యములు చేయు సరసిజాక్షి, యూరువుల కట్లటన్నఁ బైఁ దాయు మోము, గొడుగులును నల్లకలశముల్ గుఱులు కావె. ఆము. ౫. ౩౧.

౪. కోటకొమ్మలు మున్నగువానిపై కట్టఁబడినగొడుగువంటికట్టడము.

ద్వి. క్రొత్తడంబులఁ గోటకొమ్మల గొడుగు, లెత్తించి...బస. పు. ౩. ౫౦౪ పం.

జ: గొడుగుగడ్డి, గొడుగుబల్ల, గొడుగుమెట్టెలు.

**గొడుగుగడ్డి.** వి. (గొడుగు+గడ్డి) గ్రుడ్డికామంచి, అతిచ్ఛత్త్రము ?. (శ. ర.)

**గొడుగుబల్ల.** వి. (గొడుగు + బల్ల) తలుపుమీఁది కుబుసము తిరిగెడుపట్టె. (శ. ర)

**గొడుగుమెట్టెలు.** వి. బ. (గొడుగు + మెట్టెలు) వాటును పెట్టి ఓరలు సన్నగాఁ దీర్చినవెడలుపు మెట్టెలు. (శ. ర)

**గొడ్డ.** విణ. బిఱుసైనవాఁడు.

ద్వి. ఘుటికసిద్ధుఁడు తాయికొట్టినగొడ్డ,యటుమటు కాఁడు మహామాయలాఁడు. ద్వి. హరిశ్చ. ఉ. ౬౪౭ పం. (శ. ర.)

వి. బిఱుసు. (శ. ర.)

బ. బిఱుసుమాటలు,స్వోత్కర్షము తెలుపుమాటలు.

ద్వి. తర మెఱుంగక నీవు తఱుముగా నిట్లు, గురువుఁ దుటారించి గొడ్డ లాడెదవు. ప్రభు. ౩. ౭౪ పా. ౭ పం.

గీ. నాఁడు నేఁడును దమ కీడు లేఁ డటంచు,గొడ్డ లాడును రొండొరు లొడ్డు లేక. రా. వి. ౧. ౫౪.

జ: గొడ్డతనము.

**గొడ్డగము.** వి. దుండగము, దుశ్చేష్ట.

గీ. స్వామి గుడియుంచి పెక్కుయజ్ఞములు సల్పి, భూమిప్రజ లెల్ల నిండ్లు పోతరమున, గొడ్డగము లిట్లు చేయంగ నడ్డపెట్ట, రాక బ

హునాయకం బర్యో నాకపురము. వరాహ. ౧౦. ౧౫.

విణ. బాధకము.

క. గొడ్డగపుజరావ్యాధుల,కడ్డ మగుక్ మృత్యు దుఃఖహర మై మిగులక్,దొడ్డగు ముక్తిసుఖద మగు, నొడ్డాణపుబంధ మెలమి యోగీంద్రుల కున్. శివయో. ౩. ౭౮.

గొడ్డతనము. వి. (గొడ్డ+తనము) బిఱుసుఁదనము.

సీ. మఱచిరే సత్యభామాముఠారుల బండిగొడ్డులఁ జేసినగొడ్డతనము. చంద్ర. ౩. ౧౭.

గొడ్డలి. వి. ప్రా. (సం. కుఠారః.) ౧. చెట్లు మున్న గువానిని నఱకెడిసాధనము.

క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ, బొడువఁ దగినమ్రా నఁ జిగురు వొడము...భార. ఉద్యో. ౨. ౬౧.

గీ...తగుం గుఠారము గొడ్డలి యన. ఆం.భా.౨. ౨౧౬.

సీ. పిడుకకుంపటు లాకుతెడికలు ప్రోఁగుఁద్రా ళ్వాఁడిగొడ్డండ్లు మవ్వంపుటురులు.శుక. ౧. ౧౬౫.

౨. పరశువు, గండగొడ్డలి.

చ.పాలుపుగఁ గొండకట్టెలకుఁ బోయెడివానివిధం బు దోఁప గొ,డ్డలి యిది యేమి దీన జగడం బొనరింపఁగ వచ్చితే ఖళీ,ఖలి భృగురామ ...దశ. ౬. ౧౧౯.

గొడ్డు[1]. వి. (క. గొడ్డు.) ౧. గొంజ, సంతతి లేని యావు.

సీ. గొడ్డన పంజ నా గొంజ నా వంధ్య యా... ఆం. భా. ౨. ౨౬౩.

వ. ఆఁబోతుపంచితంబు మూర్కొనినను బై గాలి వీచినను గొడ్డున కైనం జాలు నిలుచు ... భార. విరా. ౧. ౨౯౬.

౨. గొడ్రాలితనము.

మత్త...నిను మేదినీ,గుప్తి కై కని యెట్టకేనియు గొడ్డు వీఁగిరి వంచు నే,సప్తవింశతివత్సరం బులు సంతసంబున నుండితిన్.భా.రా.అయో. ౭౩.

గీ. గొడ్డు వీఁగి కనియెఁ గొడుకు నెంతయు మూ ర్తిమంతు నెలఁతలందు మహితభార్య, యొ క్కటియ యశోద యుర్విపై ననుమ త్రే, పల్లెఁ బొగడి రెల్లపడఁతుకలును. హరి.పూ. ౫. ౧౬౫. కాశీ. ౪. ౮౭.

విణ.౧.వంధ్య,సంతతి లేనిది.(స్త్రీ,పశువు,మొ.)

ఉ...నాయెడఁ దప్పుఁ బట్టదు మనంబున నాసతి గొడ్డు గావునన్. వి. పు. ౬. ౨౨౧.

క. ఒడ్డును బొడువును రూపును,దొడ్డతనము గలి గి ప్రజతో మెలఁగని యా,బిడ్డను గనుకంటె ను సతి,గొడ్డైనను మే లనంగఁ గుందుట గలి గెన్. ద్వా. ౮. ౧౩౬.

౨. ఫలింపనిది. (చెట్టు, మొ.)

గీ...వంధ్యసంజ్ఞ, యగును గొడ్డన... ఆం. భా. ౨. ౩౫.

౩. ఫలము లేనిది, ప్రయోజనము లేనిది.

ఉదా: గొడ్డుమాటలు.

౪. కావలసినయితరవస్తువులు లేనిది.

ఉదా: గొడ్డన్నము, గొడ్డంబలి.

౫. శూన్యము, వట్టిది.

ఉదా: గొడ్డేఱు=నీళ్లు లేనియేఱు. (వ్రా, శ. ర.)

జ: గొడ్డుఁగాఁకర, గొడ్డుఁబోతు, గొడ్డురాలు, గొడ్డువోవు, గొడ్డేఱు[2], గొడ్రాలు.

గొడ్డు[2]. వి. పశువు. (ఆవు, ఎద్దు, మొ.)

ద్వి. ఎండినమ్రాఁకుల నిగురులు వొడమెఁ, గుండ నిండఁగఁ బాలు గొడ్డులు పితికె. ప్రభు. ౨. ౪౧ పా. ౧౩ పం.

సీ. అనివిలాపించ నూరార్చి యేటికిఁ గ్రేపుఁ బా సి గొడ్డొఱలెడిపగిది వడలె,దు...జై. భా. ౬. ౨౬౫.

గీ. అహహ ముదిగొడ్డు నెక్కి భిక్షాటనంబుఁ,

చేయఁ బోవుట యదియు మేల్పాటు చుమ్మీ. హర. ౪. ౨౭.

చ. మడఁగి పడుండఁ బ్రాసులకమంచపుఁగుక్కకి నిల్వ వెల్లువుల్గడి పెకు నొండు రెం డేనుద గొడ్లకు నోరికిఁ బోఁక వ్రక్కకుఁగా, గుడు వఁగఁ గూటికి న్నాలకుఁ గోకకు సీదిరము... వేం. పంచ. ౧. ౪౩౩.

గొడ్డుఁగాఁకర. వి. (గొడ్డు[1] + కాఁకర.)-గొడ్డు తనమునుపోఁగొట్టుకాఁకర-వంధ్యాకర్కోటకీ. (సాల. ని. ౪౬౭ పా. చూ)

గొడ్డుఁబోతు. విశే. (గొడ్డు[1] + పోతు[2]) ౧. పిల్లలు లేనివాఁడు;పిల్లలు లేనిది;కాపు లేనిది,ఫలింపనిది. ఉదా:- గొడ్డుఁబోతువాఁడు, గొడ్డుఁబోతుది, గొడ్డుఁబోతు చెట్టు, మొ.

౨. అప్రయోజకుఁడు. (శ. ర.)

గొడ్డురాలు=గొడ్రాలు. వి. దే. (గొడ్డు[1] + ఆలు) వంధ్య యగుస్త్రీ.

చ...గొడ్డురాలి కిల నెక్కుడిమోహము లెంచి చూడఁగన్. సారంగ. ౩. ౫౦. ప్రబంధ. ౭౬౦.

గొడ్డువోవు. అ. క్రి. (గొడ్డు[1] + పోవు) ౧. గొడ్రా లగు.

క. అని చదివి లవుఁడు రాఘువ, మనుజేశునితల్లి వీరమాతఁట సీతా,జనని కుశలవుల నిరువురఁ, గనియు నకట గొడ్డువోయెఁ గడపట ననుచున్. జై. భా. ౬. ౧౧౫.

౨. పౌరుషహీనుఁ డగు.

వ...వీర లందఱును గొడ్డువోయినవారలు పౌరుషంబు గలవానిని యిం దెవ్వఁడు ...భార. ఉద్యో. ౧. ౩౫౨.

చ. మును మము గొడ్డువోయి రని ముష్కరతం జెడనాడినట్టిమ్లేచ్ఛుల ... భార. శల్య. ౨. ౨౭౫.

౩. వ్యర్థ మగు.

చ...వీఁగ బట్టి క్రొవ్వునఁ బరిమార్పఁ జేసిన యుపాయము లన్నియు గొడ్డుపోయె. నృసిం. ౪. ౧౩౫.

౪. సృష్టిలేక యుండు, ఉత్పత్తి లేని దగు.

గీ...సప్తార్ణవములు,నిండుకొని యుండఁగా రిత్త నింగిలోడఁ, గొంతకాలంబు శూన్య మై గొడ్డువోయె. శివరా. ౧. ౫౧.

గొడ్డేఱు[1]. స. క్రి. గుత్తకు తీసికొను, గుత్తయెత్తు. (బ్రౌ.శ.ర-దీనికి క్త్వార్థమందే ప్రయోగము కనఁబడుచున్నది.)

గీ. బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి,నెట్లు చెల్లింతుఁ డంకంబు లేమునూర్లు. వీథి. ౪౭.

గొడ్డేఱు[2]. విశే. వ్యర్థము. (గొడ్డు[1] + ఏఱు?)

వ...రాకుండె నేని నేమును నీమువలి యున్నయుంగుమత మటుగాక యొఱగొడ్డెంబులు వలికి నీవడ్డపాటు గొడ్డేఱు గా బిడ్డువఱుపం గలవారమె...హర. ౨. ౧౩౨.

శా...బిడ్డలు లేనియీబ్రతుకు గొడ్డే ఱయ్యెఁ జింతింపఁగన్. కవిక. ౧. ౩౭.

క్రి. విశే. ౧. వ్యర్థముగా.

గీ.... చెలియలికి నాకు గొడ్డేఱు కలఁక వుట్టె. క్రీడా. ౨౯౭. ప్రథ. ౭౩ పా. ౫ పం.

౨. దిక్కులేకుండఁగా.

క. ఒడ్డారించి విషంబున,కడ్డము చనుదెంచి కావ నధికులు లేమిన్,గొడ్డేఱు మ్రందిరా లన,బిడ్డన నెడ లేక జనులు వృక్ష్వినాథా. భాగ.౭. ౨౧౭. (చి. ని. పా)

గొడ్డేఱు[3]. వి. ఒకయడవి చెట్టు. (చి. ని.)

గొడ్రాలు=గొడ్డురాలు.

సీ. యతి మాతకమ్మ గొడ్రాలు దీక్షావతిని మగనిఁ
బాసినయింతి మరునిపాలు. నైష. ౭. ౧౩౭.

శా. గొడ్రాలైనవధూటి జన్మ మది పేర్కోఁ – నిష్ఫలం బిమ్మహిన్. వైజ. ౧. ౬౩. ఆం. భా. ౨. ౧౦౬.

**గొణఁగు**=గొడఁగు.

(మాట వెడలనీక నోటనే ఉచ్చరించు.)

సీ. పిలిచి పెట్టనివన్యభిక్షు గైకొనువాఁడె కోరి
పెట్ట రటంచుఁ గొణఁగ సాగె. కువల. ౨. ౫౪.

ఉ... నాథు లో, లోన గొణంగి తిట్టుచు... చెన్న. ౨. ౪౬.

గీ. నోర జగములమెకిమాని పేరు సారె, గొణఁగు
చును వచ్చె జగడంపుఁగూటితపసి. అచ్చ. రా. యు. ౧౫౪.

**గొణగ**=గొడగ. వి. ఏడికోల లేనినాఁగలి. (శ. ర.)

**గొణగొణ**. వి. గొణఁగుటయం దగుధ్వనికి అనుకరణము. (శ. ర.)

జ: గొణగొణలాడు.

**గొణగొణలాడు**. అ. క్రి. (గొణగొణలు+ఆడు) గొణగొణయను. (శ. ర.)

**గొణిపే**=గొణిప. (శ. ర)

**గొణిప**. వి. తలుపుగ్రంద తగిలించుటకై దారబందము లోనగువానినిఱువులయందు బిగఁగొట్టినచీల. (శ. ర–గొడిపె. వా)

**గొతుపు**. వి. నీలమణివిశేషము.

సీ. కప్పురా లనఁగను గనుపట్టు నీలము గొతుపు
వాఁ డద్భుద మతిశయిల్లు. ఆం. భా. ౨. ౧౭౮.

**గొత్తు¹**. వి. (సం. గుచ్ఛః.) గుత్తి. (ప్రా. చి. వి.)

గీ. జలరుహము పుష్పగొత్తులు షట్పదాళి, లవలిన
ళములఁ జూపెతో యిని సహింప, నవ్యనవ
తాంగతులితంబు లౌటఁ దావ, తాంగసమము
లుగామి నోహంసయాన. దశా. ౭. ౨. ౬౫.

**గొత్తు²**. వి. ౧. క్రమము, వరుస. ౨. నిశ్చయము. (బ్రౌ)

**గొత్తు³**. వి. పాసిపోయినవెన్న పాలు మొదలగువానికంపు. (బ్రౌ, శ. ర.)

**గొద¹**. వి. (సం. క్షుధా. ప్రా. ఖురా. త. కుర్తె) ఆఁకలి, క్షుత్తు.

సీ. ఆఁకలి యన గొద యనఁగ నాకొంటు నాఁగను
క్షుత్తుపేరు గాఁ దనరుచుండు. ఆం. భా. ౨. ౨౬౦.

జ: గొదగొను¹.

**గొద²**. వి. (క. గొద) ౧. అతిశయము. ౨. త్వర. (చూ. గొదగొను².)

జ: గొదగొను².

**గొదగొద**. వి. వగ, విరోధము.

క. నా విని విహగము లను నయ, కోవిద యారంటి
కేల గొదగొద పొడమెన్, జా వేల వచ్చె నో
తువు, చే వానికి నింతపట్టు చెప్పుమా తెలి
యన్. వేం. పంచ. ౩. ౯౯.

**గొదగొను¹**. అ. క్రి. (√గొద¹) ఆఁకలిగొను.

సీ. కోల్పులి వీఁక మై గొదగొని రేల్లకు నుఱుకు తె
అంగునఁ దతియుఁ జొచ్చి. భార. ఉద్యో. ౨. ౧౩౯.

ద్వి. అలమట చేతఁ జిత్రాంగి రావించి, గొదగొన్న
పులివలెఁ గోలుపుకూటంబు, వదరంగ బిట్టు
అం తడరఁ గోపమునఁ, గాంతను జూచి భూ
కాంతుఁ డిట్లనియె. ద్వి. శ. సా. ౩. ౧౦౧ పా. ౧౨ పం.

క. గొదగొని సారంగంబుం, బొడివినసింగంబుక
రణి... హరి. పూ. ౯. ౧౩౯.

**గొదగొను²**. అ. క్రి. (√గొద2) ౧. విజృంభించు అతిశయించు; చెలరేఁగు.

క. కదిసినబలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగ
నీక గాండీవి వెసం,బొదివి యటు గడపె నవి
యును, గొదగొని తమపాలము సొచ్చె గోపా
లురలోక. భార. విరా. ౪. ౨౭౧.

ఉ...చనుదెమ్ము లె మ్మనక్, హ్రీగరిమంబు వాపు
చు నోకించుక లేవఁగఁ బూను మాను నా,లో
గొదగొన్న సిగ్గునఁ జెలుల్ బలిమిం దను దివ్వఁ
గోరుచుక్. కళా. ౭. ౧౧౭.

క. ఒదవినకినుకం గొదగొని, గదగొని హలధరుఁ
డు రథముకండ్లును నొగలుక్, జదిపి పతాక
యు సారథి,విదారణముచేసి మిన్ను ప్రీలఁగ
నార్చెక్. ఉ. హరి. ౪. ౨౪౬.

౨. త్వరపడు.

వ... రేయింటియాకఁటిపెల్లున గొదగొని కమిచి
చంచువులం దిగిచి త్రుంచి యానుచు... భార.
విరా. ౨. ౨౪౦.

**గొదగొను**[3]. స. క్రి. వహించు, తాల్చు.

సీ...పూనెఁ దాల్చెఁ దొడిగె మోచె నాఁగఁ.
గీ. దార్చె నా గొదగొనె ననఁ దనరు నా వ,హిం
చె ననుమాట గా... ఆం. భా. ౩. ౧౧౯.

**గొనకొను**. (చి. ని, బ్రా.) అ. క్రి. ౧. ఉద్యమిం
చు, పూను. (ఈయర్థమున 'కొనకొను' అనురూ
పము గూడ శ. ర. లో కలదు.)

క. తనబలము నెదిరిబలమును, మనమునఁ జింతిం
ప కరుల మర్దించుటకై, గొనకొనినవాని కొ
ప్పమి, జనియించుట తప్ప దండ్రు శత్రుని
కైనక్. నా. పంచ. ౩. ౪౬.

చ...సధర్మవృత్తికిం, గొనకొనఁ డేని... భార.
శాం. ౬. ౨౪౩. విక్ర. ౨. ౧౩౦.

౨. సమ్మతించు.

చ. జనవముఁ జెప్పి యేఁ దెలుప సత్యము నమ్మర
తుంతిభాషణం,బని తనుజత్వజాతకృప నంబు
జమిత్త్రుఁడు పల్కె నేమిటం, గొనకొన నేరఁ
డయ్యో నినుఁ గూడ సుయోధనుఁ బట్టి యట్టి
కర్ణునకయి నీకు నేటికి మనోవ్యథఁ బొందఁ
గ నిట్లు పుత్రకా. భార. శాం. ౧. ౩౯.

౩. అతిశయించు.

ద్వి. గొనకొన్న ప్రేమమైఁ గొలువు చాలించి. రం.
రా. అర. ౧౭౦ పా. ౩ పం.

చ...ధ్వనుల్, గొనకొని పర్వ ... హరిశ్చం. ౩.
౯౮. రం. రా. ఉ. ౨౩ పా. ౧౭ పం.

౪. నెలకొను.

చ. గొనకొని యమ్మహాత్ముఁడు వికుంఠపురంబున
నున్నవాఁడు...భాగ. ౩. ౬౨౨.

రగడ. కుంభకోణమున గొనకొని కదలనిశార్ఙ్గధరు
నుపాసనచేసెద...హంస. ౪. ౨౧౩.

౫. తటస్థించు, సంభవించు.

ద్వి. పెను పొందఁగా సామభేదదానములఁ, గొన
రానికార్యంబు గొనకొనె నేని,మఱి గదా దం
డంబు...రం. రా. యు. ౨౮౯ పా. ౧ పం.

౬. ఇది కొన్నిచోట్ల క్త్వార్థకరూపముతో వా
క్యాలంకారముగా నుండును.

చ. గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనం
దనుండు చే,కొని భరియింపుము ... భార. ఆ
ది. ౪. ౧౦౪.

చ...గొల్లఁడుం,గొనకొని ముద్దుఁగన్నియకుఁ గో
రినయట్టిమగండు గల్గె నం,చును దనయాలుఁ
దాను నెదఁ జొక్కుచు నుండె ... నీలా. ౧.
౧౦౦.

చ. గొనకొని శోకవేగమునకుక్...భా.రా. యు.
౧౫౫.

జ: గొనకొలుపు.

**గొనకొలుపు**. స. క్రి. (√గొనకొను)
(పురికొల్పు, ప్రేరేఁచు)

క...విక్రమమునకుం, గొనకొల్పి తిట్లు వీరల...
భార. ఆశ్ర. ౧. ౧౬౧.

**గొనను**=గొనప[2]. ఆం. భా. ౨. ౧౨౩.

గొనప[1]=గొనము. వి. అతిగినవాఁగేలు, జీర్ణలాంగలము. (శ. ర.)

గొనప[2]=గొనను. విశే. పొట్టివాఁడు, వామనుఁడు.

సీ... గొనను గొనప గొనిసె గునిసె గిఱుక తింగణా యనఁగను వామనాఖ్య దనరు. ఆం. భా. ౨. ౧౨౩.

ఉదా: గొనపకోడి. (శ. ర.)

గొనబారు. అ. క్రి. (గొనబు+ఆరు) మనోజ్ఞమగు, సొగసగు.

సీ.కోకనదాకృతి గొనబారె నీకొమ్మ స్తననాభిబిలములు చరణయుగము. రసిక. ౩. ౬౨.

సీ. గొనబారునూఁగారు కొదమతుమ్మెద బారు... నీలా. ౧. ౫౬.

గొనబు. విశే. ౧. మంజులము, సొగసైనది,

చ...గొన బగుముద్దుమోము సమకొన్న మెఱుంగులకట్లదండయుఙ్...శుక. ౩. ౧౦౫.

క...గొనబుసొమ్మెఱుఁగుంగరములు, చన వమరఁగ నిచ్చి...హంస. ౧. ౭౯.

గీ. గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటంబన వెలయు మంజులసమాఖ్య. ఆం. భా. ౩. ౧౪. నీలా. ౩. ౯౦.

౨. మధురము.

గీ. కుసుమరసమును గా దిది గొనబుజున్ను...శశాం. ౩. ౪౩.

౩. శ్రావ్యము.

గీ.గొనబుఁగోకిలరవములఁ గొంతసేపు.శశాం. ౪. ౬౭.

సీ. గొనబుఁబాటల నేర్పుఁ గుముదరసామోదసామోదమధుపసద్ధాంతసమితి. వసు. ౩. ౫౭.

౪. సురభి, పరిమళించునది.

సీ. గొన బైనకట్టుపున్నసను గోడలు వైచి మంచి గందంపుఁగంబములు నిల్పి. దశా. ౭. ౩౯.

౫. సొగసు, విలాసము.

సీ...గొనబు మురిపము ముద్దు సొగసు...హావ య లనఁగ విలాస మొప్పుచుండు. ఆం. భా. ౧. ౧౩౯.

జ: గొనకాడు, గొన బుకాఁడు.

గొనబుకాఁడు. విశే. (గొనబు+ కాఁడు) సొగసు కలవాఁడు.

క. ఎన లేనిగొనబుకాఁడా, పెనుమిసుకుందగలు వొగవుపేరిమివాఁడా. అచ్చ. రా. సుం. ౧౫౧.

గొనము=గొనప[1]. (బ్రా, శ. ర)

సీ...జీర్ణలాంగలసంజ్ఞ చెలఁగు గొనము. గీ. యనఁగ...ఆం. భా. ౨. ౨౩౨.

గొనము[1]. వి. (సం. గుణః) సౌశీల్యాదిగుణము.

చ. గొనముల ప్రోక నీయనుఁగుఁగూఁతురు దీనితలంపు మాన్పఁగా, మనకు నశక్యము...భార. అర. ౬. ౧౫౪.

సీ. జడదారిరాయ యిజ్జగమున నాడెంపుగొనమును వాఁడియుఁ గనికరమును. అచ్చ. రా. బాల. ౨౭. ఆం. భా. ౧. ౯౭.

గొనము[2]. వి. (సం. గుణః.) గొనయము, వింటినారి.

సీ...గొన మల్లె నారి నా గుణము పరఁగు. సాం. ని. మాన. ౪౪. (ప్రమాణాంతరము లేదు)

గొనయము. వి. (సం. గుణః.) ౧. వింటినారి, మౌర్వి.

క. అని నెస నాదివ్యశరం, బనూనమంత్రప్రకాశ మగునట్టులుగా, గొనయమునఁ జేర్చి తిగిచినఁ,గని యశ్వత్థామ బాహుగర్వం బలరఙ్. భార. ద్రో. ౩. ౨౦౪.

క...సింగిణి,గొనయుం బెక్కించి మిక్కుఁ గూరిచి కడిమిఙ్. అచ్చ. రా. బాల. ౧౧౪. ఆం. భా. ౨. ౨౧౧.

౨. ధనురగ్రము, గనయము, వింటికొప్పు.

సీ. ధనురగ్రగుణములు దను గొనయం బన...ఆం. భా. ౩. ౫౧.

గొనిసె=గొనెను. ఆం. భా. ౨. ౧౨౩.

గొనుగు=గొలుగు. వి. గుడఫలము. (శ. ర.)

గొప్ప. విశే. (కొల పరిమాణము మున్నగువానిలో) ఘనము, పెద్దది.

చ...పల్మఱుఁ గైకొని గొప్పతమ్మికెంపులు...నీలా. ౧. ౬౧.

సీ...కప్పులు గొప్పలు గలవు మ్రింగ. దశా. ౧. ౧౩౭.

సీ.గొప్పకన్నులవాఁడు కోదండగుణకిణాంకము లైనముంజేతు లమరువాఁడు. విజ. వి. ౨. ౧౬౪.

ఉదా:-అతఁడు అదృష్టమువలన గొప్పపదవికి వచ్చినాఁడు. వారికి గొప్పపాండిత్యము కలదు.ఆయూరిలో గొప్పపెండ్లి జరిగినది.ఆయనమనస్సు చాల గొప్పది.

వి. గొప్పతనము.

(వ్యవ) వాఁడు గొప్పకోసము తంటాలుపడుచున్నాఁడు.

జ: గొబ్బండు.

గొప్పెలు. వి. బ. ౧. మిరెపతోఁటమున్నగువానియందు కొంచె మెత్తుగా నుండెడుచోట్లు. (శ. ర.) ౨. గోపానసి, చూరుపట్టె. (చి. ని, శ. ర.)

గొబ. వి. (సం. గుహా. త. కెపి.) ౧. గుహ.

గీ. కలఁచునురవడిఁ బోడమునిబ్బరపుప్రోఁత, కొండగొబ లెల్లఁ జొచ్చి యొండొండ పెరుఁగు. హరి. ఉ. ౫. ౧౬౧.

౨. గొంది, మూల.

క. మార్జాలంబులు చెలఁగుమ, గర్జించెను గొబల నుండి...ఉ. హరి. ౫. ౩౬.

గొబడి. వి. పక్షివిశేషము, ఒకానొకపక్షి.

సీ. బిట్ట గొబడి డాబ బీనువ వడ్రంగి గున్నంగి ...ఆం. భా. ౨. ౯౯.

గొబ్బండు. వి. (గొప్ప+పండు) పెద్దపండు.

సీ. పాకవేగారంభపరిపాటిఁ దమయంతిఁ బగిలిన పనసగొబ్బండ్లచేస,ము...పాండు. ౧.౧౧౯. (శ. ర. పా.)

గొబ్బన=గొబ్బున. అవ్య. ద్రు. (త. గొబ్బెనల్)
(శీఘ్రముగా.)

చ. విని సరసీరుహాక్షుఁ డతివిస్మితుఁ డై జలకూన్యకూప మ,ల్లన కదియంగ నేఁగి కృకలాసము నొక్క తృణంబుఁబోలె గొ,బ్బన వెడలించె వామకరపద్మమునన్ ... భాగ. ౧౦ ఉ. ౪౫౬.

చ...శుభస్య శీఘ్ర మనుపల్కు నిజం బొనరింపుమన్న గొ,బ్బనఁ బతిచిత్తవృత్తి గని భట్టి...

క ... శుభలగ్నము నిర్ణయించి ... విక్ర. ౪. ౧౩౪, ౧౩౫. భోజరా. ౪. ౧౬౭.

గొబ్బరము. వి. (క. గొబ్బర.) ఎరువు, చేలకు వేసెడి పెంట. (బ్రౌ, శ. ర.)

గొబ్బి[1]. వి. (త. కొప్పి.) ౧. ధనుర్మాసదినములసాయంకాలములయందు గడపలకు ముందు బాలికలు పాటలు పాడి చేతులు తట్టుచు చుట్టివచ్చి జరిపించెడునొక వేడుక. (శ.ర.)

సీ...పొంగలికిఁ దేవలకును గొబ్బికిని...గీ...కొఱఁతపడకుండఁ గుండ లాకుమ్మరిచ్చు.హంస. ౫. ౧౪.

౨. సమర్తాడినపుడు బాలికలు పాటలుపాడి చేతులు తట్టుచు చుట్టివచ్చి జరిపించెడునొక వేడుక. (శ. ర.)

గొబ్బి[2]. వి. క్షురము, గొలిమిడి ౧. (దీనిపువ్వులు పచ్చగా నుండును.)

సీ...క్షురము విరాజిల్లు గొబ్బి యనంగను గొలిమిడి యన. ఆం. భా. ౨. ౫౬.

జ: గొబ్బికాయలు.

**గొబ్బికాయలు.** వి. బ. (గొబ్బి2+కాయలు) ధాన్యవిశేషము.

సీ. గొబ్బికాయలు బలుగుత్తులు పాలమీఁగడలు శ్రీరంగాలు...గీ ...అవియగు పేళ్లు గలుగు వడ్లు...హంస. ౪. ౧౭౮.

**గొబ్బిలి.** వి. ఉపయోగము లేని ఒకానొక చెట్టు. (ప్రా)

**గొబ్బిళ్లు[1].** వి. బ. ౧. బాల్యక్రీడావిశేషము.

సీ. కుప్పిగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు. గీ ... ఆదిగా శైశవ క్రీడలాడి రచట, రామకృష్ణులు...వి. పు. ౭. ౨౦౨.

సీ...బొమ్మరిండ్లు గుజగుజరేకులు గొబ్బిళ్లు... హంస. ౫. ౧౫౫.

(పీనుఁగు)మ...పులులం గారెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచున్, గొలఁకు ల్సొచ్చి కలంచుచు న్గిరులపై గొబ్బిళ్లు గోరాడుచున్. భాగ. ౮. ౩౫. (గొబ్బిళ్లుకోరాడు=గొబ్బిళ్లవలె-బాల్యక్రీడావిశేషమువలె-కోరాడు అని తోఁచుచున్నది. శ. ర)

౨. ఒకానొకపాట.

సీ. బెసకునందములు గొబ్బిళ్లపాటలు కొప్పు సవరించు నేర్పు చేసన్నవగలు. శుక. ౨. ౪౩౩.

ద్వి. చెలఁగి వీనులఁ గేలు సేర్చి గొబ్బిళ్లఁ, బలుతెఱంగులఁ గూడి పాడెడువారు. అ. మ. క.౨. ౮౪ పా. ౩ పం.

**గొబ్బిళ్లు[2].** వి. బ నమస్కారభేదము.

సీ... మ్రొక్కు దండము కేలుమోడ్పుఱఁగుకు, నాఁగఁ జెన్నొందును నతి తద్విశేషముల్ చేవిప్పు వెన్నెలచిన్ని పువ్వు,జోహారను జోహార జోడాలు చెంగనాల్ డింగిళ్లు గొబ్బిళ్లు డెంకణాలు....అం. భా. ౨. ౧౭౫.

రగడ. వజ్రపురిని దావలపై చిక్కన, గోవప్రియునకు గొబ్బిళ్లనుచును. హంస. ౪. ౨౧౩.

**గొబ్బున=గొబ్బన.** అవ్య. దు. ౧. శీఘ్రముగా.

సీ. తతవయోవిభవ కీలతకూన కాసన్న పున్నాగవిహృతి గొబ్బునని యబ్బు. వసు. ౨. ౫౯.

మ...లే లె మ్మటం,చమితోత్సాహము మీఱ నెత్తె సురరాజ్యశ్రీసమాకర్షణ,క్రమపాండిత్యకలాపిచండిలభుజాకాండంబులన్ గొబ్బునన్. దశా. ౨. ౧౨౪.

సీ. జడితి గొబ్బున వేగ నరగు గ్రక్కున వడి వేగిర మనఁ దగు వేగమునకు. సాం.ని.మాన.౨౧.

౨. అకస్మికముగా.

ఉ...ఘృత మతిమాత్రఁ బోసినన్, గూరికి కూర్కి యాక్షణము గొబ్బున మండినదీవమో యనన్. నైష.౩. ౧౧౬.

సీ. మఱుఁగువెట్టక డెంద మెఱిఁగించు కైవడి గొబ్బునఁ బయ్యెదకొంగు సడల.విక్ర.౧.౧౨౨.

గొబ్బుగొబ్బునన్=అతిశీఘ్రముగా, వేవేగ.

గీ. గొబ్బుగొబ్బునఁ దలలెత్తి కొండ ఱంపుఁ,జాడఁ జూడంగఁ బాగలు వీడి పడిన... సారంగ. ౧. ౧౨౩.

**గొమలిరేకు.** వి. మొగలిరేకు. (మొగలి-వర్ణవ్యత్యయముచే 'గొమలి'అయినదా?)

గీ. జాణవిప్రుండు సిగఁ దాల్చెఁ జందమామ, కొండనాలుక యగునొక్క గొమలిరేకు. క్రీడా. ౧౭౬.

**గొయి=గోయి.** (దీనికి ప్రథమైకవచనమందే ప్రయోగము.)

చ...అతఁడప్పుడు ముందట నుయ్యి వెనుకలోఁ, తగుగొయి యున్నలా గయినఁ దల్లడమంద వణంకు మేనితోన్. విక్ర. ౩. ౮౧.

**గొయ్యి=గోయి.** (దీనికి ప్రథమైకవచనమందే ప్రయోగము. ఇది 'నుయ్యి'వంటిది)

**గొరక¹.** వి. (సం. ఖురాలకః.) ౧. ఇనుపబాణము, అమ్ము.

గీ...ఒక్క-, యొంటిగాని మహీనాథుఁ డొడిఁగి యేయ,గొరక మే నుచ్చి ధరఁ గాఁడ శిరము విసరె,లే దస్పృశ్యాన మనుచుఁ దల్పెడు నసం గ. మనుచ. ౪. ౪౭.

సీ. చిన్న సేజయు నమ్ము చెలఁగును గొరక నా... ఆం. భా. 3. ౪౪. మనుచ. ౨. ౬౧.

౨. చిన్నయీఁటె.

క...రాజు...ఉరస్థలి నపుడా పిడికిటిగొరకఁ వేయం, బిడికిటి బి ట్టొగసి బిల్లవిరాటుగఁ బడి యెన్. సారంగ. ౧. ౯౬. ఆం. భా. 3.౪౪.

జ: గొరకకట్టె.

**గొరక².** వి. (సం. ఖురాకః.) మృగవిశేషము. (శ. ర - కారెనుము, వనమహిషము. బ్రౌ.)

**గొరక³.** విశే. చింపిరి ?

వ. వికృతముఖంబును గొరకవెండ్రుకలును మిడిగ్రుడ్లును...జాహ్నవీ. ౪. ౨౦.

ఆ..గొరకవెండ్రుకలును గుఱుచచేతులు నయ్యెఁ, దరుణులకుఁ బిశాచతనువు లాదవె. పద్మ. 3. ౧౯౯.

**గొరకకట్టె.** వి. (గొరక¹+కట్టె.)అలుఁగు గలచేతికఱ్ఱ. (శ. ర. చేతియీఁటె,చిన్నయీఁటె-బ్రౌ)

**గొరగ.** వి. (క.గొరగ=శైవభిక్షువు.) ౧. మైలారు అను క్షుద్రదేవతను గొలిచెడియొకానొకమతము వాఁడు; అమతముది.

సీ. గొరగయై మైలారుఁ గొనియాడు నొకవేళ నొసలిపై బండారుపనుపుఁదాల్చి. కాశీ. ౭. ౨౩౦.

గీ. వీరమైలారుదేవరవీరభటులు, గొండ్లియాడుచు నున్నారు గొరగపడుచు, నాడుచున్నది చూడు మర్థాభినయము, తాను సెట్టికసీలంత గాని లేదు. క్రీడా. ౧౪౩.

౨. భిక్షుకుఁడు.

క. పులిమాడుతిండిగొరగం, గలిచియు నోచెల్ల యింత గల్పించెదు ... కు. సం. ౩. ౧౩౪, ౧౬౯.

3. శివభక్తుఁడు.

ద్వి. గొరగ లుమ్మెత్త పత్తిరిఁ బూజసేయ, మరుతెత్తి వచ్చితో యూరుతరాటుఁకి. బస. పు. 3. ౬౪౫ పం.

(శివభక్తుఁడగురాజుశివమును చూచి మసిఁడి చాదయ్య అన్నమాటలు.) ద్వి. డిగుడిగు గొరగ నా కగపడి తింక. బస. పు. ౫. ౪౪౭ పం.

**గొరగొర.** వి. వేగము. (శ. ర)

క. ఇరుపంకలఁ దన్నుఁ బొదివి, గొరువంకలుఁ దుమ్మెదలును గోయిలలుం డక్కరిచిలుకలుఁ బురిపులుఁగులు, గొరగొర రా మరుఁడు వెడలెఁ గొమ్మఁ గలంపన్. నీలా. 3. ౧౧.

సీ. గొరగొరఁ బరువిడి...రసిక. ౧. ౧౧3.

**గొరజె(జ్జె).** వి. కాలిత్రోవ. (బ్రౌ)

**గొరమ.** వి. మిట్ట.

ద్వి... వాఁగుల మడులఁ బల్లముల, గొరముల మడుఁగులఁ గొండలవరిని. నవనాథ. ౪౬.(బ్రౌ)

**గొరవంక**=గోరువంక.

సీ...శారికాఖ్య,గోరింక గోర్వంక గొరవంక గోరంక గోరువంక యనంగ మీఱుమంకు. ఆం. భా. ౨. ౧౯. (వ్రాతప్రతిపా.)

క. గొరవంకయాసమాటల,మరువంకఁ దలంకు గలిగె మగువకుఁ దములో,వెర వింక నేమి కలదని, యిరువంకలఁ బొగిలి రప్పు డెంతయు వంతన్.విక్ర.౭.౬౧. (గొరువంక...వెరువింక. శ.ర.పా) విక్ర. ౭. ౪౯. యయా. ౨.౨౪.

జ: గొరవంకరాజనాలు.

**గొరవంకరాజనాలు.** వి. బ. (√ గొరవంక) ధాన్యవిశేషము.

చ. ...సుఖభోగులు పన్నసూదులు గొరవంకరాజ
వాలు కాటుకరేకులు ... ప్రబంధ. ౧౧౨.

**గోరిజే**=గోరిసె.

చ. గోరిజలత్రొక్కుడం బ్రిదిలి కుండలిభర్త యు
డుంగ...పోత్రివై,ధర వదిలంబుగా నిడిన
తావకలీలఁ దలంతు మద్యయా. నృసిం. ౩. ౩౬.

చ...ధరకా, గోరిజలు మోపి మోపవన ఘోట
కముల్ పడిఁ బాఱుచున్నవి... ప్రబోధ. ౪. ౩౯. ఆం. భా. ౨. ౧౯౮.

గీ... మెకములు గెరలి బెదరి, గోరిజదాఁటుగఁ
బరుగెత్తి తిరిగి చూచె.... కువల. ౧. ౯౫.

**గోరిసె**=గోరిజే. వి. (సం. ఖురః. క. గొరిసె.)

చ. గోరిసెలయందముకా గుఱుచకొమ్ములచందము
వెన్నుమందముకా... హార వగుకామధేనువు
...దశా. ౨. ౨౨౪.

జః గోరిసెగాలి.

**గోరిసెగాలి.** వి. (గోరిసె + గాలి.) పశువుల గోరి
సెలనడుమ పుండై పురుగులు పడెడివ్యాధి. (శ. ర.)

**గోఱక.** వి. ౧. అడవిదున్న, కారుపోతు. (బ్రౌ.)
౨. కారుపోతుయొక్కఅఱపు.

గీ.ఒక్కఁ డడుగెత్తి గోఱకవేయుమను డాఁచి,
నట్టిరిగి బెంకిఁ గని వీఁకఁ బట్టుటయును,మృ
గయు లందఱుఁ జని వెల్వరించి నిశిత, కాం
డములఁ జెండి రొకపెద్దకారుపోతు.మనుచ.
౪. ౪౭.

**గోఱకు.** విశే. (సం. క్షుల్లకః) నీచుఁడు, దుష్టుఁడు.

గీ. తాను జెడుట గాక తక్కినవారినిఁ, జెఱుపఁ
జూచె నార గోఱకుఁబడుచు, వీని పెట్టు లైన
వినువక పాలియింప,వలయు ... నృసిం. ౪. ౭౬.

చ. గోఱకుఁదనంబు మీఱ ధరఁ గ్రుమ్మరుచుండు
దు ...దశకు. ౩. ౧౧. విజ్ఞా. ఆచా. ౧౩౯.

**గోఱపము**=కోఱపము. వి. ౧. గుఱ్ఱమును తోము
టకుపయోగించు పనిముట్టు.

వ...పిడుకగోఱపంబులో మకంబునఁ బుటపుట
నై...కొడమటట్టువగుంపు...ఆము. ౪. ౩౫.

గీ. గోఱపమూ లేదు నీరార్పఁగొడవ యెఱుఁగ,
గడ్డి వేయఁడు...శుక. ౩. ౪౦౭.

౨. (సం. క్షురప్రః.) కోఱపము, అర్ధచంద్రాకా
రబాణము.

ద్వి. కరగసంబులఁ ద్రెంచి కత్తులఁ గోసి, గోఱ
పంబులను దుస్సి కోఱవులఁ జూఁడి... రం. రా. ఉ. ౫౨ పా. ౭ పం.

**గోఱియపోతు.** వి. (గొఱియ + పోతు) మేషము,
మగగొఱ్ఱె.

గీ. మేర మీఱినగొఱియల మేఁకగముల, గొఱియ
పోతుల నటికి ప్రోగులుగ నిడ్డ,వెగ్గలపుఁబచ్చి
వంజాళ్లు...కదుపార మెసవి...అచ్చ. రా. యు. ౨౩౧.

**గోఱుగు(ర్గు).** స. క్రి. (సం. క్షుర్.) క్షౌరము
చేయు.

క. అలరుక్మి రుక్మవసనుఁడు, తలయును మూతి
యును గొర్గి తను విడుచుటకుకా ... భోజసు
తా. ౪. ౧౪౪.

చ...ధరణీపతి...నిష్ఠురభాష లాడి... తల గొ
ఱిగింపఁ బంచె నొకతప్పుచు గావరుగా నృ
పాలకుల్. కాశీ. ౧. ౪౭. భాగ. ౧౦ పూ.
౧౮౮౦. అను. ౬. ౮౧. భార. అర. ౬. ౨౫౦.

వి. గోఱుగుట, వపనము.

గోఱుగులువడు=గొఱఁగఁబడినవగు.

చ. గోఱుగులువడ్డవెండ్రుకలు గ్రూరపుఁజూపులుఁ
గోరదాడలున్...కల్గిన బ్రహ్మరాక్షసుం,డు...
పద్మ. ౨. ౧౯౧.

**గొఱుపడము**=గోరుపడము. వి. నల్లకంబళము.

ద్వి. వఱదఁ బోవు నెఱుఁగు గొఱుపడ బహుమ, నెఱుఁగక యొఁతకాఁ దేఁగి పట్టుకుచు. బస. పు. ౩౧౧౩౭పం.

ద్వి. నెఱి నెన్నిమాఱులు నీళ్లలోపలను, గొఱుప డం బుదికిన మఱి తెల్ల నగునె. బస. పు. ౭౦౬౫పం. చెన్నబ. ౩. ౩౧.

**గొఱె(ఱియ)**=గొఱ్ఱె. వి. ౧. (సం. కురరీ. క. తు. కురి) మేషి; మేషము.

చ...గొఱెకోళ్లు...చట్టులు చట్టిమూఁతలుం, గ లుగుమలాలగేహము ప్రఘాణము చేరిరి పాం డునందనుల్. పాంచా. ౨. ౪. భార. భీష. ౧. ౨౯౬.

క...గొఱియలపాఁడియును దఱి చగుఁ...భా ర. ఆర. ౪. ౨౯౫.

చ. గొఱియల మేఁకపోతులను గొమ్ముపొట్టేళ్లను గావుకొందు, వు...కాళికేశ్వరీ. వీథి. ౪౧.

౨. మూర్ఖప్రాణి, తెలివిమాలినజంతువు.

ద్వి. కొఱగానిజఱభులకొయ్యనగాండ్ర, గొఱియ లవార్తలు గూడునే త్రవ్వ. బస. పు. ౫. ౯౧పం.

గొఱియలనూఁకు, గొఱియగొంగ=తోడేలు.

సీ...తోడేలు గొఱియలనూఁడన వృక మొప్ప ...సాం. ని. తిర్య. ౭౬. వేంక. తిర్య. ౯౫.

జ: గొఱియపోతు.

**గొఱ్ఱు.** వి. దే. ౧. దున్నినపొలమును చదునుచే యుసాధనము.

సీ కోళ్లగూండ్లును గొఱ్ఱు కుఱుగాఁడి యేడికో లలు కాఁడి పలుపులు గలుగునటుక. శుక. ౨. ౪౦౮.

సీ. గుంటక నాఁగను గొఱ్ఱు నా... కృషి, సాధన భేదముల్...ఆం. భా. ౨. ౨౩౩.

౨. మూఁడుదిరెండుకుంటలకొలఁది. (శ. ర.)

**గొఱ్ఱె(ఱ్ఱియ)**=గొఱె.

సీ. కోకలుఁ రూకలుఁ గొఱ్ఱెలుఁ బఱ్ఱెలుఁ ...నీలా. ౨. ౪౧.

గీ. గొఱ్ఱె గొఱ్ఱియ యనఁగను గొఱలు మేషి. ఆం. భా. ౨. ౨౬౫.

(గొర్లు అనుబహువచనాంత మొక్కచోఁ గనఁ బడుచున్నది.)

సీ. తొట్రించి గొర్లలోఁ దోడేలు సొచ్చినట్లెగ బ్బి) లేళ్ల వట్టెట్టు సేయు. సారంగ. ౧. ౯౨.

**గొల**=గెల, గొలక[1]. వి. (బ. గొలలు, గొల్లు-సం. గు చ్ఛః. క. గొలె. త. కులై.)

(పూవులు పండ్లు మొదలగువాని) గుత్తి.

చ...తొలుగుబ్బలిఁ గొండగోఁగుపూ, గొల య లరించె నాఁ బొడిచెఁ గోకనదాప్తుఁడు... పారి. ౨. ౬౯.

గీ. వాయు చెట్టునఁ దనుదాన యారఁబండి, నట్టిప రువంపురసదాడియరఁటిపంటి, గొలలు చక్క ర నెయ్యి మక్కువ నొసంగ. శుక. ౨. ౩౭.

సీ...మనసింహమధ్య గోరనె పూనుకొని కబంధ ము వాపె నీగజగమనఁ బొదివి. గీ. రాజము ఖులార వరముఖాంభోజలార, చారుబిసబా హులార రంభోరులార, కందఁగా నేల ము డుఁగుచుఁ గుంద నేల, కుళ్లఁగా నేల తలవం పుగొళ్ల వేల. చంద్రా. ౪. ౨౫౮.

**గొలక**[1]=గొల.

(పూలగుత్తి.)

గీ. పొదుపుమలపొన్నపై నెలపువ్వుగొలక, నెల కొన నొకింత నగియె నాఁ దెలుపు దోఁచె. హ న. ౪. ౧౪.

బ. తొటిచన్నులు (శ. ర-గులకలు. వా)

**గొలక**[2]. వి. కలకలధ్వని, గొల్లు.

సీ...కలకలధ్వని దోఁచు నలబలం బన హాళాహళి యనంగ, గొల్లన గొలకన గెల్లన రొద యనఁ ...ఆం. భా. ౧. ౧౨౧.

**గొలగొల=కొలకొల.** వి. ౧. కలకలధ్వని.

సీ. జమిలిముక్కాలిపిపాళిబల్లోత్రకుఁ గొదవ కోయిలచాలుగొలగొలలకు. గీ... మిగుల నెద నోడి యాడు వమ్మించుఁబోఁడి. నీలా.౩.౧౫.

౨. ధ్వన్యనుకరణము.

వ...కలికినునుసోగవలుకులకలకలంబున గొలగొల మనుకాతుకాగారంబు సొత్తెంచి. మనుచ.౫. ౭౫.

**గొలిమిడి.** వి. క్షురము కి.

సీ...గొలిమిడి నీరుబచ్చలి...హంస. ౪. ౧౦.

సీ...క్షురము విరాజిల్లు గొబ్బి యనంగను గొలి మిడి యన. ఆం. భా. ౨. ౫౬.

**గొలివె.** వి. తృణవిశేషము. బ.తృణధాన్యవిశేషము.

సీ...తృణధాన్యములు చెలంగు, గునుకులు దూస రుల్ గొలివె లనంగను ... ఆం. భా. ౨. ౨౩౯.

**గొలుగు=గొనుగు.** (బ్రౌ, శ. ర)

**గొలుసు.** వి. (క. గొలసు.) ౧. కుక్క మొదలగు వానిని గట్టెడుశృంఖల; సంకెల.

(జాగిలముయొక్కవర్ణన) వ...పసుపార్చి కట్టుఁ గంబంబులకుం దార్చి బంధించినకుందనంపు గొలుసులు గల్లుగల్లుమనంగ. మనుచ.౪. ౨౭.

పీ. శుకశదంబము గొలుసులచే నిబద్ధమై వారాం గనాగారకారఁ బడఁగ. ఆము. ౨. ౪౩.

౨. గొలుసువలె నుండి మెడ చేతులు మున్నగు వానియందు ధరింపఁబడెడి యాభరణవిశేషము.

సీ...గొలుసన లలంతికావిశేషం బగు ... ఆం. భా. ౨. ౧౪౯.

(వ్యవ)వాఁడుచేతిగొలుసులు తాకట్టుపెట్టినాఁడు. గొలుసుకట్టువ్రాఁత, గొలుసుమోడివ్రాఁత=గొలుసువలె అక్షరములు కలిసియుండువ్రాఁత. (చి.ని.)

జ: గొలుసుగొను.

**గొలుసుగొను.** అ. క్రి. (గొలుసు+కొను) గొలుసువలె నుండు,ఒకదానితో నొకటి యంటి యుండు.

గీ. ఆదిశబ్దంబునకు మీఁద నడుపదము, దగువిశేషణములతోడఁ దగిలి వచ్చు, గొలుసుగొని యర్థసంగతిఁ గూడెనేని, నదియు నేకావలీసంజ్ఞ నడరు నండ్రు. కావ్యా. ౬. ౨౧.

**గొల్ల[1].** వి. (సం. గోపాలః. ప్రా. గోఅలా.క. గొల్ల) ౧. పసుల మేపియు పాలు నెయ్యి అమ్మియు జీవించుజాతి.

ఉదా: గొల్లది. గొల్లవాఁడు.

సీ. గొల్లయిల్లాండ్రతోఁ గోడిగింపులు సేసె వర కామినీసహోదరతఁ బూన. పారి. పీఠి. ౧౭.

౨. గొల్లజాతివాఁడు, గోపుఁడు.

క...తా నప్పుడు గొల్ల మెచ్చెఁ దనకులకాంతన్. నా. పంచ. ౧. ౪౫౫.

ఉ. ఎక్కడిమాట గొల్లతన మించుక యేనియు లేదు నీదెసన్...భార. విరా. ౧.౨౮౧.ఉ.రా. ౨. ౨౨౧.

జ: గొల్లఁడు, గొల్లత, గొల్లపల్లె, గొల్లసివాలు, గొల్లెత.

**గొల్ల[2].** వి. ౧. ద్వారపాలుఁడు.

క. ఇదియే మించుక వారిం, చెద మనుచుఁ గడంగ నీదుచిత్తమునకు రా,దదరిపడి మొన్న గొల్లల, నద టుఁ జోడిపించువాఁడ వైతి నరేంద్రా. పరమ. ౩. ౬౪.

సీ. వెలిపాజారంబున నిలిచి గొల్లలు నిల్పఁ బలికి నే వచ్చుట దెలుపుఁ డనుచు, నవసరంబులవారి ననుసరించిన వారు సమయంబు గాదని జాగుచేయ. దశా. ౨. ౯౭.

౨. ధనపాలుఁడు, కోశాగారమును కాపాడువాఁడు. (శ. ర, బ్రౌ)

ద్వి. తొలుత మంత్రి పురోహితులు యువరాజా, దళవాయి గొల్ల లంతఃపురికర్త. రం. రా. అయో. (శ. ర)

**గొల్లఁడు.** విశే. (√ గొల్ల[1]) మూర్ఖుఁడు. (గొల్లవాఁడు మూర్ఖుఁ డగుట లోకప్రసిద్ధము)

క. ఒల్లనిసతి నొల్లనిపతి, నొల్లని చెలికాని విడువ నొల్లనివాఁడే, గొల్లండు కాక ధరలో, గొల్లండును గొల్లఁడౌనె గుణమున సుమతీ. సు. శ. ౨౩.

వి. అలకాపరి, ప్రేఁడు.

క. గొల్లఁడు వ్యాధుఁడు రజకుఁడు, కల్లమ్మెడు వాఁడు లోనుగాఁ గొందఱు దా, రిల్లాల ప్పురువం దగు,నిల్లు నడపుదనవు దాని కిచ్చినకతన నే. విజ్ఞా. వ్యవ. ౮౦. వేమన. ౨. ౫౯౪.

**గొల్లజిడ్డు.** వి. నాగిని కై.

గీ...నాగిని యుగు, గొల్లజిడ్డన... అం. భా. ౨. ౬౬.

సీ...దొండతీఁగె ముల్లంగి గొల్లజిడ్డు... హంస. ౪. ౧౦. ('గొల్లజీఁడు' అని ముద్రి, వ్రా.పా)

**గొల్లత.** వి. (గొల్ల[1] + త) గొల్లది, గోపిక.

ఉ. గొల్లతల న్విరాళి తగఁ గొల్పెడు కృష్ణుఁడు ...మొ. రా. పీఠి. ౩. హరి. పూ. ౫.౨౨౩.

**గొల్లదొండు.** వి. మత్స్యవిశేషము.

గీ. అల్లెద మ్మొప్పెఁజేఁపయు గొల్లదొందు, వరిగె రొయ్యాగియగుమీలఁ బట్టు వతఁడు. హంస. ౪. ౧౯౭.

**గొల్లపల్లె(ల్లియ).** వి. (గొల్ల[1] + పల్లె.) ఘోషము ప్రేపల్లె.

గీ...వ్రేపల్లె యనిన,గొల్లపల్లె యనంగను ఘోష మగును. అం. భా. ౨. ౨౩.

**గొల్లము.** వి. (చీ. ని, శ. ర-క. కొళ) ౧. పడియ, నీళ్లగుంట.

గీ. కూడి గిరులఁ దరులు గొల్లంబుఁ బల్లంబు, నరసి మిట్టపుట్ట లడవిఁ దడవి, రూపి తొలులు గొలులు నోలంబు సాలంబు, నూచి క్రంత గుంతఁ జొచ్చి వచ్చి. ఉ. హరి. ౫. ౩౧౧. (శ. ర. పా.)

౨. (క. కొళ్ల) పల్లము.

ద్వి. మెల్లన సాగుచు మెట్టు మెట్టుచును, గొల్లముల్ డిగ్గుచుఁ గురువ లెక్కుచును. పండితా. పర్వ. ౩౪౮ పా.

అ...ఎల్లగుహలయందు, వెదకి రూలములు వివేకించి చఱుల భ్రావించి గొల్లములకుఁ బంచె దృష్టి. భోజరా. ౫. ౫౩.

**గొల్లసివాలు.** వి. బ. (గొల్ల[1] + సివాలు.) గొల్లవాఁడు సివమెత్తి పాడెడుపాటలు.

సీ. ఒక్కండు పట్టుగా నూఁకొనఁ దబ్బిబ్బుపాటు గొల్లసివాలు పాడుకొనుచు. కువల. ౨. ౧౧౪.

**గొల్లియన, గొల్లెన.** వి. ఒకవిధ మైనగుడారము.

క. పసిఁడిజలపోసనంబుల, నసముసుచిం బోలుము గొల్లియన లున్నతిఁ బెం,పెసఁగెం బసిండిగుగుబ్బలి, పసినినుఁగులగతిఁ దదంకభాగస్థము లై. కవిక. ౨. ౯౬. (శ. ర. పా)

మ...పుష్కరసరఃపార్శ్వంబునం దల్లి గొల్లెన లెత్తింతు...ఉ. హరి. ౪. ౨౦౬.

ద్వి. గూడారముల్ దెరల్ గొల్లెనల్ బన్ని. పండితా. పర్వ. ౩౫౦ పా.

జ: గొల్లెనబండి.

**గొల్లు.** వి. ౧. కలకలధ్వని, గొల్లు.

సీ...కలకలధ్వని దోఁచు నలబలం బన హాళాహాళి యనంగ, గొల్లన గోల కన గొల్లన రొద యన...అం. భా. ౨. ౧౨౧.

గీ. గొల్లుగాఁ గూఁక లిడుచు గగ్గోలుసేసి ... అచ్చ. రా. యు. ౨౨౭.

౨. నవ్వుట నక్క కూయుట మొదలగువానియందగుధ్వనికి అనుకరణము.

ఉ... గొల్లున నవ్విరి ప్రౌఢభామినుల్. భాను. ౨. ౭౮. ఉ. హరిశ్చ. 3. 30.

క. గొల్లునఁ గూసెడినక్కలు, పెల్లార్చి యదల్చు భూతబేతాళంబుల్. సానందో. ౨. ౯.

గొల్లుమను=౧. మిక్కుటమగు, అతిశయించు.

సీ. పాదుక ల్మెట్టుచోఁ బటువేత్రధర సౌవిదల్లసాహాధ్వనుల్ గొల్లుమనఁగ. ఇందు. ౨.౧౨3.

౨. ఏడ్చు.

ఉ... కానకు రాఘవుండు పోఁగా నిపుడెంత పుట్టెఁ గడగండ్లనువార్తలు మిన్నుముట్టె బి, ట్టైనగ శెల్ల గొల్లుమన నాగత మయ్యెఁ బ్రభాత మంతటన్. చం. రా. ౮. ౯౫.

(వ్యవ) వాని ప్రాణము పోయినతోడనే యింటిలో నందఱు గొల్లుమన్నారు.

గొల్లెత=గొల్లత. వి.(గొల్ల[1] + ఎత)గొల్లది, గోపిక.

ద్వి. గొల్లెతరూపంబు గొల్లెతయిల్లు, గొల్లెతయున్నయుంకువయుఁ జెప్పుటయు. బస. పు. ౨. ౫౨౫ పం. పండితా. దీక్షా. ౭3 పా. వేం. పంచ. ౧. ౫౯౮.

గొల్లెనబండి. వి. (గొల్లెన + బండి) గూఁడుకట్టిన బండి.

ఉ. పల్లకులన్ మహోష్ట్రముల భద్రగజంబుల నందలంబులన్, గొల్లెనబండులన్ నడకగుఱ్ఱపుమోటులవేసడంబులన్, బెల్లుగ నెక్కి పౌరజనబృందము వోఁ బురినైదునాళ్లు భూవల్లభుఁ డుండి తాఁ గదలె వాయుజముఖ్యులతోడ వేడుకన్. జై. భా. ౨. ౧౧3.

గొవరు. వి. తాపము. (చూ. గొవరువోవు.)

జ: గొవరువోవు.

గొవరువోవు. అ. క్రి. (గొవరు+పోవు)తపించు.

గీ. కాన్ని దేశంబు లెండచే గొవరువోయె. కాశీ. ౧. ౧3౭. (శ.ర)

గొహోరు. వి. ౧. అంతు, పెద్దమ్రోఁత.

సీ... అంతు గొహోరు గోర చన వెలయు, నాఘోషణసమాఖ్య... ఆం. భా. ౧. ౧౧౫.

౨. బాధ.

పంచచామరము. జొహోరు మీకుఁ జల్లఁగాఁగఁ జూడుఁ డోసమీరకం, జహోయిలార మంట మారి శంబరారిఁ గూడి నన్, గొహోరుసేయ నేల సాకకున్... సారంగ. ౨. ౯౦. (గొహోరుసేయు=బాధించు) కువల. ౫. ౧౯. విజ. వి. 3. ౮౯.

## గోం

గోండము. సం. వి. అ. పుం- వృషభముయొక్క అండమువంటిది- ఉఱుకుబొడ్డు, పెద్దబొడ్డు.

గోండుఁడు. సం. విశే. (అ. ఆ. అ)-వృషభముయొక్క అండమువంటిబొడ్డు గలవాఁడు- ఉఱుకుబొడ్డువాఁడు, పెద్దబొడ్డువాఁడు. వి. అ. పుం. కొండలందు నివసించునొకపామరజాతివాఁడు.

గోండ్రించు=గోండ్రిలు. అ. క్రి. (√గోండ్రు.) -ఎలుఁగు మొదలనవి-కూయు.

ద్వి. గాటుగాట గోండ్రించి కోఱ లొండొంటిఁ, గటకటఁ దాఁకింప గర్భంబు గలఁగి. నవనాథ. 3 భా. (శ.ర)

గోండ్రింపు=గోఁడిరింపు. వి.(√గోండ్రించు)-పులి మున్నగువాని-కూఁత. (వా)

గోండ్రిలు(ల్లు)= గోండ్రించు. అ. క్రి.(√గోండ్రు.)-పులి మొదలగునవి-కూయు.

ద్వి. బిలముల గుహలందు బెబ్బులుల్ చిఱుత, పులులు గోండ్రిలుచుండు... ద్వి. నల. 3. ౧౯౯ పా. ౧౯ పం.

సీ. కినిసి గోండ్రిలుచుఁ గైకొనుపంచనఖముల బారుటేఁ బెల డింపవశిచి చతిది. కృ. శతం. ౧. ౬౧.

**గోంద్రు.** వి. (ఎనుపోతు, మొ.) అఱచుటయందగుధ్వనికి అనుకరణము. (ఆమ్రేడితరూపము_గోంద్రుగోంద్రు.)

చ... ఆ, కళవుల నాదువాలభుజగిం గని గోంద్రని యంగలార్చుచుఁ ...ఆము. ౩. ౧౫.

గీ. గోంద్రుగోం ద్రని గర్జించుఁ గొంతతడవు, కోరచూపుల వీక్షించుఁ గొంతతడవు. వరాహ. ౧౧. ౭౬.

జ: గోండ్రించు, గోండ్రింపు, గోండ్రిలు.

**గోఁకు.** స. క్రి. గీఁకు, బరుకు. (శ. ర, చి. ని, బ్రా.)

గీ...శిరము గోఁకంగఁ దగ దిరుసేత...భార. అను. ౪. ౧౦౨.

జ: గోఁకుడుపాఱ.

**గోఁకుడుపాఱ.** వి. దోఁకుడుపాఱ. (శ. ర, చి. ని)

**గోఁగు**=గోను. వి. (క. గోగి) ౧. కర్ణికారము, కొండగోఁగు.

చ...కోంకణంబు గోఁగును గనకంబు కేసరము గ్రోవియు వావిలి పొన్న మావియుఁ. వసు. ౩. ౧౮౬.

శ్లో. సల్లాపతః కర్ణికారః.

౨. ఊరగోఁగు, పీలువు.

సీ...గోఁగు బొట్టుగు చిక్కి_గోఁగు కొండగోఁగు ...హంస. ౪. ౧౧. ఆం. భా. ౨. ౪౩.

జ: గోఁగులమ్మ.

**గోఁగులమ్మ.** వి. (గోఁగులు+అమ్మ) ఒకానొకగ్రామదేవత

గీ. దక్షవాటికపశ్చిమద్వారభూమిఁ, బ్రతివసించును సర్వాంగరమ్య యగుచు ... కోమలార్ధేందుధరుకొమ్మ గోఁగులమ్మ. భీమ. ౧. ౯౭.

**గోఁచి.** వి. కౌపీనము, కచ్చడము.

గీ. గోఁచి యనఁ గచ్చడం బన గోణ మనఁగ, బొట్ట ముంచనఁ గౌపీనము దనరారు. ఆం. భా. ౨. ౧౫౭.

సీ. ముందటిది క్కాడి మొలత్రాటఁ దవిలినతోఁక గోఁచులవెంటఁ దూలువారు. ఉ. హరి. ౧. ౧౦౨. ప్రభా. ౧. ౧౦౨.

జ: గోఁచికట్టు, గోఁచికాఁడు, గోఁచిపాఁత, గోఁచిబాఁపఁడు, గోఁచివాఁడు.

**గోఁచికట్టు.** వి. (√ గోఁచి.) కౌపీనధారి, బ్రహ్మచారి.

గీ. ఆస లన్నియు మొన లంటఁ గోసియున్న, గోఁచికట్టున కటువంటిగొడవ గడచు, రాక మెడఁ జుట్టుకొనియె నూరక యకార్య, కరణశీలుర కప్పాటఁ గలదె సుఖము. పాండు. ౫. ౨౩౯.

**గోఁచికాఁడు.** వి. (గోఁచి+కాఁడు) బ్రహ్మచారి. (శ. ర.) విణ. గోఁచిమాత్రము మిగిలినవాఁడు, దరిద్రుఁడు.

ద్వి. రాచకూఁతును గొని రవ్వ గాకుండ, దాఁచినమీఁమూలధన మెల్లఁ బెట్టి, గోఁచికాఁడై దానిఁ గొనుచు చేతెంచి. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౫౧౬౦.

గీ. ఆరివేరంబురీతి నిం దందుఁ దిరిగి, గోఁచికాఁడయ్యెబాఁపనకో డెకాఁడు. ప్రబంధ. ౭౫౪. భల్లాణ. ౫ఆ (శ. ర.)

**గోఁచిపాఁత.** వి. (గోఁచి+పాఁత) గోఁచిగుడ్డ.

గీ. కుక్కిమంచము బొంతయు గోఁచిపాఁత, యూఁతకోలయుఁ గుంపటియును...శివధ. ౫. ౬౯.

గోఁచిపాఁతరాయఁడు=దరిద్రుఁడు.

ఆ. పేర్మి నదుకుకుండె పిక్కచెవకు లేక, యుండ వచ్చుఁ బేద యులుకు దక్కి, రమణ గోఁచిపాఁతరాయుఁడు దొంగల, మిండఁ డనెడిమాటమేలు దెలిసి. కుచేల. ౩. ౪౭.

**గోఁచిబాఁపఁడు.** వి. (గోఁచి+బాఁపఁడు) బ్రహ్మచారి.

సీ. వడుగు నా గోఁచిబాఁపఁడు నాఁగ బ్రహ్మ

వారికిఁ బేళ్లు నడచు ధరిత్రియందు.అం. సం. మాన. ౨. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౫ పం.

గోఁచివాఁడు.=గోఁచికాఁడు. (గోఁచి+వాఁడు) (బ్రహ్మచారి)

(అంజనేయునిమాటలు.) గీ. ప్రతినవబ్రహ్మచర్యాప్తి భవ్యతరత, పోఁబలంబునఁ గడు చీఱు వోనిగోఁచి, వాఁడ ననుచు నిజానుభావంబుఁ దెలిపి. హ. న. పీఠి. ౧౧.

గోఁజాట. వి. (√గోఁజు) గోఁజాడుట. (ఉదా: ఇ దేమి ఎప్పుడు చూచినను ఈగోఁజాట-శ. ర.)

గోఁజాడు. స. క్రి. (గోఁజు+అడు-స్వార్థమున) పీడించి అడుగు. (ఉదా: ఏల ఊఁరక గోఁజాడుచున్నావు. శ. ర. బ్రౌ)

గోఁజు. వి. ౧. పీడ, బాధ.

ఉ. శైలవరేణ్యగర్భకలశాంబుధిరత్నమ కోదె ప్రాయపు. న్వేళఁ దపం బటంచుఁ దలపెట్టెదిగోఁజులు చూడఁజాల....పార్వ. ४. ౧౩౧.

౨. గోఁజాట. పీడించి అడుగుట. (శ. ర.) స. క్రి. పీడించి యడుగు. (శ. ర.)

జః గోఁజాట, గోఁజాడు.

గోఁటు. వి. ౧. కోకయంచున చేర్చి కుట్టెడుసన్నని సరిగపట్టె. (బ్రౌ. శ. ర.) ౨. ఒయ్యారము. (శ. ర.) ౩. రేఖ. (శ. ర.) ४. హస్తభూషావిశేషము.

గీ....గోఁటు ముంగామురు వన.హస్తభూషావిశేషంబు లలరుచుండు. అం. భా. ౨. ౧౪౫.

జః గోఁటుకత్తె, గోఁటుకాఁడు.

గోఁటుకత్తె. విణ. (గోఁటు+కత్తె) ఒయ్యారము కలది. (శ. ర.)

గోఁటుకాఁడు. విణ. (గోఁటు+కాఁడు) ఒయ్యారము కలవాఁడు. (శ. ర.)

గోఁదు. వి. బందన, బంక. (శ. ర.)

గోఁదురు=గోఁదురు కప్ప. (శ. ర.)

గోఁదురుకప్ప. వి. పెద్దజాతికప్ప, మండూకభేదము.

సీ....గోఁదురుకప్ప కప్ప....హంస. ४. ౧౮౬.

గోకంటకము. సం. వి. అ. పుం. న. ౧. స్థపుటము. నిమ్నోన్నతప్రదేశము. ౨. గోవుగొరిజ,గోవుడెక్క. ౩. పల్లేరు†

గోకర్ణము. సం. వి. అ. పుం. ౧. సర్పవిశేషము. ౨. జుత్తు, చాఁప బడినబొటనవ్రేలిఁడుంగరపు వ్రేలినడిమి కొలత. ౩. దక్షిణదేశమందలి ఒకశివక్షేత్రము. ४. కణుఁజు. మృగభేదము. ౫. అశ్వతరము, కంచరగాడిద. ౬. గణదేవతావిశేషము. ౭. అవుచెవియాకారము గలపాత్ర.

గోకర్ణి. సం. వి. ఈ. స్త్రీ-ఆవుచెవులవంటియాకులు గలది-మూర్వ. చాఁగ†

గోకిరాట. సం=గోకిరాటిక.

గోకిరాటిక. సం. వి. అ. స్త్రీ-కూయుచు పరువెత్తునది. శారిక, గోరువంకపిట్ట.

గోకిలము. సం=గోకీలము. (కల్ప)

గోకీలము. సం. వి. అ. పుం-భూమికి మేకువంటిది. ౧. రోఁకలి. ౨. నాఁగలి. (కల్ప.)

గోకులము. సం. వి. అ. న. ఆవులమంద. ౨. గోష్ఠము, పసులసాల. ౩. వ్రేపల్లె.

గోకులికుఁడు. సం. విణ. (అ. అ. అ) ౧. అడుసునఁ బడినయావునకుఁ దోడ్పడనివాఁడు. ౨. కేకరుఁడు, మెల్లకంటివాఁడు (మే. ని.)

గోకృతము. సం. వి. అ. న. గోమయము, అవుపేఁడ. (వాచ.)

గోక్షురము. సం. వి. అ. పుం. ౧. అవుగొరిజ. ౨. పల్లేరు†

గోగృష్టి. సం. వి. ఈ. స్త్రీ. ఒకమాఱు ఈనినయావు.

గోగ్రంథి. సం. వి. ఇ. పుం. ౧. గోష్ఠము, పసులసాల. ౨. ఏఱుపిడుక. ౩. బెండ†

గోఘృతము. సం. వి. అ. న. ౧. ఆవునెయ్యి. ౨. -భూమికి నేయివంటిది-వాననీరు. (త్రి.ని.)

గోఘ్నుఁడు. సం. విణ. (అ. అ. అ) గోవును చంపిన వాఁడు. (అమనుష్యకర్తృక మైనపుడు స్త్రీ లింగమున ఈకారాంతము అగును.) వి. అ. పుం-ఆతిథ్యమున ఎవరికొఱకు గోవు చంపఁబడునో వాఁడు-అతిథి.

గోచందనము. సం. వి. అ. న. గోశీర్షమను చందనము. పచ్చచందనము.

గోచరము. సం. విణ. (అ. ఈ. అ) ౧. భూచరము, భూమియందు తిరుగునది. (మనుష్యాది) ౨. పసులు మేయునది; పసులు తిరుగునది. (పొలము, మొ.) వి. అ. పుం. ౧. ఇంద్రియార్థము, ఇంద్రియములచే గ్రహింపఁబడు విషయము. (రూపరసాది) ౨. జ్ఞానాది విషయము.

శ్లో. అవాఙ్మనసగోచరం. సం. రఘు. ౧౦. ౧౫
౩. స్థానము.

శ్లో.....పితృసద్మ గోచరః. సం. కు. సం. ౫. ౭౭.

గోచరించు. సం. అ. క్రి. ౧. అగపడు.

చ....క్రీడ సేయుమ,ర్కటమిథునంబు మన్మథ సుఖస్థితి దృష్టికి గోచరించినఁగా, సమీర. ౧. ౧౩౩. ఉ. రా. ౩. ౨౪౬.

౨. స్ఫురించు, తోఁచు.

సీ....భస్తలెంచుమాట. గీ. దన మనంబున గోచరించిన నొకించు, కేనియు వివేక మెంచక....సమీర. ౬. ౧౨౪.

వ....నామదికి గోచరించినంతయు వినిపించెద....భాగ. ౧ ౭౪.

గోచర్మము. సం. వి. న్. న. ౧. ఆవుతోలు, ౨. భూపరిమాణభేదము.

గోచారకుఁడు. సం. వి. అ. పుం. పసులకాపరి.

గోచారణము. సం. వి. అ. న. పసులను మేపుట.

గోచారము. సం. వి. అ. పుం. మేషాది రాసులయందు సూర్యాదిగ్రహముల సంచారము.

గోజరము. సం. వి. అ. పుం. ముసలియెద్దు. సం.భాగ. ౩. ౩౦. ౧౩.

గోజాగరికము. సం. వి. అ- న. కల్యాణము, మంగళము. పుం. వాఁకుడు†.

గోజిహ్వా. సం. వి. అ. స్త్రీ. ౧. గోవుయొక్క నాలుక. ౨. బెండ, ఎద్దునాలుక చెట్టు.

గోటదొర్లుడుకాయ. వి. (√గోడు) బాలక్రీడా విశేషము. హంస. ౩. ౧౪౬.

గోటాపన. వి. (పక్షి) ఈఁక. (శ. ర.)

క. నేటుకొని పండ్లు కొఱుకుచుఁ, జీటికి మాటికిని గసరుచిలుకఁగా జిలుకా, బోటుల నలయించెదు నీ, గోటాపన యెన్నఁడింక గూఁటం బడునో. వీలా. ౩. ౨౬.

గోటిచెనకు. వి. (గోరు+చెనకు) గోటి నాటు, నఖక్షతము. ఉ. రా. ౪. ౨౨౧.

గోటినాటు. వి. (గోరు+నాటు) నఖక్షతము.

ఉ....చిక్కులువడ్డహారములు నీబ్బెపుగుబ్బల గోటినాటు లా, చక్కెరబొమ్మకుఁగా రతిరస స్ఫుటచిహ్నములొప్ప వేకువఁగా. కవిరా. ౫. ౨౩౦.

గోడ. వి. (సం. కుడ్యమ్. క. గోడె) భిత్తి.

సీ....మేడలు గోడలు పాడుచేసి. అచ్చ. రా. సుం. ౯౫.

సీ....గోడదొల్చెడిఱాఁగ గుజ్జుఁపు నెఱజోదు గాటం పుటక్కటికముల పాదు. అచ్చ. రా. బాల. ౫. (గోడదొల్చెడిఱాఁగ=ఎలుక) ఆం. భా. ౨.౧౨.

సా:- ౧. గోడకు పెట్టిన సున్నము, లంజెకు పెట్టిన సొమ్మును మరల రావు. ౨. గోడపెట్టును చెంపపెట్టునుకూడనా? ౩. గోడయున్న చిత్రము వ్రాయవచ్చును. ౪. గోడమీఁది పిల్లివాటము.

జః గోడకాలు, గోడచేర్పు.

గోడకాలు. వి. (√గోడ) కరగోడ, వెలుగునాటుటకై పొడిమట్టితో నేర్పఱచిన గోడ. (శ.ర.)

సీ. కమ్మఁదేనియసిల్ల గట్టి పుప్పొడిమట్టి గోడకా ల్దీర్చిన ప్రోడతనము. రా. వి. ౩. ౮౧.

గోడగించు. అ. క్రి. (త. గోడకై=ధ్వని.) శబ్దించు.

ఉ. వారణరాజయాన కనువారముఁ గుంతలమ ధ్యవీథి నిం,దూరము దూరమయ్యె మగ తుమ్మె దప్రోడలు గోడగించురుం, కారము కారమ య్యె....పవిక. ౩. ౮౭. (ప్రయోగాంతరము లేదు)

గోడచేర్పు. విణ. (√గోడ) జడుఁడు.

ద్వి. ఈ రాజు....మొండరి చల్లచప్పుడు గోడచేర్పు. ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౯౫ పం.

గోడా(డ). వి. (సం. ఘోటః. హిం. ఘోడా). గుఱ్ఱము.

క. జోడసలు నిబ్బరంబులు, వేడెంబులు మెఱయ రాజు వేసుకపోడా, గోడా దుమికింపఁగ జత, గూడిరి దొరలెల్ల భటుల గుమి వెనుకొ నియెన్. ఉ. రా. ౭. ౩౯౫.

చ....సెబా సగు గోడ యటంచు మెచ్చుచున్. ఇందు. ౨. ౫౬.

గోడాడు. అ. క్రి. (√గోడు) దుఃఖించు, విలపించు.

వ....కనకవతియుఁ గనుఁగవ నశ్రుపూరంబుదో రంబుగాఁ బెదవులం దడుపుచు మొగము వెలవెలఁ బుచ్చుచుఁ గోడలిం గూడి గోడాడుచు.......... ద్వా ౭. ౨౩౬.

ఉ. ఏడువనేల తండ్రితను వేమఱు పండుఁడు తోడులార నే,సూ డిదె తీర్తునంచుఁ బరశు ద్యుతి భీముఁడు రాముఁ డుగ్రుఁడై, మోడక యర్జునాత్మభివు లున్నపురంబున కేఁగి చొ చ్చిగో,డాడఁగఁ బట్టి చంపె వడి నర్జున జాతుల బ్రహ్మఘాతులన్. భాగ. ౯. ౪౮౩.

ద్వి. కూ డెఱుంగక దగగొంటిది చాల, గోడాడ కిచ్చోటఁ గూర్చుండు మనుచు. అభిమన్యు. ద్విపద (శ. ర.)

గోడి. విణ. ౧. ఒడ్డగెడపు, ఒకప్రక్క క్రింది కొఱఁగి రెండవ ప్రక్క పైకి లేచినది. (చూ. గోడివడు) ౨. మొన పైకున్నది. కొన మీఁదికున్నది.

(పిశాచ వర్ణనము) సీ. గూని వీపులమీఁద గోడిపై దోఁచెత్తి తటివర్ణ కంకాళ తండములును.... గీ. కలిగి యుచె కొందఱున్నారు గగనవీథి. కాశీ. ౩. ౧౩౮.

(వ్యవ) వాఁడు గోడిగా కాలక్షేపము చేయుచు న్నాఁడు.
(గోడిగా=జాగ్రత్తగా, మెలఁకువతో.)

జః గోడివడు, గోడివెట్టు.

గోడిగ. వి. (సం. ఘోటికా) ఆఁడు గుఱ్ఱము.

సీ....బడబ గోడిగ నాఁగఁ బరఁగుచుండు. ఆం. ధా. ౨. ౧౯౭.

సీ. గోడిగ జాతిలోఁ గొదమపెంటుల నేర్చి మాసుల హత్తించు పూర్వపంబు. భార. విరా. ౧. ౯౩.

చ....తఱచుగ నీను గోడిగలుఁ దత్పురికూద్రుల కొప్పు నెప్పుడున్. విక్ర. ౧. ౭౬.

గోడిపట్టెలు. వి. బ. బాలక్రీడా విశేషము. (శ. ర. కోడిపట్టులు=కోడియు పిల్లలు అను ఆట, బ్రౌ.)

గీ. గుజ్జ దాఁగిలి ముచ్చులు గోడిపట్టె, లేలపాటలు సరిబేసు లీలహూత, లాదిగా శైశవక్రీడ లాడిరచట, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౭. ౨౦౨.

గోడివడు. అ. క్రి. (గోడి+పడు) ఒడ్డ గెడపగు, ఏటవాలగు.

సీ. తారకసుతుఁడు మందారుఁడు నా మహావీరుఁడు.... ధారణీతలము గోడిఁబడ నెత్తి వచ్చి....కు. సం. ౧౨. ౮౦౮.

గీ. గోగణము ముంగలిగ నేల గోడిపడఁగ, నడచు కౌరవరాజసైన్యంబు గనియె. భార. విరా. ౪. ౫౦.

వ. ఒకయెడు గొక్కచక్కి నిడి యూఁదినఁదచ్చుర ణంబు నిర్ఘరో,దకములముంపువం దడియఁ దద్గిరి గోడిపడంగ లేచి యొం,డొకయెడు గవ్వల న్నిలుప నుండె యథాస్థితి నర్ఘ్యపాద్య పూ,ర్వకముగ రాఘ వాప్తునకు వచ్చి యెదుర్కొనిపోయెనో యనన్. రామా. ౬.౮౬. (కలహంసము) వ.....ఝూంకారిత పతత్రధారావి హారంబుగ గోడిపడి దిగ్గనప్పుడు ....వైష. ౨. ౩౫.

గోడిపెట్టు. స. క్రి (గోడి + పెట్టు) వంచు. (శ. ర)

గోడు = గోలు. వి. ౧. ఏడ్పుటయం దగుధ్వని కనుక రణము. (అమ్రేడితరూపములు 'గోడుగోడు, గోడ్గోడు')

ఉ. మాడలు సంతరించుకొని మచ్చిక నెవ్వరి కీఁగలేక పత్నీ్పిడలు మేనులం బొరయఁ బెక్కురు చోరులు బాధపెట్టఁగా,గోడని యేడ్చుచున్ భ్రమలఁ గుందు శరీరుల నేమ మెత్తునే....కుచేల. ౩. ౧౦౨.

క....నెంజిలిం గృశించుచుఁ జిత్తం,బునఁ బట్టలేక గోడ్గో,డున నేడ్చెన్ బాష్పములు కడున్ వెడలంగాన్. పరమ. ౪.౧౧౩.

క. ఆమాయలాఁడి యపు డా,కోమలిమొగముఁగని గోడుగోడున నేడ్వన్. శుక. ౨. ౪౨.

౨. (క. గోడు, గోళు) దుఃఖము,పీడ; రోదనము, ఏడ్పు.

క....అలమ టదరు గో డు,మ్మలిక వవట కుందు నా నమరు దుఃఖాఖ్యల్. ఆం. శే. ౧౦.

క. పరమమునీంద్ర సమరమృత, సుతవీరుల మామన ములగో డుడుగ భవ,త్కరుణ వెలయ లోకంబ, చ్చెరు వందఁగఁ జూపవే విచిత్రపుమహిమన్. భార. ఆశ్ర. ౨. ౯౨.

గీ. వనట యంగలారుపు వెత వంత గోడు,బాద యంగద వగ పనఁ బరఁగుఁ బీడ. సాం. ని. మాన. ౩౩.

సీ....కొఱలు రోదన మేడ్పు గోడు నాఁగ. ఆం. భా. ౧. ౧౪౧.

సీ. ఎండినయూళ్లగో డెటిఁగింపఁ డెవ్వఁడుఁ బండిన యూళ్లెన్నుఁ బ్రోధు లంద,ఱు....రామలిం. ౪.

వ....ఈక్రూరునిచేతులు వెండికొండక్రిందఁ జిక్కిన నాఁ డట్టె యడంగఁద్రొక్కి నుగ్గునూచంబు సేయక మరల వరంబు లిచ్చి హరుండు దమగోడుపోసి కొనె ననువారును....ఉ. రా. ౪.౯౪. (తమగోడుపోసికొనె = తమ్ముఏడ్పించిన పాపము గట్టికొనియె.)

గీ. లంజెతల్లు లనఁగ లక్షింపఁగా నిట్టి,కట్టిఁడులకు నలువ కరుణ లేక, బ్రాఁతిమాలినట్టి బ్రతుకులు విడుపుగాఁ, జేసి విటులగోడువోసికొనియె. కవిక. ౪. ౧౧౦. (విటులగోడుపోసికొనియె = విటులను క్షోభపెట్టినపాపముగట్టికొనియె.) వైజ. ౨. ౯౫.

గోడు సేయు.... = బాధపెట్టు.

సీ. కోటిచంద్రులదాలు గోడుసేయఁగఁ జాలుమొగ ముకుంకుమచుక్క సొగసు గుల్క. వీథి. ౯. (ఇట ఔపమ్యద్యోతకము)

జ: గోడాడు.

గోడు(తు)౦బ. సం. వి. అ. స్త్రీ. ౧. పిన్నపాఁపరత్ ౨. కర్కటీవిశేషము. నక్కదోసt. (వి. ని.)

గోడెము = గూడెము. వి. బోయపల్లె. శబరాలయము.)

గీ. గూడెమని గోడె మని యనుకొందు రాశ్య.

లెల్లఁ బిక్కణమునకు బాలేందుమౌళి. ఆం. భా. ౨. ౨౩.

గోణము, గోణాము=గోవణము. వి. (సం. కౌపీనమ్. ప్రా. కోపీనం) ౧. గోఁచి, కౌపీనము; రెండు వైపులను త్రాళ్ళుగలకౌపీనము.

గీ. గోఁచి యనఁ గచ్చడం బన గోణ మనఁగ, బొట్ట మంచనఁ గౌపీనము దనరారు. ఆం. భా. ౨.౧౫౩.

ఉత్సాహ....కావిగోణములు గట్టువారి నైన నగుచుఁ జిత్త జుండు చిత్తములు గలఁచి చెఱచు....శివ. ఉ. ౨. (శ. ర.)

ద్వి. ఉంకించి యవ్వు డయ్యోనపరివువ్వు, కంకటిమీఁద డిగ్గన డిగ్గ నుఱికి, గోణంబుతోనె మిక్కుటపు వేగమున. ద్వి. పరమ. ౩. ౧౫౪౦. పం. వరాహ. ౩. ౧౦౫.

సీ. బంగారువ్రాఁతచెఱుంగులగోణాము గళమున రుద్రాక్ష కంఠమాల. కాశ. ౧. ౩౦.

జ: గోణముదారి.

గోణముదారి. వి. (గోణము+దారి) కౌపీనధారి. సన్న్యసి. (బ్రౌ)

గోణి. వి. ఎద్దు. (శ. ర.)

గోణి. సం. వి. ఈ. స్త్రీ. గోనె.

గోణిక. సం. వి. అ. స్త్రీ=గోణి.

గోత(తా)ము. వి. ౧. అల్ప గోణీవిశేషము, ఒక విధమైన చిన్నగోనె.

సీ....అసిమి గోతము సంచి యనఁగ నల్ప, గోణీ విశేషముల్ గొఱలు....ఆం. భా. ౨.౨౬౬.

సీ. చిక్కము ల్మోలలు మాసినచింపి బొంతలు దామెన త్రాళ్ల గోతములు వెండ్రుకలమోపులును....చెన్న. ౨. ౨౦౪.

సీ....గోనెలు తణగాలు గోతములును. హంస, ४. ౮४.

౨. మల్లసాధనవిశేషము.

స్రగ్ధర. గ్రుద్దుగా గోత్రాచలంబుల్ గులగులలయివో గోతముల్ గ్రుద్దులీలగా మనుచ. ४. ౮. (జెట్టిలు సాదనచేయునప్పుడు జనపనారసంచులలో రాలు పోసి కుట్టి పిడికిళ్ళతో పొడుతురు వ్యాఖ్య.)

సీ. మనసు జెట్టి యనంగ మల్లాభిధానంబు....తత్సాధనంబులై తగుఁ గంబము కొణత కటికనలోడి సంగడము బాల. గీ. సంగడము నీలి గోతా మనం గఁగొన్ని....ఆం. భా. ౨. ౨౦౬. ప్రబంధ. ౮౨. ౭౮.

గోతి. వి. (త. కోదై) ఆఁడుది. స్త్రీ.

క. జ్ఞాతులయెడ గోవులయెడ, గోతులయెడధర్మమెడలి క్రూరుఁ డగుట కా,ర్యాతురవిప్రోపే క్ష.నీతి బినము లపహరించునిపుణత యరయన్. భార. అను. ౩. ౨౩४.

క. రోగికి సుహృదులఁ గన్గొనఁగా గుణ మెట్టిదగు నట్టిదైవడిఁ జేతో,రాగ మెలర్పఁగ నునికికి, నాగోతులు ప్రీతినొంది యాతనితోడన్. భోజరా.౩.౨४४. ఆం. భా. ౨. ౧౦४.

గోత్ర. సం. వి. అ. స్త్రీ. ౧. భూమి. ౨. గోవులసమూహము.

గోత్రకీల. సం. వి. అ.స్త్రీ-పర్వతములుకీలములుగాకలది భూమి.

గోత్రపటము. సం. వి. అ. పుం. వంశవృక్షమును తెలుపుపటము.

గోత్రప్రవరుఁడు. సం. వి. అ.పుం.మూలపురుషుఁడు, వంశమునకు కూటస్థుఁడు.

గోత్రభిత్తు. సం. వి. ద్. పుం-పర్వతములను భేదించువాఁడు-ఇంద్రుఁడు.

గోత్రభిదుఁడు. సం=గోత్రభిత్తు.

గోత్రము. సం. వి. అ. న. ౧. వంశము. ౨. విత్త

ము, ధనము. ౩. గుంపు, సమూహము. ౪. పేరు. ౫. అడవి. ౬. పొలము, వరిమడి. ౭. దారి, బాట. ౮. గొడుగు. ౯. బలము. పుం. ౧. కొండ. ౨. మేఘము. (కే. ని.)

గోత్రస్ఖలనము సం. వి. అ. న. ఒకరిని మఱియొకరి పేరితో పిలుచుట.

గోత్రస్ఖలితము. సం=గోత్రస్ఖలనము.

గోత్రుఁడు. సం. విశ. (అ. ఆ. అ) ౧. గోవులను గాచువాఁడు ౨. భూమిని రక్షించువాఁడు.

గోద. వి. ఎద్దు, వృషభము.

(కన్నప్ప అడవిలో నున్న శివలింగమును చూచి అన్న మాటలు.) ద్వి. ఎక్కుడుగోద నిన్నిక్కడ వైచి, యె క్కడఁ బాతెనో యేఁగెదఁ జెపుమ. బస. పు. ౩. ౬౫౩ పం. (ఎక్కుడుగోద=వాహన మైనవృష భము.)

ద్వి. కోటయుఁ బద్దదిగూడ నమ్యైక, వాటంబులును జివ్కివసుధఁ ద్రెళ్ళినవి, యొదల నర్ధముగొన్నయు మఱోటి పుట్టు పొద లేదు శివునంద యఁడగెనో కాక, భయమంది యొంటి గోదయు మీఁదఁగసవు, వయిచుక యున్నది వనరుచు నెదుర. బస. పు. ౩. ౪౫౩ పం.

జ: గోదరి.

గోద. సం. వి. ఆ. స్త్రీ. ౧. గోదావరి. ౨. ఘూడికొడు త్తనాచ్చియారు, ఆముక్తమాల్యద. (ఈమె వైష్ణవులకు ఉపాస్య యగునొక దేవత)

గోదంతము. సం. వి. అ. న. హరితాళము, అరిదళము.

గోదము. సం. విశ. (అ. ఆ. అ) గోవులనిచ్చునవి. వి. అ. పుం- దృష్టిని బాగుగా నుంచునవి-మస్తిష్క ము, మెదడు.

గోదరి. వి. (√గోద) ముచ్చెవాఁడు, చర్మకారుఁడు

సీ....చర్మకారాఖ్య వరఁగు గోదరి ముచ్చెవాఁడవంగ. ఆం. భా. ౨. ౨౮౩.

గోదానము. సం. వి. అ. న. బ్రాహ్మణునకు పదియా అవయేఁటను క్షత్రియునకు ఇరువది రెండవయేఁటను వైశ్యునకు ఇరువది నాల్గవయేఁటను చేయఁదగిన సం స్కారవిశేషము, కేశాంతము, మను. ౨. ౬౫.

గోదారణము. సం. విశ. (అ. ఈ. అ) ౧. నాఁగలి. ౨. గుద్దలి.

గోదారి. వి. వెన్నకాఁచినమడ్డి. (బ్రౌ. శ. ర)

గోదావరి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకనది, గౌతమి. గోదావరిఁగలుపు=పాడుచేయు.

సీ. కులము గోదావరిఁగలిపి వేశ్యాసంగ మాసచేఁ గా వించితే సుపుత్ర. నిరం. ౨. ౮౩.

గోదుమ. (సం. గోధుమః. క. గోదుమె) వి. సస్య విశే షము. బ. ధాన్యవిశేషము. ఆం. భా. ౨. ౨౩౪. జ: గోదుమపూసలు.

గోదుమపూసలు. వి. బ. (గోదుమ+పూసలు) స్త్రీ కంఠ భూషావిశేషము. (శ. ర.)

గోదుహుఁడు. సం. విశ. (-హ్-అ.ఆ.అ) ఆవులను పాలు పితుకువాఁడు. వి. హ్, అ. పుం. గొల్లవాఁడు.

గోదోహని. సం. వి. ఈ. స్త్రీ. ఆవుపాలు పితుకుట కుపయోగించుపాత్ర.

గోద్రవము. సం వి. అ. పుం. గోమూత్రము.

గోధ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఉడుము. ౨. అల్లెత్రాటి దెబ్బ తాఁకకుండుటకై ఉడుముయొక్కతోలితో కుట్టి చేతికి తొడిగికొనుకవచము. (కే. ని.)

గోధనము. సం. వి. అ. న. గోకులము, గోవులగుంపు- పుం. స్థూలాగ్రము గలబాణము. (కల్ప)

గోధము. సం. వి. అ. న. గోధ, అల్లెత్రాటిదెబ్బ

శాఁకకుండుటకై చేతికి తొడుగుకొను ఉడుపతోలికవచము.

గోధాపది. సం. వి. ఈ. స్త్రీ. చెప్పుతట్ట†.

గోధి. సం. వి. ఇ. పుం. ౧. అళికము, నొసలు. ౨. ఉడుము.

గోధుక్కు. సం. విణ. హ్. ఫి. హ్ = గోదుహుఁడు.

గోధుమము. సం = గోధూమము (కల్ప)

గోధూమము. సం. వి. అ. పుం. ౧. గోదుమలు, ధాన్యభేదము. ౨. నారింజ†.

గోధూళి. సం. వి. ఇ. స్త్రీ. గోవులు పొలమునుండి ఇండ్లకు వచ్చునపుడు దుమ్ము రేఁగెడివేళ, సాయం సంధ్యాకాలము.

గోధేనువు. సం. వి. ఉ. స్త్రీ. క్రొత్తగా ఈనినయావు.

క....కొను మిచ్చెద నీకు లక్షగోధేనువులఁ. భార. ఆది. ౭. ౫.

గోధేరుఁడు. సం. విణ. (అ. ఆ. అ) రక్షకుఁడు. కాచువాఁడు.

గోనంది. సం. వి. ఈ. స్త్రీ. బెగ్గురుపక్షి.

గోనర్దము. సం. వి. అ. పుం. ౧. సారసము, బెగ్గురుపక్షి. ౨. దేశవిశేషము. న. కయివడిముస్తె†.

గోనర్దీయుఁడు. సం. వి. అ. పుం-గోనర్దదేశమున పుట్టినవాఁడు-మహాభాష్యకారుఁడగు పతంజలి.

గోనసము. సం. వి. అ. పుం. ౧. కొండచిలువ. ౨. వైక్రాంతమణి.

గోనాసము. సం = గోనసము. (రా. వి.)

గోనియ. = గోనె. (శ. ర. )

గోను. = గోఁగు. (దీని'ను'వర్ణకమునకు ఏకవచనమున వికల్పముగాను బహువచనమున నిత్యముగాను బిందుపూర్వకగువర్ణము ఆదేశ మగును.) వృక్షవిశేషము. పీలువు †.

గీ....తగు గోను గోఁ గనఁగను నుపీలు. ఆం. భా. ౨. ౪౩.

సీ. పొన్న బొట్టుగు పోఁక పొగడ దాడిమ మిప్ప. గుముడందు గురివెందగోను రేను. వేం. పంచ. ౪. ౩౨౨.

గోనె = గోనియ. వి. (సం. గోణీ. ప్రా. గోణి. త. కోణి.) ధాన్యము మున్నగునవి నించెడి జనపనారసంచి.

సీ. హేరాదియొద్దాదిభారాదులను వచ్చుగోనెలు తణగాలు గోతములును. హంస. ౪.౧౪. 'కప్పురపు గోనెలు' కళా. ౭. ౨౫.

గోపకము. సం. వి. అ. పుం. బాలెంతబోళము.

గోపకుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షించువాఁడు. ౨. దాఁచువాఁడు, కప్పిపుచ్చువాఁడు. ౩. గోవులను కాచువాఁడు. వి.అ. పుం. ౧. బహుగ్రామాధిపతి. ౨. గొల్లవాఁడు

గోపతి. సం. వి. ఇ. పుం. ౧. ఆఁబోతు. ౨. స్వర్గాధిపతి, ఇంద్రుఁడు. ౩. భూపతి, రాజు. ౪. పశుపతి, శివుఁడు. ౫. అంశుమంతుఁడు, సూర్యుఁడు. ౬. దిక్పాలకుఁడు. ౭. గోవుల కధిపతి.

గోపదలము. సం. వి. అ. పుం. పోఁకచెట్టు.

గోపన. సం. వి. అ. స్త్రీ = గోపనము.

గోపనము. సం. వి. అ. న. ౧. కాపాడుట, కాచుట. ౨. దాఁచుట, కప్పిపుచ్చుట. ౩. దూఱుట, నిందించుట. ౪. కాంతి. ౫. ఈర్ష్య. ౬. కలఁత.

గోపనీయము. సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షింపఁదగినది, కాపాడఁ దగినది. ౨. దాఁపఁ దగినది, కప్పిపుచ్చఁదగినది.

గోపము. సం. వి. అ. పుం. ౧. బాలెంతబోళము ౨ = గోపనము.

గోపానసి. సం. వి. ఈ. స్త్రీ. చూరుపట్టె, గొప్పులు.

గోపాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ) ౧. కాపాడువాఁడు, కాచువాఁడు. ౨. కప్పిపుచ్చువాఁడు, దాఁచువాఁడు.

గోపాయనము. సం. వి.అ. న. ౧. రక్షణము, కాచుట. ౨. దాఁచుట, కప్పిపుచ్చుట.

గోపాయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. కాచువాఁడు, కాపాడువాడు. ౨. దాఁచువాఁడు, కప్పిపుచ్చువాఁడు.

గోపాయితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షితము, కావఁబడినది. ౨. దాఁపఁబడినది, కప్పిపుచ్చఁబడినది. వి. అ. న=గోపనము.

గోపాయితవ్యము. సం=గోపితవ్యము.

గోపాలము. సం. వి. అ. పుం. దాసరులు బిచ్చమెత్తునపుడు ఉపయోగించుపదము.

గీ....గోపాల మనుచు, వీథి కెవ్వారు సుడిసిన వెక్కిరించు, నయ్య నన్నుఁగన్నకొయ్య గయ్యాళితల్లి. విప్ర. ౩. ౧౫.

గోపాలమెత్తు=బిచ్చమెత్తు. (బ్రౌ)

గోపాలకుఁడు. సం. విణ. (అ. లికా. అ.) వి. అ. పుం=గోపాలుఁడు.

గోపాలధాని. సం. వి. ఈ. స్త్రీ. ౧-గోవులను గాచువారుండుచోటు-గొల్లపల్లె. ౨. గోష్ఠము. పసులసాల.

గోపాలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. గోపాలునిభార్య. ౨. బుడమ †. ౩. వివాహదినములలో పెండ్లికొమరుఁడు పెండ్లికూఁతునకును పెండ్లికూఁతురు పెండ్లికొమరునకును పసుపు మున్నగువానితో పెట్టునలుఁగు. (వై.ని)

గోపాలిక. సం. వి. ఆ. స్త్రీ=గోపాలి.

గోపాలుఁడు. సం. విణ. (అ. ఆ. అ) గోవులను కాచువాఁడు. వి. అ. పుం. ౧. గొల్లవాఁడు. ౨. భూపాలుఁడు, రాజు. ౩. పశుపతి, శివుఁడు. ౪. కృష్ణుఁడు.

గోపి. సం. వి. ఈ. గొల్లది; గొల్లవానిభార్య.

గోపించు. సం. అ. క్రి. (సం. గుప్) ప్రచ్ఛన్నమగు, దాఁగు.

ద్వి. వనమునఁ బండ్రెండువత్సరంబులును, జనగోప్యమై యొక్క సంవత్సరమును, నియతితో గోపించినేఁ దెల్లి వారు. రయ మొప్పఁ గోపించి రానున్నవారు. ద్వి. భార. విరా. ౧. ౧౧ పొ.

గోపిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. వ్రేత, గొల్లది. ౨. కాపాడెడిస్త్రీ.

గోపిత. సం=గోపాయిత.

గోపితవ్యము. సం=గోపనీయము.

గోపిత్తము. సం. వి. అ. న. గోరోజనము.

గోపిలుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షించువాఁడు. ౨. దాఁచువాఁడు.

గోపీచందనము. సం. వి. అ. న. ఒకజాతిసుద్దమన్ను (విల్యమ్సు)

గోపీతము. సం. విణ. (అ. ఆ. అ.) గోవులచే త్రాగఁబడినది. వి. అ. పుం. ఖంజన విశేషము, ఒకజాతి కాటుకపిట్ట.

గోపీథము. సం వి. అ. న. జలాశయము. (కల్ప)

గోపు. విణ. మూఁకుఁడు?

సీ. అకతాయ బికారి యడిబండ గుండఁడుమొండికట్టె గులాము మొప్పె గోపు. హంస. ౫. ౧౧౩.

గోపుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. రక్షించువాఁడు. ౨. దాఁచువాఁడు, కప్పిపుచ్చువాఁడు. ౩. గోవులను రక్షించు వాఁడు. వి. అ. పుం. ౧.

గొల్లవాఁడు. ౨. భూపాలుఁడు, రాజు. ౩. గోవుల కధిపతి. ౪. బహుగ్రామాధిపతి.

**గోపుచ్ఛము.** సం. వి. అ. పుం. ౧. కొండముచ్చు. ౨. పలువది పేటలు గలహారము. ౩. ఆవుతోఁక.

**గోపురము.** సం. వి. అ. న. ౧. పురద్వారము, గవను. ౨. దేవాలయద్వారము, దేవాలయముఖమున ఎత్తుగా కట్టినద్వారము. ౩. కైవడిముస్తె.

**గోప్త.** సం. విణ. (ఋ. స్త్రీ. ఋ) ౧. రక్షకుఁడు, కాచువాఁడు. ౨. దాఁచువాఁడు, కప్పిపుచ్చువాఁడు.

**గోప్తవ్యము.** సం=గోపితవ్యము.

**గోప్యము.** సం=గోపనీయము.

**గోప్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. భృత్యుఁడు, సేవకుఁడు. ౨. దాసీపుత్త్రుఁడు. (కల్ప)

**గోప్రచారము.** సం. వి. అ. పుం. పసులు మేయుచోటు. యాజ్ఞ. ౨. ౧౬౬.

**గోప్రతారము.** సం. వి. అ. పుం. ౧. పశువులకేవు. ౨. సరయూతీరమందలియొకక్షేత్రము.

**గోప్రవేశము.** సం. వి. అ. పుం. గోవులు పొలమునుండి మరలివచ్చి యింట ప్రవేశించుట. ౨. గోవులు ఇంటికి వచ్చువేళ, సాయంసంధ్యాకాలము, మలుసంజవేళ.

**గోమంతుఁడు.** సం. విణ. (త్. మతీ. త్) గోవులు కలవాఁడు.

**గోమక్షిక.** సం. వి. ఆ. స్త్రీ-పశువులకు బాధ కలిగించుఈఁగ-జోఱీఁగ.

**గోమతి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకనది.

**గోమయచ్ఛత్త్రము.** సం. వి. అ. న. కుక్కగొడుగు.

**గోమయప్రియము.** సం. వి. అ. న. కుక్కగొడుగు.

**గోమయము.** సం. వి. అ. పుం. న. ౧. పేఁడ. ౨. పిడుక.

శ్లో... ఉపలశకలమేతద్భేదకం గోమయానాం. ముద్రారా. ౩. ౧౫.

**గోమయోత్థ.** సం. వి. ఆ. స్త్రీ. పేఁడపురుగు.

**గోమాయువు.** సం. వి. ఉ. పుం-వికృతముగా అఱచునది-జంబుకము, నక్క.

**గోమారి.** సం. వి. ఈ. స్త్రీ-పశువులను బాధించునది-పశువులకు పట్టెడిచెక్కపిడుఁడు. (ఈశబ్దము జంతుమారీశబ్దమువంటిది. కాని సంస్కృతనిఘంటువులలో కన్పడదు. మి. వి. అని శ. ర.)

గీ... పిడుఁదు నాఁగ,పఱలు గోమారి కైలాసపురవిహారి. ఆం. భా. ౨. ౫౫.

**గోమి.** సం. విణ. (న్. నీ. న్) గోవులు కలవాఁడు. వి. న్. పుం. నక్క. (మే. ని)

**గోమించే.** స. క్రి. (√గోము) గోముచేయు. (గారాముచేయు, ప్రేమించు.)

క. ఈమాడ్కి నమితభోగ, శ్రీ మెఱయఁగ నొక్కనాఁడు చిత్తమున నిజ,స్వామియుఁ దలిదండ్రులుఁ దను,గోమించిన నడత దలిసికొని యతఁ డెలమిన్. శుక. ౧. ౩౩౫.

**గోమిడి.** వి. ఒకజాతిపూరేడుపిట్ట. (బ్రా)

**గోము.** వి. ౧. సౌకుమార్యము.

క. కాకుండిన నీగోమును, నీకళుపు స్వామిటారమీ తేటకళల్, లోకములఁ గలవె చెలువల, కాకమలజు నేర్పు పొగడఁగాఁ దర మగునే. ఉ. హరి. ౩. ౫౫.

సీ. చెలువ నీజిగిగోము గలమోము మఱివాని తొట్టినోరున ముద్దువెట్టఁ దగునె. హంస. ౧. ౯౧.

౨. విశ్వాసము.

చ. కుముదిని పొంగెఁ బద్మినులగోము దొలంగె న
భస్థలిం జకోరములు చెలంగెఁ గోకనికరమ్ము
గలంగె విభుండు పూర్వభాగమున వెలిఁగె
...కృ. శకుం. ౨. ౧౯౫.

౩. గారాబము.

గీ. వానితలిదండ్రు లత్యంతవత్సలతను, బూఁట
పూఁటకు గోముచేఁ బొసఁగఁ బెంచి...హం
స. ౧. ౧౫౪.

క. గోము మిగుల ప్రేపల్లెను, ధీమంతులు రామ
వాసుదేవులు బాల్య,శ్రీ మెఱసి...హరి.పూ.
౫. ౨౫౦.

క... ఆయమయూను జేఁ,పునిజస్తన్యంబులచేఁ,
బెనిచెం గో మొప్ప నిట్లు పెరుఁగఁ గ్రమ
మునన్. ఆము. ౫. ౬.

౪. విధము, రీతి.

వ...పుష్పంధయస్తనంధయస్తోమంబుహోమధూ
మంబుగోమున నెసంగ...ఇందు. ౨. ౪౪.

౫. గౌరవము.

శా. దీపింపం గలయట్టిపుత్త్రుఁ గనుటన్ దీవ్యత్త
పశ్శీలుఁడీ, గోపాలుం డనఁ గీర్తితుండ నగు
నాగో మిమ్మెయి స్వమ్ముగాఁ,జా పాత్మన్ గ
ణుతింప దైవము గడుం బాపోపదయ్యెం జు
మీ. హరి. పూ. ౭. ౩౩.

౬. గర్వము.

మ. అనిలో నింద్రునిగోము మాన్పి పెఱదేవానీక
ముం జీరికిం, గొన కీమూఁడుజగంబులం గలఁ
చి యశ్లోభ్యుండనై యెందుఁ బేర్చినవాఁ
డన్...హరి. ఉ. ౪. ౧౩౯.

విశ. ౧. మృదువైనది, సుకుమారము.

సీ. మను మెత్తనిది గోము మవ్వ మనంగను మృదు
సంజ్ఞ...ఆం. భా. ౩. ౨౪.

౨. సుందరము, అందమైనది.

సీ. గోముగా నాకుదుల్ గొప్పవెట్టినవార్త సకి
యు చెప్పిన బన్నసరము లొసఁగె. కళా.౪.
౨౬.

జ: గోమించు.

గోముఖము. సం. వి. అ. పుం. న.వాద్యవిశేషము.
పుం. ౧. మొసలి. ౨. సురంగావిశేషము; గోడ
యందు దొంగ లొకతీరుగాఁ ద్రవ్వినకన్నము.
(విల్యమ్సు) న. ౧. అలుకుట. ౨. లోపల చేయి
పెట్టి జపమాలతో జపముచేయుటకు సాధనమైన
గోముఖాకారమగు సంచి. (కల్ప)

గోముఖి. సం. వి. ఈ. స్త్రీ. హిమాలయమున గంగ
ప్రవహించెడు కనుమ.

గోమూత్రిక. సం. వి. ఆ. స్త్రీ. చిత్రకవిత్వము
లోని యొకానొక బంధము.

శ్లో. వర్ణానామేకరూపత్వం యద్యేకాంతరమర్ధ
యోః, గోమూత్రికేతి తత్ప్రాహుః దుష్క
రం తద్విదోవిదుః. (కల్ప)

గోమృగము. సం. వి. అ. పుం. గవయము, గురు
పోతు.

గోమేదకము. సం.వి.అ.న.పుం.పీతమణి, పసుపువ
న్నె గలరత్నవిశేషము. (మే.ని-రా. ని)

గోమేదము. సం. వి. అ. పుం=గోమేదకము.(రా.
ని.)

గోమేదికము. వి. (సం.గోమేదకమ్)పసుపువన్నె
గలరత్నవిశేషము.

గీ. రమణ మీఱఁగ గోమేదికములు చాలఁ, జెలువ
మొప్పార నంచులఁ జేర్చి చేర్చి.యయా. ౪.
౧౧౬.

గోమేధము. సం. వి. అ. పుం. యజ్ఞవిశేషము.

గోయానము. సం. వి. అ. న. ఎడ్లబండి.

గోయి=గొయ్యి, గొయి. (సం. గర్తః) వి. ఇ. గ
ర్తము.

సీ... తెలిపుల్లు బురదగోతులకుఁ జను నె. నీలా.
౨. ౭౬.

గోయుగము. సం. వి. అ. న. ౧. గోద్వంద్వము, గోవులజత. ౨. ద్విత్వమున వచ్చు నొకానొక ప్రత్యయము. (ఉదా: గోగోయుగము=గోద్వయము. అశ్వగోయుగము=అశ్వద్వయము.)

గోర=గోరువంక[1].

సీ. పికిలిపిట్టలు గడ్డిపిట్టలు గోరలు బంగరుపిచ్చుకల్ పసుపుముద్ద. గీ. లాదిగాఁ గలపులుఁగులు...రసిక. ౧. ౬౭.

గోరంక=గోరువంక[1]. ఆం. భా. ౨. ౭౯. సాం. ని. తిర్య. ౭౭. వేంక. తిర్య. ౯౭.

గోరంకువు. సం. వి. ఉ. పుం. ౧. గోరువంకపిట్ట. ౨. దిసమొలవాఁడు. ౩. బట్టువాఁడు.

గోరఁట. వి. (సం. కురంటకః) ౧. ఒకజాతిచెట్టు.

సీ. మైద గోరంట నా మనుఁ గురంటకసంజ్ఞ ... ఆం. భా. ౨. ౫౩.

రగడ. కొమ్మ వేగిర మేటికే కొనగోర గోరఁటవిరులు గిల్లుము...పారి. ౪. ౧౬.

రగడ...తమి నీగోరంటకు నీగో రంటకు ... ఇందు. ౩. ౩౫. పారి. ౩. ౫౭.

౨. గోరంటాకు నూఱి పెట్టుటచేఁ గలిగినఎఱుపు.

సీ. గోరంటా గోళ్లనిక్కు వపుఁగెంపో యని చెయి బట్టి నయమున సెజ్జ సేర్చి...మనుచ. ౬. ౯.

సీ...గోరంటఁ బొలుచు గోళ్లు. శుక. ౨. ౪౨౬.

గోరక్షకర్కటి. సం. వి. ఈ. స్త్రీ. చిర్భటి, బుడమకీ.

గోరక్షకుఁడు. సం. విశే. (అ. క్షీ. కా. అ) వి=గోరక్షుఁడు.

గోరక్షణము. సం. వి. అ. న. పాశుపాల్యము, గోవులను రక్షించుట.

గోరక్షతుంబి. సం. వి. ఈ. స్త్రీ. కుందానుగుకీ.

గోరక్షము. సం. వి. అ. పుం. ౧. పాశుపాల్యము, వనులను కాచుట. ౨. నారింజకీ. ౩. ఋషభ మను ఓషధి.

గోరక్షుఁడు. సం. విశే. (అ. ఆ. అ) గోవులను రక్షించువాఁడు. వి. అ. పుం. ౧. గొల్లవాఁడు. ౨. శివుఁడు, పశుపతి.

గోరగించె. అ. క్రి. (√గోరము) భయంకర మగు. (చూ. గోరగింత.)

గోరగింత. వి. (√ గోరగించె) భయంకరత్వము, ఘోరకృత్యము.

గీ. గోరగింత యనంగను ఘోరత దగు. ఆం. భా. ౧. ౧౩౨.

గోరడి. వి. నఖక్షతము ? (√ గోరు?)

క. వెడలి సతి రతిఁ జెనంగిన, బడలిక నిట్టూర్పు తొట్రుపాటును జనుగో, రడి మోవికాటు చిమచిమ, జడిచెమట నటింపఁ జూపె సోపానగతుల్. పాంచా. ౫. ౩౨.

గోరణము. సం. వి. అ. న. ఉద్యమము, పూనిక.

గోరతనము. వి. (గోరము+తనము) దౌష్ట్యము, దుశ్చేష్ట.

గీ. గోరతనములు మానరా కొడుకుఁగుఱ్ఱ. కాశీ. ౪. ౯౧.

గోరవ. వి. ఆఘోషణము, పెద్దధ్వని.

సీ. రట్టు రట్టడి అవ్వ రద్దిర ద్దుప్పత అంతు గోహరు గోర వన వెలయు, నాఘోషణసమాఖ్య... ఆం. భా. ౧. ౧౧౫.

గోరపడు. అ. క్రి. (గోరము+పడు) విసుగుకొను?

క...కాసారాఖ్యుఁడు, రార మ్మని మిగుల నాదరమునఁ జోటిం, పార నొసఁగెఁ గక్కస మని, గోరపడక యివి సుసాత్త్వికులచరితంబుల్. వరమ. ౧. ౯౪.

గోరము. విశే. (సం. ఘోరం.) ఘోర మైనది, భయంకర మైనది.

సీ. ఘోరాభిధానంబు గోర మనంగను ... ఆం. భా. ౧. ౧౩౨.

క... ఇదె నా, గోరంపుటుక్కు గదఁ గొని, బోర నఁ దల వ్రయ్య నడిచి పొరిగొని విడుతున్. నృసిం. ౪. ౩౯. శుక. ౩. ౭౫.

వి. ౧. ఆపద, ఇడుమ.

క. నగి యతఁడు వదినె కనియెన్, మగువా బెగడంగ నేల మాయన్నకుఁ జే,టగపడియె నేని జేజేల్, మురురును గడ లేనిగోరములపాల్గా రే. అచ్చ. రా. అర. ౪౭. ఆం. సం. మాన. ౫౯.

౨. ఘోరకృత్యము, దారుణకార్యము.

సీ.కొడుకునకై యిట్టిగోరంబు సేసినయింతి యీ కైకేయి యేమి గనియె. భా. రా. యు. ౨. ౬౧౧.

క... కొఱకొఱలాడెద వదేమి గోరము మే ల్లేల్ ...రసిక. ౫. ౧౬౩.

౩. బాధ.

చ. కలిగినవాఁడు గా మరునికన్నను వన్నియ గల్గువాఁడు గా, కులమున మేటి గా సవతిగోరము గాన మటంచు నెంచి వేడ్కల కెదురేఁగుదున్...శుక. ౨. ౧౧౨.

జః గోరగించు, గోరగింత,గోరతనము,గోరపడు.

గోరవంక=గోరువంక[1]. వేంక. తిర్య. ౯౫.

గోరవము. సం. వి. అ. న. కుంకుమపువ్వు. (విల్యమ్సు.)

గోరసము. సం. వి. అ. పుం. ౧. ఆవుపాలు. ౨. దధి, పెరుఁగు. ౩. కాలశేయము, మజ్జిగ, చల్ల.

గోరాటి. సం. వి. ఈ. స్త్రీ. శారిక, గోరువంక.

గోరింక=గోరువంక[1]. (సం. గోరికా) ఆం. భా. ౨. ౮౯. సాం.ని. తిర్య. ౭౫.

గోరించే. అ. క్రి. ఎగయు. (చూ. గోరింపు.)

సీ. చెండు గోరించినచెలువున లివ మీఱ నొయ్యారమునఁ గొంత యుబికి యుబికి. కళా. ౩. ౧౧౧.

జః గోరింపు, గోరింపుబంతులు, గోరింపులాడు.

గోరింపు. వి. (√ గోరించే.) ఎగపు. (శ.ర.)

సీ. కసిడీఱకటు లేచి గ్రక్కునఁ దమి రేఁచి కుఱుచగోరింపులఁ గొంత సేపు. కళా. ౪. ౬౫.

గోరింపుబంతులు=చెండుగోరింపులు. వి. బ.(గోరింపు + బంతులు) బాల్యక్రీడావిశేషము.

సీ. పొదరింటిపట్టులఁ జదరంపునట్టులఁ బంతు గా గోరింపుబంతు లాడు. ఉ. హరివ్. ౩. ౧౫.

గోరింపులాడు. స. క్రి. (గోరింపులు + ఆడు)-ఎగురఁగొట్టు-సంహరించు, చంపు.

సీ. తొలివేలుపులమూఁక దురములో గోరింపులాడి తాండవ మాడునట్లు గాదు. నిరం. ౩. ౯.

గోరిక. సం. వి. ఆ. స్త్రీ. రాజశారిక. (రాజని,కల్ప)

గోరు. వి. దే. (సం. ఖురః. ప్రా. ఖురొ. క. ఉగిర్) ౧. నఖము.

సీ. రవయుంగరంబులరత్నాలదీప్తులు వాలారుగోళ్లపై జాలువాఱ. హర. ౫. ౪౪.

సీ. గోర నొక్కినఁ బాలు గాఱుకెంజెక్కుల... దశా. ౬. ౧౫.

ఉ...పూవులుగోట మీటుతఱి...ఆము.౧.౬౨.

౨. గద్దగోరు,చోరసాధనవిశేషము. ఆము.౫.౩౦.

౩. కదళీకేసరాగ్రవృత్తాంశము, అరఁటిపువ్వులలో కేసరములపైని గుండ్రము గా నుండుఱల్లిపారవంటిపదార్థము.

గీ. కదళి దివియించె నాగ్రాంఘ్రికంబు తొడల, పెనుపు నెట్లన్నఁ బోరలసోవన నడంచు,కొన్న యాఁదోఁకపాటును గొప్ప విప్ప, మొఱయఁగోర్ముచ్చులును గెంపు గుఱులు గావె. ఆ. ము. ౫. ౩౦. (పైరెండవయర్థమునకు కూడ నిదియే ఉదాహరణము.)

సీ...అనంటి నాఁ గదళికాహ్వాయము లై పాదలు
చుండు...తత్కేసరాగ్రవృత్తాంశంబు గోర
నకా...ఆం. భా. ౨. ౫౮.

ర. తంతి మీటుటకు బంగారు లోనగువానితో
చేసి వ్రేలికి తగిలించుకొను నెడు ప్రతినఖము.

ఉ. కీరమనోజ్ఞవాణి యొకకిన్నరి కిన్నెర మీటి
మీటి యొ, య్యారపులీల నేఁగి వసుధాధి
పుఁ గన్గొనె జిల్గుఁబయ్యెదకా, హారముఁ జ
క్కఁ బెట్టెడు కుచాహితహస్తము పైఁడిగోళ్లు
హిం, సారతి సేయుదర్పకునిసంపఁగెముల్కు
లువోలె మించఁగకా. మనుచ. ౫. ౬౮.

విణ. అల్పము, చిన్నది. (శ. ర.)

ఉదా: గోరుచిక్కుడు, గోరువెచ్చ.

గోరంత=కొంచెము.

క. క్షారము రసమును జమురును, గోరంతయు సా
సపడక గోధూమమయా, హారములఁ జేయవ
లయుం, బారణ ధరణీతలంబె వల్లీము గాఁ
గకా. వరాహ. ౯. ౬౦.

క...గో, రం తాలస్యంబునఁ గొం, డంత ప్రయో
జనము దప్పు నదఁగా వినమే. కళా. ౨. ౧౭౦.

ఉ...గో, రంతలు కొండలంత లగునట్టుగఁ జేసితి
మంచు...ఆము. ౫. ౭౭.

(వ్యవ) వాఁడు ఎప్పుడును గోళ్లు గిల్లుకొనుచుఁ
గూర్చుండును=గోళ్లుమీటు. (వా)

గోళ్లుమీటు:-ఏపనియు చేయకుండ సోమరిగా
నుండుటను సూచించును.

క. వనుల కొడల్వంగక కా, మిను లిద్దఱుఁ గూడి
గోళ్లుమీటుచు దాదుల్, దినదినము మిసిమి
యుడఁగాఁ, గనిపింతురు సున్న గచ్చకాయల
కరణికా. శుక. ౨. 333.

సా:-గోట నావనికి గొడ్డలి ఏటికి.

చ. అన విని యట్ల చేయఁ దగు నం చనె నైరృతి
కార్య మిందునకా, గొనకొన గోట నావనికి
గొడ్డలి యేటి కటంచుఁ బల్కె, న, య్యనిలుఁడు
...శకాం. ౪. ౧౬౦.

గీ...ఇంతమాత్రమునకు నీతడం బేటికి, గోట నై
నవనికి గొడ్డ లేల...తపతీ. ౪. ౧౧.

క...గోరం గడతేఱుపనికి గొడ్డలి యేలా...రు
క్మా. ౨. ౧౨౭.

గోరుముక్కు=గోటికొన.

గీ. ఎలయునీత్కారములతోడ నీర్లు గ్రుక్కి, యం
టుసొంటులు వరికించి యంట్లఁ బొడిచె, గోరు
ముక్కుల దిగ దువ్వి తూరుపెత్తి, నెఱులఁ గ
లిగిన పేల నన్నింటిఁ దిగిచె. పాండు. 3. 30.

గోళ్లునాకు=సంతోషించు. (ఇది చంకలు కొట్టు
కొనువంటిది.)

వ...అని చెప్పి నారదుండు సఫలమనోరథుండై
గోళ్లునాకుచు నాకసంబున నదృశ్యుండై చని
యె...వరాహ. ౧౧. ౯౫.

జ: గోటదొర్లుడుకాయ, గోటిచెనకు, గోటినా
టు, గోరుగల్లు, గోరుగాలము, గోరుగొండి, గోరు
చిక్కుడు, గోరుచీరణము, గోరుచుట్టు, గోరుమూ
ద్ద, గోరురాజనాలు, గోరువంక[2], గోరువెచ్చ,
గోరొత్తు.

గోరుగల్లు=గోరుగొండి. (√ గోరు)వి. ఔ. (మం
గలి గోళ్లు తీసెడి) ఇనుపసలాక.

ఆ. బదనుగోరుగండ్లఁ బదరక కొందఱు, కండ్లు వె
ఱికి నిమ్మపండ్లు గ్రుచ్చి...పానందో. 3. ౫౮
పా.

సీ. దూరవీక్షార్థి యీగోరుగంట హృతాక్షుఁ డ
య్యె...కళా. 3. ౧౦౮.

గోరుగాలము. వి. (గోరు + గాలము) చేఁపలను
బట్టుటకు ఉక్కుతో గోటివలె చేసినపనిముట్టు,
బడిశ భేదము. (శ. ర.)

గోరుగొ(గ్గొ)ండి. వి. (√గోరు) గోరుగల్లు.

ద్వి. బెదరుచు జనులు విభీతులై మాడ, గోరుగొం
డ్లను యామికులు గొని చేర. పండితా. మహి
మ. ౨౫౦ పా.

ద్వి. దండిరైయై యామ్యహస్తంబున గోరు,గొండి
వల్పటికంటికొల్కి-లో నునిచి. పండితా.
మహిమ. ౨౫౧ పా.

సీ. మెడ మెట్టి గోర్గొండి మెటికి ద్రుచ్చుఁడు వీని
గ్రుడ్లు చెక్కుల నెత్తురులు స్రవింప. కాశీ.
౩. ౧౫౨.

**గోరుచిక్కుడు.** వి. (గోరు + చిక్కుడు) ఒకచి
న్నజాతిచిక్కుడుకి. (శ. ర.)

**గోరుచీరణము.** వి. (గోరు+చీరణము) గోటివలె
కొనయందు వంపు గలయులి. (శ. ర.)

**గోరుచే(ర్చు).** స. క్రి. (బంతిని) కొట్టు.

మ. తరుణుల్ వీటిశిరోగృహాళి నిసి ముక్తాకందు
కం బాడుచోఁ, గరకంజంబున జాఱి బంతి
కడ కేఁగం దత్స్ఫృతిం జేరుచం,దురుఁ దద్బు
ద్ధి గ్రహించి గోర్చఁగఁ దదస్తోకాపాతిం గం
డఁ గా,కురుమాలిన్యము సక్కలాధిపతి కె
ట్లొందున్ మదిఁ జూడఁగన్. చంద్రి. ౧.
౧౦౨.

మ...రఘువీరుఁడు...మారీచము,ష్కరుమే నా
కుగయుక్తి గాలిపటముంగా వింట నాడించు
చున్, సౌరిదిం దక్కవదైత్యకోటితలబంతు
లోర్చి మెప్పించె ... విశ్వామిత్రమానీశ్వ
రున్. చంద్రా. పీఠి. ౨౧.

ఱ: గోరుపు, గోరుపులాడు.

**గోరుచే(ర్చు)ట్టు.** వి. (గోరు+ చుట్టు) గోటిచు
ట్టును లేచుకురుపు.

ఆ. సుజనవినుత గోరుచుట్టుపై రోఁకటి, పోటు
దాఁకినట్ల పో తలంప, మొదల శోకజలధి ము
నుఁగంగ నందుపై, నీవు పల్కినట్టినిష్ఠురో
క్తి. హరిశ్చ. ౫. ౭౯.

క. వీఁక చెడ నీదుదూతలు, ప్రాఁకంగా నిప్పు డ
ప్పుపైని మడుగునీ,లేఁకువ గోర్చుట్టువయిన్,
రోఁకటిపో టనెడుమాట రూఢం బయ్యెన్.
శేష. ౩. ౨౬౩. తపతీ. ౪. ౪౯.

**గోరుతము.** సం. వి. అ. న-గోవుఅఱపు వినిపించు
నంత దూరము-రెండుకోసులదూరము.

**గోరుప(ర్ప)డము**=గొఱుపడము. వి.కంబళి;నల్ల
కంబళి; ఒకవిధ మైనకంబళి.

సీ...కంబ. గీ. లంబు గొంగడి యనఁగను గంబళి
యన,గోరుపడ మనఁగా ... అం. భా. ౨.
౧౫౯.

ఉ. భూరినదీప్రవాహమునఁ బోయెడినల్లని యు
చ్ఛభల్లమున్, గోరుపడంబుగాఁ దలఁచి...
చెన్న. ౩. (శ. ర.)

(గొల్లనివర్ణనము) సీ. ఒడిసెల పాలకావడి నుచ్చు
ప్రాఁతలగుది మూఁపుపై వ్రేలుగోర్పడంబు.
వేం. పంచ. ౧. ౫౯౭.

ద్వి...గద్దె,కంబళ్లు కప్పడికంబళ్లు గోర్ప,డంబులు
...పండితా. పర్వ. ౩౪ పా.

**గోరుపు.** వి. (√ గోరుచే.) గోర్చుట. (చూ.గోరు
పులాడు.)

**గోరుపులాడు.** స. క్రి. (√ గోరుపు)-బంతి-కొ
ట్టు.

చ. గురుకుచ గుబ్బచన్నుఁగవ గోరుపులాడును
బుట్టచెండ్ల...చంద్రా. ౨.౧౨౨. (ఇట పౌరు
ష్యవాచకము.)

**గోరుముద్ద.** వి. (√గోరు) గోటిమీఁదికి తీసికొని
పిల్లలకు పెట్టు అన్నముముద్ద. (వా.)

**గోరురాజనాలు.** వి. బ. (గోరు+రాజనాలు)ధా
న్యభేదము.

సీ. జీలకఱరాజనా ల్చింతపువ్వులు గోరురాజ
నాలు...హంస. ౪. ౧౨౭.

వ... కస్తూరిపట్టెలు చెన్నంగులు శ్రీరంగాలు
చింతపూలు గోరురాజనాలు ... ప్రబంధ.
౧౧౨.

**గోరువ(ర్వ)ంక**[1]=గొరవంక, గోర, గోరంక,గోరవంక, గోరింక.(సం. గోరంకుః.) వి. శారిక,గోర.

వ...జాలువాపంజరంబులఁ జిలుకపలుకులకు మాఱుపలుకుగోరువంకలవంకఁ జెలరేఁగి... ఉ. రా. ౬. ౧౫౮.

సీ...శారికాఖ్య, గోరింక గోర్వంక గొరవంక గోరంక గోరువంక యనంగ మీఱుచుండు. ఆం. భా. ౨. ౭౯.

గీ. గోరవంక గోరంక నా గోరువంక,యనఁగ శారికాహ్వయములు... వేంక. తిర్య. ౯౭. సాం. ని. తిర్య. ౭౭.

**గోరువంక**[2]. వి. (గోరు+వంక.) నఖక్షతము.

గీ. నఖక్షతశారికాభి, ధానములు గోరువంక నా ...ఆం. భా. ౩. ౬౦.

**గోరువె(ర్వె)చ్చ.** వి. (గోరు+వెచ్చ.) అల్ప మైనవెచ్చఁదనము. (చూ. వెచ్చ) విశే. కొంచెము వెచ్చనిది.

సీ. ఉష్ణాంబువు లటంచు నొద్దుకో గోర్వెచ్చజలముల నొకకల్కి జలకమార్చె. దశా. ౬. ౨౭.

సీ. గోర్వెచ్చచము రంటుకొనిరి మస్తకముల జలకమాడిరి నిశామిళితవారి. పాండు. ౩. ౭౮.

**గోరొత్తు.** అ. క్రి. (గోరు + ఒత్తు.) నఖక్షతము చేయు.

ద్వి. మునియేఁట నే పైఁడి ముడిచినపసుమ, చనుగుబ్బ గోరొత్తి చనుగబ్బివాఁడు. అ. మ. క. ౧. ౩౮ పా. ౧౧ పం.

సీ. గుజ్జుమామిడిబావ గోరొత్తనీవుగా యని చేతఁ జెనకె గయ్యాళి యొకతె. రామా. ౨. ౧౦౦.

ఇట్లే: గోరిడు, గోరులుంచు.

గీ. నాగవల్లీదళంబు వెన్నడుమఁ జీరి,మడఁచి యందిచ్చినపుడు గోరిడుమఁ గేల ... నైష. ౭. ౭౮.

సీ. చెలులలోతోడఁ బిఱుందుల గోరు లుంచుచు మురువుతో నొకతెకు ముద్దొసంగు. దశా. ౮. ౮౧.

వి. నఖక్షతము.

సీ...గోరొత్తులకుఁ జనుగుబ్బ లొసఁగి. కళా. ౭. ౧౬౧.

సీ. ఒఱ పైన మెఱుఁగు గోరొత్తుసందులతోడ రాలుచుండెడిగంధరజముతోడ. భాను. ౨. ౩౯.

**గోరోచన.** సం. వి. ఆ. స్త్రీ. గోరోజనము.(పశువులపిత్తరసమునుండి తీయఁబడినయొకానొకపసుపుపచ్చనిపదార్థము-విల్యమ్సు- పీతవర్ణము కల గోమస్తకస్థమష్క-పిత్తము- కల్ప.)

**గోరోచము.** సం. వి. అ. న. హరితాళము, అరిదళము.

**గోరోజనము.** వి. (సం. గోరోచనా) గోరోచన.

సీ. గోరోజన మనంగ గోరోచనాభిధ ... ఆం. భా. ౨. ౧౬౩.

**గోర్దము.** సం. వి. అ. న. మస్తిష్కము, మెదడు.

**గోర్పిళ్ళాడు.** అ. క్రి. బంతివలె ఎగురు.

శా...అతండు...దంతిరథరథ్యవ్రాతము ల్చేతులన్,గోర్పిళ్లార్చుచు వచ్చుచున్నఁ గని రక్షోనాథసేనాధిపుల్. రామా. ౬. ౨౦౬.

**గోఱజేము.** వి. కస్తూరి, ఇట్టిగోఱజము.

వ...అలికమ్ముల గోఱజంపుటారజంపుఁదిలకంబులు... ప్రబంధ. ౭౯.

**గోల**[1]. విశే. ౧. ముగ్ధ; ముగ్ధుఁడు, తెలివిమాలినవాఁడు.

సీ. ముగ్ధకుఁ బేళ్లగు ముగుద యన స్నిగ్ధరాలు నా గోల నా బేల యనఁగ. ఆం. సం. మాన. ౮.

ఉ...విప్రవరుండు గోలయుక్, బాలుఁడుఁ గాన నప్పటికిఁ బైఁబడఁ గొంకను...మనుచ. ౩. ౬౮.

సీ. ఖేదమోదంబుల భేదంబు తెలియక గోలనై క
డపితిఁ గొన్నినాళ్లు. వేణు. 33.

వి. ఆఁడుది, స్త్రీ.

గీ...లేమ గోల యువిద చామ చాన ... ఆం. భా. ౨. ౧౦౪.

గీ. గోల తెచ్చుట గాటంపుఁగోన తెచుట, వలవ దుడుగుము వయనంబు తలిరుఁబోఁడి. అచ్చ. రా. అయో. ౭౭.

జ: గోలతనము.

**గోల².** వి. కలకలము.

(వ్యవ) ఏదియో గోల వినఁబడుచున్నది. పిల్లలు గోలచేయుచున్నారు.

**గోల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. వట్రువ యగునీటికాఁగు. ౨. గుండ్రనిపదార్థము. ౩. గోలీ; చెండు. ౪. సిరా. (విల్యమ్సు.) ౫. మణిసిల, ఎఱ్ఱపాషాణము. ౬. చెలికత్తె. ౭. దుర్గ. ౮. గోదావరీనది.

**గోలతనము.** వి. (గోల¹+తనము.) ముగ్ధత్వము, మౌగ్ధ్యము.

గీ...ఇవ్వేళ యింత, గోలతన మేల నను నేలుకొనవె బాల. రసిక. ౫. ౧౭౨.

ఉ. గోలతనానఁ బల్కెదవు కుంభకుచాపరిరంభగుంఫనో,ద్వేలసుఖోదయం బనుభవింపనివాఁడవు గాన ... శశాం. ౩. ౭౦. విజ. వి. ౨. ౨౮.

**గోలత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. ఖంజరీటి, ఆఁడుకాటుకపిట్ట. (వై. ని)

**గోలాంగు(గూ)లము.** సం. వి. అ. పుం-ఆవుతోఁకవంటితోఁక కలది-కొండముచ్చు, ఒకజాతికోఁతి.

**గోలాసము.** సం. వి. అ. పుం. కుక్కగొడుగు.

**గోలించు.** స. క్రి. చమురు పోసి వేఁచు. (శ. ర)

**గోలిహము.** సం. వి. అ. పుం. ముష్కకము ౧. (కల్ప)

**గోలీ.** వి. (సం. గోలిక.) బాలురాడుకొనుచిన్నరాతియుండ. (శ. ర.)

**గోలీఢము.** సం. వి. అ. పుం. ముష్కకము, మొక్కపుఁజెట్టు.

**గోలు¹=గోడు.** వి. ఏడ్చుటయందగుధ్వనికనుకరణము. (దీనియామ్రేడితరూపము 'గోలుగోలు.')

వ...దృగ్గోళకంబుల వేఁడికన్నీరు వెడల గోలుగోలున నేడ్చినఁ... నైష. ౧. ౧౦౮.

**గోలు².** వి. పేఁపబొద్దునకు ప్రక్క చేర్పఁబడెడు సన్నని పేఁపబొద్దు. (శ. ర.)

**గోలురించు.** అ. క్రి. (పులి) కూయు. (శ.ర)

జ: గోలురింపు.

**గోలురింపు.** వి. (√ గోలురించు) వ్యాఘ్రగర్జధ్వని, పులికూఁత.

సీ...అగు గోలురింపన వ్యాఘ్రగర్జాధ్వని. ఆం. భా. ౨. ౮౨.

**గోలెము.** వి. బాన.

ఆ. మగనిరాక యెఱిఁగి మగువ యొయ్యన లంకు, మగనిఁ దెచ్చి యింటిమఱుఁగునందుఁ, గల్లు గోలెమునను గదియించి యామీఁద, గంప దబ్బ పెట్టెఁ గదలకుండ. భల్లా. ౧. (శ.ర)

**గోలోకము.** సం. వి. అ. పుం. వైకుంఠమునకు మీఁదుగా నుండి శ్రీకృష్ణునకు నిత్యస్థానమగు నొకలోకము.

**గోలోమి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. వేశ్య, వెలయాలు. ౨. తెల్లగఱిక ౧. ౩. మరులుమాతంగి ౧. ౪. వస ౧. ౫. నేలగొలిమిడి ౧.

**గోళ(ల)కము.** సం. వి. అ. పుం.=గోళకు.

**గోళ(ల)కుఁడు.** సం. వి. అ. పుం. గోళుఁడు, పెనిమిటి మరణించినతర్వాత అన్యపురుషునివలన కలిగినకొడుకు.

**గోళ(ల)ము.** సం. వి. అ. పుం.న.౧. గోలీ,ఉండ; అచ్చనగాయ. ౨. భూమ్యాదిమండలము. ౩. న ట్రువ, వలయము. పుం. ౧. జారెంతబోళము. ౨. (జ్యోతి) ఒకరాశియందు ఆఱు గ్రహములు కూడుట అనుయోగము.

**గోళాయంత్రము.** సం. వి. అ. న. ఒక జ్యోతిష యంత్రము.

**గోళి.** వి. (సం. ఘోలీ.) ఒకానొకఆకుకూర.

గీ...కొయ్యకూర చక్రవర్తము చిల్కకూర గోళి,కూర దుంపబచ్చలి తోఁటకూర...హంస. ౪. ౧౩౩.

సీ. కుచ్చలి యంచనఁ గుచ్చెలి యనఁగను గోళి యటన్నను ఘోలి యొప్పు. ఆం. భా. ౨.౩౪.

**గోళుఁడు.** సం. వి. అ. పుం. విధవకు ఱంకుమగనివలన పుట్టినకొడుకు. (వ్యతి. కుండుఁడు.)

**గోళ్లకుతికకంటు.** వి. స్త్రీకంఠభూషావిశేషము.(శ. ర.)

**గోళ్లగొండి.** వి. తృణవిశేషము.బ.ధాన్యవిశేషము.

గీ. గనుకు లూదర్లు ఒరపటల్ గోళ్లగొండు, లల్లి బియ్యంబు వెదురుబియ్యంబు ... కాశీ. ౩. ౧౫౧.

**గోవ¹.** వి. పురుషగవయము, గురుపోతు.

గీ...గవయమ్ము గోవ,నాఁగ గురుపోతు నాఁగఁ దనర్చు...ఆం. భా. ౨. ౭౫.

**గోవ².** వి. యౌవనము. (చూ. గోవాల్లు) విశ. ౧. మనోజ్ఞము. (ఉదా: గోవపని, మొ. శ. ర.) ౨. పొగరుఁబోతు, అసాధువు.

వ. దూడలం గుడువ విడిచి దుగ్ధదోహనంబునకుఁ జేర వచ్చిన బెదరి పసులసందునం దాటిపోవుగోవావుల వెనుదగిలి సాధుపశువులచాటునఁ బొంచి కూడముట్టి తలఁగోలలు వెట్టి యాఁగువారును...వి పు. ౬.౧౪౬.

ఉ. గోవవిక్రమబంబుననుఁగూఁతకు ... దశకు. ౬. ౩౩.

గోవమీఱు=అడ్డము లేక తిరుగు. (చి. ని.)

గోవమొలత్రాడు,గోవత్రాడు=పురుషులు మొలను ధరించుటకై వెండితీఁగతోఁ గాని బంగారుతీఁగతోఁ గాని అల్లఁబడినమొలత్రాడు. (బ్రా. వా.)

జః గోవతనము, గోవాల్లు.

**గోవ³.** వి. పశ్చిమసముద్రతీరమందలి యొకపట్టనము. (బ్రౌ)

గోవతేజీ=గోవపట్టనపుగుఱ్ఱము.

సీ. నవవిధదివ్యరత్నంబు లేనుంగులు గోవతేజీలు చ్చికుంకుమంబు. శుక. ౧. ౧౦౭.

గోవజవ్వా(వా)ది=గోవపట్టనపుజవ్వాది.

గీ. గోవజవ్వాది మొదలుగాఁ గొన్ని గలుగు, పరిమళద్రవ్యములు పెట్టె బంధురముగ. ధనా. ౩. ౩౯.

ఉ. గోవజవాది కస్తురియుఁ గుంకుమ గందము పైఁడిగిన్నెలన్. విజ. వి. ౩. ౧౯౧.

**గోవంది(ద)ని.** సం. వి. ఈ. స్త్రీ.ప్రేంకణము శీ.

**గోవణము=గోణము.** వి. (క. కౌవణ. త. కోమణమ్.) కౌపీనము.

సీ. తాళవృంతమును వస్త్రములు గోవణములు నొసఁగి రోగార్తుల నుపచరించు. కాశీ.౪. ౬౧.

గీ. వృక్షశాఖాంచలంబుపై వ్రేలుచున్న, కోటిసంఖ్యలనీర్కావిగోవణములు ... కాశీ. ౫౫.

**గోవతనము.** వి.(గోప²+తనము) పొగరుఁబోతుఁదనము.

క. మీవీటిమ్రుచ్చు లేవురు, మావీటం గన్నపెట్టి మణిభూషణముల్, గోవతనంబునఁ దెచ్చిరి, నీ విటు సేయించు టెల్ల నేరమ కాదే.దశకు. ౪. ౨౪.

**గోవత్సము.** సం. వి. అ. పుం. ఆవుదూడ.

**గోవత్సాది.** సం. వి. న్. పుం-ఆవుదూడలను తిను నది-తోఁడేలు. (కల్ప)

**గోవర్ధనము.** సం. విణ. (అ. ఆ. అ) గోవులను వృద్ధి నొందించునది. (అ. ఈ. అ) గోవులను వృద్ధిబొందించుటకు సాధనమైనది. వి. అ. పుం. ఒకానొక కొండ. (ఇది బృందావనమందలిది. దీనిని కృష్ణుఁడు వ్రేలిపై ధరించెనని భాగవతకథ) న. ౧. గోవులను వృద్ధినొందించుట ౨. గోవృద్ధి.

**గోవశ.** సం. వి. ఆ. స్త్రీ. గొడ్డావు.

**గోవాళ్లు(ళులు).** వి. బ. (గోవ² + వారలు. శ.ర.)

౧. యౌవనవంతుఁడు; యౌవనవంతులు.

ఆ. కోడెకాఁడనంగ గోవాళ్లు నాఁగను, యౌవనాఖ్యలొప్పుచుండు రెండు. ఆం. సం. మాన. ౮.

క. తిమిరంపువయసుగుబ్బల, కొమరాలవు నీకుఁ దగినగోవాళ్ల మహిన్, నెమకి నగ రాదె ముదిసిన, మముఁ జెనకిన నేమి గలదు మద మేమిటికిన్. మనుచ. ౪. ౮౩.

మ... ఎలుకుగోవాళుల్ ప్రసూనాళుగ, ప్రదరప్రేరితచిత్తవృత్తులగుచున్ భ్రాంతమ్ములం ద్రిమ్మరన్. కాళ. ౩. ౧౧.

౨. విటుఁడు; విటులు.

సీ. విటనామధేయ మా విటకాఁడు వేడుకకాఁడు బోజుఁగు నన్నుకాఁడు లంజె, కాఁడనఁగ నివి యుఁ గాక గోవాళ్లనఁగా నొక్కశబ్దంబు గలదు బహుత... ఆం. భా. ౨. ౧౧౬.

వ... తమతమచెంగటికో డెప్రాయంపుగోవాళ్లకుఁ దిరునాళ్లఁ జూచువేడుకలలోఁ బిసికిళ్లఫలము కల్పింప నుపాయంబు లెంచి... ప్రబంధ. శిర. వేంక. మాన. అ. సాం. ని. మాన. ౮.

**గోవిందద్వాదశి.** సం. వి. ఈ. స్త్రీ. పుష్యనక్షత్రముతో కూడిన ఫాల్గునశుద్ధద్వాదశి. (కల్ప)

**గోవిందుఁడు.** సం. వి. అ. పుం. ౧. శ్రీకృష్ణుఁడు. ౨. గవాధ్యక్షుఁడు, గోసమూహాధిపతి. ౩. బృహస్పతి. (మే. ని.) ౪. గోవిందపాదుఁడు, శ్రీశంకరాచార్యులగురువు.

**గోవికర్తుఁడు.** సం. వి. అ. పుం. ౧-భూమిని చీల్చువాఁడు-సేద్యగాఁడు, కృషీవలుఁడు. ౨. గోఘాతుకుఁడు, కసాయివాఁడు.

**గోవిట్టు.** సం. వి. ష్. స్త్రీ=గోవిష.

**గోవిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. గోమయము, ఆవుపేఁడ.

**గోవిసర్గము.** సం=గోసర్గము.

**గోవు.** సం. వి. ఓ. పుం. ౧. ఆదిత్యుఁడు. ౨. వృషభము. ౩. ఒకానొక యజ్ఞము. ౪. ఒకానొక ఋషి. ౫. గుఱ్ఱము. స్త్రీ. ౧. వాక్కు. ౨. దిక్కు. ౩. భూమి. ౪. ఆవు. ౫. ఆఁడుగుఱ్ఱము. పుం. స్త్రీ. ౧. స్వర్గము. ౨. వజ్రము. ౩. ఉదకము. (ఈయర్థమున బ. అని త్రి. ని.) ౪. కిరణము. ౫. నేత్రము. ౬. బాణము. ౭. రోమము, వెండ్రుక. ౮. వర్గము. ౯. నారి, అల్లెత్రాడు-కే. ని-(దీనికి స్త్రీలింగమున తత్పురుషసమాసాంతమందు 'గవి' యనురూప మగును. ఉదా: పన్నగగవి = పతంజలి వాక్కు. కామగవి=కామధేనువు. పుంలింగమున తత్పురుషసమాసాంతమందు 'గవ' అనురూప మగును. ఉదా: దృఢగవము. తీక్ష్ణగవుఁడు=తీక్ష్ణమైనసూర్యుఁడు. ఇది సమాహారద్విగువునందు 'గవ' అనురూపము నొందును. ఉదా: పంచగవము. ఇది ఉపసర్జనమైనప్పుడు-బహువ్రీహి మొదలగువానియందు-'గు'అనురూపము నొందును. ఉదా: చిత్రగుఁడు. అతిగువు=గోవు నతిక్రమించినవాఁడు. గవాధ్యక్షుఁడు, గోఅధ్యక్షుఁడు, గోధ్యక్షుఁడు, గవేంద్రుఁడు మొదలగుపట్ల నితరవిశేషములు వ్యాకరణమును బట్టి యెఱుంగునది.)

**గోవృషభము.** సం. వి. అ. పుం. ఆఁబోతు.

**గోవృషము.** సం=గోవృషభము.

**గోవ్రజము.** సం. వి. అ. పుం. ౧. పసులసాల. ౨. పసులమంద.

**గోశకృత్తు.** సం. వి. త్. న. గోమయము, అవుపేఁడ.

**గోశీర్షము.** సం. వి. అ. న. చందనవిశేషము.

**గోషా**=ఘోషా. వి. (హిం. గోషా.) అంతఃపురము, రాణివాసము. (శ. ర.)

**గోష్ఠము.** సం. వి. అ. పుం. న. ౧. గోవులుండుచోటు, పసులసాల. ౨. వ్రేపల్లె, గొల్లపల్లె.

**గోష్ఠశ్వము.** సం. వి. అ. పుం. గోష్ఠమందలికుక్క. విశ. (అ. ఆ. అ)-పసులకొట్టమందలి కుక్కవంటి వాఁడు-స్వస్థానమం దుండి పరులను తిట్టుచు ద్వేషించుచు నుండువాఁడు. (త్రి. ని.)

**గోష్ఠి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. ౧. పరిషత్తు, సభ. ౨. సంఘము, సమాజము. ౩. సల్లాపము. ౪. కుటుంబములోఁ జేరినపోష్యవర్గము. ౫. (అలం) ఒక్క అంకముతో ముగియురూపకవిశేషము.

**గోష్ఠిపతి.** సం. వి. ఇ. పుం. ౧. సభాధ్యక్షుఁడు. ౨. గృహాధిపతి, ఇంటిపెద్ద.

**గోష్పదము.** సం. వి. అ. న. ౧ గోవుయొక్క అడుగుకొలఁది గల ప్రదేశము; గోవుగొరిసెచే నేర్పడినగుంట. ౨. గోవులు తిరిగెడిచోటు. (అవుపాదము మొదలగు అన్యార్థములందు 'గోపదము' అనియే రూపము.)

**గోసంఖ్యుఁడు.** సం వి. అ. పుం. గొల్లవాఁడు.

**గోసఁగి.** వి. (సం. గోహింసకః) ౧. మాదిగవాఁడు.

సీ...గోసంగి మాదిగ గూబరి యన, మాతంగుఁ డగు...ఆం. భా. ౨. ౫౯.

క. సంగీతఫలంబున గో, సంగి సగ మైన దయ ప్రాపఁగ నీవే...అము. ౬. ౬౪. ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౭౧ పం.

**గోసదృక్షము.** సం. విశ. (అ. ఆ. అ) గోవుతో సమాన మైనది. వి. అ. పుం. గవయము, గురుపోతు.

**గోసన**=గోను. వి. (సం. ఘోషణా. ప్రా. ఘోసణా. క. గోసనె.) ౧. చాటించుట. ఆం. భా. ౧. ౧౧౪. ౨. గోల, ఘోషము.

క. మాసామి మాకు గోసఁగిన, మీసామ్ము నీకు మగుడ మీమాసామ్ముల్ వాసి వడకుండ నూరక, గోసన యేమిటికి మార్చుకొనియెద మింఁ డెన్. పి. శకుం. ౩. ౮౨.

**గోసనపుచ్చు**=౧. చాటించు, ప్రకటించు.

చ...దాసియుఁడ్, గొఱగొఱ వీటసెల్లెడల గోసనపుచ్చిన నర్థులుబ్బుదై, యమరమాని తద్విభుఁడు నాబలభద్రునిఁ బట్టఁ బంచినన్. దశకు. ౧౦. ౧౨౬.

౨. స్తుతించు, పొగడు.

మ. తనదుర్వారతరప్రతాపమునఁ జిత్తస్నేహము ల్గట్టి సే, యునితం డెట్టివిదగ్ధుఁడో తలఁపనోహో యంచు లోకంబు గో, సనపుచ్చం గర మొప్పు దర్పకుఁడు రాజత్సుందరాకారుఁ డో, భవనంబన్నుఁ గృతీశ్వరుం బ్రచురసౌభాగ్యాన్వితుం జేయుతన్. దశకు. ౧. ౭.

**గోసము.** సం. వి. అ. పుం. ౧. బోలము, బాలెంత బోళము. ౨. ప్రభాతము, వేకువ.

**గోసర్గము.** సం. వి. అ. పుం-ఆవులను మేఁతకు విడుచువేళ-గోవిసర్గము, ప్రభాతము.

**గోసు.** వి. (సం. ఘోషః) ౧. చాటింపు, గోసన.

గీ. గోసన యనంగ గోసు నా ఘోషణ మగు... ఆం. భా. ౧. ౧౧౪.

౨. దూఱు, నింద.

మ...ఈగో సేల చుట్టాలలోన్. హరి. పూ. ౫. ౨౩౪.

గోసడుచు=నిందించు.

మ. మనలన్ ధూర్జటితోడ గోసడిచి కామధ్వంసి పట్టీక పొంౘడని చంద్రాంకునిఁ జూపి పోవిడ సురేంద్రాదు ల్సరోజాతునిం,గని యొగ్గ్రప్రకటించినం గినిసి లోకంబు ల్వివంగా వతం, డనుమానింపక పూని దైత్యకులసంహారంబు గావింపఁగాన్. నిర్వ. ౨. ౯౩.

గోసెక్కఁగఁజేయు=తప్పగా నెంచు?

ఉ. అక్కట యేను వేడ్క పడి యానెడునాసవ మర్థిఁ దేరఁగా, నొక్కనికృష్టుఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో,సెక్కఁగఁజేసి నిన్ను నతిహీనవిధాననియుక్తుఁ జేఁత గా,నిక్కమ యుమ్మలించి తిది సెయ్యముతియ్యము కల్మియే సఖీ. భార. విరా. ౨. ౯౭.

గోసెక్కించు=స్తుతించు, పొగడు.

క. కఱుదులమాటల మమ్మం, గుఱుచవడుగ యేల యింత గోసెక్కింపన్, నెఱయఁగ నీయిష్టము మా, కెఱిఁగింపుము వేడ్క నిత్తు మెయ్యాదియైనన్. హరి. ఉ. ౧౦. ౨౪౩.

మ. హరి దాఁటించెఁ బురోపకంఠమున వాహ్యాళిప్రదేశంబునం, దరరే యల్లయరెడ్డినందనుఁడు దొడ్డయ్యాఖ్యమాధీశ్వరుం,డిరువైనాలుగుమూళ్ల మేర యని గోసెక్కింపఁగా నేల య,ద్ధరణీనాథునికీర్తి దాఁటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండమున్. కాశీ. ౧. ౫౩. (చి. ని. పా.)

గోసూత్రిక. సం. వి.ఆ.స్త్రీ.దామెనత్రాడు,పశువులను కట్టువేర్వేఱుపలుపులు గలనిడివిత్రాడు.

గోస్తనము. సం. వి. అ. పుం. ౧. ఆవుచన్ను. ౨. నలువదిపేటలు గలముత్యాలహారము.

గోస్తని. సం. వి. ఈ. స్త్రీ. ద్రాక్ష ౯.

గోస్వామి. సం. వి. న్. పుం. ౧. గోవుల కొడయఁడు. ౨-జితేంద్రియుఁడు - కొన్నిపురుషనామములచివరఁ జేర్పఁబడుగౌరవనామము.(ఉదా:- బోపదేవగోస్వామి, మొ.) ౩. (నాట్యపరిభాష యందు) రాజకుమారుఁడు. (వై. ని, కే. ని.)

గోహత్య. సం. వి. అ. స్త్రీ. గోవును చంపుట.

గోహత్యగాఁడు. మి.విణ.గోహత్య చేసినవాఁడు.

సీ....న న్నెట్లుగా నిట్టిగోహత్య గానిఁ జేసి,కను చు...వరాహ. ౧౦. ౬౫.

గోహరి. వి. పరాక్రమము. (శ. ర)

సీ. హరికిశోరములగోహరికి కోష్ఠలనిమ ర్వారగ ర్వాటోపవీరభటులు. జై. భా. ౬. ౧౫౪.

గోహరీతకి. సం. వి. ఈ. స్త్రీ-మనుజులకు కరక కాయలవలె పశువులకు హితము చేయునది-బిల్వము, మారేడు ౯.

గోహిరము. సం. వి. అ. న. కాలిమడమ, పాదమూలము. (కల్ప)

## గౌ

గౌండ్లవాఁడు=గవుండ్లవాఁడు. (సం. గోండః.)

గౌఁడు=గవుఁడు. వి. ౧. సారాయిఅమ్మువాఁడు. ౨. కాఁపువారిపట్టపుపేరు. (శ. ర.)

గౌఁడుగీతములు=కల్లు దింపెడివారిపాటలు. (కు. సం. వ్యాఖ్య)

ఉ. జీతికకల్లు ద్రావి మదసింధురగామిను లన్నికేరియ,ల్వాఱుచు గౌఁడుగీతములు వాడుచుఁ బొల్పుగఁ గ్రాలియాడుచున్. కు. సం. ౬ ౮౦౨.

గౌడ(ళ). సం. వి. ఆ. స్త్రీ. (సంగీ) స్త్రీ రాగములలో నొకటి.

గౌడపేరు=గవుడపేరు.

గౌడము. సం. వి. అ.పుం.ఒకానొకదేశము. న. ఒకానొకపిండివంట, బెల్లముతో చేసినభక్ష్యము.

గౌడసరము=గవుడసరము. వి. స్త్రీ భూషావిశేషము. ('చెంపసరము' అని శ.ర-కాని ఈక్రింది ఉదా

కారణముచుట్టి 'స్త్రీ హస్తభూషావిశేషము' అని తోఁచుచున్నది.)

గీ. మెఱుఁగుఁదీఁగెయుఁ బెద్దముక్కఱయుఁ బెట్టి, దండకాయెతులును సందిదండ లునిచి, కేలగాజులు గాడసరాలు దొడిగి, ప్రేమఁగై సేసి... వై జ. ౪. ౩౦.

సీ... అణిముత్తెపుఁబేస్లు సందిదండలు మూడిగములు గాడసరములును. కళా. ౭. ౬౬.

గాడి. సం. వి. ఈ. స్త్రీ. ౧. బెల్లమునుండి తీసినసారాయి. ౨. (అలం) రీతులలో నొకటి. (ఇది పరుషాక్షరబహుళమై సమాసబహుళముగా నుండును) ౩. (సంగీ) స్త్రీరాగవిశేషము. (కల్ప)

గాడికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. బెల్లమున కుపయోగించునది. ౨. బెల్లముతో చేయఁబడినది. వి. అ. పుం. చెఱుకు ౪. న. మద్యవిశేషము.

గౌణము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. అముఖ్యము, అప్రధానము. ౨. ఔపచారికము, లాక్షణికము ౩. గుణసంబంధమైనది.

గౌణికము. సం. విణ. (అ. ఈ. అ) ౧. సత్త్వాదిగుణములచేత కలిగినది. ౨.అముఖ్యము. ౩.గుణములకు సాధనమైనది, గుణములను కలిగించునది. ౪. గుణముల నెఱిఁగినది. ౫. గుణములను చెప్పు గ్రంథమును చదివినది. (వాచ)

గౌణ్యము. సం. వి. అ. న. అప్రాధాన్యము, అముఖ్యత.

గౌతమి. సం. వి. ఈ. స్త్రీ. ౧.కృపి, ద్రోణునిభార్య. ౨. గోదావరి. ౩. బుద్ధునిబోధనము. ౪. గౌతముని న్యాయశాస్త్రము. ౫. ధనుపు. ౬. దుర్గ. ౭. గోమతీనది. ౮. గోరోజనము.

గౌతముఁడు. సం. వి. అ. పుం-గోతమువంశమున పుట్టినవాఁడు-౧. అహల్యాపతియు శతానందజనకుఁడు నగునొకఋషి. ౨. శతానందుఁడు. ౩. భరద్వాజుఁ డనుముని. ౪. కృపాచార్యుఁడు. ౫. మాయాదేవీపుత్త్రుఁ డగుశాక్యబుద్ధదేవుఁడు.

గౌద=గవుద. వి. ౧. చుబుకము, గడ్డము; నవుడక్రిందిభాగము.

సీ... ప్రసన్నత నొంది కుబ్జ ముప్పంకలయొసలు సక్కఁగ నొత్తి యునుచఁ దలఁచి, తత్పదంబులమీఁదఁ దనపదంబులు ద్రొక్కి హస్తాంగుళిద్వయ మబలగౌద, క్రింద విప్పగ నిడి కృష్ణుఁడు మీఁదికి నెత్తిన వక్రత లెల్ల మాని ...భాగ. ౧౦ పూ. ౧౨౭౭.

ఉదా: గౌదబిళ్లలు.

౨. గండస్థలము, చెంప.

సీ. చెక్కుచెక్కిలిచెంక చెంప గౌదయనంగ గండస్థలాఖ్యయై యుండు ... ఆం. భా. ౨. ౧౪౩.

జ: గౌదకట్టు.

గౌదకట్టు=గవుదకట్టు. వి. (గౌద + కట్టు) చెంపలను మూసి కట్టుట; చెంపలను మూసికట్టినకట్టు.

గీ. చెంపలను మూసి కట్టుట చెలఁగు గౌదకట్టనంగను ...ఆం. భా. ౩. ౩౭.

చ...గౌదకట్టు గసచేరులనెక్కియు దోఁపు నొల్చి పోఁక. ఆము. ౬. ౮౧.

గౌధారము. సం. వి. అ. పుం. ఉడుముయొక్క పిల్ల.

గౌధూమీనము. సం. వి. అ. న. గోదుమలు పండెడుపొలము.

గౌధేయము. సం=గౌధారము.

గౌధేరము. సం=గౌధారము.

గౌనర్దుఁడు. సం=గోనర్దీయుఁడు.

గౌపుచ్ఛికము. సం. విణ. (అ. ఈ. అ) ౧. ఆవుతోఁక యిచ్చి కొనఁబడినది. ౨. ఆవుతోఁక పట్టుకొని దాఁటునది.

**గౌర**=గవుర. వి. వర్తకుఁడు, బేహారి.

గీ. ఈడను వళంద బందర యింగిలీసు,కళము
మొదలైనపేటఁ గౌర లెల్ల,సారభద్రవ్యము
లు చేరసారమూడఁ, బిలువనంపిరి తమతమ
పేటలకును. హంస. ౧. ౧౧౨.

క. ఈరీతి సకలధర్మవి,చారుం డగువతనిమాట జ
వదాఁటక యగ్గౌర మనుచున్నఁ దన్నగ,రీర
త్నం బేలునట్టినృపవరుఁ డెలమిన్. శుక. ౧.
౯౦.

**గౌరక్ష్యము.** సం. వి. అ. న. పశుపాల్యము, పసు
లను కాచుట.

**గౌరము.** సం. విణ. (అ. ఈ. అ) ౧. తెల్లనిది. ౨. ఎఱ్ఱనిది. ౩. పీతము, పసుపువచ్చనిది. ౪. స్వచ్ఛమైనది. వి. అ. పుం. ౧. తెలుపు. ౨. ఎఱుపు. ౩. పసుపు. ౪.తెల్లావచెట్టు. ౫. ఏకశఫము గలఒకజాతి మృగము. న. ౧. పద్మకేసరము, అకరువు. ౨.కుంకుమపువ్వు. ౩. బంగారు.

**గౌరవము.** సం. విణ. (అ. ఈ. అ) గురుసంబంధమైనది. వి. అ. న. ౧. గురుత్వము, బరువు. ౨.గొప్పతనము. ౩. బహూకారము, మన్నన.

**గౌరవించు.** సం. స. క్రి. గౌరవము చేయు.

వ...ఐరావణకుంభికుంభాస్ఫాలనకర్కశం బగు
కరంబున వాస్తోష్పతి తన్ను సంస్పర్శించి గౌ
రవించిన మన్మథుండు మధుసహాయుండై హి
మవత్పర్వతంబు సేరం జనియె. హర. ౩.౫౩.

**గౌరవితము.** సం. విణ. (అ. ఆ. అ) పూజ్యము, గౌరవము కలది.

**గౌరసర్షపము.** సం. వి. అ. పుం. ౧. తెల్లావచెట్టు. ౨. పరిమాణభేదము.

**గౌరాస్యము.** సం. వి. అ. పుం. తెల్లమొగమును నల్లదేహమును గలకొండముచ్చు.

**గౌరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పార్వతి. ౨. ఎనిమిదేండ్లచిన్నది. (శ్లో. అష్టవర్షా భవేద్గౌరీ నవవర్షా తు రోహిణీ.) ౩. సమర్తాడనికన్యక. ౪. భూమి. ౫. పసుపు. ౬. మ్రానిపసుపు. ౭. గోరోజనము. ౮. వరుణునిభార్య. ౯. మల్లెతీఁగ. ౧౦.తులసిచెట్టు. ౧౧. మంజిష్ఠ, మంజిటిచెట్టు. ౧౨. తెల్లగఱికచెట్టు.౧౩. వాక్కు. ౧౪. సువర్ణకదళిచెట్టు. ౧౫. ఒకానొకరాగము. (వాచ)

ఉ... భైరవి నాట తోడి... గౌరి బిళాహరి ల
లితకన్నడగౌళ ముఖారి... చెన్న. ౨.౨౩౬.

**గౌరికుంకుమలు.** మి. వి. బ. ఒకజాతివడ్లు.

సీ...సీతాభోగసరులు గౌరి,కుంకుమల్ రణపెం
డ్లికొడుకులు...గీ...అది యను పేరు గలుగు
వడ్లనియింట,నుండు...హంస. ౪. ౧౨౭.

వ...సీతాభోగాలు గౌరికుంకుమలు నాగమల్లెలు
...ప్రబంధ. ౧౧౨.

**గౌరిలము.** సం. వి. అ. పుం. ౧. తెల్లావచెట్టు. ౨. అయశ్చూర్ణము, ఇనుపపొడి.

**గౌరీజము.** సం. వి. అ. న. అభ్రకము.

**గౌరీపట్టము.** సం. వి. అ. పుం. శివలింగము నెలకొనియుండుపళ్లెరమువంటిపీఠము, పానపట్టము.

**గౌరీలలితము.** సం. వి. అ. న. హరితాళము, అరిదళము.

**గౌరు**[1]=గవురు. వి. ౧. ఏనుఁగు.

సీ...ఏనుంగు హత్తి గౌ రేనుఁ గేన్గు, నాఁగ
దంతావళ నామ మూ...అం. భా. ౨. ౧౯౪.

ఉ...నీరు ద్రావుగౌ,రుం దిగి యుండు నిట్ల పగ
రోవ మెలర్పఁగ నాఁడునాఁటికిన్. భార.
అను. ౧. ౨౨౧.

గౌరుమోముదొర = గజాననుఁడు, విఘ్నేశ్వరుఁడు.

చ. ... నిచ్చలుం, బలితపుగౌరుమోముదొరపాద
యుగంబు శుభంబు లీవుతన్. చం. రా. ౧. ౬.

**గౌరు**[2]. వి. కాహళి, బాకా.

వ...మారి భేరి గౌరు గుమ్మెటంబు ... లోనగున సంఖ్యాతవాదిత్ర త్రితయపరంపరలు ... ఆము. ౪. ౩౫.

పీ. గౌరవ నేనుఁగు కాహళి విలసిల్లు ... ఆం. భా. ౩. ౪౪. హంస. ౩. ౨౯.

**గౌరు**[3]. వి. కపటము.

సీ...కపటాఖ్య విలసిల్లు గబ్బి గౌరు ... ఆం. భా. ౧. ౧౩౭.

**గౌరుఁడు.** సం. వి. అ. పుం. ౧. చంద్రుఁడు. ౨. బ్రహ్మదేవుఁడు. (శే. ని)

**గౌలక్షణికుఁడు.** సం. వి. అ. పుం. గోలక్షణము లు తెలిసినవాఁడు. ౨. గోలక్షణములను దెల్పుశాస్త్రమును చదివినవాఁడు.

**గౌలికము.** సం. వి. అ. పుం. ముష్కకము, మొక్కపుఁజెట్టు.

**గౌలు**=గవులు. వి. ౧. గంధము, వాసన.

చ...లేఁగపులితండము నెత్తుటిగౌలుకై వాళా, వాళిమెయి రాఁగ...సారంగ. ౩. ౧౧౬.

ద్వి. మానిసిగౌలుఁ బల్మఱు పసిగొనుచు...ద్వి. మారిశ్చ. పూ. ౨౦౨౯ పం.

౨. దుర్గంధము, దుర్వాసన.

గీ. మూఁడువేళలఁ బురువులఁ దోఁడివేసి, నీళ్లచే గౌలు వోవంగ నెమ్మిఁ గడిగి. భల్లా. ౨౭. (శ. ర.)

**గౌళము**=గవిలెము? వి. వాసనకై అఱుగఁదీసి గంధములో కలిపెడుఒకానొకగింజ.

సీ. గౌళము ల్పచ్చాకు కచ్చూరములు...హంస. ౧. ౭౧.

**గౌళి**=గవుళి. వి. గృహగోధిక, బల్లి. (ఇది శకునము ను సూచించును.)

వ...కౌశికంబు డబ్బు గబ్బులుఁగు గౌళి కనుఁ బెంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు భావిప్రయోజనసూచకంబులై యున్నయవి. ఆము. ౬. ౬౬.

గీ. బల్లి గౌళన ముసలికిఁ బరఁగు సాంజ. సాం. ని. తిర్య. ౬౫. వేంక. తిర్య. ౯౫.

**గౌళ్ళి.** సం=గాడి.

**గౌశతికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ) నూఱుగోవులు కలవాఁడు.

**గౌష్ఠీనము.** సం. వి. అ. న. మునుపు గోవులమంద యుండినపట్టు.

**గౌసహస్రికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ) వేయి గోవులు గలవాఁడు.

**గౌసెన**=గవుసెన. (సం. కోశః. త. కొడసై.)

క...నాదగు,కడిమియ నీసైన్యమునకు గౌసెన గాదే. భార. ఉద్యో. ౪. ౨౧౪. (గవుసెనవలె రక్షక మని భావము.)

ఉ. కట్టిననీలిదిండ్లు సెలకట్టియవిండ్లును విండ్లగౌసెనల్. మనుచ. ౪. ౩౩. కువల. ౫. ౩౬.

## గ్ర

**గ్రంథకుటి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పుస్తకభాండాగారము. ౨. వ్రాసికొనెడిగది. (త్రి. ని.)

**గ్రంథన.** సం. వి. ఆ. స్త్రీ=గ్రంథనము.

**గ్రంథనము.** సం. వి. అ. న. ౧. కూర్పు, రచన. ౨. (పుష్పమాలిక, మొ. వానిని) గ్రుచ్చుట.

**గ్రంథము.** సం. వి. అ. పుం. ౧. కూర్పు, రచన. ౨. (పుష్పములు, మొ. వానిని) గ్రుచ్చుట. ౩. కావ్యాది. ౪. ధనము. ౫. అనుష్టుప్పు, ముప్పదిరెండక్షరములశ్లోకము. (వాచ)

**గ్రంథి.** సం. వి. ఇ. పుం. ౧. కంతి. ౨. గనుపు. ౩. ముడి. ౪. ముల్లె, బట్టకొంగున ముడివేయఁబడిన ధనము. ౫. అవయవసంధి, కీలు. ౬. గండీవనము,

గ్రంథిపర్ణము ౯. ౩. కౌటిల్యము. ౯. పుం. ౧. గ్రంథములు కలవాఁడు. ౨. గ్రంథములు చదువు వాఁడు.

గ్రంథికము. సం. వి. అ. న. ౧. పిప్పలీమూలము, పిప్పలికట్టె. ౨. గ్రంథిపర్ణము ౯. ౩. గుగ్గులువు, మహిషాక్షము. ౪. శరీరము, వెదురు మొలక. (మే. ని.)

గ్రంథికుఁడు. సం. వి. అ. పుం. ౧. జోస్యుఁడు. ౨. సహదేవుఁడు, యుధిష్ఠురునితమ్ములలో నొకఁడు. (మే. ని.)

గ్రంథిచ్ఛేదకుఁడు. సం. వి. అ. పుం. ముడియవిడుపుదొంగ, మూట విప్పి దొంగతనము చేయు వాఁడు.

(ఇట్లే గ్రంథిచ్ఛేదుఁడు, గ్రంథిమోచకుఁడు, మొ.)

గ్రంథితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కూర్పఁబడినది. (మాల్యాది) ౨. రచింపఁబడినది. (గ్రంథాది.)

గ్రంథిపర్ణము. సం. వి. అ. న. ౧. గండివనము ౯. ౨. పచ్చాకు౯. ౩. మాచిపత్రి ౯.

గ్రంథిబంధనము. సం. వి. అ. న. ౧. ముడివైచుట. ౨. వివాహమున వధూవరులచెఱఁగులు ముడివైచుట.

గ్రంథిమూలము. సం. వి. అ. న. లశునము, వెల్లుల్లి ౯ (రా. ని.)

గ్రంథిలము. సం. విణ (అ. ఆ. అ) గనుపులు గలది. వి. అ. పుం. వెణుతురు ౯. న. ౧. పిప్పలివేరు. ౨. అల్లము ౯.

గ్రంథిహరుఁడు. సం. వి. అ. పుం. మంత్రి.

గ్రంఠె. వి. దారబంధము లోనగువానినిలువులయందు బిగఁగొట్టినచీలకు తగిలించెడుతలుపులయందలియినుపపట్టె. (శ. ర.)

గ్రక్కతిలు(ల్లు). అ. క్రి. (భయాదులచే) వడఁకు, కంపించు, అదరు.

క. మ్రొక్కెడము సామి నీదయ, నెక్కడనుం బొద్దుపొడుచు టెఱుఁగక నీవే, దిక్కని యుండుము దాయలు, గ్రక్కతిలం గడుపు చల్ల గదలక యుండ౯. రామా. ౨. ౩.

ఉ. ...ధరిత్రియుం, గ్రక్కతిలంగఁ జొచ్చె వధిరంబుగ నొక్కత మ్రుక్కెళ యై, మిక్కిలి యేడ్చు చున్నయది మీఁదటికే దది యేమి పుట్టునో. భా. రా. యు. ౧౩౩౪.

సీ. నిజవేగజితమనోనిలజవవాజిసంహతి ధరాతలము గ్రక్కతిలఁ బర్వ. చిత్రభా. ౩. ౩౦. నుద. ౫. ౫౧.

గ్రక్కదలు. అ. క్రి. (గ్రక్కు+అదలు-ఉభయయతులలోనిది.) ౧. కంపించు, అదరు.

చ. గదఁ గొని భీముఁ డంత్యలయకాలకృతాంతుఁడపోలె నేల గ్రక్కదల నదల్చి నిల్చిన నకంపితుఁడై మణిమంతుఁడు...భార. అర. ౪. ౧౫.

(అసురేంద్రసైన్యములు) క. పదపదఁ డంచు దిశలు గ్రక్కదలఁగ లేయొండచాయఁ గడు నుగ్రములై, యెదురం గొందఱు గల రని, మది నించుక సరకుగొనక మదమున నడచె౯. ని. ర్వ. ౬. ౯౨.

(లక్ష్మణుఁడు.) క. కదలె రథసమున ధర గ్రక్కదలఁగ శేషుండు శిరము లల్లన వంప౯. భా. రా. యు. ౧౩౧౦.

౨. భగ్నమగు.

చ. ...కలాపకుంతలలు కంతుశరవ్యథ మాన మెల్ల గ్రక్కదలి కలంగకుండఁ దమకాంతునిఁ దెచ్చెదమన్న ...వరాహ. ౪. ౪౨.

గ్రక్కన=గ్రక్కున. క్రి. విణ. ద్రు. శీఘ్రముగా.

చ. ...పైచెఱంగు గ్రక్కనఁ జనుదోయిఁ జేర్పు

చు మొగంబున లేఁజెమ రంకురింప... పారి. ౧. ౧౨౮.

మ...ధాత... గ్రక్కున లంకాపురి కేఁగెఁ జారణముఖుల్ గైవారము ల్సేయఁగన్. ఉ. రా. ౫. ౧౨.

మ. అని యూహించుసమీరపుత్త్రుని రయం బారన్ భుజంగాంబ గ్రక్కున మ్రింగ న్దశయోజనాయతముగా నాస్యంబు వే పెంచినన్. భా. రా. సుం. ౪౭. (చి. ని. పా.)

మ...ఆచంద్రహాసుండు...జే,వునిఁ జక్రాబ్జగదాసిహస్తు...కాంచి గ్రక్కున మాణిక్యరథంబు డిగ్గి చని సాష్టాంగంబుగా మ్రొక్కినన్. జై. భా. ౮. ౧౩౦. దశా. ౧. ౩౦౪.

గ్రక్కు=కఱుక్కు. వి. తెగుట మొదలగువానియందగుఅనుకరణము.

ఆ. అన్ని నెడఁదవాతియమ్ము లద్భుతముగ,నొక్క ముష్టిఁ దొడిగి గ్రక్కునంగ,నతఁడు లీలఁ దునిమె నందఱతలలును...భార.విరా.౫.౧౮౯.

జ: గ్రక్కుడలు.

గ్రక్కున=గ్రక్కన. క్రి. విశ. ద్రు. ౧. శీఘ్రముగా.

చ. కరము సలంబు మీఱ దశకంఠునిమంత్రి ప్రహస్తుఁ డుగ్రుఁ డై, కరముసలంబునం గడపె గ్రక్కున వేవుర యత్తులన్...ఉ. రా. ౩. ౩౬.

చ...దైవకృతంబులు మాన వంచు గ్రక్కున నలప్రవేశమునకుం గృతనిశ్చయ యయ్యె నంతటన్. విక్ర. ౬. ౧౨౬. యయా. ౩. ౯. ఆం. భా. ౩. ౭౧. దశా. ౨. ౬౫.

౨. వెంటనే.

సీ. గ్రక్కున సప్తపారావారవలయితక్షోణిమండలి వాన గురియదయ్యె. వరాహ. ౩. ౫౨. (చూ. ౫౦, ౫౧.)

౩. నిరంతరము, ఎడతెఱపి లేకుండఁగ.

ఉ. అక్కట నీయుదగ్రచరణాహతి కోరువ లేక యెగతిన్, స్రుక్కినొ గట్టురాచకొమరుండలనాఁడు కపోతపాంక్తితిన్, గ్రక్కున మూల్గుచున్ బిలముఖంబున నేఁడును గంటె నెత్తురుల్, గ్రక్కెడు ధాతువు ల్సదరఁగా నరుణాంబుఝరీమిషంబునన్. వసు. ౨. ౯.

గ్రచ్చ=గచ్చ.

సీ. గ్రచ్చ గచ్చనఁ జెల్వఁ గాంచుఁ గాచస్థాలి ...ఆం. భా. ౨. ౪౯.

క. అచ్ఛోటితీర్థవాసులు, వచ్చి తగుని నీకుఁ బుణ్యవాహిని నిటు వా,క్రుచ్చితి వని వడి నందఱు,గ్రచ్చ గదలినట్లు గుప్పకరిగొని తిట్టన్. జై. భా. ౪. ౭౨.

జ: గ్రచ్చకాయ.

గ్రచ్చకాయ. వి. (గ్రచ్చ + కాయ) గ్రచ్చతీఁగకాయ.

సీ. కలివోసి నాన్చినగ్రచ్చకాయలభంగిఁ గోఱమాలినట్టిదృగ్గోళకములు. కాశీ. ౩. ౧౩౮.

౨. బాలక్రీడావిశేషము.

సీ. డాఁగిలిమ్ముచ్చులాటలు గ్రచ్చకాయలు వెన్నెలకుప్పలు తన్నుబిల్ల. కాశ. ౩. ౩౩.

గ్రచ్చు=గచ్చు౨. విశ. (సం. గ్రస్తమ్-శ. ర)

గ్రథన. సం. వి. ఆ. స్త్రీ=గ్రథనము. (విల్యమ్సు)

గ్రథనము. సం. వి. అ. న. ౧. రక్తాదులు పేరుట, గడ్డకట్టుట. ౨. కూర్పు; గ్రుచ్చుట. ౩. (గ్రంథాదులు) రచించుట. (విల్యమ్సు)

గ్రథితము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. రచింపఁబడినది. (గ్రంథాది) ౨. గ్రువ్వఁబడినది. (హారాది) ౩. కూర్పఁబడినది. ౪. పేరినది, గడ్డకట్టినది.

గ్రద్ద=గద్ద. వి. (సం. గృధ్రః. ప్రా. గద్ధో) గద్ద.

సీ...గృధ్రము గ్రద్ద వాఁగను దనర్చు. ఆం. భా. ౨. ౯౩.

సీ...కనుఁగొంచె ధ్వజముపై గ్రద్ద లాడె. ఉ. రా. ౬. ౨౩౫.

జ: గ్రద్దగోరు, గ్రద్దముక్కువాఁడు.

**గ్రద్దగోరు**=గద్దగోరు. వి. దే. (గ్రద్ద+గోరు.)

౧. చోరసాధనవిశేషము.

(చోరవర్ణనము) మత్త. గాలిచీరయు నొల్కిబూడిద గ్రద్దగోరును గ్రొంకియుఁ...ద్వా. ౧౦. ౧౧౮.

క. బలపముఁ గన్నపుఁగత్తియు...గ్రద్దగోరును...కత్తెరయును మొదలగువానిఁ. పరమ. ౪. ౧౮౪.

౨. మల్లసాధనవిశేషము.

గీ...గ్రద్దగోళ్లు... చూరి బాణా ధరించు వర్వీరుఁ డెపుడు. హంస. ౧. ౨౦౫.

**గ్రద్దన.** క్రి. విశే. దే. శీఘ్రముగా.

క...అయ్యిద్దఱుఁ దమరథములపై, గ్రద్దన నిడికొని తొలంగఁగాఁ జని రథిపా. భార. భీష్మ. ౩. ౪౩.

గీ. త్వరితమున కొప్పుఁ బేళ్లు...గ్రక్కున గ్రద్దన వడంగ...ఆం. సం. మా న. ౬౪.

**గ్రద్దముక్కువాఁడు.** వి. (√గ్రద్ద.) ఖురణుఁడు, వాఁడిముక్కు గలవాఁడు.

సీ...బుఱ్ఱముక్కువాఁ డన గ్రద్దముక్కువాఁ డనఁగను గ్రమముగా వలువుచుండ్రు, ఖురణ నఖురణసుల్...ఆం. భా. ౨. ౧౨౧.

**గ్రమ్మన**=క్రమ్మన.

చ...ఈతని నీవును నేను నుండి మొక్కలమునఁ బోవ నీఁదగదు గ్రమ్మన సెద్దుము నిల్పు మవ్విభుఁ. భార. ద్రో. ౫. ౧౧౮.

శ. గ్రమ్మన సెత్తురుటేఱులు, గ్రమ్మఁ...అక్షౌహిణీత్రయము మడియించెఁ. జై. భా. ౭. ౧౬౧. ఈ. సం. ౫. ౬౩౨. హరి. ఉ. ౧. ౩౬.

**గ్రసనము.** సం. వి. అ. న. ౧. కబళించుట, మ్రింగుట; తినుట. ౨. కబళము, గ్రాసము.

**గ్రసి(యి)ంచు.** సం. స. క్రి. ౧. కబళించు, మ్రింగు; తిను.

వ...అమృతాబ్ధి నాకసంబు మ్రింగు నతివిశాలం బగునవ్వియత్తత్త్వంబు మనంబు గ్రసియించు మనంబు నయ్యహంకారాధిష్ఠితపురుషుండు కబళించు...భార. శాం. ౬. ౨౮.

చ... సుందరహరినీలజాలము తృణంబు గ్రసించె దదీయనైల్యభా, గురుకచమండిమంబు నను నోడి...కవిజ. ౧. ౬౫.

౨. లోఁగొను, లోపల నడఁచుకొను.

ఉ. మనమున రాగలోభములు మత్సరము ల్దమ నగ్గలింప నజ్ఞులు గడు న్మమత్వమున సన్న్యులు న్నదులు న్నగంబులుఁ, వనములు వేఱువేఱ బలవంతులు లుబ్ధులునై కడంగి క్రొనిరి తదీయకోపమునఁ గుంభిని మోసమునఁ గ్రసించినఁ. మార్క. ౪. ౪౨.

౩. ఆకర్షించు. కవిజ. ౧. ౬౫.

**గ్రసిష్ణువు.** సం. విశే. (ఉ) ౧. మ్రింగువాఁడు; తినువాఁడు.

**గ్రస్తము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. తినఁబడినది; మ్రింగఁబడినది. ౨. గ్రహింపఁబడినది, పట్టుకొనఁబడినది. ౩. ఆక్రాంతము. (ఉదా. రోగగ్రస్తుఁడు, మొ.) ౪. వర్ణలోపము గాని పదలోపము గాని కలిగినది. (మాట, మొ.)

**గ్రస్తాస్తము.** సం. వి. అ. పుం. గ్రహణకాలమధ్యమున-విడుపునకు ముందు-అస్తమించిన గ్రహము. (సూర్యాది) న. గ్రహణకాలమధ్యమున-విడుపునకు ముందు-సూర్యచంద్రు లస్తమించుట.

**గ్రస్తి.** సం. వి. ఇ. స్త్రీ=గ్రసనము.

**గ్రస్తోదయము.** సం. వి. అ. పుం. గ్రహణములో నుండఁగ సూర్యచంద్రు లుదయించుట.

గ్రహకల్లోలము. సం. వి. అ. పుం. రాహుగ్రహము. (త్రి. ని.)

గ్రహణము. సం. విణ. (అ. ఈ. అ) గ్రహించుసాధన మైనది. వి. అ. న. ౧. పట్టుకొనుట. ౨. ఆదానము, తీసికొనుట. ౩. తెలిసికొనుట. ౪. బుద్ధి. ౫. ఆదరించుట. ౬. ఉపరాగము, రాహుకేతువులు సూర్యచంద్రులను బట్టుట. ౭. బంది, చెఱపట్టఁబడినప్రాణి. ౮. చేయి. ౯. ఇంద్రియము. ౧౦. శబ్దము, పదము.

గ్రహణి. సం.వి. ఇ,ఈ. స్త్రీ. ౧-రోగిదేహమును గ్రహించునది-ప్రవాహిక, అతిసారరోగము. ౨. పిత్తధర యనెడికళ, జఠరాగ్ని కధిష్ఠానమగునాడి. (ఇది చెడిపోయినచో గ్రహణీరోగము కలుగును.)

గ్రహణీయము. సం. విణ. (అ. ఆ. అ) గ్రహింపఁదగినది.

గ్రహణీహరము. సం. వి. అ. న-గ్రహణీరోగమును పోఁగొట్టునది-లవంగము.

గ్రహదశ. సం. వి. ఆ. స్త్రీ. (జ్యోతి) గ్రహమునకు నిర్ణీత మైనకాలము.

గ్రహనేమి. సం. వి. ఇ. పుం-గ్రహకక్ష్యలకు నేమివంటివాఁడు-చంద్రుఁడు.

గ్రహపతి. సం. వి. ఇ. పుం. ౧. సూర్యుఁడు. ౨. జిల్లేడు ? ౩. చంద్రుఁడు.

శ్లో. తస్య విస్తీర్యతే రాజ్యం జ్యోత్స్నేవ గ్రహపతేరివ. సం. భార. శాం. (వాచ)

గ్రహము. సం. వి. అ. పుం. ౧. సూర్యాది. ౨. గ్రహించుట. ౩. గ్రహణము, రాహుకేతువులు సూర్యచంద్రులను పట్టుకొనుట. ౪. నిర్బంధము, చెఱ. ౫. పూతనాదిపిశాచము. ౬. అనుగ్రహము. ౭. యజ్ఞపాత్రవిశేషము. ౮. ఆగ్రహము, పట్టుదల, విడువనిపూనిక. ౯. యుద్ధప్రయత్నము. ౧౦. రాహువు. ౧౧. నవసంఖ్య, తొమ్మిది యనుసంఖ్య.

గ్రహశాంతి. సం. వి. ఇ. స్త్రీ. జపారాధనాదులచే గ్రహపీడ నుపశమింపఁజేయుట.

గ్రహాధారము. సం.వి.అ.పుం. ధ్రువనక్షత్రము. ఇట్లే: గ్రహాశ్రయము, మొ.

గ్రహి(యి)ంచు. సం. స. క్రి. ౧. స్వీకరించు; కైకొను, తీసికొను, పుచ్చుకొను. ౨. పట్టుకొను.

సీ. లీలాద్రివన్యామహైలావళుల్ దాని గ్రహియించు విరులచాల్లగనలక్ష్మి. ఉ. రా. ౧. ౫౯.

గీ. పదియు నెనిమిది విద్యలీపద్మనయన, శ్రవణములవెంట నర్థ మర్థము గ్రహించె, నంతయు తీర్ణగంభీరహారిలేఖ, యదిగదా వీనులందుఁ దొమ్మిదవరేఖ. నైష. ౩. ౧౭౪.

గ్రహిలుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. గ్రహించువాఁడు. ౨. కోపానురాగములచేఁ బుట్టినచలనము గలవాఁడు.

గ్రహీత. సం. విణ. (ఋ. త్రి. ఋ)-గ్రహించువాఁడు-౧. పట్టుకొనువాఁడు. ౨. తెలిసికొనువాఁడు.

గ్రహీతవ్యము. సం=గ్రహణీయము.

## గ్రా

గ్రాంథికము. సం. విణ. (అ. ఈ. అ) గ్రంథసంబంధ మైనది.

గ్రాఁజే. వి. ఒకజాతిచెట్టు.

గీ. కడిమి చిగిరించె గ్రాఁజవంగడము ననిచె, నఖిలహిత మైనమేఘోదయంబునందు. పాండు. ౪. ౨౧.

గ్రాద. వి. కదుము.

ఉ. క్రచ్చఱ నేఁగి మేను పెనుగ్రాదలు కట్టఁగ గ్రేసికొంచు...వాసిష్ఠ. ౨. ౧౯౨.

గ్రామకుమారుఁడు. సం. వి. అ. పుం. ౧. ఊరివారిలో అంద మైనవాఁడు. (వాచ) ౨. పల్లెటూరివాఁడు. (విల్సన్)

గ్రామకూటుఁడు. సం. వి. అ. పుం. శూద్రుఁడు.

గ్రామఘాతము. సం. వి. అ. పుం. ఊరిదోఁపిడి. మను. ౯. ౨౬౪.

గ్రామచైత్యము. సం. వి. అ. పుం. ఊరివీథిలోని చెట్టు, రచ్చమ్రాను.

గ్రామటిక. సం. వి. ఆ. స్త్రీ. స్వల్పగ్రామము, పల్లె.

గ్రామణి సం. విశే. (ఈ. ఈ. ఇ) -గ్రామమును గాని సంఘమును గాని నడపువాఁడు- ౧. ముఖ్యుఁడు. ౨. గ్రామాధిపతి. వి.ఈ. పుం. మంగలి. స్త్రీ. ౧. వేశ్య. ౨. నీలిచెట్టు.

గ్రామత. సం. వి. ఆ. స్త్రీ. గ్రామములసమూహము.

గ్రామతక్షుఁడు. సం. వి. అ. పుం. గ్రామమునకు అధీనుఁ డైనవడ్రంగి.

గ్రామపాలము. సం. వి. అ. పుం. గ్రామరక్షకభటసముదాయము, గ్రామరక్షణార్థ మేర్పడినసేన.

గ్రామపాలుఁడు. సం. వి. అ. పుం. గ్రామాధిపతి; గ్రామరక్షకుఁడు.

గ్రామపురోహితుఁడు. సం. వి. అ. పుం. ఊరిపురోహితుఁడు.

ఇస్లో: గ్రామయాజకుఁడు.

గ్రామప్రేష్యుఁడు. సం.వి .అ.పుం. గ్రామభృత్యుఁడు, ఊరివారి కందఱకును పని చేయుభటుఁడు.

గ్రామమద్గురిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. గ్రామయుద్ధము. ౨. శృంగీఝషము, మత్స్యభేదము. (మే.ని)

గ్రామము. సం. వి. అ. పుం. ౧. ఊరు. ౨. షడ్జాదిస్వరసముదాయము. ౩.శబ్దభూతగుణాదులకంటె పరమగునపుడు సమూహార్థము వచ్చును. (ఉదా: శబ్దగ్రామము,భూతగ్రామము, గుణగ్రామము, ఇంద్రియగ్రామము, మొ.) ౪. గ్రామ్యధర్మము, మైథునము. (వాచ)

సా:-గ్రామము క్రొత్త యైనఁ దనకర్మము క్రొత్తయగునా. కుచేల. ౨. ౧౧౩.

గ్రామముపని. మి. వి. గ్రామాధికారిత్వము, గ్రామణీత్వము.

సీ...గాయకుండు గ్రామముపనిఁ గుడుచునాతఁడు గృహ, దాహి కుష్ఠము గలతనువునాతఁడు... భార. అను. ౩. ౧౭౫.

గ్రామముఖము. సం. వి. అ. న. ౧. హట్టము, బజాఱు. (త్రి. ని) ౨. గ్రామద్వారము, గ్రామమునఁ బ్రవేశించుప్రదేశము.

గ్రామమృగము. సం. వి. అ. పుం. కుక్క.

గ్రామషండుఁడు. సం. వి. అ. పుం. మైథునశక్తిహీనుఁడు, నపుంసకుఁడు. (వాచ)

గ్రామసింహము. సం.వి. అ. పుం-గ్రామమున సింహమువంటిది-శునకము, కుక్క.

గ్రామహాసకుఁడు. సం. వి. అ. పుం. భగినీపతి, బావ.

గ్రామాంతము. సం. వి. అ. పుం. ఉపశల్యము, ఊరిపొలిమేర.

గ్రామాంతీయము. సం. విశే. (అ. ఆ.అ) ఊరిపొలిమేరలో నున్నది.

గ్రామాధానము. సం. వి. అ. న-గ్రామరక్షణమునకు అవలంబింపఁబడినది-వేఁట,మృగయ.

గ్రామి. సం. విశే. ( న్. ణీ. న్. ) ౧. గ్రామము కలవాఁడు. ౨. స్త్రీలంపటుఁడు, గ్రామ్యధర్మము కలవాఁడు. ౩. గ్రామవాసి, ఊరివాఁడు. ౪. గ్రామాధిపతి, ఊరిపెద్ద.

గ్రామికుఁడు. సం. వి. అ. పుం. గ్రామాధికారి.

గ్రామీణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. నీలిచె. ౨. పాలంక్యశాకము?.

గ్రామీణము. సం. విశే. (అ. ఆ. అ) ఊరిలో నున్నది; పల్లెటూరిది, నాగరకత లేనిది. వి. అ. పుం. ౧. కుక్క. ౨. కాకి. ౩. ఊరఁబంది.

గ్రామేయము. సం. విశే. (అ. ఈ. అ.) ఊరిలో నున్నది.

గ్రామేయి. సం. వి. ఈ. స్త్రీ. వేశ్య.

గ్రామ్య. సం. వి. ఆ. స్త్రీ. నీలిచెట్టు.

గ్రామ్యకర్కటి. సం. వి. ఈ. స్త్రీ. కూశ్మాండము, గుమ్మడికాయ.

గ్రామ్యకర్మము. సం. వి. న్. న. మైథునము, రతి.

గ్రామ్యకుంకుమము. సం. వి. అ. న. కుసుంభము, కుసుమపూవు. (త్రి. ని.)

గ్రామ్యధర్మము. సం. వి. అ. పుం. మైథునము, రతి.

గ్రామ్యము. సం. విశే. (అ. ఆ. అ) - గ్రామభవము - ౧. ఊరియందు పుట్టినది. ౨. ఊరియందు వసించినది. ౩. గ్రామమున పెరిఁగినది. (మృగము, వృక్షము, మొ- వ్యతి. వన్యము.) ౪. మూఢము, తెలివి లేనిది. ౫. ప్రాకృతము, పామరము, నాగరకత లేనిది. ౬. అసభ్యము, అశ్లీలము; వ్యాకరణదుష్టము, తప్పుది, అసాధువు, అపభ్రంశము. (మాట, మొ.) ౭. షడ్జాదిస్వరసముదాయసంబంధమైనది. వి. అ. పుం. ౧. ఒకానొకకావ్యదోషము. (ఇది శబ్దగతము అర్థగతము అని ద్వివిధము.) ౨. గ్రామమందలిపశువు. (పశువులు గ్రామ్యములు ఆరణ్యములు అని ద్వివిధములు. గోవు మేఁక గొఱియ గుఱ్ఱము మొదలగునవి గ్రామ్యపశువులు. ఋక్షవానరవ్యాఘ్రాదులు ఆరణ్యములు.) న. ౧. మైథునము. ౨. రతిబంధవిశేషము. ౩. అసభ్యమగుమాట.

గ్రామ్యమృగము. సం. వి. అ. పుం. కుక్క.

గ్రామ్యవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పాలంక్యాశాకము. (ఇది గ్రామ్యులకు ప్రియము) ౨. వేశ్య.

గ్రామ్యవాది. సం. విశే. (న్. నీ. న్) ౧. అపశబ్దములు మాటలాడువాఁడు. ౨. అసభ్యసంభాషణము చేయువాఁడు.

గ్రామ్యసుఖము. సం. వి. అ. న. మైథునము, రతి.

గ్రామ్యాశ్వము. సం. వి. అ. పుం. గర్దభము, గాడిద.

గ్రావము. సం. వి. న్. పుం. ౧. ఱాయి. ౨. కొండ. ౩. మేఘము. (శిల్యమ్న.)

గ్రాసము. సం. వి. అ. పుం. ౧. కబళము. ౨. ఆహారము. ౩. మ్రింగుట. ౪. మాటలాడునపుడు స్పష్టముగ తెలియకుండఁగ మాటలు గాని అక్షరములు గాని మ్రింగివేయుట. ౫. గ్రహణము, రాహుకేతువులు సూర్యచంద్రబింబములను మ్రింగుట.

గ్రాహకము. సం. విశే. (అ. హికా. అ.) ౧. గ్రహించునది. ౨. గ్రహింపఁజేయునది. వి. అ. పుం. డేగ.

గ్రాహకుఁడు. సం. వి. అ. పుం. పాములను పట్టుకొనువాఁడు, పాములవాఁడు.

గ్రాహము. సం. వి. అ. పుం. ౧. గ్రహణము, గ్రహించుట. (పట్టుకొనుట, తెలియుట, మొ.) ౨. మొసలి. ౩. ఆగ్రహము, పట్టుదల.

గ్రాహి. సం. విశే. (న్.ణీ. న్) ౧. గ్రహించునది. (పట్టుకొనునది, తెలిసికొనునది, మొ.) ౨. మలబంధము కలిగించునది. వి. న్. పుం. కపిత్థము, వెలఁగ కాయ.

గ్రాహించు. సం. స. క్రి. స్పృశించు, తాఁకు.
శా. బాహాస్తంభచతుష్టయంబున మురప్రధ్వంసి లంఘించియు, త్సాహం బొప్పఁగ నెత్తె మందరమహీధ్రం బుద్ధతింగూటసం, దోహంబుల్

ద్రుహిణాండకర్పరము నున్మూలించు దిక్పటులం, గ్రాహించు బలియాళునిష్ఠురమహాగండోపల ధ్వానముల్. భీమ. ౪. ౫౮. (దిక్కులవఱకు వ్యాపించు అని భావము)

**గ్రాహిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ప్రతికూలరాలైన స్త్రీ. (భట్టి. ౫. ౬౩) ౨. క్షుద్రదురాలభ, చిన్న తీఁటకసింద తీ.

**గ్రాహితము.** సం. విణ. (అ. ఆ. అ) గ్రహింపఁజేయఁబడినది.

**గ్రాహ్యము.** సం= గ్రహణీయము.

## గ్రి

**గ్రిక్కొను**=గిఱికొను. స. క్రి. వేష్టించు.

గీ. గిఱికొనెను బ్రహ్మ బరికొనె గ్రిక్కొనె నన, వెలయు వేష్టించె ననుటకు వేదవేద్య. ఆం. భా. ౩. ౧౧౭.

## గ్రీ

**గ్రీవ(ము).** సం. వి. అ. స్త్రీ- మ్రింగుటకు సాధనము; ఉమియుటకు సాధనము - మెడ, కంధరము.

**గ్రీవి.** సం. విణ. (న్. ణీ. న్.) ౧. నిడుద మెడ గలవాఁడు. ౨. అందమైన మెడ గలవాఁడు. వి. న్. పుం. లొట్టిపిట్ట.

**గ్రీష్మము.** సం. విణ. (అ. ఆ. అ)- రసములను పీల్చునది- వేఁడియైనది. వి. అ. పుం. ౧. వేఁడిమి. ౨. వేసంగి, ఎండకాలము.

**గ్రీష్మసుందరము.** సం. వి. అ. పుం. ఒకజాతిశాకము తీ.

**గ్రీష్మి.** సం. వి. ఈ. స్త్రీ. నవమల్లిక తీ.

## గ్రు

**గ్రుంగుటగుట.** వి. (గుటగుట+గుటగుట) అమృతము మొదలగునవి అధికముగా త్రాగుటయందగు ధ్వనికి అనుకరణము.

చ. గొటగొట ధారగా పడియుచుం గడలొత్తు సుధారసంబు గ్రుంగుటగుట వప్పుటప్పుటికిఁ గ్రోలుచు... పాండు. ౪. ౪౫.

**గ్రుంత**=గుంత. వి. పల్లము.

గీ... పెద్దవాన ... కురియు చుండంగ పఱదలు గ్రుంతమిట్ట, లొక్కకొలఁదిగఁ బాఱెనీళ్లక్కజముగ. ద్వా. ౧౦. ౪౪.

**గ్రుక్క.** వి. (√ గ్రుక్కు) ౧. మ్రింగుట.

ఉ. గ్రుక్కకు గ్రుక్కకుం జవులు క్రొత్తలు సేయఁగ నొక్కకొమ్మ పేరక్కునఁ జేర్చి దాని యధరామృత మానినత్రాణఁ గాక యీ, యక్కకు నోర్చి యిప్పగిది నూపిరిఁ బట్టిన బొజ్జగల్గునే. చంద్రా. ౩. ౧౦౬.

సీ... గ్రుక్క గ్రుక్కకు గుటుగుటుకు మనుచు నొకరెండు గ్రుక్కల నువిదప్రాణంబుల సైతము మేనిలో సత్త్వ మెల్లఁ. గీ. ద్రావె... భాగ. ౧౦ పూ. ౨౨౫. హర. ౬. ౧౨౩.

౨. కంఠనాళరూప మగుపరిమాణవిశేషము; అది పట్టెడిజలము, మొ.

క. నాచనుఁబాలొక గ్రుక్కం, డోచిన్నికుమార త్రావుము... భాగ. ౧౦ పూ. ౨౨౧.

సీ... కుండపుట్టుగుజోగి కొన్న గ్రుక్క. కవిరా. ౪. ౬౩.

క... మీఁక, మ్రింగిన గ్రుక్క న్వారిధి, కింగొఱఁతయె... ఆము. ౬. ౬౪.

౩. ఊపిరి, శ్వాసము.

(వ్యవ) ఒక్కగ్రుక్కలో రెండుపనసలు చెప్పఁగలను. పిల్లవాఁడు గ్రుక్కపట్టి యేడ్చుచున్నాఁడు.

సీ. గడియదైనను గ్రుక్క విడువక హాయలుగా నవగడంబుగఁ దాన మానెడు చేతువు, పరరాగములవింత సారనీక వ్యాప్తిమై మించు గారాగంబుఁ బెంచువింత. కువల. ౪. ౧౧౧.

**గ్రుక్కగొను.** స. క్రి. (గ్రుక్క+కొను)-గ్రుక్కగా కొను-త్రాగు.

ద్వి. అక్కజంబుగ నబ్ధి నాపోశనముగ, గ్రుక్కగొన్నట్టియాకుంభజుఁ డుండ. ద్వి. హరిశ్చ. పూ. ౩౦౨ పం.

(సముద్రుఁడు) సీ. ఎఱుఁగడు మత్తిల్లి పఱఁటిపుట్టువు గ్రుక్కగొనినయప్పుడు గలకుతిలపాటు. యయా. ౧. ౯౫.

**గ్రుక్కలుపెట్టు.** స. క్రి. (గ్రుక్కలు + పెట్టు) -గ్రుక్కలుగా కొను-త్రాగు.

క. కిక్కురుమన కమృతంబును, గ్రుక్కలుపెట్టుదురు సురలు...హర. ౬. ౧౨౨.

**గ్రుక్కలుమ్రింగు.** అ. క్రి. (గ్రుక్కలు+మ్రింగు)-గుటకలువేయు-౧. అపేక్షపడు.

చ. మునుకొని మూఁడుమూలలను ముప్వురు గ్రుక్కలుమ్రింగ...హంస. ౩. ౧౦౩.

౨. సంకోచించు.

ఉదా: ఏల గ్రుక్కలుమ్రింగెదవు. చెప్పుము. (శ. ర.)

**గ్రుక్కిలి.** వి. జా. గుటక, గ్రుక్క.

చందమామకు గ్రుక్కిలి = చందమామగ్రుక్కిళ్లు. (చూ)

గీ. చందమామకు గ్రుక్కి లాయిందువదన, వదనసామ్యంబు సేయంగ వాంఛ సేఁత. కవిక. ౩. ౪౯.

**గ్రుక్కిళ్లుమ్రింగు, గ్రుక్కిళ్ మ్రింగు**=గ్రుక్కలుమ్రింగు. (గ్రుక్కిళ్లు+మ్రింగు.)
(నోరూరి గుటకలువేయు; అపేక్షపడు.)

శా... నిశాతబాణముల నాజో దేసి శేతాళముల్, గ్రుక్కిళ్ మ్రింగఁగఁ గ్రొత్తనెత్తురు లవాఁగుల్ పాఱ...కాశీ. ౨. ౫౧.

సీ. భోగించువారలఁ బుల్కుపుల్కనఁ జూచి మెల్లన గ్రుక్కిళ్లుమ్రింగువారు. శైవ. ౭ ౫౩.

సీ. కోకిలవ్రాతంబు గ్రుక్కిళ్లుమ్రింగించుక్రొమ్మావిచిగురాకుగొడుగులోడ. గీ... వచ్చె వలరాజు...హర. ౩. ౩౭. వసు. ౨. ౧౫౫. శుక. ౩. ౪౭౭.

**గ్రుక్కు.** అ. క్రి. గ్రుక్కలుమ్రింగు,(చెప్పుట కేమియు లేక) గుటకలువేయు.

సీ. నిలునిలు మొకమాట గల దని నిలిపి పల్కుట కేమియును లేక గ్రుక్కి గ్రుక్కి. ప్రభా. ౫. ౨౭.

౨. తొట్రుపడు.

క. వీనులకు సుధారసముల, సోనలు వర్షించుమృదులనుస్వరఫణితిం, దా నిట్టటు గ్రుక్కక పని, లేనిపునఃపదము లిడక లీల దలిర్పన్.

శా ... వ్యాసోక్తశాస్త్రంబు వ, క్కాణించెన్ ...ప్రభా. ౪. ౬౦,౬౧.

వి. జలాదులు త్రాగుటయందగుఅనుకరణము.(దీని ఆమ్రేడితము 'గ్రుక్కు-గ్రుక్కు')

ద్వి. చెలువార వాసిల్లుశీతలోదకము, లలరుచు గ్రుక్కుగ్రుక్క నఁగఁ ద్రావుచును. పండితా. దీక్షా. ౪౨౯.

జ: గ్రుక్క, గ్రుక్కగొను, గ్రుక్కలుపెట్టు, గ్రుక్కలుమ్రింగు, గ్రుక్కిలి, గ్రుక్కిళ్లుమ్రింగు, గ్రుక్కుమిక్కనక, గ్రుక్కుమిక్కను.

**గ్రుక్కుమిక్కనక, గ్రుక్కుమిక్కుమనక, గ్రుక్కుమిక్కురనక.** అవ్య. (√గ్రుక్కు) కిక్కురుమనక, నిశ్శబ్దముగా; నిశ్శబ్దముగా నుండి.

గీ. అడవుభయమున గ్రుక్కుమిక్కనక వెనుక, వెనుక కొదిఁగెడుతనప్రాణవిభునిఁ జూచి... శుక. ౩. ౨౪౭.

చ... తపోధనులున్ సురలు స్వేదంగుపా, టొలయఁగ గ్రుక్కుమిక్కుమన కుండి రొదుంగుచు నక్కడక్కడన్. ప్రభా. ౧. ౯౨.

గీ. గుండియలు గ్రుళ్లఁ దన్నిన గ్రుక్కుమిక్కు, రవక యాతనికినుక చల్లార నిచ్చి, విక్రమా ర్కుండు నిద్ర గావించుదనుక, వెడలి రా రా దటంచును వేఁడుకొనియె. శుక. ౩. ౬౩౩.

గ్రుక్కుమిక్కను=బిక్కుబిక్కుమను. అ. క్రి. (√ గ్రుక్కు)-ఏకాకిత్వాదులచే-దిగులుపడు.

మ. అనుడుం బ్రాణసఖుల్ భయాకులితచిత్తాంభోజలై గ్రుక్కుమి,క్కనుచున్ శైత్యకృతోపచారగుణజన్యంబై విజృంభించుగం, టనికోపంబునఁ దమ్ములం జాఱుకు ముట్టం జాచునా కన్య నే,ర్పునఁ జేరం జని పల్కి రిట్లని భయంబుం బ్రీతియుం దోఁపఁగన్. చంద్రా. ౪. ౧౭౦.

క. ఒక్కతనె గ్రుక్కుమిక్కని,ది క్కెడసినకీతి నుండఁ దెరువరు లెవరో,యిక్కడకుఁ బండ వచ్చిన,నక్కట. ప్రాణమ్ము లుండె నధిపా యనినన్. హంస. ౪. ౨౭౬.

గ్రుచ్చు. స. క్రి. ౧. నాటించు.

శా...కృతవర్ముండు... నారాచంబులు పెక్కులొక్కమొగి మేనన్ గ్రుచ్చ మూర్ఛిల్లె... భార. కర్ణ. ౧. ౧౬౫.

గీ...ఏడుబాణముల వి,గోధిసర్వమర్మంబుల గ్రుచ్చుటయును...హరి. ఉ. ౧. ౯౭. ఉ. హరి. ౩. ౨౯.

౨. గాఢముగాఁ బట్టుకొను,బిగియఁ బట్టుకొను.

సీ. ధర్మపుత్రునిపదద్వయమున కతిభక్తి నెఱఁగి వనిన్నతఁ డెత్తి గ్రుచ్చి, నిడుకేలఁ బెద్దయుఁ దడవుగాఁ గౌఁగిలింపఁగ...భార.ఉద్యో. ౩. ౩౫౩.

ఆ. గ్రుచ్చి కవుఁగిలించికొని యమ్మహీధర,సార్వభౌముదేవి...హర. ౪. ౫.

౩. భేదించు, చీల్చు.

చ...నరసింహమూర్తివై,కుటిలనఖాగ్రకుంచికల గ్రుచ్చవె వానియురఃకవాటమున్. పారి. ౩. ౩౭.

౪. పెల్లగించు.

సీ.వలగొన్న బహురాజవంశగుల్మంబులఁ బలుతెఱంగుల గ్రుచ్చి పాఱవైచు. వసు. ౧. ౬౯. (గ్రొచ్చు?)

౫. (మాలిక, మొ.) కూర్చు.

సీ. నిల్వుటద్దము నూడ నెచ్చెలితో వాడ సరసోక్తులకు నవ్వ సరులు గ్రుచ్చ. విక్ర. ౪. ౧౪౭.

క. వెరవున నూఁతల నెత్తిలఁ, గరముల మత్స్యములఁ బట్టి కడు సంతసముం, బొరయుచుఁ ద్రాళ్లం గ్రుచ్చఁగఁ, గర మూహించి మదిఁ బ్రాప్తకాలజ్ఞుండున్. భార. శాం. ౩. ౧౯౩.

వ...మధుసూదనుం డేయుసాయకంబులు ...వరంబులు దోఁడియు నుదరంబులు వ్రచ్చియు నూరువులు గుది గ్రుచ్చియు మకుటంబులు విఱిచియు...ఉ. హరి. ౧. ౧౪౮.

౬. తూర్చు, చొనుపు.

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీఱఁ, దీఱకుండు దాని తెఱఁగు దగిన,యప్పు డాడరాదె యిప్పుడు ముకుఁద్రాటఁ, గాలు గ్రుచ్చ నేల కమలనాభ. భార. ఉద్యో. ౩. ౨౨౦.

మ. తలఁ బత్తుచ్చుట గ్రుచ్చి బాతువులు కేదారంపుఁగుల్యాంతర,స్థలి నిద్రింపఁగ...ఆము. ౧. ౬౫.

ద్వి. రాత్రియు నూది దారంబు గ్రుచ్చంగ, నేత్రములకు దృష్టి నెక్కొల్పు మనుఁడు. బస. పు. ౪. ౩౦౭.

౭. గ్రుచ్చి కౌఁగిలించు.

సీ...గ్రుచ్చెఁ దావులు సోఁకఁ గ్రోవిరిమ్మ. వసు. ౧. ౧౫౮.

అ. క్రి. నాటు.

చ...భీ,కరముగ మూఁడు మూఁడు శరకాండము లన్ దగ గ్రుద్వ నేసినన్. భాగ. ౪. ౩౨౫.

గ్రుచ్చిగ్రుచ్చి యడుగు=నొక్కినొక్కి అడుగు.

వ. ఇంతకు మున్నది యెన్నండును విన్నది గాదు. ఇప్పు డెప్పగిది నొదవెఁ జెప్పు మని గ్రుచ్చి గ్రుచ్చి యడుగ...కళా. ౧. ౯౪.

క. వేమఱు గ్రుచ్చి గ్రుచ్చిపు,డేమి యడిగెద వు...విజ. వి. ౨. ౧౦౨.

గ్రుచ్చిగ్రుచ్చివిను=గ్రుచ్చిగ్రుచ్చి యడిగి విను.

క. ఈమేలివార్త నాచే,వేమఱుఁ గ్రుచ్చిగ్రుచ్చివినుదనుకఁ గుల,స్వాముల కెంతయుఁ జింతా, సామగ్రీమంతములు నిజస్వాంతం బుల్. రామా. ౬. ౨౫౫.

పూసగ్రుచ్చినట్లు=జరిగినది జరిగినట్లుగా, యథాక్రమముగా.

క. కొమ్ములఁ గాళ్లం బిండిగఁ,గ్రుమ్మి మగిడిపోయి పూసగ్రుచ్చినగతి ముక్క,దమ్ముం బనిచినగోవు ల,కమ్మునితోఁ గల్లఁ జెప్పి పార్థ మొనర్చెన్. భార. అను. ౩. ౪౯.

ఙ: గ్రుచ్చుకొను, గ్రుచ్చెత్తు.

గ్రుచ్చుకొను. అ. క్రి. (గ్రుచ్చు+కొను-స్వార్థమున) కాఁడు, తూఱు, నాటుకొను.

(వ్యవ) కాలిలో ముల్లు గ్రుచ్చుకొన్నది.

గ్రుచ్చెత్తు. స. క్రి. (గ్రుచ్చు+ఎత్తు) కలయఁ గలుపు.

సీ. గొజ్జంగినీరున గ్రుచ్చెత్తి కపురాన రంగు మీఱంగ నరంగు వైచి. చమ. ౧. ౮౮.

గ్రుడ్డి. విశే. (√గ్రుడ్డు-క. కురుడు, కుడ్డు. త. కురుడ్. తు. కురుడు.) అంధుఁడు; అంధురాలు;అంధము, చూడ శక్తి లేనిది.

క. బిడ్డలకు బుద్ధి సెప్పని,గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పాం డిడె...భాగ. ౧. ౩౧౩.ఆం. భా. ౨. ౧౭౦.

సీ...గ్రుడ్డవ్వ తో లూఁదికొని రాఁగ ... పార. ౨. ౮౩.

సీ... గ్రుడ్డిక న్నన రాదు గొట్టునేయు. శుక. ౩. ౨౧.

గ్రుడ్డివడు=అంధమగు.

గీ. కొన్ని దేశంబు లిరులచే గ్రుడ్డివడియెఁ, గొన్ని దేశంబు లీఁదచేఁ గూడఁబడియె. కాశీ. ౧. ౧౩౪.

గ్రుడ్డివెన్నెల=కాంతిహీన మైనవెన్నెల. (ప్రా)

గ్రుడ్డిపాఠము=అర్థజ్ఞానము లేనిచదువు. (ప్రా)

గ్రుడ్డిదీపము=కాంతి లేనిదీపము. (ప్రా)

గ్రుడ్డిబేరము=తెలివితక్కువబేరము. (ప్రా)

వి. గ్రుడ్డితనము, అంధ్యము.

సీ... అంధభావంబు గ్రుడ్డనఁగ వెలయు. ఆం. భా. ౨. ౧౨౪.

సా: [illegible] మెల్ల. గ్రుడ్డికంటె మెల్ల మేలు. గ్రుడ్డెద్దు [illegible]. గ్రుడ్డికన్ను మూసినను తెఱచినను ఒ[illegible]

గ్రుడింగిలాయి. [illegible] ఇంగిలాయి) ఒకజాతిఇంగిలాయి, మత్స్యవిశేషము. (శ. ర.)

గ్రుడికామంచి. వి. (√గ్రుడ్డి) గొడుగుగడ్డి, అతిచ్ఛత్రము. (శ. ర.)

గ్రుడికాను. వి. (గ్రుడ్డి+కాను.) కాణవరాటకము, గ్రుడ్డిగవ్వ, చిల్లిగవ్వ.

మ. ఇలఁ ద్రవ్య న్నిధివాంఛ ధాతువితతుల్ హోమింప నూఁదుకా మహో,పలఁ గొల్చెన్ ...ఎందు గ్రుడ్డికాసైన లేదు...మల్లభూ. వైరా. ౩.

గ్రుడికొక్కిరాయి. వి. (√గ్రుడ్డి) కోయష్టికము, చీకుకొక్కెర. (శ. ర.)

గ్రుడికొక్కెర. వి. (గ్రుడ్డి+కొక్కెర) కోయష్టికము,గ్రుడ్డికొంగ.

సీ...కోయష్టికము గ్రుడ్డికొక్కెర యన... ఆం. భా. ౨. ౯౪.

గ్రుడివాటు. విశే. (√గ్రుడ్డి) దైవికము. (శ. ర)

**గ్రుడ్డు.** వి. (క. గుడ్డు.) ౧. నేత్రగోళకము, కను గ్రుడ్డు; తారక, నల్లగ్రుడ్డు.
సీ. చిప్పముత్యంబు రాల్చినభంగి నలవోక భగుని గ్రుడ్డులు ధరఁ బడఁగఁ జిదిమె. కాశీ. ౭. ౮౪.
గీ... చేడియలమీఁద గ్రుడ్డెఱ్ఱసేయ రాకు. నీలా. ౩. ౨౫.
గీ. అండతారకలు గ్రుడ్డనఁగ మీఱు. ఆం. భా. ౩. ౫౩.
౨. పక్ష్యాదులయండము.
గీ... భావివృష్టికిని గ్రుడ్డు,తో మఘురి మేచ్ఛడిగు నెఱ్ఱచీమ లనఁగ. ఆము. ౨. ౭౦.
గీ. లెక్క లిడ రానిరాయంచజక్కజోదు, గ్రుడ్డుఁబనఁటులు నిండారుగొప్పబజ్జఁ, బూను పెనుదంట వ్రేపల్లెలోనఁ గల్గు, జున్ను పెరుఁగులు మ్రుచ్చిలి జుఱ్ఱుచుండు. నీలా. ౧. ౭౮. ఆం. భా. ౩. ౫౩.
జ: గ్రుడ్డి, గ్రుడ్డింగిలాయి, గ్రుడ్డికామంచి, గ్రుడ్డికాను, గ్రుడ్డికొక్కరాయి, గ్రుడ్డికొక్కర, గ్రుడ్డివాటు, గ్రుడ్డుకానుపు, గ్రుడ్డెఱ్ఱ, గ్రుడ్లగూబ.

**గ్రుడ్డుకానుపు.** వి. (గ్రుడ్డు + కానుపు) అండజము.
(క) పక్షి.
(చ) సర్పము.
సీ. గ్రుడ్డుకానుపుతోఁడు గ్రుడ్డుకానుపుతోఁడు గుఱ్ఱంబు పాన్పునై కొమరుమిగుల. అచ్చ. రా. బాల. ౧. ౩. (పై రెండర్థములకు నిదియే యుదాహరణము.)

**గ్రుడ్డెఱ్ఱ.** వి. (గ్రుడ్డు + ఎఱ్ఱ.) కన్నెఱ్ఱ, కోపము.
గీ. ఎదురు కను రేల కోపించె నిందుధరుఁడు, అకట గ్రుడ్డెఱ్ఱ బాదరాయణునిమీఁద. భీమ. ౪. ౧౨.

**గ్రుడ్లగూబ.** వి. (గ్రుడ్లు + గూబ) - పెద్దగ్రుడ్లు గల గూబ - ఘూకము.
గీ. గ్రుడ్లు మిడికించుచును గ్రుడ్లగూబకేలి, వేగ తనయిల్లు వెడలె నావృద్ధవేశ్య. శుక. ౩. ౩౦.
సీ. గ్రుడ్లగూబ పగటిగ్రుడ్డిగూబ ... గీ. యనఁగ ఘూకాభిధానంబు... సాం. ని. తిర్య. ౮౦.

**గ్రుద్దు.** స. క్రి. (క. గుద్దు. త. తు. మ. కుత్తు.) పిడికిటితో కొట్టు; శూలము మొదలగువానితో పొడుచు.
స్రగ్ధర. గ్రుద్దు న్గోత్రాచలంబుల్ గులగుల లయి పో గోతము ల్గ్రుద్దులీలన్. మనుచ. ౪. ౮.
గీ. అసుర వధసాధనము గోయునపుడు గ్రుద్దిఁ దాఁచి... ఆము. ౬. ౨౨.
సీ. హరి గర్వమును జెంద నట్టె శూలంబున గ్రుద్దట మెంచి దుర్బుద్ధి పోవొ. గీ. వారికం బెను బలియొ యీబక్క బాఁపఁడు ... పార్వ. ౪. ౧౯.
గీ... గేదంగిచేయుమ్మకొద్ది గ్రుద్ది. చంద్రా. ౩. ౧౧౭.
వి. పిడికిటిదెబ్బ; పిడికిటిపోటు. (చూ. గ్రుద్దులాట)
(వ్యవ) వాఁడు నన్ను నాలుగు గ్రుద్దులు గ్రుద్దినాఁడు.
జ: గ్రుద్దుకత్తి, గ్రుద్దులాట, గ్రుద్దులాడు.

**గ్రుద్దుకత్తి.** వి. (గ్రుద్దు + కత్తి.) ఎఱుకలవాండ్రు వేఁటకై ధరించెడుఆయుధవిశేషము.
సీ. కావిలాగులు నీలికాసెలు వాగురుల్ గ్రుద్దుకత్తులు నల్లగొంగడీలు. రసిక. ౧. ౬౩. (చి. ని. పా.)

**గ్రుద్దులాట.** వి. (√ గ్రుద్దులాడు) యుద్ధము; గ్రుద్దులాడుట.
సీ. తనరును బెనఁకువ పెనఁగులాట యనంగఁ బెనయన గ్రుద్దులాటనిన యుద్ధము... ఆం. భా. ౨. ౨౨౨.
సా:- మునుఁగులో గ్రుద్దులాట.

**గ్రుద్దులాడు.** అ. క్రి. (గ్రుద్దులు + ఆడు) ఒకరి నొకరు గ్రుద్దుకొనుచు పోట్లాడు, దెబ్బలాడు.

(వ్యవ) వారును వీరును గ్రుద్దులాడుచున్నారు.

**గ్రుయ్యు**=గ్రుచ్చు. స. క్రి. (బాణాదులను) నాటు.

గీ. కాఁడె గ్రుస్సెను దోలిచెను నాడె ననఁగ,నా
కెట వినుమాట కర్థ మా నాగభూష. అం.భా. ౩. ౧౨౨.

**గ్రువ్వ**=గువ్వ. (గ్రా) (అడవిపావురము.)

గీ. గ్రువ్వ గద్ద దివ్యాఖుపుఁబ్రువ్వ గూబ, యి
ల్లు సొచ్చిన శాంతి సేయింప వలయు. భార. అను. ౪. ౧౧౯.

ఆ. ఫలము నినుము వెండిఁ బసిఁడి ముచ్చిలి కొ
న్నఁ, గ్రోఁతి వాయసంబు గ్రువ్వ నీచ, కృ
మియు నగు... భార. అను. ౪. ౨౬౬.

## గ్రె

**గ్రెమ్ము.** స. క్రి. సాఁగఁగొట్టు.

గీ. మేటిజమ్మేటియనటఁ గ్రెమ్మించుమించుఁ, బో
దివి మదన ప్రతాపాగ్నిఁ బుటమువెట్టి, తమ్మి
గద్దియదాకట గ్రెమ్మి యట్టికొమ్మఁ గావిం
చెఁ బోలు నెత్తమ్మిచూలి. వసు. ౨. ౩౨.

## గ్రై

**గ్రైవము.** సం=గ్రైవేయము.

**గ్రైవేయకము.** సం. వి. అ. పుం. (అష్టాధ్యాయి. ౪.౨.౯౬. సూత్రములోని భాష్యాద్యుదాహరణములనుబట్టి పుంలింగముగా గ్రహింపఁబడినది. నిఘంటువులలో నపుంసకముగా నున్నది.) కంఠభూషణము, మెడనుబెట్టెడు అలంకారము. (కంటె, మొ.)

**గ్రైవేయము.** సం. విశే. (అ. ఈ. అ.) మెడయందున్నది. (అలంకారాదికము.)

**గ్రైష్మకము.** సం. విశే. (అ. ష్మిక. అ.) ౧. గ్రీష్మఋతువునందు పుట్టినది. ౨. గ్రీష్మఋతువునందు చల్లఁబడినది. (విత్తు, మొ.) ౩. గ్రీష్మమునందు చెల్లింపఁబడునది. (ఋణము)

**గ్రైష్మము.** సం. విశే. (అ. ఈ. అ) గ్రీష్మసంబంధమైనది.

**గ్రైష్మి.** సం. వి. ఈ. స్త్రీ. వనమల్లిక, విరజాజి తీ. (త్రి. ని.)

## గ్రొ

**గ్రొచ్చు.** స. క్రి. (√గ్రొయ్యు-ప్రాఁతయం దిది వరుసాదిగా కూడ కన్పడుచున్నది అని శ. ర)

౧. గ్రొచ్చఁజేయు, త్రవ్వు.

సీ. కుత[illegible]కొనఁ గొలకొండ గా నిల్పి కర
నిధి[illegible]రి సగరసుతులు. శు. సం.౧.౫౨.

సీ. కట్టినక[illegible]కుల గ్రొచ్చినబావు
లఁ గూ[illegible] వ్యవ. ౧౪౭. నా.
పంచ. ౧. ౫[illegible]. ఆది. ౭. ౧౩౩.

౨. చీల్చు, విదళించు.

స్రగ్ధర. గ్రొచ్చు న్నర్థ్యావ్రజంబుల్ ఘుటఘుట
రభటిల్ ఘూర్ణిల్లై... రాజ. చ. ౨. ౭౬.

సీ. కన్నుల వెడలెడికజ్జలధారలు కుచకుంభమం
బుల గ్రొచ్చి పాఱ. భాగ. ౧౦ పూ. ౯౮౪.

౩. (త్రవ్వి) పెకిలివేయు, పెల్లగించు.

ద్వి. ఉటజపంక్తులఁ జొచ్చి యూపము ల్గ్రొ
చ్చి. ద్వి.హరిశ్చ. పూ. ౧౨౦౯ పం.

సీ. క్రూరారికోటీర కురువిందములఁ గాని కురువింద
ముల నెందు గ్రొచ్చఁబోవు. గీ... కుహనావ
రాహమూర్తి. దశా. ౩. ౨౦౮.

**గ్రొయ్యు.** అ. క్రి. పల్లమగు.

గీ. అమహాత్ముఁడు ...ఇచ్చు, గోగణంబులగొరిజల
గ్రొస్సి యయ్యెఁ, గాడె యూసరోవరము జగ
న్నుతముగ. భార. అర. ౪. ౩౬౮.

జ: గ్రొచ్చు.

## గ్ల

గ్లపనము. సం. విణ. (అ. ఆ. అ.) గ్లాని కలిగించు నది. వి. అ. న. గ్లాని కలిగించుట.

గ్లస్తము. సం=గ్రస్తము.

గ్లహము. సం. వి. అ. పుం. ౧. జూదమునందొడ్డి పందెము, పణము. ౨. పాచిక. ౩. జూదమాడుట.

## గ్లా

గ్లానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. రోగము చేక్షీణించినది, గ్లాస్నువు. ౨. దీనము, విన్ననైనది. ౩. మ్లానము, వాడినది. వి. అ. న. ౧. దౌర్బల్యము, సత్త్వ తగ్గుట. ౨. దైన్యము. ౩. తెవులు. ౪. మ్లానత్వము.

గ్లాని. సం. వి. ఇ. స్త్రీ. ౧. (శ[illegible]మము మనస్తాపము క్షుత్పిపాసలు మొదల[illegible]వానిచేఁ గలిగిన) దౌర్బల్యము. (ఇది యొకవ్యభిచారి భావము. దీనివలన కంపము కార్శ్యము అనుత్సాహము మొదలగునవి కలుగును.) ౨. అశక్తి, అసమర్థత. ౩. తెవులు, రోగము. ౪. అలపు, బడలిక. ౫. మ్లానత్వము, వాడుట. ౬. క్షయము, హాని, నాశము.

శ్లో. ఆత్మోదయః పరగ్లానిర్ద్వయం నీతిరితీయతీ. శిశు. ౨. ౩౦.

శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత. భగవద్గీత. ౧౪. ౭.

గ్లాస్నువు. సం. విణ. (ఉ) గ్లానుఁడు, రోగము చే కృశించినవాఁడు.

గ్లౌ. సం. వి. ఔ. పుం. ౧-కృష్ణపక్షమందు క్షీణించువాఁడు-చంద్రుఁడు. ౨. కర్పూరము.

గ్లౌ. సం=గ్లౌ.

## ఘు

ఘు. సం. ఒకానొకయక్షరము. వి. అ. పుం. ౧. ఘంట, గంట. ౨. ఘర్ఘురధ్వని. ఆ. స్త్రీ. ౧. మొల నూలు. ౨. ఘాతము, దెబ్బ. (మే. ని-దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

ఘంట. సం. వి. ఆ. స్త్రీ. ౧. గంట, వాద్యవిశేషము. ౨. అఱువదినిమిషములకాలము. ౩. ఘంటాపాటలి, మొక్కపుఁజెట్టు. ౪. అతిబల, ఒకజాతి ముత్తవపులగము? ౫. నాగబల, బీఱ?.

ఘంటాకము. సం. వి. అ. పుం. ఘంటాపాటలి, మొక్కపుఁజెట్టు. (వాచ.)

ఘంటాకర్ణుఁడు. సం. వి. అ. పుం-గంటలు చెవులకుఁ గట్టుకొనినవాఁడు-ఒకానొకశివభక్తుఁడు.

ఘంటాతాడుఁడు. సం. వి. అ. పుం. ౧-కాలము తెలుపుటకు-గంటలు కొట్టువాఁడు. (వాచ.) ౨. ఒకానొక సంకీర్ణజాతివాఁడు. మను. ౧౦. ౩౩.

ఘంటాపథము. సం. వి. అ. పుం. ౧. పదిబారలు వెడల్పు గలబాట, రాజమార్గము.

శ్లో. దశధన్వన్తరో రాజమార్గో ఘంటాపథః స్మృతః. కౌటిల్యుఁడు. (వాచ)

౨. మల్లినాథకృత మగుకిరాతార్జునీయవ్యాఖ్య.

ఘంటాపాటలి. సం. వి. ఇ. పుం. మొక్కపుఁజెట్టు. (కల్ప)

ఘంటాఫలకము. సం. వి. అ. పుం. న. చిఱుగంటలు గట్టినడాలు.

ఘంటాబీజము. సం. వి. అ. పుం. జయపాలవృక్షము.

ఘంటారవ. సం. వి. ఆ. స్త్రీ. గిలిగిచ్చ, గిలకచెట్టు.

ఘంటాలి. సం. వి. ఈ. స్త్రీ. కోశాతకి, బీఱ?.

ఘంటికా. సం. వి. ఆ. స్త్రీ. ౧. చిఱుగంట. ౨. కొండనాలుక.

ఘంటువు. సం. వి. ఉ. పుం. ౧. ఏనుఁగునకుఁ గట్టుగంట. ౨. ప్రతాపము. (వాచ.)

ఘంఢము. సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద.

**ఘట.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఏనుఁగులసమూహము; సమూహము. ౨. గోష్ఠి, సభ. ౩. ఘటన, కూర్పుట. (శ. ని.)

**ఘటకక్రియ.** సం. వి.ఆ. స్త్రీ. (తెనుఁగువ్యాకరణమున) కొన్ని ధాతుజన్యరూపముల కనుప్రయుక్తమగు ధాతువు. (అగు, పోవు, మొ.)

ఇది కొన్నిపట్ల నిరర్థకముగాను కొన్నిపట్ల విశేషార్థకముగాను ఉండును.

ఉదా: రాఁడయ్యెను, వెళ్లిపోయెను. (ఇట నిరర్థకము) రాకపోఁడు. (ఇట విశేషార్థకము)

**ఘటకము.** సం. వి. అ. పుం. వనస్పతి, పూవులు లేకయే కాయలు కాచునది.

**ఘటకర్పరము.** సం. వి. అ. పుం. కుండపెంకు.

**ఘటకర్పరుఁడు.** సం. వి. అ. పుం. నీతిసార మను గ్రంథమును రచించినఒకానొక ప్రసిద్ధకవి. (ఇతఁడు విక్రమార్కునియాస్థానమందు నవరత్నములని ప్రసిద్ధికాంచినకవులలో నొకఁడు.)

**ఘటకుఁడు.** సం. విశే. (అ. టికా. అ) ఘటిల్లఁజేయువాఁడు.

**ఘటగ్రహుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) నీటికుండలు మోయువాఁడు.

**ఘటజుఁడు.** సం. వి. అ. పుం-ఘటమందుఁ బుట్టినవాఁడు-౧. ద్రోణుఁడు. ౨. అగస్త్యుఁడు. (త్రి. ని.)

ఇవ్వే: ఘటోద్భవుఁడు, మొ.

**ఘటదాసి.** సం. వి. ఈ. స్త్రీ. విటీవిటులను కూర్చెడియింతి, తాపికత్తె, కుట్టెని. (త్రి. ని.)

**ఘటన.** సం. వి. ఆ. స్త్రీ=ఘటనము.

**ఘటనము.** సం. వి. అ. న. ౧. ప్రయత్నము, పూనిక. ౨. సంభవము, కలుగుట. ౩. ఒడఁగూర్పుట. ౪. కూర్పు, సంయోజనము, కలుపుట.

**ఘటపర్యసనము.** సం. వి. అ. న. ప్రాయశ్చిత్తమునకు ఒప్పుకొననిపతితుని త్యజించుటకై బ్రతికియున్నపుడే వానికి ప్రేతకార్యము నేయుజ్ఞాతులు ఒకకుండను నీటితో నించి దానిని దాసిచే తన్నించి నీ రొలుకఁబోయించుట యనుకర్మము.

ఇవ్వే: ఘటవినయనము, మొ.

**ఘటము.** సం. వి. అ. పుం. ౧. కుండ. ౨. కుంభము, ఏనుఁగుకుంభస్థలము. ౩. కుంభకము, సమాధివిశేషము, ఊపిరి లోనికి పీల్చి నిలుపుట. ౪. కుంభరాశి. ౫. శిఖరము. ౬. ద్రోణపరిమాణము. (శ. ని.)

**ఘటయంత్రము.** సం. వి. అ. న. ౧. నూతిగిరక. ౨. [illegible] ఘటీయంత్రము.

**ఘట**[illegible]**.** [illegible] వి. న. పుం. ఘటికోపాధ్యాయుఁడు. ([illegible]డు. అని. శ. ర, బ్రౌ-శాసనములలో 'ఘ[illegible]ద్యాసంస్థ కలదని యుండుటచే 'ఘట' [illegible]టికా' శబ్దలుత్తరపదము కావచ్చునని తోఁచుచున్నది.) ఐస. పు. ౩. ౨౧౪ పం. అము. ౬ ౬౩. క్రి. దా. ౨౫౩. (దీనికి 'ఘడికాసి, ఘడియకాసి, ఘడికాసి' అనురూపములు కొన్నిచోట్ల కాన్పించుచున్నవి.)

ద్వి. సోమయాజులపెద్ది రామనభట్టు, దామోదరవృన వామనకూచి, కేసనఘడికాసి కేమనపెద్ది. పండితా. దీక్షా. ౪౧ పా.

వ... కెబ్బనఘడియకానుల-ఖ ౨...ద. కా. ౪. ౬౬౩.

వ... కాండవశాఖతైత్తిరీయశాఖలు చదువించ్చుటిఘడికాను తైవబ్రాహ్మణుల కిద్దఱకు నిబద్ధాలు మూండును...(దీనికి సంస్కృతము)

శ్లో. అత్యుత్కృష్టయజుశ్శ్రుతేరవారవాః స్వాధ్యాయసత్రద్వయు, క్షితైర్ కాండవతైత్తిరీయకలసత్ శాఖాద్వయస్య క్రమాత్, అత్రాధ్యాపకవిప్రయోరపి పునర్ద్విఘాత్యైనిబంధ్య

త్రయం, శ్రీమత్ ధన్యవదాన్యమాన్యచరిత ప్సామన్తచూడామణిః. ద. శా. ౬. ౯౦౪.
(ఇంకను విచార్యము)

ఘటాఘటీలు. విశ. బ. గొప్పవారు.

శా. మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదము లేదు నిండు సభలో నొక్కింతమాత్రంబు హే,మాహేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాత లీసాము లే,లా హీనాధికభావముల్ తడవ రాదంచుఁ వితాకుండ నై. వరాహ. ౧౦. ౭.

ఘటి. సం. విశ. (న్. నీ. న్) ఘటము గలవాఁడు. వి. ఈ. స్త్రీ. ౧. చిన్నకుండ, దుత్త. ౨. ఇరువది నాలుగునిమిషములకాలము, గడియ. ౩. గడియలు తెలుపుట కైనచిన్ననీటికుండ. న్. పుం. కుంభరాశి

ఘటి(యి)౦చు. సం. స. క్రి. ౧. ఘటిల్లఁజేయు, చేయు.

క. నెలకొన్నభక్తి సద్గురు,కులచూడారత్న మగున ఘోరశివాచా,ర్యులదివ్యపాదపద్మం,బులకు నమస్కృతి ఘటించి పూతాత్ముల మై. వరాహ. ౧. ౧౯.

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్, దమకార్యంబు ఘటించుచుఁ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్, దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ వృథాన్యార్థభం,గము గావించెడువార లెవ్వరో యెఱుంగఁ శక్యమే యెరికిఁ. భర్తృ. నీతి. ౬౫.

క. ఈలాగున రఘువీరన్ప,పాలుఁడు సుగ్రీవు నెడఁ గృపాలుం డగుచుఁ, మేలు ఘటియించి కపిపద, మేలు మనుచు వాన కొక్కయెడ వసియించెఁ. ఉ. రా. ౧. ౧౦౨.

౨. సంపాదించు.

చ... భోగపరుండు గావునఁ,ధనము ఘటింపఁగాఁ దగువిధం బని చూచి... భార. శాం. ౩. ౪౭౨.

ఘటింధముఁడు. సం. విశ. (అ. ఆ. అ) ఘటవాద్యమును వాయించువాఁడు.

ఘటింధయుఁడు. సం. విశ. (అ. ఈ. అ) కుండెఁడునీరు, మొ. త్రాగువాఁడు.

ఘటిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. చిన్నకుండ, దుత్త. ౨. ఇరువదినాలుగునిమిషములకాలము, అఱువదివిగడియలకాలము. ౩. ముహూర్తము, రెండుగడియలకాలము. (వై. ని.) ౪. ఒకానొకవిద్యాసంస్థ. (చూ. ఘటశాసి.)

ఘటికము. సం. విశ. (అ. ఆ. అ) ఘటముచే నదిమొదలగువానిని దాఁటునది. వి. అ. న. నితంబము, తుంటి.

ఘటితము. సం. విశ. (అ. ఆ. అ) ౧. యోజితము, కూర్పఁబడినది. ౨. కలిగింపఁబడినది, ఒడఁగూర్పఁబడినది.

ఘటి(యి)ల్లు. సం. అ. క్రి. కలుగు.

ఉ. డెందమునం బ్రమోదము ఘటిల్లఁగ నమ్ముని శిష్యుఁ జూచి నీ,యందును సర్వభూతములయందును నిప్పుడు సౌహృదంబు నా,యందుఁ గుమార నిశ్చలిత మైనది యీవిధ మేమియో కొ,య,స్పందితపుణ్య యే నెఱుఁగఁ జయ్యనఁ జెప్పుము నాకు నావుడుఁ. మార్క. ౭. ౬౪.

సీ... భూతంబులయం దెల్ల దయ ఘటిల్లు. భార. శాం. ౫. ౨౨౭.

చ. డమరుకడిండిమప్రకటఝంకృతియుం గతినాట్టహాసవి,భ్రమమును దాండవారభటిపాటవముం ఘటియిల్ల మాతృకా,సముదయభూతభైరవపిశాచనిశాచరడాకినీగణ, ప్రమథసమూహముల్ పొగడ భర్గుఁడు సంతస మందె నెంతయుఁ. భీమ. ౪. ౧౫౦.

ఘటీకారుఁడు. సం. వి. అ. పుం. కుమ్మరి.

ఘటీయంత్రము. సం. వి. అ. న. ౧. ఏతము. ౨. నీళ్లు చేఁదడుగిరక. 3. గడియలు తెలుపునట్టియొకయంత్రము, గడియారము.

ఘటోత్కచుఁడు. సం. వి. అ. పుం. భీమునకు హిడింబయందు పుట్టినయొక రాక్షసుఁడు.

ఘటోఘ్ని. సం. వి. ఈ. స్త్రీ.-కుండవంటిపొదుఁగు గలది.-పెద్దపొదుఁగు గలయావు, గేద, మొ.

ఘట్టకుటి. సం. వి. ఈ. స్త్రీ. సుంకము పుచ్చుకొను చోటు.

ఘట్టజీవి. సం. వి. న్. పుం. రేవుకడ పడవ మొదలగువానిచే ఏఱుమొదలగువానిని దాఁటించి బ్రతుకువాఁడు. (వీఁడు రజకునికి వైశ్యస్త్రీయందు పుట్టినసంకీర్ణజాతివాఁడు.)

ఘట్టన. సం. వి. ఆ. స్త్రీ. ౧. చాలనము, కదల్చుట. ౨. రాపు, ఒరపిడి. 3. గట్టించుట. ౪. వృత్తి, బ్రతుకుఁదెరువు.

ఘట్టనము. సం. వి. అ. న.=ఘట్టన.

ఘట్టము. సం. వి. అ. పుం. ౧. నద్యాదులరేవు. ౨. సుంకము పుచ్చుకొనుచోటు. 3. చాలనము, కదల్చుట. ౪. రాపిడి.

ఘట్టించు. సం. స. క్రి. ౧. (బట్టలు) ఉదుకు.

ద్వి. ... చర్మపరిధానభక్తులపరిధానవితతి, గాని యొందుతుకఁడు వానిని నంటఁగా నీఁడు నితరుల ఘట్టించుచునెడను. బస. పు. ౪.౭౬౫౦.

౨. (మోఁకాళ్లు మొదలగువానితో) పొడుచు.

సీ. మొగము పగుల వ్రేసి మోఁకాళ్ల ఘట్టించి... భా. రా. యు. ౧౭౧౫.

క. కడవసములఁ బ్రహరించిరి, యడిచిరి లాతములమొత్తి రహివలయములం, బిడికిళ్లను ఘట్టించిరి, తడఁబడ మృదుభటులు దంశధుకిం కరులకా. శివరా. ౪. ౫౯.

ఘట్టితము. సం. విశ. (అ. ఆ. అ) ౧. చాలితము, కదల్పఁబడినది. ౨. రాపిడి చేయఁబడినది; గట్టింపఁబడినది. 3. నిర్మింపఁబడినది. ౪. చిత్రపటాదులకు రంగు వేయుటకై యన్నపుగంజి మొదలగువానిని రాచి గట్టింపఁబడినది. (వస్త్రాదికము.)

ఘణఘణ, ఘణాంఘణా=గణగణ.

ఉదా: ఘంట ఘణఘణ మ్రోఁగుచున్నది.

సీ. సాధారణవిహంగసంరావములు గావు మణికింకిణులఘణాంఘణలు కాని. దశా. 3. ౪3.

ఘణిల్లు=ఘణిల్లు. వి. ౧. అంత వేయుటయం దగు ననుకరణము. (ఆమ్రేడితరూపము. 'ఘణిఘణిల్లు')

సీ. పరవృషభంబును బాఱఁదోలి ఘణిల్లరనుచు ... చుకొనుచు మీఱి. కిరా. ౨. ౫౭.

గీ. గంధ...నుబంధి పుష్పంధయముల, ఝుంకృతుల ... ల్లన అంత లిడుమ, విషమశరు పేర... విడిచి రనఁగఁ, గ్రొవ్వి చరియించు నప్పటఁ ... డగాడ్పు. కవిక. ౧. ౨౫.

(గణిల్లు. శ. ర. పా)

౨. భూషణములు గంటలు మున్నగువానిధ్వనికి అనుకరణము.

సీ... భామాకరాంచన్మణికంకణాళి ఘణిల్లురనఁగ. ఇందు. ౨. ౧౨3.

క... హస్తలోహపటుతరకటక, శ్రేణి ఘణిల్లన ... రా. వి. ౨.౫౬.

ద్వి. ఘణిఘణిల్లని మ్రోయుఘంటాస్వనములు. రం. రా. యు. 3౫౭ పా. ౨౭ పం.

3. కఠినపదార్థమును దునుముటయం దగునకరణము.

సీ. కుటిలోగ్రకర్కశకోటికోటిసంఘాటముల్ దినిసి ఘణిల్లునఁ దునుమవచ్చు. వరస. ౫. ౧3౦.

౪. కఠినవస్తుసంఘర్షణముచేఁ గలుగుధ్వని కనుకరణము.

సీ. అతిరయస్ఫూర్తిచే నరుగుచో నాడాక గన

శృంగములు ఘణి ల్లనఁగఁ దాఁకు. దశా. ౧. ౧౯౫.

సీ. ఘణిఘణిల్లురటంచు గగనమార్గంబున వైమాని కులవిమానములు తాఁకె. దశా. ౩. ౧౧౦.

ఘతనము. సం. విశే. (అ. ఆ. అ) మారకము, హింసించునది. (వాచ)

ఘన. సం. వి. ఆ. స్త్రీ. ౧. మాషపర్ణి, కారుమినుము కీ. ౨. రుద్రజట కీ. అ. పుం. వేదపాఠవిశేషము.(ఇది ఈయర్థమున దర్భాదులలోనిది.)

ఘనకఫము. సం. వి. అ. పుం. కరక, వడగల్లు.

ఘనకాలము. సం. వి. అ. పుం. వర్షాకాలము.

ఘనగోళకము. సం. వి. అ. పుం. వెండిబంగారములు కలిసినమిశ్రలోహము.

ఘనచ్ఛదము. సం. వి. అ. పుం. శిగ్రువు, మునగ కీ.

ఘనజ్వాల. సం. వి. ఆ. స్త్రీ. విద్యుత్తు, మెఱుము.

ఘనతాళము. సం. వి. అ. పుం. ౧. సారంగపక్షి, వానకోయిల. ౨. (సంగీ) తాళభేదము. (వాచ)

ఘనతోలము. సం. వి. అ. పుం. చాతకము, వానకోయిల. (త్రి. ని.)

ఘనత్వక్కు. సం. వి. చ్. పుం. శిగ్రువు,మునగ కీ.

ఘననాభి. సం. వి. ఇ. పుం. ధూమము, పొగ.

ఘనపత్త్రము. సం. వి. అ. పుం. పునర్నవ, గలిజేరు కీ.

ఘనపల్లవము. సం. వి. అ. పుం. మునగ కీ.

ఘనపాషండము. సం. వి. అ. పుం. మయూరము, నెమిలి.

ఘనఫలము. సం. వి. అ. పుం. ౧. వికంకటము కీ. (కల్ప) ౨. (గణిత) ఘనపదార్థములయొక్క గాని గోతులయొక్క గాని త్రివిధపరిమాణములను గుణింపఁగా వచ్చినలబ్ధము. (పొడుగు, వెడల్పు, ఎత్తు- పొడుగు, వెడల్పు, లోఁతు-పొడుగు, వెడల్పు, దళసరి-ఇవి త్రివిధపరిమాణములు.)

ఘనము. సం. విశే. (అ. ఆ. అ) ౧. దృఢమైనది, గట్టిది. ౨. నిబిడము, సాంద్రము, దట్టమైనది. ౩. గొప్పది. ౪. పెల్లు, అధికమైనది. వి. అ. పుం. ౧. మేఘము, మబ్బు. ౨. తుంగముస్తె కీ. ౩. సమూహము. ౪. విస్తారము, విరివి. ౫. లోహముద్గరము, ఇనుపగుదియ. ౬. పమ్మెట. ౭. శరీరము. ౮. అభ్రకము. ౯. కఫగంధము. ౧౦. దార్ఢ్యము, దిటవు. ౧౧. (గణిత) సమానమైనమూఁడుసంఖ్యలను గుణింపఁగావచ్చిన లబ్ధము. (మూఁడుఅనుసంఖ్యయొక్క ఘనము. 3 X 3 X 3=౨౭) ౧౨. ముప్పదిరెండుముద్దలపరిమాణముగలభిక్షాన్నము, వాంతకారద్వయము. (వై. ని.) న. ౧. నృత్యాది మధ్యమానము. ౨. కంచుతాళములోనగువాద్యము. ౩. తగరము. ౪. చెట్టుతోలు, పట్ట. ౫. తోడు పెట్టినపెరుఁగులో పైదియును అడుగుననున్నదియును గాక నడుమనున్న పెరుఁగు.

ఘనమూలము. సం. వి. అ. న. (గణిత) సమానమైనమూఁడుసంఖ్యలను గుణింపఁగా వచ్చిన లబ్ధమునకు మూలసంఖ్య. (3 X 3 X 3=౨౭-ఇట '3' ఘనమూలము.)

ఘనరసము. సం. విశే. (అ. ఆ. అ) ౧. చిక్కనిరసముగలది. ౨. అధికరసముగలది. వి. అ. పుం. న. ౧. నీల్లు. ౨. కర్పూరము. ౩. గడ్డకట్టినరసము. ౪. చెట్టుబంక. ౫. కషాయము. ౬. పీలుపర్ణి, చాఁగ కీ.

ఘనవల్లి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అమృతస్రవ, రుదంతి కీ. ౨. మెఱుపుఁదీఁగ.

ఘనవల్లిక. సం. వి. ఆ. స్త్రీ=ఘనవల్లి.

ఘనవాతము. సం. వి. అ. పుం. ౧. నరకభేదము. ౨. మబ్బుమీఁదిగాలి. (వాచ)

ఘనవాసము. సం. వి. అ. పుం. కూశ్మాండము, గుమ్మడికి.

ఘనసారము. సం. వి. అ. పుం. ౧. కర్పూరము. ౨. పాదరసభేదము. ౩. జలము.

ఘనసారోదయము. సం. వి. అ. న. సుగంధిద్రవ్య విశేషము. (ఇది కర్పూరముతో చేయఁబడును.)

వ. అగరుచందనవారిచందనఘనసారోదయభాస్కరోదయమృగమదప్రముఖనిజవాసనల నాకావకాశంబులు వాసించుచు నృపరత్నంబుఁ జేరునంత. ద్వా. ౩. ౨౦౬.

ఘనస్కంధము. సం. వి. అ. పుం. కోశామ్రము, కొండమామిడికి.

ఘనస్వనము. సం. వి. అ. పుం. తండులీయశాకము, చిత్రికూర కి.

ఘనహస్తము. సం. వి. అ. పుం. (గణిత) ఒకహస్తముపొడుగు ఒకహస్తమువెడల్పు ఒకహస్తము లోఁతు పండ్రెండుఅంచులు కలపరిమాణము.

ఘనాకరము. సం. వి. అ. పుం. వర్షాకాలము, వానకారు.

ఘనాకులము. సం. వి. అ. పుం. వాస్తూకశాకము, చక్రవర్తికూర కి.

ఘనాగమము. సం. వి. అ. పుం. వర్షాకాలము, వానకారు.

ఘనాఘన. సం. వి. ఆ. స్త్రీ. కాకమాచి, కాచి కి.

ఘనాఘనము. సం. వి. అ. పుం. ౧. వర్షుకమేఘము, కురియుమేఘము. ౨. హింసించునట్టిమదపుటేనుఁగు. ౩. అన్యోన్యఘట్టనము, ఒకటితో నొకటి రాచుకొనుట. (వాచ)

ఘనాఘనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

ఘనాత్యయము. సం. వి. అ. పుం. శరత్కాలము.

ఘనామయము. సం. వి. అ. పుం.—అపక్వమైనపుడు గొప్పరోగమును కలిగించునది—ఖర్జూరముకి.

ఘనాశ్రయము. సం. వి. అ. పుం. ఆకాశము.

ఘనీభవించు. సం. అ. క్రి. ముద్దకట్టు.

ఉ. పారదరాశి చంచలతఁ బాసి వసించెనొ శైలమై సుధా,నీరధి నిల్చెనో కుముదినీపతి కాంతి ఘనీభవించెనో, నా రజతాద్రి ముక్తలలనామణికేళిసుధాంశుకాంత రా,జీరచితోరుసౌధగతిఁ జెల్వెసఁగు సన్మునిసిద్ధసేవ్యమై. కాశీ. ౪. ౧౫౬.

చ. కదలి జనించుమూక్తికనికాయము బాడబవహ్నికాఁకచే, నుడికి ఘనీభవించి పయి కుబ్బిననున్నపుముద్దమే నుమీ, యుడుపతి... సుదంతా. ౩. ౬.

ఘనోపలము. సం. వి. అ. పుం. కరకము, వడగల్లు.

ఘుమ్ము=గమ్ము.

(అధికముగా పరిమళించుటయందలి యనుకరణము.)

గీ. ఘనతరశీతమధుపూరమహితకుసుమ, పరిమళమ్ములు ఘుమ్మని పరిమళించె. చంద్రా. ౫. ౭౭.

సీ. తనతనూసురభిళత్వము ఘుమ్మనఁ గ్రమ్మఁగా న గంధవహభావ మనిలుఁ డొంద. ఉ. రా. ౧. ౧౭౯.

సీ. మై నలందినకుంకుమ ప్రసౌరభ్య[illegible] బాహుమూలపుఁగదంబంపుపలపు. గీ. కలసి యొకవింతవైఖరి ఘుమ్మురనఁగ. చంద్రా. ౪. ౧౦౦.

ఘురట్టము. సం. వి. అ. పుం. తిరుగలి.

ఘుర్ఘుర. సం. వి. ఆ. స్త్రీ. ౧. క్షుద్రఘంటిక, చిఱుగంట. ౨. వీణాభేదము.

ఘుర్ఘురము. సం. వి. అ. పుం. ౧. కుపానలము, ఊఁకనిప్పు. ౨. పర్వతద్వారము, కొండకనుమ. ౩. ద్వారము, వాకిలి. ౪. క్రుక్లభూమి. ౫. హాస్యము. ౬. ఒకానొకవదము.

ఘర్ఘరిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. చిఱుగంట. ౨. ఒకానొకనది. ౩. పేలాలు. ౪. వాద్యవిశేషము.

ఘర్మచర్చిక. సం. వి. ఆ. స్త్రీ. చెమటకాయ.

ఘర్మజలము. సం. వి. అ. న. చెమట.
ఇట్లే: ఘర్మోదకము, మొ.

ఘర్మదీధితి. సం. వి. ఇ. పుం-వేఁడికిరణములు గలవాఁడు-సూర్యుఁడు.

ఘర్మము. సం. వి. అ. పుం. ౧. చెమట; ఊష్మము, ఉక్క. ౨. ఆతపము, ఎండ. ౩. వేఁడిమి, కాఁక. ౪. వేసఁగికాలము. ౫. ఏనుఁగుహృదయమునందలిమదము.

ఘర్మవిచర్చిక. సం=ఘర్మచర్చిక.

ఘర్మాంతకాముకి. సం. వి. ఈ. స్త్రీ-వర్షాకాలమందు కామము కలది-బలాక, కొక్కెరపక్షి.

ఘర్మాంతము. సం. వి. అ. పుం. వర్షాకాలము.

ఘర్షకము. సం. విశే. (అ. స్త్రీ. కా. అ) ౧. రాముసది, ఒరయునది. ౨. రుద్దునది, తోమునది. ౩. మర్దనముచేయునది. ౪. స్పర్ధపడునది.

ఘర్షణము. సం. విశే. ( అ. ఆ. అ ) ఘర్షణము చేయునది. (అ. ఈ. అ) ఘర్షణసాధనమైనది. వి. ౧. [illegible]యిక, రాపిడి. ౨. మర్దించుట. ౩. రుద్దు[illegible]ర్ధ.

ఘర్షణాలము. సం. వి. అ. పుం-నూఱుటకు సమర్థమైనది-పాత్రము, నూఱెడుగుండు.

ఘర్షణీయము. సం. విశే. (అ. ఆ. అ) ఘర్షింపఁదగినది.

ఘర్షత్. సం. శతృ. ఘర్షించుచున్న.

ఘర్షము. సం. వి. అ. పుం. ౧. ఒరయిక, రాపు. ౨. మర్దించుట. ౩. రుద్దుట. ౪. స్పర్ధ. ౫. పాత్రము, నూఱెడుగుండు.

ఘర్షించు. సం. స. క్రి. ౧. ఒరపెట్టు. ౨. బాధపెట్టు, రాయిడిచేయు.
గీ. పెక్కుమాటల నిటు జాగుపెట్ట నేల, సాధ్వి ఘర్షింప నొకఁడెట్టు చాలఁగలఁడు, గంధవాహంబు వెఱచు నక్కలువకంటి, పసుపుఁబయ్యెద పాలిండ్లఁ బాయఁదట్టి. కాశీ. ౨. ౮౮.

ఘర్షిణి. సం. వి. ఈ. స్త్రీ. పసుపు. (త్రి. ని)

ఘర్షిత. సం. విశే. (ఋ. త్రి. ఋ) ఘర్షించువాఁడు.

ఘర్షితము. సం. విశే. (అ. ఆ. అ) ౧. ఘర్షణముకలది. ౨. ఘర్షింపఁజేయఁబడినది.

ఘర్షితవ్యము. సం=ఘర్షణీయము.

ఘర్ష్యము. సం=ఘర్షణీయము.

ఘలము. సం. వి. అ. న. తక్రము, మజ్జిగ. (వాచ)

ఘల్లు. వి. ౧. మువ్వలు కంకణములు మొదలగువాని ధ్వని కనుకరణము. (ఆమ్రేడితరూపములు-ఘల్లుఘల్లు, ఘలుఘల్లు, ఘలుఘలు.)
చ. మలయపుగాలి రేఁప వనమాలివిమానపతాక ఘల్లుమం, చలియఁ బసిండిమువ్వగమి నొక్కొకమాటు గదల్ప...ఆము. ౧. ౭౪.
గీ. గిలుకుటందెలు ఘల్లన...దశా. ౨. ౩౫౫.
సీ. ఘల్లుఘల్లని రత్నకంకణంబులు మ్రోయ ...భీమ. ౩. ౬౨.
ఉ...ఘలుఘల్లని మ్రోయ నందియల్...రామా. ౧. ౨౦౫.
సీ. ఘలుఘలు మని యందియలు మ్రోయ... సారంగ. ౩. ౨౪౬.
చ...గజ్జియల్, ఘలుఘలు ఘల్లుఘల్లు రనఁగా... ఇందు. ౨. ౬౯.
౨. సింహధ్వనికనుకరణము.
సీ. ఘల్లురంచు నెదుర్చు కంఠీరవంబులఁ జంద్రహాసంబులఁ జదిపి చదిపి. కృ. శకుం. ౧. ౬౧.

ఘళ. వి. తరంగము మొలనూలు మున్నగువానిధ్వని

అనుకరణము. (ఆమ్రేడితరూపములు. ఘళఘళ, ఘళఘళఘళ.)

సీ. అభ్రంకషంబు లై యంభోధివీచికల్ ఘళ ఘళఘళమంచుఁ గప్పికొనిన. దశా. ౪. ౨౧౩.

గీ. రవ్యమేఖలఘళఘళల్ ... గ్రహించ రా యంచకడ నిల్చెఁ జంచలాక్షి. హంస. ౩. ౫౪.

క. జలసేవనఘళఘళల, వ్వలము లపళపళలు... ...ఏకీభవించె జనము నుతింపన్. బహు. ౪. ౨౪.

సీ. ఘళఘళార్భటులతోఁ బళపళ మనువాన ధారారాస్త్రాది మహార్తి నింప. హంస. ౪. ౨౨౧.

ఘుళుకుఘుళుకు. వి. సాలెవానిపలక తాటించుట యందగుధ్వని కనుకరణము.

వ... కోడెపాయంపునాడెంపుసాలెవాఁడు ఘుళుకుఘుళుకు మనఁ బలక చులుకఁగాఁ దాటించువాటంబున... చంద్ర. వి. ౩. ౧౩౧.

ఘుస్మరుఁడు. సం. విణ. (అ. ఆ. అ) తిండిపోతు; చంపినవాఁడు. (ఉదా: మురఘుస్మరుఁడు. మొ.)

ఘుస్రము. సం. విణ. (అ. ఆ. అ) హింసించునది, వి. అ. పుం. దినము. న. కుంకుమపువ్వు. (త్రి. ని)

## ఘా

ఘా. సం. వి. ఆ. స్త్రీ. ౧. కాంచి, మొలనూలు. ౨. ఘాతము, దెబ్బ. (మే. ని-దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగము కనఁబడలేదు.)

ఘాంటికము. సం. వి. అ. పుం. ధుత్తూరము, ఉమ్మెత్త.

ఘాంటికుఁడు. సం. వి. అ. పుం. ౧. గంట వాయించువాఁడు. ౨. వేకువను గంట వాయించి రాజులను మేల్కొలుపు వైతాళికుఁడు.

ఘాట. సం. వి. ఆ. స్త్రీ. పెడతల. (ముచ్చిలిగుంట -అనికొందఱు.)

ఘాటించు. సం. అ. క్రి. విజృంభించు.

ద్వి. ఘాటించి ఘోరమెకఁబులు బిట్టు, గఱచిన ...నవ. ౧. ౪౧ పా. ౧౦ పం.

ఘాటిక. సం. వి. ఆ. స్త్రీ.=ఘాట.

ఘాతకుఁడు. సం. విణ. (అ. తికా. అ) హింసించువాఁడు.

ఘాతనము. సం. విణ. (అ. ఆ. అ, ౧. చంపునది. ౨. చంపించునది. వి. అ. న. ౧. చంపుట. ౨. చంపించుట.

ఘాతము. సం. వి. అ. పుం ౧. ప్రహారము, దెబ్బ. ౨. మారణము, చంపుట. ౩-హననసాధనము-బాణము. ౪. లంఘనము, కోఁపిడి. (మను. ౯. ౨౭౪.) ౫. హాని. (యాజ్ఞ. ఆచా. ౧౬౨.) ౬. ఉచ్ఛేదము. (ఉదా: విశ్వాసఘాతము.) ౭. (గణిత) గుణనము, గుణకారము; గుణింపఁగా వచ్చిన మొత్తము, లబ్ధము. ౮. (జ్యోతి) వైధనతార.

ఘాతి. సం. విణ (న్. నీ. న్) చంపినవాఁడు. (వృత్తియందు కర్తృవాచకము పూర్వపదము గా నున్నపుడే ఈరూప మగును. (ఉదా: పితృఘాతి, పుత్రఘాతిని.) వి. ఇ. పుం. పక్షిబంధనము, పక్షులను పట్టుపల.

ఘాతించు. సం. స. క్రి. హింసించు [illegible]

క. అతఁడు ప్రసన్నుఁడై ... [illegible] బడుగు మనిన నాకేసు నని, ఘాతింపఁగ నోపెడునుతు, నాతలబు సప్ప రాంగి [illegible] యున్. హరి. పూ. ౧. ౭౯.

ఘాతిపక్షి. సం. వి. న్. పుం. డేగ.

ఘాతుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ)=ఘాతకుఁడు.

ఘాత్యము. సం. విణ. (అ. ఆ. అ) ౧. చంపఁదగినది. ౨. (గణిత) గుణింపఁదగినది.

ఘారము. సం. వి. అ. పుం. సేచనము, తడుపుట.

ఘూరి. సం. వి. ఇ. స్త్రీ. రాత్రి. (వై. ని) వ. (ఛంద) ఒకానొకవృత్తము. (వాచ)

ఘూర్తికము. సం. వి. అ. పుం. నేతియందు బక్వమైన గోధుమపిండివక్ష్యము.

ఘాసకుందము. సం. వి. అ. పుం. పచ్చికబీడు. (వాచ)

ఘాసకూటము. సం. వి. అ. న. గడ్డివామి, గడ్డిమేటి. (విల్యమ్సు)

ఘాసము. సం. వి. అ. పుం. ౧. ఆహారము. (విల్యమ్సు) ౨. లేఁతపచ్చిక.

ఘాసి. సం. వి. ఇ. పుం. అగ్ని. (వై. ని)

ఘాసికుఁడు. సం. వి. అ. పుం. గుఱ్ఱమునకు గడ్డి తెచ్చువాఁడు. (వై. ని)

## ఘి

ఘిరాయించు. స. క్రి. (హిం. ఘిరానా=ముట్టడించుట) ముట్టడించు.

గీ. అపుడ రంధ్రశ్రుతి ప్రభునాజ్ఞ వడసి, తడసి కొన కేఁగి బడవాల్గు దండువెంట, గడి ఘిరాయింపఁ బైనము ల్గండటంచు, సైనికుల కెల్ల మోహీము సాటి రపుడు. రంగా. ౩. ౮.

## ఘీ

ఘీంక[illegible]అ. క్రి. (ఏనుఁగు) ధ్వనించు, ఘీంకారము చేయు.

చ. కనుఁగొని నీలదానవుఁడు గంధగజాకృతి ఘీంకరించి వచ్చిన మృగరాజరూపమునఁ జించె నఖంబులఁ గుంభముల్ ఘనా, ఘనఘనగర్భముక్తకరకల్వలె మౌక్తికరాజి రాలఁగా, నని మొన వీరభద్రుఁడు భయంకరకంఠనినాదకాద్రుఁడై. వరాహ. ౬. ౧౧౨.

ఘీంకారము. సం. వి. అ. పుం. బృంహితము, ఏనుఁగు చేయుధ్వని.

వ... బెదిరి మరుఘీంకారంబుల వంకురించిననంకాతంకంబుల... దశా. ౧. ౨౬౧.

ఘీంకృతి. సం. వి. ఇ. స్త్రీ=ఘీంకారము.

## ఘు

ఘుంటము. సం. వి. అ. పుం. చీలమండ.

ఘుంటికము. సం. వి. అ. న. ఏఱుపిడుక.

ఘుండము. సం. వి. అ. పుం. తుమ్మెద.

ఘుక్కు. వి. గుడ్లగూబకూఁత కనుకరణము.

ఉ. ఘుక్కని మాటిమాటికిని గోటఁడు పల్కెడు వామదిక్కునన్. క్రీడా. ౫౧.

ఘుటము, సం. వి. అ. పుం. చీలమండ.

ఘుటి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. చీలమండ.

ఘుటిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. గుల్ఫము, చీలమండ. ౨. గుళిక, మాత్ర.

ఘుటికము. సం. వి. అ. పుం. ౧. చీలమండ. ౨. ఏనుఁగు గుఱ్ఱము మొదలగువానివెనుకకాలిని కట్టుకంకువు. (శే. ని)

ఘుణము. సం. వి. అ. పుం. మ్రాను తొలుచుపురుగు, నుసిపురుగు.

ఘుణలిపి. సం. వి. ఇ. స్త్రీ. ఘుణాక్షరము, నుసిపురుగు దొలువఁగా ఏర్పడినయక్షరము.

ఘుణాక్షరము. సం. వి. అ. న=ఘుణలిపి.

ఘుమఘుమ, ఘుమంఘుమ. వి. ౧. శంఖధ్వని కనుకరణము.

క. ... ఖగేశ్వరపక్షజనితవాతాంపూరిత శంఖ మపుడు ఘుమఘుమ మ్రోసెన్. పారి. ౨. ౩౭.

వ.... విజయశంఖంముల ఘుమంఘుమలు పిరంగుల ధింధిమ్ములు... ప్రబంధ. ౭౮.

౨. గుహ మొదలగువానిలో గాలి చొచ్చునప్పుడు కలుగుధ్వని కనుకరణము.

(నెమిళ్లు) సీ. ఘుమఘుమధ్వని గాలి గుహఁ జొరఁ బురి రొయికించుక యెత్తి కని తలంచుకొని వంచి. ఆము. ౪. ౧౮౧.

౩. ఉఱుముటయందగు ధ్వనికి అనుకరణము.

గీ... మొగిలు, ఘుమఘుమ నుఱిమె ... ఘటికా. ౨. ౪౨.

౪. తరంగములధ్వని కనుకరణము.

సీ. కిన్నరద్వంద్వసంభిన్నపంచమరాగనిర్యన్మ
హావేగనిర్ఘరాంబు,పతితప్రతిధ్వానఘంగోరు
ఘుమఘుమఘుమఘుమాయితదిశాగోళకంబు...
గీ. ఐనహిమశైలపాదంబునందు ... హర. ౩. ౩౦.

శా. సాయంకాలనటన్మహానటజటాఝూటాటవీ
ద్వ్యోధునీ, స్ఫాయద్భంగఘుమంఘుమాపమిత
వాచాచాతురీధుర్యఁ డై. శుక. ౩. ౬౪౧.

ఘుమ్ము=గుమ్ము.

(అధికముగా పరిమళించుటయందలి యనుకరణము)

క. ఇమ్మాడ్కి జనానందక,రమ్ముగ వెన్నెలలు గా
య రంభోర్వనులుక్, గుమ్మెత్తుదారముల
కడ, ఘుమ్మనుక పురంపుజగతిఁ గూర్చుండిత
గ౯. వాల్మీకి. ౩. ౧౦౧.

(వీణాధ్వని కనుకరణము)

సీ. ఆపిమ్మట విపచ్చరీపాణివల్లకీగుంభస్వరంబు
లు ఘుమ్మురనియె. వసు. ౫. ౩.

ఘురణము. సం. వి. అ. న. ధ్వని.

ఘురి. సం. వి. ఈ. స్త్రీ. పందిముట్టె.

ఘుర్ఘుర. సం. వి. ఆ. స్త్రీ. పందికూఁత.

ఘుర్ఘురము. సం. వి. అ. పుం. పందికూఁత.

ఘుర్ఘురి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పందికూఁత. ౨. జలజంతువిశేషము.

ఘుర్ఘురించు. సం. అ. క్రి. ఘుర్ఘురధ్వనిచేయు, (పంది) కూయు.

సీ. పడిఁ గుక్క లంటంగ వచ్చిన మెకఁ ద్రిప్పి
ఘుర్ఘురించుచు బయల్ గొమ్ముఁ జిమ్ము. మను
౨. ౪. ౪౨.

ఘుర్ఘురిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఘుర్ఘురధ్వని. ౨. ఘుర్ఘురధ్వని గలవగర్భురోగము.

ఘులంచము. సం. వి. అ. పుం. అడవిగోధుమలు.

ఘులఘులారవము. సం. వి. అ. పుం. ఒకజాతి పావురము.

ఘుషము. సం. విశే. (అ. ఆ. అ) ఘోషించునది, శబ్దించునది.

ఘుషితము. సం. విశే. (అ. ఆ. అ) ఘోషించఁబడినది; ప్రకటించఁబడినది, చాటఁబడినది.

ఘుష్టము. సం. విశే. (అ. ఆ. అ) ౧. పేనఁబడినది, (త్రాడు) ౨.=ఘుషితము. (కల్ప)

ఘుష్టాన్నము. సం. వి. అ. న. సత్త్రాములందు భోజనమునకు వచ్చువారు రండని బిగ్గరగా పిలిచి పెట్టినయన్నము, సత్త్రాన్నము. మను. ౪. ౨౧౫.

ఘుసృణము. సం. వి. అ. న. కుంకుమపువ్వు. (వై ని.)

## ఘూ

ఘూకము. సం. వి. అ. పుం-'ఘూ' అని ధ్వని చేయునది - గుడ్లగూబ.

ఘూకారి. సం. వి. ఇ. పుం. కాకి.

ఘూకి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగ్రుడ్లగూబ.

ఘూర్జరము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము, గుజరాతి.

ఘూర్జరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఘూర్జరదేశస్త్రీ. ౨. ఒకానొకరాగము.

ఉ... దేవగాం,ధారి వరాళి కన్నడ ధనాసరి
ఘూర్జరి పూరి... చెన్న. ౨. ౫౩౬.

ఘూర్జరుఁడు. సం. వి. అ. పుం. ఘూర్జరదేశపురుషుఁడు.

ఘూర్ణత్. సం. శత్రు. తిరుగుచున్న.

ఘూర్ణన. సం. వి. ఆ. స్త్రీ=ఘూర్ణనము. (వాచ)

ఘూర్ణనము. సం. వి. అ. న. ౧. భ్రమణము, తిరుగుడు. ౨. కునికిపాటు.

ఘూర్ణమానము. సం. విశ. (అ. ఆ. అ) తిరుగుచున్నది.

ఘూర్ణము. సం. విశ. (అ. ఆ. అ) ౧. భ్రాంతము, తిరుగునది. ౨. కునికిపడునది, తూఁగిపడునది. వి. అ. పుం. ౧. భ్రమణము, తిరుగుడు. ౨. త్రిప్పరోగము. ౩. గ్రీష్మసుందర మనుశాకము ౯.

ఘూర్ణి. సం. వి. ఇ. పుం. భ్రమణము, తిరుగుడు.

ఘూర్ణితము. సం. విశ. (అ. ఆ.అ) ౧. భ్రాంతము, తిరుగుడుపడినది. ౨. భ్రమితము, త్రిప్పఁబడినది. ౩. ప్రచలాయితము, కునికిపాటుపడినది.

ఘూర్ణిల్లు. సం. అ. క్రి. ౧. తిరుగుచుపడు.

మ...కొం,దల మందెం ద్రిదశేంద్రుపట్టనము పాతాళంబు ఘూర్ణిల్లె...భార. విరా. ౪.౧౭౨.

౨. ధ్వనించు, మ్రోఁగు.

వ. శుంభుండు త్రిభువనకుహరంబు నిండి నిజసింహనాదంబున ఘూర్ణిల్ల విలయసమయనిర్ఘాతఘోషంబు గా నార్చె...మార్క. ౬. ౨౦౧.

ఘూర్ణ్యమానము. సం.విశ. (అ. ఆ. అ.) భ్రామ్యమాణము, త్రిప్పఁబడుచున్నది.

## ఘృ

ఘృణ. సం. వి. ఆ. స్త్రీ. ౧. కనికరము, దయ. ౨. జుగుప్స, రోఁత.

ఘృణాళువు. సం. విశ. (ఉ) కనికరము గలవాఁడు.

శ్లో. నిష్పాదితం తు కార్త్స్న్యేన భగవద్భిర్ఘృణాళుభిః, సాధూచ్ఛిష్టంహి సర్వం మే ఆత్మనా సహ కిం దదే. సం. భాగ. ౪. ౨౨. ౪౩. (వాచ)

ఘృణావాసము. సం. వి. అ. పుం. కూశ్మాండము, గుమ్మడి ౯.

ఘృణి. సం. విశ. (న్. నీ. న్) ఘృణ గలవాఁడు. వి. ఇ. పుం. స్త్రీ. ౧. కిరణము, వెలుఁగు. ౨. జ్వాల, మంట. ౩. తరంగము, అల. ౪. నిదాఘము, గ్రీష్మము. ౫. పగలు.(శే.ని.)

ఘృతకోశాతకి. సం. వి. ఈ. స్త్రీ. నేతిబీఱ ౯.

ఘృతమండలిక. సం. వి. ఆ. స్త్రీ. హంసపది ౯.

ఘృతము. సం. విశ. (అ. ఆ. అ) ౧. తడుపఁబడినది. ౨. ప్రకాశించినది, వెలిఁగినది. వి. అ. పుం న. ౧. అజ్యము, నెయ్యి. ౨. నీరు. (శే. ని)

ఘృతాచి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రాత్రి. ౨. ఒక అప్సరస్త్రీ.

శ్లో. ఊర్వశీ మేనకా రంభా ఘృతాచీ చ తిలోత్తమా, సుకేశీమంజుఘోషాద్యాః కథ్యంతే ఽప్సరసో బుధైః.

ఘృతాచీగర్భసంభవ. సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకి ౯. (వాచ)

ఘృతాహ్వము. సం. వి. అ. పుం- నేతివాసన గల జిగురు కలది-సరళము ౯. (త్రి. ని.)

ఘృతేశి. సం. వి. ఈ. స్త్రీ. ౧. తైలపాయిక, గబ్బిలము. ౨. ఎఱ్ఱచీమ.

ఘృతోదము. సం. వి. అ. పుం. నేతిసముద్రము.

ఘృష్టము. సం. విశ. (అ. ఆ. అ) ౧. ఒరయఁబడినది. ౨. రుద్దఁబడినది. ౩. మర్దితము, మర్దనము చేయఁబడినది. ౪. నూఱఁబడినది.

ఘృష్టి. సం. వి. ఇ. పుం. ౧. పంది. ౨. కిరణము.

